వెల స్వల్పము! ఫల మధికము!!

# ఫలాహార మాహాత్మ్యము

మహాత్మాగాంధీ మొదలయిన మహామహులు దీనినిగురించి పలుసార్లు పలువిధములుగా ప్రశంసించియున్నారు. శాస్త్రములు దీనిని బహువిధములుగా ఉద్ఘోషించుచున్నవి వైద్యులు దీనిని వేవిధములుగా పొగడియున్నారు.

అటువంటి ఫలములను గురించి తెలుసుకొనుటకు మీ రెందుకు కృషి చేయ కాదు?

లోకములో ఎన్నెన్ని రకముల పండ్లున్నవి? వాని గుణాగుణము లేవి? ఏయే దేశములలో ఏయే కాలమానములలో ఏయే పండ్లు పండును? ఏయేపండ్లకు ఏయే భూసారము అనుకూలముగా ఉండును? ఏయేపండ్ల ఆహారపు విలువ యెటువంటిది? ఏయే పండ్లచెట్లను ఏయేవిధముగా పెంపకము చేయవలయును? ఆపంటలకు చేయదగిన కృషియేది? మొదలయిన విషయములన్నియు ప్రతివారును తెలుసుకొనవలసినది పరమధర్మము.

ఈ ఫలకృషి అనేకకృషులకు మూలాధారమగుచున్నది. కాదా? మీ ధర్మ నిర్వహణమునకును, పరిజ్ఞానమునకును, శ్రేయస్సునకును ఫలకృషిని వివరముగా తెలుసుకొనుట అత్యవసరము.

ఆంధ్రగ్రంథమాలవారి నూతన గ్రంథము 'పండ్లు'
మీ కీ విషయములో యావత్సహాయమును చేయగలదు.
వెంటనే వారికి ఉత్తరము వ్రాయుడు.

వె: రూ. 1-8-0. పోస్టేజి ప్రత్యేకము

ఆంధ్రగ్రంథమాల, పోస్టుబాక్సు 212, మదరాసు.

# భారతి

## సచిత్ర
## మాసపత్రిక

సంపాదకుడు

కా. నాగేశ్వరరావు

సంపుటము ౧౮, సంచిక

ఆంధ్రపత్రికా ముద్రాలయము,
మద్రాసు.
౧౯౩౨

# బహుధాన్య సంవత్సరాది సంచిక

మహాశయా !

బహుధాన్య సంవత్సరాది సంచికకు విన్నపమిదివరకే చేరియుండును. కాని వర్తమాన రాజకీయార్థికసాంఘికపారిశ్రామిక పరిస్థితుల నవలోకించునపుడు సంచిక ప్రచురణము క్రొత్తమార్గము నవలంబించుట ప్రయోజనకరముగ నున్నది.

ఆంధ్రత్వ మతిప్రాచీనము. హిందూస్థానమునందలి, ఇతరప్రాంతములందలి పరిస్థితుల వలె, ఆంధ్రదేశ ప్రజాస్థితులు ప్రతిఘటనములకు పాలైనను, ఆంధ్రత్వము చైతన్యప్రదమై విలసిల్లుచున్నది. ప్రజాహృదయమునందు గాఢమైనప్రబోధ ముదయించినది. ఈప్రబోధమును సార్థకముచేయుట ప్రజానాయకులకు ధర్మము.

చెన్నరాష్ట్రమునందు స్వరాజ్యప్రభుత్వము ఏర్పడినది. ప్రజలయందు విద్యా,విజ్ఞానములు, సౌభాగ్యము మొదలగు వానిని వ్యాపింపజేయుటకు ప్రయత్నములు జరుగుచున్నవి. ఈ మహోదయ సమయమునందు ఆంధ్రులు వారి ప్రాచీన వర్తమానస్థితిగతులను కనుగొని భావి భాగ్యోదయమునకు పనిబూనుట పరమావసరము, పరమధర్మము. అందువలన బహుధానస్యసంవత్సరాది సంచికకు ఈక్రిందివిషయములలో తమకు పరిచితమైన విషయమునుగురించి వ్యాసమును వ్రాసి డిశంబరు 30-వ తేదిలోపల పంప ప్రార్థితులు. వ్యవధి తక్కువ, ప్రయత్నము సాహసికము. కావున త్వరలో శ్రమచేసి వ్యాసములను పంప ప్రార్థితులు. వీలైనయెడల సచిత్ర వ్యాసములు పంప ప్రార్థితులు.

1. ఆంధ్రచరిత్రములోని ముఖ్యఘట్టములు: (ఎ) అమరావతి, నాగార్జున స్తూపముల నాటి ఆంధ్రులు, (బి) శ్రీకృష్ణదేవరాయలనాటి ఆంధ్రులు. 2. ఆంధ్రదేశ పరిశ్రమలు: (ఎ) వ్యవసాయ పరిశ్రమ, (బి) నేతపరిశ్రమ, (సి) గృహపరిశ్రమలు, (డి) వర్తకవాణిజ్యములు. 3. ఆంధ్రకళ: (ఎ) చిత్రకళ, (బి) శిల్పము, (సి) గానము. (డి) ప్రాచీన నాట్యకళ. 4. ఆంధ్ర సాహిత్యాభ్యుదయమునందలి ముఖ్యఘట్టములు. 5. ఆంధ్రుల మతసాంఘికవ్యవస్థలు. గ్రామకట్టుబాట్లు, కులకట్టుబాట్లు. 6. ఆంధ్రోద్యమము. 7. సత్యాగ్రహము, గాంధి. 8. ఆంధ్రరాష్ట్రనిర్మాణావశ్యకత. 9. బ్రిటిషుపరిపాలనమున ఆంధ్రదేశము. 10. ఆధునికాంధ్ర జాతి నిర్మాతలు. 11. ప్రత్యేకాంధ్రసంస్థలు. 12. ఫెడరేషను-ఆంధ్రరాష్ట్రము. 13. ఫెడరలు ఫైనాన్సు. 14. ఫెడరలు, యూనిటరీప్రభుత్వములు; భారతదేశమునకు తగినదేది ? 15. దేశాంతరములందలి ఆంధ్రులు.

కా. నాగేశ్వరరావు

# భారతి—చతుర్దశ సంపుటము—భా ౧

## వ్యాసముల అకారాది సూచి

## త్రివర్ణచిత్రముల అకారాదిసూచి

# విషయసూచిక




నాట్యభంగిమము —అన్నపూర్ణాదేవి.




సంపు. ౧౪ ఈశ్వర సంవత్సరము, ఆషాఢమాసము ( జూలై ౧౯౩౭ ) సంఖ్య ౭

# నన్నయ

కల్లూరి వేంకటసుబ్రహ్మణ్య దీక్షితులు

గాసట బీసట్లై, ప్రకృతిగాథ లగాధములై, నిరంతరా
భ్యాసము దప్పి, ఆర్యమతభంగికి భంగము గూరువేళ నా
యాసము నోర్చి, తెన్గుబడు లారయ రాళ్లను రప్ప లేరి, నే
డీసరిక్రొత్తబాస వెలయించిన నన్నయ సంస్తుతించెదన్.

కమ్మని తెన్గుబాస నుడికారపు సొమ్ముల సొంపునై కళల్
చిమ్మ, చళుక్యభూవిభుని జీవనగాథలు మోహతంత్రిపై
కిమ్ముగఁ దార్చి, భావము లఝుంప సుధామధురార్ద్రగీతముల్
గమ్మనిపించు నాంధ్రలలనా కలగానవినోద మెన్నెదన్.

నన్నయ! నీ చరిత్రము లనన్య సుగమ్యము లంచు నూరకే
మెన్నిదినాల నిట్లు వినిపించెద రాంధ్ర నవాంకురంబు ల
న్నన్న తపింతుమున్నరని యారసికాధిపపాళిమండను
న్గన్న తెలుంగుఁదల్లి విధికై తలపోయుచుఁ గ్రుంగిపోవుచున్.

భారత మొక్క భారతము; పండితయుద్ధము; తెన్గుబాస సిం
గారము గూర్చు వింత నుడికారములన్ గళలంకురింపఁగాఁ
గూరిచినావు నన్నయ!, అకుంఠిత రాగరసాబ్ధి వీచికా
వారము జాలువారెను భవత్కవితా స్ఫుటలేఖినీ గతిన్.

గణనాథుం దలపోసినావు; అట మార్కండేయ గర్భాలయాం
గణసీమంగల ఘంట ఖంగుమని మ్రోగన్; భారతామ్నాయకా
రణ విద్వద్రణ భూమి భేరిజరచెన్ రారాజు; దిగ్భామినీ
గణసుస్వచ్ఛ కపోలపాళికలపైఁ గల్పించె జైత్రాంకముల్.

తీయని తెన్గుతేటల శ్రుతిప్రతిబోధిత ధర్మపఙ్క్తి నం
దీయఁ జళుక్య రాజ్య రమణీమణి కన్నరమోదు వెట్టినిన్
హాయి! సెబాసు! బాగు! బళిరా! యని మెచ్చుచు పొంగు గౌతమీ
తోయ తరంగగానములతో జతగూరిచి పాడుకొన్నదా?



# పూర్ణ

[నవల - అనువృత్తము]



● వాసిష్ఠగణపతిముని ●

## పదియవ ప్రకరణము

### చపలుని మనోగతులు

గణపొంతనము సరిపడకపోవుటయే ప్రత్యాఖ్యానమునకు కారణమని భవనంది కుటుంబస్థు లెవ్వరును నమ్మలేదు. తమ శాశ్వతస్నేహమునకు భంగము రాఁగూడ దను సుద్దేశముతో ధనంజయుఁడు ఘనేంద్రునితో రహస్యముగా నిజమైన కారణమును గౌరవము చెడనివిధమున చెప్పినవాఁ డయ్యెను. "మా అనసన్న బాంధవుఁడు నగధరబాబు భానుమతీకన్యను మిక్కిలి ప్రేమించుచున్నాఁడని నాకును మా నాయన గారికిని విశ్వసనీయమగువార్త తెలిసినది. ఈ సంబంధమువలన వానిమనస్సు మిక్కిలి నొచ్చునను భయముచే మేము తొలఁగి పోవలసివచ్చినది." ఇవియే ధనంజయుఁడు చెప్పిన మాటలు. దరిద్రుఁడగు బాంధవుఁడు కోరిన కన్యను — తదేకనిష్ఠతో కోరిన కన్యకను సంపన్నుఁడు తనధనబలముచే కన్యాబాంధవులను లోఁగఁదీసుకొని యపహరించుట మిక్కిలి యన్యాయ్యమని యాచార్యుఁడు తలంచినవిధముననే ఘనేంద్రుఁడు యుక్తమేయని యంగీకరించెను. అది జ్ఞాతితో శాశ్వతవిరోధమునకు కారణమగును. అది జ్ఞాతికి శాశ్వతాపకారము చేసిన ట్లగును. ఆ రెండును వాంఛనీయములు గావు.

ధనంజయుని యీ ఋజుచర్యవలన ఘనేంద్రునితో నతనికిఁ గల స్నేహము సురక్షితమయ్యెను. ఘనేంద్రుఁడుమాత్ర మాసంగతిని తనతండ్రితో చెప్పలేదు. తండ్రికి నగధరునిపై కోపము కలిగింపఁ జేయుట యతని కిష్టము కాకపోయెను. ఆ సంగతి చెప్పనెడల నగధరుఁడే స్వయముగానో, పరద్వారాగానో ఈ కార్యమునకు విఘ్నము చేసెనని తండ్రి యనుమానింపవచ్చును భానుమతిగూడ నగధరుని ప్రేమించుచున్నదేమోయని ఘనేంద్రున కనుమానము కలిగెనుగాని దానిని తెలుసుకొనుట కతఁడు ప్రయత్నింపలేదు. యోగీశ్వరిసిద్ధవాక్కు ఫలించుననియే యతఁడు నమ్మెను. దానిశక్తికే యాకార్యమును విడిచి తాను తటస్థుఁడుగా నుండుటకే యతఁడు తీర్మానించుకొనెను.

భవనంది కనకపురసంబంధమును గురించి పునఃప్రయత్నము చేసి విఫలుఁ డయ్యెను. మహాసమాహర్త హేమచంద్రుఁడు (వీరసింహునితండ్రి) సుమిత్రుని దానమానములచే లోబఱచుకొని తనపిల్ల విలాసవతిని కనక

పురేశ్వరునకు నుదుప్పచ్చనట్లు అంగీకరింపఁజేసిన వాఁడయ్యెను. అందువలన సుమిత్రుఁడు వేఱుపెద్దమనిషికి మాటయిచ్చివేసితినని భవనందికి చెప్పివేసెను. మూఁడుస్థలములందుఁగూడ విఫలుఁడైన భవనందికి "కితవునకే డక్కు- కిరణాలభామ" అను రాజకాళిమాట సత్యమగునేమో యని భయము తోఁచినది.

హేమచంద్రునకు తన కొమారితెను భోగనాథునకుఁ గాని రణేశ్వరునకుఁ గాని యీయవలె నని యాశ యుండెను. భోగనాథుఁడు మంగళవారమునాఁడు సాయంకాలముననే విలాసవతిని సవినయముగా ప్రత్యాఖ్యానము చేసినవాఁడయ్యెను. లీలావతీదేవి రణేశ్వరునకు శాంతిసేనాకుమారికన్య సత్యప్రభను చేయించి శాంతిసేనావీరేశ్వరులకు సంధి యేర్పఱచవలె నని తనభర్తకు మంగళవారమునాఁడే సూచించియుండెను. ఆపద్ధతి బాగున్నది యని యంగీకరించి మహారాజు ప్రయత్నించెద నని తనప్రేయసికి వాక్కిచ్చెను. ఆసంగతి భృంగాలకకు తెలిసి రణేశ్వరునివిషయములో నాశ విడుచుకొనవలసివచ్చినది. ధనంజయునిగుఱించి హేమచంద్రుఁడు చాలకాలమునకుముందే ప్రయత్నించి విఫలుఁడయ్యెను. అందువలన వారు కనకపురసంబంధము నాకట్టుకొనినారు.

ఇది యంతయు నిట్లుండ మనభోగనాథబాబు బుధవారమునాఁడు మధ్యాహ్నభోజనానంతరము తనశయ్యపై పరుండి యిట్లు తనమనంబున తర్కించుకొనుచున్నాఁడు.

"భానుమతి గొప్పపండితురాలు. మంచి చక్కనిదిగూడ. చేతికి వచ్చిన సంబంధము పోఁగొట్టుకొంటిని. ఆమెయన్న నింత బిగువుగా మాట్లాడునపుడు నేను వేఱువిధముగా నెట్లు నడుచుకొనుట?

కనకవల్లి మిక్కిలి యందకత్తె, మంచి సరసురాలు. ఆమె సమావేశములు స్వర్గసుఖతుల్యములే యగును. అయినను ఆమె కాముకురాలేకాని ధార్మికురాలు గాదు. ఆమెతండ్రిపై ప్రజల కెవ్వరికిని పడదు. అప్పటికిని ఏఁబదిలక్షలు కార్షాపణముల ఆస్తి యిప్పుడే యిచ్చివేసి తక్కినయాస్తి తనయనంతరమున నిచ్చిన నామెను వివాహమాడుటకు నే నంగీకరించితినిగాని యాలోభి తాను బ్రతికియుండువఱకును తనయాస్తిలో నేమియు నిచ్చుట కంగీకరింపకున్నాఁడు. ఆ సంబంధము నె ట్లంగీకరించుట?

విలాసవతిరూపము బహు యువతి సాధారణము. ఆకన్యగూడ మిక్కిలి సరసురాలే యగునుగాని రాణిగా నగుటకు తగిన గంభీరురాలు గాదు; మిక్కిలి వెలితిమనిషి. అందువలన దానిని నేను తిరస్కరించుట యుక్తమే యైనది.

పూర్ణ యన్నివిధముల గొప్పకన్య. భానుమతీసంబంధప్రత్యాఖ్యానమునకుఁ బిమ్మట నేను మాఅమ్మదగ్గఱ నాసంబంధముగుఱించి ప్రస్తావించితిని. అమ్మ యిష్టపడి నాయనగారి యొద్ద చెప్పినదిగాని యపవిద్ధయను కారణముచే వా రంగీకరింపలేదు. నన్ను, చిన్నబాబునుగూడ ప్రత్యేకముగా పిలిచి పూర్ణనుగుఱించి ప్రయత్నింపవల దని యీదినము ప్రాతఃకాలముననే ఖచితమైన యాజ్ఞగూడ నిచ్చియున్నారు.

మణిమాలనుగుఱించి నాయనగా రంగీకరింతునుగాని యాపిల్ల చక్కనిదియును కవి

శ్వరియు నైనను తగినంత చురుకుదనము గలది గాదు; మిక్కిలి ఛాందసురాలు.

"తూచాలు తప్పక తొలిపల్కు చెప్పు
నాచారమున నిష్ఠ యమల ధర్మంబు"

అని సభలో వ్రాకుచ్చినది. ఆమె రాణి యగు నెడల నంతఃపురములో మడిహడావడి యెక్కువ యైతీరును.

ధరణి యంగసౌష్ఠవము బాగున్నను, కవిత రమణీయముగా నున్నను బంధుబలము గలదిగాదు.

మధువాణి యన్నివిధములు బాగున్నది గాని విశ్వామిత్రులతో వసిష్ఠులకు సంబంధ మచ్చిరా దని యెవరో యొకపేటకము పెట్టి యున్నారు మా నాయనగారు ఆ సంబంధ మున కెంతమాత్రము నంగీకరింపరు.

పద్మాక్షి మంచి చక్కనిదిగాని చదువు రానిపిల్ల.

రత్నాంగి చక్కనిదియు, చదువుకొని నదియు నగునుగాని గొప్పకులీనురాలు గాదు.

కుముదాక్షి భానుమతివలె బంధు సంపత్తి గలది, మా రథినీకుమారివలె వ్యవహారనిపుణురాలు, మంచిచక్కనిది, బాగుగా చదువుకొనినది. మహామండలేశ్వర సత్యకర్మగారి రత్నప్రభ చిక్కనపుడు కుముదాక్షియే పరిగ్రాహ్యయని తోచుచున్నది. చిన్నబాబు నగరకన్యలలో నొకతెను వరించుట తటస్థించునెడల నాకు రత్నప్రభ తప్పక లభించును. ఆమె సర్వోత్కృష్టురాలగు కన్య.

## పదునొకండవ ప్రకరణము

### ఆఖరుసాక్ష్యము కోరుట

సుచంద్రుని రాజ్యారంభ కాలమునందు సుదర్శనుం డను సుప్రసిద్ధ బ్రాహ్మణ వైద్యుం డొకం డు కాలకేశియను తనభార్యతోం గూడ నింద్రదతీర్థ మను గ్రామమున సుఖజీవనము సేయుచుండెను. అతం డొకనాం డు తెల్లవారు జామున వీథితలుపుతీసిచూచునరికి వీథియరుం గుపై నొకస్త్రీశవమును, దానిప్రక్క నేడ్చుచు నొకరెండుమాసముల పసిశిశువును అతనికిం గనుపట్టిరి. ఆ స్త్రీరూపవేషములను బట్టి యొక భూసురాంగనవలె నుండెను. చనిపోయిన యా స్త్రీశవమును పరీక్షించి పిమ్మట సుదర్శన పురస్సరులగు గ్రామస్థులు దానిని దహనముచేసివేసిరి. ఆమెయొంట నుండిన నగలును, ఆమె మొలలో దొరకిన యొకజాబును జ్ఞాపకార్థముగా సుదర్శనుండుంచెను. ఆ జాబు నందలి గ్రంథ మిట్లుండెను :

"ప్రేయసీ! పిల్లవానితోంగూడ శ్రీకాకుళనగరికి వచ్చివేయుము. నేను నిన్ను విడిచి వెళ్లినవాండ నిచ్చటికి వచ్చితిని. నీవు వచ్చి నగరమునందు ధర్మశాలకు వచ్చిన చాలును. ఏయిల్లుగూడ వెతక నక్కఱలేదు. నేను ప్రతిదినము స్వయముగా ధర్మశాలకు వచ్చి చూచుచుందును. నిన్ను నేను ధర్మశాలలోనే సంధింపంగలను. ఇంద్రదతీర్థము దగ్గఱ నది దాంటుము. అచ్చట నెప్పుడును పడవ యాడుచుండును. మనము కలుసుకొనిన పిమ్మట నంతయును మాట్లాడుకొనవచ్చును.

కా॥ సు॥ వ్రాలు."

సుదర్శనుం డాపిల్లవానిని పెంచుటకు తనభార్యచేతి కిచ్చెను. ఆమె మిక్కిలి వాత్స

ల్యముతో తీసుకొనినది. ఆపిల్లవానికి సుదర్శనుఁడు కాలనాథుఁ డని పేరుపెట్టెను. జాబులో సంతకము చేసిన కా॥ సు॥ ఎవరో కనుగొనుటకు సుదర్శనుఁ డంతగా ప్రయత్నింపలేదు.

మూఁడు సంవత్సరములు గడచినవి. కాలకేశి సుదర్శనునివలన ధరణి యను నొక యాఁడుపిల్లనుగూడఁ గనినది. ధరణి పుట్టిన కొలఁదిదినములలో సుదర్శనుఁడు కృష్ణానది నిండుప్రవాహములో నీఁదుచు బలవత్తరమగు సుడివలన నామహానదిలో మునిఁగిపోయి యస్తమించినవాఁ డయ్యెను. భర్త మరణవార్త వినఁగానే శోకావేశమువలన బెంగపెట్టుకొని జబ్బుచేసి కాలకేశి మంచము పట్టినది. ఆజబ్బు ఆమె యవసానమును కల్లఁజూచినది. ఆమె తన యవసానకాలమునందు తనభర్తయాస్తిలో సగము ధరణికిని, సగము కాలనాథునకును నీయవలె నని గ్రామమునందలి పెద్దమనుష్యులదగ్గఱ చెప్పినది. కాలకేశియంత్యసంస్కారము నింద్రతీర్థవాసులే చేసిరి.

అనాథశిశువుల నొకమాసమువఱకును పొరుగింటి బ్రాహ్మణకుటుంబమువారు పెంచిరి. శ్రీకాకుళనగరిలోనుండి వారి బంధువులకు సంగతులు తెలియఁజేయఁబడినవి. కాలకేశిచెల్లెలు నీలకేశియు, సుదర్శనుని పితృవ్యపుత్త్రుఁడు ప్రమతియు తమ కుటుంబములతో వెళ్లి యింద్రతీర్థమునుండి యాపిల్లలను శ్రీకాకుళమునకు తీసుకొని వచ్చివేసిరి. ఆడపిల్లను పెంచుటకు నీలకేశియు, మగపిల్లవానిని పెంచుటకు ప్రమతియు పూనుకొనిరి. సుదర్శనుని యాస్తిలో సగము ధరణికిని, [illegible]

పంచిపెట్టఁబడెను ఆస్తియంతయు పదివేలు కార్షాపణములు కుండెను. నీలకేశిభర్త పతంగావధాని ధరణియాస్తికిని, ప్రమతి కాలనాథుని యాస్తికిని ధర్మకర్తలైరి. పతంగావధాని యింట ధరణియు, ప్రమతియింట కాలనాథుఁడును పెద్దవారైరి. సుమారు రెండుసంవత్సరములక్రిందట ప్రమతి కాలనాథుని సొత్తువడ్డీమొత్తముపెట్టి యొకమంచియిల్లు శ్రీకాకుళనగరములో కొని యాయింటికి ప్రౌఢుఁడైన కాలనాథుని పంపివేసినవాఁడయ్యెను. హాసలైకువేలు నతఁడు కాలనాథుని పరము చేసెను. పిల్లవాని సంరక్షణక్రింద నతని సొత్తులోనుండి యేమియును తాను తీసుకొనలేదు. వేఱుపఱచుటకు కారణము తాను భోగనాథునకు గురువై యంతరంగమిత్రుఁడై యుండ కాలనాథుఁడు భోగనాథుని ద్వేషించుపక్షములోఁ జేరుటయే. బలాత్కరించి తనపక్షములో పిల్లవానిని జేర్చుటగాని, తనపక్షమునకు విరుద్ధునితో తాను కలిసియుండుటగాని యతనికి కిట్టలేదు.

ఇప్పుడు కాలనాథుఁడు మంచి ప్రౌఢుఁడైన యువకుఁడు. అతఁ డాచార్యవిపమసిద్ధశస్త్రవిద్యాలయములో సర్వాయుధవిద్యలందును సుశిక్షితుఁడై యాంధ్రసామ్రాజ్యవీరవర్గములో మొదటిశ్రేణియందు వెలుఁగుచున్నాఁడు. ఆచార్య భవనందిగురుకులములో నుభయభాషాప్రవీణత సంపాదించి కాంకోలయోగశాస్త్రమును చదివియుండెను. ఆ కాలమున సత్యరథునితండ్రి కంకోల భట్టాచార్యులవారు (జటాముని) రచించిన యోగశాస్త్రము పఠనపాఠనములలో నుండెను. అప్పుడప్పుడు నీల భీమనాథులతోఁ [illegible] యోగవిద్యోపన్యాస

ములు వినుటలో పాల్గొనుచుండును. రాజకాళియం దతనికి యోగసిద్ధురా లని నమ్మకము. అతఁడు కృతవిద్యుఁడుమాత్రమే కాదు; చతురుఁడగు కార్యసాధకుఁడు, ఉద్రేకవంతుఁడగు వక్త, ప్రాప్తకాలజ్ఞుఁడగు సాహసి, నిరాయుధుఁడై సింహ వ్యాఘ్రాది మృగములతో పోరాడఁగలుగు బలవంతుఁడు, ఆకర్షకుఁడగు రూపవంతుఁడు, ఉచ్ఛృంఖల యువకసహవాసి యైనను దుర్వ్యసనవర్జితుఁడు, స్నేహితుల నాత్మకంటె నధికముగా ప్రేమించు స్నేహితుఁడు, నీ వనిన రక్షించువాఁడు, వగపట్టిన హతమార్చువాఁడు. ఇతఁ డిప్పుడు రాజుగారిసేనలో శతపతిగాఁ బనిసేయుచున్నాఁడు.

కొన్నిమాసములక్రిందట కాలనాథుఁడు తన యనలు జననీజనకులగుఱించి యెంతయో శోధించి కొన కిట్లు కనిపెట్టినాఁడు :

"తనతల్లి బ్రాహ్మణాంగన. పేరు శ్యామల. తనతండ్రి యొకనాగుఁడు. అతని సంపూర్ణ నామము కాళిక సులోచనుఁడు. కుళిక నాగేంద్రవంశసంభవుఁ డగు సులోచనుఁ డన్నమాట. శ్యామలా సులోచనులు చంద్రపల్లియను గ్రామమునందు వసించుచుండెడివారు. శ్యామల బ్రాహ్మణకన్య యైనను రాగాతిశయమువలన ప్రతిలోమముగా నాగుని పెండ్లియాడి స్వకులభ్రష్ట యైనది. తాను షాణ్మాసికశిశువుగా నుండునపుడు సులోచనుఁడు గ్రామాంతరమునకు వెళ్లినవాఁడు శ్రీకాకులనగరి చేరెను. అప్పుడు నగరిలో దసరాపండుగదినములు వచ్చినవి దాని కనేకస్థలములనుండి జనులు గుంపులు గుంపులుగా వచ్చిరి. సులోచనుఁడు చంద్రపల్లినుండి వచ్చిన యొకచాకలివానిచేతి కొకజాబిచ్చి తనభార్య కిమ్మని చెప్పిపంపెను. ఆజాబును సులోచనుఁ డొక బ్రాహ్మణ లేఖకునిచే వ్రాయించి తాను పొడియక్షరములచే సంతకముపెట్టెను. ఉత్సవమునుండి మఱలిన చాకలి జాబును శ్యామలచేతి కిచ్చినవాఁడయ్యెను. శ్యామల యాజాబు చదివించుకొని శిశువగు తనతోఁగూడ వీరపల్లి విడిచి బయలుదేఱినది. ఆమె యింద్రతీర్థగ్రామములో సుదర్శనుని వీథియరుఁగుపై పండుకొని యాకస్మికముగా హృదయచలన మాఁగి చనిపోయినది."

సులోచనుఁడు శ్యామల చనిపోయిన కొలఁదిరోజులలో నొకపడవ యింద్రతీర్థము దగ్గఱ మునిఁగిపోయి చాలమంది ప్రయాణికులు చనిపోవుటయు, వారిలో నొకతల్లియు పిల్లవాఁడుగూడ నుండి రని తెలియుటయుఁ బట్టి తన భార్యాపుత్రులు కృష్ణలో మునిఁగిపోయి రనియే నిశ్చయించుకొనినాఁడు. ఇంతలో నతనికి రాజుగారి సేనలో నుద్యోగము దొరకినది. ఒకచక్కని నాగకన్యగూడ నతనిని వరించినది. ఆసంతోషములో నతఁడు తన ప్రాఁతభార్యాపుత్రుల చింతను కడిగివేసినాఁడు. పిమ్మట నాపసయమును గుఱించి యతఁడు తలపెట్టనేలేదు. భటుఁడుగా ప్రవేశించిన సులోచనుఁ డిప్పుడు సేనలో శతపతిగా నున్నాఁడు. నగరియందు వీరుఁ డని ప్రసిద్ధి వడసియున్నాఁడు. పౌరులగు నాగనాయకులలో నొకఁడుగా వెలుఁగుచున్నాఁడు. సుమారు రైదాఱువేల వరాల యాస్తిని సంపాదించుకొనినాఁడు. నీలుఁడను ప్రచ్ఛన్ననామముతోనుండు నిశుంభు డతని పెంపకపు కుమారుఁడుగా నున్నసంగతిని పౌరకు లింతకు ముందే తెలుసుకొనియున్నారు.

కాలనాథుని శోధ ముగించినపిమ్మట సంగతి తెలియఁగానే సులోచనుఁడు కాలనాథుఁడు తనప్రథమభార్యాపుత్రుఁడని కనుఁగొనినాఁడు. అతఁడు కాలనాథునిదగ్గఱకు వచ్చి 'నీవుపుట్టిన కులములోఁ జేరి దానికి వన్నె తెమ్మని' వేఁడుకొనెను. ప్రమతి యతని వేఁడికోలు కష్టపడెను. ప్రమతిసులోచనులకు కొంతవాగ్వాదము జరిగినది. కొసకు వారిద్దఱును కాలనాథుఁ డేమిచెప్పునోయని యతని ముఖము చూచినవారైరి. అప్పుడు కాలనాథుఁడు సులోచనునిజూచి యిట్లు పలికెను:

"తండ్రీ, ఇప్పుడు నేను కాశ్యపసుదర్శన బాబునకు కృత్రిమపుత్రుఁడ నైయున్నాను. ప్రమతిబాబు నన్ను యథావిధిగా బ్రహ్మోపదేశముచే సంస్కారించెను. నేను జనకునకే పుత్రుఁడ నగుదునో పోషకునకే పుత్రుఁడ నగుదునో యీసంగతిని ధర్మాసనము నిర్ణయింపవలసియున్నది. అందువలన మీరు నన్నుమీపుత్రునిగా ప్రకటింపఁగోరుచు మహాన్యాయస్థానమున కొకవిన్నపమంపుఁడు. మీయొక్కయు, ప్రమతిబాబుయొక్కయు వాదప్రతివాదములు విని ధర్మాసన మెట్టి నిర్ణయ మొసఁగునో దానికి నేను బద్ధుఁడ నయ్యెదను."

కాలనాథుని సూచనప్రకారము సులోచనుఁడు మహాన్యాయస్థానమునకు విన్నపమంపుకొనెను. ప్రమతి ప్రతివిజ్ఞప్తి నంపెను. కాలనాథుఁడు "వాది ప్రతివాదులలో నెవరితోఁ గూడఁ జేరక మధ్యస్థుఁడనై యుండి ధర్మాసన నిర్ణయమునకు బద్ధుఁడ నయ్యెదను" అని వ్రాసి పంపుకొనినాఁడు.

ప్రాడ్వివాక శివదత్తుఁడు వ్యాజ్యమును విచారణ చేసినాఁడు. ఉభయపక్షముల విచారణ యాదివారమునాఁటికే ముగించిపోయినది. అతఁ డింక తీర్పు చెప్పవలసియుండెను. ఆ దీర్ఘాలోచనపరుఁడగు ప్రాడ్వివాకుఁడు తీర్పుచెప్పక కాలనాథునే ఈ విషయములో నొక ముఖ్యప్రశ్న గుఱించి యాఖరుసాక్ష్యము కోరుచు బుధవారమునాఁడు ప్రాతఃకాలమున కాలనాథున కొక సూచకపత్రము (నోటీసు) పంపినాఁడు. సులోచనుని జనకునిగా నీయంతరాత్మ చెప్పుచున్నదో లేదో యీసంగతిని గుఱించి సాక్ష్యము చెప్పుటకు మఱునాఁడు గురువారము పూర్వాహ్ణమున తన ధర్మాసన సన్నిధికి రావలెనని దానిలో నున్నది. ఇట్లు న్యాయస్థానమువారిచే కాలనాథుఁడు తీర్పుకు ముం దాఖరుసాక్షిగా కోరఁబడినాఁడు. ఈ సమాచార ముభయపక్షములవారికిని తెలిసిపోయినది. అంతమాత్రమున నూరకుండలేదు. పట్టణములోని యనేకప్రముఖుల చెవులకుఁగూడ నెగఁబ్రాఁకినది. ఈ వ్యాజ్యపు పర్యవసాన మెట్లుండునో యని కనిపెట్టు కాణ్వాశుకనాసున కీ సూచకపత్రపుభోగట్టా తెలియుటయే యింతవ్యాప్తికి కారణము.

## పండ్రెండవ ప్రకరణము

### సాక్షిపై నుభయపక్షముల ప్రచారము

కాలనాథుని సాక్ష్యము ననుసరించియే శివదత్తుని తీర్పుండునని యుభయపక్షములవారు ననుమానించిరి. బుధవారమునాఁడు మధ్యాహ్న భోజనానంతరము దండనాయక పింగాక్షుఁడును, చంద్రసేన నాగేంద్రుఁడును, నాగప్రముఖులలో నొకఁడగు సహస్రపతి బలభద్రుఁడును, తనకృత్రిమపుత్రుఁ డగు నీలునితోఁగూడ సులోచనుఁడును కాలనాథుని యింటికి వచ్చి యతనిని సంధించిరి. వీరిలో

పింగాక్షుఁడు మనకాలనాథునకు శోధనములో మిక్కిలి సహాయపడియుండెను. అతఁడు ముందుగా తనమిత్రున కిట్లు బోధింప నారంభించినాఁడు:

"మిత్రమా! బయలుదేరిన శ్యామల శ్రీకాకులము చేరలేదు. కృష్ణలో మునిఁగి పోయిన తల్లియు పిల్లఁడును వేఱు బీద బ్రాహ్మణియు నామెపిల్లఁడు నని మనకుఁ దెలిసినది. ఇంతియే చాలదా యింద్రతీర్థమున గతించినయామె శ్యామల యనుటకు? అందువలన నీవు సులోచనపుత్రుఁడ వను విషయములో సంశయ ముండఁగూడదు. బ్రాహ్మణత్వ మననేల, దేవత్వము వచ్చు ననినను నీవు సత్యగుణుండి చలింప వను సంగతి నాకు తెలియనిది గాదు. ప్రాడ్వివాక శివదత్తుఁడు తీర్పుభారము నంతటిని నీకే విడిచినట్లు చెప్పవచ్చును. నీయంతరాత్మ యేమిచెప్పునోయని యాంధ్రరాష్ట్రమునందలి నాగజాతి యంతయు నీప్రక్కకు గాఢ మగు నాశతో చూచుచున్నది."

సులోచనుఁ డిట్లనెను: "నాయంతఃకరణప్రీతి నీవు నాపుత్రుఁడవే యని తృప్తికరమగు సాక్ష్య మిచ్చుచున్నది. పరిశుద్ధమగు నీయంతరాత్మపై నాకు నమ్మకము గలదు. అయినను ఒకసంగతి నీకు చెప్పుట కిప్పుడు వచ్చితిని. ప్రాడ్వివాకుని తీర్పు నా కనుకూలముగా నుండునెడల నీయిల్లు కొనినసొత్తును కాశ్యప సుదర్శనుని యాస్తిలోనుండి నీకు వచ్చిన యసలుమూలద్రవ్యమును నేను ధరణి కిచ్చుకొందును. నీవు నాపుత్రుఁడవుగా నుండి సుదర్శనునిసొత్తు తినవలసిన సందర్భమును నీకు నేను కలుగఁజేయను."

నీలుఁ డిట్లు పలికెను: "సోదరా! నా యీ యాయసభుజములకు నీ సౌవర్ణభుజములు తోడగునెడల మన అన్నదమ్ములకు ప్రపంచములో నెదు రుండదు."

బలభద్రుఁ డిట్లు వక్కాణించెను: "మిత్రుఁడా! నాగుల యదృష్ట మంతయు సత్యమగు నీ సాక్ష్యముపై నాధారపడి యుండదు."

చంద్రసేనుఁ డిట్లు వచించెను: "కాలనాథబాబు! ప్రాడ్వివాక శివదత్తుని తీర్పు మానాగులకే యనుకూల మగునెడల నా కొమారితె పర్ణినిని లక్షవరాలు కట్నముతో నీకు నే నిచ్చుటకు సంసిద్ధుఁడనుగా నున్నాను. ఆంధ్రసామ్రాజ్యమునందేగాక ప్రపంచమునందలి నాగకన్యకలలో నాకూఁతు రగ్రగణ్యురాలని యామెను తెలుసుకొనినవా రొప్పుకొనకతీరదు. షడ్జమధ్యమ గ్రామములే కాక గాంధర్వగ్రామముగూడ నాపిల్ల సంగీతములో గోచరించు నని సంగీతశాస్త్ర పారంగతుఁడు దండనాయక బలవర్ధనుఁడు చెప్పుట గలదు. దేవవాటికా దుర్గపాలుఁడును, దండనాయక పింగాక్షుఁడును, ఇంక నెందఱో యుత్తమనాగయువకులును ఆ కన్యకామణిపాణిని గోరుచున్నారు. నీ యంతరాత్మ నిన్ను కాళిక సులోచనుని పుత్రునిగానే చెప్పునెడల నీ కది సులభ మగును."

"నేను సాక్ష్యము చెప్పినపుడు నా యంతరాత్మకు తోఁచినసత్యము చెప్పుదునే కాని బ్రాహ్మణత్వమునకుఁగాని, వేఱు ఫలమునకుఁ గాని లోఁబడి కూటసాక్ష్యము నీయ నని మీరు నమ్మవచ్చును" అని చెప్పి కాలనాథుడు వారిని పంపివేసెను.

పిమ్మట ప్రమతి వచ్చి యిట్లు కాలనాథునకు హెచ్చరిక చేసెను— "నాయనా! నీయంతరాత్మ చెప్పినవిధమున నీవు సాక్ష్యమిచ్చువిషయములో నేను జోక్యము కలుగఁజేసుకొనరాలేదు. ప్రాడ్వివాక శివదత్తుని తీర్పు మా అన్నయ్యకు ప్రతికూలముగా నుండునెడల నేను నీకు చేసిన బ్రాహ్మణజాత్యుచితసంస్కారము లన్నియు తత్క్షణమే తుడుచుకొనిపోవును. అందువలన నీవు బ్రాహ్మణకులాచారము ననుసరించి సుదర్శనదంపతులకు యథావిధిగా పార్వణశ్రాద్ధమాచరించుట నిలిపివేయవలసివచ్చును గాని కేవల సంకల్పవిధానముచే నామశ్రాద్ధముల నాచరించుకొనవచ్చును. నిన్ను పెంచిన తల్లియాదేశప్రకారము నీ కిచ్చిన యాస్తిని నీవు ధరణికి త్రిప్పియీయ నక్కఱలేదు."

ఈమాటలు చెప్పి ప్రమతి నిష్క్రమించెను.

కాలనాథుఁ డొంటరిగాఁ గూర్చుండి తర్కించుట కారంభించినాఁడు. అనుమానముల బలము సులోచనుని ప్రక్కకు లాగుచున్నది. ప్రీతి భావనాజన్యముగా కన్పట్టుచున్నది గాని సహజముగాఁ గన్పట్టుటలేదు ఆ తర్కములో నతనికి చంద్రసేనుని కన్యాదానప్రతిజ్ఞ జ్ఞప్తికి రాలేకపోలేదు. అది గొప్ప లాభదాయకమగు సంబంధమగుటయే కాక యతి సౌఖ్యావహ మగు సంబంధ మని కూడ యతనికి తట్టకపోలేదు. పర్ణిని సనిమేష గంధర్వాంగన యని బలవర్ధనుని పలుకు. నాగుల భాగ్యదేవత యని పింగాక్షునిమాట. భూమికి దిగిన యచ్చర యని రూపచంద్రుని నిర్ణయము. నేలకు జాఱిన నక్షత్రమని వీరసింహుని వచనము. ప్రాణములతో సంచరించు పంచబాణుని రత్నపాంచాలిక యని బలభద్రుని తీర్పు. మహావీరాంగన యని యక్షోభ్యుని వాక్కు. సర్వోత్కృష్టవాణి యని రాజకాళి జయవాదము. పర్ణినిని గుఱించి పుట్టిన యీ ప్రశంసాస్త్రము లన్నింటిని కాలనాథుఁ డంగీకరించితీరును. స్వయముగా నతఁ డనేకపర్యాయము లామెను జూచియున్నాఁడు. అతని కనులు పూర్ణాగారథినులకు సమానురాలినిగా నామెను శ్లాఘించినవి. అతఁ డనేకపర్యాయము లామెపాటను వినియున్నాఁడు. అతనిచెవు లా పాటను దివ్యమని పొగడినవి. అప్పు డామెమోహనమూర్తి యతని మనోవేదికయందు ప్రత్యక్షురాలయ్యెను. ఆమె కోమల మగు తన హస్తము సాఁచి నాగకులములోఁ జేరుటకు తనను పిలుచుచున్న ట్లుండెను. వెంటనే యతని మనస్సాక్షి యతని నా ప్రక్కనుండి మరలించినవాఁ డయ్యెను. ఇట్టి సమయములో నీ వాశలకు లోనుగాక సత్యమును వచించుటకే ప్రయత్నింపు మని యతఁ డుచ్చైస్స్వరముతో నాజ్ఞాపించినాఁడు.

ఇట్టి సమయమున గదిలోని కొక మనిషి వచ్చి తన చేతి కొకపత్ర మిచ్చి వెళ్లినవాఁ డయ్యెను. కాలనాథుఁడు ససంభ్రమముగా దాని నందుకొని విప్పి చదువుకొనినాఁడు.

"ప్రియసఖుఁడా! మహాన్యాయస్థానము నుండి నీకు సాక్ష్యసూచకపత్రము వచ్చిన పిమ్మట కొందఱు నాగప్రముఖులు నీదగ్గఱకు వచ్చి యేమియో చెప్పివెళ్లిరని మాకు తెలిసినది. స్వయముగా నీ వాలోచించుకొని నీ యంతరాత్మనిర్ణయమును కనిపెట్టి సాక్ష్యము చెప్పవలసినవిషయములో పరులు జోక్యము కలుగఁజేసికొనుట తప్పు. అందు

వలననే బ్రాహ్మణయువకులలోనుండి యెవ్వరు నీరోజున నీదగ్గఱకు రాకుండ మేము కట్టుఁబాటు చేసితిమి. మా ప్రతిపక్షులు తమప్రచారమును నిర్భయముగా చేసినందున మేమూరకుండినచో, మాపక్షమునకు నష్టము వాటిల్లునను భయముచే మౌనమును విసర్జించి మేమీ జాబు వ్రాయవలసివచ్చినది. నగరపాల ఘనేంద్రబాబు ఇట్టి స్థితిలోఁగూడ మమ్ములను సమానముగానే యుండుఁడని చెప్పెను గాని మా కొండఁబట్టినది గాదు. నీవు సాక్ష్యము చెప్పునపుడు గమనింపవలసిన విషయములు రెండని మేము సూచించుచున్నారము. మొదటిది శతపతి కాళికసులోచనుఁడు జనకుఁడౌనా కాఁడా యను విషయములో నీ యంతఃకరణములో స్వల్ప సందేహము తలసూపినను దానిఫలితమును నీ విప్పుడుండు జాతికే చెందఁజేయవలెను. రెండవది బాహ్యానుమానసామగ్రిపై నాధారపడక సహజభావముచే చక్కఁగా నీవీవిషయములో గమనింపవలెను. బాల్యమునుండి నీకును మాకును గల పరస్పర ప్రేమానుబంధముచే సాహసముతో నీ జాబును నీకు వ్రాసితిమి.

కుమారకౌండిన్య శక్తిధరుఁడు వ్రాలు
దండనాయకకౌండిన్యధనంజయుఁడు వ్రాలు
శతపతియాంగిరసమల్లికార్జునుఁడు వ్రాలు
శతపతి వాత్స్యాయన విష్ణుశర్మ వ్రాలు"

కాలనాథుఁడు జాబు చదివి ముగించి యంతఃకరణమును పరీక్షింప నారంభించినాఁడు. ఇంతలో నతనికి కిటికీసందులోనుండి రాజకాళమ్మ పాడుపాటలు వినఁబడినవి.

"వంచకులగువారి వచనము వినక
మెచ్చినవారికిఁ బిండము పెట్టు
ఇలఁ బ్రాణములతోడ నిటునిటు తిరుగ
నిలిపిన ఘనుపేరు నిలఁబెట్టవలయు.
శునకి నక్కనుగూడి కనునె సింగమును
పెనుసర్పమున కెట్లు పెదజోగి పుట్టు?
పుట్టకుఁ బుట్టునా పురుహూతుధనువు?
గుట్టకుఁ బుట్టునా కోకబాంధవుఁడు?
కుక్క కుక్కను గూడి కులములోఁ గలిసె
నక్క నక్కనుగూడి నాడులో వెలసె.
మాయలమల్లియా మహిలామతల్లి
కాయంబులోనుండి కదలివచ్చితివి.
కయ్యాలభామయా దయ్యాలరాణి
యయ్యాలలోనుండి యూడివచ్చితివి.
భువిఁ దిరుగాడెడు భూతాలసాని
చవిగలయొడినుండి జాఱివచ్చితివి.
ఉపమ గానఁగరాని యుద్ధతనారి
విపులవక్షోవాటి విడిచివచ్చితివి.
పాలువేసినతల్లి ఫల మెట్లు తినును?
పాలునిరతును బాలింపుమయ్య"

తాను కనిపెట్టిన యానుమానికసామగ్రీవాదము రాజకాళిపాటలచే పటాపంచలు చేయఁబడినది. ఆపాటలలోని పూర్వభాగమున కర్థము కాలనాథున కవగత మైనది. రాజకాళియున్మాదము వేష మనియు, నామె యొక మహాయోగిని యనియు విశ్వసించు వారలలో కాలనాథుఁ డొకఁడు. ఆమె యుద్దేశపూర్వకముగానే తన కర్థ మగునట్లు సమయోచితోపదేశము చేసెనని యతఁ డనుకొనెను. మొదటి ద్విపద చంద్రసేనుని కన్యాదానప్రతిజ్ఞలో నేదియో వంచకాభిప్రాయ మున్నది యని చెప్పుచున్నది. మూఁడవ ద్విపద తాను శ్యామలా సులోచనుల పుత్రుఁడు కానట్లు పలుకుచున్నది. నాల్గవ ద్విపద చనిపోయినస్త్రీ తనతల్లి గా దని

చాటుచున్నది. ఐదవద్విపద శ్యామలపై నపరాధ మారోపించుచున్నది. చనిపోయిన స్త్రీ శ్యామల గాదని దాని యంతరార్థము. అనంతరద్విపద లైదును తన తల్లినిగుఱించి విచిత్రసంగతులను దెలుపుచున్నవి. అసలు విషయమే తిరిగియు నంధకారబంధుర మై పోయినది. అప్పు డతని మనస్సాక్షి యుచ్చ ధ్వనితో నిట్లు పలికినది :

"కాళిక సులోచనుఁడు నీతండ్రి యెంత మాత్రమును గాఁడు. నీ వింకను సరియైన పరిశోధన సలిపి నీయసలుతండ్రులనుగుఱించి తెలుసుకొనుము."

## పదుమూఁడవ ప్రకరణము

### శివదత్తుని తీర్పు

గురువారమునాఁడు పూర్వాహ్ణమున ప్రాడ్వివాక శివదత్తునిచే కాలనాథుని సాక్ష్యము తీసుకొనఁబడినది. అతఁడు తన యంతరాత్మ కాళిక సులోచనుని జనకునిగా ప్రేమింపఁజాలకున్నది యని తనసాక్ష్యము చెప్పెను. అందులో నతఁ డేమియు నసత్యము చెప్పలేదు. రాజకాళిపాటలను వినకముందు గూడ నతనికి సులోచనునిపై సహజ పితృభావ మేర్పడియుండలేదు.

కాలనాథునిసాక్ష్యము ముగించినపిమ్మట శివదత్తుఁడు తీర్పు వ్రాసి మాధ్యాహ్నికమునకు లేవకముందే వినిపించినవాఁ డయ్యెను.

"శతపతి కాళికసులోచనుఁడు శతపతి కాశ్యపకాలనాథుని కశ్యపులనుండి విడఁబఱిచి తనపుత్రునిగా ప్రకటింపఁగోరుచు మహాన్యాయస్థానమున నొక విజ్ఞప్తిని పంపి యున్నాఁడు. పౌరసామంత కాశ్యపప్రమతి యావిజ్ఞప్తి నాక్షేపించుచు ప్రతివిజ్ఞప్తి పంపెను. మాచే నుభయపక్షముల సాక్ష్యములును, వాదప్రతివాదములును పరిశీలింపఁబడినవి. కొనకొక ముఖ్యప్రశ్న విషయములో మా సంశయము నివారించుకొనుటకు శతపతికాలనాథునిగూడ విచారించితిమి.

"ఆదియందు సులోచనునిపక్షమున కాలనాథుని సంరక్షణము ధర్మార్థమే కాని పుత్రార్థము గాదని వాదింపఁబడినది. కీ. శే. పండిత సుదర్శనుఁడు తన పినతండ్రికుమారుఁడైన మానసీయప్రమతికి వ్రాసిన యొక జాబులో తాను కాలనాథుని కృత్రిమపుత్రునిగా చేసుకొంటి నని స్పష్టపఱుపఁబడి యున్నది. కీ. శే. కాలకేశి తమయాస్తిలో సగము కాలనాథున కిమ్మని యాదేశించుటయు నాభావమునే వ్యక్తపఱచుచున్నది. ప్రమతిబాబు కాలనాథునకు బ్రహ్మణజాత్యుచితసంస్కారము నాచరించి తనకీర్తిశేష సోదరుని సంకల్పమును పూర్తిచేసినాఁడు. పౌరులందఱును కాలనాథుని కాశ్యపునిగా వ్యవహరించుట యతఁడు సుదర్శనపుత్రుఁడని తెలుసుకొనుటవలననే యగుచున్నది. అందువలన మేముగూడ నతనిని కీ. శే. పండిత కాశ్యప సుదర్శనుని కృత్రిమపుత్రునిగానే యంగీకరించితిమి.

"అజ్ఞాతకులగోత్రుఁడగు కృత్రిమపుత్రుని యొక్క అసలు జననీజనకులు మధ్యకాలములో తెలిసినపు డెట్లు నిర్ణయించుట యను ప్రశ్న యిప్పుడు మాముందుకు వచ్చి యున్నది. ప్రకృతమునందు శ్యామలాసులోచనులే కాలనాథుని తలితండ్రు లగునెడల నతనిని పెంచకపోవుటలో వారి తప్పేమియు లేదు. శ్యామల పరలోకగతురా లయ్యెను

సులోచనుఁడు తనపుత్రుఁడు కృష్ణలో మునిఁగిపోయె నని భ్రాంతి చెందెను. అందువలన వారికి తమపుత్రునిపైఁ గల మాతాపితృధికార ముపేక్షాదోషదూషితము కాలేదు. అందువలన నట్టిసందర్భములో కాలనాథుఁడు శ్యామలాసులోచనుల మాతాపితృ కార్యకరణబాధ్యుఁడగు నౌరసపుత్రుఁ డనియే చెప్పక తప్పదు. అప్పుడు కృత్రిమౌరస పుత్రత్వములకు పరస్పర సంఘర్షణము కలుగును. పెంపకపుతండ్రి బ్రాహ్మణుఁ డగుటచేతను జనకుఁడు నాగుఁడగుటచేతను, పిల్లవానిని ద్వ్యాముష్యాయణునిగా నిర్ణయించుటకు వలనుపడదు. నాగకులమును, బ్రాహ్మణకులమును చేరి యొకనియందు విరోధము లేక వర్తింపవుగదా! ఆర్షసంప్రదాయ ప్రకారము ద్విగోత్రు లుందురుగాని ద్వివర్ణు లుండరు. అందువలన నేకవర్ణమునందు మాత్రమే ద్వ్యాముష్యాయణత్వము సిద్ధించును. ప్రకృత సందర్భములవంటి స్థలములలో సంఘర్షణ మేర్పడినపుడు కృత్రిమత్వముకంటె నౌరసత్వమే బలవత్తర మని మా యభిప్రాయము.

ఇఁక కాలనాథుఁడు కౌళిక సులోచనుని యౌరసపుత్రుఁడేనా యను విషయము తేల్చవలసియున్నది. కాలనాథుని పరిశోధనకు సంబంధించిన సాక్ష్యాంశములు మాచే పరీక్షింపఁబడినవి. తా నొకజాబును సులోచనునుండి తీసుకొనివెళ్లితి ననియు, నాజాబును శ్యామలచేతి కిచ్చితి ననియు రజకుఁడు చెప్పుచున్నాఁడు. జాబువ్రాసిన బ్రాహ్మణుఁడు స్వర్గతుఁడైనను అతని కుమారుఁ డా జాబులోని దస్తూరి తన తండ్రిదే యని యంగీకరించుటయే కాక యతని దస్తూరిగల కొన్ని పత్రములనుగూడ ధర్మాసన సన్నిధిలోఁ జూపినవాఁడయ్యెను. జాబులోని దస్తూరి సులోచనుఁడు చెప్పిన బ్రాహ్మణునిదే యని మేము తృప్తి చెందితిమి. శ్యామల యక్షరజ్ఞానము లేని స్త్రీ యగుటచే నాజాబును చంద్రపల్లిలో నుండు నొక బడియుపాధ్యాయునిచే చదివించుకొనినది. అతఁడు తన సాక్ష్యములో జాబుయొక్క గ్రంథమును సమముగా చెప్పఁజాలకపోయినను జాబు తాత్పర్యమును చెప్పియున్నాఁడు. అది యించుమించుగా ప్రకృత లేఖ తాత్పర్యమునకు సరిపోవుచున్నది. సంబోధన మేపదములో నుండెనో యదిగాని, ధర్మశాలవిషయముగాని యతఁడు చెప్పఁజాలకపోయెను. సంతకము పొడియక్షరములతో నున్నది యనిమాత్రము నిర్ధారణగా చెప్పుచున్నాఁడు. అయినను జాబులోని సంతక మిప్పటి సులోచనుని పొడియక్షరముల సంతకమువలె లేదు. తన దస్తూరి కాలక్రమమున బాగుపడినది యని వాది సమాధానము చెప్పుచున్నాఁడు. అందువలన నాజాబు సులోచనుఁడు వ్రాయించినది కావచ్చును. అథవా కాకపోవచ్చును. అతఁడు వ్రాయించినదే యని నిర్ణయించుటకు బలవత్తరలింగ మెద్దియును లేదు. ఒకపిల్లవానితో కలిసిన తల్లిదగ్గఱ నాజాబు కన్పట్టుటయు, నాతల్లి వేఱుస్త్రీయని నిర్ధారితము కాకపోవుటయు, పిల్లవానితో బయల్వెడలిన శ్యామల శ్రీకాకుళము చేరకపోవుటయు జాబును సులోచనుఁడు వ్రాయించినదానినిగా స్థిరపఱచుచున్నవియని వాదిపక్షమున వాదింపఁబడెను. వాదిపక్షమువారే ఆదియందు వాదములో నాజాబే యా చనిపోయిన స్త్రీ శ్యామల యనుటకు బలవత్తరలింగ మని వాదించియున్నారు. ఈరెండు లింగముల కన్యోన్యా

శ్రయదోషము పట్టుటచే వాటిబలము సన్న గిల్లుచున్నది. జాబు సులోచనీయ మగు నెడల చనిపోయిన స్త్రీ శ్యామల యగును. చనిపోయిన స్త్రీ శ్యామల యగునెడల జాబు సులోచనీయ మగును. ఇదియే యన్యోన్యా శ్రయదోషము.

చనిపోయిన స్త్రీ రూపవేషములను గుఱించియు, శ్యామల రూపవేషములను గుఱించియు సాక్షుల కథనము స్వల్పవ్యత్యాసముతో సరిపోవుచున్నది. పిల్లవాని రూపమును గుఱించి సాక్ష్యములో మఱికొంచె మధిక వ్యత్యాసము గలదు. ప్రేక్షకుల దృష్టిలోని వ్యత్యాసములే కాని యవి రూపవ్యత్యాసములు గావనియు, ప్రధానాంశములుమాత్రము సరిపోయినవా లేవా యను విషయ మొక్కటియే గమనింపఁదగినది యనియు వాదిపక్షమున వాదింపఁబడినది. ఇతరానుమానికసామగ్రి బలవత్తరముగా నున్నప్పుడీ స్వల్పవ్యత్యాసములు ప్రతిబంధకములు గావు గాని యిట్టివ్యత్యాసములతోఁ గూడిన రూపసాదృశ్యమే బలవత్తరలింగ మొకటి యని చెప్ప వలనుపడదు.

సులోచనుని పోలిక కాలనాథునియం దేమియును లేకపోవుటచే నతని యౌరసపుత్రుఁ డితఁడు గాఁడని ప్రతివాదిపక్షమున వాదింపఁబడినది. బాహ్యశరీరమునందు తండ్రినిపోలని కుమారులను కొందఱిని జూపి యది యంత ముఖ్య ప్రతిబంధకము గాదని వాదిపక్షమున సమాధానము చెప్పఁబడినది. వాదిసమాధానము నంగీకరించినను మిగిలిన బలవత్తరలింగ మెద్దియును కన్పట్టదు.

ప్రతివాదిపక్షమున మఱియొక విచిత్ర వాదము చేయఁబడినది. తనయొకయు ప్రాసిన జాబును చూచినపిమ్మట దాని ప్రయోజనము ముగించినది. పిల్లవానితో మగని దగ్గఱకు పోవునపుడు ఆజాబు నంత భద్రముగా నామె మూటగట్టి తనతో తీసుకొనిరా నవసర మేమి? చనిపోయిన స్త్రీ యొక కాంతుని జాబును కాంతయొద్దకు తీసుకొని పోవు మనిషివలె నున్నది." ఇది యావాదము. ఆపక్షమునందు "కా॥ సు॥" వేఱు వ్యక్తి. మనకుఁ దెలిసినంతవఱకు సామ్రాజ్యమునందు మఱి యిద్దరు కా॥ సు॥ లు గలరు. ఒకరు మన మహారాజ పరమేశ్వర శ్రీ కౌండిన్య సుచంద్రభట్టారకులు. మఱియొకరు మహామండలేశ్వర కౌత్స సత్యకర్మ సహోదరులు కౌత్స సుకర్మ. మహారాజుగారి సంతకమునకును జాబులోని పొడియక్షరములకును పోలిక లేదు. కౌత్ససుకర్మసంతకము ధర్మాసనముయొక్క యెదుటికి రాలేదు. కనుక నావాదము సంశయగ్రస్తముగానే యున్నది. కొసకు వాదిప్రతివాదులలో నెవరునుగూడ నిస్సంశయముగా తను వాదమును సమర్థించుకొనలేదనియే మే మెంచుచున్నారము. అట్లుండినను వాదియే సమర్థనభారమంతయు వహింపవలసియున్నది గాన ప్రతివాది ఖండింపఁజాలనంతమాత్రమున వాది కృతార్థుఁడు కాఁజాలఁడు. తాను తన వాదమును నిస్సంశయముగా ఋజువు పఱచుకొనవలసియున్నది. అతఁ డట్లు ఋజువుపఱచుకొనఁజాలఁ డయ్యెను.

శతపతి కాలనాథుని యంతరాత్మ కౌశిక సులోచనుని తన తండ్రినిగాఁ జెప్పునెడల నది యతఁడు కనిపట్టిన యానుమానిక సామగ్రిలోని చిన్నచిన్న లోపములను సరిపట్టు బలవత్తరలింగ మయ్యెడిది. అతని

సాక్ష్యము వాదివాదమునకు మిక్కిలి ప్రతికూలముగా నున్నది. ఇట్టి లోపయుక్త లింగములవలన ననుమానింపఁబడు ఔరస పుత్రత్వము ప్రత్యక్షమగు కృత్రిమపుత్రత్వమును బాధింపఁజాల దనియే మా అభిప్రాయము. అందువలన కౌళికసులోచనుని విన్నపము త్రోసివేయఁబడినది. కాలనాథుఁడు కాశ్యపుఁడుగానే యుండవలెను.

ప్రాడ్వివాక భారద్వాజ శివదత్తుఁడు వ్రాలు. విజయ సంవత్సర జ్యేష్ఠశుద్ధ నవమీ గురువారము."

## పదునాల్గవ ప్రకరణము

### జాబులును, ప్రత్యుత్తరములును

శ్రీర్పనకు పిమ్మట శ్రీకాకుళమునందలి నాగుల ముఖములు వాడిపోయినవి. బ్రాహ్మణుల ముఖములు వికసించినవి. ఇది ప్రాయోవాదము. ఆదినము మధ్యాహ్నానంతరమున కాలనాథునకు మూఁడభినందనపత్రములును, ఒక యభినందనపూర్వక సదైన్య ప్రార్థనాపత్రమును వచ్చినవి.

#### మధువాణి జాబు

"నా ప్రియమైన బావా!

నీసాక్ష్య మెట్లుండునో యని మేము మిక్కిలి భయపడితిమి. మా మామయ్య ప్రమతికి సంతతియును లేదు. మా పెద తాతయ్యగారి సుదర్శన మామయ్య కైనను సంతతి గల దని మేము కొంత సమాధాన పడుచుంటిమి అట్టి సందర్భములో కౌళిక సులోచనుని వ్యాజ్యము తలవని తలంపుగా వచ్చినది. మహాబుద్ధిమంతుఁడగు శివదత్తసూరి కొనకు సులోచనుని వాదములోని లోపములను కనిపెట్టి మా పెద్దమామయ్య వంశమును నిలఁబెట్టినాఁడు. నేను స్వయముగా వచ్చి నిన్నభినందింపవలె నని యనుకొంటిని గాని మా నాయనగారికి చిన్న జ్వరము తగులుచుండుటచే రాఁజాలకపోతిని.

సాలంకాయని మధువాణివ్రాలు."

#### పూర్ణ జాబు

"నా ప్రియమైన అన్నయ్యా!

కొనకు బ్రాహ్మణులు గెలిచిరి. విశేషించి కశ్యపులు గెలిచిరి. ఇంక కశ్యపుల కీర్తిపతాక శ్రీకాకులనగరిలో నున్నతమై యెగురును. మీయంత రాత్మ సరియైనమాటనే మహాన్యాయస్థానమునఁ బలికించినది. నా దృష్టికి మీ శరీరములో నాగజాతిరక్త మొక బిందువుగూడ ప్రవహించునట్లు కన్పట్టుట లేదు. ఇన్నాళ్లకు సరియైన బ్రాహ్మణుఁడు బ్రాహ్మణులకు స్థిరపడినాఁడు. ప్రాడ్వివాక శివదత్తసూరిమిమ్ములను కశ్యపులలో స్థిరముగా స్థాపించినందులకు వందనీయులు.

రాధీశరి పూర్ణవ్రాలు."

#### శక్తిధరాదులజాబు

"ప్రియసఖుఁడా!

కొనకు మే మనుకొన్నట్లే నీయంతరాత్మ నిన్ను పలికించినది. మాజాతినుండి మహారత్నము జారిపోలేదు. ఈ దినమును ఆంధ్ర బ్రాహ్మణులు ఉత్సవదినమునుగా పరిగణింతురు. అసలు నీజాతిలోనే నీవు నిలితి వని మా నమ్మకము. నీతల్లివలె నీజనకతండ్రి గూడ బ్రాహ్మణుఁడనియే మా అవిచాల్యవిశ్వాసము. నీ అసలుతల్లిదండ్రులిద్దఱిని కనిపెట్టుట కీ దినముననే మేము రహ

సార్వరపరిశోధక వర్గాధిపతి ఘూరకి ప్రమథ నాథున కొక సూచనను పంపగలము.

కుమారకౌండిన్య శక్తిధరుఁడు వ్రాలు.
దండనాయకకౌండిన్యధనంజయుఁడు వ్రాలు
నగరపాలభారద్వాజఘనేంద్రుఁడు వ్రాలు
శతపతియాంగిరసమల్లికార్జునుఁడు వ్రాలు
శతపతివాత్స్యాయన విష్ణుశర్మ వ్రాలు"

ధరణిజాబు

"నా ప్రియమైన అన్నయ్యా!

ఈదినమున శివకీర్తిసూరి తీర్పును గుఱించి విని గట్టునఁబడితిని. కొన్నాళ్లనుండి నీకొకజాబు వ్రాయవలె నని యనుకొంటిని గాని యిదివఱకు నాకు తీరిక కాలేదు. కారణము ను వివరించి నా దినచర్యా కష్టమంతయు నీ జాబులో వెళ్లఁబోయుట యకాలోచితమని మానివేయుచున్నాను. ఈదనపు శివదత్త సూరితీర్పు వాదికనుకూలముగా నుండు నెడల నేను సముద్రమున మునిఁగిపోవలసి నదే. భగవంతుఁ డతని లేఖినిలో ప్రవేశించి నన్ను కాపాడినాఁడు. నా భావినంతటిని పాడు సేయుటకు మన పినతల్లిభర్త సంకల్పించి యున్నాఁడు. ఆ విషయమునుగుఱించి ప్రత్యక్షముగా నీతో మాటాడవలెనే కాని కొలఁది మాటలలో వ్రాయ నలవిగాదు. మన ప్రమతి బాబయ్యగారి కవధాని బాబయ్యగారితో నేమియును పడదు. మన రెండుప్రక్కల పిన తల్లు లిద్దఱికిని మధ్య పచ్చిగడ్డి వేసిన భగ్గు మనును. నే నెప్పుడును ప్రమతి బాబయ్య గారియింటికి వెళ్ల నని వారికి కోపము. వీరు వెళ్లనీయరు. నా కష్టముల నన్నింటిని ప్రమతి బాబయ్యను పిలిపించి యతనితో చెప్పుటకు ధైర్యము చాలకున్నది. అతనియగ్గఱ నా కంతగా చనువు లేదు. ఇప్పుడు నీభాయ నాకు దూరస్థ మగునెడల మన నాయనను తన కడుపులోఁ బెట్టుకొనిన కృష్ణవేణమ్మయే నాకు గతి. దీనిలో నతిశయోక్తి యేమియును లేదు. నిన్నొకసారి చూచి నా కష్టమంతయు చెప్పుకొనవలె నని యున్నది. నేను స్వయముగా వచ్చి చూచుటకు కత్తులబోనులో నున్నాను. ఘోరాతపములో నెడారిలో పడినదానను వలె పరితపించుచున్నాను. అన్నయ్యా! శరణాగత యగు చెల్లెలిని కాచుటయో చావనిచ్చుటయో యా భారము నీది. నీదీనతమభగిని

కాశ్యపి ధరణి వ్రాలు"

మొదటి మూఁడుజాబులను చదివి కాలనాథుఁ డుప్పొంగినాఁడు. నాల్గవజాబు చూచుకొని క్రుద్ధుఁడయ్యెను. అన్నింటికిని ప్రత్యుత్తరముల నప్పుడే పంపివేసెను.

మధువాణికి ప్రత్యుత్తరము

"నా ప్రియమైన మధు!

ప్రీతిగల నీజాబు చేరినది. మీ పెద్ద మామయ్యవంశము విచ్ఛిన్నము కాకుండ నుండినందులకు నీకంటెనుగూడ నధికముగా సంతోషించువా రెవ్వరు నుండరు. ఆ సంతోషములో నేను భాగస్థుఁడను. తీరుపాటు చేసుకొని మామయ్యా సముద్రదత్త బాబును చూచుటకు వచ్చెదను. అప్పుడు ముఖస్థముగా నంతయు మాటాడెదను.

కాశ్యప కాలనాథుని వ్రాలు."

పూర్ణకు ప్రత్యుత్తరము

"ప్రియభగినీ!

గంభీరార్థ మగు నీ జాబు చేరినది. మిక్కిలి సంతోషించితిని. లోపల నా

యంతరాత్మ పలికినంత తీవ్రముగా నేను ధర్మాసనసన్నిధిలో చెప్పలేదు. కాళిక సులోచనుని జనకునిగా నా యంతరాత్మ ప్రేమింపఁజాలకున్నది యనిమాత్రమే నేను చెప్పితిని. అతఁడు నీజనకుఁడు కాఁడనియే నా యంతరాత్మ స్పష్టముగా చెప్పినది. నిద్రలో నుండిన నా యంతరాత్మను లేపినవి సిద్ధకవీశ్వరి రాజకాళమ్మపాటలు. చిరంజీవిని ధరణి నింటికి తీసుకొనివచ్చినపిమ్మట సాయంకాల మొకసారి నిన్ను చూచుటకు వచ్చెదను. మాటాడవలసిన విషయము లనేకము లున్నవి.

కాశ్యపకాలనాథుని వ్రాలు."

శక్తినరాదులకు ప్రత్యుత్తరము

"ప్రియసఖులారా!

మీజాబు చేరినది. తేజోమయమంత్రములను కనిపట్టిన వసిష్ఠాదిమహర్షులు జన్మించిన బ్రాహ్మణజాతిలో, భగవానుఁడు పరశురాముఁడు తమ జాత్రిప్రతాపమును ప్రపంచమునకు వెల్లడిచేసిన బ్రాహ్మణజాతిలో, యాజ్ఞవల్క్యాదులను లాధ్యాత్మికజ్ఞానమును భువనములో వెదచల్లిన బ్రాహ్మణజాతిలో, నత్యుత్కృష్ట భారతసంహితాకారుఁడగు ద్వైపాయనముని యుదయించిన బ్రాహ్మణజాతిలో, మహాపురుషుఁడగు జటాముని యావిర్భవించిన బ్రాహ్మణజాతిలో, మహావీరుఁడగు సుచంద్రభట్టారకుఁ డుదయించిన బ్రాహ్మణజాతిలో, సిద్ధకవీశ్వరి రాజకాళి యుద్భవించిన బ్రాహ్మణజాతిలో, మహాయోగిని ధవలాక్షి సంభవించిన బ్రాహ్మణజాతిలో, మహావైద్యుఁ డక్షోభ్యముని యవతరించిన బ్రాహ్మణజాతిలో, నామిత్రు లైదురత్నములు పుట్టిన బ్రాహ్మణజాతిలో, భువనోత్తరనారీకవు లార్వురు వెలసిన బ్రాహ్మణజాతిలో, విజ్ఞానమునకు విహారస్థలమగు బ్రాహ్మణజాతిలో, విచారమునకు విశ్రాంతిధామమగు బ్రాహ్మణజాతిలో, విక్రమమునకు లీలాభవనమగు బ్రాహ్మణజాతిలో యఃకశ్చిద్వీరుఁడనగు నేను నిలిచియుండుట నాదే స్వార్థము. నన్ను మహారత్నమునుగా నెంచుట నా మిత్రుల స్నేహాతిశయవిలాసమే కాని వేఱుగాదు.

కాశ్యప కాలనాథుఁడు వ్రాలు."

ధరణికి ప్రత్యుత్తరము

"ప్రియభగినీ!

సరియైన సమయములో నీజాబు చేరినది. ఇదివఱకు కత్తులబోనులో నున్నావని నాకు తెలియదు. ఇంకొకపూఁటయైన నాలస్యము సేయక నిన్నా దారుణమగు బోనులో నుండి తప్పించుటకు నే నెగిరివచ్చి పడుదును. ఈరాత్రి భోజనము నీయన్నతోఁ గలిసియే నీవు చేసెదవు. సూర్యాస్తమయమునకు లోపల ని ఘోరనరకవాసము సమాప్తి చెందును.

నీ అన్న—

కాశ్యపకాలనాథుఁడు వ్రాలు."

## పదునైదవ ప్రకరణము

భగినీసముద్ధరణము

దండనాయక భుజంగుఁడు పదిసంవత్సరములనుండి కాఁపురము సేయుచున్న భార్యయందు సంతానము గానక రెండవపెండ్లి చేసుకొనుట కిప్పుడు పూనుకొనియున్నాఁడు. అతనివయస్సు ముప్పదిమూఁడు సంవత్సరములు. అతఁడు పతంగావధానికి రహస్యముగా పదివేలు కార్షాపణములు సంరక్షకదక్షిణ నిచ్చెద నని చెప్పి ధరణివివాహము ను

గుఱించి వాక్కు తీసుకొని యున్నాఁడు. అతనికి వేయివరాలు జీతము. ఆస్తి సుమారు పాతికవేల వరాలు విలువగలదిగా నుండెను. అతఁడు రాణిగారికి పినతల్లి కుమారుఁడు.

అవధాని భార్యను బోధపఱచినాఁడు. ధరణిమాత్రము సపతిపై సంబంధము నంగీకరించినది గాదు. ఆసంగతిని నీలకేశి భర్తకు చెప్పినది. మృదువుగా చెప్పినచో కార్యము నెఱవేఱదని రెండురోజులనుండి ఝంఝూమారుతమువలె విజృంభించుచు చెప్పియు విఫలుఁడయ్యెను. ఈ దినమున పతంగావధాని మహోగ్రకోపము ధరించినవాఁ డయ్యెను. తాను తగినంత భయము చూపినచో ధరణి లొంగు నని యతని నమ్మకము. పతంగుని కోపమున కింటివా రందఱును లొంగు చుండుట యింతకుమునుపు దలవాటు. ఆ కోపములో నతఁడు యుక్తాయుక్తములను విచారించుట తక్కువ.

సూర్యుఁ డింక నస్తమింపలేదు. అతని కిరణములుమాత్రము మందము లగుచుండినవి. ఇట్టి సమయమున లుబ్ధక్రూరస్వభావుఁడగు పతంగావధాని ధరణిని లేడిపిల్లను పులివలె సమీపించెను. క్రోధాగ్నిచే నతని కనులెఱ్ఱవాఱి యుండినవి. ఆక్రోధాగ్ని ధూమముచే నల్లనిది యగు నతని ముఖము మఱింత నల్లనిది యయ్యెను. అప్పుడు ధరణి పెరటిలో నుండినది.

పత—ఏమే ధరణీ! నేను చెప్పినమాట గుఱించి యాలోచించితివా? పెద్దమనిషికి మాట యిచ్చివేసియున్నాను. ఇంక తిరుగుటకు వీలులేదు. ఏమనెదవు?

ధర—ఏమాటను?

పత—(క్రోధోద్రేకముతో) ఏమాటయా? చదువు చెప్పించినందులకు కండ్లు నెత్తికి వచ్చినవి. చాలదినములనుండి దెబ్బలు లేక పోతరించియున్నావు. ఈ చింతరివకతో నాలుగు మొట్టఁజెప్పిన నేమాటయో జ్ఞాపకమునకు వచ్చును.

అని చెప్పినంతపని పతంగుఁడు చేసివేసినాఁడు. ధరణి పెద్దగొంతుకతో నేడువనారంభించినది. ఏడ్వవలదని పతంగుఁడు తిరిగియు కొట్ట నారంభించినాఁడు.

"దాని కిష్టములేని పెండ్లి దాని కెందులకు? ఊరకొనఁగూడదా?" అని నీలకేశి చెప్పి తిట్ల వర్షముతోఁబాటు కొన్ని చింతరివకదెబ్బలు గూడ తినినది. ఆ స్వగృహమాత్ర వీరుఁడు పిమ్మట భీకరస్వరముతో నిట్లు ధరణిని జూచి పలికినాఁడు:

"నీ వేడ్చినను సరియే, చచ్చినను సరియే. నా మాటనుండి నేను తిరుగను. లక్షాధికారి. దండనాయకుఁడు. మహావీరుఁడు. రాజబంధువు. అట్టి వరుని సంపాదించితిని. దరిద్రురాలా! నీకేమి చేదా?"

ధరణి యేమియు బదులుచెప్పక యింక నేడ్చుచున్నది. పతంగావధాని క్రోధముచే మండి వంటయింటికి వెళ్లి యొక కొఱకంచు తీసుకొని వచ్చినాఁడు. అతఁడు దాని నాదీన బాలికకు చూపుచు నిట్లనినాఁడు:

"నీవు చెప్పినట్లు విని భుజంగబాబును పెండ్లియాడెదవా? లేక యీ కొఱకంచుతో రక్షులు వేయించుకొనెదవా? శీఘ్రము చెప్పుము."

ఇప్పుడు వాస్తవముగా ధరణి భయపడినది. ఇంతలో పెరటిలో నొక పెద్దచప్పుడైనది.

పతంగావధానిదృష్టి యా శబ్దమువంకకు మఱలినది. అది యొక బలవంతుఁడగు మనిషి గోడ గంతినచప్పుడు. ముం దామనిషి నవధానియు పిమ్మట ధరణియు చూచినారు. మహోగ్రబలుఁడగు కాలనాథుఁ డతఁడు. తన చెల్లెలిని కాపాడుటకు శీఘ్రగతితో వచ్చిన కాలనాథుఁ డతఁడు.

అతఁడు వీథిప్రక్కకే ముందు వచ్చియుండెను. అప్పుడు పొరిగింటిముసలమ్మ (రత్నాంగితల్లి.) యాతురతతో నిట్లు పలికినది:

"నిర్భాగ్యుఁడా! నిన్ను పెంచిన దయావంతుని కూఁతురు నంత నిర్లక్ష్యముగా చూచుచున్నావేమి? ఆ దుర్మార్గుఁడు వీథితలుపు గడియపెట్టి పెరట్లో పిల్లను చావఁజంపి చెవులు మూయుచున్నాఁడు. ఏదో పెండ్లియఁట. వాఁడుచెప్పిన వరు నీమె యొప్పుకొనలేదఁట."

ఆమాట వినఁగానే పెరటిప్రక్కకు పొరుగింటిగుండా వెళ్లి గోడగంతి కాలనాథుఁడా రంగస్థలమున ప్రత్యక్షుఁ డైనాఁడు.

కాలనాథుని జూడఁగానే ధరణి మహాంధకారకూపమునుండి జ్యోతిస్సునకు మార్చఁబడిన ట్లయినది. ఆమెభయము పూర్ణముగా నంతరించినది. ఆ భయ మిప్పుడు పతంగావధాని నాక్రమించినది.

కాలనాథుఁడు వచ్చిన తత్క్షణమే కొఱకంచుతోఁ గూడిన పతంగునిచేయి పట్టుకొని లాగి మనిషి నమాంతముగా విసరివేసినాఁడు. వాఁడు పదిమూరల దూరములో వెళ్లిపడినాఁడు. వాని చేతి కొరకంచు వానిపార్శ్వభాగమునకే తగిలి మఱపునకురాని రక్తమైనది.

కాలనాథుఁడు చెల్లెలిని జూచి — "చెల్లెలా! ఇంక నీ దుష్టచ్ఛాందసుని యింటి యొద్ద నుండవలదు. రమ్ము. మన యింటికి పోవుదము" అని పలికెను.

పతంగావధాని యెట్టకేలకు లేచి కాలనాథుని చుఱచుఱ చూచెను. తననే బాధించిన తన చేతి యాగ్నేయాస్త్రమును విడిచిపెట్టినవాఁ డయ్యెను. కాల్పుమంట యటుండ తన పదివేలు పోయినవి యను విచారము పతంగుని మనస్సును వేధింప నారంభించినది. అతని క్రోధము మఱింత ప్రచండ మయ్యెను. గాని యెదుట నుండినవాఁ డసాధ్యుఁడు. అతఁడేమియుఁ జేయలేకపోయినను మాటచే నడ్డగింప యత్నించినాఁడు.

"నేను పెంచిన పిల్లను తీసుకొని పోవుటకు నీకు హక్కేమున్నది?"

కాల — నీ వెంత పెంచినను పైవాఁడవే. మాయింటి పిల్లను తీసుకొనిపోవుటకు న న్నెవ్వ రడ్డెదరు? నీవే వాస్తవమైన సంరక్షకుఁడ వగునెడల నీమె నిట్లు చావఁగొట్టెదవా? కొరకంచుతో కాల్చుటకు యత్నించెదవా? ప్రాజ్ఞత వచ్చిన పిల్లను మహాసభలలో పూజ్యురాలగు పిల్లను కొట్టిన నీవు కటికివానికంటె క్రూరబుద్ధివి. ఇట్టి నీవు సంరక్షకుఁడవా? అర్థజ్ఞానము లేక నీవు వల్లించిన వేదము నీకు తద్దినమంత్రములు చెప్పుటకు పనికివచ్చినదే కాని దయాధర్మముల నిచ్చినది గాదు. మా పినతల్లిని స్మరించి నిన్నిపుడు విడిచిపెట్టితిని. లేనియెడల నొక్క చెంపకాయతో నీ పండ్లన్నియు నూడఁగొట్టి యుందును.

పత—నేను దీని సంరక్షణకొఱకు ఖర్చుపెట్టిన ధన మంతయు నిక్కడఁ బోసి గుమ్మము దాఁటుము.

కాల—మా ధరణి యసలు సొత్తును వడ్డియును గలిసి యెంతయో పెరిగియున్నది. దానిలో మా ధరణి తిండి ఖర్చులు పోఁగా తక్కినదే మా కిచ్చినఁ జాలును.

పతంగుఁ డింకొక బిభీషికచూపి కార్యము సాధింపనెంచినాఁడు. అందువలన నతని స్థితి మఱింత చెడినది.

"ఈపిల్ల దండనాయక భుజంగునకు నిశ్చయింపఁబడినది. ఆపెండ్లికి నీవు విఘ్నము సేయుచున్నావు. ఆ రాజబాంధవుని దెబ్బను నీవు కాచుకొనవలసియుండును. నేనుగాదు జెక్కపట్టుకొని విసరివేయుటకు."

కాల—పిల్ల యంగీకారములేనిదియే నిర్ణయించుటకు ప్రేమలేశముగూడ పినతల్లి మగనికి హక్కేమున్నది? మీ దండనాయకునితో ధరణిని కాలనాథుఁడు తన యింటికి తీసుకొనిపోయెననియు, నా పిల్ల నిన్ను వరించుట కిష్టపడలేదనియు చెప్పివేయుము. నీ చేతికొరకంచుకంటెఁ గూడ నిస్సారమగు నతనిశక్తికి స్త్రీలుమాత్రమే భయపడవలెను. ఆ రాజబాంధవుని వీరత్వము మాకుఁ దెలియనిది గాదు.

ఇంతియే వారి కచ్చట జరిగిన సంవాదము. కాలనాథుఁడు పతంగావధానిని తృణమువలె నెంచి ధరణిని తనయింటికి తీసుకొని పోయినవాఁడయ్యెను.

---

# 'శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు'

[ప్రతివిమర్శ]

పిసుపాటి సుబ్రహ్మణ్యశాస్త్రి



వైశాఖమాసములో వెలువడిన భారతి పత్రిక చూచితిని. అందు శ్రీ బులుసు వేంకటరమణయ్యగారు 'సూర్యరాయాంధ్ర నిఘంటువు'ను గుఱించి యాక్షేపించుచు వ్రాసిన వ్యాసమును బరిశోధించితిని. ఆవ్యాసము దాదాపు ఎనిమిదిపుటలు నిండియున్నది. అందాక్షేపణములనేకములు కలవు. కాని నిఘంటువులోఁగల శబ్దార్థాదులను విమర్శించి దోషనిర్ణయము చేయఁగల యాక్షేపణ మొక్కటియు లేదు. ఐనను సామాన్యజనులు వీరి విమర్శనాభాసము చూచి భ్రమపడి వంచింపఁబడవచ్చునను భావముతో లోకమునకు యథార్థస్థితిని దెలుపుటకీ ప్రత్యుత్తరము ప్రారంభింపఁబడినది. విమర్శకుల యాక్షేపణములలోఁ గొన్నింటికి పీఠికలోనే సమాధానములు కలవు. తక్కిన యాక్షేపణములకు మాత్రమే ఉత్తరము చెప్పుచున్నాను. అనావశ్యకములగు పొల్లుమాటలతో పుటలు పెంచఁదలఁచుకొనలేదు.

౧. "శబ్దరత్నాకరమందలి లోపములు సవరింపఁబడవలసియున్నవి." అని యాక్షేపము.

శబ్దరత్నాకరములోఁ గలలోపములు అనేకములు సవరింపఁబడియేయున్నవి. మఱియు అనేకవిశేషాంశములతోఁ గూడిన క్రొత్తశబ్దము లధికముగాఁ జేర్పఁబడియున్నవి ఈ విషయము విమర్శకులు గ్రహింపక గ్రంథమంతయుఁ బరిశోధించినవారివలె లోపములు సవరింపఁబడవలసియున్నవని వ్రాసియుంజిరి.

శబ్దరత్నాకరము—

అట్టాఁకలి— (ఆఁకలి + ఆఁకలి) మిక్కిలియాకలి.

క. సొలయక యన్నంబిడుమీ,
జలజభవాన్వయుల కనుప చాలదె యట్టాఁ
కలి సేయకుమని యేలా
పలికితివని యడుగ సతికిఁ బతి యిట్లనియెన్.

శా. ఆహారాధికమైనమంచి నిలలో నయ్యగ్ని దేవుండు స్వ
ల్పాహారంబున మందు విప్రుఁడు. —భో. ౬ ఆ.

సూర్యరాయాంధ్రనిఘంటువు—

అట్టాఁకలి. వి. (అట్టి = అఱ + ఆఁకలి.) సగమాఁకలి. ఆఁకలి పూర్తిగా తీఱమి.

క. అవనీసురులకు నన్నం
బవనీశా పెట్టు నెవ్వఁ డట్టాఁకలిగా
నవనిపయి నతఁడు పదో
ద్భవుఁడైనను బోలియుఁజుమ్ము తత్క్షణమాత్రన్.
భోజరా. ౬ ౧౭౩, ౧౬౧,౧౬౩

ఇట్లే అట్టాఁక, ఏఁగు మొ. పదములలో శ. ర. లోనిలోపములు సవరింపఁబడియున్నవి.

అట్టాఁగు, అట్టాచు, ఎద్దుమొద్దు, ఎద్దువేట మొదలగు పదములు శ. ర. లో లేనివి చేర్పఁబడినవి.

౨. కొన్ని పదములకు ప్రత్యేక ప్రయోగము లేదను వివరణము నిఘంటువులో లేదని యాక్షేపము

చేయఁబడినది. కాని సంజ్ఞావివరణ పట్టికలో తెలుఁగున శబ్దంతములకు వ్యస్తప్రయోగము లేదని వ్రాయఁబడియే యున్నది. ఈ విషయము చూచుకొనకపోవుట విమర్శకుల లోపము.

3. "ఈఁదు౧ స. క్రి. (కాలుసేతుల సాహాయ్యముచే నద్యాదులను) తరించు, దాటు. దీనికి "ఏవిను నీ్నరు నేయీఁతి నీఁద,............జఃనీ మదిసిముప్పకాలంబున సుతిశోకసాగరం బెబ్భంగినీఁదఁగల దానవు... భీముఁగడవ "నీఁదవశమె నాపుత్రులకు...ఎవ్విధంబున వలపీఁదనేర్తు .." అని నాల్గు ప్రయోగము లీయఁబడినవి... పయినాల్గు ప్రయోగములలో మొదటి రెండింటిలో నేదోయొకటి యుండినఁజాలును. ఆరెండును స్పష్టముగ నున్నవి, చివరిరెండును అస్పష్టముగనున్నవి. అవి అనావశ్యకములు కూడ" అని యాక్షేపము.

ఇచ్చట చేయీఁతినీఁదు, వలపీఁదు, కడవనీఁదు మున్నగు ప్రత్యేక ప్రయోగవైచిత్ర్యముల యావశ్యకతను గ్రహింపఁజాలక ప్రయోగములు వ్యర్థముగా నీయఁబడినవని వ్రాయుట ప్రాజ్ఞలక్షణము కాదు.

౪. ఈఁదు - చల్లఁదనము, తడి.

శా. తారాప్రోష్ఠుఁ గాలసూతుఁడు వియద్వారాశి వేఁటాడి ప్రాణ్ణారంభంబను బుట్టఁ బెట్టి నలివాయం గుంజి యీఁదాఱఁ జెన్నారన్ వైచిన...

—కాశీ. ౪—౯౬.

(ఈఁద + ఆఱన్ అనియు విడఁదీయ వచ్చును)

"అని నిఘంటువునందే యున్నది. ఈపదమే యీయర్థమున సందిగ్ధముగనున్నది." అని యాక్షేపము. 'ఈఁదన'అను ఆంధ్ర భాషార్ణవములోను, 'ఈఁదాఱన్' అను ప్రకృత ప్రయోగములోను ఈఁదు అనిగాని, ఈఁద అనిగాని నిర్ణయించుటకు వీలులేకపోవుటచేత నిఘంటుకారులు యథార్థస్థితిని మఱుఁగుపఱుపక లోకమునకు వెల్లడించిరి. ఇది దోషముకాదు.

౫. ఆఱు౨- స. ఔ. (త. ఆఱు. క. ఆఱు) ఐదునొకటి

క. తురగముల నాలుగిట నుత్తరు నాఱిట...

(భార. విరా. ౫—౧౦౩.)

ఆయత్తపడు౨. అ. క్రి. (ఆయత్తము + పడు) సిద్ధపడు.

ద్వ...శోషాగ్ని భస్మీకరింప, నాయత్తపడి యుండుమనిన...[రం. రా. ఉ. ౧౪౫. పా ౨౩. పం.] కాయంబు కడచేసి కన్నులు మూసి యాయత్తపడి యుండె నారాజసుతుఁడు...

[ద్వి. శి. సా. ౪౨ పొ. ౬ పం.]

"పయి రెండర్థములును ప్రసిద్ధములు. వానిని ప్రమాణీకరించు ప్రయోగములును అనావశ్యకములు." అని యాక్షేపము. ఆఱు అనుపదము ఔపవిభక్తికము. అని యీనిఘంటువులోఁ జూపఁబడియున్నది ఆఔపవిభక్తికమును ఆఱిట అను ప్రమాణముచే బలపఱుచుటకును, ప్రయోగ సిద్ధత్వమును నిరూపించుటకును పైప్రమాణము చూపఁబడినది. ఇంక ఆయత్తపడు శబ్దార్థము ప్రసిద్ధమగుటచే ప్రయోగము చూపు టనావశ్యకమనుట యుక్తముకాదు. నిజముగా అది ప్రసిద్ధార్థకము కాదు. అగునని యొప్పుకొనినను ప్రసిద్ధార్థక శబ్దములకుఁ బ్రయోగసిద్ధిని జూపఁగూడదను నిషేధము లేదు అది నిఘంటుసంప్రదాయమునకు విరుద్ధమును గాదు.

౬. "ఏగాని—అనుపదమునకు 'కానిలో సగము విలువగల రాగినాణెము' అని వివరణము కలదు. రెండు దమ్మిడీలు ఏగాని; (⅓ కాని త్రి కాదు.) ఇది ప్రత్యేకమగు నాణెమునుకాదు" అని యాక్షేపము. గోదావరీ మండలములో అంగడికిఁబోయి ఏగాని కొకవస్తువీయవలసిన దని యడిగి యంగడివాని కొకకాని నిచ్చినచో వాఁడు కానివిలువగల వస్తువులో సగము వస్తువును మనకిచ్చి ఏగానినాణెము నిచ్చుచున్నాఁడు. ఈ విషయమీమండలములోఁ దెలియనివారు లేరు. ఇది సుప్రసిద్ధ వ్యవహారము. అంతియగాక కానిలో సగమువిలువగల ఏగానినాణె మిచ్చట నిత్యకృత్యములలోఁ గూడ వాడుకొనుచుందురు. ఇప్పుడు నాయొద్దఁగూడ ఏగానినాణె మున్నది. అది ౧౯౧౫ సం. లో ప్రకటింపఁబడినది. కాని గుంటూరు నెల్లూరుమండలములలో రెండు దమ్మిడీలు ఏగానియనువ్యవహార మున్నది. కాన నీయర్థమును గూడ రెండవయర్థముగా నిఘంటువులో చేర్చుట మంచిదని నాయభిప్రాయము.

౭. అర్థ. సూ. వి. ౭. ఆసక్తి—

గీ. అనఘ! ధర్మార్థకామంబులందు నొకట
నర్థిఁ దగిలిన మానవుం డధముఁ డొకటి
మాని వర్తించునాతఁడు మధ్యముండు
నడపు నన్నింటి నుత్తమం డనఘ యండ్రు.

[భార. శాం. ౩-౪౬౧.]

ఆనందించు-౨. అభినందించు, కొనియాడు, స్తుతించు.

మ. హరిమై సాదిశిరంబు సాదిమెయి జా
త్యశ్వోత్తమాంగంబు గా
డ రణోర్విన్ రఘునాథశౌరి యసిఁ జెం
డఁగ దివ్యమందారవృ
ష్టి రహిం బ్రాణయుతంబులై గగనవా
టిం బర్వ గంధర్వ కి
న్నరరూపంబులు దాల్చి సారె కవి యా
నందించుఁ దచ్చోద్యమున్.

[వసు ౧-౭౦.]

"ఇందు మొదటి యుదాహరణము 'నొకట నర్థిఁ దగిలిన మానవుం డధముఁడు' అని, రెండవ యుదాహరణము 'సారె కవి యానందించుఁ దచ్చోర్యమున్' అనియు నుండినఁ జాలును" అని విమర్శకులు సంపూర్ణ పద్యోద్ధరణము నధిక్షేపించిరి. ఈ యాక్షేపము దూరదృష్టితోఁ జేసినది కాదు. విమర్శకు లిచ్చినట్లు మొదటి యుదాహరణములో నొక్క పాదమే యుదాహరించినచో 'అర్థి' శబ్దమునకు ఆసక్తియను అర్థము నిర్ణయించుట కవకాశము లేదు. ప్రేమక్రోధాసూయాద్యర్థములు గూడ స్ఫురింపవచ్చును. అట్టి స్ఫురణము తొలఁగించుటకే సంపూర్ణపద్య మదాహరింపఁబడినది. ఇంక రెండవ యుదాహరణములో 'సారె కవి యానందించుఁ దచ్చోద్యమున్' అనియే యుదాహరించినచో అవి యేవియో తెలియకుండుటయే గాక ఆనందించు పదమునకు అర్థాంతరములను దొలఁగించి అభినందించు, కొనియాడు, స్తుతించు, అను నర్థము నిర్ణయించుట కవకాశము లేకపోవును. కనుక తగినంతవరకే నిఘంటువులో నుదాహరింపఁబడియున్నది.

౮. అర=అల (౧. ౨. అర్థములు సగము; కొంచెము.) రెండవయర్థమునకు క్రింది ప్రమాణ మీయబడినది.

క. అరమోడ్చిన కన్నులు సు
స్థిరమగు నాసనము...

(హరి. ఉ. ౫-౧౧౩.)

క. 'అరమేసి' కు. సం. ౪-౪౬.

"పయిచోట్ల సగము మోడ్చిన, సగము మేసి అను అర్థము గ్రహించుటయే ఉచితము. (చూ. 'దర్భైరర్ధావలీఢైః శ్రమవివృతముఖభ్రంశిభిః కీర్ణవర్త్మా'—అభిజ్ఞానశాకుంతలమ్. ౧)" అని యాక్షేపము. ఇచ్చట కొలిచినట్లు సగము మోడ్చుట, సగము మేయుట అసంభవము. సంస్కృతోదాహరణములోఁ గూడ సరిగా కొలిచినట్లుగా సగము కొఱికిన దర్భలు మృగముల ముఖములనుండి జారిపడుట సంభవింపదు. వాచస్పత్యములో గూడ అర్ధశ్రుతశబ్దములో నున్న అర్ధశబ్దమునకు అసంపూర్ణత అను అర్థము నిర్ణయింపఁబడియున్నది. కావున పై మూఁడుదాహరణములలోఁ గూడ కొంచెము అను అర్థము చెప్పుటయే యుక్తము.

౯. (ఆమని. క్రి. విశే. అధికముగా, తృప్తికరముగా) "ఇచ్చట నీయబడిన ప్రయోగమే మరల ఆమని కొనులో నీయబడినది. రెండవసారి గ్రంథనామము పద్యము ఇచ్చినఁ జాలును" అని యాక్షేపము. ఆమనిలో నిచ్చిన ప్రయోగము పాఠకుల సౌకర్యార్థమయి ఆమని కొనులోఁ గూడ నీయవచ్చును. ఇది యొక తప్పు కాదు.

౧౦. ఆనందించు ౨. అభినందించు, కొనియాడు, స్తుతించు- "పయిమూఁడర్థములు సమానములు కావు అభినందించుటకు సంతోషించు- సంతోషపెట్టు అను అర్థములే యా నిఘంటువున నీయఁబడినవి." అని యాక్షేపము. ఇది కేవల మయుక్తముగా నున్నది. అభినందించు అను పదములోనే స. క్రి. ౧ ప్రశంసించు- శ్లాఘించు అని చెప్పు.

క. కొందఱు కర్మకరణ మభి
నందింతురు వారలకు జననమరణములం
బొందక పోరాదు... భార. శాం. ౫-౧౨౬.

అని సోదాహరణముగా ప్రశంసించు, శ్రేష్ఠమని చెప్పు అనుఅర్థము నిఘంటువులో నీయబడియుండఁగా ఈయర్థము లేదని వ్రాయుట యెంతటి సాహసమో పాఠకులే నిర్ణయింతురుగాక.

౧౧. ఈ నిఘంటువున తత్సమపదము లధికములు, తదితరము లత్యల్ప సంఖ్యాకములు అను అభిప్రాయ మొకటి కల్పించుకొని విమర్శకులు తమ లేఖినిని స్వేచ్ఛతో నడిపించిరి. ఈ యభిప్రాయము భ్రమమూలకము; నిఘంటు పరిశోధనవలన నేర్పడినదికాదు. ఈ సూర్యరాయాంధ్రనిఘంటువు ఆంధ్రవాఙ్మయములో గ్రహింపఁదగిన అచ్చతెలుఁగుపదముల నన్నింటినికూడ గ్రహించియే యున్నది. శబ్దరత్నాకరాది నిఘంటువులలో లేని యచ్చతెలుఁగుపదము లనేకములు అనేక విశేషాంశములతో నీ నిఘంటువునఁ జేర్పఁబడియున్నవి. ఇది విజ్ఞులకు తెలియనివిషయము కాదు. తగిన పండితులై సహృదయదృష్టితోఁ బరిశోధించువారికితర నిఘంటువులకును ఈ నిఘంటువునకును గల మహాంతరము తారతమ్యము బోధపడఁగలదు.

---

# 'ఇనుపయెడ్లు'

బులుసు వెంకటరమణయ్య



వాడుకలో లేకున్నను "ఇనుపయెడ్లు" అను పదము-నిత్యబహు వచనాంతము తెలుగు శాసనములందు కనబడుచున్నది. ఈ పదమున కిదివఱ కెవరును అర్థమును నిర్ణయింపలేదనియు, గొఱ్ఱెలని తాము అర్థమును కనిపెట్టితిమనియు, మనముందు నిఘంటువులలో నీపదమును చేర్పవలెననియు శ్రీకుందూరి ఈశ్వరదత్తు గారు అభిప్రాయపడినారు. ౧

క్రొత్తగా వెలువడిన శ్రీసూర్యరాయాంధ్ర నిఘంటు ప్రథమ సంపుటమున ఏతత్పదమును గూర్చియు, తత్సంబద్ధములగు పదములగూర్చియు నిట్లున్నది:

"ఇనుప (న్ప)యెడ్లు = ఈన్పయెడ్లు. వి. బ.

(త. ఈన్ = ఈను. ఆడు = మేక; గొఱ్ఱె. వ్యు. ఈనునట్టి మేక; గొఱ్ఱె—అనఁగా ఆఁడు మేక; ఆఁడు గొఱ్ఱె. మేకలు. గొఱ్ఱెలు?

(ఈన్పయెడ్లు అనునదే ప్రథమరూపమని తోఁచుచున్నది. ఇది ప్రాచీనశాసనములందు మాత్రమే కాన్పించుచున్నది.)

'స్వస్తి సమస్తప్రశస్తిసహితం శ్రీమన్మహామండలేశ్వర కోటకేతరాజులు శకవర్షంబులు ౧౧౦౮ గునేంటి మాఘశుద్ధ ౧౦ గురువారమునం దమకు ధర్మార్థముగా శ్రీబుద్ధదేవరకు నఖండవర్తి దీపములు రెంటికిన్నై ఇచ్చిన ఇన్పఎడ్లు ౧౧౦. వీనిలోన దామక అమరబోయుండు ఎంథదేనుగొటియలం జేకొని ఆచంద్రార్కముగాం దన పుత్రులును పౌత్రికమున నిత్యమానెండునేసి నేయిం బోయంగలవాండు.'

అమరావతి శా. Ep. Ind. ౬-౧౬౦

'ఈనుపెడ్లు = ఇనుపయెడ్లు.

వ నూఱు ఈనుపెడ్లు. దా. శా. ౧౩౦౫'

'ఈన్పయెడ్లు = ఇనుపయెడ్లు.

వ. కొమ్మని వసమునం బెట్టిన ఈన్పయెడ్లు ౫౦టికి నిత్యపడి (నఁజెచ్చు)......ద. శా. ౧౧౧౭.'

శ్రీ ఈశ్వరదత్తుగారు చెప్పిన అర్థమునే కాక నిఘంటువున మఱొక అర్థము ఎక్కువగ ఈయబడినది. వారు విడిచిన వ్యుత్పత్త్యర్థముకూడ నిఘంటువున సాధింపబడినది.

'ఇనుపయెడ్లు' అనగా 'గొఱ్ఱెలు' అను నర్థము శాసనములందే స్పష్టముగా కనిపించుచున్నది. దాని నెవ్వరును క్రొత్తగా కనుగొన నక్కఱలేదు. కాని ఆపదమే యే అర్థములం దుపయోగింపబడినదో విమర్శించినచో మఱికొన్ని విషయములు బయటపడగలవు.

గొఱ్ఱెలు ఇనుపయెడ్లు కావచ్చును. కాని, ఇనుపయెడ్లన్నియును గొఱ్ఱెలు కాజాలవు. ఈ కాలమునందును మనము 'సొమ్ములు, పశువులు, గొడ్లు' అను పదములను స్త్రీ, పురుష భేదములను వివక్షింపక పశుసామాన్యబోధకములగా వాడుచున్నాము. ఈ రీతినే శాసనకాలమునందును 'ఇనుపయెడ్లు' అను పదము పశు

---

౧. నవ్యసాహిత్య పరిషత్తువారి "ప్రతిభ"- సం.౧. సంచిక ౧. వ్యాసము: 'శాసనములలోని తెలుగుభాష.

సామాన్యవాచకమయి యుండవచ్చును. పయిపదములు పాడిపశువులకు పర్యాయములుగ శాసనములందు కాన వచ్చుచున్నది. 'ఇనుపయెడ్లు' అనగా 'నల్లని పశువులు' అనిమాత్రమే మొదటి యర్థము. 'ఇనుము' దానికి సంబంధించిన పదములను ద్రావిడభాషలలో నల్లనివస్తువులనే తెలుపుచున్నవి. ఉదా: ఇనుము. (తె)=నల్లని లోహము. ఇరుంబు (త.)=ఇనుము. ఎఱుంబు (త)=నల్లని కీటకము (చీమ). ఎనుము (తె) = నల్లని పశువను బఱ్ఱె. ఎరుమై (త.) = బఱ్ఱె. ఇరులు (తె.) = నల్లనిదగు చీకటి. ఇరుళ్ (త. క.) = చీకటి మొదలైనవి.

భగవంతుని దీపారాధనమునకు నల్లని పశువుల నేయియే శ్రేష్ఠమైనది. కావుననే పెక్కు శాసనములలో "ఇనుపయెడ్లు" అను పదమే తఱచు ప్రయోగింపబడినది. కాలక్రమమున పయి పదములోని ఏకదేశమను 'ఇనుము' 'ఎనుము'గా మారి 'బఱ్ఱె (గేదె)' అను నర్థమున రూఢమయినది. అవశిష్టమగు 'ఎడ్లు' పదము 'వృషభములు' అనునర్థమున రూఢమైనది. నిరుపపదమగు "ఎడ్లు" అను పదముకూడ "ఇనుపయెడ్లు" వలెనే పాడిపశువులను తెల్పునటుల శాసనములు కలవు.౨

'ఇనుపయెడ్ల' అర్థనిర్ణయమునకు ముందు శాసనములలో నీయబడిన నేతిమానమును మనము ముందుగా తెలిసికొనవలయును. ప్రాయికముగా మానెడు నేతికి గొఱియలు (గొఱ్ఱెలు) ౫౫. ఆవులు ౫౦. బఱ్ఱెలు ౨౫. అనగా మానెడు నేయి కావలెనన్న సామాన్యముగ ౫౫ గొఱ్ఱెలపాలు కావలెను; ౫౦ ఆవులపాలు మానెడు నేయి అగును. మానెడు నేతికి ౨౫ బఱ్ఱెల పాలు చాలును.౩ శాసనములలో చాల చోట్ల 'ఇనుపయెడ్లు' ఒక మానెడు నేతికి ౫౫ గను, ౫౦ గను, ౨౫ గనుకూడ కన్పడుచున్నవి.౪ 'ఇనుపయెడ్లు' కేవలము గొఱ్ఱెలే యయినచో ఇంత భేదము కలుగుటకు కారణము కుదురదు. కావున ఆ పదము గొఱ్ఱెలనేకాక ఆవులను, బఱ్ఱెలనుకూడ తెలియజేయు నని నిశ్చయింపవలెను. దాని క్రింది శాసనభాగములును ప్రమాపకములు.

'.........ధర్మువుగా శ్రీ భీమేశ్వర మహాదేవరకు నుత్తరాయణ సంక్రాంతినిమిత్తమునం బెట్టిన యఖండవర్తి లోహదణ్డదీయలు రెణ్టికి నాచంద్రార్కమును నెయి సరియించువారుగా బోలు నల్వురం

---

౨. ...'బూంటగా పెద్దిబోల నవని వసంబునపెట్టిన ఎడ్లు ౫౦. నిత్యపడి వోయంగల త్రిభువనంగు(ం)శమున నేమాన ౧......'

South Indian Inscription Texts, vol. Iv. No. ౧౩౦౬) "...బ్రమ్మియవసమున విడిచిన ఎడ్లు ౫౦. నిత్య త్రిభువనాంకుశ (మన)నే (మాన) ౧...లిఖితం వీరరాజేంద్ర ఆచార్యుణ'

(S. I. I Texts vol. Iv. No. ౧౩౭౧)

౩. 'మల్లేశ్వరమ [హా] దేవునికి అఖండదీపనకు ఇ(o)చ్చిన గొఱ్ఱెలు ౫౫. వీనిం గొని నల్లంగేతె బోయుండు తన పుత్రానుపాత్రికమున నిత్యే మనెండునె [యి] బోయంగలవ —'

[S.I.I. TextsVol. IV No. ౪౫౨]

'...వనబోల నావని వసమునం బెట్టిన మొదవులు ౫౦ ణ్టికి నిత్యపడి నేతిమా [౧]'

[S.I.I.T. Vol IV No. ౧౧౩౬.]

'...వెరసినవారు పూంటగాం గాటబోలనాసయవసమున విడిచిన యెనుములు యిరువదేను నిత్యపడి వోయంగల త్రిభువనాంకుశ నే మానయు ౧.'

S.I.I. Texts Vol. IV No. ౧౧౯౪.

౪. S. I. I. Texts Vol IV. Nos. ౪౫౩, ౧౧౩౬, ౧౩౬౬.

# అంకోరువాటు శిల్పచిత్రములు



౧. అంకోరువాటు మందిరము
సింహద్వారము-గోపురము



౨. మందిరములోపల ఒకహాలు
(లోకప్పు అమరిక చూడదగినది )



౩. బేయర్ మందిరములోపల

(మొదట ఈమందిరము బౌద్ధాచార్యుడు లోకేశ్వరుని ఆలయముగా నుండెను. తరువాత బ్రాహ్మణమతము ప్రబలినరోజులలో శివాలయమాయెను.)



౪. ఏడుపడగల నాగము

(రాతిశిల్పము)

బూంట్లుగా మొదలియడవున ప్రోలబోల నావని యడవున అయ్తిబోల కా [ట] ని వసమునం బెట్టిన మొదవులు ౫౦. నావబోల సుశ్వనవసమునం బెట్టిన మొదవులు ౫౦. బెరసి ఇ [ను] ప యెడ్లు ౧౦౦ ణ్టికి నిత్య పడి పోయంక్కల త్రిభువనాంకుస నేతిమానలు రెణ్డు.'

[S. I. I. Texts Vol VI No ౧౧౫౮]

పయి శాసనములో '౫౦ మొదవులు, ౫౦ మొదవులు కలిసి ౧౦౦ ఇనుపయెడ్లని వ్రాయబడినది. మొదవులనగా ఆవులను సంశయు అందరు నెఱిగినదేకదా!

'మొదవులు' 'ఇనుపయెడ్లయినపుడు బఱ్ఱెలును కావచ్చును. బఱ్ఱెల నేతిమానమునుబట్టియు, ౨౫ ఇనుపయెడ్లు ఒక మానెడు నేతికి సరిపడునను శాసనప్రమాణములబట్టియు పయిరీతిని నిశ్చయించవచ్చును.

పై యంశములంబట్టి నిఘంటువున ఈయబడిన అర్థములు సరికావని చెప్పవలసి వచ్చుచున్నది.

'ఇనుపయెడ్లకు నిఘంటువున గల వ్యుత్పత్త్యర్థముకూడ సరికాదు. అందు 'ఈను+ఆడు (లు)' ఈన్పయెడ్లయి, క్రమముగ 'ఇనుపయెడ్లయినట్లు చెప్పబడినది. అట్టి వ్యుత్పత్తికి తగిన ప్రమాణము అందు కానబడదు.

'ఎనుము, ఇనుము' అనునవి నల్లనిదను నర్థమున ఉపయోగింపబడుచున్నట్లు నిఘంటువునందే ఈయబడినది.* అట్టి యర్థమునే ఈవిషయమునను ఏల గ్రహింపలేదో?

'ఇనుపయెడ్లు' మొదటిరూపము; 'ఈనుపెడ్లు ఈన్పయెడ్లు' అనునవి మీఁదిదాని అపభ్రంశములు.

---

౫. 'ఎనుము (న్మ్మ) వి. (V ఇనుము = నల్లనిది?...)
'ఎనుపతేలు- వి. (ఎనుము + తేలు) నల్లతేలు. సీ. ఎనుపతేలన(గ్రహ్మవృశ్చి)కంబగు'...ఆం. భా. ౭౬౮.

# ఛాయ

[ఏకాంకనాటకము]



యస్. వి. కేశవస్వామి

## మొదటి రంగము

[మగధదేశపు రాజభవనము. రెండుజాముల వేళ. ఛాయ, ఆమె చెలికత్తె కుమారి, కూర్చొని యుంటారు]

ఛాయ

కుమారీ! అబ్బ! ఎన్నాళ్లనుండీ నే ఈదినం కోసరం పరితపిస్తూవచ్చాను! ఇవాళ మహారాజుగారు చాలా ఆనందంగా వున్నారు. నా భావిభాగ్యోదయము నేడేకదూ ?

కుమారి

అందుకు మా ధన్యవాదములు తల్లీ!

ఛాయ

వారు నన్నెంతగా ప్రేమిస్తారనుకున్నావు! అబ్బ! వారిప్రేమను తలచుకుంటేనే సిగ్గేస్తుంది.

కుమారి

సిగ్గెందుకమ్మా ?

ఛాయ

ఏమంటివి ? సిగ్గెందుకా ?

కుమారి

(వూరుకుంటుంది.)

ఛాయ

కాస్త వారిని చూడు...తర్వాత నన్ను చూడు. నేను ఈ దేశానికంతా వారు మహారాజులు, వారినోటి నుండి వెలలే ఒక్కొక్క మాట ఒక్కొక్క శాసనము......మరి నేనో, ఒక సాధారణపు కొండరాజు పుత్రిని; పర్వతముమందటి రాయిని. అంతేకదూ ?

కుమారి

అట్లు కాదు దేవీ!

ఛాయ

ఇంతకూ నన్ను వారు కోరారు; నా ప్రేమకై తహతహలాడుతారు; నా మూర్తిని కాంక్షిస్తారు. అబ్బ! ఎంతగా చెప్పనే! నేను లేంది ఆయన అసలు ఉండనే లేరు.

కుమారి

అది ప్రేమలీల...............

ఛాయ

అన్నిటికంటె నన్నే ఎక్కువగా ప్రేమిస్తున్నారు. "రాజ్యాన్నికూడా వదిలేస్తానుగాని, నిన్ను మాత్రం వదలలే" నన్నారు.

కుమారి

అది కృతజ్ఞత...............

ఛాయ

ఏమంటివి ? కృతజ్ఞతా ? ఎవరి కృతజ్ఞత ? ఎందుకు ? ఎవరికి ?......సరిగా బోధపడలేదు కుమారీ !

కుమారి

మీరు వారిని రెండుమూడుసార్లు రక్షించారుగా !

ఛా య

ఉస్స్! సామ్రాజ్యాధిపతులయెడల యెంతటి నీచపుతలంపు! కుమారీ, ఆయనహృదయం నీకు తెలియదు. అందుకే ఆయ న్నంతహీనం గా భావిస్తున్నావు. నే నాయన్ని రక్షిస్తే, ఆయనకు ఉపకారముచేశాననే తలచావా కుమారీ?

కు మా రి

కాదు మరీ?

ఛా య

ఛా! ఒకసేవకుడు తన యజమానిని రక్షిస్తే... అది ఉపకారమేనా? ఒక రక్షకభటుకు తన సేనాధిపతినిఆపదనుండి కాపాడితే......అదీ ఉపకారమేనా? కాదు. ఎన్నటికీ కానేరదు. అది వాని విధి......

కు మా రి

గొప్పభావము!

ఛా య

నాదీ అంతే కుమారీ! ఈ భారతదేశమును కాపాడడానికి వారు తను ప్రాణములను అరచేతిలో పెటుకొని పోరాడుతూంటే, నేను వారిని ఒకప్పుడు రక్షించాను. నిజమే కాని ఇది ఉపకారమెట్లవుతుంది? కాజాలదు, కుమారి! పొరబడుతున్నావు. ఇది నా ధర్మము. నేను భారతస్త్రీ నని మరువవద్దు.

కు మా రి

అర్థమైంది. మీవిధిని మీరు నెరవేర్చుకున్నారు. కావచ్చును కాని వారుమాత్రము వారి విధిని నెరవేర్చుకోరాదూ?

ఛా య

ఏమిటో వారివిధి......?

కు మా రి

మీ సేవను జ్ఞాపకవీధిలో నుంచుటే. మీమేలు .........కాదు, మీవిధినిమాత్రము వారు మరువరు.

ఛా య

నిజము. వారు దీనిని మరువరు, మరువజాలరు, మరువలేరు... ఒప్పుకున్నాను.........కాని ఇది మా ప్రేమకు కారణమంటేమాత్రం ఒప్పుకోను. రేపు మరొకస్త్రీ ఆయన్ని కాపాడితే, ఆమెనికూడా ప్రేమిస్తా రనుకుంటున్నావా? వట్టి పిచ్చిదానవు! పురుషుల హృదయాలు అంతనీచమైనవి కావని నీవు తెలిసికోవాలి కుమారీ!

కు మా రి

మరి మీ అన్యోన్యప్రేమకు కారణం?

ఛా య

కారణమా? అది నాకూ తెలియదు. ఆయనకూడా తెలియ దనుకుంటాను. నే నాయన్ని ప్రేమిస్తాను; నా హృదయంలో ఆరాధిస్తాను; ఆయన్నే నా దైవంగా భావిస్తాను. ఇది ఆయనకూ తెలుసు బాగా తెలుసుననే నానమ్మకం. అందుకనే నన్నంతగా ప్రేమిస్తారు. లేకున్న నావంటివా.........కుమారీ! ఇదంతా యెందుకు? నిజంగా ఆయన మనిషి కాదు-దేవత. నేను మనఃపూర్వకంగా ఆయన్ని పూజిస్తాను.

(చంద్రగుప్తుడు వస్తాడు.)

చ ం ద్ర

ఎవర్ని పూజించేది ఛాయా!.......అబ్బ! ఏ మాసిగ్గు! నే నొచ్చాననేనా?

ఛా య

(తల వంచుకొని నిలుచోనుంటుంది. కుమారి మెల్లగా వెళ్లిపోతుంది. చంద్రగుప్తుడు కిటికీవద్ద సోఫాలో కూర్చుంటాడు.)

చ ం ద్ర

ఇట్లా రా ఛాయా! ఇటు...ఈపురవైభవాన్ని చూడు.

ఛా య

(కిటికీలోనుంచి కిందికి చూస్తూ, సంతోషం వెలిబుచ్చుతూ) అబ్బ! ఇక్కడ ప్రతివాడికీ యేదో ఒక పనేనే!

చ ం ద్ర

అకారణంగా కాదుగదా ఛాయా! ఈరోజు వాళ్ల ...... వెళ్లి...

ఛాయ

(ఉదాసీనయై) కాని మహారాజా!...

చంద్ర

(ఆతురతతో) ఏమిటి ఛాయా! ఎందు కీమార్పు? ఈకన్నీళ్లేమిటి, ఈ వైఖరేమిటి? ఈనాడుకూడా ఏడ్పా? ఈ స్థితిలో నిన్ను చూడలేను ఛాయా, చూడలేను.

ఛాయ

మహారాజా!............(ఊరుకొంటుంది.)

చంద్ర

చెప్పు, ఛాయా, చెప్పు.

ఛాయ

మహారాజా!.........

చంద్ర

అబ్బ! నాప్రశ్నలకు ప్రత్యుత్తరము "మహారాజా" కాదు ఛాయా! నీ యేడుపు నాహృదయాన్ని కలతపెడుతోంది. నాకుకావలసింది నీ బాధకు కారణం.

ఛాయ

మీప్రేమే నన్ను బాధిస్తోంది మహారాజా!

చంద్ర

నాప్రేమా? అంటే?

ఛాయ

మహారాజా! నేను మీకు ఏమాత్రమూ తగను. ఏవిషయంలోనూ సాటిరాను. కాని మీరు నన్ను అమితంగా ప్రేమిస్తున్నారు. భారతదేశాన్నంతా గెలువగలిగిన శూరులు మీరు. ఇంతటి ధీరుల హృదయాన్ని నేను గెలువగలిగాను. అందరికంటే ధన్యురాలనయ్యాను. మీహస్తగతమైన ఈ భారతసామ్రాజ్యాన్ని చిరకాలం నిలుపుకోగల శక్తి మీలో ప్రకాశిస్తోంది.........కాని మహారాజా! ఈ మన ప్రేమ ఎప్పటి......

చంద్ర

చాలు, ఛాయా, చాలు బోధపడ్డది. ఇలాంటి ఆలోచనలతో మరెప్పుడూ నీచిత్తశాంతిని పాడుచేసుకోకేం. లేక, ఈవిధంగా నాప్రేమను పరీక్షింపదలచావా? అందుకు సంసిద్ధంగా ఉన్నాను.

ఛాయ

(బెదరిచూస్తూ) లేదుమహారాజా! ఎన్నటికీఅట్లా తలచను. కాని మహా......

చంద్ర

ఛాయా! లోకదృష్టిలో నేను రారాజును. నాకు బలం ఉంది. గొప్పతనం ఉంది. నాసామ్రాజ్యానికి నేను మేటిచక్రవర్తిని. కాని నీదగ్గర నే నొక ప్రేమ భిక్షువును. నీప్రేమను కోరుతాను. నీ హృదయాన్ని వెతుకుతాను. నా ఈ రాజ్యము, సంపద......అన్నీ నీముందు ఎందుకూ కొరగానివి. చంద్రికముందు మిణుకు మిణుకుమను తారలు. సూర్యు......

ఛాయ

(కన్నులు మూతలుపడ, సంపూర్ణతృప్తి కనబరుస్తూ) చాలు, మహారాజా, చాలు. తృప్తిపొందింది నా ఆత్మ. నాకు ఈ లోకంలో కావలసినదల్లా మీ ప్రేమయే.

చంద్ర

అదెప్పటికీ నీదే. నీహక్కు. నీసొత్తు. నీ.......

ఛాయ

ఇదేరూపంగా?

చంద్ర

ఆహా! ద్విగుణీకృతంగా......

ఛాయ

భాగ్యము! నాకంటే ధన్యులు మరెవ్వరూ లేరనుకుంటా.

చంద్ర

లేకపోలేదు. ఉన్నారు ఛాయా! ఉన్నారు.

ఛాయ

(స్థిరగా చూస్తూ) ఎవ్వరు?......

చం ద్ర

మఱెవ్వరు ఛాయా! నేను......ఇంకకొన్ని గడియలలో నీవు నాదానవౌతావు. అప్పుడు మనల్ని ఈ ప్రపంచసర్వశక్తులూ గలిసినా విడదీయలేవు.

ఛా య

(ఆనందబాష్పములు రాలుస్తూ పైకి చూస్తూ) దేవునికృప!

చం ద్ర

నీ దగ్గరనుంచి కదలడానికి మనసొప్పడంలేదు. కాని, ఛాయా, వేరేపనులు చాలాఉన్నాయి. ఇకనాకు శెల విప్పించాలి.

ఛా య

అమ్మమ్మో! శెల. విప్పించేంతదాన...... ఇక మీరు పోవచ్చును, మహారాజా! పొండి.

చం ద్ర

(లేస్తూ) అబ్బ! "మహారాజా! మహారాజా!" వినివిని విసుగత్తేసింది.

ఛా య

(లేస్తూ) మరే మనమంటారు?

చం ద్ర

ఏదేనా మంచిపదము......హాయిగొలిపేపదము ......అలాంటిదాంతో పిలవకూడదూ?

ఛా య

మీ కేపదము నచ్చుతుందో మీరే చెప్పండి.

చం ద్ర

ఒక హైందవవనిత తన్ను ప్రేమించిన హృదయ నాథుని ఏపదముతో పిలుస్తుందో......అదే......ఆ మాత్రం చాలు, ఛాయా, నాకు.

ఛా య

రేపటినుంచి ఆవిధంగానే పిలుస్తాను లెండి.

చం ద్ర

(నవ్వుతూ) ఏం? ఇప్పుడు పిలవ్వూ?

ఛా య

ఊహుఁ (సిగ్గుతో తల వంచుకుంటుంది)

చం ద్ర

చిలిపిపిల్ల! (వెళ్లిపోతాడు.)

(కుమారి వస్తుంది. ఛాయ ఆమెను చూడకుండా నే ఆలోచనలో మునిగి వుంటుంది.)

ఛా య

(చంద్రగుప్తుడు వెళ్లే దిక్కు చూస్తూ) అప్పుడే వెళ్లిపోతిరా? ఇంకానేపు ఉంటారని ఆశపడితినే!

కు మా రి

పిలుచుకురానా? లేక మీరే వెళ్లి మాటాడు తారా?

ఛా య

(ఉలిక్కిపడి) ఎవరు? ఎవరినిగురించి చెప్తు చున్నావే? కుమారీ, నీకు తెలియదూ నే నేదో ఆలో చిస్తున్నా నని?

కు మా రి

తెలియకేం? (నవ్వుతుంది. ఛాయ దీర్ఘంగా ఆలోచిస్తోంటుంది. ఒకసారి ఉలిక్కి పడుతుంది.)

ఛా య

కుమారీ!

కు మా రి

దేవీ!

ఛా య

ఇంతకుముందు నీవు నాతో మాటాడింది ఎవరి సంగతే? నన్నుచూడటానికి ఎవరు వచ్చారు?

కు మా రి

వాచాలుడుగారు అవల వేచియున్నారు. కొన్ని నిమిషాలు మీతో మాట్లాడవలయునట. మీ ఆజ్ఞ కోరు తున్నారు.

ఛా య

వాచాలుడా? (ఆలోచిస్తూ) నాయాజ్ఞా?... కొన్ని నిమిషములా?......సరే, రమ్మను.

కు మా రి

(వెళ్లి వాచాలుడితో వస్తుంది.)

వా చా

క్షమించండి మీ.........

ఛా య

రండి మహారాజా! రండి. మీదేహస్థితి ఎలా వుంది?

వా చా

పరమాత్ముని కరుణ.

ఛా య

మీరాకకు కారణం తెలుప కోరుతాను.

వా చా

(వూరుకుంటాడు.)

ఛా య

(బెదరుచూపులతో) ఏమి టిది? మీ మౌనము నాఆదుర్దాను బలపరుస్తూంది. ప్రత్యుత్తరము త్వరగా ఇవ్వండి.

వా చా

(నేలవైపు చూస్తూ మెల్లగా) అకారణంగా వచ్చా నని ఎప్పటికీ తలచకండి.

ఛా య

మరి చల్లకు వచ్చి ముంత దాచడం...?

వా చా

ఏవిధంగా చెప్పాలో బోధపడకుండావుంది.

ఛా య

(కన్ను లెగరజేస్తూ) మిమ్ములను మరిఒక సారి అడుగుతున్నాను. మీరాకకు కారణం?

వా చా

(నిట్టూర్పు విడుస్తూ) దేవీ! అప్పుడే మరిచారా ఆరోజులు? మీరూ, నేనూ ఎన్నో ఏళ్లు ఒక్క చోట గడిపిన దినములు! ఒక్కచోట ఆడుకొన్న గడియలు. మీకు జ్ఞాపకి ముండవచ్చు, ఒకసారి నేను మీతో నాప్రేమను తెలియజేసినట్టు. (నిట్టూర్పు విడుస్తూ) నాప్రేమ, నాస్వచ్ఛమైన ప్రేమ, నాపవిత్రమైన ప్రేమ, తెలియజేశాను. కాని......

ఛా య

కాని మిమ్మల్ని మరెప్పుడూ ఆ ప్రశంస ఎత్త వద్దని అప్పుడే మీకు ఖండితంగా చెప్పేసినట్టు కూడా నాకు బాగా జ్ఞాపకముంది. చెప్పేశాను కదూ?

వా చా

మరి మీ యాజ్ఞ నుల్లంఘించానా?

ఛా య

మరి యిప్పుడో?

వా చా

ఇప్పటికీమట్టుకు క్షమించా లని ముందే కోరుకున్నాను. మీదగ్గర కడపటి సెలవు పుచ్చుకొందామని వొచ్చాను. ఇక ఈపాపుమొగము ఈజన్మలో మీకు చూపించను. (పెడమొగం^) నాప్రేమ ఇట్లా ధిక్కరింపబడుతుం దని నేను కలలోనైనా నమ్మలేదు. నాబుద్ధిసూంద్యము.........చంద్రగుప్తుడు చక్రవర్తి ...రారాజు ...... అన్నిటికన్న ముఖ్యము...అందగాడు. మరి నేనో?... (నిట్టూర్పు విడుస్తూ) ఆచంద్రుడి ముందటి తారను. అ ధుం డెక్కడ చంద్రు డెక్క.......

ఛా య

ఇదంతా అనవసర ప్రసంగము.

వా చా

(అనేధోరణిలో వుండి ఛాయమాటలు విననట్టే నా అదృష్టతారలు మళ్లీ అమావాస్యనాడు మెరుస్తాయనుకున్నాను. కాని మబ్బులు అలుముకొని అట్లాకాని వ్వలేదు. వాటి ప్రకాశమే తగ్గిపోయింది. ఇంక కొద్దిలో నశించేపోతుంది....... నేడు నా తుదినిర్ణయదినము. ఇవ్వాళ నిశ్చయించుకున్నాను. నాజీవిత వృక్షానికి ఇక పూతా, కాతా......ఏమీ లేదు. నా.......

ఛా య

వాచాళా! ఇంక వినలేను. నాహృదయం కనుక్కోలేకుండా వున్నావు. నిన్ను సోదరుడి లాగా ప్రేమించాను, ప్రేమిస్తున్నాను, ప్రేమిస్తాను. దురభిప్రాయపడవద్దు. ఒక ఆర్యస్త్రీని ఆమిపెళ్లిరోజున

ఇట్లా కష్టపెట్టడం నీవంటివాళ్లకు భావ్యంగాదు వాచాళా!

వా చా

నిజమే కాని ఛాయా! ఇక నీనుంచి వేరయిపోతున్నాను. అంతకు ముందునీకు—హృదయపూర్వకంగా ప్రేమించిన కాంతకు—నా హృదయావేదన తెలపటానికి వచ్చాను. అంతే............ నాహృదయభార మెక్కువౌతోంది మాట్లాడలేను. ఇంక నాకు సెలవు... నేను జీవించినంతకాలం నిన్ను మరవను. నీ ప్రేమను నా హృదయపీఠమునుంచి తోసివేయలేను. కాని ఎప్పుడూ నీతో నాప్రేమప్రశంస చేయనని వాగ్దానం చేస్తున్నాను. నీ యెదుటికి గూడా రాను. నీకు నా గాలి గూడా అగల్నివను......ఎప్పుడైనా నీవు నాచావు వార్త వింటే, నేనుగూడా ఒకప్పుడు జీవించియుంటిననీ, నాలోగూడా ఒక హృదయం ఉండేదనీ, నాకు గూడా ప్రేమించేశక్తి కొద్దోగొప్పో వుండేదనీ—ఈ మాత్రం తలుస్తేనా,ఛాయా! నా ఆత్మకు శాంతి, తప్పక కలుగుతుంది. ఆ నమ్మకం నాకుంది. ఇంక ఇంతకన్న ఎక్కువ చెప్పలేను ఛాయా! సెలవు. (తల వంచుకొని పోతాడు. ఛాయ ఖిన్నురాలై చూస్తూంటుంది)

[తెర]

## రెండవ రంగము

[రాజభవనంలో వేరొకగది.
మూడు జాములవేళ]

(ప్రవేశము: చంద్రగుప్తుడు, వాచాళుడు)

చంద్ర

వాచాళా! ఇదేమిటి ఇట్లా అంటున్నావు? ఇంత సంతోషదినమున నన్నువదలిపోతావా? నిన్ను నేను వదల్లేను, వాచాళా వదల్లేను.

వా చా

మహారాజా! క్షమించాలి. ఈ దినంకోసరమే ఎన్నాళ్లబట్టో నిరీక్షిస్తూవచ్చాను. ఎన్నో ఆశయాలు నాలో మొలకలెత్తేయి. మిమ్మల్ని పెళ్లిపీటల మీద చూచి అమితానంద భరితుణ్ణవుతానని అనుకునే వాణ్ణి. కాని............

చంద్ర

కానీ?............

వా చా

కాని యేంచేయను? దైవం అనుకూలంగాలేదు. ఎందుకో కూడా నాకు తెలియదు. నేను మగధదేశమంతా గాలించి చూచినా, నా అంత దురదృష్టవంతుడు మీకు వేరే అగుపడడు. అందుకని ఈ పాడు దేహాన్ని సాధ్యమైనంత త్వరలో ఈ దేశమునుంచి దూరంగా తీసుకొనిపో నివ్వండని నాప్రార్థన. ఈ పాడు మొగంతో నేను మీ పెళ్లిపందిట్లోకి రాలేను.

చంద్ర

ఇదేమి ఈ వాగ్ధోరణి, వాచాళా! (మీద చేయి వేసి) ఈ స్థితిలో నిన్ను చూడలేకుండా వున్నాను. ఇటు చూడు! నీవు నాకొరకెన్నో రాజ్యాలు గెలిచావు, ఎన్నోసార్లు నన్ను రక్షించావు, ఎన్నో......

వా చా

(మొహం తిప్పి) అది నావిధి, నాధర్మం.

చంద్ర

నీవుమాత్రం నీవిధిని నెరవేర్చుకోగల సమర్థుడవనీ, ఇతరులు దుర్బలహృదయులనీ తలచితివా వాచాళా. నీవిధిని నీవు నెరవేర్చుకున్నావు. ఇక నావిధి మిగిలి వున్నది. ఈ అవకాశాన్ని పోనివ్వను. ఎట్లా వూరుకోవడం వాచాళా! లోకు లేమంటారు? "వాచాళుడు తన కర్తవ్యము నెరవేర్చుకున్నాడుగాని చంద్రగుప్తుడు వానిసేవలకు తగిన ఫలితము కలుగజేయలేకపోయినాడు......" అంతేనా? అబ్బ! భరించలేను. నేను నిన్నుపోనివ్వను ఎన్నటికీ పోనివ్వను.

వా చా

మహారాజా! (వూరుకుంటాడు.)

చంద్ర

చెప్పు, వాచాళా! నీకష్టానికి కారణమేమిటో చెప్పు. నాసంతోషం నీదుఃఖాన్ని భరించలేకుండా వుంది.

వా చా

(...టాడు.)

చం ద్ర

(బుజ్జగిస్తూ) చెప్పవా, వాచాళా! చెప్పవా?

వా చా

మహారాజా! నా యీస్థితిలో మౌనమే క్షేమంగా తోస్తుంది. నన్నిలా వుండనీయండి. మీకు కష్టంగా వుంటుంది.

చం ద్ర

అభ్యంతరంలేదు. నీ కష్టాన్ని తీరుస్తాను. సామ్రాజ్యాధిపతిని...నీరాజును.

వా చా

(ఆశాపూరితమైన కంఠంతో) నా కష్టాన్ని తీరుస్తారా?

చం ద్ర

నా చేతనైతే, తప్పక...

(సేవకు డొస్తాడు.)

సే వ

మహారాజుకు జయము గాక!

చం ద్ర

ఎవరది?

సే వ

రాజగురువు చాణక్యమహనీయులు వచ్చారు.

చం ద్ర

గురువుగారా?

సే వ

చిత్తం.

(చంద్రగుప్తుడు, వాచాళుడు పోయి చాణక్యుణ్ణి తీసికొని వస్తారు.)

చం ద్ర

దయచేయండి, మహారాజా! దయచేయండి.

చా ణ

(కూర్చుంటూ) చంద్రగుప్తా!

చం ద్ర

(సవినయంగా) మహారాజా!

చా ణ

ఇవ్వాళ నీ పాణిగ్రహణము కదూ?

చం ద్ర

చిత్తము. తమ ఆశీర్వచనము; దైవసంకల్పము.

చా ణ

నీవు నా శిష్యుడవు.

చం ద్ర

అందుకు నేను గర్విస్తున్నాను.

చా ణ

ఇప్పటివరకూ నా ప్రతిమాటా వింటూ వచ్చావు. ఔను కదూ?

చం ద్ర

ఇకముందుకూడా అంతే.

చా ణ

ఎప్పటికీ?

చం ద్ర

ఆఁ! గురుదేవా, ముమ్మాటికీ ఎప్పటికీ. మీ ఉపకారాలభారం మోయలేకుండావున్నాను.

చా ణ

ఒకవేళ నేను చెప్పేది నీఅభిప్రాయానికి భిన్నంగా వుంటే?

చం ద్ర

నాదే పొరపా టనుకుంటాను.

చా ణ

చాలు! ఆ మాటతో నిలువు. ఈ మనోనిశ్చయాన్నే నేను ఆశించాను. అయితే విను. నేను నిన్ను పరీక్షించదలచాను.

చం ద్ర

(ఆదుర్దాతో) గురుదేవా! (తదేకంగా చూస్తుంటాడు.)

చా ణ

ఛాయాకుమారిని పరిణయ మాడకద్దు.

చం ద్ర

(దిగ్గున లేచి, ఆదుర్దా కనబరుస్తూ) మహారాజా!

చాణ

ఇది చాణక్యుని ఆజ్ఞ.

చంద్ర

కాని......

చాణ

నీదే పొరపాటనుకో. నేను చెప్పే దంతా నీ కొరకే.

చంద్ర

కాని, యెందుకో అదు......

చాణ

రాజగురువును. ప్రతిమాటకూ బదులు చెప్పమని బలవంత పెట్టకూడదు. నాకు కష్టంగా వుంటుంది.

చంద్ర

(తల వంచుకొని) క్షమించండి.

చాణ

(దయతో) చంద్రగుప్తా!

చంద్ర

(మెల్లగా) మహారాజా!

చాణ

నీవు రారాజువు. నీశరీరము నీరాజ్యానిది. ఏం?

చంద్ర

ఒప్పుకుంటాను.

చాణ

ఛాయ ఒకసాధారణపు కొండనాయకునిపుత్రిక.

చంద్ర

అందుకు......?

చాణ

దీనివల్ల నీదేశాని కేమీ లాభంలేదు.

చంద్ర

కాని నాప్రేమ, గురుదేవా, నానిష్కళం......

చాణ

(నిరసనభావంగా) ఉం! ప్రేమ......నీదేశము, ఈ భారతవర్షము నీనుంచి బలికోరుతూంది. ప్రజలు నిన్ను నిందలపాలు చేస్తున్నారు. ఎట్లా భరిస్తావు?

చంద్ర

(మెల్లగా) నిందా? హుం........నాఛాయ ముందట......నా ప్రేమముందట, ఆనిందను లెక్కించను.

చాణ

(కోపంగా) మరి నీరాజ్యానో? (తొట్రుపాటుతో) కాదు, కాదు. ఈ పెళ్లెప్పటికీ కానేరదు.

చంద్ర

(పెడమొగంతో) నాఛాయ ముందట నాకేమీ కనపడ్డంలేదు, వినపడ్డంలేదు. నాప్రేమప్రవాహాన్ని అరికట్టగలశక్తి ఉన్నదనినమ్మను.

చాణ

ఏమంటివి? ఆ శక్తి నాలో లేదా? అయితే ఈ పెళ్లి ఆగదా? (కోపంగా చూస్తుంటాడు.)

చంద్ర

(కట్టెలాగ నిలుచుకొంటాడు. ఏమీ మాట్లాడను.)

చాణ

(తొందర గనపరుస్తూ) ఆగదా? చెప్పు, నీతుది నిశ్చయముచెప్పు. నీదృఢసంకల్పమే నాకిప్పుడు కావాలి.

చంద్ర

(కంటనీరుగారుతూంటుంది.) మహారాజా! ఛాయ జీవనం వ్యర్థ మైపోతుంది. ఆమెను నేను నాహృదయపూర్వకంగా ప్రేమిస్తున్నాను. ఇప్పుడిప్పుడే ఎన్నో ప్రమాణాలు చేసివచ్చాను. ఆముగ్ధ ఈవార్త విన్నట్లయితే.........అబ్బ!......ఆమె.హృదయం...... కోమలమైన ఆమె హృదయం......ఇట్టి కఠోరమైన వార్తను భరించగలదా? నన్ను నిందిస్తుంది. నన్నేమిటి, పురుషజాతి నంతటినీ నిందిస్తుంది. తుదకు తాను మాత్రంబతుకుతుందా ?......బతుకదు...ఊహుఁ... బతుకలేదు.

చాణ

అయితే ఈ పెళ్లిని ఆపలేవూ?

చంద్ర

(మెల్లగా) నాశక్తికి మించినపని ఎలా చేయగలను?

చా ణ

(కోపంగా) ఆప వన్నమాట......?.........
అంతేనా?

చ ం ద్ర

(తలవంచుకొని ఊరుకుంటాడు.)

చా ణ

గ్రహించాను. నీమౌనంలోని భావం గ్రహించాను. ఇన్నాళ్లనుంచి నిన్నర్థంచేసుకోలేకపోయాను. ప్రయాసపడి, బలంచూపి నేర్పుతో నీ విన్నాళ్లనుండీ సంపాదించిన ఈరాజ్యమంతా మట్టిలో కలపడానికి పూనుకున్నట్టున్నావు. నీవెనుక నీదేశము ఈ పెళ్లి చేసుకోకూడదని ఎలుగెత్తి అరుస్తూ వున్నది. కాని ఈ నీసామ్రాజ్యరోదన నీవిషయంలో అరణ్యరోదనగా పరిణమిస్తూవుంది. ప్రేమలో మునిగియున్న నీకు చెలికుభలోక్తులు తప్ప వేరే ఏమీ వినబడేట్టులేదు. దీనికి ఫలితము, నీరాజ్యము మట్టిపాలవుతుంది. చంద్రగుప్తా! కండ్లు తెరువు. బాగా యోచించుకో. నీ రాజ్యానికోసరం, నీదేశముకొరకు, నీప్రజకై నీప్రేమను కూడా ఆహుతి చేయాలి. వెనుదీయుటం రాజధర్మం కాదు. దీనిని నిదర్శనంగా నీ ప్రజకు చూపించాలి. అప్పుడు, నీవంటి చక్రవర్తి లభించినందుకు ప్రజ గర్విస్తుంది, నిన్ను ప్రేమిస్తుంది, నీయందు గౌరవముంచుతుంది......ఒప్పుకుంటావా?

చ ం ద్ర

నేనేమి చేయాలి? మహారాజా! ఈ పరీక్ష చాలా కఠినంగా ఉంది.

చా ణ

నాయనా! చంద్రగుప్తా! నామాట విను. నీ రాజ్యాన్ని కాపాడుకో.

చంద్ర

ఛాయాప్రేమనిరసనంవల్ల రాజ్యసంరక్షణ ఎలా జరుగుతుందో నాకేమీ బోధపడడంలేదు. కాని ఏమి లాభం?

చా ణ

అది నాకు తెలుసు. ఆసంగతి నాకు వదలివేయి.

చం ద్ర

మంచిది. కాని.........

చా ణ

(సంతోషంతో చంద్రగుప్తునిమాట పూర్తికాకపూర్వమే) ఇప్పుడు నీవు నిజంగా చంద్రగుప్తునిలాగ మాట్లాడుతున్నావు. ఆనందము, ఆనందము! ఇక నా వెంటరా (అటు తిరిగి) వాచాళా!

వా చా

(తల వంచుకుని) మహారాజా!

చా ణ

నీ విప్పుడే వెళ్లు. ఛాయను కలుసుకుని ఆమెకీసంగతి చెప్పు. ఇది చంద్రగుప్తుని తీర్పని కూడా చెప్పు. ఇక తిరుగు లేదను.

వా చా

చిత్తము; ఆజ్ఞ.

చా ణ

వెళ్లు. (చంద్రగుప్తునితో) రా నాయనా! చంద్రగుప్తా! ఈ వార్త ప్రజలకు తెలియపరచాలి. నీ వెంత గొప్పవాడవో వాళ్లకప్పుడు తెలుస్తుంది. (చంద్రగుప్తుడి చేయిపట్టుకొని లాక్కెళ్తాడు. చంద్రగుప్తుడు విచారంగా చాణక్యుని వెంట వెళ్తాడు.)

వా చా

ఆశ.........ఆశ.........అంధకారంలో మళ్లీ మిణుకుమిణుకు మంటూ వున్నది ఆశాజ్యోతి... కాని నమ్మకం లేదు......మళ్లీ నాకు అపజయమే నేమో......ఎవరది? ఛాయేనావస్తూన్నది? ఈసంగతి ఎట్లా చెప్పాలో తోచడంలేదు. ఈ సంగతి విన్నతప్పక ఏడుస్తుంది......అబ్బ!......ఛాయ యేడుస్తూవుంటే నేను చూడలేను.

(వాచాలు డొక కుర్చీకానుకొని తనచేత్తో కళ్లు మూసుకుంటాడు. ఛాయా, కుమారీ వస్తారు. వాచాలుని చూచి ఛాయ ఉలిక్కిపడుతుంది.)

ఛా య

ఎవరూ ? వాచాలుడా ? ఇంకా యిక్కడనే వున్నావు?

వా చా

ఇది నాతప్పు గాదు, మహారాజుగారిది.

ఛాయ

ఏమీ ? మహారాజుగారి తప్పా......?

వా చా

వారు నన్ను పోనివ్వలేదు. నాతో ఒక సందేశ మంపారు.

ఛాయ

(ఆతురతతో) సందేశమా ? ఎవరికి ? నాకేనా?

వా చా

అవును, మీకే.

ఛాయ

ఏమని ?

వా చా

దురదృష్టవంతుణ్ణి కాకపోతే-నావంటివారు వేల మంది ఉన్నా, ఈపనికి నన్నే నియమించాలీ?

ఛాయ

ఏమిచెప్పాలో తొందరగా చెప్పు. కాలయాపన చేయకు వాచాళా!

వా చా

కోప్పడకుండా వుంటే చెప్తాను ... ఇదే నా స్థితిలో మరెవడైనా వుంటే, తప్పక సంతోషంతో పొంగిపోయే వాడు. ఇంత ఆలస్యంగూడా చేసి యుండకపోవునేమో. కాని...... (నిట్టూర్పు) ......నేను నిన్ను ఇంతవరకూ ప్రేమిస్తూ వున్నాను. నీ కేచిన్న కష్టం వచ్చినా నాకు గొప్పప్రళయంలా కనబడు తోంది. నీసంతోషమే నాఆనందము. నిన్ను కష్టపెట్ట లేను...... అబ్బ! ఈవార్త చెప్పలేను. చెప్పను. రాకుమారీ! చెప్పను. శెలవు. (పోబోతాడు)

ఛాయ

ఉండు, వాచాళా! ఉండు. నాకు కష్టం కలిగించ నని ఇప్పుడే అన్నావు. ఆవార్త తెల్పకపోతే నాకు చాలా బాధకలుగుతుంది. నన్నిప్పుడన్నా నిజంగా ప్రేమించినట్లయితే—— (ఆగి) చెప్పు, వాచాళా, ఆసంగ తేమిటో కానివ్వు.

వా చా

రాకుమారీ! ...... (బాధగా) అబ్బ! చెప్ప లేను. ఊహూ చెప్పను. నన్ను క్షమించాలి.

ఛాయ

(దీనంగా) అయితే నాకోర్కె తీరదా?

వా చా

నీవు నన్ను అసహ్యించుకుంటావు.

ఛాయ

అసహ్యపడను. చెప్పు, ఏమిచెప్పాలో చెప్పు. నన్నిలాపీడించడం నీకు బాగుందా వాచాళా ?

వా చా

అయితే విను. గుండెను దాయిచేసుకో ...... మహారాజు గారి ఆజ్ఞ......దానికి తిరుగులేదట కూడా......

ఛాయ

(ఆతురతతో) ఆజ్ఞా?......ఏమని?

వా చా

ఏమని, నీతో చెప్పమని ...... మీ ఇద్దరికీ పెళ్లి కాజాలదు, కాదని.

ఛాయ

(కలవరపడుతూ) ఏమిటీ ? మాపెళ్లా...... కాదా ?...... ఇదేనా ? ఇదేనా నువ్వనేది ?

వా చా

(నెమ్మదిగా) అవును రాకుమారీ! నా సందేశము అంతే. మహారాజుగారు ఇట్లాగే అనమన్నారు. కాని వారుమాత్రం ఏమిచేస్తారు ? ఏడుస్తున్నారు, నీ యందు వారికిగల గాఢప్రేమను వెలిపుచ్చుతూ. రాజ్యము, దేశము, ప్రజ——ఇవన్నీ వారిని వదలలేకుండా ఉన్నాయి; వదలవు. వాటి సంతుష్ట్యర్థమే నీతో వేరగుటకు వారు బలవంతపెట్టబడ్డారు.

ఛాయ

ఏమీ, బలవంతమా? (కుమారివైపు తిరిగి) కుమారీ! విన్నావా ? మహారాజుగారు బలవంతపెట్ట బడ్డారట!

కు మా రి

కలలోగూడా తలచనివార్త.

ఛా య

(ఏడుస్తూ) వారు నాతో ఎన్నిప్రమణాలు చేశారు. తుదకంతా ఇలా పరిణమిస్తుం దని ఎన్నడూ అనుకోలేదు.—(హఠాత్తుగా ఏడుపాపి) వారునన్ను వదల్లేరు, వదలరుకూడా. ఇదంతా నన్నూ, నా జీవితాన్నీ నాశనముచేయుడానికి వేసిన యెత్తు. ఇది రాజసందేశం ఎంతమాత్రమూ కాజాలదు. కాలదన్నిన హృదయపు తుదిప్రయత్నము; తిరస్కరింపబడినప్రేమ గనిపెట్టిన సాధనము; ధిక్కరింపబడినమోహము పగదీర్చుకొనుటకయి పన్నిన పన్నుగడ. హుం! ఎంత నీచపు ఆలోచన. (వాచాళునివైపు తిరిగి) వాచాళా! నీ......

కు మా రి

అమ్మా! ఒక్కసంగ...........

ఛా య

(కుమారిమాటలను వినకుండానే) నీ దొక్కమాటకూడా నమ్మను వాచాళా! నీ అన్నీ అబద్ధాలు. అంతా మోసం. ఈ నీచపు ఎత్తుతో నీ ప్రేమను ధిక్కరించిన నా హృదయాన్ని మళ్లీ గ్రహించాలని చూశావు కాబోలు. మహారాజు నిన్ను పూర్తిగా నమ్మాడు. విశ్వాసపాత్రుడిగా ఎంచాడు. అంతఃపురంలోనికి కూడా రానిచ్చాడు. దీని కంతా నీవు చేసే ప్రతిఫలం ఇది. అంతేకదూ? నా మనసు ఆయనవైపునుండి తిరిగి పోతే, నాకూ ఆయనకూ ఎడబాటు గలిగితే నీకాళ్లపై వాల్తానని అనుకుంటున్నావేమో. కాని.........

వా చా

రాకుమారీ!...

ఛా య

స్త్రీహృదయం ఎట్లాంటిదో నీకు తెలియదు. అది ఒక్కరినే ప్రేమిస్తుంది. అదీ ఒకేసారి. తనప్రేమలో అపజయమంటూ పొందితే, తన సంతోషాలని అంతతో శాశ్వతంగా గాలితో తన్ని వేస్తుంది. స్త్రీని వంచించడం అంత సులభ మనుకున్నావేం? వాచాళా! అది సాధ్యమైన పని కాదు.

వా చా

ఛాయాదేవీ!......

ఛా య

నీ ప్రయత్నమంతా వ్యర్థమైపోయింది. నీమాటలను నేను నమ్మను. కుమారీ! రా, మహారాజుదగ్గరకు పోదాం. చూడు, ఎచ్చటనున్నారో వారు. (ఆవేశంతో వెళ్లిపోతుంది. కుమారి వెనుకనే వెళ్లుతుంది)

వా చా

(ఖిన్నుడై బొమ్మలాగ నుంచుంటాడు. ఒక్కసారి పోబోయి ఆగి) "ధిక్కరింపబడిన ప్రేమ పగదీర్చుకొనుటకై పన్నిన పన్నుగడ".........అబ్బ! నన్నెంత నీచునిగా భావించింది......కాని ఇది ఆమె తప్పు కాదు. ఆమె మహారాజుని ప్రేమిస్తూంది. ప్రణయాంధురాలు. ప్రేమదే ఆతప్పు. ఆమెమాత్రం నిర్దోషురాలు. (పోతాడు)

[తె ర]

## మూ డ వ ర ం గ ము

[ఛాయ గది. సాయంసమయము. ఛాయ ఉదాసీనంగా కూర్చొనుంటుంది. లేచి ద్వారంవైపు పోతుంది. తిరిగీ వస్తుంది. మళ్లీ చూస్తుంది. పిచ్చిదానివలె మాటలాడుతుంటుంది.]

ఛా య

కుమారి ఇంకనూ రాలేదు......అబ్బ! కాలానికి కాళ్లు పడిపోయినట్టున్నాయి. విసుగెత్తుతుంది. (అటూ ఇటూ పచారుచేస్తూ) కుమారి ఇంకా రాదు, కారణం?......తెలిసింది, తెలిసింది. మహారాజుగారు దానితో మాట్లాడ దలచుకోలేదు......అయితే వాచాళుని మాటలు...అబ్బ! అవే నిజమైతే భరించగలనా? (కిటికీలోనుంచి కిందికి చూచి ఆశ్చర్యంతో) ఇదేమిటీ? పురాలంకారాలన్నీ ఏవీ? పహారావారేరీ?... ...నిజమే......నిజమే......అమ్మయ్యో! అంతా నిజమే......?

(కుమారివస్తుంది. ఛాయ ఆమెదగ్గరకు పరుగెత్తుతుంది.)

ఛాయ

చెప్పు కుమారీ! చెప్పు, మహారాజాగారు నీతో మాట్లాడారా? ఏమన్నారు? ఎప్పుడొస్తారు?.......

కుమా

వారిప్పుడు చాణక్యమహారాజుదగ్గర ఉన్నారు.

ఛాయ

(ఆతురతతో) ఏమిచేస్తున్నారు?

కుమా

దుఃఖిస్తున్నారు.

ఛాయ

మరి................?

కుమా

వారి ఒక్కమాటకూడా చాణక్యమహారాజు గారు వినిపించుకోవడంలేదు.

ఛాయ

(లేచి) అయితే ఇది నిజమేనా?

కుమా

నిజమే......కాని మహారాజాగారు పిచ్చి...

ఛాయ

(మాటకడ్డువస్తూ) కుమారీ! నీపిచ్చి......ఇదంతా ఒక పన్నుగడ. పురుషులు ఇందులో ప్రవీణులు. ఇంతమోసం జరుగుతుందని కలలోగూడా అనుకోలేదు. అతని ప్రమాణాలనే నమ్మినానుకాని ఆ ప్రమాణాలవెంబడినే నా నాశనముగోరు ప్రయత్నాలు గూడా జరుగుతున్నాయని కొంచెంగూడా తెలుసుకోలేకపోతిని.......కుమారీ! ఇంతకూ నా బుద్ధితక్కువ కాని, చిన్నపిల్లవలె ఆ "చంద్రుడి" నాశించుటేమిటి............!

కుమా

శాంతించండి దేవీ! మీ.........

ఛాయ

కుమారీ! ఇటురా. (కుమారి వస్తుంది.) ఈ వస్త్రాలంకార మంతా నీవు చేసిందేకదూ?

కుమా

(ఏడ్పుకంఠంతో) ఇట్లా అవుతుందని నాకు తెలియదు దేవీ!

ఛాయ

అందుకు నిన్నేమీ అనడంలేదు. నేను చెప్పేదది కాదు. ఈ అలంకారమంతా నీవే చేసితివి కాబట్టి నీవే ఇవన్నీ నానుండి వేరుచేసేయి. (కుమారి ఊరకుంటుంది.) వినవా? నామాట వినవా?......అవును, ఎందుకువింటావు? నేను రాణిని కానుగా? సరే నేనే, వీటిని నానుండి వేరుచేస్తాను (అంతా తీసివేస్తుంది) కుమారీ! ఈ ఒక్కసంగతన్నా చెప్తావా? మహారాజుగారొస్తారా?

కుమారి

వస్తారు... (ఎదుట చూచి) అదుగో వస్తూనే వున్నారు.

ఛాయ

అయితే నే నాయన్ను చూడలేనని చెప్పు. నేను పోతాను.

కుమారి

పొరపడుతున్నారు దేవీ!

ఛాయ

అనవసరము...........(తొందరగా వెళ్లిపోతుంది. కుమారి ఆతురతతో ఛాయ తీసివేసిన దుస్తులను ఒకమూల దాస్తుంది. చంద్రగుప్తుడొస్తాడు.)

చంద్ర

కుమారీ!

కుమారి

(తలవంచుకొని) మహారాజా!

చంద్ర

ఛాయ యేదీ? నేనొచ్చానని చెప్పు.

కుమారి

చిత్తము... (వెళ్లిపోతుంది. చంద్రగుప్తుడు కూర్చుంటాడు.)

చంద్ర

మించిపోయింది...చంద్రగుప్తా! అంతా మించిపోయింది. నీచేతిలో ఏమీ లేదు. ఇక రెండుమాటలతో ఛాయ గొంతుకోయడానికి సిద్ధపడు......ఇది ధీరత్వము కాదు, [illegible]ద్దున ప్రేమానందభరితమైన

ఆ సుందరవిగ్రహాన్ని ఇప్పు డొక దుఃఖపూరితమైన మూర్తిలాగ చూచి, నీతుదిసంతోషాన్ని అనుభవించు ......గురుదేవా! ఈ పరీక్ష చాలా కఠినమైంది. ఎలా కడతేరుతానో...(లేచి ఇటూ ఆటూ పచారుచేస్తాడు. అతని దృష్టి ఆ దుస్తులపై పడుతుంది. ఈవలకు తీసి బల్లపై పెడ్తాడు) ప్రణయావస్థ......మనసులో ఎంత నొప్పుతుందో కాని ఇది నా తప్పు కాదు......నేనొక రాజును......

(ఛాయా, కుమారీ కీచులాడుతూ వస్తారు)

ఛా య

నన్ను వదులు. నన్నాపకు. నేను చాణక్యుణ్ని లక్ష్య పెట్టను. (చంద్రగుప్తుణ్ణి చూచి) మహారాజా! మీరు వచ్చారా? నేను విన్నదంతా నిజమేనా?

చం ద్ర

దేవీ! నన్ను క్షమించు. నా స్థితిని గమనింప లేవా?............ నేను రారాజును. ఆకారణం చేతనే అందరికంటే దురదృష్టవంతుడను. నేను......

ఛా య

మహారాజా! నాకిప్పుడు ప్రత్యుత్తరం కావలెను ...... ఇదినిజమేనా?......

చం ద్ర

దేవీ! నే నిప్పుడు నీతో ప్రణయసంభాషణ చేయడానికి రాలేదు. నావిధి నన్నిట్లా పాషాణహృదయునిగా చేసివేసింది...నీవుకూడా ఎన్నోసార్లు నామనసును నాఽధివై పుకు మరలచ్చావు. ఇప్పుడుకూడా ధైర్యం వహించు. నీవుకూడా పాషాణహృదయవు కమ్ము.... అబ్బ! అట్లాచూడకు ఛాయా. అట్లాచూడకు ...నేను భరించలేను....

ఛా య

(కన్నీళ్లు కారుస్తూ) మహారాజా ...

చం ద్ర

...దేవీ?...

ఛా య

మీరు నన్ను...

చం ద్ర

రాజ్యము దేవీ! రాజ్యము.

ఛా య

(కన్నీళ్లాపి) రాజ్యమా? రాజ్య మేమంటోంది?

చం ద్ర

ఈ పెళ్లి చేసుకోడానికి వీలు లేదని

ఛా య

కారణం?

చం ద్ర

రాజ్యానికి బల మవసరమున్నది.

ఛా య

అంటే?

చం ద్ర

నీవొక సాధారణపు కొండరాజు పుత్రివి.

ఛా య

అందుకు.........?

చం ద్ర

ఈ పెళ్లితో నాబల మభివృద్ధి పొందదు.

ఛా య

(తీక్ష్ణంగా) మరి మీబలాభివృద్ధికి ఏ త్రోవను అవలంబించ నున్నారు.

చం ద్ర

(తల వంచుకొని) అది చాణక్యమహారాజుతీర్పు, నాది కాదు.

ఛా య

ఏమిటో అది?

చం ద్ర

.........సెల్యూకస్ పుత్రిక...... హెలన్ ............

ఛా య

(నిట్టూర్పు) బాగుంది. అందమైనపిల్ల...... రూపరేఖావిలాసాల లోటు లేదు. అందులో ఒకగొప్ప తండ్రికి సుపుత్రి. వారికి సైన్యముంది...బలంఉంది... ధనముంది. మరి నేనో... (ఏడుస్తూ) ...ఒకసాధారణ ...[illegible]... ఎందుకు లెండి...అరణ్యరోదన

......కాని మహారాజా! మీపై నాకున్నంత ప్రేమ మరెవ్వరికీ ఉండదనే నానమ్మకం.

చం ద్ర

ఛాయా! అది నాకు తెలుసు. నీతో వేరవడం నాసంతోషాలకు దూరమవడమని నాకు బాగా తెలుసు. ప్రతిక్షణమూ నీజ్ఞాపకమే. నీప్రేమే నా హృదయాన్ని కలతపెడ్తూంటుంది. నేను జీవించి వున్నంతవరకూ నీ ప్రేమ నాహృదయంలో ఇదేరూపంగా ఉండగలదు... (దీనంగా)...కాని ఛాయా! రాజ్యము దీనినే కోరుకుంది ...(నిరాశతో) నేనేమీ చేయలేను.

ఛా య

(తలయెత్తి తీవ్రంగా చూస్తూ) నాతో కొత్త కొత్త ప్రమాణాలు చేసేటప్పుడు మీబుద్ధెక్కడకు పోయింది? మీరాజ్యమెక్కడ పడుకుంది? మీ ప్రజ లెక్కడ నిద్రబోయినారు?......అప్పుడేమీరు నాతో అనలేకపోయినారా..."వెఱ్ఱిపిల్లా, నేను రారాజును, నీ వొక సాధారణపు రాచబిడ్డవు. నీకూ నాకూ ఏం సంబం ధం"...అని ...—మీరు ప్రేమపూరితమైన నాహృద యాన్ని తీసుకొని, మీ రాజ్యపాషాణముపై చితుకగొట్టి నారు. ఇవేనా మీ ప్రమాణాలు? ఇవేనా మీ......?

చ ం ద్ర

ఛాయా! నేనేమిచేయగలను? నా రాజ్యానికి నాపై అధికారమున్నది.

ఛా య

కాని మీపై మీ కధికారము లేదా......?

చ ం ద్ర

(గద్గదకంఠంతో)...—ఛాయా? ......?

ఛా య

మహారాజా? మీరేమంటున్నారో, కాస్తఆలో చించండి......నేను మీ ఛాయను... (ఏడుస్తుంది).

చ ం ద్ర

(ఏడుస్తూ తన్నుతాను చూచుకుంటూ) చంద్ర గుప్తా! భవిష్యత్తును కొంచెమన్నా ఆలోచించ లేదు... నీవ్యక్తిత్వం నీవుతెలుసుకోలేకపోతివి. నీవొక సాధారణస్వతంత్రజీవివనుకున్నావు. కాని చంద్ర గుప్తా! నీవొక రారాజువు. నీస్వేచ్ఛ నీ రాజ్యపుసొత్తు. నీ ఇష్టము నీరాజ్యశ్రేయోభిలాష. నీ సంతోషము నీరాజ్యముకోరిక...నమ్మరానిది నమ్మినావు....... ఫలితము?.......నేను నీసంతోషము, నీ సర్వసుఖము, పాడైపోతున్నది. నీవేమీ చేయలేక చూస్తున్నావు... ...(ఒక్కసారి ఛాయవైపు తిరిగి)కాని ఛాయా! నేను రాజ్యముపాలించాలి.

ఛా య

(దీనంగా) అయితే మీ తీర్పు ఇదేనా?

చ ం ద్ర

ఆఁ. ఇదే.

ఛా య

దీనికి తిరుగులేదా?

చ ం ద్ర

......లేదు, ఛాయా!......తిరుగులేదు.

ఛా య

(గద్గదకంఠంతో) ఏలుకొండి మహారాజా, ఏలు కొండి మీబలాభివృద్ధికే పాటుపడండి. నే నడ్డుతగలను. మీ సామ్రాజ్యవ్యాప్తికే మీసర్వశక్తులను వినియోగిం చండి. నాప్రేమను మీ కడ్డుతగల్నివ్వను. నాకుఅమోఘ ప్రమాణాలుచేసిన మీ నాలుక నాప్రేమను ఎట్లా ధిక్క రిస్తుందో విందా మని కుతూహలంగా వుండేది. నా కోర్కె నెరవేరింది. ఇక శెలవు.........అబ్బ! ఈ పద ముచ్చరించటానికి నానాలుక తడబడుతూన్నది. కాని ఏమిచేయను? మీ రాజ్యము, మీప్రజ, మీ...... దినములు, వారాలు, ఏండ్లు గడచిపోతాయి కాని, ఇక మీరు నా మొగము మళ్లీచూడరు. నా మాటలు వినరు. మీకు జయమగుగాక......శెలవు (పోబోతుంది.)

(మురతొందరగా ప్రవేశిస్తుంది)

ముర

ఉండు, పుత్రీ! ఉండు, పోవద్దు...(చంద్ర గుప్తునితో) చంద్రగుప్తా!

చ ం ద్ర

మాతా?

ము ర

ఇవంతా ఏమిటి?

చ ం ద్ర

. . . . గురుదేవుని ఆజ్ఞ తల్లీ!

ము ర

ఇట్టి రత్నాన్ని పో ‘ ట్టుకుంటున్నావా? చంద్రగుప్తా? ప్రపంచమంతా వెతికినా ఇంత మంచిపిల్ల దొరుకుతుందా, నాయనా?

చంద్ర

సందేహం లేదు, తల్లీ !

ము ర

మరి ఈ పెళ్లి ఎందు కాగింది ?

చంద్ర

గురువుగారి ఆజ్ఞయని చెప్పితిగా.

ము ర

కాని, చంద్రగుప్తా! నేను నీతల్లిని..... ఇది నాఆజ్ఞ. ఆమెను పెళ్లిచేసుకో......ఆదేవి కన్నీరు నేను చూడలేను. ఆమెనిట్టూర్పులను భరించలేను. అవి నీ సింహాసనాన్ని వేళ్ళతో పెకలించగలవు. నీశక్తిమీద మబ్బులై తాండవమాడగలవు. నీ...

ఛా యా

కాదు, తల్లీ ! కాదు అల్లైన్నటికీ కాజాలదు. నేనెక్కడనున్నా, ఏ స్థితిలోనున్నా, నాహృదయ మెప్పటికిన్నీ వీరి సంతోషానికొరకే దైవాన్ని ప్రార్థిస్తూ వుంటుంది. నేను భారతపుత్రి’.

ము ర

నాయనా ! చూడు, ఆమాటలు, ఆభావాలు... రత్నాన్ని కాల రాయుచుంటివినువూ!

చం ద్ర

కాని, తల్లీ! రాజ్యము నానుండి బలికోరుతుంది.

ము ర

నీ రాజ్యము శిగతరిగిరి......రాజ్యము...... హుం......నీ రాజ్యాన్నే బలి ఇచ్చుకో. ఈ అమ్మయిపై నీ కేమి అధికారము?

చ ం ద్ర

మాతా!..............

ము ర

చంద్రగుప్తా! నా మాట ఎప్పుడూ వింటూ వస్తున్నావు.

చ ం ద్ర

ఇప్పుడుకూడా వింటాను.........

ము ర

వింటావా? వింటావా? (సంతోషంతో) ఇప్పుడు కూడా వింటావా ?

చ ం ద్ర

ఆఁ, జవదాటను. కాని.........తల్లీ ! కాస్త దీర్ఘంగా ఆలోచించు. ఇన్నాళ్లనుండి కష్టపడి నిలబెట్టిన ఈ భవనం త్వరలో కూలిపోతుంది.

ము ర

ఎంచేత ?

చ ం ద్ర

గురువుగారి జోస్యం.

ము ర

ఆ సెల్యూకస్ బిడ్డ—ఒక పరదేశపుపిల్ల—వచ్చి ఈ కూలిపోయే భవనాన్ని తన చేతులతో నిలబెట్టుతుందేం?...అబ్బ! ఎంతటి అజ్ఞానము ... ఇందుకేనా ఈ పిల్లప్రేమను నిరాకరించడం?

చ ం ద్ర

(వ్యాకులమనస్సుతో) నేనేమీ చేయలేనుతల్లీ!

ము ర

ఏమీ ! ఏమీ చేయలేవా? నామాట గూడా వినలేవా? ... ఇంతసాహసమా ? కన్నతల్లి మాటలు జవదాటిన కొడుకులకెందును శ్రేయము కలుగదు సుమా!

చ ం ద్ర

తల్లీ!.........

ము ర

చంద్రగుప్తా ! బాగా యోచించుకో. నీ పిచ్చిని పారద్రోలాలి. ఈ మూర్ఖత్వాన్ని వదలాలి........

చం ద్ర

అమ్మా! నేను తీర్మానించుకున్నాను. రాజ్యాభివృద్ధికొరకు నా సంతోషాన్ని కూడా వదలుకుంటాను. గురుదేవుని ఊహ రాతిగీత. నేను చావవలసిన చచ్చెదను. కాని రాజ్యాభివృద్ధికి అడ్డు తగను. ఇది నా దృఢ సంకల్పము. నేను ఛాయను ప్రేమించాను......అందరి కంటే ఎక్కువగా, నా మనఃపూర్వకంగా ప్రేమించాను.........ఛాయే నా సంతోషము......ఛాయే నా సర్వస్వము......కాని రాజ్యంకొరకు నాయీ అమూల్యమైన వస్తువునుగూడా వదలుకోడానికి వెనుదీయను...లేకుంటే దేశము నన్ను నీచంగా చూస్తుంది ......తలెత్తుక తిరుగలేను......

ఛా య

మహారాజా అట్లు కాదు. మీరు తలెత్తుకొనే తిరగండి. దేశము మిమ్ముల కనోళ్ల పొగడగలదు బలము మిమ్ము ఆహ్వానించగలదు. కీర్తి, యశస్సు......మీ కీర్తిపై తాండవమాడగలవు......వాటివైపే తిరగండి, వాటనే తలచండి, నాటికే ఆతిథ్యమొసగండి......... నన్ను (‘ట్టూర్పు విడిచి) తలవకండి. మీకు నేను అడ్డు తగలను. మీరు నా సంతోషము, శాంతము, నిశ్చింత అన్నీ తీసుకున్నారు. కాని మీ ప్రేమ నాహృదయంలో ఇంకా రగుల్కొనుచునే వున్నది. నేను జీవించివున్నంతవరకు అదేవిధంగా ఉంటుంది. అట్లాగే ఉండనీయండి......దానినెవరూ తీసివేయలేరు.........ఎమిటే? మీరు ఏడుస్తున్నారా? ధైర్యము తెచ్చుకోండి మహారాజా! ఇప్పుడే కదూ మీరు నాకు ధైర్యంగా ఉండమని బోధించింది?......... మీ కన్నీళ్లు మీ హృదయాన్ని నాకు స్పష్టపరుస్తున్నాయి. మీరు నన్ను ప్రేమిస్తున్నారు...చాలు, అంతే చాలు నాకు...కుమారీ! మాతా!! మహారాజా!. ఇక నాకు సెలవు. మహారాజుగారికి జయ మగుగాక! (వెళ్లిపోతుంది. చంద్రగుప్తుడు తల వంచుకొని ఏడుస్తాడు.)

ము ర

పోయింది, చంద్రగుప్తా! ఛాయ పోయింది.

ట్లు కాగూడదు...కాజాలదు......

చం ద్ర

(ఏడుస్తూ) తల్లీ!......

ము ర

ఛాయ వెళ్లిపోయింది. చెప్పనాయనా ఇప్పటికన్నా చెప్పు, పిలుచుకరానా?

చం ద్ర

ఏమిటీ ?

ము ర

వేళమించిపోతోంది. తొందరగా చెప్పు, పిలుచుకరానా ?

చం ద్ర

అదృష్టము.........

ము ర

త్వరగా చెప్పు చంద్రగుప్తా! నాభయము, ఛాయ తన ప్రా.........

చం ద్ర

ఆ ఆ! ఛాయ తన ప్రాణముపైకి తెచ్చుకుంటుందీ...అవును......అట్లుకాగూడదు...కాజాలదు. పో, పో, త్వరగా పో, నా తీర్పును మారుస్తాను.

ము ర

నన్ను రక్షించావు నాయనా! (పరుగెత్తుతుంది.)

చం ద్ర

ఒక్క రోజులో ఎన్ని మార్పులు......అబ్బ! ......ఛాయా! ఛాయా!! నారాజ్యాన్ని వదులుకుంటాను. ప్రేమభిక్షువునై నీ వెంట సంతోషంగా తిరుగుతాను. నీ వుండగా నాకీరాజ్య మెందుకు......?...

(వాచాళుడు వస్తాడు.)

వా చా

మహారాజాగారికి జయమగుగాక.

చం ద్ర

ఎవరూ ? వాచాళా! ఇక్క నీవు పోవుకదూ?

వా చా

కడసారి తమదర్శనానికై వచ్చినాను.

చం ద్ర

అట్లు కాదు, వాచాళా! నేను భరించలేను... ...ఈ ప్రపంచంలో నేను ప్రేమించింది మీ ఇద్దరినే- నిన్నూ ఛాయనూ. నేడు మీరిద్దరూ నన్ను వదలడానికి సిద్ధంగా వున్నారు. నేను ఛాయను వదలుతున్నాను. నీవు నన్ను వదలుతున్నావు.........కాని ఇట్లుకాజాలదు. మీలో నాకు ఒకరు ఎండ, ఒకరు వెన్నెల. మీరులేంది నాకు అంతా అంధకారమే. నేను ఛాయను వదలుతీర్పు ఉపసంహరించుకొంటున్నాను. నీవు కూడా అట్లానే చెయ్యి.

వా చా

హా! అదృష్టము. ఆశాజ్యోతి మళ్లీ అంధకారం వహించింది.

చం ద్ర

ఏమి టీ మాటలు?

వా చా

మహారాజా! నా దొక విన్న.........(పూరుకుంటాడు)

చం ద్ర

చెప్పు వాచాళా! ఏమి చెప్పదలచు కున్నావో చెప్పు.

వా చా

మీరు వినలేరేమో అని జంకుతున్నాను మహారాజా!

చం ద్ర

వింటాను, వాచాళా! ఈరోజు అన్నీ వింటాను. నా జీవితచరిత్రలో ఇదొక ప్రళయదినంలాగున్నది. చెప్పు, చెప్పు, వింటాను.

వా చా

మహారాజా!......నేను......ఛాయను...... ప్రేమించాను.

చం ద్ర

(ఉలికిపడి) ప్రేమించావా?...... ఇప్పుడూ?

వా చా

ఇప్పుడు కూడా ప్రేమిస్తూనాన్నాను. మీరు నాజీవితాన్ని మంట గలిపివేసినారు. ఈ స్థితిలో నేను మీవద్ద ఉండలేను.

చం ద్ర

(కోపంతో) వాచాళా! ఇంత సాహసమా? ఏమాత్రమూ జంకు లేకుండా నన్నూ, నారాజ్యాన్నీ అవమానించినావు!

వా చా

(నిర్లక్ష్యంగా) అనమానపరచినట్లయితే నేనప రాధిని.

చం ద్ర

(కోపంతో) రాజద్రోహీ!...............

వా చా

(నడుమున కత్తిపై చేయి వేసి) చాలించండి, నేను వినలేను.

చం ద్ర

(హేళనగా) తీయి కత్తి, ఎందు కాగినావు?

వా చా

మహారాజా! మీరు ప్రభువులు. మీ ముందట కత్తి తీయగలనా?

చం ద్ర

పిరికిపందా!............

వా చా

(కత్తిదూసి) సరే రండి! పోట్లాడుదాము. నేను మాత్రం దీనికి కారకుణ్ని కాజాలను.

(ఇద్దరూ యుద్ధానికి సంసిద్ధులౌతారు. తెరలో ఏడుపు వినబడుతుంది.)

చం ద్ర

ఎవరూ?......అమ్మగారికంఠం లాగున్నది... ...ఎందుకో?

(చాణక్య డొస్తాడు.)

చా ణ

చాలించండి మీ పోరుసాలు. ఛాయ ప్రాణం విడుచుచున్నది.

చంద్ర

(కత్తి పారవైచి, పిచ్చివానిలాగ చూస్తూ) ఏమిటీ .........“ఛాయ.........” దానితర్వాత ఏమన్నారూ ?

చాణ

ప్రేమమూర్తి అవమానము భరించలేక పోయింది. తర్వాత ఒక ఘుంటకూడా బ్రతుకలేదు. విషము తాగింది.

వాచా

(చంద్రగుప్తునితో) దీనికి కారకులు మీరు, మహారాజా !

చంద్ర

(మిక్కిలి కోపంతో) నేను కాజాలను. నాతప్పు కాదు. ఇదంతా ఈ గురువు.........ఈ బ్రాహ్మడి పని.........ఛాయా ! ఛాయా ! ! (పిచ్చివానివలె అరుస్తూ పరుగెత్తుతాడు. ఎదురుగుండా ఛాయ తూలుతూ రాజమాత సహాయంతో వస్తుంది )

ఛాయ

(సన్నని కంఠంతో) మహారాజాగారికి జయమగుగాక, నమస్కరించుచున్నాను.

చంద్ర

(ఏడుస్తూ) ఛాయా ! ఇదేమిటి ఛాయా ! వినలేదూ ? నేను నీకోసరం రాజ్యం, ప్రజ......... అన్నీ వదులుకుంటున్నానని ? ఈ విధంగా నేను తీర్మానించుకున్నాను ఛాయా ! కాని.........

ఛాయ

(మెల్లగా) మీ విధిని మీరు నెరవేర్చుకున్నారు. ఇది నావిధిగా భావించినాను......ఇక మాటాడలేను ...నాలుక............

చంద్ర

వాచాళా ! పరుగెత్తు. తొందరగా వైద్యుణ్ని తీసుకరా. నాఛాయ చావగూడదు. నేను ఛాయను చావనీయను.

ఛాయ

(కిందబడి పొరలుతూ) వైద్యు డిప్పు డనవసరము.....మ...హా...గా...జా... న...ను......

చంద్ర

(గట్టిగా ఏడుస్తూ) ఛాయా ! ఛాయా ! !

మురా

ఇంకెక్కడి ఛాయ, నాయనా !

చంద్ర

(పిచ్చివానిలాగా ఛాయపైబడి ఏడుస్తూ) ఏమీ? ఛాయ పోయిందా? నాఛాయ నన్ను వదలిపోయిందా? ...(ఏడుస్తూ) అనాఘ్రాతమైన పుష్పం మట్టిపాలైంది ......ఆశాజ్యోతి వెలగకమునుపే కరిగిపోయింది... ...దీనికి కారణం ?......నేనా?......అవును నేనే, నేనే......ఛాయా ! ఛాయా ! ! నీహంతకుణ్ణి నేనే.

(మూర్ఛిల్లుతాడు )

[తెర]

# వసంతర్తువు

విశ్వనాథ సత్యనారాయణ



పరిచయాతురోద్రిక్తపరిరంభసమయానఁ బ్రియురాలి మెడ చెమరించినంత
శీతోదకస్నానజాతసౌఖ్యముపైని ముకుపుటాన చెమర్పు పుట్టినంత
పేరంటమున కేగు పిన్నబాలిక వాలుజడ మల్లెమొగ్గ కన్పడినయంత
వంగిన వేపకొమ్మం గావిచిగురీన పజ్జయానకుఁ బూఁతపట్టినంత
ఒకదినాన హఠాత్తుగాఁ జికిలికూహు
కుహుహు ప్రొద్దెక్కి దూరపుఁ గోననుండి
సాగ వినవచ్చినంత వసంత మరుగు
దెంచె నను మధుకోహ స్ఫురించె లోన.

కించిదుషఃపూర్వ కించిదతఃపర ప్రాలేయబిందు సంపాతవశత
మధ్యాహ్నవేళాక్రమప్రాప్త తీక్ష్ణతా కలితాతపోగ్ర సంక్రాంతివశత
సాయంసమాగత స్వచ్ఛచంద్రాతప కుల్యాప్రసారణాకూతవశత
మధురనిశార్ధభాగధునీఘ్రాప్రియాహేలామనోజసాహిత్యవశత
శిశిరహేమంతశుచిశరత్సైన్యమాను
డై మహారాజవైభవోద్దామమూర్తి
కూడి ఋతురాట్సభాసలకూఁబఱుంచు
మాధవుడు వచ్చె సుమసుకుమారమూర్తి

సొంపు మైఁ దేల నాజూకుఫసందు లేఁజివురుజున్నులు తెచ్చి చిదిమియొసఁగ
గొంతు జీరలువాఱ గ్రొమ్మావిలేయివుల్లావులు తేకు పాయసము లీయ
రతికోర్కి సుంకు తేరఁగ నిమాంజీను గ్రొమ్మొత్తయివుల్లు లామెతలువెట్ట
రత్యంతవేళాత్తశ్రమ పో జహాంగీరు తలిరాకురసములు త్రావఁజేయ
క్రొత్తగా జతకట్టిన కోకిలమ్మ
పెంటికై నూత్నయౌవనోద్వేగవేగి
యగుచు ముక్కున జిరుమని యామ్రకిసల-
యమ్ములేదు వసంతవనాంతవీథి.

విరియగాచిన పండ్ల బరువుచే వంగి రసాలమ్ము వాలిచెఁ జూలాలువోలె
కోకిల జిగిగొంతుకోలెత్తి ప్రలపించె వనవీథి భార్యాప్రవాసివోలె
పరువులై పుప్పుడి తిరిగి తేనియ బొట్టులుగఁ గూర్చె భృంగమ్ము లోభివోలె
తొలచి కొబ్బరిమొవ్వ గొల నిక్కి యుడుత హేలారుచిఁ మఱగెఁ గలాలివోలె
బ్రదికి చెడినవాని చిదుకు గుండియవోలె
నేల యెండఁ బగిలి నెఱియలుండె
ఒకటఁ జూపి మఱియు నొకట కొట్టు సురియ
కాడువోలె నురియ గాలి వీచె.

కుసుమ కుదుళ్లలోఁగూడఁ జెమ్మటవోయు నిచట గంధప్రబూత కెడము లేదు
కొమ్మ తొమ్మాన్పినగూడ నుమ్మకలంచు నిచట భావము లొత్త నింపులేదు
వలిపముల్ సన్నభూషలుగూడ నెరియించు నిట చల్లగాలి పో నిరవులేదు
ప్రాణమ్ములందు లోపల గూడ నుడికించు నిట సీధువులు పట్టు నెఱుకలేదు
కామినీకాముకులును భోగములుచొరని
కొన్నియసుఖంబులకుఁ దాళుకొనఁగలేక
యావటిల్లిరి యంగజాతాంబుజాప్త
దారుణాంతర్బహిర్వహ్నితప్తులగుచు.

రాల్చాత నారికేరమున నిల్పగ దిన్నకటిఁ దిర్గి గొడ్డలి గాట్లుపెట్టి
కానిడ్డ నెఱజాతిమావిపండులు చెదల్ ముట్టకుండగఁ బూటపూట త్రిప్పి
వెల్లకచ్చిక బూది జల్లించి గండుచీమలు పాయ మల్లెపాదులను జల్లి
అవియు బత్తాయి రెండవకాపు చెడకుండ నారార నీర్వోట్టి యాకుచుట్టి
యేపెరిగి చెట్టుచెట్టునఁ గాపుదించి
పండి పగిలిన పనసలు భద్రపఱచి
యేమఱక వేయివిధముల బ్రాముకొనియె
దేటి తేనియవలెఁ దెన్గుతోటమాలి.

పానీయమంచుఁ జల్వాలటంచు వినియోగపఱచుకొందురు జనుల్ వట్టివేళ్లు
తాపశాంతులని శీతలములంచును ద్రావ సక్తులొందురు జనుల్ చల్లనీళ్లు
చలువలటంచు వాసనలంచుఁ బైపూత గ్రమ్ముకొందురు జనుల్ గందవాళ్లు
దాహమటంచు శైత్యమ్ములటంచు నానెదరు జన మ్మొడనీరములను

స్వేదబాధానివారణాపాదు లంచు
జనములు ధరించుకొందురు సన్నచీర
లర్థమెఱుగని జనము తాపాపనోద
కృతప్రయత్నమ్ము తప్తశరీర మయ్యె.

ఆరటినారకు మల్లె లచ్చటచ్చట పది గ్రుచ్చిన దండ యొక్కొకడు మెడను
ఉబ్బిన యుదరమ్ము లురములు చేతులు గీరుగంధాలు దక్షిణకరముల
బిడులు తాటాకుల వీవనల్ వామహస్తములఁ దాంబూలదక్షిణలును
సంగతైలామరిచపుఁ బాగ లెగయఁ బానకపుఁ బ్రేనుపులు మందగమనములు
రొండి దోపిన బొబ్బిలి వెండికట్ల
పొడుముకాయలతో వృద్ధభూసురాళి
సాగుచెంచెను క్రొత్తవైశాఖపూజ
దృప్తులై గేస్తునిల్వితర్దికలు కదలి.

ప్రొద్దుగ్రుంకెడువేళ ముగ్ధభావప్రచాలితప్రియాహస్తగుంఫితము లగుచు
రేయి వడ్డనవేళ ప్రియురాలి చొల్లెమ్ముపైని ముద్దులుగుల్కు బంతి యగుచు
పరనిశామధురసంభ్రాంతిగాఢగృహీతప్రేయసీధమ్మిల్లమృదువు లగుచు
మఱునాటి ప్రొద్దున మండువాలో నిర్దళితములై యిల్లుబాళింత లగుచు
పగలు రెండుజాములవేళ పంచపాత్ర
వారిపైఁ దేలియాడు పూఁబడవ లగుచు
నిబుతిదిగ్వాయుపతివసంతఋతుశోభ
లీను చూలాండ్రు మల్లెపూ లెసక మెసగ.

దీప్తిమాధుర్యవఃశిరస్సుధాంశుభాస్వన్మనోహరవిలాసమ్ము లగుచు
క్లిష్టబంధవిచిత్రకేళీరశస్త్రిరహఃకళాపూర్ణోదయమ్ము లగుచు
కృష్ణపదాగ్రభక్తిసుగృహీతాముక్తమాల్యదాచ్ఛప్రౌఢమధువు లగుచు
అనిరలభ్యవర్ణనోత్తమశయ్యాహితాంశువై పాండురంగమహాత్తు లగుచు
తీయదనములు మెఱుగులు దెచ్చుకొన్న
ప్రియులుప్రియలుఁ కూడిమనుచరిత్ర లగుచు
తెలుగురసికలోకముల కందిచ్చెఁ సువు
లత్తుకొనిమల్లెపూల్ క్రొత్తక్రొత్తరుచులు.

---

## అంకోరువాటు శిల్పచిత్రములు



౫. దేవాలయము -
సోపానపంక్తి



౬. దేవాలయావరణలో
శిల్పసంపద



౨. ప్రాఖానుదేవాలయము: దానిని కాపలాకాయుచున్న నాగులు, సింహములు

# తెలుగుమఱుగు:
# వ్యవహారభాషా వ్యాకరణము

కీ. శే. పారనంది రామశాస్త్రి



భాష యనగా భాషింపబడునది. అది యథార్థముగా మాట్లాడబడుచున్నదే. ఈ మాటలు వాగింద్రియముగల జంతువుల సృష్టినుండి యున్నవేయని యెల్లవారును ఒప్పుకొనవలసినదే. సృష్టిలో క్రిమికీటాదులకంటె పశుపక్ష్యాదులును, వానికంటె మనుష్యులును, వారికంటె దేవతలును ఉత్తములనియును ఎల్లవారును అంగీకరించునదే.

పూర్వ మెల్ల వ్యవహారములును మాటలలోనే జరుగుచుండునవి. ఆమాటల సంఘాతమునే భాషయందురు. ఈ భాష వాగ్రూపముగా మొదట నుండెను. మనుష్యులకంటె దేవతలు గొప్పవారు గావున మనుష్యుల భాషకంటె దేవతలభాష యుత్తమము. దానిలోనే మనకందఱకును ముఖ్యప్రమాణము లనదగు వేదములున్నవి. అది దేవభాష వాగ్రూపముగానే యుండెను. ఆ వేదములు గురుముఖోచ్చారణము ననుసరించి నేర్చుకొనవలసినవేకాని లిఖితములు లేకయుండెను. ఇటీవల లిఖితము లేర్పడి పుస్తకములలో నున్నను ఆ పాఠసంప్రదాయముమాత్రము ఇప్పటికిని కానబడుచున్నది. అట్లే అతిప్రాచీనములగు శాస్త్రములును వాగ్రూపములోనే ప్రాయికముగా నున్నవి. అవి మనకు ఐహికమును, ఆముష్మికమును చెప్పునట్టివి. దేవభాషలో నుండునట్టి వగుటచేతనే మన కవి అతిపవిత్రములని మనవారి సంకేతము.

ఇట్లుండ నొకకొంతకాలమునకు నట్టి దేవభాష ఛందోబద్ధమై పద్యములుగా నారబ్ధమైనట్లు తెలియబడుచున్నది. అప్పుడే లిఖితమును ఆరంభించినది. లిఖితారంభమైన పిమ్మటనే లిఖితవాగ్రూప ముభయమునకును భాషయను సంకేత మేర్పడినది. ఈ ద్వివిధభాషకును సంస్కారార్థమై వ్యాకరణము లేర్పడినవి. అవియన్నియును దేవభాషలో నుండెను. ఆ దేవభాష వ్యాకరణములచే సంస్కరింపబడినది కావుననే దానికి "సంస్కృత"మని సంకేతము వచ్చినది. ఇట్లుండ మహర్షులు సూత్రములు, స్మృతులు, పురాణములు మొదలగు వానిని కొన్నిటిని వాగ్రూపముగను, కొన్నిటిని ఛందోబద్ధముగాను వ్రాసినారు.

ఈ భాషయున్ను దేశమునుబట్టియే భేదించియున్నది. ఎట్లనగా స్వర్గమందుండువారు దేవతలు. వారి భాష దేవభాష-సంస్కృతము. అదియే మనుష్యదేశమునకు వచ్చినను దాని కా సంకేతము తప్పలేదు.

మనుష్యభాషలు వారివారి దేశములనుబట్టియే ఆంధ్రము, కర్ణాటము, ద్రావిడము, మహారాష్ట్రము అనునీ మొదలుగా భిన్నభిన్నము లయ్యెను. దేవభాషయగు సంస్కృతముమాత్ర మెల్లవారికిని తుల్యమయియే యున్నది.

మనుష్యదేశములలో నొండొంటితో భేదముండునుగాని దేవదేశమగు స్వర్గమునకు మనుష్యదేశములకు వలె

నవాంతర భేదము లేదు. స్వర్గ మొక్కటియే. కావున నా దేవభాష యెల్ల దేశములకును సమానమే.

ఈ మనుష్యదేశమునకు వచ్చిన దేవభాషకు సంస్కారార్థము పాణిన్యాదులు వ్యాకరణములను చేసియున్నారు. సంస్కారమనగా సిద్ధరూపమున కుపపత్తిని కల్పించుట. ఇట్లు ప్రాయికముగా నుపపత్తిని చెప్పచును వ్యాకరణములచే సాధ్యములుగాని కొన్ని సిద్ధరూపములను వేదములలో "ఛాందసము"లనియు, స్మృతి పురాణాదులలో నార్షములనియు, లోకములో నిపాతములనియును చెప్పియున్నారు. కాని యా రూపములను నిరసించలేదు.

అట్లే మనుష్యభాషలలో నాయా దేశములలో నాయాభాషలకును వ్యాకరణము లేర్పడియున్నవి. ఆంధ్రదేశమందలి యీ యాంధ్రభాషకును నన్నయభట్టాదులు వ్యాకరణములను చేసియున్నారు. ఈవ్యాకరణములు భాషను సంస్కరించు కొరకే కాని భాష నుత్పాదించుటకుగాని, నశింపజేయుటకు గాని కాదు. ఎట్లనగా సంస్కృతములో "రామః" అనురూపము గాన్పించుచుండగా దానికి ప్రకృతియనియు, ప్రత్యయములనియు, ఆగమములనియు, నాదేశములనియు నిర్ణయించి యాసిద్ధరూపమున కాప్రకృతిప్రత్యయాదు లెట్లు సంగతములో యట్లు సరిపఱచినారు. అట్లే తెనుగుభాషలోను "రాముడు" అని కాన్పించుచున్నందున దానికి 'రామ' అనునది ప్రకృతి యనియు, దానిపైని 'డు' ప్రత్యయ మనియు, 'డు' పరమగుచుండగా అకారాంత మహచ్ఛబ్దమునకు ఉకారము వచ్చుననియు, రాగా "రాముడు" అగుననియును సూత్రములను చేసినారు. వ్యాకరణము సిద్ధరూపనిష్పత్తి యెట్లయినది తెలియజేయునుగాని సిద్ధరూపమును నిరాకరించునది కాదు.

ఇట్లుండ నీ యాంధ్రభాష వ్యవహారములో ప్రబలినప్పుడు దీని కతి చిరకాలమునుండి ముందే ప్రబలియున్న సంస్కృతపదములననుసరించి కొన్నియు, ప్రాకృతపదముల ననుసరించి కొన్నియును ఈ తెనుగులో వాడుకలోనికి వచ్చియున్న వానిని చూచి, దీనికి సంస్కృత ప్రాకృతభాషలు రెండును ప్రకృతులనియు నీ యాంధ్రభాష వికృతియనియును చెప్పినారు.

సంస్కృతము ననుసరించి యున్న వానిని సంస్కృత తత్సమ తద్భవములనియు, ప్రాకృతము ననుసరించియున్న వానిని ప్రాకృత తత్సమ తద్భవములని యును చెప్పి సూత్రములను నిబంధించినారు.

ఈ వ్యాకరణాది నిబంధనములు భాషలో గ్రంథరచనారంభమయినప్పుడే కాని యంతకు ముందు గావు.

సంస్కృతములో పద్యగ్రంథారంభము వాల్మీకి మహర్షినాఁ డయినదన్నట్లే యీ యాంధ్రభాషలో గూడ భారతముతోనో, అంతకు కొంచెము ముందుగానో పద్యగ్రంథరచన లారబ్ధమైనవి. అప్పుడే ఛందో లక్షణములును పుట్టినవి.

ఈ యాంధ్రభాష స్వతంత్రభాషయు, సమగ్రభాషయును కానందునను, గ్రంథరచన కనంతవాఙ్మయము కావలసినందునను, ఈ భాషకు తత్సమ,తద్భవ, దేశ్య, గ్రామ్యము లను నాల్గువిధములగు పదముల నంగీకరించియున్నారు.

ప్రాచీనకవులనాటికి సంస్కృతమే ప్రబలియుండుటను, వారు ప్రాయికముగా సంస్కృతమం దెక్కువ జ్ఞానము గలవారగుటను, వారి గ్రంథములు సంస్కృత ప్రచురములయి సంస్కృత భాషాసంప్రదాయము ననుసరించియే యున్నవి.

అప్పుడు సంస్కృతమందు ప్రచార మెక్కువగా నుండుటను, తెనుగున నప్పుడే గ్రంథరచనారంభమగుటను అది యొక భాషాసంధికాల మనవచ్చును. అప్పుడు పూర్వపు సంస్కృతభాషా సంస్కారవేగవశమున సంస్కృతపదములతో తెనుగుపదములకు సంధులు, సమాసములు, క్రియారూపములను చేసియున్నారు. అవి వ్యాకరణములకు విరుద్ధములయ్యును ఎల్ల వ్యాకరణకర్తలును వానిని నిరాకరింపక యొప్పికొనియేయున్నారు. అవి యెట్లనగా-

## మిశ్రసంధులు

(సంస్కృత మర్యాద ననుసరించి.)

"ఘనవల్లి యన్నిష్టసఖి నూదియున్న దాని" —భార. ఆది. 3 ఆశ్వా.

అను + ఇష్టసఖిన్. ఇచట 'అను' అనుదానిలో సకారమువిూది ఉకారము లోపింపగా "అన్ + ఇష్ట సఖిన్" అనియుండగా హ్రస్వాచ్చునకు పరమగు నకార మునకు అచ్చు పరమగునపుడు నకారమునకు ద్విత్వము సంస్కృతభాషా సంధిశాస్త్ర మర్యాదాసిద్ధము గాని తెనుగుమర్యాదచే నయినదికాదు.

"అన్నుర్వీపుడు"- నిర్వచనోత్తరరామాయణము, 4. ఆశ్వా.

అను + ఉర్వీపుడు. ఇదియును నట్టిదే.

"సర్వము న్నతని దివ్యకళామయమంచు"-భాగ. 8 స్కంధ.

మ. "తరుణీశాత కటాక్షవీక్షలకొన ల్దార్కొన్న చోట్లం బలె న్నరుశోభావిభవాకరంబు."- కళాపూర్ణో దయము, 8 ఆశ్వా.

అనుకరణమందు "పురతయని", "ఆన్తరని", "హరిణాయని" అనువానిలో విసర్గమునకు "ఇతి" అను సంస్కృతభాషయందలి యనుకరణపదము పరమగు నపుడు విసర్గమునకు లోపము, రేఫాదేశము ననుకాని తెనుగుభాషయందలి "అను" పదము పరమగునపుడు కాదు. కావున్నను సంస్కృతమర్యాద ననుసరించి చేయబడినది.

ఇంకను "నరకే సతి కోదోషో మరణే సతి కింభయ మనినచదువు చదువంబోలున్." ఇచట "కింభయం" అనుదానిలో ననుస్వారము- అచ్చు పరమగునపుడు మకారముగా నుండుట సంస్కృత మర్యాదాసిద్ధమేకాని తెనుగుమర్యాదచే గాదు. తెనుగున "కింభయము అనిన" అనియున్నచో నిట్లు కావలయునుకాని సంస్కృతములో "కింభయము" అని యుండదు. అది సంస్కృతమున కాదు. దీనికి ద్వితీయాచార్యుడు "సంకీర్ణత్వం వికృ త్యాద్యాను కృత్యా మంజులం భవేత్" అని సాంకర్య ము నంగీకరించినాడు.

మఱియును 'దాసోహమ్మని', 'జ్ఞాతిశ్చే దనలేన కిమ్మనెడు వాచారూఢి సత్యమ్ముగన్'- ఇచటను తెనుగు మర్యాదచే నయిన మకారద్విత్వము ననుసరించి 'దాసో హమ్మని' అను చోటను మకారమునకు ద్విత్వము చేయబడినది.

'రామాయ నమోనమ' 'రామస్సహాయ' యనుచోట్ల విసర్గమునకు లోపము సంస్కృతాను కరణమగు 'ఇతి' పరమగునప్పుడేకాని అకారయకార ములు పరమగునప్పుడుకాదు. ఇంకను "తుభ్యంనమో యనియె" "తుభ్యంనమయనె" "కిం తత్తనియె" "కస్త్వ మ్మనియె" "వర్ధతాంశ్రీయనియె" ఇత్యాదు లనేకములు గలవు. ఇది సంధిసాంకర్యము.

## సమాసములు

అక్కర: అవసరజ్ఞుండై వ్యాసు డేతెంచె నంత నత్తపసి-కపిలగడ్డంబును గపిలజడలును, గపిలకన్నులు- దవిన యన్నువ నల్లనైన దీర్ఘవపుతనువును జూచి-యు విరె కన్నుంగవ మొగిచి తెలవకయుండె భయమున"

(భారతము, ఆదిపర్వము, 6 వ ఆశ్వాసము)

ఇందు 'కపిల'అను సంస్కృతపదమునకు గడ్డము, జడలు, కన్నులు అను తెనుగుపదములతో సమాసము సంకీర్ణము.

మఱియు నట్లే కటికంతుడు, ప్రాణగొడ్డము, జీవగఱ్ఱ అను నివియును మిశ్రములగుటను గ్రామ్యము లయ్యును గ్రాహ్యములని చిన్నయసూరి మొదలగువారు చెప్పరు. బ. సీతారామాచార్యులు కటికంతి శబ్దము "గరకంఠ"శబ్దతద్భవముగాను, 'ప్రాణగొడ్డము' ప్రాణ ఘట్టశబ్ద తద్భవము గాను చెప్పి అవి గ్రామ్యములు కావనిరి. కాని కపిల కన్నులు,కపిలజడలు అనువానికిని పాండురంగమాహాత్మ్యము, 3 వ ఆశ్వాసము) ఇచ్చ ... లేదు.

ఇంకను వేడిపయోధారలు, వాడిమయూఖములు, వేల్పువీరభటవర్గము, కఱకుదర్భపూరిపరుపులు, నాచులతలు, మేటిమునిరాజు, బ్రహ్మదండపు గైదువు, తెలివమ్మికంటి గేహిని పుట్టినింటి సంపత్తి పెంపు, పాపరాజు, పాపవిషము, వేపగంధము, రాయభారము, రాయభారులు, ఈ బిడారు మృగీమద శ్రీబిడారు, కటిబంటి నెత్తురు కాలువల్, విచ్చలవిడిం దనమయంబుగాగ గగనంబున నిగుడు నచ్చక్రంబు గనుంగొని, ఇంతితాను మగవేషం బూని, తన పూర్వతపఃస్థానంబని, శరధి తరగలంబోలె, అర్చన పువ్వుల యవ్విధంబునన్, మూర్ఖులకు విధాతృ చెయ్వులనగుజ దురితంబుల్, అన్యథాబుద్ధి చెప్పితేని, హంసపింఛముతోనదియును, సమతం దొల్లి పురాణపల్కు లితిహాసశ్రేణులున్, తార్కాణకర్మ స్థితుల్, ఒక్కమాత్రమున నరపీనుగునీడిదికొంచు ఇత్యాది మిశ్రసమాసములు భారత, భాగవత, హరివంశ, విజయవిలాస, స్వారోచిషమనుసంభవ, అప్పకవీయ, అహోబలపండితీయాది గ్రంథములలో గానబడుచున్నవి.

మిశ్రక్రియలు

“మీరు కార్యణ్యాతిశయమున విజయంచేసితిరి.”
“అరాతితనముగా కెంతయు.”

మది సమకట్టి, పదపడి, పదంపడి, కరమను రాగిల్లె, వృథపుచ్చక, అసహ్యాపడి.

వానికి భయంపడుచుందురు, సమకూరె, ద్రవ్యంబులు సమకట్టుకొని, సమకూర దెవ్వనికిని, విధాత కృతి నన్యథాకరింప నలవియె, వ్యథసేయగా దగదు, భరంపడి, నీవు విజయంచేయుము, సంతోషపడి, సూత్రపట్టినట్లు, మహాహి భయంపడి మొదలగునవి.

ధాతు ప్రత్యయ సాంకర్యము

రంజిల్లె, ఘటిల్లె, పోషించె, లభించె, దర్శించె మొ.

నామప్రత్యయ సాంకర్యము

సమ్మతించె, అనుమతించె, నుతించె, సంతోషపెట్టి, భయపెట్టి, శోభించు, సందిలు, సంభవిల్లె, మొ.

ఇట్లనేకములు సంస్కృతముతో సంకీర్ణములు. వీని కుపపత్తులను గల్పించి వ్యాకరణకర్తలు సూత్రములు చేసియున్నారు కాని నిషేధింపలేదు.

ఇట్టి సంకీర్ణము, అస్వతంత్రము నను నీ తెలుగు భాషలో కటకంతుడు, ప్రాణగొడ్డము మొదలగు కొన్నింటిని కొందరు గ్రామ్యములని చెప్పి, అయినను పెద్దలు ప్రయోగించుటచే నవి గ్రాహ్యములే యని యంగీకరించినారు. మఱికొందఱు వానిని గ్రామ్యములు కావనియే చెప్పినారు. ఇందు మొదటి మతమున గ్రామ్యములయ్యును ప్రయోగము లున్నచో నింద్యములు కావనియు, రెండవవారి మతమున గ్రామ్యములయినచో గ్రాహ్యములు కావనియును తెలియబడుచున్నది. కాని మొదటిపక్షములో మొదల నవి సాధువులని తలంచియే పెద్దలు తమ గ్రంథములలో బ్రయోగించియుందురా? లేక వారు ప్రయోగించిన పిమ్మట నవి సాధువు లయినవా? అసాధువులని తెలిసియే వారు ప్రయోగించికొనియుందురా? అనునవి విచారణీయములు. రెండవ పక్షములో నట్టి గ్రామ్యములు గల గ్రంథములన్నియును నింద్యములే కావలయును.

అది యెట్లయినను ఈసంకీర్ణరూపముల కుపపత్తిని చెప్పువారును ఆసాంకర్య మెందు కీభాషయందు గలిగినదో, యెట్లు కలిగినదో చెప్పలేదు. అందుకే నాయీయుద్యమము.

అప్పకవి దేశ్యము చెప్పినపుడు “ఆంధ్రదేశ్యంబులు రెండు తెఱంగులు: శుద్ధాంధ్రంబులు, నన్యదేశజాంధ్రములనియు. “ఆంధ్రదేశపురస్థాయులైన సకల జనములకును మఱుగుదేశంబు లేక, తేటతెల్లమిగా బల్కు మాటలెల్లనవని శుద్ధాంధ్రదేశంబులనగబడును.” అని చెప్పి పాలు, పెరుగు, నేయి మొదలుగా గలవి శుద్ధాంధ్రము లనియు, ఆంధ్రులు నానాదేశములందుండి తెనుగుపదములనే ఆయాదేశ్యముల నంటి పలికినచో నవి యన్యదేశజాంధ్రములనియును, ఆలము, చిన్న, కయ్యము మొదలగునవి యన్యదేశజాంధ్రములు గాను, సంస్కృత తత్సమమును మాత్రము విడిచి తక్కిన తద్భవ దేశ్యములతో గలసినవి అచ్చతెనుగు లనియును చెప్పి “తెలుగుమఱుంగులు ప్రౌఢలుగులు”

అని చెప్పియున్నాడు. కాని యీ తెలుగుమఱుగులు, ప్రాఁదెలుగులు స్పష్టపఱచినట్లు కానరాదు. కావున దానిని విచారింపవలయు.

"తొల్లింటికవులు ప్రయోగించిన వెల్లను ఇప్పటికవులు చెల్లుబడి వాడునవి మాత్రమును ప్రాత తెనుగు" లనియెను.

ఇందు 'తొల్లింటికవుల వాక్యములెల్లను' అనుట వలన వ్యాకరణములకు పూర్వపుకవుల వాక్యములెల్లననియును, లేక పూర్వకవుల వాక్యములు వ్యాకరణములకు విరుద్ధములయ్యును అనియును కావచ్చును. "ఇప్పటివారల్ చెల్లుబడి వాడునవియే" అనుటవలన నిప్పటివారి వాక్యములు వ్యాకరణములచే జెల్లుబడి గలవి మాత్రము అనియును తెలియబడుచున్నది. అది యెట్లయినను "తెలుగు మఱుగులు ప్రాఁదెలుగులు" అనుటవలన క్రొత్త తెలుగులకంటె ప్రాతతెలుగు లుత్తమము లయినట్లును, అవియే తెలుగురహస్యము లయినట్లును తేలుచున్నది.

చదువులలో ప్రాఁజదువులు - (ప్రాతచదువులు) వేదములు ఉత్తమములయినట్లు తెలుగులలో ప్రాత తెలుగు లుత్తమములని యప్పకవిహృదయము కావచ్చును.

ఇంక ప్రాతతెలుగులు వ్యాకరణములకు పూర్వపు తెలుగులు, లేక పిమ్మటివైనను పూర్వపువారి వాడుకలో నున్న తెలుగులు ఎట్లయినను అవి వ్యాకరణవిరోధమును పాటింపక ప్రాతతెలుగులు, అనగా నుత్తమములని తెలియదగియున్నది.

ఇందు మొదటి పక్షములో వ్యాకరణవిరోధశంకయే లేదు. రెండవపక్షములో విరోధ మున్నను పూర్వపువారి వాక్యములు చెల్లునని సిద్ధించుచున్నది. ఇంతయే తెలుగురహస్యముగా నప్పకవి చెప్పినాడు. కాని యింకను దాని రహస్య మున్నట్లు కానబడుచున్నది. అది యెట్లనగా -

ప్రాచీనకవుల గ్రంథములు వ్యాకరణములకు పూర్వమయిన పక్షమున నప్పటికి లోకమందు వాడుకలో నున్నట్లు వారు తమ గ్రంథములలో బ్రయోగించికొనిరి కావున పిమ్మటి వ్యాకరణములకు అవి గ్రామ్యములయ్యును అనింద్యములుగా నంగీకరించినవనియు, లేక వ్యాకరణములకు పిమ్మటనే వారి గ్రంథము లయినపక్షమందు వ్యాకరణవిరోధము నెఱిగినను వారు పూర్వపు సంస్కృత కవితాసంప్రదాయ వేగవశమున క్రొత్తదియగు తెనుగుకవితాసంప్రదాయము ననుసరించియు నట్టి సంకీర్ణ రూపములను వారు ప్రయోగించియున్నారని తెలియనగును. అట్టి భాషాసంధికాలములో గొప్పగ్రంథములను రచించుటయే శ్లాఘ్యతరమగుటను వ్యాకరణములు వానిని అనింద్యములుగా నంగీకరించినవి. ఇది యొక తెలుగుమఱుగు.

ఇంకను రంజి, రాజి, వృధీ, భూ మొదలగు సంస్కృతధాతువులపైని తెనుగుప్రత్యయములు చేర్పగా క్రియారూపము లేర్పడినట్లే కొన్ని తెనుగుధాతువులపైని సంస్కృతప్రత్యయములు చేర్పగా నయిన క్రియారూపములును గానబడుచున్నవి. ఎవ్వియనగా వస్తాడు, తెస్తాడు, చూస్తాడు మొదలగు రూపములు వ్యాకరణములకు ముందునుండి యిప్పటికిని లోకమందు వాడుకలో నున్నవి. వానిని కొన్ని వ్యాకరణములు గ్రామ్యములనియు, గ్రామ్యములు గ్రాహ్యంబులు గావనియును చెప్పుచున్నవి. కావున నీగ్రామ్యములనుగురించి విచారింపవలయును.

ఈ తెలుగుభాష తత్సమ, తద్భవ, దేశ్య, గ్రామ్యము లను నాల్గువిధములగు పదములతోగూడినదే కాని వేరు కాదని యెల్లవ్యాకరణములు ఒప్పికొనినదే కదా. కాని యీ గ్రామ్యపదము రూఢ్యర్థకమా, యౌగికార్థకమా ? తక్కిన తత్సమాదిపదము లెట్టివి ? ఈ గ్రామ్యములకుమాత్రము అగ్రాహ్యత్వము దేనినిబట్టి? అను నీవిమర్శమెందును విశదముగా చేసినట్లు కానరాదు.

ఈ గ్రామ్యతను గురించియైనను పరిపరివిధములుగా జెప్పుచున్నారు. చిన్నయసూరి లక్షణము చెప్పకయే "లక్షణవిరుద్ధంబగు భాష గ్రామ్యంబు-వస్తాడు, తెస్తాడు, వచ్చేని, తెచ్చేని, వచ్చేవాడు, తెచ్చేవాడు, వచ్చేటివాడు, తెచ్చేటివాడు. ఈ భాష ప్రయోగంబున కనర్హంబు" అనియు, "ఆర్యవ్యవహారంబుల దృష్టంబు గ్రాహ్యంబు" అనియు చెప్పినాడు. ఇటీవలివారందఱును ఇంచుమించుగా నట్లే చెప్పుచున్నారు.

ఆంధ్రభాషాభూషణమందు కేతన గ్రామ్యము నకు లక్షణము చెప్పక పంచాకుము, తోపించాకుము మొదలగువానిని మాత్ర ముదాహరించినాడు. అందు "వస్తాడు, తెస్తాడు" లేవు.

త్రిలింగశేషమందు కటకంతుడు, ప్రాణగొడ్డము మొదలగునవి గ్రామ్యములు కావనియు, "గ్రామ్యంబు లె త్తజ్జాతివర్ణనంబునం బ్రయోగార్హంబగు"ననియును చెప్పి "ముక్కెముసాఖి" "ఇకని మూసెనా మేలు బాగెము నేసినాము" అనువాని నుదాహరించినాడు. లక్షణమును చెప్పలేదు. "వస్తాడు, తెస్తాడు" ఉదాహరించలేదు.

అప్పకవి "సంస్కారార్థో నియమోఽస్య యమా ద్గ్రామ్యం హి యత్త్వపభ్రంశః" అను నన్నయభట్టీయ సూత్రమునకు వ్యాఖ్యానముగా

తే. ఉక్తలక్షణవంతమై యుండునట్టి
కావ్యముల నెఱుగవలయు సంస్కార మనుచు
హీనలక్షణ కావ్యంబు నెఱుగవలయు
గ్రామ్యమనుచు నపభ్రంశకంబు ననుచు.

క. లక్షణవిరహిత కావ్యము
పక్షిగమన గ్రామ్యమనఁగఁబడు నది పెద్దల్
వీక్షింపరు లక్షణయుత
మీక్షితి నగ్రామ్యమని గ్రహింతురు ప్రీతిన్.

తే. క్షితి నపభ్రంశపదములు కృతులయందు
గమలలోచన చెప్ప నర్హములు గావు
గాన నాంధ్రకవీంద్రులు వానిఁ దెలియ
వలయు నీశాస్త్రమునఁ దమతలపు నిలిపి.

తే. చులకగా గ్రామ్యజనములు పలుకునట్టి
తెనుగుమాటలు గ్రామ్యంబు లనఁగఁబడియె
వర్ణలోపంబు నొంది కావ్యములఁ జేరవు
పరులఁ దెగడెడుచో నొప్పు పాలదొంగ.

తే. అక్షరవిలోపమై యుండునట్టి పలుకు
గ్రామ్యమననొప్పు నదె యపభ్రంశకంబు
ననఁగబడును నాఁడ కాడ యనుచు మఱియు
నడుమనున్న కకారంబు గుడునున్న

అని చెప్పి

క. వస్తాడా హరి సామ్ములు
దెస్తాడా గొల్లడంట దిట్టక కరుణన్
జూస్తాడా కౌగిలి నే
డిస్తాడా చెప్పమన్న నవి గ్రామ్యోక్తుల్.

అని యుదాహరణ మిచ్చినాడు.

ఇచట విచారింపవలయు. చిన్నయసూరి "లక్షణ విరుద్ధంబగు భాష గ్రామ్యంబు" అనినదానిలో దేని లక్షణమునకు విరుద్ధము? భాషాలక్షణమునకా? భాషా లక్షణమునకు విరుద్ధమయినది భాష యగునా? భాష యనగా నొకటిరెండు పదములే భాష యగునా, లేక గ్రంథమంతయును కలిసి భాష యగునా? "గ్రామ్యము" అని యీ తెనుగుభాషయవయవములలో నొకదానిని పరిచ్ఛేదించుటచేత మీది తత్సమ, తద్భవాదుల మూటి లక్షణమునకు విరుద్ధమయినది గ్రామ్యమనియా? స్పష్టము కాకున్నది. మఱియు నీభాష తత్సమ తెనుగుభాష, తద్భవతెనుగుభాష, దేశ్యతెనుగుభాష, గ్రామ్యతెనుగు భాష అనియా, దాని యభిప్రాయ మెట్లు? అది యెట్లయినను ఒకదాని లక్షణమునకు మఱియొకటి లక్ష్య మెట్లగును? అలక్ష్యమందు లక్షణము పట్టినచో లక్షణ మతివ్యాప్తి దోషగ్రస్తము కాదా? కాక లక్షణముపట్టి నది లక్ష్యమే కాదా? కావున నలక్ష్యము మఱియొకదాని లక్షణమునకు విరుద్ధము కాక యెట్లుండును?

అట్లుకాక "లక్షణమనగా వ్యాకరణశాస్త్రము. దానికి విరుద్ధము గ్రామ్యము" అన్నచో దేశ్యము వ్యాక రణ శాస్త్రసిద్ధమేనా? పాలు, పెరుగు, నేయి మొద లగునవి యే వ్యాకరణ సూత్రములచే సాధింపబడినవి? లేదుకదా? అవి గ్రామ్యము లెందుకు గావు?

వాని స్వరూపమును చెప్పటయే సాధించుట యన్న పక్షమున వ్యాకరణములలో గ్రామ్యస్వరూప ముగూడ జెప్పబడినదేకదా యది గ్రామ్య మెందు చేతను? గ్రామ్యమైనచో నింద్య మెందుచేతను? వ్యాక రణ విరుద్ధమగుటనే నింద్యమన్న పక్షమున చెప్పిన లక్షణ మును తప్పియుండుట విరోధమా? లక్షణము లేకుండు టయే విరోధమా? దేశ్య గ్రామ్యములకు చెప్పిన లక్షణ

మేమి? దేశ్యములకు, లేక గ్రామ్యములకు మాత్ర మందు దోష మెద్ది?

ఈ విచారము చేయకయే గ్రామ్యము నింద్య మని చెప్పు చిన్నయసూరి యభిప్రాయ మేమి?

ఆపదములనుబట్టి విచారింప దేశ్యమనగా నొక దేశమంతటను ప్రచారముగలదియు, గ్రామ్యమనగా నొక గ్రామమందు మాత్రము ప్రచారము గలదియును అగును. కాగా బహుల ప్రచారము కొఱకు చెప్పబడిన గ్రంథములలో గ్రామైకసంకేతితములయి యల్పప్రచారము గల పదములను ప్రయోగింపరాదని "గ్రామ్యములు గ్రాహ్యములు కా"వనుదాని తాత్పర్యమై యుండవలయును.

అట్లయినచో నిప్పటి గ్రామీణులు నాగరికులతో నెక్కువసంపర్కము గలవారే యగుటను, ఇప్పుడు గ్రామీణుల మాటలున్ను నాగరికుల మాటలవంటివేయయి బహులప్రచారము గలవగుటను దేశ్యములే యనదగియుండును. ఈ దేశ్యగ్రామ్యములు కాలభేదమును బట్టి మాఱుచుండవచ్చును. అప్పు డావ్యాకరణములు దేశ్యగ్రామ్యములకు నిర్ణాయకములు గాజాలవు.

మఱియు నింద్యతాప్రయోజకము గ్రామ్యత్వమా, గ్రామ్యతాప్రయోజకము నింద్యత్వమా అని విచారింపగా గ్రామ్యపదమునకు యథాశ్రుతార్థములో గ్రామీణముఖోచ్చారణమాత్రమున నింద్యత్వము కాదు. దేశ్యపదములుగూడ గ్రామీణులచే నుచ్చరింపబడును. వానికి గ్రామ్యత్వ మిష్టముకాదుకదా? ఇక గ్రామ్యతాప్రయోజకము నింద్యత్వమే చెప్పవలయును. అట్టి నింద్యత్వము నాగరికుల మాటలలో నున్నచో నవియును అగ్రాహ్యములే యగును. కావున నింక గ్రామ్యత్వము పారిభాషికమే యని మీదజెప్పిన లక్షణవిరోధ మే యన్నపక్షమున నదియును దేశ్యములం దతివ్యాప్తమగును.

మఱియును గ్రామ్యత్వాగ్రాహ్యత్వములకు వ్యాప్యవ్యాపకభావము సిద్ధింపదు. కొన్ని గ్రామ్యములను చిన్నయసూరి యొప్పికొని చేయున్నాడు. "లక్షణవిరుద్ధంబగు భాష" అనుదానిలో ఛందోలంకారాది కావ్యలక్షణసామాన్యపరమగు "లక్షణ" పదమును గ్రహించి వాక్యసంఘాతపరమగునట్టి "భాష" అనుటచేతను, "ఆర్యవ్యవహారంబుల దృష్టంబు గ్రాహ్యంబు" అని కొన్ని గ్రామ్యములకు గ్రాహ్యత్వ మంగీకరించుటచేతను చిన్నయసూరియభిప్రాయము "కావ్యలక్షణసామాన్యవిరుద్ధమగు గ్రంథము గ్రామ్యము, అదియే అగ్రాహ్యము" అనునట్లు తెలియదగినదిగా నున్నది. "ఆర్యవ్యవహారంబుల దృష్టంబు" అనుచోట వ్యవహారమనగా వారి నోటిమాటలా? కాక వారి గ్రంథములా? గ్రాహ్యమనగా నట్టిది వారి వ్యవహారములో నున్నందు నెల్లవారును అంగీకరింపవలయుననియా, లేక అట్టిదానినే యెల్లవారును తమ వ్యవహారములలో ప్రయోగింపవలయుననియా? వ్యవహారమనగా గ్రంథమేయన్నపక్షమున "ఆర్యవ్యవహారంబుల" అని బహువచనమును గ్రహించుటచేత నొక గ్రంథములో నున్నను గ్రాహ్యము కాకపోవలయును. ఆ సూత్రమునకే తాత్పర్యములో "కటంగుడు, ప్రాణగొడ్డము, జీవగఱ్ఱ, కపిలకన్నులు, కపిలగడ్డము, కపిలజడలు" ఉదాహరించియున్నాడు గదా, యివి యొక్క గ్రంథములో నున్నంతమాత్రమున గ్రాహ్యములు కావచ్చునా? కానిచో వానిని గ్రాహ్యములుగా దానెట్లుదాహరించినాడు? కావున వ్యవహారమనగా లోకమువాడుకయు, గ్రంథములును రెండును అగును. కాని యొక్క గ్రంథమనియే చిన్నయసూరి యభిప్రాయము కాదు. కానిపక్షమున చిన్నయసూరివచనము సంగతము కానేరదు.

చిన్నయసూరి అప్పకవిని ఆధారముచేసికొని చెప్పినవాడై యుండును. అప్పకవి "వస్తాడా, తెస్తాడా" ఇత్యాదులు గ్రామ్యములుగా నుదాహరించియున్నందున దానిని చూచియే తానున్ను వానిని గ్రామ్యములుగా జెప్పినవాడుగాని యవి యేందుచేత గ్రామ్యములో కారణమును చెప్పలేదు.

ఇంక నప్పకవి యభిప్రాయ మాలోచింతము. ఇతను ఉక్తలక్షణవంతమైయుండు కావ్యము సంస్కారవంతమనియు, హీనలక్షణ కావ్యము గ్రామ్యమనియు అనుటవలన కావ్యమునకు చెప్పిన లక్షణములు గలది సంస్కారవంతమనియు, అట్టిలక్షణములు లేనిది గ్రామ్యమనియును తెలియుచున్నది. ఛందోలంకారాది సాధా

రణమగు లక్షణ పదమును చెప్పినాడు. అది వ్యాకరణ మాత్రపరము గాదు. ఇందువలన కావ్యములో నేవో కొన్ని మాటలు వ్యాకరణవిరుద్ధము లున్నను అట్టి కావ్య ము గ్రామ్యము కాదనియు, లక్షణమనుచోట వ్యాకర ణము మాత్రమే కాదనియును స్పష్టము.

కావ్యమునకు మొత్తముమీద రసము ముఖ్యలక్ష ణము. ఆ రసపోషకములు గుణాలంకారాదులు, వాని కాశ్రయములు శబ్దార్థములు దోషరహితము లయ్యుండ వలయునను నన్నయభట్టీయ సూత్రమగు "విశ్వశ్రేయః కావ్యం త దదోషౌ పరిష్కృతౌ చ వాగర్థౌ. సా వాగ్వ్య రసవృత్తిః సాధ్యో హి రసో యథాతథం కవిభిః" అను దాని యభిప్రాయ మెఱిగి హీనలక్షణ మనగా, రసాది లక్షణ హీనకావ్యము గ్రామ్యముగా జెప్పినాడు. ఇందు వలన కావ్యమునకు ముఖ్యలక్షణము రసవత్త్వము. దాని కంగములు గుణాలంకారాదులు. వాని కంగములు శబ్దా ర్థములు. వాని కంగము దోషరాహిత్యము. ఈదోషము శబ్దగతము, అర్థగతమనని రెండువిధములు. అందు శబ్ద గతిదోషముకంటె నర్థగతిదోష మెక్కుడు. గ్రామ్య తయును అట్టిదే. వ్యాకరణ విరోధము శబ్దదోషము గాని యర్థదోషముగాదు. "శబ్దదోషములలోనున్న పద్య గ్రంథములో వ్యాకరణ విరోధముకంటె ఛందో దోష మెక్కుడు" అని భావించియే యప్పకవి వ్యాకరణము నంతగా పాటింపక ఛందస్సు ననుసరిం చియే చెప్పినట్లు తన గ్రంథమందలి ప్రయోగములవలన దెలియబడును. ఎట్లనగా ఈ గ్రామ్యములనే చెప్పు నపుడు తాను

"క్రమత వీనికి వీనులు కన్నదోయి
జెక్కులును బలువరుసలు నిక్కుజన్ను
గవయు బొక్కిలి పిఱుదు చొక్కంపు టడుగు
లనుచు మను వాడి రవియె చేకొనగవలయు."

అని గ్రామ్యములను శోధించి తాను చెప్పినదాని లోనే "క్రమమున" అనుటకు బదులు "క్రమత" అని ప్రయోగించినాడు. ఇచట క్రమశబ్దము - భావార్థకము- సంస్కృతశబ్దముకదా, దానిపైని మఱల భావార్థకమగు తల్ ప్రత్యయము జేర్చి "క్రమత" అని ప్రయోగించినం దున నది వ్యాకరణదుష్టము. అయినను అచ్చట ఛంద స్సునే యనుసరించినాడు గాని వ్యాకరణమునుపాటింప లేదు.

మఱియును ఆ పద్యములోనే "మను వాడిరవియె చేకొనగవలయు" అని తాను చెప్పియున్నాడుగదా. క్రమార్థమందు "క్రమత" యని మను నెవ్వరు వాడి యున్నారు?

మఱియు సమసీసపద్యమున కుదాహరణమగు

"వ్రేల్మి నేవాడు ఖాండవవిపిన మెల్ల
జాతవేదోత్థవిలసితజ్వాలమీద
నతని గీర్తింతు మదిలోన ననుదినంబు
ననగ నలరారు సమసీస మఖిలకృతుల"

అనుదానిలో జాతవేదశ్శబ్దము సాంతము. దానికి అజంతమునకువలెనే సంధిచేసినాడు. ఇది సంస్కృత వ్యాకరణమునకు విరుద్ధము కాదా?

ఇందువలన వ్యాకరణవిరోధము నంగీకరించినను పద్యగ్రంథములలో ఛందోవిరోధ మంగీకరింపరా దనియు, లక్షణమనుదానికిఛందోలంకారాది రూపలక్షణ మనియు నప్పకవియభిప్రాయము కావచ్చును. అప్ప కవి వ్యాకరణము నెఱుగనివాడు కాడు. ప్రకృతివికృతి భేదమును చెప్పునపుడు "క్రమమునను సంస్కృత ప్రాకృతములు రెండు" అనుచోట క్రమముననే ప్రయోగించియున్నాడు.

మఱియు "మదిరాక్షికి" అను పద్యమందు నిషే ధించిన పదములు "చెవుల్, కనులు, బుగ్గలు, పండ్లు, చండ్లు, బొడ్డు, మడ్డి, కాళ్లు" అనునవి. వీనిలో వ్యాకరణవిరోధ మేమియును కానరాదు. "బుగ్గలు, పండ్లు, చండ్లు, బొడ్డు" పదములలో నశ్లీలము, తక్కినవానిలో గాంభీర్యాభావమును భావించి వానిని గ్రామ్యములుగా జెప్పియుండును.

ఇట్టియప్పకవి "వస్తాడా వారి సామ్ము", దెస్తాడా గొల్లడంటదిట్టక కరణం, జూస్తాడా కాగిలి నే డిస్తాడా చెప్పుమన్న నవి గ్రామ్యోక్తుల్" అని చెప్పెను కదా, అది యెట్లు? ఆలోచింపవలయు. ఇచట వ్యాకరణ విరోధ మేమియును కానరాదు. కాబట్టి ఇవి వ్యాకరణ ముచే దుష్టములు కావు. అందుచేత గ్రామ్యములును గావు. మఱి యెట్లనగా ఆ పద్యమందు మొత్తముమీద నశ్లీలము, గాంభీర్యవిరహము నుండుటచేత నర్థదో షమునుబట్టియే యచ్చట గ్రామ్యములని యప్పకవి యభి ప్రాయ మైయుండును.





పూడిపెద్ది
వెంకటరమణయ్య

"కృష్ణవేణీ! కృష్ణవేణీ!"

వీణ అపి, ఆ పద్మాలతివాసీమీద మెల్లగా దానినివాల్చి- వాత్సల్యం తొలకాడే నవ్వుమొగం పైకెత్తి మిలమిలామెరసే కన్నులతో మీదికి చూచింది.

"కృష్ణవేణీ! కృష్ణవేణీ! గజ్జెలందియలు ఘల్లు రనంగా, కలికీ రాగదవే!"

"ఏలే! ఎంతమధురంగా ఉంది ఆపిలుపు- అక్క పిలుస్తే ఇలాగుంటుందేమో ఆ ఆదరణ తులకించడంలో- అమ్మ! ఆమెపిలుపుకూడా ఇంతతీయగా ఉండదేమో?" నిటారుగా నిలచింది కృష్ణవేణి మాడుక్కలచే "ఏమిటి కావాల? కలకండ ఫలరసాలు! గోరను గోధుమపిండి."

"అక్కయ్యాక్కయ్యా."

చెవులుమూసికొంది కృష్ణవేణి. కాస్తతీక్ష్ణంగా తలఅట్లుత్రిప్పిచూచింది. "ఎంతటివ్యత్యాసం!" చల్లని గాలితాకున అలలవలె మాలతీర్చే ఆమెహృదయకాసారంలో మట్టిబెడ్డ విసరినట్టు పడ్డాదా చిలుకపలుకు— ఆకలత తేరడానికో అన్నట్టు కాస్తక్రిందుచూస్తూ నిలబడిపోయింది సోగగా మేను పెనకువంచి కృష్ణవేణి. కృష్ణవేణికి పదిహేను లేక పదహారేళ్ళవయసుంటుంది. ఎఱ్ఱగోరంచు తెల్లమజిలీనుచీర, తెలి పట్టురవిక, చామనచాయమొగము, నల్లని తలకట్టు, ఆమెవాల్చూపులలో ఏవో ఊహలు తిరుగుతున్నాయి. జపమాలలాగు. శబ్దరహిత సంచలనం మాత్రం ఆమె పెదవులలో తోస్తోంది.

తిరుగా 'కృష్ణవేణీ' అన్నశబ్దం ఆపంజరద్వారం వెలువడి ఆమెచెవులలో పడింది.

పులకించినట్టు భుజా లెగశోసి, అరచేతులు తొడ పెడలంటు నడుముకొని గర్వంగా నిట్టూర్చింది కృష్ణవేణి - ఉదయరాగం చిదిమి పిడుస్తూన్న లేత నీరెండ వడియగట్టే కిటికీ ఆవలకు చూచింది. ఈవల నుండిచూస్తే ఆరలదగులొక్కన్ని గండుమీల కవగా తోస్తాయా మెకన్నులు - వెకునులాడే చూపులయితేనేం వెక్కసపడే రెప్పల కదలిక లయితే నేం.

ఆమెకదో కావాలి - ఏదో పిద్దుబాటు ఏదో చక్కబాటు - గిఱ్ఱున తలత్రిప్పికొని, చిత్తక్షోభ యెరుగని చిన్నపిల్లలాగు, పాగిలిపడు కొక్కెం, నిద్రిస్తూన్నవి. చూచింది,

"ఈవీణతో కూడ నేను ఈచిలుక హృదయంలో... ఇంతటి మనోహరాకృతిగల యీచిలుక ఏలే! పాచి చివురించిన పట్టుమేను- అన్నివన్నెల కంఠహారము! ఆయెఱ్ఱని దొండపండు ముక్కు—ముద్దులాడవలదా ——అదిమెసవిన కలకండ మాధురులు చిలజిల చిమ్ముచున్నవేమో! ఆముఖాగ్రమున"

"అక్కయ్యాక్కయ్యా"

త్రుళ్ళిపడ్డది కృష్ణవేణి.

"కృష్ణవేణీ! కృష్ణవేణీ! ఇవురుపాదములు ఎఱ్ఱ వారినవా? ఏలా అలిస్యం?

గోరపాడింది.

పట్టరానివాత్సల్యం కృష్ణవేణిలో రేగింది.

ఆఁ! అలాగే? నేనూరుకోను ఎందుకూరు కుం టానూ.

"ఆకక్కాయ్యాకక్కాయ్యా"

"ఉండు చిలకా! నీవు మాట్లాడకు నే నిప్పుడు యోగీశ్వరుల దృష్టి సలవరించుకుంటున్నాను. నాచెవుల నిక నేళబడగూ పట్టదు. ఉఁహు! ఓంకారమాగోర మనుఁగీత మే! ఆఁ! వస్తున్నా! వస్తున్నా! ధీమంతుల చేతలయితేనే దిద్దుబాట్లుండవా? లోపం లోపంగా ఒప్పుకోవాలి సామర్థ్యాశ్శ న్ననుసరించి సంస్కరణా న్నంగీకరించాలి"

వీణ నాటుకొని ఒక్కలే అతునవేసింది అటు పోయి గోడనుమేకున వ్రేలాడుతూన్న బీగాలసుత్తి తీసింది. చిన్నివ్రేలికొనలతో చిలుతాళమొకటి సుత్తి నుండి వేరుచేసింది. ఆయోర వార్నిష్ కుసుతో నోరు మూతపెట్టుకొని నిలిచింది బీరువా - అరల బీరువా... బీరువా తలుపు తెరచింది. కృష్ణవేణి ........... నిజమే నెతగితే దాని హృదయంకూడా రాగసంకీర్ణమే కావచ్చు. గాజుపెట్టె చిన్నది పైకి తీసింది. నాలు గయిదు గాజుగిన్నెలు చిన్నవి. ఆనేల పెట్టి ది. ఒక పాదినుండి ఏరి రెండు మూడు కుంచెలు తీసింది. ఆమెలో చురుకుదనం హెచ్చుతూంది. ఆ రంగులు చిప్పలలో కలిపినది. కుంచె వొకటి రెండు సరిచూచి నది, సరిచేసినది. తెల్లనిగాజు పలకమీద వన్నెలు గీచి మచ్చుచూచినది. మెచ్చుకొన్నది.

నాడు నూత్నసృష్టి చేసిన విశ్వామిత్రుణ్ణడగాలి "స్వామీ! ఆనాటి నీహృదయావస్థ కాస్తవర్ణించి చెప్పవూ" అని

కృష్ణవేణి వర్ణాలు కలపడంచూస్తే ఆమెకూడా వర్ణిస్తుందేమో తనహృదయావస్థ!

అట్లామె మూగనోటితో రాగదృష్టులతో, త్యాగదీక్షలో చేసినరచన ఆమెహృదయావస్థను సప్త వర్ణాలలో చాటిచెప్పదా?

ముంజేలగోర, మునుక్రేళ్ళుసుంచె, ముంగలకలి పినపలువన్నెలు. వివిధరాగా లాలపించి పాడే ఆమె ఊహాతంత్రి - రవించింది రూచాలు తప్పకుండా అన్నిరంగులూ అన్నిచోట్లా అందంగా పూసి గోరకు చిలుకవన్నెలు. ఆగోరమెడలో కంఠహారమున నాయ కమణి చిత్రిస్తూంది. అయినది; నిట్టూర్చి సుఖించ దాని కాయత్తపడింది కృష్ణవేణి.

"కృష్ణవేణీ! కృష్ణవేణీ!" అంది ఆగోర ఒయ్యా రంగా మెడ ఓరకువంచి - అనడమేమిటి? పాడింది. పాడడమేమిటి? అపూర్వరాగం ప్రస్తరించింది. చీరా రవికే కట్టుకున్న సింగారవతినవ్వితే ఎంతో శోభ అంటాడు పండితుడుకూడా భయం లేకుండా. ప్రకృతిలో కళఉబికితే ప్రకృతి కళకు లొంగిపోతుంది తల్లిబిడ్డకువలె అది యొక అపూర్వమైనఒప్పందల.

"కృష్ణవేణీ! కృష్ణవేణీ!".

"ఓయ్! ఓయ్!" ఔను! ఔను! ముంజేతిగోరను మరిపెంగా చూచింది కృష్ణవేణి - విశాలంగా విప్పిన ఆకన్నులనీటి చెమ్మలోఆచింతగోర ప్రతిఫలిస్తూంది.

"అమ్మా! నాన్నగారూ! రండి! రండి! నూంచి చిత్రం! రండి ఎలాచిత్రించేనో చూడండి! రండి. ఇదేతరుణం! రండమ్మా రండి."

పిలుపు పూర్తి అయిందోలేదో పుస్తకంలో చూపుడువ్రేలు చొనిపి, పుస్తకంమూసి ఆచేయినెమ కనుపెట్టికొని రెండవచేత కళ్ళజోడు ముకుదూలంమీద సర్దుకుంటూ, మందహాసమొలికిస్తూ ముచ్చటగా చూస్తూ నిలబడ్డాడు నీలకంఠం. ఏబదిదాటి ఉంటుంది ఆతనివ యసు - అజానుబాహువు, ఆనందమయమయినమొగం. ఆతడు శ్రీమంతుడని ముఖంచూడగానే చెప్పకోవ చ్చును వానిముఖకళతో అధికారంలో కలసిన సుకుమా రలక్షణం పచారుచేస్తూ ఉంటుంది.

వాత్సల్యంతో చూచేను కూతురువైపు. ఆశ్చ ర్యంనటించేడు తనచేరువను పొట్టిగా నిలచినభారతివేపు. భారతికి ఉంటాయి, నలభైకి ఒకటోరెండో ఆవలే. ఒంటినిండా నగలూ, ఒయ్యారం అతిశయం. సున్నితం సుకుమారత్వమూ ఆమెకు లేదు. ఐశ్వర్యలక్షణం.

భారతి అన్నీ మరచి బాబాకరంగా చూచింది కూతురు కృష్ణవేణి నెగాదిగా!"

"కిట్టూ! అదేమిటే! నీ ముంజేతిమీద ముద్దులొలుకుతూన్న బొమ్మ?"

"ఇది బొమ్మకాదమ్మా - దీనికి ప్రాణముంది. మాటాడుతుంది. పాడుతుంది ఏలాగుందమ్మా యిది" మంచిబాగుందికదూ నాన్నగారూ ఈపక్షి.

ఆ పక్కినిమాచి పక పక నవ్వింది - దిగ్గన లేచి పంజరంలో దానిని పెట్టింది. తలుపుమూసి తలపంకిస్తూ దానిని చూచింది. తన్నే చూస్తూన్న తండ్రివంక చూచింది. "కళ ప్రకృతిలో ఇమిడినప్పుడే కన్నులపండువు చేస్తుంది నాన్నగారూ! బలే-బలే! ఎంత బాగుందో ఇప్పుడా పంజరం...పాడు! మాటాడు... అచ్చా! అదీ కళారచన - జీవనంలేని కాగితం మీద చీపరపాపరరంగులద్ది చిత్రమంటారా నాన్నగారూ! వన్నెలూచిన్నెలూ ప్రకృతినుండి యెరవు తెచ్చికొని కళాప్రజ్ఞగలవాడేంచేస్తున్నాడు? తన బుద్ధిచైతన్యాన్ని కళకు జీవంగా ఎరవిస్తున్నాడు. ఆ కృత్రిమం మనం పోల్చికూడా చిత్తరు మందహాసానికి సత్వమిస్తాం! ఇదో! ఇదీ నిజమయిన కళ" "హ-హ-హ్హా" అట్టహాసం చేసింది. కిలకిలా నవ్వింది. పంజరం చేరువగా నిలచి ఆ పక్షిని చూచింది. కాస్తమారంగాపోయి చూపులు గాజుచేసి ఆ పక్షిని చూచింది-వెనకు తిరిగి తండ్రితో సరిగా నిలచి ఓరగా చూచింది- ఆ పంజరంలో పక్షిని. "ఏమండీ నాన్నగారూ వన్నెలతోపాటు జీవంకూడా ప్రకృతినుండి ఏరికొని కళారచనచేస్తే - బలే! చూడండి నాన్నగారూ, ఆ పంజరమెంత శోభాయమానంగా ఉందో! ఉత్తమకళారచన సన్నిహితకళారచనలకు వన్నె లేదూ? మంచి పటానికి కట్టిన చట్టుకూడా ఎంతో అందంగా ఉంటుంది కాదూ ఏమండీ నాన్నగారూ! మాటాడరేం-అనండీ. ఇదే సహజకళ అనండి. ఇక్కడే ప్రకృతీ కళా వియ్యమందుతున్నాయనండి. అనండి నాన్నగారూ!

"ఔనమ్మా! చాలా బాగుంది. గోరపిట్టను చిలుకగా మార్చేశావు. ఆ వన్నెలు చాలాసహజంగా పూసేవు కిట్టూ! కిట్టూ - నీలో ఏదో కళాప్రజ్ఞ దాగి ఉంది." అంతపొడవాటి తనువూ వింతగా కూతురు తలమీదకు వంచి ఆమెతల వాత్సల్యంతో మూర్కొని - చెదరిన ఆమెముంగురు లటూయిటూ సరిచేసి, మెరిస్తూన్న ఆమె లేత చూపుల్లోకి, జ్ఞానసంపన్నములయిన తనముదురు చూపులు సంతరించి సమపడి - "కిట్టూ కిటూ" అని గద్గదికలో ఆనందం పొదిపికొని ఆమె చెక్కిలిముద్దిడి-

"ఏమే భారతీ! మనకిట్టు చూచేవా? వింతరచన చేసింది. కళా ప్రకృతులకు గాఢమయిన అనురాగం నెలకొల్పింది. చూడూ! ఆపంజరంలో"— (కూతురివైపు తిరిగి) "కిట్టూ దీనిపేరేమిటి?"

తండ్రివాత్సల్యాన్ని త్రాగేస్తూన్న కృష్ణవేణి తిరుగా కళాప్రపంచంలోకి ఒక్కమారు దూకింది.

"ఔను నాన్నగారూ! దీనికి నామకరణం చెయ్యాలన్నమాటే మరచేము—(కొంచెమాలోచించి) దీనిని "గోరచిలుక" అని పిలుస్తేనో,"

నీలకంఠం—"బలే! బాగుంది కిట్టూ ఆపేరు చాలా అందంగా ఉంది. ఆడుకో తల్లీ; నీఆటే నాకూ మీఅమ్మకూ ఆనందం! ఆడుకో."

"ఆటకాదండీ నాన్నగారూ - ఇదే నిజమయిన అనుభవమంటాను"

"నేనూ అలాగే అంటానే; కిట్టూ."

కృష్ణ—"గోరచిలుక! గోరచిలుకా, బలే; ఎవ్వరికీ లేని నేత్రానందం కన్నులున్నందుకు సార్థకత."

"అక్కయ్యాక్కయ్యా"

నీ కింకెవరు దిక్కయ్యా! చిలుకరాజుగారూ! చెలో! చెలో! అడవిరాజ్యం పట్టాభిషేకం ఆవెలితి కళలో నీవుకూడా వెళ్ళి కలసిపో! దిద్ది తీర్చలేని కళాలోపం ఉంది నీలో - చెలో! చెలో!"

పంజరం తలుపుతీసి బైటకు విడిచేసింది కృష్ణవేణి చిలుకను.

నవ్వుకుంటూ వెడలిపోయారు నీలకంఠం దంపతులు. ఆమె ఏమిచేసినా వారికానందమే- ఒక్కగాని ఒక్కతే కూతురు, ఒల్లమాలిన భాగ్యమూను.



ఆఁ అటూ, తోటలోకి నిదానించి చూడు! మన 'జహంగీరు' మామిడంటుచేరువను......

"ఊఁ! చూడాలి అందరూ చూడాలి- చిత్రవస్తు ప్రదర్శనశాల కంపుతా- అబ్బ- నేను దీనిని విడువను. గోరచిలుకా పాడు! ఒయ్యారంగా చూడు."

కిటికీ అవలకు చూచింది. తాను ఎగరవిడచిన చిలుకేమో అలా హంసలాగు నడుస్తూంది అచ్చరలాగు మెరుస్తూంది. దడదడా కిటికీదగ్గరకు వెళ్ళి వంగి తొంగి చూచింది. పొరుగువారి సుందరి "సుందరి కీదృశ్యం చూపాలి" పరుగుపరుగున వెళ్ళి ఇంటితలుపు తెరచికొని "సుందరీ! సుందరీ!" అని పిలిచింది కృష్ణవేణి.

కృష్ణవేణి వయసుదే సుందరి. కృష్ణవేణికి పరిచితురాలూ, ఆటకత్తెకూడా. సుందరిని చూచినప్పుడల్లా ఆమెకు హృదయం వింతగా కదులుతుంది. అది అనురాగమో, జాలో, వాత్సల్యమో - ఏమో ఇంతదనుక ఆమెకూ బోధపడలేదు. "సుందరీ! రా! రా! వెనుదిరిగి వెళిపోకు రా! రా!"

పాపం మాసినచీరారవికే తుప్పరేగిన తలకట్టూ ఇత్తడిపట్టెల చేతులూ, ఎంతో జంకుతూ వచ్చి నిలచింది సుందరి కృష్ణవేణి ఉచితసామీప్యంలో.

"సుందరీ, నీకో సుందరదృశ్యం చూపెడతాను- రా! చూడవూ? నీవు- నీవుకాదు ఈలోకమే యెరుగని ఒకానొకరచన, కళాప్రజ్ఞ! ఒకానొక సౌందర్య సన్నివేశం-ఒక మధురదృశ్యం...అదేమిటో సుందరీ! నీవేనా! ఆఁ...నిలు...నిలు...చెప్తానుండు. ఇలారా! ...ఆఁ! అటుకాదు అటుతరువాత వెళుదువుగాని...రా! నిలబడిపోకు-నాకు కళావేశం వచ్చింది. రా...నూత్నరచన - అపూర్వసౌభాగ్య సన్నివేశం. రా! రావమ్మా సుందరీ! సుందరీ."

పంజరంలో గోరచిలుక పలుకుతూంది. దాని నూత్న కంఠాభరణం మెరుస్తూంది నవరత్న సమ్మేళన శోభతో, కళానుభవానికయినా నడుమనడుమ కాస్త విరామముండాలిగా - కాని కళాప్రజ్ఞులుమాత్రం ఆవేశం కలిగినప్పుడు తట్టుకొని, తాళీ, తచ్చాడరు, శరవేగంతో ఆప్రజ్ఞను ఏదోరకంగా వెలువరించీదాకా నిలువరు. పాపం! వెలువరించి - తమ రచన నితరు లెట్లనుభవిస్తున్నారో అని వారలు జాలిగా నిట్టూరుస్తారు.

ఆహాఁ! అలాటిదేమీ అక్కర లేదు కృష్ణవేణికి. అంతవరకూ మూసికొన్న తన ముస్తాబు గది తలుపు తెర చింది కృష్ణవేణి. గోరచిలుకమాట మరచేపోయింది. గొంతెత్తి "నాన్నగారూ! అమ్మా!" అనిపిలిచింది. సిగ్గుతో భుజాలంట మొగముదించికొన్న సుందరి భుజాలు పట్టుకొని తనవైపున కామెను త్రిప్పికొంది. "ఏమీ సుందరీ! కోపమా! .." "నాన్నగారూ! అమ్మా! చూడండి. చెప్పుకోండి. ఈమె ఎవరు సుందరి కాదుసుమండీ! సౌదర్యం. ఏం. అమ్మా! ఎలాగుంది ఈ నూత్న సౌదర్యం."

"చాలా బాగుంది, సినీమానటి నాగుంది."

"అయుస్తా బామెకు తగిఉంది కాదమ్మా."

"చాలా తగిఉంది"

"ఈ ఆభరణములకూ ఈ చీరకూ ఈ రవికెకూ- అమ్మా! ఆ పాదములలో లత్తుక ఎలా సిగ్గుపడి తొంగి చూస్తుందో. ఈచెక్కులు చూడమ్మా ఆ లేతగులాబి తళుకు...(వ్రేలితో సుందరి చెక్కిలిమీద చిటికీవేసింది. కృష్ణవేణి) అబ్బ ఏమి శరీర సౌకుమార్యం! అలంకారం వద్దమ్మా- ఏమి నాన్నగారూ సుందరీ సౌందర్య రచనమెలాగుంది?-" దూరంగా తండ్రిచేరువకు పోయి నిలచింది. కృష్ణవేణి సుందరినిచూచింది. చప్పునవచ్చి ఆమెఫాలాన జారిన అలకయొకటి వ్రేళ్ళకొనల సవరించి "సుందరీ! కాదు సౌందర్యం-చూచుకో! ఆనిలువుటద్దంలో నీడ! నీడ కద్దమే శోభకల్పిస్తూందో అద్దానికి నీనీడే అందమిస్తూందో! లే! తలయెత్తి ధారాళంగా చూచుకో, నీనీడ... ఏమి- ఎలాఉన్నది." "అమ్మా! నాన్నా! ఏమి మాటాడిరేమి ఎలాగుందిసౌందర్యం - సుందరి! చెప్పుకోలేరు..." "చెప్పనా గోరచిలుక-అంతే నే పెట్టినది పేరు."

"బాగుందమ్మా!" అన్నది భారతి.

"ఆడుకోండమ్మా నీవూ సుందరీ కలసి హాయిగా" అంటూ వెడలిపోయాడు నీలకంఠం.

గోరచిలుకే! కళారచన! ఔను చితిని పాటించిన కళారచనయే-సుందరి - పాపం ఏదో నేరం చేసినట్టు ముడుచుకునిపోతూంది. జీవచైతన్యం ఆడు దానిలో- ఊర్పుల రాకపోకలుకాదు. ఊహూ. అవయవసంచలనంకాదు. అందును యౌవనవతిలో, లే బ్రాయపుపడతిలో." తన్నుతాను నిలువునా తలవంచి పరీక్షించుకుంది కృష్ణవేణి యౌవనం - నూత్నయౌవనం నవయౌవనం సజీవమంటే శృంగా...... జంకిపోయింది ఊహ. తొట్రుపడ్డని తలపు "సుందరీ! బాగున్నదా నారచన?"అని కిలకిలానవ్వింది కృష్ణవేణి గోరచిలుక! గోరచిలుక ఊహూఁ.

కళోద్రిక్తమయిన ఆమెమనసు అలా గలాసర్దుకొంటూంది, మధ్యందిన మతిక్రమిస్తూంది.

*   *   *   *

ఒకరోజా తెంపిది కృష్ణవేణి మునివ్రేళ్లంది ముక్కంట పైకెత్తింది. అటుచూచింది ఇటుచూచింది. చేరువనున్న Prince of Wales మొక్క చూచింది. దానికొమ్మలలో పడేసిం దారోజా. సహజ గృహాంగణాన సంతుష్టిపడి కూర్చునట్టా కొమ్మ తలను కూర్చుందారోజా. అట్టేచూచి జల్లుమన్న గుండెతో సంచలించింది కృష్ణవేణి. అదేదో తొట్రుపాటుతో అటూయిటూ చూచింది - నేలచూచింది, నింగిచూచింది, తోటంతా కలయచూచింది. ఏవో మార్పులు చేయాలి పూలకూ ఆకులకూ ఏదో అపూర్వసంబంధం కల్పించాలి, ఆలేత కొమ్మ పొదుపులో ఏదో విలాసముండాలి ఈ లే దీవతీరుపులో



ఎంత బాగున్నారో అమ్మ.

ఏదో కూరువుండాలి. ఏమిటికావాలో ఆమెకూ అంద కుండా ఉంది.

ఆచలువరాతి చప్పరం మీద ఒక్కరితా కూర్చుంది కృష్ణవేణి. ఆకాశాన ఆబొల్లేమిటి? ఆతెలి మబ్బు కునుకలేమిటి? ఆవికారపు నీలిమబ్బు పులుముడు. నాకే శక్తిఉంటే చేరువ గ్రూసన కోకిల "సహుకు కుహూ"సిహాసింది. "ఔను - ఆకసమంతా ఇంద్ర ధనువై కోకిల పంచవన్నెల చిలుకలై, -చేరువను ఛాయలచాయలు విసరుతూ, మసలితే - కసరుతూ కొసరితే - కూస్తూచూస్తే-బల్!"

ఉద్రేకించిం దామెహృదయం: పూపపాయపు మొగ్గ పులకించింది. ఊహాపరీమళాలు వెదచల్లుతూంది. ఆమె అరుగుమీద కూర్చున్నా అక్కడ లేనట్టే అంత రశాన రాగప్రసారాలలో తూగుటుయ్యేల లూపు తూంది. కృష్ణవేణి, గారాలపట్టి, కమ్మని హృదయం గలది - గంభీర మయిన మధుర స్వభావ, మంజుభాషిణి.

ఒక గిద్దదిక సవరింపు - వీణకు శ్రుతిగదించి మ్రోగించినట్టు! త్రుళ్లిపడ్డది కృష్ణవేణి. ధ్వని దిక్కు నకు చూడ్కులు సారించింది. ఇంద్రధనువులో నిమిడి, తిరిగిన, ఆమెచూడ్కు లొక్కమారుగా తబ్బిబ్బయి తడబడి తొట్రువడి కలగలుపయి ఆధావళ్యంలో గ్రుచ్చు కొనిపోయినాయి. ధావళ్యం! పాలవన్నె మిలమిలా మెరసిపడుతూందాముఖం. నూనూగుమీ కట్టు నీలపు టుంగరాలతలకట్టు- ఇంద్రధనువులో లేనినైల్యం నలుపు నిగనిగలతో ఆవిశాలనేత్రాలు ఏ కాఠిన్యం ఎరుగనివిట్టని పూరేకుపెదవులు, పాలమీది మీగడవన్నె చిరునవ్వు, విశాలములయిన వెన్నెలకన్నులు, చీకటి కనుబాపలు, తీర్చిన అందం, కూర్చిన ముస్తాబు, పేర్చిన సౌందర్య సోపానపరంపర!

ఆశ్చర్యం, ఆనందం, అదేదో కళవళపాటు,దిగ్గన లేచింది చూపులు మరలింపకుండా అక్రొత్తగా వచ్చిన యువకుని ముఖమే చూస్తూ నిలిచింది కృష్ణవేణి.

(యువకుడు మర్యాదగ తలయోరచేసి) "నా కన్నుల కబ్బిన యీ పెన్నిధి నీలకకంఠగారి ముద్దుకూ తురు కృష్ణవేణియేనా?" అని అతిమృదువుగా ఆమె నుద్దేశించే ప్రశ్నించేడు. ఆప్రశ్న సంగీతంలాగ వినబ డింది. "ఆఁ! సృష్టి యింతసంపూర్ణత, ఇంతనిండుదనం, ఇంతతగిన రచన చేయగలదా?" అనుకొని కొంచెమాల సించి "ఔనం"ది (అతని ముఖమే చూస్తూ.)

"మోహనుడన్న" పేరు మీ తలిదండ్రులవల్ల వినే ఉంటావు. కొలది దినముల క్రిందట నా ఛాయాపటం కూడా చూచేఉంటావు. ఆ రెండునూకలసి సజీవంగా ఇప్పుడు నీకట్టెదుట నిలచినవి ఈ వ్యక్తిలో. మీ తలి దండ్రులు నిన్ను నాకిచ్చి వివాహముచేయ నంగీకరించి నీ అభిమతము తెలిసికొనిరమ్మని నన్నీ తోటలోనికి పంపేరు.

"బలే! బలే!" అంది పైకే — వాని సౌందర్యం చూచి మెప్పు ఆమె పట్టలేకపోయింది.

"దయచేసి ఈచలువరాతి చప్పరంమీదకూర్చొండి, ఈ సపోటాపండ్లు తినండి. ఈ నిర్మలజలం త్రాగి కాస్త స్వస్థత పడండి."

అరుగు అర్వాలికొస నానందంగా కూర్చుంటూ మోహనుడు మోహ ముబికే క్రీగంటి చూపుతో ఆమెను కూడ నరుగుమీద కూర్చుండ సన్నచేసేడు. ఇరువురూ అరుగుమీద కూర్చున్నారు. ఆమె చేసిన సపర్య లంది కొన్నట్టు నటిస్తున్నాడు మోహనుడు. ఆపండ్లొలిచీ ఈ నీరు పెదవులనంటీ.

ఎక్కడుంది కృష్ణవేణి? - ఏమాలోచిస్తూంది. దానికేం;ఏంచేస్తూంది-జవాబు చెబుతూంది? "ఏమిటిది? నేనేం చెయ్యడం? నాకాలోచన స్తంభీభూత మయిపో యింది. ఈసౌందర్యంచూచి నాఒడలు మ్రాన్పడిపోయిం ది.ఆముఖకాంతిలో నాచైతన్యతేజోలేశం అసదై కరగి పోయింది." భారంగా తలవంచికొంది ప్రక్కగా చప్ప రపువీపునకు చేరబడి కృష్ణవేణి. తలవంచి కన్నులు మెల్లగా విప్పింది. ఆఅరుగుమెరుగులో తన ముఖ చ్ఛాయ చూచుకొంది. ఆమె ముఖాన ఏదో నీడలాగు ప్రాకుతూంది. ఆమె నిట్టూర్చింది. నిటారుగా నిలచింది. దిటవుగా కాహ్యది ప్రహరీగోడచేరువకు వెళ్లింది. చెట్లచాటున మాయమయింది. ఆమెవాల్జడా అడుగుల ఒయ్యారం శరీరనిర్మాణసౌభాగ్యం జడుపుదీరి వెనుక

పాటున చూచేసు మోహనుడు - ఇంతదనుక సిగ్గుచేత ఆమె ముఖావలోకనం అంతధీమాగా చేయలేక పోయాడు.

బహుళపాడ్యమి! వెన్నెలవెలుగుపూత సంజకావిరి తుడిచి చల్లగా ప్రాకింది తోటచెట్లమీదికి.

ఇంటి వసారాలో నీ కంఠం భారతీ ఒండొరుల భుజాలు రాసికొంటూ పచారు చేస్తున్నారు. ఉండి ఉండి తోటవేపు చూస్తూ ఏవో వ్యవహారాలు మాటాడుతూ నడుమనడుమ నిలిచి ఆలకిస్తూ.

భారతి:—“ఔను! ఇంతసేపాలించుట చూస్తే వారికి అన్యోన్య ప్రేమానుబంధం ఏర్పడినట్లేతోస్తూంది.”

కిచకిచనవ్వు మీంమిలనడకా, వడివడి యూర్పుతో దడదడలాడే గుండె నదిమకొంటూ.

“ఇద్దరూ తగినవారయితేను అన్యోన్యానుబంధానికి లోటేమిటమ్మా!”

సావిట్లోనుండి వినవచ్చిందా చిడీ మాటలూను. నీలకంఠం గుండు దెబ్బతగిలినట్లు నిలబడి పోయాడు. భారతి ఉత్తరపాటుతో ద్వారంలోకి తొంగిచూచింది అత్యుత్సాహంగా ఆనందంగా నవ్వుమొగంతో తల్లికొరకు వెతుకులాడుతూంది కృష్ణవేణి. ఆశ్చర్యం అడచికొంటూ కిట్టూ అని పిలచింది మెల్లగా భారతి.

“ఔనమ్మా! ఆ యిరువురికలయిక బంగారు ఇలిగారమలపొత్తు-రా! చూపిస్తాను. అమ్మా అలా ఉండాలి గాని సృష్టి అదియిదీ-సర్దుబాటుగా - రా అమ్మా వస్తూ- ఇలారా! నాతోచే-ఇదిగో ఈమెట్టెపక్క-చూడు నా చూపుడువ్రేలు త్రోవనే-ఆఁ అటూ, తోటలోకినిదానించి చూడు!- మన ‘జహంగీరు’ మామిడంటుచేరువను ఆఁ అటూ-అలాగు’ కిలకిలా పిట్టలచడిలాగు నవ్వింది. “ఎంత బాగున్నారో అమ్మా!- చూడు-చూడు అదీ! ఏం! ఏమంటావు. అందంలో అందం ఎలాలీనమై అందొందం అవుతూందో.”

భారతి:—(చూచి చూచి తెల్లబోయి- పాడిగ ఆరిపోయిన కంఠం పెదవులూ తడుపుకొని) ఏమిటె కిట్టూ. ఇది కలా? నిజమా? నా కళ్లయెదుటి దృశ్యం నిజమేనా?” “ఆఁ, నిజంకాదూ మరి?” అంది కృష్ణవేణి ఆనందంలో నవ్వులో కుతుకలలో తొట్రుబడుతూన్న స్వనంతో!

“ఏమిటిది కిట్టూ?” అంది భారతి సగమాశ్చర్యంతో, సగం కినుకతో.

“గోరచిలుకమ్మా!”పకపకానవ్వుతూ-“నారచన”-తిరుగా కిచకిచానవ్వింది. ఆలేతరేయి గడగడలాడేటట్లు-వెన్నెలమునుగులో.

భారతి:—“ఎవరామె? వాని సందిటిలో?”

కృష్ణవేణి:—“తగినఆమె”కిచకిచా కిలకిలా పకపకానవ్వి- పడబోయి తల్లి భుజం ఊతగా ఆచికొని “సుందరి! సుందరి!” అంది ఆమెచెవిలో.

---



దేవతావిగ్రహము - 'అంకోర్ వాట్' శిల్పము



౮. ప్రాఖాను దేవాలయమును కావలికాయుచున్న నాగుల శిరోలంకార స్వరూపము



౯. అంకోరువాటు మందిరము గోడమీద మలచబడిన దేవతా స్త్రీ ప్రతిమలు

# దేవేంద్రవర్మనాపితవాటక శాసనము

మల్లంపల్లి సోమశేఖరశర్మ



ఈ శాసనముకూడ ఇదివరలో ఈపత్రిక యందు ప్రకటితమయిన గాంగ సామంత వర్మశాసనముతోపాటు చీడివలసగ్రామమునకు పడుమటను ఒక 'మెట్టగుడ్డ'లో దొరకినదే. దీనినికూడ శ్రీ శ్రీ శ్రీ ఫలహారీమహంతు రాజా రాంబావాజీగారు సంపాదించి జాగ్రత్తపెట్టగా మన్మిత్రులు శ్రీభైరి అప్పలస్వామి నాయడుగారు వారిని కలసికొని దీనిని తీసికొని ప్రకటనార్థము సామంతవర్మశాసనముతోపాటు దయతో నాకు పంపినారు.

ఈ శాసనమున ఒక్కొకటి ౮. ౭ అంగుళములు పొడుగును, ౨. ౬ అంగుళములు వెడల్పును గల మూడు రేకులు కలవు. ఇవి ౩. ౮ అంగుళముల వ్యాసముగల యొక కడియమున దూర్చియున్నవి. ఈ కడియపు కొనలు ఒకగుండ్రని ముద్రికయడుగుభాగమున తాపటము చేసియున్నవి. ముద్రిక వ్యాసము ౧. ౬ అంగుళములు. ఈ ముద్రిక మీద దిగువయంచుకడ బూరగొమ్మువలె మెలితిరిగిన కాడతోడి పద్మమును, దానిమీద రొక పీఠపురేఖయు, దానిమీద పడుమటివైపునకు ముఖముత్రిప్పి మోకరించియున్న చక్కని నందియు, దానికెగువను నాగరాక్షరములతో '(శ్రీ) దేవే [న్ద్రి] వర్మా' యన్న పేరును, ఎగువయంచుకడ చంద్రుడును ఉబ్బెత్తుగ చెక్కబడినవి.

శాసనమంతయు వేంగీ-కళింగ తెలుగు, నాగరివర్ణములు కలిసిన కలగలుపు లిపిలో వ్రాయబడినది. కళింగ గాంగశాసనముల యందు నాగరివర్ణ ప్రాబల్యము గాంగశకము ౩౫౧ నాటికి హెచ్చిపోవుట వలన [1] ఈ శాసనము గాంగశకము నాలుగవ శతాబ్దినాటిదనుటకు సందియములేదు. ఇందలి నాగరివర్ణములు గాంగశకము ౩౫౧ నాటి సత్యవర్మ[2], ౩౯౭ నాటి దేవేంద్రవర్మ[3] శాసన

1. భారతి, సం. ౧౧, పుటలు, ౯౧౩-౯౧౪.
2. Ind. Aut., Vol. XIV, p. 10 ff.
3. Jour. Andhr. Hist. Res. Soc., Vol. II, p. 146 ff.

ములలోనివానివలెనే యున్నవి. అ, ఆ, క, ఖ, ణ, త, ద, ధ, న, ప, ఫ, మ, ర, ల, సవర్ణములు ఈ శాసనమున తెలుగునను, నాగరిలోను కూడ వ్రాయబడినవి. శాసనమున తెలుగు 'శ' వర్ణమును వాడినారు కాని ముద్రికమీద మాత్రము నాగరి 'శ' వర్ణము కలదు. మొదటిరేకు మొదటిపెడను, మూడవరేకు రెండవపెడను శాసనమును చెక్కలేదు. ఈశాసనపు మూడవరేకుమీద ఏదో వేరొక శాసనపుచిత్తు (draft) వ్రాయబడి యున్నది. శాసనాక్షరములను స్ఫుటముగను లోతుగను చెక్కుటకు పూర్వము ముందుగ ఉత్కీర్ణకుడు రేకులమీద తేల్చిగీసిన యక్షరములు లీలగా కనిపించుచున్నవి. ఆశాసనము పనికిరాకపోవుటవలననో మరియే కారణముననో ఆచిత్తుశాసనము మీదనే ఈ శాసనమును స్ఫుటముగా చెక్కినారు. మొదట చెక్కిన శాసనపు వ్రాత మూడవ రేకు రెండవపెడకూడకలదు. ఇప్పటి శాసనపు వ్రాతయున్న మూడవరేకు మొదటిపెడ మీద శాసనపు అక్షరములు బొత్తిగ గుర్తింపవచ్చుట లేదు కాని యిప్పటి శాసనము లేని రెండవపెడమీద మాత్రము అచ్చటచ్చట అక్షరములు బాగుగనే కనబడుచున్నవి. వీనిలో తెలుగు నాగరి అక్షరములు రెండునుగూడ నున్నవి. అవికూడ సరిగా మనయీశాసనకాలమునాటివే. ఈ పెడను గూడ ఏడుపంక్తుల వ్రాత కలదు. కొంచెము శక్తిగల భూతద్దముతో జాగ్రత్తగాను, దీర్ఘముగాను పరిశీలించి చూడగా అది పూర్వ

గాంగవంశప్రశస్తి యనియు, మూడవరేకు మొదటి పెడనుండియే ఆశాసన మారంభమనియు తేలినది. పూర్వగాంగప్రశస్తిపరిణామము పరిచితమయినదియు, బాగుగ దెలిసినదియు అగుటచేత ఆ పంక్తులలోని ఈ క్రింది భాగములు మాత్రము చదువుటకు వీలైనది.

౧. కలజో్కనేక (కా) హ [వ] సంక్షోభజనిత జయశబ్ద [ః*] ప్రతాపావ [నత] [సమస్తసామన్త *]

౨. చక్రమా [డామణిప్ర *] భా [మ] ఞ్జరీపుఞ్జరఞ్జిత వరచరణ [ః] నిజ (?) ని [స్త్రీం *]

౩. [శో] పాఙ్జితి...కలి...కళ...ధిగత సితకుముద కున్దేన్దువదా

౪. త.............

౫. 'శ్రీ సాయ్యా [ణ*] దార్య సత్యత్యాగాదిగుణ సమ్పదాధారభూతః పరమమాహేశ్వ

౬. రో మాతాపితృపాదాను......

౭. ...

౮. . టుమ్వ...

శాసనభాష యంతయు సంస్కృతము. కడపటి వ్యాసగీతాశ్లోకములు తక్క మిగిలిన శాసన మంతయు గద్యాత్మకము. వ్రాత తప్పులు చాల గలవు.

ఈ శాసనము గాంగవంశజుడయిన మహారాజాధిరాజ పరమేశ్వర శ్రీ భూపేంద్ర వర్మ కుమారుడు దేవేంద్రవర్మది. ఈదేవేంద్ర వర్మ తన తలిదండ్రులకును, తనకును పుణ్యాభివృద్ధి యగునట్లుగా షడంగ (?) సహిత మయిన బహ్వృచవేదమను సాంతముగ నధ్యయనము చేసినవారును, సకలశాస్త్రార్థములను ఎరింగినవారును, కామకాయన సగోత్రులును అయిన నరసింహభట్ట, మాధవ భట్టులకు కోలువర్తనివిషయమునందలి నాపిత

వాటకగ్రామమును సర్వకరపరిహారముచేసి ఉత్తరాయణమునిమిత్తమున ఉదకపూర్వముగ దానముచేసెను. ఈ విషయమును దెలుపుటకే ఈ శాసనము పుట్టినది.

ఇదివరలో ఆంధ్రసాహిత్య పరిషత్పత్రికలో బ్రహ్మశ్రీ కర్రి సాంబమూర్తి శాస్త్రిగారు తెలుగుననున[4], ఆంధ్రేతిహాస పరిశోధక మండలివారి పత్రికయందు శ్రీరాళ్లభండి సుబ్బారావుగారు ఇంగ్లీషునను[5] ప్రకటించిన చీడివలసశాసనపు దేవేంద్రవర్మయు, మన శాసనదాతయు నొక్కడే. చీడివలస శాసనమునవలెనే ఇందునను మొదట గాంగవంశ ప్రశస్తికలదు (పం. ౧-౧౨ లు). దీనికిని చీడివలసశాసనమునందలి (మొదటి పండ్రెండు పంక్తులలోని) ప్రశస్తికిని రవంతయినను భేదములేదు[6]. ప్రశస్తికి పిదప మూడుపంక్తులలో (పం. ౧౨-౧౪ లు) దేవేంద్రవర్మ తాను చేయబోవు ధర్మమును గురించి కోలువర్తనివిషయమునందలి నాపిత వాటకగ్రామవాసులకు సంబోధించి తెలిపి యాజ్ఞాపించును. తరువాత నాలుగైదు పంక్తులలో ప్రతిగ్రహీతలనుగురించిన విషయము కలదు (పం. ౧౫-౧౯ లు). ప్రతిగ్రహీతలయిన నరసింహభట్ట, మాధవభట్టులు మాధవభట్టుమనుమలు; షట్కర్మనిరతుడును, సకలవేదార్థము నెరిగినవాడును అయిన ద్రోణభట్టుకొడుకులు. తరువాతి ఆరుపంక్తులలోను దానముచేసిన గ్రామము సరిహద్దులు తెలుపబడినవి (పం. ౨౦-౨౬). కడపట 'బహుభి ర్వసుధా దత్తా' యను మామూలు వ్యాసగీతలు కలవు (పం. ౨౬-౨౯లు). అంతటితో శాసనము ముగియుచున్నది.

చీడివలస శాసనమునవలె ఇందుశాసనకాలము తెలుపబడలేదు. ఇందు శాసనదాత తండ్రిపేరే కాని దానిలోవలె తాతనుకూడ పేర్కొనలేదు; శాసనోత్కీర్ణక, శాసనలేఖకుల పేరే లేదు. అయినను చీడివలసశాసనప్రశస్తియు, ఇందలి ప్రశస్తియు ఒక్కరీతిగనుండుటంజేసి చీడివలసశాసనమువలెనే ఇదికూడ గాంగశకము ౩౯౭ ప్రాంతపుదనుటకు సంశయింపబనిలేదు.

చీడివలసశాసనమున 'భూపేంద్రవర్మసూనుః శ్రీ దేవేంద్రవర్మా' యనుదానితో నంతమగు ప్రశస్తి యనంతరము నాలుగు శ్లోకములు కలవు. వీనిలో మొదటి మూడును దేవేంద్రవర్మధర్మపరిపాలనమును సంకీర్తించును.

నాలుగవ శ్లోక మిది:

---

4. 1927, మార్చి సంచిక.　　5. Vol. II, p. 146 ff.

6. కళింగ గాంగశక మనుపేరుతో నేను ఈపత్రికలో వెనుక వ్రాసిన రెండవ వ్యాసమున ప్రకటితమయిన చీడివలస శాసనము ప్రతిబింబములను జూచి 'ఆకల్పాన్త సంకల్పితానల్పజన సమ్పత్సంశోభిత మహో మహిమ' మని వ్రాసినాను. ఈ శాసనము ననుసరించి °సంకల్పితానల్ప° పిదప 'జనసమ్పత్సమ్పాదిత మహామహిమ' మని యుండవలెనని తేలుచున్నది.

మారసింహః పితా యస్య
వజ్రీచైవ పితామహః
స్వయం దేవేంద్రవర్మేతి
సూతి స్సద్గుణ కీర్తనమ్.

దీనినిబట్టి, తండ్రి మారసింహు డని, తాత వజ్రియని, స్వయము తాను దేవేంద్ర వర్మ కొడుకునని చెప్పుటవలనను, ప్రశస్తిని బట్టి దేవేంద్రవర్మ భూపేంద్రవర్మకుమారు డని తెలియుచుండుటవలనను భూపేంద్ర వర్మ మారసింహు లిరువురు నొక్కరే యని నా యభిప్రాయము. మారసింహు డన్నది అసలుపేరును, భూపేంద్రవర్మ యన్నది బిరుదము నైయుండును[7]. భూపేంద్రవర్మ, రాజేంద్ర వర్మనామములు సమానార్థకము లగుటచేత కళింగగాంగశాసనములయందు భూపేంద్ర వర్మ రాజేంద్రవర్మ యనియు వ్యవహరింపబడి యుండవచ్చునని తోచుచున్నది. ఈ యూహ ము ననుసరించి దేవేంద్రవర్మ వంశవృక్షము నీ దిగువ విధమున జూపవచ్చును :




దానమిచ్చినగ్రామము నాపితవాటక. ఇది చీడివలస శాసనమున పేర్కొనబడిన సరిహద్దుగ్రామములలో నొకటి. అందు దీని పేరు నాపితవాడయని కలదు. ఈ శాసనమున నాపితవాటక సరిహద్దుగ్రామములలో నొకటిగ దెలుపబడిన 'కన్దకవాటక' ప్రాయికముగ చీడివలసశాసనమున దానమిచ్చినట్లు తెలుపబడిన కందలివాడగ్రామమే కావచ్చును.[8] చీడివలసశాసనమున 'ఖోలామ్పురి' యని పేర్కొనబడినగ్రామము మనశాసనమునందలి 'కోలాల' గ్రామము కాదగునేమో. ఈగ్రామము లేవియు నిపుడు గుర్తింపరావు ఈపేరులతోనొక్క గ్రామము లేవియు నిపుడు లేకపోయినను కందలివాడ చీడివలసనికటమునందలిదే కావున ఇవి యన్నియు నాప్రాతమునసే శ్రీకాకుళముతాలూకాయందే యుండి యుండవలయును.

పూర్వోక్తగ్రామము లన్నియు కోలువర్తని విషయములోనివి. దేవేంద్రవర్మ చీడివలసశాసనమున దానమిచ్చినట్లు తెలుపబడిన గ్రామమును కోలువర్తని విషయము లోనిదే. ఈవిషయమే మూడవ వజ్రహస్తుని చిక్కాలవలస, బొడ్డుపాడు శాసనములలో గూడ వచ్చును.[9]

7. కళింగ గాంగశకము; రెండవ వ్యాసము — భారతి, సం. ౧౧, పుటలు, ౯౧౪-౯౧౫.

8. చీడివలస శాసనమున దానమిచ్చిన విషయమును దెలుపు పట్టున నిట్లు కలదు :
"సూర్యగ్రహణ నిమిత్తే సివిడిప్రవే (దే) శం కన్దలివాడ గ్రామోదత్త [ః*]". దీనినిబట్టిచూడగా చీడివలస శాసనమున దానమిచ్చిన గ్రామము సివిడిప్రదేశముతో గూడిన కందలివాడ గ్రామమే యని నా నమ్మకము. "సివిడిప్రవే(దే) శ [సహిత*]ం కన్దలివాడగ్రామోదత్త [ః*]" అని యాపాఠమును సంస్కరింపదగు ననుకొందును.

9. భారతి, సం. 3, [illegible] 

## మూ ల ము[1]

### మొ ద టి రే కు



౧. స్వస్తి[॥*] శ్రీమదనేక దేవకులాకులాదమరపురనుకరిణః[2] [ఆ]

౨. కల్పాన్తసంకల్పితానల్పజనసమ్పత్సమ్పాదితమహామహిమ్నా

3. మహీతల[3]తిలకాత్కలింగనగరాత్త్రిసిద్ధసిద్ధతాపసాధ్యాసిత

౪. కన్దరోదరమహేన్ద్రగిరిశిఖరశేఖరస్య సురాసురగు

౫. రోః సకలత్రభువనా[4]మహాప్రాసాదనిర్మ్మాణైకసూత్రధారస్య

౬. భగవతో గోకర్ణ్ణస్వామినశ్చరణకమలప్రణామాద్విగతకలికా

౭. లకలఙ్కో గంగామలకులచూడామణి[ః*]స్వజ్జర్న్నిజభుజవజ్ర[5].

---

1. నాదగ్గరనున్న రేకుల ననుసరించి.
2. °దమరపురానుకారిణః' అని చదువవలెను.
3. 'మహీకల° అని.
4. °త్రిభువన° అని.
5. 'స్వాఙ్జర్న్నిజభుజవజ్ర° అని.

## రెండవ రేకు : మొదటి పేడ



౮. జితసకలకలింగాధిరాజ్యో మన్దానిలవః కుల[6]కల్లోలజలధి

౯ మేఖలారని [7]తలామలయశాః అనేకభివణ[8]సమరసంఙ్ఘో భజని

౧౦. తజయప్రతాపావనతసమస్తసామన్తచక్రకిరీటకిరణమంజరీపుంజర

౧౧. ంజితచరణః పరమమాహేగ్వరో[9] మాతాపితృపదనుధ్యాతో[10] మహారాజధి[11]

౧౨. రాద(?)[12]పరమేశ్వరశ్రీమద్భూపేన్ద్రివర్మ్మణసూను [ః*] శ్రీదేవేన్ద్రివర్మ్మణ[13] ॥ కోలు
వత్త[ఽ*]న్యా[మ్*]

౧౩. నపితవాటక[14]గ్రామవాసినః కుటుంబిన స్సమాజ్ఞాపయతి విదితమస్తు వో

౧౪. యథాయంధర్మ్మ[ః*]మాతాపిత్రోరాత్మనశ్చపుణ్యాభివృద్ధయే ॥ అశేషగుణగణా

---

6. °వేలాకుల° అని.
7. °మేఖలావని° అని.
8. 'అనేక భీవణ° అని.
9. °మాహేశ్వరో° అని.
10. °పాదానుధ్యాతో°, అని
11. °రాజాధి° అని.
12. °రాజ° అని.
13. °వర్మ్మణ° అని.
14. 'నాపితవాటక° అని.

## రెండవరేకు : రెండవపెడ



౧౫. ధరస్య [15] మాధవభట్టస్యపౌత్రాభ్యాం[16] షట్కర్మనిరతస్య విథిత[17]సకలవే

౧౬. దార్థస్య ద్రోణభట్టస్యపుత్రాభ్యా [ం] షడంశసహిత[18]బహ్వృచ వేదపారగాభ్యాం

౧౭. అవగతాశేషశస్త్రార్థభ్యాం కముకాయనస[19]గోత్రాభ్యా[ం] నరసింహభట్ట మధవ[20]

౧౮. భట్టాభ్యా మ్మయా అయంగ్రామ స్సర్వ[క*]కర పరిహారేణ భకన్తుక(?) ముత్తరయ[21]

౧౯. ణనిమిత్తే ఉదకపూర్వ్వకం సమ్ప్రదత్తఇతి [విదిత్వా *] యథోదితభోగభాగఃషు

౨౦. పసయన్త స్సుఖంప్రతివసతేతి॥ సమ్ప్రతి ప్రాదక్షిణ్యేన సీమలింగాని లిఖ్యన్తే[॥*]

౨౧. ఈశాన్యాం[దిశి*] జపు(?)సివిడి నామదవాటత్రికూటేవల్మీకః తతో వనరజీ యవ[త్ *]
త్రికు[22]మ

15. °ధారస్య,
16. 'పౌత్రాభ్యాం' అని.
17. 'విదిత°' అని.
18. 'షడంగసహిత°' అని.
19. 'అవగతాశేషశాస్త్రార్థ భ్యాం కామకాయనస°' అని.
20. 'మాధవ°' అని.
21. °ముత్తరాయ° అని.
22. లేఖకుడు సీమాలింగములను వ్రాయుటలో 'యావత్', 'త్రికూటే', 'వనరాజీ', 'శిలా', 'తటాక' పదములలో
తరుచుగ దీర్ఘములను, [illegible]

## మూడవ రేకు : మొదటి పెడ



౨౨. ఓే(?) తతో౽పి వనరాజి యావత్కన్దకవాటక కోలల నాపితవాటక గ్రామాణాం[*] త్రికు

౨౩. ఓే వల్మీకః తతో౽పి వనరా[జీ*]యావత్తటకపాలీ(?) తతో౽పి భాజు(?)స్థితా వల్మీకం యవ[త్*]

౨౪. త్రికూఓే శిలా।తతః పశ్చిమతః త్రికుఓే శిల।తత[ః*]ఉత్తరతః కోణే శిలా[।*] తతః

౨౫. కించిత్పూర్వ్వతః వల్మీకః। తత[ః*] ఉత్తరతః గర్త్తాసహితా వనరాజీ యావద్వా యవ్యా[ం*]

౨౬. త్రికూఓే వల్మీకః తతో గర్త్తా[ః*]॥ భవిష్యద్భూపాన్విజ్ఞప[య*]తి[23] వ్యాసవచనైః॥ బహుభి ర్వ్వ[ః*]సుధా

౨౭. దత్తా రాజభి స్సగరాదిభిః[।*] యస్యయస్య యద[24]భూమి స్తస్యతస్య తదాఫల[మ్।*]। స్వదత్తామ్ప[25]

౨౮. [ర]దత్తాంవా యత్నాద్రక్ష యు[ధి*]ష్ఠిర॥ మహి[26]మ్మహిమతాం శ్రేష్ఠ [।*] దానాత్ శ్రేయోనుపలన[మ్॥*][27] షష్టిం

౨౯. వష[ః*]సహస్రణాం[28] స్వర్గ్గే [ః*] తిష్ఠతి భూమిదః [।*] ఆచ్ఛేత్తాచానుమన్తాచ తాన్యేవ నరకవా[సే*]త్ [॥*][29].

ముద్రిక



---

23. °న్విజ్ఞాపయతి' అని.
24. 'యదా° అని
25. 'స్వదత్తామ్ప° అని.
26. 'మహీ° అని.
27. °పాలన[మ్*]' అని.
28. 'సహస్రాణి° అని.
29. 'నరకేవ [సే*]త్' అని.




శివభక్త మాహాత్మ్యమునందలి రజకోపాఖ్యానమున నొకరంగము
(శ్రీ కాశీనాథరావుగారి తంజాపుర ప్రాచీనచిత్రసంగ్రహమునుండి)

# నక్షత్రప్రాబల్యము

వసంతరావు వెంకటరావు



మానవాభ్యుదయమునకై యెట్టి సాహాయ్యమైనను నక్షత్రగ్రహములనుండి భూవాసులు పొందిరా యను విషయము "మానవుని యేకాకిత్వ*" మను వ్యాసములో చర్చించియుంటిమి. తన సుఖదుఃఖములనుండి గ్రహించి పెంపొందించుకొనిన జ్ఞానమేగాని పరనక్షత్ర వాసులనుండి మానవు డెట్టి ప్రోత్సాహము పడయలేదని నిర్ణయించితిమి. ఇతర గ్రహములలో మనకన్న మేధావంతు లుండవచ్చుననియు, వారిలో నొక పథికుడు భూసంచారము చేయవచ్చినచో ప్రకృతిజన్యదుర్నియమములకు ముఖ్యముగ చకితు డౌననియు చెప్పితిమి. నహోమారుల కాహారులగుచున్న శిశువులు, ఆశోపహతులై, దుఃఖభాజనులై దుర్భగక్లేశయుతమగు జరాభారముచే క్రుంగుచున్న వృద్ధులు ప్రదర్శించు భయానకదృశ్యమే వానికెల్లెడ గోచరించును. అట్టియెడ, వైద్యశాస్త్ర రహస్యార్ణవము తరించిన పథికుడు రోగములు నిర్మూలించి శిశువులకు పూర్ణారోగ్యమును, వయోవృద్ధులకు జీవితసౌఖ్యము నొసగూర్చుట కొక స్వచ్ఛందపద ముచ్చరించిన చాలుగదా? మనకట్టి మహాభాగ్యోదయ మెవ రొదవించిరి?

ఇట్లు ప్రశ్నించుట కేవలము సమంజసము కాకపోవచ్చును. సహజమగు మానవధృత్యుత్సాహములచే పొందినజ్ఞానవికాసమేగాని పరలోకవాసుల కారుణ్యముచే నన్యప్రతిభావిశేషముల మానవజాతికి లభింపలేదను విషయము ప్రపంచచరిత్రమునుండి గమనింపవచ్చును. ఒక్కొక్క యుగమునందొక్కొక్క జాతివారు ప్రాలుమాలి, నిద్రావివశులై ఏమహాపురుషుని దివ్యగానముననో మేల్కాంచి, కాలవిలంబమునకు ప్రాయశ్చిత్తమొనర్చుటకో యనునట్లు మహావేగమున జ్ఞానసౌధములు నిర్మించిన ఘట్టములు చరిత్రమందు గోచరించును. ప్రతిభావిశాలురగు ప్రాచీన భారతీయయోగిపుంగవులు, ఇయ్యవసరమున గూడ మానవుల నలజడిపెట్టు విషమ విషయములనే అనాదిగ చర్చించిన పురాతన గ్రీకు వేదాంతులు, నూతనమతస్థాపకులగు బుద్ధుడు, క్రీస్తు, మహమ్మదు మొదలగు పుణ్యపురుషులు, సృష్టి రహస్యభేదనమునకై యనేకదీక్షాయత్తచిత్తులగు శాస్త్రవేత్తలు జనించిన యాయా యుగములే తార్కాణములు. కష్టములకోర్చి, యుగముల పర్యంతము జ్ఞానాభివృద్ధికై పాటుపడిన మనుజుల ప్రబల ప్రయత్నములే మహత్తర విజ్ఞానసౌధ నిర్మాణమునకు పునాదులైనవి కాని, పరలోకవాసుల యనుగ్రహము కాదను విషయముకూడ చరిత్రనుండి గమనింపదగును.

దృక్కు మరల్చి మరియొక దెస విలోకించెదము. భూజననమాది కోట్లకొలది వత్సరములు గతించినను, మన చారిత్రజ్ఞానము గత 30, 40 శతాబ్దములకెక్కువ లేదు. ఈ కాలావధిలో పరలోకవాసుల సాంగత్యము లభించినట్లు ప్రమాణము లేకున్నను, తత్పూర్వ మట్టి మహాభాగ్యము పొందలేదనుట కవకాశము లేదు. పాషాణములు, వృక్షములు, పక్షులు, పశువులు మొదలగు జీవరాసులలో యుక్తాయుక్త విచక్షణజ్ఞానము, మేధాశక్తి, యోచనాసామర్థ్యము, సృష్టి రహస్యాన్వేషణకాంక్ష

* భారతి: సంపు. ౧౩; సంఖ్య ౪; పుట ౬.

ఒక్క మనష్యబుద్ధికే కేదు. ఇట్టి ప్రముఖ్యము మానవునికే లభించుటేల? మహా రహస్యముల నందందు గుప్తపరుచు ప్రాచీన పురాణేతిహాసములలో సూచించినరీతి మన చారిత్రకులకు పూర్వమెక్కప్పుడు పరలోక మహాపురుషుల సందేశముచేతనే మానవునియందీ ప్రత్యేక ప్రజ్ఞావిశేషము లుద్భవించియుండరాదా? భావినట్టి ప్రోద్బలముచే దేవత్వముకూడ ప్రాప్తింపకూడదా?

పూర్వ మెన్నడో సందేశమంపిన పరలోక వాసులు మరల పంపరేల? ఆలోకమున కాలమానము వేరొక పరిమాణములో నుండవచ్చును. మన కాలమతి త్వరితముగ జరుగిడుచున్నది; మనకాలమునకు విశుద్ధ పరిమాణము (absolute dimension) లేదు; అది మన గుండె దడారము ననుగమించుచున్నది. ౭౨ సార్లుగుండె కొట్టుకొనిన మనకొక నిమిషము గడచును. కాని, మన శతాబ్దము లొక లోకమందలి సంవత్సరమునకు, మరియొక లోకమందలి దినమునకు సరిపడ వచ్చును. మన కొక దేవుడు వొకప్పుడు సందేశమంపి ప్రత్యుత్తరమునకై నిరీక్షించి, హతాశుడై మనలను విడనాడి యుండవచ్చును. లేక, అట్టిసందేశములు గుర్తించి బోధపరుచుకొనుటకు మన పూర్వులకుండిన సామర్థ్యము మనము గోల్పోయి యుండవచ్చును; ఆ సందేశమంపిన తారక పరిణతినొంది, అందలి జీవులతోకూడ శూన్యాకాశమున లీనమై యుండవచ్చును. మరియు, మనకన్న ప్రాజ్ఞులగు వ్యక్తులతత్త్వమే వేరు కావచ్చును; వారి యాశయములే వేరుకావచ్చును. వారికి పరలోకములతో వ్యవహరించు కాంక్షయే లేకపోవచ్చును; గాఢమేఘావృతంబై, విపరీత వాతావరణముగల యా తారకు పరలోక సంపర్కమే దుర్లభమై యుండవచ్చును.

ఆకాశమునగల అసంఖ్యాక నక్షత్రములలో మన సూర్యమండలము ప్రత్యేకత వహించినది. ఒక నక్షత్రమునుండి తునియలై దానిచుట్టు నిరంతరము పరిభ్రమించు గ్రహమండలమును పోలిన సముదాయము లరుదుగ గలవు. స్వల్పయుష్ణోగ్రత (Temperature) గల గ్రహములచే పరివృతుండగుచున్న మన భానుడు జగన్మాత కపూర్వపుత్రుడు.

ఇతరగ్రహములను విచారించుటకు ముందు మన భూమినరయుదము. భూమిలో పలువిధములగు జీవులున్నను మన భావములను సజాతీయులగు మానవులకే వెల్లడింపగలము. పాషాణములతో, వృక్షములతో సంప్రతింపలేము. మృగపక్షిజాతులలో మనపంచనుండి, మనమిడుయాహారము భుజించుకొలది జంతువులలో నతి తెలివైనవాటిచే రెండుమూడు చిన్నపలుకులు పలికించుటే బహుకష్టతరము. పిపీలికాది కీటకములు సంఘోద్యమములలో మానవులకన్న నేర్పుగలవని మనము తలంచినను, వాటితో సంప్రతింపగలమా యను సందియమైన కలుగదయ్యె; అది కేవలము దురూహమనియే మన నమ్మకము.

ఇక, శూన్యాకాశ ప్రలంబిత గణనాతీత నక్షత్రములలో జీవానుకూలమను భూపరిస్థితులకంటె పరిస్థితులుగల తారకలైదారుండుట దుర్ఘటము. ప్రాణవాయువు (Oxygen), ఉదజని (Hydrogen), అంగారము (Carbon) మొదలగు మూలపదార్థముల సంయోగమునకే విశ్వమందు నక్షత్రము లుద్భవించుచున్నవి. అందుచే, అగణ్యనక్షత్రములలో కొన్నియైన సమశీతోష్ణావస్థలో నుండుటకవకాశమున్నది.

అట్టికొలది నక్షత్రములైదింటిలోనైన మానవుడే పాలనాదక్షుడని విశ్వసింపలేము. నానానేక జీవజాతులుగల భూలోకమందైన మేధానిధియై, అగ్రశ్రేష్ఠుడై, మానవుడే రాజాధిరాజగుటకు నిశ్చితకారణమగపడదు. భూదేవి లేత్రాయమునందు జనించిన పలువిధములగు భూచర జలచరజాతు లంతరించినను పుత్రవాత్సల్యముచే నామె వాటి శల్యములనైన భద్రముగ గుప్తపరచుటచే బహుళజీవత్వము మనకు వ్యక్తమగుచున్నది. వాటివలె మానవుడు కూడ శల్యావశిష్టుడు కాకుండుట కేవలము దైవికము. అందుచే అట్టిజీవోత్పాదక గ్రహములందొకదానిలో నొకబృహజ్జలచరమును, వేరొకదానిలో భీషణమృగేంద్రమును, ఒక దానిలో దీర్ఘకాయువగు విహాయసమును, (?) ఇంకొకదానిలో సంఘీభావసంపన్నములగు మహాకీటకములును, కడదానిలో మానవాతీతములగు నిరూపవ్యక్తులును (?) ప్రాభవము వహించియుండవచ్చును.

పరలోకమండలి పరిస్థితులను, జీవులను గూర్చి యోచించునప్పుడు పరలోక సాంగత్యలాభ మించుకైన పొందని మనము స్వానుభవముచే నార్జించిన లౌకికజ్ఞానమే ప్రయోగింతుము. భూలోక ప్రమాణములు వర్తించు గ్రహములందు వాటివాటి వయఃపరిమితి ననుసరించి యొక్కొక్కదానిలో వేర్వేరుగ మీనము, మృగేంద్రము, విహంగము, కీటకసంఘము, దురూహ వ్యక్తియు ప్రముఖత్వము వహించి, భూలోకమానవుని కన్న మిగుల మేధావంతులై, ధైర్య స్థైర్యయుతులై, యాధ్యాత్మిక చింతనాపరులై యుండియు విశ్వమునెడ భిన్నాభిప్రాయము లనుటచే వారికి భూలోక సంపర్క వాంఛయే లేకపోవచ్చును.

గ్రహాన్వేషణమందు, మన కనతిదూరమున నున్న మనతోడి గ్రహములను మనము పరీక్షించెదము. కొంత కాలము వరకు ఖగోళశాస్త్రజ్ఞు (astronomers) లాశలన్నియు అంగారకునిపై (Mars) కేంద్రీకరించుకొని యుండిరి. భూమిలో సేడవవంతు పరిమాణము గల అంగారకుడు యాంత్రికాన్వేషణమున కనుకూలము దూరమునన్న గ్రహములలో ద్వితీయుడు. చంద్రుడు ప్రసన్నుడైనను వానికి వాతావరణము లేదు; అతనొక మృతగ్రహము; అలను జీవోత్పాదకుడు గాడు. అంగారకుని యుష్ణోగ్రత బహుస్వల్పము. సామాన్యముగ మనముకన్న ౯౦ అంశములు (Degreas) తక్కువ; అచ్చటచ్చట హిమసమానముగ నుండవచ్చును. అందలి కొండ చరియలలో నున్న జలమంతయు హిమరూపమున కన్పడును. వాయువు మిగుల పలుచన; ప్రాణవాయు వత్యల్పము. అట్టి వాతావరణములో శీతోష్ణవిపర్యయముల నోర్చి, శాకాహారములు విసర్జించి, తద్దేశలభ్య లోహపాషాణ విద్యుద్ఘటికాహారములనే స్వీకరించుట కలవడిన వ్యక్తులు తప్ప మనవంటి జీవులు మనుట దుస్సంభవము.

ఆవ్యక్తు లెట్టివారు? జగచ్చరిత్రలో వారు మన కన్న వయోవృద్ధులు. భూమిలో నేడవవంతు బరువుగల అంగారకుడు భూమికేడురెట్లు వేగమున చల్లవారియుండుటయు అటజీవోత్పత్తి చాలముందుగ ప్రారంభించి యుండవలయు. శీతలాధికతచే

అంగారకులు కేవలధైర్య సాహసములచే నాదుర్భరావస్థల ప్రతిఘటించు నవసరమున సర్వశాస్త్రములలో నపారపాండితి నార్జించియుందురు. సకలశాస్త్ర పారంగతులగువారు మనతో సంప్రతించువిధాన మెరిగి యుందురు. అట్లైన, ప్రకృతిశక్తులచే సందేశమంపుటకై మనమొనర్చు యత్నములు వ్యర్థమగుచుండు టేల? మన వలె పూర్వమొకప్పుడు వారు సందేశమంపినపుడు దానిని గ్రహించు ప్రాజ్ఞత మనకు లేకపోయి యుండవచ్చును. నేడు ప్రకృతిశక్తులను వార్తావహులుగ ప్రయోగించు సామర్థ్యము మనము సముపార్జించుసరికి వారు లయమై యుండవచ్చును.

భూజనన మాది మన మనుభవించిన దశలన్నియు నంగారక చంద్రులందలి జీవులు గడిపియున్నారు. వార్ధకదశయందువారు గడిపిన దశలన్నియు భావి మనకు ప్రాప్తించును. ఆ గ్రహములలో పరిణామము ముగియ వచ్చినది. మనకు జ్ఞానోదయమగుసరికి వారిజ్ఞానము పరిణతనొంది యంతర్ధానమైయుండును. వారితో వ్యవహరించుటకు మనము ప్రయాసపడుచున్న ట్లితరనక్షత్రవాసులు నేడుగూడ యత్నించుచుండవచ్చును. మనము నిర్మించిన యంత్రములచే నక్షత్రములందలి విచిత్రముల నాలోకించుచు నక్షత్రనిర్మాణ మభ్యసించుచున్నాము. కొలదికాలములో మహత్తర దూరదర్శిని (Telecope) నొకటినిర్మించి దానితో నక్షత్రములపై వాటిల్లు విశేషములనెల్ల పరీక్షింపగలము. జీవోత్పత్తి ప్రారంభింపక పోవుటచేతనో, దట్టమగు మేఘములచే నావరింపబడి యుండుటచేతనో సూర్యకుటుంబమందలి యితర గ్రహములు స్వీయచరిత్ర మనకు వెల్లడింపలేక పోవచ్చును. ఒకవేళ, మహోన్నత సౌధోపరిభాగమునుండి వీక్షింపగలుగు యాతాయాత జనమ్ములట్లు పరలోకవాసులను చూడగలిగినను లాభమేమి? వారితో సంభాషించు టెట్లు? మనపై యంత్రములు లక్షించి భూలోకచిత్రములు విస్పష్టముగ నాలోకించు పరలోకజీవు లనంతకాశమున నెందరుండినను, సందేశమంపుటకు యుక్తమగు వార్తాహరులు లేక నిర్విణ్ణులై యుండవలసినదే కదా?

కేవల మానవమాత్రులమగు మనకు స్వానుభవజన్య జ్ఞానము వినా వేరుమార్గోపదేశకము లేదు. (?) భూలోక

మన మానవునికే చెందిన ధీ విశేషము లితరలోకము లందు నిర్జీవశక్తుల నాశ్రయించి యుండవచ్చును. మానవశరీరమందు జీవద్రవము (protoplasm) లో జీవకణము (living age) లు తేలుచున్నట్లు విశ్వజగజ్జీవద్రవము (universal protoplasm) లో బుద్ధికణము మానవుడు నడయాడుచున్నాడు. నక్షత్రగ్రహావేశమున వివిధ జగచ్ఛక్తులు వాని నశ్రాంతము మర్దించుచున్నవి. ఆ శక్తులకు విరామములేదు. అవియే మానవాకాంక్షిత సందేశములు. జగత్సామ్రాజ్యాధినాథుల కనువగు పవిత్ర దైవభావలోనున్న ఆయపూర్వ సందేశము లుత్తమోత్తమములై, చతురములై బలవత్తరములైనను నేటివరకు వాటి యాదేశములు మనకు దురూహము.

అనవరతము మనకేగుదెంచుచుట్టి సందేశములలో ప్రధానమైనది గురుత్వాకర్షణము (Gravitation) చలనమే జీవము; చలనముయొక్క బాహ్యప్రకాశనమే గురుత్వాకర్షణము. పదార్థములకు గల గురుత్వాకర్షణశక్తిని (Gravitational force) నిరూపించుటకు కాయాపదార్థముల ద్రవ్యరాశి (mass) వాటి నడుమనున్న దూరము గమనింతుము. నిరంతరము పరిభ్రమించు విశ్వములో మన యజ్ఞానముచే గురుత్వాకర్షణము యొక్క నిజరూపము గ్రహింపలేక దానిని దీర్ఘపరిమాణ సన్నిభముగ భావించుచుండవచ్చును. ఈ శక్తిచే వస్తువులొకదాని చెంతకొకటి యాకర్షింపబడుచున్నచో వీణామండలములో శోభాయమానముగ ప్రకాశించు బ్రహ్మ (Vega in lyra) వైపు సెకెండునకు ౧౨ మైళ్లవేగము మన సూర్యమండలమును, మకరము (Capricorn) వైపు సెకెండునకు ౨౫౦ మైళ్ల వేగమున మన మండలమునకు జగత్తను దుగ్ధపథము (Milky way) ను లక్షలకొలది వత్సరములనుండి పరుగిడుచుండ కడచిన యనంతకాలములో నవి గమ్యస్థానముల చేరకుండుటేకాక, ఆయా గమ్యస్థానముల పొలిమేరకైన రాకుండుటకేమి కారణము? గమ్యస్థానములుగూడ వాటితో సమానముగ గమించుచుండవలయు గదా! కావున, ఈ శక్తిచే గ్రహకూటములు, దుగ్ధపథము, వీణామండలము, మకరమాది(?)నక్షత్ర సులన్నియుశూన్యాకాశధ్వాంతములలో నిమజ్జనముగుటకు(?)మారుగ మాయామేయయక్షాగ్రము (?) (axis) పై నిరంతరము భ్రమించు ప్రాంతరహిత చక్రమువోలె సర్వదా కాలమహార్ణవమున ఘూర్ణిల్లుచున్నవి.

స్థావరాకాశమున విశ్వమందలి ప్రపంచములు ప్రయాణమొనర్చుచున్నట్లు, నిశ్చలానంత్య (Eternity)గర్భమున నిరాకారమునుండి సాకారములు సృజించి, పెంపొందించి, లయమొనర్చు సర్వవ్యాపికాలము (Time) పారుచున్నది; చలనమును శాసించుచు, ప్రకృతియందలి శక్తులన్నిటితో మేళవించుచున్నది. రహస్య గాంభీర్యములం దెచ్చటనో జనించి సర్వనాశనమగువరకు లయమొందనిది కాలము. చలనము మాయమగునప్పుడే కాలము రూపుమాయును. కాని, విశ్వములో చలన మెన్నడైన నశింపగలదా? ప్రపంచములన్నియు చరించుచున్నవి; అందలి పదార్థములు స్థూలదృష్టికి స్థావరములగనున్నను వానిలో సణువులు (Molecules), అణువులలోని పరమాణువుల (atoms) నిత్యగమనమొందుచున్నది. పరమాణువులలో విద్యుత్పరమాణువులు (Electrons) మహావేగమున భ్రమించుచున్నవి. ఇక విశ్వములో నిశ్చలత్వ మెట్లు కలుగును? లేనిచో కాల మెట్లు నశించును?

విశ్వమంతయు కుక్షియందిడుకొనిన కాలము కన్న దుర్జ్ఞేయమగునది దివ్యవాయువు(Aether). నానా ప్రపంచములనుండి వెలువడు ప్రకంపములు, సందేశములు విశ్వమెల్లెడ వ్యాపింపచేయుచున్న దివ్యవాయువు లేదన్నచో, గొడ్డుపోయిన దిగంతరాళముల ననంత శక్తులను దిశలెల్లెడ పర్విడచేయు కర్తలుగ భావింపవలయును. అది యసంభవము. దివ్య వాయువందలి ప్రకంపములే తేజస్సు (Light), వెలుతురు. తేజస్సనేమియో నిర్వచింపలేక పోయినను తేజస్సును కనులార చూడగలము. తేజస్సు లేకపోయినచో సంధకారమయమై యేమియు గోచరించదు. పదార్థములు ధరించు భాసుర శరీరమే తేజస్సు; తేజస్సు వినా లోకములే లేక పోవచ్చును. అనంత విశ్వమున మనమే కాపురము కామనియు, విశిష్ట సందేశ పూరితములైన మహోజ్జ్వల కిరణ పరంపరల నశ్రాంతము ప్రసరించు నక్షత్రములు లక్షలకొలది గలవనియు ప్రకటించునదే

తేజస్సు. ఆ సందేశములు మనకడ కేగుదెంచుటకు లక్షలకొలది వత్సరములు పట్టినను, అల్పజ్ఞులమగు మనము వాటి యాదేశము గ్రహింపలేకున్నను మననేత్రములు విచ్చి, దృష్టి ప్రసాదించి, విశ్వవైభవము తిలకింపజేయునదే తేజస్సు. నిత్యము దాని నాశ్రయించి వెన్నాడుచున్నది యుష్ణము, వేడి (Hot) వెలుతురంత త్వరితముగ పోలేకున్నను, దానితో వేడిమి సర్వదా పరుగిడుచుండును. జీవాభ్యుదయమునకు తేజోష్ణములు రెండును ప్రధానములే.

దివ్యవాయువు తప్పమిగిలిన శక్తులింద్రియ గోచరములు. దృశ్యాదృశ్యములగ పరలోకముల సంయోగము కలుగజేయునవి గురుత్వాకర్షణము, తేజస్సు, ఉష్ణము, కాలము కన్న వేరుశక్తులు లేవనుకొంటిమి. పరలోకసంపర్కదోషము లేకుండ విశ్వాభ్యంతరముల నొకచో నొంటరిగ నున్న భూమిపై నిరాటంకముగ సుఖజీవన మొనర్చుచున్నా మనుకొంటిమి. ఇప్పుడది మిథ్యయని తెల్లమైనది. దుగ్ధపథాంతరాళముల నుండి బహిర్గమించి నిర్దాక్షిణ్యముగ భూమి నక్రాంతమొక్క విధమున మర్దించు కాస్మిక్ కిరణము పరంపర (Cosmicrays) వీనడుమ యంత్రగోచరమైనవి. అనంతాకాశము యొక్క గర్భకుహరముల జనించి దిగంతములు ప్రసరించి, పదార్థములలోనికి జొరబడి, చొచ్చుకొనిపోవు యీకిరణములెట్టి సాహసకృత్యముల కొడబడియున్నవో యెవ్వరెరుగుదురు? 40 విధములగు భాసురశక్తులు యంత్రగోచరమైనవని బూడిన్ (Bocdin) పండితుని యుద్దేశము. అగోచరమైన వెన్నికలవో యెరుగము.

ఈ యదృశ్య కిరణశక్తుల ప్రయోజన మొకింత విచారించెదము. శాస్త్రవేత్తయగు జార్జి లెఖోస్కి (George Lakhosky) మనోహరమగు విషయము గమనించెను. మహావ్రణ పీడితములగు వృక్షభాగములను రాగి తీగచే నావరించి రెండు వారములుంచుసరికి వ్రణములు తెగినేల వ్రాలుటయు, వృక్షమున నూతన జవసత్వము లావిర్భవించెను. రాత్రింబవల్లు వర్షించుచున్న తేజః కిరణములందలి "గామా" కిరణములకన్న (X-rays) భేదకసామర్థ్యముగల కిరణముల నీతీగ బంధించి వ్యాధిగ్రస్త జీవకణముల కొసగిచే నారోగ్య మొనగూర్చినది. ఇట్లు, జీవులను సంక్షోభించు భయానకరోగోత్పాతములను నిర్మూలించి మానవకల్యాణమాచంద్రార్కము ప్రతిష్ఠించుటకై కాస్మిక్ కిరణముల నుపయోగించు విధాన మెన్నడు కనుగొందుమేమో? రేడియము (Radium) నుండి నిర్గమించు తేజఃప్రసారమును భిషగ్వరు లౌషధముగ నుపయోగించుచున్నారు ఉదయభానుని యరుణకిరణప్రసార మారోగ్యప్రదమని స్మరించియే ప్రాచీనులు సూర్యనమస్కారములకు దినచర్యయందగ్రస్థాన మొసంగిరి.

గురుత్వాకర్షణము, దివ్యవాయువు, తేజస్సు మొదలగువాటి ప్రాబల్యములు, సందేశములు భౌతిక (Material) మైనచో విశ్వము భౌతికమా ఆధ్యాత్మికమా (Spiritual) యని ప్రశ్న. ద్రవ్యము శక్తియగునా? శక్తి ద్రవ్యమగునా? శక్తిసముచ్చయ మొకచోగూడి ద్రవ్యముగ పరిణమించుచున్నది; ద్రవ్యమునుండి శక్తి ప్రసరించినప్పుడు ద్రవ్యము తఱుగుచున్నది. విశ్వమందలి ద్రవ్యగోళము లన్నిటి నొక్కటిగ జేసి, యా బృహద్ద్రవ్య గోళమును ప్రకంపిత దివ్యవాయువులో విడిచిన సమస్త భూద్రవ్యములో నిసుక రేణువువోలె యనంతాకాశమున నా ద్రవ్యగోళము క్షుద్రముగ దోచును. తత్వతః విశ్వము భూతాత్మకమైనచో తన్మూలాధారమగు ద్రవ్య మాకాశములో తృణప్రాయముకన్న హీనమగుట మహదాశ్చర్యకరము

అంత సూక్ష్మమై, ఘనద్రవ, వాయుపదార్థముల కన్నిటి కాధార భూతమగు విద్యుత్పరమాణువు విమర్శించునపుడిట్టి విషమావస్థయే కలుగును. దాని పరిమాణమును, చలన వేగమును తెల్పుట కమెరికా శాస్త్రవేత్తయగు డా॥ మిల్లికా (Dr. Millikan) నిట్లు వర్ణించియున్నాడు. "౧౬ క్రొవ్వొత్తుల వెలుతురు. (౧౬ Candle power) గల విద్యుద్దీప మందలి మహోజ్జ్వలతంత్రినుండి యొక సెకండులో నిర్గమించు విద్యుత్పరమాణువులను చికాగోలో నున్న ౨,౫౦౦,౦౦౦ మందియు నిద్రాహారములు మాని, మృత్యుదేవత సెలవుగైకొని సెకండున కొక్కొక్కడు ౨ రేణువుల వంతున లెక్కించిన యెడల ౨౦,౦౦౦

సంవత్సరములలో లెక్క పూర్తియగును"* అణుకు గులు దళసరిగల సీసము నది సులభముగ భేదించుకొని పోవు సామర్థ్యము; ఎట్టి సూక్ష్మదర్శని (Microscope) కైన గోచరింపని మహాసూక్ష్మాతిసూక్ష్మ పరిమాణము; అక్షయశక్తియు, విద్యుదావేశమేగాని దేహములేని రూపము; విశ్వమెల్లెడ వ్యాపించి, సర్వాంతర్యామియై విశ్వగమనమును నిర్వహించి బాధ్యత; లక్షలకొలది యంశముల (Degrees) ఉష్ణోగ్రత (Temperature) ప్రతిఘటించు దార్ఢ్యము; ఈ గుణములుగల విద్యుత్పరమాణువు భూతాత్మకమా? ఈ మహోజ్జ్వల, అప్రతిహత, శాశ్వతశక్తి; ఈ దేహరహిత పదార్థము; ఈ నిరంతరగమన మాధ్యాత్మికము కాకపోయినచో నాధ్యాత్మికశక్తియేది? ఎందున్నది? దానినెట్లు నిర్వచింపగలము?

ఆకాశమున నిరంతరయానమొనర్చుచున్న భూమి నూతన ప్రపంచములను సర్వదా సమీపించుచున్నది; వివిధ విద్యుదయస్కాంతక్షేత్ర (Electro-Magnetic) ప్రదేశములలో చరించుచున్నది; పలు విధముల యుష్ణోగ్రతగల నక్షత్రములను హెచ్చరించుచున్నది; విద్యుత్పరమాణుపూరితములైన దివ్యవాయు మండలములలో భ్రమించుచున్నది అట్టిభూమి, మృతగ్రహమగు చంద్రుని క్షీణప్రాబల్యములకే చలించుచున్నపుడు సర్వదిశల నవరించు జగచ్ఛక్తుల ప్రాభవమున కధీనము కాకుండుటెట్లు?

ఐనచో, ప్రపంచ చరిత్రమందలి విచిత్రఘట్టములకు కొంతకారణ మిందు కనుగోనగును. ఒక్కొక్క యుగమునం దద్భుత భావావేశములు వాటిల్లుటకు; ఒక్కొక్క ప్రత్యేకసంతతివా రాకస్మికముగ జ్ఞానవాహిని నుల్లంఘించుటకు; భావవిప్లవ మొకచో జనించి వాయువేగమున దేశదేశములు వ్యాపించుటకు; జడార్త్తులైన జీవులకు నవీనసిద్ధాంతము లుపన్యసించి, నూతనశక్తి ప్రసాదించి, జిజ్ఞాసకలిగించి వారి నమానుష కార్య నిర్వాహకులుగ జేయు మహాపురుషు లుద్భవించుటకు కారణ మీనక్షత్ర ప్రాబల్యమే కాకూడదా? నేడీ వాదమంత సమంజసముగ చూపట్టకున్ననిది సత్యాంతర ప్రయుక్తమని భావి నొకప్పుడు విశదము కాకపోదు.

భూగర్భమునుండి జనించి, భూసారమొసంగు పదార్థములనే భుజించి, జీవితాంతమున భూమిలో లీనమైపోవు మనము మన చరిత్రకు రించియే నతి స్వల్పమెరింగినప్పుడు, జగత్తత్వ మూహింపలేకపోవుట కాశ్చర్యమేమి గలదు? తన ప్రేమహస్తములలో లాలించు భూదేవికి మనపై నెట్టి యనురాగము కలదో యేరికెరుక? నిగూఢముగ నూతనవ్యక్తులను సృజించి వారి కల్యాణమునకై మనలను త్యజింపనున్న దేమో? మన చిత్తవృత్తియు, మనోవికారము లామె ప్రసాదించిన ఋణలేశము; మన హృదయమం దామె పుత్రవాత్సల్యముచే రసులొల్కు పు జ్ఞానోపచయముచే నామె సచ్చరిత్రయు, తన్మూలమున జగత్తత్వమును ముందెన్నడైన గ్రహించు కాశింపవచ్చును.

మన శరీరమందలి యసంఖ్యాక జీవకణములే మన ప్రసక్తిలేక, మన సంకల్పములేక, యథేచ్ఛా క్రియాలోలత్వ మెందుచున్నవి. వాటి కార్యక్రమము మన మెరుగము. ఇక, బాహ్యప్రపంచ వర్తనము గూర్చి యజ్ఞానులమగుట కాశ్చర్యమొంద పనిలేదు. మన యజ్ఞానతిమిరము విచ్ఛేదముకాకుండుటనో, భూదేవి బాల్యావస్థయందుండుటచేతనో గాని మన కామెచరిత్రము కొంచెమే తెలిసినదని మన యుద్దేశము; మున్ముందు పూర్తిగ గ్రహింపగలమని విశ్వాసము. అనంతకాలమునుండి విశ్వము మనుచున్నను మన జ్ఞాన మింత స్వల్పమాయని యధీరులము గా నగత్యములేదు. విశ్వమున కాద్యంతములు లేవు; నూతనానుభవములు లేవు. అన్నిలోకములవోలె మన లోకమును విశ్వార్థమున యానమొనర్చుచున్నది: అదెట్టి నియమానుసరణమగుచున్నదో ఎట్టి యాశయబద్ధమైనదో గ్రహించుటకొనర్చు దృఢప్రయత్నము లెన్నటికైన సఫలీకృతము కాకపోవునా యను ధైర్యమే తదీయసాధనోపాయము.

---

* R. A. Millikan: The Electron.

# నల్లశానపు రాళ్లల్లో

కవికొండల వెంకటరావు



"తల్లికీ తండ్రికీ లేనటువంటి ప్రేమ నా మీద ప్రకృతికి మాత్రం ఏలా వుంటుంది? నేనీ నల్లశానపు రాళ్లు నానెత్తిని పెట్టుకు మోయలేను నాతల్లీ! నాతండ్రీ! అవి అంటే నీకూక్కాడెట్టాం పొమ్మన్నారు. కూడెట్టాం పొమ్మన్నారే గాని రోజూ మళ్లీ ఆళ్లకూటి లోకి చింతచిగురు కోసి అమిర్చిపెట్టేదాన్ని నేనే. ఈ వేళమట్టు కావేళకు కుసింతకూర కోసుకు పట్టుకెడితే నాకింత గంజోయ్యరూ? ముసిలి తొత్తుకొడుకూ ముసిలితొత్తు కూతురూను? పొయ్యకపోతే మీ కూక్కారేలేదని ఆపచ్చిదే వాళ్లెదూరుగుండా నెమరేస్తూ కూచుంటాను. అయినా వాళ్ల ననవలసిన పనేమున్నది - వాళ్లకడుపున పుట్టినందుకు నన్ను నేనే నిందించుకోవలసిన పనిగాని - ఈ నిర్భాగ్యపు నల్లశానపు రాళ్లల్లో ఇలా కూటికీ గుడ్డకూ మొగంవాచి, ఎండనక కొండనక తిరుగుతూ - రాళ్లు మలిచి, రప్పలు దొలిచి, ఎవడు మిణకమన్నాడు నన్ను? చెట్టు మొలిచి ఆకాశాన్ని కాస్తూవుందే! తీగెబలిసి చుక్కల్లో పూస్తూవుందే! మనిషినైపుట్టి నేనిల్లా అధశ్శ్రేణి నణగిపొండడమనేది నాదే తప్పు, నాదే తప్పు! [illegible]



సివంగి అనే పేరుగల నిరుపేద జవరాలు ఒకానొక చింతక్రింద నల్లశానపు రాళ్లు త్రవ్విన పురాతనపు గని మెరకములో కూర్చుని ఆలోచిస్తూవుంది.

కూర్చుని పైకిచూచింది. నాడామెకు నీడొసగుతూవున్న చింతచెట్టు మిక్కిలి మెత్తుగా పెరిగివుంది. వ్రాలు కొమ్మలకోసం మునివ్రేళ్లమీద నించుని ఆమె తన చెయ్యి పైకి సాచినా అందీ చెట్టులా కనిపించలేదది. పిల్లకానైతే పొడుగైందే. పిల్లకానైతే చుఱుకైందే. ఒక్క మెగురు ఎగిరి ఒక్క బరికె చివరందుకుందా అంటే గుప్పెడు చిగురు దూసేసిందన్నమాటే. అయితేం, ఆనాడామెకు స్వతస్సిద్ధంగా వుంటూ వచ్చే యుత్సాహం లోపలలేదు. లోపల ఉత్సాహం లేనప్పుడు, పొట్టకూటిగ్గాను చేసేపని లోనైనా విజృంభించడానికి ఏ వ్యక్తికీ హుషారు వుండదు.

ఆమె మళ్లీ చెట్టుక్రిందనే వోరాతి మీద—రాయి వెచ్చగా తన తొడలకు తగుల్తూవున్నా—అప్పుడప్పుడే పైరుగాలి తిరిగిన వాతావరణం ముఖమండలాన్ని చల్లగా సోకి ఒకవిధమైన ఆశాంధకారం

హృదయక్షేత్ర మ దిలకెత్తించగా—లోలో పల్నే కులుక్కుంటూ కూర్చుంది. దూరాన్నే

పండిన చెట్ల పండ్లను తింటూ
ఎండిన చెట్ల కట్టెలుకొడుతూ
గండుకోయిలల కూతలువింటూ
నిండువేడ్క నొకండు గనంబడె.

గొడ్డలుచ్చుకు తిరుగుతూ వున్న వాడా కోయిలపాటలు వింటూ అనే సందేహం ఆమెడెందంలో అపూర్వంగా మొలిచినట్ట యింది. లేచినిలుచుంది. పిల్ల ఆలా లేచినిలు చునే ఇంతపాటి సావకాశంలో ఫుల్లలు కొట్టు కునే ఆ యువకుడు పిల్లవున్న చింత చెట్టుకేసి



"దూరాన్నే నిండువేడ్క నొకండు గనంబడె"

చూచింది జవరాలు. ఆపిల్ల కాచూపులో అతగాడు బహూబలిష్ఠంగాను, బహూ అంద మైన వాడుగాను, బహూ మిసిమంతుడుగాను, బహూ! బహూ! అన్ని విధాలా ఈడూ జోడూ అయినవాడుగా దోచాడు. "అయితే ఎవడో అతడు?" అనే సంశయం మనస్సులో తట్టింది. నిజంగా ఫుల్లలు కొట్టు కునే పుట్టుదరిద్రుడా, లేకపోతే ... ...

బ్రహ్మాండంగా నడవసాగినాడు. వానిచేతిలో గండ్రగొడ్డలివుంది. వాని మూతి మీద నూనూగు మీసాల్లో చిరుచెమ్మట హావణిల్లి వేర్పాటుగా ముత్యాల చల్లులా నిలిచివుంది ఎండకాంతినే.

చాన వానిని పునః తిలకించి, కించిత్ ఓరమోముగా చెట్టుచాటుకు వెళ్లింది. కోడె ... ... గొంతుతో "ఏం! పిల్లా!

నన్ను చూచి ఆలా చెట్టుచాటుకు పోతావు? నీవీ ప్రాంతంలో రాళ్లుకొట్టుకు బతికే దివ్వెల వారి సివంగివి కావూ ?" అన్నాడు. సివంగి ఆశ్చర్యపోయింది, తన పేరతగాని కెలాగు ఎఱుకపడిందా అని. కొంచెం చనువైనట్టు చెట్టువిడిచి యిసుకుంటూ వచ్చింది వీనికేసి.

"చింతచిగురు కోసమా?" అన్నాడు కుఱ్ఱవాడు. "ఊఁ — మా అమ్మా మా నాన్నా తెమ్మన్నారు. నా కందటంలేదు." అంది పదుచు. నిజంగా పదుచు అబద్ధమే చెప్పింది. ఆ అమ్మిని వాళ్ల అమ్మా నాన్నా తెమ్మన్నారా మఱి చింతచిగురు ? లేదు, తెమ్మనలేదు. నిజంగా ఆఅమ్మిని వాళ్ల అమ్మా నాన్నా తగిలేశారు, సరిగా పని చెయ్యకపోతే, రాళ్లు మొయ్యకపోతే, పొమ్మన్నారు. నిలువ నీడలేకుండా చేసి పారేశారు. అయినా ప్రతివాళ్లకూ పామరుల నుంచి పైవాళ్లదాకా మానంకాపాడుకోవాలనే విచింతనం వొకటి వుంటుంది కాబట్టి, దాన్నిబట్టి ఏదోసాకు ఎదరవాళ్లతో చెప్ప వలసి వస్తుంది తానొక్కర్తే కాదు, తనను కన్నటువంటి తల్లీ తండ్రీ వున్నారు తన్ను రెండు కళ్లా చూస్తూ యీ జగత్తులో—అనే తనయొక్క గొప్పతనం వాని యెందు ప్రకటించాలనే అనుకుందాం, ఆ అమ్మి ఆలా ఆ జవ్వనుడితో జవాబు చెప్పింది.

కాని జవ్వను డదేం అంత జరుగురైన సమాచారంగా తాను తీసుకోలేదు. "చెట్టెక్కి కోసిపెట్నా?" అన్నాడు యాదాలాపంగా. "కొయ్యగలిగితే కోసిపెట్టు కుసింత" అంది పిల్ల. పిల్లఅన్నదే కాని మఱుఊహలో "ఏమో చెట్టెక్కమన్నాను! చెట్టుమీదనుంచి పడితే?" అనే విషాదాంతస్ఫురణ సూది కుట్టులా గతుక్కున తగిలింది ఆమె జాలి గుండెకు. "పోనీలే! ఎందుకులే! ఈ యేలకు లేకపోతేంలే ముండాకూ౹? నీవు సెట్టెక్కొద్దులే!" అంది, అతగాడు గొడ్డలి నేల జారవిడుస్తూ చెట్టెక్కడానికి శం చెగ్గట్టుకుంటూ వుంటే.

"ఏం, మళ్లీ అలా నివారిస్తున్నావు ?" అన్నాడు వెనుముఖంగా అతడు తిరిగి ఆమె కేసి చూస్తూ. "ఏమీలేదు, చెట్టెత్తుగావుంది, కింద రాళ్లున్నాయి." అంది. "పడిపోతాననే భయం నీకు ? నేను పడిపోతాననే? ఎన్ని చెట్లెక్కి యీ సరికి ఎన్నికొమ్మల్ని చెలిపివిడిచి పెట్టానో నేను ? కుసింతసిగురు కోసేఇంతలో పడిసస్తానా ?" అన్నాడు అతి ధైర్యంగా. "అయితే నిజంగా నీవు పుట్టుచేటు పుల్లలు గొట్టేవాడివేనా ?" అంది పిల్ల. "ఏం? నీ కలాంటి అపోహ ఎందుకు గలిగింది ?" అన్నాడు కుఱ్ఱవాడు. పిల్ల అంటూవుంది "ఏమీలేదు. మా పాటకపుజాతిలో అంత నేవళీకంగా, అంత కలకలలాడుతూ కనబడే వాళ్లు అరుదు." అంది. యువకుడు ముగ్ధుడై పోయినాడు ; ఆమెయొక్క తత్వజ్ఞత్వానికి నివ్వెరపడిపోయినాడు. ఆలా చూచాడు మూడోతడవ ఆమెకేసి.

దివ్వెలవారి సివంగియొక్క కనుపాపలు వాని కళ్లల్లోంచి ఛాయాపటం దీసికొన్నట్టు

అయిపోయింది. "దారిద్ర్యము! దారిద్ర్యము! సుఖంగా జీవనం గడపడానికి ఈ పిల్లకే వో పిల్ల జమీందారీ వుండివుంటే——" అని ఆలా ఏదో సామ్యవాద సమస్యలో పడ్డట్టు పడ్డాడు బొట్టెడు. లక్షోపలక్షుల కధికారిమైన తన తండ్రియొక్క భాగ్యభోగ్యము, తన హార్మ్యము, తన యింటిలో ఇనప్పెట్టెలో పడి మూల్గుతూవున్న పెద్దకాసులూ, తనఅసలు ఖోకులూ, అన్నింటినీ వెంటనే తలపునకు దెచ్చుకున్నాడు. వెంటనే తనకే కనుక శక్తి వున్నట్టాయినా ఆమెను ఇంద్రజాలవిద్యచేతన బంగరుతూగుటుయ్యాల్లో కూర్చోపెట్టుకుని తన నట్టింట ఆమెతో వూగేసెయ్యాలని రాగిల్లిపోయినాడు.



బంగరుతూగుటుయ్యాల్లో కూర్చోపెట్టుకొని తననట్టింట ఆమెతో వూగేసెయ్యాలని రాగిల్లిపోయినాడు.

ఎంతసేపు ఆ ఉద్ధృతం? ఓనిమిషం. నిమిషమైన తరువాత అతడు మళ్లీ తనచుట్టూ వున్న సర్వసామాన్యపు ప్రపంచపు మనిషి అయిపోయినాడు. అయిపోయి ఇలా అనసాగాడు తనకట్టెదుటనున్న కుఱ్ఱదానితో: "అమ్మాయీ! చూడు! నేను నిజంగా పుల్లలు కొట్టేవాణ్ణి అవితే నీకెందుకు? కాకపోతే నీకెందుకు? నీకల్లా కావలసింది కుసింత సింత సిగురన్నావు! అది కోసిస్తాను. చాలుగా యీనాటి మనమైత్రి కదిం." అన్నాడు. ఆమె మఱి వానితో వాదించి ప్రయోజనం లేదనుకుంది. అతణ్ణి చెట్టెక్కికోయమని తాను క్రింద చెంగట్టి చెంగులో పడేయమంటూ "ఎవగా యీ యువకుడు"అని తా నంతక్రితం అప్పటప్పట వింటూ వచ్చిన యొకానొక వదంతి తలపోసికోదొడగింది.

ఆవదంతి యేమిటంటే:——రఘురామయ్య అనే వొకానొక పెద్ద భాగ్యవంతుడున్నాడు. అతడు డబ్బు నిలవచేయడంలో మొదటి మానవుడు. అంతా దాచడంపనే. అందఱిమల్లే ఇనప్పెట్టెల్లో పెట్టి దాచింది గాక, ఇంట్లో కొంతధనం గూళ్లల్లోను, కొంతధనం గోడలనడుమ, కొంతధనం నూతిలోను, కొంతధనం మంచంకోళ్ల క్రింద కప్పెట్టి ఎవరికీ కనబడకుండా నిలవచేసి యున్నాడని న్నీ, అది సరిపోక, వెండిఖడ్డీలు, బంగారునాణాలు లెక్కలేనన్ని

దేశమ్మీద అక్కడక్కడ అడివిల్లోను, రాళ్లకింద, పొదల్లోను, నదుల్లోను, మరుగు చేసి, ఆనవాలుగా తాను గుర్తుంచుకొని ఎప్పటికప్పుడు ఒక్కదమ్మిడీ బీగోకుండా లెక్కచూచుకుంటూ వుంటాడనీ వదంతి. ఆరఘురామయ్య పాదమ్మెట్టినచోటల్లా ఒఖపా తుంది అనే బహుజనాభిప్రాయం. ఆరఘురామయ్యకు పలుకుబడిన్నీ అపారమే. డబ్బునుపట్టే అనుకోండి. కో అంటే కోటి ముందు గుమిగూడి 'ఏం సెలవు' అని చేతులొగ్గి నిలబడిపోతారు. కాని రఘురామయ్యకు వాళ్లెవళ్లన్నా కించిత్తూ నమ్మకం లేదు. అసలు అందాకా ఎందుకు? అతడికి తనకొడుకంటేనే పరమానసహ్యం. కొడుక్కే చెప్పడం వుండేదికాదు, తానెక్కడ డబ్బుదాచీది, తానెలా సంపాదించీది, తానెంతెంత వెచ్చించీది. ఇదీ అతని ప్రకృతి. అలా అని కొడుకుతో మళ్లీ ఏమీ మాట్లాడీవాడు కాడను కోవడానికి వీల్లేదు.

"నాయనా! చూడు, నీవు ఇల్లువిడిచిపెట్టి ఎక్కడికైనా వెళ్లడమంటూ వస్తే మాత్రం మామోలు పాటకపుజనుల్లాగు పోయి తిరుగుతూ వుండవలసిందే గాని లోకంలో భాగ్యవంతుని కొడుకులా తిరిగేవు గనుక. నాకొడుకువని తెలిస్తే లోకం నిన్ను హతమారుస్తారు. నీవన్నా నేనన్నా లోకానికి ప్రేమగాని, దయగాని, భయంగాని, నిజంగా ఎంతమాత్రమున్నూ ఉండనేరవు. ఎంతసేపూ మనడబ్బు మననుండి ఎలా కాజేయడమా అనేదే లోకసంగ్రహమహాసంకల్పం. దానికి తోడు నీవు చచ్చిపోయినావా అంటే ఇంకీసొత్తుఅంతా కాకులపాలు అయిపోతుంది." అని వొక్కమాటున్ను, మఱొక్కమాటు "చూడు, ఆతాడిచెట్టు గుర్తుంచుకో, ఆకొండగుహ ఆనవాలెట్టుకో, అనల్లశానపురాళ్లల్లోని ఎత్తయిన చింతచెట్టు మనస్సున నాటించుకో" అని ఇలా ఏవో ఏవో అర్థోక్తులున్ను చెప్పడం కద్దు.

తండ్రిచెప్పే మాటల్నిబట్టి కొడుకు అప్పుడప్పుడు ఆనవాళ్లు చూచుకుంటూ వుండడాని కైనాగానీ మాఱువేషంతో, ఒక్కొక్కప్పుడు కట్టెపుల్లలు కొట్టుకునేవాడిలాగ, ఒక్కొక్కప్పుడు రాళ్లుమల్చేవాడిలాగ, ఒక్కొక్కప్పుడు బండితోలేవాడిలాగ, వేషభాషలమర్చుకొని ప్రచ్ఛన్నంగా తిరిగేవాడని విపరీతప్రతీతి.

దానాదీనా దివ్వెలవారి ఆడపడుచుయొక్క దివ్యదృష్టికి నాడు చింతచెట్టెక్కి తనకోసంగాను చింతచిగురు కోస్తూవున్న సుకుమారుడు రఘురామయ్యగారి కుమారుడేమో నని నడుమనడుమ తట్టుతూ వచ్చింది. కాని మళ్లీ అనుకొనేది, రెండు మూడు చిగుళ్లు తనవొళ్లోకి పైనుంచి అతగాడు రాలుస్తూవుంటే "నిజంగా రఘురామయ్యగారి కుమారుడే అయితే ఇలా నిజంగా చెట్టెక్కి యీ దిక్కుమాలిన పక్షికోసం ఇలా చింతచిగురు కోసిపెడతాడా? అసలు చెట్టెక్కనే ఎక్కడు. అంతగా తనకు సాయం చేయాలని వుంటే ఓడబ్బో, ఓఏగాణిపో చేతిలోపెట్టి కొనుక్కోమంటాడుగాని" అని

మళ్లీ అనుకునీది. ఒకపర్యాయం చటుక్కున పైనుంచి గుప్పెడు చిగురు పడేశాడు కుఱ్ఱవాడు. పిల్ల "చాల్లే! బావా!" అంది. అన్నాగాని మానక యావన విలాసంకొద్దీ ఓ చిగుర్రొబ్బట్టుకున్నాడు పైడి;క్రమంగా క్రింద తాను నించున్న కొమ్మ వదిలేశాడు. పై రొబ్బ పాపంజారి,గుప్పెట్లో చిగురూ నెత్తురూ రెండూ ఒక్కటై, అంతరాళాన్ని "బాబో" అంటూ ఆవిసురు తాగలేక వెంటనే నేల మీదకు—కఠినశిలలు తవ్వగా కత్తుల్లా మిగిలి వున్న అంగుళం అరఅంగుళం కంకరముక్కల మధ్య ఒంటిగా నిలిచివున్న ఒకానొక గుండ్రాతి మీదకు - తలక్రిందుగా పడ్డాడు. తలకు మోసంగలిగింది.

"హారా! ఎంతపని జరిగింది!" అని గోతి అంచుకు వెళ్లి పిల్లతొంగిచూచి "నేనెక్కే వద్దన్నాను అసలు." అని— ఏం చేస్తుంది!—కంట నీరెట్టుకుంటూ—పైకి తియ్యడానికి—చేయి అందిచ్చింది. కుఱ్ఱవాడు హానిలాభం లేదన్నట్టు తనను అక్కడే తత్క్షణం ఆ చింతచెట్టు మొదటనున్న పెద్ద రాతితో కప్పెట్టి పిల్లను వెళ్లిపొమ్మన్నట్టా సంజ్ఞచేశాడు. సివంగికి లోలోపల దడ పట్టుకుంది. చుట్టూ పరకాయించింది. ఎవళ్లూ లేరు. "ఆరాయి నేనొక్కర్తెనూ పైకెత్తగలనా? ఎత్తినప్పటికిన్నీ ఆ ఆ నా అనువుగాని మీద పడెయ్యగలనా? వానిమీద నేను తులసి మొక్క మొలిపించడమా?" అని గజగజా వణికిపోయింది. గోతిలో మనిషి గోతిలోనే వుండి ఆయువకుడు గుటుక్కుమంటూ వున్నట్టయింది. పిల్లకేమిన్నీ తోచలేదు. ప్రపంచేతర ప్రపంచంగా వుంది.



రాయి తనంతనే గోతిలోకి దొర్లి పోతూ వుంది.

యువకుడు సూచించినట్టు చెట్టుమొదటనున్న పెద్దరాయి నలా దొర్లించింది. రాయి తనంతనే గోతిలోకి దొర్లిపోతూవుంది — రాతికింద పెద్దపాతు- అమాంతంగా లక్షువరహాలపాతు - బయలుపడింది. దివ్వెలవారి సిషంగి దొర్లిపోతూవున్న రాయికేసి చూస్తూ రాయి నాపడానికో చేయి చాపుతూ, రెండో చేత్తో మెఱిసిపోయే వరహాలు గుప్పెడెత్తి "ఇవి? ఇవి?" అని కేకేసింది.

రాయి తనమీదకు దొర్లుకు రావడం —

గోతిలో ప్రాణంవదుల్తూవున్న మనిషి కింకా కొద్దోగొప్పో శబ్దస్ఫురణ వుంది కాబోలు— గమనిస్తూ ఆయువకుడు "పిల్లా! ఓ! దివ్వెల వారి ఆడపిల్లా! ఇలా చూడు! రాయి నామీదకు తనంతనే యిక దొర్లుకు వచ్చేస్తుంది. నీవు రాయికోసం చూణ్ణక్కర్లేదు. ఆవరహాలన్నీ మీయింటికి పట్టుకుపోయి సుఖంగా జీవించు. పిల్లా! సుఖంగా జీవించు. నేను నిన్ను గాఢంగా ప్రేమించాను నేను నిన్ను గాఢంగా ప్రేమించాను" అన్నాడు.

"నేను నిన్ను గాఢంగా ప్రేమించాను. నేను నిన్ను గాఢంగా ప్రేమించాను" అనే అఱపు పిల్లకోసంగాక దొర్లుకు వస్తూవున్న రాతికోసమా అన్నట్టు రాయి మఱింత వడి వడిగా దొర్లుకొచ్చి గోతిలోపడి యువకుణ్ణి దిగ్రమింగింది. దివ్వెలవారి సివంగి వెంటనే బొబ్బెత్తి "అయ్యో! అయ్యో! మనిషంత మనిషి చచ్చిపోయిం తరవాత ఆమనిషి. డబ్బెవరిక్కావాలోయ్? నేనాకలిచేత మలమల మాడిపోతే నేమి! రాళ్లుమోస్తూ వలవల కుమిలిపోతేనేమి? మనిషిఅంతమనిషి చచ్చిపోయింతరవాత ఆమనిషిడబ్బెవరిక్కావాలోయ్?" అని వొక్కపెద్ద బొబ్బెత్తి అక్కడే ప్రాణంవిడిచింది.

సిరిగలవాడు కప్పడ్డ గోతిమీదను, నిరుపేదరాలి ఎముకలగూడుమీదను, కొత్తగా బయలుపడ్డ వరహాల నిధిమీదను, ఒక్క మాదిరిగా పై చింతచెట్టు తనఆకు నారాత్రి వీచిన ఝంఝూసాహాయ్యాన్ని రాల్చి ఇమ్మహావిశ్వంలో విధిసేతలు వేఱన్నట్టు మర్నాటి ప్రొద్దుటికి చాటింది.






పూజా పురస్కారములు

# జపాను రాజకీయ కల్లోలము

'రావుజీ'



జపాను రాజకీయరంగం చాలా అల్లకల్లోలంగా వుంది. గడిచిన అయిదారు నెలలలోనూ హిరోటా, ఉగాకీ, హయాషీ ప్రధానమంత్రులు ముగ్గురూ వరసగా రాజీనామా ఇవ్వవలసివచ్చింది. ఈముగ్గురి రాజీనామాల తర్వాత ఈనాటివరకింకా సుస్థిరమైన మంత్రివర్గం ఏదీ ఏర్పాటుకాలేదు దీన్నిబట్టి జపాను రాజకీయాలు ఎంతటి సందిగ్ధస్థితిలో వున్నాయో సులభంగానే ఊహచెయ్యొచ్చు.

ఒకవిధంగా ౧౯౩౧ వరకు జపాను రాజకీయాలలో అంతగా ఒడుదుడుకులు రాలేదనే చెప్పాలి. కాని, ౧౯౩౧ లో జరిగిన మంచూరియా జైత్రయాత్రతో సైనికకక్షవారికీ, రాజకీయపక్షాలకూ మతభేదాలు ఏర్పడ్డాయి. ఈ మతభేదాలు అంతకంతకు తీవ్రరూపాన్ని ధరించి, ఇప్పటి ఈ విపరీతస్థితికి వచ్చాయి.

ప్రస్తుతం జపానుదేశాన్ని కలవరపెడుతూవున్న ఈ రాజకీయ కల్లోలం ఏమిటో సరిగా బోధపడాలంటే ఆదేశాన్ని ఎదుర్కొంటూవున్న ప్రధానసమస్య ఏమిటో ముందుగా తెలుసుకోవాలి. ఈ సమస్య—ఒక్కమాటలో చెప్పాలంటే—ఆకలి! నిజానికి ఆకలిసమస్య అన్నిదేశాలకూ సహజమైనదే! అయితే శక్తిమంతంగా ఎన్నదగిన రాజ్యాలలో మరిదేనిలోనూ ఈ సమస్య జపానులోవున్నంత తీవ్రంగా లేదు.

జపానులో ఈ ఆకలిసమస్య ఇంత తీవ్రంగా వుండడానికి ప్రధానకారణం,-ఆదేశంలోని విపరీతమైన జనసంఖ్య. ౧౮౭౨ లో జపానుజనసంఖ్య ౩ కోట్లు మాత్రమే. ఇప్పుడు ఈసంఖ్య ౭ కోట్ల ౭౦ లక్షలకు పైగా వుంది. అంటే షుమారు ౬౦ సంవత్సరాలలో జపానుజనసంఖ్య రెట్టింపుకు పైగా పెరిగిపోయింది. గత శతాబ్దంలోకంటేకూడా ఈ శతాబ్దంలో జపాను జనసంఖ్యలో అత్యధికంగా అభివృద్ధి చెందుతూ వుంది. ౧౯౨౨ నుంచి ౧౯౩౦ వరకు చూస్తే, మొత్తం ౬౦ లక్షల పెరుగుదల కనబడుతుంది. అంటే, ఈ ఎనిమిది సంవత్సరాలలోనే జపాను జనసంఖ్య మొత్తం ఆస్ట్రియాఖండంలో ఎంతజనసంఖ్య వుందో అంత పెరిగింది! ప్రస్తుతం సంవత్సరానికి సగటున ౭౫ లక్షల చొప్పున జపాను జనసంఖ్య పెరుగుతూవుంది. ఈవృద్ధినే మరోవిధంగా చెప్పాలంటే,—ప్రతి వెయ్యిమందికి సగటున సంవత్సరానికి ౩౮ మంది చొప్పున సంతానాన్ని కంటున్నారు.

ఈ జనసంఖ్య క్రమక్రమంగా ఎంతగా పెరుగుతూవున్నదో తెలుసుకోడానికి క్రింది అంకెలు చక్కగా ఉపయోగిస్తాయి:

| సం. | జననాలలో వృద్ధి (నూటికి) |
|---|---|
| ౧౮౭౦-౧౮౮౦ | ౫ |
| ౧౮౮౦-౧౮౯౦ | ౭.౬ |
| ౧౮౯౦-౧౯౦౦ | ౧౦ |
| ౧౯౦౦-౧౯౧౦ | ౧౨ |
| ౧౯౧౦-౧౯౨౦ | ౧౩ |
| ౧౯౨౦-౧౯౩౦ | ౧౫ |

ప్రతినిమిషానికీ జపానులో ఆరుగురుబిడ్డలు పుడుతున్నారని కాబోలు ఆమధ్య ఒకరు అంచనావేస్తారు! ఇంతగా జనాభా పెరుగుతూ వుండడంవల్ల జపాను దేశానికి తన ప్రజాసముదాయానికి అంతటికీ కావల

సిన భుక్తిని చేకూర్చడం చాలా కష్టమైపోతున్నది. బ్రిటన్‌లానే జపానుకూడా చాలా చిన్న దేశం. అక్కడ సేద్యానికి పనికివచ్చే భూమి చాలా స్వల్పంగావుంది. అసలే స్వల్పంగావున్న ఈ భూమిమీద అంతకంతకు వృద్ధిచెందుతూవున్న ప్రజాకోటి బ్రతకడమంటే, మాటలా? జపానులో సేద్యయోగ్యంగావున్న భూమి మీద ఎంత హెచ్చుమంది జీవించవలసి వస్తున్నదో తెలుసుకోడానికి క్రింది అంకెలు చక్కగా పనికి వస్తాయి:

| దేశం | చదరపుమైలు సేద్యయోగ్యమైన భూమికి వున్న జనం |
|---|---|
| బ్రిటన్ | ౨,౧౧౬ |
| బెల్జియం | ౧,౬౪౩ |
| అమెరికాసంయుక్తరాష్ట్రాలు | ౧౮౬ |
| ఆస్ట్రేలియా | ౧౬౮ |
| జపాను | ౨,౫౪౭ (!) |

ఈవిపరీతపరిస్థితిలో జపానుఆకలిసమస్యాపరిష్కారానికి రెండే మార్గాలున్నాయి. వాటిలో మొదటిమార్గం,—వలస. రెండోది,—పరిశ్రమాభివృద్ధి. అయితే, ఈరెండుమార్గాలలో ఏదీకూడా సులభసాధ్యమైందికాదు.

జపాను దేశస్థులు వలస వెళ్లడానికి అనుకూలమైన దేశాలు అమెరికాసంయుక్త రాష్ట్రాలు, న్యూజిలాండ్, ఆస్ట్రేలియాలని చెప్పవచ్చును. ఈ దేశాలలో జనసమర్దం చాలాతక్కువ. వీటిలో సేద్యయోగ్యమైన భూమి విస్తారంగావుంది. పైగా, ఈ దేశాల శీతోష్ణస్థితి జపానుదేశస్థులకు చాలా అనుకూలంగా వుంటుంది. అయితే, పై మూడు దేశాలవారుకూడా జపానుదేశీయుల వలసను ప్రత్యక్షంగానో, పరోక్షంగానో నిషేధిస్తూ శాసనాలను చేశారు.

ఒకవేళ ఏ నిషేధ శాసనాలు లేకపోయినా, జపానుదేశస్థులు అసలు వలసకు వెడతారా అనేది చాలా సందేహాస్పదమైన విషయం. స్వదేశమంటే జపానువారికి విపరీతమైన ప్రేమ. అంచేత స్వదేశంలో సగం ఆకలితో మాడి చావనైనా చస్తారుగాని, ఒక పట్టాన వారు విదేశాలకు వలస వెళ్లడానికి అంగీకరించరు.

ఇందుకు నిదర్శనం కావాలంటే, మంచూరియాను చూపించవచ్చును. మంచూరియాలో ఇప్పటికి చాలా కాలంనుంచీ కూడా జపానుకు ఇంతో అంతో పలుకుబడీ, రాజ్యాధికారమూవున్నా, ౧౯౩౦ నాటి అంకెల్ని బట్టి చూస్తే, అప్పటికి ఆ దేశంలోవున్న జపానువారి సంఖ్య ౨ లక్షలు మాత్రమే! అయితే, ఆ ౧౯౩౦ నాటికే అక్కడవున్న చైనావారి సంఖ్య ౩ కోట్లు!! ప్రస్తుతం జపానునుంచి సగటున సాలుకు ౨౦,౦౦౦ మంది మాత్రమే వలసవెడుతున్నారు. వీరిలో సగానికి పైగా సౌత్ అమెరికాకు వెడుతున్నారు; మిగతా జనం కొరియా, మంచూరియాలలో సర్దుకుంటూ వున్నారు. అయితే వలస వెడుతూవున్న ఈ ౨౦ వేల మందిలో కూడా ఏటేట సగం మంది మళ్లీ—ఇంటి మీది బెంగతో—తిరిగివచ్చి వేస్తూనే వున్నారు. ఇందుకు నిదర్శనం క్రింది అంకెలే:

| సం. | వలసవెళ్లినవారు | తిరిగివచ్చినవారు |
|---|---|---|
| ౧౯౩౦ | ౨౧,౮౨౯ | ౧౪,౫౪౬ |
| ౧౯౩౧ | ౧౦,౩౮౪ | ౧౨,౯౬౫ |
| ౧౯౩౨ | ౧౯,౦౩౩ | ౧౩,౧౭౦ |
| ౧౯౩౩ | ౨౭,౩౧౭ | ౧౪,౧౪౧ |
| ౧౯౩౪ | ౨౫,౦౮౭ | (అంకె తెలియదు) |

వలసకున్నట్టుగానే పరిశ్రమాభివృద్ధికి కూడా ఎన్నో ప్రతిబంధకాలున్నాయి. ప్రస్తుతం ఏ దేశానికాదేశం తన సరుకుల్ని విదేశాలకు అమ్ముకోవాలని చూసేదే! ఇందుకుగాను—అంటే, ఎగుమతుల్ని ప్రోత్సహించడానికీ, దిగుమతుల్ని వీలైనంతవరకు తగ్గించడానికీ— సుంకాలనీ, కోటాలనీ, ప్రిఫరెన్సులనీ, మారకపురేటు హెచ్చుతగ్గులనీ...ఎన్నో పద్ధతులూ, కట్టుబాట్లూ ఏర్పడ్డాయి; ఏర్పడుతున్నాయి. ఇలాంటి సందర్భంలో పరిశ్రమాభివృద్ధివల్ల ఆకలిసమస్య పరిష్కారం చెయ్యడంకూడా సులభసాధ్యమైన పనికాదు.

అయితే, కష్టసాధ్యమైనదిగదా అని జపాను వారు ఈ సమస్యాపరిష్కారానికి పూనుకోకుండా ఊరుకోలేదు, ఇందుకుగాను వారు ఎన్నో ప్రయత్నాలను చేస్తున్నారు. అసలు ఈ ప్రయత్నాల విషయంలోనే భిన్నాభిప్రాయాలు కలిగి, జపాను రాజకీయాలలో ప్రస్తుత [illegible] ఏర్పడింది



౧౦. శాంతాకారుడు, హసన్ముఖుడు నయిన బుద్ధుని విగ్రహము

# జీవితరంగచిత్రములు



౧౧. ఇంటిలో: పురుషుల వాదోపవాదములు, ఒక మూల ఒకతె కొడుకును సముదాయించుట, మరియొకతె మగనితలలో వేలుచూచుట.



౧౨. బయట: పనిపాటలకు పరుగెత్తుచున్న ప్రజల సందడి.



౧౩. రాచనగరిలో: వంటవారి హడావడి.

జపానుప్రజల్ని అత్యధికంగా వలసకు పంపించడానికి కొత్తకొత్త రాజ్యాలను ఆక్రమించుకోవాలనీ, జైత్రయాత్రలవల్లనే జపానుసరుకుల్ని ఎగుమతి చేసుకోడానికి కొత్తకొత్త మార్కెట్టులను ఏర్పాటుచేసుకోవాలనీ సైనికకక్షువారు వాదిస్తున్నారు. జైత్రయాత్ర వల్ల కలిగేలాభంకంటె నష్టమే హెచ్చుగనక, సౌమ్య పద్ధతులతో కార్యసిద్ధికి పూనుకోవాలని రాజకీయ పక్షలవారు అంటున్నారు. ఈ ఉభయులకూ ఇక్కడనే సంఘర్షణ కలుగుతున్నది.

సైనిక కక్షువారు—తమ వాదాన్ని అనుసరించి ౧౯౩౧ లో మంచూరియాఆక్రమణకు పూనుకున్నారు. ౧౯౩౧ సెప్టెంబర్ ౧౮ వ తేదీ నాడు సౌత్‌మంచూరియా రైల్వేలైన్‌కింద ఎవరోగాని ఒక బాంబును పెట్టారు. ఈబాంబు ప్రేలడంవల్ల రైల్వేలైన్‌కు కొద్దిగా నష్టం కలిగింది. కావాలంటే, చైనాప్రభుత్వంతో రాయబారాల్ని నడిపి, ఆనష్ట పరిహారాన్ని పుచ్చుకోడానికి అవకాశం వుంది. అయితే, జపాను సైన్యాధికారులు అలాంటి ప్రయత్నాన్ని దేన్నీ చెయ్యకుండా, ఈబాంబు ప్రేలుడునే, సాకుగా చేసుకుని, మంచూరియాపైన దండయాత్రను చేశారు. ఈ దండయాత్రవల్ల అంతగా సుముఖంగాలేని ఇనూకే ప్రధానమంత్రిని ౧౯౩౨ మే ౧౫ వ తేదీని సైనిక కక్షుకు చెందిన దుండగీళ్లు కొందరు హత్యచేశారు. ఈ హత్యానంతరం జపానులో ఎన్నికలు జరిగాయి. ఆ యెన్నికలలో-జైత్రయాత్రను ఆశించే కక్షులవారు చేసిన విపరీత ప్రచారఫలితంగా- ప్రధాన రాజకీయ పక్షమైన మిన్‌సీటోపార్టీ ఓడిపోయింది. మిన్‌సీటోపార్టీ అంటే మనకు తెలిసిన రాజకీయ పరిభాషలో- లిబరల్‌పార్టీ అన్నమాట. మిన్‌సీటోపార్టీతోపాటు దాదాపుగా సమానబలం గల పార్టీ ఇంకొకటికూడా జపానులో వుంది. దీనిపేరు సీయూకేపార్టీ. అంటే, కన్సర్వేటివ్ పార్టీ అని చెప్పవచ్చును. మంచూరియా దండయాత్రను ఆమోదించడంవల్ల ఈ సీయూకేపార్టీకి ౧౯౩౨ ఎన్నికలలో విజయం కలిగింది. ఎన్నికల ఫలితం కూడా తమకు అనుకూలం కావడంవల్ల అప్పటిలో సైనికకక్షువారి మాట కిక తిరుగులేకుండా పోయింది.



చైనాప్రయాసల్ని శాఖచెయ్యకుండా వారు తమ దాడిని కొనసాగించారు. జపాను చేస్తున్న పని దురాగతమైనదంటూ చైనా నానాజాతిసమితికి అప్పీల్ చేసుకుంది. సమితి జపాను చర్యల్ని ఖండించింది. అయితే, మాటలరూపంగా ఖండించడమేగాని, అంతర్జాతీయ ధర్మానికీ, సంధులకూ భిన్నంగా వెళ్లి, మంచూరియాపైన దండెత్తినందుకు జపానుపైన చర్య జరపడానికి మాత్రం సాహసించలేదు. సమితి ఈదౌర్బల్యాన్ని చూచి, జపాను అసలు సంస్థనుంచే లేచి వెళ్లిపోయింది. ఆతర్వాత అనతికాలంలోనే మంచూరియాను పూర్తిగా ఆక్రమించుకుని, మంచూకో అనే కొత్తపేరుతో దాన్ని తన సామంతరాజ్యంగా చేసుకుంది.

మంచూకో దండయాత్ర జయప్రదం కావడం వల్ల జపాను సైనిక కక్షువారి పలుకుబడి చాలా హెచ్చింది. దాన్ని చూచి ద్విగుణీకృతోత్సాహంతో వారు ఔటర్ మంగోలియా రాజ్యాన్నికూడా ఆక్రమించుకోవాలని ప్రయత్నించారు. అయితే, సోవియట్ రష్యాప్రతిఘటనం వల్ల ఈ ప్రయత్నం సాగలేదు. ఔటర్ మంగోలియా జపాను-రష్యాల సరిహద్దులో వున్నరాజ్యం. సోవియట్ ప్రభుత్వంవారి సహాయంతో ఇది ప్రజాస్వామిక రాజ్యంగా వుంటున్నది. దాన్ని ఇంగ్లీషుభాషలో "మంగోలియన్ పీపుల్సు రిపబ్లిక్" అని అంటున్నారు. సామ్రాజ్య తృష్ణతో చస్తున్న జపాను తాకిడికి తట్టుకోవాలంటే, తమ సరిహద్దులకూ, జపాను సరిహద్దులకూ మధ్య ఒక స్వతంత్ర రాజ్యాన్ని అడ్డుగావుంచడం రష్యావారికి అవసరం. అంచేత మంచూకో విషయంలో జపానుతో రాజీపడ్డానికి ఒప్పుకున్నా, మంగోలియా ఆక్రమణకు మాత్రం సోవియట్ ప్రభుత్వంవారు అడ్డుతగిలారు. మంగోలియా సరిహద్దులలో జపాను సైన్యాలకూ, సోవియట్ సహాయంవున్న మంగోలియా సైన్యాలకూ సంఘర్షణలు జరిగాయి. ఈసంఘర్షణలలో ప్రతి దానిలోనూ జపానువారికే అధికంగా నష్టంకలిగింది. దీన్నిచూచి, మంగోలియా ఆక్రమణ ప్రయత్నాన్ని విరమించుకోవడమే తెలివిగల పని అని

జపాను నిశ్చయించుకుంది. సోవియట్ ప్రభుత్వం వారు కూడా వీలైనంతవరకు జపానుతో కలహ కారణాల్ని చంపుకోవాలని మంచూకోలోని తమ చైనీస్ ఈస్టర్న్ రైల్వేను చాలాచౌకగా జపానుకు అమ్మివేశారు. కమ్చాట్కా పరిసరాలలో చేపల్ని పట్టుకునే అధికారాల్ని గురించి రష్యా, జపానులకు చాలాకాలంగా తగాయిదావుంది. పరస్పరవైమనస్యాలను చంపుకోడానికి తమతో ఒడంబడికను (non-aggression pact) చేసుకుంటే, ఇందుకు ప్రతిఫలంగా కమ్చాట్కా తగాయిదా విషయంలో జపానుకు రాయితీ చెయ్యడానికికూడా రష్యావారు ఒప్పుకున్నారు. తక్కిన అన్ని విషయాలలో జపానుకు అనుకూలంగా వున్నా, మంగోలియా ఆక్రమణను మాత్రం రష్యా పూర్తిగా ప్రతిఘటించింది.

రష్యాకు విరుద్ధంగా మంగోలియాను ఆక్రమించడం సాధ్యపడదని జపాను తనదృష్టిని తిరిగి చైనా వైపుకే మరల్చింది. ఇలా మరల్చి ౧౯౩౩ మార్చినాటికి చైనాలోని జెహోల్ రాష్ట్రాన్ని ఆక్రమించుకుంది. జెహోల్ ఆక్రమణంతో జపాను సామ్రాజ్యం సరిహద్దు చైనా గ్రేట్ వాల్ వరకు పాకింది. ఈ గ్రేట్ వాల్ను ఆనుకుని, హూపై, చహార్, ష్యుయాన్, షాన్టంగ్, షాన్ షీరాష్ట్రా లున్నాయి. వాటిలో హోపై, చహార్, షాన్టంగ్, షాన్ షీరాష్ట్రాలలో మంచి బొగ్గు గనులున్నాయి. చహార్ రాష్ట్రంలో బొగ్గుగనులే కాకుండా ఇనుపగనులు కూడా వున్నాయి. పైగా, ఈ అయిదురాష్ట్రాలలో ప్రత్తికూడా సమృద్ధిగా పండుతుంది. అందుచేత ఈ అయిదురాష్ట్రాలను సయితం ఆక్రమించడానికి జపాను పూనుకుంది. అయితే, చైనా ప్రతిఘటనం వల్ల ఈ పూనిక పూర్తిగా నెగ్గలేదు. కొంతవరకు యుద్ధమూ రక్తపాతమూ జరిగినతర్వాత హోపై రాష్ట్రంలో మూడువంతుల్ని చీదీసి, దాన్ని తన అధీనంక్రింద ఒకస్వతంత్రరాజ్యంగా జపాను ఏర్పరచగలిగింది. ఆ తర్వాత చహార్ రాష్ట్రాన్నికూడా చేజిక్కించుకుని, దాన్నికూడా స్వతంత్రరాజ్యాన్ని చెయ్యలేకపోయినా దాని పరిపాలనకు ఒక మిలిటరీ కౌన్సిల్ను ఏర్పరచగలిగింది. మిగిలిన మూడురాష్ట్రాలలో తనకు ప్రత్యేకాధికారాలు కావాలని జపాను కొంతదౌర్జన్యం చేసిందిగాని, ఇది ఇప్పటివరకు నెగ్గలేదు.

మంచూరియా, నార్త్ చైనాలమీద జపాను సైనిక కక్షవారు జరిపిన ఈ జైత్రయాత్రవల్ల అనుకున్నంత విశేషలాభం ఏదీ కలగలేదు. మంచూరియా వ్యావసాయిక దేశం గనక దాన్ని ఆక్రమించుకుంటే తాము ధాన్యాలకూ, ప్రత్తికీ ఇతరదేశాలమీద ఆధారపడవలసివుండదని సైనిక కక్షవారు ఊహచేశారు. అక్కడికి స్వదేశీయులను లక్షలకొలదిగా వలసకు పంపించవచ్చును గదా అనికూడా అంచనావేశారు. అయితే, ఈ రెండింటిలో ఏదికూడా పూర్తిగా ఫలప్రదం కాలేదు. ఈ అయిదు సంవత్సరాలలోనూ మంచూరియా నుంచి జపానుకు దిగుమతి అయినప్రత్తి అంతకుపూర్వం దిగుమతి అయినదానికంటె చాలా తక్కువ! మంచూరియాకు వెళ్లిన జపాను ఎగుమతుల

మొత్తం ఈ అయిదు సంవత్సరాలలోనూ హెచ్చిన మాట నిజం. అయితే, ఈ హెచ్చుదలకు కారణం మంచూరియా అభివృద్ధికి జపాను ప్రారంభించిన నిర్మాణ కార్యక్రమమే! ఈ కార్యక్రమానికి జపాను ఇంత వరకు ౨౨ కోట్ల ఎన్నులను పెట్టుబడి పెట్టింది. ఈనాటి వరకు ఈ పెట్టుబడిలో అధికభాగానికి వడ్డీ అయినా గిట్టుబడి కావడంలేదు. పైగా, ఈ అయిదు సంవత్సరాలలోనూ—మంచూరియా తమ సామంతరాజ్యమైనా—అక్కడికి వలసవెళ్లిన జపానువారి సంఖ్య ౨½ లక్షలు మాత్రమే. అయిదు సంవత్సరాలలో ౨½ లక్షలు వలసవెడితే, ఈ వ్యవధిలో—నూతన సంతానం కారణంగా-జపాను జనసంఖ్య షుమారు ౩౭½ లక్షలు




పెరిగింది. ఇక నార్తుచైనా జైత్రయాత్రవల్ల కూడా ఏమంతలాభం కలగలేదు. ఒకదాని తర్వాత ఒకటి చొప్పున అన్నిరాష్ట్రాలనూ కబళించడానికి జపాను చేస్తున్న దౌర్జన్యాలను చూచి చైనావారు తమ అంతః కలహాలను ఉపసంహరించుకుని, స్వదేశరక్షణకోసం సైనికశక్తిని కూడగట్టుకోసాగారు. పైగా, జపానువస్తువుల్ని బహిష్కరించడానికి ఒక ఉద్యమంకూడా బయల్దేరింది. ఈ ఉద్యమం కారణంగా జపాను వర్తక వ్యాపారాలకు పెద్దదెబ్బ తగిలింది.

ఈరీతిగా జైత్రయాత్రకారణంగా జపానుకుఎన్నదగినలాభం ఏదీ కలగకపోగా యుద్ధ శాఖావ్యయం దుర్భరంగా పెరిగి పోయింది. ఈ వ్యయాభివృద్ధిని తెలిపే అంకెలు ఇవి :

| సం. | | సైనికవ్యయం (ఎన్నులలో) |
|---|---|---|
| ౧౯౩౦-౩౧ | | ౨౦,౦౮,౨౪,౦౦౦ |
| ౧౯౩౧-౩౨ | | ౨౨,౭౪,౮౮,౦౦౦ |
| ౧౯౩౨-౩౩ | | ౩౭,౩౫,౭౫,౦౦౦ |
| ౧౯౩౩-౩౪ | | ౪౬,౨౬,౪౦,౦౦౦ |
| ౧౯౩౪-౩౫ | (బడ్జెట్టు) | ౪౫,౩౬,౯౫,౦౦౦ |
| ౧౯౩౫-౩౬ | (బడ్జెట్టు) | ౪౯,౨౯,౫౦,౦౦౦ |
| ౧౯౩౬-౩౭ | (బడ్జెట్టు) | ౫౦,౮౩,౧౦,౦౦౦ |

సైనిక వ్యయంతోపాటు నౌకాదళ వ్యయం కూడా క్రిందివిధంగా వృద్ధి చెందింది:

| సం. | | నౌకావ్యయం (ఎన్నులలో) |
|---|---|---|
| ౧౯౩౦-౩౧ | | ౨౪,౨౦,౩౫,౦౦౦ |
| ౧౯౩౧-౩౨ | | ౨౨,౭౧,౯౯,౦౦౦ |
| ౧౯౩౨-౩౩ | | ౩౧,౨౮,౦౯,౦౦౦ |
| ౧౯౩౩-౩౪ | | ౪౦,౯౯,౭౫,౦౦౦ |
| ౧౯౩౪-౩౫ | (బడ్జెట్టు) | ౪౮,౯౧,౪౭,౦౦౦ |
| ౧౯౩౫-౩౬ | (బడ్జెట్టు) | ౫౨,౯౬,౮౩,౦౦౦ |
| ౧౯౩౬-౩౭ | (బడ్జెట్టు) | ౫౫,౦౩,౯౦,౦౦౦ |

ఇలా దాదాపు అయిదు సంవత్సరాలలో జపాను యుద్ధశాఖా వ్యయం రెట్టింపుకు పైగా పెరిగిపోయింది. దేశసంపద ఏవిధంగానూ వృద్ధి కానప్పుడు యుద్ధశాఖావ్యయం ఇంతగా పెరిగిపోతే, ప్రజలు ఆభారంక్రింద క్రుంగిపోతూ వుండడంలో ఆశ్చర్యం వుండదుగదా! ఈ సందర్భంలో ఇంకొక విపరీతం ఏమిటంటే, జపాను ప్రభుత్వాదాయం బ్రిటిష్ ప్రభుత్వాదాయంలో సరిగా నాలుగోవంతు కూడా లేదు. కాని, జపాను యుద్ధశాఖా వ్యయంమాత్రం బ్రిటిష్ యుద్ధశాఖా వ్యయంతో దాదాపు సరిసమానంగావుంది.

సైనిక కక్షువారు అవలంబించిన జైత్రయాత్ర [illegible] యుద్ధశాఖా వ్యయమే కాకుం

డా జాతీయఋణంకూడా విపరీతంగా వృద్ధిపొందింది. ఈ వృద్ధిని తెలిపే అంకెలు ఇవి:

| సం. | జాతీయఋణం (ఎన్నులలో) |
|---|---|
| ౧౯౩౦-౩౧ | ౫౮౫,౯౪,౮౭,౦౧౭ |
| ౧౯౩౧-౩౨ | ౬౧౮,౭౬,౫౭,౪౭౪ |
| ౧౯౩౨-౩౩ | ౭౦౫,౪౧,౯౫,౫౫౨ |
| ౧౯౩౩-౩౪ | ౮౧౩,౯౦,౩౮,౩౯౨ |
| ౧౯౩౪-౩౫ | ౯౦౯,౧౪,౫౪,౦౨౨ |

జాతీయ ఋణాభివృద్ధి ఈ క్రింది అంకెలవల్ల ఇంకా సులభంగా బోధపడుతుంది:

| సం. | సగటున తలకు నూటికి (అభివృద్ధి) |
|---|---|
| ౧౯౩౦-౩౧ | ౬౩.౭౧౬ |
| ౧౯౩౧-౩౨ | ౬౫ ౪౫౦ |
| ౧౯౩౨-౩౩ | ౭౩.౪౦౯ |
| ౧౯౩౩-౩౪ | ౮౮ ౪౫౭ |
| ౧౯౩౪-౩౫ | ౯౨.౩౫౫ |

జైత్రయాత్రవల్ల పెద్దలాభం ఏదీ లేకపోగా యుద్ధశాఖా వ్యయం వృద్ధిపొందీ,జాతీయఋణం పెచ్చు పెరిగీ, శిస్తులభారం అధికమైపోయీ, వర్తకవ్యాపారాలు మందగించీ అధికమైన నష్టం వాటిల్లుతూ వుండడంవల్ల సైనికకక్షువారి మీద ప్రజాబాహుళ్యానికి అసహ్యం కలిగింది. అసహ్యభావం కారణంగా ౧౯౩౬ ఫిబ్రవరిలో జరిగిన ఎన్నికలలో మిన్‌సీటో పార్టీకి మెజారిటీ వచ్చింది. డైట్ (జపాను పార్లమెంటు)లో మొత్తం ౪౬౬ స్థానాలున్నాయి. ఈ ౪౬౬ స్థానాలలోనూ ౨౦౫ స్థానాలు మిన్‌సీటో పార్టీకి లభించాయి. అంటే, అంతకుపూర్వంకంటె ౬౮ స్థానాలు ఈ పక్షానికి అధికంగా లభించాయి. పోతే సీయూకే పక్షానికి ఈ ఎన్నికలకు పూర్వం ౨౪౨ స్థానాలు వుండేవి. ఈ ఎన్నికలలో ఆపార్టీకి ౬౮ స్థానాలుపోయి, ౧౭౪ మాత్రమే మిగిలాయి. అంతకుపూర్వం సైనికకక్షువారి జైత్రయాత్రను సమర్థించి వుండడంవల్ల సీయూకేపార్టీ ఈ ఎన్నికలలో వోడిపోయిన మాట నిజమే కాని, ఈ పార్టీకికూడా ౧౯౩౬ నాటికి సైన్యాధ్యక్షుల జైత్రయాత్రనీతిమీద కొంత అవిశ్వాసం కలిగింది. కొత్తగా కలిగిన ఈ అవిశ్వాసంవల్ల ఈ పార్టీవాళ్లు కూడా—మిన్‌సీటో పార్టీవారివలె తీవ్రంగా కాకపోయినా—కొంతవరకు తమ స్వదేశ, విదేశ నీతిలో మార్పురావాలని కోరసాగారు. ఈ విధంగా ప్రధాన రాజకీయ పక్షాలు రెండూకూడా మార్పుకోరడం చూస్తే, సైనికకక్షువారికి తమ ప్రాబల్యం తగ్గిపోతుందేమోనని భయం కలిగింది. అంచేత వాగు ఎన్నికల ఫలితం తెలియగానే—అంటే ౧౯౩౬ ఫిబ్రవరి ౨౬ తేదినాడు—తిరిగి రాజకీయనాయకుల హత్యకు పూనుకున్నారు. ఆనాడు టోకియోనగరంలో ౧౪౮౦ మంది సైనికులు ప్రభుత్వకార్యాలయాలపైన పడి, ఆర్థికమంత్రి టాకాహషీని, వారి ఇద్దరు ఉన్నత ప్రభుత్వోద్యోగుల్ని హత్యచేశారు. ప్రధాన మంత్రి అడ్మిరల్ ఒకాడాను కూడా హత్యచెయ్యాలని వారు ప్రయత్నించారుగాని, కొంచెం పొరపాటువల్ల అది సాగ



ప్రధానమంత్రి అడ్మిరల్ ఒకాడా—ఆయనబావమరది

లేదు. హంతకులు ప్రధానామాత్యుని ఇంటికి వెళ్లేసరికి ఆయన బావమరిది—కొంతవరకు ఆయనను పోలిన వాడు—ఎదురయ్యాడు. అతడే ఒకాడా అని భ్రమపడి, అతణ్ణి చంపి, వాళ్లు తమ దారిని పోయారు. సైనికులు జరిపిన ఈ హత్యాకాండ తర్వాత—అంటే, ఫిబ్రవరి ౨౮ వ తేదీనాడు—ఒకాడా మంత్రివర్గం రాజీనామా ఇచ్చింది.



జపాను చక్రవర్తి

ఒకాడా మంత్రివర్గం రాజీనామా ఇచ్చిన తర్వాత ప్రభువుల సభ అధ్యక్షుడైన ప్రిన్స్ కోనేమేను నూతన మంత్రివర్గాన్ని ఏర్పాటు చెయ్యవలసిందిగా జపాను చక్రవర్తి ఆహ్వానించాడు. తన ఆరోగ్యం సరిగా లేనందువల్ల తాను ఈ గురుతర కార్యభారాన్ని వహించలేనని ప్రిన్స్ కోనేమే సాకు చెప్పాడు. చక్రవర్తి ఆజ్ఞను జపాను పౌరుడు తిరస్కరించడం ఆదేశచరిత్రలో ఇదే ప్రప్రథమం కావడంవల్ల, ఇది అప్పటిలో ఆ దేశీయులను ఆశ్చర్య చకితుల్ని చేసింది కూడా! ప్రిన్స్ కోనేమే తన ఆహ్వానాన్ని నిరాకరించినమీదట కాకా హిరోటాను మంత్రివర్గాన్ని ఏర్పాటు చెయ్యవలసిందిగా చక్రవర్తి [illegible]

హిరోటా పూర్వపు ఒకాడా మంత్రివర్గంలో విదేశాంగమంత్రి. ప్రారంభంలో చాలా ప్రాతికూల్యాన్ని ఎదుర్కొనవలసివచ్చినా, ఇతడు చివరి కొక మంత్రివర్గాన్ని ఏర్పరచ గలిగాడు. అయితే, రాజకీయ పక్షాలకూ, సైనికకక్షకూ కూడా—ఒకే సమయంలో—అనుకూలంగా వుండాలనే తెలివి తక్కువ ప్రయత్నాన్ని చేసి హిరోటామంత్రివర్గం ఉభయపక్షాలవారి సానుభూతినీ కోల్పోయింది. సైనికకక్షవారిని సంతృప్తిపరచడానికి హిరోటామంత్రివర్గం ఆదివరకే అత్యధికంగా వున్న సైనికశాఖా వ్యయాన్ని నూటికి ౪౦ వంతులూ, నౌకా శాఖావ్యయాన్ని నూటికి ౨౫ వంతులూ వృద్ధి చేసింది. అయితే, ఈవృద్ధి సైనిక కక్షవారు కోరినంత హెచ్చుగా లేకపోవడంవల్ల వారి ఆగ్రహం ఎలాగూ తప్పలేదు. ఇంతేకాదు. సైనిక, నౌకాశాఖలకు కావలసిన ధనంకోసం పొగాకు, బట్టలు మొదలైన నిత్యజీవితావశ్యకమైన వస్తువులపైన అదనం శిస్తులు వెయ్యవలసివచ్చింది. ఆదివరకే శిస్తులభారంక్రింద క్రుంగిపోతూవున్న ప్రజలలో ఇందుమూలంగా అశాంతి హెచ్చింది. గ్రామస్థులమీదినుండి పన్నుల భారాన్ని కొంత తగ్గించి, దాన్ని పట్టణవాసులపై వెయ్యాలని హిరోటామంత్రివర్గం ప్రయత్నించింది. ఇందువల్ల పట్టణవాసులకు—ముఖ్యంగా—పట్టణాలను అనుసరించివుండే పారిశ్రామికులకు—ఆ మంత్రివర్గంపై ఆగ్రహం కలిగింది. ఇంతే కాకుండా, హిరోటాపరిపాలనకాలంలో ఆహార పదార్థాల ధరలు—ముఖ్యంగా బియ్యం, చేపలు మొదలైనవాటి ధరలు—విపరీతంగా పెరిగిపోయాయి వీనితో అతడి మంత్రివర్గం పలుకుబడి పూర్తిగా చచ్చిపోయింది.

పైగా, ౧౯౩౬ నవంబర్ నెలలో హిరోటా మంత్రివర్గం జర్మన్ నాజీ ప్రభుత్వంతో చేసుకున్న ఒడంబడికను గురించికూడా జపాను ప్రజలకు అసంతృప్తి కలిగింది. ఈఒడంబడిక ప్రధానోద్దేశం కమ్యూనిజం వ్యాప్తిని ప్రతిఘటించడం.

"కమ్యూనిజం వ్యాప్తిని ప్రతిఘటించడం" అనే దానికి— రాజకీయ పరిభాష తెరను తొలిగిస్తే—అర్థ[illegible] ప్రభుత్వ ప్రాబల్యాన్ని ప్రతి

ఘటించడం. తమకు విరుద్ధంగా జపాను, జర్మనీలు ఏకం కావడాన్ని చూచి, సోవియట్ ప్రభుత్వంవారు కమ్ చాట్కా పరిసరాలలో చేపల్ని పట్టుకునే అధికారాల విషయంలో అంతకు పూర్వం జపానుకు అనుకూలంగా తాము స్వయంగానే సూచించిన ఒడంబడికను తొక్కి పట్టారు. ఇంతేకాకుండా జర్మనీ జపానుల ఒడంబడికకు పూర్వం జపానుకు తాము అమ్మిన ముడిఇనుమును ఎగుమతి చెయ్యకుండా ఆపుచేశారు. వ్లాడివోస్టక్ రేవులో జపానువారి నౌకా వ్యాపారాన్ని అరికట్టడానికి కూడా పూనుకున్నారు ఈఅన్నిటివల్ల జపాను వర్తక వ్యాపారాలకు దెబ్బతగిలింది. జర్మనీతో ఒడంబడికను చేసుకుని, సోవియట్ ప్రభుత్వానికి ఆగ్రహంతెప్పించి, తద్వారా జాతీయవర్తక వ్యాపారాలను నష్ట పెట్టినందువల్ల హిరోటా మంత్రివర్గంపైన ప్రజలకు-సహజంగానే-అసంతృప్తి కలిగింది.



కోకి హిరోటా

దేశం అంతటిలోనూ హిరోటామంత్రివర్గంపైన కలిగిన అసంతృప్తి కారణంగా ౧౯౩౭ జనవరి ౨౧ వ తేదీనాడు ప్రారంభమైన డైట్ సమావేశంలో తీవ్ర విమర్శనలు, ప్రతివిమర్శనలు జరిగాయి. ... పార్టీనాయకులలో ఒకడైన హమడా, సైన్యం అనవసరంగా రాజకీయాలలో జోక్యం కలుగజేసుకుంటూవున్నదంటూ ఆ సంస్థను గట్టిగా విమర్శించాడు. జపానులో ఫేసిస్టుభావాలు వ్యాప్తిపొందుతూ వున్నాయనీ, పార్లమెంటరీప్రభుత్వం నామమాత్రమైపోయి, డిక్టేటర్ షిప్ ఏర్పడే సూచనలు కనబడుతున్నాయనీ, దీనికంతటికినీ సైనిక కక్షవారే కారణభూతులనీ అతను ఘంటాపథంగా చాటాడు. ఈ తీవ్రవిమర్శనకు సైన్యానికి చెప్పనలవిగానంత ఆగ్రహం కలిగింది. తాము ఈ అవమానాన్నీ, ఈ ధిక్కారాన్నీ సహించలేమని చెప్పి, సైనికకక్షవారి తరఫున యుద్ధమంత్రి టెరూచీ డైట్‌ను రద్దుచెయ్యవలసిందిగా పట్టుపట్టాడు. అయితే, హిరోటా ప్రభృతులు డైట్‌ను రద్దుచెయ్యడానికి అంగీకరించక, తమ మంత్రివర్గంచేత రాజీనామా పెట్టించారు.

హిరోటా మంత్రివర్గం రాజీనామా ఇచ్చిన తర్వాత చక్రవర్తి, కొరియా గవర్నర్ జనరల్ అయిన జనరల్ ఉగాకీని పిలిపించి, మంత్రివర్గాన్ని ఏర్పాటు చెయ్యమని కోరాడు. జనరల్ ఉగాకీ—చక్రవర్తి కోర్కెను అనుసరించి-మంత్రివర్గాన్ని ఏర్పాటుచెయ్యాలని శతవిధాల ప్రయత్నించాడు గాని, సైనిక కక్షవారి సహాయనిరాకరణంవల్ల అతడు సఫలీకృతుడు కాలేకపోయాడు. జనరల్ ఉగాకేని ప్రధానామాత్య పదవికి నియమించడాన్ని డైట్‌లోని రాజకీయ పక్షాలు అన్నీ కూడా హర్షించాయి. జపాను రాజ్యాంగ నియమావళి ప్రకారమైతే, ఉగాకే అతిసులభంగానే ఒక మంత్రివర్గాన్ని ఏర్పాటుచేసి, డైట్ సభ్యులలో అధికసంఖ్యాకుల ఆమోదాన్ని పొందగలిగేవాడే. అయితే—రాజ్యాంగ నియమావళిలో ప్రత్యేకంగా లేకపోయినా-ఏమంత్రివర్గంలోనైనా సరే యుద్ధ, నౌకామంత్రుల పదవులకు యుద్ధ నౌకాకార్యాలయాల ఆమోదాన్ని పొందిన వారినే నియమించాలనీ, ఈ నియామకానికి ముందు వారు ఆ యాశాఖలలో ఉద్యోగాన్ని చేస్తున్నవారై వుండాలనీ ఒక ఆచారం వుంది. ఈ ఆచారాన్ని పురస్కరించుకొని, రాజకీయ పక్షాలకు అనుకూలుడైన ఉగాకీ పరిపాలన క్రింద తమ ఆటలు సాగవేమోననే భయపడ్డ... సైనికకక్షవారు ఉగాకీ మంత్రివర్గంలో

సైనిక, నౌకామంత్రుల పదవుల్ని భర్తీచెయ్యనిరాకరించారు. ఈ స్థితిలో— గత్యంతరంలేక— జనరల్ ఉగాకీ తన ప్రధానామాత్య పదవికి రాజీనామా ఇచ్చాడు. కేవలం ప్రధానామాత్య పదవినే కాకుండా-సైనిక కక్షవారిమీద కలిగినఅసహ్యభావం కొద్దీ-అతడు తన జనరల్ హోదానుకూడా వదులుకున్నాడు.

జనరల్ ఉగాకీ తర్వాత జనరల్ హయాషీ-ఇతడుఅడ్మిరల్ ఒకాడా మంత్రివర్గంలోయుద్ధమంత్రిగా పనిచేశాడు-ప్రధానామాత్య పదవికి వచ్చాడు. ఉగాకీ రాజకీయ పక్షాలకు అనుకూలుడైతే, హయాషీ సైనిక



హయాషీ

కక్షు పక్షపాతి. అందుచేత సైనిక కక్షవారు ఉగాకీతో సహాయ నిరాకరణం జరిపినట్టే, రాజకీయ పక్షాలవారు హయాషీతోకూడా జరిపారు. హయాషీ బెదరించాడు; సదిరించాడు. అయినా, రాజకీయ పక్షాలు అతనితో కలిసి పనిచెయ్యడానికి నిరాకరించాయి. దీన్ని చూచి ఆగ్రహించి, అతడు అసలు డైట్‌నే రదుచేసి, ౧౯౩౭ ఏప్రిల్ ౩౦ వ తేది నాడు తిరిగి కొత్త ఎన్నికలను జరిపించాడు. అయితే, ఈ ఎన్నికల ఫలితం కూడా సైనిక కక్షవారికి ప్రతికూలంగానే పరిణమించింది. ఈ ఎన్నికలలో సైనిక కక్షకు మద్దతు చేసే వారికి ఒక్క ౪౦ స్థానాలు మాత్రమే లభించాయి. పోతే, మిన్‌సీటో పార్టీకి ౧౭౯ స్థానాలూ, సీయూకే పార్టీకి ౧౭౫ స్థానాలూ వచ్చాయి. ఎన్నికల ఫలితం ఈ విధంగా తనకు ప్రతికూలంగా వున్నా, జనరల్ హయాషీ-రాజకీయ పక్షాలతో నిమిత్తం లేకుండానే పరిపాలన సాగించాలని మొండిపట్టు పట్టాడు. అయితే, చివరకు ఈపట్టు సాగనందున అతడు మే ౩౧ వ తేది నాడు తన పదవికి రాజీనామా ఇచ్చాడు.

ఈ వ్యాసాన్ని వ్రాస్తున్న నాటికి — అంటే జూన్ ౧ వ తేదినాటికి—ఉన్న పరిస్థితులివి ఈ పరిస్థితుల్ని బట్టిచూస్తే, జపానులో రెండు విభిన్నశక్తులు సంఘర్షిస్తూవున్నట్టు స్పష్టంగా తెలుస్తుంది. ఒకవైపున సైన్యమూ, సైన్యం ప్రతిపాదించే దైత్యయాత్ర నీతితో సానుభూతివున్నవారూనూ. ఇంకోవైపున రాజకీయపక్షాలూ, వాటి ఆదర్శాలను ఆమోదించేవారూనూ. వీరిలో సైనికకక్షవారిని అతివాదులనీ, రాజకీయపక్షాల వారిని మితవాదులనీ చెప్పవచ్చును. అయితే, అతివాదులలో అందరూ ఒకే ధోరణికు రారు. వీరిలో సైనిక శాఖకు చెందినవారు ఎక్కువ అతివాదులు; నౌకా శాఖకు చెందినవారు తక్కువ అతివాదులు. సైనికశాఖవారిలా నౌకాశాఖవారు ప్రస్తుత ఆర్థిక, రాజ్యాంగవ్యవస్థలలో విపరీతమైన మార్పుల్ని కోరడంలేదు. ౧౯౩౬ ఫిబ్రవరిలో టోకియోలోని సైనికులు చెలరేగి, రాజకీయహత్యల్ని చేసిన సందర్భంలో నౌకాదళం ప్రభుత్వ సహాయానికి—అవసరమైతే—వెళ్లడానికి సిద్ధపడింది. తిరిగి ఇలాగే ౧౯౩౭ ప్రారంభంలో రాజ్యాంగ సంబంధమైన చిక్కులు వచ్చినప్పుడు హిరోటామంత్రివర్గం రాజీనామా ఇవ్వడం ధర్మంగాని, అసలు డైట్‌నే రద్దుపరచడం అక్రమమని నౌకాశాఖామంత్రి అడ్మిరల్ నాగానో పట్టుపట్టాడు. ఈ విధంగా అతివాదులకు తమలో తమకే కొంతవరకు మతభేదాలువున్నాయి పోతే, అతివాదులలోవున్నట్టుగానే మితవాదులలోకూడా - కొన్నికొన్ని విషయాలను గురించి—స్వల్పమైన అభిప్రాయభేదాలు లేకపోలేదు.

అతివాదుల ఉపన్యాసాల్ని, వారి ప్రచురణాల్ని పరిశీలించి చూస్తే కేపిటలిజంను ప్రతిఘటించే

సూచనలు కనబడతాయి. అయితే, సోషలిజంపైన ప్రేమకొద్దీ ఇలా వారు కేపిటలిజంను ప్రతిఘటిస్తున్నారని అనుకోవడం పొరపాటు. అతివాదులకు సోషలిజం అంటే తీవ్రవిరోధం. దాన్ని కాలికింద పెట్టి రాచి వెయ్యాలనే వారి ఆశయం. అయితే మరి కేపిటలిజంను ప్రతిఘటించడం ఎందుకంటారా? ఇందుకు కారణమిది: అతివాదులు జైత్రయాత్ర చెయ్యాలని కోరుతున్నారు. ఇది ధనవ్యయంతో కూడిన వ్యాపారం ఈధనం మితవాదులైన కేపిటలిస్టులదగ్గరినుంచి రావాలి. అయితే మితవాదులకు (అనుభవంమీద నిరుపయోగాలని తేలిన) జైత్రయాత్రలకు ధనాన్ని ఇవ్వాలనిలేదు. అంచేత, అతివాదులు అసలు కేపిటలిజం పైనే విరోధాన్ని పూనుతున్నారు. దేశహితంకోసం దేశ పరిశ్రమల్ని నడపాలనీ, ఇందుకుగాను వ్యక్తుల స్వాధీనంలోనుంచి పరిశ్రమాగారాల్ని అన్నింటినీ తప్పించి, వాటిని ప్రభుత్వాధీనంలో వుంచాలనీ వారు ఆందోళన చేస్తున్నారు. ఇది కాదని ఎవరూ అనలేరు గాని, ఈ అతివాదుల దృష్టిలో "దేశహితం" అంటే --జైత్రయాత్రల్ని చెయ్యడం! మొత్తం మీద జపాను సైనిక కక్షవారి వైఖరి చాలా విచిత్రమైనదే! రాజకీయంగా వెనక్కు వెళ్లాలనీ, సాంఘికంగా ముందుకు వెళ్లాలనీ వారు వాంఛిస్తున్నారు. వారి వైఖరిని ఇంగ్లీషులో అయితే Political reactionism and social radicalism అని అనవచ్చును.

జపాను సైన్యంలో అధికంగా సామురాయ్ కులంవారు వున్నారు. వీరిని పూర్వపు హిందూసంఘంలోని క్షత్రియకులంవారితో పోల్చవచ్చును. వీరికి యుద్ధమంటే అమితప్రేమ. వాణిజ్యమంటే చెడ్డతలనొప్పి. విచిత్రమైన ఈ స్వభావాన్నిబట్టే, సైనికకక్షవారి ప్రస్తుత వింతవైఖరి ఏర్పడివుండాలి పైగా, జపానులో పట్టణాలన్నీ భాగ్యవంతంగానూ, పల్లెటిదిక్కు లేదతనంగానూ వుంది. సైన్యంలో పట్టణవాసులకంటె పల్లెప్రజలే ఎన్నోరెట్లు అధికంగా వున్నారు. అంచేత లేదతనంలో అల్లాడుతూవున్న పల్లెటూరివారికి భాగ్యభోగ్యాలతో తులతూగుతూ వున్న పట్టణవాసులపై సహజంగావుండే ద్వేషం, అనాయాసంగా సైనికకక్షవారి వైఖరిలో ప్రతిఫలిస్తున్నాయి.

క్లుప్తీకరించి చెప్పాలంటే, అతివాద, మితవాద వైఖరులుఇవి: అతివాదులకు జైత్రయాత్రకావాలి. ఇందుకు ధనం అవసరం. ఈ అవసర సంపూర్తికి జాతీయ పరిశ్రమల్ని కూడినంతవరకు ప్రభుత్వవశం చేసుకోవాలి. ఇలా వశంచేసుకోవాలంటే, డైట్‌లో అవసరమైన శాసనాలను చెయ్యాలి. డైట్‌లో మితవాదులకు ఎక్కువ బలంవుంటు గనక, ఈ శాసనాలు జరగడం దుర్ఘటం. అంచేత, డైట్‌నే రద్దుచెయ్యడమో, లేక దాన్ని నామమాత్రపు పరిపాలనా సంస్థగా చెయ్యడమో జరగాలి. అంటే, ప్రజాస్వామిక ప్రభుత్వాన్ని చంపి, సైనిక పరిపాలనను సాగించాలి. పోతే, ఇక మితవాదుల సంగతి: మితవాదులకు జైత్రయాత్ర ఇష్టంలేదు. నిరుపయోగమైన జైత్రయాత్రలకోసం తమ ఆస్తిపాస్తుల్ని పోగొట్టుకోవడం అసలే ఇష్టంలేదు. ఇంతవరకు డైట్ తమనూ, తమహక్కుల్నీ చాలావరకు రక్షిస్తున్నది. అంచేత ఇకముందుకూడా డైట్ అధికారానికి ఏవిధమైన నష్టంరాకుండా కాపాడుకోవాలి.

అతివాద, మితవాదులకున్న విరోధం చివరకు—పైనచెప్పినట్టుగా—డైట్ భవిష్యన్నిర్ణయసమస్యగా తేలింది. డైట్ తమకోర్కెలకు అనుగుణంగా నడుచుకోనకపోతే, డైట్ నియమించే మంత్రివర్గంతో తాము సహకారం చెయ్యమని అతివాదులు పట్టుపడుతున్నారు. ప్రజా ప్రాతినిధ్యంగల సంస్థఅయిన డైట్ అభిమతానికి భిన్నంగా వెళ్లే మంత్రివర్గం ఏర్పడితే, దాన్ని ప్రతిఘటిస్తామని మితవాదులు అంటున్నారు. ఇవి రెండూ పూర్తిగా పరస్పరవిరుద్ధమైన వైఖరులు గనుకనే గడచిన అయిదారు నెలలలోనూ హిరోటా, ఉగాకీ, హయాషీ ప్రధానమంత్రులు ముగ్గురూ వరసగా రాజీనామాలను పెట్టవలసివచ్చింది. ఈ స్థితిలో జపాను భవిష్యత్తు ఎలా పరిణమిస్తుందో జోస్యం చెప్పడం కష్టమైనపని. కాని, ఒక్కటిమాత్రం ఖాయం. ఈ సంఘర్షణలో అతివాదులు నెగ్గితే, ఇటలీ జర్మనీ రాజ్యాలమాదిరిగా జపాను కూడా ఫేసిస్టురాజ్యమై పోతుంది. తత్ఫలితంగా ప్రజాస్వామిక సిద్ధాంతాలకూ, ప్రపంచశాంతికీ విపరీతమైన అపకారం జరుగుతుంది.

# రావుబహదూర్ బి. వి. నాథ్

## (భాగవతుల విశ్వనాథంగారు)

వేమూరి విశ్వనాథశర్మ





ఏవిధమైన యితర సహాయము లేక, కేవలము స్వయంకృషివలన పైకి వచ్చిన యాంధ్రులలో భాగవతుల విశ్వనాథంగారు అగ్రగణ్యులని చెప్పవచ్చును. ఇతను ధనవంతుడు కాడు. విద్యలో విశ్వవిద్యాలయమును తొక్కలేదు. కాని చిన్నప్పటినుండియు నూతన పరిశ్రమలకొరకును, పరిశోధనలకొరకును డబ్బంతయు కర్చుపెట్టుట ఇతని యలవాటు. ఉత్సాహము మెండు. కార్యదీక్ష యపరిమితము. పని పట్టినప్పుడు నిద్రాహారములు, సంసారతాపత్రయములు జ్ఞప్తికి రావు. ఇతని యభిమానవిద్య రసాయనశాస్త్రము. సామాన్యముగ గురుశుశ్రూషవలనగాని భౌతికశాస్త్రములలో ప్రవీణతగలుగుట దుర్లభము. ఐనను రసాయనశాస్త్రమునం దితనికి గల యభిరుచియు, పట్టుదలయు నిరుపమానమగుటచేత స్వయంకృషివలన పాండిత్యము సంపాదించి దొరతనమువారి వ్యవసాయశాఖలో తారాజువ్వవలె అగ్రస్థానముచేరి ఢిల్లీనగరమున వ్యవసాయ పరిశోధనాలయమున కధ్యక్షుడై ప్రపంచమునందున్న వ్యవసాయరసాయనశాస్త్రజ్ఞుల గణనకు పాత్రుడయ్యెను. కేవలము స్వయంకృషివలన అభివృద్ధికి రావచ్చుననుటకు తార్కాణమై ఆంధ్రయువకులకు ఆదర్శప్రాయుడుగ నుండునట్టివాడు.

సర్వధారినామ సంవత్సర మార్గశిరబహుళ అమావాస్యకు సరియగు ౧౮౮౯-వ సంవత్సరము జనేవరి మొదటి తేది నాథుయొక్క జన్మదినము. ఇతనిపూర్వులు విశాఖపట్టణంజిల్లా వాస్తవ్యులు. తాతగారు ప్లీడరు. తండ్రి జిల్లామునసబు పనిచేయుచు నాథుకు పది సంవత్సరములు దాటినతరువాత గతించెను. తండ్రి పోయినతరువాత నాథు మేనమామపోష్యవర్గములో చేరెను. మేనమామదగ్గిర చేరిన కొలదికాలములో నాథుకు ౧౨ వ యేట వివాహముమాత్రము జరిగినది. ఉన్నతవిద్య పట్టుపడలేదు. మెట్రికుర్యులేషను పరీక్ష తప్పినతరువాత విద్యార్థిదశకు స్వస్తిచెప్పెను.

"డిగ్రీలు లేనిపాండిత్యం వన్నెకురానికాలం"లో భాగవతులవిశ్వనాథం, యజ్ఞేశ్వరచింతామణి ఉపజ్ఞకి, స్వయంకృషికి ప్రత్యక్షనిదర్శనాలు. చింతామణిగారి అనతికాల కళాశాలాప్రవేశం విశ్వవిద్యాలయాలకు అభినందనకరం కావచ్చును. నాథుగారు కళాశాలలో కాలైనా పెట్టలేదు. కాని ఆధునికవ్యవసాయ రసాయన విజ్ఞానంలో భారతదేశవ్యవసాయ కళాశాల లన్నిటికి ఆయన పరీక్షకుడు. భారతదేశంలో వ్యవసాయరసాయనశాస్త్రం పేరుతో ఆయనపేరు భాషాభావసం

బంధం పొందుతోంది. ఈ అత్యున్నతస్థానానికి ఆయన నలంకరించిన పరిశోధనజిజ్ఞాస, మొక్కవోని ఉత్సాహం యువకులందరికి ఆదర్శం కావాలి.

సుప్రసిద్ధభారతీయ గణితశాస్త్రజ్ఞుడగు రామానుజం మదరాసు విశ్వవిద్యాలయం ఇంటరుమీడియేటు పరీక్ష ఉత్తీర్ణుడు కాలేదంటే ఊహాతీతంకాదు. కాని బాల్యంలోనే తండ్రిని కోల్పోయిన నాథు మేనమామ సంరక్షణలో నుండి రసాయనశాస్త్రమందలి విపరీతాభిమానంతో ప్రత్యేకతకు ప్రాతినిధ్య మీయని మెట్రిక్యులేషను విడిచిపెట్టారంటే ఆశ్చర్యజనకంగా ఉంటుంది. రసాయనశాస్త్ర చరిత్ర అంతా యిట్టి విచిత్ర ఘట్టాలతోనే నిండిఉంది. ఆధునిక రసాయనశాస్త్రం ఎంతమందో శాస్త్రజ్ఞులత్యాగసంపుటం అనడం అతిశయోక్తికాదు. నాథుకూడా తనజీవితంలో ప్రతిక్షణాన్ని, సాధనసంపత్తిని పరిశోధనలో ఒడ్డివేశారు. సాధారణంగా మెట్రిక్యులేషనులో ఉత్తీర్ణులుగాని విద్యార్థులుఎంతమందో జీవితంలో నిస్పృహచెంది వ్యర్థులవడం చూస్తుంటాము. కాని విడువని పట్టుదలతో కలకత్తా బొంబాయి నగరాల్లో రసాయనశాస్త్రజ్ఞులవద్ద పనిచేయడానికి పోయారంటే అవ్యక్తిఅంతరంగికశక్తి బహిర్గతమవుతోంది. అక్కడ కొంత కాలం పనిచేసి తెలుగుదేశంలో కాలు పెట్టేసరికి స్వదేశోద్యమ ఝంఝామారుతం వీస్తోంది. విపినచంద్రపాలుగారు విజయనగరం వచ్చినప్పుడు తాను స్వయంగా తయారుచేసిన సుగంధద్రవ్యాలతో వారినిబహూకరించారు. అప్పుడే విజయనగరంలో ఒకచిన్నపారిశ్రామిక రసాయన పరిశోధనాలయాన్ని స్థాపించారు. ఆరోజులలోనే "భారతమాత" అను వారపత్రికను నడిపారు. ఈ పత్రిక ౧౯౦౮ మొదలు ౧౯౧౨ వరకు నిర్విఘ్నంగా సాగింది. అప్పటి తునిరాజాగారు ఆయనకున్న గ్రాఫైటు గనులను వృద్ధిలోనికి తీసుకొని రావలెనని కొన్ని పరిశ్రమాలయాల్ని స్థాపించారు. వానిని విశ్వనాథుగారి యాజమాన్యంక్రింద ఉంచారు. కాని అవికూడ తదితర తెలుగు పరిశ్రమల పద్ధతినే అనుసరించాయి. కాని నాథుఉత్సాహం తెలుగురీతిని తాత్కాలికం కాదు. ఏదోవిధంగా భారతదేశసౌభాగ్యానికిని, విజ్ఞానానికిని తాను ఉపకరించాలనే కాంక్షతోనే జపానులో నిప్పుపెట్టెలు పరిశ్రమ నేర్చుకునేందుకు తీసుకుపోయింది ధనాభావంచేత అత్యల్పకాలంలోనే తిరిగి రావలసి వచ్చింది. జపానునుండి తిరిగి రావడంతోనే మద్రాసు ప్రభుత్వ రసాయన పరిశోధకునివద్ద ఉచితంగా పనిచేయుటకు చేరారు. లెఫ్టినెంటు కర్నల్ మిల్లరు నాథుగారి నిశితమైన విచక్షణకు, అకుంఠితమైన అవలంబన శక్తికి ముగ్ధుడైపోయారు. ఏవో చిన్న చిన్న పనులలో జీవితం గడిచిపోవుచుండెడిది. ఆ రోజులలోనే నాకు ఆయనతో పరిచయం కలిగింది. సన్నగా, పొడుగ్గా విశాలమైన నెన్నుదురుతో నిరంతరయోచనానిమగ్నుడైన నాథుగారిని చూచినప్పుడే నా కాయనజీవితం ఒక విజ్ఞానసాధసోపానపథ మౌతుందని ఆశ పొడమింది. మేమిద్దరం ఒకింటిలోనే కాపురముండేవాళ్లం. నేను పచ్చయప్పాకాలేజిలో పనిచేస్తుండేవాణ్ణి. చాలా రోజులు నాథుకు ఎక్కడైనా ఉద్యోగం దొరుకుతుందా అని వెతికాం. ఆఖరికి పోర్టులాండ్ సిమెంటు ఫ్యాక్టరీలో రసాయనశాస్త్రజ్ఞుడుగా రాత్రిపూట పని చేయుటకు ఖాళీదొరికింది. కాని జీతం తక్కువగుటచే దాని కాయన అంగీకరించలేదు.

## పాతికేళ్లక్రిందట

ఇప్పటికీ నా కారోజు కళ్లకుకట్టిన ట్లుంది. దేశమంతా ఢిల్లీదర్బారు కోలాహలంలో మునిగిఉంది. మేము ఆరోజున (౧౯౧౧ డిశంబరు ౧౨ వ తారీఖున) చేతిలోఉన్నడబ్బంతా ఖర్చుపెట్టి రిక్తహస్తాలతో నూతనజీవితాన్ని ప్రారంభించుదామనుకొన్నాం. మరునాటినుంచీ ఇద్దరం కలిసి విశ్లేషణరసాయనశాస్త్రజ్ఞులుగా (Analytical chemists) వ్యాపారం ప్రారంభింతామనుకున్నాం. ఇక ఈ సంకల్పసిద్ధికి నాథు ఆయనవాటా వెయ్యిరూపాయలు తీసుకురావడానికి విజయనగరం వెళ్లడమే మిగిలిపోయింది.

బయలుదేరదలచుకున్నరోజునే నా కేదో చూచాయగా కోయంబత్తూరు వ్యవసాయపరిశోధనాలయములో సహాయరసాయనశాస్త్రజ్ఞుని ఉద్యోగానికి ప్రకటించినట్లుగా జ్ఞాపకంవచ్చింది. జీతం యాభైరూపాయలు. ఎం. ఏ. లు కావాలన్నారు. ఆ రోజులలో

యం. ఏ. లందటికి యాభైరూపాయలంటే చాలతక్కువగా తోచింది. నేను నాథును దరఖాస్తుపెట్టమన్నాను. మొట్టమొదట నేనేమిటి, దరఖాస్తుపెట్టడమేమిటి అని నవ్వాడు. ఆఖరికి ఎల్లాగైతేఏమి, ఆయన దరఖాస్తుపెట్టి ఆరోజునే విజయనగరం వెళ్లిపొయ్యాడు. ఆయన మళ్లీ విజయనగరంనుండి తిరిగివచ్చేసరికి డాక్టరు హారిసనునుంచి మద్రాసులో డాక్టరు నికల్సనును కలుసుకోమని ఉత్తరంవచ్చింది. డాక్టరు నికల్సనుగారు నాథుయొక్క వ్యక్తిత్వానికి, రసాయనశాస్త్ర పరిజ్ఞానానికి చాలా సంతోషించి డిగ్రీలు లేకపోయినాసరే ఉద్యోగం యివ్వాలన్నారు. ఆరుసెలలలోనే నాథు సహజప్రతిభాచాకచక్యాలతో చాలాపైకివచ్చాడు. యుద్ధానంతరం బస్రాలో ఇరాకు ప్రభుత్వానికి ప్రత్యేక రసాయన శాస్త్రజ్ఞునిగా నియమించారు.

తిరిగి రావడంతోనే (౧౯౨౩)మద్రాసు ప్రభుత్వ రసాయనశాస్త్రజ్ఞునిగా నియమించారు. మన దేశంలో F. I. C. (Fellow of Institute of Chemists) బిరుదంపొందినవారు చాలాకొద్దిమంది ఉన్నారు. ఈ బిరుదు రావడానికి ముందర ఏవిశ్వవిద్యాలయంలోనైనా ఎం. ఏ. డిగ్రీ పొంది ఏ. ఐ. సి. బిరుదు పొంది ఉండాలి. కాని నాథుగారి పరిశోధనలను చూచి ఈ నియమాలను ఆయనవిషయంలో పాటించడం అనవసరమన్నారు. ఒకేసారి పరీక్షచేసి యఫ్. ఐ. సి. బిరుదం ఇచ్చారు.

అప్పటినుండి ౧౯౩౮ జూలైవరకు మద్రాసు ప్రభుత్వ వ్యవసాయశాఖలో అత్యున్నత స్థానాన్ని అలంకరించారు. తరువాత ఆయనను భారతప్రభుత్వ వ్యవసాయ రసాయన శాస్త్రజ్ఞునిగాను, కొలది కాలంలోనే అఖిలభారత వ్యవసాయ పరిశోధనాలయానికి సంచాలకునిగాను నియమించారు.

నాథుగారు ఏపదవిని పొందినా ఆపదవికి గౌరవమే అని చెప్పాలి. సాధారణంగా జీవితంలో పైకివచ్చుటకు తలిదండ్రులో, బంధువులో వేసిన నిచ్చెనలు లేకుండా, కేవలం స్వప్రయత్నానికి అంటే నిశితమైన మేధస్సుకి, నిరంతర కృషికి ఆయనజీవితంలోని ప్రతి ఘడియా సాక్ష్యం చెపుతుంది. ఆయన నిత్యాహార విశ్రాంతులు అత్యల్పం. మానవుడు, తనకు కావలసినది, తాను పనిలో వినియోగించే శక్తికంటె అనవసరంగా ఎన్నోరెట్లు ఎక్కువ భుజిస్తూ కాలం వృథాచేస్తాడని ఆయనవాదన. పదిమంది స్నేహితులలో కూర్చున్నప్పుడు ఆయనవాగ్ధారలో ఒక అపురూపమైన ఆకర్షణ ప్రవహిస్తుంది. మునివేళ్లమధ్య నిరంతరం భస్మీకృతమయ్యే సిగరెట్టు ధూమకుండలాలలో ఆయన వర్ణించే ప్రతి విషయంలోనూ సహజమాతసత్వంలో ఎన్నిరాత్రుళ్లయినా స్వప్నాలుగా గడిచిపోతాయి.

ఏమాటలోనూ దాపరికంలేదు. జీవి తౌన్నత్యాన్ని పొందినతరువాత ప్రారంభజీవితంలోని స్వల్ప విషయాలను మరచిపోవడం చూస్తుంటాం. మొదటలో పొందిన కొద్దికొద్ది సహాయాల సంగతే సుర్తుండదు. ఆయన ఈరోజుకికూడా "నేను నాజీవితంలో పొందిన వృద్ధి కాసా లన్నీకూడా, మొదటలో నాకేమీ ఆస్తిగాని నెలసరి సంపాదనగాని లేనిరోజుల్లో కేవలం నన్ను నమ్మి అప్పురూపంగా నాకు సహాయంచేసిన పూసపాటి వెంకటజోగి జగన్నాథరాజుగారి మూలాన్నే" అని స్మరిస్తాడు. నాథ్ మొదలుపెట్టిన పరిశ్రమాలయానికి, పత్రిక లన్నిటికీ కూడ ధారాళంగా జగన్నాథరాజుగారు సహాయం చేస్తుండేవారట. ఆచిన్ననాటి దినాలనుగురించి అతిగౌరవంతో, కృతజ్ఞతతో చెపుకుంటారు.

ప్రతిమాటలో ఒక తాత్వికునిజిజ్ఞాస, ఒక పరిశోధకుని తృష్ణ ప్రత్యక్షమవుతుంది. ఒకసారి ఆయన ప్రకృతిలో ఋతుపరివర్తన అంటే ఏమిటో నాకు బోధపడకుండా ఉందన్నారు. ఆయా ఋతువుల శీతోష్ణాలు, వాతావరణాన్ని కృత్రిమరీతిని ఉద్భిజ్జాలపై ప్రయోగించినా అవిమట్టుకు ఋతువు రానిదే సహజశోభను పొందలేవు.

భారతదేశభూముల భౌతిక రసాయన పరిశోధన చేసినవా రెవరైనా ఉన్నారంటే నాథునే చెప్పాలి. మనశరీరములలో శక్తి దార్ఢ్యములకు విటమినులు ఎంత ఆవశ్యకమో అల్లే మొక్కలకుకూడ ఆక్సిజను [illegible] ముఖ్యము వహించునని నాథు

గారు కనిపెట్టిరి. పైరు పంటల దార్ఢ్యము ఈ ఆక్సిజను విటమిను పై ఆధారపడియుండును. చోళ్ల (రాగుల)మాల్టులందు చేసిన పరిశోధనలనుగురించిగోటేటి జోగిరాజుగారు భారతిలో ఇదివరకే విశదపరచియున్నారు.

అదీగాక, ప్రతి పరిశోధనలోను రైతుకు ప్రస్తుతపరిస్థితులలో ఎంతలాభం గలుగుతుందా అని ప్రయత్నిస్తారు. ఆయన కనిపెట్టిన పంచదార బెల్లము, ఉత్తేజిత కార్బనము (ఊకను చెరుకు పానకము వడపోయుటకు ఉపయోగించు విధానము) మనరైతు ఆర్థికప్రతిపత్తిని వృద్ధిచేయు ననుటలో సందేహంలేదు. పంచదార బెల్లము, ఉత్తేజిత కార్బనము చేయువిధానము అనుబంధమునందు వ్యక్తపరుపబడినది.

నాధుగారి నిష్పాక్షికబుద్ధి ఆదర్శప్రాయ మని చెప్పాలి శక్తి సామర్థ్యముల ముందర బంధువులను, స్నేహితులను కూడ పాటించరు. అనేకసార్లు దగ్గిర బంధువులను, స్నేహితులనుకూడ తోసివేయుట నేనెరుగుదును. నెలకు రెండు వే. రూపాయలు సంపాదించుతున్నా కుడిఎడమ చేతులమధ్య పరమరహస్యము. గుప్తదానాలకు లెక్కలేదు. ఇట్టి ప్రతిభాశాలి ప్రభుత్వోద్యోగ పరంగాకుండా ఉంటే భారత పరిశ్రమల్లో మకుట స్థానాన్ని అలంకరించేవా రనుకుంటాను.

ప్రస్తుతం నాధుగారు ఇదివరలో భారతీయులెవరూపొందని గౌరవాన్ని పొందారు. భవిష్యత్తులో నా....... నూతనరాజ్యాంగ విధానంలో ఆయనవంటి అనుభవజ్ఞుని సలహాసహాయాలతో భారతదేశ వ్యవసాయం సర్వతోముఖంగా వికసిస్తుందంటే సాహసంకాదు.

## (అనుబంధము)

## పంచదారబెల్లము చేయువిధానము

రక్షణక్రింద పంచదారపరిశ్రమ దినదినాభివృద్ధి పొందుతోంది. కాని నూటికి ౭౦ వంతులు కర్షకులుగల మనదేశంలో పరిశ్రమలను కేంద్రీకరింప జేయడంకంటె గ్రామపరిశ్రమలను వృద్ధిచేసి రైతుల ఆర్థికప్రతిపత్తిని వృద్ధిచెయ్యాలి. అదీగాక మనదేశంలో సగటున మనిషికి ౨౦½ పౌనులు బెల్లం, ౫½ పౌనులు పంచదార వాడుతారు. అందుచేత ప్రస్తుత పరిస్థితులలో మంచిరకము బెల్లము, దానిలోనుంచి పంచదార తయారుచేయు విధానం రైతుకు నేర్పాలి.

చెరుకురసంలో నూటికి ౭౦ వంతులు నీళ్లు, ౧౫ వంతులు పంచదార, ౨ వంతులు తదితర పదార్థాలుంటాయి. బెల్లం చేయడానికి, నీళ్లు తదితర పదార్థాలు లేకుండా ౧౫ వంతుల పంచదారను సంఘటించాలి. మామూలుగా ఫ్యాక్టరీలలో అనేకరసాయనపదార్థాలను, యంత్రాలను దీనికోసం ఉపయోగిస్తారు. అవన్నీ మన రైతుల అందుబాటులో లేవు. అందుచేత పొల్లుగాపోయే ఊకను ఉత్తేజితకార్బనంగా చేసి దానిని చెరుకురసం వడబోయుటలో వినియోగించిన ఇంచుమించుగా పటికబెల్లంతో సమానంగా ఉండే బెల్లం తయారవుతుంది. మామూలుగా బెల్లం వండుతుంటే వచ్చే నురుగు రాకుండా చాలా చక్కగా తెల్లగా బెల్లం తయారవుతుంది.

సాధారణంగా బెల్లంవండే కళాయితే (౧వ పటం) దీనికికూడ ఉపయోగింపవచ్చును. ఇనుప కళాయిలకంటె రాగి కళాయిలు ఉపయోగించడం మంచిది. రాగికళాయిల్లో చివరకి అసలు ఖరీదులో సగమయినా రాబట్టుకోవచ్చును ముందర చెరుకురసమును గానుగలోనుంచి తీసిన వెంటనే కాగబెట్టి ఉత్తేజిత కార్బనముతో నింపిన గొట్టములో పోయవలెను. దానికిగాను ౨ అ. ౬ అం. పొడవు, ౧౦ అం. వ్యాసము అడుగున, ౧౬ అం. వ్యాసము పైన గల్గి అడుగున ౨౦ లేక ౨౫ చిల్లులుగల గొట్టమును ఒకదానిని ఉపయోగించాలి. దానిని నాల్గు ఇనుప కొక్కములతో వ్రేల్లాడదీయవచ్చును. అడుగున ౧½ అం. మందమున గరుకు ఇసుకయు దానిపైన కొంచెము సన్న ఇసుకయు పోసి నీళ్లు పోసిన ఆ ఇసుకపొరలన్నియు దట్టమగును. తరువాత ౬ అం. మందమున ఉత్తేజిత కార్బనమును పోయవలెను. కాసుచు కాగుచుఉన్న వేడి చెరుకురసమును పోయవలెను. మొట్టమొదటలో వడగట్టిన రసమందు చిన్న చిన్న కార్బనకణము లుండును గాన రసము



౧. బెల్లంవండే కళాయిలు




౨. క్రొత్తరకపుకొలిమి : దానిప్లాను

అంత తెల్లగా, శుభ్రముగా నుండకపోవచ్చును. అందుచేత మొదట కారిన రసమును తిరిగి గొట్టములో పోయవలెను. తరువాత వచ్చిన రసము స్ఫటిక స్వచ్ఛతను గల్గియుండును. ఇక ఈ రసమును మామూలు కళాయిలలో పోసి బెల్లము వండవచ్చును. దీనిలో అప్పుడప్పుడు పైకి తేలు తుట్టను వెదురుకర్రకు తీగెల జల్లెడను కట్టి దానితో తీసి పారవేయవచ్చును. దీనికంతకు రైతుకు ౨౫ రూ. కంటె ఎక్కువ పెట్టుబడి అక్కరలేదు.

## ఉత్తేజిత కార్బనము

దీనిని మామూలు ఊకతో తయారుచేయవచ్చును. ఇందుకుగాను పెద్ద పెద్ద యంత్రము లక్కరలేదు. గ్రామములో అయినా తయారు చేయవచ్చును. మొట్టమొదట ఊకను ౨, ౩ పటములలో కన్పరిచిన కొలిమిలలో మాడ్చవలెను. అలాగున మాడ్చిన ఊకను సున్నపు సోడానీళ్లలో (౧౦౦ పాళ్లు నీళ్లు ౨౫ పాళ్లు సున్నపు సోడా) వేసి కాయవలెను. తరువాత మొదట కళపెళ కాగుచున్న వేడినీళ్లతోను, కొద్దిగా మహాద్రావకం (Hydrochloric acid) తోను బొగ్గునుండి సున్నపు కారము శుభ్రముగా పోవునట్లు కడగాలి. తడితడిగా ఉన్న కార్బనాన్ని ముందర ఎండబెట్టినతరువాత పటంలోకన్పరిచిన కొలిమి గొట్టాలలో పుటం పెట్టాలి. ఈవిధంగా తయారుచేసినదానినే ఉత్తేజిత కార్బనం అంటారు. ఇది చెఱకురసంలో ఏవిధమయిన రంగు లేకుండా తెల్లపరుస్తుంది. ఉత్తేజిత కార్బనం చేయడానికి పౌను ౧ కి ౦-౨-౩ అవుతుంది.

(ఇంకా వివరాలకి Director Imperial Agr. Res. Inst. New Delhi కి వ్రాసి తెలుసుకోవచ్చును)

---






భి క్షు కు డు





౧౪. అంకోరుథామ్‌లోని రాజప్రాసాదముమీద మలచబడిన రాజకుమారికలు - నాగుబాము



౧౭. ఆంకోరుథామ్ । ఉత్తరద్వారము

## కీర్తిశేషులు

# వల్లూరి సూర్యనారాయణరావుగారు

జటావల్లభుల పురుషోత్తము



౧

శ్రీయుత వల్లూరి సూర్యనారాయణరావుపంతులుగారు ౧౮౬౬ వ సంవత్సరమున మాతామహస్థలమగు కడలిగ్రామములో జననమొందిరి. పంతులుగారు ఆర్వేలనియోగులు; ఆపస్తంబసూత్రులు; పరాశర



కీ. శే. వల్లూరి సూర్యనారాయణరావు

సగోత్రులు. వీరిపూర్వులు కొంతకాలము పెదమద్దాలిలోను, పిమ్మట గోదావరీమండలములోని మండపేటలోను నివసించుచుండిరి. వారిలో చాలమంది ప్రభుత్వోద్యోగులును, సంగీతవిద్వాంసులు నైయుండిరి. పంతులుగారి తాత తహసీల్దారు... ల్పవేతనముపై కరణీకము లెక్కలను వ్రాయుచుండెను. వీరిపేరు వెంకటకృష్ణయ్యగారు. పంతులుగారు బాల్యమును చాలభాగము కడలిలో గడపిరి. పిమ్మట రాజమహేంద్రవరములోని పౌనఃస్కూలులో చేరిరి. అప్పటి వారి యుపాధ్యాయులలో శ్రీ వడ్డాది సుబ్బారాయకవిగారొకరు. పిమ్మట పంతులుగారు ప్రభుత్వకళాశాలలో చేరి బి. ఏ. వరకును నచటనేచదివి, పరీక్షకు మద్రాసువెళ్లి అందుత్తీర్ణులై, మద్రాసులోనే ఎఫ్. ఎల్., బి. ఎల్. పరీక్షలకు చదివి ౧౮౯౭ లో బి. ఎల్. డిగ్రీని పొందిరి. ఆ సంవత్సరమే ఎల్. టి. పరీక్షలోకూడను త్తీర్ణులైరి. మద్రాసు రాజధానిలో మొదట ఎల్. టీ. పరీక్షప్యాసయినవారు వీరే. పిమ్మట పంతులుగారొకసంవత్సరము సైదాపేటలోని బోధనాభ్యసన కళాశాలలో నుపాధ్యాయులుగ పనిచేసిరి. ౧౮౯౭ మొదలు ౧౯౦౪ వఱకును వారు మద్రాసులోనే యుండిరి. ఆ కాలములో వారు శ్రీ రెంటాల వెంకటసుబ్బారావుగారితో సాహచర్యమున నుండి వారికి గ్రంథరచనలోను, ఫోటోమాన్యుఫాక్టరీలోను సహాయముచేయుచుండిరి. ౧౯౦౫ నుండి ౧౯౨౫ వఱకును పంతులుగారు బందరులో న్యాయవాదిగ పనిచేసిరి. పిమ్మట వారు ఆంధ్రగీర్వాణవిద్యాపీఠమునకు సేవచేయు తలపుతో కొవ్వూరులో గృహమును నిర్మించుకొని యచట నివాస మేర్పరచుకొనిరి. ౧౯౨౬ నుండి యీ ౧౧ సంవత్సరములలోను పంతులుగారు ఆంధ్రగీర్వాణ విద్యాపీఠమునకు అధ్యక్షుడుగనో, కార్యదర్శిగనో పనిచేయుచుండిరి. తుదకు ౨౭-౪-౩౭ బుధవారము తెల్లవారుజామున ౬-౩౦ గంటలకు కొవ్వూరులో స్వగృహములోనే

శ్రీ సూర్యనారాయణరావు పంతులుగారు భౌతికదేహమును వీడిరి. ౭౦ సంవత్సరములు జీవించి పుత్రపౌత్ర దౌహిత్రసంపత్తితో కాలము గడపుచున్న సమయములో దివికేగిన శ్రీ పంతులుగారు ధన్యులే కాని యా కష్టమును భరింపవలసిన వారికుటుంబమువారును, ముఖ్యముగ వారిభార్యయు సతీమతల్లియు నగు పార్వతమ్మగారును దుఃఖభాజనులైరి.

## ౨

పంతులుగారు పేదకుటుంబములోపుట్టి మిక్కిలి కష్టపడి ధనమునార్జించినవారు కావున ధనముయొక్క విలువను చిన్నతనములోనే గ్రహించిరి. వీరు మిక్కిలి నిరాడంబరజీవితమును గడపి బందరులోనున్న కాలములో నొకలక్షరూపాయలను నిలువచేయగల్గిరి. వీరికంటె నెక్కుడు సంపాదించిన న్యాయవాదు లనేకు లమిత వ్యయము చేసి పాడయిపోయిరి. లక్షరూపాయలకు మించిన ధనము తమ కక్కరలేదని భావించి పంతులుగారు ౧౯౨౦ లోనే న్యాయవాది వృత్తిచే ధనార్జనము చేయుటను మానివైచిరి. ఇది కేవలము గాంధిమహాత్ముని యసహాయోద్యమ తత్వమని చెప్పుటకు వీలులేదు. ఏలన ౧౯౨౮ నుండి చనిపోవువరకును గూడ పంతులుగారు ధర్మాదాయము లనుగూర్చి న్యాయస్థానములలో వాదించుచునే యుండిరి. కాని ఫీజుతీసికొనకూడదను నియమమునుమాత్రము నవిచ్ఛిన్నముగ పాటించిరి. కాన పంతులుగారి న్యాయవాదివృత్తి త్యాగము కేవలము ధనముపైనున్న నిర్లిప్తత వలననే కల్గినదని చెప్పవలెను. ఈవిధముగ శరీరములో పటుత్వమును, సంపాదించుట కవకాశమును నున్న సమయములో 'నిక నాకు డబ్బెందులకు' అను వైరాగ్యముతో సంవత్సరమునకు వేనకువేలు తెచ్చుచున్నవృత్తిని తృణప్రాయముగ విడచివైచు మహాత్యాగు లెందరాంధ్రదేశమునగల రనుసందేహము గల్గుచున్నది.

శ్రీ పంతులుగా రెంతశ్రద్ధతో ధనమును నేకరించి నిలువచేసిరో యంతసాహసౌదార్యములతోనే దానిని త్యజించిరి. వీరు బందరుజాతీయకళాశాలకు ౨౩౦౦౦ రూపాయలను, తిలకుస్వరాజ్యనిధికి ౧౬౦౦౦ రూపాయలను, బెజవాడలోని రామమోహన ఆయుర్వేదకళాశాలకు ౫౦౦౦ రూపాయలను, కొవ్వూరులోని ఆంధ్రగీర్వాణవిద్యాపీఠమునకు ౧౨౦౦౦ రూపాయలను నిదివరలో దానముచేసియుండిరి. వీరి మరణానంతరము సుమారు ౫౦ వేల రూపాయలు ఆంధ్రగీర్వాణ విద్యాపీఠమునకు చెందవలెనని వీ రొకవిల్లును వ్రాసియుండిరి.

సూర్యనారాయణరావు పంతులుగారు లక్షరూపాయల యాస్తిని చక్కబెట్టుకొనుచుండినను వారికి స్వవిషయమై యెన్నడును వ్యవహారములుగాని, తాపత్రయముగాని లేకుండెను. డబ్బుతో భూములనుకొన్నను, వడ్డీవ్యాపారముచేసినను నేవోతగాదాలు వచ్చుచుండుననియు, తమకాలమంతయు వానితోనే సరిపోవుననియు తలచి పంతులుగారు తమసొమ్మును బ్యాంకులలో మాత్రమే వైచి ప్రతిమాసమునను వడ్డీతీసికొనుచుండిరి. దీనివలన వారు నిశ్చింతగ నుండి ప్రజాహితకార్యములలో పాల్గొనగల్గుచుండిరి.

## ౩

చిన్నప్పటినుండియు పంతులుగారు తీవ్రజాతీయవాదులుగనుండిరి. సూరతుకాంగ్రెసులో వారు తిలకు పక్షమున నెట్లు పనిచేసినదియు నాతో చాలసారులు చెప్పుచుండిరి. ౧౯౩౦ లో వారికి దగ్గరలో కలుగకుండినచో తప్పక శాసనోల్లంఘనము చేసి కారాగారమున కేగెడివారే. జాతీయపతాకము నెగురవేసినవారిని పోలీసువారు లాటీదెబ్బలు కొట్టుచుండినకాలములో గూడ పంతులుగారు తమ యింటిపైన జెండా నెగురవేసిరి. వారెన్నడును గాంధిటోపీని వీడలేదు. రాజమండ్రిలోని పోలీసు కాన్ స్టేబిలులాటోపీని బలవంతముగ తీసివేయగా వారు దానికై హైకోర్టువరకును పోరిరి. గడచిన యెన్నికలలో పంతులుగారు ప్రశంసనీయముగ ప్రచారముచేసిరి. పత్రికలకు వీరు వ్రాయుచుండిన వ్యాసములను బట్టి వీరు కేవలము దేశభక్తులేకాక యావత్ప్రపంచరాజకీయపరిస్థితులను కరతలామలకముగ నవగాహనముచేసికొనినవారనియు, రాజకీయదూరదృష్టి కలవారనియు తెలియగలదు. ముప్పదియేండ్ల క్రిందటనే బందరులో జాతీయకళాశాలను స్థాపించినప్రముఖులలో వీరొకరు.

ఆంధ్రత్వమనిన పంతులుగారికి మిక్కిలి ప్రీతి. ఆంధ్రోద్యమమునకు లేవదీసినవారిలో వీరొకరు. సభలలో

నాంగ్లములో మాట్లాడుటను వీరు గర్హించుచుండిరి. ఈనడుమ రాజమండ్రి ఆర్ట్సు కాలేజి ప్రాతవిద్యార్థి వార్షికసభకు వీరి నధ్యక్షులుగ పిలచిరి. ఆయాహ్వానము నంగీకరించుటకు వీరు రెండుషరతులను పెట్టిరి; సభావ్యవహారమంతయు నాంధ్రములోనే జరుగవలెనను నది యొకటి. సభలో నాంగ్ల పద్ధతిని టోస్టులను జరుప రాదనునది మరియొకటి. ఈషరతులను సభాసమావేశ కర్త లంగీకరించుటచే పంతులుగా రధ్యక్షతవహించిరి. ప్రభుత్వమువారి యాంగ్లకళాశాలలలో ప్రాతవిద్యార్థుల సభలో నాంగ్లము పనికిరాదనుసంప్రదాయమును నెల కొల్పిన పంతులుగారి యాంధ్రాభిమానము నేమని వర్ణింప వలెను? ఆంగ్లము, సంస్కృతము మున్నగుభాషలలోని యుద్గ్రంథముల నాంధ్రములోని కనువదింపజేయవలె ననియు, ప్రపంచములోని విజ్ఞానమునంతయు నాంధ్రము లోని కేదోవిధముగ నవతరింపజేయవలెననియు పంతులు గారు కోరుచుండిరి. వీ రాంధ్రగీర్వాణవిద్యాపీఠమున కొసగిన నిధితో చేయవలసిన పనులలో నిది యొకటి.

౪

శ్రీ సూర్యనారాయణరావు పంతులుగారి మన స్సెప్పుడును ప్రజాసేవచేయుటయందే లగ్నమైయుం డెను. ప్రజాసేవచేయుట కెంతచిన్న యవకాశము వచ్చి నను వారు పోనిచ్చెడివారు కారు. ఒకనాడు పంతులు గారు రైలెక్కుటకు గోదావరిస్టేషనుకు వచ్చిరి. స్టేష నులో జనమునకు తగినంత చోటు లేక సమ్మర్దముగ నుండెను. బుక్కింగుఆఫీసువద్ద కూడ రద్దీగా నుండెను. పంతులుగారు కొవ్వూరు వచ్చినపిమ్మట రైల్వే యుద్యోగుల కొకపిటిషను పెట్టిరి. దానికి ఫలితముగ గోదావరిస్టేషనుతూర్పుగా కొన్నిగజములు పెంచబడెను. అందు చాల బల్లలు వేయబడెను. మరియు పట్టణములో నొక బుకింగు ఆఫీసు నెలకొల్పబడెను. ఇతరులందరును చూచి మన కెందులకని తలచి యుపేక్షించు చిన్న చిక్కులను, కష్టములను తొలగించుటకు పంతులుగారెట్లు పాటుపడుచుండిరో తెల్పుట కిదియొక యుదాహరణము. పంతులుగారిట్టిపనుల నెన్నిచేసిరో లెక్కలేదు. దీనికై వారికనేకవిరోధులేర్పడుచుండిరి. కాని వా రెన్నడును నేమనుష్యుని లెక్కచేయలేదు. వారు బందరులో

న్యాయవాదిగ నున్నపుడుగూడ నే న్యాయాధిపతిని లక్ష్యపెట్టలేదు. తాము బందరులో నున్నపుడు న్యాయాధిపతులు క్రొత్తగ వచ్చునప్పుడును, పోవునపుడును న్యాయవాదిసంఘమువారు విందులు, సభలు చేయు సంప్రదాయమును తీసివేయించితి మనియు, తాము బందరు విడచినపిమ్మట నది మరల ప్రారంభింప బడె ననియు వారు చెప్పెడివారు.

"స్వదత్తా ద్విగుణం పుణ్యం పరదత్తాను పాలనం" అని పంతులుగారు తరచుగ చెప్పుచుండెడి వారు. వీ రీయుద్దేశముతోనే దేవాదాయ ధర్మాదాయ రక్షణమునకు పూనుకొనిరి. ౧౯౧౩ నుండియు వీ రీ విషయమై పనిచేయుచున్నారు. దాతల యుద్దేశమునకు వ్యతిరేకముగ నడుపబడుచున్న దేవాలయములు, సత్రములు మున్నగువానిని బాగుచేసి మంచిస్థితియం దుంచుటకై న్యాయస్థానములలో పోరుటను పవిత్రకృత్యముగ వీరు పెట్టుకొనిరి. సుమారు ౫౦ దేవాలయములను, సత్రములను నీవిధముగ బాగుచేసిరి. పంతులుగారిని నాస్తికులని దూషించు ఆస్తికశిఖామణులలో ననేకులు తమ జీవితకాలములో దర్శించియుండిన దేవాలయములకంటె నాస్తికులైన పంతులుగారు దీపము పెట్టించిన దేవాలయముల సంఖ్యయే హెచ్చుగ నుండుననుటలో సందియము లేదు. 'మీకీ దేవాలయముల గొడవ యెందుల' కని కొందరడుగగా పంతులుగారు 'ఏ దెట్లు నడువవలెనో దానినట్లు నడపుటయే నావిధి' యని సమాధానము చెప్పెడివారు.

ఎవ్వరికిని తెలియకుండ నణగిపోయిన ధర్మాదాయముల నుద్ధరించుటలో పంతులుగారికి గొప్ప నైపుణ్య ముండెను. ఇందుల కొకయుదాహరణము నిచ్చెదను. ౩౭ ఏండ్లక్రిందట ఎడ్వర్డు పట్టాభిషేక సందర్భమున కొవ్వూరు తహసీల్దారు తాలూకాలో ౫౦౦ రూపాయలను పోగుచేసెను. ఒక తహసీల్దారు తర్వాత మరొకతహసీల్దారాసొమ్మును స్వాధీనములో నుంచుకొని తరువాతివానికి నప్పచెప్పుచుండెను. ప్రజ లందరు నానిధిమాట మరచియేపోయిరి. ఎవరోవృద్ధుడు పంతులుగారికి నావిషయమును చెప్పెను. వెంటనే పంతులు

గారు కలెక్టరునకు నోటీసునిచ్చిరి. కలెక్టరు తానేమియు చేయజాలనని సమాధానము వ్రాసెను. అంత పంతులుగారు ప్రభుత్వముపైన వ్యాజ్యమువేసి యా సొమ్ముతోను, దానిపై వడ్డీతోను కలిపి కొవ్వూరులో నొకసత్రము కట్టించుటకై డిక్రీని పొందిరి.

పంతులుగారు నిలబెట్టిన ధర్మములలో కొన్ని చాలపెద్దవి కలవు. ఆమర్తి రామారావు గారి, సుమారు ౫౦ వేల రూపాయలధర్మమును, వీరే నిలబెట్టిరి.

౫

శ్రీసూర్య నారాయణరావుపంతులు గారి చరమావస్థ ముఖ్యముగ నాంధ్ర గీర్వాణ విద్యాపీఠ సేవలో గడచెను. కీర్తిశేషులయిన తిల్లాప్రగడ సూర్యనారాయణరావు పంతులుగారు తమ యవసానకాలములో వీరి నిబిలుచెచ్చి దీనిభారమును వహింపగలసినదని కోరియుండిరి. నాటినుండియు పంతులుగారీవిద్యాపీఠమును పుత్రికవలె పాలించుచున్నారు. ౧౯౩౧ లో నొకసారి విద్యాపీఠము మూసివేయవలసిన యార్థికపరిస్థితి తటస్థింపగా పంతులుగారు నడుముకట్టి సుమారు రెండువేల రూపాయలను చందావేయించి తాము స్వయముగ ౧౨౦౦౦ రూపాయల నిచ్చి ౨౦౦౦౦ రూపాయల నిచ్చుటకు శ్రీవాడ్రేవు జమీందారిణీగారి ధర్మకర్తలను ప్రోత్సహించిరి. రేయింబవలు విద్యాపీఠచింతయే తప్ప పంతులుగారికి మరొకచింత లేకుండెను. లేకున్న ౫౦ వేల రూపాయల నీసంస్థకిచ్చుచు నెందులకు విల్లు వ్రాసియుందురు? కేవలము ప్రాచీనభారతీయ విద్యలు నేటికుపకరింపవనియు, నేటి పాశ్చాత్యవిజ్ఞానముతో వానిని మేళవింప జేయవలెననియు పంతులుగారి యభిప్రాయము.

౬

శ్రీ సూర్యనారాయణరావు పంతులుగారు మత విషయములలోను, సాంఘికవిషయములలోను తీవ్రసంస్కర్త. ఏమతమందుకాని ఏ సంప్రదాయమందుగాని వారికి విశ్వాసములేదు. అంతరాత్మబోధ ననుసరించియే ప్రతిమానవుడును వర్తింపవలెనని వారి యూహ. దీనిని బట్టి పంతులుగారు చార్వాక మతస్థులని తలపరాదు. చార్వాకులవలె వారు ఇంద్రియచాపల్యమునకు లొంగువారు కారు. సన్న్యాసాశ్రమమునకు తగిన వైరాగ్యముతో వారు జీవయాత్రను గడపిరి. వారి యింద్రియనిగ్రహము మిక్కిలి గొప్పది.

సంఘసంస్కరణ విషయములో శ్రీ సూర్యనారాయణరావుగారు వీరేశలింగము పంతులుగారి శిష్యులు. వీరివలె సంస్కరణము నాచరణలో పెట్టినవారరుదు. వీరు ముగ్గురు కుమారులకును, ముగ్గురు కుమార్తెలకును వివాహములను చేసిరి. కాని కట్నము నీయలేదు; పుచ్చుకొనలేదు.

ఒక్కసంగతి చెప్పవలెను. శ్రీ పంతులుగారు పాపపుణ్యములను గూర్చియు, స్వర్గనరకములను గూర్చియు, జీవహింసను గూర్చియు, భగవంతుని గూర్చియు వివాహసంస్థను గూర్చియు వ్రాసియుండిన వ్యాసములలో వారు తమ వ్యక్తిగతాభిప్రాయముల కేమియు తావీయక కేవలము హేతువాదముమీదనే నడచిరని నేను చెప్పగలను. ఒకచ్చోట వారు ముసలియావులను చంపివేయవచ్చునని వ్రాసిరి. కాని యీ కోమలహృదయు డొకసారి నాతో తనదొడ్డిలో పనికిమాలిన చెట్లు కొన్ని కలవనియు, వానిని నరకివేయుటకు తనకు చేతులు రాక అట్లే యుంచివైచిన నీడనైనను నిచ్చుచున్న వికదాయను సంతృప్తిని పొందితిననియు చెప్పెను. ఇట్లే యితరవిషయములలో గూడ వీరు చాలవరకు హిందూపద్ధతి జీవితమునే గడపిరి.

శ్రీ సూర్యనారాయణరావు పంతులుగారు మనకిక కనపట్టరు. కాని వారు చేసిన దేశసేవను మనము మరువజాలము. వా రాంధ్రగీర్వాణవిద్యాపీఠమునకు చేసిన సేవ ప్రత్యేకస్మరణీయముగ నుండగలదు. వారి యభిప్రాయములను రాబోవుతరములవారికిగూడ తెల్పుటకై వారి 'వర్ణాశ్రమధర్మపరిణామము', 'అంతర్జాతీయధర్మశాస్త్రము', 'నానాదేశరాజ్యాంగవిధానము', 'స్వీయచరిత్ర', 'మనస్స్వాతంత్ర్యము' (నాల్గుభాగములు) అను గ్రంథములు కలవు. అయినను తగినవిధముగ వారి స్మారకమును నెలకొల్పవలసిన బాధ్యత యాంధ్రలోకముపైన కలదు.

# ఓటామీల ఆకాశనృత్యము



ఆకాశనృత్యమునకు పేరుగన్న ఓటామీలు మెక్సికోప్రాంతముల ఆదిమనివాసులు. వీరు రెడ్ ఇండియను జాతివారు. ఆ ప్రాంతములు స్పెయిను దేశీయు లాక్రమించుటకు పూర్వమునుండియు వీ

పోవుటకు సాధ్యముకాదు. ఎత్తయిన సరుగుడుచెట్లు, గోధుమచేలు, అరటితోటలు, ఆపల్లెలప్రాంతములకు వింతశోభను చేకూర్చుచుండును. కంచరగాడిదల మీదను, కాలినడకను పోవలయును గాని, సరియయిన బాటలు మొదలయినరాక పోకలసౌకర్యములు లేవు.

ఓటామీల వింత కార్యములలో "ఆకాశనృత్యము" ఒకటి (Juego de los Voladores). ఇది మిగుల ప్రాచీనము. ౧౬౧౨ లో రచింపబడిన గ్రంథ మొకదానిలో దీని ప్రశంసకలదు. అప్పటికే దీనిప్రచారము తగ్గిపోయినది. ఏమారుమూల పల్లెలోనో ఎప్పుడో కాని ఇది యిప్పుడు వాడుకలో లేదు. వీరు తమప్రాచీన వినోదములను, ఆచారములను జాగ్రత్తగా కాపాడుకొనుచుందురు. వీరు తమ పూర్వులదగు గారడివిద్యను ఈనాటికిని మరువకున్నారు.



1. ముగ్గురు ఆటకాండ్రు ౮౦ అడుగుల మాని మొదట నిలుచుకొని ఉన్నారు. నడుమ వేషమున నున్న ఆటకాడు. కుడివైపున బుర్రగిలకపటుకొన్న ఆటకాడు; ఎడమవైపున, బూర, డప్పువాయించు ఆటకాడు ఉన్నారు.

రచ్చల నివసించుచు నున్నవారు. వీరు ప్రకృతము కొండజాతులవారుగను, అనాగరకులుగను భావింపబడుచున్నారు. ఆ ప్రాంతముల ఈశాన్య వాయవ్యదిక్కులందు పెనచుకొనియున్న కొండలనడుమ ౭౫౦౦ అడుగుల పీఠభూమియందలి పల్లెలు వీరి నివాసస్థలములు. కొండలను, లోయలను దా

ఓటామీ పురుషులు నారబట్టలను కట్టుకొందురు; కంబళ్లను కప్పుకొందురు. ఆడువారు చలికాలమున స్పెయినునుండి దిగుమతియయిన రోజాయీలను కప్పుకొందురు. తక్కిన కాలములలో చక్కని అల్లిక అంచులు గల నలుచదురపు, అద్దకపు నూలుబట్టలను ... బుజములమీదనుండి కప్పుకొని ముందువైపున

ముడివేసికొందురు. ఇవి వారి ప్రత్యేకపు దుస్తులు. సామాన్యముగా పురుషులు పరాయీలను, కుడితినీలను, స్త్రీలు పరికిణీలను, కబ్బాలను తొడుగుకొందురు.

ఆకాశనృత్యము చేయువారుమాత్రము తెల్లని నూలుపరాయీలమీద ఎఱ్ఱనిజరీఅంచుల చడ్డీలను తొడుగుకొందురు. ఎఱ్ఱనిరంగు చేతిగుడ్డ నొకదానిని ముందువైపున వ్రేలునట్లు నడుమునకుకట్టుకొందురు. తెల్లని చొక్కాలు తొడుగుకొని, ఆపైన భుజముల మీదనుండి ముందువెనుక వైపుల కుండునట్లు రంగుగుడ్డల నొకదాని మీద నొకటి అడ్డుగ బిగించి కట్టుకొందురు. తలమీద ఎఱ్ఱనిగుడ్డ టోపీని పెట్టుకొందురు. ఆట ఆడువారు ఆఱుగురు. వారిలో అయిదుగురు పైన చెప్పినమాదిరి దుస్తులను తొడుగుకొనుదురు. వారిలో ఒకనివద్ద మూడు కన్నములున్న బూరగొమ్ము ఉండును. వాడు చేతికొక డప్పువంటి వాద్యమును వ్రేలాడ కట్టుకొనును. తక్కిన నలుగురు బుఱ్ఱగిలకలను పట్టుకొనియుందురు. ఆరవవాడు ఆడువేషము వేసుకొనును. వాడు పరికిణీ కట్టుకొనును. తెల్లని జుబ్బాను తొడుగుకొనును. తలకు రంగుగుడ్డను చుట్టుకొనియుండును. చేత నొక పెద్దరంగు రుమాలను, రంగులపాత్ర (గిన్నెవంటిది) నొకదానిని పట్టుకొనియుండును.

గ్రామమధ్యమున విశాలమగు స్థలమున ఒక పెద్ద మ్రాను బోదెను (సరుగుడు మ్రాను కావచ్చును) ౮౦ అడుగుల ఎత్తు ఉండునట్లు నాటెదరు. దానిచుట్టును లావుపాటి గట్టితీగచుట్టబెట్టబడి యుండును. ఆతీగ చుట్లపయిన కాలూని దానిపైన కెక్కవచ్చును. స్తంభాగ్రమున ఒకఅడుగుఎత్తు, రెండడుగుల వలము గల కఱ్ఱదిమ్మ రోలువంటి దొకటి డిప్పవలె అమర్పబడియుండును. దానిమీదనుండి ఆరుమూల లేర్పడునట్లు చక్రమువలె కట్టబడిన కఱ్ఱచట్రమొకటి గొడుగు కమ్ములచట్రమువలె వ్రేలాడుచుండును. స్తంభాగ్రము మీదడిప్ప చక్రమువలె తిరుగుటకు వీలుగ అమర్పబడియుండును. దానితోపాటు ఈ కఱ్ఱచట్రముగూడ తిరుగును. విప్పివిడిచిన నేలకు చేరునంత పొడవుగల త్రాళ్లు ఆరు మానిచివర కఱ్ఱడిప్పకు క్రిందుగ చుట్టబెట్టబడియుండును.

తరువాత ఆటకాండ్రు ఆరుగురు ఆ మానుచివరకు ఎక్కి కాళ్లు లోవైపునకు విడచి ఆరుకఱ్ఱల మీద కూరుచుందురు. వారిలో వాద్యకాడయినవాడు బూర ఊదుచు, డప్పును లయబద్ధముగ వాయించుచుండును.



౨. మానిచివర డిప్పను, మీది కఱ్ఱచట్రమును సిద్ధము చేయుట.

తక్కినవారు గిలకల నాడించుచుందురు. వారిలో ఒకడు వెంటనే కఱ్ఱడిప్ప మీదకి ఎగిరి ఎక్కి, పదినిమిషములపాటు ధైర్యసాహసములతో అద్భుతము గొలుపునట్లు నానావిధముల నృత్యము చేయును. ఇట్లు ఒకరితరువాత నొకరుగ నందరును పదేసినిమిషములు నృత్యము చేయుదురు. వీరిలో ఆడువేషమున నున్నవానివంతు చిట్టచివరవచ్చును. వాడు పాటతాళమునకును, డప్పులయకును సరిగా తనచేత నున్న రుమాలును, పాత్రను ఇటునుండి అటుకు, అటునుండి ఇటుకు విసరుచు, శరీరమును నలువైపులకు వంచుచు, అవయవములను [illegible], అందరికన్న అద్భుత

తరముగ ధైర్యసాహసములను కనుపరచుచు రెండింతల సేపు నృత్యముచేయును. చివరభాగమున మాత్రము ఇందుకొంత అధికముగ సాహసము కనుపించును. ఇతడు యాను. ఇక మిగిలిన భాగము రసవత్తరము, అద్భుతతరము అయినది. అది ఆటకాండ్రు స్తంభముచివరనుండి మరల నేలకు చేరవలసినపట్టు.



3. మ్రానిమీద ఆరుగురు ఆటకాండ్రు. వారిలో ఒకడు దిప్పమీద ఆడుచున్నాడు.

డిప్పమీదనుండి ఆట ఆడుచునే అప్పుడప్పుడు ఒంటి మోకాటిమీదుగ వెనుకకువంగి క్రిందనున్న అయిదుగురు ఆటకాండ్ర తలలకు తన చేతిరుమాలును తాకించుచుండును. దీనితో స్తంభాగ్రముమీద నృత్యము ముగి

ఆటకాండ్రు మ్రానిచివర కట్టబడియున్న త్రాళ్ల కొనల నూడదీసి ఒక్కొక్క త్రాటికొనను ఒక్కొక్కరు తమనడుములకు గట్టిగా కట్టుకొందురు. అంతట తమకాళ్లను మాని కానించి పట్టి చట్రముపయి నారు

నైపుల కూరుచుందురు ఆ క్షణమున వారి యాపాందిక ఎరుపుతెలుపు రంగులుగల ఒకపూమొగ్గను తలపింప జేయును. అపు డొకసంజ్ఞ చేయబడును వెంటనే వారు



4. మ్రానిచివరనుండి ఆట

త్రాళ్లను పాదములసందున పట్టుకొని దాని యాధారము మీదనే కర్రలమీదనుండి చట్రము వెలికి తలక్రిందుగ ఉరుకుదురు, ఆబరువునకు

మొదలిడును. అది తిరుగుకొలది క్రిందచుట్టబెట్టియున్న త్రాళ్లును విడుచుండును. త్రాళ్లు విడుచున్నకొలది ఆటకాండ్రు క్రిందికి తలక్రిందుగ దిగజారుచుందురు. వారు దిగజారుకొలది మానికి దూరమైపోవుచుందురు. ఇది యంతయు పూవుగవిచ్చుచున్న మొగ్గను తలపించును (... విచ్చుచున్న ...గునయిన తలపించును).



5. ఆటకాండ్రుక్రిందకు దిగజారు క్రమము

వారు అట్లు తిరుగుచును, వాద్యములను గిలకలను మోగించుచునే యుందురు. ప్రేక్షకులందరు నోళ్లు తెఱచుకొని, ప్రాణములను బిగబట్టుకొని సంభ్రమాశ్చర్యములతో నిశ్శబ్దముగా నీ దృశ్యమును చూచుచుందురు. అప్పుడు వాద్యాదులమోత, స్తంభముమీద డిప్ప తిరుగుట వలన కలిగెడు కిర్రు తప్ప మరేశబ్దమును వినబడదు. క్రమముగ వారు నేలకు సమీపించి, ఇక తల నేలను తాకి బద్దలయిపోవునేమో యను సంశయము కలుగు సమయమున, పాదములతో పట్టియున్న త్రాటిని తటాలున



6. నేలచేరువకు వచ్చినను ఇట్లు బూర ఊదుచును, డప్పు మోగించుచును ఉందురు.

వదలి చులకనగా తలక్రిందుల తిరిగి నేలమీద చప్పున నిలువబడుదురు. ఈతంతంతయు రెండు నిమిషములలో ముగిసిపోవును.



7. గ్రామానికి భూతాదుల బాధ కలుగకుండ కాపాడుటకయి చేత కొరడామొదలయిన పరికరములను పట్టుకొనియున్న మాంత్రికుడు.

(జాగ్రాఫికల్ మేగజిన్.)

---

# సాహితీ సమాలోచన

జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి



సాహితీసమాలోచనమున మనదృష్టి నాకర్షించు ముఖ్యాంశములు పాండితియును, సహజశక్తియును. పరిశ్రమ చేయుజాలువానికి పాండితి లభించును. కాని, ఆత్మమహత్త్వమును గుర్తింపగోరు విజ్ఞానపిపాసువు పాండితితో దృప్తినంది యూరకొనియుండడు. ఎంత ప్రశంసనీయమైనదయ్యు పాండితి యొరులవర్థించి పడసిన సరుకుమాత్రమే! మనుష్యహృదయమం దీశ్వరప్రజ్ఞ కలదు. సృష్టివలనగాని ఇది సంతృప్తిగనదు. సహజమైన భావమును, స్వతంత్రమైన భావను సృష్టించుకొనవలెనని గుండెలో గల ప్రతిభ ఆతురం పడును. ఇట్టిసృష్టి తలనూపిన మంగళముహూర్తమందే సార్థకములైతిమని హృదయస్థ సచ్చిదానందములు మిగుల నుప్పొంగును.

మానసకేదారమున నడగియున్న శక్తిని కదలించు హలము పాండితి. భావి దివ్యభావ ఫలసాయమున కిది నిమిత్తమాత్రమే! పాండితి అన్నపుముద్దవంటిదనినను అనవచ్చును. కడుపున బడిన ముద్ద రక్తమాంసములగును; ఆయురారోగ్యముల కాధారమగును. జీర్ణమైన పాండితి మనసున కెంతో కండనిచ్చును. జిజ్ఞాసకు మఱింత జీవమిచ్చును. జిజ్ఞాస యంతర్దృష్టి తీక్ష్ణమొనరించును. రచయిత తన ప్రతిభను తాను గుర్తించును; ఆత్మవిశ్వాసము నందును. ఇతడు దివ్యసృష్టి సమన్వితు డగుననుట తప్పుకాదు; దివ్యపక్షము లందుననుట సత్యదూరముకాదు. పక్షవిక్షేపమున భావనావీథులం దెగసి క్రొంగ్రొత్తదృశ్యములను విలోకించి, పూవులుపోలు పలుకులందు, నభోరాగముల కెనయైన మాటలందు వానిని తళుక్కొత్తించి సాహితి కప్పనమనును.

సృష్టికర్త కాగోరు రచయిత మహాసంయమి కావలెను. ఇంద్రియపటుత్వముగలవాడే సంయమిత్వమున కర్హుడగునట్లు, పండితుడే ఇట్టి శక్తి కర్హుడని చెప్పినను జెప్పవచ్చును. పండితుడు కాని ప్రతిభావంతుడు తొలిభవమందైన పండితుడై, తపస్వియై యుండనోపు. ఈశ్వరకటాక్ష మీతని హృదయముపై జాల్వారి సాహితీ పోషణమున కక్కరైన పాడిపంటల నందు పెంపొందించియుండును. జితేంద్రియుని శక్తి బాహిరమున వ్యర్థముగాక, అంతరంగమును ద్రవ్వి త్రవ్వి దాని గభీరతను హెచ్చించి నిహితసారమును స్మృతిపీఠమున నిలుపును. పాండితి నంతరంగవ్యవసాయమునకై వినియోగించునాతడు తా దలపని, తా నెఱుగని, తా నూహింపజాలని శక్తి తనయందుంట గాలక్రమమున గుఱుతించి అదను లభించినపుడు దాని సుజ్వలవ్యక్తీకరణమొనగును. పాండితిని ప్రకటించుట తప్పనను కాని కేవలపాండితీప్రకటనము గాంచి, శతాబ్దులును సహస్రాబ్దులును మానవమస్తకముపై మణిమకుటమును నిలుపవని నొక్కి తెలిపెదను. సాహిత్యసమ్రాట్టునకు రత్నఖచిత సింహాసనమును నిర్మించునది దండి తెలిపిన నైసర్గిక ప్రతిభయే! ఈ దివ్యాసనమునకు పాండితి సోపానము కావచ్చును. మెట్టుపై గూర్చున్నవానికి సర్వకాలములును జేజేలు పాడవు.

పాండితియే పరమావధి గావించుకొనునాతడు ఒరుల సొత్తుపై దృష్టి నిలుపును. ఈతనిది మీదిదృష్టియే! చూడ్కిని వెనుకకుమరల్చి తన గుండెలోని రత్నరాజిని కన్గొను నవకాశ మీతని కుండదు. పాండితి నిమిత్తమేయని గ్రహించునాతడు కొండొక యుద్గ్రంథమును పఠించి, అందొక్క వాక్కును మదికైకొని, మననము గావించుకొని, యోచనాబల మంది నిజాంతరంగమున సొంతసొమ్మెందున్నదో వెదకును.

స్వంతశక్తి విజృంభింపవలెననిన పాండితి వెన్క నుండవలెను. ఎంతో కష్టపడి సంపాదించి, మనమున జేరవేసికొనిన సరుకును అంతరంగమున గట్టియుంచుట చాలకష్టము. ఈసంవరణ సామర్థ్యము కాలక్రమమున గాని చేకూఱదు. Conservation of energy ని గుఱించి భౌతికశాస్త్రము తెలుపుచుండును. భౌతిక శక్తులలో Energy ఒకటి. ఇది కొండొకవడి అడగి యుండవచ్చును గాని కడతేఱదు. భావశక్తి దీనికంటె పెక్కుమడుంగు లధికమైనది. ఉచిత ముహూర్త మాసన్నమగువఱకు ఇది యంతరంగమున నణగియున్నను, అంతదనుక బుగ్గికాదు. భావిభవములందుగూడ నది యవతరించితీఱును. రచయిత లీయంశమును హృదయంగమ మొనరించుకొనినచో, చిత్తమువచ్చిన చొప్పున సందర్భాసందర్భములను పరికింపక లోని సరకు నవ్వల గుమ్మరింప దలపడరు. పెండ్లికొమరిత కూర్చుండవలయు హారిద్ర పీఠముపై సదస్యపు బ్రాహ్మణులు చాపచుట్ట వతుగపడినచో వికృతదృశ్యము ప్రత్యక్షము కాదా? వ్యాసపీఠస్థలి నుండవలయు శుభవిషయముపై అక్కరకు మాలిన సరకు ఉల్లిపడినయెడల నెట్టి జఘన్యదృశ్యము సృష్టికాదు? వ్యాసమందలి సంబంధసూత్రము తెగిపోదా? దాని సౌష్ఠవమునకు, దాని Symmetry కి భంగము కలుగదా? దాని సౌందర్యమునకు ముసలమును, పఠితల మనసులకు విసుగును దాపరింపవా?

ప్రపంచ మహారచయితల వ్రాతలను పరికించితిమేని, కాలక్రమమునగాని మితిమీఱిన పాండిత్య విజృంభణమును వీ రరికట్టజాల రైరని గ్రహింతుము. ఈ విజృంభణము పదములకును, భావములకునుగూడ సంబంధించినది. అక్కరకుమాలిన సొదయు, కడుంగడు క్లిష్టమైన శబ్దములును, మాఱుమూలమాటలును ఈ విజృంభణమున వెలువడును. ఇది తప్పక కళకు చేటువాటిల జేయును.

హద్దును పాటింపక పరభాషణములను (Quotations) తమ వ్రాతలందు గుప్పించువారు ఇట్టి విజృంభణ దోషమునకు పాల్పడుదురు. విజ్ఞానజీవనమున రచయిత ముందంజ వేసినకొలది ఈ దోషము తనంతదాను సమసిపోవును. ఆధునికులలోనంశి [illegible]

సహజశక్తి కుసుమించును. ఎడ్మండుబర్కు మహాశయుడు అద్భుతమైన ప్రతిభగలవాడనుట నిస్సంశయము. అక్కరకుమాలిన చోటులందు గూడ నీతడు Quotations దొరలనీయ నిచ్చెననుటకు నీతని రచనలనుండి కొన్నిదృష్టాంతములను చేర్కొనవచ్చును. అక్కరైన చోటులందు వీనిని ప్రయోగించుటొప్పు. ఉపనిషత్తుల నాధారముగాగొని రవికవీంద్రుడు "సాధన", "మానవు" డాది గ్రంథములను వ్రాసి విరివిగా వీనిని వాడినాడు. రాధాకృష్ణుని రచనలందును, ముఖ్యముగా సంస్కృత విజ్ఞానముపై నాధారపడిన ఈతని Indian Philosophy యన్న గ్రంథములం దివి విశేషముగా కానంబడును.

తక్కుంగల రచనలలో Quotations కు తావుండనే యుండదు. వ్యాసరచనమందే ఇవి తలసూపును. తన కేసును బుజువుచేసికొను న్యాయవాది ఎన్నో తీర్పులను Digests నుండి, వివిధములైన Reports నుండి ప్రమాణములు గావించుకొనులాగున తాదెలుపు దానిని ఒక్కొకచోటున వ్యాసకర్త Quotations వలన బుజువు గావింపవచ్చును. కాని, ఇవి రచయిత స్వంత భావములను దిగమ్రింగునవిగా నుండరాదు. నీలాకాశమున, శారద రాత్రులందు తేజరిల్లు చందురుని చందమున రచయిత స్వతంత్రభావము సారస్వత ప్రత్రమున గాంతిలవలెను. చంద్రు నాశ్రయించిన చుక్కలట్లు ఇందందు Quotations ఉండవచ్చును. స్వతంత్రభావము కీని నాశ్రయించునదిగా నుండరాదు. గర్భాలయమున శంఖారవముగుతటి చిఱుకిల చప్పుడున కవకాశ మీయవచ్చును గాని, రుంజ వాద్యమునకు గాదు. అష్టదిక్కులందు ప్రతిధ్వనించి వాని యెడందలందు గంభీర భావములను లేపవలసినది శంఖారవము! పఠిత హృదయ కరండమున ముఖరితమై, అందు గంభీర నిస్వనమును లేపునది శంఖారావమున కనర్యమైన సహజభావమే! భావ బంధురమైన ఈ నినదము నణంచు Quotations ఉండరాదు. ఉండెనేని, అవి కుక్కలట్లఱచి అసలు తలపును మూలనక్కించి మనసునకు దురంతమైన బాధ గలుగజేయును. ప్రమిదలలోని వత్తి నిగనిగ [illegible] కెంత హాస్కు కలదో సహజ

భావము పొంత పరకీయమైన అభిప్రాయమునకు (Quotation) అంత వాక్కే కలదు. కనులకు మిఱుమిట్లు గొలుపు జ్యోతిర్జ్వలను ప్రదర్శించున దీ భావమే! అక్కరకు మాలిన పుల్లలు ప్రదీపమున జేరుకొనెనేని, ప్రదీపము యొక్క పని యేమగును? అమెరికా మహారచయిత ఎమర్సను గ్రంథములను పరికించితిమేని, ఈయంశము నాతడు చక్కగ గ్రహించెనని తెలిసికొందుము. ఈతని రచనమున చూడ్కిని చొప్పించినపుడు కోటివత్తులతో తేజరిల్లు పూజాగృహమున ప్రవేశించితి మను మద మందెదము.

మనసు మగ్గినపిదప వ్యాసరచయిత Quotations కావిలో పడియుండనక్కరలేదు. అనవరత మీతడు న్యాయవాదస్థానమున నిలువరాదు. గురుపీఠమున నాసీనుడగు మహావిజ్ఞాని యీతడు. ప్రమథగణపరివృతుడైన మహాదేవుని బోలువాడు. అమరవ్రాతము దహిపర్యంకమున దేజరిల్లు దేవదేవుని దలపించువాడు; మునిముఖ్యుల దమ పయోజపీఠి నాసీనుడైన విధాత కెనయైనవాడనినను అనవచ్చును. ఈతని నుడువులు అద్భుతవిజ్ఞానముతో,— గభీరప్రపంచపరిజ్ఞానముతో నిండియుండును. ఒక్కొకమాట ఒక్కొక వజ్రపుదునకబోలి యుండును. ఒక్కొక పలుకు ఒక్కొక నక్షత్రమట్లుండును. ఒక్కొక యక్కర మొక్కొక సుధాబిందువున కనయై యుండును. "సత్యములను విలోకించిన కొలది మనసు మహిమోపేతమగునని షెల్లీప్రభృతులు వాకొనిరి. ప్రతిభావంతుని రచనము సత్యములరాశి! భావోద్వేగముచే, భావనావేశముచే నాత్మవిస్మృతుడైన మంగళముహూర్తమున నీతని ముఖమునుండి ముత్యముల ట్లీ సత్యములు వెల్వడును. గ్రీకుచరిత్ర ఒక్క Delphic Oracle గురించిన యుదంతము దెలుపుచున్నది. భారతఋషులందఱు Oracles! "నానృషిః కురుతే కావ్యం" కదా! మహాకవులును, మహారచయితలును ఋషులే; వీరి వాక్కులు సత్యసందీప్తములు. వీనికి ఋజువులేల? సూర్యతేజస్సును కాగడా ఋజువొనరించునా? చంద్రికా సౌందర్యమును ఋజువొనరించుటకు సాక్షులు కావలెనా? గులాబిమాధుర్యము నెఱుగుటకు సెంటుబుడ్లు యుపన్యాసములు

అమృతమందలితీపికి భాష్యముచెప్పునవి బెల్లపుఅచ్చులా? పరంజ్యోతికి గుడ్డిదీపములు పాఠములుచెప్పునా? స్వయంభువునకు మంత్రసాను లెందులకు? ఓటికొంపలకు బొట్లుండవలెనుగాని గగనచుంబిమహాసౌధముల కవెందులకు? హిమగిరులకు గులకరాళ్లగురుత్వ మక్కరగునా? సర్వాంగసుందరికి నగలెందులకు? వ్యాసమహర్షికి సంస్కృతప్రబోధమా? మల్లెపూవుకు సుద్దపూయుటా? కన్నతల్లికి ముద్దులుకట్టుటా? అర్కకాంతికి జేగురుపూతా? సహజరచనమునకు సాక్ష్యమా? వన్నెచిన్నెలా? ఇందు Quotations పడెనేని, సుధాకలశమున గులకరాళ్లు పడినట్లగును; మృష్టాన్నమున మట్టిబెడ్డలు దూరినట్లగును.

సహజ ప్రజ్ఞాధురంధరుని రచనము మిహిరమండలమట్లు వెలుగొందును. ఈ మండలమధ్యమున నుండువాడు సూర్యదేవుడు; చుట్టు దేజరిల్లునవి సహస్రమయూఖలు. ప్రతిభాశాలి తన రచనమున దినమణివలె వెలుగొందును. ఈతని భావములో? అవి వేయికిరణముల హొయలున వెలుగొందును. తన ప్రజ్ఞ నుగ్రదొక్క, ఒరులసొత్తునకు సత్తువకు ఆత్మార్పణమునునాతడు గ్రహణమునాటి తరణికరణి నుండును.

సహజశక్తియందుమే! అదెట్టిది? మంజూషమందలి మానికమును పోలునదికాదు. విష్ణుదేవుని మూపున గొని, పదునాలుగు భువనములం దెగయు విహంగపతి వంటిది! భావనము కతన దీని కిట్టి శక్తి కలుగును. భావనము హృదయగుణము. హృదయమే కమల. మహాలక్ష్మి కడుపున బుట్టిన మన్మథునివలె ఇందుండి యుదయించు భావము సుందరమై యుండును. సహజ సౌందర్య సౌరభ మాధుర్యము లెందు వెలయునో సద్భావసదాశయసద్వాక్కులందే యుద్భవించును. నిర్మలాకాశమే కాంతి నీనునట్లు, కరుణామయి శివాయుని కనులీల సచ్చిదానందములచే నిండిన గుండె మహిమోపేతమైన సాహితిని గనును. మగవాడు ఆడుదాని వేషము వేసి ఎంత తినికినను బిడ్డను కనగలడా? కనగలిగినచో, ముసలము దెచ్చు బండరాతిని గనవచ్చును. గుణరహితుడు, హృదయరహితుడు, ప్రతిభారహితుడు కేవలము గట్టి సారస్వతమును—ముద్దు

గొలుపు భావడింభకమును గనదలచుచో, నిట్టి యరిష్ట మునే తెచ్చిపెట్టును. కార్లయిలు తెలిపిన కన్నులు లేని వారును, మతిలేనివారును రాతిని చంకబెట్టికొని "బిడ్డా!" యని ముద్దాడిన ముద్దాడుదురు. కళాదృష్టిలేనివారు ప్రతిభారహితుడిచ్చిన రచనమును అక్కున నదిమిపట్టి మటిమటి ముద్దిడుకొనుట పరిపాటి. రసరహితములై భావరహితములై ఆలోకరహితములై, ప్రాణరహితములైన రచనలు వసుంధరలో నందంపుటచ్చున (దువ్వలువునచుట్ట బడిన బెడ్డలవలె) దోచినంతన నెందఱెందటి ముద్దులనో అందుచున్నవి. ముద్దుకృష్ణునిబోలు భావమును, దేవమానవుల నమస్సుల నందు భావమును దేవకి పగిది తపస్విని యైన మానసమే కనగలదు.

శ్రీకృష్ణుడు సృష్టికర్త. సహజభావమును సృష్టికర్తయే! తనపై కన్నుంచినవారి మనసులం దిది యెన్నెన్నో నూతన భావముల నుదయింపజేయును. ఈ శక్తినే Suggestive ability అందుము. ఇది Creative ability లోనిదనుట స్పష్టాంశము. చంద్రికను చూచినంతన కడలి కడుపులో నెన్నెన్ని కెరటాలుప్పొంగవు? పుష్పహృదయమున మరందము తోచినంతన మధురఝంకృతులు సలుపుచు నెన్నెన్ని గండుతుమ్మెదలు వెల్వడవు? పూలమాలను చేగొని సుందరి యొక్కర్తు స్వయంవరాంగణమున జూపట్టినతోడన నెందఱెందటి రాకుమారుల హృదయములు చలింపవు? ఎందఱెందటి దృగిందిందిరము లామెవదనవనరుహముపై వ్రాలవు?

భావము మెఱుపుదీగకంటె వడిగలదని వచింతుము. దానికంటె గాంతివంతమైన దనుటయు నిక్కమే! ప్రభాకలితమైన తలపు మనసున ఒక్కొత్తినంతన నూతన భావసృష్టి కలుగునంటిని. దినకరుడు తూరుపు దిక్కున తోచినంతన నిభృతకులాయములనుండి మధురకూజితములు సలుపుచు, పక్షిభావములో గాయత్రి నాలాపించుచు నెన్నెన్ని ప్రాణులో వెడలు టెవ్వ రెరుగరు? వెలుగురేకలు తళ్కొత్తినపుడు గమోయవనిక చిరుగుటయు, అడగిమడగియున్న అందచందములు కనుల బడుటయు సంభవించునుగదా! పరిపూర్ణత్వదేవత్వములు మనుష్యహృదయమున నున్న వనియు ("Perfection and Divinity are already in man"—Swamy Vivekananda), వీనిపై మాధ్యాంధకార మలముకొని యున్నదనియు, ఇది తొలగినతోడన లోగల దివ్యశక్తులు విజృంభించుననియు ఆదినుండి ప్రాచీవిజ్ఞానులు తెలుపుచునే యున్నారు. భావమరీచికలు హృదయమున దళుకులీనినపుడు, తమసావృతమైయుండి బహుభవసంచితమైయున్న వెనుకటి భావవిభూతియు, వివేకానందు డనిన పరిపూర్ణత్వదేవత్వములును స్మృతిపీఠమున దేజరిల్లును. వీనికి నూతన సృష్టి తోడైనపుడు హృదయము విష్ణుదేవుని శయ్యాగృహమట్లుండదా? సర్వతోముఖమైన హృదయమహత్త్వము నిట్లు ప్రకటించు ప్రతిభాసమన్విత భావ మెంత యుత్కృష్టమైనదో!

హృదయ మహత్త్వమును గుర్తించిరయే విజ్ఞానులు హృదయముతో భావించుట ఘనతరాంశమని వాకొనిరి. వీణాహృదిని మీటిన జాలును, మధురగానఝరి యుబికి తెరలుతెరలై దివిదెస జాల్వారును! భావనచే హృదయమును స్పృశించి కలమును పట్టినజాలును, లేఖినీముఖమునుండి నవజీవనధుని కనుపడిగ ప్రవించి సాహితీజగతిని తనుపును! ధ్యానముచే హృదయస్థ దివ్యధరాజమును గదల్చినజాలును, వాక్కులనుండి పారిజాతములు జలజలరాలును! ప్రార్థనచే హృదయస్థిత వనమాలిపదములు పుడికినజాలును, పదునాలుగు భావభువనములను కుదురుగ బొజ్జనిడికొని, మంజులవంశీరవము సలుపుచు, కలముకొననుండి అల్లన సాహిత్యాంగణమున ప్రవేశించి, దాని నాతడు బృందావనము గావించివైచును! తరణికులగల బరువులెత్తు కిరణములవలె, ఘనభావముచెంత గంతులిడు కడలేని తలపుతళుకులట్లు, వనమాలిగూడి వ్రజయువతులు వెడలి ఈ బృందావనమున రాసక్రీడల దేలుదురు. కన్నన్నపతిత ఈ సారస్వతాంగణమున దివ్యశోభను తిలకించి మటిమటి మురియును; వీనులున్న విమర్శకు డీదు శ్రుతిగోచరమగు మధురనినదమున కలరి ఆత్మవిస్మృతుడగును.

పాండితి మెదడు కను కొడుకు. సహజశక్తి హృదయసముద్భవమైన బిడ్డ. నైసర్గిక ప్రతిభయను నామాంతరముగలది. ఆత్మనందనమున దీని ప్రాభవము ద్ధిలుగా [illegible] సంపర్కమున కలుగు భావము,

ఈ భామ యభినయించుచుండ పాండితి వెనకనుండి భళాభళి యనవలెను. అపుడే కథ రక్తికట్టును. భామను వెనకకుద్రోసి, తాళమువాయించువాడే గజ్జగట్టి తెయ్యి యని ముందులకురుకుచో రసభంగము కాదా? సహజశక్తిని వెనకనిలిపి పాండితి విజృంభించుచో రసభంగము కాదా? వందిమాగధులలో నొకడు రాజుగారిని క్రిందికిదింపి, భట్రాజుగిరి వారి తలకు గట్టి తాను సింహాసనము నధిష్ఠించి హుకుము చలాయించుచో నరాజకము తలసూపదా? రాణిని క్రిందికి దింపి, తాను చక్కగ చీరసింగారించుకొని కులుకుచు దాది పూలపానుపునెక్కిన రోతబుట్టించు వికృత దృశ్యము సృష్టికాదా? ఉష్ణీషమున వెలుగొందు మణిని తొలగించి, మడమలమీది యందియలను తలపై కెక్కించిన నెట్టి చెట్ట కలుగదు? పూవులందడగియుండు దారమువలె సహజశక్తియందున పాండితి విడియవలెను. దారపుటుండలో నొక్క పూరేకును చొప్పించిన సదెట్లుండును? పాండితిలో ప్రతిభ నక్కినచో నది కన్నుగట్టునా? శైవాలమందలి పుష్పమునకు నాశ్రమమందలి శకుంతలను పోల్చిన కాళిదాసునట్టి ప్రతిభావంతుడో యోజింపుడు. సుమసౌందర్యముపై నాచు దాడివెడలదు. పచ్చనియాకుపై పన్నుండిన గులాబివలె, తామరలందు శోభిలు రాజహంసకైవడి, పాదుపై పవ్వళించిన దొండపండుడంబున, మేఘశకలముపై రంగారు చంద్రవంకచందమున, శ్వేతఫాలముపై తేజరిల్లు అనలతిలకము పోలుపున, శ్యామసుందరుని కవుంగిలిలో నిశ్చల విద్యుత్తువలె వెలయు నగుమోమురాధ వడువున ప్రతిభ కన్నుగవకు విందొనరించును. ఇది డొంకలోని మొగ్గవలె నుండరాదు. నూఱుకోయిలలో నొక కాకి యున్న నంతగా చింతయుండదు. నూఱుకాకులం దొక కోయిల యుండుచో "అయ్యో!" యనిపించదా?

జిజ్ఞాసువుల దృష్టిని చూఱగొనిన ఎమర్సను ఇట్టి కళాకౌశలము నలవఱుచుకొనినాడు. ఈతని కీడైన రచయితె ఇంకొకడు పాశ్చాత్య జగతియందింకను జనింపలేదు. కార్లయిలువలె నీతడు "భగవద్గీతా"నువాదమును పఠించి, భారతసంప్రదాయము నారాధించిన మనీషి. ఈతనివలె తాత్త్వికకవియై, తన ప్రతిభా ప్రాభవమును సభ్యజగతిమ్రోల ప్రకటింపగలిగిన భారతీయుడు రవీంద్రుడు. బహుళ సత్యము లీతని రచనమున వెలుగొందును గావున నది నక్షత్రఖచిత విహాయసమట్లుండును. దీనిని తిలకించుతఱి హృదయము భావోద్వేగముచే నిండిపోవును. అంతరంగమున నానందవార్ధి యుప్పొంగును. వట్టిపాండితితో నిండినపుట Legal Digest వంటిదనినను అనవచ్చును. మనసున కిది యానందమును గాక దురంతమైన యాతనమును కలిగించును. "ఆహా!" యనిపించక ఇది "అయ్యో!" యనిపించును. పాండితి మెదడునుండి పుట్టిన గట్టిపిండమగుటచే మెదడుగలవారికే ముద్దు గొలుపును. వీరి సంఖ్య యల్పము. వీరుశాస్త్రుల్ల వర్గములోనివారు. కళ హృదయమునకు సంబంధించినది. ప్రజలందు బహు సంఖ్యాకులు హృదయము గలవారు. శాస్త్ర మేకొందఱికో యుద్దేశింపబడ, గళ ఎందఱికొఱకో సృష్టినందును. ప్రకృతియంతయు గళాసందీప్తమేకదా! పూవును చూచి ఎంద ఱానందింపరు? ఉడుపతిని గాంచి ఎందఱెందఱు ముదమందరు? సృష్టిచిత్రములను చూచి ఎవ్వరైన "ఇసీ!" యందురా? కళను సృష్టించువా రేకొందఱోయైనను, కళను కన్నులకద్దుకొనువారు పల్వురుందురు. కలముపట్టగలవా రల్పసంఖ్యాకులైననేమి, కలము కనినదాని నక్కున జేర్చుకొని మురియువారు బహుసంఖ్యాకులుజుడీ! చక్కనిరచనము, తేనెకాల్వలతో నిండిన రచనము అనేకుల నలరించును. ప్రతిభాశాలిరచనము పూలతోటవలె నుండును; పండితుని రచనము బండరాళ్లతో నిండిన క్వారీవలె నుండును. కుసుమోద్యానమున పరుగులెత్తుట కందఱు నాతురంపడుదురు. రాళ్లగుట్టలో నులుకులెత్తనుంకించువారు కాళ్లువిఱుచుకొనరా? క్లిష్టరచనమును విలోకించినపు డెందఱెందఱి గుండియలో దడదడలాడును.

పరిమాణము ననుసరించికూడ సౌందర్యము తేటపడును. గులాబిపూవు చేటంతయుండుచో తన యందమును గోల్పోవును. చక్కని అంగప్రత్యంగములు కలదియయ్యు, ఆడుది యొడ్డు మహాకాయ యగుచో ఆండకత్తె యనిపించుకొనదు. మఱి గ్రామదేవతయని ఈమెదరిజేరుట కళికలు లడలుదురు. అక్కఱకుమాలిన పెద్దముక్కు అలంకార సమన్వితమైనదయ్యు ఎవరికో

గాని కొరుకుపడనే పడదు. బెడ్డలతో నిండిన పులగము నెవ్వరు తిందురు? రాతిపెట్టెలోని నగ నెవ్వరు మెచ్చెదరు? లలిత పదపంక్తులే సుందర రచనాసృష్టికి పనికివచ్చును. చిన్నిచిన్ని ముత్తియములే ముద్దుగొలుపు సరమగును. తిరుగటిరాళ్లను దండజేసి "తల్లీ! మాలగైకొను"మని ఎవ్వరైన భాషాయోషకిచ్చి వరములందగలరా?

పూవులో సౌరభ ముండునందురు. సౌరభముచుట్టు పూవుండు నందును. పువ్వుదళములందే తావితనకు తగిన వ్యక్తీకరణ మార్గమును గనును. సహజమై, మధురమైన భావము సుమసన్నిభ పదములందే ఆత్మప్రకాశ మందును. అందకత్తెయైన భావము తన భాషాంబరమును తానే రచించుకొనును. శంఖచక్రములతో నుదయించిన దేవదేవునివలె, కవచ కుండలములతో జనించిన కర్ణుని కరణి ప్రతిభాశాలి హృదయమునుండి ఇది సహజాలంకారములతో నుద్భవించును.

కడలికడుపున నెన్నో యలలుదయించును. గభీర హృదయమం దెన్నెన్నో తలపుకెరటాలు తమంతదాము పుట్టి, పొంగి పారలను. ఇవి సాహితీ పత్రమున దోచినపుడు అనంతగీతిక వెడలి అంతరంగమందలి వీనులకు విందొనరించును. సింధుగర్భమున నందందు దీవులుండునట్లే సహజ రచనమున నందందు Quotations ఉండవచ్చును. ఎంత చక్కని దీవులైనను సాగర సంగీతము నాలాపింపగలవా? వీచికాయువతులు చక్కని మేజువాణి చేయుచుండ మీసములు ద్రిప్పుచు, పాటజూచు రసిక శిఖామణులవలె నివి యబ్బురపాటున జూచును. అంతియే! సాహిత్యాంగణమున మంజుల గీతిక నాలాపించునవి సహజశక్తి సముద్భవ భావములే గాని కంఠస్థము గావింపబడి, మరల క్రక్కబడిన Quotations కావు.

మనుష్యాత్మ స్వాతంత్ర్యమును వలచునది. సాహితి ఆత్మసముద్భవము. ప్రాచీవిజ్ఞాన మాత్మను హంసకు పోల్చినది. అది హంసయేయనినది! దీని సహజస్వాతంత్ర్యమునకును, నైసర్గిక ప్రతిభకును అవినాభావసంబంధము కలదు. అంకిలి నెఱుగనపుడే ఇది పూర్ణముగ నాత్మప్రకాశము గావించుకొనగలవు. ఇట్టి వ్యక్తీకరణమందే అద్భుతమైన కళాసృష్టి గోచరించును. మహాకవుల రచనలను పరిశీలించినపుడీ సత్యము నిండుచందురుని వలె చూపట్టును. షెల్లీకవీంద్రుడు తన యాత్మను పాండితీ పంజరమున బంధింపక, చిత్తమువచ్చిన తెఱగున నంతరిక్షమున నెగయనిచ్చి, ఆనందస్వాతంత్ర్యములను యథేచ్ఛగ వ్యక్తీకరింప నిచ్చినాడు. ఈతని "Sky-lark" ఈతని యాత్మకు మాఱుపేరని వాదింతును.

మానసికముగ ననంతవిశ్వమున నెంతెంతదూరమో పోజాలునట్లు ప్రజ్ఞాధురీణుడైన రచయిత విజ్ఞానవిశ్వమున బహుదూరము పోగలుగును. దివ్యపుష్పకమెక్కి, వైదేహీసహితుడై శ్రీరాముడయోధ్యకు మరలు తటి అంతరిక్షమునుండి ఎన్నెన్నో సుందరదృశ్యముల నర్ధాంగలక్ష్మికి జూపి, తానుమురిసి, ఆమెను మురిపింపజేసినట్లు ("రఘువంశము"ను చూడుడు) కలము చేబూని మనసునకు Key యిచ్చి, అంతరంగపుష్పకమున నంబరవీథి నెగయుచు బ్రహ్మాండమందలి బహుళదృశ్యముల నవలోకించుచు, నొక్కొక్క దృశ్యము నొక్కొక్క కలముపోటున నిజరచనమున తళుక్కొత్తించుచు నీ రచయిత తాను రఘురాముడై, పాఠకలోకమును వైదేహి గావించి మఱిమఱి మురియును. సిద్ధహస్తుడైన వ్రాతగాడు ఒక్కనుడువున నొక్కయద్భుత దృశ్యమును చూపగలడు; త్రుటిలో పఠితమనసును బహుయోజనముల దూరము గొంపోవగలడు; చుక్కపడుచులందు నిలిపి వింతయాటలకు పురికొలుపగలడు. వెన్నిసన్ప్రతిభ ఎందఱెందఱు పాఠకులకు నుత్తర గగనమున కాంతిలు Aurora borealis చూపలేదు? భూమ్యాకాశములనడుమ చిందులుద్రొక్కు గజాసురుని మెప్పునందిన కపటంపు గంగిరెద్దువలె నిట్టి రచయిత మనసు భూనభోంతరాళములందు వింత నృత్యము గావింపగలదు; నారదతుంబురులై తన్నాశ్రయించిన పఠితలచే నాట్యమాడింపగలడు. ఈప్రజ్ఞ నతడు తన దృష్టాంతములందు ప్రదర్శింప గలడు. స్థలకాల ప్రతిబంధకము లీతనికి వంగి సలామొనరించును గావున, సుదూరదృశ్యములనేగాక భావికాలమందలి విశేషముల గూడ నీతడు రంగురంగుల దృశ్యములందు చిత్రింప గలడు. కావున విజ్ఞు లీతని దివ్యదృష్టి గలవాడని,

ప్రవక్తయని (Prophet అని seer అని) వచింతురు. ఈతని చిత్త మెంత వేగవంతమైనదో, ఈతని దృష్టి ఎంత దివ్యమైనదో, ఈతని సృష్టిశక్తి ఎంత యద్భుత మైనదో, ఈతని ప్రతిభ ఎంత మహత్తరమైనదో ఈతని రచనా,[చిత్రము లు (Vision, illustration Etc.) చెప్పక చెప్పను. విజ్ఞాన వీథులందలి వివిధ విషయము లను సంక్షిప్తోల్లేఖనములందును, విపుల సాదృశ్య ప్రతి పాదనములందును (Allusions, allegories Etc.) చాకచక్యముతో నీ విజ్ఞాని ప్రదర్శింపగలడు. విజ్ఞానులైన చదువరుల మనసులం దివి విద్యుత్తుల వలె దళ్కొత్తును. మెకాలేమున్నగువారి గద్యరచ నలును, టెన్నిసన్ ప్రభృతుల పద్యరచనలును ఇట్టి తళుక్కులను వర్షించును. ఈరీతి పాండితీప్రదర్శనము రచనమున నందందు తలసూపునంతదనుక ప్రశంసనీయ మైనది.

అపూర్వ సృష్టిలోనికి, విశాలవిజ్ఞానాంగణము లోనికి బహుళమానసములను దోకొనిపోవు కలము యొక్క మంత్రశక్తియును, రచనమందలి ఇంద్రజాల మును ఎట్టివో యూహింపుడు.

ఈకలము నారాధింపని సీమలేవి? ఈరచనమును కనులకద్దుకొనని యుగము లెవ్వి?

---

## భారతి చందాదార్లకు హెచ్చరిక

ఈక్రింది కనబరచిన నెంబర్ల వారికి ఈనెల (1937 సం. జూలై నెల)తో ఇదివరకు చెల్లించిన చందా పూర్తి యగుచున్నది. తిరిగి ఇంకొక సంవత్సరమున కగు చందా మాకు చేరునట్లు ఈనెలాఖరులోగా మనియార్డరు చేసినచో తెంపులేకుండ పత్రికను పంపుచుందుము. అట్లు తమయొద్దనుండి 30-వ తేది లోపుగ సొమ్మురానిచో సహజ భాషాభిమాను లగు తాము తిరిగి ఇంకొక సంవత్సరము వఱకు చందాదారులుగ నుందురను నమ్మకముతో 1937 సం. ఆగస్టు 10-వ తేదిని రూ॥ 6-4-0 లకు వి.పి. పంపుచున్నాము. గావున తా మెప్పటివలెనే పత్రికయం దభిమాన ముంచి సొమ్ము చెల్లించి వి. పి. ని గైకొన ప్రార్థితులు. ఒకవేళ తమ కీపత్రిక ప్రస్తుత మనవసర మగు దోచినచో మా కావిషయము వెంటనే తెలియజేసినయెడల వి. పి. పంపుట నాపుదుము.

B 3, 4, 6, 19. C 3, 9. H 23, 24, 27, 29. K 10. L 1, 4. M 8, 12. N 12, 13, 23. P 11, 12, 16, 17, 19, 20. R 16, 17, 19, 20, 46, 47. S 55, 64, 67, 75, 76, 79, 169, 175, 178, 191. V 16, 22, 23, 43, 44.

# కలగూరగంప

శ్రీ పారనంది రామశాస్త్రిగారు

ఈసంచికయందు ప్రకటింప మొదలిడిన 'వ్యావహారిక భాషావ్యాకరణము'ను రచియించిన కీర్తిమూర్తులు శ్రీ పారనంది రామ శాస్త్రిగారు సంస్కృతాంధ్రములయందఖండ పాండిత్యము గలవారు; నిత్యసారస్వత జీవనులు. శాస్త్రిగారు ప్రత్యేకముగ నభిమానించి అధ్యయనముచేసిన శాస్త్రములు తర్కాలంకార వేదాంతములు. వీరు ౧౮౮౪ సం. నుండి ౧౯౧౧ సం. వరకు పర్లాకిమిడిస్కూలులో సంస్కృత పండిత పదవియందుండిరి.

ఆకాలమున శాస్త్రిగారు ముఖలింగేశ్వరుని కథను సంస్కృతమున రూపకముగ రచియించిరి. శాస్త్రిగారు పర్లాకిమిడి సంస్థానమున ఆస్థానపండిత గౌరవమునకు పాత్రులయి పాండిత్యవినోదముల ప్రొద్దుపుచ్చుచుండెడివారు. ఆవినోదముల ఫలితముగ కొన్ని గ్రంథము లవతరించినవి.

శాస్త్రిగారు భగవద్గీత కొక క్రొత్త వ్యాఖ్యానమును రచియించిరి. తిలకు సిద్ధాంతములు శంకరుల సిద్ధాంతములకు విరుద్ధములు కావని వీ రా వ్యాఖ్యానమున నిరూపించిరి. ఆవ్యాఖ్య అముద్రితము. భగవద్గీత భారతమునందలిదేయని శాస్త్రిగారి యాశయము. ఈ విషయమున వీరు సంస్కృత భారతము నాద్యంతము సవిమర్శముగ పరిశీలించిరి.

వ్యావహారిక భాషావాదము తీవ్రముగా సాగుచున్న దినములలో శ్రీ గిడుగు రామమూర్తిపంతులుగారి ప్రోత్సాహమువలన ఆంధ్రభారత పరిశీలనమునకు రామశాస్త్రిగారి దృష్టి మరలినది. ఇందు భాషా, విషయముల విమర్శలు ప్రత్యేకముగ కొనసాగినవి. అందు విషయవిమర్శము 'ఆంధ్రమహాభారత విమర్శన' మనుపేర గ్రంథరూపమున సిద్ధమయినది కాని తదేకదేశమగు నుద్యోగపర్వభాగము మాత్రమే ముద్రితమయినది. అదియు నిప్పుడు లభింపదు.

భాషావిమర్శనఫలము 'ఆంధ్రశబ్ద చింతామణి విమర్శ' అనుపేర మొలకెత్తినది. ఇది ముద్రితము. ఆంధ్రభారత కర్తయగు నన్నయయు, చింతామణి కర్తయగు నన్నయయు భిన్నులు కావలసిన ఆవశ్యకము లేదనియు, సూత్రప్రయోగ వైరుద్ధ్యము నిర్వచనలోపమున నయినదియే యనియు వీరి భావము. ఈయాశయము ననుసరించియే శాస్త్రిగారి చింతామణివిమర్శ నడచినది.

ఇన్నింటిని పురస్కరించుకొని తల యెత్తినది ఈ 'వ్యావహారిక భాషా వ్యాకరణము.' ఇది వ్యావహారిక గ్రాంథిక భాషావాద ప్రతివాదములందలి గుణదోషములను సయుక్తికముగా పోల్చుకొనుట కుపయుక్తము కాగలదు.

ఇంతకాలము మఱుగున పడియుండిన యీరచనమును శ్రీ గంటి జోగిసోమయాజిగారు, శాస్త్రిగారి కుమారులు శ్రీ జగన్నాథస్వామిగారి కడనుండి కొనితెచ్చి భారతి యందు ప్రకటింపనిచ్చిరి. ఇందు కీయిరువురికిని భారతి యెంతయు ఋణపడినది.

సం. భా.

---

## గుండీల పరిశ్రమ

భారతదేశమునకు ప్రతిసంవత్సరము సుమారు ౮౫ లక్షలరూపాయల విలువగల గుండీలు విదేశముల నుండి దిగుమతియగుచున్నవి. ఆకొరంతతీర్చుటకు ఢిల్లీలోను డక్కాలోను యంత్రాలయములను పెట్టియున్నారు. దీనికై యంత్రాగారములను పెట్టక, పల్లెటూళ్లలో గృహపరిశ్రమగా కృషిచేయవచ్చును. దీనికి కావలసిన పరికరములును కొద్దియే. దంతముతోగాని, బొమికతోగాని, కొమ్ముతోగాని, కొయ్యతోగాని, కొబ్బరిడిప్పతోగాని చేయవచ్చును. చొక్కాగుండీలును, చేతిగుండీలును, కోటు గుండీలును, కప్పు గుండీలును చేయవలనుపడును. అన్నియు సులభమే. దీనిని తయారుచేయుటకు ఒక చేతిమర, ౧౦ ఉలులు, ౧ జాతిఉలి, ౧ రెంచి, ౧ పటకారు, ౧ సుత్తి, ౧ చేబాడిత, ౧ చేరంపము, ౧ చిన్న తిరుగుడు కావలెను. వీటన్నిటికి ఖరీదు సుమారు రు. ౮౦ లకు మించదు. గుండీల వస్తువులకు అయ్యే పెట్టుబడి రు. ౩౫ లకు మించదు. ఇట్లు రు. ౭౫ ల పెట్టుబడితో దీనిని గృహపరిశ్రమగా సాగించవచ్చును. రోజు ౧ కి ౮ గంటలు పనిచేసినయెడల కనీసము ౧౪౮ గుండీలు తయారగును. గుండీ ౧ కి ౦-౦-౧ చొ. మజూరీ వేసినను రోజు ౧ కి రు. ౦-౧౨-౦ లు సంపాదింప వీలగును. రోజు ౧ కి రు. ౦-౮-౦ వెనుకవేసి మూడునెలలలో యంత్రాదులపెట్టుబడిని ఎత్తి వేయవచ్చును. అప్పటి నుండి ౫ గురు గల కుటుంబమును ఈఆర్జనతో పోషింపవచ్చును. నైపుణ్యము పెరిగిన కొలదియు మరింత ఆదా సంపాదింపనగును. ఈకళను నేర్చుకొనుటకు సుమారు 3 నెలలు పట్టును. ౧౬ సం. వయస్సుగల పుత్రవాడు దీనిమీద పనిచేయవచ్చును. నేర్చుకొను కాలములో గూడ చివరభాగములో భోజనమునకు సంపాదించుకొనవచ్చును. దీనివలన మంచి అవకాశము కలదు కనుక కాంగ్రెసుమంత్రులు దీనిని గృహపరిశ్రమగా గ్రామములలో వ్యాపింపచేయుటకు పూనుకొనదగును. కావలసిన యంత్రాదులను తర్ఫీదైన కుఱ్ఱవాండ్రకు అరువుగా నిచ్చి, ఆరు వాయిదాలమీద రాబట్టుకొనవచ్చును. ఇట్టిపద్ధతి అవిచ్ఛిన్నముగా కుట్టుయంత్రములలో విదేశీయులు అమలు జరుపుచున్నారు. మోటారుబస్సులలో కూడ ఇట్టిపద్ధతి అవలంబింపబడుచున్నది. ఒక్కచోట కర్మాగారముపెట్టి యీయంత్రాదులను తయారుచేసిన యెడల పైచెప్పిన దానికన్న చౌకగా గుండీలు లభింపగలవు.

దీనిని నేర్చుకొను కుఱ్ఱవాండ్రకు అక్షరజ్ఞానము కూడ అవసరము లేదు. సామాన్య శరీరపాటవము చాలును. కనుక ఇది సర్వవిధముల ప్రోత్సహింప తగియున్నది.

—గొల్లపూడి సీతారామశాస్త్రి.

(గ్రంథాలయ సర్వస్వమునుండి)

---

ఆంధ్రరాష్ట్ర మహాసభ, ౧౯౩౭, నంద్యాల

ఆంధ్రరాష్ట్ర మహిళా సభ, ౧౯౩౭, నంద్యాల



అధ్యక్షుడు: శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్యగారు



అధ్యక్షురాలు

శ్రీ కొల్లా కనకవల్లి తాయారమ్మగారు



ఆహ్వాన సంఘాధ్యక్షుడు: యస్. శంకర రెడ్డిగారు



ప్రారంభకురాలు

శ్రీ గంధం అమ్మన్న రాజాగారు

కీ. శే. రా. సా. పండిత గానాల
రామవర్ణిగారు



వీరాంధ్ర సారస్వత, రాజకీయ రంగముల నంట పెట్టుకొని, ప్రముఖతగాంచి, జీవితమును గడపుమండిన వారు. న్యాయదీపిక, సమదర్శిని మొదలగు పత్రికలకు కొంతకాలము సంపాదకులుగ నుండిరి. వీరు స్వ (విశ్వ బ్రాహ్మణ) సంఘాభివృద్ధికయి మిక్కిలి కృషిచేసి కొన్ని సౌకర్యములను సంపాదించి పెట్టగలిగినారు. ఇంకను సాకల్యముగ సమకూర్చుపట్టుబడి, సామర్థ్యము లభింపకపూర్వమే యిట్లు మృత్యువుపాలయినారు. వీరి వయస్సు ఏబదియేండ్లకు ఇంచుమించుగ నుండవచ్చును. ఈ వయస్సున వీరు మృతినొందుటవలన వీరిదగు విశ్వ బ్రాహ్మణసంఘమునకు తీరనిలోపము సంప్రాప్తమయినది; చేయూతజారిపోయినది.

———

రష్యాలో పిల్లలు

పిల్లల్ని పోషించి పెద్దవారిని చెయ్యడంలో రష్యాదేశం అవలంబించే విధానం చాలా బాగుంది కనపడుతుంది. 'నేటిబాలుడే రేపటియువకుడు' అనే ప్రకృతిసూత్రాన్ని వాళ్లు బాగా గమనించారు. అందుచేత పిల్లలవిద్య, ఆరోగ్యము, నడత మొదలగునవన్నీ సోవియటుప్రభుత్వ సూత్రాలకు అనువైనపద్ధతిలో బోధించి, ఆ పిల్లలే యువకులైనప్పుడు ఆ ప్రభుత్వాన్ని బాగా కొనసాగేటట్టు చెయ్యడానికి వీలయేటట్టు రష్యాదేశపు సోవియటు ప్రభుత్వంవారు మంచి ప్రయత్నాలను చేస్తున్నారు.

ఇరవై సంవత్సరాలకుపూర్వం రష్యాదేశంలోని ప్రతిపట్టణంలోనూ వీధులన్నీ దిక్కుమాలిన పిల్లలతోనూ, మూటలూ ముల్లెలూ యెత్తుకపోవడానికి అటూ యిటూ తిరిగేపిల్లలతోనూ నిండివుండేవి. నేటిరష్యాలో అలాకాదు. తల్లిదండ్రులకు వివాహబంధము లేకపోవడముచేత పిల్లలు ప్రభుత్వపుపోషణలో వుంటారు. ఆ పిల్లలందరికీ తిండీ, వస్త్రాలూ, విద్యా యివ్వవలసిన బాధ్యత ప్రభుత్వమువారిదే. ప్రేమవున్న తల్లిదండ్రులు అప్పుడప్పుడు వచ్చి చూస్తూవుంటారు. లేకపోతేలేదు. పిల్లలుమాత్రం హాయిగా పెరుగుతారు.

చిన్నపిల్లలు విహరించడానికి ప్రత్యేకం పార్కులు; ఆడుకోడానికి ప్రత్యేకం మైదానాలు.

రష్యాలోని పిల్లలకి సక్రమమైన విద్యాబోధ ఏడో యేటినుంచీ జరుగుతుంది. ౧౩ అయేటప్పటికి విద్య నిశ్శేషంగా పూర్తి అవుతుంది. విద్యాభ్యాసమంతా ఈ లోపలనే పూర్తికావాలి.

రష్యాదేశంలో పిల్లలికిచెప్పే చదువు రెండు రకాలు: ఒకటి వాళ్లని దిట్టమైన కమ్యూనిస్టులుగా తయారుచెయ్యడానికీ, రెండోది వాళ్లని మంచికార్మికులుగా తయారుచెయ్యడానికీ. ధనస్వామికమువల్ల కలిగే నష్టాలూ, ధనస్వాములుచేసే దుర్మార్గాలూ మొదలైనవి యీ పిల్లలకి పాఠాల ద్వారానూ, కథలద్వారానూ బోధించడమేకాకుండా సినిమాలలోకూడా చూపెడతారు. ఈ పాఠశాలలో జరిగే విద్యాబోధ యొక్క

తరువాత వృత్తిపనులు. ఏ పిల్లవాడి ధోరణి యే వృత్తిపైకి మొగ్గుతుందో, యే పిల్లవాడు యే విషయాన్ని నేర్పుగా అభ్యసించగలడో కనిపెట్టి, ఆ పిల్లవాడికి ఆ విద్యనే నేర్పుతారు.

'దేవుడు లేడు' అనే సిద్ధాంతాన్ని పిల్లలందరికీ బాగా వంటబట్టేటట్టు బోధిస్తారు. సాధారణంగా ప్రజలంతా కమ్యూనిస్టులేకనక పిల్లల చిన్నతనంలో వాళ్లదగ్గర దేవుడున్నాడనీ, పాపమనీ వేదాంతపుమాటలు పెద్దవాళ్లు అనరు. అంచేత, చాలామంది పిల్లలికి దేవుడంటే కూడా యేమిటో తెలీదు.

పాఠశాలలలో పిల్లలకి ఎంతో స్వాతంత్ర్యము ఇస్తారు. ఉపాధ్యాయుల లోపాలనుగురించి వ్యాఖ్య చెయ్యడానికి పిల్లలు వారానికి రెండు మూడుమార్లు సమావేశమై చర్చలు జరపటానికికూడా వాళ్లకి స్వాతంత్ర్యం వుంది.

పాఠశాలలలో పిల్లల్ని యెంతమాత్రమూ కొట్టరు. ఎవడేనా కుర్రాడు సరిగ్గా పాఠాలుచదవకపోతే వాణ్ణి పిచ్చిఆసుపత్రికి పంపిస్తారు.

పిల్లల్ని సోవియట్ పరిపాలన సక్రమంగాసాగించగల యువకులుగా తయారుచెయ్యడమే ప్రభుత్వంవారి ఆశయం. అందుకోసం వాళ్లు ఎంతశ్రమైనా అనుభవిస్తారు.

'చక్రవర్తి'



# క న్నీ రు



ఇంచుమించు ఇరవయిఅయిదేండ్ల లేప్రాయంలో జీవితసౌఖ్యాన్ని ఏమాత్రమూ అనుభవించడానికి నోచుకోకుండానే ఏడెనిమిదినెలలపాటు క్షయతో నవిసి నవిసి కృశించి, అసలే దుర్బలమూ, కృశమూ అయిన శరీరం శిథిలంకాగా సహృదయుడు జనార్దనరావు అపమృత్యువుపాలయిపోయినాడు. కొనితెచ్చుకున్నాడు



కీ. శే. కొంపెల్ల జనార్దనరావుగారు

ప్రాణాంతకమయిన పాడు జాడ్యాన్ని ఆలోచన లేకుండా. తన పనే అది అన్నట్లుగా ఆ జాడ్యం జనార్దనరావును మింగివేసింది.

జనార్దనరావు వయసులోనూ, అనుభవంలోనూ చిన్నవాడే కాని వ్యక్తిగతగుణాల్లో ఎంతో పెద్దవాడు. ఆంధ్రసాహిత్య సంస్కారవిషయంలో అతనికి ఎన్నో భావాలు! ఎన్నో ఊహలు! కొన్నయినా రూపుకట్టుకుంటేనా? ఏవేవో ఆశలు! కొన్నయినా తీరడమంటూ ఉంటేనా? ఎంతో విజ్ఞానం! అది బయటపడడానికి తగిన అవకాశం లభిస్తేనా? ఏమిటేమిటో ప్రయత్నాలు! సాయందోరికి ఏపాటయినా సఫలం అయితేనా అవి? ఏదీలేదు. అన్నీ అరకొరలే. అహోరాత్రాలు నిద్రాహారాలు లేకుండా శ్రమపడ్డాడు. అంతా నిష్ప్రయోజనమే; అంతటా ఆశాభంగమే. ఆపాట్లన్నీ ప్రాణానికే ఎసరుపెట్టినవి. అతని జీవనజ్యోతి కాస్తా ఆరిపోయింది. ఇంక జనార్దనరావు లోకంకండ్లకు కనుపడడు. మనస్సులో మాత్రం పరిచితులకు అతని చిన్ని నవ్వుముఖమూ, మెరుపులుచిమ్మే కండ్లూ, అమాయకతను ప్రకటించే పొందికా, వీటితో అతని ఆకృతి పొడగట్టుతూ ఉంటుంది ఎల్లప్పుడున్నూ.

ఎనిమిదేండ్లకు పూర్వం భారతి సంపాదకవర్గంలో ఒకడుగా ప్రవేశించాడు. ఐదారేండ్లపాటు తనకని ఏర్పడిన, ఏర్పరిచిన పనులను జవాబుదారితో నిపుణతతో నిర్వహించాడు. అతని ప్రవర్తనలో కలుపుగోలుతనం ఉంది. కాని ఆత్మగౌరవానికి ముందు దానికి చోటులేదు. అలాటిదే యుక్తమయిన ప్రవర్తన; మిక్కిలి మెప్పును పొందే ప్రవర్తన.

జనార్దనరావు పాండిత్యంలో అంత పెద్దకాడు; కాని సంస్కారంలో పెద్ద. అందులో పెద్ద పండితులనబడే పలువురెంతో చిన్న లతనికి ఇటీవల అతడు, పాపం, పెద్దపాండిత్యంకోసం ప్రాచీప్రతీచీసాహిత్య క్షేత్రాల్లో నిరంతరం కృషి చేయడానికి పూనుకున్నాడు. బతికే ఉంటేనా, కొలదికాలంలోనే ఉభయక్షేత్రాల్లోనూ గొప్ప పాండిత్యాన్ని పండించుకోగలిగేవాడే ప్రాచీన నవీన విజ్ఞానాలు రెంటిలోనూ మేలువాటిని ఏరుకోగల

శక్తి అతని కుంది; వాటిని ఉపయోగించుకొనే శక్తి కూడ ఉంది. అన్నింటికీ కొత్తదనాన్ని తేవాలనేది అతని సంకల్పం. అందుకనే కొత్తఫక్కీ రచనలో తన భావాలను కొత్తమార్గంలో వ్యక్తీకరించేవాడు. అందులో ప్రత్యేకవ్యక్తిత్వం ఆయనదే.

అతని హృదయంలోవలెనే అతని రచనల్లో భావాలు చాలా లోతులో ఉంటవి. రచనలో బరువు ఆభావాలని పైకి తేలనీయకుండా తొక్కిపెడుతూ ఉంటుంది. అందుచేతనే ఆ లోతుల్లో ఉండే భావ విశేషాలు సామాన్యంగా అందవు. అందజేసుకోడానికి ప్రయత్నం చేదామన్న బుద్ధికూడ పుట్టదు ఆరచనను చూస్తే చాలమందికి.

జనార్దనరావు బుద్ధి చాల చురుకయింది; స్వభావము స్వతంత్రమయింది. మొహమాటం అంటే ఏమాత్రమూ గిట్టదు; చెప్పవలసింది చెప్పేటప్పుడు వెనక ముందులు చూడడమనేది లేదు. కాని సౌహార్దానికి మాత్రం భంగం కలగదు.

అతను విమర్శనలు చాల సున్నితంగాను, ఉదారంగాను నడిపిస్తాడు. అందులో పక్షపాతం ఉండదు. గుణదోషపరిశీలనం సప్రమాణంగా, తిరుగులేకుండా ఉంటుంది.

అతని రచనలన్నింటిలోనూ అతని భావిప్రయోజకత్వాన్ని స్ఫురింపజేసే ఒక విలక్షణత ఉంది. కాని అతనే లేకుండా పోయినాడు.

అతనిలో చిరకాలాన్నుండి నవలు సాగుతూ ఉండిన ఊహలు పండి ఉదయినిపుట్టుకకు బీజాన్ని తయారుచేశాయి. దానికోసమని మూడేండ్లనాడు భారతిని వదలుకున్నాడు. ఒక్కఏడాదిపాటు దానిని ఎలాగో సాగించాడు. అవతల సాగుదలకు ధనాభావం అడ్డుతగిలింది. పెట్టుబడికి తనవద్ద పైసాలేదు. పైవాళ్ల దయాదాక్షిణ్యాలమీద ఆశపెట్టుకొని ఎంతకాలం సాగించవచ్చు 'ఉదయిని' లాంటి పత్రికను! వెనుకకు పడిపోయింది పత్రిక. ఎట్లా దాన్ని ముందుకు తేవడం అనే బెంగ పట్టుకుంది అతణ్ణి ఉపాయాలు ఆలోచించడంలో, ప్రయత్నాలు చేయడంలో ఎంతో శ్రమపడి క్షీణిస్తూఉండే అతణ్ణి సులువుగా క్షయ ఆక్రమించింది. దాంతో క్షయించి రూపుమాసిపోయినాడు తాహతు తెలియని జనార్ధనరావు. ఉదయిని, దాని గొప్పతనం ఏమయిన నగుగాక, సహృదయుణ్ణి జనార్దనరావును తుదముట్టించడానికి ఉదయించింది! లేకుంటే ఎంతకాలం బతికేవాడో, ఎంతప్రయోజకుడయ్యేవాడో స్వస్థంగా జీవితం గడుపుకుంటూ ఉంటే. అంతా మూణ్ణాళ్లముచ్చటయిపోయింది. నవ్యాంధ్ర సాహిత్యచారిత్రలో అతనిచరిత్ర ఒకపెద్ద అధ్యాయం కావలసింది. ఆ అధ్యాయం ఈ విధంగా, ఇంతలోనే, ఇట్టేట్టే ముగిసిపోయింది.

గ. సుబ్బరామయ్య

---



# అంకోరు పూర్వచరిత్ర: శిల్పచిత్రములు



అంకోరు పట్టణము కాంబోడియా దేశములో నున్నది. కాంబోడియా దేశము మొట్టమొదట నాగుల రాజ్యముగా నుండెను. ఆ యిసుకయెడార్లలోను, పర్వత దుర్గములందును కాలిడిన మొదటి మానవవ్యక్తి ఆర్యదేశపు రాజగు కంబుస్వయంభు వను నతడు. లోకు లనుకొనున దేమనగా,

ఆరాజునకు మీరా అను నొక భార్య యుండెను. ఆమె అసమాన లావణ్యవతి. ఆమె సాక్షాత్పరమేశ్వరుని యనుగ్రహమున కంబుకు లభించినది. ఆమె ఒకనాడు ఉన్నదున్నట్టుగా దీర్ఘనిద్ర తీసినది. అటుపిమ్మట ఏకదేకజీవితుడగు కంబు స్వయంభువు విచారముతో, జీవితముమీద విసుగెత్తి, ఏ యరణ్యమునకైనను పోయి ప్రాణములను విడువదలచి, తన రాజ్యమును వదలిపెట్టి చక్కగా వెళ్లి [illegible]

కొన్ని మాసములకు అతడు ఈ నాగరాజ్యమునకు చేరుకొనెను.

ఈక్రొత్తవ్యక్తిని చూడగానే ఇక్కడి కొండల బిలములలో నుండిన నాగములు ఒక్కవిసురున బుస్సుబుస్సు మనుచు వచ్చి, పడగలెత్తి, తోకల నాడించి విజృంభింప జొచ్చినవి. కంబుస్వయంభువు భయపడలేదు. మీదు మిక్కిలి తానాశించిన అవసానము అనాయాసముగా వచ్చి పడుచున్నందుకు మురిసెను. కాని పరిస్థితులు తద్విపరీతముగా నేర్పడినవి. ఆ నాగులకు రాజగు నొక మహానాగము కంబుదగ్గరకు వచ్చి, అతని ధైర్య సాహసములకు మెచ్చి, "నీవు మాతో నుండిపొమ్ము. నీకష్టములను మేము తీర్చెద" మని బతిమాలెను.

అందులకు సమ్మతించి కంబు అక్కడనే నిలిచి [illegible] నాగరాజు తన కూతురు నితని కిచ్చి వివా

అంకోరునగర, తత్పరిసరముల ప్లాను

హము చేసెను. కంబుకూడ పూర్వ కష్టముల నన్నిటిని మరచి, క్రొత్త భోగభాగ్యములకు అలవాటుపడెను. నాగులు కామరూపులును, దేవతా సమానులును కాబట్టి తాము మానవ స్వరూపములను దాల్చుటతో బాటు ఆమెడార్ల నన్నిటిని పైరుపచ్చలు నిండిన అడవులు గాను, కట్టిపోయిన జలాధార కుల్యలను జలసమృద్ధము లైన నదులుగాను మార్చివేసిరి. కొన్నాళ్లకు కంబుకు ఆ నాగకుమారియందు అనేక కుమారులు జనించిరి. ఆ సంతతివారే తరువాత తరువాత ఖ్మేరులని పిలువబడిరి.

క్రీస్తుశకారంభములో కాంబోలు, జావాదేశస్థులు ఖ్మేరసంతతిని వంచి, లోబరచుకొని వారిరాజ్యమును క్రిందికి దించి, ఫౌనాను రాజ్యములో దాని నొక రాష్ట్రముగా చేసివేసిరి. ఆతర్వాత క్రీ. శ. ౮౦౦ లో మద్రాసు ప్రాంతమునుండి కౌండిన్యుడను నొకబ్రాహ్మణుడు ఫౌనానుకు దేశదర్శనార్థమై వెళ్లెను. అది అప్పటికే ప్రాచ్యవాణిజ్యమునకు కేంద్రస్థలముగా వాసికెక్కియుండెను. పోయినవా[illegible]

బ్రాహ్మణుడు ఆ దేశమంతటను హైందవవిజ్ఞానమును బోధపరచి, శైవమతమును ప్రచారము చేసి క్రమముగా

సీకపీను (మెలికలు దిరిగిన నాగము) దగ్గర విగ్రహముచుట్టును అల్లుకొని పెరిగిన ఒక వటవృక్షము



అంకోరు వాటుమందిరములోని కేంద్రాలయము. ఖ్మేరుల చివరి శిల్పనిర్మాణము.

ఆసింహాసనమునే అక్రమముగా నాక్రమించుకొనెను. అంతవరకును అక్కడ నాలుగుపాదములతో నుండిన బౌద్ధమతము అంతటితో దిగతీత కుపక్రమించెను

క్రీ. శ ౯ వ శతాబ్ది చివరిభాగములో భావవర్మ అనెడి యొక కాంబోడియా రాజు ఈ క్రొత్త ఫూనాను-రాష్ట్రమును స్వాధీనపరచుకొనెను. ఆతర్వాత ఎన్నెన్నో మార్పులు జరిగినవి. ౯ వ శతాబ్దిలో అంకోరు థామ్ పట్టణమునకు పునాది వేయబడెను. దీనినిర్మాణమునకు నడుముకట్టినది యశోవర్మ యను నొకఖ్మేర రాజు. దీనికి మొట్ట మొదటి పేరు యశోధరపురమని. ఈ పట్టణము నడుమ అతడు యశోధరగిరియను పేరుతో నొక శివాలయమును (బేయన్) నిర్మింపజేసెను. ఒక రాజప్రాసాదమును కట్టించుటకుగూడ ఆరంభించెను గాని అది అతని జీవితములో ముగియలేదు. ఆ తర్వాత ఎప్పుడో ముగిసినది.

యశోవర్మ జీవితము ముప్పాతిక భాగము ఛాములతో యుద్ధములు చేయుటతోనే సరిపోయినది. అతడు చేసిన నౌకాయుద్ధములు అంకోరులోని ఉబ్బెత్తు చిత్రములలో చక్కగా చిత్రింపబడియున్నవి.

యశోవర్మ యుద్ధములలో జయములను గొన్నాడు; అపజయములను కూడ పొందినాడు. రాజ్యపా

ఇరువురు దేవతలు
(వారి విగ్రహపుష్టి గమనింపదగినది)



అంకోరువాటు కేంద్రాలయములోని ఆవరణము చుట్టును ఉండు మండపములు: ప్రశాంతమైన యీమండపములు జపతపములు చేసుకొనుటకు అన్నివిధములుగాను తగి యున్నవి.





అంకోరువాటు కేంద్రాలయములోని మండపముల కమర్చియుండు వాతాయనముల వ్యక్తస్వరూపము.



అంకోరుథాములో నడుమ నిర్మింపబడిన బేయను మందిరము

నలో సమర్థుడు మాత్రమే కాక ఇతడు కళలను పోషించుటలో గూడ ఖ్యాతిపొందియుండెను. చాతుర్వర్ణ్యములవారికిని వారివారి విధుల నతడు ఏర్పరచెను. ఇతడు చనిపోవునాటికి - క్రీ. శ. ౯౦౮ లో ఇతనిరాజ్యము ఇండియానుండి చీనావరకును వ్యాపించియుండెను. అనగా ఇప్పటికి సుమారు వెయ్యి సంవత్సరములకు పూర్వము ఇప్పటిసయామూ, కాంబోడియా, కొచిన్ చైనా, లాస్ మొదలగువానికి అంకోరు రాజధాని నగరముగా నుండినది.

పిమ్మట రాజ్యమునకు వచ్చిన మరికొందరు రాజులు ప్రాఖాను మొదలైన అనేక దేవాలయములను హిందూపద్ధతిని నిర్మించిరి. అటు తరువాత రెండవ సూర్యవర్మ కాలములో, ఆతని యాజ్ఞమేరకు, దివాకరుడను బ్రాహ్మణుడు అంకోరుథాముకు కొంచెము దక్షిణముగా ఒక గొప్పదేవాలయమును నిర్మింప నారంభించెను. అదియే అంకోరువాటు. ఇది క్రీ. శ. ౧౨ వ శతాబ్దపు మధ్యకాలపుమాట. అసలు అంకోరు పట్టణమా పరిసరములందే యుండెను.

తర్వాత ఏడవజయవర్మకాలములో కాంబోడియా రాజ్యము మహోన్నతదశయందుండినది. ఆతడు అసహాయశూరుడని ప్రసిద్ధిచెందెను. సింహములను, ఏనుగులను సైతము ముఖాముఖిగ నెదిర్చి శస్త్రాస్త్రములతో పోరగల ధీరుడతడు. అతడే ఛాములను నిశ్శేషముగా హతమార్చెను. అతడు అనేక బౌద్ధాలయములను నిర్మించెను. అతడే అంకోరువాటుమందిర నిర్మాణమును సైతము పూర్తిచేసెను. అంకోరువాటు మందిరము

బేయనుకు పడమటనుండు 'ఏనుగుల గోడ'





అంకోరు వాటుమందిరము: , ఇది సుమారు 1 మైలు వైశాల్యముగలిగియున్నది. దీని చుట్టును 350 గజముల వెడల్పుగల ఒక అగడ్త కలదు. ఆ అగడ్తను దాటి, మందిరములోనికి పోవుటకు ఈ దారిగుండా పోవలెను. ఆదారిని నిర్మించియుండుపద్ధతిని చూడుడు.

ఖ్మేరుల శిల్పశాస్త్రనైపుణికి మచ్చుముక్కగా మనకు కుమారుడు రెండవ ఇంద్రవర్మకు రాజ్యమువదలివేసి మిగిలిపోయినది. క్రీ. శ. ౧౨౦౧ లో అతడు తన ఒక బౌద్ధమతములో చేరిపోయెను.

అంకోరును పాలించుచుండిన ఖ్మేరరాజుల ప్రాసాదము మూలమట్టముగా మాయమయి పోయినను, మిగిలి నిలిచిన యీప్రాసాదోపరితలము దాని సమగ్రసౌందర్యమునకు దృష్టాంతమైయున్నది.





బేయన్ మందిరములోని శిల్పసంపద: ఖ్మేరుల ? కానొక నౌకాయుద్ధయాత్ర ఇందు చిత్రింపబడినది. వారి శిరస్త్రాణ వైఖరియు, కేశబంధ పద్ధతియు చూడదగినవి

మరి ౨౦౦ సంవత్సరములవరకును అంకోరువైభవము ఉన్నతదశలో నేయుండెను రాజధాని నగరమే కాక అది కళలకు, మతవిజ్ఞానమునకు, వాణిజ్యబాహుళ్యమునకు, అఖండైశ్వర్యమునకును ప్రసిద్ధిచెందియుండెను. కాని సయామీలు క్రమశః ప్రబలులైపోయిరి. వారు తిరుచు ఖ్మేరరాజులపైన దండయాత్రలు సలుపజొచ్చిరి. చివరకు ౧౫ వ శతాబ్దములో అంకోరును వారు స్వాధీనపరచుకొని, దాదాపు వేయియేనుగులు మోయగల బంగారును, నగలను, స్త్రీలను, గృహోపకరణములను, విగ్రహములను మోసుకొనిపోయిరి.

ఖ్మేరుల ఒకానొక యుద్ధయాత్ర





ప్రాఖానుమందిరమునకు సమకాలికమగు టాప్రోవఁమందిరము. ఇది పితామహ బ్రహ్మాలయమనికూడ పిలువబడుచున్నది. సన్యాసులకును, మతాచార్యులకును ఇది యొక మఠముగా నుండెను. అంకోరును శతాబ్దముల తరబడి భూగర్భమున ముంచియుంచిన అరణ్యముల పరిశేషములింకను (త్రవ్వితీసినపిదపకూడ) ఈమందిరముపైన రాజ్యమేలుచునే యున్నవి, చూడుడు.

అంకోరువాటు మందిరముయొక్క మరియొకవైపు దృశ్యము: ఇందులో మందిరము చుట్టును ఉండు అగడ్తస్వరూపముకూడ కనబడుచున్నది.





అంకోరుథాము రాజప్రాసాదోపరితలమున మలచబడిన ఒకశిల్పము: ఖ్మేరుల పిచ్చిభ్రమ కిదియొక మచ్చుతునుక. ఇందలి అయిదుతలల అశ్వమువలెనే ఇంకను ఎన్నియో వింతమృగ, పక్షులను చిత్రించుటకు వారు మోజుపడుచుండిరి.

అది మొదలు అంకోరుమందిరములన్నియు పాడు పడిపోయెను. మహోన్నతవైభవముతో తులతూగి పోయిన దేవాలయములు శిథిలము లయిపోయెను.

అంకోరుథామునకు నాలుగుద్వారములు గలవు. ఈ పట్టణములలోనికి కుక్కలను, నేరస్థులను మాత్రము రానిచ్చుచుండలేదు. నేరస్థులయినవారిని వారి వ్రేళ్లను చూచినిర్ణయించుచుండిరి. నేరస్థులవ్రేళ్లు ఖండింపబడుట అప్పటి అలవాటు. అంకోరుప్రజలకు సువాసనద్రవ్యములన్నచో అమితప్రీతి. చందనము నలదుకొనుటయు, కస్తూరి రాచుకొనుటయు వారికి ప్రియాలంకరణకృత్యములు. పై తరగతిప్రజలకు పెక్కుమంది దాసీదాసులుండిరి. వారిని వారు డబ్బిచ్చికొనుచుండిరి. కొని ఆ మొరటు జాతికి నిత్యకృత్యములు నిర్వహించు విధానములు నేర్పుచుండిరి. అంకోరులో తరచు నేరములు చేయుట కలవాటు పడినవారిని పట్టితెచ్చి, న్యాయపరిశీలకులు వారి కాలివ్రేళ్లను తెగగోయుచుండిరి. దొంగలయినచో వారి చేతులనే కోసివేయుచుండిరి. చిల్లర తప్పులకు చేతివ్రేళ్ల కోతదండన. ఇది అక్కడి అప్పటి దండక్రమము.

ఇంకను ఎన్నోవిధములుగా అంకోరు ప్రజాజీవితము ప్రేక్షకులకును, పాఠకులకును వింత గొలుపదగి యున్నది. అసలు అంకోరు పట్టణము కర్రలు, పెంకులు మొదలైన నశ్వర పదార్థములతో నిర్మింపబడియుండుట కాబట్టియే, అది యేనాడో భూగర్భమున లీనమైపోయినది. దాని ఛాయలుకూడ నేడు గోచరముకావు. కాని, అక్కడి ప్రజలయొక్క జీవితక్రమము, ఆనాటివారి శిల్పనైపుణి, రాజ్యపాలనాక్రమము మొదలగు చారిత్రకాంశములన్నియును అంకోరుథామములోను, అంకోరువాటులోను, ఆచుట్టుప్రక్కలందును నిర్మింపబడిన మందిరములందు శిలారూపముగా చిత్రింపబడియుండుట వలన, మనకు వానివైన మారూపుగానైన లభించు చున్నందుకు సంతసింపవలసియున్నది. ఇప్పుడిప్పుడే



ఆంకోరుథాము ద్వారములను కావలికాయుచున్న 'రాక్షస' శ్రేణి.

చరిత్రవేత్తలును, అర్ష విచార శాఖోద్యోగులును అడవుల సందులలోను, మట్టిదిబ్బలలోను మరగిపోయియుండిన యీ శిలామందిరముల శిథిలములను వెలికితీయ సర్వ విధముల ప్రయత్నములను చేయుచున్నారు. కొంత వరకు చేసినారు. అంకోరువాటులోను, అంకోరు థాములోను వెలసిన మందిరముల నిర్మాణ మంతయు శిలామయము మే.

అక్కడి శిల్పసంపదను, ఆశిల్పుల నిర్మాణచాతురిని విశేషించి వర్ణించుట అనవసరము. ఇందు ప్రచురింపబడిన చిత్రములే నిరక్షరముగా నా వర్ణనమును పాఠకులకు శ్రుతపరచి ఆ శిల్పరామణీయకమును వెల్లడి పరచగలవు.

['జాగ్రాఫికల్ మాగజిన్'నుండి.]



# భారతీయ మహిళా మండలి

భారతదేశప్రతినిధులు అంతర్జాతీయ మహాసభ, వియన్నా




శ్రీ థాకూరం కన్య (పంజాబు)          శ్రీ పార్వతీకన్య (ఆసాము)



# విమర్శనము

## దయ్యాలు

ఆంధ్రభాషలో వచనరచన యేబది యేండ్లకు పూర్వము కాశీమజిలీలు తప్ప నింకొకటి లేదని నాయూహ. పిమ్మట రామాయణ భారతాదులకు వచనమున బరివర్తనము, రానురాను పాశ్చాత్య సంప్రదాయమును గమనించి నవలాకథారచన ప్రారంభమయ్యెను. ఇంతవరకు గ్రాంథికమనబడు భాషయే వెలిగింది.

నవీనయుగ ప్రారంభమునకు శ్రీగురజాడ అప్పారావుగారు తమ "కన్యాశుల్కం" నాటకమున దారి జూపిరి. పిమ్మట శ్రీయుత గిడుగు వెంకట రామమూర్తి పంతులవారఖండప్రచార మొనరించి దిగ్విజయమునందిన నిప్పటికి వ్యావహారిక భాష పండితపామరుల కలములలో వార్తా పత్రికలలో గ్రంథములలో దాండవ మాడుచున్నది.

వ్యవహార భాష వ్రాయుట కష్టమేమి? యని కొందరు భ్రాంతిపడుచున్నారు. అట్లుకాదు. నేను సరిగా వ్యవహారభాష వ్రాయలేకున్నాను. గ్రామ్యములు రాకుండ సరసమయిన వ్యవహారభాష వ్రాయుట కూడ సులభము కాదు. క్రమక్రమముగా స్త్రీకవులలో గూడ జక్కని శైలిలో వ్యవహారభాష వ్రాయుట యలవడుచున్నది.

కవితకు వాక్యరచనాచమత్కార ముత్తమస్థానము నలంకరించును గాని కేవలపదాడంబరము కాదు. సర్వసులభముగా పదము లర్థమగుచు భావగాంభీర్యముండినచో నే రసావిర్భావము కలుగును.

వ్యవహారభాషలో - సరసవ్యవహారభాషలో శ్రీమతి స్థానాపతి రుక్మిణమ్మగారు "దయ్యాలు" అను గ్రంథమును రచించిరి.

ఈమె విశేషలోకానుభవము లేని యిరువదేండ్ల ప్రాయము గలదయ్యును గ్రంథములు చదువు నభ్యాసమును స్వతఃకవనచాతురి యుండుటంబట్టి పుక్కిటిపురాణము కథలనుగూడ సరసముగా సందర్భానుగుణముగా మార్పు లొనరించి వ్రాసినందుకు మెప్పు నందదగియున్నది.

ఈ గ్రంథమున పండ్రెండు కథలు కలవు. అన్నియు దయ్యములనుగూర్చిన చరిత్రలే. అందు గడపటి "ప్రతిబింబాలు" అనుదానిలో కవికల్పన యధికము. అసలుకథ తక్కువ. అన్నియును బూర్వులు పరంపరగా జెప్పుకొనుచున్నవే. చాలమంది కిప్పటివారలకు దయ్యాలు భూతాలు అన్నవి లేవని యభిప్రాయము. కాని నా నమ్మకముమాత్రము దయ్యము లున్నవనియే.

కవి గోదావరిమండలమున నిడదవోలు పుట్టినిల్లు కలయామె యగుటంబట్టి మాండలికపదములు కొన్ని కలవు. పూర్వము శ్రీనాథాదులుకూడ వారి మాండలిక పదములు ప్రయోగించినారు.

అల్లాగ, కటిక, (కుంత)రుప్య, (ఒడ్డులతి) వరకంగా అజా, ఐషు, పుంత, ఇద్దూ. (ముఖ్యముపురుష) చదకటం, కమతం- ఇవి మాత్రమె గ్రంథమున గలవు.

భూతములలో మనుష్యులకు మేలు గలిగించునవి కొన్నియు, బాధించునవి కొన్నియు గలవని యీ గ్రంథమున కథలవల్ల దెలియును. మన గ్రంథములలో మంత్రశాస్త్రమున వీటినిగురించి కొన్ని మంత్రములు సాధనలు కలవు.

ప్రకృత ప్రకృతి పరిశోధకులు శరీరములేని జీవులు వాయురూపమున నున్నారని, వారితో మాటలాడ వచ్చునని చెప్పుచున్నారు.

ఇందలికథలను బట్టి సన్యాసులు, బ్రహ్మచారులకే భూతగణములు, వాటిని లొంగదీయుసాధనములు పట్టుబడునట్లు తెలియును. అదియట్లే.

బొమ్మలాట కథవల్ల నేకాక యనభవమును బట్టి కూడ ఆంజనేయుని స్మరణమాత్రమున పిశాచబాధ తొలగుననన్నది సత్యము.

పుస్తకమునందలి కవిత్వ నైపుణ్యము కొంత కనబడుచెదను. స్థాలీపులాకముగా నీదిగువ గనబఱతును.

"రెల్లు దుబ్బులచివర్లనుండే వెన్నెలు గోదావరమ్మ గృహారామంలో పున్న విద్యుద్దీపాల్లా"

"వారిదాంపత్యం పుష్పాతావి లాంటిది" "ఆస్తి కర్పూరంలా హరించిపోయింది" ౧౭ పుట - ౩౦-౩౧. మరివర్ణన. గోదావరీ ప్రాంతవర్ణనలు సహజసుందరములు ౫౨ పుటలో "భటులవధాన్ని ...... సిద్ధాక్షిణ్యంగా" అనుగించి "అవధాని వెంటనే బ్రహ్మరాక్షసియయిపోయి" ఇత్యాది ౫౫ లో కథారంభ కథాంత ములా నవలారీతిని అనుకరించుచున్నవి.

రాజమ్మ కథలో అత్తాకోడండ్రకథోపకథనము సరసముగా గొంత స్వకపోలకల్పితము.

"జమీందారులసిల్ల ...నదృశ్యుడయినాడు." అను విషయసూచన పాత్రగుణపోషణయు నతిరమ్యముగా నున్నవి.

సాంఘికదురాచారోద్ఘాటనలవల్ల నూతనయుగమున కొంతకదలిక కలుగును. ఉదా "ఇంతకీ స్త్రీలు పురుషులచేతిలో లక్కబొమ్మలు" ౩౫ "పాప మా పిల్లకు గేళఖండనము మాత్రం జరగలేదు" అనుచోట బాలవితంతువుల దురవస్థలు శోచనీయముగా గనంబరచబడెను.

ఇట్లీచిన్నపుస్తకమును నాకు దోచినంత విమర్శించితిని. ఇట్టి వింక గొన్నిపుస్తకము లీమె వ్రాసి మెప్పునందుగాతయని యాశించుచున్నాను.

దేశమున స్త్రీకవులుగూడ నుత్తమస్థానమునకుం జెంది విలసిల్లుభాగ్యము ఈ యొరవడి కల్పించుచున్నందుకు బరదేవతావిలాసమును మనసా ఎన్ను కొనుచున్నాను.

బంకుపల్లి మల్లయ్యశాస్త్రి

---

## లక్క పిడతలు

బాలానందం ౧. బాలగేయాలు; కర్త: శ్రీచింతాదీక్షితులు, నవ్యసాహిత్య పరిషత్తు, గుంటూరు. డెమ్మీ ౧౬ సైజు, ౫౬ పుటలు.

ఏ దేశంలోనైనా సరే నిరక్షరాస్యత నిర్మూలమై, విద్యకి వ్యాప్తి కలగాలంటే ఆ విషయమైన ప్రయత్నాలు మొదట్నుంచీ జరగాలి. పునాది దిట్టంగా లేకపోతే దానిమీద లేచిన కట్టడం చిరస్థాయికాలేదు. చిన్నపిల్లలలో విద్యావ్యాప్తి కలగచేయడానికి నిర్బంధ పద్ధతులకంటే సున్నితమైన మార్గం వొకటి ఉంది. అదేమిటంటే—వాళ్ల మనస్సుని ఆకర్షించి ఆనందాన్ని కూర్చే వాఙ్మయం!

చిన్నపిల్లల మనస్సుని అవలీలగా ఆకర్షించేవి కథలూ, గేయాలూను. అవి వ్రాసేవారు తెలుగువారిలో బహుకొద్దిమంది. అట్లాటివారిలో శ్రీ దీక్షితులుగారిది అందెవేసిన చెయ్యి.

బాలవాఙ్మయాన్ని అభిమానించేవారిలో శ్రీదీక్షితులుగారిని ప్రశంసించనివా రుండరు. వీరి 'సూరీ, సీతీ, వెంకీ' కథలూ, గేయాలూ మంచి పేరుతెచ్చుకుని బాగా ప్రచారానికి వచ్చాయి. శ్రీ దీక్షితులుగారి రచనలు మంచి ధారాశుద్ధి కలిగి, కొంచెం చదవనూ, వ్రాయనూ నేర్చిన ప్రతీవారూ అర్థంచేసికోతగ్గట్టుగా వుండే భాషలో, అలాంటి భావాలతోనే రసం చిప్పిలుతూ వుంటాయి.

'లక్కపిడత' ల్లో యిరవై చక్కటి గేయాలున్నాయి. అన్నీ ఒకదాని కింకోటి ఈడుతీయకుండా వుండడంచేత తారతమ్యం నిర్ణయించడం కష్టం. ఈ గేయాల్లో చాలావరకూ యిదివరకు చాలా పత్రికల్లో పడ్డవే అయినా సరికొత్తల్లాగే కనబడతాయి. ఎన్ని సార్లు చదివినా విసుగు అనిపించదు. అన్నీ స్వాభావిక

వర్ణనలతో ఉండటంబట్టి పండిత, పామర భేదం లేకుండా అందరికీ ఆమోదాన్నీ ఆనందాన్నీ కలిగిస్తాయి.

'లక్క పిడతలు' బాలగేయవాఙ్మయంలో అగ్రస్థానాన్ని అలంకరింపదగినది.

ఇంతవరకూ తెలుగులో బాలురికి స్వంతంగా చదవడానికి ఏలైన వాఙ్మయం లేదు. అరవంలోనూ, కన్నడంలోనూ 'బాలర్ కల్వి', 'మక్కళ పుస్తక' మొదలైన పత్రికలుకూడా ప్రత్యేకం బాలురకోసమే పనిచేస్తూ వున్నాయి. అలాంటి పత్రిక లేవీ లేకపోయినా శ్రీ దీక్షితులు గారివంటి వాఙ్మయాభిమానులు యిలాంటి చిన్న చిన్న పుస్తకాలు ప్రకటించి బాలురకి వుత్సాహాన్ని కలుగచెయ్యాలి. వాఙ్మయాభిమానులు యిల్లాంటివారికి తగిన ప్రోత్సాహం యివ్వడం విధిగా భావించాలి.

బు. వేం. ర.

---

## మహాభారత కౌరవరంగము

డెమ్మీసైజు, గ్లేజుకాగితము, ౧౧౫ పేజీలు, వెల రు. ౧-౦-౦

కవి: ఉమర్ అలీషా.

విజ్ఞాన విద్యాపీఠాధిపతులగు ఉమర్ అలీషాకవిగారు ఆంధ్రలోకమునకు చిరపరిచితులు. తెలుగుకవుల తెన్నులగూర్చి వ్రాయుదలపడువారికి ఉమర్ అలీషాకవిగారి జీవితచరిత్ర, తెలుగుకు వారొనర్చినసేవ, వారి రచనలు కొంతసామగ్రిని కూర్చి పేర్చు నవుటలో సందేహమావంతయు లేదు.

ఈ కవి "మహాభారత కౌరవరంగము" అను నీదృశ్యప్రబంధమును తొలుత ౧౯౧౬ వ సంవత్సర ప్రాంతముననే రచించినట్లు పీఠికయందు దుగ్గడింపబడినది. దీనిని రచించుటయందీకవి త్రొక్కిన ఫక్కి పైవిషయమును స్పష్టపరుపనున్నను స్పష్టపడుచున్నది. ఆంధ్రనాటకరంగ మొకపాటి ఔన్నత్యదశయందున్న దినములవి. పదిపదునైదు వత్సరములకుమున్నే యీకవి యీ నాటకమును వెలువరించియుండిన ప్రయోజనముండెడిది.

మహాభారతేతిహాసము భారతవ్యక్తి ప్రతిపాదకమైన దనుట నిర్వివాదాంశము. దీని నెందరెన్ని విధ ములనిర్వచన మొనర్చినను నిందలి చేవ తరుగదు. "మహాభారత కౌరవరంగము" అను నీ నాటకము పాండవ కౌరవులకుగల నైతికస్థానిక సంప్రదాయాది ప్రసిద్ధనర్మములు నిష్పాక్షికముగ భారత వ్యక్తిత్వమును ప్రతిపాదించునట్లు ధర్మయుక్తముగ రచించినట్లుదాహరింపబడినది.

రాయబారముతో ప్రారంభమై సంగ్రామాంతము వరకు జరిగిన గాథయే యిందలి యంశము. అసలు, ప్రధానరసము వీరము. నంజుడుగ నిసుమంత హాస్యధోరణినిగూడ గల్పిత మొనర్చిరి చివరవరకు నొకే విధముగ నడక గలదు. రాయబారరంగము, యుద్ధము ముగిసి ముగియకమున్న తనవారెల్లరు మడసినపిమ్మట తన ప్రతిజ్ఞప్రకారము అపాండవము కాలేదేయని దుర్యోధనుడుపడు ఆవేదన మొదలగు ఘట్టములు రసవంతములుగ నున్నవి. రసమునకు తగినట్లు భాష అమరియున్నది. పద్యములు పుష్కలముగ నున్నవి. నాటకమన్నివిధముల ప్రదర్శనానుకూలముగ నున్నది. అయితే ఆంధ్రనాటక రంగము అవసానదశయందున్న యీదినములలో నిట్టి నాటకముల కెట్టి ప్రయోజనము, ప్రచారము లభింపగల దనునదియే సందేహము.

వడ్లమన్నాటి కుటుంబరావు

---

## నూతన ఇండియా రాజ్యాంగము

క్రౌనుసైజు, ౭౮ పుటలు, చక్కని గ్లేజు కాగితము, వెల ప్రతి ౧ కి రు. ౦-3-౦.

గ్రంథకర్త: దిగవల్లి వేంకట శివరావు, బి. ఎ, బి. ఎల్.

ప్రకాశకులు: ఆంధ్రరాష్ట్ర రైతు సంఘము, బెజవాడ.

మన దేశమునకు వైస్రాయిగనుండిన కర్జను ప్రభువు ౧౯౦౧ లో " భారతదేశము బ్రిటీషు సామ్రాజ్యమునకు కొలికిపూస. ఏ భాగము పోయినను మన సామ్రాజ్యము నిలుచును గాని భారతదేశము పోయినచో మన సామ్రాజ్యము అస్తమించవలసినదే" అని పలికినాడు. భారతదేశమును బ్రిటీషువారు అంత చులకనగా చూడరు. దీనికి తాత్కాలికముగ సంస్కరణములకల్ల

భారతదేశమును వారంతకంతకు ఉచ్చులచే బిగించుచున్నారు.

నూతనముగ వచ్చిన క్రొత్త రాజ్యాంగము ౧౯౧౯ నాటి ప్రాత రాజ్యాంగముకన్నను కఠినతరమైనది. ముఖ్యముగ వైస్రాయికిని గవర్నరులకును యిక ముందు "ప్రత్యేక బాధ్యతలు" అను పేరట అపరిమితములగు సర్వాధికారము లొసగబడినవి. జాతీయాభివృద్ధికరములగు శాఖలను వృద్ధిచేయు మార్గముల కిది దారి చూపుట లేదు.

మొన్న మొన్నటివరకు భారత రాజకీయ సమస్యలు కేవలము విద్యాధికుల నడుమనే నలుగుచుండెడివి. సామాన్యరైతునకవి దుర్గ్రాహ్యముగ నుండెడివి. గాంధి మహాత్ముని కృషివలన రైతులలో నిప్పుడొకతీవ్రతర-ఆవేశము వెలువడినది.

ఇప్పట్టున భారతరాజ్యాంగమునకు సంబంధించిన "నూతన ఇండియా రాజ్యాంగము"వంటి గ్రంథములయొక్క ఆవశ్యకత యెంతేని కలదు. బ్రిటిషువారెట్టి యుచ్చులచే భారతదేశమును బిగించచూచుచున్నారో ప్రత్యంశమునందును గ్రంథకర్త బహు కూలంకషముగ రచించినారు. రాజకీయసమస్యలకు సంబంధించిన అలజడులయందు ఒక నాయకుని నమ్మి ఆతని ననుసరించుట యటుండ ఆ సమస్యలకు సంబంధించిన పూర్వాపర సందర్భములు, వాటి లాభనష్టములు, వాటియందిమిడియున్న స్వార్థపరత మున్నగు అనేకవిషయములు తుణ్ణముగ గ్రహించియున్నచో నట్టి రాజకీయాందోళన త్వరలో తప్పక ఫలప్రదము కాకమానదు. రైతుకంతునకు వచ్చిన నేటి రాజకీయోద్యమము ఫలకారియగుటకు ప్రతి రైతు నూతన సంస్కరణముయొక్క బాగోగుల నవగాహన చేసికొనుట ప్రథమకర్తవ్యము.

శివరావుగారి యీరచన బహుసమయోచితమైనది. రైతు సంఘమువారుగూడ దీనిని ప్రకటింపబూనుట, బీదవానికి గూడ అందుబాటున నుండునట్లు ప్రకాశకు లీ గ్రంథమునకు అంత స్వల్పమూల్యము నుంచుట మిగుల ప్రశంసింపతగినవి. ఈ గ్రంథము తప్పక బహుళప్రచారము లభించగలదని మ్మనచున్నాము.

ఈ గ్రంథమునందు భారతదేశ పరిపాలన, బ్రిటిషుపార్లమెంటుయొక్క సర్వాధికారము, ఫెడరలు శాసననిర్మాణసంస్థ, అట్టి సంస్థయొక్క అధికారము, గవర్నరు జనరలు అధికారములు, సంస్థానాధీశులు, శాసననిర్మాణసంస్థలు, గవర్నర్ల అధికారములు, కేంద్ర ప్రభుత్వము, రాష్ట్రీయ స్వపరిపాలనము, బ్రిటిషువారి హక్కులు, ఐ. సి. ఎస్. ఉద్యోగులు మున్నగు విషయముల గూర్చిన నూతన సంస్కరణముల మూలమున భారతీయుల కెట్టి స్వాతంత్ర్యములు, లాభములు లేకపోగా యెవ్విధమున దేశదాస్య బంధనములను మరింత గట్టిపరచుచున్నవో బహు చక్కగ సులభముగ గ్రాహ్యమగునట్లు రచింపబడినవి. ఇందు నూతన రాజ్యాంగము యొక్క స్వరూప స్వభావములగూర్చి అఖిలభారత-కాంగ్రెసు కమిటీవారు ప్రచురించిన ఇంగ్లీషువ్యాసమును, దీని ఆర్థిక రాజకీయఫలితములనుగూర్చి బూటానీగారు వ్రాసిన ఆంగ్లవ్యాసమును అనువదించి చేర్పబడినది.

వడ్లమన్నాటి కుటుంబరావు.

---

## సోవియటు రష్యాలో సమిష్టి వ్యవసాయ పద్ధతి

క్రౌనుసైజు, సుమారు ౩౦ పుటలు, వెల ఒక అణా. గ్రంథకర్త: రామమోహన్.

౧౯౧౭ వ సంవత్సరం ప్రాంతంవరకు రష్యా బహు అనాగరకస్థితిలో వుండేది. ఏకాలంలో గూడా యిక్కడ వ్యవసాయమే ప్రధానవృత్తి. అయినప్పటికీ రైతుకు సుఖంలేదు. జారు ప్రభుత్వము అంతరించి సోవియటు ప్రభుత్వం తలయెత్తిన పిమ్మట రష్యాలోని రైతుస్థితి సంపూర్ణంగా మారిపోయింది. జమీందారీ పద్ధతి తొలగింపబడింది. భూమినంతను సమిష్టిమీద వ్యవసాయం చేసుకోవటం. ఇదంతా ఉమ్మడి సొత్తు. ఒక్కొకడు తాను చేసే కష్టాన్ననుసరించి ప్రతిఫలం పంచుకోవటం. ఈ మార్పు రావటానికి ప్రారంభంలో కొంచెం [illegible] కరమైన పరిస్థితు లేర్పడినా యీనాడు

ప్రభుత్వం, ప్రజలు యేకమై ఒకకట్టుమీద శ్రమచేసి ౧౯౧౩ నాటికంటె ౧౯౩౬ నాటికి తమ దేశ జాతీయాదాయం నాలుగురెట్లు పెంచుకున్నారు. ఈనాడు రష్యా ఆదర్శ వ్యవసాయక్షేత్రంగా ప్రపంచమంతటిచేత పరిగణింపబడుతోంది.

రష్యా యీనాడు యిట్టి స్థితికి యేలా రాగలిగిందో, అక్కడ అనుసరింపబడిన విధానాలెట్టివో యీ గ్రంథం తెలుపుతుంది. సంఘీభావము, కట్టుబాటువల్ల యెంతపనినైనా సాధించవచ్చునని సోవియటు విధానం తేటపరుస్తుంది.

గ్రంథములు కావలసిన రామమోహనరాయ్ సామిల్సు కాంపౌండ్సు, గాంధీనగరం, కాకినాడ అని వ్రాసిన పనయగలరు.

వడ్లమన్నాటి కుటుంబరావు.

---

## శ్రీ నాగమహాశయుని జీవితచరిత్ర

క్రౌనుసైజు ౧౫౦ పు. చక్కని గ్లేజుకాగితము, వెల ౮ అణాలు.

ప్రకాశకులు: శ్రీరామకృష్ణమఠము, మైలాపూరు, మదరాసు.

శ్రీ నాగమహాశయుని అసలు నామధేయము దుర్గాచరణనాగు. శ్రీరామకృష్ణ పరమహంసయొక్క శిష్యవర్గమునం దీనాగమహాశయు డగ్రగణ్యుడు. ఈతని యందుగల మహద్విశేష మేమన గృహస్థాశ్రమమున నుండియే పారమార్థిక జీవితమునందు అత్యున్నతస్థితిని బొందుట. వైద్యవిద్య నభ్యసించి అర్థాని యాధారమున రోగులను బిండజూచెడు ఘనుల నెందరనో మన మెరుగుదుము. అట్టివారికి నాగమహాశయుని జీవితచారిత్రము వైద్యవిద్యయొక్క పారమార్థిక ప్రయోజనమును తెల్లమొనర్చుచున్నది. వైద్యవిద్యయొక్క ప్రయోజనము ధనార్జనకాదు. సోదర మానవుని దేహానర్థకములను తొలగించి అతని సుఖజీవమునసుంచుటే వైద్య విద్య ప్రయోజనము,

ఇంతేకాక యీతని యహింసావ్రతదీక్ష అప్రతిమానమైనది. పుట్టుకతో శూద్రుడయ్యును మత్స్యమాంసాముల సేవింపకుండుట మాత్రమేకాక భూమిపైనడచు నంతమాత్రమున అందందు దిరుగాడు చీమ లెక్కడ తన పాదములక్రింద నలిగి చచ్చునోయని దినముల తరబడి యిలు వెడలెడువాడు గాడట.

మాంస మజ్జా యుతమగు నీదేహము ఎప్పుడో ఒకప్పుడు రూపములేకుండ నశించునదనియు, అట్టిదీనికి కామినీకాంచనములమీద మమకారమేలయనియు, బ్రతికియుండినంతకాలము భగవత్సేవ, పరోపకారము మాత్రమే కైవల్యసిద్ధికి మార్గములనియు నీతని నమ్మకము. రెండుతడవలు వివాహము చేసికొనినను భార్యను స్పృశించి యెరుగడు. లక్షలార్జించగల అవకాశ మమరియున్నను తన కెంత కావలెనో అంతియే గ్రహించువాడు ప్రపంచమునందలి ప్రత్యణువునం దాతనికి భగవల్లీల గోచరించును.

ఆదర్శప్రాయములగు నిట్టి మహదంశము లెన్నియో ఈనాగమహాశయుని జీవితమునందు గాననగును. ఈగ్రంథమునం దీతని చరిత్ర,బాల్యము, వైద్య విద్యాభ్యాసము, పునర్వివాహము, మంత్రోపదేశము దక్షిణ దేశయాత్ర, జన్మస్థాన నివాసము, శ్రీరామకృష్ణ సందర్శనము, గార్హస్థ్య జీవితము, అంత్యదినములు, మహాసమాధి, నాగమహాశయులచే విరచితంబులగు కొన్ని గీతములు మొదలగు వివిధప్రకరణములు కలిగియున్నది. శ్రీరామకృష్ణపరమహంస కేవలము భగవదవతారమనియు, ప్రపంచమున నేది జరిగినను భగవదిచ్ఛ ననుసరించియే జరుగునుగాని మానవుడు అహం అని యుచ్చరించుటకు తగడనియు మానవు డీ ప్రపంచమున కేవలము రేణుమాత్రాంశమే అనియు నాగమహాశయుని విశ్వాసము. బుద్ధి తెలిసినది మొదలు ప్రాణము హరీయును వరకీతని జీవిత మొకేతీరున గడచినట్లు తెలియుచున్నది. స్త్రీ పురుషులెల్లరు పఠించి అనుసరింపదగు విశేషము లెన్నియో కలవు.

ఈతని జీవితచరిత్ర వంగ ఆంగ్లభాషలందు మాత్రమేకాక అనేక యితర భాషలందుగూడ ప్రచురింపబడినది. వంగ ఆంగ్లభాషల రెంటను పాండిత్య మమరియున్న శ్రీయుత గోటేటి సత్యనారాయణ మూర్తిగారు తెలుగున వ్రాసిరి. సరళమగు భాష, చక్కని ఆంధ్రపత్రికా ముద్రణాలయపు అచ్చుకూర్పు.

వడ్లమన్నాటి కుటుంబరావు.

---

## స్రుతమధూలిక

ప్రథమసంపుటము - కర్త: శ్రీ మానూరువేంకట శేషగిరిరావు, క్రౌను ౭౯ పుటలు.

ఈ 'స్రుతమధూలిక' లో ౫౭ ఖండకావ్యాలున్నాయి. వాటిలో పద్యాలు ఎక్కువ; గేయాలు తక్కువ. పద్యాలు గ్రాంథికంలో రాయాలనీ, గేయాలు వ్యావహారికంలో రాయాలనీ కవి తలచినట్టు వాటి వాటిని బట్టి తెలుస్తుంది. కాని పద్యాల్లోకూడా చాలా చోట్ల వ్యావహారికపదాలు స్వేచ్ఛగా ఉపయోగింపబడ్డాయి. పయి ఖండకావ్యాల్లో చిన్నది రెండు బంతులది. పెద్దది ౩౬ బంతులది. తక్కినవన్నీ ఈ మధ్యరకంలో ఉన్నాయి.

అసలు 'స్రుతమధూలిక' అంటే ఏమిటో అర్థం కాలేదు. అట్టపైని ఉన్న చిత్రంలో ఒకవ్యక్తి పాత్రలోంచి మధువుని ఒలకబోస్తూ ఉన్నట్టు కనబడుతుంది. సంపుటంలోని ప్రతికావ్యమూ అర్థం కాకపోయినా మొత్తంమీద ఒకవ్యక్తి తన ప్రియురాలికోసం విషాదగీతాలు ఆలపిస్తున్నట్లు తెలుస్తుంది. 'మధూలి లేక మధూలిక' అంటే ఒక చెట్టు; మధువు కాదు. 'చెట్టు' అనే అర్థమే గ్రహిస్తే 'స్రుత' అనేది దానికి సరిపడదు. 'స్రుత మధూలిక' అనే ఖండకావ్యంలో 'మగ్గజీవ మధువు దొర్లిపోయినది.' అని కొంత చిత్రాభిప్రాయాన్నే వ్యక్తపరుస్తుంది. కవి అనుకున్న అర్థంలో 'స్రుతమధూలిక' పదం అసమర్థం అవుతున్నది.

కవి పద్యాల్లో ఛందోయతినియమాల్ని పాటించినట్లు కనబడుతున్నది. కాని ఆనియమం చాలాచోట్ల తప్పిపోయింది.

సామాన్యంగా భావం పూర్తి అయినప్పుడుగాని, వ్యంగ్యం కావలసినప్పుడుగాని పద్యాల్ని పూర్తిచేయకుండా విడిచిపెట్టడమూ, పద్యాల నడుమనే కొన్ని పదాల్ని విడిచిపెట్టడమూ ఆధునిక కవులకి అలవాటు. ఈ పుస్తకంలో అలాంటి అవసరాలు లేకపోయినప్పుడున్నూ పదాలే కాకుండా పద్యైకదేశాలున్నూ విడువబడ్డాయి. పయి తీరు పుస్తకమంతటా తరుచుగా ఉంది.

'మోవిసుధాప్రవర్షిత... సంతసాత్మజా!, ఏకతెన్న, రేనాగబోడి, సహచర్యము, ... వారి, క్షుద్రదబికారి, విని స్రుస్నతమధుసోన, ప్రథకన్నె, స్వంతయనుభవము, నదీకన్నె, మగ్గమల్లియలు, భువీధరము, బికావేణి, పూసుందరాంగి, ఉషా ఉపద, సౌందరీయాణువు'ల వంటిప్రయోగాలు చాలా యిందులో ఉన్నాయి. మిశ్రసమాసాలూ, వ్యాకరణవిరుద్ధాలూ వాడితే యేం పుట్టిమునిగిందనవచ్చు. కాని అట్టివి శ్రుతికటువులు కాక రసానుగుణములయితే పరవాలేదు. స్వరూప, సందర్భాల్ని పట్టి మాస్తే ఇట్టిపదాలకి శ్రావ్యత్వంతోటీ, రసంతోటీ సంబంధం ఈ గ్రంథంలో కనపడలేదు. 'నా దేవివోయి నీవు!, చెల్లునోయి కొంటరితనమోయి' అని స్త్రీనిగూర్చి పురుషుని సంబోధించే మాదిరిగా 'ఓయి!' అని వాడబడ్డాది. అది సరసంగా ఉంటుందా?

ఈ పుస్తకంలో ఏకొద్ది కావ్యాలో తక్క తక్కినవన్నీ ఊహాకందని భావాలతో కూర్చబడ్డాయి.

'నిన్న' ఉంచి, పెంచుకొనగ గ్రొన్ననలు' గడించుకోలేని కడుబీద కిచ్చుకొంటి, వెట్లు దక్కెద వతనికి?

లోకకారణజన్మగా లోకు లెరిగి, కొన్న నిన్ను... నీతోడనే నన్ను........... .........'

మొదలైన కావ్యాలు దాని కుదాహృతులు. అయినా—

'తల వరించి ఆరాధింపవలయు దేవి, మైన నిన్ సతి వనుకొని నానో ఏమొ, ప్రేమ సేర్చుకొనుటకైన ప్రియతమవగు, నట్టి నిన్ పశుతను గనినానో ఏమొ, వ్రేలుతాకున మధుగీతు లాలపించు, వీణెతీగల తెగ లాగి విడిచినానో, అట్టె చూచుకొని పులక లందవలయు, సుమసుగంధము వాసన చూడగోరి, కరముల నలిపివేసిన ఘనుడనేమొ!, కాక............'

యిల్లాటి మంచి భావాల కావ్యాలూ ఉన్నాయి, స్వల్పంగా. బాగా సంస్కరిస్తే పయి కావ్యం యింతకంటె చాలా బాగా తయారయేదే!

ఈ పుస్తకంలో నవీన ఖండకావ్యపద్ధతిని పేజీకి రెండు మొదలు పన్నెండు బంతులవరకూ ముద్రణం జరిగింది. పేజీల సంఖ్య లేదు. విషయసూచికయు లేదు.

ర.

### జన్మభూమి

ఆంధ్రసేవా ద్వితీయ ప్రసూనము; కరుణరస భరితమగు నాటిక. కర్త: శ్రీ ముద్దా విశ్వనాథము. క్రౌను సైజు, ౪౦ పుటలు, చక్కని కూర్పు. వెల ౪ అణాలు. ప్రకాశకులు: వ్యాసకుటీరము, మెలుపాక, ఎలమంచిలి.

'జన్మభూమి'కి 'మాతృక' జువెనిల్ బడ్జెట్టు' లోని హృదయంగమమగు నొక చిన్న కథ. ఇందు కవి 'మన దేశాచార సంప్రదాయముల కనుకూలముగ గాథ మార్పుచేయుటయేకాక, ఇందులకుపకరించు భావములు ఆంగ్లేయకవిరత్నములగు ఎలిజాకూక్, సర్ విలియం షేక్స్పియర్, సర్ వాల్టర్ స్కాట్ మహాశయులు రచించిన అమూల్యపద్యకావ్యముల నుండి గ్రహించి ప్రసంగములలోఁ జేర్చిరి. 'పాఠకులకు రుచి గల్గించుటకై భారత, భాగవతాది సుప్రసిద్ధ పురాణ గ్రంథములనుండి కథాసందర్భమునకు సరిపడు పద్యములు కొన్ని వలయు మార్పులతోఁ బాత్రములచే ననువదింపఁ జేసిరి. 'ఇదిగాక, ఆధునిక విఖ్యాతకవిపుంగవులగు శ్రీ మంగిపూడి వేంకటశర్మగారు, శ్రీ వడ్డాది సుబ్బారాయుఁడుగారు, శ్రీ కూచి నరసింహముపంతులుగారు మున్నగువారి పద్యరత్నములును ఇందు గ్రహింపఁ బడినవి.'

ఇందలి కథ హృదయంగమము; రచన సరళము. జన్మభూమియెడ కవికి గల గౌరవము, ప్రీతి యిందు సువ్యక్తములు. ఇతరుల పద్యము లిందు కొన్ని గ్రహింపబడినను, కొన్ని కొలదిమార్పులను చెందినను అవి ప్రస్తుతానుగుణములు కాక పాఠకుల ఆమోదమునకు పాత్రము లయియున్నవి. భావ గ్రాంథికమైనను స్వభావవిరుద్ధముగ లేదు. భాషాభిమాను లీ గ్రంథమును పఠించి, గ్రంథకర్తృప్రయత్నమును సఫలము నొనర్తురు గాక!

బు. వేం. ర.

---

### "రూమ్ టు లెట్"

రచయిత: పిల్లలమర్రి బాలకృష్ణశాస్త్రి. ఇది తెనాలి యువకార్యాలయంవారి మూడో ప్రచురణం. ఈ కార్యాలయంవారు ఆధునికుల కథల్ని నూరేసి పుటలకు మించకుండా సంపుటాలుగా ప్రకటిస్తున్నారు. సంపుటం వెల ఒక్కింటికి నాలుగణాలు మాత్రమే. ఇంగ్లీషులోని ఆరుపెన్నీల నకలలూ, కథాసంపుటాలూ లాంటి పుస్తకాలు మనకు లేని లోపాన్ని యువకార్యాలయంవారు ఈనాటికి తీర్చారు. ఇందుకు వారిని ఎంతైనా అభినందించాలి.

ఈ కార్యాలయంవారి మొదటి రెండు కథాసంపుటాల ఉత్తమశ్రేణిలోకి రాకపోయినా, పిల్లలమర్రి బాలకృష్ణశాస్త్రిగారి కథలు చదవడానికి కులాసాగానే వున్నాయి. "ఇవి వినోదకథ"లని చెప్పడం కంటె ఈ సంపుటి ప్రకాశకులుకూడా వీటినికరించి "క్లెయిం" చెయ్యలేదు

శాస్త్రిగారి కథలన్నింటిలోనూ మొట్టమొదటి "రూమ్ టు లెట్" చాలాచక్కగావుంది. తక్కిన అన్నికథలూకూడా ఈ శ్రేణిలోనివే అయితే ఈ సంపుటం ఉత్తమోత్తమమైనదని చెప్పడానికి ఏమీ సందేహం వుండేదికాదు.

మొత్తంమీద శాస్త్రిగారి కథలలో చాలా Promise కనబడుతున్నది. ఇంతవరకు వారువ్రాసిన కథలు ఈ సంపుటంలోని ఆరూ మాత్రమే. అంచేత ఇకముందు వారు ఇంతకంటె ఉత్తమమైనవాటిని ఎన్నింటినో వ్రాయుగలరనీ, వ్రాస్తారనీ ఆశించవచ్చును.

—రావుకీ

---

## స్వీకారము

### శ్రీ గీత గోవిందము

సంస్కృత శ్లోకములు, తెనుగు పద్యములు, తాత్పర్యము. పు. ౭౩. వెల ౦-౪-౦.

అనువాదకుడు: సూరాబత్తుల సూర్యనారాయణ

ప్రకాశకులు: గుండు జగన్నాథంసన్, బుక్ సెల్లర్సు, రాజమండ్రి.

౧. విజ్ఞానలహరి

క్రౌను ౧/౮ సైజు, పు ౬౦, వెల రు. ౦-౪-౦.

౨. ఆనందలహరి

క్రౌను ౧/౮ సైజు, పు. ౮౩, వెల రు. ౦-౧౦-౦.

౩. అధ్యాత్మామృతసారము

క్రౌను ౧/౮ సైజు, పు. ౧౦౪.

ఈమూఁడు వచనగ్రంథములకు కర్త: శిష్టా గోపాలం, బి ఏ, యల్. టి., హెడ్మాష్టరు, ట్రెయినింగు స్కూలు, అమలాపురం.

---

ఆంధ్రజ్యోతి (పద్యరచనము)

క్రౌను ౧/౮ సైజు, పు. ౨౬.

గ్రంథకర్త: కొడాలి వేంకటరాజారావు.

కృష్ణాజిల్లా పెదకళ్లేపల్లి నివాసులు కొడాలి ఆంజనేయశర్మగారికి ఐదుఅణాల స్టాంపులను పంపిన పుస్తకము లభించును.

---

౧. హిందూ మతము (ప్రధానసందేశము)

డెమ్మి ౧/౧౬ సైజు, పు ౮౨. రు. ౦-౨-౦

౨. శ్రీరామకృష్ణ వివేకానంద రామతీర్థుల ఉపదేశములు

డెమి ౧/౧౬ సైజు, పు. ౧౦౬, వెల రు. ౦-౪-౦

౩. హిందూమతము, స్వధర్మము

డెమి ౧/౧౬ సైజు, పు. ౮౭, వెల రు. ౦-౨-౦

ఈ మూడువచనరచనముల రచయిత బులుసు వేంకటేశ్వర్లు, ఎం. ఏ., పి. ఆర్. కాలేజి, కాకినాడ.

---

దుర్భా సుబ్రహ్మణ్య శర్మగారి యాంధ్ర - లక్ష్మీశృంగార కుసుమ మంజరీ విమర్శము

క్రౌను ౧/౮ సైజు, పు. ౬౩, వెల రు. ౦-౪-౦.

విమర్శకుడు: ఓరుగంటి వేంకటేశ్వరశర్మ, హిందీపండితుడు, ఆంధ్రవిశ్వకళాశాల, వాల్తేరు.

---

లక్ష్యఖండం (పద్యరచనల సంపుటి)

డెమి ౧/౮ సైజు, పు. ౧౬. వెల రు. ౦-౮-౦

సమాహారకర్త: కొమరవోలు చంద్రశేఖరమంత్రి, వాఙ్మయసమితి, తిరువల్లిక్కేణి, మదరాసు.

---

పండుగకట్నము (పద్యరచనము)

ఫూల్స్‌క్యాప్ సైజు, పు. ౨౪.

కవి: పాలెపు బుచ్చి వేంకటసాంబశివరావు, అనకాపల్లి.

---

తత్త్వబోధ

(శ్రీదుర్భా సుబ్రహ్మణ్యశర్మగారి 'వర్ధంతి' విమర్శము)

క్రౌను ౧/౮ సైజు, పు. ౪౫, వెల రు. ౦-౨-౦.

విమర్శకుడు: ధరణికోట వేంకటసుబ్బయ్య, 'శ్రీనగర్', నెల్లూరు.

---

సుబ్బయ్యగారి దబ్బరలు

(ధరణికోట వేంకట సుబ్బయ్యగారి తత్త్వబోధలోని విషయములు.)

క్రౌను ౧/౮ సైజు, పు. ౬౫

విమర్శకుడు: కే. నారాయణరావు నాయుడు, నెల్లూరు.

---

ధరణికోట వారి ధార్ష్ట్యము

క్రౌను ౧/౮ సైజు, పు. ౨౦

విమర్శకుడు: దీపాల పిచ్చయ్యశాస్త్రి, నెల్లూరు.

---

సిద్ధగణపతి నీతులు

(పద్య రచనము)

క్రౌను ౧/౮ సైజు, పు. ౧౨౭, గ్రంథకర్త ఆల్లక వీరభద్రకవి, లక్ష్మీనారాయణపుపేట, రాజమహేంద్రవరము.

౧. శ్రీరమణగీత

పద్యకావ్యము. క్రౌను ౧౩౦ పుటలు వెల ౮ అణాలు.

అనువాదకులు: గుబ్బిం వేంకటసుబ్బరామయ్య, నెల్లూరు.

౨. మహర్షియు; తత్సందేశమును; శ్రీమదరుణాచలాష్టకము

గద్యపద్యాత్మకము. క్రౌను ౧౩౬ పుటలు. వెల ౬ అణాలు.

అనువాదకులు: దోమా వెంకటస్వామిగుప్త,

౩. ఉన్నది నలుబది; సద్విద్య; నేనెవరు?

క్రౌను ౪౪ పుటలు. వెల ౦-౨-౬.

౪. 'మహర్షిపాదపద్మసన్నిధిలో

క్రౌను ౪౫ పుటలు: వెల రెండణాలు.

అనువాదకులు: శ్రీ దామరపాక్కం ఓ కృష్ణయ్య

౫. అరుణాచలస్తుతి పంచకము

క్రౌను ౩౧ పుటలు. వెల రెండణాలు.

అనువాదకులు: గిద్దలూరి నరసింగరావు.

౬ ఉపదేశసారము

క్రౌను ౨౦ పుటలు. వెల అణాకాని.

అనువాదకులు: శ్రీ ప్రణవానందులు.

పయి ఆరుగ్రంథములకును ప్రచురణకర్త: శ్రీ నిరంజనానందస్వామి, సర్వాధికారి, శ్రీ రమణాశ్రమము, తిరువణ్ణామల.

ప్రకృతిగృహవైద్యము

క్రౌను ౧/౪ సైజు. పు. ౧౪౧. వెల రు. ౨-౮-౦.

గ్రంథకర్త: పుచ్చా వెంకట్రామయ్య, ప్రకృతి కార్యాలయము, బెజవాడ.

---

ఆంధ్రభాషాచరిత్రము (రెండు సంపుటములు

ఆంధ్రవిశ్వకళాపరిషద్ గ్రంథమాల ౧౮ వ ప్రచురణము.

గ్రంథకర్త: చిలుకూరి నారాయణరావు, యం. ఏ., యల్. టి., పి. హెచ్ డి, సంస్కృతాంధ్రకర్ణాటభాషాధ్యాపకుడు, రాయలసీమ కళాశాల, అనంతపురము.

ఒక్కొక్క సంపుటము వెల ఆరురూపాయలు.

---

౧. ప్రేమాంజలి - (పద్యరచనము)

క్రౌను ౧/౮ సైజు, పు. ౯౨. వెల రు. ౦-౪-౦.

౨. శ్రీ బాలకోటేశ్వరస్తవము నేవాంజలి (పద్యరచనము)

క్రౌను ౧/౮ సైజు. పు. ౪౦. వెల రు. ౦-౨-౦.

పై రెండు రచనములకును కర్త: వాసిరెడ్డి వేంకటసుబ్బయ్య.

ప్రకాశకులు: వాసిరెడ్డి వేంకటేశ్వరరావు, వడ్లమూడి, గుంటూరు జిల్లా.

---

ప్రత్యూషము

పద్యకావ్యము. డెమ్మి ౧౨౦ పుటలు. వెల రు. ౧-౦-౦.

కర్త: కొమరవోలు వెంకటసుబ్బారావు.

---

తెనుగుతల్లి (సచిత్రమాసపత్రిక)

చిత్తూరునుండి వెలువడుచున్నది. సంపాదకులు: కుమారదేవ. ఏడాదిచందా ౧రూ. విడిప్రతిక ౦-౧-౩ క్రౌను సైజులో పుస్తకరూపమున వెలువడుచుండు, సమస్త విజ్ఞానదాయకములగు విషయముల చర్చించు పత్రిక. దీనికి శుభోదర్కము నాసించుచున్నాము.

---

Printed and Published by K. Nageswara Rao,
at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St., Madras. Editor: G. Subbaramayya.

# విషయసూచిక



త్రివర్ణ చిత్రములు:—రంగివల్లి; శివభక్తమాహాత్మ్యమున యజ్ఞదత్తనామక బ్రాహ్మణాఖ్యానమున నొక రంగము.

సాధారణచిత్రములు:—బళ్లారిదుర్గచిత్రములు; మణిపురినాట్యచిత్రములు; ఆనందపారవశ్యము; తదితరచిత్రములును.

# భారతి చందాదార్లకు హెచ్చరిక

ఈక్రింది కనబరచిన నెంబర్ల వారికి ఈనెల (1937 సం. ఆగస్టునెల)తో ఇదివరకు చెల్లించిన చందా పూర్తి యగుచున్నది. తిరిగి ఇంకొక సంవత్సరమున కగు చందా మాకు చేరునట్లు ఈనెలాఖరులోగా మనియార్డరు చేసినచో తెంపులేకుండ పత్రికను పంపుచుందుము. అట్లు తమయొద్దనుండి 30-వ తేది లోపుగ సొమ్మురానిచో సహజ భాషాభిమానులగు తాము తిరిగి ఇంకొక సంవత్సరము వఱకు చందాదారులుగ నుందురను నమ్మకముతో 1937 సం. సెప్టంబరు 10-వ తేదిని రూ 6-4-0 లకు వి.పి. పంపుచున్నాము. గావున తామెప్పటివలెనే పత్రికయందభిమాన ముంచి సొమ్ము చెల్లించి వి. పి. ని గైకొన ప్రార్థితులు. ఒకవేళ తమ కీపత్రిక ప్రస్తుత మనవసర ముగ దోచినచో మా కావిషయము వెంటనే తెలియజేసినయెడల వి. పి. పంపుట నాపుదుము.

B 7, 20, 21, 22. G 6, 7. H 30, 32, 33. H 65. J 7, 8. K 18.
L 3, 13. M 13. N 30. P 18, 23, 24, 53, 55. R 22. S 20, 74, 78, 81, 85,
87, 91, 92, 93, 94, 95, 192, 193, 195, 196, 199, 205. T 5. V 2, 24.



సంపు. ౧౮ ఈశ్వర సంవత్సరము, శ్రావణమాసము ( ఆగస్టు ౧౯౩౭ ) సంఖ్య ౮

# గుడిపాటి వెంకటచలంగారి 'పాపం'!!!* విమర్శన

బుర్రా వెంకటసుబ్రహ్మణ్యం

● ● ●

గుడిపాటి వెంకటచలంగారి కథలు తొమ్మిదింటిని పుస్తకరూపంలో తెనాలి యువకార్యాలయం వారు వార ద్వితీయప్రచురణంగా ప్రచురించారు. వారి ప్రథమప్రచురణం కొడవటిగంటి కుటుంబరావుగారి 'కారుణ్యం' అన్న కథలసంపుటి. 'పాపం !!!' తర్వాత పిల్లలమర్రి బాలకృష్ణశాస్త్రిగారి 'రూమ్ టు లెట్' అన్న కథలసంపుటి కూడా ప్రచురించారు. † ఇటువంటి ప్రచురణాలవల్ల తెనాలి యువకార్యాలయంవారు ఆంధ్రవాఙ్మయాభివృద్ధికి చాలా తోడ్పడుతున్నారు. ఇప్పటివరకూ వారు ప్రచురించిన కథలపుస్తకాలవెల చెరొక నాలుగణాలు మాత్రమే. ఏ విధంగా ఆలోచించినా, ఆంధ్రప్రజయొక్క సహాయానికి తెనాలి యువ

---

* యువకార్యాలయ ప్రచురణం, యువకార్యాలయం, కొత్తపేట, తెనాలి. వెల నాలుగణాలు.

† [ఆ తరువాత మునిమాణిక్యం నరసింహారావుగారి 'కాంతం కైఫియతు' (కథలసంపుటి)న్నూ ప్రచురించారు. సం. భా.]

కార్యాలయంవారు పూర్తిగా అర్హులన్న విషయం అందరూ గ్రహించాలి.

తెలుగుకథలు చదివే ఆంధ్రులలో వెంకటచలంగారి పేరు వినని వారుకాని, వారికథలు చాలావరకు చదవనివారుకాని ఎవరూ ఉండరు తెలుగుదేశంలో వెంకటచలంగారు కథలు వ్రాయడం మొదలుపెట్టకముందు కథలు లేకపోలేదు. కాని అప్పటికథలన్నీ ప్రాచీన పద్ధతులమీద వ్రాయబడ్డవి. పాశ్చాత్యనవలలూ, పాశ్చాత్య కథలూ అనేకం చదివి, వాటిపద్ధతులు గ్రహించి, ఆ పద్ధతుల ప్రకారం తెలుగులో కథలు వ్రాయడం పది పదిహేను సంవత్సరాలకిందటివరకూ జరగలేదు. వెంకట పార్వతీశ్వరకవులు ఆంధ్రప్రచారిణీ గ్రంథనిలయం స్థాపించి, బెంగాలీకథలు కొన్ని తెలుగుభాషలోకి తర్జుమా చేయించారు కాని, ఆ బెంగాలీకథలు చాలావరకు అపరాధపరిశోధకనవలలే అవడంవల్లనూ, చెప్పదగినన్ని సాంఘిక నవలలు వారి గ్రంథనిలయంనుంచి వెలువడకపోవడంవల్లనూ, 1920 వ సంవత్సరానికి పూర్వం వారు ఆంధ్రభాషాభివృద్ధికోసం చేసిన ప్రయత్నాలు అంతగా ఫలించలేదు. ఇటీవల సాహితీసమితి స్థాపింపబడడంవల్ల తెలుగులో కొంతవరకు చదవదగిన కథలు కొన్ని వ్రాయబడ్డాయి. కాని, వెంకటచలంగారు కథలు వ్రాయడం మొదలుపెట్టకమునుపు తెలుగు భాషలో చెప్పుకోదగినకథకు లెవ్వరూ లేరని ఒప్పుకోక తప్పదు.

వెంకటచలంగారి కథల గురించి వ్యాసం వ్రాస్తుంటే ముఖ్యంగా చెప్పవలసిన విషయం ఇదే. నవీన పాశ్చాత్య వాఙ్మయాలు కొద్దో గొప్పో చదివి తెలుగు వాఙ్మయంలోకి కొత్తపద్ధతులూ, కొత్తకళలూ తెచ్చిన మొదటి కథకు డీయనే. కాని, పేరుపడ్డ పాశ్చాత్య కథకులు అనేకమందున్నారు. వారి వారి పద్ధతులు అనేకం ఉన్నాయి. వెంకటచలంగారు శ్రద్ధగా చదివిన కథకులూ శ్రద్ధగా బోధపరచుకున్న పద్ధతులూ మాత్రం చాలా తక్కువ. గీడిమోపసా అన్న ఫ్రెంచి కథకుడియొక్క కథలు వీరు అన్నీ చదివినట్లు కనిపిస్తుంది. వీరి కథలు కొన్ని పూర్తిగా మోపసాయొక్క కథల అనువాదాలే. పూర్తిగా అనువాదాలు కానప్పుడు కూడా అక్కడక్కడ వీరి కథలలో [illegible] మైన భావాలూ సొంపులూ వీరికి మోపసాయొక్క కథలు చదవడంవల్లనే పట్టుబడ్డాయని మోపసాయొక్క కథల గురించి ఏమాత్రం తెలిసినవాళ్లకైనా బోధపడుతుంది. అప్పుడప్పుడు వీరు తమ కథలు కొన్ని అనువాదాలు మాత్రమే అన్న విషయం తెలియపరచకుండా కూడా ఊరుకుంటారు. వారి 'సావిత్రి' నాటకానికి మనవి మాటగా 'దీనిలో వున్నతభావాలన్నీ మీటర్‌లింక్ కవివి' అని వ్రాసేరు. కాని, 'సత్యం శివం సుందరం' అన్న కథలలో ఒక కథ పూర్తిగా మోపసాయొక్క 'బూల్ డి సూఫ్' అన్న కథకి అనువాదం అన్న విషయం కాని, వారి 'దైవమిచ్చిన భార్య' హెచ్. జి. వెల్స్‌యొక్క 'పేషనేట్ ఫ్రెండ్స్' అన్న నవలకి అనువాదం అన్న విషయం కాని వారు ఎక్కడా ప్రకటించినట్లు నాకు జ్ఞాపకం లేదు.

నిజానికి పూర్తిగా స్వంతకథలు ఊహించి వ్రాయలేని సందర్భంలో మన వాఙ్మయం అభివృద్ధి చెందాలంటే పరదేశపు కథలకి అనువాదాలు తయారు చెయ్యక తప్పదు. ఈ విధంగా ఆలోచిస్తే, మన కథకులు తమ కథలు కొన్ని అనువాదాలని లోకానికి ప్రకటించినా ప్రకటించకపోయినా మోపసావంటి గ్రంథకర్తల కథలని మన సంఘపరిస్థితులకి సరిపోయేటట్లు తిప్పి మన భాషలో వ్రాయడం ఆనందించవలసిన విషయమే. అతి రమ్యమైన అనువాదాలు తయారు చెయ్యడంలో వెంకటచలంగారి కున్న నిపుణత ఎవరికీ లేదు. 'బూల్ డి సూఫ్' యొక్క అనువాదం చదువుతుంటే వారెంత తెలివైనవారో ఎవరికైనా తెలుస్తుంది. నా అభిప్రాయం కానప్పటికీ, కొందరి అభిప్రాయం ఏమిటంటే అసలు కథకంటె వీరి అనువాదం ఎక్కువ చక్కగా ఉందని. వారి 'దైవమిచ్చిన భార్య' కూడా చాలా అద్భుతమైన అనువాదం. వా థలలో అనువాదాలు కాకుండా వారి స్వంతకథలే అని తెలిసిపోయే కథలు ఏవీ కూడా వారి అనువాదాలలో ప్రశస్తమైనవాటంత అందంగా ఉండవని నా ఊహ.

వెంకటచలంగారి కథల విమర్శన వ్రాయడంలో ఒక చిక్కు కూడా ఉంది. వారి వ్రాతలో ఎంతవరకు స్వంతరచనో ఎంతవరకు అనువాదరచనో తెలుసుకోడం [illegible] కథలు చదువుతున్నప్పుడు 'ఒక

వేళ ఈభాగం అనువాదమేమో ' అన్న అనుమానం కలగడానికి కారణం వారికథలలో ఉండే సంఘనిరూపణ మనసంఘపరిస్థితులకి సమంగా చెందకపోవడమే. అటుకంటప్పుడు ఆభాగం అనువాదమే అయినట్టయితే అనువాదం అందంగాలేదని చెప్పవల సొస్తుంది. అనువాదం కాకుండా స్వంతరచనే అయినట్టయితే కథ మన సంఘానికి సహజంగా లేదని చెప్పవల సొస్తుంది. ఈ కథలసంపుటిలో నే ' మోసంచేసిందా ?' అన్న మొదటి కథ చదువుతుంటే ఇటువంటి అనుమానం కలుగుతుంది. ఒకవైపు హనుమంతరావుని ప్రేమిస్తూ, మరొకమనిషిని, మద్దులమధ్య, "పాపంకదండీ పెళ్లి కానివాళ్లతో సహవాసం ?"అని ఒకసారీ, "పానీ, ఈపనులకి అంతప్రాంముఖ్యం లేనప్పుడు అనేకమందికి- యిద్దరుముగ్గురికి- సంతోష మిస్తేనేమండి ?" అని మరొకసారీ ప్రశ్నలువేసే లలితకాని; మొదట అసందర్భంగా నరకబాధకి భయపడి హనుమంతరావుని పొమ్మని, చివరకి నరకంలేదన్న చవకబోధనలవల్ల చటుక్కున ధైర్యం తెచ్చుకుని హనుమంతరావుతో లేచిపోయే లలితకాని మన ప్రస్తుత సంఘ పరిస్థితులకి కథలో ఏ సమయంలోనూ సహజమైన స్త్రీలా కనపడదు. కథ చమత్కారంగా ఉందన్నమాట నిజమే. కాని మనదేశంలో జరిగేకథకాదు. పైకి కనిపించడం ఏదేశపు భావంలోనో ఉన్న ఏ శతాబ్దపు కథనో తెచ్చి మన దేశంలోనూ, మనభావంలోనూ ఇరికించడానికి ప్రయత్నించినట్టుగా కనిపిస్తుంది. అనటోల్ ఫ్రాన్స్ అన్న ఫ్రెంచికథకుడి కథలు కొన్నిటిలో ఈ కథలోఉన్న చమత్కారభావం ఉంటుంది. కాని ఆ ఫ్రెంచికథకుడి కథలు చదువుతుంటే సంఘనిరూపణలో కాని, స్వభావచిత్రణలోకాని తప్పుపట్టేందుకు అవకాశం ఎక్కడా ఉండదు.

ఈ కథలసంపుటిలో 'అమ్మగారి అవసరం' అన్నకథకూడా పైన చెప్పినవిధంగానే చాలా అందంగానూ, చాలా అసహజంగానూ కూడా ఉంది. కథంతా మూడునాలుగు వాక్యాలలో ఇమిడుంది. "గోపాలయ్యరు ముసలివాడు. ఎవరన్నా పెద్దమనుషు లొస్తే భార్యని పంపుతాడు వాళ్లగదిలోకి......యింకెవరూ దొరక్కపోతే పదిగంటలప్పుడు "భవానీసింగ్ అమ్మగారి అవసరం చూడు" అంటాడు. అందుకనే ఎవరు వచ్చినా కరుస్తాడు, ఆ జవానుగాడు." ఇంత ఉదార స్వభావుడైన గోపాలయ్యరూ ఇంత మదపీడితురాలైన రుక్మిణీ, భోగభాగ్యాలతో ఇంత తులతూగుతున్న జవానుగాడూ వెతికితే వెంకటచలంగారికి ఏ ఊళ్లల్లోనైనా కనిపిస్తారేమోకాని, ఈ గోపాలయ్యర్లూ రుక్మిణులూ భవానీసింగులూకూడా ప్రతిరోజూ. ఇంతధారాళంగా, నిస్సంకోచంగా, నిర్భయంగా ఇలా ప్రవర్తించడం ఎక్కడా ఉండరు. కథ మనసంఘానికి సహజంగా ఉండాలంటే ఈభయం సంకోచం దాపరికం ఏదో ఒకవిధంగా ప్రధానపాత్రలలో చూపించాలి. లేకపోతే ఏ పాశ్చాత్యకథకుడికథనో దొంగిలించినట్టు చదువరులకి అనుమానం కలగడం చదువరులతప్పు కాదు.

ఈ సందర్భంలోనే 'మచ్చలు' అన్నకథకూడా కొంత చర్చించవలసిన దవును. దుర్గమ్మ ఒకపిచ్చి 'ముంగివెధవ'యొక్క భార్య. దుర్గమ్మశరీరంమీద ఎప్పటికప్పుడు 'పళ్లుదిగపడ్డగంట్లూ' మచ్చలూను. 'దుర్గమ్మకీ భర్తకీ సరసాలు అంతతీవ్రంగా ఉంటాయి గావును' అని దుర్గమ్మయొక్క కథ చెప్తున్నకుర్రవాడూ అతనిభార్యా అనుకుంటారు. అతనిభార్య ప్రసవానికి పుట్టింటికి వెళ్లినప్పుడు అతను దుర్గమ్మని అతనిపెరట్లో కలుసుకుంటాడు :

ఆమెదగ్గిరికి వెళ్లి, "ఏంకొత్తమచ్చలు లేవు" అన్నాను.
సిగ్గుపడక, చిన్ననవ్వుతో "లేవండీ" అంది.........
"కొత్తమచ్చలు లేనేలేవా?" అన్నాను మళ్లీ.
"ఉంటే కనపడవు" అంది ధైర్యంగా.
"కనపడనిచోట్ల ఉన్నాయా?"
కళ్లూ తలా తిప్పేసింది.
"మచ్చ లేవీ? చూడనీ" అని ఆమెబుజం మీది రవికను పక్కగా లాగాను. దుర్గమ్మ మెల్లిగా నావేళ్లను తొలిగించి మళ్లాకప్పుకున్నది. అదే పట్టుదలతో రెండోచేతి పక్కన చూశాను.

అక్కడో పెద్దమచ్చ వుంది. ఇంకాకొంచెం కిందగా యెత్తుగా మొదలుపెట్టేచోట యింకోమచ్చ వుంది.

"పాపం, దుర్గమ్మా!" అని ఆమెకలని నా రొమ్మూకి అద్దుకున్నాను.

"ఎందుకు నామచ్చలిజోలి నీకు? ఎప్పుడూ నవ్వుతావు. వొళ్లంతా అవే" అని మోకాలి మీద చీర తీసి చూపింది.

నేను చప్పున యింకా పైకిలాగి "ఇంకా లేవా?" అన్నాను.

దుర్గమ్మకీ కథచెప్తున్నవాడికీ ఉన్నట్టు చూపించబడ్డ పరిచయ పరిస్థితులలో ఈ 'బుజంమీది రవికను పక్కగా లాగడాలూ', ఈ 'మోకాలిమీదిచీర తీసి చూపించడాలూ', ఈ 'చప్పున చీరె యింకా పైకిలాగడాలూ' వింతలు కానట్టూ, అంతసర్వసామాన్య మైన విషయాలైనట్టూ వర్ణించడంలో వెంకటచలంగారు ఏసంఘంయొక్క పరిస్థితులు మనసులో పెట్టుకుని ఈ కథ వ్రాసేరో తెలుసుకోడం కష్టం. దుర్గమ్మకథ చెప్తున్నవాడు ఆ ఊరి వైద్యుడై యుండి, దుర్గమ్మకి మందులూ మాటలూ ఇస్తున్న సందర్భంలో అతని కామచ్చలు కనపడ్డట్టు కథవ్రాసినట్టయితే ఈకథలో సంఘనిరూపణ ఇంత అవకతవకగా ఉండకపోను.

ఈ కథల సంపుటిలో ఉన్న మిగిలిన కథలు చదువుతుంటే కూడా సంఘనిరూపణలో ఈ దుర్గుణం అనేకచోట్ల కనిపిస్తుంది. ఒకవేళ తమ కథలకీ మన సంఘపు ప్రస్తుత పరిస్థితులకీ సంబంధమే లేదని కాని, సంబంధం ఉందోలేదో ఆయనకి అవసరంలేదని కాని వెంకటచలంగారు వాదించేటట్టయితే, ఆయన కొక జవాబు చెప్పవలసుంటుంది. ప్రత్యేకంగా ఒక సంఘాన్నే మనసులో పెట్టుకుని కథలు వ్రాయనివాళ్లు ప్రత్యేకంగా ఒక సంఘానికి మాత్రమే చెందేవర్ణనలూ మాటలూ వారి కథలలో ఏభాగంలోనూ కూడా వాడకూడదు. అలా వాడినట్టయితే గ్రంథకర్త ప్రత్యేకంగా ఆ సంఘాన్నిగురించే కథ వ్రాయదలచుకున్నట్టు నిర్ధారణ. మన సంఘపరిస్థితులకి ప్రస్తుతం చెందే వర్ణనలూ మాటలూ వెంకటచలంగారి ప్రతి కథలోనూ అనేకం కనిపిస్తాయి. 'మోసంచేసిందా?' అన్న కథలో 'హనుమంతరావు జాడ్యపు అసలు కారణం విష్ణ్వాలయం ప్రాకారసామీప్యంలో ఉండాలనుకుని వతికేను' అని వ్రాయడంలో కాని; 'దొంటరితనం' అన్న కథలో 'వెంకటబ్రహ్మం పేరు చెపితే చాలు, దొంగలకే కాదు, వంటవాళ్లకీ, మేస్త్రీటుకీ, తక్కిన యినస్పెక్టర్లకీ హడలు' అనడంలో కాని; 'అమ్మగారి అవసరం' అన్న కథలో 'భోజనంచేసి డిప్టీసూపరెంటు నరసింగరావు బంగాళా వరండాలో నుంచున్నాడు' అని వ్రాయడంలో కాని; 'అవసరంలేని ఆపరేషన్' అన్న కథలో 'యింక బిడ్డలకోసం వాళ్లు పడ్డ శ్రమా, చేసిన ప్రయత్నాలూ. యిన్నన్ని కావు యెన్నిమందులో, యెన్ని యాత్రలో, యెన్ని మొక్కులో, యెన్నివిధాలైన ప్రదక్షిణాలో, యెంతమది బైరాగులకీ సన్యాసులకీ బహుమతులో!' అని వ్రాయడంలో కాని; 'మచ్చలు' అన్న కథలో 'నాభార్య ప్రసవానికి పుట్టింటికివెళ్లింది' అని వ్రాయడంలో కాని; 'ఎదగనేలేదు' అన్నకథలో 'గోదావరి యిసికలంకల వెనక సూర్యుడు అస్తమిస్తున్నాడు. వుల్లొంచి బిందె పట్టుకుని ఒక అమ్మాయి మా రేవువేపు వొచ్చింది' అని వ్రాయడంలో కాని వెంకటచలంగారు మన సంఘపరిస్థితులనే మనసులో పెట్టుకుని కథలు వ్రాయబోయారన్న విషయం అందరికీ విశదం. ఆ ఉద్దేశ్యంలో కథలు మొదలుపెట్టి, మధ్యలోనూ చివరనా మళ్లీ అల్లకల్లోలాలైన పాశ్చాత్య సంఘాలలోనే ఆరితేరిన తెల్లవాళ్లకంటె కూడా ఎక్కువ స్వేచ్ఛగానూ, నదురూ బెదురూ లేకుండానూ మనదేశపు ఆడవాళ్లూ మొగవాళ్లూ ప్రవర్తిస్తున్నట్టు ఆయన వ్రాయడం ఆయనకథలయొక్క మిగిలిన అందాన్నికూడా పాడుచేస్తుంది. సాంఘికసంబంధ మైన కథ ఏదైనా కూడా ఏదో ఒక సంఘంయొక్క పరిస్థితులలో జరిగుండొచ్చునని నమ్మతగినట్టుండాలి. వెంకటచలంగారి కథలు చదువుతుంటే వ్యతిరేకమైన అనేక సంఘాలు కలగాపులగ మైనట్టూ, లోకం అంతా తల్లకిందులైనట్టూ ఉంటుంది. గొప్ప కథకుల కథలలో ఉంటే సంఘనిరూపణలో ఇటువంటివ్యత్యాసాలేవీ

ఉండవు. బొకాచ్చియో యొక్క కథలుకాని, బాల్జాక్ యొక్క కథలుకాని, మోపసాయొక్క కథలు కాని, అనటోల్ ఫ్రాన్స్‌యొక్క కథలుకాని, డి. హెచ్. లారెన్సుయొక్క కథలు కాని చదివి ఆనందించిన ఏ చదువరికైనా వెంకటచలంగారి కథలు చదువుతుంటే మొదట కనిపించే భేదం ఇదే.

వెంకటచలంగారి కథల సంఘ నిరూపణలో వ్యత్యాసా లుండడానికి కారణం ఆయనకి పైనచెప్పినట్టు పాశ్చాత్య కథకుల వ్రాతలతో ఉండవలసినకంటె ఎక్కువ పరిచయం ఉందన్న విషయం ఒక్కటేకాదు. అంతకన్న ముఖ్యమైన కారణం ఆయనకి స్వంతదేశపు పరిస్థితులు బోధపరచుకుని, వాటిపైనే ఆధారపడుండే కథలు వ్రాయడానికి శక్తికాని, అభిలాషకాని లేకపోవడం. ఈశతాబ్దంలో మనదేశపు ఉన్నతభావాలూ ఆశయాలూ అన్నీ పాశ్చాత్య నాగరికతతో పోటీలో పడడంవల్ల, మనసంఘంలో మనకళ్లయెదుట అనేక మార్పులు బయలుదేరుతున్నాయి. సమిష్టికుటుంబం మాయమై పోతోంది. వివాహవిధానాలూ సాంఘిక నిబంధనలూ మారిపోతున్నాయి. స్త్రీల వ్యక్తిత్వమూ, స్త్రీల స్వాతంత్ర్యమూ, స్త్రీల హక్కులూ పెరిగిపోతున్నాయి. ఈమార్పులన్నీ వాటంతటవి సునాయాసంగా రావడంలేదు. కొందరువ్యక్తులు సంఘానికి ఎరవకుండా ముందడుగు వేస్తున్నారు ఈ ముందడుగు వేస్తున్న వాళ్లకికూడా అప్పుడప్పుడు ధైర్యం చాలడంలేదు. ధైర్యం చాలకపోవడమే కాకుండా కొన్ని సమయాలలో వాళ్లు కొత్తగా తొక్కుతున్నమార్గాలు సరియైన మార్గాలు కావేమోనన్న సందేహంకూడా వాళ్లని బాధిస్తోంది. ఈవ్యక్తులందరూ సంఘాన్ని ఎదురుకుని పడుతున్న కష్టాలూ, కొత్తమార్గాలు తొక్కడంలో వారికి ధైర్యం చాలనప్పుడు వారిని ఖేదించే సందేహాలూ, వారి మనోవేదనా వెంకటచలంగారి కథలలో ఎంతవెతికినా కనపడవు. వారివి ఈతొమ్మిదికథలూ చదువుతుంటే, ఇన్ని శతాబ్దాలనుంచి కదలిక ఎరగని మన సంఘాన్ని పాశ్చాత్యనాగరికత వచ్చి కలికేస్తోందన్న విషయంకాని, మన పూర్వాచారాలకీ ఈకొత్తనాగరికతకీ మధ్య పడి చాలామంది [illegible]న్న విషయంకాని ఏ సందర్భంలోనూ ఎవరికీ తట్టదు. మన జీవితాలలో ముఖ్యమైన సాంఘిక సమస్యలకీ వెంకటచలంగారి వినోదప్రపంచానికీ ఎక్కడా సంబంధం లేదు.

వెంకటచలంగారు ఈ కథలసంపుటికి గంభీరంగా 'పాపం !!!' అని పేరుపెట్టేరు. కాని వీరికింత జాలి వీరికథలలో సంభవించేవాళ్లెవరెవరిమీద ఏఏ కారణాలవల్ల పుట్టిందో బోధపడడం లేదు. 'మోసం చేసిందా ?' అన్నకథలోనూ, 'వొంటరితనం' అన్న కథలోనూ, 'నేనూ మా ఆవిడా మిగిలాం' అన్నకథలోనూ, 'అమ్మగారిఅవసరం' అన్నకథలోనూ, 'అవసరంలేని ఆపరేషన్' అన్నకథలోనూ, 'అవతారమా?' అన్నకథలోనూ కథకుడి ఉద్దేశ్యంలో జాలిశబ్దం పుట్టించగలిగే ఆడదికాని మొగవాడుకాని ఎంతవెతికినా కనపడడంలేదు. 'ఎదగనేలేదు' అన్నకథలో ఒకపెద్ద మనిషి, తనపెళ్లానికి ముసలిరూపు వస్తోందని దుఃఖపడుతూ, ఆదుఃఖంలో ఏమి చెయ్యడానికీ తోచక తన అత్తగారితో సంబంధం పెట్టుకుంటాడు! ఈకథలో పెళ్లాన్నిచూసి జాలిపడాలో మొగుడినిచూసి జాలిపడాలో తెలియకుండా ఉంది. 'మచ్చలు' అన్నకథలో పాశ్చాత్య శాస్త్రజ్ఞులచేత 'శాడిజమ్' అనబడే కొస వెర్రితో బాధపడుతున్న రత్తయ్య పిచ్చివాడన్న విషయం కథలో ఏ భాగంలోనూ నొక్కిచెప్పకుండా, రత్తయ్య పెళ్లామైన దుర్గమ్మ పడుతున్న బాధలు లోకంలో ప్రతి ఆడదీకూడా పడుతున్నట్టూ, ఒకడిపెళ్లాన్ని మరొకడొచ్చి లేవతీసుకుపోతేకాని ఆడవాళ్ల బాధలకి అంతులేనట్టూ కథవ్రాయడం చాలా హాస్యాస్పదంగా ఉంది. పిచ్చివాడిని పిచ్చివాళ్ల ఆసుపత్రికి పంపలేదన్న విషయమై కథలో నాయకులుకాని గ్రంథకర్తకాని ఎక్కడా విచారిస్తున్నట్టు చిహ్నాలు లేవు. దుర్గమ్మయొక్క దుఃఖంలో ఈ ముఖ్యాంశం మూలపడేసి, పైగా దుర్గమ్మని చెరపడానికికూడా ప్రయత్నించి నెగ్గలేక "ఆడది తృణీకరించింతరువాత మళ్లీ ఆమెక్షేమం కనుక్కుంటానా ?" అన్నధీరుడు ఆఖరికి అట్టహాసంగా, "జీవితంలోని దురదృష్టవంతులు మనపక్కనేవుంటారు. మనలోనే స్నేహంగా తిరుగుతోవుంటారు. బాధపడుతో, [illegible] మనకళ్లయెదటనే అకాలమృత్యువు

వేపు నడుస్తోవుంటారు. మనం గుర్తించం. గుర్తించినా మన ఆనందంలోంచి తప్పుకుని, వాళ్ళకోసం చెయ్యి జాచము. జాచినా, సహాయం తీసుకోరు. సహాయం చెయ్యలేము. నిస్సహాయులము. సహాయం తీసుకోడం వారిచాతకాదు. దౌర్భాగ్యులు, నిస్సహాయులు, విచిత్రమైనలోకం—భయంకరమైన జీవితం—" అంటూ అధికఉపన్యాసం ఇవ్వడం ఎంతవికారంగా ఉందంటే, చివరకి దుర్గమ్మంటే పుట్టనిజాలి కథకుడంటే పుట్తోంది.

ఒకవేళ 'పాపం !!!'యొక్క అర్థం పుణ్యానికి వ్యతిరేకమైన పదార్థం అయినట్టయితే ఈ తొమ్మిది కథలకీ ఈ పేరు పెట్టడంలో ఔచిత్యం ఆసలే కనపడదు.

ఒక దేశానికీ ఒకసంఘానికీ చెందనికథలు వ్రాయడానికి విశేషమైన పరిశీలనాశక్తికాని, ఎక్కువసూక్ష్మమైన బుద్ధికాని అవసరం లేదు. కాని, ప్రత్యేకంగా ఒకసంఘంయొక్క పరిస్థితులకే సరిపడేకథలు వ్రాయాలంటే, ఆటువంటికథలు మునిమాణిక్యం నరసింహరావుగారి కథలలా హాస్యప్రకథలు మాత్రమే కానప్పుడూ, పాంచకడీదేవ్ యొక్క కథలలా అపరాధ పరిశోధక నవలలు మాత్రమే కానప్పుడూ, చింతాదీక్షితులుగారి కథలలా చిన్నపిల్లలకి వ్రాయబడ్డ కథలుమాత్రమే కానప్పుడూ, కథకుడిలో రెండువిశేషమైనగుణాలుండాలి. మొదటిగుణం, ఆ సంఘంలో ఉండే వివిధవ్యక్తులయొక్క వివిధోద్దేశ్యాలతోనూ ఏకీభవించినా ఏకీభవించకపోయినా ప్రతివ్యక్తియొక్క మనోజీవితాన్నీ కూడా స్నేహభావంగానూ నిష్పక్షపాతంగానూ బోధపరచుకోగలిగినశక్తి. రెండవగుణం, సంఘం యావత్తులోనూ దోషాలన్నీ ఎలాఉద్భవించాయో, వాటిని పోగొట్టేందుకుమార్గాలేమిటో, ఊహాప్రపంచంలో అసలు సంఘం అంటే ఏమిటో, వ్యక్తియొక్క స్వేచ్ఛ అంటే ఏమిటో, సంఘానికీ వ్యక్తికీ వైరం ఎటువంటిదో, ఈ వైరం లేకుండా ఉండాలంటే సంఘం ఎటువంటిదై యుండాలో, వ్యక్తు లెటువంటివారై యుండాలో తెలుసుకునేందుకు ప్రయత్నించే మేధాశక్తి. ఈ రెండుగుణాలూకూడా వెంకటచలంగారిలో లేవనే చెప్పాలి. దీని అర్థం వెంకటచలంగారికి తెలివితేటలే లేవనికాదు. సంఘసమస్యల గురించి చర్చించడంలో వారి తెలివితేటలు ఇంకా సరియైన మార్గంలో పడలేదని చెప్పొచ్చును. హిందూమతాన్నీ పూర్వాచారాలనీ, పురాణం చెప్పించుకునే స్త్రీలనీ, చదువుకోని పల్లెటూరు వాళ్ళనీ వేళాకోళం చెయ్యడం అతిసులభమైన కార్యం. ఈమతచారాలలోనూ, సంఘాచారాలలోనూ, మనుష్యులలోనూ మంచిచెడ్డలు బోధపరచుకుని, ఉన్నమంచితనాన్ని వృద్ధిచేయడం అతికష్టమైనపని. వెంకటచలంగారి 'అవసరంలేని ఆపరేషన్' అన్నకథలో డాక్టరుయొక్క భర్తా, 'అవతారమా?' అన్నకథలో పంచాననతీర్థులూ, వాళ్ళకున్నపాటి చవటతెలివితేటలకి వాళ్ళెంతో ఘనులైనట్టూ, వాళ్ళచర్యలు వినోదకరమైన విషయాలు మాత్రమే అయినట్టూ, వాళ్ళగుణాలు కూడా ఆమోదించవలసిన గుణాలే అయినట్టూ, వాళ్ళవలలోపడ్డ తెలివితక్కువ స్త్రీల జీవితమార్గాలకి రవంతైనా దుఃఖం చూపించకుండా కథలు వ్రాయడం గ్రంథకర్తకి సంఘంయొక్క మంచిచెడ్డలంటే లక్ష్యంలేదన్నవిషయం రూఢిగా రుజువుపరుస్తుంది. సంఘం అంటే ఏమిటో, వ్యక్తిత్వం అంటే ఏమిటో సమంగా అర్థంచేసుకోలేని ప్రతి కుర్రవాడూకూడా గర్వంగా ఈ సంఘమూ ఈ లోకమూ ఈ నక్షత్రమండలమూ తనకోసమే ప్రత్యేకంగా సృజించబడినట్టు వెర్రిగంతులు వేస్తూ వెర్రికేకలు పెట్టుంటే చాలా వినోదకరంగానూ ఉంటుంది, చాలా విచారకరంగానూ ఉంటుంది. సృష్టికంతటికీ అర్థం తన చిన్నచిన్న కష్టాలలోనూ తన చిన్నచిన్న సుఖాలలోనూ మునిగి తేలుతున్న ఒక చిన్న వ్యక్తియొక్క తప్పకు జీవితంలో మాత్రమే వెతికితే కనపడదన్న విషయం వెంకటచలంగారుకూడా గ్రహించాలి. మనం అంతముఖ్యులమూ కాము. ఈసంఘాలూ ఈమతాలూ ఈసృష్టీ అంతతృణీకరించవలసినవీ కావు. కప్పలన్నా తొండలన్నా సహించక తమవినోదంకోసం వాటిని రాళ్లు రువ్వి బాధించేపిల్లలకీ అద్వైతవేదాంతం పూర్తిగా గ్రహించి ప్రతిజీవాన్నీ ప్రేమించే జ్ఞానికీ ఎంత భేదం ఉందో వెంకటచలంగారికీ నిజంగా గొప్పకథకులైనవాళ్లకీ అంతభేదం ఉంది.

పైనచెప్పిన రెండుగుణాలూ ఒకేసారి లేకపోయినప్పటికీ కొందరు పాశ్చాత్యకథకులు పేరుపడ్డవా

ళ్లున్నారన్నమాట నిజమే. కాని విమర్శకులు అటువంటి ప్రతి కథకుడియొక్క లోపాలూ కనిపెట్టక పోలేదు. గీ డి మోపసా యొక్క చిన్నకథలు చదువుతుంటే, మొత్తంమీద సంఘసమస్యలు అతన్ని అంతగా పీడించలేదన్న విషయం తేటపడుతుంది. కాని ప్యారిస్ నగరంలో ఫ్రెంచి సంఘపరిస్థితులు ఎటువంటివో పుస్తకాలు చదివి గ్రహించినవాళ్లకికూడా మోపసాకథలలో ఉండే సంఘనిరూపణలో ఏమీ లోటు లేదనీ, తను ఎటువంటివాళ్లగురించి కథలు వ్రాయబోయాడో అటువంటివారి స్వభావాలు మోపసా నిష్పక్షపాతంగా బోధపరచుకున్నాడనీ తెలుస్తుంది. అది కాక మోపసా యొక్క నవలలూ కొన్ని పెద్దకథలూ చదువుతుంటే, సంఘం అంటే అతని కంత నిర్లక్ష్యభావం లేదనీ, మానవజీవనంయొక్క అర్థం శరీరభోగాలతో ఆగిపోలేదన్న విషయం మోపసా గ్రహించాడనీ కూడా తెలుస్తుంది. వెంకటచలంగారి కథలలో సంఘ నిరూపణ ఏచోటా సమంగా ఉండదు. ఆయనకథలలో శరీర భోగాలని మించిన ఆంతరంగిక జ్ఞానం ఎక్కడా కనపడదు. మనుష్యులస్వభావాలు బోధపరచుకోవడంలో మోపసాకి ఉన్న నిష్పక్షపాతబుద్ధి ఆయనకి అసలేలేదు. మోపసా తనప్రతికథాకూడా కథయొక్క చమత్కారగుణాన్నే మనసులో పెట్టుకుని వ్రాసేడు కాని, సంఘాన్ని దూషించాలన్న ఉద్దేశ్యమూ, కొన్ని రకాల మనుష్యులని ఏడిపించాలన్న ఉద్దేశ్యమూ అతనికి ఎన్నడూ లేవు. వెంకటచలంగారి కథలలో మోపసాకథలలో ఉండే చమత్కారగుణం లేక పోలేదు. మోపసాయొక్క మిగిలిన సుగుణాలుమాత్రం ఏవీకూడా వీరిలో లేవు.

సంఘాన్ని తూలనాడి మనుష్యులని వేళాకోళం చెయ్యడానికి సమకట్టుకున్న కథకుడు సంఘాన్ని మించినవాడై యుండాలి. సంఘంలో మిగిలినవాళ్లకంటె ఎక్కువ తెలివైనవాడై యుండాలి. వ్యక్తులందరినీ బోధపరచుకునేందుకు అభిలాష. కాని, తెలివితేటలు కాని లేనివాడూ, సంఘాన్ని మనతో ఏమీ సంబంధం లేని ఒక తెలివితక్కువరాక్షసిగా భావించుకునే వాడూ ఇంకా చాలా విషయాలలో జ్ఞానం సంపాదిస్తే కాని గొప్ప కథకుడు కాలేడు. వెంకటచలంగారు అనేకవిధాల గొప్ప కథకుడు కావలసిన మనిషి. ఆయన ఊహాప్రపంచం అంత ఘోరంగా అర్థంలేనిదై యుండడం ఆంధ్రదేశంయొక్క దురదృష్టం.

ఈ వ్యాసం వ్రాస్తూ వెంకటచలంగారి సుగుణాలన్నీ ముందు చెప్పకపోవడం ఆయనమీద ద్వేషంవల్ల కాదు. ఆయన తెలుగువాఙ్మయానికి చేసిన సహాయానికి కృతజ్ఞత లేకపోవడంవల్ల కాదు. సంఘానికి నచ్చని బోధనలు ఆయన చేస్తున్నాడని ఆయన్ని ద్వేషిస్తే ఆయన తెలివితక్కువతనంలోనే మిగిలినవాళ్లు కూడా పడినట్టవుతుంది. ఈ లోకంలో ద్వేషంవల్ల ఏపనీ సమంగా జరగదు. ఒకవ్యక్తినికాని, ఒక సంఘాన్ని కాని బాగుపరచాలన్న ఆశ పెట్టుకున్నవాళ్లు ప్రేమవల్ల ముందు ఆ వ్యక్తితో ఐక్యం అవాలి, ఆ సంఘంతో ఐక్యం అవాలి. సంఘంతో ఐక్యం అవాలనడం ఏదో అర్థంలేని పొల్లుమాట కాదు. సంఘం మంచిదైనా చెడ్డదైనా, మనం మంచివాళ్లమైనా చెడ్డవాళ్లమైనా ప్రతి వ్యక్తీ సంఘంలో లీనమయియున్నాడు; ప్రతివ్యక్తిలోనూ సంఘం లీనమయియుండి. ఈ విషయం గ్రహించేవరకూ వ్యక్తికీ సంఘానికీకూడా మోక్షంలేదు. అందువల్ల చెప్పదలచుకున్న విషయం: వెంకటచలంగారి గొప్పతనం ఈ వ్యాసానికి మొదటకాకుండా ఆఖరిని వర్ణించడం ఆయనఊహాలంటే కక్షవల్ల కాదు. ఏకథకుడి విషయంలోనైనా కథకుడి ఊహాలు చర్చించడం విమర్శకుడి ప్రధానకర్తవ్యం. సరియైన విమర్శనలలో ద్వేషానికి చోటు లేదు.

అదికాక మరొకసంగతికూడా చెప్పాలి. నిస్సందేహంగా చిన్నకథలవిషయంలో తెలుగువాఙ్మయం చాలా దురవస్థలో ఉంది. వెంకటచలంగారు కథలు వ్రాస్తున్నారన్నంతమాత్రాన ఈ దురవస్థలో ఏమాత్రమూ మార్పు లేదు. రష్యాలోనూ జర్మనీలోనూ ఇటలీలోనూ ఫ్రాన్సులోనూ వ్రాయబడ్డకథలు చదువుతూ, మధ్యలో మనవాళ్లవికథలైనా కొన్ని తీసి చదవబోతే, మనం ఇంకా ఎంతవెనక్కపడున్నామో మనకే బోధపడుతుంది. మనకొత్తకథకుల్ని వెనకేసుకుంటూ ప్రపంచవాఙ్మయాలలో మనకికూడా చోటుందనేం

దుకు తెలుగువాడెవ్వడూ- తెలిసినవాడైతేనూ, చదువుకున్నవాడైతేనూ- సాహసించడు. ఇటువంటి పరిస్థితులలో విమర్శనలు వ్రాయడంఅంటూ ఉండవలసినట్టయితే, కథకులయొక్క లోపాలే ముందు చెప్పవలసుంటుంది. అలాకాకుండా, లోకంలో ఏకథకులతోనైనా సమానులనిపించుకునే కథకులు మనలోకూడా ఉన్నారని మనలోమనం నటించుకునేటట్టయితే అందువల్ల రెండుకష్టా లుంటాయి. మొదటికష్టం, మిగిలినదేశస్థులు మనప్రలాపాలువిని మనకథలు పరీక్షచేసినప్పుడు వాళ్ల వేళాకోళానికి మనం పాత్రులం అవడం. రెండవకష్టం, తెలుగుదేశంలోనే ఇతరవాఙ్మయాలతో పరిచయం లేని వాళ్లు ఇప్పుడున్న మనకథకులే గొప్పకథకులని నిశ్చయించుకున్నట్టయితే మనవాఙ్మయం అభివృద్ధిచెందకుండా ఉండిపోవడం. ఉన్నకథకులు గొప్పకథకులన్న నటన వదులుకుంటే కాని తెలుగువాఙ్మయానికి ముక్తి లేదు.

వెంకటచలంగారి కథలు బూతుకథలని చెప్పి ఎక్కువగా చదివేవాళ్లూ ఉన్నారు. బూతుకథలని చెప్పి ఎక్కువగా తిట్టేవాళ్లూ ఉన్నారు. చాలావరకు ఎక్కువగా తిట్టేవాళ్లే ఎక్కువగా చదివేవాళ్లని ఒప్పుకున్నా తప్పులేదు. కాని బూతుకథలవల్ల పేరు సంపాదించడం కాని, బూతుకథలవల్ల అనేకమంది చదువరులని సంపాదించడంకాని అంతగర్వపడవలసిన విషయం కాదు. ఎందువల్లనంటే, నిజానికి తెలుగుభాషలో కథకుడుగా వెంకటచలంగారికి గర్వపడవలసిన గుణాలు మిగిలినవి కొన్ని ఉన్నాయి. ఆయన శ్రద్ధగా వ్రాసినప్పుడు ఆయనవ్రాసినంతఅందంగా గ్రామ్యభాషలో ఎవరూ వ్రాయలేరు. గ్రామ్యభాష వాఙ్మయవృద్ధులకి తగినదని నిరూపించినవారిలో వెంకటచలంగారి పేరు ముందు చెప్పాలి. గ్రాంథికభాష నిజంగా ఆత్మసందేశాలతో కూడుకున్న ఉన్నతవాఙ్మయానికి తగదని నిరూపించిన గ్రంథకర్తలు కిందటి ముప్పైనలభై సంవత్సరాలలో చాలామందే ఉన్నారు. గ్రామ్యభాషయొక్క సామర్థ్యం మొదట వెల్లడిచేసినది వెంకటచలంగారే అని చెప్పొచ్చును. 'వినోదిని' మొదలైన తికలకి వ్రాసేటప్పుడు వెంకటచలంగారు గ్రామ్యభాషలో చాలా కంగారుగానూ, చాలా అందవికారంగానూ వ్రాస్తారు కాని, అప్పుడప్పుడు వారి భాష నిర్మలంగానూ, అందంగానూ ఉంటుంది. కొన్నిచోట్ల ఈ సంపుటిలోకూడా 'రైటర్ని పర్మిషన్ అడిగి' అనీ (౧౬ వ పేజీ), 'ఆ ఇల్లు ఎంతో కంఫర్టబుల్‌గా సుఖంగా ఉన్నట్టు కనపడ్డది' అనీ (౧౮ వ పేజీ), 'హ్యూరియాసిటీ ఆపుకోలేక' అనీ (౨౧ వ పేజీ), 'నా ప్రిన్సిపిల్సు నీకు తెలుసుకదా?' అనీ (౩౨ వ పేజీ), 'పెద్దస్కాండల్ ఐవుంటుంది' అనీ (౪౬ వ పేజీ), 'సూర్యుడు బ్రిడ్జి వెనకాల అస్తమిస్తున్నాడు' అనీ (౫౬ వ పేజీ), 'షర్టుకింద నా బుజం చక్కిలిగిలి ఫీలయింది' అనీ (౬౧ వ పేజీ) అనవసరంగా ఇంగ్లీషు పదాలు ప్రయోగించి భాషయొక్క అందం పోగొట్టేరు కాని, వారి మంచిశైలికి ఉదాహరణలు ఈకథలలోనే చాలా ఉన్నాయి:

౨౯, ౩౦ వ పేజీలలో, "కిటికీలోంచి బయిటికిచూస్తే చుట్టూ అందమయిన చీకటి, చీకటికంటె నల్లగా తుమ్మచెట్లు ఊగుతున్నాయి. చీకటి కాంతి నీళ్లమీద కొంచెంగా ప్రతిఫలించడంవల్ల నీళ్లు మెరుస్తున్నాయి. అంతవానకికూడా ఆరని నీలప్రదీపాల్ని మోసుకుంటూ మిణుగురుపురుగులు ఆకుల్లో వుత్సవం చేసుకుంటున్నాయి. మబ్బులు దెయ్యాలవలె ఎగిరిపోతున్నాయి ఆకాశంమీద"

౬౯ వ పేజీలో, "పొలాలమీద చల్లనిగాలి వింతగా రైల్ని యిదేమివస్తువా అని అనుమానంతో తాకిచూస్తోంది."

౮౪ వ పేజీలో, "ఎండలో వాడిలిన గోగుపూలు సాయంత్రపుగాలిలో ప్రాణాల్ని నింపుకుంటున్నాయి."

స్త్రీపురుషులసంబంధం కథలో అంకురించినప్పుడు ఆయనవర్ణనలూ, ఆయనపరిశీలనాశక్తీ అద్భుతంగా ఉంటాయి. 'నేనూ మా ఆవిడా మిగిలాం' అన్న కథలో హెడ్‌మాస్టరుగారిభార్యని వర్ణిస్తూ, "ఆమెని చూడగానే పగలబోయే పచ్చని పెద్దగుమ్మడిపళ్లూ, [illegible] మెత్తగదిళ్లూ, నిండుపాడిగేదెలూ

జ్ఞాపకమొస్తాయి'' అన్నవర్ణన చాలా బాగుంది. ఆకథలోనే పైనవర్ణింపబడిన స్త్రీయొక్క చూపుల గురించి "ఆ చూపులు చిన్నాలు - పన్నాలు పదిహేనేళ్లపిల్లలోనూ నలభై యేళ్ల స్త్రీలోనూ వొకటే" అనడ లోనూ, 'అమ్మగారిఅవసరం' అన్నకథలో పడకగదిలో రుక్మిణిని వర్ణిస్తూ "మెల్లిగా కాటిక రెప్పల్ని యెత్తి మళ్లా వాల్చింది. పశువుకి, నపుంసకుడికి, పసిపిల్లవాడికి అర్థమౌతుంది ఆచూపు" అనడంలోనూ వెంకటచలంగారు కొన్నిసంగతులు పరిశీలించడంలో ఎవరికీ తీసిపోరన్న విషయం తేటపడుతుంది 'మచ్చలు' అన్నకథలో(౯౩వ పేజీలో) 'రాత్రంతా ఆమెకేకలు మూలుగులు విన్నవాళ్లే అంతా. ఒక్కరూ కదల్లేదు. కిటికీలూ,తలుపులూ, చెవులూ, మనసులూ బిగించుకుని హాయిగా పడుకున్నారు' అన్నవాక్యాలూ; 'భావన్నా తెలీదు' అన్నకథలో కడియం స్టేషనులో ఉత్తర హిందూస్థానపు పిల్లా తనూ దిగిపోయాక తన సామాన్లన్నిటితో రైలు వెళ్లిపోతూ ఉండడం వర్ణించడంలో, 'ముసలాయనా, మూటలూ, నాట్రంకూ, దాంట్లో నాభార్య నాగవొత్తులూ, నా యల్. టీ. సర్టిఫికేటూ, నా కాకినాడ ప్రియురాలి వుత్తరాలూ అన్నీ వేగంగా యెర్రదీపంముందు నన్ను చూచి భయపడ్డట్టు పరుగెత్తుతున్నాయి" అన్నవాక్యమూ చదువుతున్నప్పుడు వెంకటచలగారు, ఊహకి రూపం ఇవ్వడంలో, తెలుగుభాషని ఎంతవరకు లొంగతీసుకున్నారో, ఎంత అందంగా ప్రయోగించగలుగుతున్నారో అందరికీ తెలుస్తుంది. కాని, ఈ అందాలన్నీ ఉన్నప్పటికీ, భాషావిషయంలో వెంకటచలంగారు ఇంకాశ్రద్ధతీసుకోవాలని చెప్పకతప్పదు. అటువంటిశ్రద్ధ వారు తీసుకునేటట్టయితే గ్రామ్యభాషలో వాఙ్మయాభివృద్ధికి వారు చెయ్యకలిగినమేలు మరెవరూ చెయ్యలేరన్నమాట నిశ్చయం.

మిగిలినవిషయాలలో—అంటే, కథ ఎలా మొదలుపెట్టాలో, ఎలా అంతుచెయ్యాలో, కథ ఎప్పుడు సంభాషణరూపంలో చెప్పాలో, ఎప్పుడు మామూలుగా చెప్పాలో, ఇటువంటివిషయాలలో వారికథలలో సామాన్యంగా ఎక్కడా లోట్లు కనపడవు 'వొంటరితనం' అన్నకథయొక్క ఆఖరివాక్యాలూ, 'అవతారమా ?' అన్నకథయొక్క ఆఖరివాక్యమూ రావలసినవిధంగానే రావలసినచోటనే వచ్చాయి. మోపసాయొక్కకథలు చాలాచదవడంవల్ల వెంకటచలంగారికి ఈ నిపుణత అద్భుతంగా పట్టుపడింది. స్వభావచిత్రణలో మట్టుకు మోపసాయొక్క అద్వితీయమైన చాకచక్యత వీరికి అంతగా అలవడలేదు.

తెలుగువాఙ్మయం అభివృద్ధిచెందాలని ఆశపెట్టుకున్న ప్రతి ఆంధ్రుడూ వెంకటచలంగారి 'పాపం !!!' అన్న కథలసంపుటి చదవకతీరదు.

———

# పూర్ణ

[నవల - అనువృత్తము]



● వాసిష్ఠగణపతిముని ●

## పదునాఱవ ప్రకరణము

### ఘనేంద్రుని విన్నపము

ఆచార్యభవనంది రెండవకుమారుఁడు ఘనేంద్రుఁడు నగరపాలుఁడుగా నున్నాఁడని మా పాఠకులకు ముందే తెలుసును. సుచంద్రుని కాలపు రాజకీయనిబంధన ననుసరించి నగరపాలుఁడు రాష్ట్రియుని చేతిక్రింద నధికారి. రాష్ట్రియుఁడు సర్వరక్షీ జనాధ్యక్షుఁడు. ఆతనికి మంత్రిమండలిలో నాసనము గలదు. నగరమునందు చౌర్యములు జరుగకుండ కాపాడుటయే గాక విప్లవకారులవలన ప్రజలకు భయము లేకుండ కాపాడుటయుఁ గూడ నగరపాలుని కర్తవ్యము. అతని నెల జీతము నూఱువరాలు. అతని గౌరవము శతపతికంటె నెక్కువ; సహస్రపతికంటె తక్కువ.

పరంతప సంఘచర్యలను కనిపెట్టువిషయములో ఘనేంద్రుఁడు చెప్పిన యుపాయములను తిరస్కరించుచు రాష్ట్రియ వీరనందుఁడు వేఱుపద్ధతుల నవలంబించి విఫలుఁడయ్యెను. తాను సరిగా పనిచేసి సామ్రాజ్యమునకు సేవచేయవలెనని ఘనేంద్రుఁడీపనిలో ప్రవేశించినాఁడు. తన చేతిక్రింది యుద్యోగస్థుని మాటవినుట తనయంతస్థుకు లోపమని వీరనందుఁడతనిని స్వతంత్రముగా నేపనియు చేయనీయకున్నాఁడు. ఘనేంద్రుఁడు మొన్న కుమారభోగనాథునిదగ్గర కుమార శక్తిధరునకు విరుద్ధముగా ప్రచారము చేయనని చెప్పుట భోగనాథవర్గమువారికి ఘనేంద్రునిపై మిక్కిలి క్రోధము కలిగించినది. భోగనాథవర్గములో వీరనందుఁడు మిక్కిలి ముఖ్యుఁడు. అతఁడు భోగనాథునకు మేనమామ యని యింతకుముందే సూచించియుంటిమి. అందువలన వీరనందుఁడు రెండు రోజులనుండి ఘనేంద్రునిపై మిక్కిలి కక్ష వహించి యతనిపనులన్నింటి కడ్డుపడుచున్నాఁడు. అందువలన విసిగి ఘనేంద్రుఁడు రాజుగారి కొక విన్నప మంపు కొనినాఁడు.

రాజుగారికి రహస్యముగా పంపవలసిన విన్నపములను బహిఃపురమున నుండు నొక డొక్కిలో వేయుదురు. ఆడొక్కిలోని కాగితములను తాళము తీసి, తీసుకొని సాయాహ్నము పార్థివుని విశ్రాంతిసమయమున నతని సన్నిధిలో సచివుఁడు రూపచంద్రుఁడు చదువుట యలవాటు.

గురువారమునాఁడు సాయంకాలమున రూపచంద్రుఁడు ఘనేంద్రుని విన్నపమును చదివినవాఁడయ్యెను.

"మహారాజ పరమేశ్వర కౌండిన్య సుచంద్రభట్టారకులవారి దివ్యసన్నిధికి. సేవకుఁడు నగరపాలుఁడు భారద్వాజఘనేంద్రుఁడు దండప్రణామపురస్సరముగా నతివినయముతో వ్రాసుకొనిన విన్నపము. నేను శ్రీవారి రక్షివర్గములో రాష్ట్రసేవకొఱకు ప్రవేశించితిని గాని జీతముకొఱకుఁ గాదు. రక్షిజన సర్వాధికారి నన్నే పనినిగూడ స్వతంత్రబుద్ధితో చేయనీయకున్నారు. ప్రభువువారు బాధ్యతగల పనిని నా కొప్పగించిరి. నే నా బాధ్యత నెట్లు నిర్వహించుట? పరీక్షకైనను నేను చెప్పెడు పరంతప సంఘచర్యా పరిశోధన పద్ధతిని వా రవలంబింపరు. ఆయన చూపిన మార్గముల నవలంబించి పనిచేసి మే మన్నివిధములుగా విఫలుల మైతిమి. బుద్ధిమంతుఁ డెవఁడును వీరనందబాబుగారిదగ్గఱ పనిసేయఁజాలఁ డని నా స్వల్పకాలానుభవములో నేను తెలుసుకొంటిని. శ్రీవారు నా పనిలో నాకు సంపూర్ణబాధ్యత యిచ్చిన పదునైదు దినములలో తగినంత కార్యము చేసి చూపఁగలవాఁడను. నావిన్నపము తిరస్కరింపఁబడునెడల నన్నీ సేవనుండి తప్పించి వేఱు సేవలోనికి శ్రీవారు గైకొనఁ బ్రార్థితులు. చిత్తగింపవలెను. విధేయుడు — భారద్వాజఘనేంద్రుఁడు వ్రాలు. విజయ జ్యేష్ఠశుద్ధనవమీ గురువారము."

సుచంద్రభట్టారకుఁడు సాంతముగా విని సచివుని చేతినుండి యా విన్నపమును తీసుకొని యంతఃపురమునకు వెళ్లినవాఁ డయ్యెను. అది తన కౌమారితె రథినీకుమారి తనను చూచుటకు వచ్చు సమయము.

## పదునేడవ ప్రకరణము

### కౌమారితెతో మంతనము

అంతఃపురమునందు పార్థివుఁడు సాయంకాలకృత్యములు తీర్చుకొని తన యేకాంతశాలలో రథినీకుమారిని సంధించెను. కొన్నాళ్లనుండి యతనికి తన కౌమారితె మంత్రిణిగా నున్నది.

మహారాజు ఘనేంద్రుని విన్నపమును రథినికి చూపించెను. ఆమె చదువుకొని తండ్రిముఖము చూచినది. విన్నప మంగీకరించు ననుకూలచ్ఛాయ యామె ముఖములో కన్పట్టినది.

రథి—ఘనేంద్రబాబుకు ప్రమాదకరమగు పనియేదియు కల్పింపఁగూడ దని దయగాఁబోలును మామామయ్యకు?

సుచ— ఘనేంద్రునకే కాదు, తనకుఁగూడ నతఁడు ప్రమాదకరమగు పని కల్పించుకొనఁడు. మీ మామయ్యరక్షిదళములు పగలెల్ల దొంగలను వెతకి రాత్రి చక్కఁగా నిద్రపోవుచున్నవి. పగలుగూడ తూర్పులో దొంగల వాసస్థల ముండిన నతఁడు తన వారిని పడమరకు పంపును.

రథి— నాయనా! తనతోటి మంత్రులందఱును పగలుమాత్రము పనిసేయుచుండ మా మామయ్యను రాత్రింబవళ్లు పనిసేయుమని చెప్పుట యేటిన్యాయ్యము? శ్రీవారికంతగా నవశ్య ముండిన రాత్రి రాష్ట్రియు నొకనిని నియమించుకొనుఁడు.

సుచ— కుమారీ! నీమాటల యర్థము నాకు తెలిసినది. వీరనందుని పనిలోనుండి తీసివేసిన మాయమ్మ కష్టపడునని వెనుకకు

తగ్గుచున్నాను. అతఁడు చేతఁగానివాఁడని యింతకుముందే తెలుసును.

రథి—నాయనా! ప్రాసాదకార్యదర్శి యను క్రొత్తయుద్యోగము నొకటి సృజింపవలెను. ప్రాసాదమునకు కావలసిన పదార్థములను కొనుట, అంతఃపురస్త్రీలకు కావలసిన భూషణములను చేయించుట, కంచుకివర్గమును సరియైన యాజ్ఞలో నుంచుట, ప్రాసాదోద్యానమును రక్షించుట, భవనములను మరమ్మతు చేయించుట, బహిఃపురమునందలి ప్రతీహారులను సరియైన యాజ్ఞలో నుంచుట మొదలగు ప్రాసాదసంబద్ధము లగు కార్యములకు వేఱువేఱు ప్రత్యేకోద్యోగస్థు లుండినను వారందఱిపై నధికారము చలాయించు నొకపెద్దయుద్యోగి యిప్పుడు లేఁడు. అందులకు వీరనందమామయ్యతగియుండును రాష్ట్రీయాధికారమునకు గొప్ప సమర్థుని మఱియొకనిని నియమించుట మంచిది.

సుచ—నీవు చెప్పిన యుపాయము బాగున్నది. అట్లే చేసెదను. రాష్ట్రీయాధికారమునకు తగినవాఁడెవఁడు? నీకెవరైనఁ బొడగట్టుచున్నారా?

రథి—నాదృష్టిలో ఘనేంద్రుఁడే యందులకు తగినవాఁడు. అతఁడజేయుఁడగు వీరుఁడు. సర్వోపాయవేత్త యగు ప్రజ్ఞాశాలి. అతనిని మించిన సర్వసమర్థుఁడీ యాంధ్రసామ్రాజ్యములోనే లేఁడని మాతాతయ్య చెప్పుచుండును.

చొరవ చేసుకొని చెప్పిన తాను ప్రేమించిన వ్యక్తిమాట వినుట సుచంద్రుని స్వభావము. ఇప్పుడు తండ్రితత్త్వము తెలుసుకొని యానీతినే యవలంబించినది. ఈ నీతి నవలంబించియే లీలావతీదేవి మ...

యిదివఱకు సామ్రాజ్య మేలుచున్నది. ఇప్పుడు రథినీకుమారి యామెకు పోటీగా నేర్పడినది. రథిని మంత్రాంగము ననుసరించి సుచంద్రుఁడు ఘనేంద్రుని రాష్ట్రీయునిగా నియమించుట కంగీకరించినవాఁడయ్యెను.

అంతట రథినీకుమారి తండ్రికి

"ధనువున దొంగల దండన సేసి
ధనమును నిలఁబెట్టు ధన్వి గావలెను."

అని కవిత్వపరీక్షలో పూర్ణ చెప్పిన ద్విపదను జ్ఞాపకపఱచినది.

సుచ—ఇంక రాజధానిలోని భోగట్టా లేమి?

రథి — సింహాసనాధికారము జ్యేష్ఠపుత్రునిదా, పట్టమహిషీపుత్రునిదా యను సమస్యను గుఱించియే రాజధానిలో చాలచోట్ల మాట్లాడుకొనుచున్నారు. మాతాతయ్యగారింటికి ప్రతిదిన మందులకు సంబంధించిన వాదోపవాదములు వచ్చుచుండును.

సుచ — ఇందును గుఱించి రాజధానిలో రెండుపక్షము లేర్పడియున్నవని నాకుఁ దెలుసును. నగరిలో నేపక్షమునకు బలమెక్కువగా నున్నది?

రథి—అధికారి వర్గములో పెద్దబాబు పక్షమునకును సామాన్యప్రజలలో చిన్నబాబు పక్షమునకును బల మెక్కువగా నున్నది.

సుచ—(నవ్వుచు) నీ యభిప్రాయమేమి?

రథి—మాస్త్రీలకు నిష్పక్షపాతముగా విమర్శించి యొకపక్షము చేరఁదగినంత విశాలహృదయ మెచ్చటినుండి వచ్చును? అది సరియో కాదో నేను నానగర్భ్యసోదరుని ... కోరుచున్నాను.

సుచ— ఇది చాలవిషమమైన సమస్యయే.

రథి—కాశ్యపప్రమతియును కౌండిన్య ధర్మపాలుఁడును గలిసి యొక విన్నపము తయారుచేసిరఁట. ఆ విన్నపము ప్రాయికముగా రాజధర్మాసనసన్నిధికి జేపో ఎల్లుండియో వచ్చును. పౌరులను కలవరపఱచుచున్న ఈ సింహాసనోత్తరాధికారి సమస్యను గుఱించి రాజధర్మాసనము విచారించి నిర్ణయ మొసంగవలె నని వా రావిన్నపములో కోరిరఁట. ప్రమతి పెద్దబాబు పక్షమునను, ధర్మపాలుఁడు చిన్నబాబుపక్షమునను వాదింతురఁట.

సుచ—వా రవలంబించినది మంచి పద్ధతియే. మూతముప్పిడిగా నుంచిన తరువాత పిల్లలలో నన్యోన్య కలహము పుట్టి సామ్రాజ్య మధోగతి కావలసివచ్చును. అందువలన నే నా విన్నపము గుఱించి రాజధర్మాసనము విచారించున ట్లుత్తరువిచ్చెదను.

రథి—అది చాల మంచిపని.

సుచ—కుమారీ! సాక్షరనారీసభలో రాజకాళి తన తండ్రిని గుఱించి చెప్పిన మాటలు నీ కేమైన నర్థమైనవా ?

రథి—ఆమె చెప్పిన కగచజ బాబు నాలుగుపేరులు ధరించిన యొకవ్యక్తి. కకారుఁడు కంకోలభట్టాచార్యులు. గకారుఁడు గణదాసు. చకారుఁడు చక్రధరుఁడు. జకారుఁడు జటాముని. కంకోలుని కొడుకు కీ. శే. దండనాయక సత్యరథుఁడని యందఱికిని తెలిసిన విషయమే. గణదాసు పిల్లలు విమలనిర్మలలఁట. విమలుఁడే శాంతిసేనత్తయ్య భర్త. నిర్మలయే రాజకాళి యను పేరుతో తిరుగుచున్నది. చక్రధరుని పిల్లలు సుముఖియు నపరాజితయు నక్షోభ్యము నియు నఁట. ఈసంగతినంతయు నిన్న పూర్ణ నాతోఁ జెప్పినది. పూర్ణకు రాజకాళియే స్వయముగాఁ జెప్పెనఁట.

సుచ—సుము ఖ్యపరాజితలు ఎచ్చట నున్నారో ?

రథి— అపరాజిత చిదంబరమునందు తపస్సు చేసుకొనుచున్నది యనియు, సుముఖి దండకారణ్యమున నున్నది యనియు పూర్ణ చెప్పినది. అంతకంటె నధిక సమాచార మామెకు తెలియలేదో, తెలిసినను రహస్యముగా నుంచుకొనినదో నేను కనిపెట్టఁజాలకపోతిని.

సుచ—పూర్ణ జన్మ గుఱించి కాత్యాయనీ సులోచనులు కని పాఱవేసిరని యొక వాదు పుట్టినది. అది యెంతవఱకు సత్యమో?

రథి — అది సర్వాబద్ధము. ఎవరో దుష్టులు కల్పించిన దావార్త.

సుచ—అది యబద్ధమయినను ఆపిల్ల యపవిద్ధ గనుక నామె పరిగ్రాహ్య గాదని నేను పిల్లలనిద్దఱిని పిలిచి యాదేశించి చెప్పితిని.

రథి — అపవిద్ధ యైన సీతాదేవిని రాముఁడు పెండ్లియాడలేదా ?

సుచ—ప్రాచీనేతిహాస రహస్యములు మనకు తెలియవు. సీతాదేవి భూమియందయోనిజయై పుట్టెనని చెప్పెదరు. రావణునకు వేదవతియందు పుట్టినపిల్ల యని మఱికొందఱి కథనము. అస్మదాదుల భావనకు మొదటిపక్షమే మంచిదిగా కన్పట్టుచున్నది.

రథి— పూర్ణ గూడ నయోనిజయే యని యేల మనము భావింపరాదు ?

సుచ— సీత యవతారస్త్రీ గనుక నామెనుగుఱించి యేమి చెప్పినను నమ్మితిమి. అట్టిశ్రద్ధయే మనభావనకు బల మిచ్చినది.

రథి—సీత యవతారస్త్రీ యగునెడల పూర్ణగూడ నవతారస్త్రీయే యగును. ఇది వఱకు మనభరతఖండములో పూర్ణవంటి స్త్రీ లెవ్వరైనను పుట్టిరా?

సుచ— ఆసంగతిని తరువాతతరముల వారు చెప్పవలసియుండును. దాని కేమి? పూర్ణ పరిగ్రాహ్యా యనియే నీ యభిప్రాయమా?

రథి— ఔను. ఇప్పుడు తొందరపడ నక్కఱలేదు. మా అన్నలలో నెవరు సింహాసనోత్తరాధికారి యగుదురో యతనికి మన మామెను మాట్లాడవచ్చును. మా అన్నల కిచ్చిన యాదేశము నిప్పుడు నాయన త్రిప్ప నక్కఱ లేదు. ఉత్తరాధికారి సమస్యను మాత్ర మతిశీఘ్రముగ పరిష్కరింపవలెను.

సుచ— ఒక్కదినములోపల పరిష్కరించివేసెదము.

రథి— ప్రజల సాక్ష్యము లెన్నియో తీసుకొనవలెనఁట.

సుచ— ఇది కేవల న్యాయసమస్య. దీనిలో ప్రజల సాక్ష్య మవసరము లేదు. వ్యక్తుల గుణతారతమ్యమును బట్టి ఈసమస్య తేల్చవలసినది గాదు. ఆచర్చకే యవకాశ మీయను.

రాజుగారినిర్ణయము రథని కిష్టముగానే యుండెను. పెద్దమనుష్యుల మని పేరు చెప్పకొనువారిలో భోగనాథ పక్షమునకే బల మెక్కువ యున్నది. వారు లీలావతీదేవి యనుగ్రహమువలన మంచిస్థితికి వచ్చిన వారు. వారు సమయమునందామెకు ద్రోహము సేయరు. సాధారణప్రజలలో శక్తిధరుని పక్షబల మెక్కువగానున్నను వారిలోనుండి సాక్ష్యమునకు పిలువఁదగినంత యోగ్యత గలవారు తక్కువగానుందురు. అందువలన రథినివిచారణ శీఘ్రము ముగింపవలె నని ముందు పీఠిక వేసినది. అనంతరము తాను చెప్పఁబోవు విషయమును రాజుగారే స్వయముగా నిర్ణయించిరి.

రథి—అదియే బాగున్నది.

### పదునేనిమిదియవ ప్రకరణము

"మనకాలనాథుంకు మంజులకొఱుకు"

సుచ—పిల్లా! ఒకసంగతి గుఱించి పూర్ణ నీ కేమైనం జెప్పినదా?

రథి—ఏసంగతిగుఱించి?

సుచ—రాజకాళ్లి పెండ్లినిగుఱించి.

రథి— దానినిగుఱించి పూర్ణ చెప్పనక్కఱలేదు. ఆమెయే స్వయముగా సాక్షరనారీసభలో మహారాజే తనభర్తయని స్పష్టముగా వక్కాణించినది: "నా రాజు నరపాలి నాచిన్నిమగఁడు." అని. ఏదియో సంబంధము లేనిదియే యట్లు చెప్పఁగలదా?

సుచ—అది భావనామాత్రమేమో?

రథి — నాకు భావనామాత్రముగా తోఁచలేదు. నాయనా! జ్ఞాపకము సరిగా తెచ్చుకొనుఁడు. ఇట్టిస్త్రీని మీ రెప్పుడైన సంధించితిరా?

సుచ—లేదు పిల్లా! ఇట్టి స్త్రీని నేను సంధించినట్లు నాకు జ్ఞాపకము లేదు.

రథి—మాతల్లు లిద్దఱును తప్ప వేఱు కన్య నెవతెనుగూడ మీరు పెండ్లియాడి యుండలేదా?

సుచ—నీ కిట్టి సంశయ మేల కలుగ వలెను ?

రథి— మీరు ప్రతి మం౹ళవారము రాత్రి యెచ్చటికో యొంటరిగా వెళ్లుచుం దురు. అది నేను కనిపెట్టితిని. అందువలన నాకు సంశయము కలిగినది.

సుచ—(పిల్లను దగ్గఱకు తీసుకొని కట్టుకొని) పిల్లా! నీ శోధనకు సంతోషించితిని. నాకు మఱియొకభార్య యుండుట నిజమే. అది మానవురాలు గాదు. అది యొక యక్షిణి. దానిపేరు మంజుల.

రథిని యాశ్చర్యపడినది. ఆయక్షిణి కాల నాథునితల్లి యేమో యని యామెకు స్ఫురించినది. ఆమె గతదినమునందు రాజకాళి కాలనాథుని యింటిదగ్గఱ పాడిన పాటల గుఱించి తనసఖి పద్మాక్షిద్వారా తెలుసుకొనియుండెను. ఇప్పుడు రథిని యా కథను తండ్రికి తెలియఁజేసెను.

సుచ—ఎవ రాపాటలు వినిన నీసఖి?

రథి— వీరభద్రావధానిగారి పద్మాక్షి. అక్షోభ్యముని యనుగ్రహమువలన నామె శ్రుతధరత్వశక్తిని సంపాదించెను. ఆమె రాజకాళమ్మ పాడినపాటలు విని జ్ఞాపకముంచుకొని నాకు చెప్పినది. వీరభద్రావధానిగారి యిల్లు కాలనాథునియింటి కెదురుగా నున్నది. అందువలన నాపిల్ల తమ యరుఁగుమీఁద నిలిచియుండియే వినినది.

సుచ—ఆపాట లెవ్వి?

రథి—(పద్మాక్షివలన వినినపాటలను తండ్రిదగ్గఱ చదువును.)

"వంచకులగువారి వచనము వినక
మెచ్చినవారికిఁ బిండము పెట్టు
ఇలఁ బ్రాణములతోడ నిటునటు తిరుగ
నిలిపిన ఘను పేరు నిలఁబెట్ట వలయు
శునకి నక్కనుగూడి కనునె సింగమును
పెనుసర్పమున కెట్లు పెదజోగి పుట్టు.
కుక్క కుక్కనుగూడి కులము చేరెనుర
నక్క నక్కను గూడి నాడులో వెలసె.
పుట్టకుఁ బుట్టునా పురుషూతుధనువు
గుట్టకుఁ బుట్టునా కోకబాంధవుఁడు.
మాయలమల్లి యా మహిలామతల్లి
కాయంబులోనుండి కదలి వచ్చితివి.
కయ్యాలభామయా దయ్యాలరాణి
యుయ్యాలలోనుండి యూడి వచ్చితివి.
భువిఁ దిరుగాడెడు భూతాలసాని
చవిగలయొడినుండి జాఱివచ్చితివి.
ఉపమ గానఁగరాని యుద్ధతనారి
విపులవక్షోవాటి విడిచివచ్చితివి.
పాఱవేసినతల్లి ఫల మెట్లు తినును ?
పాఱుని రక్షను బాలింపుమయ్య."

సుచ—దీనిని గుఱించి చక్కగా శోధించి తెలుసుకొనవలసియున్నది.

రథి — శ్రీవారు మంజులముఖము చూచినారా ?

సుచ—ఎన్నడును చూడలేదు.

రథి — ఆమెమాటల నెప్పుడైన విన్నారా ?

సుచ—ఎన్నడును వినలేదు.

రథి—ఆశ్చర్యముగానున్నది.

సుచ—అతిమధుర భాషిణియు, నతిలావణ్యపూరితయు నగు లీలావతికంటె

హాసవతియు, నంధకారప్రచ్ఛన్నయు నగు మంజులయే నీతండ్రి కానందసంధాయినిగా నున్నది.

రథి—అది యక్షిణి గాదు నాయనా! యక్షిణులు తమ రూపవాక్కులను దాచు కొన నవసర మేమి?

సుచ—మఱి యెవరు? దయ్యమా?

రథి—యక్షిణి యన్నను, ఆడదయ్య మన్నను, ఆడభూత మన్నను ఒక్కటే యని భూతవిద్యాభిజ్ఞులలో శ్రేష్ఠు లగు కంకోల భట్టాచార్యులవారు తన గణపతితంత్రములో చెప్పియుండిరి. ఆమె మానవి యనియే నా యభిప్రాయము.

సుచ—(ఆశ్చరముతో) మానవియా?

రథి—ఔను. (ఉద్రేకవశమున ఛందోబద్ధవాణి నాశ్రయించి)

ద్విపద:—

భూరమావర! యాంధ్రభూమిభూషణము
మారాజకాళియే మంజులాదేవి
మీరాజ్యలక్ష్మికి మిత్రహాసవతి
మారాజకాళియే మంజులాదేవి
సారంబులకు గొప్ప సంత మీకాంత
మారాజకాళియే మంజులాదేవి
వీరునిజనయిత్రి వీరునిపత్ని
మారాజకాళియే మంజులాదేవి
రాయలమనమును రంజిల్లఁజేయు
మాయలమల్లియా మారాజకాళి
కరమునసమర్థయా కన్యాలభామ
ధర రాజకాళియే దయ్యాలరాణి
భువిఁ దిరుగాడెడు భూతాలసాని
కవిరాజ్ఞియేగాని ఘనయక్షి గాదు
నృపచిత్తరమణియా నీరజేక్షణమె
యుపమ గానఁగరాని యుద్ధశనారి
వనజప్తతాక్షుఁడు మనుజోత్తముండు
మన కాలనాథుఁడు మంజులకొడుకు.

## పందొమ్మిదియవ ప్రకరణము

### తప్పు నొప్పుకొనుట

సుచ—(అత్యానందముతో) ఇదియే వాస్తవ మగునెడల ననేకకష్టసమస్యలు విడిపోవును.

రథి—ప్రాయికముగా నిజమే.

అటుపిమ్మట నా తండ్రికూఁతుండ్ర సంభాషణము మిక్కిలి యంతరంగవిషయ ములతో సంబంధించి యుండెను. ఇదివఱ కెవరికిని చెప్పని కొన్నిరహస్యములను తండ్రి కూఁతురుకు చెప్పినవాఁడయ్యెను. అడుగరాని ప్రశ్నలను వేసి రథిని తండ్రిరహస్యములను లాగినది. కాలనాథుని జన్మరహస్యము తెలుసుకొన నుద్దేశమే రథిప్రశ్నలకు కారణము. రథిని యెదురు లేని మాటకారి. సిగ్గులేని వ్యవహర్త్రి. భయములేని వాదిని. కార్యసాధనమే యామెప్రధానలక్ష్యము.

సుచ—నేను మంజులాదేవి రూప వాక్కులు కనుగొనుటకు యత్నించెదను.

రథి—నాయనా! మంజులాయక్షిణి శ్రీవారి కెట్లు తటస్థించినది?

సుచ—జటాముని యక్షిణీసాధన విద్యను నా కుపదేశించెను. దానిని నేను జపించితిని. అనంతరము మంజులాదేవి నన్ను వరించినది. ఆమె యంధకారప్రియ యనియు, హాసిని యనియు జటామునియే నాకుఁ జెప్పెను. ఆమె నా కొకరసాయన మిచ్చినది.

దానిని నేను సేవించితిని. అందు వలన నే నెంత భోగలంపటుండ నైనను నాయావనము క్షీణింపలేదు. నా కొకనాఁడుగూడ రోగము రాలేదు.

రథి—నాయనా! నిశ్చయముగా రాజకాళియే మంజులాదేవి. జటాముని రాజకాళి తండ్రి యని మనము తెలుసుకొనినారము. తనకూఁతురు శ్రీవారిని ప్రేమించుచున్నది యని యతఁడు కనిపెట్టి ప్రత్యక్షవివాహము కష్టసాధ్యమనియెంచియో, రాజకాళికిప్రత్యక్ష సంసార మిష్టము లేనందుననో యిట్టిసంవిధానము నాశ్రయించెను. కాలనాథునితల్లి రాజకాళి యనుటలో మనము సంశయపడ నక్కఱలేదు.

సుచ—రాజకాళియే కాలనాథుని తల్లి యగునెడల నతఁడు వేఱుస్త్రీప్రక్కలో కన్పట్టుటకు కారణ మేమి?

రథి—అది యొకప్రతిబంధకముగాదు. శవముప్రక్క నాయున్మత్తసిద్ధాంగన పాఱవేసి యుండవచ్చును. "పాఱవేసినతల్లి ఫల మెట్లు తినును?" అని స్పష్టముగా న మె చెప్పినది.

సుచ—ఔను.

రథి— అన్నింటికంటె పోలిక ప్రధానము. నాయనా! నా తండ్రియంగసౌష్ఠవము కాలనాథునియందు నేను కనిపెట్టితిని. అనేకవిషయములలో నాయనకును కాలనాథునకును రూపసామ్య మున్నది.

సుచ—నిదానించి కనిపెట్టితివా?

రథి—ఔను. తాతయ్యగారింటి కతఁడు మాటిమాటికి వచ్చుట యలవాటు. అప్పుడు నేను చేయునది యంతయు మీయిద్దఱి రూపసాదృశ్యపరీక్షయే. ఆ చనిపోయిన స్త్రీ మీగుప్తప్రియురాలుగా నుండవచ్చునని గూడ నే ననుమానించితిని. కొనకు సులోచనుని వ్యాజ్యము వచ్చిన పిమ్మట నాయనుమానము జీర్ణించిపోయినది. కాని న్యాయస్థానములో కా॥ సు॥ యొక్క లేఖ ప్రకటితమైనపిమ్మట నది తిరిగియు తలయెత్తెను. నా తండ్రి కా॥ సు॥ ఏమో యని నేను సందేహించితి. నావలె ప్రాడ్వివాకుఁడుగూడ సంశయించెనుగాని సంతకపుదస్తూరి పోలిక లేదని చెప్పి యాసంశయమును విడిచి వేసెను.

సుచ—తీర్పులో నాపేరుదాహరించుట నా కాశ్చర్యమే కలుగఁజేసినది.

రథి—నాయన మంజులాదేవిని సంధించు స్థల మెద్ది?

సుచ—మన నగరి వెలుపల చిట్టడవిలో నుండు మహామారీ దేవాలయము. సంవత్సరమున కొకసారి దానిలో పూజ జరుగును. తక్కిన యన్ని సమయములందుఁ గూడ నది వివిక్తముగానేయుండును. మందిరమున కెప్పుడును తాళము వేసియుండును గాని నాదగ్గఱ మాఱుతాళ ముండుటచే సులభముగాఁ బోయి వచ్చుచుందును.

రథి — నాయన వెళ్లిన పిమ్మటనే మంజుల వచ్చును గాఁబోలును?

సుచ— ఔను. ముసుగుతో వచ్చి రాఁగానే గడియ వేసుకొనును.

రథి—ఆమె యెంత పొడుగుండునో పోల్చినారా?

సుచ— రాజకాళి యంత పొడుగే యుండును.

రథి-కృశగాత్రియా? స్థూలగాత్రియా?

సుచ—సమగాత్రి.

రథి— ఇంకను నాయనకు తెలిసిన యంగలక్షణములు కొన్ని యుండవచ్చును.

సుచ—ఆమెకనులు మిక్కిలి విశాలములు. కనులు ముద్దుపెట్టుకొనుట నా కలవాటుగాన నా కాసంగతి తెలిసినది. పాటలోఁ జెప్పినట్లామె వక్షోవాటి విపులమే. ఆమెకటి ప్రదేశము విశాలము. నితంబములు మిక్కిలి పెద్దలు. పాదములు మిక్కిలి చిన్నవి. ఊరువులు తిరుగఁబడిన రంభాస్తంభములే. నాభి యత్యంతగంభీరము. కేశములు సాంద్రకుటిల విస్తృతము లైనను అంతగా మసృణములు గావు.

రథి—ఈపోలిక లన్నియు రాజకాళమ్మకు సరిపోవుచున్నవి. నాయనా! ఎన్ని సంవత్సరము లైనవి యామెను చేపట్టి?

సుచ— నా ప్రథమరాజ్య వర్షారంభమున లీలావతిని పెండ్లియాడితిని. ప్రథమ రాజ్య వర్షాంతమున మంజులాదేవిని చేపట్టితిని.

రథి—అది మొదలుకొని ప్రతి మంగళవార మవిచ్ఛిన్నముగా శ్రీవారు మంజులాదేవిని సంధించుచున్నారా?

సుచ—నా ద్వితీయరాజ్య వర్షారంభమున చారుమతీ లీలావతు లిద్దఱు దేవేరులతోడను సామ్రాజ్యమునందలి సకలతీర్థములను చుట్టివచ్చితిని. ఆ ప్రయాణము నాకు సుమారు సంవత్సరము పట్టినది. నా మైదవ రాజ్యవర్షములో కలింగవిజయయాత్ర తటస్థించినది. అది యాఱుమాసములు పట్టినది. ఈ సంవత్సరమునర తప్ప నే నెప్పుడు నిల్లు కదలలేదు. నేను ప్రాసాదమున నుండునపుడు ప్రతిమంగళవార మవిచ్ఛిన్నముగా మంజులాదేవిని సంధించుచునేయుంటిని.

రథి— శ్రీవారి ద్వితీయ రాజ్యవర్షముననే కాలనాథుని జన్మ యని న్యాయస్థాన విచారణలో తేలినది. మంజులయే కాలనాథుని తల్లి యగునెడల నామె ప్రౌఢగర్భిణి యైన పిమ్మట నాయన యామెతో సంధింపలే దన్నమాట. అందువలన నాయనకు మంజుల గర్భిణ్యవస్థ గోచరించుట కవకాశమే చిక్కలేదు.

సుచ—అంతయు సరిగానున్నది గాని యున్మత్తవేష మైనను మహాప్రాజ్ఞురాలగు రాజకాళి పిల్లవానిని శవముదగ్గఱ పాఱవేసినది యనునదియే సరిపడకున్నది. అందువలన పిల్లవానికి భద్రత లేదు సరియే గదా పిల్లవాని దీప్తభావిగూడ నడ్డగింపఁ బడ లేదా? అతఁడే నా కుమారుఁ డని ప్రకట మగునెడల నుత్తరాధికారి సమస్య కాలనాథ శక్తిధరులకే గాని భోగనాథ శక్తిధరులకు మధ్య తటస్థింపదు గదా! సింహాసనోత్తరాధికారి కాఁదగిన కుమారుని రాజకాళి యట్లు పాడుసేయునా? కొసకు రాజకాళి సిన్న కాలనాథుని సుదర్శనుని పుత్రునిగానే యుండుమని సూచించినది గాని యసలు జననీజనకులను గుఱించి చెప్పినది గాదు. అతని కసలు జననీజనకులు తెలియు నెడల ధర్మాసన సన్నిధిలో పునర్విచారణ సలుపుటకు విన్నప మంపుకొన నవకాశ ముండెడిది. ఏందుల కాతల్లి కింతగోప్యము?

రథి—ఔను. అంతయు సరిపోయినను ఇది యొకటియే యనుమాన ప్రతిబంధక

ముగానున్నది. నాయనా! నే నెంత యాలో చించినను కాలనాథబాబు మాయన్న య నియే తోఁచుచున్నది. (తండ్రిముఖము నిదా నించి చూచి) నాయనా! నా తలకు తగని ప్రశ్న వేయుచున్నానని కోపగించుకొనవలదు. చారుమతీ లీలావతీ మంజులలుతప్ప వేఱు స్త్రీ సంపర్క మేదియైనను నాయనకుఁ గలదా?

సుచ—(నవ్వుచు) నా కన్నా! నీ మీఁద నాకు కోపము వచ్చునా? నీ ప్రశ్న యొక్క అంతరార్థము నాకు తెలిసినది. వేఱు స్త్రీసంపర్క మొకసారి తటస్థించినమాట వాస్తవమేగాని కాలనాథుని తల్లి యామె కాఁజాలదు. నేను యువరాజుగా నుండునపు డా స్త్రీని సంధించితిని. అప్పటికి మీ అమ్మను గూడ నేను పెండ్లాడియుండలేదు.

రథిని యేమియు మాట్లాడక స్తబ్ధురా లయ్యెను.

సుచంద్రుఁ డింకను చెప్పుచున్నాఁడు—

"రహస్యమును వెల్లడించితిని గనుక నా విషయమును స్పష్టముగా నీకు చెప్పెదను. ఆపిల్ల కన్యకయేగాని పరస్త్రీ గాదుసుమా! ఒక్కతప్పుమాత్రము చేసితిని. వెంటనే యామె నంతఃపురమునకు తెచ్చుకొనెద నని మాట యిచ్చితినిగాని నాయనగారిదగ్గఱి భయముచే తీసుకొనిరాలేకపోతిని. నేను రాజ్యమునకు వచ్చిన పిమ్మట జ్ఞప్తికి తెచ్చుకొని యామెను రప్పించుటకు యత్నించితిని గాని యామె కాలధర్మము నొందెనని తెలిసినది. ఆ సంగతిని స్మరించినపుడు నా యొడలు ఝల్లుమనును. నేను నామాటప్రకారము ముందే ప్రాసాదమునకే తెచ్చుకొని యుండు నెడల నామె చనిపోయియుండదు. నిండు ప్రవాహము గల యొకమహానదిలో ప్రమాద వశమువలన నామె మునిఁగి చనిపోయినది. ఆ పాపము పోఁగొట్టుకొనుటకే నేనుతీర్థయాత్రలు చేసితిని. ఇచ్చితిని. పెట్టితిని. తపించితిని. అను తపించితిని. ఈసంగతి నాప్రాణమిత్రుఁ డగు దండనాయక బలవర్ధనున కొక్కనికే తెలుసును. ఇప్పుడు నీకు చెప్పితిని. నీహృదయములో నావిషయము రహస్యముగా నుండునుగాక."

రథిని కనేకానుబంధప్రశ్నలు వేయుటకు తోఁచినవి గాని యడుగుట మర్యాద గాదని యూరుకొనినది. తనతండ్రి తానడిగినపుడు తనతప్పు నొప్పుకొని వెల్లడించినందులకు అతని ఋజుభావమును మనస్సుచే మిక్కిలి కొనియాడినది.

## ఇరువదియవ ప్రకరణము

### అనావశ్యకవిఘ్నప్రయత్నము

ఆదినముననే సూర్యాస్తమయమునకుఁ బిమ్మట విలాసవతి పూర్ణతో నొకగడియ మాట్లాడినది. కొసకు తాను కృతకృత్యురాలైనట్లు తలంచి వెళ్లిపోయినది. వీరసింహునకు రాజుగారు తనపిల్లలతో పూర్ణను పెండ్లియాడవలదని యాదేశించిన సంగతి తెలియదు. భానుమతీసంబంధప్రయత్నము విఫలమైనది యను సంగతిమాత్రమే మతనికి తెలిసినది. తనకుమారప్రభువు పూర్ణప్రక్కకు దృష్టి మఱల్చునేమోయని యతఁడు భయపడినాఁడు. అందులకు విఘ్నమాచరించుటకు పూర్ణబుద్ధిని భోగనాథునిపై జుగుప్సగలదానిగా చేయుటయే తగినమార్గ మని యతఁ డాలోచించుకొని యాపనిని నిర్వర్తించుటకై తన చెల్లెలిని నియోగించెను. ఇది సందర్భము.

పూర్ణా విలాసవతుల సంవాదమును మన ప్రకృతాంశమునకు సంబంధించినంతవఱకు నీ ప్రకరణములోఁ బొందుపఱచెను.

పూర్ణ— సఖి! నిన్ను కనకపురేశ్వరునకు నిశ్చయించిరఁట. నేను వినినవార్త నిజమేనా?

విలా—ఔను.

పూర్ణ — నీవు ఆంధ్రసామ్రాజ్యమునకు భావిమహారాజ్ఞి వయ్యెద వని మే మందఱ మాశించుచుండ కొనకు మీ నాయనగారు సామంతురాలిసిగాఁ జేసినారు. ఏ అసూయాపరుఁడు రాజసంబంధమునకు విఘ్నమాచరించెనో?

ఈప్రశ్న పరిహాసార్థమే పూర్ణ వేసినది. అయినను విలాసవతి కది మిక్కిలి సంతోషము కలిగించినది. ఎట్టి యుపోద్ఘాతము గూడ నక్కఱలేకయే తన ప్రచారము సాగించుట కాప్రశ్న విలాసవతికి మిక్కిలి యుపయోగించెను.

విలా— ఎవ్వరును విఘ్నము సేయలేదు. మాఅమ్మ రాజదంపతులదగ్గఱ గట్టిగా చెప్పిన నాసంబంధము నిర్విఘ్నముగా కొనసాగెడిదే. నాకే యిష్టము లేకపోయినది. ఆ కుమారప్రభువు చర్యలను తెలుసుకొనిన నేగొప్పకులకన్యయు నతనిని వరింపఁజాలదు.

పూర్ణ— (తనలో) తనకు సిద్ధింపనందున నిందించి యీమె సమాధానపడుచున్నది. (ప్రకాశముగా) ఏవి యట్టిచర్యలు?

విలా-గౌతమ హిరణ్యనాభుని కొమారితె కనకవల్లిని పెండ్లాడెదనని యాశపెట్టి మొంగిలిచేసి యిప్పుడు తిరస్కరించెను. ఆమె యిప్పుడు నెలతప్పెననిగూడ వదంతి.

పూర్ణ — తిరస్కరించుటకు కారణమేమి?

విలా— తండ్రియాస్తిలో సగ మిప్పుడే తనకు కట్నముగా నిచ్చివేయవలెనని యితఁడు కోరెనఁట. తండ్రి యంగీకరింపలేదఁట.

పూర్ణ— సమావేశమునకు ముందే యితఁడు కోరియుండవలసినది.

విలా— ఐశ్వర్యమదాంధులకు యుక్తాయుక్తవిచార ముండదు. ఇంక నతని చర్యలు వినుము. తనతల్లిగారి చేటిక రత్నాంగి నతఁడు చెడిపివేసె ననియే చెప్పవచ్చును. హేమాంగి గుఱించి ప్రయత్నించుచున్నాఁడు. ఎప్పుడు వలలో వేసుకొనునో? గుడిచేటి కోమలాంగి సంపాదించిన ధనములో సగ మితఁ డిచ్చినదే. కాత్యాయనిగారి కామసేన యితనివలలో పడిపోయినదో, తేపో ఎల్లుండో పడిపోవునో? ఇది యంతయు నిట్లుండ, కుముదాక్షినిగుఱించి రాయభారములు నలుపుచున్నాఁడు. నిన్నుగుఱించి గూడ ప్రయత్నించు నని వినికిరి.

పూర్ణ—వ్యభిచారము దోషమే కాదని మీ అన్నయ్య వాదించు వాదమువలన నతని బుద్ధి వ్యభిచారవిషయములోఁ గాని, కన్యాదూషణ విషయములోఁ గాని నిర్భయమైనది.

విలా—ఔను. అతని కీ యవివేకుఁడు తోడైనాఁడు.

విలాసవతి తన కార్యసిద్ధికొఱకు తన యన్ననుగూడ దూషించుటకు వెనుదీసినది గాదు.

పూర్ణ—నీవు భాగ్యవశమున తప్పితివి. కొనకీ పట్టాభిషేకము సఖి కుముదాక్షి నెత్తిపైఁ బడు ననుకొనెదను.

విలా—నెనెత్తిపైఁబడునని చాలమంది యనుకొనుచున్నారు.

పూర్ణ—అది సర్వాబద్ధము. నేనెంత మాత్రము నా మహాపురుషుని బెండ్లియాఁడ నంగీకరింపను. అతఁడు కనకవల్లిని తిరస్కరించుట మహాపాపము.

విలా—మఱియొకసంగతి మఱచిపోతిని. కాత్యాయని శిష్యురాలగు కాంతామణిమిత్రకూటములో నితఁడొకఁడఁట.

పూర్ణ—కులస్త్రీలదోషములను మన ముద్ఘాటించుట తగదు. సఖి! నేనిట్లంటినని నీవు కోపగించుకొనవలదు.

విలా—నా కెన్నఁడైన నీపై కోపము కలుగునా? నాయొల్లుడికి నే నిట్లు చెప్పితిని. ఆ దుర్మదాంధుని చేష్టలను కీర్తించు నావేశములో యుక్తాయుక్తవిచారము గోల్పోతిని.

పూర్ణ—నాదగ్గఱ చెప్పిన సంగతులు కుముదాక్షిదగ్గఱ చెప్పకుము. ఆమె విను నెడల పెండ్లాడనొల్లదు. ఆమె గొప్పచాతుర్యము గలదిగాన పెండ్లాడునెడల తప్పక మన రాజపుత్రుని బాగుపఱచును.

విలా—నేనెన్నఁడు నామెతో చెప్పను.

పూర్ణ కెన్నఁడును భోగనాథుని బెండ్లియాడు నుద్దేశము లేకపోయినను విలాసవతి తాను యత్నించి విఘ్నము చేసితినని యనుకొనినది. ఆ సంతోషములో నామె తన వ్యగ్రపు పనికి చింతించినదిగాదు.

మూఁడవ భాగము

మొదటి ప్రకరణము

ప్రతిధ్వని

పూర్ణను చూచుటకు కొంచెము రాత్రి గడచిన పిమ్మట కాలనాథుఁడు చంపావతిగారింటికి వెళ్లెను. పూర్ణ తనగదిలో కాలనాథుని సంధించినది. వారిద్దఱును వేర్వేఱు దర్భాసనములపై కూర్చుండిరి.

పూర్ణ—అన్నయ్యా! కొనకు మీరు కశ్యపులలోనే స్థిరపఱుపఁబడినారు. నకు మిక్కిలి సంతోషమయ్యెను.

సత్యరథుని మేనత్త (భవనంది భార్య) కూఁతురు ప్రమతిభార్య. అందువలన నామె పూర్ణకు పిన్నివరుస. ఆమెబావగారి కృత్రిమ పుత్రుఁడు కాలనాథుఁడు. అందువలన పూర్ణకతఁ డన్నవరుస. ఈ అత్యంత దూరసంబంధము వరుస కల్పించుకొనుట కుపయోగపడినను వారిద్దఱిమధ్య భ్రాతృభగినీభావమును పెంపొందించినది యేదియో యొక యనిర్వాచ్యమగు నంతఃకరణసంబంధము.

కాల—చెల్లీ! రాజకాళమ్మ పాడిన పాటలగుఱించి నీకు తెలిసినదా?

పూర్ణ—వీరభద్రావధానులుగారి పద్మాక్షి నాకు చెప్పినది. పాటలను విన్నాను.

కాల—విశేషణములలోనుండి యామె యుద్దేశించిన నాతల్లి యెవరో నీకు బోధపడినదా?

పూర్ణ—ఆమెయే స్వయముగా తా నుద్దేశించిన మీతల్లి యని నాయభిప్రాయము. ఆమెకంటె మాయలమల్లి యెవరున్నారు? ఆమెకంటె కపటాలభామ యెవరు గలరు?

రాజపుత్రులలో పెద్దవాఁడు హక్కుదారుఁడా, పట్టమహిషీపుత్రుఁడా యను సమస్య నామెయే లేవనెత్తినది. ఆమెయే దయ్యాలరాణి. ఆమెకు తెలిసినంత తాంత్రికవిద్య మఱి యెవరికిని దెలియదు. తాంత్రికవిద్యాబలముచే నామె జీవించియుండఁగానే పిశాచి యైపోయె నని నా యభిప్రాయము. పిశాచముల శక్తు లన్నియు నామెయొద్దఁ గలవు. దయ్యాలరాణియే భూతాలసాని. ఆమెకంటె నుద్ధతనారి మఱియెవరు గలరు? అందువలన మీరు రాజకాళికుమారులే యని నేను నిశ్చయించుకొంటిని.

కాల—ఆమెయే నాతల్లి యగునెడల నాతండ్రి యెవరుగా నుండును?

పూర్ణ—(ఉద్రేకమువలన ఛందోబద్ధవాణి నాశ్రయించి)

"హేలాజితారాతి యిలముద్దుమగఁడు
లీలమ్మసరసుఁడే కాలయ్యతండ్రి
కూలంకషకృపాణుఁ డాలంబులోన
లీలమ్మసరసుఁడే కాలయ్యతండ్రి
కాలింగు నాజిలోఁ దూలించినట్టి
లీలమ్మసరసుఁడే కాలయ్యతండ్రి
జాలంబు తెలియని సద్వర్తనుండు
లీలమ్మసరసుఁడే కాలయ్యతండ్రి
మంజులాకారుఁడు మనపార్థివుండు
కంజాక్షి మనరాజకాళికి మగఁడు
ఉన్మత్తసరసకు నుత్తమవిటుఁడు
మన్మథాకారుఁడు మనభూమిభర్త
శుద్ధవర్తనుఁ డాంధ్రశూరాధిపుండు
సిద్ధకవీశ్వరి సేవించుమగఁడు."

కాల—(ఆశ్చర్యముతో) ఇది నీ వెట్లు కనిపెట్టితివి?

పూర్ణ నారీసభలో రాజకాళమ్మ ప్రకటముగా సుచంద్రభట్టారకుని తనమగనిగా చెప్పినది: "నారాజు నరసూళి నాచిన్ని మగఁడు, నారాణి లీలమ్మ నాముద్దుసవతి." అని.

కాలనాథుఁడు గంభీరముగా తలయూఁచెను.

పూర్ణ— సుచంద్రభట్టారకుఁడు మా మేనత్త రాజకాళియందు మిమ్ములను సృజించె ననుటలో నా కేమియు సందేహము లేదు.

కాల— రాజకాళమ్మ మీ మేనత్తయా? అది యెట్లు?

పూర్ణ— కగచజబాబు సంతానము గుఱించి వివరించి చెప్పినది.

కాల— నే నాశ్చర్యములను వినుచున్నాను. రాజకాళమ్మ నాతల్లి యగునెడల నాపూర్ణ నాకు మేనమామకొమారితె యగును. రాజకాళమ్మయే నాతల్లి యగునెడల మహారాజు నాతండ్రి యనుట నిశ్చయము. అప్పుడు నాప్రాణస్నేహితుఁడు శక్తిధరబాబు నాకు తమ్ముఁడగును. చిత్రచరిత్రురాలు రథినీకుమారి నాచెల్లె లగును. విమలబాబును, అక్షోభ్యమునియు నామేనమామలనుట మఱింత సంతోషదాయకము.

పూర్ణ—మఱియొక మేనమామ మీకున్నాఁడు.

కాల—ఎవరు?

పూర్ణ—(ఛందోబద్ధవాణి నాశ్రయించి)

"లోహదండోపమబాహుద్వయుండు
సోహ మనుచు శక్తి చూపించు మేటి
దమరాగముంబునఁ దరుణఘనేంద్రు

కనదుగ్రధారమా కత్తిలో నిన్ను
మదపూర్ణబలములో మల్లికార్జునుని
గదలోను రణరంగఖరుఁడైన నీలు
ప్రమథనాథుని లసత్ప్రాసంబులోను
సమతతో స్పర్ధించు సాహసాంకుండు
కదనప్రచండుండు కర్ణీసుతుండు
పెదజోదు నీమామ భీమనాథుండు."

కా—ఇది మఱియొకయాశ్చర్యము

గడియకు ముందు రథిసీ సుచంద్రులు చేసుకొనిన సంవాదార్థమే యిట్లు ప్రాయికముగా పూర్ణాకాలనాథుల సంవాదమునందు ప్రతిధ్వనించినది.

## రెండవ ప్రకరణము

### ధర్మభగిని

పూర్ణాకాలనాథులిట్లు మాట్లాడుకొనుచుండఁగా, చంపావతి లోపలఁ బ్రవేశించినది.

"రండు. దొడ్డమ్మా! రండు." అన్నాఁడు కాలనాథుఁడు. చంపావతి పూర్ణ కూర్చుండిన ధర్మాసనముపై కూర్చుండినది.

చంపా—నేను చెప్పినమాట మీ రిద్దఱును వినెదరా?

కాల—దొడ్డమ్మా! మీయక్కయ్యగారి మల్లికార్జునబా బాకటి, నేనొకటి గాదు. నన్నాజ్ఞాపించుటకు మీకు శక్తి గలదు.

చంపా—(పూర్ణను జూచి) నీ వేమని యెదవు?

పూర్ణ—అమ్మా! నేను నీవు చెప్పిన మాట యెప్పుడు వినలేదు? నా కిష్టములేని యెడల కొంతసేపు వాదించి కొనకు లొంగిపోవుదును.

చంపా—మీ రిద్దఱును నేను చెప్పిన మాట వినెదరని నాకు నమ్మకము గలదు గాని—

కాల—వికల్ప మేమియు వలదు. ఆజ్ఞాపింపుఁడు.

చంపా—నాయనా! నీవు కులపరిషత్తు ద్వారా శివదత్తసూరితీర్పు ననుసరించి కళ్యపులలో స్థిరపఱచఁబడినావు. నేను కాశ్యప గోత్రసంభవురాలను గనుక మీతల్లికి నాకు సహోదరుఁ డగును. అందువలన నీవు నాకు మేనల్లుఁడవు. విశాల మగు నీభూమండలములో నీవంటివరుఁడు నా కూఁతురుకు దొరకుట దుర్ఘటము. మాపూర్ణ యెట్టిదో నేను నీకు వేఱుగా చెప్ప నక్కఱలేదు. మీయిద్దఱిని దంపతులనుగాఁ గూర్చవలె నని నాకీ దినమున బుద్ధి పుట్టినది. మీ రంగీకరించు నెడల నీమాసములోనే వివాహము జరిపించి వేసెదను. ఏ మనియెదరు?

చంపావతిసూచన యత్యంతరమణీయముగానే యుండినను వారిద్దఱిని కంపిపఁ జేసినది. ఇదివరకు కాలనాథుఁడు పూర్ణదగ్గఱ భగినీభావముతో మెలఁగుచున్నాఁడు. పూర్ణ యతనిదగ్గఱ భ్రాతృభావముతో మెలంగుచున్నది. దాంపత్యమనఁగానే వారికి భయము వేసినది. చంపావతిమాటను ధిక్కరించుట వారి కంతకంటె భయప్రదము ఇట్టి స్థితిలో వారిద్దఱు నొకక్షణము మాట్లాడక స్తబ్ధులైరి. కొనకు పూర్ణ కాలోచితముగా నిట్లనినది:

"రెండుక్షణములు మే మాలోచించుకొని బదులు చెప్పెదము."

చంపా—నా గదిలోనికి వెళ్లి యాలో చించుకొని రండు.

చంపావతియాజ్ఞ ప్రకారము వారిద్దఱును వేఱుగదికి వెళ్లిరి. అచ్చట వారు నిలుచుండియే యిట్లు మాట్లాడుకొనిరి.

పూర్ణ—అన్నయ్యా! మన మిప్పుడేమి సేయుట?

కాల—నాకేమియును తోఁచలేదు.

పూర్ణ— ఇదివఱకు నేనే పురుషుని గూడ భర్తృభావముతో ప్రేమించి యెఱుఁగను. నాతల్లి యత్యంతస్పృహణీయుఁడగు వరుని జూపిన యీసమయములోఁ గూడ నాయందు శృంగార స్థాయిభావ మావిర్భవింపలేదు. మీతో సమానులు మఱియిద్దఱు ముప్వురు వరులు కన్పట్టుచున్నను మిమ్ములను మించినవరుఁడు భూప్రపంచమునందే లేఁడు. శ్రేష్ఠవరుల పట్టికలో నాదృష్టి మీకే అగ్రస్థాన మిచ్చుచున్నది. నిన్న మామేనత్త పాడిన పాటలు దానికి బల మిచ్చుచున్నవి. అయినను నల్లికార్జునునికంటె నధికముగా ప్రేమపాత్రులైన నాధర్మసోదరుని వివాహ మాడుటకు నామన స్సొల్లకున్నది. అట్లుండినను పూర్ణను శయనసఖినిగాఁ జేసుకొనుటకు మీరభిలషించునెడల నత్యంత ప్రియమిత్రు లగు మీ సుఖముకొఱకును నా తల్లిమాట కొఱకును నేను లొంగిపోయెదను. నాసంగతి యేదియో కపటము లేక తెలిపితిని. నాకు దాఁచి మాట్లాడుటగాని, గొప్పకొఱకు మాట్లాడుటగాని తెలియదు. మీరు బాగుగా నాలోచించుకొని యొక మాట చెప్పవలెను.

ఈమాటలు చెప్పినపుడు పూర్ణముఖము గంభీరముగా నుండినను భావోద్రిక్తముగా నుండినది. ఆభాషము ధర్మవీరస్థాయియే యైనను తనమిత్రుఁడు యాచించిన సర్వత్యాగము సేయుట కది సిద్ధపడి సమయము తటస్థించిన శృంగారస్థాయికి స్థల మిచ్చుటకు సర్వవిధముల నాయత్తపడియుండెను. తాను సోదరునివలె ప్రేమించినవానిని వివాహ మాడఁగూడ దని ధ్వని యామెహృదయములోనుండి వినఁబడుచుండినను పరమమిత్రుఁడగు నతఁడు యాచించిన నెంతత్యాగమైనను చేయుమని ధ్వనికూడ నామెకుఁ దోఁచో వినఁబడుచుండెను.

పూర్ణముఖమును కాలనాథుఁడు నిర్వర్ణించి చూచినాఁడు. అది సంపూర్ణకళలతో విరాజిల్లు చంద్రమండలమును ధిక్కరించుచున్నది. అది రమణీయములలోనికెల్ల నుత్తమ మగు రమణీయము. ఆకర్షకములలోనికెల్ల శ్లాఘ్యమగు నాకర్షకము. మాదకములలోనికెల్ల శ్రేష్ఠమగు మాదకము. దర్శనీయములలోని కెల్ల ప్రథమ గణ్యమగు దర్శనీయము. సంతర్పకములలోని కెల్ల నధికమగు సంతర్పకము. అది ముద్దు పెట్టుకొనుట కొకసారి దొరకిన దేవయువకుఁడుగూడ తనను ధన్యునిగాఁ దలంచును.

కాలనాథుని యాలోకనమును సంతోషముతో పూర్ణదృష్టులు రాఁబట్టుకొనినవి. ఆపరస్పర దర్శనములో మన్మథుఁడు దగ్గఱ పడినవాఁ డయ్యెను. “వెఱ్ఱివాఁడా! ఇంక నెందుల కాలోచించెదవు? చేతికి దొరకిన మహాఫలమును విడువకుము. ఈమె లభించిన నీవు భూమియందే స్వర్గలోక సుఖమును పొందఁగలవు సుమా!” అని మదనుఁ డతని చెవిలో చెప్పుచున్నట్లుండెను. అయినను

ధీరవరుఁడగు కాలనాథుఁడు చలించినవాఁడు గాఁడయ్యెను. సుఖముకొఱకు ధర్మమర్యాదను భగ్నము సేయుట కతఁ డియ్యకొనఁడయ్యెను. అతఁడు పూర్ణను జూచి స్పష్టముగా నిట్లనెను :

"చెల్లీ! ధరణియు నేను నొక గర్భమునందు పుట్టినవారము గాము. ఒకతండ్రిగూడ మమ్మ్మలను సృజింపలేదు. అయినను పెంచినవారిపై నాకు మాతాపితృభావము కలుగుటచే నామెయందు నాకు భగినీభావము కలిగెను. అది భావాంతరములోనుండి పుట్టిన భావము. నీయందు నాకు స్వతంత్రముగా భగినీభావము కలిగినది. దూరబంధుత్వపు వరుసయే ముందు పిలుపుకు కారణమైనను ఆభావము నాయందు గొప్పగా విజృంభించినది. నా యత్యంతప్రియమిత్రుఁడగు మల్లికార్జునుని సన్నిధిలో నీవు నా ధర్మభగిని వని నా భావమును వెల్లడించితిని. నీవుగూడ నంగీకరించితివి. ఇట్లు మనోవాక్కులు రెండును నాకు నిన్ను చెల్లెలనుగా చేసినవి. కాయ మందులకు తగినట్లు ప్రవర్తించుచున్నది. ఈ సంగతి దొడ్డమ్మకు తెలుసును. మణిమాలకు తెలుసును. మల్లికార్జునునకు తెలుసును. ఘనేంద్రునకు తెలుసును. అక్షోభ్యమునికి తెలుసును. ఇంక కర్ణపరంపరగా నెందఱికి తెలుసునో? ఇట్లు మన సోదరీసోదరభావము బహుజనవిదితము. బహుపవిత్రము. అత్యంతస్వతంత్రము. అందువలన ధరణికంటె నీవే నాకు దగ్గఱభగినివి. అందువలన నిప్పుడు మనకుండు భావమునే స్థిరస్థాయిగా నుంచుకొనుట నా యిష్టము. అమ్మనుమాత్రము నీవు బోధపఱచవలెను. ఆమె తీవ్రముగా నాజ్ఞాపించునెడల మనము లొంగవలసియేవచ్చును. మన మెంతపాపము నైనఁ జేసినఁ జేయవచ్చును గాని యామె యాజ్ఞనుమాత్ర మతిక్రమింపఁగూడదు."

"అన్నయ్యా! మీ ధైర్యమునకును, ధర్మనిష్ఠకును నేను మిక్కిలి సంతోషించితిని."

అని చెప్పి పూర్ణ యప్పుడు కాలనాథు నాలింగించుకొనినది. ఆధర్మభగిని ధైర్యవంతుఁడగు తనసోదరున కిచ్చిన బహుమానమది.

పూర్ణయు కాలనాథుఁడును వివిక్తప్రదేశములలో నెన్నియోసారులు సంధించిరి. రాత్రివేళలందుఁగూడ సంధించిరి. తలుపులు వేసుకొని యొక గదిలోఁగూడ మాట్లాడుకొనిరి. ఎప్పుడును కాలనాథుఁడు రాగచేష్టలనుగూడ చేయలేదు. పూర్ణగూడ నతని నందులకు ప్రోత్సహింపలేదు. ఇప్పుడు కాలనాథుని భ్రాతృభావముస్థిరపడిపోయినది. అందువలన నెట్టి శంకయును లేక యామె యాలింగించుకొనెను. పూర్ణముఖము కాలనాథుని వక్షముపై నుండినది. కాలనాథుఁ డొకచేతితో నామెముంగురులు సవరించుచుండెను. రెండవచేతి నామె భుజముపై నానెను. అప్పు డతఁడు తనవక్షస్సు పూర్ణబాష్పాంబువులచే తడిసిపోయినట్లు కనిపెట్టెను.

కాల—ఇది యేమి చెల్లీ! ఏడ్చుచున్నావా? నీకు కష్ట మేల కలిగినది? నిజముగా నేను పాపముకంటె నీ తాపమునకే భయపడుదును. వ్రతభంగముకంటె నీయుత్సాహభంగమునకే భయపడుదును. మర్యాదాహానికంటె నీ హర్షహానికే భయపడుదును.

నియమచ్యుతికంటె నీ బాష్పచ్యుతికే భయ పడుదును. నీదుఃఖమునకు కారణ మేదియో చెప్పుము.

పూర్ణ—(ఆలింగన బంధము విడిచి) అన్నయ్యా! నిన్ను కట్టుకొనఁగానే నాకు మా మేనత్త రాజకాళమ్మ జ్ఞాపకమునకు వచ్చినది. ఇంత గొప్పకొడుకును పాఱవేసు కొని "పాఱవేసినతల్లి ఫల మెట్లు తినును?" అని ఆమె విలపించిన విలాపము నాకు జ్ఞప్తికి వచ్చినది. నేను దుఃఖ మాఁపుకొనలేక పోతిని. ఆమెకంటె నెన్నియో నెట్లు తక్కు వది యైన లీలావతి రాజ్యేశ్వరియై వెలుంగు చున్నది. ఆమె ముష్టిదానివలె వీథులఁ దిరుగు చున్నది. అగతికురాలు వలె నిలువ నీడ లేక యున్నది. మహారాజును చెయిపట్టి యేమి ప్రయోజనము? కొడుకునా పాఱవేసుకొని నది. మగనినా లోఁబఱచుకొనలేక వీథుల పాలైనది. గణదా నేమి తప్పు చేసెనో గాని యతని పిల్ల లిద్దఱును ఘోరకష్టముల పాలై నారు. ఈ క్షణముపఱకు వారి కష్టములు గట్టెక్కలేదు.

కాలనాథుఁడు పూర్ణదుఃఖమును పంచు కొని తాను గూడ బాష్పాకులలోచనుఁ డయ్యెను. శృంగారరంగముగా నుండు నని మదనుఁడు గంపెడాశ పెట్టుకొనిన స్థల మిట్లు కరుణరంగముగా మాఱినది. కొన్ని క్షణము లకుఁ బిమ్మట వా రిద్దఱును చేలాంచలము లచే కను లొత్తుకొనినారు.

## మూఁడవ ప్రకరణము

### శక్తిధరుని వాగ్దానము

అనంతర మిద్దఱును చంపావతిదగ్గఱకు వెళ్లిరి. ఇదివఱకు తమకుండిన అన్నాచెల్లెండ్ర భావము గుఱించి పూర్ణ వివరముగా తల్లితో చెప్పినది. ఆ భావమును చెడనీయకుండ కాపాడవలె నని తల్లిని వేడుకొనినది.

చంపావతి కేమి చెప్పుటకును తోఁచ లేదు. దీర్ఘముగా నాలోచించుట కందఱును కూర్చుండిరి. అప్పుడు చంపావతి యిట్లనెను :

"విశాల మగు నాంధ్రసామ్రాజ్యములో విషమసిద్ధి శిష్యులలో మహావీరు లగు విప్ర యువకు లైదుగు రే యని యందఱికిని తెలిసిన విషయము. ఘనేంద్ర కాలనాథ మల్లికార్జున శక్తిధర ధనంజయులు వారు. వారిలో మల్లి కార్జునుఁడు పూర్ణకు పెత్తల్లికొడుకు. ఘనేంద్ర శక్తిధర ధనంజయులు దుర్లభులు. మాపిల్ల యపవిద్ధ యను కారణముచే వారు వెనుకఁదీయుదురు. మిగిలినవాఁడవు నీవొక్క రుఁడవే. నీ వంగీకరింపనియెడల మహావీరురా లగు నాపూర్ణకు మహావీరుఁడగు భర్త దొర కుటయే దుర్లభ మగును.

కాల—ఘనేంద్ర శక్తిధరులలో నొకనిని కుదుర్చుటకు నేను ప్రయత్నించెదను. నాప్రయ త్నము సఫలమగు ననియే తలంచెదను. వా రిద్దఱును నాకు ప్రాణస్నేహితులు. ముందు నే నెవరిని గుఱించి ప్రయత్నింపవలెనో దొడ్డమ్మ చెప్పవలెను.

చంపా—(పూర్ణను జూచి) పిల్లా, నీ వేమనియెదవు?

పూర్ణ—అమ్మయిష్టమే.

చంపా—అట్లగునెడల ముందుగా రాజకుమారుని గుఱించి ప్రయత్నింపుము.

కాల—ఈరాత్రియే యెంతవేళ కైన బదులు తెచ్చెదను.

చంపా—వెళ్లుము. నీకు జయ మగునుగాక.

కాలనాథుఁడు నిష్క్రమించెను.

*　　*　　*　　*

ప్రాసాదముయొక్క బహిఃపురములో తన యేకాంతశాలలో శక్తిధరుఁడు కాలనాథునకు దర్శన మిచ్చెను. శక్తిధరుఁడు తండ్రిని మించిన రూపవంతుఁడు. రూపమునకుఁ దగిన శరీరపుష్టియు, శరీరపుష్టికిఁ దగిన బలమును, బలమునకుఁ దగిన సద్గుణములు నతనియం దొప్పారుచుండినవి అతనికి ఘనేంద్ర కాలనాథ మల్లికార్జున భీమనాథులు సమాన స్నేహితులే యైనను కాలనాథుని యం దాతనికి నమ్మక మెక్కువ.

కాల—భర్తృదారక! శ్రీవారి సన్నిధిలో నొక వర మడుగుటకు వచ్చితిని.

శక్తి—కొన్నిగడియల క్రిందట దండనాయక చిత్రసేనుఁడు కాలధర్మ మొందె నని విన్నాను. సంప్రదాయప్రకారగ మొక సహస్రపతి నా పదవిలో నియమింతురు. అప్పుడు సహస్రపతిపదవి యొకటి ఖాళీ యగును. దానినిగుఱించి మీరు కోరునెడల నే నేర్పాటు చేసెదను. ఇదివఱ కేమియు మా నాయనగారియొద్ద నెవరినిగుఱించియు చెప్పి యెఱుఁగను. అందువలన నేను చెప్పిన వారు కాదనరు. మా తాతయ్య సేనాపతిగూడ నా మాట త్రోసివేయరు.

కాల—అది గాదు నే నడుగువరము. ఆ పదవికి నాకంటె ముందుగా గ్రహింపఁదగిన మహావీరుఁడు మల్లికార్జును డుండెను.

శక్తి—మీ చెల్లెలు ధరణిని సార్వభౌముని కోడలనుగా చేసుకొనఁ గోరెదరా? అదియును మీకు దుర్లభము గాదు.

కాల—అదియును గాదు నే నడుగు వరము.

శక్తి—మఱి యేది యావరము?

కాల—మహాకవీశ్వరియు, మహావీరురాలు నగు రాధీతరి పూర్ణకొఱకు నేను మీ హస్తమును యాచించుచున్నాను.

శక్తి—(నిట్టూర్పు విడిచి) నాయనగారు స్వయముగా నన్ను పిలిచి పూర్ణగుఱించి ప్రయత్నింపవల దని నిషేధించియున్నారు. దేవతలు కోరినను దొరకని హస్తమును నా కిప్పించుటకు మీరు సిద్ధముగా నుండినను నేను దానికి నోచుకొనలేదు. మీరు చంపావతమ్మగారి కుటుంబముగుఱించి చేయు శుభప్రయత్నములో నే నింకొకవిధముగా మీకు సహాయపడఁగలను. పూర్ణచెల్లెలు మణిమాలను వారు నా కీయ నంగీకరించునెడల నేను తప్పక యంగీకరింపఁగలను.

కాల—(సంతోషముతో) అదియే మాకుఁ జాలును. నేను వారికి తెలియఁజేసెదను. వారి యంగీకారమును రేపు భర్తృదారకులయొద్ద మనవిచేసెదను. ఒకమాఱాపిల్లను చూచుకొనెదరా?

శక్తి—కవిత్వపరీక్షా దినమున నే నాపిల్లను చూచితిని. ఆమె మధురమగు కవిత్వముగూడ వింటిని. మహాయోగీశ్వరి రాజకాళీదేవి యామె నీతిని పొగడినది. "నిత్యహామణిమాల నీతికి జయము" అని. రాజకాళీదేవి ప్రశంసాపత్రము పొందినవారికి వేఱు పరీక్ష యక్కఱలేదు.

శక్తిధరుఁడు చేసిన రాజకాళీస్తుతి కాలనాథునకు సంతోషము కలిగించినది. శక్తిధరుని భక్తి పరీక్షించుటకు తిరిగియు నతఁ డిట్లడిగినవాఁ డయ్యెను.

"రాజకాళి యంతగొప్ప యోగీశ్వరియా ?"

శక్తి — మహాయోగి అక్షోభ్యముని యామెపాదములకు మ్రొక్కుటను నేను చూచితిని. ఆమె మహాయోగీశ్వరియే కాని యెడల నామహాముని యట్లు లొంగునా ? మానాయనగారియం దామె భగవద్బుద్ధిచే భర్తృభావ ముంచుకొనినందున నా కామెయందు మాతృభావము కలిగినది. సహజముగా నా కామెయందు దేవతాభావము గలదు. ఆమెమాట నాకు పరమప్రమాణము.

కాలనాథుఁడు సంతోషముతో రాజకుమారునియొద్ద సెలవు తీసుకొని చంపావతి యింటికి వచ్చినవాఁ డయ్యెను. చంపావతీ కుటుంబస్థులు భోజనశాలలో నుండిరి. అధికమగు చనువువలన నతఁడు భోజనశాలలో చొరఁబడెను. చంపావతి యొకపీట వేయఁగా కాలనాథుఁడు కూర్చుండెను. పూర్ణా మణిమాలలు భోజనము సేయుచున్నారు. వారిమడి ముస్తాబు నిరాడంబరముగా నుండినను వారి యాకృతిసౌభాగ్యమువలన రమణీయముగానే కన్పట్టుచుండినది. చంపావతి వడ్డించుచున్నది.

మణి—అన్నయ్యా ! మీరు వెళ్లిన కార్య మేమైనది ?

చంపావతి మణిమాలతో కాలనాథుఁడు శక్తిధరునియొద్దకు పంపఁబడినవిషయమును చెప్పియుండెను గాన నామె యట్లడిగినది.

కాల—చెల్లీ ! నేను దొడ్డమ్మతో చెప్పెదను. నీతో చెప్పను.

చంపా — ఏమి జరిగినది ?

కాల—రాజుగారు స్వయముగా పూర్ణనుగుఱించి ప్రయత్నింపవలదని శక్తిధరబాబును నిషేధించినారఁట. అందువలన నతఁడు పూర్ణను బెండ్లియాడుటకు వాక్కీయఁజాలకపోయినను యాచకుఁ డగు తనమిత్రున దరించుటకు చెల్లెలు మణిమాలను తప్పక చేసుకొనెద నని మాట యిచ్చివేసెను. నేను మీయందఱిపక్షమున స్వాతంత్ర్యమువహించి యతనికి మణిమాల నిచ్చుట కంగీకరించి వచ్చివేసితిని. అచ్చట మిత్రునిమాటను రాజకుమారుఁడు గడపినాఁడు. ఇచ్చట తన యన్నయ్య మాటను చెల్లెలు గడపవలసి యున్నది.

చంపా—పెద్దల యాశీర్వచనము లన్నియు నిప్పటికి ఫలించినవి. నాకు చాల సంతోష మైనది.

పూర్ణ—ఎట్లు జరిగిన మన కుటుంబమునకు మంచిదో యట్లే భగవంతుఁడు మనల ననుగ్రహించినాఁడు.

మణిమాలయొడ లంతయు చెమర్చినది. కాలనాథుఁ డీ మాటలు చెప్పునపుడు మణిమాల కంచుగిన్నెలో వేడివేడిపాలుఅన్నము వేయించుకొని బెల్లము నంచుకొనుచు తినుచున్నది. స్వేదము కలుగఁజేసినవాఁడు మన్మథుఁడేమైనను పాలువేడి కపకీర్తివచ్చినది.

కాల—మణీ, నీ వేమనియెదవు ?

మణి—ఒప్పుకొనివచ్చినతరువాతయడుగుట యెందులకు ?

కాల — ఒప్పుకొనక ముం దడిగిన నేను చెప్పెదనో యదియే ఇప్పుడు చెప్పుము.

మణి—అప్పు డమ్మయిష్ట మని చెప్పి యుందును. ఇప్పుడుగూడ నంతియే చెప్పెదను.

కాల — అమ్మ నాకు చాల సంతోష మనెను.

మణి—అట్లగునెడల నందఱును సంతోషింపుఁడు.

కాల—నీవు సంతోషించుచున్నావా? లేవా ? అది నాప్రశ్న.

మణి—వెళ్లన్నయ్యా! నీకు హాస్యమాడుటకు కొనకు చెల్లెలు దొరకినది.

చంపా—మణీ! నీ కతఁడు మేనమామకొడుకు గనుక నిన్ను హాస్యమాడుట కతని కధికార మున్నది.

## నాల్గవ ప్రకరణము

### అంకురారోపణము

రాజకాళి హఠాత్తుగా లోపలఁ బ్రవేశించి—"అతఁడు నీ మణికి మేనమామ కొడుకనుట మిక్కిలిదూరము. అతఁడు నీ పిల్లలకు సాక్షాత్తుగా మేనత్తకొడుకు. చంపావతి వదినా! మీ మామగా రతనికి మాతామహుఁడు."

ఆ మాటలను వినఁగానే యచ్చటివా రందఱు నాశ్చర్యభరితులైరి. ఆమెకు ముందు స్వాగత మీయవలెనో, యామెమాటలకు ముందు స్వాగత మీయవలెనో యెవరికిని దోఁచలేదు. పూర్ణాకాలనాథులు హర్షప్రఫుల్లనయనములతో నొకరి నొకరు చూచుకొనిరి. తక్కినవారి కా మాటలు క్రొత్తగానే యుండినవి. చంపావతి మణిమాలలకు రాజకాళి కంకోలభట్టాచార్యునికూఁతు రని యింతకుముందే తెలిసియుండినను కాలనాథుని జన్మను గుఱించి రాజకాళి చెప్పిన యద్భుతసంగతి వారికి క్రొత్తగా నుండినది.

చంపా—అమ్మన్నా! భోజనమైనదా?

రాజ — లేదు వదినా! ఇప్పుడు నాకు నీవు క్షీరాన్నమును వండిపెట్టవలసియున్నది. నాముద్దుమణిమాలకు పెండ్లి కుదిరినదిగదా! నాకు విందు సేయవా?

చంపా — అట్లే చేసెదను గాని కాలనాథబాబు మాపిల్లలకు సాక్షాత్తుగా మేనత్తకొడు కెట్లు? ఆ సంగతి ముందు నాకు వినవలె నని యున్నది.

రాజ—వీఁడు రాథీతర సత్యరథుని చెల్లెలికొడుకు.

పూర్ణాకాలనాథులకు తమ యనుమానము స్థిరపడిపోయినది.

చంపా — ఇతని తల్లి శ్యామల యన్నారే.

రాజ—ఔను, శ్యామలయే. నీవలె తెల్లనిది గాదు.

పూర్ణ నవ్వెను.

చంపావతి పీటవేసి—"ముందు కూర్చుండు మమ్మన్నా!"

రాజకాళి కూర్చుండినది.

చంపా—కాలనాథబాబు మా అమ్మన్న కొడుకా ?

రాజ — నిజముగా నితఁడు నీయాడబొట్టె కొడుకే.

చంపా — ఏ మహాపురుషుఁ డితని తండ్రి?

రాజ—ఆడబొట్టెదగ్గఱ నట్టే ప్రశ్నలు నేయఁగూడదు. నోరు మూసుకొనుము. ఇప్పుడు మఱియొక సం ంధము గూడ కలిసినది. జాగ్రత. నా కొడుకుకు నీపిల్ల యిప్పుడు నిశ్చయింపఁబడినది. నేను నీకు పోతు వియ్యపురాలను సుమా!

చంపా — శక్తిధరబాబు నీకొడుకా?

రాజ—మహారాజు నా భర్తయైనపుడు శక్తిధరుఁడు నాకొడుకు కాఁడా? లోకజ్ఞానము లేక ప్రశ్నించెదవేమి?

ఇప్పటికి చంపావతీ మణిమాలలుగూడ కాలనాథుఁడు సుచంద్రునకు రాజకాళి యందు పుట్టిన కుమారుఁ డని గ్రహించిరి.

అనంతరము పూర్ణ స్పష్టార్థ మి ట్లడిగినది: "కౌండిన్యసుచంద్రభట్టారకులు కాలనాథునితండ్రియా?"

రాజ—(ఛందోబద్ధవాణి నాశ్రయించి) ఔను.

"కాలింగు గెలిచిన కరవాలధారి
లీలమ్మతో నాడు లీలానరుండు
కాయజు మించిన కమనీయతముఁడు
మాయావిహీనుఁడౌ మహనీయతరుఁడు
మందారమును మించు మాన్యుఁడౌ దాత
వందారుజనులను పాలించు త్రాత.
ఆడితప్పనివాఁడు హరినామపరుఁడు
నాడును గాపాడు నాయకవరుఁడు
రాజమ్మ ప్రేమించు రాజాధిరాజు
పూజితుఁడౌ తండ్రి పురుషోత్తమునకు."

మణి — అత్తయ్యా! కాలనాథబాబు శోధించి కనిపెట్టినది యంతయు నబద్ధమేనా?

కాల — సర్వాబద్ధము.

చంపా — మణిమాలకు సంబంధము కుదిరినది. పూర్ణ కింక తగినవరుని వెతకవలసియున్నది.

రాజ—కంకోల భట్టాచార్యుని మేనల్లుఁడు ఘనేంద్రుఁడు మనపూర్ణకు తగినవరుఁడని నా యభిప్రాయము.

చంపా — ఆచార్య భవనంది యంగీకరింపఁడేమో?

రాజ — రాజకాళి నేయఁదలఁచుకొనిన కార్యమున కొకయెద్దు విఘ్నము నేయఁగలదా? దాని కింత పచ్చగడ్డిచూపినఁ జాలును. అది మాదారి కడ్డు రాకుండ వెళ్లిపోవును.

కాల—ఘనేంద్రబాబుదగ్గఱకు వెళ్లి నేను ప్రయత్నింపవలె నని యనుకొనుచున్నాను.

రాజ—నాతలపై నాభారము విడిచివేయవలెను. నాకు నూపూర్ణ కొంచెము సహాయము చేసినఁ జాలును.

పూర్ణ—నేను చేయవలసిన సహాయమేమి?

రాజ—నీమనస్సులో నీ నా మహాపురుషుని ప్రేమించినఁ జాలును.

పూర్ణ—పెండ్లికి ముందు ప్రేమించుట యెందులకు?

రాజ — పెండ్లాడుటకు.

పూర్ణ — పెద్దలు మీ రందఱును చెప్పితిరి గనుక నేనంగీకరించుట కభ్యంతరము లేదు గాని ముందుగానే ప్రేమించుట యెందులకో నాకు తెలియకున్నది.

రాజ—నేను గూడ పెండ్లికి ముందు పర్వతస్వామి భట్టారకుల కుమారుని ప్రేమించితిని. పిమ్మటనే పెండ్లిచేసుకొంటిని. పెద్దలు చెప్పినందులకుఁగాను నీవు పెండ్లాడవలదు. నీవు ప్రేమింపఁగలవానిని జూచియే పెద్దలు చెప్పిరిగాని నిన్ను వారు బలాత్కరింపరు.

మణి — అత్తయ్యను మహారాజు పెండ్లాడియుండునెడల నీస్థితి యేల పట్టినది? పట్టి కబుర్లే అత్తయ్యవి. క్రియ యంతయు లీలావతీదేవిదే. పెండ్లియే సత్యమగునెడల నత్తయ్య యంతఃపురము నేల నాక్రమింపఁగూడదు?

రాజ—పట్టిక్రియలే లీలావతివి. ఫలిత మంతయు మీా అత్తయ్యదే. నాసవతి యాంధ్ర భూమి నా ప్రక్క నున్నది నా కుమారుని యాయుధమునకు ప్రపంచ మంతయు వణకును.

పూర్ణ — అత్తయ్య నాంధ్రేశ్వరుఁడు పెండ్లి యాడెనా?

రాజ—జరిగినది మాకు మంత్రాలు లేని పెండ్లి. మంగళవాద్యములు లేనిపెండ్లి. బ్రాహ్మణదక్షిణలు లేని పెండ్లి. ఉభయ పక్షముల బంధువులు విందులు కుడువని పెండ్లి. అగ్ని లేని పెండ్లి. కొన కొన దీపమైన లేని పెండ్లి. సంద్రయ్యగారిలచ్చమ్మ కొడుకు ముందుండి పెండ్లి నడిపించినాఁడు. ఒక బల్లి యాశీర్వదించి పలికినది. ఇంక నా పెండ్లి మాట యడుగకుము. నీ ప్రేమ మాట చెప్పుము.

పూర్ణ — నీవు ప్రయత్నింపుము. నీవు నాకుఁ గూర్చిన భర్తను నేను ప్రేమింపఁగలను.

రాజ—అది సరియైన మాట గాదు. నీవు ప్రేమించిన వరుని నేను నీకుఁ గూర్చెదను.

పూర్ణ—అత్తయ్యా! నా నోటినుండి మాట తీయుటకు నీ వేల యింతగా పట్టుపట్టితివి? నీప్రయత్నమునకు నేను ప్రతికూలురాలను గాను.

రాజ—ఆమాట చాలదు. నీవు నా ప్రయత్నమున కనుకూలురాలవుగా నుండెదవా?

పూర్ణ — ఉండెదను.

ఆ నాలుగక్షరము లుచ్చరించునపుడు పూర్ణముఖములో క్రొత్త లావణ్యతరంగము లుప్పతిల్లినవి. ఆమె మనస్సులో ధనుష్పాణి యగు ఘనేంద్రుఁ డొకసారి మెఱసినవాఁడయ్యెను. ఆ క్షణముననే యామె కన్యకా వ్రతమును సమాప్తి నేయుటకు జరుగవలసిన ప్రక్రియలో మొదటిది యగు నంకురారోపణము జరిగెనని చెప్పవచ్చును. అందుల కామె మనస్సు పాలకిగా నుండెను. ఘనేంద్రుని వీర మూర్తియే యందులో నాటిన యంకురము. ఆ నవాంకురమునకు రాజకాళి తన వాగమృతముచే ప్రథమదోహద మొసంగినది.

సిద్ధకృపాణుఁడు సిద్ధకార్ముకుఁడు
సిద్ధగదాధరుఁ డుద్ధతబలుఁడు
శుద్ధాంతరంగుఁడు శుద్ధచేష్టితుఁడు
శుద్ధచరిత్రుఁడు శుద్ధభాషణుఁడు
స్మరునకు లొంగని సద్బ్రహ్మచారి
గురువుకు లొంగిన గుణవారిరాశి
అరులకు భయమిచ్చు నతిరథపాళి
నరుఁను నడిపించు నాయకవరుఁడు
ఆ[illegible] డవిజేయుఁ డాజి

సుక్షత్రియుల మించు శుద్ధభూసురుఁడు
పరమమాహేంద్రుఁడు భవనందికొడుకు
పురుషవరేణ్యుఁడు పూర్ణకుఁ దగును.

*    *    *    *

చంపావతిగారింట రాజకాళి యారాత్రి క్షీరాన్నము భుజించియే వెళ్లినది.

## ఐదవ ప్రకరణము

### ప్రమథనాథుని ప్రథమనివేదిక

ఇప్పటికి రెండు వారముల క్రిందట ఘోరక పుత్రుఁ డగు ప్రమథనాథబాబు రహస్యార్థ పరిశోధకుఁడుగా నియమింపఁబడెను. మహారాజరాష్ట్రీయ నగరపాలురలో నెవరికి చెప్పఁదగిన రహస్యములను వారి కితఁడు తాను కనిపెట్టినవాటిని చెప్పవలెను. ఇంచుమించుగా నితఁడు నగరచారుఁడును నగర రహస్యాపరాధపరిశోధకుఁడు గూడ నగును. రెండుపదములలో నొక్కొక్కటి రాజుగారితనికి విధించిన కర్తవ్యములను సాకల్యముగా చెప్పవు. రాజకీయములతో సంబంధించినంత వరకే కనిపెట్టుట చారుని పని. అన్నివిధములగు నేరములను మాత్రమే కనిపెట్టుట రహస్యాపరాధ పరిశోధకుని పని. సర్వాపరాధ రహస్యములతోఁబాటు ఇతర రహస్యముల నన్నింటినిగూడ నితఁడు కనిపెట్టవలెను. ఇతఁడు కనిపెట్టిన సంగతులనుబట్టి యితనికి సర్కారువారు నెలకు నూఱుకార్షాపణములు జీత మిత్తురు. తగిన బహుమానము దొరకు నెడల నితఁడు సాధారణప్రజలు కోరిన రహస్యములనుగూడ కనిపెట్టి చెప్పుట కభ్యనుజ్ఞ గలదు.

ఇతఁడు తనపనికి తగినట్లు మిక్కిలి గుప్తముగా సంచరించుచుండును. ఇతనిని ప్రత్యక్షముగాఁజూచిన వారు మిక్కిలి యరుదు. రథినీకుమారి మంత్రాంగము ననుసరించి రాజుగారీక్రొత్త యుద్యోగస్థుని నియమించిరి. లంచగొండులగు నధికారులును, విప్లవకారులును తుల్యముగా నితని నియమనము వలన భయపడుచున్నారు. ఈ పని కితనిని సమర్థించి చెప్పినవాఁడు దండనాయక బలవర్ధనుఁడు.

గురువారమునాఁడు రాత్రి రెండవ యామమున ప్రమథనాథబాబు పత్రద్వారా తాను కనిపెట్టిన మూఁడురహస్యములను నగరపాల ఘనేంద్రునకు నివేదించినవాఁడయ్యెను. తనగదిలో నేకాకియై కూర్చుండి ఘనేంద్రబాబు ప్రమథనాథుని నివేదికను చదివెను.—

“నగరపాల శ్రీ భారద్వాజ ఘనేంద్ర బాబుగారికి: విధేయుఁడు రహస్యార్థ శోధకుఁడు ఘోరకి ప్రమథనాథుఁడు వినయపూర్వకముగా వ్రాసుకొనిన నివేదిక. నే నుద్యోగములో ప్రవేశించిన యీ పదునైదు దినములలో మూఁడు రహస్యవిషయములను కనిపెట్టితిని.

౧. తాక్షక చంద్రసేనుని కీర్తిశేష భార్య రేవతియే కాకులపుత్రి శరావతి. ఇందువలన నాగమణి యను నామాంతరము గల పర్ణినియే కాకులదౌహిత్రి యిరావతి యని వేఱుగాఁజెప్పనక్కఱలేదు నగధరబాబు ధనముకొఱకు నగ యొకటి మా తండ్రిదగ్గఱ తాకట్టు పెట్టెను. నే నా నగను పరీక్షించితిని. అది సాధారణస్త్రీలు గాక రాజస్త్రీలు ధరించు బంగారు కాలుగడియముగా నున్నది. పుష్టి గల మగవాఁడు ధరియించు

దండకడియమైనను కావచ్చును. విచారింపఁగా నది రేవతి తమపురోహితపుత్రి యగు వసుంధరకు దాన మిచ్చిన కాలు కడియములలో నొకటి యని తేలినది. "మావారు చేయించిరి గాని సువర్ణమును పాదములందు ధరించుట నా కిష్టములేదు." అని చెప్పి రేవతి వసుంధర కిచ్చివేసెనఁట. వసుంధర తనభర్తకు తెలియకుండ నా కడియములను తనపెట్టెలో దాఁచుకొనినది. తన దారిద్ర్య సమయములో వాటిలో నొకటి నగధరునిచే నిప్పుడు తాకట్టుంచఁబడినది. చంద్రసేనుఁడు రేవతికి బంగారుకాలుకడియములు చేయించె నని నేను నమ్మఁజాలకపోతిని. అవి రాణి శ్రీకాకులపత్నివి కొమారితెకు వచ్చినవి యని నా యనుమానము. రేవతిపుట్టి ల్లని చెప్పఁబడుగణపవరములో నామెపుట్టింటివా రిప్పుడు లేరు. పూర్వముగూడ వారు గణపవరమునకు వచ్చి రెండు మూఁడు సంవత్సరములు కాఁపుర ముండిరేగాని యనాదిగ్రామవాసులు కారు. వారినిగుఱించి యందఱికథన మొక్క విధముగా కన్పట్టుటలేదు.

చంద్రసేన నాగేంద్రుని యిల్లు పరంతప సంఘమునకు కేంద్రస్థానముగా నుండు నని నమ్ముచున్నాను. పర్ణినిమాత్ర మేకారణము చేతనో నిశంభునకు నిశ్చయింపఁబడ లేదని తెలియుచున్నది. ఆమెను మన కాళనాథ బాబు కిచ్చి యతనిని నాగులలోని కాకర్షించుటకు చంద్రసేనుఁడు ప్రయత్నించి విఫలుఁడయ్యెను.

౨. ఇప్పు డాపిల్లను వారు కర్ణీసుతుఁడగు భీమనాథున కిచ్చి యతనిని తమ సంఘములో చేర్చుకొనుటకో, లేక యిదివఱకే చేరియుండినవానిని స్థిరపఱచుటకో ప్రయత్నము సలుపుచున్నారు. రాజకాళమ్మ పాడిన కొన్నిపాటలలో నుండి భీమనాథుఁడు జటామునిపుత్రుఁ డని నేను గ్రహించితిని. అతనిని బీజప్రాధాన్యముచే బ్రాహ్మణులలో చేర్చుట కవకాశ మున్న దేమో మీరు ధర్మపాల బాబు నడిగి తెలుసుకొనవలెను. అవకాశ ముండునెడల త్వరగా ప్రయత్నింపవలెను. ఏమి యాలస్యము చేసినను ఆమహారత్నము మన శత్రువులచేతఁ బడిపోవును. అతనిని నిగ్రహించుట కష్టసాధ్యము. అతఁడు సామ దాన భేద సాధ్యుఁడే గాని దండసాధ్యుఁడు గా డని నా యభిప్రాయము.

3. కేళికసులోచనుని పుత్రుఁడు దళపతి నీలుఁడు ఒక్కతలప్రహారముచే భయంకరమగు భల్లూకమును చంపివేయుటను నేను చూచితిని. చిట్టడవిలో నతఁడు ధనుర్విద్యావ్యాయామము నేయుచుండుటను నేను కనిపెట్టితిని. ధనుస్సులో మీ చేతులలోని కౌశల మతనిచేతులలో నాకు కన్పట్టినది. సహస్రపతి బలభద్రునితో నతఁ డాజ్ఞాయుక్తస్వరముతో మాట్లాడుట నేను వింటిని. ఈ కారణములనుబట్టి యతఁడే నిశంభు వని నే ననుమానించుచున్నాను. కుంజనాథుఁడు తన పుత్రుని పెంచుటకు సులోచనున కీయ నోపును.

చిత్తగింపవలెను.

ఘోరకిప్రమథనాథుఁడు వ్రాలు."

# నూతన జాతీయప్రభుత్వమున ఆంధ్రప్రముఖులు




౧. గౌ. శ్రీ బులుసు సాంబమూర్తిగారు : మదరాసు శాసనసభాధ్యక్షులు

## మంత్రులలో ఆంధ్రప్రముఖులు


౧. గౌ. శ్రీ వి. వి. గిరిగారు


౨. గౌ. శ్రీ టి. ప్రకాశం పంతులుగారు


౩. గౌ. శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారు

# తెలుగుమఱుగు:
# వ్యవహారభాషా వ్యాకరణము

కీ. శే. పారసంది రామశాస్త్రి



ఈ యాంధ్రభాషకు ప్రథమమూలప్రకృతియగు సంస్కృతభాషయందును గ్రామ్యములు గలవు. అవి యర్థమునుబట్టియేకాని వ్యాకరణవిరోధమునుబట్టికాదు. ఎట్లనగా - "సిష్ఠ్యూతో ద్గీర్ణ వాంతాది గౌణవృత్తి వ్యపాశ్రయం, అతిసుందర మన్యత్ర గ్రామ్యకక్ష్యాం విగాహతే" అని యాలంకారికులు చెప్పియున్నారు. "వ్యాకరణ విరుద్ధము గ్రామ్యము. గ్రామ్యము నింద్యము. నింద్యము గ్రామ్యముగాదు" అనునది యిటీవలివారు కల్పించికొనిన సంకేతము. ఆ సంకేతములోనైనను తామే నింద్యములని చెప్పిన కొన్ని గ్రామ్యములను అనింద్యములుగా నంగీకరించుటచేత వారివచనము వ్యభిచరితము, స్వవిరుద్ధమును అగుటను ప్రమాణము కాజాలదు.

అప్పకవి చెప్పిన "చులకగా గ్రామ్యజనములు పలుకునట్టి తెనుగుమాటలు గ్రామ్యంబు లనగబడియె, వర్ణలోపంబు నొంది కావ్యములఁ జొరవు పదుల దెగడుచో నొప్పు పాలదొంగ" "అక్షరవిలోపమై యుండునట్టి పలుకు గ్రామ్య మనగనొప్పు నదె యపభ్రంశకంబు ననఁగబడును నాకడ కాడ యనుచు మఱియు నడుమనున్న కకారంబు నుడుపకున్న" అను గ్రామ్యలక్షణము వస్తాడు, తెస్తాడు మొదలగువానిలో నెట్లు కలుగును?

ఇందు మొదటిపద్యములో "చులకగా గ్రామ్యజనములు పలుకునట్టి" అనుటవలన వస్తాడు, తెస్తాడు మొదలగునవి గ్రామ్యజనులు పలుకునట్టివే కావు. అవి అప్పకవికి ముందునుండి యిప్పటికిని నాగరికుల నోటను, వ్రాతలలోను కానుపించుచునేయున్నవి. మఱియు వానిలో చులకతన మేమియును కానరాదు. కాబట్టి యవియే వత్తాడు, తెత్తాడు అని పలికినప్పుడు గ్రామ్యములని యప్పకవియభిప్రాయము కావచ్చును. ఇంక రెండవ పద్యములో "అక్షరవిలోపమై యుండునట్టిపలుకు" అనుటవలన వీనిలో నక్షరవిలోప మేమియును లేదు. "నాకడ" అనుచోట నాదిమాక్షరమును లోపింపజేసి "కడ" అనియు, మధ్యమాక్షరమును లోపింపజేసి "నాడ" అనియును పలికినపుడు నవి గ్రామ్యములుగా నుదాహరించుటచేత నక్షరవిలోప మనగా ఏ యర్థమును ఏపద మెన్నియక్షరములు గలిగి చెప్పగలుగునో అన్నిటిలో నొక యక్షరమును విడిచినచో గావలసిన యర్థము సిద్ధింపదు కావున నట్టిపదములే గ్రామ్యములని దానియభిప్రాయము.

కావుననే కనియె, అనియె అనువానికి కనె, అనె అని వాగనుశాసనుడు ప్రయోగించియున్నాడు. వానిలో నర్థలోపము లేదు. కావున వ్యాకరణకర్తలలో ప్రథమాచార్యుడనియొప్పుచున్న వాగనుశాసనుని ప్రయోగములకు మొదల గ్రామ్యతను సంపాదించి గ్రామ్యములుగా నొప్పికొనుటకంటె "ప్రక్షాళనాద్ధి పంకస్య దూరాదస్పర్శనం వరం" అను న్యాయమున వానికి గ్రామ్యత్వమునే చెప్పక యప్పకవి నిర్వచనమునకే యట్టి యభిప్రాయము చెప్పుట యుచితము. కానిచో నప్పకవి వచనములు సంగతములు కానేరవు. యథాశ్రుతముగా గ్రహించినచో వస్తాడా, తెస్తాడా మొదలగువానికి



 8 5

గ్రామ్యతను చెప్పుట యప్పకవికి ప్రమాదము కావల యును.

మఱియు నప్పకవి నన్నయభట్టీయమునకు వ్యాఖ్యాతగాని మూలకర్త గాడు. నన్నయభట్టీయ మూలసూత్రము. "సిద్ధి ర్లోకా ద్దృశ్యా లోకోఽనన్యా దృశశ్చనిత్యశ్చ, సంస్కారార్థో నియమోఽనియమా ద్గ్రామ్యంహి య త్త్వపభ్రంశః" అని. ఇందు నప్పకవి పూర్వార్ధమును విడిచిపెట్టి యుత్తరార్ధమునకు మాత్రము తాను వ్యాఖ్యానము చేసియున్నాడు. ఆ సూత్రమునకు పదసిద్ధి లోకవ్యవహారము వలననే చూచికొనవలయు ననియు, లోకవ్యవహారము అనన్యా దృశము - అనగా తత్సమ, తద్భవములవంటిది (శాస్త్ర నియంత్రితము కాదు,)- అది నిత్యము-ఎన్నటికిని నుండు నదే యనియు, నియమ మనగా శాస్త్రనియమము, సంస్కారార్థమనగా ప్రకృతి ప్రత్యయాది సమావేశ మును తెలుపుటకే కాని రూపమును నిష్పాదించుటకు కాదనియు, "అనియమాద్గ్రామ్యం" అనగా నియమము గలపదమును నియమము తప్పి పలికినచో నది "అప భ్రంశః" అనగా నపభ్రంశ మను గ్రామ్య మగుననియు నర్థమగుచున్నది. ఇందువలన నేపదములు నియమముం డగా నానియమమును తప్పి యుచ్చరింపబడునో యవియే గ్రామ్యములుగాని నియమమే లేని దేశ్యపదములు గ్రామ్య ములు కావు. నియమము తత్సమ, తద్భవములకే కానబడుచున్నది కావున నవియే నియమమును తప్పినచో గ్రామ్యములన్నట్లు నన్నయభట్టాభిప్రాయము కాన బడు చున్నది.

ఇంకను "ప్రవాహినీ దేశ్యా" అని. దేశ్యము లోకవ్యవహారప్రవాహమువలననే సిద్ధించునది కాని శాస్త్రమువలన గాదు. ఇచట నహోబలపండితీయము "దేశ్యా మార్గ ంచ రూఢత్వా త్స్వతంత్రత్వాచ్చ భూ యసా, లక్ష్మ నాపేక్ష్యతే తస్య సంప్రదాయోహి బోధకః" అని. "ఏదేశము మానవులకు, నా దేశము భావ దేశ్య మయ్యె గరు,త్సాది జనవ్యవహారము,చే దాని నెఱింగి కృతుల జెప్పగ నొప్పున్" అని చెప్పుచున్న యప్పకవి వస్తాను, తెస్తాను మొదలగునవి గ్రామ్య ములుగా నెట్లు చెప్పెను? మఱియును "భారతీదేవి

శైశవభాషితంబు, ప్రాకృతము పంచవిధ మయ్యె ప్రాకృతంబు, శౌరసేనియు మాగధీ సంజ్ఞకయును, గ్రమత బైశాచికయు నపభ్రంశ మసగ."

"నామ మపభ్రంశ.బని, సామాన్యముగా వెలంప జన దదిభాష, భామాశిశుత్వభాషిత,మై మెలగుట నశబ్దమను నెల్లెడలన్" అని చెప్పుచున్న యప్పకవి యభిప్రాయ మేమైయుండను? ఇందువలన శైశవమందు బాలురు మాటలలో గొన్నికొన్ని యక్షరముల విడిచి చులకనగా బలుకుచుట్టివే యపభ్రంశగ్రామ్యము లనియు, శాబ్దార్థ గ్రామ్యముల రెంటిలోను శబ్దస్వరూపము చేనైన యప భ్రంశగ్రామ్యము సరస్వతి బాల్యభాషితము గావున నింద్యము గాక గ్రామ్యమే యనియును, అశ్లీలాద్యర్థ దోషమును బట్టియయిన అర్థగ్రామ్యమే నింద్యమని యును తెలియవలయు.

"వస్తాడా హరి యిస్తాడా" అను పద్యమందు చెప్పిన గ్రామ్యత యర్థదోషమును బట్టియే కాని శబ్ద దోషమునుబట్టి కాదు.

కావున నెట్లు చూచినను వస్తాను, తెస్తాను మొదలగు తాంతరూపములు దేశ్యక్రియలు, గ్రామ్య ములు కావు. వానికి శాస్త్రనియమ మక్కర లేదు. సిద్ధరూపములుగా గ్రహించునది. నియమము కావలయు నను ఆగ్రహము గలవారి క్రిందిరీతి నింకొక సమాధానము. అది ముందలి వ్యాకరణ కర్తలే చెప్పియున్నచో నెవ్వరికిని ప్రశ్నమే లేకుం డును. కావున నాయీగ్రంథ మంతయును సావ ధానులై విమర్శించుటకు సహృదయులు ప్రార్థితులు. అట్లుకాక గతానుగమనమునే యనుసరించి నాయుద్యమ మును నిందింపబూనినవారినిన్ని ప్రార్థించి తమతమ తాతముత్తాతలు గురువులు మొదలగు నార్యులకు గ్రామ్య త్వము, ననార్యతయు, వ్రాత్యతయు నంగీకరించుకొనిన వారి సాహసిక్యముకంటె నాదు సాహసిక్యము పెద్దది కాదని తలంచి యీయుద్యమమునకు బూనికొనినాడను. పెద్దల మాటలకు గ్రామ్యతానిరాకరణము, సాధుత్వ సంపాదనమును దీనికి మంగళము.

వచ్చు ధాతువు...తా ఆనుబంధకము, 'డు' పురుష ప్రత్యయము. "వచ్చుతాడు" కాగా ధాతూ

కారమునకు లోపము "వచ్చ్ + తాడు". చకారమునకు సకారాదేశము "వస్స్ + తాడు." ద్వితీయసకారమునకు లోపము "వస్తాడు." ఇది లుట్ లకారరూపము. ఇచట "తా" అనుబంధకము సంస్కృతభాషలో లుట్ లకారమందు జూచి చేసినది. సంస్కృతమందు లకారములు పదింటిలోను లేట్‌లకారముతప్ప తక్కినవి లోకమందు గలవు. లోకమం దుండగా గొంతకాలమున కారూపములు గ్రంథములలో జేరినవి. ఆరూపములను చూచియే వాని కనుకూలించునట్లు వ్యాకరణము లేర్పడినవి. ఆపిమ్మట నీతెలుగుభాషలో గవితారంభ మైనప్పుడు సంస్కృతభాషా మర్యాదా ప్రకారమే సంస్కృతపదములకు తెనుగు ప్రత్యయములోను, తెలుగుపదములకు సంస్కృత ప్రత్యయములతోను కొన్నికొన్నిటికి సంకరముచేసి గ్రంథములు చేసినారు. అందు కుదాహరణములు మీద గొన్ని చూపబడియే యున్నవి.

ఈ లుట్ లకారము కాలములలో ననద్యతనభవిష్యత్కాలమును, స్వభావమును, శక్తిని గూడ దెలియజేయును.

లడాదిలకారము లన్నిటికిని కొన్నిచోట్ల సంకీర్ణముగాను, కొన్నిచోట్ల వ్యస్తముగాను భారతాది గ్రంథములందు బ్రయోగములు గలవు. ముందు వానిని చూపెదను. లుట్‌లకారమునుగూర్చి యిప్పుడు చెప్పుచున్నాను. అచ్చు, ఇచ్చు, వచ్చు మొదలగు చువర్ణాంత ధాతువులకు అస్తాడు, ఇస్తాడు, వస్తాడు, చూస్తాడు, కాస్తాడు, దాస్తాడు, వేస్తాడు, లేస్తాడు మొదలగు రూపము లగును. బ్రోచు మొదలగు కొన్నిటికి ఉకార లోపము లేక "బ్రోచుతాడు" అని యగును. అందు లోకమును బట్టియే రూపసిద్ధి జేసికొనవలయును.

చేయు, మోయు, కోయు మొదలగు యువర్ణాంతధాతువుల యకారమునకు సకారాదేశము రాగా చేస్తాడు, మోస్తాడు ఇత్యాదిరూపము లగును.

తిను, విను, కొను మొదలగు నువర్ణాంతధాతువులకు ఉకారలోపము, తకారమునకు టకారాదేశమును రాగా తింటాడు, వింటాడు, కొంటాడు ఇత్యాది రూపము లగును. చను, మను మొదలగు కొన్నింటికి టకారాదేశము లేదు.

ఉండు, వండు, మండు మొదలగు డువర్ణాంత ధాతువులకు ఉండు తప్ప తక్కినవానికి టకారాదేశము లేదు.

ఈ రూపములకు లోకమే ప్రమాణము. వ్యాకరణములు సిద్ధరూపమున కుపపత్తి జెప్పునట్టివే కాని రూపమును పుట్టింపవు.

లడాదిలకారముల కుదాహరణములు:

లట్ లకారమునకు—

"వేశ్యతోఁ దవిలి తగ వినుచున్నవారల"

భార ఆది. ౧ ఆ.

"రాజ్యంబు సేయుచున్నఁత"- 3 ఆశ్వా. ౧౫

ఇచట వర్తమానార్థమందు చువర్ణక మెట్లు వచ్చినది? అకస్మాత్తుగా వచ్చినదా? కాదు. మఱి యెట్లనగా- నన్నయభట్టుడు "శత్రర్థే తూత శ్చానో స్తస్య స్యాచ్చ పూర్ణబిందురపి" అను సూత్రమందు సంధివిషయములో "శత్రర్థే తూతశ్చా" అనుచోట శత్రర్థమందు చకారమును సిద్ధపఱచి చెప్పినాడు. తాను శత్రర్థమందు చకారమును విధింపక దానికి కార్యమును చెప్పుట సంగతమెట్లని విచారింపగా నన్నయభట్టుడు సంస్కృతవ్యాకరణము ననుసరించియే తాను వ్యాకరణము చేసినవాడు. శత్రర్థ మనగా శతృప్రత్యయార్థము. శతృప్రత్యయము వర్తమానకాలమందు సంస్కృత వ్యాకరణములలో విధింపబడినది. దానిలోని తకారము ధాతువులకు చేర్చగా చూచుతున్నాడు, వచ్చుతున్నాడు మొదలుగాగల రూపము లగును. ఆతకారమునకే చకారాదేశముచేసి సంస్కరించిన రూపములు చూచుచున్నాడు, వచ్చుచున్నాడు మొ. ఆతకారశ్రవణము గల రూపములు తొలితెలుగున నున్నవి. తొలితెలుగనగా వ్యాకరణములకు ముందుండినది. ఆరూపము లిప్పటికిని లోకమందు గానబడుచున్నవి. గ్రంథములలో సంస్కరింపబడినవానినే వాడుకొనుచున్నారు. కాని కొన్నిచోట్ల నరుదుగా తొలితెలుగుపదములు గ్రంథములందును జ్ఞాపకముగా గానబడుచున్నవి. ఈ చకారము

తకారమున కాదేశమన్నందుకు "శత్రర్థమందు చకార" మనుటయే జ్ఞాపకము. ఇది యొకటి.

ఇటీవలి వ్యాకరణకర్తలు "వర్తమానార్థమందు చకారము" అని స్వయముగానే చకారమున్నట్లు చెప్పుట వలనవారు నన్నయభట్టుని హృదయము సరిగా కనిపెట్టి వ్రాసినట్లు కానరాదు. కాని వారన్ను శత్రర్థకచువర్ణక మని వ్రాయుటచేత వారన్నను అనకున్నను అది తకారాదేశచకార మనక తప్పదు.

ఇటీవలి వైయాకరణులు "న స్యాన్నిత్తద్ధరోక్త శ్చేర్వాప్యాద్వర్తమానవిహితస్య" అను నన్నయభట్టీయ సూత్రమందు వర్తమానమందు చకారము విధింపబడినట్లు మాత్రము తెలిసికొని చెప్పియుందురు. అహోబలపండితీయమందు "చున్తి క్రియాపదానాం సర్వేషాం వర్తమానకాలే స్యాత్" అనుదానిలోను గూడ శత్రర్థ వర్తమానకాల మందుటను అట్లు చెప్పియుందురు. అది యెట్లయినను శత్రర్థక చువర్ణక మనునది తకారాదేశమే కాని వేరు కాదు.

పరోక్షానద్యతనభూతార్థమందు లిట్—

"మహామునులసం జెప్పె," "జనమేజయుం డిట్లనియె." భా. ఆ. ౧ ఆ.

ఇవి ప్రథమపురుషైకవచనములు. చెప్పిరి అనిరి అనునవి బహువచనములు.

అనద్యతన భవిష్యదర్థమందు లుట్—

"మీరు బొంగలయప్పుడు నన్నుందలంచుడు నాక్షణంబ వత్తు" నని. వచ్చుతాను, వస్తాను. అనుదానికి బదులు తద్ధర్మరూపము. "అఖిలదేవానరు లిస్తు రభిమతములు."

"దాని వినగవలతు," "యయాతిచరితంబు వినవలతుం జెప్పుము." స్వభావార్థకలుట్ లకారమునకు బదులు తద్ధర్మరూపము. విను స్వభావము గలవాడను. అని యర్థము.

అద్యతనభవిష్యదర్థమందు ల్రుట్—

"సవిస్తరంబుగా జెప్పెదవినుము."

—భా. ఆది. ౨ ఆ.

"కళ్యపుండు ప్రసన్నుండై కోరినవరంబు లిచ్చెదవేడుండనిన. భా. ఆ. ౧ ఆ.

ప్రత్యక్షంబ చూచెదము. భా. ఆ. ౧ ఆ.

"నేసరిందము నతని నిరీక్షింపగబోయెద," "ప్రీతి జేసెదన్."

ఈ యెద యంతమందు గల వి ల్రుడ్రూపములు.

ల్రుట్ ప్రతిరూపక తద్ధర్మము స్వభావార్థము దూ భా. ఆది. ౨ ఆ. "ఎటవోయెదు."

భా. అర. ౨ ఆ. "అరణ్యావాసము సేసెదు." వర్తమానతద్ధర్మము.

"వరింపదల్చెమాతము." (భా. ఆ. ౨ ఆ.) వ్యతిరేక తద్ధర్మము.

తెనుగున తద్ధర్మమనునది కాలత్రయమునకును కర్తయొక్క శక్తిస్వభావములకును అనుగతమగునట్లు తత్పదముచేత కాలత్రియకర్తను గ్రహించి, ధర్మపదముచేత కాలత్రయముయొక్కయు కర్తయొక్కయు స్వభావమును చెప్పునదని తెలియుటకయే తద్ధర్మమని పేరు పెట్టినారు. వీనిలో నటింతురు, వధియింతురు, ఆపాదింతురు, వత్తురు, కావింతురు, కొంతురు మొదలగు తకారశ్రవణముగల రూపములు లుట్ లకార ప్రతిరూపకములు.

చేసెద, చూచెద, చెప్పెద, మొదలగు దకారశ్రవణముగలవి ల్రుట్ లకార ప్రతిరూపకములని యెఱుంగునది.

వచ్చు, చేయు, చూచు మొదలగు విశేషణరూపములు కర్తయొక్క స్వభావమును, శక్తిని చెప్పును. అందు కాలవివక్ష లేదు.

మీద జెప్పిన లుట్ రూపములు 'తా' అనుబంధకముతో నన్నయభట్టును తన భారతమందు ప్రయోగింప లేదనియు, తన వ్యాకరణమందును లుట్ లకారమును చెప్పలేదనియును, అతని కది యనిష్టమనియును తలంపరాదు.

నన్నయభట్టుడు తన వ్యాకరణమందు "అస్తిరనుబంధక స్యాత్ద్వ్యత ల్రుడర్థో వివక్షితో ధాతోః,

వసతి రనుబంధక స్స్యాత్ ల్యుట్లృతలడర్థో వివక్షితో ధాతోః"
అని లృడర్థలడర్థముల నుల్లేఖించి "అస్తి, వసతి" అను బంధకములను విధించి యా రూపములను తన భారతములో ప్రయోగించియున్నాడు. ఆరూపములు మీదగనుపఱచబడియున్నవి. ఆనను "అస్తి, వసతి" అనుబంధకములు శబ్దస్వరూపము లయ్యును వానిని నర్థపరములుగా గ్రహించుటచేత "తి" గాని, "తా" గాని "స్య"గాని ప్రయోగములలో గానరాకున్నను ఆయర్థము గల రూపములు గానబడుచునేయున్నవి.

అత డర్థపరములను గ్రహించుటచేతనే యాయా యర్థములనుబట్టి యాయాలకారములను మనము తెలిసికొనవలయును. అర్థభేద మపలపించుట శక్యముకాదు. లుట్ లకారమును వేఱుగ జెప్పకున్నను లృట్ లకారమందు "అస్తి" (కల) అనుబంధకమును విధించుటచేతనే లుట్లకారమును చెప్పినట్లే మనము తెలిసికొనవలయును. ఎట్లనగా—

ఈలడాదిలకారములు సంస్కృత వ్యాకరణ సంకేతితములు. వాని యర్థములును అట్టివే. లుట్లకారమునకు కాలమర్థమైనపుడు అనద్యతనభవిష్యత్తును, లృట్ లకారమునకు అద్యతనభవిష్యత్తును అర్థముగాని కాలసామాన్యము గాదు అట్లే భూతమందును అద్యతనానద్యతన భేదము గలదు. ఇట్లుండ నన్నయ భట్టుడు ఆసంకేతము నెఱిగినవాడే కావున "అస్తి రనుబంధక స్స్యాత్" అను సూత్రములో "యత్ర" ఏరూపమందు,"లృడర్థః"లృట్లకారార్థము, "వివక్షితః" వివక్షింపబడునో అచ్చట "అస్తి" కల అనుబంధకము "విహితః" విధింపబడినదని చెప్పినాడు. ఈ "కల" అనుబంధకము ధాతువులయొక్క తుమున్నంతరూపములందే కానబడుచున్నది. "చూడన్ + కలడు" "చేయన్ + కలడు."ఇత్యాదులు. వానిలో కాలమే యర్థమైనప్పుడు చూడన్ = చూచుటకు, చేయన్ = చేయుటకు, కలడ = సిద్ధముగా నున్నాడని యర్థము. ఇవి "ద్రష్టుమస్తి", "కర్తుమస్తి" అను సంస్కృతవాక్యములకు సమానములు. కావున నివి అద్యతన భవిష్యత్కాలమునే చెప్పునుగాని కాలసామాన్యము నెప్పుడు

ఇంకను "కలడు" అనునది "కలవాడ" అను నర్థమును చెప్పును. అప్పుడు శక్తిగలవాడు, స్వభావము గలవాడనియు నర్థము. కాగా లృట్లకారము దానికి కలానుబంధకము దానివలన అద్యతన భవిష్యత్కాలమున్ను సిద్ధించుటచేతనే అనద్యతన భవిష్యత్కాలము దానికి రూపాంతరమున్ను సిద్ధించుననియే వేఱుగ జెప్పలేదు. అది "తా"అనుబంధకము గల లుట్రూపము. ఆరూపమును నన్నయభట్టుడు తనభారతమందు ప్రయోగింపమి దోషము కాదు. అతని కాలకారము అనిష్టమున్ను కాదు. లట్ లృట్ లకారములను చెప్పినవాడే అయ్యును ఆరూపములను తద్ధర్మములోనే ప్రయోగించియున్నాడు కాని ఆరూపములలో వానిని ప్రయోగించలేదు. అట్లే యీ లుట్ లకారమును గూడ సంగ్రహించి తద్ధర్మరూపములోనే ప్రయోగించియున్నాడని యెఱుంగవలయు. ఇట్లు సంగ్రహించి చెప్పుట ప్రౌఢికాని లోపము గాదు. నన్నయభట్టుడు ప్రౌఢుడు కావున నట్లు ప్రయోగించినాడని తెలిసికొనవలయును.

ఆరూపమునకు కాలమును, స్వభావమును విశేషించి చెప్పక తద్ధర్మమని చెప్పుటయే యిందుకు జ్ఞాపకము. ఆ లుట్రూపమే తద్ధర్మములో తకార శ్రవణము గలది యనియు, దకారశ్రవణము గలది లృట్రూపమనియు నెఱుంగవలయు.

ఇక లోట్లకారము బహ్వర్థములు గలది.

భా. ఆ. ౧ అశ్వ "సర్పయాగ మతిధీయుత చేయుము." విధ్యర్థకము.

—ఆ. ౮ ఆ. "మనోరథంబు తనులుగాక." సంభావనార్థకము.

"కారణాం బమల చరిత్ర చెప్పుమయ్య." ప్రార్థనార్థకము.

"నీవిప్డు నాకు దాసివగుము." విధ్యర్థకము.

భా. ఆ. ౨ ఆ. "పాములు పంచత్వము చనియెడుమని." ఆశీరర్థకతద్ధర్మము.

"మా యీదాస్యము వాయునుపాయము సేయుండు నన్నుం బనుపుం డిష్టం బేయది దానిన తెత్తు." ప్రార్థ

భా. ఆ. 3 ఆ. "నీకన్యాత్వంబు దూషితంబుగా దోడకుండునని వరం బిచ్చి." ఆశీరర్థకము.

"వానిజవ్వనంబు వానికిచ్చునది." విధి. ఆశీరర్థకము.

"పనిసేయుంగాక." ఆశీరర్థకము.

"అనుభవింత్రు కాక." ఆశీరర్థకము.

లజ్ అనద్యతనభూతమందు.

భా. ఆ. ౧ ఆ. "భూనాథ రణముసేసితి."

"మనుష్యమాంసములు దించును త్రావ్వితి."

3 ఆ. "జనమేజయుం డిట్లనియె."

"దేవనివహంబుచే బడసె."

"తపంబునకు మెచ్చితి."

విధిలిజ్ బహ్వర్థకము.

భా. ఆ. 3 ఆ. "కావంగావలయు." ప్రార్థనార్థకము.

"తేవలయు." విధ్యర్థకము.

"ఎవ్వం డగునోయని." సంభావనార్థకము.

"నిహతుండయ్యెంగావలయు." సంభావనార్థము.

"నన్ను జీవితుం జేయవలయు." ప్రార్థనార్థకము.

"ప్రసాదింపవలయు." ప్రార్థనార్థకము.

ఆశీర్లిజ్ ఆశీరర్థకము.

భా. ఆది. ౨ ఆ. "యమసదనంబున కరిగెడుమని." ఆశీస్త్వదర్థము.

౭ ఆ. "ధర్మనందనుం డొనరించుచుండు గావుతమఖండితముగ."

"తత్కర్మసంసిద్ధి నుత్తముడై పొందెడుమంచు."

"ఇంక మీకు లగ్గగుస్."

భాగ. ౧ స్కం. "కృపాబ్ధి యీవుత కవిత్వమహత్వపటుత్వసంపదల్."

లుజ్ పరోక్షాఽపరోక్షాద్యత నాఽనద్యతనభూతము సాధారణము.

భా. ఆది. 3 ఆ. "మహామునులకుం జెప్పె."

"తపంబునకు మెచ్చితి."

"సత్వంబు బడసితి."

"కరంబుగారవంబుగా జెనిచితిమి."

లృజ్ క్రియార్థ క్రియాద్యోతనమందు.

భా. ఆది. ౨ ఆ. "జరత్కారుం డనపత్యుండైనం దెగుదు మేమధఃపాతులమగుదు మాతం డపత్యంబు వడసెనేని నూర్ధ్వగతుల మగుదుము."

భా. అర. ౧ ఆ. "నరనుత నీయనుజ్ఞగొని నాడ విరోధులకెల్ల బోరిలో, సరభసవృత్తి నక్కడగ జంపితి మేని మహోగ్రకాననాం, తరముల నుండకుండ నతిదారుణ దుర్మృగసంగమ బునం, బొరయక యుండగా మనకుబోలునముందమునః ప్రియంబుగాన్."

"ఇప్పర్వతంబు దైవనివాసంబు గావున నితండు కిరాతకరూపప్రచ్ఛన్నుం డయ్యెనేని నొక్క దివ్యపురుషుండు గావలయు."

భార. ఆ. 3 ఆ. "భూసురులాదిగ గజము, లీసుర సేవించిరేని నిదిమొదలుగ శా, పాసక్తి బతితులగుదురు."

భా. స. ౨ ఆ. "అన్యథాబుద్ధి జెప్పితేని మఘువుకులిశంబు వ్రచ్చు నీమస్తకంబు."

"సమబుద్ధి గలిగెనేని గాదు శాపఫలంబు బుద్ధిహీను డై గర్వితుండయ్యెనేని శాపహవ్యవాహనఫలం బనుభవించు."

"ఉత్తమజ్ఞానవృద్ధు నా నుండెనేని, బాలుడయ్యును బూజ్యుండు బ్రాహ్మణుండు, క్షత్రియుండు బూజ్యుండు విక్రమసమృద్ధి, నుర్విపతులలో నధికుడైయుండెనేని."

"మఱియు నల్ల లేదయ్యెనేని నీకు సేదాసి నగుదు."

ఇట్లు భారతాదిగ్రంథములలో గానబడు భిన్నరూపములను అర్థభేదము ననుసరించి యాయాలకారములగా నెఱుంగునది. ఎచ్చటనైనను భేదమును పాటింపక ప్రయోగించినచో నదియును సాంకర్యమే యని గ్రహించునది.

ఇక ధాత్వర్థమును గురించి:

"భావే టవర్ణకోంతే సర్వేషాం క్రియాపదానాం స్యాత్" అని నన్నయభట్టు.

"ధాతువులకు భావార్థమందు టవర్ణక మగును." అని తక్కినవారును.

ఇచట నీ టవర్ణకము ఆగమమా, ఆదేశమా? దేనికి? ఎందుకు వచ్చినది? టవర్ణకమే యెందుచేతను? కొన్ని చోట్ల టవర్ణకము లేక కేవలధాతువులకే భావార్థము గానబడుచున్నది.

భార. ఆది. ౧ ఆశ్వా. శాప మిచ్చునాడు. ౨ ఆశ్వా. నా పేరుకొనునంతకు. ౨ ఆ. వినునేర్కన్. ౪ ఆశ్వా. వారు వచ్చునంతకు. వసుచరిత్రము 3 ఆశ్వా. దెల్పగ నేసకైవశిన్.

ఈ భావార్థకటకారము గురించి విచారింతము.

సంస్కృతములో భావార్థమందు తల్, త్వ ప్రత్యయములు విధింపబడియున్నవి. ప్రాజ్ఞతా, మూర్ఖతా, సాధుతా, ప్రాజ్ఞత్వం, మూర్ఖత్వం, సాధుత్వం ఇత్యాదులు. ఇందు "తా" లు హ్రస్వములై తత్సమరూపములగుచున్నవి.

అట్లే యీ తెలుగునందును కొన్ని నామములందును, విశేషణములందును, క్రియారూపములందును గూడ "త" గానబడుచున్నది. చిఱుత, పోరిత, ఇంపిత, కట్టాయిత, అంత, ఇంత, కొంత, ఇచ్చుత, వచ్చుత, కావుత మొదలగునవి.

ఈ క్రియారూపములందలివి మాత్రము ఆశీరర్థమందని వ్యాకరణములు చెప్పుచున్నవి. కాని భావములందును ధాతువుల కీతకారము గానబడుచున్నది. అది తొలితెలుగున నట్లే యయ్యుండును. ఆ రూపములు లోకమం దిప్పటికిని కొందఱి వాడుకలో నున్నవి. "నీవెప్పుడువస్త, ఇప్పుడేవస్త, నిన్నవస్త." ఎప్పుడువచ్చుట అని యర్థము. క్రియలలో భూతకాలమందు "వస్తివి, వస్తిని," "ఇస్తివి, ఇస్తిని." వర్తమానమందు "వస్తున్నాడు వస్తున్నాను, ఇస్తున్నావు ఇస్తున్నా

"వస్తాడు, వస్తాను, ఇస్తాడు, ఇస్తాను" అనురూపములు వాడుకలో గానబడుచునే యున్నవి. ఇట్లుండగా ఆభావార్థకతకారమునకే టకార మాదేశము చేసి సంస్కరించియుందురు.

ఈ టకారరూపములే గ్రంథములలో ప్రాయికముగా ప్రయోగించియున్నారు. సంస్కరించిన యీగ్రంథముల తెలుగు నడిమితెలుగు. ప్రాత తెలుగులో "త"కారమున్నందుకు జ్ఞాపకముగా కొన్నిరూపములు గ్రంథములందును అరుదుగా గానిపించుచున్నవి.

భార. ఉద్యో. ౨ ఆశ్వా. "చిఱుతనాడును వాడు నా శిక్షు బోడు." చిఱుతనాడు-చిన్ననాడు-బాల్యమందు.

భార. ఆది. ౫ ఆ: "సాలయక తూనిగలం గొల్కులబెట్టితి నీవు నీ చిఱుతకాలము దత్ఫలమిప్పు డనుభవింపక, తొలగునె..."

ఇచట "చిఱు" విశేషణము. దానిపైని భావార్థమందు "తల్" ప్రత్యయము. దీనికి "చిఱు" నైకృతము, విశేష్యము. చిఱుతశబ్దమునకు మీదివర్ణము లోపింపగా మిగిలినరూపము. "చిఱుగాలి" "చిఱుగూబ" అని సీతారామాచార్యులవారి నిఘంటువునందున్నది. కాని యిచ్చట చిఱు విశేషణము. చిఱుత అనునది విశేష్యమే కాని విశేషణము గాదు.

చిఱుతనాడు, చిఱుతకాలము అనునవి బాల్యమునాడు, బాల్యకాలము అని తత్పురుష.సమాసములు గాని విశేషణసమాసములు గావు.

ఇంకను భార. ఆది. ౪ ఆశ్వా. "కొండికనాడు" అని. భా. ఉ. ౨ ఆ."చేటుకాలము,""చేటుకాలమైన జెట్టమాటలు" అను మొదలగువానిలో కొండిక చేటు విశేష్యములుగాని విశేషణములు గావు. అట్లే "చిఱుత" అనునదియును విశేష్యము.

భార. ఉ. "చిఱుతవానినైన బోలడు" - అను చోట చిఱుత అనునది విశేషణముగా దోచును. అచ్చట "చిఱుతవానిని" అను దానికి "చిఱుతగలవానిని" - అని అర్థము.

భా. ఉ. ౨ ఆ. "మనవీటనెకా దయ్యార్జు ననుసరి వింటివాని" అనుచోట సమాను డను విల్లుగల వాడు-ధానుష్కు డని యర్థము. అప్పుడును విశేష్యమే కాని విశేషణముగాదు. కాగా చిఱు విశేషణము, చిన్న అర్థము. దానిపైని భావార్థక తల్ ప్రత్యయము కావల యును. సీతారామాచార్యులుగారు వైకృత మనిరి కాని దేనివైకృతమో చెప్పలేదు. ఉపపత్తియును చెప్పలేదు. కావున నిది దేశ్యము, సంకీర్ణరూపము.

"కొఱత"యు నిట్టిదే కావచ్చును. భార. ఉ. ౨ఆశ్వా. "చెలిమియు సంభావనమును, బలిమినివాడం బుద్రోపుబాడియు దనుయం, తిలవాకితోన తనునని, కుల హీనులతోడనైన నొఱగా దధిపా." ఇచట కొఱ విశేష ణము.

భా. ఉ. ౨ ఆ "ఎల్లనెంటకును కొఱంతలేక."

భార. విరా. ౪ ఆ. "కంకుడు ధర్మసు తుండు-ఇంక కొఱతపెట్టనేల..."

ఇందు విశేష్యములు. "కొఱ"పైని తకారముచేసి యుండును.

భా. ఉ. ౨ ఆ. "శాంతనవుండు సర్వకురు సంతతికింగలవాడుకాడె యాత్యంతహితంబు లీపలుకు లా హావమొప్పదు ధర్మసూతితో, బొంతము మేలు." పొందు ధాతువు-దానిపై-త. పొందుట యర్థము.

ఇట్లే 'పంతము' కావలయు. పన్ను + త.ఉ కార లోపము కాగా నైనది. దీనిపర్యాయము పన్నిదము. భా. ఆ. ౨ ఆ. "నీకు నే దాసినగుదు పన్నిదము పలుము." ఇంకను అన్ని, ఇన్ని, కొన్ని అను నామముల ఇకారము లోపించి తకారము చేర్పగా అంత, ఇంత, కొంత అగును.

భా. ఉ. ౧ ఆ. "ధరణిబరగు బొగడ్త యెం దాక." పొగడు + త - అప్పకవీయము, కళాపూర్ణో దయము, "అది శతతాళదఘ్న మను సార్థకనామము తోడ నుత్తమ, హ్రదములలో బొగడ్త గనినట్టిది." ఇవి దేశ్యములని సమర్థించినను దేశములో వాడుక కెట్లు వచ్చి నవో ఆలోచింపవలయు.

ఇట్లున్న వానిలో ధాతువులపైని తకారమునకు ట కారమును చేసియుందురు. ఇది స్త్రీసమము. చేయుట, చూచుట మొ. 'తల్' ప్రత్యయము స్త్రీప్రత్యయము కావున నిదియును స్త్రీసమముగానే యుండును. ఇదియు నొక జ్ఞాపకము. ఎచ్చటనైనను ఆనియమమును తప్పి నచో నదియును లింగసాంకర్య మని యెఱుంగవలయు.

ఇంకను సంస్కృతమందు తల్ ప్రత్యయము వలెనే 'త్వ' ప్రత్యయమున్ను భావార్థమందు గలదు. అది నపుంసకము. ప్రాజ్ఞత్వం, మూర్ఖత్వం మొ. ఇవి సం స్కృతములో నామములందే కానబడును. తెనుగులో ధాతువులకు 'ట' వలెనె డము చేసియున్నారు. చూడ డము, పావడము మొ. ఈ డము:తరూపములు లోక మందు బహుళముగానే కానబడుచున్నవి. గ్రంథము లలో నరుదుగా జ్ఞాపకములయ్యెన్నవి.

భార. ఉద్యో. ౧ ఆ. "పాండవేయుల దగ బ్రార్థించి - నామాటకు వారొడబాటు లేకయుండు దురు. కేరడములాడుచుండుదురేని" కేరు ధాతువు. డము ప్రత్యయము. కాగా కేరడములు. దీనికి తల్ ప్రతిరూపము కేరుట.

భా. ఉ. 3 ఆ. "నృపకుంజరుమాటల కడ్డ మాడరాకుంట..."అడ్డు ధాతువు, డము ప్రత్యయము. ధాతూకారమునకు లోపముకాగా "అడ్డము".

భార. ఉ. 3 ఆ. "నావుడు నవ్వటాల కని నం బవనాత్మజ యింతయేటికిం, గేవల యోధనే పరుల కిల్బిషముల్ దలపోయ కిమ్మెయిం, జావడమైన జూచి యిది చందముకాదని యంటిగాక."చవ్వు ధాతువు,డము ప్రత్యయము. చుకారమునకు వకారాదేశము-చావడము. నవ్వుతాలు అని వాడుక.

# కాంచీకుమారి

చింతా దీక్షితులు



౧

రాజు

గుర్తించారా నా ఆజ్ఞ?

మంత్రి

చిత్తం.

రాజు

ఎందుకింకా సందేహిస్తారు?

మంత్రి

తమ కన్నివిధములా భృత్యుడైన యీ మంత్రికి ఏమిన్నీ సందేహము లేదు— కాని—

రాజు

కాని?

మంత్రి

ఈ మంత్రిలో సర్వస్వతంత్రముగా సర్వదా సంచరించే బుద్ధి సంశయిస్తోంది.

రాజు

ఏమని?

మంత్రి

తమ ఆజ్ఞ కొనసాగదేమో నని నాబుద్ధి సంశయిస్తోంది మహారాజా!

రాజు

ఎప్పుడూ సరళముగా ప్రవర్తించే తమబుద్ధి కిప్పు డీ విపరీతవృత్తి ఏల కలిగెనో?

మంత్రి

స్వామిపూజాదురంధరత్వమున మెలగే బుద్ధి కెప్పుడూ సరళవృత్తే మహారాజా! విపరీతత్వము మనము కల్పించుకొన్నది.

రాజు

కాంచీపురాధినేతను గెల్చిన నేను తత్కాంచీకుమారిని శిక్షించలేనా?

మంత్రి

మహారాజులు శిక్షించుటకూ, రక్షించుటకూ సమర్థులే. కాని కాంచీకుమారిపై తమరు వేయించిన శిక్ష పారదేమోనని సందేహము.

రాజు

అందు కాటంకము కలుగజేసే ప్రబలశత్రు వెవ్వడైనా ఉన్నాడా?

మంత్రి

మానవరూపముతో లేదు.

రాజు

సమ్మార్జకోలకే రాజ్యములో లోటువచ్చిందా?

మంత్రి

మాటమాత్రమున వేలకొలది తమ ఆజ్ఞశిరసా వహిస్తారు.

రాజు

ఇక వివాహము చేయించడమునకు పురోహితులు కరవా?

మంత్రి

అట్టికర వీరాజ్యమున లేదు మహారాజా!

రాజు

అయితే కాంచీకుమారిని సమ్మార్జకున కిచ్చి వివాహము చేయించండి.

మంత్రి

మహారాజా! ఒక్కమనవి.

రాజు

ఏమది?

మంత్రి

తమరు పగ సాధించదలచుకొంటె కాంచీపురాధీశునిమీద.

రాజు

అవును.

మంత్రి

ఆవిధముగా పగ సాధించారుకూడాను.

రాజు

అవును.

మంత్రి

కాంచీకుమారిని తాము వలచి వివాహమాడ తలపెట్టారు.

రాజు

ఆమాట నిజమే.

మంత్రి

కాంచీపురరాజు ఆమాట విని చులకనగా మాట్లాడాడు.

రాజు

అవును.

మంత్రి

నే నుచ్చరించుటకు సహితము జంకే, అన రానిమాట అన్నాడు.

రాజు

ఆతనిమాటే ఆతనికి అప్పజెప్పవలెను గదా! అందుకనే మేము వేయించిన ఆజ్ఞ—సమ్మార్జకున కిచ్చి ఆమెను పెండ్లిచేయవలె నని—

మంత్రి

మదోన్మత్తులకు ఉచితానుచితజ్ఞత ఉండదు గదా!

రాజు

అందుకనే ఆతని గర్వ మణచుటకు యుద్ధములో ఓడించితిని.

మంత్రి

ఆతప్పు కాశిక్ష సరిపోలేదా మహారాజా!

రాజు

చాలదు.

మంత్రి

ఆతని కుమార్తెను, కాంచీకుమారిని, సమ్మార్జకున కిచ్చి పెళ్లిచేయడము—ఎవరికి శిక్షగా మీరు భావిస్తారు?

రాజు

రాజునకు శిక్ష కాదా!

మంత్రి

అంతకన్న కాంచీకుమారికి కాదా స్వామీ!

రాజు

నల్లుల మంచమునకు కఱ్ఱదెబ్బలు తప్పవు గదా!

మంత్రి

నేర మొకచోటా, దండన వేరొకచోటానా న్యాయమూర్తీ.

రాజు

ధర్మసూక్ష్మ మెరిగిన మంత్రిపుంగవులకు నేను వేరే చెప్పవలసిన పనియేమి?

మంత్రి

స్వామివారి ఆజ్ఞ అయితే ఈ సేవకు డొక మనవి — ధర్మసూక్ష్మము — చెప్పకోబోతున్నాడు.

రాజు

కానియ్యండి.

మంత్రి

తాము విధించిన శిక్ష తప్పుచేసిన కాంచీపురాధీశు డనుభవింపదగిన దే.

రాజు

అవును.

మంత్రి

తప్పుచెయ్యని కాంచీకుమారి ఆజన్మమూ ఆశిక్ష అనుభవింపవలసిఉంటుంది.

రాజు

విచారించవలసిన విషయమే కాని — అది తప్పనిసరి.

మంత్రి

అంతకన్న విచారకరమైన సంగతి మనవి జేసుకోబోతున్నాను.

రాజు

ఏమది?

మంత్రి

శిక్షను విధించే తామే ఆశిక్షకు భాగస్వాములు కాబోతున్నారు.

రాజు

నాకు నేను శిక్ష విధించుకొంటున్నానని నా మీ అభిప్రాయం?

మంత్రి

చిత్తం.

రాజు

అదెట్లు?

మంత్రి

వివరముగా మనవి చేసుకొంటాను. సావధానముగా ఆలించవలెను ప్రభువులు.

రాజు

సావధానులమే.

మంత్రి

తాము కాంచీకుమారిని ప్రేమించి వివాహమాడ నిశ్చయించారు.

రాజు

అవును.

మంత్రి

కాంచీకుమారి తమ్ము ప్రేమించి వివాహమాడ నిశ్చయించినది.

రాజు

కావచ్చు.

మంత్రి

శుద్ధసంకల్పుల సంకల్పములకు విపరీతఫలము లుండవుగాదా !

రాజు

ఆమాట యిప్వ డెందుకు ?

మంత్రి

తమరు తలపెట్టిన వివాహసంకల్పమున కిట్టి విపరీతఫలము రానున్నదని నేను ఆశ్చర్య పడుతున్నాను.

రాజు

ఏమి చేయగలను ?

మంత్రి

ఆమెపై లగ్నమైన మీహృదయమును మీరు చంపుకోవడమే కాకుండా మీపై లగ్నమై యున్న ఆమెహృదయమునుకూడా మీరు చంపడము లేదా !

రాజు

ఏమి చేయగలను ?

మంత్రి

ఎక్కడ తాండవ మాడునని ఊహించా రామెపాదములు— మీ రామెను మోహించి నప్పుడు — ... ఈ రాజసౌధములోనా — పాడు పూరిగుడిసెలోనా?

ఎవరియాశల నూరించునని ఊహించా రామె చూపులు—మీఆశలా, ప్రాకృతజనులవా ?

ఎవరిని ఎల్ల వేళలా ముంచెత్తునని యూహించా రామెలా వణ్యము— [illegible]

ఎట్టి శుద్ధసంకల్పము మీది ? దాని కిట్టి విపరీతఫలము వప్పుకొంటారా మహారాజా !

తొలినాటి మీ సుసంకల్పములను చంపు కొన్న పాపము మిమ్ము చుట్టుకోదా ?

ఆమెహృదయసంకల్పముల కురిబోసే శిక్ష విధించిన పాపము మిమ్ము చుట్టుకోదా ?

ఫలోన్ముఖముకాని మీసంకల్పమువల్ల పుట్టే దుఃఖము — నిరంతర చింతనవల్ల కలిగే దుఃఖము — ఆజన్మదుఃఖము మీ రనుభవించబోవడము లేదా ?

ఎవరి కీశిక్ష ? — ఆమె ఒక్కతెకేనా ?

ఎవరువేశా రీశిక్ష — మీరా ?

కాదు మహారాజా కాదు. ఈశిక్ష మీరు.

అందరికన్న అధికముగా మీ రనుభవించ వలసిన శిక్ష ! ఈ శిక్ష మీరు వేసినదికాదు. కాంచీపురాధీశుడే మీపైవేశాడీశిక్ష. ఇంత కన్న కఠినశిక్ష యితరులు మీపై విధించ గలరా, ప్రభూ !

మీరు గెలవలేదు, రాజా, కాంచీపురాధీశ్వరుని; అతడే గెలిచాడు మిమ్ము.

రాజు

ఏమిటీ ?

౨

రాజు

వేటకాని బాణమునకు లక్ష్యమైన హరిణము [illegible] పాదమునకు దిగుతున్నదా ?

కాంచీకుమారి

మీరు ప్రేమించి పెంచుకో దలచుకొన్న మృగమునే తీవ్రబాణముల కాహుతి చేసే కఠిన హృదయులు కారని ఈ దీనురాలి ఆశ.

రాజు

కఠినహృదయము రాజలక్షణములలో నొక్కటి కాదా, శత్రుకుమారీ!

కాంచీకుమారి

అబలలపట్లకాదు, దయామయా!

రాజు

పురుషులతో—నీతండ్రికి శత్రువైనవానితో వాదించే సాహసము నీ కెక్కడినుండి వచ్చింది—అబలా!

కాంచీకుమారి

తమ సన్నిధానమున అవనతముఖినై నిల్చో వలసిన లజ్జావతిని నేను మీకు నా కష్టసుఖములు నచ్చజెప్పే స్థితికి వచ్చానని క్రుంగిపోతున్నాను, రాజా.

రాజు

కారణము?

కాంచీకుమారి

తమరే!

రాజు

నీ తండ్రికాడో?

కాంచీకుమారి

బ్రహ్మవ్రాతను మించిన మహోత్కృష్ట దశ నా తండ్రి నాకంటగట్టదలిచాడు. అది నా తండ్రినేరముకాదు. ఆతనికి నాపై వాత్సల్యము చేసిన నేరము.

రాజు

నేను సమ్మార్జకుడనటగా! నీకు నేను తగనటగా! అందువల్లనే నీవు సమ్మార్జకునకే తగుదువని నీతండ్రికి నేను ఋజువు చేయ దలిచాను.

కాంచీకుమారి

నాతండ్రిదృష్టిలో మీ రెట్టివారైనా నా దృష్టిలో మీరు దైవసములు.

రాజు

ధన్యుడనే.

కాంచీకుమారి

నాకు మీరు తగుదురో లేదో నిర్ణయించేది నాహృదయము—మాతండ్రి వాత్సల్యము కాదు.

రాజు

ధన్యుడనే.

కాంచీకుమారి

నేను సమ్మార్జకునకే తగుదునని నాతండ్రికి ఋజువుచేయ దలిచారా?

ఆపక్షమున మీరుసమ్మార్జకులే కావలె. మీకు నేను జాయను కావలె.

రాజు

ఏమీ?

కాంచీకుమారి

అట్లుకానిపక్షమున —. ముఖముపై కోపించి కళ్ల నూడబెరుకుకొనే అవివేకులు మీ రవుతారని నే నెన్నటికీ నమ్మను.

రాజు

ఇం దవివేక మెక్కడ నున్నది ?

కాంచీకుమారి

నన్ను ప్రేమించి నా హృదయమును తమ జీవితములో లంగరువెయ్యదలచిన తమరు మీ అమూల్య ప్రేమ నేమిచేసుకొంటున్నారు? ఆత్మహత్య దోషమని కాదా పెద్దలమాట! దేహమును చంపుకోవడంకన్న ప్రేమను చంపుకోవడము ఎక్కువదోషము కాదా?

రాజు

నా హృదయములో అంకురించే ప్రేమబీజాలను నేను పోషించడం మానివేశాను. అందు దోషము లేదు.

కాంచీకుమారి

ఆబీజములు హృదయక్షేత్రములో మొట్టమొదట ఎందుకు చల్లుకొన్నారో?

తమ ప్రేమవారాశిలో ఈదులాడవలసిన నా హృదయం తమ కోపపర్వతానికి తగుల్కొని ముక్కలైపోతూఉంటే చూస్తూ ఊరుకొంటారా రాజా !

రాజు

ఎవరి అదృష్టము వారిది.

కాంచీకుమారి

నన్నేల మీరు ప్రేమించవలెను మొదట? నామనస్సులో ఆశ లేల రేకెత్తించవలెను మీరు? ప్రేమ నేల ప్రజ్వలింపజేయవలెను? చిన్నపువ్వుల నవ్వులతో నవ్వే నాహృదయాన్ని మీ రాకర్షించి మీపై లగ్నము చేసుకోవడ మేల? లోకముజాడలు గుర్తెరుగని పసిదానను నన్ను నా అమాయకపు లోకమునుండి బయటికిలాగి ఈ తుపానులోనికి ఎందుకు దింపారు ?

ఇది మీ వివేకలక్షణమా? నా దురదృష్టఫలమా ?

అబలల హృదయములు వజ్రసన్నిభములనా తమ ఊహ ?

ఈనాభగ్నహృదయము-తొలిసారి మీకర్పించిన లేతహృదయము — ఇతరుల వశము చేస్తానా, జీవితేశ్వరా! అట్లా చేస్తే ఈ ఘటము నిలుస్తుందా ?

రాజు

నామాట కెప్పుడును తిరుగు లేదే మరి?

కాంచీకుమారి

సత్యసంధులవాక్కులు వృథా కావు జగదీశ్వరా.

మీవాక్యములు వృథా కావు.

కామాక్షీవరపుత్రిక, అమాయిక లేత కోర్కులు వృథాపోతవా ?

నాకోర్కులు వృథాపోతవా?

నేను సమ్మార్జకుని భార్యనే కావలెను. మీపాదసేవకే నాజీవితమంతా వినియోగపడి తీరవలెను.

రాజు

మంత్రీశ్వరా !

మంత్రి

చిత్తం మహారాజా !

రాజు

నేను సమ్మార్జకుణ్ణే, మంత్రీ !

మంత్రి

అదెట్లు రాజా?

రాజు

నా ఖడ్గముతో నలుముఖములా శత్రుసేనలను తుడిచివేస్తినిగదా.

మంత్రి

ఖడ్గము సమ్మార్జనికాదు రాజా !

రాజు

నా అనునయవాక్యములతో, ప్రేమతో, కాంచీకుమారిదుఃఖమును తుడిచివేస్తున్నాను మంత్రీ !

మంత్రి

అనునయవాక్యము సమ్మార్జని అవుతుందా రాజా ! ప్రేమా కాదుగదా !

రాజు

అయితే నేను సమ్మార్జకుణ్ణి కానంటారా !

మంత్రి

కారనే నా ఊహ మహారాజా !

రాజు

మరి ఏమిటి ఉపాయం?

మంత్రి

సమ్మార్జని పట్టినవాడే సమ్మార్జకుడు. మీరు కోపముతో ఆపదము వాడినప్పుడు మీకు హృద్గతమై ఉన్న అర్థ ముశేకదా ! కన ఉపా-

యము మాటకా — మాతృశ్రీ కాంచీకుమారినే అడగండి — ఆమె వివేకవతి.

రాజు

ఏమంటావు దేవీ !

కాంచీకుమారి

కామాక్షీపదభక్తుడు నాతండ్రి మిమ్ము సమ్మార్జకు డన్నాడు. ఆయనమాట చెల్లవద్దా ? మీరు సమ్మార్జకులైతే మీ భార్యను నేనూ సమ్మార్జని పట్టవలెను.

రాజు

వివేకవతివే.

కాంచీకుమారి

కాబట్టి, జీవితేశ్వరా

స్వర్ణదండమండితమా
సమ్మార్జని నేబట్టెద
స్వర్ణదండమండితమా
సమ్మార్జని మీరున్నూ
పట్టుడు, మన మిరువురమును
ప్రాణేశ్వర ! కామాక్షీ
సన్నిధాన వర్తుల మయి
శాంకరి వశవర్తుల మయి
కామాక్షీ దృఙ్మాలలు
కప్ప మనల నొకటిజేసి
కామాక్షీప్రాసాదము
కలధౌతముభాతి వెలుగ
కలిసి చిమ్ముదా మండీ.

రాజు, కాంచీకుమారి

కలిపికొంటిమమ్మ హృదుల
కామాక్షీ యిరువురమును

మామనములనుండి కోప
మంతరింపజేయవమ్మ
మామనములలోని ఈర్ష్య
మటుమాయము చేయవమ్మ
నీందనమె మామెడదలు
నిర్మలమ్ము జేసుకొమ్మ;
కరకంకణ నిక్వణములు
కల్యాణపు పాటలుగా
ధరణీశ్వరు కఠినభుజా
దండము జయస్తంభముగా
పాణిగ్రహణోత్సవమై
భవము లిట్లు చెలగ తల్లి
నాలుగు చేతులు కలుపుకు
సమ్మార్జకు లిద్దరమును
ఒకటేహృదయముతోడుత
కలయుచిమ్ముచుంటిమమ్మ
కామాక్షీ నీ సదనము
కరుణజూడవమ్మ తల్లి
కామాక్షీ, కామాక్షీ.

(ప్రతిభలో పడ్డ, శ్రీ శివశంకరశాస్త్రిగారు వ్రాసిన, ప్రభువాక్యమనే గీతికలోని కథయే ఈ నాటికలోని కథ.)

---



బ్రహ్మశిఖరమునసున్న శ్రీ త్రికోటీశ్వరాలయము

# కోటప్పకొండ

అంగర వెంకట లక్ష్మీనారాయణరావు

గుంటూరు మండలమునందలి నరసారావుపేటకు ఆరుమయిళ్లదూరమున త్రికూటాద్రియనుకొండ ఒకటి యున్నది. ఇది యొకపుణ్యక్షేత్రము. దీనిపయి నెలకొని యున్న దేవునకు త్రికోటీ (కూటే)శ్వరుడని పేరు. ఈ క్షేత్రమునకు కోటప్పకొండయనియు, త్రికోటీశ్వరునకు కోటప్పయనియును వ్యవహారనామములు. దక్షిణహిందూదేశమందలి శైవక్షేత్రములలో నిది శ్రీశైలమంత ప్రశస్తిగలది. ఇచ్చట ఏటేట శివరాత్రిసమయమున మహోత్సవము జరుగుచుండును. ఆ యుత్సవమునకు లక్షల కొలదియాత్రికులు చేరుదురు. శ్రీశైలమునకుపోవు నాప్రాంతములవారెల్లరు నిక్కడకువచ్చి యీదేవుని సేవించి పోవుచుందురు.

చిరకాలమునుండియు నీక్షేత్రము ప్రసిద్ధిగలదని చెప్పుదురు. ఈ పర్వతముచుట్టుకొలత అడుగుతక్కువ ఆమడ యనియందురు; కాని వాస్తవముగ మూడు క్రోసులుమాత్రమే. దీనిఎత్తు ఇంచుమించు ౧౬౦౦ అడుగు లుండును. యాత్రికులు సేవించు (కొత్త) కోటప్పగుడి ౬౦౦ అడుగులయెత్తున నున్నది. ఇంకను ఎత్తున 'పాత కోటప్పగుడి' యున్నది. ఇచటికియాత్రికులంతగాపోరు. అచట దొరతనమువారి క్షేత్రగణితభవన (G. T. Survey station) మున్నది. ఈ త్రికూటపర్వతము ఫారెస్టు రిజర్వులో నున్నది. ఇచ్చటిఅడవులలో వంటచెరుకు, పచ్చిక, ఓషధులు మొదలయినవి లభించును. కొన్ని మాతుకమార్గము లిచ్చట నున్నవి. చోరభయము వెనుక



త్రికూటాద్రియొక్క మూడుశిఖరములు: కొండక్రింద ఆర్యవైశ్య ధర్మసత్రము

నుండెడిది. ఇచట నీటిదొనలు, చీకటిగుహలు అనేకము లున్నవి. ఈపర్వతమునకు మూడుశిఖరము లున్నవి. కావుననే దీనికి త్రికూటాద్రి అనుపేరు వచ్చినది. అందు చేత నిచట వెలసినదేవునకు త్రికోటీ (కూటే) శ్వరుడను పేరు వచ్చినది.

ఈ క్షేత్రమునుగూర్చిన గాథలు స్థలపురాణాదులం దీక్రిందివిధమున గలవు:

శివుడు, దక్షయజ్ఞధ్వంసానంతరము శాంతుడై దక్షిణామూర్తిరూపమున నవతరించెను. పండ్రెండేండ్ల బాల్యమున సకలవిద్యలనునేర్చి బ్రహ్మచర్య వ్రతనిష్ఠాగరిష్ఠుడయి, కైలాసముపయి సప్తమావరణమున సమాధి యందుండెను.

అపుడు బ్రహ్మవిష్ణువులు, దేవమునిబృందములతో నాదక్షిణామూర్తియొద్దకుపోయి తనకు బ్రహ్మోపదేశ ముచేయ ప్రార్థించిరి. అంతట శివుడు ఈ త్రికూటాద్రిమధ్యశిఖరమున బిల్వవనాంతరమున వెలసి వారలకెల్లరకు బ్రహ్మోపదేశము చేసెను. ఈచోటనున్న గుడికే పాతకోటప్పగుడి అని వ్యవహారము. అక్కడికెక్కిపోవుటకు కాలిబాట కలదు; సోపానములు లేవు. ఎక్కుడు చాలకష్టము. కావుననే యాత్రికులలో నధికసంఖ్యాకులు అక్కడికి పోరు. ఇచట గుడి రాళ్లుపేర్చి కట్టబడియున్నది. లోపలిలింగము ఒక అడుగు ఎత్తు కలది. ఈ గుడియున్నశిఖరము రుద్రశిఖర మనబడుచున్నది.

ఈ రుద్రశిఖరముప్రక్కది విష్ణుశిఖరము. దక్షయజ్ఞమున హవిర్భాగములను స్వీకరించినపాపము పోవుటకై విష్ణు వీశిఖరమున రుద్రునిగూర్చి తపముచేసెను. రుద్రుడు ప్రత్యక్షుమై త్రిశూలముతో నేలమీద పొడిచెను. ఆరంధ్రములనుండి వెంటనే జలము పైకి పొంగి

ప్రవహించెను. ఆజలమున స్నానముచేసి తన్ను ప్రార్థించిన పాపముపోవునని రుద్రుడు చెప్పెను. విష్ణువట్లు చేసి పాపవిముక్తుడయ్యెను. అందువలన నీశిఖరము విష్ణుశిఖరమనియు, ఇచ్చట ప్రత్యక్షమయిన ఈశ్వరుడు పాపవినాశనేశ్వరుడనియు ప్రసిద్ధి. ఈ శిఖరమునకు 'గద్దలచోడు' అనియు పేరు. యాత్రికులు తొలుత ఈ శిఖరముసెక్కి ఇచటి తీర్థమున స్నానమాడి, పాపవినాశనేశ్వరుని సేవించి తరువాత కొత్తకోటప్పను సేవింపబోదురు.

రుద్రశిఖరమునకు నైరృతిదిశయందు కొంత క్రిందుగ నున్న శిఖరమునకు బ్రహ్మశిఖరమని పేరు. రుద్రవిష్ణుశిఖరములపయి స్వయంభువులగు జ్యోతిర్లింగములు వెలసియుండుటయు, ఈ శిఖరముపయి నేమియు లేకపోవుటయు కని, చింతిల్లి, బ్రహ్మ శివునిగూర్చి తపముచేసెను. దానికి మెచ్చుకొని శివుడు లింగరూపమున నిక్కడ నావిర్భవించెను. అందువలన దీనికి బ్రహ్మశిఖరమను పేరు. ఇచటికి తూర్పునగల చిన్నపల్లె 'మునిమంద' 'ఎల్లమంద' అను పేరులు గలది. తొల్లి బ్రహ్మాదిదేవతలు, సకల మునిగణములు శివు నచట పరివేష్టించియుండిరట. కావుననే దీని కాపేరులు వచ్చినవని యందురు. ఈ శిఖరముననున్న లింగమునకే 'కొత్త కోటప్ప' అను వ్యవహారము. ఈ దేవునకే శివరాత్రినాడు అతి వైభవముతో తిరునాళ్లు జరుగునది. ఉత్సవసమయమున జనసమ్మర్ద మత్యధికము. దేవదర్శనము కష్టసాధ్యము.

ఈ కొత్తకోటప్పనుగూర్చి మరియొకగాథ యిట్లు కలదు. ఇక్కడికిసమీపమున దక్షిణముగా 'కొండకావూరు' అనుపల్లె ఉన్నది. ఆయూర నందుడనుగొల్ల డుండెను. వానియాలు కుందరి. వారికూతురు ఆనందవల్లి. ఆకూతురు పుట్టినది





౧. రుద్రశిఖరమునందు పాతకోటప్పగుడి

౨. ఆనందవల్లిగుడి


కోటప్పకొండ ప్రభ

మొదలు వారి కదృష్టము కలిసివచ్చెను. ఆనందవల్లికి చిన్నతనముననే శివునియెడ భక్తి కుదిరినది. ఆటపాటల యందును శివుడే లక్ష్యము. ఆ బాలిక ఇతరాలంకారములను వీడి విభూతిని, రుద్రాక్షలను ధరించుచుండెడిది. నిత్యమును త్రికోటీశ్వరుని కొండయెక్కి కోటీశ్వరుని పూజించి వచ్చుచుండెడిది. తల్లిదండ్రు లామెను వారింపజాలకయిరి.

ఒక మహాశివరాత్రి పర్వమున ఆనందవల్లి ఓంకారనదిలో స్నానముచేసి రుద్రశిఖరమునకు చని యీశ్వరు నర్చించుచుండెను. అపు డచటనున్న బిల్వవనమున తపోనిష్ఠనున్న యొక్క దివ్యపురుషు డామెకు ప్రత్యక్షమయ్యెను. అంత నామె పాపవినాశన తీర్థమున స్నానముచేసి అందలి యుదకమును గొనితెచ్చి యాతని కభిషేకించి, పాలారగింపనొసగి, పీతశేషమును తాను త్రాగినది. నాటినుండి యానందవల్లి యను దినము నట్లే చేయుచుండెను. వేసవియందొకనా డామె పాపవినాశనతీర్థమునుండి యుదకమును తెచ్చి కుండను క్రిందుంచి మహాపురుషునిరాకకయి వేచియుండెను. అపు డొకకాకి యాకుండపయి వ్రాలెను. దాన కుండ యొరగి నీరంతయు నేలకి పోయెను. అపు డామె కినిసి, కాకులచ్చటికెన్నడును రాకుండ శపించెనట. ఇప్పటు నచ్చటికి కాకులు రాకుటయే యిందుకు నిదర్శనము.

ఆ దివ్యపురుషుడు జంగమరూపియగు నీశ్వరుడే. అత డానందవల్లి నీసుగో[?]వ్రతము నుండి మాన్ప సమకట్టి. యామె నచట నొంటిమెయి నుండక యింటికిబోయి సుఖింపుమనెను. ఆమె యీశ్వరార్చనను మించిన సుఖము లేదని యనమాటను నిరాకరించెను. తరువాత కొన్నాళ్లకా మెకు బ్రహ్మోపదేశముచేసి ఇక నింటికిపోయి సుఖింపుమని ఆయన బోధించెను. అప్పటికి నామె యామహాత్ముని సాన్నిధ్యము విడువనొల్లదయ్యెను.

ఉపాయాంతరము కానక యాతడు బ్రహ్మచారిణియగు నామెకు తన మహిమచే గర్భమును కలిగించెను. అప్పటికిని, నానాటికి గర్భభార మధికమగుచున్నను, ఆమె యాతని సపర్యలు మానకుండెను. ఆమె భక్తిశ్రద్ధల కాతడెంకయు నచ్చెరువొంది "నీవు నాకయి శ్రమపడవలదు. నేనే నీయింటికి వచ్చెదను. నీవు నీవ్రతమును నెరవేర్చుకొనుచుండ వచ్చును. నీవు ముందుగ చనుము. నీ వెంబడి నేను వచ్చెదను. నీవు నడచుచు వెనుకకు చూడజనదు. ఇది ఆన. దీనిని మీరి వెనుకకు చూచితివేని, అప్పుడు నే నున్నచోటనే యాగిపోయెదను" అని చెప్పెను. అందు కానందవల్లి యంగీకరిం



భూమిలోపల బావిలోకట్టిన నీలకంఠేశ్వరాలయము. లోపలకు దిగిపోవుద్వారము

చెను, వారిరువురు పయనము ముందు వెనుకల నడచుచుండిరి. కొంత సేపు నడచునప్పటి కామె కొక భయంకరధ్వని వినవచ్చెను. దాని కామె జడిసి వెనుకకు చూచెను. మహాపురుషు డచ్చట నిలువబడెను. 'నీవు నాయాన మీరితివి. ఇక నేను ముందుకుసాగించను. ఇచ్చటనె యుండిపోవుదును' అనెను. అంత, నచట నొక బిలమున సమాధినిష్ఠ నుండిపోయెను. ఆ బిలముమీదనే కొత్తకోటప్పగుడి వెలసినదని ప్రతీతి. అప్పుడే ఆనందవల్లి కుమారుని ప్రసవించెను. జరిగినదానికి వగచి, ఆమె, యోగముద్రనుండి మరల కనులు దెరచుసంతలో నా శిశువు మాయమయ్యెను. అందుల కామె యాశ్చర్యమునొంది, ఆతడు తన్ను పరీక్షింప నట్లు మాయపన్నెననియు, ఆతడే సాక్షాత్త్రికోటేశ్వరుడనియు నిశ్చయించి యచటనే సమాధినుండి శివసాయుజ్యము [illegible]

గుడికి కొంచెము దిగువ నీయానందవల్లి దేవాలయమున్నది తొలుత నామెను దర్శించి యాత్రికులు తరువాత కోటప్పను సేవింపబోదురు.

ఆనందవల్లి కాలమువాడగు సాలంకయ్య అను శివభక్తు డొకడు ఈ కొత్త కోటప్పగుడిని, ఆనందవల్లి దేవాలయమును కట్టించెనట. తరువాత కోటప్పకు కల్యాణాదిమహోత్సవములు చేయదలచి సాలంకయ్య కొత్త కోటప్పగుడికి పడమరగా పార్వతికి దేవళము కట్టింప సమకట్టెను. "బ్రహ్మచర్యదీక్ష నుండు దక్షిణామూర్తి నెలకొనిన క్షేత్ర మిది. ఇందు వివాహాది కార్యములను చేయ వలనుపడదు" అని అశరీరవాక్కొకటి వానికి విన [illegible] నంతతో విరమించెను.



శివరాత్రినాడు ఇక్కడికేతెంచు యాత్రికబృందము యొక్క ఒకదృశ్యము

ఈకొండమీద అమ్మవారి దేవాలయముకాని, కళ్యాణాద్యుత్సవములుగాని లేవు.*

మహాశివరాత్రినాడు భక్తులు వెదుళ్లతో నెత్తుగా కట్టిన చట్టములను బండ్లపై కొనివత్తురు. ఈ చట్టములకు ప్రభలనిపేరు. అవి యిటునటు వ్రాలకుండ త్రాళ్లతో ననేకులు లాగిపట్టుకొందురు. కొండకడకువచ్చి మేళ తాళములతో బజారులవెంట నూరేగుదురు. ఇట్టివి ఏటేట వేలకొలది వచ్చుచుండును.

కొండక్రింద మఱికొన్ని దేవాలయము లున్నవి. కొత్తకోటప్ప గుడికి పోవుత్రోవయందు బొచ్చు మల్లయ్య అను మల్లికార్జునునిగుడి ఉన్నది. మ్రొక్కు బళ్లు గలవారు ఇక్కడ తలనీలాలు అర్పింతురు. ఈ కారణము ననే బొచ్చుమల్లయ్య అను (బొచ్చుకోటయ్య అనియు) పేరు వచ్చినది.

దీనికి వెనుకవైపున, నూరుగజములదూరమున ప్రసన్నకోటీశ్వరాలయ మున్నది. దీనికి నాలుగువైపుల ద్వారములున్నవి. దీని గుడిపల్లి అయ్యంభొట్లు కట్టించి ఇందు ౧౯౨౮-వ సంవత్సరమున ప్రసన్నకోటీశ్వర దేవుని ప్రతిష్ఠచేసెనట. చతుర్వర్ణములవారును గర్భగృహమున ప్రవేశించి, ఈ దేవుని పూజింపవచ్చును. ఈదేవాలయము నెదుట భువనేశ్వరిఆలయమును, ప్రక్కను, భూగర్భమున నీలకంఠేశ్వరాలయమును కూడ కట్టించెనట. నీలకంఠాలయమున నంతట, ఎప్పుడో తప్ప ఎల్లపుడును, లింగమునకుమీద మూరెడెత్తునకు జలముండును.

కోటప్పకొండవద్ద బ్రాహ్మణాదిజాతులకు భోజనము లభించుసత్రములు కొన్నియున్నవి. ఉత్సవసమయమున బ్రహ్మశిఖరమందు వేలకొలది బ్రాహ్మణ్యమునకు భోజనము పెట్టబడుచుండును. దానికితగిన ఏర్పాటుకలదు.

*నరసారావుపేట వాస్తవ్యులు శ్రీ మద్దులపల్లి గురుబ్రహ్మశర్మగారు 'త్రికోటీశ్వర చరిత్ర' యనుగ్రంథము రచియించిరి. ఇది యముద్రితము. ఇందలి స్థలపురాణగాథలకు మూలాధారములగు ననేకవిషయములు పురాణములు, ఇచటనున్న శాసనములు, వాడుకలోనున్న కథలు-ఇవి సమన్వయింపబడినవి. శర్మగారు కొండవీటిసామ్రాజ్యము మొదలగు చరిత్రగ్రంథములను రచించినవారు.

# గుడిపాటి వెంకటచలంగారి రచనలు

కొడవటిగంటి కుటుంబరావు



ఏ ఇతర తెనుగురచయితకూ లేని ప్రత్యేకత గుడిపాటి వెంకటచలంగారిలో ఒకటి కనిపిస్తుంది. ఆయన రచనలనుగురించి రెండే అభిప్రాయాలు—అంత ఉత్తమ రచన లేదనీ, అంత రోతహ్యమైనరచన లేదనీ. "బాగానే ఉంది", "షుమారుగా ఉంది", "ఓమాదిరిగా ఉంది," "ఉంది—!" అన్న ముక్కలు ఆయనరచనగురించి వినబడవు. కాని నిజం ఆలోచిస్తే ఇతరులరచనలవలెనే ఆయనరచనకూడా గుణదోషపూరితమయినదే. కాగా, జరుగుతున్న దేమిటంటే, ఈ రచనయందలి గుణాలు గ్రహించగలిగినవారు దోషాలను సహించగలుగుతున్నారు. అటువంటివారికి ఆయనరచనఅంటే ప్రీతి. అందులో తప్పేమీ లేదు. ఇక ఆయన్ను దూషిస్తున్నవారు? వీరు ఆయనదోషాలను ఎట్లాగూ సహించలేనివారుగా ఉండటంవల్ల గుణాలను గ్రహించలేకుండా ఉన్నారా? అట్లా జరగటంలేదు. వెంకటచలంగారి రచన సహించలేనివారు ఆరచనయందు లేనిదోషాలు దానికి ఆరోపిస్తున్నారు. ఇది అన్యాయం.

"సాధనాలూ" "సాధ్యాలూ" మొదలైన పెద్ద పెద్దమాటలజోలికి పోకుండా గుడిపాటి వెంకటచలంగారి రచననుగురించి సంసారపక్షంగా కొంత చర్చించదలచుకున్నాను. ఆయనను మెచ్చుకోవటంగాని, ఖండించటంగాని ఇక్కడ నాపని కాదు.

ఏరచనకైనా ఆధారభూతాలైనవి (1) రచించటానికి ఉద్రేకమూ (దీన్ని Inspiration అంటారు—గొప్పగా ఉండటానికి), (2) రచయితయొక్క ఆశయమూ (3) రచనావిధానమూ (లేక శిల్పమూ) ఈ మూడూ కూడితేనేగాని రచన కలగదు. రచయితయందు ఈ మూడూ ఏ స్వరూపంలో ఉన్నాయో తెలుసుకునిగాని రచయితయొక్క గుణాగుణాలు నిర్ణయించరాదు. రచయితను అర్థంచేసుకోకుండా విమర్శించరాదు. ఎవరైనా చిన్నతనంకొద్దీ విమర్శిస్తే దాన్ని అచ్చువెయ్యరాదు. ఎవరైనా చిన్నతనంచేత అచ్చువేసినా ఆ విమర్శనకు ఎటువంటి విలువా ఉండదు.

ముఖ్యంగా వెంకటచలంగారి రచనకు ఆపాదించబడుతున్న దోషమేమంటే ఆయనరచననిండా బూతులుంటవని. ఆ కారణంచేతనే భాగవతమూ, భారతమూ, వసుచరిత్రా, మనుచరిత్రా మొదలైనకావ్యాలూ, తారాశశాంకవిజయమూ, విజయవిలాసమూ, బిల్హణీయమూ మొదలైన ప్రబంధాలూ, శ్రీకృష్ణలీలాతరంగిణీ, కృష్ణకర్ణామృతమూ మొదలైన గ్రంథాలూ తోసివెయ్యవచ్చును గదా అని ఎవరో అంటే, ఆ గ్రంథాలలో ఉన్న భావ చప్పన అర్థంకాదు గనుక తప్పులేదనటానికి సాహసించిన మేధావులూ, ఆ ముక్కను అచ్చువేసిన ధీమంతులూకూడా ఉన్నారు!

వెంకటచలంగారి రచనకు ఆపాదించిన మరొక దోషమేమిటంటే ఆయనకథలలోని పాత్రలు నీతిబాహ్యంగా ప్రవర్తిస్తవని. అందుచేత రచన యావత్తూ నీతిబాహ్యంగా ఉన్నదని! వాల్మీకి రావణుడనేవాణ్ణిగురించి రాయటమూ, వ్యాసుడు కీచకుణ్ణిగురించి రాయటమూ ఈలెక్కప్రకారం తప్పయిపోవాలి. అయితే వాల్మీకీ, వ్యాసుడూ ఆయాపాత్రలను దుష్టపాత్రలకింద నిరూపించినట్టు వెంకటచలంగారు నిరూపిస్తున్నారా అని అడగవచ్చును. అట్లా నిరూపించనిచోట ఆనిరూపించకపోవటానికి రెండుకారణాలున్నై. ఒకటి—వాల్మీకీ, వ్యాసుడూ నీతిగా భావించినదానికీ వెంకటచలంగారు నీతిగా భావించేదానికీ కొంతం భేదం ఉంది.

రెండు—వెనకటి రచయితలు తమ అభిప్రాయాలను కూడా రచనలో ప్రవేశపెడుతూ తమ పాత్రలననుసరించి వ్యాఖ్యానం చేస్తూఉండటం జరుగుతూ ఉండేది. ఇప్పటి రచనావిధానానికి అది సరిపోదు. నీతి, న్యాయ, ధర్మ సిద్ధాంతాలు చెయ్యటం సాహిత్య కళయొక్క ఉద్దేశం కాదు. అవి తెలుసుకోటానికి నీతిశాస్త్రమూ, న్యాయ శాస్త్రమూ, ధర్మశాస్త్రమూ ఉన్నై. అందుచేతనే భారతమూ భాగవతమూ ఇంకా జీవించిఉన్నై. భారతం విన్నంత మాత్రాన మనతల్లులు కుంతీదేవిలాగు ప్రవర్తిస్తారనే భయం మనకు లేదు. కాని వెంకటచలంగారి కథలు చదివి మనభార్యలు "చుక్కమ్మ" మాదిరిగా ప్రవర్తిస్తారని మనకు దిగులు!

వెంకటచలంగారి రచనలో కొందరు ఈకాలపు యువకులు పట్టే తప్పేమంటే ఆయనకథల్లో కొన్ని కొన్ని సంఘటనలు అసహజంగా ఉంటవని. ఈమాట అనేవారు సామాన్యంగా కథకు ప్రాముఖ్యత ఇచ్చి, శిల్పమూ, శైలీ, రచయితయొక్క అభిప్రాయమూ మొదలైనవి గ్రహించలేనివారు. తనపని నెరవేర్చుకునేటందుకు కథకుడు ఎటువంటి సంఘటన అయినా తీసుకోవచ్చును. (శాస్త్రంమీద కళయొక్క ఆధిక్యత నిరూపించటానికి నేను ఒకసారి—"అనంతం" అనేకథలో ఇద్దరు సూక్ష్మజీవులను తీసుకున్నాను. ఒక చిత్రకారుణ్ణీ, ఒకవైద్యుణ్ణీ తీసుకున్నా నాకు పని గడచి పొయ్యేదే!)

సారస్వతకళవల్ల సాధించదగిన దేమిటో, మానవ జీవితంలో దానికి ఏస్థానంఉందో చాలామంది గ్రహించినట్టు కనపడరు. దాన్నిగురించి సంగ్రహంగా ఇక్కడ నాలుగుముక్కల్లో రాస్తాను. సారస్వతం నీతీ, ధర్మమూ, న్యాయమూ మొదలైనవాటిమీదికి వెళ్లుతుంది. కాని దానిపంథా వేరు. అనేకకోట్లమానవులు వివిధ పరిస్థితుల్లో ఎట్లాప్రవర్తించాలో దాన్నిగురించి నీతిశాస్త్రం లోనూ, న్యాయశాస్త్రంలోనూ రాసిఉంచటం అసంభవం. సామాన్యజీవితంలో సామాన్యమానవుడి ప్రవర్తనకు ఎక్కువగా వినియోగపడుతూ, విశేష పరిస్థితులను గూడా సాధ్యమైనంతవరకూ చర్చించగలవు ఈశాస్త్రాలు. కాని వీటిని రోజురోజుకూ మార్పుచెయ్యటం అసంభవం. కాని మానవుడి మనఃపద్మం అనుక్షణమూ వికసిస్తూనే ఉంటుంది. మానవుడు యుగయుగాలనించీ సాటిమానవుడి మనస్తత్వాన్ని అర్థంచేసుకుంటూ వస్తున్నాడు. నిర్జీవాలైన న్యాయ శాస్త్రమూ, నీతిశాస్త్రమూ సమర్థించలేకపోయిన సోదరమానవుణ్ణి ఇతను సమర్థిస్తాడు. తెలివితేటలు వినియోగించి ధర్మశాస్త్రాన్ని తప్పించుకు తిరుగుతున్న దుర్మార్గుణ్ణి పట్టుకుని ఈమేధావి నరకంలో తోసిపారేస్తాడు. న్యాయశాస్త్రాలూ, నీతిశాస్త్రాలూ అంతరించిపోయినా ఇతనిరచన అట్లా శాశ్వతంగా నిలిచి ఉంటుంది. ఈరచయిత ఇంకొకటికూడా చేస్తాడు— అమలులో ఉన్న న్యాయానికి బద్ధుడైన వ్యక్తి పడిన ఆవేదన చిత్రించుతాడు. మెదడులేని మనం ఆపాత్రయొక్క ఆవేదనను ఆనందించి ఆన్యాయశాస్త్రాన్నే పట్టుకుని వేళ్లాడుతాం... ఏవిధంగా చూసినా సారస్వతకళయొక్క పని శాస్త్రాలకు ప్రత్యామ్నాయంగా ఉండటంకాదు— వాటివల్ల కాని అత్యుత్తమధర్మాన్ని నిర్వర్తించటమే. రంకుతనం మహాపాతకమని చెప్పేకథ నేను చదవను. రంకుతనంచేసినవారికథా చదవను. అది న్యాయశాస్త్రం చెబుతుంది. ఇది జీవితంలో ఎక్కడబట్టితే అక్కడే ఉంది. కాని ఒక రంకుతనాన్ని సమర్థిస్తూ రాసిన కథను నేను పూజిస్తాను. లేదా రంకుతనం చెయ్యని కారణంచేత ఎవరైనా పడిన ఆవేదన నేను నమ్మేటట్టు రాస్తే ఆరచన చదివి రెండుకన్నీటిచుక్కలు రాల్చగలను... వెంకటచలంగారి "వొంటరితనం" *అనేకథ నాకు ఆవిధంగానే నచ్చింది. అందులో వెంకటబ్రహ్మం ఆఖరుకుచేసినపని సంఘం ఎగతాళిచేసే పనిగా ఉంది. కాని ఆపరిస్థితుల్లో "నువ్వూ నేనూ" చేయగలిగిన పని వెంకటబ్రహ్మం ఏది చెయ్యలేదు? అన్నీ చేశాడు. అతను భార్యను స్వీకరించకుండా ఉండాలంటే పిల్లలమీదిప్రేమ చంపుకోవాలి. అటువంటి భార్యతోరాజీపడి సంఘమర్యాదకు—కృత్రిమంగా వచ్చిన సంఘమర్యాదకు—దూరు డయేకంటె సహజమైన పుత్ర

---

* యువకార్యాలయ ప్రచురణ "పాపం!!!" అనే కథా సంపుటిలో ఒకకథ.

ప్రేమనే వదులుకోవటం యోగ్యం అని వాదించే ఆంధ్రులకు సారస్వతకళతో ఏమీ పనిలేదు!

వెంకటచలంగారి రచనలు జాగర్తగా పరిశీలించినట్టయితే ఆయనకంటె ఇన్స్పిరేషన్, లేక ఉద్రేకంతో రాస్తున్న రచయిత తెలుగువారిలో మరొకడు లేడని బోధపడుతుంది. చేతితీటకొద్దీగాని, చౌకగా పేరు ప్రఖ్యాతులు సంపాదించుకుని నాలుగు పత్రికలలోనూ అచ్చుపడదామనే ఉద్దేశంతో కాని ఆయన రాస్తున్నట్టు ఎవరూ భావించనవసరంలేదు. లోకం ఆమోదించనిదీ, లోకం జాగ్రత్తగా కప్పిపెట్టుతున్నదీ వెంకటచలంగారు చాలా బయటపెట్టదలుచుకున్నారు. అది కాగితంమీద పెట్టితీరాలి గత్యంతరం లేదు. నిజమైన ఇన్స్పిరేషన్‌తో రచించబడినదానికీ ఏదో సరదాకు రాసినదానికీ ఉండే తేడా సులభంగా కనిపిస్తూనే ఉంటుంది. "మాంసం తింటున్నామని బొమికెలు మెడలో వేసుకుంటావా?" అన్న వాదం నాకు కుంటివాదంగా కనిపిస్తుంది. సంఘంలో ఉన్న కుళ్లు సారస్వతంలోకి రాకుండా చేసి ఎవరికళ్లు కప్పుదామని? ఇదంతా నిజంగా కుళ్లుకాదేమో! దీనికి కాస్తగాలి తగలనిస్తే ఇదంతా పరిశుద్ధమైన పదార్థంగా పరిణమిస్తుందేమో! వెంకటచలంగారు రాస్తున్న విషయాలు ఎవరో ఒకరు రాసి తీరాలంటాను. ఆయన ఇన్స్పిరేషన్ ఆయన్ను ఇది రాయటానికి ప్రేరేపించింది. అనేక కారణాలవల్ల జీవితంలో మనం మన సాటివాళ్ల పాపాలు చూడనట్టు నటిస్తున్నాం. వెధవను పట్టుకుని "వెధవా!" అని పిలిస్తే జీవయాత్ర సాగదు. సారస్వతానికికూడా అటువంటి ప్రారబ్ధమేమిటంటాను. మన పిరికితనమూ, మన అంధత్వమూ మన సారస్వతాన్ని బాధించాలా ఏమిటి?

ఆయన తొక్కినమార్గంలో వెంకటచలంగారు పరిపూర్ణత్వం సంపాదించారని నేననటంలేదు. ఆయన రచన అప్పుడప్పుడు అత్యుత్తమ ఆశయాలను వదలిపెట్టి వట్టిబూతులలోకి దిగటం కద్దు. కాని ఆయనరచనలో మొపాసాను మరిపించే మెరుపులు కనిపిస్తూంటై. ఇతరులు ఆయనను ఈమార్గం వదలిపెట్టమంటూంటే నేను ఆయన్ని ఈమార్గానే ఇంకాపైకి వెళ్లమంటున్నాను.

ఇంతకూ నాకు బొత్తిగా అర్థంకాకుండా ఉన్న దేమంటే అమిత నిరర్థకంగా రతివర్ణనలుచేసిన పూర్వుల రచనలను సహించిన ఆంధ్రులు, వెంకటచలం గారు నాలుగైదు ముక్కలతో అటువంటి ఘట్టాలనే వర్ణించి శిల్పాన్ని ఎట్లా పోషిస్తున్నారో ఎందుకు గ్రహించలేరా అని! "అవతారమా?" *అన్నకథలో సన్యాసి నాయికను బలాత్కరించిన ఘట్టంలో వెంకటచలంగారిచ్చిన కొద్దివివరాలు-విచక్షణ అనేదిలేని మూర్ఖులకు జుగుప్స కలిగించుగాక - ఆ సన్యాసిని వట్టిపశువుగా ఏర్పరించటానికి ఎంత ఉపయోగపడినై! ఇప్పుడు తెలుగులో ఉన్న ప్రబంధాలలో ఏ ఒక్కదాంట్లో కానీ రతివర్ణనను శిల్పంకోసం అట్లా వినియోగించిన ఉదాహరణ ఒక్కటైనా ఉందా? ఎవరో తుమ్మాయిలూ జగ్గాయిలూ తమలో తాము ప్రకటించుకోవలసిన అభిప్రాయాలు విమర్శకులు అచ్చులో పెట్టి తృప్తిపడటం తెలుగు సారస్వతానికి తలవంపులుగా భావించవలసిన సంగతి.

"వెంకటచలంగారి రచనఅంతా బూతు" అనటానికి విమర్శకులు అక్కర్లేదంటాను. ఆర్టిస్టు ఏది తీసుకోవటానికీ అధికారం కలిగిఉన్నాడు - అది తీసుకోవటానికి తగినకారణం (కళాదృష్టిలో) ఉండాలే కాని!

ఇక వెంకటచలంగారి ఆశయంగురించి. ఉత్తమ రచయితలందరికీ ఏ ఆశయం ఉంటుందో అదే వెంకటచలంగారికీ ఉండాలి. మానవ ప్రకృతిని ఖండించి చూపటం మానవుణ్ణి సాటిమానవులు అర్థంచేసుకునేటందుకు సహాయం చెయ్యటం. ఆపనిలో వెంకటచలంగారు ఏవైనా పొరపాట్లు చేసిఉంటే - చెయ్యలేదని నేను వాదించను - అంతవరకూ ఆయనరచనలో లోపం ఉన్నట్టే.

వెంకటచలంగారికి కామంతో కూడుకోని అవ్యాజప్రేమలో నమ్మకంలేదనే చెప్పాలి. అందు కా

* "పాపం !! !" అనేకథాసంపుటిలోని మరొకకథ.

యున్ను తప్పుపట్టవలసిన అవసరంకూడా కనిపించదు. మన ప్రేమకోసం చెయ్యి చాచినప్పుడల్లా మన కందేది స్త్రీ అవయవాలకంటె అధికం ఏమైనా ఉంటున్నదా? ఎక్కడైనా నూటికి కోటికి అంతకంటె ఏమైనాఉంటే దాన్ని గురించి వెంకటచలంగారు రాయరు. మన హృదయాలూ, అందులో ఉన్న భయంకరదృశ్యాలూ మనకు చూపటమే ఆయనపని—ఆదర్శాలను ప్రకటించటం కాదు.

ఆయనకథలలో వచ్చేపాత్రలకు నీతీ కట్టుబాటూ అనేది ఉన్నట్టు కనిపించదు. ఇది కూడా లోపంకింద ఎంచ నక్కర్లేదు. షేక్స్పియరు పాత్రలు కూడా ఇట్లాగే ఉంటై. అందుచేతనే లేడీ మాక్బెత్తును గురించి రాస్తూ ఒక విమర్శకు డన్నాడు - "లేడీ మాక్బెత్తు చేసిన ఘోరకార్యం మనలో ఎవరమూ చెయ్యకపోవచ్చును. కాని మనలో అనేకమంది లేడీ మాక్బెత్తు లున్నారు." అని. అవకాశం లభిస్తే మనమంతా వెంకటచలంగారి పాత్రలల్లేనే ప్రవర్తిస్తామని నే నంటాను. ఒక యంత్రానికి దాని సెక్షనల్ డయాగ్రముకు ఆపాటిభేదం ఉండకపోదు!

తరువాత వెంకటచలంగారి రచనావిధానాన్ని గురించి. స్వకపోలకల్పితా లయిన కథలే రాయాలని ఆయనకు పట్టింపు లేదు. కథనంలోకూడా చిత్రచిత్ర విధానాలు అన్వేషించ రాయన. శైలికికూడా ఆయన ఎక్కువ లక్ష్యం చెయ్యరని నా అనుమానం. అనేక చోట్ల ఆయనవాక్యాలను కొద్దిమార్పులతో బాసుచెయ్య వచ్చు ననిపిస్తుంది. కాని ఆయన భావంలోఉన్న విశేషం ఏమిటంటే, ఆయన చెప్పదలుచుకున్న విషయాన్ని ఏదోవిధంగా పాఠకుడి బుర్రకు ఎక్కేటట్టు చెప్పి తీరుతారు. ఆ తరువాత కథాఘట్టంయొక్క "మూడ్" (Mood) అనుసరించి అక్కడక్కడి వర్ణనలలో ఆయనకు మాటలు దొర్లివస్తయి. ఇది దాదాపు "జీనియస్". ఈ జీనియస్ అనేకమంది కవులకుకూడా ఉన్నట్టు కనిపించదు.



# నా రి ద్వే షి

రవీంద్రనాథమైత్ర



సోమేన్ సముద్దార్ హ్రస్వనామధేయం సోమూ. యూనివర్సిటీలో ఫిఫ్త్‌యియర్ స్టూడెంటు (మొదటి సంవత్సరం ఎం. ఏ). జీవనాంకసంఘానికి ప్రెసిడెంటు కూడానూ. ఈ సంఘాన్ని సృష్టించినవారు సోమూ, చటక్‌లు. చటక్ దీనికి పాట్రన్ (Patron). కొద్ది ధన సహాయంకూడా చేశాడు.

ఈ సంఘంయొక్క క్రీడ్ (Creed) ఏమంటే 'జీవిత మొక మహానాటకం; ప్రతి ఒక్కరోజూ దాని లోని ఒక్కొక్క కొత్తదృశ్యం. ఆహారంలో, విహారంలో, ప్రతీహారంలో, వ్యతీహారంలో-అన్నిటిలో యీ నాటకపు అనుభూతిని పొందటమే మానవజీవితానికి చరమలక్ష్యం.'

కాని హఠాత్తుగా సోమూ యీ సంఘనీతికి విరుద్ధమైన గర్హితకార్యం ఒకటి చేశాడు. ఫలితం, జీవనాంకసంఘానికి జీవనాంత మయింది. చటక్, సోముకు స్నేహవిచ్ఛేద మయింది. భవిష్యత్తులో సోమూ ఈ దుష్కర్మానికి ఫలం ఏమనుభవిస్తాడో ఎవరు చెప్ప గలరు? జరిగిందేదో జరిగిపోయింది. దాన్ని గురించి తల పగలగొట్టుకోవటం వ్యర్థం.

కాన ఇక్కడ జరిగిందిమాత్రమే వ్రాస్తున్నాను. దీన్ని కథ అనుకోవచ్చు, నవల అనుకోవచ్చు, ఇతిహాసం అయినప్పటికీ ఆశ్చర్యంలేదు.

సోమూ చటక్‌కు భావదాస్యుడు. ఫర్డ్ క్లాసులో ఇద్దరూ కలిసినప్పటినుంచీ వదలకుండా సినీమాలూ, థియేటర్లూ చూస్తూవస్తున్నారు. వివాహం చేసుకోమని ప్రతిజ్ఞకూడా చేసుకున్నారు. హాలీవుడ్ అందగత్తె వచ్చి తన్ను చేపట్టమని ప్రార్థించ[illegible]!

సోమూ నాయనమ్మా, వదినా యిద్దరూ తిరుపతి వెంకన్నకు ముడుపులుకూడా కట్టారు. ఏం లాభం? సోమూమతిమాత్రం మారలేదు. అయినా ఒకసారి వదినానాయనమ్మలు సోమూను బలవంతపెట్టి ఒక పిల్లను చూడటానికి పంపారు. దానికి ఫలితంకూడా వికటంగానే పరిణమించింది.

అది ఈ విధంగా జరిగింది.

శివరాత్రినాటిరాత్రి అనార్కలీనాటకం చూచి సోమూ ప్రొద్దుపోయి యింటికి తిరిగివచ్చాడు. వరండాలో దాసీది పండుకొని ఉంది. దాని పేరుకూడా అనార్కలీ-అనార్ అనే పిలుస్తూ ఉంటారు

నిద్రపోయే అనార్‌ను చూడగానే సోమూలో జహంగీర్ ప్రవేశించాడు. రెయిలింగ్ అనుకుని, కుడి చెయి పైకెత్తి, "ఈమె ఆ అనార్కలీయేనా? బాల్యకాలంలో ఎవరినైతే- అనార్కలీ- ఆ-"అని అభినయ సహితంగా చెప్పసాగాడు.

అనార్ హఠాత్తుగా మేలుకొని చీత్కారం చేసింది. నాయనమ్మ జపమాల వదలి పరుగిడి వచ్చింది. వదినె లబలబలాడుతూవచ్చి సోమూనెత్తిన కడివెడునీళ్లు కుమ్మరించింది.

మరుదినం వదినా నాయనమ్మ లిద్దరూ కూడ బలుక్కుని ఉపవాసం చేయసాగారు. సోమూ విధిలేక పాల్పాడాలో ఉండే విశ్వాసబాబుయింటికి పెళ్లి కుమార్తెను చూడబోయాడు. ఇదివరలో చాటుగా పెళ్లివిషయమై ప్రస్తావన జరుగుతోనే ఉంది. ఎక్కువ ఆలస్యం [illegible] పిల్ల సింగారించుకొని ఎదు

టికి వచ్చింది. సోమూ ఆ అమ్మాయి ఎడమచెయ్యి గట్టిగా పట్టుకొని 'కచదేవయాని' లోని కచునిమాదిరిగా చదివాడు.

"పతికి యోగ్యుడను గాను కుమారీ,
బ్రహ్మచర్యవ్రతధారిని నేనూ—"

పిల్ల గడగడా వణకసాగింది. భయంతో నయిందీ తెలీదు. సిగ్గుతోనయిందీ తెలీదు. పిల్ల అన్న అవినాశుడు "ఆఁ! ఆఁ!" అంటూ పరుగెత్తుకొచ్చాడు. కాని ఫస్టుక్లాసులో ఫస్టున పాసయిన సోమేన్ సమద్దార్ వంటిమీద చేయివెయ్యటానికి సెకండు యియర్ తప్పిన కుర్రవాడికి సాహసం చాలకపోయింది. సోమూ బంతివలె లేచి ట్రామెక్కి ఇంటికి చేరాడు.

ఇక తన వివాహవిషయమై ఆలాప విలాపా లేమైనా జరిగాయంటే కాలుపెడ్డునవున్న నిష్క్రియానంద మఠంలోకి వెళ్లి సన్యాసం పుచ్చుకొంటా నని, పిల్ల నచ్చిందోలేదో తెలుసుకోవాలని వచ్చిన వదినె నాయనమ్మలను సోమూ భయపెట్టాడు.

మూపైఫ్రెండు పళ్లలో మిగిలివున్న ముందు రెండుపళ్లతో నాలుక కొరుక్కొని నాయనమ్మ అంది- "శివ, శివ! అలా అనగూడదు నాయనా!"

సోమూ తనచదివేగది తలుపు తాళ్ళన వేసుకొని అన్నాడు-"అంటాను! లక్షమాట్లు అంటాను! ఆకాశంలో చంద్రతారలు సాక్షి! స్వర్గంలో మందాకిని సాక్షి!" తరవాత ఇక వినపళ్లేదు. కిటికీతలుపులు కూడా బిగించుకున్నాడు.

వంటయింటో కూర్చుని "దుర్గేశనందని" చదువుకుంటున్న వదినె పుస్తకంలో మొహం పెట్టి వెక్కి వెక్కి ఏడవసాగింది. ఇక వివాహప్రసంగం ఎవ్వరూ ఎత్తలేదు.

ఇది భూమిక.

౨

ఇక కథారంభం....

ఆవాళ ఆసాఢమాస ప్రారంభం. నవమేఘ భారంతో ఆచ్ఛన్నమైవున్న నీలాకాశం ఒకతరుణి సర్వాంగాలూ చుట్టుకొనివున్న నీలిరంగుచీర చెరగువలె వుంది. మెరుపులుకూడా మెరుస్తున్నాయి— ఆ చెరగున కుట్టిన బుటేదారీ పనివలె. ఆకాశంలో మేఘగర్జన, క్రింద ట్రాం గరగర. ప్రతి గల్లీమూలనూ కారపు శనగలు అమ్మేవాళ్ల విరామంలేని కేకలు.

సోమూ ఒక పొట్లం కారపుశనగలు కొని బస్సెక్కాడు. పదిగంటల బస్సు కావటంవల్ల ప్రయాణీకులు నిండుగావున్నారు. వెనుకసీటులో ఒకమూల కాస్త చోటుంది. సోమూ పుస్తకాలు ప్రక్కన పెట్టుకొని కూర్చున్నాడు.

బస్సు పోతూ పోతూ ఆగింది. చేతులో పుస్తకాలూ, నోటుబుక్కులూ పట్టుకుని ఒక అష్టాదశి వచ్చి ఎక్కింది. బండిలో ఉన్నవాళ్లంతా ఒక్కమాటు మెడ చాచి చూచారు. అందులో సోమూ ఒక్కడు మాత్రమే నిర్వికారభావంతో చూచాడు.

బస్సు కదిలింది. యువతి ఒక్కసారి బస్సంతా చూచి సోమూవద్దకు వచ్చి నిలబడి లోలుపదృష్టితో సోమూప్రక్కన ఉన్న పుస్తకాలవంక చూడసాగింది. పుస్తకాలు తీస్తే ఆమె కూర్చోటానికి చోటు దొరుకుతుంది. కాని అంతదగ్గరగానా! సోమూ సర్వాంగాలూ సూదులతో పొడిచినట్లయింది. ఏవగింపుతో అతను పుస్తకాలు తీసుకొని లేచి నిలబడ్డాడు.

యువతి అవలీలగా కూర్చుని అంది- "థాంక్స్! ఎక్కడకు పోతున్నారు?"

సోమూ చేతులోని పుస్తకాలను నిర్దయగా నలుపుతూ అన్నాడు— "ఏట్లోకి!"

యువతి అంది—"అవి దర్భాంగా బిల్డింగ్స్ * కావుగదా?"

సోమూ అదేవిధంగా నిర్వికార భావంతో అన్నాడు — "ఆఁ!"

యువతి అంది—"పదండి నేనూ కూడా వస్తున్నా."

---

* యూనివర్సిటీ భవనాల్లో కొన్ని భవనాలు.

సోమూ అన్నాడు — "థాంక్స్!"

ఇద్దరూ ఒకక్లాసులోనే చదువుతున్నారు. ఒకరి మొహం ఒకరు ఇదివరకే ఎరుగుదురు. సంభాషణకు మాత్రం ఇదే మొదలు.

కమలకూడా ఫస్టుక్లాసులోనే పాసయింది, సోమూకు రెండుమెట్లు దిగువగా. అతనితో మాట్లాడాలని చాలారోజులనుంచీ ఆమెకోరిక — చదువులో సహాయంగా ఉంటాడని. కాని సోమూ స్వభావం సంగతి విన్నాక దగ్గరకు పోవటానికే భయపడ్డది. దైవయోగంవల్ల ఇవాళ పరిచయం అయినందుకు చాలా సంతోషించింది. అతని స్వభావాన్నికూడా బాగా గుర్తించింది.

బస్సు దిగి టకటకా సోమూ మూడో అంతస్తుకు ఎక్కేవరకు వాకిట్లోనే కమల ప్రత్యక్షమయింది. ఆమె లిఫ్ట్ ద్వారా ఎక్కింది. సోమూను చూడగానే కారపుళనగలపొట్లం అందిస్తూ అంది—"తీసుకోండి. బస్సులో వదలెట్టి వచ్చారు."

ఇలా అసంగతంగా స్నేహితం చేసుకోబోవటం చూసి సోమూకు వొళ్లుమండింది. "అక్కర్లేదు. టిఫిన్ తీసుకోండి" అన్నాడు.

కమల అంది—"థాంక్స్!"

అయిదు నిమిషాలు గడిచాక.

సోమూ తదేకధ్యానంతో ఏదో రాసుకుంటున్నాడు. కమల వెనగ్గావచ్చి అడిగింది—"పెన్సలు కాస్త యిప్పిస్తారా?"

సోమూ తలెత్తి చూచాడు. లోలోపల పళ్లు నూరుతూ జేబులోనించి కానీ బయటకు తీసి డస్కుమీద పెట్టి అన్నాడు—"తీసుకుపోయి కొనుక్కోండి."

కమల కానీ తీసుకొని అంది—"థాంక్స్!"

తరువాత, నాలుగు గంటలకు.

సోమూ లైబ్రరీలో కూర్చుని "అపోలోజియా" (Apologia) నూతన సంస్కరణంమీద నోట్సురాసుకుంటున్నాడు. కమల వచ్చి తెరచిఉన్న పుస్తకంమీద కానీ వేస్తూ అంది—"కారపు శనగలకా నీ—"

పుస్తకంమీద ఒకగుద్దు గుద్ది పెదవికొరుకుతూ సోమూ అనబోయాడు—"డా—"ఇంతలో ఎదుట ప్రొఫెసరు గోపాలబాబును చూచి "—ంక్స్!" అని పూర్తిచేశాడు.

కమల వెనుకనుంచి మృదుస్వరంతో "డాంక్స్!" అని ముసిముసినవ్వు నవ్వుకుంటూ వెళ్లిపోయింది.

సోమూముందున్న ఇంగ్లీషు పుస్తకంలో అక్షరాలు పార్సీఅక్షరాలమాదిరిగా అలుక్కుపోయినై. ఇక ఆరోజుకు నోట్సురాయటం పడలేదు.

సాయంకాలం నాయనమ్మతోపాటు వదినె మిద్దెమీదికి వచ్చేటప్పటికి సోమూ కారాబద్ధ జగత్సింహుని వలె అటూ యిటూ పచారుచేస్తూ గొణుక్కుంటున్నాడు—కమలా, చపలా, తబలా—హూఁ,హూఁ"

ఈ అస్థిరతకు కారణం ప్రాస కుదరకపోవటం అని లేఖకుడు ఊహిస్తున్నాడు. మనమడిమనస్సు కమలాఫలాలమీదికి పోయిందని నాయనమ్మ అనుకుంది. కమల అనేది ఒక పిల్లపేరు కావచ్చని వదినె అంచనా వేసుకుంది. వదినె, నాయనమ్మలు చప్పుడుచెయ్యకుండా వచ్చినవారు వచ్చినట్టుగానే వెళ్లిపోయారు. నేనుమాత్రం లేఖకుణ్ణి కావటంవల్ల కథపూర్తిచెయ్యటంకోసం అదృశ్యరూపంతో సోమూతోపాటు ఉండిపోయాను.

ఒకగంట కష్టపడి 'లా' చివర గల చెడుశబ్దాలన్నీ కూర్చి ఒకకవిత్వం తయారుచేసి పగతీర్చుకున్న సంతోషంతో వాలు కుర్చీమీద జారగిలబడి నిట్టూర్చాడు.

## ౩

మర్నాడు.

ప్రొఫెసర్లు రావటానికింకా వ్యవధానం ఉంది. సోమూ కోపంతో కమలా, ఆమె సహాధ్యాయినులూ కూర్చునే బెంచీవేపు అప్రయత్నంగా చూడసాగాడు. ఇంతలో వెనుకనుంచి ప్రశ్న వినపడింది—"ఇవాళ టెంపర్ ఎలాఉంది సమద్దార్‌జీ?"

సోమూ తిరిగిచూచాడు—కమల! క్లాసునిండా పిల్లలు. వచ్చినకోపాన్నంతా దిగమింగి నిన్నసాయం

త్రం రచించిన కాగితం అందిస్తూ అన్నాడు—"ఇది తమదే, తీసుకుపోండి."

కమల కాగితం తీసుకొని, "థాంక్స్!" అంటూ వెళ్లిపోయింది.

సోమూ లోలోపల గుర్రుపెట్టాడు.

కమల చేసిన పరిహాసానికి చక్కని జవాబు ఇచ్చానన్న ఆనందంలో సాయంత్రం సినీమా చూచి సోమూ ఇంటికి వచ్చేటప్పటికి వదినె పెద్దకవరు ఒకటి యిచ్చింది. సోమూ మూడో అంతస్తుకు వెళ్లి విప్పిచూచాడు. అందులో యిలా వ్రాసిఉంది:

'థాంక్స్ ఫర్ యువర్ కాంప్లిమెంట్స్. నాకు చిత్రం గీయటం తెలుసు కాని కవిత్వం వ్రాయటం చేతకాదు. అందువల్లనే—

ఇట్లు,
కమల.'

దళసరిగా ఉన్న చదరపు ఆర్టు పేపరుమీద యీనాలుగు పంక్తులూ వ్రాసిఉంది. కాగితం తిప్పి చూచేవరకు అచ్చంగా సోమూమాదిరిచిత్రం ఒకటి గీయబడిఉంది. కారపుళనగల పొట్లం ఒకటి మాత్రం అధికంగా నెత్తిమీద ఉంది. క్రింద పేరు వ్రాసిఉంది- "కారపుళనగల సమద్దార్!"

ఎగ్గూ సిగ్గూలేనిపిల్ల! చేతికందితే జుట్టు పట్టుకొని వీపుమీద నాలుగు వేసేవాడు! సోమూ పిడికిలిపట్టి చేతులు విసర సాగాడు.

ఉత్తరం ఎక్కణ్ణించి వచ్చిందో కనుక్కోవాలని వచ్చిన వదినె కిటికీగుండా ఇదంతా చూచి అడిగింది- "అదేమిటి, మరిదీ, ఎవరిని కొడుతున్నావు?"

ఎత్తిన చేతిని కోటుజేబులో పెట్టుకుంటూ సోమూ జవాబిచ్చాడు—"వేధించబోకు! ఎక్సర్ సైజ్ చేసుకుంటున్నా."

వదినె మళ్లీ ప్రశ్నించింది—"డంబెల్స్ ఏవీ?"

జేబులో పెట్టిన చెయ్యి తీసి పిడికిలివిప్పుతూ సోమూ అన్నాడు—"ఇక డంబెల్స్ అక్కర్లా. మద్దరాలు కావాలి!"

సోమూకళ్లు చూసేవరకు వదినెకు భయం కలిగి తత్తరబిత్తర లాడుతూ దిగిపోయింది. సోమూ మళ్లీ చిత్రంవంక చూచాడు. ఈ చిత్రంముందు తన కవిత్వం ధూపానికిరాదు. మల్లుతీసి కొర్రుపెట్టుకొన్నట్టయింది.

ఇంతలో నాయనమ్మ వచ్చి అడిగింది—"త్రిఫల కషాయం తెచ్చేదా, నాయనా?"

సోమూ తీవ్రస్వరంతో అన్నాడు—"త్రిఫల కషాయం లాభంలేదు—షట్ఫలకషాయం కావాలి."

త్రిఫలకషాయానికి బదులు షట్ఫలకషాయం ఇవ్వవచ్చునేమో కనుక్కురమ్మని నాయనమ్మ దాసీదాన్ని వైద్యునింటికి పంపింది.

౪

త్రిఫలకషాయం త్రాగినా ఆరాత్రి సోమూకు నిద్రపట్టలేదు. రాత్రంతా మేలుకొని కమల చేసిన యీ పరాభవానికి ప్రతిక్రియ ఏమిటా అని ఆలోచించాడు. ఇక కవిత్వంతో కుదరదు. కమలఫోటో కనక ఒకటి దొరికితే గొప్పచిత్రకారునివద్దకు వెళ్లి వ్యంగ్యచిత్రం (Cartoon) ఒకటి గీయించవచ్చు. ఇది బాగానే ఉంది. కాని ఫొటో దొరికేదెలా? ఆమె నడిగితే గుట్టంతా బయటపడుతుంది! అయితే—

ఉపాయం తట్టకపూర్వమే తెల్లవారింది కాస్సేపు 'అటలాంటా', కాస్సేపు కమలా, కాస్సేపు మిల్టన్ — యీ విచిత్రవిషయాల తాకుడుకు అతని మనస్సు అప్రసన్నమై పోసాగింది. ఇంతలో పదిగంటలయింది. సోమూ పుస్తకాలుచేతబట్టి ట్రాం ఎక్కాడు. ట్రాం కొంచెం దూరం పోయిందోలేదో కమల ఒక సహాధ్యాయినితో వచ్చి ఎక్కింది. సోమూ పుస్తకాలు చేత పట్టుకొని దిగటానికి ఉపక్రమించాడు. కమల ప్రశ్నించింది—"ఎక్కడకు వెళుతున్నారు?"

"కారపుళనగలు కొనుక్కోటానికి."

కమల ముసిముసినవ్వులు నవ్వుతూ అంది— "నాకూడా తెచ్చిపెట్టండి—థాంక్స్!"

వెంటఉన్న స్నేహితురాలు కిలకిల నవ్వింది. సోమూ గుడ్లుతేలవేస్తూ దిగిపోయాడు.

ఒకగంట అయాక కమలడస్కుమీదికి ఒక పొట్లం వచ్చింది. విప్పిచూస్తే కారపుళనగలకు బదులు అరటిపండుతొక్క లున్నవి. కమల నవ్వుకుంది.

కమ కు కోపం రాకపోవటం తను కూర్చున్న చోటినుంచి సోమూ చూస్తూనే ఉన్నాడు. తను ప్రయోగించిన అస్త్రం పారకపోవటం చూచి మొహం మాడ్చుకున్నాడు.

బడివదిలాక గోల్ దీఘీ*వద్ద నిలబడి బస్సుకోసం నిరీక్షిస్తున్నాడు. కమల సహపాఠినులతో సహా వెనుక నిలబడి నోటిమీద జేబురుమాలు పెట్టుకొని నవ్వుతో వుండటం అతను చూడలేదు. బస్సు ఎక్కినతరువాత కమలను చూచాడు.

"తమకు ప్రియతమమైన వస్తువు నాకు పంపారు —అందుకు థాంక్స్!" కమల కౌతుకంగా అన్నది.

సోమూ ముఖం త్రిప్పుకున్నాడు. ఆ పిల్లను పళ్ళతో పీకి, గోళ్ళతో రక్కి—— ముక్కలుముక్కలు చెయ్యాలన్నంతకోపం వచ్చింది.

మరుదినం సోమూ కాలేజీకైమూకు ఒక గంట ముందుగా బయలుదేరి బడి వదలక పూర్వమే యింటికి తిరిగివచ్చాడు. కాలేజీలో తనకు తెలియకుండానే కమలవంక గంభీరంగా చూచాడు. కమలకూడా అతని వంక కౌతుకంగానూ, వెటకారంగానూ చూచింది!

ఈ విధంగా దాదాపు పదిహేనుదినాలు గడిచాయి.

ఈమధ్య వీరిద్దరికీ ఏ విధమైన సంభాషణా జరగపోయినప్పటికీ పగతీర్చుకోవాలనే సంకల్పం సోమూ బుర్రలో గూడుకట్టుకుంది. ఒకతుచ్ఛస్త్రీ తనను పరాజితుని చేసి తనకళ్ళ ముందు స్వేచ్ఛగా తిరుగుతూ ఉండటం సోమూ సహించలేక పోయాడు! వదినెకు యీ సంగతంతా చెబితే దీనికి ప్రతిక్రియ చెయ్యటానికి ఏదైనా సదుపాయం చేసేదే. కాని ఒకస్త్రీని అణచటానికి ఇంకోస్త్రీని ఆశ్రయించటం సోమూకు సుతరామూ యిష్టంలేదు.

ప్రతిక్రియ చెయ్యకతప్పేదీ లేదు. రోజూ అతన్ని చూచి కమల కౌతుకంగా నవ్వుతూ ఉంది. పైగా బస్సులో ఎక్కడ కలుస్తుందో అనే భయం మూలాన క్రమంగా క్లాసులో సోమూ నాదాలు పెడుతున్నాడు. ఏవిధంగానైనా కానీ కమలను మాత్రం ఎప్పటికీ నోరెత్తకుండా చేయాలి.

ఆవాళ సమయం చిక్కింది.

కాలేజీ వొదిలారు. కమల మరిద్దరు సహాధ్యాయినులతో కలిసి కారెక్కి టాక్సీవానితో బొటానికల్ గార్డెన్సుకు పోనిమ్మని చెప్పుతూంది. సోమూ విన్నాడు. అయిదారు నిమిషాలు ఆలోచించి దారినపోయే టాక్సీని ఆపి డ్రైవరును హెచ్చరించాడు— "బొటానికల్ గార్డెన్సు."

బొటానికల్ గార్డెన్స్. సాయంకాలం. స్నేహితురాండ్రు చెట్లూ చామలూ నిరీక్షిస్తూతిరుగుతున్నారు. కమలమాత్రం ఒక బెంచీకి చేరగిలబడి కూర్చుంది. దాపున ఎవరూ లేరు. సోమూ ఒక పొదచాటున నక్కి వీలుకోసం వేచివున్నాడు. కమలసఖులు కొంచెం దూరంగా పోగానే సోమూ ఎదుటపడి అన్నాడు— "కారపుళనగలు తింటారా?"

కమల చకితురాలయింది. పూర్వంమాదిరిగా నవ్వలేకపోయింది. కాని -భ్యాసంవల్ల అనేసింది-"థాంక్స్! ఇవ్వండి—"

సోమూ కళ్లు నిప్పులు కక్కినై. కమలకుడి చెయ్యి గుప్పెట్లో బిగించి అన్నాడు— "నీజుట్టు పట్టుకుని—"

అంటూనే సోమూ చకితుడయాడు. కమలజడ వచ్చి అతనివక్షస్థలందగ్గర పడింది. కమలముఖాన నెత్తురుచుక్క లేదు.

హతాశుడై సోమూ బెంచిమీద కూలబడ్డాడు. కమల తనకళ్లమీద చీరచెరగు పెట్టుకుంది.

* గోల్ దీఘీ కలకత్తాలో ఒకచెరువు, స్క్వేర్ కూడాను.

కమల ఏడుస్తోందని సోము గ్రహించి తనగుప్పెట్లో ఉన్న చేతిని వదలి ఆదుర్దాగా అడిగాడు- "చెయ్యి నొప్పి పట్టిందా?"

కమల చెయ్యి తీసుకోకుండానే అంది — "ఊఁహూఁ!"

సోముకు ఏమీ అర్థం కాలేదు. మళ్లీ అడిగాడు—"మరెందుకు—"

కమల కళ్లమీది చెరగు తియ్యకుండానే అంది— "ఆచిత్రం చించి పారేసి నన్ను క్షమిం—"

సోమూకు నోరు లేవలేదు. బెల్లంకొట్టినరాయి వలె కూర్చున్నాడు. హఠాత్తుగా దూరాన నవ్వులు విని తలయెత్తి చూచాడు. కమలసహాధ్యాయినులు నవ్వుకుంటున్నారు.

సోమూ దడబిడగా లేచి అన్నాడు— "చెయి ఒరుసుకుపోయింది. టించెర్ ఆయొడీన్ పట్టీ—" అని చుట్టకున్నట్టు చెయి త్రిప్పుతూ మెల్లగా జారుకున్నాడు

కొంతదూరం పోయి సోమూ ఒకమాటు తిరిగి చూచాడు. కమల తలవంచుకు నిలబడిఉంది.

*  *  *

సోమూ మూడో అంతస్తు కెక్కి చూచాడు— వదినె కమలగీసిన చిత్తరువు చూస్తూ నవ్వుతూంది. సోమూ అన్నాడు-"వదినా, సర్వనాశన మయింది!"

వదినె గాభరాపడి అడిగింది—"ఏమయింది?"

సోము పక్కమీద చిత్తుగా పండుకొని అన్నాడు—"నారీ నిర్యాతనం."

వదినె భయంతో అడిగింది-"నీ నటన చాలించి, అర్థం అయేటట్టు చెప్పు, మరిదీ!"

సోమూ కళ్లు మూసుకొని చెప్పసాగాడు-"అయితే వింటావా? విను! సోమూ అనే పేరు గల కుర్రవాడొక డున్నాడు—" తరువాత కథంతా వినిపించాడు.

వదినె అంతా విన్నాక అంది - "చిత్రం వచ్చిన నాడే చెబితే, మరిదీ, ఆపిల్లకు చక్కని జవాబు ఇచ్చేదాన్ని. ఇప్పుడైనా ఏమీ మించిపోలేదు. నే నా పిల్ల తిక్క అణుస్తాలే!"

మరునాడు సోమూ సరిగా పదింటికి స్కూలుకు వెళ్లాడు. కమల కనపళ్లేదు. కమల సఖులిద్దరూ మాత్రం సోమూను చూచి నవ్వారు. చేయెత్తి నమస్కారం కూడా చేశారు.

ఆ మర్నాడుకూడా కమల రాలేదు.

ఈ మధ్యలో భార్యతంతి చూచుకొని సోమూ అన్న చప్రానుండివచ్చాడు. కమలఉత్తరంలో ఉన్న చిరునామానుబట్టి వదినెనాయనమ్మలు ఒకసారి కమల యింటికికూడా పోయివచ్చారు.

ఫలితం, సోమూఅన్నా కమలమామా యాదృచ్ఛికంగా బజారులో కలుసుకుని గంటన్నరసేపు మాట్లాడారు.

తరువాత ఒకరోజున కాలేజీలో కమల సోముకు కనపడి చీరచెరగు నెత్తిమీదికి లాక్కోబోయింది. బ్రూచ్ పెట్టి ఉండటంవల్ల చెరగు నెత్తిమీదికి రాలేదు. విధిలేక ముఖంమాత్రం క్రిందికివంచుకొని అత్యంతనిరీహప్రాణివలె కూలబడింది. సోమూ చూడనట్టుగా పెన్సలు చెక్కుకుంటున్నాడు.

ఆఖరుకు, ఒకసామాన్యస్త్రీని వశపరచుకోవటానికై ఒకనాటి సాయంకాలం టాక్సీ ఎక్కి, దుర్యోధనవేషంతో (పెళ్లికొడుకై) బంధుమిత్రాది సైన్యాలను సమకూర్చుకొని, కమలమామ హోరాన్ మజుమ్దారు యింటిని శ్రీయుత సోమేన్ చంద్రసమద్దార్ ముట్టడించాడు.

(బెంగాలీకథకు అనువాదము.)

— చక్రపాణి



మార్వారీ నాట్యము

# వీరేశలింగకవి - నిర్యాణము

గోబ్బూరు వేంకటానంద రాఘవరావు

●●●

౧

నిన్నగాక మొన్నటివలె ఉన్నది నాకు— కాని లెక్కించిచూడగా, అప్పుడే పదునెనిమిది సంవత్సరము లైపోయినది — వీరేశలింగముగారు దివంగతులై నేటికి.



వారు ౧౯౧౯ సంవత్సరము మే నెల ౨౭ తేదీ ఉదయము గం. ౮. ౨౦ మినిట్లకు కాలధర్మము నొందిరి. వారి చివరదినములలో నేను వారిబసలో [illegible] ఉండుట తటస్థించినది. కావున ఈ నిర్యాణకథ కొంచెము విపులముగా వ్రాయుటకు నాకు అవకాశములు లభించినవి.

మనము ౧౯౧౯ సంవత్సరము మే నెలలో జరిగిన కొన్ని విశేషములు తెలిసికొనుట ఈకథకు ముఖ్యము. కావున, వానినిట సంగ్రహముగా తెలిపెదను.

శ్రీ మునగాల రాజావారిపై వారి బంధువు లెవరో ౧౯౧౮. సంవత్సరములో వ్యాజ్యము దాఖలుచేసిరి. ఆ వ్యాజ్యము ౧౯౧౯ సంవత్సరము మార్చి, ఏప్రిల్ నెలలలో మద్రాసు హైకోర్టులో విచారణకు వచ్చెను. శ్రీ రాజావారి దివానుగా నుండిన శ్రీ కొమర్రాజు వేంకట లక్ష్మణరావు పంతులుగారు, ఈ వ్యాజ్యపుపని చూచుచు, ఆంధ్ర సారస్వత సేవ చేయుచు బహు సంవత్సరములు మద్రాసు - ఎగ్మూరులో వేదవిలాస మను భవనమున కాపుర ముండిరి. శ్రీ వీరేశలింగము పంతులుగారు అంతకు పూర్వము రచించిన ఆంధ్రకవుల చరిత్రలో ౧వ సంపుటమును పెంచి పునర్ముద్రితము చేసి ప్రకటించియుండిరి. రెండవ సంపుటము [illegible]యుండెను. ఆంధ్ర

భాషాసేవకు లగు లక్ష్మణరావుగారు ఈ యాంధ్రకవుల చరిత్ర రెండవ సంపుటము విస్తరించి వ్రాయుడని వీరేశలింగముపంతులు గారిని ప్రోత్సహించి, తా మున్న వేదవిలా సమునందు వీరేశలింగముగారికి బస యేర్పాటుచేసిరి. ఆ కారణముచేతనే వీరేశ లింగముగారు అవసానకాలమున వేదవిలాస భవనమున నుండుట తటస్థమైనది.

౧౯౧౯ సంవత్సరము మేనెల మొదటి వారములో మద్రాసు హైకోర్టువారు మున గాల కేసులో రాజావారి పక్షము తీర్పు చెప్పిరి.

ఆ సంవత్సరములోనే చెన్నపురి ఆంధ్ర సభవారు ఆంధ్రవచనరచనాదశా పరిణా మము (Development of Telugu prose Literature) ను గురించి వ్యాసములు వ్రాయించి జరిపించిన పోటీపరీక్షలో ప్రథమ బహుమానముగా నాకు రావుబహద్దర్ కల వల కణ్ణను శ్రేష్ఠిగారి రత్నఖచిత స్వర్ణపత కము నొసంగిరి. నావ్యాసమును పరిశీలించిన లక్ష్మణరావుపంతులుగారు, అముద్రిత ఆంధ్ర గద్య వాఙ్మయమును పఠించి, వ్యాసమును నేను విస్తరింపజేయవలసియున్నదని సెల విచ్చి, నేను చెన్నపురిలో కొన్నిమాసము లుండి తాళపత్రాది గ్రంథ పరిశోధనము జేయుట కగు వ్యయముక్రింద కొంత పైక మిప్పించి, వేదవిలాసములోనే నేనుకూడ ఉండుటకు మేడదిగువ నొకగది యిచ్చి బస ఏర్పాటుచేసిరి. నాసోదరుడు తిరుమలరావు అపుడు తాత్కాలికముగా ప్రెసిడెన్సీ మేజ స్ట్రేటు కోర్టులో ట్రాన్సులేటరుగా నియ మింపబడినందున, వాడును నాతో కూడ వేదవిలాసపు దిగువగదిలో నుండెడివాడు.

హైకోర్టువారు తీర్పుచెప్పిన కొలదిదిన ములలోనే లక్ష్మణరావు పంతులుగారు, జమీందారీ వ్యవహారములు స్వయముగా చూచుకొనుటకు సకుటుంబముగా నడి గూడెమునకు వెడలిరి. వీరేశలింగము పంతులుగారు వేదవిలాసపు మేడమీద నుండి ఆంధ్రకవులచరిత్ర రెండవ సంపుటమును విస్తరించివ్రాయ నారంభించిరి. నేను ఓరి యంటల్ లైబ్రరీలో నున్న ప్రాచీనాంధ్ర వచనగ్రంథపరిశోధన చేయుచుంటిని.

౨

వీరేశలింగము పంతులుగారు శ్రీ కృష్ణ దేవరాయలవారినిగూర్చి ౧౮ పుటలు మాత్రము వ్రాసిరి. అంతలో వారి దృష్టి మరొక వంకకు మరలవలసివచ్చెను.

ఆంధ్ర పత్రిక సంవత్సరాదిసంచికలు ఇప్పటివలె అప్పుడు సంవత్సరాదినాటికి సరిగా తయారగుట లేదు. మేనెలలోగూడ క్రొత్తవ్యాసములు వచ్చుచునే యుండెను. సిద్ధార్థి సంవత్సరపు (౧౯౧౯) సంచికలో ఆంధ్రవాల్మీకి వావిలికొలను సుబ్బారావు గారు బమ్మెరపోతరాజు ఒంటిమిట్టలో నివ సించుచుండె నని ఋజువుచేయుటకు ఒక వ్యాసము వ్రాసిరి. ఆ వ్యాసముయొక్క ముద్రితప్రతి యొకటి ఆంధ్రపత్రికవారు వీరేశ లింగముగారి కందిచ్చి, వావిలికొలనువారి

వ్యాసమును ఖండించుచు వారు మరొక వ్యాసము వ్రాసినయెడల ఆ సంచికలోనే రెండువ్యాసములను ముద్రించి ప్రకటింతు మని విన్నవించిరి. వీరేశలింగముగారు సరే అని అందు కంగీకరించి ఖండనవ్యాసము వ్రాయ నారంభించిరి.

ఆ వ్యాసము పూర్తి కాకపూర్వమే వీరేశలింగముగారికి జ్వరము తగిలెను. అది క్రమముగా ఇన్‌ఫ్లూయెన్జా (Influenza) సంబంధమైన విషజ్వరముక్రింద పరిణమించి నది. డాక్టరు లక్ష్మీపతిగారు వారికి మందిచ్చుచుండిరి.

జ్వరముతోనే పనిచేసి పంతులుగారు వ్యాసము పూర్తిచేసి, వ్రాతప్రతిని నా ద్వారా ఆంధ్రపత్రికాధిపతులకు పంపించిరి. మరి రెండు మూడు రోజులలో (Proof) ప్రూఫుచిత్తు వచ్చినది. అది పట్టుకొని నేను వారివద్దకు వెళ్లితిని. అప్పటికి వారి టెంపరేచరు నూటనాలుగు డిగ్రీలు (౧౦౪°); వడ్లగింజ వేసిన పేలగింజ మై ప్రేలునంతటి వేడిమితో కూడిన దారుణజ్వరముతో వారు మిక్కిలి ఆయాసపడుచుండిరి. వారి కనుకొలకులనుండి నీళ్లు కారుచుండెను. అట్టి సమయములో వారు ప్రయాసపడుట కిష్టము లేక "అయ్యా! ప్రూఫు వచ్చినది. దిద్దమని సెలవా?" అని విన్నవించితిని.

"వద్దు. నేనే దిద్దుకుంటాను. ఇలా తెండి" అన్నారు వారు.

"జ్వరం తీవ్రంగా ఉన్నది. నేను చదువుతాను. తాము వినండి. తమరు చెప్పినట్లే దిద్దుతాను. తాము ఇప్పుడు ఎక్కువగా ఆయాసపడకూడదని నామనవి" అంటిని.

"మరొకరు దిద్దితే నాకు తృప్తిలేదు. నాప్రూఫులు నేనే దిద్దుకోవాలి. ఏ మంత ఆయాసం లెండి. తెండి" అని ఆయన ఆ ప్రూఫు కాగితములు నాచేతినుండి తీసికొని సులోచనములు పెట్టుకొని స్వయముగా దిద్దుట కారంభించిరి. ఆమహనీయుని అప్పటి మూర్తి నా కిప్పుడు కనులకుకట్టినట్లున్నది. వణకుచున్న చేతులతో ఊటకలము తీసి, పట్టుకొని, "మొట్టమొదట మే మిక పనిచేయజాల" మనుచు ఏడ్చుచున్నట్లున్న కన్నులనుండి వెడలు నశ్రువుల నరికట్టి, జ్వరతాపము లక్ష్యముచేయక, ఎప్పుడైనను, ఏ విషయము నందైనను, తనదే మాట, తాను పట్టినపట్టే సాగితీరవలె నను దృఢసంకల్పసంభవ మైన మహాదీక్షతో, అవసానసమయమున గూడ తన వ్యాసముయొక్క అచ్చుచిత్తులను తానే స్వయముగ దిద్దుకొనినగాని తనయాత్మకు సంతోషము లేదనుచు, త్రికరణశుద్ధిగా నాంధ్రమాతనే సేవించుచు ధన్యుడైన ఆ భాషాసేవకుని దివ్యస్వరూపము ఎవరి మానస సీమలందు నిలుచునో వార లందరకును మాతృభాషాసేవవిషయమున ఎప్పటికప్పుడే నూతన చైతన్యోత్సాహములు ప్రేరేపితములు కాకమానవు.

నేను వీరేశలింగము పంతులుగారిని పెక్కుసారులు అనేకసందర్భములలో చూచితిని. వారి హైస్కూలులో కొన్ని మాసములు ఉపాధ్యాయుడనై పనిచేసితిని. ఇటీవల

రాజమహేంద్రవరమున స్థాపింపబడిన వారి శిలావిగ్రహమును చూచితిని. కాని, ఆనాడు కడసారి ప్రూఫులను దిద్దుచున్నప్పుడు నా కనులకు పొడగట్టిన ఆతని దివ్యస్వరూప ముతో తక్కిన వేవియు సాటిరావు. ఆమహో త్కృష్టమూర్తియే నామానససీమను సుప్ర తిష్ఠితమై నా కెన్నటికిని మరపునకు రాకు న్నది. "మాతృభాషా సేవాదీక్షకును మన శరీర సౌఖ్యలాలనత్వమునకును చాల దూర మున్నది సుమీ" అను సందేశమును సదా చాటుచున్న ట్లున్నది ఆ పుణ్యమూర్తి!

## 3

ఆ సాయంకాలము ఐదు గంటలకు నేను లైబ్రరీనుండి బయలుదేరి బసకు తిరిగి వచ్చి తిని. వచ్చునప్పటికి డాక్టరు లక్ష్మీపతిగారు కల్వము చేపట్టి ఘాటుమందు నూరుచుండిరి.

"ఏ మది నూరుచున్నారు, డాక్టరు గారూ?" అని పలుకరించితిని.

"Musk and absolute alcohol" (కస్తూ రిన్నీ నీటిబొట్టుకలియని బ్రాందీన్నీ) అని వారు మారుపల్కిరి.

నే నది విని నిశ్చేష్టితుడనై నిలచితిని.

"మీా రిట్లు నిలబడుటవలన లాభము లేదు. పంతులుగారీ రాత్రి గడిచి బ్రదుకుదు రని తోచదు. మీారు ఈ టెలిగ్రాములు త్వరగా పోస్టాఫీసులో అందిచ్చివచ్చి, భోజ నముచేసి, వెంటనే మైలాపూరు వెళ్లి నాగే శ్వరరావు పంతులుగారిని తీసికొనిరావలెను" అనుచు నాచేతికి అయిదు రూపాయలనోటు ఇచ్చిరి. ఆ టెలిగ్రాములలో నొకటి రాజ మహేంద్రవరము పాలావఝుల లక్ష్మీనారా యణగారి కని వ్రాయబడెను. రెండవ దెవ రికో జ్ఞాపకము లేదు.

వీథిలోనికి రెండడుగులు వెళ్లునంతలో మాతమ్ముడు బసకు వచ్చుచుండెను. పంతులు గారి శరీరస్థితి చెప్పి, టెలిగ్రాము లిచ్చిరమ్మని ఫారములును, పైకమును వానిచేతికిచ్చి నేను హోటలుకు వెళ్లితిని.

భోజనము ముగించుకొని ట్రామునెక్కి మైలాపూరు వెళ్లితిని. నాగేశ్వరరావు పంతులుగారు అపుడు రెంటాల House లో నుండిరి. గుఱ్ఱపుబండియే గాని మోటారు కొనలేదు. నేను వెళ్లి తలుపు తట్టితిని. అప్పుడే భోజనము చేసి విశ్రమించ పోవుచు నాగేశ్వరరావుగారు స్వయముగా తలుపు తీసిరి. వీరేశలింగముగారు ఆ రాత్రి బ్రతు కుట కష్ట మనియు, తాము విచ్చేయక తప్ప దని లక్ష్మీపతిగారు సెలవిచ్చిరనియు విన్న వించితిని. తొలిరోజున బెజవాడలో కాం గ్రెసు కమిటీ మీాటింగుకు హాజరయి పంతులుగారు ఆయుదయమే తిరిగి వచ్చిరి. మెయిలు మూడుగంట లాలస్యమైనది. వారి బండితో గుఱ్ఱము మొదట స్టేషనుకు పోయి వచ్చినది; పిమ్మట పత్రిక ఆఫీసుకు పోయి వచ్చినది; జీవదయాపరు లగు పంతులుగారు అలసియున్న తమ గుఱ్ఱమును మరల శ్రమ పెట్టుటకు అంగీకరింపక జటకాబండి తెమ్మ నిరి. రాత్రి తొమ్మిదిగంటలకు మే మిరువుర మును వేదవిలాసము చేరుకొంటిమి.

౪

వీరేశలింగముగారు పండుకొనియున్న గదిలోనికి నాగేశ్వరరావు పంతులుగారు తొందరగా ప్రవేశించి, నమస్కారము చేసి "ఏమి సెలవు ?" అని అడిగిరి. వీరేశలింగముగారు ప్రతినమస్కారము చేసిరి. కాని, మాటాడ ప్రయత్నించియును మాటలాడలేకపోయిరి. "ఏమిచెప్పదలచిరో? ఏమో? పాపము, నోరాడకపోయెనుగదా ?" అని మిక్కిలి చింతించితిమి.

నాటిరాత్రి కవసర మగునని తోచిన మందు లన్నియును లక్ష్మీపతిగారు పెట్టెలతో తెచ్చిపెట్టుకొనిరి ; తమ మోటారును, గుఱ్ఱపుబండినిగూడ వారు వేదవిలాసపు గుమ్మముకడ నుంచిరి ; ఇంకను అవసరమని తోచిన మందులు ఆలస్యము లేకుండ కోరిన తత్క్షణము అందిచ్చునట్లు హూంటురోడ్డు, బ్రాడ్వే మందులషాపులవారితో ఏర్పాట్లు చేసిరి. గడియలు, గంటలు అనకుండ అవసర మని తోచినపుడెల్ల మందులు వేయుచు, ఇంజెక్షను లిచ్చుచు డాక్టరుగా రెంతో ప్రయాసపడిరి.

మధ్య నొకమాటు కొంత చర్చలోనికి దిగి మాతో వేదాంతము మాటలాడిరి. "Mystery of life and the Mystery of Death ఇదమిత్థమని సరిగా సాధించిచెప్పిన వా రెవ్వరును లేరుకదా ? ఇదిగో ! ఈమహనీయుడు డెబ్బదిసంవత్సరములుపైగా జీవించి, అనేక విధముల దేశమునకు గొప్ప సేవ చేసినాడు; త్వరలో మనలను వీడిపోవుచున్నాడు. పోకుండ ఆపుటకు సాధనము కనబడకున్నది. మనల విడిచి ఈప్రాణి ఎక్కడకు పోవునో ? ఏమగునో ? ఏమో ? రూఢిగా చెప్పగలవారు లేరుగదా ? Here we are three of us. Myself a Doctor. Mr. Nageswara Rao, experienced Editor and Proprietor of our only Telugu Daily; and you a budding young lawyer. None of us can say anything.

నేను-"Hamlet చెప్పినట్లు No traveller hath ever returned from that realm of Death. మృత్యులోకం చూచి, అక్కడనుండి తిరిగివచ్చి, స్పష్టముగా ఇది అని తెలిపినవారు లేరు. The rest is silence. పోయినతరువాత అంతా గుప్ చుప్-నిశ్శబ్దమే. తత్త్వవేత్తలు, వేదాంతులు, కవులు అందరును తమ ఊహాలను చెప్పిరే కాని మృత్యురహస్యముయొక్క యథార్థము నిరూపింపలేకపోయిరి. అనాదినుండియు అందరి మనస్సులను ఈ సమస్య కలవరపెట్టుచునే యున్నది. ఇపుడు మీరు వీరి విషయము ముందు చెప్పగలుగుచున్నారు కాని ఆకస్మికముగా ఎందరు పోవుచున్నారు !"

లక్ష్మీపతిగారు-"ఒకప్పుడు మాకును ముందు తెలియదు. మైనంపాటి నరసింహంగారి తండ్రిగారికి జబ్బుచేసినది. ప్రమాద మైన దశకాదు. నేనే treat చేయుచుంటిని. ఒకనాడు ఏమైనదంటే : patient పండుకున్న పక్క clean గా లేదు; bed మార్చి cleanగా మరొకపక్క వేయించమంటిని. మరొక మంచం, పరుపు, దానిమీద clean

bed sheet వేసినారు; patient ను ఈ మంచముపై నుండి ఆ మంచము మీదకు మార్చుటలో — మరేమున్నది? వాచీ ఆగిపోయినది - heart stop అయినది"

అనిన యీ తీరున ఆకస్మికపు చావులు, దీర్ఘ జాడ్యములు, ఎందరెందరివో మరణములు, ఉపనిషద్వాక్యములు, వేదాంతుల భావములు ఎన్నెన్నో చర్చించితిమి. Addison వ్రాసిన Vision of Mirza (మీర్జా స్వప్నవృత్తాంత మను కథ) చెప్పుకొంటిమి. రాత్రి మూడుగంట లయినది. డాక్టరుగారు మరొక ఇంజెక్షను ఇచ్చిరి. అందువలన ప్రయోజనము కనబడదయ్యెను; కనిపెట్టి చూచుచుంటిమి. నాలుగుగంటలు కావచ్చెను.

"Now I am giving him what I suppose will be the last thing we can give for him సరి- దీనితో ఆఖరు" అనుచు డాక్టరుగారు ఒక చమిచాపాలు, ఒక చమిచా నీళ్లు, ఒక చమిచాతో మందు మూడును కలిపి రోగినోటిలో పోసిరి. ఆద్రవము ఆయన గొంతుక దిగినది. దిగదని నిరాశతో నున్న నాకు ఆమందు దిగుటవలన కొంత ఆశ కలిగినది.

"దైవకృపవల్ల జీవించవచ్చును. మందు దిగినది కదా?" అని నేనంటిని. "దిగినది. కాని బ్రదుకుట దుర్లభము. He is fast sinking" అని డాక్టరుగారు చెప్పిరి.

మేము ప్రసంగములు మాని వీరేశలింగముగారి వంకనే చూచుచుంటిమి. శ్వాసము మందమగుచుండెను. ఆఖరున రెండుసారులు చిన్నగుటకతో నిశ్శ్వాసము వినవచ్చెను. పిమ్మట శ్వాస మాగిపోయెను. ఆతని యాత్మ భౌతికదేహమును విడిచి పోయెను. అప్పుడు సరిగా నాలుగుగంటల ఇరువది నిమిషము లాయెను.

లక్ష్మీపతిగారు పసుపుతో కొన్ని మందులు కలిపి దేహమునకు పట్టించిరి. "వారము రోజులనుండి నాకు ఏమీ Rest లేదు. వెళ్లివస్తా" నని డాక్టరుగారు వెడలిరి. "పత్రికలో ప్రధానవ్యాసము వ్రాయించవలె" నని వీరేశలింగముగారిబ్లాకు వెదకి పట్టుకొని "వెళ్లివస్తా"నని నాగేశ్వరరావు పంతులుగారు వెడలిరి. శవమువద్ద నేను మాత్రము కాపుంటిని.

వీరేశలింగముగారు మా తండ్రిగారికి గురువులు. నాకే కాక సకలాంధ్రలోకమునకును పూజ్యులు. ఏ సుకృతము చేతనో నాకు ఆ శవముకడ కాపుండు నదృష్టము లభించినది. పంతులుగారి మరణవార్త శ్రీ పిఠాపురంమహారాజావారికి ఫోనులో తెలుపబడెనట. వేసవిసెలవు లగుటచేత హైకోర్టును, కాలేజీలును మూయబడియుండెను. కావున నేనొంటరిగా ఆశవముకడ కొన్ని గంట లుండవలసివచ్చెను; లేకున్న సినుక వేసిన రాలుటకు తెరపిలేకుండ జనము క్రమ్ముకొనియుండరా!

౫

పదునొకండు గంటలైనది. తేకుమళ్ల రాజగోపాలరావు పంతులుగారు మొదట వచ్చిరి. వారికి మరణవార్త తెలియదు. మేమొండొరులకు నమస్కరించుకొనిన పిదప "ఎట్లున్నారు పంతులుగారు?" అని వారు ప్రశ్నించిరి. ఉదయము ౮-౨౦ కి

పోయినారు" అంటిని. "పోయినారా!? పంతులుగారు పోయినారా?" అని రెండు సారులు ప్రశ్నించిరి. శవమును చూపితిని. వెనుకటి సంగతు లెన్నెన్నో జ్ఞప్తికి తెచ్చుకొని, చాలసేపు విచారించి, మరల వచ్చెదనని చెప్పి రావుగారు గృహోన్ముఖులైరి. పిమ్మట ఒక లేడీడాక్టరు (బహుశా ముద్దు లక్ష్మి రెడ్డిగారు కావచ్చును.) వచ్చి, పంతులుగారి శవమును చూచి, విచారించి వెళ్లిరి.

అక్కడినుండి రెండు గంటలవఱకును ఎందరో Under takers వచ్చి "Order ఇవ్వండీ, సార్, Coffin ½ hour లో తెస్తాము" అని అడుగవచ్చిరి. వీరేశలింగము గారు మొదట శైవులు; పిమ్మట యజ్ఞోపవీతమును విసర్జించిన బ్రహ్మసామాజికులు. దహనమో, ఖననమో - కర్తవ్య మేమో నాకు తెలియలేదు. ఖనన మైనచో పెట్టెలో పెట్టి ఖననము చేతురో లేదో నాకు తెలియదు. నే నేమి చెప్పుటకును స్వతంత్రము లేదు. పెద్దలు వచ్చిన తరువాత మరల రమ్మంటిని. ఆ కంపెనీల తరఫు మనుష్యులు ౧౦ నిమిషముల కొకసారి వచ్చి "ఏమండీ" సార్, పెద్దలు వచ్చినారా.' అని నన్ను వేపుకొని తినుచుండిరి పంతులుగారు రచించిన 'తిర్యగ్విద్వన్మహాసభ' అను ప్రహసనమపుడు నాకు జ్ఞప్తికి వచ్చినది.

౬

మధ్యాహ్నము మూడుగంట లైనది. బ్రహ్మశ్రీలు, చెన్నాప్రగడ భానుమూర్తి పంతులుగారు, నాగేశ్వరరావు పంతులుగారు, లక్ష్మీపతిగారు, ఆంధ్రపత్రిక సంపాదకులు శేషగిరి రావు పంతులుగారు, గాడిచర్ల హరి సర్వోత్తమరావుగారు, అక్కిరాజు ఉమాకాంతంగారు, పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రిగారు, దంటు సుబ్బావధాని గారు లోనగు పెద్దలందరును వేదనిలాసమునకు వచ్చిరి. వీరేశలింగముగారి శవమును రాజమహేంద్రవరము తీసికొని వెళ్లుటకు ప్రయత్నించిరట కాని అది సాధ్యము కాలేదట. తుదకు చెన్నపురిలోనే దహనసంస్కారము చేయుటకు నిశ్చయింపబడెను. శవమునకు స్నానము చేయించి కట్టెకుపై నెక్కించిరి. భానుమూర్తి పంతులుగారును, నాగేశ్వరరావు పంతులుగారును ముందు రెండుకొమ్ములను పట్టి వీరేశలింగము గారియందు తమకు గల గౌరవమును ప్రకటించిరి. తోడనే మరికొంద రాయత్తపడి తక్కిన కొమ్ములను భుజములపై నిడికొనిరి. భగవన్నామస్మరణము చేసికొనుచు మరి ముప్పదిమంది జనము వెనుక వచ్చుచుండిరి. బంగాళాదేశమునుండి వచ్చిన ఒక బ్రహ్మసమాజికుడు పాదరక్షలు విడిచి, పాటలు పాడుచు ప్రక్కను నడచుచుండెను. అవసరమైనపుడు భుజములు మార్చుకొనుచు సుమారు రెండుమైళ్ల దూరము నడిచి ప్రేతభూమి చేరితిమి. పిడుకలతో చితి పేర్చి దానిపై శవమును పరుండబెట్టి, కంఠమువరకును మీద పిడుకలు పేర్చిరి. పిమ్మట Funeral Orations చెప్పుటకు ప్రారంభించిరి. వీరేశలింగము పంతులుగారి ఆత్మ గతరాత్రియే భౌతికదేహమును వీడెననియు, ఇక నాదేహముకూడ త్వరలో అగ్నికాహుతియై మనకు మరి కనబడదనియు, బహువిధముల ఆంధ్రసేవ చేసి, నూతనయుగ మేర్పరచి ధన్యులైన పంతులుగారి నామము ప్రాతస్స్మరణీయ మనియు

ఆంధ్రపత్రికా సంపాదకులు శేషగిరిరావు గారు చెప్పిరి. మరికొందరు వక్తలుకూడ అదేతీరున మాటలాడిరి. ఉమాకాంతము గారు మాటలాడుచు "వీరేశలింగముగారు పండితు లనియా, కవి యనియా, సంఘ సంస్కర్త అనియా? ఏవిధముగా మనము వారిని స్మరింపవలసియుండు" నని ప్రశ్నించుచు ఉపన్యసించిరి. ఆతరువాత చితికి అగ్నిస్పర్శ మైనది. జ్వాలలు నలుప్రక్కలను వ్యాపించినవి. పంతులుగారి భౌతికశరీరము భస్మము కాజొచ్చినది. మేము మరలితిమి.

* * * *

వీరేశలింగముగారిని గూర్చి పత్రికలలో ప్రధాన వ్యాసములును, ఇతర వ్యాసములును ప్రకటింపబడినవి. వారి మరణవార్త తెలిసిన వెంటనే నడిగూడెమునుండి కొమఱ్ఱాజు లక్ష్మణరావు పంతులుగారు నాకు వ్రాసిన లేఖ ఈదిగువ నిచ్చుచున్నాను.

నడిగూడెము 30-5-1919.

ప్రియరాఘవరాయా!

వీరేశలింగము పంతులుగారు ఆకస్మికముగా దివంగతులైనవార్త వినగానే నాకు కలిగిన విచారము ఇంతింత యని తెలుపజాలకున్నాను. నా గుండె చెక్కలైపోయినది. నిన్న సాయంకాలము మేము విందు చేసికొనుటకు ఏర్పాట్లు చేసికొంటిమి. ఈ మరణవార్త తెలియగానే వేడుకలపై బుద్ధి పుట్టక మే మవి మానుకొంటిమి. నేను తిరిగి చెన్నపట్నము చేరకముందే ఆ మహాపురుషుడు కాలధర్మము నొందునని నే నెన్నడును అనుకొనలేదు. ఆయన మరణము వలన ఆంధ్రలోకమునకు తీరని లోపము వాటిల్లిన దనుటకు సందేహము లేదు. నామట్టుకు నాకు వ్యక్తిగతముగా కలిగిన నష్టము అపారము. 1900 సంవత్సరములో నాకు వారితో పరిచయభాగ్యము లభించినది. నాకు ఎల్లప్పుడును వారియందు అత్యంతమైన గౌరవము కలదు. తీరా చివర దినములలో నేను ఇక్కడకు విధిలేక వచ్చివేసితిని. అందువలన నేను అవసానకాలమునందు వారి కేమియు ఉపచరింపజాలనైతిని గదా యని మిక్కిలి విచారించుచున్నాను. వేదవిలాస భవనపు యజమానులు మీవద్దకు వత్తురేని, ఇల్లు నా క్రిందనే ఉన్నట్టును, నేను జూన్ నెలాఖరుకు అద్దెవగైరాలు చెల్లింతునని చెప్పవలెను. మీరు ఆయింటిలో స్వేచ్ఛగా ఉండవచ్చును...... ఇట్లు

కొ. వేం. లక్ష్మణరావు.

---

Nadigudem, 30—5—1919.

Dear Raghava Rau,

I am unable to express my feeling of sorrow at the news of the sudden death of Mr. Viresalingam Pantulu Garu. It is a shock to me. An entertainment was arranged yesterday evening and when the news came in we gave it up; could not proceed with it. I never thought that the great man would be no more before I would return to Madras. The Telugu world has no doubt suffered irreparable loss but my personal loss is heavy. Our personal acquaintance commenced in 1900 and I have always entertained the highest respect for him. I am so sorry that I was of no use to him in his last days; I had to go away to this place. As for the house, you can tell the house owner's people, if they chance to go to you that it would be under me and that the rent etc. would be paid when I go there by the end of June. You can remain undisturbed............Yours sincerly.

(sd) K. V. Lakshman Rau.

# తెలుగువారిచరిత్ర ౨౦౦౦ ఏండ్ల క్రిందట నారంభమైనది

తేకుమళ్ల రామచంద్రరావు



'భారతి' ఆంగీరస సం. వైశాఖమాసపు (మే నెల ౧౯౩౨ సం.) సంచికలో సూర్యారాధనసమన్విత మహా విజ్ఞానము (Haebolithic culture) దక్షిణ భారతదేశమున క్రీ. పూ. ౫౦౦౦ మొదలు ౩౦౦౦ సం. ప్రాంతములందు ప్రబలియుండెనని వ్రాసియుంటిని. ఆ కాలమున ఆంధ్రదేశాదులను దక్షిణభరతఖండదేశములందెవరు నివసించుచుండిరి, వారి పుట్టుపూర్వోత్తరము లెవ్వి, వారి నాగరకత ఎట్లుండెను, అందలి విశేషము లెవ్వి అను విషయములనుగూర్చి ఈ వ్యాసమును వ్రాయబూనితిని.

### కోయలు - వారికాలము

సూర్యుని పాములను ఆరాధించుట, మానవుల శవములను భద్రపరచుట, రాతికంబములను నిలువబెట్టుట, పచ్చపొడిపించుకొనుట మొదలగునవి సూర్యారాధన సమన్విత మహా విజ్ఞానమున ముఖ్యాంగములయి యున్నవి. నేటికిని ఆంధ్రదేశమునను తత్పరిసరభూములందును నివసించుచు 'గాంకులు' అను పేరుతో వ్యవహరింపబడుచున్న కోయవారియందీ విజ్ఞానము విరివిగ వ్యాప్తమయియుండినట్లు అనేక నిదర్శనములు గోచరించుచున్నవి.

కోయలదేవతలలో సూర్యుడొకడు. ఈతని 'నారాయణ' దేవుడను పేరుతో వారు వ్యవహరింతురు. మనకు నారాయణుడు సూర్యాంతర్గతుడు; సూర్యుడాతనికి లోబడిన వాడు. కోయలకు సూర్యుడే నారాయణుడు.

నాగదేవుడు అను త్రాచుపాము రూపము గల దేవుని కోయలారాధింతురు. ఇంతే గాక వారిలో గల పెక్కుతెగలందొకటి 'నాగవంశము'. మరావి, పోతారి, కరంగ, సురెతి, ధుర్వా అను పేరులు గల అయిదుకులములవారును ఈ నాగవంశమునకు జెందినవారే.

శవములను భద్రపరచుటకు గాను కొన్ని లేపములను భారతదేశమునసేకాక ప్రపంచమున ననేక భాగములందుపయోగించుచుండిరి. కోయలలోగూడ నొకరకపులేపము వాడుకలో నుండెను. చనిపోయినవాని దేహము మొట్టమొదట పరిశుభ్రముగ కడిగివేయబడుచుండెను. పిమ్మట మృతకళేబరముపై పాలను ఒత్తుగ చిలికి, బొగ్గును పసుపుకొమ్ములను వేఱువేఱుగ పొడియగునట్లు చేసి ఈ రెండు పొడులను ఇప్పనూనెలో కలిపి రంగరించి శవమునకు పట్టించెడివారు.

గతించిన తమపూర్వులయెడ గౌరవమును జూపుటకుగాను రాతికంబములను నిలువబెట్టుట యను నాచారము సూర్యారాధనసమన్విత మహా విజ్ఞానము వెల్లివిరిసిన అన్ని దేశములందును గానవగును. రాతికంబములను గాని, పొడుగైన శిలలనుగాని, కొన్నియెడల పొట్టి రాళ్లనుగాని కోయలు నిలువబెట్టుచుండిరి. ఈ శిలలకు ముందువైపున చనిపోయిన తమ పూర్వికుడు హాయిగ నప్పుడప్పుడు కూర్చుండుటకై అరుగులు నిర్మించబడుచుండెను. అప్పుడప్పుడు ఆ శిలలదగ్గరకు చనిపోయినవాని

బంధువులు పోయి ఆశిలలకు పెరుగు, నేయి, ఇప్పనూనె, పసుపు మొదలగు పదార్థములను రాయుచుండెడివారు.

పచ్చ పొడిపించుకొనుట కోయలలో నెక్కువగ ప్రబలియుండెను. ఇందుల కుదాహరణముగ నొక్క యాచారమును మాత్రము పేర్కొందును. వారి బాలికలు రజస్వల లైనప్పుడు నాలుగుదినములు విడిగనుండి, అయిదవనాడు స్నానముచేసి నల్లకోడిని దేవతలకుబలియిచ్చినపిమ్మట దేహమున కిరుప్రక్కలను పచ్చపొడిపించుకొందురు. దీనివలన నాయువతికి కడుపునిండ కడుపెను బిడ్డలు పుట్టుదురని కోయల నమ్మకము.

పై విషయములనుబట్టి క్రీ.పూ. ౫000 మొదలు 3000 సం.వఱకు ఏనూర్యారాధనసమన్విత మగు విజ్ఞానము దక్షిణభారతదేశమున వ్యాపించియుండెనో ఆవిజ్ఞానముగల కోయలకాలము నిర్ధారణయగుచున్నది. ఇంతేగాక ఈ కాలనిర్ణయమున కితరాధారములును గలవు.

కోయలు 'రావణవంశము' వారమని చెప్పకొందురు. ఈప్రతీతి గ్రంథస్థమును, సంప్రదాయసిద్ధమును నైయున్నది. కోయలు విరివిగనున్న మన్యపరగణాలయందలి 'భానువారఘుర్' అనునూరి రాజు మదాంధుడై కోయల నేదోబాధపెట్టెను. అప్పుడారాజును కోయలు "అదే మారావణుడు వచ్చుచున్నాడు, నిన్ను చంపనున్నాడు" అని పాటలు పాడిరి.

కోయలలో నొక ముఖ్యమైన అయిదుదినముల తంతు కలదు. ఈతంతును రావణుని కుమారుడైన మేఘనాదుని (ఇంద్రజిత్తు) పేర 'మేఘనాద్' అందురు. ఈ అయిదుదినములలో నొకనాడు కోయ లొకచోట సుమారేడడుగుల లోతు గల గుంటను త్రవ్వి దానిలో తెల్లగుగ్గిలపు మ్రానునో, టేకుమ్రానునో పాతి ఆగోతినంతటిని ఉప్పుతో నింపివేయుదురు. ఆపిమ్మట కుంకుమతోను, రంగులతోను ఆగోతి నలంకరింతురు. అంతట మ్రొక్కుబడులు చెల్లించవలసినవారందరును మేకలను, కోళ్లను మేఘనాదస్తంభమునకు బలియిత్తురు. తరువాత ఆకంబముపై నడ్డముగ నొక చిన్న దూలము నుంతురు. ఈ అడ్డదూలమున కొకచివర పురోహితుని కట్టుదురు. రెండవచివర నొక త్రాటిని కట్టుదురు. కోయలందఱును ఈ త్రాటిని పట్టుకొనిలాగుచు, వదలుచు అడ్డదూలమును ఏతమువలె నూగింతురు. ఇట్టు లైదుసారు లూగించినపిమ్మట పురోహితునకు కొబ్బరికాయ, బట్టలు కానుకగ నొసంగుదురు. మేఘనాదునకు ప్రియతమమైన ఈ తంతువలన రోగములు రావని కోయల నమ్మకము.

ఈవిషయజాలమునుబట్టి చూచినచో కోయలగ్రగణ్యులైయుండినకాలము మతీతఖచితముగ మనకు తెలియుచున్నది. రావణుడు అయోధ్యారామునకు సమకాలికుడుగదా? పైన పేర్కొన్న నా వ్యాసమున అయోధ్యరామునికాలము క్రీ పూ. ౭000 సం ప్రాంతము అని నిర్ణయించియున్నాను. రావణవంశీయులగు కోయలకు ఆకాలము స్వర్ణయుగమై యుండెను.

## కోయల ఆగమనము

తమ పుట్టువునుగూర్చి కోయలలో నొకకథ కలదు.

ఆదిని ధవళగిరియందు కోయదొరలు పదునారు వందలకోట్లమంది నివసించుచుండిరి. వీరు స్నానము చేయకుండుటయేకాక చుంచులను, కుక్కలను, పిల్లులను, పందులను, గేదెలను, దున్నపోతులను తినుచుండిరి. ఇట్టి అసహ్యవర్తనులగు కోయదొరలపై శివునకాగ్రహము గలిగి వీరినందఱి నొకగుహలో బంధించి యొక పెద్దబండను గుహయొక్క ద్వారమున కడ్డము పెట్టి భస్మాసురుడు అను పేరుగల తనకుక్క నక్కడ కాపుంచి వెడలిపోయెను. పార్వతికి కోయదొరలన్న మిక్కిలి ప్రీతి. వీరిట్లు బంధితులై యుండుట ఆమె తెలిసికొని తనయొడలి మట్టిని నలిచి దానితో నొకకుమారుని తయారుచేసెను.* ఆకుమారుని పేరు 'లింగో'. ఈతడు శివునిగూర్చి ఘోరమగు తపము చేయగా శివుడు ప్రత్యక్షుడై సముద్రతీరముననున్న 'ఓందో'లను (రాబందులను) తనకడకు తెచ్చినచో కోరికను నెరవేర్తునని చెప్పెను. అంతట లింగో సముద్రతీరమునకు బోయి అచ్చటి పిల్లరాబందులను దొంగతనముగ తెచ్చుట భావ్యముకాదని

---

* వినాయకునిజననముతో పోలిక కనబడుచున్నది.

పెద్దరాబందులు వచ్చువఱకు నిరీక్షించుచుండెను. ఇంతలో సముద్రములోనుండి భవరనాగుడు అను పేరు గల యొకపాము వచ్చి పిల్లరాబందులను తినుట కుద్యుక్త మగుచుండగా లింగో ఆపామును చంపివైచెను. పిమ్మట పెద్దరాబందులు వచ్చి తమ పిల్లలవలన జరిగిన వృత్తాంతమును విని లింగోకోరిక ననుసరించి వెంటనే పిల్లలతోను, లింగోతోను ధవళగిరికి పయనమయ్యెను. అచ్చట కను ధవళగిరికిని ప్రయాణము సుమా రారునెలలు పట్టును. కాని ఆరుదినములలోనే ప్రయాణము ముగించబడెను. శివుడు గత్యంతరములేక గుహయొక్క ద్వారమున కడ్డమున్నరాతిని తొలగించెను. అంతట తన పదునారు వందలకోట్లకోయదొరలతోను లింగో ప్రయాణమై వచ్చుచుండగా త్రోవలో నొకనది తగిలెను. లింగో వారికి బియ్యమును, జొన్నపిండిని ఇచ్చెను. కోయదొరలు అచ్చట ఆర్యులదేవతలయొద్ద నేతిని కొల్లగొట్టిరి. ఆనదిదగ్గర వంటచేసికొని భుజించి వారు నదిని దాటిరి. అప్పటికి వారిలో నాలుగుజాతులవారుండిరి. ఆజాతులకు 'శేకం', 'మార్కం,' 'పూసం', 'తెలింగం' అనుపేర్లుండెను. నదిని దాటినపిమ్మట లింగో కోయదొరల కొకపట్టణమును నిర్మించెను. వారిని తెగలుగ విభజించెను. తెగలను కులములుగ విభజించెను. ఒకకులమువారింకొకకులమునుండియేగాని వివాహము చేసికొనరాదని నియమ మేర్పరచెను. కోయదొరలందరిలోను వయోధికుని ప్రధాని (పురోహితుని) గ నియమించెను. దేవతలను నిర్ణయించెను. వివాహాద్యాచారములను నిర్ధారణచేసెను. పిమ్మట లింగో దేవతలదగ్గరకు వెడలిపోయెను.

## దేవతలు

కోయలదేవతలందఱిలోను బూరదేవుడు గొప్పవాడు. ఇతరదేవతలందఱు బూరదేవునియందిమిడియున్నట్లు వారు భావించుచుండిరి. ఈదేవుని చాలకాలమువఱకు తెల్లబుగ్గిలపు (సజ్) చెట్టులో నున్నట్లు భావించి వారు ఆచెట్టును పూజించుచుండిరి. ఇట్లే శేకుచెట్టునుగూడ వారు పూజించుచుండిరి. నారాయణదేవుడు (సూర్యుడు), నాగదేవుడు (త్రాచుపాము), మతీయదేవుడు (అల్లరికిదేవుడు) కల్లు దేవుడు (దేవతల నాఖరు) * అనువారినిగూడ కోయలు ప్రథమమునుండి పూజించుచుండిరి. కాలక్రమమున నితరదేవతలను గూడ వీరితో చేర్చి కోయ లారాధింపసాగిరి. ఇట్లు భీమ (బలమునకు) దేవుడు, గొర్ర (గుఱ్ఱముల) దేవుడు పాలెరా (కొయ్యముక్క) దేవుడు, సలే (పశువుల కొట్టపు) దేవుడు, జూలర్ (జోల, లేక ఊయల) దేవి, చావర (ఆవుతోక) దేవుడు, ఘంఘ్రు (కంచుగంట) దేవుడు పరశిపెను అను పరశు (గొడ్డలి) దేవుడు, ఘనశ్యామ (పెండ్లికొడుకు) † దేవుడు, పాలో (ఈటె-బట్ట) దేవుడు ననువారు కోయలచేనారాధితులై యుండిరి.

## కులములు

లింగోనాయకత్వమున కోయలు పట్టణనిర్మాణ మొనర్చుకొన్నప్పుడు వారిలో ముఖ్యముగ నాలుగు తెగలుండెనని పైన వ్రాసియున్నాను. శేకం అను పేరుగల శేకుచెట్టుతెగ, మార్కం అను పేరుగల వేపచెట్టుతెగ, పూసం అనుపేరుగల పూసతెగ, తెలింగం అనుపేరుగల తెలుగుతెగ అనునవి యీనాలుగు తెగలు. కోది (పెద్దపులి) కులము, సుయబదిర (అడవిపంది) కులము, బకరవంశ మను మేకతెగ, నాగవంశము అను త్రాచుపాముతెగ యనునవికూడ వారిలో గలవు.

## వృత్తులు

మానవులు చరిత్రారంభకాలమున అడవులందు తిరుగాడుచు అందలి వృక్షాదులవలనను, మృగముల

---

* ఈతని నారదునితోగాని, దేవతలకునోరని మనము భావించు అగ్నిదేవునితోగాని పోల్చనగును.

† నేడు మనలోవలెనే పూర్వము కోయలలో గూడ వివాహమునకు పెండ్లికుమారుడు పెండ్లికుమార్తె యింటికి పోవుచుండెను. కాని, ఒకసారి త్రోవలో పెండ్లికుమారుని పెద్దపులి యొకటి చంపుట తటస్థించెను. అప్పటినుండియు పెండ్లికుమార్తెయే పెండ్లికుమారునింటికి వచ్చుట యాచారమయ్యెను. చనిపోయిన పెండ్లికొడుకు దేవుడుగ పరిగణింపబడి ఘనశ్యామదేవుడయ్యెను.

మాంసమువలనను పొట్టపోసికొనుచుండిరను నంశము చరిత్రలయందంతటను గానుపించును. అట్లే లింగో నాయకత్వమున పట్టణనిర్మాణ మొనర్చుకొని స్తిమితముగ నాగరికతావస్థకు వచ్చుటకు పూర్వము కోయలు మానవచరిత్రయందలి పై జెప్పిన శైశవదశయం దుండిరి. కోది (పెద్దపులి), సుయబదివ (అడవిపంది) మొదలగు మృగముల పేర్లును, టేకు, వెదురు మొదలగు అడవిచెట్ల పేర్లును వారి తెగలయొక్కయు, కులములయొక్కయు పేర్లుగ వాడుకలో నుండుట కిదియే కారణము.

మానవుని నాగరికతాభివృద్ధియందలి రెండవసోపానము గొడ్లకాపరిదశ. కోయలు మేకలనుగూర్చి ఎరిగియున్నట్లు వారిలోని 'బకర' (మేక) వంశము నిదర్శనము.

లింగోనాయకత్వమున పట్టణనిర్మాణ మొనర్చుకొనునప్పటికి వారు మానవుని నాగరికతాభివృద్ధియందలి మూడవ సోపానము నధిష్ఠించియుండిరి; అనగా, వారప్పుడే వ్యవసాయమును వృత్తిగ నవలంబించిరి. ఇందుకు నిదర్శనములుగ నీక్రిందియంశములు మనకు గోచరించుచున్నవి. ఆకాలపు కోయలదేవతలలో హూలెరా అను నొక దేవుడు గలడు. పాడిపంటలు సమృద్ధిగ గలుగుటకు ఈదేవుని కోయలు కొయ్యముడ్డి* రూపము గలవానిగ పూజించుచుండిరి. ఇట్లే ఆవులోకయాకృతి గల 'చవార' దేవుని, పశువులకొట్టముల కధిష్ఠాత యగు 'సలే' దేవునికూడ వారు పూజించుచుండిరి మరియు కోయలయందలి 'ఉయక' అను పేరుగల యొక కులమునందు 'కడపచోరు' అను నొక శాఖ గలదు. ఈపదమునకు 'ధాన్యము నెత్తుకొనిపోయినవాడు' అని యర్థము. ఈ శాఖయందలి ప్రథమపురుషుడు దేవవాటిక ‡ యందలి ధాన్యమును దొంగిలించెనని యొకగాథ కలదు. పైన చెప్పిన లింగోకథయందు కోయదొరలకు లింగో జొన్నపిండిని, బియ్యమును ఇచ్చినట్లు ఈ కోయదొరలు వానితో వంటచేసికొని భోజనముచేసినట్లును కనబడుచున్నది. ఈ విషయజాలమునుబట్టి కోయలవృత్తులలో వ్యవసాయమొక్కటిగ నున్నట్లు మనకు ద్యోతకమగును. కావున పట్టణనిర్మాణకాలమున కోయలు వేట, పశువులను మేపుట, వ్యవసాయము నను వృత్తు లవలంబించియుండిరి.

## అహారాది పదార్థములు

పై సంగతులనుబట్టి మాంసము, పాలు, జొన్న, బియ్యము కోయల యాహారపదార్థము లయియున్నట్లు మనకు విశదమగుచున్నది. జొన్న మొదలగు ధాన్యములను పిండిచేసి వంటకము చేసికొనుటయు వారెరిగియుండిరి. ఇప్పనూనె దేవతలకుగూడ నతిప్రీతికరమగునూనెగ వారు భావించి దానిని, ఇప్పచెట్టును వారతి మర్యాదతో చూచుచుండిరి. టేకు, మామిడి, ఒకరకపు గుమ్మడి, బిల్వ, వెదురు మొదలగు చెట్లను వారు బాగుగ నెరిగి యుపయోగించుకొనుచుండిరి.

లింగోకథలో కోయలకు జొన్నపిండి, బియ్యము ఇచ్చినప్పుడు కోయదొరలు ఆర్యులదేవతలయొద్ద నేతిని కొల్లగొట్టి దానితో వంట చేసికొన్నట్లు చెప్పబడియున్నది. అంతకుపూర్వము జొన్నపిండి, బియ్యమువలె నేయి వారియొద్దనున్న పదార్థము గాదు. ఇది వారికి నూతనము.

## బట్టలు

అందరివలెనే కోయలును ఆదియందు తోళ్లను, ఆకులను ధరించి పిమ్మట నారబట్టలను కట్టుకొనుచుండిరి. వారియందలి నాగవంశీయులలో 'ధుర్వా' యను పేరుగల శాఖ యొకటి గలదు. ఈ శాఖయందు 'కుశాద్య' (ఒకవిధమగు పట్టు) అను తెగ కలదు. ఈ తెగకు చెందిన ప్రథమపురుషుడే పట్టును గనిపెట్టినట్లొక సంప్రదాయసిద్ధమగు ప్రతీతి గలదు. నూలుబట్టలు వారిలో నప్పటికి వాడుకలో లేవు.

కోయల ఆదిమదేవతలలో నేని 'పాలో' దేవుడు విక్కిలి వ్యాయమునకు కారకుడు. ఈ టేకొన చుట్టును నొక నూలుబట్టను కట్టి తయారుచేసిన ప్రతిమయే ఈ 'పాలో' దేవుని ప్రతిమ. పురోహితుడు తప్ప నింకెవ్వరును ఈ ప్రతిమను నిర్మించరాదు. నుమారారు మాసములు ప్రధాని (పురోహితుడు) ఎవ్వరితోను మాట

---

* ఎద్దుల మెడలలో కట్టబడు నొక యాభరణము.

‡ కోయలు దీనిని 'దేవకులము' అందురు.

లాడక ఒంటరిగ పరులకు గనబడకుండ నొకగదిలో గూర్చుండి ఈప్రతిమను నిర్మించవలెను. ఈమూరుమాసములవ్యవధిమును ఊరికోయలు భరింతురు. ఇంతటినిష్ఠ, ఇంతటికష్టము, ఇంతటివ్యయము ఇతర దేవతల ప్రతిమల నిర్మాణమునందు కానరాదు దీనినిబట్టి చూచినచో నూలుబట్టలు మనదేశమున కోయలకాలమున ప్రప్రథమమున వాడుకలోనికి వచ్చినవని తేటతెల్లమగును.

## ఇనుము

నూలుబట్టయేగాక ఇనుముగూడ కోయలకాలముననే మనదేశమున నవతరించెను. పరికించగా ఇనుమును కోయలే కనిపెట్టినట్లు ఈక్రింది నిదర్శనములు మనకు గానవచ్చుచున్నవి.

౧. కోయలదేవతలప్రతిమ లన్నియు ఇనుముతో చేయబడినవి. వారి దేవతలందరిలో నధికుడగు బూరదేవుకుసైతము పూర్వపు తన తెల్లగుగ్గిలపుచెట్టురూపమును మాని ఇనుప్రతిమ రూపమున నారాధితుడు కాజొచ్చెను. హూలెరా (కోయ్యమవ్వ) దేవ్రడును, 'ఘుంఘు' (కంచుగంట) దేవుడును తప్ప మిగిలిన దేవతలందరును ఇనుపప్రతిమ యాకారము గలవారే.

(౨) కోయలలో వృత్తులనుబట్టి ఏర్పడిన విభజనప్రకారం మైదువ్యవస్థలు గలవు. అందరికంటె నగ్రస్థానము ఇనుపపనివారిది. వారితరువాతివారు 'ఒజ్జలు'. వీరు వారములు, వర్జ్యములు చెప్పుచు విద్యలను గరపుచు నుండెడివారు. మూడవవ్యవస్థవారు ప్రధానులు (పురోహితులు). నాలుగవవారు సోలహులు (వడ్రంగులు). చివరివారు వేశ్యలు, నటకులు.

(3) కోయల వివాహాచారములందు సైతము ఇనుము ప్రాముఖ్యము వహించినది. పెండ్లికుమారుడు పెండ్లికుమార్తెవేలి కొకయినుపయుంగరమును తొడుగవలెను.

ఇను మెప్పుడు వాడుకలోనికి వచ్చినదో మన మించుక పరిశీలింతము.

ఆర్యులలో అయోధ్యరాముడు శివుని ఇనుప (ఉక్కు) విల్లు విరిచి సీతను పెండ్లియాడినకథ సుప్రసిద్ధము. అంతకు పూర్వము ఆర్యులు ఇనుమును ఆయుధముల కుపయోగించినట్లు మనకు నిదర్శనములు లేవు; పరశురాముడు (కోయల పరిశిదేవుడు) గండ్రగొడ్డలి నుపయోగించినట్లు మాత్రము తెలుపబడియున్నది. కావున క్రీ. పూ. ౪౦౦౦ సం ప్రాంతముల నాటికి ఆర్యులు ఆయుధములకు ఇనుము నుపయోగించియుండలేదు.

కోయలు పైన చెప్పినవిధముగ ఇనుము నుపయోగించుటయే కాక 'ఈబెరూపుడుగ 'పాలో' దేవుని, గండ్రగొడ్డలి ఆయుధముగ గల పరిశిదేవుని ఆరాధించుచుండిరి. కోయలలో ఇనుమువాడుక విశేషముగ నుండుటచే వారినుండి అది ఆర్యులకు వ్యాపించియుండవలెను. కావున క్రీ. పూ. ౪౦౦౦ సం. ప్రాంతములకు పూర్వమే కోయలలో నీవాడుక ప్రబలియుండెను.

ఈబె ననుసరించియున్న 'పాలో' దేవుని నూలుబట్టయు ఈబె వాడుకలోనికి వచ్చిన సంవత్సరప్రాంతముల కించుకయనంతరమున వాడుకలోనికి వచ్చియుండవలెను.

## కోయలు తెలుగువారు

పైనవ్రాసిన లింగోకథలోని విషయములను జూచినచో ఆ కాలపుకోయలలోని నాలుగుముఖ్యతెగలలో 'తెలింగం' (తెలుగువారు) అనుతెగ యున్నట్లు కానబడుచున్నది. శ్రీశైలేశుడు, భీమకాళేశుడు, ద్రాక్షారామ భీమేశుడు నను మూడు లింగమూర్తుల దేశము త్రిలింగదేశ మనియు, ఈ దేశమున మాటలాడు భాష ఈకారణమున తెలుగుఅని వ్యవహరింపబడుచున్నదనియు పండితాభిప్రాయము. కాని ఈ వ్యాసమునం దుదాహృతములైన సంగతులను గమనించినచో మూడులింగముల నడిమిదేశమును బట్టికాక, ఈ దేశమునకు రాకపూర్వమే ధరింపబడిన యొకతెగనామమును బట్టి మనకును, మన భాషకును ఈపేరు గలిగెనని మనకు ద్యోతకమగుచున్నది.

మరియు, మధ్యపరగణాలయందును, మధ్యఇండియాయందును నివసించుచున్న 'గాండులు'ను, మనమును, సవరలు, కొండులు, చెంచులు నను మొదలగుపేర్లు గల కోయవారును ఒకేతల్లి వేరు గల సోదరులము.

ఈ విషయము పై యంశములవలననే కాక మన మన ఆచారవ్యవహారముల పోలికలవలనగూడ స్పష్టపడు చున్నది.

మనవివాహములలో పసుపులోముంచిన దారములను చేతులకు కట్టుకొను నాచారము గలదు. గాండులలో వివాహమునందలి మొదటిదినమున పెండ్లికుమారుడు పెండ్లికుమార్తెచేతికిని, పెండ్లికుమార్తె పెండ్లికుమారుని చేతికిని పసుపుదారమును గట్టుదురని ల్యాంగుహోరన్ గారు వ్రాసియున్నారు.

మనలో పసుపునీరు (వసంతము) భార్యాభర్తృ సంబంధమును, ఉల్లాసమును సూచించును. గాండులలో కూడ నింతే. బస్తర్ సంస్థానమునందలి గాండులలో ఏ అవివాహితయైనను పసుపునీటి నొక పురుషునిపై పోయునో వారు వేరే తంతు అవసరము లేకుండగనే భార్యాభర్త లగుదురు. విడాకులిచ్చినస్త్రీలును ఇట్లే మరొకని చేపట్టవచ్చును. *

మనవివాహములందు వధూవరు లిరువురును గలసి రాత్రి పూలబంతులాట యాడుట ఆచారము. గాండులలో పెండ్లి మొదటిరోజురాత్రి పెండ్లికుమారుడును, పెండ్లికుమార్తెయు గలసి నృత్యము చేయుదురు.

మనలో 'వప్పగింతలు' అనునది యొకముఖ్యమగు వైవాహికాచారము. ఇది గాండులలోగూడ కన బడుచున్నది. పైనచెప్పిన నృత్యమున కనంతరము పెండ్లికుమార్తె తనవిడిదికి వెడలిపోవును. మఱునాటి ప్రాతర్భోజనానంతరమున వధువును ఆమెతల్లిదండ్రులు వరునింటికి తీసికొనివచ్చి యింటిలోనికి త్రోయుదురు. అప్పుడు వరునితండ్రితో "ఈ పిల్లను మీరు స్వాధీన పరచుకొనుడు" అని వారు చెప్పుదురు. పిల్లతో "నీ వింతటినుండియు నీభర్తయొక్క కుటుంబములోని దానవు. మాయొద్దకు నీ వొక్కతెవును రాకుము" అని వా రందురు. ఇంతటితో వివాహము పరిసమాప్తినందును.

---

*. ఆర్. వి. రస్సెల్ గారు వ్రాసిన Tribes and Castes of the Central Provinces అను గ్రంథము, ౭౩ వ పుట.

తెలుగువారి పెండ్లిండ్లలో తెర కవ్వల వధువును, ఇవ్వల వరుని కూర్చుండబెట్టి తెరను కొంచెముగ నెత్తి బెల్లము, జీలకఱ్ఱ మొదలగు వస్తువులను గలిపిన యొక లేహ్యమువంటి పాకము నొకరితలపై నొక రుంతురు. ఎవరు ముందు రెండవవారి తలపై దీనిని నిలకడగ నుంతురో వారియాజ్ఞలను రెండవవారు శిరసావహింతురని మనలో నందురు. గాండులలోను ఇట్లే తెరకట్టబడును. తెరయడుగున నేలపై తెరపాడుగునను మద్యమును జల్లుదురు. పిమ్మట పెండ్లికుమారుడు తెర నించుక పైకెత్తి, వధువుదగ్గరకు పరుగెత్తి వీపుపై నొకదెబ్బ కొట్టును. ఆమెచేతి కొకయుంగరమును తొడిగి మేకవలె అరచుట నభినయించును. ఇట్లు వీపుపై కొట్టినయెడల భార్య భర్తయాజ్ఞలను యావజ్జీవము శిరసావహించునని వారి నమ్మకము.

గాండుల వివాహసందర్భమునందు వధువుతరపు స్త్రీలును, వరునితరపుస్త్రీలును చెరి యొక జట్టుగ నేర్పడి మామిడియాకులతోరణమునకు చెరి యొక ప్రక్కన నిలిచి ఇష్టము వచ్చినట్లు పాటలు పాడుదురు. ఇట్టియాచారము మనలోను ఉన్నది.

బుక్కాచల్లు నాచారమును ఇరు జాతులలో గలదు.

మనలో వివాహాంతమున జరుగు నొకవేడుక సందర్భమున పానుపుపై పెండ్లికుమార్తెయు పెండ్లికుమారుడును నొకరికెదురుగ నొకరు కూర్చుందురు. ఇరువురకును నడుమ నొకగుడ్డయూయాల కట్టబడును. తాటాకుతో నొకచిన్నబొమ్మను చేసి, ఆబొమ్మ వధూవరులకు బుట్టిన బిడ్డయైన ట్లెంచబడి యూయాలలోన, వధూవరుల చేతులలోను మెలగును. కోయలవివాహములందు పీఠమువంటి యొకసాధనముపైన గాని, ఊయలలోగాని పెండ్లికుమారునితండ్రిని కూర్చుండబెట్టి పెండ్లికుమార్తె ఆ పీఠమును పైకిని క్రిందకిని ఊపును. బంధువులు "నీకొడుకు ఏడ్చుచున్నాడు, ఏడ్చుచున్నాడు" అని ఆమెతో పరియాచకము లాడుదురు.

కోయలలో వివాహానంతరమున భార్యాభర్తలు వారికి నిర్దేశింపబడిన యొక యింట ప్రవేశింతురు. ఆరాత్రి బంధువులు ఇంటిచుట్టును చేరి, అరచుచు గోలచేయు

దురు. తయింటిమీదను, చుట్టును మట్టిముద్దలను, రాళ్లను, చెత్తను పోయుదురు. తెల్లవారకమునుపే నూతన దంపతులు ఆప్రదేశమనంతను శుభ్రపరచవలెను. తెలుగువారిలో కార్యనునాడు గదిచుట్టును బంధువులు (స్త్రీలు)చేరి తిరుగుచుందురు. తెల్లవారకమునుపే దంపతులు లేచి యాతలకు పోవలెను. అందరును లేచునప్పటికి గది చెక్కుచెదరకట్లుంచవలెను.

ఆంధ్రుల పెండ్లిండ్లలో తోడుపెండ్లికొడుకు నొకని తయారుచేయుదురు. కోయలలో వివాహములందు దేవుని పూజించుటకుగాను వధూవరులు బయలుదేరుదురు. వారికి ముందిరువురు పురుషులు బుట్టలో నొక కోడిపిల్ల నుంచుకొని బయలుదేరుదురు. ఈ కోడిపిల్లను 'థెంధా' యందురు. ఈ పదమునకు 'తోడు' యని యర్థము. గుడిని సమీపించినప్పుడు గ్రామములోని గంధోళిగాడు ఈతోడుకోడిపిల్లను తీసికొని కోరుకుకొని తినుట నభినయించును.

కోయలలో వధూగృహప్రవేశ సమయమున నొకకోడిని చంపి దానిరక్తమును వధూవరులతలపై జల్లుదురు. ఆ సమయముననే వధు వొక కోడిపిల్లను కాలిక్రిందపెట్టి త్రొక్కివేయును. కొన్నితెగలవారిలో పెండ్లికూతురు వివాహాగారమును చేరు సందర్భమున గొడ్డలితోనో, కత్తితోనో కోడిపిల్లతలను ఛేదించును. ఆంధ్రులలో గృహప్రవేశసమయమున వాకిట నిలువబెట్టి వధూవరులపాదములకు పసుపు పూసి వారి తలలపై రక్తాక్షతలను జల్లుదురు. ఆ పిమ్మట గడపపై నొకగిన్నెలోనో, శేరులోనో, పావుశేరులోనో బియ్యమును పోసి యుంతురు. వధువు దానిని కాలితో తన్ని లోపల ప్రవేశించవలెను.

వివాహాచారములందేగాక జననసమయాచారములందును, ఆంధ్రులకును కోయలకును చాల పోలికలు కానవచ్చుచున్నవి.

కోయలలో శిశువు పుట్టిన యైదవనాడుగాని, అంతటినుండి పన్నెండవనాటిలోగాగాని తల్లికి పిల్లకు స్నానముచేయించి అక్కమగనిచేతగాని, మేనత్తమగనిచేతగాని పిల్లకు క్షౌరము చేయించి, ఇంటినంతటిని శుభ్రపరచి వెల్లవేయించి అవు పసుపు పిల్లలకిని పిమ్మట నొకచేటలో వారు తిను ధాన్యమునుపోసి దానిమీద శిశువును పరుండబెట్టుదురు. శిశువుకొరకందరు నొకగిన్నెలో కానులువేయుదురు. ఆంధ్రులు చేటబదులు జల్లెడ నుపయోగింతురు. అప్పుడు క్షురకర్మ చేయరు. ఆంధ్రులలో పిల్లనికి క్షురకర్మ చేయునప్పుడు గిన్నెలో కానులు వేయుదురు. వానిని మంగలి తీసికొనును.

పుట్టిన శిశువు చెవిటిగ నగబడుచో కోయలు జననసమయానంతరమున నెల్లప్పుడు నొక ఇత్తడిగిన్నెను గట్టిగ చప్పుడు చేయుదురు. శిశువుయొక్క కర్ణకుహరములందీచప్పుడు చొరబడి వినికి కడ్డముగ నున్నయడ్డును తొలగించు నని వారినమ్మకము. ఆంధ్రులలో శిశువు పుట్టగనే యేడువనిచో ఇత్తడిచేట నొకదానిని గట్టిగ వాయింతురు.

కోయలయాచారములలో కొన్ని మనభాషలో మాత్రము నిలిచియున్నవి. కోయలలో గొప్పవారు-అనగా క్షత్రియుల మనుకొనువారు కొందరు గలరు. వారిలో వివాహములకు పెండ్లికొడుకులు వెడలరు. వారి బదులు కత్తులను పంపుదురు. ఈకత్తి నొకసువాసిని వివాహస్తంభముచుట్టును ఏడుసారులు త్రిప్పును. అంతట పెండ్లికుమార్తె కత్తిపై నొకపూలమాలను వేయును. ఇది తెలుగువారిలో 'కత్తికి భాషికము కట్టుట' అని ప్రవచనమున నిలిచియున్నది. మరియు కోయలలో తాతయొక స్త్రీని వివాహమాడి మరణించుచో మనుమడామెను పరిగ్రహించవచ్చును. ఇది 'అవ్వను బట్టుకొని వసంతము లాడుట' 'తాతా అవ్వావరుస' అను పదములందు ఆంధ్రులలోనున్నది. గాండులలో 'పైసా ముండి' యను నొకపదము గలదు. దీనికి 'ఉంపుడుకత్తె' యని అర్థము. వారిలో నొకస్త్రీ ఎవనికో ఉంపుడుకత్తె కాబోవునప్పుడు దానిని దానిబంధువులు పసుపుతోను, నూనెతోను స్నానమాడించి కొబ్బరియాకుల కిరీటములను వారిరువురి తలలపై నుంచి ఇప్పచెట్టుచుట్టును వారిని ఏడుసారులు త్రిప్పుదురు. ఇట్టి స్త్రీ 'పైసా ముండి.' తెలుగువారిలో 'ముండ'యను పదము ఉంపుడుకత్తె' యను నర్థముతో వాడుకలో నున్నది.

ఇంతేకాక కోయలకును తెలుగువారికిని మరి కొన్నిపోలికలు గోచరించుచున్నవి. సంవత్సరాది పం

దుగనాడు మనము అప్పుడే కాపు మొదలిడిన మామిడి కాయలను క్రొత్తచింతపండుతోను, అప్పటి చెరకు పానకముతో క్రొత్తగ తయారైన బెల్లముతోను, వేప పువ్వుతోను సేవింతుము. ఇట్లే కోయలును సంవత్సరాదినాడు పండుగ చేసికొని క్రొత్తపంటను, పండ్లను కలుపుకొని తిందురు. మనవలెనే వారును పులిని జూచినచో నదృష్టము గలుగునని నమ్ముదురు. మండ్లపై బరుండి కష్టపడినచో దుఃఖము తొలగునని మనవలె కోయలును భావింతురు. భార్య భర్త పేరు చెప్పుటయు, భర్త భార్య పేరు చెప్పుటయు తప్పని వారు మనవలెనే తలంతురు. చేతులవ్రేళ్లను గడ్డముక్రింద బెట్టి, బుగ్గలను బొటనవ్రేలికిని తక్కిన వ్రేళ్లకును నడిమికి వచ్చునట్లు పట్టుకొని పిమ్మట ఆ చేతివ్రేళ్ల కొనల నన్నిటిని కలిపి ముద్దిడుకొనుట కోయలలోవలె మనలోను వాడుకలో నున్నది.

మన జాతీయకథావళిలోనున్న కథలవంటి కథలు కోయల జాతీయకథలలోను కానవచ్చుచున్నవి. ఇందుల కుదాహరణముగ ఫోర్సిత్ గారు రచించిన 'హైలాండ్స్ ఆఫ్ సెంట్రల్ ఇండియా' అను గ్రంథమున వ్రాయబడిన కోయలజాతీయకథ నీక్రింద పొందుపరచుచున్నాను.

కోయలనాయకుడు లింగో కాలమున 'రికద్-గవాదు' అను నొక్కరక్కసు డుండెను. అతని ఏడుగురు కుమార్తెలను లింగో తెచ్చి తన నలుగురన్నలకు వివాహము చేసెను. పెద్దవారు ముగ్గురకు చెరి యిద్దరును, చివరియన్న కొక్క భార్యయు నైరి లింగో వివాహమాడుట కొప్పుకొనలేదు. తమకు భార్యలను దెచ్చినందుకు సంతసించి నలుగురన్నలును అడవిలో వేటాడి లింగోకు మంచి మాంసమును తెచ్చి ఇచ్చెదమని చెప్పి వెడలిరి ఇట్లు పోవునప్పుడు లింగోను ఒక ఊయలలో గూర్చుండబెట్టి ఆతని నూపునట్లు భార్యల కాజ్ఞాపించిరి. ఊయలలోని 'లింగో' ధ్యానావస్థలోనుండెను. ఆతనితో సరససల్లాపము లాడు నుద్దేశముతో ఆతని కాలు సేతులను వదినలు లాగిరి. కాని లింగో వారిని జూచి "మీరు నాకు తల్లులతోను అక్కలతోను సమానులు. ఇది మీకు తగదు" అని చెప్పెను. వారు వినక లింగోపైన పడి కౌగిలించుకొనిరి. లింగోకు కోపమువచ్చి వారిని రోకలితో చావమోదెను. అంతట వారింటిలోని కేగి ఏడ్చుచుండగా వారిభర్తలు వచ్చిరి. భార్యలు వారితో లింగో తమ పాతివ్రత్యమును హరింప సంకల్పించుకొనెననియు, తా మక్కడ నుండజాలమనియు, పుట్టింటికి పోదుమనియు చెప్పగా భర్తలు కోపించి, మంచిమాటలు చెప్పి లింగోను అడవికి తీసికొనిపోయి వానిని చంపి గ్రుడ్లుపెకలించి గ్రుడ్లతో బంతులాడిరి. కాని భగవానుడాతని పునర్జీవితుని చేసెను.

ఆంధ్రులలో శ్రీకృష్ణజయంతి సందర్భమున 'ఉట్టికొట్టుట' యనువేడుక జరుగుచున్నది. ఇట్టిదే కోయలలోను గలదు. ఒకకంబమును నాటి, దానికి వెన్నను, నూనెను, ఇతరములగు జారిపడిపోవునట్టి పదార్థములను రాచి దానిపైన నొకసంచిని కట్టుదురు. ఆసంచిలో నొకరూపాయయును, ఒక పావలాయు, ఒక శేరునేతిని ఉంచుదురు. నేయిబదులు వెన్న నుంచుటయు గలదు. పురుషు లాకంబమును నెక్కి పైనున్న సంచియే బహుమతిగ సంపాదింతురు. స్త్రీ లట్లు కంబమెక్కు పురుషుని కఱ్ఱలతో గొట్టియు, నడ్డుపెట్టియు, ఎక్కకుండ చేయజూతురు. పురుషు లెవ్వరును విజయులు గాకున్నచో ఆసంచి స్త్రీల కిచ్చివేయబడును. వా రందలివస్తువులను పంచుకొందురు. దీనికిని శ్రీకృష్ణునకును ఏలాటిసంబంధమును లేదు.

ఈ విషయములను జాగరూకతతో పరిశీలించుచో, తెలుగువారు తెలుగుమీరినకోయలని తోచును. సోదర-కోయలకంటె ఆర్యాచారములను విరివిగ ననుసరించి, ఎక్కువ నాగరకుల మైనను వారికిని మనకును గల సంబంధ మింకను గోచరించుచునే యున్నది.

ఈ వ్యాసమునందలి విషయజాలమును బట్టి తెలుగువారిచరిత్ర క్రీ. పూ. ౫౦౦౦ సం. ప్రాంతములం దారంభమగుచున్నది. అప్పుడు వారు కోయలలో నొకతెగగనుండి ధవళగిరినుండి పయనమై వచ్చి సూర్యారాధనసమన్వితమగు విజ్ఞానము నవలంబించిరి. రావణాదులను తమరాజుల పాలనమున వన్నెయు వాసియు గాంచిరి. నాగరకతను వృద్ధిపరచుకొనిరి. ఇనుమును నూలుబట్టలను కనిపెట్టి యుపయోగించిరి. ఇకముందు, తెలుగువారిచరిత్ర ఇప్పటివలె ఏరెండువేలయేండ్లక్రిందటిది మాత్రముగానో మనము పరిగణించుట పొరపాటు. మనచరిత్ర నేటికి అధమము ఏడువేలసంవత్సరములకు పూర్వమున నైనను ప్రారంభించినదని మనము ఘంటాపథముగ చెప్పవచ్చును.




శివభక్తి మాహాత్మ్యమున యజ్ఞదత్తనామక బ్రాహ్మణాఖ్యానమున నొకరంగము

(శ్రీ కాశీనాథరావుగారి తంజాపుర ప్రాచీనచిత్రసంగ్రహమునుండి)

# భూతవైద్యం

"కరుణకుమార"



గొల్ల నారాయుడికి, చిన్నప్పటినుంచీ దయ్యాలూ, భూతాలూ, పిశాచాలూ ఉన్నాయని నమ్మకం. నమ్మకంమాత్రమే కాదు. అవి అంటే అతని కెంతో భయం కూడాను. అందువల్లనే పాతికేళ్ల వయస్సు వచ్చేదాకా కూడా, అతనికి చీకట్లో ఒంటరిగా పోవడమంటే భయం. ఎక్కడనైనా పెద్దపెద్ద మర్రిచెట్లుగాని, జువ్విచెట్లుగాని, తుమ్మచెట్లుగాని — ఏ చెట్లయినా సరే, దట్టంగా పెరిగి ఒకచోట గుంపుగా ఉన్నాయంటే, అట్లాంటి చోట్లకూడా అతడు ఒంటరిగా పోలేకపోయేవాడు. చిన్నప్పుడు అతని అవ్వా, తాతా చెప్పుతూ ఉండిన కథల్లో దయ్యాలు తరుచు చెట్లమీదా, ఊరు బయటా, శ్మశానంలోనూ - ఇల్లాంటి స్థలాల్లో విరివిగా నివసిస్తూఉంటాయని అతడు వింటూ వచ్చాడు. ఆనమ్మకాలన్నీ అతనికి గాటంగా మనస్సుకు పట్టిపోయి, ఇప్పటికీ ఆ నమ్మకంలోనే ఉంటున్నాడు. రాత్రిపూట అంటే రాత్రిపూటనేకాదు, పగటివేళనయినా మంచి నడిజామున, ఓతుమ్మలబీటిలోకి పోవాలన్నా, ఓతాటితోపులోకి పోవాలన్నా, ఓపెద్దచెట్టుకింద ఒంటరిగా పండుకొని నిద్రపోవాలన్నా, అతనికి ఇంతంతభయం కాదు.

నారాయుడి చిన్నతనంలో ఒకసారి వీథిభాగవతులు హరిశ్చంద్రనాటకం ఆడుతుంటే చూడడానికి వెళ్లాడట! ఆ నాటకంలో హరిశ్చంద్రుడూ, చంద్రమతీ, లోహితాస్యుడూ, నక్షత్రకుడూ — వీళ్లందరూ అడివిలో ప్రవేశించి ఒక చెట్టుక్రింద పండుకొని నిద్రపోతూ ఉన్నారట! అప్పుడు ఆ చెట్టుమీదినుంచి ఒక భూతం వీళ్లమీదికి దూకినట్లు, భాగవతం ఆడడానికి వేసిన పందిరి మీదినించి, కింద పండుకొన్న చంద్రమతీ, నక్షత్రకులమీదికి భేతాళుడి వేషంతో ఒక వికృతాకారంతో గభాలున కిందికి దూకిందట. దాన్ని చూచి, నారాయుడు కెవ్వుమని కేకపెట్టి, జడుసుకొని, ఆదెబ్బతో పదిహేను లంకణాలు చేశాడట! అదిలగాయతు అతనికి దయ్యాలన్నా, భూతాలన్నా నమ్మకం బలపడడమేకాకుండా అవి సాధారణంగా చెట్లమీదనే ఉంటాయన్న నమ్మకంకూడా బలపడింది.

ఈ దయ్యాల భూతాల భయంతోనే అతనికి ఇప్పటికీ, చచ్చిన శవాన్నిగాని,

చచ్చిన పశువునిగాని, ఆఖరుకు ఒక కుక్కను గాని చూడడానికి జంకు. చిన్నతనంలో అతని తల్లితండ్రి వగైరాలు చెప్పే కథలు ఎప్పుడూ దయ్యాలతోనే నిండిఉండేవి. ఒక మనిషి చచ్చిపోతే అతడు దయ్యం అయిపోతాడనీ, చచ్చిపోయిన పదకొండోరోజుదాకా ఆ దయ్యం, మనిషికి ప్రాణం పోయిన స్థలం లోనే కాచుకొని తిరుగుతూ ఉంటుందనీ, తర్వాత ఏ శ్మశానంలోనో, ఏ చెట్టు మీదనో, ఏ పుట్టమీదనో నివాసం ఏర్పర చుకొని ఉంటుందనీ — ఇట్లాంటి విషయా లన్నీ ఎన్నో అతనిపు్రైను పట్టిఉన్నవి.

దయ్యాల్లో మామూలు దయ్యాలూ, కొరివిదయ్యాలూ అని రెండురకాలు ఉంటా యని కూడా అతనికి తెలుసు. అతడు చెప్పు తాడు — తాను పద్నాలుగేళ్ల పిల్లవాడుగా ఉండంగా, ఒకనాడు రాత్రి తన మేనత్తపక్కలో పండుకొని నిద్రపోతూఉండినాడట! అతనికి రాత్రి నడిరేయి మెళుకువ వచ్చిందట; పక్కలో పండుకొన్న తను కళ్లు విప్పిచూచే వరకు ఎవరో ఒకమనిషి వచ్చి గుమ్మంలో నిలబడి ఉన్నట్టు అతనికి అగుపడిందట! అట్టే చూడగా, ఆమనిషి చచ్చిపోయిన తన మేనత్త పెనిమిటిలాగ ఉన్నాడట! 'మామా, మామా' అని అతన్ని పదిసార్లు పలకరించాడట. కాని ఆమనిషి మాట్లాడ కుండానే నిలబడి, చేతులేమో ఇటూ అటూ తిప్పుతూ, పళ్లు ఇకిలించి నారాయుడుమీదికి దూకబోయాడట! ఆరూపం జూచి నారా యుడు భయపడి "అమ్మో! దయ్యమే!" అని అరిచి నిద్రపోతూ ఉండిన మేనత్తను గట్టిగా పట్టుకొని కళ్లుమూసుకొన్నాడట! తనకు దయ్యాలమీద గల నమ్మకాన్ని ధ్రువపరచడానికి, ఇటువంటి తన అనుభవాలు ఎన్నో చెప్పుతూ ఉంటాడు — నారాయుడు.

కొన్ని కొన్ని దయ్యాలు రాత్రిపూట పొలంల్లో తిరుగుతూ కుప్పలదగ్గరా, చేల దగ్గరా నిద్రపోయే మనుష్యుల్ని సాయం పట్టి, ఓం ఓం ఓం ఓం అని గంజీకావడి పట్టి మోసుకొనిపోతూ ఉంటాయనీ, కొన్ని కొన్ని దయ్యాలు మనుష్యుల్ని బెదిరించి వాళ్లవంటిమీద ఉన్న గుడ్డలూ, చొక్కాలూ పెరుక్కొని వాటిని ధరించి, అవి హాయిగా మనుష్యుల్లాగే తిరుగుతూఉంటాయనీ, కొరివి దయ్యాలయితే - మనిషి వచ్చేదారి కడ్డంగా నిలబడి మంటవేసి, ఆ మనిషిని దారితప్పించి ఇంకోపక్కకి, ముళ్లల్లోకీ, కాలవల్లోకీ, కంచె ల్లోకీ తీసుకొనిపోయి చిక్కులు పెట్టుతూ, పకపకనవ్వుతూ ఉంటాయనీ — ఇట్లాంటికథలు తాను చిన్నతనంలో విన్నవి అన్నీ నారా యుడు ఇప్పటికీ చెప్పుతూనే ఉంటాడు.

అంతదూరం ఎందుకు? నారాయుడి తాత ఉండేవాడట! ఆతాత రాత్రింబగళ్లు గొర్రెలు కాచుకొంటూ, ఎప్పుడూ పొలం మీదనే తిరుగుతూ ఉండేవాడట! రాత్రి పూట ప్రతిరోజూ, ఓ ఏడెనిమిది దయ్యాలు జతగా వచ్చి, "తాతా! వక్కా, ఆకూ పెట్టవూ? పొగాకుకాడ పెట్టవూ?" అని అత న్ని బెల్లించుకొని తీసుకొనిపోతూ ఉండేవట! వాటిలో ఆడదయ్యాలు, తాతతో సహా

గా లాడుతూ, అతని మొలగుడ్డ పట్టుకొని లాగీ, అతనిగోచీ పట్టుకొని లాగీ, అతనిజుట్టు పీకీ—ఈవిధంగా చిలిపిపనులు చేస్తూ వుండే వట! ఈ సంగతులన్నీ నారాయుడు చెప్తూనే ఉంటాడు.

కాని - చిన్నతనంలో తన మేనత్త పక్కలో పండుకొన్నప్పుడు చూచినదయ్యం తప్ప - మళ్లా ఇంతవర కెప్పుడూ, అతడు దయ్యాన్ని చూడలేదు. అయితే దయ్యాలు ఉన్నవనీ, అవి కామరూపులనీమాత్రం అతనికి నమ్మకమే. నమ్మకమయితే చిన్నప్పటికంటె ఇప్పుడు బలమయిపోయింది కాని, దయ్యాలంటే అతనికి చిన్నప్పుడు ఉండినంత భయంమాత్రం ఇప్పుడు లేదు. అది సహజమేగా! వయస్సు వచ్చినకొద్దీ భయాలు తగ్గుతూనే ఉంటవి! అయినా దయ్యాలనేవి మొత్తంమీద దుష్టజంతువుల్లో చేరినవనీ, మనిషయినవాడు ఎప్పుడూ వాటికి ఎడంగా ఉండడమే మేలనీ, నారాయుడి ఉద్దేశం. దయ్యాలుకూడా కొంచెమించుమించు మనిషిలాగే, కాళ్లూ చేతులూ, ముక్కూ చెవులూ, ఇట్లాంటివి కలిగిఉంటా యని—అతడు చిన్నతనంలో తనమేనత్తపక్కలోచూచినప్పటినుంచీ—అనుకొంటూ ఉన్నందువల్ల, తాను పెద్దవాడయి జ్ఞానం తెలిసినతర్వాత, దయ్యాన్ని పోసి ఒకసారి ప్రత్యక్షంగాచూచి దాని నిజస్వరూపం తెలుసుకొని, సందేహ నివర్తి చేసుకొందామనే తలంపు—అతని కెన్నడూ కలగనూలేదు, ఆప్రయత్నం అతడు చేయనూలేదు. ఇక ఏతావాతా, దయ్యా లున్నవని నమ్మినప్పటినుంచీ, అతగాడు చేస్తూవచ్చినకృషి ఏమిటంటే-దయ్యాలవల్ల తనకు ఏవిధమైన బాధగాని, కష్టంగాని కలగకుండా చేసుకోవాలన్న జాగ్రత్తలో మాత్రం ఉంటూవచ్చాడు.

వాళ్లగ్రామానికి ఒకానొకప్పుడు, ఒకానొక భూతవైద్యుడు వస్తే, "అయ్యా! దయ్యాలూ, భూతాలూ, పిశాచాలూ-ఇల్లాంటివి ఏవీ దరిచేరకుండా ఉండే ఉపాయం చెప్పదురూ" అని ఆయన్ని అర్థించాడు. దానికి అతడు మంత్రించిన విభూతీ, కుంకుమా పొట్లాలు కట్టి ఇచ్చి ప్రతిరోజూ రాత్రిపూట పండుకొని నిద్రపోయే ముందు వాటిని నుదుట ధరించి నిద్రపోయినట్లయితే, భూత ప్రేత పిశాచ బాధ ఏమీ ఉండదని ఘట్టిగా చెప్పాడు.

ఆప్రకారం నారాయుడు కొంతకాలం చేశాడు. కాని అతనికి ధైర్యం చిక్కలేదు. విభూతీ కుంకుమా ఎన్నిరోజులు ధరించినప్పటికీ తనకు తెలియకుండా దయ్యాలు తనని సమీపిస్తున్నట్టూ, తనని బాధించడానికి ప్రయత్నం చేస్తున్నట్టూ—ఇట్లాగే అతని మనస్సుకు కలవరంగా ఉండేది. అదిగాక, కొన్నాళ్లయినతరువాత విభూతీ కుంకుమా విషయమై తాను కొంతమందిని విచారించి తెలుసుకోగా-అవి మంత్రించి యిచ్చి చాలారోజులయినదనీ, అందువల్ల వాటికి మంత్రశక్తిమ తగ్గిపోయివుంటుందనీ, ఇక అవి పనిచేయవనీ, చెప్పారు. అంతట వాటిని అవతల పారేశాడు నారాయుడు.

తరువాత కొన్నాళ్లకు ఆవూరి కంసాలి శరభయ్యకూడా కొత్తగా భూతవైద్యం నేర్చుకొని చాలామందికి నయం చేస్తున్నాడని తెలిసి, అతనిదగ్గరకుకూడా వెళ్లి సంప్రతించాడు. శరభయ్యకూడా ఏమేమిటో మంత్రాలూ తంత్రాలూ చదివి విభూతికుంకుమా యిస్తూ వాటితోకూడా ఆంజనేయ విగ్రహం చెక్కిన ఒక రాగిరక్షరేకుకూడా మంత్రించి, దాన్ని నారాయుడి మెడలో ముడివేశాడు. ఇక నారాయుడి దగ్గరకుగాని, అతడు ఉండిన చోటికి గాని — జాగ్రదవస్థలో ఉండంగా, దయ్యాలు రానే రాలేవు సరిగదా, ఆఖరుకు స్వప్నావస్థలో నయినా సరే, అవి దరిమేలా రావని — శరభయ్య చాలాదూరం ఎంతో నమ్మకంగా చెప్పాడు.

గొల్ల నారాయుడికి మునపటికంటె ఇప్పుడు మరింత ధైర్యం కలిగింది. కాని — రాగిరక్షరేకు సరిగా పనిచేస్తున్నదా లేదా అనిమాత్రం అత నెన్నడూ పరీక్షగా చూడలేదు. కొన్నిరోజులు గడచేవరకు అతనికి దానిమీదకూడా నమ్మకం తగ్గుతూవచ్చింది; ఎందువల్లనంటే — అతడు రాత్రిళ్లు నిద్రపోతూ ఉంటే ఏవో పెద్దపులులూ, సింహాలూ, తాచుపాములూ — ఇట్లాంటి దుష్టజంతువులు అతన్ని తరుముకొని వస్తున్నట్లూ, వాటిని తప్పించుకోవాలని తాను ఎంతో ప్రయత్నంచేస్తున్నట్లూ, తా నెంతప్రయత్నించినా తనకు అడుగు ముందుకు సాగకుండానే నిలబడిపోతూ ఉండినట్లూ—ఇట్లాంటికలలు రోజూ ఎన్నో వస్తూ ఉండేవి! ఇది ఎందువల్లనా, నిద్రలో మనస్సు ఇంత భీతి చెందడానికి కారణ మేమా అని నారాయుడు కొంతమందితో సలహాపడగా - అది అంతా దయ్యాలూ, పిశాచాలూ చేసే చేష్టలని వాళ్లు చెప్పారట! అయినా కంసాలి శరభయ్యతో వివరాలన్నీ చెప్పి మళ్లా మంత్రం వేయించుకొందామని, అతనివద్దకు వెళ్లాడు.

నారాయుడు చెప్పిన విషయం శరభయ్య శ్రద్ధగా విని "నీకేమీ భయంలేదు: నిజంలో రక్షరేకు పనిచేస్తున్నది కాని, పని చేయకుండా పోవడంలేదు. అయినా, ఇంకొక్క పనిచేస్తావా" అని అడిగాడు.

"చేస్తా" నన్నాడు నారాయుడు.

"నువ్వు చదువుకొన్నావా?"

"ఏదో వానకాలం చదువు చదువుకొన్నాను."

"నీకు ఆంజనేయదండకం పుస్తకం ఒకటి ఇస్తాను. ఆ దండకం నోట వల్లించి, కంఠోపాఠం పట్టగలవా? దండకంగనక కంఠస్థంగా వచ్చిందంటే, ప్రతిదినమూ రాత్రి పండుకొనేముందు దాన్ని పఠించి నిద్రపోతే నీకు ఆస్వప్నాలుకూడా రావు."

"నేను సంతకంమాత్రం ఎట్లాగో చేస్తానుగాని, పుస్తకం తీసుకొని చదవడానికి నాచేత కాదే? ఎట్లా?"

"అట్లానా? — అయినా పరవాలేదు. ఒక పదిహేనురోజులుమాత్రం, ప్రతిరోజూ రాత్రి భోజనం చేసుకొని నా యింటికి రా. రోజూ కొంచెం కొంచెంగా, నీకు ఆదండకం

నేను చదివి చెప్పతూ ఉంటాను. ఒక్కొక్క ముక్కే నాతోపాటు నువ్వుకూడా అంటూ ఉంటే, పదిరోజులకల్లా నీకు దండకం కంఠస్థం అయిపోతుంది.. మరి అట్లా రాగలవా?"

"అబ్బో! అంతపెద్ద దండకం, నాకు నోటపట్టుతుందా, నాకు జ్ఞాపకం ఉంటుందా?"

"ఓయి పిచ్చివాడా! నీ కాభయం ఏమీ పనిలేదు. నీకంటెకూడా అక్షరమ్ముక్క రాని మొద్దులికి ఎంతమందికి చెప్పాను — ఈ దండకం? రెండోవాళ్ళ సహాయం లేకుండా, నీచేత దండకం చెప్పించేపూచీ నాది—."

"అట్లా అయితే సరే"

"ఇంకొక్క విశేషం: ఈ దండకం నీకు పూర్తిగా వచ్చిన తర్వాత నాకు పది రూపాయల ఖర్చు ఒకటి ఉన్నది! ఆంజ నేయస్వామి ఉగ్రశాంతికొరకు, నేను ఒక రోజు ఇంత పూజా, పురస్కారమూ చేసి సంతర్పణ జరిపించవలసి ఉంది. ఆ ఖర్చు భరించే బాధ్యతమాత్రం నీవు పెట్టుకోవలసి ఉంటుంది."

"నీ ఇష్టప్రకారమే కానీ" అని నారా యుడు అంగీకరించాడు."

శరభయ్యమీద ఒకవిధమైన గురి కుది రింది నారాయుడికి. అతడు దినమ్మూ రాత్రి భోజనంచేసి కంసాలి శరభయ్యవద్దకి పోయి రెండునెలలకు ఆంజనేయదండకం పూర్తిగా కంఠోపాఠం వచ్చేలాగ చెప్పించుకొన్నాడు; శరభయ్య కోరిన పదిరూపాయలు సంభావనా యిచ్చాడు. ప్రతిదినమూ, రాత్రి పడుకొనే ముందు నారాయుడు ఆంజనేయదండకం చదువుకోవడమూ, శరభయ్య యిచ్చిన విభూతీ, కుంకుమా ముఖాన్న ధరించడమూ, గుండెమీద చెయ్యివేసి నిద్రపోవడమూ— ఈవిధంగా జరిగిపోతున్నాయి రోజులు.

మూడుమాసములు జరిగింది. నాలుగు నెలలు గడచింది. దండకం ఒకరకంగా కొంత పనిచేసినట్టుగానే తోచింది నారాయుడికి. ఇదివరకులాగ పీడకలలూ, ఆబాధలూ ఆట్టే రావడంలేదు. కాని అతనికి ఓ పెద్దసందే హం కలిగింది. ఒకవేళ తాను ఏ రాత్రిపూట అయినా, ఏ చెట్టుకిందనుంచి అయినా, లేక ఏ పొలంలోనుంచి అయినా ఒంటరిగా పోవలసి ఉన్నప్పుడు, ఒకానొకదయ్యం తన కెదురుగ్గా తటస్థపడితే ఎట్లా? అప్పుడు ఆంజనేయదండకం చదివినంతమాత్రంచేత దయ్యం పారిపోతుందా? పారిపోతుం దని శరభయ్య చెప్పినమాట నిజమేనా? ఏమో? పారిపోతుందో పారిపోదో! నోటి తో మంత్రం చదివితే అంతమాత్రంచేత దయ్యానికి నిజంగా భయం ఉంటుందా? తాను ఒంటరిగా ఉండే సమయంలో ఒకటికి రెండూ మూడూ దయ్యాలు తోడయి వచ్చిన ట్లయితే ఎట్లా? అప్పుడేం చేయాలి? అని అతనికి సందేహం కలిగింది. వెళ్లి మళ్లా శరభయ్యనే సంప్రదించాడు. అత డేదో సమాధానం చెప్పాడు; కాని నారాయుడికది తృప్తికరంగా ఉండలేదు. పైగా ఈ మధ్య తాను రోజూ ఆంజనేయదండకం పఠించి పడుకొంటున్నప్పటికీ కూడా రాత్రి స్వప్నంలో

దయ్యాలు మళ్లా అప్పుడప్పుడు కనిపిస్తూనే ఉన్నాయి. పదిహేనురోజుల కిందట ఒక రాత్రి మంచంమీద వెల్లకిలా గుండెలమీద చెయ్యివేసుకొని తాను నిద్రపోతూ ఉండడమూ, ఎవరో ఒక మనిషి వచ్చి తన గుండెలమీద కూర్చొని పీకె చేత్తో పట్టుకోవడమూ, తాను పెద్దగా అరవాలని ప్రయత్నం చేయడమూ, ఎంత ప్రయత్నించినా నోట మాట రాకపోవడమూ, కొంత సేపటికి తాను మంచంమీదినుంచి త్రుళ్లిపడి కేకపెట్టి కిందపడిపోవడమూ, ఇంట్లోవాళ్లది చూచి గోలపెట్టడమూ—ఇంత వ్యవహారం జరిగింది. అదిలగాయతు, తాను దయ్యాలబాధ వదలించుకోవాలని ప్రయత్నం చేస్తూన్న సంగతి దయ్యాలు బాగా తెలుసుకొన్న వనీ, తాను జాగ్రత్తపడినకొద్దీ అవి తన్ను బాగా పట్టుకొని పీడిస్తున్నవనీ, ఇంక శరభయ్యమంత్రం కూడా అంతగా పనిచేసేటట్టు లేదనీ, తా నేదయినా ఇంకోదారి తొక్కవలసిన అవసరం ఏర్పడిందనీ—విషయం అంతా మనస్సుకు తెచ్చుకొన్నాడు నారాయుడు.

కాని ఇంకోమార్గం అంటే ఏముందీ? సాధారణంగా దయ్యాలూ, పిశాచాలూ వీటిని మంత్రబలిమిచేతనే సాధిస్తూ ఉంటారు వైద్యులు. కాని ఆ మంత్రబలిమి తనపట్ల వ్యర్థమయిపోయింది. ఇక ఇంకోఉపాయం ఏమున్నదీ అని అతని కేమీ దారి తోచటం లేదు.

తిరిగాడు తిరిగాడు ఆచుట్టుపక్కల పది ఇరవై మైళ్ల దూరంలో ఉన్న పల్లెలన్నీ తిరిగాడు. తనకు నమ్మకం కల వైద్యుణ్ణల్లా సలహా అడిగాడు. కాని వాండ్లు చెప్పిన ఉపాయాలుగాని, సలహాలుగాని నారాయుడికి సరిపడలేదు. తిరిగి తిరిగి ప్రాణం విసిగి ఒక రోజు తన ఊరికి తిరిగి వస్తున్నాడు.

దారిలో ఇంకొక్కవూరు అతనికి తటస్థపడింది. చుట్టుపక్కల ఊళ్లనుంచి ఆ వూరికి జనం తండాలు తండాలుగా వస్తున్నారు. ఆడవాళ్లు, మొగవాళ్లు, చంటిపిల్లలు—అనేకమంది కుటుంబాలతోకూడా బండ్లు కట్టుకొని కొంతమందీ, కాలినడకని కొంత మందీ వస్తున్నారు. అంతమంది తిరునాళ్ల ప్రజలాగ ఆ ఊరికి రావడానికి కారణ మేమని ఆ ప్రయాణీకుల్నే అడిగాడు. ఆ ఊళ్లో ప్రతియేటా ఆషాఢ శుద్ధ పంచమికి వీరభద్రస్వామి తిరునాళ్లు జరుగుతుందనీ, ఆ వేడుకలు చూడడానికీ, వీరభద్రస్వామికి కానుకలు చెల్లించుకోవడానికీ జనంవస్తున్నారనీ నారాయుడు తెలుసుకొన్నాడు. అతనికి కూడా తిరునాళ్లు చూడాలని కోరికపుట్టింది. ఆ జనంలో ఒకగొల్లకుటుంబంతో పరిచయం కల్పించుకొని వాళ్లతో కూడా ఊళ్లోకి వెళ్లాడు.

సాయంత్రం అయ్యేవరకు ఊరు ఈని నట్లు ఏ సందుగొందుల్లో పట్టినా జనమే-తిరునాళ్లప్రజలే. రాత్రి అన్నం తిని వీరభద్రస్వామి ఉత్సవం చూడడానికి వెళ్లాడు—నారాయుడు.

ఓ! రాత్రి పట్టపగ లయిపోయింది. [illegible] యయ్యాలు చిన్న చిన్న ప్రభలు

వీపులకు కట్టుకొని, ముఖాన్నీ కళ్లమీదా విభూతి పెట్టుకొని, మెడలో వెండిలింగ కాయలు ధరించి, చేత జేగంటలు పట్టుకొని, వీరాంగం తొక్కుతూ వీరనృత్యం చేస్తున్నారు. మరి కొంతమంది జంగమయ్యలు కంచుగంటలకు చుట్టూ నల్లచేవ చందనపు కొయ్య తిప్పుతూ, ఓంకారశబ్దం సృష్టించి, ఆ శబ్దంతోకూడా శంఖారావం మేళవించి నాదబ్రహ్మానికి శ్రుతులు వేస్తున్నారు. వీరగాలూ, డోళ్లూ, సన్నాయిమేళం — వీరాంగం తప్ప మరొకశబ్దం చెవికి వినరావడం లేదు. ఇద్దరు మనుష్యులు — ముష్ఫయ్యేళ్లవాళ్లు, కంఠంలో ఒకడూ, నోటిలో ఈబుగ్గలోనించి ఆ బుగ్గలోకి వచ్చేటట్టుగా ఇంకొకడూ, చెరొక శూలమూ గుచ్చుకొని, రక్తప్రవాహంతో తడిసిన శరీరం మరిచి ఉత్సవంలో ఊరేగుతున్నారు. ఇంకొక కంసాలిబత్తుడు — ఒక మణుగు బరువు గల (ఇనప) అగ్నిశూలాన్ని నాలుకచివర గుచ్చుకొని, ఆశూలం మొదలు ఒకచేత్తో పట్టుకొన్నాడు. ఆ శూలానికి పైభాగం అంతా పలవలూ, చిలవలూ వేసిన చిన్నతులసిచెట్టు లాగా, షుమారు నూరు వందసూదు లున్నవి. ఒక్కొక్క సూదికి చమురులో నానవేసిన ఒక్కొక్క నూలుకండె గుచ్చి వెలిగించారు. నూరునూలుకండెలూ ఒక్కసారి భగ్గున మండిపోతున్నవి. ఎర్రగా కాలిపోతూఉన్న అగ్నిశూలం కంసాలిబత్తుడి నాలుకమీదనే నిలబడిపోయింది. అ దొక అగ్నిగోళంలాగా ప్రజ్వలిస్తూ ఉత్సవంలో ఊరేగుతు ంది.

ఇంకా కొంతమంది జంగాలూ, శైవులూ ఉరుము లురిమేటట్టు "అశ్శరభ, శరభా, అల్లల్లవీర" అని ఖడ్గాలు చదువుతున్నారు. ఈ నారసాలవారి, శూలాలవారి వెనుక, ఉత్సవంలో నట్టనడుమున ఒక నలభయిఏళ్ల ఆడమనిషి, ముఖం అంతా పసుపు పులుముకొంది. రూపాయంత కుంకంబొట్టు ధరించింది. తడిగుడ్డలు కట్టుకొంది. తడితలనే ముడివేసుకొంది. వెండిపొన్నులు చుట్టిన పేప బెత్తాన్ని ఈ చివరా ఆ చివరా చెరొక చేత్తోను ఆమె పైకెత్తి పట్టుకొన్నది. ఆమెను ఇద్దరు మనుష్యులు సందిట పట్టుకొన్నారు. ఆమెకు ఉగ్రం తగ్గేటట్టు సాంబ్రాణిపొగ ధూపం వేస్తున్నారు. అక్కడక్కడ బిందెలతో నీళ్లు తెచ్చి ఆమెనెత్తిన దిమ్మరిస్తున్నారు. ఆమెకే వీరభద్రస్వామి ఆవేశించా డని ప్రజ లంటున్నారు. ఆమెకు చేతులెత్తి మొక్కుతున్నారు. అశేష జనమూ ఒకవిధమైన వీరావేశంతో మైమరచి తిరుగుతున్నారు.

ఈ తిరునాళ్ల ఉత్సవం నారాయుడెన్నడూ చూడలేదు. అ దొక నూతనసృష్టిగానూ, నూతన ప్రపంచంగానూ ఉన్నదతనికి. రాత్రితెల్లవార్లూ ఆజనంతో కలిసి ఉత్సవంలో తిరిగాడు - నారాయుడు.

తెల్లవారింది. ఉదయం ఏడు గంటలకు వీరభద్రస్వామి ఆలయందగ్గర మంటపంలో కూర్చుని ఉన్నది— రాత్రి స్వామిపూనిన ఆడమనిషి. ఒక బారెడుపొడుగునా, బొటన వ్రేలిలావుగల ఒకపేపబెత్తం ఆమె

చేత పట్టుకొని కూర్చున్నది. ఆడవాళ్లూ మొగవాళ్లూ ఆమెకెదురుగాపోయి సాగిలపడు తున్నారు. ఆజనంలో ఒక్కొక్కరినే ఆమె ముందుకు తనదగ్గరికి పిలుస్తోంది. వచ్చిన ఆడమనిషినిగాని, మొగమనిషినిగాని జుట్టు పట్టుకొంటోంది. చేతిలోనిబెత్తంతో శరీరం మీద ఛెడేలు ఛెడేలుమని అంటిస్తోంది. ఆమె చేత జుట్టుచిక్కిన మనిషి గడగడ వణికి పోతోంది. "బాబో! బాబో! నాయనో! పోతాను. నేను లేచిపోతాను. ఇక్కడ ఉండను. నన్ను విడిచిపెట్టు" అని గొల్లున కేకలుపెట్టి ఏడుస్తోంది. ఈ ప్రకారం ఒకరి తర్వాత మరొకరుచొప్పున మధ్యాహ్నం పన్నెండు గంటలయ్యే సరికి సుమారొక వందమందిని, ఆబెత్తంతోనే ఆ ఆడమనిషి చావగొట్టింది.

ఈ చర్య అంతా కంటిమీద రెప్ప వాల్చకుండా గమనిస్తున్నాడు నారాయుడు. అతని కిదేమీ అర్థం కావడం లేదు.

"ఎందుకయ్యా! ఆ ఆడమనిషి అట్లా కొట్టుతుంది. వీళ్లు ఇట్లా ఏడుస్తున్నారు?" అని తనతోకూడా ఉండిన గొల్లవాళ్లని అడిగాడు నారాయుడు.

"వాళ్లకు గాలిపట్టినందువల్ల, ఆమె వదల గొట్టుతోంది."

"గాలి అంటే?"

"గాలి అంటే ఎరగవూ? గాలి అంటే దెయ్యం. ఆడవాళ్లకిగాని, మొగవాళ్లకిగాని దయ్యం పట్టి పీడిస్తూ ఉంటే, ప్రతిసం [illegible] తిరనాళ్లకు వచ్చి మొక్కుకొంటే, మళ్లా జన్మజన్మానికీ, దయ్యమనేది రాకుండా ఈమె వదిలించి పంపివేస్తుంది."

"అయితే ఆమె అట్లా కొట్టడం ఎందుకు?"

"కొట్టకుంటే దయ్యం విడిచిపెట్టి పోతుందా? దెబ్బకు తప్ప మరి దేనికీ లొంగదు-దయ్యం."

"అట్లాగునా? కొంతమంది భూత వైద్యులు మంత్రించిన విభూతీ, రక్షరేకూ - ఇట్లాంటివి ఇస్తూఉంటారే, వాటివల్ల దయ్యాలకు భయం లేదు కాబోలు" అని ఊహించి ప్రశ్నించాడు నారాయుడు.

"అబ్బే! అట్లాంటి వైద్యాలు ఏమీ పనిచేయవు. ఎన్ని చేసినా, దెబ్బకొట్టే వైద్యం తర్వాతనే—ఏవైద్యమైనా. మంత్రం చేతనే దయ్యాన్ని లోగట్టుకోగలిగితే, ఇంత మంది జనం ఈడకి రావడ మెందుకు? ఆమెచేత చావ దెబ్బలు తినడం ఎందుకు? దెబ్బ దేవేంద్రలోకం— అన్నట్లు, దయ్యానికల్లా పడవలసింది దెబ్బే!" అని వాళ్లు సమాధానం చెప్పారు.

ఈ విషయం అంతా ఆశ్చర్యంగా వుంది నారాయుడికి. దయ్యం దెబ్బకు భయపడుతుందా? అని అనుకొన్నాడు - మరి తాను ప్రత్యక్షంగా చూస్తూనే వున్నాడు అక్కడ. అందులో నిజం లేకుంటే అంతమంది జనం ఆ ఆడమనిషిచేత ఆవిధంగా [illegible] దెబ్బలు తింటారా?

నారాయుడికి సందేహానివృత్తి అయి పోయింది. ఆరోజున అతనికి గలిగిన ఉత్సాహానికీ, సంతోషానికీ మేర లేదు.

ఒక్క ఆడమనిషి ఇన్ని దయ్యాలని జయించిందే, తాను మొగవాడైకూడా ఇంకా భయం ఎందుకు ?

ఆరాత్రి భోజనంచేసి నెల క్రుంకే వరకూ వీరభద్రస్వామి ఉత్సవమూ, నిప్పుల గుండమూ, పీఠపూజా చూచుకొన్నాడు. అన్ని వేలమంది ఒక్కచోట చేరడం, ఆ జనం చేసుకొనే వేడుకలు, వాళ్లఉత్సాహం, వాళ్ల ఆవేశం, శరీరాలకు ఆవేశం ఎత్తించే వీరాంగం, సాంబ్రాణిపొగా — ఇవన్నీచూస్తే అతనికీ ప్రపంచం యావత్తూ అవలీలగా గోటితో మీటివేయగలం అన్నధైర్యం గలిగింది. ఇకప్రపంచంలో గల దయ్యాలనుగాని, భూతాలనుగాని, పిశాచాలను గాని— చెప్పకింద తేలులాగ నేలబెట్టి రాచిపారెయ్య వచ్చునని అతనికి ధైర్యం కలిగింది. ఒకటిగాదు, లక్షదయ్యాలు కలసివచ్చినా, తన అధికారానికి లోబడి ఉండవలసిందే గాని, ఇదవరకులాగ తోకాడించడానికి మాత్రం వీలు లేదనుకొన్నాడు; తన జబ్బపుష్టి చూచుకొన్నాడు. రెక్కలలో తిరిగిన కండలు పైకి పొంగినై. ఇక తనకు ఆ ఉత్సవంతోగాని, ఆ వేడుకలతోగాని పని ఏమున్నదని అనుకొన్నాడు. వెంటనేబయలుదేరి వేకువజామునకు తనఇల్లు చేరుకోవా లనుకొన్నాడు. చేత కర్ర పుచ్చుకొని, కాలికి చెప్పులు తొడిగి, రాత్రి నెల క్రుంకిన తరువాత ఆ చీకట్లోనే ఎకాయెకీని ఇంటికి ప్రయాణమైనాడు.

వీరభద్రస్వామిఉత్సవంలో ఎక్కిన కైపులో అతనికళ్లకి చీకటి అనిగాని, దయ్యం అనిగాని, పురుగు అనిగాని, పుట్ట అనిగాని, భయం అనిగాని, — ఏమీ తెలియడం లేదు. విల్లువిడిచిన శరంవేగంతో, ఆ రోడ్డు ఎక్కి చరచర చరచర నడిచిపోతున్నాడు. అతనికి పొద్దు తెలియలేదు. శరీరం తెలియలేదు. ప్రపంచమే తెలియలేదు. తన కేదో పెన్నిధానం దొరికినట్లు పట్టరాని సంతోషం. రాజ్యాధిపత్యం లభించినట్లు— అధికారగర్వం. శత్రువును బరిమార్చడానికి రణరంగానికి దూకే భారత యోధుడిలాగ, పరుగుమీద పోతున్నాడు నారాయుడు.

చీకటి బాగా దట్టంగా ఉంది. తన ఊరికి వెళ్లే డొంకలో ప్రవేశించాడు. నడక వేగం తగ్గలేదు. ఊరు ఇంకా రెండు ఫర్లాంగుల దూరం ఉన్నది. డొంకకి తూర్పుతట్టు జీబురుమంటూ తాటితోపూ, పడమటితట్టున తుమ్మలబీడూను నక్షత్రాల గుడ్డివెన్నెలను కూడా మింగేశాయి చెట్ల గుంపులు. ఆచెట్లగుంపు దయ్యాల కాటపట్టని, నారాయుడికి ఉగ్గుబాలతోనే తెలుసును. దయ్యాల మధ్యకి తాను వచ్చినట్టు తటాలున స్ఫురణకు వచ్చింది. తల పైకెత్తి ఇటూ, అటూ కలయజూచాడు. ఎదురుగా ఒక నలభై ఏభయి గజాల దూరంలో ఒక డొంకలో ఇటూ, అటూ తిరుగుతోంది—దయ్యమేనా?

నారాయుడు తటాలున నిలబడ్డాడు. దయ్యమే కాకపోతే ఈచీకట్లో ఈజీబురులో ఏమనిషి తిరుగుతుంది? చూడగా చూడగా అది తూర్పుగా తాటిచెట్లల్లోకి తప్పుకుంది. దయ్యం పారిపోతోందే అనే ఆత్రంతో, లేడిపిల్లని కబళించే సింహంలాగ ముందు కొక్కదూకు దూకి పరుగుపెట్టాడు. తెల్లని బట్టతో, తలనిండా ముసుగుతో తూర్పుగా తొలగిన దయ్యం, చెట్టుచాటునుండి డొంక లోకి నారాయుడికి పక్కగా వచ్చింది. దయ్యాలభావనలో పడివున్న నారాయుడు "చావు దయ్యమా!" అని చేతిలోని కర్ర ఎత్తి దయ్యంనెత్తినపెట్టాడు. ఒకదయ్యాన్ని జయించానని ఉప్పొంగి పోయినాడు నారాయుడు.

చేతు లూపుకొంటూ, కర్ర ఆడించు కొంటూ, మీసం దువ్వుకొంటూ, దిగ్విజయం చేసివచ్చిన వీరుడిలాగ ఇంటికి పోయి, భార్యను నిద్రలేపి, నారాయుడు తలుపు బిగించుకొని పండుకొన్నాడు.—

కోళ్లు కొక్కొరోకో యని కూశాయి

తెల్లవారి వెలుతురు వచ్చేవరకు,— తాటిలోపుదగ్గర డొంకలో దయ్యాలు వేకువజామునే డొంకలో పేడ పోగు చేసుకోను పోయిన కోమటిముసలిది గోవిందమ్మ నెత్తణిచాయన్నారు ప్రజలు.




ఆనందపారవశ్యము

కొత్తపల్లి సుబ్రహ్మణ్యం.




భావరాజు నరసింహారావు

౧

నగరవాసం చేస్తూ రైళ్లు, మోటార్లు, ఫ్యాక్టరీల మధ్య ఉండి యేమేడమీదనుంచో వాటి దుర్గంధాలను పీల్చిపీల్చి కృశించిపోయిన ఘ్రాణేంద్రియంతో ఉండ వలసిన రంగయ్య, దైవవశాత్తు పొలాలలోనుంచి, తోట లలోనుంచి వచ్చే కమ్మతెమ్మెరల నాఘ్రాణిస్తూ, కొత్తపల్లిలో పుట్టాడు గోదావరీ తీరాన. తండ్రి సంపా యించిన రెండుకుంటల పొలమూ, తానుండే చిన్నపాక తప్ప ఆ ఊళ్లో అతనికి సంబంధించిన ఆస్తి యేమీలేదు. లేకలేక పుట్టిన గారాబుబిడ్డ డవటంచేత రంగయ్యను పొలంపని చేయించి కష్టపెట్టకుండా ముద్దుగా చదివిం చాడు తండ్రి. "రంగయ్యని ప్లీడరీ చదివిస్తాడట్రా వాళ్లనాన్న! వాడెక్కడరా, ఏ పట్నంలోనో ఉం టాడు!" అంటూఉండేవాళ్లు తోటిపిల్లలంతా రంగ య్యను. నిజానికి రంగయ్యతండ్రికి ఆకోరిక మనసులో ఉన్నా ఆర్థికపరిస్థితులతన్ని ముందంగ వేయనిచ్చాయి కావు. అంచేత రంగయ్య ఆ ఊరి ప్రాథమిక పాఠశాల లోనే పట్టభద్రుడయ్యాడు.

రంగయ్యకు తల్లి చిన్నతనంలోనే పోయింది. అతడి కిరవయ్యేళ్లొచ్చేసరికల్లా తండ్రికూడా రంగ య్యను పెద్దవాణ్ణి చేసి యీలోకం విడిచిపోయాడు. చిన్నతనంనుంచీ పొలంపని పుటలామూ ఏమీ తెలియక పోవడంచేత యిప్పుడు తండ్రిపోగానే ఆకాస్తపొలం ఉండటం అతనికి కంటకంగా ఉంది. పొలం, యింటి దిబ్బా అమ్మి బస్తీదగ్గర ఉన్న మేనత్తదగ్గర ఉండా లని గట్టి ఉద్దేశం కలిగింది. కాని తనంతట తాను ఆ విషయం మేనత్తతో చెప్పటానికి బిడియపడి ఆఊళ్లోనే చిరతభజనలతోనూ, పేకాటతోను కాలక్షేపం చేశాడు కొంతకాలం.

*   *   *

భర్త చనిపోతూ ఉండటానికి యిల్లు, నాలుగు గేదెలూ, పదహారేళ్లపిల్లను — మాణిక్యాన్నీ—ఒప్ప చెప్పివెళ్లాడు వీరమ్మకు. అప్పటినుంచీ ముద్దుకూతుర్ని, మాణిక్యాన్ని కష్టపెట్టకుండా తానే కూలీ నాలీ చేసి సంపాయిస్తూ, నెయ్యి, పాలు అమ్ముకుంటూ చాలా పొదుపుగా సంసారం చేస్తోంది వీరమ్మ.

తండ్రి ఎప్పుడైనా బస్తీకి పంపితే, రంగయ్య సాధ్యమైనంతవరకు ఆ రాత్రికి మేనత్తగారియింటిదగ్గర ఉండి ప్రొద్దున్నే యిల్లుచేరేవాడు. వీరమ్మ కొడుకుల్లేక పోవడంచేత రంగయ్యంటే ఆపేక్షగానే ఉండేది మాణిక్యంకూడా ఎప్పుడూ యింట్లో ఒంటరిగా ఉండ టంచేతగాబోలు, బావ వచ్చాడంటే సంతోషంగానే ఉండేది. రంగయ్య వెళ్లిపోతుంటే మళ్లీ రమ్మనీ, అప్పుడు తప్పకుండా నాలుగురోజులు ఉండి పొమ్మనీ

చెప్తూ వుండేది. ఆ పిల్ల అలా చెప్తూంటే రంగయ్య మాత్రం ఎల్లా రాకుండా ఉంటాడు? కాని వచ్చేటప్పుడు వట్టి చేతుల్తో రాకుండా, పబ్బుబిళ్లలో, ఊలో, పువ్వులో యిలాంటి వేవో తెచ్చి యిస్తూండేవాడు. తల్లికి చూపిస్తూండేది మాణిక్యం బావ తెచ్చిన వస్తువులన్నీ. వీరమ్మకూడ సంతోషించేది.

అప్పుడప్పుడూ అన్నగారొచ్చినప్పుడు, మాణిక్యం వినకుండా, రంగయ్యకు మాణిక్యాన్నిచ్చి పెళ్లి చెయ్యమని అడుగుతూండేది వీరమ్మ. కాలచక్రం తిరుగుతూనే ఉంది; చెల్లెలికోరిక తీరుద్దామనుకుంటూనే రంగయ్యతండ్రి కాలంచేశాడు. రంగయ్యమాత్రం యీ విషయం తండ్రి చెప్పగా విని తన అదృష్టానికి గర్విస్తూండేవాడు.

*   *   *   *

కూతుర్ని ఒక్కదాన్ని విడిచి తాను రావడానికి వీల్లేదు కాబట్టి రంగయ్యను ఒక్కసారి రమ్మని కబురు చేసింది వీరమ్మ. రాత్రి అన్నాలు తింటూండగా "రంగడూ! నా కింట్లో మొగదిక్కు లేదు; నీకు ఆడదిక్కు లేదు. నాకు నీకన్న దగ్గిరవాళ్లూ లేరు; నీకు నాకన్న దగ్గిరచుట్టాలూ లేరు. కనక మనమంతా ఒక చోట ఉంటేనేగాని నా మనసుకు బాగుండదు. ఇంకా కొన్నాళ్లకు పోతాడనగా మాణిక్యాన్ని నీకిచ్చి పెళ్లి చేసి అంతా కలిసి యిక్కడే ఉందామంటూండేవాడు మాఅన్న. వాడి కాభాగ్యం లేకనేపోయింది. నేనన్నా బ్రతికుండగా మీరిద్దరూ ఒక యింటివాళ్లయి కాపరం చేస్తుంటే నాకదే పదివేలు. ఏదో పిచ్చిముండ చెప్పిందనుకోక యిక్కడే కలో గంజో కలిగినంతే తిని అంతా ఒకచోటే ఉందాం" అని ఊసువెళ్లబోసింది వీరమ్మ. ఈ మాటలు యెప్పుడు తన చెవిని పడతాయా అని ఆతురపడుతున్న రంగయ్యకు అమృతం చిలకరించినట్లనిపించింది. తెల్లవారుఝామునే తన ఊరు వెళ్లి నెల్లాళ్లలో అక్కడున్న కాస్త ఆస్తి అమ్మి నాలుగు వందల రూపాయిలూ తెచ్చి మేనత్త కిచ్చాడు రంగయ్య.

మంచిరోజు చూసి సీతారామస్వామిగుళ్లో ముడిపెట్టారు రంగయ్యకు–మాణిక్యానికి. పెళ్లయినప్పటి నుంచీ అల్లుడి భారమంతా తనమీదే ఉన్నట్టు వీరమ్మ రోజూ పోరుతూండేది రంగయ్యను ఏదైనా పనిచేసి నాలుగుడబ్బులు సంపాయించమని. రంగయ్యకూడా ఆలోచిస్తూనే ఉండేవాడు ఆ విషయం.

౨

అది సాయంకాలం. సూర్యుడు గోదావరి కావలివైపు పర్వతాల్లోకి క్రమంగా దిగిపోతున్నాడు. అతని దివ్యతేజము గౌతమీ విమలజలాల్లో ప్రతిఫలిస్తోంది. కొండలమీద వివిధ ఫలవృక్షాలమీద వ్రాలి పక్షులు సంతోషంతో చేస్తున్న రొదలు పెళ్లివారింట్లో గందరగోళంలా గుంది. కనుచూపుమేర త్రోవకిరుప్రక్కలా ఉన్న శాద్వలస్థలాలు సూర్యకిరణప్రవాహంలో మునిగి మనోహరంగా ఉన్నాయి. గాలిలో షేకల్లీసాహెబు తోటలోని పూలమొక్కలన్నీ తల లూపుతున్నాయి. రంగురంగుల సీతాకోకచిలుకలు తోటలో అన్నివేపులా ఎగురుతూ పాఠశాలలోనుంచి విడిచిపెట్టబడిన బాలికలలాగు కనులపండువగా ఉన్నాయి.

రంగయ్య ఆరోజు సంతకెళ్లి సాయంత్రం తిరిగి వస్తున్నాడు యింటికి. షేకల్లీసాహెబు తోటదగ్గర కొచ్చేసరికి ఆ ప్రశాంతసమయంలో, ఆ గోదావరీ తీరాన, సూర్యకాంతిలో బంగారుపూత పూసినట్లుండి మనోహర పరిమళములను వెదజల్లుతూన్న ఆ తోటలో కాసేపు కూర్చుందామని కుతూహలం కలిగింది. వెళ్లి కాసేపు సాహెబుతో బాతాఖానీవేసి వస్తూ మాణిక్యానికి మల్లెపూవులు తీసుకువచ్చాడు. త్రోవపొడుగునా అతనిమనస్సు పరిపరివిధాల పరుగెత్తింది. తానాపూలు మాణిక్యంతలలో ముడిచినట్టు, తానుకూడా అల్లాంటి మల్లెపూలతోట కొన్నట్లు,–యింకా యేవిటో ఆలోచిస్తూ యిల్లుచేరాడు. అత్త అన్నంపెడ్తూండగా తాను షేకల్లీసాహెబుతోట ఆరోజున చూశాననీ, చాలా బాగుందనీ, అలాంటితోట యింకా మంచిమంచి పూలతో తానుకూడా వేసి సాహెబుకన్నా యింకా యెక్కువడబ్బు సంపాయించ గలననీ చెప్పాడు. డబ్బు వృథా అయిపోతుందేమోనని ముందు కొంచెంసందేహించినా రంగయ్య తలయెత్తినతర్వాత యిదే అతడిప్రథమ ప్ర[illegible]తుడిదయ ఉంటే మరేం

ఫరవాలేదని 'సరే' నన్నది వీరమ్మ. ఆరాత్రంతా మాణిక్యంతో పూలమొక్కలనుగురించి చెప్తూనే తెల్లవారబుచ్చాడు రంగయ్య.

మర్నాడు వీరమ్మసలహావల్ల ఊళ్లో నలుగుర్నీ ఆలోచించాడు తనతోటవిషయం. 'లోకోభిన్నరుచిః' కొంతమంది 'భేష'న్నారు. మరికొందరు 'నీ కేవన్నా పిచ్చెక్కిందా? పూలతోటలో ఏఁవిలాభం? లాభం రావాలంటే ఎంతకష్టపడాలి? ఎంత పెట్టుబడికావాలి? అసలయినా యీ ఊళ్లో సాహెబుతోటతప్ప మంచి స్థలాలేలేవు పూలతోటకు' అని రకరకాలుగాచెప్పారు.

కర్ణాకర్ణిగా పడమటివీథిలో చిన్ననాగయ్య తాతదగ్గిర తోటదొడ్డి అమ్మకాని కున్నదని విని బేరం చేశాడు. ఈ సంగతి విని ఊళ్లోనలుగురు రంగయ్యను చీవాట్లుపెట్టి—దొడ్డి తోటకు మంచిదేకాని దాట్లో వుండే చింతచెట్టుమీద దయ్యమున్నదనీ, అది యిదివరకు చాలామందిని చంపిందనీ, యింకా యెన్నో చెప్పి రంగయ్యను ఆ ప్రయత్నంనుంచి మాన్పించాలని ప్రయత్నంచేశారు. కాని రంగయ్యమాత్రం భగవంతుడిమీద భారంవేసి వాళ్లమాటలు లెక్కచెయ్యలేదు. మొదట కొంచెం తికమకలుపడ్డా చివరకు రెండువందలకు పైసలుచేసి దొడ్డి కొన్నాడు రంగయ్య. కోరడివేయించి బాగుచేయించడానికి, మొక్కలకూ యింకొక వంద రూపాయిలు అయింది. తోటలో ఒకవంతు గులాబీలు, యింకోభాగం సంపెంగలూ, సన్నజాజులూ, మిగతాదంతా విరూపాక్షిమల్లెలతో నాటేశాడు. ఇద్దరు కూలీలు తాను కలిసి ఆరునెలల్లో తోటను నందనవనం చేశారు. వసంతఋతువువచ్చేసరికి రంగయ్యకష్టం ఫలించింది. మొదటికోతపూలలో మాణిక్యం కావలసినన్ని తీసుకోగా మిగిలినపూలే సంతకెళ్లాయి తట్టలతో. కొద్ది నెలలకే రంగయ్యకు పెట్టుబడిసొమ్ము వడ్డీతో సహా ముట్టింది. సంవత్సరం పూర్తయ్యేసరికి ఆ ప్రాంతాల్లో పూలసప్లయిదార్లలో రంగయ్య పెద్ద అయ్యాడు. వీరమ్మ అల్లుడి అదృష్టానికి సంతోషించింది.

## ౩

ఆయేడే వెలిశాడు ఆంజనేయస్వామి ఆఊరికి కోశెడు దూరంలో. ఎంతమంది దేవుళ్లున్నా తురక దేవుళ్ల కోసం కూడ దేవుళ్లయితేనన్నా మనవారంతా ఇంకేముంది ఆంజనేయస్వామికి ఆకాశమంటే మంచి గుడి కట్టించాలి, అంబారీసేవ చేయాలంటూ హడావుడి చేశారు. ఊరూరినుంచీ వేనవేలు వచ్చిపోతున్నారు స్వామిదర్శనానికి. ఆడపిల్లలున్న వాళ్లు మొగపిల్లలకోసం మొగపిల్లలున్నవాళ్లు ఆడపిల్లలకోసం, యిద్దరూలేని వాళ్లు ఎవరో ఒకరు కలిగితే చాలనీ మొక్కుకుంటున్నారు. కళ్లులేనివాళ్లు, కాళ్లులేనివాళ్లు, ముష్టివాళ్లు సరే! యిహ లెక్కలేరు.

రంగయ్యకు కూడా మాణిక్యంతో తీర్థాని కెళ్లాలని కోరికకలిగింది. మాణిక్యం కూడా సరదాపడ్డది దేవుణ్ణి చూద్దామని. వీరమ్మకూడ చిన్నవాళ్ల ఉత్సాహాన్ని భంగపరచలేదు. ఓపికలేకపోబట్టిగాని తాను కూడా ఒక్కసారి కొత్తదేవుణ్ణి చూచివచ్చేదే! సాయంకాలం పెందరాడే అన్నం తిని మళ్లీ త్వరగానే తిరిగి వస్తామని ముసలమ్మకు చెప్పి మాణిక్యాన్ని వెంటబెట్టుకుని వెళ్లాడు రంగయ్య.

* * * *

రాత్రి పదకొండుగంటలు దాటింది. వెన్నెల యిస్త్రీ మడతలు పరిచినట్లు కన్నులపండువగా ఉన్నది. ఆంజనేయుల వారి ఉత్సవం అయిపోగానే అంతా తలోకదారిని యిళ్లు చేరుకుంటున్నారు. సంబరం కబుర్లు చెప్పకుంటూ వెనక్కి తిరిగి చూసుకుంటూ మనమే ముందరొస్తున్నా మనుకుంటూ తూనీగల్లాగ వస్తున్నారు రంగయ్య, మాణిక్యం. తోటకు కనుమేర దూరంలో కొచ్చేసరికి రంగయ్య కేమి తోచిందో "అయితే, మాణిక్యం! నన్ను విడిచిపెట్టి నువ్వుండగలవా?" అన్నాడు.

"అదేవిటి బావా! అల్లాగంటావు? నువ్వు కాసేపు తోటకాడుంటే నామనసు తోటదగ్గిరకే పరిగెత్తుకొస్తుంది. నిన్ను విడిచి......అమ్మో" అన్నది మాణిక్యం రంగయ్యభుజం గట్టిగా పట్టుకొని. "అదికాదే, పిచ్చిపిల్లా! నా కెందుకనో యీరాత్రికి మనతోటలో పడుకుందామని బుద్ధిపుట్టింది."

'చింతచెట్టుమాట మరచిపోయావా? రాత్రి పూట అక్కడికి వెళ్లొద్దని అమ్మ చెప్పలేదూ?...... రెండంగల్లో యింటికే పోదాం...(?)'

'ఇప్పు డిల్లు చేరలేమని కాదే? ఈ రాత్రికి తోటలో ఆ పూలవాసనల మధ్య మనం ఉండాలని

గట్టిసరదాగా ఉంది నేనుండగా నీకేంభయం! రేపు పొద్దున యింటికి వస్తా మని కోటయ్యతో కబురంపుదాం (?)'

'..........................'

మాణిక్యానికి చింతచెట్టుభయం మనసులో పీడిస్తున్నా సంతోషంగానే తల ఊపింది, రంగయ్యకు కష్టంతోస్తుందని. వాళ్ల వెనకనే వస్తున్న కోటయ్యకు చెప్పాడు ముసలమ్మకు కబురుచెప్పమని. కోటయ్యే కాకుండా అతనితో వస్తున్న మిగతావాళ్లుకూడా రంగయ్యను కూకలేశారు చింతచెట్టు సంగతి జ్ఞాపకంచేస్తూ, తోటదగ్గరకు పోవద్దని. రంగయ్య ఎంతకూ వినలేదు, చివరికి 'సరే' నని అంతా వాళ్లను విడిచివెళ్లారు. పది నిముషాల్లో యిద్దరూ తోటచేరారు.

తోటగేటు పదిగజాల్లో ఉన్న దనగానే రంగయ్యను గట్టిగాపట్టుకుని నడుస్తోంది మాణిక్యం చింతచెట్టుకేసి చూడకుండా. రంగయ్య అది గ్రహించి మాణిక్యాన్ని బుజ్జగిస్తూ, సంబరంకబుర్లు జ్ఞాపకంచేస్తూ లేని సంతోషం కలుగజేస్తున్నాడు. గేటు తియ్యగానే తోటలోని కుక్క తోకాడిస్తూ రంగయ్యను పరామర్శించి కూడా నడిచింది. గేటు పక్కగానే ఉన్న చిన్న నుడిసెలోని చాపలు బైటికి లాక్కుని నాలుగుమల్లె పొదలమధ్య వేశాడు. దానినిండా పూలు వెదజల్లి సంబరందగ్గర కొన్నమిఠాయి యిద్దరూ చెరికాస్తా అక్కడ కూర్చునితిన్నారు. కుండలోని నీళ్లు కాసిని త్రాగి నిర్మలాకాశమే చాందినీ అనుకుని, చల్లనిచంద్రుడే దివిటీగా భావించి, ప్రకృతి ప్రసాదించిన పూలగుమాయింపు మధ్య ముద్దులవర్షం కురిపిస్తూ వాళ్లిద్దరూ పరస్పరాలింగనాల్లో బాహ్యప్రపంచాన్ని మరచి హాయిగా పడుకున్నారు.

*  *  *  *

"మాణిక్యం! యింతసుఖంగా ఉంటామని ఎన్నడైనా అనుకున్నాం? మానాన్నలాగు నాగలిపట్టుకొని కూర్చుంటే యీతోట, నువ్వూ, యీసుఖం నాకు దేవా? నిజంగా దేవు డేదిచేసినా మన మేలుకే చేస్తాడు! రోజూ యిల్లాగే సుఖంగా ఉంటూ, ఆసుఖంలోనే ప్రాణంపోతే యెంత బాగుంటుంది!"

"అల్లా గనకు బావా! నాకు భయమేస్తున్న దింఇలాగే యెప్పుడూ సుఖంగా ఉందాంగాని .........
ప్రాణం పోవటం ఎందుకూ?"అంటూ గట్టిగా కౌగిలించుకుంది మాణిక్యం.

అల్లాగే మాట్లాడుతూ యిద్దరూ పసిబిడ్డల్లాగు ఒకరిచేతుల్లో ఒకరు నిద్రపోయారు.

*  *  *



సంబరం దగ్గర కొన్న మిఠాయి యిద్దరూ చెరికాస్తా అక్కడ కూర్చునితిన్నారు

తెల్లవారు ఝామున మూడుగంట లైనట్లుంది; సరిగ్గా కోడికూసింది. చంద్రుడు మెల్లగా పశ్చిమాద్రి చాటునకు జారుతున్నాడు. గాలిమాత్రం కొద్దిగా వీస్తోంది. అప్పుడప్పుడల్లలాడే ఆకులచప్పుడూ, దూరాన చెట్టుమీది గుడ్లగూబకూత మాత్రం ఆనిశీథ గంభీరాన్ని భంగపరుస్తున్నాయి. రంగయ్య తోటలోని పూలన్నీ ఒక్కమాటు మొగ్గతొడిగి, విచ్చి తోటనంతా సువాసనలతో నింపివేసినాయి. ఆఘ్రాణ మాత్రంచేత మత్తు గలిగిస్తున్న ఆపరిమళమునకు రంగయ్య కొంచెం ఒత్తిగిలి మాణిక్యాన్ని లేపటానికి ప్రయత్నించాడు. కాని ఏదో మూర్ఛవచ్చినట్లుండి మాట్లాడలేక, ఏమి చేయడానికి తోచక, మాణిక్యాన్ని మరింత గట్టిగా తన బాహువులలో బిగించి, అలాగే ఉండిపోయాడు. పువ్వులాలసన సదృశమైన మాణిక్యం శరీరం ఆగాఢపరిష్వంగ సుఖాన్ని మైమరచిపోయింది. మాణిక్యం కూడా ఒక్కమాటు కళ్లు తెరచి, మళ్లీ అలాగే మూసుకుంది మాట్లాడటానికి ఓపికలేక. అతిపవిత్ర ప్రణయలాంఛన మగు ఆయువతీయువకుల పరిరంభమును తూర్పు దిశనుండి చూచి మలమల మెరుస్తూన్న ఒక నక్షత్రం మేఘం చాటుకు పోయింది. వాళ్లిద్దరూ అంతసుఖం అనుభవించడం అదే మొదటి పర్యాయము—తుది....(?) !

౪

తెల్లవారింది. సూర్యుడు 'ఎంతపని జరిగిందీ!' అన్నట్లు దృక్కులను కొంచెం తీక్ష్ణంగా ప్రసరిస్తున్నాడు. చెట్లమీది పక్షులుకూడా ఏదో కలవరపడి ఆక్రందనంచేస్తూ, యీ సంగతి చెప్పడానికా అన్నట్లు ఊళ్లోకి పరుగెత్తుతున్నాయి. తోటమాలి యింటిదగ్గర నుంచి మామూలుగా తోటలోకి వచ్చేసరికి ఆవిధంగా పడుకొనిఉన్న రంగయ్యనూ భార్యనూ చూచి, తన యీ వనపుకాలం జ్ఞప్తిరాగా, పాకదగ్గరకు వెళ్లి గట్టిగా ఏదో చప్పుడుచేశాడు, నిద్రలేస్తారని. ఆశ్చర్యపోయాడు, ఏమీ ఫలితం లేకపోయింది! సిగ్గు విడిచి రంగయ్యను నిద్రనుంచి లేపడానికి ప్రయత్నించాడు; కాని లాభం లేకపోయింది. ఇద్దరిలో ఒక్కరుకూడా లేవకపోగా, జీవించి ఉన్నట్లుకూడా తోచలే దతనికి. ఇహ ఖంగారుపడి భయంతో ఊళ్లోకి పరుగెత్తి నలుగుర్నీ వెంటబెట్టుకొచ్చాడు. నలుగురూ నాలుగువిధాల అనుకున్నారు, రంగయ్య స్థితినిగురించి. వీరమ్మ దుఃఖంతో కొడుకువారి మొదలునరికిన చెట్టులాగు కూలిపోయింది.

*    *    *    *

"మరేం ఫరవాలేదు; ఆచార్లుగారిని కాస్త కస్తూరి తీసుకురమ్మ"ని కబురు చెయ్యమన్నాడు కరణం. "వాతం చేసినట్టుంది వెల్లుల్లి పాదరసం అరి కాళ్లల్లో మర్దనచేయ"మన్నాడు మునసబు. వైద్యం, సంగీతం రానివాళ్లు లేరుగా ప్రపంచంలో! ఎవరికి తోచిన సలహా వాళ్లిస్తున్నారు అంతా. తలొకటి చేస్తున్నారు. ఇంతలో ఆచార్లుగారు వచ్చారు, మందులసంచితో సహా. నాడిచూస్తే ఎక్కడా అందలేదు. అరికాళ్లూ, అరిచేతులూ పట్టిచూసి, ముక్కుదగ్గర వేళ్లు పెట్టి చూసి, మళ్లీ నాడిచూసి, మెల్లగా అవతలకు వెళ్లి "చాలసేపైంది..." అని చప్పరించి, "యీ కరణంమూలాన జంధ్యాలు తియ్యవలసొచ్చిం"దని విసుక్కుంటూ జారాడు.

"తోట కొనవద్దురా బాబూ! ఆచింతచెట్టు దెయ్యాలపోగు, మనకువద్దురా అని చెవిని యిల్లుకట్టుకు పోరినా, నామాట విన్నాడుకాడు. ఇంతకూ యిల్లా ఉంది కామోసు నాడిగీత" అన్నాడు రంగయ్యస్నేహితు డొకడు.

"నాగయ్యని నరికి నా పాపముందా!" అన్నాడు యింకొక స్నేహితుడు ఆదుఃఖానికి నాగయ్యని సరిచేస్తూ.

"చూస్తా రేవిట్రా...యింకా, ఆనాగయ్యగాణ్ణి... అంటూ నలుగురు యువకులు ఆదుఃఖావేశంలో



నాగయ్యయిల్లు ముట్టడించారు. నాగయ్యకూడా ఓపి కతో కాసేపుచూసి, వ్యవహారం ముదురుతోందని గ్రహించి "అబ్బాయిలూ! ఎందుకు అనవసరంగా నన్ను నిందిస్తారు? అదేస్థలంలో నేను యెన్నిసార్లు పడుకో లేదు? అయితే అప్పటికింకా చోడిచేనేగాని యీమల్లె తోట లేదు పూలపొదదగ్గిర పడుకోవద్దని చెప్పిన మన పెద్దలు పిచ్చివాళ్లా! నాయనలారా! వాళ్లకు మన కున్నంత సుఖానుభవజ్ఞానం లేదూ? ఆచెట్టు మీది దెయ్యమూకాదు, భూతమూకాదు వాళ్లప్రాణాలు తీసింది. రంగయ్య ప్రాణతుల్యంగా పెంచిన ఆ విరూ పాక్షిమల్లెలూ, సంపెంగలే అతనిప్రాణం తీశాయి. కారణం తెలియకుండా, ఆలోచించకుండా యేపాపం యెరగని నన్ను తిట్టితే ప్రయోజనం యేమీలేదు. పిల్లల్ని కన్న ముండావాణ్ణి ఆమాత్రం కష్టసుఖాలు తెలియ కుండానే సంచరిస్తున్నానా?" అని తనురీతిని నచ్చ చెప్పి దెబ్బ తప్పుకున్నాడు.

*          *          *          *

సద్దుఅంతా అణగినతర్వాత పోలీసులు హాజర య్యారు, డాక్టరుతో సహా, విచారణచేయడానికి. రంగయ్య తోట కొన్నప్పటినుంచీ అప్పటివరకూ జరిగిన కథంతా సావకాశంగా విని,శవాలను పరీక్షించి "కొవ్వూ రు కాపురస్తులు రంగయ్య—(వయస్సు ౨౩ సం. లు భార్య మాణిక్యం (వయసు ౧౭ సం. లు) క్రిందటి రాత్రి ఆంజనేయస్వామి ఉత్సవంచూచి యింటికి వస్తూ మార్గమధ్యంలో ఉన్న వాళ్లతోటలో పరుండుటకు నిశ్చయించిఉంటారు. తోటవద్ద ఉన్నచింతచెట్టుమీది పెనుభూతమే వారిచావునకు కారణ మని ఊరివారిలో చాలమంది అభిప్రాయపడుతున్నారు. కాని మన పూ ర్వులు దట్టపు పూలతోటలలో పరుండి ప్రాణములను గోల్పోయినవారు చాలామంది కలరని వినియున్నాము. అందులో శాస్త్రసమ్మతమైన నిజ మున్నదని నాఅభి ప్రాయము. ఎంచేతనంటే, మానవుడు కొన్ని మృదు వైన వాసనలను మాత్ర మాఘ్రాణించి సహింపగలడు. ఎక్కువవాసనగలవాటి నాఘ్రాణించిన మత్తు కలుగ జేయును. అదీగాక కొన్ని పువ్వుల వాసన కొంతవరకు ఉల్లాసముగాను, ఆరోగ్యముగాను ఉన్నప్పటికీ మితి మీరినయెడల ప్రాణాపాయకరము. మల్లెపూవులు, వాటిలో ముఖ్యముగా యీ దురదృష్టవంతులు పెంచిన 'విరూపాక్షి' అనునవి కొన్ని మత్తుపదార్థములు గలిగి ఎక్కువగా పీల్చబడినపుడు ప్రాణములుకూడ తీయు నను టకు సందేహము లేదు. నా అనుభవమునుబట్టి వెన్నెలలో మల్లెపొదలమధ్య వీరు పరుండుటనుబట్టిన్నీ, తెల్లవారుఝామున మల్లెపొదలు మొగ్గలు తొడిగి వెద జల్లిన వాసనకు ఉక్కిరిబిక్కిరియై ప్రాణములను గోల్పో యిరని గట్టిగా చెప్పగలను.

మన పూర్వులు యీ మాదిరిగ ప్రాణములను గోల్పోయిరని వినుటయేగాక నేను స్వయముగ పాశ్చా త్యదేశములలో చూచియుంటిని. పైకారణములను బట్టి నా నమ్మకము ధ్రువమని నిరూపించగలను."

*          *          *          *

దురదృష్టవంతులు రంగయ్య, మాణిక్యం చని పోయి చాలా కాలమైనా 'విరూపాక్షు' ల సంగతి తెలిసిన నాగన్నతాతబోటివాళ్లకు యేకొద్దిమందికో తప్ప అందరికీ వాళ్ల విచిత్రమరణం తీరనిసమస్యగా ఉంది; చింతచెట్టుమీది దయ్యం చిరస్థాయిగా ఉంది.






## నీటిగొట్టములను తనిఖీచేయువారికి విద్యుచ్ఛక్తి బండి

పెద్దపెద్ద పట్టణములందు నీటిని సరఫరాచేయుటకు ఇటువంటి నీటిగొట్టములు అమర్చుచుందురు. అట్లు అమర్చుటకుముందు ఆ గొట్టములలోపలి ఎనామలుపూత మొదలైనవి యథారీతిగ నున్నవో, లేదో పరిశీలించుట చాల అవసరము. సామాన్యముగా ఇటువంటి నీటిగొట్టములు ౩౬ అంగుళములు, అంతకుమించియు వ్యాసము గలిగియుండును. వీనిలోపల దూరి పరిశీలించి వచ్చుట యెట్లు? ఇందుకుగాను ఇప్పుడీరకమైన మూడుచక్రముల బండ్లు తయారుచేయబడుచున్నవి. ఇవి విద్యుచ్ఛక్తి సాయమున నడచును. వీనికి ముందువైపున చక్రాకారముగ ఉక్కుతూలికలు అమర్చబడియుండును. ఎనామలుపూత ఎక్కడనయినను మరామతు చేయవలసియున్నచో అటువంటిచోట్ల ఈ తూలికలు విద్యుచ్ఛక్తి మిణుగురులను చిమ్మును. ఆ ప్రదేశమును పరీక్షకుడు గుర్తువేసిపెట్టును. ఈ బండికి వెనుకతగిలించియుండు మరియొక సాదాబండిలో కూర్చొనివచ్చు మరామతుదారుడు గుర్తువేసిన ఆ ప్రదేశములందు కావలసిన మరామతులు చేయును. కారుచీకటి క్రమ్ముకొనియుండు నాగొట్టములలో వీరికి కండ్లుకనుపించుటకు బండిముందువైపున, తూలికల చట్టమునందొకభాగమున ధగద్ధగ వెలుగుచుండు దీపముండును. గొట్టములక్కడక్కడ [illegible] వ్యాసము గలవిగా నుంచుచుండును.






1. మరామతు చేయునతడు
2. నీటి గొట్టము
3. పరీక్షకుడు మరామతుకావలసిన స్థలములను గుర్తుపెట్టుట
4. మరామతు చేయునతనికి వెలుతురునిచ్చు దీపము
5. దీపములను, బండిని నడిపించు విద్యుచ్ఛక్తి బ్యాటరీ
6. మిణుగురులను జనింపజేయునట్టి విద్యుచ్ఛక్తిపెట్టె
7. తూలికలనుండి మిణుగురులు చిమ్ముట
8. గొట్టములచుట్టును గిరగిర తిరుగుచుండు తూలికలు
9. బండిముందరి పెద్దదీపము

అటువంటప్పుడు ఈ బండికూడ ఆవ్యాసమునకు తగినట్లు ముడుచుకొని పోవుచుండును.

---

## పాదములను వెచ్చగానుంచు తివాసి



ఈ విద్యుచ్ఛక్తి తివాసిని వైద్యశాలలందును, ఆరోగ్యాశ్రమములందును ఉపయోగపరచవచ్చును వెచ్చదనము కావలసినవారు దీనిమీద పాదములు పెట్టుకొని కూర్చున్నచో తగుమాత్రము ఉష్ణమును పొందగలరు. దీని కమర్చియుండు తీగను గోడలోని ఏ విద్యుచ్ఛక్తి మీటకైనను తగిలించవచ్చును. అమితమైన ఉష్ణమును కలుగజేయకుండ, దీనిలో కట్టుదిట్టములు చేయబడియున్నవి.

---

## రంగుపూతయొక్క దళసరిని తెలుపు మర



ఉక్కుమీదగాని, తదితర సామగ్రిమీదగాని ఉండు రంగుపూతయొక్క మందమును, ఆ రంగును కదలించకయే, కనిపెట్టుటకీ విద్యుచ్ఛక్తి మరను కనిపెట్టినారు. పూతయొక్క విద్యుచ్ఛక్తి నిరోధపరిమాణ మీమరలోని ఒక అంకెలబిళ్లలో సూచింపబడును. దానినిబట్టి పూతయొక్క మందమును తెలిసికొనెదరు. ప్రస్తుత మీ మరలను మోటారుబండ్ల నిర్మాతలు బండ్లమీది లక్కపూతలయొక్క దళసరిని తెలిసికొనుటకు విశేషముగా వాడుచున్నారు.

---

## ఒక పడకలో మూడుపడకల జోడింపు

ఒక పడకమాత్రము మామూలుసోఫావలె బయటికి గోచరించుచుండును. కాని అందులోనే మూడు పడకలు జోడింపబడి వచ్చుచున్నవన్నచో ఆశ్చర్యముకాదా? చూడు డీవిధానమును. ఆ మామూలు పడకను చట్టముపట్టుకొని వెనుకప్రక్కగా లేపినచో



అది యొక పై అంతస్తుగా నేర్పడును. అడుగున మరియొక పడక తయారయియుండును. ఇప్పటికి రెండంతస్తుల మంచ మొకటి యేర్పడినది. అందు





లో అడుగు అంతస్తుక్రింద సొరుగువలె ఒక అర ఉండును. అందులో మెత్తలు మొదలైనవి దాచుకొనవచ్చును. ఆ సొరుగును ముందుకు లాగి, పైకి అణచినచో అది మూడవపడక యగును. ఒక్కొక్క పడకకును ఊపుడు మెత్త లుండును. ప్రయాణికుల కిటువంటివి చాలసౌకర్యముగా నుండగలవు.

---

## ఇస్త్రీపెట్టెను తలదిమ్మును, శైత్యమును పోగొట్టుకొనుటకు గూడ ఉపయోగించుకోవచ్చును



శ్వాససంబంధమైన ఆవ్యవస్థలను నివారించుటకు కొన్ని పీల్పుమందులు గలవు. ఆ మందులను పీల్చుటకుకొన్ని పరికరములు కూడ ఉండును. అటువంటి పరికరములలో దేనినయినను సర ఇస్త్రీ పెట్టెకు తగిల్చియుంచుకొనవచ్చును. ఎట్ల

నగా—ఆ పరికరమునకు రెండు లోహపుగొట్టముల నమర్చి, ఒకదానిని ఇస్త్రీపెట్టెలోనికిని, రెండవదానిని మందుసీసాలోనికిని ఇమిడించవలయును. అప్పుడు ఇస్త్రీపెట్టెలోని ఉష్ణము సీసాలోని మందుమీఁద పారి, ఆ మందంతయు పొగలరూపముగా మారి సుప్పలిపై పరికరముగుండా వెలికి విసురుకొని వచ్చును. మందుపీల్చవలసినవారు ఆపరికరమున కెదురుగానుండి ఆపొగలను పీల్చవలయును.









---

## టెన్నిసుబంతుల పుట్టుక

గడ్డకట్టిపోయిన రబ్బరుచెట్లపాలను మరికొన్ని పదార్థములతో చేర్చి రోలర్లనడుమ గిరగిర, తిప్పి, బాగుగాకలిపి, ఆకలిపినముద్దను గొట్టపు మరలలోనుంచి, మరను త్రిప్పుదురు. అప్పుడుఅది ఒక నిడుపాటితీగగా సాగి యివతలికి వచ్చిపడును. ఆ తీగను మరియొక యంత్రమునందు వేసి త్రిప్పినచో చిన్నచిన్న గుండ్ల ఆకారముతో ముక్కలు ముక్కలుగా ఆ తీగ తయారగును. ఆ ముక్కలను గిన్నెలవంటి అచ్చులుగల ఒకపెట్టెలో అచ్చు కొకటివంతున వేసి, ఒకమరమూత మూసి గట్టిగా నొక్కెదరు. ముక్కలు ఆ గిన్నెల ఆకారము దాల్చి, బోలుగా నిలిచిపోవును. ఈ రబ్బరు గిన్నెలు సగము సగము బంతులన్నమాట. ఈ గిన్నెలను మరల మరియొక మరలో పెట్టి అంచులందు హెచ్చుతక్కువలు లేకుండ సరిపుచ్చెదరు. పిమ్మట వానిని మరియొకమరలో వేసి, రెండు రెండుగా కలిపి అతికించెదరు. అతుకులు కనబడకుండ ఆ అతుకులమీద పలుచని రబ్బరురేకుల నతికించెదరు. ఇట్లు తయారయిన బంతులను మరియొకఅచ్చులో వేసి త్రిప్పెదరు. ఆ అచ్చులో ఆ బంతులకు సన్నపొరలు అతికింపబడును. ఇన్ని ప్రక్రియలయనంతరమే మనము టెన్నిసు ఆటలయందుపయోగించు బంతులు సంపూర్ణమైన యాకారమును దాల్చున్నవి.











## మెరుగుడుపురుగుమెరుపుకు కారణం

ఈ పురుగు మెరుపులో ప్రస్తుతం మనశక్తికి మించిన విచిత్రవిషయం ఒకటి ఉంది. మనం మామూలుగా కాంతిని ఉత్పత్తిచేసినప్పుడల్లా, ఉష్ణంతో కూడిన కాంతినేగాని 'శీతకాంతి'ని ఉత్పత్తిచేయలేకుండా వున్నాము. శీతకాంతిని ఉత్పత్తిచేయడంచేతనైతే 'దీపంముట్టుకోకు' చేయి కాలుతుంది. జేజి, దూరంగాఉండి దణ్ణంపెట్టు' అని మనపిల్లల కుపదేశించడం అవసరం ఉండదు. దీపం పెట్టుకొంటే మనకు కావలసినది ప్రకాశంగాని, ఉష్ణంకాదు. వెలిగేదీపంలో కొంతశక్తి, మనకవసరంలేని ఉష్ణం రూపంలో వ్యర్థమవుతోంది. ఈ విధంగా శక్తి వ్యర్థంకాకుండా పూర్తిగా శీతకాంతినే ఉత్పత్తిచేసే రహస్యం మెరుగుడు పురుగుకు తెలిసింది కాని, మన కింకా బయల్పడలేదు. మెరుగుడుపురుగులో వుండే రహస్యం బయటపెట్టడానికి వైజ్ఞానికులు గట్టిప్రయత్నం చేస్తున్నారు. అమెరికాలోని ప్రిన్స్టన్ విశ్వవిద్యాలయంలో ఫిజియాలజీ (శరీరశాస్త్రం) ప్రొఫెసరుగా వున్న డాక్టరు న్యూటన్ హార్వేగారు ఈ రహస్యం కొంతవరకు బయటపెట్టగలిగారు. ఈ కాంతి ఉత్పత్తి, బహువిషమమైన కొన్ని రాసాయనికపదార్థాల వియోగంమీద ఆధారపడి వుందని తేలింది. 'ప్రోటీనులు' అనే ఈ విషమ రాసాయనిక పదార్థాలను స్వయంగా మనం ప్రయోగశాలలో తయారుచేయగలిగిననాడు, శీతకాంతిని మనమూ ఉత్పన్నం చేయగలుగుతాము. ఈ ప్రత్యేకపదార్థాల సంశ్లేషణ, ఇంకా ఇంతవరకు మనకు సాధ్యం కానప్పటికీ వీటికి సన్నిహిత సంబంధంగల చాలా రాసాయనిక పదార్థాలను, మనం తయారుచేయగలిగాం. ఇంకా కొంతకాలం పరిశోధన జరిగినమీదట ఈ పదార్థాలను కూడా మనం స్వయంగా తయారుచేయగల మనడంలో సంశయం లేదు.

(విజ్ఞానం)

---

## వైద్యప్రపంచంలోని ఘనకార్యాలు

వైద్యలోకంలో కంతకీ ఘనకార్యా లేడింటిని పేర్కొనవలసివస్తే ఈ క్రిందివి లెక్కపెట్టవచ్చునని డాక్టర్ బామర్ సి క్రోవెల్ గారి అభిప్రాయం. ఈయన 'అమెరికన్ కాలేజ్ ఆఫ్ సర్జన్స్' డైరెక్టరు.

౧. టీకాల మూలంగా రోగం సంక్రమించకుండా చేయడం.

౨. అనేకరకాల మత్తుమందుల మూలంగా నొప్పి తెలియకుండా చేయడం.

3. శస్త్రచికిత్స సందర్భంలో వాతం కమ్మకుండా ఉండేటట్టు చేయగలగడం.

౪. ఆహార విషయాలను గురించిన పరిశోధన.

౫. సూర్యరశ్మి క్రిమిసంహారక మని కనుగొనడం.

౬. మనుష్యుల అంతరవయువాలలోని లోపాల వల్ల కలిగే అనేకవిధ వ్యాధులను, ఆయా లోపాలను పోగొట్టే అవయవాలనీ, అవయవసారాలనీ ఇతర జంతువులలోంచి తీసి, వాటివల్ల కుదర్చ గలగడం.

౭. ఆయుర్దాయం ఎక్కువ చేసుకో గలగడం.

(విజ్ఞానం)

---

# కలిగూరగంప

## క్రోధము

" కామఏషః క్రోధఏషః రజోగుణసముద్భవః,
మహాశనో మహాపాప్మా విద్ధ్యేనమిహ వైరిణం."

భ. గీ.

ఇది రజోగుణమువలనఁ దన కిష్టమయినవస్తువు ననుభవించుటకు నిరోధము కలిగినప్పుడు జనించును. రౌద్రరసమునకు స్థాయి. అధర్మమార్గప్రవర్తకుల మఱల్చుటకై సజ్జనులయందు తోఁచి తృణాగ్నివలె వెంటనే శమించును. దుష్టులయందు కాష్ఠాగ్నికరణి నిరంతరము ప్రజ్వలించుచుండును. సింహ వ్యాఘ్ర ఖడ్గ కిటి భల్లుక సర్ప వృశ్చికాదులు దీని రూపాంతరములు. కోపము మనుజుని ప్రవేశించినప్పుడు కన్నులుండియు గ్రుడ్డియగును; చెవులుండియు బధిరుఁడగును; శరీరముండియు స్పర్శజ్ఞానశూన్యుఁడగును. క్రోధము సముద్రముల నింకించును; కొండల నుఱ్ఱూతలూగించును; భూమండలమును కుమ్మరిసారెవలె గిరగిర ద్రిప్పును; ఆకాశమును బ్రద్దలు సేయును; త్రాగుబోతునకుఁబోలెఁ గైపెక్కించును; అనరానిదుర్భాష లాడించును; తినరానికూళ్లు తినిపించును. చొరరానిచోట్లు ప్రవేశపెట్టును; శాస్త్రనియమముల ధిక్కరించును; సాధూపదేశములఁ దృణీకరించును; శక్తికిమించిన పనులయందు నల్లేరుపై బండి నడకలు చూపించి పడఁజేయును. చెప్పినదానికి వ్యతిరేకముగాఁ జెప్పుటయే దీనికి నైజగుణము. కొఱ్ఱిగింజవలె సూక్ష్మములైన పంచకోశముల నొప్పించును. కార్యములకు సాధనములైన యింద్రియముల శక్తివిహీనములఁ జేయును. గడియారముంబోలెడు మూలాధారాది షట్చక్రముల నుడిగాలివలెఁ బ్రకంపింపఁజేయును. ఆహారపదార్థము నంతర్నాడులయందుఁ జేర్చి సుఖము కలిగించు ప్రాణాదివాయువుల సంచారమునకు తొట్రుపాటు గల్గించును. ఆయుర్వృద్ధికాధారభూతములైన శ్వాసకోశములను కొలిమితిత్తులఁగావించును. క్రొత్తవిశేషము సంపాదించుటట్లుండగా నున్నదానినే యాచమట్ట నశింపఁజేయును. వీరప్రతివీరులయందు విడుమరలేని విహారము సలుపుచుండును. చూపులు కతిభయంకరముగాఁ దోఁచుచుండును. విశేషముగా స్త్రీజనమందును, గ్రామ్యులయందును సులువుగాఁ జేరఁబడి క్రొమ్ముడులు వీడఁజేయును. గోండ్రుమని గోల చేయించును. మొగము కందఁజేయును. బొమలు చిట్లఁజేయును. పండ్లు పటపటాత్కరింపఁ జేయును. మెటికలు విఱిపించును. గుమ్మె లెత్తించును. తుమతుమలాడించును. చేటలవలెఁ జేతులఁ ద్రిప్పించును. గుండియ బాదించును. గతజలసేతుబంధనములు విసువక చేయించును. పునరుక్తిదోషములు పూరించుచుండును. జ్వరము లేకయే తాపము, విదాహము మొదలైనవి ప్రకటించును. కారణములేని కయ్యములు పురికొల్పును. తనకు లోబడువారిమీఁదనే తకతక తందనాలిడుచుండును. ఇయ్యదిపిశాచమువలెఁ బట్టినచోట నెత్తురు వఱదలుగా దెబ్బలు తినుచుండును. ఎక్కుపెట్టఁబడిన వింటినుండి వెడలు బాణముగతి ఱివ్వునఁ జెరఁబడును. వజ్రపాతమురీతి నిలువునఁ బడఁగొట్టును. హాలాహలము వడువున మాఱురూపు పడఁజేయును. నగారామ్రోఁత విధమున నితర వాక్యములఁ జెవిఁ జొరనీదు. కంటకము తెన్నునఁ బ్రతిక్షణము కలకపాటు గూర్చుచుండును. ఊషరక్షేత్రముకరణిఁ బ్రబోధబీజముల మొలకెత్తనీయదు. కీచుబాయివలె నెడతెంపులేని రొదలఁ జెవులు చిల్లులు పడఁజేయును. పసరుమాడ్కి వికారము పుట్టించును. గాలిచందమున నొఱపిడి గలిగించును. కార్చిచ్చు తెఱఁగునఁ జుట్టుకొనినవానినిఁ దుదముట్ట నశింపఁజేయును. పొగరుబోతు గుఱ్ఱముపోల్కి నలవిమాలి యుంకెకు రాకుండును. పేరాసమాదిరి లేనిబలుపు

తెప్పించుకొనను. కల్యభక్షణ మొనర్చు కునకము క్రమమునఁ దన నెత్తురే తాను త్రాగుచుండును. విద్యాగోష్ఠులకు వాకట్టుమందు. నీతిచంద్రికకు నిరంతర మేఘావరణము. తత్త్వసందర్శనమునకు తలపని చిమ్మ చీఁకటి. అభ్యుదయ పరంపరా లతాంకురములకు వేరుపురుగు. మేధావిస్ఫురణమునకు మితిలేని విఘ్నము. సాహసిక్యమునకు ప్రేరణము. పమోమ్మహమునకు కారణము. అనర్థములకు పుట్టినిల్లు. కుతర్కములకు జీవగఱ్ఱ. గడుసుఁదనమునకు కాణాచి. దీని నాశ్రయించి దూర్వాసుఁ డంబరీషునిఁ బరాభవింపఁదలఁచి విష్ణుచక్రమువలన సమస్తలోకములు తిరిగి బహుకష్టములపాలయ్యెను. విశ్వామిత్రుఁడు వసిష్ఠునెదిరించి యాయన పుత్రుల నూర్వర వధించి చిరకాలార్జితతపోధనమ్ము వమ్ముచేసికొనెను. ఋషులే యిట్లయినఁ దక్కినవారిఁ జెప్పనేల? ఇక దీని జయింపఁదలఁచుగలవాఁడు శాంతిగుణము నాశ్రయింపవలెను. దానివలనఁ గట్టెలసహాయము లేని యగ్నిచందమునఁ దనకుఁదానే పొలియును ఎదిరి తన్నుఁ గూర్చి కుత్రలాలోచించునపుడు తన మానసికదోషము లన్నియు నశించెనని సంతోషించుచు మహానుభావుఁడని పొగడవలయును. విశ్రాంతిలేక కఠినముగాఁ దన్ను దూషించునపుడు వాక్సంబంధిదురితము లన్నియుఁ దొలఁగిపోయెనని భావించుచుఁ బరమాప్తుఁడని ప్రశంసించుచుండవలయును. పైఁబడి కొట్టునపుడు శరీరము నాశ్రయించియున్న పాపము లన్నియుఁ బంచబంగాళమైనవని పొంగుచు సిద్ధోషిత్వప్రదాతగా ముప్పూటలఁ గొనియాడుచుండవలెను. మఱియు నతనికి తన పాపములు పోఁగొట్టుటకైన శ్రమమంతయు శమించునట్లు శుశ్రూషలను జేయుచుండవలెను. ఇట్లొనర్చుచుండిన మహాగ్నివలె మండిపడువాఁడును మంచి గంధము మాడ్కి జల్లనివాఁడగును. అజాతశత్రువగును.

—చల్లా పిచ్చయ్యశాస్త్రి

---

## కీ. శే. నడకుదుటి వీరరాజు పంతులుగారు

తెలుగునేలను ప్రాచీనపద్ధతి పండితులు—గట్టి పాండిత్యముకలవారు—కొలదిమందియే నేడు మిగిలియున్నారు. వారందరు నించుమించుగ పరిణతవయస్కులు. అట్టి పండితులలో నొక్కరు నడకుదుటి వీరరాజుపంతులుగారు. వీరిని కడచిన నెలలో క్షయరూప మృత్యువు దిగమ్రింగినది. వీరివయస్సు ఆఱువదియారేండ్లు.



ప్రాచీనపండితుల సంఖ్య యిట్లు నానాటికి సన్నగిల్లుచుండుట మిగుల విషాదకరము. నిత్యసారస్వతజీవనులగు నీకొలదిమందికి తరువాత గట్టిగ నాలుగుపదములకు అర్థమును చెప్పి సమన్వయము కుదుర్పగలవా రుండబోవుటరు. నే డట్టి చదువుగాని, అట్లు చదువుకొనువారుగాని లేరు. ఇకముందుమాట వేఱుగచెప్పబనిలేదు.

పంతులుగారు కవులు, పండితులు, విమర్శకులు; పందొమ్మిదవశతాబ్దిని ఖ్యాతిగనిన నడకుదుటి రామకవిగారికి కుమారులు. 'సకలజన మనోభిరంజన'మను ప్రబంధమును వెనుక రచియించి, వీరు పీఠికాపురాధీశుని వలన ప్రథమగణ్యసమ్మానము నందుకొనిరి.

పంతులుగారి పాండిత్యము పంతులుగారిని విమర్శవంకకు త్రిప్పినది. నిరంతర గ్రంథపరిశోధనము దానికి చేయూత యిచ్చినది. ప్రాచీనగ్రంథములయెడ- అందును వాని తాళపత్రమాతృకలయెడ—పంతులుగారికి మక్కువ మిక్కుటము. ప్రాచీనభాషాస్వరూప నిర్ణయమున

వానికి ప్రామాణ్యము గలదని వారి యాశయము. సుపరి ష్కృతములు కానందుకారణమున నచ్చుపుస్తకములు వారికి అంతగ నచ్చవు. శబ్ద, అర్థనిర్ణయము నకయి గ్రంథపారాయణము పంతులుగారికి జీవితపరమార్థము నది. 'విమర్శాదర్శ'బిరుదప్రాప్తికి నదియే కారణము.

ఇట్టి వ్యాసంగమువలన వీరి లేఖినినుండి యెన్ని యో వ్యాసములు వెలువడినవి. అవి యన్నియు నించు మించుగ విమర్శనరూపములే. ఆంధ్రదేశమునందలి సుప్ర సిద్ధ సారస్వతపత్రికలన్నియు వానికి ప్రకటనస్థానము లయినవి. భారతియు, పుట్టిననాటినుండి, యెడపడపు, వీరి వ్యాసములను తలనుదాల్చుచుండెను. భారతియందు పంతులుగారికి ఆదర మధికము. భా. తినలంకరించిన వ్యాసములలో 'వన్నియయతులు కొన్నిటిగతులు' అను నది ఎక్కువ గౌరవము కలది.

పంతులుగారి విమర్శలు ప్రాయికముగా ఒరుల విమర్శలను విమర్శించునవియే కాని స్వతంత్రములు కావు. ఇందు వీరు త్రొక్కుడు త్రోవయే వేఱు. దుర్బలప్రమా ణములనయినను-అట్టివని తమకు తెలిసినప్పుడుకూడ— యుక్తులతో చమత్కరించి నిలువబెట్టచూచు నేర్పు వీరికి మిక్కిలిగ గలదు.

ఏనాటివో యగు విషయముల విమర్శనముల యందు, 'ఇదమిత్థ'మని నిర్ణయించుటకు చాలినప్రమాణ ములు లేనపుడు—లభింపనపుడు—అభిప్రాయ భేద ములు గలుగుట సహజము. అంతమాత్రను విమర్శకుల పాండిత్యమునకును, పరిశ్రమకును కొఱత యేర్పడినదని సహృదయులు తలపబోరు.

ఈ సారస్వత వ్యాసంగముతో పాటు వీరు అచ్చు కూటము నొకదానిని నెలకొలిపి ప్రాచీనగ్రంథములను పెక్కింటిని అచ్చొత్తించి ప్రచారమునకు దెచ్చిరి.

ఇట్లెల్ల సారస్వతసేవచేసి ధన్యజీవను లయిన పంతు లుగారు లేనిలోటు ఎట్లును తీరునదికాదు. పంతులు గారిని శాశ్వతముగా కోలుపోయిన కుటుంబమున కూర డిలుటయే ఇక కర్తవ్యము.

---

## ప్రప్రథమ యూరోపీయ సంస్కృత మహాపండితుడు

హెన్రీ థామస్ కోల్ బ్రూక్ పండితుడు చిట్ట చివరకు గ్రుడ్డితనముతో, కడుపునిండ తిండికి గతిలేక లండనులో చచ్చి ఇప్పటికిసరిగా నూరేండ్లు కడచి పోయినవి. అతడు కావించిపోయిన సంస్కృత విజ్ఞాన సేవకు భారతదేశము అతనియెడ చాల కృతజ్ఞత చూప వలసియున్నది. సంస్కృత పాండిత్యమునందే కాక ఆ మహనీయుడు ఈస్టిండియా కంపెనీవారి ప్రభుత్వ కార్యనిర్వహణమునందును అసమానమైన చాతుర్యమును ప్రదర్శించినాడు.

కోల్ బ్రూకు ౧౭ ఏండ్ల ప్రాయమప్పుడు కంపెనీ వారి కలకత్తా ఆఫీసులో రైటరుపనిచేయుటకు ఇండి యాకు వచ్చెను. ఇండియాకు అతడువచ్చుట అదియే మొదటిసారి. ఆ యుద్యోగ మతనికి అప్పుడు కంపెనీ డైరెక్టర్ల కోర్టుకు ఛేర్మెనుగనున్న తినతండ్రిమూలమున లభించినది. అందులో నాలుగేండ్లపాటు కష్టించిన పిమ్మట అతడు తిరుహుత్ అసిస్టెంట్ డైరెక్టరుగా నియ మింపబడెను. కలకత్తాసందడికిని, రచ్చకును విసుగెత్తి పోయిన కోల్ బ్రూకు శాంతమైనప్రదేశమున నివసింప వచ్చునుగదాయని ఆ క్రొత్తయుద్యోగమును సంతోష ముగా పరిగ్రహించెను.

కోల్ బ్రూకుకుగల ప్రభుత్వ కార్యనిర్వహణ దక్షత తిరుహుత్ లో స్పష్టపడెను. దూషణభూషణ ములను రెంటిని లెక్కగొనక న్యాయైకదృష్టితో తన విధుల నతడు చక్కగా నెరవేర్చెను. పైయుద్యోగు లతని యీబుద్ధికి తృప్తిపడిరి. కారణమేమనగా, అది వరకు నిండియాకు ఉద్యోగములు చేయవచ్చుచుండిన వారందరును తమవిధులపై దృష్టిమాని కేవలము ధనార్జ నముపైననే దృష్టినిలుపుచుండినది వారు బాగుగా నెరిగి యుండిరి.

ఒకప్పుడు కంపెనీడైరెక్టర్లతో నతనికి సంఘర్షణ కలిగెను. బెంగాలులోని కంపెనీభూముల వ్యవసాయ పరిస్థితుల నివేదిక నొకదాని నతడు తయారుచేసెను. అందులో కొన్ని పుటలు రైతులవిషయమై కంపెనీవారు

బళ్లారి దుర్గప్రదేశము —




దృశ్యము ౧



దృశ్యము ౨



౩. బళ్లారికోటయందలి బురుజులు



౪. కోటగవనువద్దనున్న జారుడు బండ : నూరడుగుల ఎత్తు. జనులు నిరపాయముగా మీదినుండి క్రిందికి జారివచ్చుచుందురు.

చూపుచువచ్చిన ఉపేక్షాభావమును విమర్శించుచుండెను. రైతుల పరిస్థితులయెడ కంపెనీవారి అలక్ష్యమును నిర్దాక్షిణ్యముగా నతడు దానిలో విమర్శించియుండెను. ఆ నివేదికను చూచి డైరెక్టర్లు మండిపడిరి. కంపెనీని విమర్శించుచు వ్రాసిన యాభాగముల నుపసంహరించుకొనవలసినదని కోల్‌బ్రూకును వారడిగిరి. కాని అతడు ధైర్యముగా వల్లకాదనెను. డైరెక్టర్లు నివేదికను ప్రకటింపకయే అతనికే వాపసుపంపిరి. పంపుటమాత్రమే కాక అతని నక్కడనుండి ఎక్కడో ఒక మూలనున్న పూర్ణియాకు బదిలీచేసిరి.

పూర్ణియాలో నుండగానే అతడు సంస్కృత వ్యాసంగమునకు పట్టుదలతో మొదలుపెట్టెను. అదివరకే అతడు సంస్కృతము నభ్యసించుటకు ప్రయత్నములు చేయుచుండెనుగాని ఆ భాషయందలి కాఠిన్యము అతనిని తికమికపెట్టినందున, అతడు కొంచెము వెనుక త్రొక్కి యుండెను. మరల నిప్పుడు ఎట్లయినను దానిని సాధించి తీరవలయునని యతడు గట్టిగా పూనుకొనెను.

అతడు తిరుహుత్‌లో నుండగానే కలకత్తాలోని ఏషియాటిక్ సొసైటీ స్థాపింపబడెను. వారు ప్రచురించిన పుస్తకముల నప్పుడతడు తెప్పించి తదేకధ్యానముగా పఠించెను. ఆభాషయందలి గాంభీర్యమూ, ఆ పుస్తకములందలి విజ్ఞానసంపద అతనిని మరింత పట్టుదల గలవానినిగా చేసినవి. అదే పట్టుదలతో అనతికాలముననే యతడాభాషను సమగ్రముగా అవగాహన చేసుకొని, దానియందపారమైన పాండిత్యమును సంపాదించెను.

పిదప నతడు గ్రంథరచన కారంభించెను. అతని మొట్టమొదటి యనువాదము హిందూవితంతు ధర్మములను గురించిన గ్రంథము. దానివెంట వరుసగా ననేకానువాదముల నతడు తయారుచేసెను. తోడిపాశ్చాత్యులు ఆ గ్రంథములనుచూచి, సంస్కృతభాష యింత గొప్పదాయని వెరగుపడిపోయిరి.

౧౭౯౮ లో కోల్‌బ్రూక్ పండితుని యుద్గ్రంథము-డైజెస్ట్ ఆఫ్ ఇండియన్ లా అనునది- వెలువడెను. ఇండియన్‌లా చదువు విద్యార్థులకది [illegible]

గ్రంథముగా నున్నది. ఆగ్రంథ మతనికి పైసాయేమియు సంపాదించి పెట్టలేదుగాని - అసలు ప్రతిఫలము నతడు కోరనేలేదు- కలకత్తా అప్పీలుకోర్టులో అతనికి స్థానము సంపాదించిపెట్టెను. ఆగ్రంథమును చూచి స్వయముగా గవర్నరు జనరలతని నభినందించెను.

ఉద్యోగధర్మముతో ౩౨ ఏండ్లు శ్రమపడి, చివరకతడు దానినుండి విరమించుకొని ఇంగ్లాండుకు పయనముకట్టెను. కాని ప్రయాణము పెట్టుకొన్న రోజుకు వారమురోజులకు ముందుగానే పాప మతని భార్య అసువులను బాసెను. కలకత్తాలో నామెకు ఖనన సంస్కారముచేసి, దుఃఖాక్రాంతుడై యాతడు స్వదేశమును చేరుకొనెను.

కోల్‌బ్రూకు తన అంత్యవయస్సును కష్టపరంపరలతోనే కడపెను. ఇండియాలో తాను సంపాదించిన దంతయు దానధర్మములకును, సంసార నిర్వహణమునకును సరిపోయినది. చివరకొక్క పైసామిగులలేదు. వృద్ధాప్యములో కడుపునిండ తినుటకును, ఒంటినిండ కట్టుకొనుటకునుకూడ అతనికి దుస్సాధ్యమై పోయెను.

ఈదుఃఖములు చాలవేమో యన్నట్లు, అతని యిరువురు కుమారులు కూడ ఒకరివెంట నొకరు రోజుల వ్యవధిలో గతించిరి. తోడు నీడలేని యాపండితునకు ఇవిచాలక కంటిపొరలుక్రమ్మి అంధ్యమొకటి ప్రాప్తించెను. ఎంతటి విజ్ఞానికెటువంటి యాపత్తులు!! ఎటువంటి మరణము!!!

కాని యాతని కీర్తి? జగజ్జేగీయమానముగా నిలిచి యున్నది.

('టైమ్సు ఆఫ్ ఇండియా' వీక్లీ)

---

## కొడగుదేశము

ఇది దక్షిణ-ఇండియాలో ఒక చిన్నరాష్ట్రము. దీని వైశాల్యము ౧౫౮౨ చదరపుమైళ్లు. పడమటి కనుమలకొనలో తూర్పుముఖముగా నుండి యిది దక్షిణ కనడాతోను, ఉత్తర-మలబారుతోను చుట్టబడి యున్నది.

దక్షిణ-ఇండియాలోని రమణీయభూభాగములలో [illegible] నదులతోను, పచ్చని

యడవులతోను, ఉన్నతమైన పర్వతములతోను, రమణీయములగు లోయలతోను ఈదేశము నందనవనమున కీడుజోడుగ నున్నది. పర్వతములలో సుమేరుపర్వతమువలె, పువ్వులలో మల్లెపూలవలె రమణీయభూభాగములందు కొడగుదేశము వెలయుచున్నది. మహోజ్జ్వలములగు సుందరదృశ్యముల కిది యునికిపట్టు. ఇండియాదేశపు స్విట్జర్లాం డని యిందువలననే దీనికి పేరువచ్చినది.

ఆంధ్రదేశపు ఉష్ణమునకును, తూర్పుతీరపు ఎండల మిడిమిడికికిని, కాలికట్టు, తెల్లిచ్చేరి, కన్ననూరుల చెమటధారలకును చందనలేపమువంటిది కొడగు. కొడగులో మితవ్యయముతో జీవితము సాగిపోవును. ఆ ప్రజలకు ఆదరణబుద్ధి యెక్కువ. కాబట్టి ఆదేశములోనికి పోయినవారు తిరిగివచ్చుటకు వెనుకాడుచుందురు. ఆదేశమునకు ప్రధాననగరము మెర్కారా. అక్కడ ఉష్ణపరిమితి వేసవిలో ౮౦ డిగ్రీలకు మించుట గొప్ప. కావుననే దక్షిణఇండియాలోని వేసవి వాసస్థలములలో మెర్కరాకూడ స్థానము కల్పించుకొన్నది.

ఈదేశపు ప్రాచీనచరిత్రము వింత గొలుపును. కొడగుదేశస్థులు రాజులుగా నుండినదే లేదు. లింగాయతురాజులు దీనిని రెండువందలయేండ్లకు పైగా పరిపాలించిరి. ౧౬-వ శతాబ్దపు చివర ఎక్కేరివంశములోని యొకరాజు రాజ్యభ్రష్టుడై యీ దేశమునకు వచ్చెను. ఇతడక్కడ నొకసన్యాసివలె ప్రవర్తించుచు హాలేరిలో నివసింపజొచ్చెను. కొన్నియేండ్ల లోపుగానే యితడక్కడి సామంతప్రభువుల విశ్వాసమునకు పాత్రుడై ౧౬౮౧ లో మొట్టమొదటి కొడగురాజుగా నాయెను. మైసూరులో టిప్పుసుల్తాను అధికారమునకు రాగానే ఈకొడగుపై దాడివెడలివచ్చి దీని నాక్రమించుకొనెను. కాని త్వరలోనే యీదేశపు రాజకుటుంబములోని యొకరు టిప్పుచెరనుండి తప్పించుకొని వచ్చి, రాజభక్తి పరాయణులగు కొందరు దేశీయుల సాయముతో మరలతమ దేశమునుమహమ్మదీయులహస్తములనుండి లాగుకొనగలిగెను. అదిమొదలు కొడగురాజు బ్రిటిషువారిని సామంతుడుగా నుండి, మైసూరుయుద్ధములందు వారికి మిక్కిలి సహాయముగా నుండెను. కొడగు రాజులలో చివరివాడు, దురదృష్టవశమున దుష్టప్రవర్తనము పాలయినందువలన బ్రిటిషువారీదేశమును ౧౮౩౪ లో తమ స్వాధీనముక్రిందికి తీసికొనుట సంభవించెను.

ఇప్పు డీదేశము ఇండియాప్రభుత్వపు పరిశీలనక్రింద నున్నది. ఒక ఛీఫ్ కమీషనరు దీని కధికారిగా నున్నాడు. అతడే మైసూరుకు రెసిడెంటుగా కూడ నుండును. స్థానికప్రభుత్వమున కతడే యధికారి. అతని నివాసము బెంగుళూరులో. సెక్రెటరియేటు, హైకోర్టు కూడ బెంగుళూరులోనే యున్నవి. అతనితరువాతి యధికారి కమీషనరు. అతడు మెర్కారాలో నుండును. ౧౯౨౪ లో ఈరాష్ట్రమున కొక శాసనసభ యేర్పడినది. ౧౫ మంది సభ్యులు ఎన్నికలవలనను, ౫ గురు నామినేషనువలనను నియమింపబడుదురు. చీఫ్ కమీషనరే శాసనసభకు అధ్యక్షుడుగా నుండును.

ఈదేశపుజనసంఖ్య సుమారు ౧,౮౦,౦౦౦. ఇందులో నూటికి నలుబదిమంది కొడగు దేశీయులు. క్షత్రియులని వీరు వ్యవహరింపబడుదురు. వీరి ఆచారవ్యవహారములే వేరు. ఆ విగ్రహపుష్టి, తీర్చిదిద్దినట్లుండు నాసికలు, ఆజానుదీర్ఘములగు బాహువులు, ముఖపుకట్టు, చర్మపురంగు వీనినిబట్టి చెప్పవలసివచ్చినచో వీరు దక్షిణ ఇండియావారుగా కనుపించుటలేదు.

వీరు మిక్కిలి విక్రమసాహసములు గలవారు. వీరికి ప్రత్యేకముగ నొక భాష గలదు. వీరి జాతీయవేషమే వేరు. వీరి భాష అరవము, కన్నడము, మలయాళముల మిశ్రమముగా నుండును. వీరి దుస్తులలో కూడ ప్రత్యేకత గోచరించును: పాదములవరకు జీరాడు, నల్లని కోటు. దానికి మోచేతులవరకుమాత్ర ముండునట్టి పొట్టిచేతులు. నడుముకు దాదాపు ఆరుగజముల నిడివి గల పట్టీ. దానిలో ప్రక్కవైపుగా నొకబరలో ఒక పొట్టి బాకు; వెనుక నొకపొడుగుపాటిచాకు. తలకొక రుమాల-ఇది మగవారి దుస్తులతీరు. స్త్రీలదుస్తులతీరుకూడ చాల ఆకర్షకముగా నుండును. చీరకట్టు, జాకెట్టుతీరుకూడ భారతీయయువతులకు అనుగుణమయినవిగా నుండును.

వీరు గణపతిని, ఈశ్వరునికూడ పూజింతురు ఈదేశములోనే ప్రభవమంది, దక్షిణ ఇండియా అంతటను పవిత్రనదిగా పరిగణింపబడుచుండు కావేరినది యధిష్ఠానదేవతయగు కావేరీదేవినికూడ వీరు ఆరాధిం

తురు. నాగపూజ వీరిలో లేదు. దేవోత్సవసమయము లందు పూజలకు ముందు యజ్ఞములు చేయుచుందురు; నాట్యనృత్యములుకూడ కార్యక్రమములో నొకటిగా నుండును.

వీరి వివాహాచారములు దక్షిణఇండియాలో కెల్ల చాలసామాన్యమైనవి. బాల్యవివాహములు వీరిలో లేవు. వితంతువివాహములకు వీరిలో సమ్మతి గలదు. వీరు చావును సంతోషముతో పరిగణింతురు. చచ్చిన వృద్ధులకు గౌరవముగా, ఖననాది సంస్కారములకు వరకును మధ్యమధ్య తుపాకిగుండ్లను ప్రేల్చుచుందురు. వీరిలో అశుభములు వచ్చినపుడు తెల్లని యుడుపులను ధరింతురు.

(మాడర్న రివ్యూ)

---

## నగ్నమత తత్త్వము

గ్రీసుదేశములో స్పార్టాలోను, మరికొన్ని ప్రదేశములందును పూర్వము యువతీయువకు లొక చోట చేరి, నగ్నముగా వ్యాయామములు, నాట్య నృత్యములు చేయు నలవాటుండెను. సుప్రసిద్ధ తత్త్వజ్ఞాని యగు ప్లేటోకుకూడ ఈ సంప్రదాయము సమ్మతముగా నుండెను. చివరవరకును అతడామనస్సును మార్చుకొననేలేదు. ఇటువంటి నడతవలన కామవాసన యొక్క అసంగతమగు ఉద్రేకము తగ్గునని అతని యభిప్రాయము. ఈ ఉద్దేశ్యముతోనే 'దేహముయొక్క అంగాంగములను వ్యక్తముగా కానుపించునట్టి ఉడుపు తొడుగులలో నున్న యువతీయువకుల నొకచో వ్యవహరింప నిచ్చుటలో నెట్టి యాశంకయు నుండ గూడదు' అని యొక యభిప్రాయము నాతడు తెలిపి యున్నాడు.

రోములో మట్టుకు ఇందుకు విపరీతమైన పరిస్థితులు గోచరించుచున్నవి. అక్కడ రంగస్థలముల యందు నటీనటులు నగ్నముగా వ్యవహరించు సందర్భములు లేకపోలేదుగాని, వారు అధమశ్రేణిక్రింద పరిగణింపబడుచువచ్చిరి. క్రైస్తుమతస్థులకు రోమనుల ఆచార వ్యవహారములు మరేవియు పట్టువడలేదు గాని నగ్నత పనికిరాదను మతము మాత్రము పట్టువడినది దేహమును సమగ్రముగా కప్పికొనుటవలన కామవాసన తగ్గదు సరికదా, మరింత హెచ్చునని వారికి తట్టలేదు పాపము! కామవికారము పట్టుకొని తపించువారు ఔషధ మనుకొని తదేకదృష్టితో నగ్నశరీరమును పరిశీలించుచుండిన గుణపడుదురని పలువురు భావించుచున్నారు.

'వేషభూషణములవల్లనే కామవికారము హెచ్చుచుండును గాని నగ్నతవల్లగా' దనుటలో మతభేదము లుండగూడదు. ఆఫ్రికా, మెడగాస్కరు మొదలగు దేశములను చుట్టివచ్చిన స్కాట్ ఇలియట్ అను నైదేశికు డొకడు 'వస్త్రములవల్లనే కాముకత్వము ప్రబలుచున్న' దని వ్రాసియున్నాడు. వస్త్రము లెంత తక్కువగా నున్న కామవాసన యంత తక్కువగును. పురుష చిత్రకారులయెదుట నగ్నముగా కూర్చొనుట కలవాటుపడిన స్త్రీల యనుభవములను చూడుడు: "పూర్తిగా నగ్నముగా కూర్చొన్నంతకాలమువరకును మాకు పురుషుల కామవాసనబెదరు ఉండదు." కుషెల్ట్ అను చిత్రకారు డొకడు ఒకస్త్రీని గురించి వ్రాయుచు "ఆమె చిత్రగృహమును ప్రవేశించీప్రవేశించగానే నదురుబెదురులేక తటాలున వస్త్రములు తీసి పారవేయును. 'అటువంటియప్పుడు వారికి మేము దిసమొలతోనున్నను కామాతురత సుంతయైన జనించదు.' అని యామె చెప్పుచుండును." అని వ్రాసియున్నాడు. కామవాసన లేకుండచేయవలెనని యెవరికయిన నపేక్ష యున్నచో, వారు నగ్నతను ద్వేషించుటకన్న వస్త్రముల ఆచ్ఛాదనను ద్వేషించుట మంచిది.

క్రైస్తుధర్మము నగ్నత కాటంకము పెట్టుచున్నను వారిలోకూడ అప్పుడప్పుడు దానిని సమ్మతించువారు తలచూపుచునే యున్నారు. క్రీ. శ. రెండవశతాబ్దములో ఆడ్యామాయిట్ సంప్రదాయమువారు ప్రార్థన సమయములందు నగ్నముగానే మెలగుచుండిరి. పదుమూడవశతాబ్దములో జర్మనీలోను, ఆతర్వాత ఫ్రాన్సులోను ఇటువంటిదే యొకవర్గము బయలుదేరెను. ఆవర్గము వా రనుభవించిన సంకటము లిన్నన్ని కావు. కాని మధ్యయుగమునందు యూరపుదేశములలో నీదిసమొల

తత్త్వము చాలినంత ప్రచారమునకు వచ్చియుండెను. సార్వజనికస్నానగృహములకు స్త్రీ పురుషు లిరువురును ఏకకాలమున పోవుచుండిరి.

పదునారవ శతాబ్దములో ఫ్రాన్సుస్త్రీలు స్నాన సమయములందు తమకు కావలసినవారిని నిస్సంకోచ భావముతో దగ్గర నుండనిచ్చుచుండిరి. ఆశతాబ్దపు చివరి భాగములో చిత్రించిన యిటువంటి స్త్రీల నగ్నచిత్రములు మనకిప్పుడు దొరకుచున్నవి. కాని యవి వాస్తవిక చిత్రములు మట్టుకు కావు. పందొమ్మిదవశతాబ్దములో మాత్రము దిసమొలతత్త్వముయొక్క ధార్మికాక్షేపణ అడగిపోయి అది యొక కేవలశిష్టసంప్రదాయముగా నిలిచిపోయెను. ఇంతమాత్రమున నగ్నతనందరును పరమోపాదేయముగా భావించిరని యనుకొనగూడదు. పరిస్థితులు మరల విపరీతముగానే పరిణమించినవి. యూరోపి యను మిషనరీలు ఎక్కడెక్కడ తమ క్రైస్తవధర్మముయొక్కదీక్ష నొసగిరో అక్కడంతటను- అది యెంతటి ఉష్ణప్రదేశమైనను-తమ యూరోపీయదుస్తులనే ప్రచారము చేసిరి.

'వివాహకాలమునందు వధూవరు లిరువురును మోసపోకుండ వారినగ్నశరీరమును వీరు, వీరి గ్నశరీరమును వారు చూచుకొనుట ఆవశ్యకము' అని సర్ థామస్ మూరు అనునతడు 'యుటోపియా' అను తన గ్రంథమునందు చెప్పియున్నాడు. కొన్ని దేశములందు వధువు కుమారిగా నున్నను సరే, విధవగానున్నను సరే ఆమెను నగ్నస్థితిలోనే భవిష్యత్పతికి చూపుట రూఢియైయుండెను. అట్లే వధువునకు గూడ వరునియొక్క నగ్నదేహమును చూచుసందర్భములు కల్పింపబడుచుండెను. వారియభిప్రాయ మేమి? గుఱ్ఱము, ఎద్దు మొదలగు చిల్లరజంతువులను పరిగ్రహించునప్పుడు పరిగ్రహించువారు వానిని ఎంతగా పరిశీలింతురు? ఎక్కడెక్కడ ఏలోపము లున్నవో యని తదేకదృష్టితో సర్వాంగములను పరీక్షింతురే! జీవితముయొక్క సుఖదుఃఖములకు పరమకేంద్రమైన వివాహమువిషయములో ఆమాత్రము దృష్టికూడ జనుల కుండదే! అంత అలక్ష్యమా! మొట్టమొదట ముఖమును మాత్రము చూచుకొని, ఆయందమునకు తృప్తిపడి వివాహమాడుటయు, తరువాత నేదైన మహాదోషము కనుపించగానే విసిగివేసారుటయు నేమిపనులు? ఇంతకంటెను మొదటనే ఒకొక్కరును పరస్పరము పరీక్షించుకొనుట యను నియమము మంచిదికాదా?

కళాదృష్టిలోను, ఆరోగ్యదృష్టిలోను నగ్నత్వము ఆవశ్యక మను వాదము ౧౯ శతాబ్దపు ప్రారంభమునుండియు కానుపించుచున్నది. 'దిసమొల దేహమును చూచుచుండుటవలన అనావశ్యకమగు కామాతురత తగ్గిపోవు'నని సేనాంకుడు (౧౭౦౦) అను నొక ఫ్రెంచి లేఖకుడు వ్రాసియున్నాడు. జాన్‌సన్ చరిత్రలో, స్కాచ్ న్యాయాధీశుడొకడుఆరోగ్యముకొరకు తెల్లవారిపూట తన గదిలోనే సంపూర్ణనగ్నముగా తిరుగాడుచుండెనని వ్రాసియున్నది. ఆ న్యాయాధీశుడు తన కుమార్తెలనుగూడ ఉప్పరిగచంద్రశాలలలో దిసమొలలతో తిరుగుచుండునట్లు చేయుచుండెనట. బెంజామిన్ ఫ్రాంక్లిను నగ్నముగానే పనిపాటులుచేసుకొనుచుండెడివాడట. ఒకరోజు అతడు పరధ్యానముతో అట్లే బయటికివచ్చెనట. పరిచారికలు ఆవేషమును చూచి నివ్వెరపడిపోయిరట.

దిగంబరముగానుండువారు మిక్కిలిపటుత్వము గలవారుగా నుందురనుటకు సందేహమే లేదు. ఐర్లాండులో ౧౭ శతాబ్దమువరకును స్త్రీపురుషులుభయులును ఒకేఒక నిలువుటంగిని వదులుగా తొడుగుకొనుచుండెడివారట. అందువల్లనే వారు పుష్టిగా నుండిరి. బట్టపాతలులేని ఆటవికులుకూడ గట్టిముట్టుగనున్నారు. వస్త్రముల యుపయోగ మెప్పుడు బలమైనదో అప్పుడు రోగములుకూడ వివిధములుగా ప్రబలజొచ్చును. ప్రకృతియే చెడిపోవును.

(జయకర్ణాటక)

---

## బైబిలుకు వేయవ తర్జుమా

బ్రిటిష్-ఫారిన్ బైబిల్ సొసైటీవారి ప్రయత్న ఫలముగా బైబిలుకు మరియొక అనువాదము తయారైనది. దీనితో బైబిలును వేయిభాషలలోనికి పరివర్తన జరిగినదన్నమాట. మూలమూలలనుండు ఆటవికుల భాషలలోనికి సయితము దీనికి పరివర్తన జరిగినది. ఈ వేయవ

అనువాదము బెల్జియన్ కాంగోలోని ఒక ఆటవిక జాతి భాషలో చేయబడినది. ఆసొసైటీవారి ఉత్సాహ ప్రయత్నములను చూచి మనము తలలు వాల్చవలసి యున్నది. ఆసొసైటీ ౧౮౦౪ లో పుట్టినది. అప్పటికి బైబిలు ౮౨ భాషలలోమాత్రమే లభించుచుండెను. ఆపిదప దీనిప్రచారమునకు వారు ఎడతెగని ప్రయత్నములు చేసిరి. ఇప్పటికిని ఆయుద్యమమున వారు వెనుకంజ వేయలేదు. ౧౮౨౪ నాటికి బైబిలుఅనువాదముల సంఖ్య ౮౨ నుండి ౧౦౦ కి ఎక్కెను. ౧౮౮౧ లో ౨౦౦; ౧౮౯౨ లో ౩౦౦; ౧౯౦౭ లో ౪౦౦; ౧౯౧౬ లో ౫౦౦; ౧౯౨౨ లో ౬౦౦; ఈ సంవత్సరములో ౮౧౨. ఆఫ్రికాలోని భాషలలో ౨౦౦ లోనికిని ఇది తర్జుమాఅయినది. ఇంకను మరికొన్నిచేరి, బైబిలుకు వేయి తర్జుమాలు పూర్తియగుచునవి. ఈ బైబిలుప్రతులు ౫౦౦ మిల్లియన్లు ఖర్చయినవి.

వారు తమ మతమును ప్రచారముచేయుచుండు పద్ధతి చూడుడు. మనవారు అటువంటి ఉత్సాహము నెందుకు చూపరు?

---

శ్రీ. కె. రామమోహనరావుగారు



బెజవాడ కాపురస్థులు, ఆంధ్ర యువకులు' సంగీతజ్ఞానం కలవారు. భవిష్యత్తును చూచి చెప్పగల ప్రజ్ఞానిధులు. వి. వి. గిరిగారి విజయమునుగురించి ఎన్నికలకుముందే జోస్యము చెప్పిరి. ఇంకను భవిష్యత్సమాచారములను పెక్కింటిని సూచించి దేశనాయకులనేకుల కాశ్చర్యమును కలుగజేసిరి.

---

కంచివరదరాజస్వామి ఆదిమూలవిగ్రహము



ఆదిమూలవిగ్రహము
జలాధివాసమున్న మంటపము

కంచి వరదరాజస్వామి మూలవిగ్రహము ఆదిని దారుమయమట. దానిని దేవాలయాధికారులు కొన్ని శతాబ్దులకు పూర్వము, దేవాలయావరణలో నున్న అనంతసరస్సు అనుకోలనిలో జలాధివాసము చేయించి దానిస్థానమున నేనున్న శిలావిగ్రహమును తెప్పించి నెలకొలిపిరట. ఆశిలావిగ్రహము కంచికి పదిమైళ్లదూగ



ఆదిమూలవిగ్రహము జలవాసమున్నచోటు. నాగప్రతిమలు
ఆదిశేషువువిగ్రహము నారాధించుటకు సూచన



వసంతమంటపమున ఆదిమూలవిగ్రహము
[illegible] జరుగును

మున నున్న 'పల్లయి శివరం' అను గ్రామమందలి ప్రాచీనదేవాలయమున నుండినదట. విగ్రహమును చేసిన దారువు నీటిలో చివికి శిథిలమయిపోవునట్టిది కాదు. కొలనిలోనున్న చిన్నిమంటపమున నిది యుండ, ఆదిశేషువు ఆరాధించుచుండునట.

ఈవిగ్రహమును నమ్మాళ్వారు, కూరత్తాళ్వార్, తిరుకచ్చినంబి, ఉడయవరులు, వేదాంతదేశికులు మున్నగువారును ఆరాధించి, అధికముగ స్తుతించినట్లు ప్రతీతి.

౧౮౯౨ వ సంవత్సరమున దీనిని వెలుపలికి దీసిరి. నలువది దినములు పూజాపురస్కారాదులు జరిగినవి. తదనంతరము మరల నీటిలో యథాస్థానమున నుంచిరి.

మరల మొన్న (౧౯౩౭) జూలయి ౧౨-వ తేది నాడు దీనిని వెలుపలికిదీసిరి. అభిషేకాలంకారాదులు సమకూర్చి దానిని వసంతోత్సవ మంటపమునందలి వేదికపయి 'పవళింప' జెట్టిరి. అట్లొకనలువదిదినము లుండును. అనుదినమును పూజాపురస్కారాదులు జరుగుచుండును. తండోపతండములుగ జనులు వచ్చి సేవించి పోవుచుందురు. ఈయుత్సవము మండలారాధన మన బడును. ఈవిగ్రహమును 'ఆదిగిరి వరదర్ మూలవర్' అని అఱవమున నందురు. నలువదిదినము లయినపిదప మరల జలమున నెప్పటిచోట నుంచెదరు.

---

## కీర్తిశేషుడు మార్కొనీ

రేడియో తంత్రమునకు మూలపురుషుడయిన మార్కొనీపండితుడు కడచిన నెల ౨౧ వ తేదీనాడు ఈ లోకమును వదలిపోయి కీర్తిశేషుడైనాడు.

రేడియో తంత్రమువలన ప్రపంచమునకు చేకూరిన లాభము లేవియో ప్రత్యేకించి చెప్పబనిలేదు. రెండు రోజులుకాదు, రెండుగంటలసేపు రేడియోయంత్రములు పనిచేయకమానినచో ఆలాభము లేవియో స్వయముగా బోధపడగలవు: వార్తాపత్రికలకు విదేశవార్తలు రాకుండ అడ్డుపడిపోవును; వ్యాపారము స్తంభించిపోవును; ఆపత్తులలో తగుల్కొన్న ఓడలకు దిక్కు [illegible] వరణవిశేషములు తెలియక ఆకాశయానములు తల్లడిల్లిపోవును; ఇంకను ఎన్నియోవిధములుగా ప్రపంచము నష్టపడిపోవును.

రేడియోతంత్రము చేసినంతమేలు మరి యే ఇతర తంత్రమును చేయలేదు. వాయువార్తావిధానము మార్కొనీ మొట్టమొదట నలువదియేండ్లకుముందు ప్రారంభించినాడు. తీగలులేకయే వాయువార్తలను మొట్టమొదట పంపినది మార్కొనీ. సముద్రమార్గముగా వార్తలు మొదలుపెట్టి ముప్పదియేండ్లయినది. ఈ రేడియో వాయువార్తలవలన ప్రపంచముయొక్క నాలుగుచెరగులును అన్యోన్యముగా వ్యవహరించుకొనుటకు వీలుపడుచున్నది.

ఏకాంతత మట్టమయిపోయినది. వీథులలోనెంత సురక్షితముగా సంచరింపవచ్చునో అంతకంటె సురక్షితముగా సముద్రమునందు నైతము తిరుగాడుటకు వీలైనది. కోట్లతరబడి తమ ప్రజలతో రాజులు నేరుగా మాట్లాడుటకు సాధ్యమైనది. కోట్లతరబడి సామ్రాజ్య ప్రజలు తమ చక్రవర్తి పట్టాభిషేకోత్సవ విశేషములను వీనులారవినగలిగిరి. ఇరుగుపొరుగువారితో మాట్లాడునంత సులభముగా విదేశములందెక్కడో ఉన్నవారితో గూడ సంభాషింప ననువుపడినది. వ్యాపారములు వడివడిగా సాగుటకు సాధ్యమైనది. వేయేల? ప్రపంచమే ఒక ప్రాంతముతో నొక ప్రాంతము సంబంధబాంధవ్యములను సంపాదించుకొన్నది.

ఈ వాయువార్తాహరణమును గురించి మార్కొనీ యభిప్రాయములేవో తెలియనగును. "వాయువార్తాహరణము నేలను, నీటనుగూడ వార్తాహరణమునకుపయోగపడుచుండుట నిజమే. ఒక దేశమునకు నింకొక దేశమునకు మైత్రికూర్పుటయు నిక్కమే. సంచారమునందు సేనానివేశములు, ఆకాశయానములు ప్రధాన కార్యస్థానములతో సలహా సంప్రతింపులు చేయుటకు కారణమగుటయు సత్యమే. ప్రజలకు వార్తలను సంగీత సాహిత్యములను వినిపింపజేయుటకు హేతువగుట కూడ యథార్థమే. కాని నాయుద్దేశ్యములో ఇవికాదు దాని ముఖ్యకార్యములు. మొట్టమొదట ఇదిపుట్టినది (జనవరి [illegible]) [illegible] సముద్రములలో దగుల్కొన్న ఒక

యోడకు సహాయము సర్థించుటకు. అది మొదలు దీనిమూలముగా నెన్నియో ప్రాణములు, ఎంతయో ఆస్తి సంరక్షింపబడెను. ఇదియే దీనికి చరితార్థతయని నాభావము."

ములను చేసి, విద్యుత్తరంగములను తీగలు లేకయే బహుదూరము తీసుకొనిపోవచ్చుననియు, వానిమూలమువార్తలను పంపవచ్చు ననియు కనిపెట్టెను. అంతవర



ఇట్లు మానవ ప్రపంచమున కింతటి మేలును సమకూర్చిన మేటి మన మార్కొనీ.

౧౮౯౫ లో నితడు ఇటలీలోని బొలోన్నాలో తన యింటియందు కూర్చొని ...

కును ఏకొద్ది దూరమైనాకాని విద్యుత్తరంగములను పంపుటకు సాధ్యపడుచుండలేదు. మార్కొనీ పరిశోధనల ఫలితముగా నందరును ఆశ్చర్యాన్వితు లయిరి. రోజు ... మార్కొనీకి రేడియోలో శ్రోత్రపద్ధతులను

కనిపెట్టుటయే పనియైయుండెను. దినదినమునకు నొక క్రొత్తపరిశోధన. వానిఫలితమే నేటి నిస్తంత్రీదూరసంభాషణము, దూర వాయువార్తాహరణము, శబ్ద విపులీకరణపద్ధతులు, టెలివిషను అను దూరదర్శనము. రేడియో కార్యములు ఇంతతో పరిసమని చెప్పుటకును వీలులేదు. ఇప్పటికి మాట, చూపులు దానికి లోబడిపోయినవి. ఇంక నెన్ని ప్రాకృతికశక్తులు లోబడిపోవునో యెవరు చెప్పగలరు? దాని సృష్టియనంతము! మరోకొనీ చేసి పెట్టిన పరిశోధనల ధర్మమాయని యీ వాయువార్తాహరణ ప్రకరణమునకు 'హరిః ఓమ్' అని ముగింపు చెప్పుట అసంభవమై పోయినది.

ఆ విజ్ఞాని భౌతికముగా మనలను వీడిపోయినాడు. కానియాతని కీర్తికాంతి విద్యుత్తరంగముల రూపమున దినమొక్క యాకారముతో మనముందు సాక్షాత్కరించుచునే యుండును.

'ట్రిబ్యూను ఆఫ్ ఇండియా' వీక్లి

---

## స్కూలుఫైనలు తెలుగుపాఠ్యగ్రంథము (బోర్డు ప్రకటించునది)

ఇటీవల నొకటిన్నర సంవత్సర కాలమునుండియు స్కూలుఫైనలు తెలుగుపాఠ్యగ్రంథము విషయ మొక పెద్దగోలయై పోయినది. నిర్ణీతభాగము లుచితములయినవి కాకపోవుట, వానిటిప్పణి తప్పులతడక యగుట, అపూర్వ నిరుపయోగ సామగ్రి అందపరిమితముగ పెరిగియుండుట - ఇట్టివి దానికి పట్టుచుండెను దుర్దశలు. ఈ దుర్దశల కెక్కువగా పాలుపడినవి ౧౯౩౬,౩౭ సంవత్సరముల పాఠ్యగ్రంథములు. అంతకుపూర్వపువానిలోను ఎక్కడనో పొరపాటునబడిన తప్పు లున్నను శబ్దార్థముల సంబంధము సరిగనే పాటింపబడినది. కాని, వ్యాకరణ విశేషముల మిషను బాలవ్యాకరణాదుల సూత్రములు వానిలో కుప్పలుతిప్పలుగ నిండిపోయినవి. ఎట్టిది, ఎంత, ఏతీరున నుండవలెనను విచారమున కవకాశము వానిలోను కనుపడదు. నిరుటిడియు, ఈ యేటిదియు అసలే తప్పులపాతరలయి నిరుపయుక్తములయి పోయినవి. కాబట్టి, వీనియందలి మూలభాగముల యౌచిత్యానౌచిత్యములను, టిప్పణిలోని వివిధ వివరణాదుల సొరును చర్చింపవలసిన యగత్యము లేదు. ఏయేటికి మదరాసు, ఆంధ్ర-యూనివర్సిటీలలో కలిసి స్కూలుఫైనలు పరీక్షకు చదువు విద్యార్థులు దాదాపు పదివేలమంది యుందురు. ఇందరు చదువవలసిన పాఠ్యపుస్తకము పైన పేరుకొనిన తీరున నున్నది. ఇది యిట్లుండుటకు కారణమేమి?

ఈ విషయమున హైస్కూళ్లలో స్కూలుఫైనలువారికి పాఠ్యపుస్తకములను బోధించు పండితులుదాసీనులయియుందురు. వారందరు నిందలి లోపములను తెలిసికొనజాలినంత పాండిత్యము కలవారు కారా? తెలిసియు మనకేలయని యూరకుందురా? తెలియనివారి మాటకేమి? తెలిసినవారయిన నూరకుండుట భావ్యమా? విద్యార్థిహితైషులగు నుపాధ్యాయుల కీయౌదాసీన్య మనుచితము. ఇందువలన నెందఱో విద్యార్థులు పరీక్షలయందుత్తీర్ణులు కాజాలకపోవుచున్నారు.

ఈ పాఠ్యగ్రంథ నిర్ణయకార్యమునకయి దొరతనమువారేర్పరచిన బోర్డొకటి ప్రత్యేకముగ నున్నది. ఆ బోర్డులోని సభ్యులు పాండిత్యాదులయందారితేరినవారయి యుండవలెనను నియమము కలదు. ఆసభ్యులలోనివారే యొక్కరు-వారు అందఱిలో మిక్కిలి సమర్థులుకూడనయి యుండవలెననక తప్పదు - పాఠ్యగ్రంథభాగములను నిర్ణయించి - బహుశః తక్కినవారియనుమతిని పొందవలసి యుందురు కాబోలు ఇందు మాత్రము - టిప్పణి మొదలయినవానిని వ్రాసి అచ్చొత్తించుటకు నియమితులగుదురు. వారిది కేవలము శుష్కహస్తాల పరిశ్రమయు కాదు. కొంత కట్నమును సమర్పించుట కవకాశమును కలదు.

గొప్ప నిపుణులనబడువారయ్యును, పరిశ్రమకు ఫలమన్నను పాఠ్యగ్రంథమిట్లు అవకతవకగా రూపుకట్టుచున్నది. ఈదుష్ఫలమనుబట్టి పాఠ్యగ్రంథ సంధానాదులకు బోర్డుచే నియమింపబడిన యానిపుణులు, నియమములెట్టివయినను, అందుకుభిన్నముగా కేవల మసమర్థులను భావము కలుగుట వింతకాదు. అసమర్థుల చేతబడినపుడు గ్రంథము మరియొకరీతి నెట్లుండగలదు?

నేటి విద్యావిధానమున మాతృభాషాభివృద్ధి కుండునవకాశ మల్పము. అందువలన స్కూలుఫైనలు

విద్యార్థికి లభించు మాతృభాషాజ్ఞానము శూన్య ప్రాయమని అనుభవమువలన తెలియుచున్నది. దుష్పరిష్కృత లోపభూయిష్ఠ పాఠ్యగ్రంథము లిందుకు సాయము. ఇంక వారికి గలుగు మాతృభాషాజ్ఞానము నూహించుకొనుట చాల తేలికపని.

ఇట్లుకాకుండుటకయి బోర్డులో నుచితములగు మార్పులు వెంటనే జరుగవలెను. పాఠ్యగ్రంథ సంధానాది కార్యము వాస్తవముగ సమర్థులయిన పండితుల చేతులమీదుగ జరుగవలెను. పాఠ్యగ్రంథములను వర్తక దృష్టితో ముద్రించి ప్రచురించుటకు పూనుకొనియుండు బోర్డు అసమర్థుల నేల నియమింప వలయునో యాపనికి? పరిశ్రమకు చాలినంత ప్రతిఫలము ముట్టజెప్పి సమర్థులగువారిచేత నేలచేయింపరాదు? బోర్డులోనివారే పండితులని బోర్డుభావమా? అట్లు కాదని తత్కార్యము నిరూపించు చున్నదే! కావున ఇక మీద బోర్డు అట్లు చేయజనదు. బోర్డు చూడవలసినది విద్యార్థుల భాషాభివృద్ధి. దానికయి తాను సకలవిధముల ప్రయత్నించవలెను. అట్లు సాధ్యము కానియెడల పాఠ్య గ్రంథ భాగములను నిర్ణయించి ఆయా గ్రంథముల పేరులను ప్రకటించి యూరకుండవలెను. అది యుత్తమమయిన పని. లేకున్న, మూలభాగములను మాత్రము ముద్రించి ప్రచురించుటతో తృప్తిచెంది యూరకుండవచ్చును; అందువలన విద్యార్థులకు సౌకర్యము కొంతయుండును గనుక.

మఱియు పాఠ్యభాగముల నిర్ణయమునను లోపములు కనుపడుచున్నవి. ఈనిర్ణయమున ననుసరింపబడు పద్ధతులెవ్వియో? ౧౯-౩౮-వ సంవత్సరపు పాఠ్యగ్రంథమున శ్రీశైలవర్ణనము, ఎవరుతల్లి, భామినీవిలాసము అనునవి కలవు. ఇవి తునుకలు.

శ్రీశైలవర్ణనము: ద్విపద. పండితారాధ్య చరిత్రములోనిది. వర్ణన భూయిష్ఠము. మూలమున నిది చాలగ్రంథము. ఇందు మూడుపుటలు మాత్రమే. అదియు మూలభాగమున నేకదేశముకాదు. సంధాత ఇష్టానుసారము ఎడనెడ భాగములను విడిచి ఇట్లు కుదించెను. ఇందువలన వర్ణనమున సొంపుచెడినది. అన్వయక్రమము తప్పినది. భావముల నుద్దీపింపజేయు నితివృత్తము కాని, సోమనాథునికవనమును సొంపులుగులుకచేసిన జాను తెనుగు నుడికారములుగాని యుద్ధృతభాగమున చాల తక్కువ.

ఎవరుతల్లి: ఇది ఏబదియారు పాదముల గీతమాలిక. అయిదేసి పాదముల పల్లవులు నాలుగు అనగా నిరువది పాదములు కాక, ముప్పదియారుపాదములు మాత్రమే. ఇందు విషయగౌరవము కాని, విన్యాస గౌరవము కాని అగమ్యగోచరము. నిర్దుష్టమును కాదు.

భామినీవిలాసము: ఆరు పద్యములు మాత్రము. పండితరాయలు మూలకర్త. మూలమునగౌరవ మనువాదమునకు సామాన్యముగ నుదురదు. మూలమునందలి యన్యాపదేశవిషయము లనువాదమున లోపించినట్లు స్థూలదృష్టికి గోచరింపకున్నను, కవిత్వమున మెరుగు చూపట్టదు ఇట్టివానిని గ్రహించుటేలనో?

శ్రీరామచరిత్రము (భాగవతములోనిది), కృష్ణకవి శకుంతలాపరిణయములోని భాగము శబ్దార్థాలంకారబహుళములు. ఈ యలంకారాదులను తలకెక్కించుకొనుటకు స్కూలుఫైనలు విద్యార్థులెంత తాపత్రయము పాలుకావలెనో కదా!

నీతుల కొరవడిగ భర్తృహరియనువాదపద్యములు, వచనరచన కొరవడిగ చిన్నయసూరి పంచతంత్రభాగము నించుమించుగ నేటేట వెన్నంటియుండునవియే. ఏటేట నిర్ణయింపబడు పాఠ్యభాగముల తీరు రమారమి యిట్టులేయుండును. ఇదియంతయు సంస్కరణాపేక్షము. పాఠ్యగ్రంథములలోని భాగములు, భావములు, భాష విద్యార్థులకు సులువుగ మననున నిలుచునట్లు చేయునట్టివిగ నుండవలెను. విద్యార్థులమనోవికాసమునకు, భాషాభివృద్ధికి నప్పుడు మంచిపునాదులేర్పడును. ఇది యంతయు గమనించి, చక్కదిద్దుబాధ్యత బోర్డువారియందు గలదు. ప్రజాప్రముఖులు నీవిషయమున తగిన ప్రయత్నములుచేసి మునుముందీ పాఠ్యగ్రంథముల కిట్టి దుర్దశ పట్టకుండ చూడవలసియుండురు.

—సహాయ సంపాదకుడు.

౧౯౩౮ బి. విద్వానుపాఠ్యగ్రంథములు

౧౯౩౮ సంవత్సరము విద్వాన్ (బి. తెలుగు ప్రధానము) ప్రిలిమినరి పరీక్షకు నిర్ణయింపబడిన పాఠ్య గ్రంథములలో 'కావ్యనాటకాది పరిశీలన' మొక్కటి. అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రిగా రప్పుడప్పుడు రచియించి పత్రికలలో ప్రకటింపజేసిన వ్యాసములు కొన్ని యందు సేకరింపబడినవి.

అవి:

౧. ఉత్తర రామచరిత నాటకము: ౧. ఉత్తర రామచరిత్ర - రామాయణకథ మార్పులు, వాని ఫలితములు. ౨. సీతారాములు వాల్మీకి భవభూతులు — సీతారాములను వాల్మీకి యెట్లు చూపెనో, భవభూతి యెట్లుచూపెనో యిందు చెప్పఁబడినది. ౩. భవభూతి రసము, కాళిదాసపాత్రౌచితి — భవభూతి రసప్రధానుఁడనుటకు జనకపాత్రమును, కాళిదాసుఁడౌచిత ప్రధానుఁడనుటకు గణ్వపాత్రమును తారాకాణ సేయబడినవి. ౪. వాల్మీకి యుత్తరరామ చరిత-వాల్మీకి వ్రాసిన యుత్తర రామాణకథ. ౫. కరుణమా? కరుణ విప్రలంభమా? ధర్మవీరమా ? అను విచారణ.

౨ అభిజ్ఞాన శాకుంతల నాటకము: ౧. కనిష్ఠ శాఢిష్ఠిత కాళిదాసా-శృంగారమన్ని యంకముల నుద్దీపన శమనములతో వ్యాపించియుంట, హాస్యవీరశాంత వాత్సల్యాదు లంగములై దానిని వెల్లివిరియించుచుఁ బోషించుట. ౨. శకుంతల- భారతశకుంతలకును నాటక శకుంతలకును గలభేదము. ౩ కాళిదాసః కవిశ్రేష్ఠః- శాకుంతలనాటకములోని నాలుగుశ్లోకముల భావములు.

౩. మృచ్ఛకటికనామౌచితి- మట్టిబండి కథవల్ల సూచించుచు రసప్రసారాస్పద మగుచున్నదనుట.

౪. నైషధములు— కొన్నిచోట్ల శ్రీనాథుడు మించుట.

౫. లక్షణనిర్బంధము — దశరూపకములోని నియమ బాహుళ్యము, అలంకారదృష్టి.

౬. చింతామణి సూచన—గ్రామ్య గ్రాంథిక భాషల విచారణ.

౭. వ్యాకరణ బాహుళ్యము—భాషాప్రవేశ సాధనమగు వ్యాకరణము సంస్కృతములో వలె విరివిగాక ఇంగిలీషులోవలె మితముగా నుండవలెను.

౮. ద్రౌపది రోషము—వ్యాసుడు, తిక్కన.

౯. భారతకవి యౌచితి—సంజయ రాయబారమున శ్రీకృష్ణధర్మజ సంజయుల నైపుణ్యము.

౧౦. బమ్మెర పోతరాజు కవి దృష్టి, రజోగుణ ప్రధానుడగుహిరణ్యకశిపునిభావప్రదర్శనము.

ఇవియన్నియు నించుమించుగ లఘుటిప్పణులవలె, విస్తరించి వ్రాయదలచి వ్రాసి పెట్టుకొనిన'నోట్సు'వలె, ముక్కలు ముక్కలుగా, పెక్కుచోటుల సంపూర్ణార్థ భావములు ద్యోతకము కాకుండనుండునవి. దండిపండితులకివి సుసాధ్యములయిన కావచ్చును వారి నుద్దేశించి రచియింపబడినవయినకతమున,

ఇది నూటరువది పుటల క్రౌను సైజు పుస్తకము. ఇందు మొదటి నాలుగు విషయములు ౧౦౦ పుటంబ నాక్రమించుకొనినవి. ఇందలి విషయమంతయు సంస్కృత రచనముల ప్రాధాన్యమున రచియింపబడినవి. సంస్కృత మూలభాగములు విశేషముగా నుద్ధరింపబడినవి. ఇందునను ఇరువదిరెండు పుటలమేర గ్రంథకర్తృకృత పద్యరచనములు రెండు. తరువాతి మూడు విషయములును సంస్కృతమున రచియింపబడిన అలంకార వ్యాకరణాది లక్షణగ్రంథములమీది దృష్టితో నడచినవి.ఐనను సంస్కృతభాగములువిరివిగా నుద్ధృతములు. ఇవి బి. విద్వాను ప్రిలిమినరి విద్యార్థులకు అర్థముకావు. కావున వారికి పనికిరావు. వీరియెడ చూడవలసిన సంస్కృత పాండిత్యము కుమారసంభవమునందలి తొలి యయిదు సర్గలను, కాదంబరి సంగ్రహము (పూర్వభాగము)ను చదువుట వలన గలిగెడు దానిసే. సంస్కృత రచనములగు ఉత్తరరామచరిత్ర, శాకుంతలము, నైషధము, మృచ్ఛకటిక, చింతామణి వీరి పాఠ్యగ్రంథములలో లేవు. రూపకలక్షణ విచారము నకు వీరి కవకాశము లేదు. 'వ్యాకరణబాహుళ్యము' సామాన్యవిషయము కాన దానివలన నొకింత యుపయోగ ముండవచ్చును, మూడు విషయములలో మొదటి

రెండును, 'ఆంధ్రభారత కవితా విమర్శన' మను పాఠ్యగ్రంథమందలి విషయములే యయినను కర్తృభేద మున నభిప్రాయభేదమున్న నది యవగతము కాగలదు. చివరది భాగవతమున హిరణ్యకశిపు వృత్తాంతమును జదువక సరిగా అర్థముగాదు. 'నోట్సు' వలెనున్న నను సంగతి ఈ గ్రంథమున నన్ని విషయముల విషయము నను పేర్కొనబడినదే.

ఏవంవిధమయినది యీపుస్తకము. ఇది యేమని పాఠ్యగ్రంథముగా నిర్ణయింపబడినదో! నిర్ణయ మునకు పూర్వము దీనియందలి విషయములను నిర్ణాయక సంఘసభ్యులు తెలిసికొని యుండిరా? లేదని యెట్లు చెప్పనగును! పరీక్ష స్టాండర్డుకు తగిన పుస్తక ములను నిర్ణయించవలసిన బాధ్యత కలవారు కదా బోర్డు వారు! తాము నిర్ణయించు గ్రంథముల నన్నిటిని చదివి చూచి, వాటియుపయోగము నెరిగి, ఆవశ్యకమును గమ నించికదా మఱి నిర్ణయింతురు! అట్లుచేయక బాధ్యతను త్రోసిపుచ్చి, చిత్తానుసారమో, మోమోటమినో పుస్తక ములను- పనికిమాలినవానిని- విద్యాను పరీక్షకు జదువువారి కంటగట్టినవారి నేమనవలెను? ఇట్టి పని యెన్నడును క్షంతవ్యముకాదు. విద్యావంతులే కదా ముందుముందు సాహిత్యసౌధమును నిలువబెట్టవలసినవారు!

ఈ పరీక్షకే వావిలాల వాసుదేవ శాస్త్రిగారు అనువదించిన 'ఉత్తర రామ చరితము' పాఠ్య గ్రంథము. కాబట్టి పైన పేర్కొనిన గ్రంథము నందలి ఉత్తరరామచరిత్రవిషయ విమర్శ పనికివచ్చు ననవచ్చును. ఆ యనువాద మెంత మూలమునకు దగినదిగ నున్నదో ముందు చూతురు గాక! అది చక్కని యను వాదమే యయినను మూలము నర్థము చేసికొనలేని విద్యార్థి కావిమర్శనమువలన ప్రయోజనమేమి కలుగును?

ఇది యంతయు—పాఠ్యగ్రంథ నిర్ణయసంఘ కార్యక్రమము—ఒక ప్రహసనమువలె దోచును. ఈ ప్రహ సనమునకు భరతవాక్యము చెప్పవలసిన యదను వచ్చి నది. ఇంకను ఉదాసీనత సాహిత్యహానికి కారణము కాగలదు.

ఇక పైన చెప్పిన ఉత్తరరామచరితమూలాను వాదముల తారతమ్యము నొకింత పరిశీలింపదగును.

మూలము:

ఆత్రేయీ - భద్రే, గమ్యతేధునా.

వాసంతీ-ఆర్యే, ఆత్రేయి, ఏవమస్తు, కఠోరీ భూ తను:దివసః. తథా హి:—

కండూల ద్విపగండ పిండకషణా
కంపేన సంపాతిభిః
ఘర్మ స్రంసితబంధనైః స్వకుసుమై
రర్చంతి గోదావరీమ్;
ఛాయా పస్కిరమాణ విష్కిరముఖ
వ్యాకృష్టకీటత్వచః
కూజత్ క్లాంతకపోత కుక్కుటకులాః
కూలే కులాయద్రుమాః."

ఇది ఆత్రేయీ వాసంతుల సంభావణ సంద ర్భము. రెండవ అంకము నారంభమున శుద్ధవిష్కంభము నందలిది. దీనియనువాద మిట్లు గలదు.

"ఆత్రేయి—అట్లుకావచ్చును. అమ్మ, ఇంత ట నే నందునా?

వాసంతి—నేను నింతట దిగబడుదును. అబ్బా! ఏమీ! యీయెండ యింత దుస్సహముగా నున్నది.

మహాస్రగ్ధర

అదిగో గోదావరీరమ్యతటబహుకులా
యద్రుమంబుల్ మరీవే
సవి యెండల్ మెండుగాఁగా, జిమికితొడిమెలన్
సామజంబుల్ మెందళ్లం
గవి యంగాఁ బాఱి యూపంగ నొఱసి తమబల్
గజ్జిగండస్థలంబుల్
బువులెల్లన్ రాలు నేటం బొలుపుగ నదికిం
బూజలర్పించు లీలన్

మహాస్రగ్ధర

అదిగో యాపాదపచ్ఛాయల బులుఁగులుస్వా
హార మార్జించుకోగం
దివిరిం దొల్వంగనాత్రమాని బెరడు, పులుఁగుల్
నీళ్ల లోనోర వ్రేయన్
బవలెల్లన్ గాడ్పు బెండెన్ వడఁబడి చెడియుం
బావురాల్ కుక్కుటంబుల్

చెవికింపైనట్లుగా నంచిత మధురగతిం
　　జెట్లపైఁ గూయ సాఁగెన్."

ఇట మూలానువాదములకు గల తారతమ్యమును సహృదయులు గుర్తింపగలరు. కాని దీనినిగూర్చి యొకింత చెప్పుటయు దోసముకాదు.

మూలమునందలి

'కఠోరీ భూతసుదివసః' దీనికి 'ఏమి! యీ యెండయింత దుస్సహముగానున్నది.' అని యనువాదము. ఇది భావానువాదమందురేమో ? సారస్యము చెడినది. ఆత్రేయీవాసంతులు చాలతడవు మాటలాడి ఇక పోవుదమను కొందురు. వీరిట్లు పోవుదమనుకొనుటకు కారణము చాల ప్రొద్దుపోయే (అనగా మధ్యాహ్నముకావచ్చినదనుట) కాని 'యెండ దుస్సహముగా' నుండుటకాదు. తరువాతిశ్లోకమునందలి వర్ణనము వలననా విషయము నిరూపింపబడినది

తరువాతి మూలశ్లోకము శార్దూల వృత్తము ఒక్కటిమాత్రమే. అందు చాల సొగసుగ, స్పష్టముగ వివరింపబడినవి భావములు. అనువాదమున రెండు మహాస్రగ్ధరలు (కాదు. మూలచ్ఛేదమున బుట్టిన మహోపద్రవ లనుటొప్పును వానిని.) పుట్టినవి వానికోసము. అట్లుచేయుటవలన మూలమునకు మెఱుఁగు కలుగలేదు; కాని కళంకము సంప్రాప్తమయినది. ఔచిత్యానౌచిత్యముల విచారమువలన నిట గ్రంథము పెరుగును. తప్పులను మాత్రము పరికించదగును.

౧. "కండూల ద్విపగండపిండ కష ణాకంపేన" అనుదాని యనువాదము "సామజంబుల్ కవియంగా జాటీ యూపంగ నొఱసితమబల్ గజ్జిగండస్థలంబుల్."

౨. "ఛాయాపస్కిరమాణ విష్కిరముఖవ్యాకృష్టకీటత్వచః." దీని యనువాదము :

"అవిగో! యాపాదపచ్ఛాయలఁ బులుఁగులు స్వాహార మార్జించుకోగం దివిరెం దొల్వంగ నా్రమాని చెరదు, పులుఁగుల్ నీల్ల లోనోర ద్రేయన్." మూలమునందలి శబ్దములను అర్థము చేసికొని కాని, భావము గ్రహించి కాని చేసినయనువాదమే యందురా పండితులు దీనిని!

2. మూలము:

"శంబూకో నామ వృషలః పృథివ్యాం తప్యతే తపః ;
　శీర్ష చ్ఛేద్యస్స తేరామ, తంహత్వా జీవయ ద్విజమ్."

దీని యనువాదము:

"క. ఓరామరాజ! భువిలో
　　ఘోరత శంబూకనామ శూద్రుఁడు తపమున్
　　బ్రారంభించెను వానిం
　　దోరించిన విప్రసుతుఁడు తోడనె బ్రతుకున్."

ప్రాసకోసము శంబూకునికి 'ఘోరత', మారు మూలపదమగు 'దోరించు', పద్యమున కెక్కినవి. 'తపమున్ ప్రారంభించెనట!' ఎంతసొగసుగ నున్నదో కదా అనువాదము!

3. 'స్వత ఏవ గురవో నశక్నువం త్యస్మాన్ విహాతుం.' దీని యనువాదము 'మహనీయులయిన మీ తండ్రిగారు చిరకాలముదాక మనలను వదిలియుండనే లేరు.' ఇందలి 'చిరకాలము దాఁక' మూలమున లేదే. పోనిండు; దీన తేగలిగిన సారస్యమేమి ?

౪. 'ఆరణ్యే......మనీషిణో విశ్రామ్యంతి.' దీని యనువాదము: 'మనీషావంతులయిన పండితులు...... వనమున విశ్రమింతురు.' మనీషావంతులు కాని పండితులును కలరు కాబోలును !

౫. 'సస్మితం.' అను: 'విస్మయముతో.' ఈయనువాదము విస్మయకరమే.

౬. 'నిర్విఘ్న సోమపీథీ మేభావుకో భగవాన్ ఋశ్య శృంగః.'

అనువాదము:

'పెద్దదియైన శాంతయు, సోమపానము చేయుచున్న మాబావ పూజ్యుడయిన ఋశ్యశృంగుడును ఏ విఘ్నములు లేక బాగున్నారుగదా!' ఈమూలానువాదములకు గల సంబంధ మేమని చెప్పవలెను! 'పెద్దదయిన శాంత' మూలమున లేదు. ఉన్నను రాముని నోట అట్లు వచ్చునా ? విఘ్నములు వేనికి? 'ఋశ్యశృంగుడు తలపెట్టిన యాగము నిర్విఘ్నముగ కొనసాగుచున్నదా' అనునది రాముని భావము కావలెను.

౮. 'స్నేహం దయాంచ సౌఖ్యంచ
యదివా జానకీమపి;
ఆరాధనాయ లోకస్య
ముంచతో నాస్తి మే వ్యథా!'

అను :

'స్నేహ దయా సౌఖ్యంబుల
కేహాని పొసఁగినఁగాని, యిఁక జానకిపై
మోహమయినఁ దెగఁగోసెద
ఆహా! ప్రజారాధనంబునందు సుఖింతున్.'

'ఆహా' పుట్టించు ననువాదమే ఇది! భవభూతియే బ్రతికియుండిన నెంత పొగులునో కదా మూలమునకు మచ్చదెచ్చునీ యనువాదమునకు!

౯. 'సర్వథైతాని.' అను: 'సత్వరముగానివి యెల్ల!' మూలమునందలి 'సర్వథా' అనువాదమున 'సత్వర' మయినది. సత్వరానువాదమగుటచే కాబోలు నిట్లగుట!*

"విస్మిత స్తిమిత తాతనగరజన దృశ్యమాన." అను: "మా నాయన యాయనను ఎంత విస్మయముతోఁ జూచుచున్నాడు."

నగరజను లనువాదమున నెగిరిపోయినారు. పాపము! ఆ కాలమునను రాజులముంగల నగరజనులగతి నేటి యట్టిదే కాబోలును!

తరుచు అనువాద రాముడు సీతను దాసినివలె 'ఓసీ' 'ఓసీ' యని పిలుచుచుండును.

౧౦. "హృది నిత్యానుషక్తేన సీతాశోకేన తప్యతే;
అంతః ప్రవృద్ధ దహనో జరన్నివ వనస్పతిః."

అనువాదము :

'లోనఁ జిచ్చంటుకొని రగులుచు నుండ;
వెలికి నొప్పువనస్పతివృక్షమువలెఁ
దనదుకూఁతురు వడ్డ బాధఁదలఁచుకొన
శోకవహ్నిని దపియించు క్షోణిపు హృది.'

అనువాదమున నొక క్రొత్తవృక్షము వచ్చినది: వనస్పతి వృక్షము. మూలమున వనస్పతి జనకునికి ఉపమానము. అనువాదమున జనకుని 'హృదికి.' తక్కిన సారస్యముల కేమి?

౧౧. లవచంద్రకేతువు లన్యోన్య మనుకొందురు:

'ఏతస్మిన్మసృణిత రాజపట్టకాంతే........'
ఇత్యాది.

అను: 'సానపట్టిన మణివలె జానువీఁబు......'

'రాజపట్ట' మనగా 'నీలపట్టవస్త్ర' మని వీర రాఘవవ్యాఖ్య.

౧౨. తమకముతోడ నిండు నెలి
దామరతూఁడులు వల్లి కామరా
శములు గరుత్తిక్కయక్కమదక
లస్వనినాదము చేయుచూచుటల్
గమల విశాలనేత్ర! మను
కంటికి నేఁకు ధారరాలు మ
ధ్యమదిక్కఁదోఁచకుంకినవృ
థా కనుగొంటిని బోలునెల్లెటో."

ఈ పద్యము నెట్లర్థము చేసికొనవలెను? అన్వయ క్రమమేది? ఒకవేళ, మూలమును చదివిన వారికి యీ శ్లోకమున ననువాదమయి యుండవచ్చు ననుకొందురేమో! కాని యితరుల కగమ్యగోచరము. దీనిమూలము.

"ఏతస్మి న్మదకలమల్లికాక్షపక్ష
వ్యాధూత స్ఫురదురుదండపుండరీకాః;
బాష్పాంభః పరిపతనోద్గమాంతరాళే
సందృష్టాః కువలయినో మయా విభాగాః"

మూలానువాదములయంతరం మిపుడు కరతలామలకము. వ్యాఖ్యాత లీమూలమున నెన్నియో సారస్యముల వెలార్చిరి. ఒక్క సారస్యమునయిన చూపగలిగినదా యీ యనువాదము! అస లర్థముయినతరువాతగదా సారస్యముమాట!

అనువాదరచనమున నిట్టిఘట్టము లనేకములు కలవు.

* 'ఈ నాటకాంధ్రీకరణము సుమా రొక నెలలోపుననే గావించినట్లు' తొలిపలుకున గలదు.

ఇట్లెన్నింటినయిన చూపవచ్చును. స్వాతంత్ర్యమెక్కువగా తీసికొనిచేసిన యనువాదమది. కొన్ని పట్టులు మూలమర్థము కొంచెము లోపించినవి. భాష సౌరును చాలచోటుల జారిపోయినది. కాని కొన్ని పద్యములు, వచనరచనయందు కొన్నిభాగములు తీయదనముగలిగియున్నవి. ఇది స్వతంత్రరచనమయిన నప్పుడనవలసినమాట యది. ఒకమహాకవి యుత్కృష్ట రచనమున కనువాదమయినపుడు మూలగౌరవము ముఖ్యముగా పాటింపవలసియుండును. అందును రూపకరూపముననే యున్న యనువాదము మూలమున కెల్లవిధముల సరిపోవలెను. అట్లొనరింప సాధ్యముకాదేని, యూరకుండవలెను. ఇంతేల! ఇటు చెప్పవలసినది వేలు. ఇది ప్రసక్తానుప్రసక్తము.

ఇట్టి గ్రంథములను, తత్త్వమరయక, పాఠ్యగ్రంథములుగ నిర్ణయించువారి నేమనవలెను! బాధ్యతను గుర్తెరుగనివారు చేసెడికార్యము లిట్టివని వేరుగ చెప్పబనిలేదు. ముందుముందు బోర్డు ఆఫ్ స్టడీసువారు యుక్తమార్గముల నవలంబించు విధానము లవలంబింపకున్న విద్యార్థుల విద్వత్తు ఇంకను నిరుపయోగము కాగలదు. అంతేకాదు; అడుగంటియే పోగలదు. ఇది భాషాభ్యుదయము నాకాంక్షించు ప్రజాప్రముఖులు ముఖ్యముగా గమనించవలసిన విషయము.

—సహాయ సంపాదకుడు.

---

## మణిపురి నాట్య భంగిమములు

మణిపురి నాట్యముచేత మనములకు ఆనందమును కలిగించు యువతీమణి శ్రీమతి సాధనబోసు. ఈమె కలకత్తానగరమునందలి సినీమా డైరెక్టరులలో ప్రముఖుడైన మధుబోసుగారి సతీమణి సర్. బి. యల్. మిత్రగారి మనుమరాలు. హైందవ శాస్త్ర సంప్రదాయానుసారముగ నాట్యకళయందు ప్రావీణ్యముగల సహృదయురాలు.

---



# భారతీయ మహిళా మండలి

## బాలికల ఉన్నతపాఠశాల, హైదరాబాదు



కలు మాత్ర ముండిరి. ఉదారాశయులగు సంస్థాపకులనిరంతరకార్య దీక్షవలన నది నేడున్నత పాఠశాల యయినది ఇందిపుడు మూడువంద లమంది బాలికలు చదువుచున్నారు.

బొంబాయిలో శ్రీ కార్వే మహాశయుని సంకల్పప్రయత్న ఫల ముగ నెలకొని, పేరెన్నికగనిన 'భారతమహిళా విశ్వవిద్యాలయము'న కీ పాఠశాల అనుబంధింపబడినది.

ఈ పాఠశాలయం దిప్పటి వరకు పదుమగ్గురు బాలికలు ప్రవేశపరీక్షయందు విజయముగాంచిరి. స్త్రీ విద్యాభిమానులగు సుదారాశయులసాయమున, తరువాతి కళాశాలవిద్యకు కావలసిన సౌకర్యములు (౧౯౨౮-౯ సంవత్సరమున) సమకూరినవి. ఆసాయము చేయూతగా బాలికలుకొందరు జి. ఏ. (ఇది ఇక్కడి బి. ఏ. వంటిది) పరీక్షకు తరిబీయతునొంది ఈయేడు విజయము నొందిరి. ఈ మొదటి జట్టులోని వారు శ్రీ ఇందిరాబాయి (వయస్సు ౧౮ ఏండ్లు), శ్రీ రమాబాయి (వయస్సు ౧౯ ఏండ్లు) అను బాలికలు. శ్రీ రమాబాయి ఇంగ్లీషున నగ్రస్థానమున నిలిచి విశ్వవిద్యాలయపు పారితోషికమును పొందినది. వీరిరువురు అభినందనార్హులు. శ్రీ ఇందిరాదేవిని శ్రీ నందగిరి వెంకటరావు

౧౯౨౧-౨౨-వ సంవత్సరమున బాలికలకొరకొక చిన్నపాఠశాల మొలకెత్తినది. నాడు కొలదిమంది బాలి

గారు (బి. ఏ, యల్. యల్. బి.) (వీరికిని భారతికిని చక్కనిపరిచయము కలదు.) ఇటీవల వివాహమయిరి.

ఈ ఉన్నతపాత్రలాల అచిరకాలమున కళాశాలయయి వెలయుగాక!

### శ్రీమతి కే. జి. భగవతమ్మ



తిరువాంకూరు సంస్థానమున[ఉ]పరిజిస్ట్రారు (సబ్ రెజిస్ట్రా)రుగా నియమింపబడెను.

### శ్రీమతి రుక్మిణీలక్ష్మీపతి



అసెంబ్లీ ఉపాధ్యక్షపదవియందు నియమింపబడెను.

### కుమారి జహనుజాఫరు అలికన్య




అలీఘరు విశ్వవిద్యాలయ శిశువిద్యా శాఖాధికారి. జపానులో జరగు ప్రపంచవిద్యాసభకు భారతీయ ప్రతినిధి

### శ్రీమతి షానవాజుసతి



పంజాబుమంత్రికి పార్లమెంటరీ కార్యదర్శి.



# విమర్శనము

### కారుణ్యం

ఠా చిన్నకథల సంపుటి. గ్రంథకర్త: కొడవటి గంటి కుటుంబరావు.

తెనాలి యువకార్యాలయ ప్రచురణం. వెల అణాలు. ౦-౪-౦.

ఈ ఎనిమిదికథలలోనూకూడా ప్రేమ విషయక మయిన స్వేచ్ఛ ప్రణాళికగా వ్రాకింది. ఈ కథలలో జైలుఖానా అనేది కథగాకంటె ఏ Parable గానో ఏ Allegory గానో రూపిస్తూంది. దానిన్ని కథలసత్తలంలో ఎందుకు చూర్చేరో తెలియదు. అది మొదటిదిగా గాని, ఉపోద్ఘాతంలో ఇమిడిగాని ఉంటే బాగుండు నేమో. ఎక్కడున్నా దానిని కథగా లెక్కించడానికి వీలు లేదు. దీనిలో స్వేచ్ఛను బాగానిర్వచించేరు. దానిని బాగా నిరూపించడానికి జైలుఖానా కట్టేరు. గాలిపాటు అనేది ఒకవర్తమానం లాగుంది ఇందు కథకు దోహద మిచ్చి కథాలక్షణాన్ని పోషించే యితరాంశము లేవీలేవు. శాస్త్రిరాక Dramatic గా ఉంది. అయితే కళ్యాణిమనను మార్చడాని కాధారమయ్యేడు.

కథలలోని చాలాచోట్ల సంభాషణలు దీర్ఘాలై గురుశిష్య సంవాదాలు లాగు పెరిగేయి, కేవలం ఏదో స్వేచ్ఛాసూత్రం వడకడానికని. ఇది కథను పోషించదు.

ఇందు కొన్నికథలు కథకుడు సూచించి, పన్న బోయే స్వేచ్ఛాసూత్రాలకు నిదర్శనాలుగా, నిమిత్తాలుగా నిలిచి పోయినాయిగాని, కథాపాటవాన్ని చదువరి మీద ముద్రింపవేమో అనిపిస్తున్నాయి. అంతేకాక, కథకుని వచోధోరణి ప్రార... 

స్తూంది ఏదో ఒక స్వేచ్ఛాసూత్రం మీద కథ నడుస్తూందా, లేక కథావస్తువునుండి స్వేచ్ఛాసూత్రం వెలువడుతూందా? ఇందు రెండవఫక్కీ కథకు ప్రాధాన్యం ఇస్తుంది. మొదటిది సూత్రపటుత్వాన్ని సూచిస్తుంది. అంతేగాక ఈమొదటివిధానం చదువరికే అవకాశం విడువదేమో. కడకూ సాగదీరిన సంఘసంస్కరణ విషయమైన గ్రంథకర్త అభిప్రాయాల సంఘర్షణే ఈకథలలో ప్రధాన స్థాన మాక్రమిస్తూంది. దానివలన చాలాకథలు ప్రచారానికని సాగించే ఉపన్యాసధోరణిలో నున్నాయి. ఈ విధానం చిన్నకథల లక్షణానికి హత్తదేమో. ఉదంతం ప్రధానంగావుండి అభిరుచి దానినీడలో పోవాలిగాని అభిరుచి ఉదంతాన్ని మింగీవచ్చునా?

అయితే మొత్తంమీద కథలు సరళమయిన భాషలో చక్కగా రచించేరు. వీరీవరకే పత్రికలమూలాన ఆంధ్రపాఠక లోకానికి పరిచితులు. వీరి కథలు బాగుంటాయన్న ఉబలాటంకూడా ఉంది పాఠకలోకంలో కొన్నిచోట్ల గ్రంథకర్తగా రాణించే పాఠకలోకం కోరతవడ దీకథలకని నానమ్మకం. పుస్తకం వెల నాలుగణాలు. ఎంతో బాగుంది ఎలాటి వాళ్లుకూడా కొని చదువవచ్చును.

పు. వెం. ర.

---

### ముత్యాలశాల

గ్రంథకర్త: వెంపటి నాగభూషణం. ఇదియొక చిన్నకథల సంపుటం.

ఇందలి కథలకూర్పు బాగుంది. చిన్నకథల లక్షణాన్ని పోషిస్తూ ఆంగ్లఫక్కీని ఎక్కువగా స్ఫురింపచేస్తున్నాయి ... కథలన్నీ. అవి చదువుతూఉంటే ఇం

గ్లీషులోని చిన్నకథలు చదువుతూన్నట్టే అనిపిస్తుంది. అయితే చదువరి కాస్త ఓపికపట్టి చదవాలి కథావస్తు వంతా పూర్తిగా గ్రహించాలంటే. లుప్తభావా లెక్కు వయి పోయినాయి.

ఇక ఇందలి భాష త్రివర్ణచిత్రంగా ఉంది. ఘాట యిన సంస్కృతం ముక్కలూ, పేలవమయిన వ్యావ హారికపు తెలుగుముక్కలూ ఇంగ్లీషు ముక్కలూ విర ళంగా వాడుకయినాయి. అవి కలగలుపుగా వాడుక కావడంబట్టి ఒక క్రొత్త భాషగా వినబడుతుంది. అక్క డక్కడ హిందీముక్కలు కూడా వినబడ్డాయి.

ఇన్నిభాషలలో గిరగిరా తిరగడంఅవస్థ మన తెలుసుకే పట్టిందా? తక్కినభాషలకుందా? ఎక్కడ యితే భావం మనభాషలో చెప్పలేకపోతామో అక్కడ అన్యభాషాసహాయం జరూరంటే బాగుంది.

వాక్యనిర్మాణంకూడా చాలాచోట్ల విపరీతమై అర్థం వెంటనే స్ఫురించనీకుండా కూడా ఉంది. కొన్నియెడల పదప్రయోగాలు కూడా ఉచితాలుగా లేవు. వీనివల్ల ఏమయిందంటే కథల కూర్పెంత బాగు న్నా చదవడానికి కొంతపని పడుతూంది. అంతే కాకుండా వీరికథలు, ఇంగ్లీషుభాషాపరిచయం గల వారికేగాని ఇతరులకు సుగమాలుకావు. భాష ఇంత కంటె సరళమయిన వ్యావహారికమయితే బాగుండు నేమో.

దీనివెల ఒకరూపాయి కావడంచేత ఇది అందరి అందుబాటులోనూ ఉండదేమో.

పూ. వెం. ర.

---

## కాంతం కైఫీయతు

క్రౌనుసైజు, రఫ్‌కాగితము, సుమారు ౧౧౦ పుటలు, వెల ప్రతి ౧ కి నాలుగు అణాలు.

గ్రంథకర్త: మునిమాణిక్యం నరసింహారావు.

ప్రకాశకులు: యువకార్యాలయం, పాతపేట, తెనాలి.

మునిమాణిక్యం నరసింహారావుగారు రచించి యిదివరలో పత్రికలందు ప్రకటింపచేసిన పెద్దకథల సంపు టమే "కాంతం కైఫీయతు". శ్రీకాంతయమ్మ రావు గారు—కైఫీయతు, బహుముఖాలఅద్దం, ప్రణయకలహం, గట్టినిశ్చయం, కోర్టులోకాంతం, ధర్మచక్రప్రవర్తన, లేచిపోవాలనుకుంటే, కిటికీకిఅవతలాయివతలా, ఎండ-వాన, సముద్రస్నానం శీర్షికలుగలవి యీ గ్రంథంలో చేర్పబడినాయి.

ఆంధ్రదేశంలో కథలువ్రాసేవారు బహుకొద్ది మంది. తర్జుమాలుచేసేవారు, తస్కరులు, మూలాన్ని ఆధారంగాగ్రహించి అనుసరణలు జరిగించేవారు ఈపట్టీ క్రిందకు రారు. కథలువ్రాసేవారు బహుకొద్దిమందిఅంటే స్వతంత్రంగా రచించేవారనిభావం. అట్టివారిని వ్రేళ్ల మీద లెక్కపెట్టి చెప్పవలెను. మునిమాణిక్యం గారు యిట్టి తరగతికి చెందినవారు.

వీరిరచనలలోని వస్తువు యెంతవరకూ తమయింటి నాలుగు గోడల నడుమ జరిగే సాంసారిక ముచ్చట్లు, కష్టాలు. మునిమాణిక్యంగారికథలంటే చదువరుల మనోదృష్టికి తపీమని తగిలేవి. వారు కాంపోజిషను పుస్తకాలు దిద్దుకోవటం, వారి కాంతం, వారిపిల్లల జంజాటం, అవ్యక్తమైన యేదో ఒకసంసార సంబంధ ఘట్టం ఇది. వారు, వారికాంతం, పిల్లలుతప్ప మరొక పాత్ర నిరికించి పాఠకులను తికమిక పరచరు. కథలు వ్రాసినా, నాటకాలుఆడినా, ప్రబంధాలు సృష్టించినా నీతి అనేది ఒకటి అత్యవసరమని సూత్రికారులు నిర్ణ యించారు. మునిమాణిక్యంగారి రచనల్లో అట్టి నీతి అనేది మృగ్యమైనా సంసారం దుఃఖమయమైన దనో, ఆనందమయసామ్రాజ్యమనో అస్పష్టంగావుండి ఆ నిర్ణయం పాఠకులఊహాకే వదలబడి వుంటుంది.

వీరికథలు మానవసంసారానికి ప్రతిబింబాలు. అసలు వీటికి నశింపు ఉండదు. ఏదేశానికి చెందిన వాఙ్మయం అయినా అక్కడ వెలువడేదానిలో తాత్కా లిక ప్రయోజనమాత్రమే వుండేది కొంత వుంటుంది. యేకాలంలోగాని చదవతగింది, ఆనందింప తగింది మరికొంత వుంటుంది. మునిమాణిక్యంగారి రచనలు సజీ వమైనవి అవటంచేత యీనాడు చదివితే యెంత ఆనం దాన్ని కలిగిస్తాయో పది పదునైదు సంవత్సరాల పమ్మట చదివినా అంత ఆనందాన్ని కలిగిస్తయి.

ఈనాటి మనసంఘం బహుచికాకుగా వుంది. ఆర్థిక, రాజకీయ, సాంఘిక పరిస్థితులు మానవజాతి కేమాత్రమూ విశ్రాంతి నియ్యకుండా వున్నాయి. మానవ జీవికి నిర్ణయింపబడిన యిరవైనాలుగుగంటల దిన పరిమాణంలో ఒకగంటైనా విశ్రాంతి కావాలి. ఈవిశ్రాంతి కాలంలో మనస్సుకు నిర్మలమైన ఆనందాన్నిచ్చే పనులుమాత్రమే చేస్తే మిగత గంటలలో అతడు చేయవలసిన భారమైనపనులు భారముగ తోపవు. విశ్రాంతి, విశ్రాంతిలో ఆనందాన్ని అభిలషించేవారికి మెదడు చీల్చుకొనవలసిన అవసరములేని మునిమాణిక్యంగారి కథలవంటి చిన్నకథలు యెంతో ఉపకరిస్తవి.

వ. కుటుంబరావు

---

## సోషలిజం ఎందుకు?

శ్రీ జయప్రకాశ నారాయణగారి "Why Socialism" అనే ఆంగ్లేయగ్రంథమునకు ఇది అనువాదము. అనువాదకులు శ్రీయుతులు రామమోహన్, కం. సత్యనారాయణ, ఎం. ఎ. గార్లు.

క్రౌను సైజు, ౨౬౫ పుటలు, రఫ్ కాగితము, వెల ప్రతి ౧ కి రు. ౧-౦-౦.

సోషలిజంఅనేది ఈనాడు ప్రపంచంలో గొప్ప సమస్య అయిపోయింది. ఆర్థిక రాజకీయాలయొక్క సహాయంవల్ల మానవసమాజాన్ని పునర్నిర్మించ జూచే పద్ధతి సోషలిజమని పిలువబడుతోంది. సంఘంలో అసమానతలేకుండా—అనగా ధనికునకు నిరుపేదకు, భూస్వామికి రైతుకు, పెట్టుబడిదారుకు కూలివానికి, నడుమగల వ్యత్యాసములేకుండా, తన్మూలంగా ఏర్పడ్డ ఎడతెగని పోరాటం అంతరించాలనంటే ఆర్థికరాజకీయాలు రెంటిని హస్తగతంచేసికొని ప్రజాక్షేమమే, ప్రజాసౌఖ్యమే ముఖ్యంగా అభిలషించే పక్షం అధికార ప్రాబల్యంలోఉంటే అదిసమకూరి కొనసాగుతుంది.

సోషలిజం అనేదానికి అనేకులు వారివారి ప్రకృతులనుబట్టి, వారివారి జీవితపరిస్థితులను అనుసరించి అనేక విధములుగ నిర్వచనం చెబుతున్నారు. దీనిని భూషించే వారున్నారు; దూషించేవారున్నారు. ... భూషణలసంగతి యెలాగున్నప్పటికీ సోషలిజంయొక్క విధానంలోనే అతివాదతత్వమునకు, మితవాదతత్వమునకు చెందినవారున్నారు. అతివాదముకానిండు, మితవాదముకానిండు ధనికవర్గముయొక్క నిరంకుశత రూపుమాయవలెననేదానిలోమాత్రం అందరూ యేకీభవిస్తారు.

సోషలిజం ౧౯-వ శతాబ్దంలో ప్రపంచంలో తలచూపి ఈనాటికి చాలాభాగము వేళ్లు పాతుకుపోయింది. ప్రజాస్వామికప్రభుత్వం యేర్పడ్డ అనేక రాజ్యాలలో కార్మికులకు రక్షణ ఇయ్యబడుతోంది. కాయకష్టంచేయలేని దుర్బలదేహులకు, ముసలివారికి ప్రభుత్వమే రక్షణ యిస్తోంది.

ఈ యిరవయ్యోశతాబ్దపు రాజకీయ వాతావరణంలో సోషలిజం ప్రముఖస్థాన మాక్రమిస్తోంది. ఇంగ్లాండు, ఆస్ట్రేలియాలలో లేబరుపార్టీవారు బలవంతులై సోషలిస్టులు ప్రాధాన్యం వహిస్తున్నారు. అమెరికాలో లేబరుపార్టీకి పలుకుబడి లేదు. తిరిగి జర్మనీ, ఫ్రాంసులలో లేబరుపార్టీకి పలుకుబడి జాస్తి. ప్రపంచమహాయుద్ధం పిమ్మట రిపబ్లికులుగ మారిన రాజ్యాలన్నిటిలోను సోషలిస్టులదే పైచేయిగ నుండి వారియూహలే చలామణి అవుతున్నాయి. స్పెయిను, ఐర్లండు మొదలైన రాజ్యాలలో సోషలిస్టులే ప్రముఖస్థానం ఆక్రమిస్తున్నారు. రషియాదేశంలో యీనాడు ప్రబలంగావున్న సోషలిజం ఇతర అన్నిదేశాలలోని సోషలిజములకంటె తీవ్రతరమైంది. ఒకప్పుడు బహుదరిద్రవంతంగా వున్న రషియా యీనాడు ఆర్థికంగా చాలా బాగుపడటం, ఇటలీజర్మనీలలో రాజకీయవాతావరణం మార్పుచెందటం మొదలైనవన్నీ సోషలిజంయొక్క విజృంభణంచేతనే.

ప్రపంచాన్నంతా చుట్టుముట్టజూస్తున్న ఈసోషలిజం మన యిండియాలోగూడ ప్రారంభమైంది. ఇతరదేశాలలోవలె యీ దేశంలో సోషలిజం జనసామాన్యంలో పుట్టలేదు. కార్మికవర్గంలోగాని, కర్షకజాతిలోగాని పుట్టలేదు. గాంధీమహాత్మునిమాట ప్రకారం స్వరాజ్యంరాక అది అంతకంతకు గగనకుసుమం అవుతున్న ... నిరుత్సాహులైన యువజనులలో

నుండి బయటపడిన చిచ్చే యిక్కడ సోషలిజమని చెప్పవచ్చు.

హిందూదేశం సోషలిస్టుదేశంగా మారవలెనంటే ప్రభుత్వం ప్రజాపక్షం కావలె. అనగా కాంగ్రెసు పక్షం కావలెనన్నమాట. అది జరిగినప్పుడే ఇక్కడ సోషలిజం ప్రబలటానికి అవకాశాలున్నాయి కాని పారతంత్ర్యంలో ఉన్నంతవరకు క్రొత్తరాజకీయ వర్గాలు బయలుదేరి స్వాతంత్ర్యం అంతకంతకు దూరం చేయటానికే తోడ్పడుతున్నాయని ఊహించవలసి వుంటుంది.

హిందూదేశంలో నేటి సోషలిజంకు తల తోక ఇంతవరకు యేర్పడకపోయినప్పటికీ రాజకీయాలలో వింతవింత వ్యాఖ్యానాలు బయలుదేరుతున్నాయి. ఇండియాకు సోషలిజం పనికిరాదని కొందరు; ఐకమత్యం యెప్పుడితేగదా అని మరికొందరు; విదేశీయాధికారం అంతరింపచేసినంతమాత్రాన భారతదేశ దారిద్ర్యసమస్య ఒక్కమారుగా అంతరిస్తుందా అని కొంతమంది; రక్తపాతంతో కూడిన మహావిప్లవం రైతుజనంలోనుంచిగాని, కార్మికులలోనుంచిగాని పుడితేనేకాని సోషలిజం తల పెట్టడానికి వీలులేదని యింకాకొందరు; రైతులయొక్క-కార్మికులయొక్క యోగక్షేమాలు విచారించటానికి కాంగ్రెసుమహాసంస్థ ఒకటియుండగా తిరిగి సోషలిస్టులు అని మరిఒక తెగ యేమిటి-వీరిప్రత్యేక కార్యక్రమ మేమిటి అని కొందరు—ఈ విధంగా సోషలిస్టుల సిద్ధాంతాన్ని విమర్శిస్తూ నిరసిస్తున్నారు.

ఆవిధంగా విమర్శించి నిరసించేవారందరికి "సోషలిజం ఎందుకు" అనేగ్రంథం చెంపపెట్టు. భారతదేశంలో సోషలిజంయొక్క ఆవశ్యకత చాలకలదనీ, ఇక్కడగూడ సోషలిజం స్థాపించటానికి వీలున్నదనీ యీగ్రంథం ఖండితంగా చెబుతోంది. "మనం సోషలిజం స్థాపించటం సాధ్యమా? సోషలిజంవస్తే భారతదేశపు వ్యవసాయంలో రైతులలో ప్రజలలో యేమయినాఅభివృద్ధి కలుగుతుందా, కలగదా అనేదానికి జయప్రకాశ నారాయణగారు ధీమాగా సమాధానం యిలా ఇస్తున్నారు: "భారతదేశీయ వ్యవసాయాన్ని దివాళానుంచి, నాశనాన్నుంచి ... ఒక్క సోషలిజమే! రైతుక్షేమాన్ని కోరి వారి అభివృద్ధికి తోడ్పడగలది ఒక్కసోషలిజమే! భారతజాతిని బలసంపన్నమునుచేసి శక్తిసామర్థ్యముల నీయగలది ఒక్క సోషలిజమే! దీనిలో యేమీ సందేహం లేదు."

"సోషలిజం ఎందుకు" అనే ఈ గ్రంథం చాలా మందిలోగల అనేకతరహాలైన అనుమానాలను తీరుస్తుంది. సోషలిజమును నిరసించేవారికి మాత్రమేగాక సోషలిజంఅంటే యేమిటో, దానితత్వమేమిటో తెలిసికోకుండా వెర్రిమొర్రిగా ప్రసంగించే ఛోటా సోషలిస్టులకుగూడ ఈగ్రంథం యెంతో ఉపకరిస్తుంది. ఎల్లరు తప్పక చదువవలసిన గ్రంథం.

ఈ గ్రంథమునకు శ్రీయుతులు మద్దూరి అన్నపూర్ణయ్యగారు పీఠికవ్రాసిరి. విశ్వసాహిత్యమాలవారు ఈ గ్రంథాన్ని ప్రకటించినారు.

గ్రంథములకు విశ్వసాహిత్యమాల, ముంగండ, (వయా) అంబాజీపేట, తూర్పుగోదావరిజిల్లా అని వ్రాసిన బడయగలరు.

వ. కుటుంబరావు

---

## ప్రకృతి గృహవైద్యము

క్రౌను నాలవవంతు, చక్కని గ్లేజుకాగితము, సుమారు ౧౬౫ పుటలు, వెల ప్రతి ౧ కి రు. ౨-౮-౦.

గ్రంథకర్త: డాక్టరు పుచ్చా వెంకట్రామయ్య, ఎన్. డి.

ప్రకాశకులు: ప్రకృతి కార్యాలయ ట్రస్టు, బెజవాడ.

ఈ గ్రంథము ఆంధ్రప్రకృతి ధర్మపరిషత్తు వారి నాల్గవప్రచురణము. ఇందలి విషయములన్నియు "ప్రకృతి" పత్రికనుండి పునర్ముద్రితములు.

గ్రంథకర్త: ఆంధ్రలోకమునకు క్రొత్తవారు కారు. తెలుగుదేశమున ప్రకృతి వైద్యమును నెలకొల్పుటకు ప్రకృతి, ఇండియన్ నాచురోపతీ అనుపత్రికల నడిపించియు, సునిశితవైద్యము, తొట్టివైద్యము అను గ్రంథముల ప్రచురించియు వీరొనర్చుచున్న సేవ కొనియాడతగినది. వీరి ప్రయత్నములు ఫలప్రదము కాగలుగుటకు ... దొరకునుగాక.

ఆరోగ్యవిషయమునందు భారతీయులు అన్నియితర జాతులకంటె చాల వెనుకపడియున్నారు. భారతజాతి దుర్బలముగనుండుటకు కారణము లనేకము లు. మనకు ఆరోగ్యముయొక్క విలువ తెలియకున్నది. దానివిషయమున భారతీయు లావంతేని శ్రద్ధచూపకున్నారు. ఈజాతి యీనాడిట్టిదౌర్బల్యస్థితిలో నుండుటకు ప్రప్రథమహేతువు ఆరోగ్యవిషయమున గల ఉదాసీనతయే.

భారతవర్షము కర్మభూమి. ఆధ్యాత్మికచింత మన కుస్తుపాలతో బుట్టినది. అన్యరాజ్యాంగము, పనికిమాలిన యింగ్లీషుచదువు, నాగరకమను పేరున నేర్పడిన కొన్ని దురలవాట్లు మనల నంతకంతకు నధోగతికి చేర్చుచున్నవి. ప్రకృతియందు భగవత్స్వరూప మిమిడియున్న దనియు, అందు లభ్యపడు ప్రత్యణువు భగవంతుని సంతతియన దగిన మనకు ఉపయోగపడున వనియు మనము మరచితిమి. సూర్యరశ్మి, వెలుతురు, నీరు, గాలి, ఆహారములు ప్రకృతి యొసంగుచున్నది. వీటిని తగువిధమున ఉపయోగించుచునెడల మానవునక నారోగ్యమనునది యుండదు. భగవద్దత్తములగు పై వాటిని మనము సరిగ నుపయోగించు కొనకుండుటే అనారోగ్యమునకు కారణము.

ఆరోగ్యమును కాపాడుకొను విషయములో మానవుడు పశుజాతికంటె వెనుక పడియున్నా డన వచ్చును. మానవునకు వివేచనాపటిమ యొకటి పరమేశ్వరుడు ప్రసాదించినట్లు గర్వపడును. ఈయూహ కేవలము మిథ్య. అనారోగ్యము చెందిన పశువు యేచెట్టు యొక్క ఆకో, బెరడో తిනినంత మాత్రమున అట్టి అనారోగ్యము శమించునని దానికి తెలియును. అంతమాత్రము జ్ఞానమయినను మానవునకు లేదు. జ్వరము చేత బాధపడుచున్న జంతువు మానవునివలె మందుకొరకల్లాడక సూర్యరశ్మిలో పరుండును. వేడిని వేడియే కొట్టివేయు ననెడు శాస్త్రసిద్ధాంతముయొక్క నిజానిజములు జంతువులకు తెలిసినంతగ యీనాటి మానవునకు తెలియవు. సింహము మొదలు మార్జాలమువరకు ఉదయమున నిద్రనుండి మెలకువచెందిన వెంటనే ఒడలు విరచుకొనును. అట్టి ఒడలువిరుపునందుగల రహస్యము వాటికే తెలియును. మానవుడుగూడ ఆ ఒడలు విరపును అభ్యసించుట మంచిది. ఇది పోనిండు.

జ్వరము వచ్చినప్పుడు అన్నాహారము కూడదను సంగతిగూడ చాలమందికి తెలియదు. విరేచన సాధకమునకే ఆముదమో త్రాగిన దినమున దుంపకూరలు, గోధుమ మొదలగు బలువయిన ఆహారములు తినదగదని గూడ కొలదిమందికి మాత్రమే తెలియును. పిల్లలివల్ల కలిగే ఉపయోగము తల్లి వలన గూడ కలుగదు. దుర్భర దారిద్ర్యమున మునిగియున్న భారతీయు లిట్టి స్వల్పాంశములనైన తెలిసికొనినచో ఇక్కడ ఇంతమంది ఆంగ్లేయవైద్యు లుండరు. సుమారు పదికోట్ల రూపాయలు హిందూదేశమునుండి పాశ్చాత్యదేశములకు ఔషధముల క్రింద పోవలసిన యవసరముకూడ ఉండదు.

ఇక ప్రపంచమునగల వైద్యపద్ధతులకు లెక్కలేదు. ఆంగ్లేయ, ఆయుర్వేద, యూనాని, సిద్ధ, హోమియోపతి, బయోకెమిష్ట్రీ), తొట్టి, ప్రకృతి మొదలగు చికిత్సావిధానము లెన్నియో కలవు. ఔషధసేవయనుసరికియే చికిత్సాపద్ధతి నను ఆయౌషధమున చేరెడి మూలికలు, పట్టలు, ఆకులు, దుంపలు మొదలగునవన్నియు ప్రకృతిలోనుండియే గ్రహింపబడుచున్నవి తనకు చరణదాసిగనున్న ప్రకృతియొక్క సహాయసంపత్తుల వదలి మందు కొరకని వైద్యుల చెంతకు పరుగులిడుట మానవునిబుద్ధి లేమిని ప్రదర్శించును. ఇది కుక్షింభరులకు ద్రవ్యార్జన సాధనమైనది. ప్రకృతివైద్య చికిత్సను పూర్వము ఋషులవలంబించిరి. అప్పుడు భారతజాతి వికాసవంతముగ నుండెడిది.

ప్రకృతివైద్యము రెండువిధములు: ఒకటి,: రోగము ప్రవేశింపకుండ కాపాడుకొనుట. రెండవది, రోగము ప్రవేశించినపిమ్మట అవలంబింపదగు చికిత్స. "ప్రకృతి గృహవైద్యము"ను నీ గ్రంథము ద్వివిధములగువాటిని పరిచయ మొనర్చుచున్నది. ఇందు ౨౫ పాఠములు గలవు. సామాన్యమానవున కుపయోగపడునవి, అర్థమగునవి విషయములు రెండుమూడు పాఠములందు మాత్రమే అగుపడును. ఆరెండుమూడును ఆహార శాస్త్రమునకుసంబంధించినవి. మిగత అధ్యాయము లన్నియు అస్థినిర్మాణము, శరీరశాస్త్రము, దేహమునందలి అవయవములు,

రోగము, రోగనిదానము, రోగచిహ్నములు, ప్రత్యేక వ్యాధులు, వాని చికిత్స, మర్దన చికిత్స, చలనచికిత్స, వ్యాయామము, నీటివైద్యము, విద్యుద్వైద్యము, సూర్య కిరణచికిత్స, మూత్రపరీక్ష, కశేరుకా చికిత్స, అస్థిచికిత్స మొదలగునవి సామాన్యమానవులకు గ్రాహ్యములు కావు. ప్రకృతివైద్యము నభ్యసించువారికీ గ్రంథము ప్రారంభ పాఠములను నేర్పు నని పీఠిక యందు పేర్కొనబడినది.

ప్రకృతి చికిత్సను గూర్చి మన దేశమున అనేకాభిప్రాయములు ప్రబలియున్నవి. ప్రకృత్యాహార మునుమాత్రమే స్వీకరించువారు కొందరు గలరు. అట్టి వారిని కొందరు హేళనచేయుట గూడ గలదు. ప్రకృత్యాహారముతో నుండువారు ప్రకృత్యారాధకులుగ నెన్నదగుదు. పరీక్షించి చూచినచో ప్రకృత్యారాధకులు విపరీతము లగు కోరికలెవ్వియు లేక సహజము లగు విషయములతో తృప్తిచెందియుందురు. వారి కుండు నంత శాంతి, ఆనందము లక్షలార్జించువానియందుగూడ చూడము. ప్రకృత్యారాధకునకు కలవు, భయశోకములు మోహము ఈర్ష్య, అసూయ మొదలగు దుర్గుణములు అంటవు. దేహమునందు ఆరోగ్యము, బలము, శౌర్యము, త్యాగము యేర్పడుననుటలో సందేహము లేదు. ప్రకృత్యారాధనమువలన భారతజాతి తిరిగి వీర్యవంతము కాగలదనుట నిస్సందేహము.

వ. కుటుంబరావు

---

భిక్షావతి

పద్యము కర్త. శ్రీవఝ్ఝల కాళిదాసు, క్రౌను ౫౪ పుటలు; మేలురకపు కాగితము. వెల ౮ అణాలు. సంపాదకుడు: మట్టా గురుమూర్తి, సరస్వతీ ముద్రాశాల, విశాఖపట్టణము.

ఎనిమిది ప్రకరణములు గల ఈ చిన్నిపద్యకావ్యమున అభాగ్యురాలగు నొక బిచ్చకత్తె చరిత్రము వివరింపబడినది. ఆకలిచిచ్చు నార్చుకొనగోరి తన పసిబిడ్డనితో కూడ నొక భిక్షావతి వీథులు, దేవళము, సందుగొందులు తిరుగుచు 'బిచ్చ'మని అరచుచుండెను; ఎవ్వరు నామెమొర నాలింపరైరి. కట్టాకలి నామెబిడ్డ యూపిరు విడిచెను, ఆ శోక మానవస్వభావమున తన యాకలి తీరుటకయి తిరియక తప్పినదికాదు; ఒకబాట కావలివైపున నుండి ఒక ధర్మాత్ముడొక 'కాణి' నీయదలచెను. అందుకొనుట కామె బాట దాటులోపల నొక మోటరు ఆమెను త్రొక్కి పొట్ట బెట్టుకొనెను. ఆమెయు ఆమె బిడ్డయు తారలయి కటికిలోకమునందలి దృశ్యముల యెడ ఔదాసీన్యమున మింట మిలమిల మెరయుచు రెండు నైక్యముచెందినవి. ఇందలి కథావస్తు వింతియే. కథ అల్పమయినను బిచ్చగాండ్ర స్వభావజీవనములు, భాగ్యవంతులగు బీదలయెడ గల నిర్దాక్షిణ్యము, ప్రకృతి వర్ణనము మొదలగు నంశములు విస్తరించుటకు పెంపు గనినది.

శ్రీ కాళిదాసుగారు ఆంధ్రులకు అపరిచితులు కారు. వీరు వెంకట కాళిదాసకవులలో నొకరు. ఇపుడు వేరుపడి స్వతంత్ర గ్రంథరచన సాగించుచున్నారు. పసితనముననే వీరికి కవిత అబ్బినది; వీరి కవితాధార అడ్డులేనిది; మనసులోని భావముల నన్నిటిని పద్యరూపమున ప్రకటించుశక్తి వీరికి కలదు; కాన భావమును స్పురించుటకు పాఠకులు పరిశ్రమింపనక్కరలేదు. వీరి వర్ణనలు స్వభావసిద్ధములు; హృదయంగమములు.

'భిక్షావతి'లోని కథకంటె ప్రకృతివర్ణనమే ఎక్కువగ పాఠకుల నాకర్షింపదగినది. కాని శివాలయ వర్ణనమున గోడలపయి విష్ణుని దశావతారములు చిత్రింపబడినవని వర్ణించుట ఔచితిని కోలుపోయినది. పద్యములు రసవంతములయి చక్కగ సాగినవి. కొలదిచోట్ల 'విభ్రాజోజ్వలచ్చంచలాకారస్ఫూర్తి', '(గ్రావాకల్పిత కుడ్యములు)......పురావిలాసస్ఫుటముల్' 'మెల్ల మెల' వంటి ప్రయోగములు అర్థస్ఫూర్తికి, రసమునకు కొంచెపాటి కొరతను కూర్చుచున్నవి. 'భాగ్యశాలురు' అనుటకు 'భాగ్యశాలులు' అని యున్నది. అది అచ్చుపొరపాటై యుండవలెను.

'భిక్షావతి' బీదవారల జీవితమును ప్రతిబింబింపజేసి, కఠినుల మనస్సులందు కరుణను మొలకలెత్తించుటకు ఉత్తమ సాధనము; ఆంధ్రు లాదరింపదగినది.

బు. వేం. ర.

## వ సం త ము

పద్యము. కర్త: శ్రీ పెమ్మరాజు లక్ష్మీపతి; సైజు ౧౬ రాయల్; పుటలు ౨౪. చక్కని కూరుపు.

కవికుమారుల కుపాస్యదైవతము, ఋతురాజము నగు వసంతుని ‘వసంతము’న వర్ణితము. పానకమున మిరియపుబొడివలె నష్టప్రియూడను నొక దుఃఖజీవి విషాదగీతి ఇందు హృదయంగమముగ మేళవింపబడినది. ఇందలి పద్యములు హృద్యములు. వర్ణన లనన్యసాధారణములు; అత్యంత హృద్యములు. ధార అనర్గళము. గ్రంథము ఆమూలాగ్రము రసమయము.

శ్రీ పెమ్మరాజు లక్ష్మీపతిగారు తెలుగువారికి చిరపరిచితులు. వీరు ‘లోకముకంటc బడక, తాత్కాలికములగు ధన, కీర్తులపొంతc బోక, వినీతమయ్యును పునీతమగు పల్లెటూరి యుపాధ్యాయవృత్తిచే దేహయాత్ర సేయుచు’న్నారు. పత్రికలందు ప్రకటితపూర్వములగు వీరి ‘బలి’, ‘చెల్లమాంబ’ మొదలగు కావ్యములు ఆధునిక కవికుమారులలో వీరికి ఉత్తమస్థానమును గడించియిచ్చినవి. ఈ ‘వసంతి’ మేలివియు మునను వానికి తీసిపోదు. వసంతగానము నొనరించుట కీ కవికోకిల మత్యంతము నర్హమయినది.

‘వసంతము’ ఈ కవికుమారునిచే ‘శ్రీ అద్దేపల్లి నాగగోపాలరాయకవి మిత్రులకు వివాహమహోత్సవావసరమున సమర్పితము.’ కవికోకిలము ప్రియమిత్రులకు సమర్పించుటకు ‘వసంతము’న మించిన పెండ్లికానుక లేదు.

ఈ ‘కృతి’ పతికీర్తిని ప్రచారముచేయుట కెంతయు తగినది.

బు. వేం. ర.

---

## శు భ మ స్తు

కవిమిత్రగ్రథితము. రాయల్ ౧౬ సైజు. పుటలు ౩౪. చక్కని కూర్పు.

ఇదియును కవిమిత్రులచే ‘శ్రీ అద్దేపల్లి నాగగోపాలరాయకవి సుహృన్మణికి పరిణయోత్సవావసరమున ప్రేమాంకితము.’ సులలిత కవితావిలసితములగు పద్యాశీస్సు లిందు కూర్పబడినవి. అన్నియును రసవంతములు. విశేషించి సత్యనారా ప్రకాశరావు, బాపిరాజు, ఉమర్ ఆలీషా, వెంకటేశ్వర్లు, లక్ష్మీపతి, లక్ష్మణస్వామి గార్ల పద్యములు హృద్యములు.

‘శుభమస్తు’ అను గ్రంథనామము వరుని గృహస్థాశ్రమ ప్రారంభ వ్యంజకమై చక్కగనున్నది.

గ్రంథముచివర కవిమిత్రుల జననకాలము, వారు రచించిన ముద్రితాముద్రితగ్రంథములు పట్టికగా ఈయబడినవి.

బు. వేం. ర.

---

## ర సాం జ లి

శిష్యశ్రేణికృతము. రాయల్ ౧౬ సైజు. ౧౫ పుటలు; చక్కని కూర్పు.

ఇది ‘శ్రీ అద్దేపల్లి నాగగోపాల రాయ సుకు పాదులకు’ శిష్యశ్రేణి చే ‘పరిణయోత్సవావసరమున గౌరవ తాత్పర్యములతో సమర్పితము.’

ఇందైదుగురు శిష్యులు వ్రాసిన ఖండకావ్యములు కలవు. ఈశిష్యులింకను కవితాభ్యాసము చేయుచున్నారు; వీరి కవిత పసితనమును వీడలేదు; అయినను వీరి ప్రయత్నము ప్రశంసింపదగినది. ఇందు వేంకటకృష్ణమూర్తి రచించిన ‘నివేదన’ మాత్రము సరసముగను, నిర్దుష్టముగను ఉన్నది. అభ్యాసము పూర్తియైనపిదప నీశిష్యులు మంచి కవులు కాగలరు.

బు. వేం. ర.

---

## వి జ్ఞా నం

(రెండునెలలకొకసారి వెలువడు తెలుగుపత్రిక)

ఇది జనసామాన్యమునకు విజ్ఞానమును, అనగా సైన్సును వ్యాపింపజేయుటకు సంకల్పించినది. సులభమయినభాషలో మంచివ్యాసములు ప్రకటింపబడుచున్నవి. ఇప్పటికి వెలువడిన మొదటిసంచికలోని వ్యాసములనుబట్టి యీ యభిప్రాయము కలిగినది. వ్యాసములకు వలయుచోట్ల చిత్రములుకూడచేర్పబడినవి. సంపాదకులు కాళీపట్నపు కొండయ్య, యం. యస్ సి., కార్యస్థానము రాజమండ్రి. చందా సంవత్సరమునకు నాలుగు రూపాయలు. విడిసంచిక ౧౨ అణాలు. విజ్ఞానాభివృద్ధికి ఉపయోగకరమైన పత్రిక.

---

# గ్రంథస్వీకారము

## గురుకట్నము

(పద్యరచనము)

క్రౌను ౧/౮ సైజు పు ౬౫. వెల ౦-౨-౦.

గ్రంథకర్త: పెండ్యాల సీతారామయ్య, పుళ్ల, పడమటి గోదావరిజిల్లా.

---

## నవీన ఆర్థికనీతి

క్రౌను ౧/౮ సైజు. పు. ౫౬. వెల రు. ౦-౨-౦.

రచయిత: దిగవల్లి వేంకటశివరావు.

ప్రకాశకులు: ఆంధ్రరాష్ట్ర రైతుసంఘము, బెజవాడ.

---

## ఆంధ్రరత్నావళీనాటిక (రెండవ కూర్పు)

డెమి ౧/౮ సైజు. పుటలు పీఠిక ౧౬ + నాటిక ౬౧ + టీకాదులు ౫౦. వెల రు. ౧-౮-౦.

గ్రంథకర్త: వేదము వేంకటరాయశాస్త్రి.

ప్రకాశకులు: వేదము వేంకటరాయశాస్త్రి అండ్ బ్రదర్స్, ౮, మల్లికేశ్వరగుడి సందు, లింగిసెట్టి వీథి, మన్నడి, జి. టి., మదరాసు.

---

## శ్రీయోగవాసిష్ఠము

పూర్వార్థము సంపుటము ౧, భాగములు ౨, 3.

(తాత్పర్యప్రకాశిక యను ఆంధ్రానువాద సహితము).

రాయలు ౧/౮ సైజు. పు ౧౬౧-౪౯౬.

అనువాదకుడు: శ్రీ పూర్ణానంద. ప్రకాశకస్థానము: శ్రీ వ్యాసాశ్రమము, ఏర్పేడు P. O., చిత్తూరు జిల్లా.

---

## ఖండకావ్యము

(ఖండకావ్యముల సంపుటములు ౧,౨ భాగములు)

క్రౌను ౧/౮ సైజు. పు ౧౧౫+౧౦౪. వెల రు. ౦-౧౨-౦ + రు. ౦-౧౨-౦.

గ్రంథకర్త: జి. జాషువకవి, తెలుగుపండితుడు, వినుకొండ, గుంటూరుజిల్లా.

---

## మేఘసందేశము

(ఆంధ్రీకృతము)

అనువాదకుడు: యం. యం. వెంకటాచార్యులు, బి. ఏ., వకీలు, తిరుపతి.

క్రౌనుసైజు, పుటలు ౬౮, వెల ౮ అణాలు.

---

Printed and Published by K. Nageswara Rao,
at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St., Madras. Editor:—K. Nageswara Rao.

# విషయసూచిక




సంపు. ౧౪ ఈశ్వర, భాద్రపదమాసము ( సెప్టెంబరు 1937 ) సంఖ్య ౯

# పూర్ణ

[నవల - అనువృత్తము]

వాసిష్ఠ గణపతిముని

## ఆరవ ప్రకరణము

### పర్ణిని యంతర్ధానము

ఆ రాత్రియే యెట్టి యాలస్యమును గూడఁ జేయక నీలుని పట్టుకొనుటకు ఘనేంద్రుఁడు సులోచనుని యింటికి వెళ్లెను. గాని యాయిల్లు కొలఁది క్షణములక్రిందట ఖాళీ సేయఁబడినటు తెలుసుకొనినాఁడు. సులోచనుఁడు తన భార్యతోడను, పుత్రునితోడను కలిసి రాత్రిభోజనానంతరము గణపవరము రెండెడ్లబండి మీఁదుగా వెళ్లె నని పొరుగింటి వారు చెప్పిరి. గుఱ్ఱమెక్కి ఘనేంద్రుఁ డాదారి పట్టుకొని గణపవరమువరకు వెళ్లి వ్యర్థప్రయత్నుఁడై వచ్చివేసెను. ఎట్టిబండియు గణపవరము వెళ్లలేదు.

గణపవరమునుండి రాఁగానే యతఁడు రాష్ట్రియుని యొద్దనుండి చంద్రసేన గృహము శోధించుట కుత్తరువు పొందుటకు మహామంత్రిగా రింటికి వెళ్లెను. ఎట్టకేలకు రాష్ట్రియుని లేపి సంగతి మనవి సేయఁగా నతఁడు నిద్రాభంగము చేసినందులకు విసుగుకొని, "ఇప్పుడేమి మించిపోయినది? తే పుదయము చూచుకొనవచ్చును. పోయి నిద్రపొమ్ము" అని కసరి పంపివేసెను.

మఱునాఁడు ప్రాతఃకాలము చంద్రసేనుని యిల్లు శోధించుటకు రాష్ట్రియుఁడు వీరనందుఁడు ఘనేంద్రునితోడను, రక్షకభటులతోడను సాడంబరముగా వచ్చి చూచుసరికి చంద్రసేన నాగేంద్రుఁడు గత రాత్రియే నవోఢయగు తన ద్వితీయ భార్యతోఁ గూడ శ్రీశైలయాత్రకు బయలుదేఱి వెళ్లిపోయినట్లు తెలిసినది. ఇంక శోధన మవసరము లేదని ఘనేంద్రుఁడు చెప్పెనుగాని వీరనందుఁడు వినక యిల్లంతయు శోధించి యేమియు నేరముయొక్క గుఱుతులు తెలియక నిరుత్సాహుఁడై విరమించెను. సులోచననీల చంద్రసేనులు పరంతపసంఘములోని నాయకులని యందఱికిని తెలిసిపోయినది. ప్రమథనాథబాబు పత్రమిచ్చి పంపిన మనిషి యా పత్రము పరంతపసంఘములోని యెవరికో చూపియుండవలెనని ఘనేంద్రుఁ డనుమానించెను. ప్రమథనాథునితో ప్రత్యక్షముగా మాట్లాడుటకు ఘోరకునియింటి కతఁడు వెళ్లెనుగాని ప్రమథనాథుఁ డింట లేఁడు. పరంతపసంఘీయుల రహస్యములను తెలుసుకొనుటకే యతఁ డెచ్చటనో తిరుగుచున్నాఁడని ఘోరకుఁడు చెప్పెను. రాష్ట్రియవీరనందుఁడు చంద్రసేనుని మేడచుట్టు కావలివారిని నియమించి పర్ణిని నెచ్చటికిని పోనీయవలదని కట్టుదిట్టములుచేసి యచ్చటినుండి కదలి వెళ్లిపోయెను. శోధనములో మఱియొక యద్భుత సంగతి తేలినది. పర్ణి ని [illegible] నింట్లో వెలగల వెండివస్తువులుగాని, బంగారు వస్తువులుగాని, ధనముగాని, రత్నవస్తువులుగాని యెద్దియును దొరకలేదు. పరంతపసంఘమువారి చురుకుదనమునకు ఘనేంద్రుఁ డాశ్చర్యపడెను.

దశమినాఁడు పూర్వాహ్ణమునందు సంభ్రమముతో మహారాజ మహామంత్రి రాష్ట్రియులతోఁ గూడిన రాజ్యకులము సమావేశమై పర్ణిని విప్లవకారుల నాయకగానున్నందున బంధింపఁబడవలెనని యుత్తరువు చేసినది. రాజకులాజ్ఞ ననుసరించి నగరపాలుఁడు పర్ణినిని బంధించి తీసుకొనిపోవుటకు చంద్రసేన భవనమునకు వచ్చి యిల్లంతయు వెతకెను గాని యసలు పర్ణిని యెచ్చటను కన్పట్టుటలేదు. ఒక ముసలమ్మ మాత్ర మాయింట నున్నది. ఇట్లు రక్షిజనుల ప్రథమప్రయత్నము పూర్ణముగా విఫలమయ్యెను.

## ఏడవ ప్రకరణము

### పరస్పర ప్రతాపపరిచయము

శుక్రవారము పూర్వాహ్ణముననే కలనాథుఁడు శక్తిధరునితో మణిమాలా ప్రదాన విషయములో చంపావతమ్మ పూర్ణసమ్మతి తెలిపినవాఁడయ్యెను.

ప్రమతిధర్మపాలుల విన్నపము పూర్వాహ్ణముననే రాజధర్మాసన సన్నిధికి వచ్చి చేరినది. మహారాజు దానిని విచారణీయముగా నంగీకరించి పౌర్ణమీ బుధవారమును విచారణ దినమునుగా నిర్ణయించెను. భోగ

నాథ శక్తిధరులకు ప్రమతి ధర్మపాలులుగాక వేఱు వకీళ్లద్వారా గూడ నాదినమున న్యాయస్థానమునందు తమ తమ వాదములను పోషించుకొనుట కభ్యనుజ్ఞ యీయఁబడినది.

ఉత్తరాధికారి సమస్యా విచారణావతరణమువలన భిన్నమనస్కయగు లీలావతీ దేవిని మహారాజు వీరనందుని రాష్ట్రీయ పదవిలోనుండి ప్రాసాదకార్యదర్శి పదవికి మార్చుట కాలోచన యడిగి మఱింత ఖేదపఱచినవాఁడయ్యెను. అట్టి మార్పు తన తమ్మున కవమానకరమని యామె యెంచినది. ఆవిషయమును మఱునాఁ డాలోచింప వచ్చునని యామె వాయిదా వేసినది. ఇది శుక్రవారమునాఁడు మధ్యాహ్న విశ్రాంతి కనంతరము జరిగిన ముచ్చట.

ఇదివరకు సుచంద్రుఁడు లీలావతి నెంతో యారాధించినాఁడు. ఆమె యిష్టులకు కావలసిన యుద్యోగముల నిచ్చినాఁడు. ఆమె యనిష్టుల నేకుల నుద్యోగములనుండి లాగివేసినాఁడు. సుమారు పదిలక్షల వరాల సొత్తు విలువ గల యేడువారముల రత్నాభరణములను చేయించినాఁడు. ఎంత చేసిననేమి? ఉత్తరాధికారి సమస్యావిచారణ కవకాశ మొసంగినాఁడు. భోగనాథునే యువరాజునుగా ప్రకటింప నతని కిష్టముండునెడల నట్టి విచారణ కతఁ డవకాశము నతఁ డీయ నక్కరలేకుండ నుండఁగలఁడు. రాజకులములో సర్వసమయములందును జన్మజ్యేష్ఠుఁడే యుత్తరాధికారి యగునని యొక శాసనము సృజించి న్యాయాధికారుల వాక్కులను కట్టివేసి యుండవచ్చును. ఇంతియే గాక శాంతిసేనాకుమారి విన్నపముగూడ మహాన్యాయస్థానములో విచారించుటకు బద్ధకంకణుఁడై యున్నాఁడు. తనకును, తనపితృకుటుంబమునకును పరమశత్రువులగు శివంకరసంఘము వారి ప్రతినిధితో శనివారమునాఁడు మాట్లాడ నున్నాఁడు. ఈ విషమసమయమునందు రాజు వానితో కలిసి మాట్లాడుట లీలావతి కిష్టము లేదు. ఇది యంతయు నిట్లుండ తన తమ్ముని రాష్ట్రీయ పదవినుండి లాగివేయుటకు సంకల్పించుకొనినాఁడు. తన కండ్లు తుడుచు నిమిత్తము ప్రాసాద కార్యదర్శి పదవిని సృజించి వాని కంటఁగట్టనున్నాఁడు. ఇదియంతయు తలపోసుకొని తనకు మగనిపై వశీకరణశక్తి యేమియు లేదనియే యామె చింతింప నారంభించినది. రథినీకుమారియే తనభర్తను తననుండి త్రిప్పివేయుచున్నది యని యామె కనుమానము కలిగినది. ఈకష్టమునంతటి నామె తనసఖి భృంగాలక యొద్ద వెళ్లపోసుకొనినది. ఉత్తరాధికారి సమస్యావిషయములో రాజధర్మాసనమునం దిద్దఱు ప్రాడ్వివాకులు జ్యేష్ఠుని పక్షమునను, ఇద్దఱు పట్టమహిషీపుత్రుని పక్షమునను ఉందురని భృంగాలక యంచనావేసి చెప్పినది. రాజుగా రెవరి నామోదింతురో వారికి కొసకు జయము కలుగునని భృంగాలక యూహ. తన సఖి యనుమానమును లీలావతీదేవి యామోదించినది. ఇంక తన పతిని వశపఱచుకొనుట యెట్లు?

ఇన్నాళ్లు పనిచేసి మొఱవవోవని తన నిశాత కటాక్షముల నామె నమ్మఁజాలకపోయినది. సమ్మోహన చూర్ణ ముష్టులువలె పనిసేయు తన మందస్మితముల నామె విశ్వసింపఁ జాలకపోయినది. అనేకకాలము [illegible] యోగీశ్వరి భవ

లాక్షిపై నామె సంకల్పము ప్రసరించినది. ధవలాక్షి వట్టి యోగీశ్వరిమాత్రము గాదు. గొప్ప మాంత్రికురాలు. అనేక విచిత్రశక్తిగల మూలికల నెఱింగిన తాంత్రికురాలు. ఆమె దగ్గఱనుండి పతివశీకరణమూలిక తెచ్చుకొనుటకు లీలావతి కాశ జనించినది. ఆమె తన యుద్దేశమును భృంగాలకకు తెలియఁజేసినది. భృంగాలక యాకార్యమును సమర్థించినది.

మహారాజ్ఞి తన తండ్రిని జూచి వచ్చెదనను మిషతో సాయంకాలము ప్రాసాదము విడిచి బయలుదేఱినది. ఉత్తరాధికారి సమస్యా విషయములోను, తమ్ముని క్రొత్త యుద్యోగము విషయములోను తన ప్రియకాంత తండ్రితో నాలోచించునని రాజు తలంచెను. అతఁ డడ్డుపెట్టలేదు. అడ్డుపెట్టుట యతని కలవాటుగూడ లేదు. తండ్రిగారింటినుండి సాధారణ వేషములతో ప్రొద్దుగ్రుంకినపిమ్మట తానును, భృంగాలకయు, తన తమ్ముఁడు వీరనందుఁడును గుఱ్ఱపుబండిపై బయలుదేఱి గణపవరగ్రామమునందు ధవలాక్షి యాశ్రమమునకు వెళ్లిరి. లీలావతి కోరికప్రకారము ధవలాక్షి పతివశీకరణార్థము ధార్యమైన యొక మూలికను ధూపము వేసి యిచ్చినది. మఱునాఁడు ప్రాతఃకాలము మరియొకసారి ధూపమువేసి దానిని మెడలో కట్టుకొనవలెనని ధవలాక్షి యాదేశించెను. లీలావతి ధవలాక్షికి దక్షిణ సమర్పింపఁబోయెను గాని యామె స్వీకరింపలేదు. ఆమె యనుజ్ఞవడసి యందఱును మఱలిరి.

రాత్రి యాఱుగడియలు మాత్రమే గడచినవి. బండి చిట్టడవిలో వేగముగా వచ్చుచున్నది. ఇట్టి స్థితిలో బండి యకస్మాత్తుగా నాఁగిపోయెను. కారణమేమి యని బండిలోపలనుండి వీరనందుఁడు సారథి నడిగెను. "ప్రభో, దొంగలగుంపు అడ్డుకొనినది." అని చకితస్వరముతో సారథి పలికెను.

వీరనందుని చేతిలో ఖడ్గమున్నది. అయినను మనస్సులో ధైర్యము లేదు. భుజములలో తగినంత త్రాణము లేదు. శస్త్రవిద్యా కౌశలము సున్న. అయినను సామ్రాజ్యమునందలి తలవరులకెల్ల సర్వాధికారిగా మాత్రమున్నాఁడు. ఆజ్ఞలిచ్చుటకు పెద్దనోరుమాత్రమతని కున్నది. అతఁడు రథమునుండి దిగకముందే యతనిని నలువురు బలవత్తర పురుషులు రథమునుండి లాగివేసిరి. వారిచే నతఁడు సులువుగా నిరాయుధుఁడు గావింపఁబడినాఁడు. వెంటనే యతని నొక చెట్టుకు త్రాళ్లచే కట్టి నోట గుడ్డలు క్రుక్కిరి. సారథికిఁ గూడ నదియే ముచ్చట జరిగినది. లోపల స్త్రీలనుమాత్రము దొంగలు ముట్టలేదు. అయినను లీలావతీభృంగాలకల భీతికి మేరలేకపోయినది.

ఇద్దఱు మనుష్యులు గుఱ్ఱముల నాపిరి. మఱి యిద్దఱు ముందు నిలువఁబడియుండిరి. నలువురు వెనుకప్రక్కకు వచ్చిరి. వారిలో నొకఁడు మిక్కిలి మృదుస్వరముతోడనే భయంకర మగు తమ నిశ్చయమును వెల్లడించినవాఁ డయ్యెను.

పురుషుఁడు— "మాననీయ నారీమణులారా! మీలో స్వర్ణాంగి యాంధ్ర మహారాజ్ఞియనియు, పాటలాంగి చేటీజనాధ్యక్షురాలనియు మే మెఱుంగుదుము. మేము పరంతప సంఘమునందు సభ్యులము. మా నాయకుఁడు నిశుంభ నాగేంద్రుఁడును, మానాయకు

రా లీలావతీదేవియును తమను మిక్కిలి మర్యాదతో తీసుకుని రమ్మని యుత్తరువిచ్చి నందున మే మిచ్చటికి వచ్చితిమి. మిమ్ము లను నిర్భయముగా నీ బండితోడనే మే మచ్చటికి తీసుకొనిపోయెదము. మీ మానము గురించిగాని, ప్రాణములనుగురించి గాని మీరు భయపడ నవసరము లేదు. రాజు గారితో మాకు సంధి కుదురువఱకు మీరు మా సంఘముయొక్క ప్రత్యేక గృహమున నివసింపఁబడవలసియుండును. మీకుఁ గావలసినంత రక్షకుల సిబ్బంది యా గృహ మున నుండును. అందు మీ యుపచారముల కేమియు తక్కువ యుండదు. పరంతప సంఘముయొక్క బలమును స్వయముగా మీ కండ్లతో మీరు చూచుట కవకాశము కల్పింపఁబడును.”

మహారాజ్ఞి కేమియు మాట్లాడుటకు తోఁచలేదు. భృంగాలక బిక్కసొచ్చిపోయి నది. మహారాజ్ఞి తనకు దురదృష్టదినములు వచ్చినవి యని యనుకొనినది. ఇంతలో మెఱుపు మెఱిసినట్లు వారి కొక దృశ్యము గోచరించినది.

అది యేది? ఒక జగన్మోహనమగు స్త్రీ విగ్రహము. ఒకసారి చూచిన నెన్నటికిని మఱపునకు రాని స్త్రీవిగ్రహము. దేవపురు షుల కండ్లకుఁగూడ నాశ్చర్యకరమగు స్త్రీ విగ్రహము. శక్తికి నివాసస్థానమగు స్త్రీవిగ్ర హము. ఆమె పూర్ణయని లీలావతీ భృంగాల కలు పోల్చుకొనిరి. ఆమెగూడ పరంతప సంఘములో నొక సభ్యురాలేమోయని వారు ముందుగా భ్రమపడిరి. మఱుక్షణముననే యది భ్రమయని వారికి యథార్థము బోధ పడినది.

పూర్ణ రాఁగానే సఖడ్గమగు హస్త ముతో నా పురుషుని ఝళిపించుచు నిట్ల నినది—

“ఓ మాననీయ వీరుఁడా, నీగుంపును తీసుకొని నీవు వెనుకకు వెళ్లుము. పరంతప సంఘమువారు మా యాంధ్ర సమ్రాజ్ఞిని బందిగా తీసుకొనిపోవుట సులభమని తలం చుట పొరపాటు. కుండినుల యధికారమును కాపాడుటకు విశాల సామ్రాజ్యమునందు ప్రతిమూలలోను జాగ్రతవహించు శక్తు లెన్ని యేని గలవు.”

పురు—ఓసుందరీ! నీ చక్కనిముఖము నుండి వచ్చుమాటను మన్నించుట కిది శృం గారరంగము గాదు. ఇది వీరరంగము.

పూర్ణ — ఈ మాటను నాసుందర ముఖము చెప్పెనని మీరు తలంపవలదు. దీనిని నాసఖడ్గహస్తము చెప్పుచున్నది. మాట ప్రకారము నీవు నడవనియెడల నిది మీ గుంపు నవలీలగా చెదరఁగొట్టఁగల దని సత్యము నీతో చెప్పుచున్నాను.”

పూర్ణయొక్క ధైర్య సాహసములకు లీలావతీ భృంగాలకలు పరమాశ్చర్యము పొందిరి.

“ఈయుద్ధతవారి చేతినుండి ఖడ్గమును లాగివేయుఁడు.” అని యా పురుషుఁడు తన యనుచరుల కాజ్ఞాపించెను. వా రామె నాక్ర మింపఁ దలపడిరి. కనుఱెప్పపాటులో మూఁడు తలలు నెగిరిపోయినవి. వాటి రక్తధారలచే ముందాకాశమును, పిమ్మట భూమియు నెఱ్ఱ వడినవి. ఆ ముగ్గురు వీరులను నఱికి పూర్ణ యా పురుషు నిట్లు హెచ్చరించినది:

“ఇప్పుడైనను పారిపొమ్ము.”

ఆమె లాఘవ పరాక్రమములకు లీలా వతీ భృంగాలకలు మిక్కిలి సంతోషించిరి. పురుషుఁడు దిగులొంది పెద్దకేక వేసెను. ముందున్న వారేకాక చుట్టుపట్ల నున్నవారు గూడ చేరిరి. వారు సుమారేఁబదిమంది యుందురు. గుఱ్ఱములు బండి లాగుకొని పాఱిపోకుండ వారిలో నొకఁడు వాటిని విప్పివేసినవాఁడయ్యెను.

ఇప్పుడు పూర్ణ యేఁబది మందితో పోరాడవలసియున్నది. ఒకస్త్రీ కేఁబదిమందితో యుద్ధమనిన సాధారణముగా నెవరును నమ్మరు. అసాధారణ వ్యక్తుల విషయములో నంతయు సాధ్యమే. ఆమె నిరుపమ లాఘవముతో, నిరుపమాన వేగముతో, నిస్సదృశ మండల ప్రచారముతో, నిస్తుల సాహసముతో, నిస్సమాన సత్వముతో, నిష్ప్రతిమాన కౌశలముతో నాగుంపుతో యుద్ధము చేసినది. లీలావతీ భృంగాలక లామె మహాశక్తియొక్క యవతార మనుకొనిరి.

సగముమంది చనిపోయిరి. తక్కినవారు విడువక యొక్కపెట్టున నామెపైఁ బడనుంకించిరి. ఇంతట వారికి వెనుకనుండి మఱియొక భయంకరమగు తారుడు తటస్థించెను. అది యొక మహావీరపురుషునిది. అసామాన్యరణ నైపుణ్యముగల యా స్త్రీపురుషుల మధ్యలో నాగుంపు అడకత్తెరలోని పోక చెక్కవలె చితికిపోయినది. ఒక్కఁడు మాత్రము తప్పించుకొని పాఱిపోయెను. వాఁడు వారి నాయకుఁడగు కౌశిక సులోచనుఁడే యగును. ముందుగా స్త్రీలతో సంభాషించిన వాఁ డీరసిక వీరుఁడే.

రంగస్థలమంతయు రక్తసిక్తమై పోయినది. ఆనిశ్శాత్రవ రంగమునందు జయించిన వీరయువద్వంద్వము వెలుఁగుచుండెను. ఆ పురుషుఁడు ఘనేంద్రుఁడని పూర్ణాలీలావతీ భృంగాలకలకు తెలిసినది. పూర్ణాఘనేంద్రులు పరస్పర ప్రతాపపరిచయమువలన నత్యంత పరస్పరాదరముతో పరస్పర మొకసారి చూచుకొనిరి. ఆ పరస్పరాదరములో రాగపురంగు కొంచెము కలిసెనని చెప్పవచ్చును.

## ఎనిమిదియవ ప్రకరణము

### విచిత్రసంధాపద్ధతి

ఘనేంద్రుఁ డరివిజయానంతరము దగ్గఱనుండు చెట్లయొద్దకుఁ బోయి వీరనంద రథసారథులకు కట్లు విప్పి నోటిగుడ్డలు తీసి విడిపించినవాఁ డయ్యెను. వారిద్దఱును బండి దగ్గఱకు మెల్లగా చేరిరి. వీరనందబాబు లజ్జకు మితిలేకపోయినది. సారథి గుఱ్ఱములను తెచ్చి తిరిగియు పూన్చెను. వీరనందుఁడు మాత్రమే కాక పూర్ణాఘనేంద్రులు గూడ లీలావతీదేవి యాజ్ఞవలన నాబండి నెక్కిరి. బండి నడువ నారంభించినది.

భృంగా—(పూర్ణను జూచి) పూర్ణా! నీవు సమయమునందు సమ్రాజ్ఞికి గొప్పసేవ చేసితివి. ఈ సేవను సమ్రాజ్ఞి యెన్నటికిని మఱువఁజాలదు.

పూర్ణ—ఇది నా కర్తవ్యము.

భృంగా— (ఘనేంద్రునిజూచి) ఘనేంద్రబాబు! నీవు సమయమున వచ్చినందువలన పూర్ణకు సంపూర్ణవిజయము కలిగినది. గొప్పవీరుఁడు నూఱుమందినిగూడ జయింపఁగలఁడని మాబాబు చెప్పినపుడు నాకు నమ్మకము లేకుండెడిది. ఇప్పుడు నమ్మకము కలిగినది.

లీలా—(పూర్ణనుజూచి) పూర్ణా! నీ వెచ్చటినుండి వచ్చుచున్నావు ?

పూర్ణ—అక్షోభ్యమహాముని యాశ్రమమునుండి వచ్చుచున్నాను.

లీలా—(ఘనేంద్రుని జూచి) నీవెచ్చటనుండి వచ్చుచున్నావు?

ఘనే—నారాయణపురమునుండి వచ్చుచున్నాను. అచ్చటికి నన్నొక కార్యము నిమిత్తము రాష్ట్రియులు పంపియుండిరి.

వీర— శాత్రవుల నెదురుచూడనందున ప్రమత్తుండనై వారిచేతం జిక్కితిని.

రాష్ట్రియుని యీ హీనస్వరపు మాట యతని యసమర్థతను కప్పిపుచ్చుటకు బదులు మఱింత వ్యాఖ్యానము చేసినది.

"ప్రమాదో ధీమతామపి" అని ఘనేంద్రుండు సర్దినాఁడు

లీలా—ఇప్పుడు జరిగిన సంభవము వెల్లడించిన మహారాజుగారి మనస్సు మిక్కిలి వ్యాకులపడును. అందువలన దీనిని మీరిద్దఱును వెల్లడింపకుండ నుండిన నేను మిక్కిలి సంతోషించెదను. పూర్ణను దొంగలు చుట్టడింప నామె యనేకులను వధించెననియు, నింతలో ఘనేంద్రుండు వచ్చి తక్కిన వారిని వధించుటలో నామెకు తోడ్పడెననియు లోకులకుఁ దెలిసినఁ జాలును.

పూర్ణా ఘనేంద్రులు వల్లెయనిరి. బండి త్వరితముగా రాజధాని చేరినది. పూర్ణ ముందుగా క్రొత్తపేటలో దిగిపోయినది. అప్పు డామె ముందు సమ్రాజ్ఞి యభ్యనుజ్ఞ వడసి ఘనేంద్రుని యభ్యనుజ్ఞ వేడుచు నిట్లనినది:

"మామయ్యా! మీరు సమయములో రాకపోవునెడల నాకు శత్రువధ శ్రమసాధ్యమయ్యెడిది. మీ రాకవలన నాకది సులభసాధ్యమయ్యెను. ఈ యుపకారమును నే నీ జన్మలో మఱువను. నా నమస్కారములను మీ రందుకొని నాకు సెలవీయవలెను."

ఘనే— రాధీతరీ! నీ పరాక్రమమునకు నేను మిక్కిలి యాశ్చర్యపడుచున్నాను. తాను పెంచిన కూఁతురు పరాక్రమము విని యానందించుటకు మా బావ సత్యరథ బాబు లేరని నా విచారము. వెళ్లుము. అక్కయ్య చంపావతమ్మకు నా నమస్కారములను చెప్పుము. కుండినుల వంశాధికారమును కాపాడుటకు నీ కత్తి తోడ్పడును గాక.

పూర్ణ—పెద్దల యాశీర్వచన ముండిన నట్లే తోడ్పడును.

పూర్ణ నిష్క్రమించినది. బండి మఱి కొంతదూరము పోయినపిమ్మట నగ్రహారపుపేటలో ఘనేంద్రుఁడు లీలావతీ వీరనందులచే నభ్యనుజ్ఞాతుఁడై తన యింటికి నిష్క్రమించెను.

ఘనేంద్రుని ప్రతాప పరిచయము పూర్ణకు నిన్నరాత్రి యంకురించిన యనురాగపు మొలక యీ రోజుకే పెద్దదిగా పెరుగుటకు సహాయపడినది పూర్ణాప్రతాప పరిచయము ఘనేంద్రుని హృదయక్షేత్రములో ననురాగబీజము నాటుటకు పదును కల్పించినది. అప్పుడు ఘనేంద్రునకు రాజకాళమ్మ తన తండ్రికగ్గఱ వినోదముగా నాడిన పెండ్లిమాటలు జ్ఞాపకమునకు వచ్చినవి. ఆ మంచి సమయముననందే మన్మథుఁ డా వీరుని హృదయక్షేత్రమునం దనురాగ బీజమును నాటినవాఁడయ్యెను.

రాజవీథిలో భృంగాలక దిగి తమ యింటికి విషణ్ణవదనముతో చేరినది. ఘనేంద్రుని పరాక్రమమును లీలావతి చూచుట యామె కిష్టము లేదు. ధారావతి ఫలినిని ఘనేంద్రున కిచ్చుటకు సంకల్పించియున్నది గదా! ఆమెకు లీలావతి తోడగునెడల నా సంబంధము నడ్డుటకు తన సోదరుఁ డగు చండసేనునకు శక్తి చాలదు. తమ కది మహానష్టదాయక మగు విషయము. ఘనేంద్రుని పోటీయే లేకుండిన ఫలిని తనపుత్రుఁ డగు వీరసింహునకు దక్కితీరునని యామె విశ్వాసము. ఆ విచారములో నామె కా రాత్రి చక్కఁగా నిద్రపట్టలేదు.

లీలావతి తన పుట్టింటికి బండితో వెళ్లి యచ్చటినుండి భద్రముగా ప్రాసాదము చేరినది. లీలావతీదేవి కా రాత్రి మహావీరురాలగు పూర్ణను తన కోడలినిగాఁ జేసుకొనుట కాశ జనించినది. మఱియొకసారి రాజుగారితో గట్టిగాఁ జెప్పి యొప్పింపవలె నని యామె యనుకొనెను.

ఘనేంద్రుఁడు తన యింటికి వెళ్లిన తత్క్షణమే శీఘ్రముగా భోజనము ముగించుకొని తన రక్షిదళముతో చనిపోయినవారి శవములను కనిపెట్టుటకుఁ బోవ నచ్చట పెద్ద చితి యొకటి వెలుఁగుచుండెను. శవ మొక్కటియు క్రింద కన్పట్టుట లేదు పరంతప సంఘమువారి సత్వర కాలోచితచర్యకు ఘనేంద్రుఁ డాశ్చర్యపడెను. అతని కా చితి సమీపమున సిద్ధేశ్వరి రాజకాళి కన్పట్టినది. అతఁడు భక్తితో నామెను నమస్కరించినవాఁ డయ్యెను. ఆమె ఘనేంద్రు నాశీర్వదించి యా చితి చూపుచు [illegible] పాడినది:

"పాపాత్ము లెందరో బలమత్తగజులు
నాపూర్ణ కత్తిలో నశియించినారు
దుర్మార్గు లెందఱో దుర్ధర్ష బలులు
ధర్మపాలిని కత్తిధారలోఁ బడిరి
చయ్యన తోడయ్యెఁ జండికి హరుఁడు
దయ్యాలగుంపుకు దగువిందు జరిగె
అజితుఁడు తోడయ్యె నైంద్రి కింద్రుండు
విజితు లైరి విషమ విప్లవకరులు
వనమాలి తోడయ్యె వనజవాసినికి
వనిలోను దెగటారి రణవీరవరులు
దనుజపక్షంబును దండించినాఁడు
ఘనబాబు ఘనమైన తన పూర్ణతోడ."

రాజకాళియొక్క యీ పాటలు ఘనేంద్రుని మనస్సులో మన్మథుఁడు రెండుగడియలకు ముందు నాటిన బీజము నప్పుడే మొలిపించినవి. ఆమె యుక్తమాన స్వారస్యములచే పూర్ణను ఘనేంద్రుని కాఁబోవు కాంతనుగాఁ జెప్పుచు నతని భావమునం దా సంగతి నాటునట్లు చేసినది. ఎంతయో చాతుర్యముతోఁ జేసిన సంధానపద్ధతికంటె రాజకాళియొక్క యీ పద్ధతియే ఘనేంద్రు నావర్జించినది. అతఁడు తనకు పూర్ణ ప్రాణేశ్వరి కాఁబోవు నని నమ్మినవాఁ డయ్యెను. రాజకాళమ్మ యాశీర్వచనము వ్యర్థము గాదని యతని నమ్మకము. ఇట్లు రాజకాళి పూర్ణకు తా నిచ్చిన వాక్కును చాలవఱకు నెరవేర్చినది యయ్యెను.

## తొమ్మిదియవ ప్రకరణము

### తండ్రికొడుకుల ప్రతాపము

కౌళికసులోచనుఁడు పాఱిపోయినవాఁ డూరకుండ లేదు. శవదహనమునకు చిట్టడ [illegible] కొందఱిని చంపి మఱి కొందఱి వీరులతో

నింకొక సాహసకార్యమునకు పూనుకొనిన వాఁడయ్యెను. బహిఃపురమున పండుకొను భోగనాథు నపహరింపవలె నని యతఁడు సంకల్పించెను. ఆకార్యము సిద్ధించిన చిట్టడవిలో తమకు జరిగిన నష్టమునకు పరిహారము లభించునని యాతని యుద్దేశము. బహిఃపురము ప్రవేశించుట యంత కష్టమైన పని గాదు. సంప్రదాయము ననుసరించి సింహద్వార మెప్పుడును పూర్ణముగా మూయఁబడదు. చిన్న దిడ్డిద్వార మొకటి సింహద్వారమునుండి తెఱవఁబడియుండును. పండ్రెండు గడియలరాత్రి యైనది మొదలుకొని బ్రాహ్మముహూర్తము వఱకు దానిని మహాప్రతీహారి ఘోరకుఁడు కాయుచుండును. అర్ధరాత్రమునకుఁ బిమ్మట వెళ్లి యొక మహాప్రతీహారిని వధించి వాని వేషముతో నొకఁడు సింహద్వారమున నుండి తక్కిన వారు మెల్లగా భోగనాథ శయనాగారమునకు వెళ్లఁగలిగిన నచ్చటి ప్రతీహారిని చంపి యాతని నపహరించుట సులభమైన కార్యమని సులోచనుని యూహ.

ఊహించుటకీ కార్యము సులభముగా నుండినను ఆచరణలో మిక్కిలి కష్టసాధ్యము. ఇద్దఱు ముగ్వురు ప్రతీహారుల వధతో కార్యమంతయు చక్కఁబడు నని సులోచనుఁ డూహించెను గాని వారి కేకలవలన కోటలోపల నిద్రించువారు మేలుకొనిన వేలకొలఁది యోధులను ఘడియలో పిలుచుకొని రావచ్చును. మహాప్రతీహారి సాధారణుఁడని తలంచుటలోఁ గూడ సులోచనుఁడు మిక్కిలి పొరపాటు చేసెను.

రాత్రి మూఁడవ యామమున సులోచనుఁడు తన రెండవకూఁతుమున్ ... సింహద్వా... సమీపమునకు వచ్చెను. వాని కచ్చట ఘోరకుఁడు కన్పట్టెను. ఘోరకుఁడు ఘనీభవించిన చీఁకటివలె మేచకమూర్తి. గహనమగు శ్మశ్రుపటలములో నతని సగము ముఖము మునిఁగిపోయియున్నది. అతని వదనచ్ఛాయాంధకారమధ్యమున విశాలనేత్రములు మిఱుమిట్లు గొలుపుచు వింతశోభ నిచ్చుచుండినవి. అతనిచేత భయంకరకృపాణ మొకటి యున్నది. అతనిని జూచి సులోచనుఁడు చంపుఁడని తన భటులకు సంజ్ఞ చేసెను. సులోచనుని భటులు ముప్పదుగురుండిరి. ఘోరకుఁడు వారివైఖరి తెలుసుకొని ప్రతిఘటనమునకు సిద్ధపడెను.

ఒక పావు గడియ భయంకర మగు యుద్ధము జరిగినది. ఘోరకుని కత్తిసేయు నాట్యమునకు బలవంతులగు సులోచనుని భటు లొక్కొక్కరుగా బలియగుచుండిరి. ఇంతలో ప్రమథనాథుఁ డకస్మాత్తుగా వచ్చి వెనుకనుండి వారిని దాఁకెను. ఆ తండ్రికొడుకులు సులోచనుని భటులలో నొక్కరు గూడ మిగలకుండ వారి నందరిని బరిమార్చిరి. వారందఱి తలలును శరీరములనుండి వేఱుపడినవి. సులోచనుని ధైర్యము తలనుండి వేఱుపడెను. వాఁడు ప్రాణభయముచే పాఱిపోయెనుగాని ప్రమథనాథుఁడు వానిని విడువలేదు. అతఁడు వానిని వెన్నంటి తరిమెను.

శత్రువధానంతరము ఘోరకుఁడు కోట యదరునట్లు సింహనాదము చేసెను. లోపల నుండి ప్రతీహారులు చాలమంది కోటద్వారము దగ్గఱకు వచ్చిరి. ఇఁక ప్రాసాదరక్షకుల సంభ్రమము చెప్పవలసిన దేమున్నది? ... క్షణములో కోటయంతయు

వ్యాపించినది. ఆ కల్లోలములో మహారాజు గూడ లేచెను. అతఁడు స్వయముగా కోట ద్వారము దగ్గఱకు వచ్చి రణభూమిని పరీక్షించెను. పార్థివుఁ డిదివరకే పూర్ణా ఘనేంద్రుల ప్రతాపమును సచివునిద్వారా విని యుండెను. సచివునకు ఘనేంద్రుఁడే స్వయముగాఁ జెప్పెనఁట. ఇప్పుడు ఘోరక ప్రమథనాథుల కండ్లారఁ జూచెను.

తత్క్షణమే రాజాజ్ఞవలన ఘనేంద్ర వీరనందులు రప్పింపఁబడిరి. ఘనేంద్రుఁ డా దృశ్యము చూచి యసూయ విడిచి ఘోరక ప్రమథనాథులను శ్లాఘించినవాఁ డయ్యెను.

ఘనేం—ఎవరైన తప్పించుకొని పాఱిపోయినారా?

ఘోర— ఒక్కఁడు పాఱిపోయెను. వాఁ డా గుంపుకు నాయకుఁ డైన కాళిక సులోచనుఁడు. మా ప్రమథనాథుఁడు వాని వెంటఁ బడియున్నాఁడు. వాఁడు పాతాళములో గ్రుంకినను పట్టుకొని తీరును.

ఘనే—పూర్ణ నటకాయించిన గుంపుకుఁ గూడ సులోచనుఁడే నాయకుఁడుగా నుండెను.

సుచ—వాఁడు శతపతిగా సేనలో ప్రవేశించి సర్కారువారి సొత్తు పడ తిని కొనకు సర్కారువారికే ద్రోహ మాచరింప సమకట్టినాఁడు.

వీర—వాఁడు బహుదుర్మార్గుఁడు. ఆది యందు శ్యామల యను విప్రకన్యను పాడు చేసినాఁడు. ఇప్పుడు కాత్యాయని యను విప్ర విధవాంగన నుంచుకొనినాఁడు. మన జాతిపై వాఁడు సేయు నత్యాచారము లింక నెన్ని యో యున్నవి. వాఁ డిప్పుడు దొరకిన శిరశ్ఛేదముకంటె తక్కువ దండన యీయఁ గూడదు.

కాత్యాయనీ నిందను ఘోరకుఁడు సహింపఁ డయ్యెను. అతఁడు సావహేలముగా వీరనందుని జూచి యిట్లనెను:

"అయ్యా! మీరు రాజసన్నిధిలో మహానుభావురాలగు కాత్యాయని పేరును మలినపఱచియున్నారు. ఆమె కూర్చుండిన చోటనిలుచుండుటకుఁగూడ మీకు యోగ్యత చాలదు. మీ నిందను మీ రుపసంహరించుకొననియెడల కత్తిధరించినాతో ద్వంద్వయుద్ధమునకు దిగవలెనని మిమ్ములను రాజసన్నిధిలో నాహ్వానించుచున్నాను. ఉపసంహరించుకొనెదరా, కత్తి ధరించెదరా?

వీరన—నీ కత్తిప్రతాపమును కాణ్వశుకనాసునిపై చూపుఁడు. అతఁడు చెప్పఁగా నేను వింటిని గాని నేను స్వయముగా నీ వార్త సృజింపలేదు.

అనంతరము పార్థివుఁడు జోక్యము కలుగఁజేసుకొని యీ ప్రసంగమును నిలిపివేసెను.

వీరన—(ఘనేంద్రునిఁజూచి) ప్రమథనాథునకు తోడగునట్లు కొందఱు రక్షకజనులను పంపిన బాగుండును.

ఘోర—అక్కఱలేదు. ఒకనిని పట్టుకొనుటకు చాలమంది మనుష్యులేల?

సుచ—ఘోరకబాబు! దాని కేమి గాని మీ తండ్రికొడుకులు చేసిన పనికి నేను మిక్కిలి సంతోషించితిని. అందుల కుచితమైన బహుమానమును మీ కవశ్య మిచ్చునట్లు నేను మా కోశాధ్యక్షున కాజ్ఞాపించెదను.

ఘోర—మహాప్రభో! శ్రీవారికి మాకు బహుమాన మీయ సంకల్ప ముండునెడల నది ధనరూపముగా నుండిన మే మంతగా సంతోషింపము నాకు సర్కారువారిచ్చు జీతము మా కుటుంబపోషణకు యథేష్టముగా సరిపోవుచున్నది.

సుచం—మఱి యేమి నీకు కావలెను?

ఘోర— కోరుమని సెలవైనయెడలఁ గోరెదను.

సుచం—కోరుము.

రథినీకుమారిని ప్రమథనాథునకుఁ గాను కోరునని ఘనేంద్ర వీరనందులు తలంచిరి. ఘోరకుఁడు వేఱు బహుమానమే కోరెను.

"మహాప్రభో! శివంకర సంఘమువారు రాజద్రోహులని సునందబాబుగారును, వీరనందబాబుగారును నిర్ణయించిరి. నేను శివంకర సంఘములో నొక సభ్యుఁడను. మా సంఘమువారు రాజభక్తితో సామ్రాజ్యమునకు సేవసేయ బద్ధకంకణులై యున్నారు. వారు సేయు సేవను శ్రీవారు గుర్తించి స్వార్థపరు లగు సునంద కుటుంబస్థుల బారినుండి రాజభక్తులును, దేశభక్తులు నగు శివంకర సంఘమువారిని కాపాడుటయే మాకుఁ దగిన బహుమానము.

వీర — (ఉద్రేకముతో ఘనేంద్రునిఁ జూచి) ఘనేంద్రబాబు! వీఁడు తాను శివంకర సంఘ సభ్యుఁడ నని యంగీకరించియున్నాఁడు. శివంకరసంఘము రాజద్రోహిసంఘ మని సార్వభౌముని రాజకులము నిర్ణయించినది. అందువలన నిప్పుడు వీనిని బట్టి బంధింపవలెను. బాధ్యత గల రాజకీయాధికారుల గుఱించి వీఁడాడు కటూక్తులు క్షంతవ్యములు గావు.

ఘనే—భట్టారకులు కోపపడున్నారు. అతఁ డేమియో కోరినాఁడు. వారి సంవాద మధ్యములో మనము చొరఁబడుట యుక్తము గాదు.

వీర— (కోపోద్రేకముతో) నీవుగూడ శివంకర సంఘసభ్యుఁడవేనా? ఆజ్ఞ నుల్లంఘించి యెదురుతిరిగి మాట్లాడుచున్నావు.

ఘోర—ఆంధ్ర సార్వభౌముని మాటయొకటి తప్ప ఘోరకుని బంధించు శక్తి భూమ్యాకాశములలో మఱియొకటి లేదని వీరనందబాబుగారు తెలుసుకొనవలసినది.

సుచం—ఘోరకబాబు! శివంకరసంఘము విప్లవసంఘ మను రాజకులప్రకటన మింకను రద్దుకాలేదు. ఆప్రకటనము సరియైనదో, కాదో యా విషయము వేఱు. నీవు శివంకర సంఘ సభ్యుఁడవు గాన నిప్పటి కపరాధివే యగుదువు. అందువలన ముందు నీవు లొంగిపోవలసినదే. పిమ్మట నీ ప్రార్థన గుఱించి యోచింపఁబడును.

ఘోరకుఁడు నిరుత్తరుఁడై రక్తసిక్తమగు తన కత్తిని మహారాజు పాదములపై నిడి చేతులు జోడించుకొని నిలిచినవాఁడయ్యెను.

సుచం—(వీరనందునిఁ జూచి) వీరనందబాబు! మీ ప్రభు వొకనితో మాట్లాడుచుండ నతఁడు సేయవలసిన పనిని మీరు సేయఁబూనుట రాజధిక్కారమే యగును. మీ ప్రభువు కోరినవానికి వరమిచ్చునో, మానునో, దండించునో, విడుచునో యేమియు తెలుసుకొనుటకు ముందు మీరు మధ్యప్రవేశించుట మిక్కిలి యసభ్యము. మీరు

మిక్కిలి బాధ్యత గల రాష్ట్రీయాధికారమును నిర్వహింపఁజాలరు. అందువలన మీ రాష్ట్రీయఖడ్గమును మహావీరుఁడగు ఘనేంద్రబాబు చేతి కిచ్చివేయవలెను. (ఘనేంద్రునిఁ జూచి) ఘనేంద్రబాబు! నిన్ను మా ప్రభుత్వములో రాష్ట్రీయునిగా నియమించుచున్నాను.

రాజాజ్ఞ వినఁగానే వీరనందుఁడు కంపమాన హస్తముతో తన రాష్ట్రీయాధికార చిహ్నమగు మహాఖడ్గమును ఘనేంద్రునకు సమర్పించివేసినవాఁడయ్యెను. ఘనేంద్రుఁడు వినయముతో దాని నందుకొని సార్వభౌమునకు ప్రణామము గావించెను.

ప్రతీహారులందఱు నాశ్చర్యపడిరి.

## పదియవ ప్రకరణము

### సింహద్వారమునందు రాజకులము

సుచంద్రభట్టారకుఁడనంతర మా రంగస్థలమునకు మహామంత్రిని రప్పించెను. అతఁడాతురతతో వచ్చినాఁడు. సింహద్వారమునం దందఱును నిలిచియున్నారు. రాష్ట్రీయఖడ్గము ఘనేంద్రుని చేతిలో నున్నది. అది యిన్నాళ్లకు తగినచేతికి వచ్చి జ్వలించుచున్నది. వీరనందుఁడు నిరాయుధుఁడై యాఱిపోయిన కొఱవివలె నిష్ప్రభుఁడై కన్పట్టుచున్నాఁడు. మహాప్రతీహారి ఖడ్గము మహారాజపాదములపై కన్పట్టుచున్నది. రాజప్రేరితుఁడైన యొకప్రతీహారి జరిగిన సంగతి నంతటిని తూచాతప్పకుండ మహామంత్రికి నివేదించెను.

అనంతరము మహారాజు సింహద్వారమునందే మహామంత్రితోడను, క్రొత్త రాష్ట్రీయునితోడను శివంకర సంఘము గుఱించి ముందుచేసిన ప్రకటనను రద్దుపఱచుట కాలోచించినవాఁడయ్యెను. అప్పటి ప్రభువుస్థితి కనిపెట్టి మహామంత్రి ప్రతికూలముగా చెప్పఁజాలకపోయెను. ఘనేంద్రుఁడు సంపూర్ణ సమ్మతితో రాజుగారి సూచనను సమర్థించెను. పూర్వప్రకటనను రద్దుచేసినట్లు పునఃప్రకటనను ఘనేంద్రుఁడచ్చటనే వ్రాసెను. అనంతరము మహారాజ మహామంత్రులు సంతకములు చేసినపిమ్మట తాను సంతకముపెట్టి పత్రము పూర్తిచేసినవాఁడయ్యెను.

సునంద కుటుంబస్థులగుఱించి కటూక్తి పలికినందులకు రాజు ఘోరకునకు పదిపణములు జుల్మానావేసి యతనిఖడ్గము నతనికి తిరిగియు నిచ్చివేసెను. తాను కోరిన బహుమతి తనకు లభించినందులకు ఘోరకుఁడు పార్థివునకు నమస్కరించెను.

సుచ — ఘోరకబాబు! నీవు కోరిన బహుమానము నీ కీయఁబడినది. నీ కుమారునకు మంచి బహుమతి యొకటి యీయవలసియున్నది. అతనికి నగరపాల పదవి యిచ్చుటయే మంచి బహుమతి యని యనుకొనుచున్నాను.

ఘోర — ఇప్పుడు సర్కారువారు వానికిచ్చిన పదవియే వాని కిష్టము. సంపూర్ణముగా పరంతప సంఘమువారి చర్యలను కనిపెట్టి రాష్ట్రమునకు సేవ సేయవలెనని వాని యాశ. నగరపాలుని జీతము రహస్యార్థశోధకుని జీతముకంటె నాలుగురెట్లధికముగా నుండినను రహస్యార్థశోధకుని పని జయప్రదముగా ముగిసిన పిమ్మట నతనికి దొరకవలసిన బహుమాన మమూల్యముగా నుండును.

సుచం—సరి. అట్లే కానిమ్ము.

అనంతరము మహారాజు వీరనందునకు ప్రాసాద కార్యదర్శి పదవి నొసంగినాఁడు. ఈ యధికారముల మార్పు జరుగునని మహామంత్రికి ముందే తెలుసును. అయినను తత్కాలసంభవ మవమానకరముగా నుండెనని మాత్రమే యతఁడు చింతించెను. ప్రాసాద కార్యదర్శిజీతము మంత్రుల జీతముతో సమానముగానే యేర్పరుపఁబడినది.

ఘోర—మహాప్రభో! ఒక సంగతి నే నిప్పుడడుగవలసియున్నది. అధికప్రసంగమని యెంచక శ్రీవారు ప్రత్యుత్తరము దయసేయవలెను.

సుచం—అడుగుము.

ఘోర—వీరనంద బాబుగారి క్రొత్త యుద్యోగములో మహాప్రతీహారి తన బహిఃపుర ప్రతీహారివర్గముతోఁ గూడ నతని చేతిక్రింద నుండవలసివచ్చునా?

సుచ—నీ కెందుల కీప్రశ్న?

ఘోర—అట్లుండునెడల నీ యుద్యోగము మానుకొనుటకు.

సుచ—ఎందులకు మానవలెను?

ఘోర—కారణము చెప్పునెడల నాకు మఱికొన్ని పణములు జుల్మానాపడును.

సుచంద్రుఁడు నవ్వెను.

సునంద వీరనందులకు కనులనుండి నీరులేని యేడుపు వచ్చినది.

సుచ—ఉండనక్కఱలేదు. మహాప్రతీహారి మహారాజకుమాత్రమే బాధ్యుఁడు.

* * * * *

అనంతరము ఘనేంద్రుఁడు తన రక్షిజనులతోఁగూడ కలిసి శవపరీక్ష గావించెను. సైనికులగు నాగులు చాలమంది యాగుంపులో చనిపోయినట్లు కనుగొనఁబడినది. అటుపిమ్మట రాజుగారిచే శవదహనమునకు నుత్తరు వీయఁబడినది. ఎడ్లబండ్లలో శవములను వేసి రక్షిజనులు శ్మశానమునకు తీసుకొనిపోయిరి. నిండుశరీరముతో నుండు శవ మొక్కటియును లేదు. అన్ని శవములును రెండేసిఖండములే. శవములబండ్లు కదలిన పిమ్మట ప్రతీహారులు రక్తపంకిలమగు రణస్థలమును బాగుచేసిరి. సుచంద్రభట్టారకుఁ డంతఃపురమునకు మఱలెను. సునంద వీరనందులు దీనవదనములతో తమయింటికి మఱలిరి. ఘనేంద్రుఁడు శవములతో శ్మశానమునకు వెళ్లెను. ఘోరకుఁడు ఖడ్గధారియై సింహద్వారము దగ్గఱ వెలుఁగుచున్నాఁడు. అతని శరీరము మేచకమైయుండినను శరదిందుగౌరమగు నతని శత్రువిజయకీర్తి యారాత్రి వెన్నెలను హసించుచుండినది.

## పదునొకండవ ప్రకరణము

### "మనోహారిణి శ్యామలయా?"

సులోచనుని వెంటఁ దరిమిన ప్రమథనాథుని సంగతి యేమైనదో యిప్పుడు చెప్పవలసియున్నది. సులోచనుఁడు పరాక్రమములో నంత గొప్పవాఁడు కాకపోయినను పరుగెత్తుటలో నసాధ్యుఁడు. వానికిఁ దీసిపోవనివాఁడు ప్రమథనాథుఁడు. ఆ నిశీథమునందు సులోచనుఁడు ప్రమథనాథు ననేక వీథులు త్రిప్పినవాఁ డయ్యెను. ఎప్పటికైన నలసి యతఁడు తనను విడిచిపెట్టునని సులోచనుని యూహ. ఎప్పటికైన నలసి వాఁడు చిక్కునని ప్రమథనాథుని యాశ.

ఒకరిని మించి యొకరు పరుగెత్తుచున్నారు. ఇట్లు పరుగెత్తుచుండ సులోచనుఁ డొక సందులోఁ బడెను. ప్రమథనాథుఁ డా సందుకు వచ్చుసరికి సులోచనుఁ డా సందులో కన్పట్టుట లేదు. ప్రమథనాథున కాశ్చర్య మైనది. అంత శీఘ్రముగా నా సందు దాఁటు శక్తి సులోచనున కుండునని యతఁడు విశ్వసింపలేదు. ఎవరి యింటిలోపల నైనను ప్రవేశించె నని యనుమానించుటకుఁ గూడ నవకాశము లేదు. అన్ని తలుపులును వేసియున్నవి. ఎవరైన తలుపు తెరచినవారతనిని లోపలకు రాఁబట్టుకొనిరని యనుకొనుటగూడ నసంభావ్యమే యగుచున్నది.

ప్రమథనాథుఁ డా వీథిలోని యిరుప్రక్కల యరుఁగులపై దృష్టి సారించినవాఁ డయ్యెను. ఒక యరుఁగుపై ముట్టుగది యొకటి లోపల గడియ వేసుకొని యున్నట్లు కన్పట్టినది. సులోచనుఁడే ప్రవేశించి లోపల గడియ వేసుకొనె నని ప్రమథనాథుఁడు తలంచి యా యరుఁగుమీఁదికి మెల్లగా వెళ్లి నిశ్శబ్దముగా తలుపు త్రోసి చూచెను. తలుపు గడియ వేసియే యున్నది.

ఇప్పుడు ప్రమథనాథుని స్థితి సంశయగ్రస్త మైనది. లోపలఁ బండుకొనినది ముట్టు స్త్రీయే యగునెడల సులోచనుఁడు వేఱుగా నెచ్చటికో తప్పించుకొని వెళ్లిపోయినట్లే. తా నచ్చట నుండి ప్రయోజనము లేదు. లోపలఁ బ్రవేశించినవాఁడు సులోచనుఁడే యగునెడల తా నచ్చట నిలిచియేతీరవలెను. కావున ప్రమథనాథుఁడు నిశ్శబ్దముగా ద్వారమునందు నిలిచినవాఁ డయ్యెను. లోపలఁ బ్రవేశించియుండునెడల రాత్రి శత్రువు తనకు దొరకకతీరదు. లేనియెడల నా రాత్రి తాను చేసిన ధావనప్రయత్నము వ్యర్థమే కానిమ్ము. ఇది యతని కొస నిశ్చయము.

నిజముగా నేమి జరిగినది? సులోచనుఁ డా సందులో ప్రవేశించిన తత్క్షణమే తలుపు తెఱచి యుంచిన యా ముట్టుగది యతనికి కనిపించినది. వాఁడు వేగముతో వచ్చి లోపలఁ బ్రవేశించి తలుపు గడియ వేసుకొనెను. పరుగెత్తు ప్రమథనాథుఁడు ప్రక్కలు చూడక సందులో పరుగెత్తునెడల తాను తప్పించుకొని పాఱిపోవచ్చునని సులోచనుని యూహ. ప్రక్కగదిలో తాను ప్రవేశించునని యతఁ డా సంభ్రమములో కనిపెట్టఁజాలఁడని సులోచనుఁ డనుకొనినాఁడు. ఎట్టి సంభ్రమములోఁ గూడ మోసపోవనిబుద్ధి ప్రమథనాథునిది.

తన తొందరలో సులోచనుఁడు గమనింపలేదుగాని యా గదిలో ముట్టయిన యా యింటి యజమానురాలు పండుకొని యున్నది. ఉక్కగా నున్నందున నామె తలుపు తీసుకొనియే పండుకొని యున్నది. సంభ్రమముతో సులోచనుఁడు వచ్చి తలుపు వేయునపు డామెకు తెలివి వచ్చినది. ఎవఁడో దొంగ లోపలకు ప్రవేశించె నని యామె యనుమానించినది.

ఎవ రామె? వీరభద్రావధాని భార్య మనోహారిణి యామె. కాశ్యపదేశకీర్తిచెల్లెలు మనోహారిణి యామె. ఆమె మిక్కిలి ధైర్యవంతురాలు. అత్యంతనిర్భయురాలు. ఛాందసుని పత్నియైనను గొప్ప నెఱజాణ. ఆమె తన కనుమానము కలిగిన తత్క్షణమే కుంపటిని వెలిగించి యా నిప్పులతో దీపము వెలిగించినది. కనిపించినాఁడు భయగ్రస్తుఁ డగు నాగఫణిఁ డామెకు. కనిపించినాఁడు విఖ్యాత

విటనాయకుఁ డగు సులోచనుఁ డామెకు. వానిని జూడఁగానే భయ జుగుప్సా సంభ్రమును లామెకు కలిగినవి.

సులోచనుఁడు గూడ మనోహారిణిని జూచెను. ఆమెను జూడఁగానే వాని తత్కాల భయోద్రేక మంతర్హిత మయ్యెను. ఇంత సేపువఱకు తానుపడిన భావనాయాసము మాయమైనది. తనవెనుక ఘోరశత్రువు ప్రమథనాథుఁ డున్నాఁడను విషయముగూడ వాని జ్ఞప్తిలో నుండిపోయినది. వాని కనుల యెదట కన్పట్టునది మనోహారిణీమూర్తి. వాని భావములోఁ గన్పట్టునదిగూడ మనోహారిణి మూర్తియే.

"శ్యామలా! నాప్రియమైన శ్యామలా! నీ విచ్చట నున్నావా? నీవు చనిపోతి వనుకొన్నాను. బ్రతికియున్నావా? ప్రాణేశ్వరీ! ఈ ఛాందసునియింట నీ వెందుల కుండవలసి వచ్చినది?"

ఇవి యప్రయత్నముగా సులోచనుని నోటినుండి వెలువడిన మాటలు. అవి ద్వారమునందు కాచుకొనియున్న ప్రమథ నాథుని చెవులలోఁగూడఁ బడినవి. పిమ్మట మనోహారిణీ సులోచనుల కీ క్రింది సంవాదము నడిచినది. ప్రమథనాథుఁడు వినుచునే యున్నాఁడు.

మనో—ఎవఁడవు నీవు? దుర్మార్గుఁడా! శ్యామల యెవతె? నే నెవతెను? తలుపు తీసుకొని వెళ్లెదవా? కేకలు వేయు మన్నావా?

సులో — అదిగో!! ఆ స్వరముగూడ నా శ్యామలదే.

మనో — అరే! నీవు త్రాగివచ్చితివా యేమి?

సులో — సులోచనుఁ డెన్నియో తప్పులు చేసినాఁడు గాని త్రాగుటమాత్ర మెన్నఁడు నెఱుఁగఁడు. అతని కనులు వేయి మంది మధ్యలో తన ప్రియమైన శ్యామలను కనిపెట్టఁ గలవు. అతని చెవులు చీఁకటిలోఁ గూడ శ్యామల స్వరమును పోల్చుకొనఁ గలవు.

మనో — నీ పేరు సులోచనుఁడా?

సులో—నన్నొక క్షణమైన చూడని యెడల నీవు సహింపనిరోజులు కాలగర్భములో లీనమైపోయినవి. నీవు సులోచనుని పేరుగూడ తెలియనట్లు నటించి యడుగ వలసినరోజు లిప్పుడు వచ్చినవి. నా ప్రియమైన శ్యామలా! బాభ్రవ్యుని కామతంత్ర మంతయు నీకు నేను చెప్పలేదా? నీభర్త యగు సులోచనుని మఱచిపోయినను గురువగు సులోచనుని మఱచిపోతివా?

మనో.—నీవు రూపసాదృశ్యము వలన భ్రాంతిచెందియున్నావు. నేను కాశ్యపదేవకీర్తి చెల్లెలను. అవధానులగారి భార్యను. నాపేరు మనోహారిణి. నీ శ్యామల యెవరో నాకు తెలియదు. నే నిప్పుడు ముట్టుదాననుగా నున్నాను. ఇట్టి సమయములో నీ వర్ధరాత్రివేళ నా గదిలో ప్రవేశించుట ఘోరమైన పని. నీవు తత్క్షణమే యీ గది విడిచి వెళ్లనియెడల నేను కేకలు వేసి యీ వీథివా రందరిని లేపెదను.

సులో—రూపసాదృశ్యమే కాదు. స్వర సాదృశ్యముగూడ నున్నది. ఎంత వినినను తనివితీరని స్వర మిది. ఎంతచూచినను తనివి

తీరని రూప మిది. అవి నేను ముద్దుపెట్టుకొనిన చెక్కులే. అవి నేను చేతులతో సవరించిన ముంగురులే. ఇంక నా ముఖము యొక్క కళ చెక్కుచెదరలేదు. మనోహారిణియే శ్యామల యను పేరుతో నన్ను కొన్నాళ్లేలినది యని యిప్పుడు నేను తెలుసుకొనుచున్నాను. నా మనోహారిణీ! నన్ను విడిచి వేఱు మగనిని బెండ్లి యాడుట ధర్మమా? నే నీఘోరము తాళఁజాలను. నాదగ్గఱ కత్తి యున్నది. నీచేతి కిచ్చెదను. నన్ను నీ హస్తముతో పొడిచివేయుము. అప్పుడు నారక్తవారిచే నా దుఃఖము చల్లారును.

మనో — నీ కేమి పిచ్చియెత్తినదా సులోచనబాబు! నే నెంతమాత్రము శ్యామలను గాను.

సులో — ఆమాట నేను నమ్మను. నీవు నేను శ్యామలనని యంగీకరించినను నేను నిన్నిప్పుడు ముట్టఁజాలను. ఆ విషయములో నీవు భయపడకుము. ఒక్కసంగతిమాత్ర మనుగ్రహించి నాకు చెప్పుము. నా కొడుకు నెచ్చట నీవు పాఱవేసితివి?

మనో — నీకొడుకును నేను పాఱవేయుట యెట్లు? నే నెంతచెప్పినను గది విడిచిపోకున్నావు. నేను తలుపుతీసుకొని పోయి కాలనాథబాబుతో నీ యత్యాచారపు మాటలను చెప్పెదను. ఆతఁడు నీకు బుద్ధి చెప్పును.

అని చెప్పి మనోహారిణి లేచినది.

ప్రమథనాథుఁ డంతయు విని "మనోహారిణి శ్యామలయా?" అని దృఢముగా శంకించినాఁడు.

## పంద్రెండవ ప్రకరణము

### శరణాగతరక్షణము

మనోహారిణి తలుపు తీసినది. దీపపు వెలుతురులో మనోహారిణీ సులోచనుల కిద్దఱికిని ప్రమథనాథబాబు కనిపించినాఁడు. మనోహారిణి మిక్కిలి సిగ్గుపడినది. సులోచనుఁడు మిక్కిలి భయపడెను. ఆభయములో నతని కెక్కడను లేని వేగము వచ్చినది. ఒక త్రుటి కాలమైన నతఁడు వ్యర్థము సేయక మనోహారిణిని ప్రమథనాథునిమీఁదికి త్రోసివేసి యరుఁగుమీఁదికి వచ్చి క్రిందికిలంఘించి పాఱిపోయినాఁడు. ప్రమథనాథునకు వాఁడరుఁగు మీఁదికి రాఁగానే పట్టుకొనఁజాలకపోవుటకు కారణము తనమీఁద త్రోసివేసిన మనోహారిణి నాఁపుకొనుటకు తీసుకొనిన క్షణిక చర్యయే. ఆ యవకాశమే సులోచనున కరుఁగు గంతుటకు సరిపోయినది. ప్రమథనాథుఁడు తనమీఁదఁబడిన మనోహారిణి క్రిందఁబడకుండ నిలఁబెట్టి తత్క్షణమే యామెను విడిచి యరుఁగు గంతినవాఁడయ్యెను తిరిగియు సులోచన ప్రమథనాథుల ధావనానుధావనములు యథావిధిగా నడిచినవి. మనోహారిణి యది చూచి యాశ్చర్యపడినది. ఆసంగతి యేమియో యాలోచించుటకుముందు సులోచనుని బారినుండి గడబిడలేకుండ తాను తప్పించుకొనినందులకు సంతోషించుటలో నామె రెండు మూఁడు క్షణములు గడపినది. కొనకామె లోపలకుఁబోయి తలుపువేసుకొని పండుకొనినది గాని యనేకాలోచనలలో నామెకు నిద్రపట్టలేదు.

సులోచనుఁడు మఱికొన్ని వీథులు దాటినాఁడు. కొనకు ప్రమథనాథునకే

జయ మగునట్లు సంభవము తటస్థించినది. అట్టి సందర్భములో సులోచనుని యదృష్ట వశమున నొక స్త్రీ తలుపు తీసినది. సులోచ నుని దృష్టి యాప్రక్కకు ప్రసరించినది. ఆ తలుపుతీసిన స్త్రీ తనకు పరిచితురాలు. ఆమె తనను రక్షింపఁగలదని వాఁడాశించి యా యింట వేగముతో దూరెను. "శరణు, కాత్యాయనమ్మా! నన్ను రక్షింపుము." అను మాటలతో వాఁడా యింటిసి ప్రవే శించెను.

"వాఁడు రక్షింపఁదగినవాఁడు గాఁడు. దుర్మార్గుఁడగు రాజద్రోహి." అని చెప్పుచు ప్రమథనాథుఁడు గూడ నా యింటఁ బ్రవే శింపఁబోయెను.

కాత్యా — ప్రమథనాథబాబు! కా త్యాయని శరణాగతుని విడువదు. నీ కా మనిషియే కావలయునెడల నీవు నన్ను చంపి లోపలకు వెళ్లవలసినదే.

ప్రమథనాథునకు కాత్యాయని పై మిక్కిలి గౌరవము. తనతండ్రి ఘోరకుఁడు కాత్యాయని మహిమను కొనియాడుట నతఁడెన్నియోసారులు విన్నాఁడు. అట్టి గొప్పస్త్రీని తాను చంపి లోపల కతఁడు వెళ్లఁగలఁడా?

ప్రమ— అమ్మా! మీరు రక్షించిన మనిషిని నేను పట్టుకొనను నొల్లనుగాని వానితో మీయెదుట ముఖాముఖిగా మా ట్లాడవలెనని నాకున్నది. గొప్ప మహా వీరుఁడనని బడాయికొట్టు మనిషి యొక స్త్రీ ద్వారా రక్షణపొందుట యెంత గౌరవహాని కరమో వాని కెఱుకపఱచెదను.

కాత్యా — వీఁడెన్ని టప్పాలు కొట్టి నను తనకార్యసాధనముకొఱకు గడ్డితిను టకుఁగూడ వెనుకఁదీయని తుచ్ఛుఁడు. వీనిని పట్టుకొనినంతమాత్రమున నీకీర్తి యెంతమా త్రము వర్ధింపదు. నీ వధిక్షేపించినంతమాత్ర మున వీఁడు సిగ్గుపడు నని నీ వెంచవలదు. శౌర్య మావంతయు లేనివానికి సిగ్గెక్కడి నుండి వచ్చును? వీఁడు బ్రతికియుండినను చచ్చినవారిలోనే లెక్క. ఈరాత్రియే పూర్వయామమునందు వీఁడొక యాడుదాని కత్తికి భయపడి పాఱిపోయినాఁడు. ఇప్పుడు చేత కత్తి ధరించియు నిరాయుధురాలగు స్త్రీని శరణువేడుచున్నాఁడు. (సులోచ నునిఁజూచి) అభాగుఁడా! నీకు శస్త్ర మెందులకు? దానిని నీ శాత్రవున కిచ్చి యతని కాళ్లపైఁబడి విముక్తుఁడవై పొమ్ము. ఈరాత్రియే కాదు, నీవు బ్రతికి యున్నంత కాలము నీ తుచ్ఛప్రాణములపై నతఁడు రాఁడు.

సులో — నేను నిన్ను శరణువేడితిని. నీవు రక్షింపఁజాలనపుడు శాత్రవుని శరణు చొచ్చెదను.

కాత్యా—అట్లగునెడల నీకత్తి నా కిచ్చివేయుము.

సులోచనుఁడు తనకత్తిని కాత్యాయని కాళ్లపై నుంచెను. ప్రమథనాథుఁ డాశ్చర్య చకితుఁడయ్యెను.

ఇంతలో రాజకాళి యచ్చట ప్రత్యక్షు రాలైనది. అందఱును స్తబ్ధులైరి.

రాజ—కాత్యాయనీ! చంపమ్మ వదినె గారింట నాకు నిద్రపట్టలేదు. నీయింట పండు కొనుటకు వచ్చితిని.

కాత్యా — నీకు కాత్యాయనియిల్లు ఇన్నాళ్లకు గోచరించినదా ?

రాజ—ఔను.

(ఛందోబద్ధవాణి నాశ్రయించి)

"నశ్యమైన ప్రపంచ నాటకమునందు
దృశ్యాలు చూడంగ తిరుగుచున్నాను
ఈరాత్రి యీదృశ్య మీక్షింపఁ దాను
మీరాజకాళమ్మ మీయిల్లు సేరె
కత్తిని కలకంఠి కాళ్లపై నుంచి
నెత్తిని వంచిన నీచదృశ్యంబు
భీరువు శరణన్న పిఱికిని గాయ
వీరుని నిలిపిన ధీర దృశ్యంబు
చూడంగ వచ్చితి సుందరీ యిపుడు
పాడంగ వచ్చితి భామినీ యిపుడు
ఒళ్లు బాగున్నది యూహలు పాడు
కళ్లు మంచివి గాని కథ బాగులేదు
కాళ్లలో బలముంది(మస్తి) కరములోలేదు
[(నాస్తి)
నీళ్ల లోఁ దిరుగాడు నీచ సర్ప మిది"

* * * *

కొసకు ప్రమథనాథుఁడు కాత్యాయని యుత్తరువు తీసుకొని వెళ్లిపోయెను. తరువాత సులోచనుఁడు దీనవదనముతో నిష్క్రమించెను. ఆ రాత్రి రాజకాళి కాత్యాయని యింటనే పండుకొనెను.



విశ్రాంతి A. A.

# తెలుగుమఱుగు:
# వ్యవహారభాషా వ్యాకరణము

[అనువృత్తము]

కీ. శే. పారనంది రామశాస్త్రి

ఇది వచ్చుధాతువునకు "రావడము"వంటిది. దీనికి సమ్మతింపనివారు "చావడ"మనుదాని కర్థాంతరమును గల్పింతురు. ఏ యర్థమైనను వారుగూడ ధాతుప్రత్యయములను చెప్పవలయునుకదా. లేక యశనిపాతమువంటి నిపాత మందురేమో? కాని భారతాభిప్రాయ మట్లు కానరాదు. "తమలోని పాళ్లకును సమరము చేసినఁ గాని చావు రాఁజనదె" (భా. ఉ. ౨ ఆ.) అని "చావు" మరణముగానే చెప్పఁబడినది. ఇంక ననేకస్థలములలో మరణపరముగానే యున్నది. "సడికి నధర్మవృత్తికిని జావునకుం దొలగించి." (భా. ఉ. ౯ ఆ.)

ఇంక "పోరితము" అనుదానిని విచారింతము. "పోరితంబులేకయ్యెడు నర్థసిద్ధి" (భా. ఉ. ౧ ఆ.) "జ్ఞాతుల పోరితమును గోత్రాతము నాక్రమము" (భా. ఉ. ౨ ఆ.) ఇవి యేరూపము లయ్యెడును? పోరు, పోరి, పోరితము-ఇవి యుద్ధపర్యాయములుగా నున్నవి. ఇందు "పోరిత"మనునది పోర, పోరు అనువాని పైని "ఇత" ప్రత్యయము చేయఁగా నైనదా, లేక "పోరి"పైని "త" ప్రత్యయము చేయఁగా నయినదా? "విలసిత", "చేష్టిత" వలెనే క్తాంతరూపమా? ఎట్లు చెప్పినను సంస్కృత ప్రత్యయముతో సంకరమని చెప్పకతప్పదు. నిపాత మన్నచో నన్నియును నిపాతములుగానే చెప్పవచ్చును. వ్యాకరణముల ప్రయోజనము లేదు.

"కట్టాయితము"—"అరుదారు మేలుకట్టాయితంబై చూడ నొప్పారితనునకు చప్పరములు" (భార. ఉ. ౧ ఆ.) ఇది "ఫలాయిత", "పలాయిత", "దాసాయిత" అనునట్టిదేనా, కాదా? ఇందు ప్రత్యయమెద్ది? తెనుగున అయిత ప్రత్యయ మున్న

ఆది దేశ్యమందురా? అయితే దేశములోనికి ఎట్లువచ్చినది? విచారింపవలయు.

ఈ రీతిని శబ్దసాంకర్యము. ఇఁక నర్థసాంకర్యమును చూతము.

"అనుమాన"—సంస్కృతపదము. దీనికి సంస్కృతమందు ప్రమాణములలో నొకటి యనుమానప్రమాణ మర్థము. తెనుఁగున సంశయము అర్థము.

"పరోక్షము"—దీనికి సంస్కృతమందు అప్రత్యక్ష మర్థము. తెనుఁగున జీవితానంతర మర్థము.

"నిజ" — దీనికి సంస్కృతమందు స్వీయము, సహజము అర్థము. తెనుఁగున యథార్థము.

"తాత" — సంస్కృతమందు జనకుఁ డర్థము. తెనుఁగున పితామహుఁడు.

"చోద్యము" — సంస్కృతమందు ప్రేరణీయము (పూర్వపక్షము). తెనుఁగున ఆశ్చర్య మర్థము.

"విశేష" — సంస్కృతమందు 'లోనున్నది.' యర్థము. తెనుఁగున ప్రతిబంధ మర్థము.

"శిక్ష"—దీనికి సంస్కృతమందు అభ్యసించుట. తెనుఁగున దండించుట.

"తటస్థ"— సంస్కృతమందు ఉదాసీనుఁ డర్థము. తెనుఁగున 'సంభవించినది.'

"ఘట్ట" — సంస్కృతమందు తీరము, లేక ప్రకరణము. తెనుఁగున కష్టతరము.

ఇట్లనేకములు సంస్కృతపదములు లోకము వాడుకలో భిన్నార్థములం దుపయోగింపఁబడియున్నవి. [illegible] యాపదముల సాయా

యర్థములందు గ్రంథములలోను ప్రయోగించికొని యున్నారు.

ప్రాచీన గ్రంథకర్తలు పద్యగ్రంథములలో ఛందస్సును పాటించినంత వ్యాకరణమును పాటించినట్లు కానరాదు.

కర్మకర్మ భావవిషయములో—

"పర్వము వైరాటాదిక పర్వచతుష్టయము నను సభారంజనమై" (భార. ఆది. ౧ ఆ.) 'సభారంజకమై' అని.

"అతిశయ రూపయౌవన గుణాధిక సుందరమైన" (భా. ఆది. ౪ ఆ) 'అతిశయిత' అని యుండవలయును.

"అనినఁ బ్రదీపుఁ డిట్లనియె నంబురుహానన నగ్ని సాక్షికంబునఁ బరిణీతయైన–" (భా. ఆ. ౮ ఆ.) అగ్నిసాక్షికముగ నని యుండును.

"సుఖము దుఃఖముఁ బ్రాప్తించుచోట నరుఁడు, దవిలి తన కర్మవశముఁ దనక తాన, కర్తగా కన్యులకు నేమికారణంబు" (భా. ఆ. ౮ ఆ.) అన్యులేమి కారణంబు ?

"ఈ వంశము విచ్ఛేదముగావచ్చిన" (భార. ఆది. ౫ ఆ.) విచ్ఛిన్నము.

"ఈ ప్రమద్వరకు నిర్విషమయ్యెడు నేడు మీద యన్" (భార. ఆ. ౧ ఆ.) ప్రమద్వర నిర్విషయయ్యెడు.

"విమలచారిత్రశిక్షకాచార్యకంబు" (భార. ఆ. ౮ ఆ.) ఆచార్యుఁడు.

"నీ కారణమున వంశము నాకులమై" (భా. ఆది. ౮ ఆ.) నీ కారణత్వమున.

"సూరినుత యింపలము నీవారకములుగాగ మమ్ము వగవుము బుద్ధిన్" (భార. ఆ. ౩ ఆ.)

"మహానందముఁ బొందు నతిశయప్రీతి మెయిన్" (భార. ఆ. ౮ ఆ.) అతిశయిత.

"భూషణావలు లిచ్చి విశేషలీల" (భార. ఆ. ౫ ఆ.) విశిష్ట (విశేషిత).

"దీనికి సాదృశ్యముగా నే నేమి యొనర్తు నీకు నిష్టంబనినన్" (భార. ఆ. ౬ ఆ.) సదృశముగా.

"ఇంక బ్రాహ్మణుల కవజ్ఞ సేయుక శమత్వము నేకొనుము" (భార. ఆ. ౭ ఆ.) శమము.

"విస్తారయుండు" (భార. సభా. ౧ ఆ.) విస్తృతయుండు.

"వారల చెప్పినట్లు తన నిర్వాహకంబుఁ జెప్పి" (భార. ఆర ౨ ఆ.) నిర్వాహ్యము.

"నీశరణంబు సొచ్చిన మాకుం జరమశోభనంబులు సుఖంబగుట నిశ్చయంబుగాదె" (భార. ఆర. ౮ ఆ.) నిన్ను శరణంబు – నిశ్చితంబు.

"సుస్థిరతయు నోషధీరసవిశేషతయుం గల దుత్తమంబు మందరవసుధరంబు" (భార. ఆ. ౨ ఆ.)

అప్పకవీయమందు ౧౯౦౯ సం. మందు ముద్రిత పుస్తకములో "క్రమత వీనికి వీరలు"– క్రమమున.

స్థలాంతరమందు అప్పకవియే "క్రమమునను సంస్కృతప్రాకృతములు రెండు".

అప్పకవి రేఫలోపవిషయములో "నేరు పఠనట్టి లపితము, లో రేఫం బచ్చతోడ లోపంబగు రా, ధారమణ వలసినప్పుడు, భారతమున సోమయాజి పలుకుట వలనన్"— లుప్తంబగును.

"ఘన సాహిత్యము గద్యపద్యము లనం దా రెండు భేదంబులై, పరగు న్గద్యమునందుఁ బాదనియతుల్ భావింపగా లేవు వా, క్స్ఫురణంబై విలసిల్లగా నుడవ నొప్పం గావ్య డెం తేనియున్, మరుతంద్రీ మతి దీనికే వచననామం బయ్యె నాంధ్రంబునన్"— దా రెండుగా భిన్నమై. కవి, లేక కావ్యకర్త.

నృసింహపురాణములో "కల్యాణ ముద్ఘోషమై"- ఉద్ఘోషితమై.

విశేషణవిశేష్య వ్యుత్క్రమము :— (అప్పకవీయము) "ఉక్తలక్షణవంతమై యుండునట్టి, కావ్యముల నెలుగవలయు సంస్కార మనుచు, హీనలక్షణ కావ్యంబు నెలుఁగవలయు గ్రామ్యమనుచ నపభ్రంశకంబు ననుచు."

ఇందు లక్షణవంతమునకు లక్షణహీనము విరుద్ధము. అట్లు చెప్పుటకు 'హీనలక్షణ' అని చెప్పినాఁడు.

మఱియును కావ్యములు సంస్కారవంతములుగాని సంస్కారము కావు. ఛందస్సునకై యట్లు చెప్పినాఁడు.

(అప్పకవీయము) "పురుటింటం బసిబిడ్డచందమున నాపోవంగ నా డాత్మలో, మఱువొప్ప స్వివమదుగ్ధయుగ్మకుచయై మద్దాడు రాకాసి గః, త్రెఱుఁగిప్టంబుగఁ బాలు ద్రావు మిషచే నిర్దైన్యనకాలంబునన్, ధరణిం గూల్చిన నందపుత్రు వలనం దార్కాణ ధర్మస్థితుల్."—స్తన చయుగ్మయై అని యభిప్రాయము.

"విహీనసంతానులకు నూర్ధ్వలోకసుపథంబు లవశ్యము లేవు" (భార. ఆది. ౫ ఆ.) సంతానవిహీనులకు అని.

సంధివిషయము:— (అప్పకవీయము) "వ్రేల్చె నేవాఁడు ఖాండవ విపిన మెల్ల, జాతవేదోత్థవిలసిత జ్వాలమీఁదఁ."—జాతవేదస్ సాంతము. జాతవేద ఉత్థ. సంధిసాంకర్యములో విస్తరించి చూపఁబడియున్నందున నిచట విస్తరింపలేదు.

గణ నిర్బంధము:— "వీరలు దైవశక్తిఁ బ్రభవించినవా రను కేమిసందియంబు" (భార. ఆది. ౫ ఆ.) అనుట కేమి సందియంబు.

"వేడ్కతోఁ త న్వినుచున్న వారికి" (భార. ఆది. 3 ఆ.) తనను.

"నిజం బిట్లాత్మఁ గ న్మన్నియున్" (భార. ఆది. ౫ ఆ.) కను మన్నియున్.

"బ్రాహ్మణుల కవజ్ఞ సేయక శమత్వము నేకానము" (భార. ఆది. ౭ ఆ.) శమము.

(అప్పకవీయము) - కాదనీలుడు - కదనీలుడు - కదమేఘము.

"ధర్మవె తాత్పర్యముగా" (భార. ఆది. ౭ ఆ.) ధర్మమందే తాత్పర్యముగా.

(కవిజనాశ్రయము) "సగణమునకు తగణ గణము జాతంబయ్యెన్". తగణము జాతంబయ్యెన్:

(అప్పకవీయము) "క్రమతఁ బైశాచయు". క్రమమున.

"అతనిచేత నపరిమిత ధన ప్రాప్తుండ నగుదు" (భార. ఆ. ౨ ఆ.) ప్రాప్త ధనుండ నగుదు.

"రండిట నొక్కఁడొక్కఁడ దురం బొనరింపగ మీరు పల్వు రొక్కండను నేను హేతిహతకాయత డస్సినవాడ నన్ను నాతం డభిమన్యుబాలుని నధర్మతఁ బ్రాధు లనేకయోధు లొక్కండవకెట్లు చంపి రటుగాఁ గొను మిబ్బవరంబు నావుకున్" (భార. శల్య. ౨ ఆ.) అధర్మమున అని.

"వంటయిల్ గుండెలు సొచ్చె" (భార. ఆది. ౬ ఆ.) వంటయిల్లు గుండేలు సొచ్చెనని.

"కర్మసూక్ష్మ భంగి" (భార. కర్ణ. 3 ఆ.) కర్మసూక్ష్మత భంగి.

"సూతతనూజుఁ డబ్బలము సొచ్చి శతత్రయి యోధవీరులం జేతులతీట వో నఱుమునేసి" (భార. కర్ణ. ౨ ఆ.) యోధవీర శతత్రయమని.

"వరం బీ వచ్చితి" (భార. ఆది. ౨ ఆ) వరం బీయవచ్చితి అని.

అలంకార విషయములో:—"కుడిచినపిమ్మటం గుసుమకోమలి" (భార. అర. ౫ ఆ.) కుసుమమువలె కోమలాంగము గలది యని మిశ్రసమాసము.

"మునిపత్నుల రూపము గైకొని వరుస న్వచ్చి పుష్పకోమలి క్రియఁ బ్రీతునిం జేయుచు" (భార. అర. ౫ ఆ.)

ఇంక ననేకములు గలవు. ఇట్లు సంస్కృత భాషతోటి సాంకర్యము. ఇఁక దేశ్యభాషలతో సాంకర్యమును చూతము.

ఈ యాంధ్రభాషకు "తెలుఁగు" ("తెనుగు") అనియును పేరు వ్యాకరణకర్తలు చెప్పినదే. ఆ పేరును పట్టియే యీభాష దేశాంతర భాషతో సాంకర్యముఁ గల దనియును స్పష్టము. ఎట్లనఁగా "తెలుగు" అను దానికి వారు చెప్పిన వ్యుత్పత్తి: "శ్రీశైల, కాళేశ్వర, ద్రాక్షారామముల మూడింటియందును మూడులింగములు గలవు. ఆమూడు లింగములు గల దేశము త్రిలింగము. దానియందుఁ బుట్టిన భాషకావున నీ యాంధ్రభాష మొదలఁ "తెలుఁగు" అనఁబడి పిమ్మట నదియే తెనుగు అనియు నైనది." అని అప్పకవి. ఇచటను త్రిలింగపద తద్భవము తెలుఁగు అనియు నామాక్షరముల పోలికను

పట్టి చెప్పియుండును. ఇందు రేఫమునకు లోపము, తకారమున కత్వమును చేయఁగా నీరూప మయినది. తెలుగు, తెలుంగు అనియును వాడుకగలదు.

పిమ్మట దీనికే కొందఱు రేఫలకారములకు లోపము, తకారమున కెత్వమును చేసి తెనుఁగని చెప్పినారు. ఇట్లీభాష మూడుదేశములవారి వాడుక ననుసరించి సాంకర్యము నొంది యీ రెండురూపములను గలదై యున్నది. ఇట్లు పేరునుండియును సాంకర్యమును నొందియే యున్నది.

ఇచట నప్పకవి "త్రిలింగపద తద్భవము తెలుగు" అని మాత్రము చెప్పినాడుగాని "తెనుగు" ఎట్లో చెప్పలేదు. చూడగా "తి" అనుదానిని హిందూస్థాని, పోత్రథమభాషలలో "తీని" అని పలుకుదురు. కాగా "త్రీణి లింగాని యస్మిన్ స త్రిలింగః" అను వ్యుత్పత్తిచే సిద్ధమగు త్రిలింగపదము సంస్కృతము చెడి "తీని లింగ" అని వ్యవహారములోనికి వచ్చియుండును. అది క్రమక్రమమున "తెనింగ" అని అయి, "తెనుగు" అయ్యుండును. త్రిలింగ సంస్కృత తద్భవము తెలుగు, ప్రాకృత తద్భవము తెనుగు అయ్యుండును. ఇదియే "త్రీణి" అను సంస్కృతపదములోని ణకారమునకు నకారము, "లింగ" అనుదానిలోని అనుస్వారమును చేర్చి చేసిన రూపము "తెనుంగు" అగును. ఆపూర్ణానుస్వారమును చెరిపి యర్ధానుస్వారము చేసిన రూపము "తెనుఁగు" అట్లే సంస్కృత తద్భవమగు "తెలుఁగు" పదము. "లింగ" అనుదానిలోని పూర్ణానుస్వారముంచి చెప్పునది "తెలుంగు" అగును. అదియే చెడి యర్ధానుస్వారమగు రూపము "తెలుఁగు." ఇందలి యనుస్వారము అచ్చట నొక యక్షరము లోపించిన దనుటకు సూచకము. అందుకే వ్రాతలలో నర్ధానుస్వారమైనను ఉంచి వ్రాయుదురు. వాస్తవముగా పూర్ణానుస్వారమునే యుంచవలసినది. దానికి జ్ఞాపక మర్ధానుస్వారము. ఈ పూర్ణానుస్వారమనునది కుండలాకార రేఖ. అది వస్తువులమధ్యమున నొకదానికి వైయర్థ్యమును తెలుపుటకై యుంచబడును. ఈసంప్రదాయ మతిచిర కాలమునుండియు నున్నదేను. ఎట్లనగా నైషధమందు శ్రీహర్షుడు,

"తదోజస స్తద్యశసః స్థితా విమౌ వృథేతి చిత్తే కురుతే యదా యదా, తనోతి భానోః పరివేషకైతవా త్తదా విధిః కుండలనాం విధోరపి."

బ్రహ్మ తనసృష్టిలో సూర్యచంద్రులను సృజించియుండి పిమ్మట నలమహారాజును సృజింపగా నతని ప్రతాపము, కీర్తియును లోకమందు సూర్యచంద్రులు చేయవలసిన పనిని అవియే చేయుచుండగా జూచి తాను ముందు సృజించిన సూర్యచంద్రు లిప్పుడు వ్యర్థమని తలచి వారి వైయర్థ్యమును తెలుపుటకయే పరివేషమును మిషచే వారికి కుండలాకార రేఖను చుట్టియున్నాడని యుత్ప్రేక్షించినాడు. కావున నీసంప్రదాయ మానాటి నుండియు నున్నదియే.

అట్లే అతిప్రాచీన గ్రంథముల లిపులలో నొక యక్షరమేదైన ననవసరముగా వ్రాయబడి యున్నపుడు దానిని చెరుపుటకు బదులుగా దానికి కుండలాకార రేఖ ("ం"ఇట్లు) చుట్టుదురు అది ఆయక్షర విలోపమునకు సూచకము. దానిని చూచి యీభాషయందును అట్టి గురుతు పెట్టియున్నారు. ఆగురుతు లుప్తాక్షరమును జ్ఞాపనము చేయునప్పుడే యుంచవలసినది. లేనిచోట నక్కఱలేదు. కాని యిట్లు రానురాను "తెలుంగు" "తెనుఁగు" అనువానిలోని యనుస్వారములను చూచి యవసరమున్నచోట్లను, లేనిచోట్లనుగూడ ననుస్వారమును చెప్పియుందురు. అట్లు చెప్పినది సంపాతాయాతమని యెఱుంగునది.

ఇంక పదముల సాంకర్యమును చూతము.

తండ్రిని కొన్ని దేశములందు "అయ్య" అనియు, కొన్నిటియందు "అన్న"అనియు, మఱికొన్నిటియందు "అప్ప"అనియు నందురు. వెంకయ్య, వెంకన్న, వెంకప్ప, అని లోకమందు గానబడుచున్నవే. ఇది కుమాళ్లకు తమ తండ్రులపేర్లే పూర్తిగానుంచుట లేనిచో తండ్రిని తెలుపునట్టి "అయ్య" "అన్న" "అప్ప" అనుపదముల నయినను చేర్చి పేర్లిడుట సంప్రదాయము. దీని ననుసరించియే భారతారంభకర్తకు మొదల "నన్నయ" అని పేరు పెట్టియుండగా నాతనికే దేశాంతరభాషా సాంకర్యము వలన నన్నవ, నన్నప అనియును పేర్లు వచ్చినవి.

"తన కులబ్రాహ్మణు నుజను నన్నపార్యుఁ జూచి" (భారతము, ఆదిపర్వము, ౧ ఆశ్వాసము) అనియు, ఆశ్వాసాంతములందు "నన్నయ భట్టప్రణీతంబైన" అనియు నిట్లు ఒక్క తనకే అయ్య, అప్ప అను దేశీయ పదములను వాడుక చేసికొనియున్నాడు.

అట్లే భాగవతమందును ప్రథమ స్కంధారంభమందు గ్రంథకర్త "తిక్కమనీషిం భూషించి ఒనర నన్నయ తిక్కనాదికవులు", "తిప్పయ పోతయ నామ వ్యక్తుండన్" అనియు, భిన్న దేశీయములగు అన్న, అయ్య అనుపదములు వాడియున్నాడు. మఱియును తన కొక్కనికే "పోతయ", "పోతన" అనియును చెప్పికొని యున్నాడు. ఇట్లొక్కచోటనే భిన్న దేశ్యపదముల నుపయోగించియున్నారు.

ఇంకను తెనుగులో అతను, అతడు, వాడు అనునవి పర్యాయములు. కన్నడమందు అవను, వాను అని పర్యాయములు. ఇందలి 'అవను' అనుదానిలోని వకారమునకు తకారము చేయగా "అతను." "అత" అను దానికి "డు"చేర్చగా అతడును. "వాను" అనుదానిలో నుకారమునకు బదులు డు చేయగా 'వాడును' అయ్యుండును. ఇందు"డు" తెలుగుభాషా ప్రత్యయము; "ను" కన్నడభాషాప్రత్యయము.

ఇందుకు వాఁడు, వాండ్లు అనుచోటి యనుస్వారము జ్ఞాపకము. "వాను" అనుదానిలోని నకారమే అనుస్వార మయిన దని తెలియదగియున్నది.

ఇట్లే "ఇవను"కు ఇతడు, ఎవనుకు ఎతడు, ఏవానుకు ఏవాడును బదులురూపములు ప్రకృతిప్రత్యయ సాంకర్యమునుపట్టి యయినవి. ఇందులో ఇతడుకు రూపాంతరము వీడు అని. ఇవి అవనులోని వకారమును, ఇవనులోని ఇకారమును, వానులోని దీర్ఘమును కలిసి యైనట్లున్నది. ఇది ఏకవచనము.

బహువచనము: — "అవరు"కు "వారు" అయినది. లోకమందు వాడుకలో వాడు, వాడిని, వాణ్ణి, వాడిచేతను ఇత్యాదులు మహత్తులకును, అది, దానిని, దానిచేతను ఇత్యాదులు అమహత్తులకును ఏకవచనమందు లోకములోను, గ్రంథములలోను తుల్యములుగానే యున్నవి. బహువచనమందు మాత్రము వాటిని, వాటిచేత ఇత్యాదులు లోకములో గానబడుచున్నవి. వాడు, వాండ్లు అనుచోట డకారము, ఏటి, ఏటికి మొదలగు చోట టకారమును గ్రంథములలో బ్రయోగింపబడియే యున్నవి. ఇట్లుండగా వాడిని, వాటిని మొదలగునవి గ్రామ్యము లెందుచేతనో తెలియదు.

ఇట్లే వస్తాడు, తెస్తాడు మొదలగు లుట్ల కారరూపములను, రావడము, పోవడము మొదలగు త్వప్రత్యయాంత ప్రతిరూపములును గ్రామ్యములనుటకు కారణము కానరాదు.

గ్రామ్యమనుటలో వ్యాకరణకర్తల యభిప్రాయమును స్పష్టముకాదు. "గ్రామమందు బుట్టినది, లేక గ్రామసంబంధముగలది గ్రామ్య మన్నపక్షమున భాషేతరవస్తువులందు నతివ్యాప్తి. గ్రామీణముఖోచ్చరితము గ్రామ్యమన్న పక్షమున తత్సమదేశ్యములందు నతివ్యాప్తి. నింద్యము గ్రామ్య మన్న పక్షమున "కలకంఠుడు" మొదలగువానియందు అసంభవము, అవ్యాప్తి. ఇక వాచ్యార్థమును విడిచి "లక్షణవిరుద్ధము గ్రామ్య" మన్నను లక్షణమనగా వ్యాకరణమేనా ? విరుద్ధమనగా వ్యాకరణముచే నిషేధింపబడినదా, లేక దానిలో జెప్పబడనిదా ? ఆ విరుద్ధమయినది వేరువేరు మాటయా, గ్రంథమా ? అనునది విచారణీయము. ప్రథమాచార్యుడగు వాగనుశాసనుడు "విశ్వశ్రేయః కావ్యం" అని కావ్యస్వరూపమును చెప్పి పిమ్మట రసాలంకారాదులను, వళిప్రాసాదులను కావ్యాంగములుగా జెప్పుటవలన లక్షణమనునది వ్యాకరణ మాత్రము కాదనియు, భాషయనునది వేరువేరు మాటలు కాక కావ్యమనియును తెలియబడుచున్నది.

అట్లే అప్పకవియును "ఉక్తలక్షణవంతమగు కావ్యము", "లక్షణవిరహిత కావ్యము" అనుచోటను కావ్యగ్రహణమే చేయుటచే భాషయనగా కావ్యాత్మక భాషయని కాని వేరువేరు పదములు కావని యభిప్రాయము. లక్షణమనునది కావ్యలక్షణము. అది వ్యాకరణ మొక్కటియే కాదు. రసచ్ఛందోలంకారాదులును కావ్యలక్షణములే. వానిలో రసభావార్థాలంకారాదులు ఆంతరలక్షణములు. ఛందో వ్యాకరణ శబ్దాలంకారములు బాహ్యలక్షణములు. వానిలోను వ్యాకరణము కంటె ఛందోలంకారాదులే యాంతరములయినట్లు కానబడుచున్నది. ఛందోలంకారములకై వ్యాకరణము నతిక్ర

మించినందుకు మీదను చూపించిరే యున్నాను. వ్యాకరణములు గూడ తామే గ్రామ్యములని చెప్పియు కవి ప్రయుక్తములయినవానిని అనింద్యములుగా నొప్పికొనుచునే యున్నవి ఎట్లు చూచినను వస్తాడు, తెస్తాడు, రావడము, పోవడము మొదలగు లోకసిద్ధరూపములు గ్రామ్యములు గానేరవు. ఈ డమంతరూపములు కొన్ని గ్రంథములందును అరుదుగా గానబడుచునే యున్నవి. భార. ఉద్యో. ౩ ఆశ్వాసమందు "కేరడము", "చావడము" అనియు, నింక ననేకస్థలములందు "అడ్డము" అనియు నున్నవి. "అడ్డము" అనునది అడ్డుధాతువు ఉకారము లోపింపగా నయిన డమంతరూపమేకాని వేరుకాదు.

ఇంకను కళాపూర్ణోదయము ౪ వ ఆశ్వాసమందు "త్రవ్వటము", విష్ణుపురాణము ౨ ఆశ్వాసమందు "మెత్తడము", కాశీఖండము ౫ ఆశ్వాసములో "మట్టడము", జైమినీ భారతము ౭ ఆ. లో "వ్రాయడము", పాంచాలీ పరిణయము ౧ ఆశ్వాసమందు "చెక్కడము" అనియును ప్రయోగములు గలవు. వీరు లోకమునుచూచియే ప్రయోగించుకొనియున్నారు. ఇంకను ఇట్టివి పంచమీ విభక్తియందు "వల్ల", అతిశయార్థమందు "చాల", సముచ్చయమందు "నేనున్ను, నీవున్ను" ఇత్యాదులు లోకవ్యవహారములో ప్రసిద్ధముగా గాన్పించుచున్నవి. వానిలో వ్యాకరణదోషముగాని, అశ్లీలాద్యర్థదోషముగాని యేమియును లేదు. ఆ రూపములు పూర్వగ్రంథములలో లేకున్నను వాని కుపలక్షకము లనదగునట్టి మఱికొన్ని రూపములు గ్రంథములలో గానబడుచున్నవి: "నా కనినంత"కు నాకన్నంత, "ఏల"కు ఏలా, "సుమి"కి సుమీ మొదలగునవి.

ఈ దేశ్యపదముల రూపసిద్ధి లోకవ్యవహారమువలననే కాని శాస్త్రమువలన గాదని "సిద్ధిర్లోకాద్దృశ్యా" అనుదానిలోను, లోకవ్యవహారము తత్సమ, తద్భవము లట్టిది కాదని "లోకోఽనన్యాదృశశ్చ" అనుదానిలోను, అది ఆనాటికే కాక యెప్పటికిని ఉండునదే యని "నిత్యశ్చ" అనుదానిలోను, శాస్త్రము సిద్ధరూపమున కుపపత్తిని చెప్పునది మాత్రమే అనుదానిని "సంస్కారార్థో నియమః" అనుదానిలోను, శాస్త్రనియమము గల పదము ఆ నియమమును తప్పినచో నదియే గ్రామ్యమగును గాని శాస్త్రనియమమే లేని పదము గ్రామ్యము గాదని "అనియమా ద్గ్రామ్యం" అనుదానిలోను, వ్యాకరణ నియమమును తప్పిన గ్రామ్యము శాబ్దగ్రామ్యము గాని అర్థగ్రామ్యము గాదని "య త్త్వపభ్రంశః" అనుదానిలోను, దేశ్యపదములు దేశకాలములను పట్టి మారుచుండునుగాని యేకరూపముగా నవియే యుండవు. లోకవ్యవహారము ప్రవాహమువలె నవిచ్ఛిన్నమైనందున దేశ్యభాష యాయాయి దేశవ్యవహారసిద్ధమై ప్రవాహనిత్యమనుదానిని "ప్రవాహినీ దేశ్యా" అనుదానిలోను, ఏయే కాలమం దేయే దేశమం దేయేపదము లేయే యర్థమందు సంకేతింపబడి సుప్రసిద్ధములై యుండునో ఆయా దేశములందు ఆయా కాలమునందు ఆయా యర్థములందే ఆయాపదములు గ్రంథములందు ప్రయోగించికొనవలయునను దానిని "ఇహాతు ప్రవ్యాహార్యం సంకేతిత సుప్రసిద్ధమేవ పదం" అను దానిలోను తన వ్యాకరణమందు వాగనుశాసనుడు చెప్పియున్నాడు.

అందుచేతనే భారతమందు "ప్రాణగొడ్డము", "తన నిర్వాహకము" అను మొదలగునవి లోకము వాడుకనుపట్టియే ప్రయోగించికొనియు నున్నారు.

చిన్నయసూరి తన బాలవ్యాకరణమందు గూడ క్రియాపరిచ్ఛేదములో (౧౯-౨ సూ.) "లాతిచో సహితము కాదేశాదులు కానంబడియెడి" అని సముచ్చయార్థమందు "సహితము" అని ప్రయోగించియున్నాడు. "సహితము" అనునది సముచ్చయార్థమందు లోకము వాడుకలోగాని శాస్త్రములందు లేదు.

మీదివాని నన్నిటిని పట్టి చూడగా నుపాసనాతత్త్వవేదులు బాహ్యోపాసనముకంటె నాంతరోపాసనమే యుత్తమమని తలంచినవారగుటను విగ్రహోపాసనమును చేసినను ఆత్మయందే దృష్టినుంచి చేసినట్లే యీ కవితోపాసకులలో ప్రాచీన గ్రంథకర్తలు విగ్రహోపాసనమనదగు శబ్దస్వరూపముకంటె నాంతరోపాసనమనదగు రసాలంకారాదులనే ముఖ్యముగానెంచి వ్యాకరణదోషములను పాటింపక తమ గ్రంథములలో ప్రయోగములను చేసినారని మనము తెలియదగియున్నది.

# అపస్వరాలు

బుర్రా వెంకట సుబ్రహ్మణ్యం

## 1. ఆవిడ

అప్పుడే నాలుగు గంటలు దాటిపోయింది! నాలుగున్నర కాకుండానే వస్తానన్నాడు విశ్వనాథం. అయిదుంపావుకి హాస్టలు సభ కూడా ఉంది. ఒకవేళ నేను ముస్తాబుకాకుండానే వచ్చేస్తాడో ఏమో. ఆవెధవ పుస్తకం చదువుతూ ఇంత పొద్దుపోయిం దనుకోలేదు. ఇంకా ఏ మూడుగంటలో అయుంటుంది అనుకుంటున్నాను......ఆ పచ్చచీర కట్టుకుంటాను. నెల రోజులకిందట అది కట్టుకుని కాలేజికి వెళ్లినప్పుడు చీర చాలా బాగుందన్నాడు విశ్వనాథం నవ్వుతూను...... అన్నట్టు, పచ్చచీర కాదు, మొన్న కొత్తగా కొన్న నీలిరంగుచీర కట్టుకుంటాను. అవును, దానికి రంగు కుదిరే జాకెట్టుకూడా ఉంది...ఈ సబ్బుబిళ్ల ఎక్కడ పెట్టానో రోజూ మరిచిపోతూ ఉంటాను. నాకు ప్రత్యేకంగా ఒకగదీ, ఒకబల్లా, ఒకబీరువా ఉంటేనే కాని సరిపడదు. ఇదుగో, ఇక్కడే ఉంది......సరిపోయింది! గదిలో ఎవరో స్నానం చేస్తున్నారు. ఏమర్రోయ్, ఇంకా ఎంతసేపు? అయిదు నిముషాలే! అవును. నేను తొందరగా ముఖం కడుక్కోవాలి. ఉన్నదానివి ఉన్నట్టుగా, ఒళ్లు తుడుచుకోకుండానే బయటపడమనలేదు, తల్లీ. నువ్వు బట్ట విప్పుకున్నప్పుడు నిన్ను చూడాలని నేనంత బెంగపెట్టుకోలేదు. త్వరగా కానియ్యి. అంతే...మొదట కలుసుకున్నప్పుడు విశ్వనాథం ఒట్టి వెంకిఘటంలా కనిపించాడు, ఎప్పుడూ పొగరుమోతులా వెకిలి నవ్వులు నవ్వుతూ. ఏదోఒకవిధంగా నాదగ్గరికి రావాలనీ, నాతో మాట్లాడాలనీ ప్రయత్నిస్తూ ఉండేవాడు. నేను దగ్గిరున్నప్పుడల్లా, తెనాలి రామలింగడినీ, గిరీశాన్నీ, మావూరి శంబరిప్రకాశంగారినీ మించిన హాస్యకాడిలా కబుర్లు చెప్పబోయి, ప్రతివాక్యానికీ చివరిని నాకేసి పరీక్షగా చూసేవాడు. నిజానికి విశ్వనాథానికి అంత తెలివితేటలు లేవు. అతనితో తరచు తిరిగే భీమశంకరానికి ఎక్కువ తెలివితేట లున్నాయి. ముక్తసరిగా మాట్లాడినా ముత్యాలలాంటి మాటలు మాట్లాడుతాడు భీమశంకరం. పల్లెటూరు హాస్యాలు కావు. మనిషిమాత్రం మరీ అందవికారంగా ఉంటాడు. అతను ఎన్నడూ పళ్లుతోముకున్నట్టే కనపడదు...... వచ్చేవు తల్లీ? స్నేహితు డొక డొస్తున్నాడు. ఎవరయితే ఎందుకులే! నువ్వు తర్వాత చూడలేకని కాదు. విశ్వనాథం......... గదంతా పాడుచేసి పోతారు. కంపుకంపు. దానికితోడు ఇదొక చీకటి కోణం. నిన్నరాత్రి జారిపడ్డాను కూడాను......... అన్నట్టు, తువ్వాలు మరిచిపోయాను ఈహడావిడిలో. అతను వచ్చేస్తాడో ఏమిటో. తువ్వాలు తెచ్చుకునే లోపున ఈగదిలో ఎవరూ దూరరుకద! జాకెట్టు విప్పి తలుపుమీద పెట్టిపోతాను...... ఎవరూ రాలేదు. కొళాయినీళ్లు ఎంత వేడెక్కిపోయాయి! ఈసబ్బుకి సువాసన మరీహెచ్చుగా ఉంది. మన స్వదేశీసబ్బులన్నీ ఇంతే అనుకుంటాను.... నాముక్కు దిద్దినట్టు తిన్నగా లేకపోయినా, నానుదురు మరీ చిన్నదయినా, నాగడ్డం ఆసినీమానటి శాంతాబాయి గడ్డం ఉన్నట్టు ఇత్తడిచెంబుయొక్క కిందభాగంలా ఉన్నా నా ముఖంలోఉన్న కళకాంతులు ఎవరిముఖంలోనూ లేవన్నాడు విశ్వనాథం, మొన్ననే చటుక్కున మరొక సంగతేదో మాట్లాడుతూ ఉండగా. నానల్లని విశాలమైన కళ్లుచూస్తే ఎవరైనా మిగిలిన లోపాలు మరిచిపోతారట. కాస్త వాగనిస్తే విశ్వనాథం వాగినట్టు మరెవరూ వాగలేరు. నిజానికి విశ్వనాథం చాలా అమాయకుడు. చిన్నపిల్లాడిలా కోపాలు పెట్టుకుంటూ ఉంటాడు. కానేపట్లోనే మళ్లీ చిన్న పిల్లాడిలా అన్ని కోపాలూ మరిచిపోతూఉంటాడు. శారద గురించి తను నాతో చెప్పిన మాటలకి నాకు నిజంగా కోపంవచ్చిం

దచుకున్నాడు. ఆరాత్రికిరాత్రి కూర్చుని ఎనిమిది పేజీల ఉత్తరం వ్రాసి పడేసేడు నాకు. శారదా నేనూ ఎప్పుడూ కలిసి తిరుగుతుంటే అందరూ ఏమిటో అనుకుంటారు......జారిపోయిందీ సబ్బుబిళ్ల. ఈవెధవగదిలో కిందపడ్డసబ్బు మళ్లీ తీసుకునేందుకు లేదు. పోతే పోయింది. సరికొత్తబిళ్ల. నిన్ననే కొన్నాను. మరొక నాలుగణాలు దండుగ. బజారులో మూడణాలన్నారే. ఇక్కడ నాలుగణాలు...విశ్వనాథం నన్ను కలసుకోక ముందు ఏ ఆడపిల్లతోనూ స్నేహం చెయ్యలేదు. తనకి గుంటూరులో ఆడస్నేహితు లున్నట్టు డాబుచేస్తాడు కాని, నేనే అతని మొదటి స్నేహితురాలిని. ఈ మొగపిల్లలు ఇంతకిముందు ఆడవాళ్లతో సహవాసం ఉన్నవాళ్లో, లేనివాళ్లో తెలుసుకునేందుకు ఒకటే గుర్తు. ఇంతకిముందే ఆడవాళ్లతో సహవాసం ఉన్నవాళ్లు కొత్తగా మన సహవాసం సంపాదిద్దామని ఉద్దేశించినప్పటికీ అంత తెలివితక్కువగా మనవెంట పడరు. విశ్వనాథం మొదటిలో నవ్వుతూ ఉండేటట్టు మనం కనపడగానే వెకిలినవ్వులు నవ్వరు. మనవెంట పడకుండా మనని ఆకర్షించేందుకు ప్రయత్నిస్తారు. మళ్లీ, వాళ్ల మౌనానికీ కొత్తవల్ల సిగ్గుపడేవాళ్లు మాట్లాడకుండా ఉండడానికీ చాలా భేదం ఉంది. మొన్న శెలవలలో కలసుకున్న పెద్దమనిషి ఆడపిల్లల్ని కొందర్ని ఎరుగుండుండాలి. లక్నోలో ఆయన చదువుచెప్తున్న ఆడపిల్లలే కొందరుండుండాలి. రెండురోజులు ఇంట్లో పెట్టుకుని, నాన్న ఆయన్ని నన్ను పెండ్లిచేసుకునేటట్టు చేద్దామని ప్రయత్నించాడు కాని ఆమనిషి పట్టుపడలేదు. చాలా గడుసుమనిషి. ఆయన వెళ్లిపోయాక ఆయన కొక ఉత్తరంకూడా వ్రాసేను. అదిచూసి ఏమనుకున్నాడో! జవాబు మాత్రం ఇవ్వలేదు. నాన్న తొందరపడకుండా అప్పుడప్పుడు కొంతసేపు మమ్మల్నిద్దర్నీ వదిలేస్తే ఆయన ఏమి చేసుండునో! ఆఖరాఖరికి ఆపెద్దమనిషి నాతో కూర్చుని మాట్లాడడం తనకి నచ్చినట్టూ, నాకు తను లోబడుతున్నట్టూ కనపడ్డాడు. నాన్నకిలాంటి సంగతులేవీ తెలియవు. నాన్న ఒట్టి అమాయకుడు. అమ్మఎంత చెప్తే అంతే. ఎన్నడూ గట్టిగా తను మాట్లాడడం విన

లేదు......ఈ జాకెట్టేదీ? కిందపడిపోయింది. రామ రామ! గదిలో మూలపడెయ్యాలి. చాకలివాడు మళ్లా శనివారంనాడు వచ్చేదాకా అక్కడే పడుంటుంది. పాతబట్టలకి సంచిఒకటి కొనాలి. జుట్టంతాకూడా తడుపుకున్నట్టున్నాను. హడావిడిలో ఏపనీ సమంగా జరగదు......విశ్వనాథం ఇంకా రాలేదనుకుంటాను. లేకపోతే కబురొచ్చుండును. అతనికి నేనంటే ప్రతిరోజూ పెరిగిపోతోంది ప్రేమ. నావల్ల తన చదువు క్షీణిస్తోందని గోలపెట్టున్నాడు. ఈమధ్య, అందరి ఎదురుగుండానూ నాతో మరీ చనువుగా ఉన్నట్టు ప్రవర్తించొద్దంటే కోపం తెచ్చుకున్నాడు. నాలుగురోజులు మాట్లాడలేదు. రావలసినరోజున రాలేదు. నేను మళ్లీ క్షమించమని ఉత్తరం వ్రాసేవరకూ చూడడానికి రాలేదు. అప్పుడు వచ్చిననాడు మళ్లీ అపరిమితానందం చూపించాడు. నే నేమిటి చెయ్యమన్నా చేస్తాడతను. ధనవంతుడు. ఖరీదైన బహుమానా లిస్తాడు. వద్దంటే వినడు. చాలాడబ్బు గణించుండాలి విశ్వనాథం తండ్రి. నాకంటె అతను ఒక్క ఏడాదే పెద్ద...ఈ చీర పెట్టెకి అడ్డకిందుగా ఉంది కాబోలు. పెద్దపెట్టెబదులు రెండు చిన్న పెట్టెలుంటే బాగుండును. నాన్నకీ అమ్మకీ బుద్ధిలేదు. ఈ పెద్ద తోలుపెట్టె ఎవరు కావాలన్నారు? పైగా, నాకోసం అప్పుడే కొనేసి ఉంచామని కబురు చెప్పడం! దీనికి సరిపోయిన జాకెట్టేదీ? అన్నట్టు, నిన్ననే చాకలివాడికి వేసేను. పోనీ, ఇది సరిపోతుందనుకుంటాను. ఇదికాదు. సరే, ఏదో ఒకటి...ఏమిటంటావు? విశ్వనాథం వచ్చేనేడా? కూర్చోమన్నావా? ఎందుకలా నవ్వుతావు? చెవిలో సబ్బుండిపోయిందా? ఏమీ లేందే! 'హేజలిన్ స్నో' పూసుకుంటున్నాననా? నువ్వెన్నడూ పూసుకోనట్టు! నీ వకీలుస్నేహితు డొచ్చినప్పుడు నువ్వు చేసుకునే సింగారాలో? ఊరికే మాట్లాడకూ! నేను చీర కట్టుకోవాలి పైకైనా వెళ్లు. లోపలికైనా రా. సరే పో...ఇంకా నాలుగున్నర కాకుండానే సిద్ధం అయినట్టుంది విశ్వనాథం. కోపాలు పెట్టుకోకుండా ఈవాళ సరదాగా మాట్లాడితే బాగుండును. పెళ్లిచేసుకోమని అడుగుతాడేమో విశ్వనాథం ఎప్పుడైనా!

నా కేమీ తోచడంలే దీవాళ. గుండెలో ఒక దడ మోస్తరుగా ఉంది...పెట్టె తాళంవేసేనా? లేదు. నానా చీకాకుగానూ ఉంది. అద్దం ఏదీ? అసహ్యంగా ఉన్నాను. తలైనా సరిగ్గా దువ్వుకునేందుకు వేళలేదు. నాకోసం అక్కడ కాచుకుని కూర్చోడం తనకి మర్యాద టికి నచ్చదని అనేకసార్లు చెప్పేడు విశ్వనాథం...మళ్లీ వచ్చావు, తల్లీ. నువ్వు పైకి వెళ్లేటట్టయితే గదికి తాళం వేసుకుని వెళ్లు. నా దగ్గిర తాళం ఉంది. ఇదుగో, వెళ్తున్నానుకా.

*

* *

2. అతను

ఒరే, సుబ్బారావు, ఆ తువ్వాలూ సబ్బుబిళ్లా అక్కడపెట్టి—తర్వాత స్నానం చేద్దుగాని—నాజోళ్లకి కాస్త రంగువేసిపెట్టూ. వెధవగీర్వాణాలకి పోకుమరి. ఇలాంటిపనులు నీ కెన్నిసార్లు చేసిపెట్టేలో. అవునురా. తొందరగాపోవాలి. అప్పుడే నాలుగుకావచ్చింది. నాలు గున్నరకి అక్కడుండకపోతే ఏమవుతుంది. నీ ముఖం! రంగువేసిపెట్టు మరి. అలాగ!...అయితే, నన్ను చూస్తే ఎవరూ మోహించరంటూవా? గుంటూరులో నా శోభ నీకు తెలియదు మరి. దరిద్రపు కాకినాడలో పుట్టిపెరి గేవు. అయితే రంగువెయ్యడం అంటే అంతే? మరికొం చెం రంగు పులిమి ఆ గుడ్డముక్కతో జోళ్లు కాస్తమెరిసే టట్టు తోమరా, నాయనా. సరే, పో. నేనే చేసుకుం టానులే. మళ్లా నీ కేపనైనా చేసిపెడ్తే ఒట్టు...ఈ పని చేసుకునైనా స్నానానికి వెళ్లేనుకాదు. ఇప్పుడు చేతులు మళ్లీ రంగవుతాయి. మళ్లీ సబ్బుతో చేతులుకడుక్కోని రావాలి ... ఏమిట్రా, మళ్లీవచ్చావు? అవునుమరి, నీ తాళం నువ్వు దగ్గిరుంచుకోకపోతే ఎలాగ? నేను గదికి తాళంవేసి వెళ్లిపోతాను...ఈ సుబ్బారావుగాడికి కల్యాణిసంగతంతా చెప్పేస్తున్నాను. వీడుతీరానలుగురికీ ఊదేస్తాడో ఏమిటో. ఊదడానికి ఏముందని కాని... ఈకిటికీలో చెయ్యి కడుక్కుంటే చాలు. అంత మరీ రంగు కాలేదు...ఈనెక్ టైలన్నా, ఈపంట్లాములన్నా, ఈకోట్లన్నా నాకు విసుగుపుట్టోంది. కాంగ్రెసు రాజ్యంవచ్చాక ఈవేషాలన్నీ పనికిరావని వాళ్లొక తీర్మానం జరిపితే బాగుండును. మొన్న కల్యాణితో మాట్లాడుతూ కాలేజికి మొగాళ్లందరినీ గోచీలతో రానిస్తే బాగుండునని నేనంటే 'అవిపట్టుకు ఎందుకు?' అని జవాబుచెప్తూ అమాంతంగా గట్టిగా నవ్వడం మొద లెట్టింది. చుట్టుపక్కల వాళ్లంతా మాకేసిచూడడం మొదలెట్టేరు. ఈమాటకూడా సుబ్బారావుగాడికి చెప్పేను. వాడు, ఆడవాళ్లందరూ పోకిరీ లయిపోతు న్నారంటూ, కల్యాణిపేరు చెప్పి తిట్టిన తిట్లు ఇన్నన్ని కావు. నాకూ కల్యాణికీ ఉన్న పరిచయబలం వాడికింకా పూర్తిగా బోధపడలేదు.... నా తెలివితేటలు అపరిమిత మైనవని కల్యాణి ఉద్దేశ్యం.నన్నుకలుసుకున్నప్పటినుంచీ నేను దగ్గిరుండగా, మిగిలిన వాళ్లెవరు మాట్లాడుతూ ఉన్నాకూడా, నాకేసే చూస్తూ కూర్చుంటుంది. క్లాసు లోకూడా అంతే.నాకు చదువులో అంతశ్రద్ధ లేకపోయి నా లోకజ్ఞానంలోనూ, హాస్యపు కబుర్లు చెప్పడం లోనూ నన్నుమించినవాడు లేడని కల్యాణికి తెలుసును. మొదటిరోజులలో నేను తమాషాగా మాట్లాడుతుంటే, ఒకటేనవ్వు నవ్వేది నేను మాటనడం తడవుగా...... సరిపోయింది! ఈ పంట్లాముకి ముఖ్యమైనచోట బొత్తాం విరిగిపోయింది. ఈ చాకలాళ్లందరూ ఒక్క సారిగా చస్తే బాగుండును! ఇప్పుడేమిటి చెయ్యడం? నా దురదృష్టం కొలదీ నా మిగిలిన మూడుసూటూ చాకలాడికి పడ్డాయి. కుట్టించేందుకు వేళలేదు. 'సేఫ్టీ' పిన్ను పెడ్తే సరిపోతుంది. పొద్దున్న సుబ్బారావు దగ్గి రొకటి చూసేను. ఇదిగో, బల్లమీదే పడేశాడు వాడు. అదృష్టవంతుడినే ఈ రోజుకి...... అన్నివస్తువులూ బల్లమీదే పడేస్తాడు ఈ సుబ్బారావుగాడు. ఎంత చెప్పినా లాభంలేదు ......... నాలుగు గంటలయి పోయిం దప్పుడే. ఆలస్యంఅయితే గోలపెట్టుంది. గోల పెట్టుందన్న మాటేకాని, నిజానికి, నేనువెళ్లిన పది పది హేను నిముషాలవరకూ హాజరవదు. ఎప్పుడూ, ముందు తన స్నేహితురాలు, ఆ శారద వచ్చి, ఎంతో ఆప్యా యంగా నవ్వుతూ కూర్చోమని చెప్తుంది. నేనూ కల్యాణీ మాట్లాడుతున్నంతసేపూ ఏదో ఒక మిష పెట్టుకుని కల్యాణికి కనపడకుండానూ, నాకు

కనపడేటట్టూ ఎక్కడో ఒకచోట పచార్లు చేస్తూనో, నుంచునో, కూర్చునో సిద్ధం అవుతుంది. కల్యాణితో ఎప్పుడైనా చెప్దామనుకుంటే, నామాట నమ్మక, కస్సుబుస్సు మంటుందేమోనని కంగారు. ఈ ఆడపిల్లలు ఒకరితో ఒకరు ఇంతస్నేహంగా ఎందుకుంటారో నాకు తెలియదు. వీళ్లని బోధపరచుకోడం కష్టం.........నాలుగూ అయిదునిముషాలు! రిక్షాలో వెళ్తేకాని వేళకి చేరననుకుంటాను. రిక్షా అయినా రమారమి అరగంట తీసుకుంటుంది. నాతాళా లేవీ ? వీటికోసం వెతుక్కునేసరికి పుణ్యకాలంకాస్తా దాటిపోతుంది. స్నానాలగదిలో మరిచిపోయానేమో. లేదు. చేతిలో ఆడిస్తూ తెచ్చినట్టే జ్ఞాపకం. ముక్కూ, చెవులూ, వేళ్లూ ఉన్నట్టు దేవుడు మిగిలిన అవయవాలతోపాటు జన్మలో కావలసిన తాళాలన్నీకూడా శరీరాన్నే ఎప్పుడూ అంటుకునుండేటట్టు మనందరినీ సృజిస్తే బాగుండును. ఇవుగో, పంట్లాం జేబులోనే ఉన్నాయి. వీటి దుంప తెగ! మరి తాళంకప్పో? ఈ బల్లనిండా పుస్తకాలు పడేస్తాడు వీడు. చదువూ లేదు మన్నూ లేదు. ఇదుగో నాలుగూ పదయిందప్పుడే!.........ఒరే, రిక్షా, ... ఎంత కావాలి? ఆరణాలే! రంగూను వెళ్లిరావచ్చు నా డబ్బుకి. రెండణా లిస్తాను. సరేపో. పోనీ, రెండణాలన్నర. మూడణాలకి తక్కువకి రావు? సరే, రా. అవసరంగా వెళ్లవలసొచ్చింది. బేరమాడేందుకు సమయంకాదు. త్వరగా పద. బక్కపీనుగులా ఉన్నావు నిన్ను తిట్టడంలేదురా, బాబూ. నీకు తెలుగు సమంగా రాదు. చెన్నపట్నంలో మాకు ఇదొకగోల... నాలుగూ పదిహేను! ఎన్నాళ్లు పోయాక, కల్యాణిని చూడడానికి వెళ్లేటప్పుడు నాకీ గుండెదడదడ మానుతుందో! కలుసుకున్నప్పుడు మొదట కల్యాణి చాలా గర్విష్ఠురాలిలా కనిపిస్తుంది కాని, నిజానికి చాలా మంచి అంతఃకరణ, చాలా నిర్మలమైన హృదయం. నేనంటే తనకి అపరిమితమైన ప్రేమ. నన్ను కలసుకున్న మొదటి రోజునుంచీ తన మనసులో మిగిలిన కుర్రాళ్లందరూ ఒక ఎత్తునీ, నేనొకడినీ ఒక ఎత్తునీ చెప్పింది. ఉండి ఉండి నాతో అలాంటి మాటొకటి అంటూఉంటుంది. ...ఓయ్, రిక్షా, కొంచెం త్వరగా పోనియ్య మరి. తొందరగా వెళ్లాలి. అప్పుడప్పుడు కల్యాణి చాలా తెలివితక్కువగా మాట్లాడుతూఉంటుంది. చిన్నపిల్ల నాకంటె తను ఒక ఏడాదే చిన్న. కాని, లోకజ్ఞానం చాలా తక్కువ. ఆ మధ్య తను అందరిఎదుటా తనతో మరీ చనువుగా ఉండొద్దని నాతో చెప్పినప్పుడు, నేను తనకేసి చూడడం మానేసి, తనని చూడడానికి కూడా వెళ్లకపోయేసరికి, ఏడుస్తూ పెద్ద ఉత్తరం వ్రాసింది. జాలిపడి నేను మళ్లీ చూడడానికి వెళ్లినప్పుడు నన్ను చూసి తనుపడ్డ ఆనందం వర్ణించనలవి కాదు...ఏయ్, రిక్షా, అక్కడికికాదు. ఇంకాపైకి వెళ్లాలి. నేను ముందేచెప్పేనుకా. మూడణాలు ఇక్కడికే ననుకున్నావా ? నీకు మతిపోయిందేమిటి? పోట్లాడితే జాగ్రత్త. ఎందుకొప్పుకున్నావు మరి ?......వీడు పోట్లాడుతాడో ఏమిటో, గోల!...ఆడవాళ్లకి మలాగ్గా లొంగిపోతే లాభంలేదు. అప్పుడప్పుడు మనం కొట్టుసరి చేస్తేకాని మనకి గడవనూగడవదు, వాళ్లకి మనం అంటే మర్యాదా ఉండదు. ఒక్కవారంరోజులు తనకేసి చూడకుండా నిర్లక్ష్యంగా తిరిగేసరికి మళ్లీ నాకాళ్లమీద కొచ్చిపడింది. ఆ సమయంలో అది నేను కాకుండా మరొకడైయుంటే తెలివితక్కువవల్ల మరీలోకువైపోయుండును. ఎల్లకాలం వాళ్లగురించే ఆలోచిస్తున్నట్టూ, వాళ్ల వెంటేపడుతున్నట్టూ, వాళ్లకోసమే పడి ఏడుస్తున్నట్టూ స్థిరమైన అభిప్రాయం కుదరనివ్వకూడదు. కల్యాణికి నిజంగా అంత అనుభవజ్ఞానంలేదు. లేకపోతే అంత తెలివైనపిల్లకి అంతసున్నితమైన స్వభావంఉండడం కష్టం. నన్నుకలసుకున్నంతవరకూ ఎన్నడూ పరాయి మొగవాడితో ఇంత చనువుగా మాట్లాడలేదు. మన కుటుంబాలలో శారదాచట్టాలు ఎన్నివచ్చినా పరిస్థితులు అంతేకా... ... ... నిజానికి, కల్యాణి నన్ను ప్రేమించినంత కల్యాణిని నేను ప్రేమించలేననుకుంటాను. తను నాకువ్రాసిన ఉత్తరాలు కొన్ని సుబ్బారావుకి చదివి వినిపిస్తే వాడు గుండె బాదుకున్నాడు. ఇంగ్లీషు బాగా వ్రాయలేదు కల్యాణి. సుబ్బారావుకి చదివి వినిపించేటప్పుడు, తప్పులుసద్ది, తప్పులున్నట్టు తెలియపరచకుండా చదివి వినిపించాను. అందువల్ల సుబ్బారావు కల్యాణి వ్రాసే ఇంగ్లీషుశైలికూడా విని ఆశ్చర్యపడ్డాడు ... ... ... కల్యాణి అంత అందమైనదికూడా కాదు. ఆ ముక్కూ ఆగడ్డం మరీ అంద

వికారంగా ఉంటాయి. ఆ కళ్ళయినా, మంచి నలుపైనప్పటికీ, మంచి విశాలం ఉన్నవైనప్పటికీ, దారుఢ్యం లేనివాళ్ల కళ్లల్లా దిగపడిపోయి ఉంటాయి ముఖం చూసి మోహించడం కష్టం. గుండ్రనిముఖం. గుండ్రనిముఖాలు నాకు నచ్చవు. కల్యాణి శరీరసౌష్ఠవం కూడా అంత చెప్పుకోతగినది కాదు. కాని చాలా తెలివైనది. శరీర సౌష్ఠవానికి నా చిన్నప్పుడు కార్లి కౌరు సర్కస్సులో తీగమీద నడిచిన మలయాళపు పిల్లతర్వాతనే ఎవరినైనా చెప్పాలి. వాళ్లు గుంటూరులో ప్రదర్శనా లిస్తున్నప్పుడు ఆ పిల్లని చూసి నేను మోహించినట్టు నేనెన్నడూ మరెవరినీ మోహించలే ననుకుంటాను. బిగుతుగా పట్టేసీ, నిగనిగ మెరిసేవీ ఆబట్టలు తొడుక్కుని గొడుగు దివ్యంగా ఆడిస్తూ ఆతీగమీద నడుస్తుంటే నా ఆనందం చెప్పాలా? చిత్రం, నా కప్పుడు పన్నెండేళ్లో పదమూడేళ్లో! ఆపిల్లకి పాతికేళ్లదాకా ఉండుండొచ్చును! ఆపిల్ల ఎక్కడ, కల్యాణి ఎక్కడ!......... ఏమోయ్, రిక్షా, ఇక్కడే ఆపు. నాదగ్గర మూడణాల చిల్లర లేనట్టుందే. నీదగ్గిర చిల్లరుందా? నాలుగణాలకి. లేకపోతే ఎలా అనుకున్నావు మరి? తర్వాత నాగదికి రా...అక్కడికొచ్చి విశ్వనాథంగారికోసం వచ్చానని చెప్పు ఇస్తాను. ఏమిటి చెయ్యమంటావు మరి? వెంటపడకు ఎక్కడి కొస్తావు? చిల్లర లేదంటే వినవేమి? కావలిస్తే, రెండణా లిచ్చేస్తాను. తర్వాత వచ్చి అణా పుచ్చుకో. ఏమిటా అనుమానం? నీతో తప్పుపేరు చెప్పి అబద్ధాలాడుతున్నాననా? వెంటపడ్డావంటే జాగ్రత్త. సరే, ఈనాలుగణాలూ తీసుకుపో. వెధవగోలా నువ్వూను. తిట్ట కేంచేస్తాను? వెధవా!... ఈరిక్షాలలో రావడమే తప్పు. కల్యాణి ఈవాళైనా సరదాగా మాట్లాడితే బాగుండును. నా కేమీ తోచడం లే దీవాళ. పరిమితి లేకుండా నన్ను ప్రేమిస్తున్నానని చెప్తే బాగుండును......అదుగో, అప్పుడే చూసింది నన్నా శారద. అవునండీ, కల్యాణికోసమే వచ్చాను. కూర్చుంటాను లెండి......శారదకి నేనంటే ఇంత ఆపేక్ష ఎందుకో! ......అవునండీ, కల్యాణికోసమే. అప్పుడే వారెవరో చెప్పేందుకు వెళ్లేరు......ఈ ఆడపిల్లలకందరికీ తెలుసును నేను కల్యాణికోసం వస్తానని. కాని ప్రతి సారీ ఒకడజనుసార్లైనా నన్నడిగి తేనేకాని తృప్తిపడరు. ......వెధవ రిక్షావాడు నాలుగణాలు లాక్కుపోయాడు......ఏమండీ? వస్తోందా? సరేలెండి. మిమ్మల్ని చాలా కష్టపెట్టేను.........వస్తోందని చెప్పడానికి మళ్లీ ఎందుకో రావడం ఈ శారద?.........అదుగో కల్యాణి!

* * *

### 3 వాళ్లిద్దరూ

ఆవిడ:—నాలుగన్నర కాకుండానే వచ్చేనే వీవాళ!

అతను:—నాలుగున్నర దాటి ఏనాడయింది?

ఆవిడ—ఏదీ, ఎంతయింది చూడనీ. అబ్బో! నీ గడియారం సరిగ్గా తిరుగుతోందీ? నే నింకా నాలుగున్నర దాటలే దనుకుంటున్నాను. తలదువ్వుకోబోతుంటే నువ్వు వచ్చినట్టు కబురొచ్చింది. దువ్వుకోకుండానే వచ్చేసేను. నానా అసహ్యంగానూ ఉంది జుట్టు.

అతను:—ఇప్పుడే స్నానం చేసేవా?

ఆవిడ:—అవును ...ఏమి టింత మౌనంగా ఉన్నావీవాళ?

అతను:—ఏమీ లేదు.

ఆవిడ:—నువ్వువచ్చేరోజున పొద్దుటినుంచి నువ్వువచ్చేవేళకోసం ఎదురుచూస్తూ కూర్చుంటాను. నాకు మరొక పనేదీ జరుగదు. రోజల్లా అదే ఆలోచన. నీలాకాదు నేను....బయలుదేరేవేళకి తప్ప నీకు నేను జ్ఞాపకమే రాననుకుంటాను!

అతను:—నువ్వు మనకాలేజికివచ్చేటప్పుడు రిక్షావాడికి ఎంతిస్తావు?

ఆవిడ:—ఆ ప్రశ్నెందుకిప్పుడు?...రెండణాలు.

అతను:—ఇంతే?

ఆవిడ:—అవును. అంటే, ఇద్దరిద్దరంవెళ్తాంకాదూ, చెరొక రెండణాలూ ఇస్తాము.

అతను:—రిక్షాలో ఒక్క రేనైతే?

ఆవిడ:—అప్పుడప్పుడు మూడణాలకే కుదురుతారు. అప్పుడప్పుడు నాలుగణాలూ ఇవ్వవలసొస్తుంది. ఎందు కీ ప్రశ్నలన్నీ ?

అతను :— ఈవాళ నే నిక్కడికి రిక్షాలో వచ్చానులే. మూడణాలకి బేరమాడేను. తీరా ఇక్కడికి వచ్చాక నాలుగణాలు పుచ్చుకుంటే కాని వది లేడు కాదు.

ఆవిడ :—పోనిద్దూ, ఒక అణాయేకా నష్టం.

అతను :—అణాకోసం కాదు...నువ్వెప్పుడూ ఇంతే. ...ఈ రిక్షావెధవలు...

ఆవిడ :—అవునులే. వాళ్లంతా దొంగవెధవలు. నాకు తెలుసును. నేనుకూడా అనేకసార్లు వాళ్లతో పోట్లాడేను...నువ్వివాళ ఎందుకో సరదాగా లేవు.

అతను :—సరదాగా లేకేమీ ?...అన్నట్టు నేనుచెప్పిన సినీమాకి వెళ్లేవా ?

ఆవిడ :—'భాగ్యచక్ర' కేనా ? వెళ్లేను. నిన్న సాయింత్రమే వెళ్లేను.

అతను :—ఎలా ఉంది ?

ఆవిడ :—బాగానే ఉంది. హిందీ తెలియకపోవడం వల్ల కొన్నికొన్నిచోట్ల బోధపడలేదు...నిన్న మన క్లాసువాళ్లు చాలామందొచ్చారు ఆ సినీమాకి.

అతను :—ఎవరెవరు ?

ఆవిడ :—చాలామందొచ్చారు. నిరంజనరావు, నారాయణ స్వామి, వెంకటశాస్త్రి, సుందరరావు, ప్రకాశరావు, శివరామ కృష్ణయ్య...

అతను:—ప్రకాశరావు కూడా వచ్చాడా?

ఆవిడ:—వచ్చాడు. రావడమే కాకుండా, తనకారులో మమ్మల్నిక్కడికి తీసుకువచ్చి దిగపెట్టేడు కూడాను.

అతను:—మిమ్మల్నంటే ఎవరెవరిని ?

ఆవిడ:—నాతో ఇక్కడనుంచి మరొక ఇద్దరుపిల్లలు వచ్చారు.

అతను:—ఇంతమందికి అతని చిన్నకారు సరిపోయిందీ ?

ఆవిడ:—సరిపోకేమీ ? మేము ముగ్గురమూ... అంటే, అనే, మిగిలినఇద్దరూ వెనకసీట్లో కూర్చున్నారు. నేను ముందుసీట్లో కూర్చున్నాను. అతను నడుపుతున్నాడు.

అతను:—ఏమంటాడు ప్రకాశరావు ?

ఆవిడ:—ఏమంటాడు ? 'భాగ్యచక్ర' చాలా బాగుందన్నాడు.

అతను:—ఉఁహూ.

ఆవిడ:—తర్వాత... ఎప్పుడైనా నన్ను చూడడానికి ఇక్కడికి వస్తానన్నాడు... ఈవాళే వస్తానన్నాడసలు...

అతను:—నువ్వు రావద్దన్నావా?

ఆవిడ:—తర్వాత ఎప్పుడైనా రమ్మన్నాను. కావలిస్తే, రేపు రమ్మన్నాను.

అతను:—నేనుండగా అతను రాకూడదనా ?

ఆవిడ:—అదికాదు. అతనొస్తే మనం మామూలుగా మాట్లాడుకునేందుకు వీలుండదని.

అతను:—ఇప్పుడే చెప్తున్నాను, కల్యాణీ! నువ్వుమట్టుకు రేపు ప్రకాశరావువచ్చినప్పుడు అతన్నిచూడడానికి దిగొస్తే, నేను మరెన్నడూ నిన్ను చూడడానికి రాను, నీతో మరెన్నడూ మాట్లాడను.

ఆవిడ:—తీరా అతనొస్తే చూడకుండా ఉండడం ఎలాగ?

అతను:—ఎలాగేమిటి? నిశ్చయించుకుంటే అనేకమార్గాలుంటాయి. లేవని కబురుపంపించు. లేకపోతే ఆవేళకి ఎక్కడికైనా వెళ్లిపో.

ఆవిడ:—అతన్ని రమ్మని నేనేచెప్పి, వచ్చాక చూడకపోతే బాగుంటుందా ?

అతను:—ఎందుకు రమ్మని చెప్పేవు ?

ఆవిడ:—అతను వస్తానంటుంటే నే నేమని చెప్పను మరి ?

అతను:—ఏదో సామెత చెప్పినట్టుంది. అన్నిటికీ ముఖ మాటమే ?

ఆవిడ:—అతను కారులో ఇక్కడ దిగపెట్టి అప్పు డన్నాడు 'ఎప్పుడైనా వస్తా'నని.

అతను:—అతని కారులో ఎందుకు రావాలి నువ్వు ? అక్కడ రిక్షాలులేవూ ? ట్రాము లేదూ ?

ఆవిడ:—అతను మర్యాదగా కారులో దిగపెట్తానం టుంటే ఎలావద్దనడం ? అన్నిటికీ తప్పు పట్తావు నువ్వు. నాకేమీ తెలియదు. నేనొక తెలివి తక్కువ మొద్దుని.

అతను:—నువ్వేమీ మొద్దువికావు. చాలా గడుసు దానివి.

ఆవిడ:—ఈనాళ పొద్దుటినుంచి నువ్వు వస్తావనీ, నీతో సరదాగా కబుర్లు చెప్పుకుంటూ కాలంగడ పొచ్చు ననీ ఆశ పెట్టుకున్నాను. రావడమే రుద్రుడులా వచ్చావు. ఈరోజల్లా నేను పడు తున్న చీకాకు లన్నీ నీతో చెప్తే నీకు తెలుస్తుంది నాతో ఇలా మాట్లాడి నువ్వు నన్నెంత కష్ట పెట్తున్నావో.

అతను:—నిన్నెవరు కష్టపెట్తున్నారు ? నిన్ను కష్ట పెట్టగలిగే శక్తిగూడా ఉందేమిటి నాకు ? ఏమిటి నీ చీకాకులన్నీ ?

ఆవిడ:—ఎందుకు చెప్పడుని ఏడవడం నీకు నాలో సరదా లేకపోయాక ?

అతను:—అయినా చెప్పు.

ఆవిడ:—నిన్నరాత్రి స్నానాలగదిలో జారిపడ్డాను. కాలు బెణికింది. వెన్నుఅంతా నొప్పిగా ఉంది. నిన్నరాత్రి నిద్రలేదు. ఈవాళ పొద్దుటినుంచి తలనొప్పిగానూ, ఒళ్లంతా బాధగానూ ఉంది. నడవడానికి కూడా కష్టంగా ఉంది.

అతను:—ఇప్పుడిలావస్తూ కుంటలేదే నువ్వు !

ఆవిడ:—కుంటాలికూడా కాబోలు.

అతను:—ఇంకాఏమిటి నీ చీకాకుకి కారణాలు ?

ఆవిడ:—నీకంతా వేళాకోళంగా ఉంది.

అతను:—వేళాకోళం కాదు. చెప్పు.

ఆవిడ:—నాసబ్బుబిళ్ల పోయింది.

అతను:—సబ్బుబిళ్ల పోతేనే చీకాకా ?

ఆవిడ:—రోజుకొక సబ్బుబిళ్ల పోతోంది. ఎలా పోతుందో తెలియదు. బజారులో మూడణా లన్నారే. ఇక్కడకొంటే నాలుగణాలూ అయి దణాలూను.

అతను:—ఒక్క అణాకదా భేదం !

ఆవిడ:—భేదం ఎంతయితే ఏమిటి, రోజుకొక సబ్బు బిళ్ల కొనుక్కోడం అవుతోంది. నీలా డబ్బున్న దాన్ని కాను.

అతను:—పోనిద్దూ, సబ్బుబిళ్లకి ఇంత హడావిడేమిటి? ఇంకా ఏమిటి కారణాలు ?

ఆవిడ:—అదికాక శారదా నేనూ ఈవాళ ఘోరంగా పోట్లాడుకున్నాం.

అతను:—భేష్ ! దేనికని ?

ఆవిడ:—దేనికేమిటి ? ఒక కారణంఅని లేదు.

అతను:—అంత పోట్లాడుకున్నా, నే నొచ్చినట్టు నీతో చెప్పడానికి వెళ్లిందే మీస్నేహితురాలు !

ఆవిడ:—తర్వాత మళ్లీ తను వచ్చి నన్ను క్షమించ మని అడిగింది లే...మరొకసంగతి నీ కింత వరకూ చెప్పలేదు. రెండువారాలకిందట మా అమ్మ నా కొక ఉత్తరం వ్రాసింది.

అతను:—ఏమని ?

ఆవిడ:—నీకు చెప్పాలో, చెప్పకూడదో తెలియడం లేదు.

అతను:—చెప్పు. పరవాలేదు.

ఆవిడ:—ఎవరితోనూ చెప్పకూడదు నువ్వు.

అతను:—చెప్పను. చెప్పు.

ఆవిడ:—ఈయేడు పరీక్ష అయిపోయాక శలవలకి ఇంటికి వెళ్లినప్పుడు మానాన్న నాకు పెళ్లి చెయ్యాలని స్థిరపరచుకున్నాడట.

అతను:—ఎవరికిచ్చి ?

ఆవిడ:—ఎవరో ఇద్దరు మాస్టరిని చూస్తున్నాడట.

అతను:—నీకు తెలిసినవాళ్లా ?

ఆవిడ:— నాకు తెలియనివాళ్లే.....అంటే, ఒకరిని మాత్రం ఎరుగుదును

అతను:—ఎవరది ?

ఆవిడ:—ఎవరో కృష్ణమూర్తి. లక్నోలో ఏదో కాలేజీలో ప్రొఫెసరు.

అతను:—నువ్వు చూసేవా ?

ఆవిడ:—చూసేను. చూసేను కాని మాట్లాడలేదు. ఒకసారి ఆయన్ని మా ఇంటికి రప్పించాడు నాన్న, కిందటి శెలవలకి నేను వెళ్లినప్పుడు. ఇందుకోసమని అనుకోలేదు నేను.

అతను:—మీ నాన్న నీకు పెళ్లిచేస్తానంటేకూడా నీకు చీకాకైతే ఎలాగ ?

ఆవిడ:— నాకు పెళ్లిచేసుకోవాలనిలేదు. మా నాన్న వెతుకుతున్న సంబంధాలు నా కసలేనచ్చవు.

అతను:—ఆ లక్నో ప్రొఫెసరు నీకు నచ్చలేదా ?

ఆవిడ:—లేదు.

అతను:—ఎందుకు నచ్చలేదు ?

ఆవిడ:—ఎందుకంటే ఏమని చెప్పను? నచ్చలేదు. అంతే.

అతను:—నీకు నిజంగా ఎవరినీ పెళ్లిచేసుకోవాలని లేదూ ?

ఆవిడ:—లేదు. ...నీకో ?

అతను:—నీకు లేకపోతే నాకూ లేదు.

ఆవిడ:—నాజోలి నీ కెందుకు ?

అతను:—నాజోలి నీకు లేదుకనక.

ఆవిడ:—పెళ్లాడితే నువ్వెటువంటిదాన్ని పెళ్లాడుతావో చెప్పు.

అతను:—నువ్వెటువంటివాడిని పెళ్లాడుతావో ముందు చెప్పు.

ఆవిడ:—నేను ఆ మనిషిని చాలాకాలం బాగా ఎరుగుండుండాలి.

అతను:—చాలాకాలం అంటే ?

ఆవిడ:—అధమం రమారమి రెండేళ్లయినా అనుకో.

అతను:—బాగా ఎరుగుండడం అంటే?

ఆవిడ:—తరచు కలుసుకుంటూ ఉండాలి. అన్ని సంగతులూ మాట్లాడుకుంటుండాలి.

అతను:—ఇంకా వర్ణించు.

ఆవిడ:—అందంగా ఉండాలి. అందంకంటె తెలివితేటలు ఎక్కువగా ఉండాలి. తెలివితేటలంటే పరీక్షలలో చూపించే తెలివితేటలే అని కాదు. చమత్కారంగా మాట్లాడుతూ ఉండాలి. ఎప్పుడూ నవ్వుతూ ఉండాలి. ఎప్పుడూ నవ్విస్తూ ఉండాలి.

అతను:—ఇదంతా నువ్వు నన్నే వర్ణిస్తున్నట్టు కనిపిస్తోందేమిటి ?

ఆవిడ:—నిన్నేమీ కాదు. ఏమి గర్వం నీకు!

అతను:—నిజంగా నీకు నన్ను పెళ్లి చేసుకుందామన్న ఉద్దేశ్యం ఎన్నడూ కలగలేదూ?

ఆవిడ:—లేదు.

అతను:—నిజం చెప్పు.

ఆవిడ:—నాకు ఉద్దేశ్యం కలిగితే మట్టుకు ఏమిలాభం?

అతను:—ఏమీ తెలియనట్టు నటించకు.

ఆవిడ:—ఏమిటి నా నటన ?

అతను:—నేనెందుకు నిన్నిక్కడ చూడడానికి ఇంత తరచుగా వస్తున్నానో, ఈ రెండేళ్లబట్టీ నువ్వూ నేనూ ఒకచోటే ఉండడం నాకెంత ఆనందం కలగచేస్తోందో, నిన్ను నే నెంత ప్రేమిస్తున్నానో.....

ఆవిడ:—మరి గుంటూరులో నిన్ను ప్రేమిస్తున్న అందమైన పిల్లలందరూనో?

అతను:—గుంటూరులో ఎవరూ అటువంటి పిల్లలు లేరు కల్యాణీ.

ఆవిడ:—నిజంగా ?

అతను:—నిజంగా లేరు.

ఆవిడ:—నేను నమ్మను.

అతను:—నిజంగా చెప్తున్నాను. ఎవ్వరూ లేరు. నిన్నొక్కత్తెనే ప్రేమిస్తున్నాను నేను.

ఆవిడ:—ఇంతకిముందు నువ్వెవరినీ ప్రేమించలేదూ?

అతను:—లేను.

ఆవిడ—నిజం చెప్పు.

అతను:—లేదు... అంటే, చిన్నప్పుడొకసారి కార్లికారు సర్కస్సులో తీగమీద నడిచే పిల్లనొకత్తెని చూసి మోహించాను! ఒక నెలరోజులు మన స్తిమితంలేకుండా!

ఆవిడ :—అప్పుడు నీకన్నేళ్లు ?

అతను :—నాకా ? పదిహేనో పదహారో. ఆ పిల్లకి పంథొమ్మిదో ఇరవైయో

ఆవిడ :—భేష్! మోహించి ఏమిటి చేసేవు ?

అతను :—చేసేదేముంది? రోజూ వెళ్లి చూస్తూ ఉండేవాడిని.

ఆవిడ :—నిన్నావిడ చూసిందా ఎప్పుడైనా ?

అతను :—చూసింది. రెండుసార్లు. ఒకసారి, మొదటిసారి మాపినతల్లి కొడుకు రమణయ్యతో,—వాడొకరౌడీ— వాడితో వెళ్లేను. అప్పుడు ఏవో మాటలలో మా ఇంట్లో కుక్క నాలుగు పిల్లల్ని పెట్టిందనీ, కుక్కపిల్లలన్నీ చాలా అందంగా ఉన్నాయనీ చెప్పేను. ఎలాగైనా ఒకకుక్కపిల్లని తనకి తెచ్చిపెట్టమంది. స్నేహితుడొకడికి కుక్కపిల్లకావాలని చెప్పి మానాన్నని బతిమాలుకుంటే ఇవ్వను పొమ్మన్నాడు. మా ఇంట్లో కుక్కపిల్లలన్నీ ఒక్కసారిగా హఠాత్తుగా చచ్చిపోయాయని చెప్పడానికి మళ్లీ వెళ్లినప్పుడు నన్ను రెండవసారి చూసింది. అంతే. ఎందుకు నవ్వుతావు ?

ఆవిడ :—కథలు చెప్పడానికీ, అబద్ధాలు చెప్పడానికీ నీతర్వాతే ఎవరైనా !

అతను :—నిజంగా, కల్యాణీ ఈ ఏడాదయిపోయాక నువ్వెక్కడుంటావో, నేనెక్కడుంటానో! ...నన్ను మరిచిపోకుండా నాకు ఉత్తరాలు వ్రాస్తూవుంటావా ?

ఆవిడ :—వ్రాస్తాను.

అతను :—వాగ్దానం చెయ్యి... చేతిలో చెయ్యివేసి.

ఆవిడ :—వాగ్దానం చేస్తున్నాను.

అతను :—చేతిలో చెయ్యివేసి

ఆవిడ :—ఎవరైనా చూస్తారు

అతను :—పరవాలేదు. అలాగే...నన్నే పెళ్లి చేసుకుంటానని కూడా వాగ్దానంచెయ్యి.

ఆవిడ : —వదలు మరి. అందరూ వస్తూవెళ్తూ ఉంటారు...మరెవరినీ పెళ్లి చేసుకోను.

అతను :—అలాకాదు. నన్నే పెళ్లిచేసుకుంటానని వాగ్దానం చెయ్యాలి.

ఆవిడ :—అదుగో, వాళ్లెవరో చూస్తున్నారు. నిన్నే పెళ్లి చేసుకుంటాను...నా చెయ్యి వదలమన్నప్పుడే వదలవలసింది.

అతను :—పరవాలేదు, కల్యాణీ...కాని, ఇంతకిముందు నువ్వెవరినైనా ప్రేమించావా ?

ఆవిడ:—లేదు. నువ్వే మొదటివాడివి. నాకు అటువంటి ఉద్దేశ్యాలు అంకురించేవేళకి సరిగ్గా నిన్ను చూసేను. నిన్ను చూసినప్పటినుంచీ మరొకరి మీదికి నా మనసు వెళ్లనేలేదు.

అతను:—నిజంగా ?

ఆవిడ:—నిజంగా. నువ్వీవాళ నన్ను పెళ్లిచేసుకుంటానని చెప్పకపోతే నే నీ జన్మంతా ఎంత దుఃఖపడుతూఉందునో నీకు తెలియదు.

అతను:—నిజంగా ?

ఆవిడ:—నువ్వు లేకపోతే నాకేమీ తోచదు. నువ్వు నాపక్కని లేనప్పుడు నే నేపనైనా చేస్తున్నట్టు నటిస్తూ ఉంటాను కాని అంతసేపూ నాఆలోచనలన్నీ నిన్నుగురించే. నాకు రోజురోజుకీ ఊపిరి హెచ్చయి పోతోంది.

అతను:—నిజంగా ?

ఆవిడ:—ఇప్పుడు నువ్విక్కడున్నావు. నిన్నువదిలి వెళ్లాలని లేదు. నువ్వు ఈకాసేపట్లో వెళ్లిపోడం నాకెంతో దుఃఖంగా ఉంటుంది. నువ్వువెళ్లిన కొంతసేపటివరకూ మరెవరితోనూ మాట్లాడాలనిపించదు. ఎప్పుడూ నీతోనే ఉండాలని [illegible]పోయి నీగదికిటికీమీద

వాలి రాత్రి నువ్వు నిద్రపోతున్నప్పుడు కూడా నిన్ను చూస్తూఉండాలని ఉంటుంది.

అతను:—కల్యాణీ! రేపు ప్రకాశరావు వచ్చినప్పుడు ఏమిటి చేస్తావు?

ఆవిడ:—చూడను. లేని కబురు పంపిస్తాను.

అతను:—అలాకాదు. జిగి చూడు. అయిదు నిముషాలు మాట్లాడి మరోకపనుందని చెప్పి లేచివెళ్లిపో. మళ్లీమళ్లీ వచ్చేటట్టు ప్రోత్సహించకు.

ఆవిడ:—ఛీ, ఛీ. ఇంకా నిన్ను నేనెంత ప్రేమిస్తున్నానో నీకు తెలియడం లేదు...అయిదుగంటలకి రమ్మన్నాను అంటే, అదే, అయిదుగంటలకి తనే వస్తానన్నాడు. అయిదూపది నిముషాలు కాకుండానే పంపించేస్తాను. నువ్వు అయిదుంపావుకి ఇక్కడికిరా. నీకే తెలుస్తుంది.

అతను:—ఛా, నేనెందుకురావడం? నీమీద నాకు అపనమ్మకాలు లేవు.

ఆవిడ:—మాటవరసకి చెప్తున్నాను.

అతను:—మరి మీ నాన్న నీకు కుదర్చబోతున్న సంబంధాలమాటో?

ఆవిడ:—మా నాన్న చాలా కోపిష్ఠి. ఎంతకోపిష్ఠి అయినా ఎలాగో ఒకలాగ ఒప్పిస్తాను. శలవలకి ఇంటికి వెళ్లగానే నీ మాట చెప్తాను. నీవిషయంలో ఒప్పుకోకపోతే ఎన్నడూ అసలు పెళ్లే చేసుకోనని చెప్పేస్తాను.

అతను:—అంత కోపిష్ఠా మీ నాన్న?

ఆవిడ:—నీకు తెలియదు. మా అమ్మ ఇప్పటి కింకా బెదిరిపోతూ ఉంటుంది.

అతను:—నాసంబంధం ఒప్పుకోరంటావేమిటి మీ నాన్న? నేను ఉద్యోగం చెయ్యడంలేదనీ....

ఆవిడ:—అంత సులభంగా ఏదీ ఒప్పుకునే రకంకాదు. నాకు భయంగానే ఉంది. మీనాన్న ఒప్పుకుంటారా?

అతను:—మానాన్న చాలాకాలం కిందటే చెప్పేసేడు, నాకు నచ్చినపిల్లని నేను చేసుకునేందుకు తనకేమీ అభ్యంతరం ఉండదని. పిల్లనుట్టుకు మంచి కుటుంబానిదై యుండాలన్నాడు. నీ విషయంలో ఏమీ అభ్యంతరా లుండవు. అది నా పూచీ. మా అమ్మకూడా చాలామంచిది. నేనంటే తనకి చాలాప్రేమ.

ఆవిడ:—మా నాన్ననే ఒప్పించాలి నేను. నిజానికి నాకు కంగారుగానే ఉంది, ఏమంటాడో అని.

అతను:—నన్ను మీనాన్నకి వ్రాయమంటావా?

ఆవిడ:—నువ్వొద్దు వ్రాయించకలిగితే మీ నాన్నచేత మా నాన్నకొక ఉత్తరం వ్రాయించు.

అతను:—ఓ, తప్పకుండా వ్రాయిస్తాను.

ఆవిడ:—ఇప్పుడప్పుడేకాదు. నేను శలవలకి ఇంటికి వెళ్లేక అంతా చూసి నీకు వ్రాస్తాను. అప్పుడు వ్రాయించు.

అతను:—సరే.

ఆవిడ:—నా కీవాళ నువ్వు ఎంత ఆనందం కలగచేసేవో నీకు తెలియదు.

అతను:—ఈవాళ నాకుకూడా ఎంతో హాయిగా ఉంది— నీవల్ల. ఈ రోజు నేను జన్మండగా మరిచిపోలేను...నీ చెయ్యి ఇలా ఇయ్యి.

ఆవిడ:—వద్దు.

అతను:—పరవాలేదు. ఒక్కసారి.

ఆవిడ:—చూస్తారు.

అతను:—ఎవరూ లేరు. ఎప్పుడు మనిద్దరం ఈ భయాలన్నీ లేకుండా స్వేచ్ఛగా ఉంటామో?

ఆవిడ:—మరి వెళ్లాలినువ్వు. అయిదుంపావుకి మాసభకి వెళ్లాలని చెప్పేను.

అతను:—వెళ్తాను. ఈ రాత్రంతా నీ మాటే తలుచుకుంటూ ఉంటాను.

ఆవిడ:—నేనూ నీమాటే తలచుకుంటూ ఉంటాను.

అతను:—వెళ్లనా?... ప్రకాశరావుతో అట్టే సేపు మాట్లాడకు.

ఆవిడ:—అసలు మాట్లాడనే మాట్లాడను. నేనువెళ్లాలి.

అతను:—అసలే మాట్లాడొద్దనికాదు.

ఆవిడ:—అవును. తెలుసును, తెలుసును....మళ్లీ కాలేజిలోనే కలసుకోడం.

అతను:—సరే, వెళ్తున్నాను.

ఆవిడ:—ఉంటాను...చాలా ఆలస్యం అయిపోయింది.

# ఆముక్తమాల్యదకవి శ్రీకృష్ణదేవరాయలే

దేవరపల్లి వెంకటకృష్ణారెడ్డి

"కృష్ణరాయ వసుధాధ్యక్షోదితాముక్తమాల్యద" అని ఆశ్వాసాంత పద్యములలో నున్నను, వ్యాఖ్యాతలు లాక్షణికులు చాటుపద్యకారులు ఆముక్తమాల్యదను పెద్దన రచించినాడని వ్రాసినట్లు పెద్దనవాదులు ప్రమాణముల నుల్లేఖించియున్నారు. ప్రారంభమున వీరిప్రమాణముల ప్రామాణికతను తెలిసికొనట యుక్తము.

లాక్షణికులు :

క్రీ. శ. ౧౬౫౬ లో ప్రారంభింపబడిన అప్పకవీయమందు:-

"ఆంధ్రకవితాపితామహుడు "కొనియె" ననుటకు "కొనె" నని చెప్పె "విష్ణుచిత్తీయమునందు"[1] అని కలదు.

క్రీ. శ. ౧౭౫౦ లో రచింపబడిన "రంగరాట్ఛందస్సులోఁగూడఁ బెద్దన చెప్పిన యాముక్తమాల్యద"[2] అని ఉన్నట్లు వ్రాసియున్నారు.

లాక్షణికులు తాము సాధించదలచిన సిద్ధాంతమునకుగాని, లేక ఖండించతలచిన సిద్ధాంతమునకుగాని పనికివచ్చు లక్ష్యములను ఎవరివద్ద విన్నను, వానిని ప్రామాణ్యములుగా స్వీకరించి, పాఠకుడు చెప్పిన గ్రంథమునుగాని, కవినావమునుగాని తమ గ్రంథములలో నుదాహరించినట్లు క్రింది ఇందుధరోపాఖ్యానపద్యచరిత్రము చెప్పుచున్నది:—

౧. తెనాలి రామకృష్ణుని యిందుధరోపాఖ్యానములోనిదని "ఒకనా డిందుధరుండు పార్వతియు ......"అనెడి యీపద్యము రంగరాట్ఛందమునం దుదాహరింపఁబడియున్నది.



వ్యాసకర్త.

౨. "అప్పకవి యీపద్యమునే యాదిపురాణములోనిదని యుదాహరించి యున్నాడు....

3. కాని "ఈపద్యము (నాచన) సోమునివారి వంశములో నున్నది." 3

ఉత్తర హరివంశములో "ఇందుధరోపాఖ్యానము" అను శీర్షిక క్రింద "ఒకనాఁ డిందుధరుండుఁ బార్వతియు......" అను పద్యము కాన్పించుచున్నది.

---

1. అప్పకవీయము, ౧ ఆ. ౧౯౯, ౧౩౧.
2. భారతి, ౨ సంపు. ౮ సంచిక, ౬౭ పుట.
3. ఆంధ్రకవులచరిత్రము, ౨౭౭ పుట.
4. ఉత్తర హరివంశము, ౫ ఆ. ౭౭ పద్య.

కాన, లాక్షణికు లిచ్చిన లక్ష్యములన్నిటిని, వా రాయా గ్రంథములను పరిశోధించి చూచివ్రాసినారని తలంచుటకు అవకాశము లేదు. లేనిచో "కృష్ణరాయ వసుధాధ్యక్షో దితాముక్తమాల్యద" అని ప్రతి యాశ్వాసాంతమున నుండగా, లాక్షణికులు కృష్ణరాయలపేరును ప్రస్తావింపకనే పెద్దన చెప్పిన ఆముక్తమాల్యద - అని వ్రాయుట ఎట్లు సంభవించును?-ఆలోచింపుడు.

గ్రంథాలయ సౌకర్యములు లేని ఆకాలములో నిట్టి పొరపాట్లు జరుగుట చోద్యము కాదు. కనుక, లాక్షణికులు వ్రాసిన పెద్దన ఆముక్తమాల్యదా కర్తృత్వమును వేదప్రమాణముగా నంగీకరించుటకు వీలులేదు.

తప్పు గావించిన అప్పకవి అడుగుజాడలలో నడచిన అహోబలపతి మాచిన వ్రాతను ప్రమాణముగా నంగీకరింపరాదు.

క్రీ. శ. [illegible] కు పిమ్మట నెప్పుడో రచింపబడిన కవిశిరోభూషణములో:—

"ఏతత్సూత్ర మనుసృత్యైవోల్లసాని పెద్దనకవినా ఆముక్తమాల్యదాయామ్." 5

అహోబలపతి తనకవిశిరోభూషణములో "కాకునూర్యప్పకవినా గృహీతం"6 అని అప్పకవిని ప్రస్తావించియున్నాడు. కాన ఇతను అప్పకవియభిప్రాయముతో నేకీభవించినాడని తలంచవచ్చును. తప్పుదారి త్రొక్కినవారిని గ్రుడ్డితనముగా అనుకరించువారు అధిక సంఖ్యాకులైనను వీరివ్రాతకు ప్రాధాన్య మిచ్చుటకు వీలులేదు.

## వ్యాఖ్యాతలు

వ్యాఖ్యాతలు ఆముక్తమాల్యదావ్యాఖ్యాన ప్రారంభములో వ్యాఖ్యానావతారికలను వ్రాసినారని కొన్ని ప్రతులలో కలదు.

శ్రీనివాసకవి "విష్ణుచిత్తతనయోద్వహనంబును. ... పెద్దనార్యు డుద్ధురఫణితిఁ రచించె" నని వ్యాఖ్యాన ప్రారంభమున కొన్ని తాళపత్రగ్రంథముల లోనున్న మాట సత్యము. కాని, ఓరియంటల్ లైబ్రరీలోనున్న మరియొక వ్యాఖ్యాన తాళపత్రప్రతి ప్రారంభములో శ్రీనివాసకవి వ్యాఖ్యానావతారిక లేదు.

షష్ఠాశ్వాసాంతమువరకు గల యీతాళపత్ర గ్రంథము 7 చివర శ్రీనివాసకవి తన వ్యాఖ్యానావతారికను వ్రాసినాడు

"శ్రీకరగట్టుపల్లికుల సింధు సుధాకరుడన్ సురూప (ద?) దేశకలితోరు శాస్త్ర హృదయ ప్ర(ది?)థితుండను శ్రీనివాసుడన్, లోకహితంబి(దా?) దొనరుచులో గణియించి రచించితి(ఁ) మ(హ?) హా టీక మనీషికోటికి ; తించు విఘం బొనగూడునట్లుగాఁ."8 గట్టుపల్లి శ్రీనివాసకవి వ్యాఖ్యానాశ్వాసాంత పద్యములో అవతారిక నిమిడ్చియున్నాడు. కాన వ్యాఖ్యాత "పెద్దనార్యు డుద్ధురఫణితిఁ రచించె" నని వ్యాఖ్యాన గ్రంథాదిలో అవతారిక వ్రాయలేదని స్పష్ట మగుచున్నది.

ఆముక్తమాల్యద పెద్దనకృత మను వ్యాఖ్యానావతారికలు లేని తాళపత్రప్రతులు కొన్ని దేశములో ప్రచారమం దున్నట్లు స్పష్టమగుచున్నది. ఒకటిమొదలు ఎనుబదిమూడు తాటియాకులసంఖ్య గల తాళపత్ర ప్రతిలో వ్యాఖ్యానావతారిక శిథిలమైనదని వాదించుటకు వీలు లేదు.

"శ్రీనివాసకవివ్యాఖ్య" గల మరియొక కాగిత ప్రతినిగూర్చి:—

"వ్యాఖ్యాత్రవతారికయు, గద్యము నిందు లేవు. 9" అని కేటలాగులో వ్రాసియున్నారు. ఈకా

5. వసుచరిత్రవిమర్శనము, 114 పుట.

6. కాళిందీ కన్యా పరిణయము. 1 భాగ. పీఠిక 3, 4 పుటలు.

7. తాటియాకున కొకప్రక్కన 1 మొదలు 83 వరకు క్రమసంఖ్య గలదు. రెండు ప్రక్కల వ్రాసియున్నది.

8. No. D/414 ఓరియంటల్ లైబ్రరీలోని గ్రంథ వివరణపట్టిక (Descriptive Catalogue) ను చూచునది.

9. No. D/420, Des catalogue, ఓరియంటల్ లైబ్రరి [illegible]

గితప్రతి తాళపత్రప్రతికి నకలు కాదని ఊహింపవచ్చును.

"ఇదియును శ్రీనివాసకవి వ్యాఖ్యయే. మరియు నిందు "రామేశ్వరీయము" అని ప్రతిపుటయందును పైన వ్రాయబడి యున్నది." అని కేటలాగులో కలదు. "రామేశ్వరీయము" అను నామము తాళపత్రప్రతిలో లేదు. కాన వ్యాఖ్యానావతారికలు లేనిప్రతులు దేశములో ప్రచారమందున్నట్లు నిశ్చయింపవచ్చును.

గుడిపాటి వెంకటకవి యను ప్రాచీనపండితుడు:—

"అల్లసానిపెద్దన యాముక్తమాల్య దాఖ్యకృతి సమంచితముగ జేసె(ను)10" అని వ్యాఖ్యానావతారిక వ్రాసినట్లు ప్రమాణము నిచ్చియున్నారు.

వెంకటకవి రచించిన "తాత్పర్యబోధినీ" వ్యాఖ్యానప్రతులు మూడుమాత్రము లైబ్రరీలో కలవు. వీనిలో రెండుప్రతులు ప్రథమాశ్వాసముతో ప్రారంభింపబడియున్నవి. కాని ఇందొక్కదానిలోకూడ వ్యాఖ్యానావతారిక లేదు.11

ఇందువల్ల చాటుపద్యములను వ్యాఖ్యానావతారికలుగా కల్పించినారనికాని, లేక వ్యాఖ్యానావతారికలు లేని కొన్నిప్రతులు దేశములో ప్రచారమందున్నవనిగాని అంగీకరింపక తప్పదు.

ఇంతేకాక ఆశ్వాసముకడపట:—

"...ఆత్రేయగోత్ర పవిత్ర నందవర వంశోత్తం(స?) స కృష్టిపాటి చ్ఛాయాపతిప్రధానానుజ చెన్నప్పప్రధాన తనూభవ నిత్యాన్నదానానవద్య విద్యాపరిశీలన చతురతర నిశ్శంక వెంకటప్రధానైణాంక సంకల్ప రూప శ్రీహయగ్రీవ (దే?) దేవప్రసాద సమర్థిత సంస్కృతాంధ్రప్రబోధ నిబం(ధ?)న నాపస్తంబ సూత్ర హరితసగోత్ర గుడిపాటికిచ్చనామాత్యపుత్ర వెంకటకవీంద్ర విరచితాముక్తమాల్యదా ప్రబంధతాత్పర్యబోధినీసమాఖ్య ప్రఖ్యాతవ్యాఖ్యానంబు." 12 అని కలదు. వెంకటకవి వ్యాఖ్యానాంతగద్యములో వ్యాఖ్యానావతారికను ఇమిడ్చి వ్రాసియున్నాడు గాన ఇతను వ్యాఖ్యానప్రారంభములో అవతారికను వ్రాసియుండ లేదని విశ్వసింపవచ్చును.

ఇంతేకాక, "కృష్ణరాయ వసుధాధ్యక్షోదితాముక్త మాల్యద" అను ప్రథమాశ్వాసాంత పద్యమునకు గుడిపాటి వెంకటకవి "కృష్ణదేవరాయడనే రాజు చేతను పల్కబడిన "ఆముక్తమాల్యద అనే ప్రబంధ(ము) అని వ్యాఖ్యానము వ్రాసియున్నాడు.13 ఇట్లే:—

గట్టుపల్లి శ్రీనివాసకవి "కృష్ణరాయడ (నె)? నేమహాప్రభువుచేత నిర్మించబడ్డ ఆముక్తమాల్యదా పరిణయమనే మహాప్రబంధ(ము)"అని వ్రాసియున్నాడు.14 ఈ ఆశ్వాసాంత పద్యవ్యాఖ్యానమునకు విరుద్ధముగా "పెద్దన యాముక్తమాల్యదాఖ్య కృతి సమంచితముగ జేసె(ను)" అని గుడిపాటి కవియు,

విష్ణుచిత్త తనయోద్వహనంబును...పెద్దనార్య దుర్ధుర ఫణితిక్ రచించె(ను)" అని శ్రీనివాసకవియు, వ్యాఖ్యానావతారికలను గ్రంథాదిలో రచించినారని తలంచుట యుక్తియుక్తము కాదు.

కల్పిత వ్యాఖ్యానావతారికలను చూచి లాక్షణికులు పొరపడినారేమో నిశ్చయింపజాలము. ఇంకను వ్యాఖ్యాతల కాలనిర్ణయము కాలేదు. ఇంతకును సందిగ్ధసాక్ష్యము నిచ్చుచున్న వ్యాఖ్యానావతారికలనుగాని, లాక్షణికగ్రంథములనుగాని శిలాక్షరములని విశ్వసించుటకు వీలులేదు.

---

10. ఆముక్తము, ౬౯ పుట.

11. No. D/ 402, D/ 403 Des. Cat. కాగిత ప్రతులలో ప్రథమాశ్వాసము కలదు.

12. No. D/౪౦౨, D/౪౦౩, D/౪౦౪ Des. Cat. ప్రతులలో వ్యాఖ్యాత్రవతారిక లేదు. No. D/౪౦౨లో వ్యాఖ్యానావతారిక లేదు. అని నాప్రియమిత్రులు, ఆంధ్రభూమి సంపాదకులు శ్రీయుత ఆంధ్ర శేషగిరిరావు (బి. ఎ.) గారు తెల్పినారు. వారికి కృతజ్ఞతాపూర్వక వందనము లర్పించుచున్నాను.

13. No. D/402 Des. Cat. చూడుము.

14. No. D/414 Des. Cat. చూడుము.

క్రీ. శ. ౧౭౦౫ లో జోగి జగన్నాథరాజు తన వైష్ణవ సర్వ్వాదేశముతో ఆముక్తమాల్యదకు "బుధమన స్తోషిణీ"15 వ్యాఖ్యానమును రచించినాడుగాని, దానిలో పెద్దన రచించిన ఆముక్తమాల్యద అని లేక పోఁగా, ఆశ్వాసాంత పద్యములకు కృష్ణరాయలు ఆముక్తమాల్యదను రచించినట్లు వ్యాఖ్యానము కలదు.

## ఆముక్తమాల్యదా మనుచరిత్రముల రచనాకాలము

ఆముక్తమాల్యదా, మనుచరిత్రముల రచనాకాల సంగ్రహచరిత్రను తెలిసికొనిన గాని, ఆముక్తమాల్యద కర్తృత్వమును నిశ్చయింపజాలము.

"అల్లసాని పెద్దన తెల్పె మది మదిఁ ప్పి యా ముక్తమాల్య(ద)" 16 అని రామకృష్ణుని చాటువులో కలదు.

పెద్దన వృద్ధాప్యములో అనగా మనుచరిత్రాది రచనానంతరము ఆముక్తమాల్యదను రచించినా డని భావము కాబోలును ?

ఈ ఊహను సుడిపాటివారి (కల్పిత) వ్యాఖ్యా నావతారిక బలపఱచు చున్నది.

"మనుచరిత్రాది సమ్యక్కావ్య రచనను పలిపిన వైష్ణవచక్రవర్తి, ఆలఘు డల్లసాని పెద్దన యాఘనుండు, మహిమ జేసిన యాముక్తమాల్యదా ప్రబంధ(ము)17" అని కలదు.

వీ రిద్దరి వాద మిట్లుండగా "కృష్ణరాయలపేరు నిడి నీవు రచియించితివి తొల్త విష్ణుచిత్తీయు మనఁగ, గాఢిన్యమ ర్థంబు గ్రాహ్యంబుగాదు సాధారణుల కని మాధవుడు పలుక, తరువాత మనుచరిత్రము నొన రించి యుత్తమకావ్యము" 8 అని మాధవుని వాదము కలదు. ఈరెండు పక్షములవారి వాదములో ఒకరిది చరిత్రకాలక్రమానుగుణముగా నుండక తప్పదు. ప్రస్తు తము ఆముక్తమాల్యదా కర్తృత్వ వివాదమును విడిచి ఈ చాటువులలోని కావ్యరచనాచరిత్రను పరిశోధించి, పిమ్మట కర్తృత్వవివాదమును పరిశీలింతము.

రాయలు ఆముక్తమాల్యదలో వర్ణించని "భువనవిజయ" సభను, పెద్దన మనుచరిత్రములో వర్ణించినాడు:—

"శ్రీకృష్ణదేవరాయాగ్రగణ్యుఁ, డొక్క నాఁడు కుతూహలం బుప్పతిల్ల.

*   *   *   *

"భువనవిజయాఖ్య సంస, ద్భవనస్థిత సింహపీఠి బ్రాజ్ఞులగోష్ఠిం, గవితామధురిమ డెందము, దవులం గొలువుండి సదయత౯......"

"కృతిరచింపుము మాకు శిరీషకుసుమపేశలసుధా మయోక్తుల పెద్దనార్య"19 అని పలికెను.

పేయసు "విజయభవన" నిర్మాణచరిత్రను తెలిపియున్నాడు:—

"This house called the house of victory as it was made when the king came back from the war against Orya" 20

దీనినిబట్టి శ్రీకృష్ణదేవరాయలు కళింగదేశ యుద్ధమునుండి తిరిగి రాజధానికి వచ్చిన పిమ్మట "విజయభవనము" ను నిర్మించినట్లు తెలియుచున్నది.

హంపీశిథిలములలో "విజయభవన" చిహ్నములు కలవు. ఇదిగాక రాయలు మరియొక "భువనవిజయము" ను నిర్మించినట్లు హంపీ శిథిలములలో చిహ్నములు కానిపించుట లేదు. కాన పేయసు వర్ణించిన "విజయభవనము" నకును, పెద్దన వర్ణించిన "భువనవిజయము" నకును భేదము లేదని నిశ్చయింపవచ్చును.

పేయసు స్పష్టముగా చెప్పని "ఒరిస్సా" యుద్ధమును ఆముక్తమాల్యదా సహాయమున గుర్తింపవచ్చును.

---

15. D/405 Des. Cat. చూడుము.
16. ఆముక్తము పీఠిక. 69 పుట.
17. ఆముక్తము పీఠిక 69, 70. పుటలు.
18. కవిజీవితములు, 568 పుటలు.
19. మనుచరిత్రము, ౧ ఆ. ౧౧, ౧౫, ౧౬ ప.
20. A forgotten Empire-page 263.

"నీలాచల నీలచేలక సుభద్రేందీవరాభాక్షికోణ దృగంచద్భుజవీర్యధుర్య జయసన్నాహోద్భటీ వాద్య ధీక్ష్యుదితే భేశ్వర కృష్ణరాయ." 21 ఈపద్యమందలి "నీలాచల" శబ్దము పురాణప్రసిద్ధమైన "శ్రీజగన్నాథ క్షేత్రము"ను సూచించుచున్నది. జగన్నాథ ప్రాంతములలో కటకము కలదు. కాన, ఈపద్యము కటకవిజయమును చెప్పక చెప్పుచున్నది.

సింహాచల ప్రాంతమందలి పొట్టునూరు విజయమును రాయలు "సింహాచల దంభకేసరి పదాభీష్టార్చనాలబ్ధ" 22 మైనదిగా వ్రాసికొన్నాడు.

ఇట్లే:—

జగన్నాథ ప్రాంతమందలి కటకవిజయమును రాయలు "నీలాచల నీలచేలక సుభద్రేం దీవరా భాక్షికోణ దృగంచ (ద్భు)"గా వర్ణించినట్లు స్పష్టమగుచున్నది. సుభద్రా బలరాములతో కూడిన శ్రీకృష్ణుని కృపాకటాక్షము జగన్నాథప్రాంతమందలి కటకయుద్ధమును సూచించుచున్నది.

ఇంతేకాక 'జయసన్నాహము' 'ధీక్ష్యుదితే భేశ్వర' అని వాచ్యముగా చెప్పియున్నాడు. కాన ఇవి కటకవిజయమును చెప్పక చెప్పుచున్నవి.

పెద్దన "కటకపురి గాల్చె గజరాజు గలగిపఱవ."23 అని మనుచరిత్రములో వర్ణించియున్నాడు. ఆముక్తమాల్యద పీఠికలోని వింధ్యవాటి గజపతి పలాయనముగాక, మరియొకసారి కటక విజయములో గజపతి పలాయనము జరిగినట్లు స్పష్టమగుచున్నది. లేనిచో రాయలు చరిత్రకాలక్రమానుసారముగా తన విజయములను సంఖ్యాసూచకాశ్వాసాంత పద్యములలో వ్రాసిన ప్రయోజనము వ్యర్థమగుచున్నది. కాన కటకవిజయమునే రాయలు ద్వైవిధముగా వర్ణించినాడని నిశ్చయింపవచ్చును. కనుక కటకవిజయముతో ఆముక్తమాల్యదారచనము ముగిసినట్లు స్పష్టమగుచున్నది.

21. ఆముక్తమ, 7 ఆ. 75.
22. ఆముక్తమ, 4 ఆ. 28.
23. మనుచరిత్రము, 1 ఆ. 37. ప.

"నీలాచల" (జగన్నాథ) ప్రాంతమందలి గజపతి పలాయనమును వర్ణించిన ఆముక్తమాల్యదలో "భువన విజయ" ప్రస్తావము లేదు గాన, పేయసు వర్ణించిన "ఒరిస్సా" (Orya) యుద్ధము జగన్నాథ ప్రాంతయుద్ధమని నిశ్చయింపవచ్చును.

మరియు "భువన విజయ" సభలో నవరాత్ర్యుత్సవములు సెప్టెంబరు ౧౨ తేదీ ప్రారంభ మయినట్లు పేయసు తెల్పుచున్నాడు.

"The feasts begin on the 12th of September and they last nine days."24

* * * *

Returning to the feasts, you must know that in the house of victory the king has a room (casa) made of cloth with its door closed where the idial has shrine." (?)25

శ్రీకృష్ణదేవరాయలపరిపాలన కాలములో నవరాత్ర్యుత్సవ ప్రారంభదినమయిన ఆశ్వయుజ శుద్ధ పాడ్యమి, సెప్టంబరు ౧౨-వ తేదినాడు క్రీ. శ. ౧౫౨౦ లో తప్ప మిగిలిన సంవత్సరములలో రాదని లెక్కించి స్వామియేలు దొరగారు నిర్ణయించియున్నారు. కాన "భువన విజయము" 12-9.1520 కి పూర్వము నిర్మించినట్లు స్థూలముగా చెప్పవచ్చును. కాన ఇంతకుముందుగానే ఆముక్తమాల్యద రచింపబడినట్లు ఊహింపవచ్చును.

"తొల్త విష్ణుచిత్తీయము...తిరువాతి మనుచరిత్రము నొనరించి" 26 నట్లు మాధవుని చాటువు చెప్పుచున్నది. దీనిని "భువన విజయ" చరిత్ర బలపరచుచున్నది. కాన, మనుచరిత్ర రచనానంతరము పెద్దన ఆముక్తమాల్యదను రచించినాడను రామకృష్ణుని చాటుపద్య చరిత్రముగాని, దీనిని బలపరచు సుదిపాటివారి వ్యాఖ్యానావతారికయందలి చరిత్రముగాని విశ్వసించుటకు వీలు లేదు.

ఆముక్తమాల్యదా రచనా ప్రారంభకాలమునాటికి రాయలు జయించిన దిగ్విజయములను పీఠికలో వ్రాసి

24. A Forgotten Empire, page 263.
25. A Forgotten Empire, page 265.
26. కవిజీవితములు, ౨౬౦ పు.

యున్నాడు. చరిత్రకాలక్రమ మెరుగని ప్రక్షిప్తకులు ఆ ముక్తమాల్యదాప్రారంభపీఠికలో "కటకపురి గాల్చె గజరాజుగలగి పఱవ"27 అను మనుచరిత్రపీఠికను చేర్చినారు. కాని "నీలాచల" (జగన్నాథ) క్షేత్రమందలి "జయసన్నాహేర్ఘటీవాద్యఘీత్యాదితే భేళ్వర కృష్ణరాయ" అను కటకయుద్ధమును రాయలు గ్రంథపరిసమాప్తిలో వ్రాసినాడని గుర్తించలేదు.

మరియు ఆ ముక్తమాల్యదలో వర్ణించనట్టియు, కటక విజయానంతరము నిర్మించినట్టియు "భువనవిజయము"ను పెద్దన మనుచరిత్రములో వర్ణించినాడు గాన మనుచరిత్ర ప్రారంభపీఠిక పద్యములను, మనుచరిత్రరచనానంతిర మెప్పుడో ప్రక్షిప్తకులు ఆముక్తమాల్యదా ప్రారంభపీఠికలో చేర్చినారని స్పష్టమగుచున్నది.

ఆముక్తమాల్యదా ప్రారంభపీఠకలోని మను చరిత్ర దిగ్విజయాదులను తీసివైచినను, మూల (స్వతంత్ర) పీఠిక సంపూర్ణముగా నున్నది. ఆముక్తమాల్యదాకాలనిర్ణయమునకు దీనిచరిత్రనే ప్రధానప్రమాణముగా గైకొనవలె గాని దీనిలోని మనుచరిత్ర విజయాంకములను చరిత్ర ప్రమాణములుగా గైకొనరాదని "భువన విజయ" చరిత్రము చెప్పుచున్నది. "నీలాచల" (జగన్నాథ) "జయసన్నాహ(ము)"తో పరిసమాప్తమైన ఆముక్తమాల్యదలో, "ఒరిస్సా" విజయానంతరము నిర్మింపబడిన "భువనవిజయ" సభావృత్తాంతము లేకుండుట చరిత్ర క్రమానుగుణ్యముగా నున్నది. గనుక రాయలు "భువన విజయ" నిర్మాణమును ఆముక్తమాల్యదలో వ్రాయక విడిచినాడని వాదించుటకు అవకాశము లేదు.

రాయలు పెద్దనను "భవచ్చతురరచన కనుకూలంబుగా"28 అని ప్రశంసించినట్లు పెద్దన మనుచరిత్రపీఠికలో వ్రాసికొన్నాడేగాని, అప్పటికి తాను రచించిన కావ్యములను వాచ్యముగా పేర్కొనలేదు.

"మనుచరిత్రము నొనరించి తు త్తమకావ్యము... పిదప పెక్కుకావ్యములు పెంపెక్క విరచించి"29 నట్లు మాధవునిచాటువులో కలదు.

మరియు "మనుచరిత్రాది సమ్యక్కావ్య రచనము సలిపి"30 నట్లు గుడిపాటివారి వ్యాఖ్యానావతారికలో కలదు.

పెద్దనమనుచరిత్ర పీఠికలో "నవీనకావ్యరచన కనుకూలకథల్ దలంచు నాసమయమునన్." 31 అని అంగీకరించి యున్నాడు. కాన "చతురరచన" చాటువులకు సంబంధించినదే గాని మనుచరిత్రమునకు పూర్వము రచించిన కావ్యములకు చెందినది కాదని స్పష్టమగుచున్నది.

కాన "కృష్ణరాయలపేరు నిడి నీవు రచియించితివి తొల్త విష్ణుచిత్తీయ(ము)"32 అనుమాధవుచాటువును విశ్వసింపరాదు. మనుచరిత్రమునకు పూర్వము పెద్దన మరేకావ్యమునుగాని రచించకపోగా, పెద్దన మనుచరిత్రమునకు పూర్వము ఆముక్తమాల్యదను రచించినాడని తలంచుటకు అవకాశము లేదు. కాని ఇది మనుచరిత్రమునకు పూర్వము రాయలు ఆముక్తమాల్యదను రచించినా డనుసత్యమును తెల్పుచున్నది. అసత్యవాదియు ఒకానొకసత్యమును పల్కునని దీనివల్ల స్పష్టమగుచున్నది.

## చాటువులు

"రాయనికిని పెద్దనకును సమకాలికుడైన రామలింగకవి ఆముక్తము పెద్దనకృతమే యని తెలిపినాడు. ఈతడు తత్సమకాలికుడని యితనిపండితారాధ్యచరిత్రమునం దెలియును."33 అని యొకచాటు పద్యమును ప్రమాణముగా నుల్లేఖించియున్నారు.

---

27. మనుచరిత్రము 1 ఆ. 37 ను ఆముక్తమున 1 ఆ. 36 గా చేర్చియున్నారు.

28. మనుచరిత్రము, 1 ఆ. 16,

29. కవిజీవితము, 568 పుట.

30. ఆముక్తము పీఠిక, 69 పుట.

31. మనుచరిత్రము. 1 ఆ. 10.

32. కవిజీవితములు, 568 పుట.

33. ఆముక్తముపీఠిక, ౬౮ పుట.

"ప్రౌఢదీర్ఘసమాస పదములు గూర్చి శ్రీ
నాథుండు కూలార్చె నైషధంబు
దానితల్లిగ నల్లసాని పెద్దన తెల్పె
మది మది దప్పి యాముక్తమాల్య
నూహించి తెలియరాకుంత సూరపరాజు
భ్రమఁ గళాపూర్ణోదయము రచించె
నతిశ్లేషశబ్దవాగాడంబరం బొప్పఁ
పప ఘటించెను మూర్తి వసుచరిత్ర
నిట్టి కవులకు నేను వాకట్టుకొఱకుఁ జెప్పినాఁడ
మదీయ వైచిత్రి మెరయ
పాండురంగ విజయమును బటిమ దనర
విష్ణువర్ధిష్ణుఁడను రామకృష్ణకవిని."[34]

రామకృష్ణుని పాండురంగ మాహాత్మ్యములో నీ పద్యము లేకపోవుటయేగాక, ఇట్టి చాటుపద్యము లను రచించు స్వభావము తనకు లేదని సూచించి యున్నాడు.

"చాటుకవిత్వ తత్వరస
సాగరపారగు లయ్యు సత్కవుల్
పాటిగఁ బట్టి విందు రొక
పాటివి గావన కన్యకావ్యముల్."[35]

"రామలింగనామ విఖ్యాతు(డు), కావ్య నిర్ణయ ధురీణు(డు)"[36] అయిన రామకృష్ణుడు ఈ చాటువును రచించినాడని తలంచుటకు అవకాశము బొత్తిగాలేదు.

రామకృష్ణకవిని రాయల ఆస్థానకవులలో చేర్చుటకు వీలులేదు.

"భువిని విచిత్రవాక్సరణి
బొల్చిన తెన్నలి రామకృష్ణ స
త్కవివిపుల వజ్రపాణి ఘటి
కాగిరినాథ మహాచరిత్రముల్
సవరణగా రచించి కృతి
సంతతి కెన్నగ యోగ్యుఁడైన(?)
ధవుఁ డొకరుండు లేమిఁ గని
తా మదిలోన వితాకుఁ జెందుచున్."

*  *  *

కృతికన్య నింటనే యుంచె(ను)[37]

"రామలింగడే రామకృష్ణుడు" అయినను, ఇతను శ్రీ కృష్ణరాయల ఆస్థానమందలి అష్టదిగ్గజములలో నొకడుగా నుండినది సత్య మయినచో, రామకృష్ణుని కడపటి కావ్య మయిన ఘటికాచల మాహాత్మ్యమునకు "ఎన్నగ యోగ్యుఁడైన ధవుఁ డొకరుండు లేమి" సంభవించునా ? పరికింపుఁడు.

ఇంతకును ఆంధ్రభాషాభూషణము లైన కళాపూర్ణోదయాది కావ్యములను నిరసించు చాటువును రామకృష్ణుడు రచించినాడని తలంచుటకు అవకాశము లేదు. సత్కవులు "విందు రొకపాటివి గావన కన్యకావ్యముల్" అను నీతి నుపదేశించిన రామకృష్ణుడు ఈ చాటువును రచించలేదని ఖండితముగా చెప్పవచ్చును.

రామలింగడు రాయల ఆస్థానకవి యని చమత్కారకథలను సృష్టించినట్లే రామకృష్ణునిపేర ఈ చాటువును రచించి ప్రకటించినారని విశ్వసింపవచ్చును.

ఇవన్నియు "రాచకవిత్వబాధ పడరాదు పరామరిశింపు దైవమా" అను కాలమహిమతో కల్పింపబడిన చాటుకథలేకాని అన్యములు కావు.

## రాయలు ప్రబంధకవి కాడా?

రాయలు ఆముక్తమాల్యదను రచించినట్లు, అతని ఆస్థానకవు లెవ్వరు పేర్కొనలేదను ముఖ్యాక్షేపణకు సమాధానము చెప్పకతప్పదు.

వైంధ్యద్విప గంధనిబ
ద్ధాంధ్యాళి ప్రతిపదో దితాలయ విభవా
వంధ్య ప్రబంధ కృతి సం
బంధ్యను భావునకు..."[38]

ఇందలి సంకేతచరిత్రను తెలిసికొనినగాని పద్య భావమును గుర్తింపజాలము.

---

34. ఆముక్తము పీఠిక, ౬౯ పుట.
35. పాండురంగమాహాత్మ్యము, ౧ ఆ. ౧౪.
36. ఉద్భటారాధ్య చరిత్రము, ౧ ఆ. ౧౫.
37. ఘటికాచలమాహాత్మ్యము, ౧ ఆ. ౧౪, ౧౫
38. పారిజాతాపహరణము, ౧ ఆ. ౩౧.

౧. "నైంధ్యద్వీప(ము)" అనగా "విడుము గజరాజు నీధాటి వింధ్యవాటి" 39 అను చరిత్రము గల గజపతిగాని అన్యము కాదు. "వింధ్యవాటి గజరాజు"ను "నైంధ్యద్వీప" మని సంకేతము కావించినాడని స్పష్టమగుచున్నది.

౨. "అంధ్యాళి" అనగా "దయాసార మరంద పోషితార్థి భ్రమరోల్లాస గుణ." 40 మే గాని మరియొకటి కాదు.

ఇది రాయల "కళింగదేశ" దండయాత్రలోని దానములను సూచించుచున్నది. "ఈదితి" అనుక్రియ మనుష్యసంసర్గమును, సూచించుచున్నదిగాన "అంధ్యాళి" దానములు గ్రహించిన యాచకులని తిమ్మకవి సంకేతానుసారము ఊహింపవచ్చును.

3. "ఆలయవిభవ(ము)" అనగా "భక్తి తద్గృహ గోపురప్రణతి జేసి" 41 న శ్రీకాళహస్తి వృత్తాంతమును సంగ్రహముగా సూచించుచున్నది. "ఆలయ" మనగా దేవాలయమను రూఢ్యర్థము వ్యవహారములోనున్నది.

దీర్ఘసమాసముగా కూర్చిన పద్యభావమును విశదపరుచుట మత్యావశ్యకము:

గజపతి గర్వమును అణచుసమయమందలి దానములతో మదించిన యాచకులచేత అన్నిచోట్లను చెప్పచున్న శ్రీకాళహస్త్యాలయ స్వామైశ్వర్యముతో ఫలవంతమైన కావ్యమును రచించుటవల్ల కూడిన "కవితాప్రావీణ్యఫణీశ" 42 అను మహిమ గలవానికి అని తాత్పర్యము చెప్పవచ్చును. లేక కావ్యమును రచించుటవల్ల వియ్యంకుడు (పిల్లనిచ్చినవాడు) అనెడి మహిమ గలవానికి అనగా వేంకటేశ్వరునకు రాయలు తనకృతికన్య నిచ్చినాడని భావము. శ్రీకాళహస్త్వామి "పొత్తమిటు నేయ నీకుత్తరోత్తరాభివృద్ధి" 43 యని చెప్పియున్నాడు. దీనిని "అవంధ్య" శబ్దములో తిమ్మకవి సూచించియున్నాడు.

"నీలాచల" గజపతి పలాయనము వర్ణించిన ఆముక్తమాల్యదలో వర్ణించని "భువనవిజయాఖ్యసంస(త్తు)" 44 ను తిమ్మకవి పారిజాతములో వర్ణించియున్నాడుగాన, మనుచరిత్రమువలెనే పారిజాతముకూడ ఆముక్తమాల్యదకు తరువాత రచింపబడినట్లు స్పష్టమగుచున్నది. కాన తిమ్మకవి ఆముక్తమాల్యదాపీఠికను చూచినాడని స్పష్టమగుచున్నది.

"కవితాస్త్రీలోలునకున్" అను పెద్దన పద్యాంతమునకు "కవితాస్త్రీకి కవి తండ్రిగాని వల్లభుడుగాడు దీనివలన రాయడు కవనరసజ్ఞుడు గాని కవికాడని సూచితము. 45 అని ఆక్షేపము కలదు. ఇది సమంజసమైనయాక్షేపము కాదు. ఎట్లనగా:

"శ్లోకంబుల్ శతకోటిఁ గాండములుగా
సూత్రించి రామాయణం
బేకైకాక్షర మెల్లపాపముల మా
యింపంగ నిర్మించి సు
శ్లోకుండైన పురాణసంయమివరుల్
జూతు న్మనోవీథి వా
ల్మీకిన్ బ్రహ్మపదావతీర్ణకవి గ
లీలావతీవల్లభున్. 46

కవితయనెడులీలావతి(స్త్రీ)కి వల్లభుడైనవాల్మీకి రామాయణమును రచించలేదని సంప్రదాయజ్ఞులైన పండితులు(విశ్వసించి) నిశ్చయింప గలిగినచో, రాయలు ఆముక్తమాల్యదను రచింపలేదని అంగీకరించుటకు ఆక్షేపము లేదు. కాన "రాయడు కవనరసజ్ఞుడు గాని కవి కాడు" అను ఆక్షేపము సమజంసమైనది కాదు.

మరియు,

"కవితాప్రావీణ్య ఫణీశ" అను తిమ్మన కృతి విశేషణము "కవితాస్త్రీ లోలునకున్" అను పెద్దన కృతి

39. ఆముక్తము, ౧ ఆ. ౩౯.

40 పారిజాతము, ౨ ఆ. ౧.

41. ఆముక్తము, ౧ ఆ, ౧౭.

42. పారిజాతము, ౪ ఆ. ౧.

43. ఆముక్తము

44. పారిజాతము, ౫ ఆ. ౧౧౦.

45. ఆముక్తము, పీఠిక, 64. పుట.

46. భీమేశ్వరపురాణము (భీమఖండము), ౧. ఆ.

విశేషణమునకు సమర్థకము" 47 అను (రాయలు కవి కాడను వాదముతో వ్రాసినను) పెద్దనవాదుల సిద్ధాంతము సత్యమైనదిగా తోచుచున్నది. అయిన "గాంగేయాచల చాప నా పుం వచో గాంభీర్య లీలాస్పదా!"48 అనగా ఆదిశేషుని వాగ్వైఖరి వంటి వాగ్వైఖరి కలవాడా!" అని పెద్దన రాయలను సంబోధించియున్నాడు. ఇది "కవితా ప్రావీణ్య ఫణీశ" 49 అను తిమ్మకవిసంబోధనమునకు ప్రతిబింబముగా కానిపించుచున్నది. పెద్దన సంబోధనములోని "వచో గాంభీర్య లీల" రాయల ఆశుకవిత్వమును, అవధానాది విద్యలను సూచించుచున్నది. దీనిని తిమ్మకవి స్పష్టముగా చెప్పియున్నాడు.

"కవితా ప్రావీణ్యఫణీశ" అను తిమ్మకవిసంబోధనము వలన వేయుపడగలు (ముఖములు) గల ఆదిశేషుని వలె రాయలు సహస్రావధాన, ఆశుకవిత్వాదులయందు ప్రవీణతకలవాడని స్పష్టమగుచున్నది. ఒకవేళ ఈసంబోధనములను అతిశయోక్తులని తలచినను రాయలు కవి కాడని చెప్పుటకు వీలులేదు. కవులు సత్యవిషయమును అతిశయోక్త్యలంకారముతో వర్ణింతురేగాని, అసత్య విషయమును వర్ణించరని ఖండితముగా విశ్వసింపవచ్చును. "సరసకథాధోరణికిన్" 50అను తిమ్మకవి వచస్త్వం తము "కవితాస్త్రీలోలునకున్" అను పెద్దన వచస్త్వంతమునకు సమానార్థకమని చెప్పవచ్చును. ఇవి రాయల ఆశుకవితాప్రజ్ఞను చాటుచున్నవి.

## రాయలు "బాసాడి"
## తెలుగు నేర్చెనా?

"ఎల్ల నృపులు గొలువ నెఱుగవే బాసాడి, దేశభాషలందుఁ దెలుగు లెస్స" 51 దీనికి "ఆడి"—తెనుగు రాజులతో ఆడి నేర్చెనేకాని చదివి నేర్చినవాఁడు గాఁడు.—"నృపులు" అనుటచే తెనుఁగు ఆతనియింటి భాష గాదు." అని సంజీవినీవ్యాఖ్యానాంతములో కలదు. కాని, శ్రీకాళశస్వప్నమును విన్నవిద్వజ్జనులు దీనికి మరియొకఅర్థమును చెప్పియున్నారు.

"అతం డశేషనృపసేవం దత్తద్భాష తెలుంగవేయనుట యితోధికసమస్తసామంత సమాజసమాకర్షణంబును."52.

ఇందలి "తత్తద్భాష తెలుంగవే యనుట" రాయల బహుభాషా కోవిదత్వమును స్థాపించుచున్నది. కాని "బాసాడి" తెలుగును నేర్చినట్లు చెప్పుట లేదు.

"రసమంజరీ ముఖ్యమనురకావ్య రచన మెప్పించు కొంటి గీర్వాణభాష, నంధ్రభాష యసాధ్యంబె యందు నొక్కకృతి వినిర్మింపు (ము)53 దీనికి "సంస్కృతమందే అట్టి ప్రబంధములు రచించిన వానికి ఆంధ్రభాషలో రచించుట యసాధ్యమా అనుట యర్థాపత్త్యలంకారము" అని సంజీవినీ వ్యాఖ్యానము కలదు. మరియు "అసాధ్యంబె—అసాధ్యమా (కాదనుట)" అనియు కలదు. ఇందలి కాకుస్వరము రాయలకు తెనుగు తెలియునని సూచించుచున్నది. కనుకనే తెలుంగురాయడు "అందు నొక్కకృతి వినిర్మింపుము" అని కన్నడరాయని ఆజ్ఞాపించినాడు.

ఇంతేకాక "దేశభాషలందు దెనుఁగు లెస్స54 అను శ్రీనాథుని గీతపాదమును, "తెనుగు" అను దాని రూపాంతరము "తెలుఁగు" అను మార్పుతో తనగీతపద్యములో నిమిడ్చిన రాయలు "బాసాడి" తెనుగును నేర్చినాడని విశ్వసించుటకు వీలులేదు"బాసాడి," నేర్చినఅన్యభాషలతో చదివినేర్చిన తెనుగుభాషను పోల్చిచూడుము అని తెలుగువల్లభ రాయడు చెప్పినట్లు నిశ్చయింపవచ్చును. లేనిచో "ఆంధ్రభాష యసాధ్యంబె (కాదు కనుకనే) యందు నొక్కకృతి వినిర్మింపు (ము). 55"

47 ఆముక్తమ, పీఠిక, 70 పుట.
48. మనుచరిత్రము, 1 ఆ. 45.
49. పారిజాతము, 4 ఆ. 1.
50. పారిజాతము, ౧ ఆ. 33.

51. ఆముక్తమ, ౧ ఆ. ౧౫.
52. ఆముక్తమ, ౧ ఆ. ౧౪.
53. ఆముక్తమ, 1 ఆ. ౧3.
54. క్రీడాభిరామము, 1 ఆ. 3౭.
55. ఆముక్తమ, 1 ఆ. ౧3.
56. జైమినిభారతము, ౧ ఆ. ౧౮, ౧౭, ౧౯.

అని రాయల నాజ్ఞాపించినట్లు వ్రాసికొనుట సంభవించి యుండదు. పైకారణమునుబట్టి రాయలు శ్రీనాథుని ఆంధ్రకావ్యములను కంఠతః వల్లించినాడని చెప్ప వచ్చును.

క్రీ. శ. 1458 మొదలుకొని శాసనప్రసిద్ధుడైన సాళువనరసింగరాజు పిల్లలమఱ్ఱి పినవీరభద్ర కృత జైమిని భారతమును అంకితము పొందెను.

"సాళ్వగుండయ నరసింగజనవిభుండు."

("జైమినిభారత మనగా")

"ఆ పురాణంబు గనఁ దెనుగయ్యెనేని, తెనుగు నుడికారమున మించు గనియెనేని"56 అని చెప్పినట్లు పినవీరభద్రుడు వ్రాసెఁ దానిని బట్టి శ్రీ కృష్ణరాయలు పట్టాభిషిక్తుడగుటకు షుమారు ౭౦ సంవత్సరములకు పూర్వమే (అనగా రెండవ రాజకుటుంబము నాటికే) విజయనగరాధీశులకు తెనుఁగు తెలియుననియు జైమిని భారత రచనమువల్ల స్థిరపడుచున్నది. తెనుగుభాష నెఱుంగని రాజులు తెలుగుకావ్యములను అంకితము పొందినారని తలచుట యుక్తిసహమయిన వాదము కాదు.

మరియు సాళ్వనరసింగరాజు సేనాపతిగా నుండి పిదప విజయనగరాధీశుడైన తుళువ నరసింహరాయలు తెనుగు వరాహపురాణము నంకితము పొందియున్నాడు. ఇతను శ్రీ కృష్ణదేవరాయల తండ్రి. కాన రాయలు తన తండ్రి అంకితము పొందిన తెనుఁగుకావ్యము నైనను చదివియుండలేదని వాదించుట సమంజసము కాదు. ఇంతవఱకు రాయలు శ్రీనాథునికావ్యములను చదివినట్లు నిదర్శనము కలదు.

## ము గిం పు

మనుచరిత్ర "అల్లికజిగిబిగి"కిని, [ఆము]క్తమాల్యద "ఉద్ధురఫణితి"కిని నక్కకు నాగలోకమునకు ఎంత దూరమో అంత తారతమ్యము కలదు. ఆముక్తమాల్యద కవి శ్రీ కృష్ణదేవరాయలేగాని, పెద్దన కాడని చెప్ప టకు ఒక్క శైలీవ్యత్యాసమే చాలును. రాయల ఆస్థానకవియైన తిమ్మనార్యుడు రాయల "ప్రబంధ కృతిని" (కావ్యరచనను) ప్రస్తావించుటయే కాక రాయలను "కవితాప్రావీణ్య ఫణీశ" అని సంబోధించి యున్నాడు. కాన రాయలు ఆముక్తమాల్యదను రచించ లేదను వ్యాఖ్యానావతారికలనుగాని, లక్షణగ్రంథములను గాని, చాటువులనుగాని విశ్వసించరాదు. ఇవన్ని యు కల్పితము లని సప్రమాణముగా నిరూపించినా నని విన్నవించుచున్నాను.

అయిన, 'తిమ్మకవి "వైంధ్యద్వీప" మనుపద్య ములో "ఆముక్తమాల్యద లేక గోదాకళ్యాణము" అను పేరు నిమడ్చక సంకేతముగా వ్రాయుటకు కారణ మే మైయుండును?' అని పాఠకులకు సంశయము కలుగ వచ్చును. కాని,

"గోదాదేవి" యనక "ముము దాల్చిన మాల్యమిచ్చు నప్పిన్నది" 57 అని రాయలు రమ్యతర భంగ్యంతర స్వీకారముతో గ్రంథ ప్రారంభమనసే (గ్రంథనా మము తెలియకపూర్వమే) చెప్పియున్నాడు. తిమ్మకవి ఈ విధానమునే అవలంబించినాడని విశ్వసింపవచ్చును. చతుష్షష్టి (అరువది నాలుగు) కళలలో కవిత్వము చేరి యున్నది.

"కావ్యక్రియేతి—సంస్కృత ప్రాకృతాపభ్రంశ కావ్యస్యకరణం ప్రతీత ప్రయోజనమ్." 58

అనగా—

కావ్యక్రియ— సంస్కృతము ప్రాకృతము అప భ్రంశము మున్నగు సమస్తభాషలలోను కావ్యరచనము చేయుకళ(కు) కావ్యక్రియ యని పేరు. "కావ్యకళ"59 అని దీనిసే శ్రీనాథుఁడు పేర్కొనియున్నాడు. పెద్దన రాయలను "నిరంకుశ ప్రతి కళాప్రౌఢిప్రియంభావుకా" 60 అని సంబోధించియున్నాడు. కాన రాయలు "ప్రౌఢ"మైన ఆముక్తమాల్యదను రచించినాడనుటకు ఆక్షేపముండకూడదని మనవి చేయుచున్నాను.

---

57. ఆముక్తమా, ౧ ఆ. ౧౭.

58 వాత్స్యాయన కామసూత్రములు, ౧౧౬, ౧౩౨ పుటలు.

59. కాశీఖండము, ౨ ఆ. ౨౦.

60. మనుచరిత్రము, ౧ ఆ. ౭౧.

# ఆధునిక విజ్ఞానం : పూర్వాచార పరాయణత్వం

వసంతరావు వేంకటరావు

"ఆ యెర్రగానున్న దేమిటో, నల్లగానున్న ఆకాశంలో ఎంత మనోహరంగా నుంది?"

"నీకు తెలియదూ? అది ఒక గ్రహం. నవగ్రహాలంటారు విన్నావా?

"విన్నానుగాని, వాటి పేర్లు తెలియవు."

"అయ్యో! నీ వెరుగుదువు, నాయనా. తెలుసునన్న జ్ఞానం నీకులేదు. వారాల పేర్లేమిటనుకున్నావు, గ్రహాల పేర్లే. మొదటినుంచి తీసికో: ఆదివారం- ఆదిత్యుడు, సూర్యుడు; సోమవారం-సోముడు, చంద్రుడు; మంగళవారం, లేక భౌమవారం-భౌముడు, లేక కుజుడు; బుధవారం-బుధుడు; గురువారం-గురుడు; శుక్రవారం-శుక్రుడు; శనివారం - శని. వరుసగా ఇప్పుడు చూడు: సూర్యుడు, చంద్రుడు, కుజుడు, బుధుడు, గురుడు, శుక్రుడు, శని; ఏడుగ్రహాలయినాయి. ఇవి గాక రాహువు, కేతువు: ఇవి ఛాయాగ్రహాలు."

"అయితే, ఇవేమిటి?"

"పుట్టినప్పుడివన్నీ మండుచున్న పెద్ద అగ్నిగోళాలు. ఇప్పుడు చాలావరకన్నీ ఘనీభవించాయి. కొన్నిట్లో పర్వతాలు, మరికొన్నిట్లో సముద్రాలు కనుపిస్తున్నాయి. నక్షత్రాలు మినుకు మినుకుమంటాడతాయి, గ్రహాలు కాంతిచలనం లేకుండా విద్యుద్దీపాల్లా గుంటాయి. అదిగో తూర్పున చూడు, ఇప్పుడే ఇంకో గ్రహం ఉదయిస్తూంది. అదే గురుడు. సూర్యుడిని నవగ్రహాల్లో చెప్పేరే కాని, ఈ గ్రహాలన్నీ సూర్యుడిలోంచి జన్మించాయి. మన భూమికూడా గ్రహమే. సూర్యుడిలోంచి పుట్టబట్టి ఇవన్నీ కూడా సూర్యుని[illegible] చేస్తూ ఉంటాయి. మనభూమి ఒకప్రదక్షిణం చెయ్యడానికి ఒక ఏడాది పట్టుతుంది."

"అసలీ నక్షత్రాలేమిటి?"

"నక్షత్రాలన్నీ మండుచున్న అగ్నిగోళాలు. ఆగోళాలలోనంతా వాయువేగాని ఘనపదార్థాలు, ద్రవపదార్థాలు సామాన్యంగా లేవు."

"ఏమిటీ! నక్షత్రాలు మండిపోతున్నాయి!!" అంటూ మాకబుర్లకడ్డం వచ్చేరు శివరావుగారు.

అప్పుడే భోజనాలయినాయి. మండువేసవి, ఎండగాడ్పులతో దినమంతా ఎలాగో గడిపేము. రాత్రి భోజనాలయినానక అప్పుడే డాబామీద నడుంవాల్చి ఊర్ధ్వముఖంగా పడుకున్నాం నేను, మా మేనల్లుడు రామం. రామం అయిదోఫారం చదువుచున్నాడు. కొంచెం చురుకైన పిల్లవాడు; క్రొత్తవిషయం ఏదైనా కష్టపడి నేర్చుకొందాం అనే ఆసక్తి మెండు.

ఇద్దరం పడుకొని నిర్మలాకాశంవేపు చూస్తున్నాం. నాకు నక్షత్రాలు చూడడం అంటే సరదా. వాటి గురించి మాట్లాడడం అంటే మరీసరదా; అందులో పిల్లలకి చెప్పడం అంటే అపరిమితానందం. ఏమంటే, పిల్లలకేదైనా బోధపరచినప్పుడు మనం కూడా నేర్చుకుంటామని నాయుద్దేశం. సమగ్రమైన జ్ఞానం ఉంటేనేకాని వారడిగే యక్షప్రశ్నలకు సమాధానం చెప్పడం కష్టం. మనకి యథాలాభంగా నున్న భావాలన్నీ వారితో ప్రసంగించినప్పుడు సువ్యక్తమవుతాయి.

ఆ నిర్మలనీలాకాశంలో మెరుస్తూన్న నక్షత్రా[illegible]పోయిఉండాలి. అవే

మిటా అన్న ప్రశ్న వచ్చింది. సరిగ్గా మా నెత్తిమీదనే ఉన్నాడు కుజుడు. కుజుని చూడగానే 'ఎంతబాగుందీ' అన్న పలుకులు అప్రయత్నంగా జారినాయి వాడి నోట్లోంచి. మే మిలా మాట్లాడుతూంటే అప్పుడే మేడ మెట్లెక్కి గదిలోకి వెళుతూ నాతుదిమాట విన్నారు శివరావుగారు.

శివరావుగారు మా మేనమామ. నాలుగోపడి దాటిన వయస్సు, చామనచాయ. అంతపొడుగూ కాదు, పొట్టీ కాదు. ముఖంలో ఛాందసం కొంత వ్యక్తం అవుతుంది. ఉద్యోగరీత్యా ఊపిరితిరగని పనులు చాలా ఉంటున్నా సంధ్యావందనం, గాయత్రీమంత్ర జపం, రామాయణ పఠనం, భగవద్గీతా పారాయణం అనుదినం కాలోచితంగా అంతరాయం లేకుండా సాగిస్తూ ఉంటారు. సంస్కృతగ్రంథపఠనం బాల్యావస్థనుండి అభ్యాసం. ఉద్యోగ నిర్వహణంలో నప్పుడప్పుడు విధిలేక అన్యాయానికి దొరకొన్నప్పటికి కష్టసుఖాలు విచారించే స్వభావం; నవనీతం లాంటి హృదయం. పూర్వాచారపరాయణు లంటే గౌరవం, ఆధునికయువకు లంటే కొంచెం ఒళ్లుమంట కూడాను.

మాపక్కకు ప్రక్కగానుంది ఆసనపరుపు. పరుపుమీదకొస్తూ మళ్లా గర్జించేరు "అయితే, నక్షత్రాలు మండిపోతున్నాయా? నిజంగా నంటున్నావా, కుర్రవానితో హాస్యమా?" ఆధాటీ చూసేసరికి నాకు భయ మేసింది. కాని, ఈ విశ్వనిర్మాణాన్ని గురించి ముచ్చటిస్తూంటే సామాన్యంగా నాకు ఆవేశం ఎత్తుతుంది. ఆస్థాయిలోనే చెప్పేమాటలు నిష్కర్షగా చెపుతాను. ఎదిరి ఎవరైనాసరే జంకూ గొంకూ లేకుండా వాదిస్తాను. విశ్వసృష్టియొక్క మహత్తర విషయాలు కొన్నిఅయినా ప్రతిజీవికి హృద్గతం కావాలని నా ఆశయం. అందుచేత, చర్చకు దిగినపుడు నిర్మొగమాటంగా చెపుతాను.

ఆయన అలా ఉరిమినపుడు సామాన్యంగా మాట్లాడే ధైర్యం నా కుండదు. కాని, ఆయనప్రశ్నకి నాకు నవ్వువచ్చింది. 'ఈయనకీమాత్రం తెలియదా' అనిపించింది, తెలియనప్పుడు చెప్పడమే నాకర్తవ్యం అనిపించింది—నేను ఉపాధ్యాయుడిని, చర్చించే విషయంలో జ్ఞానంలేనివారికి జ్ఞానప్రదానం చేయడమే మా విధ్యుక్తధర్మం. వెంటనే జవాబిద్దా మనుకుంటూ "ఆమాత్రం మీకు తెలియదూ?" అన్నాను. నా చొరవకు నాకే ఆశ్చర్య మైంది.

కొంచెం గతుక్కు మని "ఏమిరా, అది నీయుద్దేశమే" అన్నా రాయన.

"నాయుద్దేశమా......నాదంటే భౌతికశాస్త్రజ్ఞు డనన్న సందర్భంలో నాదే. ఆధునికశాస్త్రం చెప్పే విషయమే అది. నక్షత్రాలన్ని మండుచున్న వాయుగోళాలు. వాటిలో పదార్థంఅంతా వాయురూపంలోనే ఉన్నది అవెల్లప్పుడు మండుచున్నాయి, ప్రచండాగ్ని జ్వాలలు ప్రసరింప చేస్తున్నాయి. ఆభీకర కీలావిర్భావంతో, ఆ మహోజ్జ్వల తేజోవిక్షేపంతో క్షణక్షణం వాటివేడిమి తగ్గుతూంది. వేడిమితో పాటు వాటిలోనున్న పదార్థంకూడా తరిగిపోతూంది. ఇవి హాస్యానికన్న మాటలు కావు. భౌతికశాస్త్రవిజ్ఞానం ప్రసాదించిన రహస్యాలలో ఇవి కొన్ని" అని గొప్ప ఆత్మవిశ్వాసంతో, 'బస్తీమే సవాల్' అనే వివాద భావంతో నేనూ కొంత తీవ్రంగానే జవాబిచ్చేను.

"ఏదేనీ, ఈ నక్షత్రాలగురించి మీ భౌతిక విజ్ఞానం కనుగొన్న విశేషాలు కొంచెం చెప్పు వింటాం."

నే ప్రారంభించేను. "ద్రవ్యానికి మూలమైనవి పరమాణువులు (atoms) పరమాణువులన్నీ కూడా ఎలక్ట్రాను(electron), ప్రోటాను (proton) సమ్మేళనంతో ఏర్పడుచున్నాయి. ఈ ఎలక్ట్రానులు, ప్రోటానులు విద్యుచ్ఛక్తియొక్క మూలరూపాలు. ఇట్టి ఎలక్ట్రాను ప్రోటానులరూపాలతో విశ్వంలోనున్న ద్రవ్యమంతా ప్రప్రథమంలో విశ్వాభ్యంతరాల్లో ఒకేవిధంగా నిండి ఉండాలి. ఏదో కారణంచేత—అ దేదో నిశ్చయంగా చెప్పలేము—ఒకప్పుడీ ఎలక్ట్రాను ప్రోటానులు స్థలం అనే మహార్ణవంలో అక్కడక్కడ గుమిగూడుతూ దీవుల్లాగ ఏర్పడడానికి ప్రారంభించేయి. అట్టిదీవిని గెలక్సీ (Galaxy) అంటారు. గెలక్సీకి గెలక్సీకి మధ్యనున్నది శుష్కప్రదేశం. గెలక్సీగా చేరిన ఈ రెండురకాల విద్యుత్కణాలు వివిధవిధాల్లో సంకలనములై పరమాణువు లేర్పడ్డాయి. పరమాణువులు కలసిఅణువు(molecules)

లయినాయి; అణువుల సమూహాలు మూలపదార్థాలుగాను, పదార్థాలగాను పరిణమించాయి. ఈ గెలక్సీ దీవులు చెదిరి నక్షత్రా లయినాయి. సూర్యు డొక నక్షత్రం సూర్యునిలోంచి గ్రహానాలుద్భవించి సూర్యుని చుట్టు తిరుగుతున్నాయి. ఇప్పటి సిద్ధాంతం ఇది."

"అబ్బా! ఒక్కమారుగా సృష్ట్యాదే కనుక్కొన్నారేం! ఎంత చులకనగా చెప్పేవోయి! అలా పూస గ్రుచ్చినట్లు గుక్క విడవకుండా చెప్పడాని కెంత సాహసం మీ భౌతికశాస్త్రజ్ఞుల కెంత గట్టిగుండె. ప్రత్యక్షంగా సర్వం చూచినట్లు అంత 'తూ' 'చా' తప్పకుండా విశ్వోత్పత్తి వర్ణించేవే, ఏం దారుణం! ఏవీ, ఆ నక్షత్రాలమంటలు నాకు చూపించగలవ ?"

"నక్షత్రాలు మనకి కోటానకోట్ల మైళ్ళదూరాన్న ఉండడంచేత వాటిమంటలు కనుపించవు. కాని, వాటిలో నొకటగు సూర్యునిమంటలు చూడగలం. సూర్యగ్రహణ సమయమందు సూర్యబింబాన్నంతటిని చంద్రుడు మరుగుపరచినప్పుడు సూర్యోపరితలంనుండి లక్షలకొలది మైళ్లు ఆకాశంలోనికి దూసికొనిపోయే మంటలు కనుపిస్తాయి. ఏ ప్రసిద్ధ నక్షత్రాగారంలో తీసిన ఛాయాచిత్రమైనా చూడవచ్చును.

కాని, ఇంకొక విషయం. పూజ్యుడైన ఏ మహా ఋషీశ్వరుని దగ్గరకో, ఏ యోగిపుంగవుని దగ్గరకో వెళ్లి 'అయ్యా, యోగచింతానిమగ్నులై చైతన్య రహితులై నిర్వికల్పసమాధిలో కూర్చుంటా మంటారే, నన్ను కూర్చోబెట్టగలరా?', అంటే ఆయన ఏంచెప్పగలడు? 'నాయనా, కావాలనగానే లభ్య మయేది కాదోయి యోగనిష్ఠ. అనన్యమైన అభ్యాసం చెయ్యాలి. ఎవరి మట్టుకు వా రనుభవించాలి' అంటారు. ఆవిధంగా, మా పరిశోధనల ఫలితా లున్నాయి. తదనుగుణంగా ప్రతిపాదించిన నియమాలూ, సిద్ధాంతాలూ ఉన్నాయి. కుతూహలం ఉంటే అవి పఠించి గ్రహించుకోవాలి. అంతే కాని, శాస్త్రజ్ఞుని పరిహసించి ఏంలాభం?"

"విశ్వంలో శాశ్వతంగాను, స్థిరంగాను ఉండేవి లేనేలేవా? నక్షత్రాలకి క్షయం తప్పదూ? ఎవరు చెప్పేరురా నీకు? సూర్యుడుకూడా క్షీణిస్తున్నాడంటే ఎలా నమ్మేవురా? సూర్యుడు శాశ్వతజ్యోతి అని మన ప్రాచీన శాస్త్రాలు ఘోషిస్తూంటే, ఈ క్షీణభావాన్ని మీ రెలా ఆమోదించేరురా?"

నాకు కోపంవచ్చింది, ఒళ్లుమండింది. "సరే, మీసంశయం బహుసమ్మతంగా ఉంది. అక్షీణభానుడన డానికి మీ ప్రమాణా లేమిటో చెప్పండి" అన్నాను గద్గద స్వరంతో.

"ప్రమాణాలా? అలా దారికిరా. చూడు, ఆ సంగతి మనఋషులు కనుక్కొన్నారు. వారుచెప్పిన విషయాల్లో కించిత్తయినా దోషంలేదు. భౌతికంగా కాకపోయినా మానసికంగా వారు సర్వం అనుభవించి, ఆ అనుభవాలు శాస్త్రాల రూపంగా మన కందజేసేరు. అవి నమ్మకతీరదు. నమ్మకపోవడం మన మూర్ఖత అన్నమాట!" అంటూ అంధునికి దృష్టి ప్రసాదించినట్లు తలపోస్తూ నా అజ్ఞానతిమిరాన్ని ఛేదించేశక్తి గల వాడిచూపులు నా మోముపై కేంద్రీకరిస్తూ సగర్వంగా క్షణకాలం నా వైపు తదేకదీక్షతో చూసేరు.

"ఆహా! మీ ప్రమాణాలని నమ్మవలసిందా, నమ్మనివారు మూర్ఖులూ, శుద్ధపశుప్రాయులూనా? పదార్థనిర్మాణం కనుక్కొని, అనంతకోటిమైళ్లదూరాన్న ఉన్న నక్షత్రాల ఛాయాచిత్రాలు తీసి, వాటినుండి వచ్చే కాంతిని విశ్లేషించి, పరిశోధనాగారాలలో వివిధ తాపక్రమాలలో ప్రజ్వలిస్తూన్న లోహాలకాంతిని విశ్లేషించి ఈ రెండురకాల విశ్లేషణచిత్రాలు సరిపోల్చి, ఏయే నక్షత్రంలో ఏయే పదార్థంగాని, లోహంగాని ఏయే అవస్థలో నుండడానికి అవకాశమున్నదో నిర్ణయిస్తూ నక్షత్రాల బరువూ, దూరం, తాపక్రమం కనుగొన్న ఆధునిక శాస్త్రం దోషయుతమా? కేవలంకల్లా? అసత్యమా? ఆశాస్త్రాన్ని నమ్మినవారు శంకలూ, శుంకలూనా? కొంచెం తీవ్రంగామాట్లాడుతున్నాను, క్షమించండి. మన ప్రాచీనశాస్త్రాలంటే నాకు మహాగౌరవం. ఆధునికశాస్త్రజ్ఞు లిప్పటి కింకా కనుగోలేని రహస్యాలు విశేషంగా వాటిలోనున్నాయని నా యభిప్రాయం. అవి ఉత్కృష్టమైనవి, పూజనీయమైనవి, భావిశాస్త్రాభ్యున్నతికి మహోపయోగమైనవి అని నానమ్మకం. అందుచేత, వాటిమీద తిరస్కారభావంతో నేనిలా

మాట్లాడుతున్నానని మీరు భ్రమపడకూడదు. నేను చెప్పేవిషయాలు కొంత సానుభూతితో గమనించాలని నాకోరిక. కొంచెం సావధానంగా వింటారా?"

"ఆ."

"మన ప్రాచీన శాస్త్రాలమీద నున్న మీ అభిమానం కొంత దురభిమానంగా పరిణమిస్తున్నాదని చెప్పవలసి వచ్చినందుకు ముందు క్షమాపణం. ఎలాగంటే! మన ఋషీశ్వరులు అనుభవాలన్నీ మానసికంగా పొందేరనీ నేనూ నమ్ముతాను. వారనుగమించిన మార్గమే వేరు. వారేమీ శాస్త్రీయోపకరణాలుపయోగించినట్లు లేదు. ఉపయోగించేరనడానికంతగా ఆధారాలులేవు. అసలు, ఆభావమే అనవసరమనుకుంటాను. ఏమంటే, వారు కేవలం ఆత్మశక్తిని, ఆధ్యాత్మికచింతనాన్ని సాధనంగా పెట్టుకొన్నారు. యోగమార్గం అవలంబించేరు. భౌతికపదార్థాలతో వారికి సంపర్కం అక్కరలేకపోయింది. అంతవరకు మీతో నేనేకీభవిస్తాను.

ఆధునికులంటే పదార్థపరిశోధనంతో ప్రారంభించేరు. పరిశోధనకై సూక్ష్మమైనవి, సున్నితమైనవి ఉపకరణాలు నిర్మించేరు. పదార్థానికి శక్తికి ఉన్న సంబంధం కనిపెట్టేరు. వాటి అవినాభావం గ్రహించేరు. వీళ్లపథం వేరు. వీరు కేవలం భౌతికంగా పోతున్నారు. భౌతికావరణం అతిక్రమించేరు. ఆధ్యాత్మిక మండలంలోకి ప్రవేశిస్తున్నారు. ముఖ్యమైన ఈభేదం గమనించండి.

ఇంక, మనశాస్త్రాలకు మనమే అపచారం చేస్తున్నామన్నాను. అది ఎలా జరుగుతూందో మీరు ఎరుగకపోవచ్చును, చెప్తావినండి. పాశ్చాత్యులు విమానాలు తయారు చేసేరు. అప్పుడు మన మేమన్నాం? 'ఓ, మాకివి క్రొత్త కావయ్యా, పుష్పకం శ్రీరామ రాజ్యంలోనే ఉండేది. రావణసంహారానంతరం శ్రీరాములవారు పుష్పకంమీదే నిజరాజ్యంచేరుకొన్నారు. అది మహాగొప్ప విమానం. అందులో నెంతమంది కూర్చున్నా ఒక్కనికి స్థలం మిగిలేదట. అలాంటి దాన్ని వీళ్లను తయారుచేయమను, చూదాం. వీళ్ల తాతలు దిగిరావాలి.' – వైర్లెస్ (Wireless) కనుక్కున్నాడు మార్కోని. అప్పుడేమన్నాం: 'ఇదేనండీ! దీనినే మనవాళ్లు దూరశ్రవణం అన్నారు. అదీ మనకు చిరపరిచితమే.' టెలివిషన్ (Television, సాధ్యమౌతూంది. దాని కేమంటున్నాం: 'దివ్యదృష్టి ప్రతి ఋషికీ తెలుసునయ్యా! ఒక్కమారు గట్టిగా కళ్లుమూసుకొంటే చాలును, ఈ లోకంలోనే కాదు చతుర్దశ భువనాల్లో ఎక్కడేది జరుగుతూందో చెప్పేవారా మహానుభావులు; మన కర్మం ఇలా కాలిందికాని.' మరికొంతమంది 'ఈదొంగలు మన వేదాలూ, ఉపనిషత్తులూ ఎత్తుకొనిపోయి, బాగా పరిశోధించి, విమానాలు, దివ్యదృష్టి, దూరశ్రవణం పైకిలాగేరు. శాస్త్రచౌర్యం!' అని మహా ఆర్భాటంగా నంటారు.

ఇట్టి భావాలకి తావివ్వటం న్యాయమా అని ఎప్పుడైనా విచారించారా? అవి మనకి గౌరవప్రదమా? ఇంతకన్న తీవ్రంగా మనశాస్త్రాలను అగౌరవపరచే విధానం లేదేమోఅని నాసందేహం. మీరు నుడివినట్లు ప్రాచీనులది ఆధ్యాత్మికమార్గమై, ఆధునికులది భౌతిక పథం అయితే ఈరెండింటికి సంబంధమేముంది? ఎవరి మార్గానుసరణం వారికే కష్టతరం కాదూ? ఇందులో చౌర్యాని కేముంది?

చూడండి, పుష్పకం ఉండేదని రామాయణంలో చదివేరు. విమానాలని ప్రత్యక్షంగా చూస్తున్నారు. కార్య నిర్వహణంలో రెండూ ఒక్కటే: గాలిలో ఆకాశయానం చేస్తూ ఒక ప్రదేశం నుండి మరొక ప్రదేశంలోనికి జీవులను, నిర్జీవులను చేర్చడం. అయితే, వాటి నిర్మాణంలో ఏమైనా సారూప్యం ఉన్నదా అని, పుష్పకంగూర్చి మనకు లభించిన జ్ఞానాన్ని విమాననిర్మాణంలో ఆధునికు లెంతవరకుపయోగించేరు అని యోచించవలసిన బాధ్యత మనపై లేదూ? దూరశ్రవణం ఋషులకు సులభసాధ్యమైనదే; వారది తీవ్రమైన అభ్యాసయోగంచే గణించేరు. ఈ యుగంలో కించిద్ధనికులకు రేడియో పలుకుతుంది. అంతే కాదు. ఆ యంత్రం పొలిమేర నున్నవారందరూ దూరశ్రవణానందభాగ్యం అనుభవించగలరు. దీనికి ఆత్మశక్తి గాని, యోగాభ్యాసంగాని అక్కరలేదు. అయితే, దూరశ్రవణానికి రేడియోకి సంబంధమేముంది? ఇప్పుడు

చెప్పండి: ఆధునిక విజ్ఞానదూషణం అన్యాయమా, కాదా?"

నావాదం చాలా సమంజసంగా నున్నట్లు ఆయన ముఖంలో కలిగినమార్పు తెలియజేసినప్పటికి దాని నామోదించడానికి మనసు ఒప్పుకొన్నట్లు లేదు. వికటహాసం చేసేరు. వెంటనే తొల్లిటి నిరసనభావం ముఖంలో ప్రకటమైంది. లేచి కూర్చున్నారు. గొంతు సవరించారు.

"మీ శాస్త్రాని కోస్థిరత్వం ఏడిసెండిట్రా? మీ వాదాలు సిద్ధాంతాలు రోజు రోజుకి మారిపోతూంటాయి. గురుత్వాకర్షణసిద్ధాంతం (Law of gravitation) ఏమయింది. న్యూటన్ కనుగొన్నానక సుమారు ౨౫౦ ఏండ్లదాకా నిలిచియుంది. ఇప్పుడది పనికి రాదంటున్నారు. కాంతితరంగాలంటారు, కాంతి కణాలంటారు. ఈథరు (Ether) ఒకమారున్నదంటారు, మరొకసారి లేదంటారు. మన ప్రాచీనశాస్త్రంలో నున్న శాశ్వత సత్యసూత్రాల్లాంటివి మీ ఆధునిక శాస్త్రంలో మచ్చుకైనా ఉన్నాయిట్రా?

అన్నిటికంటే దుర్భరమైంది—మీరు దేవుడు లేడంటారే! నోబెలు బహుమానం పొందిన జగద్విఖ్యాత పురుషుడు, మహాశాస్త్రవేత్త రామన్ మహాశయుడేమన్నాడు? దేవుడులేడన్నట్టుగా నొకమారు చెప్పేడు. ఇంకొకటి చెప్పు. ఆదిని విశ్వంలో సర్వత్ర వ్యాపించియున్న విద్యుత్కణాలు ఒకప్పుడక్కడక్కడ గుమికూడడం ప్రారంభించేయి అన్నావే. అలాగెందుకు కావాలో చెప్పగలవు? ఏవిషయమైనా సరే 'ఏమిటి' అంటే మీరు చెప్పగలరు. కాని 'ఎందుకు' అన్న ప్రశ్నకు సరిగ్గా సమాధానం చెప్పలేరు. మీది కేవలం నాస్తికత్వంరా, అదే నా వొల్లమంటకి కారణం."

"నాసమాధానం వినండి. మాశాస్త్రాలకు స్థిరం లేదనీ, అవెప్పుడు మారిపోతున్నాయనీ అన్నారు. నిజమే. విజ్ఞానశాస్త్రం అంటే ఏమిటి? ప్రకృతిలో గమనించిన దృగ్విషయాలను సంకలనంచేసి, సందర్భానుసారంగా వాటిని విభాగాలుచేసి, ఒక్కొక్క శాఖకు అనువైనట్లు సిద్ధాంతాలు, నియమాలు ఏర్పరుస్తాము. పరిశోధనాశక్తి అభివృద్ధియైనకొద్దీ, యంత్రసౌకర్యం పెంపొందిన కొద్దీ, కనుగొనే విషయాలు కూడా అధికమవుతాయి. విషయాలు ఎక్కువైన కొద్దీ వాటినికూడా యిమిడ్చేటట్లు సూత్రాలను సవరించాలి. సిద్ధాంతాలు మారుతున్నాయంటే అస్థిరంచే కలిగినమార్పుకాదు. నూతన విషయసంకలనంతో సిద్ధాంతంయొక్క వ్యాప్తి విస్తరింపచేయాలి. అందుకు సిద్ధాంతాలను సమగ్రంచేయాలి.

చూడండి, కాంతికిరణాల్లో కాంతికణాలున్నాయన్నారు, మొదట ఆవాదంతో కాంతికిరణాలు పరావర్తనంచెందడం (Reflection)—అంటే ప్రతిబింబం కనుపించడం—వక్రీకరణం పొందడం (Refraction)—అంటే గాలిలోంచి నీటిలోనికి పోయినప్పుడు జలతలంవద్ద ఒకవైపుకు కిరణంవంగడం—అనే విషయాలు సమర్థించేరు. తరువాత సంఘర్షణం (Interference) అనే మరొకవిషయం బయల్పడింది. ఈ కణసిద్ధాంతం దానికి వర్తించలేదు. అప్పుడు కాంతికిరణాలు తరంగాలుగా నున్నాయన్నారు. ఇటీవల మరల కణసిద్ధాంతం ఒప్పుకొంటున్నారు. అలాగే పరమాణువు సందర్భంలో కూడా. పరమాణువులో నున్న ఎలక్ట్రానును విద్యుత్కణమనీ, ఉక్కుగుండులా గట్టిగా ఉన్నదనీ భావించారు. విద్యుత్కణాలు పలుచనిరేకులమీద పడినప్పుడు తీసినచిత్రాలు పరీక్షిస్తే అవి తరంగాలులాగ గోచరించాయి. వాటికి రెండుగుణాలూ ఉన్నాయన్నారు. ఒకప్పుడు కణంలాగ, మరొకప్పుడు తరంగసమూహంలాగ ప్రకటితమాతుందన్నారు. దాని వ్యక్తిత్వాన్ని వ్యక్తమొనర్చే పరిస్థితులనుబట్టి, దేశకాలానుసారంగా ఒక్కొక్కవేషం వేస్తుందని సమర్థించారు. ఇట్టిపరిణామం విజ్ఞానాభ్యుదయాన్నే సూచిస్తుందిగాని, శాస్త్రచ్యుతిని గాదు.

రామన్ మహాశయు లలాగెందుకన్నారో నే చెప్పలేను. ఆధునికశాస్త్రం దైవాభిప్రాయాన్ని గుర్తింపవలసినపరిస్థితు లేర్పడ్డాయి. విజ్ఞానశాస్త్రజ్ఞులు కొంచెం మోమోటపడుతున్నారేకాని, లేదేని, దైవభావాన్ని యీపాటికే బహిరంగంగా ప్రకటించి యుందురని నానమ్మకం. చూసేరా, ప్రకృతి రహస్యాలు కనులార వీక్షిస్తూ, అద్భుతమైన యంత్రాలు సృష్టిస్తూ, విశ్వాభ్యంతరాల్లో కోటానకోట్ల మైళ్లు దృష్టి సారించి విశ్వగమనక్రమాన్ని బోధపరచుకోడానికి ప్రబలప్రయత్నాలు చేస్తూ, తత్సాధనదీక్షా నిమగ్నుడై, క్షణక్షణం

శ్రోత్రసంగతులు వెల్లగిస్తున్న విజ్ఞాన శాస్త్రజ్ఞుడేదైవ శక్తిని సంపూర్ణంగా అవగాహన చేసికోగలడనీ,దైవ భావాన్ని సగౌరవంగా శిరసావహించగలడనీ నా యభిప్రాయం.”

“అబద్ధం! నీకు మతిపోయింది. ప్రాచీనశాస్త్రా లంటే నీకున్న అభిమానంచేత దైవం ఉన్నాడంటు న్నావుగాని, పాశ్చాత్యశాస్త్రజ్ఞులలో నెవడు ఒప్పు కుంటాడురా?”

“వారు కూడా దైవభావాన్ని గుర్తిస్తున్నారనే నేననేది. ఆభావం శాస్త్రసామ్రాజ్యంలోనికి ప్రవేశిం చిన విధానం చెపుతా వినండి. ఇప్పుడే మీ రడిగేరు: ఆదిని విద్యుత్కణా లెలాగ అక్కడక్కడ దీవుల్లాగ చేరేయి అని. ఎలాగంటే మన రుగము. వాటి నలా చేర్చిన కర్త ఎవరంటే మౌనమే సమాధానం,లేదా ‘ఛాన్స్’ (Chance) అనాలి. దానికి సరియైన తెలుగు పదం కిట్టడంలేదు, అందాకా ‘విధి’ అందాము.

ఇటువంటిదే రేడియో ధార్మికత్వం (Radio-activity) రేడియం పరమాణువులు విచ్ఛిన్నమౌతూ హీలియం (helium) గాను, సీసం గానుమారిపోతాయి. ఆ పరమాణువు గర్భంలోంచి కొంతశక్తి ప్రసరిస్తూం టుంది. అది పోగా సీసము మిగులుతుంది. ఆవిచ్ఛిత్తి ఎందుకు వాటిల్లుతుందంటే చెప్పలేము: దాని కామార్పు స్వాభావికం. విచ్ఛిత్తిమట్టుకు నిరంతరంగా అవుతూం దనే విషయం ప్రత్యక్షంగా ప్రదర్శించగలము. ఒక నియమానుసారంగా విచ్ఛిత్తి కావలసిందే కాని మన మెంత ప్రయత్నించినా దాన్ని మార్చలేము. బాహ్య వస్తువులతో సంబంధం లేకుండా ఎట్టిపరిస్థితులలోనయినా విచ్ఛిత్తి ఒకేవిధంగా ఎలా వాటిల్లుతుందో చర్చిస్తూ జీన్సుపండితుడు “రేడియంపరమాణువును విధి తలుపు తట్టి పిలుస్తుందని, పిలిచి భిన్నముకమ్మని బలాత్కరి స్తుందని ప్రతి విజ్ఞానశాస్త్రజ్ఞుడు నమ్ముతాడు” అని స్పష్టంగా చెప్పేడు. ఇంకొకసందర్భంలో “భూత కాలంలో జరిగినదాన్ని బట్టి భావి కార్యక్రమాన్ని మనం అనుకొన్నంత పూర్తిగా నిర్ణయించలేము. అది కొంతవరకు ఏదైవము లుంటే ఆ దైవముల చిద్విలాసాన్ననుసరించి ఉంటుంది[2] అన్నాడు. ఈయభి ప్రాయాన్ని ఇతర శాస్త్రవేత్త లామోదిస్తున్నారు. కావున, శాస్త్రజ్ఞులమీద నాస్తికత్వాన్ని ఆరోపించ వలసిన అగత్యం లేదు. ఆరోజులు దాటి పోయినాయి.

మరొక విశేషం గమనించేరా? విజ్ఞానం నిత్యా భివృద్ధి పొందుతూందంటే మానవజాతియొక్క నిరంతర వర్ధమానౌన్నత్యమే తెలియజేస్తుంది కాదూ? మానవుని దినదిన ప్రవర్ధమాన మేధాశక్తి ఆకాశమండలి అగోచర శక్తులను వశం చేసికొని స్వాభ్యుదయంకోసం నిరంకు శంగా వాటి నుపయోగిస్తూం దన్న సంగతిమానవుడు సగ ర్వంగా ప్రకటించ తగినదే కదూ? అన్వేషణలో చూచినట్లయితే వ్యయ ప్రయాసముల కోర్చి, ఒక్కొ క్క నూతనాంశం కనుగొనే సందర్భంలో ప్రాణత్యా గానికూడా తెగించి జ్ఞానం కేవలం జ్ఞానం కోసమే అన్న ఉత్కృష్టాశయ తోనూ, విజ్ఞానఫలాన్ని సామాన్య జనానికి సమర్పించే స్వార్థత్యాగబుద్ధితోనూ కృషిచేసే విజ్ఞానశాస్త్రజ్ఞులు అభినందనపాత్రు లనడానికి సందేహ ముంటుందా? మానవజాతికి వారు తలమానికములు కారూ? ఏమంటారు?”

“ఆ! నీవు చెప్పినవన్నీ చాలావింతగానున్నాయి. నాలో నేను వితర్కించుకొంటే గాని, ఏం చెప్ప లేను... నీకు నిద్రరాలేదూ?”

అప్పటికి ౧౨ గంట లైంది. రెప్పలు బరు వెక్కేయి. పౌరుషంకొద్దీ వాదిస్తున్నానే గాని నాకూ నిద్ర ముంచుకొని వస్తున్నది.

“నాకూ నిద్ర వస్తున్నదండీ” అన్నమాట జ్ఞాప కం ఉంది. అలాగే పడుకొని నిద్రపోయాను. తెలివి వచ్చి నలుదిక్కులు చూచేసరికల్లా భళ్లున తెల్ల వారింది. క్షీణభాస్కరు డన్నా నన్న కోపంచేత కాబోలు తీవ్రకరాభిఘాతంతో నన్ను లేపుచున్నాడు సూర్యుడు. కాఫీ పట్టుకొనివస్తూ “మామా, ఇంకా లేవలేదూ?” అన్నాడు రాము.

---

1. *Every physicist rather believes that fate knocks at the door of (each) radium atom......and compels it to break up'. Sir J. Jeans: Myserious Universe. Page 19.*

2. *Ibid, Page. 18.*

# *పిక్టోరియల్ ఫొటోగ్రఫి ౨

కొడవటిగంటి కృష్ణమూర్తి

ఫొటోగ్రఫి కళ అవునా కాదా అనే ప్రశ్న ఈనాటిది కాదు. ఈప్రశ్న విదేశాలలో చాలాకాలము క్రిందటనే బయలుదేరి కొద్దికాలం క్రిందటనే హిందూ దేశంలోకి ప్రాకింది. ఆంధ్రదేశంలోకి ఇంకా అడుగు పెట్టలేదు.

పై ప్రశ్నకు సమాధానము చెప్పకపూర్వము "కళ" అంటే ఏమిటో తెలుసుకుంటే మూడువంతులు పని పూర్తి అవుతుంది. కళఅంటే నేను విన్నదీ, నాకు తెలిసినదీ మనవిచేస్తాను. భగవంతుడు సృష్టించిన ఈ ప్రపంచంలో ప్రతి అణువులోనూ, ప్రతి వస్తువులోనూ, ప్రతివ్యక్తిలోనూ, ప్రతి ప్రదేశములోనూ, ప్రతి శబ్దములోనూ అందము (Beauty) వున్నది, పైన చెప్పినవాటిలో భగవంతుడుకూడ వున్నట్టుగానే. ప్రతి వ్యక్తీ వాటిల్లోవున్న పరమాత్మను ఎట్లా చూడలేడో, లేక ప్రతి వ్యక్తికీ ఆ భగవంతుడు ఎట్లా అగపడడో అట్లాగే ప్రతివ్యక్తికీ ఈ బ్యూటీకూడ అగపడదు, లేక ప్రతివ్యక్తీ చూడలేడు. ఈ బ్యూటీని కొంతమందే చూడగలరు. కొంచెము తక్కువమంది చూచి గ్రహించ గలరు. ఇంకా తక్కువమంది చూచి గ్రహించి దానిని ఇతరులకు చూపగలరు. ఎవడైతే ఆ అందాన్ని చూచి గ్రహించి ఇతరులకు అర్థమయ్యేటట్టు వున్నతభావంతో చూపగలడో వాడిని ఆర్టిస్టు అంటాము. అందరు వ్యక్తులూ ఒక మాదిరిగా వుండనట్టుగానే అందరూ ఒకరకంగా ఈ అందాన్ని చూపలేరు. ఆకారణం చేతనే వీరిలో మంచి చెడ్డ లేక చౌకఆర్టిస్టులు తయారవుతారు. ఈ నిర్ణయము అనుభవముమీదగాని బోధపడదు. ఈ అందమే కళ. దాన్ని చూపగలిగినవాడు ఆర్టిస్టు. భగవంతుడికంటె గొప్ప ఆర్టిస్టు లేడు!

కళ వ్యక్తికి భోజనము, నిద్ర, స్త్రీ మాదిరిగా అవసరములేదు. కొనటానికి దొరకదు. లాల్చీలు తొడిగితే అబ్బదు.

పైన చెప్పినఅందాన్ని ఫొటోగ్రాఫరు ప్రకృతియందుచూచి గ్రహించి దానిని ఇతరులకు వున్నతమైన భావములతో చూపగలడా? ఫొటోగ్రాఫరులు ఈ అందాన్ని ఇతరులకు గంభీరమైనభావములతో చూపగలరని కళావిమర్శకులు వొప్పుకున్నారు. అనుమానం వున్నవారు ఫొటోగ్రఫిక్ ప్రదర్శనాలను చూడటం అత్యవసరం, అతిముఖ్యం. ఈ ప్రదర్శనాలు మనదేశంలో ఇంకా విరివిగా లేనందున ఈప్రదర్శనాలలో ప్రదర్శింపబడిన చిత్రముల ప్రచురణాలను చూడటం రెండో రకం. ప్రస్తుతం మనం అంతకంటె చేసేదీలేదు. ఈక్రింద చెప్పబడిన పుస్తకాలు తెప్పించుకుని వాటిలోని చిత్రాలను చూస్తే మూడువంతులు తీరిపోతుంది.

1. Pictures from the Tyng Collection·
2. The year's Photography.
3. Photograms of the year.
4. American Annual of Photography.

ఇవి ప్రతిసంవత్సరమూ అచ్చవుతుంటయి. ఇవి కాక ఫ్రెంచిలోనూ, జర్మనిలోనూ అనేకం వున్నయి.

అయితే చాలమంది "దినపత్రికలలోనూ మాసపత్రికలలోనూ ఇన్ని ఫొటోలు అచ్చవుతున్నప్పుడు వీటిలో కళతోకూడుకున్న చిత్రాలు లేవా? వుంటే అవి ఏవి?" అన్నప్రశ్న వెయ్యవచ్చును పైనచెప్పిన పుస్తకాలు చూడకమునుపే. అసలుఫొటోగ్రఫి బయలుదేరినప్పుడు ఎవరూ దీనిని అట్టే గమనించలేదు. ఎందుకంటే మంచివిషయము ఎప్పుడూ కొత్తదికాదుకాబట్టి, (ఏ మంచిఅయినా మనశాస్త్రాలలో ఇదివరకే వున్నదాయె!) కొత్తది ఎప్పుడూ మంచివిషయముకాదు

* ఈ వ్యాసాన్ని ఫొటోలుతీసేవారేకాక ఇతరులుకూడ చదవవచ్చు. కొ. కృ.

కాబట్టే! వజ్రాన్ని సానపట్టినప్పుడు అన్నివైపులా దాని కిరణాలు సమానశక్తితో ఏవిధంగా పరుగెత్తుతయ్యో ఫోటోగ్రఫీకూడ మానవునిజీవితంలో అట్లా ప్రవేశించింది కొంతకాలం అయినపిమ్మట. మానవుడికి ఫోటోలు అవసరమైనై. మనకు మామూలుగా కనుపించేవి కళతో కూడుకున్న చిత్రాలు కావు. పోతే ఒకటిరెండు చిత్రాలు బాగుండవచ్చు. దేనివల్ల? ఆతీయబడినప్రదేశం అందంగా వుండవచ్చు. లేకపోతే ఆ చిత్రంలో వున్న స్త్రీ అందంగా వుండవచ్చు. ఇంకా పోతే ఆమెపమిట తొలిగివుండటంవల్ల మనకు నచ్చవచ్చు! అంతే కాని వీటిల్లో చిత్రకారుడిపనితన మెక్కడ వున్నది అంటే ఎక్కడా లేదు. అప్పుడప్పుడు కళతో కూడుకున్న చిత్రాలుకూడ పత్రికలలోకి రాకపోవటంలేదు! కాని నివురుకప్పిననిప్పు కంటి కెట్లా గోచరించదో అట్లాగే మనకు, మామూలుపత్రికలు ఇచ్చేఅచ్చు దానిలోవున్న అందాన్ని మూడువంతులు కబళించటంవల్ల, ఈ చిత్రాలలో (దారితప్పివచ్చి ఒకటి రెండింటిలో) చిత్రకారుడి కళానైపుణ్యము కనపడదు. ఈ విషయం సామాన్యంగా మనము ప్రతిదినం చూచేపత్రికలలోని చిత్రాలకు చెందుతుంది సుమండీ! ఈ పత్రికలలో ప్రచురింపబడే చిత్రాలు వ్యాపారసంబంధమైన వస్తువులు ప్రకటించటానికి తయారైనవి. మరికొన్ని ఫలానిప్రదేశంలో జరిగిన ఫలానివిషయానికి చెందివుంటయి. ఎటొచ్చీ కళతో కూడుకున్న చిత్రాలు వీటిల్లోకి రావు. వచ్చినా మనవాళ్లు ప్రకటించరు!

కళతో కూడుకున్న చిత్రాలు తియ్యటానికి సంబంధించిన ఫోటోగ్రఫీకి పిక్టోరియల్ ఫోటోగ్రఫీ అనిపేరు. ఇది అర్థము కాదన్నా, ఇటువంటిది లేదన్నా, ముఖ్యంగా అనవసరమన్నా, లేక అనవసరమైన శ్రమ అన్నా ఎవ్వరూ ఎక్కువగా పాటించ నక్కరలేదు. వీరిని పసిపిల్లలకింద కట్టి ముందుకుపోవచ్చు.

ఇంతవరకు చెప్పిన విషయంగాని, ఇక చెప్పబోయే విషయంగాని నేను సృష్టిచేశానని చెప్పను. కళకు సంబంధించిన విషయాలు ఒకరిసొమ్ము కాదు. పోతే అవి తిరిగిచెప్పేపద్ధతిలోమార్పుగాని, Improvement గాని వుండవచ్చు. ఈవిషయం ఇదివరకు "భారతి"లో అచ్చుపడిన వ్యాసంలో మనవి చేశాను. ఇప్పుడు మళ్లీను.

ఉదాహరణకు "ఆనందభవనం" తీసుకుందాము. ఈభవనంవిషయం మనందరమూ వినివుంటాము. కాని మనలో సహజంగా చాలతక్కువమంది చూచివుంటారు. దీనిని వొకవ్యక్తి ఫోటోతీస్తాడు. మామూలుగా దాన్ని చూడగానే "ఏమిటిది?" అని ప్రశ్నిస్తారు. "ఆనందభవనం" అని సమాధానంవస్తుంది. "ఓహో! అట్లాగ! ఒరేయ్, ఇదిగోరా ఆనందభవనం ఫోటో!" అని పక్కవాడికి చూపటం జరుగుతుంది. దీన్ని బట్టి వీరకి 'ఆనందభవనం'లోనే అభిరుచి వున్నదనీ (కారణం అది కాంగ్రెసు ప్రెసిడెంటు గృహముకావచ్చు) ఆ ఫోటోలోమట్టుకు ఆట్టే అభిరుచిలేదనీ తెలుస్తుంది. ఆ ఫోటో నిజంగా కళతో కూడుకున్నదే కనక అయితే వెంటనే అది ఏమిటో తెలియకుండానే 'ఎంత బాగుందోయి!' అంటారు. ఇది మానవస్వభావం. వినపడే సంగీతంలో నిజమైన ఆనందం వుంటే ఏరాగమో విచారించటాని కవకాశ మేమున్నది? ఆర్టిస్టు ఒక ప్రదేశాన్ని చూడగానే దాన్ని ఎంతసేపటికీ తనకునచ్చినట్టుగా ఇతరులకు చూపుతాడు. ఆర్టిస్టు కానివాడు ఆ ఆనందభవనాన్నే చూపిస్తాడు. అప్పుడు అది (చిత్రము) ఇతరులు ఆ భవనాన్ని గుర్తుపట్టటానికి మాత్రమే పనికివస్తుంది. లేకపోతే జవహర్లాలు గృహం ఇట్లా వుంటుందికామాలు అనుకోటానికి వుపయోగపడుతుంది.

మన పిల్లవాడిని ఇంకోరూపంలో చూచుకోటానికి ఫోటోతీశాము. ఇది నిజంగా మనపిల్లవాడిని ఎరగని ఇతరులకు ఎందుకు? ఆర్టిస్టు అయినవాడు తనకు దొరికే వస్తువుద్వారా తనకళానైపుణ్యాన్ని ఇతరులకు, తను ఎన్నడూ చూడలేనివారికి చూపాలి. అప్పుడు ఈ పిల్లవాడిని వారు పరీక్షచెయ్యరు. ఆపిల్లవాడిని చూపిన రీతిని పరీక్షచేస్తారు. వస్తువు ఎటువంటిదైనప్పటికీ, ఏదైనప్పటికీ ఆర్టిస్టుకు అడ్డంరాదు, రాకూడదు. ఇది మామూలు చిత్రాలకీ, కళతో కూడుకున్న చిత్రాలకీ ముఖ్యమైన భేదం.

మన జీవితంలో ప్రతిదినం మనం చేసేపనులకే శాస్త్రాలు, నిబంధనలు ఉన్నప్పుడు కళలకు శాస్త్రాలు, నిబంధనలు వుండటంలో ఆశ్చర్యములేదు. ఇవి వారు సృష్టిచేసినవి కావు. అనాదినించీ వస్తున్నాయి. ప్రకృతి స్వభావంలోనే గోచరిస్తాయి. వీటిలో Composition అన్నిటికంటె ముఖ్యమైనది. Composition లోనే Balance వగైరా వున్నాయి. కళమీద నిబంధనలు ఏ కళకు సంబంధించిన గ్రంథాలలోనైనా దొరుకుతవి. F. C. Tilney రచియించిన Principles of Photographic Pictorialism వుత్తమగ్రంథాల్లో వొకటి. కళయందు అభిరుచివున్న ప్రతివ్యక్తీ ఈ శాస్త్రాన్ని పఠించాలి. వకవాక్యాన్ని రాయటానికి వ్యాకరణం ఎట్లా తెలియాలో వకచిత్రాన్ని తయారు చెయ్యటానికి శాస్త్రం అల్లా కావాలి. కొంతకాలం గడిచిన తర్వాత ప్రతివ్యక్తీ వ్యాకరణరీత్యా సరిగా వున్నదా, లేదా అన్నగమనం లేకుండానే వ్యాకరణానికి సరిపోయేటట్టే వాక్యాలను సులభంగానే వ్రాయగలుగుతాడు. ఇతరకళలు కూడ అంతేనేగాని ఇతరకళల్లో ఎందుకనో స్థితి ఆవిధంగా లేదు! కారణం ఇతరకళల ద్వారా భావాన్ని చూపటం అంతసులభం కాకపోవటమేమో! భావం ప్రధానంగా పెట్టుకున్నవాడెవడూ శాస్త్రం కోసం శ్రమపడడు. ఆవిధంగా శాస్త్రంకోసమే తంటాలుపడితే ఆకళలో శాస్త్రమే వుంటుంది కాని అసలు ముఖ్యమైనది భావం ఎక్కడుంటుంది? పిల్లవాడు భావిలో పడ్డాడని తెలియగానే మానవుడైనవాడు భావిదగ్గరకు పరుగెత్తుతాడుగాని తాడుకోసం, నిచ్చెనకోసం వెతకడు. కీర్తనకు తాళం సరిపోవాలి. తాళంకోసం కీర్తనవిరిస్తే భావం నశించటానికి అడ్డు ఏమున్నది? వ్యాకరణంగాని, తాళంగాని, శాస్త్రంగాని వాటి అంతట అవి నడవాలి. మనస్సు మాత్రం ఎప్పుడూ అర్థానికి,రసానికి, భావానికి తయారుకావాలి ఈస్థితి రావటానికి వ్యక్తి శాస్త్రాల్ని కష్టపడి క్షుణ్ణంగా నేర్చుకుని మళ్లీ అంతకష్టపడి మరచిపోవాలి!

సంగీతాన్ని తీసుకుందాము. మోక్షసాధనానికి సంగీతం ఒకమార్గం. భగవంతుణ్ణి కృష్ణుణ్ణి గురించి భజన చేసేటప్పుడు, పాడేటప్పుడు తొడ పగిలేటట్టు తాళం వెయ్యటంవల్ల నొప్పి కలుగుతుండగాను, తాళం తప్పితే అందరూ గోలచేస్తారు అని ఒక భయం వుండగాను మనస్సు ఆభగవంతుడిమీద ఎట్లా నిలుస్తుంది? అర్జునుడికి పక్షితప్ప మరేమీ కనుపించలేదు! పాటపాడేవాడు తననోటివెంట వెలువడే శబ్దాలవల్ల, భావంవల్ల కలిగే ఆనందంలో లీనమైపోవాలి. అప్పుడే అది ఇతరులకు ఆనందం ఇస్తుంది. ఈ స్థితిలో తాళానికి శాస్త్రానికి చోటులేదు. అంతమాత్రాన తాళంగాని, శాస్త్రంగాని అనవసరమని కాదు. అవి కొంచెము వెనక వుండాలి. త్యాగరాజు రచియించిన కీర్తనల్ని అర్థంతెలియని అరవసోదరుడు ఎంతమాత్రమూ తెలుగురానిజనాన్ని ముందుపెట్టుకొని బొంబాయివంటి నగరాల్లో పాడుతుంటే ఎవరికైనా కష్టంగానేవుంటుంది. ఇదేమన్నా సంగీతం పోటీపరీక్షా? శాస్త్రానికీ పాండిత్యానికీ సమయాలు చోట్లు వేరే వున్నాయి. పైగా పాటకచ్చేరీలు "సంగీతకళయందు జనసామాన్యానికి అభిరుచి కలిగేటందుకు" పెట్టిస్తారు! అరవసోదరులు భావంతెలియక తెలుగుకీర్తనలు పాడితే పాడారు, తెలుగువచ్చినవాళ్లకయినా భావం తెలియదా అంటే "నగుమోము" అంటే వారు నిజంగా నగుమోము అని అన్నప్పటికీ (అనుమానించవలిసిన విషయమే అనుకోండి!) అది మనకు "లగుమోము" అన్నట్టుగా వినిపిస్తుంది. తప్పు మనదే అందాము. "అగమమూగుల అవనిజలోగొల" అంటే తెలుగువాళ్లకు ఏమి తెలుస్తుంది? (వినుడు-సుబ్బయ్యభాగవతారు ప్లేటు — శ్రీరఘువరసుగుణాలయ) భావంలేకపోతే పోయింది ఆరసాన్ని చవిచూద్దామా అంటే ఎంతసేపటికీ తమలపాకురసం తప్ప రాదు కదా! ఒకవేళ తీరా వచ్చే సమయానికి (ఎన్నడూ రాదు లెండి!) స్వరం మొదలవుతుంది. ఇది పాటకచ్చేరి సుఖం. దీనిలో వున్న కళ మామూలు మానవులకు కనిపించటం లేదు మరి! ఆ పైన ఈ పాటకచేరీలు జనసామాన్యానికి ఈ సంగీతకళలో అభిరుచి కలిగించటానికి అని చెప్పటం మహాఘోరం. క్షమించరాని అపరాధం. ఒకసారి ఒక ఆయన ఒకప్లేటు తీసుకెళ్లి ఆ సాయంత్రమే దాన్ని వాపసుచేశాడు షాపువాళ్లకి. విచారించగా ఆయన ఆ ప్లేటుమీద గాయకుడిపేరు చూచేకొన్నాడట. కాని తీరా ఇంటికి వెళ్లి దాన్నివింటే చివరభాగం అంతా మృదంగమేట! అం

దుకని ఆయనదృష్టిలో ఆ ప్లేటు అంతఖరీదు చేయదు గనక దండగట (మృదంగం వుండటం మూలానా!). ఇక ఎవడైనా శాస్త్రం తెలియనివాడు భావ తెలేని ప్లేటుగాని సంగీతాన్ని మెచ్చుకున్నాడంటే (ఎదురుగా వున్న వ్యక్తి స్త్రీ అయితే చెప్పలేంకాని!) ఆ సంగీతంలో నిజంగా కళవున్నదని చెప్పటానికి అభ్యంతరం ఏమిటి? తెలిసినవాళ్లకు బాగుండకపోతే అది కళ కాదు. తెలీనివాడికి బాగుంటేవాడికి నిజమైనకళ తెలియదు. ఇదేనా కళాధర్మం?

సంగీతంలో మాదిరిగానే ఫొటోగ్రఫీలో శాస్త్రమే ఎక్కువ తెలిసినవాళ్లు తయారయినారు. వీరు తీసే బొమ్మలనుబట్టి నిబంధనలపుస్తకాలు రాయవచ్చు—భారతాన్నిబట్టి వ్యాకరణం తయారుచేసినట్టు! టెక్నిక్ అత్యద్భుతంగా వుంటుంది. ప్రింటింగ్ క్వాలిటీ అసమానంగావుంటుంది. అసలు ఈ ప్రింటింగు క్వాలిటీని పట్టే Royal Photographic Society వాళ్లు ఒకటి రెండుచిత్రాలను ప్రత్యేకంగా ప్రదర్శిస్తారు. ఐతే ముఖ్యమైనదిభావం,భావప్రకటనగానిలేదు. కారణం శాస్త్రం తంటాలుపడి ప్రతివ్యక్తీ నేర్చుకోవచ్చు. కనీసం 3౫ మార్కులు రెండుసార్లు తప్పి అయినా, లేక డబ్బిచ్చి అయినా తెచ్చుకోవచ్చు. కాని తెలివితేటలు ఎక్కణ్ణించి వస్తయి? అసలు కళకు ప్రధానమైనది కావాలిసి వచ్చేటప్పటికి బయట పడిపోతారు.

ఒక్కొక్కప్పుడు ఒకవ్యక్తి మాట్లాడుతుంటే భావ అర్థం కాకపోయినా చెవులకు ఆనందంఇస్తుంది. అది సంగీతం. ఒకసారి సంగీతం ఏమీలేకుండా పాడితే మనస్సుకు ఆనందం కలుగుతుంది. అది ఆపాటలో వున్నభావం. ఈవిధంగా ప్రతికళలోనూ ఇతర కళల గుణాలు తయారవుతయి. నృత్యంచేస్తుంటే అది నిజంగా వుత్తమజాతి నృత్యం అయితే తయారయ్యే కాంపొజిషన్, curves lines చూస్తే ఏచిత్రకారుడికి ఆనందం కలగదు? బాలగంధర్వ ఒక్కొక్కప్పుడు ఆడవేషంతో స్టేజిమీద నిల్చుంటేనే తయారయ్యే చిత్రానికి మనస్సు కరిగిపోతుంది.

ఏకళైనా సరే ఆకళను చూపించేవాడికేగాని బాధ చూచేవాడికి లేదు. అవ్యక్తి శాస్త్రం నేర్చు-

కోటానికి ఎన్నిఅవస్థలు పడ్డాడో లేక ఒక చిత్రాన్ని ఎన్నిసార్లు తయారుచేసి చించివేశాడో చూచేవాడికి అనవసరం. వ్యక్తి కష్టపడి తయారుచేసిన చిత్రాన్ని చూచి చూడనట్టుగా వదిలిపెట్టుతాడు. చూచేవ్యక్తి నిజమైన కళను చూడలేకపోవటం ఒకకారణం; లేక చిత్రకారుడే తనభావాల్ని చూపకపోవటం రెండో కారణం. నరాలు, నెత్తురు, మాంసం వున్న ప్రతివ్యక్తీ అందాన్ని చూడగలడు. ఆవ్యక్తిచెవులు సంగీతానికి లొంగక పోవచ్చు. నేత్రాలు మంచిదృశ్యానికి చలించకపోవచ్చు. గంభీరమైన భావాలు తల కెక్కక పోవచ్చు. కాని ఆవ్యక్తి ఆనందించలేని ఈ సృష్టిలో లేకపోలేదు. ఇక చిత్రకారుడే తన భావాన్ని సులభంగా అర్థమయ్యేటట్టు చూపకపోవటం సాధారణంగా జరుగుతుంటుంది. కారణం అసలు భావమే లేదు కాబట్టి! ఎంతసేపటికీ చిత్రాలలో టెక్నిక్ జాస్తిగావుండటంవల్లనూ, ఇది సామాన్యంగా ఎవ్వరికీ అర్థంకాకపోవటంవల్లనూ, ముఖ్యం అనవసరం కావటంచేతనూ వీటిని చూచే వారు వదిలివేస్తారు. ఇక ఒక్కొక్కప్పుడు చిత్రంలో భావం మరీ గంభీరంగా వుండటంవల్ల ఆ చిత్రంలో నిజంగా భావంవున్నప్పటికీ టెక్నిక్‌తోపాటు భావంకూడ అర్థంకాక తోసివెయ్యటం జరుగుతుంటుంది! ఇటువంటివారిని వుత్తమజాతి ఆర్టిస్టులకింద వెయ్యకూడదు. మావాడు చెప్పినట్టు పసిపిల్లలకిచ్చే మందులు సాధ్యమైనంతవరకు తియ్యనిగా వుండటం ఎంత అవసరమో ఆర్టిస్టు తను చూచిన దాన్ని, తననుభవించిన సుఖాన్ని దుఃఖాన్ని ఇతరులకు సాధ్యమైనంతవరకు అర్థం అయ్యేటట్టు చూపటం అంత అవసరం. సామాన్యవ్యక్తి గంభీరమైన భావాన్ని అర్థం చేసుకోగలిగితే ఆర్టిస్టు అనవసరమవుతాడు. ఆ భావాలను ప్రకృతిలోనే ఆవ్యక్తి చూడగలగటం దీనికి కారణం. ఆర్టిస్టు సామాన్యమానవుడైనప్పటికీ అతను సృష్టికర్తకూ జనానికీ మీడియం.

కొత్తనిబంధనలు రాగానే జనాభాఅంతా రెండు రకాలు అవుతుంది. ఈ నిబంధనలకు కట్టుపడి వాటి ప్రకారం తు, చ, లు తప్పకుండా ప్రవర్తించేవారు. మంచివాళ్ళు, మర్యాదస్థులు. వీరిదగ్గరనుండి గవర్న-

మెంటువారు ధరావతులు పుచ్చుకోరు. వీళ్లకే మోక్షం వస్తుందని అందరీనమ్మకం. ఏది వచ్చినాసరే, నిబంధనలు మంచివి అయినా చెడ్డవిఅయినా ఎదురుతిరిగి రాడీకనం చేసేవాళ్లు రెండోరకం చెడ్డవాళ్లు. జైళ్లకుపోతారు. నరకం వస్తుంది. ఈ చెడ్డవాళ్లు మరల రెండురకాలుగా తయారవుతారు. జీవితంమీద విసుగెత్తి, న్యాయానికి తావులేదని తేల్చుకొని ఏదికొత్తదివచ్చినా భరించలేక జనాన్ని పీడించేరకం వకటి. వున్నదాన్ని వుండనీయకుండా కొత్తదెందుకు, మనిష్టంవచ్చినట్టు మనం తిరగడానికి ఒకరి ఇష్టం యెందుకు, పాతవివుండగా ఈకొత్తవికూడ దేనికని స్వతంత్రాన్ని బయటపెట్టేవారు రెండోరకం. వీళ్లే సంస్కర్తలు. ఫోటోగ్రఫీలో పైన చెప్పిన జాతులన్నీవున్నయి. సంస్కర్తకు ప్రాముఖ్యం గౌరవం సంస్కారానికి అవసరమున్నప్పుడుగాని రాదు. అవసరం లేనప్పుడు సంస్కర్త లుండకూడదు. వుంటే వాళ్లగతి కెవ్వరూ బాధ్యులుకారు. వుంటే చెడ్డవాళ్లలో మొదటివాళ్లు అవుతారు! కొత్తగా వుంటుంది గదా అని చిత్రాన్ని తల్లకిందులుగా తయారుచేస్తే పిచ్చివాడంటారు అందరూ. ఇటువంటివారిది అతి తెలివి. పిల్లి జాతి! పోతూపోతూ తొంగిచూస్తారు. అనుభవిస్తారు!

నిబంధనలు నిజంగా ఆలోచిస్తే అనవసరం! ఇవి మంచివాళ్లకూ, తెలిసినవాళ్లకూ అనవసరం. తెలియనివాళ్లు, చెడ్డవాళ్లు వీటివల్ల మారరు, బాగుపడరు!

మనదేశంలో భావకవులు, నవ్యసాహిత్య పరిషత్తు బయలుదేరినట్టుగానే ఫోటోలు తీసేవాళ్లలో కూడ Modernists బయలుదేరారు. వీరు ప్రతి వస్తువునూ నూతనదృష్టితో చూస్తారు. నూతనదృష్టితో చూడటం చాలముఖ్యం. చూడగలగటం అదృష్టం. కాని నూతనదృష్టితో చూడటం ఎందుకటఅంటే “ఇప్పటిదృష్టి సనాతనులకు నచ్చకపోయినా వచ్చేవారికి నచ్చవచ్చు లోకం మారుతూవుంటుంది. దాన్నిబట్టి దృష్టినికూడ మార్చుకోవాలి” అని సమాధానం చెపుతారు! నూతనదృష్టేమంచి అనటం పప్పులో కాలువెయ్యటం వకటే. ఎందుకంటే వెనకటి దృష్టి ఇప్పటివారికి పనికిరానప్పుడు ఇప్పటిదృష్టి ముందువారికి ఎట్లా పనికి వస్తుంది? ఇప్పుడున్నట్టే ముందు వుండనప్పుడు ఇప్పటిదృష్టే అప్పుడూ ఎందుకు వుంటుంది? ప్రతివ్యక్తిజీవితంలో ప్రతివ్యక్తిదృష్టీ నూతనమైనదే! వెనకటి జీవితాన్ని, వెనకటి విషయాలను ఇప్పటిదృష్టితో చూస్తే ఆదర్శప్రాయంగా కనపడకపోగానే అవి చెడ్డవని తేల్చటం అర్థంకానిపని. వెనకటి విషయాల్లో ఏదో ఒకవిధమైనది వుండమట్టే అప లిప్పటివాళ్లు అటుచూడటం జరుగుతున్నది! అన్నిటికంటె ఇప్పటిదృష్టి ముందు వచ్చేజనానికి పనికి వస్తుందేమోనని ఆశపడటం మహా అన్యాయం. ఎందుకనో ఎంత తెలిసినవాళ్లయినా ఒక్కొక్కప్పుడు పసిపిల్లలకే తప్పులు కనపడేటట్టుగా ప్రవర్తిస్తారు! సృష్టిలో ఇంతకన్న చిత్రము మరొకటి లేదు! సృష్టి ఆరంభమైనప్పటినుంచి అనేకం మార్పులు జరిగినై, యుద్ధాలు జరిగినై, జాతులు నశించినై, మతాలు వచ్చినై, మాయమైనయి. సారస్వతాలు పుట్టి, పెరిగి, నశించినై. దేశాల వైశాల్యం మారింది. వ్యక్తులచూపులే మారినై. కాలం గడుస్తున్న కొద్దీ సంస్కారాలు గాని, మార్పులుగాని మంచికేమారి తయారవుతూవచ్చినై. కాని సంఘంయొక్క మూలసూత్రాలు దాదాపు ఒకటిగానే వున్నయి. స్త్రీ పురుషులకున్న సంబంధం మారలేదు. సత్ప్రవర్తనకు గౌరవం పోలేదు. దుష్ప్రవర్తనకు గౌరవమూ కలగలేదు. ఇంతసృష్టిలో ఇక కళలెంత?

టెక్నికు కానీయండి, శాస్త్రం కానీయండి, నూతనదృష్టి కానీయండి మనకు అవి స్వాధీనంలో వున్నంతవరకూ ఎప్పుడూ ఇబ్బందిలేదు. వాటికి మనం దాసులమైనామా మరి మోక్షంలేదు.

కళల్లో అభిరుచి కోరుకోతగ్గదైనప్పటికీ మంచిది కాదు! స్త్రీ సంపర్కము అనుభవం లేనివాడు కొంతకాలము నిగ్రహించగలడు. కాని ఆ సంపర్కము చవిచూచినవాడు స్త్రీ లభించకపోతే పడేబాధ అందరికీ తెలిసినదే! కళల్లో అభిరుచి లేనివాడు ఎప్పుడూ అదృష్టవంతుడే! ఈ అభిరుచి కలగగానే వ్యక్తిలో ఒక చిత్రమైనమార్పు కలుగుతుంది. తోచదు, భోజనము సయించదు. ఒకటే ఆలోచన! ఒకవిధమైన “ఆకలి” బయలుదేరుతుంది. ఏం తిన్నా చల్లారదు. అన్నీ వెగటు

వేస్తాయి. ఈవిధంగా కొంతకాలం జరిగేటప్పటికి సృష్టిలో కొన్ని ఆనందంకలిగించేవి కనపడతై. ఈ ఆనందం ఇచ్చేవి సాధారణంగా ఈ వ్యక్తికి అందుబాటులో వుండవు. ఈస్థితిలో పడే బాధ నిజంగా విషాదకరమైనది వ్యక్తిజీవితంలో. ఈ "ఆకలి" తీరటం ఎట్లా? ఇది తీరేవరకూ తోచదు. కొంతమంది ఈ ఆనందం ఇచ్చే వస్తువులను చూచితేనే తృప్తిపడిపోతారు. కొంతమంది అవి లభిస్తేనేగాని తృప్తిపడరు. కొంతమందికి లభిస్తుంది! కొంతమంది అవి పొందటానికి చేసే ప్రయత్నంలోనే ఈశరీరాన్ని విడుస్తారు – భక్తుడు రథంకింద పడి మరణించినట్టు.

కళల్ని పొందాలనుకునేవారు గమనించవలసిన విషయాలుముఖ్యంగా కొన్ని వున్నయి. పరీక్షలలో కాపీ కొట్టిప్యాసవుతూ వచ్చిన వ్యక్తి ఫలితాన్ని చూచి తృప్తి పడతాడేగాని తన్నుతనే మోసంచేసుకుంటాడనే గమనం వుండదు ఆవ్యక్తికి. ఈమోసపోవటం తర్వాత ఎంత హానిచేస్తుందో ఎవ్వరూ చెప్పనవసరంలేదు. ఆవిధంగానే కళని పొందాలనుకునేవాడు తనకూ కొంచెము తెలుసుననీ (ఏమీ తెలియకుండానే), ఇంకాకొద్దికాలంలోనే పండిపోతామనీ తలచటం అజ్ఞానం. ఈఅజ్ఞానానికి తన పక్కనవుండే జనం మూఢుకంతులు కారణం. వారు ఏమి తెలియకుండానే ఈ వ్యక్తిని పైకెత్తుతారు, లేక నిరుత్సాహపరుస్తారు. సత్యానికి దూరమైనప్పుడు ఈ రెండూ అపాయకరమే. ఇది వకరకం. తమచుట్టూ మరెవ్వరూ లేకపోవటంవల్ల ఇతరుల అజ్ఞానంతో (కళలో) తమవున్న కొద్దిజ్ఞానాన్ని పోల్చి చూసి తృప్తిపడతారు. వీరు కాలంగడిచినకొద్దీ పడే బోల్తాలు అపారం! తమకంటె ఏకొద్దిగా ఎక్కువతెలిసినవాడు అగుపడినా హతమైపోతారు. కళోపాసకుడు క్రమంగా నడవాలి. మనుష్యులలోనే పరిపూర్ణతలేనప్పుడు కళలలో ఎట్లా వుంటుంది? ఈ సృష్టిలో కళోపాసకుడి జీవితం, అనుభవం ఒక అణువుకంటె హీనమైనది. అటువంటప్పుడు తనకూ సృష్టికీ పోలికెక్కడ? సృష్టిమూర్తితో కళోపాసకుడి ఆదర్శం మారవచ్చుకాని తత్వం ఎన్నడూ మారదు. వెల్సు చెప్పినట్టు "No rest for the Man! He must go on!" వ్యక్తికెప్పుడూ విశ్రాంతిలేదు. ఆగటానికి వీల్లేదు. తృప్తిలేదు. ఏవ్యక్తయినా శరీరం విడిచేవరకూ నేర్చుకుంటూనే వుంటాడు. అట్లాకాక ౩౫ రూపాయల క్లరికల్ వుద్యోగంతో తృప్తిపడేవాళ్లని వెయ్యి రూపాయల జీతగాడితో పోల్చి వాడు కాస్త పనిచేసినా వెయ్యిరూపాయలు జీతం, నేను ఇంతపని చేసినా ౩౫ రూపాయలే జీతం అని గునిసేవాళ్ల అజ్ఞానాన్ని ఎవడూ తెలిసినవాడు క్షమించడు.

కళోపాసకుడెప్పుడూ ఎవ్వరినీ మోసంచేయబోవటం లేదు కనకనూ, చేయలేదు కనకనూ స్వచ్ఛమైన మనస్సుతో తన తృప్తికే పాటుపడాలి. తన "ఆకలి"ని చంపుకోటానికి కదా తను తంటాలుపడుతున్నది? అటువంటప్పుడు ఇతరులకు సయించే పదార్థములు వుండటం ఎందుకు? ఒకవేళ వుండగలిగితే తన జిహ్వను చంపుకుని ఇతరులకు ఎన్నాళ్లు వండిపెట్టగలడు? తనకు సయించే పదార్థములు ఇతరులకు రుచిగా వుండేటట్టు చెయ్యాలి. లేకపోతే ఆ చేతలో విలువ లేదు.

కళల్ని చవిచూడాలనుకునేవారు ఎవడైనా ఏదైనా బాగుందన్నప్పుడు వెంటనే ఏమిబాగుంది, ఎందుకని బాగుంది అన్నప్రశ్నలు వెయ్యటం చాలమంచిది తనకు తెలియకపోతే. వాడు చెప్పలేడుగదా అని నలుగురిలో అవమానం చెయ్యవద్దు. నూటికి తొంభైమంది బాగుంది అనటమే కాని ఎందుకు బాగుందో చెప్పలేరు. ఇది మానవస్వభావం. కాని అట్లాప్రశ్నిస్తే తప్పించుకునేటందుకుకూడ సృష్టికర్త అనేకమార్గాలుపెట్టాడు. నాకు బాగుంది, నా కంటికి నచ్చింది, నా చెవుకు ఆనందంగా వున్నదనటం ముఖ్యమైనది. పైప్రశ్నకు వాడు సరియైన జబాబు చెప్పలేడనుకుందాము, అప్పుడు ఆ వ్యక్తికి ఈ ప్రశ్న చాలమంచి చేస్తుంది ఆతని అదృష్టం బాగుంటే. అతనికే అనుమానం వేస్తుంది, ఇది ఎందుకు బాగుందా అని! ఇటువంటి అనుభవం రెండుమూడుసార్లు ఆ వ్యక్తికి కలిగినా ఆవ్యక్తి బాగుపడినట్టే! కారణం ఫలానిది ఎందుకు బాగుందో అతనికి తెలిసేవరకూ నిద్ర వుండదు. ఈ తెలుసుకోటంవల్ల ఎప్పుడూ చెడు లేదు. ఇక ఆవ్యక్తి నిజంగా తెలిసినవాడయితే మనం చాల

నేర్చుకుంటాము. చెప్పలేనివాడయ్యేనా తెలుసుకోటానికి అతనికి మంచి అవకాశం ఇస్తుంది. ఎప్పైనా చిక్కు లేదు!

తెలుసుకున్నప్పుడల్లా ఒకవిధమైన మంచివ్యాసం రాయగలగటానికి కొన్నివందలవ్యాసాలు రాసిపారెయ్యటం ఎంత అవసరమో మంచి బొమ్మలు పదేపదే తియ్యగలగటానికి కొన్నివందలఫోటోలు తీసి పారెయ్యటం అంత అవసరం. ఏదైనాగాని అనుభవంమీదగాని బోధపడదు. చేసిన పొరపాట్లు మళ్లీ చెయ్యకూడదు. ఏ ఆర్టిస్టూ ఒక్కరోజులో తయారుకాలేదు. అనుభవజ్ఞులూ, అనుభవంలేనివారూ ఎప్పుడూ ఒకటేకారు అనుభవంలేనివారు ఒకవేళ అనుభవంవున్నవారికంటె తెలివిగలవారైనప్పటికీ.

ఇతరుల చిత్రాలు దొరికినన్ని చూడాలి, చూడగలిగినన్ని సంపాయించాలి. వాటిని జీర్ణంచేసుకోటానికి ప్రయత్నం చెయ్యాలి. అర్థంకాకపోతే తెలిసినవాళ్లు వాటిని గురించి చెప్పినది వినాలి, చదవాలి. నచ్చకపోతే ఆచరించ నవసరంలేదు. రాళ్లనుకుని వదిలిపెట్టినవి వజ్రాలుగా ఎన్ని మారలేదు? చిన్నప్పుడు చేసిన పనులకు కొన్నిటికైనా చింతపడనివారెవరున్నారు? ఆరాధనలో భక్తివుండాలి. మనంచేసే పనియందు కనీసం మనకైనా గౌరవం వుండాలి. సంగీతం అంటే ఇష్టంలేనివాడు సంగీతం ఎన్నడూ నేర్చుకోలేడు. నేర్చుకున్నా అబ్బదు. అబ్బినా అది సంగీతంకాదు!

ఎవడు దేన్ని నేర్చుకోటానికైనా ఏదైనా ఖర్చుపెట్టి, లేక కాలాన్ని వృథాచేసి అనుభవం సంపాదించగలిగితే అది ఎప్పుడూ నష్టంకాదు. కాలంపోవచ్చు, ధనంపోవచ్చు. కాని అనుభవం ఎట్లాపోతుంది? దీనివిలువ ధనానికి లేదు. శక్తిగలవాడికెప్పుడూ ఎటువంటి అనుభవంలోనైనా నష్టంరాదు. నిగ్రహం కలవాడు ఏ అనుభవానికైనా చలించడు. అయితే ప్రతివ్యక్తి ఇటువంటి అనుభవాలను భరించలేడు. డబ్బు విషయంలోగాని, కాలం విషయంలో కాని. ఫోటోగ్రఫీలో మనం అనేకం చెడువాటిని-అనగా సత్యంగానివి, లేక అనవసరమైనవి చేయటం జరుగుతుంది. తెలిసివుంటే [illegible] ప్తె పడవచ్చు. తెలియకపోతే అనుభవంలో నష్టము లేదు.

మన చిత్రాలను మనమే విమర్శనాదృష్టితో చూడగలగాలి. ఈవిషయంలో మనల్ని మనమే మోసం చేస్తే లాభంలేదు. అనుభవి-చేవళ్లము తర్వాత మనమే. కళతో కూడుకున్న చిత్రాలను తయారుచెయ్యటానికి ముందరే మంచివిమర్శకుడు కాగలటం ఆదర్శప్రాయమే గాని అవసరంలేదు. మంచి చిత్రాలెప్పుడూ మంచి విమర్శకుడి దగ్గరనుంచే రానక్కరలేదు కాబట్టీ, మంచివిమర్శ నెప్పుడూ మంచిచిత్రకారుడి దగ్గరనుంచే రానక్కరలేదు కాబట్టీ.

కళోపాసకు డెప్పుడూ ప్రతివస్తువునూ కళాదృష్టితో చూడగలగాలి. అంతేకాని కళాదృష్టితో వాటివిషయం మాట్లాడ నక్కర్లేదు! ఒకవేళ అట్లా చేసేటట్టయితే నలుగురూ ఈవ్యక్తిని పిచ్చివాడికింద కడితే ఎవరు ఏమి చేసినా లాభం లేదు! ఒక్కోసారి మనం వూహించినచిత్రాలే ఎవరో చిత్రించగా చూడటం గలుగుతుంది. ఇది చింతించటానికి బదులుగా సంతోషించవలసిన సంగతి. మనం అనుకున్నది కొంచెమయినా మంచిదయి వుండాలి. కళాదృష్టితో ప్రతివస్తువునూ చూడగలిగినవాడు ఈ అనుభవానికి విచారపడడు. ప్రపంచం, సృష్టి వున్నంతవరకూ కళకూడ వుంటుంది. ఇంతపదార్థం వున్నప్పుడు మనకుకావలసినది మనము తీసుకోలేమా? తీసుకోలేనివాడు నిజమైన ఆర్టిస్టు కాడు. అదీకాక ఒక్కటే వుత్తమజాతిచిత్రాన్ని తయారుచేసి నూనె అయిపోగానే దీపం ఆరినట్లు కాళ్లు బారచాపే ఆర్టిస్టు లేకపోతేనే నయం. అయితే నిజమైన ఆర్టిస్టు సృష్టి చేసినదంతా వుత్తమజాతికి చెందవలసిన అవసరంలేదు. కాని ముద్రమటుకు మారకూడదు. చిత్రం తయారుచేసినవాడి ముక్కూ, నేత్రాలూ ఎంతప్రత్యేకంగా వున్నయ్యో వాడి చిత్రాలుకూడ అంత ప్రత్యేకంగా వుండాలి. అప్పుడే వాటియందు ఇతరులకు గౌరవం కలుగుతుంది. అవి ఎన్ని చెప్పినా అతనివి!

చిత్రప్రదర్శనాలలో మనకుకూడ చోటియ్యా[illegible]రితో, ఇద్దరికీ చోటిచ్చిన

కారణాన్ని ఆధారంగా తీసుకుని, సమానంగా చూడరాదు. ఎందుకంటే మనం, వాళ్లు ఒకటికాదు కాబట్టి! వారి అనుభవం మనకేవి? మేమంతా కథలు రాసేవాళ్లమే అని ఒకళ్యక్తి పక్కనున్న అనుభవజ్ఞుడితో తనను సమానంగా వేసుకున్నయెడల ఇతరులెవ్వరూ మోసపోరుకాని తనే మోసపోతాడు. నాకథలూ ప్రచురింపబడ్డాయి! ప్రచురింపబడటంలో సమానమేకాని వాడూ వీడూ ఎన్నటికీ సమానంకారు! 'కారమ్స్ ఆట' వుంది. కాయలన్నీ దగ్గరగా విడివిడిగా వున్నాయి. రెండు కాయలు కొట్టి మూడోది తప్పతాడు అనుభవం లేనివాడు. మరి ఆమహత్త్వమేమిటో చేతయినవాడు అన్నీ కొడతాడు. వాడు రెండుస్ట్రోకులు కొట్టాడన్నా, తనకు మూడోకాయే ఎదురుతిరిగి వచ్చిందన్నా, అసలు స్ట్రైకరు తను కొట్టినప్పుడు బోర్డు మీద తిన్నగా జరగలేదన్నా పక్కనున్నవాళ్లు నవ్వుతారు. ఏదైతేనేం వాడు అన్నీ కొడతాడు! చేతయినవాడికే అదృష్టం వుందంటే ఎవరూ నమ్మరు. కళలూ ఇంతే.

కళతో కూడుకున్న చిత్రాలలో వుండవలిసిన విషయాలు కొన్ని ముఖ్యమైనవి వున్నాయి.

చిత్రంలో ఆర్టిస్టు సందేశం ఒకటి వుండాలి. అది చూచేవాడికి సులభంగా అర్థంఅయేటట్టువుండాలి.

ఆ సందేశం మామూలుదైనప్పటికీ ఇతరులకు ఒకడు చూపించ తగ్గదిగా వుండాలి. వున్నతమైనదిగాను, ఆలోచనను రేపేదిగాను వుండాలి. సందేశంలేని కళ వ్యర్థం. కాని ఇది నూటికి తొంభైమందిలో వుండదు. అయినప్పటికీ ప్రపంచంలో ఇవి ఆంధ్రదేశంలో అరవ గాయకులు చలామణీ అయినట్టు చలామణీ అవుతున్నాయి. కారణం భగవంతుడి మాయ! నిజమైన ఆర్టిస్టులు దేశానికి ఒకరిద్దరికంటె వుండరు.

చిత్ర మెప్పుడూ పూర్తిగా వుండాలి. దాంట్లో మళ్లీ ఏదీ కావాలిసి రాకూడదు. తిరగమోతలోపం వుండకూడదు. వుప్పు తక్కువకారాదు. చిత్రంలో కన్ను దేనికోసరమో తిరగకూడదు. కన్ను ఎన్నివైపుల తిరిగినా తిరిగి ఒక ప్రదేశానికి చేరాలి.

భావాన్ని దాచకూడదు. అనేక భావాలకు ఒకచిత్రం పనికిరాదు. భావాన్ని ప్రకటించటానికి చిత్రంపేరు సగంతోడ్పడుతుంది. "పేరులోనేమి పెన్నిధియున్నది" అన్నమాట షేక్సుపియరు ఎంతపురాతనమైనవాడో అంతపురాతనమైనది. ఈ పేరు సాధ్యమైనంతచిన్నదిగాను, భావానికి సరిపోయేటట్టుగాను వుండాలి. భావానికి సరిపోయేటట్టు చాలమంది పేరు పెట్టరు! భావాన్ని ప్రకటించటానికి కింద ఒకపద్యంగాని, ఒక వ్యాసంగాని రాయకూడదు. ఈ పేరులో నాలుగైదుమాటలకంటె ఎక్కువవుండకూడదు. పైగా ఈ పేరు అర్థమయేటట్టుగా వుండాలి. భావాన్ని అన్నిటితోనూ చుట్టివేయకూడదు. దాన్ని సాధ్యమైనంతవరకూ నగ్నంగానే వుంచాలి...వస్తువుతత్వం చిత్రంలో ఆనందకరంగా వుండాలి.

## నగ్నచిత్రాలు

నగ్నచిత్రాలను చూడగానే కొందరు తమకేదో పరాభవం జరిగినట్టుగా చింతిస్తారు. ప్రబంధకావ్యాలను పదేపదే పఠించి అందులోవున్న రసాన్ని గ్రహించటానికి వీరి కభ్యంతరంలేదు. స్త్రీ అవయవాలను ఎంత నగ్నంగా వర్ణిస్తే వీరి కంతతృప్తి! ఎవరన్నా 'ఈబూతు వర్ణనలేమిటి' అంటే దాంటో విషయాన్ని వదిలి ఆవర్ణనలోని సారస్యం, కవితాశక్తి గ్రహించమంటారు. ఈ పండితులు నగ్నచిత్రాలను మాత్రం ఆదృష్టితో తీసుకోరాదు? అయినా నశ్యంపీల్చేవాళ్లు సిగరెట్టు కాల్చేవాడిని తప్పపట్టటం ఏమిటి? ఈ నగ్నచిత్రాలు వీళ్లంతా బూతుకావ్యాలతో నింపి బాగుచేస్తున్న సంఘాన్ని చెడగొడతయ్యేమో మరి! ఎవరికి వారికి నగ్నచిత్రాలను చూడటానికి అభ్యంతరంలేదు. ఇతరులు చెడిపోతారేమోనని వీరిభయం. అది ఆపుదామని వీరి ప్రయత్నం!

ఫొటోగ్రఫీలో నీచజాతికి చెందిన నగ్నచిత్రాలు అనేకం వున్నాయి. బూతుకథ లుంటేగాని పత్రికలు ఖర్చుకావు. నగ్నచిత్రాలతో చూపిస్తేగాని వ్యాపారం జరగదు! ఈ చిత్రాలు వ్యక్తిని నగ్నంగా చూపించటానికే తయారయి వ్యాపారసంబంధమైన వస్తువులమీద

మానవుడికి ఆశ పుట్టించటానికే ఏర్పడ్డయి. వీటిల్లో వుత్తమజాతికి చెందినవి అనేకం వున్నయి.

అసలు ఏవ్యక్తయినా ఏకళనో ఎందుకు ఆరాధించాలి? ఆవ్యక్తిమాచిన అందాన్ని, అనుభవించిన కష్టాన్ని, సుఖాన్ని, ఈ సృష్టిలో ఏదో ఒక వస్తువులో చూడటంవల్ల గలిగిన వికారాన్ని జీర్ణం చేసుకోలేక ఏదో ఒకరూపాన ఇతరులకు చూపిస్తాడు. ఈ ఆకలిని చంపటం, ఏదో ఒక అందాన్ని ఇతరులకు చూపటం ఆవ్యక్తిపని. ప్రతివ్యక్తీ ఒకరకంగా వుండనట్టుగా ప్రతివ్యక్తిఆలోచనా, చూపూ, అనుభవం ఒకవిధంగా వుండవు. ఒకడికి గంభీరమైన సముద్రాన్ని చూస్తే ఆనందంకలుగుతుంది. ఇంకొకడికి ఈ మానవుడు నిర్మించగలిగిన మేడలను చూస్తే వికారంకలుగుతుంది. మావాడు చెప్పినట్టు తన కంటె కొన్నివేలరెట్లు బలమూ, ఆకారమూ కలిగిన సైకిళ్లనూ, వ్యక్తులనూ, కార్లనూ తప్పించుకుంటూ రోడ్డు ఈచివరనుంచి ఆ చివరకు పోయే చీమనుమాస్తే మనస్సు తిరిగిపోతుంది ఒకడికి. కారుమబ్బులనుమాస్తే నెమళ్లమాదిరిగా పొంగుతాడు ఒకడు. ఒకడికి వానచూస్తే భగవంతుడి గొప్పతనం తెలుస్తుంది ఒకడికి కొండలను చూస్తే, ఒకడికి నదులనుమాస్తే, ఒకడికి శిథిలములైన కోటలను చూస్తే వివిధములైన వికారాలు కలుగునై. ఇటువంటప్పుడు ఒకడికి సృష్టి లోకెల్లా ముఖ్య మైనది, విచిత్రమైనది అయిన ఆ "వ్యక్తి"ని చూస్తే ఆనందం గాని, ఆశ్చర్యంగాని కలగటం విచిత్రం?

వ్యక్తిలోవున్న అందం ఏమిటి? జీవితం, శక్తి, వింత వింతగా మారి ఒకదానికొకటి కలిసివున్న అవయవాలు! ఈ అవయవాలతో ఏర్పడే curves, lines సృష్టిలో ఇంకెక్కడున్నయి? చిత్రకారుడికి curves, lines కంటె ముఖ్యమైనవి ఏమి వున్నయి? ఈcurves, lines పత్తిగుడ్డలతో నింపితే ఎట్లా కనపడతై? ఇంత అందమైనది, ఇంత శక్తిగలది, ఇంత విచిత్రమైనది ఒక కళోపాసకుడి ఆలోచనను రేపిందంటే విచిత్రమేమిటి?

నగ్నచిత్రాలు తయారుచెయ్యటం చాల సులభమని చాలమంది అభిప్రాయం. వ్యక్తిని నగ్నంగావుంచి Shutter నత్తితే వస్తుంది నగ్నచిత్రం చిత్రంగా! ఈ అభిప్రాయాలు తక్షణం మార్చుకోమని మనవి. ఆవ్యక్తి ఎంతవిచిత్రమైనదో, ఎంత అందమైనదో, ఎంత శక్తి గలదో దాన్ని చిత్రించటంకూడ అంత కష్టమే! చేతగానివాడు తీస్తే నగ్నచిత్రమే వస్తుంది కాని కళ ఎక్కడనుంచి వస్తుంది? ఆ వస్తువును కళాదృష్టితో చూడాలి. ముఖ్యంగా గౌరవంతో చూడాలి. నగ్నచిత్రాలు చిత్రించటం వూహించటమే కష్టంగా వుంటుంది వూహించగలిగినవాడికి చిత్రకళలో ఇంత కంటె కష్టమైన వస్తువు కళోపాసకుడికి దొరకదు. నగ్నచిత్రాలు చిత్రించటానికి డాక్టర్లకు అవసరమైన ఎనాటమీ తెలిసివుండాలి ముఖ్యంగా. లేకపోతే అవయవాలు అని నిర్దేశింపబడినట్టుగా రావు. కొన్నాళ్ల కిందట తెలుగుపత్రికల ముఖపత్రంమీది చిత్రాలు చూస్తే ఈ అనుమానం తీరుతుంది. ఈచిత్రాలుచూస్తే ఇంతవిపరీతమైన అవయవాలున్న స్త్రీ వున్నదా అని పిస్తుంది! వీటిని చూస్తే డాక్టర్లు ముఖ్యంగా నవ్వుకుంటారు!

పాముకంటె అందమైన జంతువు మరొకటిలేదు కదా! పడగవిప్పినప్పుడు శిరస్సుదగ్గిర కలిగేవంపుకళలో అభిరుచివున్న ఏవ్యక్తికైనా ఆనందం ఇస్తుంది. పాము శరీరంవంటిజడ, ఆ పాముపడగవంటి వంపుగలిగిన శిరస్సు మీదవుండే తలకట్టు కలిగిన స్త్రీ పామువలె వూగుతూండగా చూస్తే ఏమానవుడి హృదయమూ వుప్పొంగకుండా వుండదు. పామువంటి వస్తువును నగ్నంగా వుంచాలని ఆ సృష్టికర్తకే తెలుసు! ఆకళానిధికి నా నమస్కారాలు.

---

# తెలుఁగు అక్కరములు

# ష, జ్ఞ, హైఁ, మాపు

'కృష్ణకుమారి'

భాష యొక్క మహాస్రవంతి. ఆ స్రవంతిని పూవులఁబెట్టి పూజించి పుణ్యతోయములని కనుల నద్దుకొనువారును గలరు. దానిని నిర్లక్ష్యముచేసి అందు గడ్డిగాదములఁ జేర్చి చెఱచువారును గలరు. "పావనం జలం పీత్వా పునర్జన్మ న విద్యతే" యనుకొనునంతటి భక్తిపరులును గలరు. భాషకు లిపి యుజ్జీవకమని యిపుడు నేను మొదలెత్తుకొంట అపహాస్యముగ నుండవచ్చును. లిపిసహితమగు భాష అడ్డమాఁకలు లేక పెరిగిపోవుచున్నది. ఇత్థమిత్థమని యూహించుటకు శక్యము కాని యట్లు క్షణక్షణమునకు దాని స్వభావము చూపఱకు వెఱుఁగుదోఁచునట్లు మారిపోవుచున్నది. పరిశీలించిన కొలఁది నది యొక్క గంధర్వనగరి, అది యొక్క కామరూపిణి, అది యొక్క మాయామహేంద్రజాలమువోలెఁ గన్పట్టును.

లిపిరహితమగు బాసలు శ్రుతి, స్మృతిమాత్రము ఆధారముగాఁగలవై 'ఆహ్వాన విసర్జనములు' లేక 'నానాఁటికి తీసికట్టు దిగంబర భోట్లు' అగుచున్నవి. లిపిరహితమగు భాషలు నిరర్థకములే కాక అనర్థకములని కూడ చెప్పవచ్చును.

లిపిరహితములగు బాసలు ఎక్కడనో కొండలలో, కోనలలో, మూలలలో, మూకలలో పరిమిత సంఖ్యాజనములచే భాషింపఁబడుచు, వారితోఁబాటు నవియు వృద్ధిక్షయముల నందుచున్నవి. అందును పెరుగుటకంటె తరుగుటయే యెక్కువ యని చెప్పవచ్చును.

ఇఁక లిపికల బాసలసంగతి చూతము. లిపి లేని బాసలకంటె లిపికలభాషలే యెక్కువమార్పు లొందుచున్నవి. జీవనదిలోనే యుపనదులెక్కువ చేరి దానికి పెక్కుమార్పులు కల్గించినట్లు జీవద్భాషలకే పరిణామావస్థలు పెక్కులు.

తెలుఁగు: ఇప్పటిహిందూదేశభాషలలో తెలుఁగే యొక విధముగ పరిపూర్ణమగు వ్రాఁత కల భాష యని యందఱెఱింగిన విషయమే. ఎట్టి ధ్వనులైనను, ఎట్టి ఉచ్చారణలైనను వ్రాఁతలో నిముడ్చుటకు చాలవఱకు తెలుఁగుఅక్కరములు చాలియున్నవి. కాని యింకను కొన్ని ధ్వనివిశేషములు తెలుఁగువ్రాఁతలోనికి రాకున్నవి. దీనికి తెలుఁగునందక్కరములు లేమియే కారణమని చెప్పుట సాహసము కాదు.

ఐననిచట పాఠకులకొక ఆశంక కలుగవచ్చును. "భాష యిప్పటికే హద్దుమీఱి పెరిగిపోవుచున్నది. ఇఁక దానికిఁదోడు లిపినిగూడఁ బెంచినచో భాషయే కాక వాఙ్మయముగూడఁ బెరిగిపోవును. కాన నట్లు చేయ వీలులేదు." అని వారు వాదింపవచ్చును. కాని భాషను సంకెలలలోఁ గట్టఁజూచుకాలము కడచన్నది. అది యిపుడు విశృంఖలవిహారిణి. అట్టి యెడ మన యుచ్చారణకు సరిపడు నక్కరములు భాషాలిపిలో నున్నఁగాని యాలిపి సమగ్ర మనిపించుకొనదు. అట్లు పెంచుకొనకున్నచో పందెపుపరుగునకై విడిచిపెట్టి గుఱ్ఱమునకుఁ గాలికి సంకెలలు కట్టినట్లగును. దానివలన ఫలితము గుఱ్ఱము ముందునకు బోర్ల పడుటయే కదా.

అదియుఁ గాక తెలుఁగున పూర్వమునుండియు లిపి పెంచుకొను సంప్రదాయము మునుపనేయున్నది. చూడుఁడు. మన అచ్చతెల్గునకు అక్కరములు ముప్పదియాఱే (౩౬):—

అ, ఆ, ఇ, ఈ, ఉ, ఊ, ఎ, ఏ, ఐ, ఒ, ఓ, ఔ, అం=౧౩. క, గ, చ, ౘ, జ, ౙ, ట, డ, ణ, త,

ద, న, ప, బ, మ=౧౫. య, ర, ల, వ, స, ళ, అ, హ=౫+౧౩+౧౫=౩౩.

సాంస్కృతికసహవాసము ప్రబలమైన కొలఁది తక్కిన యక్కరములను చేర్చికొంటిమి. అవి యీ క్రిందివి:—ఋ, ౠ, ఌ, ౡ, అః=౫.

ఖ, ఘ, ఙ, ఛ, ఝ, ఞ, ఠ, ఢ, థ, ధ, ఫ, భ, శ=౧౩+౫=౧౮. ప్రస్తుతాంధ్రము పైమొత్తపు టక్షరములతో వ్యవహరింపఁబడుచున్నది.

ఇంతలిపి నన్నయనాఁటికే సంతరింపఁబడినది నాఁటినుండి నేఁటిదనుక తెలుఁగున నెన్నో క్రొంగ్రొత్త పదములను, పరభాషాపదములను జేర్చుకొంటిమి. కాని వానికి సరియగు నక్కరములఁ గూర్చుకొనుటకు మాత్రము మనకు తెరవ లేకపోయినది. కొఱఁతగనున్న అక్కరములను కూడ లిపిలో చేర్చుకొనుచో లిపి సమగ్రమగును. అపుడిఁక మన తెలుఁగు నోరులు వ్రేలుపెట్టి చూపుటకు వీలుచిక్కదు. హిందీయందుకాని, ఆంగ్లమునందుకాని, అరవమునందుకాని, తురకమునందుకాని, యింకా చాలా యితరభాషలయందుకాని మన తెలుఁగునందున్నన్ని యక్కరములైన లేవు. అందుచే నవి పరభాషాపదములను తమ భాషలో నిముడ్చుకొనలేకున్నవి.

చూడుఁడు అరవఅక్కరములను:—

అ—அ, ఆ—ஆ, ఇ—இ, ఈ—ஈ, ఉ—உ, ఊ—ஊ, ఎ—எ, ఏ—ஏ, ఐ—ஐ, ఒ—ஒ, ఓ—ஓ, ఔ—ஔ, అక్—ஃ.

క—க, ఙ—ங, చ—ச, ఞ—ஞ, ట—ட, ణ—ண, త—த, న—ந, ప—ப, మ—ம, య—ய, ర—ர, ల—ல, వ—வ, ఴ—ழ, ళ—ள, ఱ—ற, న—ன.

వర్గునకు ఒకే అక్షరము. అదియే సందర్భమును బట్టి భాషాపద్ధతినిఁబట్టి పరుషసరళములుగ మాఱుచుండును. ఉదా:—"గాంధిగారు" అని వ్రాయవలయుచో காந்திகாரு (కాంతికారు) అని వ్రాయవలయును. ఇదెంత సౌకర్యమగు పద్ధతియో వేఱె చెప్పనక్కఱలేదు.

రాజభాషయగు నాంగ్లమునకుఁగూడ నిట్టిపాట్లే కలవు. 'దట్' 'థాట్' ఈ రెండు అక్కరముల కును that, thought-th ల సంయోగమే సంకేతితమైయున్నది. కాని యిపుడిపుడు వారు పరభాషాపదములకుఁ గొన్ని క్రొత్తగుఱుతుల నిడుచున్నారు. "భారతము"-ఇందు దీర్ఘపు "భా" ఉన్నది అని తెలుపుటకు "Bhārathamu" అని "A" కు పైన నొకగీత నిలుపుచున్నారు. ఇట్లే ఇంకను కొందఱు ర్తలు కొన్ని కలవు.

మన లిపియందు అన్నిలోట్లు లేకున్నను ఉన్న కొలఁది కొఱతలను సవరించుకొనుట మంచిది. అందు కొన్నిఁటిని నాకుఁ దోఁచినవాని నీక్రింద వివరించుచున్నాను.

Father-Fruit (ఇంగ్లీషు)

फल, फसली (హిందీ)

వీనికి మన తెలుఁగునందు 'ఫ' అనునక్కరము నుపయోగించుచున్నాము. కాని యది పై అక్కరముల యుచ్చారణధ్వని నిచ్చు నక్కరముకాదు. ఆ యక్షరము 'ఫలమ్' ఇత్యాది సాంస్కృతిక పదములనుండి సంగ్రహింపఁబడినది. 'ఫ' F, फ़-మొదటి మన తెలుఁగు అక్కరమునకును, దానితో నించుమించు సమానమగు ధ్వని కల తక్కిన హిందీ ఆంగ్లాక్షరములకును ఉచ్చారణభేద మున్నది. ఆంధ్రాక్షరము పెదవులను కొలఁదిగ మూసి 'ప' కారమును గట్టిగ వత్తి పలుకవలయును. తక్కిన అక్షరములు క్రిందిపెదవిపై పైపండ్లనాన్చి ఆ వత్తును తేల్చి పలుకవలయును. ఇది చదువరులు గమనించియే యుందురు.

ఆ పరభాషాపదముల యుచ్చారణ నొసఁగు అక్షరమును మన తెలుఁగులో 'ఫ' అని సంకేతించుకొనుట బాగని నా యుద్దేశము. అక్షరముతీరునుబట్టి చూచిన నిది 'ప, ఫ' వరుస కొంకించుక దగ్గఱగనే యుండును. ఇట్లే (பழம்) తమిళము. Treasure, Measure (ఆంగ్లము)అను పదములలో క్రీఁగీఁతగల యక్కరమునకు తెలుఁగున జ, ఝ, అను రెండక్షరము లున్నవి. కాని యవియు పైయక్కరముల యుచ్చారణ సరిగ నియ్యఁ

జాలియుండలేదు. ఈ యుచ్చారణకు తెలుఁగున 'ఁ' అను నక్షరము అస్పష్టముగ పూర్వ, ప్రపూర్వ శాసనములలో నగపడుచున్నదని గు, నదియైనను నాలవ శతాబ్ది నాఁటికే—తెలుఁగునకు కన్నడమునుండి వేఱుపడుట ప్రారంభమై ప్రాకృత సంపర్కము చేరనిపోవుకొలఁది—అంతరించినదనియు పరిశోధకులు కొందఱు నుడువుచున్నారు. ఆ యక్కరము కొంచెము బండి'ర'కును (ఱ), కొంచెము 'ఉ' వర్ణసహిత 'ల' కారమున (లు)కును దగ్గఱగ నున్నది. వ్రాఁతకొందరలలో నాయక్షర మీ రెండక్షరములతోఁ గలిసి పోనే వచ్చును. ఇపు డాపూర్వాక్షరము నుద్ధరింపనైన నుద్ధరింపవచ్చును. లేదా "ఞ్ఞ" యని వేఱొక యక్కరము నైన కల్పించుట మంచిది. ఇపుకు నా సూచించిన ఈ యక్షరము వ్రాఁతకొందరలలో 'ఱ','లు' లతోఁ గలయక, 'వ,జ'ల సంయోగమును ఆకారము చేరినే తోపింపఁజేయుచు 'su', 'ఙ' అను ఆంగ్ల తమిళాక్షరముల యుచ్చారణను చక్కఁగ నిచ్చునదైయుండు నని నాయూహ.

ఇంతియకాక పిల్లియఱుపునకు, Mat, Pass, వేఁక (వ్యావహారికోచ్చారణము)- వీనికి సరియగు అక్కరము తెలుఁగున లేక పిల్లి అఱుపునకు 'మ్యావు' అనియు, తక్కిన ఆంగ్లోక్తులకు మ్యాట్, ప్యాస్ అనియు మనము సాధారణముగ వ్యావహారికమున నుపయోగించు ఎత్వసహిత అకారోచ్చారణకు నిట్లే ఇంకేయో అసందర్భపు టక్షరములను నుపయోగించుచున్నాము. ఈ అసందర్భపు అక్షరముల కూర్పుకంటె ఆ యక్షరములపై నా విలక్షణోచ్చారణకు నొక గుఱుతు నేర్పరచుట మంచిది. అది యొకచుక్కగనైనను, గీతగనైనను, లేక చె, జె, లకు వలె నొకగిరిటెగనైనను నుంచవచ్చును ఉః—మావు,మాపు, మాట్. ఇది "మె" కారముపైనైనను నుంచవచ్చును: "మేపు-మేట్, మేవు" వలె.

ఇఁకనొకటి కలదు—అది ముక్కు పలుకు. దీనికిని పూర్వము తెలుఁగున అరసున్న నుంచెడివారు. కాని అరసున్నల యర్థము గజిబిజియై, గందరగోళమై, గాసరబోసరై, కలగూరగంపయై ఆఖరునకు అరవసాంబారైపోయినది ఇపు డద్దానిని ముక్కుపలుకునకై ప్రత్యేకించుట మనతరము కాదు. హైఁ (హిందీ) హిందీయం దిట్లు దీనికి గుఱుతున్నది. అట్లే తెలుఁగున ఈయుచ్చారణకు అక్షరముపై అరచంద్రుని నిల్పి, ఆచంద్రునకు డెందములో మచ్చవలె నొక చుక్క నుంచుటయే యనుసరణీయము. అపుడు "హైఁ" అని వ్రాయవచ్చును.

ఇట్లే యింకను తెలుఁగున ననేకములగు నుచ్చారణలకు, ధ్వన్యనుకరణములకును అక్షరములు లేకయుండవచ్చును. ఇదివఱక ఆంధ్రసాహిత్య పరిషత్తు వారు కాని, అభినవాంధ్ర సాహిత్య పరిషత్తువారు కాని దీనియందు శ్రద్ధ వహింపరైరి. నా అల్పమతికి తోఁచిన యూహములను పాఠకులయెదుటఁబెట్టితిని. పదుగు రాడు మాటయును, పెద్దలాడు మాటయును పాటియై ధరలో చెల్లుబడి యగును. కాన సాహిత్య పరిషత్తుల వారో, లేక శ్రీ గిడుగు రామమూర్తిప్రభృతి పెద్దలో దీని నాలోచించి నిర్ణయఫలమును తెలుఁగులకు ప్రసాదించుట మహోపకారమని యెంతును.

టైపు నేర్పఱచుటకు సౌకర్యముగ నుండుకొఱకును, పిల్లలకు నేర్పుటకు సుకరముగ నుండుకొఱకును తెలుఁగక్కరములను మదించి కుదించవలెనని కొందఱు కొందఱు అభిప్రాయములైయున్నవి. అట్లు అవసరములకు లిపి తగ్గించు మాట వేఱుసంగతి. లిపిని సమగ్రమొనర్చుకొనుట మున్ముందు విధికృత్యము. ఆవెనుక కావలసిన తగ్గించుకొనవచ్చును. కాన అవసరములగు నక్కరములను ఏర్చి, కూర్చి, చేర్చి, పేర్చి లిపిని సమగ్రముగ నొనర్చుటయే భాషాదేవిని సర్వాంగసుందరిగ నొనర్చుట యగును. అదియే యామెకు విన్నాణమని నాయూహ. ఆటుపై పెద్దలయిష్టము.

---

# సాహిత్యం ఎందుకు?

కొడవటిగంటి కుటుంబరావు

రచన ఎందుకు? ఒకవ్యక్తి తన పంచేంద్రియములయొక్క సహాయంతో తన మనస్సు సంపాదించిన జ్ఞానాన్ని ఇతరులకు సులువుగా అందచెయ్యటానికి. (ఇక్కడ జ్ఞానమనేదాన్ని స్థూలంగా తీసుకోవాలి.) మంచిజ్ఞానం ఉంది, చెడుజ్ఞానం ఉంది; పనికివచ్చే జ్ఞానం ఉంది, పనికిరాని జ్ఞానం ఉంది; వేదకాలంలో జ్ఞానాన్ని "కమ్యూనైజు" చేసేవారు—అంటే కొందరు పెద్దలు పనికివచ్చేదీ మంచిదీ అనుకున్నజ్ఞానాన్ని ఒకచోట పోగుపెట్టారు. ఆ కాలంలో వాఙ్మయమూ, సారస్వతమూ, సాహిత్యమూ అంతా కలిపి ఒక్క వేదమే. ఇటువంటి కమ్యూనిజం శాశ్వతంగా సాగటం అసంభవం. ఈనాడు మంచి దనిపించిన జ్ఞానం రేపు చెడ్డదిగా పరిణమించుతుంది; ఇవాళ పనికివచ్చిన జ్ఞానం రేపు పనికిరాదు. "సూర్యుడు తూర్పుసముద్రంలో పుట్టి భూమిచుట్టూ ప్రదక్షిణంచేసి పడమటి సముద్రంలో అస్తమించుతున్నాడు" అన్నది ఈనాడు నిజంగా కనపడి, రేపు అబద్ధంగా పరిణమించుతుంది. ఒక్క పుస్తకంలోనే ఒకపేజీలో సూర్యుడు భూమిచుట్టూ తిరుగుతున్నాడనీ, మరో పేజీలో భూమి సూర్యుడిచుట్టూ తిరుగుతున్నదనీ రాయటం ఆపుస్తకంయొక్క విలవకు హానికరం. ఇట్లా మారే జ్ఞానంతోపాటు ఎప్పటికీ మారనిజ్ఞానముంది—"ఎనిమిదిమూళ్లు ఇరవైనాలుగు" లాటిది. జ్ఞానం చిలవలూ పలవలూ వెయ్యసాగేటప్పటికి జ్ఞానాన్ని కమ్యూనైజు చెయ్యటం అసంభవమయి, జ్ఞానాన్ని విభజింపవలసి వచ్చింది. ఆవిభజనలో సమస్తస్మృతులూ, శాస్త్రములూ, పురాణములూ, కావ్యములూ, ప్రబంధములూ, నవలలూ, నాటకములూ, కథలూ, ఖండకావ్యములూ బయలుదేరినై. ఇవన్నీ వేదములలోనించే వచ్చినవనటం ఒకవిధంగా సత్యమే. అంతమాత్రాన వేదములవిలవ అధికం కాలేదు.

మానవుడు అనేక ప్రకృతిప్రేరేపణల (Instincts) కు లోనవుతున్నాడు. అటువంటి ప్రేరేపణలలో జ్ఞానాన్వేషణ ఒకటిమాత్రమే. దానిని మానవుడు కొంతవరకు తృప్తిపరిచేటప్పటికి మరొక Instinct తలఎత్తి "నా మాట ఏమిటి? ఇంతజ్ఞానం సంపాదించావు. దేన్ని ఏవిధంగా వినియోగించబోతున్నావు? అది నువ్వు నిర్ణయించేవరకూ నేను శాంతి పొందను" అన్నది. అప్పుడు మానవుడు తను సంపాదించిన జ్ఞానంవల్ల తనకు చాలా ప్రయోజనం ఉందని తెలుసుకున్నాడు. ఈ జ్ఞానం తనలో గుప్తంగా ఉన్న శక్తులను బయటికి తీసుకురావటమే కాక ప్రకృతిలో

ఉంటూ ఉన్న శక్తులనుకూడా తెచ్చి తనకు కరగతము లయ్యేటట్టు చేస్తున్నది. "ఇది చాలా బాగుంది. ఈజ్ఞానం మూలంగా నేను శక్తివంతుడి నైనాను. నే నీశక్తులను వినియోగించుతాను. గొప్పవాడి నౌతాను అందర్నీ శాసిస్తాను, నామాట విననివాణ్ణి నాకు నాజ్ఞానంవల్ల లభించిన శక్తులతో రూపు మాపుతాను," అనుకున్నాడు. ఇంతలో మరొక insti. ct అతన్ని నిలవ వేసి, "ను వ్వీశక్తులను జాగ్రత్తగా ఉప యోగించు. ఈశక్తులవల్ల నీకు ఎంత ఉప కారం ఉందో అంత అపకారం కూడా ఉంది సుమా. నీశక్తులను ఎట్లా ఉపయో గించుతున్నావో తెలిసి ఉపయోగించు. ఇది నీనెత్తి అడిచినట్టయితే నువ్వుపీ టెని దుర్వి నియోగపరిచినవాడి నవుతావు" అని ఉద్బో ధించింది. దానివెనక మరొక In:tinct తలఎత్తి, "నువ్వు ఒక్కడివీ. నీజ్ఞానంవల్ల బాగుపడి ఏం ప్రయోజనం? నీసాటి వాళ్లం తా ఉన్నారు చూడు. వారందరూ నీవల్ల శక్తిమంతు లయినట్టయితే, నీతోపాటు వారుకూడా బాగుపడితే నువ్వులోకసంగ్ర హం చేసిన వాడివి అవుతావు. అప్పుడు జ్ఞానాన్వేషణలో నీకు తోడుపడుతారు. అప్పుడు ఇంకా బోలెడంత శక్తి మీఅందరికీ లభిస్తుంది. దానితో ఇతర లోకాలన్నీ జయింతురు గాని. మిమ్మల్నందరినీ పుట్టిం చిన భగవంతుడితో మీరంతా సమానం అయే వరకూ మీఅభివృద్ధి ఎక్కడా ఆగ నవసరం లేదు. మీజాతిమూవత్తూ పట్టుబట్టి బ్రహ్మాండంలో ప్రతి అంగుళమూ జయించ వచ్చును," అని చెప్పింది.

జ్ఞానానికి పిల్ల పుట్టింది. "అసలు జ్ఞానం ఇదీ!" అన్నాడు మానవుడు. భగవంతుడి స్వరూపము అవగాహన చేసుకునేటందుకు ప్రయత్నము చెయ్యటమూ, ఆతరువాత అతన్ని సమీపించటానికి ప్రయత్నించ టమూ,— ఇదీ, ప్రతిమానవుడికీ కర్తవ్యం! ఈ నూతన జ్ఞానోదయపు ఉత్సాహంలో మానవుడు చాలా పొరపాట్లు చేశాడు. తను భగవత్స్వరూపాన్ని అర్థం చేసు కోవటం పూర్తి కాక పూర్వమే ఆవేశం కొద్దీ పెద్దపెద్ద అంగలు వేసి ముందుకు వెళ్లి తప్పదారి అని గ్రహించి మళ్లీ వెనక్కు వచ్చాడు. అతను చేసిన మొదటి తప్పే మంటే తన Instinct ఆఖరుకు చెప్పిన మాట మరచిపోయి తాను ఒంటరిగా భగ వంతుణ్ణి అర్థం చేసుకుని అతన్ని చేరుకుందా మని ఆశించాడు. ఈలోపుగా సాటిమాన వులు తను సంపాదించిన జ్ఞానంతో తను ఊహించలేని శక్తులనన్నిటినీ సాధించి ఆశక్తు లను ఎడాపెడా దుర్వినియోగపరుస్తున్నారు. ఇందువల్ల జాతికంతకూ ప్రమాదం సంభవించే టట్టున్నది. అది కూడనిపని. తన ఆశయం ఫలించాలంటే— ఈ నూతన జ్ఞానో దయంవల్ల ఏదైనా సాధించాలంటే తన ఒక్కడివల్లా కాదు. ఇది ప్రత్యేకవ్యక్తి ఆశ యం కాదల్లే కనిపిస్తున్నది. జ్ఞానసంపాద నకూ దాన్ని ఉపయోగించటానికీ ఒక జీవితం ఎట్లాగూ చాలదు. ఈపని తాను

అనుకున్న దానికంటె బహుదుర్ఘటంగా ఉంది. ఇది జాతికి వదిలిపెట్ట వలసిందే. ఈ అన్వేషణలో తను చావటమే తనవల్ల కాగల పని. ప్రతిమానవుడూ వాడి సంతానమూ, వారందరి సంతానమూ - ఈవిధంగా బ్రహ్మప్రళయంవరకూ, లేక ఈ ఆశయం ఫలించే వరకూ, ప్రయత్నం ఆగకుండా జరగవలిసిందే... ముందు తను సంపాదించిన జ్ఞానాన్ని ఇతరులు దుర్వినియోగం చెయ్యకుండా కొన్ని కట్టుబాట్లు చేయాలి. జ్ఞానంమీదా, అందువల్ల పొందదగిన శక్తుల మీదా తనకున్న హక్కే అందరికీ ఉన్నది. కాని ఈ సహజమైన హక్కుకు వారంతా అర్హత సంపాదించలేదు. వారికి ఆత్మవికాసంలేదు సంస్కారం లేదు.

సృష్టిలో ఉన్న శక్తులనూ తనకు ప్రకృతి ప్రసాదించిన శక్తులనూ దుర్వినియోగపరచకుండా మానవుడి స్వేచ్ఛను అవసరమైనంతవరకు అరికట్టటానికి గాను న్యాయ చట్టమూ నీతిచట్టమూ పుట్టినై. మానవుడి సంస్కారమూ ఆత్మవికాసమూ పెంపొందిన కొద్దీ మానవుడు ఎక్కువ స్వేచ్ఛకు అర్హత పొందుతూ, ఒక చెంపనించి వృద్ధి అవుతున్న జ్ఞానాన్ని జాతియొక్క ఉన్నతికి ఎక్కువగా ఉపయోగించుకో గలుగుతూ, తనను బంధించిన చట్టాలను క్రమంగా సంస్కరించుకుంటూ వాటినుంచి ఉపాయంగా విముక్తి పొందుతాడు.

కాని మానవజాతి యొక్క చరిత్ర చూస్తే ముందునడకకంటె వెనక్కూ ముందుకూ ఊగటం జాస్తిగాఉంది. మధ్యమధ్య జాతియొక్క యోగక్షేమాలు మూఢులచేతుల్లో పడటం జరుగుతున్నది. అటువంటి మూఢులు ఈచట్టాలను భగవంతుడు మనకు మనపొగరు అణచటానికీ, మనస్వేచ్ఛ అరికట్టటానికీ శిక్షకింద ఇచ్చాడన్న నమ్మకంతో వాటియందు విశ్వాసంకంటె భయభక్తులు ఎక్కువ కలిగినవారై, వాటిని అవసరమైన విధంగా సంస్కరిస్తూ ఉండటానికి మారుగా వాటిని మరింత బిగిస్తూ, సంస్కారానికి బయటినించి అపకారం జరగకుండా ఉండటానికిగాను పెట్టిన గోడలకు మరినాలుగు గోడలను జతచేసి మానవజాతిని ఖైదీలను చేసి ఇంకా తృప్తిపొందలేకుండా ఉన్నారు. వేదకాలం నాటినించీ మానవజాతి క్రమంగా అధోగతికి వెళ్లుతున్నదనీ, అట్లా వెళ్లవలిసిందేననీ విశ్వసించేవాళ్లుండటం నాకాశ్చర్యం కలిగించదు. కాని వాళ్లే, జాతిని పైకి తీసుకురావటానికి ప్రయత్నం చేద్దామంటే అటువంటి ప్రయత్నం విఫలమవు తుందని విశ్వసిస్తూ కూడా, ఈసంకెళ్లను మరింత బిగించాలని చెప్పటం నాకుచాలా ఆశ్చర్యకరంగా ఉంటుంది.

మనకు కావలిసింది వెలుగు — ఆత్మవికాసం - సంస్కారం - శాస్త్రాలు మనచేత పెడుతున్న జ్ఞానంద్వారా మన కరగతమవుతున్న శక్తిని సద్వినియోగం చేసి జాతిని పైకి తీసుకురావటానికి స్వేచ్ఛ ముళ్లమీదినించి గుడ్డను ఉపాయంగా లాగినట్టు జాతికి ఈచట్టాలనించి విముక్తి! భగవంతుడి యందు

మనకు సరిఅయిన సమ్మకమే ఉంటే, అతన్ని చేరుకోవటానికి మనము నడిచే నడకే అభివృద్ధి అని మనం నమ్మితే, భగవంతుడు మనకు అందుబాటులో ఉంచిన ప్రతిశక్తి వినియోగించితేనే కాని మన అభివృద్ధి పరిపూర్ణంకాదని గ్రహించగలిగితే ఈ శక్తిని దుర్వినియోగం చెయ్యకుండా ఉండగలందులకు మనకు సంస్కారం అవసరమని అంగీకరించితీరాలి. వట్టిచట్టాలు స్వేచ్ఛను దుర్వినియోగం చేసినందుకు శిక్షించుతవేకాని సద్వినియోగం చేసే యోగ్యత కలిగించలేవు. ఈ సంస్కారాన్ని మనము శతకోటిలక్షల విధాల సంపాదించ గలగవచ్చును. కాని వాటిలో కలం కాగితంమీద పెట్టడంకూడా ఒకటి అయితే, ఆవిధంగా సంస్కారం పెంపొందించగలది సాహిత్యం తప్ప వాఙ్మయంలో మరొకటి లేదు.

నీతిచట్టాలూ న్యాయచట్టాలూ అవసరం లేదని నే ననటం లేదని స్పష్టంగా తెలుసుకోవాలి. సాహిత్యం ఎందుకు పుట్టిందో ఆచట్టాలూ అందుకే పుట్టినై—జాతియొక్క అభ్యుదయానికి. కాని ఈ రెండూ జాతికి ఉపకారంచేసే విధానాలు ఒకదానికొకటి విరుద్ధంగా ఉంటున్నవి. సంస్కారము పెరుగుతున్న కొద్దీ చట్టరూపమైన న్యాయమూ నీతీ తరిగిపోవాలి. ఇప్పుడు న్యాయచట్టం చేసేపని అప్పుడు సంస్కారమే చేస్తుంది. (ఈనాడు మనం మన ఆడవాళ్లను భర్తలతో సహగమనం చేయించకుండా ఉండటానికి ఒకచట్టం అవసరం లేదు!) చట్టంలో నూతనంగా కలిగిన మార్పును సాహిత్యం ప్రచారం చెయ్యవచ్చును. కాని చట్టంలో జరగవలసిన మార్పుకు సాహిత్యం ఎప్పుడూ విరుద్ధంగానే ప్రచారం చేస్తుంది. మనపూర్వ సారస్వతం ప్రచారం చేసినధర్మం అప్పుడే కొత్తగా అమలులోకి వచ్చినదీ, ఎక్కువమందికి రుచించనిదీ అయిఉండాలి; లేదా అప్పటికి గ్రంథకారులకు సాహిత్యంయొక్క ఈప్రయోజనం తెలియకపోయి ఉండాలి; అదీ కాకపోతే, ధర్మశాస్త్రం రాసినసత్పురుషుడే ఆసాహిత్యం కూడా రాసిఉండాలి. అమలులో ఉంటూ ఉన్న నీతికిగాని న్యాయానికి గాని ప్రచారం ఇవ్వటమే సారస్వతంపని అయితే సారస్వతం నీతిశాస్త్రముగానూ న్యాయశాస్త్రముగానూ మారిపోయి, నిజమైన సాహిత్య లక్షణం పోగొట్టుకుంటుంది.

ఇది స్పష్టంగా అర్థంచేసుకోని వారికి నేటి సాహిత్యం అవినీతిని ప్రచారంచేస్తున్నదనే అపోహా, వేదాలూ, ఉపనిషత్తులూ తొక్కిన మార్గం తొక్కలేదు కనక ఈసాహిత్యం చెత్తలాగు పెరుగుతున్నదనే అపోహ కలగటం వింతకాదు. ఒక కుర్రవాడికి నేను చదువు చెప్పటానికి కూర్చున్నప్పుడు నేను వాడితో మాట్లాడేవిషయమూ అందుకు ఉపయోగించే భాషా వాడివెనుకటిచదువు మీదా, వాడికిగల భాషాజ్ఞానంమీదా ఆధారపడి ఉంటై. నావల్ల వాడికి ఉపకారం కలుగుతున్నంతవరకూ వాడికి నాకంటె పండితుడితో పని లేదు—మీదుమిక్కిలి అపకారం ఉండవచ్చును. వెనకటివారు పెద్ద

పరుగులు పరుగెత్తి ఉండవచ్చును. దానికి ఈనాటి కవులు బాధ్యులు గారు. భగవంతుణ్ణిగురించి వేదాలు చేసిన ఘోషయావత్తూ మనల్ని నాస్తికులను చేసి విడిచిపెట్టింది. (మనం స్వార్థంకోసమో, భయంకొద్దినో గుళ్లో బొమ్మరాళ్లకు దణ్ణాలు పెట్టుతున్నామేమో! మన అంతఃకరణలను చీల్చిచూస్తే అక్కడ భగవంతుడి వాసన ఏమీ లేదు.) ఆదర్శపురుషుల జీవితాలు మన హృదయాలను తాకలేవు. వాళ్ల చరిత్రలు మనం నాటకరంగంమీద చూడవచ్చుగాక వాళ్లతో నిజమైన సానుభూతి మనకు లేదు. వాళ్లగొప్పతనం మనల్ని అంటలేదు. వాళ్ల దౌర్బల్యం మనం అర్థంచేసుకోలేం.

ప్రతిరోజూ భార్యను చావగొట్టుతూ ఉండేవాడికీ, సంసారం దుర్భరం అనిపించినవాడికీ చెప్పవలసింది కాంతం కథలు——సీతారాములదాంపత్యం కాదు. తెచ్చిపెట్టుకున్న పాతివ్రత్యం సంసారసుఖాన్ని ఎట్లా ధ్వంసం చేసిందో చూపగల సమర్థుడింకా తెలుగు రచయితల్లో రాలేదు.

వేదాలూ, ఉపనిషత్తులూ, రామాయణ భారతాలూ ఒకే మార్గాన వెళ్లినవని పామరుడు అనుకోవాలి. పండితుడు ఒక్కనాటికి అనుకోడు.

కావ్యానికి ఉపదేశించటమే ఉత్తమ ధర్మం అనటం ఉంటే, భగవంతుడి దీపారాధనకు వినియోగించే ఆముదం భేదిమందుగా ఉపయోగించటం మహాపాపమన్నట్టుంటుంది. నేటి సాహిత్యం ఉపదేశం చెయ్యకుండా కూడా సంస్కారం పెంపొందించటానికి చాలా పనిచేస్తున్నది. అసలు ఉపదేశమనేది మారిపోయి అనేకరూపాలు పొందింది.

శ్రీ శ్రీనివాస శిరోమణిగారి "ప్రతిఫలం" అనేకథ చూడండి. అందులో ఒక భర్త తన భార్యను, ఆమెతప్పేమీ లేందే, వదిలిపెట్టి తిరిగి వివాహం చేసుకుంటాడు. అతనుచేసిన యీపని అతనిజీవితానికి ఆవగింజంత అపకారం చెయ్యలేదు. కాని నిర్దోషిఅయిన అతని మొదటిభార్య విడాకుల చట్టం లేని కారణంచేత స్త్రీత్వానికీ మాతృత్వానికీ దూరమయింది. ఇదిచూచి అమిత సంస్కారీ నాగరికుడూ అయిన యువకుడొకడు భార్యను వదిలిపెట్టినవాణ్ణి చంపి అతని భార్యకు వైధవ్యం కలిగించుతాడు. ఆవిధంగా ఆమె స్త్రీత్వానికీ మాతృత్వానికీ అర్హత పొందుతుంది! ఈకథలో ఒక అధర్మమైన, అన్యాయమైన, అవినీతికరమైన హత్య సమర్థించబడింది. ఇందులో ఉపదేశం ఏమీ లేదు——"ఇటువంటి భయంకరమైన అసంస్కారమూ అనాగరికతా సమాజంలో ప్రబలిఉన్నందుకు అందరూ తలలువంచుకోండి" అనితప్ప. ఇది ఉన్న న్యాయచట్టంమీద దెబ్బతియ్యటమే. విడాకులచట్టం తెచ్చుకోండి అని ప్రబోధ ఇందులో లేదు. ఎక్కువమంది స్త్రీలు అసంస్కారులయినప్పుడు భర్తలు తమరిని విడిచేదాకా ఆగకుండా తామే భర్తలను విడిచిపెట్టి ఇష్టంలేనప్పుడల్లా ఒక మొగుణ్ణి మార్చటం

ప్రారంభించ వచ్చును. భర్తకు ఎడంగాఉన్న ప్రతిభార్యా భర్తచేత విడవబడిందో, భర్తను విడిచిందో ఎవరు చెప్పగలరు? అసంస్కారి హృదయం స్వేచ్ఛను దుర్వినియోగ పరచటానికి ఉబలాట పడటం సహజం.

అదీకాక శ్రీనివాసశిరోమణి గారి కథ మన అలోచనరేపుతున్నది - మన న్యాయచట్టం గురించి. అందరు స్త్రీలకూ స్త్రీత్వమూ మాతృత్వమూ సార్థకం చేసుకునే స్వేచ్ఛ ఇస్తూ, కొన్ని పరిస్థితులలో మరొకస్త్రీకి ఆస్వేచ్ఛలేకుండా చేసి, ఒక హత్యద్వారా - హత్యద్వారా మాత్రమే - ఆమెకు తిరిగి ఆస్వేచ్ఛను ఇవ్వగలుగుతున్నది. "దీనికి ఏమంటారు?" అని ఆకథ మనల్ని పృచ్ఛిస్తున్నది.

శ్రీ శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రిగారు ఆలోచన రేపేకథలు కొన్ని అద్భుతంగా రాశారు. ఒకకథలో ఒక అంటరాని వాడు తురకల్లో కలిసి గ్రామమధ్యానికి వస్తాడు!... శాస్త్రిగారు దేశభక్తిని గురించి ఆలోచన రేపే కథ ఒకటి రాశారు. అందులో ఒక దేశభక్తుడికి తన దేశం ఏది - ఆంధ్ర దేశమా? భారత దేశమా? — అని సంశయంవస్తుంది. (ఇటువంటి సంశయాలకు అనాలోచనపరులు త్వరపడి సమాధానం చెప్పకుండా నోరు మూయ గల సత్తా ఉంది శాస్త్రిగారి కలానికి.)

ఈ ఆలోచన రేపేగుణంలో ఉపదేశానికి లేని శక్తి ఉంది. గాంధిమహాత్ముడు అస్పృశ్యతా నివారణకు గాను చేసిన ఉపదేశం అంతా చెయ్యలేని పని శాస్త్రిగారి కథ ఒక్కటే చేస్తుంది. ఉపదేశం మనవ్యక్తిత్వాన్ని పరాభవిస్తుంది. ఆలోచన రేపే గుణం మనవ్యక్తిత్వాన్ని నిద్రలేపుతుంది.

అనాగరికుడూ అసంస్కారీ తనహక్కులను దుర్వినియోగ పరిచినట్టే బానిసతనానికి అలవాటు పడ్డవాడూ, భావదాస్యం చేసేవాడూ తన హక్కులను సులభంగా జారవిడుస్తాడు. అటువంటి 'బానిసల' ఉపయోగార్థం 'హక్కులు' అనే శీర్షికకింద కొన్ని సంఘటనలు రాసి శ్రీముద్దుకృష్ణ గారు చక్కని సాహిత్యం సృష్టించారు. వారికి తగినప్రోత్సాహం లేకనో మరేకారణం చేతనో ముద్దుకృష్ణగారు సంక్షేపించుకున్నారు. మరొకరు ఆచాయలకు పోలేదు నవ్యసాహిత్యచరిత్రలో ఇది ఒక శోచనీయాంశంగా కనిపిస్తుంది నాకు.

శ్రీ భమిడిపాటి కామేశ్వరరావుగారూ శ్రీవిశ్వనాథ కవిరాజుగారూ హాస్య నాటికలు రచించి మన మనస్సులకు శాంతీ సుఖమూ కలిగిస్తారు. సాహిత్యం తాత్కాలికంగా చెయ్యగల ఉపకారాలలో ఇంతకంటె ఉత్తమ మయినది కనిపించదు. విశ్రాంతీ, ఆనందమూ మన ఆరోగ్యానికి ఎంత అవసరమో మననాగరి కతకూ అంత అవసరం మనల్ని చూసి మనం నవ్వుకో గలగటం మాట చెప్పే దేమిటి?

ఇప్పుడిప్పుడు శ్రీనివాసశిరోమణిగారి లాటి ప్రముఖుల సహాయంతో "ఖులాసా

కథ" పైకి వస్తున్నది. ఈకథ ప్రచారంలోకి వచ్చిన తరువాత ఎన్ని వేలమంది ఆంధ్రులో పఠనంలో ఆనందం కనిపెట్టగలిగారు! భావి కవులంతా తమతత్వానికి ఇప్పటి "ఖులాసా కథ" ఆధారభూతముయుందని గ్రహించవలసి ఉంటపోతుంది.

ఇదంతా ఇట్లావుండగా సాహిత్యకళ యొక్క ప్రాముఖ్యత అట్లాగే ఉంది. తెలుగులో తొలిగ్రంథమైన భారతంనాటి నుంచీ మనకు వ్యసనంమోస్తరుగా అయిపోయిన రసానందం ఈనాడు చంపుకోలేం. కృష్ణదేవరాయల ఆస్థానంలో తెలుగు కావ్యకన్యను వయసువచ్చిన భోగినితో పోల్చి ఒక కవీశ్వరుడు రాయలచేత స్వయంగా కాలికి గండపెండేరం వేయించుకున్నాడు. అప్పటి కవులుతా కావ్యకన్యచేత రాయలఆస్థానంలో గజ్జకట్టి ఆడించారు. వారి పుస్తకాలవల్ల జరిగిన లోకసంగ్రహం చూసినట్టయితే పెద్ద సున్నా! ఉపదేశమే కావ్యప్రయోజనమైతే ఆ గ్రంథాలన్నీ తగలవెయ్యవలసిందే కాని మరొకటి లేదు.

సాహిత్యకళను ఈనాటి భావకవులు ఏ యుగంలో కవులూ ఆరాధించనిరీతిగా ఆరాధిస్తున్నారు. శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు, శ్రీరంగం శ్రీనివాసరావుగారు, శ్రీ శివశంకరశాస్త్రిగారు మొదలైన కవుల చేతుల్లో సాహిత్యకళ భరతనాట్యం చేస్తున్నది. వచనకావ్యం హృదయాన్ని సంస్కరించలేదు. ఈకవులు హృదయసౌకుమార్యాన్ని వృద్ధిచెయ్యగలుగుతున్నారు. ఎప్పటికైనా మేధస్సుకంటె హృదయమే ముందు భగవంతుడి సాన్నిధ్యం సంపాదించుకుంటుం దని పించుతున్నది ఈకవుల కవిత్వం చూస్తే. నవ్యసాహిత్యం పుట్టేవరకూ సాహిత్యకళ చేత మెదడుకు మెరుగుపెట్టించుతూవచ్చారు. ఈనాడు ఈసౌందర్యం కవిత్వాన్ని ఆశ్రయించి ఆమెచేత హృదయాన్ని సంస్కరింపజేస్తున్నది.

అయినా వచనకావ్యానికికూడా కళ అవసరమే. మంచిగ్రంథం అందంగాకూడా ఉండటం ఎంతయుక్తమో, మంచిరచన అందంగా రచించబడటంకూడా అంతయుక్తమే. అందుకనే నాబోటి రచయితలను భాష నేర్చుకోమని ప్రబోధిస్తున్నారు తెలిసినవారు.

ఎట్లాగూ సమర్థించటానికి వీలు లేని రచనారచయితలూ నవ్యసాహిత్యంలోకి చొరబడుతూండటం నేనెరుగుదును. స్కూలు ఫైనలు చదివే కుర్రవాళ్లు ఆవేశంకొద్దీ రాసే పిచ్చికథలనూ, వాటిని అచ్చువేసే పిచ్చిపత్రికలనూ, ఎక్కడిసించో కథలను ఎత్తుకుని వచ్చి వాటిని పాడుచేసి అచ్చువేయించుకునే దొంగలనూ సమర్థించటం ఎవరివల్లా కాదు. వాళ్లెప్పుడూ ఉంటూనే ఉంటారు. వారిరచనలు పత్రికలు అచ్చు వెయ్యకపోతే స్వంతానఅయినా వారు ముద్రించుకోకుండా చెయ్యలేం. వాటిని మనం చదవవలసిన అగత్యం లేదు. వాటిని గుర్తించటం కూడా కష్టం కాదు. అన్నమంతా పట్టి చూడనక్కర్లేదు.

"ఈరచన లన్నీ ఎందుకు?" అని అడగటం అమిత అమర్యాదకర మైన పని.

ఆమాశే మనుష్యులను గురించి అడిగితే మన జీవితాన్ని రూపాయికి భీమా చెయ్యటానికికూడా ఏకంపెనీ అంగీకరించదు! అయినా, "ఆర్యులు చూపించిన ఆదర్శాలకు భిన్నంగా నడిచే ఈ మనుష్యులంతా ఎందుకు?" అని అడగటం మనకు నోటివట్టమే కాని దానివల్ల ప్రయోజనం ఏమిటి?

కొందరు పేరుపడ్డ రచయితలు తమకు ప్రచారం కలగటానికిగాను నవ్యసాహిత్య పరిషత్తును పట్టుకొని వేళ్లాడుతూ, దానితోనూ అది అభిమానించే నవ్యసాహిత్యంతోనూ సానుభూతి లేకపోగా ప్రమువేటుగా దాన్ని నిరసించి మాట్లాడుతూ ఉంటారు. వారిని ఏం చెయ్యగలుగుతున్నాం?

ఒక సుప్రసిద్ధ నవకవి రేపు ఒక పురాణం పద్యరూపంగాకూడా రాయబోతున్నాడట! నవ్యసాహిత్యంతాలూకు ముక్కేదో మొహ మేదో తెలియని ఈ కవి శేఖరుణ్ణి రేపు నవ్యసాహిత్యపరిషత్తు ఏమి చెయ్యగలదు? ఏమీ లేదు!



పూరి: రథోత్సవము

# గృహం

ఏకాంకిక

మల్లాది అవధాని

స్థానము : కపిలవాస్తు

కాలము : రాత్రి

సిద్ధార్థునిశయనమందిరము. అది చతురస్రాకారము, విశాలమును.

కుడ్యములను వివిధ మనోహర భంగిమలలో నున్న విలాసవతుల చిత్రపటము లున్నవి. 'చాందినీ' నుండి కాచగోళములు వ్రేలాడుతున్నవి. వాటిలో చంపక కళికలవంటి దీపికలు వెలుగుతున్నవి. బంగరు ప్రమిదలలో సుగంధధూపరేఖలు తీగలవలె పెనవేసుకొంటూ పై కెగసిపోతున్నవి.

తెరచిఉన్న గవాక్షములనుండి బయటి ప్రకృతి గభీరముగా కనబడుతున్నది—అంధకారము...మబ్బుపట్టిన ఆకాశము...మినుక్ మినుకను ఒకటి రెండు నక్షత్రములు... దూరమున వంకరటింకరలు తిరిగిన అంచులుగల పర్వతములు—

లోపల—పర్యంకముపై ఉపధానమునకు చారబడి ఆలోచనలో కన్నులరమోడ్చినాడు సిద్ధార్థుడు. ప్రక్కను కూర్చుండి జడలోని పువ్వులచెండును సరిగా సర్దుకొంటూ ఉన్నది గోప. గోప అతని భార్య. ఆమె ఒడిలో [illegible] తన బొటనవ్రేలిని చప్పరించుకొంటూ హాయిగా నిద్రపోతున్నాడు.

సిద్ధార్థు డిరువదియాల్గేండ్లవాడు. ఆజానుబాహువు. అతని నయనములు జ్యోతిర్మయములు. గోప అతనికన్న నాలుగేండ్లు చిన్న. శ్యామలాంగి. ఆమె కన్నులు సోగలు, విశాలములు. అవి అయస్కాంతముల వంటివి.

ఎదురుగా తివాసిపై కూర్చుండి వీణలను మృదంగాది వాద్యములను సంకులముగా పల్కించుతూ వాటితో తమ గాత్రములు మేళవించి 'నిశాగీతము' నాలపించుతున్నారు వారవిలాసినులు. విదేశపు యువతు లిరువురు మయూరవృంతములతో రాజదంపతులకు విసురుతున్నారు.]

సిద్ధార్థుడు—[త్రుళ్లిపడి దిగ్గునలేచి] సంగీతం చాలించండి. మరి వినలేను.

వారవిలాసినులు—[చకితలై వాద్యములను విడచి కళవళపాటుతో నిల్చున్నారు.]

గోప—భర్తతో ఏమిటిది ?

సిద్ధార్థుడు—స్వస్థతపడి తిరిగి కూర్చుండి ఏమీలేదు!

గోప—[వార విలాసినులతో] మీరు వెళ్లవచ్చును.

[వారవిలాసినులు తలలు వంచి నమస్కరించి వెళ్లిపోయినారు.]

[గోప యువతుల వైపు చూచినది. వారు వృంతములను దిగువ నుంచి వెళ్లిపోయినారు. ఆమె వచ్చి భర్తప్రక్కను కూర్చుండి వీవనను తీసి దానితో నెమ్మదిగా విసరుతున్నది.]

గోప—కన్నులు మూసుకొని నిద్ర పోవడానికి యత్నించండి!

సిద్ధార్థుడు—నిద్ర రాదు.

గోప—మరికొంచెం సేపు సంగీతం వింటే.

సిద్ధార్థుడు— [గాభరాతో] వద్దు! వద్దు! ఎంతమాత్రమూ వద్దు!

గోప—ఎందుచేత ?

సిద్ధార్థుడు—"ఎందుచేత" అని అడుగుతా వేమిటి గోపా! నీకు ఆసంగీతంలో ఏమీ వినబడలేదూ ?

గోప—సంగీతంలో ఏమిటి వినబడు తుంది ?

సిద్ధార్థుడు—జాగ్రత్తగా విన్నావా? ఏమీ వినబడలేదూ ? సన్నగా ఆరంభమై క్రమక్రమంగా అధికమై పోయిన రోదనం వినబడలేదూ ?

గోప—[భీతితో] రోదనమా ? సంగీతంలోనా ?

సిద్ధా—నువ్వు గమనించలేదు. ఇంకా ఆయేడుపు నాహృదయంలో మార్మ్రోగుతూనే వుంది. ఏమి రోదనం! అదేమో_స్తరు! నిన్నసాయంత్రం ఆగుడ్డి పిల్లవాడు ఆరోగి ఆమృతుని వెనుక నడుస్తున్న బంధువులూ ఆవృద్ధుడూ అందరూ కలసి ఏడుస్తున్నట్టనిపించింది.

గోప—వారవిలాసినులు మీకు దీనుల లాగా వాళ్లసంగీతం రోదనంలాగా తోచిందా?

సిద్ధా—అవును గోపా! కనులు తెరచినా, మూసుకొన్నా, నాకు ఆగ్రుడ్డిపిల్లవాడు ఆవృద్ధుడు, ఆమృతుడు ఆదుఃఖజనమే కనబడుతున్నారు. నాకు సంగీతం వినబడదు. రోదనం...రోదనం.

గోప— ఏమో! మిమ్మల్ని చూస్తే నాకు దిగులుగా వుంది. నిన్నసాయంత్రం షికారునుంచి వచ్చిన దగ్గిర్నుంచి మీరంతా ఒక్కసారిగా మారిపోయినారు.

సిద్ధా—ఎలాగ మారిపోయినాను ?

గోప—మీరదోలాగ...వింతగా చూస్తారు. ఆచూపు చూస్తే నా గుండె అదిరిపోతుంది.

సిద్ధా—[మ్లానహాసము] వెర్రిదానా!

గోప—మీరలా నవ్వకండి! అదుగో మళ్లా నవ్వుతున్నారు! ఆనవ్వు నన్ను భయపెడుతూంది. అది దుస్స్వప్నంలాగ నామనస్సును మథిస్తూంది.

సిద్ధా—[తల్లి ఒడిలో నిద్రిస్తున్న రాహులునివంక చూస్తూ] దుస్స్వప్నం... భయం... ఏమీ తెలియక హాయిగా బాబాయి నిద్రపోతున్నాడు.

గోప—[శిశువును తండ్రి అంకమున పండుకోబెట్టి] పిల్లవాణ్ణి చూడండి! చింత లన్నీ మరిచిపోయి పండుకోనండి. తెల్లవారే సరికి మనస్సు నిర్మలంగా వుంటుంది.

సిద్ధా—నిద్ర నామనస్సులోని బాధను తొలగించగలదా? అలాగనయితే నేను శాశ్వతంగా నిద్రింతునే. స్మృతిలో నేను దాగినా, నాకన్నుల కా గుడ్డిపిల్లవాడు వృద్ధుడు కనబడతారు, రోదనం దుఃఖం విన బడుతుంది. నన్నాదృశ్యం ఆశబ్దం విడిచి పెట్టవు... గోపా! అలా నిలువున కంపించి పోతున్నా వేమి ?

గోప—[తడబడుతూ] మీ మాటలు మరి వినలేను. [కంట తడి.]

సిద్ధా—అమాయకురాలా! ఇటురా! ఇలాకూర్చో! చూడు నేను అంతా మరిచి పోతానులే. గుడ్డిపిల్లవాణ్ణే, అందర్నీ కూడా మరిచిపోతాను మనం మునపటిలాగనే వుం దాము. బెంగపడకు. [కన్నీరు తుడుస్తూ] పిచ్చిపిల్లా! ఈమాత్రానికే కంట నీరుపెట్టు కోవాలెనా! [నిద్రిస్తున్న రాహులుని] బాబాయ్!

గోప! ఊరికే వాణ్ణెందుకు లేపివేస్తారు. లేచిపోయినాడంటే ఒకంతటికి గాని తిరిగి పండుకోనడు.

సిద్ధా—తనివితీరా యీరాత్రే వీణ్ణి "బాబాయ్ బాబాయ్" అని పిల్చివేస్తాను.

గోప—[నవ్వుతూ] రేపుదయం పిలవ రాదా?

సిద్ధా—రేపు! రేపు! [హాసము] రేపు నేనిక్కడ వుంటాననని నిశ్చయమేమిటి?

గోప—ఉండక ఎక్కడికి వెళ్లుతారు?

సిద్ధా—నిన్నటి ఆమృతుని విధంగా నేను రేపు చనిపోకూడదా ?

గోప నిశ్చేష్టురాలైనది. కన్నులలో గిర్రున నీరు తిరిగినది.]

సిద్ధా—మరణమనేమాట విన్నంతనూ త్రమున యేడుస్తున్నావు. నేను మృతులను చూశాను. మృతులకంటే ఘోరజీవులను, వృద్ధులను, రోగపీడితులను చూశాను. సూ ర్యచంద్రులు జగత్తును చూస్తున్నట్టే నేనూ దుఃఖితులను చూస్తున్నాను. కిక్కురుమన కుండా వూరుకొని వుంటున్నాను. అంతేకాని నేనేడ్వలేదు. ఏడ్పుమాత్రం ప్రయోజన మే మిటి?.. అదుగో మళ్లా ఏడుస్తున్నావు. వెక్కివెక్కి యేడుస్తున్నావు.... నేను పండు కొంటున్నాను. కళ్లు తుడుచుకో! నవ్వుతూ సరదాగా నాతో మాట్లాడు! నేను సర్వం మరిచిపోతాను నిన్నూ బాబాయినీ గాక.

[సిద్ధార్థుడు పండుకొన్నాడు. గోప అత నికి విసరుతున్నది. నిశ్శబ్దము—గోప రెండు సార్లావులించినది. ఆమెచేతులోనుండి వీవ న దానంతటనదే క్రిందపడి పోయినది. గోప కూడ గాఢనిద్రకు వశమైపోయినది.

క్షణముతరువాత మెల్లగా సిద్ధార్థుడు లేచినాడు. మందిరములో అంతటను నిశ్శ బ్దము.

బయట చినుకు పడుతున్నది. మబ్బులు కమ్ముకొంటున్నవి.]

సిద్ధా—[గోపను చూస్తూ] అమాయ కురాలు! [ఆమె ముంగురులను సవరించినాడు, ఆమె కపోలములను క్రిందిపెదవిని తనమునివ్రేళ్లతో తాకినాడు. దృష్టి ఆమెనుండి మరల్చుకొన్నాడు. పల్యంకమును విడచివచ్చి గవాక్షము దగ్గర నిలచి ఆకాశమువంక చూస్తూ] వానరావచ్చును. రొజ్జ గాలి వేస్తూంది. పిల్లవాడు లేచిపోతాడు [కిటికీ తెరలను మూసివేయబోయి, మాని] మబ్బులెంతచక్కగావున్నాయి! నేనొక మబ్బును కారాదా? దేవతలు కరుణించి నన్నొకమబ్బును చేసివేస్తే ఆకాశం నడుమకు ఎగిరిపోతాను. అక్కడ నిలుచుని నాశరీరంలోని రక్తాన్నంతటినీ... ప్రతి బిందువును కూడా... దుఃఖజీవుల కోసమని భూమిమీదకు వర్షించివేస్తాను. కాని నేను దుర్బలుణ్ణి, దుఃఖితులను రోగగ్రస్తులను మృతులను చూచి కూడ శక్తిలేక చేతగాక నిశ్శబ్దంగా నిర్వ్యాకులనై పూరకుంటున్నాను

[ప్రతీహారి వచ్చినది. ఆమె ముప్పది సంవత్సరముల యువతి వినయముగ సిద్ధార్థునకు నమస్కరించినది.]

సిద్ధా—ప్రతీహారీ!

ప్రతీహారి—ప్రభూ!

సిద్ధా—ఏమివచ్చినావు ?

ప్రతీ—ప్రతీహారమున వుంటిని. తమరు తమలోనే యేమేమో మాటాడుకొంటున్నట్టు వినబడి వచ్చాను.

సిద్ధా—అవును. ఉన్మత్తుని విధంగా నాలో నేనే మాటాడుకొంటున్నాను.

ప్రతీహారి—క్షమించండి ప్రభూ! నాఅభిప్రాయ మదికాదు. తమరు తీవ్రాలోచనచేస్తున్నట్టున్నారు. అర్ధరాత్రి అయింది. ఇంకా పండుకోలేదు. నిద్రలేకుంటే శరీరానికి జబ్బు చేస్తుందని వైద్యులు చెపుతారు.

సిద్ధా—మరి నీవింతవరకు పండుకోలేదేమి ?

ప్రతీహా—ఉద్యోగధర్మం!

సిద్ధా—సరే వెళ్లు. నిద్రపోతానులే.

[ప్రతీహారి నమస్కరించి వెళ్లిపోయినది.]

[గాలి వేస్తున్నది. చినుకులు పడుతున్నవి ఒక్కసారి మెరుపు మెరసినది.]

సిద్ధా— నిద్ర! ఈరాత్రి వర్షంలో ఎన్ని జీవులు రోగబాధతో జరతో నిద్ర రాక దుఃఖిస్తున్నారో! వారంతా నావంటి వారేకదా! వారు నాస్వజనం కారా? అగ్రుడ్డిపిల్లవాణ్ణిచూస్తే నాకు మాబాబాయి జ్ఞాపకము వస్తాడు. ఆవృద్ధుణ్ణిచూస్తే నాన్నగారు తలపునకు వస్తారు. వారంతా నాబంధువులు. వాళ్లు తలదాచుకుందుకుచోటులేక బాధపడుతున్నారీరాత్రి. నే నీమందిరంలో హాయిగా వున్నాను....

దరిద్రులంటే యెవరో అంధులూ, రోగులూ, వృద్ధులూ, మృతులూ అంటే యెవరో వారిబాధలు ఏమిటో నిన్న ఛందకుడు నాకు బోధపరిచాడు. లోకంలో వుండే సకలజీవుల

రోగాలూ దుఃఖాలూ నాకు వచ్చివేసి వారు హాయిగా వుంటే యెంత బాగుంటుంది. లోకంలోని ప్రతిజీవివంతూ నే నొక్కసారి మరణించగలను. కోటికోటి సార్లు మరణిస్తాను. మళ్లా పుట్టగలను. కాని... కాని నేనే మీ చెయ్యలేను.....దుర్బలుణ్ణి.....నేనెంత దుర్బలుణ్ణి! [నిట్టూర్చివచ్చి కూర్చున్నాడు.]

రాహులుడు—[నిద్రలో] అమ్మా.

సిద్ధా—పడుకో! బాబూయి! పడుకో!

రాహులుడు—[నిద్ర లేచి కూర్చుండి] అమ్మా!

సిద్ధా—లేచి పోయినావా?

[రాహులుడు గునుస్తూవున్నాడు.]

సిద్ధా—[దగ్గరకు తీసికొని బుజ్జగిస్తూ] పండుకోనాయనా! నువ్వు మామంచివాడవు. రేపు నీకు రంగురంగులచిలకలు యిస్తాను. పండుకో బంగారుతండ్రీ!

గోప—[కనులు తెరచి ఆవులించి బద్ధకము తీర్చుకొని] లేచిపోయినాడూ?

సిద్ధా—నన్నుకూడ లేపివేసినాడు.

గోప—[నవ్వుతూ] కొంటెమాటలు! మీరే వాణ్ణి లేపి వుంటారు.

సిద్ధా—[ఆమె పెదవులవంక చూస్తూ] ఎంత చక్కనినవ్వు, మెరుపు తీగవలె ఎంత సొగసైన నవ్వు... గోపా!

గోప—ఏమి?

సిద్ధా—గోపా, గోపా, నీచుబుకమున నీసోగకన్నులు నీ పూ ల రే కు పె ద వులు నీమెడ నన్ను మోహపెట్టుతున్నాయి నీస్వరూపజాలములో మీనంవలెచిక్కుకొనిపోతున్నాను.

గోప—మీకీరాత్రి నిద్రరావడం లేదు.

సిద్ధా—నిన్ను విడిచిపెట్టి వుండగలనా? నా కది సాధ్యమా?

గోప—ఏమిటి మీమాటలు?

సిద్ధా—తుపానుగాలులు వీస్తున్నాయి. ఆగాలుల వేగంలో ఎండుటాకువలె నే నెగిరిపోతానేమో.

గోప—[లేచి వెళ్లి స్వర్ణపాత్రికలో పుష్పాసవం నింపి తెచ్చి] మీరు ఆసవం స్వీకరింపక తప్పదు. లేకుంటే తెల్లవార్లూ యిలాగనే కలవరింతమాటలతో మేలుకునికూచుంటారు.

సిద్ధా—[ఆసవం త్రాగి] ఏదీ నీకుడిచెయి ఆమృదువయిన మునివ్రేళ్లతో నానుదుటిని స్పృశించు.

గోప—నిద్రపోరూ? నామాట వినరూ [విసురుతూ] క్షణం కన్నులుమూసుకొనండి.

సిద్ధా—నన్ను తల్లివలె బుజ్జగించుతున్నావే....చిన్నతనంలోనే మా అమ్మ పోయింది...

[క్రమంగా నిద్రపోయినాడు. కోటలో నుండి అర్ధరాత్రి 'నగారా' వినబడుతున్నది. గోపకూడ ఉపధానముపై నిదురలో వాలినది. చాలాసేపు నిశ్శబ్దము.

బయట వర్షం కురుస్తూ ఉన్నది. మేఘములు అరుస్తున్నవి. మెరుపులు పరుగిడుతున్నవి. రొజగాలి వీస్తున్నది.

సిద్ధార్థుడు ఎవరో తనను లేపినట్టుగా త్రుల్లిపడి లేచినాడు. చేతులో చుబుకము నుంచుకొని ఆలోచిస్తున్నాడు.]

సిద్ధా—ఎవరు నన్ను పిల్చింది ? అన్నా అని వొకరు 'నాయనా,' అని వొకరు, సరే. ఆగుడ్డిపిల్లవాడు నాతలదగ్గర కూర్చుని 'అన్నా' అన్నాడు. వృద్ధుడు 'నాయనా' అని జాలిగాపిలుస్తున్నాడు. కొండవెనక కోటికోటి జనం నన్ను పిల్చారు. అంతా స్వప్నమా ?

[బయట మేఘములోనుండి ఉరిమినది.]

సిద్ధా—[ఉరుము విని చటుకున లేచి నిలచి] అదుగో! అదుగో! తన వురుము గొంతుకతో భగవంతుడు నన్ను "సిద్ధార్థా! జీవుల కోసం లోకంలోనికి వెంటనే వెళ్లు" అని శాసిస్తున్నాడు—ప్రతీహారీ, [నిశ్శబ్దము.]

సిద్ధా—ప్రతీహారీ ప్రతీహారీ నిద్రపోతున్నావా? ఒక్కసారి లేచి యిటురా అమ్మా.

ప్రతీహారి—[నిదురకన్నులతో వచ్చి వంగి నమస్కరించి] ప్రభూ! తమ రింకా.....

సిద్ధా—వెంటనే వెళ్లి ఛందకుని పిలుచుకురావలెను.

ప్రతీహారి—ఛందకునా ?

సిద్ధా—అవును. సారథిఅయిన ఛందకునే.

ప్రతీహారి—ఇంతరాత్రి.

సిద్ధా— విలంబం చేయవద్దు. వెంటనే వెళ్లు.

[ప్రతీహారి వెళ్లబోయినది.]

సిద్ధా—ఇదుగో.

[ప్రతీహారి ఆగిపోయినది.]

సిద్ధా—అతనిని రథంతో రావలసిందని చెప్పవలెను.

[ప్రతీహారి సంశయిస్తున్నది.]

సిద్ధా—ఈసంగతి ఎవ్వరికీ తెలియరాదు. బహుగోప్యం.

ప్రతీహారి—ఇంతరాత్రి రథంలో ఎక్కడకు ప్రభూ.

సిద్ధా—ఉదయం గోపలేస్తుంది. మందిరంలో నేను కనబడను. కళవళపడుతుంది. బెంగ పడుతుంది. అపుడు నువ్వు నెమ్మదిగా చెప్పు "సిద్ధార్థుడు తనయింటికి వెళ్లిపోయినాడు" అని.

ప్రతీ—తనయింటికా ?

సిద్ధా— అవును. నాయింటికి. ఇది ప్రవాసం.

ప్రతీహారి—నాకేమీ బోధపడడంలేదు.

సిద్ధా—రేపు గోపకుకూడా నామాటలు అగమ్యంగా వుంటాయి గాబోలును. ఇక నీవు వెళ్లు.

[ప్రతీహారి వెళ్లిపోయినది.]

సిద్ధా—గోప... వెర్రిగోప...అమాయకురాలు.

గోప—[నిద్రలో కలవరింత] ఈ గులాబీలు వాసన చూడండి...ఉహు...నా కపోలములు గులాబిలా...ఏమి టాపరిహాసం...

సిద్ధా---[తదేకదృష్టితో ఆమెనుచూచి] గోపా గోపా [ఆమె పల్యంకముదగ్గర మోక

రించినాడు. కనులనుండి జలజల బాష్పబిం దువులు రాలినవి.]

[ప్రతీహారి వచ్చి, వెనుతగ్గి వెళ్లిపోబో తున్నది.]

సిద్ధా—[లేచి కన్నీరు తుడుచుకొని] ఛందకుడు వచ్చినాడా?

ప్రతీ—వచ్చినాడు.

సిద్ధా—రథంతో ?

ప్రతీ—రథంతోనే వచ్చినాడు.

సిద్ధా— వాణ్ణిక్కడకు రమ్మను.

ప్రతీ—సారథినా ? శయనమందిరం లోనికా ?

సిద్ధా—అవును.

[ప్రతీ వెళ్లిపోయినది.]

సిద్ధా—నేను గోపవైపు చూడను. నేను నాయింటికి వెళ్లిపోతాను. లోకం... దుఃఖజీవులు... ఇది ప్రవాసం. [ఛందకుడు వచ్చి ద్వారముదగ్గర నిలచినాడు.]

సిద్ధా— ఛందకా. బయలు దేర దామా ?

[ఛందకుడు నిర్వాక్కు.]

సిద్ధా—విశాలమైన లోకం నాయిల్లు. రోగులు ఆర్తులూ సకలదుఃఖ జీవులూ నాస్వజనం. ఈమందిరం నాకు ప్రవాసం. ఈప్రవాసంలో నే నెంతకాల మని వుండ గలను?

ఛందకుడు— ప్రభూ! రాత్రి... అర్ధ రాత్రి. హోరుమని వర్షం. ఎక్కడనో రెండు పిడుగులుకూడ పడినాయి. ఉరుములు, మెరు పులు...

సిద్ధార్థుడు—ఇదంతా దేవతల విచిత్రా శీర్వాదం వెళ్లు. గుర్రాలను హుషారు చెయ్యి. వస్తున్నాను.

[ఛందకుడు సంశయిస్తున్నాడు.]

సిద్ధా—గోప అనాధ అయిపోతోంది. బాబాయి దిక్కుమాలిన పిల్లవా డయిపో తాడు. వెళ్లి నిద్రిస్తున్న గోపనూ రాహు లునీ చూచి గద్గదస్వరముతో చాల మెల్లగా గోపా గోపా, బాబాయి, వెళ్లుతాను.[తొందర గా తిరిగి ద్వారముదగ్గరకు వచ్చి] ఛందకా పద పద. వెంటనే పద, వెనుదిరిగి చూస్తిన, మరిరాలేను. గోపవైపు చూడను.

ఛందకుడు—ఏమి ప్రభూ!

సిద్ధా—గోప ప్రేమఖాతం......గోప అనురాగనిర్ఝరి. అందులో పడిపోయితినా మునిగిపోతాను.

[సిద్ధార్థుడు ఛందకునితో బయటికి నడ చినాడు. మెరుపు మెరసినది. హోరుమని వర్షము కురుస్తున్నది. నిదురలో చెడుకలగని కాబోలు గోప కలవరించినది. శిశువు నోటి లోతన బొటనవ్రేలిని చప్పరించుకొంటూ అమాయకముగా నవ్వుతూ హాయిగా నిద్ర బోతున్నాడు.]



మల్లికార్జునదేవాలయ ద్వారము, బెజవాడ.

—వేణుగోపాల్.

# పంచదార పరిశ్రమ

## అంతర్జాతీయసమావేశము : భారతదేశముయొక్క ప్రస్తుతస్థితి

'రావు'

పంచదారపరిశ్రమ ప్రాచ్యఖండంలో క్రీ. శ. ౫వ శతాబ్దానంచీకూడ వ్యాప్తిలో ఉన్నట్టు దృష్టాంతా లున్నాయి. పశ్చిమదేశాలలో మాత్రం అటు తర్వాత చాలా కాలానికి గాని చక్కెర అనే పదార్థం యెలా ఉంటుందో కూడ తెలియక పోయింది. క్రీ. శ. ౧౫వ శతాబ్దంలో మడీరా, కానరీ ద్వీపాలలో పోర్చుగీసువారు చెరకుపంట ప్రారంభించారు. ఆ పై స్పెయిన్ దేశీయులు వెస్టిండీస్ దీవులలో మొదలు పెడితే అక్కడనుండి క్రమేణ మధ్య అమెరికా, దక్షిణ అమెరికా దేశాలకు వ్యాపించింది. ఇలా అభివృద్ధిచెందిన పంచదారపరిశ్రమ నేడు ప్రపంచ వ్యాపార సమస్యలలో ప్రథమ తాంబూలం గ్రహిస్తోంది. కాని హిందూదేశంలో మాత్రం తమ దేశీయ పరిశ్రమ అని చెప్పకోతగిన దీన్ని గూర్చి ప్రజలు తగినంత దూరదృష్టి, ప్రభుత్వము వలసినంత అభిమానము చూపింపలేనందుకు నిజంగా విచారింపవలసే యుంటుంది.

ఆలోచించి చూస్తే మన దేశంలో యీ పరిశ్రమాభివృద్ధికి కావలసినన్ని అవకాశా లున్నాయి. సారవంతమైన భూమి, సరియైన శీతోష్ణస్థితి మొదలైన సౌకర్యాలు సమృద్ధిగా ఉన్నాయి. కాని యిన్నియుండి కూడ యీ విచిత్రపరివర్తనానికి కారణ మేమై యుంటుంది?

### విదేశీయులపోటీ

ఇంగ్లాండు, మరియితరమైన యూరపుదేశాలలో పూర్వము తరచుగా బీటుచక్కెర (ఒకవిధమైన తెల్లని దుంపలవల్ల తయారుకాబడే చక్కెర) వాడబడుతూ వచ్చింది. కాని జావా, క్యూబా, హిందూదేశము మొదలగు చోట్ల చెరకువల్ల పంచదార తయారు కాబడుతూంది. ౧౯౧౪-౮ సంవత్సరము వరకు ఈ రెంటి యొక్క వ్యాపారము ౧౯౦౨ లో జరిగిన బ్రస్సెల్సు సమావేశములోని షరతుల ననుసరించి జరుగుతూ వచ్చింది. అమకోపామహాయుద్ధంతో పరిస్థితులు తారుమారయినాయి. యూరపు దేశాలనుంచి ఇంగ్లాండుకు దిగుమతిఅయ్యే బీటుచక్కెరఫ్యాక్టరీలు, జర్మన్ పక్షంవారి అధీనంలో ఉండటం తటస్థించింది. అందువల్ల ఇంగ్లాండుకు పరదేశాలమీద ఆధారపడవలసిన అవస్థ పట్టింది. ఈ అవకాశా న్ననుసరించి జావా, వెస్టిండీస్, క్యూబా మొదలగుచోట్ల చెరకు పంచదారపరిశ్రమ అద్భుతమైన అభివృద్ధిని ప్రదర్శించింది.

ఈక్రింది ఫలితాలు పై నుదాహరించిన విషయాలను స్పష్టం చేస్తాయి.

| సంవత్సరం | ప్రపంచలో తయారయిన పంచదార (టన్నులు) |
|---|---|
| ౧౯౧౩-౧౪ | ౧౭,౪౩౬,౦౦౦ |
| ౧౯౩౫-౩౬ | ౨౭,౬౭౧,౦౦౦ |

| | చెరకుచక్కెర | బీటుచక్కెర |
|---|---|---|
| ౧౯౧౩-౧౪ | ౯,౭౦౨,౦౦౦ | ౭,౬౩౫,౦౦౦ |
| ౧౯౩౬-౩౭ | ౧౯,౭౭౧,౦౦౦ | ౯,౯౨౬,౦౦౦ |

యుద్ధానంతరం బీటుచక్కెరపరిశ్రమదారులు తమకు సంభవించిన అనర్థాన్ని గ్రహించారు. కలిగిన నష్టాన్ని సవరించుకోవాలని ప్రయత్నించారు. తగినంత జయం మాత్రం సంపాదింపలేకపోయారు. తమ వ్యాపారాన్ని, పరిశ్రమను వృద్ధిపరచుకోటానికి విదేశీయుల పోటీని భరింపలేక యూరపువారు రక్షణచట్టాలను

ప్రయోగించారు. దిగుమతిసుంకాలను హెచ్చుచేశారు. స్వేచ్ఛావ్యాపారము ఈ రక్షణపట్టాల మధ్య సన్నగిల్లి పోయింది. దీనితో పరిశ్రమాభివృద్ధికి ప్రబలమైన ఆటంకం సంభవించింది. ఇది యిటీవలివరకు విదేశాలలో కలిగిన పోటీవలన ప్రాప్తించిన పర్యవసానము. ఇక హిందూదేశమమాట ?

మొదటినుంచీ భారతీయులు వాణిజ్యవిషయాల్లో వెనుకంజ వేయటం పరిపాటి అయిపోయింది. ప్రభుత్వంకూడ యిందుకు హర్షించి ఊరుకుంటూంటే యిక అడుగవలసిన దేముంటుంది ?

ప్రపంచంలో వివిధదేశాలు దినమునకు ౧౫౦ టన్నులకు మించి తయారుచేయగల చెరకు చక్కెర ఫ్యాక్టరీలు ౯౦౦ మొదలు ౧౦౦౦౦ వరకు స్థాపించి విపరీతమైన పంచదారవ్యాపారము చేస్తున్న కాలంలో కూడ, అనగా ౧౯౩౧-౩౨ లో మనదేశంలో ౩౨ ఫ్యాక్టరీలు మాత్రం ఉంటూ వచ్చాయి. వీనిలో సక్రమంగా పనిచేసేవి ౨౭. దేశంలో ఉత్పత్తిచేసే చక్కెరకన్న పైదేశాలనుంచి దిగుమతిఅయ్యే సరకు అధికమైంది. మొత్తంమీద ౧౯౩౨ లో ౧౫౮,౫౮౧ టన్నుల పంచదార దేశంలో తయారైతే ౫,౭౬,౨౦౦ టన్నులసరకు పైదేశాలనుంచి తెప్పించుకోవలసివచ్చింది. అప్పటికి ప్రజలలో కొంత మెలకువ కలిగింది. దీనివిషయమై కొంత ఆందోళన జరిగింది. ప్రభుత్వముకూడ కొంతవరకు ఔదార్యము వహించి హిందూదేశంలో పంచదారపరిశ్రమకు ఎలాగైతే నేం ౧౯౩౨ నుంచీ రక్షణ ప్రసాదించింది. అంతవరకు సంతోషింపవలసిన అంశమే.

విదేశపు పంచదారపై దిగుమతిసుంకము వేయటంతో స్వదేశపరిశ్రమకు కొంత ఆధారం దొరికింది. క్రొత్త క్రొత్త ఫ్యాక్టరీలు నెలకొల్పబడ్డాయి రైతులు చెరకును విరివిగా పండించారు. ప్రజలుకూడ పంచదారను చౌకగా కొని ఉపయోగించుకోటానికి అవకాశం కలిగింది. ౧౯౩౫ నాటికి ఫ్యాక్టరీల సంఖ్య ౧౩౩ వరకు పెరిగింది. నేడు దాదాపు ౧౪౯ ఫ్యాక్టరీలు దేశంలో వేర్వేరుచోట్ల జయప్రదంగా పనిచేస్తున్నాయి.

దీనిఫలితంగా విదేశాలనుంచి మనకు దిగుమతి అయ్యే చక్కెర తగ్గిపోయింది. ౧౯౩౨ లో షుమారు ౬ కోట్ల రూపాయల విలువ గల చక్కెర, అనగా ౫౧౬,౨౦౦ టన్నులు దిగుమతిచేసినవాళ్లము ౧౯౩౬-౩౭లో ౨౨,౩౭౮ టన్నులు, అనగా రు. ౨౨,౯౭,౨౦౩ విలువగల చక్కెరనుమాత్రము తెప్పించుకొనియున్నాము. మొత్తంమీద మన దేశానికి యావత్తు సరిపోగల పంచదారను విదేశాలనుండి తెప్పించుకొనకుండా మన దేశంలోనే తయారు చేసుకోగలస్థితి యేర్పడ్డది. ఈపరిశ్రమవల్ల ప్రస్తుతం ౨ కోట్ల జనులకు జీవనాధారం దొరకుతూన్నట్లు అంచనావేయబడ్డది. రైతులకు చెరకు పంటవల్ల ౧౯౩౫-౩౬ లో ౮ కోట్ల రూపాయలు లభించినట్లు తెలుస్తోంది. ఇంతవరకు ఈఫలితాలు చాల ప్రోత్సాహకరంగానే యున్నాయి.

ఈసందర్భంలో యింకొక ముఖ్య విషయం గమనించటం మంచిది. ప్రస్తుతం దేశంలో పండే చెరకు పంటలో నూటికి ౧౬ వ వంతు మాత్రము పంచదార తయారుచేయటానికి ఉపయోగపడుతోంది. మిగతా ౮౪ వంతులు బెల్లము మొదలగు యితర వ్యాపారాలకు సహాయపడుతోంది దీనిని బట్టి యిక్కడ పండే చెరకుపంటవల్ల మన దేశానికే కాక పరదేశాలకుకూడ చాలినంత చక్కెర తయారుచేయగల సమర్థత మనకు ఉన్నట్లు స్పష్టమవుతోంది.

## ఎగుమతి వ్యాపారము

సాధారణంగా ఒక దేశంయొక్క అర్థసంపదలు ఆదేశీయుల యెగుమతివ్యాపారంవల్ల ఊహించుకోవచ్చు. విదేశాలతో యెగుమతివ్యాపారం లేనిది పరిశ్రమలకు పట్టులేదు. ఈవిషయంలో యింకా హిందూదేశం బాల్యావస్థలోనే ఉన్నదని చెప్పవచ్చు. బ్రిటిషు ప్రభుత్వము ఒటావామొదలైన ఒడంబడికల మూలంగా సామ్రాజ్యదేశాలకు లాభాలు చేకూరుస్తున్నామని ప్రకటిస్తున్నా నిజానికి మనకు ప్రత్యక్షంగా కన్పించిన ప్రయోజన మేమీ లేదు.

గ్రేటు బ్రిటను సగటున సాలుకు ౨౦ లక్షల టన్నుల చక్కెరను ఉపయోగిస్తుంది. ఇందులో యే

౩,౮ లక్షల టన్నులో మాత్రం ఇంగ్లాండులోనే బీటు చక్కెర తయారవుతుంది. మిగతా చక్కెర యావత్తు విదేశాలనుంచి తెప్పించుకోవలసిందే. ఈదిగుమతి అయ్యేసరకులో కూడ ౨/౩ వంతు పరదేశాలనుంచి, ౧/౩ వంతు మాత్రం సామ్రాజ్యదేశాలు, అనగా క్వీన్సులాండు, నేటాలు, వెస్టు ఇండీలు, మారిటస్, ఫీజి మొదలగు చోట్లనుంచి తెప్పించుకుంటుంది. అయితే సామ్రాజ్యదేశాలనుంచి వచ్చే దిగుమతిచక్కెరకు సుంకం తక్కువ. విదేశపంచదారకు మణుగు ౧కి ౬ షిల్లింగులు (రు. ౪-౨-౯) అయితే సామ్రాజ్య దేశాలకు ౩౧/౩ షిల్లింగులు (రు. ౨-౩-౬) వంతునమాత్రం వసూలు చేశారు. తిరిగి యీ సామ్రాజ్యదేశాలలోకూడా మారిటస్ మొదలైన చోట్లనుంచి వచ్చే చక్కెరకు మూడోవంతు (అంటే మణుగు ౧కి ౦-౧౨-౦)సుంకం మాత్రం చాలన్నారు. కాని ఒక్క హిందూదేశానికి యీఅవకాశాలు ఏవీకూడ కల్పించడానికి బ్రిటిషువారు సమ్మతించలేదు. ఒక పర్యాయం ఢిల్లీ కేంద్రశాసనసభలో సభ్యులు ప్రశ్నిస్తే యీదేశంలో తయారయ్యే చక్కెరవెల జాస్తిఅగుటవల్ల విదేశవ్యాపారంలో పోటీకి నిలువలేదని ప్రత్యుత్తరం వచ్చింది.

కాని ఈప్రశ్న అంత సులభంగా త్రోసివేయతగ్గది కాదు. చక్కెర ఉత్పత్తి వెల తగ్గుటకు ప్రభుత్వ మెంతవరకు సహాయం చేసిందో తెలియని విషయం కాదు! ౧౯౩౧-౩౨ లో తాత్కాలికంగా రక్షణచట్టం ప్రసాదించినా పరిశ్రమ పూర్తిగా వృద్ధికాకముందే ౧౯౩౪ లోను, తిరిగి యీ సంవత్సరం (౧౯౩౭) లోను కేంద్ర ప్రభుత్వం స్వదేశ పంచదారపై ఎక్సయిజు పన్ను వేసి అడ్డు తగిలింది. గత మార్చిలో ఫైనాన్సు బిల్లు శాసనసభలో ప్రవేశ పెట్టుచూ ఆర్థిక సభ్యుడు ప్రభుత్వానికి వచ్చే ఆదాయంలో విదేశ పంచదారయొక్క దిగుమతి వ్యాపారం తగ్గుటవల్ల ౧౦ కోట్లు లోటువస్తున్నట్లున్నూ, ఎక్సయిజు పన్ను విధించినా దాని మూలంగా ౨ కోట్ల కన్న జాస్తి రాబడి రాదన్నట్లున్నూ చెప్పి తన చర్యను సమర్థించటానికి ప్రయత్నించాడు. ౧౯౩౦ వ సంవత్సరపు లెక్కలను ఆధారంగా తీసుకొని ఆదాయము తగ్గినదని అంచనావేసి చెప్పుట అంత న్యాయమగలేదు. దిగుమతివ్యాపారములో రాబడి తగ్గినంత మాత్రాన స్వదేశంలో చెరకు విరివిగా పండించినందువల్ల వచ్చిన రెవిన్యూ, చక్కెర. వ్యాపారస్థుల వల్ల లభించిన ఆదాయపు పన్ను (Income - tax) క్రొత్త ఫ్యాక్టరీ స్థాపించటానికి కొనిన విదేశయంత్రములపై వచ్చిన దిగుమతిసుంకమూ, మొత్తముమీద ప్రజలకు కలిగిన లాభమూ, పరిశ్రమయొక్క అభివృద్ధిని గమనించి ఉన్నట్లయితే పైన వివరించినలోటు ఎంతవరకు నిజమో తెలుస్తుంది.

ఒకవేళ మాటవరుసకు ప్రభుత్వముయొక్క ఆదాయము దీనివల్ల కొంత తగ్గినట్లు ఒప్పుకున్నప్పటికీ, యింతవరకు క్రమక్రమంగా వృద్ధిపొందుతూన్న పంచదార పరిశ్రమపై ఎక్సయిజు పన్ను వేయటంకన్న వేరొకవిధంగా సవరించి యున్నట్లయితే సమంజసంగా యుండేది. నిరర్థకమైన సైనికవ్యయంమాత్రం కొంచెపైనా తగ్గించకూడదు. ప్రభుత్వంలో ఉన్నతోద్యోగుల జీతాలు తగ్గరాదు. ఇలాంటి అవకతవకలు అడ్డులేకుండా జరిగిపోవలసిందే. ఎటు వచ్చీ దేశీయ పరిశ్రమలకు మాత్రం సహాయం ఉండదు.

ఈ యెక్సయిజు పన్నువల్ల పంచదారపరిశ్రమకై దాదాపు ౩౦ కోట్లరూపాయలు వ్యయపరచి ఆశలతో యెదురుచూస్తున్న వ్యాపారస్థులకు నిరుత్సాహం కలిగింది. చెరకుపంటనే జీవనాధారంగా భావించుకుని వ్యవహరిస్తున్న రైతులకు క్రొత్తసందేహాలు బయలుదేరాయి.

## అంతర్జాతీయ సమావేశము

ఇది యిలావుండగా మరియొక నూతనవిశేషం అవతరించింది. విదేశవ్యాపారస్థులు పరస్పరంగా జరుపుతూన్న పోటీని తగ్గించుకుని యేదోవిధంగా తమ పరిశ్రమలను బాగుపరచుకునే అభిప్రాయంతో గత మేనెలలో లండనునగరమందు ఏర్పాటుచేయబడిన అంతర్జాతీయ సమావేశానికి హాజరైనారు. షుమారు ౨౦ దేశాలనుంచి ప్రతినిధులు వెళ్లారు. కాని హిందూదేశానికి ఆహ్వానంగాని, సరియైన ప్రాతినిధ్యంగాని లేదు!

అక్కడ జరిగిన సంభాషణల ఫలితంగా వేర్వేరు దేశాలు ఉత్పత్తిచేసి విదేశవ్యాపారము చేయతగిన

చక్కెరయొక్క విలువనుగూర్చి ఒడంబడికలు గావించుకున్నారు. చివరకు ఎలాగో డాక్టర్ మాకుగారు హిందూదేశము తరపున ఒడంబడిక సంతకము చేసినట్లు ప్రకటించారు. ఈ ప్రాతినిధ్యము భారతీయుల అభిప్రాయమును పురస్కరించుకుని చేసిందో, లేక తిరస్కరించుట కుద్దేశింపబడినదో వేరే వ్రాయవలసిన అగత్యంలేదు. ఒడంబడిక గత మే ౬ వ తారీఖున ప్రతినిధుల ఆమోదమును సంపాదించింది. దీని ననుసరించి యికముందు హిందూదేశము బర్మాకు తప్ప యితర దేశాలకు పంచదార యెగుమతి చేయగూడదని నిర్ణయింపబడ్డది! డాక్టర్ మాకుగారు భారతప్రభుత్వానికి అంతర్జాతీయ సమావేశాన్ని గూర్చి ఒక నివేదిక సమర్పించినట్లు కూడ తెలుస్తుంది. కాని ఆనివేదికలోని విషయాలు ఇంకా ప్రజలకు వెల్లడికాలేదు.

దీనినిబట్టి ప్రభుత్వము ప్రజల కెంత సహాయకారిగా ఉన్నదో స్పష్టమవుతూనే ఉన్నది. ఎక్సైజు పన్ను విధించటం ఒకటి—ఎగుమతివ్యాపారం నిషేధించటం ఒకటి—ఈరెండున్నూ కలసి యిప్పుడిప్పుడే తల యెత్తుతూన్న పంచదార పరిశ్రమకు నిరోధక సాధకాలవుతాయంటే విచిత్రమేమీ లేదు.

## ప్రజలయొక్క కర్తవ్యము.

ఈసందర్భంలో జనసామాన్యము తమయొక్క బాధ్యత గుర్తింపవలసిన అవసరము కనిపిస్తుంది. శాసన సభలలో దీనినిగూర్చి తగినంత ఆందోళన జరుగవలసియున్నది. ప్రస్తుతము దేశములో పర్యటనము చేస్తూన్న టారిఫ్‌బోర్డు సభ్యులకు వ్యాపారస్థుల కష్టనష్టములను పూర్తిగా యెరుకపరచవలసియున్నది. అంతే కాకుండా సాధ్యమైనంతవరకు పరిశ్రమాభివృద్ధికి మార్గముల వెదుకవలెను.

ముఖ్యంగా యితర ప్రాంతీయులకన్న ఆంధ్రులు ప్రత్యేకశ్రద్ధ తీసుకొనుట అత్యవసరము. బొంబాయి, బీహారు, సంయుక్త ప్రాంతములకన్న మద్రాసు చాల వెనుకబడియున్నట్లు లెక్కలవల్ల తేలుతూంది. కృష్ణ, గోదావరి, విశాఖపట్నం జిల్లాలలో చెరకుపంటకు చక్కని సదుపాయము లున్నాయి. అయినా మనము వెనుకబడుటకు కారణం ప్రజలలో వలసినంత అభిమానము, ఆసక్తి లేకపోవటంవల్ల నేమో అనిపిస్తుంది. అఖిలభారత వ్యవసాయ పరిశోధకమండలివారిచే జరుపబడుతూన్న పరిశోధనా ఫలితాలను తగురీతిగా పరిశ్రమదారులు వినియోగపరచుకుని లాభములుపొందుట మంచిది. ప్రస్తుతము మద్రాసులో ౧౯౩౪-౩౫ అంచనాప్రకారం ౧౨౫,౩౧౦ యెకరముల భూమి చెరకుపంటకొరకై సాగుబడి అవుతోంది.

ఉన్న అవకాశాలు జారవిడువక పరిశ్రమను ప్రోత్సహింపవలసిన బాధ్యత మన ఆంధ్రులంతా గుర్తించవలసి యున్నది. కేవలము మూలధనము సంపాదించి ఫ్యాక్టరీలు స్థాపించినంతమాత్రమున చాలదు. వ్యాపార కార్యనిర్వహణంలో కౌశలం చూపించాలి. ఆంధ్రులచేత స్థాపింపబడి, ఆదరణలేక కృశించి, చివరకు ఆంధ్రేతరులచేతిలోనికి పోయి అభివృద్ధిపొందిన అనేక పరిశ్రమలు, కర్మాగారాలు ఈ ఆంధ్రలోకంలోనే ఉన్నాయి. ఇవి మనవాళ్లకు తెలియని విషయాలు కావు. అయినప్పటికీ తాత్కాలికోత్సాహం తప్ప కార్యదీక్ష, దృఢనిశ్చయము మనకింకా అలవాటుపడలేదనటం సత్యదూరం కాదు. ఇది ముఖ్యంగా యావద్భారతసమస్య అయినప్పటికి వేర్వేరుప్రాంతీయులు తమతమ ధర్మాలు గుర్తించి కార్యరూపంలో ప్రదర్శింపకపోతే ప్రయోజనం లేదు.

ప్రస్తుతం కేంద్రశాసనసభలో యీవిషయాన్ని గూర్చి తీవ్రమైనచర్చ రాకతప్పదు. ప్రభుత్వముకూడ ప్రజాభిప్రాయమును కొంతవరకైనా పాటించకపోదు. అంతేకాక బీహారు, మద్రాసు, సంయుక్త ప్రాంతాలలో కాంగ్రెసు మంత్రులు పంచదార పరిశ్రమకు తగినంత ప్రోత్సాహమిచ్చేసూచనలు కన్పిస్తున్నవి. ఇలాంటి అనుకూలవాతావరణాన్ని గమనించి ప్రజలు మన యీ జాతీయ పరిశ్రమను పట్టుదలతో అభివృద్ధి పరచుటకు ప్రయత్నించుట శ్రేయస్కరము.

---



కుమారి బిబ్బో

# విధి

బొడ్డు బాపిరాజు

ఎలమంద చెప్పింది:

నావూహ తెలిసింది మొదలుగా నాన్నతో కంటే అమ్మతోనే ఎక్కువ పరిచయం. అమ్మ పేపకోటి. అమ్మకు నేనంటే తగని ప్రేమ. గుండెల్లోని ఆ జాతిలో అటువంటి దయావంతురాలు వుండడం విరుద్ధమే. నా కప్పటి కించుమించు పదేళ్ల ప్రాయ ముంటుంది. మా ముఠాలో అందరికంటే కొంచెం అందం కలవాణ్ణి నేనే; దుర్బలుడనూ నేనే. మా వాళ్లందరూ మద్యపానానికి అలవాటు పడ్డవారే. నా కంటె చిన్న వయసుగల మాలోని కొందరు యిటువంటివి పుట్టుకతోనే అభ్యసించారు. నాకెందుచేతనో వాటి పేరు వింటేనే డోకువచ్చేది. నాయెదుట తిని తాగేవాళ్లని అసహ్యించుకొంటూ వుండేవాడిని. ఏ కారణమో తెలియదు కాని, అమ్మకూడా నన్ను వాటికి దూరంగా వుంచేది; ఎవరైనా కొంటెతనంగా నాకలవాటు చేయడానికి పూనుకొన్నారంటే వాళ్లని గట్టిగా మందలించేది.

నాకు చిన్నతనంనుండి మంచి అలవాట్లు నుప్పేందకు అమ్మ చేసిన ప్రయత్నాలు యిప్పటికీ కళ్లకు కట్టిన ట్లగుపిస్తాయి. ఆడవాళ్లయితేనేం, మగవాళ్లయితేనేం మా వాళ్లలో చుట్టలుకాల్చనివాళ్లు లేరు. చిన్నకారు రోడ్లవెంట పారేసిన యెంగిలి పీక లేరుకొని భోగం వెళ్లబోసేవారు. నాకూ బాల్య చాపల్యాన వాటిమీద మోజుపుట్టేది. సుళ్లు సుళ్లుగా పొగ పైకి వూడటం చూస్తావుంటే అదో సరదాగా వుండి, అలా నేనుకూడా చేయాలనిపించేది. ఒకసారి దొంగతనంగా చుట్టపీకి కాల్చేను. నాకది సరిపడింది కాదు. అన్నం కక్కుకొన్నా. రహస్యం బయలయింది. చీవాట్లు సరేకదా, ఎన్నడూ కళ్లెర్రచేయని అమ్మ ఆరోజున కొట్టినట్టుగా కూడా గుర్తు. మా సంఘానికీ నాకూ పరస్పర సంబంధం వుండకుండా వుండేట్టుగా చూసేది వేయికళ్లతో. ఆ మహాసముద్రంలో కొట్టుకుపోతూ గుక్కెడు వుప్పునీళ్లయినా మింగలేదంటే అమ్మ జాగ్రత్తే అనాలి.

తరువాత జరిగిన విషయాలు స్మృతికి పట్టివుండేఅంత ప్రభావం కలవికావు. నాకు పదేళ్లు వచ్చినప్పటినుంచీ జీవితం వొక విధంగా స్థిరపడ్డదని చెప్పవచ్చు. అప్పటి మా కాపురం ఏలూర్లో. నేనూ అమ్మా వొక చిన్న గుడిసెలో సంసారము సాగించేవాళ్లం. మా ముఠా అంతా ఏమయిందో, అప్పటి మా జీవితవిధానానికేహేతువో అంతగా చెప్పలేను. అప్పటికి అమ్మకు ముసలితనం అంకురిస్తావుంది. కాని, ఏమాత్రం అలసత్వం, దుర్బలతా అన్నమాట వినిపించదు.

అమ్మ వొక బ్రాహ్మలయింట్లో పని చేసేది. ఒకపూట భోజనం, నెలకు అయిదు రూపాయలజీతం. ప్రొద్దుట అయిదింటికి

వెళ్లేది. మధ్యాహ్నం పన్నెండు గంటలకు వచ్చేది. తిరిగి మూడింటికి వెళ్లి ఆరింటికి యింటికి చేరుకొనేది. ఇదీ దినచర్య. ఏలూరు వచ్చినప్పటినుంచి నా జీవితంలో కొంత మార్పు కూడా సంక్రమించింది. వున్నతికి అవకాశం లభించిందీ కూడాను.

ఇదివరకే నాకు కొద్దిగా చిన్న చిన్న పేర్లు కూడబలుక్కొని చదవడం, వ్రాయడం అమ్మకృషివల్ల వచ్చినై. ఏలూరు వచ్చిన వెంటనే మా బ్రదుకు తెరువు యేర్పరచుకొన్న మీద నన్నొక చిన్న బడిలో చేర్పించింది. నాకు పద్నాలుగేళ్లు వచ్చేటప్పటికి కొంచెంకొంచెం లోకానుభవం చిక్కింది. అంతవరకు రెక్కలమరుగున పిల్లలాగా మా అమ్మ అంకసీమయే సకలమున్నూ. అమ్మను మించి నాకు ప్రపంచమే లేదు.

నేను కొన్నాళ్లకు మున్సిపల్ హైస్కూల్లో చేరాను. స్కూలునుంచి యింటికి వచ్చే త్రోవలోనే మా అమ్మ యజమానుల యిల్లు వుండేది. స్కూలు వొదలిన వెంటనే ఆయింటికి వెళ్లి అమ్మను కలుసుకొని యిద్దరం యింటికి పోయేవాళ్లం. ఆరోజుల్లో చాలా సంతోషంగా మా కాలం గడిచిపోయేది. స్కూల్లో సంగతులు నేనూ, యజమానుల సంగతులు అమ్మా చెప్పుకొంటూ ఆనందించేవాళ్లం. మా అమ్మ పనిచేసే యింటి యజమానురాలికి నేనంటే యెంతోచేతనో చాలా కనికరం. ప్రతిదినం అమ్మకోసం వెళ్లినప్పుడు ఆయమ్మ నా కేవో తినుబండాలో, అర్ధణా అణో, యింటివారి పంచీకండువాయో ఏదో వొకటి యిచ్చేది కాని, వుత్త చేతుల్తో వొకనాడూ నన్ను పంపేది కాదు. నా చక్కని రూపం, సౌమ్యవర్తనం ఆతల్లి నాకర్షించివుంటాయి.

ప్రస్తుతం నా కిప్పుడు పదియేడేళ్లు. ఎంతవరకూ నా దృష్టి విద్యార్జనమీాదే వుండేది. మనసిచ్చి పెంచే అమ్మ నాకే విధానా కొరత చూపించేది కాదు. నేనా అల్పజీవితంలోనే ఆనందం అనుభవించేవాణ్ణి. నాకంటే భోగభాగ్యాలలో అదృష్టంలో ఎన్నో రెట్లు ముందడుగు వేసిన ధనికుల బిడ్డలు చదువులో, మంచినడతలో నాకంటే మైళ్లకొద్దీ వెనుకపడ్డారు.

ఆరోజు సాయంత్రం బడిలో కొంచెం ఆలస్యమయింది. నేను వచ్చి మామూలుగా ఆ బ్రాహ్మలింట్లో 'అమ్మా!' అని పిలిచాను. 'ఓయ్' అంటూ యజమానురాలు ఆరోజున వండుకొన్న దేదో రొట్టె చేతులో పెట్టి 'కోటి కొంచెం జ్వరం తగిలిన ట్లుండడంచేత యింటికి ముందుగానే వెళ్లిపోయింది' అన్నది. ఆమాట వింటూనే నేను వెళ్లబోయేటప్పటికి ఆయమ్మ నన్ను పిల్చి నా చదువు సంగతులు అవి యివీ అడుగుతూ తల్లి వీల్లేక చెప్పించనంటే చదువు మానవద్దని, తన భర్తతో చెప్పి సాయం చేయిస్తానంటూ ఎంతో అప్యాయంగా చెప్పింది.

***

కోటి చెప్పింది:

మేం లంబాడీవాళ్లం. మా మగవాళ్లు చాలా క్రూరంగా ప్రవర్తించేవాళ్లు. నా తలిదండ్రుల నంత బాగా యెరుగను. చిన్నతనం లోనే పోయివుంటారు. అప్పట్నించి మేనమామే నన్ను పెంచి పెద్దదాన్ని చేశాడు. చివరకతనే నన్ను పెళ్లిచేసుకొన్నాడు. నేనంటే అతనికి పంచప్రాణాలున్నూ. నామాట

కెప్పుడూ అడుగుదాటేవాడు కాడు. అతనే మా లంబాడీతండా కంతటికీ పెద్ద. అతను చేసేపనులు నాకు పుతరాం గిట్టేవి కావు. మా తండావాళ్లకూ నాకూ ప్రవృత్తిలో చాలా వ్యత్యాసం వుంది. నాకు జీవితం శాంతంగా సాగిపోవడం ఇష్టం. వాళ్లది పూర్తిగా దౌర్జన్యం. ఇంత వ్యతిరేకప్రకృతులు గల మా దంపతులం వొకసారీ కలహించి యెరుగం. అతను నామాట కెంత యెదు రాడకపోయినా అతనంటే నాకు చాలా భయం, భక్తీ వుంది.

ఆరోజుసంగతి యిప్పటికీ కళ్లకు కట్టినట్లు కన్పిస్తూనే వుంది. బహుళపక్షం లోని అష్టమి. మసకమసక వెన్నెల చాల తమాషాగా వుంది. శ్రావణం అనుకొంటా. కొంచెం గాలి చలిచలిగా మావాళ్లు అక్కడనుంచి మకాం వుంది. యెత్తి వేసే రోజది. మాపనియెప్పుడూ వొక వూర్నించి వొకవూరికి మారడమే. ఏవూ ళ్లోను కాల్నిలిచి నాలుగురోజు లుండే వాళ్లం కాం. అట్లా వుంటానికన్నా మా వృత్తినిపట్టి వీల్లేదు. పగ లేపనులు చేస్తూనో వుండేవాళ్లం. రాత్రుళ్లు మావాళ్లు చిల్లర చిల్లరగా దొంగతనాలకు బయల్దేరిపోయే వాళ్లు. ఒక్కొక్కసారి దారులుకాచి కొల్ల గొట్టేవారు కూడాను. మా లంబాడీతండా వెంట వొకపశువులమంద తప్పకుండా వుం టుంది. ఏవూళ్లో మకాంచేసినా ఆవూళ్లోవి యే నాలుగైదు పశువ్వులో మా మందలో కలుపుకొని అర్ధరాత్రిని లేచిపోయేవాళ్లం. ఇదీ మావృత్తి.

ఆరోజున గుడివాడనుంచి మకాంయెత్తి ఏలూరు చేరాలని మాసంకల్పం. ఇది పది యేడు పద్దెనిమిది యేళ్లక్రితం మాట. అప్ప టికి ఏలూర్నించి గుడివాడకు మోటార్ల రస్తా యేర్పడలేదు. మాకుండా చట్టీ నెత్తిన పెట్టుకొని ఆమసకవెన్నెట్లో పడి దారితీశాం. చల్లని గాలి గిలిగింతలు. మావాళ్ల యేల పదాలు. అప్పుడే వూరిపొలిమేరకు వచ్చాం. ఆ సన్ననిగాలిరొదలో కలిసి యెక్కడ్నించో వొక శిశుకంఠం వినిపించింది. ఆసమయంలో ఆచోట శిశువుకంఠం! నాకు సందేహం కలి గింది. నలువైపులా పరకాయించి చూచా. రోడ్డువారనే వున్న బెల్లపుచెట్టు మొదట తెల్లని గుడ్డల్లో వొకనెలగుడ్డు గుక్కపట్టి యేడుస్తూ వున్నాడు. ఏతల్లి పాపఫలమో అతను!

నా కప్పటికి యిద్దరు బిడ్డలు పుట్టి పో యారు. పిల్లల్ని తలచుకొంటే గుండె చెరు వయ్యేది. ఆ పోయిన నిసుగులకోసం యెన్ని రాత్రిళ్లు కళ్లవెంట నీళ్లు కారుస్తూ వాపోయి నానో నాతోపాటు మిణికే చుక్కలకు తెలుసు. ఏ పసిపాపను చూచినా నా బిడ్డల మీద తపుబారి కడుపు చుమ్మలు చుట్టుకు పోయేది.

ఆ మసకవెన్నెలవెలుగులో, ఆ నల్లని బెల్లపుచెట్టు పరచిన కొమ్మలక్రింద, ఆ చలి గాలిలో, నిరాధారంగా నిర్జనంగా పడి విల పిస్తూవున్న పసికందును చూస్తే యేతల్లిప్రాణ మైనా తల్లడిల్లకమానదు. ఏ పిరికిగుండె గల తల్లో చేసిన తప్పును పట్టిచ్చే యీబిడ్డను యిట్లా వుంచివుంటుంది. ఆ దిక్కులేని బిడ్డను చూస్తూవుంటే మాతృత్వం నాలో తిరిగి మొలచిన ట్లయింది. నా అనేవారు లేని ఆ చిన్నితండ్రికి కడుపుకాలిన నేను తల్లిగావుండ

డానికి అభ్యంతరం పెట్టేవారు లేరు. మే మిద్దరం వొకరిలో టొకరు తీర్చుకున్నాం.

నెమ్మదిగా ఆబిడ్డను తీసుకొని అక్కున కొత్తుకొన్నాను. ఒకరోజయినా గిడువని ఆ చిన్నిబిడ్డ తల్లిచేతుల్లో మోస్తరు యేడు పంతా మాని వూరుకొన్నాడు. వెచ్చని ఆపాపతలను గొమ్ము కాన్చుకోవడంతోనే పాలు చేపొచ్చినై. నాకూ ఆబిడ్డకూ ఏదో తెలియని జన్మాంతరసంబంధం వుండి వుంటుం దనుకొన్నా. కొన్నాళ్లబాటు బాలెంతసుఖం అనుభవించా.

ప్రాణం వొకెత్తుగా బిడ్డను పెంచుకొం టూవున్నాను. అతని ఆకారం అదీ చూచి బ్రాహ్మల బిడ్డయి వుంటాడని వూహించాను. మా జట్టువాళ్లందరి మోస్తరుగా అతను చెడిపోవడానికి నామనసు స్సంగీకరించలేదు. అతనిమీద చిన్నప్పటినుంచి కన్నుంచి కాపా డకొస్తూ వున్నాను. తినేది మా అన్నమే అయినా అతనికి చెడ్డరుచులు మప్పలేదు. 'అమ్మా!' అని నోటినిండా పిలిచేవాడు. నా తండ్రి ఎలమంద వొకరోజున తప్పక అదృష్ట వంతు డవుతాడని నా కదో పిచ్చినమ్మకం మట్టుకు వుండేది.

మా జట్టువాళ్లందరు అంతవరకూ మా మీద యెంతోగౌరవం చూపించేవారు. ఒక సారి భద్రాచలంఆప్రాంతాలకు పోయాం. అక్కడ మా మామకు మన్యజ్వరం అంటు కొంది. పాపం! దాంతో అతను చాలాబాధ పడ్డాడు. ఒకయేడాదపాటు పడవలసిన శ్రమ లన్నీ పడి తనత్రోవ చూచుకొన్నాడు.

మా మామ పోవడంతోనే నాకు జట్టు లో వుండ బుద్ధి కాలేదు. అదివరకే వాళ్లు చేసే పను లసహ్యించుకొంటూ వుండేదాన్ని. మిగి లినవాళ్లందరూ వుండమని బ్రతిమాలారు కాని, నే నిష్టపడలేదు. అప్పటికి మామామ దినవారాలఖర్చుల కైనదిగాక వొకయాభై రూపాయలు నాచేతిలో వున్నవి. అవి తీసు కొని మంచిగా బ్రదుకు తెరువు చూచుకొం టానికి ఏలూరు చేరుకొన్నాను. అప్పటికి ఎలమందకు పదేళ్లు, నాకు నలభైయేళ్లుపైగా వుంటాయి.

ఒక బ్రాహ్మలింట్లో పనిమనిషిగా కుదిరాను అట్టాగే ఎలమందకు చదువు చెప్పిస్తూ వున్నాను. మా తల్లీకొడుకుల మీద యజమానురాలి కపరిమితమైన దయ. ఇద్దరిలో ఎలమందంటే పరీప్రాణం. అటువంటి కొడుకు లేనందుకు చింతిస్తూవున్నట్టుంటాయి ఆయమ్మకళ్లు. మాఎలమందకు పుస్తకాలకూ, బడిజీతాలకూ, ఆ తల్లి చాలా సాయం చేసింది. ఆయమ్మకు మేం చాలా ఋణపడి వుంటాం. ఇంట్లో చేసుకొన్న దింతేనా వా నికి పెట్టకుండా వుండేది కాదు. 'ఎందుకో! అంతప్రేమ?' అనిపించేది నాలో నాకు.

ఆరోజున సాయంకాలం కొంచెం వూష్ణం తగిలినట్టుంది. కొంచెం తలనొప్పి కూడా దానికి జతయింది. ఎందుకో నాకు పనిచేస్తూఉంటే భార మనిపించింది. రమ ణమ్మ - మాయజమానురాలుగారితో చెప్పి యింటికి వచ్చి నన్ను తెలియకుండా ముక్కి మంచంలో పడ్డాను. నావెన్నంటే యెల మందకూడా వచ్చాడు. 'అమ్మా!' అంటూ పలకరించి మంచందగ్గర చదికిలపడి నా కాళ్లు పట్టి పరిచర్య చేశాడు.

నాకు రోజుకురోజు జ్వరం పెరుగుతూ వచ్చింది. ఎలమంద బడికికూడా మాని

ముప్పొద్దూ నన్ను కనిపెట్టుకొని వుండేవాడు. ప్రతినిమిషం 'అమ్మా! ఎట్లా వుంది?' అని అడిగేవాడు. పాపం నిర్భాగ్యుడు! ఏ సంపన్నుల యింటిలోనో పెరగవలసినవాడు నా దరిద్రజీవితంలో అతుక్కొనిపోయాడు. అంతఃపురాల్లో మెరవవలసిన మణిదీపం పాడుగుడిల్లో కళతప్పి వుంది. అతని కింతయినా జన్మవృత్తాంతం తెలియదు. నన్నే కన్నతల్లిగా భావించుకొంటూవున్నా డింతవరకు. నిజంగా యేతల్లి యింత సుగుణవంతుడైన కొడుకును చూచి మురిసిపోయే అదృష్టం చేతులారా తప్పించుకొన్నదో!

ఇక నాకు జీవితంమీద ఆశ లేదు. మృత్యువుకూడా దగ్గరకు వస్తూవున్నట్లు నా కనిపిస్తూవుంది. మాయజమానురాలు రమణమ్మగారు వొకటిరెండుసార్లు నౌకర్లను పంపి నాఆలనా పాలనా కనుక్కొంది. మా ఎలమందకూడా అప్పుడప్పు డక్కడకు వెళ్లి నా సంగతి చెప్పివచ్చేవాడు. వారి యింటి ప్రక్కనే వొకడాక్టరుగారిల్లు వుంది. అతన్ని మందివ్వవలసిందిగా రమణమ్మగారు పురమాయించారు. నిత్యం ఉదయం, సాయంత్రం వైద్యుడింటికి వెళ్లిమందు తెచ్చేవా డెలమంద. నా కెందుకనోతిరిగీ భూమిమీద కాలు పెడతా నన్నఆశమాత్రంలేదు. కాని, వొకచింత మట్టుకు నన్ను దహించివేస్తూవుంది. 'ఇంతవరకు నాచాటున కాలంగడుపుకొన్న ఎలమంద కిక పైన?'అన్నది నాగుండెలుతొలిచివేస్తూవుంది. అతనిలో చాలా మంచిగుణా లున్నై. మోస మెరుగడు. అంతఅమాయికునకు లోకం ఏం సాయం చేస్తుంది? భగవంతుడే వున్నాడు! దిక్కులేకుండా చెట్టుక్రింద పడి అర్ధరాత్రి దేవురించే నెలగుడ్డుకు ఆధారం చూపిన ఆ భగవంతుడు, ఆ దయామయుడు యిప్పుడూ చూపకపోడు. ఆరోజునే అతని ప్రాణం చెల్లిపోవలసివుంటే పురిటిగది నే దాటడు. అతని భవిష్యత్తులోనవి వెలుగుకిరణాలో, చీకటి మబ్బులో!

నా కారోజునుంచి యిప్పటివరకు తేలికన్నమాట లేదు. ఇవ్వేళ చాలా ఆయాసంగా వుంది. ఇక నా బ్రతుకుకథ ముగిసిపోతూవుంది. నా కేం చింతలేదు, ఎలమంద విషయంతప్ప. ఇంతకాలంవరకు దాచివుంచిన అతని నిజవృత్తాంతం యివ్వేళయినా, జీవితం ముగిసే యివ్వేళయినా చెప్పడం న్యాయం. తప్పక చెప్పితీరాలి. అతణ్ణి మోసగించికాక పోయినా, అతనికి యెరుకపరచకుండా మాతృగౌరవాన్ని అనుభవిస్తూవున్న నే నీ అంత్యసమయంలో కూడా నాతోపా టొక రహస్యాన్ని మోసుకొనిపోవడానికి నా మనసు సమ్మతించలేదు. నే నున్న సంగతి చెప్పగానే బిడ్డ ఎంత తెల్లపోతాడో! ఇంతవరకు నామీద చూపిన గౌరవం! అబ్బా! అతనితో యీసంగతి ఎలా మొదలుపెట్టాలో నాకే తెలియడం లేదు. పదియేడేళ్లనుంచి అతన్ని నేను కడుపున మోసి కనలేదన్నమాటగాని తల్లికంటే ఎక్కువగా పెంచాను. ఇప్పుడు నాకూ అతనికీ ఏమాత్రమైన సంబంధమూ లేదని చెప్పాలి. ఎంతకష్టం! అయినా సత్యం. అందుకనే చెప్పాలి.

***

రమణమ్మ చెప్పింది:

అప్పుడే లేచాను. ఇంకా మసిమసి చీకటిపోలేదు. రోజూ ఆవేళకే పాసిని చేయడానికి కోటి వచ్చేది. నెలరోజులనుండి దానికి సుస్తీగా వుండడంచేత వేరొకమనిషిని పుర

మాయించుకొన్నాం. 'కోటికి ఎట్లావుందో!' అని అనుకొంటున్నాను. దొడ్డితలుపు చప్పుడయింది. తలుపు తీశాను. ఎలమంద గొల్లు మంటూ వచ్చి నాకాళ్లదగ్గర కూలబడ్డాడు. అతనికళ్లనుండి కన్నీళ్లు చెక్కిళ్లమీదుగా వెల్లువలు కట్టి ప్రవహిస్తూ వున్నాయి. అతనికళ్లు బాగా కెంపెక్కివున్నాయి. రాత్రల్లా నిద్రలేనట్లు అతని ఆకారం చెప్పక చెబుతూవుంది. కోటి అనా డుదయానే అనంతంలో విలీనమైంది.

ఎలమందను ఆరేడేళ్లనుండి చూస్తూ వున్నాను. ఎందుకో అతణ్ణి చూస్తూవుంటే నాకొక విధమైన మమత జనించేది. అతనిలో నా హృదయం కొంత నిక్షిప్తంగా వున్నట్లనిపించేది. అతని అమాయికపు కళ్లల్లో ఏదో అవ్యక్తమయిన నా ఛాయ కనిపిస్తూవుండేది. అతను నాదగ్గర నిలుచుంటే నాలోనుండి పోయిన వొక అంశం తిరిగి కలుసుకొన్నట్లు నిండుతనం అనుభవించేదాన్ని. అతన్ని చూస్తూ నా చిత్త మేదో స్మృతిసీమలో ప్రయాణం చేస్తూ వుండేది.—— పదియేడేళ్ల క్రితం. అప్పుడు నాకు పదియేనేళ్లు దాటినై. అభాగిని నైన నాలో నిండు యౌవనం పిక్కటిల్లివున్న రోజు లవి. నాఅందం చందం, విద్యాసంపద అన్నీ వృథాచేసి నాభర్తఅన్న ఆ వ్యక్తి యిరవైయేళ్లలోపలనే పరమపదించాడు. అతనికోసం నేను బ్రహ్మచర్యం పాలించవలసిందని సంఘం శాసించింది.

నాపెళ్లి జరగడంకూడా చాలా ధనలోభంచేతనే జరిగింది. అతనంటే మామేనత్తకొడుకు కృష్ణమూర్తి బీదవాడవటమే నా పాపం పండింది. అతనంటే నాకూ, నేనంటే అతనికీ బహు[illegible]

తండ్రి సంబంధం తప్పించాడు. మానవప్రయత్నంలో సౌభాగ్యమే వుద్దేశింపబడ్డది. కాని, పాపిష్టిదైవం నా మంగళసూత్రాన్ని రద్దుచేశాడు. ఆ విచారంవల్ల యేడాది తిరుగకుండా మాఅమ్మ స్వర్గానికి వెళ్లింది. ఇక నేనూ మాతండ్రీ. మాయిద్దరకూ వండిపెట్టడానికిమామేనత్త-కృష్ణమూర్తితల్లి వచ్చింది. తల్లివెంట అతనుకూడా వచ్చాడు.

ఇక యింట్లో మాదే రాజ్యం. నాన్న గొడవ నాన్నదే. అమ్మ పోయినప్పటినుంచీ తిన్నగా ఆయనకు మతే లేదు. అత్త మాకెన్నడూ యెదురాడేది కాదు. నిండుయౌవనంలో వున్నా మిద్దరమున్నూ కళ్లాలులేని గుర్రాలం. మాకు నిమిషాలకూ రోజులకూ వున్న తేడాయే తెలవడంలేదు. అంతా హాయ్! హాయ్!!

మా చీకటిరహస్యం బయలుపెట్టడానికి చిహ్నాలు కనిపించినై. మాపనులన్నీ తెలియనట్టు నటించినా, మా అత్త కన్నీ తెలుసును. ఆవిడే మా కంత వీలుకూడా జతపరచేది. అప్పుడు మా బావ యింటరు చదువుతున్నాడు. సెలవలు ఆఖరైనంతనే ఏలూరు వెళ్లిపోయాడు విడువలేక విడువలేక. నా రహస్యం అత్తజాగ్రత్తవల్ల రెండో కంటికి తెలియలేదంటే మా నాన్నగారి మాట చెప్పాలా ?

చక్కని బిడ్డ. ముక్కూ మొగం అంతా మాబావదే. నాకు మనస్సొప్పకపోయినాఅత్త బలవంతాన్న ఆ బుడుతని అప్పగించక తప్పలేదు. కాని, అత్తచేతమాత్రం ప్రాణాలతో యేచెట్టుక్రిందో విడిచివచ్చేటట్లు వొట్టు [illegible]ను పూరవతల బెల్లపు

చెట్టుక్రింద పెట్టివచ్చానని మా అత్త నాతో అపుడే చెప్పింది.

నిండా సంవత్సరం గడిచింది. సెలవలకు మాబావ మళ్లీ వచ్చాడు. ఈ సంవత్సరంలో లోకానికి, ముఖ్యంగా మాతండ్రికి చాలా మార్పు వచ్చింది. నన్నెన్నోసార్లు దగ్గఱకు తీసుకొని నా అవస్థకు విచారించేవాడు. ఆయనచూపులో ఆ సమయాల్లో పొంగే వాత్సల్యానికి అంతు లేదు. విధవావివాహాల ప్రబోధంకూడా అప్పుడే. ఇదివరకు జడిసేవా రంతా కొంచెంకొంచెం సేద తీర్చుకొంటు న్నారు. పెద్దక థెందుకు, నాకూ బావకూ పెళ్లయింది.

ఎలమంద వచ్చి కోటి చచ్చిపోయిం దని చెపుతూ అది పోయేముందు తనకు చెప్పిన కథంతా చెప్పి బావును మన్నాడు. అత నా కథ చెపుతూవుంటే నా జీవితాన్ని యేకరువు పెడుతూవున్నట్లుంది. నా కతనిమీద అవ్యాజంగా కలుగుతూవున్న అనురాగానికి కారణం యిప్పుడు బోధపడ్డది. కన్నతల్లి గుండెలు మెన్నెళ్లక్రింద పోయిన బిడ్డనైనా గుర్తించుకోలేకపోవు. చేతులార త్రోసి వైచిన నా వంశధనాన్ని భగవంతుడు తెచ్చి యిచ్చాడు. మా ప్రేమలో కల్మషం లే దన్నమాట. వెక్కివెక్కి యేడుస్తూవున్న ఎలమందను దగ్గఱకు తీసుకొని గుండెకు హత్తుకొన్నాను.

ఇదంతా ప్రక్కగదిలోనుంచి వింటూ వున్న మాబావకూడా కళ్లు చెమ్మగిలుతూ వుండగా అక్కడకు వస్తూ 'విధి' అన్నాడు.



# తేనెటీగల పెంపకము

## పైకి వస్తూఉన్న గృహపరిశ్రమ

(సచిత్రము)

మనుష్యజాతికి ఎక్కువగా ఉపకరించే పురుగుల్లో తేనెటీగ ఒకటి. తిండి కేమాత్రమూ చాలనిరాబడితో కృషిస్తూఉండే బీదపల్లెటూరిజనము తేనెటీగలను పెంచుకొని ఎక్కువ రాబడిని గడించుకోవచ్చును. తేనెటీగల్లో ఎన్నోరకాలవి ఉన్నవి. వాటిల్లో పెంపకానికి చక్కగా సరిపోయేవి దేశీయపుటీగలే. చెట్ల తొర్రల్లో, రాళ్లపగుళ్లలో, పాడుపడ్డ కట్టడాల్లో తేనెటీగలు పట్లుపెట్టడం మామూలు.

తేనెటీగలను పెంచుకోడానికి అవకాశాలు ఉన్నచోట మొదట కర్రగూడు ఒకటి చేయించుకోవాలి. అది ఒక చిన్న పెట్టెవలె ఉంటుంది. దానిమూత కోనుగా ఉండవలెను. ఆగూటిలో ఆరేడు కర్రచట్రాలు ఉంచడానికి అవకాశం ఏర్పరచుకోవడం అవసరం.



౨. తేనెటీగల గూడు



౧. కుర్రవాడు చెట్టు తొర్రలోనుంది తేనెపట్టులను తీస్తున్నాడు

ఈగల రాకపోకలకు పెట్టె అడుగున ఒకరంధ్రం ఉండవలెను. గూటిలో ఉండే చట్రాలకు తేనెపట్లను కట్టి నిలవచేయవలెను. ఈగూడును నాలుగు రూపాయలక్రయానికి వ్యవసాయశాఖవారమ్ముతారు. లేకుంటే సులభంగా తామే చేయించుకోవచ్చు.

ఇంక తేనెపట్లను సంపాదించి ఆ గూట్లోకి చేర్చాలి. తేనెపట్టు ఉన్నచోటు కనిపెట్టి వాటిమీదికి పొగపెడితే ఈగలు పారిపోతవి. అపుడు లిన్నగా పట్లను ఊడదీసి, ఒక్కొక్కచట్రాని కొక్కొకపట్టును అరటినారతో జాగ్రత్తగా కట్టిపెట్టవలెను. తర్వాత చట్రాలను గూట్లో ఇమడ్చి, లోపలికి ఈగలు చేరుకునేటట్లు చేయవలెను. తల్లి ఈగను కనుక్కొని దాన్ని

లోపలకు ప్రవేశింపచేస్తే తక్కినవన్నీ నలువుగా ప్రవేశిస్తవి. తల్లి ఈగకూ, తక్కినవాటికీ అపూర్వమయిన అనుబంధం ఉండడం మూలాన్ని, అన్నీకూడా దాన్ని అనుసరించే తిరుగుతూ ఉంటవి. తల్లి ఈగ అనేదిఅన్నిటికంటె పెద్దదిగానూ, రూపంలో కొంత విభిన్నంగానూ ఉంటుంది. ఆ గూటిని తర్వాత ఇంటికి తీసుకునిపోయి తోటలో కాని, పంచపాకలోకాని భద్రపరచవలెను. దాన్ని చీమలుఅంటకుండా జాగ్రత్తగా చూచుకోవలెను. చీమలు తేనెటీగలకు పరమశత్రువులు. అవి ప్రవేశించిన పంచే మాత్రం ఇంక తేనెపట్లన్నీ స్వరూపనాశనం



౩. చట్రానికి కొంతగా పట్టినపట్టు

కావలసిందే. చీమలు పట్టకుండా ఉండడానికి గూటిని చిన్న బల్లమీదపెట్టి దాని నాలుగుకాళ్ల క్రింద నీటి గిన్నెలను పెట్టడం అవసరం. కోతులు మొదలయిన చిలిపిజంతువు లేవీపాడుచేయకుండా గూటిమూతనుగట్టిగా కట్టిపెట్టడంకూడా అవసరం.

ప్రతిదినమూ ఒకమారు గూటినితెరిచి చూచకుంటూ ఉండవలెను. తల్లి ఈగఉందో వెళ్లిపోయిందో, పట్టుకు ఈగలుసరిగా ముసురుకున్నవో లేవో. తెలుసుకుంటూఉండవలెను. తల్లిఈగలేకపోతే పట్టువృద్ధికిరాదు. కాబట్టి, అది లేకపోయినపుడు మరోదాన్ని



౪. పూర్తిగా తేనెపట్టిన పట్టు

లోపలికి చేర్చాలి. కొంచెం జాగ్రత్తఉండి అలవాటు చేసుకుంటే తేనెటీగలను పెంచడానికి కావలసినజ్ఞానం సామాన్యంగా కలుగుతుంది.

పట్లల్లో తేనెనిండుగా కూడినతర్వాత, మరి కొన్ని చిన్నచట్రములను మీద ఉంచవలెను. వానికి, గూటిలోపలఉండే చట్రములనుండి తేనెనిండిన పట్ల నూడదీసి జాగ్రతగా కట్టవలెను. ఈగలన్నీ పైవాటికి క్రమంగా చేరుకుంటవి. క్రిందివాటిల్లోను తేనె కొంత



౫. ఇందులో గూటిలో చట్రాలమీద నుంచే చిన్న చట్రాలు ఉన్నవి



౬. చిన్నచట్రాలలో ఉండే పట్టుల మీద పలచనిపూత తేనె ధారాళంగా స్రవించడంకోసమని కత్తితో గీచివేయబడుచున్నది.

నిలిచిపోతుంది. దాన్ని ఈగలకోసం విడిచిపెట్టడం మంచిది. పైచట్రాల్లో, పట్టులు తేనెతో నిండినతర్వాత వాటిని పైకితీసి తేనె పిండుకోవలెను. పట్టులను చట్రాల నుండి ఊడదీసి వాటిల్లో తేనెను చేత్తోపిసికిపిండుకోవడం పాతపద్ధతి. ఆతేనె శుభ్రంగాఉండదు. కొంచెంగా వస్తుంది కూడ.

ఇప్పుడు తేనెపిండడానికి ఒకమర తయారయి ఉంది. దానివెల తొమ్మిదిరూపాయలు. వ్యవసాయ శాఖవారమ్ముతారు దాన్ని. పట్టులు దాంట్లోఉంచి మరతిప్పితే తేనే క్రిందికి స్రవిస్తుంది. ఇట్లాచేయడం వల్ల తేనె పరిశుభ్రంగా ఉంటుంది. పట్టుకూడా తర్వాత ఉంచుకోవడానికి పనికివస్తుంది.

కొంచెం శ్రమ తీసుకుంటే ఒక్కడు ఆరేడు గూళ్లను పెట్టుకోవచ్చును. ఒక్కగూటివల్ల ఏడాదికి పదిరూపాయల క్రయంచేసే తేనె దొరుకుతుంది. ఎక్కువ అనుకూలంగా ఉంటే, ఎక్కువగాకూడా దొరుకుతుంది. తేనెటీగలు అన్నిరకాల పూవుల నుండీ, పంటలనుండి తేనెను సేకరించుకొంటవి. జొన్న, కంబు, రాగి, ఆముదం, పత్తి, చింత,



౭. తేనె పిండుకునే మర



౮. దొడ్లో జాగ్రతపెట్టి ఉంచిన గూడు. బల్లకాళ్ల క్రింద నీటిపాత్రలున్నవి చీమలు ఎక్కకుండా.

వేప, అరటి, మామిడి మొదలయిన వాటిల్లో తేనె పదార్థం ఎక్కువగా ఉంటుంది. కాబట్టి ఇవి శ్రేష్ఠమయినవి. ఇండియాలో ఇవిలేని గ్రామమంటూ సామాన్యంగా ఉండదు. అందుచేత, పల్లెటూళ్ల దారిద్ర్యాన్ని పోగొట్టడానికి ఈ తేనెటీగల పెంపకము కొంత వరకు తోడ్పడుతుంది.

— మూర్తివాసన్

ప్రకృతం తిరుచినాపల్లి జిల్లాలో ఈ పద్ధతి పెంపకం అమల్లో ఉంది. ఆఫ్రికాలో ఇంతకంటే సలీసుగా, లాభసాటిగా ఉండే పద్ధతి వాడుకలో ఉందట. ఆఫ్రికావారు 'టెంబో' అనే దేశీయపు సారాలో తేనెను చాల ఎక్కువగా చేర్చుకుంటారట. అయితే ఇంతకర్చుచేసి ప్రత్యేకంగా గూళ్లు వాళ్లు చేయించుకోరట.

వాళ్లు బోలుగా ఉండే లావుపాటి కర్రను రెండు వైపుల బిరడాలతో బిగించేస్తారు. మీద నొక రంధ్రాన్ని యీగల రాకపోకలకోసమని చేస్తారు.

దాన్ని తీసుకుపోయి తేనె టీగలుండే చోట చెట్టుకు వేలదీస్తారు. ఇలాటిబుర్రలు వందలకొలదిగ తయారుచేసి ఎవరిమట్టుకు వారు చెట్లకు వేలదీసి పెడతారు. అవి గాలిలో ఆడుతూఉంటవి. వాటిలోపలికి రంధ్రంగుండా ఈగలు ప్రవేశించి లోపల పట్లుపెట్టి తేనె కూరుస్తవి. అవకాశం ఎక్కువగా ఉన్నాకూడా ఒకరిబుర్రను ఇంకొకరు ఆదేశంలో సామాన్యంగా అపహరించరట. చెట్ల తొర్రటల్లో పట్లుపెట్టడం కంటే ఈ బుర్రల్లో పెట్టడమే ఎక్కువ క్షేమకరమని ఈగల తలంపు. సకాలంలో ఎవరి బుర్రల్లోనుండి వారు తేనెను తీసుకుంటారు. ఆతేనెలో మైనమూ, పిల్ల ఈగలూ కలిసిఉంటవి. దాన్ని డబ్బాలలో తీసుకొని పోయి పట్నస్థలాల్లో మంచివెలకే అమ్ముకుంటారు. ఈపద్ధతి. మనదేశంలో అడవి ప్రదేశాలలో ఉండేవారికీ, పండ్లతోటలు ఉండేవారికీ పనికివస్తుంది. దీనికి శ్రమ తక్కువ, ఫలము అధికము.



# ఓరుగల్లు నంది

విశ్వనాథ వేంకటేశ్వరులు

మోము మలంచి దుఃఖమున మున్గిన నీయెద బాయి కాఁగ నే
బాములఁ ద్రవ్వఁగొంచుఁ గడఁబట్టెదవో ! యల యోరుగంటి రా
ట్ఛ్రీ మహనీయ హస్తమున చెందిర దాకిన గంగడోలు బా
ష్పామిత వారి నల్ల బడి ప్రాకుడు వట్టినదే వృషేశ్వరా !

ఎన్నాళ్లైనది నిన్ను నెక్కి శివుఁ డూరేగఁగ ఖణిల్లన్న యు
ద్యన్నవ్యాంబుదగర్జ, ఱంకె యిడి కాల్ద్రివ్వఁగ భవన్మూర్తిచే
స్విన్నంబై తెలుఁగంటి యాఁబాదుగు వర్షించఁగ సుధాధార సం
పన్నత్వంబున నోరుగల్ తడుపఁగాఁ బ్రాల్మాలి యెట్లుందువో !

స్థాణుఁగ నమ్మి భవత్ప్రభావములునుఁగ స్థాణుత్వముం జెంద ని
ద్రాణంబైనది యోరుగల్లు బసవా ! త్రయ్యంతనాదాకృతుల్
శ్రేణీమంజులముల్ శ్రవఃప్రియములుఁగ జిల్లత్క్మ నృత్యోన్మిష
త్ప్రాణోత్తేజకముల్ భవద్గళస్థ నవఘంటానాదముల్ లేమిచేఁ.(?)

వేయికంబములందు వేయి జోతులు వెట్టి యారాత్రికల నెత్తె నాంధ్రధరణి,
ఖడ్గధారాంచలో గ్రానల ప్రభఁ బెట్టె నీరాజనము తెల్గునేలతేఁడు
వీరమాహేశ్వర విక్రమాత్మార్పణ క్రమసిద్ధి గనె నోరుగల్లునగరు
కవితాసరస్వతీ కమ్రనృత్యోన్మిష ద్భోగంబు లిడె నాంధ్రభూతల కవి
ఓరుగల్ రుద్రకంటఁ బెల్లుబ్బు సెకల - జీవనాడుల కడిమి యుష్ణీకరించి
లీల నాడితి శ్రీశివలీల లెన్నో - నేఁటి కిట్లైతి వెట్లుగాసీ, వృషేంద్ర !

నీకకుదంబు నాంధ్రరమణీయ పురీరమణీ కుచంబుగాఁ
జేకొని తాఁ జెమర్చెనొకొ చిత్తమునఁ శివుఁ డొక్కనాఁడు, దీ
ప్తా కమనీయమూర్తి విటు కాలు కదల్పవు వేయి యేండ్ల కే
నీ క్రియనుండు మెప్పటికి నీ శివమూర్తికి వెష్ట పుట్టునో !

ప్రోలుఁడు మింటికెత్తి నల పువ్వులదీపిక తెల్గునేల వె
ల్గై, లలితంపు వల్లు లయి, కాకతివంశ్యుల దీప్తశౌర్యపుం

తైలముచే సుపుష్టమయి, తావక శృంగయుగాంతరస్థలీ
శిలమణి ప్రరోహమయి నేఁటికి మాసెనుగా వృషాధిపా !

నీ ఱంకె గర్జయై నెఱియలువాఱిన పర్వతంబులు వజ్రపటలి కురిసి
నీవు కాల్ద్రివ్విన భావమ్ము లిగిరించి పుడమిధేనువు పంటపుల్క లంది
నీ బుసకొట్టుటల నెగసి వాయువు లూది యరిసైన్యములు నంతనంత బాఱె
నీవు కొమ్మునఁ జిమ్మ నెగడి యొర్గలు హేమశిఖరి బంగారు వర్షించి మించి
నీదుమయమై చెలఁగుఁ దెల్గు నేలయెల్ల - నీవు నిద్రింప నీలోన నిద్రఁ జెందె
వృషభలోకేశ త్వత్తనూవృతమహాగ్ని-కుండములనూది దానిమేల్కొలుపరాదె!

గణపతి రుద్రదేవు లెఱ కాపరులై నిను నోరుగంటి ప
చ్చనిబయలందు మేపుకొన సాముగవంగిన మూపురంబు గో
మునఁ గఱఁగుల సవాంధ్రగవి ముగ్ధరసాకృతి యాచఁ బుల్కరిం
చినయెద మాధురిర్ఝరులు చిందినదయ్య మహోక్షచంద్రమా !

క్రుమ్మిన కోరకొమ్ముకొనఁ గ్రూరభుజంగమరాజు నిష్పకల్
చిమ్మఁగ ఘ్రాతకృతుల్ నెఱపఁ జెంగున దూకిన గిట్టతాఁకుల
దుమ్ము తఱంగలించి శివద్రోహులు తుత్తుమురై చెడంగ ను
గ్రమ్మగు నీదుమూర్తి కనరాదు తెలుంగులు చిన్నవోవఁగల్.

భవుఁడు భవానియు బాపురే యని మెచ్చ నోరుగల్గవనిలో హుంకరించి
యరిసైన్యములకంటి కజగవ ఖడ్గశూలాలంకృతమ్ములు హారతనువులు
శతసహస్రమ్మై తోఁప సమయాంతపుష్కలావర్తకాశనిపాత భయదములు
శఫశృంగ ఘట్టనల్ శాతవాలోత్క్షిప్త వహ్నిస్ఫులింగముల్ పట్టికాల్పఁ
బాయనడియును జచ్చియుఁ జేయికాలు-నార్ప నేరక శివశివాయంచు సురిగి
యాంధ్రవైరులు నీధాటికాఁగలేక-శరణుజొచ్చిరి బసవ! మచ్చరము లుడిగి.

ప్రథనసంస్థితిలయ ప్రథితముల్ భాను విష్ణుగిరీశఘనపరంజ్యోతు లెవట
జ్యోతిర్మయంబైన శుద్ధాకృతిఁ దాల్చి త్రైలింగశిల్పవిద్యామహస్సు
శతసహస్రస్తంభదర్పణప్రతిబింబితాంధ్రప్రజా పదివ్యార్చిఁ గూడి
కొలువఁ గాకతిదేవి తెలికన్నుగవ కాంతి పద్మాక్షినవతనూప్రభలు కలసి
యారతులు దిద్ద నప్రతిహతము నద్వితీయ మప్రమేయమ్ము జ్యోతిస్సు వగుచు
ఆంధ్రమున స్వర్ణతేజమ్ము లలరఁజేసి-యేకశిలమున శిలవెలితివే వృషేంద్ర !

తెలుఁగుశిల్పులు ఱాయి మలచి ప్రాణముఁబోయు శిల్పవిద్యాధ్వరానల్పవిధికి
త్రైలింగరాజ్యకేదారఖండమ్ముల సస్యేందిరానృత్యసవనవిధికి
తెలుఁగు నరేంద్రహేతిజ్వాల దీపించి యరిహవిస్సులవేల్చు హవనవిధికి
తెలుఁగురాజ్యేందిర తులనక్రమాతీత సౌభాగ్యమిడు విశ్వసత్రవిధికిఁ
గలిమి నధ్వర్యుఁడవయాచుఁ గనకవృష్టి-కృతమహావభృథస్నానకేళిఁగాంచి
సర్వ మఖవుసకొఱకుఁగా సన్న్యసించి-యచలమూర్తినిగొంటి వోయాదివృషభ!

ఇది యాగంబు శివార్థమై జరిగెనిం దెవ్వారి కెట్లైనను౯
దుది నోంకార మహాగ్రపీఠమున సంస్తుత్యప్రభాజ్యోతివై
చిదతీతస్థితి నుండు వూర్జిత జగజ్జేగీయమానుండవై
మది నాంధ్రంబు కరంగుచుండుత భవన్మాహాత్మ్య దివ్యాబ్ధిలో౯.

---



హంపీ-విట్ఠలరాయ దేవాలయమునందలి శిల్పసమంచిత స్తంభములలో నొకటి. ఇందు మార్దంగికభంగిమము భావస్ఫోరకము.

D. A. R.

# కీ. శే. దూసి రామమూర్తిశాస్త్రిగారు

నలుబది యేండ్లయినను నిండని పిన్నవయసుననే శ్రీ దూసి రామమూర్తి శాస్త్రిగారికి నూరేండ్లు నిండినవి. కడచిన ఆగస్టు ౧౮వ తేదీని వారియాత్మ భౌతిక దేహమును విడిచినది. వారి అకాలమృతి తెలుగు వాఙ్మయమునకే కాక దేశమునకును తీరని లోపమును కలుగజేసినది; బంధు మిత్రులను అపారమగు దుఃఖమున ముంచివేసినది

శ్రీ రామమూర్తి శాస్త్రిగారు పరితనమననే విద్యానగరమగు విజయనగరములోని మహారాజ సంస్కృత కళాశాలయందు విద్య నభ్యసించిరి. వీరు స్వప్రతిభచే గురువులను మెప్పించి విద్యార్థులలో మిన్నలయి, ౧౯౨౨వ సం.న మద్రాసుపుర విశ్వవిద్యాలయ విద్వత్పరీక్షయందు ఉత్తమముగ ఉత్తీర్ణులయినారు. అంతియ కాక వీ రాంధ్రచ్ఛందో వ్యాకరణములయందపారమగు కృషి సలిపి మంచి లాక్షణికులుగ ప్రసిద్ధి కెక్కినారు.

ప్రభుత్వ, ప్రజాసంస్థల యాదరాభిమానములకు అంతగా పాత్రులు కాని ప్రాచ్యపట్టభద్రులు ప్రాథమిక, మాధ్యమిక, కోన్నత పాఠశాలలయందలి పండిత పదవులతోనే సంతృప్తిని పొందవలసివచ్చుచున్నది. అదృష్టవశమున శ్రీ శాస్త్రిగారీదుర్దశకు పాల్పడలేదు. పరీక్షయందుత్తీర్ణత గడించినవెంటనే వీరికి తాము విద్యనభ్యసించిన విజయనగర సంస్కృత కళాశాలయందే ఆంధ్రాధ్యాపకపదవి లభించినది. అది అన్నివిధములను వీరి యభివృద్ధికి కారణమైనది. శ్రీ వజ్ఝల చిన సీతారామస్వామి శాస్త్రి గురుపాదుల అంతేవాసిత్వమున గడించిన వీరి పాండిత్యము రిత్తవోలేదు. అది దినక్రమమున అభివర్ధితమయి వీరి ప్రతిభావిశేషమునకు విస్తృతిని కలిగించి విలువకు మించిన కీర్తిని సంపాదించిపెట్టినది; రమారమి పదునైదేండ్లపాటు పెక్కురు విద్వాంసులను, ఉభయభాషా ప్రవీణులను తయారుచేయించినది; విశిష్టగ్రంథ నిర్మాణమునకు వీలు కలిగించినది.

బంగారమునకు పరిమళమబ్బినట్లు, అభ్యాసము వీరి పాండిత్యమునకు మెరుగుపెట్టినది. స్వయంకృషివలననే వీరు చక్కగా కవిత్వము చెప్పగలిగినారు; ఉత్తమ పండిత, విమర్శకులలో ఉచితస్థానమును గడింపగలిగినారు. వీరి రుక్మిణీ కల్యాణము, ఉదయసుందరి, పారిజాతాపహరణ సురభివ్యాఖ్యానము మయివిషయములకు ఉదాహృతులు.

శ్రీ శాస్త్రిగారు సరళస్వభావులు; దయాహృదయులు; విద్యార్థిపక్షపాతులు; సత్యము నిర్వహించుపట్టుల మోమోటమి లేనివారు; ఎట్టి కఠినవిషయము నయినను సవిమర్శముగను, సులలితముగను విద్యార్థులకు బోధింపగల సమర్థులు. ఎట్టి కొమ్ములుతిరిగిన పండితులయెదుటనైనను జంకు లేక ప్రవచన మొనరింపగల దిట్టలు.

వీరు పెక్కేండ్లక్రిందటనే ఆంధ్రవిశ్వకళాపరిషత్తువారి 'ఉభయభాషా ప్రవీణ' పరీక్షకు పరీక్షకులయినారు వీరి గ్రంథము లాంధ్ర, మద్రపుర విశ్వవిద్యాలయములలో వివిధపరీక్షలకు పఠనీయములుగ నిర్ణీతములయినవి. బ్రతికియే యుండినచో వీ రింకను ఎన్నియేని గౌరవములను పొందియుండెడివారు. ఆంధ్రవాఙ్మయమున కెంతయేని సేవ చేసి యుండెడివారు. 'కాలస్య కుటిలా గతిః !'

పాపము ! పతిప్రాణ యగు వీరి సతీమణి జీవితము నిరవధికదుఃఖభాజన మయిపోయినది. అనపత్యత దాని నత్యంతదుర్భరము నొనర్చుచున్నది!

ఒ.వి. వేం. ర.

ఈ పండితుని యకాలమృతికి భారతియును కన్నీరు విడుచుచున్నది. వీరి పాండిత్య ప్రసవములను, అతివిరళముగనే యగుగాక, తలను దాల్చినది. కొంతకాలమునుండియు వీరి రచనములు భారతికి లభింపకున్నను, సజీవులయి యున్నచో నిక ముందయినలభింపగలవను నాశయుండెడిది. ఇపు డట్టి యాశపూర్తిగా నశించిపోయినది

ఎట్టివారి మృతివలన గలుగు దుఃఖమయినను కాలక్రమమున సన్నగిల్లిపోవుట సహజము. అట్లు సన్నగిల్లుదనుక గట్టి మనస్సుతో ఊరట నొందియుండుటయే తదీయుల కర్తవ్యము.

సం. భా.



తాడేపల్లి శ్యామసుందరరావు, యం. బి., బి. యస్.

బొంబాయి గ్రాంటుమెడికల్ కాలేజిలో వైద్యము చదివి యం. బి., బి. యస్. పరీక్షయం దీయేడు బొంబాయి విశ్వవిద్యాలయమున సర్వప్రథములుగ విజయమును గాంచిరి. వీరు ప్రకృతము బొంబాయి జె. జె. వైద్యాలయమున గౌరవవైద్యులుగ నున్నారు.




శ్రీ మారేమండ రామరావు, యం ఏ., బి, ఇడి.

చరిత్రపరిశోధనలకు ఫలముగ మదరాసు విశ్వవిద్యాలయము రామరావుగారి కిటీవల డాక్టరు బిరుదమునిచ్చి గౌరవించెను. వీరు మొదట రెండేండ్లు మదరాసు విశ్వవిద్యాలయ పరిశోధనశాఖయందు ఆంధ్రకాకతీయరాజుల చరిత్రమునుగూర్చి పరిశోధనచేసిరి. వీరి చరిత్రరచనములు కొన్ని ఆంధ్రేతిహాసమండలి (రాజమహేంద్రవరము) పత్రికయందును, భారతి మున్నగు పత్రికలందును ప్రకటితములయినవి. వీరు పైమండలికి సభ్యులుకూడ. మండలి ప్రకటించిన 'కాకతీయ సంచిక'కు వీరు సంపాదకులు. గద్వాలసంస్థాన చరిత్రమునుగూడ వీరు వ్రాసినట్లు తెలియవచ్చుచున్నది. ప్రకృతము వీరు గుంటూరు హిందూ కళాశాలలో చరిత్రోపన్యాసకులుగా నున్నారు.

# కలగూరగంప

## అఖిలభారతభాష-ప్రాంతీయభాషలు

### గాంధీ సూచించిన ౧౭ నిబంధనలు

(౧) మనము చేయుచున్న యావత్తు కార్యక్రమము, ప్రభుత్వ విద్యావిధానమును ఆయా ప్రాంతీయ భాషలలోనే జరుగవలెను. హిందుస్తానీ, హిందీ, ఉరుదూ, బెంగాలీ, గుజరాతి, మరాటి, తమిళం, తెలుగు, కన్నడం, మలయాళం, ఓఢ్రం, అస్సామీసు, సింధి, పంజాబీభాషల నిందులకు వాడవలెను.

(౨) హిందూస్థానీ మాటలాడు ప్రాంతములలో హిందీ, ఉరుదూభాషలు ఆలిపులతో కూడ అధికార రీత్యా ఆమోదించవలెను. సామాన్యప్రకటనలన్నియు ఉభయలిపులలోను చేయవలెను. కోర్టులు మొదలైన వానిలో ఉభయలిపులలో ఏదైన వాడవచ్చును.

(౩) హిందూస్థానీప్రాంతములలో అన్ని విషయములు హిందూస్థానీలోనే బోధించుచు, రెండు లిపులు కూడ వాడవచ్చును. ఎవరకు ఇష్టమువచ్చిన లిపి వారు వాడుకొనవచ్చును.

(౪) హిందూస్థానీ అఖిలభారత భాషగా స్వీకరించవలెను. హిందూస్థానీలో నిరాక్షేపణీయముగా ఏ ప్రభుత్వ కార్యస్థానములో నైనను తాను మాటలాడవచ్చును, వ్రాయవచ్చును.

(౫) దేవనాగరి, బెంగాలీ, గుజరాతీ, మరాటీ లిపులనుకలిపి అచ్చుకు, టైపుకు పనికివచ్చు క్రొత్తలిపి కనిపెట్టవలెను.

(౬) సింధీలిపి, ఉరుదూతో కలిపి సులభము చేయవలెను.

(౭) దేవనాగరివలె దక్షిణభాషలు తయారు చేయుటకు ప్రయత్నించవలెను. అది సాధ్యముకానిచో తమిళము, తెలుగు, కన్నడం, మళయాళం భాషలకు ఒక సమానలిపి పరిశోధించవలయును.

(౮) లేటిన్ లిపి ఉపయోగించిన దానికిఎన్నో సదుపాయములున్నవి- కాని అది మనము వాడుటకు ప్రస్తుతము వీలులేదు.

దేవనాగరి, బెంగాలీ, గుజరాతీ, మరాటీ, ఉరుదూ, సింధీ, దక్షిణభాషలు— ఇన్నింటికి సరిపోవు క్రొత్తలిపి కనుగొనవలెను.

(౯) హిందీ, ఉరుదు ప్రత్యేక ప్రత్యేకముగా అభివృద్ధి చెందుచుండుట ప్రమాదకరముగా భావించ నక్కరలేదు. ఏది అభివృద్ధియైనను భాష బాగుపడును. ఎప్పటికైనను జాతీయైక్యము ఏర్పడును. ఇది లాభించును.

(౧౦) మనము జనసామాన్యమగు సులభశైలిలో భాషలన్నియు నుండునట్లు చేయవలెను. వానికి సంబంధించిన విషయములను గూర్చి వ్రాయవలెను. పెద్ద సమాసములు, అలంకారములు, జిలుగులు వదలిపెట్టవలెను. దీనివలన హిందీ, ఉరుదూలు ఒకటే అగును.

(౧౧) ఇంగ్లీషులో బేసిక్ ఇంగ్లీషు ఉన్నట్లు సరళమగు బేసిక్ హిందీకావలెను. ఇందులో వ్యాకరణ క్లిష్టత, అర్థక్లిష్టత లేకుండ అది సులభముగా తెలియవలెను. ఇది సంపూర్ణ భాష కావలెను. అన్ని భాషల లోను ఉన్న సులభపదములను ఈ క్రొత్తభాషలో వాడుక చేయవలెను.

(౧౩) విద్యయంతయును ఆయా ప్రాంతపు దేశభాషలలోనే గఱపవలెను-క్రింది ప్రైమరీ తరగతుల నుండి యూనివర్సిటీ తరగతులవరకు ఆయాదేశ విద్యార్థికి వానిమాతృభాషలోనే అన్ని విషయములును నేర్పవలెను.

ఒకే రాష్ట్రములో అనేక భాషలు మాటలాడువారు న్నను సరే, వారివారి మాతృభాషలోనే వారివారికి విద్యగరపు అవకాశములు కల్పించవలెను. సెకండరీ విద్య లో ఆ ప్రాంతభాషనే నిర్బంధముగా చదువవలెను.

(౧౪) హిందూస్థానీ రాని దేశములలో బేసిక్ హిందూస్థానీ సెకండరీ తరగతులలో చెప్పి, లిపి ఇచ్ఛ వచ్చినది ఉపయోగించునట్లు చేయవలెను.

(౧౫) విశ్వ విద్యాలయ విద్య ఆప్రాంత మాతృ భాషలోనే నేర్పవలెను. హిందూ స్థానీయును, ఇంకొ కవిదేశ భాషయును నిర్బంధముగా నేర్పవలయును. పెద్దశాస్త్రవిషయములు నేర్చుకొనువారికీభాషా నిర్బంధ ముండ నక్కఱలేదు.

(౧౬) సెకండరీ పాఠశాలలలో విదేశ భాషలు, ప్రాచ్యభాషలు నేర్పుటకు వీలునుంచవలెను. అవి నిర్బంధము చేయవలెను.

(౧౭) విదేశసారస్వతములలోను, ప్రాచీన వాఙ్మయములలోను గల ప్రాచీనాధునాతన గ్రంథములను దేశభాషలలోనికి తర్జుమా చేయవలెను. దానివలన మన భాషలలో సారస్వతము, విజ్ఞానము, పరదేశములలోని నాగరికత, విజ్ఞానము, సంఘాభివృద్ధి మున్నగునవి తెలు సుకోవచ్చును. దానివలన మన భాషలకు వాఙ్మయ రూపమైన పుష్టిచేకూరును.

---

## ని ద్ర

మనము మన ఆయుః పరిమితిలో మూడవవంతు కాలమును నిద్రలోనే గడపుచున్నాము. ఇంతకంటెను సులభముగా చెప్పవలయునన్న-దాదాపు 33 సంవత్స రములు మనము ప్రజ్ఞలేకుండ పడియుందుమని చెప్ప వలయును. ఈ నిద్రయనున దేమి ? నిద్రలేకకూడ ఉం డుట సంభవమా ?

“నిన్నరాత్రి నీకు బాగుగా నిద్రపట్టినదా ?” అని యెవరైన నడిగిన “ఓ ! బాగుగా పట్టినది. మొద్దు నిద్రపోయినాను” అని చెప్పుట తరచు వినుచుందుము. కాని యిది పట్టి అసంభవము. ఎవడును మొద్దువలె నిద్రపోడు. శాస్త్ర మట్లని నిరూపించుచున్నది.

మరికొందరు “అబ్బబ్బ! రాత్రిళ్లు వారము రోజులుగా నిద్రయను మాటయే లేదు. కంటికి కునుకు పట్టి యుండిన ఒట్టు” అని ఫిర్యాదు చేయుచుందురు. నిజము చెప్పవలసివచ్చినచో వారును అబద్ధమే ఆడు చున్నారు. వైద్యశాస్త్ర ప్రకారము “మొద్దు నిద్ర పోయినవా” రెంతసత్యవాదులో వీరును అంతేసత్య వాదులు.

పరిశోధనలుచేసిచేసి నిశ్చయము చేసిన దేమనగా: మామూలుగా నిద్రపోవువాడు చాలసేపు ఒకే సంస్థా నము(Position)నం దుండనేరడు: బోరగిలపండు కొనును; వెల్లకిల తిరుగును; అటుపొర్లును, ఇటుపొర్లును; ముడుచుకొనును; చాచుకొనును. ఇట్లు సుమారు ఒక్క ఎనిమిదిగంటల కాలములో అనుమపక్షము 35 మార్పు లయినను వాని శయన సంస్థానమున మనము గమనింప వచ్చును. కాబట్టి మొద్దువలె ఇటునటు కదలిమాడక నిద్రపోయితిమనుట పట్టికల్ల.

మరి ‘కంటికి కునుకేలేదు’ అనువారి మాట యేమి ? ఏండ్లపర్యంతము నిద్రపోని పలువురు వ్యక్తు లను గురించి మనము వినియున్నాము. ఈ మధ్యనే కల కత్తాలోని యొకకోటీశ్వరుడు ‘ఎవరయిననుసరే దినమున కొక్కటేఒకగంటసేపయినను నాకు నిద్రవచ్చు నట్లు చేసినయెడల నాయాస్తిలో సగము బహుమతి చేసెద’నని సవాలు చేసియున్నాడు. పాప మతఁ డెన్నాళ్లనుండి నిద్రాసుఖమెరుగనివాడో ! ?

నిజముగా వీరు సత్యమునే పలుకుచున్నారను కొందురేమో ? ‘స్లంబరోమీటరు’ అను నొక క్రొత్త యంత్రముతో పరీక్షించినయెడల ఇది పట్టి యబద్ధమని తెలియగలదు. నిద్రలేమిచే బాధపడుచున్నా మనువారు గూడ నిద్రపోవుచునేయున్నారనియు, ఆనిద్ర ‘అలల’ రూపముగా పైకొనుచుండుననియు నీ యంత్రము ఋజు వుచేయుచున్నది.

నిద్రను మనము గుణమునుబట్టి కొలువవలయును గాని పరిమాణమునుబట్టి కాదు. గాఢనిద్ర ఒక్క పది నిమిషములు పట్టినచాలును; తూగునిద్ర ఎన్నిగంటలు పట్టినమాత్ర మేమి లాభము ? జాన్ వెస్లీ జీనుమీదనే గాఢనిద్ర పోయెడివాడు! ఎడిసన్ తన పరిశోధనా

గారములో తాను కూర్చున్నచోటనే నిద్రపోయెడి వాడు!! ఎన్ని నిమిషములు? పదినిమిషములకు మించదు. నెపోలియన్, ద్యూమానూ మొదలైన విఖ్యాత పురుషులందరును చాలకొద్ది కాలమే నిద్రపోవుచుండిరి. ఎవరో ఏల? మన గాంధిమహాత్ముడు రెండుమూడు గంటలకంటె నెక్కువసేపు నిద్రపోడనుట మన మెరుగమా?

"నిద్రలేని"వారుకూడ బ్రతికియున్నారనిన వారు అలలలోనే, అనగా తూగులలోనే నిద్రపోవుటకు నేర్చుకొనియుండుటయే యందుకు కారణము. నిద్రలేమి అనునది ఒకరోగము కాదు. అది కేవల మొక అనుమానమే. నిద్రలేదను భయమే నిద్రలేమిక్రిందికి దిగినది. నిద్రవచ్చుటలేదేయను నాశంకయే నిద్రలేమి యన్నమాట.

నిద్రకు ప్రబలశత్రువు చింత. భయముకూడ నిద్రను పోగొట్టును. రాత్రికి నిద్రపట్టదేమో యను భయమే ఆనిద్రను రానీకుండ చేయుచుండును. కోపము, అసహ్యము, ప్రేమ, దుఃఖము, మితిమించిన యాహారము అనునవి కూడ నిద్రను భంగపరచును. చెడ్డ తలంపుకూడ అటువంటిదే.

పడకగదిలో పరిశుభ్రమైన గాలి, తేలికయై వెచ్చనైన బట్టలు, పండుకొనబోవుటకుముందు ఒక లోటా పాలు,అన్నిటికంటె ముఖ్యమైనది నిర్మలమైన మనస్సు-ఇవికుదిరినప్పుడు ప్రశాంతమైన మంచినిద్ర తనంతకు దానేవచ్చును. పగలు ఎక్కువగా నిద్రపోవకుండుట గూడ రాత్రిపూట గాఢనిద్ర పట్టుటకు అనుకూలించును.

[టైమ్స్ ఆఫ్ ఇండియా వీక్లీ.]

---

## ఘంటాకర్ణుని శ్రాద్ధము

ఘంటాకర్ణుడను శివభక్తునిగురించి మనము పురాణములందు చదివియున్నాము. అతని నిజమైన పేరేమో కాని ఘంటాకర్ణుడనునది యతనికి నడుమంత్రపు పేరు. అతడు వీరమాహేశ్వరుడు. హరి పేరు చెవులబడకూడదని యతని పట్టుదల. తప్పిదారి యేక్షణమైన నాపాడుపేరు వినవలసి వచ్చునేమోయని యతడు చెవులకు బ్రహ్మాండమైన ఘంటలను వ్రేలవేసుకొనెడివాడు. వాని మోతలో నాయశ్రావ్యపదము లీనమై పోవునని యతని యూహ. ఈ ఘంటలవలన వచ్చినదే ఘంటాకర్ణుడను పేరు. అతడు చచ్చి చాల సంవత్సరములు దాటిపోయినవి. మనకు వానిపేరు గ్రంథములందు కనబడుచున్నది. కాని, నేపాళదేశములో నేటేట నతడొకసారి ప్రజలకు కనబడిపోవుచుండును.

నేపాళదేశములో నొకభాగమగు ఖాట్మండులో ప్రతిసంవత్సరము శ్రావణ బహుళ చతుర్దశినాడు ఘంటాకర్ణుకు 'ప్రత్యక్షు'మగుచుండును. వీథిలోబోవు ప్రతివాడును వాని చేతనయినంత మట్టుకు అతనికి కానుకలు సమర్పించి తీరవలయును. ఇది సుగ్రీవాజ్ఞ.

పూర్వ జన్మమందు ప్రాప్తమైన యొకానొక శాపమునుండి విముక్తిపొంది యతడు పరమపదించిన దిన మది. అతని శ్రాద్ధకర్మల నానాడు చేయువానికి గూడ వానికివలెనే యనర్థనివృత్తి గలుగునని యొక విశ్వాస మాప్రాంతమున ప్రబలిపోయియున్నది. ఆనాడు వారుచేయు కర్మలకు 'గోథేమంగళ్' అనిపేరు. అనగా గృహమునకు శుభమన్నమాట.

ఒక్క ఖాట్మండులో తప్ప ఆదేశపు మరి యేభాగములోనుగూడ ఈతంతుజరుగుటలేదు. దీని ఖర్చు వెచ్చములకు గూర్ఖాలు చందాలు పోగుచేసెదరు. బహుశా ఈ సంప్రదాయము రెండుమూడు వందల యేండ్లకు ప్రాచీనమైనదికాదేమో! నీవారు మల్లరాజులు రాజ్యపాలనము చేయుచుండిన కాలమున నిది పుట్టియుండవచ్చును.

కార్మిక యువకుల కానాడు గొప్పసంబరము. సరదాగా వా రీతంతును నడపెదరు. వేసవజామున నాలుగునాలుగున్నరకే లేచి, పాచిపనులు ముగించుకొని పెక్కుగుంపులుగా విభజనయయి పట్టణవీథులందంతట చతుష్పథములలో మకాముచేయుదురు. వీథుల మూలలందును, కూడలిస్థలములందును కట్టెలతోను, వెదురు టాకులతోను చిన్నచిన్న ప్రతిమలుకట్టి పెట్టి వానిచుట్టును గుమిగూడి 'ఘంటాకర్ణకే జగత్' (ఘంటాకర్ణునికి శుల్కము) అని ఆదారిన నెవడైనను కనబడగానే గొల్లుమని యరచుచుందురు.

ఎంత మొండివాడయినను ఈశుల్కము నీయ కుండ తప్పించుకొనిపోజాలడు. వారుచేయు గల్లంతుకు 'ఎట్లయినను వీరినుండి బయటపడిన చాలు రాభగవంతుడా' యనిపించును. ఒకవేళ వారి కేదైనను పడవేసి ముందుకు దాటిపోయినను అక్కడ మరియొకగుంపు ముట్టడింతురు. అక్కడను ఏదైనను వేయకతప్పదు. గమ్యస్థానము చేరులోపల నిటువంటి గుంపులను ఎన్నిటినో తప్పించుకొనిపోవలసియుండును. జేబునిండ డబ్బులున్నచో నేబాధయు నుండదు. లేకపోయిన కష్టమే.

ఈ సుంకరి గుంపులకు మంచిరాబడిసమయము సాయంకాలము. ఊరి పెద్దపెద్దలందరును విహారమునకు పోవుసమయ మది. కాబట్టి అప్పుడు వారికి డబ్బీలనిండుగా వెండిరూకలు పడును. రోజంతయు నిట్లు వసూళ్లతో గడచిపోవును.

చివరకు రాత్రి ఎనిమిది తొమ్మిది గంటలకు వారందరును వీథులలో తాము కట్టిపెట్టిన ప్రతిమలనన్నిటి నెత్తుకొని ఊరి వెలుపలిప్రదేశములకు పోయి తదనంతర కర్తవ్యమునకు - అనగా దహనమునకు సన్నాహము గావింతురు. అక్కడ మరికొన్ని జాతులవారు వీరితో చేరుదురు. అప్పటి కొకపెద్దప్రతిమను గడ్డితో తయారుచేయుదురు. పూర్వపు చిన్నచిన్న బొమ్మలన్నియు నీపెద్దదాని ప్రతినిధులుమాత్రమే. ఒకపిల్లవాడు ఒక కొరవిపట్టుకొని ఆపెద్ద ప్రతిమచుట్టును మూడుమార్లు తిరుగును. తరువాత ఆబాలునిగూడ ప్రతిమతోబాటు కఱ్ఱలమీద బెట్టుకొని దహన ఘట్టమునకు తీసుకొనిపోవుదురు. వెంట వందలకొలది జనము ఆడుచు పాడుచు అల్లరిచేయుచు పోవుదురు. అంత నక్కడ ఆఘంటాకర్ణప్రతిమకు దహన సంస్కారము జరుగును. అంతయు నయినతర్వాత అక్కడచేరినవారందరును పగలువసూలుచేసిన డబ్బులను పంచుకొందురు. ఇండ్లకుపోవుటకు ముందు అందరికిని భోజనములుకూడ ఏర్పాటు చేయబడును.

ఇవన్నియు ముగిసినతర్వాత వారు వారివారి యిండ్లకు వెళ్లి ప



కిండ్లముందర ఏవేవో బొమ్మలు బొగ్గుతోగీచి ధూపదీపములువేసి మంత్రములు జపింతురు.

మరునాటి యుదయము ప్రతివాడును చేతియందొక ఉంగరము-రాగిదో, లేక ఇత్తడిదో-ధరించి యుండును. వీనికి 'గోథేమంగళ్' ఉంగరములని పేరు. వీనిని తలేజాభవాని దేవాలయమున పురోహితులు మంత్ర తంత్రములతో సంస్కరించియుందురు. వీనిని ధరించినచో భూత ప్రేతముల బాధ తొలగుననియు, అనిష్టములు నివారణమగుననియు నక్కడివారి నమ్మకము.

[టైమ్స్ ఆఫ్ ఇండియా వీక్లీ]

---

## వ్రేలిముద్రలనుబట్టి రోగములను నిర్ణయింపవచ్చును

వ్యక్తులయొక్క వ్రేలిముద్రలను పరిశీలించి వారిలోనప్పుడుండు రోగములను, రానున్న రోగములనుకూడ తెలిసికొనవచ్చునని శాస్త్రజ్ఞులు కనిపెట్టినారు. వారిలో నొక రేమిచెప్పుచున్నారనగా:

"నేను వేలకొలది వ్రేలిముద్రలు పరీక్షించినాను. ఒకరేరకమయిన జబ్బుతో బాధపడుచుండువారి వ్రేలిముద్రలనుగూడ అనేకములు పరిశీలించినాను. వ్యక్తులనుబట్టి వ్రేలిముద్రలు మారుచుండినప్పటికిని ఒకే జబ్బుగలవారి విషయములోమాత్రము అవి సమాన ధర్మము గలవిగానే నేను నిశ్చయించగలిగితిని. తరువాత ఆరోగ్యముగా నుండువారి వ్రేలిముద్రలనుగూడ అనేకములను పరిశీలించితిని. అవికూడ సమాన ధర్మము గలిగి యున్నట్టుగానే నాకు కనుపించినవి.

"ప్రస్తుతము మానవులకు మహోపద్రవకరములుగా నుండు కర్కాటక వ్రణము, క్షయ అను నీ రోగముల మీదికే మొట్టమొదట నాదృష్టి పారినది. ఎవరెవరికీ రోగము లున్నవో వారందరి వ్రేలిముద్రలు ఒకటే రీతిగా నున్నట్లు నేను గ్రహింపగలిగితిని.

"ఇంతవరకును వ్రేలిముద్రలప్రమేయము గలిగిన దొక్క నేరములుపరిశీలించునుద్యోగులకే. వారు పరిశీలించి పరిశీలించి నిర్ణయించినదేమనగా ఏసందర్భములో

గాని ఒకరి వ్రేలిముద్ర మఱియొకరి వ్రేలిముద్రను పోలి యుండదు.

"నా పరిశోధన తద్విపరీతమైన నిర్ణయమునకు నన్నీడ్చినది. అన్ని విధములయిన పోలికలను ఏ రెండు ముద్రలలోను నేను చూడలేదుగాని కొన్నికొన్ని విశిష్ట లక్షణములు మాత్రము అనేకముద్రలయందు నేను చూడ గలిగితిని. అటువంటిముద్రలనుబట్టి ఆ వ్యక్తుల జాతి, వంశము మొదలైనవానినిగూడ మనము చెప్పవచ్చునని నేను కనిపెట్టితిని.

"యూరోపియనులకు ప్రత్యేకముగా నొకరకమైన వ్రేలిముద్రగలదు. ఆ లక్షణములు ఏవో కొన్ని భారతీయజాతులు, ఉత్తర ఆఫ్రికాలో కొన్నిభాగములు, ఇండియాదగ్గరనుండు నొక చిన్నద్వీపము వీనిలో తప్ప మరి యెక్కడను చూడలేము.

"జాతినిబట్టి, దేశమునుబట్టి మాత్రమేకాక గ్రామములు, పట్టణములు, మండలములను బట్టికూడ నీ వ్రేలిముద్రలలోని లక్షణములలో భేదములగుపడు చుండును.

"ఆరోగ్యవంతులయొక్కయు, అనారోగ్యవంతులయొక్కయు వ్రేలిముద్రలను తులనాదృష్టితో పరిశీలించినందులకు ఫలితముగా ఆ ఉభయుల ముద్రలలోనుగల సామాన్యలక్షణములేవో, ఏ సందర్భములందు అవి భేదపడినవో వ్యక్తముగ తెలిసికొనగలిగితిని. చిన్నబిడ్డలకు వచ్చునట్టి యొక భయంకరజాడ్యముకలదు. దానిని 'పోలియోమైలిటిస్' అందురు. అది వచ్చినవారికి తొడలు వికలమగును. ఈ జబ్బు వచ్చినవారి వ్రేలిముద్రలలో నొక ప్రత్యేకలక్షణ మున్నట్లు తెలిసికొంటిని. ఆ లక్షణము ఆరోగ్యముగానుండు బిడ్డలలో నెక్కడను నాకు కనబడలేదు.

"ఆరోగ్యపరిస్థితులు వ్రేలిముద్రల తారతమ్యములకు ముఖ్యకారణములు. కాబట్టి వ్రేలిముద్రలనుబట్టియే ఆయావ్యక్తులు కప్పుడేయేరోగములున్నవో, భవిష్యత్తులో నేయేరోగములు రానున్నవోకూడ మనము తెలిసికొనవచ్చును. ఇది నేను బహుదినములు ప్రయాసపడి తేల్చిన సత్యసిద్ధాంతము"

['టైమ్స్ ఆఫ్ ఇండియా వీక్లీ']

---

## అంకోరుకు మార్గములు

["అంకోరు పూర్వచరిత్ర" అనువ్యాసము భారతి జూలయి (౧౯౩౫) సంచికయందు ప్రకటితమయినది.]

అంకోరుకు పోవుటకు రెండుమార్గములు కలవు. ఫ్రెంచి రానివారు సయాములోని బాంకాకు గుండ పోవుట మంచిది. సరిహద్దునందు అరన్యా నగరమునకు బాంకాకునుండి సరాసరి ఇనుపదారి కలదు. ఆయినుపదారి అక్కడతో నాగిపోవును. అక్కడనుండి అంకోరుకు నూరుమైళ్లు దూరము. అక్కడనుండి ఫ్రెంచికాంబోడియా. ప్రయాణికులకు మోటారుకారులను, ఇంగ్లీషు, ఫ్రెంచి, ఇతర దేశభాషలు వచ్చినవారు, హిందువులు నయిన దారితోడు మనుష్యులను కుదుర్చుటకు అక్కడ ఏజంట్లు కలరు.

సైగాను నగరమునుండి పోవునది రెండవమార్గము. అక్కడనంతయు ఫ్రెంచిమయము. ఇంగ్లీషు మాటలాడగలవాడక్కడ మందునకయిన దొరకుట అరుదు. ఇనుపదారి సౌకర్యము లేదు. కాని మంచి మెట్టబాటలున్నవి. అక్కడనుండి అంకోరుకు ౨౯౩ మైళ్లు దూరము. ప్రయాణమునకు పూర్తిగ నొక్కపగలు పట్టును. తిన్నగ తెల్లవారకమునుపే మోటారు బస్సు బయలుదేరును. ప్రయాణికులు సామాన్యముగా క్రిక్కిరిసియే యుందురు. అంకోరు కది సాయంకాల మారేడు గంటలవేళకు చేరును. సొంతముగా కారుల నేర్పాటు చేసికొని పోవచ్చును; కాని, బస్సుకంటె అవియు ఏమంతత్వరగా పోయిచేరవు. కానున్న ప్రయాణము కొంత సుఖముగ నుండును కాని.

అంకోరులో హోటళ్ల వసతి ప్రశస్తము. శిథిలముల దగ్గరనే ఒక చిన్న హోటలున్నది. శిథిలపాలకులే దానిని నిర్వహింతురు. అక్కడకు రెండుమైళ్ల దూరమున 'సీమ్ రీప్' నగరమున పెద్దహోటలున్నది. అక్కడ వ్యయమెక్కువ. ఆ ప్రక్కననే ఫ్రెంచివారు పెట్టిన చిన్న హోటలున్నది. అది చాల ప్రశస్తమయినది; వ్యయమెక్కువయును కాదు. చీనావారి నిర్వహణమున కొన్ని బసలున్నవి. అక్కడ భోజనాదుల కేరుపాటులు లేవు. నివాసమునకు మాత్రమే. అంకోరువద్ద కావలసిన సౌకర్యములు కలవని యాత్రికులు చెప్పెదరు.

స్థలదర్పణ గ్రంథములు మూడు ఫ్రెంచిభాషలో నున్నవి.

ఫణీంద్రనాథబోసు ఇంగ్లీషులో చంపచరిత్ర యను పేరు నొక చిన్న గ్రంథమును రచించెను. అది అత డప్పుడప్పుడు రచించిన వ్యాసముల సంపుటీకరణ మాత్రమే. దానిని అడయారు (చెన్నపురి) వారు ౧౯౨౭ లో ప్రకటించినారు.

సర్ ఛార్లస్ ఎలియట్ రచియించిన 'హిందూ-ఇజం బుద్ధిజం' అను గ్రంథము మూడవ సంపుటమున కంబోడియాను, చంపను గురించి రెండధ్యాయములు కలవు. అందలి విషయమునకు ప్రామాణ్యముకలదు. అతడక్కడకుపోయి చూచినవాడు. ఫ్రెంచి చరిత్ర పండితుల ననుసరించి ఆకాలపు చరిత్రను చక్కగా చదివినవాడు. ఆ రెండధ్యాయములే ఇంగ్లీషున ఇప్పటి కున్నవానిలో నుత్తమములు.

'త్రివేణి' ఆగస్టు సంచికనుండి.

---

## నా ర న వ్వా రు

నూలుతోగాని, నారతోగాని నవ్వారు నేయ వచ్చును. నారను పురిపెట్టి, ఆపురితో నవ్వారు తయారుచేయవలెను. గోగునారతో గాని, జనుప నారతో గాని పురిపెట్టవచ్చును. కాని జనుపనార పురి ఆరోగ్యకరము కాదు. గోగునారపురి యంత్రముల మీదగాని, తిక్కడిమీద చేతితోగాని తయారగును. మరపురికంటె చేపురి నాణెమయినది. పెక్కు మందికి పని కల్పించును. కాబట్టి, గోగునారను చేతితో పురి పెట్టి, చేతితో నేసిన నవ్వారు శ్రేష్ఠము.

మణుగుపురి సుమారు రు. 3-౦-౦ అగును. తిక్కడి వెల రు. ౦-౧౨-౦ కు మించదు. నేతమగ్గము మంచిది రు. ౧-౦-౦. కొన, పెట్టుబడి రు. ౫-౦-౦ లకు లోపుగానే ఉండును. పురిపెట్టువానికి రోజుకు ౨, 3 అణాలు గిట్టును. నేయువానికి రోజుకు ౪ అణాలు గిట్టును. రోజుకు ౬ గంటలలో ౫౦ గజ ములు నేయవచ్చును. ౫౦ గజాల నవ్వారు వీసెడు తూగును. దాని ఖరీదు రు. ౦-౧3-౦. మంచమునకు 3 వీసెలు పరిపోవును. చాల గట్టిగా ఉండును. నులక కంటె చాల మేలుగా ఉండును.

స్త్రీలును, పురుషులును, వృద్ధులును, పిల్లలును ఈపని చేయవచ్చును. ౧౦ ఏండ్ల లోపలివారు కూడ నేయగలరు. నీళ్లలో నానవేసినను నవ్వారు చెడిపోదు. నూలునవ్వారుకంటె చాల ఏండ్లు మనును.

కాబట్టి ఇది ప్రోత్సహింపదగిన తేలికపని. ౧౦ రోజులలో నేర్చుకొనవచ్చును. వలయువారు వినయాశ్రమములో తర్ఫీదు పొందనగును.

గొల్లపూడి సీతారామశాస్త్రి

[గ్రంథాలయసర్వస్వము]

---

## కూ చి పూ డి వా రి రం గ ము

కూచిపూడివారికి స్థిరములగు రేకులతో గట్టిన రంగములు లేవు. నాటక మాడవలయునన్న వారు వారి రంగమును పరిమిత మగు కాలములో ఏర్పరుచుకొన వలయును. కూచిపూడి బ్రాహ్మణులు వలయు కొలది పరికరములను తమతో తెచ్చికొందురు. గ్రామములకు నాటకములు వేయుటకు వచ్చినప్పుడు గుడారము నొక దాని వైచికొని టిక్కెట్టులు పెట్టు ఆచారము వారికి లేదు. క్రమక్రమముగా నేటికి "టిక్కెట్టు" దాపరించి కళాభిమానులగు దరిద్రులను కొందరను కళాభిలాషము నుండి తొలగించినది. గ్రామమున నాలుగు వీథులకు మొగను గడకఱ్ఱలతో ఎత్తుగా పందిరి వేయించెదరు. పందిరిపై పచ్చని కొబ్బరాకులు పరచెదరు. నటులు కూర్చుండుటకు గాని, నిలుచుండుటకు గాని బల్లలతో రంగ మున్నతముగా నమర్చెదరు. ఉన్నతమగు రంగ మునకు ముందు కొంత విశాలస్థలము నృత్యాదులకు వదలివేయుదురు. వెనుకభాగమున ఒకటి రెండు తడికలు నిలువబెట్టుదురు. నాలుగు గోడల మధ్యనే గాని వారికంఠములు ప్రతిధ్వనింప వను భయము వారికి లేదు. ముందుభాగమున నున్న ఉభయపార్శ్వస్తంభ ములకొక దారము గట్టి ౨ గజముల వెడల్పు గలిగిన తెర నొకటి రింగులతో నమర్చెదరు. ఈ తెరలపై రంగు లతో చిత్రము లుండవు. నాటక సమాజముల నామ ధేయములు వ్రాయబడియుండవు. దీనికి కప్పీ లవసరము

లేదు. వెనుక నొకడు త్రాడు లాగవలసిన బాధ్యతయు లేదు. పొరపాటుచే త్వరగా త్రాడు వదలింపబడి నచో తెరలకు కట్టిన త్రాడులవలన నటులు గాయములు పడ నవసరము లేదు. చేతితో ముందుకును, వెనుకకును తెరను ఆ సంఘనియంతయే లాగుచుండును. తెర వాల్చుటకును, ఎత్తుటకును మధ్య గంటలకొలది కాల వ్యవధి యుండదు. రెండు మూడు నిమిషముల వ్యవధి కాలములో తెర దించుటయు, ఎత్తుటయు గూడ నగును.

బల్లలతో నున్నతముగా నమర్చబడిన రంగము మీద ఒక కుర్చీగాని, రెండు కుర్చీలుగాని వేయబడి యుండును. హంసతూలికాపర్యంకములతో నలంకృతము లయిన కృత్రిమసింహాసనాకృతు లుండవు. ఈ వేదికకు వెనుక భాగమున రంగులు పులుముకొనుటకు వేషముల గదిగాని, మరచిపోయిన పాత్రసంభాషణముల నందించుటకు పుస్తకములు చేత పుచ్చుకొని చదువుకొనిపోవుటకు కూరుచుండువారు గాని యుండరు. నాటకసామాజికుల కందరకు వారి వారి భాగములే గాక నాటకమంతయును నాంది మొదలు భరతవాక్యమువరకు కంఠస్థముగానే యుండును. వలసినచో గంగాప్రవాహమువలె అనర్గళముగా వేదపండితులు వేదమును వల్లించురీతి తలక్రిందుగా కూడ చెప్పగలరు. ఇట్టి వారికి విని వినబడని పటాంతరములయందుండి వచ్చు నందింపులతో పని యేమి? రంగవేదికకు ప్రక్కగా వెనుకనుండి వేషము ధరించుకొని వచ్చిన వేషధారి రంగము ప్రవేశించుటకు వీలుగ నుండుటకు తగిన ద్వారము ఒకటి యుండును. ఇది వారి ప్రాచీన నాటక రంగము. ఇపుడుకూడ (సినిమారంగములు లేని) గ్రామాదులకు వచ్చినప్పుడు, వేయునాటకము ననుసరించి తగిన వైశాల్యము గలిగిన రంగముల నేర్పరించుకొందురు.

కూచిపూడివారి రంగములయందలి యంగముల పరిశీలింతము. దీనికే కూచిపూడివారి 'సరాంజా' మందురు. ఉన్నత మయిన కృతకవేదిక కిరుప్రక్కలను మృదంగముతో మార్దంగికుడును, శ్రుతికొరకే వినియోగింపబడు హార్మోనియముతో నింకొకడును ఉందురు. హార్మోనియముపై పాటల నెక్కించి పాట లందించుట వారు పాటింపరు. సవ్వారు బద్దెలతో బిగించి కట్టిన తాళద్వయములను చేతబట్టుకొని కొందలును, మెడలో వైచికొని కొందలును బ్రాహ్మణులు మొలకు తెల్లని వస్త్రములను బిగించి, మొగమున విభూతి రేఖలు బాగుగా దిద్ది నిలబడుదురు.

కూచిపూడివారు నాటకము వేయుదురన్నచో ఊరిపెద్దలకే కాదు పని. తెలికలవాని దగ్గరనుండి చాకలి మంగళ్లవరకును తొందరయే. ప్రాచీన గ్రామములయందు సంప్రదాయములు వేరు. ఆయా సంప్రదాయము లింకను కొన్ని కొన్ని మూలమూలల యందలి గ్రామములయందు నశింపలేదు. గ్రామము యొక్క కట్టుబాటుప్రకారము, ఊరిపెద్ద నియంత్రతానుయోగమున ఎవరిపనులను వారు విధ్యుక్తముగ నాచరింపవలసినదే. ఊరిపెద్దను తిరస్కరించి ప్రతికక్షిగా గ్రామమున ఒక కాకి యయినను బ్రతుకలేదు. ఊరిపెద్ద యన నెవరు? గ్రామస్థులందరు నామోదించి ఆ పెద్దరిక మాతనియందు నిలిపిననేగదా ఆతడు గ్రామమునకు పెద్దయు, నియంతయు, న్యాయాధికారియు నయినాడు?

ఆ సంప్రదాయము ననుసరించి చాకళ్లు కాగడాలు వేయుటకు సిద్దెలతో సూర్యాస్తమయమునకు వచ్చి గ్రామభవన సమీపమున హాజరు కావలయును. మంగలి కూచిపూడి బ్రాహ్మణుల వసతిగృహ సమీపమున వారికి కావలసిన సదుపాయములు చేయుటకు నడుముకట్టుకొని నిలుచుండియుండవలయును. తెలికలవాడు గ్రామ నియంతయొక్క సెలవు ప్రకారము రాత్రి సరిపోవునంత ఆముదము సిద్దెలలో పోసి చాకళ్ల కీయవలయును. గ్రామమున నున్న తిలఘాతకుల కుటుంబము లన్నియును సమాలోచించుకొని భాగములు వైచుకొని చేసికొనవలసిన విధి యిది. పొడుగు కఱ్ఱలకు చివర గుడ్డలను చుట్టి చాకళ్లు తెల్లవారువరకును రంగపురోభాగమున గడకఱ్ఱల నానుకొని కాగడాలను వేయుదురు. కాగడాల దీపములు పోయిన వెనుకనే అక్షిరోగములు ప్రబలమయిన వని పెద్దల వాదము. నాటకములకు ముందు కాగడాల దీపములు

వేయించుట, ఒక్క దినములోనే అక్షిరోగములు వచ్చు నని కాదు. తదితరము లను దీపవిధానములు గ్రామములయం దలభ్యములు. విద్యుచ్ఛక్తి దీపము లక్కడ కెట్లు వచ్చును ? ఇప్పుడు లేనియాళ్లకు ఇరుగుపొరుగున నున్న గ్రామములనుండి 'గ్యాసు లైట్లు' తెప్పింపబడుచున్నవి. రంగమునకు పైని క్రింద ను ప్రతిబింబదీపములతో వారికి పని లేదు.

కూచిపూడివారి రంగముల గందు గ్యాసులైట్లు ఇపు డుపయోగింపబడినను వారు వేషములు వైచి కొను గదులలో నాముదపు దీపము తప్పక యుంచు కొందురు. ఆముదపు దివ్వెయొక్క చక్కని జ్యోతిలో అద్దములయందు ముఖబింబములు సుస్పష్ట ముగా నగపడు నందురు. వా రుపయోగించు రంగులు ఆముదపు దీపముల కళలలో విచిత్రముగ ప్రకాశించు ననియు, తదితర తైలదీప జ్యోతులలో అంతగా ప్రకాశింపవనియు వా రందురు. అందులకే కాబోలును, పూర్వులు ఆరోగ్యదాయకములు, శోభాకరములు నగు కాగడాల దీపముల నుపయోగించెడువారు. అదియు గాక 'గ్యాసులైట్లు మొదలగు దీపములు' వేడిఎక్కువైనచో పగిలి సమీపమున గూర్చుండి యున్న సామాజికుల కుపద్రవములు తెచ్చిపెట్టు నను భయము పూర్వులకు పోయియుండదు. ఇంతటితో కూచిపూడి వారి రంగము సర్వాంగములతో కూడుకొని సుందర మయినదని చెప్పవచ్చును.

దివాకర్ల రామమూర్తిగారి వ్యాసమునుండి

[గ్రంథాలయసర్వస్వము]

---

## అంకారానగరము

### (టర్కీ దేశపు రాజధాని)

ఎన్నాళ్లనుండియో కలలుగనుచుండిన 'గంధర్వనగరము' ఇప్పటికి తయారయినది. ఆధునికవాస్తు శిల్పమునకును, నగరనిర్మాణ ప్రణాళికకును గొప్పనిదర్శనమై, కాగడాపెట్టి వెదకినను యావత్ప్రపంచమున సాటిలేదనిపించుకొనగల తాహతుపొంది అది ఆసియా మైనరులో నేడు విరాజిల్లుచున్నది. పుట్టి యింకను పండ్రెండేండ్లయినను 'సమ్మసరి'గా కాలేదు. అప్పుడే అది యందరిదృష్టికి కేంద్రమయినది. ఇసుక యెడారిగా నుండిన యొక గ్రామభాగము నేడొక సుందరమైన నగరముగా వెలసినది: అది టర్కీకి రాజధానీనగరమగు అంకారానగరము.

టర్కీషు రిపబ్లికు అధ్యక్షుడును, నూతన టర్కీకి నిర్మాతయు నగు కెమాల్ అటాటర్కు ప్రభుత్వపీఠమును ప్రాత రాజధానీనగరమగు ఇస్తాంబుల్ నుండి ఆసియాలోని యొక గ్రామమగు అంగోరాకు మార్చినప్పుడు అందరును ఆశ్చర్యపడిపోయిరి. క్రొత్త రిపబ్లికును ప్రాతనగరమునుండి పరిపాలింపకపోవుటకు కెమాలునకు ప్రబలకారణములు లేకపోలేదు. మసీదుల తోను, అంతఃపురములతోను నిండిపోయిన ఇస్తాంబుల్ నగరము ప్రాచీన మహమ్మదీయ కళావైభవమునకు నిదర్శనముగా నుండెను. దానిని క్రొత్తపంథాలోనికి మారిపించుట కెమాలునకు కష్టమనిపించెను. అందలి భవనములును, స్మృతిచిహ్నములును అన్నియు నిరంకుశపాలనము చేయుచుండిన కాలిఫులనాటి సంప్రదాయములను, స్మృతులను, భావములను వ్యక్తపరచునట్టి చిహ్నములుగా నుండెను.

వానిని సర్వనాశనము చేయుట అంతమంచిపని కాదు. కాని రాజ్యనిర్మాణపద్ధతి, శాసననిర్మాణవైఖరి, సాంఘిక-సాంసారిక జీవితములు సకలమును సరిక్రొత్త నడకలతో నడుపబడుచుండు నొకదేశమునకు అంగుళమంగుళమందును ప్రాచీన సంప్రదాయములే-చరిత్రవైన నేమి, మతమువైననేమి - ప్రతిబింబించుచున్న ప్రాచీన నగరము రాజధానీ నగరముగా నుండుటకు ఎవడొప్పును? అందులోను - కెమాలును, అతని ప్రభుత్వమును నిరసించుచుండు సంప్రదాయముల మధ్య మరల తలదూర్చుటకు ఏయభిమానస్థుడు సమ్మతించును ?

కాబట్టి ఘాజికి ఆసియాలోని ఈ చిన్నయెడారి గ్రామము రాజధానీ నగరముగా నుండుటకు తగినదిగా తట్టెను. వెంటనే వలయు సన్నాహములు చేయబడెను. అమెరికా యూరపుల నగరనిర్మాణ ప్రణాళికలను ఆలోడనచేసి, వీలైనంతవరకు తదనుగుణముగానే నిర్మాణమా

రంభింపబడెను. కొన్ని యేండ్లలోనే ఆ కుగ్రామము నేటి గొప్ప సుందరనగరముగా మార్పుచెందెను.

ఆకాశమునంటు సౌధభవనములతోను, మనోహరములైన క్రీడావనములతోను, విశాలమైన వీథులతోను ఆనగరము కన్నులకానందము గొలుపుచుండును. నగరమున కంతటికిని నీటిని సరఫరాచేయుటకు తగినన్ని జలాధారములు కల్పింపబడియున్నవి. అన్నివిధములను అంకారానగరము అలకానగరమును తలపించుచున్నది.

నగరము మొత్తము మూడు భాగములుగా విభజింపబడియున్నది: జనులనివాసములు; వాణిజ్యభవనములు; పారిశ్రామికాగారములు. నివాసభవనములు, ప్రభుత్వసంస్థలభవనములు అన్నియు నేకరూపముగా తయారయి ఆధునికములలో నాధునికమగు వాస్తుశిల్ప సంప్రదాయములను ప్రదర్శించుచున్నవి. భవనము లన్నియు చదరముగానుండి సర్వసాధారణ మయిన రూపముతో చూడ మచ్చటగొలుపుచుండును. ఈనగరము చంకాయ పర్వతముయొక్క అడుగువరకును వ్యాపించియున్నది. కొండ అడుగునుండి వరుసగా కొండపైవరకు ప్రభుత్వ భవనములు కట్టబడియున్నవి. అన్నిటికంటెపైన కొండ కొనకొమ్మన కెమాల్ అటాటర్కుయొక్క విల్లా ఉన్నది. అదియొక లోకమోహనమైన ప్రాసాదము.

సుందరభవనసంపద యొక్కటే కాదు అంకారాకు అంత గొప్పదనమును తెచ్చిపెట్టినది. కెమాలు అధికారమునకు రాకపూర్వము టర్కీదేశపు పట్టణములందు కుందేటికొమ్ముగా నుండిన ప్రతిమాశిల్పసంపద నేటి మహమ్మదీయ రాజధానీనగరమందు వెల్లివిరియుచున్నది. మహమ్మదు ప్రవక్త తన యనుయాయులకు మానవాకృతినిగాని, చివరకు మానవముఖమునుగాని చిత్రములందును, శిల్పమునందును ప్రదర్శింపనే ప్రదర్శింపకూడదని సుగ్రీవాజ్ఞ చేసియుండెను. అందువలననే యీ రెండు కళలును మహమ్మదీయదేశములందెక్కడను కనిపించవు. మసీదులలోగాని, ఇండ్లలోగాని, వస్తుప్రదర్శనశాలలందుగాని మచ్చునకైన ప్రతిమాశిల్పము, చిత్రములు మనకు కనబడవు. మహమ్మదీయకళావేత్తలు తమనైపుణిని ప్రదర్శించుటకింక నెన్నియో రంగముల నాశ్రయించుచుండిరి. కాని మానవరూప చిత్రణము మట్టుకు చిత్రకళయందుగాని, శిల్పకళయందుగాని మహాపాతకముగా నెన్నబడుచుండెను. పదునేనేండ్ల యనంతరము ఇప్పుడు అంకారాలో నేమూలజూచినను విగ్రహశిల్పములు కనబడుచున్నవి. అంకారాలోనే కాక టర్కీలోని ప్రతి పట్టణమునందును, పల్లెయందును అధ్యక్షుని శిలాప్రతిమలు వందలకొలది నేడు చూడనగుచున్నవి. ఇవి అధ్యక్షుని పిచ్చుకు కాక అతని ధైర్యసాహసములకును, సంస్కరణబుద్ధికిని ప్రమాణమైయున్నది.

అంతకుముందుండిన నిషేధశాసనమును తొలగించుచు కెమాలు చిత్ర, శిల్పములయందు ప్రతిమాకృతులను బాహాటముగా ప్రోత్సాహపరచుట కారంభించిన క్రొత్తలో నందరు నతనిని తిట్టిపోసిరి. ప్రాచీనసంప్రదాయములను వదలుకొనుట ఆ దేశస్థులకు కంటకప్రాయముగానుండెను. కాని కెమాలు పట్టినపట్టు వీడలేదు. మంచిపేరుగల శిల్ప, చిత్రకారులను పిలిపించి తనయొక్క విగ్రహశిల్పములను పెక్కులను తయారుచేయించి, ఆ విగ్రహములను రాజధానిలోను, తక్కినపట్టణములందును గూడ మూలమూలలలోను స్థాపింపజేసెను. బహిరంగస్థలములందంతటను ఈ విగ్రహములను చూచుచువచ్చిన, నవ్యవాసనలుగల ప్రతివాడును అదిమొదలు ఆతని అడుగుజాడలనే పట్టిపోవజొచ్చిరి ఇంటింట కెమాలుయొక్క అర్థాంగవిగ్రహమును గలిగియుండుట ఇప్పుడాదేశములో నొకపరిపాటి యయినది.

ఈ కళలయందు చక్కని కౌశలమును బడయుటకై టర్కీయువకులకు చాలినన్ని సౌకర్యములు సమకూర్చుచు కెమాలు గొప్ప ప్రోత్సాహమిచ్చెను. ప్రతిమాచిత్రణముగాని, ప్రతిమాశిల్పముగాని కుందేటికొమ్మయియుండిన టర్కీలో నిప్పుడు ఇస్తాన్‌బుల్‌లో ఒక లలితకళాపరిషత్తే స్థాపింపబడి కళాసంపదను వెదజల్లుచున్నది. యువతీయువకులు వేలకొలదిగ నాపరిషత్తులో పాల్గొని కళాసేవ చేయుచున్నారు.

నగరనిర్మాణపద్ధతులందుకూడ కెమాలు క్రొత్త దారినే త్రొక్కినాడు. అందులోగూడ ప్రాచీన వైఖరులు ఆతనికి 'సుతరాము' నచ్చలేదు. వానిని దిద్ది తీర్చి, క్రొత్తరూపములనిచ్చుట అంతకంటెను నచ్చ

లేదు. కావున దేశదేశములను సూక్ష్మదృష్టితో విలోకించినాడు. ఏయే వైఖరి తనకుబాగుగ తోచినదో ఆయా వైఖరుల నన్నిటిని అనుకరించి తన నగరమును భూలోకస్వర్గముగ నిర్మింపజేసినాడు. ఈ విషయమునందును అతడు సంప్రదాయబద్ధులను లెక్కచేయు లేదు. రాజ్యాంగ విధానమునందుకూడ నూతనత్వమును ప్రదర్శించి, ధర్మసమ్మతమని తనకుతోచిన రాజ్యతంత్రమును స్వీకరించినాడు.

అతడు క్రొత్తగా ప్రవేశపెట్టిన విద్యావిధానము గూడ నవ్యవాసనలుగలదై హేతువాదబద్ధమైయున్నది. అమెరికా, యూరపులందలి విద్యావిధానముకూడ దీని ముందు దిగదుడుపుగా చెప్పుచున్నారు. టర్కీలోని— అంగోరాలోని— ప్రతివిద్యాసంస్థయు రమణీయములైన పూలతోటలమధ్యలో నిర్మింపబడి, సాంకేతిక విద్యలకు కావలసిన పరికరములన్నిటితోడను, ఆరోగ్యపారిశుద్ధ్య సౌకర్యములతోడను నిండియున్నవి. వానిలో ముఖ్యముగా పేర్కొనదగినది ఇస్మెట్ ఇనోనుపాఠశాల. అందులో బాలికలకు, స్త్రీలకు తమజీవితములో కావలసివచ్చు ప్రతియంశమును నేర్పబడుచున్నది. వంటచేయుట, కుట్టుపని, దుస్తులు తయారుచేయుట, శిశుపోషణ, ఆపన్నసపర్యలు, తదితరములైన యంశములు ఎన్నియో బాలికలాపాఠశాలలో నేర్చుకొనుచున్నారు. తాము నేర్చుకొన్న విషయముల నితరులకు బోధించుట కవసరమైన పరిజ్ఞానమును వారు గడించుచున్నారు. పాఠశాలలో విద్య ముగిసినంతనే వారందరును పాటకజనమున కవే విద్యలను నేర్పుటకు పల్లెటూళ్లకు పంపబడుచుందురు.

చదువు నేర్చుకొనగోరు యువతులకు అక్కడి విశ్వకళాపరిషత్తు అన్ని భాగములకును ప్రవేశమిచ్చుచున్నది. ఇది నేర్వవచ్చును, అది నేర్వగూడదు అను నిర్బంధములు ఇతరదేశములం దక్కడక్కడ నుండునట్లు అక్కడలేవు. స్త్రీవిద్య నానాటికిని హెచ్చిపోవుచున్నది. ౧౯౨౩ నుండి ౧౯౩౩ లోపల ప్రాథమికపాఠశాలలకు పోవు బాలికలసంఖ్య ౫౦౦౦౦ నుండి ౨౦౧౦౦౦ కు పెరిగెను; ఉన్నత పాఠశాలలకు పోవువారి సంఖ్య ౭౫౦ నుండి ౧౧౧౫౦౦కి హెచ్చెను. ఇట్లే కళాశాలలకు పోవువారి సంఖ్యలోకూడ పూర్వమునకును ఇప్పటికిని చాల అంతరము కనబడుచున్నది.

మగపిల్లలకుగూడ అనేకపాఠశాలలు గలవు. ప్రతియొక వాణిజ్యమును నేర్పుటకును పాఠశాల లేర్పరుపబడియున్నవి. అందులో వ్యవసాయకళాశాల ప్రత్యేకముగా పేర్కొనదగినది. అది విశాలమైన ఒక బయలులో పండ్రెండు ప్రత్యేక ప్రత్యేక భవనములుగా నిర్మింపబడియున్నది. భౌతిక, రాసాయనికాది పరిశోధనలకు అందులో ప్రత్యేక భవనములుగలవు. ప్రయోగశాలలుగాను, పశువులమేతకును, పాలు, పెరుగు, వెన్న, మీగడ మొదలైనవి తయారుచేయుటకును కొన్నిభవనములు ప్రత్యేకింపబడియున్నవి. పశువుల శస్త్రచికిత్సకు గూడ ఏర్పాట్లుగలవు.

ఈ కళాశాలలోని ఉపాధ్యాయులందరును దాదాపు జర్మనీవారే. బాగుగా వ్యాప్తిలోనుండు పరభాషలు మూడు: జర్మను, ఇంగ్లీషు, ఫ్రెంచి. కాని టర్కీభాషావిషయమై కెమాలు అశ్రద్ధచూపుట లేదు. టర్కీభాషలో అరేబియనుమాటలును, పర్షియను మాటలును వేనవేలు గలవు. కెమాలు భాషావిషయములో గూడ క్రొత్తసంస్కరణమునకు ఆరంభించినాడు. భాషాచరిత్రవేత్తలను ప్రోత్సహించి వేరువేరు మండలములందు ప్రచారములోనుండు భాషాశైలులను అన్నిటిని సమకూర్చి, పరిశీలించి, విమర్శించి ప్రమాణముగా నుండదగిన యొక టర్కీకోశమును తయారు చేయవలసినదిగా కోరినాడు. దేశములో ప్రకటింపబడు పత్రికలన్నియును ప్రతివారము తమభాషలోనికి దొర్లిపోయివచ్చిన అరబ్బీ, పర్షియనుమాటల పట్టికలను ప్రచురించుచు, వానిస్థానమున నుపయోగించుటకు తగిన క్రొత్త టర్కీమాటలను సూచించవలసినదిగా పాఠకులకు విన్నపములు చేయుచుండును.

నూతన టర్కీలో బాలబాలికలు ఉభయులును కలసిచదువు విధానము గలదు. టర్కీలిపి పిల్లలకు చాల శ్రమసాధ్యమైనదగుటచేత దానికిబదులు లాటినులిపినే కెమాలు ప్రవేశపెట్టవలసినవాడాయెను. టర్కీలిపికి అటువంటి గతి యుండినందుచేతనే పూర్వమక్కడ నిరక్షరాస్యత ప్రబలముగానుండెను. నూతన టర్కీలో దానిని సమూలముగా పోగొట్టుటకు ప్రయత్నింపబడుచున్నది.

ముసలివారు గూడ సాయంకాలపు తరగతులకు పోయి నూతనపద్ధతుల ప్రకారము వ్రాయను, చదువను నేర్చుకొనుచున్నారు.

టర్కీ దేశపు బాహ్యస్థ రూపమును, తత్త్వమును కూడ ఇట్లు కెమాలు మార్చివేసినాడు. చాలమట్టుకు నిరక్షరాస్యతను రూపుమాపినాడు. పురుషులతో బాటు సమాన స్వత్వములను స్త్రీలకు ప్రసాదించినాడు. కాని ఒక సంస్కరణను ప్రవేశపెట్టుటకు మాత్రము కష్టపడుచున్నాడు: టర్కీటోపీ (ఫెజ్) అతనికొక సమస్యయై పోయినది. దానిని తొలగించలేకున్నాడు. పడమటి దేశముల హ్యాటును ఉపయోగించుట అవమానకరమైనదిగా దేశస్థులు గోలపెట్టుచున్నారు. ఆత్మాభిమానము గల యేటర్కీ దేశస్థుడును పడమటి సంప్రదాయమగు హ్యాటుకు సమ్మతింపకున్నాడు.

అందుకు ఒకయెత్తు ఎత్తినాడు. తన యుదాహరణతోనే ఆప్రకరణమున కంకురార్పణ చేయవలెనని సంకల్పించినాడు. సభలకు సమావేశములకు వెళ్లినప్పుడు తాను హ్యాటును పెట్టుకొనియే పోవనారంభించినాడు. కెమాలు ఏమిచేయునో అదియే మేలుబంతి టర్కీకి! అంతతో అతని సంకల్ప మీడేరినది. మొట్టమొదట అతని అనుచరబృందము నాయకుని ననుకరింప దొడగెను. వారిని చూచి మరికొందరు. ఇట్లు పోయిపోయి యిప్పుడా దేశములో ప్రతివాడును హ్యాటుధరించువాడే.

క్రమముగా స్త్రీ ప్రపంచమున పరదాపద్ధతియు ముసుగులును కూడ తొలగిపోయెను.

టర్కీలో ప్రబలిపోయివచ్చుచున్న మార్పుల నన్నిటిని రాజధానీ నగరమగు అంకారా స్పష్టముగా చాటుచున్నది.

---

లండను—'ఇండియా హౌస్' లోని కళాసంపద



ఈ దేశమునుండి లండనుకు పోయివచ్చువారు ఒకప్పుడుగాకపోయిన మరియొకప్పుడైనను – పనియుండియో, లేక వట్టిచూపులకొరకో 'ఇండియా హౌసు'కు వెళ్లి చూచిరాకమానరు. ప్రభుత్వ కార్యాలయ మను

దృష్టితోగాక దర్శనీయమయిన భవన మను దృష్టితోనే చాలమంది అక్కడికి వెళ్లివచ్చుచుందురు.

ఏదైనను ఒకమాట కర్థముకావలసి నిఘంటువును చూచునప్పుడు మనకు ఇదితరములైన మాటలమీదికిని, విషయములమీదికిని దృష్టిపారి, అసలు చూడదలచు కొన్న మాటసంగతి కట్టిపెట్టి ఆ పెరమాటలను, విషయములను పరిశీలింప గోరిక పుట్టునట్లే ఈ 'ఇండియా హౌసు'కు వెళ్లువారుగూడ పోయిన పని మానుకొని అందలి రమణీయమయిన భాగములను, దర్శనీయమయిన వస్తువులను చూచుచుపోయి, భారతీయ కళల యొక్కయు, భారతీయ పరిశ్రమలయొక్కయు గొప్పదనమును చూచి చూచి మురిసిపోకమానరు.

ఈ భవనమును కట్టినది సుప్రసిద్ధ శిల్పియగు సర్ హెర్బర్ బేకర్ అను పాశ్చాత్యుడు. అతడు పాశ్చాత్యుడే కాని ప్రాచ్యశిల్పము నవగాహనచేసుకొని, భారతీయమహత్వమును సంపూర్ణముగా ప్రదర్శింపవలయు నను నాదర్శముతోనే యీ భవనమును నిర్మించినాడు. ఈ నిర్మాణములో అలంకరణ భాగమంతయు భారతీయ శిల్ప సమంచితముగానే చేయుటలో నాతనికి పట్టుదల యుండినట్లు కన్పించుచున్నది.

బాహ్య స్వరూపమునందు పరిసరముల ప్రభావము వలన కొంత వేరుపాటు గోచరించుచున్నను లోపలి నిర్మాణమున శిల్పికి ఆదర్శమును మీరవలసినంత అడ్డంకులు వచ్చినట్లు తోచదు. ఆ భవనములోనికి ప్రవేశించిన తక్షణమే భారతీయ వాతావరణము మన మనస్సును ముంచెత్తివేయును. గోడలకును కప్పునకును అమర్చిపెట్టిన వర్ణచిత్రములు చూపర మనస్సులను భ్రమింపజేయక మానవు. ఆ చిత్రములన్నియును భారతీయ చిత్రకారుల సృష్టియే. భవనములోని స్తంభములు ఎఱ్ఱని ఇసుకరాతితో మలచబడినవి. చిల్లరముల్లర నిర్మాణము చలవరాతి మయము. కొయ్యపనులకును, ఆసనాది పరికరములకును హిందూదేశపు రకరకములైన మ్రానులుపయోగింపబడినవి. ఇట్లు సర్వవిధములుగాను 'ఇండియా హౌసు' భారతీయ వాతావరణమును ప్రదర్శించుచున్నది.

ఈ భవనములోనే భారతదేశముయొక్కయు, భారతీయ ప్రజలయొక్కయు సర్వ వ్యవహారములును పరిశీలింపబడి నిర్వహింపబడుచుండును.

భారతీయ కళలకును, భారతీయ శిల్పమునకును, భారతీయ పరిశ్రమలకును, వేయేల-భారతదేశపు మహత్త్వమునకే ఇది యొక మచ్చుతునుకయని యీ భవనమును చూచివచ్చినవారు చాలమంది పొగడియున్నారు.

[టైమ్సు ఆఫ్ ఇండియా పేక్]





# భారతీయ మహిళా మండలి



శ్రీమతి డి. హేమలత, బి ఏ

ఈమె కాశీ హిందూ విశ్వవిద్యాలయమున చదివి సంగీత గృహనిర్వహణ శాస్త్రములందు పట్టమునుపొందెను. కర్ణాటక హిందూస్థానీ సంగీతములం దీమె గడించిన ప్రావీణ్యమునకు ప్రత్యేకముగ బహూకృతయయ్యెను. వీణావాదనమున నీమె కడు ప్రవీణ. తన యెనిమిదవ యేటినుండి 'పాట కచేరీలు' చేయుచుండెను. ఈమెప్రాయ మిపు డి[illegible]



నివాసులు దామర్ల గోపాలరావుగారి కీమె కూతురు; దర్శి సుభద్రమ్మగారికి చుట్టము.

---



శ్రీమతి చందావతికన్య

మదనపల్లి బాలికాపాఠశాల ప్రధానోపాధ్యాయురాలు. ఈమె బెంచికోర్టుకు ప్రెసిడెంటుగా నియమింపబడెను.




లలిత (కుడి), పృథ (ఎడమ)

వీరు జె. సి. కుమారప్పసోదరుని కూతుర్లు. ఆర్థికశాస్త్రమునందు ప్రావీణ్యమును గడించుటకయి అమెరికాకుపోయిరి. కార్నెలు, వెలెస్లీ విశ్వవిద్యాలయములందు చదువుదురు.

---

# సింహళద్వీపపు ప్రాచీనపట్టణములు

## అనూరాధపురము : పోలన్నరువ

సింహళద్వీపమునందు ఇప్పుడు అడవులతో నిండిపోయియుండు నొకానొక భాగమున రెండు వేలయేండ్లకు పూర్వము లండనంత పెద్దది ఒకపట్టణముండెను ఆపట్టణములోనికెల్ల నత్యున్నతమైనది బ్రేజన్ ప్రాసాదము. అది తొమ్మిదంతస్తుల కట్టడము. అందలి అభయ గిర్యదాగాబా లండనులోని సెంటుపాలు చర్చి శిఖరమునకంటె ౫౦ అడుగులు పెద్దది ; ఆదాగాబాలోని ఇటికలతో ఇప్స్విచ్ వంటి యొక పట్టణమునే



పోలన్నరువలోని యొకానొక సభామందిరము



పోలన్నరువలోని 'పుష్ప పూజాపీఠము'

కట్టవచ్చును. ఆపట్టణములో నొక్కటేయొక వీథి ఉత్తర ద్వారమునుండి దక్షిణద్వారమువరకు సుమారు ౧౬ మైళ్లదూరము వ్యాపించియుండెను. ఆ ఒక్క పట్టణమందలి జనమే ఇప్పటి సింహళద్వీపము మొత్తము యొక్క జనసంఖ్యను మించియుండెను. నున్నని నల్లరాతితో కట్టబడిన స్నానతటాకములు కట్టడము యొక్క బలిమివలన నిప్పటికిని చెక్కుచెదరక నిలిచి యున్నవి. రోగులు చికిత్సలు పొందుటకు ఆస్పత్రులును, బీదలకు అన్నపాన గృహములును ఆపట్టణములో పెక్కు లుండెను. దూరమునుండి చూచువారికా నగరమునందలి మధ్యభాగము భూలోక సూర్యబింబమువలె కనబడుచుండియుండవచ్చును. ఏలన : బ్రేజన్ ప్రాసాద మంతయును ఇత్తడిరేకులతో కప్పబడియుండెను; లోపల, అందలి ౯౦౦ గదులను నిలుపుచుండిన స్తంభములకు రాగిరేకుల తాపటము వేయబడి



అర్ధ వలయములగు చంద్రకాంతశిలలు దేవాలయముల ముందును, అవశేషగృహముల ముందును అమర్పబడి యుండుతీరు

యుండెను; ప్రాసాదము యొక్క నడిమిభాగమున నున్న దంతపు సింహాసనమునకు బంగారుతో సూర్యుడును, వెండితో చంద్రుడును, ముత్యములతో నక్షత్రములును అలంకరింపబడియుండెను ఇన్నిటికాంతి యెంతయుండగూడదు !

నగరపు వెలుపలి పరిసరములందు అనేక పుష్పవాటికలుండెను. వానిలో పండుగపర్వదినములందు దేవాలయములకును, వీథులకును, దాగాబాలకును అలం



పోలన్నరువనుండి వెంగవట్రిప్పి నిలిచిన పరాక్రముడు

కరించుటకు ఉత్తమమైన రకరకములైన పుష్పములు పెంచబడుచుండెను. అనేక సందర్భములందు, అతిపవిత్రముగా తలంపబడుచుండిన బుద్ధుని జత్రు అస్థితో వేయుచుండిన యొక దాగాబా ఆపాదమస్తకముగా కమలములతోను, జాజిపూవులతోడను, ఇంక నెన్నియో ఉత్తమమైన పూలతోడను నింపివేయబడుచుండెను. ఇటికల పిండములగు ఈదాగాబాలే చుట్టుముట్టునుండిన ఇతరనిర్మాణములకంటెను బలవత్తరములై చాల కాలము చెక్కుచెదరక నిలువగలిగి మన కిప్పటికిని కనబడుచున్నవి. ఆనగరపు శిథిలము అసలురూపముతో నిలిచిన దిది యొక్కటే.



కాశ్యపుని సభామందిరము

ఈ పుష్పవాటికల కవతలనుండిన విశాలములైన వరిపొలములకు నీటిపారుదలవసతులు సమృద్ధిగా చేయబడుచు వచ్చుచుండెను. లంక—ఇది సింహళమునకప్పటి పేరు—యందంతటను అప్పటి రాజులు యథేష్టముగా కాలువలు మొదలైన జలాధారములను కల్పించియుండిరి. ఇప్పుడనిన ఈ ద్వీపము తన ప్రజలకు కావలసిన వరిబియ్యమును అపారముగా దిగుమతిచేసుకొనుచున్నది గాని ఆరోజులలో నిది అపారమైన తన జనసంఖ్యకు కావలసినన్ని యాహారవస్తువులను పండించుచుండినదే కాక అందులో చాలభాగము ఎగుమతికూడ చేయగలుగుచుండెను. ఆద్వీపముయొక్క సంపదయంతయు రక్ష

'గలవిహారము' దగ్గర నమర్పబడియుండు బుద్ధుని శయనవిగ్రహము



ములయందే యుండెను. దేశదేశములనుండియు ననేకులు వచ్చి పట్టుబట్టలు, కంబళ్లు, తివాసీలు, చందనవస్తువులు మొదలయినవి విక్రయముచేయుచు కెంపులు, పచ్చలు, ముత్యములు మొదలైన విలువగలవస్తువులను కొల్లగొట్టు కొనిపోవుచుండిరి.

లంకకు రాజధానీనగరమైన అనూరాధపుర మింత మహోన్నతమైన వైభవముతో దాదాపు పం డ్రెండు శతాబ్దము లుండెను. ఇండియానుండి సింహళీలు మొట్టమొదటిసారి ఆ ద్వీపమును ప్రవేశించి అక్కడ నంతవరకునుండిన ఆదిమవాసులను (ఇప్పుడు వారికి వెడ్డాలనిపేరు) అరణ్యములకు తరిమివేసి ఆక్రమించిన తర్వాత నొక శతాబ్దమునకు క్రీ. పూ. ౪౩౭ లో అనూరాధపురము నిర్మింపబడినది.



'గలవిహారము' నందలి బుద్ధవిగ్రహము



'గలవిహారము' దగ్గర నుండు బుద్ధుని శయన విగ్రహమును కావలి కాయుచున్న ఆనందుని 24 అడుగుల యెత్తు విగ్రహము

క్రీ. పూ. మూడవ శతాబ్దములో ఇండియా నుండి మహిందో అను నొక మత ప్రచారకుడు ఆద్వీపమునకు వెళ్లి అప్పుడు దాని నేలుచుండిన తిస్సా అను రాజును నమ్మించి బౌద్ధమతములోనికి మార్చివేసెను. తిస్సా మతము మార్చుకొన్న వెంటనే ఆక్రొత్త మతములో తనకు కుదిరిన భక్తిప్రపత్తులకు చిహ్నముగా అనేక దేవాలయములను, సంఘారామములను, మొట్టమొదటి దాగాబాను నిర్మించెను. నగరమందలి పవిత్ర

అవశేష గృహములకును, దేవాలయములకును సోపుద్వారములవుం దమర్పబడి యుండు, అర్ధవలయాకారముగల చంద్రకాంత శిలలందలి శిల్పసంపదతీరు





క్రీడాసరోవరము, అనూరాధపురము.
క్రీ. పూ. ౪౩౮ నాటి సింహళరాజధానులలో
పెద్దది.

మధ్య భాగము చుట్టును ఎల్లలను నిరూపించుటకై తిస్సా బంగారు నాగకిలి ఏసుగులను కట్టి, ఆ నాగలి చాలుతోనే గుర్తులు పెట్టించెను. అది యొక ఉత్సవముగా మహావైభవముగా జరిగెను. ఆ పరిహద్దుచాలు ముగియునప్పటికి భూమి కంపించినదట. అతని రాజ్యకాలములోనే క్రీ. పూ. ౨౫౮ లో బోధిచెట్టు యొక్క ఒకకొమ్మ సింహళ ద్వీపమునకు గొనిపోబడెను. నీడలు చాల పొడుగుగా వ్యాపించునటువంటి వేళలో అది అనూరాధపురమును చేరినది. వెంటనే యది ౮౦ మూరలయెత్తున కాకాశమున కెదిగినదట. అది కాక ఆరువర్ణములుగల ఒక పరివేషమునుగూడ కల్పించినదట. వెంటనే యది తనంతదానే భూమి కణగిపోయినదట; అప్పుడుకూడ మరల భూమి కంపించినదట; కారుమబ్బులు ఏడురోజులపాటు దానిని కప్పియుండెనట. ఈబోధి వృక్షమునకు ఇప్పుడు వయస్సు...



ఇంకను అది జీవించియే యున్నది. పసుపు పచ్చని వస్త్రములను ధరించిన బౌద్ధసన్యాసు లిప్పటికిని దానిని కావలికాయుచున్నారు. వేలకొలది యాత్రికులు ప్రతిదినము వెళ్లి దానిని పూజించి వచ్చుచున్నారు.

సింహళీలు మొత్తముమీద మతమునందు మంచి విశ్వాసముగలవారు; శాంతస్వభావులు; కళలయందు గట్టి పట్టుదలగలవారు. వారి ఉత్తమనాగరికత యంతయు తరువాతతరువాత ఇండియానుండి లంకమీదికి దాడివెడలిపోయిన క్రూరజాతుల కాహుతి యయిపోయినది. ఎంత మేధాసంపదయున్న నేమి, ఎన్ని సౌకర్యములున్న నేమి, సింహళీలు, పాపము, తమ దేశమును కాపాడుకొనలేకపోయిరి. వారిలోవారి కుండు మనస్పర్థలును, కలతలును, దురాలోచనలను తప్ప ఈ విపరీత పరిణామమునకు వేరు కారణమేదియు కన్పించుటలేదు.

ఇటువంటి ప్రవర్తనకు చక్కని యుదాహరణము కాశ్యపునికథ. అతడే సిగిరియాయను శిలాదుర్గమునకు నిర్మాపకుడు. క్రీ. శ. ౪౫౯ లో, చాలకాలము తమిళబలగముతో హోరాహోరి పోరాడినతర్వాత, ధాతుసేన డనురాజు సింహాసనమునకు వచ్చెను. ధాతుసేనుని కొకకూతు రుండెను. ఆమె నతడు తనబంధువర్గములోనివాడేయయిన తన సేనాధిపతి కిచ్చి పెండ్లిచేసెను. కాని యల్లుడు కూతురును నానా హింసలుపెట్టుట విని, తగనికోపముతో నాయల్లుని తల్లిని జీవములతో కాల్చి

శిగిరియా పర్వతముపైకి పోవుటకు కట్టించిన గ్యాలరీలు





శిగిరియా పర్వత దుర్గము

చేయవలసిన దని యుత్తరువు చేసెను. అంతతో అల్లునికి అరికాలిమంట నెత్తికెక్కి, అతడు పడగద్రొక్కిన త్రాచువలె విజృంభించి ధాతుసేనుని జ్యేష్ఠకుమారుడగు కాశ్యపునితో మంతనములాడి, కుట్రలుపన్ని, తిరుగుబాటు చేసెను. ఇరువురును చేరి ధాతుసేనుని పట్టి బంధించిరి. క్రమేణ నిద్రాహారములు లేక ధాతుసేనుడు చిక్కి శల్యమై జీవితము విరమించెను. కాశ్యపుడు సింహాసనమునకు వచ్చెను.

అపమృత్యువు పాలయిన ధాతుసేనుని కడగొట్టుకొడుకు, మొగల్లన అనువాడు, వారిద్దరిమీదను పగబూని, ఎట్లయినను పితృహంతను మార్తునని శపథముపట్టి, క్రూరకర్ములపాత్రు అట్టిపరిస్థితులలో మంచిదికాదని యెంచి ఇండియాకు పారివచ్చెను. కాశ్యపుడు సేనాధిపతి యిచ్చకములకు లొంగిపోయి సాహసించినాడే కాని తన పాపకృత్యమే తనకళ్లెడల కనబడుచుండగా, తమ్ముడెక్కడ మీదబడి పగతీర్చుకొనునో యను భయమొకవైపు పీడించుచుండగా అనూరాధపురమును విడిచిపోయి, సిగిరియా అను కొండకొమ్ము చేరుకొని అక్కడనే యొకప్రాసాదమును, దానిచుట్టును శత్రువులకభేద్యమైన ఒకదుర్గమును నిర్మించుకొనెను. కొండచివరకు మెట్లవరుసలను గ్యాలరీలవలె చెక్కించి గట్టి సున్నముతో గోడలను కట్టించినాడు. ఆ గోడలు ౧౫౦౦ ఏండ్ల తరువాత ఇప్పటికిని క్రొత్తలో నెట్లుండెనో అట్లే యున్నవన్న ఆగారబలిమి యెంతో శ్రేష్ఠముగా చెప్పవలసినది లేదు.

లో నొకచోట ఒకకావలిగదిలో గచ్చుమీద కొన్ని రంగులచిత్రములు గలవు. ఆరంగులు బొమ్మలుచిత్రించిన క్రొత్తలో నెంతకాంతిమంతములుగా నుండెనో ఇప్పటికిని అదే మెరుగుతోనే యున్నవి. ఆబొమ్మలన్నియును నడుమువరకు నగ్నముగా నుండి సొమ్ములు దిగవేసుకొన్న యువతీమణులవి. ఆ బొమ్మలను చిత్రించిన చిత్రకారు డెవడో తెలియరాదు. అహోరాత్రములు విరామములేక కావలికాయుచుండిన రక్షకపురుషులు ప్రొద్దుపుచ్చుటకై చేసినపని యది యని చెప్పెదురు. దినవభాగమున స్నాన తటాకములు లేక స్నానపు గదులు, దేవాలయములు, సభామందిరములు మొదలైనవానిని కొండలోనే చెక్కించి పెట్టినాడు.

ఎట్లయిననేమి మొగల్లన మాటనిలుపుకొన్నాడు. ఇండియాలోనే యత డొక సైన్యమును సమకూర్చుకొని, సింహళముమీదికి దండెత్తి కాశ్యపుని కయ్యమున కీడ్చినాడు. కొండదిగువ ఉభయసేనలును పరస్పరము

క్రీ. శ. ౩౧౧ సం. లో సింహళమును జేరిన బుద్ధుని దంతములుంచబడిన నిర్మాణము





అనూరాధ పురమునందలి 'ఇసురుముని య' దేవాలయములో గల శిల్పచిత్రము (క్రీ. ౫-౮ శతాబ్దుల నడుమది.)

తాకినవి. కొంతకాలమువరకును జయ మెవరి కబ్బునో చెప్ప వలనుపడలేదు. అంతయు సందేహముగా నుండెను. మంచి అదనులో కాళ్యపుడు తన సేనను మరియొక రంగమునకు నడుపవలయునను నుద్దేశముతో తన ఏనుగును వెనుకకు త్రిప్పెను. ఆ సంకేతమును గ్రహింపనేరక అతని సేనలు అది యొక పలాయనచిహ్నముగా గ్రహించి యెవరి యిష్టము వచ్చినట్లు వారు చీలిపోయి పారిపోయిరి. ఎదురు చూచుచుండిన సందు దొరికినది గదా యని యుబ్బితబ్బిబ్బయి మొగల్లన ఒక్కదూటున కాశ్యపునిపైకి లంఘించి వాని తల నరికివేసెను.

తరువాత లంకమీదికి క్రమముగా నెందరో ఇండియానుండి దాడివెడలిరి. చివరకు క్రీ. శ. ఏడవ శతాబ్దములో అనూరాధపురము కాలగర్భములో మునిగి పోయెను. సింహళీలు తమ రాజధానిని విడిచివెళ్లి పోలన్నరువలో మరియొకదానిని ఏర్పాటుచేసుకొనిరి. ప్రాత దేవాలయములన్నియు తగులబెట్టబడెను; బ్రేజన్ ప్రాసాదము కొల్లగొట్టబడి నాశనము చేయబడెను. దాడియెత్తి పోయినవారికి నగరములతో పని లేకపోయినది; అనూరాధపురము సర్వధ్వంసము చేయబడెను; దాని వీథులు నామరూపములు లేక పాడయిపోయెను; ఉద్యానవనములు మొదలైనవి తెగబెరిగి సౌందర్య హీనములై పోయెను; చుట్టుపట్టుల నుండిన జలాధార వసతులన్నియు చెడగొట్టబడెను.

క్రీ. శ. ౭౬౯ మొదలు ౧౨౪౦ వరకును పోలన్నరువయే సింహళమునకు రాజధానిగా నుండెను. అంతట తమిళుల గుంపులు పరాక్రమించి సింహళులమీదికి వెళ్లి వారిని తరిమివేసిరి.

పోలన్నరువ సౌందర్య వైభవముల కన్నిటికిని పరాక్రముడను రాజే కారణము. పరాక్రముడు యుద్ధవీరులలో యుద్ధవీరుడు; జిజ్ఞాసువులలో జిజ్ఞాసువు; కళావేత్తలలో కళావేత్త; రాజ్యాంగ వేత్తలలో రాజ్యాంగవేత్త. అతనికన్నులు ఆకర్ణాంత విశాలములైనవట. ౧౧౬౪ లో అతడు సింహాసనమునెక్కగానే తమిళుల నందరిని తరుమగొట్టి, జలాధారవసతులను మరమ్మతు చేయించి, ౧౪౭౦ సంఖ్య వరకు మరికొన్ని జలాధారములను నిర్మింపజేసి, రాజధానిని పునర్నిర్మాణము చేసి రక్షణకు కావలసిన దుర్గసంపదను గూడ సమకూర్చెను.

బుద్ధుని యవశేషములుంచిన యొకానొక దాగాబా





బ్రేజన్ ప్రాసాదపు శిథిల శిలాస్తంభములు

మరల కొంతకాలము లంక వైభవము వెలిగిపోయెను. దేవాలయములు కట్టింపబడెను; సంఘారామములు స్థాపింపబడెను; బౌద్ధసన్న్యాసులకు చలికాలములో అవసరమైన దుస్తులు మొదలైన సామగ్రియొసగబడెను. పోలన్నరువ చాల నాగరికమైనట్టియు, సుందరమైనట్టియు పట్టణముగా నుండియుండవలెను. దానికి నలువైపులను మైళ్లకొలది వైశాల్యము గల వరిపొలములు చూడనగుచుండెను. ఆపొలములకు కావలసినంత జలవసతిని సరఫరాచేయుటకు జలాధారములుగూడ యథేష్టముగా కల్పింపబడెను.

పరాక్రముడు స్వస్థానమున తమిళుల నెదిర్చినదే కాక ఇండియామీదికి కూడ దండెత్తెను. ఏడుయుద్ధములుచేసి దక్షిణ ఇండియాలోని పాండిని జయించెను. ఆతరువాత కాంబోడియామీదికి పోయెను; ఆ దేశపు రాజును చంపెను; ఆ దేశము లంకకు కప్పముకట్టునట్లు నిర్బంధపెట్టెను. తనకు చావు సమీపించుచున్నదను సూచనలు కనబడగానే పరాక్రముడు తన విగ్రహమునొకదానిని పెద్దశిలలో మలిపించి పెట్టెను. ఆ విగ్రహములో, యుద్ధములతోను, ఎడతెగని కార్యకలాపముతోను అలసిపోయిన అతని స్వరూపము చక్కగా చిత్రింపబడియున్నది. ఆ విగ్రహశిల పరాక్రముడు తాను పెంచి పెద్దచేసి విడిచిపోవుచుండిన పట్టణమునకు వీపుచేసి నిలుచుకొని యుండినట్లు నగము వెలుపటి గోడలకుముందు నిర్మింపబడినది. విగ్రహముచేత నొక పుస్తకము చెక్కబడియున్నది. చివరి రోజులలో పరాక్రముడు చిత్తశాంతిని గోరుచు పఠించుచుండిన పుస్తకమది.

పరాక్రముడు కట్టించిన కట్టడములలో ముఖ్యమైనవి: పది యడుగుల మందముగల గోడలతో నొప్పు ఏడంతస్తుల ప్రాసాద మొకటి; క్రీ. శ. ౩౧౧ లో ఒరిస్సారాజుకూతురు వెండ్రుకలలో తనుకొని సింహళమునకు వెళ్లిన బుద్ధ దంతాస్థికకు ఒక దేవాలయము; రాతికంబములతోడను, రాతి కటకటాలతోడను గూడిన 'పుష్పపూజాపీఠము'; 'వాటాడాగే' అనబడు వర్తులాకారమైన అస్థికాలయము. 'వాటాడాగే' నడుమ ఇటికలతోకట్టిన చిన్నదాగాబా ఒకటి కలదు. దాని చుట్టును నాలుగు బుద్ధవిగ్రహములు కూర్చున్నట్లు కలవు. ఈ ఆలయమందు చిత్రకారునియొక్కయు, శిల్పియొక్కయు సామర్థ్యమును తెలుపజాలిన చిత్రణశిల్పములు చాల కలవు.

బుద్ధుని అవశేషములుంచబడిన వలయాకార నిర్మాణము. క్రీ. శ. ౧౩ శతాబ్దులలో సింహళ రాజధానిగ నుండిన పోలన్నరువలో నున్నది.





ఆనూరాధ పురమునందలి రాజుల స్నానసరోవరము

పోలన్నరువలోని స్మృతిచిహ్నములలో 'గల విహార ' మను శిలాదేవాలయము ఇంకొకటి. జ్ఞానదేవతలకు ఇది నివాస గుహ. ఒకానొక అడవిలో ౨౫ అడుగుల యెత్తుగల ఒక పెద్దబండలో నీగుహను తొలిచిపెట్టినారు ఈ గుహలో అలంకృతమైన ఒక పీఠముమీద, ఒక వితానముక్రింద నున్నట్లు రాతిలోనే ఒక బుద్ధవిగ్రహము అతిసుందరముగా మలచబడియున్నది. ఈ గుహచుట్టును గలువైపులను పెద్ద పెద్ద ప్రతిమలు చెక్కిపెట్టబడియున్నవి. ఒకవైపు కూర్చొన్న బుద్ధుని విగ్రహ మున్నది; మరియొకవైపు శయనించియున్న బుద్ధుని విగ్రహము ప్రశాంతమైన యాకారముతో నున్నది. ఆ విగ్రహముయొక్క తలదిక్కున అతని ప్రియశిష్యుడయిన ఆనందుని నిలువు విగ్రహము గలదు. ఆనందుడు చేతులుకట్టుకొని యెక్కడనో అడవివైపు చూచుచున్నాడు. బుద్ధుని శయనవిగ్రహము ౪౩ అడుగుల పొడుగున నున్నది. అందు బుద్ధుడు తల ఒక దిండుమీద పెట్టుకొని, కుడిచేతిని చెంపలక్రింద నానించుకొనియున్నాడు.

ఇటువంటి పోలన్నరువకూడ కాలక్రమమున ౧౨౫౦ ప్రాంతమున అడవులలో లీనము కావలసివచ్చెను.



# విమర్శనము

### ౧. మహర్షియును, దత్సందేశమును:

అనువాదకులు శ్రీ దోమా వేంకటస్వామిగుప్త; క్రౌను ౧౩౬ పుటలు. వెల ౬ అణాలు.

పాల్ బ్రంటన్ అను పాశ్చాత్యపండితుడు ఆంగ్ల భాషలో రచించిన *'A search of Secret India'* (భారతదేశ రహస్యాన్వేషణము) అను గ్రంథమునందలి మూడధ్యాయముల కిది అనువాదము. బ్రంటన్ దొరగారు తమకు శ్రీ రమణమహర్షుల దర్శనలాభ మెట్లు కలిగెనో తెలుపు విధమును, వారి సందేశపద్ధతులను, తమ ఆశ్రమవాసానుభవములను ఆంగ్లమున లెస్సగ వివరించిరి. ఈ యనువాదము యథామూలమయి బ్రంటనుగారి హృదయమును వెల్లడింపఁజాలియున్నది. ఇందు మహర్షుల శిష్యుల మహిమలుకూడ చెప్పఁబడినవి. ఇది సామాన్యములగు సందేశములవలె చదువరులకు విసువు కలిగింపక కథారీతిని హృదయాకర్షకమయి వారి హృదయభూమిని సత్యాన్వేషణ బీజమును నాటి మొలకలెత్తించును.

ఈ పుస్తకముచివర 'శ్రీ భగవాన్ రమణమహర్షులవారిచే నరవణుఁగావింపఁబడిన 'అరుణాచలాష్టక' రచనము అనువాదకాంధ్రీకృతము తాత్పర్యముతో గూడఁ జేర్పఁబడినది.

శ్రీ రమణమహర్షుల మహిమ, వారి సందేశ సారము తెలుఁగఁగోరువారి కీపుస్తక మవశ్యాదరణీయము.

### ౨. మహర్షి పాదపద్మ సన్నిధిలో

ఇది 'శ్రీ భారద్వాజకపాలిశాస్త్రిగారిచే ఉద్ధరింపఁబడిన ఆంగ్లేయ మాతృకకు ... కృష్ణయ్యగారి' అనువాదము. క్రౌను ౮౫ పుటలు. వెల రెండణాలు.

ఆత్మతత్త్వమును గూర్చియు, సమాధి మొదలగు తత్సాధనసంపత్తిని గూర్చియు శిష్యుఁ డడిగిన ప్రశ్నలకు మహర్షులొసగిన ప్రత్యుత్తరము లిందు కూర్పఁబడినవి. ఇందలి ప్రశ్నములు, వాని సమాధానములు అత్యంత తృప్తికరములు. ఆత్మజిజ్ఞాసువులు అవశ్యముగ దీనిని పఠింపనగును. వెలయు స్వల్పము.

### ౩. అరుణాచలస్తుతికదంబము

శ్రీరమణమహర్షి ప్రణీతమునకు అనువాదము. అనువాదకుఁడు శ్రీగిద్దలూరి నరసింగరావు. క్రౌను ౮౧ పుటలు. వెల ౨ అణాలు.

ఇందు 'అరుణాచల అక్షరమణమాల, అరుణాచల నవమణిమాల, అరుణాచల పదికము, అరుణాచల అష్టకము, అరుణాచల పంచరత్నములు' కలవు. పుస్తకము మొదట అరుణాచల దీపదర్శన తత్త్వము, అరుణాచల మాహాత్మ్యము పద్యరూపముగ కూర్పఁబడినవి. స్తోత్రములలో 'అక్షరమణమాల' మాత్రము గేయము.

ఈ గ్రంథమున ఆమోదింపఁదగినది విషయము. అనువాదము నాతిసరళము; దోషదూషితము. అయినను ఇందలి విషయమునుబట్టి ఆంధ్రుల ఆదరమునకు పాత్రము కాపలెను.

### ౪ ఉపదేశసారము

భగవాన్ శ్రీ రమణమహర్షులు రచించినది. ... ప్రతి ... నీ.

'భగవాన్ శ్రీ రమణ మహర్షులవారు ముందు 'ఉపదేశ ఉందియార్' అను పేరుగల తమిళ్ గ్రంథమును ౩౦ పద్యములలో రచించియుండిరి. పిమ్మట దాని భావమునే పూర్ణముగా తీసికొని వారే స్వయముగా సంస్కృతములో ముప్పది లలితవృత్త గీతములుగాను, తెలుగులో ముప్పది ద్విపదలుగాను, మళయాళములో ముప్పది చతుష్పద గీతములుగాను రచించిరి ప్రస్తుతము...ఈ పుస్తకములో సంస్కృత గీతములును, తెలుగు ద్విపదలును ముద్రింపఁబడినవి. 'శ్రీ రమణ శిష్యులును, సుప్రసిద్ధ పండితులును అగు వాసిష్ఠ గణపతిమునిగారి సాహాయ్యమువలన' శ్రీ రమణదాసులగు ప్రణవానందులచే 'రచింపఁబడిన తెలుగు తాత్పర్యమును' చేర్పఁబడినది. ఈ తాత్పర్యము మూలాభిప్రాయమును వివరింపఁజాలి యున్నది.

౫. ఉన్నది నలుబది, సద్విద్య, నేనెవరు?

శ్రీ రమణమహర్షుల కృతుల కాంధ్రీకృతులు. క్రౌను ౪౪ పుటలు. వెల రెండున్నరణా.

ఇందలి ఆద్యంతములు గద్యములు. మధ్యమము పద్యము: అది 'శ్రీ గి. నరసింహరావు విరచితము.' అంతిమము 'శ్రీ ప్రణవానందానువదితము.' ఆద్య మెవ్వరి అనువాదమో తెలియదు.

'ఉన్నది నలువది' లో సత్యవస్తు స్వరూపము సూత్రప్రాయముగ నిర్వచింపఁబడినది. 'సద్విద్య'లో ఉత్తమమగు ఆత్మస్వరూపమును దెలుపు విద్య వివరింపబడినది. 'నేనెవరు'లో 'తన్ను తా నెఱుఁగుట'ను గూర్చి విపులముగఁ జర్చింపఁబడినది. ఆత్మతత్త్వము నెఱుఁగఁదలచువారికి, శ్రీ రమణమతతత్త్వ జిజ్ఞాసువులకును ఇది అవశ్యము పఠనీయము. వెల తక్కువ.

౬. శ్రీ రమణగీత

పద్యము : శ్రీ రమణ విభక్త్యష్టక, శ్రీ రమణ చత్వారింశ ద్గీతమాలాసహితము. అనువాదకులు శ్రీ గుఱ్ఱం వేంకటసుబ్బరామయ్యగారు, ఎం. ఏ., క్రౌను ౧౩౦ పుటలు. క్యాలికో బైండు, వెల ౮ అణాలు.

వైదికమతసారమును పూజ్యుడగు వేదవ్యాస మహర్షి భగవద్గీతగ రచించినట్లు శ్రీ రమణమత సారమును వాసిష్ఠ గణపతిముని పదునెనిమిదధ్యాయములలో 'రమణగీత'గ సంస్కృతభాషను రచించెను. ఆ రచనకిది తెలుఁగునేత. గీతలలో భగవానుఁడు అర్జునునకు బోధించిన ట్లిందు బ్రహ్మతత్త్వము మహర్షిచే శిష్యులకు బోధింపఁబడినది.

ఇందలి పదునెనిమిదధ్యాయములందును వరుసగ, ఉపాసన ప్రాధాన్యము, మార్గత్రయము, ముఖ్యకర్తవ్యము, జ్ఞానస్వరూపము, హృదయవిద్య, మనోనిగ్రహోపాయము, ఆత్మ విచారాధికారి తరంగము, ఆశ్రమ విచారము, గ్రంథిభేదము, సంఘవిద్య, జ్ఞానసిద్ధి సామరస్యము, శక్తివిచారము, సన్న్యాసస్త్రీ పురుషతుల్యాధికారము, జీవన్ముక్తి విచారము, శ్రవణ, మనన, నిదిధ్యాసనములు, భక్తివిచారము, జ్ఞానప్రాప్తి విచారము, సిద్ధమహిమానుకీర్తనము చర్చింపఁబడినవి.

శ్రీరమణ విభక్త్యష్టకమునను, శ్రీరమణ చత్వారింశత్తునందును మహర్షిమాహాత్మ్యము కొనియాడఁబడినది. అగ్ని- గణపతి- ఇంద్ర- వాయు- సూర్య- దశావతార- అంబికా- రేణుకా- గురు- యోగసార- తారకరామ గీతములం దాయా దేవతలయు, విషయములయు తత్త్వము ఎఱుకపఱుపఁబడినది.

అనువాదమునందలి పద్యముల ధార అసర్గళము. శైలి సులభము. మూలమునందలి అభిప్రాయము లనువాదమున కొఱతలేక కూర్పఁబడినవి. శ్రీరమణమతసారము నెఱుఁగఁదలచువారి కిది తప్పక చదువఁదగినది. సంస్కృత మూలముతోడను, తెనుఁగు తాత్పర్యముతోడను కూడ దీనిని ప్రకటించినచో దీని యుపయోగ మింతకంటెను ఎక్కువగ నుండఁగలదు.

మీద పేర్కొనిన ఆరుగ్రంథములకును ప్రకాశకులు శ్రీనిరంజనానందస్వామి, సర్వాధికారి, శ్రీరమణాశ్రమము, తిరువణ్ణామల.

బు. వెం. ర.

---

## ప్రత్యూషము

పద్యకావ్యము. కర్త: కొమరవోలు వెంకటసుబ్బారావు, కాకినాడ. డెమ్మీ ౧౨౦ పుటలు. వెల

ఇం దయిదు మరీచులలో ప్రకృతివిషయములను ధ్వనింపఁజేయు కథ వర్ణింపఁబడినది. ఇందు కొన్నియెడల ప్రాచీనప్రబంధపద్ధతులు, కొన్నియెడల నవీనపద్ధతులు అనుసరింపఁబడినవి. ప్రకృతివిషయములను కథతోఁబాటు క్రమముగ జోడింపఁదలఁచుటచే కొన్నిపట్టులందు కథలో చమత్కృతి కొఱవడినది. అట్టిది సాధారణముగ నిట్టి కావ్యములందు అనివార్యము.

ఇందలిపద్యములు హృద్యములు; నిర్దుష్టములు. భావములు మధురములు. వర్ణనలు స్వాభావికములు. ఆంధ్రు లాదరింపఁదగిన అధునాతన ప్రబంధములలో 'ప్రత్యూషము' ఎన్నిక కెక్కఁదగినది.

బు. వెం. ర.

---

## గూడుమారిన కొత్తరికం

క్రౌను ౧/౮ సైజు, పు. ౨౬, వెల రెండణాలు.

కర్త: శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి, కలాభివర్ధనీ పరిషత్తు, ఇన్నీసుపేట, రాజమండ్రి.

శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారి కథా వాఙ్మయం నవ్యాంధ్రవాఙ్మయ ప్రధానశాఖల్లో ఒకటి. కథా రూపంగా అది ఉత్తమశ్రేణికి చేరుతుంది. ఆయనకథలను దేశంలో మంచిప్రచారం ఉంది. అవంటే ఎంతో మందికి ఎంతో మోజు. కొన్నికథలు ఎన్నిమాట్లు చదివినా ఇంకాచదవాలనే అనిపిస్తూఉంటవి. ఇంతకంటే వాటి గొప్పతనాన్ని వర్ణించడం అనవసరం.

ఆయనకథలన్నీ అప్పుడప్పుడూ పత్రికల్లో ప్రకటింపబడినవే. అవి ప్రత్యేకగ్రంథంగా దొరకవు.

ఒక పదికథలు కాబోలు వెనకెప్పుడో సంపుటంగా 'పూలదండ' అనేపేరుతో ప్రకటింపబడింది. అదికూడ ఇప్పుడు దొరకదు. కాబట్టి వాటిని ప్రత్యేకపుస్తకంగా ప్రకటించడం అత్యవసరం. 'కలాభివర్ధనీ పరిషత్తు' ఈ అవసరాన్ని తెలుసుకుంది. "ఇదివరకు 'పూలదండ' అనేపేరితో సంపుటాలుగా ప్రకటించడానికి ప్రయత్నిం"చింది. "కాని ఆ ప్రయత్నం సాగలేదు. అంచేత ఇపుడు...ఏకథకి ఆకథ విడివిడిగా ప్రకటింప" సంకల్పించింది. "సాధారణంగా ... ఒకటిరెండు"గా ప్రకటిస్తుందట. ఇలా విడివిడిగా ప్రకటించటల పెట్టడం చాల తెలివయినపని. ఇందువల్ల అచ్చయినవి త్వరగా చెల్లిపోవడానికీ, తరవాతివి వెంటవెంట అచ్చయి వెలువడుతూ ఉండడానికీ మంచి అవకాశం ఉంటుంది.

పరిషత్తు సంకల్పలత తొడిగిన మొదటి మొగ్గ ఈ 'గూడుమారిన కొత్తరికం.' ఈతర్వాత వెలువడే 'తల్లి ప్రాణం', 'ఇల్లుపట్టినవెధవాసబకుచు' అనే కథలు. పేరుచెవితేనే చాలు, కథంతా మనస్సుకు వస్తుంది ఒకమారు చదివిఉండినాకూడా. అలాగా మనస్సుకు పట్టిపోతవి ఆయనకథలు!

పరిషత్తు సంకల్పించిన యీ కార్యం నిరంతరాయంగా కొనసాగునుగాక!

---

## కాత్యాయని

ఇది యొక గేయ సంపుటి. చిన్నది. ఆర్టుకాగితంమీద అచ్చువేయబడింది. అందచందాలతో అమరి ఉంది.

కర్త: బొడ్డు బాపిరాజు, ఆదివారపుపేట, ఏలూరు.

గ్రంథకర్త తమ యేడాది చిన్నికబ్బదానికి— కాత్యాయనికి — పుట్టినదినంనాడు ప్రేమతో పెట్టిన నూడిద యిది. ఆ బిడ్డ అచ్చట్లు ముచ్చట్లే ఇందలి గేయములలో వర్ణింపబడినవి.

---

## తెలుగు ఇన్‌కంటాక్సు ఆక్టు

గ్రంథకర్త కడిమిశెట్టి వీరరాజుశెట్టి, వకీలు, బెజవాడ. వీరు ఒకప్పుడు అసిస్టెంటు ఇన్‌కంటాక్సు ఆఫీసరుగా నుండిరి. గ్రంథంపుటలు ౧౩౨. వెల రూ. ౧-౪-౦. మొదటి ముద్రణము.

ఆంధ్రవాణి నాదరించుట ఆంధ్రుల ధర్మం. మాతృసేవ మెచ్చదగినదే. లాగ్రంథములు తెలుగున విశేషముగ వెలువడలేదు. ఈగ్రంథవిషయం చాలా గంభీరమైనది; లోతు తెలియనిది. ఇన్‌కంటాక్సులా ఇంగ్లం... ప్రసిద్ధ ...వాసులకు కూడ అగమ్య

గోచరమని Lord Hailsham తెలిపెను. ఈ విషయం మనదేశానికి వర్తించును. న్యాయవాదుల స్థితి యీతీరుగ వుంటే సామాన్య పౌరుల సంగతి వేరుగ వ్రాయ పనిలేదు.

ఈగ్రంథం ఆంధ్రులకెల్ల సహాయకారి కాదన వచ్చును. ఏలననగా న్యాయవాదులకు ఆంగ్లమున గ్రంథములు అందుబాటులో నున్నవి. పైగా వారికి ఆక్టుపుట్టుపూర్వోత్తరములు కావలయును. వారికి శాసన సభలోని చర్యలవసరము. వారికి సెలెక్టు కమిటీ రిపోర్టుతో నిమిత్తమున్నది. ఆక్టు ప్రవేశపెట్టుటకు కారణములు వారు పరిశోధింతురు వారలకు ఆక్టులోని ప్రతి పదము ముఖ్యము. ఒకముక్క పోతే ముప్పవస్తుందని వారి నమ్మకము. పైగా యిది పన్నుతో పని. వారి మార్జినల్ నోట్సు సహాయపడును. ఉదాహరణలు, వివరములు, సూత్రాలకు భిన్నములు వారికి కళ్లకుకట్టినట్లుండవలయును. సూత్రముల వ్యాఖ్యానం అంతా వారికి కావలయును. కోర్టు తీర్పులెన్ని వారిముందున్న అంతమంచిది. కేసులలోని ముఖ్య సూత్రములు వారికి కావలయును. ఆక్టులోని మార్పులపట్టిక వారికి తెలియవలెను. గ్రంథాంతమున షెడ్యూలులు, ఫారాలు వారికి కావలయును. ఇట్టి విషయవిభజన న్యాయవాదులకు తోడ్పడును. పైగా Reference నకు ముఖ్యముగా సెక్షనులు వరుసక్రమమున వ్రాయుటే మంచి పద్ధతి. న్యాయవాదులకు గాను యీ గ్రంథం వ్రాయబడినట్టు తోచదు.

ఇక తదితరుల విషయం గమనించవలయును. ఇన్‌కం టాక్సు ఆక్టులోని విషయములు సులభముగ బోధపడవు. బోధనాశక్తి బోధకునికి కావలయును. ఈ గ్రంథమున Principles కూడా ప్రత్యేకించి వ్రాయలేదు. No receipt, no taxation అను ముఖ్యసిద్ధాంతమును బాగుగ తెలుపలేదు. పేర్కొన్న తీర్పులు గ్రంథమునకు శోభ తేలేదు. వీరి స్వానుభవమైనను తెలిపి ఆక్టులోని లోటు పాటుల పేర్కొనిన బాగుండెడిది. వచ్చుబడి పన్నురేట్ల గూర్చి ౨ వ అధ్యాయం వ్రాసిరి. ఇందు "ఇండియా గవర్నమెంటువారి ఫినాన్సు ఆక్టును [illegible] అన్న [illegible] వరికి విషయం విపులముగా తెలిపియుండిన బాగుండెది. ౨౬ వ పుటలో ౪ వ అధ్యాయంలో "సెక్యూరిటీలు" అని వ్రాసినారు. ఇది ఆక్టు ననుసరించి Interest on securities అని యుండవలయును. సెక్యూరిటీలకును సెక్యూరిటీలమీద వడ్డీలకును భేదమున్నది కదా! ౨౬ వ పుటలో "గృహములు" అని వ్రాసినారు. ఆక్టులో ౯ వ సెక్షనులో Property అని యున్నది. ఆక్టులోని పదమొకటి; వీరి తర్జుమాలోని పద మింకొకటి. ఈ గ్రంథమున Accuracy in statement ఉండవలయును. ఆక్టులోని ౧౧ వ సెక్షనులోని అంశములకును ౪౯ వ పుటలో వీరు వ్రాసిన విషయమునకును భేదా యున్నది. పది పంక్తులలో యీ సెక్షనులోని విషయములన్నియు యిమిడియున్నవని చదువరులు భావింపరు. భావించుట సరికాదు. వీరు Professional earning అనగా వృత్తి అని వాడినారు. వృత్తికిని వృత్తిరాబడికిని తేడాయున్నది. ౩౨ వ పుటలో వీరు "వ్యవహారము" ను గురించి వ్రాసిరి. ఆక్టులోని ౨ (౪) సెక్షనులో నున్నదానికి యిది సరిగా లేదు. సెక్షనులో Fusiness includes any trade, commerce, or manufacture or any adventure or concern in the nature of trade, commerce or manufacture అని యున్నది. తర్జుమా సరిగాలేదు.

ఉదాహరణల విషయం చూద్దాం. ౩౯-వ పుటలో ఉదాహరణపట్టిక యున్నది చదువరికి యిది బోధపడదు. దీని గూర్చి ౩౮-వ పుటలో ముందుగ కొంత వ్రాసియుండిన బోధనపూర్వకముగ నుండెడిది. ౪౩-వ పుటలో ప్రొవైజోలో "బయల్పరచితిరేని" అని యున్నది; యిది సరికాదు. ౭౫-వ పుటలో "ఇది హైకోర్టు వారికి (a) కమిషనరు వలన గాని (b) ద్వారాగాని శాస్త్ర విషయములను ప్రశ్నలను గూర్చి చేయబడును" అని వ్రాశారు. ఇచ్చట కమిషనరు ద్వారా అని అర్థమగుట కష్టము. ౧౫-వ పుటలో "తప్పుడు సాక్ష్యము చెప్పినను, ఉపయోగించినను, పోషణ చేసినను" అని యున్నది. ఎవరిని పోషణ చేయుటో తేటపడుట లేదు. ఆ పుటలోనే [illegible] న్ని కోర్టు అధికారము లున్నను

ఇన్‌కంటాక్సు అధికారులను కోర్టని చెప్పటకు సావకాశము లేదు" అని యున్నది. సావకాశమును పద మిచ్చుట సరికాదు Mutual Benefit Societies విషయములో రాబడి పన్ను లేదని వీరు తెలిసి యుండ వచ్చును సెక్షను ౬౬-౨ యొక్క చరిత్రాంశములు చదువరికి తెలిసియుండవచ్చును.

లా గ్రంథములను తెలుగున వ్రాయుట కష్టము; కష్టమైన కార్యముల చేయ బూనుటకు ధైర్యసాహసములు మాత్రము చాలవు; తగు శక్తి సామర్థ్యములు కావలయును. ఇన్‌కంటాక్సు ఆక్టు నందలి వరులకు సుబోధముగ వ్రాయుట సులభము కాదు. కడకు Lord Hailsham అభిప్రాయమే నిజమని తోచుచున్నది. ఈ గ్రంథం ద్వితీయ ముద్రణమున క్రొత్త మార్పులందునుగాక!

ఏలేశ్వరపు కృష్ణమూర్తి

---

# గ్రంథస్వీకారము

## ఓదార్పు
## (విమర్శ గ్రంథము)

క్రౌను ౧/౮ సైజు. పు. ౧౬౧. వెల అ. ౧౦.
కర్త: దీపాల పిచ్చయ్యశాస్త్రి, నెల్లూరు.

---

## చింతామణి విషయు పరిశోధనము
### సానుబంధము (రెండవకూర్పు)

క్రౌను ౧/౮ సైజు, పు. ౨౩౧+౨౦, వెల రు. ౧.

గ్రంథకర్త: వజ్ఝల చినసీతారామస్వామిశాస్త్రి, ఆంధ్ర విశ్వకళాపరిషత్కళాశాలాంధ్రోపాధ్యాయులు, వాల్తేరు.

---

## విజయనగర సామ్రాజ్యమందలి ఆంధ్రవాఙ్మయచరిత్రము

ప్రథమభాగము (క్రీ. శ. ౧౩౩౦-౧౫౦౦)

డెమ్మీ ౧/౮ సైజు, పు. ౩౨౫, వెల రు. ౨. విద్యార్థులకు రు. ౧-౮-౦.

కర్త: శేకుమళ్ల అచ్యుతరావు, యం. ఏ., యల్. టి., పిఠాపురము.

---

## శ్రీ పుష్పసేనవిజయము

క్రౌను ౧/౮ సైజు, పు. ౭౨, వెల రు. ౦-౮-౦.

గ్రంథకర్త: బాడిడిమఠం సిద్ధి వీ య్య, ఆంధ్రోపాధ్యాయుడు, జోగిపేట రాజకీయ మాధ్యమిక పాఠశాల, డాకూరు, మెదకుజిల్లా, నైజాంరాష్ట్రము.

---

## త్రిపురాంతకోదాహరణము

క్రౌను ౧/౮ సైజు, పు. ౫౮+౨౧, వెల అ. ౧౨.

గ్రంథకర్త: రావిపాటి త్రిపురాంతక మహాకవి.

సంస్కర్త, ప్రకాశకుడు: నిడుదవోలు వేంకటరావు, బి. ఏ., సూర్యారావుపేట, కాకినాడ.

---

## కేసరికిశోరలీలలు (పద్యరచనము)

డెమ్మీ ౧/౮ సైజు, పు. ౧౮, చివర రెండుపుటలలో 'సూర్యోపాసన.'

గ్రంథకర్త: వడ్డాది సీతారామాంజనేయకవి, ఖాసింకోట, విశాఖపట్నంజిల్లా.

---

## గానశాస్త్ర ప్రశ్నోత్తరావళి

క్రౌను ౧/౮ సైజు, పు. ౧౫౮. వెల రు. ౧-౦-౦

గ్రంథకర్త: అరిపిరాల సత్యనారాయణమూర్తి, సుందరవిలాస్, గాంధీనగర్, బెజవాడ.

## మరణానంతర సందేశములు

క్రౌను ౧/౮ సైజు. వెల రూ. ౧-౦-౦.

గ్రంథకర్త: రావుబహద్దూర్ యం. నరసింహంపంతులు.

ప్రకాశకులు: కొండేపూడి కృష్ణమూర్తి, ఉల్లితోట వీధి, రాజమండ్రి.

---

Printed and Published by K. Nageswara Rao,
at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St., Madras. Editor:—K. Nageswara Rao.

## ఆర్షరసాయనశాల
## ముక్త్యాల, కృష్ణా

స్థాపితము 1925

ప్రశస్తాయుర్వేదౌషధముల
కు నిలయము. ఏమందు కావ
లసినను మాకు వ్రాయుడు.
నమ్మకమైనవి లభింపగలవు

ఆయుర్వేద భూషణ
వేటూరి శంకరశాస్త్రి, ఎ.ఎం.ఎ.
CONSULTING PHYSICIAN

---

## మాసక్సెషన్
## పాలిసీ
## సులభముగా...............

మీ కుమారునకు

21 యేండ్ల వయసువచ్చునప్పటికి వైద్య పరీక్ష లేకుండ, లాభములతో గూడిన ఎండోమెంటుపాలిసీ చౌకగా లభించును.

ఇంతేకాకుండ మీకు గూడ

అతడు ఎదుగుచుండగా మీకు సంపూర్ణముగా భీమా రక్షణము యేర్పడును. రేట్లు మొదలైన పూర్తివివరములు గల కరపత్రిక మాకు వ్రాసి తెప్పించుకొనుడు.

**నేషనల్ యిన్సూరెన్సు కంపెని లిమిటెడ్.**

నేషనల్ యిన్సూరెన్సు బిల్డింగ్సు,
యెస్ప్లనేడ్, మదరాసు.

---

## రాజమోహన హేరాయలు



శ్రేష్ఠమయిన సువాసనగల తల నూనె. మెదడుకు చల్లదనమును కలిగించి వెంట్రుకలను అభివృద్ధి చేయుటలో అత్యుత్తమ మయినది.

తలపోటు, కూడుపోటు, శిరో వేడిమి, చుండు మొదలగువాటిని పోగొట్టి కన్నులకు చలవ నొసంగి వెంట్రుకలను మృదువుపరచి, నల్లగా పెంచుటలో అత్యుత్తమ మయినది.

స్త్రీలకు ఆనందమును కలుగజేయును.

సీసా 1-కి రు. 0-12-0 6 సీసాలు రు. 4-4-0

పోస్టేజి ప్రత్యేకము.

**పి. శి. ఏ. అండు కంపెని,**

ఆయుర్వేదసమాజం,

[illegible], నెల్లూరుజిల్లా

---

## తెల్లకుష్ఠు
## బొల్లివ్యాధి

కొద్దిరోజులీ ఔషధమును రుద్దినచో తెల్లకుష్ఠు బొల్లి ఘోరవ్యాధులు మొదలంట నాశనమగును. హాకీమ్‌లు, వైద్యులు, కుదుర్చలేనివాటిని యీ ఔషధము తప్పక కుదుర్చును. గుణములేదని ఋజువు జేయువారికి రూ 500/- బహుమానమివ్వబడును. వెల రు. 2/-

## సంతాన నిరోధము

సంతాన నిరోధమున కిది అమోఘమైనది. దీనిని వాడుట మానివేసినతోడనే సంతానము గల్గును, నెలకు 2 లేక 3 రోజులు మందును వాడుచుండవలెను. సం॥నకు వెల రు 2/- గుణములేదని ఋజువు జేయువారికి రు 100/- బహుమానము. ఆరోగ్యమునకెట్టి హానిగలుగదు.

**Vaidyaraj Akhil Kishore Ram**
**No. 47 P. O. Katri Sarai (Gaya)**

# వి ష య సూ చి క

---



# చి త్ర ము లు



---

# ప్రత్యేక దసరా సంచిక

[ఆంధ్ర (సచిత్ర) వారపత్రిక]

1937 ప్రత్యేక దసరా సంచిక ఆంధ్ర (సచిత్ర) వారపత్రిక తరఫున ఈనెల 13-వ తేదీ బుధవారమునాడు వెలువడును.

ఇందు సాంఘిక, రాజకీయ, ఆర్థికసంబంధములగు వ్యాసరాజములు, కథలు, విజ్ఞానప్రదాయకములగు అనేక యితర విషయములు సుప్రసిద్ధ ఆంధ్రమహాశయులచే వ్రాయబడును. డెమ్మీ ¼ సైజులో చక్కని గ్లేజుకాగితములమీద ముద్రింపబడి, త్రివర్ణ చిత్రముగల ఆర్టు పేపరు ముఖపత్రముతో యీసంచిక సర్వాంగసుందరముగ నలరారుచుండును.

చందాదారులు కానివారికి పోస్టుఖర్చుతో సహా రు 0-2-6 లకు పంపబడును.

మేనేజరు, ఆంధ్రపత్రిక, మద్రాసు.



సంపు. ౧౪    ఈశ్వర, ఆశ్వయుజమాసము ( అక్టోబరు 1937 )    సంఖ్య ౧౦

# జన్మాష్టమి

రాయప్రోలు సుబ్బారావు

శ్రావణ మంగళోత్సవ పరంపరలన్ గృహవీథు లొప్పె, భూ
దేవి సుఖప్రసూతపగిదిన్ జలమాడి ధరించె పచ్చపూ
పావడ, దిక్సతీచికురపాశములట్టుల వ్రేలె కృష్ణమే
ఘావలి, పుట్టె నొక్కశిశు వష్టమినాడు నిశీథవేళలన్.

చెఱలో చిందులు మానె చీకటి, నభశ్శృంగారమాలామనో
హరమై మించెను తారకాళి, శ్రుతివియ్యంబయ్యె వాగర్థబం
ధురభావోదయరక్తి వ్యాసముఖ తంత్రుల్, నందగోపాల మం
దిర మంథానములున్ స్వయంభ్రమణమందెన్ త్రాళ్లముల్లాడగన్.

మందల నున్న లేగలు తమంతట పల్వులు సల్ల లేచి ఆ
నందముతోడ పాల్గుడిచె, నవ్వుచు పండువెదుళ్లు పాడ సా
గెం, దమసాతరంగవతికిన్ పొడకట్టె సమర్తచిన్నె, లా
డెం దల వన్నియల్ ప్రతిఫలింప నెమిళ్లు సమీపసీమలన్.

బందియలో శిరోదయవిభాతము, యాదవసూతికాంకపా
ళిం దొలి స్తన్యపానము, ఫలింపగ నోపును గోమతల్లికా
మంద తపోవ్రతంబు; రుచిమన్మృదుశాద్వల పత్రశయ్యలన్
బృందయు వెల్గె ముత్తయిదు లెత్తిన పచ్చల పళ్లెరంబనన్.

ప్లుతవల్గితంబుల పులకలు నరువెల్ల గుబ్బాల వెన్నుల గుస్తరించె
నందనోద్యాన సుందరమైన పారిజాతము పాఁతగిలినట్లు తలఁకి యులికె
వాడినసిగలు మవ్వమువోసి విప్పార తులసీవనంబులఁ దొలకరించె
కౌమార యోగధారా ముగ్ధయగు రాధ సాధన కమృతసమాధి కుదిరె
ఇష్టదేవతామకుటము లెక్కినట్లు - వింతమైశ్వర్యమున కేకి గంతులాడె
పెరుగు లెండక్కుదాకను తఱచితఱచి - వెన్న రాక వేసారిరి వ్రేతలెల్ల.

గొల్లల చల్దిముద్దలఁ బుగుల్కొను కమ్మదనాలకోసమై
మల్లిరి రాజభోగులు, సమగ్ర విరూపిణిరైన కుబ్జరున్
భల్లున తెల్లవాఱఁ గలవచ్చె సమస్తసులక్షణాంగ సం
పల్లత మైనయట్టుల, ప్రపంచమె కన్నెరికంబు దాల్చె నాన్.

కన్నులఁ గ్రోలి ఈ ప్రకృతికంఠసువస్తు సురూప భాగ్యమున్,
కన్నెపులుంగుటెల్గుల సుఖశ్రుతి లాలన లాని వీనులన్,
మన్నన మీఱు జానపదమండలమంతయు నృత్యగీతవా
ద్యోన్నతిఁ గృష్ణపక్షమయి యూగెను భాగవతాల యాటలన్.

భారత ధర్మసంహితకు భాష్యముఁ బన్నగ, రాసయోగలీ
లా రసవద్రహస్యము వెలార్పగ ఉత్సవరాగరక్తి నా
చారహతాగ్రహారములఁ జార్పగ, కర్మఫలామృతంబు గీ
తారసదాళికిన్ పిదుక, తావుకొనెన్ బహుధా తదంశువుల్.

---

# పూర్ణ

[నవల - అనువృత్తము]

వాసిష్ఠగణపతిముని

## పదునూఁడవ ప్రకరణము

### శివంకరసంఘప్రతినిధితో సంభాషణము

ఆ మఱునాఁడు సాయంకాల కృత్యములు ముగించుకొనిన పిమ్మట రాజు శివంకర సంఘప్రతినిధికి దర్శన మిచ్చుటకుఁగాను కాచుకొని యుండెను. తాను స్వర్ణ సింహాసనముపైఁ గూర్చున్నాఁడు. ఎదుట వేత్రాసనము వేయఁబడియున్నది. విమాన ప్రథమభూమికా ద్వారము దగ్గఱ లీలావతి చారురాలును, రథినిచారురాలును ప్రవేశించు శివంకర సంఘప్రతినిధి యెవఁడో తెలుసుకొనుటకు జాగరూకములగు కండ్లతో చూచుచు నిలఁబడి యున్నారు. ఇంతట శుకనాసుఁడు కాలనాథునితో కలిసివచ్చి విమానములోపలకు ప్రవేశించెను. కాలనాథు నచ్చట నిలఁబెట్టి తాను ముందు పోయి శివంకర సంఘప్రతినిధిరాక భట్టారకున కెఱింగించెను. అతని యుత్తరువును పొంది కాలనాథుని దగ్గఱకు వచ్చి వానిని షష్ఠభూమికలో ప్రవేశపెట్టి రాజాజ్ఞ పొంది తాను మఱలెను. సంప్రదాయప్రకార మా విశిష్టసమయములో మహాప్రతీహారి ఘోరకుఁడు ద్వారమునందు కావలి కాయుచుండెను.

కాలనాథుని చూడఁగానే సుచంద్ర భట్టారకునకు సంతోషాశ్చర్యములు కలిగినవి. ఘోరక కాలనాథులవంటి మహావీరులు శివంకరసంఘములోనున్నారా యని యతఁ డాశ్చర్యపడెను. రథిని కాలనాథుని గుఱించి చెప్పినది మొదలుకొని యతనికి కాలనాథుని చూడవలె నని యపేక్ష గలదు. అది యిప్పుడు తలవని తలంపుగా తటస్థించినది. అందులకు సంతోషము.

ఇప్పుడు రాజు కాలనాథుని నిర్వర్ణించి చూచినాఁడు. తనయెదుట గోడపై తగిలించిన దర్పణములో తన ముఖమును గూడ చూచుకొనినాఁడు. తమ యుభయుల ముఖసాదృశ్య మతనికి చక్కఁగా గోచరించినది. నిశ్చయముగా నితఁడు నాకుమారుఁడే యని యతనికి తోఁచినది. కనులు వాత్సల్యరసార్ద్రము లైనవి. ముఖము ప్రేమప్రసన్నమయ్యెను.

కాలనాథుఁడు సుచంద్రుని పితృభావముతోఁ జూచుచున్నాఁడు. అందువలన నతనిభక్తి యుద్రిక్తమయ్యెను. అతని గౌరవము హెచ్చినది. పూర్తిగా నాపితృమూర్తి కతఁడు లొంగిపోయినవాఁ డయ్యెను. ఈభావ కోలాహలములో నతఁడు క్షణమాత్రము స్తబ్ధుఁడై నిలిచిపోయెను. పిమ్మట నతనికి రాజసన్నిధిలో తానున్నానని జ్ఞప్తికి వచ్చినది. మోకాళ్లు వేసుకొని ప్రణామ మాచ

రించి మహారాజ పరమేశ్వర శ్రీ సుచంద్ర భట్టారకులవారికి జయ మగునుగాక యని పలికి యతఁడు లేచి తనచేతికత్తిని సార్వభౌముని కాళ్లపై నుంచినవాఁ డయ్యెను. సుచంద్రుఁడు వంగిన కాలనాథుని తల స్పృశించి యతఁడు లేచిన పిమ్మట నతని కత్తి యతనిచేతి కిచ్చివేసెను. కాలనాథుఁ డనంతరము రాజానుజ్ఞాతుఁడై యాసనములోఁ గూర్చుండెను. కాలనాథుఁడు తనను తండ్రినిగా తెలుసుకొనలేదని సుచంద్రుని భ్రమ. రాజు తనను కొడుకునుగా గ్రహించుకొనలేదని కాలనాథుని భ్రాంతి. కాలనాథుఁడు చూపు భక్తి సుచంద్రునకు రాజభక్తిగాను, సుచంద్రుఁడు చూపు వాత్సల్యము కాలనాథునకు ప్రజావాత్సల్యముగాను తోఁచుచుండినవి. వాస్తవముగా నవి పితృభక్తి పుత్రవాత్సల్యములే యగును. సంభాషణ మారంభించినది.

సుచ—నేను శివంకర సంఘమువారి విన్నపమును వినుటకు సిద్ధముగా నున్నాను. కాలనాథబాబు! నీవు చెప్పవలసిన దంతయు నిర్భయముగా చెప్పవచ్చును.

కాల—పరమభట్టారక! సామ్రాజ్యమునందలి ప్రజలను తృప్తిపఱచుటయే శివంకర సంఘమువారి ముఖ్యలక్ష్యము. నిశంభునాగేంద్రుఁడు సామ్రాజ్యమునందలి ప్రజలకు రాజద్వేషము కలుగునట్లు ప్రచారము సేయుచున్నాఁడు. ప్రభుత్వచర్యలలోనికొన్ని లోపముల నతఁ డెంచియే యా కార్యమును నెఱవేర్చుచున్నాఁడు. వాటిని సర్దినఁ గాని ప్రజలను రాజద్వేషమునుండి మఱలించుట కష్టమని మాకు తోఁచినది. తప్పక ప్రభుత్వ చర్యలను సక్రమమాందోళనమువలన సంస్కరించెద మని నచ్చచెప్పి మేము నిశంభునకు ప్రతికూలముగా ప్రచారము సేయుచున్నారము.

సుచ—ప్రభుత్వ చర్యలలో ప్రజలకు కష్టము కలుగఁజేసినవి యెవ్వి?

కాల—సామ్రాజ్యపు మొత్తము పైని నేను చెప్పెదను. తత్కాలావసరమున కెక్కువచేసిన పన్నులను అవసరముతీఱినను తిరిగియు రద్దుచేయకుండ శాశ్వతముగా నిలుపుట సామాన్యప్రజలలో నసంతృప్తినిగలుగఁజేసినది. శాంతిసేనాకుమారిని తప్పించి వీరేశ్వరబాబుగారిని చిత్రకూట మహామండల సింహాసనమునఁ గూర్చుండఁబెట్టుట యాప్రాంతమునందలి ప్రజలకందఱికి నసంతృప్తి కలిగించినది. ఉద్యోగస్థులను నియమించుటలో యోగ్యత గమనింపఁబడ లేదు. మహా మంత్రిగారి బంధువులకు మొదటి యవకాశమును, వారిపక్షస్థులకు రెండవ యవకాశమును, సమర్థులకు మూఁడవ యవకాశమును కల్పింపఁబడుచున్నవి. ఇది విద్వాంసులకును, వీరులకును ప్రభుత్వముపై నసంతృప్తి కలిగించుటకు కారణముగా నున్నది. కొందఱు రాజబంధువులు మదోద్ధతులై రాజధానిలో నల్లరిపనులు సేయుచున్నారు. ఇవి ముఖ్యముగా ప్రభువు వారు గమనింపవలసిన విషయములు.

సుచ—పన్నులను నేను తీసివేయవలెనని యే యున్నాను. మా నాయనగారు చేసిన నిబంధనప్రకారము మావిషయము రాజకులములో తీర్మానింపఁబడవలెను. మహామంత్రియు, మహాసమాహర్తయు నేను రెండు

మూఁడుసారులు సూచించినను అంగీక రింపరైరి. ఆవిషయములో వారు గట్టిపట్టు పట్టియున్నారు. కోశబలము తగ్గిన ప్రభుశక్తి క్షీణించు నని వారివాదము. వారిలో నొకరు నాకు పూజ్యులగు మామగారు. ఇంకొకరు బాల్యస్నేహితులు. వారు ప్రజాహితులు కాకపోయినను రాజభక్తి గలవారు గారని యెవరును చెప్పఁజాలరు. వారిలో నొకరి నుద్యోగమునుండి తప్పించినఁ గాని పన్ను లను తీసివేయుట సాధ్యముగాని పని. అభి ప్రాయభేదమునకుఁగాను మంత్రుల నుద్యో గమునుండి తీసివేయుట రాజులకు న్యాయ్య ముగాదు. ఇట్టిస్థితిలో మే మేమి సేయుటయో మాకు తోఁచకున్నది.

కాల— మహాప్రభో! మీచరణముల కనేక వందనములు. ఈసంగతి శివంకరసంఘ మునకు తెలియని విషయము. అయినను ప్రజలలో మాసంఘమువారు సార్వభౌము నిపై పల్లెత్తుమాటయైన నాడి దుష్ప్రచా రము సేయలేదు. ఈవిషయములో నా కొక యుపాయము తోఁచుచున్నది. ఆజ్ఞయగు నెడల మనవిచేసెదను.

సుచ—చెప్పుము.

కాల—సర్కారువారు శ్వశురుల నిద్ద ఱిని విశ్రాంతి తీసుకొండని చెప్పవలెను. వారిలో మహామంత్రికి వారుచేసిన రాజ సేవకు బహుమతిగా నొక జాగీరీయవలెను. సేనాపతిగారి కింతకుముందే సంస్థానమున్నది గాన వారి కేమియు నీయ నక్కఱలేదు. మహామంత్రి నూతన సంస్థానలాభమువలన నుద్యోగమునుండి విశ్రాంతి తీసుకొనుమని చెప్పినందులకు చింతింపరు. ఆ వృద్ధుల స్థాన ములలో నిద్దఱు సమర్థుల నియమించి రాజ్య తంత్రము నడిపించిన సింహాసన మవిచాల్య ముగా నుండును.

సుచ— (మిక్కిలి సంతోషముతో) తండ్రీ! నీవు చెప్పిన యుపాయము బాగు న్నది. ప్రాయికముగా రేపే యాపని గావిం చెదను. ఆ రెండుపనులకు తగినవా రెవరో నీవు సూచింపఁగలవా?

కాల—మహాప్రభో! శ్రీవారు నన్ను మహిమపరచి యడుగుచున్నారు. శ్రీవారి సేనలో నే నొక శతపతిని. శ్రీవారు కూర్చుం డిన స్థలమునకు వందమూరల దూరములో నిలువవలసినవాఁడను. శివంకరసంఘమునందు మర్యాద యుంచి న న్నెదుట నాసనములోఁ గూర్చుండఁబెట్టి మాట్లాడుచున్నారు. మహా మంత్రి సేనాపతుల నియమన విషయములో సార్వభౌమునకు సలహా చెప్పఁ దగినంత యోగ్యత నాకుఁ గలదా?

సుచ—నీవు శతపతిగా నుండుట మా యుపేక్షాదోషము గాని నీ యోగ్యతా లోపము గాదు. ఆచార్యవిషమసిద్ధి నిన్ను రథయూథపయూథపులలో నొకనిగా పేర్కొనియున్నాఁడు. అదియునుగాక ప్రజాభి ప్రాయమును ప్రతిధ్వనింపఁగల శివంకరసంఘ ములో సభ్యుఁడవు. అందువలన నీ విషయ ములో నీమతము నడుగుచున్నాను.

కాల—మహాప్రభో! ఇట్టి సమయ ములలో కేవల ప్రజ్ఞాశాలియగు మహామంత్రి పనికిరాఁడు. రాష్ట్రీయ సేనాపతుల నిద్దఱిని గూడ నడిపింపవలసిన బాధ్యత మహామం

త్రిపై నిప్పుడు గలదు. లోపల భయంకరమగు విప్లవసంఘము. అన్ని దిక్కులందును శత్రురాజుల కుట్రలు. అందువలన నిప్పుడు నియమింపఁబడఁబోవు మహామంత్రి విద్వాంసులలోను, వీరులలోను గూడ మూర్ధన్యుఁడుగా నుండవలెను. సర్వజనాకర్షకుఁ డగు ప్రసన్నమూర్తిగా నుండవలెను. స్వవాద సాధనసమర్థుఁడగు ప్రవక్తగా నుండవలెను. విజితాత్ముఁడగు తపస్విగా నుండవలెను. నీతిశాస్త్రవేత్తయగు వ్యావహారికుఁడుగా నుండవలెను. నిష్పక్షపాతుఁడగు న్యాయదర్శిగా నుండవలెను. ఆయవ్యయ విభాగవేత్తయగు నిపుణుఁడుగా నుండవలెను. ప్రజాప్రియుఁడగు దయావంతుఁడుగా నుండవలెను.

సుచ—ఇన్ని మహాగుణములరాశి మన సామ్రాజ్యములో నెవరున్నారు?

కాల— అట్టి మహాపురుషుఁడు మన రాజధానిలోనే జ్వలించుచున్నాఁడు.

సుచ—ఎవ రతఁడు?

కాల—అతని నాచార్యవిషమసిద్ధి రథయూథప యూథపులలో నొకనిఁగా లెక్కించెను. ఆచార్యభవనంది యతనిని చతుశ్శాస్త్రపారంగతునిగా కీర్తించుచున్నాఁడు. అక్షోభ్యమహాముని యతనిని విజితాత్ముఁడగు ఋషినిగా నొప్పుకొనెను. శ్రీకాకుళజనసంఘ మతనిని మహాప్రవక్తనుగా కొనియాడుచున్నది. విశాలాక్షుఁ డతనిని నయవేత్తనుగా గౌరవించుచున్నాఁడు. అతఁడు సర్వజనాకర్షకుఁడగు ప్రసన్నమూర్తి. అతఁడు నిష్పక్షపాతుఁడగు న్యాయదర్శి. అతఁ డాయవ్యయ విభాగవేత్తయగు నిపుణుఁడు. అతఁడు ప్రజాప్రియుఁడగు దయావంతుఁడు. అతని నొక కుగ్రామములో మహాసాధ్వి జ్ఞానేశ్వరి యాంగిరస యజ్ఞమిత్రునివలన కనినది. అతని భవ్యనామము మల్లికార్జునుఁడు.

సుచ—సచివుఁడు రూపచంద్రబాబు మొన్న ప్రసంగవశాత్తుగా నతనిని గుఱించి విస్తారముగా పొగడి చెప్పెను. అప్పుడే నాకతనిని చూడవలె నని బుద్ధి పుట్టినది. అతని వయ స్సెంత?

కాల—నాకంటె కొన్ని నెలలు పెద్దవాఁడుగా నుండవచ్చును.

సుచ—అతఁడు శివంకర సంఘములో సభ్యుఁడా?

కాల—సంఘ స్థాపన కాలమునం దతనినే నాయకునిగాఁ జేసుకొనవలెనని నిశ్చయించుకొంటిమి గాని యతఁడు సంఘములోఁ జేరుట కంగీకరింపనందున మానుకొనవలసి వచ్చినది.

సుచ—అతఁడు సంఘములోఁ జేరక పోవుటకు కారణ మేమి?

కాల—సంఘోద్దేశ్యములలో నతనికి సహానుభూతి యుండినను సార్వభౌముని ప్రభుత్వమును విమర్శించు సంస్థలో చేరవలదని యతనికి మాత్రాజ్ఞ యైనందున నతఁడు చేర లేకపోయెను. జ్ఞానేశ్వరి తనకుమారునితో రాజధాని ప్రవేశించునపుడు మిక్కిలి దరిద్రురాలుగా నుండినది. అదృష్టవశమున నామెపై మహాసమాహర్త భార్య భృంగాలకకు కనికరముపుట్టి ప్రాసాదములో పూజారికురాలినిగా నియమింపఁజేసి జీవనో

పాధి కలుగఁజేసినది. కొన్నిమాసముల క్రిందట తనకుమారుఁడు శతపతిగా నియమింపఁబడిన నామె విశ్రాంతి తీసుకొనినది. ఆమెకు సమ్రాజ్ఞిపై భక్తిమెండు. ప్రభుత్వచర్యావిమర్శన మనిన మహామంత్రిచర్యావిమర్శనమని యర్థము. మహామంత్రిచర్యలను విమర్శించిన సమ్రాజ్ఞి కపచారము చేసినట్లగు నని జ్ఞానేశ్వరి భయము. అందువలన నామె తన కుమారునకు మా సంఘములోఁ జేరుట కనుమతి యిచ్చినది గాదు. అతఁడు తన తల్లి కేమియును జెప్పకయే గుప్తముగా సంఘములోఁ జేరుటకు సాహసింపఁజాలక పోయెను.

సుచ--జ్ఞానేశ్వరి నాకుఁ దెలుసును. ఆమె వాస్తవముగా మహారాజ్ఞియందు భక్తిగల వనిత. మహారాజ్ఞికిఁగూడ నామెపై మిక్కిలి గౌరవము. మల్లికార్జునునే మహామంత్రినిగా నియమించుటకు నేను ప్రయత్నించెదను. అతనియొద్ద వయస్సులోలేతవాఁడను లోప మొక్కటియే యున్నది.

కాల—వేయి సంవత్సరములు గడచిన దీర్ఘజీవి కుండవలసినంత లోకానుభవ మతని కున్నది. అతఁడు లేతవాఁడైన నేమి?

సుచ—సైనాపత్యమున కెవరు తగినవా రని నీ యభిప్రాయము?

కాల—నిరుపమాన మహావీరుఁడగు ఘనేంద్రబాబే యందుకు తగినవాఁడు. యుద్ధములందతని శస్త్రము మహేంద్రుని వజ్రమునకు తుల్యము. అతఁడు శస్త్రము లందువలె శాస్త్రములందుఁగూడ ననమానుఁడు. ఆచార్య విమమసిద్ధిని మించిన శస్త్రవిద్యా కౌశలమును, ఆచార్య భవనందని మించిన శాస్త్రవిద్యా నైపుణ్యము నతనియందమరియున్న వి.మల్లికార్జునబాబు మహామంత్రిగాను, ఘనేంద్రబాబు సేనాపతిగాను పనిసేయునెడల భూప్రపంచమంతయు కలిసినను ఆంధ్రరాష్ట్రమును తేఱిచూడఁజాలదు.

సుచ—ఇప్పు డతనిని రాష్ట్రియునిగా నియమించితిని. అదిగూడ నీకాలమునం దత్యంత ప్రధానోద్యోగమే. అందుచలన వేఱు మహావీరునే సేనాపతినిగా నియమించుట యుక్తమని తలంచెదను.

కాల—రాష్ట్రియపదవి యెంతగొప్పది యైనను సేనాపతిపదవికంటె చిన్నదియే యగును.

సుచ—ఆమాట యితర సమయము లందు. విప్లవకాలములందు రెండును సమానోద్యోగములే.

కాలనాథుఁడు నిరుత్తరుఁ డయ్యెను. సుచంద్రునకు కాలనాథునే సేనాపతినిగా నియమింపవలెనని యున్నది. ఆ భావము నతఁ డిట్లు వ్యంగ్యమర్యాద ననుసరించి సూచించెను.

"ఘనేంద్ర మల్లికార్జునులకు సమానుఁడగు వీరుఁ డెవఁడో నాకుఁ దెలుసును. అతనినే నేను సేనాపతినిగా నియమించెదను."

కాల—వీర పరీక్ష యొకటి పెట్టించి ప్రథమోత్తీర్ణునకు సేనాపతి పదవి యిచ్చిన బాగుండును.

సుచ—నీసూచన బాగున్నది గాని ఘనేంద్ర మల్లికార్జునులను విడిచిన వీర పరీక్ష యంతగా శోభింపదు.

కాల—వారిని విడువ నక్కఱలేదు. వారి పదవులు సేనాపతిపదవికి తీసిపోనందున వా రిద్దఱిని విడిచి తక్కినవారిలో ప్రథమునకు సైనాపత్య మిచ్చెద మనియు, ధనరూపమగు ప్రథమ ద్వితీయ బహుమానములు మాత్రము ప్రథమద్వితీయులకే యిచ్చెద మనియు ప్రకటించిన సర్కారువారి యుద్దేశము నెఱవేఱును.

సుచ—ఆవిషయ మాలోచించి నిర్ణయించెదను.

పదునాల్గవ ప్రకరణము

శాంతిసేనకథ

సుచంద్రుఁ డింకను జెప్పుచున్నాఁడు:

"కాలనాథబాబు! మల్లికార్జునుని మహామంత్రినిగా నియమించినపిమ్మట నధికారుల నియమన విషయములో ననంతర మెవరికి నసంతృప్తి యుండదని నేను వేఱుగా చెప్ప నక్కఱలేదు. —జబంధువులు నగరిలో నల్లరిసేయకుండ కట్టుదిట్టములు చేసెదను. ఇఁక మిగిలినది చిత్రకూటసింహాసన సమస్య. శాంతిసేనావిన్నపము నంగీకరించి యామె యభియోగము తెచ్చుటకు మేము సమ్మతి నిచ్చితిమి. గత సప్తమినాఁడు తిరిగియు మే మొక సందేశము పంపితిమి. శాంతిసేనా కుమారికూఁతురు సత్యప్రభను వీరేశ్వర పుత్రుఁడు రణేశ్వరున కిచ్చిన నుభయ పక్షములకు కలహము లేకుండ రాజీకుదురునని నాకు తోఁచి యావిషయమునే నేను మా చెల్లెలకు నా సందేశములో సూచించితిని. దాని కిదివఱకు నాకు బదులు రాలేదు. దానిని గుఱించి నీతో నేమైన చెప్పిరా?"

కాల—శాంతిసేనాకుమారి దీర్ఘముగా నాలోచించి రణేశ్వరునకు తన పిల్ల నీయఁజాలనని యార్య ధర్మపాలుని ద్వారా నాకు కబురంపినారు. ఒకవేళ తనకు కుమారుఁడు పుట్టునెడల నీ రాజీ వ్యర్థమగునని యామె భయము.

సుచ—మొదటి సంతానమునకుఁ బిమ్మట నిన్ని సంవత్సరములు దాటినవి గదా! ఇంకను సంతానము కలుగునని యాశ గలదా?

కాల—మొదటి సంతానము కలిగిన పిమ్మట నామెకును భర్తకు నెడబాపు తటస్థించినది. ఇదివఱ కామె కింకను భర్తృసమావేశము తటస్థింపలేదు. అదృష్టవశమున తటస్థించునెడల తిరిగియు సంతానము కలుగుట కవకాశ మున్నది.

సుచ—ఎందువలన నట్టి వియోగము తటస్థించినది ?

కాల—సత్యప్రభ పుట్టిన కొలదిరోజులలో లాంగలీ నదీతీరమునందు వారియింటికొక యతిథి వచ్చెను. అతఁడు విమలబాబు కత్యంతపరిచితుఁడు. శాంతిసేనా వివాహమునకు ముందు విమలుని పూర్వవృత్తాంత మంతయును చక్కగా తెలిసినవాఁడఁట. అతఁడు తనకు తెలిసిన సంగతులను శాంతిసేనా కుమారికి చెప్పకుండిన బాగుండెడిది. కాలోచిత జ్ఞానము లేనివాఁడును, సహజాసూయ గలవాఁడునగు నాయాత్రికుఁడు విమలుని పూర్వవృత్తాంతమును శాంతిసేన చెవిలో నూదినవాఁడయ్యెను. అతనిమాట లివి:

"అమ్మా! నీమగఁడు బ్రాహ్మణుఁడు గాఁడు. అతనితండ్రి గణదాసు ఎవఁడో సంకరజాతివాఁడు. గణదాసుభార్య వన దుర్గ యొక సంకరజాతి విధవాంగన."

ఊదవఁ సిన దూది బ్రాహ్మణుఁడు వెళ్లిపోయెను. గృహమునందు ఘోరమగు కలహ ముద్భవించినది. విమలుఁడు తాను పౌనర్భవుఁడనని యంగీకరించెను గాని తన తల్లితండ్రులు బ్రాహ్మణులేయని సత్యము చేసి చెప్పెను. శాంతిసేన వారి వంశావళులను గుఱించి యడిగినది. విమలుఁడు చెప్పఁజాలక పోయెను. శాంతిసేనాకుమారి సంశయించి క్రోధోద్రిక్తయై భర్తను పరుషభాషణములచే నొప్పించినది. భార్యా వాక్పారుష్యమును సహింపఁజాలక విమలుఁ డామెను విడిచి పరాఁ యయ్యెను.

చంటిపిల్లతో నొంటరిగా నుంఁన శాంతిసేనాకుమారి పుణ్యలేశమువలన తీర్థయాత్రాపరులగు జటామునిని సందర్శించి తనకష్టము నంతటిని చెప్పుకొనినది. జటాముని తానే గణదాసునని చెప్పి తనయొక్కయు, తన భార్య వనదుర్గయొక్కయు వంశావళులను శాంతిసేనాకుమారికి చెప్పి యామె సంశయమును నివారించెను. కంకోలభట్టాచార్యులే గణదాసని తెలిసినపిమ్మట శాంతిసేనకు తనమగని యున్నతవంశముగుఱించి బోధపడినది. వనదుర్గవృత్తాంతము మఱింత విచిత్రము. ఆమె ఆచార్యవిషమసిద్ధిగారి మేనత్త జయలక్ష్మీదేవి యఁట. తాను పునర్వివాహము చేసుకొనినసంగతి ఘనత చెందిన తన పుట్టింటివారికి తెలియకుండుట కామె పేరు మార్చుకొనెను.

సుచం—ఇది యాశ్చర్యమైన సంగతి. విమలబాబు మా మేనత్త కుమారుఁడా?

కాల—ఔను. సుప్రసిద్ధ కవీశ్వరియగు రాజకాళీదేవి విమలుని చెల్లెలు. ఆమెకూడ సర్కారువారికి మేనత్తకూఁతురే.

సుచ—ఇదియు నద్భుత విషయమే.

కాల—కథాశేషము చెప్పెదను. శ్రీవారు వినవలెను. జటాముని సత్యప్రభను విశ్వసనీయ శిష్య కుటుంబమునందు పెంచుటకు విడిచి శాంతిసేనాకుమారిని దక్షిణదేశయాత్రకు తీసుకొనిపోయెను. అచ్చట నరుణాచల క్షేత్రములో తన గురువగు నరుణగిరి యోగియాశ్రమములో నామెను నిలిపి తాను సేతుబంధయాత్రకు వెళ్లినవాఁడయ్యెను. శాంతిసేనాకుమారి యాపవిత్రాశ్రమమునందు వీతసంగయై తపమాచరించుకొనుచు ననేక సంవత్సరములు గడపినది. ఇన్నాళ్లకా రాజకుమారి తిరిగియు తన దేశమునకు వచ్చినది. అనంతరము తన యన్నగారి కామె విన్నప మంపుకొన్న విషయము సర్కారువారికి విదితమే.

సుచ—ఇప్పటికి నామెకు విమలబాబు కనిపించలేదా?

కాల—ఆమె మా సంఘమునకు చెప్పకపోయినను ఈ శ్రీకాకుల నగరములో నామె భర్తను సంధించె ననియు, భర్త ప్రేరణ వలననే యామె సర్కారువారికి విన్నప మంపుకొనె ననియు నే ననుమానించుచున్నాను. ఆ యనుమానమునకు రెండు కారణములు గలవు. వీతసంగయగు నామె యంత క్షాత్రయుక్తమగు

జాబును స్వయముగా వ్రాయుట యసంభవము. రెండవది వచ్చినప్పటి యామె వేషము కంటె నిప్పటివేషము వేఱువిధముగా నున్నది. అప్పటివేషము ప్రసన్న పావనము. ఇప్పటి వేష ము జ్వల రమణీయము.

సుచ—బాగుగానే పోల్చితివి.

కాల—భావిసంతానాశగూడ నీయంశమునే స్థిరపఱచుచున్నది.

### పదునైదవ ప్రకరణము

### సంధి షరతులు

సుచ—సరి. అది యట్లుండనిమ్ము. మఱియొకమాట నిన్నడిగెదను. మీ శివంకర సంఘమునకు విప్లవోద్దేశ మేమూలలోఁ గూడ లేదా?

కాల— కుండినుల యధికారమును భంగపఱచు నూహ మా కింతమాత్రమును లేదు. అంతియేగాదు. కుండినుల యధికారమునకు ప్రతికూలముగా పనిసేయు శక్తులను నిర్మూలించుటకు మేము మా వేఁడిరక్తమును ధారవోయఁగలము. పరదేశమునుండి దండయాత్ర యే వచ్చునెడల మాతిండి మేము తినుచు మాయాయుధములతో మేము యుద్ధమునకు సిద్ధపడఁగలము. అయినను—

సుచ—అదియే నాకు వినవలెనని యున్నది. ఏదియో యొక యుద్దేశమే లేనియెడల కేవల ప్రచారమునకుఁగాను గుప్తసంఘ మొకటి యేర్పఱచవలసిన యవసర మేమి?

కాల—భగవత్సమానులగు భట్టారకుల సన్నిధిలో నే నసత్యమాడఁజాలను. చిత్రకూట మహామండలమును రక్తపాతము లేకుండ న్యాయస్థానమువారు శాంతిసేనాకుమారి కొప్పగించిన మంచిమాట. అట్లు జరుగనపుడు మేము తప్పక శాంతిసేనాకుమారికి తోడ్పడి వీరేశ్వరబాబును సింహాసనము నుండి తరిమివేయఁగలము.

సుచ—న్యాయస్థాననిర్ణయము మీకు ప్రతికూల మగునని భయమున్నదా?

కాల — చంద్రప్రభాదేవి మోసము రుజువుపఱచుట విషయములో మాకు భయము లేదు గాని పంద్రెండుసంవత్సరము లవిచ్ఛిన్నముగా ప్రతిపక్షుల యాక్షేపణ లేక యనుభవించిన యనుభవము గౌరవింపఁదగినది యను యుక్తిపై న్యాయస్థానమువారు శాంతిసేనాకుమారి వ్యాజ్యమును త్రోసివేయుదురేమో యను భయము మాకుఁ గలదు. అట్లు వారు త్రోసివేయునెడల మాసంఘము కత్తిధరించి తీరును. మాయభిప్రాయములో న్యాయమునకు కాలదోషము లేదు.

సుచ—అపహర్తుఁడు వారసా, కొమ్మారితె వారసా అను విషయమును చర్చించుటకు కాలదోషము పట్టినను మోసమునకు కాలదోషము పట్టెనని నేనెంచను అయినను న్యాయవాద్వివాకుల సమీక్ష యెట్లుండునో. న్యాయస్థానపుతీర్పు తొంబదితొమ్మిదివంతులు కుమారి కనుకూలముగా నుండవచ్చును. ఒకవేళ ప్రతికూలమగునెడల సార్వభౌముని సేనలు వీరేశ్వరబాబుకు తోడ్పడుట రాజధర్మము.

కా.—మా కర్తవ్యము మాకు స్పష్టముగానే యున్నది. మేము సార్వభౌముని సేనలు వీరేశ్వరునకు తోడ్పడినను గూడ ఘోర సంగ్రామము సేయుటకు నిశ్చయించుకొనియే యున్నారము.

సుచ—మీ శివంకర సంఘములో సభ్యు లెందఱున్నారు ?

కాల—లక్షమంది గలరు.

సుచ—(ఆశ్చర్యముతో) లక్షమందియా ?

కాల—ఏబదివేల మంది చిత్రకూట రాష్ట్రమున నున్నారు. ఏబది వేల మంది యాంధ్రరాష్ట్రమున నున్నారు.

సుచ—ఇంత మందికిని గజవీరుడేనా యధిపతి ?

కాల—ఔను. అతనిచేతిక్రింద నున్నారు సేనాపతులిద్దఱు-ఒకరు చిత్రకూటరాష్ట్రమున, నింకొకడాంధ్రరాష్ట్రమున.

సుచ—(నవ్వుచు) మా కాలనాథబాబే కాబోలు నాంధ్రరాష్ట్రమునందు సేనాపతి?

కాల—శ్రీవా రెట్లు పోల్చుకొన్నారు?

సుచ — చిత్రకూటరాష్ట్రసేనాపతిని బహువచనముచే గౌరవించి యాంధ్రరాష్ట్రపతి నేకవచనముచే దిం వేయుటవలన.

కాల—ఔను మహాప్రభో ! శ్రీవారు పోల్చినట్లు తమ కాలనాథుడే యాంధ్ర రాష్ట్రసేనాపతి.

సుచ—ఏ షరతులపై మీ సంఘ మంతయు సార్వభౌముని ప్రభుత్వమునకు సంపూర్ణముగా లొంగిపోవునో వాటిని స్పష్టముగా నేదియును దాచక చెప్పుము.

కాల—దయచేసి వినవలెను.

సుచ — చెప్పుము.

కాల—౧. ప్రజల పన్నులను తగ్గించి యథాపూర్వముగా నిలపవలెను.

౨. ప్రస్తుత మహామంత్రిని తీసివేసి మఱియొక సమర్థుడగు మహామంత్రిని నియమింపవలెను.

3. చంద్రప్రభాదేవి మోసము రుజువగు నెడల శాంతిసేనాకుమారి కామె రాజ్యము నిచ్చివేయవలెను.

ఇవియే మా సంఘముయొక్క షరతులు.

సుచ—మహామంత్రి మన మనుకొనిన విధముగా తప్పక మార్చబడును. అతడు మార్చబడిన తత్క్షణమే పన్నులను తగ్గించి వేసెదము. శాంతిసేనాకుమారి వ్యాజ్యమును విచారించుట కుత్తరు విచ్చుటయే గాక యనుకూలభావముతో విచారించెదను. కాలదోషసమస్యలో నా ప్రాడ్వివాకులలో ముగ్గురు కాలదోషము పట్టిన ట్లభిప్రాయపడు నెడల నే నపుడు వారి నిర్ణయమును గౌరవింపవలసి వచ్చును. అట్టి సందర్భములో మా చెల్లెలిని పార్వతీయమహామండలమున కీశ్వరినిగా చేసెదను. మీసంఘమువా రంగీకరించెద రా ?

కాల—ఈ విషయములో నేను మా నాయకునితో నాలోచించి బదులు చెప్పవలసి యున్నది.

సుచ — నేనే మీ నాయకునితో మాట్లాడెదను. అతనిని నాయొద్దకు పంపఁగలవా ?

గజవీరుఁ డెవఁడో తెలుసుకొనుటకే రాజుగా రీవిధమున నడిగిరి.

కాల—తప్పక పంపెదను. సమావేశము మాత్రము కోటలోఁగక రహస్య స్థలములో జరుగవలెను.

సుచ—ఏ స్థలము బాగుండును ?

కాల—నగరము వెలుపల చిట్టడవిలో నుండు మహామారీ మందిరము దగ్గఱ నొక వటవృక్ష మున్నది. అది సరియైన స్థలమని నాతలంపు.

సుచ—(ఆతురతతో) ఈ రాత్రియే అర్ధరాత్రమునకు ముందుగా నీ వచ్చుటికి మీ నాయకుని తీసుకొనిరమ్ము. నేను సచివుఁడగు రూపచంద్రునితోఁ గలిసివచ్చెదను.

కాల—ఆజ్ఞప్రకార మట్లేచేసెదను.

పదునాఱవ ప్రకరణము

అంతరంగ సంభాషణము

సుచ— కొసకు నీ తల్లితండ్రులు శ్యామలాసులోచనులుకారని నీ మనస్సాక్షికి స్ఫురించినదా?

కాల—ఔను మహాప్రభో !

సంభాషణము ముగించినది గాన సెలవు తీసుకొనివెళ్లవలెనని కాలనాథుఁ డెంచుచుండ రాజు వేఱుప్రసంగమునకు దింపి సంభాషణము పొడిగించినవాఁ డయ్యెను.

సుచ—తిరిగియు నీ యసలు తల్లితండ్రులను శోధింప నారంభింతువా?

కాల—విస్తారము శోధన మక్కఱలేకయే నా తల్లితండ్రులు నాకు తెలిసిపోయినారు.

సుచ— (సంభ్రమముతో) వారి పేరులను నేను వినవచ్చునా?

కాల — యోగీశ్వరి రాజకాళీదేవి చెప్పిన పాటలు ముందుగా నన్ను తప్పత్రోవలోనుండి మరలించినవి. అవి యెవ్వియనఁగా—

"వంచకులకువారి వచనము వినక
పెంచినవారికిఁ బిండము పెట్టు
ఇలఁ బ్రాణములతోడ నిటునటుఁ దిరుగ
నిలిపిన ఘనుపేరు నిలఁబెట్టవలయు
శునకి నక్కను గూడి కనునె సింగమును?
పెనుసర్పమున కెట్లు పెదజోగి పుట్టు?
పుట్టకుఁ బుట్టునా పురుహూతు ధనువు?
గుట్టకుఁ బుట్టునా కోకబాంధవుఁడు?
కుక్క కుక్కను గూడి కులము చేరెనుర
నక్కనక్కను గూడి నాడులో వెలసె.
మాయలమల్లియా మహిలామతల్లి
కాయంబులోనుండి కదలివచ్చితివి
కయ్యాలభామయా దయ్యాలరాణి
యుయ్యాలలోనుండి యూడివచ్చితివి
భువిఁ దిరుగాడెడు భూతాలసాని
చవిగల యొడినుండి జాఱివచ్చితివి.
ఉపమగానఁగరాని యుద్ధతనారి
విపులవక్షోవాటి విడిచివచ్చితివి
పాలువేసినతల్లి ఫలమెట్లు తినును?
పాలునిరతుము బాలింపుమయ్యా."

వీటిలోనుండి శ్యామలగాక వేఱు అమానుషవ్యక్తి యెవ్వరో నాతల్లి యని నాకు ముందుగా బోధపడినది. మొన్న రాత్రి రాజకాళి స్వయముగా చంపావతిగారి యింటికివచ్చి నన్నుచూపి "వీఁడు రాథీతర సత్యరథుని చెల్లెలికొడుకు" అని యొక సారియు, "నిజముగా నితఁడు నీయాడబొట్టె కొడుకే" అని యింకొకసారియు చెప్పి కంకోల గణదాస చక్రధర జటాముని నామములతో విలసిల్లు మహాపురుషుని కొమారితె నా తల్లి యని స్పష్టపఱచినది. రాజకాళీదేవి తననే పరోక్షభాషలో నట్లు చెప్పెనని మేము నిశ్చయించుకొంటిమి. మహాప్రభో! నే నిట్లొక యున్మత్తకవీశ్వరి కుమారుఁడను. నా తండ్రి యా మహాకవీశ్వరి ప్రేమించు మహాపురుషుఁడే కావచ్చునని మే మనుమానించితిమి. ఆమె స్వయముగా నారీసభలో—"నా రాజు నరహరి నాచిన్ని మగఁడు, నా రాణి లీలమ్మ నాముద్దుసవతి" అని వక్కాణించుటయే గాక తనవదినె చంపావతితో మహారాజు తనభర్తయని స్పష్టభాషలో ప్రసంగవశాత్తుగా తెలియఁజేసినది. అనంతరము పూర్ణ స్పష్టార్థము "కౌండిన్య సుచంద్రభట్టారకులు కాలనాథుని తండ్రియా?" అని యడిగెను.

సుచ—(ఆతురతతో) ఏమి బదులు చెప్పినది?

కాల—అందుల కౌనని ప్రత్యుత్తరమిచ్చి నాతండ్రి నైదు పాటలలో వర్ణించినది.

సుచ—ఆపాటలు జ్ఞాపకమున్నవా?

కాల—వాటిని మఱచుటకు నాకు సాధ్యమా? ఆపాట లివ్వి—

"కాలింగు గెలిచిన కరవాలధారి
లీలమ్మతో నాడు లీలానరుండు
కాయజుమించిన కమనీయతముఁడు
మాయావిహీనుఁడౌ మహనీయతరుఁడు
మందారమును మించు మాన్యుఁడౌ దాత
వందారు జనులను పాలించు త్రాత
ఆడి తప్పనివాఁడు హరినామపరుఁడు
నాడును గాపాడు నాయకవరుఁడు
రాజమ్మ ప్రేమించు రాజాధిరాజు
పూజితుఁడౌ తండ్రి పురుషోత్తమునకు."

అందువలన నా తండ్రి మహారాజ పరమేశ్వర శ్రీ కౌండిన్య సుచంద్రభట్టారకులని చెప్పుటకు నాకు సందేహములేదు.

సుచంద్రుని యూహలో నీ యంశము ముందే నాటుకొనియుండెను. అయినను రాజకాళినోటినుండి వెడలిన మాటలను వినినపిమ్మట నతని సంశయములన్నియు విడిపోయినవి. రథినియొక్క యద్భుతబుద్ధికతఁడు మిక్కిలి యాశ్చర్యపడెను.

సుచ—(హర్షముతో) ఔను కుమారా, ఔను. నీవు నా పుత్రుఁడవే. ఈసంగతి మొన్న మధ్యాహ్నము రథినీకుమారి పోల్చి నాదగ్గఱ చెప్పినది. ఇప్పు డావిషయము స్థిరపడిపోయినది. నా తండ్రీ! నీ తల్లిమాయలవలన నీ పుట్టుక నేను తెలుసుకొనలేకపోతిని.

కాలనాథుఁడు లేచి తండ్రికి సాష్టాంగముగా నమస్కరించినాఁడు. సుచంద్రుఁ డతనిని లేవనెత్తి యాలింగించుకొని తనతొడపైఁ

గూర్చుండఁబెట్టుకొనెను. ప్రపంచము నంతటి నెదురులేక సాధింపఁగల యువకుఁడు శిశువుగా మాఱెను. తండ్రికొడుకు లిద్దఱును భావోద్రేకమువలన నేడ్చుకొనిరి. నీ తల్లి యంతఃపురము నలంకరింపకుండ భిక్షుకురాలువలె వీథులలో తిరుగుచున్నది యని తండ్రి విలపించెను. శైశవమునుండి యామె కష్టములనే యనుభవించుచున్నది యని కొడుకు విలపించెను. అప్పుడు వారిద్దఱును చాలసేపువఱకు రాజకాళిని గుఱించియే మాట్లాడుకొనిరి. మంజులావృత్తాంతము నంతటిని రాజు కొడుకుతో చెప్పెను. రాజకాళి తన పెండ్లి గుఱించి వర్ణించిన విషయమును కొడుకు తండ్రికిఁ జెప్పనవాఁడయ్యెను.

## పదునేడవ ప్రకరణము

### ఘోరకుఁడే విమలుఁడు

రాత్రి వెన్నెల కాయుచున్నది. మహామారీ మందిరము దగ్గఱనుండు వటవృక్షము క్రింద నొక కటాసనముపై సార్వభౌముఁడు కూర్చుండియున్నాఁడు. అతని సమీపమున రూపచంద్రుఁడు నేలపైఁ గూర్చుండెను. రాజు సచివునితో రూపచంద్రునితో శివంకరసంఘ ప్రతినిధి మాటలు వ్యవహారకాండమునకు సంబంధించినంతవరకు చెప్పెను. మహామంత్రిపదవిని గుఱించి మల్లికార్జునబాబే తగినవాఁడనుటలో రూపచంద్రుఁడు కాలనాథునితో నేకీభవించెను. సేనాపతి నియమన విషయములో తత్కాలమునకు చండసేనుని సేనాపతినిగా నియమించి రెండు మాసములలో స్థిర సేనాపతినిగా ఘనేంద్రునే నియమించి ఘనేంద్రుని రాష్ట్రియోద్యోగమును కాలనాథున కీయవచ్చుననియు, సద్యః కాలనాథుని నగరపాలునిగా నియమించిన బాగుండుననియు నభిప్రాయపడెను. రాజు విని తలయూచెను గాని యేదియును నిర్ణయించుకొనలేదు.

రాజు రాజకాళికిని తనకుఁగల సంబంధము గుఱించి సచివునితో చెప్పక పోయినను కగచజబాబు కుటుంబము గుఱించి తనకు తెలిసినంతవఱకు చెప్పి విమలరాజకాళులను గుఱించియు, వారితల్లి తనయొక్క వేలువిడిచిన మేనత్త జయలక్ష్మిని గుఱించియు నధికముగా చెప్పెను.

గజవీరుఁ డెవరుగా నుండవచ్చు ననుటలో రాజసచివులు భిన్న భిన్నముగా నంచనావేసిరి. ఘనేంద్రుఁడుగా నుండవచ్చునని సచివుని యంచనా. అతఁడు తన మేనబావ విమలుని కుటుంబ విషయములో పాటుపడుట సహజమని యతని యూహ. ఘోరకుఁడే గజవీరుఁడని పార్థివుని యంచనా. తన తల్లితండ్రులకు తెలియకుండ ఘనేంద్రుఁడు ప్రభుత్వచర్య ప్రతికూలమగు గుప్త సంఘమునకు నాయకత్వము వహింపఁడనియు, భవనంది యట్టి గుప్తసంఘ నాయకత్వము వహించుటకు కుమారున కుత్తరు వీయఁడనియు రాజుగారి వాదము. ఘోరకునకు విమలునితో నేదియో గుప్తసంబంధము గలదని వారి యూహ.

వారిట్లు వాదించుకొనుచుండఁగా నిద్దఱు మనుష్యు లాప్రదేశమునకు వచ్చుచుండుట కన్పట్టెను. రాజసచివుల మాటలాఁగినవి. వారిదృష్టు లాప్రక్కకు మఱలి

నవి. కాలనాథునితో వచ్చువాఁడు సచివుఁడు తలంచినట్లు ఘనేంద్రుఁడు గాఁడు. రాజుగారు తలంచినట్లు ఘోరకుఁడు గూడఁ గాఁడు. అతఁడు బాలుఁడైనను స్థవిరులను మించిన బుద్ధిమంతుఁడగు ప్రమథనాథుఁడు. తండ్రి ఘోరకుని మించి పరాక్రమశాలి. ప్రమథనాథుఁడు తండ్రివలె నతఁడుగూడ మేచకవర్ణుఁడే యగును. ఒక విశేషమున్నది. తండ్రి కేశములు నీలములు. ఇతని కేశములు తామ్రములు.

కాలనాథ ప్రమథనాథులు చక్రవర్తిని సమీపించి ముట్టి కాళ్లు వేసుకొని దండములు పెట్టిరి. ప్రభు వభినందించిన పిమ్మట వారిద్దఱును నిలఁబడిరి.

సుచ—ఇతఁడేనా శివంకర సంఘనాయకుఁడగు గజవీరుఁడు?

కాల—ఔను మహాప్రభో!

సుచ — పదునాఱేండ్లు దాఁటియు దాఁటని బాలుని లక్షమందిగల గొప్ప మహాసంఘమునకు నాయకునిగా చేసుకొనినారా?

కాల—విశ్వామిత్ర యజ్ఞరక్షణకాలములో శ్రీరాముని వయస్సెంత? భారత యుద్ధకాలములో నభిమన్యుని వయస్సెంత? తేజస్సులకు వయస్సులెక్క యెక్కడిది? ముందుగా మే మితని తండ్రినే నాయకునిగా నుండఁగోరితిమి. తన రాజకీయోద్యోగము విస్తారము తీరుపాటు లేనిదిగా నుండుటవలన నతఁడు తాను నాయకత్వము వహింపఁజాలక మహాసమర్థుఁడగు తన కుమారుని మాకుఁ జూపెను.

సుచ—సరి. (ప్రమథనాథునిఁ జూచి) గజవీరబాబు! నీతో నేను కొంత మాట్లాడవలసియుండి పిలిచితిని. మనము మాట్లాడునపుడు రూపచంద్ర కాలనాథు లుండవచ్చునా?

గజ—ఉండఁగూడదు.

రాజు రూపచంద్ర కాలనాథులను దూరముగాఁ బోవ నాజ్ఞాపించెను. ఆజ్ఞాప్రకారము వా రట్లే చేసిరి.

సుచ—గజవీరబాబు! కూర్చుండుము.

గజవీరుఁడు నేలపైఁ గూర్చుండెను.

సుచ—మా ప్రభుత్వమునకు శివంకర సంఘముతో సంధి కుదురుటకు మా ప్రతినిధి చెప్పిన మూఁడవ పర తడ్డంకిగానున్నది. న్యాయస్థానముయొక్క చేతుల నా పరతు కట్టివేయుచున్నది. తొంబదితొమ్మిదివంతులు న్యాయస్థానము శాంతిసేనా కుమారి కనుకూలముగానే తీర్పియఁవచ్చును. ఒకవేళ ప్రతికూలమగునెడల పార్వతీయ మహామండలమును మాచెల్లెలి కిచ్చెదను. మీరు సంధి కంగీకరించెదరా?

గజ—మాకు న్యాయస్థాన విచారణ యక్కఱలేదు. శ్రీవారు మా యాధారము నొకసారి చిత్తగించి యెట్లు చేయుమని సెలవిచ్చిన నట్లు నడుచుకొనెదము.

సుచ—ఆయాధార మిప్పుడు నీ దగ్గఱ నున్నదా?

గజ—ఉన్నది. నే నా పత్రమును తీసుకొనివచ్చితిని. అది చదువుటకు దీపము

కావలసివచ్చునని దీపము వెలిఁగించు సామగ్రిగూడ తీసుకొనివచ్చితిని.

సుచ—అట్లగునెడల దీపము వెలిఁగింపుము.

గజ—ఆజ్ఞప్రకారమట్లే చేసెదను.

గజవీరుఁడు తన కంబళికవచములోనుండి ప్రమిదయు, వత్తియు, నూనెబుడ్డియు, చెకుముకిఱాళ్లను తీసి దీపము వెలిఁగించినవాఁ డయ్యెను. ఆ దీపము చూచి దూరములో నున్న రూపచంద్రుఁడు కాలనాథునితో వటవృక్షముక్రింద న్యాయవిచారణ జరుగుచున్నది యని చెప్పెను. గజవీరుఁడు తన జేబులోని పత్రమును సార్వభౌమునిచేతి కందించెను. సార్వభౌముఁడు దానిని చదువుకొనినవాఁ డయ్యెను.

"మహామండలేశ్వర శ్రీ కౌండిన్యమేఘస్వామి భట్టారకులవారు —

తమ దండనాయకులైన నందాపుర దుర్గపాలకులు నందిసేనదొరగారికి వ్రాయించిన ప్రత్యుత్తరము.

మీ యుత్తరమును మా యంతరంగ కార్యదర్శి మాయొద్దఁ జదివినాఁడు. చిరంజీవిని శాంతిసేనాకుమారిని శ్రీశైల మహామండలేశ్వరుని కుమారున కిప్పించి పెండ్లి సేయించుటకు చిన్నమహాదేవి ప్రయత్నించుచుండుట వాస్తవమే యైనను మా యేకపుత్రికను చిత్రకూటరాష్ట్ర సింహాసనోత్తరాధికారిణిని దూరస్థలమున కిచ్చి వేయుటకు మే మంగీకరింపలేదు. ఆ విషయములో మీరు భయపడ నక్కఱలేదు. చిన్న మహాదేవి పెంచిన వీరేశ్వరుఁడు మాచే యౌవరాజ్యమున నభిషేకింపఁబడునని మీరు భ్రమపడుట పొరపాటు. రహస్యముగా తన ప్రేరణచే పాఱవేయఁబడిన తన చెల్లెలి కుమారునే చిన్న మహాదేవి పెంచుకొనెనని కొన్ని నిదర్శనముల వలన మాకుఁ దెలియకపోలేదు. అయినను అనపత్యురాలగు రాణి యొకనిని పెంచుకొని వానివలన పుత్రసౌఖ్య మనుభవించుచుండ దానిని మేము భంగపఱచు నవసరము కన్పట్టుటలేదు. ఆ పిల్లవాని కొక జాగీరును వ్యయపఱచుట యంత నష్టము కాదనుకొనెదను. గ్రహింపవలెను.

కౌండిన్యమేఘస్వామి వ్రాలు.

ప్రజోత్పత్తి సం॥ చైత్రశుద్ధ చతుర్థీ సోమవారము.

ప్రభువువారి యొఱుకను భార్గవ సోమనాథుఁడు వ్రాసినది."

జాబు చదివి ముగించిన సుచంద్రుని ముఖమును గజవీరుఁడు చూచెను. అది తమ కత్యంతానుకూలముగా కన్పట్టినది.

సుచ—కాలదోష సమస్యకు మీరు భయపడ నక్కఱలేదు. శాంతిసేనా కుమారిచే వ్యాజ్యము తెప్పింపుఁడు. తప్పక యామె సంస్థానము నామె కిచ్చివేసెదను. స్వర్గస్థులగు మాపినతండ్రిగారి యభిప్రాయమునకు నేను తలయొగ్గెదను. నా అసాధారణాధికారము నుపయోగించి యీ సమస్యకు కాలదోషము గమనింపఁబడ నక్కఱలేదని యుత్తరు విచ్చెదను. అసాధారణ

వ్యాజ్యసందర్భములం దట్టి యుత్తరు విచ్చుటకు నా కధికారము గలదు.

గజ—అట్లే చేసెదము.

సుచ—ఇఁక మనకు సంధి కుదిరినట్లేనా ?

గజ—కుదిరినట్లే అందులకు సూచకముగా నా సంపూర్ణసంఘముతో సార్వభౌముని ప్రభుత్వమునకు నేను కింకరుఁడనైతినని నేనొక విన్నపమును శ్రీవారికి పంపుకొనెదను. నా కైంకర్యము నంగీకరించినట్లు సార్వభౌముఁడు ప్రత్యుత్తర మిప్పించినఁ జాలును.

సుచ—అట్లే కానిమ్ము. అందులను కలిసి మీసంఘముయొక్క కార్యనిర్వాహక మండలివా రెందఱు ?

గజ — అధ్యక్షుఁడుగాక శ్రీకాకుల నగరియందున్నవారు నలువురు—అక్షోభ్య మహామునియు, ధర్మపాలసూరియు, కాలనాథబాబును, మా అమ్మ సౌదామినియును. చిత్రకూట రాష్ట్రమునందు నందిసేన పుత్రుఁడు వీరసేనుఁడు సర్వాధికారి.

సుచ—ఘనేంద్రునకు మీ సంఘము గుఱించి యేమైనఁ దెలుసునా ?

గజ—తెలియదు.

సుచ—ఇఁకమీఁదట నీ యసలు పేరుతోనే నీవు సంఘము నేల నడిపింపఁ గూడదు?

గజ—గుప్తముగా నుండుటలోనే దాని శక్తి యధికముగా నుండును. మా కార్యనిర్వాహక సభ్యులకును మా తండ్రికిని మా ప్రభువుకును తెలిసినఁ జాలును.

సుచ—మీ తండ్రి కొడుకులకు శాంతి సేనాకుమారి విషయములో నింత శ్రద్ధ యుండుటకు కారణమేమి ?

గజ—మహాప్రభో! అది యొక గొప్ప రహస్యము. ఆరహస్య మక్షోభ్యమహామునికిని మా అమ్మకును తప్ప మా కార్యనిర్వాహక సభ్యులకుఁగూడఁ దెలియదు. సత్యరథ బాబుగారి పూర్ణ కొకరితెకు తెలుసును.

సుచ—అది రహస్య మగునెడల నాకు చెప్ప నక్కఱలేదు.

గజ—శ్రీవారికి చెప్పఁగూడని రహస్య మింక మాదగ్గఱ నుండదు. శాంతిసేనాకుమారి భర్తయగు విమలుఁడే మాతండ్రి ఘోరకుఁడు. దురదృష్ట వశమున నతఁడు తన భార్యచే తూలనాడఁబడి కోపము పట్టఁజాలక యామెను విడిచి వీరపల్లియను గ్రామమునకు వచ్చి యచ్చట జ్ఞానేశ్వరీ చంపావతుల చెల్లెలగు మా అమ్మ సౌదామినిని పెండ్లియాడెను. ఇప్పుడు భాగ్యవశమున తిరిగియు తన ప్రథమభార్య నతఁడు సంధించి యామెదుఃఖమును పోఁగొట్టెను.

సుచ— (అత్యాశ్చర్యముతో) ఘోరకుఁడే విమలుఁడా? మా మేనబావ మా భగినీపతి విమలుఁడు నాయొద్ద మహాప్రతీహారిగా పనిసేయుచున్నాఁడా ?

గజ—ఔను. పరమశివునకు నందివలె నాంధ్రేశ్వరునకు విమలుఁడు మహాప్రతీహారిగా నున్నాఁడు. అన్ని రాజసేవలకంటె నదియే గొప్ప రాజసేవ యని యతని శ్రద్ధ.

## పదునెనిమిదియవ ప్రకరణము

### పూర్ణయే సత్యప్రభ

సుచ—సత్యప్రభను జటాముని యెవరి యింట పోషణమున కిచ్చెనో నీకుఁ దెలుసునా?

గజ—తెలుసును. ఇతరుల యింటి కెక్కడనుగూడ నీయలేదు. తన పెద్దకుమారుని చేతికే యిచ్చినాఁడు. ఆమె యిప్పుడు శ్రీకాకుల కన్యకామణులలో ప్రథమురాలుగా వెలుఁగుచున్నది. ఆమె తలకు భేదింప శక్యముగాని విషయము లేదు. ఆమె వాక్కునకు గోచరింపని తత్త్వ రహస్యము లేదు. ఆమె పాటలతో మాటలాడఁదగినంత యాశుకవీశ్వరి. ఆమె మహేంద్రుని భక్తులలో నగ్రగణ్యురాలు. ఆమెశస్త్ర మతిభీకరము. కాళికసులోచన డేఁబదిమందితో నామెపైఁ దలపడి యొక గాయమైన నామెశరీరమునందు చేయ లేక పోయినాఁడు. రాజకాళీదేవి యామె నింద్రాణి యవతారమునుగా భావించును. కాత్యాయని యామెను చతుర్భగినులలో నొకతెనుగా కీర్తించును. ధవలాక్షి యామెను సంచరించు వజ్రసాలభంజికనుగా నెంచును. సౌదామిని యామెను తమ యింటి భాగ్యదేవతనుగా స్తుతించును. రథినీకుమారి యామెను కుండిన సామ్రాజ్యలక్ష్మికి సఖినిగా శ్లాఘించును. ఫలిని యామెను శ్వేతకాళినిగా కొనియాడును. మధువాణి యామెను వీరసరస్వతినిగా పొగడును. ధరణి యామె నాంధ్రదేశముకుటమణినిగా వర్ణించును. ఘనేంద్ర కాలనాథ మల్లికార్జునులకంటె నామెనుండియే నిశంభుఁ డెక్కువగా భయపడును. జటాముని తన పిల్లలకంటె నెక్కువగా నామనుమరాలినే ప్రేమించును. అక్షోభ్యముని యామెను ననిమేష సురాంగననుగా పక్కాణించును. ఆమె శుభ్రాంగిని మించిన విద్వాంసురాలు. రాజకాళీదేవిని మించిన కవీశ్వరి కాత్యాయనిని మించిన తాంత్రికరహస్యజ్ఞురాలు. ధవళాక్షిని మించిన మహాయోగిని. రథినీకుమారిని మించిన రాజకీయ తంత్రజ్ఞురాలు. కుండిన వంశముక్తామణి శాంతిసేనాకుమారి మహానీయఁ డగు కాంకోలవిమలునివలన లాంగలీ తీరమునం దామెను కనినది. కన్నతండ్రి యామెకు పెట్టిన పేరు సత్యప్రభ. ఆమె శరీరప్రభ సత్యము. ఆమె ప్రజ్ఞాప్రభ సత్యము. ఆమె కరవాలప్రభ సత్యము. అందువలన నిజముగా నామె సత్యప్రభయే. పెంచిన తండ్రి యామెకు పెట్టిన పేరు పూర్ణ. ఆమె బలమునందు పూర్ణ. విద్యయందు పూర్ణ. ప్రజ్ఞయందు పూర్ణ. గుణములందు పూర్ణ. అందువలన నిజముగా నామె పూర్ణయే. పరమాత్మ ప్రకాశమే సత్యప్రభ. వ్యాపక చిచ్ఛక్తియే పూర్ణ. ఈ రెంటికిని భేదములేదు. మహాప్రభో! ఇట్లు పూర్ణయే సత్యప్రభ.

## పందొమ్మిదియవ ప్రకరణము

### "సాటి యెవరు రాజచంద్రున కింక"

గజవీరుని ప్రకటనము పార్థివునకు సంతోషాశ్చర్యములఁ గలిగించినది. ప్రఫుల్ల నయనములతో నతఁడు గజవీరుని జూచి యిట్లనినాఁడు—

"దుష్టులు పూర్ణజన్మను గుఱించి యేమేమియో కల్పించినారు. అసలు సంగతి

యిదియా? లక్ష్మి క్షీరాబ్ధిలోఁగాక మఱి యెచ్చటఁ బుట్టును? ఈరోజు మంచిరోజు. నా బంధువులందఱును నాకుఁ దెలియుటయే గాక వారితో సంధిగూడ నాకుఁ గుదిరినది. ఇంక రూపచంద్ర కాలనాథులను పిలువుము."

గజవీరుఁడు వెళ్లి వారిద్దఱిని పిలిచినవాఁడయ్యెను. ముప్వురును వచ్చి రాజాజ్ఞచే రాజసమీపమునఁ గూర్చుండిరి.

సుచ—(సచివునిజూచి) రూపచంద్ర! శివంకర సంఘముతో నాకు సంధి కుదిరినది. మల్లికార్జునుని మహామంత్రినిగా నియమించి పన్నులను తగ్గించుటకు ముందే యంగీకరించితిని. ఇప్పుడు శాంతిసేనాకుమారి వ్యాజ్యము నసాధారణముగా నంగీకరించి కాలదోషసమస్య యడ్డు లేకుండ విచారించుటకుఁగూడ నిప్ప డొప్పుకొంటిని. (గజవీరుని జూచి) క్రొత్త సేనాపతి నొకనిని నియమింప వలసియున్నది. తగిన యతనిని నీవు సూచింపుము. కాలనాథ రూపచంద్రు లిద్దఱును ఘనేంద్రుని నియమింపుమని కోరుచున్నారు. నీ యభిప్రాయ మేమి?

గజ — మల్లికార్జునుని మించిన మహామంత్రి యెట్లు దొరకఁడో ఘనేంద్రుని మించిన రాష్ట్రియుఁ డట్లు దొరకఁడు. సంగ్రామదక్షుఁడగు మహావీరుఁడు సైనాపత్యమునకు చాలును. రాష్ట్రియాధికారమునకు మహావీరుఁడుగా నుండుటయే గాక రహస్యాపరాధ పరిశోధనమునందు మహానిపుణుఁడుగాఁ గూడ నుండవలసినది. ఘనేంద్రుఁ డందులకు తగినవాఁడు. అతని నా పదవి నుండి సేనాపతి పదవికి మార్చుట నాకు సమ్మతము గాదు. సైనాపత్యమునకు తగిన వ్యక్తిని మనము వెతకుకొన నక్కఱలేదు. అట్టి మహావీరుఁడు మన రాజధానిలోనే యున్నాఁడు.

సుచ — (కుతూహలముతో) ఎవ రతఁడు?

గజ— అతఁడు ధర్మనిష్ఠయందు యుధిష్ఠిరుఁడు. బాహుబలమునందు భీమసేనుఁడు. ధనుర్విద్యయం దర్జునుఁడు. ఖడ్గవిద్యయందు నకులుఁడు. నిష్కపట నీతియందు సహదేవుఁడు. ఔదార్యమునందు కర్ణుఁడు. వ్యూహజ్ఞానమునందు ద్రోణుఁడు. స్వసైన్యరక్షాతంత్రమునందు భీష్ముఁడు. పరసైన్యవిదారణపద్ధతియం దశ్వత్థామ. అశ్వ హృదయజ్ఞానమునందు కృష్ణుఁడు. కలలోనైన నబద్ధమాడి యెఱుంగనివాఁడు. సప్రేమ మహాసుందర కన్యల వివిక్తసన్నిధిలోఁ గూడ చలింపని యకలంక బ్రహ్మచారి. స్వార్థత్యాగమునకు పేరువడసిన మహాపురుషుఁడు. పరార్థసాధన వ్యసని. కాశ్యపసుదర్శనుని కృత్రిమపుత్రుఁడు. అతని పేరు కాలనాథుఁడు. తమ ధర్మపత్ని యాంధ్రభూమియొక్క సత్పుత్రులలోనతఁడు శ్రేష్ఠుఁడు. కనిపించుచుండు నతనిని విడిచి సైనాపత్యమున కింకొకనిని వెతకుట యనావశ్యకము.

సుచ—గజవీరబాబు! నీవు చెప్పిన మాట నిశ్చయము. ఇప్పటికి తాత్కాలికముగా చండసేనుని సర్వసేనాపతినిగా రెండు మాసములలో కాలనాథ బాబును దండనాయకపదవివఱ కెక్కించి యనంతర మితనినే సర్వసేనాపతినిగా నియమించుటకు నిశ్చయించుకొంటిని.

రూప—బాగానే యున్నది యీ సంవిధానము.

కాలనాథుఁడేమియు మాట్లాడలేదు.

పని ముగించినందున నందఱును లేచుటకు సిద్ధులై యుండిరి. అంతలో నాచెట్టుప్రక్కనుండి యకస్మాత్తుగా నొక స్త్రీ బయల్వెడలి వచ్చి వారి యెదుట ప్రత్యక్షురాలై యీ క్రిందిపాటలు పాడినది.

"పెద్ద వృక్షముక్రిందఁ బెనుభూత మొకటి
నుద్దెలవాయించు మూనిసితోడ
చిన్న దేవత యింటఁ జిత్రభూతంబు
మన్ననసూపెడు మన్నీనితోడ
ఘోరమౌ నడవిలో గొప్పదయ్యంబు
వీరులలో మేటి వీరుని తోడ
రాముని కరుణచే రహి మిత్రమయ్యె
భీమపిశాచంబు భూమిపాలునకు
సతిభార్య దయ్యంబు సఖుఁడు దయ్యంబు
మతిగల తేనికి మఱి చిక్కులేదు
తెల్లని వీరుఁడు తెలుపును ద్రోవ
నల్లని వీరుఁడు నడుపును సేన
జాడలు కనిపెట్టు జన్మశూరుండు
పాడును సత్యము ప్రాణేశిరాణి
మేటిజటామూని మేలును బలుకు
సాటిమెవరు రాజచంద్రుని కింక?"

ఆ స్త్రీ మన రాజకాళియే. పార్థివుఁ డామెతో మాట్లాడ నెంచెనుగాని యామె త్వరితగతితో నా స్థలము విడిచి వెళ్లిపోయినది.

## ఇరువదియువ ప్రకరణము

### చీవాట్లు

ఆ స్థిరవారమునాఁడు రాత్రియే కౌళిక సులోచనుఁడు మ్లానవదనముతో నిశ్శంభు ప్రభృతులు దాఁగియుండిన స్థలమునకుఁ బోయెను. గణపవరములో ధవళాక్షియాశ్రమమునందు వారిప్పుడు దాఁగియున్నారు—చంద్రసేనుఁడు, పర్ణిని, నిశంభువును. ఆశ్రమము చిన్నదియే యైనను లోపల పాతాళగృహమున్నందున దాని ప్రాముఖ్య మెక్కువగా నున్నది. భయంకర మగు విప్లవ మారంభించుటకు వారు తగిన యాలోచన సేయుచున్నారు. ఇంతట వారియెదుట సులోచనుఁడు ప్రత్యక్షుఁ డయ్యెను.

పాతాళగృహదీప ప్రభలుగూడ సులోచనుని ముఖగతాంధకారమును పోగొట్టఁజాలకపోయినవి. పర్ణిని నిర్మల హాస చంద్రికలుగూడ నా యంధకారముపై పని సేయఁజాలకపోయినవి.

చంద్ర—సులోచనబాబు! ఏమి చేసుకొని వచ్చితివి?

సులో—లీలావతిని బంధించి తేవలెనను నుద్దేశముతో ప్రథమప్రయత్నము చేసితిని. చంపావతిగారి పూర్ణ వచ్చి నాప్రయత్నమునకు విఘ్నమాచరించినది. భోగనాథుని బంధించి తేవలెనని ద్వితీయ ప్రయత్నము చేసితిని. ఘోరకుఁడు సామాన్యుఁడనుకొంటిని. అసాధ్యుఁ డా యుదీచ్యుఁడు. వాఁడు నా ద్వితీయ ప్రయత్నమును వమ్ముచేసినాఁడు.

చంద్ర—సుమా రెనుబదిమంది నాగుల రక్తమును ధారవోసి యపకీర్తి కొనుక్కొని వచ్చితివి. నీ వా రెండు యుద్ధములలో నొక దానిలో ప్రాణార్పణ చేసియుండినను కొంత బాగుండెడిది.

పర్ణి—పూర్ణకు ఘనేంద్రుఁడును, ఘోరకునకు ప్రమథనాథుఁడును కొంనకు సహాయముచేసిరని వినికిరి. లేనియెడల మన సులోచన బాబు తన కార్యమును సాధించియే యుండును.

పర్ణినియొక్క యీ పరిహాసము సులోచనునకు మఱింత దుర్భరమయ్యెను.

ధవ—కొంనకు ప్రమథనాథుఁడు దయ తలఁచి విడిచినందుననే యితఁడు మనకు ముఖముచు చూపఁగలిగినాఁడు.

నిశం—అది యేమి కథ?

ధవలాక్షి కాత్యాయనమ్మ శరణాగత రక్షణ కథను వివరించి చెప్పినది.

నిశంభుఁడు నిట్టూర్పు విడిచెను.

సులో—నన్నిఁక చీవాట్లుపెట్టి చంపవలదు. ఎంత పరాభవము కలిగినను నిన్న రాత్రి యొకలాభము నాకు కలిగినది.

చంద్ర—అది యేది?

సులో—నా ప్రథమ భార్య శ్యామలను నేను చూచితిని.

ధవ—అది లాభమా? అది యింకొక పెద్ద యవమానము. బ్రాహ్మణుఁడ నని చెప్పి మోసగించి నీ వామెను పెండ్లాడితివి. ఆ మోసము తెలియఁగానే యామె నీపై యేవగించుకొని నీకొడుకును నిషాదవాటికలో పాఱవేసి తాను జటాముని నాశ్రయించి తన ప్రాంత పేరుతో వీరభద్రావధానిని పెండ్లాడి తిరిగియు బ్రాహ్మణులలో తల యెత్తుకొని తిరుగుచున్నది. వంచనమునకు తగిన ప్రతివంచనము జరిగినందులకు నీవు సిగ్గుపడవలసినది. మఱియొకని భార్యగా నుండు నిజభార్యను చూచి లాభమని యానందించు మనిషిని నిన్నొక్కనినే చూచితిని.

సులో—నా కొడుకు నిషాదవాటికలో పాఱవేయఁబడెనా?

ధవ—కృష్ణలో పాఱవేయకుండ నుండినందులకు సంతోషించుము.

సులో—ఆ పిల్లవాఁ డిప్పుడు క్షేమముగా నున్నాఁడా?

ధవ—ఉక్కుగుండులా గున్నాఁడు.

సులో—వాని పేరేమి?

ధవ—మన సంఘములో నతి ప్రసిద్ధుఁడగు శంబరుఁడే వాఁడు. పంచకులలో నిన్ను మించినవాఁడు వాఁడు. నీకంటె వాఁడు పరాక్రమశాలి వాఁడు నీవలె పిఱికిపంద గాఁడు. స్వార్థపరతలో వాని దగ్గఱ నీవు మంచివాఁడ వనిపించుకొందువు.

సులో—శంబరుఁడు నా కొడుకా?

ధవ—సాక్షాత్తుగా నీకొడుకే.

నిశం—మంచి సమర్థుఁడగు కొడుకును కన్నందులకు మా బాబయ్యను నే నభినందించుచున్నాను శంబరుఁడు విప్లవకార్యముల నాచరించు విషయములో నప్రతిమానుఁడు. వానికి తెలిసినన్ని నక్కచిక్కులు మఱి యెవరికిని తెలియవు.

చంద్ర—ఔను.

పర్ణి— భీమనాథుఁడు గొప్ప సమర్థుఁడైన దొంగ. జంభుఁడు క్రూరుఁడైన దొంగ. నగధరుఁడు శాస్త్రజ్ఞుఁడైన దొంగ. శంబరుఁడు వంచకుఁడైన దొంగ.

సులో—నాది యొక ప్రార్థన.

నిశఁ— అది యేది?

సులో—నా భార్య శ్యామలను నాకు తిరిగియు తెచ్చి యీయఁగోరెదను.

ధవ—ఇది న్యాయ్యమైన కోరికకాదు. నీ యిప్పటి భార్య కది సమ్మతముగా నుండదు.

నిశం—వాస్తవమే.

సులోచనుఁడు నిరుత్తరుఁ డయ్యెను.

పర్ణి— (ధవలాక్షిని చూచి) మనోహారిణియే శ్యామల యగునెడల సుదర్శనాదులు దహనముచేసివేసిన స్త్రీ మఱియెవరు?

ధవ—అది వారి నాయనకూఁతురు.నాకేమి తెలుసు నా గొడవ?

పర్ణి — కాలనాథబాబు సులోచనబాబుకొడుకు కాఁడన్నమాట.

ధవ—ఆమహాపురుషుఁడు ఈపిరికివానికొడుకని నీ వెట్లు సమ్మితివి?

సులో — చాలు నీరోజున నాకు చీవాట్లు.

అందఱును నిశ్శబ్దు లైరి.

తృతీయ భాగము సమాప్తము.

# దేశభక్త వేంకటప్పయ్య

జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి

పురుషులందు శ్రేష్ఠులు మహాపురుషులు. పలువురిలో వీరు తలమానికములై తనరుచుందురు. వీరికీ గుణాధిక్యము ఎట్లలవడును? ఒక్కొక్క తెలుగు కేదార మొక్కొకరీతి పండు నట్లు మహాపురుషుల ప్రసవించు సీమలు కొన్ని, కాపురుషులకు కన్నతల్లులగు విషయములు కొన్ని యుండునా? మహాపురుషులకు ప్రత్యేకములైన రూపులును, చూపులు నుండునా? చతుర్ముఖుని వలె, శంఖచక్ర సమన్వితుని పగిది, దత్తాత్రేయుని చొప్పున, కవచకుండలధారికై వడి పుట్టుకలందే వీరు చోద్యముగ గన్పట్టెదరా? మహాపురుషలక్షణము లెవ్వి? ఇవి నైసర్గికమైనవా? అభ్యాసమువలన నలవడునా? ఈ ప్రశ్నలకు పూర్ణప్రత్యుత్తరము లిచ్చుట కిందు స్థానము లేదు. ఒక్కొక్క యుత్తరమున కొక్కొక్క యుద్గ్రంథ మక్కరగును.

ఉత్కృష్టశక్తులకై, మహోన్నత గుణములకై తపించువారు కొలదిమందియే! వీరి యొజ్జబంతి ఈశ్వరశక్తియే! వీరి తప సొకనాటిదికాదు - ఒక పుట్టుకది కాదు. అర్జునునంతటివాని తపసు పండుటకే అసంఖ్యాకములైన భవము లనివార్యము లయ్యెనని భగవద్గీత తెలుపుచున్నది. క్రమతపస్సుకతన లోగలశక్తివృద్ధియగుచునే యుండును, ఒక్కొక్క పుట్టువున నొక్కొక్క నిమిత్తమూలకతన నీశక్తి విజృంభించును. స్వకీయపరిస్థితులును, వివిధములైన సంఘపరిస్థితులును, గురుకర దృష్టాంతములును ఈశ్వరప్రేరితములై లోనిశక్తిని రేకెత్తించి, దాని కుచితమైన యాటపంజిరి జూపును. అభివృద్ధి గాంక్షించు నాతనికి జగదీశ్వరుడు చేయూత నొసగును. దుష్టకష్టపరంపరలను సోపానములొనరించి వానినధిష్ఠించి తనదెసరండని జిజ్ఞాసువుల నీశు డాహ్వానించును. కావున కష్టము లెందున్నవో, దుష్టపరిస్థితు లెందున్నవో మహాపురుషు లందు జన్మించి, అందే తమ క్రియాంగణములను విలోకించి ముందంజవేతురు. ప్రత్యేకమైన భూభాగము వీరు పుట్టు చోటని తెలుపు టొప్పు కాదు. కాని యొక్కొక్క తావలను తపోభూమి యనుటకు— కురుక్షేత్ర మనుటకు పెక్కుకారణము లుండవచ్చును. కావున నందు మహాపురుషులు మిన్నగ గోచరింతురు. మానవులందుత్తములను, అధములను రూపుచూపుల ననుసరించి నిర్ణయింప వలను పడదు. కాని మన కావ్యకర్తలును, మన కళోపాసకులును కొండొకపద్ధతి నవలంబించిరి. రూపులు చూచియే సామాన్యులు గొనముల నూహింతురు. కావున, కళ బాహ్యాంతరంగసమన్వయమును కాంక్షించును గావున సుచారిత్రులకు సుందర రూపులను, ప్రత్యేకాకారములను సృష్టించిరి. దుర్మతులను వికృతాకారములందు ప్రదర్శించిరి. దేవతలును దేవసములును, అసురులును అసురసములును భిన్నరూపములందే గోచరించిరికదా! మహాపురుష లక్షణములు నైసర్గికములని చెప్పనొప్పదు అభ్యాసము వలన నివి పెంపొందును.

మహాపురుషులన యశస్తిలకులే యని చెప్పరాదు. కావ్యకర్త కనుల బడని మహనీయులు, మూలమూలలందుండియే తమ పవిత్ర కర్తవ్యములను నెఱపుకొను మహాత్ములు, కీర్తిని కాంక్షింపని ఆదర్శపురుషులు కలరు. ధర్పియొక్క ప్రాంగణమున నుపవిష్టుడై యోచనామగ్నుడైన గ్రేకవీంద్రుడు "నీరవుడైన మిల్టను, గ్రామవాసియైన కొండొక హేంప్డన్ ఇందు పరలియుండు" ననినాడు. అక్కరైన తరుణముల నందని వారు, ఒరులకంట బడనివారు — సుందరవర్తనులు

అనేకులుందురు. "Full many a flower is born to blush unseen" అని కదా థామస్ పలికినాడు. (Vide: Elegy in a country Churchyard) చారిత్రక సాంఘిక హేతువులు కొందఱి నీవలికి గొని వచ్చి తీఱును.

ఏసు నిరుపేదల యింట బుట్టినాడు. గొల్ల చావడిలో జనించినాడు. మహాపురుషు లుద్భవించినపుడు వియత్తలమున గాని, విశ్వమండలి మఱేకడయందు గాని విడ్డూరములు పొడసూప నక్కరలేదు. కాని ప్రచారకులును, రచయితలును ఈ విడ్డూరములను గుఱించి చిత్ర విచిత్రములైన గాథలను కల్పించిరి. వీరి నుడువుల యంతరార్థమునే కైకొనుట మేలు. ఏసు జనించినపుడు బెథల్‌హామ్ దిక్కున నంబరమున చక్కనిచుక్క పొడసూపె ననియు, మువ్వురు ప్రాచీ విజ్ఞాను లాదిక్కుగ పయన మొనరించిరనియు బైబిల్ తెలుపుచున్నది. రాజప్రాసాదమున గాక లుంబినీ వనమున సిద్ధార్థుడు జనించిన పిదప, దేవతలు పద్మముల నాడింభకుని బ్రోల నొడ్డి రనియు, బ్రహ్మాదు లాతని గీర్తించిరనియు, బాలకుడు పుండరీకములపై నడగులు వేసెననియు చదువుచుందుము.

ఇటీవలి మహాపురుషులు భావికాలమున కావ్య పాత్రలగుచో, వీ రెన్ని చిత్రవర్ణములందో పొడసూపెదరు. పాఠకలోకముయొక్క హృదయము నాకర్షించుటకు కావ్యకర్త వేయినెరవులను రోయవచ్చును. ఈ నెరవులందును ఈ యలంకారములందును గల గభీరార్థము బుద్ధిమంతులు గ్రహింతురు. ఎంతోకాలము కడచిన యనంతరమే, కావ్యపీఠస్థలి జొచ్చిన యనంతరమే మహాపురుషులు అద్భుతకాంతు లురల జేయుచు గోచరింతురు. కావ్యకర్తకు భక్తిశ్రద్ధలు మెండుగ నుండును. ఇట్లని ప్రజాభిప్రాయ మొప్పని తీఱున తనచిత్తమువచ్చిన తీఱున నీతి డత్యుక్తులందు లంఘింప దొరకొనదు, కొమ్మమువలె నొక్క నిక్క మెదురైయుండ దానికి భుజకీర్తులు లగించి, "దేవదేవుడు సుడీ" యని యొక కల్లోపాయకు డనినచో నేటిప్రజ లీతనికి చెంపపెట్లు ప్రసాదింపరా? సమకాలికులం దతిశయోక్తులకుగాని, వన్నెవన్నెల యబద్ధములకుగాని చోటు లేదు; సామాన్యాంశములపై మణిమకుటముల నిడుపుటకు సమకాలము సమ్మతింపదు. ఈ విషయ మిట్లుండ నప్రియమైన సత్యమును విని ఇది యపుడపుడు కనులెఱ్ఱజేయును.

కావ్యరచన మన నాకెంతో ప్రీతియే! మనుష్య చరిత్రను గుఱించి, మహాపురుషావిర్భవమును గుఱించి ఘనతాత్త్వికాంశములను గుఱించి, ప్రాపంచికవిజ్ఞానమును గుఱించి తెలుపు వృత్తాంతము నిత్యసత్యసందీప్తమై యుండును. కావున దీని వ్యక్తీకరణమును గుఱించి ఎట్టి యిబ్బందియు, నెట్టి ప్రతిఘటనమును దృగ్గోచరము కాదు. నేగావించు రచన మిథ్యయు కాదుకదా. నేటిమహాపురుషులను గుఱించి, ఎల్లరవోలె ప్రత్యక్షమైన సత్యములను గుఱించి తెలుపుటకై నాలేఖిని నుద్దేశించి "ఖబడ్దార్ !" అని గద్దించి పలుకుచునే యుంటిని. దేవతల లాలిపాటలను నే నీరచనమున వినిపింపజాలను; చిత్రవిచిత్ర గ్రహోదయములను నే నిందు జూపజాలను. జ్యోతివలె వెలుగు సత్యమునకు జేజేలు పాడి, విశాలదృష్టితో విజ్ఞానదృష్టితో నీపూతకర్తవ్యమును నిర్వహింపవలెనని యాతురంపడుచున్నాను.

మహాపురుషులను గను స్థితిగతులెన్నో మనదేశమున దోచినవి. భారతాంబ వీరప్రసవిని యైనది. సహృదయులైన అన్యదేశీయులుకూడ ఈజనయిత్రి మహత్త్వమును గుర్తించి ఈమెకు ప్రణమిల్లిరి. జేమ్స్‌టాడను సుప్రసిద్ధ ఆంగ్లరచయిత శతాబ్దికిమున్ను రాజస్థానమున మసలి "గ్రీక్ దేశమున లియనిడసను * మహాయోధు డొక్కరుండు వెలసినాడు. రాజస్థానమున నట్టివీరప్రవరు లనేకులు వెలసిరి" అని వచించినాడు' (Vide: Annals of Rajastan," Jame Tod's magnificent work) రాజస్థానమందే కాదు, సమస్త భారతావనియందును యోధాగ్రేసరు లుద్భవించి రని

---

* థెర్మపలీ కనుమ తెరువున కొలదిమంది సైనికుల తోడు నంది, పరివ్యను మహావాహినులతో పోరిపోరి అసువులు పాసిన మహావీరు డీతడు.



శ్రీయుత కొండా వెంకటప్పయ్యపంతులుగారు

టాడ్ మహాశయుడు గుర్తించియుండవలసినది. దృష్టాంతములు బహుళములు కదా!

ఉత్తరమున రాజస్థాన మెట్టిదో, పశ్చిమమున మహారాష్ట్ర† మెట్టిదో దక్షిణమున నాంధ్రావని యట్టిది. ఆంధ్రులు ముకుటములుదాల్చిన వీరవరులని ఆంధ్ర చరిత్ర వేయినోళ్ల ఘోషించుచున్నది.

ఆంధ్రావనిలో ప్రత్యేకభాగము ప్రత్యేకప్రజ్ఞకు రంగస్థలియైనది. పవిత్రగోదావరీసీమ కవులనిలయమైనట్లు ప్రసిద్ధగుంటూరుభూమి వీరులకు నాలవాలమైనది. పల్నాడు వీరవరుల చరిత్రమును, కొండవీడు రాజన్యుల యుదంతము నాంధ్రులకు దెలుపుచు చర్వితచర్వణమగును. నాటివలెనే నేడును గుంటూరుసీమ శౌర్యమూర్తులకును, దేశభక్తులకును జన్మస్థలియైనదని ఆధునిక-చరిత్ర చెప్పక చెప్పుచున్నది.

ప్రత్యేక కాలపరిస్థితులకతన తొల్లింటివీరులు సమరధరణి బ్రవేశించినను వీరు రణక్రీడాలంపటులని తెలపరాదు. "అజంబుల వెనుకొను వృకంబులవిధమున నెత్తుటదోగు" వారిని, "అంత్యకాలశిఖిదారుణభంగి నమేయమార్గణార్చులు వరగించు" వారిని ఆరాధ్యదేవతలు కాజాలు శూరులని భారతీయులెన్నడును దలచియుండలేదు. పూజనీయులైన మనవీరులు సంయమీంద్రులు "ఆహవభూమియం దనేకులను తుండెములు గావించువానికంటె నంతరంగమందలి యరివీరుల నిర్జించువాడే యధికుడు. ఇతడే మహాయోధుడు" అని బుద్ధభగవానుడు వచించెనని "ధమ్మపద" మను పాళీగ్రంథము తెలుపుచున్నది. భారతఋషులు భారతవీరులు. భారతవీరులు భారతఋషులు. ధర్మసంస్థాపనము, ఉత్తమగుణదిగ్విజయము, పవిత్రకర్తవ్యనిర్వహణము, పరసేవాపరాయణత్వము ఈ వీరుల దృష్టిలో తేజరిల్లిన మహదాశయములని భారతచరిత్రను పరికించిన సహృదయులెఱుగుదురు. బుద్ధునివాక్కు భారతవాక్కని, ప్రాచీనసభ్యతనుండి వెడలిన గంభీరోక్తియని, బుద్ధునకు మున్నుగూడ నిట్టివచనము భారతముఖము నుండి వెడలి సమస్తభూవలయమునను ప్రతిధ్వనించెనని విజ్ఞానులు గ్రహింపగలిగిరి. రెండవబుద్ధుడనదగిన గాంధికాలమున నీ వచనము భారతముఖమునుండి మఱింత గంభీరమై వెడలుచు నష్టదిక్కులందు ముఖరితమగుచున్నది. ఆంధ్రావనిలో నీప్రతిధ్వని గుంటూరు మండలమునుండి, వేంకటప్పయ్య గుండెనుండి వెడలినది.

వీరులతావున నుదయించిన వేంకటప్పయ్య వీరవతంసుడయ్యెను. ఇతడు మహాత్ముని మహోద్యమమున పాదనూపిన సృష్టియే యని తెలుప జెల్లును. ప్రజాసేవ ఈతనియింట బుట్టి, ఈతనియొంట బట్టినది. దక్షిణాఫ్రికాలో గాంధిజీ శాంతిసమరము సలుపు నవసరమున నాంధ్రావనిలో నట్టి సమరాంగణమునందే ఈతడు కవ్వషియై యుండెను. గాంధి కడుంగడుభాగ్యశాలి. ఈతని కురుక్షేత్రము వసుమతీవదనమున వరలి పృథ్వీవాసుల మాటక్కల నొక్కమాఱుగా నాకర్షింప జాలెను. సత్త్వగలవారిని దీనను తరుణములన్, సత్యాన్వేషణమునకై గడంగజాలు తరుణములను, ఇచ్ఛాశక్తి దృఢనిశ్చయములను విజృంభింపజేయు రజాలు తరుణములను పసిని గాంధి టాల్‌స్టాయ్ ప్రభృతులదృష్టిని బడినాడు. శక్తిసంపన్నుడైనంతన మనుష్యుడు కీర్తిసమన్వితుడు కాడు. తనను గుఱుతింపగల మఱొక శక్తిమంతుని చూడక్క నీతడాకర్షించి తీఱవలెను. నాడే ఈతడు శమంతకమణి మాడ్కి మానవలోకమున గాంతిలును. కోహినూరుమణిని గుర్తింపనివారు దానిని కోళ్లబుట్టయందు పడవైచియుందురు; గుర్తించినవారు ముకుటమున నిలిపిరి. రాధాకృష్ణుని రవీంద్రుడు గుఱుతించిన మంగళముహూర్తమందే ఆతని కీర్తిచంద్రికలు దిగంతములను చుంబింప దొడంగినవి. అంతకుమున్న గాంధిని టాల్‌స్టాయ్ గుర్తించి, ఆతనిపై పూలచెండను విసరిన నిముసమున గాంధిలోని జ్యోతికి సర్వసీమలు "జే జే!"

---

† రాజస్థానము వాలుస్తూపములకు నాకరము, మహారాష్ట్రము పర్వతసంకులమైన ప్రదేశము. ఇచ్చటి శీతోష్ణస్థితులు సుఖజీవనమునకు ననుకూలములు కావు. ప్రతికూలప్రకృతితో పోరిపోరి యచటివారు వీరులైరని చరిత్ర తెలుపుచున్నది.

యనినవి. వేంకటప్పయ్య కర్మవీరుడే కాని అన్యదేశీయుల కన్నుల బడినాడు కాడు; అన్య రాష్ట్రీయులు వినునట్లు సింహనాదము గావించినాడు కాడు. మేలిముసుగులోని చంద్రవదనముచందమున మొగులు గముల మఱుగున చిందులాడు విద్యుల్లతవడువున నీత డడగిమడగి యుండెను. ఈతడే కాదు ఆంధ్రకర్మవీరు లందఱు నిభృతమందే నిలిచిపోయిరి. కారణములు బహుళములు. ప్రత్యేకమైన కాంగ్రెసు రాష్ట్రమును పడయునంతదనుక ఆంధ్రులు మదరాసీలందే బుడుంగున మునింగియుండిరి. అంతకుమున్నే వీరి నెఱిగినవారి సంఖ్య నిండుసున్న. ప్రపంచముతో ముఖ్యసంపర్కము లు గలిగి బహుసీమల దృష్టి నాకర్షింపగలుగు నగరము వీరికి లేదు. కావున నాంధ్రవీరు లడ్డుగోడవెనుకనే నిలువంబడిరి. జెండాపూని అన్యసీమల కరుగుటకు వీ రిచ్చగింపరైరి; మహోన్నతరంగస్థలములందు గోచ రింపరైరి.

కాని, మనుష్యశక్తికి విలువగట్టుకతటి రంగస్థల ములు కొలబద్దలుకావు; సభావేదికలు కొలకుంచములు గావు. నిష్కామకర్మకు వేదిక లాటపందిళ్లు కావు. నిష్కామయోగియైన గాంధిజీ వీని నభిలషింపనే లేదు. ఈతడు తలపని, మఱెవ్వరుగాని యూహింపని హేతు వు లీతని సర్వప్రపంచదిగ్వలయమున నిలిపినవి. ఈ హేతువులకు వేంకటప్పయ్య పెక్కామడల దూరము దుండెను. ఈ యాంధ్రుడు నిర్మలచిత్తుడని, ఉత్తమ గుణమండితు డని, ఉత్కృష్టాశయములకై అసువులను సమర్పింప సమకట్టు మహాయోధుడని ఈతని జీవనవిధా నము బహువర్షములనుండి తెలుపుచునే యున్నది. క్రియాంగణము విశాలమైననేమి విశాలము కానిదైన నేమి, కర్తవ్యనిర్వహణ మెత్తుకొండపై జరిగిననేమి లోతులోయలో జరిగిననేమి, పని పెద్దదైననేమి చిన్నది యైననేమి, ఫలము చేకుటిననేమి చేకుఱకున్ననేమి, ఉద్దేశముత్కృష్టమైనపుడు, ఆశయ ముదాత్తమైనపుడు మనుష్యయత్నము మహత్తరమైనదిగా నెన్నబడును. హనుమదాదులు గిరిశృంగములను త్రుంపి కపలికడు పున గ్రువ్వి వారధి గట్టిరి. సైకతరేణువులనే యుడుత ఉదధిలో రాల్చినది. ఈశ్వరదృష్టిలో దీనిసేవ మారుతీప్రభృతులసేవకు దీసిపోయెనా? వైశా ల్యము ననుసరించి కర్మక్షేత్ర మహత్వము నెవ్వరు గ్రహింతురు? భావగభీరతయే కదా లెక్కలోనికి వచ్చునది!

గాంధి వేంకటప్పయ్యలు కేవలము రాజకీయ వాదులే యగుచో వీరిధోరణి వేఱైయుండెడిది. నేడు వసుంధరనేలు రాజకీయములు ప్రతీచీసభ్యత కనిన రక్కసి బిడ్డలు. ఇవి యాత్మసముద్భవములు కావు. శాంతిభంగమునకు, ప్రవంచనమునకు, ఘోరదౌష్ట్యము నకు మార్గదర్శకము లగుచుండె నని నేటి యూరపుఖండ చరిత్ర విశదము గావించుట లేదా? వీని వైఖరి జూచి సహృదయులైన ప్రతీచీ వాసులును, మతబోధకులును ఉలికిపడుచుండుట లేదా? "ఇది పశుబలము. ఏసు ప్రబోధములకు ప్రతికూలమైనది. ఇది మానవుల నుద్ధ రింపదు" అని వీరు అఱచుచుంటలేదా? Diplomacy పేరున నెన్నో ఎత్తులును జిత్తులును తలలెత్తు చున్నవి. Dictatorship పేరున దురంతమైన నిరంకు శత్వము విజృంభించుచున్నది. మధుకైటభులకును, దేవదేవునకును నెంతసఖ్య ముండెనో, దౌర్జన్య నిరంకు శత్వములకును గాంధికిని అంత నేస్తమే యున్నది. "భారత స్వాతంత్ర్యము దౌర్జన్యమూలమున లభిం చుచో దానికి త్రోసిరాజందును" అని మహాత్ముడు బొంబాయి కాంగ్రెసులో పలికెను. ఈ యంశమునే యశస్తిలకుడు రాధాకృష్ణ డిటీవలి యాక్స్ఫర్డ్ మహోపన్యాసమున నుల్లేఖించినాడు. స్వాతంత్ర్య మనుడు, ఐశ్వర్యమనుడు, అభ్యుదయ పరంపరాభివృద్ధి యనుడు, స్వర్గములో నెకసక్కెములు సలుపు భోగ భాగ్యము లనుడు ధర్మపథమున లభించినపుడే భారతీ యులకు పరిగ్రహణయోగ్యము లగును. అర్థకామమోక్ష ములు పురుషార్థములలోనివే! కాని, ఇవి ధర్మ యుక్తము లైనపుడే చేబట్టదగినవని ప్రాచీ సారస్వతము తెలుపుచునే యున్నది.

"ఓపి ధర్మార్థకామంబు లొకటి నొకటి
నాళ మొందింపకుండంగ నడుపవలయు;

గాక ధర్మంబు సెడ నర్థ కామములను
గోరు పురుషుండు నిందకుఁ గురుఁ గాఁడె".

(భారతము : శల్యపర్వము, ౨ ఆ, ప. ౩౦౨)

ప్రాచీబుషిసత్తముఁడు ఏసు ఏమనెనో విలోకింపుడు :

"What is a man profited if he shall gain the whole world, and lose his own soul ? " (Matt 16: 26)

ఆధ్యాత్మికభావగర్భిత మైన ఉద్యమమే భారతావనియం దాదరణమునందును. పాశ్చాత్య విద్యావ్యామోహాయుక్తుల కట్టిభావము సెడల విశ్వాసము లేకున్నను, పామరులనుండియలం దది యచలమై యున్నదని యెఱిగి మహాత్ముడు తనపూనికను పామర సులభము గావించినాడు. యథార్థముగ భారతశక్తి- భారతశక్తియే యేల ప్రపంచశక్తి కర్షకులలోను, కార్మికు లనబడెడు పామరులందును కలదు. చరిత్ర తెలుపు డెమక్రసీలన్నియు వీరి బలముమీదనే యాధారపడి యున్నవి. పామరులందు నుద్వేత్తుగ నుదయించు భావోద్వేగము నరికట్టు టెవ్వరికిని శక్యము కాదు. ఇంగ్లీషు చదువుకొనిన కొలదిమంది పెద్దలకే చెందిన కాంగ్రెసు గాంధి వేంకటప్పయ్య ప్రభృతుల పూనికకతన ప్రజాసంస్థ యైనది. "నేద్యగాడను, నేతగాడను" అని తెలుపుకొనిన లోకోత్తర పూరుషుడు భారత మహోద్యమమునకు నేతయై, మహానాయకులకు మేలుబంతి యైనాడు. న్యాయవాది యై యున్న నాటగోలె వేంకటప్పయ్య పేదటికముతో చుట్టఱికము కలుపుకొనవలె నని మక్కువపడుచు, గాంధి యడుగులందే తన యడుగుల నిడుచుండెను. వీరి యుత్కృష్ట దృష్టాంతములకతన మేటి విద్వాంసులు వెలగల యుడుపులను నిప్పులందు గలిపుబెట్టి ఫకీరులై సేవకులకు సేవకు లగుచున్నారు. నిన్నగాక మొన్న నరసాపురములో సుహృద్వరుకు వి. వి. గిరి "కాంగ్రెసులో నే నొకబంటును, కార్మికులకు బంటును. దేశమునకును, కార్మికులకును నేను నా సర్వస్వమును సమర్పించి రేపు అవసరమైనచో నురికంబమున నాప్రాణములనుగూడ నిచ్చుటకు సిద్ధముగా నున్నానని మీయందఱికిని మనవిచేయుచున్నాను." అని పలికినాడు. "బలే గిరీ! ధన్యవాదములు." గిరి వినయశీలుడు. సేవకులకు సేవకుడై నాడు! * గాంధి వేంకటప్పయ్య గిరి ప్రభృతుల పలుకులను, ఆచరణములను ప్రజాహృదయములందు నూతనమై, యుత్తాలమైన భావతరంగముల నుదయింపజేసినవి. ఈ యద్భుతసంఘటనము గాంధిస్థాపిత మహోద్యమస్థ మతావేశము కతన, నంటలి యాధ్యాత్మికశక్తివలన సుసాధ్య మయ్యెను.

ఈ యంశమును ఎస్. ఎన్. రాయ్ పోలువారు గుర్తింపకుండుట దురదృష్టము. రాయ్ భారతస్వాతంత్ర్యమును కాంక్షించు మహనీయుడు. సేవకుల సముద్ధరణము నపేక్షించుపుణ్యాత్ముడు. అయిననేమి? విదేశములందు పెక్కుడులం మసలుటచే నచటి భావవాతావరణ మాతనిమనసున గొంత సోకినది. కావున నీతడు "మతమును, రాజకీయములను వేర్వేరై యుండవలెను. కాంగ్రెసు హిందూమతమయ మైనది. దానంజేసి మసల్మాను లందు నంతగా నెక్కుటు కొల్లకున్నారు" అని వచించినాడు. ఈతడు మతభావమును హృదయంగమము గావించుకొనినాడు కాడు. మతముపేరిట దుర్మతులు సలుపు కలహములు మతసముద్భవములని తలచి మిక్కిలి పొరపడినాడు. భారతోద్యమమందలి యాధ్యాత్మికశక్తి ఒక్క హిందూమతమునకే కాదు, సర్వమతములకును చెందినది. అది మనుష్యహృదయ సముద్భవము. భేదములకు, పొరపొచ్చెములకు, కలహములకు నందు తావులేదు. కావుననే హకీమ్ అజ్మల్ ఖాన్, మౌలానా అబుల్ ఖలమ్ అజాద్, డాక్టర్ అన్సారీ, ఫ్రాంటియర్ గాంధి మున్నగు మసల్మాను ప్రముఖులును,

---

* మంత్రియై నగరమందలి సందులందును, గొందులందును నడచుచు బండ్లుతోలువారిని తక్కుంగల పేదలను సమీపించి వారి కష్టసుఖముల నీతడరయుచుంట చూచితిని.

జోసెఫ్ మొదలైన క్రైస్తవప్రముఖులును, తదితర మతస్థులును కాంగ్రెసు మహాంగణమున ప్రవేశించి, దీక్షాజీవులు కాలేదా? "గాంధి ముసల్మాన్ ముఖ్యులలో పెద్ద" అని ఆగాఖా ననినాడు. పల్వురు మహాత్ముని Living Christ అనిరి. కొందఱు వానిని బుద్ధునితో బోల్చిరి. కాని గాంధి ఎవ్వరో ప్రపంచ మెఱుగును. మహాపురుషులును, మహోద్యమములును జాతిమతభేదములకును, కులకక్షులకును పెక్కువేల యడుగులయెత్తున నగలుట కన్నున్నవారు గుర్తింతురు. మిల్టన్ మహాకవీంద్రు నుద్దేశించి వర్డ్సువర్త్ "నీవు నిరుపేదలతో గలసి ధూళియందు మసలినను, నక్షత్రమువలె వియత్తలమున దేజరిల్లితివి" యనినాడు (Vide: Wordsworth's "London 1802"). నక్షత్ర మేజాతికి చెందినది? ఏమతమునకు సంబంధించినది? గాంధియును, గాంధినామాంకితము గల కాంగ్రెసును నేజాతిమతముల ప్రత్యేకపు సొమ్ములు? స్వార్థపరుల ప్రచారమువలన తలసూపు మతకలహములను, జాతి దౌర్జన్యమును సమయింప గాంధి వేంకటప్పయ్య ప్రభృతులు శక్తివంచనలేక ప్రయత్నించుచున్నారు.

ప్రజాళి కాలోక మొసగుట ప్రదీపముయొక్క కర్తవ్యము. దివ్యప్రదీపకళికను లోగల మహావ్యక్తికి పరోపకార మొనరించుటయే జీవనాశయమగును. ఈతని యంతరంగమున నఖండము వెలుగును గావున, వీని క్రియలందు మహాద్భుతమైన జ్యోతిర్లీలను గాంతుము. దీనిని గాంధి మంగళగీతిక లాలాపించుచు, క్రియాకర్త మహాత్ముడని నిష్కామయోగియని యుగములును, మహాయుగములును ప్రస్తుతించును. నేటినుండియే దిక్కాలములు గాంధిని గుఱించి దివ్యసంకీర్తనము సలుపుటలేదా? మతానుష్ఠానమున నాటితేటి, కర్మయోగియైన వేంకటప్పయ్యను గుర్తించినవారెల్లరు ఆతని హృదయ మహత్త్వమును గుఱించి ప్రబంధములు వ్రాయకమానరు. గుణమందును, భావమందును, జీవనవిధానమందును బాంధవ్యముగల వ్యక్తు లాతని నవలీలగ గుర్తింతురు. కావుననే వేంకటప్పయ్యను గుఱుతించిన వారిలో గాంధి యగ్రగణ్యుడైనాడు.

"He is the greatest man among the Andhras" అని పదునేడేండ్లకు మున్ను మహాత్ముడు కంఠమెత్తి వచించు టెఱుగమా?

తా నభిలషించు గుణమును, తనయందుగల గుణమును, క్రియాంగణమున దాను ప్రత్యక్ష మొనరించు గుణము నొక్కండు వేఱొక వ్యక్తియందు గాంచెనేని, ఆతనితో దానవినాభావసంబంధము గలిగి వర్తించును. గుణసంబంధమును త్రుంచుటకును, భావబాంధవ్యమును త్రెంచుటకును ఎవరికి సాధ్యము? పరస్పరారాధనమున నీపవిత్రసంబంధ మాత్మప్రకాశము గావించుకొనును. శివకేశవులు పరస్పరారాధ్యదేవతలును, పరస్పరభక్తులును గారా? గాంధి వేంకటప్పయ్యహృదయ మహత్త్వమును గుర్తుపట్టి "జే!" యనినాడు. మహాత్ము గుర్తించిన వేంకటప్పయ్య ఆతనిభక్తులం దగ్రగణ్యుడైనాడు. ఒరులకై ఈతనివలె కన్నీరోడ్చువారును, దురంతదురితోత్కట బాధల నాహ్వానించువారును, తమకున్నదానిని వమ్ముజేయ గమకించువారును, కడుంగడు క్లిష్టమైన కర్మక్షేత్రమున లంఘించి సేవాధర్మము ననుష్ఠించి, కొండొక భాస్వదాశయమునకై నిజాసువుల నివాళి గావించువారును మానవులలో, కలుషభూయిష్ఠమైన యీ కాలమున నెందఱున్నారు?

ఒక్కొక్క యుగమున నొక్కొక్క యాశయము విశేషప్రాముఖ్యము నందును. సేవాధర్మము ప్రపంచ విజ్ఞానుల దృష్టిని విశేషముగా నాకర్షించుచున్న దని ఆధునిక యుగచరిత్ర తెలుపుచున్నది. పాశ్చాత్యులలో గెటేమహాకవి దీనినుగ్గడించినాడు. పీటరుసైమనుల నుద్దేశించి "Feed my sheep" అని ఏసుపలికిన పలుకులను విశేషముగ మననమొనరించి, పరసేవను ప్రధానభావము గావించుకొని అద్భుతసాహిత్యసృష్టి గావించిన యూరపు యుగపురుషుడు గెటేకవీంద్రుడు. భారత విజ్ఞానమందలి గంభీరభావముల నీమహనీయుడు హృదయంగమము గావించుకొనినాడు. స్వీయముక్తికై యడవుల నివసించు యోగికంటె ప్రజానీకమందు నిలిచి పరార్థజీవియై యుండువా డధికుడని ఈతడు వచించినాడు.

సేవాధర్మ మహత్త్వమును భారతీయులు ప్రాచీన కాలమందే గుర్తించిరి. భగవద్గీతయందలి ప్రత్యక్షరమునీమహత్త్వమును గుఱించిన ప్రబోధమే! రామానుజుడు, రామానందు, కబీరు మున్నగుసంయమీంద్రులు వనముల ప్రవేశింపక, సేవాధర్మపరాయణులై ప్రజలందే వసించిరి. కాని ఈ యాశయమే అన్ని యుగములందును అగ్రస్థానము వహించినదని మనము తలపరాదు. గత శతాబ్దిలో భారతావనియందుగూడ నిది యూరపునందువలె ప్రధానస్థానము నందినది. గాంధీ మనకాచార్యుడయ్యెనని తెలుపుట సత్యేతరము. కాని ఈతడు వనినకాలమందే ఈ యాశయము నారాధ్యదేవత గావించిన ఆచార్యులు భారతభూమియందుద్భవించిరి. రామమోహన రామకృష్ణులు ముఖ్యులు. ప్రార్థనమునకంటె సేవకే వీ రధికప్రాముఖ్యము నిచ్చిరనుట పొరపాటు కాదు. వీరి ప్రబోధదృష్టాంతములను మేలుబంతులు గావించుకొనిన తరువాతియాచార్యులును సారస్వతోపాసకులును ఈ యుత్కృష్టాశయమునే ఇష్టదేవత గావించుకొనిరి. "ఒరుల ముక్తికై నరకకూపమున లంఘింపవలసివచ్చినను లంఘింతును" అని వివేకానందుడనినాడు. ఈ యాదర్శము పాశ్చాత్యులకుకూడ నతిప్రియమైన దగుటచే వారి హృదయములందీతని వాక్కు లనుకూలప్రతిధ్వనులను లేపినవి. రామమోహనుని దృష్టాంతముపై కన్ను నిలిపి సేవను ప్రధానభావము గావించి యుద్గ్రంథములను రచించిన మహాకవి రవీంద్రుడు. వనవాసము జేయు మునిమీది యనిష్టమును, పరార్థజీవిమీది యిష్టమును రవికవిరచనమున స్పష్టమై గోచరించును. గత శతాబ్దమున దోచిన యన్ని యుద్యమములకును — సాహిత్యోద్యమములనుడు, మతోద్యమములనుడు, రాజకీయోద్యమములనుడు మఱే యుద్యమములనుడు — సేవయే మూలవిరాట్టయినది. కావున నీ యుద్యమము లవినాభావ సంబంధము గలవియని, వీని నాయకులు సైదోడులని తెలుపుట సత్యదూరము కాదు. విశేషముగ భావప్రకాశమును గావించు నుద్యమము తక్కినవానికి మిగుల దోడుపడును. ఒక ప్రవక్త ప్రబోధము లేకుండ బహుళ సంఖ్యాకుల హృదయకవాటములను తట్టి, అందు భావమణులను ప్రోగొనరించునది సాహిత్యము. కావున సాహిత్యోద్యమము ప్రధానమైనది. సాహిత్యోద్యమమున నాటితేజని వాడు, భావోపాసనము నెఱుగనివాడు ఏయుద్యమమందును నెగ్గుదల నందడని కంఠమెత్తి వచింతును. బహుళసంఖ్యాకులకు సహజమై సుబోధకమైనది మాతృభాష. కన్నతల్లి యన్నికోర్కెల దీర్చులాగున మాతృభాషాసాహిత్యమునకు సంబంధించిన మహోద్యమమే బహుళాభ్యుదయప్రదాయిని యనుట నిక్కువము. మనలో నీయంశమును తొలుత గుర్తించినవారు వంగీయులు. రామమోహన రామకృష్ణులు వంగభాషకు నూతన భావసంజీవిని ప్రసాదించిరి. ఈ భావము, సేవకు సంబంధించినదనుట మఱవరాదు. మాతృభాషను సేవను ఎఱిగిన ప్రజ్ఞాధురీణు లన్నియుద్యమములకు నాయకమణులు కాగలరు.

ప్రస్తుతము మనదృష్టిని విశేషముగ నాకర్షించునది రాజకీయోద్యమము. ఇది మాతృదేశమునకు సంబంధించినది. మాతృదేశోద్యమము మాతృభాషాంగణమున నుదయించుననుట నిర్వివాదాంశము. ఈ యుద్యమము వంగసీమయందు మానవశ్రేష్ఠుల కనులముందు జనించినది. రామమోహన, రామకృష్ణ, వివేకానంద, శివనాథ, దేవేంద్రనాథ, మహేంద్రనాథ, భూపేంద్రనాథ, సురేంద్రనాథ, రవీంద్రనాథ, శరశ్చంద్ర, బంకించంద్ర, నవీనచంద్ర, గిరీశచంద్ర, ఈశ్వరచంద్ర, కేశవచంద్ర, రమేశచంద్ర, బిపిన్‌చంద్ర, ద్విజేంద్ర, డబ్లియు. సి. బెనర్జి, మనోమోహన, లాల్‌మోహన, శిశిరకుమార, మోతీలాల్, శ్యామసుందర, అశ్వనీకుమార, అరవింద, అమృతలాల్, అషుతోషు, చిత్తరంజన ప్రభృతులు వంగసీమయందు గత శతాబ్దమున నుదయించిరి. వీరిలో పలువురు సమకాలికులు. ఆధునికయుగమున నిందఱు మహాపురుషులు మఱేదేశమందు నొకేకాలమున నుదయింపలేదు. వీరి నాయకత్వమున వంగావనియందు మత సాంఘిక సారస్వత రాజకీయోద్యమములు జనించినవి. వంగసీమయను బ్రహ్మయొక్క నాల్గుమోములు నీ నాలుగుద్యమములని గ్రహించుట పాడి. బ్రహ్మ సారస్వతమునకు

తంద్రికదా! ఇట్లనిన నీయుద్యమములకు ప్రాపైనది సాహితి యని గ్రహింపజెల్లును. సాహిత్యాంకమందే రాజకీయోద్యమము వర్ధిల్లినది.

రాజకీయోద్యమము ఆంగ్లవిద్యాధికుల పూనిక వలన గదా. ౧౮౮౫ లో పొడసూపినదని చదువరులు వచింపవచ్చును. అది యట్లు పొడసూపుట నిక్కువమే. గ్రీసులును, రోమనులును, ఆంగ్లేయులును, అమెరికనులును, ఫ్రెంచివారును స్వాతంత్ర్యమునకై పోరు సలిపిరను నంశమును బహుళచరిత్రలం దాంగ్లవిద్యాధికులు కాంచి, వారి దృష్టాంతముల ననుకరించిరి. వారి యాశయమును తమ యాశయము గావించుకొనినను, వా రవలంబించిన దౌర్జన్యవిధానము జుగుప్సతో వీక్షించిరి. తొల్లింటి కాంగ్రెసునాయకుల వాక్కులను గమనించితిమేని ఈ యంశము స్పష్టముగ తెల్లమగును. ౧౮౪౮ లో జనించి, డబ్లియు. సి. బెనర్జీకి నాలుగేండ్ల పిన్నయై, నారోజీప్రభృతుల నెచ్చెలి యై, రెండుమారులు కాంగ్రెసున కధ్యక్షుడై, కాంగ్రెసు జనకుడే యైన సురేంద్రుని వచనముల నవలోకింపుడు :

"We, men of the Congress, are the friends of peace and orderly Government. We denounce violence; we condemn violent methods; for we believe in our heart of hearts that order is the first condition of Political progress." (Vide : Surendranath Banerjee's speech delivered at the Amraoti Congress in 1897.)

ఇందు భారతాంతరంగము పొడసూపుటలేదా? తోడ్తోడనే మంచంజవేయు మతోద్యమ మహత్త్వ మిందు గోచరించుట లేదా? ఈ మతమహత్త్వము క్రమవృద్ధి నందినది. ౧౯౦౫, ౧౯౦౬, ౧౯౦౭ లలో బాల్, పాల్, లాల్ నాయకుల కృషికతన నిది చక్కనివృద్ధి నంది, భారతభూమియం దెల్లకడలందు ప్రాకినది. తిలక్ మేధస్సు, అరవిందుని లేఖని, పాల్ రసనము నా డద్భుతమైన భావోద్వేగమును గలిగించినవి. సారస్వత సాంఘిక మత రాజకీయోద్యమములకు మహారాష్ట్రమున లోకమాన్యుడు నాయకుడైనాడు. ఈ యుద్యమముల పరస్పరసంబంధ మెట్టిదో ఈతనిరచనలు బహుముఖముల జాటుచున్నవి. తిలకు గ్రంథములలో ముఖ్యమైనది గీతాభాష్యము. ఇది సేవాధర్మమును నుతించిన భాష్యమని తెలుపుటొప్పు. ఇట్లని యెఱిగి దివియందలి గొఖేయాత్మ పరమానంద మున నృత్యమొనరించినది. తిలకు విజ్ఞానమునకు, తిలకు భావసంపదకు మహామేధావి మేక్సుముల్లరు ప్రణమిల్లినాడు.

కాంగ్రెసు తలసూపిన దినములలో ఆంధ్రప్రజ్ఞ దానిని స్పృశింపకపోలేదు. ఒక కాంగ్రెసుమహాసభ కధ్యక్షుడైన ఆనందాచార్యు లాంధ్రుడే! ముప్పది యెనిమిదేండ్లకుమున్ను ఈయుద్యమాంగణమున నాహ్వానసంఘాధ్యక్షుడై నే డాంధ్ర భీష్ముడై వరలు మేటి పెద్ద నెవ్వ రెఱుగరు? కాని ఆంధ్రభూమియందు విశేషసంచలన ముదయించినది ౧౯౦౫,౧౯౦౬,౧౯౦౭ ల లోనే!

వంగసీమలో నుదయించు ప్రతియుద్యమము నిశ్చయముగ నాంధ్రవసుంధరలో బహుశాఖలయి వృద్ధి నందుచుండును. భావోద్రేకమున నాంధ్రులును, వంగీయులును సైదోడు లగుట దీనిహేతువు. తెలుగునేలలో నీ వివిధోద్యమములకు నాయకులయినవారు పలువురు గుంటూరు బందరువాసులే యనుకొందును. రాజకీయ సాంఘిక సారస్వత మతోద్యమములందు విశేషకృషి సలిపి, చక్కని రచయితయై మహావక్తయై వరలిన బిపిన్‌చంద్రపాల్ తనమహోపన్యాసములచే మనరాజధానిలో నెంతో భావోద్రేకము గలిగించెను. ఆంధ్రహృదయమందలి స్వాతంత్ర్యకాంక్ష యనెడి నెరసుపై విపినచంద్రుని యుపన్యాసములు తీవ్రవాతూలము లయి సోకినవి. ఈతని దృష్టాంతము మననాయకుల యుత్కృష్టోద్దేశమునకు దోహద మొసగినది, అరవింద, లజపతి, తిలకు, సురేంద్రాదుల శంఖారావములు వీరి హృదయముల నుద్వేగసంభరితము లొనరించెను. మదరాసును మనికిపట్టుగావించుకొనిన బెసంటు వీరి మనసుల నుత్సాహ

పూరితములు గావించెను. భోగరాజువారును ముట్నూరి వారును, కాశీనాథుని వారును, ఉన్నవవారును, వల్లూరివారును కోపల్లెవారును, కొండావారును నాడు యువకులై వర్ధిలుచుండిరి. వీరి ధమని స్నాయువులందు, వీరి శరీరనాళములందు ఉష్ణ రక్తము ప్రవహించుచుండెను. దిక్తటములు ప్రతిధ్వనించు లాగున "వందేమాతర" మని సింహనాదము లొనరించి మొక్కవోని విక్రమమున నాటి యుద్యమరంగమున లంఘించిరి. యువకులే యగుడు ఉత్సాహ విజృంభణమున దృప్తిఁజెందిరి గాని రాజకీయ మత సాంఘిక సారస్వత మహోద్యమముల సంబంధ మెట్టిదో వీరంతగా గుర్తింపరైరి. సారస్వతాచార్యులు కానిచో, నే యుద్యమమునకు దాము ఆచార్యులు కాజాలరని గ్రహింపరైరి. నవయుగ సముత్థిత భావనివహమును వీరాంధ్రసాహిత్యమున బ్రవేశపెట్టరైరి. ఉష్ణరుధిరము వెల్లుబ్బుతటి వీరు గంభీరోపన్యాసము లొసగిరి. కాని వీరి యాశయము లక్షురస్థములు గాలేదు. వీరి తలపులు వీరి మనసులందే కాపురమున్నవి గాని, అందుండి పామరహృదయములం దింకినవి కావు. Renaissance పై నాధారపడని Revolution, Reformation లు జయపతాక మెత్తవని వీరు తెలిసికొనిరి కారు. తమ పాణింధమములు ప్రజాహృదయములందు ప్రతిధ్వనించిన గాని, తమ యుద్యమము పల్లెలందు శంకుస్థాపనమందినగాని, తాము మతావేశమునంది జనాళి మనసులందు నద్దానిని తద్దయు బొంగించిన గాని, తమకృషికతన నవ్యభావాంకురములు పామరుల మానస కేదారములందు కల్పద్రుమములైన గాని, తమ యుద్దేశములు కుసుమింపవని, తమ యాశయములు ఫలింపవని వీరు గ్రహించిరి కారు. నాడు తలసూపిన సాంఘిక సారస్వత మతోద్యమ నాయకులు సయితము ఈమతముల పరస్పర సంబంధమును చక్కగ హృదయంగమము గావించుకొనలేదేమో! ఒక వీరేశలింగము తక్క తక్కిన బ్రహ్మోపాసకులు నేటి లిబరలు నాయకులవలె పట్టణములందలి గగనచుంబి సౌధాగ్రములందు దేవతలకు వినబడులాగున నాంగ్లమున గురుగంభీరోపన్యాసము లొసగిరి. బ్రహ్మమతోద్యమము భావోద్యమమని వీరు గుర్తించి రనుట కెట్టి యాధారములు కానంబడవు. గుర్తించియుండినచో తెలుగునుడిని, తల్లి మాటను ప్రాపు గావించుకొని పామరులగుడిసెలందు నవ్యభావములను జలజల రాల్చెడువారు; భావస్వాతంత్ర్యమును తారకమునట్లు జనసామాన్యమున కుపదేశించెడివారు; పల్లెలనుండియే ప్రజానీకమునుండియే తమ యుద్యమస్యందనము కదలవలసెడినని గ్రహించెడువారు. వీరిలో కొందఱు సముచితవిజ్ఞానసంపద నెఱుగక పోవుటచే బ్రహ్మమతము హిందూమతమునకు ప్రతిద్వంద్వి యని ప్రజ లూహించులాగున హిందూమతతత్త్వమున కవగతులుకాక మాతృమతమును జులకనజేసిరి. సర్వతోముఖమైన నవయుగోద్యమమునకు తమ యుద్యమము మాఱుపేరని వీరు గుర్తించియుండిన వేఱయ్యెడిది. వీరేశలింగము సాంఘిక సారస్వతోద్యమముల రెంటను బనిచేసి పుస్తెముగట్టుకొనినాడు. కాని ఈతడు రాజకీయములపొంతకు పోలేదు. సాంఘిక దురాచారములను మాపుచేయుట కీతడు కలమును చేబట్టినాడు; సభావేదికలపై నుపన్యసించినాడు. పెద్దలు పల్వురు మనలో దోచినను, ప్రధానోద్యమములు చేతులు కలుపుకొనకపోవుటచే ఝంఝామారుతమువలె నివ్వల విజృంభించిన సంచలనము నాంధ్రరాష్ట్రహృదయమున బ్రవేశింపలేదు. మన సీమలో పెక్కుపల్లె లున్నవికదా! ఏ యొక్కపల్లెయందైన బ్రవేశించి, సాంఘిక సారస్వత రాజకీయమతోద్యమములను గుఱించి యెవ్వరినైన బ్రశ్నించియుంటిమేని, ప్రతివచనము పడయక, యూర్పుగాడ్పుల నుప్పతిలజేసెడివారము. ఇంచుక కాలము కడచినంతన నాగేశ్వరరావు కృష్ణారావులు రాజకీయసారస్వత మతముల యవినాభావసంబంధమును గుర్తించిరి. "ఆంధ్రపత్రిక", "భారతి", "కృష్ణపత్రిక"ల ననుదినము నాంధ్రావనియందలి మూలమూలలకు పుత్తెంచి, నవయుగభావములను చిరమాధ్యముచే గట్టిపడియున్న రొమ్ములందు గ్రుచ్చదొడగిరి. వ్రేళ్లపై లెక్కింపదగిన నగరములందు పెద్దలు గొప్పగొప్ప యుపన్యాసము లెన్ని యొసగిన నొసగెదరు గాక. ఈ

పత్రికా రాజములు లేకుండినయెడల నసంఖ్యాకము లైన మనపల్లె లేయిక్ష్వాకుని గోష్ఠియందో మునింగి యుండెడివి. భోగరాజు, ఉన్నవ, అయ్యదేవరవారల గ్రంథరచనమువలన నిపుడు భావోద్యమమునకు కొంత తోడ్పడుచుండిరి.

గాంధియుగమున పరిస్థితులు విశేషముగ చక్కబడినవి. తొలుత మాతృభాష నిద్దురనుండి లేచినది. తోడ్తోడనే ప్రజా హృదయములును మేలుకాంచినవి. మేలుకాంచినయెడందల మ్రోల, విమర్శింప నేర్వ గడంగిన పామరుల సమక్షమున వికృతమైన వేషముగాని, సహజముగాని భాషగాని జోడుభాషలభంగి తెయ్యిమనగలవా? రాజకీయ మతసాంఘికార్థిక సారస్వతోద్యమముల కలయిక యెట్టిదో చూపి, జగదీశుడు దాసులకు దాసుడనునట్లు, సేవకులకు సేవకుడై ధర్మక్షేత్రమైన కురుక్షేత్రమున గాంధి పాంచజన్యమును పూరించినాడు. నాటియువకులు నేడు నాయకులై, ఘనతరశక్తిసమన్వితులై కడుంగడు విశాలమైన కర్మక్షేత్రమున లంఘించిరి. పాంచజన్యధ్వానము శ్రుతిగోచరమైనంతనె వేంకటప్పయ్య, పట్టాభి, నాగేశ్వరరావు, కృష్ణారావు, లక్ష్మీనారాయణులు క్రమముగ ననంతవిజయ, పౌండ్ర, దేవదత్త, సుఘోష, మణిపుష్పకముల బూరించిరి. పట్టాభి భీమకర్ముండని, వాగ్వాదములందు గడబూను మహాయోధున కెనయైనవాడని ఈ వటిలో దెలిపియుంటిని. వేంకటప్పయ్య ధర్మరాజును దలపించువాడని తెలుపుట నా ప్రస్తుతకర్తవ్యము.

భగవద్గీతలోని శంఖారావ ప్రకరణము గంభీరభావబంధురమైనది. శంఖమును బూరించుటన వీర్యమును, ఓజస్సును, తేజస్సును నిలుపుకొనుట. అంతరంగస్థారి షడ్వర్గము నడంచి విజయడిండిమమును ప్రయోగించుట వీరికే సాధ్యము. కౌరవులు తమ తేజస్సును నిలుపుకొనక ఆధ్యాత్మికశక్తిని గోల్పడుటచే శంఖముల నొత్తజాలరైరి.

సేవాధర్మము నాత్మజీవన ధర్మము గావించుకొనినను వేంకటప్పయ్య సాహిత్యోద్యమ స్యందనమున సారథి కాజాలకపోయెను. ఉత్తమాశయారాధనమున సాహిత్యోపాసన మనివార్యమైనదని, సత్యోద్యమములకు భావశబలత భావసఫలతల జేకూర్చునది సాహితియుద్యమ మని ఈతడు గ్రహించినాడుకాడు. ఈ మహావీరుడు మహావిజ్ఞాని కాకపోవుట ఆంధ్రుల దురదృష్టము. వేంకటప్పయ్య పండితుడు కాడు; కళోపాసకుడు కాడు; భావప్రవక్తుడు కాడు. భాషాసేవకుడు కాడు; వక్త కాడు; వ్రాతగాడు కాడు. మహాపురుషునకు మిగుల ముఖ్యమైన లక్షణము సేవయని వాకొందునుగాని పట్టినేవ ఏమహాపురుషుని మహానాయకుని గావింపనేరదు. నిష్కళంకమైన దేశభక్తినిజూపి, పడరానిపాట్లు పడినమహనీయు లెందఱో మననేలలో గన్పట్టిరి. వీరు యోధులుగాని నాయకులు కారు. హృదయబలమున కీడైన మేధాశక్తిని గలవాడే ప్రజల కొజ్జయును, రక్షకుడును కాగలడు. భావబంధురహృదయుడు, ప్రతిభాసమన్వితుడు, ప్రజ్ఞాధురంధరుడు మానవసేవకుడైనపుడే బహుళసీమ లాతని మహానాయకునిగావించి, వాని యడుగుజాడల నంటినడచును. రాజకీయములు సేవకేకాక విజ్ఞానమునకుఁగూడ సంబంధించినవి. వీనిలో నేది కొఱవడినను రాజకీయములందు మసలువా డగ్రస్థానము నందజాలడు. విశేషమేధాశక్తియున్నగాని క్లిష్టసమస్యల నెదుర్కొనలేడు; ఉద్వేళసిద్ధికి దోహదకారిపోవు ప్రణాళిక నెద్దానిని నిర్ణయింపజాలడు; ఎట్టితీర్మానమునకు సైన నాయువు వోయనేరడు; తనయభిప్రాయమును బహుళమానసములకు మేలుబంతి గావింపజాలడు; శుభంకరమైన భావికాలములోనికి సుగమనిరోధకముగాని తెరువును కన్గొనలేడు. ఈతడు వేయు అడుగులందు జంకుగొంకులైన నుండును, మొండిచొరవయైన నుండును. కావున నీతడు వెనుక నిలిచి మేధావియు, గర్మయోగియునైన మహానాయకుని ముదలను హృదయపూర్వకముగా నిర్వహించుచునుండవలయును.

ఆధునిక భారతరాజకీయములకు సక్కనైన భావశక్తి నిచ్చియుండినచో, వేంకటప్పయ్య, చిత్తరంజన, మోతీలాలుల కెనయైన మహానాయకుడై దిగంతవిశ్రాంతకీర్తిమంతుడై యుండువాడు.

గాంధిజీ ప్రణాళికపై మనకుంచి ౧౯౨౦ సెప్టెంబరులో నీతడు కలకత్తాకు నరుదెంచినాడు. వంగ వలంటీరులలో నాంధ్రవలంటీరుసై, వేంకట ప్పయ్య ప్రభృతులను ౨౦ వ నెంబరు నెబుతలా లేక్ లోని విడిదికి గొనిపోతిని. దేశభక్తుని నిరాడంబర జీవ నమునకు మిక్కిలి యక్కజంపడితిమి. అనతిదూర మున వెల్లింగ్టన్ స్క్వేరులోనే అవసర కాంగ్రెసు మహాసభ సమావేశమైనది. హేమాహేమీలందఱుగూడిరి. లజపతి అధ్యక్షుడు. పాంచాలకేసరిగర్జనము పరిసర ప్రదేశములందు శ్రుతిగోచర మయ్యెను. పిడుగులు పోలు నుడువులు బిపిన్‌పాల్ రసనమండి వెడలినవి. చిత్తరం జనుని సింహనాదము గుహావినిర్గత మహానాదమువలె వెలువడినది. మాలవ్యాపండితుని మహోపన్యాసము వేగవంతమై హుగ్లీప్రవంతితో పందెమునకు బూనినది. కెవ్వుకెవ్వుమనుచు లేచి వి. జే. పటేలు దిక్కులను నిదురనుండి లేపినాడు. జితేంద్రలాల్ మాటల 'గామా' యై ప్రేక్షకులచే "అబ్బా!" యనిపించినాడు. వంగీయులే మహావక్తలని ప్రగల్భములు కొట్టు సహాధ్యాయుల న్ప్రతిభల జేయసమకట్టి వేంకటప్పయ్య సింహనాదమును వినిపింప వారితో కాంగ్రెసున బ్రవేశించితిని. సింహనాదముపేరు దేవుడెఱుగును, వేంకట ప్పయ్య మాటలాడనేలేదు. మణిబంధమునకు దీక్షాకంక ణము గట్టుకొని మాత్రము సభాంగణమున నాతడాసీను డైనాడు. మూడేండ్లుకడచిన పిదప కాకినాడ కాం గ్రెసున నీత డాహ్వానసంఘాధ్యక్షుడై గోచరించినాడు. శాంతనవుని ప్రతిజ్ఞను దలపించు నిశ్చితాభిప్రాయము లీ శాంతమూర్తిరచనములం దుండుట స్పష్టమైనను పట్టాభిపల్కులవలె నీవాక్కులు జలదగంభీరము లయి వినబడలేదు. మహాసభాధ్యక్షుడు మహమ్మదాలీ మాటలకును, ఈతని నుడువులకును నెంతో వ్యత్యాస మగపడినది. Subjects committee లో గాని, తదితర సభలందు గాని భావనాయకుడై ఈతడగపడలేదు. వేంక టప్పయ్య "రసబంధుర వాగ్విభవాభిరామధౌరేయుడు" కాలేదు.

వేంకటప్పయ్య అనంతవిజయమును బూరించి నాడంటిని. కురుక్షేత్రమున నీతడు నాయకుడు కాలేదు. భూతలమున నవతరించిన రాజకీయవేత్తలలో నగ్ర గణ్యుడై మహోద్భుతమేధావి యై, కర్మవీరుడైన శ్రీకృష్ణుడే ధర్మక్షేత్రమున నాయకు డైనాడు. శ్రీకృష్ణు డనన్యసామాన్య విజ్ఞానసమన్వితు డని భగవద్గీత తెలుపు చున్నది కదా! ఈతడు దాసదాసుం డని, పరార్థజీవి యని లోకము తెలియును. ప్రపంచమహానాయకులకును, ప్రపంచ మహాపురుషులకును ఈతని జీవనవిధాన మొజ్జ బంతి. విజ్ఞానియైన కర్మవీరునకే ప్రథమశ్రేణి మహా పురుషులందు స్థాన మొసగెదను.

అంతరాత్మ పరుశుడానికి చెవియొగ్గి, దానియా నకు నాదల నొగ్గువాడు వినయశీలుడై, సంయమియై శర ణను. ఈయాజ్ఞను పాలించుటన జిత్తమునకు ప్రీతి కరములైన,— భౌతికదృష్టిలో నెంతేని విలువగల వస్తునికరములను దూదిపింజలయట్లు విసరివైచుట. సిద్ధా ర్థుడు తన రాజ్యలక్ష్మిని, తన యర్ధాంగలక్ష్మిని, తన యనుంగునందనుడు రాహులుని పరిత్యజించి, మణి భూషణములకు మాఱు కచికలను చేగొని, రాజవసనము లకు బదులు చెన్నుడను గుడ్డిపువాని కాపీనమును దాను ధరించి, పైడిగిన్నెల వీడి భిక్షుకపాత్రను జేబూని, అర్ధ శర్వరీసమయమున లక్ష్మీనివాస మైన నిజనిలయము నుండి నిర్గమించి, గభీరాంధకారబంధుర సాంద్ర గహన మున ప్రవేశించి, నెక్కుఇక్కట్టుల నాహ్వానించి, ముక్తిదూత యగుటకై బోధిద్రుమతలమున తప సొన రించినది తనయంతరాత్మయానకు మూలి నొగ్గియే కదా! సచివుల వంశమున జన్మించిన గాంధి దేశార్థమై కక్షు పాలను చేతబూనినది ఏతాదృశాజ్ఞకు శిరమును వాంచియేకదా! ఇట్టి మదలకే తలయొగ్గి తన నెచ్చె లులు తనయుద్యమాంగణమున బ్రవేశింపవలె నని కల కత్తా అవసర కాంగ్రెసు పీఠస్థలినుండి మహాత్ముడు స్పష్టవాక్కుల దెలిపినాడు. సామాన్యాంశములందు సయితము గాంధిజీ హృదయాగారమున నిట్టి యానను వినియే క్రియకు దొడరును. తన యంతరంగ మిత్రులు తనయట్టు లాచరింపవలెనని ఈత డభిలషించును. ఈతని

స్వీయచరిత్రయందలి బహుళదృష్టాంతము లీ యంశమును ధ్రువపఱచుచున్నవి. విలువగల వస్తువులపై నీతనికింతేని జుగుప్స కలదు. దక్షిణాఫ్రికాలో తనయంతరంగమిత్రుడై యుండిన హెర్మన్ కాలెంబాచ్ చేతులనుండి వెలగల రెండు దూరదర్శినీ యంత్రములను గైకొని చివాలున కడలికడుపున కప్పగించుట కాతడు సంశయింపలేదు. తన నెచ్చెలిహృదయము తనయెడంద వంటిదని యెఱిగియే ఆతఁ డట్టులొనరింప సాహసించినాడు. అంతరాత్మకు "దాసోహం" అనజాలు మహనీయులు మానవులం దత్యల్పసంఖ్య నున్నారు. వీరిలో వేంకటప్పయ్య యొకండు. ఈతని జీవనపద్ధతులను పరికించిన వారి కిట్లని బోధపడకమానదు. న్యాయవాదియై* సామాన్యదైనిక జీవననిర్వాహణమునకు నక్కరైన పైకమును మాత్ర మార్జించి, అవలీలగ నతులైశ్వర్యమును చేబట్టగలిగియు నట్టులొనరించుటకు సమకట్టక, గాంధిజీ యుద్బోధము చెవులబడకమున్నే తనవృత్తికి తిలకర్పణము వదలి తన శక్తులను జనయిత్రీసేవకై వినియోగింప దొరకొనినాడు. అమేయ ధనరాసులను ప్రోగొనరించియు, కుత్తుకలో తులసీజలము పడువఱకు కోర్టులనుండి కదల నిచ్ఛగింపనివారి సంఖ్య బలిసియున్న దినములలో వేంకటప్పయ్య తన నైతికోన్నతిని జూపి సేవకగణమున ప్రవేశించుట ఘనవిషయము కాదా? మానవహృదయము నుపట్టి పాలార్చు దురాశను దూరీకృతమొనరించుట కెట్టి యిచ్ఛాశక్తి, ఎట్టిస్థితప్రజ్ఞ, ఎట్టి దృఢనిశ్చయమక్కరైనదో చదువరులే యూహింతురుగాక!

ఒక్కని యంతరాత్మ తెల్పిన దొక్కండై, కోటికోటి లోకులు చెప్పినది వేఱొక్కండై యుండవచ్చును. దురూహలు కొంతకాలము బహుళమానసములపై దండెత్తి వానిని దాసుల జేసెనను దృష్టాంతములు ప్రపంచేతిహాసములందు కొల్లలై కన్పట్టుచున్నవి. పెద్దదియైన పశుబలము జళిపించు విచ్చుకత్తుల జూచి గడగడ వడకి, తమ యెడందలనుండి యాత్మవిశ్వాసములను పెల్లగించి మనుగడ నిలుపుకొనిన అభాగులెందఱో యున్నారు. లాఠీశక్తులు వాడియడిదములు చేబూని చివాలున గుండెలో గ్రువ్వినను, స్వయంభువైన శివలింగమువలె నందునవరు స్వీయవిశ్వాసమునకు మననాభిషేకమహోత్సవము నెఱపుచు స్మితముఖులై ఆత్మవిజయ డిండిమమును మ్రోగించిన మహావీరులు కొలదిమంది కలరు. నేనుగాకున్న గాలక్రమమునందైన హృదయస్థ సద్భావము జయభేరిని మ్రోగింపకమానదు. పశుబల విజృంభణమున పెద్దలమైతిమని విఱ్ఱవీగిన బహుళసంఖ్యాకులు పీనుగుపెంటలై పడియుండ, నాత్మభావ సంరక్షణార్థము అంగప్రత్యంగములను అత్యాచారమునకు నంజుకొనబెట్టిన ధీరచిత్తులు కొలదిమందియైననేమి, నిత్యజీవులై కాలవిత్తలమున జుక్కలై వెలింగెదరు; ప్రతికూలశక్తి తన పాశముచే మనసును బరబరలాగ దొడరినపుడు, సత్యసంశ్లేషమునుండి దానిని సడలింప నీయని తాపసవరేణ్యు లనంతజీవులని మన సారస్వతము తెలుపుచుంటలేదా? ఇట్టిదొడ్డజీవులును, అట్టి ధీరచిత్తులును ప్రతీచీ సాహిత్యవిహాయసమందు గూడ నిత్యసందీప్తజ్యోతులై వెలుగొందుచున్నారు. ఏసు, సోక్రటీస్, పైథాగరస్, కోపర్నికస్, లూథర్, న్యూటన్, గలీలియోల నెవ్వ రెఱుగరు? ఒకజాతిమానస మున్నతి నందుటకు చాలకాలము పట్టును. సామాన్య గణమున

*న్యాయవాదవృత్తియం దీతడు తన మర్యాదను చక్కగా గాపాడుకొనినాడు. ఈవృత్తియందే నరకమునకును, నాకమునకునుగూడ రహదారులు కలవు కదా! ఇందు కాలిడువానికి నధోగతియు, నూర్ధ్వగతియు గూడ ప్రత్యక్షమగును గదా! క్రిందికి చూడక ఊర్ధ్వగతియందే వేంకటప్పయ్య చరచర సాగిపోయినాడు. స్వాతంత్ర్యకామికి కడుంగడు ప్రియమైన వృత్తి తనదియని గుర్తించినాడు. మాటిమాటికి "Your Honour, Your Honour" అనుచు Semi- Circles వలె వంగు మహాశయులతో నీతడు కలియలేదు. తన యాత్మగౌరవమున కెన్నడు ధక్కా తగులనిచ్చినాడు కాడు. తన వల్లూరిమిత్రుడును, దానును వృత్తిగౌరవ రక్షణమునకై శ్రమించిన తెఱగును గొండొక దృష్టాంతమున నిటీవల నీతడు వ్యక్తీకరించినాడు.

క్షతీతులైన అల్పసంఖ్యాకు లీ యున్నతి నచిరములో నంది అత్యాచారమునకు సుతియసుట సర్వసామాన్యము లందును గోచరించు సంఘటనమే! అవలంబింపబడిన భావము బలవత్తర మైనకొలది అత్యాచారము తీవ్రతర మైయుండును. తీవ్రవిషయము లటుండ, సామాన్యాంశములందు ఆత్మవిశ్వాసముల నట్టిట్టు లాడించి, పరభావములకే అంజలెత్తి పలుకుబడిని ప్రచారమును పడసి, తళికి, మెఱపు లేని రిక్తవస్తువులకై, ఈశ్వరప్రదత్త ప్రజ్ఞను దుర్వ్యయము నొనరించి, నిజజీవనములను దుమ్మునకును వమ్మునకును పంచియిచ్చువానికి మహాత్ముని మహత్తర చరిత్రయు, దేశభక్తుని నియమబద్ధజీవనమును ఘనపాఠములను గఱపకపోవు.

నియమములను పాలించుకటి సామాన్యాంశము లని, అసామాన్యాంశము లని వ్యత్యాసములను పాటింపరాదు. భంగముగాని, విజయముగాని చేకుఱు వస్తువునకును విషయమునకును గాక నియమమునకే, నీతికే! చిల్లిగవ్వను దొంగిలించినను, వరాలమూట నపహరించినను నియమమునకు తలవంపులు వచ్చితీఱును; ఆత్మపై బురద పడితీఱును. కట్టుదిట్టము గలవారు మానవులం దేకొలదిమందియో కలరు. వీరికిని తక్కుంగల వారికిని భావసంఘర్షణము గలుగుటయు, ఒరుల కుత్సితంపు టూహలకును, దుర్విమర్శలకును వీరు గుఱియగుటయు తఱచుగ జరుగు సంఘటనములు. ఇట్లని గుర్తించినవారిని కనజాలనపుడు మన విషాదము ద్విగుణీకృత మగును. ఈశ్వరుడే సత్యపరిశీలన మొనరించువాడని మనసును కుదుటబఱుచుకొందుము. నియమారాధకులు వ్యతిరేక వర్తనమును గాంచి ఆగ్రహింతురు, దుఃఖింతురు. ఈ దుఃఖాగ్రహములు పవిత్రమైనవని తఱచుగ పదస్ఖలనమున కలవాటుపడినవారును, ప్రత్యేకముహూర్తమునకు ప్రత్యేకనాటక మాడువారును గుర్తింపరు. నీతివర్తనుడును, నియమబద్ధజీవియు నైన వేంకటప్పయ్యను వీరినుండి, నీటినుండి పాలను వేఱుచేయులీల, ప్రత్యేకింపవలెను. అపుడపు డీతనియాగ్రహవిషాదములు విజృంభించుచుండునని చిత్తమువచ్చిన విమర్శనలకు దొడరువారు వీనిహేతువు లెట్టివో గమనించుట పాడి. చిన్ని దృష్టాంతమును విలోకింపుడు. ఇటీవల గుంటూరు మండలములోని కొండొక సుప్రసిద్ధాశ్రమమున దోచిన లోపమును గాంచి మహాత్ముడును, దేశభక్తుడును ఇంచుక కనలి, కన్నీళ్లు విడువలేదా?

ప్రపంచ పురోభాగమున నేడు విశేష ప్రాముఖ్యము నందినవాడు రాజకీయవేత్తయే యైనను, ఈతని వలననే వివిధజీవనాంగణములందు చక్కని సంచలనము కలుగుచున్నను, ఈతనికి గల శత్రువులు మఱెవ్వరికిని లేరు. “To be great is to be misuunderstood” అని ఎమర్సన్ మహాశయుడూరక వచించినాడా? సంఘీభావము తక్క తక్కిన సర్వలక్షణములు గల భారతీయులయందు పారస్పర్యములు రేకెత్తించు ప్రతికూలవాదులు పలువురున్నారు. వంగమహాకవి ద్విజేంద్రుడు “మీవారుపతన” మను తన నాటకరాజమున “జగదీశుడు భారతమాత ఫాలతలమున ‘అభాగినీ! నీ తనయులందు సంఘీభావ ముండదుసుమీ!’ అని వ్రాసియుండు” నని వచించినాడు. మీవారుపతనము నాటగాని, ద్విజేంద్రుడు మనియున్న నాటగాని, నేడు గాని సిద్ధురనుండి సంఘీభావము లేకపోవుట భారతీయుల దౌర్భాగ్యము. విషాదసంభరితమైన ద్విజకవి వాక్కును చెఱిపివేయు సుదినములు భారతదిగ్వలయము నుండి కనకమరీచుల సారించుచు నెపు డుదయించునో కదా! నేటి భారతరాజకీయవాదులందలి తీవ్రభేదాభిప్రాయములే భారతకల్యాణమహోత్సవమున చావుబాజా వాయించుచున్నవి. అభిప్రాయభేదములు వ్యక్తిగత దూషణములకును, దురంత వైరమునకును, దుష్ప్రచారమునకును, దుర్విమర్శనమునకును, దుష్టచేష్టలకును దారితీయుచున్నవి. ఏ యభిప్రాయమునైన నెదుటివాడు తనతో నేకీభవింపక పోయినను, అతనిని నెచ్చెలియట్లే వీక్షించు విశాలహృదయుడు వేంకటప్పయ్య. ఎట్టి లాతివానిని గుఱించియైనను, నిజమానసమున నీతడు దురభిప్రాయమునకు చోటీయడు. విశాలదృష్టితో, నుదారభావముతో మనుష్య చరిత్రను విలోకించుట ఈతని సహజలక్షణము. ఈ లక్షణమున దేశ

భక్తవత్సలుడైనవాడు దేశోద్ధారకుడు. స్థలపరిమితి కలిగిన దృష్టాంతములను పేర్కొనజాలను. ఇట్టివారుమతి కొందఱున్నారు గాని వీరిసంఖ్య మిక్కిలితక్కువ. ఈ సంఖ్య ఇంచుక పెరిగిననాడు భారతరాజకీయాంగణమున మల్లెలును, మొల్లలును పూయును. కల్పకమట్లు సంఘీభావమందు పెంపొంది తన కొనరెమ్మలనుండి ఉత్తమాశయఫలములను పుడుకుడని భారతపుత్రులకు సైగజేయును.

ఏతక నాంధ్రోద్యమమునకై నడుముగట్టి పని చేసినవారిలో వేంకటప్పయ్యయొకండు. ఆంధ్రావనిలో నీయుద్యమమును గుఱించిన శ్రద్ధ క్షీణించి రెండు దశాబ్దులయ్యెను. ఈ మహోద్యమము భారతోద్యమములో నిదే యని మననాయకమణులు గుర్తించిరికారు. అంగ ప్రత్యంగములలో నెద్దానికైన జెబ్బు ఘటిల్లినచో సర్వావయవములకు జంకుకలుగదా? హృదయశక్తికి భంగమువాటిలదా? ఈ యంశమున కవగతులగుటవలననే వంగీయులు భారతోద్ధరణమునకై ముందంజవేయుచు, తోడ్తోడనే సర్వతోముఖవంగాభివృద్ధికై తమ సర్వశక్తులను వినియోగించుచున్నారు. కావుననే ఉత్తమాశయములు వంగమేదినిలో మేలిపంటలై వర్ధిల్లుచున్నవి. వివిధకళలందును, వివిధశాస్త్రములందును జగద్విఖ్యాతి నందిన ప్రజ్ఞాధురీణు లందు దోచిరి. తమరాష్ట్రము చీలికలుకానున్నతటి వంగీయు లుత్తేజితులై లేచిరి; వారితో భారతీయులందఱును లేచిరి. తమశక్తిని వంగవాసులు తమనుండెంను కేంద్రీకరించిరి. కావున వసుంధరలో నసర్ఘమైన ప్రశస్తినందిరి. ఆంధ్రోద్యమము తాత్కాలికోద్రేకసంజనితమైనది. ఆంధ్రహృదయమున నన్యచింతలు ప్రవేశించినంతనే ఈ పవిత్రోద్రేకము ఎడారిలోని నీటిబొట్టువలె నింకిపోయినది. "మననేల"యను తలంపు రెక్కలు కట్టుకొని ఎందో ఎగసిపోయినది. ఆంధ్రహృదయము చలించుట మానుకొనినది. ఆంధ్రావనిలోని ముఖ్యభాగములను పొంతినున్నవారు జున్నుముక్కలనట్లు చీల్చి తమరాష్ట్రముఖమున జారవిడిచినను మనసోదరులు తమకు గాదని మిన్నకొనిరి. సీతాపతి మన్నగువారికి జేయూతనీయరైరి. మూడుకోట్ల యాంధ్రుల హృదయములలో నాంధ్రత్వము నిదురించుచుండ ముప్పదిరు నిరుపేద లేమి చేయగలరు? ఈ Precedent ముందుముందు ఇఁదున్నవారికి, అందున్నవారికి చక్కని చేయూతయై పని చేయును. ఆంధ్రప్రజలనేకులు అన్య విశ్వవిద్యాలయము నాశ్రయించిరి. ఆంధ్రైక్యముపై నాంధ్రులయుదాసీనభావమే యాఘాతమువైచినది. ఆంధ్రుల శక్తి అట్టిటులాడినది అన్యరాష్ట్రములందును, అన్యదేశములందును పలుకుబడి నెఱుగక, ఒరులేమియనిన దానికి "భళాభళీ" యనుచు తెలుగు సైదోడులు జెండాలుచేబూని వెనుకనే నిలువంబడియుండిరి. స్వీయోన్నతికి నక్కరైన వ్యవస్థయెద్దియో వీ రెఱుగరైరి. మాతృభాషా మందిరమున నాంధ్రభావాభివృద్ధికై వేంకటప్పయ్య ప్రభృతులు పాటుపడియుండినచో, పల్లెలందలి బహుళసంఖ్యాకుల గుండియలు కదలికనందెడివి. ఇవి కదలినపుడే ఎట్టియుద్దేశమైన సిద్ధినంది, చతుర్భుజమూర్తివలె ప్రత్యక్షమగును.

వేంకటప్పయ్య వీరుడంటిని; వీరుడు సంయమియంటిని. వీరు డుద్వేగసమన్వితుడై, ఆ యుద్వేగమును చిత్తమువచ్చిన మహూర్తములం దడంపజాలువాడై యుండును. రాతి కుద్వేగము లేదు; సంయమము నుండదేమో. రాతియుండెడివానికి పాషండులందే తావుండును. ఇంద్రియ పటుత్వముగలవాడే జితేంద్రియుం డగును; ఈతడే సన్న్యాసి యగుటకు, ఆశ్రమస్వీకారము గావించుటకు నర్హుడు. ఉద్వేగసంయమ గుణములందు దివ్యశక్తి దృఢనిశ్చయములు నిహితమైయున్నవి. తన దృఢనిశ్చయ మెట్టిదో, తనధృతి యెట్టిదో, తన యిచ్ఛాశక్తి ఎట్టిదో తన కురుక్షేత్రమున పెక్కుమాఱుల వేంకటప్పయ్య చూపినాడు. ఈతని యుద్దేశములందలి దివ్యదీప్తులను తిలకించియే, తొలుతనుండియు నీతని మండలవాసులీతనియెడల మిగుల ననురక్తులై యుండిరి. వేంకటప్పయ్య ఎరెస్టయిన నిముసమున గుంటూరులో గగ్గోలు పుట్టెను. న్యాయవాదుల గూడి ఆ పురవాసులు నాల్గునాళ్లు తమపనులను విరమించి దేశభక్తునియెడల దమ సానుభూతిని జూపిరి; ఈతని యుత్కృష్టోద్దేశమునకు

జేజేలు పాడిరి.* ఉద్వేగపూరితమైన సందేశమును గాంధిజీ వారి కంపుట లోకమెఱుగును.

వేంకటప్పయ్య బర్డోలీవిజయముపై కన్నిడి, రెండవబర్డోలిని దననేలయందు ప్రత్యక్షమొనరింప గమకించుట భారతీయులందఱికిని తెలిసినవిషయమే! ఈతనిసత్త్వ నాడు విజృంభించినట్లు మఱెప్పుడును విజృంభింపలేదు.

పరిహద్దురాష్ట్రములో వేఱొకగాంధి పొడసూపకమున్నే యాంధ్రగాంధి యగపడె నందును. బహుగుణములందు సర్దారుపటేలునకును, ఈతనికిని పోలికలు కలవు. పటేలు చరిత్ర గాంధిచరిత్రకు ప్రతిబింబము. ఇర్వురలో నెంతో పొందు కలదు. కావుననే ఒకప్పు డెరవాడా జెయిలులో పరిహాసపూర్వకముగా మహాత్ముడు "మేమిరువురము దంపతుల"మనినాడు. పటేలు వేంకటప్పయ్యలు గాంధిని బోలువారగుచో వీరిరువురు నొకరి నొకరు పోలినవారే కదా! కావుననే దేశభక్త డాంధ్రబర్డోలీ నాయకుడుగా నంకించినాడు. "దుర్ఘటకార్యమని పలువురు నెఱిగంటిరి." భారతీయులందఱు గుంటూరుపై నాతురంపుదృక్కులు నిగిడించిరి. మేరు సమాన ధీరుడై, అద్భుతసాహసోపేతుడై, రసపుత్రవీరునివలె వేంకటప్పయ్య తన యుద్యమాంగణమున లంఘించినాడు. కాని,—కాని,—కాని, సంయమీంద్రుడైన నాయకుడు పరిస్థితులను చక్కగ పరికించి, "ఇది యదనుకాదు; వెన్కకు రమ్మ"ని దేశభక్తునకు ముడల నొసగెను. తానును సంయమికావున్న వేంకటప్పయ్య నాడు తన స్యందనమునకు రెక్కలగుఱ్ఱములను గట్టి వాని నంబరవీథిని ఛంగు ఛంగున నుడాయించి, దివిగల గీర్వాణులకు మిక్కలి యక్కజము గొలిపెనువాడు.

కాని, యుఱుక నుద్యమించిన మహావీరుడు చివాలున నిలువగలిగినాడు; లోగల దళతేజుల నాకస్మికముగ మరలింపజాలినాడు. ఉఱుకులెత్తువారనేకు లుందురు గాని లంఘించు నియమమందే దూరమునకు వాడి చూడ్కి సారించి, చివాలున సర్వము గ్రహించి మఱొక మంగళ ముహూర్తమునకై తడయగలవారు మానవులందు మిక్కిలి తక్కువగా నుందురు. ఆధ్యాత్మికదృష్టితో విలోకించిన, వీరిని Seers అందుము; రాజకీయదృష్టితో వీక్షించిన Statesmen అందుము. Seer and Statesman ఐనగాంధికి గల శక్తి నాడు వేంకటప్పయ్యలో నాత్మప్రతిబింబమును గాంచినది.

గాంధి యుపదేశములయెడల బూర్ణ విశ్వాసముంచి, ఎట్టి యభిప్రాయభేదమునకు చోటీయక తూచాతప్పక ఆతని తీవ్రప్రణాళికను నిజమాళి బూని, నిండుబత్తితో నాతని యడుగుజాడల నంటి చరించిన కొలదిమంది యనుచరులలో వేంకటప్పయ్య ముఖ్యుడు. మహాత్ముడు కారాగృహమందున్నప్పుడు రాజకీయవాదులందు కొన్ని భేదాభిప్రాయములు పొడసూపినవి. No - changers and Swarajists ఒకరి నొకరు డీకొనిరి. గయా కాంగ్రెసు ముగిసినది. చిత్తరంజనుడు సింహనాదము చేసినాడు. జెబ్బగొట్టి Swarajists తమ మహానాయకుని వెనుక నిలిచిరి. వేంకటప్పయ్య సనేమిరా యని ప్రథమప్రణాళికకే అంజలి ఘటించినాడు. All India Congress Committee దేశభక్తునకు భక్తి పుష్పాంజలిని సమర్పించి, అధ్యక్ష పీఠమున నాతని నాసీను గావించెను. దేశబంధునకు పిదప దేశభక్తుడే ఈ పూజ్యస్థానమున కర్హుడని బహుళ సంఖ్యాకులు గ్రహించిరి. వేంకటప్పయ్య నాడందిన సన్మానము తనదియని ఆంధ్రజాతి మఱిమఱి మురిసినది.

శ్యామసుందర, సర్దారు పటేలు, రాజగోపాలాచార్యులవలె నాడు No changer అయి యుండిన వేంకటప్పయ్య కాలపరిస్థితులను పరికించి, కాంగ్రెసు ముడల నొదలబూని నేడెన్నికలందు నిలిచి విజయ

---

* ఈ మండలవాసు లెట్టి యుత్సాహవంతులో, ఎట్టి కార్యదీక్షాపరతంత్రులో తెలుపుటకు మున్ముందు నాకు కొన్నితరుణములు లభింపగలవు......చీరాల పేరాల లేకతలమును భావసంభరి మొనరింపవు ?

మందినాడు. * నిర్దిష్ట పంథనుండా నడువ సంకించుచున్నాడు. ఈతడు వ్రతపీఠమున నాసీనుడైన యుండగనే కొలది నెలలకు మున్ను ఈతని యర్ధాంగలక్ష్మి ఈతని బాసి దివంగతయైనది. వ్రతఫలమును గాంచక మున్నే ఈయమ గతించుట దుఃఖకరము. సంయమి కావున వేంకటప్పయ్య దుఃఖగరళమును మ్రింగి, తనకు మిగుల గూర్పు కర్తవ్యమునకు బూజ మొడ్డినాడు. ఇటీవల దన సర్వస్వమందలి యధిక భాగమును శారదా విద్యాలయమునకు సమర్పించెనని తెలియవచ్చుచున్నది. ఈ మహావ్యక్తి హృదయ మహత్త్వ మెట్టిదో, స్త్రీయుద్యమమునెడల ఈతనికి గల యనురాగ మెంత గాఢమైనదో, త్యాగ మన నీతని కేవల ప్రీతికలదో ఈ మహత్కార్యము వేయినోళుల జాటుచున్నది.

వేంకటప్పయ్య పురోభాగమున నేను నందనమున కేదైన దృశ్యము గోచరించుట లేదు. భారత రాజకీయములం దిపుడు పెక్కు డొంకటిక్కు లగపడుచున్నవి. ముందంజ వేయుటయో, నిలిచి తెన్ను వెదకుటయో, పూర్వ విధానమును ప్రవర్తించుటయో, నూతన విధానము నావిష్కరణ మొనరించుటయో కాల పరిస్థితులును, దేశపరిస్థితులును నిర్ణయింపవలెను. ఏదో ఫలప్రదానమును పడసి, మనము నెట్లో కుదుటబడుచు కొనుట కియ్యకొనువారు కాంగ్రెసువారు కారు. మణికట్టులకు కట్టుకొనిన తోరములను పదవుల కొఱకును, పణముకొఱకును ప్రుటుక్కున త్రెంపుకొను వారు కాంగ్రెసువారు కారు. ఎట్టియిక్కట్టులు పిడుగుల వడువున గుండెలపై పడినను, వానిని నిరాశ కప్పన మనువారు కాంగ్రెసువారు కారు. అర్థానుస్వార స్వరాజ్యమునకై ఆత్మార్పణ మొనరించుకొనువారు కాంగ్రెసువారు కారు. రాజకీయ కురుక్షేత్రమున నేడింకను మహాత్ముడు ప్రత్యక్షము కాకున్ననేమి, పాంచజన్యధ్వానము కర్ణగోచర మగుచున్నది! త్యాగుణీ కృతోత్సాహమున వేంకటప్పయ్య ప్రభృతుల నంత విజయ పౌండ్ర దేవదత్త సుఘోష మణిపుష్పకముల మరల బూరింప గలరు!! నేడు గాకున్న రేపై. విజయ పాణింధమధ్వని బోరు కలంగుట తథ్యము!!!

రాజకీయ సూత్రము లనంత నిబంధనములు కావు. కాలపరిస్థితుల ననుసరించి, ఎదుటివారి ప్రవర్తనమున తలసూపు పరివర్తనమును బట్టి అంగాంగసంబంధము గల బహుళ ప్రాపంచిక సాంఘిక ఆర్థిక రాజకీయస్థితుల ననుసరించి ఇవి మారుచుండును. చీటికి మాటికి చిత్తము వచ్చిన చొప్పున మార్పులొనరించి విచ్చలవిడిగా నడువ గడగి స్వార్థమున కక్కరైనజిత్తుల నవలంబించి ఎత్తులు వేయు టెట్టిచెట్టయో ఎల్లవేళలందు మొండిపట్టు పట్టి 'ననేమిరా' యనుటయు నట్టిచెట్టయే! నియమములు ప్రాణయుతములు. Principles, Dogmas కావు. దృఢనిశ్చయము కన్నులు కలది. మొండిపట్టు కనులు లేనిది. బండపట్టు నిరంకుశత్వ మనిపించుకొనును. నిరంకుశత్వమునకు హృదయము హుళిక్కి. హృదయమునకును కన్నులకును అవినాభావ సంబంధము కలదు. హృదయరహితుని నయనములు మూతలుపడియే యుండును. గుండెలేనివాడు ప్రతిపక్షులచరిత్రయందు దోచు పరిణామమును గననొల్లడు. ఎదుటివారి యభిప్రాయ

* ఈ సందర్భమున మహావిజ్ఞాని ఎమర్సన్ పల్కులను పరికింపుడు. "A foolish consistency is the hobgoblin of little minds, adored by little Statesmen and Philosophers and divines. With consistency a great soul has simply nothing to do. He may as well concern himself with his shadow on the wall. Speak what you think now in hard words and tomorrow speak what tomorrow thinks in hard words again, though it contradict everything you said to-day.—'Ah, so you shall be sure to be misunderstood?'... Is it so bad, then, to be misunderstood?............To be great is to be misunderstood." (Vide: Emerson's famous Essay on "Self-reliance")

ములు సక్రమపరివర్తనమునందుటకు నించుకైన నవకాశ మీయనిది నిరంకుశత్వమే! బండపట్టువలన జెడునవి యు, ఉదారభావమువలన నెగ్గునవియు ననేకాంశము లున్నవి. తీవ్రప్రతిఘటనమే నిత్యక్రియా విధాన మని యెంచునాతడు మేధావి కాడు; విజ్ఞాని కాడు; దూర దృష్టికలవాడు కాడు; సహృదయుడు కాడు; ఇతడు Statesman అని యెవ్వరును బలుకరు. నిష్ఠురు డందురు. Prestige పై దెబ్బ తగుల నిచ్చుట రాజకీయ వాదికి తగదు. కాని False prestige చుట్టు నాతడు రామభజనము చేయుచో తనకును, తన దేశ మునకును తీఱని, తలుగని దుష్టకష్టనష్టములను దెచ్చి పెట్టుకొనును. ప్రతిఘటనము ప్రధానోద్దేశము గాక, తాత్కాలికముగ, ననివార్యముగ, ననిష్ట పూర్వకముగ నవలంబింపబడవలసిన క్రియయే యని యెంచు టొప్పు. కనులు మూసికొని, యొకరి నొకరు తమ్ముకొనువారును, పెద్దబారలు కలవు కదాయని గుభాలున నుడిగుండమున లంఘించువారును బుద్ధిమంతు లనిపించుకొనరు....మహానాయకునకు వల సిన ప్రధాన గుణములు సహనము, శాంతము, గభీర యోచనమును. వీనిపై నాధారపడు ధృతినే జయలక్ష్మి వరించును. ఎదుటివానిని జయించుటకు నొక్కొకపుడు బుద్ధిశాలి తీవ్రోక్తులకు చెవి యొగ్గి, అత్యాచారమునకు వెన్నొడ్డి, నతమస్తకుడై నిలిచియుండును. అంతియే! ఉచితమని యూహించి నిముసమునేపు వెనుకంజ వేసి యుండుట కాతడు సంశయింపడు. తన క్షమాదృష్టి యందే ఈతడు కల్యాణమహోత్సవమును కాంచును. ప్రణయ విజయమే చిరవిజయ మని ఈత డెఱుగును.

ఈ యంశము లన్నిటికిని నవగతుడైన మహాపురు షుడు గాంధిజీ. ఇతడు స్థితప్రజ్ఞుడే! మొండిపట్టునకు మంగళసూత్రమును గట్టి యెఱుగడు. నిరంకుశత్వము నకు జేజేలు పాడినవాడు కాడు. నే డీతడు అసాధారణమైన సహనశాంతులు చూపుచు నిలిచియున్నాడు. గుండె లోని భావోద్వేగము నడంచియుంచి, క్రమపంథలందు దానిని బాటింప సమకట్టినాడు; పాలకులు దూరదృష్టి గలిగి, సహకారము నపేక్షించి, కొంత సహకారము నీయ నుద్యుక్తులైయుంట గనిపెట్టి, నే డుద్యోగస్వీకర ణమున కనుమతి నొసగినాడు. నాటి సహకార నిరా కరణమువలె నేటి సహకారము శాంతియుత స్వా తంత్ర్యసమరమందలి కొండొక క్రియావిధానము మాత్రమే. ఇది తాత్కాలికమైనదో, స్థిరమైనదో, నిమి త్తము మాత్రమై నిలువక ఉత్కృష్టాశయము కాగలు గునో కాజాలదో నే డెవ్వరును జెప్పజాలరు. ఇట్టి నిర్ణ యమును గావించునవి రేపటి పరిస్థితులు.

ఉద్యోగస్వీకరణము నిమిత్తమాత్ర మైనపుడు, ఇది కాంగ్రెసు దృష్టిలో గల ప్రస్తుత ప్రణాళికాంశ మైనపుడు, భారతీయ సిద్ధికై వర్తమాన స్థితుల ననుసరించి నిలుపబడిన సోపాన మైనపుడు వ్యక్తిగతమైన ప్రాముఖ్యము గలది కాదని తెలుపుట చర్వితచర్వణమే యగును. "సర్వం కృష్ణార్పణమస్తు" అను మహాభక్తుని వలె "నిది కాంగ్రెసున కర్పణ"మనుట నే డుద్యోగమును స్వీకరించినవారు వాకొను టొప్పు. సమరావని నన్నతడే యోధు డేదేని వస్తువును చేపట్టినను, అది తనయేలికదే యని యెంచి దాని నాతనికి సమర్పించును గదా!... కాంగ్రెసు ప్రతినిధులై యనుడు, దేశమాతప్రతినిధు లై యనుడు, బువ్వలేని యభాగుల ప్రతినిధు లై యనుడు మన నాయకులు నే డుద్యోగములు స్వీకరించిరి; ఉత్సవములు బోరు కలంగుచున్నవి. దేశార్థము ప్రస్తుతము కాంగ్రెసు ఉద్యోగములను స్వీకరించిన దనిన, ఇది ప్రత్యేకవ్యక్తుల స్వీకరణము కా దనిన, "నీవ్యక్తి కిట్టిపదవి లభించినది. ఆవ్యక్తి కట్టిపదవియే లభించినది. మఱొక్కరున కిదియు నదియుగూడ లభింపలే" దనుభావముల కెందును చోటేలేదు... కాని, — కాని, - ఇట్టి యుత్కృష్టాశయమునకు మన సున చోటిచ్చుట సామాన్యక్రియ కాదు. దూరమున నిలిచి మడిబట్ట గట్టిగ బిగించి, గీతగోవిందములు పాడుట కష్టముకాదు. ప్రలోభ మెదురైనపుడును, మఱొక్కని నపుడును ప్రతిజ్ఞ నట్టిటు లాడనీకుండ నుంచుట కష్టమే! తామరాకుమీది నీటిబొట్టువలె నుద్యోగమున నిలిచ యుండుట సులభముకాదు. నాటిదీక్షకు భంగము వచ్చు నేమో యని, ఏవేళ నెట్టిజిడ్డు పట్టుకొనునేమో యని

యనలినవారే యుద్యోగ స్వీకరణమును ప్రతిఘటించి యుండిరి. మహాత్ముని ప్రబోధములను వీనులొగ్గి, ఎట్టకేలకు "ఊఁ" యనిన జవహరు పండితుడు కాంగ్రెసు పతాకము వంగరాదనినాడు. ఈవాక్కును మహాత్ముడు బలపఱచినాడు. మనుష్యప్రకృతి నెఱిగిన మహాత్ముడు "హరిజన" పత్రికలో దీక్షను గుఱించి ఇటీవల భావబంధురమైన వ్యాసమును వ్రాసినాడు. రామ, కృష్ణ, శివాజీ, ప్రతాప, అబూబేకర్, ఉమరుల యుత్కృష్ట శేముషుల నగ్గడించినాడు.

ఎంతో త్యాగము చేసిన మహాపురుషుల నుద్దేశించి "మీరు మలమూత్రమాకులవారి ప్రతినిధులు చుడీ, సేవకులు సుడీ!" యని తెలుపనక్కఱలేదు. మిల్టన్ చెప్పిన Task-master దృష్టిలోవలె, గాంధిజీదృష్టిలో, కాంగ్రెసు మహాసంస్థ దృష్టిలో నుద్యోగములు స్వీకరించిన దేశభక్తవరేణ్యులు నేడు మణికట్టులపై గల తమ కంకణములను వదులుచేతురని, వైరాగ్యమునుండి శృంగారమునకు మఱలుదురని, దీక్షావస్త్రములను దిగజార్చెదరని, వ్రతము పూర్తికాకమున్నే మాతృదేవి దృష్టిసమక్షమునుండి తరలి విలాసామోదములను "దూ! దూ!!" యని పిలుతురని ఎవ్వరును అడలనక్కఱలేదు. "మీమనోరథ మింకను దూరపు కొండలమీదనే యున్నదని కురుక్షేత్రమున మీ రింకను సాగిపోవలసిన దూరము చాల కలదని, నేటి యుద్యోగస్వీకరణము కర్తవ్యాంగణమందలి కొండొక ఘట్టమే సుడీ యని ద్విగుణీకృతోత్సాహముతో శంఖములు పూరింపవలయు సమయము ముం దున్నదని" ఈ త్యాగమూర్తుల నుద్దేశించి అస్మదాదులు తెలుపుట సాహసమే యగును.

వేంకటప్పయ్య ఆంధ్రనాయకులలో నొక్కండు. గాంధిజీకి మిగుల సన్నిహితుడై గుంటూరుమండలము నొకప్పుడు భావోద్వేగమున తూగుటుయ్యాలవలె నూపి, బహుళరాష్ట్రీయులదృష్టి నాకర్షించిన మహాయోధుడు. పట్టాభిజవహరులవలె నీతడెన్నికలకు నిలువకున్నవాడు కాడు. కాని, నేడుద్యోగములను స్వీకరించినవారిలో నీతడొక్కడు కాడు. పండిన తల గలవాడు! అనుభవశాలి! వెన్కనిలిచియే తోడియోధులకు ప్రోత్సాహమిచ్చు నిశ్చయించినసంయమి యని గ్రహించుట పాడి. "ముందుల కుఱికినవారే కాక జగదీశుని మ్రోల నిలిచిన వారును, వెన్కనున్నవారును నీశ్వరకరుణ నందు మహాభక్తు"లని కదా దేశభక్తుడు మిల్టన్‌కవీంద్రు డనినాడు. (ఉద్యోగస్వీకరణమునకు వ్యక్తిగతమూల్యము గాని ప్రత్యేకప్రాముఖ్యము గాని లేదని కదా వాకొని యుంటిమి. స్వీకరించినవారును, స్వీకరింపనివారును నిష్కామయోగులే). భారతాంబచెంగట నిలిచిన దేశభక్తుడు నాడును దేశభక్తుడే, నేడును దేశభక్తుడే!

---



డు బు డ క్క వా డు
(బళ్లారిమండలము)

# జ టా యు వు

చిం తా దీ క్షి తు లు

[దట్టమైన కీకారణ్యము. దండకారణ్యము. బ్రహ్మాండమైన చెట్లు. అక్కడక్కడ పెద్ద కొండలు. మధ్యమధ్య చిన్నవీ పెద్దవీ సరస్సులు. గోదావరీ నది పుష్కలంగా ప్రవహిస్తోంది, ముత్యాల కోవ భూదేవి ధరించినట్లు. వివిధములైన పక్షులధ్వనులు దండకారణ్యము చెట్లలోనుంచి బయలుదేరి అంతరిక్షానికి ఎగసిపోతూన్నవి. మృగముల అలజడి. ఆకులవాసనలూ, పువ్వుల పరిమళములూ, పెనవేసికొని అంతరిక్షాన్న ఆడుతూఉన్నవి ఒక బ్రహ్మాండమైన రావిచెట్టు చివరకొమ్మల్లో ఒక చిన్నకొండవంటిపక్షి కూర్చున్నది. ఆపక్షి జటాయువు. చింతాక్రాంత. ముదుసలి.]

జటాయువు

మనస్సులోపుట్టి మనస్సును చీల్చివేస్తున్న అనిర్వాచ్యమైన నావాంఛను* తీర్చుకోడానికి, అన్న-సంపాతితో పందెము గట్టాను. ఉభయులమూ సూర్యమండలముదాకా ఎగసిపోయినాము. ఫలము—నా కాపదరాకుండా నా అన్న నన్ను రెక్కలతో కప్పడము — నా అన్నరెక్కలు కాలిపోవడము — నేను స్మృతితప్పి భూమిమీద పడిపోవడము— స్మృతివచ్చినతర్వాత నా మనస్సును పరిశీలించిచూచుకొన్నాను. నా వాంఛ తీరనే లేదు—ఎంతటి దారుణవాంఛో అది — నా అన్నను బలిగా తీసుకొన్నది. నన్ను కూడా బలిగా తీసుకొంటుంది కాబోలు — నాతోకూడా అంతరిస్తుంది కాబోలు......

ఏమిటాశబ్దము? — అది పక్షుల పలుకా— కాదు. ఖగసార్వభౌముడను నేను పక్షుల పలుకులే గుర్తించలేనా? చల్లగా చెవులలో పడ్డదే ఆపలుకు — హృదయములో ప్రవేశించి దహించివేస్తూన్నదే—నా వాంఛను రేపుతోందే—నావాంఛనే బలిగా తీసుకోబోతోందే—ఏమిటాపలుకు—ఆలిస్తాను —

అంతరిక్షము

రామా, రామా, రామా.

జటాయువు

దారుణమైన గాలివానలో కోకిలపలుకు వినబడ్డట్లున్నది—ఏమిటి ఈ కోలాహలము— ఈకోలాహలములో ఈ రామనామమేమిటి? ఎక్కడినుంచి వస్తోంది యిది.

[మెడజాపి రెక్కలు విప్పను.]

ప్రచండమారుతమో అన్నట్లు విమాన మీ దారిని వస్తూన్నది—ఎవరో అందులో ఉన్నవారు......కాలమేఘమువలె నున్నాడు— ఎవడో రాక్షసుడు కాబోలు — ప్రక్క ఆ వాడిపోయిన పువ్వెవరో? కాంతితరిగిన నక్షత్రమా? ఎవరో సుకుమారివలె ఉన్నది—

---

* నోరి నరసింహశాస్త్రిగారి 'పతంగయానము' చూచేది.

అంతకంత కామూర్తి విస్పష్టముగా కానవ స్తున్నది—ఆసుకుమారి భగ్నహృదయము నుండి బయలుదేరి, పెదవులనుండి వెలువడి, కన్నీళ్లతో తడిసి రామశబ్దము నిర్గతమౌతూ న్నది.

విమానము

రామా రామా రామా.

జటాయువు

ఆ మూర్తిని చూడగానే నాతల్లి నాకు జ్ఞప్తికి వస్తున్నది. నా హృదయము పొంగు తోంది – ఆ రామనామము నాకు ఉప దేశమూ, ఆదేశమూ కూడా.

[రెక్కలను జాడించును.]

విమానము

రామా, రామా, రావా, కాపాడవా, ఓ మృగములారా, ఓ పక్షుల్లారా, ఓవృక్షము లారా — నన్నీ నీచుడు చెరబట్టినాడు— నారామునితో నన్ను ఎడబాటు చేసినాడు —విన్నారా మీరంతా ? ఈ దారుణాన్ని చూస్తున్నారా? ఈ అధర్మాన్ని సహిస్తారా? వింటున్నావా గోదావరీ? నా అవస్థ నా భర్తకు చెప్పవూ? వింటున్నారా వృక్షము లారా? నా రామున కీసంగతి చెప్పరా? వింటున్నారా పక్షుల్లారా? నా ఆపద కడ్డు పడరా?

రామా— నాపిలుపు నీకు వినిపిస్తోందా — వాయుదేవుడా—త్వరగా పరుగెత్తి ఈ నా పిలుపు నాభర్తచెవులో వెయ్యవు నాయనా? సౌమిత్రీ—రావోయి నాయనా త్వరగా మీ అన్నయ్యను తీసుకొనీ — పంచభూతము లారా!

రావణుడు

చక్కనిది లంక, సీతా. ఆలంకలో వైభ వాలు స్వర్గములో లేవు సీతా. ఇంద్రుణ్ణి నీ సేవకుణ్ణి చేస్తా సీతా......

సీత

రామా, రామా, రామా.

రావణుడు

కోమలీ— అట్టి లంకలో నివాసము - ఇట్టి విమానములో యానము—నావంటి సార్వ భౌమునితో.........

సీత

రామా, రావా, రావా, రామా.

రావణుడు

రాముడు మనుష్యమాత్రుడు సుమా తన్వంగీ! —నేనో రాక్షస సార్వభౌముడను—మనో హారిణీ! రామునితో అరణ్య సంచారమా, రావణునితో లంకావాసమా వివేకవతీ - నిర్ణ యించుకో.

సీత

రామా, ఈ నా దుర్భరదుఃఖ మెట్లాతీరగల దోయీ; వినవుగదా నా మాటలు రామా. వినవుగదా నామాటలు సౌమిత్రీ; వినరుగదా నామాటలు ఓమృగములారా; వినరుగదా నామాటలు ఓపక్షుల్లారా!

జటాయువు

వింటున్నా, వస్తున్నా, అమ్మా, తల్లీ, సీతా— వస్తున్నా.

సీత

అహో, పన్నీటితో నాహృదయాన్ని తడుపు తున్నావు—ఎవరునాయనా నువ్వు ?

జటాయువు

వస్తున్నా తల్లీ, వస్తున్నా.

రావణుడు

సూర్యబింబాన్ని ఆచ్ఛాదించి నా కన్ను తగిలే ఈమేఘ మెక్కడినుండి వచ్చిందో ?

సీత

నాపుణ్యము మూర్తీభవించి ఈ రూపమున వచ్చిందా! రామా, నన్ను కాపాడవా ?

రావణుడు

మేఘము కాదిది — నా విమానాన్ని ఆపి వేసింది. అంతరిక్షానికి నావిమానం తీసుకు పోతున్నా డెవ్వడో ఈ బలశాలి — ఎవ డవురా నీవు లంకాపతి విమానగమనాని కాటంకము కల్పించినవాడవు ? ఎరుగవా నాభుజశక్తి ?

భయపడకు సీతా, భయపడకు—

జటాయువు

నీచుడా? ఎవ్వడవు నువ్వు, నాతల్లిని చెరబట్టి తీసుకుపోతున్నావు ?

రావణుడు

ఎరుగవా రావణుని—పులస్త్యుని మనుమని —త్రిలోకాధినేతను— ఎరుగవా రావణా బ్రహ్మను—లంకాధిపతిని—

ఇప్పుడు తెలుసుకో— వదలు విమాన— మాయానము నడ్డగించకురా.

జటాయువు

వాలిసంకట నలిగినవాడవు నీవేగా రావణా! నిన్నెరుగుదును. నాతల్లితో నీ కేమిపనిరా, రావణా!

రావణుడు

నన్నధిక్షేపించే నీ వెవ్వడవురా ?

జటాయువు

సంపాతితమ్ముణ్ణి నేను; సూర్యసారథి అనూరుని పుత్రుణ్ణి నేను; విష్ణువాహనుడైన గరుత్మంతుని అన్న కొడుకును నేను; ఖగకుల సార్వభౌముణ్ణి. నేను నీ విమానాన్ని తీసుకు పోయి రాముని సన్నిధానాన్ని పెట్టదలచు కొన్నానురా, రాక్షసుడా !

సీత

తండ్రీ, జటాయువూ ! రామసన్నిధికి కొని పోవయ్యా విమానం; నన్ను రాముని పాద ములవద్ద చేర్చవయ్యా, నాయనా.

రావణుడు

ఏల నీ కీ భయము జనకపుత్రీ! త్రిజగన్నేత నీపక్షిగాడా ప్రతిఘటించేది !

ఓరీ పక్షీ! పండని భ్రమించి ఈ విమానాన్ని పట్టావేమో, విడవరా.

జటాయువు

అధికప్రసంగము విహంగజాతి లక్షణము కాదు. కాబట్టి ఒక్కమాట చెప్పుతున్నాను. నాతల్లిని సీతను విడిచిపెట్టు.నీయింటిమార్గము పట్టు. లేదా నా తీక్ష్ణనఖ చంచువుల దండన నీవు సహించలేవుసుమా రాక్షసుడా !

రావణుడు

సీతా, భయపడకుమా; ఈ ముసలిపక్షికి బుద్ధిచెప్పబోతున్నాను. నాపరాక్రమ మెట్టి దో నీవుకు చూతువుగాని— నిన్ను కోరిన ఈ లంకాధిపతి సామాన్యుడు కాడని నీవు చూచి మెచ్చుకొనుటకు మంచితరుణము

వచ్చినది లే. నా పరాక్రమ విజృంభణము నీకు భయకారణము కాకూడదు సుమా. ఆ రాముడే గొప్పవా డనుకొని వరించావు కా బోలు—నేడు చూడు మా రాముని మించిన పరాక్రమశాలిని—నేడు వరించవా, రాముని మించిన సుందరమూర్తిని సీతా—

సీత

అయ్యో ఎంతపాపము చేసుకొన్నవో, రామా, నా చెవులు. ఏం సహిస్తున్నావు వాయుదేవుడా, ఈ మాటలతో మలిన మయి నా చెవిదూరుటకు—రామా, నీసతి కెంతటి దుర్యోగము పట్టిందో చూస్తున్నావా! రామా నీపాదములవద్ద నన్ను చేర్చే వా రెవరూ లేరా?

జటాయువు

లేకేమి, తల్లీ, నేను చేరుస్తున్నాగా! దిగులు పడకుమా అమ్మా, నా రెక్కలలో శక్తి ఉండగా ఈదుర్మార్గుడు లంకవైపు ని న్నొక అడుగుమేర అయినా తీసుకుపోలేడు తల్లీ!

రావణుడు

విమానము ముందుకు బదులు వెనుకకు పోతోంది. నావిమాన శక్తిని మించిన శక్తి ఈపక్షికి ఎక్కడినుంచి వచ్చిందో!

జటాయువు

శ్రీరామమూర్తివద్దనుంచిరా, రావణా.

రావణుడు

అయితే ఇప్పుడు చూతువుగాని రావణుని శక్తి ఎట్టిదో... భద్రముగా కూర్చో సుమా, సీతా! త్రుటిలో వస్తాను.

[రావణుడు ఖడ్గపాణియై విమానమునుంచి బయటకువచ్చి జటాయువుపై కత్తి దూస్తాడు. జటాయువు విమానము వదలి రావణునితో కలియపడతాడు. సూతుడు విమానాన్ని దూరముగా నిలుపుతాడు.]

సీత

అయ్యో నాయనా, ముసలిపక్షివి ఆ దుర్మార్గుడితో ఎలాగ యుద్ధంచేయగలవు, నాయనా.

జటాయువు

[ముక్కుతో రావణునిఖడ్గము విరిచివేస్తాడు. గోళ్లతో వక్షస్థలాన్ని చీరుతూ రెక్కలతో మొహాన్ని కప్పి బాహువులు తుండముతో ఖండించివేస్తాడు.]

రావణుడు

[బాహువులు మళ్లీ మొలుస్తాయి. ఇరువై బాహువులతోనూ జటాయువును పట్టుకొని రెక్కలు పెడవిరిచి మెడ నులివేసి దూరముగా విసురుతాడు.]

జటాయువు

[సొమ్మసిలి పడిపోబోతూంటే]

సీత

అయ్యో నాతండ్రీ — రామా, ఈ నీచుడు నన్ను చెరబట్టవలసిందేనా — అధర్మానికి రెక్కలు మొలిచి ధర్మము సొమ్మసిలి పడిపోవలసిందేనా? అయ్యో, ఈధర్మశీలునకు సహాయము చేసేవా రెవరూ లేరా? నా ఏడ్పు ఎవరికీ వినపడ్డంలేదా? రామా, రామా!

జటాయువు

భయము లేదు తల్లీ—భయపడకు—నీ దీన వాక్యములు నా రెక్కలలో బలము పోస్తున్నవి.—

రావణుడు

[విమానము ప్రవేశించి విల్లూ బాణములూ తీసుకొని జటాయువును బాణములతో కొడతాడు]

జటాయువు

[దూసుకొని వచ్చే బాణాలను ముక్కుతోనూ, పాదనఖములతోనూ ఖండిస్తూ సమీపించి విల్లులాగి విరిచేస్తాడు. విమానాన్ని చిరగగొడతాడు. గొడుగు లాగి వేస్తాడు. సూతుని మెడ కొరికి వేస్తాడు.]

సీత

నాతండ్రి విజృంభిస్తున్నాడు — పక్షులు కలకల సంతోషిస్తున్నవి — ప్రకృతి ఉత్సాహము చెందుతోంది—నా హృదయములో ఆశాభాను డుదయిస్తున్నాడు; రామా, లక్ష్మణా ఈపక్షికి సహాయం చెయ్యడానికి రారా, త్వరగా, రారా.

జటాయువు

[విరిగిపడిపోతూన్న విమానములోని సీతను జటాయువు రెక్కలతో పొదివి పట్టుతాడు. విమానంపెద్ద శబ్దముతో పడిపోతుంది ]

రావణుడు

[ఇరవై చేతుల్తోనూ యిరవై ఖడ్గాలు పట్టుకొని జటాయువుమీాద పడి పాదములు నరుకుతాడు. జటాయువు ఒకక్షణము అవశుడు కాగా సీతను రావణుడు లాక్కొని అంకము మీాద నిలిపి పట్టుకొంటాడు ]

సీత

అయ్యో! రామా, ఎంతపని జరిగిందో రామా; నాజటాయువుపాదములు తెగినవి. నన్నెవ రింక రామా, కాపాడేవారు —

రావణుడు

[సీతను పట్టుకొని లంకవైపు పారిపోతూంటే జంటలుజంటలుగా వచ్చి చక్రవాకాలూ, పావురాలూ, పిచికలూ, గువ్వలూ, గోరింకలూ అతనికి అడ్డుతగులుతవి. గుంపులు గుంపులుగానూ, బారులు బారులుగానూ చిలకలూ, కోకిలలూ, గ్రద్దలూ, బకములూ, పాలపిట్టలూ, నీటిపక్షులూ అతనిని చుట్టుముట్టుతవి: కత్తులుతిప్పుతూ వాటినికొట్టుతూ దారిచేసుకొంటాడు]

సీత

ఏడీ నాజటాయు వేడీ; నా జటాయు సైన్యం నన్ను రక్షించ పూనుకొందా! రామా! ఈ తరుణం మించిపోనిస్తావా! నన్ను కాపాడడానికి రావా రామా.

జటాయువు

[రావణుని వెనకే ఎగిరి వెళ్లి అతని వీపు ముక్కుతో పీకి గాయపరుస్తాడు. జుట్టు ముక్కుతో పట్టి అతన్ని ఆపుతాడు.]

రావణుడు

[వెనుదిరిగి జటాయువుతో తలపడతాడు. పక్షులు వళ్లూ, జుట్టూ, చేతులూ, కాళ్లూ, చెవులూ పీకుతూంటవి. రావణుడు లక్ష్యపెట్టడు.]

జటాయువు

రాజదార నపహరిస్తావురా నీచుడా! పర
పదారాహరణము శ్రేయస్కామి చేయదగ్గ
దేనా దుర్మార్గుడా? భర్త యింటలేనివేళ
వైచోరుడ లోకమాత నెత్తుకుపోతావురా
లుచండాడా — ఇదిగో చూచావా, తెగిన
నాపాదములశక్తి, ఇదిగో చూడు వజ్రతుల్య
మైన నాతుండము బలము, ఇదిగో చవి
చూడు దుష్టా నారెక్కలశక్తి — నాతల్లి
బాష్పములతో నిండిన కన్నులు నీకు జాలి
పుట్టించడం లేదా కఠినహృదయుడా.

రావణుడు

సీతా, నిన్నీ చెట్టుక్రింద కూర్చోబెట్టుతున్నా
ను—భయపడక కూర్చో! సగము చచ్చిన
ఈ పక్షికి స్వర్గమిప్పించి వస్తాను.

సీత

[దిగాలుపడి చెట్టుక్రింద కూచుంది. పక్షు
లూ, మృగములూ ఆమెచుట్టూ చేరి పర్ణ
శాలకు దారి చూపుతాము రమ్మంటున్నవి.]

రావణుడు

నాకు నీతులు చెప్పేపాటివాడవా పక్షీ,
నువ్వు! నీపక్షికూతలు విన్నానులే; ఏదీ నీ
రెక్కల శక్తి.

జటాయువు

[ఎన్నిమారులు బాహువులు ముక్కుతో
ఖండించినామళ్లీ మళ్లీ బాహువులు మొలుస్తూం
డడంవల్ల ఏమి చెయ్యడానికీ తోచక సీతను
పర్ణశాలకు తీసుకొనిపోవచ్చునని సీతదగ్గిరికి
వచ్చి రెక్కలతో ఆమెను ఎత్తుకొనుచుం
డగా]

రావణుడు

[వెనకే పరుగునవచ్చి జటాయువురెక్కలు
నరుకుతాడు. జటాయువు నేలమీదకు దొర్లి
పోతాడు.]

సీత

[జటాయువుమీదపడి]
నాయనా, తండ్రీ, జటాయూ, నామూలాన్ని
నీకు పాదములు తెగినవా; నామూలాన్ని
నీకు రెక్కలు తెగినవా; నాకోసము నీవు
ప్రాణాలు విడుస్తున్నావా? తండ్రీ, నీమేలు
నే మరవగలనా? పరదారను రక్షించబూనిన
నీ సనాతనధర్మపరత్వమునకు శాశ్వతత్వము
తప్పదు గదోయీ తండ్రీ—నీసత్యబుద్ధి భవి
ష్కాలమున కొజ్జబంతి కాగలదోయీ నాయ
నా! అయ్యో తండ్రీ యెన్ని గాయములో
దేహమునిండా; నీ బాధానివారణ మెట్లా
చేయగలనో కదా; నాచీరకొంగుతో ఈ
రక్తధారలు తుడుతునా; నా కన్నీళ్లతో ఈ
గాయములు కడుగుదునా? నాచేతుతో నీ
దేహము నిమురుదునా?

జటాయువు

తల్లీ, సీతా, నాతల్లిచేతులవలెనే నీచేతులూ
చల్లగా నాదేహమునకు తగిలి బాధ తగ్గిస్తూ
న్నవమ్మా; నీమాటలు నాతల్లి జోలపాటలు
గావటమ్మా; అమ్మా, ఈ దుర్మార్గుడు నిన్ను
తీసుకుపోతాడు కాబోలు—శక్తి లేదుగదా,
లేవలేనుగదా— ఏమిచేతునమ్మా—అయ్యో-
నాతల్లి కుపకారము చెయ్యలేని ఎంతటి చేత
కానివాణ్ణయితినో—అమ్మా, సీతా— శ్రీ
రామదర్శనార్థ మిక్కడే ప్రాణములు నిలుపు

కొనిఉంటానమ్మా, నీ దీనావస్థ చెబతానమ్మా.

సీత

దారుణము గదా ఈదుఃఖము—నా రాముని అవస్థ తలుచుకొని దుఃఖించనా? — నా నిస్సహాయస్థితి చూచుకొని దుఃఖించనా?— నీ బాధలు తలుచుకొని దుఃఖించనా?— రామా.

రావణుడు

రా, సీతా, పక్షిపై నీ కంత ప్రణయ మెందుకు? రా, సీతా—లంకావాయువులు వీస్తున్నవి—త్వరలో లంక చేరుదాము—

జటాయువు

ఉన్నావురా, అక్కడ నీచుడా—[అని లేవబోయి క్రిందకు పడిపోవును.]

సీత

[జటాయువుమెడ కౌగలించుకొని] రెక్కలు తెగినన్నీ నన్ను కాపాడ ప్రయత్నిస్తున్నావా, తండ్రీ— నాతండ్రి జనకునికన్న, నాతల్లి భూదేవికన్న నీ వెక్కువ నామీద వాత్సల్యము చూపావు నాయనా; కాపాడజాలక పోయావు నన్ను — ఇప్పటిమట్టుకు పశుబలానికే జయము కలిగిందిగా — నన్ను కాపాడదలచిన ఈ రెక్క లెంత ప్రియములో నాకు—నన్ను కాపాడదలచిన ఈ నీ తుండ మెంత ఘన మైనదో — నన్ను కాపాడ దలచిన నీదేహ మెంత పవిత్రమైనదో? తండ్రీ రాముని దర్శించు— నా అభాగ్యస్థితి చెప్పు—

రావణుడు

[సీతను తలపట్టుకులాగుతూ] రావుగా, సీతా, లంకేశ్వరునిమాట మన్నింపవుగా, శాస్తి అనుభవిస్తావు సుమా.

సీత

అయ్యో, అయ్యో, జటాయూ, తండ్రీ, నన్ను లాగుతున్నాడు, తీసుకుపోతున్నాడు. ఓ గోదావరీ, నన్ను రక్షించవా; ఓ కొండల్లారా, ఓ మృగముల్లారా; వినరా నా యేడ్పు—రామునకు చెప్పరా — నాతండ్రీ జటాయూ, లేవలేవుగదా, నాయనా, ఓ మునుల్లారా, ఓ దేవతలారా, ఈ అధర్మము మీకు గోచరము కావడంలేదా— రామా, ఎక్కడున్నావు — ఏడీ లక్ష్మణుడు — అయ్యో.

రావణుడు

[సీతను అంకముపై, నిల్పి పట్టుకొని ఎగిరి లంకదిక్కుకు పోతాడు.]

సీత

జటాయూ, తండ్రీ........

జటాయువు

[మెడయెత్తిచూచి కోపముతో ఒక్కమారు బలమంతా ఉపయోగించి ఉవ్వెత్తుగా కొన్ని గజముల దూరము పైకి లేచి రెక్కలు లేక క్రిందపడిపోతాడు.]
అయ్యో, రామా.

రావణుడు

చూచావా సీతా, నాపరాక్రమ విజృంభణము—కనిపెట్టావా, సీతా, నాబలౌన్నత్యము

—కోపింపకుమా, సీతా, నీతలపట్టిలాగాననిచక్కనిది లంక, సీతా, ఆలంకలో వైభవాలు స్వర్గములో లేవు సీతా—

సీత

రామా, జటాయూ, తండ్రీ—

జటాయువు

అమ్మా, సీతా, రామా.

సీత

[పైకిపోతూన్న సీతజడలోంచి ఒక పువ్వు ఎదురుతిరిగివచ్చి, కృతజ్ఞతా సూచకంగా దీవనమై జటాయువు శిరస్సున పడుతుంది.]

జటాయువు

[పక్షులు జటాయువును చుట్టుకొని బాధోపశమనార్థమై రామగీతములు పాడుతవి.]

సీత

[దూరమునుంచి అస్పష్టముగా]
రామ్, రామ్, రామ్.

జటాయువు

[ఆలించి] రామ్, రామ్, రామ్. నాతల్లి ఉపదేశమంత్రమైన రామమంత్రమువల్ల—పాంచభౌతికమైన రెక్కలు తెగిన నాకు—ఆధ్యాత్మికమైన రెక్కలు మొలిచినవి.

నే నీబ్రహ్మాండాలు దాటిపోగలను—సూర్యచంద్రాదుల దాటి పోగలను. పుణ్యాలోకాల్లో నా రెక్కలకసితీరా సంచరించగలను.

శ్రీరామ శ్రీచరణ దర్శనార్థమై అందాకా ఈ నారెక్కలు ముడుచుకొని యిక్కడ వేచిఉంటాను.

నాతల్లి సీతమ్మ తనకు ప్రళయాగ్నిజ్వాల అనే మాట తెలియక ఆమూఢుడు ఆమెను తనకొంగులో మూట కట్టుకు పోతున్నాడు. వాడి పురాకృత కర్మ ఫలమై ఆహుతి చేస్తుంది వాణ్ణి. నేను తప్పించగలనా?...... నా కుపకారిదే అయినాడు. సీతాదేవికై దేహార్పణము చేయించాడు నా సీత ... ... శ్రీరామదర్శనం కాబోతోంది.

అన్నా, సంపాతీ, నీవు కాపాడిన ఈ నా దేహము పవిత్ర కార్యానికై వినియోగపడింది చూశావా ?

నావాంఛ నేటికిగదా తీరింది ! అన్నా, నీ దగ్గిరకి వస్తున్నాను సుమా — శ్రీ రాముణ్ణి దర్శించుకొని—శ్రీరాముణ్ణి పూజించుకొని—

రామ్, రామ్, రామ్.

---



ముగ్గు —వేణుగోపాల్.

# కావ్యాలంకారచూడామణి: దోషప్రకరణము

బులుసు వేంకటరమణయ్య

ప్రధానములగు ప్రాచీనాంధ్రాలంకార గ్రంథములలో కావ్యాలంకారచూడామణి యొకటి. దీనిని విన్నకోట పెద్దయకవి రచించి విశ్వేశ్వరభూపాలున కంకిత మొనర్చెను. తెలుగున వెలువడిన తొలియలంకార గ్రంథము నిదియే.

తక్కిన అలంకారగ్రంథములవలెనే చూడామణియు సంస్కృతానుసారియే. అయినను వానివలె నియ్యది యేదేనొక గ్రంథమున కనువాదము కాక అనేక గ్రంథముల ననుసరించుచున్నది. ఇందలి కావ్యస్వరూపము, అర్థాలంకారములు, గుణములును దండ్యాచార్యుని కావ్యాదర్శము ననుసరించుచున్నవి. నాయకలక్షణములు, నాయికాలక్షణములు, భావ, రసలక్షణములు, విశేషించి దోషములును విద్యానాథ పండితుని ప్రతాపరుద్రయశోభూషణము (ప్రతాపరుద్రీయము) ననుసరించుచున్నవి. కొన్నియెడల మమ్మటాచార్యుని కావ్యప్రకాశములోని విషయములను గ్రహింపఁబడియున్నవి.

లాక్షణికుఁడు తన లక్షణగ్రంథములో లక్ష్య, లక్షణములను రెంటిని స్పష్టముగ వివరింపవలెను. అట్లు కానపు డాగ్రంథమువలన తగిన ప్రయోజనము కలుగదు. చూడామణిలోని లక్ష్యలక్షణములు చాలవఱకును అననుకూలములుగ ఉన్నవి. తక్కినవానికి ఏదో ఒక విధమున లక్ష్యలక్షణము లున్నను దోషప్రకరణమున మాత్రము చాల దోషములకు దోషము పేరు, ఉదాహరణము, కొంచెపు సమన్వయమును కనబడుచున్నవి. అవియు ఒక్కొక్క పద్యముననే. లక్షణము లీయఁబడలేదు. ప్రతాపరుద్రీయమును జదువుకొనినగాని ఆ లక్షణములు తెలియవు. ఉన్న ఉదాహరణములును అవకతవకగ ఉన్నవి. సంస్కృతాలంకార గ్రంథ పరిచయము లేనివారికి ఇందలి విషయము దురవగాహము. సందర్భము లిట్లున్నను ఆంధ్ర విశ్వకళా పరిషత్తువారును, మద్రపుర విశ్వవిద్యాలయము వారును చూడామణిని ప్రతి వత్సరమును ఉత్తమకరగతి పరీక్షలకు ఏదో ఒక విభాగమున పఠనీయముగ నిర్ణయించుచునే యున్నారు. కావున, పరీక్షాభ్యర్థుల సౌకర్యము కొఱకును, జిజ్ఞాసువులకు తత్త్వము తెలుపవలయుటకును ప్రస్తుతము ముద్రితప్రతి ననుసరించి చూడామణిలోని దోషవిషయము వివరింపఁబడుచున్నది.

చూడామణికి దోషవివేకమున స్థూలమూల మగు ప్రతాపరుద్రీయమున పదునేడు పదదోషములు, ఇరువది నాలుగు వాక్యదోషములు, పదునెనిమిది అర్థదోషములును చెప్పఁబడినవి. చూడామణిలో మాత్రము పదునైదు పదదోషములును, పదునాలు వాక్యదోషములును వివరింపఁబడియున్నవి. అర్థదోషపరిగణనమున 'అశ్లీలము' మాత్రము విడువఁబడినది.౧

---

౧. ముద్రితప్రతిలో ఈ సంఖ్యాపరిగణనము తప్పుగ నున్నది. 'అనఁగఁ బదియేడు విధములై యతిశయిల్లుఁ - గావ్యమున దోషములు పదగతము లగుచు' [పు. ౭౧.] అనుచోట 'పదియేడు'ను 'పదునైదు'గా దిద్దుకొనవలెను. ఇట్లే 'అనగఁ బదియేను విధులఁ గావ్యములయందు - వాక్యదోషంబు లుదయించు' [పు. ౭౮] అనునెడ 'పదియేను'కు బదులు 'పదునాలు' అని సరి చేయవలెను.

మూలమునఁ గల క్లిష్టము, గ్రామ్యము నను పదదోషము లిందు విడువఁబడినవి. మూలము నందలి 'అప్రయోజనము' ఇం 'దప్రయోజన సంశ్లిష్టము'గను, 'గూఢార్థము' 'క్లిష్టగూఢార్థము'గను మార్పఁబడినవి మూలమునందలి వాక్యదోషములలోని 'శబ్దహీన, వాక్య సంకీర్ణ, అపూర్ణ. వాక్యగర్భిత, అరీతిక, విసర్గలుప్త, అస్థానసమాస, సంబంధ వర్జితములు విడువఁబడినవి. 'వాచ్యవర్జితము' 'న్యూనపదము'గా మార్పఁబడినది. గ్రహింపఁబడిన దోషములవలెనే విడువఁబడినదోషములు కూడ కావ్యతత్త్వజ్ఞుల కామోదనీయములే. అట్టి యుపయుక్త విషయములను విడుచుటయు, అప్రయోజన, గూఢార్థముల పేరులు మార్చుటయు, ఆంధ్రవాఙ్మయమున నుపయుక్తమగు ప్రాసభంగదోషమును పరిగణింపకుండుటయు నిందలి ప్రధానలోపములు.

పదదోషములు :

'చెవి కసుఖాస్పదము లగునవి దోషము' లని చూడామణిలోని దోషలక్షణము. ఇందలి పదదోషము లీ క్రిందివిధమునఁ జెప్పఁబడినవి.

"అప్రయుక్తమ్ము, నపుష్టార్థకంబును, నప
మర్థకంబును, నిరర్థాహ్వయంబు,
నపసంస్కృతంబు, నేయార్థంబు, సందిగ్ధ,
నష్టప్రయోజన శ్లిష్టములును,
గాఢ పరిక్లిష్ట గూఢార్థకంబులు౧
నప్రతీతికమ్ము, నన్యార్థకంబు,
నవిమృష్టక విధేయకాంశంబు, నశ్లీల,
పరుష, విరుద్ధార్థ భాషితములు
గీ..............................."
[చూడామణి, ప్ర. ౮౧.]

౧. 'కవులు ప్రయోగింపని పద మప్రయుక్త' మని మూలములోని లక్షణము. తెలుఁగునను సంస్కృతమునందువలెనే 'దైవతుఁడు' అని దైవత శబ్దమునకుఁ బుల్లింగత్వము ఉదాహరణముగ నీయఁబడినది; వివరణము మాత్రము 'వావిరిఁ బుల్లింగత్వము దైవతపదమునకు దఱచు దనరక యునికిన్' అని యున్నది. అది సరి కాదు. ఆంధ్రలక్షణ గ్రంథమున ఉదాహరణములు కూడ కేవలము భాషాంతరీకరణపద్ధతి నందుట సముచిత ప్రయోజనమును కల్గింపనేరదు.

౨. ప్రకృతమున నుపయోగింపని యర్థము అపుష్టార్థము. ఇందలి ఉదాహరణమును మూలానుసారియే.

౩. రూఢియందుఁ గాక యోగమాత్రమునఁ బ్రసిద్ధమగు నర్థము అసమర్థము. 'వనధిపరివృతి' మనుటకు 'వనధరపరివృతి' మని వాడుట దుష్ట మని యుదాహరింపఁబడినది.

౪. పాదపూరణమాత్ర ప్రయోజనము కలది నిరర్థకము. అది యిం దొకచో 'అనర్థకము'గాఁ జెప్పఁబడినది. ఇందులకు 'చి, ఒగి' ఉదాహృతములు.

౫. వ్యాకరణమునకు విరుద్ధముగ నున్నయది చ్యుతసంస్కారము. చ్యుతసంస్కార మిందు 'అపసంస్కృతము'గా పేర్కొనఁబడినది. 'స్పరిశనము, దరిశనము' అనునవి ఉదాహృతములు. వివృతియందు 'ఇవి వ్యాకరణదుష్టములు' అని లేదు. 'తద్గురుత్వ మాద్యక్షరములఁ గూడక యునికిన్ - అపసంస్కృత మగు' అని మాత్ర మున్నది. ఆద్యక్షరములను 'స్పారిశనము, దారిశనము' అని మార్చి గురుత్వమును కూర్చినచో సరిపడునా? 'స్పర్శనము, దర్శనము' అని యుండవలెనని కాఁబోలు పెద్దయక్కవి తలంపు! ఇచ్చటి వివృతి ఉచితముగ లేదు.

౬. తాను సంకేతించుకొనిన అర్థమునందే ప్రసిద్ధమగునది నేయార్థము. మూలమున 'వ్యత్యస్తనవవృత్తయః' అని ఉదాహృతి కలదు. వ్యత్యస్తనవ—అనఁగా—వన; వనవృత్తయః = వనమునఁ దిరుగువారు! ఇది కవి కల్పించుకొనిన పదము; కాన నేయార్థకము. తెలుఁగున 'పరుని పయిఁ గూర్మి వనిశము నిరవగ్రహమెపుడు' నని ఉదాహరింపఁబడినది; నిరవగ్రహపదము ప్రసిద్ధముగాని కవికల్పితము కాదు. ఇది వ్యత్యస్తనవమువంటిది కాదు. ఇచటి వివృతి 'నిరవగ్రహశబ్దా

---

౧. 'గూఢార్థకంబును' అని యుండవలెను.

ర్థము తిరముగ నేత్వ్యసరణిఁ దెలియుటచేతన్' అని యున్నది. అనఁగా అర్థమేమో బోధపడకున్నది.

౭. 'ఇదియా, అదియా' అను సందిగ్ధమగు నర్థమున వాడఁబడినచో సంధిగ్ధము. మూలమునను, తెలుఁగునను ఉదాహరణము సమానము.

౮. అవిశేష విధాయకమగునది అప్రయోజకమనియు, దూరదూరాన్వయము కలది క్లిష్టమనియు మూలమున రెండు దోషములు కలవు. ఆ రెండిటికిని గలిపి

'అప్రయోజన, క్లిష్టే యథా—
హన్త! వర్త్మామహే వజ్ర
ఘట్టనాత్ ప్రాక్ చలాత్మసు,
నభిస్వదళనారాతి
ధ్వజాగ్రజవిరోధిషు.'

అని ఒకశ్లోక ముదాహరింపఁబడినది. ఇందలి మొదటి సగపాలున అప్రయోజనము, రెండవ యర్థమున క్లిష్టమును గలవు.

ఆంధ్రమున అప్రయోజనము అప్రయోజనక్లిష్టముగాఁ జేర్కొనఁబడి, పయి శ్లోకభాగమే 'సమీరణాశనారాతికృతకేతనాగ్రజన్మ శత్రుశిటముల నిల్తురు శత్రు'లని ఉదాహరింపఁబడి 'ఏతదర్థంబు గిరులకు నేగిరనట' అని సమన్వయింపఁబడినది. ఆ సమన్వయ సరణి చాల అస్పష్టముగనున్నది. 'వజ్రఘట్టనమునకుఁ బూర్వము తిరుగుచుండిన పర్వతములపై శత్రువులు నిల్తు'రనిన అప్రయోజన దోషమున కుదాహృతి యగును; ఉదాహృతి విషయము దూరదూరాన్వితమగుట క్లిష్టమున కుదాహరణమగుటయే యుచితము. తెలుఁగున ఆ దోషపుఁబ్రసక్తియే లేదు.

౯. అప్రసిద్ధార్థమునఁ బ్రయోగింపఁబడినది గూఢార్థమని మూలము. పామర వ్యవహారమాత్ర ప్రసిద్ధము గ్రామ్యము. రూఢార్థమును విడిచి యోగార్థమున నుపయోగింపఁబడినది అన్యార్థము. పయి మూఁడు దోషములకును క్రింది శ్లోకము మూలమున ఉదాహృతము.

'శోణితాబ్జస్పృశః కామం
శ్యామగల్ల కటిస్థలాః,
విదగ్ధహృదయాః శోక
వహ్నినా రాజకన్యకాః'

ఇందలి మొదటి బంతి గూఢార్థమునకును, రెండవపంక్తి గ్రామ్యార్థమునకును, మూఁడవ బంతి అన్యార్థమునకును ఉదాహరణములు.

పెద్దయకవి విలక్షణముగ 'క్లిష్ట గూఢార్థము'ను గ్రహించి పయి శ్లోకమునే ఆంధ్రీకరించి, యుదాహరించి, వివరించినాఁడు. చూడుఁడు:—

'తే. క్షతజ కంజేక్షణలు, శ్యామగల్లకటలు,
ఘనవిదగ్ధాత్మికలుఁ, బరకాంత లనఁగఁ,
గ్లిష్టగూఢార్థ మనఁజనుఁ, గ్లేశసరణిఁ
దత్తదర్థంబు నెఱిఁగెడి తలఁపుచేత.'

ఇచట 'క్షతజ' అనుచోటనే గూఢార్థము కలదు. పెద్దయ అన్నింటిని గూఢార్థము లనియే చెప్పినాఁడు. ఇచటి పదముల కన్నింటికిని అర్థము క్లిష్టము కాదు. గూఢార్థమునకు 'క్లేశసరణిఁ దత్తదర్థంబు నెఱుఁగుట' లక్షణముకాదు.

౧౦. శాస్త్రములందు మాత్రము ప్రసిద్ధమగు పదము అప్రతీతికము. శాస్త్రమునందే 'మంత్రము' అను నర్థముగల 'మను' పదము మూలమున ఉదాహృతము. తెలుఁగున 'క్షితిబాడబులకు మన్వర్థస్థితి యుచితము' అని ఉదాహరింపఁబడి 'విశ్రుత బాడబ, మనువులకు వితతార్థము లెందుఁ బెక్కువిధములగుటచేన్' అని వివరింపఁబడినది. పయి పదద్వయము శాస్త్రమాత్ర ప్రసిద్ధము కాదు. ఆ పదములకు అర్థములు పెక్కువిధములగుట అప్రతీతిక లక్షణమును కాదు.

౧౧. రూఢ్యర్థమును విడిచినది అన్యార్థమనియు, 'విదగ్ధహృదయులు' (విశేషముగ దగ్ధమగు హృదయము కలవారు అను నర్థమున) అనునది దాని కుదాహృతి యనియు నీవలకే చెప్పఁబడినది. చూడామణిలోని ఉదాహరణ, సమన్వయములఁ గనుఁడు—

'క. అచట నింద్రుని జగదా
హ్లాదంబునఁ జంద్రుఁడనిన నన్యార్థము సం

పొదిల్లు నియతనామ
ప్రాదుర్భావముల నెన్నఁబడకుండుటచేన్.'

పయి ఉదాహరణ, సమన్వయము లవగతములు కాకున్నవి. ఒకరు చేయుపనిని వేఱొకరి కంటఁగట్టుట అన్యాయ్యమని పెద్దయ అభిప్రాయపడెనేమో!

౧౨. విధేయమును అప్రధానముగఁ జెప్పినచో అవిమృష్ట విధేయాంశ మగును. దీని నుదాహరించుపట్ల చూడామణికర్త కావ్య ప్రకాశోదాహరణమును గ్రహించెను. అందు కాళిదాసుని కుమార సంభవములోని "ద్వితీయ మౌర్వీమివ కార్ముకస్య" అను శ్లోకభాగ ముదాహృతము. అచట ("రెండవ నారివోలె" అని) మౌర్వియొక్క ద్వితీయత్వము విధేయము. సమాసము చేయఁబడినచో ఉద్దేశ్యమగు మౌర్వీపదమే ప్రధానమగును. అందుచే "మౌర్వీం ద్వితీయామివ కార్ముకస్య" అను పాఠము నంగీకరించినచో దోషము నశించునని మమ్మటుని అభిప్రాయము.

పెద్దిరాజు - అనఁగా పెద్దయకవి మూలాభిప్రాయము నవగతము చేసికొనక క్రిందిరీతిని వ్రాసెను.

"క. ఉవిదకు మొలనూలు మనో
భవు రెండవనారి వోలెఁ బరఁగె ననంగా
అవిమృష్ట విధేయాంశం
బవు నతనికి రెండు నారు లడరకయునికిన్."

ఈసమన్వయ మెంతయు నుచితరీతి లేదనుట స్పష్టము.

౧౩. వ్రీడామంగళ జుగుప్సలను గలిగించునది అశ్లీలము. దీనికిమాత్రము తెలుఁగునను లక్షణము కలదు. ఉదాహరణములును ఉచితముగనే యున్నవి.

౧౪. పరుషాక్షరములు కలది పరుషము. 'కార్త్స్యార్థాత్థిత్వము' అనునది తెలుఁగున-

క. 'పర్కుర్కరకర్కశ బర్బర
తర్కిత మవ్విటుని సురతతంత్రం బనుచున్
చేర్కొన్నఁ బరుష మనఁజను
దార్కొను ప్రతికటువుననఁగఁ దజ్జ్ఞులచేతన్.'

ఇది పరుషోదాహరణముకంటె అశ్లీలమున కుదాహరణ మగుట యుచితము.

౧౫. విపరీతమగు నర్థమును బోధించునది విరుద్ధము. మూలమున 'అంబికారమణ స్వాంఘ్రిసేవా వ్యర్థా కథం భవేత్' అని యుదాహృతము. ఇచటి 'అంబికారమణ'పదము శివుఁడనే అర్థమునే కాక తల్లితో రమించువాఁడను విపరీతార్థము కలుగుచున్నది. చూడామణిలో

తే. 'మిత్రుఁడుదయింపఁ గువలయోన్మేష మొదవె
నన విరుద్ధంబు సఖునకు నవనికైన
గలువలకు నర్కునకునైనఁ గలుగు మైత్ర్య
కారణం బొక్కనెపమునఁ గానబడమి.'

అని లక్ష్య, వివృతు లున్నవి. ఇది యేమో బోధపడకున్నది. ఒకవేళ కలువలకు నర్కునకును మైత్రి వర్ణింపఁబడుట దుష్టమైనచో అది అర్థదోష మగును గాని పదదోషము కాఁజాలదు.

వాక్యదోషములు:

చూడామణిలోని వాక్యదోషము లీ క్రిందివిధమున పేర్కొనఁబడినవి.

సీ. 'క్రమభంగమును, విసంధికంబును, బునరుక్తి
కంబును, వ్యాకీర్ణకంబు నాఁగ,
భిన్నవచస్కంబు, భిన్నలింగంబు, ఛం
దోభంగ యతిభంగ దోషములును,
న్యూనాధికోపమా, న్యూనపదంబులు
నట సమాప్తక పునరాత్తకంబు,
నశరీరకంబును, నధికపదంబుఁ, బ్ర
క్రమభంగము పతత్ప్రకర్షకంబు,'

౧. శబ్దముగాని, అర్థముగాని క్రమమును తప్పియున్నచో క్రమభ్రష్టము. ఇదియే ఇట 'క్రమభంగము'గ చెప్పఁబడినది. 'కీర్తి, ప్రతాపములతో రాజీవేందీవర మిత్రులు చెలిమి కావింతు' రనునది ఉదాహృతి.

౨. చేయవలసిన చోట సంధిని విడుచుట, అక్కఱలేనిచోట చేయుటయు విసంధికము. ఈయెడ చూడామణిలో

క. 'వల అంబుజ అరుక్కుండిల
   బలిఇంద్ర ఉదాత్తః డనెడు పలుకులలో న
   చ్చులు హల్లులతోఁ గూడం
   గలయకయుండిన విసంధికంబగుఁ గృతులన్ '

అని కలదు. సంధి చేయకుండుట ఒక్కటియే విసంధిక లక్షణమని పెద్దన తలఁచెఁగాబోలు! ఈ యుదాహరణమున తెలుఁగుఁదన మేమాత్రమును లేదు. అచ్చులు హల్లులతోఁ గూడియుండుటయే సంధియని వివరణము వల్ల తెల్లమగుచున్నది. ఇది సరికాదు. పయి ఉదాహరణమున సంధి కలుగవలసినది అచ్చులకుఁగాని హల్లులకుఁ గాదు.

౩. చెప్పిన యర్థమునుగాని, శబ్దమునుగాని తిరిగి చెప్పుట పునరుక్తము. 'చక్రి చక్రాయుధుఁడు' అనునది శబ్దపునరుక్తికిని, 'శార్ఙ్గి చాపాస్త్రుఁడు' అనునది అర్థపునరుక్తికిని ఉదాహరణములు. వీనికి తెలుఁగున వివృతి లేదు.

౪. సంకీర్ణపదములు కల వాక్యము వ్యాకీర్ణము. 'తలల వరాహాంక మురంబుల నాజ్ఞయుఁదాల్చి విశ్వభూవిభుఁ గొలువం దలఁపుదు రరులు' అనునది ఉదాహృతి. తలల నాజ్ఞ, నురముల వరాహాంకమును ధరింతురని అన్వయక్రమము. దీనికిని వివరణము లేదు.

౫. ఉపమానోపమేయముల వచనము భేదించిన భిన్నవచనమగును. 'ఆశనిభంగంబులును, ససేవ్యములునైన యంబునిధులట్లు గంభీరమగు మనంబు' అని యుదాహృతి. ఇచటి వివృతి 'పెక్కుమాటల నొక మాట భేద్యమగుట' అని కలదు. అది సమన్వయమున అస్పష్టముగ నున్నది.

౬. ఉపమానోపమేయముల లింగము వేర్వేఱుగ నుండిన భిన్నలింగమగును. 'త్రిశూలంబునుబోని సేన' అనునది ఉదాహృతి ఇచట వివృతిలేదు. త్రిశూలము అమహత్తు; సేన మహతి.

౭. ఛందస్సు తప్పిపోయినచో ఛందోభంగమగును.

క. 'ఎందున నీ రాజున కే
   చందంబున లేదు సరి జగంబుల నెందున్
   సుందరతను, శూరత నన
   ఛందోభంగంబు కృతులఁ జను దోషంబై.'

అనునది ఉదాహృతి. దీనికి వివృతిలేదు. యథాస్థితముగ నీ పద్యము ఛందోభంగమున కుదాహరణము కాఁజాలదు; యతిభంగమునకే ఉదాహరణము అగును. 'చందంబున లేదు సరి జగములనెల్లన్' అని దిద్దుకొనినచో ఇది ఛందోభంగోదాహృతి కాఁగలదు.

౮. చెప్పవలసినచోట యతిని చెప్పకుండినచో యతిభంగము. ఉదాహరణము—

క. 'చెప్పినయెడ నిలుపక వడి
   దప్పిన యతిభంగ మనఁగఁజను సత్కృతి నీ
   చొప్పు నెఱుంగుఁడు తెలుఁగున
   మెప్పడును విరామభంగ, మెన్నరు కృతులన్.'

ఈ యతిభంగ మొక్కదానికి మాత్రము పెద్దయ కవి లక్షణమును చెప్పినాఁడు: వివృతిమాత్రము లేదు.

౯. ఉపమేయముకంటె ఉపమానము తక్కువగ (కొఱతకలిగి) యుండిన న్యూనోపమ.

గీ. 'చంద్రతారాభిరామమై చదలు వొలిచెఁ
   బుండరీకాంక కాసారఖండ మనఁగ
   నట్ల చెప్పిన న్యూనోపమాఖ్య యయ్యె
   నుపమ తారకాపథంబున కూనమగుట.'

అని ఉదాహృతి, వివృతులు. ఇచట 'తారాపథంబునకు' అనుట తప్పు. 'తారా పదమునకు' అని యుండవలెను. ఉపమేయపదమగు 'తారా' పదమునకు సరియగు నుపమానపద మిందు లేదని భావము.

౧౦. ఉపమేయములకంటె ఉపమానములసంఖ్య ఎక్కువైన అధికోపమ యగును. తెలుఁగులోని ఉదాహృతి, వివృతు లనుగుణముగనే యున్నవి.

౧౧. చెప్పవలసినదానిని చెప్పక విడుచుట వాచ్యవర్జితము; ఇదియే చూడామణిలో 'న్యూనపదము'గాఁ

చెప్పఁబడినది. దీని యుదాహరణ, వివరణము లుచితము గనే యున్నవి.

౧౨. వాక్యము పూర్తియైనను, వేఱొక విశేషణమును ఆ పిదపఁ జెప్పి వాక్యమున సంబంధింపఁ జేయుట సమాప్తపునరాత్తము. తెలుఁగునందలి ఉదాహరణము సరిగ ఉన్నది; వివరణము లేదు.

౧౩. క్రియ లేనిది అశరీరకము. ఉదాహృతియు, వివృతియు స్పష్టముగనున్నవి.

౧౪. అక్కఱలేని పదములఁ జెప్పుట అధికపదము. ఉదాహరణాదు లుచితములు.

౧౫. ప్రారంభింపఁబడిన నియమమును చెడఁగొట్టుట ప్రక్రమభంగము. ఉదాహరణము, వివృతి. తగు రీతినే ఈయఁబడినవి.

౧౬. ప్రకర్షక్రమమును తప్పించి చెప్పుట పతత్ప్రకర్షము. దృష్టాంతము, సమన్వయము తీరుగ ఉన్నవి. ('బలు'లను 'బులు'లని దిద్దవలెను.)

ఇవియేకాక మూలమున మఱి ఎనిమిది దోషములు చెప్పఁబడినవి. కాన వాని స్వరూపమాత్ర మిట వివరింపఁబడును.

౧. వ్యాకరణమునకు విరుద్ధమగునది శబ్దహీనము.

౨. వాక్యాంతరములోని పదములు కలిసినది వాక్యసంకీర్ణము.

౩. సంపూర్ణమగు క్రియాన్వయము లేనిది అపూర్ణము.

౪. ఒకవాక్యమునడుమ వేఱొక వాక్య ముండిన వాక్యగర్భితము.

౫. రసమున కనుగుణము కాని రీతి యుండిన అరీతికము.

౬. తఱచుగ విసర్గమునకు ఓత్వము చేయుట, లోపము చేయుటయు విసర్గలుప్తము.

౭. కావలసినచోట మాని, అక్కఱ లేనిచోట సమాస ముపయోగించుట అస్థానసమాసము.

౮. ఇష్టమగు అన్వయము లేకుండిన సంబంధవర్జితము.

ఇం దొక్క విసర్గలుప్తము తప్ప తక్కిన వన్నియును తెలుఁగునకును సంబద్ధములు.

అర్థదోషములు:

అర్థదోషములు చూడామణియం దీ క్రిందివి పేర్కొనఁబడినవి.

'సీ. వరుస నపార్థంబు, వ్యర్థంబు, హీనాధి
కోపమంబులు, సంశయోక్తికంబు,
నతిమాత్రికంబు, నేకార్థంబు, భిన్నంబు.
జరపద క్రమమును, బరుషకంబు,
నసదృశోపమమును, నప్రసిద్ధోపమ
మును, హేతుశూన్యార్థమును, దనర్ప
విరసాహ్వయంబును, నిరలంకృతియు, విరు
ద్ధంబు, నసంగతత్వంబు ననఁగ.'

గీ .........

౧ సముదాయార్థము లేనిది అపార్థము. ఇట 'వాచికార్థము కామిన్' అను వివృతిమాత్రము అస్పష్టముగ నున్నది.

౨. ప్రయోజనశూన్యము వ్యర్థము. ఇది స్పష్టముగ వివరింపఁబడినది.

౩. ఉపమానము హీనమగునెడల హీనోపమము. దీని కుదాహరణ మీయఁబడినను సమన్వయరీతి వివరింపబడ లేదు.

౪. ఉపమాన ముపమేయముకంటె గొప్పదిగ చెప్పఁబడిన అధికోపమము. ఇదియుఁ బైరీతినే ఉన్నది.

౫. వాక్యార్థము సందిగ్ధముగ నుండినచో ససంశయ మగును. ఇదియే చూడామణిలోని 'సంశయము.' దీని సమన్వయపద్ధతి గూఢముగ నున్నది.

౬. 'పలికిన యర్థము క్రమ్మఱఁ బలుకుట యేకార్థ'మని పెద్దనయే ఏకార్థమును నిర్వచించి ఉదాహరించెను.

౭. సర్వలోకాతీత మగు వర్ణన మతిమాత్రము. పెద్దయకవి 'అతిభాషితమున నతిమాత్రంబగు'నని లక్షణము చెప్పి ఉదాహరించియున్నాఁడు.

౮. సంబంధము లేనివానిని చెప్పుట భిన్నము. ఇది భిన్నసంబంధ మనియు చూడామణియందు చెప్పఁబడినది. ఇం దుదాహృతి మాత్రము కలదు.

౯. పూర్వాపర సందర్భము తారుమారయిన అప్రక్రమ మగును. చూడామణిలోని వివృతి'కృత్యంబు గడచి అకలిపని సేయుఁనని చెప్పునట్టి కృతుల'అని స్పష్టముగాక యున్నది.

౧౦. అతికఠినమగు నర్థముతోఁ గూడినది పరుషము. ఉదాహరణ, సమన్వయము లుచితముగ నున్నవి.

౧౧. తుల్యము కాని యుపమానోపమేయ భావ మసదృశోపమము. ఉదాహరణ మచితముగ నున్నది.

౧౨. ప్రసిద్ధముగ లేని ఉపమానోప మేయభావము అప్రసిద్ధోపమము. ఉదాహరణ, సమన్వయములు లెస్సగ నున్నవి.

౧౩. హేతువు లేకుండ జేనినైనఁ జెప్పినచో హేతుశూన్యమగును. చూడామణిలోని యుదాహృతి సరసముగ లేదు.

౧౪. సందర్భమునకు తగని రసమును వర్ణించిన విరసమగును. చూడామణిలోని ఉదాహరణము సరళముగ లేదు.

౧౫. అలంకారము లేనిది నిరలంకృతి. చూడామణిలోని యుదాహరణము సముచితముగ లేదు.

౧౬. దేశము, కాలము లోనగువానికి విరుద్ధమగు నర్థము విరుద్ధము. 'జగదసమ్మతమగు నర్థము విరుద్ధ' మనియు, నది దేశ - కాల - లోక -ది - క్రమయ భేదముల నైదు విధములనియు పెద్దయకవి చెప్పెను. ఒక్క దిగ్విరుద్ధమును విడిచి తక్కిన వన్నియు నిందు సరిగా నున్నవి. దిగ్విరుద్ధము.

క. 'ఉదగంబుధివీచుల న
　న్మదుఁడై క్రీడించె దాక్షిణాత్యుఁ డనంగా,
　మదిలో వినియెడువారల
　యెద నించును దిగ్విరుద్ధమను నర్థంబై.'

ఇయ్యది ఉచితముగ లేదు. దాక్షిణాత్యుఁడు ఉదగంబుధివీచులఁ గ్రీడించిన క్రీడింపవచ్చును. మూలమున తగిన ఉదాహృతి కలదు.

'దిశ్యుత్తరస్యాం నేదీయా
　నుద్వేలో లవణార్ణవః'

అని. ఉత్తరదిక్కున దగ్గఱగా సముద్రముండుట దిగ్విరుద్ధము; దూరముగా ఉన్నదని అభిప్రాయము.

౧౭. సమానములు కానివానిఁ గూర్చుట సహచరభ్రష్టము. చూడామణిలో నిది 'అసంగతి, సహచర భ్రంశము' అను పేరులతో వాడఁబడినది. అన్వయపద్ధతిని గాక ఉదాహరణము వ్యతిరేకపద్ధతి నీయఁబడినది.

పయి పదునేఁడు దోషములను కాక 'అశ్లీల' మను నర్థదోషము మూలమునఁ గలదు. అశ్లీలమగు నర్థమును చెప్పుట అశ్లీలము. తన్నిరూపణ మావశ్యకమయి నను చూడామణియందు విడువఁబడినది.

ప్రతాపరుద్రీయమున గుణవివరణ సందర్భమున ఏయే దోషములను పరిహరించుటకు ఏయే గుణములు గ్రహింపఁబడుచున్నవో క్రిందివిధముగ వివరింపఁబడి యున్నవి.

'......గ్రామ్యదోష నిరాకరణాయ కాన్తిః స్వీకృతా...... న్యూనాధికపద నివారణాయ సమ్మితత్వం మతమ్......అనుచితార్థ నిరాకరణార్థ ముదాత్తతా స్వీకృతా. విసంధి నిరాకరణాయ ఔర్జిత్యం మతమ్. పతత్ప్రకర్ష నిరాకరణాయ రీతిరిష్టా. అశ్లీల పరిహారార్థ ముక్తిః స్వీకృతా. చ్యుత సంస్కార పరిహారార్థం సౌశబ్ద్య మిష్టమ్......పరుషదోష నివృత్త్యర్థం ప్రేయాన్ మతః'

అట్టి సందర్భమునందే చూడామణియందు పయి విషయములే భాషాంతరీకరణపద్ధతిని క్రిందిరీతి వివరింపఁబడినవి.

'క...................
　చతురతఁ గాంతి ఘటించుట
　వితతగ్రామ్యార్థ హరణవిస్రుతిఁ జేయున్.
　...................

సతతన్యూనాధికపద
యుతిహతికై సమతఁ జెప్పనొప్పుం గృతులన్.

తే. అనుచితార్థ నిరాకరణాప్తికొఱకు
నగు నుదాత్తతఁ గావ్యములందుఁ జొనుప
యుక్తపాదవిసంధి విచ్యుతి యొనర్చు
పనికి నూర్జస్వి కర్జంబు పద్యములను.

ఆ. కుదిఁ బతత్ప్రకర్ష దోషాపహతికినై
యుక్తిరీతిఁ గావ్య మొగి నొనర్చ,
..........................

క. చ్యుతసంస్కృతి మానుటకై
యతిమధురసుశబ్దవృత్త మగు నొనరింపన్,
......................
ప్రేయోఽలంకారము దా
శ్లేషంబుగఁ బరుషదోష శిథిలతకొఱకై,
ఛేయఁదగు సూక్తితంత్రము
హేయాశ్లీలంబుఁ దొలఁగ నెగుచుటకొఱకై.'
[చూడామణి, పుట ౫౯.]

మూలమునఁ జెప్పఁబడి, అనువాదకుఁడు గ్రహించిన పయి గుణములలో ఏదియును చూడామణిలో వివరింపఁబడలేదు. పెద్దయకవి మతమున గుణములు పది మాత్రమే. ఈ యంశము ఆతని

క. 'క్రమమున నౌదార్య, శ్లే
షములను, సుకుమారతా, ప్రసాద, మధురతా,
సమతా, ర్థవ్య, క్త్యోజ,
స్సమాధి, కాంతులును దగు దశప్రాణములై.'

అను పద్యమే తెలుపుచున్నది.

పెద్దయకవి తాను తొలుత చెప్పిన గుణములను గుర్తింపక విరోధమును లెక్కింపక పయి మూలవిషయమును భాషాంతరీకరించుట ఎంతయు నసంగతము. అతఁడు తాను విడిచిన గ్రామ్య, అశ్లీల దోషములను కూడ వీనిలోఁ జేర్చుట అనుచితము. ఈ యనువాదము కూడ ఇందసంగతముగ నున్నది. న్యూనాధికపదదోష నివారణమునకు మూలకారుఁ డంగీకరించినది సమ్మితత్వము కాని సమత కాదు. పరుషదోషవిచ్యుతి కంగీకరింపఁబడినది ప్రేయోగుణము కాని అనువాదమున నున్నట్లు 'ప్రేయోఽలంకారము' కాదు.

అనువాదకుఁడు దోషనిరూపణమున 'అపసంస్కృతము'ను చెప్పియున్నాఁడు. ఆ యంశమును మఱచి యిచట మూలము ననుసరించి 'చ్యుతసంస్కృతి'ని గ్రహించుట సరసముగ లేదు.

దోషవిషయమున మూలానువాదములకుఁ గల భేద మీ రీతిది. ఈ వ్యాసమునకు ౧యథార్థవిషయవివేచన ముద్దిష్టాంశము; కాని గ్రంథదూషణము కాదని మనవి. పండితు లీ విషయముల సామంజస్యమును వివరింతురేని గ్రంథాధ్యయనము సుకరము కాఁగలదు.

౧. ఈ వ్యాసమున నా 'ఆంధ్రాలంకార వాఙ్మయ చరిత్రము'లోని విషయము కొంత సంగ్రహీతము.

# చాటువూ - తెఱచాటువూ

జి. వి. సుబ్బారావు

ఏవనితల్ మముందలంప నేమిపనో తమరానువారుగా
రో వలపించు నేర్పెఱుంగరో తమ కౌఁగిటిలోన నుండగా
'రావది యేమిరా విజయరామ' యటంచు పిలుదూటి బల్మిసైఁ
దీవరశక్తినై పెనఁగి తీసుకవచ్చితినా తలోదరీ!

## లతాగుల్మము

ఆహా! భోగంపడుచా! ఎంత ముద్దు లొల్కే పద్యం చెప్పావే నీవు! మాట మాటకు చాంతాడంత వ్యాఖ్యానాలు చేయటానికి పుంకొల్పుతున్నావే నన్ను! భగవద్గీతలకు కొంతకాలానికన్నా ముగిస్తుందేమో కాని నీ గీతలకు ముగియుదేమో నని జంకుతున్నాను నేను! బుద్ధదేవుడి పన్ను స్వర్ణ పేటికలో దాంకితే బౌద్ధ మతస్థుల కెంత ఆవేశం కలుగుతుందో అంతకన్న వేయిరెట్లు ఈ ప్రేమపిపాసికి కలిగించావే నీవు! నీ రసస్థితి గుర్తించాను, నీ వాగమృతాలు చవి చూచాను, నీ కవిత్వానికి "అచ్చరనచ్చలేంటి అచ్చరకోట్లిచ్చేసినా" తీసికెళ్లు. అవును!! ఎవరైతేమటుకు, అసలు నీవూ సెత్తడ మెందుకు? స్త్రీతోవను నీవు బ్రతుకుతున్నావే! ఎవరిజోలికైనా పోతున్నావా? లేదే! పైగా అందఱూ నీజోలికే వస్తూవుంటే! ఎవరింటికైనా పట్టుమని ఓ శుభానికి పేరంట మేమన్నా పోతున్నావా? లేదే! ప్రతి పోరగాడు ముడుపులు చెల్లించుకోటానికి నీ యింటికే వస్తూవుంటే!

పైకి అందఱూ నీకులాన్ని అన్నివిధాల తిట్టి దుమ్మెత్తిపోసేవారే; లోపల మళ్లా నీ కౌంగైనా తగిలితే చాలునని వ్రేలు కొఱుక్కునేవారే. పైన పటారం, లోపల లొటారం!

పగటిపూట నువ్వో కళావిహీనమైన పాడుదేవాలయానివా! రెండు సంధ్యల మధ్యా కళాప్రపూర్ణమైన కామదేవాలయానివా! అక్కడ ఒక్క దినమైనా నిమీలించనివాళ్లు దినదినం నీ సన్నిధానంలో నిర్వృతిజెంది పరబ్రహ్మానుసంధానం పొందుతున్నారా! ఒకప్పుడు నీవు కావాలి! మఱొప్పుడవసరంలేదూ? మంటబడి, దుమ్ము ధూళిలో గలిసి అంతర్ధానమైపోవాలి! బాగుంది! బాగుంది! ఇకమీద సృష్టికర్తను, దీనికైనా నిన్ను గురించి ప్రత్యక్షం చేసుకొని నీకులానికి అమరత్వం ప్రసాదించేటట్లు వరం లాక్కొస్తాను—కంట నీ రెట్టకు—పగలైనా కళ్లబడకుండా వుంటే యీ శాపాదపులు శరాదపులు కొంత తప్పుతాయేమో నీకు!

పిచ్చపిల్లా! నీ వ్వాలా పన్ను బిగించి నీ హైన్యంకొద్దీ, ఇంత నిష్ఠురంగా పలికితే, నా మనస్సుకూడా చివుక్కుమన్నది సుమా! ఈజవాబు ఓ కులస్త్రీకి, అందులో ఓ వుత్తమ రాజకన్యక కన్న సంగతి మఱచినట్లున్నావు. ఈ మాటలు వింటే ఆ యల్లాలి హృదయం వ్రక్కలై పోదనుకున్నావా? ఏమో!

బద్ధాడు. సవ్వడి విని రదనిక బైటికివచ్చింది. సంజ్ఞాసంభాషణ కొంతజరిగింది. "నే, చెప్పలే దుటే రదనికా, పూసపాటివారి కీ వేశ్యా సంవర్కం పారంపర్యావస్తూంది. పానకంలో పుడకలా యీ విలాసవతి యెక్కడద్దాపరిం చిందే సిద్ధాన్నాన్ని కొనగోట చిమ్మెయ్యటా నికి? ఏమిటి కర్తవ్యం?" అన్నాడు మైత్రే యుడు. ప్రశీతమారుతం తగిల్తే గుండె ఎలా ఝల్లుమంటుందో ఉజ్వలానందమయు మైన శయ్యాసదనం అలా వణికి నిర్జీవమైపోయింది. నిర్విణ్ణమై పాన్పుమీద వ్రాలిపోయింది కళా వతి. పుష్పాలు, సుగంధద్రవ్యాలు కమ్మ తావులు కమ్మటం మానేశాయి. చిలకబడ్డ శ్రీగంధం తటాల్న వెలవెలబోయింది. పుష్పబాణుడు తొంగిచూచి తన అస్త్రా ల్ని చేజిక్కించుకొని అంత ర్ధాన మయ్యాడు. తలుపులు మూతబడ్డ అమ్మవారి దేవా లయంలా అంతా హఠాత్ స్తంభిత మైపో యింది. తొంగలిరెప్పలను తొలగత్రో స్తూ కన్నీటిధా రతో కళావతి భవిష్యత్తును చెండాడి చూ స్తూంది. "అమ్మా, విలాస వతనే తొత్తిం టికి రాజుగారు వేంచేశారట" అంది రద నిక గద్గదస్వరంతో. "విధి నెవ్వరూ తప్ప లేరే రదనికా! ప న్నీ దుఃఖం అనుభవించ మని వుంటే, ఇతరుల నని లాభం లేదే. సరే! రాజీగుమ్మం తొక్కేవఱకూ ఈ మందిరం వదిలిరాను. భోజన సౌకర్యాలన్నీ ఇక్కడే నాకు మేర్పాటు" అంది కళావతి.

* * * *

ఆరుమాసాలు గడిచి ఏడో మాసం సగం జొరబడ్డది. మనోవ్యథచేత కళావతి కృశీభూతురాలైంది.



"ఇక నే నోపలేనే రదనికా! చీకటిపడ్డ తక్షణం ప్రచ్ఛన్నంగా నీవు విలాసవతి యింటికి వెళ్లి, యీవొక్క రాత్రికైనా..."

ఎన్నిదినాలు చూచినా తన రాణివాసం వైపు రాజు కన్నువేయటమే మానేశాడు. తానోగొప్పయింటిబిడ్డకు బానచేసి కల్యాణం చేసుకొన్న వృత్తాంతం మఱచేపొయ్యాడు. విలాసవతి తగులాటమే రాజగేహాన్ని శూన్యగేహాన్ని చేసి కళావతిని శోభనమందిరంలో ప్రవాసిని చేసిందని రాజ్యమంతా మ్రోగిపోయింది. ఎదుటపడి "నాథా! ఆనాడు సూత్రధారణ చేసి తమఃట్టణం తీసుకొనివచ్చిన ఈ దీనురాలిని గుర్తింతురా" అని వేడుకొనుటకైనా రాజదర్శనమే కాలేదు.

వియోగాగ్ని రగులుకొనిరగులుకొని కళావతి నావరించివేసింది. "నా నాథుడిక రాడు" అనే నిరాశ పూర్తిగా నాటిపోయింది. ఆనాడు బిరుదునిశానీలను క్రిందపెట్టిన మదనుడు కసిదీఱ తన గుఱికి నిర్దయపెట్టసాగెను. గత్యంతరం లేక, అభిమానాన్ని చంపుకొని, అసురసంధ్యవేళ తన చేటిని పిలిచి "ఇక నే నోపలేనే రదనికా! చీకటిపడ్డ తక్షణం ప్రచ్ఛన్నంగా నీవు విలాసవతియింటికి వెళ్లి, యీ వొక్క రాత్రికైనా శ్రీవారు ఇక్కడకు వచ్చునట్లు చేయుమని నా వేడుకోలుగా తెల్పవే" అంది.

రద—అమ్మా! ఎంత తప్పు! మీరేమిటి, తొత్తుకూతురికి కబురంపట మేమిటి! తగదమ్మా యీ యోచన.

కళా—నిజమేనే. కాని మఱేం చేయమంటావు? ఈదినం నానాథుణ్ణి ఏవిధంగానైనా కంటచూడక నే బ్రతకలేనే!

రద—అమ్మా! కాని ఆ మాయలాడి ముండయింటికి నన్ను వెళ్లమంటారా?

కళా—ఇది నీపని కాదు గదా? నా అవసరం. నువ్వో దూతికవు. నేనూ నిన్ను పంపుతూంది. నా నాథుడే దాని యింటికి వెళ్లుతూఉంటే నీ కేం తలవంపు లుంటాయే ఇందులో?

రద—అమ్మా! సరే వెళ్తాను గాని వుత్తర మేమన్నా వ్రాసియిస్తారా?

కళా—ఏమీ యివ్వను. నేను చెప్పిన మాటలు మాత్రం నీవు చెప్పు. అంతే చాలును.

రద—ఆలాగే తల్లీ! ఆలాగే! వేళ్ల కూడా అవుతూంది. సెలవుపుచ్చుకుంటాను.

అంటూ అధరాన్ని పైపంట నొక్కి మోముమవంచి బొటనవ్రేలితో రత్నకంబళాన్ని తాటిస్తూ నిలబడ్డది. కళావతి తన చంద్రహారంతీసి రదనికమెళ్లోవేసి "ఇది నీది" అని భుజాన్నితట్టింది.

* * * *

ప్రదోషకాలమైంది. నిండుచంద్రుడు తూర్పున వుదయించి తనబారి తప్పించుకొని పరువిడుతూవున్న నిశాదేవిని బాహువల్లరులతో చాచి వొడిసిపట్టుకొంటున్నాడు. రాజవీథులలో మనుష్య సంచారము పలచ

బడ్డది. ప్రచ్ఛన్న వేషంతో రదనిక తనయిల్లు బయల్దేరింది. మార్జాలం ఒకటి తటాల్న ఎదురై వెనక్కు తిరిగి వచ్చినతోవనే పారి పోయింది. "ఏం దుశ్శకునమైందే ఈదినం! ఇంతకన్న మంచిశకునం ఇవ్వాళ ఎలా అవుతుం దిలే! ఓ మార్జాలం మఱో మార్జాల మింటికి నన్ను ఆహ్వానించి వెంటతీసుకువెళ్లుతూంది. ఇందులో తప్పేముంది? అంతా సరీగ్గానే కుది రింది" అనుకున్నది రదనిక.

మార్గానపడి కొంతదూరం పోయింది. ప్రచ్ఛన్న వేషంతో తన నాథుడు త్రోవలో కనపడి, వెన్నంటి మందమందంగా పరిక్ర మిస్తూ విలాసవతియింటికి త్రోవసూ పి స్తున్నాడు. కొంత సేపటికో రెండంతస్థులమేడ సమీపించేవఱకు "ఒసే! ఇంటిదానా! దా ని ల్లిదే. ఈ క్రీడను ఆసరా చేసుకొని నక్కుంటాను. త్వరలో కార్యం పూర్తిచేసు కురా—ఊరికే సోదిపెట్టుకోక" అన్నాడు వసంతుడు. రదనిక రివ్వున గృహంలోకి దూరింది.

మొగసాల్లో వేశ్యమాత కనకవల్లి యెదురై "అమ్మా! ఎవరు మీరు?" అంది.

రద—నివ్వా విలాసవతి తల్లివి?

కన—అవునమ్మా నేనే. కూర్చోండి.

రద—తొందరపనుండి వచ్చాను. నే కూర్చుంటే ఎలా? మీ అమ్మాయి వుందా ఇంట్లో?

కన—ఆహా, వుంది. మేడపైన గదిలో తలదువ్వుకుంటున్నారు-అక్కా చెల్లెలూను రెండు ఝాములనుంచీ అదేపనమ్మా. నేనూ ఇంతకన్నా ఎక్కువ వెలిగించినదాన్నే. ఏం సింగారాలమ్మా, కూటికీగుడ్డకూ కొఱగానివి?

రద—ఏం, అలా అంటావు! "జుగా రేమో చేపట్టారటగా, మీ అమ్మాయిని? సరే! అందుకే అనుకోరాదూ!

కన—చేపట్టారు లెండి! కాదన్నానా? కాని, అమ్మా! ఓ రహస్యం చెబుతాను, వినండి—పేరూ ప్రతిష్ఠలకే గాని నిజమైన సుఖం తక్కువ. ఎప్పుడూ ఏదో మర్యాదా కోసం, హడావుడీ హంగామాలకోసం గుర్బిన లాడుకు చస్తూ వుండవలసిందే: నిజంగా నమ్మరు గాని, నలిగి నర్కోరు పడినాను ఈ ఆరు నెలలనుంచీ.

రద—కాదూ మఱి! యీవయస్సులో నడుము వంచి చాకిరీ చేయాల్నంటే ప్రాణం మీదికే వస్తుంది. ఇదేనా మేడపైకి దోవ? వెళ్లి అమ్మాయితో మాట్లాడివస్తాను. మీ కేం లే అమ్మా, అంతా నిక్షేపంలా జరు గుతూవుంటే!

అంటూ మెట్లెక్కి హృదయంలో దడ నాపుకొంటూ, ఓ నవ్వులధ్వని నా ధారం చేసుకొని, వారశయ్యాసదనం చేరి ద్వారంవద్ద నిలబడ్డది. శబ్దంవిని కోడెత్రాచు పిల్ల రూపావతి తళుక్కున తొంగి చూచి

బెళుక్కున వెనక్కు తిరిగి "అక్కా! ఎవరో భాగ్యశాలి వచ్చారే నీకోసం" అంది. ఎదుటి గోడమీ దున్న చిత్రపటం తదేకంగా చూస్తూ నిలబడ్డది రదనిక. "ఈ సమయంలో మనింటి కొచ్చే భాగ్యశాలి యెవరుంటారే పిచ్చిదానా" అంటూ తొంగితొంగి వచ్చి విలాసవతి వామహస్తంతో ద్వార బంధంపట్టుకొని దక్షిణహస్తంతో తల్లో పూలుసవరించుకొంటూ పాలిండ్లపొంగుతో నిలబడ్డది. "అమ్మా, రండి లోపలికి. ఏదో అవసరంమీద వచ్చినట్లున్నారు మీరు. అనుమానించక లోపలికి రండి. ఓసే రూపా! నీవు క్రిందికి పో. వేళ్ల కాలేదు కాని వస్తారేమో వెంటనే పైకొచ్చి చెప్పు సుమా!" అంది. రూపావతి క్రిందికి దిగిపోయింది. రదనిక గదిలో ప్రవేశించి శృంగార రస పోషణ కచ్చెరువొందుతూ అలంకారసము దాయాన్నంతా పరిశీలిస్తూ నిలవబడ్డది బల వంతంమీద ఓశయ్యాతలాన చేరి.

రద—అమ్మాయీ! నివ్వేనా విలాస వతివి?

విలా— ఔనమ్మా. అసలు పేరేమో రంగనాయకి.

రద—ఇప్పుడు క్రిందికి వెళ్లిన పిల్ల?

విలా—నా చెల్లెలు రూపావతి. దాని రెండో పేరు కృష్ణవేణి.

రద—ఆలాగా! క్రింద నాకగనపడ్డ మనిషి నీ తల్లిగారన్నమాట.

విలా—ఔను. దానిపేరు కనకవల్లి.

రద—అసలు సంతానమా, పెంపుడా?

విలా—నేనేమో సంతానమూ, మా చెల్లెలు పెంపుడూనూ.

రద—అందుకనే ఇద్దర్లోను వర్చస్సులో ఇంత తారతమ్య ముంది. పిల్లా! నీది అచ్చమైన వైష్ణవకళ సుమా!

విలా—నాతండ్రి భట్టాచార్యులవారని చెప్పింది మాఅమ్మ. మొన్న మొన్ననేగా అమ్మా వారు పరమపదించింది.

రద—ఆ-ఆ. రాజగురువులు శ్రీమాన్ పెరుమాళ్ల రంగనాథ భట్టాచార్యులవారా?

విలా—మీరు నాలోచూసిన కళ లేమన్నావుంటే ఆ గురుప్రసాదమే అనుకుంటాను.

రద—సందేహ మేముంది? ఇప్పుడు వారి కవళికలు ఎన్నో నీలో వ్యక్తమాతూ వుంటే?

విలా—(ఊరకుండును)

రద— శ్రీవారు విజయరామరాజు గారు గురువుల మతధర్మాలు అనుసరించినా అనుసరించకపోయినా ఈనాటికి వారి ప్రసాదాన్నైనా స్వీకరించి వారి ఆత్మకు శాంతి చేకూరుస్తున్నారు. సద్గురువులు ఏవిధంగా

నైనా తమ దక్షిణను రాబట్టుకొంటారు సుమా!

విలా—ఇదంతా వారి ఆశీఃప్రభావ మని వారికి దినమూ ప్రణమిల్లుతూ వుంటాను.

రద—వారి వుత్తమగుణాలే నీకు పట్టుబడివుండాలి. సరేకాని, అమ్మాయీ, మన సిచ్చి మాట్లాడుతున్నావు గనుక అడుగుతాను. ఈవిషయం రాజుగారికి తెలియదన్న మాట.

విలా—ఏమాత్రం తెలియదు. మా అమ్మ నాచాత ఒట్టేయించుకుందే?

రద—రాజుగారు చాలా బుద్ధిసూక్ష్మం కలవారని వింటాను. వారికేం సమాధానం చెప్పావు?

విలా—నాది అగ్రజాతి కోవ అని మాత్రం చెప్పాను. అటుపైన వారు నన్నేం బలవంతపెట్టలేదు.

రద—సరేకాని, ఎన్నేళ్లే అమ్మాయి నీకు?

విలా—మాఅమ్మలెక్క పదహారు, నా లెక్క ఇరవై.

రద—మఱి రాజుగారి లెక్క?

విలా—నామాట నమ్మితేగా వారు? వారి కేప్పుడూ నేనో నవోఢనేట.

రద—ప్రేమ కలా అనిపిస్తుందే పిల్లా. ఇదేకాదు, ఈ విశ్వమంతా ఒకేస్థితిలో ఆగిపోయి ఉన్మత్తనృత్యం చేస్తున్నట్లు కనిపిస్తుంది. నువ్వు నిజంగా భూలోకరంభవే! సందేహమేముంది? నీ సౌందర్య సుధల్లో జీవులను స్నానాలాడిస్తావు. నాకే నీమీద ఓ వింతమరులు కలిగితే, రసికశిఖామణులు రాజుగారి కగలగట మేం లెక్క?

విలా—అమ్మా, తమరు నామీద దండే దయవల్ల అలా అంటూవున్నారు గాని, నా సౌందర్యం ఏపాటిది? నాకంటె నిజమైన రంభ లెందఱో యీ భూలోకాన వున్నార. అంతెందుకు, ఈ పట్నంలో లేర?

రద—లేరని ముమ్మాటికీ నిశ్చయంగా చెప్పగలను.

విలా—మీ రాణీగారికంటె మించిన సౌందర్యం ఎవరి కుంది చెప్పండి.

రద—ఏం! మీ రాణీగా రంటున్నావేం కొంపదీసి?

విలా—అమ్మా, అలా అనుమానం కలిగింది నాకు: మీరు రాణీవారి మంత్రిణులు కారు గదా?

రద—పోసి. నీ మాటెందుకు కాదనాలి. అలాగే అనుకో.

విలా—అందుకనే మీరు నన్నింత వూరికే పొగడుతున్నారు.

రద—ఒట్టు! పిల్లా, ఒట్టు! అలా అనుకోకు. పైగా, నిన్ను ఇంకా సరీగా వర్ణించలేకపోయినందుకు నన్ను నీవు మన్నించాలి.

విలా—అయితే మీకు నా నమస్కారాలు.

రద—"నిరంతర నిత్యయౌవన సుఖీభవ" అని ఆశీర్వదిస్తున్నాను. కాని, పిల్లా! ఓమాట: నీలాంటి దివ్య సుందరవిగ్రహాన్ని కడుపున గని మీ అమ్మ మళ్లోపిల్లను మెంపుడెందుకు చేసుకుంది?

విలా—అది మా కులం కట్టుబాటు.

రద—ఇదేం కట్టుబాటే?

విలా—మాయింటి ఆచారమటమ్మా అది: తరతరంగా వస్తోంది.

రద—కావచ్చును—కాని—

విలా—ఏదో పెద్ద వూహాతోనే చేసుంటుంది మా జిత్తులమారిముండ. దృష్టి బలిహారాని కని ఎవరితోనో అంటున్నది ఓమారు.

రద—ఆ పెద్దదాన్ని వూర్కే ఇలా నిందించకు. ఇంత సంపాదించి నీ కిచ్చి, పైగా రాజును నీయింటి దాసుణ్ణి చేసింది.

విలా—అమ్మా, దీంట్లో దాని సంపాదనేమాత్రం లేదు. దాని సంపాదన తానే రాగిడబ్బులేకుండా వ్యయపెట్టుకుంది. ఈ సాభాగ్య మంతా, అదిగో! శ్రీవారి ఆకారమిూసాన్ని వెలిగించే ఆ చిఱునవ్వే.

రద—అలాగా! అమ్మాయీ! మరి చాను; ఈ చిత్రపటం ఎవరిచేత వ్రాయించావు?

విలా—ఎవరిచే తెందుకు? నేనే వ్రాశాను.

రద—నువ్వా: నిజంగాను? ఎంత రమ్యంగా చిత్రించావు పిల్లా నీవు! ఎన్నాళ్లయింది?

విలా—శ్రీ వారి కల్యాణానికి పూర్వం.

రద—నిన్ను చేపట్టకముందే?

విలా—అవును. ఒకదినం వారు వేటకు పోతూవుంటే హఠాత్తుగా చూశాను. వెంటనే ఆమూర్తిని హృదయఫలకంమీద హత్తుకొన్నాను: తర్వాత ఆపటంమీదికి వేరుచేశాను-అంతే.

రద—అందుకనే నీరచన ఇంత సజీవంగా వుంది. కాని, ఆ నేత్రాలుమాత్రం మఱింత విశాలంగా చిత్రించావేమో నని అనిపిస్తూందే-అంతే.

విలా—క్రీడోత్సాహంలోవున్న నేత్రాలవ్వి. అవ్వే, నన్ను వెన్నంటి వేటాడి జయించినాయి. తర్వాత ఎప్పుడూనూ అంత భాసమానంగానే నాకు కనపడ్డాయి.

రద—ఎంత చక్కగా విప్పిచెప్పావే: సంతోషం! సరే! నిన్నేమో వారు విలాసార్థం పోయి జయించారు: నువ్వు వారి నెప్పుడు జయించావు?

విలా—వారిఎదట నే నభినయించినప్పుడు.

రద—అదెప్పుడు?

విలా—మేజువాణీలో.

రద—అంటే ?

విలా—ఊరేగింపు టుత్సవం తర్వాత దర్బారులో.

రద—ఓహో! ఆదినం వచ్చిన మేళం మీాదా ?

విలా—అవును.

రద—అదే నిన్ను శ్రీవారు ప్రథమం లో చూట్టంకాబోలు !

విలా—ఏమో! ఆలాగనే అనుకుం టాను. నేపాడిన మువ్వగోపాలపదం వారికి నామీాద ఎంతో జాలికలిగించిందట.

రద—ఆ పదమేమిటే, పదం ?

విలా—"ఎవడే వాడు పవ్వళించినవేళ? అన్న పదం.

రద—తప్పకుండా ఆ పల్లవితోనే ము గ్ధులై వుంటారు రాజుగారు.

విలా—కాదుట : తర్వాత చరణాల్లో "వీథివారలెల్ల వింతచూచురె కాని, దాదూ ఫిరాదూలు ధరణీలో లేవామె" అభినయిం చినప్పుడు నా కోడిపొయ్యారట.

రద—తేలింది. కాబట్టి ఇద్దర్లోనూ ముందోడిపోయింది నీవన్నమాట. అంతేగా ? అయితే మీా సంయోగం గాఢమైన రస పాకంలోనే పడ్డది.

విలా—ఇంటికొచ్చి పోణీ విప్పానో లేదో రాజుగారి చెలికొట్టె వచ్చి మీారిందాక నిలబడ్డారే, అక్కడ నిలబడ్డాడు.

రద—ఓహో ! దొంగముండావాడు మైత్రేయుడా నీకు దూత ?

విలా—నాదూత కాదు, రాజదూత. రాజు పట్టలేని మోహంతో ప్రచ్ఛన్నంగా వేంచేసి క్రింద నున్నట్లు వెంటనే నా చెవులోవూదాడు. ఏంచేసేది? నాఅదృష్టాన్ని నేను నమ్మలేక కొయ్యలా నిలబడ్డాను.

రద—వెంటనే గుర్తుడిగావు కాబోలు, అంతేనా ?

విలా—మరేం జేసేది ? భంగున రాజ ముద్రికను చూపించాడా మంత్రగాడు. హృదయం ఢక్కాఢక్కామోతగా కొట్టుకోటం మొదలెట్టింది. భయమేసింది. దేహమంతా గగుర్పొడిచింది. ఒళ్లు తెలియలేదు. క్రిందికి దిగివెళ్లాను.

రద—పోణీ లేకుండానే ?

విలా—ఏమో వొళ్లు తెలియ దని చెప్పితినిగా, నమస్కరించి వాకిట నిల బడ్డాను. కంట నీరు కమ్మింది. రాజు లేచి వచ్చి చేయి పట్టుకొని "ఏదీ నీ ఫిర్యాదీ" అన్నాడు. పాదాలమీాద వ్రాలాను

రద—తర్వాత ?

విలా—తర్వాత ఏముంది ! ఆశయ్యా తలాన వారు నా నేత్రాలు ముద్దెట్టుకుం టున్నప్పుడు మళ్లా నావొళ్లు నాకు తెలిసింది.

రద—మరి నీ ఫిర్యాదీ చెప్పావా?

విలా—ముద్దాయీలు తమరే నని చెప్పాను.

రద—తర్వాత ?

విలా—ఇదేమిచోద్యమమ్మా ? ఇంకా తర్వాత ఏముంది ? ఈదినంవఱకు తర్వాత నేది మా యిద్దఱికీ లేకుండాపోయిందని స్పష్టంగా చెప్తాను.

రద—ఏం ఈ దిన మ టున్నావు.

విలా — మహాత్ము లూరికే రారని సామెత లేదమ్మా ? శశి బింబిస్తూవున్న నిర్మలోదకంలా ఏ అలజడి లేకుండా వుంది మా అన్యోన్య ప్రేమజీవనం. మఱి మీ రొచ్చిన పనేమో చెప్పరూ ?

రద—నీ అవ్యక్తధోరణిని పడి నిన్ను పూర్ణముగా మోహించి నేను కర్తవ్యం మఱచినందుకూ, నీవు జ్ఞప్తికి తెచ్చినందుకూ నీకు నా అభివాదాలు.

విలా—మీరు పెద్దలు. నన్నలా అనటం సమంజసంగా లేదు మీరు వచ్చినపని విచారించక ఇంత కాలయాపన చేసినందుకు నన్నే మీరు క్షమించాలి.

రద—నీ నమ్రభావానికి ఎంతో ఆశ్చర్యంగా వుంది నాకు. నీ పావనరక్తం నిన్ను పతితపావనిగా చేస్తూంది,

విలా—శ్రీవారు వచ్చేవేళ కూడా అయింది. మీపనేమిటో చెప్పండి.

రద—ఓ చిన్నవృత్తాంతం చెపుతాను ముందు. "ఊ" కొడతావు ?

విలా—ఆహా ! మీ రేంచెప్పినా వింటాను.

రద—మన పట్నంప్రక్క గ్రామంలో ఓ గొప్ప ధనికుడు మఱోగొప్పఇంటిబిడ్డను వివాహం చేసుకొన్నాడు.

విలా—క్షత్రియకుమారా ?

రద—కాదులే ! రైతుబిడ్డ. నిషేక ముహూర్తం కానిచ్చుకొని ఇంటికి భార్యాను తీసుకొచ్చాడు.

విలా—సరే, తీసుకొచ్చాడు.

రద—తన యింటిదగ్గరా అచ్చటా ముచ్చటా జరగాలా లేదా?

విలా—అమ్మా ! కాదని ఎవరంటారు ?

రద—శోభన గృహంలో చేసుకొన్న భార్యా శయ్యమీదుంది - ముత్తయిదువులంతా వుల్లాసంగా వున్న సమయం !

విలా—కాదూ మఱి!

రద—ముహూర్తం మించిపోయింది: భర్త పరారయినాడు. అమ్మలక్కలంతా ఇండ్లకు చేరారు. అప్పుడాభార్య కెలావుంటుందో చెప్పు.

విలా—ఎంతచిత్రం ! ఏమో ఎప్పుడూ నావూహకు తగలని విషయం చెప్పారు. కానీ: రాజుగారీదినం రాకపోతే నా కెలా వుంటుందో నేచెప్పగలను గాని, ఈ విషయాలు నాచాత గావు.

రద—చూశావు? పరారై ఎన్ని నెలలకూ రాలేదు, ఆ మగధీరుడు.

విలా—ఏం ఎందువల్ల ?

రద—ఎందువల్లా? ఓ వారకాంతను చేపట్టి, కృశిస్తూవున్న ఆ భార్యావేపు కన్నే వేయకుండా, ఈ పట్నంలో కులుకుతూ వున్నాట్ట మఱి అక్కడ ఆభార్యాగతేమిటో చెప్పు.

విలా—చెప్పలేను గాని ప్రయత్నిస్తాను. భర్త వచ్చేవరకు వాంఛల్ని చంపుకొని రూపాన్ని మనస్సులో చిత్రించుకోటం మంచిది.

రద—మ అభార్య నీలాంటి చిత్రకారిణి కాకపోతే ?

విలా—వియోగం అనుభవించక తప్ప దనుకొంటాను.

రద—చెప్పవే ! ఎంతకాలం ఈవుప్పూపులుసూ తినే స్త్రీ అనుభవించగలదో ?

విలా—తాను గట్టిగా తల్చుకుంటే ఏ స్త్రీ అయినా యావజ్జీవం అనుభవించగల దనుకొంటాను. ఈ విషయంలో అబలలం కాము, సబలలం మన మంతా. పురుషులకే ఈ సాధన చేతకా దనుకొంటాను

రద—మహా చక్కగా చెప్పావే ! కాని, యిదిచేతకానివాళ్లకు తరణోపాయం ఏమిటని మళ్లా నిన్నడుగుతాను.

విలా—ఏదో కొంతవరకు చెప్పాను గాని ఈ సమస్య నేను విప్పలేను. అట్టి వాళ్లకు ప్రాణత్యాగమే శరణ్య మేమో !

రద—అంతకన్న పాపకార్యం లేదని మన ధర్మశాస్త్రం చెపుతూందిగా ?

విలా—అమ్మా , ఇక మీకు నమస్కారం ! జవాబు చెప్పలేని యిరకాటం లోకి దించారు. మఱి మీరు వచ్చిన పని చెప్పండి. చాలా ఆలస్య మైంది.

రద—ఇదే.

విలా—అంటే ?

రద—ఆ రైతే రాజు. వియోగాగ్ని సహించ లేక, గత్యంతరం తోచక, ప్రాణత్యాగ పాపానికి జంకి కృశించిపోతూవున్న శ్రీరాణీవారు తనమాటగా చెప్పమన్నారు.

విలా—రాణీగారా? నాతోనా? ఏమని ?

రద—"నిమేషమాత్రమే చవిచూచిన నాఅమృతభాండం విధివ్రాతకొద్దీ నీకు కైవస మైంది. నా వ వంతలు గ్రహించి, దాన్ని నీవొక్క రాత్రికైనా ప్రసన్నను చేయమని వేడుకోలు" అని.

విలా—అమ్మా! అమ్మా! ఎంతమాట! ఎంతమాట ! ఆ అమృత స్వరూపాన్ని—ఆ కామధేనువును—ఆ విలాసమూర్తిని— నేను దొంగిలించానా? ఎంతమాట? ఎంతమాట ? నా అదృష్టంవల్ల లభ్యమైన ప్రేమమూర్తులే వారు నాకు ! ఇది నాకు కాని పని, నాచేత గాని పని. మా నిర్మల హ్రదంలో రాయి రువ్వారు మీ రీ క్షణం. మా ప్రేమలతకు వేళ్లు తెగ్గొట్టి రక్తం పోశారు. ఈ విషయ మని తెలిసుంటే సంభాషణ యింతదూరం రానిచ్చేదాన్నే కాను. ఎంత తెలివితక్కువ! ఎంత తెలివితక్కువ! కానివ్వండి. అమ్మా, జరిగిం దేదో జరిగిపోయింది. మీరు క్రిందికి పోయి, మాఅమ్మదగ్గిర వుండండి. నే నిప్పుడే వచ్చి జబాబిచ్చి పంపుతాను.

రదనిక క్రిందికి పోయినవెంటనే విలాసవతి రాజుగారి చిత్రపటం కన్నీటిధారతో క్రిందికిదించి, వక్షస్థలానికి చేర్చుకొని, ముద్దాడుకుంది. "రాజశిఖామణీ ! చిత్తహారుడా ! మనోవల్లభా ! ఈనాటితో

ఋణముతీ తెనా ?" అని కలస్వనంతో వూరికే వాపోయింది. సౌఖ్యాలు బుద్బుదాలని తెలివితెచ్చుకొని పటం వెనక్కుత్రిప్పి మూల పడ్డ తనకుంచెలను తీసి ఓపద్యాన్ని వ్రాసి క్రిందికి దిగివచ్చి

"అమ్మా ! మీరు త్వరగా వేంచెయ్యాలె. "నేను పంపగలిగిన అమృత భాండ మిదే"నని యీ పటాన్ని రాణీవారి కిచ్చి నా నమస్కారాలు అర్పించండి. వెనుక వైపున చిత్రించిన పద్యాన్ని మీరుమాత్రమే చదువుకోండి. బాసచేసి వివరమడిగితే రాణీ వారికి దాని పరమార్థం చెప్పండి. మగవారి కంటబడితే పెడర్థాలు తీస్తారు గనుక దీని నెవ్వరికీ చదవమని యివ్వకండి. ఇంతకు మించిన పనేమైనా చేయాల్నని నాకున్నా, అదుగో! ఆమండ నాగొంతుపిసికి శ్రీ రంగ నాధుడి కోనేరులో పడతోస్తుందని విప్పి చెప్పండి. నమస్కారం."

అని బొట్టుపెట్టి తాంబూలం చేతికిచ్చింది.

కార్యం సాధించలేనందుకు వగస్తూ, గడగడ వణకుతూ, వేశ్యా చిత్రితాన్ని చీర చాటుచేసి, ఉస్సూరంటూ బైటపడ్డది రదనిక.

"నే చెప్పలా ? మీ ఆడవాళ్లకున్న తెగు లెందుకు పోని స్తావు? ఈపాడువీథిలో జాగరణచేసిచేసి కళ్లూ, కాళ్లూ పీకో, పోతున్నాయి. కార్యమేమైనా సానుకూలం చేశావా మరి" అన్నాడు వసంతుడు.

వెంటనే మెళ్లో హారంతీసి "ఆడవాళ్లే ఆడవాళ్లని జయించలేకపోతే ఈ కాను కెందుకు నాకు"! అంటూ భర్తమెళ్లో వేసింది.

"మఱి నామెళ్లో ఎందుకేశావు దీన్ని ?" అన్నాడు వసంతుడు.

"మాచేత గొంది మీది. మీ స్నేహితుడు మైత్రేయుడేటయీ మైత్రి కల్పింది. మళ్లా మిత్రభేదం అత గాడి వల్లనే



"నేను పంపగలిగిన అమృతభాండ మిదే"

కావాలి. రహస్యం చెప్తాపదండి. అందాకా మీవద్దనే వుంచండి హారాన్ని" అంది రదనిక.

*   *   *   *

వసంతుడూ, రదనికా రాజభవనం చేరారు.

శోభనగృహంలో కళావతి ఎన్నడూ లేని గాఢసుషుప్తిలో "నాథా! నాథా!" అని పలవరిస్తూవుంది. రదనిక పటాన్ని గోడకు తగిలించి ఆభరణాల్ని ఝుళిపించి ధ్వని చేసింది. చివాల్ని లేచి అరుణనేత్రాల్తో దూతికను గుటిచేసి "పండా, పచ్చా" అని అడిగింది కామశోషిణి కళావతి.

"అమ్మా, దొరకాయే! త్వరలోనే పండుతుంది" అంది రదనిక.

కళా—ఓసీ నానాథుడా? నానాథుడి చిత్రపటమా అది? ఇదెక్కడిది?

రద—అమ్మా, వారి చిత్రపటమే! ఇదే మీ అమృతభాండమని ఆ భోగం చిన్నది పంపించింది.

కళా—ఇదేమిటే నీపండు?

రద—త్వరపడకమ్మా! త్వరపడకు. ఏశుభముహూర్తానికి శ్రీవారు మిమ్మ మఱచిరో ఆ ముహూర్తానికే మిమ్ము జ్ఞప్తికి తెచ్చుకొంటారు. ఈ రాత్రి మూడోయామానికి వారిక్కడికి రాకతప్పదు: లేకుంటే, ఈ కృపాణంతో నేను పొడుచుకొని చచ్చిపోతాను.

కళా—ప్రాణప్రియా, రదనికా, ఇటురా (అని దగ్గరకు తీసి నుదురు ముద్దు పెట్టుకొని) అంత చక్కనిదిటే విలాసవతి?

రద—ఏం చెప్పనమ్మా! నిజంగా చక్కనిచుక్కే! సందేహమేముంది? కాని మీ కెక్కడి సాపత్న్యమమ్మా? దాంది బ్రాహ్మణ కళ! మీది రాచకళ! దాన్ని పరీక్షగా కొంతసేపు చూడొచ్చు; మిమ్ము చూస్తూనే కళ్లు మూతలుపడుతాయి. అది చంద్రబింబం; మీరు సూర్యబింబం.

*   *   *   *

ఓ పానశాలలో వసంతుడు మైత్రేయుణ్ణి వెదికి పట్టుకొన్నాడు. వెంటనే అతగాడు రాజును వుద్యానవనంలో కల్కించుకొన్నాడు. కొంత సంభాషణలోకి దించాడు. విలాసవతి అట్టుపుట్టాన వాళ్లన్నీ తిరగేసి చెప్పాడు. అంతే.

*   *   *   *

రాత్రి మూడోయామాన ఖిన్నవదనంతో చిన్నపోయి కళావతిశయ్యాసదనం ముందు విజయరామరాజు నిలబడ్డాడు. మైత్రేయుడి భుజంమీదఒక చెయ్యివుంచాడు: రెండో హస్తం రదనిక పట్టుకుంది. మెల్లమెల్లగా తలుపుకొట్టూ "దేవీ! దేవీ! విలంబనాలు సైరించి, తలుపులు తెఱచి, ప్రసన్నురాలవు కమ్ము" అంది రాచ కార్యతంత్రిణి రదనిక. కిటకిటా తెఱవబడ్డాయి తలుపులు. అరుణవదనంతో పాదాలమీద వ్రాలిపోయ్యే అర్ధాంగిని రాజు చివాల్న తన వక్షస్థలాని కంకించుకున్నాడు.

(సశేషం)

# పాణినీయము - కావ్యభాష

పోతుకుచ్చి సుబ్రహ్మణ్యశాస్త్రి

బ్ర. శ్రీ వజ్ఝల చిన సీతారామస్వామిశాస్త్రి గారు తాము రచించిన చింతామణి విమర్శపరిశోధన మనఁ బాణినీయము కావ్యభాషానుశాసకము కాదనియుఁ దదనుశాసకమగు మఱియొక వ్యాకరణ మావశ్యకమనియు నొక పరమసిద్ధాంతమును బ్రకటించిరి. దాని కనుకూలముగా మఱికొన్ని సిద్ధాంతములను గూడ నేర్పఱచిరి. వీనికన్నింటికిని మహాభాష్యమే ప్రమాణమనియు నుదాహరించిరి. నే నెంతయో కుతూహలపడి యది యంతయు విమర్శనాదృష్టితోఁ బరిశోధించి చూచితిని. కాని నా కవి న్యాయసమ్మతములు కావని తోఁచుటచేఁ దత్త్వజిజ్ఞాసువునై నే నీవ్యాసమును బ్రకటించియుంటిని.

'పృషోదరాదీని యథోపదిష్టమ్'

"కై రుపదిష్టాః, శిష్టైః,...యది తర్హి శిష్టాః శబ్దేషు ప్రమాణం కిమష్టాధ్యాయ్యా క్రియతే, శిష్టపరిజ్ఞానార్థాఽష్టాధ్యాయీ, కథంపున రష్టాధ్యాయ్యా శిష్టాః శక్యా విజ్ఞాతుమ్.

అష్టాధ్యాయీ మధీయానో ఽన్యం పశ్యతి అనధీయానమ్, యేఽత్ర విహితాః శబ్దా స్తాన్ ప్రయుఞ్జానం పశ్యతి, నూన మస్య దైవానుగ్రహః స్వభావోవా యోఽయం నచాష్టాధ్యాయీ మధీతే, యే చాస్యాం విహితా శ్శబ్దా స్తాన్ ప్రయుఙ్క్తే, నూన మయ మన్యానపి జానాతీతి, ఏవ మేషా శిష్టపరిజ్ఞానార్థాఽష్టాధ్యాయీతి."

(మహాభాష్యము ౬ అధ్యా. 3 పాద. 3 ఆహ్ని.)

పై సూత్రభాష్యములను బట్టి బ్ర. శ్రీ. వజ్ఝల చిన సీతారామస్వామి శాస్త్రిగారు పాణిని పతంజలుల కాలమున శిష్టవ్యవహారభాష యనునొకభాష ప్రత్యేకముగాఁ బ్రసిద్ధివహించియుండెడిదనియు, నద్దాని నాధారముగాఁ జేసికొనియే పాణినీయము రచింపఁబడినదనియు, నందుచే నాశాస్త్రమెల్లను శిష్టవ్యవహార భాషామాత్రానుశాసకమే యయియున్నదనియు సిద్ధాంతీకరించిరి. కాని పైసూత్ర భాష్యములను బరిశీలించి చూచినచో శ్రీ శాస్త్రిగారు వ్రాసినవిధముగా నాకాలమున శిష్టవ్యవహారభాష యను నొకభాష యుండెననుటకుఁ గాని, దాని నాధారముగాఁ జేసికొనియే పాణిని తనశాస్త్రమును రచించె ననుటకుఁగాని యేమాత్రమును బైసూత్రభాష్యములు ప్రమాణములై యుండలేదు. భ్రమ ప్రమాదములకు లోనుగాని శిష్టోపదేశమును మాత్రము ప్రమాణీకరించికొని పాణిని మహర్షి తన శాస్త్రమును రచించెనని పై సూత్రభాష్యములు సుస్పష్టముగా నుద్ఘోషించుచున్నవి. ఒక్కపాణినీయమ నేల ప్రతిశాస్త్రమును శిష్టసంప్రదాయమును మూలముగాఁ గొనియే వ్రాయఁబడియున్నది ఈ విషయమున ధర్మవ్యవస్థయే మనకుఁ బ్రబల నిదర్శనమై యున్నది. ధర్మమున కేప్రకారముగా శిష్టాచారము మూలమనఁదగి యున్నదియో యావిధముగానే వ్యాకరణమునకును శిష్టోపదేశమే నిదానమని మన మంగీకరింపక తప్పదు. శిష్టాచార మేరీతిని స్మృత్యనుమాపకమై ప్రమాణపదము నధిరోహించుచున్నదియో శిష్టోపదేశమును నారీతిగనే పూర్వపూర్వవ్యాకరణానుమాపకమై ప్రమాణమగుచున్నది. ఈ శిష్టాచారమనునది యేవిధముగాఁ గొందఱకు మాత్రమే యాచరణీయముగాను, మఱికొందఱకనాచరణీయముగాను నేర్పఱుపఁబడియుండలేదో యావిధముగానే యా శిష్టసంప్రదాయ మనునదియుఁ గొందఱకు మాత్రమే యనుల్లంఘ్యముగాను మఱికొందఱకుల్లంఘనీయముగాను నేర్పఱుపఁబడియుండలేదు. కావున నెల్లవారలకును ధర్మవిషయమున శిష్టాచారము

వలెనే భాషావిషయమున శిష్ట సంప్రదాయమును ననతిక్రమణీయమై యున్నదనుట సిద్ధాంతితము. కావునఁ గవులైన నీశిష్టసంప్రదాయము ననుసరించియే కావ్యములను విరచింపవలసినవా రగుచున్నారు. ఈపాణినీయ సాధ్యములు శిష్టసంప్రదాయసిద్ధ శబ్దానతిరిక్తములే యని పైభాష్యమే యుద్ఘోషించుచుండుటచేఁ బాణినీయమునుగూడఁ గవు లనుసరింపవలసినవారనుట సుస్పష్టము. శిష్టాచారము నుల్లంఘించినవారి యాచారముల నెట్లు దుష్టాచారములుగాఁ బరిగణింతుమో యట్టులే శిష్టోపదేశమూలకమగు పాణినీయము నతిక్రమించిన కవిప్రయోగములు సయితము దుష్టము లనక తీరదు. ఈ విషయమునే మహాభాష్యకర్త 'యాస్త్రీశబ్ద్యానదీ' అను సూత్ర వ్యాఖ్యానావసరమున నొక కవిప్రయోగమును బ్రమాణీకరించి శాస్త్రమునే కవు లనుసరింపవలయునుగాని యవ్వారి ననుసరింపవలసిన యావశ్యకత శాస్త్రమునకు లేదనియు, శాస్త్రము ననుసరింపని కవిప్రయోగము లసాధువులేయనియు "ఛందోవత్కవయః కుర్వన్తి, నహ్యేషాఇష్టిః," అని స్పష్టీకరించెను. పైభాష్యమున "ఛందోవత్కవయః కుర్వన్తి" అని యుండుటచే "ఛందసి దృష్టానువిధిః" అను వాక్యము ననుసరించి కవు లేది ప్రయోగించిన నదియే పరమప్రమాణమనియుఁ దదనుశాసకమగు మఱియొక వ్యాకరణ మావశ్యకమనియు నెవ్వరేని భ్రమించెదరనియే కైయటుఁడీ క్రిందిరీతిని సుస్పష్టముగా వ్యాఖ్యానించెను. "నహ్యేషేతి. అసాధవ ఏ నైవమాదయః, నతు తత్ప్రామాణ్యాత్ సాధుత్వవ్యవస్థా" అనఁగా "ఛందోవత్కవయః కుర్వన్తి" అను దానికిఁ బైరీతి నర్థముచెప్పుట భాష్యాభిప్రేతము కాదనియుఁ, గవులు పైనిచెప్పినరీతిని శిష్టసంప్రదాయము ననుసరింపవలసినవారేయయినను ఛందస్సు మొదలుగాఁగల కావ్యనియమముల ననుసరింపవలసినవారగుటచే "అపి మాషం మషం కుర్యా-చ్ఛందోభంగం నకారయేత్" త్తనురీతిని బ్రమాదమువలననో, కావ్యనియమానుసరణముచేతనో యసాధుశబ్దములను బ్రయోగించి శిష్టసంప్రదాయము నుల్లంఘించి యుచ్ఛృంఖలులై ప్రవర్తించుటయుఁ గలదనియు నట్టిప్రయోగములను బ్రమాణీకరించికొని శాస్త్రవ్యవస్థ నేర్పరచుటకు వీలు లేదనియు, నట్టిప్రయోగములు శాస్త్రానను గృహీతములగుచో నసాధువులేయనియుఁ, గవులు నిరంకుశులని చెప్పుటలోనే పైఛందోదృష్టాంతము చూపఁబడినదనియు, నట్టిఛందస్సు నన్ని విధముల దృష్టాంతీకరించుచో "నహ్యేషా ఇష్టిః" అను భాష్యమసంగతమే యగుననియుఁ బైకైయటమునకుఁ దాత్పర్యమై యున్నది. పైభాష్యకైయటములనుబట్టి కవిప్రయోగములైనను నెంతవఱకు శాస్త్రానుగృహీతములగునో యంతవఱకే ప్రమాణభూతములగునవనియు, నెప్పుడయ్యవి శాస్త్రము ననుసరించియుండవో యప్పుడయ్యవి ప్రమాణములే కావనియు మనము నిర్ణయింపవచ్చునుగదా. ఇఁకఁ గావ్యములలోఁ బాణినీయాననుగృహీతములై యసాధువు లనఁదగు నే ప్రయోగములో కొన్నికలవని చూపి యవ్వాటిని సాధించుటకుఁగా మఱియొక వ్యాకరణము గావలసియున్నదను శ్రీ. శాస్త్రిగారి వాదమునకు మన ముత్తరవాదులము గావలసిన యవసరము లేదు ఇది యిటులుండ పై భాష్యకైయటములనే ప్రమాణీకరించికొని పాణినీయము కావ్యభాషా శాసకముగాదని శ్రీ శాస్త్రిగారు వ్రాయుసాహసించిరి. మహాభాష్య ధోరణి యటులుండ శ్రీ శాస్త్రిగారి వాదమును గైయటుఁడైన నంగీకరించువాఁడసునో? గావ్యభాషానుశాసకమే కాని యీవ్యాకరణమునుఁబట్టి పైరీతి "అసాధవ ఏ నైవమాదయః" అని వ్రాసియుండఁడు గదా? భాష్యకారుఁడైనను "సోఽప్యదోష భవతి" అని మఱిఁ దానాప్రయోగమును ("బ్రాహ్మణేభ్యః ప్రియాఖ్యేభ్యః" అనుదానిని) సమర్థించియుండఁడు. ఇంతయేల, "ఘుషి రవిశబ్దనే" అను సూత్రమున "కి మేతస్య జ్ఞాపనే ప్రయోజనమ్" "మహీపాలవచశ్శ్రుత్వా జుఘుషుః పుష్యమాణవాః" అనియు "కర్మణో రోమన్థతపోభ్యాం వర్తిచరోః" అను సూత్రమున "కథం తపస్యతో లోకజిగీషు రగ్నిః" అనియు "షపాన్మత్ర్త) కరణే" మొదలగు సూత్రములతో "బహూనా మప్యచిత్తానా మేకో భవతి చిత్తవాన్, పశ్య వానర సైన్యేఽ

స్మిన్ య దర్క ముపతిష్ఠతే" "మైనం మంస్థాస్య ...... ఏషోఽపిహి యథావయమ్" "ఏతదప్యస్య కాపేయం యదర్క ముపతిష్ఠతి" "వరతను సంప్రవదంతి కుక్కుటాః" "జఘాన కంసంకిల వాసుదేవః" "ఆశ్మన్మురి శ్చరతి యాథ మసేవమానః" "అసిద్వితీయోఽనుససార పార్థమ్" అనియు రామాయణ భారత భాగవతాదులలోని ప్రయోగము లెన్నెన్నియో భాష్యమున సాధింపఁబడియున్నవి. ఇట్టిప్రయోగసాధన మేపాణినీయము కావ్యభాషానుశాసకమని వేనోళ్ల నుద్ఘోషించుచున్నది. ఇది యిట్లుండ శ్రీశాస్త్రిగారు "వైదిక కర్మోపయోగి శిష్టవ్యవహార భాష" యనియుఁ "గావ్యభాష" యనియు రెండుభాషలను వేర్కొని మొదటిదానికే పాణినీయ మనుశాసకమై యున్నదనియు రెండవదానికిఁ బాణినీయ మనుశాసకమై యుండలేదనియువ్రాసిచ్చిరి. కాని పైన మేము చెప్పినరీతిని గావ్యభాషయు శిష్టసంప్రదాయమూలకమే యగుటచేఁ దద్వ్యతిరిక్తముగాఁ గావ్యభాష యొకటి లేదనుట సిద్ధాంతితము. కవులశిష్ట సంప్రదాయమునే మూలముగాఁ గొని వచ్చుచు మానవ సహజములగు భ్రమ ప్రమాదముల వలన నెచ్చటనో యొకచోట శాస్త్రానను గృహీతములగు ప్రయోగములను బ్రయోగించినయంతమాత్రమున నాభాష కొక వైలక్షణ్యము గలిగిన దనుకొని యదియొక భాషా విభాగముగా నంగీకరించి యద్దాని కొక వ్యాకరణము గావలయుననుట న్యాయ్యముగాదు. ఇటులు సూక్ష్మ సూక్ష్మభేదములనుబుచ్చికొని భాషావిభాగము నేర్పఱుపఁదలఁచినచో స్తోత్రభాషయనియు నార్ష భాషయనియుశాస్త్రభాషయనియు నాటకభాష యనియుఁ బత్త్రికాభాష యనియు నెన్నెన్నియో విభాగములు కలుగవలసియుండును. ఆయాభాషల కొక్కొక్క వ్యాకరణమును నావశ్యకమనవలసివచ్చును. ఇదియేగాక 'వైదికకర్మోపయోగిభాష' కే పాణినీయ మనుశాసకమగునాఁడు తత్కర్మోపయోగి పదజాలమును మాత్రమే పాణినీయ మనుశాసింపవలసియుండ వైదికకర్మోపయోగికాక లోకవ్యవహారములో సుప్రసిద్ధముగానున్న శబ్దజాతమును రామాయణ భారతాది ప్రాచీన వాఙ్మయములోని 'దాశరథిః' 'కైకేయీ' 'దుర్యోధనః' 'దుర్మర్షణః' మొదలుగాఁగల యనంతమగు పదజాతమును సాధింపనేల? పోనిండు.

శ్రీశాస్త్రిగారు వ్రాసినట్లు మునిత్రయమువారు తమ నాఁటికే ప్రాచీనముగా నేర్పడియున్న కావ్యపురాణేతిహాసాదులలోని ప్రయోగముల ననేకముల సాధింపకుండుటచే నియ్యది తదనుశాసకముగాదని మన మంగీకరించెదమనినను నట్టి ప్రయోగములేవియుఁ గానిపింపకున్నవి. ఇఁక శాస్త్రిగారు తలఁచినట్టి 'సీతాయాఃపతయేనమః' మొదలగు నార్షత్వాత్సాధువులనఁదగు ప్రయోగములన్నియో ప్రమాదపతితము లగుటచే మనకు గ్రాహ్యములు కావు. ఆకవి యాగ్రంథమున నట్టి ('పతయేవంటి') ప్రయోగములను దద్వ్యతిరిక్తములగు (శాస్త్రాననుగృహీతములగు 'పత్యై'వంటి) ప్రయోగములను నెన్నిసారులు ప్రయోగించెనో మన మెంచి బహుళదృష్టితో వీక్షించినచో నట్టి (శాస్త్రాననుగృహీతములగు) ప్రయోగము లేకొలఁదిగానో కానిపించుటయే మన కయ్యవి ప్రమాదపతితములనుటకు నిదర్శనము కానోపును. ఏవి ప్రమాదపతితములో యవి గ్రాహ్యములుకావని పతంజలి భగవానుఁడే "య స్త్వప్రమత్తగీత స్తత్ప్రమాణమ్" అని చెప్పియున్నాఁడు. ఇట్టిస్థితిలో సకలభాషాపరిశోధకాగ్రేసరులగు సుప్రసిద్ధవైయాకరణులును, సకలవిద్యాపారంగతులగు నాలంకారిక శిరోమణులును, విమతవాది దుర్వాదనిర్వాపణ పటిష్ఠులగు నైయాయిక చూడామణులును, సాంగోపాంగవేదవిజ్ఞాన సంపన్నులగు మీమాంసకోత్తములును, దత్త్వనిర్ణాయకులగు వేదాంతవేత్తలును, మఱియునెందఱో తదితరమతస్థులును పాణినీయము సకల సంస్కృతవాఙ్మయానుశాసకమని సుస్పష్టముగాఁ దమ గ్రంథములలో నాఁటినుండి నేఁటివఱకును నుద్ఘోషించుచుండ నవియెల్లను భ్రమమూలకములని వ్రాసిన వ్రాఁతలకు లోక మాశ్చర్యపడవలసియున్నది. ఇఁక "పృషోదరాదీని యథోపదిష్టమ్" అనుసూత్రమును దద్భాష్యమును మూలముగాఁ గొని తామేర్పఱిచికొనిన 'శిష్టవ్యవహారభాష' "యజ్ఞకర్మణి సనియమోఽన్యత్రానియమః, యాజ్ఞే కర్మణి పున ర్నాపభాషన్తే" (మహాభాష్యము ౧ అధ్యా.

౧ పా. ౧ ఆహ్ని.) అను భాష్యమునుబట్టి వైదిక కర్మోపయోగిగాఁ గానిపించుచున్నదని తలంచి పైనుదాహరించిన మొదటి విభాగమును శ్రీ శాస్త్రిగారంగీకరించిరని మన మూహింపవచ్చును. ఇదియేగాక “మ్లేచ్ఛా మాభూమే త్యధ్యేయం వ్యాకరణమ్... దుష్టాఞ్ శబ్దాన్ మాప్రయుక్ష్మహి త్యధ్యేయం వ్యాకరణమ్, నమ్లేచ్ఛితనై, నాపభాషితనై, మ్లేచ్ఛోహవా ఏష యదపశబ్దః” మొదలగు వాక్యములను బుఱస్కరించుకొని కొందఱు “అపశబ్దం ప్రయుఞ్జానో రౌరవం నరకంవ్రజే” త్తని కావ్యకర్తలు నరకదండమును విధించియుండిరనియు వారుదాహరించిన పై ప్రమాణవాక్యములెల్లను “యజ్ఞకర్మణి సనియమో ఽన్యత్రానియమః ... యర్వాణ స్తర్వాణో నామ ఋషయో బభూవుః, ప్రత్యక్షధర్మాణః పరాపరజ్ఞాః విదితవేదితవ్యా అధిగతయాథాతథ్యాః తే తత్రభవన్తః యద్వానస్తద్వాన ఇతి ప్రయోక్తవ్యే యర్వాణస్తర్వాణ ఇతి ప్రయుఞ్జతే, యాజ్ఞే పునః కర్మణి నాపభాషన్తే” అను భాష్యమునుబట్టి శ్రౌతస్మార్తాది పుణ్యకర్మ విషయకములే యగుటచేఁ బైవారివాఁ మజ్ఞతామూలకమే యనియు వ్రాసిరి. శాస్త్రిగారీ భాష్యమును మాత్రమే యాఁతగాఁగొని వ్రాసిన వ్రాఁత లెంతవఱకు సమంజసములో విమర్శింతము, మహాభాష్యకర్త “ఏకశ్శబ్ద స్సమ్యగ్జ్ఞాత శ్శాస్త్రాన్విత స్సుష్ఠుప్రయుక్తస్స్వర్గే లోకే కామధుగ్భవతి” అను శ్రుతికి నర్థనిర్ణాయకములగు “జ్ఞానే ధర్మఇతిచే త్తథాఽధర్మః” మొదలగు వార్తికముల వ్యాఖ్యానించు సందర్భమున సాధుశబ్దజ్ఞానముననే ధర్మము సిద్ధించునా, లేక సాధుశబ్దప్రయోగముననే తత్సిద్ధియా, లేక శాస్త్రజ్ఞానపూర్వకసాధుశబ్ద ప్రయోగముననా యని విమర్శించుచు మొదటిరెండు పక్షములలోను దురుద్ధరములగు కొన్ని దోషములు గానిపించుచుండుటచే నయ్యవి సిద్ధాంతితములు గావని నిరాకరించి “శాస్త్రపూర్వకే ప్రయోగేఽభ్యుదయ స్తత్తుల్యం వేదశబ్దేన” అనువార్తికము ననుసరించి మూఁడవపక్షమునే సిద్ధాంతీకరించెను. తరువాత మరల “అథవా పున రస్తు జ్ఞానఏవ ధర్మః” అని చెప్పి మొదటఁ దాను సిద్ధాంతితములుగావని నిరాకరించిన పక్షములలో నొకటియగు “జ్ఞానేధర్మః” అను పక్షమునే మరల స్వీకరించెను. అప్పుడు పూర్వపక్షియుఁ దాను మొదటనుద్ఘాటించిన దోషములలో నొకటియగు “ఆచారే నియమః” అనుదోషమును జూపించెను. అప్పుడు దానిని సమర్థించుట కేవలవును గానక భాష్యకారుఁ డీ పైభాష్యము నుదాహరించెను. మొట్టమొదట దోషభూయిష్ఠమగుటచే సిద్ధాంతితమే కాదని నిరాకరించియు మరల నాపక్షమునే గ్రహించుటనుబట్టి పరిశీలించినచో “తుష్యతు దుర్జనః” అను న్యాయమునో, యీ పక్షమునైనను మేము సమర్థించి నిలుపఁజాలుదు మను తమ యుక్తిని నేర్పును వెల్లడించుటకుఁగానో తా నీపక్షము నుపన్యసించెనని తోఁపక పోదు. “అథవా పునరస్తు జ్ఞాన ఏవ ధర్మః” అను రచనయు దీనినే దృఢీకరింపఁజాలియున్నది. అదియేగాక “యదేవ విద్యయా కరోతి తదేవ వీర్యవత్తరం భవతి” అను శ్రుత్యనుగృహీతమగు “సర్వత్రైవహి విజ్ఞానం సంస్కారత్వేన గమ్యతే, పరాఙ్గం చాత్మవిజ్ఞానా దన్యత్రే త్యవధార్యతామ్” అను ప్రామాణికోక్తి ననుసరించి యాత్మవిజ్ఞానమునకన్న నతిరిక్తమగు విజ్ఞానమెల్లను పరాంగమై సంస్కారి గావలసియుండఁగా శ్రుత్యనుగృహీతమగు తత్ప్రామాణ్యమునుగూడ వదలి విజ్ఞానము నంగిగా నొనరించి సంస్కార్యముగాఁ జేయవలసివచ్చుటయుఁ బైపక్షము సిద్ధాంతితము గాదనుటకు నిదర్శనమైయున్నది. ఇదియేఁగాక జ్ఞానమాత్రమునకే యభ్యుదయకారిత్వ మంగీకరించుచో సర్వత్ర యనుష్ఠానమునకు నైయర్థ్యము తప్పకున్నది. పైపక్షములకెల్లను మూలమగు “ఏకశ్శబ్ద స్సమ్యగ్జ్ఞాత శ్శాస్త్రాన్విత స్సుష్ఠుప్రయుక్త స్స్వర్గే లోకే కామధుగ్భవతి” అను పైశ్రుతియు జ్ఞానపక్షమును విరోధించుచున్నది. పైశ్రుతి “సుష్ఠుప్రయుక్తః” అని చెప్పుచు సాధుశబ్దము సమ్యగ్జ్ఞాతమై శాస్త్రానుగృహీతముగాఁ బ్రయోగింపఁబడునప్పుడే ధర్మజనకమగునని ముక్తకంఠముగా నుద్ఘోషించుచుండ సాధు శబ్దజ్ఞాన మాత్రమే యభ్యుదయ కారియనుట యీ శ్రుతికి విరుద్ధమనక తీరదు. పోనిండు, మొట్ట

మొదట భాష్యకర్త చూపిన మూఁడవపక్షము (సాధుశబ్ద జ్ఞానపూర్వక ప్రయోగముననే ధర్మోత్పత్తియను పక్షము) "శాస్త్రపూర్వకే ప్రయోగే అభ్యుదయ స్తత్తుల్యం వేదశబ్దేన" అను వార్తికానుసృతమై యుండుటచే నయ్యది వార్తికకార మతము మాత్రమే యయియుండు ననియు దాని ననుసరించియే మొదటి రెండుపక్షములును నిరాకరింపఁబడి మూఁడవపక్షము స్థాపింపఁబడి యున్నదనియుఁ దరువాత భాష్యకర్త సిద్ధాంతితమగు తన మతమును నిరూపింపఁదలఁచియే తా నీపక్షమును మరల స్వీకరించెననియుఁ జెప్పుట కెవ్వరైనను సాహసింపవచ్చును. కాని భాష్యకారునికి వార్తికకారుని మత మంగీకరణీయమే కానిచో స్వమత స్థాపనమనునది పరమత నిరాస పూర్వకమే యగుటచే భాష్యకారుఁడు వార్తికకృన్మతమును ఖండింపవలసినవాఁ డగుచున్నాఁడు. ఎట్టి మత స్థాపకుఁడును బరమతమం దేదియో తన కరుచి యుండుటవలననే గదా తదతిరిక్తమగు నొకమతమును దా నాశ్రయింపవలసిన వాఁడగుచున్నాఁడు. అట్టియరుచియేదియు వార్తికకార మతమున భాష్యకర్త సూచింపకుండుటయే యిది భాష్య మతము కాదనుటకుఁ బ్రబల నిదర్శనమైయున్నది. ఇదియేగాక "యాజ్ఞే పునః కర్మణి నాపభాషన్తే" అను భాష్యమును బురస్కరించికొని శ్రీ శాస్త్రిగారివాదమే సిద్ధాంతమని యంగీకరించుచో బూర్వోత్తర భాష్యము లెన్నియో విరోధించుచున్నవి. ఈభాష్యమునకు మునుముందు వ్యాకరణ ప్రయోజన నిరూపణ సందర్భమున "యస్తు ప్రయుఙ్క్తే కుశలో విశేషే శబ్దాన్ యథావ ద్వ్యవహారకాలే, సోఽనన్త మాప్నోతి జయం పరత్ర వాగ్యోగవి ద్దుష్యతి చాపశబ్దైః" అను కాత్యాయనుని శ్లోకమును బ్రమాణముగాఁ దీసికొని దానిని జాలవఱకు విమర్శించి యపశబ్ద ప్రయోగము దోషదూషితమనియు సాధుశబ్ద ప్రయోగ మభ్యుదయ కారి యనియు సామాన్యాకారముగానే స్థాపించెను. పై శ్లోకమున "వ్యవహారకాలే" అని చెప్పఁబడి యుండుటచే నపశబ్ద ప్రయోగము సర్వత్ర దోషదూషిత మనుట స్పష్టీకృతము. దీనికి నిదర్శనముగా "అజే ర్వ్యఘఞపోః" అను సూత్రమున సూతవైయాకరణ సంవాదమొకటి యుదాహరింపఁబడియున్నది. ఈసంవాదమును బట్టి చూచుచోఁ గావ్యములలో నన నేల సామాన్య వ్యవహారములో సయితము నపశబ్ద ప్రయోగము దోషదూషితమని తోఁపకపోదు. ఈసంవాదమును బట్టియే పైశ్లోకములోని "వ్యవహారకాలే" అనుదానికి 'యజ్ఞవ్యవహారకాలే' అని సంకోచింపఁజూచుటయు న్యాయదూర మనకతప్పదు కావునఁ బూర్వోత్తర భాష్యములు "యాజ్ఞే కర్మణి పున ర్నాపభాషన్తే" అను భాష్యమునకు విరుద్ధములనుట సత్యదూరము కాదు. ఒకవేళ పై భాష్యము సిద్ధాంత భాష్యమేయని యంగీకరించినను పక్షాంతరోపపాదకమే యగుటచే శ్రీ శాస్త్రిగారి వాదమునకుఁ బ్రబలప్రమాణము కానేరదు. "యద్వానః, తద్వానః" అని ప్రయోగించుటకు బదులుగా "యర్వాణః తర్వాణః" అని ప్రయోగించుచుండిరిగాన నాకాలములోనివారు వారిని యర్వాణులనియుఁ దర్వాణులనియుఁ బిల్చుచుండిరని పైభాష్యము వలననే విశదపడుచుండుటచే వ్యవహారములో సయిత మపశబ్దప్రయోగ మప్పుడును నాక్షేపాపాదకముగానే యుండెననుటకు సంశయము లేదు. ఇట్టిస్థితిలోఁ బైభాష్యము నాధారముగాఁగొని పాణినీయము వైదికకర్మోపయోగి భాషామాత్రానుశాసకమే యని నిరూపించుటయు "అపశబ్దం ప్రయుఞ్జానో రౌరవం నరకం వ్రజే"త్తని విజ్ఞులు వ్రాసినవ్రాఁత లజ్ఞతామూలకములని యుపపాదించుటయు నెంతవఱకుఁ దగియున్నవియో విమర్శించుటకుఁగాఁ బండితలోకమునకే వదలి శ్రీ శాస్త్రిగారు ప్రామాణికులని యంగీకరించిన మునిత్రయమువారైనను దమవాదమున కేమాత్ర మనుకూలురుగా నున్నారో విమర్శించి చూపెదను.

(సశేషము)

# మధురదేవాలయమందలి రూపశిల్పము

కళయొక్క వాస్తవికతను హిందూమతము సమ్మతించుటలేదని ఒక ప్రవాద మేర్పడి పోయినది. దీని కుపబలకముగా శుక్రాచార్యుని శ్లోకమొకటి గలదు. దాని సారాంశ మిది:

"చిత్రకారుడు దేవతాప్రతిమలను చిత్రించుట చాలమంచిదే. కాని మానవ రూపములనుమాత్ర మతడు చిత్రింపరాదు. అది చాలదోషము."

అనాకారిగా నున్నప్పటికిని దేవతా ప్రతిమకు బాధలేదట గాని, ఎంత ఆకారిగా నున్నను మానవ విగ్రహము దూష్యమట. ఈ సిద్ధాంతమున కర్థమేమైయుండును? ఆదర్శ రూపములయొక్కయు, సాంకేతిక రూపములయొక్కయు చిత్రణములకంటెను అనుకరణము, రూపచిత్రణము అనునవి హీనములనియే కదా! శుక్రాచార్యుని పద్ధతిమేరకు చూచినచో చిత్రకారుడు రూపమును రూపముగా గాక దివ్యత్వసమ్మిళితముగా ప్రదర్శించుటలోనే దృష్టి యుంచవలయునని తెలియుచున్నది. ఈ వాదమును పురస్కరించుకొనియే డా: వి. ఏ. స్మిత్తుగారు "ఇండియాలో చక్కని, శాస్త్రసమ్మతమైన రూపవిగ్రహములే అరుదైపోయిన"వని చెప్పజాలిరి. ఇది వాస్తవముకానే కాదు. మధుర దేవాలయము యొక్కటే రూపశిల్పసంపద కొక గొప్ప ప్రదర్శనాలయమై వెలయుచున్నది. దక్షిణహిందూ



విశ్వనాథనాయకుడు

దేశమందలి దేవాలయములను కొంచెము పరిశీలనగా చూచినయెడల రూపశిల్పకళయందుగూడ భారతీయ శిల్పి యూరపు శిల్పిని తలదన్నగలుగుచున్నాడని నిక్కచ్చిగా తెలియగలదు. భారతీయ శిల్పి రూపముయొక్క సత్యాంశయందే నిమగ్నుడైన



తిరుమలనాయకుడు : అతని రాణులు

మాట వాస్తవమే, కాదనము. కాని అవసరము వచ్చినప్పుడు, అనుకొన్నప్పుడు అతడు అనుకరణకళయందు కూడ తన మహామహోపాధ్యాయత్వము ను స్థాపింపగలడనుటలో సందేహము లేదు.

మధుర దేవాలయములో వాస్తవమైన రూపప్రతిబింబము లెన్నియో యున్నవి. ఆ దేవాలయములోనికి పోయినమనకండ్లయెదుట వివిధములైన వాస్తవిక విగ్రహములు స్తంభములమీద గోచరమగును. వీరులే కాదు, రాతులే కాదు, నాట్యాంగనలే కాదు, గొల్లలే కాదు, వర్తకులే కాదు, మంత్రులే కాదు, రాజపోషకులే కాదు, భర్తురాండ్రగు రాణులే కాదు, సుప్రసిద్ధు లగు సన్యాసులే కాదు, ఎన్నెన్ని రకముల మానవ విగ్రహములో మన యెదుట సాక్షాత్కరించుచుండును. ముఖకవళిక, అంగ నిర్మాణము, వేషభూషలు, దేహసౌష్ఠవము మొదలగువానియందలి తారతమ్యములను గమనించినవారి కవి కేవల కృత్రిమ విగ్రహములు కావనియు, అచ్చుగ్రుద్దిన రూప ప్రతిబింబము లనియు స్ఫురింపగలదు. ఇందలి సత్యాసత్యములను తెలియగోరువారు తిరుమల నాయకుని వేసవిభవనమగు 'పుదుమంటపము' లోనికి వెళ్లిచూడవచ్చును. ఆ రమణీయ భవనము లో 'నాయక' వంశమువారైన విశ్వనాథ నాయకుడు మొదలు తిరుమలనాయకుని వరకు గల పదిమంది సుప్రసిద్ధ రాజుల యెదుట ముఖాముఖిగా నిలిచినట్లే యెంచుకొనజాలినంతటి రూపప్రతిబింబములు నెలకొల్పబడియున్నవి. చిట్టచివర నిలిచియున్న తిరుమలనాయకుడే యీ రూపవిగ్రహముల ప్రతిష్ఠాపనకు కారకుడైనట్లు తెలియుచున్నది. విగ్రహములన్నియు అసలుపరిమాణము గలిగియున్నవి. ఒక్కొక్కదాని యడుగునను ఆయా వ్యక్తుల పేర్లు చెక్కబడియున్నవి. తిరుమలనాయకుని లంబోదరమును, మహాకాయమును, పరిఘలవంటి భుజములును, శిరస్త్రాణమును ప్రేక్షకులకు ఆశ్చర్యాద్భుతములను గలిగించుచుండును. ఎక్కడ ఏ మూల నున్నను సరియే తిరుమలనాయకుని విగ్రహమును ఏ వీథినబోవువాడుకూడ గుర్తుపట్టగలుగుచుండుటయే అది అతని అచ్చపు రూప ప్రతిబింబ మనుటకు బలమైన నిదర్శనమగుచున్నది. మధురలోను, ఆ చుట్టుపట్టులందును ఈ తిరుమల నాయకుని విగ్ర

హములు అనేకమున్నవి. తిరుప్పరం కుండ్రములో ఒకటున్నది ; శ్రీవిల్లిపుత్తూరులో ఒకటున్నది; అళగర్ కోవెలలో ఒకటున్నది; తిరుప్పూవనములో ఒకటున్నది. ఇవి యన్నియుగూడ ఒకటేపోలికగా నుండి, భారతీయ శిల్పి అనుకరణకళనుగూడ సమగ్రముగా కైవసమొనర్చుకొనినాడని చాటుటకు చాలియున్నవి.

తిరుమలనాయకుని విగ్రహములన్నియు నొకటే పోలికగా నుండుటయు, తక్కిన విగ్రహములకును ఈ విగ్రహములకును భేదము లగుపడుచుండుటయు గమనించినచో ఈ విగ్రహములు ఆ రాజుయొక్క సరియైన ప్రతిబింబములని నమ్మ వలనుపడుచున్నది. పాఠకులు మరియొక విశేషము నీ సందర్భమున గమనింపవచ్చును. తిరుమలనాయకునికి వెనుక కనబడుచున్న అతని రాణులలోనొకామె కుడితొడలో నొకమచ్చవ్యక్తముగాపడియున్నది. జాగ్రత్తగా చూడుడు. దీనిని గురించి యొక కథ విననగుచున్నది. ఈ విగ్రహములను తయారుచేసిన సుందరఆశారి అను శిల్పి ఆ మచ్చను తెలియనీయకుండ కప్పిపుచ్చవలయునని యెంతో ప్రయత్నము చేసినాడట. కాని దానిని కప్పిపుచ్చజాలలేకపోయినాడట. వెంటనే ఆసంగతి నతడుపోయి తిరుమల నాయకుని మంత్రియగు నీలకంఠ దీక్షితులకు విన్నవించెనట. దీక్షితులు గొప్ప శివభక్తుడగుటవలన ఆమచ్చకు కారణమేమో దివ్యదృష్టితో చూచి తెలిసికొనగలిగెను. కప్పిపుచ్చ జూచినను శిల్పికి లొంగని మచ్చకు (విగ్రహమందలి) హేతువుండకపోదని యాతడూహించినట్లే యాయెను. రాణి శరీరములో నదే చోట ఒక మచ్చయుండినట్లు, విచారణచేసిన మీదట, నిజము తెలిసినది. అందువలన ఆదీక్షితులు మచ్చను మరుగుపరచవలసిన యావశ్యకత కనుపించదనియు, దాని నట్లే యుండనీవచ్చుననియు చెప్పి శిల్పిని పంపివేసెను. ఈ వర్తమానము రాజునకు తెలిసెను. తెలియగానే అతడు మంత్రి గుణముల యెడలను, భార్య పాతివ్రత్యము నెడలను వృథా సందేహపడెను. ఈకథ తర్వాత ఎట్లెట్లు ముగిసినదో మనకవసరములేదు కాని దీనినిబట్టి శిల్పకళయం దానాడు వాస్తవికత యెంతమట్టుకు అవలంబింపబడుచుండినదో, ఆ వాస్తవికతను ప్రదర్శించుటలో శిల్పులు ఎంతటి సూక్ష్మ, వికట విషయములను గూడ



మంత్రి అరియనాథముదలి



ముత్తురామఅయ్యరు : అతని భార్య

నరకుచేయకుండిరో మాత్రము తేటతెల్ల ముగా బోధపడుచున్నది. విషయమిట్లుండగా "మానవసహజములగు భావములను, ముఖ వికారములను మొదలైనవానిని ప్రదర్శిం చుటలో భారతీయకళలు వెనుకంజయే వేయుచువచ్చిన" వని స్మిత్తుగారే యాధా రముమీద చెప్పగలిగిరో బోధపడకున్నది.

స్పష్టముగా చెప్పవలసివచ్చినచో, పైని పేర్కొన్న పదివిగ్రహములును పది విగ్రహ సముదాయములని చెప్పవచ్చును. ఒక్కొక్క విగ్రహము జతలోను కొంతమంది రాణులో, ప్రియురాండ్రో కలిసియే చెక్కబడియుండుట పొడగట్టుచున్నది. ఒకటిరెండు స్తంభముల యందు రాజుగారి సంతతి ప్రతిబింబములు కూడ గలవు. కాని అన్నిటను ప్రధానవిగ్ర హమే యెక్కువముఖ్యముగా మలచబడుచు వచ్చినది. ఈ చెప్పిన విగ్రహశ్రేణిలో మొట్ట మొదటిది విశ్వనాథ నాయకునిది. అతడు 'నాయక'వంశమునకు మూలపురుషుడు. ఏడ వది కస్తూరిరంగప్ప విగ్రహము. విశ్వనాథుని విగ్రహమును రంగప్పవిగ్రహమును తార తమ్య దృష్టితో పరిశీలించినయెడల నా రెంటిలో నుండు సామ్యమో వైషమ్యమో ప్రస్ఫుటముగా తెలియును. విశ్వనాథుని విగ్ర హములో గల పరిమాణముగాని, అంగ నిర్మాణ వైఖరిగాని కస్తూరిరంగప్ప విగ్రహ ములో లేవు. ఈ రెండు విగ్రహములకును ఏమూలలోగూడ సామ్యమనునది కను పించదు.

తరువాతిది ముత్తుకృష్ణప్ప విగ్రహము. అందులో అత డొకవైపుకు చాల వంగి యుండుటచేత ప్రేక్షకుల కతని కాళ్లలో నొకటి రెక్కినదానియంత నిడుపుగలది కాదేమో యను భ్రమకూడ కలుగుచున్నది. ఈ విగ్రహము లన్నియును వంశావళివరుస చొప్పున క్రమముగా అమర్చబడియున్నవి. జీవద్విగ్రహముల వలెనే యుండవలయునను నభిలాషతో విగ్రహములకు రంగుల పూత కూడ వేసినట్లు కనబడుచున్నది. భారతీయ శిల్పుల కళావాస్తవికతను సందేహించు వారు శ్రీవిల్లిపుత్తూరు దేవాలయమందలి తిరుమలుని యొక్కయు, అతని తమ్ముని యొక్కయు రూప ప్రతిబింబ విగ్రహములను చూచుట మంచిది. ఆ విగ్రహములను చూ చిన తక్షణమే, ఎవరి అవసరము లేకుండనే, అవి నిరూపించు వ్యక్తు లొకరికొకరు దగ్గరి



ఒకానొక స్తంభపురాతు

చుట్టములై యుండవలెనని ఎట్టివారికయినను తప్పక స్ఫురించును.

ఈ విగ్రహముల వలెనే మరియొక విగ్రహముకూడ ఈ దేవాలయములో వింత గొల్పుచున్నది. అది ముత్తురామ అయ్యరు యొక్కయు, అతని భార్యయొక్కయు విగ్రహము. సన్నగ గొరిగించుకొన్న తల, విశాలమైన వక్షము, వ్రేలాడు బొజ్జ గల అయ్యరు ప్రతిమప్రక్కనే అతని భార్యప్రతిమ కూడ ఉన్నది. ఆమె, భారతీయ సౌశీల్యమే మూర్తీభవించినదో యన్నట్లు మలచబడి యున్నది. ముత్తురామఅయ్యరు విగ్రహమున కనతి దూరముననే జస్టిస్ సర్ సుబ్రహ్మణ్య అయ్యరుగారి తండ్రియగు సురవళి సుబ్బఅయ్యరు విగ్రహము గలదు. అది చాల ఇటీవలిది కాబట్టి దానినిగురించి వ్యాఖ్యానమే అవసరములేదు. ఈ దేవాలయము నిండుగా రూపశిల్పసంపద యున్నదని నిరూపించుటకే దాని ప్రస్తావ మిక్కడ వచ్చినది. ఆతరువాత విశ్వనాథనాయకుని సుప్రసిద్ధ మంత్రియగు అరియనాథముదలి విగ్రహము గలదు. అరియనాథునిని గురించి చదివి యుండువారు ఆ విగ్రహమందు శిల్పి చూపిన నేర్పును అభిమానింపగలరు. అరియనాథుని ముఖములో అలసట నెరుగని శక్తి, తరుగని కళాకాంతులు, అసమానమైన మేధా ప్రతిభలను స్పష్టముగా గోచరింపజాలి యున్నవి.

[మాడరన్ రివ్యూ]

# కాంగ్రెసుమంత్రుల మొదటి బడ్జెట్టు

గాడిచర్ల హరిసర్వోత్తమరావు

కాంగ్రెసువారు మంత్రిపదవులు స్వీకరించినారు. ఈసంభోదయము మన మద్రాసు రాష్ట్రములో కడచిన జూలైమాసము ౧౪ వ తేదిని జరిగినది. సెప్టెంబరు నెల ఆఖరు నాటివరకు రాజ్యకార్యముల కగు వ్యయములను నేటి చట్టముక్రింద గవర్నరు మంజూరు చేసియుండినాడు. అక్టోబరు మొదటి తేదీనాటికి ఆతనిమంజూరు తీరిపోవును. ఆలోపున మరి యారు మాసముల కర్చును క్రొత్త శాసనసభలు చేరి యాలోచించి తీర్మానించని యెడల వ్యవహారము జరుగుటకు వీలు లేదు. కాబట్టి అధికారమునకు వచ్చిన క్రొత్తమంత్రులు ఆగస్టు మాసాంతములోపుగ తామీయారుమాసములలో చేయ దలచుకొనిన పనిని నిర్ణయించుకొని, అందులకగు కర్చు లింత యని తేల్చి ఆమొత్తము వచ్చుమార్గము లిట్టివని స్థిరపరచుకొని సంవత్సరమంతటికిని కలిపి బడ్జెట్టును శాసనసభల యెదుట పెట్టవలసిన అవసర మేర్పడినది. అసెంబ్లీసభ్యులు ౨౧౫ గురు. కౌన్సిలుసభ్యులు ౫౫ గురు. మొత్తము ౨౭౦ గురున్నారు. వీరందరకును మంత్రు లేర్పరచిన బడ్జెట్టు — అనగా ఆదాయవ్యయముల అంచెనా—అచ్చయి సకాలమునకు చేతి కందవలెను గదా. కాబట్టి ఆగస్టు ఆరంభముననే అచ్చుకు కాగితము లిచ్చి కావలెను. ఇన్ని కారణములను బట్టి కాంగ్రెసు మంత్రులు తాము అధికారమునకు వచ్చిన ఆరువారములలో ఇదివరలో అమలులో నున్న సర్వవిషయములను మనస్సునకు దెచ్చుకొని, "ఈయీపన్నులవలన ఈయీ ఆదాయమార్గములలో ప్రభుత్వానికి ఇంతఇంత మొత్తము చేతికివచ్చుచున్నది. ఈయీబాబతులగు పనులకు ఇంతఇంతమొత్తము కర్చగుచున్నది." అనుసంగతు లన్నిటిని, ప్రతి సూక్ష్మవివరణతోను అర్థము చేసికొని తాము రాచకార్యాలలో ఇప్పటి పరిస్థితులలో ప్రజోపయోగమునకై యేమి యేమి చేయుటకు అవకాశ మున్నదో యెంతమట్టుకు మార్పులు చేయవచ్చునో నిశ్చయించుకొని లెక్కల నన్నిటిని సిద్ధము చేయవలసియుండినది. ఆర్థికమంత్రి సి. రాజగోపాలాచారిగారు—ఇతడే ప్రధానమంత్రి—చేసిన యుపన్యాసము కాక సభ్యులచేతికి అందజేసిన లెక్కలకట్ట ౫౧౬ అచ్చు అరటావుల గ్రంథ మయినదంటే మన మంత్రులు ఆరువారములలో మోసిన కార్యభారము ఎంత ఉండవచ్చునో అర్థము కాగలదు.

* * *

సర్కారువారు పెట్టే కర్చు రెండు ముఖ్యమైన బాబతులుగా వర్ణించవచ్చును. పన్నుల మూలకముగా నైతేనేమి వ్యాపారపు వైఖరిని పనిచేసి గడించే సంపాదనమూలకముగా నైతేనేమి వీరికి చెందే ఆదాయము నుంచి పెట్టే కర్చు ఒకబాపతు. డబ్బు అప్పు దెచ్చి, అడ్వాన్సులుగా తీసికొని పెట్టేటటువంటి కర్చు రెండవ బాబతు. మొదటిబాబతుది ఆనాటికానాటి ఫలంతో తీరిపోయే పనులకు పెట్టుకోతగినది. ఆనాటికానాడంటే సర్కారు పనులకు సంబంధించి ఆ సంవత్సరమని, అథవా హ్రస్వకాలమని అర్థము చేసుకోవలెను. బహుకాలముమీదట కర్చు పెట్టవలసియుండి బహుకాలముమీదట ఫలము కనుపడే విషయాలలో చేసే కర్చు రెండవ బాపతుది. అనుదినము గడనగా బొక్కసమునకు చేరే ద్రవ్యమును ఇంగ్లీషులో 'రెవిన్యూ' అంటారు. పెట్టుబడిగా వినియోగపడే ద్రవ్యమును 'కాపిటలు' అంటారు. కాబట్టి ఏ కర్చు పెట్టినా 'రెవిన్యూ'లోనుంచి పెట్టుచున్నారా, 'కాపిటలు'లోనుంచి పెట్టుచున్నారా అనే అంశము మొదట తేల్చుకావలె.

ఇక ప్రాంతీయ ప్రభుత్వమువారు—దీనికే ప్రావిన్షియల్ గవర్నమెంటు అని పేరు—పెట్టే కర్చులు ఆ కర్చులయొక్క స్వభావమునుబట్టి మూడువర్గాలక్రింద నేర్పరచుకొనవచ్చును. మొదటివర్గముక్రిందికి వచ్చే కర్చు విశేషభాగము ఇదివరకే నిశ్చయ మయిపోయినది. అన్ని జిల్లాలలోని ఆఫీసరుల జీతాలు, బత్తాలు, వారిసిబ్బందీ, వారి ఆఫీసుల కర్చులు, ప్రాంతీయప్రభుత్వానికి చెందిన అన్ని డిపార్టుమెంటుల ఆఫీసర్ల జీతములు, బత్తెములు, సిబ్బందీ వగైరాలు, కరణము మునసబులు వగైరా జిల్లాలలోని ఇతర నౌకరుల జీతము బత్తెములు ఇవియన్నియు నొకవిధమైన కంట్రాక్టులో చేరియుండును. అదేపనిగా కొన్ని హోదాలే కొట్టివేసినప్పుడుగాని నూటి కింత తగ్గించవలసినదని సవ్యముగా తీర్మానించినప్పుడుగాని ఇవి సంవత్సరమునుండి సంవత్సరమునకు రమారమిగా నొకటే రీతిని స్వస్వరూపమున ప్రత్యక్ష మగుచుండవలసినవే. ఇంక్రిమెంటలు స్కేళ్లు—అనగా సంవత్సరమున కొకసారి యింతేసి పెరుగవలసిన దని ఏర్పడిన జీతాల దర్జాలు—ఉన్నచోట్ల ఈ మొత్తము వృద్ధి అగుచునే యుండును. అంతేకాక, ఇప్పటి ప్రభుత్వ విధానమున పైదర్జాయుద్యోగుల జీతాలు—ఐ. సి. యస్., ఐ. ఎమ్. ఎస్. వగైరాలవి—శాసనసభవారికి అంటరానివి. కాబట్టి వానివిషయములో కోతలు పెట్టడము సాధ్యము కాదు. ఇతరజీతములలో కాంగ్రెసు మంత్రులు నూటికి ౨౫ మొదలు ౩౦ వరకు కోతలు పెట్టదలచినారు కాని ఆవిషయ మాలోచనయం దున్నది. ఈలోపుగ మంత్రులు తాము రు. ౫౦౦ ల జీతము తీసికొనుటను ఉదాహరణముగా కంటియెదుట జూపి ప్రజాక్షేమమునకయి యితరోద్యోగస్థులును ఐచ్ఛికముగా జీతములు తగ్గించుకొనవలసినదని సహృదయులకు (మన) బీదలపరముగా వేడికోలు చెల్లించుకొన్నారు. ఈ వేడికోలు ఫల మింతత్వరలో తేలునదికాదు కాబట్టి అది ఈబడ్జెట్టులో కనుపడదు. రెవిన్యూలోనుంచి కర్చుపెట్టుతూ సంవత్సరాలతరబడిని జరుగవలసిన కార్యక్రమము ఇదివరలో మంజూరై పోయినది ... యుండును. ఉదాహరణము తీసికొని చూతము. పంటనీటివసతులు—దీనినే ఇరిగేషన్ అందుము—కొన్ని రివిన్యూలెక్కలోనుంచే చేయుడము కలదు. అవి ప్రాత ఇరిగేషన్ పనులకు హెచ్చువిలువను కలుగజేసే రిపేరీలు పునర్నిర్మాణాలువగైరాలు కావచ్చును. లేదా కొద్దిమొత్తముతో సాగగల ప్రత్యేకపు పనులైనను కావచ్చును. ఉత్తరగోదావరి సర్కిలులో అన్నవరముగ్రామములో కుంటకట్టడము ఒక ఐటెముగా నేటి బడ్జెట్టులో కన్పించును. అదే ప్రకారముగా చిత్తూరు ఇరిగేషన్ జిల్లాలో పెద్దచెరువు పునర్నిర్మాణముకూడ కన్పించును. మొదటిది గోదావరి డెల్టాపని. రెండవది ప్రత్యేకముపని. రెంటికిని ఎస్టిమేట్లు ఎన్నడో తయారైనవి. ఒకటి రు. ౨౨,౩౦౦ లు. రెండవది రు. ౧౨,౮౦౦ లు. పని యారంభమైనది, ౧౯౩౫-౩౬, ౧౯౩౬-౩౭ లలో కొంత కర్చుకూడ జరిగినది. ఇట్టిపనికి ఇంకను పెట్టవలసిన సొమ్ము పెట్టక యేమిచేయుగలరు? ఇట్టివియే యితర డిపార్టుమెంటులలోను ఉండును. ఉదాహరణము మలేరియా నిర్మూలనోపాయముల యాలోచన విశాఖపట్టణముజిల్లాలో ఆరంభించినారు. పని యారంభించినారు. జరుగుచున్నది. పూర్తియగువరకు కర్చుపెట్టక తీరదు. ఇట్లే పెట్టుబడిసొమ్మునుండి వ్యయపరచే బాబతులలో కూడ ఇదివరకే నిర్ణయమై చాల్తీగా కర్చుపెట్టితీరవలసినవి ఉన్నవి. ఈబాబతులు ముఖ్యముగా ఇరిగేషను లోను, కట్టడములలోను కన్పించును. కావేరీ-మెట్టూరు ప్రాజెక్టు ఇట్టిది. ఇక ప్రత్యేకము క్షామనిధి యొకటి ప్రాంతీయప్రభుత్వమువారి చేతిలో నున్నది. అం దిదివరకు తప్పక నలువది లక్షలు నిలువయుండేది. క్రొత్త చట్టముచేత ఆమితి అరువదిలక్షలు చేసినారు. అందులోనుంచి కొన్ని ఇరిగేషన్ పనులు ఇదివరకే ఆరంభించినవి కలవు. తిప్పాయపాలెం ప్రాజెక్టు అట్టిది. ఇటువంటి అన్ని బాపతులలో గవర్నమెంటువారు ఇదివరకు జరిగిన కార్యక్రమమును ముందుకు సాగించవలసినదే. ఈకార్యక్రమమును బడ్జెట్టులో పార్టు I స్కీము ... మొదటివిభాగము స్కీములన్నమాట.

క్రొత్తగా ఆ సంవత్సరములోనే ఆరంభించి చేయుట కేర్పరచే కార్యక్రమము—ముందుకు కొన్ని సంవత్సరములవరకు ఆ కార్యక్రమము సాగవలసినదే యైనా—పార్టు II స్కీములలో చేరుతురు.

కాని ఇది సత్యమును బయటపెట్టే విభాగము కాదు. ఎందువలన నందురా? పార్టు I స్కీములలో విద్యావిధానము, ఆరోగ్యము, వైద్యము, వ్యవసాయము, పశుచికిత్స, పరపతిసంఘములు, పరిశ్రమలు వగైరాలకు ఎక్కువగా చేసే వ్యయమంతయు ఇమిడిపోవును. నిజమునకు, ఒకొకప్పుడు, పార్టు II స్కీములు క్రొత్తరోడ్లు, కట్టడములు వగైరాలు—కొంత ఆపివేసి— ఈ సంవత్సర మట్టులే ఆపినారు —పార్టు I స్కీములను బలపరచవలసిన యావశ్యక ముండును. కాబట్టి ఈ సంవత్సరము క్రొత్తమంత్రులు బడ్జెట్టును తయారుచేయడమునందు క్రొత్తగా పెట్టే అన్నివిధము లయిన కర్చులు శెక్రటరీగారిచేత సిద్ధము చేయించి ప్రకటింపించినారు. ఆ వివరములన్నిటిని ఇచ్చు నిచ్చుటకురాదు. తెలిసికొనగోరువారు ౧౯౩౭-౩౮ వ సంవత్సరపు బడ్జెట్టు మెమోరాండములో ౧౫౨ పేజీ మొదలు తుదివరకును చూచుకొనవచ్చును. ఈవిధమైనట్టి మొత్తపుకర్చు ఒకే పర్యాయము పెట్టదగినది రు.౫౦,౪౮,౨౦౦ లున్నూ, ప్రతిసంవత్సరమును పెట్టదగినది రు. ౪,౩౯,౧౦౦ లును అంచెనావేసి ౧౯౩౭-౩౮ లకు మొదటిబాపతు రు. ౧౧,౫౭,౩౦౦ లును, రెండవ బాపతు రు. ౨,౧౩,౨౦౦ లును, మంజూరు కోరినారు. ఇది సాధారణపు రివిన్యూలోనుండి నిర్వహించే కార్యవర్గము. పెట్టుబడి సొమ్ములోనుంచి నిర్వహించే కార్యాలకు మొత్తము అంచెనా ఒకేపర్యాయము కర్చుపెట్టదగినది రు. ౫౧,౭౯,౪౮౦ అంచెనావేసి రు ౨౦,౨౭,౨౦౦ మంజూరు కోరినారు. మంజూరు కోరిన మొత్తములలో ఏయేడిపార్టుమెంటు కెంతెంత చెందినదో తెలిసికొనుట యవసరము.

* * * *

జైళ్ల డిపార్టుమెంటులో సాలీనా బాపతు క్రింద రు ౫౩,౧౦౦ లు . ఒకే[illegible] బాపతు క్రింద రు. ౩౦౦ లు కోరినారు. ఇందులో రు. ౫౦,౦౦౦లు సాధారణ ఖయిదీలకు మజ్జిగ పోయించుటకు కోరినది. పరిశ్రమలక్రింద ఒకేమొత్తము బాపతు రు. ౨,౨౯,౧౦౦ లు ప్రతిసంవత్సరపు కర్చు బాపతు రు ౨౦౮ లు కలదు. ఇందులో రెండు లక్షల రూపాయలు ప్రత్యేకము చేతినూలు వడుకు పరిశ్రమను ప్రోత్సాహపరచుటకు నియమిత మైనది. చిల్లర డిపార్టుమెంటులలో మొత్తముగా వ్యయపడే బాపతు రూ. ౧,౨౬,౬౦౦ లును, సాలీనా వ్యయము బాపతు రూ. ౧౯,౯౦౦ లును కన్పించును. ఇందులో రేడియోలు పల్లెటూళ్లలో పెట్టుటకు రు. ౧౦,౦౦౦ లు చేర్చినారు. లేబరు డిపార్టుమెంటు వారు త్రవ్వించే బావులు వగైరాలకు రు. ౧,౩౩,౦౦౦ కోరినారు. గుంటూరు శ్రీకృష్ణాశ్రమమునకు సంవత్సరమునకు రు. ౧౦౦ ల గ్రాంటు ఇవ్వదలచినారు. చదువులక్రింద మొత్తపుకర్చు గ్రాంటులు రు. ౧,౪౫,౮౦౦ లును సాలీనా వ్యయపు బాపతు రు. ౪౪,౨౦౦ లును గోచరించును. ఇందులో రు. ౧,౬౫,౬౦౦ లు యూరోపియనేతర ప్రైవేటు స్కూళ్లు, కాలేజీలు, స్పెషలు స్కూళ్ల ఎక్విప్మెంటు గ్రాంటులకొరక యేర్పడినది. ఆరోగ్యము క్రింద మొత్తపుకర్చు గ్రాంటులు రు. ౪,౪౨,౫౦౦; సాలీనా వ్యయముక్రింద రు. ౧,౧౦౦ లు కలదు. ఇందులో రు. ౧,౫౦,౦౦౦ లు గ్రామసీమలలో మంచినీటివసతులు కల్పించుటకు, లోకలుబోర్డులకు గ్రాంటు లిచ్చుటకు ప్రత్యేకించినారు. వారును సమభాగ మియ్యవలసి యుండురు కావున ఇవి మూడులక్షలగును. ఇది గాక తెలుగు దేశమునకు సంబంధించినవరకు కడప, గుంటూరు, బెజవాడ త్రాగుడునీటి సరఫరా లభివృద్ధి చేయుటకు రు. ౫౦,౦౦౦లు, రు. ౨౪,౦౦౦లు, రు. ౬౫,౦౦౦ లును, తిరుపతి మునిసిపాలిటీ మురుగుడు కాలువల నిర్మాణమునకు రు ౨౩,౮౦౦ లు. విశాఖపట్టణము ఏజెన్సీలోను హూస్పేట మునిసిపాలిటీలోను మలేరియానివారణకు రు. ౧,౦౦౦లు, రు.౫౦౦లు మంజూరు కోరినారు. మంత్రి డాక్టరు రాజన్ గారు 'పల్లెటూళ్లో, పల్లెటూళ్లో' యని [illegible] క్రొత్తకర్చు నాలుగు

లక్షల నలువది రెండున్నరవేలలో మూడులక్షలకు పైబడి పట్టణమాసములకే వ్యయమగుచున్నది. వైద్యము క్రింద మొత్తపువ్యయము బాపతు రు. ౧,౦౪,౯౦౦ లును, సాలీనా రు. ౫౭,౮.౦౦ లును క్రొత్తవ్యయముగా చూపినారు. ఇందులో రూరల్ డిస్పెన్సరీలకు గ్రాంటులకు కోరిన రు. ౨౯,౧౦౦ లు తప్ప రమారమి తక్కిన మొత్తమంతయు కూడ పట్టణమాసములకు చెందినదే. కాని పట్టణమానపు ఆస్పత్రులు పల్లెటూరి వారికిని ఉపయోగకరములే యనినను డాక్టరు రాజన్‌గారన వచ్చును. పెట్టుబడి బాబతుక్రింద ఎలెక్ట్రిసిటీస్కీముల కయి రు. ౨,౧౫,౫౦౦ లు మంజూరు కోరినారు. అందులో తెలుగు దేశమునకు సంబంధించిన దేదియు కన్పించదు. వడ్డీకి అప్పులుగాను అడ్వాన్సులు గాను ఇచ్చేకర్చు మొత్తము రు. ౨౦,౨౭,౦౦౦. ఇందులో బెజవాడ నీటి సరఫరాకు రూ. ౭౫,౦౦౦ లు, ఎలెక్ట్రిసిటీకి రు. ౨౬,౨౦౦ లు, కడప, గుంటూరు నీటిసరఫరాస్కీములకు రు.౨౪,౦౦౦లు, రు. ౫౦,౦౦౦ లు, ఒంగోలు సిమెంటు కాన్‌క్రీటింగు రోడ్డులకు రు. ౭,౬౦౦ లు, బళ్లారిరోడ్డులకు (షెల్‌క్రీటింగు) లక్షరూపాయిలు, కాకినాడరోడ్లకు రు. ౨౫,౦౦౦లు, తాడిపత్రి మునిసిపలు స్కూలు బిల్డింగులకు రు. ౪,౯౦౨ లు తెలుగుదేశపు బాపతులు కన్పించుచున్నవి.

మొత్తముమీద అన్ని జిల్లాలకును పంచవలసిన బాపతులలో తెలుగు దేశానికి ఎంతభాగము సంక్రమించునో తెలియదు గాని క్రొత్తఖర్చులని వేయబడిన ఈ జాబితాలో ప్రత్యేకము స్థలము ఉద్దేశము రెండును నిర్ణయించి వేసిన ఒట్టు మొత్తములలో ఆంధ్రప్రాంతాలకు చాల తక్కువ వచ్చినది. రివిన్యూలో నుంచి పెట్టే సుమారు రు ౯,౫౦,౦౦౦ లతో మద్రాసు మ్రింగిపోయే సుమారు రు ౧,౫౯,౭౦౦ పోగా మిగత సుమారు ఎనిమిది లక్షలలో తెలుగుదేశానికి చెందేది సుమారు రు ౨,౪౮,౦౦౦ లు కన్పించుచున్నది. అప్పులు అడ్వాన్సులలో నుండి ఇచ్చే రు ౨౦,౨౭,౨౦౦ లలో మద్రాసుభాగము సుమారు ౭ లక్షలు పోతే మిగతా రు ౧౩,౨౭,౨౦౦ లలో తెలుగుప్రాంతాలకు చెందేది సుమారు ౩,౦౦,౦౦౦ లు. తెలుగు జిల్లాల ప్రతినిధులు కొంత మేల్కొని పని చేసికొనవలసియుందురనుట కిది యొక హెచ్చరిక యని వేరుగా చెప్పనక్కరలేదు.

తెలుగుప్రాంతమునకును ఇతర ప్రాంతములకును ఉండే పోలికలమాట యెట్లున్నను పైన వ్రాసిన విషయమునుబట్టి కాంగ్రెసు ప్రభుత్వమువారు మంచిపనులకుగాను ఈసంవత్సరం కొంతవ్యయము నిర్ణయించినారనడము తెలియగలదు. కాని, ముందుసంవత్సరముతో పోల్చిచూచినప్పుడే వీరు చేయదలచుకొనిన ప్రజోపకారముపరిమితి బడ్జెటులో విశదపడగలదు.

*     *     *     *     *

సర్కారువారు నెరవేర్చే ధర్మములను మూడు విధాలుగా వివరింపవచ్చును. వారు ప్రాతిపదికముగా చేసుకోవలసిన పనులు కొన్ని యున్నవి. పన్నులు వసూలుచేసికొనడము, పోలీసువగైరాల నేర్పరచుకొనడము, న్యాయవిచారణ కేర్పరచడము, జైళ్లు మొదలైనవి నిర్వహించడము, జిల్లాలలోను ముఖ్యపట్టణములోను పరిపాలకుల నిర్ణయించుకొనడము ఇత్యాదులు ప్రాతిపదిక ధర్మములు. ప్రజాభివృద్ధి కార్యక్రమము రెండవ వర్గము. ఇందులో ఇర్రిగేషను, విద్య, వ్యవసాయము, ఆరోగ్యము, పరపతి, వైద్యము, ఎలెక్ట్రిసిటీ, పశుచికిత్స, కార్మికులసంరక్షణ, రోడ్లు వంతెనలు ఇత్యాదులన్నియును చేరును. ఈ రెంటికిని సమముగా పనికివచ్చు ఋణనిర్వహణ, పెన్షన్లు, అచ్చువగైరా పనులను మూడవవర్గములో చేర్చవచ్చును. ఈ మూడువర్గముల క్రిందను అగు కర్చులను మూడేండ్ల తారతమ్యమును కనుపరచుచు ప్రభుత్వమువారు ప్రకటించినారు. దానిని బట్టి చూడగా ప్రభుత్వమువారి ప్రాతిపదికవ్యయములు ౧౯౩౫-౩౬, ౧౯౩౬-౩౭, ౧౯౩౭-౩౮ వ సంవత్సరములలో ౬౯౧.౭౯; ౬౭౨.౬౧; ౬౮౮.౬౨ లక్షలుగ కన్పించును. మొత్తముకర్చులో నూటికి ౮౩.౩; ౪౨.౩; ౬౨.౦౦ లగుచున్నది. అనగా ఈకర్చు తగ్గతగినది తగ్గినది. తగినంత తగ్గిన దని

యనుటకు వీలులేదు. జీతముల బత్తెములు బాగుగా తగ్గినప్పుడు ఆరీతియగు తగ్గుదల కన్పించును. జీతములు తగ్గింపువిషయములో మంత్రులు చేయుచుండు ఆలోచన ఇదివరలో సూచించడమయినది. అయిన ఒక్క హెచ్చరికమాట మాత్రము చెప్పదగియున్నది. పైజీతములు తాకుటకు వీలు లేదుకదా యని డబ్బు మిగుల్చుటకు బహు సంఖ్యాకు లైన బీదజీతగాండ్ల జీతములు తగ్గించుటమాత్రము పొరపాటగును. రు. ౫౦ లకు లోబడిన జీతములను తాకనేరాదు. రు. ౩౦ లకు తగ్గ జీతములను హెచ్చింపవలెను.

ప్రజోపయోగకరము లగు అభివృద్ధికార్యముల కేర్పడిన వ్యయము సంగతిలో కాంగ్రెసు మంత్రులు చక్కని పురోగమనమును కనుపరచినారు. ఈబాపతు ౧౯౩౫-౩౬ లో మొత్తము ౭౪౮.౯౪ లక్షలు. ౧౯౩౬-౩౭ లో ౭౫౯.౮౪ లక్షలు. ౧౯౩౭-౩౮ కి ౮౧౨.౩౨ లక్షలు. అనగా కర్చులలో నూటికి వరుసగా ౪౬.౮; ౪౭.౭; ౫౦.౩ భాగములుగా నేర్పడినది. సగమునకు పైగా ప్రజోపయోగకార్యక్రమమునకు ద్రవ్యముకర్చుపడుట కీనాటిమంత్రు లేర్పరచినారు.

మూడవ వర్గపు కర్చులు ౧౫౮.౬౪; ౧౫౯.౩౭; ౧౨౨.౭౩ లక్షలు మూడేండ్లకు వరుసగా చూపబడినది. నూట ౯.౯; ౧౦.౦; ౭.౭ భాగము లగుచున్నది. ఈ విషయమున నిప్పటి మంత్రివర్గపు చర్య మిక్కిలి ప్రశంసనీయముగ కన్పించును.

అభివృద్ధి శాఖలవారీగా పరీక్షించినయెడల ౧౯౩౬-౩౭ కన్న ౧౯౩౭-౩౮ లో తలపెట్టిన కార్యములకెక్కువ వ్యయపరుచనుద్దేశించియుండుట తోచును. ఇరిగేషన్ ఖర్చు ౪.౪౭ లక్షలు పెరిగినది. లెక్కల కతాయింపుచే నిందులో కొంత పెరిగిన మాట వాస్తవమేకాని మొత్తముమీద కొంత నవీనకార్యము తలపెట్టియుండుటయు నిశ్చయము. దువ్వేరుప్రాజెక్టుకు ౫౦ వేలు ప్రత్యేకించినారు. రాయలసీమలో (౧)బోరుబావుల వలన నీరు పైకి తెచ్చు ప్రయత్నమునకు (౨) పెన్నేరు కుముద్వతీ (౩) తుంగభద్ర ప్రాజెక్టులకు నీటికొలతలు తీసికొనుటకు కర్చులు పెట్టదలచినారు. చదువుల డిపార్టుమెంటులో ౨.౪౫ లక్షల పెంపక మున్నది కాని గ్రంథాలయములకు ఇచ్చుచుండిన గ్రాంటులు మాత్రము చాలకయుండిన రు ౧౦,౦౦౦ నుండి రు ౫౦౦౦ లకు కృశించినవి. ఆరోగ్యమునకు నిర్ణయించిన కర్చులలో మహత్తమవృద్ధి యున్నది. ఆకర్చు ౨౪.౨౧ లక్షల నుంచి ౩౩.౭౬ కు పెరిగినది. ఒక్క ఏడాదిలో ౯.౫౫ లక్షల పెంపుదల. నూటికి ౩౯ వంతున హెచ్చుదల. ఇది యంతయు గ్రాంటుల క్రింది హెచ్చుదలయే. వ్యవసాయశాఖలో లక్ష ఎనుబదినాలుగువేల హెచ్చుకర్చు కేర్పరచినారు. పండ్ల పంట పరిశోధనస్థానమునకును గ్రామములలోని పాడి పశువుల స్థితులను గురించిన విచారణకును ప్రత్యేకము చేయబడుద్రవ్య మిందులో చేరినది. పశుచికిత్సకు ఎనుబదియారువేలు హెచ్చుగా మంజూరు కోరినారు. పరపతి సంఘములశాఖకు ౨ లక్షల ౧౬ వేలు జాస్తిగా మంజూరుకు పెట్టినారు. జైళ్లు, పరిశ్రమల శాఖలలో ఖయిదీలకు మజ్జిగ పోయుటకు చేతినూలు పరిశ్రమాభివృద్ధి గ్రాంటుకు చేసిన ఏర్పాటు లిదివరకే తెలుపడమయినది. ఈ కారణముచేతను ఇతరమగు కారణముల చేతను ఆ శాఖలలో ౯౩ వేలును ౪ లక్షల ౫౨ వేలును హెచ్చు మంజూరులు కన్పించును ఎలెక్ట్రిసిటీ డిపార్టుమెంటులో ౪.౫౮ లక్షల జాస్తీ మంజూరున్నది. లేబరు డిపార్టుమెంటు కర్చులకును లక్ష ఎనిమిదివేలు ఎక్కువగా నిర్ణయించినారు. పెట్టుబడి బాపతు కర్చులలో ఎలెక్ట్రిసిటీ క్రింద ౪౯ లక్షల ౯౯ వేలరూపాయల అదనపుకర్చున కేర్పాటు కలదు. అందులో విశాఖపట్టణము థర్మల్ స్టేషనుకు ౧౬.౯౩ లక్షలును బెజవాడ థర్మల్ స్టేషనుకు ౧౩.౮౮ లక్షలును నిర్ణయించినారు. గుంతకల్లు థర్మల్ స్టేషనుమాట కర్చులలో కానరాలేదు. కాని ఇదియు నంద్యాల, కాకినాడ, పాలకొల్లుల స్కీములును ఆలోచనయం దున్నవనిమాత్రము సూచితమైనది. వ్యవసాయదారులకు అప్పులు స్వల్పవడ్డీల కిచ్చుటకు ౩౭.౨౩ లక్షల కేర్పరచినారు. ౧౯౩౬-౩౭ లో ౨౬.౨౬ లక్షలకుమాత్రమే యేర్పాటుండేది.

*   *   *

ప్రాంతీయ ప్రభుత్వానికి సంబంధించిన (౧) రివిన్యూ (౨) కాపిటలు మొత్తములనుండి పెట్టే పై వివరణపు కర్చులు గాక ఇండియా ప్రభుత్వము వారివద్ద నిలవడబ్బులో నుండి గ్రామ పునర్నిర్మాణమున కని కొంత గ్రాంటు, పరపతి ఉద్యమాభివృద్ధికని కొంత గ్రాంటు ఇదివరలో ఇచ్చినారు. ౧౯౩౭-౩౮ కిని ఇవ్వగలరు. ఈ మొత్తమును వ్యయపెట్టుటలో గ్రామపు పాలులు, రీడింగురూములకు గూడ మంత్రివర్గము వారు తావిచ్చియుండుటకు సంతోషింపదగి యున్నది.

* * * *

ఇదివరకు వ్రాసినదంతయును గూడ సర్కారు వారు చేయ నిశ్చయించిన వ్యయములకు సంబంధించి వ్రాయడమయినది. ఆ విషయములో ప్రభుత్వమువారు ప్రజలకు చేయగలిగిన సేవ యెంత కలదనుటను నిరూపించుట యయినది. కాని ఈసేవమాత్రముతో మంత్రివర్గము తృప్తిపడియుండిన నెక్కువ ప్రయోజనమును సాధించినవారై యుండరు. వచ్చే ఆదాయమును పోగొట్టుకొనవలసినను పెద్దయెక ప్రజోపయోగమును సాధించుటలో కాంగ్రెసు మంత్రివర్గమువారు క్రొత్త దారిత్రొక్కి మార్గదర్శకు లయినారు.

* * * *

ఇందులో మొదట నమాదుచేయదగినది త్రాగుడును నిరోధించే ప్రయత్నము. మద్రాసు ప్రాంతమంతటను త్రాగుడులేకుండ తుడిచివేయుట యుద్దేశము. అయిన నంతటను నొకేపర్యాయ మీ ప్రయత్నము చేయుట ఇప్పటి పరిస్థితులలో సాధ్యముకాని పని. అందుచేత ఈ సంవత్సరము సేలము జిల్లామట్టుకు ప్రయత్నము చేయుచున్నారు. దీనివలన మొత్తము రు. ౨౬,౦౦,౦౦౦ ల ఆదాయము పోగొట్టుకొనవలసి వచ్చును. ఈ బజ్జెట్టు కాలములో మిగిలినది ఆరు మాసములే కాబట్టి ఇప్పటికి ౧౩ లక్షల నష్టముతో కార్యము సాగగలదు. ఈ ప్రయత్నము మహోత్తమప్రయత్నమనుటకు సందేహము లేదు. ప్రధానమంత్రి రాజగోపాలాచారిగారు వేసే అంచనానుబట్టి ౨౬ లక్షలు సర్కారుకు నష్టమైనా త్రాగుడుమానుకొని మనుష్యులు బుద్ధిమంతు లయి తమతమపనులు చక్కగా చేసుకోవడము మూలకముగా ప్రజకు కోటిరూపాయిలు మిగుల గలదు. ఇది సత్యము. కాని ఈ విషయమునందు విమర్శలు విస్తారముగా చేసినవారున్నారు. ఇతరదేశాలలో—ముఖ్యముగా అమెరికాలో—ఈ ప్రయత్నము చేసి విఫలమనోరథులయి మానకున్నారు. ఇచ్చటను అదే గతి పట్టునని కొందరన్నారు. దీనికి రెండు జవాబులు. ఒకచోట జరుగనిపని ఇంకొకచోట జరుగదనడము కట్టి మనోదౌర్బల్యము. అంతే కాదు. మనభూమిలో పరిస్థితులే వేరు. పాశ్చాత్యనాగరకములో త్రాగడము దూష్యము గాదు. అతిగా త్రాగడము కూడదని బోధించడమున్నది. త్రాగడ మారంభించెదరు కాబట్టి త్రాగుబోతు లౌచున్నారని అబ్రహాము లింకను పలికినపలుకు సత్యము. ఇష్టాగోష్ఠిలో ఇది నిజమని పడమటిదేశాల బుద్ధిమంతులు ఒప్పుకొందురు. కాని వ్యవహారములో మాత్రము త్రాగుడు తుడిచివేయడము సాంఘికముగా వారు పొసగనివ్వరు. అది హేయమనుభావము వారిలో లేకపోవడము దీనికి కారణము.

మన దేశములో త్రాగడ మంటేనే పాపము. త్రాగేవాడు తన్ను తానే చిన్నబుచ్చుకొన్నట్లుగా తలవంపులు పడుతాడు. త్రాగుడు అంటనివారు మనలో చాల ఎక్కువ. పాశ్చాత్యనాగరకదేశాలలో త్రాగుడు అంటనివారు అరుదు. మహానుభావులు. అందుచేత వారి ఉదాహరణము తీసికొని మనము వెనుకంజవేయవలసిన పని లేనేలేదు.

ఈ సంస్కారము పూర్తిగా జరిగితే నాలుగు కోట్లరూపాయిల ఆదాయము నష్టపడవలసివచ్చునుగదా, దానిని పూడ్చే పద్ధతి యేమి? అనునట్టి ఆక్షేపణ రెండవది. ఈ ఆక్షేపణకు గూడ నర్థము లేదు. ప్రజలనీతిని చెరిచి వ్యర్థులను చేసి మన మానవత్వమునే నశింపజేయుచుండు రాక్షసాభ్యాసమును సంహారము చేయుటకు "విల్లుకర్చు, అమ్ముల కర్చు"లకు జంకి వెనుదీయుటకంటె వెర్రితన ముండునా? పెద్ద హోదాలలోని యుద్యోగస్థ





నాట్యభంగిమము

లకు జీతాలు పెంచడమునకు మనదేశ మొక్కొక్క చెప్పిన పదులకోట్లు సమర్పించుకొన్నది కదా! ఆక్షేపకులు దాని నెట్లు మరచుచున్నారో? యుద్ధప్రక్రియల కొరకు అనంతముగా పెరిగిపోవుచుండు పదులకోట్లు వందలకోట్లు దేశదేశము వర్ధుకొనుచున్నదే. ఆ దెట్లు జరుగుచున్నదో? ఆరాజనీతికర్తృ్వ మాక్షేపకులు తెలిసికొనవలదా? ఐదుకోట్లకు నాల్గింతలు ౨౦ కోట్లప్రయోజనము ప్రజలకుకల్గిన నాటికి ప్రజలో కలుగు పరివర్తనము చేత ఆ ౫ కోట్ల నష్ట మొక లెక్కలోనిదిగా నుండదని అంకదృష్టితో చూడలేని రిక్తమానిసులు రాజ్య మేలుట కర్హులుకాగలరా? రాష్ట్రపాలనమనిన పట్టిరూపాయలణాల గుణింతమా? కాదు, కాదు. అది మరవరాదు. ఆక్షేపకులలో నొక రెడ్డినాయుడుగారు తప్ప తక్కిన వారెల్లరును ఈ సంస్కారము చేసితీరవలసినదే యని యంగీకరించిరి. ప్రభుత్వమున కెదుటిపార్టీ నాయకులు సర్ ఉస్మాన్‌గారు మంత్రుల ప్రయత్నమును పూర్తిగా మెచ్చుకొని హృదయపూర్వకముగా అభినందించిరి. దేశము తోడ్పడినచో జరుగలేని కార్య ముండదు. కావుననే మంత్రి రాజగోపాలాచార్లు ప్రత్యుత్తర మొసంగుటలో తన ధర్మమును తాను నెరవేర్చి దేశప్రజల యెదుట నిలుతు ననియెను. వా రేమి తీర్మాన మిచ్చిన నది శిరసావహింతు ననియె.

*   *   *   *

సర్కారు ఆదాయమునకు నష్టము సంఘటిల్లు మరియొక సేవ భూమిశిస్తుతగ్గింపు. ఇది మొత్తము ౭౫ లక్షలవరకు ముజరా యిచ్చుటకు కాంగ్రెసు మంత్రివర్గమువారు తీర్మానించినారు. ఇదివరలో ఇచ్చిన రీతిని ఇప్పుడుకూడ ఇది రైతుకు కనబరచు తాత్కాలికపు ముజరాగాని పన్నుభాగము రద్దగుట కాదని యాక్షేపణ కలదు. మంత్రు లావిషయమున స్పష్టమయిన నిర్ధారణకు రావలసియుందురు. అందులోను ఈ ముజరా అంత యెక్కువైనది కాదనియు ననదగి యున్నది. ౧౩౪౭ వ ఫసలీకే యావిధమగు ముజరా — ఇచ్చినట్లు ఇవ్వనట్లు — ౫౬,౫౫ లక్షలవర కేర్పడి యుండినది. కాబట్టి కాంగ్రెసు మంత్రివర్గమువారు ఈ భాగమును పూర్తిగా రద్దు చేసినట్లు ప్రకటించేవరకు వారు చేసిన మేలు ౧౯ లక్షలు మాత్రమునకే వ్యాపించు ననుటకు వీలున్నది. కె. వి. రెడ్డినాయడుగారు తమ మంత్రిత్వములోనే తా మీనిర్ణయము చేసితిమని వ్రాకుచ్చి తమ కీకీర్తిచెందవలసి యుండునని వాదించిరి. మంత్రి రాజగోపాలాచార్లు దీనికి ప్రత్యుత్తర మిచ్చుచు ఉత్తరువు చేయువారు నాయడుగారు చలామణి చేయవలసినది కాంగ్రెసు మంత్రివర్గమని తెలిసియుండి మూడుమాసములయధికారపు ముచ్చటగా తా మీకీర్తి కోరుదురేని రెడ్డినాయడుగారు ఆరీతిగానే సంతోషింపవచ్చు ననిరి. అంతకంటె విశేష మింకొకటి చెప్పిరి. పన్నుతగ్గుదల చేసికొన్నవాడు రైతేగాని తా మెవ్వరు కాదనిరి. ఎంతోకాలముగా మొరపెట్టుచున్న రైతుకోరిక ఈనాటికి ఫలించిన దని సూచించిరి. వారు చెప్పిన ఈవరాలమాటనుబట్టియే తమ ధర్మ మింతటితో తీరిపోయినదని వారనుకొనరనుట స్పష్టము. ముజరా ఇచ్చుచున్నా మనడము, ఏదో విచిత్రమయిన విధానా లాముజరాల అమలు కేర్పరచడము, తుద కా ముజరా రైతుకంటికి కనుపించునట్టిదిగా లేకపోవడము, ఆ కారణముచేత ఇచ్చినముజరా యైనను పూర్తిగా స్పష్టముగా అతనికి చేరకపోవడము ఇదివరలో జరిగినది. కాంగ్రెసు మంత్రివర్గమువారు జాగ్రత్తగా నాలోచించి ముజరా విషయమునందు మెలగవలసి యుందురు. విలువలో తారుమారగుచుండే నాణ్యముల రూపకముగ పన్నులు వసూలుచేయుచు సర్కారు నౌకరులకు అదే రీతిగా జీతము లిచ్చుచు పన్నులో తగ్గింపు చేసినంత మాత్రమున నిజమును శాశ్వతమును నగు ప్రయోజనము రైతుకు కలుగునా యను సంగతి ఆలోచింపవలసి యుందురు. అతడు పండించుపంటలో నిష్కర్షయగు భాగముమాత్రము — నాణ్యములతో సంబంధములేకుండా — తాము తీసికొన్నప్పుడే, తమ నౌకరులలో స్థానికులైన వారికైనా వస్తురూపకమైన ప్రతిఫలము సాధ్యమైనంతవరకు ఇవ్వగలిగినప్పుడే బీదరైతుయొక్క కష్టములు గట్టెక్కగలవని తోచుచున్నది. ఇంతకంటె ఎక్కువ వివరణము ఈ విషయమునుగురించి వ్రాయుట కీవ్యాసమున ప్రస్తుతముగాదు.

*   *   *   *

కాంగ్రెసుమంత్రుల బడ్జెట్టు ఆరంభ మగునప్పటికి కోటి యేబదిలక్షలు వా రప్పచేయడము లోకము కంటికి కనుపించినది. ఇది విపరీతమనుగాదు, క్రొత్తదియును గాదు. కాపిటలుకర్చులు పెట్టడానికి అప్పులు అడ్వాన్సులు ఇవ్వడానకు ప్రభుత్వాలు ఎప్పుడును అప్పులు తీసికొంటారు. అట్లుచేయడము ఆవశ్యము, ధర్మము. నేటిచట్టము అమలులోకి వచ్చుటకుముందు ప్రాంతీయ ప్రభుత్వములకు కావలసిన ఈ విధమైన యప్పులను ప్రాంతీయప్రభుత్వములు తీసికొను చుండ లేదు. ఇండియాప్రభుత్వమువా రప్పతీసికొని వీరి కిచ్చు చుండువారు. ఇప్పుడు ప్రాంతీయ ప్రభుత్వములు స్వతంత్రము లయినవి కాబట్టి అప్పులు తీసికొనే జవాబుదారీయు వీరిదే యైనది. ఆ జవాబుదారీని నిర్వహించడము తప్ప ఈ అప్పులో వేరే అర్థమేమియు లేదు. వేరే అర్థము తీయుటకు వీలుకూడ లేదు.

* * * *

పైన చెప్పిన ఆదాయవ్యయ వివరము లన్నిటి ఫలము ఈ దినపుబడ్జెట్టునిలవలో చూపుదురు. ఇప్పటి ఎస్టిమేటుప్రకారము మన ప్రాంతీయ ప్రభుత్వమువారి రివిన్యూ రు. ౧౫,౯౩,౭౩,౨౦౦ లు; కర్చు రు. ౧౫,౯౩,౬౭,౩౦౦; నిలవ రు. ౫,౯౦౦. ఇంత కొద్ది నిలవ యుంచడమా? ఇది యేటిబడ్జెట్టని యొక యాక్షేపణ. ప్రజలనుండి వసూళ్లెక్కువజేసి ఫలయుతముగా వారికి చేయవలసిన సేవను సంకోచము చేసినయెడల నిలవలు ఎక్కువగానే చూపవచ్చును. కాని అది ప్రజాసేవమాత్రముకాదు. నిలవ కొద్దియగుటవలన హఠాత్తుగా పైబడునష్టములు—వరదలు, భూకంపములు, క్షామములు—పుట్టుట యెట్లని వెంకటరెడ్డిగారు ప్రశ్నించిరి. ఇట్టిబెడదలు రానేవలదు. వచ్చినను ఆ ప్రశ్నకు శ్రీ రాజగోపాలాచారిగా రిచ్చిన ప్రత్యుత్తరమే ప్రత్యుత్తరము. క్షామనివారకనిధిలో ౬౦ లక్ష లున్నవి. అది ఇట్టి యుపయోగముల కేర్పడినదే. నిలవలు నిలవ లని పెంచి జీతాలు బత్తాలు వగైరా ఏనాడో పెంపుదల చేసికోడానికి వినియోగింపకుండా నిర్బంధమగు ఈ నష్టనివారణనిధిమీద నాధారపడడము మిక్కిలి సమంజసము.

* * * *

ఈనాటి బడ్జెట్టు సరిపరచుటకు కాంగ్రెసు మంత్రివర్గమువారు మరియొక విషయమునందు ప్రాతక్రొత్తవనపోక నవీనమార్గమును దీసినారు. ఇటీవల ఏర్పడిన ఒకచట్టమునుబట్టి సర్కారు ఉద్యోగములు చేసి పెన్షనులు పుచ్చుకొనినవారు తమ పెన్షను లంతటినిగాని కొంతటినిగాని సర్కారువారికి వదలివేసి దానికి బదులు కొంతమొత్త మారంభమునందే తీసికొనవచ్చును. దీని ఫలితముగా పెన్షను పొందిన చాలమంది అప్పటి కప్పుడు పెద్దమొత్తములు తీసికొనడము సంభవించుచున్నది. ౧౯౩౭-౩౮ లో దీనికిగాను ౧౦.౬౩ లక్షలు అంచెనా వేసినారు. ఇదివరకు ఈ బాపతుకర్చు సాదారివిన్యూనుండి పెట్టేవారు. కాని నిజమైన అర్థనీతి ప్రకారము ఆలోచించినయెడల ఈ కర్చు కాపిటలు నుండి పెట్టడము దోషము కాదు. పెన్షనులముందు మొత్తము లీనాడు తీసికొనుటలో ఆమట్టుకువడ్డీ ఎదురు కట్టిచ్చియే తీసికొనవలసియుందురు. కాబట్టి తాము వడ్డీకి తెచ్చిన డబ్బులో నుండి యీ కర్చుపెట్టి క్రమముగా ఇవ్వవలసియున్న పెన్షనులలోని నిలవభాగము వడ్డీక్రింద ప్రభుత్వమువారు ఇచ్చుట యగును కాని వేరు కాదు. అందులోను త్రాగుడు నిర్మూలోద్యమము, చేతినూలు ప్రోత్సాహము, భూమిశిస్తు తగ్గింపు, మరి పైని వర్ణించిన ఖయిదీలకు మజ్జిగసరఫరా, నీటివసతుల వ్యాప్తి వగైరా బరువులు పెట్టుకొనిన కాంగ్రెసు మంత్రివర్గమువారు తాత్కాలికముగా, పూర్ణమైన పద్ధతిని కనిపెట్టుకొనేవరకు, ఈ యార్థికనీతి నవలంబించుట యందేదోషమును కన్పించదు.

* * * *

ప్రభుత్వమువారి అధికారములో ఉండి కూడ వారి లెక్కలలోనికి రాని హిందూధర్మాదాయముల బోర్డుశాఖ కలదు. ఇట్టి వర్గములో కాకపోయినా ప్రత్యేక శాసనాలక్రింద స్వతంత్రముగా నడిచే తిరుపతి వంటి సంస్థలు కలవు. ఇట్టి సంస్థలలో ఎక్కువ ఆదా

యము కలదు; వ్యయమును కలదు. ఇవి ప్రజాప్రతినిధుల దృష్టిలోనికి వచ్చుటకు తగినంత అవకాశములు లేవు. తగిన ఏర్పాటులు కాంగ్రెసుమంత్రులు చేయుదు రని ప్రజ లెదురుచూడగలరు.

*   *   *   *

చేయదగిన పనులు చాల యున్నను ఆరువారము లలో కాంగ్రెసు మంత్రివర్గమువారు కనపరచిన బుద్ధి కౌశల్యమునకు, ప్రజాపక్షోత్సాహమునకు, దూరదృష్టికి, స్థిరశాంతప్రవర్తనకు ఈ బడ్జెట్టు నిదర్శన మని లోకా మోదమును పడసినారు. శుభంబగుగాక!

---



మబ్బు గుట్టలు

—K. K.

# భవభూతి

ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రి

నావలె, భవభూతి
మహాకవి కావ్యాలు
చదివి పరవశమై ప్రాణం
పెట్టే రసికులకు అంకితం

౧

భవభూతి కవిరాజు
పలుకు బంగారమ్ము
గీర్వాణ సాహిత్య
కోటీర హీరమ్ము

౨

నటరాజ సాంధ్యతాం
డవనృత్య నిర్గళత్
పూత భాగీరథీ
పాత గంభీరమ్ము

౩

నవనవోషః ఫుల్ల
మల్లికా మధురమ్ము
హేమంత శేఫాలికా
మంజుహాసమ్ము

……………

అనుభూతి సాగరా !
భవభూతి సత్కవీ !
హృదయపుటపాకాన
ఉడుకుభావాలలో
పరిపక్వ కావ్యమ్ము
పలికి ధన్యుడ వైతి

***

ఎంత తపియించి యా
సించినాడవో కవీ !
పుట్టిరోయ్ నీవాదు
విపులభూతలి నేడు

***

మ్లానమహా జీవకుసు
మమ్ము వికసింపగా
సకలేంద్రియమ్ము లా
నందమూర్ఛలువోవ
జానకీరాఘవుల
మాలతీమాధవుల
ప్రేమానుబంధప్ర
బంధమ్ము పల్కితివి—
ప్రేమైకజీవినీ
రామదేవుని హృదయ
రక్త గీతారవము
జాలిగా జాలిగా
కుహర గద్గదనదత్
గోదావరీ వారి
నీలికెరటాలలో
నేటికిని వినబడును

***

నీకరుణ వాణీర
సప్రళయ కావ్యాన
పగులు వజ్రపుగుండె
పొగులు పాషాణమ్ము

* * * *

అనుభూతిసాగరా !
భవభూతి సత్కవీ !

—

# పశువుల కొట్టం

"కరుణకుమార"

"మామా! వాకిలి తియ్యి: మామా! వాకిలి, వాకిలి!"

పెట్టకూత వినబడ్డ పుంజులాగ, చెవులు బారెడేసి చేసుకొని ఆప్యాయంగా ఆలకించాడు ఆ పిలుపు-సాలలో గుర్రానికి మాలీసు చేస్తున్న రొబ్బయ్య; వడివడిగాపోయి వాకిలి చిలుకు తీసి తలుపు తెరిచాడు, గడపలో నిలబడ్డ పెంచెల్ని ఆహ్వానం చేస్తూను.

"వాకిలి బిగించుకొన్నావేందయ్యా, సంజ కాడ? లోగా చిల్లాటలాడుతుండావా ఏంది?" అని కిసుక్కున నవ్వింది పెంచెలి.

"ఆడుతూనే వుండా" అన్నాడు బింకంగా, రొబ్బయ్య.

"దేనితో?..............." అని తెల్ల మొగం వేసింది పెంచెలి.

"నీ తోనే..............."అని సరాగంగా అన్నాడు రొబ్బడు.

"ఊఁ!..............." అని దీర్ఘం తీస్తూ నెత్తిమీది గడ్డిగంప రెండుచేతులతోనూ పట్టుకొని ఒకమె ట్టెక్కింది పెంచెలి. గిల్లితే పాలుగారే దాని బుగ్గమీద చిటికెతో కొట్టి గడ్డిగంప తన రెండుచేతుల్లోకి తీసుకొన్నాడు రొబ్బడు.

వాకిట్లో రొబ్బడి దర్శనంతోనే తన శరీరం తేలిక అయిపోయిన పెంచెలికి నెత్తిమీది గంపకూడా తొలగేవరకు పిట్టలాగ ఎగిరి రొబ్బడితోకూడా గుర్రపుసాలలోకి దూకిందది.

"మామా! గుర్రానికి గడ్డి మట్టసంచేసి తెస్తుండానని, దినమ్మా నీపోసు పడలేక, ఈపొద్దు చేతులు బొబ్బ లెక్కేటట్టు దోకి దోకి, తెచ్చాను చూడు! అరిచేతు లెట్లా పుల్లుపడ్డాయో?" అని రెండుచేతులూ రొబ్బడికి చూపింది. తన రెండుచేతులతోనూ పెంచెలి పాణిగ్రహణంచేసి ఆమెను చూస్తున్నాడు రొబ్బడు.

"ఎండలు ముదిరినై మామా! పచ్చని గరికపోచ సిక్కడంలేదు. నేల తడి ఆరి గట్టిపడి రాయిలాగ పొద్దుగూకులూ ఎంతదోకినా - దోకుడుపార అటిగి మొద్దుబారడం, చేతులు పుల్లెక్కడం తప్ప- గంపమట్టానికి కూడా రావడంలేదు గడ్డి. ఇక తేకుంటే మామ కోపం చేస్తాడుగాబోసని మోసుకొనితెచ్చా" అని తలపైకెత్తి మామకళ్లల్లోకి చూచింది పెంచెలి.

"కష్టం చేయకుంటే కడుపులోకి బువ్వ ఏడనుంచి వస్తుందనుకొన్నావు?" అంటూ బొబ్బలెక్కిన పెంచెలిచేతులు తన కళ్లల్లో పెట్టుకొని ఆమెను దగ్గరగా లాక్కొన్నాడు రొబ్బడు. పెంచలి బాహువల్లరులు రొబ్బడి కంఠసీమను చుట్టవేసుకొన్నవి. నుదుటిమీది నీటిచుక్కలు చేత్తో తుడిచి, ఆమెను సందిట్లోకి లాక్కొని ఫాలభాగంమీద తన పెదిమెలు మెదిపాడు రొబ్బడు. పెంచెలికి ఆదినంచేసిన కాయకష్టం అంతా హరించి ఆనందం పొంగింది.

"వొదులు మామా! వొదులు: ఎవరన్నా సూస్తే సిగ్గు బోయేను" అని విడిపించుకోబోయింది పెంచెలి.

పైట జారగా రవికెలో బిరెక్కిన చిన్నిరొమ్ము ఒక్కసారిగా కంపించి చలించినట్లుతోచింది రొబ్బడి దృష్టికి. ఆచలనంలోనే అతని హస్తచిత్తచాంచల్యాలు కూడా ఒక్కసారిగా అలుముకొన్నాయి.

"ఇహిహిహిహీ" అంటూ గుర్రం సకిలించింది.

పరధ్యానంలో వినబడ్డ సకిలింపుకి ఉలిక్కిపడి.-

"అమ్మో! ఎవరో వస్తుండా"రని పట్టు విడిపించుకొని పైట సవరించుకొంది పెంచెలి.

"ఎంత పిరికిపిల్లవే!" అంటూ గుర్రంవైపు మళ్లి మాలీసు ఆరంభించాడు రొబ్బడు.

చీరకొంగున కట్టిన మూట విప్పి వక్కముక్క పంటిసందున కటుక్కుమని కొరికి, సగంముక్క మూట లోనే వేసుకొని, ఆకు చుట్టి నోట్లోపెట్టుకొంటూ, గోడకానుకొని కూర్చుంది పెంచెలి.

రొబ్బడు గుర్రానికి మాలీసుచేస్తున్నాడు; తొడ లుదిగని లంగోటీ, కండలు తిరిగినదేహం, నిడుదైన వక్షస్థలం — పిక్కలమీది కండలు చెండుల్లాగ ఉబికేటట్టు, నేలకు కాళ్లురెండూ బిగదన్ని, గుర్రం డొక్కలికి తల మోటించి, ఊపిరి బిగబట్టి రెండుచేతులతోనూ తనశక్తి కొద్దీ గుర్రానికి మాలీసుచేస్తున్నాడు రొబ్బడు. మోటు రాళ్లనుపిడిగుద్దులచే ముక్కలు చేయగలబలం; లేవ దాటి టెంకకట్టినయౌవనం: తన బలమేమో, ఎదురుగా నిలబడ్డగుర్రం బలమేమోకూడా భేదం తెలుసుకోలేని నిర్లక్ష్యం — చేతులు మంటలెత్తేటట్లు గుర్రాన్ని రుద్దుతున్నాడు రొబ్బడు. గుర్రంకూడా పొట్టకిందా, మెడ కిందా, నడుములమీదా నొప్పులు తీరేటట్టు మర్దనా చేయించుకొంటూ, తన్నాస్థలంలోనుంచి అడుగుదీసి అడుగుపెట్టేటట్టు కదిలించు చూతామంటూ, వెనక కాళ్లు వెనక్కి, ముందుకాళ్లు ముందుకీ గట్టిగా తన్నిపట్టి నిలబడేఉంది. గుర్రమూ, రొబ్బడూ ఒకరిమీద ఒకరు పంతాలువేసుకొని కలియబడ్డారు. కాని ప్రపంచంలో గల జవం అంతా బ్రహ్మదేవుడు తన నాలుగు కాళ్లలోనే పెట్టినసంగతి ఆగుర్రం మరిచింది కాళ్లు నేలకి తన్నిపట్టి తల గుర్రాని కానించి, "హుమ్మ"ని హుంకరిస్తూ మర్దించేవరకు, ఏనుగవంటి ఆగుర్రంనడుము ఉండీలబద్దలాగ జవజవలాడుతూ వంగి, వెనకకాళ్లు రెండూ కలగదొక్కుకొని ఆపక్కకి కిందపడబోయింది.

"ఆఁ! భద్రం! మోటుతనం చేయవోక!" అని గోడ కానుకొన్న పెంచెలి రొబ్బణ్ని హెచ్చరించింది.

కిచకిచలు పెట్టిన పిల్లలు నవ్వినట్లుగా "ఇహి హిహిహీ" అంటూ గుర్రం మళ్లా సకిలించింది.

రొబ్బడు ఎడంగావచ్చి చేతులు దులుపుకొన్నాడు.

"ఏందీ, ఒళ్లంతా ఆ చెమటలు! అయ్యో! నీళ్లల్లో మునిగి లేచినట్టుండావే! మరీ అంతమోటుతనమా? ఇట్టా రా! ఇట్టా వచ్చి కూకో, ఒళ్లోపాలి తుడుస్తాను రవ్వంత తాళి మళ్లా పట్టొచ్చులే!" అని మామను పిలిచింది పెంచెలి.

"ఉస్సు" మంటూ పెంచెలి కెదురగ్గా మోకాళ్లమీద మోచేతులు పెట్టుకొని కూర్చున్నాడు. రొబ్బడు. చీరకొంగు తీసి అతని వక్షస్థలం, వీపూ, చేతులూ, ముఖం- అన్నీ తుడిచింది పెంచెలి.

రొబ్బడికి ఆలుపుతీరింది చెదిరిపోయిన అతని క్రాపింగులోని వెంట్రుకలు చేత్తో సవరిస్తోంది పెంచెలి.

"పిల్లా! బిడ్డల్ని కనే ఈడు వచ్చీకూడా, మనిద్దరికీ ఎన్నాళ్లీదొంగచేష్టలు ?"

"అయితే నాకు పెళ్లి చేయుమని మా అయ్యనీ, అమ్మనీ నానోటితో ఎట్లా అడిగేది, నువ్వే చెప్పూ?"

"ఏమి అడిగితే ఎగ్గా ?"

"ఎంత బాగుండ దీ యిద్దూరం! అంత ఉబలాటంగా ఉన్నవాడివైతే, నువ్వే వచ్చి మా అయ్య నడగ్గూడదూ ?"

"మొగజన్మఎత్తి మూతిమీద మీసంగలవాడు, ఓ పరాయి మొగాణ్ణి పిల్లనివ్వమని నాలిక తెగ్గోసినా అడగ్గలడా ?"

"నీ కెంకరోషం ఉండదో, ఆడదాన్ని నాకూ అంతే ఉండది"

"అయితే పెళ్లి చేసుకోకుండా ఈమోయిన కూకుంటావా ?"

"మొగోడివి నీకు లేని తొందర నాకేమొచ్చె? నువ్వు అజ్జాయిస్తే, నేనూ అజ్జాయించే ఊరకొంటటికే—ఎకానీ అప్పతిరుప్పటికిప యిరి."మో

అని రొబ్బడివెనక చేరి వీపుమీదిమట్టి నలుస్తూ కూర్చుంది పెంచెలి.

రవ్వంత నిదానించాడు రొబ్బడు.

"ఇంక గడువుపెట్టే క్రియ లేదు. ఎప్పుడు నీమెళ్లో తాళిబొట్టు కట్టేనా, గుర్రంమీద నిన్నెక్కించుకొని ఎప్పుడు ఉత్సవం చేసుకొనేనా, ఎప్పుడు నీ బుగ్గలు పులిమేనా—అని నాకూ ఉబలాటంగానే ఉండది. మా సూపరెంటుదొరనికూడా అడిగాను. ఓ! అభ్యంతరం లేకుండా తీసుకొని పొమ్మన్నాడు గుర్రాన్ని. పిల్లా! పసుప్రబట్టలు కట్టుకొని, ఈ చింత పువ్వువన్నె గుర్రంమీద నిన్ను కూకోబెట్టుకొని, గాజు దీపాలేసుకొని, టొట్లు పేల్చుకొంటూ, ఉత్సవం చేసుకొంటే, నేను రాజులాగా ఉండనంటే!" అని మెడ వెనక్కి వాలేసి పెంచెలి ఒడిలోకి ఒరిగాడు రొబ్బడు.

"నువ్వు రాజులాగుంటే నేనుమాత్రం రాణిలాగ ఉండనంటయ్యా?" అని అతని చెక్కిళ్లమీద రెండు చిట్టి దెబ్బలు కొట్టింది పెంచెలి. "ఏదీ ఒక్క ముద్దియ్యవే పిల్లా!" అంటూ ఆమెముఖం తనముఖంలోకి లాక్కున్నాడు రొబ్బడు.

"నిజంగా మీదొర గుర్రాన్ని ఇస్తానన్నాడా మామా?" అని ఆత్రంతో అడిగింది పెంచెలి.

"నిజంగానే: నేనంటే మా దొరకి గుండెలో గుండెకాయ. అయిదువందలు కరుకులుపోసి మోజుపడి కొనుక్కొన్నజీవం. దాన్నిడబ్బిచ్చి ఆయన కొనుక్కోవడమేందో, దానిపోషణకి నాచేతిలో పెట్టడం ఏందో—అంతే! ఇంక దొర మళ్లా గుర్రంమాట మరిచిపొయ్యేటట్లు చేశానుగాని ఏమరి ఉండాననుకొన్నావా? రేపవేళ అనకుండా, మాపవేళ అనకుండా బిడ్డని సాకినట్లు సాకుతుండాను గనకనే తలవెంటికవాసికూడా తగ్గిపోకుండా ఏనుగలాగ ఎట్లా ఉండదో సూడు. వేడుకగా పెళ్లి చేసుకొంటానంటే ఉత్సవానికి ఒక్కపూట గుర్రమే ఇవ్వననడానికి ఆయనకి నోరువస్తదా మొదలు?"

"మామా! నాకు గుర్రంమీద కూకోవాలంటే భయమే."

నేనుండానుగా. వెనకతట్టు కూచోని పట్టుకోనూ?"

"అబ్బో: ఆమాట తలుసుకొంటూంటే ఒళ్లు జలదరిస్తాం దయ్యా! మరి గుర్రం ఉండి ఉండి ఒక్కసారి పేరెంతీస్తేనో?"

"తీస్తదా? మనం నిలుచోమంటే నిలుచోవాలె! కదంతొక్కమంటే తొక్కాలె! తరటుపొమ్మంటే పోవాలె! గాలప్ తీయుమంటే తీయాలె! అంతేగాని దానిష్టప్రకారం పోడానికి గుండెలుండాయా?"

గుర్రం మళ్లా సకిలించింది.

"మామా! ఆగుర్ర మెక్కి మావూరు వూరంతా వూరేగాలె. ఈజన్మ ఇక ఈడేరినట్లే అవుతదినాకు."

"మీ వూరే అన్నమాటేందే పిల్లా! ఈ నగరం అంతా తిప్పనంటే! గుర్రాన్ని లొంగగొట్టడంలో రొబ్బడంతటి సైసు ఉండాడా అనిపించుకొన్నా! ఓ! నీసరదా తీరేటట్లు దేశం అంతా తిప్పతా గుర్రం దిగకుండా."

"అట్టయితే నే నీరాత్రికే మాఅమ్మదగ్గర అంటానుండు పెళ్లిసంగతి. మామా! నువ్వన్నట్లు మనకీ దొంగచెల్లాటాలు బాగులేదే! ఏం దీకర్మ: మనిద్దరం ఇష్టపడ్డాక ఇంక నలుగు డేమొచ్చె!"

రొబ్బడు పరేనని లేచి నిలబడి చెడ్డీ కంటుకొన్న మట్టి దులుపుకొన్నాడు.

తనకు కాబోయ్యేమగడూ, అతని ఎత్తునే నిలబడ్డ ఉన్నతమైన గుర్రమూ, ఇద్దరూ రెండు పురుషసింహాల్లాగ గోచరించారు పెంచెలికళ్లకు. ఆ ఇద్దరినీ ఆర్తేచూచుకొని మనస్సులో నేపొంగిపోయింది పెంచెలి.

"సీకటిపడింది: పరుగుదూరం పోవాలె, మామా! రేపు మళ్లా వస్తా........" నని గడ్డిగంప చంకనబెట్టుకొంది. జారిపోయిన కొప్పముడి సవరించుకొంటూ,

కట్టకొన్న కుచ్చిళ్లు చక్క జేసుకొంటూ, పైట కొంగు నడుంచుట్టూ తిప్పుకొంటూ జరజర, జరజర నడచి పోయింది పెంచెలి. పోతూఉండే పెంచెల్ని ఆట్టే పరకాయించి చూచి చూచి, గడప దిగి వీధిలోనికి పోంగనే,

"నేసుకొంటే ఇట్లాంటిపిల్లనే నేసుకోవాలె; సుకపడాలె"నని అనుకొంటూ, గుర్రానికి దాణా పెట్ట డానికి ఉలవలసంచీ మూతి విప్పాడు రొబ్బడు.

౨

పెంచెలికాపురంవుండేవూరు ఆ నగరానికి పరుగుదూరంలో వుంది. చీకటి దట్టంగాకముందే ఇల్లు చేరుకోవాలని పరుగులుతీస్తూ ఇంటిదారిపట్టి పోతోంది పెంచెలి: మంచియౌవనంలోఉన్న రొబ్బడూ, తనూ రొబ్బడూ కలిసికూచొని ఊరంతా ఊరేగగలచే యెత్తు గుర్రమూ, తన మాలవాడలో ఏవధూవరులకీ లభ్యపడని అపూర్వమైన అశ్వారోహణభాగ్యమూ – ఈ తలపులన్నీ పెంచెలి మనస్సు వికసింపజేసి, శరీరం పులకరించి, ఆమె ఒక విధమైన ఉత్సాహంతోనూ, ఉద్రేకంతోనూ తొందరగా పోతోంది.

తనవూరు ఇక అరమైలుదూరం ఉంది. కని చీకటి పడుతూపడుతూఉంది. డబడబమని ఆకాశంలో పెద్ద ఉరుము ఉరిమి, పెంచెలి హృదయాన్ని చెదర గొట్టింది. అమ్మో! ఎక్కడనో పిడుగు పడిందే అను కొంటూ తటాలున వెనక్కి తిరిగి ఆకాశంలోకి చూచింది. సూర్యభగవానుడేలోకంలోకి జారిపోయాడో కాని నల్లని కాటుకకొండలు రెక్కలు కట్టుకొని ఆకాశంలోకి ఎగిరి పెంచెల్ని తరుముకొనివస్తున్నాయి. పెద్దగాలీవానా వచ్చి తాను తడిసిపోతానన్నభయంచేత పెంచెలి కాలివేగం వృద్ధిచేసింది. కాని అంతా కను రెప్పపాటు దృశ్యం. కళ్లు చీకట్లుకమ్మే మెరుపులు మెరవడ మేమిటో, మేఘాలు పరస్పరమూ పరామర్శ చేసుకొని ఒరుసుకొని గర్జించడ మేమిటో, తూర్పు సముద్రం మీదుగా ఎగిరివచ్చే గాడ్పులు పశ్చిమగోళం వరకూ వ్యాపించడ మేమిటో— అంతా అయిదు నిమి షాలలోనే. నల్లని ఆకాశం కరిగి నీరయిపోయింది. వడ గళ్లరాళ్లవాన దౌష్ట్యానికి పెంచెలి ఓర్చుకోలేకపో యింది. వడగళ్లతాకుడు— కావలెనని ఎవరో దుండ గీండ్రు ఆమెను రాళ్లతో విసరివిసరి కొట్టుతున్నట్లుగా వుంది. రొబ్బణ్ణి ఎంతస్మరించుకొన్నా తన నాదకోసు రాలేకపోతున్నాడు. రాళ్లదెబ్బలు తప్పించుకొనే ఉపాయం ఊహించుకొనేలోపలనే, ఆమె ఆపాద మస్తకమూ తడిసి ముద్దయిపోయింది. తలమీద వడగళ్ల దెబ్బతగలకుండా కాపాడుకొనేనిమిత్తం చంకన వున్న ఖాళీ గడ్డిగంప నెత్తిని బోర్లించుకొంది. అప్పటికప్పడే కారుమబ్బులు దశదిక్కులా ఆక్రమించుకొన్నవి. పొద్దెంకపోయిందోకాని, కటికిచీకటి కుంభవృష్టిలో పాటు లోకాన్ని ముంచెత్తివేస్తోంది. నెత్తిమీది గంప తనదృష్టికి కొంత అడ్డుతగిలేవరకు, దారి వెతుక్కొంటూ. అడుగులో అడుగుపెట్టుకొంటూ పోయే పెంచెల్ని, ఒక పెనుగాలి చేతుల్లో ఎత్తుకొని, ఇరవైగజాలదూరంలో ఒకకానుగచెట్టు మొదటిలోకి తీసుకొనిపోయి దింపింది.

నెత్తిమీదిగంప పైకెత్తి పక్కగా చూచేసరికి, సమీపంలోనే వున్న నొకపెద్దపశువుల కొటం. తల దాచుకోను రక్షదొరికినందుకు సంతోషిస్తూ ఆ పశువుల పాకలోకి దుడుంగున దూరింది పెంచెలి; వానజల్లు తగలకుండా ఆ పాకలో ఒకమూల ఒదిగి, చలికి గడగడ వణికే దేహాన్ని కాపాడుకొంటోంది. బయట వానదేవుడూ, వాయుదేవుడూ ఒకరితో ఒకరు పంతాలువేసుకొని ప్రాణికోటులకు తగిలేదీ, తప్పేదీ తెలుసుకోకుండా విచ్చలవిడిగా విహరిస్తున్నారు. తళు క్కుమని మెరుపులు మెరిసినపుడల్లా ఆ కొటంలో రెండువరసలుగా దగ్గరదగ్గరగా కట్టివేసి, గాటిలో గడ్డి మేస్తూఉండిన ఆ బోతులలాంటి పడమపెద్దులూ, తెల్లని వాటి మూపురాలూ, అందమైనకొమ్ములూ, గాంభీర్యమైన వాటిముఖంలోని నేత్రాలూ— అన్నీ ఒక్కసారిగా పెంచెలికళ్లకు గోచరిస్తున్నాయి. ఆ ఆ పత్సమయంలో ఆ ప్రదేశం అంతా నిర్జనప్రదేశంగా ఆమెకు పొడగట్టినప్పటికీ, రొబ్బడిలాగ, రొబ్బడి చేతుల్లో పెరిగే గుర్రంలాగ, బలిష్ఠమై దేహసౌష్ఠవం

గలు, అన్ని వృషభరాజములు ఆమె దండమండగా చూచుకొనేవరకు, తన ప్రాణానికేమీ భయంలేదని ఆ అబల కొకగాఢమైన ధైర్యం కలిగింది. గాలీ, వానా రవంత తెరిపియిస్తే, ఎంతలోపోవాలి ఇంటికి! ఇంక ఊరు పదిపగ్గాలదూరంలో ఉంటుందేమో!

తడిసిపోయిన రవిక శరీరాని కంటుకొని పోయింది. నీళ్లుకారే పైటకొంగు తీసి పిండుకోవడానికి ఒకటి రెండుసార్లు ప్రయత్నించిందిగాని అన్ని ఎద్దుల సమక్షంలో పైట తొలగించుకోనిచ్చిందికాదు ఆమె శీలం.

ఎద్దులమంద గాటిలోని ఎండుగడ్డి విదిలించి, వామిలోనుంచి తెచ్చిన జొన్న చొప్పకట్టల్ని విరిచి ఎద్దులముందు వేసుకొంటూ ఆ చివరనుంచి ఈ చివరికి వస్తున్నాడు రాయుడి సేద్యగాడు మతరాచు సుబ్బడు. ఆ పాకలో మనిషిసంచారం సవ్వడి తెలుసుకొనేవరకు పదుటబడవలసిన పెంచెలిమనస్సు భీతిచెందింది— ఎందుకల్ల ? మత: చుసుబ్బడివి వేదుకుక్కముక్కలా ఏమిటి, లేకుంటే ఆ గాఢాంధకారంలో పెంచెలి సవ్వడి అత డెట్లా పసిక ట్టగలిగాడు!

"ఎవ రామనిషి?" అని ప్రశ్నించాడు సుబ్బడు.

బదులు లేదు.

"ఎవరంటే మాట్లాడవేం?" అని సమీపించాడు సుబ్బడు.

"నేను చిన్నాయనా ! పెంచెల్ని"

"ఏ పెంచెలివే?"

"నేనయ్యా, వెంకటిగాడి కూతుర్నయ్యా! గడ్డి అమ్ముకొనివస్తుంటే వానకు తడిసి ఇట్టా వచ్చా" అన్నది పెంచెలి.

"ఎవర్రా ఆ మనిషీ?" అని ఆపాక చివరినుండి ఆ చీకట్లో ఇంకో ప్రశ్న బయల్దేరింది.

జవాబు లేదు.

"ఒరే సుబ్బా! ఎవర్రా ఆ మనిషి?" అని మళ్లా వచ్చింది ప్రశ్న!

జవాబు చెప్పకుండానే సుబ్బడు పెంచెల్ని విడిచి ఎద్దుల్లో జొరబడి ఆ చివరికి వెళ్లిపోయాడు.

"ఎవరితోరా నువ్వు మాట్లాడుతుండేదీ?"

"అదే........."

"అదే అంటే?........."

"అదే సామీ! నువ్వు కోరుకొన్న మనిషే! వెంకటిగాడి కూతురు."

"పెంచెలే! ఈడ కెందుకొచ్చిందీ?"

"గడ్డిఅమ్ముకొని ఇంటికి పోతుండదంట! వాన వచ్చేవరకు పాకలోకి దూరింది."

"ఒరేయ్: సుబ్బా: ఇదేరా సమయం. చిక్కిం దిలే! లంజ. ఇక పోలేదులే ——"

"..............."

"నేను ఈడుండానని దానితో చెప్పకుండా చెయ్యిపట్టుకొని దాన్నిట్లా లాక్కురా!"

"తలా, బట్టా, గుడ్డా అన్నీ తడిసి ముద్దయి పోయిందే: అబ్బే. ఈకడవ పోనీ. ఇంకోపాలి పిలుచు కొని వస్తాలే."

"అట్టా కాదురా. ఆలంజ చెయ్యిజారితే మనకు చిక్కదురా—నీకు తెలీదు. దాని కోసరం ఇప్పటికి ముగ్గురిచేత కబురుచేశాను. అది రానని చెప్పింది. ఈ సమయం పోగొట్టుకొని ఉపయోగం లేదు."

"................."

"నీ కెందుకు నువ్వుపోయి దాన్నిట్లా లాక్కొని వద్దూ. తరువాతసంగతి నేను సరస పెట్టుకొంటాను."

ఫెళ ఫెళమని పెద్ద ఉరుము ఉరిమింది. పరధ్యానంలో ఉండిన పెంచెలి జడుసుకొని మెరుపుతీగలాగే దాని శరీరం కంపించి వంకలు తీసింది. నోటిలోకి తీసుకొన్న గడ్డి నోటిలోనే పెట్టుకొని, నములడం చాలించి, మెడలెత్తి నిర్ఘాంతపోయి చూస్తున్నాయి ఆవృషభ రాజములు. గాలివానా చేయీచేయీ కలుపుకొని వాటి ఇష్టంవచ్చినట్లు చెలగాటా లాడుతున్నాయి.

"టర్రు" మని ఎద్దుల్ని అదిలించుకొంటూ, దారి తొలిగించుకొంటూ పెంచెలిదగ్గరికి వచ్చాడు సుబ్బడు. ఏదో సమాధిలో ఉండినట్లు తదేకధ్యానంలో కదలకుండా మెదలకుండా నిలబడేఉంది పెంచెలి.

"ఏమే" అని పలకరించాడు సుబ్బడు.

"అమ్మో! ఎంతవానో! ఎంతగాలో! ఇదేం ఖర్మమయ్యా, ఇయ్యేల ఇంటికి పోనిచ్చేటట్లు లేదే, ఈ మాయదారివాన!" అన్నది పెంచెలి.

"ఇంటికి పోవచ్చుగాని, రాయుడు చెప్పిపంపితే రానన్నావట! నీ కేమంతపొగరే!" అన్నాడు సుబ్బడు.

జల్లుమని కంపించింది పెంచెలి దేహం: అప్పటికి స్ఫురణకువచ్చింది తాను దూరిన కొఠం రాయుడి దని. కాని, రాయుడు అప్పుడు అక్కడనే ఉన్నాడని ఆమె కింకా తెలియదు.

"నిన్నే! అడుగుతుంటే పలకవేమే? మాలలం జవు: నీ బతుక్కు ఆట్టాంటి మారాజు వెయ్యిజన్మా లెత్తినా చిక్కుతాడా? లచ్చనంగా ఇంతబంగారు పెడతాడు. డబ్బూ, దస్కమూ ఇస్తాడు: నీ కేమంత గాడా! ఆయన రమ్మంటే రానన్నావుట-ఎందువల్ల?"

"ఊరుకోవయ్యా! సుబ్బయ్యా! ఇట్టాంటి ముచ్చట్లు నాకాడ ఎత్తవోకయ్యోవు, బాగుండదు!"

"బాగుండక చేదా ఏందే! రాయుడు మోజు పడి కులమయినా పాటించకుండా అడుగుతుంటే ఎన్నాళ్లని ఇట్టా ఎగర్తించి పోగలవే! పిచ్చిపిచ్చి చేష్టాలు చేయవోక. నే తీసుకొనిపోతా, రా!"

ఆకాశంలో మేఘాలు ఒరుసుకొన్నట్లే పెంచెలిగుండెలుకూడా రాపిళ్లుపడుతున్నాయి. పెంచెలి నోరువిప్ప లేదు.

"రా. రాయుడు ఈడనే వుండాడు. రా! ఆయన్ని ఎగర్తించి పోబోక: చెడిపోగలవు" అన్నాడు సుబ్బడు.

ఆసమయంలో రాయుడు ఆ కొఠంలోనే ఉన్నాడన్న సంగతి వినేవరకు పెంచెలికి దడపుట్టింది.

"అమ్మయ్యో! ఈడకెందు కొస్తినే! పెద్దపులి నోట చిక్కితినే దేవుడా" అని లోలోపలనే భయ పడింది.

"ఇట్టా రా!" అని దానిచెయ్యిపట్ట బోయాడు సుబ్బడు.

గల్లుగల్లుమని దాని చిల్లోరిగాజులు పెద్దశబ్దం చేశాయి. అంబా అని ఒక ముసలిఎద్దు అరిచింది.

"సుబ్బా! లాక్కొనిరారా లంజని: దాని సొయ్య మణచాలి" అని ఆచివరినుండి గర్జిస్తానే ఉంది రాయుడు సింహం.

"బాబో, వీళ్లు నన్ను బతకనివ్వ" రని అంటూ కింద పెట్టిన గడ్డిగంప చేతికి తీసుకొని వాకిట్లోకి దూకింది పెంచెలి.

"ఏడకి పోతావే!" అని మీదికి దూకి గంప పట్టుకొన్నాడు సుబ్బడు.

"పోనిచ్చాబోకురా" అని అరుస్తానే ఉన్నాడు రాయడు.

"నీ తల బద్దలు కానూ, నీకే మంతపొయ్యేకాల మయ్యా! సుబ్బయ్యా!" అని పెద్దఅరుపు అరిచి సుబ్బడి చేతిలో గడ్డిగంప విడిచిపెట్టి చీకట్లోకి పారిపోయింది పెంచెలి. దాన్ని వెన్నంటి తరుమబోయిన సుబ్బడు కాలుజారి కిందపడిపోయి, లేచేలోపల పెంచెలిజాడ అయోమయమైన ట్లనిపించింది సుబ్బడికి.

"పోనిచ్చావేమిరా పెద్దమ్మా? అన్నాడు రాయుడు.

"దాని కిష్టంలేనిది మనం ఎంతచేస్తేమట్టుకు చిక్కుతుంధా ఆడది?"

"ఏడవక పోయినావు. పెద్దమ్మ:—కాదురా: చేతికిచిక్కిన ఆడదాన్ని పట్టుకొని రాలేకపోయి నావే— ఏడవనా నువ్వుండీ!"

"నన్నేం చెయ్యమన్నావయ్యా; అది తప్పించు కొని పారిపోతేను.

"అఘోరించావులే. ఇంతట పోగొట్టితే పోగొట్టావు కాని రేపు తెల్లవారి దాన్ని నువ్వు ఖండితంగా అడిగి తెలుసుకో; తెలిసిందా ?"

"సరే: అట్టనే అడుగుతాలే."

"చూడు: పదిసవరలు బంగారు ఇస్తానని చెప్పు: మంచి పగడాలదండ ఇస్తానని చెప్పు. ఒప్పుకొంటుందిలే: ఇంకా పసిది కాబట్టి జంకుతున్నది."

"అట్టనే" అన్నాడు సుబ్బయ్య.

వానరవ్వంత తెరపి ఇచ్చినతర్వాత ఇద్దరూ ఇళ్లకి పోయారు.

పెంచెలి ఎట్లా ఇంటికి ఘటం చేరవేసిందో-తనదేహం తనకి స్మృతి తెలియులేదు. పొద్దుపోయి, గాలీ వానాలో పిల్ల ఇంకా ఇంటికి రాలేదని దిగులుపడి ఎదురుచూచే తల్లిదండ్రుల మనస్సుకి ఆమెఆగమనం స్థిమితం చేకూర్చింది. కాని పెంచెలి మనస్సుకు స్థిమితం చేకూరేది ఎన్నటికి ?

ఇంటికి పోంగనే తడిగుడ్డలు విడిచి, పొడిగుడ్డలు కట్టుకొని, తడిసినతల తుడుచుకొని, తనకు ఆకలిలేదంటూ ఆరాత్రి ఉపవాసంచేసి పండుకొంది పెంచెలి.

పెంచెలి కారాత్రి కంటికి నిద్దరాలేదు. ఎట్లా వస్తుంది? రాయుడు తనగుండెల్లో పెట్టిన అగ్నికణాన్ని రగుల్కొల్పి పెద్దదిచేస్తున్నాడు. చిన్నతనం చపలత్వంచేత తనకు చెప్పి పంపించాడని ఆరంభంలో ఆమె లక్ష్యపెట్టకుండా తోసేసుకొంటూ వచ్చింది. కాని చూడగా అతడు పెద్దఆలోచనమీదనే ఉన్నట్టుగా ఉన్నాడు. వీలయితే తనను దౌర్జన్యంమీదనైనా లోబరుచుకోవలెననే ప్రయత్నంమీద ఉన్నాడు. లక్షాధికారి! బలవంతుడు! ఆయన అంతరం ఎంత, మాలకులంలో పుట్టిన తన అంతరం ఎంత? ఆదోరకు తనమీద ఎందు కీభ్రమ ? ఆనాటిరాత్రి తన రోజు బాగుండి ఎట్లనో తప్పించుకొని పారిపోగలిగింది కాని, ఆపెద్దపులిని తప్పించుకొని ఎన్నాళ్లని తా నాగడ్డమీద తిరగగలదు? పోనీ, ఈ సంగతి రొబ్బడితో చెప్పి, త్వొందరగా పెళ్లిచేసి తీసుకొని పొమ్మంటేనో! అమ్మో, ఈ విషయం అతని చెవికిపోతే తనను గురించి అత డేమి సంకల్పిస్తాడో! అసలు తాను నోరువిడిచి ఇట్టా ఇట్టా జరిగిందని అతనితో చెప్పడం ఎట్లా?

పోనీ, తల్లితోగాని, తండ్రితోగాని తన బాధ చెప్పుకొంటే ?—చెప్పి ఉపయోగం ఏముందీ? వాళ్లిద్దరి మనస్సుకూ తేనిపోని దిగులూ, విచారమూ కొనితెచ్చి పెట్టడంతప్ప. వాళ్ల బ్రతుకిక్కవాండ్లుపోయి ఈవిషయమై రాయుడితో తగువులాడగలరా? — ఎంత ఆలోచించుకొన్నా ఆమెకు గత్యంతరం తోచలేదు. తా నీవిషయమై నోరు విప్పినట్టయితే నలుగురునోటా పెళ్లికాని పిల్ల, తనే రచ్చా రావిడీ అల్లరీ పడేట్టుగా కనిపించింది కాని తా నెంత వ్యక్తిగల ఆడదయినా, కేవలం లోకానుభవంలేని తనవంటి బాలికకు, ఆస్థితిలో సంభవించిన విపత్తు నెదుర్కొని నిగ్రహించడానికి ఆమెకు గుండెనిబ్బరంచాలలేదు. కడుపులో పెద్దభయమూ దుఃఖమూ పుట్టుకొనివచ్చినవి. తండ్రికీ తల్లికీ తెలియకుండా ఆరాత్రి తెల్లవార్లూ ఏడుస్తూనే పండుకొన్నది పెంచెలి.

రాయుడికిమాత్రం ఆరాత్రి కంటికి కునుకు ఎట్లా వస్తుందీ? రాత్రి భోజనంచేసుకొని, మిద్దెమీద రెండో అంతస్తుగదిలో పందిరిపట్టెమంచంమీద శయనించినప్పటికీ, మాలవాడలో తాటాకుగుడిసెలో నులకకుక్కిమీద పడి పొర్లుతూఉండే పెంచెలిస్థితికంటె హీనంగా ఉన్నది అతగాడిస్థితి. కళ్లెంతెగిన గుర్రంలాగ, విచ్చలవిడిగా సంచరిస్తోంది అతని మనస్సు. ఆరునెలలకిందట తనచేలో వరినాటు వేళలకి చూచినపుడు తన హృదయఫలకంమీద హత్తిపోయిన పెంచెలి బింబం అతన్ని పిశాచంలాగ పట్టుకొని పీక్కొని తింటోంది. మనోగతమైన ఆ బింబాన్ని సాకారంగా హస్తగతంచేసి తీరుతానని అతని ధనలక్ష్మి అత డాశవదలుకొన్నకొద్దీ అభయహస్తమిస్తూనే వుంది అతనికి- తాను కామించింది ఆస్త్రీఅవయవసౌభాగ్యసంపత్తికాని, ఆమాలదాని కులం కాదుగా! తనవల్ల నిత్యమూ ఎన్నో సహాయాలుపొందే

ఒకబీదమాలకుటుంబంలో పుట్టిన ఆపిల్ల తనయెడల అంతమాత్రం కృతజ్ఞత చూపలేదూ!

పెంచెల్ని సాధించడం ఎట్లా ? ? ?
తల పగిలిపోతోంది రాయుడికి.

ఆ రాత్రి మాలవాడలోని పెంచెలికీ, మేడమీది రాయుడికీ కాళరాత్రే! గుర్రపుసాలలో చింకిరిచాప మీద శయనించిన రొబ్బడుమాత్రం ఒళ్లెరగడు — గాఢసుషుప్తిలో!

3

కాలవైపరీత్యం—బళ్లు ఓడలూ, ఓడలు బళ్లూ అవుతూఉంటవి! మన రాయుడితాత, తన హయాంలో ఉప్పుకావిళ్లు మోసుకొని జీవించేవాడట! అయితేనేం? అది ఎప్పటిసంగతో— పురాతనం నాటిసంగతి; రాయుడి కుటుంబానికి, అతని తండ్రిహయాంలోనే అందుకొన్నది—శుక్రమహాదశ! ఆరంభంలో అతగాడు అయిదువందల రూపాయలు అప్పుచేసి, పూనా బొంబాయి ప్రాంతాల్లో ఆరంభించిన ముత్యం, పగడాల వ్యాపారం, పేటిగడ్డమీది తోటకూరకాడలాగ రెపరెప లాడుతూ నిమిసాలమీదా, ఘడియలమీదా ఎక్కివచ్చి, ప్రాణం హరీ అనేవరకు అతడు లక్షరూపాయల ఆస్తిని గడించి, కొడుకు రాయుడిచేతిలో పెట్టి మరీ చచ్చిపోయాడు. ఇంతకీ అదృష్టమంటే రాయుడిదిగాని, నిజంలో అతని తండ్రిది కానేకాదు. తండ్రి సంపాదించి యిచ్చిపోయిన నూరు ఎకరాలమీదా ఏటా పండే నూరుపుట్ల ధాన్యమూ, ఇంటిచుట్టూ కొట్లు కట్టించి నిలవచేసుకొని, కోస్తాలో ధాన్యానికి ధర ఎప్పుడు ఉబుకుతుందా అని తపస్సు చేయవలసిన బదనాయంతప్ప, ఇక ఇతరవిధమైన బాధ్యతలుగాని, చీకుగాని, చింతగాని ఎరగడు ఆ మానవుడు! పుట్టుభోగి: ముప్ఫయ్యేళ్లు నిండిన నిండుజవ్వనం! ఏడుకావిళ్లరూపాయల సంచులతో మొన్ననే కాపరానికి వచ్చినభార్య- పెంచెలికంటె కూడా తనకి పచ్చిపచ్చిగా, వగరు వగరుగా ఉంది ఇంకా! అందీ అందనట్టు ఉవ్విళ్లూరించే దొరకాయ — ఆ పెంచెలి తన మనస్సులో విషం కలిపి ఊఁ కలిచివేస్తోంది.

పెంచెలి తన చెయ్యిజారిపోయిన రాత్రికి అనంతరం వారంరోజుల కొకనాడు సాయంత్రం రాయుడు మిద్దెమీద వసారాలో గచ్చు అరుగుమీద రెడ్డికం వేసుకొని చుట్టకాల్చుకొంటూ పండుకొన్నాడు. ఆనాటి రాత్రి పశువులకొట్టంలో వ్యవహారం అంతా చెడగొట్టిన చవట పెద్దమ్మ, ముతరాచు సుబ్బడు మిద్దెక్కి,

"దానికప్పుడే పెళ్లిమనువుకూడా ఖాయంఅయిందంట" అని అన్నాడు.

రాయుడు ఉలిక్కిపడ్డాడు.

"దేనికిరా?"

"పెంచెలికే!"

" ఏవూళ్లో ? "

"వాడి స్వంతవూరు పడమట బద్వేలి! మా ఆడదానివూరే వాడిదికూడా. నేను వాణ్ణి బాగా ఎరుగుదును. నేను నగరంసంతకి పోయినపుడల్లా వాడు నాకగుపడుతూనే వుంటాడు. తమరు రెన్నడూ వాణ్ణి చూడలేదూ?!"

"ఎవడురా వాడూ ?"

"అదేందిసామీ! పోలీసుసూపరెంటుగుర్రం కాడ ఉంటున్నాడు నల్లంగా పొడుగ్గా- భారీమనిషి! తమరుకూడా చూసేవుంటారు సుర్తులేదేమో ?"

" సూపరెంటు గుర్రంకాడ ఉంటాడా ? వాడిపేరు ?"

"వాడిపేరు రొబ్బడు. నెలకి పదిహేనో ఇరవయ్యో కాబోలు వాడికి జీతం! ఇప్పటికప్పుడే ఏడెనిమిదినెల్లనించీ, వాళ్లిద్దరూ పెళ్లిచేసుకోవాలని తీర్మానం చేసుకొన్నారంట! వాడెన్నడూ నాతో అననేలే దీసంగతి: నిన్న తెలిసింది నాకు మాలవాడలో!"

"అట్లనా ?"

"మనకు తెలియనే తెలియను సామీ! ఈ పిల్ల దినమ్మూ గడ్డిఎత్తుకొని వాడిదగ్గరికి పోయివస్తూనే ఉంట

దంట! వాడేమో సూపరెంటుఆసరా చూసుకొని, పెళ్లికి గుఱ్ఱమెక్కి ఊళ్లో ఊరేగాలనికూడా పట్టుపట్టా డనీ, అందుకు మాలవాళ్లుకూడా సరేనన్నారనీ మాల వాడంతా గోలగోలగా ఉండది."

"మనవూళ్లో మాలవాళ్లు గుఱ్ఱమెక్కి ఉత్సవం చేసుకొనే ఆచారం లేదు కాబోలు కదరా ?"

"లేదు-సరే. వాడికి తేరగా గుఱ్ఱంచేతిలో ఉండె. పైగా పోలీసు సూపరెంటుఆసరా ఒకటి ఉండె. పెద్దమాలవాడు అంకడూ, పెంచెలి అబ్బ వెంకటి గాడూ—పెద్దతలకాయలు, గుఱ్ఱమెక్కి ఊళ్లోకి వస్తే, లెమబోటి గొప్పోళ్లంతా ఏం చేస్తారో అని అజ్జాయిస్తూ ఉన్నారంట! కాని— ఇప్పుడిప్పుడు బయల్దేరుతూ ఉండారే, ముందరిజుట్లు పెట్టుకొనే కుఱ్ఱకారు— వాళ్లుమాత్రం సంబరం చేసుకో వలసిందే అని హఠం పట్టి ఉండారంట."

"అబ్బో! శానాకథ పెరిగిందే!......"

"పాపం! మనసేద్యగాడు రోశిగాడు, ఒకలేే గోల, ఈ పెళ్లి ఖాయమైనప్పటినుంచీని......"

"ఎందుకూ ?"

"ఎందుకంటే, వాడు తల్లితండ్రి లేని దిక్కు లేని పచ్చి! 'నీకు పిల్లనిచ్చి పెళ్లి చేస్తా'ననీ, 'ఇల్లరికం పెట్టుకొంటా'ననీ,' చిన్నప్పటినించీ వాడి మేనమామ వెంకటిగాడు ఆశపెట్టి, వాడికి తమరు ఏటాయిచ్చే జీతంవడ్లు పుట్టీ ఏడుంగింజలూ వెంకటిగాడే కాజేస్తూ, తీరా ఇప్పుడు ఆ పిల్లకి పెళ్లిఈడు వచ్చేవరకు, దాన్ని పరాయిచోట యిచ్చిచేస్తున్నాడని, రోశిగాడు ఒకలేే గోల...పాపం!"

"అయితే మన రోశిగాడికి, వెంకటిగాడు సయానా మేనమామా ?"

"ఓ వేలు విడిచిన మేనమామకాబోలు! అయితే మట్టుకు, ఇన్నేళ్లుగా ఆశపెట్టి, నోరులేనివెధవ, వాడి చేత అన్నిపనులూ చేయించుకొని, చూడండి, ఇప్పు డెట్లా ఎదురు తిరిగాడో వాళ్లంద రూకూడా......"

"అసలు పిల్ల ఏమంటుందీ?"

"అదో మిడిమేలపులంజ: దానికి అపడమటాడి మీదనే మరులు! ఆ గుఱ్ఱం, ఆ సంబరం, ఆ ఊరేగడం ...ఈదరువుమీదనే ఉండ దది. ఇట్లాంటి చవటల్ని దగ్గరకి రానిస్తుందా మొదలు?"

"అట్లనా?..............."

"ఆరోశిగాడు - నోరులేని కుంక- ఒకలేగోల! అందులో ఆపిల్ల ఎఱ్ఱగా ఫుల్లగా కాస్త కంటికి నద రుగా అగుపడే చట్టమైన పిల్లేమో — దాన్ని విడిచి పెట్టుకోవాలంటే, వాడు దిగులుపడి చస్తుండాడు."

"ఆ వెధవసంగతికేంగాని, నువ్వు మళ్లా దాన్ని అడగలేదటరా?"

"అడగకేం! ఈవారం రోజులుగా అడిగి అడిగి, ప్రాణం చాలొచ్చింది నాకు. అబ్బో! అది అసాధ్యపు లంజ సామీ! మనం ఒక్కమాట మాట్లాడితే, అది పది మాటలు చెప్పతుంది. అది మనకి అలివి అయ్యే మనిషి కాదు—"

"......................"

"మా దొర నిన్నేం చేయడులేవే! ఒక్కపాలి ఆయనకాడికి వచ్చి ఒక్కమాట మాట్లాడిపోదువుగాని రమ్మంటే, రాను పొమ్మని దాని దొకటే పాట! ఇక దానన్నడగడమే నాకు చిన్నతనంగా ఉండది సామీ!"

"సరే! ఇక నువ్వు దానితో ఈ ప్రస్తావన ఏమీ చేయనేవద్దు. పలుక్కుండా ఊరుకో!......"

"చిత్తం!......కాని దొరలు ఎట్లనయినా, ఈపెళ్లి నిలుపుదల అయ్యేటట్టు చేయిస్తిరా, దాని రోగం కుదురుతుంది; అటుతర్వాత మన చెప్పుకింద తేలయి పడిఉంటది–" అంటూ మిద్దెదిగి వెళ్లిపోయాడు సుబ్బడు.

రాయుడికి మనస్థిమితం చెడింది: పరిపరివిధాల పోతోంది అతనిమనస్సు: అతని నోటిలోనిచుట్ట చివర ఎఱ్ఱడాలు ప్రస్ఫుటంగా గోచరిస్తోంది. పెంచెలీ చెయ్యిజారిపోతోందని అతనికి ఒకవిధమైన ఖంగారు

పుట్టింది. పోతేపోయింది. తనయెడల అదిచూపిన అవిధేయతకు దానికి తగినశాస్తి చేసి విడిచిపెట్టితేనే గాని వీల్లేదని అతనికి క్రోధం ఉద్రేకించింది. తనగ్రామం అంత నిర్భయంగా ప్రవేశించి, తాను కాంక్షించిన వస్తువును తీసుకొని పోదలచిన ఆ మొనగాడెవరా అని అతనికి ఆలోచన కలిగింది! అతనికి చికాకనిపించి పండుకొన్న మనిషి లేచి వసారాలో ఇటూ అటూ పచారులారంభించాడు.

రాయుడుది పిన్నవయస్సయినా మొదటినుంచీ పట్టుదలమనిషీ, హఠవాదీని. తనను ఎదిరించిన మనిషిని సాధించి, రాచిరంపాన్న పెట్టేవరకూ అతగాడికి నిద్ర పట్టదు. పైగా అతగాడికి ఆగ్రామంలో ఎదురులేదు. ఆఖరుకు తనంతటి మనిషికి ఒకమాలదానివల్ల పరాభవం కలిగిందే అని అతనికి అరికాలిమంట నెత్తికెక్కింది. చిన్నపిల్ల, నిదానంమీద అదే అంగీకరిస్తుందని ఎంత దూరం ఓర్మి వహించినా, చివరకు అతనిచేలతనమే బయట పడిందిగాని—కార్యసాఫల్యం కానేలేదు. "ఛా! నోరువిడిచి ఎందుకు అడిగాను వాన్ని"అని జుగుప్సపడ్డాడతడు.......కానీ.........చూతాం...... అనుకొన్నాడు. ఈవిషయం మళ్లా రెండో చెవికి రానే కూడదనుకొన్నాడు. ఆరాత్రితెల్లవార్లూ, తన బుద్ధికి పదును పెట్టి ఆలోచన సాగించాడు. మెదడు వేడెక్కుతోంది. కాని, పద్మవ్యూహానికి పడకం కుదరడంలేదు.

తెల్లవారుజామున కోడికూతవేళకు అతని కొక పదకం కుదిరింది. అప్పటి పరిస్థితుల్లో పనిచేయదగ్గది అదొక్కటే మందు: ఆగరళం పనిచేస్తే చేసినట్టూ లేకుంటే లేనట్టూను అనుకొన్నాడు.

ఉదయం నిద్ర లేచీలేవడంతోనే ముతరాచు సుబ్బడికి కబురుచేశాడు. వాడితో ఏదేదో మాటాడి, చివరకు ఈ విషయంలో తన పేరు బయటికివస్తే గొంతుకు పిసుకుతానని చెప్పి వాణ్ణి పంపివేశాడు.

"చిత్తం. ఆ పని అంతా నేను చక్కబెట్టుకొని వస్తానుగా—" తమరి కొసందేహం ఏమీ పనిలేదు. అంటూ వెళ్లిపోయాడు సుబ్బడు.

తెల్లవారి ఉదయం నాలుగు ఘడియల పొద్దెక్కిన తర్వాత గ్రామంలో ఇతర పెద్దతలకాయలను—చలమానాయుణ్ణీ, సభాపతినీ, శింగరశెట్టినీ పిలిపించాడు రాయుడు; వాండ్లతో రహస్యంగా మంతనాలుచేసి గ్రామంలో మాలవాళ్లు కొత్తగా గుర్రా లెక్కి ఉత్సవంచేసుకొంటూ ఉంటే పెద్దతలకాయలు నలుగురూ ఊరుకొంటారా, మీకుపౌరుషంలేదా, మీకు పరువులేదా అని వాండ్లనుచివాట్లుపెట్టి శిర మెత్తించాడు. మాలవాళ్లు గనుక గుర్రంఎక్కి వీధిలోకి వచ్చినట్టయితే, గ్రామ రైతు లందరూచేరి, తలకాయలు పగలగొట్టడానికి తయారుగా ఉన్నారు కాబట్టి జాగ్రత్త అని మాలవాండ్లకు తెలిసేలాగున ఊళ్లో ఒకవిధమైన పుకారు లేవదీశాడు—తాను తెరచాటునే నిలబడ్డాడు.

౫

పెంచెలి — ఏ ముహూర్తాన తన వివాహవిషయమై తలపెట్టిందోకాని ఆక్షణం లగాయతు ఆమెకన్నీ కడగళ్లుగానే కనపడుతున్నవి. ఆమె మనస్సు శాంతీ, సంతోషమూ ఎట్లాంటివో ఎరగదు. గ్రామమూ, మాలవాడా కూడా, అట్టుడికినట్లు ఉడికిపోతున్నది. మాలవాడు గుర్రమెక్కి ఊళ్లో అడుగు పెట్టినట్లయితే ముక్కలూ, ముక్కలుగా చెండాడుతామని ఊళ్లో రైతులూ, ఏమైనప్పటికీ ఈ పెళ్లికి మాత్రం వెనక్కి జంకకూడదని మాలవాళ్లూ—అప్పుడే రోషా లెక్కి వీరావేశంమీద కత్తులూ, కటార్లూ నూరుతున్నారు. మాలవాడలో పెద్ద పెద్ద తలకాయలు పదిమందీ కలిసి, ఇంతదూరం వ్యవహారం రాకుండానే, నెమ్మది మీదనే చక్కపెట్టుకొందామని యోచనతో గ్రామంలో పెద్దరైతులదగ్గరకు పోయి—ఈ ఆచారం ఒకవేళ ఆగ్రామంలో లేకపోయినప్పటికీ, ఆచుట్టుపక్కల చాలా గ్రామాలలో అమలులో ఉన్నదనీ, పెళ్లికొడుకూ, పెళ్లికూతురూ ముచ్చటపడి వేడుక చేసుకోదలచినారనీ చెప్పతూ, ఉత్సవం చేసుకోవడానికి ఉత్తర్వు ఇవ్వవలసిందని గ్రామపెద్దలనందరినీ ఆశ్రయించి అర్థించారు. కాని

ఉపయోగం కనిపించలేదు; రాయుడి దగ్గరికిపోయి ఆయనగారి రెండుకాళ్లూ పట్టుకొన్నారు. 'గ్రామంలో ఇతరపెద్దలందరూ ఇష్టపడితే తన ఆక్షేపణ ఏమీలే'నని మాలలతో బహిరంగంగా తియ్యనిమాటలు చెప్పతూ— గ్రామంలో మాలవాళ్లుకొత్తగాకోరే హక్కును వాళ్లకు ప్రసాదించినందుకు, మాలలందరూ కలిసి, ఆగ్రామ ఉమ్మడి ఖర్చులకుగాను పోగుచేసిన ఫండుకు 300-0-0 లు నజరానా చెల్లించినట్టయితే ఈ హక్కు శాశ్వతంగా మాలవాళ్లకి విక్రయం చేయడానికి గ్రామస్థులు సిద్ధంగా ఉన్నారని — లోపాయికారీగా రాయుడు మాలలకి కబురు చేయించాడు. కానివాళ్లదగ్గర అంతశక్తి ఏదీ? మాలవాడలో ఎందరిసంసారాల్లోని కుండబొచ్చెలు పోసచేస్తే మూడువందల దమ్మిడీలు కాగలవు? ఎన్ని సకిసెలు కాలదోస్తే మూడువందల చిన్నడబ్బులు కాగలవు? ఎన్నిసంసారాలు దిబ్బచేస్తే మూడువందల అణాలు కాగలవు? బాబో! మావల్ల కాదంటే, మావల్ల కాదని గుండెలుకొట్టుకొన్నారు మాలలు: అంతగా వ్యవహారం వల్ల తప్పి, మెలిబడితే కొండంత ఆసరా మూపరెంటుదొర ఉండనే ఉండాడని వాళ్లలోవాళ్లు ఇక ధైర్యం తెచ్చుకొని కూర్చున్నారు. అయితే అయింది, ఎంతకయినా తెగబడుదామని మాలవాండ్లు నడుముకు ధట్టీలు బిగిస్తున్నారు.

పెళ్లికొడుకు మూపరెంటుదగ్గర ఉండేవాడన్న జంకుతోనే, రాయుడు తాను బహిరంగంగా ఏమీ కలహం పెట్టుకోకుండా, ఊళ్లో యితరరైతులనుమాత్రం లేవదీసి, వెనకతట్టు తాళహాంగుచేస్తూ తాను తెర చాటునే నిలబడ్డాడు. అతనికీ తెలుసు— దండోపాయం ఉపయోగంలేదని. అందువల్లనే తిరుగులేని యెత్తు ఎత్తాడు. లోకానుభవం గలవాడు. దీనికి సాధ్యంకాని దంటూ ఉండదని తెలుసు నతనికి.

మాలవాడలో జరిగే ఈ గలభాకి పెంచెలి తాళలేకపోయింది. తన మూలాన్నికొంపలూ కొంపలూ అంటుకొనిపోయేటట్లుగా ఆమెకు తోచింది.

"దానిట వాన గురిసిన స్వరం! సంబరం లేకుంటే మానె! ఆయనా నేనూ ఇంత పప్పూకూడూ తిని, కంకణాలు కట్టుకొని పెళ్లిఅయిందనిపించుకొంటే శాన! ఆ రాయడు నన్నెట్టాగా బతకనిచ్చేటట్టులేదు: ఈ రచ్చ అంతా ఆయనగారు లేవదీసిందే! అవ్వలూ, ఆవులూ కుమ్ముకొని లేగల్ని తన్నినట్లు, ఈ కొట్లాటలో నా పెనిమిటి కేం కీడుచేస్తారో, ఆయనా తల్లి తండ్రీలేని దిక్కులేని పక్షి! నామీదనే కళ్లుపెట్టుకొని బతుకుతుండాడు: ఏమో! మా ఇద్దరి ప్రాణం సల్లంగుంటే ఇంత బొద్దాకూ నీళ్లూ తాగి బతుకుతాం! ఏమైనా సరే, ఈ సంబరం మునిందుకోమని ఆయన కాళ్లు పట్టుకొంటాను. ఒప్పుకొంటాడులే నే చెప్పితే వింటాడులే మామ!" అని మధ్యాహ్నం పన్నెండు గంటలకు ఎర్రటి ఎండ అని అయినా అనుకోకుండా బయలు దేరింది రొబ్బడిదగ్గరికి పెంచెలి.

నడినెత్తికి వచ్చి తేరి చూడడానికి వీల్లేకుండా నిప్పులు కక్కుతున్నాడు ప్రచండభాస్కరుడు. ఎండ తగలకుండా నెత్తిమీద కొంగుముసుగు కప్పింది పెంచెలి; గుర్రాన్నిగనక ఊళ్లోకి తీసుకొనిరాకుంటే ఇక తనపెళ్లి కేమీ కష్టాలులేవని స్థిమితపడింది; గుర్రాన్ని తీసుకొనిరాకుండా పెళ్లికొడుకు రొబ్బణ్ణే ఒప్పించినట్లయితే తనకే బాధా ఉండదని ఆశించింది. వీధివాకిలి లోపలికినెట్టి గుర్రపుశాలలోకి పోయింది పెంచెలి.

మంచి నడిజాముపొద్దు. ప్రజలు భోజనాలు చేసే సమయం, భోజనానంతరం విశ్రాంతి తీసుకొనే సమయమూను. రొబ్బడు ఆపూట అన్నంతిన్నాడో లేదో, గుర్రపుశాలలో చాపమీద ముసుగుతన్ని పండుకొని గాఢనిద్రలో ఉన్నాడు. గుర్రంకూడా వాడివైపు చూస్తూ ఏదో విచారాన్ని సూచిస్తూ ముడుచుకొని పోయి నిలబడిఉన్నది. అంత గాఢనిద్రావస్థలో ఉండిన తన ప్రియుణ్ణి లేవగొట్టనా వద్దా అని సందేహించింది పెంచెలి: కాని ఆమె తన మనస్సులోని ఆత్రం అరికట్ట లేకపోయింది. ఎర్రటి ఎండలో పేరెంమీదవచ్చిన వగర్పులోనే—

"మామా! మామా!" అని అతనిపక్కనే కూర్చొని తలమీద ముసుగుతీసి రొబ్బణ్ణి నిద్రలేపింది. త్రుళ్లిపడి

నిద్రలేచాడు రొొబ్బడు. ఎర్రటి చింతనిప్ప కణాలలాగ ముఖంలోకి ఉబికి నెత్తురు కక్కుతున్నాయి అతగాడి నేత్రాలు. పెంచెలికే ఆ ముఖవీక్షణం భయంకర మయింది; నిద్రలో లేచినందువల్ల ఆ విధంగా ఉన్నా డనుకొన్నది.

"మామా! మామా! మన కా గుర్రమూ వద్దు, ఆ సంబరమూ వద్దు, మామా!"

"నా కాగుర్రమూ వద్దు, ఆ సంబరమూవద్దు, ఆ పెళ్లీవద్దు" అన్నాడు రొొబ్బడు.

ఉలికిక్కిపడింది పెంచెలి:

"మామా! నిద్రకళ్ల నేందీ ఆమాటలు! శుభ మల్లె పెళ్లెందుకు వద్దు?"

"సంబర మెందుకు వద్దు?"

"మాలాడు గుర్రమెక్కి వూళ్లో సంబరం చేసుకొంటే, తలకాయ పగులకొట్టుతామని ఊళ్లో పెద్ద పెద్ద ఆసాములందరూ కత్తికట్టి ఉండారు."

"మిండగాళ్లని మరిగినలంజ, నన్ను మోసంమీద పెళ్లి చేసుకోవాలని వస్తే తలకాయ పగలకొట్టాలని కర్ర చేతపట్టి ఉండాడు — ఈ రొొబ్బడు."

"ఏందీ మామా! ఈ మాటలూ?"

"ఏందేలంజా! ఈ తప్పుడుచేష్టలూ?" అని లేచి పెంచెలి డొక్కప్రక్కన ఒక్కతన్ను తన్నాడు రొొబ్బడు. పెంచెలి కేమీ అర్థంకాలేదీ వైఖరి. నిర్ఘాంతపోతోంది. అతన్ని అడుగుదామని అనుకొంటుంది—కాని నోరువిడి బడడంలేదు. ఇంతలోనే రొొబ్బడు దానిజుట్టుపట్టుకొని "ఊళ్లోవాళ్లనందరినీ మరిగి నన్ను పెళ్లాడాలని తయారవుతావా లంజా?" అని దానితల కిందికి వంచి వీపు మీద పిడిగుద్దులు కురిపించాడు.

బాబోయి, బాబోయి అని అరవడానికి కూడా నోరురాలే దా పడుచుకి! అతనివైఖరి కాశ్చర్యపోవడం తప్ప దుఃఖించడం చేతకాలే దా అబలకి. ముఖంమీద విడిబడ్డ కురులు సవరించుకొనేలోపలనే ఎప్పుడు తెచ్చాడో పదిబారల జనపనారపగ్గం ఒకటితెచ్చి పెంచెలి రెండుచేతులూ వెనక్కి విరిచికట్టి ఆమెను బరబర లాక్కొనిపోయి గుంజకు కట్టివేశాడు రొొబ్బడు. నోరు విప్పలేదు ఆభూదేవి! కళ్లు చారెడు చేసుకొని అతని ముఖంలోకి చూస్తూ నిలబడింది కొయ్యలాగ!

గుర్రాన్నితోలే కంచీ చేత తీసుకొని ఎదురుగా నిలబడ్డాడు ఆమె ప్రేమ హరించిన ప్రియుడు.

"నిజం చెప్పతావా చెప్పవా?"

ఆమె పెదిమెలు కంపించాయి.

"నువ్వు నీ మేనత్తకొడుకు రోశిగాణ్ణి పెట్టుకొన్నావా లేదా?"

"రామ! రామ!" అంది ఆమె హీనస్వరంతో

"ఏడే నీ రాముడు?" అని అతడు ఉచ్చరించే లోపలనే ఆమె దేహంమీద కంచీ ఛెల్లుమని పలికింది.

"మామా!............" అని మాత్రమే అన గలిగింది ఆశీలవతి.

"ఆనాడు నువ్వు నాకాడనించి పోయినపొద్దు మీపూరుకాపు రాయుడి పసువుల కొట్టంలో దూరావా?"

"దూరాను" అని సత్యవాణి పల్కింది.

"ఎందుకు దూరావు?"

"వాన జల్లుకి భయపడి—"

"రంకులతనం అంటే భయంలేని దానికి నీకు వాన జల్లంటే భయమా?" అని తీవ్రంగా హెచ్చరించింది కంచీ!

"మామా ..."

"ఆ పాకలో ఏమి జరిగిందో నిజం చెప్పు!"

పెంచెలిముఖంలో మిడిగ్రుడ్లే అతనికి జవాబిచ్చాయి!

"పలక వేం?"—అని కంచీ ఆడించాడు రొొబ్బడు—

ఆకంచీ చేసేధ్వనికి, దాని రుచితెలిసిన ఆ స్వరం భయపడి, బెదిరి కలగతొక్కుకొంటోంది—

పెంచెలి గొంతెండిపోయింది: గుటక పడడం లేదు. కళ్లు చీకట్లు కమ్ముతున్నాయి: కాని రెప్ప లాడడంలేదు—నిజం చెప్పతావా చెప్పవా అని రొబ్బడిచేతిలోని కంచీ యింకా సత్యాన్వేషణకొరకు పెంచెలిరక్తాన్ని కూడా పరిశీలిస్తోంది.

"మామా —" అని నోరారా పిలవాలని ఆమె కోరిక. తన ప్రియుని కరువుతీరా కౌగిలించుకోవాలని ఆమె ఉబలాటం! తనమీద ఎంతప్రేమా, ఎంత విశ్వాసమూ లేనిదీ ఆ అమాయకుడికి, లోకం చెప్పిన చెప్పుడు మాటలమీద అంత ఆగ్రహంపస్తుందా అని ఆమెసంతోషం. ప్రేమసూచకములా?-ఆకంచీదెబ్బలకు ఆమెశరీరం ఉప్పొంగిపోతోంది—కాని ఆ అపూర్వమైన అనుభవంలో ఆమె బదులు చెప్పలేక నిశ్చేష్టయై తన్ను కట్టివేసిన కొయ్యకుంజలాగే కొయ్యలా నిలబడి ఉన్నది పెంచెలి—

మౌనం అర్ధాంగీకారసూచకమా? 'తనప్రశ్నకు జవాబు చెప్పకుండా, చేసినతప్పు ఒప్పుకొంటోంది ఈలంజ!, అనుకొన్నాడు రొబ్బడు. వాడికసి తీరడంలేదు. తానింకా పెండ్లాడని పిల్లే, ఆపిల్లమీద తానంత తీవ్రమైనఅధికారం చెలాయించవచ్చునా అనేయోచన మనస్సుకు తట్టలేదు ఆ పెళ్లికొడుక్కు. ఒకసంవత్సరంగా తనతో కపటస్నేహంచేసి మోసగించిందని అతనికి శరీరంయావత్తూ భగ్గున మంటలెత్తి పోతోంది! అందులో పోలీసు సూపరెంటుదొరదగ్గర నౌకరీచేస్తుండే మనిషి తాను, వివాహం కాకపోయినప్పటికీ, తనమనస్సూ, తనదేహమూ, తన సర్వస్వమూ తన అధీనం చేసి వేసినట్టునటించింది పెంచెలి. అతనికి వీరావేశం విజృంభించడానికి, ఇంకా ధూపం ఎందుకూ?

పెంచెలికి కట్టినకట్లు విప్పాడు! ఆమెదేహం తనంతట అదే అప్రయత్నంగా అతని పాదాలమీద పడిపోయింది- కాని, ఆక్రోధమూర్తికి జాలిఏదీ?

"చావు లంజా! " అని తనశక్తికొద్దీ దాని వీపుమీద ఒక్క పిడిగ్రుద్దు గుద్దాడు రొబ్బడు. తన కనిగ్రుడ్డులోని ఎరుపురంగుతో దీటయినరక్తం ఆమెనోట జల్లున ఒకగ్రుక్కెడు కక్కుకొనేటప్పటికి అతనికి ఈప్రపంచం తెలిసింది.

"ఓసీ! ఇంత మోసమా! చెప్పకో, నీ దిక్కున్నచోట చెప్పుకో! నా కాపెళ్లీ వద్దు, ఆ సుర్రమూ వద్దు, ఆ సంబరమూ వద్దు. ఈ సూపరెంటు దగ్గర నాకీ నౌకరీకూడా పనిలేదు. ఇప్పుడే లేచి పోతాను మా వూరికి" అని పై మీద గుడ్డవేసుకొని నోటివెంట నురుగులు కక్కుకొంటూ ఆక్షణమే లేచి చక్కాపోయాడు రొబ్బడు.

సాయంత్రం అయిదుగంటలయింది! అప్పటికి చల్లబడింది ప్రచండసూర్యబింబం. పెంచెలికి స్పృహ కలిగింది. లేచి కూర్చుంది. నలువైపులా చూచుకొంది! తాను ఏకాకిగా ఉన్నదా ఆవరణలో. ఒడలూ, గుడ్డలూ చూచుకొంది. నెత్తురుమరకలు ఆమె గుండె చెదరగొట్టాయి! ఆమె లేచి నిలబడింది. రెండుచేతులూ ఎత్తి సూర్యునికి దణ్ణం పెట్టింది. పెద్దనవ్వు నవ్వింది...మామా... మామా...అని పిలిచింది: పెద్ద ఏడుపు ఏడిచింది. సూర్యాస్తమయం కాబోతోంది. పెంచెలి వీధిలోకి పోయింది.

విరబోసుకొన్న జుట్టు: చిరిగిపోయిన రవిక గాట్లుపడ్డ దేహం! బూడిదలో పొర్లాడిన నెత్తురు మరకల చీర! వికృతాకారం! వికటాట్టహాసం! వెర్రి చూపులు! కారణంలేని ఏడుపు—ఆహా! ఇక మూడు రోజులకు మెడలో మంగళసూత్రధారణ చేయించుకోవలసిన పెండ్లికూతురా—ఆ అవతారం!

వీధిలో తిరిగేకుక్కలు మొర్రో అని అరుచుకొంటూ ఆమె వెంటబడ్డాయి. తనని కరవమని వాటినోటికి తన చేతు లందిస్తుంది—పెంచెలి వీధుల్లో ఆడుకొనే పిల్లలు చిన్నచిన్న రాళ్లుతీసి ఆమెమీద రువ్వుతూ దూరంగా పోయి కేకలుపెట్టుతున్నారు. తనతల పగలగొట్టుమని పెద్దపెద్ద బండలుతీసి ఆపిల్లల కివ్వబోతుంది. వచ్చేపోయే మోటారుకార్ల కింద, బండ్లక్రిందా పడిపోవాలని, రోడ్డులో వంకరవంకరగా నడుస్తుంది. కాని అవి అన్నీ ఆమెను తప్పించుకొని పోతున్నాయి-

సంజచీకట్లు విరిశాయి. పెంచెలి వికృతాకారం మరీ భయంకరమయింది. ఆమె ఇంకా పోతూనేవుంది. తన వూరికి పొయ్యేదారిలో రాయు౹ పశువులకొఠం దగ్గరికి వచ్చింది. పెద్దనవ్వునవ్వింది. పిచ్చిపాట పాడింది— ఆకాశంచుట్టూ తిరిగింది — కానుగచెట్టు కిందికి పోయింది. మామా అని దాన్నిగట్టిగా కౌగిలించుకొంది—కళ్లుమూసుకొంది—పెద్దంగా ఏడిచింది. మామా రా అంటుంది. నేనూ వస్తా అంటుంది. ఇటూ అటూ పరువులెత్తింది. అటూ ఇటూ రెండు బెడ్డలు విసిరింది. అర్థంలేని కేకలువేసింది. రెండు మాలగద్దలు పశువులకొఠంమీద వాలాయి. వాటిని చూసింది. పెద్ద పెనవ్వునవ్వింది; మామా అంటూ కింద తూలిపడిపోయింది.

---



నీరెండ —K. K.

# విమర్శలేశము

ఎలవర్తి రోశయ్య

విమర్శమనఁగానే తప్పులు వెదకి తిట్టిపోయుట యని యపోహపడువా రీ యిరువదవ శతాబ్దములోఁ గూడ ననేకు లున్నారు. కవిత్వము వ్రాయలేనివారే విమర్శకు లౌదురనియు, విమర్శకులందఱుఁ గతినాత్మ లనియుఁ గొందఱు దలఁతురు. 'ఇది మంచిది, యిది చెడ్డది' యని జడ్జివలె తీర్పుచెప్పుట విమర్శకునిపని కాదనియుఁ, దానుచదివిన యుత్తమకావ్యము లు తన్నెట్లా నందపూరితుని జేసెనో లోకమునకుఁ దెలియఁజేయుటే విమర్శక కృత్య మనియు మఱికొందఱి యాశయము. ఒక కావ్యములో గుణము లెక్కువగా నుండి దోషములు తక్కువగా నున్నచో నాకవిని గొనియాడవలెనని, దోషములే యెక్కువగానున్నచో మందలింపవలె నని కొందఱు బుద్ధిమంతు లందురు. సహృదయత్వముతో నే విషయమునైన మంచిదనియో చెడ్డదనియో చెప్పి యానిర్ణయమున కాధారములైన కారణములు దెలుపుటయే విమర్శనోద్దేశమని నాయభిప్రాయము. కాని కొలతబద్ద విమర్శనము సరియైనవిమర్శనము గాదు. ఒక కవియెడఁ దనకున్న స్నేహమును, ద్వేషమును బురస్కరించుకొని యతని కావ్యమును విమర్శకుఁ డనుచితముగా స్తుతించినను, గర్హించినను అతనిది సద్విమర్శనమని యనిపించుకొనదు. ఇది పలువురకుఁ దెలియును. వారిలో నూటిలోఁ దొంబదిమంది యీదోషమునకుఁ బాల్పడుచున్నారు. అతిస్తోత్రపరాయణులును, పురోభాగులును దుర్విమర్శకు లనఁబడుదురు గావుననే నీజాడ్యము వాతఁ బడకుండుటకుఁ బ్రయత్నించెదను. విమర్శమును గూర్చి వ్రాయవలెననిన నొకపెద్దగ్రంథ మగును గాన ప్రస్తుత మీ సాధారణసిద్ధాంతములతోఁ దృప్తిచెంది గ్రంథవిమర్శన మారంభించుచున్నాను. నేను విద్యార్థిని, సాహిత్య ప్రియుఁడను, సత్యరతుఁడను గావున సాహిత్యభూషణ శ్రీయుత జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి, ఎం. ఏ., బి. ఎల్. గారు విరచించిన "విద్యార్థప్రకాశిక"ను, "సాహిత్యతత్త్వ విమర్శనమును" యథాశక్తిఁ బరామర్శింతును.

## విద్యార్థప్రకాశిక

ఇది యాంధ్రవిశ్వవిద్యాలయములో ౧౯౩౯, ౧౯౪౦ సం॥ల యింటర్మీడియేటు పరీక్షలకుఁ బాఠ్య గ్రంథము. ఇందుఁ బెక్కు శీర్షికలతో ననేకాంశములు వ్రాయఁబడియున్నవి.

"తమోదీపిక" యను వ్యాసములో, సరిగా నాలోచింపకుండ నుపనిషన్మతమును, భారత నాగరకతను దూలనాడరాదని చెప్పఁబడినది. "విజ్ఞానయాత్ర" యను వ్యాసములో, "తందానతాన బ్రదుకు" నీచమనియు, నందఱును దమకుఁ దాము బాగుగా విమర్శించుకొనవలె ననియు, భారత స్త్రీ మహత్త్వము కీర్తనీయమనియుఁ దెలుపఁబడినది. "ప్రాచీనుల యాశయము"లోఁ బాశ్చాత్యుల నాగరకత విద్దూరమనియుఁ, బాశ్చాత్య విద్యావిధానమున నాంతరంగిక దృష్టి లేదనియుఁ, బ్రాచీన భారతీయ విజ్ఞానము కట్టలు లేనిదనియు, ననంతమైన దనియు, శాశ్వతమనియు వ్రాయఁబడినది. తదితరవ్యాసములలో విజ్ఞానమును గూర్చియు నేటి విశ్వవిద్యాలయములు చెప్పెడు చదువు మన కెక్కువ యుపయోగకరము గాదనియు, మాతృభాష ప్రోత్సహింపఁబడవలె ననియు, నంధానుకరణము పనికిరాదనియుఁ దెలుపఁబడినది. ముందంజ వేసిన శ్రీ గిడుగు రామమూర్తి పంతులవారి కృషి యమోఘమనియు, వారి భాషాతత్త్వపాండిత్య మపార మనియు, నీవఱకు వ్రాయఁబడిన తెలుఁగు వ్యాకరణములు బహువిద్యార్థ

లకు దుర్బోధములై దాదాపు నిరుపయోగములుగా నున్న వనియుఁ దెలిపి, స్త్రీ విద్యావశ్యకతను గూర్చి గ్రంథకర్తగారు మిగుల శ్రద్ధ వహించి విశేషముగా వ్రాసినారు.

మొత్తముమీఁద గ్రంథము చదువరుల జాతీయ భావములను, విద్యాపరత్వమును, సౌశీల్యమును బెంపొందింపఁ గలదని నా నమ్మకము.

ఈ గ్రంథములో దోషములు గూడఁ గొన్ని యున్నవి. అనుచితస్థలములందుఁ గూడ వ్యక్తుల ప్రతిభావిశేషము లత్యుక్తులతో వర్ణింపఁబడినవి. రచన మితిమించి Allusive గా నుండి ధారాళముగను, సహజముగను లేక యొగుడుదిగుడై, "యాళువ్య"యని చెప్పుటకు వీలులేక, "వీరిబాన వేలు" అన్నట్లున్నది. కొన్నిచోట్లఁ జెప్పినదే మరలఁ జెప్పఁబడెను. మఱికొన్నిచోట్ల నయోమయత్వ మగపడుచున్నది. గోటితోఁ బోవుదానికి గొడ్డలి దెచ్చినట్లు, కొలఁదిపుటలకు సరిపోవు విషయములతో అరరా పుటల గ్రంథము చేయఁబడినది. చూడఁగా, కర్తగారి కింగ్లీషు, బెంగాలి, పాళీ మొదలగు కొన్ని భాషలలో విశేషపాండిత్యమున్నట్లు తలఁపవలసియున్నది. కాని యీ "తెలుఁగు" గ్రంథములో సుమారు నాల్గువందలు ఇంగ్లీషు వాక్యములకే తావీయఁబడుట లెస్సగాదని నామనవి.

సాధారణముగాఁ దెలుఁగుగ్రంథములను నిర్దుష్టముగా ముద్రించునలవాటు మనలో లేదు. ప్రతిగ్రంథము తుదిని తప్పొప్పులపట్టి తయారగును. కొన్నిటిలో నొప్పులే తప్పులుగా దిద్దఁబడినవి! ఈపుస్తకములో నట్టి దెద్దియుఁ గనఁబడక యుండుటచే జాల సంతోషించితిని. పుస్తకము తెఱచిన పిదప మోసపోయితినని తెలిసికొంటిని. అచ్చుతప్పులే కాఁబోలు, పుటపుటలోను లెక్కలేనన్ని యున్నవి. ఈవఱకు వెలువడిన ముద్రణములలో నీష్షాలిత్యములను దిద్దకున్నను రాఁబోవు కూర్పులలోనైన గ్రంథకర్తగారు శ్రద్ధతో వానిని దొలఁగింతురని గంపెడాశతో నమ్మిచు వానిలోఁగొన్నిటిని మాత్రమే యిట వ్రాయుచున్నాను.

దురూహ్యము, రాబోందు, తేజోకాలి, నభోనీను, మేధస్సు, ప్రతీచీ యాచారములు, ప్రాచీన యాచారములు, మైత్రేయీగార్గీలు (మరల, మైత్రేయీలు గార్గీలు), గొయ్యిఁగూర్చి, దురదృష్టవశాత్తూ హృదయమూలేదు, అనఁగూడమూ?, కాదూ?, తేజోవంతమూ, పెద్దలూ పిన్నలూ, అనేది, అనేవారు, మనిషి, జ్ఞానజిజ్ఞాస, బాధకరమూ, పంచాయతు విధానమూ, ఇదంతా పెద్దలు చేసే పెద్దగొడవ.......

### సాహిత్యతత్త్వవిమర్శనము

ఇది యాంధ్ర విశ్వవిద్యాలయములో ౧౯౩౭ వ సం॥ను బి. ఏ. పరీక్షకుఁ బఠనీయగ్రంథము ఇందులోఁ గూడ సారస్వతవ్యాపకము లనేకము లున్నవి గాని 'విద్యార్థప్రకాశిక' లోవలెఁగాక విషయ మెక్కువగా నున్నది.

సాహితీహృది :

ఈవ్యాసములోనున్న విషయ మిది : "అచ్చుయంత్రములు, అక్షరములు — సాహిత్యము కావు. భావము కడుపున నిముడ్చుకొన్న భావమే సారస్వతము. కేవలభావమే సారస్వతమనుట శరీరమే మనుజుఁడనుట. భావమునకు భావ మెట్లవసరమో, అట్లే సాహితికి మనుష్యజీవన మవసరము. కవికి అంతర్దృష్టి; యంతర్జ్ఞానము అత్యవసరము. ప్రకృతియందుఁ గవి తీక్ష్ణలక్ష్య ముంపవలెను. సహజసాహిత్యశక్తికి అక్షరములు సాధనములే కాని కారణములు గావు. ప్రకృతియు, కళయు; కళయు, మనుష్యజీవనమును; సైదోడులు. సాహిత్య మనుష్య జీవనమునకు సత్యశివత్వయు, మహాలక్ష్యములును గావలెను. సత్యవిరుద్ధ విషయము లన్ని సారస్వతము లందును అక్కడక్కడఁ గలవు. ప్రాచీ ప్రతీచీ సారస్వత దృక్పథములో భేదము లున్నను ముఖ్యాంశములు సమానములే. హిందూసారస్వతమునకు మోమోట మెక్కువ, దుడుకుదనము తక్కువ. క్రైస్తవ సారస్వతము అమానుషములైన భయంకర ఘట్టములను గూడఁ జిత్రించును. ఉత్తమసారస్వతము నుత్తమజీవనము నుత్తమమతమును వేలుచేయుట యసా

ధ్యము. దేశకాలములు మహాకవుల కడ్డుగోడలు గావు. వ్యాసాదులును షేక్స్పియరు ప్రభృతులును సత్యారాధకులే. వీరిమార్గములు భిన్నము లైనను గమ్యస్థాన మొక్కటే. షేక్స్పియరు భారత కవులవలెనే పూజ్యుఁడు." ఇందలివిషయము సత్యము, హృద్యము.

సారస్వతము ముక్తిసాధనము :

"భగవంతుఁడు మన హృదయములందే కలఁడు. మన యంతరంగమే దైవసామ్రాజ్యము. సద్భావమే దీని ద్వారము. బ్రహ్మానందప్రద మగు మోక్షప్రాప్తికి సేవ యుత్కృష్టసాధనము. సేవలన్నిటిలో సాహితీసేవ శ్రేష్ఠము. దైవసామ్రాజ్యములోఁ బరంజ్యోతి వెలుఁగుచున్నది. ఈజ్యోతిని గుర్తింపఁజేయు జ్యోతి సాహిత్యము. మనుష్య జీవనము సాహిత్యము. ప్రకృతియును, జీవనమును మిత్రములు. సారస్వతపట్టభద్రులు ప్రకృతిజనయిత్రి మధురదుగ్ధము లానినవారే. సేవయే భగవంతునకు మదావహమని మిల్టను చెప్పెను. కవి భావమయుఁడు. భావశక్తి యగ్నికంటెను తేజస్వంతమై, శాంతి కాధ్యాత్మిక ప్రపంచమునకుఁ గారణ మై యున్నది."

సాహిత్యము ముక్తిసాధనము :

"ఉత్తమకవు లున్నతాదర్శములు చూపి మనుష్యులను స్వార్థచింతనుండి యుద్ధరించిరి. గీతాంజలి భక్తచింతామణీకావ్యములు దైవ మహిమమును గొని యాడి ముక్కడులను ముముక్షువులుగాఁ జేసి పవిత్ర భావములను దశదిశల వెదఁజల్లినవి. రవి వసుకవు లిహమునసే ముక్తి నందిరి. భగవత్ప్రేరితకవిత్వమందు భగవత్స్వరూపము గోచరించును. కెయిడ్మన్, షేక్స్పియరు, బర్న్స్, రవీంద్రుఁడు వ్రాసిన గీతములు వారివి కావు. వీరి నాధారముగాఁ గొని కొండొకశక్తి వీరి ముఖములనుండి గంభీరముగా వాకొనుచున్నది. "పలికించెడువాఁడు రామభద్రుండఁట" యని పోతన యనలేదా? మిల్టను, స్పెన్సరు, సంబోధించిన విద్యాదేవత యెవరు? ఆకస్మికముగా మహోన్నతభావద్యుతి ప్రసరించుట యాధ్యాత్మికశక్తివలనఁ గాదా?"

పై రెండువ్యాసములును మనోరంజకములుగా నున్నను, గొంచెము వివాదాస్పదముగా నున్నవి. కాని రెండవదానిలో "ఐహికపునర్జీవనము, హృదయకోమలత్వము, భావోన్నతి, అనురాగప్రభావము, ఆధ్యాత్మికశక్తి, మానసికోద్ధరణము, ముక్తి గాక మఱేమి?" అని యన్నప్పుడు "ముక్తి" కొంతవఱకు నిర్వచింపఁబడినది. సారస్వత సాహిత్యముల భేదము సరిగాఁ దెలుపఁబడలేదు; కొన్నిపట్ల రెంటికి ముడిపెట్టఁబడినది. సారస్వతము కాలానుకూలమై ముక్తిదాయక మగుటకు ముందు, తాను ముక్తి పొందవలెననికూడఁ జెప్పఁబడినది.

సాహితిగోష్ఠి :

ఈవ్యాసములోని విషయ మిదిగో: "నేఁటి వాతావరణము భావబంధురము. ఇప్పుడు చూపట్టు క్రొత్త పోకడలు అంతరంగమునకు సంబంధించినవి గావు, భావ్య వ్యక్తీకరణవిధానములోనివి. భావకవులనువా రిప్పుడే పుట్టిరనుట భ్రమము. మనుష్యహృదయము, ప్రకృతి, దంపతులవలెఁ గలసికొన్నప్పుడు కల్గినది భావకవిత్వము. ఇట్టికవిత్వము నాఁడును గలదు, నేఁడును గలదు, రేపుగూడ నుండఁగలదు. ఇఁక విశేష మేమనఁగా, నట్టి భావకవుల సంఖ్యలో హెచ్చుతగ్గులే! అంతే! "భావకవిత" యనుపేరు "అగ్గినిప్పు" వంటిది. తెలుఁగులోఁ జక్కని గద్యరచన మింకను దలయెత్తలేదు. కారణ మేమి? మనకు గద్యమునెడఁ గల జుగుప్స (రోఁత)యే. రచనము రమ్యముగా నుండవలెఁ గాని మిట్టుపల్లములతో నిండియుండరాదు. సాహితికిఁ గావలసినది సౌకుమార్యము గాని కాఠిన్యము గాదు. వ్యాస (Essay) రచనముకంటెఁ గథారచనము సులభతరము. వ్యాసకర్త (Essayist) కు గభీరాలోచన కావలె. కథకునకు సహజశక్తి గావలె; పాండితితో నెక్కువ పని లేదు. వ్యాసపు వాక్కులు కలకండ ముక్కలు; కథావాక్కులో — పానకపు గ్రుక్కలు. పెద్దతల గలవారికి వలసినది వ్యాసము. విశాల హృదయమున్నవారికి వలసినది కథ. జనసామాన్యమునకు విద్యాభిరుచి గల్గింపవలెనన్నఁ గథారచన పెంపొందింపవలె."

ఈవ్యాసము హృదయంగమమై, "కలకండ ముక్కల"వలె నున్నది. భావకవితానిర్వచనము చక్కఁగానే యున్నది గాని భావకవు లొప్పుకొనరేమో? భావకవిత్వ మనునది విశిష్టమైన యొకరకపు కవిత్వ మని చెప్పి, "భావకవిత" యనుపేరు "అగ్గినిప్పు" వంటి దని యనుట సమంజసము గాదు. ఇట్టి విశిష్టకవిత్వమును గూడ 'కవిత్వ' మను సాధారణనామముతోనే పిలువవలెనా? గుర్తుకొఱకు "భావకవిత" యని యనఁగూడదా? లేకున్న నెట్టిపే రుండఁదగును?

శైలి:

"శైలికలహ మొక్క యాంధ్రావనిలోనే యున్నది. జిజ్ఞాసతోడి దృష్టియే ఫలవంతము. జిజ్ఞాస లేని చూపు వెఱ్ఱిచూపు. ఆంధ్రులం దీజిజ్ఞాస చల్లబడి యుండుటచే వీరు భాషాహృది నంతగా నెఱుఁగ లేకున్నారు. వీరు భాషావ్యాయామము చేసిన మల్లులు. కేవలము వ్యర్థమైన గ్రామ్యగ్రాంథిక కలహము చూడఁగా, సంధి కుదురు చిహ్నెలు కానవచ్చుట లేదు. నిరంకుశత్వము రాజులను, రాజ్యములను, భాషాచక్రవర్తులను గూల్చును. సాహిత్యవృద్ధినిరోధకము లగు మితిమీఱిన నిబంధనములు పెరిఁగినప్పుడు నిరంకుశత్వము తల యెత్తును. ఎవరికి వారే రాజు లైనచో విప్లవము పుట్టునట్లే, యెవరికి వారు భాషాశాసకు లైనచో భాషావిప్లవము తప్పదు. కాని నిరంకుశత్వ మెట్లనర్థదాయకమో నియమరహితాచరణముగూడ నట్లే యనర్థదాయకము. అవసరము లైన నియమము లుండవలెను. విచ్చలవిడిగాఁ ద్రాగుఁబోతువలె గంతులు వేయుట స్వాతంత్ర్య మనిపించుకొనదు. భాషకు వ్యాకరణసూత్రము లవసరములే. కాని యవి యినుపత్రాళ్లవలెను, సంకెళ్లవలెను గాక యనురాగసూత్రములవలెను, భూషణములవలెను సొంపుగూర్చుచుండవలెను. అన్యదేశ్యపదములను యథోచితముగా వాడుట తప్పుగాదు.

భావము ననుసరించి భాష యుండును. యుద్ధరంగమును, క్రౌర్యమును వర్ణించుపదములు చల్లని కరటములను, పుష్పరామణీయకమును వర్ణించుటకుఁ దగవు. ప్రకృతియందలి భేదమే భావమందలి భేదమై శైలియందలి భేద మగును. విషయప్రకృతి తదనుకూలమైన మనుష్యప్రకృతియందే యిముడును. అట్లు గాక, రాధాకృష్ణుఁడు భౌతికశాస్త్రమును, రామన్ తత్త్వశాస్త్రమును పరిశీలించినచో నేఁడిరువురును పేరువులై యుండెడివారా? కారు; అణువు లై యే మూలనో యుండెడివారు. విభిన్నప్రకృతులు గల కూల్రిడ్జి, వర్డ్సువర్తు, షెల్లీ, బైరను, సదే-ల శైలలు విభిన్నములు. తలఁపులనుబట్టి శైలి మాఱును. వ్యక్తి యొక్కఁడైనను విషయమును బట్టి శైలి మాఱును. ప్రకృతివిభూతిని గ్రుమ్మరించుటలో కాళిదాసుఁడు షెల్లీనేకాక షేక్స్పియరును గూడ మించెను. అగాధయోచన, గభీరతత్త్వము భారతీయుని లక్షణములు: రవీంద్రుఁడు భారతీయుఁడు, మహర్షిపుత్త్రుఁడు.

కళోపాసకుఁడు జగదీశు నంతవాఁడు. సృష్టియందలి లోపములను కళావ్రతుఁడు దిద్దఁజూచును. భాషాప్రపంచములోఁ గూలి నాలి చేసికొని బ్రదుకువారు కళోపాధ్యాయులు గారు. సాహితీపరులు కళోపాసకులే. వీ రాకాశవీథి నెగురక, తోడివారి యభ్యుదయమును దృష్టియందుంచుకొని సరళభాషలో వ్రాయఁదగును."

ఇందలి విషయములు పెక్కు నాకుఁ బరమసత్యములుగాఁ గాన్పించుచున్నవి. గ్రంథకర్తగారు చెప్పుచున్న విషయమును వదలి కలము దూరము పోయినారు. వీరు తెలుఁగుసాహిత్యమును వృద్ధిచేయు నభిలాషము గలవారు గాన, ఉపమానములను బహుళముగాఁ దెలుఁగుసారస్వతమునుండి, కొలఁదిగా నింగ్లీషు, హిందీ, బెంగాలి సారస్వతములనుండి తెచ్చుకొనుట ప్రయోజనకారి. అంతే కాని వ్యాసములో మూఁడవవంతు అన్యసారస్వత మాక్రమించుట న్యాయ్యము గాదని నామనవి.

గ్రాంథిక గ్రామ్యములలో వీరి కేది యిష్టమో సరిగాఁ జెప్పక వీరిమాటలు కోమటిసాక్ష్యమును జ్ఞాపకముగా నున్నవి. వీరు (స్వయముగా సరళభావ

వ్రాయఁబడ్డను) అన్యదేశ్యములకుఁ గూడ గతి కల్పించి కొంతదిసంస్కరణ మపేక్షించు సరళ గ్రాంథి కాంధ్ర భాషాపరులని నే నూహించుచున్నాను. నాయూహ భ్రమజనితమే కావచ్చును.

భావనావేశము :

ఇది యేసమాసమో నాకు స్పష్టముకాలేదు. దీనియర్థము — ఆవేశమువలని భావన యనియా? భావనవలని యావేశ మనియా? భావన యను నావేశ మనియా? భావనతోడి యావేశమనియా? ఇందులో నేది? ఏదియుఁ గాకున్న మఱేమి?

శీర్షిక గర్థ మెట్లున్నను వ్యాసమునందలి విషయ మున్నతమైనది పరమ సత్యవాక్యము లనేక మీవ్యా సములో నున్నవి, చూడుఁడు.

"రసబంధురహృదయమునుండి సౌందర్యమును గరిపించునది భావనావేశము. ఇది యమేయశక్తిమంతము. ప్రకృతినుండి కవి హృదయములోనికిని, కవి హృదయమునుండి ప్రకృతిలోనికిని అదృశ్యతరంగిణి వలె భావనావేశము ప్రవహించును. దీని వీచికలందే రెండును గలిసికొనును. వరునిఁ జూచి మోహిత యగు వధువువలె, కవినిగాంచి ప్రకృతి హృదయము విప్పి తన సౌందర్యము నాతనివశ మొనర్చును. కవిహృదయములో నానంద శృంగారాదుల నూరించు సద్భుతశక్తి భావనావేశమే. ఇది మేఘశిఖరమునఁ బుట్టునది గాదు. మఱి, హృదయమహోదధిలో జనించును. ఇంకొక విశేషము. కవిత్వము కొందఱకు మాత్రమే—మనుజులకే సుమండీ! — హృదయరంజక మగును. గానమో, మానవులకు, మృగములకు, దేవతలకు, రాక్షసులకు, నొకే భావమగా నుండఁగలది"

భావనము, పరిశీలనము :

"సాహితికి భావన మాయువు; పరిశీలనము పోషకము. పరిశీలనము పైచూపు గలది; భావనము లోచూపు గలది. కాని, శాస్త్రజ్ఞునిదృష్టి వేఱు, కవిదృష్టి వేఱు. ఇద్దఱ పరిశీలనములే వేఱు, ఇద్దఱసిద్ధాంతములే వేఱు." — ఇందలి వస్తువు రమ్యము.

మాతృభాష :

"మాతృభాషకుఁ బ్రాముఖ్య మీయవలెను. రవీంద్రుఁడు తఱచుగా మాతృభాషాగౌరవ మత్యవసర మని చెప్పచుండును. అఱువదేండ్లకు మున్ను ఊరు పేరు లేని వంగభాష నేఁడు దివ్యసింహాసన మధిష్ఠించినది మంజులమైన మనభాష Italian of the East అని ప్రసిద్ధినందినది. ఆంధ్రసాహిత్యము పునరుద్ధరింపఁ బడవలె ననిన, భాషావిప్లవము తప్పదు. భాషాప్రవాహమున కానకట్టయై వ్యాకరణ మండెనేని దానిని దెగఁ గొట్టుట కాలసింపరాదు."

నిజమే, శుభస్య శీఘ్రమ్!

నేఁటి వాఙ్మయోద్యమము :

లో నిట్లున్నది: "భాష శుద్ధశ్రోత్రియముగా నుండవలెనని మడిగట్టుకొన్న పండితు లనుచున్నారు. ఎంతచక్కని చుక్కయైన నేండ్లు గడచినతరువాత అవ్వ యనునని యెఱుఁగక యీపితామహులీ వీథిని బడుచున్నారు. గ్రాంథికవాదులును, గ్రామ్యవాదులును, స్వతంత్రవాదులును యుద్ధము చాలించి, సంధి చేసికొని "అఖిలాంధ్ర సాహితీ సభ" యొకటి యేర్పఱచి భాయి భాయీ యనుచుఁ గలిసికోవలెను. కావున శీఘ్రముగా సాహితీయోధు లందఱుఁ దమరథములను గిడుగుమహోపాధ్యాయుని వెంట నడపుదురు గాక."

మార్గదర్శయితలైన గిడుగువారివెంట రథములు దోలుఁడని సాహితీయోధుల కందఱకు సలహాయిచ్చిన గ్రంథకర్త గారు "పట్టాభిషేక మందిన వాడుక" భాషయే నిజముగాఁ దమకు నచ్చినచో, తమరథమును గూడ నాదిక్కునకే పోనీయరేమి? యోధులనందఱను దారికిఁబట్టించి తాము కడపటఁ బోఁదలఁచిరిగాఁబోలు. లేకున్న, వీరు నిన్నగాక మొన్న వ్రాసిన "విద్యార్థ ప్రకాశిక"నుగూడఁ దమకుఁ బెట్టని సామ్మైన గడబిడ గ్రాంథికములోనే వ్రాసినా రేల? వీరి యంతరంగము దురూహముగా నున్నదే!

లలితకళలు - నవ్వు కెరటాలు :

కళలో హాస్యరసము కూడఁ బోషింపఁబడవలెనని యిం దున్నది.

విమర్శనము - లలితకళాభ్యుదయము :

"విమర్శకుఁడు విజ్ఞాని యై విశాలదృష్టి గల్గి యుండవలెను. విమర్శనము సాహితీ స్పందనమును విధ్వంసము చేయక దానికి జీవకళ నిచ్చి ముందటికి సాగింపవలెను." ఇందలి కొన్ని వాక్యములు "దీనిభావ మేమి తిరుమలేశ" యన్నట్లున్నవి.

నాట్యకళ - సంస్కరణము :

"నాటకమునకు సంబంధించినవారు ముగ్గురు: రచయిత, నటుఁడు, ప్రేక్షకుఁడు. నటునికి సహజశక్తి, పాండితి, సద్వర్తనము కావలెను. ప్రేక్షకు లందఱును విమర్శకదృష్టి గలవా రని తలఁపరాదు. నేఁడు విజయ ధ్వానములతోఁ బ్రదర్శింపఁబడు నాటకము లన్నియు నాదర్శనాటకము లని తలఁచుట పొరపాటు. లలిత కళల కన్నిటికిని నాటకమునఁ గొంత చోటున్నది. నాటకకర్త లలితకళారాధకుఁడై, లోకజ్ఞుఁడై మన శాస్త్ర పరిజ్ఞాతయై, Stage technique బాగుగాఁ దెలిసినవాఁడై యుండవలెను.

నాట్యకళ సంఘమునకు సంబంధించినది. సంఘసంస్కరణమునకు సత్యాన్వేషణ మవసరము. ప్రత్యక్ష ప్రపంచము నెదుట నద్దము నిలుపుట నాటకకర్త పని. ఈతఁ డవ్యక్తులకు, నూహాతీత సంఘటనములకుఁ దా వీయరాదు; భావముల సంఘర్షణములో నుత్తమభావవిజయము చిత్రింపవలెను.

మనము నాటకలక్షణములను శ్రద్ధతో గమనింప వలయును. తెలుఁగులో నాదర్శనాటక మొక్కటి కూడ నింతవఱకు లేదు."

గ్రంథకర్తగారు తరవాతి వ్యాసములో ద్విజేంద్రలాల్ రాయ్‌గారి రచనమే నాటకరచనలో మేలుబంతి యని చెప్పి, తా మనువదించిన రాయ్‌గారి "షాజహాను" అను నాటకమునుండి మచ్చునకై కొన్ని తునుకలు చూపించినారు; స్వీయదేశ సాహిత్య సంప్రదాయములు గమనించుచు, నవసరమగుపట్ల, నవ్యసాహితీ నవ్యవిధానముల నాదరించి, కాలస్రవంతి ననుగమించుట నాటకకర్తల పనియని కూడ హెచ్చరించి యున్నారు.

"విద్యార్థిప్రకాశిక"లోవలెనే యీ గ్రంథమందును శుద్ధపత్రము లేకున్నను దుస్సహము లైన తప్పులు మాత్రము కుప్పతెప్పలుగాఁ జేరి తీటినవి. ఎందఱో జనులు - విశేషించి విద్యార్థులు - చదువుకోవలసిన గ్రంథము గదా యిది, యిన్ని తప్పు లుండిన బాగుండునా? ఎట్టి తప్పు లున్నవో యివిగో చూడుఁడు:

చేయికి పైనఁ గలదు, కవలలు, హిందూ ఆచారములు, కన్నును ఆకర్షించి, ముందులకు, భావకవిత వొకటీ అభావకవిత కొకటీ, ఆలసదనము, ఊరకొనుట, దానినంతను, గంతులేయు, మేధస్సు, అందించినది కాళిదాసు.........ఎన్ని యని చెప్పఁగలను?

వీనితోపాటు, పైరెండు గ్రంథములలోను "అమ్మరొమ్మా", "గతేంగంతలో కాళిదాసున్నాఁడు" "బోడిమాటలు," "మెల్లిశక్షి" మొదలగు నశ్లీలములును, "అవ్వల," "అక్కటా," "జగద్ధాత్రి" "తోఁచుబ (కన్పడుట)" "భారతావని," "మేధస్సు," "రంగారు బంగారు," "జలాదూరు" మొదలగు నలవాటు మాటలును గలవు. సంభ్రమముగా నాల్గుమక్కలలోఁ జక్కఁగాఁ జెప్పఁదగిన విషయములు పెక్కు వింత మాటలతో డొంకతిరుగుడుగాఁ జెప్పఁబడినవి. పై పెచ్చు, పద్యములోఁ గూడ నుపేక్షింపఁదగని యయోమయార్థము గద్యములోఁ దఱచుగా నుండుట శోచనీయము. అతిశయోక్తులు మితిమీఱుటచే నందము చెడినది. ఇఁక — References! అమ్మయ్యో, యీపేరెత్తఁగానే భయమగుచున్నది. గ్రంథకర్తగా రెన్ని పుస్తకములు Refer చేసినారో చూచినారా? అడుగడుగునకు,— Vide X's (English) Works, Vide Y's (Bengali) Works, Vide Z's (Pali) Works... ఇట్టి విచిత్రపు References చాలక, యొకమాఱు (సాహిత్యతత్త్వవిమర్శనము— ౧౩౨ వ పుట) "ఉత్తమప్రతీచీసాహితిని ప్రవేశించి చూడుఁ" డని సలహా యిచ్చినారు. ఇంతే కాదు. మఱియొకచోట నిదే మదే మని (సా. విమర్శనము— ౧౬౪ వ పుట) "ప్రపంచసాహిత్యము తెలిసి చూడఁ" డని చదు

వరులకు సద్బోధ చేసినారు. Refer చేయుట దోష మని నేను జెప్పుటలేదు గాని కొలఁదిగ్రంథములు పేర్కొన్నఁ జాలు నని మాత్రము విన్నవించుకొను చున్నాను.

ఈ రెండు గ్రంథములలోను, — విశేషించి సాహిత్యతత్త్వవిమర్శనములో — మహావాక్యము లనఁదగినవి పెక్కున్నవి. సత్యాతిసత్యము లై హృదయంగమములైన పలుకులు చాలఁ గలవు. వస్తువు మహోత్కృష్టము. కాని యీగుణములన్నియు నీ తికమక భావములో "నివురు గప్పిన నిప్పు" వలె నున్నవి. "సాహిత్యతత్త్వ విమర్శనము" విమర్శగ్రంథములలో నగ్రగణ్యమని చెప్పలేను గాని యిప్పు డున్న యుత్తమ విమర్శగ్రంథములలో నొకటి యనియు, నవ్యశక్కని వ్రాయఁబడిన దనియుఁ జెప్పుటకు సందేహింపను. ఎక్కువ కఠినపదములు లేకుండ, భావములను క్లిష్టముగానీయక, తిన్నగా, సులువుగా, సమర్థములైన కొలఁదిమాటలతోఁ జెప్పివైచినచో నీగ్రంథ ముత్కృష్టమై యుండెడిది. గ్రంథకర్తగా రింగ్లీషులోఁ గూడ సారస్వతవ్యాసములు వ్రాసి విద్యార్థులకుఁ, దదితరులకు మేలు చేయుదురని నమ్ముచున్నాను.

ఇంతకును నేను జేసినది విమర్శలేశమే. నే నీ విమర్శనము మనఃపూర్వకముగాఁ జేసితి నని తలఁతును. ఆంధ్రసాహితీపరు లీరెండు గ్రంథములను జదివి, విషయములు బాగుగాఁ దెలిసికొని, నా యీచిన్నివిమర్శమందలి మంచిసెబ్బరలు విచారింతురు గాక. నాయభిప్రాయములు తప్పు లైనచో, నడఁకువతో సవరించుకొందును. నా వ్రాఁత గ్రంథకర్తగారికిని, మఱికొందఱకును నొప్పి కలుగఁజేసినచో క్షంతవ్యుఁడను. ప్రియమైన యసత్యము చెప్పుటకంటె నప్రియమైనసత్యము చెప్పుటే మంచిదని తలఁచి యట్లు చేయఁ బ్రయత్నించితిని.



# విజ్ఞానం - దేశభాషలు

గూడూరి వెంకటాచలం

ఒకసారి రామలింగారెడ్డిగారు, అనేక తెలుగు పత్రికలలోని భాష అధిక భాగం హేయమైన ఆంధ్ర ఆంగ్లముల మిశ్రమమన్నారు. ముఖ్యంగా విజ్ఞాన విషయమైన వ్యాసాల్లో ఈ భాషా దాస్యానికి బలి అయిపోవలసి వస్తోంది. విజ్ఞాన విషయమై తెలుగులో వ్యాసం వ్రాస్తే 'ఇది ఎవరికోసం వ్రాస్తున్నాము' అని ప్రశ్నించుకోవాలి. ఆయాశాస్త్రాలలోని విపరీతమైన సాంకేతికపదాలు తెలుగులోనికి వచ్చేసరికి భావను తారుమారు చేస్తాయి. తదేవా, ఆ వ్యాసం ఎవరికీ పనికిరాకుండా పోతుంది. ఇంగ్లీషు వచ్చిన వారికి దానితో నిమిత్తమేలేదు. వారికి ఆ ప్రత్యేక విషయంలో ఉత్సాహము ఉంటే ఇంగ్లీషులోనే చదువుకుంటారు. ఇక కేవలం తెలుగు మాత్రమే వచ్చిన వారు ఆ సాంకేతిక పదసంచయాన్ని బోధపర్చుకొనుటకు బుర్రపగులగొట్టుకొనుటకంటె ఏవైనా రెండు కథలు చదువుదా మనుకుంటారు. ఈ విషయంలో ఒక చిన్న అనుభవం వ్రాయడం అప్రస్తుతం కాదనుకుంటాను. * భారతిలో "అంగారకుడు—జీవవర్గం" అను శీర్షికతో నా దొకచిన్న వ్యాసం ప్రకటితమయింది. విజ్ఞాన విషయం మీద తెలుగులో వ్రాయడానికి నా కదే మొదటి పర్యాయము. చాలా ఉత్సాహం కల్గింది. అయితే ఏం? మిత్రుడు, నార్ల వెంకటేశ్వరరావు, ఒకసారి లైబ్రరీకి వెళ్లి ఎంతమంది చదువుతున్నారో చూడమన్నాడు.

ఆ రోజున మే భారతి వచ్చింది. రామమోహన లైబ్రరీలో షుమారు నలభైమంది చేతుల్లోకి భారతి వెళ్లింది. నలభైమందికూడా బొమ్మలు చూచారు. ౩౬ మంది కథలు చదివారు. తదితర వ్యాసాలు చదివిన వాళ్లు ఇద్దరు. ఇకపోతే ఇద్దరుమాత్రం విజ్ఞాన వ్యాసాలు చదివారు. వీరిలో ఒకరు కేవలం నిరుద్యోగనివారణ నిమిత్తం చదువుచున్నట్లు కనబడ్డది. ఆయన ప్రతి పత్రికలో మొదటి పేజీ మొదలు చివర పేజీవరకు చదువుచుండేవాడు. ఇదే సాధారణస్థితి అయితే ఎవరికోసం ఈ వ్యాసాలు వ్రాయడం? ఒకటే సమాధానం కనబడుతోంది. ఏదో కర్తవ్యం నిర్వర్తించినట్లు వ్యాసకర్త సంతోషపడుట, 'మనపత్రికలో అన్ని విషయములు (రాజకీయ, సాంఘిక, మత, వైజ్ఞానిక) ప్రకటింపబడతాయి. అని సంపాదకుల సంతృప్తి. కాని దీనిలో దోషం చాలాభాగం రచయితలదే అనాలి ఏదో కొద్దియో గొప్పయో విజ్ఞానశాస్త్రజ్ఞులు అనుకున్నవారికి తెలుగులో ప్రవేశం తక్కువ. డాక్టరు (D. Sc.) బిరుదం పుచ్చుకొనుటకు సిద్ధముగా నున్న నా మిత్రులొకరు తెలుగులో వ్యాసం వ్రాస్తూ "పాలిచ్చు జంతువులయందలి గ్రుడ్లు" (Egg-cells in mammalia) అని అనువదించారు.

అదీగాక విజ్ఞానంలో ఒక ప్రత్యేకవిషయంలో ఔన్నత్యం పొందినప్పటినుండియూ కేవలం తనప్రత్యేక విషయాన్నే విస్తరించడంచేత అది జనసామాన్యానికి సులువుగా బోధపడదు. ఇక రెండవరకమువారు — అక్కడక్కడ జనబాహుళ్యానికి ఆంగ్లములో వ్రాసిన వ్యాసాలను చాలామంది అనువదిస్తారు. వీనిలో చాలా మట్టుకు ఆ విషయమునకు సంబంధించిన ఇతిహాసం ఉంటుంది గాని ఆధునిక పరిశోధనలను చర్చింపరు.

వైజ్ఞానిక వ్యాసాలు ప్రకటించడములో పత్రికాధిపతులకుకూడ కొన్ని వ్యయప్రయాసలున్నాయి. వ్యాసాలన్నీ బాగుగా బొమ్మలతో విశదీకరింపబడియుండాలి. ఒక్కొక్కప్పుడు ఆ విషయము బాగుగా

---

* ౧౯౩౪ జనేవరి సంచిక

బోధపర్చుటకు ప్రత్యేక చిత్రకారుని సహాయం కావలసి వస్తుంది. సాధారణంగా ఆంగ్లగ్రంథాలలో ఇవన్నీ కాపీరైటుతో ఉంటాయి. తత్ఫలితంగా మామూలు వ్యాసాలకంటె వీనిని ప్రచురించడంలో ఖర్చు ఎక్కువవుతుంది. ప్రస్తుతం తెలుగులో ఈ వ్యయప్రయాసల కోర్చి వైజ్ఞానిక వ్యాసాలను ప్రకటించేది భారతి తప్ప మరొకటిలేదని చెప్పడం సాహసం కాదనుకుంటాను.

హిందీ, బెంగాలీ పత్రికలలో వైజ్ఞానిక వ్యాసాలు విరివిగా ప్రకటింపబడుతూ ఉంటాయి. కన్నడంలో శివరామ కారంతుగారు మైసూరు విశ్వవిద్యాలయం సహాయంతో ఆంగ్లమందలి Hamsworth Popuiar Sciences, Aurthur Mee's 'Book of knowledge' వలె కన్నడంలో చక్కని త్రివర్ణ చిత్రాలతో వైజ్ఞానికగ్రంథాలని తయారుచేయగల్గినారు. ఈ పరిస్థితులలో ప్రత్యేకముగా విజ్ఞానవిషయాలు ప్రకటించుటకు ఏదైనా తెలుగుపత్రికకు తావుందా అని తెలుగునాటి విజ్ఞానశాస్త్రజ్ఞులు చాలకాలమునుంచి తర్జనభర్జనలు చేస్తుండేవారు. ధైర్యముచేసి స్థాపించితే సఫలతకంటె సానుభూతి ఎక్కువ పొందవలసివస్తుందేమో అని భయపడ్డారు.

కాని శ్రీయుత కొండయ్యగారు సాహసించి బాధ్యత వహించారు. వీరు భారతిలో వ్యాసాల పూర్వకముగానేమి, ఆంధ్రవిశ్వవిద్యాలయంవారు ప్రకటించిన "విశ్వరూపము" గ్రంథమూలమున నేమి తెలుగు వారికి చిరపరిచితులు.

"తెలుసుకోవాలన్న కోరిక, సందేహించడానికి కలసిన ఓపిక, ఆలోచించడానికి కుతూహలం,....... .................... సర్వవిధవంచనా సహిష్ణుత" అను శీర్షికతో బయలుదేరింది. 'విజ్ఞానం'. జిగీష, జిజ్ఞాస మానవవికాసానికి ప్రథమసోపాన మని సంపాదకుల ఆశయం. నూతన తేజఃకాంతులకీ పరివర్తనలకీ అల్లుకొని పోజూచే పిన్నల మనోలతలను పోషించి, వెర్రితలలువేసి గిడసబారిపోకుండా ప్రఫుల్లం చేయడమే తన ఆదర్శ మంటుంది "విజ్ఞానం". అయితే సాధారణంగా కాలవాహినిలో నేటి నవ్యాదర్శాన్ని మరునాటి భవిష్యగాములు ప్రాచీనదురాచార మంటారు. మనము ప్రాచీన దురాచారమనే ఆచారము మధ్య ఆధునికంతో పొంగిపొర్లిపోయే నూత్నాదర్శము మధ్య ఒక విస్తృతప్రదేశమున్నది. అది కర్కశకంటక సమన్వితం. అదే అనుభవం. ఈఅనుభవంతో కాయలుకాచి పోయినవి పెద్దలమనస్సులు. మనము ప్రయాణముచేసే వికాసవీథిలో ఈ ప్రాచీన తైలదీపికలే ఆత్మనిశ్చయం ప్రకటించడంలోనిదానం, పునరాలోచనకు సంసిద్ధతతో దృక్పథాన్ని చూపిస్తాయి.

ఆజ్ గారు "చంద్రలోకయాత్ర"లో వెల్సుగారి "First Men in the Moon"ను అనుసరించారు. ఇదివరలో ఈ విధముగానే శ్రీయుత తేకుమళ్ల రాజగోపాలరావుగారు "విహంగయాన"మను పుస్తకంలో వెల్సుగారి "War in the Air ననుసరించారు. వెల్సుగారి "The shapes of Things to come"ఫిల్మును చాలామంది చూచియే యుంటారు. ఆవెల్సుగారి ఊహాసౌధాలు (Utopia) చిత్రరూపాన్ని ఉన్నప్పటికూడ బోధపర్చుకోవడం కొంచెం కష్ట మవుతుంది. విజ్ఞానశాస్త్రములో ప్రాథమికావస్థయందున్న మనదేశపు జనబాహుళ్యానికి భవిష్యత్పరిశోధనల సూచించే ఊహాసౌధాలు చిత్రించడం కొంచెం శీఘ్రగమనం అవుతుంది అనుకుంటాను. మనము రోజూ వాడే "కిరసనాయిలు" పుట్టు పూర్వోత్తరాలు. కార్కు బిరడాల కథ చాలా సమంజసంగా ఉన్నాయి. మీటనొక్కితే చుక్కలు పొడిచే విశ్వసందర్శని (Planitorium) కూడా చాలా మనోరంజకంగా ఉంది.

ఇంకా వీనియన్నిటియందు ధారాళముగా చిత్రములువేసినగాని పాఠకులలో ఉత్సుకత కలుగచేయడం కష్టం. నూత్న పరిశోధనలను ఇంకా విపులంగా చర్చిస్తూ ఆంధ్రుల పరిశోధనలకు ప్రత్యేక ప్రాముఖ్యం ఇవ్వడం అవసర మనుకుంటాను. పత్రిక భవిష్యత్తు ఆంధ్రుల ఆదరంపై ఆధారపడిఉంది. 'విజ్ఞానం' జీవితం ముఖ–పుబ్బల మధ్య గాకుండా, చిరస్థాయి చేయడం ఆంధ్రుల యోచనా శక్తికి ప్రత్యక్షనిదర్శనము.

---



దారిప్రక్క దేవాలయము

మంగళగిరి

—వేణుగోపాల్.




## గాలి మొక్కలతో టోపీలకు అలంకారము

మొక్కలలో గాలిమొక్కలని కొన్ని యుండును. వానికి నేలతో అవసరము లేదు. గాలిలో నేలఅందలి చెమ్మతోనే అవి బ్రతుకును. అంతగా కావలసి వచ్చినప్పుడు కొద్దిగా నీ



టిని చిలకరించి వానికి చెమ్మనుకల్పించవచ్చును. అటువంటి గాలి మొక్కలను - అందమైన వస్తువులను - వృథా పోనీయనేల అని స్త్రీల వేసవిటోపీలకు అలంకారముగా వానిని ఇప్పుడు ఉపయోగించుచున్నారు. టోపీలమీద వానిని కొంతసేపు అతికించి పెట్టిన చాలును, అవి వానిలోనికి అతుకుకొనిపోయి నాటుకొనును. అక్కడనే అవి పెరుగుచు మారాకులు వేయుచుండును. చూచుటకు అందముగా ఉండును. చిత్రమందలి స్త్రీని చూడుడు: ఆమె తనటోపీకి ఆమొక్కల నలంకరించి చెమ్మకై ఒక బిందుస్యందినినుండి నీటిని చిలకరించుచున్నది.

---

## ఎట్లు పట్టిన అట్లు ప్రయాణము చేయు వ్రాతబల్లలు

ఇది జెకోస్లోవాకియాలో ఒకానొక భీమాకంపెనీ భవనములోని ఒకగది. కంపెనీతాలూకు ఉత్తర ప్రత్యుత్తరముల రికార్డంతయు దీనిలోని అలమారలలో పదిలముగా అమర్చిపెట్టబడియుండును. ఇంతరికార్డు ప్రపంచములో మరి యేకచేరీలోను లేదందురు. ఇందులో మొత్తము 3000 సొరుగులు గలవు ఒక్కొక్క సొరుగుయొక్క పొడుగు ౧౦ అంగుళములుండును. ఈసొరుగులను సరిగా పేర్చుటకు గోడలో ౪౦౦౦ చదరపుఅడుగుల చోటు కావలసివచ్చెను. పై వరుస సొరుగులు అడుగునుండి ౧౬ అడుగుల యెత్తుననున్నవి ఈసొరుగులలోనుండి కావలసిన రికార్డులు తీసుకొనుటకు సౌకర్యముగా నుండవలయునని యీక్రొత్త బల్లలను గుమాస్తాల కేర్పాటు చేసియున్నారు. ఇవి



పైకిని, క్రిందికిని, ప్రక్కలకును ఎట్లు కావలసిన అట్లు ప్రయాణము చేయు విధముగా తయారుచేయబడినవి. గుమాస్తాలు తాము కదలకుండనే, ఈబల్లలమీద కూర్చుని, మీట నొక్కి యేవరుసలోని యే సొరుగు దగ్గరకైనను పోయి రికార్డులను తీసికొనవచ్చును.

---

## బ్రహ్మాండమైన పుష్పము

దీని శాస్త్రీయనామము అమ్మార్ఫల్లస్ టిటనమ్ అని. దీనియెత్తు ఎనిమిది అడుగుల అయిదు అంగుళములు. ప్రపంచములోనే ఇంతపెద్ద పుష్పము మరియొకటి లేదట. దీనిని దగ్గరకుపోయి పరిశీలింపగోరు

వారు ప్రాణవాయువుముసుగులను ముఖములకు తగిలించుకొని పోవలయునట. లేకపోయిన దీని ఘాటయిన వాసనకు ఊపిరాడక తికమక పడవలసి వచ్చునట. అమెరికా సంయుక్త రాష్ట్రములవారి కిటీవలనే దీని మాదిరి దొరికినదట.



## సౌందర్యపరీక్ష చేయు త్రాసు



కాలిఫోర్నియాలో కొంతమంది స్నానసుందరులు సౌందర్య పరీక్షకు ఏటేట పోటీ చేయుచుందురు. పోటీలో గెలిచినవారికి 'మిస్ కాలిఫోర్నియా' అను బిరుదు లభించును. పదరు పరీక్షలో నొకభాగము అభ్యర్థుల తూకము. పరీక్షకులు ప్రమాణముగా స్వీకరించిన సుందరి తూకముతో వీరితూకము సరిపోవలయును. తమతూక మావిధముగా సరిపోవు చున్నదో లేదో యీ అభ్యర్థినులు ఈకొయ్యత్రాసుతో పరీక్షించు కొను చున్నారు.

## క్రొత్త వ్యాయామపరికరము



ఇది యే పాడుపట్టణమందైనను ఒకమూల కనబడినయెడల పూర్వకాలములో నేరస్థులకు క్రూరశిక్షకుపయోగించుచుండిన ఒకానొక పరికరమని మన మనుకొందుము. కాని ఇది అట్టిదిమాత్రము కాదు. క్రొత్త విజ్ఞాన ప్రపంచములో సృష్టియయిన ఒక వ్యాయామ పరికర మిది. ఈచక్రములో వ్యాయామముచేయుపద్ధతి ఈ స్త్రీ నిరూపించుచున్నది.

## చెవిటివారికి ఒక వినికిడిసాధనము

నూతనముగా కనిపెట్టబడిన యీసాధనము మూలమున చెవిటివారు కూడ స్పష్టముగా విన వీలుపడును. దీనిని వీపుమీద దుస్తులకు లోప్రక్కగా నుండునట్లు కట్టుకొనవలెను. అస్థివాహిని రూపమన నన్న ఈకృత్రిమశ్రవణేంద్రియము విస్తారిత శబ్దస్పందనము

లను వెన్నెముకకు పంపును. అక్కడనుండి వానిని అస్థి నిర్మాణములో చెవిలోని నాడులకు తీసికొని పోవును. ఈ సాధనములో ఒక విద్యుద్ఘటమాల, ఒక సూక్ష్మ శ్రవణి మాత్ర ముండును.



---

## గడియారపు జేబులో ఇముడు ఛాయా చిత్రగాహిణి



ఈ చిన్న ఛాయాచిత్ర గ్రాహిణి యిటీవలనే తయారైనది. దీనిని గడియారపు జేబులో ధారాళముగా పెట్టికొనవచ్చునన్నచో దీని యసలు పరిమాణ మెంత యుండునో యూహించుకొనుట సులభము. ఇది పూర్తిగా ఎనిమిది ఔన్సులుకూడ తూగదు. దీనికి F-3.5 కటకము అమర్చబడియున్నది. ఈ చిత్రగ్రాహిణితో సెకండులో ౫౦౦-వ వంతు నేపులోకూడ బొమ్మలు తీయుటకు ఏర్పాట్లుగలవు. ఒక అంగుళము వెడల్పు, ఒకటిన్నర అంగుళము పొడుగు గల చిత్రములను దీనితో తీయవచ్చును. పెద్దపెద్ద చిత్రగ్రాహిణులకుండు అంగములన్నియు దీనికిని ఉన్నవి.

---

## పరస్థలములందక్కరకువచ్చు ఛాయాచిత్ర వర్ధని

మామూలు ఛాయాచిత్ర వర్ధనితో చిత్రములను పెద్దవిగా చేయుటకు చీకటిగది, విద్యుద్దీపము మొదలైన సాధనసంపత్తి కావలెను. పరస్థలములలో తిరుగుచుండు యాత్రికులు మొదలైనవారి కవి యెక్కడనుండి వచ్చును? అట్టివారికై యీ క్రొత్తరకపు ఛాయాచిత్ర వర్ధని నిర్మింపబడినది. చిన్నచిన్న ఛాయాచిత్ర వికృతి బింబముల నుండికూడ దీనితో పెద్దచిత్రములు తీయవచ్చును. చీకటిగదిగాని, విద్యుద్దీపముగాని దీని కవసరములేదు. ఇందులో ఒక వర్ధనపేటిక, దాని పైభాగమున నొక భూతకటకము నుండును. ఆ కటకమునుండి సూర్యకిరణములు వికృతిబింబముమీద పడి దానిఛాయను అడుగున నుండు నొక ప్రత్యేకమైన 'ప్రింటింగు ఔట్ పేపరు' మీద పడునట్లు చేయును. ఆ కాగితమునకు బింబవికాసన ప్రక్రియ కాఁట్టదు. దానికి కాబట్టున దంతయు స్థాపన మాత్రమే



---

## బ్రహ్మాండమైన సింహపు ప్రతిమ



ఈయినుపపోతవిగ్రహము చీనాదేశములో నున్నది. యారపులో ఇనుమపోత ప్రారంభింపబడుటకు ౫౦౦ ఏండ్లకు పూర్వమే, సుమారు పదిశతాబ్దములకు వెనుక ఇది ఆదేశములో నెలకొల్పబడినది. ఇది మనుష్యుని సరాసరి యెత్తునకు మూడింతల యెత్తు గలిగియున్నది ఇనుమపోతలో ఇంత పెద్దవస్తు విదివర కెక్కడను చేయబడలేదు. ప్రతిమయంతయు నొకటే ముద్దగా పోతపోయబడినది. ఈకాలములో

కాంక్రీటుకట్టడము లేపద్ధతిలో నిర్మింపబడుచున్నవో అదియే పద్ధతిలోనే ఇదికూడ తయారుచేయబడినది.

---

## సులోచనములలోనే దీపములు



రాత్రివేళలందును, చీకటి గదులయందును ప్రత్యేక మొకదీపము నాసింపకుండ వ్రాత, చదువులు ముగించుకొను సౌకర్యమునకై యీ క్రొత్త సులోచనములు ఏర్పాటుచేయబడినవి. వీనిలోని అద్దపు బిళ్లలకు చుట్టును అమర్పబడియుండు, వెలుతురుమరల్చు రేకుల చట్టములో బయటికికనబడకుండ చిన్న దీపపు గోళములు ఉండును. ఆ గోళములకును జేబునందలి విద్యుద్ఘటమాలకును ఒక సన్నని తీగ యుండును. విద్యుద్ఘటమాలయందలి మీటను నొక్కగానే దీపగోళములు వెలిగి వ్యక్తియెదుటి ప్రదేశమునకు వెలుతురు నిచ్చును.

---

## ఎంగిలి పండ్లను చెరుచునా?



మన పండ్లమీద ఒకవిధమైన పూత యుండును. అది అరిగిపోవుటవలనగాని, చెడిపోవుటవలనగాని పండ్లకు చెరుపు ఏర్పడుట గలదు; పండ్లు పుచ్చిపోవుట, ఇగుళ్లు ఆడుట మొదలగునవి కూడ ఏర్పడవచ్చును. పండ్లమీది యీపూత చెడిపోవుటకు ఎంగిలి ఏమైనను బాధ్యత వహించుచున్నదా యని యీమధ్య ఈయంత్రముతో పరీక్షచేసినారు. ఈయంత్రములోని ఒక గొట్టములో చూర్ణముచేసిపెట్టిన పంటిపూత యుండును. దానిలోనే పరీక్షింపదలచిన వ్యక్తియొక్క యెంగిలిని కొంత తీసికొనివేసి, పూత వేసి, ఆచట్టమును శరీరోష్ణముగల నీటిలో నాలుగుగంటలసేపు చుట్టునట్లు చేసెదరు. ఈలోగా నేమైనను అందలి పంటిపూత చూర్ణము కరగిపోయియుండిన సదరు ఎంగిలిలో పండ్లను చెరుపగల దోషమున్నట్లును, లేకపోయిన లేనట్లును నిర్ణయింపబడును. దోషమే ఉన్నట్లు నిర్ణయమైనయెడల తక్షణమే చికిత్స చేసికొనవలసియుండును.

---

## కేశపోషణ చేయు కేశతూలిక



ఈతూలిక మామూలుగా ఇండ్లలో దీపముల కుపయోగించు విద్యుచ్ఛక్తితో పనిచేయును. దీనితో నిత్యము వెండ్రుకలను దువ్వుకొన్నచో వెండ్రుక కుదుళ్లను- రక్తప్రసరణమును వృద్ధిచేయుటద్వారా- బలపరచుటయేకాక వెండ్రుకలు బాగుగా పెరుగునట్లును, నిగనిగ లాడునట్లునుకూడ చేయును. ఇదికాక తలలోని నాడులను సక్రమపద్ధతిలో నుంచి తలనొప్పి మొదలైనవి రాకుండునట్లు కూడ చేయును

---

# కాలగ[illegible]ంగంపై

## మొండి జీవనము

ప్రతిజంతువునుజీవించియుండుటకు ఆహారమును, అనుకూలములగు వాతావరణపరిస్థితులును అత్యవసరములు. వీటిలో మార్పులనుబట్టి జంతువుల జీవితకాలము కూడ మారుచుండును. జీవకోటిలో కొన్ని మొండిజీవులెట్టి విపరీతపరిస్థితులందైనను ఆహారము లభింపకున్నను జీవింపగల్గుచున్నవి.

ఇటీవల పి. కాప్టెరిన్ అను శాస్త్రజ్ఞుడు వేలకొలది సంవత్సరములనుండి మంచుక్రింద కప్పుపడియున్న ప్రదేశమునుండి మట్టిని తీసి తన పరిశోధనాలయములో దానిని పరీక్షింపగా ఆ మట్టిలో సజీవముగా కొన్ని పురుగులును, గడ్డివంటి మొక్కలును కనబడినవి. దీనికంటె అద్భుతమేమనగా డాక్టర్ ఇరా, బి. బార్టిల్ గారు, రెండున్నర శతాబ్దముల క్రిందటినుండి నిర్జీవములుగా పడియున్న కొన్ని అణుప్రమాణములగు సూక్ష్మజీవులను చైతన్యములోనికి తేగల్గిరి. ౨౫౦ ఏండ్ల క్రిందటనున్న అరిజోనామిషను గృహము గోడలలోని మట్టిని తెచ్చి పరీక్షింపగా ఆ సూక్ష్మజీవులు (బాక్టీరియా) చచ్చినట్లు పడియుండెను. వాటికి తగిన ఆహారమును, చెమ్మదనమును కల్పింపగా ఆ సూక్ష్మజీవులు నిద్రనుండి మేల్కాంచినట్లు మరల చైతన్యము వహించి అభివృద్ధి చెందుట కారంభించినవట.

చార్లెస్ బి. లిప్‌మెన్ గారు ఆకాశమునుండి భూమిపై రాలిన ఉల్కలను పరీక్షింపగా వాటిలో సజీవములగు సూక్ష్మజీవులు కాన్పించినవట. ఈ విధముగానే ఖగోళమండలములనుండి భూమిమీదికి జీవు లవతరించినవని పైనిదర్శనమునుబట్టి వారొక సిద్ధాంతమునేర్పరచిరి. ఇట్లే లిప్‌మెన్ గారు ౨౫ కోట్ల సంవత్సరముల క్రిందట యేర్పడిన కఠినశిలలను భూగర్భమునుండి త్రవ్వి బైటకుతీయించి వాటిని పరీక్షింపగా ఆరాళ్లలో కూడ బాక్టీరియా సజీవముగా కనబడినదట.

కొన్ని శతాబ్దములక్రింద యీజిప్తు దేశస్థులు మరణించినవారికి దహన సంస్కారము చేయక, యెల్లకాలమును శరీరము ఆకృతి చెడకుండుటకై తైలావలేపనము మున్నగునవి కావించి, భూమిలో గదులు కట్టించి వాటిలో శవములను భద్రపరిచెడివారు. ఆ శవములతోబాటు ఆచారప్రకారము గోధుమలనుకూడ ఆ గదిలో పోసెడివారు. భూమిలో కొన్నివందల సంవత్సరములనుండి పూడిపోయియున్న శవగృహములను కనిపెట్టినపుడు, అక్కడ లభించిన గోధుమలను తీసి నాటగా మొక్కలు మొలిచినవట. కాని దీనికి వృక్షశాస్త్రజ్ఞు లంగీకరింపరు. ఏలయనగా గోధుమలు యేండ్లకొలది నిలువజేసినచో పాట్లిపోయి చూర్ణమగును. అట్లు చెడిపోకుండ నిలిచినను వాటికి ప్రరోహకశక్తి యుండదట. గోధుమలకు యిరువది సంవత్సరములు దాటిన పిదప నాటినచో మొలకలెత్తవు. కావున కొందరు శాస్త్రజ్ఞులీ విషయమును కేవలము కల్పితముగా భావించుచున్నారు.

కాప్టెన్ స్టీవెన్సు, ఆండర్సన్ అనువారు ఆకాశముమీదికి విమానములపై ప్రయాణముచేసి, యెత్తుగానున్న ప్రదేశములోని వాయువును పరీక్షింపగా మొక్కలలో వ్యాధి గల్గించెడి కొన్ని సూక్ష్మజీవు లచట కాన్పించినవి. అవి చల్లదనముచేతను, వాయుసమ్మర్దముచేతను నిర్జీవములవలె నున్నను భూమిమీదికి తీసికొని

రాగానే పరిశోధనాలయములో అనుకూల పరిస్థితులు కల్పింపగా చురుకుగా వృద్ధిచెందినవట.

౧౯౩౬ వ సంవత్సరము జూను నెలలో యఫ్. సి. బిషప్ అను అమెరికాదేశ శాస్త్రజ్ఞు డీక్రిందివిధ విధముగా ప్రకటించెను. 'డాగ్‌టిక్' అను ఒక పురుగును అతడు ౧౩ ఏప్రిలు ౧౯౩౩ లో ఒకగాజు నాళికలో పడవేసెనట. ఆ పురుగు ఆహారము లేకుండ యీ ప్రకటన గావించిన దినమువరకును సజీవముగా నుండినదట. అట్టి పురుగులకు మూడుసార్లు ఆహార మొసగినచో ఒక సంవత్సరము వరకు ఆహారము లేనిదే క్రిమికీటకాదులకుగల శైశవావస్థలు దాటి పెద్దపురుగులు కాగలవట. అట్టి పెద్దపురుగొకటి ఆహారము లేనిదే ౯౦౦ దినములు వారివద్ద జీవించినదట.

ఆ పురుగు లాహారము లేకుండ జీవించెడి సమయములో కదలకుండ పడియుండునట. గాజునాళికను కదిపినగాని స్వల్పముగా వెచ్చజేసినగాని అవి జీవలక్షణములను ప్రదర్శింపవు. ఈ నిరశనకాలములో వాటి శరీరము బరువు తగ్గదు. మొదటి దిన మెంతబరువుండెనో రెండేండ్లు ముగిసినపిదపకూడ అదే బరువుండెనట. ఈ సమయమున శరీరములోని వాయునాళములు శిథిలములగుటచే ఉచ్ఛ్వాసనిశ్వాసము లాగిపోయి శరీరములో యెట్టి మార్పును యేర్పడదట.

ఈ విధముగా ఆహారము లేకుండ సాలెపురుగులు గాజునాళికలలో నాలుగైదు సంవత్సరములు జీవించి, విడిచిపెట్టగానే చరచర ప్రాకిపోయినవట. ఇట్లే కొన్ని ఫలములపై జీవించెడి పురుగులు ఆహారము లభింపనికాలములో సామాన్యముగానే ప్రవర్తించునుగాని ఆహారములేమిచే బరువు తగ్గుట, త్వరగా మరణించుట మున్నగునవి సంభవింపవు.

ఆహారము తగ్గించుటచే ప్రాణాపాయము సంభవింపక పోవుటయేగాక, కొన్ని జీవములకు జీవితకాలము హెచ్చునట ఈ సందర్భమున డాక్టర్ సి. యం. మాకే గారు తెల్లయెలుకలపై పరిశోధనలు సల్పి యెలుకపిల్లలకు ఆహారము తగ్గించుటవలన అవి పెద్దవై జీవింపవలసిన కాలమునకు పైగా సగముకాలము బ్రతుకగలవని తెలియజేసిరి. అట్లే నీటిదోమలకుగూడ ఆహారము తగ్గింపగా జీవితకాలముకన్న దాదాపు రెండు రెట్లెక్కువకాలము జీవింపగలవని తెల్పిరి.

కొన్ని అల్పజీవులు ఆహారము లభింపనపుడు మట్టిరూపముగా మారి యెండిపోయి పడియుండును. వాటికి యేమాత్రము తడి తగిలినను మరల వృద్ధిపొందగలవు.

ఉష్ణపరిస్థితులను కోరెడి జీవులు త్వరలో పెరిగి త్వరలోనే నశించుచున్నవి శీతోష్ణస్థితిలో యేమాత్రము మార్పు వచ్చినను అవి భరింపలేవు. కాని నల్లులు మొదలగు కొన్ని పురుగులను అతిశీతలపరిస్థితులలో నుంచి విషవాయు ప్రయోగము గావించినను, వాటిపై రాసాయనిక పదార్థములను, ద్రావకములను ఉపయోగించినను అవి సహింపగలవు. కొన్ని యీగలు మంచుగడ్డ నిలువయుంచెడి పెట్టెలలో బంధించినను అవి చలిని సహింపగలవు

అట్లే కొన్నిజీవులు యెంతవేడిమినైన భరింపగలవు. డాక్టర్ లెపినోబుల్ అగ్నిపర్వతములలో బయలుదేరిన వేడినీటి ఊటకాలువలందు ఆల్గా యను ఏకాణుప్రమాణము లగు జీవులు జీవించియుండుటను గాంచిరి. మరుగుచున్న నీటిలో సూక్ష్మజీవు లెట్లు జీవింపగలవో చాల అద్భుతముగా నున్నది. దీనిని బట్టి భూమిమీదకన్న నక్షత్రమండలములో అత్యధికోష్ణ పరిస్థితులలోకూడ జీవన మేర్పడి యుండునని భావించుచున్నారు.

మానవశరీరము ౧౦౫ డిగ్రీలు ఫారెన్‌హీట్ కన్న యెక్కువ వేడిమిని భరింపలేదు అంతకు దాటినచో శరీరములోని ప్రొటీన్ పదార్థములు విరిగిపోవును. తరువాత వేడితగ్గినను విరుగుడు మరల ప్రొటీన్‌రూపముగా మారలేదు. కావున అత్యధికోష్ణతచే మరణము సంభవించుచున్నది.

నీటిని గడ్డకట్టునున్నంతవరకు ఎంత చల్లబరిచినను చేపలు జీవింపగలవు. అతిశీతలముచే శరీరములో జలము

గడ్డకట్టుటవలన చేపలు మరణించునుగాని నీరు గడ్డకట్టనిచో నెంతటి శీతలమునైన భరింపగలవు. ఒక శాస్త్రజ్ఞుడు సభలో సభికులయెదుట ఒక కప్పను నీటిలో బడవైచి, వారియెదుటనే ఆ నీటిని మంచుగడ్డగా చేసెనట. కొంతసేపటికి మంచుగడ్డ కరగిపోగా ఆ కప్ప గంతుచు నడువసాగెనట.

వేడిరక్తము గల జీవుల శరీరముపై మంచుగడ్డ యేర్పడినచో అత్యల్పకాలములో శరీరములోని జీవద్రవములు విరిగిపోవును. కావున వెంటనే మరణము సంప్రాప్తమగును. కాని కప్పవిషయములో శరీరము పైభాగమే చల్లబడుచున్నదిగాని లోపల వేడికి ప్రమాదము లేకపోవుటచే అది జీవింపగల్గుచున్నది.

ఇట్లు కొన్నిజీవము లెంతశీతలమునైన భరింపగల్గినను ఉష్ణపరిస్థితులలో చురుకుగా వృద్ధిపొందుచున్నవి. వేడి తగిలినపుడు కప్పగ్రుడ్లు త్వరగా తోకకప్పలగును. సామాన్యముగా ౭౫ డిగ్రీలు ఫారన్‌హీట్ వద్ద ౩౧ దినములు జీవించెడి యీగలను ౫౦ డిగ్రీల వాతావరణమందుంచినచో ౧౭౭ దినములు జీవింపగలవు. ఆ విధముగనే ౯౮ డిగ్రీల వేడిమి అలవాటుపడిన మానవశరీరము ౬౦ డిగ్రీలకుగాని ౭౫ డిగ్రీలకుగాని అలవాటుపడినచో రెండువేల సంవత్సరములు సైతము జీవింపవచ్చునని శాస్త్రజ్ఞులు తెల్పుచున్నారు.

కావున బాక్టీరియా, బూజులూ, సముద్రములోని సూక్ష్మజీవులు మున్నగునవి విపరీత సమయములందెండిపోయినను చైతన్యమందుకొనగలవు. ఒక పేనును ఏడు దినములు మంచుగడ్డలో నుంచినను మరణింపలేదట. ఇట్లు గాలిలేకపోయినను, ఉష్ణతలేకపోయినను, ఆహారములేకపోయినను కొన్నిజీవులు జీవింపగలవు. కాని వాటినిగురించి బయలుదేరిన కథలు చాల అవిశ్వసనీయములుగా నున్నవి. ప్రాతగోడ నొకదానిని త్రవ్వుచున్నప్పుడు దానిలోనుండి ఒక కప్ప వెలువడినదని కథ గలదు. కాని కప్పకు ఆహారము లభింపకున్నచో ఒక సంవత్సరముకన్న అధికముగా జీవింపలేదని వాటిపై పరిశోధనలు గావించిన శాస్త్రజ్ఞులు తెల్పుచున్నారు. అట్టి సందర్భమున వేలకొలది యేండ్లనుండి గోడలో కప్ప జీవముతో నుండుట యసంభవము.

జంతుకోటినంతటిని ఒక్కసారి పరిశీలించినచో ఇట్టి మొండిజీవనము అల్పజీవులకేగాని ఉష్ణరక్తము గల జీవులకు లేదు. ఎలయనగా, ఉష్ణరక్తము గల జీవులందు శరీరావయవములు పరిపూర్ణదశను పొందియుండుటచేతను, అవి బుద్ధి ఉపయోగించి ఆత్మసంరక్షణ చేసికొనగలవు గావునను వాటిలో ఆ శక్తి నశించినది. కాని అల్పజీవులు కట్టి ఆత్మరక్షణోపాయములు తెలియవు గావున యెట్టి విపరీతపరిస్థితులందైనను ఆహారము లభింపకున్నను ప్రాణములు కాపాడుకొనుటకు తగిన యవకాశములు స్వతస్సిద్ధములుగ నేర్పడియున్నవి —స.

---

## సూఫియా హనూం జగ్లుల్
## (‘ఈజిప్టుదేశస్థుల తల్లి’)

స్వదేశమునకును, స్వదేశస్థులకును స్వాతంత్ర్యమును సంపాదించుటకై యహోరాత్రములు పాటుపడిన ఈజిప్టుదేశభక్తుడు సాద్ జగ్లుల్ పాషానుగురించి వినని ముస్లీము ఉండడు. ఇప్పటికిని ఆదేశములోని ఆబాలగోపాలమునకు అతనిపేరు పారాయణము చేయదగినదై యున్నది.

చనిపోయిన ఆమహనీయుని భార్య యిప్పుడుకూడ నున్నది. ఆమెపేరు సూఫియా హనూం జగ్లుల్. బ్రతికియుండగా జగ్లుల్ పాషాకేయే గౌరవ మర్యాదలు జరుగుచుండినవో అవియన్నియు నీమె కిప్పటికిని జరుగుచున్నవి. ఆదేశపు ప్రజలందరును చేరి ఈమెకు ‘ఈజిప్టుదేశస్థుల తల్లి’ అనునర్థమిచ్చు ‘ఉమ్ మల్ మిస్రియీన్’ అను గొప్పబిరుదును ఇచ్చియున్నారు. వారి కేమైనను ప్రమాదముగాని, కష్టముగాని వచ్చినప్పుడు వారీమెయింటికి పరుగెత్తుకొనిపోయి ఈమెసలహాలను పొందుచుందురు. ఈమె ఏసలహా చెప్పిన అది వారికి వేదవాక్యము.

ఇటీవలనే ఇంగ్లీషువారికిని ఈజిప్టువారికిని ఒక రాజకీయ సంక్షోభ మేర్పడినది. దాని విషయములో

సముచితమైన సలహాను పొందవలయునని దేశీయ విద్యార్థులును, యువకులును వేలకువేలు గుంపుకూడి 'తల్లి' యింటికి పోయి మూగిరి. రక్షకభటులు ఆగుంపును చెదరగొట్టవలయునని తుపాకులుకూడ ప్రేల్చిరి. చాల మంది గుండుదెబ్బలకు గురియై ప్రాణములను వదలిరి.

ఇంతయును క్షణములో జరిగిపోయెను. లోపలి నుండి సూఫియాహానూంసలి బయటికివచ్చి గందరగోళము చూచి తాత్కాలికముగా నందరును చెదరి పోవలసినదని ప్రజలకు హెచ్చరించెను. అదివరకు గుండు దెబ్బలకు గూడ జంకక తెగలొగ్గిన ప్రజలకీ 'తల్లి' హెచ్చరింపులో నేమి మహత్తరశక్తి కనబడినదో కాని వెంటనే ఎక్కడివారక్కడ తొలగిపోయిరి.

ఈమె కొంతకాలము ప్రధానమంత్రిగానుండిన ముస్తాఫా ఫామీ పాషాకూతురు; మహాతేజశ్శాలిని; మంచి గంభీరమైన వ్యక్తి. ఈమె యొక్క పెద్దమేడలో నివసించుచుండును. ఆమేడలోని అలంకరణములును, ఆసనాది పరికరములును ఈమెయొక్క కళాభిరుచిని చాటుచుండును. మేడలో నొకచోట ఈమె జీవితనాథుని శిలావిగ్రహము జీవపరిమాణముతో నిర్మింపబడి నెలకొల్పబడియున్నది. ఆపతిదేవత నీమె నిత్యము పూలతో పూజించుచుండును. ఈమెకిప్పుడు వయస్సు కొంచెము ముదిరిన మాట వాస్తవమే కాని, యౌవన వికాసము మాత్రము మదరలేదు. తొలిరోజులలో నీమె ఆదేశములో కెల్ల నందాలరాణియై యుండ నోపును.

ఈమెవెంట నెల్లప్పుడును ముగ్గురు మంత్రిణులుందురు. వారిలో నిరువురు యూరపువారు. ఒకతె జర్మనీ దేశస్థురాలు. ఆ జర్మనుయువతికి అనేక భాషలు వచ్చును. పరాయి దేశస్థులు వచ్చినప్పుడు, వారితో మాటలాడునప్పుడు ఆయువతి దుబాషీగానుండి వ్యవహారములు తెమల్చి వేయుచుండును.

మహిళోద్యమములందు సూఫియాకు ఆదరమెక్కువ. ఆదరమేకాక ఆ ఉద్యమములు సఫలమగుటకు ఆమె ఎన్నెన్నిపాట్లయినను పడితీరును. ఈజిప్టు యువతులు ఇప్పుడు రాజకీయములందు పురుషులతో సమాన భాగస్వామ్యమును సంపాదించినారన్నచో, అది సూఫియా ప్రయత్నఫలమే. తనదేశపు యువతులే కాదు, ఏదేశపు యువతులయినను సరియే అన్ని విధములుగాను అభివృద్ధికి రావలయుననియే ఈమె సదా కోరునది



సూఫియాహానూం

సూఫియా అరాబిక్, ఫ్రెంచి భాషలను ధారాళముగా మాటలాడగలదు. ఇంగ్లీషు అర్థముచేసుకొను పాటి జ్ఞానమున్నను ఇంగ్లీషులో మాటలాడుట మాత్రమీమెకు చేతకాదు.

చిన్నప్పుడు తండ్రిదగ్గరను, వయసువచ్చినపిదప భర్త దగ్గరను ఈమె మహోత్తమమైన గుణముల నలవరచుకొనెను. విశాలహృదయము, భావస్వాతంత్ర్యము, దేశభక్తి మొదలైనవి వానిలో ముందు పేర్కొనదగినవి. అంత ఉత్తమురాలు గనుకనే దేశము మొత్తము ఈమె నంతగా పూజించుచున్నది!

స్త్రీవిద్య ఈమె అభిమానించు ఉద్యమములలో మొదటిది. కైరోలోని ఆల్ అజారు విశ్వవిద్యా

లయమున కొకప్పు డీమె తన అమూల్యాభరణములనే పెక్కింటిని విరాళమిచ్చి ప్రోత్సహించినదట. విద్యా సంస్థలకు సహాయము చేయవలసి వచ్చినప్పుడు అంత తెగింపుతో నీయమ సహాయము చేయుచుండును. "భారతీయులు కూడ స్వాతంత్ర్యమును, పురోగమనమును పొందవలయునని కాంక్షింతురేని వారుతమ విద్యాలయముల నన్నిటిని బాలికలతో నింపివేయవలె" నని యొకసారి ఈమె భారతీయులకు సందేశము పంపినది. స్త్రీల అభివృద్ధి విషయములో నీమె కంత పట్టుదల! ఈవిషయములను గురించి ఈమె పత్రికలకు గూడ వ్యాసములు వ్రాయుచుండును. ఈమె వ్యాసములందలి శైలి ఘాటుగా నుండును.

విలేఖకురాలేకాక ఈమె గొప్పవాగ్ధాటి కలది కూడ. ఎటువంటివానినికూడ తన ఉపన్యాసముతో నీమె వంచుకొనగలదు. ఈమెపేర నొక సంఘము కూడ స్థాపింపబడియున్నది. దానికి దేశమంతటను శాఖలుకలవు. వాని మూలముగా నీమె తన స్వాతంత్ర్యప్రబోధమును పల్లె పల్లెకును గుడిసె గుడిసెకును వ్యాపింప జేయుచుండును.

స్త్రీలను ప్రతి రంగమునందును ప్రవేశపెట్టి ఈమె ఒక గొప్పసాధన చేసినది. అందులో ముస్లిము యువతులకు ఇటువంటి స్వాతంత్ర్యమును సమకూర్చుట చాల శ్లాఘనీయమైన విషయము. మత సంబంధమయిన నియమములకు కట్టుబడియే ముస్లిముయువతులు తమ పురుషులతో బాటు దేశాభివృద్ధి విషయములందు సమానముగా పాల్గొనవచ్చునని యీయమ కార్యరూపముగా నిరూపించినది.

---

## సంగీతముయొక్క దివ్యశక్తి

ఆనందమయ రంగములను విషాదమయ రంగములుగను, విషాదమయ రంగముల నానందమయ రంగములుగను మార్పుగల యసామాన్యశక్తి సంగీతమునకు కలదని పురాణములవలన తెలివిడి. అట్టి సన్నివేశములు హిందూదేశ చరిత్రయందును కలవు.

బేజూ బారా అను గాయకుడొకడు ప్రఖ్యాతుడుండెను. అతడు గుజరాతువాడు; జానపదగాయకుడు. అతనిని 'వెఱ్ఱిబేజూ' అని యనెడువారు.

బేజూ సూరతుప్రాంతములలో నెక్కడనో జన్మించెను. సుల్తాను బహదూరుకాలమున నతడు గుజరాతునందు నివసించుచుండెను. ఆకాలమున నా పయి యుత్తర హిందూస్థానమును హుమయూను చక్రవర్తి యేలుచుండెను.

బేజూ పాడునపు డొడలు మఱచెడువాడు; తన చుట్టుపట్టులను మఱచెడువాడు. శ్రోతలును పరవశులయ్యెడువారు. అతడు ప్రజారంజకుడగు గాయకుడు. ప్రజల కష్టసుఖము లతని కెఱుక. వారి యానందమే యతని యానందము; వారి దుఃఖ మతని దుఃఖము.

తండ్రి బేబరు స్థాపించిన సామ్రాజ్యమును విస్తరింపజేయుటకయి హుమయూను గుజరాతుపయి దాడి వెడలెను. సుల్తాను బహదూ రాతని నెదుర్కొని ఘోరముగాపోరి తుద కోడిపోయి సకుటుంబముగా బందీయయ్యెను. కాని హుమయూనుకోపము జ్వలించుచునే యుండెను.

రాజధానిప్రవేశముతడవుగనే ఎఱ్ఱనిశస్త్రములను కట్టుకొని హుమయూను కొలువుకూటమునకు వచ్చెను. రక్తవస్త్ర ధారణము సకల జనసంఘాత సంహారమునకు ఆజ్ఞాప్రదానమును సూచించునట. అప్పపాటులో మొగలుసైనికుల విచ్చుకత్తులు మిలమిలలాడినవి. ఆబాలగోపాలము నగరవాసులయొక్క శరీరములనుండి శిరములు వేఱయినవి. వీథులు, నగరప్రాంతములు మృతకళేబరముల రాసులతో నిండిపోయినవి. బేజూ నివాసమగు నగరమున వారెల్లరు, పాపము, హతులయిరి!!

నిలువనీడయు, పిలుపతోడును లేక తప్పించుకొని పారిపోవుట కుపాయము నారయుచు వీథులవెంట బేజూ తిమ్మరుచుండెను. నెత్తురు దప్పిగొన్న మొగలు సైనికుడొక డాతనినిపట్టుకొని తల దెగవేయనుంకించెను. రెప్పపాటవకాశమిమ్మని బేజూ వానిని యాచించి వానితో

'ఓయీ, నా తలనఁదీయుటచే నీకగునదిలేదు! దానియెత్తుబంగారమును గొని నన్ను విడిచిపుచ్చరాదా!' అనెను.

హంతకు డదిమేలని తలచి యందుల కంగీకరించెను.

'బంగారము నిచ్చినగాని విడువ'నని బేజాతల నున్నపాగా నూడదీసి అతని రెండు రెక్కలను చేర్చికట్టి 'బంగారముండు చోటికి గొనిపొ'మ్మని సైనికుడు పలికెను.

హుమయూను సేనానులలో నొకడగు హిందూ రాజు వారిని చూచెను. వెంటనే బేజాను విడిపించి హుమయూను నాస్థానమునకు బిలుచుకొనిపోయెను. అంతకులోననే మొగలుహంతకుడును పరువిడివచ్చి బేజా సుల్తాను పక్షము వాడనియు, కావున వానిని చంపవలసియుండ నీహిందూరాజు బలాత్కారముగ అతనిని విడిపించితెచ్చెననియు హుమయూనుతో మొర పెట్టెను. అంతతో బోవక యాభగ్నాశుడు 'వీ రిరువురు హిందువులగుటయే యిందుకు గారణ' మనియు హుమయూను చెవి నూదెను.

ఇంకను చల్లారకున్న హుమయూనుకోపాగ్ని మరల గప్పున మండెను. ఆరాజునుజూచి 'నీయీ రాజద్రోహ కార్యమునకు కారణమును చెప్పు'మని గద్దించెను.

రాజు 'ప్రభూ, హిందువను భావముతో నే నీతని రక్షించినవాడను కాను. ఇతడు పేరువడసిన జానపదగాయకుడు. ఇతని పేరు బేజా బావరా. సకలకలాపోషకులగు తమయట్టివా రిట్టికళావేత్త మరణమును సహింపజాలరు. ఇతడు సమస్త హిందూస్థాన స్వామ్యము!' అనెను.

ఇంచుక యాలసించి హుమయూను 'నిరూపింపుము, లేకున్న నమ్మజాల' ననెను.

'అదెంత పని? సార్వభౌమా! సులువుగా నిరూపింతును. ప్రభువుల విజయగీతమును బేజా గానము చేయును. ఆలకించినచో ఏలినవారి చిత్తమునకు రాగలదు' అని రాజనెను.

తనకెంతయో ప్రీతి పాత్రమయిన మాతృనగరమును వధ్యశాలగ నొనర్చిన దుర్గర్వి విజయగీతము పాడవలసినవాడయ్యెను, బేజా, పాపము! ఏమి చేయగలడు?

ఎట్లో పాడెను. అందు హుమయూను స్తోత్రము లేదు. ఆపాటలో బేజా హృదయరక్తము వరదలుకట్టి ప్రవహించెను. ప్రపంచమందలి దుఃఖమంతయు నాలుకయై పలికినట్లుండెను. దానిభావము:

'ఓయీ, క్రూరకర్మా, నీ ఖడ్గాల సమున కెరయగుటకు నే డొక్కడను మిగులలేడు. నీయిచ్చయేని, మృతులను మరల బ్రదికించి, వారిని మరల జంపగలవు!'

మాటలును, పాటలును, రక్తికట్టి శ్రోతల హృదయములను ద్రవింపచేసినవి. రక్తతృష్ణ యింకిపోయినది. అందఱును సిగ్గున తలలు వంచుకొనిరి. కొలవంతయు శిలామయమువలె నిశ్చలమయ్యెను.

హుమయూను, పాటపాడుచుండగనే, కొలువునుండి తటాలున లేచి, లోనికిపోయెను. దుఃఖాతిరేకమున కన్నులనీరు చెంపలపయి కాలువలయిపార బేజా పాటను మరల మరల పాడుచునేయుండెను. అంతలో హుమయూను పచ్చనికలకలను దాల్చి కొలువులోనికివచ్చి కూరుచుండెను. పచ్చనివస్త్రమును గట్టుట దారుణమారణకర్మకు విరామమును సూచించుట.

చక్రవర్తియానతిని బేజా ధవళవస్త్రధారియై రాజవేషమున శ్వేతాశ్వము నధిరోహించెను. అంత హుమయూను తనయిచ్చకు వచ్చినవారిని చంపుటకును, కొందఱినేని, అందఱినేని బందీలను విడిచిపుచ్చుటకును బేజాకు నధికారము నొసగెను. వెంటనే బేజా తొలుదొలుత బందీలుగనున్న సుల్తాను బహదూరును, అతని కుటుంబమును, బంధుగులను విడిపించెను.

ఇట్లు విషాదము ఆనంద మయినది; యుద్ధము తుదముట్టి శాంతి నెలకొనినది! ఇదియంతయు నొకపాటవలననే!!

సంగీత మట్టి దివ్యశక్తికలది!!!

(టైమ్సు ఆఫ్ ఇండియా వీక్లీ)



# విమర్శనము

**మహోపాధ్యాయ బ్రహ్మశ్రీ కల్లూరి వేంకటరామశాస్త్రిగారి జీవితచరిత్రము**

డెమ్మీ సైజు, గ్లేజు కాగితము, ౪౦౦ పేజీలు పైగా, వెల ప్రతి ౧ కి రు. ౧-౪-౦.

గ్రంథకర్త: చిలుకూరి వీరభద్రరావు,

ప్రచురణకర్తలు: ఇతిహాసతరంగిణీగ్రంథమాల, కొవ్వూరు.

గ్రంథకర్త అవతారికలో—"మన దేశములోని పండితులు గాని కవులుగాని తమ దినచర్యలను వ్రాసిపెట్టుకొను గ్రంథముల నుంచుకొను నలవాటుకలవారు కాకపోవుటచేత నెవ్వరు వ్రాసినను వారి జీవితచరిత్రము లసమగ్రములుగానే యుండును. ఇంగ్లీషు కవులమాదిరి జీవితచరిత్రలను వ్రాయుట సాధ్యపడదు. అందులోను ముప్పదియైదు సంవత్సరముల కాలము నేపాఠశాలలోనో ఏకళాశాలలోనో అధ్యాపకవృత్తియందే గడపిన వేంకటరామశాస్త్రిగారివంటి పండితకవిచరిత్రము వ్రాయ బూనుకొన్నప్పుడు వారి పాండిత్యము గవిత్వమును గూర్చి మాత్రమే తెలుప ననువగునుగాని తదితరవిషయము లేవి యుండగలవు? ఆపాండిత్యమైనను కవిత్వమైనను వారుచేసినట్టి గ్రంథములను బట్టియు మరియు వారు సమకాలికులయిన పండితులతోడను, కవులతోడను జరిపినట్టి శాస్త్రీయచర్చలను బట్టియు శబ్దార్థముల సాధుత్వాసాధుత్వములనుగూర్చిన చర్చలనుబట్టియు నిర్ధారించి తెలిసికొనవలయునుగదా!" అని వ్రాసిరి. పైదాని ననుసరించి గ్రంథస్థవిషయమేరీతి నుండియుండునో పాఠకు లూహింపలేకపోరు. గ్రంథకర్త వ్రాసిన పైవిషయము ఏమాత్రము సత్యదూరమనుటకు వీలులేదు. గ్రంథకర్త వ్రాసినట్లు వేంకటరామశాస్త్రిగా రాంధ్రులలో ఉత్తములు. అట్టిమహనీయుని జీవితచరిత్ర తెలిసికొనుట ఆంధ్రులకు అవశ్యము.

ఈ జీవితచరిత్రమును ఆసాంతము కేవలము పైనుదాహరించినచొప్పున చర్చలతోడను, వాదప్రతివాదములతోడను మాత్రమే పోనీక పలుచోట్ల తమ స్వీయాభిప్రాయములగూడ నొసంగియుండుట జూడ గ్రంథకర్త జీవితచరిత్రల రచింపుఫక్కినే అతిక్రమించిరని వ్రాయవలసి వచ్చుచున్నది. అవతారికయందే వేరొకచో "జీవితచరిత్రమును వ్రాయుటలో నే నొక స్వతంత్రమార్గమును జేసికొని పోయితిని." అని గ్రంథకర్త చెప్పెను. చరిత్రయనగా Record of events అయినప్పుడు గ్రంథకర్తయొక్క స్వీయాభిప్రాయములకు తావెక్కడగలదో యూహింప నలవికాకున్నది. దీనిని బట్టి గ్రంథకర్తకు చరిత్రరచనాప్రయత్నము ఇదే ప్రప్రథమమేమో యని సందేహింపవలసి వచ్చుచున్నది.

ఈ గ్రంథమునకు వేంకటరామశాస్త్రిగారి జీవితచరిత్ర యని పేరిడుటకంటె శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారి జీవితచరిత్రభాగ మనుట యుచితముగ నుండెడిదేమో! ఒకటిగాదు, పదిగాదు, పలుచోట్ల శ్రీపాదవారిని నిరసించుచు గ్రంథకర్త ప్రకటించిన స్వీయాభిప్రాయములు గలవు. మచ్చుకైనను ఒకటిరెండిట నుదా-

హరించుటకును మనను రాకున్నది. చివరకు చేయికూడ ఆడకున్నది.

పోయిన తగవులు ఏనాడో అంతరించిపోగా జీవితచరిత్రలందు గ్రంథకర్త స్వీయాభిప్రాయముల నిచ్చుట క్రొత్తతగవులను త్రవ్వితెచ్చిపెట్టుట యగుచున్నది. గవర్నమెంటువారు బూతుగ్రంథముల నిషిద్ధపరచెదరు. యథార్థమునకు అట్టిగ్రంథముల ఆవశ్యకత యెంతేని కలదు. అవే మన ఆంధ్రజాతికి బునాది. అవే మన ఆంధ్రచరిత్రకు, కొంతవరకు భావకు, ఆధారభూతములు. అట్టి కృతులు ప్రచారములోనికి రాకుండ ఆటంకపరచి, అనవసరవివాదముల కెడమిచ్చి జాతియందు మరికొన్నికక్షలను పెంపొందించు ఈ వేంకటరామశాస్త్రిగారిజీవితచరిత్రవంటి గ్రంథముల నేల నిషిద్ధపరచక వదలెదరో తెలియకున్నది. ఇట్టి గ్రంథములపైగూడ గవర్నమెంటువారొకకన్ను వేసియుంచినచో కొంతమేలు.

ప్రపంచమునందేజాతికానీ ఏకొలదిగనైన తనకు సంబంధించిన మహామహుల జీవితచరిత్రలను సేకరించి ప్రచారములోనికి దెచ్చుకొనకున్నచో నట్టిజాతియందు జవసత్త్వములు లేవని తలంపబడుచున్నది. అట్టిజాతి ప్రపంచమునందు ఒక సభ్యజాతిగ పరిగణింపబడదు. ఆంధ్రులకు జీవితచరిత్రలు లేవు. భావిసంతతివారికవే ఆధారములు. కాన ఆంధ్రులు మనలో జన్మించిన మహామహుల జీవితగాథలను రచించి ప్రకటించుటకు పూనుకొనవలెను. ఈ ప్రయత్నమున వీరభద్రరావుగారు త్రొక్కిన స్వతంత్రఫక్కినిమాత్రము అవలంబింపవలదని ప్రార్థనము.

వ. కుటుంబరావు

---

## ఆంధ్ర రాష్ట్రము

క్రౌను ౧/౮ సైజు, సెమీ గ్లేజుకాగితము, ౭౨ పుటలు. వెల ప్రతి ౧ కి రెండణాలు.

గ్రంథకర్త : వావిలాల గోపాలకృష్ణయ్య

ఈ గ్రంథము ఆంధ్రదేశచరిత్ర కాదు; జాగ్రఫీయును కాదు. ఇందలి ప్రముఖాంశము ఆంధ్రరాష్ట్రవాదము, తదర్హతలు.

వైశాల్యము, జనసంఖ్య, ఆదాయము పరికించినచో ఆంధ్రులకు రాష్ట్రార్హత కలిగియున్నదనుటలో నేలాటి సందేహము లేదు. ఆంధ్రులకు ప్రత్యేకరాష్ట్రము కావలెననెడు ఆందోళన యీనాటిది కాదు ముప్పది వత్సరములనుండి జరుగుచున్నప్పటికి ఆంధ్రులు స్వరాష్ట్రమును బడయలేకపోయినారు. కారణమేమి?

"అన్నియునున్నవి, అల్లునినోట శని" యన్నట్లు ఆంధ్రులలో నైకమత్యమేదీ? సక్రమాందోళనయేదీ? ఈరెండే ఆంధ్రులు ప్రత్యేకరాష్ట్రమును బడయజాలక పోవుటకు అడ్డంకులు. ఒకరవుననుదానిని మరొకరు కాదన్నచో మూడవవానిదృష్టిలో పైయిరువురు పరిహాసపాత్రులే గదా!

ఈగ్రంథకర్త యువకుడయ్యును ఆంధ్రరాష్ట్రోద్యమ నామూలాగ్రము నవగాహన చేసికొనినాడు. ఆంధ్రుల కీ దౌర్భాగ్యదశ యేనాటితో తుడిచిపెట్టుకొనిపోవునోయనెడుతహతహతో ఉడుకెత్తినరక్తముతో వ్రాసినటులున్నది ప్రతిపంక్తిగూడ. "నిన్నగాక మొన్న కండ్లు తెరచిన సింధు, ఒరిస్సాలు తమ స్వరాష్ట్రములను సముపార్జించుకొనినవి. ప్రభుత్వమువారు వంగదేశమును విభజించినంతనే దేశమునందంతటను అగ్నిపర్వతము ప్రజ్వరిల్లినట్లు ఆందోళనాజ్వాలలను లేవదీసి వంగీయులఖండవిజయమును పొందియుండగా, మనమో చేతులారజన్మభూమిని ముక్కలు ముక్కలుగ చేసికొన బ్రయత్నించుచున్న నిర్వీర్యులము. దద్దమ్మలము!" అని గ్రంథకర్త ఆంధ్రులకు పౌరుషము గలవడునట్లు పలుకుచున్నాడు. "అధికారపీఠముల నధివసించిన ఆంధ్రాభిమానులు రాష్ట్రవిభజనమగుటకు తీవ్రకృషిచేయుట కవసరమగు సహాయ సంపత్తులను, ప్రజాభిమతమును, తీవ్రతరాందోళనమును, తీవ్రప్రజోద్యమమును సాగించవలెను" అని హెచ్చరించుచున్నాడు.

ఐకమత్యము, స్వజసంకల్పము, తీవ్రమైన ఆందోళన యున్నచో నెంతటి మహోద్యమ మైనను సులభసాధ్యము. అందు కెల్లరు పూనుకొనవలెను. ఆంధ్రదేశమందలి కాంగ్రెసు సంస్థలు కొంత ధనమును వెచ్చించి ఇట్టి గ్రంథములకు బహుళప్రచారము కల్పించినచో రాష్ట్రీ సంపాదనమునకు ప్రజలలో కొంత పౌరుషమును, ఉత్సాహమును రేకెత్తించినవారగుదురు. గ్రంథము యొక్క శైలి బహు చక్కగ నున్నది.

గ్రంథములకు డా: సి. సీతారామశాస్త్రి, ది మెడికల్ స్టోర్సు, సత్తెనపల్లి అని వ్రాసికొనిన బడయగలరు.

వ. కుటుంబరావు

---

## మరణానంతర సందేశములు

గ్రంథకర్త: రావుబహదూర్ ఎం. నరసింహం పంతులు, బి. ఏ., బి. ఎల్.,

వెల రు. ౦-౧౦-౦. దొరకుచోటు: కొండేపూడి కృష్ణమూర్తి, ఉల్లితోటవీథి, రాజమండ్రి.

ఈ లోకమున మరణించినవారు, తా మిచ్చట చేసిన మంచిచెడ్డల ఫలితమును మరొకలోకమున సూక్ష్మరూపధారులై అనుభవించి, అనంతరము ఈ లోకమున పుట్టెదరని హిందూశాస్త్రములు చెప్పుచున్నవి.

సూక్ష్మరూపధారులగు జీవులు భూలోకములోని తమ బంధుమిత్రులతో సంబంధమును విడక, తమశక్తి ననుసరించి వారికి మేలు చేయుదురనియు, విరోధులైనచో అపకారమును కూడ చేయుదురనియు, భూలోకములోనివారికి తమ సందేశములను పంపుచుందు రనియు తెలుపుటకు ఇంగ్లండులో ఒక మత మేర్పడినది. ఈ పైవాదనను సమర్థించుచు పెక్కురు వ్రాసినవ్రాత లున్నవి.

గ్రంథకర్త నరసింహం పంతులుగారికి ఈ శాస్త్రముపై గల నమ్మకమే యీ గ్రంథరచనకు వారిని పూనుకొనజేసినది. వారికి ఈ శాస్త్రమునందు నమ్మకము కుదురుటకుగల స్వానుభవములను వారు కొన్నిటిని యీ గ్రంథమున తెలుపుచున్నారు.

ఈ వాదమును అంగీకరించుటకు సందేహములు చాల కల్గును. ఈ గ్రంథమున వ్రాయబడిన కొన్ని సంఘటనలను చదివినంతమాత్రమున ఆ సందేహములు తీరుటలేదు.

టెలిపతి, మెస్మరిజం అను శక్తులవలన, సూక్ష్మజీవులు చేయునని యీ వాదమునంగీకరించువారు చెప్పు కార్యముల నన్నిటిని టెలిపతి, మెస్మరిజములవలన చేయుటకు సాధ్యమగునని స్పష్టపడుచున్నది.

చనిపోయినవారి రూపములు కాన్పించునట్లు చేయుట, ఒకరు ఫోటో తీయించుకొనునపుడు వారి వెనుక నింకొక రూపముండునట్లు చేయుట మొదలగున వన్నియు మెస్మరిజమునందు సామర్థ్యమును గడించిన వారికి సాధ్యములే. అందువలన ఈ శాస్త్రమును నమ్ముటకు సాధ్యము గాకున్నది. శ్రీనరసింహం పంతులు గారుకూడ ఈ గ్రంథమున తమ అనుభవములను, ఇతరుల అనుభవములను వ్రాయుచు, ఈ శాస్త్రమును నమ్ముటకు అవి ఆధారములని చెప్పుచున్నారు. అంత మాత్రమున దీనిని నమ్ముట సాధ్యమా ? ప్రసిద్ధులగువారు అబద్ధములను వ్రాయరు. కాని వారుకూడ మెస్మరిజం, టెలిపతిభ్రమలలో పడి, యీ వాదమును నమ్మవచ్చును.

ఈ శాస్త్రమునందు పంతులుగారికి నమ్మకము గలదుగాన, యింకను పరిశోధనచేసి దీనియందలి సత్యమును పండితపామరు లందరకును అర్థమగునట్లు ఇంకను పుస్తకములను వ్రాయనగును.

ఈ పుస్తకమున అచ్చుతప్పులేగాక భాషలో గూడ కొన్ని దోషములు నిలిచిపోయినవి. మరొక ముద్రణలో నవి సవరింపబడవలసియున్నవి.

క. స.

---

## చింతామణి విషయపరిశోధనము
## (సానుబంధము)

ఇది ఆంధ్రవిశ్వకళా పరిషత్కళాశాలాంధ్రోపాధ్యాయులగు శ్రీ వజ్ఝల చినసీతారామస్వామిశాస్త్రి గారిచే రచింపఁబడి ప్రకటింపఁబడినది. రెండవ కూర్పు. క్రౌను సైజు, ౨౦ + ౨౩౧ పుటలు. వెల ఒకరూపాయి.

ప్రథమాంధ్రలక్షణ గ్రంథ మగు నాంధ్రశబ్దచింతామణియొక్క కర్తృత్వమును గూర్చియు, కాలమును గూర్చియు, అందలి విషయములఁగూర్చియు పెక్కేండ్ల నుండియు నాంధ్రపండితలోకమున వాదవివాదములు పెరిగియున్నవి. ఈ విమర్శగ్రంథమున వివాదగ్రస్తము లగు విషయము లన్నియు పరిష్కరింపఁబడి సప్రమాణముగఁ జక్కనిసిద్ధాంతము లొనరింపఁబడినవి.

సుప్రసిద్ధాంధ్ర లాక్షణికు లగు శ్రీ సీతారామస్వామి శాస్త్రులుగారు పయి విషయ పరిష్కారమునకయి వైదిక, సంస్కృతాంధ్రభాషా, వాఙ్మయ, వ్యాకరణములను లెస్సగఁ బరిశోధించి యీ అమూల్య విమర్శనమును వెలువరించినారు. ఇందు మూఁడు ప్రకరణములందు వరుసగ 'చింతామణి నన్నయవిరచితము, కావ్యభాషకే సంస్కారము, చింతామణినిగూఢాశయములు' అను విషయములు నిరూపింపఁబడినవి. అట్లే చింతామణి, వికృతివివేకముల పౌర్వాపర్యము, సంస్కృతాంధ్ర వ్యాకరణముల స్వరూపభేదములు, క్లిష్టసూత్ర వ్యాఖ్యానములు వివరింపఁబడినవి. ఇందలి నూతన విషయము లన్నియు క్లిష్టసమస్యలను పరిష్కరింప సమర్థములు.

ఈయుత్తమగ్రంథ మీవఱకే విద్వత్ప్రకాండుల ఆదరమునకుఁ బాత్రమయి, వెలువడినదిమొదలు నేఁటి వఱకును ఆంధ్ర మద్రపుర విశ్వవిద్యాలయములచే ఉభయభాషాప్రవీణ, విద్వత్పరీక్షలకుఁ బఠనీయముగ నిర్ణయింపఁబడుచున్నది. శ్రీ 'మద్రపురీ విశ్వవిద్యాలయాంధ్రపఠనీయ గ్రంథనిర్ణాయక సభవారి' మెప్పు గాంచినది. గ్రంథములోని విషయములు కొందఱు ప్రసిద్ధ పండితులచే స్వీకరింపఁబడినవి.

ద్వితీయ ముద్రణమున నీగ్రంథము 'సానుబంధము'గఁ బ్రకటింపఁబడినది. అందు పెక్కు విశేషాంశములు చేర్పఁబడినవి.

ఈ గ్రంథము మొదటికూర్పు పొందిన పిదప కొందఱు విమర్శకులు 'ఈ గ్రంథమునందలి కొన్ని సిద్ధాంతముల విషయమునఁ గొన్ని యనుపపత్తులను జూపుచు, లేఖాముఖమునను, పత్రికాదిముఖమునను, పరీక్షాప్రశ్నముల రూపమునను దమతమ యభిప్రాయములను వెల్లడించిరట! కాని 'వానికి సముత్తరములు వెలయుచున్నవి. కొన్నింటికి జవాబు లిచ్చుపట్టుల నూతనాంశములును చేర్పఁబడినవి. 'ద్రుతము నకారవ్యంజనవ్యంజనమాత్ర రూపమే యగునపుడు 'జడిగొన్ కొఱఁకులు' మున్నగు ప్రయోగము లక్షితము' లనియు 'న్న, మ్మ, లాగమము లగుట నిర్బాధక'మనియు, 'అనాదిష్విత్యాది సూత్రార్థ సమన్వయ పద్ధతి'యు పరిషత్తువారి 'బాలసరస్వతీయ ముద్రణము దోషవిశిష్ట' మనియు, 'ద్రుతసంశ్లేష విమర్శనము'ను, ఆంధ్రవిశ్వకళాపరిషత్పరీక్షాపత్ర విమర్శనము'ను, తత్సంబాధి విషయవివేచనమును అనుబంధమున విశిష్టములు.

ఆంధ్రవ్యాకరణమున సవిమర్శముగ నిశిత మగు పాండిత్యమును సంపాదింపవలెనన్న ఈ గ్రంథమును తప్పక చదువవలసియున్నది. ఏతత్పఠనమువలన వివిధ భాషల వ్యాకరణమర్యాదలుకూడ అవగతము లగును. భాషాభిమాను లీగ్రంథము నాదరింపవలసియున్నది.

బు. వేం. ర.

---

## త్రిపురాంతకోదాహరణము

రావిపాటి త్రిపురాంతక మహాకవిప్రణీతము: శ్రీ నిడుదవోలు వేంకటరావు (బి. ఏ.) పరిష్కృతము. క్రౌను ౫౪ + ౨౧ పుటలు. వెల ౧౨ అణాలు. వలయువారు కాకినాడ, సూర్యారావుపేటలో నున్న పరిష్కర్తకు వ్రాయవలెను.

ఆంధ్రవాఙ్మయమున కలంకార మగు నీ యుదాహరణము నిదివఱకు శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు

రెండుసారులు ప్రకటించియున్నారు. శ్రీ వేంకటరావు గారు తంజావూరమునుండి సరస్వతీ మహలు ప్రతికి నకలును తెప్పించి, శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రులవారి - అమూల్యమగు - స్వంతప్రతిని పెక్కు ముద్రితాముద్రితప్రతులను పరిశీలించి పెక్కు పాఠాంతరముల తోను, వివరణములతోను ఇప్పు డాంధ్రలోకమున కొసంగుచున్నారు.

ఇంతియ గాక పరిష్కర్తలగు శ్రీ వేంకటరావు గారు అమూల్యమును, విపులమునగు పీఠికనుగూర్చి గ్రంథమున కెంతయు వన్నెఁదెచ్చినారు. అందు గ్రంథకర్తృత్వము, కవిజీవితము, కవికాలము, కవికృతగ్రంథవిమర్శనము, ఉదాహరణగ్రంథములకు వాఙ్మయమునకుఁ గల స్థానము, సంస్కృతాంధ్రోదాహరణముల స్వరూపము, ఆంధ్రోదాహరణగ్రంథముల సంగ్రహచరిత్రము, పాఠభేద విమర్శనము చక్కగ చర్చింపఁబడినవి.

పరిష్కర్తలు వాఙ్మయ సంబంధ మణుమాత్రము లేని సంస్థలో ఉద్యోగిగా నున్నారు. అయినను పసితనమునుండియు తమకుఁగల భాషాభిమానమును విడువక కష్టనష్టముల కోర్చి తెలుఁగుభాషకు సాటిలేని సేవ నొనర్చుచున్నారు.

త్రిపురాంతకోదాహరణపీఠికనుండి విద్వాంసులు కూడ గ్రహింపఁదగిన విషయము లెన్నియేని కలవు. ఆంధ్రభాషాభిమాను లెల్లరు నీ గ్రంథమును గౌరవించి పరిష్కర్త ప్రయత్నమును సర్వవిధముల సఫల మొనర్పవలసియున్నది.

బు. వేం. ర.

---

## ఖండకావ్యము
### (రెండు భాగములు)

గ్రంథకర్త: జి. జాషువకవి, తెలుఁగు పండితుఁడు, వినుకొండ.

మేలుకాగితము : చక్కని కూరుపు. క్రౌను సైజు. మొదటిభాగము ౧౧౫ పుటలు. రెండవభాగము ౧౦౮ పుటలు. ఒక్కొక్క భాగము వెల ౧౨ అణాలు.

'తెలుఁగు పత్రికలకుఁ దలమానికమైన భారతి దోఁగాడనేర్చిననాఁటఁగోలెఁ బ్రౌఢయై వలపులూరఁ బలుకనేర్చిన నేఁటివఱకు మేన నూనిన పద్యవ్యాసములే నేఁటికీ గ్రంథరూపమును దాల్చినవి.' తొలిసంపుటమున మలిసంపుటమునను ముప్పదియాఱేసి ఖండకావ్యములు కూర్పఁబడినవి.

శ్రీ జాషువకవిగారు పేరెన్నికగన్న నవీనాంధ్రకవులు. ఎట్టిభావము నయినను సరళముగను, సరసముగను ముద్దులొలుకు పద్దియములలో వ్రాయు నేరుపు వీరికుగ్గుపాలతోఁ బెట్టినది. రచన సరళము. శైలి మృదుమధురము. ప్రతిపద్యమునందును ప్రత్యేకతయు, తెలుఁగుతనమును ప్రతిఫలించుచుండును. అచ్చ టచ్చట ఆంధ్రుల గొప్పతనము తేటపఱుపఁబడినది. జాషువగారి రచనలో జీవము లేని పద్యము కన్పింపదు. ఊహాతీతము లగు భావము లేనియు వీరిరచనలో లేవు.

వీరి రచన లన్నియు వివిధ విషయములకు సంబద్ధములు. కవితాశక్తిచే అల్పవిషయము లయినను ఇందు ఉత్కృష్టము లయినవి. ఆధునిక కవులలో శ్రీ జాషువకవిగా రగ్రస్థానమును వహింప నర్హులు. ఇట్టి కవులు కొందరు వెడలినచో అన్నివిధముల నాంధ్రావనికి అభ్యుదయము కలుగగలదు.

అల్పమూల్యము లయ్యును, అమూల్యములగు నీ ఖండకావ్యము లాంధ్రుల యాదరమునకు పాత్రములు.

బు. వేం. ర.

---

## ఆంధ్రరత్నావళీ నాటకము

శ్రీహర్ష రచితమునకు ఆంధ్రమున అనువాదము. శ్రీ వేదము వేంకటరాయశాస్త్రిప్రణీతము. ద్వితీయ ముద్రణము. డెమ్మి ౧౬ + ౬౨ + ౪౭ పుటలు. వెల రు. ౧-౪-౦.

ప్రకాశకులు : వేదము వేంకట రాయశాస్త్రి అండ్ బ్రదర్సు, ౪ మల్లికేశ్వరనుడిసందు, మన్నడి, జి. టి. మదరాసు.

సుప్రసిద్ధకవిపండితవతంసము లగు శ్రీ వేంకట రాయశాస్త్రిులవారి గ్రంథముల తత్త్వము ఆంధ్రులకు అపరిచితము కాదు. శ్రీ శాస్త్రిులవారి గ్రంథము లీవఱకే తెలుఁగుసీమ తెంపులేని ప్రచారమును, మెప్పును పొందినవి. అట్టి యుత్తమగ్రంథములలోనిదే యీరత్నావళికూడ. ఇది ఇదివఱ కాంధ్ర, మద్రపుర విశ్వవిద్యాలయములందు వివిధపరీక్షలకు పఠనీయముగ నేఁటుపడి ద్వితీయముద్రణభాగ్యమును పొందినది. కాన, రత్నావళీ విమర్శనము చర్వితచర్వణ మగును.

ఈ ముద్రణమున కొన్ని విశేషములు మాత్రము కలవు. 'శ్రీ ధరణికోట వేంకటసుబ్బయ్య, ఎం. ఏ. బి. ఇడి. గారును, ఉభయభాషాప్రవీణ సంగుభొట్ల నారాయణశర్మగారును రచించిన 'ప్రభా' 'పరిష్కారము' లతో' నిది 'సంగ్రథితము. శ్రీ శాస్త్రిులవారు 'ఉత్తరరామ చరితో' పోద్ఘాతమున రచించిన 'నాటక లక్షణప్రతి' 'కొలదిమార్పులతో నిందుఁ' జేర్పఁబడినది.

'ప్రభ' లఘుటిప్పణీరూపము. ఇం దాయా యెడలఁ గల విశేషములు సంగ్రహింపఁబడినవి. శ్రీ వేంకటరాయ శాస్త్రిులవారే 'తమ సొంత ప్రతిలో సూచించియుండిన పలువిషయములను వివరణవశమున' 'ప్రభా' రచయితలు 'హెచ్చరించి' యుండుటచే విజ్ఞులను ఎఱుఁగఁదగిన విశేషము లందు పెక్కులున్న వని చెప్పవలెను.

పీఠికారూపముననున్న 'పరిష్కారము'న రత్నావళీ కృతికర్తృత్వము, శ్రీహర్ష గ్రంథ విమర్శనము, శ్రీహర్షుని ప్రతిభాదికము, రత్నావళియందలి మెఱుఁగులు మన్నగు విషయములు వివరింపఁబడినవి.

అప్రస్తుతమయ్యును అందు కాళిదాసుని మాళవికాగ్నిమిత్రపు నాటికాత్వము ప్రస్తుతింపఁబడినది. కాళిదాసకృతి 'మాళవిక' నాటిక యని దీర్ఘమగు చర్చ కొనసాగింపఁబడినది.

లక్ష్యములు ప్రాచీనములు; లక్షణము లర్వాచీనములు. లక్ష్యానురోధనముననే లక్షణకల్పనము జరుగుట అన్ని వాఙ్మయములందును ఆచార మయినది. ప్రాచీన నాటకములకును, అర్వాచీన నాటికలకును కొలఁదిమార్పులతో వస్త్వైక్యము కలిగి కొన్ని లక్షణములు ఉభయ సాధారణములు కావచ్చును. ప్రధానాంశముల పట్టుల భేదము స్పష్టముగ నున్నను కొన్నిలక్షణములను క్లిష్ట సమన్వయమున కిట్టించి గ్రంథకర్తల ఆశయమునకు విరుద్ధములగు సిద్ధాంతములను కల్పించుట సాహసము! మాళవికాగ్నిమిత్రము నాటిక కావలసి వచ్చినచో భాసుని 'స్వప్నవాసవదత్తము' కూడ నాటికయే కావలసివచ్చును. ఇంకను ఇట్లెన్ని నాటకములు తారుమారు లగునో!

'ఈ ముద్రణము' 'సర్వవిధముల విద్యార్థిసరిమముగా నెలవేర్పఁబడినది. వాఙ్మయాభిమానుల గృహములను అలంకరింపఁదగిన గ్రంథ మిది!

బు. వేం. ర.

---

ప్రబుద్ధాంధ్ర (సంపు. ౮, సంచి. ౧)

సంపాదకుడు: శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి, రాజమండ్రి.

మళ్లా ప్రబుద్ధాంధ్ర బయలుదేరింది సెప్టెంబరులో. ఇది మూడోమారు బయలుదేరడం. ఈ మారు చందా సంవత్సరానికి రెండురూపాయలు.

సంపాదకుడు "జగమెరిగిన బ్రాహ్మడు." పత్రిక ఆశయాలు దేశమంతా మోగిపోయినవే. ఈలాంటి పత్రిక దేశానికి ఎంతఅవసరమో ప్రత్యేకం చెప్పవలసింది లేదు.

ఈ సంచిక పదహారు పుటలది. తొలిపుట స్వవిషయం. తర్వాత నాలుగుపుటలు సంపాదకులు రచించిన 'రాజరాజు' నాటకంలో మొదటిరంగం. మిగతా పదకొండుపుటలు వ్యాఖ్యానాలు. అంటే సంచికనిండుకు సంపాదకుల వ్రాతలే అన్నమాట.

౧. కాంగ్రెస్సు ఆంధ్రజాతిపాలిటి తోకచుక్క, ౨. గాంధిగారు ఆంధ్రోన్నతి చూడలేరు, ౩. నాట్యకళాపరిషత్తు పరీక్షకు నిలుస్తుందా, ౪. విజటిసి

పాలించు, ౫. రోటిలో తలదూర్చి రోకటిపోటుకు జంకితే?, ౬. అధికారదుర్వినియోగం, ౭. తీపికల్లు-కృష్ణాపత్రిక, ౮ సాంబమూర్తిగారిని నెపపెట్టడానికి కాదూ, ౯. హిందీ ముప్పు తెచ్చిపెడుతుంది.

ఇవి వ్యాఖ్యానాల్లో విషయాలు. ఇందులో మూడోది తప్ప తక్కినవన్నీ రాజకీయాలు; ప్రధానంగా కాంగ్రెసు ప్రభుత్వానికి సంబంధించినవి. ప్రబుద్ధాంధ్ర వ్యాఖ్యానాల తీవ్రధోరణి పాఠకలోకానికి పరిచితమయిందే. ఈమారు వాటిధోరణిలో తీవ్రత మామూలును మరీ మించిపోయింది. అవి చాలా చాలా ఘాటుగా సాగినవి. వ్యక్తిదృష్టితో-సంకోచదృష్టితో-వ్యక్తిపరంగా నడిచినవి. ఉద్రేకంతో కూడిన ఆరోపణలు అతిమాత్రంగా కనుపడుతూంది వాటిల్లో. ఇలా నడిస్తే లోకం హర్షించడం కష్టం.

సంపాదకులకు జబాబుదారీ చాలా ఎక్కువ. వారి హృదయం చాలా విశాలంగా ఉండాలి. వారి వ్యాఖ్యానాలు ఉదాత్తంగా నడవాలి. ఇతరుల విమర్శకు అవకాశం వాటిల్లో ఉండకూడదు. అల్లా ఉంటేనే సంపాదకీయ గౌరవం వాటికి కలుగుతుంది. వాటిని లోకం మతిస్తుంది. అభిప్రాయాలు వ్యక్తిపరాలయితే చులకనయి పోవడం తప్పదు. గౌరవం నిలబెట్టుకోలేని సంపాదకీయాలు నిస్సారాలు, నిష్ప్రయోజకాలు. పత్రిక స్థితికి వాటివల్ల భంగం కలిగిందంటే ఆశ్చర్యపడవలసింది లేదు. ఈ ప్రబుద్ధాంధ్ర సంచికలో వ్యాఖ్యానాలకు వైరీతి దోషం కొంత పట్టింది.

విషయపరిశీలనంలో నిశితమయినదృష్టీ, భావాలకు చక్కనిరూపం ఇవ్వ'ల సామర్థ్యమూ స్వాయత్తమయిన ప్రబుద్ధాంధ్ర సంపాదకులకు ఉద్రేకమూ, వ్యక్తిపరమయిన సంకోచదృష్టీ ఏ మాత్రమూ ఉచితమయింది కాదు. ఈ లోపాలు సవరించుకొని సంపాదకులు ఈ మారుపత్రికను చిరకాలం మనేటట్టు చేయడం మంచిది.

ఏవో కొన్ని అభిప్రాయ భేదాలమాట అటుంచి ప్రబుద్ధాంధ్రలాంటి పత్రిక ఆవశ్యకతను గుర్తించి దేశం సంపాదకులకు చేయూత ఇవ్వడం అవసరం.

మనదేశంలో చాలమంది పత్రికలు చదువుతారు; వాటిల్లో విషయాలు తెలుసుకుంటారు; అహోరాత్రాలు వాటినిగురించి చర్చిస్తూ ఉంటారు. ఇందుకు అవకాశం లభించకుంటే ఇక ప్రాణాలు నిలవవన్నంతగా పరితపిస్తారు. ఈ ఉబలాటం బాగా ఉంది కాని, వారికి సొమ్మిచ్చి సొంతానికి పత్రిక కొనడం అంటేమాత్రం గిట్టదు ఎవడో ఒకకాపీకొనుక్కుంటే, వాడికి చూడడానికయినా అవకాశం ఇవ్వకుండా, ఈ మహానుభావులు మీదమీదపడి తమ ఉబలాటం తీర్చుకుంటారు ఇందులో ఎక్కువమంది పత్రిక కొనడానికిశక్తిఉన్నవాళ్లే కాని కేవలం దరిద్రులుకారు. ఇలా అయితే మనదేశంలో పత్రికలు ఎలాబతకడం?

దీనికి ఒక్కటేమందు: పత్రిక సొమ్మిచ్చికొన్నవాడు, రెండోమనిషికంటికి దాన్ని చూపెట్టకుండా ఉండాలి - శపథంచేసి. ఎవటివాళ్ల ఉబలాటాన్ని ఏ మాత్రమూ లెక్కపెట్టకూడదు. ఈ మాత్రం కఠినంగా ప్రవర్తిస్తే మన పత్రికలు బతకడానికి అవకాశం ఏ మాత్రమయినా కలగవచ్చు.

తర్వాత పత్రికాధిపతులుకూడ ఎవరికి పడితే వారికి గొప్పకోసం పత్రికలు ఊరికే ఇవ్వకూడదు. ఊరికే పుచ్చుకొన్న మహనీయులు మరీ పదిమందికి, తమ గొప్పకోసం దాన్ని అందచేస్తూ ఉంటారు. ఇది పత్రికలజీవిత'న్ని వేరంట కొరికేచీడ. ఈ విషయంలో ఎక్కువ జాగ్రత్తపడాలి పత్రికాధిపతులు, తమ పత్రికలు చావకుండా ఉండవలెనంటే

---

# గ్రంథస్వీకారము

---

## అపరాధి యెవరు?

(సాంఘిక నవల)

గ్రంథకర్త: కేతవరపు రామకృష్ణశాస్త్రి

డెమ్మీ ౧/౮ సైజు. ౧౦౬ పుటలు. వెల ౧౨ అణాలు.

ప్రకాశకులు: కుదుకూరి సుబ్బారావు, సరస్వతీ బుక్ డిపో, బెజవాడ.

---

లక్షణ సంగ్రహః

(సంస్కృతము) చిన్న సైజు; ౧౬౦ పుటలు, కాలికోబయిండు. వెల ౪ అణాలు.

ప్రకాశకురాలు: మనభరీదేవి, పుట్టీగ్రామం, భవానీఖేక్ పోస్టు, హిస్సార్ జిల్లా, పంజాబ్.

---

స్వగతం (కథల సంపుటి)

ఫూల్సుక్యాప్ ౧/౮ సైజు పు. ౯౨. వెల ౦-౪-౦.

గ్రంథకర్త: కొడవటిగంటి కుటుంబరావు, యువకార్యాలయము, తెనాలి.

---

స్వేచ్ఛాజీవులు (నాటిక)

క్రౌను ౧/౮ సైజు. పు. ౪౨.

గ్రంథకర్త: చాపరాల సత్యనారాయణరావు, రాజమండ్రి.

---

మధుకీల (ఖండకావ్య సంపుటి)

క్రౌను ౧/- సైజు. పు. ౧౧౧ + ౫. వెల రు. ౧.

రచయిత: మల్లవరపు విశ్వేశ్వరరావు.

ప్రకాశకుడు: కార్యదర్శి, నవ్యసాహిత్య పరిషత్తు, గుంటూరు.

---

ఆంధ్రేతిహాస పరిశోధక మండలి పత్రిక

(పదవ సంపుటము, నాలుగు భాగములు.)

శ్రీ జయంతి రామయ్యపంతులుగారి డెబ్బదియైదవ జన్మదినమహోత్సవ స్మారక సంపుటముగా ప్రకటింపబడినది.

పు. ౨౦ + ౨౩౨ + ౧౪.

ఆంధ్రేతిహాస పరిశోధకమండలి, రాజమండ్రి.

---

౧. నాటక మర్మము (నాటకవిమర్శన)

క్రౌను ౧/౮. సైజు పు. ౧౫౬. వెల రు. ౦-౮-౦

౨. తారుమారు (సాంఘిక నాటకము)

డెమి ౧/౮ సైజు. పు. ౧౧౬. వెల రు. ౦-౮-౬.

౩. శ్రీమహార్తుల టాకీ

డెమి ౧/౮ సైజు. పు. ౫౮.

ఈ మూడు గ్రంథములకు కర్త: పోరంకి వెంకట సుబ్బారావు, పోరుగంటివారి యిల్లు, రాజమండ్రి.

---

శ్రీకాంచీకామకోటి పీఠాధీశ జగద్గురు

౧౦౦౮ వ శంకర భగవత్పాద

శ్రీవిజయనగర విజయయాత్ర

రాయల్ ౧/౮ సైజు. పు. ౨౧ + ౪౨.

కర్త: ద్వారకా భమిడిపాటి వెంకట సుబ్రహ్మణ్యశాస్త్రి, విజయనగరం.

---

Printed and Published by K. Nageswara Rao,
at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St., Madras. Editor:—K. Nageswara Rao.

# విషయసూచిక



# చిత్రములు

త్రివర్ణ చిత్రము:—ఉపదేశము

సాధారణ చిత్రములు:—అజంతాచిత్రములు ; బెజవాడ ఆంధ్రమహాసభల చిత్రములు; ఇతర చిత్రములును.

---

# బహుధాన్య సంవత్సరాది సంచిక

మహాశయా !

బహుధాన్య సంవత్సరాది సంచికకు విన్నపమిదివరకే చేరియుండును. కాని వర్తమాన రాజకీయార్థికసాంఘికపారిశ్రామిక పరిస్థితుల నవలోకించునపుడు సంచిక ప్రచురణము క్రొత్తమార్గము నవలంబించుట ప్రయోజనకరముగ నున్నది.

ఆంధ్రత్వ మతిప్రాచీనము. హిందూస్థానమునందలి, ఇతరప్రాంతములందలి పరిస్థితుల వలె, ఆంధ్ర దేశ ప్రజాస్థితులు ప్రతిఘటనములకు పాలైనను, ఆంధ్రత్వము చైతన్యప్రదమై విలసిల్లుచున్నది. ప్రజాహృదయమునందు గాఢమైనప్రబోధ ముదయించినది. ఈప్రబోధమును సార్థకముచేయుట ప్రజానాయకులకు ధర్మము.

చెన్నరాష్ట్రమునందు స్వరాజ్యప్రభుత్వము ఏర్పడినది. ప్రజలయందు విద్యా,విజ్ఞానములు, సౌభాగ్యము మొదలగు వానిని వ్యాపింపఁజేయుటకు ప్రయత్నములు జరుగుచున్నవి. ఈ మహోదయ సమయమునందు ఆంధ్రులు వారి ప్రాచీన వర్తమానస్థితిగతులను కనుగొని భావి భాగ్యోదయమునకు పనిబూనుట పరమావసరము, పరమధర్మము. అందువలన బహుధాన్య సంవత్సరాది సంచికకు ఈక్రిందివిషయములలో తమకు పరిచితమైన విషయమునుగురించి వ్యాసమును వ్రాసిపంప ప్రార్థితులు.

**క్రింద నుదహరింపబడిన విషయములు సంచిక స్వరూప స్వభావమును సూచించుటకు మాత్రమె. తమ కభినివేశముగల విషయమునుగురించి వ్రాయవచ్చును. వ్యవధి తక్కువ. ప్రయత్నము సాహసికము. కావున త్వరలో శ్రమచేసి వ్యాసములను పంపప్రార్థితులు. వీలైనయెడల సచిత్ర వ్యాసములు పంప ప్రార్థితులు.**

1. ఆంధ్రచరిత్రములోని ముఖ్యఘట్టములు: (ఎ) అమరావతి, నాగార్జున స్తూపముల నాటి ఆంధ్రులు, (బి) శ్రీకృష్ణదేవరాయలనాటి ఆంధ్రులు. 2. ఆంధ్ర దేశ పరిశ్రమలు: (ఎ) వ్యవసాయ పరిశ్రమ, (బి) నేతపరిశ్రమ, (సి) గృహపరిశ్రమలు, (డి) వర్తకవాణిజ్యములు, 3. ఆంధ్రకళ: (ఎ) చిత్రకళ, (బి) శిల్పము, (సి) గానము. (డి) ప్రాచీన నాట్యకళ. 4. ఆంధ్ర సాహిత్యాభ్యుదయమునందలి ముఖ్యఘట్టములు. 5. ఆంధ్రుల మతసాంఘికవ్యవస్థలు, గ్రామకట్టుబాట్లు, కులకట్టుబాట్లు. 6. ఆంధ్రోద్యమము. 7. సత్యాగ్రహము, గాంధి. 8. ఆంధ్రరాష్ట్రనిర్మాణావశ్యకత. 9. బ్రిటిషుపరిపాలనమున ఆంధ్ర దేశము. 10. ఆధునికాంధ్ర జాతి నిర్మాతలు. 11. ప్రత్యేకాంధ్రసంస్థలు. 12. ఫెడరేషను-ఆంధ్రరాష్ట్రము. 13. ఫెడరలు ఫైనాన్సు. 14. ఫెడరలు, యూనిటరీప్రభుత్వములు; భారత దేశమునకు తగినదేది ?

కా. నాగేశ్వరరావు



సంపు ౧౪ ఈశ్వర, కార్తికమాసము ( నవంబరు 1937 ) సంఖ్య ౧౧

ప్రబంధనాయికలు౧ :-

# గిరిక

పుట్టపర్తి నారాయణాచార్యులు

అల్లసానివారి యల్లిక లాంధ్రభోజునిచే నందలముఁబట్టించుకొనునాఁటికి రామరాజభూషణుఁ డొక కొంటెవిద్యార్థి. కవితాపితామహుఁడుతూఁగుటుయ్యెలపైఁగూర్చుండి, యలవోక నూఁగుచు రాయల నధిక్షేపించుటయు, కొలువుకూటమున "చతుర్వేశ్యాభుజంగుఁడు" తాతగారికి స్వయముగా గండపెండెరముఁ దొడుఁగుటయు నంతకుముందే గడచినగాథలు. మూర్తికవికిఁ జిననాఁడే యీ కథలు చెవులకెక్కియుండును. పాండిత్యము పచ్చిపొగరుతో నప్పుడే పితామహుని 'శిరీషకుసుమపేశల సుధామయోక్తుల'తో నున్న వరూథినినిఁ గాంచి నాలుగు లొట్టలు వైచియుండును. తాను పెద్దవాఁడై గ్రంథములు వ్రాయునాఁడు పూలగుత్తులఁ బోలు కవితల విరియించి సాహితీసేవకు లగు విజయనగర రాజులను- పల్లకీబోయలుగాఁ గాదు- పంచకాపరులఁగా నేలఁదలఁచినాఁడు. కాలము

జఱ్రున౯ దిరిగినది. మూర్తికవియుఁ బెద్దవాఁడైనాఁడు. సంపూర్ణముగ విద్దెల నేర్చికొన్నాఁడు. ఆలంకారిక రాద్ధాంతముల మననఁ గావించినాఁడు. వ్యాకరణసూత్రముల నెముకలపుగ వల్లించినాఁడు. శ్రుతిస్మృతులు శోధించినాఁడు. మూర్తికవి వీథులఁ బోవుచున్నపుడు వేదముల వల్లించు ఛాందసులు వెఱపున నాపుచుండిరఁట. సాహిత్యమునకుఁ దోడు సంగీతమునుఁ గడముట్ట శోధించి సరస్వతీదేవి రెండుచన్నులపాలు మనసారఁ గ్రోలి రుచిభేదము లేర్పరచుకొన్నాఁడు. సర్వవిధముల గడుసరి మనకవి.

ఆకాలమునఁ బండితులకును, కవులకును నంతగా భేదము పాటించువా రరుదు. చాల వరకుఁ బండితుఁడే కవి యను నియమమును నానాఁడు లేకపోలేదు. ఇప్పటివలె శ్లోకము నర్థముఁ జేసికొని యానందించుటతో నప్పటి సాహిత్యము ముగియుచుండలేదు. దానిపైఁ బండితులు ద్రవ్విమెత్తు శాస్త్రీయ పూర్వపక్షములకు సమాధాన మీయవలసి యుండెను. ఆలంకారికవివాదములఁ బరిష్కరించి వారికడుపు నింపవలెను. శాస్త్రీయబలములేని దాకాలమునఁ బేరువెలయించుట దుర్ఘటము.

అప్పటికవులలో శాస్త్రశూన్యు లెవ్వరుఁ గానరారు. రామలింగని పాండురంగమాహాత్మ్యమున ముఖ్యముగాఁ దర్కపటిమ, యల్లసానివారిలో సకలశాస్త్రమర్యాదలు పొడఁగట్టుచునే యున్నవి. కడకు కేవల తత్త్వోపాసియగు సూరనార్యునకును నావేళ నాలుగు మీమాంసాన్యాయములు నెదచల్లనిది కూడు పుట్టెనది గాదు. అసలు రాజులను నెలసులు గారు. రాయలే రచించిన యాముక్తమాల్యదయే యతని వివిధశాస్త్రపారంగతత్వమును దెలుపుచున్నది. తిరుమలరాయని గీతగోవింద వ్యాఖ్య జగద్విదితము. ఆతఁడే రచించిన శాకుంతలవ్యాఖ్యయు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమున నెందో మూల్గుచున్నదఁట.

ఇఁక మనకవి గ్రంథసరియే కాక మాటపసయును గలవాఁడు. తాను జదివినశాస్త్రములపై సంపూర్ణాభిమానముగల ప్రోఁడ. అందులకే, పాపము, తాను సృష్టించిన పరమాణుమధ్యకును (౩-౩౪-౮) పటుశాస్త్ర శ్రేణికాభ్యాసము (౩-౧౦౯) దక్కినదిగాదు. పలుమారు "నానాకళాపారీణుఁ"డగు "శ్రీరామక్షితిపు"ని మెప్పించి "రత్నహారహయవేదండాగ్రహారాదులు" మరియాద లందినవాఁడు. ఎటుల మెప్పించుటని శాస్త్రములే "సాహిత్యపోషణుం" డనియు, "సంగీతకళారహస్యనిధి" యనియు తప్పెటవేసి మెరమణి దిరిగినాఁడు గదా!

భూషణుఁడు సాహిత్యమును, శాస్త్రమునుఁ జేతఁ బట్టుకొని సవ్యసాచియై సభలలో హుంకరించుచున్నను చిననాఁటిగాథలు మరువలేదు. బిరుసుమీసముల యౌవనములో,మాటఁదీర్చుకొని తాతను రమ్మని సవాలు చేసినాఁడు. సర్వవిధములఁ దనది పై చేయి యని మురిసిపోయినాఁడు. కాని, పాపము, అందలముఁ బట్టించుకొను భాగ్యము మాత్రము నోచుకోలేదు. కారణ మేమి? కలదు. నిశ్చయముగాఁ గలదు.

మను వసు చరిత్రలలోని వస్తువు సమానమే. చూడగాఁ వస్తువున కాదర్శముగాఁ

దాతగారినే యుంచుకొన్నట్లున్నది. అక్కడి కోన, యక్కడిచానయే యిందును గోచరించు చున్నవి. ఇరువురునుఁ బెనుగొండఁ జూచినవారే గనుక వారిరువురి కవిత్వమందును "జటిల ద్రాక్షాగుళుచ్ఛము"లే తనివిదీర తనుపారి యల్లుకొన్నవి. ఇంకను భూషణుని పలుకులలో "దాడిమీ బీజసంతతియు" విరిసి తళతళ మన్నది. వస్తువున కింకను మెఱుఁగులు వేయఁబోయి చదికిలఁ బడినాఁడు. ప్రాణము పెద్దన్నది; భూషణములు సాహిత్యపోషణునివి; చిత్ర మలసాని వారిది; రంగులు దిద్దు బాధ్యత మాత్రమే యీతనిది. భట్టుమూర్తియే సహృదయుఁడై "కేవలకల్పనాకథలు కృత్రిమరత్నము" లని తన కంసాలితనము నొప్పుకొన్నాఁడు పాపము!

భూషణకవి చదికిలఁ బడుటలో నొక కారణ మున్నది. అతఁడు నేయఁబూనినది యసాధారణ మగు కుస్తీలపట్టు. కావ్య మంతయు శ్లేషమయము గావించు నూహతో, అయ్యో, సుకుమారి గిరికను రాతిరప్పలకుఁ బుట్టఁజేయు పాపమున కొర్చినాఁడు. కాకున్న, కవులు సంపూర్తిగ స్వాతంత్ర్యము వహించు నాకాలమున నితివృత్త మేరీతి మార్చియున్నను "యిదేమని" ప్రశ్నించియుండరు గదా! పాశ్చాత్యకవి "యొథెల్లో" నాటకమున పరమ పవిత్రయు, సుకుమారియు నగు డెస్‌డిమోనాను క్రూరకిరాతుని కంటఁగట్టి విపరీతసృష్టి గావించి పాఠకుల మనస్సుల నొంపఁ బ్రయత్నించినట్లు భట్టుమూర్తియు నొకక్రొత్తపోకడఁ బోయి "ఛే" యనిపించుకొనఁ దలఁచెను.

మనుచరిత్రమునఁ దొలుత ప్రవర వృత్తాంత మున్నది. విప్రుని నైష్ఠికత - కూకటులుగొలిచి చేసిన కూరిమి సోమిదమ్మ చెలిమి పెంపు- బ్రాహ్మణుని తీర్థయాత్రోత్సుకత-సిద్ధాగమనము- హిమగిరిప్రయాణముతో ప్రథమాంకము ముగియుచున్నది. వసుచరిత్రమునయందును తొలుతనధిష్ఠానపురవర్ణనతోఁ బ్రారంభించి వనవిహారముతో ముగించినాఁడు. రెంటియందును ద్వితీయాశ్వాసము ననే నాయిక లరుదెంచుట. పెద్దన్న "మగువ పొలుపు దెలుపు మారుతము"తో సూచనఁ బ్రారంభించఁగా, మూర్తి "మాధురీధుర్యమగు" కలస్వనముతోఁ దెర మెత్తినాఁడు. వరూథినీగృహము చెంగలువలతోను, కేదారములతోను, మావులతోను, క్రోవులతోను నుండఁగాఁ జూచి మోముఁ జిట్లించి, రత్నకోరకములను, లవలీలతలను బెంచి ధన్యుఁడనైతి ననుకొన్నాఁడు. ఈ సన్నివేశమున వర్ణనమే కాక వృత్తములును సమజాతిలో నుండుట సాదృశ్యమునకుఁ జాల చేరువ.

కాఁగా-గిరికను సమీపించుసరికి దృష్టి మారినది. వరూథిని బేల; చమత్కారముగ మాటలాడఁగలదు. వింతతర్కములకు దిగి నెగ్గించుకొను ధీర గాదు. మనసు లేత. మమత గొప్పది. చిననాఁటినుండి సౌందర్యమునకు, సహృదయతకుఁ బేరుగన్న యచ్చరలచిన్నది యగుట "నొంటిపాటునఁ దంగేటి జున్నుకైవడిఁ" గంటఁబడిన విప్రునిఁ జూచి వలచి తనహృదయ మిచ్చినది. పలురీతులఁ దనకుఁ దెలిసిన సత్యమును, జిలుకపలుకుల వలె, నొయ్యారముగాఁ జెప్పినది. స్వర్గమున నినుపకచ్చడాలు క్రేలాడ, నచ్చరలవెంటఁ

బోవు తరుణతాపసులఁ జూచి నవ్వుకొన్నది గదా! విప్రుఁడో నైష్ఠికుఁడు. తనధర్మము, తనత్యాగమే తప్ప మరేదియు నెఱుఁగఁడు. ఛాందసుఁడుగాఁడు. దీక్షితుఁడు. ఇం దెవరిని నిందింపఁగాదు. వరూథిని యెట్లు కళాస్వరూపముగ మనకు గోచరించుచున్నదో విప్రుఁడు నదేరీతి శాస్త్రమువలె గంభీరుఁడై పొడసూపును. అందులోనిసౌందర్య మిందులో రాదు. ఇందలిగభీరత యందులో లేదు. రెండును విభిన్నములగు, సముచితములగు త్రోవలు. పెద్దన్నకును రెంటను బక్షపాతము గలదు. ఆ మహామహుఁ డొసఁగిన యర్థాంతరన్యాసమే యాతని మధ్యవర్తిత్వమును జాటుచున్నది. "కలంచునే సతులమాయల్ ధీరచిత్తమ్ములన్" అని సునాయాసముగ వరూథినివైపువంగు మన హృదయముల కెచ్చరిక నిచ్చినాఁడు. వరూథినియు నపవిత్ర గాదు. ఆమెయు సతియే. విప్రుఁడును హేతువాదములకు దిగునప్పటికి మొగము వంచి యేడ్చినది వరూథిని. దయాభిక్ష యాచించినది. బలవంతమున మీఁదఁ బడ్డది. నిరాదరణకుఁ బ్రతికృతిగాఁ గంటఁ దడిపెట్టినది. హృదయ మిచ్చినది. నడ్డితో గ్రహించలేకపోయినది. ప్రౌఢిఁ బలికింపఁ గలదు. తన యాలాపమునకు తానే సాక్షి. తన్మయహృదయ. ఇంపు దళుకొత్త వాయించును. సారించిననాదము సరియా కాదా యనున దామెపని గాదు. కేవల రసోపాసిని, యభాగ్యజీవిని!

గిరిక యట్టిముగ్ధ గాదు, విదగ్ధ. చమత్కారముగ మాటలాడుటయే కాదు. చెప్పినది యొప్పించఁగలదు. పైపైని తేలఁబలుకదు. గంభీరముగ హృదయమున నాన్చి తల జిర్రదిరుగఁ జేయును. గడుసరి నేఁతకుఁ బ్రతినేఁత సేయుటయే కాక మెఱుఁగునెట్టి నల్లిఁ గావించు ప్రోడ. రతిసమయమున వసురాజుతోఁ దాను నేర్చిన సాహిత్యవిద్యను ధ్వనివ్యక్తితోఁ బ్రత్యుపదేశ మిచ్చినదఁట (౬-౯౮) చిననాటినుండియు వసురాజు కీర్తిని విని, తనతల్లి కాతఁడు సేసిన యుపకారము మూలమున నుదాత్తగుణములఁ దలంచి, భావించి, ధ్యానించినది. అతనిఁ బెండ్లాడు నాసను బెంచికొని ప్రోదిఁజేసినది. కాని తొందరగా మనసును లయింపఁజేయు నవశ గాదు. కాలమునకై వేచియున్నది. సర్వవిధముల చమత్కారిణి గిరిక.

నాయిక మనుచరిత్రలోవలెనే వీణె వాయించుచు హాయిగఁ గూర్చున్నది. జిలిబిలిపాట గాదుసుమా, శాస్త్రమునకు గుండె నిమిరి సీరుఁదట్టినది. 'ఘనవిద్యామహిమ ల్గరామలకము ల్గావించుకొన్నది' గదా మరి. ఆ రోజున మూర్తి యీరీతి వర్ణించెను.

"వలుదగుబ్బలు ప్రసేవకవృత్తి దగుగుబ్బ
కాయల కపరంజిచాయ లొసఁగ,
లలితాంగుళీదళంబులు సమేళము లైన
సారెలపై రాగసంపద లిడ,
పాణికంకణరుతుల్ ప్రాణానుబంధమ్ము
గలతాళగతి కనుగ్రహములీన,
నాలాపభంగి యవ్యక్తసంవాది స
మస్వరంబులకు గ్రామంబు లునుప
ప్రచురతానామృతముల మూర్ఛనలచే న
చేతనంబులు చేతనరీతిఁ దనర
చేతనంబు లచేతనభాతి నొనర
వీణె వాయించు నొక యలివేణిఁ గంటి."

రామరాజ భూషణుని సాధారణశైలి యిదియే యనవచ్చును. శ్రీనాథుఁడు నన్నయనుండి నేర్చిన విశుద్ధ ధారతో నాట్యము లాడెను. రామరాజ భూషణుఁడా శ్రీనాథుని ధారాశుద్ధికే సంగీతమును జోడించి నృత్తములు త్రొక్కించెను. మనుచరిత్రలోని పద్యమునువలె నిందు పాఠకుని మదిని లోఁగొను బాహ్యస్వరూప మేమియు గోచరింపదు. అభ్యంతరమగు చంచల మనఃప్రవృత్తిని స్ఫుటీకరించు నలవాటు వీ రెవరికిని తిక్కనవలె నబ్బలేదనుట పరమ సత్యము. అల్లసానివారిలో బాహ్యస్వరూపముచే నాంతరికమనోవృత్తి నూహించుకొనవైనను వీలుగలదు. ఓనియుం దా యవకాశమును గానము. సమగ్రముగ బాహ్యస్వరూపమును గాని చిత్రించు ప్రతిభయు మనలోఁ జాలమందికిఁ దక్కువ. ఉపమానములు పరస్పరసంబంధము లేనివి, యొకటికొకటి పొసఁగనివి వాడుట, స్వభావమునకు దూరముగఁ జిత్రించుట మనకవుల ఛాందసమునకుఁ జేరిన పొరపాటులు. ధ్వనికారుఁడు "అపారేఽస్మిన్ కావ్యసంసారే కాళిదాసప్రభృతయో ద్విత్రాః పంచసావా మహాకవయో భవంతి" అన్న మాటకు సరిగా నెవరో కొంతమందియే యీ యరిష్టములకుఁ దొలఁగినిలిచిరి.

కాన మనకు చాలమంది కవులు వర్ణించిన దానిలో సంపూర్ణత యున్నదా యనుప్రశ్న కవకాశము లేక వర్ణించినవి హృద్యములా యని యడుగునంతటి యధికారమే మిగిలినది. కారణములు కొల్లలు.

పై రామరాజభూషణుని పద్యమున శాస్త్రప్రధానత కళకన్న ముందు త్రోసి కొనివచ్చినది. విసంవాది సంవాది స్వరములు మూర్ఛనలు గ్రామములు మొదలగున వన్నియు సంగీత శాస్త్రవీథులలోని సరకులే. కేవల సహృదయులకుఁ బనికివచ్చిన దిందొకటియే. "చేతనము లచేతనముల రీతి నుండుట, అచేతనములు చేతనరీతి నవుట." అదియును జాల లాస్యమాటమై మనస్సు నాఘూర్ణిత మొనర్చుచున్నది. మనసారఁ దల్లి పెట్టు భోజనమువలెఁ గాకఁ గోపముగొన్న పెంకిపెండ్లాము విసరిన వడ్డింపువలె మనస్సునకు క్లేశదనముఁ గొలుపుచున్నది. కవితా వాక్చమత్కృతి ముందు నిలచినది.

పాపము! చిన్ననాఁటినుండియు మణులు వెచ్చించి నేర్చిన విద్దె గదా! యింతమాత్రము సేయలేదా! యని సరిపెట్టఁకొందమన్నను నడుమఁ బఠించిన నిఘంటువు మనల నా ప్రపంచము నుండియే తప్పించుచున్నది. వసురా జానందబ్రహ్మము నెట్లనుభవించెనో గాని పాఠకులకు మాత్రము విసుఁగుదప్ప మరేదియుఁ గలుగదు. సంగీతకళా రహస్యనిధిత్వములో శాశ్వతానందము వలసఁబోయినది.

అసలు వరూథినికిని గిరికకును నమోభేదము చాలఁగలదు. వరూథిని గిరికకన్నను నైదాతేండ్లు చిన్నది గావచ్చును. లేనడుము, మీటిన విచ్చు గుబ్బచనుమిట్టలు, అల్లలనాడు తుఱుము, సెలవివార వెడలు నవ్వులు, అతీవమనోహారిణి. అపుడపుడ శృంగార ప్రపంచమున నడుగిడిన క్రొంగ్రొత్తకన్నె. అందుల కనుగుణమగు చాపల్యము, త్రోసికొనివచ్చు లజ్జ, సౌందర్య పక్షపాతము,

ముందువెనుక లరయలేని ముగ్ధత, వికలత్వ, లేఁతమనసు మెఱపులవలె మెలసిపోవు చున్నవి. సర్వవిధముల మానవకాంత వరూథిని.

ఇఁక గిరికయన్ననో, యామె సమంజస రూపమును మనకుఁ బట్టియీయలేదు; కవి ప్రపంచప్రసిద్ధములగు నుపమానములన్నియుఁ గుప్పించినాఁడు. స్తనములు కుంభములై, పూర్ణకలశములై, గుండులై, బండలై; కడకుఁ గొండలైనవి. జఘన మచలాభోగత నలవరించుకొన్నది. హస్తములు తామర తూండ్లు. మధ్యము పరమాణువు. ఒక నియత స్వరూపము లేదు. పద్య పద్యమున కామరూపిణి వలె గిరిక మారుచున్నది. కవి వర్ణించినరీతి బొమ్మను గీచినచో, పేరు గన్న పెద్దమ్మగాఁ దయారగునే కాని కడకు స్త్రీరూపమైనను మనము చూడలేము. ప్రబంధ కవులకుఁ బట్టిన ఛాందస మితనికిఁ బూర్తిగాఁ బట్టినది. కనుక బాహ్యస్వరూపమునుబట్టి నిర్ణయించుటకన్న నాంతరిక మనఃపరిపాక మునుబట్టి సమన్వయించుట న్యాయమగును.

గిరిక కన్నెముగుద గాదు. సిగ్గును ద్రోసి కొని-యభిలాషముందుఁబడి పండి ఫలించినది. వసురాజుకన్న తానే ముందయి 'నవలాలిత దృష్టిజాలముల' బరపినది. హృదయమును విప్పిచూపినది. ఆమెచేఁతలలో ప్రౌఢత యున్నది. మాటలలో గభీరతరమగుధ్వని యున్నది. తలపును బట్టియిచ్చు యొయ్యా రమున నెఱజాణతనమున్నది. వరూథినిలోని యీషత్ఫుల్లమగు నగ్నసౌందర్యము గిరికా దేవియందు చివురుతో తుమ్మెదలతో సర్వాంగీణశోభితముగ నున్నది. వరూథిని జగమును మించు సౌందర్యము సంగములలో వడబోసి కొన్నను నమ్మకము లేక యూఁగుచున్నది. గిరిక కంతటి మహోన్నతసౌందర్యము లేకు న్నను ముందుఁబడి ప్రపంచముతో ఢీకొను చున్నది. సర్వవిధముల తను బారిన ప్రౌఢ గిరిక, నిగనిగలాడు యౌవనము పూర్తిగాఁ బండినది. వరూథిని కల్లనల్ల 'ఇంపు దళుకొత్త' వ్యాపించుచున్నది.

వసురాజుతలఁపును గిరికహృదయమును గన్న మంజువాణి, కుంటెనగత్తె, పాటను చల్లగాఁ బ్రారంభించినది. వసుచరిత్రకా రుఁడు ముఖ్యముగాఁ జెఱచినపాత్రములలో మంజువాణి యొకతె. లజ్జాభిమానములు గాని, మరి యే స్త్రీగుణములుగాని లేని శుష్కప్రతిమగా ముందు నిలిపినాఁడు. మాయామునితోడి సంభాషణము కేవలము నింద్యముగా నున్నది. మరియాద గల మగువ భాషించు తీరు లేదు. ఇట గిరికవర్తనమును సముచితమని వచించుధైర్యము మాకు లేదు. ముగ్ధయైనను ప్రౌఢయైనను, దేవకాంతయై నను మనుష్యకాంతయైనను సిగ్గు స్త్రీలకు పరమపవిత్రమైన వస్తువు. దశాభేదములచే తత్పరిమాణమున భేద ముండవచ్చును. మంజువాణి మునుకొని పురుషునెదుట కోలాహలుని వలపును విస్తరించి యుపన్యసించునపుడు హాయిగాఁ గూర్చొని వినుచుండుట యేటిపాడి? అట్టివారు ప్రపంచమున నుండ వచ్చును. వారు కులశీల సమన్విత లనియు, ఉత్తమనాయిక లనియుఁ జెప్పఁజాలము. విశ్వామిత్రుని యపూర్వ సృష్టిలోనివారే. మన గ్రంథములు స్వభావతను గాదు చిత్రించునది,

దానియందున్న యుత్తమత్వము (Perfection) ను.

మంజువాణి చతుర్థాశ్వాసమున రాజును దర్శించినపుడు గావించిన హాస్యమున చమత్కృతి గలదుగాని సందర్భశుద్ధియు, నైక్యతయు లేదు. ఆమాటఁ బలికించుటకై కథ యొక్క యనుగతత్వమునకు విఱుపు దేఁబడినది.

శాకుంతలనాటకమున నున్న యనసూయ నాదర్శముగాఁ గొని మంజువాణి కింకను మెఱుఁగు దిద్దఁబోయినాఁడు. కాని కడకు మంజువాణి క్రోతిపిల్లగాఁ దయారైనది. శాకుంతలమున ననసూయ శకుంతలా జన్మ వృత్తాంతమును వివరించి చెప్పుచు మేనకావిశ్వామిత్రుల కలయికను దెలుపఁబోయి పొరఁబడినదానివలె సర్ధోక్తిలో నాలుకఁ గొఱికి నిలిపివేయును. ఉచితజ్ఞుఁ డగు దుష్యంతుఁడును "పరస్తా దవగమ్యత ఏవ" అని యనసూయామతల్లి శీలమునకు మాగధునితనముఁ గావించుచున్నాఁడు. మనమంజువాణియో అట్టి యవకాశము నీయలేదు. మాయామునిఁ దీసికొనుటకు సిద్ధముగ నుండలేదు. తూ-చా-తప్పక పూసగ్రుచ్చినట్లు యాదిమొదలుకొని యంతమువరకు చక్కఁగా విస్తరించి చెప్పుచున్నది. ఆ వర్ణించుఘట్టమును జూడుఁడు.

"అలముకొని చెంగల్వతావులు సెదర వేణిఁ దెమలించుచు, మకరికలు మలయ గండపాళి నొక్కుచు మధురామృతంబులు వడియం బలుదెరసొబఁగు లానుచు, మూర్తికంబులు జడియం బయోధరంబులు బట్టుచు విశదాంశుకాంతస్థితి దొరఁగ నతివిపులపులిన జఘనారోహంబుల నుత్పలపత్రంబులు నెఱపుచు."

తనివిలేక పోరాడినాఁడఁట. ఇందులో నడుము, జఘనములు, పయోధరములు కొల్లలు. ఇది యేటియౌచిత్యము? మునుల సన్నిధి నీరీతిఁ బలుకుటయు, వారును చెవులు దెరచి వినుటయు నసభ్యతగాదా! రామరాజ భూషణుఁడు తన శ్లేషపాండిత్యము వెల్లివిరియించు వీరావేశమున నౌచిత్యము నేమాత్రమైనను గ్రహించెనా? రసపరిపక్వ బుద్ధుల కేల, సామాన్యులకైనను మనసు విసిగించునది గాదా యీ ఘట్టము! చూడఁగా మంజువాణి పాత్ర కావ్యమునకు పుండు. భట్టుమూర్తి దృష్టిబొమ్మగాఁ దయారుచేసినాఁడేమో యని పించును.

ఇంతలో విఱచినాఁడు ఘట్టమును. ఈ దృశ్యకావ్యనియమము నిం దతిక్రమించుట బాగుగనే యున్నది. భూషణకవి సాహిత్యపారంగతుఁ డగుటచే నిట్టి యద్భుతముల నేర్చెను. కాని ఫలముమాత్రము కవి యనుకొన్నంత రాలేదు. మహాకవి శాకుంతలమున రెండు చోట్ల నిట్టి ఘట్టమును దెచ్చెను. మొదటిది వనగజ వృత్తాంతము. దుష్యంతుఁడు వేటకై వచ్చియుండుటయు, సైనికులు మృగములఁ దరుముచుండుటయు, నవి భయమునఁ జెలరేగుటయు కవి యింతకు మునుపే యక్కడక్కడ నలతిముక్కలలోఁ జెప్పియుండుటచే నీ వృత్తాంతము సర్వవిధములఁ గారణములచే బలిష్ఠమైయున్నది. రెండవది, మూఁడవ యంకములోని గౌతమీప్రవేశము. అందులకు

రెండవయంకములోను, మూఁడవదాని ప్రస్తావనలోను మహాకవి కారణములు నిర్వచించినాఁడు. మన వసుచరిత్రలోని కలహంసిక యొక్క ప్రవేశమున కట్టి సందర్భశుద్ధి లేదు. చూడుఁడు:

"ఆ కలహంసి వచ్చి యచ
 లాత్మజఁ గాంచి కుమారి తాపసా
నీకము నీ కమూల్యశుభ
 నిర్వహణంబు ఘటిల్లఁ గల్పకా
నోకహసూనరాజము ల
 నూన మనార్తులతో నొసంగినం
గైకొని తల్లి నిన్నిలువ
 గాఁ బనిచెన్ విరులిచ్చు వేడుకన్."
 (3-౭౨౭)

మును లెందు కరుదెంచిరి? అరుగుఁదెంచినవారు కోలాహలునిఁ జూడలే దేల? పూవుల దినము నిచ్చుట వాడుకయా? ఇంతకు మును పిచ్చిరా? మొదలగు ప్రశ్నలుదయించును. వాటికి సమాధానములు:— రాఁగూడదా, ఇవ్వఁగూడదా యను సంభావనలు దప్ప వేరు కారణములు గానరావు. ఈ ఘట్టములలోనే కొన్ని మహాకవియడుగులలో నడచినఘట్టములు గలవు కాని, అవి యన్నియు నిర్వాపితదీపములు.

వసురాజు వెడలినవెంటనే కనుకలితన మారంభమైనది గిరికకు. వరుసగా మన్మథుఁడు దేశికుఁడై బోధింప మొదలిడినాఁడు. తొలుతఁ దదధీనమానసఁ గావించి తరువాతఁ బ్రారంభించినాఁ డొజ్జలతనమునకు. ఆ శిక్షాప్రకారము ను కవి యీ రీతిఁ జెప్పినాఁడు:

"లలనారత్నము నొయ్యనొయ్య బోటవ్రేలన్ నేల వ్రాయించి ని, శ్చలవృత్తిన్ వరవర్ణపూర్ణఫలికాసంగంబు నొందించి మి, న్కులు వేమారు తదర్థచింతనలతో నూల్కొల్పి నెయ్యంపుటొ, జ్జలు పైపై వెలయింపసాగె పటుశాస్త్రశ్రేణికాభ్యాసముల్."

ఇది యొక యపూర్వమగు పద్యము. మూఁడువిధములగు సాధనల మూర్తికవి వివరించినాఁడు. మొదట లజ్జావశమున నలసప్రవృత్తిని, రెండవదాన నాభ్యంతర మానసికోద్బోధమునకు హేతువగు బాహ్యేంద్రియ వ్యాపారమును, మూఁడవచరణమున లాఘవాభ్యాసవశమున గ్రమముగా మనోలయాభిముఖ్యత్వమును దెలుపుచున్నాఁడు. ఇందలి "నెయ్యంపుటొజ్జలు" అనునది ధ్వని కమృతకలశమువంటిది. ఈపద్యమున నాతని పాండిత్యిని, శ్లేషపటిమను మఱచిపోయి, సందర్భశుద్ధితో, క్రమమువీడక సాధనల నతికించిన ప్రతిభకు 'భలే' యననిరసికుఁ డుండునా?

ఇటనుండి తిన్నగా సంచారిభావముల వైపు, తటస్థము లగు మలయానిలాదులవైపు దారిఁ జూపినాఁడు. మేధశ్శాలి యగు నీకవి యిందునను నొకపద్ధతిని, క్రమమును బాటించెనే కాని కళ్లములోని జొన్నలవలె కుప్పఁ బోయలేదు. తొలుతఁ దమ్ములని పద్మముల మాటునఁ జేరినది గిరిక. అవి మున్మున్న మేచసాగినవి. అటనుండి వరుసగా నందరు పగవారైరి. నిరంతరమువసుధ్యానమున నే మునిగి, చెలులతోఁ బలుకక, శుష్కించి యేడ్చియేడ్చి

సన్నగిల్లినది గిరిక. ఆమెచనుగట్టుపై జారి క్రిందఁబడిన కన్నీరు శుక్తిమతివలెఁ బాఱెనట (౩-౧౦౪). అసహాయ — యగు గిరికయా కాదు — అనుకొనుచున్న గిరిక యేకాంతమున నెన్నియో దినములు తపించినది. ఆ యాలోచనములకు దివారాత్రములు గనఁబడలేదు.

ఏమాలోచించినది గిరిక? కన్నీరుమున్నీరుగా నెందులకు విలపించినది ? కారణము చాలచిన్నది. వసురాజును బొందుట, ఈసమయమున నవకాశమును దొరకించుకొని నూరు పద్యములవరకు వాడినాఁడు మూర్తి. అంతయు విరహవర్ణన. వర్ణనాపద్ధతి బాగుగా నున్నది. అలంకారశాస్త్రమున వడిదిరిగిన బుద్ధి యగుటచే విభావాదులను క్రమముగా స్థాయికి నేరీతి నీడ్చుకొని పోవలెనో, భావమననలో క్రమక్రమముగాఁ బైపైని గలుగు వివిధానుభవము లేవియో సూటితప్పక వివరించినాఁడని చెప్పవచ్చును. ప్రతి యొకదానియందును శ్లేష. తనంతఁ బ్రతియొక్కటియు రమణీయమే. అందునను భూషణకవికి శబ్దాలంకారములపైఁ గొంత చాపల్యమగుటచే తానములతో తందనాలు ద్రొక్కించినాఁడు వృత్తములలో. కాని యెన్నియున్నను జీవితమగునౌచిత్య మేదీ ! గిరిక కేమి యంతపెద్ద ముప్పు ? ప్రాణముదీసికొనునంతటి దుఃఖమేమి ? వసురాజుపరిణయమున కడ్డుజెప్పినదెవరు ? వసురాజుచేఁ దిరస్కృతయా ? తన చెలియును, చమత్కారిణియును నగు మంజువాణి కేల మెఱిఁగింపలేదు ? ప్రౌఢనాయిక గాదా గిరిక ? ఈచిన్నియుపాయ మామెకుఁ దట్టలేదా ? పోనీ; యేడ్చి తా నేమి సాధించినట్లు ? వరూథిని బేల ! ఆమె విలపించుటలో నర్థమున్నది. గిరిక యట్టిదిగాదుగదా? ఆహా! కవిబ్రహ్మ సైరంధ్రీ పాత్రపోషణములోని యొకముక్కతో నివన్నియు సరిపోలఁజాలవు గదా! పురాణకాలమున దాల్చిన దుస్తులతోనే యెంతశోభనించినది తిక్కనవాణి. అల్లసానివరూథిని "అల్లనల్ల" నేడ్వఁగా మాయింటియావిడ యేడ్పులో పాండిత్యము గుమ్మరించినదని మూర్తి మురియవచ్చునుగాని యాజీవి యొక్కసారియైనను తీవ్రముగ జనమనఃపుస్తకముల విప్పి చదువలేదని చాటిచెప్ప నని యూహింపలేదు గావచ్చును. మంజువాణిని తానే పంపియున్న గిరిక బుద్ధిమంతురాలే యగును. అది స్త్రీసహజము గాదందురేమో? అనుభవైకవేద్యము లగు రహస్యములలో నిదియొకటి. ఔచిత్యానౌచిత్యములు స్థలమును, వ్యక్తిని బట్టి మారుచుండును. సాధారణముగా విలాసమన్న మాత్రముననే యొకవిముఖత అసహ్యము మన కలవాటైనది. అది మనమే యడిగితెచ్చిన వరము. మనమనోరథము లల్పములు. మన ప్రవృత్తినివృత్తులల్పము లగుటయే యందులకుఁ గారణము. అది మానవస్వభావ మనియు, దేహధర్మమనియు, దాంపత్యము తజ్జనిత సౌఖ్యములు కళంకములనియు వ్యాఖ్యానము గావించునాఁడు దానికై యంతగా భయపడ నవసరము లేదు. అయిన నందరు వరుసగా స్వైరిణులు గావలసినదేనా యందురేమో! అది గాదు నా యభిప్రాయము. అందులకే తొలుతనే కాలదేశపాత్రములబట్టి యౌచిత్యము మారుచుండు నంటిని.

అందుకే మహాకవి విక్రమోర్వశీయమున మేనకచేతనే వలపు నెఱిఁగింపఁజేసెను. అతనికిఁ దెలియదా ? కాళిదాసుమనోగతాభిప్రాయ మిదియకాఁబోలు ! అచ్చరలు సురతమును కళగా సాధించినవారు. పేరెన్నికగన్న జాణలు కంటికింపగువానిఁ గామించి తన వైదగ్ధ్యము ప్రకటింపఁదలఁచినది. ఒకవేళ మేనక మిన్నకున్నను దానిచే నా ప్రౌఢకుఁ గలుగు గౌరవమును లేదు. దీనిచేఁ దీసినదియు లేదు. ఆయాదశయందు జాతియందు తత్తద్వికారములు చెప్పకయేవచ్చుచుండును.

అతఁడే శాకుంతలమున, భారతమున శకుంతలయే మొదట మనోరథ మెఱిఁగించునట్లు చెప్పియున్నను, రూపకమున మార్చివైచెను. ఎందులకు ? శకుంతలను ముగ్ధగాఁ జిత్రింపఁ దలఁచినాఁడు. అందులకుఁ దగిన క్రమము ననుసరించినాఁడు.

తొలుతటినుండియు విదగ్ధగను, ధీరగను గనుపట్టుచువచ్చినగిరిక యిటమాత్రము ప్రపంచమే యెఱుఁగనిబేలగా మారినదన్న నమ్మువా రెవరు ? రామరాజభూషణుఁ డాలంకారిక నియమముల ననుసరించి యీరీతి పూర్వాపరవిరుద్ధములఁ బొసగించెను. అంతియకాని పాత్రల నైజస్వరూపమున దృష్టి నిడలేదు. కవిబ్రహ్మ యౌచిత్యమును తనివిదీరఁ గ్రోలిన మన కీ భోజనము వెక్కసము గాక మఱేమగును ?

ఆ సందులోనే సాహిత్య పోషణుఁడు వర్ణనలు ప్రారంభించినాఁడు. ఉద్యానవర్ణన, జలకేళి, మదనపూజ, అష్టాదశవర్ణనలు తల దూర్చినవి. గ్రంథము పెరిఁగినది. అలంకార నిపుణత పాండిత్యము వెల్లడియైనదిగాని గిరిక నానావికారములతో కుబ్జా స్వరూపముగా మారినది.

అసలీగ్రంథమున వస్తువే చాలతక్కువ. ఉన్నవస్తువునందును సమగ్రత లేదు. గిరిక ముగ్ధగాదు; ప్రౌఢగాదు. ఏకవిధము లగు భావములు రీతులు గానము. అనుగుణమగు భావశబలత లేదు. ఒకసారి యేడ్పు, ఒకసారి నవ్వు. కడకు దేనియందును "సమగ్రత" యను ధర్మమును సాధింపలేక పోయినది. అద్వితీయ యగు వరూథినితో పోటీబెట్టుకొన్నది గిరిక. నిజముగా నామెకన్న ముందంజయే వేసినది. వేసినపాత్రమును సరిగా నటించలేని నటి. అదృష్టవిహీన. శాస్త్రములు చదివినది. సంస్కార సంపాద్య మగు కళను సంపాదించలేకపోయినది. శ్లేషబంధములు మొదలగు బంధములలోఁ బడి క్షణికములగు చమత్కారములఁ జూపనేర్చినదే కాని నిత్యమై నిర్మలమగుసత్యమును జూపలేకపోయినది. ఏదో భావనానిర్మితయగు స్త్రీయైనది. నిరంతరము మన యందుబాటులో నున్నదిగాదు. అందులకే తెలుఁగుసీమలలో గిరికకు విహరించుట కుద్యానములు తక్కువ.

నిజముగా మూర్తి యుత్తముఁడు. గొప్ప పండితుఁడు. శాస్త్రములను వల్లించి వ్యుత్పత్తిచే సాధింపఁదగు కళాభాగముల నూరినాఁడు. సంగీతమున కొంతకొంతచిన్నెలు నడపినాఁ డానందోపాసనకు. కాని తెగబారు కొన్న శాస్త్రాభిమానము వెనుక కీడ్చినది.

నిజముగా భట్టుమూ ర్తియే యాంధ్రకవితా పితామహునిలోనున్న యాంతరికశ క్తిని గురు తించి యందులకై ప్రయత్నించియున్న, గురు నగు తాతగారిని యెన్నడో మించెడు వాఁడు. కాని యాతని కట్టిభాగ్యము బట్ట లేదు. పైపై పూఁతలలోనే కాలము గడపి జీవితమంతయు వ్యర్థ మొనరించు కొన్నాఁడు. అందుచే రామరాజ భూషణుని గిరికాదేవి కందలము బట్టకుండుటలో నాశ్చ ర్యము లేదు. అతని నామమును పండితు లలో లెక్కింతుము. శాస్త్రకర్తలలో బరిం తుము. కాని కవులలో చాల తక్కువచోటు గలదు. అతనిగిరిక పండితురాలు;విదగ్ధ. కాని మనసు దోచలేని మగువ. వానకారులోని మెఱుపువలె యొకసారి మెఱసిపోవచ్చునుగాని మాహృదయములచిరస్థాయిగనిలువఁజాలదు.

---





14　11　2

# నన్నయ భావప్రకాశిక

కీ. శే. పారనంది రామశాస్త్రి

నన్నయభట్టును వేగిదేశాధీశ్వరుడగు రాజరాజనరేంద్రుని యాస్థానవిద్వాంసుడు; వైదిక లౌకిక సర్వసంప్రదాయజ్ఞుడు; మిగుల లోకానుభవము గలవాడు; వేదవేదాంగాది వైదికభాషలను ఆంధ్రకర్ణాటాది సకలదేశభాషలను దెలిసినవాడు; నిర్మత్సరుడు; కవితాస్వతంత్రుడు; వ్యాకరణకర్తలలో ప్రథమాచార్యుడు; ప్రక్రియాకౌముది యను నాంధ్రశబ్దచింతామణియనెడునాంధ్రవ్యాకరణమును గీర్వాణభాషలోనతి గభీరాశయముతో రచించినవాడు; ఆంధ్రమహాభారతారంభకర్తయు నందు నాంధ్రభాషాసురభిని చతుష్పదములతోడను తనకవితాచతుష్పథమందు నిర్బంధములేక నడిపించి యెల్లకవులకును మార్గదర్శి యయినవాడు. తనవ్యాకరణమందును తనభారతభాగమందును తన గాంభీర్యము నచ్చటచ్చట దెలియునట్లు చెప్పియున్నాడు.

ఇతడు తనభారతారంభమందు తనను గురించి చెప్పికొనిన యీక్రిందిపద్యమువలన గొంత మనకు దెలియవచ్చును.

" తనకులబ్రాహ్మణు ననురక్తు నవిరళ
జపహోమతత్పరు విపులశబ్ద
శాసను సంహితాభ్యాసు బ్రహ్మాండాది
నానాపురాణవిజ్ఞాననిరతు
బాత్రు నాపస్తంబసూత్రు ముద్గలగోత్ర
జాతు సద్వినుతావదాతచరితు
లోకజ్ఞు నుభయభాషాకావ్యరచనాభి
శోభితు సత్ప్రతిభాభియోగ్యు
నిత్యసత్యవచను మత్యమరాధిపా
చార్యు సుజను నన్నపార్యు జూచి
పరమధర్మవిదుడు వరచళుక్యాన్వయా
భరణు డిట్లు లనియె గరుణతోడ."

ఈపద్యమందు దాను చెప్పికొనినదానికంటె నెక్కుడుగుణములు కొన్ని కలవాడని యీ పద్యమువల ననే మనము తెలిసికొనవచ్చును.

ఈపద్యమందలి 'తన' అనుపదము 'చళుక్యాన్వయాభరణు'నకు దూరమందన్వయించునుగాని తన కన్వయించదు. అప్పుడు 'తనకులబ్రాహ్మణు' అను సమాసములో 'తన' పదమునకు 'కులబ్రాహ్మణు' అనుదానిలో 'కుల' పదముతో నేకదేశాన్వయమును చేసి తన్ను రాజరాజనరేంద్రున కొక కులక్రమాగత బ్రాహ్మణమాత్రునిగా జెప్పికొనినాడు. ఇందహంభావము విడిచికొని 'యట్టినన్ను' అని చెప్పక 'నన్నపార్యు' అని చెప్పికొనుటచేత నతని వినీతివిశేషణముల యథార్థతయును తెలియబడును. 'అనురక్తు' అనుదానివలన రాజానురంజనము గలవాడని తెలియబడును. 'అవిరళజపహోమతత్పరు' అనుదానివలన నతనికి పంచమామ్నాయ మనుమహాభారతము నాంధ్రీకరింప నర్హతయు, 'విపులశబ్దశాసను' అనుదానివలన నతడు తన వ్యాకరణము నతిగభీరముగను, సంక్షిప్తముగను చేసి తనభారతమందు దానిలో జెప్పబడనియనేకశబ్దములను ప్రయోగములలో స్వతంత్రముగ నుపయోగించుటయు తెలియబడును. 'సంహితాభ్యాసు' అనుదానివలన సంస్కృతమూలభారతము ననేకపర్యాయములు చదివినవాడుగావున మూలవిరోధములేక యాంధ్రీకరించినవాడని తెలియబడును. 'బ్రహ్మాండాదినానాపురాణవిజ్ఞాననిరతు' అనుదానివలన నితరపురాణములలోనిరహస్యముల నచ్చటచ్చటను ప్రసంగములో దెలుపుచున్నవాడని తెలియబడును. 'పాత్రు' అనుదానివలన నిట్టిసుగుణము గిలవాడుగావుననే యోగ్యుడని తెలియబడును. పైరెండువిశేషణములవలన నతనిసూత్ర, మనగా

యజుశ్శాఖ, గోత్రమును తెలియబడును. పైవిశేష ణమువలన సత్ప్రవర్తనము గలవాడనియు తెలియ బడును. 'లోకజ్ఞు' అనుదానివలన కేవలవ్యాకరణ, కోశదృష్టములగు పదముల నేవకికొని చెప్పువాడుగాక నానాదేశ్యపదములను బాగుగ దెలిసి, తనగ్రంథ మందు ప్రయోగించియున్నవాడని తెలియ బడును. 'ఉభయభాషా కావ్యరచనాభిశోభితు' అనుదాని వలన రెండు భాషాకావ్యములనురచించినవాడు. భాషా కావ్యములనగా దేశభాషాకావ్యములు. ఈ మహాభార తము నాంధ్రభాషలో ప్రారంభించియున్నాడు. ఇంక నితడు కర్ణాటబ్రాహ్మణు డగుటను కర్ణాటభాషలో గూడ నేదో యొకటిగాని రెండుగాని కావ్యముల నింతకుముందే రచియించియుండవచ్చునని తెలియ బడును. లేక, ఉభయభాష అనగా నప్పటికి సంస్కృత భాషాకవితలు ప్రచురమైయుండుటచే తన భారతమును తెనుగులో రెండుభాషలకును మిశ్రణమును చేసి రచించినవాడనికాని తెలియవచ్చును. ఈ రెండవది విస్ప ష్టము. 'సత్ప్రతిభాభియోగ్య' అనుదానివలన నెచ్చట నెట్టిపదసందర్భము చేయవలెనో యచ్చటను సరిగా నట్టిపదములనే విషయశుద్ధికిని రసస్ఫూర్తికిని విరోధము లేక ప్రయోగించినవాడుగాని తన కవితకు నిర్బంధ మును పెట్టుకొనినవాడు గాడని తెలియబడును. 'నిత్య సత్యవచను' అనుదాని వలన నెప్పుడును సత్యమునే భాషించువాడు అనియు నిత్యమనగా దేశవ్యవహారమును యథార్థముగా జెప్పువా డనియును తెలియబడును. 'మత్యమరాధిపాచార్యు!' అనుటవలన వాక్పతి యగు బృహస్పతితో సమానబుద్ధిశాలి కావుననే వాగనుశాసను డను బిరుదము నొందినవాడనియును తెలియబడును.

ఇట్టి గుణసంపత్తిగల సజ్జనుడగు తనతో "వర చళుక్యాన్వయాభరణు డిట్టులనియె గరుణతోడ" అను దానిలో 'కరుణతోడ' అనుటవలన రాజరాజ నరేం ద్రుడు చంద్రవంశస్థుడు గావున దనవంశ్యులగు భారత రాజులచరిత్రమగు సంస్కృతభారతము నాంధ్రీకరింప దన్ను బ్రార్థించుటను 'ఇట్టులనియె గరుణతోడ' అని యతని యా ప్రార్థనమును తనయందు గరుణగా జెప్పుటచేత నతని వినయసంపత్తియు నవికత్థనత్వమును తెలియబడును.

మీదివిశేషణము లతని యథాస్థితిని తెలియ జేయునట్టివేకాని యతిశయోక్తులు గావు. మఱియు నట్టి యోగ్యతాసంపన్నునకేకాని యన్యులకీ పంచ మామ్నాయమగు భారతము నాంధ్రీకరింపనర్హత లేదను సంప్రదాయమును తెలియజేయును. ఈ యంశమును నన్నయభట్టుడు మొదటి మూడుపర్వములను తెనిగించి కాలధర్మ మొందినపిదప తిక్కన తక్కిన భారతమును పూర్తిజేయుటకు యాగముచేసికాని తన కర్హత లేదని తలంచి యాజియై పిమ్మట దెనిగించినాడను ప్రథ దృఢపఱచుచున్నది. మఱియు నితడు తన గ్రంథారంభ మందు తన భారతాంధ్రీకరణమునుగూర్చి

"పాయక పాకశాసనికి
భారతఘోరరణంబునందు నా,
రాయణునట్లు దానును ధ
రామరవంశవిభూషణుండు నా
రాయణభట్టు వాఙ్మయధు
రంధరుడుం దన కిష్టుడున్ సహా
ధ్యాయుడు నైనవా డభిమ
తంబుగ దోడయి నిర్వహింపగన్."

అని తనకు సహాధ్యాయిమిత్రుడగు నారాయణ భట్టు తనకు గ్రంథరచనలో సాహాయ్యమొనర్చుటను భారతయుద్ధములో నర్జునునకు సాహాయ్యముచేసి శత్రు వులవలని మహాపదలను తొలగించి రక్షించి విజయము చేకూర్చిన భగవంతు డగు శ్రీకృష్ణునితో నతనికి సామ్య ము జెప్పుటచేత నతనియెడల నితనికిగల కృతజ్ఞతయు, సత్యవచనత్వము, అనసూయయు మొదలగు నుత్తమ గుణగణము తెలియబడును.

ఇతడు 'తనకులబ్రాహ్మణు' అను సీసపద్య మందు జెప్పికొనిన తనగుణములన్నియు యథార్థములే యనుట కింకొక నిదర్శనము గానబడుచున్నది. 'తన కులబ్రాహ్మణు' అను పద్యమునకు మీది 'అఖిలజలధి వేలావలయిత' అను వచనమందు 'అపారశబ్దశాస్త్ర

పారగులైన వైయాకరణులును, భారతరామాయణాద్యనేక పురాణప్రవీణులైన పౌరాణికులును, మృదుమధుర రసభావభాసురనవార్థవచనరచనా విశారదులయిన మహాకవులును వివిధతర్క విగాహిత సమస్తశాస్త్రసాగరగరీయఃప్రతిభులైన తార్కికులును నాదిగాగలుగు విద్వజ్జనంబులు పరివేష్టించి కొలువ విద్యావిలాసగోష్ఠి సుఖోపవిష్టుండై యిష్టకథావినోదంబుల నుండి యొక్కనాడు' అని రాజసన్నిధి నిట్టి మహావిద్వాంసులనేకు లున్నట్లు చెప్పినందున పరోత్కర్షసహనమును, అట్టివా రందరుండగా తన్నే యీభారతాంధ్రీకరణమందు రాజు కోరుటచేత మీదజెప్పిన ప్రత్యేక విద్వాంసులకంటె నితనియం దన్నివిద్యావిశేషములును గలిగియుండుటచేతనే యీతనినే రాజు కోరినట్లును తెలియబడును.

మఱియు,

" అమలిన తారకాసముద

యంబుల నెన్నను సర్వవేదశా

స్త్రముల యశేష సారము ము

దంబున బొందను బుద్ధిబాహు వి

క్రమమున దుర్గమార్థజల

గౌరవభారత వాహినీసము

ద్రము దఱియంగ నీదను వి

ధాతృనకైనను నేరబోలునే."

" వ. అయినను దేవా, నీయనుమతంబున విద్వజ్జనంబుల యనుగ్రహంబునం జేసి నానేర్చువిధంబున నిక్కావ్యంబు రచియించెద" అనుదానిలో నీ భారతమును కావ్యముగా దాను భావించియే మీదజెప్పిన "తనకులబ్రాహ్మణు" అను సీసపద్యములో "లోకజ్ఞు నుభయభాషా కావ్యరచనాభిశోభితు" అనుచోటను ఈ భారతకావ్యమును ఉభయభాషారచనలచే, ననగా సంస్కృతాంధ్రభాషల మిశ్రణముతో రచింపబూన ప్రతిజ్ఞచేసి, యట్లే చెప్పినట్లును తెలియబడును. అదియుం దతని భారతమందలి ప్రయోగములవలన స్పష్టముగును.

"మఱియు, అమలినతారకాసముదయ" అనుపద్యమందు 'భారతవాహినీసముద్రము దఱియంగనీదను విధాతృనకైనను నేరబోలు' అని చెప్పికొనుటలో దనకు 'తా బోయిన మానమాసమున' అని చెప్పికొనుటచే భీమకవికి గలిగినట్లే యీతనికిని తనవచనమునందే ప్రాసదోషము గలిగినందుననే భారతమును మూడు పర్వములను మాత్రమే యాంధ్రీకరించి పూర్తిచేయజాలకనే తాను మృతినొందినట్లును రహస్యము తెలియబడును.

ఇటువంటి భావగాంభీర్యము భారతమందువలెనే యితనివ్యాకరణమందునుగూడ గానబడుచున్నది. ఎట్లనగా, ఆంధ్రశబ్దచింతామణి 'విశ్వశ్రేయఃకావ్యం'అనుచోట 'నెల్లగ్రంథములలో గావ్యము శ్రేష్ఠము' అని సూచించు తనభారతమును దానికి లక్ష్యముగా గావ్యముగా నందు జెప్పినాడు.

"త దదోషౌ పరిష్కృతౌచ వాగర్థౌ"అనుదానిలో దోషరహితములగు శబ్దార్థములే కావ్యమని చెప్పి, తన భారతమందు కఱకంఠుడు, ప్రాణగొడ్డము, కపిలకన్నులు, కపిలకడ్డము, కపిలజడలు, విజయంచేసి, భయంపడి మొదలగు శబ్దములు నిర్దోషములుగానే ప్రయోగించి భాషాకావ్యములలో సంకీర్ణరూపములు దుష్టములుగావని సూచించినాడు.

అట్లే పరోక్షము, నిజము, ఘట్టము, తాత, మొదలగునవి యర్థాంతరములందు ప్రమాణాంతరములలో నున్నను వానిని దేశభాషాకావ్యములలో లోకమువాడుక ననుసరించియే యర్థాంతరములం దుపయోగించియున్నాడు. ఎట్లనగా, పరోక్షశబ్దము అప్రత్యక్షార్థకము. దానిని మరణానంతర మను నర్థమందును, నిజపదము సహజ, స్వీయార్థకము దానిని యథార్థమను నర్థమందును, ప్రకరణము, లేక తీరము ననునర్థముగల ఘట్టశబ్దమును నిష్కృష్టస్థితి యను నర్థమందును, జనకుడర్థముగల తాతశబ్దమును పితామహు డను నర్థమందును ప్రయోగించియున్నాడు. ఇది లోకము ననుసరించి కాని శాస్త్రము ననుసరించి కాదు. ఇట్లింకననేకములు

గలవు. దానికి కారణ మితడు లోకజ్ఞుడు గావున లోకానుసారముగా జెప్పినవాడు. అట్లు తెలిసికొనుటకే తాను మొదలనే ప్రతిజ్ఞారూపముగనే 'లోకజ్ఞు'అని చెప్పికొనియున్నాడు. ఇంకను నితడు తన యాంధ్ర గ్రంథమునకు మంగళము "శ్రీవాణీగిరిజా శ్చిరాయ దధతో వక్షోముఖాంగేషు యే, లోకానాం స్థితి మావహ న్త్యవిహతాం స్త్రీపుంసయోగోద్భవాం, తే వేదత్రయ మూర్తయ స్త్రీపురుషా స్సంపూజితా వ స్సురై ర్భూయాసుః పురుషోత్తమాంబుజభవ శ్రీకంధరా శ్శ్రేయసే" అని సంస్కృతాంధ్రోభయ భాషానుగత మగు శార్దూలవిక్రీడితవృత్తమున సంస్కృతభాషలో మంగళముచేయుట యితని యుచితజ్ఞతను, సంస్కృతాంధ్రోభయభాషా సంకరీకరణ తత్పరతను దెలియ జేయుచున్నది. చంద్రవంశోత్తము డగు రాజరాజనరేంద్రునకు నాంధ్రభాషకంటె దేవభాషయగు సంస్కృతభాషచే నాశీర్వచించుట యుచితమని తలంచి యట్లు చేసియుండును. మఱియు నీశ్లోకమందు 'స్త్రీపుంస యోగోద్భవాం' అనుదానిలో సమాసాంతవిధానము వలన నితని వ్యాకరణనిష్ణాతృత్వము వ్యక్తము.

ఈశ్లోకమందు "లోకానాం స్థితి మావహ న్త్యవిహతాం స్త్రీపుంస యోగోద్భవాం, తే వేదత్రయ మూర్తయ స్త్రీపురుషా స్సంపూజితా వ స్సురై ర్భూయాసుః పురుషోత్తమాంబుజభవ శ్రీకంధరాః శ్రేయసే" అనువానివలన స్త్రీపుంసాత్మకము లగు వాగర్థముల యోగమున గలుగు చరిత్రనిర్మాణరూపమగు లోకస్థితిని సంపాదించు ముగ్గురు పురుషులు రాజరాజనరేంద్రుని శ్రేయస్సుకొఱకు కాంతయుక్తిని గంభీరభావము తోచును. అందు తన భవితవ్యతానుగుణముగనట్లు "త్రిపురుషాః వః శ్రేయసేభూయాసుః"అనుట వలన నతని వచనముల కమోఘతయు, నందుచేతనే తానారంభించిన యాంధ్రభారతమును ముగ్గురుగాని పూర్తిజేయరాకునికియును అభివ్యజ్యమాన మగుచున్నది.

ఇతడు రసస్ఫురణము, విషయస్థితియున్నే ముఖ్యముగా నెంచి నిరాతంకముగ దనకవితను బహువారంబుగ జేసినవాడుగాని నిర్బంధము నొందినవాడు గాదు. అట్టినిర్బంధము కవుల కెవ్వరికి నుండరాదనియే తన వ్యాకరణమందు 'సా వా గ్యా రసవృత్తిః సాధ్వోహి రసో యథాతథం కవిభిః' అనుదానిలో రసస్ఫూర్తి నిచ్చునదే వాక్కుగాని, కానిది వాక్కుగాదు. కాబట్టి కవులు యథాస్థితి ననుసరించియే రసమును సంపాదింపవలయు నని చెప్పి తా నట్లే గ్రంథమును రచించినవాడుగా దెలియబడును.

మఱియును 'సిద్ధి ర్లోకా ద్దృశ్యా' అనుచోట నీయాంధ్రభాషయందు శబ్దమునకు రూపసిద్ధియు, నర్థసిద్ధియు లోకమునుండియే చూచికొనవలయునని చెప్పి యట్లే తనగ్రంథమందు కళంకంతుడు, ప్రాణగొడ్డము, విజయంచేసి మొదలగువానికి రూపసిద్ధిని; పరోక్షము, నిజము, తాత, ఘట్టము మొదలగువానికి నర్థసిద్ధిని లోకమునుండి గ్రహించి ప్రయోగించికొనినవాడే కాని శాస్త్రమునుండి కాదు. ఎందుచేతననగా 'లోకోఽనన్యాదృశశ్చ నిత్యశ్చ' అనుచోట లోకమనగా లోకవ్యవహారము, అనన్యాదృశః = అనన్యాదృశము (అన్యమువంటిది) అనగా తత్సమతద్భవముల వంటిది (శాస్త్రనియంత్రితము)కాదు. నిత్యశ్చ=ఆలోకవ్యవహారము నిత్యము అనగా నాయాదేశకాలములను బట్టి విషయములు మాఱుటను సంకేతములు మాఱుటను ఈలోకవ్యవహారమును విశేషరూపములచే మాఱుచున్నను లోక వ్యవహారత్వ సామాన్య రూపముచే నిత్యమే యని యభిప్రాయము. ఇదియే ప్రవాహనిత్య మందురు. ఈ యభిప్రాయమున్నే ముందు 'ప్రవాహినీ దేశ్యా' అనుచోట దెలియజేయుచున్నాడు.

ఇందుపైని శబ్దస్వరూపార్థ సిద్ధులు లోకవ్యవహారమువలననే సిద్ధింపగా శాస్త్ర మప్రయోజన మను శంకను వారించుటకు 'సంస్కారార్థో నియమః' అను చోట శాస్త్రనియమము సంస్కారమనగా సిద్ధరూపమునకు ప్రకృతిప్రత్యయాది సమావేశన రూపమగు సంస్కారముకొఱకగునని నియమమునకు సార్థక్యమును జెప్పియున్నాడు. ఇట్లు చెప్పి—

"తజ్జా సమాచ దేశ్యా గ్రామ్యా చేయం చతుర్ధా భవతి" అని ముందు దాను విభజించెడు నాంధ్ర భాషాభాగములలో నొకటి యగు గ్రామ్యభాగమునకు లక్షణమును చెప్పచున్నాడు. "అనియమా ద్గ్రామ్యంహి యత్త్వపభ్రంశః" అనుచోట నియమము లేకుండుటవలన నపభ్రంశరూపమగు గ్రామ్యమగును. అనగా శాస్త్రనియమమును తప్పి లోకమందు రూఢమగునది గ్రామ్య భాగము. అదయును ఈభాషాభాగమేకావున ప్రయోగార్హమే యని చెప్పి యట్లే తన భారతమందు కఱకంతుడు, ప్రాణగొడ్డము మొదలగురూపములను నిరాతంకముగా ప్రయోగించియున్నాడు.

మఱియును "శాస్త్రసిద్ధమైన జాలునని విరళముగా నుండు శబ్దముల సంస్కృతాది గ్రంథములందు ప్రయోగించికొనినను ఈ దేశభాష యగు నాంధ్రభాషయందు మాత్ర మట్లు ప్రయోగింపరాదు. సంకేతమున సుప్రసిద్ధపదమే ప్రయోగించికొనవలయు"నని "విరళాన్ పేచోపాదికశబ్దాన్ ప్రవ్యాహరన్తు శబ్దజ్ఞాః; ఇహతు ప్రవ్యాహార్యం సంకేతిత సుప్రసిద్ధమేవపదమ్" అనుచో స్పష్టపఱచి తా నట్లే విజయంచేసి, కపిలగడ్డము మొదలగువానిని ప్రయోగించియున్నాడు.

పైన జెప్పినదానిలో "ప్రవ్యాహరన్తు శబ్దజ్ఞాః, ఇహతు ప్రవ్యాహార్యం సంకేతితసుప్రసిద్ధమేవ" అను చోట్లలోట్ లకారము,తుకారము, ఏవకారముల వలన భాషాంతర గ్రంథములందు వ్యాకరణమునే ప్రధానముగా జేసికొని వారు ప్రయోగించికొనినను 'సంకీర్ణము' దేశభాష యగు నీ యాంధ్రభాషయందు మాత్ర మట్లు కాక లోకసంకేతసిద్ధ మగు పదము వ్యాకరణ విరుద్ధమయ్యెను నది గ్రామ్యమయ్యె నట్టిదే ప్రయోగింపవలసినదిగా స్పష్టపఱచుచు నందుకే గ్రామ్యభాగము నంగీకరించియున్నాడు. తా నట్లే నిశ్శంకముగా ప్రయోగించికొనియు నున్నాడు.

ఇటీవలి వ్యాకరణకర్తలు వ్యాకరణవిరుద్ధము గ్రామ్యము, నింద్యము, ప్రయోగింపరాదు అనుటకు నన్నయభట్టుని హృదయ గాంభీర్యమును కనిపెట్టమియే కారణమై యుండును.

ఇంక భారతప్రయోగముల గురించి కొంత విచారింతము: నన్నయభట్టు డాంధ్రశబ్దచింతామణి యను వ్యాకరణమును రచించె నని కొందఱు, నతడు రచించ లేదని కొందఱు చేయు వాదమునుగురించి నాదు ఆంధ్ర మహాభారత విమర్శారంభములో కృతికర్తలప్రసంగములో నన్నయభట్టుడు రచించినట్లే విపులముగ సయుక్తిప్రమాణముగ నిరూపించియుండుటను నిచట విస్తరింపలేదు. భారతములోని ప్రయోగములకును ఆంధ్రశబ్దచింతామణి సూత్రములకును వారు చూపిన విరోధాభాసములను గురించి కొంత యిచ్చట విచారింతము.

ఆంధ్రశబ్దచింతామణి తుది గద్యము 'సకలభాషా వాగనుశాసన నన్నయభట్ట విరచితాంధ్రశబ్ద చిన్తామణౌ' అనుదానిలో 'సకలభాషా వాగనుశాసన' అనునదియు భారతమందు 'తన కులబ్రాహ్మణు' అను పద్యమందలి 'విపులశబ్ద శాసను' అను పదమును రెండును నేకాభిప్రాయములో సంగతములగుచున్నవి. ఎట్లనగా గద్యమందు సకల=సమస్తములగు, భాషావాక్ = ఆంధ్రభాషా గ్రంథమందు ప్రయోగింపనగు వాక్కులను (పదములను), అనుశాసన = శాసించినవాడు. ఆంధ్రభాషావాక్కులు (పదములు) తత్సమ, తద్భవ, దేశ్య, గ్రామ్యములను శాసించి భారతమందు 'విపుల శబ్దశాసను' అనగా తన వ్యాకరణములో విధించిన నాల్గువిధము లగు శబ్దములను తన గ్రంథమందు ప్రయోగించికొని యెల్లవారికి నట్లు శాసించినవాడనియు నభిప్రాయము.

'ఉభయభాషా కావ్యరచనాభిశోభితు' అనగా శాస్త్రసిద్ధ లోకసిద్ధోభయభాషలచేతను కావ్యరచన చేయువాడని యభిప్రాయము.

ఇట్లు పరస్పరసంగతము లయి రమణీయములుగానే యున్నవి. నన్నయభట్టు తన వ్యాకరణమందు నథర్వణాచార్య త్రివిక్రమ కవిభల్లటాదుల నుదాహరించుటచేత నతని యనసూయ, బహువేత్తృత్వము తెలియబడుచున్నది. వ్యాకరణకర్త యగు నథర్వణాచార్యుడు నన్నయభట్టునకు పూర్వుడు కావుననే యతని నుదాహరించినాడు.

మఱియు నితడు 'అద్యః క్రియాసు భూతార్థ ద్యోతిన మాద్యగం వినాసర్వః' అనుదానిలో కనియె, చనియె మొదలగు క్రియలలోని యకారమునకు నిత్యత్వమును లెక్కనచోట్ల సత్వమును సంగ్రహించి పదాదిని యకారమును చెప్పి తనభారతమం దట్లే "పాంసు జాలంబై" అను నరణ్యపర్వ ద్వితీయాశ్వాసమందలి పద్యములో దాని కుదాహరణముగానే 'అతిమలినంబైన యర్ధవస్త్రము దాని' ననియు, 'అధికహాస్యంబు నేసిరి యడవిలోన' అనియు బ్రయోగించియున్నాడు. ఇది నన్నయభట్టమతము గాదనుట యాశ్చర్యకరమగును. మఱియు నీ పద్యమందు 'అధికహాస్యంబు నేసిరి' అను చోట 'హాస్యంబు' అని లోకము ననుసరించి ప్రయోగించినాడు.

నన్నయభట్టునకు నాంధ్ర శబ్దచింతామణియందు గర్తృత్వమును నిరసించుటకు దాము కర్తృత్వమును వహించుచు దమయభిప్రాయ వైరుధ్యమును నాతని గ్రంథములం దారోపించి కొందఱు నాంధ్ర శబ్దచింతామణి భారతప్రయోగములకు వైరుధ్యమును జూపుచు చెప్పుచున్నారు. కాని యట్లుకాదు. ఆంధ్రమహాభారత విమర్శములో జూడవలయును.

"తద్ధర్మ వర్తమానా తీతాగామ్యర్థకాః క్రియాజ్ఞేయాః." అని కాలత్రయవాచకక్రియలు మూటితో గలిపి తద్ధర్మమును నొకక్రియ నంగీకరించి పిమ్మట "తత్రద్వితీయ తుర్యా యా తౌ స్త స్సానుబంధకావేవ" అని వర్తమానభవిష్యదర్థకక్రియలు అనుబంధ సహితములే యయ్యెండు నని చెప్పి 'వసతి రనుబంధక స్యాన్య ద్యత్ర లడర్థో వివక్షిత స్తత్ర, అస్తి రనుబంధక స్యాన్య ద్యత్ర లృడర్థో వివక్షితో ధాతోః' అని చెప్పియున్నాడు. ఇందు 'ద్వితీయతుర్యా సానుబంధకావేవ' అనిచెప్పి లడర్థమందు 'ఉన్న', లృడర్థమందు 'కల' అనుబంధకము చెప్పబడియుండగా భారతమం దట్టియనుబంధకములు లేనిరూపములే కాన్పించుచున్నందున నాంధ్రశబ్ద చింతామణి నన్నయభట్టుడు చెప్పినది కాదని చెప్పుదురు. కాని యది యంతసమంజసముగాదు. నన్నయభట్టు డతి గభీరహృదయుడు. తన వ్యాకరణమందు తద్ధర్మము కాలత్రయముయొక్కయు, గర్తయొక్కయు ధర్మ మనగా స్వభావమును శక్తిని తెలుపునట్లుగా తత్ పదము చేత కాలకర్తలను, ధర్మపదముచేత శక్తిస్వభావములను గూడ సంగ్రహించి చెప్పనొకదానిని తద్ధర్మ మని చెప్పట యతని ప్రౌఢిని తెలియజేయును. అట్టి తద్ధర్మరూపముచేతనే యద్యతన భవిష్యదర్థక మను లృట్లకారము నంగీకరించియున్నను వర్తమానకాలమున దాని 'కున్న' అనుబంధకము నంగీకరించినను క్రియారూపములో "ఉన్నాడు, ఉన్నారు" రూపముల నెట్లు ప్రయోగింప లేదో అట్లే లృట్లకారరూపమును కలానుబంధకముతో బ్రయోగింపక తద్ధర్మరూపములోనే ప్రయోగించుట యది ప్రౌఢి యగునని యట్లే ప్రయోగించియున్నాడు. ఈ తద్ధర్మరూపములోనే లుట్లకారరూపములను గూడ సంగ్రహించి కాలశక్తిస్వభావముల కనుగత మగునట్లు ప్రయోగించియున్నాడు. అది యతనికి ప్రౌఢియు, నతనివ్యాకరణమునకు గౌరవమునే కాని న్యూనత కాదు. ఇందు కొకజ్ఞాపకమును జూడవలయును. "అథ కికు లోపల యొక్కాన్యా" అని షష్ఠీ విభక్తిప్రత్యయము యొక్కను తన వ్యాకరణమందు జెప్పి యున్నను ఆరూపమును తన భారతమం దెచ్చటను ప్రయోగించియుండలేదు. అంతమాత్రమున భారత కర్తకు "యొక్క" రూప మనిష్టమని చెప్పుదురా? కాదు. ఒకయర్థమును దెలుపురూపము లనేకము లున్నప్పుడు ప్రయోక్తలు తమ కిష్టమగురూపముచే నాయర్థమును దెలుపుట తప్పిదము కాదు. కాబట్టి 'పలికెడును' 'పలుకును' మొదలగు తద్ధర్మరూపముల వర్తమానాగామ్యర్థముల కనుగతముగ బ్రయోగించు శాస్త్రసంకేతముల నెఱిగిన మహాకవుల కది ప్రౌఢియే కాని దోషము కాదు.

ఇంక నాంధ్రశబ్ద చింతామణి నన్నయభట్టుడే రచించియుండునేని వక్తవ్యాంశములు పెక్కులు విడిచి యసమగ్రముగా లక్షణము జేసియుండునా యను నాశంకను గూర్చి చూతము. ఆగ్రంథ మెవ్వరు చెప్పిన దన్నను ఆలోపము తుల్యమయ్యే యుండు ననునది

యాపక్షమువారికి సాధ్యసాధకము గాదు. మఱియు భారతములో గానబడుచున్న లక్ష్యములన్నిటికిని ఆంధ్రశబ్ద చింతామణిలక్షణములు లేమి వానికి విరోధము గాదు. చెప్పినలక్షణమునకు దానిచ్చిన లక్ష్యము విరుద్ధముగా నున్నచో నదిదోషము. లక్ష్యములకు లక్షణము చాలియుండలేదు. అంతియే కాని వేఱు గాదు. మఱియు నన్నయభట్టుడు లోకజ్ఞుడు గావున లక్షణము లేకున్నను లోకమందు గానబడు రూపములను తాను ప్రయోగించినవాడు. కావుననే ఆంధ్రశబ్దచింతామణిలో "నః కా" అను సూత్రములో షష్ఠీవిభక్తికి ప్రత్యయము పరమగునపుడు నగాగమము జెప్పట యంతకంటె నితర స్థలములందు నిషేధించుట కాదు. నిషేధములేని దానికి ప్రయోగము విరుద్ధము గాదు అని తెలుపుటకే "అని యిట్లు సభాపర్వంబునకథ" అని ప్రయోగించియున్నాడు.

తిక్కనసోమయాజి నన్నయభట్టుహృదయమును దెలిసినవాడు కావుననే తాను లోకజ్ఞుడై ప్రయోగించినవాడేకాని వేఱుకాదు. అట్లు తాను ఆశ్వాసాంత గద్యమందు 'ఇది శ్రీమదుభయకవిమిత్ర కొమ్మనామాత్య పుత్ర' అనుదానిలో, దన్ను ఉభయకవికి (నన్నయభట్టునకు) మిత్రుఁ డనగా సతనిసమయము ననుసరించు వానిగా జెప్పికొనియున్నాడు. అట్లే విరాటపర్వము తృతీయాశ్వాసమందు 'అంకుశంబునక్రియ', 'భూరుహంబునడస' అని ప్రయోగించియున్నాడు.

సశేషము.



సర్వదేశములనుండి

వార్తలను సంగీతమును






వినవీలొనర్చు

"హిస్
మాస్టర్స్
వాయ్స్"

రేడియో
రిసీవరు

మోడల్ 481 AC
(200-250 వోల్టులు : : 50-100 సైకిల్సు)

వెల రూ 350/-

- చూపునకు రామణీయకము
- చెవికింపైన జీవనాదము
- 7-2200 మీటర్లలోని అన్ని స్టేషనులు విననగును.
- గ్రామఫోన్ రికార్డులను కూడ విద్యుచ్ఛక్తి మూలముగ ప్రతిఫలింపనగును

నేడే వివరములకు మాకు వ్రాయుడు!

# ది గ్రామఫోన్ కంపెని, లిమిటెడ్.

45, సౌత్ పెరేడ్, బెంగుళూరు.

# విలయనృత్యము

విశ్వనాథ వేంకటేశ్వరులు

పరమ దురాశాజ్వాలలు - దరికొని కాల్పంగ దగ్ధధాత్రీజమటుల్
సరకీటక దురితాంతః - కరణ ముఱలి జగము గ్రమ్మె గాఢ తమస్సుల్.

ఒక సహస్రపాత్తయిన కీటకము క్రమ్మి - మెదడురియబట్టుచుఁ బశాక్రమించుపోల్కి
కామదుర్ధర్షపుఁ బిశాచి క్రమ్మి జగము - జీవనాడుల నెత్రు శోషిల్ల బట్టె.

సభ్యతపేరు పెట్టుకొని జాతులు జాతులు త్రుంగిపోవఁగా
బిభ్యదజాండమై కడలఁ బేర్చిన కామపిశాచ దంష్ట్రికా
త్యభ్యుదితోగ్రకీలలను దగ్ధమునై నుసియై నశించె దే
వేభ్యుల సృష్టియున్ మునులసృష్టియుఁ గృత్రిమ బుద్ధిబద్ధమై.

వృత్రుఁడు గప్పె సర్వపృథివిన్ గనకాక్షుఁడు చుట్టెఁ జాపగాఁ
జిత్రపరాక్రమంబులను జేయరె మున్ను సురారు లిట్లు సా
ర్వత్రిక సర్వతోముఖ విపత్తి మునుంగగ ధాత్రి యెల్లనున్
గృత్రిమ యంత్ర తంత్రములఁ గీడ్వడఁ జేసిరె నష్టచిత్తులై.

తఱిమిదున్నినచేల తెఱగునఁ గంధులున్ జాల్వడి బిట్టుఘోషలు పొనర్ప
గర్భమ్ము వ్రీలిన కఱి యొండ్రినా పృథ్వి కృత్రిమ యంత్ర విక్షిప్తి మెరయ
అప్రమేయ మనంత మాకాశమును మర్త్య లంఘననైచ్య విక్లబత స్రుక్క
బ్రహ్మాండ సరసిచర ద్భృంగములు గ్రహమ్ములు ‘రాకెటు’ లొరసి మ్రొత్తలిడగ
వాయుభట్టారకుఁడు చేతవాతగాని - యూడిగమ్ముల బడి పొగ లుమియు చేడ్వఁ
బంచభూతాత్మకం బగు ప్రకృతి మర్త్య-కృత్రిమేచ్ఛాక్రియలఁ బ్రతారితమయయ్యె.

ఒకఁడు రాకెటులోన నుఱికి కుజగ్రహం బొదిగిపోవఁగ మింట నోలసియాడు
ఒకఁ డదేమి యిదేమి యూర్ధ్వగామిత మహావాయుపథమ్ముల వ్రాలియాడు
ఒకఁడు రిమ్మకొలంది నుగ్రునావాసమ్ము కైలాసశిఖరిపైఁ గాలు వెట్టు
ఒకడు పంతమువట్టి యుడ్డీనగతి శింశుమారచక్రంబుపై బారసాచు
నదులఁ జెఱబట్టి కొండలఁ జదునుచేసి-పుడమి త్రవ్వించి సాగరమ్ములను బూడ్చి
తనబ్రతుకు నాల్గునాళ్ళుల తనుపుకొఱకు-నొకఁడు బ్రహ్మాండ మంతయు నుప్పళించు.

జాతివర్ణద్వేష ఘాతుకత్వము మహాసభ్యతా విజయ ప్రశస్తపథము
ఆపిపీలిక నృపర్యంత హింసారతి భూలోకశాంతి ప్రభుత్వగరిమ
మతధర్మకర్మసంతతి సర్వతో నాశ మవనిజంతుసమత్వ సువిలసనము
నవ్యసంకీర్ణ మానవజాతి సంసృష్టి సర్వసమ్మేళనా ఖర్వబుద్ధి
నై విలయకాళి కుత్సితహాసవిషమజాండ జీవనాడికలందు నలమికొనఁగ
మనుజుఁడు పిశాచియై స్వీయ మాంసభోక్తయగుచుఁ జెఱలాడుదిక్కుల సంధవృత్తి.

నెఱిఁ గల్పించెఁ జరాచరంబుల జగన్నిర్మాత, తద్ధర్మముల్
తఱుగన్ ధీ తలక్రిందుగాగ జడసత్తావిష్కృతిన్ ప్రాణి తా
స్ఫురదారోపణ వృత్తి మర్త్యుఁడు జగద్ఖ్యాతిన్ ప్రతారించు లా
నజీప్రాణిప్రచయంబు లుప్తక్రియమై యల్లాడి ఘోషిల్లగన్.

జగదవనార్థమై చెలగు శక్తుల ముక్తవివేకుఁడై తృషన్
దగిలి జగద్వినాశన విధాన వృథాత్త క్రుధోగ్రశీలియై
పొగ లుమియించుచున్ వలపు పుట్టిన దేశములెల్ల వల్లకా
డుగ దహియించి ప్రోవు లిడెడున్ తఱి దుర్బలజాతి పీన్గులన్.

ఆవులించు శతఘ్ని కాస్యమ్మునం 'దగ్నిపిం' డాక్షి గోళముల్ గండరింప
వ్రేలుచు దివిగప్ప 'విషవాయు' కేశపాశము నెత్తురోడుచు సంజగ్రమ్మ
'మృత్యుకిరణ' జిహ్వా మిలమిలలై 'మరతుపాకీ' దంష్ట్రికల దాకి కెరలియాడ
'మారణఖని' లంబమాన వక్షోజంబు లుదర 'యంత్రశకట' మొరసికొనగ
మండు 'జలగామి' కరముల మండిపడుచు - యుద్ధనౌకలపై నెక్కి యుర్వియెల్ల
రేవురేవునఁ గంకాళ నృత్యరేఖ - వెలయ రణదేవతాచండి విక్రమించె.

అక్షయపాత్రతోడ మొదలై యటవర్తకమట్లు సాగి ధీ
శిక్షణ మొప్పఁజేయుచు విశిష్టము సభ్యతపేరుమీద హిం
సాక్షత ఘోరరూపమున నంబుధులెల్ల వడంక మిత్తియై
క్షుక్షిని నింపు సాధుజనకోటుల మాంసపు తిట్టు లుగ్రతన్.

ఒకజోలి యొకసొంటియును లేక విశ్వగర్భునియొడిఁ గూర్కుచు మునులవృత్తి
దపియించు నుత్తుంగ ధరణీధ్రములు మహారణ్యానిమధ్య విభ్రాజమాన
పౌరాణిక ద్రుమ ప్రతతులు సాగరాంతస్తపస్వులగు సత్వములు కూడ
మర్త్యతృష్ణాహేతి మణగిపోవుచునుండ ముక్కిడిమనుజుల లెక్క యేమి

మారిమసగిన యట్టులు బారిసమరి - దాస్యలోహంపు టురుల బందాలు వైచి
యాత్మ నెలయించి జీవచ్ఛవాళిఁ జేసి - రాజు నను నీ శ్మశానసామ్రాజ్యమునకు.

తానే రాజట కర్త భోక్తయు నటల్ దానట్టె లోకంపు బా
డ్డై నిల్వన్ దనచుట్టు సర్వమును జక్రావృత్తిగాఁ బోనిచో
లేనేలేదు నిజోగ్రకోప దహనోల్లీఢంబు నై భస్మమై
పోనేపోవును మర్త్యతృష్ణ యదిరా! భూతమ్ము లల్లాడఁడే.

'అరుణహైందవ' ఋతుమతి పురాణపుఁ గలల్ గనుచుఁ గాలమునందుఁ గరఁగిపోవ
నీగ్రోమహాఖడ్గి నిలువు శృంఖలఁ ద్రెంచుకొనలేక భువిఁ బ్రీల ఘోషవెట్ట
భరతదేశవ్యాఘ్రి ప్రారబ్ధ ఘనతమః పటలి డిందగఁ దపఃపరతనొంద
చీనికావృకము కార్చిచ్చుక్రమ్మిన మహారణ్యగర్భమునందుఁ గ్రాగిపోవ
కృష్ణజాతిమృగమ్ములు క్రిందుమీదు - తెలియనేరక యురుల బందీలు కాఁగ
రాజ్యతృష్ణాపిశాచికి రక్తబలుల - మర్త్య డొనగూర్చు మృగయావిమత్తవృత్తి.

దేశము లెల్లఁ బండు సముదీర్ణరమానవ నూపురారవం
బాశల ఘల్ఘలల్ నెఱప నంతన యర్థపిశాచి, తృష్ణమై
లోశివమెత్తి సంద్రములలోఁ బడద్రోయును సస్యసంపదల్
గాసిలి యన్నవస్త్రముల కాటకమై జనపాళి ఘోషిలన్.

అన్నపు ముద్ద లాగికొని హస్తమునం దిడు గాజుముక్క సం
పన్నసమస్త వస్తుగుణ మంగళదేవత లక్ష్మి జాడ్యతా
సన్న ధనాధిదేవతకు సానితనం బొనరింప నయ్యె సం
పన్నులు రిక్తులైచన నభాగ్యులు మిన్నులకెక్కి చూడగన్.

ధన తృష్ణా రణదేవతా విలయనృత్యం బాప్పగన్ దుష్క్రియా
ఖని యీ మర్త్యుడునన్ మహోదర మృదంగంబూని వాయించుకొం
చును దుస్తాళలయోద్గతుల్ నెఱపు, సంక్షోభిల్లి విశ్వస్థితి
ప్రణుతంబుల్ పరమేశు వీణ్యశ్రుతులున్ భంగించిన ట్లయ్యెడున్.

———

# పాణినీయము - కావ్యభాష

(అనువృత్తము)

పోతుకుచ్చి సుబ్రహ్మణ్యశాస్త్రి

## పాణిని

ఈశాస్త్రమునకెల్ల మూలపురుషుఁ డగు పాణిని మహర్షి తన శాస్త్రమును సంస్కృత వాఙ్మయమున కెల్ల విపులమగు ననుశాసకముగాఁ దాను రచించుటకుఁ దలపెట్టియుండక శ్రీ శాస్త్రిగారు వ్రాసినట్లు లప్పటి కేకాలఁదిగానో యేర్పడియుండిన వైదికకర్మోపయోగి భాషను మాత్రమే యనుశాసింపఁ దలఁచినచో నద్దానికిఁ గా నింతటి విపులమగు వ్యాకరణమును రచింపవలసిన యవసరము లేదు. విస్తృతమగు వేదవాఙ్మయమును సంస్కరించుటకుఁగా నాతఁ డట్లు చేసియుండునని మన మూహింపవచ్చునుగాని యాతఁడు ఛందోమాత్రవిషయకము లగు శబ్దముల యనుశాసన విషయమున "ఛందసి" అని ఛందోగ్రహణమును, భాషామాత్రవిషయకము లగు శబ్దముల విషయమున "భాషాయాం" మని భాషాగ్రహణమును జేయుచువచ్చును. ఈ ధోరణినిబట్టి పరిశీలించి చూచుచోఁ దక్కుఁగల శబ్దములు పరిశేషన్యాయమున నుభయవిషయకము లనక తప్పదు. పాణినీయమున నీ యుభయవిషయకము లగు సూత్రములే పెక్కులు గల వనుట కెవ్వరును విప్రతిపన్నులు కాఁజాలరు. అందుచేఁ బాణినిమహర్షి వేదభాషకు మాత్రమే కాక లౌకికభాషకుఁగూడ నీ యనుశాసనమును రచించి యుండెననుట సిద్ధాంతితము. ఇదియేకాక శాస్త్రకర్త యేకాలఁదిగానో యున్న యీ భాషకుఁ దగులక్షణము నేర్పఱుపఁజాలక యాకృతిగణాదుల నాశ్రయించె ననుటయు నసంగతమే కదా? ఇంత యేల, సంస్కృతవాఙ్మయము నెల్లను బాణినీయ మనుశాసింపఁదలఁచె నని సాక్ష్యమిచ్చుటకు "పృషోదరాదీని యథోపదిష్టమ్" అను నొక్క సూత్రమే చాలియున్నది. పై నిదర్శనములను బట్టి పరీక్షించుచో శ్రీ శాస్త్రిగారి వాదమునకుఁ బాణిని యనుకూలుఁడు గాఁడనుట స్పష్టము.

## కాత్యాయనుఁడు

పాణినీయానుశాసనముగా వీరిచే నంగీకరింపఁబడిన శిష్టవ్యవహారభాష యనునది వీరి మతముప్రకారము శిష్టులనువారిచేఁ గడుంగడు జాగరూకతతో యజ్ఞాది వైదికకర్మములలో మాత్రమే యుపయోగింపఁబడున దగుటచే నేదియును వికారమును బొందుటకుఁ గాని వీలు గానిపింపదు. అట్టి స్థితిలో దురుక్తసంస్కారకము లగు (పాణినిసూత్రము లొకవిధమగు శబ్దములను సిద్ధింపఁ జేయుచుండఁగా మఱియొకవిధమగు శబ్దములను సాధింపఁగల) వార్త్తికములను గాత్యాయనుఁడు రచించుటయు నసంగతమనక తీరదు. ఇదియేకాక సర్వవిధములఁ బాణినిమతమునే యనుసరించి యాకృతిగణాదులను నిర్దేశించి యుండుటచేఁ గాత్యాయనుఁడును వీరి వాదమునకుఁ బ్రతికూలుఁ డనక తప్పదు.

## పతంజలి

ఇఁక మహాభాష్యధోరణినిబట్టి శ్రీ శాస్త్రిగారి వాద మెంతవఱకు సమంజసమో పరికింతము. మహాభాష్యకర్త ప్రతిపదోక్తపాఠరూపముగానే శబ్దముల ననుశాసింపవలయునా, లేక యుపాయాంతరముననా యని విచారించు సందర్భమునఁ బ్రతిపదోక్తపాఠము వ్యాకరణరచనకుఁ దగుసాధనము గాదని నిరూపించుటకుఁగాఁ దా నీ క్రిందిభాష్యము నుపన్యసించెను.

"ఏవం హి శ్రూయతే——బృహస్పతి రింద్రాయ దివ్యం వర్షసహస్రం ప్రతిపదోక్తానాం శబ్దానాం శబ్దపారాయణం ప్రోవాచ. నాన్తం జగామ. బృహస్పతిశ్చ ప్రవక్తా, ఇంద్రశ్చాధ్యేతా. దివ్యం వర్షసహస్ర మధ్యయనకాలః, న చాన్తం జగామ, కింపునరద్యత్వే...... య స్సర్వథా చిరంజీవతి వర్షశతం జీవతి......తత్ర చాస్యాగమకాలేనైవాయుః కృత్స్నం పర్యుపయు

క్తం స్యాత్......తస్మా దనభ్యుపాయ శ్శబ్దానాం ప్రతిపత్తౌ ప్రతిపాదపాఠః.........కిఞ్చి త్సామాన్య విశేషవల్లక్షణం ప్రవర్త్యమ్, యే నాల్పేనయత్నేన మహతో మహత శ్శబ్దౌఘాన్ ప్రతిపద్యేరన్ ఇతి."

పై సందర్భమునుబట్టి చూచుచో బృహస్పతి వంటి సరువునొద్ద నింద్రునంతటి మేధావి దివ్యసహస్రవర్షములు పఠించియుఁ దుదముట్టింపఁజాలని ప్రతిపదోక్త పాఠము నెల్లఁ బాణిని సామాన్యవిశేషలక్షణరూపము లనశాస్త్రముచే సంగ్రహించినట్లు విశదమగుచున్నది. అపారమగు నంతటి ప్రతిపదోక్తపాఠముకూడ వైదిక కర్మప్రయోగి భాషామాత్రానుశాసకమే యనుట కెవ్వరును సాహసింపరుగదా? ఇదియేకాక భూలోకమునఁ జేయు యజ్ఞాదికర్మములవలనఁ గలుగు సుకృతదుష్కృతఫలములనెల్ల ననుభవించుటకుఁగా నేర్పఱుపఁబడి ఫలభూమి యని వక్కాణిఁపఁబడు స్వర్గభూమి ఫలభూమియే కాని కర్మభూమికాదని యందఱు నేకగ్రీవముగా నంగీకరించినదియే. అట్టిచో నక్కడ వైదిక కర్మప్రయోగిభాష యెుక్కఁ డున్నదనుటగాని, లేదను శాసకమే ప్రతిపదోక్తపాఠమనుటగాని గగనకుసుమాయమానమేయగుచున్నది. ఇదియేకాక భగవానుఁడగు పతంజలి "సర్వే దేశాన్తరే" యను వార్తికమును వ్యాఖ్యానించుచు "ఉపలబ్ధౌ యత్నః క్రియతామ్, మహాన్ శబ్దస్య ప్రయోగవిషయః......వాకోవాక్య మితిహాసః పురాణం వైద్యక మి త్యేతావాన్ శబ్దస్య విషయః... స న్త్యప్రయుక్తా ఇతి వచనం కేవలం సాహసమాత్రమేవ" అని చెప్పియున్నాఁడు. అప్రయుక్తములకును మీశాస్త్ర మన్వాఖ్యాపక మగుచున్నదని పూర్వపక్షియాక్షేపింపఁగా నీ భాష్యము నుపన్యసించి పైనుదాహరించిన వాఙ్మయము నంతయు మాశాస్త్ర మనుశాసించియున్నదనియు, నట్టివాఙ్మయము నెల్లను బరికింపకయే మీశాస్త్ర మప్రమాణ మనుట కేవలము సాహసమే యనియు నిరూపించి కావ్యేతిహాసపురాణాది సకల వాఙ్మయమునకును బాణినీయ మనుశాసకమేయని మహాభాష్యకర్త కంఠోక్తముగా మనకు విశదపఱచియున్నాఁడు. మఱియు "అజే ర్వ్యఘఞపోః" అను సూత్రమునఁ బ్రాజితృశబ్దసాధుత్వమును విమర్శించుచు "ఇదమపి సిద్ధంభవతి, ప్రాజితేతి, కించ భో ఇష్యత ఏతద్రూపమితి బాఢ మిష్యతే–ఏవంహి కశ్చి ద్వైయాకరణ ఆహ, కో ఽస్యరథస్య ప్రవేతేతి, సూత ఆహ, అహ మాయుష్మ న్నస్యరథస్య ప్రాజితేతి, వైయాకరణఆహ, అపశబ్దఇతి, సూత ఆహ, ప్రాప్తిజ్ఞో దేవానాంప్రియః న త్విష్టిజ్ఞః, ఇష్యత ఏతద్రూప మితి, వైయాకరణఆహ, అహో ఖల్వనేన దురుతేన బాధ్యామహే ఇతి, సూతఆహ, నఖలు వేఞస్సూతః, సువతే రేవ సూతః, యది సువతేః కుత్సా ప్రయోక్తవ్యా దుస్సూతేనేతి వక్తవ్యమ్" అని సూతవైయాకరణసంవాదము నొకదానిని దృష్టాంతీకరించియున్నాఁడు. పై సంవాదము కావ్యభాషకే కాక యానాఁటివ్యావహారికభాషకుసయితము పాణినీయ మనుశాసకమై ప్రమాణీకరింపఁబడియున్నదని నొక్కి వక్కాణించుచున్నది. ఇట్టిభాష్యము లెన్నెన్నియో శ్రీ శాస్త్రిగారివాదమునకుఁ బ్రతికూలములుగాఁ గానిపించుచున్నవి. కావున బతంజలిభగవానుఁడును శాస్త్రిగారివాదము నంగీకరింపఁడనుట విస్పష్టము.

ఇదియే కాక పై సంవాదమున వైయాకరణుఁ డపశబ్దప్రయోగము చేసితివని సూతు నాక్షేపించుటయు, నాతఁడు తాను బ్రయోగించిన ప్రాజితృ శబ్దమును సాధుశబ్దమే యని సమర్థించికొని "దుస్సూతేనేతివక్తవ్యమ్" అని వైయాకరణుని బరిహసించుటయుఁ జూడఁ గావ్యభాషలో నననేల, నాఁటి వ్యావహారిక భాషలో సయితము నపశబ్దప్రయోగము దుష్టమైయుండె ననుట సర్వజనసమ్మతి మనకతీరదు. ఇది యంతయు నిట్లుండ నేకాలమునను సంస్కృతభాష సర్వజనోపయోగిదేశభాషగా నుండియుండ లేదను శ్రీ శాస్త్రిగారి మఱియొక సిద్ధాంతముకూడ నెంతవఱకు కాదరణీయమో పరిశోధింతము. పై నుదాహరించిన సూతసంవాదమే యాకాలములోని సర్వజనులును సంస్కృతభాషనే దేశభాషగా నేర్పఱచికొని వ్యవహరించుచుండెడివా రనుటకుఁ బ్రబలనిదర్శనమై యున్నది. "తస్మిం శ్చాతిమహతి శబ్దస్య ప్రయోగవిషయే తేతే

శబ్దాస్తత్రత్రతి నియతవిషయా దృశ్యన్తే. తద్యథా- శవతి ర్గతికర్మా కామ్బోజేష్వేవ భాషితో భవతి, వికార ఏనమార్యా భాషన్తే శవ ఇతి. హమ్మతి స్సురాష్ట్రేషు, రంహతిః ప్రాచ్యమధ్యేషు, గమిమేవ త్వార్యాః ప్రయుఞ్జతే, దాతిర్లవనార్థే ప్రాచ్యేషు, దాత్ర ముదీచ్యేషు." అనుభాష్యమును దత్తద్దేశములలో ననేక విధములగు వికారములతో నీభాష వెలయుచున్నదని సుస్పష్టముగా నుద్ఘోషించుచున్నది. ఈ గీర్వాణభాష యేకాలములోనో యొకకాలములో దేశదేశములను సర్వజన వ్యవహారోపయోగిదేశభాషగా నుండెనిచోఁ దా నిట్టి వికారములకు లక్ష్యభూతమై యుండెనని నిస్సంశయముగా మన మంగీకరింపవచ్చును. ఇంతయేల, సంస్కృతమున కపభ్రంశరూపమే ప్రాకృతమని వీ రంగీకరించినదే కదా? అట్టిచో మహారాష్ట్రాదిదేశములలో నెంతకాలమునుండియో దేశభాషగా నుండి యవాంతర భాషల నెన్నిటినో సృజించి శాఖోపశాఖలతో నలరారుచున్న యీ ప్రాకృతభాష వీరిమతము ప్రకారము శిష్టవైయాకరణమాత్ర వ్యవహృత మగు సంస్కృతము నుండియే కలిగియున్నదనుట న్యాయదూరమనకతప్పదు. వాల్మీకిమహర్షి తా నీప్రాకృతసంస్కారమున కెల్లను మూలపురుషుఁడై వ్యాకరణమును రచించియుండుటచే రామాయణ కాలమునాఁటికే సంస్కృతమునకన్న విలక్షణముగా నీభాష దృఢపడియున్నదని మన మూహింపవచ్చును. ఇట్టి నిదర్శనముల ననుసరించి రామాయణ కాలమునకన్న పూర్వమునుండియే చిరంతనముగా సంస్కృతభాష సర్వజనసాధారణముగా నన్ని దేశముల యందును వ్యవహరింపఁబడియున్నదనియుఁ దరువాత నయ్యది క్రమక్రమముగా వికారమును బొందుచు మిశ్రముగా (సాధ్వపభ్రంశాత్మకమై) వ్యవహారములోఁ గొంతకాలమునుండి మఱికొన్నినాళ్లకు పాళీ, హిందీ, బెంగాలీ మొదలుగాఁగల శాఖోపశాఖలతో నేర్పడి యున్న ప్రాకృతభాషా మహావృక్షము నొకదానిని గల్పించియుండును. ఈ సంస్కృతభాషయే పైపద్ధతి ననుసరించి తత్తత్కాలములలో సర్వజనవ్యవహారోపయోగిగా నుండి యీ ప్రపంచమునందలి భాషాకుటుంబమున కెల్లను మూలభూతమై సకలభాషాప్రపంచసృష్టికర్త యనుకీర్తిని నుపార్జించి మాతృభాష యని జగజ్జేగీయమానముగా శ్లాఘింపఁబడుచున్నదని మనము సిద్ధాంత మొనరింప వచ్చును. ప్రాచీన వాఙ్మయమెల్ల నిట్టిసిద్ధాంతమునే స్థిరీకరింపఁ గలిగియున్నది. భోజచరిత్రాదిప్రబంధము లన్నియు నీవిషయమునఁ బ్రత్యక్షసాక్ష్యము నిచ్చుచున్నవి. సంస్కృతము సర్వజనోపయోగిదేశభాషగా నుండెననువిషయమును ముందు విపులముగా వ్రాయఁదలఁచినవాఁడ నగుటచే నింతటితో నీవిషయమును వదలివేయుచున్నాను. ఇది యంతయు నిట్లుండఁగా మహాభాష్య ధోరణినిబట్టి వైదికకర్మోపయోగిశిష్టవ్యవహారభాష యనునది యొకటి కల దనియుఁ, బాణినీయ మంతయుఁ దన్మాత్రానుశాసకమే యయియున్నదనియు, నందుచేఁ గావ్యభాషానుశాసకముగా మఱియొక వ్యాకరణమును గల్పింపవలసి యున్నదనియు, శ్రౌతస్మార్తాది పుణ్యకర్మములలోఁ దక్కఁ దక్కుస్థలములలో నపశబ్ద ప్రయోగమాత్రే పాపాదకమే కాదనియు, సంస్కృతభాష సర్వజనోపయోగిదేశభాషగా నేకాలములోను నుండలేదనియు శ్రీశాస్త్రిగారు వ్రాసినసిద్ధాంతములు పైవిమర్శమునఁ జర్చించినరీతిని ప్రమాణము లై యుండలేదని లోకమున కెఱుకపఱచుచు నావ్యాసము నింతటితో ముగించుచున్నాను.

---

# నవ్యసాహిత్యం - దానివుద్దేశం

యలమంచిలి వెంకటేశ్వరరావు

సెప్టెంబరు భారతీపత్రికలో కొడవటిగంటి కుటుంబరావుగారు "సాహిత్యం ఎందుకు" అనే ఒకవ్యాసం రాశారు. దానిలో నా కక్కడక్కడ కొన్నిసందేహాలు కలిగినాయి. వాటి నివారణార్థం జిజ్ఞాసాభావంతోనే ఈవ్యాసం రాశాను. ఈప్రశ్న అనాదికాలంనుండి ఎన్నివ్యాఖ్యలు చేసినా విడివడక అలాగేవస్తున్నది. ప్రయత్నాలుమాత్రం జరుగుతూనే వున్నాయి. నాయీబాలప్రయత్నం ఇంకాకొంత మందికి ఈవిషయాన్ని ఆలోచించటానికి ప్రేరణ ఇస్తుందనే ఆశ. నావిమర్శలో తప్పులుచూపితే నమస్కారాలుచేసి స్వీకరిస్తాను.

"రచన ఎందుకు? ఒకవ్యక్తి తన పంచేంద్రియములయొక్క సహాయంతో తనమనస్సు సంపాదించిన జ్ఞానాన్ని ఇతరులకు సులువుగా అందచేయటానికి." అని ప్రారంభించారు. ఇక్కడ మనస్సుశబ్దం బుద్ధికి పర్యాయంగా వాడినట్టున్నారు. అదికూడ స్థూలజ్ఞానమే నన్నారు. జ్ఞానాన్ని పెద్దలు స్థూలజ్ఞానం, సూక్ష్మజ్ఞానం అని రెండుగా విభజించారు. స్థూలజ్ఞానం అంటే తనుకాక మిగిలినవస్తు–జంతుసముదాయాన్ని జ్ఞానేంద్రియములద్వారా గ్రహించగలగటమనీ, సూక్ష్మజ్ఞానమంటే అంతరంగానికి సంబంధించిందనీ–అనగా తన పూర్వసంచిత అనుభవాలు లేక కల్పనద్వారా సృష్టిరహస్యాన్ని గ్రహించటం. ఇప్పుడు మనం ఆలోచించవలసింది సాహిత్యంఎందుకు అనేతలకట్టుకు క్రింద చెప్పినపరిభాషకు సంబంధం సరిపోతుందా అని. దీనికి సమాధానం నాహృదయకోశంనుంచి సరిపోదనే వస్తున్నది. సాహిత్యం భావప్రధానం; బుద్ధిప్రధానం గాదు. సాహిత్యంలో బుద్ధి భావాన్ని అనుసరిస్తుంది. (సాహిత్యంఅంటే కావ్యాలు, నాటకాలు, నవలలు, కథలు నాఅర్థం. వారివ్యాసంలోకూడ అంతవరకే చెప్పబడ్డది.) కల్పన దానికి రమణీయతకలగచేస్తుంది. సాహిత్యం అంటే రాగతత్త్వం, లేక హృదయతత్త్వం, బోధతత్త్వం, కల్పనాతత్త్వం ఈమూటిసముదాయమూను. వీటిలో ఏది పనిచేయకపోయినా రచన శిథిలమై పోతుంది. తరువాత 'మంచిజ్ఞానం–చెడుజ్ఞానం, పనికివచ్చేజ్ఞానం–పనికిరానిజ్ఞానం' అనిచెప్పి వేదకాలంలో పనికివచ్చేది మంచిదీఅనుకున్నది ఒకచోట పోగు పెట్టారు అని రాశారు. ఈపనికిరావటమూ మంచిదీ అనేదానికీ పరిభాష చెప్పలేదు. పనికివచ్చేది–పూటికి గుడ్డకు అక్కరకువచ్చేది అని అర్థమా? అలాఅయితే పనికివచ్చేది సాహిత్యంలో ఒకఅప్రధానాంగమేకాని సాహిత్యం కాదు. పనికివచ్చేజ్ఞానం, లేక. కళ లోకి వడ్రంగం, కమ్మరిపని, బంగారుపని మొదలైనవి తీసుకోవచ్చు. రెండోది లలితకళ. ఇది ఎప్పుడూ ప్రత్యక్షంగా వుపయోగించేది కాదు. (దీన్నిగురించి ముందుచెప్తాను.) పనికివచ్చేశబ్దానికి వుపయోగించేశబ్దం వాడి అపార్థంలాగావు అని అనవక్కరలేదు. క్రిందివుదాహరణతో స్పష్టమవుతుంది: ఈనాడు "మంచిదనిపించిన జ్ఞానం రేపు చెడ్డదగాపరిణమించుతుంది." అనిరాస్తూ మారేజ్ఞానానికి "సూర్యుడు తూర్పుసముద్రంలోపుట్టి భూమిచుట్టూ ప్రదక్షిణంచేసి పడమటిసముద్రంలో అస్తమించుతున్నాడు" అనేవుదాహరణతరువాత అపవాదంలాగ ఎప్పటికి మారనిజ్ఞానంవుంది. "ఎనిమిదిమూళ్లు ఇరవైనాలుగు" లాటిది అన్నారు. ఈరెండువుదాహరణల్తో సాహిత్యానికి, జ్ఞానానికి ఎటువంటిసంబంధాన్ని జోడించారో, ఎంత సూక్ష్మం ఆలోచించగలిగారో స్పష్టమయింది. ఈరెండు సిద్ధాంతాలు వాస్తవంగా స్థూలసిద్ధాంతాలు.సూక్ష్మరహస్యం తెలుసుకోవటానికి బాహ్యప్రకృతిని పట్టుకుదేవులా

డే పాశ్చాత్యులను వైజ్ఞానికులను మరచి భారతీయదర్శన శాస్త్రాన్ని కవులకవిత్వాన్ని అన్వేషించాలి. అప్పుడు కాని మారనిజ్ఞానం ఇంకావున్నదని తేలదు. సమస్త సృష్టిలో ఆత్మప్రకాశనప్రవృత్తి సూక్ష్మాతిసూక్ష్మ రూపంతో దాగివుందనీ, అంతట ఒకే ఎనర్జీ—చేతనశక్తి పనిచేస్తున్నదనీ మన ఉపనిషత్తులు బోధించిన జ్ఞానం మారదు. ఆధునికవైజ్ఞానికులుసైతం ప్రత్యేక అణు పరమాణువులో చేతనశక్తి ఒకటి పనిచేస్తున్నదని ఒప్పుకున్నారు. ఏవిధంగా బృహద్రూపమైన సూర్యుని చుట్టు అష్టగ్రహాలు తిరుగుతూన్నవో అదేవిధంగా ఈనియమంకూడ సూక్ష్మపరమాణువుల్లో సయితం కన పడుతోంది. ఇది సృష్టిమధ్య ఆత్మప్రకాశం కొరకు జరిగే ఉద్దామప్రవృత్తిని సూచిస్తుంది. కేవలం సత్త్వమే కాదు. దానిలోపల అవ్యక్తచైతన్యం విద్యమానమై వుంది. అదికూడ అనేకరూపాల్లో తనను వ్యక్తపరు స్తోంది. ఈచైతన్య ప్రభావంవల్లనే సృష్టిలో ప్రతి వస్తువు ప్రతిక్షణం భావం తిరోభావంతో చలాయ మాన మవుతున్నది. ఈ పరిక్రమం విశ్వవ్యాప్తమైన ఆనందమయసంగీతానికి తాళం వేస్తున్నది. మానవుడు ఈచైతన్యంవల్లనే ప్రేరేపింపబడి సృష్టిలోని మధుర సంగీతాన్ని తన భాషాస్వరాల్లో పాడుతున్నాడు. ఈసంగీతానందమే భారతీయకళకు ప్రాణదాత. దీని కంటె కూడ అపరివర్తనశీల మైన జ్ఞానం ఇంకొకటి వుంది. సుఖందుఃఖం. ఈసుఖదుఃఖాలనుంచే నవరసాలు, ముప్పదిమూడు సంచారిభావాలు పుట్టినయి. ఈ సుఖ దుఃఖాలే సాహిత్యానికి మూలాధారం. మానవు డున్నంతవరకు ఇవి తదాకారంలోనే వుంటాయి. వీటినే మూలప్రవృత్తు లంటారు.

తరువాత సమస్తసస్మృతులూ, శాస్త్రములూ, పురాణములూ, కావ్యములూ, కథలూ, ఖండకావ్య ములూ వీటన్నిటికీ వేదాలే బీజమన్నారు. అన్వేషణ ప్రకారం ఇప్పటివరకు లభించిన ప్రమాణాలనుబట్టి అందరు సమ్మతించకతప్పదు. కాని అంతమాత్రాన వేద ములకువిలువ అధికంకాలేదు అన్నారు. అదెట్లా కుదురు తుంది ? వారిలెక్కప్రకారం సమస్తసాహిత్యానికి తల్లి వేదమేగా ! తల్లిప్రభావం పుత్రుడిమీద ఎంత పడు తుందో, పుత్రుడు ప్రతిష్ఠపొందటానికి తల్లిలోంచి ఏమేమి మంచిగుణము లతనికి లభించినవో అన్నిగు ణాలకు తల్లి శ్రద్ధాపాత్రయేగా !

"మానవుడు అనేకప్రకృతిప్రేరేపణల (Instincts)కు లోనవుతున్నాడు. అటువంటిప్రేరేపణలలో జ్ఞానాన్వేషణ ఒకటిమాత్రమే" అనివ్రాసి ఆప్రేరేపణ లేమిటో వరసగా వ్రాసి చివరకు "మీజాతి యావత్తూ పట్టుబట్టి బ్రహ్మాండంలో ప్రతి అంగుళము జయించ వచ్చును" అని ప్రేరేపించిందన్నారు. ఈఅభిప్రాయం తోనే వ్రాసిన "జైలుఖానా" అనే ఒకకథ వీరిది వెలు వడింది. దానిలోకూడ ఇదేక్రమం వుంది. కాని అదికథ హృదయ తత్వంతో కూడుకున్నది. కనుక పెద్దగా పూర్వాపర సంబంధాలు వెతక నవసరంలేదు. కాని ఇక్కడమాత్రం చాలావివాదాంశం. ఇంకాముందు "జ్ఞానానికి పిల్ల పుట్టింది. అసలుజ్ఞానం ఇదీ! అన్నాడు మానవుడు. భగవంతుడిస్వరూపం అవగాహనచేసకునే టందుకు ప్రయత్నమూ చెయ్యటమూ, ఆ తరువాత అతన్ని సమీపించటానికి ప్రయత్నించటమూ, ఇదీ ప్రతి మానవుడికి కర్తవ్యం!" అని రాశారు. ఈ క్రమ వికాసాన్ని ఏ ఆధారంమీద వూహించినారో మరి నాకు అర్థం కాలేదు. మన భారతీయ దర్శనశాస్త్రం ప్రకారంగానీ, లేక మనోవిజ్ఞానాన్ని ఆధారంచేసుకుని గానీ ఆలోచించితే ఈ వూహ నిరాధారం. అసలు 'జ్ఞానం ఇదీ!' అని తెలిసినవాడు ఎవ్వరూ బ్రహ్మాం డంలో ప్రతి అంగుళము జయించాలనని బయలుదేరడు. (ప్రకృతి - బాహ్యజ్ఞానమే పరమజ్ఞానమనుకునే పాశ్చా త్యులు బయలుదేరవచ్చు) అసలు జ్ఞానమంటే నాభాష లో పూర్ణ ఆత్మప్రకాశమని చెప్పతాను. పూర్ణ ఆత్మ ప్రకాశాన్ని గ్రహించినవాడు "అహం" శబ్దాన్ని మరు స్తాడు. అతను అణుపరమాణువులో తననే చూస్తాడు. సృష్టిలోని చీమకంటె తాను తక్కువనే భావం కలిగి నప్పుడే పూర్ణ ఆత్మజ్ఞానసంపన్నుడని గుర్తు. ఎదుట ఇంకొక వస్తువు వుంటేగా తను జయించేదీ? ఒకే రూపాన్ని తను జయించే దేముందీ? జ్ఞానవిహీనుడై

నంతవరకే విజిగీష వుంటుంది. తాను గొప్పవాణ్ణను కుంటాడు. "అయంపరోఽయం లఘుచేతసాం...... ఉదారచరితానాంతు వసుధైవకుటుంబకమ్." అక్షరాలు రానంతవరకే నేను మహాజ్ఞాని ననుకునేది. జ్ఞానవికాసంతోపాటు భర్తృహరిశబ్దాల్లో తన తుచ్ఛతకూడ పెరుగుతుంది.

సరే ఇక ముందుకు పోదాం. "సృష్టిలోవున్న శక్తులనూ, తనకు ప్రకృతి ప్రసాదించిన శక్తులనూ దుర్వినియోగపరచకుండా మానవుడి స్వేచ్ఛను అవసరమైనంత వరకు అరికట్టటానికిగాను న్యాయచట్టము నీతిచట్టము పుట్టినై." ఈ వాక్యాలు శాస్త్రాన్ననుసరించి రాశారో, లేక మధ్యయుగపు కవులు లక్షణగ్రంథాలే లక్ష్యగ్రంథాలనుకున్నట్లు నీతిచట్టాన్నే సాహిత్యమనుకుని రాశారో వారే చెప్పాలి. ఎందుకనగా, సాహిత్యానికి నీతిచట్టానికి ఎక్కడ ప్రత్యక్షసంబంధంలేదు. తరువాత ఇక్కడ చేసేది సాహిత్యచర్చ. ఇంక మూడోది, ఆదిమసాహిత్యం ఈనియమాలను తీసుకు బయలుదేరలేదు. ముందు ఈ చెప్పింది ఎంత నిజమో చూచుకుని సాహిత్యచర్చకు దిగుదాం. ఈ నీతిచట్టాలు మనుష్యుణ్ణి బంధించటం ఎలా? మన భారతదేశానికి నీతిచట్టం లేదు. ధర్మచట్టం అనండి. వ్యక్తిగత కార్యసాధనకొరకు ఉపయోగింపబడే వుపాయాలు నీతి అనిపించుకుంటాయి. అవే సామూహిక కార్యసాఫల్యంకొరకు ప్రయోగింపబడినప్పుడు ధర్మం. ధర్మం అంటే మంచిచెడ్డలసమన్వయం. ఒకవైపు సమాజపుగృహకళ్యాణబంధనము, రెండవవైపు నిర్లిప్త ఆత్మవిమోచన. ఇదే భారతీయుల ధార్మికవిశేషత. అజ్ఞానంలోంచి జ్ఞానమార్గానికి పోవటానికి సాధనంగావుంటానికే ఈ నియమాలు ఏర్పడినయి. స్వేచ్ఛను కట్టివేయటం ఏముంది? పిల్లవాడిఎదుట కత్తివుంటే చెయ్యికోసుకుంటాడని, అతన్ని అటు వెళ్లవద్దనటంలో స్వేచ్ఛను అరికట్టటం ఏముంది? అజ్ఞానులకే మూర్తిపూజ, రాళ్లపూజాను. తరువాత జ్ఞానికి మూర్తి ఎందుకు? సరస్వతికి నాలుగుచేతులు, వీణ తగిలించి మూర్తిని తయారుచేసి పూజించమన్నది అక్షరాలు నేర్చుకునేవాడినా, లేక విద్వాంసుణ్ణి కూడానా? పతిపరాయణ స్త్రీ పతిఆజ్ఞలో వుండటం, తెలివిగల స్త్రీ చెప్పినట్లు పురుషుడు నడచుకోవడం ఇవి వారి స్వేచ్ఛకు అడ్డంకు ఏం కలిగించుతాయి? లోభాన్ని ప్రేమ అనుకునే యూరోపియనులకు ఒకరిమాట ఒకరికి స్వేచ్ఛాభంగానికి కారణం అవుతుంది. సమాజపు నియమాల నిజానిజం, లాభాలాభాలు తెలుసుకునేముందు మానవప్రకృతిని అర్థం చేసుకోవాలి.

మనుష్యప్రపంచం ప్రకృతియొక్క శ్రేష్ఠరచన. దానిలో ఒకవైపున కరుణ, ప్రేమ, ఉదారత, క్షమ, సానుభూతి మొదలైన అత్యద్భుతదృశ్యాలు కనబడుతుంటే, ఇంకోవైపు ప్రతిహింస, రక్తపిపాస, విశ్వాసఘాతం, జీవనసంగ్రామపు భీకరప్రచండజ్వాలలు అట్టహాసంగా మనుష్యత్వాన్ని నమలక మింగవలెనని కుతూహలపడుతుంటాయి. ఒకవైపు స్వాతంత్ర్యలిప్స వీణానాదం చేస్తుంటే, రెండోవైపు దాస్యజీవనం అతిదుర్వహంగా కనబడుతుంది. మనుష్యజగత్తులో ఒకే పర్యాయం రెండుభావాలు నిరంతరం యుద్ధంచేస్తుంటవి. నిరంతరయుద్ధంలో ఘాత ప్రతిఘాతాల్లోనుండా పోతూ తనను పైకి తేల్చుకో చూడటమే మానవుని ప్రజ్ఞ. నిరంతరం అధోగతికి లాగు ఇంద్రియాలతో యుద్ధంచేసి, సేనతో దెబ్బలుతినికూడ ప్రచండపరాక్రమం చూపి సేనను జయించి సింహనాదం చేస్తూ ఉల్లాసంగా ఇంటికి తిరిగివచ్చు సిపాయిలాగు, తనప్రకాశం పొందగలగటమే మానవజీవనసాఫల్యం. (ఆదర్శవాదపు సాహిత్యంకూడ దీన్నే బోధిస్తుంది.) ఇందులోనే అక్షయ సౌందర్యం వెలుగుతూవుంటుంది. ఈ సౌందర్యంలోనుంచే సమస్తశాస్త్రాలు, కావ్యాలు, సాహిత్యమూ వెలువడుతుంది.

మానవుడి ఈ విరుద్ధప్రవృత్తులే సమాజాన్ని సృష్టించినవి. ప్రకృతి ఈద్వయాన్ని ఒకదాని ఎదుట ఒకదాన్ని దృఢంగా నిలబెట్టింది. మానవుడు సామాజిక జీవం; ఒంటరిగావుండలేడు. ఒకవైపు సామాజిక ప్రవృత్తి సామూహికంగా వుండమని ప్రేరేపిస్తే ఇంకోవైపు స్వార్థభావన సమాజంనుంచి విడతీయ యత్నిస్తుంది.

ఒకవైపు సాంఘిక ఏకీభావమును కలిగించు వివేకప్రవృత్తి అతనిని మహత్తరమైన స్వర్గసోపానాలు ఎక్కిస్తుంటే, రెండవవైపు స్వార్థపిపాస మనుష్యుల్లోంచి క్రిందకు దొర్లిస్తుంది. ఇది మానవజీవితంలో జరిగే నిత్యసంఘర్షణ. మానవప్రకృతి సతతం కిందకే దొర్లుతుంటుంది. అందుకే సహకారం కావాలి. ఆసహకారంకొరకే నియమాలు ఏర్పడ్డవి. ఈ నియమాలు ఈ జ్ఞానం సమాజశాస్త్రంలో వుంటాయి. శుద్ధసాహిత్యంలో కావు. శుద్ధసాహిత్యం దానికి చలనశక్తిని కలుగచేస్తుంది.

ఇక సాహిత్యంలో బాహ్యప్రకృతిని జయించాలననే భావం కనుపడదు. ప్రకృతియొక్క అనంతరూపాలు, అనంతవుపకారాలు ఆదికవిహృదయాన్ని విస్మయవిముగ్ధుని చేసినాయి. అతని శ్రద్ధాపూర్ణ హృదయం నుంచి "కస్మై దేవాయ హవిషా విధేయం" అనే బాలసులభవాక్కులు అమృతాన్ని వర్షించినాయి. ప్రకృతియొక్క ప్రతిదేవత సూర్యుడు, చంద్రుడు, గాలి, జలము-కు యజ్ఞం ప్రారంభించారు. సంఘసౌఖ్యానికే యజ్ఞం చేసేవారు. పరస్పరం ఒకచోట గూడి గొప్ప భావాలు ఆలోచిస్తూ వుండేవారు. ఆవుల్లాసపూర్ణవుద్గారాలే సామగీతాలు.

తరువాత ఆకర్మకాండను మరింత పెంచి తమ స్వార్థంకొరకు బ్రాహ్మణగ్రంథాలు రాశారు. కాని జ్ఞానమార్గాన్వేషకులను అవి ఆపలేకపోయినవి. వారి ఆత్మచింతన అలక్ష్యశక్తిని దర్శిద్దామనే వారిపిపాస. ఇవన్నీ మనకు వుపనిషత్తుల్లో దొరుకుతాయి. భౌతికవిజ్ఞానానికి జ్యోతిషశాస్త్రం, కర్మకాండలకు కల్పగ్రంథాలు, సామాజికజీవితాన్ని బోధించటానికి వ్యవహారశాస్త్రం ఇటు తరువాత రచించబడ్డాయి. ఆ సాహిత్యం అలక్ష్యశక్తినే వుపాసించింది. వారిదృష్టిలో ఈ బాహ్యప్రపంచం సూక్ష్మప్రపంచంలోకి చేర్చే సాధనమేకాని సాధ్యం కాదు. ఆదిమజ్ఞానాన్ని అర్థం చేసుకోవాలంటే ఈమాట గుర్తువుండాలి. ఇంకోవిధంగా అర్థంచేసుకోవటానికి వేదాలకంటె ముందు రచించబడ్డగ్రంథాలు లేవు.

వేదకాలంనాటినుంచి మానవజాతి క్రమంగా అధోగతికి వెళ్లిందంటారు. ఇది వికాసవాదానికి విరుద్ధం. ఇది సాహిత్యానికి నిరాశను, నాస్తికత్వాన్ని బోధిస్తుంది. మానవహృదయంలో నాటుకున్న జ్ఞానాంకురం ఒకప్పుడు పెరగటం ఆగెన, నశించదు. అనుకూలసమయాన్ని పొంది వికసించుతుంది. దీని నిదర్శన మనభగవద్గీత. ఉపనిషత్తులు బోధించే బాలజ్ఞానం భగవద్గీతకాలంలో త్రైకాలిక చిరంతనరూపాన్ని పొందింది. సాంఘికవికాసాన్ని గురించి చెప్పనవసరంలేదు. భారతకాలంలోని సాంఘికవిశృంఖలత క్రమంగా నశించింది. భాషలో, లిపిలో, జ్ఞానంలో అన్నివిధాల వికాసం కనబడుతునేవుంది. క్రమంగా అధోగతికి వెళ్లిందనటం ప్రౌఢజ్ఞానంకంటె బాలజ్ఞానం గొప్పదనటమన్నమాట'

"సంస్కారము పెరుగుతున్నకొద్దీ చట్టరూపమైన న్యాయమూ నీతీ తరిగిపోవాలి. ఇప్పుడు న్యాయచట్టం చేసేపని అప్పుడు సంస్కారమే చేస్తుంది. (ఈనాడు మనం మన ఆడవాళ్లను భర్తలతో సహగమనం చేయించకుండా ఉంచటానికి ఒకచట్టం అవసరంలేదు.)

వ్యాసకర్తదృష్టిలో ఇది సంస్కారరూపం తాల్చింది. సంస్కారమంటే ప్రారంభంలో మంచిదయియుండి, మధ్యలో లక్ష్యభ్రష్టత కలిగినప్పుడు దాని మూలరూపంమీద పట్టిన తుప్పును వదలించటమన్నా కావాలి. లేక మొదటువున్న వస్తువులో లోటును పూర్తిచేయటమన్నా కావాలి. ఇక్కడ ఈ రెంటిలో ఒకటే లేదు. ఈ సహగమనం చట్టసమ్మతమైన నియమం కాదు. అది ఒకభావం. స్త్రీపురుషుల దాంపత్యప్రేమాధిక్యఫలమే సహగమనం. ప్రేమువున్నవాళ్లను లేనివాళ్లను మొగుడుతో వేసి అంటకట్టి బలవంతంగా తగలపెట్టుతూ అతిచేయటమే దాని నిరాకరణకు కారణం. వైదికధర్మంలో కర్మకాండ, జంతుబలి పెరిగినప్పుడు బుద్ధుడు పుట్టి దానిమూలసిద్ధాంతంమీద ధ్యాన మీయక యావత్తు వైదికధర్మం అబద్ధమన్నాడు. అది అందరూ సంస్కారమేననుకుని దానిని ఆదరించారు. కాని శంకరాచార్యులు వచ్చి మళ్లీ యథావిధిగా ప్రారంభించారు. ఇప్పుడు మాత్రం ప్రేమాధిక్యంగల స్త్రీని చావకుండా ఆపగలవారెవ్వరు? మీసంస్కారం చితిమీద పతివెంట తగలపడే

నీయకపోతే, విషంతాగి చావకూడదా? సారాంశం సహగమననిరోధసంస్కారం సాహిత్యం ప్రచారంచేయ దగ్గ వస్తువు గాదు. అది కొద్దిరోజులు "అతి"ని ఆపే చట్టం మాత్రమే.

"మన పూర్వసారస్వతం ప్రచారంచేసిన ధర్మం అప్పుడే కొత్తగా అమలులోకి వచ్చినదీ, ఎక్కువమందికి రుచించినదీ అయివుండాలి; లేదా అప్పటికి గ్రంథకారులకు సాహిత్యంయొక్క ఈ ప్రయోజనం తెలియకపోయి ఉండాలి; అదీ కాకపోతే, ధర్మశాస్త్రం రాసిన సత్పురుషుడే ఆ సాహిత్యంకూడా రాసిఉండాలి." దగ్గరదగ్గర పైన జెప్పినసమాధానమే దీనికి చెప్పవలసి వుంటుంది. సాహిత్యం సాంఘికనియమాలను తీసుకుని బయలుదేరదు. ఏ రూపాలతో, ఏ వస్తువులతో మానవుడు ఆదియుగంనుంచి పరిచితుడయ్యాడో, ఏ దృశ్యాలను, ఏ పనులను చూచి నరజీవనారంభంనుండి మానవుడు లుబ్ధుడు, క్రుద్ధుడు అవుతున్నాడో వాటితో మనభావాలకు మూలసంబంధం వున్నది. అవి మనలను తొందరగా ఆకర్షించకలుగుతేయి. అందుకని కావ్యప్రయోజనంకొరకు ఆమూలరూపాలూ, ఆమూలకర్మలు కావలసివుంటవి. పై ఉదాహరణనుబట్టి పరోక్షవిధి సాహిత్యంలో పనికిరాదంటారు. కాని మనం ఇక్కడ ఒకటి ఆలోచించాలి. ఆదర్శం అనుకరణీయంగాని భోగ్యం కాదు. భోగ్యమైనరోజున ఆదర్శం ఆరూపంలో వుండదు. అది ఒకచోట జడంలాగ నిలిచేది కాదు. స్కూలుఫైనలు ప్యాసుకాని కుర్రవాడికి ఆ పరీక్ష ఆదర్శం. అయినతదుపరి ఇంటర్మీడియేట్. తను చేస్తున్నదానికంటె పైకిపోవాలనుకోవటం, ఎవటు ఒకే మొండిసర్దుపెట్టుకోవటం ఉన్నతిగోరే జీవితసమాజానికి లక్షణం. అందుకనే సర్వభువనసౌందర్యాన్ని ఒకే మూర్తిలో ఆరోపించి ఆనందించటానికి కృష్ణుణ్ణి తయారుచేశారు. రాముణ్ణి శీలము, శక్తి, సౌందర్యాలు మూటికి ఆదర్శంగా నిలబెట్టుకున్నారు. అందుకనే కృష్ణునికంటె రాముడు మనజీవితానికి చాలా దగ్గరగా కనబడ్డాడు. మనజీవితం ఎప్పటికీ అపూర్ణమే. పూర్ణమైనప్పుడుగా, సాహిత్యం పరోక్షశక్తిని ఆశించకుండా వుండటానికి. సృష్టిలో ఏ శక్తియొక్క లోటువల్ల మానవులు బాధపడుతున్నారో, ఆ శక్తిని పూర్తిచేయటానికి కవి ప్రయత్నిస్తాడు. అందుకే కవికి బ్రహ్మకు భేదం లేదని వ్యాఖ్యచేయబడ్డది.

"చట్టంలో నూతనంగా కలిగిన మార్పును సాహిత్యం ప్రచారంచేయవచ్చును. కాని...అమలులో ఉంటూ వున్న నీతికిగాని, న్యాయానికిగాని ప్రచారంఇవ్వటమే సారస్వతం పని అయితే సారస్వతం నీతిశాస్త్రముగానూ, న్యాయశాస్త్రముగానూ మారిపోయి, నిజమైన సాహిత్యలక్షణం పోగొట్టుకుంటుంది."

ప్రచారశబ్దం రెంటికితప్పే. నూతనమార్పు శబ్దంలోనే రాబోయేమార్పుశబ్దంకూడ దాగివుంది. ఉద్దేశ్యప్రచారం ఎప్పుడైన హానికరమే. నీతికి మనస్సుకు సంబంధం. మనస్సు ఆలోచించకుండ ఆనందగత సహజభావాన్ని గ్రహించకూడదంటుంది. అది కళలోని "ఆనందరూప మమృతం" అనేభావాన్ని తీసుకోలేదు. అందుకనే వుపనిషత్తుల్లో గ్రాహ్యశక్తుల్ని విభజించారు. అన్నమయకోశానికి అర్థనీతి, ప్రాణమయకోశపు పుష్టికొరకు ధర్మనీతి, మనోమయకోశానికి కామనీతి, విజ్ఞానమయకోశానికి విజ్ఞాననీతి వేరువేరుగా చెప్పబడ్డయి. ఈ కోశాలన్నింటికి మించినది ఆనందమయకోశం. అక్కడకు చేరుకోవటానికి ఈ నీతినియమాల మూటను బయటపారవెయ్యాలి. ఆనందానికి వెనువెంట వెళ్ళాలిగాని ముందువెళ్ళకూడదు. ఉద్దేశ్యప్రధానగ్రంథం సూక్తిగ్రంథంలాగ తయారవుతుంది. అలాగే రాజనీతికి దేశప్రేమకు సంబంధంలేదు. సహజప్రేమకు సంబంధంలేదు. సహజప్రేమకు నీతికి సంబంధమేమిటి? ఫ్రెంచి చిత్రకారుడు "మిలె" స్వయంగా కర్షకపుత్రుడు. కర్షకులంటే అతనికి అపారమైనభక్తి. అతనిచిత్రాలుకూడ కర్షకుల భోళాతనాన్ని అత్యంత స్వాభావికంగా వెలిబుచ్చ గలిగినాయి. ఆచిత్రాల్లో సారళ్యం వివిధదుఃఖాలతో పీడింపబడుతున్నాయంటూ వాత్మను స్వచ్ఛరూపంలో చూపెడుతోంది. ప్రేక్షకుని హృదయంలో కర్షకులతోటి ప్రేమను పెంపొందింపజేసి అగాధశ్రద్ధ

వాటిల్లో వుట్టిసనుతుంది. ప్రసిద్ధ క్రాంతికారి ప్రూధో (Proudhou) చిత్రాలద్వారా క్రాంతిభావాలు వ్యాపింప జేయవలసిందని ' మిలే 'తో చెప్పాడు. కాని అతను సామ్యవాదప్రచారానికి దిగలేదు. కాబట్టి అతని చిత్రాలు అమరత్వం పొందగలిగాయి.

మహాకవి 'గేటే' రాజనీతిజ్ఞులచేత సతతం చీవాట్లు తింటూనే వున్నాడు. రాజనీతి విశారదుడు "లూడన్"తో మాట్లాడుతూ 'గేటే' ఇల్లాఅన్నాడు: "జర్మనీ నాకు ప్రాణాలకంటె ఎక్కువైనది. కాని జర్మనులు వ్యక్తిగతంగా ఇంత గొప్పవారయివుండీ సమష్టిరూపంలో ఇంతతుచ్ఛాతితుచ్ఛు లయినందుకు నాకు చాలా దుఃఖం కలుగుతోంది." ఆయనదృష్టిలో కళయొక్క చరమధ్యేయం హృదయస్థిత ఉచ్చభావాలను చిత్రించటమే. అందుకనే గులామ్‌జాతిలో కవి రాసిన శాకుంతలనాటకంలో స్వర్గనరకాలు, శిశిరవసంత ఋతువులు సృష్టిలోని సమస్త సౌందర్యం ఒకేచోట కనపడినాయి. అతని ఉదారహృదయం భారతీయ కళను కనిపెట్టగలిగింది.

' What is art ' గ్రంథం రాశిన టాలుస్టాయి నీతిప్రధానంకాని రచనను నిందించాడు. కాని 'Anna Karenin' రాశిన టాలుస్టాయి నీతిసంబంధమైన శుష్కమస్తిష్కాన్ని హృదయరాజ్యానికి బానిసగా చేశాడు. 'కిటే' గార్హస్థ్య జీవితపు శాంతసుఖమయకాంతి మన హృదయానికి విశ్రాంతినిస్తుంది. కాని మనలను ఏడ్పించగలిగేది ' అన్నా ' యొక్క సంఘర్షశీల - దుర్నీతి-పూర్ణజీవితమే. స్వయంకవిబుద్ధి తనశుష్కనీతిని మరచి ఆ దుఃఖాంత జీవితాన్ని చిత్రిస్తూ తన అస్తిత్వాన్ని హృదయసముద్రంలో పోగొట్టుకుంది. ప్రారంభంలో 'కిటీ'యొక్కనీతి పూర్ణజీవితాన్ని సమర్థిస్తూ, అన్నా జీవితాన్ని నిర్దయదృష్టితో చూస్తూ నైతికసిద్ధాంతాన్ని స్థిరపరచ యత్నించాడు. కాని క్రమంగా మానవ జీవితంలోని దౌర్బల్యాలు అన్నా జీవితంపై పురుకు అతన్ని ఆకర్షించినవి. చివరకు ద్రవీభూత హృదయంతో ఏసిద్ధాంతాన్నీ రూఢిపర్చలేక పోయినాడు. అతని కవిహృదయం నీతిని బోధించు ఆచార్యమస్తిష్కాన్ని పరాభవించితీరింది. ప్రతి కళాకారుడు తన ప్రాణప్రేరణతోనే రచనకు దిగుతాడు. ప్రతి పాత్ర యొక్క బాహ్యాభ్యంతర పరిస్థితులను ఆత్మగతం - అవగతం చేసుకునే ప్రపంచంలోకి దింపుతాడు. పాత్రలకు తనహృదయానికి సంబంధం లేకుండా చేసుకుని, వాటి మీద అధికారం చలాయించలేడు.

మన నవ్యసాహిత్యం పూర్వంలాగ కిటికీలు మూసుకు కూర్చోకుండ అనేకసాహిత్యాలతో సంపర్కం కలుపుకుంటున్నది. తత్ఫలితంగా అనేక క్రొత్త క్రొత్త భావాలు, క్రొత్తక్రొత్తపంథాలు లభించుతున్నవి. ముఖ్యంగా పాశ్చాత్య సంపర్కంవల్ల ఎక్కువలాభం కలిగింది. మన కన్నిటికంటె గొప్పమేలు దానివల్ల కలిగింది. విమర్శనా క్షేత్రంలో ఆ సంపర్కం చేతనే " ఉపమా కాళిదాసస్య " అనకుండా కావ్యంయొక్క అంతరంగ బహిరంగ ప్రవృత్తులను విమర్శించటానికి అలవాటు పడుతున్నాం. (అయినా తెలుగులో చక్కని సమాలోచనలు రాయటానికి పూనుకొన్నవారు తక్కువగా వున్నారు.) కథాసాహిత్యం కూడ పాశ్చాత్యుల ప్రసాదమే. కాని, దీనితోపాటు జడవాదం-పాశ్చాత్యులలాగు రెండుదినాలకు ఒకసారి క్రొత్తవాదం బయలుదేరదీయటం-కూడ హెచ్చుతోంది. లోట్లను పూర్తిచేసుకోవటం మరచి మూల సంస్కృతికి ముప్పం తెస్తున్నాం. బాహ్యవిషయాలు ఎవరివి ఎవరు గ్రహించినా సంస్కృతిని మరచి చరించటం మహాఘాతకం. మధ్యకాలంలో మన అంధవిశ్వాసం హెచ్చింది. ముసల్మానులు దేశాన్ని ఆక్రమించితే అంధవిశ్వాసంచొప్పున గోహత్య చేస్తారని దేశాన్ని వారి హస్తగతం చేశారు. తత్ఫలితంగా మన గోవులు రక్షింపబడలేదు. దేశానికికూడ నీళ్లు వదులుకున్నాము. సాంఘిక ఆదర్శాన్ని మరచి వ్యక్తిగత ఆదర్శాన్ని చూపబట్టే పృథ్వీరాజు మనలను దాస్య బంధనాల్లో బంధించిపోయినాడు. ఇట్లే నిష్క్రియవాదులై బ్రాహ్మలు విదేశము వెళ్లినవాళ్లని నాలుకలు కాలవకుండ సంఘంలో చేర్చకూడదన్నారు. బొత్తిగా

వ్యవహారజ్ఞానశూన్యు లయ్యారు. ఆత్మరక్షణకొరకు శరీరాన్ని ఉపేక్షించగూడదనే సిద్ధాంతాన్ని మరచారు. మనయీలోటు విదేశీయులవల్ల తీరిందికాని అతి అవుతోంది. వారు శరీరాన్ని మరచి ఆత్మను ప్రేమించినట్టే మనం ఆత్మను మరచి శరీరాన్ని ప్రేమిస్తున్నాము. ఇది కల్యాణకరం కాదు. ప్రాచ్యదేశీయుల అధ్యాత్మతత్త్వము పాశ్చాత్యులశరీరతత్త్వము కలిపి తయారు చేసిన సాహిత్యం ఎక్కువలాభకారి కాగలుగుతుంది.

మనసాంఘికపరిస్థితులకు, వారిసాంఘికపరిస్థితులకు ఆదర్శాలకు ఎక్కడా పొంతన లేదు. మనజీవితం భావప్రధానం. వారిజీవితం కర్మప్రధానం. మనం సాధ్యమైనంతవరకు బాహ్యాడంబరాలు సంక్షిప్తపరచుకోవాలంటాము. మనుష్యమాత్రునితో మనుష్యమాత్రుడు ఆచరించవలసినసాధారణధర్మమే అక్కడ ప్రచారంలోకి వచ్చింది. కాని మనసమాజంలో విశేషధర్మం ఎక్కువగా వాడుకలోకివచ్చింది. తల్లిదండ్రులయందు పుత్రుడు, పుత్రునియందు తల్లిదండ్రులు, రాజునందు ప్రజ, గురువునందు శిష్యుడు, ఎక్కువవిశేషధర్మాచరణ చూపిస్తారు. అందుకనే హోటళ్లలోతిని ఇష్టము వచ్చినట్లు తిరగటం, కొడుకును చూడబోయినతండ్రికి తిండిఖర్చు బిల్లుచేసి చేతికివ్వటం మనకు ఆశ్చర్యం, ఘృణ కలిగిస్తాయి. మనకు ప్రోత్సాహంతోబాటు ప్రతిబంధకంకూడా ఒకదానివెంటఒకటి జతగావుంటవి. మన సమాజవిధానంలో త్రికరణసంయోగం వుంటే, వారి సమాజవిధానంలో ఒకకర్మమాత్రమే. వారు ప్రవృత్తిని ప్రవృత్తిద్వారా అణచాలంటే మనం ప్రవృత్తిని నివృత్తి ద్వారా తొలగించాలంటాము.

భారతదేశానిది, యూరపుది భావనాభూమి ఒకటైనా దాని వికాసపద్ధతిలో చాలాభేద మున్నది. రవీంద్రనాథుడు చెప్పినట్లుగా పాశ్చాత్యకవిత్వవీణలో అంతరంగధ్వనికంటె బాహ్యోపకరణాలు హెచ్చు. భారతదేశపుసాహిత్యంలో బాహ్యసామగ్రికంటె రసపుష్టిమీద ఎక్కువధ్యానముండుటచేత కవిత్వం ఎక్కువ ప్రాణశక్తిసంధాయిని కాగలుగుతోంది. ఇక్కడి సాహిత్యం ప్రేమప్రధానం. పాశ్చాత్యులది మాదకత్వ ప్రధానం. అది పాశవప్రవృత్తిని భోగంద్వారా దమనం చేయమంటుందే కాని దివ్యభావాన్ని మేల్కొల్పజాలదు. కాని భారతీయసాహిత్యం పాపంయొక్క భీకరపరిణామాన్ని చూపుతూ, దాన్ని విడిచిపెట్టుతూ నీహృదయంలో పుణ్యస్ఫూర్తిని ధరించి బయటకు బయలుదేరమంటుంది. దీనిలో దైవీశక్తి ఆరాధింపబడితే దానిలో ఆసురీశక్తి పూజింపబడుతుంది. అందుకనే ఇక్కడికవిత్వంలో ప్రకాశనశక్తి ఎక్కువ, అక్కడి కవిత్వంలో ప్రగల్భత ఎక్కువ వుంటుంది. వారికి మనరామాయణంలో అంత **Art** కనుపించదు. లక్ష్మణుడు, సుమిత్ర, సీత, భరతుడు మొదలైనవారి చరిత్రలు చదివితే వారు పక్కున నవ్వుతారు. వారు విభీషణుడులాటి వ్యక్తిని జూస్తే సంతోషిస్తారు. కైకేయి మూలకంగానే రావణాసురుడు చంపబడ్డాడుగనుక కైకేయిదూరదర్శితను పొగడుతారు. కాని, భారతీయ కవికి భావం ప్రధానం. అందుకని రాముణ్ణి వెళ్లగొట్టేటప్పుడు కైకేయికి ఏదురభిప్రాయం ఉందో అదే అతనికి ముఖ్యం. అందుకని అతనిదృష్టిలో కైకేయి నీచప్రవృత్తిగల స్త్రీయే. భార్య నపహరించి తిరిగి ఘోర యుద్ధము తలపెట్టిన రావణాసురునికి "రావణా, ఈ రోజు అలసినావు. రేపు రా మరల" అనిచెప్పించటం భారతీయకవికే చెల్లుపాటు. (ఇక్కడ ఆర్యులు అనార్యులు లెక్క కాదు నాకు. శుద్ధకావ్యదృష్టితో చూడాలి.) రణరంగములో యుద్ధానికి వెళ్లిన అర్జునుడికి కలిగిన మోహం, కరుణ భారతీయకవికి ఒకమహత్తరమైన విషయమే. లేనియెడ భార్య నవమానించి, అనేకవిధాల హింసించి, కొంపనైనను ఈయని దుర్యోధనాదులను జూచి అతనికి కరుణ ఏలకలిగింది? మానవత్వాన్ని ప్రకటించే ప్రతిభావము భారతీయకవికి ఆదర్శప్రాయమే. పాశ్చాత్యరచయితల అభిరుచి ఈ ఒక్క ఉదాహరణతో స్పష్టమవుతుంది. ఏషియాకవి "ఉమర ఖయ్యామ్" కవిత్వాలు తన ఆధ్యాత్మతత్త్వంవల్లకాదు. ఇంతవిరివిగా పాశ్చాత్యదేశంలో వ్యాపించకలిగింది దానిలో ఇముడ్చబడిన కల్లు, సారాయి, కైమాడుండలు, నిర్జనవనంలోనినాయిక మొదలైన ఉపకరణాలవల్లనే!

సాహిత్యంలో జీవితాన్ని కృత్రిమంచేయక ఉన్నదున్నట్లు రాయవలెననేసిద్ధాంతం మనలో చాలా విరివిగా ప్రాకిపోతున్నది. ఇది ఎలాసంభవం? కవి హృదయం ఫోటోగ్రాఫీయంత్రంలాంటి నిర్జీవయంత్రం వలె తయారయినప్పుడు గదా అతను తన వ్యక్తిత్వాన్ని మరచి ఉన్నదున్నట్లు చిత్రించటానికి. అతనిలో చిత్రకారునివంటి సజీవహృదయం ఉంది. సంఘాన్ని తను ఏవిధంగా అర్థంచేసుకోగలిగాడో అదేరూపంలో చిత్రిస్తాడు. చిత్రకారుడు ఫొటోగ్రాఫరువలెగాక తన చిత్రాన్ని ఒకచోట యెక్కువరంగు, ఒకచోట తక్కువ రంగు వేసి స్వతంత్రచిత్రాన్ని తయారుచేస్తాడు. దీన్ని బట్టి చూస్తే వాస్తవంగా సాహిత్యాన్ని క్షణికరాష్ట్రీయ అవసరాలకు, సాంఘికదురాచారాలకు ప్రత్యక్షరూపంలో ప్రచారపత్రికగా వినియోగించటం తప్పనుకుంటాను. కవిహృదయం సూక్ష్మరూపంతో వాటి మూలంలోకి ప్రవేశిస్తుంది. అప్పుడే అతను దాని నిదానం ఆలోచించగలుగుతాడు. అతడు యోగిగాక పోయినా ప్రపంచ నాట్యరంగాన్ని దర్శించే నిర్లిప్త దర్శకుడు. అసంయత కల్పనసౌందర్యాన్ని సృష్టించ లేదు. తిండిపోతుకు అన్నంలోని రుచి తెలియదు. శాశ్వతకళ సృష్టించటానికి దీర్ఘచింతనాశక్తి, గంభీర హృదయం కావాలి. సాహిత్యాకాశంలో క్షితిజానికి నలువైపుల వ్యాపించిన సంధ్యారాగమే చూడక, యావత్తు సూర్యమండలను ఆకాశపువిస్తారం అగణిత రూపచిత్రాలు చూడకోరాలి. క్షణంసేపు ఆనందం చేకూర్చే యథార్థాన్ని గ్రహించి వాస్తవికయథార్థాన్ని, దాని విస్తృత ఆదర్శాన్ని మరవటం ఉన్నత సాహిత్యానికి లక్షణంకాదు.

సాహిత్యంలో జీవితాన్ని చిత్రించాలనే ఆందోళన యూరపులో ఫ్రెంచి రాజ్యక్రాంతితో పాటు బయలుదేరింది. (మనదేశంలో ఇది నిన్నమొన్నటి వస్తువు.) ఇంగ్లండులో వర్డ్సువర్తు, ఫ్రెంచిలో విక్టరు హ్యూగో మొదలైన సాహిత్యకారులు ఈ రచనలోకి దిగారు. ప్రారంభంలో దీనిరూపం చాల ఉపయోగకరంగా ఉంది. దానివల్లనే యూరపులో మధ్యకాలీన జీవితం మారిపోయింది. దానిలో నవజీవనజ్యోతులు కనుపించినాయి. కృత్రిమజీవనం నశించి స్వాభావికమైన సరళ సాత్త్వికభావాలు అందుమూలంగా లభించాయి. ఆ సాహిత్యాన్ని మేథ్యూ ఆర్నాల్డు, వాల్టరుపేటరు వంటి సమీక్షక మహారథులకు- ఒకరు జీవనపక్షాన్ని తీసుకుని. ఇంకొకరు కళ, లేక సౌందర్యపక్షాన్ని తీసుకుని ఎవరిదృష్టితో వారు విమర్శించినా ప్రశంసించక తప్పలేదు. కాని కొలదికాలంలోనే యూరపుఅంతట రాష్ట్రీయభావాలు, ప్రాదేశికభావాలు వ్యాపించినయి. రష్యాలో సమాజసంబంధమైన పెద్దక్రాంతి బయలుదేరింది. దానికిఫలంగా రష్యాసాహిత్యం సమాజవాదంలోకి దిగింది. సామాజికంగా, రాజనీతికంగా జరిగే ఆందోళనను ఈగొందిలోంచి ఆగొందిలోకి తెలియజేసే కరపత్రాలే సాహిత్యరూపం తాల్చినాయి.

ఇక 'క్రొత్త ఒకవింత పాత ఒకరోత' అన్నట్టు ప్రాచీన సాహిత్యాన్ని ఆపివేసి ఈ నవ్య-ఆందోళన యూరపంతట వ్యాపించుతూ భారతదేశంలోకూడ వ్యాపించింది. నవ్యసాహిత్య- ఇతిహాసం సంక్షేపంగా ఇదే. సాహిత్యానికి జీవితానికి గల స్వాభావికసంబంధం ఎప్పటికి మంగళమయమే! కాని జీవితాన్నే ద్వేష, అహంకారభావాలతో కలంకితం చేస్తూ సాహిత్యాన్ని కూడ ఆ మురికి గొందులలోనే త్రిప్పటం శ్రేయోదాయకం కాదు.

ఇప్పటిసాహిత్యం విజ్ఞానాన్ని ఆధారంచేసుకుంటున్నది. అందుచేత జీవితాన్ని సమన్వయించటమనే జవాబుదారిని మరుస్తున్నది. సాహిత్యం వస్తువు యొక్క బాహ్యచిత్రాన్ని చిత్రిస్తూకూడ దానిఅంతరంగాన్ని ముఖ్యంగా తన కాధారభూతం చేసుకోవాలి. సైనికుడు దైనంతమాత్రాన సాహిత్య సమీక్షకుడు ప్రశంసాపాత్రుడు గాజాలడు. ఆశబ్దానికి పురస్కారం ప్రజలు ఇస్తారు. సాహిత్యదృష్టిలో ఆసైనికత్వానికి ఏమీ మూల్యంలేదు. సాధారణదృష్టి ఎంతవరకు పరిణామాన్నే ఆలోచించకలుగుతుంది. అతని హృదయాన్ని చదవగలవాడు కవి. భక్కొక్క సైనికుడు

అఖిల ఉల్లాసం ఉండికూడ సమయం వచ్చేసరికి పూర్ణంగా పోరాడలేకపోవచ్చు. దీనికివిరుద్ధంగా ఒక్కొక్క సైనికుడు అదివరకు ఉల్లాసం లేకపోయినా, ఆవేశంలో ఎక్కువమందిని చంపగలగవచ్చు. సాధారణదృష్టి ఈ రెండో సైనికుణ్ణే పొగడకలుగుతుంది. కాని, కవి ఇతనికి ఆ క్షణానికి ఇవ్వవలసినగౌరవమే ఇస్తాడు. అతనిదృష్టిలో మొదటిసైనికుని హృదయంలో వున్న శుద్ధఉల్లాసం నిష్కామశక్తి అతనిహృదయంలోని పశ్చాత్తాపం. వ్యాకులత ఎక్కువమూల్యం కలిగి ఉంటుంది. అందుకనే సాహిత్యానికి మార్పు లేదంటారు. ఈ రెండోసైనికుణ్ణిగురించి కొంతమంది ఎక్కువని తక్కువని వాదించవచ్చు. కాని అతన్నిగురించి వాదించటానికి ఎవరితరంకాదు. సాహిత్యకారుడికి జీవితాన్నిగురించి స్వతంత్రంగా ఆలోచించటానికి, జీవన ప్రవాహాన్ని అనేక మార్గాల తీసుకుపోవటానికి ప్రత్యేక అధికారం ఉండాలి. మనదేశపు దర్శనశాస్త్రాలు గోచరజగత్తుకు మహత్వం ఇవ్వవు. ఆ నిత్యసత్యానికి రసప్రవాహాన్ని జోడించి దానిలో చలనశక్తిని కలుగచేయటము సాహిత్యానికి ఒక ముఖ్యకర్తవ్యం. రవీంద్ర నాథునివంటి విశ్వశ్రేయోభిలాషిని రాజనీతికంగా నిందించటం న్యాయంకాదు. ఆయన స్వదేశప్రేమను, సంపూర్ణమనుష్యత్వం – విశ్వప్రేమసమక్షాన నిలపగలిగాడు. ఆయనవిశ్వప్రేమ ప్రాంతీయ జడత్వాన్ని నాశనంచేయకలిగింది.

సాహిత్యానికి జీవితానికి అవినాభావసంబంధం వున్నా రెంటిలో మౌలికభేదం వుంది. జీవనం ఒక ధారాప్రవాహం అయితే సాహిత్యం ఆ ప్రవాహంలోని ప్రాణమయరమణీయబిందువుల సముదాయం. సాహిత్యం ఎప్పుడు సామాజికజీవితంకంటె ఒక అడుగుముందేవుంది; ఉంటుంది కూడాను. అది మనకు మననయోగ్యంకాని భోగ్యంకాదు. జీవనం మనుష్యత్వాన్ని వ్యక్తపరిస్తే సాహిత్యం దానితోపాటు ఆశాఉత్సాహాలనుకూడ జోడించుతుంది. జీవితం సంపూర్ణతారహితం అయితే సాహిత్యం సంపూర్ణతాసహితం. అప్పుడేగా దానిపేరు సాహిత్యం. అప్పుడేగా సాహిత్యం జీవితానికంటె మహత్వపూర్ణ మనిపించుకొన్నది.

ఈనాటిసాహిత్యం చెత్తలాగు పెరుగుతున్నదని వాదించటం తనమీద తనకు విశ్వాసంలేదని తెల్పటం. లేదా ఇక్కడక్కడ విని అంధవిశ్వాసంతో ఇష్టంవచ్చినట్లు మాట్లాడడం. మంచిచెడ్డలు ఎప్పుడూ ఉంటాయి. వెనకటి సాహిత్యంకంటె ఒకవిశేషత మనకు లభించుతోంది. దానితోపాటు ఒకనష్టంకూడాను. వెనకటి సాహిత్యం కేవలం ఆదర్శాన్ని తీసుకు బయలుదేరింది. రామాయణాదర్శం కావాలంటే చూడండి: లక్ష్మణుడు సీతారాములవెంట పదమూడు సంవత్సరాలు వుండి నిరంతరం సేవ చేశాడు. కాని ఋష్యమూకపర్వతంమీద సీత పడవైచిన నగలను చూపి గుర్తించమంటే కాలిమట్టెలుతప్ప ఇంకయేవీ ఎరగనన్నాడు. మనధర్మంలో మాతృపంచకంలో భ్రాతృజాయకు కూడ స్థానంవున్నది. వదినమరదులమధ్య ఎంత పూజ్యభావం వుండాలో, మానవుడు పవిత్రతను ఎంతవరకు సాధించాలో అంతవరకు పరిపూర్ణంగా చూపబడింది. కాని ఆధునిక సాహిత్యం ఈఆదర్శాన్ని ఇంక ఆచరణయోగ్యం చెయ్యాలంటుంది. దానిఉద్దేశ్యప్రకారం పదమూడు సంవత్సరాలు వెంటఉంటే ఒక్కసారి అయినా లక్ష్మణునిదృష్టి సీతయౌవనంపైపుకు, నగలపైపుకు పోకుండ ఉంటుందా? తప్పక పోయిఉంటుందని. కాని దానిని కవి కప్పిపుచ్చాడు. దీనికి ఉదాహరణ ప్రహ్లాదుని గూర్చి చెప్పబడిన "అన్యకాంతలు కన్నుదోయికి నడ్డంబైన మాతృభావముచేసి మరలువాడు" అను వాక్యంలో 'చేసి' శబ్దం మానవప్రకృతిని బోధిస్తున్నది. లక్ష్మణునిలోకూడ భావసంఘర్షణ చూపించటం తరువాత ఆదర్శాన్ని పొందించటం ఇప్పటి సాహిత్యలక్షణం. జీవితంలో వివిధఘట్టాలను చూపించటమే దీనివిశేషత. దీనివల్ల హాని ఏమంటే అధికారరక్షణకొరకు చరిత్రను బలియివ్వటం. ఇక్కడే సంస్కృతికి దెబ్బతగులుతుందంటాను. మనప్రేమ ప్రేమపాత్రసుఖం తన సుఖమనుకోమంటుంది. ప్రేమపాత్రలో తన అస్తిత్వాన్ని పోగొట్టుకోవటమే తన హక్కును నిలుపుకోవటం.

ఇతరులకొరకు మనం, మనకొరకు ఇతరులు విలపించటం మన భారతీయాదర్శం. కాని పాశ్చాత్యప్రేమ భోగ ప్రధానం; సాధనప్రధానం కాదు. తన కామవాసన తీరు నంతవరకే ప్రేమపాత్రతో అవసరం. ఇతరులకొరకు ఆత్మోత్సర్గత చూపించేసాహసం వారి ఆదర్శంలో లేదు.

కాని "ప్రతిరోజూ భార్యను చావగొట్టుతూ ఉండేవాడికి...చెప్పవలసింది కాంతంకథలు—సీతా రాములదాంపత్యం కాదు." అని ఇంత నిర్భయంగా వ్రాయకలగటానికి కారణమేమిటని ప్రశ్న వస్తున్నది. దీనికి కారణం మన మధ్యయుగపుకవులు. ఆదర్శాన్ని ఎంతవరకు అధోగతిపాలు చేయవచ్చునో అంతవరకు చేశారు. దీన్ని గురించి చెప్పటానికి పూర్వం "భారతం నాటినుంచీ మనకు వ్యసనం మోస్తరుగా అయిపోయిన రసానందం ఈనాడు చంపుకోలేం" అని కృష్ణదేవ రాయల ఆస్థానకవులకొరకు చెప్పినవాక్యాన్ని విమర్శించాలి. అంటే వీరి ఉద్దేశ్యం ఆకవులందరు రసపుష్టికి ప్రయత్నించారని. ఆనాటికవులకు సాహిత్యరసం అర్థం కాలేదంటాను. వారిరసం శృంగారరసం గాదు; వ్యభిచారరసం.

అథర్వణవేదంలో ఉచ్ఛిష్టమాత్రంతో ఆనంద స్వరూపం వికసించుతుందని చెప్పబడింది. అంటే మనుష్యుని రాత్రింబగలు చేయవలసిన అవసరాలు తీరిన తరువాత, ఆ అవసరాలకంటె ఒక విశేషజ్ఞానం క్రమంగా వృద్ధిపొందుతుంది. ఆఉచ్ఛిష్టజ్ఞానాన్నే ఆధారం చేసుకుని ఆనందం ప్రతిఫలిస్తుంది. కళకు మూలం ఆనందం. ఆ ఆనందం ఒక దివ్యజ్యోతి. ఆ జ్యోతి స్వయంప్రకాశం. సాధారణపరిస్థితుల్లో సంఘర్షణ కలిగినప్పుడు ఆ ఆనందం ప్రయోజనీయకార్యాన్ని సృష్టిస్తుంది. కాని ఎప్పుడైతే ఆ ఆనందం ప్రయోజనాతీతరూపంలో పరిస్ఫుటమవుతుందో అప్పుడు తనను తాను ప్రకాశింపచేసుకుంటుంది. ఆత్మజ్యోతిరూపం తాలుస్తుంది. దీపావళికి మనం కాల్చే మందుగుండుసామాను డివిటీలవల్ల మనకు ఆనందం కలగటానికి కారణమేమిటి? దానివల్ల మన కేమీప్రయోజనం లేదు. అగ్ని యొక్క ఆత్మప్రకాశం మనకు ఆనందమిస్తుంది. బ్రహ్మానందం ఈ ఆనందం యొక్క వికాసానికి చరమపరిణతి. దర్శనశాస్త్రప్రకారం ఆ విరాట్‌పురుషుడు ఆనందాన్ని తన హృదయంలో ఆపుకోలేక హృదయంనిండగా మిగిలిన ఉచ్ఛిష్టాంశంతో ఈ సృష్టిని నిర్మించాడు. కళకూడ ప్రతినిత్యం క్రొత్తక్రొత్త భావాలను నవీనరససృష్టిని చేస్తుంది. ఈ రససృష్టీ ఆత్మప్రకాశంవల్లనే కలుగుతుంది. ఆత్మప్రకాశోత్సవమే ప్రయోజనాతీతఆనందం.

కళ కేవలం ఆత్మప్రకాశంవల్లనే కట్టుపడదు. హృదయంలో దాగి అప్పుడప్పుడు అకస్మాత్తుగా దర్శనమిచ్చే సుకుమార అంతర్వృత్తులను, సూక్ష్మసాత్త్విక భావాలను వ్యక్తపరచుటకూడ దాని కర్తవ్యం. ఆకాశంలో అవ్యక్తరూపంలో ప్రవహించేనానాభావాలను పట్టిబంధించి స్వాయత్తపరచుకోటానికే సంగీతకళ, గీతకావ్యాలు పుట్టినై. కళాకారుడి హృదయం ఆకాశంలాగు విశాలంగా స్ఫటికమణిలాగు స్వచ్ఛంగాఉన్నప్పుడుసృష్టిలోని అనంతరూపాలు ప్రతిబింబించగలుగుతవి. అప్పుడే అతను అఖండమైన, ప్రయోజనహీనమైన ఆనందాన్ని చేకూర్చగలుగుతాడు. మన మహాభారతము, రామాయణము ప్రకృతితో పందెంవేసి సృష్టించిన నానారూపాలు నానాభావాలు, నానా చరిత్రలయొక్క సముదాయం. ప్రకృతిపై పుకు చూడకుండానే ప్రకృతిలోని సమస్త వస్తు-భావ-జీవసముదాయాన్ని అనాయాసంగా ఒకచోట చూడగలుగుతాం. ఆ రచనలమూలంలో ఒక నీతిని గురించిగాని, సమస్యాపరిష్కారం కొరకుగాని ప్రచారార్థం వ్రాయవలెననే ప్రవృత్తి లేదు. సృష్టి ఏ విధంగా నిరపేక్షారూపంతో జరుగుతూ వుంటుందో అవి కూడ అందుకే సృష్టించబడ్డాయి. కావ్యదృష్టితో రామాయణమహాభారతాలు ఒకేమార్గాన వెళ్లినవని పామరుణ్ణేగాదు, పండితుణ్ణికూడ అనుకోమంటాను.

నేను సాహిత్యానికి పరిభాషచెప్పతూ ఏమూల రూపాలు, ఏమూలక్రియలవల్ల మనం ఒకప్పుడు ఆకర్షింపబడుతూ, ఒకప్పుడు కోపగించుతూ వచ్చామో ఆ మూలభావాలతో పరిచయం కలగచేసి రసోద్రే

కాన్ని కలగజేయటమే సాహిత్యకర్తవ్య మన్నాను. మూలరూపాలు, మూలభావాలంటే మనం ప్రాచీన కాలంనుంచి చూస్తూ అనుభవిస్తూ వచ్చినవి. రూపాన్ని దృశ్యంగాకూడ తీసుకోవచ్చు. దృశ్యాలంటే కళకళ లాడుతూ పెరుగుతుండే పైరులు, అడవులు, వనాలు, కలకలధ్వనిచేస్తూ ప్రవహించే నదులు, నల్ల బండలమీద తళతళలాడుతూ గంతులేస్తూ ప్రవహించే సరస్సులు, సుమసుమలాడే ఆమ్రమంజరాలు: ఇవి మనకు చిరపరిచితం. మన జీవనంలో వాటిజీవనం కలిసిపోయింది. కాని రాజప్రాసాదులు, వారివిలాసాలు, వారిపార్కులు మన జీవితాన్ని స్పర్శించవు. అలాగే బాలుని జోకొడుతూ ఉయ్యాలపైకి వంగి అనేకభావాల్లో మునిగితేలే మాతృమూర్తిలో ఉన్న సౌందర్యం మనపద్మావతుల భావావేశంలో లేదు. నవవంపతుల లజ్జాశీలనేత్రాల్లో ప్రస్ఫుటమయ్యే ప్రతిభని వేశ్యాకాంతల నిర్లజ్జవక్రకటాక్షాల్లో లేదు. పట్టణాల్లో వంతెనప్రక్కగా కప్పుకోను బట్టఅయినా లేక మట్టిలోపొర్లాడే కూలివాళ్లల్లో వున్న సౌందర్యం ప్రేయసికోరకు ఈగొంది ఆగొందిలో ఎంపరలాడుతూ తిరిగే ధనమదాంధులలో లేదు. జొన్నచేను మంచెమీద కూర్చుని ప్రపంచకష్టాలు మరచి ఆనందంగా పాడుకునే పాలిపాటల్లోవున్న ఆకర్షణశక్తి మోటారుమీదపోతూ రాగయుక్తమైన మధురకంఠంతో పాడేపాటలో లేదు. వున్నవలక్ష్మీనారాయణగారి మాలపల్లి ప్రథమదృశ్యంలో వర్ణించిన కర్షకుడి ఆనందమిశ్రితమనోభావాలు, అతని నిస్వార్థత, అతని భోళాతనం విశ్వనాథసత్యనారాయణగారి ఏకవీరలోని అంతఃపురవివిధవర్ణనలలో లేదు. దీనులకరుణాక్రందనధ్వనిలో భగవంతుని ఆత్మదర్శనంచేసుకోవలసిన యీనాయుగంలోకూడ ఆరాజప్రాసాదములపైనే దృష్టి వుంచి కృత్రిమహీనమైన సరళసౌందర్యంతో జీవనాన్ని గడిపే ప్రకృతిమాత నిజమైన పుత్రులను మరచి సాహిత్యాన్ని 'బూర్జువా'వర్గానికి పట్టారాసిఇవ్వటం, జీవితంలోవున్న వివిధపక్షాలను మరవటం తెలుగుసాహిత్యానికి తీరని ఘోరకళంకం. మనభావదారిద్ర్యానికి కారణము గ్రంథాలయాలలో పుస్తకాలుచదివి సాహిత్యం తయారుచేయటమే. మనసభ్యత తపోవనంలోనుంచి బయలుదేరింది. పల్లెటూళ్లకుపోయి వివిధక్షేత్రాలనుంచి కథావస్తువును సంగ్రహించ కలిగినప్పుడే మనసాహిత్యం పూర్ణమనిపించుకుంటుంది. దుఃఖం, దరిద్రం- ఈరెండు ప్రేమకు, సానుభూతికి కేంద్రస్థలాలు. ఏ భావాలు దేశకాలాల్ని అతిక్రమించి సమస్తమానవజాతిలో ఎల్లప్పుడు వ్యాపించిఉంటవో, అవే కళకు ప్రధానవిషయం- సుఖం-దుఃఖం, అంధకారం-ప్రకాశంతో కూడుకొన్న ప్రపంచంలో కేవలం ఉన్నతసమాజంలోని ఆలోకపూర్ణజీవితాలు తీసుకొని బయలుదేరటం సరివిందగెంజ శాస్త్రాన్ని చరితార్థపర్చటమే. ప్రపంచం దేనిని దుఃఖమంటుందో కవికి అదే సుఖము. (కవి అంటే నా అర్థం మానవజీవితాన్ని చిత్రించేవాడని అర్థం. నియమాలు, అధికారాలకొరకు పోట్లాడేవాడు కాడు.) ధనము, ఐశ్వర్యము, సౌందర్యము, బలము, విద్య, బుద్ధి, ఇవన్నీ ప్రపంచాన్ని ఎంతన్నా మోహింపచేయవచ్చు. కాని కవికి యెక్కడ ఏమిఆకర్షణలేదు. అతని ఆనందం, అతని ఆకర్షణ, చెడిపోయిన ఆశలలో విజయనగరంలోని భగ్నావశేషపు మందిరాలలో, పానీపత్తుయుద్ధంలో, విచ్ఛిన్నహృదయపు అశ్రుకణాలలో ఉంది. ఏదినం అతను వీటిని వదలుకుంటాడో ఆదినం కవిహృదయానికికూడ నీళ్లు వదలుకుంటాడు. దర్శనశాస్త్రము, విజ్ఞానశాస్త్రము ఈ జీవితరహస్యాలతో ఆడుకుంటాయి. కాని కవి దానిలోలీనమై ఆలోచించుతాడు. సంపత్తిప్రాప్తి ధనికుల చరమధ్యేయం కావచ్చు కాని కవులకుకాదు.

"అప్పటికవు లంతా కావ్యకన్యచేత రాయల ఆస్థానంలో గజ్జకట్టి ఆడించారు" ఈ వాక్యం వ్రాయగల సాహసం చూపినందుకు వారికి పదేపదే నమస్కారాలు చేస్తున్నాను. నిజంగా అప్పటిసాహిత్యం చదివితే దుఃఖం పొర్లివస్తుంది. వేదకాలంలో ఏవాణిని దేవీస్వరూపంలో స్మరించారో ఆవాణి రాయలఆస్థానంలో వ్యభిచారిణిభోగంకన్యగా తయారయింది. వారి శృంగారానికి నాయిక రంభ మేనక వేశ్య తప్ప పవిత్రదాంపత్యజీవితాన్ని గడపే యిల్లాలు దొరకలేదు. ధనాశతో కల్ప

14. 11- 5

నాకన్యను వేశ్యగా తయారుచేసి రాజులకాముకత్వాన్ని వృద్ధిచేయగలిగారు. పూజనీయులను మాతృమూర్తుల పయస్వినివక్షస్థలం కామోద్దీపన కలుగజేయు పీనపయోధరాలే కాగలిగింది. రమణీయార్థ ప్రతిపాదకశబ్దమే కావ్య మనుకొని బాహ్యావేశాన్ని పూజించి అంతరాత్మను మాయంచేశారు. కవిత్వానికి శక్తి, సౌందర్యం, రెండు కావాలి. ఆకావ్యాలలో కేవలం సౌందర్యమే సాధింపబడింది. అందుకనే శబ్దసాధన, చమత్కార ప్రవృత్తి తప్ప రసానుభూతిని కలుగజేయుశక్తి ఆకావ్యాలలో తప్పవడొరుకుతుంది. పాండిత్యప్రదర్శన కొరకు ఒక్కొక్క పద్యంలో నాలుగేసి అర్థాలు చెప్పటం చూస్తే శవానికి అలంకారాలుతగిలించినట్లుగా ఉంటుంది. భాషకొరకు భావాన్ని తీసుకున్నారేకాని భావంకొరకు భాషను తీసుకోలేదు. (దుగ్గిరాల బలరామకృష్ణయ్యగారు కూడ ఒకసారి సభావేశాలలో ఈ అభిప్రాయాన్ని వెలిపుచ్చారు.) ఆప్రభావమే ఇప్పటి మహాకవులను సహితం పాడుచేస్తున్నది. ఇంతకు చెప్పవచ్చిందేమంటే మధ్యకాలంలో కవులు స్త్రీలను కేవలం భోగ్యవస్తువులుగా తయారుచేశారు. స్త్రీలయొక్క ఆంతరంగిక సౌందర్యం బాహ్యవిలాసంతో కప్పబడింది. వారి ఆత్మతేజం నశించింది. ఈ అవనతియే స్త్రీలకు దాంపత్యజీవితాన్ని బోధించగూడదని చెప్పుతున్నది. కాని దాంపత్యం బోధించకపోవటం పెత్తదారి అవుతుంది.

"నవ్యసాహిత్యం పుట్టేవరకూ సాహిత్యకళచేత మెదడుకు మెరుగు పెడుతూవచ్చారు. ఈనాడు ఈ సౌందర్యం కవిత్వాన్ని ఆశ్రయించి ఆమెచేత హృదయాన్ని సంస్కరింప జేస్తున్నది." ఇది ఖులాసాగా చెప్పినట్లా, ఏమైన తథ్యం ఉన్నదా? దీనిలో కొత్త లేదు. అర్థం చేసుకోవటంలో పొరపాటు పడ్డారు. హృదయాన్ని బుద్ధి ఎప్పుడూ సంస్కరిస్తూనేయున్నది. హృదయాన్ని బుద్ధి సంస్కరించకపోతే అది పిచ్చివాని ప్రలాపం, లేక ఆత్మస్వగతం అవుతుంది. అప్పుడది సాహిత్యంగాదు, వ్యక్తిగతప్రలాప మవుతుంది. వస్తువుని ప్రేమించటానికి దాన్ని గురించి కొంత తెలియాలి. తెలిసిన తదుపరి ఆవస్తువుపై ప్రేమకలుగుతుంది. కాని ఆవస్తువును పొందటానికి మరల భావసహాయం కావాలి. భావాత్మక వృత్తిసహాయం లేకుండ మనబోధవృత్తి ఏపనిని ప్రారంభించలేదు. కేవలం తర్కబుద్ధితో మనము ఏపనిచేయటానికి పూనుకోలేము. కేవలం బుద్ధి వ్యాపారంతో ప్రారంభించిన కర్మలోకూడ, దాని మూలంలో భావం పనిచేస్తుంది. చాణక్యుని కూటనీతి, అతనిపట్టుదల, నిష్ఠురకర్మలు చూస్తే మనం అతనిలో దయ, కరుణ, ఉల్లాసము, పూర్తిగా నశించిందా అని అనుకుంటాము. కాని దానిమూలంలో ప్రతిజ్ఞాపూర్తియొక్క ఆనందభావన, నందవంశముమీద క్రోధము-ఈరెండు రాగాత్మక ప్రవృత్తులు పనిచేస్తున్నాయి. అతను కేవలం బుద్ధితో ప్రేరేపింపబడిన కొయ్యబొమ్మ కాదు. వర్తమానయుగంలో జరిగే యుద్ధాలు నిరపరాధిజనాన్ని ఇష్టంవచ్చినట్లుసంహరించటంచూస్తే వాళ్లు దయ మొదలైన సత్ప్రవృత్తులు లేనివాళ్లుగా బుద్ధితో ఆడింపబడే కొయ్యబొమ్మల్లాగ కనపడుతారు. కాని కాస్తలోతుగా ఆలోచించితే వారిలోకూడ తనదేశవాసులను సుఖపెట్టాలనే ఉత్సాహం, ఇతర జాతుల మీద ఉండేద్వేషము, ఇంకొకప్పుడు తనజాతీయతా శ్రేష్ఠతను వెల్లడించాలనే గర్వం మొదలయిన రాగప్రవృత్తులు పనిచేస్తుంటవి.

జపానీయుల దేశభక్తి భావప్రధాన మంటారా, లేక బుద్ధిప్రధానమంటారా? అక్కడ తనుచచ్చినా తన జాతి సుఖపడుతుందనేభావమేగా పనిచేస్తుంది! బుద్ధిలో ఈ విశాలధర్మం ఎక్కడ ఉంది? అందుకనే జ్ఞానం ఇది మంచి యిది చెడ్డ అని చెప్పేదేకాని పనిచేసేటప్పుడు వచ్చినట్టు హృదయం చెప్పినట్టు ఒప్పుకోవలసిందే. ఆ పయిన చెప్పిన పరిభాషలో స్థూలదృష్టిలో భేదం కనబడినా సూక్ష్మదృష్టిలో అర్థం శూన్యం.

ఈ పరిభాషమూలకంగానే కథలు హృదయాన్ని స్పర్శించలేకపోతున్నవి. శ్రీనివాస శిరోమణిగారి "ప్రతిఫలం" కథను ఈ పరిభాషలోకే తీసుకువచ్చారు. నిజంగా దానిలో భావాన్ని రేపగలశక్తి యేది? భావాన్ని రేపటానికి ఆ వ్యక్తిమార్పునకు కలిగిన మూలప్రవృ

స్తులు చెప్పాలి. వట్టివిజ్ఞానాన్ని తీసుకొచ్చి పోసుపె డితే కాదు. ఉపదేశించవలసినదంటూనే రెండవపెళ్లి చేసుకునేవాణ్ణి చంపి అతనిమొదటిభార్య స్త్రీత్వాన్ని, మాతృత్వాన్ని కాపాడాలని చెప్పేకథను సమర్థించారు. ఏమికారణంలేకుండా రెండోవివాహం ఎందుకు జరుగు తుంది? దానిమూలంలో కట్నం తక్కువ కావటంచే తనో, స్త్రీ కురూపి అవటంచేతనో, తల్లిదండ్రులు బల వంతంగా మెడకేసి అంటగట్టటంచేతనో, చదువుకున్నది కాకపోవటంచేతనో, ఇద్దరిభావాలు కలవకపోవటం చేతనో ఎందుకో తెలిపితే అప్పుడు సంఘంలోని లోపాలు ఏమిటో ఆలోచిస్తారు. ఇంకొకమాట. దీని వల్ల స్త్రీయొక్క ఆత్మతేజం ఏమయినా పెరిగిందా? ఈ అన్యాయంవల్ల ఆమెకోమలహృదయం ఏవిధ మయిన బాధ అనుభవించిందో చిత్రించగలిగితే ఆమెయొక్క అంతర్వేదనను పాఠకులు గ్రహించ గలుగుతారు. పాఠకులుకూడ కవితోపాటు ముక్తహృద యంతో కన్నీటిధారలను ప్రవహింపజేసి, తమ పాప పంకాన్ని ప్రక్షాళనచేస్తారు. కరుణరసాన్ని కలుగజేయ టానికి 'షేక్స్పియరు'యొక్క "కసాయిఖానా" పనికి రాదు. కరుణరసం కలుగచేయబోయి ఘృణారసం కలి గిస్తారు. మాతృత్వము, స్త్రీత్వము, కలిగించటమేనా జీవనసాఫల్యం? మొగుణ్ణి చంపి ఆతనిభార్యకు మాతృ త్వాన్ని కలిగించటము, ఆ స్త్రీని యింకప్రాణములేని బొమ్మని చేయటము చూస్తే తనస్వార్థాన్ని తీర్చుకోవ టానికి చేసిన ప్రయత్నమని చెప్పక చెప్పచున్నది. స్త్రీ యొక్క ఆత్మతేజాన్ని వాల్మీకి కనిపెట్టాడు. "సీత నిండుగర్భముతో అడవికి వెళ్లటానికి ఒప్పకొన్నదికాని రెండవసారి ప్రజలయెదుట అవమానాన్ని సహించలేక పాతాళానికి వెళ్లిపోయింది. కాని భవభూతి అలంకార శాస్త్రానికి కట్టుపడి చివరకు స్వప్నములో వియోగం ప్రత్యక్షంలో మిలనము కావించాడు.

సభ్యత పెరిగినకొద్దీ మూలభావాలను కృత్రిమ భావాలతో కప్పతారు. కావ్యసృష్టికి పైకప్పు తొలిగిం చవలసిన అవసరం ఉంటుంది. ఇద్దరు అన్నదమ్ములు ఉన్నారు. తమ్ముడు మోసంగా అన్నపాలం తన పేర రాయించుకున్నాడు. ఇది తెలిసినతరువాత అన్నకు కోపం వచ్చింది. సాధారణదృష్టిలో ఈ కోపము అష్టాంపు వ్రాయించినందుకేనని అనుకుంటాం. అప్ప డాకోపానికి ఆలంబనం స్టాంపుగాని తమ్ముడుకాదు. కాని ఆ కాగితంముక్కలోపలఅతని సంపత్తి,పిల్లలనోటిదగ్గర అన్నము అపహరించే దుష్టత్వం దాగి ఉంది. యథార్థంగా అతని క్రోధానికి కారణం ఆకాగితమూ గాదు, దానిమీద రాసిన అక్షరాలూ కాదు. ఇది కేవ లం సభ్యతయొక్క ఆవరణమాత్రం. నోటిలో అన్నం అపహరించితే మెరిమెరి చూచే కుక్కకోపంలోను అతని కోపంలోను భేదంలేదు. కాని సభ్యతప్రకా రం క్రోధం మార్చుకుని "నువ్వు నన్ను నష్టపర్చటాని కేగా ఈమోసం చేశావు?" అని శిష్టతగా చెప్పవలసి వస్తుంది. దీనివల్ల రసాత్మకత కలుగదు. తమ్ముడిలో మనోవికారాలు కలిగించటానికి ఈ క్రిందివిధంగా చెప్పాలి. "ఏమిరా! అబ్బాయి! నీవు నన్ను మోసం చేయటానికి కారణం నన్ను తిండిలేకుండ చంపి నీవు పంచభక్ష్యాన్నాలు భుజించుదామనేగా? నాకు ఉం టానికి గుడిశ అయినా లేకుండజేసి నీవు మేడలో ఉం దామనేగా? రాత్రిపూట నా పిల్లలకు కప్పకోటానికి పైపంచె అయినా లేకుండచేసి నీ పిల్లలకు పగలుకూడ శాలువలు కప్పి త్రిప్పదామనేగా?"

వారు ఉదాహరణయిచ్చినకథలో ఈగుణంలేదు. భావాల్లో వ్యాయామము కలగటానికి ఆ జరిగినకార్యం లోని ప్రకృతగుణాలను చూపి వదలాలి. ఈ కథలో ఆగుణం ఏది? హృదయంలేదు. శుద్ధముక్తిమట్టం మాత్రం ఉంది. వినగానే లాఠీతీసుకొని పరుగెత్తుతాం, ఏప్రక్క నన్నా భార్యను వదలిపెట్టినవాడు ఉంటే అతన్ని చంపి అతని భార్యకు మాతృత్వాన్ని కలిగిద్దామని. సాహిత్యం రాయటానికి హృదయం కావాలి; బుద్ధి కాదు. ప్రతి మనుష్యుడిలోను మంచిగుణం ఉంటుంది. ఒక సమయంలో పడిపోవచ్చు. మరో సమయంలో లేవవచ్చు. లేచినతరుపరి పశ్చాత్తాప పడవచ్చు.

"నా పాత్రలతో నేను ఒకటైపోవటం నా కిష్టంలేదు. అటువంటి రచనలను నేను ఉత్తమతర

గతిలో వెయ్యలేను. కథలలో పాత్రలను కథకుడు ఎందుకు నిర్బంధించాలో నాకు అర్థంకాకుండా ఉంది. నా విశ్వాసాలను నేను నా పాత్రలమీదగాని, పాఠకుల మీద గాని ఎందుకు పామాలి?"

ఈ వాక్యాలు కుటుంబరావుగారు ఈ మధ్య ప్రకటించిన 'కారుణ్యం' అనే పుస్తకపు భూమికలో వ్రాశారు. దీన్నిగురించి టాలుస్టాయిని వాళ్లని ఉదాహరిస్తూ చాలా రాశాను. అయినా కొద్దిగా చెప్పతాను. ఎవరిదన్నా పుస్తకం చదువుతున్నామంటే వారి హృదయం చదువుతున్నామని అనుకోవలసిందని పెద్ద పెద్ద సమీక్షకులు చెప్పతున్నారు.మనం సాహిత్యాన్ని జీవితానికి వ్యాఖ్యలని ఒప్పకున్నా జీవితం,ఆవ్యాఖ్యకు మధ్య వ్యాఖ్యాత,లేక కళాకారుడివ్యక్తిత్వం ఉంటుంది. ప్రకృతియొక్క ప్రతిఅంగంలో మన కొకఅర్థపూర్ణసందేశం నిహితమైఉంటుంది. మనకొరకు దానిని కవి సంపాదించగలుగుతాడు. అతనే ఆ సందేశాలను అత్యంత రమణీయచిత్రాలద్వారా మనయెదుట పెడతాడు. మనం నిన్న ఒకపల్లెటూరు వెళ్లివచ్చాము. అక్కడ మన కేమంతే విశేషత కనుపించలేదు. కాని ఆదృశ్యాన్నే మనం రేపు కవిద్వారా వింటే నోరు తెరుచుకుని ఆశ్చర్యచకితులమై పోతాము. మనం ఆపల్లెటూరులో కళ్లుమూసుకుని తిరిగివచ్చామో, లేక ఆక్షణంలో మనచేతనాశక్తి నశించిందో చెప్పలేకపోతాం. మానవాత్మ విలపించుతూఉంటే అతనిహృదయంకూడా ఏడుస్తుంది. ఆదృశ్యంలో జీవకళను ప్రసాదించేది అతనివ్యక్తిత్వమే. కళాకారుని మానసిక అవస్థావిశేషంలో జీవితం ఏరూపంలో ప్రస్ఫుటితమవుతుందో దానిని మనం సాహిత్యం అంటాము. సాహిత్యంలో మనకు కనుపించు జీవితమూ, ఇంక ప్రకృతిప్రతిబింబమూ తన అస్తిత్వనిరూపణకొరకు మొదట కళాకారుని హృదయాన్ని ఆశ్రయించాయి. ఆ ప్రతిబింబం కళాకారుని హృదయరసాన్ని గ్రోలింది. అతనికల్పన అనే రంగుతో ఉజ్జ్వలమై సత్యంకంటే ఇంక ఎక్కువసౌందర్యాన్ని పొందింది. కళాకారుని వ్యక్తిగతభావాలు దాని ప్రతిఅంగంలో పనిచేసినాయి. అప్పుడు దానికి సాహిత్యంలో స్థానం దొరికింది. కవి ఎంతనిర్లిప్తుడుగా వున్నా జీవితానికి వ్యాఖ్య రాస్తూ తన దృష్టికోణాన్ని మరచిపోడు. వస్తువును తనదృష్టితో చూడటం అతనికి స్వాభావికం. అతను ఏ కొంచెం చెప్పినా తనదృష్టితో చెప్పతాడు. ఆవాక్కుల్లో అతని వ్యక్తిత్వం సమావిష్ట మవుతుంది. అందుకనే నేటి సమాలోచకులంతా కవికృతి అర్థం చేసుకోవటానికి ముందు కవిజీవితాన్ని తెలుసుకోవా ల టున్నారు. ఎంత సౌందర్యపూర్ణమైన రచన అయినా ఇంతవరకు అనావృతరూపంలో, అనగా ప్రథమంలో కవి స్వప్నంలో వికసించిన రూపంలోనే తయారైనది ఒకటి లేదు. కవిత్వం ఒక అస్పష్టస్వప్నం.ఆకారాన్ని ధరిస్తూధరిస్తూ తన ఆదిభవిని పోగొట్టుకుంటుంది. కవిత్వం అనుభూతిగతవస్తు వని చెప్పటం న్యాయమే. కవి యెప్పుడూ భావోద్రేకాన్ని కలిగించటానికి పాఠకులహృదయంతో మాట్లాడుతాడు. బుద్ధితో గాదు. అప్పుడే అతనిరచన సాహిత్యంలోకి వస్తుంది. దీనికి ఉదాహరణగా బుద్ధిప్రధానమైన కుటుంబరావుగారి 'పెంకిపిల్ల' కథ తీసుకుందాం. దానిలో ఒకపుత్రుడు ఎనిమిది సంవత్సరాలు ఒక అమ్మాయిని ప్రేమిస్తాడు. ఆపిల్లను ముద్దుపెట్టుకోకుండా ఒకనిమిషం ఉండలేడు. తరువాత అక్కడి నుంచి కాలేజీకి వెళ్ల వలసివస్తుంది, వెళ్లాడు. కాని అతని ఆత్మ ఎప్పుడూ ఆపిల్లదగ్గర ఉంటుంది. అప్పుడప్పుడు వెళ్లి చూచివస్తూ ఉండేవాడు కూడాను. ఒకసారి శెలవల్లో ఇంటికివెళ్లినప్పుడు అతనినాన్న ఆపిల్ల అక్కాయిని పెళ్లిచేసుకోమని ప్రస్తావిస్తే తండ్రిగారి మాటను ఒప్పుకొని తర్వాత తనమనస్సుని ఈవిధంగా తృప్తిపర్చుకుంటాడు— "నాకు ఒకటే సంతోషం-రుక్మిణి నాకు మరదలు అయిపోతుంది. పెళ్లి అయితే మా యిద్దరిచుట్టరికమూ ఖాయం అయిపోతుంది. తరువాత ఎవరూ దాన్ని మార్చలేరు."

చూడండి: ఇందులో హృదయాన్ని సంస్కరించే కుటుంబరావుగారి భోగప్రవృత్తి మాట్లాడుతున్నది. వ్యాసకర్తయొక్క వేదనావిహీనశుద్ధజ్ఞానసంపన్న తుమ్మకమ సిమ్మకం ఇంకా మనలో ఏంభావాలు రేపుతుంది

పాత్ర నిశ్చలంగా కూర్చున్నప్పుడు ? ఈప్రేమ లోభానికి పర్యాయమా ? లోభంకూడ కాదు. ఈవస్తువుని ఆవస్తువుని రెంటిని పొందుదామనే అపరిపక్వలోభం. పరిపక్వలోభం ఒకవస్తువు లభించేవరకు రెండోవస్తువు జోలికి పోదు. దానికితగినట్టుగా అంతంలో ముద్దులాట సాగింది. పరిణామాన్ని ఆలోచించితే రచయిత సోద్దేశ్యంగా రాసినట్టు స్పష్టంగా కనపడుతుంది. కాని ఇంకామన్నకపడండి. కథకునికున్నతర్కం పాత్రపరిస్థితుల్లో లీనమయింది. శుద్ధకవిహృదయం మనలనుకూడ ఏడ్పింపుతోంది. మరదలకు కూడ పెళ్లి అయినతర్వాత ఆపిల్ల అత్తవారింటిదగ్గర ఉండగా చూట్టానికి వెళతాడు. అప్పుడు బావనుచూచి ఆపిల్లచూడండి, ఎంతవేదనా పూర్ణమైన బాలహృదయంతో మాట్లాడుతుందో! "మనం నిజంగా మళ్లీ చిన్నపిల్లలం అయితే?........ (ఆదుర్దాగా) నువ్వు నన్ను మళ్లీ వెనుకటిమల్లే ముద్దు పెట్టుకుంటావా బావా?" నిజంగా ఈ దృశ్యం నన్ను ఎన్నోసార్లు ఏడ్పించింది.

సారాంశంఏమంటే కవి, లేక రచయితకు హృదయంకావాలి. తనపాత్రలయందు నిష్పక్షపాతంగా ఆలోచించి ఎవరిభాగం వారికి ఇవ్వటంలో ఉపేక్షాభావం చూపకూడదు. సాహిత్యంలో పర్యాయశబ్దాలు వాడినంతమాత్రాన దాని ఉద్దేశ్యం నెరవేరదు. ఒకదురాచార శబ్దంలో ఎన్నోరూపాలున్నాయి. విజ్ఞానంలో దానిరూపాన్ని విప్పిచెప్పనక్కరలేదు. కాని సాహిత్యంలో తన్నటం, కొట్టటం, బెదరించటం వ్యభిచరించటం ఇంక ఎన్నోరూపాలున్నయి. ఆలాగే విజయనగరం శబ్దంలో ఆంధ్రుల మహోన్నతి దాగివుంది. సబర్మతీ ఆశ్రమంశబ్దంలో ముప్పది అయిదు కోట్ల భారతీయుల ఆత్మత్యాగం, అఖండవిజయం ప్రతిధ్వనిస్తోంది. తక్షశిలశబ్దంలో మన భారతీయుల విద్యాధ్యయనం ప్రతిధ్వనిస్తుంది. ఈ ఒక్కొక్కశబ్దం కవికి ఒక్కొక్కకావ్యం. ఆశబ్దాల రహస్యోద్ఘాటనమే ప్రత్యక్షీకరణమంటారు. ముద్దుకృష్ణగారి "వైతాళికులు" నేను చదువలేదుకాని ఆశబ్దమే సాహిత్యానికి వ్యతిరేకాన్ని బోధిస్తున్నది. వారి అశోకవనం, అనార్కళి మొదలైనవి నేను చదివాను. ఆరచనలలో ఆయన విశాలహృదయం ప్రతిబింబించుతోంది. ఉత్తరభారతంలోకూడ వాటి హిందీతర్జుమాలను అనేకమంది ప్రశంసిస్తున్నారు. ఆంధ్రదేశమా, భారతదేశమా అనేది నిష్క్రియవాదం; సారహీనం. ఆంధ్రదేశంకంటెకూడ ముందు తాను, తనగృహంలోని పరివారం ముఖ్యం ఈ రెంటిని సంబాళించుకోవటమే భారతదేశాన్ని ఉద్ధరించటం. ఎవరికివారు తనను బాగుచేసుకుంటే తగువేముంది? రెండుచేతులూ ఆడించితేగా చప్పట్లు మోగేదీ! ఆ వైపునుంచి వారు, ఈ వైపునుంచి వీరు కలిసి ఒకదారిని పోదామనుకోవటమేగదా ముఖ్యమెంటు. తననుతాను సంబాళించుకోలేకపోయినవాడు దేశానికి బరువేగాని చేసేదేముంది ?

సాహిత్యానికి ఖులాసా, లేక మనోరంజనమే ప్రధానమనుకోవటం మార్గాన్ని కేంద్రస్థలమనుకోవటం తప్ప ఏమీలేదు. కవి తాను చెప్పదలచుకొన్న దానిని శ్రద్ధగా వినగలందులకు మనోరంజనాన్ని సాధనంగా ఉపయోగించుకుంటాడు. రైతులు నాటటానికి పూర్వం పొలం దున్ని తడిపి అనుపాకం చేసినట్టుగానే కళాకారుడు ముందు తన వాక్చమత్కారంతో పాఠకునిమనస్సుని చంచలంకాకుండ స్థిరపరుస్తాడు. ప్రతికవికి ఏదో సందేశం ఉంటుంది. కేవలం "ఖులాసా" అనే శబ్దప్రయోగం తననవీనతను ప్రదర్శించటం మాత్రమే.

నేను సాహిత్య శబ్దాన్ని సామూహిక అర్థంలో వాడాను. కావ్యాలను, కథలను, నవలలను, శైలిని ప్రత్యేకంగా విమర్శించటం ఈవ్యాసం ఉద్దేశముకాదు. నాలో అంతశక్తిలేదు. మనసాహిత్యం రూఢిగతమైన కొన్ని అంగాలనుమాత్రమే తీసుకుని విస్తృత ఆదర్శాన్ని, విపులశక్తిని కోలుపోతున్నది. మన ప్రౌఢ కవులు పురాణాలగొడవలో జీవితాన్ని, దేశాన్ని, రాష్ట్రీయతను మరచిపోతున్నారు. మన యువకులు ప్రేయసి; ప్రేయసిని వదలి ప్రకృతిలో అనంతరూపాలను తనలో చూడ ప్రయత్నించటలేదు. ఇది కర్మ ప్రధానయుగం. కర్మద్వారా తనబలాబలాలను చూచు

కునే ఆత్మత్యాగులు, సంఘంకొరకు ప్రాణాలు సమర్పించే వీరశిఖామణులు కళ్ళముందు కనపడుతుంటే సంఘరక్షణకు పూనలేక అడవిలో పారిపోయి తపస్సు పేరుతో కళ్లుమూసుకున్నవారిని చిత్రించటం కాలవిరుద్ధం. నరునిలో నారాయణాంశమును ప్రతిఫలింపజేయు కవులు తెలుగులో చాలతక్కువ. ఇతరసాహిత్యాలలో అలాంటికావ్యసృష్టి జరుగుతోంది. నా యీరాత బాల్యచాపల్యం కాదు. యథార్థం రాస్తున్నాను. మన రామాయణం, మనభారతం ఒకొ్కక్క సంపూర్ణయుగంయొక్క ఇతిహాసాన్ని తెలియచేస్తున్నాయి. మనభారతీయులకు చరిత్రరూపమైన సాహిత్యం లేదు. కావ్యాలే చరిత్రలు, చరిత్రలే కావ్యాలు.

మనకవులు ఎన్నెన్ని పురాణాలో రాశారు; ఎన్నెన్ని మహాకావ్యాలో రాశారు. కాని, వాటివల్ల మన రాష్ట్రీయఇతిహాసం మన సత్యాగ్రహఆందోళన, మనవర్తమానయుగపు ఆత్మశక్తిని వ్యక్తపర్చగల కావ్యాలు (?) ఎన్ని సృష్టింపబడ్డయ్యో పాఠకులే చెప్పాలి. మనపూర్వులు గొప్పవారయితే మనకు కడుపు నిండదనే వివేకానందుని వాక్యం స్మరించాలి. లక్షాధికారులు నాలుగువేలు దానంచేస్తే ఆదానం కవిత్వానికి ముఖ్యవిషయం కాదు. ఉదయం మొదలుకొని సాయంత్రంవరకు కష్టించి తెచ్చిన మానెడుగింజలు ఇంటికి వచ్చిన అతిథికి వండిపెట్టి, తాను పస్తుండి, అతిథికి తన కుక్కిమంచం అప్పజెప్పి, తాను కటికనేలమీద పరుండే సామాన్యమానవుడే – నాభావలో అత్యుచ్చమానవుడు–కావ్యానికి ముఖ్యవిషయం కావాలి. అప్పుడే కవికర్మ పూర్తి అవుతుంది. లీడరీచలాయించే నాయకుల్ని ప్రశంసించేవారే కాని తనకున్న ఆస్తిని పాడుచేసుకుని, చేసుకున్న భార్యను కూటికి చంపి, తల్లిదండ్రుల మమత్వమును విడనాడి, దెబ్బలు తిని, జైళ్లలో మగ్గి, క్షయవ్యాధులతో పీడింపబడుతున్నా దేశానురాగమును వీడని బీద యువకులపై ఇంతవరకు కలమెత్తి నాలుగుపద్యాలు రాయగలిగినకవి లేడు. శ్రీ దువ్వూరు రామిరెడ్డిగారు, రాయప్రోలు సుబ్బారావుగారు, జాషువగారు మొదలైన కవులు ప్రారంభించిన మార్గాన్ని ఎంతమంది అనుకరించగలిగారు. తాను జీవించియున్న యుగాన్ని కలియుగం, పాపిష్ఠియుగం అనుకుని సత్యయుగంలోని స్వప్నం చూడటం కవిలక్షణం కాదు. తనయుగంయొక్క ప్రాతినిధ్యం వహించతగ్గకవులందరు ఆత్మవిస్మృతులై దృష్టిని వెనుకకు మరలించటం శోచనీయం. కథాసాహిత్యంకూడ నవలలు డిటెక్టివు సందేశాలతో కథలు ప్రియుడు ప్రేయసీసంభాషణలతో తనకర్తవ్యాన్ని ముగించుతున్నయి. ఇవన్ని సాహిత్యానికి అంగాలేకాని పూర్ణసాహిత్యం కాదని గ్రహించి దృష్టిని నలువైపుల ప్రసరింపచేయాలి.

న న్నీవ్యాసం రాయటానికి పురికొల్పింది మాతృభావయందలి ప్రేమయే. శ్రీ కుటుంబరావుగారు వ్యక్తిగతంగా నాకు మిత్రులు. వారితో నాకు కొద్దికాలంనుంచి పరిచయంవుంది. నే నే ఉద్దేశ్యంతో రాసింది నావ్యాసమే చెపుతుంది. నావిమర్శలో తప్పులున్నవని ఎవరైనా తెలియజేస్తే నేను సంతోషించుతాను.



# పూర్ణ

[నవల - అనువృత్తము]

వాసిష్ఠగణపతిముని

[నాల్గవభాగము]

## "మొదటి ప్రకరణము"

ఓదార్పు

అర్ధరాత్రికి సుచంద్రుఁ డంతఃపురము ప్రవేశించినాఁడు. పూర్ణచంద్రుని క్షీరాబ్ధి వీచికలవలె నతనిని భృంగాలక ముందుగా నెదుర్కొని సవినయముగా సమ్రాజ్ఞి దగ్గఱకు తీసికొనివెళ్లినది. సమ్రాజ్ఞి ప్రత్యుత్థానము చేసి తన ప్రియవల్లభుని రెండుచేతులు పట్టుకొని తీసికొనివెళ్లి హంసతూలికా తల్పముపైఁ గూర్చుండఁబెట్టినది. రాజు తన ప్రియకాంతను తాను స్వయముగా తల్పముపైఁ గూర్చుండఁబెట్టినాఁడు. భృంగాలక వారి యెదుట వేత్రాసనముపైఁ గూర్చుండినది.

రాష్ట్రసౌందర్య మంతయు శ్రీకాకుల నగరియందు కేంద్రీకరింపఁబడి యుండెను. శ్రీకాకులనగర రామణీయక మంతయు ప్రాసాదమున సంగ్రహింపఁబడినది. ప్రాసాద రామణీయక సారము రాజదంపతుల శయనశాలలో నిమడ్చఁబడినది. ఆయేకాంతశాల యెట్లుండునో మా పాఠకులు యోచించుకొనెదరుగాక.

ఆశాలలో రాజదంపతుల సన్నిధియందు భృంగాలక యొక్కరితెకుఁ దక్క మఱియెవ్వరికిని ప్రవేశాధికారము లేదు. ఈమె యధికారరీత్యా చేటీజనాధ్యక్షురాలు మాత్రమే యైనను ఈమెహస్తక్షేపము సేయని రాజకార్యమే లేదు. చక్కదనమునం దీమె లీలావతీదేవికి సమానురాలు. గడుసుతనమునం దధికురాలు. కొన్ని కార్యములందు లీలావతీదేవిప్రసక్తి లేకయే తాను ప్రభువునకు చెప్పనలవాటీమెకుఁ గలదు. ఈమెకుమారుఁడు కాలనాథాదులకంటె నెంతయో తక్కువవాఁడైనను ఎత్తఁగానే సహస్రపతిపదవిపొందినాఁడనిన నీమెపలుకుబడి రాజసన్నిధిలో నెంతగలదో వ్యక్తమగును. ఈమెదగ్గఱ పెద్దపెద్ద యధికారులు గూడ జోహారులు సేయుచుండిరి. ఈమె హేమచంద్రుని హస్తము చేపట్టుకాలమునం దతఁడు సాధారణ సంపన్నుఁడుగా నుండెను. ఇప్పుడు పదిలక్షల వరాల కధికారిగా నున్నాఁడు.

లీలావతి సునందుని రెండవ కూఁతురు. ఆమె కిప్పుడు నలువదిరెండుసంవత్సరములు వయస్సు. ధవలాక్షి యిచ్చిన యొకరసాయనము సేవించుటవలన నిప్పటికిఁ గూడ నామె యౌవనము సురక్షితముగానున్నది. నిత్యస్మేరమగు నామెముఖకమల మామెసౌందర్యమును చేతికందించిన ట్లుండును. విశాలములగు నామెకను లెప్పుడును ప్రేమ నుద్గా

రించుచుండును. ఆమెసుకుమారాంగకము లలో లావణ్యవారి పాఱుచున్నట్లు కన్న ట్టును. ఆమె యిప్పుడు చక్కగా నలంకరించు కొనియూదారంగుచీరకట్టిసిందూరారుణమగు అనిక తొడిగినది. ఎట్టివేషము సుచంద్రుని కనులకు ప్రియమో అట్టివేషమునే యామె వేసినది. ధవళాక్షి యిచ్చిన వశీకరణమూలి కను ధరించిన పిమ్మట నిప్పుడే యామె తన కాంతుని సంధించినది.

రాజు కాలనాథ గజవీరులతో మాట్లాడి లీలావతీపక్షముయొక్క యధికారము నంత టిని తలక్రిందు సేయుట కంగీకరించి వచ్చి నాఁడు. అతనిప్రేయసి రాజకాళి గూడ నతని నిశ్చయమును తన మధురకంఠముచే బలపఱ చినది. ఇప్పుడు లీలావతిదగ్గరఁ బడినాఁడు. ముందే యామెకు వశంవదుఁడు. ఇప్పుడామె బలవత్తరమగు వశీకరణశస్త్రమును ధరించి యున్నది. దాని ప్రభావమువలననో, లేక స్వభావపరిణామమువలననో యామెముఖ మాదినమున సార్వభౌమునకు మిక్కిలి రమ ణీయముగాఁ గన్పట్టుచుండెను. ఆమెమంద హాసము దానిశోభ నినుమడింపఁ జేయుచుం డినది. ఆమెకు విరుద్ధముగా తా ననేకకార్య ముల నాచరింప సమకట్టుట యతనికి నిజము గానే కష్టముగా తోఁచెను.

ఈరాత్రి గతించిన రెండుయామము లలో లీలావతి ప్రమత్తయై పడియుండ లేదు. తన యధికారమును భంగపఱచు శక్తులు పనిసేయుచున్నవి యని యామె కనిపెట్టినది. పూర్వయామమున విశాలాక్షుని పిలిపించి చాలసేపు మాట్లాడినది. ఆమెమనస్సును బాధించునవి రెండే సమస్యలు. మొదటిది సింహాసనోత్తరాధికారి సమస్య. రెండవది చిత్రకూటరాష్ట్ర సమస్య. ఈ రెంటిలో పతిని తన ప్రక్కకు త్రిప్పుకొనఁజాలనియెడల తా నిన్నాళ్లు చేసిన యధికాడంబరము హాస్యాస్పదమగునని యామె తలంచినది. అం దువలన సర్వశక్తులచే పతిని లోఁబఱచు కొనుట కామె యీరాత్రి సిద్ధురాలై యుండి నది.

ఆమె కైకేయివలె కోపించి పతిని సాధించి యెఱుంగదు గాని సత్యభామవలె నొక్కొక్కప్పుడు ప్రణయకలహముచే కాం తుని వశపఱచుకొనుచుండును. ఆమెప్రధా నాస్త్రము ప్రేమ. సేవించుటయు, తృప్తిపరచు టయు దాని యంగములు.

సుచ–(భృంగాలకనుజూచి) భృంగా! మీ అబ్బాయికి బాహునాథ మీ మధ్య చేసినదియఁట. ఇప్పుడు నిమ్మళించినదా?

భృంగా–పూర్ణముగా నిమ్మళించినది. ఈ దినముననే పనిలోఁ బ్రవేశించినాఁడు.

సుచ—దండనాయక చిత్రసేనుఁడు స్వర్గతుఁడైనాఁడు. అతని దండనాయకపదవి ఖాళీపడినది. ఎవరిని నియమించిన బాగుం డును?

భృంగా— సహస్రపతులలో నుండి నియమింపవలసివచ్చునెడల నా కుమారుని శ్రీవారు మఱవవలదు.

సుచ—(లీలావతిని జూచి) ప్రేయసీ! నీ వేమనియెదవు?

లీలా— పెద్దనాన్న (సేనాపతి రణంధరుఁడు) యెవరిని సిఫారుసుచేసినారు?

సుచ—వారిని నేనడుగలేదు. అడుగఁదలుచుకొనలేదు గూడ. నీవు చెప్పినవానినే నేను నియమించుటకు నిశ్చయించుకొన్నాను.

లీలావతి కిట్టిమాటలు వేఱుసమయములం దెంతో ప్రియములుగా నుండెడివి. ఇప్పుడంతగా నవి రుచించినవి గావు. తనకు గొప్ప యపకారములను చేయ నెంచిన పతి యీ చిన్నయుపకారమును చేయఁజూచుచున్నాఁడని యామె కపోహ కలిగినది. అది భ్రమ గాదు. తాను సంకల్పించుకొనిన ముఖ్యవిషయములలోఁ దప్ప తక్కిన యన్నింటిలోను లీలావతి చెప్పిన చొప్పున నడువవలెనని పార్థివుని యుద్దేశము.

లీలా— మహాప్రభో! రాజకార్యములలో నే ననవసరముగా జోక్యము కలుగఁజేసుకొనుచున్నానని నాకు వాదు వచ్చినది. అందువలన నిట్టివిషయములలో సర్కారువారు నన్నేమియు నడుగవలదు. నేను శ్రీవారి పాదసేవ చేసుకొనుచు సుఖముగా కాలక్షేపము చేసెదను.

సుచ— (భృంగాలకనుజూచి) భృంగా! చాల వేళమైనది. నీ వింటికిఁ బొమ్ము.

రాజు తనభార్యతో నేదియో మాట్లాడ నెంచె నని తలంచి భృంగాలక నిష్క్రమించినది.

అనంతరము సుచంద్రుఁడు లీలావతిని దగ్గఱకు చేర్చుకొనినాఁడు. లీలావతి భర్తపై చేరఁబడినది. తిరిగియు సంభాషణ మారంభించినది.

సుచ—ఔను. నీపై వాదు వచ్చిన మాట వాస్తవమే. చిన్నమామయ్య (సునందుని) మీఁదఁగూడ శాఖామంత్రుల మాట యేమియు చెల్లనీయకుండ తాను సర్వాధికారియై సార్వభౌముని వశపఱచుకొని ప్రజలను బాధించుచున్నాఁడని వాదు గలదు.

లీలా—చిన్న బంశ్రాతును గూడ మానాయన తిట్టియెఱుంగరు. అతఁడు ప్రజాబాధకుఁడఁట. అసూయాపరుల యపవాద కల్పనమునకు మేర యుండదు.

సుచ—ఔను.

ఈ రెండక్షరములును సుచంద్రుని జిహ్వనుండిమాత్రమే వచ్చినవి.

లీలా—ఇంతకును మావారి కదృష్ట దినములు గడచిపోయినవి. ప్రజ లేమనినను నాకు లక్ష్యములేదు. గాని సార్వభౌముని చిత్తము మావారిపై కరుణావిరహిత మైపోయినది. ఎన్నాళ్లనుండియో ప్రయత్నించు నా శత్రువులకోరిక లిప్పటికి ఫలించినవి.

సుచ— నాచిత్తము మీ వారిపై యథాపూర్వముగానే యున్నది. అందువలననే వీరనందుని రాష్ట్రియాధికారమునుండి తప్పించినను తత్తుల్యమగు వేఱే యధికారమునందు స్థాపించితిని.

లీలా—అధికప్రసంగము చేసినందులకు నాతమ్ముఁడు పదభ్రష్టుఁడు గావింపఁబడినాఁడు. ఒకప్రతీహారి కాపనికే పదిపణములపరాధము విధింపఁబడినది, పదిమంది

మెదుట న ట్లవమానింపఁబడినపిమ్మట వానికి మఱియొక యుద్యోగము సృజించి యిచ్చుట కండ్లుతుడుచుటకుఁ గాక మఱి యే మున్నది ?

సుచ—నా ప్రాసాదమునకు మహాకోప కర్తయగు వీరప్రతీహారిని నేను మాట్లాడు చుండునపుడే నేను వానికి కోరినవర మిచ్చు టకు సిద్ధుఁడనైయుండునపుడే సార్వభౌముని గౌరవాధికారము లెట్టివో తెలుసుకొనఁ జాలక బంధింప నాజ్ఞ యొసంగుట యెంత సాహసమో నీవే తెలుసుకొనుము. ఆ సమ యములో అధికర్త నను నేనుపేక్షించు నెడల పట్టణ మంతయు నన్ను స్యాలకదాసు నిగా కీర్తించును. అది యట్లుండనిమ్ము. మఱి యొక్క యవజ్ఞాతకార్యము నతఁడు చేసినట్లు నాకు నిన్న రాత్రియే తెలిసినది. అతఁడు నా ప్రియకాంతను తన మేనవదినెతోఁగూడ గుఱ్ఱపుబండిపై నెక్కించుకొని గణాపవరము వఱకు వాహ్యాళికి తీసుకొనివెళ్లెనఁట. మఱలునపుడు మధ్యమార్గములో దొంగలు ముట్టడింప కత్తి చేతనుండియు దొంగలచే చెట్టుకు విఱిచికట్టఁబడెనఁట. అప్పుడు పూర్ణవచ్చి యాగుంపుతో యుద్ధముచేసి తన సమ్రాజ్ఞిని కాపాడెననియు, అనంత రము ఘనేంద్రుఁడు వచ్చి యామెకు సహా యముచేసి శత్రువధ పూర్తిచేసె ననియు విన్నాను. నీ యాజ్ఞవలన పూర్ణాఘనేం ద్రులు నడిచిన సంగతిని వేఱువిధముగా ప్రకటించిరఁట. ఈ యుచ్ఛృంఖల స్యాల కుఁడు చేసిన పనినికొసకు కత్తిచేతనుం డియు స్త్రీరక్షణకొఱకు ప్రాణమ్ములు నరకు గొనక యుద్ధము సేయకుండ స్వప్రాణ రక్షణకొఱకు శత్రువులకు లొంగిపోవుటను దలంచుకొనఁ దలంచుకొన నా యొడలు మండిపోయినది. నేను లోలోపల క్షమించు కొంటిని. తిరిగియు పగఁబట్టి బహిఃపురమున ననావృతప్రదేశమునఁ బంధుకొను పెద్దబాబు నపహరించుటకు శత్రువుల గుంపు రాఁగా ఘోరకుఁ డపారప్రతాపము చూపి కోట పరువు నిలఁబెట్టెను. తాను పడిన యవ మానమునకు సిగ్గులేక తనరక్షకుఁ డగు ఘనేంద్రునే నీతప్పుఁడు సింహద్వారమునందు తూలనాడినాఁడు. అంతఃపురస్త్రీలను రా జాజ్ఞ లేకుండ రాజధాని కదలించి తీసుకొని వెళ్లుట యెంత యపరాధమో యతనికిఁ దెలిసినదికాదు. అదృష్టవశమున పూర్ణ యడ్డుపడినదిగాని లేనియెడల నాగతి యే మగును ? నా కాంత శత్రువులచేత చిక్కవల సినదేగదా ? అందువలన నేను వీరనందునిపై నంతక్రోధము వహించితిని.

లీలా — ఈకథను సర్కారువారి కెవరు చెప్పినారు ?

సుచ— ఎవరిని మీరు నమ్మిరో యా రథసారథియే ప్రత్యేకముగా కోటకు వచ్చి మహాప్రతీహారితో చెప్పి వెళ్లినాఁడు. మహాప్రతీహారి నాకు చెప్పెను.

లీలావతి నిరుత్తరురాలైనది.

సుచ— నా ప్రియమైన లీలా ! జరిగి నది యేమిమో జరిగిపోయినది. చిన్న మామయ్య తనప్రభువునకు చేసిన సేవకు బహుమానముగా నొక జాగీరు నీయదలంచు

కొనియున్నాను. ఆజాగీరుతోఁగూడ సామంత పదవికూడ నిచ్చెదను. ఆ కార్యమును రేపే నెఱవేర్చెదను.

లీలావతికి చాలకాలమునుండి తన తండ్రి కొకజాగీరును రాజుగారిచే నిప్పించ వలెనని యున్నది. ఇప్పుడు 'రాజు' స్వయముగా తానే మఱునాఁడే తనతండ్రికి సంస్థాన మిచ్చెద నని చెప్పుట యామెకు సంతోషాశ్చర్యములు కలుగఁజేసినది. ఆమె వికసితవదన యై "ఒకసంస్థానమా?" అని ప్రశ్నించినది.

సుచ—ఔను.

లీలా—పెద్దనాన్నగారి (రణంధరుని రాజుగారి ప్రథమభార్యయొక్క తండ్రి) జాగీరతని యనంతర మెవరికి వచ్చునట్లు నిర్ణయించినారు?

ఈప్రశ్న సందర్భానుచితమని పాఠకులు తలంపవచ్చును. ఈ ప్రశ్నద్వారా యుత్తరాధికారి సమస్య విషయములో రాజుగారి భావ మెట్లున్నదో కనుగొనుట కామె యత్నము. అది సఫల మయ్యెను.

సుచ—పెద్దమామయ్యసంస్థాన మతని యనంతరము మనచిన్నబాబుకు వచ్చును. ఒకవేళ మహామండలేశ్వర సత్యకర్మగారు తనకొమారితెను చిన్నబాబు కిచ్చునెడల పెద్దమామయ్యసంస్థాన మతని యనంతరము మనపిల్ల రథినీకుమారికి వచ్చున ట్లేర్పాటు చేసెదను. చిన్నబాబు సింహాసనోత్తరాధికారిగా నిర్ణయింపఁబడుటకుమాత్ర మవకాశములు మిక్కిలి తక్కువగా నున్నవి.

తనప్రియుని యుపన్యాస మతనిపైఁ జేరఁబడియుండిన లీలావతీదేవి కమృతవర్షము వలె నైనది. ఆమాటలు వినఁగానే యామె తనప్రియకాంతునకుసర్వాంగములచే దగ్గఱఁబడి యిట్లు పలికినది.—

"చిన్నబాబుకు సింహాసనోత్తరాధికారి యగుట కవకాశములు తక్కువగా నున్నవి యనెదరా?"

సుచ—ఔను. తొంబదితొమ్మిది వంతులు జ్యేష్ఠపక్షమునకే జయముకలుగును. ఒకవేళ నాప్రాడ్వివాకులలో ముగ్వురు ధర్మపాలబాబువాదమును విని పట్టమహిషీపుత్రునిపక్షమునకు సిఫార్సు చేసిరేని పెద్దబాబును పార్వతీయమహామండలేశ్వరునిగాఁ జేసెదను. నీసంతతి రాజ్యము లేక హీనస్థితిలో నుండు ననిః నీ వెంతమాత్రమును భ్రమపడవలదు.

తనపతి తన కిరితే యనుకూలుఁడుగా నుండుట మూలికాప్రభావమే యని యామె తలఁచెను. ఆమె సుందర కోమలాంగకముల స్పర్శప్రభావమే యని మన్మథుఁ డనుచున్నాఁడు. అతఁడు క్రొత్తగా నేర్చుకొనిన రాజనీతిప్రభావ మని గుట్టెఱింగినవారు చెప్పెదరు. జ్యేష్ఠపక్షమునకు జయము కలుగు నని యతఁడు చెప్పినమాట నిష్కపటమే యైనను అతనిమనస్సులో నుండు జ్యేష్ఠుఁడు కాలనాథుఁడేగాని భోగనాథుఁడు కాఁడు. నూఱువవంతు ప్రాతికూల్యము జయించి నపుడు తా నిచ్చెద ననిన మహామండలమే యతని యుద్దేశములో నూటికి నూఱు వంతులు నిర్ణీత మై యుండెను.

లీలా — నాపతిదేవత యిచ్చిన యీ వరములను నేను నా కొంగులో మూట కట్టు కొనెదను.

రాజు — నేను నీ కెప్పుడును ప్రతికూలుడను గాను. మనఃశాంతితో నుండుము.

ఆ మాటలవలన లీలావతిమనస్సు చల్లపడినది.

## రెండవ ప్రకరణము

### కార్యసాధనము

లీలా — చిత్రకూట రాష్ట్రాధికారము గుఱించి శాంతిసేనాకుమారి సర్కారువారికి పంపిన విన్నపముగుఱించి యేమి చేసెదరు?

సుచ — ఆమె రాజధర్మాసనములో వ్యాజ్యము తెచ్చునని వినికిడి. అప్పుడు మేము విచారణచేయవలసివచ్చును.

లీలా — అసలు శాంతిసేనాకుమారి కాలధర్మము నొందెననియు,విమలుడు వేఱు వివాహము చేసుకొనెననియు వదంతి. విమలుడు తన రెండవభార్యనే శాంతిసేన యను పేరుతో ముందు పెట్టి యాటయాడుచున్నాడట.

విశాలాక్షుని బెత్తాయింపువలన రాణి యీత్రోవ త్రొక్కినది.

సుచ — విచారణలో వాది తనను శాంతిసేననుగా రుజువుపఱచుకొననియెడల వ్యాజ్యము వేఱువిచారణ అక్కఱలేకుండనే కొట్టివేయబడును.

లీలా — నేను సూచించిన రాజీమాట యేమైనది?

సుచ — ఇప్పటి కేమియు తేలలేదు. ప్రయత్నించెదము.

లీలా — గొప్పపదవి యిచ్చి చిరకాల మనుభవించిన పిమ్మట తిరిగియు లాగుకొనుట న్యాయ్యము కాదు.

సుచ — అది నా దానము గాదు. వీరేశ్వరబాబు మాపినతండ్రిగారి కపవిద్ధ పుత్రుడని నమ్మి నే నతనికి చిత్రకూట సింహాసన మొప్పగించితిని.

లీలా — అపవిద్ధపుత్రుడు కాడనియా యిప్పుడు శాంతిసేనాకుమారి వాదము?

సుచ — ఔను. దానిని రుజువుపఱచ వలసిన భారము శాంతిసేనపై నున్నది.

లీలా — రుజువగునెడల —

సుచ — (నిట్టూర్పు విడిచి) అప్పుడామెతండ్రిరాజ్య మామె కిచ్చివేయవలసియేవచ్చును. నీ చెల్లెలనుమాత్ర మప్పుడు తనగతి తాను చూచుకొనుటకు విడిచి వేయను. అంతగొప్ప రాజ్యము మఱియొకటి యీయజాలకపోయినను పూర్వ గౌరవ మేమియు చెడకుండ మంచిసంస్థాన మొకటి యిచ్చి కాపాడెదను. నా ప్రియమైన లీలా! నీ యసంతృప్తికి నే నెంత భయపడుదునో యంతకంటె నధికముగా నధర్మమునకు భయపడుదును. నే నింతకంటె వేఱుగా నేమి సేయగలను?

లీలా — "శాంతిసేనాకుమారికే యొక సంస్థాన మిచ్చి సమాధానపఱుపగూడదా?

సుచ—ప్రయత్నింతునేకాని బలాత్కరింపఁజాలను.

లీలా—రెండుపద్ధతులలో నేపద్ధతిపై రాజీ కుదిరినను మంచిది.

సుచ—ఔను.

ఆమాట తత్కాలము లీలావతిని తృప్తిపఱచుటకే. మనస్సులో తన పినతండ్రి జాబుప్రకార మమలుపఱచుట కతఁడు తీర్మానించుకొనియేయున్నాఁడు.

లీలా—మాతండ్రి కిచ్చు జాగీరులో నౌకరీషర తేమైన నుండునా ?

మహామంత్రిపదవికిని సంస్థానాధిపత్యమునకును సంబంధము కల్పించిన తన పుట్టింటివారి మహామంత్రిపదవి శాశ్వతముగా నుండునని లీలావతియాశ. ఆప్రశ్నయే నరపతికి సునందుని మహామంత్రిపదవిలోనుండి వెంటనే తీసివేయుటకు సందుకల్పించినది. అవసరము వచ్చినపుడే బుద్ధిమంతుల బుద్ధి సాధనోపాయములను వెదకును. ఇన్నాళ్లు కేవలకాంతావశంవదుఁడై సంచరించిన నరపతి యిప్పుడు కాంతను మోసగించుటకు యత్నించుచున్నాఁడు. ఆ ప్రయత్నమునకు తగిన వచనోపన్యాస మతని కలవడినది. అందులకు తగిన యుపాయము లతని కకస్మాత్తుగా స్ఫురించుచున్నవి. అట్టి స్ఫూర్తి వలన నతఁ డిట్లు పలికినాఁడు.

సుచ—ఒక నౌకరి కల్పించి దానితోఁబాటు సంస్థానమును వంశపరంపరాయత్తమునుగాఁ జేయవలెనని నా యుద్దేశము. ఇప్పుడు రాజధానిలో *నరిష్ట యను మహాసభ యొకటి కలదు. ఆనరిష్టకు చిన్న మామయ్యను శాశ్వత సదస్స్పతినిగాఁ జేసి పౌరసామంతుఁ డను బిరుద మిచ్చెదను. ఇప్పటి నరిష్టలో సదస్స్పతిత్వమును రాజనియుక్తుఁ డగు నొక పెద్దమనిషి వహించుచున్నాఁడు. ఇటుపైని ఆపదవి వంశపరంపరాయత్తము గావింపఁబడును.

లీలా — మహామంత్రిగా నుండియే నరిష్టాసదస్స్పతిగాఁ గూడ నుండురా ?

సుచ—అది బాగుండదు. మామయ్యాల నిద్దఱిని విశ్రాంతి తీసుకొనవలె నని చెప్పనున్నాను. విశ్రాంతికాలములో నేచేసిన సేవకు బహుమానముగా సంస్థాన మిచ్చుటయు క్రొత్తగౌరవోద్యోగ మిచ్చుటయు శోభించును.

లీలా—(తనలో) ఈయఁబోవు సంస్థానము మహామంత్రిపదవి విడుచుకొనినను నష్టము లేనంత పెద్దదిగా నుండునో యుండదో ? (ప్రకాశముగా) ఎవఁడైన రాజద్రోహిగాఁ గన్పట్టు దుర్గాధిపతిని తీసివేసి దానిలో మానాయనను స్థాపింపఁ గూడదా ? అప్పుడు క్రొత్త సంస్థానము సృష్టి చేయవలసిన యవసర ముండదే. అమరావతీ దుర్గాధిపతియు, దేవవాటికా దుర్గాధిపతియు పరంతపసంఘముతోఁ జేరి కుట్రలు పన్నుచున్నా రని వినికిరి. మా నాన్న గారికి వారిపై ననుమానము గలదు.

---

* నరిష్ట—ఈ కాలపు కార్పరేషన్ వంటిది. పురకార్యములను నిర్వర్తించు సభ. సభ్యులు రాజనియుక్తులు.

అమరావతీ దేవవాటికా సంస్థానములు గొప్పవి గాన వాటిలో నొకటి తన పుట్టింటి వారికి లభించుటకు లీలావతి యీయామె త్తైత్తి నది. రాజు తన ప్రేయసిభావము తెలుసుకొని యిట్లనినాఁడు—

"వాస్తవమేగాని మహామంత్రిగా పని చేసినవారికి దుర్గపాలకత్వ మిచ్చుట యెక్కువకాదు. సైన్యపు ఖర్చులు పోఁగా వాటిలో నొక సంస్థానమున కెంత రాబడి వచ్చునో యంతకంటె తక్కువగాని యాదాయము గల సంస్థానములనే వీరి కిచ్చెదను. అమరావతీదేవవాటికలు ఖాళీపడునెడల నీవు సిఫార్సుచేసిన యొకని కొకదుర్గమును తప్పక యిచ్చెదను. ఒకటి నాయిష్టము వచ్చినవాని కిచ్చెదను. మొదటి యవకాశమే నీది. (దృఢముగా నాలింగించుకొని ముద్దుపెట్టుకొని) నా ప్రియమైన లీలా! ధర్మముకొఱకును, నీప్రీతికొఱకును నాయధికారమునువినియోగ పఱతును. అక్కఱలేనియపోహలు పడక శాంతిగా నుండుము.

లీలా—నేనుగూడ నా ప్రియకాంతుని ప్రీతికొఱకే జీవించుచున్నాను. నా గుండె చీల్చి చూచుకొనుఁడు. నా హృదయ మెట్లున్నదో బోధపడును.

సుచ—నీ ప్రీతివిషయములో నాకు సంశయము లేదు.

లీలా — క్రొత్త మహామంత్రి సేనాపతు లెవరు?

సుచ — తాత్కాలికముగా దండనాయక చండసేనుని సర్వసేనాపతినిగా నియమించి రెండుమాసములలో సమర్థుఁడగు సేనాపతి నాలోచించి నియమించెదను. మహామంత్రినే వెంటనే నియమింపవలసియున్నది. ఈ విప్లవకాలములో మహావీరుఁడును, మహావిద్వాంసుఁడును, మహానీతివేత్తయు, సర్వజనాకర్షకుఁడును, ప్రవక్తయు నగు పురుషుఁడు మహామంత్రిగా నియమింపఁబడవలసియున్నాఁడు. అట్టివాఁడెవఁడని వెతకుచున్నాను.

లీలా — వీరత్వ మొక్కటి దక్క తక్కినగుణము లన్నియు విశాలాక్షుని యొద్ద నున్నవి.

సుచ — ఈ కాలములోన వీరుఁడు మహామంత్రిగా నుండ నర్హుఁడు గాఁడు.

లీలా— ఆచార్యవిషమసిద్ధియో ?

సుచ—అతఁడు మంచిప్రవక్తగాఁడు. నీతివేత్తయునుగాఁడు. అతఁడిప్పుడు నేయు పని కింకొకరు తగినవారుకూడ లేరు.

లీలా—ఘనేంద్రుఁడు గూడ విషమసిద్ధి మచ్చువాఁడే.

సుచ — ఔను. అతనికి నే నిప్పఁడిచ్చినపనియే చాలును.

సుచంద్రుని యీమాటవలన లీలావతికి గొప్పగండము తప్పినట్లైనది. ఘనేంద్రునకు తన పక్షముపై కొంచెముగూడ సహానుభూతి లేదని యామెకుఁ దెలుసును.

లీలా — ఆచార్య పుత్రుఁడు ధనంజయుఁడో?

సుచ— ఆపిల్లవాఁడు సర్వతోముఖుఁడే గాని యన్నింటిలోను రెండవ తరగతివాఁడే యగును.

లీలా—శ్రీవారు చెప్పిన సర్వయోగ్యతలును జ్ఞానేశ్వరికుమారుఁడు మల్లికార్జుననియొద్దఁ గలవు గాని యతఁడు విఖ్యాత కుటుంబస్థుఁడు గాఁడు.

సుచ — ( తెలియనట్లు నటించుచు ) పూజాగారికురాలుగాఁ బనిచేసిన జ్ఞానేశ్వరి కుమారుఁడా ?

లీలా—"ఔను. అతఁడు ఘనేంద్రునకుఁ దీసిపోవని వీరుఁడు. గుణాకరునకుఁ దీసిపోవని పండితుఁడు. విశాలాక్షునకుఁ దీసిపోవని నీతివేత్త. రూపచంద్రునకుఁ దీసిపోవని సర్వజనాకర్షకుఁడు. ప్రమతికి తీసిపోవని ప్రవక్త. మానాయనగారనేకపర్యాయములు వానిని గుఱించి నాకుఁ జెప్పిరి.

సుచ—అట్లగునెడల నే నతనినే మహామంత్రినిగా నియమించెదను.

లీలావతీదేవి తనమాటకు తనభర్త లొంగిపోయె నని తలంచినది. మల్లికార్జునుఁడు గొప్ప మాతృభక్తుఁడు గాన నతని తల్లి తనభక్తురాలైనందున నతఁడు తనకు వశవర్తిగా నుండు నని యామెనమ్మకము. సుచంద్రుఁడు తనయుద్దేశమును గారడీవాని వలె లీలావతినోటనుండి రప్పించి యుప్పొంగినవాఁ డయ్యెను.

లీలా— కాలధర్మము నొందిన చిత్రసేనునిస్థానే మెవరిని దండనాయకునిగా నియమించెదరు ?

సుచ—నీయిష్టము.

లీలా—భృంగాలక తన కుమారునకాయుద్యోగ మిప్పింపవలెనని కోరుచున్నది. హేమాంగి తనభర్త కాయుద్యోగ మిప్పింపవలెనని ప్రార్థించుచున్నది. వా రిద్దఱిలో నెవరి కిచ్చినను నాకు సంతోషమే.

సుచ—వీరసింహుఁడు చిన్నవాఁడు. కామపాలుఁడు వయస్సుగడచినవాఁడు. వీరసింహున కిట్టిసందర్భములు వేఱుగా నెన్నియో తటస్థింపవచ్చును. అప్పుడు మనము వానినిగుఱించి యాలోచింపవచ్చును. ఇప్పుడాపదుచుపిల్లమగఁడు నడివయస్సు వానికి స్థిర దండనాయక పదవి యిచ్చివేసెదను. అతఁడు మంచిసమర్థుఁ డనియే వినికిరి. పాపమాపిల్ల హేమాంగి తనరాణి యనుగ్రహము యొక్క ఫలితము నిప్పుడు పొందును గాక.

లీలా—నాకుఁగూడ నదియే సమ్మతము గాని భృంగాలకకు కోపము వచ్చునని బెంగ.

సుచ—ఆమెను తృప్తిపఱచుట కొక యుపాయ మున్నది. చండసేనుని దండనాయకుఁడుగా నుండియే సైనాపత్యముగూడ వహింపుమని యాజ్ఞ యీయకుండ దండనాయకపదవి ఖాళీచేసి సైనాపత్యము వహించునట్లుత్తర విచ్చెదను. అప్పుడు వీరసింహునిగూడ దండనాయకునిగాఁ జేయుటకు సాధ్యమగును.

లీలా— సైనాపత్యాధికార కాలము ముగించిన పిమ్మట చండసేనుఁడు తిరిగియు

తన ప్రాతపదవి నాక్రమించును గాన నా తాత్కాలిక దండనాయకపదవి భృంగాలకకు సంతృప్తికరముగా నుండదు గాంబోలును.

సుచ—దుర్గాధిపత్యము ఖాళీ పడు నపుడు మనము చండసేనుని నియమించిన నా చిక్కు విడిపోవును. ఆపదవికి చండసేనునికంటె వేఱు వీరుని నీవు సిపార్సు సేయవని తలంచెదను.

లీలా—చండసేనుని దుర్గాధిపతినిగా నియమించిన కొన్ని చిక్కులు వచ్చును. అతఁడు దత్తపుత్రుని స్వీకరించిన మా అక్కయ్యగారి ఫలినికాసంస్థానము దక్కదు. అందువలన ఫలిని యెవనిని పెండ్లియాడునో వానిని దుర్గాధిపతినిగాఁ జేయుటకు నేను స్థిరపఱచుకొనియున్నాను.

సుచ—చండసేనునకు జీవితకాలము వఱకు దుర్గముపాలించు నధికార మిచ్చి తదనంతరము ఫలిని పుత్రపౌత్ర పారంపర్యముగా దుర్గాధికారమును చలాయింపవలె నని సన్నదులో స్పష్టముగా నుదాహరించిన నతని మర్యాదకుఁగాని, మనఫలిని హక్కుకుఁగాని భంగ ముండదు.

లీలా—ఆపద్ధతి బాగున్నది.

సుచంద్రుఁ డీవిధముగా తన ప్రియకాంతను సామదానోపాయములచే వశపఱచుకొని మహామంత్రి మార్పునుగుఱించి యొప్పించుటయే గాక తిరిగియు నామె యాక్షేపింపకుండుటకు మఱియొకమెరగూడ చూపినవాఁ డయ్యెను.

## మూఁడవ ప్రకరణము

పెండ్లిమాటలు

అనేకకాలమునుండి తన పుట్టింటి కొక సంస్థానమును, తన యక్కయ్య కొక సంస్థానమును రాజుగారిచే నిప్పింపవలె నని తలంచు లీలావతి కార్యార్తి మనోరథము లీడేరినవి. జ్యేష్ఠపక్షమునకే జయము కలుగు నని రాజు కంఠోక్తిగా చెప్పినందున తన కుమారుని రాజ్యాధికారము గుఱించి యామె కుఁ గల యపోహ తొలఁగిపోయినది. చిత్రకూట రాష్ట్రి సమస్యలో భర్తనిశ్చయ మామె కసంతృప్తికరముగా నున్నను విశాలాక్షాదుల సాహాయ్యమువలన నా వ్యాజ్యములో శాంతిసేనకు జయము రాకుండ యత్నింపవచ్చునని యామె యూరడిల్లినది. ఆ మహోత్సాహ సమయములో నామె పెండ్లిమాటలకు ప్రసంగమును దింపినది.

లీలా— అక్కయ్యగారి ఫలిని, మన రథికుమారి వీరి పెండ్లిం డ్లీ సంవత్సరము తప్పక చేసివేయవలెను. గురుకులములో నిన్నాళ్లు విద్యాభ్యాసము సేయుచున్నందున నుపేక్షించియుంటిమి. ఇంక నుపేక్షింపఁ దగదు.

సుచ—అట్లే కానిమ్ము.

లీలా — మనపిల్లకుఁ దగిన వరుఁ డెవ్వఁడు?

సుచ—మన బ్రాహ్మణ వీరయువకులలో మనకుమారికి వివాహ్యు లైనవారు ఐదుగు రున్నారు. భవనందిగారి ఘనేంద్రుఁడు, జ్ఞానేశ్వరిగారి మల్లికార్జునుఁడు,

విశాలాక్షుని పుత్త్రుఁడు పద్మాక్షుఁడు, వాత్స్యాయనవిష్ణుశర్మ, మనరుద్రసేనుఁడు.

లీలా—భృంగాలకగారి వీరసింహుఁడో?

సుచ — ఇంత చిన్నతనములోనే వానికి వాతము వచ్చినది. అట్టిరోగికి మనము పిల్ల నిచ్చుట దగదు.

లీలా— తెలివితక్కువవాఁడు చండసేనబాబు వానికే ఫలిని నిచ్చివేసెద నని పట్టు పట్టియున్నాఁడు.

సుచ — మీయక్కయ్య ధారావతి యేమనుచున్నది?

లీలా—ఘనేంద్రునిపై నామె యాశ పెట్టుకొని కూర్చున్నది.

సుచ—నీయభిప్రాయ మేమి?

లీలా—ఘనేంద్రుఁడు గొప్పవరుఁడే గాని వానికిఁ బెద్దబాబుపై నీషత్తుగూడ ప్రీతి లేదు. అందువలన నేను అక్కయ్యను సమర్థింపఁజాలకున్నాను. మల్లికార్జునబాబున కిచ్చివేసిన బాగుండునని యిప్పుడు నాకు తోఁచుచున్నది.

సుచ— ఆ సంబంధము బాగుగానే యున్నది. ఘనేంద్ర, మల్లికార్జును లిద్దఱును సమానులే యగుదురు. ఫలినిసంబంధము ముందు నిశ్చితమైన పిమ్మట రథినిసంబంధము గుఱించి ప్రయత్నించెదను. ఘనేంద్రుఁడు పెద్దబాబుపై ద్వేషము గలవాఁడు గాఁడు. వదినెగారి యభిప్రాయమును మనము సులభముగాఁ ద్రోసిపుచ్చివేయఁగూడదు.

లీలా— ఘనేంద్ర, మల్లికార్జునులలో నొకరికి ఫలిని నీయవచ్చు ననియా శ్రీవారి యభిప్రాయము?

సుచ—ఔను.

లీలా—రథినీకుమారికో?

సుచ — ఫలినివివాహము స్థిరపడిన పిమ్మట మిగిలినవారిలో కుమారి యెవరి నెంచుకొనునో వాని కిచ్చివేసెదను.

లీలా—కాశ్యప కాలనాథుఁడు మన వారికిఁ దగినవరుఁడు కాఁడంటారా?

సుచ—అసలు తల్లిదండ్రులు దెలియనివాని కెట్లు పిల్ల నిచ్చుట?

లీలా— మహామండలేశ్వర సత్యకర్మ యొద్దనుండి రత్నప్రభావివాహవిషయములో నేదియైన జాబు వచ్చినదా?

సుచ — తాను స్వయముగా నగరికి వచ్చెద నని వ్రాసియున్నాఁడు. వచ్చిన పిమ్మట నేను మాట్లాడెదను. మనపిల్లలలో నతఁ డెవరి కిచ్చినను సరియే, నా కాసంబంధము జేసుకొనవలయు ననియే యున్నది.

లీలా—పూర్ణను శ్రీవారు నిషేధించిరఁట. ఔనా?

సుచ—నిషేధించినమాట వాస్తవమే గాని యిప్పుడా నిషేధము నుపసంహరించుకొనుచున్నాను.

లీలా — ఆమె శక్తియొక్క యవతారమువలె నాకుఁ గన్పట్టినది.

సుచ— ఆమె జన్మగుఱించి లోకులు కల్పించినది యంతయు నబద్ధమని తేలినది.

ఆమెయే శాంతిసేనాకుమారియొక్క కూఁతురు సత్యప్రభ యని నాకు నిజము తెలిసినది. ఈరహస్యమును నీవుగూఁడ నెచ్చటను జెప్పక రహస్యముగా నుంచుకొనుము. వారు ప్రకటించిననాఁడే యది ప్రకటితముకానిమ్ము.

లీలావతి యాసంగతి నాశ్చర్యముతో వినినది. ఆమెను తప్పక భోగనాథరణేశ్వరులలో నొకనికిఁ జేసుకొనవలె నని లీలావతికి సంకల్పము కలిగినది. పిమ్మట నా దంపతుల గోష్ఠి శృంగారములోనికి దిగినది.

## నాల్గవ ప్రకరణము

### మార్పు

విజయ సంవత్సర జ్యేష్ఠశుద్ధ ద్వాదశీ భానువారమునాఁడు మధ్యాహ్న మగువఱకు రాజకీయ రంగస్థలము ప్రశాంతముగా నుండెను. మధ్యాహ్నభోజనానంతరము విశ్రాంతికిఁ బిమ్మట సార్వభౌమునియొద్దనుండి యాజ్ఞాపత్రము లాఱునొకటి వెడలినవి.

మొదటిదానివలన గౌతమసునందుఁడు పౌరసామంత బిరుదముతో నరిష్టకు స్థిర సదసస్పతిగా నియమింపఁబడినాఁడు. కాశ్యప ప్రమతి యుపసదసస్పతిగాను, కార్యనిర్వాహకుఁడుగాను ఉండవలెనని యందులో నుదాహరింపఁబడినది. ఆయాజ్ఞాపత్రమున కనుబంధముగా నొకసంస్థానము నిచ్చు సన్న దొకటి యతనికి (సునందునకు) పంపఁబడినది. దానిలో నతని వంశపరంపరాధికారమువివరింపఁబడినది. మహామంత్రిపదవినుండి యతనికి విశ్రాంతి వేఱుపత్రముద్వారా యొసంగఁబడినది,

రెండవ యాజ్ఞాపత్రమువలన దండనాయక చండసేనుఁడు తాత్కాలిక సేనాపతిగా నియమింపఁబడినాఁడు. ప్రాఁత సేనాపతికి విశ్రాంతి వేఱుపత్రము ద్వారా యొసంగఁబడినది.

మూఁడవ యాజ్ఞాపత్రమువలన సహస్రపతి కామపాలుఁడు చిత్రసేనునిస్థానే దండనాయకుఁడుగా నియమింపఁబడినాఁడు.

నాల్గవ యాజ్ఞాపత్రమువలన సహస్రపతి వీరసింహుఁడు చండసేనునిస్థానే తాత్కాలిక దండనాయకుఁడుగా నియమింపఁబడెను. అచిరకాలములో నదియే స్థిరోద్యోగముగా మార్చఁబడు నని లీలావతి భృంగాలకుఁ జెప్పి సమాధానపఱచినది.

ఐదవయాజ్ఞాపత్రము వలన శతపతి కాలనాథుఁడు కామపాలుని స్థానే సహస్రపతిగా నియమింపఁబడినాఁడు.

ఆఱవయాజ్ఞాపత్రమువలన వాత్స్యయన విష్ణుశర్మ వీరసింహునిస్థానే తాత్కాలికసహస్రపతిగా నియమింపఁబడినాఁడు.

ఏడవ యాజ్ఞాపత్ర మత్యంతప్రాముఖ్యముఁ గలది. దానివలన శతపతి మల్లికార్జునుఁ డాంధ్ర సామ్రాజ్యమునకు మహామంత్రిగా నియమింపఁబడెను.

ఈమార్పు ప్రజల కాశ్చర్యముఁ గలిగించినది. ఇరువదిరెండుసంవత్సరములనుండి రాజ్యమేకాధ్వరముగా నేలుచుండిన వ్యక్తి యొక సంస్థానము బలిగా పుచ్చుకొని రాజకీయ రంగమునుండి నిష్క్రమించినది యని రూఢ

చంద్రుఁడనెను. ఇది సామ్రాజ్యమునకు క్షేమంకరమగు మార్పని యాచార్యవిషమసిద్ధి పలికెను. శత్రువులు దీనివలన తపింతురని ధర్మపాలసూరి వచించెను. సుచంద్రునకు సమయమునందు మంచితెలివి పుట్టినది యని యాచార్యభవనంది వక్కాణించెను. సామ్రాజ్యచరిత్రములో నిది యెన్నఁదగిన దిన మని కాశ్యపప్రమతి భాషించెను. భీష్ముని మించిన వీరుని, విదురుని మించిన ప్రజ్ఞావంతు నాంధ్రసామ్రాజ్యలక్ష్మీమహామంత్రినిగాఁ దనభాగ్యపరిపాకమువలనఁ బొందినది యని ఘనేంద్రుఁడు హర్షించెను. బహుదిన సంకల్పితమగు శివంకరసంఘముయొక్క కోరిక యీడేరెనని కాలనాథుఁడు సంతోషించెను. ఈ నియమనము మిక్కిలి బాగున్నది యని భీమనాథుఁడు కొనియాడెను. ఇంక కుండినులకు భయములేదని పూర్ణ నిర్ణయించినది. నా తండ్రి యిన్నాళ్లకు స్వతంత్రుఁడై పనిచేసెనని రథిని యానందించినది. లక్షణజ్ఞానములో గొప్పచెయ్యేగాని క్రియాచరణములో నెట్లుండునో యని విశాలాక్షుఁడు సంశయించెను. గుణాకరున కా సంశయము లేదు. హేమచంద్రుఁడుమాత్రము కుబ్జ వాంద్రరాజ్య మారంభించెనని విలపించెను. పురజనుల శ్లాఘాధ్వనులలో నా విలాప మెవ్వరికిని వినఁబడలేదు. క్రొత్త సంస్థానాధిపత్యపు సంభ్రమములో సునందుఁడు కొట్టుకొనుచున్నాఁడు. తాను చిరకాలము బ్రతికినందులకు మంచివార్త వింటి నని రణంధరుఁడు వ్యక్తీకరించెను.

## ఐదవ ప్రకరణము

### దండనాయక వీరసింహుఁడు

క్రొత్తగా దండనాయకపదవిఁ బొందిన తనభర్త కామపాలుని హేమాంగి ప్రసన్నముఖముతో నెదుర్కొనినది. నీవాక్యప్రతాపమువలననే నా కీ మహాపదవి లభించె నని భర్త భార్యను కౌఁగిలించుకొనెను. అత్తగారింద్రవతి యాదృశ్యముఁ జూచి మిక్కిలి యానందించినది. అభిలషిత మగు పై శిఖరమునకుఁ గామపాలుఁడు వచ్చివేసెను. ఆ క్రొత్త యుద్యోగమునకుఁ దగిన శక్తి సామర్థ్యము లతనికి లేకపోలేదు. హేమాంగి మందహాసములు వాటినిఁ బుష్టీకరించినవి. ఆమె ప్రియవార్తలు వాటిని బైకి లేవనెత్తినవి. అత్తగారి యభినందనము వాటికి దోహద మిచ్చినది. అప్పుడుగూడ విష్ణుశర్మ తన తల్లినిఁ జెల్లెలను భావుకునిఁ జూచుటకు రాలేదు గాని మనసా కొంత సంతోషింపకుండ నుండఁజాలకపోయెను. తనకుఁ గ్రొత్తగా వచ్చిన సహస్రపతి పదవీలాభము గూడ నాసంతోషమునకుఁ గొంత కారణము కాకపోలేదు.

చండసేనుని యింటి యుత్సాహమునకు మితియే లేదు. భావిదుర్గాధిపతిపదవి యతని మహోత్సాహమునకుఁ గారణము. అతని మనోరథవీథిలో నమరావతీదుర్గ మప్పుడే యాడుచుండెను. దేవవాటికకంటె నమరావతియే మంచిదని యతని భావము. తనమఱదలి సిఫార్సువలన దానినే పొందవలె నని యతఁడువ్విళ్లూరుచుండెను.

సునందునియింట హర్షవిషాదములు తుల్యములుగా నుండినవి. సంస్థానము వచ్చినది యని హర్షము. మహామంత్రిపదవి పోయెనని విషాదము. రుద్రసేనుఁడు మాత్ర మమిశ్ర మగు నానందముఁ బొందినవాఁడయ్యెను. తన తాతగారి సంస్థానమునకుఁ దానే వారసునని వాని యుల్లాసము. వీరనందునకుఁ దన రాష్ట్రియపదవి పోయినది యను దుఃఖముతోఁబాటు తనతండ్రిగారి మహామంత్రిపదవి పోయిన దుఃఖము చేరినది. అందువలన నది పెద్దది యైనది. సంస్థానలాభసంతోషములో నతని కంతగా భాగము లేకుండెను. అతఁడు దాని కనంతరవారసు కాకపోవుటయే యందులకుఁ గారణము.

ఇంక దండనాయక పదవిఁ బొందిన వీరసింహుని గుఱించి కొంత చెప్పవలసి యున్నది. అతని గాయ మిప్పుడు పూర్తిగా నారిపోయినది. అతఁ డొక తెల్లని గుఱ్ఱమెక్కి దానిని వీథులలో మెల్లగా నడిపించుకొనుచుఁ బోవుచున్నాఁడు. అది యొక ప్రదర్శనోత్సవమువలె నుండెను. మధ్యమార్గములో నతఁడు గుడిచేటి కోమలాంగి వక్రకటాక్షములకు గుఱియయ్యెను. ఇంకొకచోట మేడపై నిలఁబడి చూచు కాంతామణి నిశాతకటాక్షములకు లక్ష్యమైనాఁడు. మఱియొకచోట వీథిగడపలోనికి వచ్చి సంభ్రమముతోఁ జూచు చించాక్షి సురామత్తమద దృష్టులకు లోనైనాఁడు. వేఱొకచోట పూర్ణామణిమాలల సపరిహాస దృష్టులకుఁ బాత్రుఁ డయ్యెను.

త్రోవలో ననేకు లతనిని కుశలప్రశ్న యడిగిరి. అనేకు లతని యారోగ్యముగుఱించి ప్రశ్నించిరి. అనేకు లతని క్రొత్త యుద్యోగము గుఱించి ప్రశంసించిరి. నా భీకరమైన కత్తియే నా కీయుద్యోగ మిప్పించెనని యతఁడొక మిత్రునితో సాడంబరముగాఁ బలికెను. అతని మనస్సాక్షి యామాట నాక్షేపించినది. అతని భీకరమైన కత్తి పూర్ణదగ్గఱ సీసపుల్లకంటె నిస్సార మైపోయినది. అంతియే గాదు. అతనిదగ్గఱనుండి యది లాగుకొనఁబడినది. అతని భుజప్రతాపము పూర్ణయొక్క శస్త్రీజ్వాలలో ముందే భస్మీభూత మయ్యెను. ఇది యతని తల్లి వచనప్రతాపము.

ఆ యూరేగింపులో నతని గుఱ్ఱమున కెదురుగా రాజకాళి కనిపించినది. అతఁడు తన గుఱ్ఱమును దారి తప్పించి నడుపుటకు సిద్ధుఁడై యుండ రాజకాళి యీ క్రింది పాటలచే నా క్రొత్త దండనాయకుని సముచితముగా నభినందించినది.

"నీతండ్రిలో లేదు నీయొంట లేదు
నీతల్లి భృంగమ్మ నీకిచ్చె బలము.
నీరాశిలో లేదు నీచేత లేదు
నీరాణి లీలమ్మ నీకిచ్చె బలము.
భంగంబు రాకుండ భంజనమందు
భృంగమ్మ రాదురా సింగన్న! వినుము.
ఆలంబు వచ్చెడు కాలంబునందు
లీలమ్మ రాదురా బాలుఁడా! వినుము."

రాజకాళి పాటలతో నా యూరేగింపు సముత్సాహ మంతయు మంటఁ గలసిపోయినది. దండనాయక వీరసింహుఁడు కొరడాతో రాజకాళినిఁ గొట్టఁ నుంకించెను గాని యామె శీఘ్రగతితో పలాయితురాలైనది. అదృష్టవశమున నామెయొంటిపై దెబ్బ పడినదిగాదు.

## ఆ ఱ వ ప్ర క ర ణ ము

### కర్ణియు, రథినియు

కర్ణి శ్రీకాకులనగరిలో మిక్కిలి ప్రసిద్ధురాలు. ఆమె మహావీరుఁడగు భీమనాథుని తల్లి. శక్తిధర రథినులకు దాది. ఆమె ప్రకటముగ పెండ్లికిముందే గర్భిణియై భీమనాథునిఁ గనినది. స్వజాతీయు లగు నాగు లామెను బహిష్కరించిరి. బ్రాహ్మణు లామెను తమలోఁ జేర్చుకొనలేదు. ఇట్లుభయసంఘ భ్రష్టయై కొన్నాళ్లామె కాఁపురముఁజేసినది. పిమ్మట నాగు లామె నొకపరతుపైఁ జేర్చుకొనుట కంగీకరించిరి. "నాతండ్రిసంతతికొఱకు నే నొక ఋషివలన పిల్లవానినిఁ గంటిని" అని యామె సంఘపరిషత్తు నెదుటఁ జెప్పవలెనని యాపరతు. అప్పు డామెను తిరిగియు జాతిలోఁ జేర్చుకొని యామె కుమారుని మాతామహుని పుత్రునిగా నిర్ణయించెదమని సంఘమువా రన్నారు. ఆపరతు నామె యొప్పుకొనినది గాదు. కొన్నాళ్లక్రిందటఁగూడ చంద్రసేనుఁడు కర్ణిభీమనాథులను పైపరతు నంగీకరించి నాగులలోఁ జేరిపోవలె ననియు, నట్లు చేరునెడలఁ దనకొమారితె నిచ్చెద ననియు ననురోధించినాఁడు. అప్పుడుగూడఁ గర్ణిభీమనాథు లంగీకరింపలేదు.

ఆకాలమునందుఁగూడ బ్రాహ్మణుల ధర్మశాస్త్రము మిక్కిలి కఠిన నియమములు గలది. ఒకని తల్లితండ్రు లిద్దఱును బ్రాహ్మణులైనఁగాని బ్రాహ్మణులలో నాపిల్లవాఁడు చేరుట కష్టము. తండ్రి గొప్పమహర్షి యగునెడల బీజప్రాధాన్యముపై బ్రాహ్మణ జాతిలోఁ జేర్చుకొనుట కవకాశ మున్నది కాని కులపరిషత్తు ఆతండ్రిని మహర్షినిగా నిర్ణయింపవలసియున్నది. ప్రకృతములో జటామునిని మహర్షినిగాఁ గులపరిషత్తువా రింకను నిర్ణయింపలేదు. జటామునియే భీమనాథుని తండ్రి యను విషయముగూడ ధ్రువ పఱుపఁబడలేదు. ఆ రెండుకారణములవలన భీమనాథుఁ డింకను బ్రాహ్మణులలోఁ జేర్చుకొనఁబడలేదు.

కర్ణి సంఘబహిష్కృత యన్న పేరు మాత్రమే కాని యుభయసంఘములలోను ఆమెకు మంచి గౌరవ ముండెను. ముఖపుష్టి వలన నామె ప్రజలలో మిక్కిలి పలుకుబడి గలదిగానే యుండెను. ఆమె కసరిన నావాడయందలి పిల్లలే గాక పెద్దలుకూడ భయపడుచుందురు. ఆమె నావాడలోనివా రందఱును "దొడ్డమ్మా" అని పిలుతురు. వాస్తవముగా నాకృతిచే నామె దొడ్డమ్మయే.

ఆదివారమునాఁడు రాత్రి కర్ణి యొక్కరితె మాత్రమే యింటిదగ్గఱ నున్నది. రాత్రిలోఁ బండ్రెండు గడియలు గడచినవి. తలుపు నెవరో తట్టిరి. తనకుమారుఁడే యనుకొని కర్ణి తలుపుఁ దీసినది. ముసుఁగుతో నొక యువతి లోపలఁ బ్రవేశించి కర్ణి కవకాశ మీయకయే తలుపుఁ దానే గడియపెట్టినది.

కర్ణి—ఎవరమ్మా మీరు ?

క్రొత్తస్త్రీ—పెరటి యరుఁగు మీఁదికి రండు. కూర్చుండి మాట్లాడెదము.

ఆస్వరము దాను విన్నస్వరమే యైనను దత్కాలసంభ్రమములోఁ బోల్చుకొనలేక పోయినది. ఆమె చెప్పినట్లు వినవలెనని

కర్ణికిఁ దోఁచినది. ఇద్దఱును పెరటి యరుఁగు మీఁదికి వెళ్లిరి. వెన్నెలరాత్రి యైనను పెరటిచెట్ల నీడవలనఁ గొంచెము చీఁకటిగానే యుండెను. సామాన్యముగా నొకరికొకరు గన్పట్టుచున్నారు. అరుఁగుమీఁద వా రిద్దఱును గూర్చున్నారు. క్రొత్తస్త్రీ ముసుఁగు దీసివేసినది. కర్ణి దగ్గఱ ముఖముఁబెట్టి చూచినది.

"నేను దొడ్డమ్మా!" అని యా క్రొత్త స్త్రీ పలికినది.

కర్ణి—నీవా? నాతల్లీ? సుచంద్ర రాయల ముద్దుబిడ్డా! నీవా? ఏనుఁగ మెందుల కీసందు దూరినది?

రథి—పెద్దావుతో మాట్లాడుటకు.

కర్ణి—కుమారీ! ఏమిపెద్దావు? అచ్చు పొడిచి విడిచిన యాఁబోతు దీనినిఁ దలమెత్తు కొని తిరుగనీయకుండఁ జేసినది. మావారు విడిచివేసినారు. మీవారు చేర్చుకొనరు. (మెల్లగా) రాయ లింకను పెద్దకోమటి కూఁతురు (లీలావతి) మాటయేనా, నీమాట యేమైన వినుచున్నాఁడా?

రథి—దొడ్డమ్మా! రాయలనిన నీకంత హాస్యముగా నున్నది కాఁబోలును. ఎవరి మాటయు నతఁడు విననక్కఱలేదు. ఆలోచించి యేపనినైనఁ జేయుట కతనికి బుద్ధి యున్నది.

కర్ణి — బుద్ధి లేదని యెవ రన్నారు? అన్నింటిని మించిన దొడ్డచెవు లతనివి యని నేను చెప్పుచున్నాను. ఆచెవిలో దగ్గఱ నుండు ప్రేమాస్పదు లేమి మంత్రించినను పాఱును. పెద్దకోమటిబిడ్డయుగము పోయి రాచబిడ్డ (రథిని) యుగము వచ్చినది యని ప్రజ లనుకొనుచున్నారు. అది యెంత సత్యమో?

రథి—కోమటిబిడ్డ మంత్రాలను త్రిప్పుటతోనే రాచబిడ్డపని సరిపోవుచున్నది. దాని కేమి? దొడ్డమ్మకు నావలన నేదియైన పని కావలసియున్నదా?

కర్ణి—మీ దొడ్డమ్మ కూటికి గుడ్డకు కఱవులేదు. ప్రభు విచ్చుచున్నాఁడు. మా భీమనాథుని మీవారు తమలోఁ జేర్చుకొను నట్లు నేయఁగలవా? బ్రాహ్మణకుల పరిషదధ్యక్షుఁడు తలంచిన నదియసాధ్యముగాదు. రాయలుచెప్పిన నతఁడు చచ్చిన ట్లంగీకరించును. కూఁతురు చెప్పిన, రాయ లీ యుపకారమును జేయక తీరదు. మీ యన్నయ్య యొక బ్రాహ్మణుఁ డైనఁ జాలును. అదియే నాకు కోటి యిచ్చినట్లు.

రథి—రేపు అన్నయ్య యొక విజ్ఞాపనమును కులపరిషత్తుకుఁ బంపునట్లు చేయుము. బ్రాహ్మణులు తమలో నతనినిఁ జేర్చుకొను నట్లు నేయుభారము నాది.

"నాతల్లీ! నే నుద్ధరింపఁబడితిని" అని చెప్పి కర్ణి రథినిని గాఢముగా నాలింగించుకొనినది.

రథి—దొడ్డమ్మా! నీ కింకేమి కావలెను?

కర్ణి — ఇంకొకటి నాకుఁ గావలసి యున్నది గాని నీ కది యిచ్చుటకు సాధ్యము గాదు.

రథి—అది యేదో చెప్పుము. సాధ్య మో యసాధ్యమో యాలోచించెదను.

కర్ణి—మాజటామునిని దెచ్చి నా కీయఁ గలవా ?

రథి—(నవ్వుచు) ఇంతకాలము వెళ్లిన పిమ్మట దొడ్డమ్మకు జటామునితోఁ గాఁపు రము సేయవలయు నని యున్నదా ?

కర్ణి—ముఖాముఖిగా నతనిఁ గలుసు కొని కసితీరఁ దిట్టవలయు నని యున్నది.

రథి—వట్టి మాటలే. అతఁడే కనిపించిన దొడ్డమ్మ యేడ్చుచుఁ గాళ్లపైఁ బడును. తన నిఁక విడిచిపోవలదని వేడుకొనును. నీ కొడుకు నాశీర్వదింపు మని ప్రార్థించును.

కర్ణి—ఎట్లు జరుగునో చూతువుగాక. తెచ్చిపెట్టఁగలవా ?

రథి—నాకుఁ జూడవలయు నని యుండియే యిచ్చటికి వచ్చియున్నాను.

ఆమాటను కర్ణి యాశ్చర్యముతో విని నది. దానియర్థమును గ్రహించుట కామెకుఁ గొన్ని క్షణములు పట్టినవి. కొంత కర్థము గ్రహించినది గాని యామె నమ్మినది గాదు. "మహర్షి యిచ్చటికి వచ్చుటయా ? అంత దయ యతనికి లేదు" అని కర్ణినోటనుండి మాటలు వెలువడినవి. ఇంతలో "పెద్ద నాగూ !" అని పిలుచుచు నెవరో తలుపు తట్టిరి. ఆస్వరము కర్ణికి మిక్కిలి పరిచితము. దానిని వినఁగానే యామె కొడలంతయు గగుర్పొడచినది.

"దొడ్డమ్మా! ఇదిగో నీవడిగిన వస్తువును తెచ్చిపెట్టితిని. ఎట్లుపయోగించుకొనెదవో చూచెదను. మీవంటయింట నాకు స్థల మిమ్ము. మీదంపతులు ముఖాముఖిగా మాట్లాడుకొనునపుడు నేను ప్రక్క నుండఁ గూడదు."

కర్ణి తలుపుఁ దీయుటకు సంభ్రమ ముతో లేచినది. రథిని లేచి త్వరగా వారి వంటగదిలో దూరినది.



# దీ పా వ ళి

బొ డ్డు బా పి రా జు

కాకులమూకమై దెస లెకాయకి మ్రింగిన కారుదయ్యా మీ
చీకటిరెక్కలన్ చిదిమి, చించి వికావికగా, వసుంధరా
శ్రీకి వెలుంగుభిక్ష దయసేయుచు దీపికలన్న పేర సీ
వాకిటి కాపలాపనికి వచ్చెనె తారక లాంధ్రసుందరీ!

ద్వారముఖమ్ములన్ వెలుగుదండలు గ్రుచ్చి యమర్చినట్లు సొం
పారు పవిత్రదీపికలు పల్కుచునున్నవి "దేశదాస్యమో
భారతి సర్వమర్పణముగా బలిపీఠమునెక్కినట్టి త
ద్వీరతపస్విని హృదయదీప్తుల మే"మని ప్రజ్వలించుచున్.

అగ్గలమైన శేవ, వెనుకాడనిచేవ సురారినిల్వునన్
విగ్గుల గ్రుంగిపోవ ననిచేసిన సత్యకు ఈడుజోడు కా
దగ్గ పురంధ్రులెందరికి తల్లివినీవు? వచింపు మోడ్పుకే
లొగ్గి శరత్సుధాకర సముజ్జ్వలరేఖకు దీపలక్ష్మికిన్.

కాలమహాబ్ధిమున్గి యణగారిన బంధువులైనవారిగో
రీలకు యీ వెలుంగు పొడ లించుకసోకిన 'జన్న' తంచు దీ
పా లెగవేయ సాయిబుల బాలురు వేచిరి, వారి కక్షుర
శ్రీలిడు కాంతిపుంజ మిడలేదొకొ నీకు స్వతంత్రతాప్రభల్?

పావనమైన సంస్కృతికి పట్టిది, వేడుకపాటిగాదు పే
రావికి లోగి గుండెలవియంగ చెరంబడి మ్రగ్గి సగ్గి వా
పోవు పదారువేల పువుబోడు లలర్చిన నవ్వు లిట్లు దీ
పావళినై జగమ్మునకు పండువజాటిన వీదినమ్మునన్.

గంజిగిన్నెలోననె కాటకమ్మునిలువ- పొగులు మనతోడి పండుగపొత్తదేడ?
రక్తమాంసములోడ్చి నరాలుకోదుకు- బానిసతనమ్ము విడుపు, పబ్బములపొడుపు!



౧ అవలోకితుని కొలిచెడు దేవగాయక బృందము

౧౭-వ గుహనుండి ఘూడకునుల ఎత్తునున్న చిత్రశకలము. (క్రీ. ఆరవశతాబ్దమునాటిది)

## పట్టాభిషేకరంగము

### శుభాక్షతస్వీకరణము

౨ ౧-వ గుహాలోని చిత్రము



## తీర్థోదక సేచనము

### రాజలాంఛన సమర్పణము

కొంతతరువాతికాలముది 3





౮ నర, నాగరాజులసమావేశము
2-వ గుహలోని చిత్రాంతరము

# విజయనగర సామ్రాజ్యము

## దాని యుదయ ప్రశస్తులు

మల్లంపల్లి సోమశేఖరశర్మ

౧

ప్రాచీనహిందూదేశచారిత్రము ప్రధానముగ హిందూమత సంస్కృతిచరిత్రమే కాని రాజకీయమునకు సంబంధించిన చరిత్రము కాదు. ప్రాచీనకాలమున పుట్టిన ఉద్యమములన్నియు మతవిషయక మయినవే కాని రాజకీయములయినవి కావు. ఒకవేళ రాజకీయము లయిన ఉద్యమములుకూడ ఉన్నపన్నయెడల అవి మతధర్మములను పోషించి పరిరక్షించుకొరకును, ఉద్ధరించుకొరకును పుట్టినవే కాని తదన్యములు కావు. కుంఫిణీ పరిపాలనము వచ్చిననాటినుండియే మనచరిత్ర రాజకీయముగ మారుచున్నది. ఉద్యమములు రాజకీయమయినట్టియు, ఆర్థికములయినట్టియు ప్రధానాశయములతో నడుపబడుచున్నవి. ఈ ప్రధానసూత్రమును మనము గమనించిననే కాని ప్రాచీన హిందూదేశచరిత్ర పరమార్థము మనకు బోధపడదు; ప్రాచీన హిందూదేశచారిత్రమే యర్థము కాదు.

వేదకాలమునాటినుండి హిందువునకు తనమతమన్నను, తనసంస్కృతియన్నను తనప్రాణముకంటెను అధికమయినది. మనసంస్కృతికిని, మన సభ్యతకును మూలము వేదము. హిందూసభ్యతాసౌధరాజము వేదవిజ్ఞానముపునాదిమీద లేచినదే. వేదములనుండియే మన మతములు, మనశాస్త్రములు, మనపురాణములు, మన ఇతిహాసములు—ఇంతెందుకు, మనవిజ్ఞానము, మన ధర్మము, మనసర్వస్వము సమస్తము ఆవిష్కారము నొందినవి. హిందూజీవితమున వేదసంస్కృతిజన్యము కాని దొక్కటికూడ లేదు. హిందువుజీవితము తెల్లవారి లేచినదిమొదలు తిరిగి యతడు కనులుమూసి నిద్రించువరకును వేదవిజ్ఞానానుబంధముగల మతకర్మలతోనే నిండియున్నది.

పుట్టినదిమొదలు గిట్టువరకును ఈ వేదభూమిని హిందువుజీవితమును నడపు కీలకము మతము. మతమును విడిచి హిందువు లేడు; హిందువును విడిచి మతము లేదు. అవినాభావసంబంధమే. తప్పించుకొనజూచినను మత మతనిని విడిచినదికాదు. ఆతని కష్టసమయమున, ఆతని దుఃఖసమయమున ఆతనికి కరదలు గరపి యూరార్చు మిత్రమయినది మతము. ఆతని సంతోషసమయమున, ఆతని సుఖసమయమున ఆతని యానందము నినుమడింపజేసి ఆతని జీవితమునకు ఒకపవిత్రమయిన, అనిర్వాచ్యమయిన అపూర్వశోభ తెచ్చినది మతము. ఈ కారణమున హిందువయిన 'ప్రతివాడు'ను తల్లినిబిడ్డవలె తనమతమును, తనసంస్కృతిని అంటిపెట్టుకొనుచువచ్చినాడు. మత మతనిదాది; మత మతనిమిత్రము; మత మతనిగురువు; మత మతని జీవితాధినేత; మత మతని యుపాస్యదైవము. మతమువినా మరి ప్రపంచమే లేదు హిందువయినవానికి. భౌతికములయిన భోగములు, వినశ్వరములయిన భాగ్యములు--అన్నియు మతమునకు తరువాతివే. ఆట్టిది భారతవర్షమునందలి ప్రాచీన హిందూజాతిజీవితరహస్యము.

---

౧. కడచిన ఫిబ్రవరిమాసమున, హైదరాబాదునందలి శ్రీకృష్ణదేవరాయాంధ్రభాషానిలయ వార్షికోత్సవముసందర్భమున చదివిన రెండువ్యాసములలో ఇది మొదటిది. గోలకొండ పత్రికలో ప్రకటితమయిన యీ వ్యాసము కొద్దిపాటి మార్పులతో ప్రకటింపబడుచున్నది.

వేదకాలమునాటినుండి ఈ మతసంస్కృతిని బ్రాహ్మణులు నారు పోసి నీరు పోసి పెంచగా భూనేతలయిన జనపతులు ఈ సస్యము సహోరాత్రము లేమరక కత్తి తీసి కాపునెట్టి తమ యధికారమున కడ్డులేనంత మేర విరివిగా పైరుపెట్టువారు. వర్ణములును, వర్ణాశ్రమములునుగూడ ఈ మతసంస్కృతిపరిరక్షణమునకేర్పడినవే. హిందూసంఘము సుస్థితియు, హిందూసంఘము ఆయువును ఈ ధర్మమువీద, ఈ సంస్కృతి మీద నిలబడినదగుటచేత ఈ యాయువుపట్టును దమ గుప్పిట బెట్టుకొని, కంట వత్తినిడికొని పదిలముగ కాపాడుచువచ్చినందుకు ఫలముగ మిగిలిన సాంఘికులు బ్రాహ్మణునికి అగ్రపదమునొసంగి యతనిని పూజించిరి. బ్రాహ్మణుని వేదాధ్యయనాదులు, బ్రాహ్మణుని వేద కర్మలు – అన్నియు హిందూసంఘక్షేమము నిమిత్తము, అభ్యుదయము నిమిత్తము నయినవి. ప్రాచీన భారత వర్షమునకు బ్రాహ్మణుడు ఒక దివ్యచక్షువు; ఒక క్రియాశక్తి. ఈరీతిని ప్రాచీన భారతవర్షమున బ్రాహ్మణుడు హిందూసంఘమున లోకయాదర్శమును, హిందూ సంస్కృతి లోకచిహ్నము నయినాడు. ఇతని తరువాతి గౌరవస్థానము గోవుది. మనది ముఖ్యముగ వ్యవసాయక క్షేమమగుటవలన హిందూసంఘము భౌతికజీవనమంతయు కృషిగోపాల్యములమీదనే యాధారపడియుండుట వలన ఇది చక్కగ గుర్తెరింగిన ప్రాచీనహిందువులు గోవును, గోసంతతిని అమితగౌరవాభిమానములతో ఆదరించుచు వచ్చినారు. బ్రాహ్మణుడు హిందూసంఘము ఆధ్యాత్మికభాగ్యప్రపత్తికి ప్రతిమూర్తికాగా, గోవు హిందూసంఘ ఆధిభౌతికభాగ్యప్రపత్తికి ప్రతి రూప లాంఛనమై యారాధ్యమైనది. రాగద్వేషపూరితమయిన పట్టి మాంసపుముద్దయని కాదు బ్రాహ్మణుడు హిందూసంఘమున కారాధ్యుడయినది; ఆతనిలో హిందూసంఘము మహోన్నతమయిన యాదర్శమును ప్రతిష్ఠించుకొన్నది. రూపుగైకొన్న వారి యాదర్శ మతడు. బ్రాహ్మణుడన్నది వారి లోకసకలకల్యాణగుణాత్మకమయిన తేజము; గోవన్నది సకల భోగభాగ్యములకు నిదానమయిన యొకదివ్యమూర్తి. గోబ్రాహ్మణులకు శుభము కలుగవలెనని బ్రాహ్మణుడు మంత్రపూతము గావించి జలము విడుచుచునపుడెల్ల శుభంకరమయిన, పవిత్రమయిన ఆతని యాశయమున సర్వమంగళములతో విరాజిల్లు సకలచరాచరప్రపంచము నవలగ్నమై తేజరిల్లినది. సకలభూతకోటికి హితముకోరు, తమ సంఘక్షేమాభ్యుదయములకు కారణమైన అట్టి బ్రాహ్మణుని కడమవర్ణముల వారు గోదాన, భూదాన, హిరణ్యదానాదికముల నొసంగి సత్కరించి పూజించువారు. గోబ్రాహ్మణులకు విపత్తు కలిగినదన్న తమ భాగ్యభోగ్యములకును, ప్రాణాధికమయిన తమ సంస్కృతికినే కాదు, సకల మంగళజగత్తునకే విపత్తు కలిగినదని ప్రాచీన హిందువుల భావన. అట్టి విపత్తే సంభవించినచో తనువెంటనే మహీపతి ఖడ్గము, మహామంత్రి సమాలోచనము, గురుదేవుని యుపదేశము, పురోహితుని మంత్రబలము, సైన్యాధిపతి సమరకౌశలము, వైశ్యుని భాగ్యవైభవము, చతుర్థవర్ణుల అప్రతిమానసేవానురక్తి శక్తులు–అన్నియు చేయిచేయికలిపి, తత్పరిరక్షణార్థము, తద్భంగవిమోచనార్థము ముందంజవైచి మొనతీర్చి మోహరించునవి. ప్రతిమిషమునకు బాసికముకట్టి యీ కర్మక్షేత్రమునకు భర్తలయిన హిందూప్రకృతిపతులెల్లరు అవినశ్వరమయిన, శాశ్వతమయిన, అనాదియై ఆబ్రహ్మకల్పాంత స్థాయియైన హిందూధర్మమునకు, హిందూసంస్కృతికి అండయై నిలిచి తమ బాహువుల బలిమిని, తమకైదువుల కలిమిని పరిరక్షించి విష్ణ్వంశసంభూతులయిరి. ఈపూర్వోక్తకారణములవలన ఇదివరలో నడిచినట్లు మన ప్రాచీనచారిత్ర మంతయు దేశీయ విదేశీయ, జాతీయ విజాతీయ, వైదిక అవైదిక విజ్ఞానసంస్కృతి సంఘట్టనముల చరిత్రమే; ఆ విజ్ఞాన సంస్కృతిమహాసాగరము పోటుపాటుల, ఉచ్ఛ్రయపతనముల చరిత్రమే.

రాజ్యములెన్నో యుదయించినవి; రాజ్యములెన్నో యస్తమించినవి. పుట్టినారు, గిట్టినారు రాజులెందరో. ఈభారతభూమి నెన్నెన్ని సంక్షోభములు సంభవించినను, మున్నెన్నెన్ని ప్రచండఝంఝామారుతములు భయంకరముగ వీచినను వీటితో తనకేమియు సంబంధము లేనియట్లు, తనను కాదన్నయట్లు హిందూ

సంస్కృతిస్రవంతి, హిందూధర్మవాహిని ముద్దుముద్దుగ తప్పటడుగులువేసి ముద్దుగులుకు చిన్నారి బిడ్డవలె, ఒకరిజోలికి పోవక మెల్ల మెల్లగ తనదారి తాను చూచుకొనుచు ప్రవహించు చిన్ని సెలయేటిలేదీవవలె కాలానుగుణముగను, రంగానుగుణముగను తన పురోగమనవేగమును సరిదిద్దుకొనుచు, మహాపథికమూర్తివలె ఈ యనంతకాలపథమున ప్రయాణము సాగించుచునే యున్నది. భక్తిభావబంధురమై హిందూసంఘము నిచ్చుకత్తులుతీసి ఘోరాయిచ్చుచు, దాని కంగరక్షయై యెన్నంటి పోవుచునేయున్నది. హిందూధర్మమున కాశ్రయమిచ్చి యాదుకొన్న రాజ్యములే, ప్రజల స్మృతిపథమున నిలయమును నిర్మించుకొని నిలిచిపోయినవి. హిందూసంస్కృతి కండయై నిలిచి ఎన్నెన్ని యవాంతరములు సంభవించినను దానిని పరిరక్షించిన భూపతులే యశస్వంతులై జాతికి పూజనీయులైనారు. ఈ ధర్మోద్ధరణమునకు, ఈ సంస్కృతిపరిరక్షణమునకు ఆదుకొను అవనీపుడే లేకపోయినా, ఆదుకొని దాని నుద్ధరించు రాజ్యమే లేకపోయినా,— కాసెలు కట్టి, వీరచందన మలంది, విడెయములు తీసికొని ముందు కడుగిడి కలినుద్ధారు నిర్మించినవారు ప్రజాప్రముఖులే; సర్వభారమును తమ యెదల వాల్చి దానిని విపదంబుధి తరింపజేసి పారము జేర్చినవారు ప్రజలే. స్వధర్మమన్న, స్వమతమన్న, స్వసంస్కృతియన్న ప్రాచీనభారతీయుల కంతటి ప్రీతి; అంతటి అభిమానము; అంతటిభక్తి. వారికి భోగపరత యెంతనిశితమో త్యాగలాలసయు నంతయధికము. జీవించియుండుమా దేవేంద్రభోగము లనుభవింపవలె; లేదా గౌరవావహముగ చచ్చి వీరస్వర్గము చూరగొనవలె. చావుబ్రతుకులను దమనుప్పిట పెట్టుకొని చెలగాటములాడిన వీరాధివీరులు వారు; బ్రతుకను చావను నేర్చిన కళాకుశలురు వారు.

ఉత్కృష్టమైన హిందూధర్మ పరిరక్షణము నిమిత్తము, ప్రాణాధికమయిన తమ సంస్కృతిని పోషించుకొనునిమిత్తము ప్రజలే ముందు కడుగిడిన ఘట్టములు మన ప్రాచీనచారిత్రమున ఎన్నియో లేవు; అసలే లేవన్నను అది యతిశయోక్తి కాదు; సత్యదూరమును కాదు. తమ రాజ్యమును రక్షించుకొనుకొరకు తమ యర్థప్రాణములను ధారవోసిన రాజులు కలరు. పేరాసతో నూతన రాజ్యలాభమునకై కైదువు తీసి జళిపించిన మన్నీలును నున్నారెందరో. సాధారణముగ మన హిందూదేశచారిత్రమున జరిగినయుద్ధము లన్నియు రాజులు రాజ్యసంపాదనముకొరకో, రాజ్యరక్షణముకొరకో తమ క్షాత్రంబావల నుపయోగించుకొని చేసినవే, ప్రజలు తమ యమూల్యసర్వస్వమయిన తమ సంస్కృతిని కాపాడుకొనునిమిత్తము రాజసాహాయ్యమేమాత్రమును లేనిచో తమకు తామయి విజృంభించిన ఘట్టములను అరుదే, విజృంభించి విజయలక్ష్మిని పైకొన్న ఘట్టములను అరుదే. అట్టి అపూర్వమయిన, అతిలోకమయిన ఘట్టము ఒక్క మనదక్షిణహిందూదేశచారిత్రమునందే, అందునను మన యాంధ్రదేశచరిత్ర ధ్యాయమునందే కన్పట్టుట మనభాగ్యము కదా! అట్టియనూనవిఖ్యాతి మన యాంధ్రులకుమాత్రమే దక్కుట మన యదృష్టము కదా! అట్టిస్థితి పదునాలుగవశతాబ్దియందు సంభవించినది. కొండవీడు, విజయనగరము లట్టి యపూర్వ పరిస్థితులకు ఫలముగ నేర్పడినరాజ్యములు. కాకతీయ సామ్రాజ్యపతనముతో ఒకశక మంతరించి వేరొక నూతనశక మారంభమైనది.

౨

పదుమూడవశతాబ్ది కడపటి దశకమునుండి దక్షిణాపథమంతయు అట్టుడికినట్లుడికిపోయినది. బలిష్ఠములయిన, పటిష్ఠములయిన రెండు సంస్కృతి సాగరములు రాచి రాపాడినకాల మది. ఎదురుముఖములయిపారు రెండు మతవాహినులు పరస్పరము ఢీకొన్నకాల మది. ఇస్లాముమతతేజము ఉత్తర హిందూస్థానమునంతను లోగొని తన చంద్రధ్వజము నచట సుస్థిరముగ ప్రతిష్ఠించి, దక్షిణాపథముపై తనదృష్టి మరల్చినది. తొలిచూపు వేడికోపునకే దేవగిరి యాదవరాజ్యము రెక్కలు విరర్చి యెదిర్చి నిలువలేక చంద్రధ్వజమునకు మోకరిల్లినది. ఓరుగంటినిమాది కట్టుతెగునాటిచూపు.

శ్రీమత్కాకతి ప్రతాపరుద్ర నృపతి పరిపాలనమున ఓరుగల్లు దుర్నిరీక్ష్యముగ వెలిగిపోవుచుండిన కాలమది. సామాన్యభూవరుడా ఆ ప్రతాపరుద్ర ధరాధినేత? దక్షిణాదినున్న జంబుకేశ్వరతీర్థము దాక తెనుగుజోదులను నడిపించుకొనిపోయి అక్కడ తిరువానైక్కావుడయారు మహాదేవునికి విజయమంగళనీరాజనము లిచ్చి మ్రొక్కులు చెల్లించినాడు. తిరుగేదీ నాటి తెలుగుబిడ్డలధాటికి? గోదావరిగంగనుండి బయలుదేరిన తెలుగు తేజిచాకళింపునకు కావేరీతీరము కడపటి హద్దయినది. నవలక్షధనుర్ధరుల సింగాణు లీవిశాలవిహారభూమికి పెట్టనికోటగోడలయి కాపయినవి. ప్రతాపరుద్ర క్షోణీశ్వరుని బాహువిక్రమమునకు పాండ్యబలము పంచబంగాళమైనది; చోళులు కూలిపోయినారు; స్వాతంత్ర్యపుబావుటా లెత్తిన కావలిమన్నీలు పిక్కబలము చూపినారు. ప్రతాపరుద్రు డంతటి వీరశిరోవతంసము. అతడు పరమశైవుడయి తన సామ్రాజ్యమున శైవమును పోషించినాడు. నాడు వర్ధిల్లిన శైవము తెలుగునాటిని చైతన్యవీరపరిప్లుతితో తొణికిసలాడించినది; కాకతీయసామ్రాజ్యమున కూపిరిపోసిన జీవశక్తియది; ఆంధ్రావని కొక క్రొత్తతేజమును, క్రొత్తరూపము నిచ్చినది. ఆంధ్రులను గుండెలుతీసిన బంట్లుగ, వెరపెరుగని వీరమూర్తులుగ దిద్దినది నాటి శైవమే. శివుడా కాకతీయయుగమున కుపాస్యదైవము. ఆ మహాశివశక్తి ప్రభావముచేత తెలుగుబిడ్డడు వీరమూర్తియై శివపాదశేఖరుడుకాగా తెలుగుమన్నీడు ప్రతాపరుద్ర జననాథుడు వీరరుద్రుడయి విఖ్యాతికెక్కినాడు.

ఇట్టి వీరరుద్రుని పరిపాలనమున ఇటుదక్షిణాదిని తనముద్ర నచ్చొత్తించిన అఖండమయిన శివశక్తి, అటు ఉత్తరహిందూస్థానమును తనపాదాక్రాంతము కావించుకొన్న అప్రతిమానమయిన ఇస్లాముశక్తి — రెండు నొరసికొని యొరసికొని, రాపాడిరాపాడి తుదకు భగ్గురని జ్వాజ్వలించినవి: ఉల్లోలకల్లోల వారాసులు రెండు కలసి కలగుండుపడి ఘూర్ణిల్లినవి - ఇక ప్రళయమును విలయమునుకాక మరియేమి?

వీరాధివీరుడు ప్రతాపరుద్రు డంత సుకరముగ వశమయ్యెడువాడును కాడు; ఇస్లాముసైన్యములు తమపూన్కిని విడనాడి చేవమాలి యంతసుకరముగ మరలునవియుకావు. ఈ కారణమున దక్షిణాపథమున తెలంగాణమునందు ప్రాచీనాంధ్ర వీరరక్తము కాగి పొంగులువారి దీప్తిమెరసిన ఓరుగంటి కోటకొత్తళములముందు ఈ సంఘర్షణము తీవ్రమయి, తీవ్రతరమయి, తీవ్రతమమయి ఏండ్లును పూండ్లును సాగినది.

వేలకొలది సంవత్సరములనుండి తెగితునకలువోకుండ వచ్చుచుండిన ధర్మసంస్కృతితంతువును భద్రముగ కాచి కాపాడి నిలబెట్టవలసిన బాధ్యత తెలుగుబిడ్డలపయి బడినది. ఆ బాధ్యతను వారు గుర్తింపక పోవనులేదు; కడు సహాయకరమయినదని తొలగదోయను లేదు. భరింపరాని మహాభారమయినను భక్తితో సంతోషపూర్వకముగ తలకెత్తుకొన్నారు. దానివిలువను గుర్తించినారు గనుకనే తమయర్థప్రాణములను ధారవోసినారు తృణప్రాయముగ. మనసంస్కృతి, మనధర్మము, మనకళలు — మనజీవితసర్వస్వమే నశించినచో ఇక మిగిలిన దేమిటి మనకు? జాతి బ్రతుకునది తనధర్మపరిపోషణముకొరకు; తనసంస్కృతి ప్రతిష్ఠాపనముకొరకు. బ్రతికినా చచ్చినా తత్పరిరక్షణముకొరకే. ఆరెంటికి కొరగానినాడు మనకు ప్రపంచమే సర్వశూన్యమని నడుములు బిగించి శంఖాలు పూరించి విజృంభించినారు ఆనాటి యాంధ్రవీరులు. నిలబడుడు, నిలిచి యాలకింపుడు, ఆంధ్రనగరమని కీర్తిమెరసిన ఆయోరుగంటి కోటగోడలకడ, 'కాకతిప్రాభవము దీర్ఘనిద్రలుపోవు నాపాడయిన పెనుకోటగోడల'కడ పొంచియుండి యాలకింపుడు; — వీనులున్నవారిప్పటికిని వినగలరు — ఈ తెలుంగురాల్పడ గుండెరాయిచేసికొని యచ్చటి శిలాసముత్కరము వినిపించు నాటి మేటిపోరాటపు ఉరుటడటులు.

ఇస్లాముసైన్యము ఓరుగంటిపై కత్తివచ్చినది యొక్కతడవయు కాదు; కాకతీయాంధ్రులు విమతవాహిని నోడించినది ఒక్కపర్యాయమును కాదు. ఎన్ని

తడవలు ఆంధ్రులకు విజయలక్ష్మి చేపడిననేమి, తుదకు ఆంధ్రుల అవిమృశ్యకారిత్వమున శత్రుజనభయంకరు డయి ఇస్లాముమతదీక్షితులకుగూడ భీతిగొలిపిన నవ లక్షధనుర్ధరాధినాథుడు వీరరుద్రదేవమహీపతి దైవ దుర్విపాకమున నోటువడి మహమ్మదీయులకు బందెయై నాడు! ఓరుగంటి దేవాయతన జయస్తంభాగ్రముల రెప రెపలాడు వరాహలాంఛిత హేమపటములు విమతమారు తాహతికి నేలగూలినవి. ఆంధ్రనగర మోరుగల్లు సుల్తాను పుర మయినది. పంచమహాశబ్దములు మొరసిన రాజ ప్రాసాదపు మొగసాలల ఢంకానౌబత్తులు మ్రోగినవి. ఏకవీర సైనోడు కాకతమ్మ ప్రాభవము కడముట్టినది. ప్రతాపరుద్రచక్రవర్తిని ఢిల్లీనగరమునకు గొనిపోవుచుండ పరరాజన్య పాదపీఠికెన్నడు నాత్మీయమౌళిమకుటస్థగిత మణిప్రవాళకాంతులతో నివాళి యిచ్చి యెరుగని యామహాభిమాని స్వేచ్ఛచే మధ్యేమార్గమున దివంగతు డయ్యెను.

కాకతిప్రతాపరుద్రుని యస్తమయముతో నల్లని చీకటు లాంధ్రావని నలముకొన్నవి. ఆంధ్రశౌర్యాగ్ని పానుపడినది. హిందూసంస్కృతికి తలదాచుకొను నెలవు లేకపోయినది. హిందూధర్మమునకు విపద్దశ సంప్రాప్తమై యది నిరాలంబయు, నిరాశ్రయయు నైనది. ఓరుగంటి పతనముతో ఆంధ్రుల స్వాతంత్ర్యభాగ్యరేఖలు దీప్తిమాసిపోయినవి.

నాడు మొదలు — హిందూధర్మము నుద్ధరించు కొరకు, హిందూసంస్కృతి కాశ్రయము కల్పించు కొరకు దక్షిణాపథమున ప్రప్రథమమున ప్రయత్నము చేసిన విఖ్యాతి ఆంధ్రులది. రాజులేని రాజ్యము; ధర్మోద్ధరణముకొరకు చేసినది ప్రబల ప్రయత్నము. ప్రజలే నాయకు నెన్నుకొన్నారు. ఆతని గొడుగునీడకు జేరి తమబలములకు హెచ్చరిక తెలిపినారు. శ్రీముసునూరి ప్రోలయనాయకుడు ఈ మహాప్రయత్నమునకు మామిడాకుతోరణము కట్టినవాడు. ఆతని పితృవ్య పుత్రుడు ముసునూరి కాపయనాయకుడు విఘ్నేశ్వర పూజ కావించి యభీష్టార్థమును సాధించి కృతకృత్యుడైన వాడు. మరల ఓరుగంటి రాచలోగిళ్లమీద తెలుగుబావుటాలు విప్పారినవి. దుర్గప్రాకారముల ఆంధ్రధనుర్ధరులు బాణకృపాణ పాణులై కాపువెట్ట హిందూధర్మసంస్కృతులకు మరల నీనాటనే యాశ్రయమేర్పడినది.

3

ఓరుగంటి విజయము ఇతరప్రాంతములయందలి యాంధ్రుల కుత్సాహము పోసినది. కాకతి ప్రతాపరుద్రభాండాగారాధిపతులయిన హరిహర బుక్కరాయాదులు కాపయనాయకుని అడుగుజాడల ననుసరించిరి. కాపయ నాయకుని రాజ్యమునకంటెను గొప్ప రాజ్యమును నిర్మించి హిందూధర్మము నుద్ధరించి దానికి శాశ్వతముగ పట్టముకట్టవలెనని వారియాశయము. కానైతే ఆశయము గొప్పదే; ఉన్నతమయినదే. కాని దానిని కార్యరూపమున బెట్టుటెలాగు? ధనమాలేదు; ధాన్యమాపూజ్యము. అంగబలమును, అర్థబలమునుగూడ కరవయిన నేమిచేయగలరు? ఉన్నతాశయములుండి ప్రయోజనమేమి ధనవిహీనునికి? అయినను నిరుత్సాహము పొందలేదు వారు. వజ్రసంకల్ప ముండవలెనుగాని కార్యసాధనమునకు కొదువా?

శ్రీవిరూపాక్ష పుణ్యతీర్థమున పరిభ్రమించుచుండగా వారికి తపస్సంపన్నుడు శ్రీ మద్విద్యారణ్య భగవత్పాదుల దర్శనము లభించినది. నివేదించుకొన్నాడు హరిహరరాయలు తనయావేదనను కొంచెమయినదాచక. ఉదాత్తమయిన యాశయము; ఉదారమయిన సంకల్పము. విద్యారణ్యులవారు నిశితమయిన చూపుతో హరిహరుని హృదయమును పరిశీలించినారు. వినమ్రమయిన హరిహరరాయల వదనసీమను రాజతేజము మెరసినది. దూరదర్శి విద్యారణ్యులవారి హృదయము భావగభీరమయినది. శ్రీవిరూపాక్షపీఠమునకు ధర్మకర్తలు విద్యారణ్యులవారు. దేశకాలపాత్రముల స్వరూపానుభావములు వారి దివ్యదృష్టికి కరతలామలకములయినవి. హిందూధర్మమునకు తగిన యాశ్రయదోహదము లొసంగిననే కాని హిందూజాతియే యంతరింపగలదని తెలిసికొన్నారు వారు; ఏడుగడియలకాలము శ్రీ విరూ

పాక శ్రీ భండారమును హరిహరరాయలకు కొల్ల విడిచి, ఇచ్చవచ్చినంత ధనమును గైకొనవలసినదని హెచ్చరించినారు. హరిహరరాయలు గురుపాదులకు మ్రొక్కి ఆధనమును పరిగ్రహించినాడు.

సర్వకార్యార్థసాధకమయిన ధనము చేపడినపుడిక కొదువయేమి? సైన్యము లాయత్తమయినవి. సైనికులలో నూతనోత్సాహ ముద్దీపించినది. హిందూధర్మ సంరక్షణము; హిందూధర్మోద్ధరణము — ఈ భావము లెల్ల వారిలోను ఒకక్రొత్తజీవనమును, క్రొత్తయావేశమును పుట్టించినవి. హిందూధర్మమును కాపాడవలె; హిందూసంస్కృతి కొకమహానిలయమును నిర్మింపవలెనన్న భావములు వారినిండుమనస్సులనుండి యుత్క్షిప్తములయినవి. ఒరలలోని కత్తికటారులుకూడ హిందూ ధర్మోద్ధరణమని సచాలించినవి. ఆముష్మికసుఖావాప్తి కయిన సోపాన మీధర్మసంస్కృతి. ఇది విధ్వస్తమయినచో నిక హిందువునికి పదచ్యుతికాక గతియేది?— శ్రీ విద్యారణ్యమహామునీంద్రుడు పురోహితుడు; శ్రీ విరూపాక్షు డుపాస్యదైవము. అభినవవ్రతదీక్షితులయిన హరిహరరాయాదులు మెరికలుతీసినబంట్లు పురోగాములయిన నాయకులు. ఎంతటి యుత్కృష్టారంభ మది!

ఏతన్మహాసంకల్పమును కార్యరూపమున బెట్టుటకు హరిహరరాయాదులు పావనమయిన తుంగభద్రా స్రవంతిలో మ్రుంకులిడి ప్రతినలుగైకొని కంకణములు కట్టినారు. హరిహరరాయని సోదరులు నలువురు నీ పవిత్రకార్యాచరణమున తోడునీడగ జరించి చేయగలిగినదెల్ల జేయుటకు వెనుదీయమని అన్నగారికి బాసయిచ్చినారు. ఆ శుభముహూర్తమున విద్యారణ్యులవారు శంఖధ్వానము కావించి విజయీభవ, దిగ్విజయీభవ యని హరిహరరాయలపై మంత్రపూతమయిన శుభ్రాక్షతలు చల్లి ఆశీర్వాదములను గురిసినారు. వేదాధ్వరాగ్ని శిఖలవలె భాసిల్లు నా యైదుగురు సోదరులును దుర్నిరీక్ష్యతేజోవిరాజితు లైరి. హరిహరరాయాదుల సైన్యముధాటికి అడ్డమాకలు లేకపోయినవి. ఇరుగు పొరుగులనున్న హిందూరాజన్యుల కీనూతన సందేశమును, ఈ యభినవవ్రతమును వినిపించినారు వారు. ఆ రాజన్యులును, మండలికులును ప్రతిదీక్ష స్వీకరించి హరిహరునికి విధేయులయి, ఆతనికి బాసటయైరి సరియే; అట్లు కానినాడు యుద్ధము.

అత్యంతశీఘ్రకాలముననే దక్షిణాపథమున ఈ నూతన లక్ష్యము—ఈ హిందూధర్మ పునరుద్ధరణము—వేలకొలది, లక్షలకొలది జనమునకు క్రొత్తతేజమును, క్రొత్తబలము నొసంగినది. మానవుడు జీవించుట కాహారమెట్లో జాతి జీవించుట కున్నతభావము లట్లు. ఒక్కొక్క మంత్రద్రష్ట, ఒక్కొక్క తపస్సంపన్నుడు ఒక మహోన్నతాదర్శమును, ఒక మహోన్నతభావమును జాతికి ప్రసాదించును. ఆభావముమీద, ఆయాదర్శము మీద నాజాతి మరల కొంతకాలము క్రొత్తజీవము పోసికొని తనువు నిలుపుకొనును. ఆ ప్రసాదపటుత్వము తగ్గనంతకాలము జాతి కభ్యుదయమే, అభివృద్ధే. అది సన్నగిల్లిన మరల జాతికి నిర్వీర్యతయే; అభివృద్ధికి ప్రతిష్టంభనమే. ఇస్లాము శక్తి మెరసి, హిందూజాతికి దిగ్భ్రమగొలిపి, దానికి నిర్వీర్యత ఘటించినది. సరిగా ఈసమయముననే శ్రీ విద్యారణ్య శ్రీపాదు లవతరించినారు. తమ కార్యార్థమును సాధించుటకు హరిహరాదులను పరికరములు కావించుకొన్నారు. ధర్మోద్ధరణమను నొక్కదివ్యసందేశము నిచ్చినారు. ఇక నీనూతన మంత్రము వాడి వాడి వత్తియగుచున్న హిందూజీవన వల్లికకు క్రొత్తతేటు, క్రొత్తదీప్తి సంతరించుటలో ఆశ్చర్యమేమి?

రాజ్యములు రాజ్యములు ఏకమయినవి. హిందువులు హిందువులు తమ ప్రాతపగలు మరచి ఈనూతనాదర్శముకొరకు చేయిచేయికలిపి పనిచేసినారు. హరిహరరాయల బలము లోటమియన్నది ఎరుగనిదైనవి. పూర్వాపరసముద్రములవరకు తనయాజ్ఞ కడ్డులేకుండజేసి హరిహరరాయలు తన సోదరులతోను, తనసైన్యములతోను వచ్చి శ్రీ విద్యారణ్య శ్రీపాదులకు ప్రణమిల్లినాడు.

'మహాత్మా! ఈ విజయమంతయు తమ యాశీః ప్రభావమున సిద్ధించినది. అపజయమెరుగని ఈ సైన్య

ములు తామెు ప్రసాదించిన ధనముతో చేకూర్చినవి. విజయలబ్ధము ఈ రాజ్యము మీయది; ఈ బలములు మీయవి. భవదాజ్ఞాబద్ధులము నా సోదరులును, నేనును తమ దాసానుదాసులము. ఉత్తమప్రయోజనార్థము తనువు ధారవోయుటకంటె ప్రమోదకరమయిన కార్యము వేరొండు లేదు. మమ్మనుగ్రహింపు డాజ్ఞాపింపుడు' అని హరిహరుడు చేతులుకట్టుకొని సవినయముగ ప్రార్థించెను. విద్యారణ్యులవారి వదనమున మందహాసరేఖలు తొలకాడినవి. ఆసంయమివరుడు హరిహరరాయల యొక్కయు, అతని సోదరులయొక్కయు భక్తిశ్రద్ధల కలిసినాడు; మదిలో ముదమందినాడు. 'హిందూధర్మ మీసోదరపంచకము బాహువులపజ్జ భద్రముగ, చిరస్థాయిగ నుండగల'దని యూహించినాడు. 'వత్సా!' అని సాదరముగ హరిహరుని సంబోధించినాడు; 'నాకొసంగిన రాజ్యమును మరల నీ భుజాస్కంధములమీదనే కట్టుచున్నాను. ఈ రాజ్యము నీయదియు కాదు; నాయదియుకాదు. త్రిలోకాధినేతయగు మహాదేవుడు శ్రీ విరూపాక్షునిది. ఈ విరూపాక్షస్వామి శ్రీ నిధియే ఈ రాజ్యనిర్మాణమునకు మూలకారణము. దానంజేసి ఈ స్వామికి కార్యకర్తవై ఈ రాజ్యమును నీవే పాలింపుము. హిందూధర్మము నేమరక పరిరక్షించినంత కాలము ఈరాజ్యమునకు భంగములేదు. కట్టు మీ విరూపాక్షసన్నిధి నొకమహానగరము. దానిని రాజధాని గావించుకొని సముద్రమేఖలయయిన యీ భూమిని నీస్వపరాక్రమముతో పాలింపుము' అని యాశీర్వదించెను. శ్రీ విద్యారణ్య మునీంద్రుల యాశీర్వాదసమయమున తుంగభద్రానదీతీరస్థమయిన యావిరూపాక్ష మహాదేవాలయమున మాధ్యాహ్నికమహానైవేద్యావసరమున విజయఘంటికానినాదములు సెలగెనవి; మంగళ నీరాజనములు వెలిగినవి. విజయనగరరాజ్యము రూపొందినది. నాడు మొదలు విజయనగరప్రభువులు విద్యారణ్యశ్రీపాదుల యుపదేశాదేశములను శిరసావహించి హిందూసంస్కృతి కొకవిపత్తును గలుగకుండ కాపాడి బహువిధముల పోషించిరి.

ఇస్లాముమతము దక్షిణాపథమును ముంచి యెత్తకుండ విజయనగరరాజ్యము చెలియలికట్టయై ఖ్యాతి మీరినది. కృష్ణాతరంగిణి దిగువను గల దక్షిణ హిందూదేశమునందలి హిందువులు తమ శక్తినంతయు దండగా నచ్చి విజయనగరరాజ్యము నలంకరించినారు. నాడు విజయనగరరాజ్యమే తలసూపకపోయినచో ఈ పాటికి మన చరిత్రను వేరొకరీతిని చదువుచుండెడివారము. ఆపత్కాలమున, ప్రాణావసానసమయమున ఆదుకొని విజయనగరరాజ్యము హిందూధర్మమును, హిందూసంస్కృతిని సంరక్షించి సాకుటయేకాక దాని కొక క్రొత్తచేవ చేకూర్చినది. హిందూమతచారిత్రమున ఇది యొకయపూర్వఘట్టము. హిందువుల రాజకీయ చారిత్రమునగూడ ఇది యొకయద్భుతసన్నివేశము. ఆకాలమట్టిది. హిందూత్వచిహ్నితములయిన సర్వశక్తులను సేకరించి ముద్దచేసి కాలశిల్పి విజయనగరరాజ్యమును తీర్చినాడు.

కాపయనాయకు డోరుగంటిని కొంతకాలము పాలించి హిందూధర్మమున కాలంబమయి నిలిచినాడు కాని పొంగులు వేరుచుండిన ఇస్లాముమతశక్తి నుబుసుబలాడి కాపయనాయకుని రాజ్యమును ముంచివైచినది. ఇక నటుమీద విజయనగరసామ్రాజ్య మొక్కటియే హిందూధర్మమున కేకైకశరణ్యమై విరాజిల్లినది. నాడు మొదలు విజయనగరసామ్రాజ్యము నుత్తరించి దక్షిణమున కన్యకుమారివరకుగల దేశము ననుశాసింపవలెనని ఇస్లాముదీక్ష; ఎంతమాత్రమును కృష్ణకు దక్షిణమున చంద్రధ్వజమునకు తావీయగూడదని విజయనగరసామ్రాజ్యము ఘోరకఠోరప్రతిజ్ఞ: ఈ రీతిని మధ్యయుగమున పదునాలుగవశతాబ్దినాటి హిందూచారిత్రము 'కర్ణుని తలభారత'మన్నట్లు 'ఆంధ్రుల తలభారత' మయినది. ఆనాటి యాంధ్రులు స్వధర్మనిర్వహణమునకు వెనుదీయలేదు; అవసరమైన నసువు లొడ్డుటకు వెనుకంజవేయలేదు.

## ౪

హరిహరరాయలు విజయనగరసింహాసనము నధిష్ఠించిన మొదటిమొనయడు. బుక్కరాయ లితనిసోదరుడు. ఇతడు హరిహరుని యనంతరమున రాజ్యమునకు

వచ్చెను. అటుపిదప నీ బుక్కరాయల సంతతివారే రాజధానియైన విద్యానగరమున అవిచ్ఛిన్నముగ రమారమి రెండువందల సంవత్సరములపాటు రాజ్యమేలినారు. హరిహరాదుల మూలపురుషుడు సంగమరాయలగుటచేత వీరు సంగమవంశజులని ప్రసిద్ధులయిరి. ఎందరు భూపతులు విజయనగరమున రాజ్యముచేసినను వారందరును శ్రీ విరూపాక్షస్వామి కార్యకర్తలే. రాజ్యమేలినరాజులు శైవులగుదురుగాక, వైష్ణవులగుదురుగాక, వారు పాలించినరాజ్యము శ్రీ విరూపాక్షస్వామిది. విజయనగరమహీధవులు ఆ స్వామిరాజ్యమునకు ధర్మకర్తలు. వారు వేదవిద్య నాదరించినారు. వేదవేదాంగపారంగతులయిన పండితులను, కవులను గోహిరణ్యాదిదానాదికముల దనిపినారు; అగ్రహారము లొసంగి పోషించినారు. వారెన్నెన్ని యగ్రహారదానములు కావించినను అవి యన్నియు శ్రీ విరూపాక్షమహాదేవునివలన జరపబడవలసినవే. పెత్తనమే తమదికాని రాజ్యము తమది కాదు. అందువలననే విజయనగరాధీశు లిచ్చిన యగ్రహారదానములను దెలుపు దానపత్రములు—తామ్రశాసనము లన్నిటగూడ చివరనుండునది దానమిచ్చిన యా విజయనగర జనవరుని వ్రాలుకాదు—శ్రీ విరూపాక్షునిది; 'శ్రీ విరూపాక్ష' అనియే. సంగమవంశమువారిలో నొకడయిన విరూపాక్షరాయలు తన పితృపితామహాదు లవలంబించిన శైవమును వదలి వైష్ణవమును పుచ్చుకొని వీరవైష్ణవుడయి, తదనుగుణముగ దానపత్రములమీది సంతకమును 'శ్రీరామ'గ దిద్దెననియు, ఆకారణముననే విజయనగరరాజ్యాధిపత్యము సంగమవంశమువారి కటుపిదప లేకుండపోయెననియు ప్రతీతి. మూఢవిశ్వాసమనిదీనిని మనము నవ్వివేసిన నవ్వివేయవచ్చునుకాని విరూపాక్షరాయల తరువాతమాత్రము విజయనగర రత్నసింహాసనమెక్కి రాజ్యమేలిన యాతని వంశస్థు డెవ్వడును లేడన్నదిమాత్రము నిజము. తుళువవంశజులయిన వీరనరసింహరాయ, కృష్ణదేవరాయాదులు మాత్రము వైష్ణవులయినను దానపత్రములమీద మరల 'శ్రీ విరూపాక్ష' యనియే వ్రాలు చెక్కించినారు.

మరల విజయనగరము దశమారినది ఆరవీటివంశము వారి కాలమున. క్రీ. శ. ౧౫౬౫ లో రక్కసతంగిడి (తలికోట) యుద్ధాధ్వరమున విజయనగరసామ్రాజ్యము బలభాగ్యము లన్నియు నాహుతియైనవి. వింధ్యగిరికి దక్షిణమున గల భారతావనినంతను తనయలౌకికప్రజ్ఞావిశేషములచేత నూటాడించి దద్దరిల్లజేసిన ఆరవీటి రామరాయలు సమరక్షేత్రమున వీరశయనము నొందెను. హతశేషు లాతని సోదరులు ఆరవీటి తిరుమలరాయలు మొదలైనవారు విజయనగరరాజ్యమును సర్వవిధముల నుద్ధరించి రక్షింపప్రయత్నముచేసిరి కాని వారికాలముననుండియే విజయనగరసామ్రాజ్యమునకు క్షీణదశ యారంభమ్ము. ఆరవీటి తిరుమలరాయ, రంగరాయ, వేంకటపతిరాయాదులకు తిరుపతి శ్రీ వేంకటేశ్వరస్వామి ఇలువేల్పు. ఈ కారణమున విజయనగర అగ్రహారదానపత్రములమీద 'శ్రీ వేంకటేశ' యనియు, 'శ్రీరామ' యనియు చేర్పడినది; వ్రాలు. విజయనగరరాజ్యవైభవభాగ్యములును తారుమారైనవి. తుళువవంశజులైన కృష్ణదేవరాయాదులనాటి ప్రాభవప్రతాపములు మాత్రము విజయనగరమున కంతరించి పోయినవి. విజయనగరప్రతాపభానుడు ప్రాయమెడలి చరమదిశకు వ్రాలిపోయెను.

౫

విజయనగర సామ్రాజ్యము వెలసినది హిందూధర్మసముద్ధరణమునకు. శైవులయినను, వైష్ణవులయినను, స్మార్తులయినను — హిందువులందరు నొక్కటి. ఇంతియకాదు, జైనబౌద్ధములును హిందూమతమువంటివే. మతములన్నియు సమానములు; సమాదరణీయములు. ఒకదానికెక్కువయు లేదు; ఒకదానికి తక్కువయు లేదని సర్వమతసమానత్వమును పాటించినవారు విజయనగరాధీశ్వరులు. అంతకు పూర్వము పాలించిన నృపాలు రెవ్వరునుగూడ ఈ విధమయిన సర్వమతసమానత నిట్లు వ్రతదీక్షగ పాటించినవారు కారు. విజయనగర సామ్రాజ్యము శతాబ్దుల తరబడి విలసిల్లుటకీ వ్రతదీక్షయె ప్రధానకారణము. ఇట్లనుటవలన విజయనగరరాజ్యమున మతవైషమ్యములు లేవనికాని, మతకలహములు జనింపనేలేదనికాని భావింపరాదు. అట్టివైషమ్యము లున్నను, అట్టి కలహములు జనించినను వెంటనే విజయనగరాధిపతులు

సౌఖ్యముకలిగించుకొని కలహాకలుషితములయిన మతములకు మైత్రి చేకూర్చి వానిని శుభ్రస్నిగ్ధములుగ నొనరించుచువచ్చిరి. హరిహరరాయలకు పిదప విజయనగర రత్నసింహాసనము నధిష్ఠించిన పూర్వపశ్చిమసముద్రాధీశ్వర శ్రీ బుక్కరాయ మహారాయల సర్వమత సంవర్ధనదీక్ష చరిత్ర యెరుగనిదిగనుకనా ? బుక్కరాయలు పరిపాలించుచుండినకాలమున వైష్ణవులకును జైనులకును వైషమ్యము లొదవి విభేదములుకలిగి తుదకు కలహముగ పరిణమించినది. వెంటనే రాయలవారు ఉభయమతములవారిని పిలువనంపించి, 'జైనవైష్ణవ దర్శనములు రెండును సమానయోగ్యత గలవి; వైష్ణవులవలన జైనులకు, జైనధర్మమునకు హానికాని, నష్టముకాని సంభవించినచో దానిని వైష్ణవులు తమకు సంభవించిన హానిగను, నష్టముగనే భావింపవలెను. వైష్ణవను సోదరమతమయిన జైనమును మిత్రభావముతో జూచి యాదరింపవలె' నని చెప్పి యా యుభయమతములనాయకులకును చేతులు కలిపి సఖ్యము నొడగూర్చెనట ! అపూర్వముకదా బుక్కరాయమహారాయల సర్వమత సామరస్యాకాంక్ష! అశోకవర్ధనునియనంతరమున సర్వమతములును సమానముగ వర్ధిల్లవలెనను ఆవేదనను, సర్వమతములయెడలను సమానమయిన యనురాగమును గనబరచిన రాజన్యుడు—ఈ బుక్కరాయలు తక్క—మరి యొకడు కనబడుట కష్టము. విజయనగరసామ్రాజ్యమున కేతెంచి యచ్చటి స్థితిగతులను స్వయముగా బరిశీలించి చూచిన 'బేరాస్' అను విదేశీయుడు ఏ మతస్థుడైనను తన మత విశ్వాసముల కనుగుణముగ ఈరాజ్యమున స్వేచ్ఛగ బ్రతుకవచ్చునని యీ విధమున వ్రాసియున్నాడు:

"The king allows such freedom that every man may come and go and live according to his own creed without suffering any annoyance and without inquiring whether he is a Christian, Jew, Moor, or Heathen. Great equity and justice is observed by all."

ఆమధ్యయుగమున యూరోపుఖండమున మతాచార్యులు ముద్రవేసిన సిద్ధాంతములను, విశ్వాసములనే కాని తదన్యములను ప్రతిపాదించినను, ఆదరించినను జను లెట్టి క్రూరమరణహింసలకు పాలుకావలసివచ్చెడిదో యూరోపు మధ్యయుగచరిత్రపాఠకులకు తెలియనిది కాదు. అట్టివారిని స్వదేశమునుండి వెడలగొట్టుట, బ్రతికియుండగనే తగలబెట్టుట—ఒక్కటా, ఇట్టిదారుణ కృత్యములు, మతముపేరిట నెన్నెన్ని జరగినవి! అట్టి కాలమున ఈ దక్షిణాపథమున అంతటి మతసహనమును జూపి, సర్వమతములు సమానమని బోధించి భిన్నమతముల వారికి మైత్రిచేకూర్చుటకు పాటుపడిన విజయనగరాధీశులు మనకు వంద్యులుకదా !

మధ్యయుగమునాటి రాజ్యములన్నిటిలో ఈ విధమయిన ఉదారాశయములతోను, ఉన్నతాదర్శములతోను వెలసిన విజయనగరసామ్రాజ్యమే ఎంతో గొప్పది. అప్పటి మిగిలిన యేరాజ్యములకు నింతటి యాదర్శములును లేవు; ఆశయములును లేవు. కట్టతెగిన ప్రవాహమువలె దక్షిణదేశమును ముంచివేయ వచ్చుచుండిన ఇస్లాముమతవాహిని ఉద్ధతిని గమనించి ఆంధ్రులు, కర్ణాటులు, తమిళులు ఒకరేమిటి, దక్షిణాపథము నందలి యన్ని జాతులవారును తమజాతివిభేదములను, మతసంప్రదాయవిభేదములను మరచి పరస్పరము సహకారము కావించుకొని, తమ ప్రజ్ఞాప్రతిభా విశేషముల నుపయోగించి, తమ శక్తియుక్తుల నన్నిటిని ధారవోసి సృష్టించిన రాజ్యము విజయనగరము. వీరు కన్నడులు, వీరు తెలుగులు, వీరు తమిళు లన్న జాతీయాహంకారవివేకవిభేదములకే యెడములేని నాడు సృష్టించిన రాజ్యమది. నాడు వారందరును పరిగణితులయినది హిందువులుగమాత్రమే. వారిది హిందూమతము. మతవ్యాపన మనుమిషతో మహమ్మదీయులు దక్షిణాదికి చొరుచుకొనివచ్చి రాజ్యమును విస్తరింపజేసికొన బ్రయత్నించినారు. మతసంరక్షణమను పేరుతోనే హిందువులు తమ స్వేచ్ఛాస్వాతంత్ర్యములను, రాజ్యమును నిలుపుకొన కంకణబద్ధులయి నిలిచినారు. నాటి ప్రయత్న మంతయు ఇస్లామువారినుండి

హిందూమతము విధ్వస్తము కాకుండ, హిందూజాతి నామమాత్రావశిష్టము కాకుండ కాపాడుటకే. మతముతోపాటు జాతి చచ్చుటా? జీవించుటా యన్నదే నాటి ప్రశ్న. ఇందునిమిత్త మానాడు ఏజాతివారు కానీ, ఏమతమువారు కానీ, హిందువయిన 'ప్రతివాడు'ను కాసె కట్టి కోక చుట్టి, కత్తి పట్టి విజయనగరాధీశుని ముత్యాలసెల్లె గొడుగునీడను నిలిచినాడు. ఆ దినమున దిశలు మారు మ్రోగిన యా ప్రశ్నకు నాటి హిందువులు వీరులై నిలిచి విజయనగర రాజ్యమును నెలయించి, విజయధ్వానము చేసి ప్రత్యుత్తరమిచ్చినారు. విజయనగరము తుంగభద్రకు దక్షిణమునగల దేశమున కాలపురుషుడు మలచిన కడపటి సామ్రాజ్యమే కాదు, కడపటి హిందూమహాసామ్రాజ్యము నదియే. అది మధ్యయుగదక్షిణాపథము హిందూధర్మమునకు కట్టిన పట్టము; దక్షిణదేశీయులు దానిని పూజించి పట్టిన మంగళనీరాజనము. హిందువుల ప్రతిభకు, హిందువుల ప్రజ్ఞకు, హిందువుల శౌర్యసాహసోత్సాహములకు నిధానమయిన సామ్రాజ్య మది. ఆసేతు హిమాచలముగల హిందూదేశమున వేలకొలది సంవత్సరములుగ జరగుచువచ్చిన విమత, విజాతీయ సంఘర్షణములు కారణముగ పొనుగుపడుచుండిన, సన్నగిలుచుండిన హిందూదీపకళిక కడపటి దీప్తి ప్రకాశములలో నొకటి విజయనగరసామ్రాజ్యము.

విజయనగరాధీశ్వరులపరిపాలనమున దేశ మత్యంతౌన్నత్యమును పొందినది. కళలు వర్ధిల్లినవి; శాస్త్రవిద్య పెంపొందినది; వేదకర్మాభిరతి హెచ్చినది; కులములు - తెలివిగాంచినవి; ప్రజలు తెలుగుమీరినారు; వర్తకవ్యాపారము హెచ్చినది; చీనాదేశమునుండి పోర్చుగల్ దేశమువరకు వర్తకపుటోడలు పరుగులువారినవి; భోగభాగ్యవైభవము లతిశయించినవి. ధర్మమునెడ నభిమానమును, సత్యమునెడ నాదరమును కుదురుకొనినది.

"Strict justice and truth are observed towards all by the Governors (f the country'

అని బేరాస్ను,

"This country is so well populated that it is impossible in a reasonable space to convey an idea of it."

అని అబ్దుర్ రజ్జాక్ను వ్రాసియున్నారు. దాని వైభవోన్నతులననుసరించి వేరే మనము వర్ణించుట యెందుకు?

విజయనగరసామ్రాజ్యనిర్మాణముతో దక్షిణాపథమున హిందువునకు మరల ఉత్పత్తి పుట్టినది. హిందువన్న గౌరవము బలిసినది; హిందూమతము గణనీయమయినది. విజయనగరసామ్రాజ్యము హిందువుల దాది; హిందువుల యప్రతిమానశౌర్యదీప్తి; అకుంఠిత కార్యదీక్ష; అసమాన ఆత్మవిశ్వాస ప్రకటనము; అతులమయిన ధర్మాభినిరతి; హిందువుల యంతిమాశయము. శ్రీ విద్యారణ్యశ్రీపాదులవారు ఆ విజయనగరసామ్రాజ్యనిర్మాణమునకు పూనుకొని హిందువు జీవితమునకు, కార్యదీక్షకు వెలకట్టినారు. శ్రీపాదులా సామ్రాజ్యనిర్మాణమునకు పునాదిరాయి వేసిన ముహూర్తము హిందూజాతికి శుభోదర్కమయినది; విజయనగర సామ్రాజ్యసంస్మరణమున స్వేచ్ఛ, స్వాతంత్ర్యము, ధర్మాభిరతి, కార్యదీక్ష, త్యాగము, ఐకమత్యము, సత్యప్రియత్వము అనురంగు లింద్రచాపమువలె మనోహరములయి, కనుపించుగ మెరయుచుండగలవు.

# 'విశ్వం' ప్రేమగీతాలు*

### శ్రీరంగం శ్రీనివాసరావు

౧

'మధుకీల' అంటే అర్థమేమి టని ప్రశ్నించాడు న న్నొక స్నేహితుడు, విశ్వేశ్వరరావు గ్రంథం నా చేతిలోనుండి తీసికొని పరీక్షగా చూస్తూ. ఈ స్నేహితుడికి తెలుగు పుస్తకాలు, ముఖ్యంగా కావ్య గ్రంథాలు చాలా ఇష్టం. ప్రబంధాలూ అవీ చదువుకున్న వాఁడు. స్వయంగా కవిత్వం చెప్ప గలడు. 'భావకవిత్వం' అంటే ఏమిటో తెలియనివాడు. తెలుసుకుందా మనే కుతూహలం ఉన్న వాడు.

అటువంటి స్నేహితుల సందేహాలు తీర్చవలసిన బాధ్యత భావకవిత్వాన్ని విమర్శించి, సమర్థింప దలచుకున్న ప్రతివ్యక్తికీ తప్పదు.

మధువంటే అర్థం అతనికి తెలుసును. కీల అంటేకూడా తెలుసును. రెండూ వ్యాకరణ రీత్యా కలిసి విశేషణ పూర్వపద కర్మ ధారయ సమాస మయిం దని తెలుసును. అయినా 'తీయనిమంట' అంటే ఏమిటో అతనికి తెలియలేదు. పోసీ 'తేనెమంట' అని రూపక సమాసంగాని, 'తేనెయొక్కమంట' అని షష్ఠీతత్పురుష సమాసంగాని చేసుకున్నా అర్థ మేమిటి చెప్పుకోవాలో అతనికి తెలియలేదు.

అప్పుడు నే నతనితో అన్నాను: 'మొదట నువ్వు వ్యాకరణంతో ఆరంభించి అర్థానికి వస్తావు. అంటే వైయాకరణులమీద నమ్మకం, భారం పారవేస్తావు. కాని వైయాకరణులు ఆకాశంనుండి దిగినవాళ్లు కారు. వాళ్లు అర్థంతో ప్రారంభించి సూత్రాలు చేసి అలా తయారయిన శాస్త్రాన్ని వ్యాకరణం అన్నారు. నీకు కవిత్వం అంటే ఎంతయిష్టమో వాళ్లకి వ్యాకరణం అంటే అంత అభిమానం. కవిత్వాస్వాదనకు వ్యాకరణం అవసరం కాదని నే ననను. నిజమైన వ్యాకరణం అభిరుచిని తీర్చి దిద్దుతుంది. కాని కవిత్వాన్ని కొలవడానికి వ్యాకరణం చాలదు.

'ప్రస్తుతం మధుకీలకు అర్థం. దీనిలోని రెండు పదాలకూ నీకు వేర్వేరుగా అర్థం తెలిసి వాటిని కలిపితే, కంగారుపడడానికి కారణం ఏమిటి? రెండు పదాల కలయిక వల్ల ఒక 'భావం' ఆవిర్భవిస్తుంది.

పదాన్ని అర్థం చేసుకున్నట్టు భావాన్ని అర్థంచేసుకోవడం కష్టం. ఇక్కడ తేనె యొక్క (లేక ఆసవంయొక్క) మాధుర్యము

---

* మధుకీల : మల్లవరపు విశ్వేశ్వరరావు, నవ్యసాహిత్యపరిషత్తు ప్రచురణము. వెల ౧ రూపాయి. నవ్యసాహిత్య పరిషత్తు కార్యదర్శి, గుంటూరు అని వ్రాసిన గ్రంథములు దొరకును.

(మత్తు) న్నూ, కీలయొక్క వేడిమిన్నీ ఒక్క చోటనే కలిసిఉన్న మనోవస్థను స్ఫురింప జేయడానికి ఒక్కపదం లేకపోవడంవల్ల కవి ఆభావాన్ని చిహ్నించడానికి 'మధుకీల' అనే సమాసాన్ని నిర్మించాడు. తాను రచించిన గీతాలను సంపుటీకరించి గ్రంథ రూపం చేస్తూ, తన చిత్తవృత్తినీ, తత్ఫల మయిన గీతాలనూ 'మధుకీల' అనే పేరుతో నిర్దేశించాడు. ఇంతకూ పదాలన్నీ సంకేత ప్రాయంగా వాడబడుతున్నవి కాని దేనికీ సరియైన, శాశ్వతమైన అర్థం లేదు. అయితే నేనుకూడా నా కవిత్వంలో నాయిష్టంవచ్చిన పదాలు సృష్టించి వాడుతా నంటావా? నిన్నెవ్వరూ అడ్డరు. పోసి నేనుమాత్రం అడ్డను. నీరచనలో ఏమాత్రం భావన, ఉద్రేకం, ఋజుత్వం ఉన్నవో, నీ కేమాత్రం సంస్కారం ఉన్నదో చూస్తాను. నీకు వ్యక్తిత్వం ఉన్నదా, ఇతరులను ప్రతిధ్వనిస్తున్నావా అని చూస్తాను. చిత్తశుద్ధి ఉంటేనే నీవు చేసిన రచన శిల్పం అవుతుంది. శిల్పం అంటే సత్యం. సత్యానికి చావు లేదు.

'అసలే కవిత్వం మాటలకంటె భిన్నమైనది. భావకవుల రచన మరీ సాంకేతికం. వీరు నెమలిచిత్రం వేసి 'ఆషాఢమేఘం' అని పేరు పెడతారు. దారిపోయేవాడు దీన్నిచూసి 'ఇది అబద్ధం. దీన్ని వ్రాసినవాడు ఉన్మాది' అనుకొని కాఫీక్లబ్బుకో ఎక్కడికో పోతాడు. అంతకంటె సున్నితమైనహృదయం కలవాడికి ఆరచనను చూస్తే తనలో ఏదో ఒక తీగ కదులుతుంది. ఏదో అగాధ నిగూఢసత్యం స్ఫోరకుతుంది.

'మరికొంద రుంటారు. వీరు నెమలి బొమ్మ వేసి 'నెమలి' అనే అంటారు. కవి పోషకులు, శిల్పప్రియులు అంతా దానిచుట్టూ పోగై భజనచేసి కవికి బ్రహ్మరథం పడతారు. సంప్రదాయాలను కాదనకుండా, ఫక్కీమార్చకుండా వ్రాసేకవులు శీఘ్రం గమనించబడతారు.

'ఈ సందర్భంలో మరోతెగను కూడా చెప్పాలని ఉబలాటం కలుగుతోంది. వీళ్లు కవులు కారు. వీళ్లకి కవిత్వం అక్కరలేదు. 'నెమలిబొమ్మవెయ్యడం ఎందుకూ?' అని అడుగుతారు వీళ్లు. 'అసలు బొమ్మలు వెయ్యడం మాత్రం ఎందుకు?' అంటారు. వీళ్లు సంస్కృతులు. ప్రాపంచికంగా 'బాగుపడ్డ'వాళ్లు. కవులనూ, శిల్పులనూ, చిత్రకారులనూ చూస్తే వీళ్లకు జాలి. కవి తనవృత్తిలో 'బాగుపడి' తమవర్గపు స్థాయికివస్తే తమ సంఘంలోనికి అతణ్ని అంగీకరిస్తారు.'

ఈ ఉపన్యాసం ముగించేసరికి నాస్నేహితుడు పుస్తకం తెరచి అందులో 'ఆవాహన' అనే మొట్టమొదటిగీతం చదివి 'దీని అర్థమేమి' టన్నాడు. నే నేమీ విసుక్కోలేదు. అతని ప్రశ్న చాలా స్వాభావిక మైనది. ఎన్ని ప్రశ్నలకేనా సమాధానం ఇయ్యాలనే నేను నిశ్చయించుకొని ఇలాగన్నాను.

'భావకవిత్వం చాలావరకు ఉత్తమ పురుషలో ఉంటుంది కాబట్టి కవినిగురించి తెలుసుకొనే అగత్యం ఇక్కడ మరీ హెచ్చు. అలా తెలిస్తే ఇంకా సానుభూతితో కూడిన సామీప్యానికి వచ్చి కవిహృదయం తెలుసుకుంటాము. ఈ గీతంలో కవి మెవరినో

'ఆవాహన' చేస్తున్నాడు. ఎన్నో సంకేతాలు ఉపయోగించి ఏవో చిత్రాలు వేశాడు. ఎక్కడా స్పష్టంగాలేడు. 'మధుకీల' అనే సమాసం ఇందులో తరుచుగా దొర్లింది. ఇది కవి తన చిత్తవృత్తినో, తన కావ్యవాణినో, ప్రేయసినో, వీటన్నిటినో పిలుస్తూ వ్రాసిన గీతం.'

'ఆసంగతి ఆయన ఎక్కడా చెప్పలేదు' అని నా స్నేహితుడు గొణుక్కున్నాడు.

'చెప్పలేదు గాని మనం ఊహించుకోగలమని వదలిపెట్టాడు. మనం తెలివయిన వాళ్ళమనీ, అతని సంజ్ఞలు గ్రహించగలమనీ అనుకున్నాడు. అటువంటి పాఠకులున్నారన్న నమ్మకమే ఈ గ్రంథప్రకటనానికి కూడా కారణం. ఆ పాఠకులే అసలైన ప్రాడ్వివాకులు. వాళ్లను సంతుష్టిపరచడంలోనే కవికి ధన్యత. వారి కీరకంకవిత్వం ఏ ప్రామాణ్యాలతో చర్చించాలో తెలుసును. అందుకే వాళ్లు చూపించే దోషాలను కవి దిద్దుకోవడానికి కూడా జంకడు. అన్యప్రామాణ్యాలతో తన్ను కొలవబోయే వాళ్లను చూస్తే మాత్రం భావకవిత్వం నవ్వుకుంటుంది.

'భావకవిత్వం ఒక అనుభవం. దీన్ని ఒకడు మరిఒకడికి బోధపరచడానికి వీల్లేదు. పరిమళం ఇలా ఉంటుందని ఏమి చెప్పగలం? దాన్ని అనుభవించగల ఇంద్రియాలు ఉండాలి. వాటిని సున్నితంగా ఉంచుకోవాలి. నీ అర్హతను బట్టి, సంస్కారాన్ని బట్టి నీ కది గోచరిస్తుంది. అందుకే భావకవిత్వానికి 'సార్వత్రిక చట్టాలు' లేకపోవడం. అసలే రూల్సులేవని కూడా అందుచేతనే అపోహాలు వ్యాపించాయి. కాని భావగీతాల మంచి చెడ్డలు నిర్ణయించేవాళ్లు లేకపోలేదు. రత్న పరీక్షకులకు తప్ప రత్నాన్ని చూచిన ప్రతి వ్యక్తికీ దాని విలువ చెప్పగలిగిన శక్తి ఉండనట్లు ఒకగీతంవిలువ సాహిత్యవేత్తలకు తెలిసినట్లు ఆవ్యాసంగం లేనివాళ్లకు తెలియదు. ఈ సాహిత్య వేత్తలంటే మాత్రం ఎవరు ? నిరంతర వ్యవసాయంవల్ల అభిరుచిని పరిణతం చేసుకున్నవాళ్లు. వీరు శాసనాలు చేసినా వాటిప్రకారం సృష్టిచేస్తానవేవాడు మూర్ఖుడు. ఎప్పుడూ సృష్టి ముందు. శాసనాలు తర్వాత. ఏవో రూల్సు ఉండి వాటిప్రకారం ప్రజలు పోతూఉంటే చాలు కొందరికి. అవి కుళ్లిపోతున్నా సరే. వాటిని మారుస్తామనేవాడు ద్రోహి. కాని ఇటువంటి ద్రోహులే, విప్లవకారులే ప్రపంచోద్ధారకులు. ఆమధ్య ఒకాయన వాడుకభాషకొక వ్యాకరణం చేసి ఆప్రకారం అందరిచేతా వ్రాయించమన్నాడు. అక్కడే ఉన్నది నా అభ్యంతరం. అలా బంధించానని నువ్వు సంతుష్టిపడడమే కాని, నీ 'ద్రోహి' అప్పుడే తప్పించుకొని రూల్సుకు వ్యతిరేకంగా పోయి విప్లవం తెస్తూ మార్పులు ఘటిస్తున్నాడు. నువ్వేమో వాడిని తిడతావు. రేపు వాడి మార్పులనే ప్రపంచం ఆమోదిస్తుంది. అతివాదుల తత్వం ఇదే! వీరు రాజకీయాలలో, సాంఘికాలలో, మతంలో, సాహిత్యంలో, జీవిత వ్యాపారాలన్నిటిలో ఉంటారు. 'వీరిని ప్రతిఘటిస్తూ సనాతనులు (Traditionists, Conservatives) కూడా ఉంటారు. అతివాది కావడం, విప్లవకారుడు కావడం, మానవ చరిత్రను మార్చడం ప్రతివ్యక్తిలోనూ లేదు.

ఈ అల్పసంఖ్యాకులే చరిత్రక్రమం మార్చేది. ఈ మార్పులు రావడానికి మితవాదులు (moderates, liberals) కారణం. వీరు సంప్రదాయాలలో పదిలంగా ఒక అడుగు ఉంచి మార్పులలో రెండో అడుగు వేస్తూ ఉంటారు. అతివాదికి వెంటనే బోధపడ్డది మితవాదికి చాలాకాలానికి గాని బోధపడదు. బోధపడినా ఆచరించడానికి దూకే సాహసం ఉండదు.

'కాని జీవితంలో సనాతనుల అగత్యం లేకపోలేదు. వీరు ఆచారాలకు అలవాటుపడి, తృప్తిపడి వాటిని రక్షించడమే పనిగా, మార్పు లంటే సహించలేక జీవిస్తున్నా, వీరి సంప్రదాయభక్తిలోనే ప్రపంచ స్థిరత ఉన్నది. వీరి విమర్శలవలన అతివాదుల లోని తక్కువరకంవారి నటనలు బయలు పడుతూఉంటవి.

'అనాదినుండీ సనాతనుల సంప్రదాయ పరత్వానికీ, అతివాదుల సంస్కారప్రియత్వానికీ సంఘర్షణ వస్తూనేఉన్నది. ఇది మన కళ్లయెదుట కూడా జరుగుతూనే ఉన్నది. పాతికేళ్లక్రిందట గిడుగు రామమూర్తి విప్లవకారుడు. గాంధీ రాజద్రోహి. నేడో? వీరికి వీరివీరి క్షేత్రాలలో ప్రముఖస్థానం వచ్చింది. వీరితో ప్రపంచం ఆగిపోతుందా? ఇతర విప్లవాలు మళ్లీ వస్తాయి. ఇతర 'ద్రోహులు' బయలుదేరుతారు. సంగ్రామం సాగిపోతూ ఉంటుంది. అతివాదులంతా తిట్లుతింటూనే ఉంటారు. బాధలుపడుతూనే ఉంటారు. భవిష్యత్తులో జయించితీరుతారు. కీట్సులాగు చిన్నతనంలో చచ్చిపోతే నేమోగాని బ్రౌనింగులాగు చాలాకాలం బ్రదికిఉంటే తమ విజయం తామే చూడగలరు. మొదటి పొగయంత్రం వేళాకోళానికి పాత్రమయింది. ఫారడే (Faraday) విద్యుచ్ఛక్తిని కనిపెడితే ఏమిటి దానిలాభం అని ప్రశ్నించాడొక మంత్రిప్రముఖుడు. బర్న్స దీనంగా చనిపోయాడు. జీసస్‌క్రీస్తు సిలువ వేయబడ్డాడు. నేడు సామ్యవాదులు జైళ్లలో పడుతున్నా భావగీతాలు పరిహాసభాజనం అవుతున్నా దీనిలో ఏమీ విచిత్రం లేదు.'

నా స్నేహితుడు 'మళ్లీ మాట్లాడుకుందాం' అని వెళ్లిపోయాడు.

౨

'మధుకీల' ఏబది ఖండకావ్యాల సంపుటం. రమారమి పదిసంవత్సరాలనుండీ గీతాలు వ్రాస్తున్న విశ్వేశ్వరరావు పుస్తకరూపంగా వాటిని ప్రకటించ దలచుకొన్నప్పుడు తనవికదా అన్న అంధాభిమానంతో వ్రాసినవన్నిటినీ కాక, ఇవే గ్రంథస్థమై నిలువదగ్గవన్న నిశిత విచక్షణతతో ఈ యేబది గీతాలనూ ఎన్నుకొని సంపుటించాడు. ప్రతిగీతం స్వయం సమగ్రంగా ఉంటూ సమష్టిని ఏకాగ్రత సమకూడడానికి ప్రయత్నించాడు. 'వస్త్వైక్యం' కోరి అన్నీ ప్రేమప్రధానంగా ఉన్న కావ్యాలనే సేకరించాడు.

ఈ ప్రేమ 'స్వప్నభంగము', 'భగ్నతరణి', 'పిలుపు'వంటి కొన్ని గీతాలలో తొలిచూపులకే స్పష్టం కాకపోవచ్చును. కాని వాటిలోని మన స్తత్వం గ్రహించగలిగితే ప్రణయవిహ్వాలుడు మాత్రమే

వాటిని వ్రాసిఉండాలని గోచరించక పోదు. ఒక యువకుడు, స్వప్నశీలి, ఆదర్శవాది, ప్రేమలోని చేదుతీపులు సమంగా, స్వయంగా అనుభవించినవాడు వ్రాసిన గీతాలుగా 'మధుకీల'లోని రచనలు అవగాహన మవుతాయి.

ఇప్పుడు భావకవిత్వంలో ప్రముఖంగా ప్రేమ కనిపించుతున్నదంటే అది నేటి కవిత్వపు పరిణామంలో ఒక మెట్టు. ఇతర రసాలేవీ కవితాద్రవ్యం కావనిగాని, వాటిని భావకవులు స్వీకరించి కావ్యరచన చెయ్యలేదని కాని ఎవ్వరూ అనలేరు. ప్రేమ నేటి కవిత్వంలో ముమ్మరంగా కనిపించడం ఒక 'యాథార్థ్యం'గా అంగీకరించి దానికి కారణాలు కనుక్కోవాలి. కొందరికి నేటి ప్రేమ రచనలు విచ్చలవిడిగా, అసభ్యంగా కనబడి ప్రతిఘటించారు. మరికొందరు అభిమానంతో, అభినివేశంతో సమర్థించ బోయారు. కాని ప్రేమవికాసానికి ఈ ఖండనమండనాలతో సంపర్కం లేదు.

రసంగా శృంగారానికి మనవారు ఉన్నతస్థానం ఇచ్చారు. మనుష్య హృదయంలో ప్రేమకు సుదృఢస్థానం ఉన్నది. ప్రేమను ఎవ్వరూ వదలుకోలేరు. ఇదివరకు కవులు ప్రేమను వర్ణించారు. ఇకముందు కూడా వర్ణించితీరుతారు. నేడు భావకవిత్వానికి యౌవనదశ నడుస్తున్నది. కావున స్వాభావికంగా ప్రేమభావాలు నేటికవిత్వంలో విరివిగా కనబడుతున్నవి. ఇంతకూ మానవుడి వయఃపరిమితిలో యౌవనమే ఉత్కృష్టకాలం. కవులు తమ అద్భుత ప్రేమకావ్యాలు ఈ వయస్సులోనే వ్రాశారు. ఉదాహరణలా? షెల్లీ *Epipsychidion* షేక్స్పియరు *Romeo and Juliet* వంటి మొదటి నాటకాలు, కాళిదాసు మేఘసందేశం. కవులు వయోవృద్ధు లవుతున్నకొద్ది వారిశిల్పం పరిణతమై, అర్థం గంభీరమై, వారి కావ్యాలలో ప్రౌఢవేదాంతం గోచరించవచ్చును. కాని, వాటిలో స్ఫాటికస్వచ్ఛమైన తొలుతటి లావణ్యం కనబడదు. ఈనాడు రాయప్రోలుకవి ఏదైనా ఉత్కృష్టకావ్యం మరోరకంగా వ్రాయవచ్చునేమోకాని 'స్వప్నకుమారం' వంటి రచన మళ్లీ అతనినుండి రాదు.

రాయప్రోలు, అబ్బూరి, బసవరాజు, నండూరి, నాయని, కృష్ణశాస్త్రి అంతా ప్రేమకావ్యాలు వ్రాశారు. వీరంతా ప్రథమ శ్రేణిలోని కవులు. ఒకే రసమైనా ప్రత్యేక వ్యక్తిత్వంతో అనితర దుర్లభమైన విధానంతో పోషించారు. వీరిని అనుకరించ బోయిన కవులంతా విఫలులైనా అయిపోయారు. లేకుంటే రెండవ, మూడవ తరగతులలో పడిపోయారు.

వీరంతా నేటిసాహిత్యంలో సుప్రతిష్ఠితులైన తర్వాత విశ్వేశ్వరరావు ప్రవేశించాడు. ఇతని స్థానం సరిగా తెలిసికోవాలంటే ఇతడు వచ్చినప్పటికి సారస్వత రంగంలోని పరిస్థితులను దిఙ్మాత్రంగానైనా గమనించాలి.

అది ౧౯౨౦ నుండి ౩౦ దాకా సాగిన దశాబ్దం. అప్పటికి రాయప్రోలు మున్నగు వారి ప్రాబల్యం ఒత్తిగిలిపోయింది. ఇతరకవుల తరం వచ్చి ఇతరకంఠాలు వినబడుతున్నవి.

(వీరిలో వెనుకటి కవుల ప్రోద్బలం దొరకదని కాదు. దాని నధిగమించి స్వీయకంఠం తెలుసుకొని వీరు పాడుతున్నారు). వీరందరిలో దృష్టిని మిరుమిట్లుకొలుపుతూ నిలిచినవాడు కృష్ణశాస్త్రి. అప్పటికే 'ఎంకిపాటల గాలిదుమారం' చెలరేగుతున్నది. విశ్వనాథ సత్యనారాయణ మేఘనినాదం వినిపిస్తున్నాడు. నాయని సుబ్బారావు మొదట 'సాహితి' లోనూ, తర్వాత 'జయంతి'లోనూ తన మనోహర మహోన్నత ప్రేమశ్రుతులు వినిపించాడు. కాని వీరందరిలో అల్లకల్లోలమైన సుడిగుండంగా కృష్ణశాస్త్రి ఒక్కడే అనేకులను తనలోనికి లాక్కుంటున్నాడు. ఈ సుడిగుండంలోనే పడి నిస్సందేహంగా కవితాహృదయంగల సహదేవ ఉక్కిరిబిక్కిరై పోయాడు. ఈ సుడిగుండంలోనే విశ్వేశ్వరరావు మొట్టమొదట చిక్కుకున్నాడు.

కేవలం కృష్ణశాస్త్రి ప్రోద్బలంలోనే విశ్వేశ్వరరావు ప్రథమ కవిత్వం సాగింది. ఆ మొదటిరచనలలో చాలా ఉత్సాహం, చాలా అపరిపక్వత, చాలా కావ్యదోషాలు ఉన్నవి. వాటిలోనే అంతర్లీనమై ఆశలు గొల్పుతూ ఒకకవితాకాంతికూడా మెరుస్తూ ఉన్నది. విశ్వేశ్వరరావు వెంటనే గమనించబడలేదు.

కాని, అనుక్షణం విశ్వేశ్వరరావు తన శిల్పాన్ని మెరుగులుతీర్చు కుంటున్నాడు. 'ప్రేమగానం' వంటి గీతంలో అతడు కృష్ణశాస్త్రి ఎన్నడూ నిర్వహించలేని సూటిదనం అందుకున్నాడు. ఇకమీద హృదయాన్ని కలవరపెట్టే అవస్థల నన్నింటినీ గీతాలు చేశాడు. ఈ వైవిధ్యంలోనే విశ్వేశ్వరరావు ప్రత్యేకత ఉన్నది. నాయనిలో అంతా ఆనందము, ఉత్సాహంగూ కనపడి, కృష్ణశాస్త్రిలో అంతా విషాదమూ, విక్లబతా కనిపిస్తే విశ్వేశ్వరరావులో ప్రేమవిస్తారపు అంచులన్నీ అన్నిరంగులలోనూ గోచరిస్తాయి. మరిన్ని నవకవులలో ఎవ్వరి ఏగీతం ప్రక్కనైనా నిలువగలిగిన వని చెప్పాలి ఇతని నెలవంక గీతం, ఒకతారక అనేవి. 'నీకకు', 'ఆమెకే' వంటి గీతమాలలో ఇతడు నాయని విధాన్ని తలపించకపోడు. ఆవిధంలో నాయని అద్వితీయుడని కూడా సులువుగా ఒప్పుకోవాలి.

భావకవులు ఉద్రేకం, ఆవేశం లేనిదే గీతాలు వ్రాయరు. అలా వ్రాసినా అవి నీరసంగానే ఉంటవి. కృష్ణశాస్త్రి నాయని మొదలగువారు వ్రాసినప్పుడు పరిపూర్ణతీవ్రతలో వ్రాశారు. అప్పటి వాతావరణం అందుకు అనుకూలంగా ఉన్నది. కవుల జీవితంలో ఇట్టిఘట్టాలు ఉంటాయి. అప్పుడే వారివాణి నిశితంగా ధ్వనిస్తుంది.

'మధుకీల'కు తుదిని పురూరవ' వ్రాసిన 'పరిచయవాక్యాలు' కలవు. వీటిలో అభిమానం, అధికారం కూడా ఉన్నవి. వ్రాసిన వ్యక్తి తనశైలివలన స్పష్టంగా కనబడుతున్నా వాఙ్మయ వ్యాసంగం లేనివాళ్లకు అతని ప్రచ్ఛన్నతవలన రచనలోని అధికారం మరుగుపడిపోతుంది. కాని హృదయపూర్వకమైన విమర్శగా 'పరిచయవాక్యాల' లో ఒక శక్తి సోకితీరుతుంది.

ఇక 'మధుకీల' లోని గీతాలసంవిధానం ఒకటి రెండు మాటలు కోరుతుంది.

ముఖ్యంగా అందలి మాత్రాచ్ఛందస్సులు. ఇవి సులభంగా ఉన్నట్లు కనబడుతూ అవ్యుత్పన్నుల ఈసడింపులకు పాల్పడ్డా, నిజమైన కవులచేతులలో ఇవి పొందిన పరిపోషణలు ఆనందాశ్చర్యాలు కలిగిస్తాయి. వీటిని సరిగా గ్రహించాలంటే ప్రక్కనే మన చవకపత్రికల నిండా కనబడే రచనలను పెట్టి సరిపోల్చితే చాలును. కాని కృషిచాలనివారికి అవీ, అసలుగీతాలూ ఒకవిధంగానే కనిపిస్తవి. అమోఘములైన క్యూబిస్టు చిత్రరచనలను వెర్రితనం అని హేళనచేసినవా రున్నారు. అక్కడే రుచి ప్రామాణ్యాల అగత్యం ఉన్నది. ప్రతి నూతనోద్యమములోనూ నాయకులూ, అనుకర్తలూ ఉంటారు. నాయకమైన రచన గ్రహించడానికి శాణితమైన అభిరుచి ఉండాలి. 'మధుకీల'లోని 'సింగారం' అనే గీతం కొందరికి అర్థంలేని మాటలదొంతర. కొందరికి సంవిధానంలో అది చెక్కిన నగ. 'ప్రేమఝంఝ'లో ఉద్రేకతాండవం పఠితల మనస్సులో హత్తించడానికి ఛందస్సు ఎలా ఎలా విరిగిందో కనిపెట్టినవారు ఒక ఆహ్లాదం పొందుతారు. ఛందోవ్యవస్థలు తెలుసుకోవడం రసానందం అధికంగా అనుభవించడానికే ఉపకరిస్తుంది.

విశ్వేశ్వరరావులో ఒక్క కృష్ణశాస్త్రి ప్రోద్బలం మాత్రమే ఉన్నదన్నాను. ఇది తెలుగు కవులతో సంబంధించినంతవరకే. బ్లేక్, షెల్లీ, టాగూరు మున్నగు అన్యభాషా కవుల ప్రోద్బలం ఇరువురిలోనూ ఉన్నది. అదీగాక ఇరువురికీ 'అభిరుచులూ,ఆశయాలూ ఇలాంటివన్నీ చాలావరకు ఒక మోస్తరువే.' అందువల్లనే కొన్ని పోకడలు ఎవరినుండి ఎవరు గ్రహించారో చెప్పడం కష్టం.

ఇటీవల విశ్వేశ్వరరావులో కృష్ణశాస్త్రి ప్రోద్బలంకూడా విడిపోయింది. 'స్వర్ణకింకిణి', 'స్త్రీ' మొదలైన గీతాలలో ఇతడు స్వకీయమున్నూ, పరిపూర్ణమూ అయిన వ్యక్తిత్వం ప్రదర్శిస్తున్నాడు. కాని ఇవి 'మధుకీల'లో ప్రకటించబడలేదు. ఇవన్నీ మరొక సంపుటంగా వెలువడుతాయని ఆశించవచ్చును.



# కజ్జలరేఖ

యలమంచిలి శ్రీరాములు

[కలకత్తా విశ్వకళాపరిషత్తువారు వ్యయప్రయాసల కోర్చి మైమనుసింగుగీతికలను మూడు సంపుటములుగా డా. దినేశచంద్రసేనుల సంపాదకత్వమున ప్రకటించినారు. ఈ వాఙ్మయమును వంగీయు లమూల్య మైనదిగా భావించుచున్నారు. ఇట్టికథలవల్ల దేశీయుల మానసికస్వభావములు, నాచారవ్యవహారములు ముఖ్యముగ దెలియును. కొన్నికథలవల్ల చారిత్రికవిషయములుకూడ దెలియవచ్చుచున్నవి. ఆంధ్రులకు నిట్టి సారస్వతము గలదు. ముద్రణభాగ్యము లేక అది నశించిపోవుచున్నది. ఆంధ్ర విశ్వకళాపరిషత్తువా రిట్టి కథలను తెనుగు దేశమునుండి సంపాదించి ప్రకటించుట వారు చేయవలసిన ఘనకార్యములలో నొకటి యని సవినయముగ హెచ్చరించుచున్నాను.

ఈకజ్జలరేఖ కొంత వచనముగను, మఱికొంత ద్విపదలక్షణమును బోలు కవిత్వము లోను వ్రాయబడినది. ఈ కథయొక్క గుణాగుణములను నేను చర్చింపక ఆ కార్యమును పాఠకులకే వదలుచున్నాను. తెనుగువారికి గల యిట్టి (Ballads) పాటకథలు, లేక యక్షగానములు ముద్రింపబడుట యెంతేని యవసరము.

ఈ కథను నేను 1930 లో అనువాదము చేసితినిగాని యింతవఱకు ప్రకటించి యుండ లేదు.

—అనువాదకుడు:]

## ౧

మైమనుసింహారాష్ట్రములో ధనేశ్వరుడనే పేరు గల వైశ్యుడుండేవాడు. ఆతని కొక్కకొడుకూ, ఒక్క కుమార్తే ఉండిరి. సహజంగా ధనవంతుడను ఆవర్తకుడు దేవుడిదయచేత వర్తకంవల్ల మహాధనవంతు డయ్యాడు. ఆయనకుమార్తె కజ్జలరేఖ మహాసుందరి. పదేళ్ల ప్రాయం. ఆపిల్ల నవ్వితే, మంచివానలో విచ్చిన పద్మాలవలె ఆమె పల్వరుస ప్రకాశిస్తుండెను. ఆయనకొడుకు నాలు గేళ్లప్రాయం. పేరు రత్నేశ్వరుడు.

## ౨

లక్ష్మీదేవిది చంచలస్వభావం గదా? ధనేశ్వరుని సమస్తైశ్వర్యం జూదంలో తుడిచిపెట్టుకుపోయింది. ధనధాన్యాలు, వస్తువాహనాలు పోయినవి. పాపం, ఏమి చేస్తాడు? పాపిష్ఠిజూదాన సమస్తం పొయ్యాక ఫకీరు వేషంతో దేశాటనం చేయ పొయ్యాడు. ఆత డెంత దురదృష్టవంతుడు కాకుంటే ఆతని పన్నెండు ఓడలలో ఒక్కటికూడా పనికివచ్చేస్థితిలో నుండకుండా పోతుం దా మరి!

## ౩

కజ్జలకు పెళ్లియీడు వచ్చింది. తండ్రి జూదరనే విషయం దేశమంతటా వ్యాపించింది. ఆకారణంచేత కజ్జలను పెళ్లిచేసికొంటామనేవారే కనబడకపొయ్యారు. ఈస్థితిలో సన్యాసి యొకడు ధనేశ్వరుని యింటికి వచ్చాడు. ఆసన్యాసివద్ద ఉంగరమొక్కటియు, మాట్లాడ

నేర్చిన కీరమొక్కటియు నుండెను. దేశాటనం ముగించు కొనివచ్చిన ధనేశ్వరునికి వాటిరెంటిని బహుమతిచేసి ఆ సన్యాసి యిట్లన్నాడు: "ఈ పక్షిని ధర్మమతిఅంటారు. అదిచెప్పినట్లు నీవు నడచుకొంటే నీపోయిన సంపదను నీవు తిరిగి సంపాదించుకోగల్గుతావు." ధనేశ్వరుడు మహానందాన్ని పొంది ఉంగరమును, పక్షిని పదిలపరచాడు. సన్యాసి యెటకో వెళ్లిపొయ్యాడు.

తర్వాత అవర్తకుడు చిలుకతో ఇట్లన్నాడు: "నామహైశ్వర్యమంతా మాయమయింది. చావిడినిండా న్వర్ణాలూ, యేనుగులూ నింపి మానాయన నాకప్పగిస్తే ఒక్కటీ నాకు మిగిలిందికాదు. కొడుకూ కూతురుతప్ప నాకేమీ నేను లేకుండపోయింది. ఫకీరునై దేశమంతా తిరిగాను. ఏమిలాభం? దీపపు కణికలవలె ప్రకాశిస్తున్న నాబిడ్డలను పోషించేమార్గ మేమిన్నీ కనబడడంలేదు. మంచిరోజులు నా కెప్పుడు వస్తవో చెప్పు."

శుక మందు కిట్లా జవాబుచెప్పింది: "నీవీవిధంగా చింతిస్తే ప్రయోజనం లేదు. నీదురదృష్టపు రోజులు త్వరలోనే వెళ్లిపోతవి. సన్యాసి యిచ్చిపోయిన ఉంగరాన్ని అమ్మి ఆడబ్బులో కొంతపెట్టి పాడైపోయిన ఓడలు మరమ్మతు చేయించడానికి పనివాళ్లను దీసికొని రమ్ము; మిగిలింది పెట్టి మళ్లీ వాణిజ్యం సాగించు; ప్రాగ్దేశాలకు పొమ్ము. ఒక్కసంవత్సరంలో మళ్లీ నీవు రాజభోగా లనుభవించడానికి తగినంత ధనం సంపాదిస్తావు."

౪

ఉంగరం చాలా కిమ్మతు పలికింది. మంచిపని వాళ్లతో తాతతండ్రులిచ్చిన ఓడలన్నీ మరమ్మతు చేయించాడు. ప్రాగ్దేశాలకు పొయ్యాడు. శుకం చెప్పినట్లు దేవుడిదయచేత పోయిందంతా సంపాదించాడు. గజతురగాలు కొన్నాడు. వెనుకటి కోశాగారాలు డబ్బు నిల్వచేయడానికే చాలకపోయినవంటే అతడెంత సంపాదించాడో తెలుస్తుంది. కోనేళ్లమధ్య పూర్వీకులు కట్టించిన విలాసమందిరాలు మరమ్మతు చేయించాడు. మింటిరిక్కలనైనా లెక్కింపవచ్చునేమో కాని అతని యైశ్వర్యాన్ని గణింప నలవికాదు. ఆతనికి మరొక చింత మిగిలియున్నది. యౌవనంవచ్చిన కజ్జలరేఖకు పెళ్లి కాలేదు. "కీరమా! అమ్మాయిపెళ్లివిషయం ఏమి చెప్పతా" వన్నాడు ధనేశ్వరుడు.

౫

చిలుక యిట్లంది: "నీవు దురదృష్టదేవతనుండి ఒక విధంగా తప్పించుకోగల్గావుగాని మరొకవిధంగా మహాకష్ట మనుభవింపవలసియుంది. దానినుండి విముక్తి పొందడమునకు చాలాకాలము పడుతుంది. కజ్జలరేఖ ముఖాన మృతుని పెళ్లిచేసికోవలసియున్నదని వ్రాయబడివుంది. ఆమె నీప్రాసాదమున నుండుట క్షేమం కాదు. అరణ్యానికి ప్రవాస మంపుము."

"అకటా! ఎంత దురదృష్టవంతురాలు! నేనత్యంతము గారాబముతో పెంచిన కూతురు మృతుని పెళ్లిచేసికొనడం నేనెట్లా చూడగల్గుతాను? తల్లిదండ్రులు కూతుళ్లను తగినవరుల కివ్వడానికి ప్రయత్నిస్తారు. నేనో! ఏ గుండెతో నాగారాలకూచిని అడవికి ప్రవాస మంపగల్గుతాను? చిన్ననాడే తల్లిపోయినా ఆమెకే కొరత కలుగకుండా పెంచాను. నేనెంతటి దురదృష్టవంతుడను! ఒకదానినుండి తప్పించుకొంటే మరొకటి బాధిస్తున్న"దని వర్తకుడు విలపింపసాగాడు. "ఏమను కొంటేమాత్ర మేమిప్రయోజన" మంది చిలుక.

౬

వర్తకు డేమిచేస్తాడు! వాణిజ్యమనే మిషతో కొమార్తెను వెంటనిడుకొని నావలో నెక్కాడు. చాలా రోజులు ప్రయాణం చేసినతర్వాత సముద్రతీరాన సాంద్రారణ్యం కనబడింది. అక్కడ ఓడనాపి కొమార్తెతో వర్తకు డడవివెంట బడ్డాడు. అడవిలో చాలాదూరం నడచేసరికి కజ్జలరేఖ బాధ కాగలేకపోయింది. ఆమెకు దుఃఖం పొంగి పొర్లివచ్చింది. వర్తకుడు దుఃఖంలో ఇట్లని మనస్సులో యోచిస్తుండెను: "అల్లారుముద్దుగా పెంచిన కన్నకూతురికి ప్రవాసమా? అడవిలో విడిచి పెళ్లిప్రయత్నం మానుకొనడమా? నా దురదృష్టపు రోజులు నన్ను విడువకున్నప్పుడు నే నేమిచేస్తాను?"

౭

కజ్జలరేఖ తండ్రిదుఃఖాన్ని గమనించింది. అడవికి తన్ను దీసికొనిరావడ మెందుకో కొంతవర కూహించింది. అందుమీదట కజ్జలరేఖ యిట్లంది: "నాయనా! నన్నెక్కడకు గొంపోతున్నావు? వాణిజ్యానికని బయలుదేరావుగదా! నావను సముద్రములో లంగరు వేసి ఈసాంద్రారణ్యంలో ఎందుకు ప్రవేశించావు? నీవు దుఃఖపడుతున్నా వేల? నన్ను ప్రవాసముంచుటకు దీసికొనివచ్చా వనుకుంటాను. ఈ సలహా కీర మిచ్చింది కాబోలు! ఇంకా కొన్ని దినములపాటు నాతమ్మునితోనైనా యుండనీయకపోతివా? ఓ నాతండ్రీ! ఈవనలతలను, వృక్షరాజములను అడిగిచూడుము. ఎన్నడైనా యేతండ్రియైనా తనకుమార్తె నీవిధంగా ప్రవాసమంపెనేమో! సూర్యచంద్రులు, నక్షత్రాలు నాలుగుయుగాలకు సాక్షులు. అడవిపక్షిమాటను నమ్మి బిడ్డ నెన్నడైనా ప్రవాసమంపడం చూచిరేమో వారి నడిగిచూడుము."

౮

అట్లాగే అడవిలో వారు చాలాదూరం పొయ్యారు. అక్కడ అడవిపక్షులు మృగాలుతప్ప మనుష్యులు లేరని వేరేచెప్పాలా? అక్కడ లోపల గడియవేయబడ్డ పాడుపడ్డదేవాలయం ఒకటి కనబడింది. తండ్రీ, కూతురూ బడలికతీర్చుకోడానికి మెట్లమీద కూర్చున్నారు. మిట్టమధ్యాహ్నపు సూర్యకిరణములు తీక్ష్ణంగా ప్రసరిస్తుండెను. కజ్జలరేఖ క్షుధాపిపాసలచే బాధపడుతుండెను.

"ఇంక కాలు కదల్పలేను. అయ్యో! నాతమ్ముడేమయ్యాడో. దురదృష్టదేవత నన్ను రాత్రింబవళ్లు వెంటాడి బాధిస్తున్నది. అమితంగా దాహమవుతున్నది. పానోదకం తెచ్చిపెట్టు నాయనా" అంది కజ్జలరేఖ. "క్షణ మోపిక పట్టుము. ఈ ప్రాంతాల నీళ్లున్న వేమో చూచి తెస్తా"నని చెప్పి వెళ్లాడు వర్తకుడు. ఆ పిమ్మట యేమీ తోచక కజ్జలరేఖ దేవాలయంచుట్టూ తిరిగింది. చివర కామె తన మృదుహస్తంతో దేవాలయద్వారమును తట్టింది. తలుపు తెరచుకొంది. లోపల ప్రవేశించింది. మళ్లీ తలుపు విచిత్రంగా మూసుకొనిపోయింది. తలుపు తెరవడానికి యత్నించినా కజ్జలరేఖకు సాధ్యమయిందికాదు. ఇంతలో నీళ్లు తెచ్చిన వర్తకుడు 'కజ్జలా, కజ్జలా' యంటూ పిలిచాడు. ఏమీజవాబు వచ్చిందికాదు గాని కొంచెంసేపుకాగానే లోపలనుండి తనకూతు రేమో చెప్పుతున్నట్లు వర్తకునికి వినబడింది. "కజ్జలా, మంచి తీర్థము తెచ్చాను. బయటికిరా" అన్నాడు వర్తకుడు. దేవాలయంలో కజ్జల బంధింపబడ్డ సంగతి యాతఁ డెఱుగడు. కజ్జల తాను తలుపు తెరవలేకపోయిన సంగతి చెప్పకొంది. అంతట వర్తకుడుకూడా తలుపుతీయ ప్రయత్నించాడు. వచ్చిందికాదు; బ్రద్దలుకొట్టయత్నించాడు. అదీ సాధ్యమయిందికాదు.

౯

"అమ్మా! గుళ్లో యెవ్వరున్నారు" అని వర్తకుడు బిగ్గఅగా అరచాడు. విలపిస్తూ ఆమె యిట్లా అంది: "శవ మొకటి శయ్యమీద బరుండబెట్టబడి వున్నది. వెన్నలో దీపం వెలుగుతున్నది. అది రాచబిడ్డ శవంవలె కనబడుతున్నది. ఆ మృతశరీరంనిండా వేలకొలదిముళ్లు గ్రుచ్చబడియున్నవి." ఆవర్తకుడు మళ్లీ యిట్లన్నాడు: "నొసటివ్రాత తప్పింప నెవరితరం నాముద్దులబిడ్డా! నీకు వేచియున్న ఆపద తప్పింప నాకెట్లా సాధ్యమవుతుంది? పక్షిచెప్పినటులు పొల్లుపోకుండా జరుగుతున్నది. దురదృష్టదేవత నిన్ను వెంటనంటి బాధిస్తుంటే మంచివరుని యెట్లా తేగల్గుతాను! కన్నతండ్రినై యుండియు నిన్నీ మృతుని పెళ్లి చేసికో మని చెప్పవలసివచ్చింది. అయ్యో! నానోములపంటను విడిచి యెట్లా పోగల్గుతాను? అయినను నే నేమిచేయగల్గుతాను? నాగారాలకూచీ! నీ ప్రక్కనున్న చచ్చిన రాకొమరుడే నీ నిక్కంపుభర్త. నే నీరోజునసే నీమీద నాకు గల మమతను పెరకివేసికొంటున్నాను. ఈ వనదేవతలూ, సూర్యచంద్రులూ యిందుకు సాక్షులు. నీవు ఉత్తమసతివి - పతివ్రతవు అయితే యీయువకుని బ్రతికింపగల్గుతావు. నీకు పసుపుకుంకమము లుండుగాక. మళ్లీ మనము కలిసికొందుముగాక, నే నికపోతున్నా" నని చెప్పి వర్తకుడు విలపించాడు. ఏకాకినిగా మహారణ్యంలో కజ్జలరేఖను విడిచిపోతున్నందుకు తండ్రిహృదయం విచ్చిపోతున్నది. కుమార్తె భయం

తో చలించిపోయి విలపిస్తున్నది. పాపం! వాళ్లిద్దరు విడిపొయ్యేటప్పు డొకరినొకరు చూచుకొనే ప్రాప్తం కూడా లేకపోయింది.

## ౧౦

కర్కశహృదయం కావించుకొని వర్తకుడు వెళ్లిపోయాడు. ఆమృతునివద్దనే కజ్జలరేఖ విలపిస్తూ కూర్చుండి దుఃఖం ఆపుకొని యిట్లంది: "ఓ సుందరయువపురుషుడా, లెమ్ము. ఈ నిర్భాగ్యురాలికేసి ఒక్కసారి చూడుము. నీవు జీవించియుండగా నేను నిన్ను జూచి యుండలేదు. ఏమైతేనేమి? మాతండ్రి నీవే నాభర్తవని చెప్పి కఠినహృదయంతో నన్నుప్రవాసముంచి వెళ్లాడు. మూణ్ణాళ్లనుండి నా కన్నపానీయాలు లేవు. నీ నయనాలు చంద్రబింబాలవలె ప్రకాశిస్తున్నవి. మేఘావృతుడైన సుదియార్కునివలె నీ వగుపడుతున్నావు. అయ్యో! నిన్నెవ్వ రీస్థితికిదెచ్చి యీ నిర్జనప్రదేశాన నీ శవాన్ని విడిచిపోయారో గదా! నా తండ్రివలె నీ తల్లిదండ్రులెంతటి కఠినహృదయులో! వారి గృహజ్యోతివగు నిన్నెట్లు విడిచిపొయ్యారో! నీ వెవ్వడవైనా సరే నా ప్రాణనాథుడవు. నేను బ్రతికియుండునంతకాలం నీదానను. నన్ను నమ్మి నాతో మాట్లాడుటకు నోరు విప్పుము. నన్ను జూచుటకు కన్నులు విప్పుము. ఇంక నన్ను నాయాసపెట్టక మేల్కొని జవాబు చెప్పుము. అయ్యో! మృతునకే మా నాయన నన్నప్పగించి పోయాడు!"

## ౧౧

కొంతసేపయ్యేసరికి దేవాలయకవాటం దానంతట నదే తెరుచుకొంది. లోపలి కొక సన్యాసి రావడం కజ్జలరేఖ ఆశ్చర్యంతో చూచింది. తండ్రికూతు శ్లెంత లాగినా రానితలుపు సన్యాసి తాకినంతనే తెరచుకొంది. అందుచేత కజ్జలరేఖ తనభర్త నాసన్యాసి బ్రతికింపగల్గుతాడని అనుకొంది. ఆమె యాసన్యాసిపాదాలమీద బడి యేడ్వసాగింది. సన్యాసియభయహస్తమిస్తూ యిట్లన్నాడు: "ఓ యువతీ, భయపడబోకుము. ఈ మృతుడొక రాకొమరుడు. అతనిని నేనే యిక్కడకు దెచ్చాను. ఒకదాని తర్వాత నొకటిచొప్పున అతనిబంటిమీది ముళ్లనన్నింటిని లాగివేయుము. అట్లా అన్నీ తీసివేసిన తర్వాత అతని రెండుకళ్లల్లోనున్న రెండుముళ్లుకూడా పెరికివేసి యిదిగో నే నిచ్చే యీ పత్రరసం కళ్లల్లో పోయుము. వెంటనే యాతడు లేచి కూర్చుంటాడు. కాని, అంతమాత్రముననే నీకష్టాలు తీరినవనిమాత్రం అనుకోకు. విధివ్రాత తప్పించడం సాధ్యంకాదు. ప్రారబ్ధాన్ని అడ్డగింపజూడబోకుము. ఈరాకొమరుడు నీభర్తయనుమాట నిజమేనైనను ధర్మమతిశుకం నిన్నాతనికి బరిచయంచేసేవరకు నీ కెంతటికష్టాలు వచ్చినా నీ వాతనికి నిన్నెఱిగింపబోకుము. ఈ నాయాజ్ఞ మీరి నిన్ను పరిచయం చేసికొంటే నీ వెప్పటికీ వితంతువుగానే యుంటావనిచెప్పి ఆమెచరిత్రనంతా యెరిగినట్టివాడును, త్రికాలవేదియు నగు సన్యాసి వెళ్లిపోయాడు, ముళ్లనన్నింటినీ తీయడానికి కజ్జలరేఖ కేడుదినాలు పట్టాయి. ఈ యేడురోజులూ ఆమె ఉపవసించింది. ఎనిమిదవరోజుకి కళ్లల్లోని ముళ్లుమాత్రం మిగిలి వున్నాయి. వాటిని తీసి పసరుపోస్తే భర్త కనువులు వస్తవిగనుక స్నానంచేసి శుచిగా నుండి దేవాలయంలో పత్నినని ప్రకటించుకోవలె ననుకొన్నది. అందుకని గుడివెలుపలకు వచ్చింది. స్నానంచేయడానికి నీ ళ్లెక్కడ దొరుకుతవాయని వెదుకసాగింది. కొంత దూరంలో కొలను కనబడింది. నీళ్లు దానిమ్మరసం వలె నున్నాయి. ఇంతలో వృద్ధుడొకడు సుమారు పదమూడు పదునాలుగేళ్లకన్నెను వెంటబెట్టుకొని "యెవ్వరికైనా దాసీది కావాలా"యని యరచాడు. ఆపిల్ల ఉన్నతవంశ సంజాత కాదని చూడగనే తెలుస్తుండెను. "ఈపిల్ల నీకేమి కావాలి ముసలయ్యా" అంది కజ్జలరేఖ. "ఈపిల్ల నా బిడ్డయే. మహాదారిద్ర్యంచేత ఈపిల్ల నమ్మతానని చాలా వూళ్లు తిరిగాను. ఎవ్వరూ కావాలన్నవాళ్లు కనబడ్డారు కారు. సన్యాసియొకడు కనబడి అడవిదారిచూపి ఫలానచోట రాజపత్ని వుంది. ఆమెకు దాసీఒకటి కావలసి వుంటుంది. ఆమె కొంటుంది. నీవక్కడకు వెళ్లుమన్నాడు. ఆ రాజపత్నివి నీవే ననుకుంటా" నన్నాడా వృద్ధుడు.

"కన్నకూతు నడవికి ప్రవాసమంపగల్గిన తండ్రి ఒక్కడే వున్నా డనుకొన్నాను. అంతకంటె కఠిన హృదయుడను తండ్రి నేను కనబడ్డాడు. పొట్టకూ డను మిషతో కన్నకూతు నమ్మడాని కీయడవికి వచ్చాడు. వాస్తవంగా ఈకన్నెకూడా నావంటి దురదృష్టవం తురా" లనుకొన్నది కజ్జలరేఖ మనస్సులో. ఆకన్య యెడల కజ్జలరేఖకు కనికరం కల్గింది. తనకష్టాలలో ఆకన్నెకూడా భాగంపంచుకొని తనభారం తగ్గిస్తుం దనే తలంపుతో స్వర్ణకంకణాల నిచ్చి ఆకన్నెను కొన్నది.

"పూర్వకర్మదోషంబున కజ్జలరేఖ వనవాసిని యగ్యెన్,

కంకణములతో నామె కొన్న కన్నెను కంకణ దాసి యనెన్"

తర్వాత కంకణదాసితో కజ్జలరేఖ యిట్లంది: "ఆకనబడ్డే దేవాలయానికి వెళ్లను. అక్కడొక రాకొమ రుని మృతశరీరం ఉంది. దాన్ని చూచి భయపడ కోకుము. ఆతని తలగడక్రింద కొన్ని ఆకు లున్నాయి. వాటిరసం తీసివుంచుము. నే నిప్పుడేవచ్చి కళ్లల్లోఉన్న ముల్లుతీసి ఆరసం కళ్లల్లో పోస్తాను. దానిచేత ఆతడు పునర్జీవితు డవుతా"డంది. ఈసంగతి చెప్పేటప్పుడు కజ్జల రేఖకు కుడికన్ను అదిరింది. ఆమె ఆరహస్యం చెప్ప వచ్చునా? వెనక్కు తిరిగితిరిగి చూస్తూ కంకణదాసి పోతుండెను. కంకణదాసి మనస్సులో పెక్కు చెడు తలంపులు కలుగ నారంభించెను. కంకణదాసి దేవాల యంలో ప్రవేశించింది. రాకొమరుని కళ్లల్లోనిముల్లు తీసింది. పత్రరసంతీసి కళ్లల్లోపోసింది. అతనికి ప్రాణాలు వచ్చినవి. లేచి కూర్చున్నాడు. కంకణదాసి ప్రాణ మిచ్చిన తన్ను పెండ్లిచేసికోవలసిందని రాకొమరుని అడి గింది. ఆ రాకొమరు డాకన్నె యెవ్వరో యెరుగడు. అయినా వెంటనే యిట్లని ప్రమాణంచేశాడు: "నీ కృప చేత నేను బ్రతికాను గనుక నిన్ను పెళ్లిచేసికొంటాను. నాకు ప్రాణాన్నిచ్చావు గనుక నీవు నాప్రాణదాతవు; ప్రాణప్రియవు. ఇదిగో చేతిలో చేయివేస్తున్నాను. భగ వంతుడు సాక్షిగా నేటినుండి నారాణివి నీవు. రాజ్య ముంది; ధనముంది. మంత్రి సామంతులు దాసదాసీ జనం ప్రజలూ వున్నారు. వాళ్లంతా న న్నీస్థితిలో విడిచి వేశారు. నీ కృపచేత జీవించాను కాబట్టి నా కిలోకాన నీకంటె ప్రియవస్తువొకటి లేదు." అంటూ కంకణదాసి కులగోత్రాలన్నా విచారించకుండా వెన్నలో మండు తూన్న దీపాన్ని తాకి ప్రమాణం చేశాడు.

౧౨

ఈ స్థితిలో దేవుడిగుళ్లోకి వచ్చిన కజ్జలరేఖకు భర్త జీవించి లేచియుండడం విస్మయకారణమయింది. రాహువు నోటినుండి బయటబడ్డ చంద్రబింబమువలె నున్న భర్తకేసి కజ్జలరేఖ మహోల్లాసముతో చూచింది. ఆతురనయనాలతో తన సర్వావయవాలకేసి చూస్తున్న కజ్జలరేఖయొక్క లావణ్యమునకు ఆ రాకొమరుడు ముగ్ధ డయ్యాడు. ము న్నెన్నడూ ఆత డంతటి సౌందర్యవతిని చూచియుండలేదు. ఆమె కప్పుడే యూపనోదయమై ప్రశస్తమైన రత్నంవలె ప్రకాశిస్తుండెను.

రాకొమరుడు కజ్జలరేఖను మృదుమధురస్వరంతో నీక్రిందిప్రశ్న లడిగాడు:| "ఓయువతీ! ఎందుండి యిక్క డికివస్తున్నావు?నీ పేరేమి?ఊరేమి? నీజననీజనకు లెవ్వరు? అడవిలో దిరుగుటకు కారణ మేమి? నీతల్లిదండ్రులు కర్కశహృదయులా? కాకుంటే ఈవనాంతరంలో నిన్ను విడిచివుంటారా?" ఆమెజవాబుచెప్పక వుపేక్షిం చుచునైనను ఆతడు గమనించాడు కాదు. ఇంతలో కంకణ దాసి కల్పించుకొని యిట్లంది: "ఆమెను స్వర్ణకంకణా లతో కొన్నాను. అంచేత ఆమెకు కంకణదాసి యని పేరుపెట్టాను." ఈవిధంగా బానిసస్త్రీ రాణి అయింది. రాణి బానిస అయింది. పురాకృతకర్మఫలం అనుభవింప కుండా తప్పుతుందా? భర్తకు తన్ను ఎరిగించుకొనరా దని సన్యాసియాజ్ఞ గదా! ఏమిచేస్తుంది పాపం కజ్జల రేఖ!

౧౩

రాజప్రాసాదమున కజ్జలరేఖ దాసివలె నుంటు న్నది. గుడ్డ లుతుకడం, గదులు కడగడం, కృత్రిమరాణికి

రేయింబవళ్లు పరిచర్యచేయడం ఆమెపని. ఆమె యెంత చేసినా కృత్రిమరాణి మెచ్చడంలేదు. పైగా ఏదో సాకుపెట్టి తిట్టడం ఆచారమయింది. కజ్జలరేఖ తన్నెవరి కన్నా యెరుకచేసికొంటుందేమోనని కృత్రిమరాణి కను మూసియుండడం లేదు. రాకొమరుడుమాత్రం కజ్జలరేఖ వినయ విధేయతలకు, మధుర సంభాషణలకు, సన్మాన పద్ధతులకు, అన్నిటికంటె ఆమెసౌందర్యమునకు సమ్మో హితుడయ్యాడు. రాకొమరుడు మరల కజ్జలరేఖతో నిట్లన్నాడు: "ఓసుందరీ! నీయాత్మచరిత్ర మెరిగింపుము. నీవిక్కడ చేస్తున్నదాస్యం నీకెంతమాత్ర మర్హమైనదిగా తోచడంలేదు. దురదృష్టవశాత్తు ఇట్లా వచ్చిపడి వుంటావు. నీ వేరాకొమరితవో చెప్పుము. నీ సౌంద ర్యాన్ని చూచి చంద్రుడు సిగ్గిలుతున్నాడు. మోసం చేయక నిజంచెప్పు." కజ్జలరేఖ యిట్లంది: "నన్ను కంకణ దాసి అంటారు. స్వర్ణకంకణాలతో నీరాణి నన్ను కొన్నది. నాకు తల్లిదండ్రులూలేరు, అక్కసెల్లెండ్రూ లేరు, అన్నదమ్ములూ లేరు. వాయుతాడితమేఘశలాక వలె నిస్సహాయనై తిరుగుతుండేదాన్ని. మహాదుఃఖ మను భవిస్తూ వనవాసినినై దినాలు గడపుతున్న నాకు నీకృప చేత నన్నవస్త్రాలు దొరుకుతున్నవి." రేడు నిత్యము కజ్జలరేఖను పెక్కుప్రశ్నలు వేస్తుండేవాడు. కాని ఆత్మవృత్తాంత మామె తెలియనిచ్చేది కాదు. ఇంతలో కృత్రిమరాణియొక్క స్వభావచరిత్రం, వాగ్వైఖరి, హ్రస్వబుద్ధి, ఆత్మస్తుతిపరాయణత్వం, వాచాలత్వం రాజుగారి కసహ్యం కలిగించాయి; కజ్జలరేఖయొక్క గుణరూపవివేకాదులవల్ల ఆమెయందు దినదినం ప్రేమ హెచ్చి ఆమెకుగాని ఆతని సమస్తైశ్వర్యం వృథా యనిపించింది. అతని కన్నంసహించడం, నిద్రపట్టడం, రాజకార్యాలలో మనస్సు నిలవడం లేదు. అతనికి లోకమే నిరర్థకంగా తోచింది. ఒకరోజున వృద్ధ మంత్రిని బిలిచి రా జిట్లన్నాడు: "నేను దేశాటనం చేయబోతున్నాను. తొమ్మిదినెలలవరకూ రాను. కంకణ దాసి నని చెప్పుకొనే యీ కన్నెనుగురించి సర్వవిష యాలు ఈలోపుగా సంపాదింప యత్నింపుము."అక్కడ నుండి రాజు కృత్రిమరాణివద్దకు బోయి "దేశాటనం పోతున్నాను. నీ కేమికావాలో చెప్పు, తీసికొనివస్తా" నన్నాడు. కందముక్కు పుడక, ఇత్తడికడియాలు, చంద్ర రోకలి, పేముబుట్ట తెచ్చిపెట్ట" మంది కృత్రిమరాణి. ఈకోరికలు రాజుగారికి చిరాకు బుట్టించెనని వేరే చెప్పాలా? కజ్జలరేఖవద్దకు బోయి రాజుగారు కృత్రిమ రాణి నడిగినట్లే యడిగాడు. "నీయింటివద్ద సుఖంగా నున్నాను. నా కెట్టిసాంథ లేదు" అంది. రాజు అందు కంగీకరింపక "యేదో ఒక్కటైనను తప్పక కోరుకోవా" లని నిర్బంధ పెట్టాడు. "నీ కంతకోరికగా ఉంటే ధర్మ మతియనుకీరమును నాకు గొనితె" మ్మంది. కృత్రిమరాణి తన ప్రకృతికి దగినకోరికలు కోరిందిగదా ? వాటిని దేవ డంలో రాజుగారికి కష్ట మేముంది? ధర్మమతిపక్షి దొర కడం సులభం గాదు. ఒకపట్టణంనుంచి మరొకపట్టణం, ఒకదేశంనుండి మరొకదేశం వెళ్లాడు. ఆవిధంగా ఎనిమిది మాసాలు గడచిపోయాయి. ధర్మమతి దొరికిందికాదు. దొరుకునో దొరకదో యనే యాందోళన హెచ్చయింది. ఇంక నొక్కనెలలో స్వదేశం తిరిగిపోవలెను. కజ్జలరేఖ యొక్క తండ్రిగారినగరం చేరాడు. అన్నిచోట్లవలెనే ధర్మమతిశుకము నమ్మితే కొంటామని టాంటాం చేయిం చాడు. ధనేశ్వరుడు అట్లా ధర్మమతిని వాంఛించింది యెవ్వరైయుంటారా యని ఆలోచించుకొన్నాడు. "తనకుమార్తెకుదప్ప ధర్మమతిసమాచారం ఎవ్వరికీ తెలి యదే" యనుకొన్నాడు. కష్టాల్లోనో, సుఖాల్లోనో యుండి ధర్మమతికోసం ఆమెయే మనిషిని పంపియుం టుందని దృఢంగా స్థిరపరచుకొని కంటకరాజుకు ఆ పక్షిసమ్మతిపై ధర్మమతి నిచ్చాడు. కజ్జలరేఖకోరికను నెరవేర్చగల్గానుగదా యని కంటకరాజు మహానందం పొందాడు. ఎట్టిప్రయత్నాలచేతనేని కజ్జలరేఖను సంతృ ప్తిపరచవలె నని అతనితలంపు.

మంత్రిగారు రాజ్యపరిపాలనలో విషమసమస్య లు వస్తే కృత్రిమరాణియొక్కయు, కజ్జలరేఖయొక్క యు సలహా లడుగుతుండేవాడు. రాజ్యాంగవిషయా లర్థంకాకపోయినా హుకుములు మాత్రం కృత్రిమరాణి జోరుగా ఇస్తుండేది. ఆమెహుకుములవల్ల, సలహాలవల్ల నష్టం వస్తుందని మంత్రి యెరిగియూ ఆమెయధికా

రాన్ని గమనించి ఆమెయిష్టా న్ననుసరించేవాడు. ఒకసారి రాజ్యానికి మహావిపత్తు సంభవింపనుండగా మంత్రి తత్తరపాటునొంది కజ్జలరేఖను సలహా అడిగాడు. ఆమె సలహావల్ల ఆపద సులభంగా తప్పిపోయింది.

రాజుగారు దేశాటనం ముగించుకొనివచ్చి ధర్మమతిని కజ్జలరేఖ కిచ్చాడు. కృత్రిమరాణి కోరినవస్తువు లామెకిచ్చాడు. ఆయన లేనప్పుడు రాజ్యపరిపాలనలో సంభవించిన చిక్కులు, కృత్రిమరాణి తొందరపాటుతో గావించిన హుకుములు - సలహాలు, కజ్జలరేఖ యిచ్చిన చక్కని సలహాలు, ఆపదలు గడచుట కక్కరకురావడం మున్నగు విషయాలు రాజుగారికి రహస్యంగా మంత్రి వివరించాడు. మంత్రిసలహాప్రకారం వాళ్లిద్దరలోగల తేడాను పరీక్షించడానికి రాజు విందు లేర్పాటుచేసి మిత్రులను భోజనాల కాహ్వానించాడు. తొలిరోజువంతు కృత్రిమరాణిది. నూనెతో పదార్థాలు వండింది. ఒకకూరలో ఉప్పు వేయడమే మరచిపోయింది; మరొకకూరలో కారం చాలీచాలకుండా వేసింది. అట్టిభోజనము మిత్రులకు పెట్టినందుకు రాజు సిగ్గుపడ్డాడు. మరునాడు కజ్జలరేఖకు వంటవంతు. ఉదయాన్నే స్నానంచేసి నిర్మలము మనశ్శరీరములతో వంటయిల్లు ప్రవేశించి గంగాతోయములతో వంటయిల్లు కడిగింది. పలురకాల కూరలు, పానీయాలు సిద్ధంచేసింది. వాటివాసనలకే నోళ్లూరిపోతుండెను. బంగారు పళ్లాల్లో అతిశుచిగా వడ్డన కేర్పాటులు గావించింది. ఆవిందుపద్ధతులు, వర్ణించడం కష్టసాధ్యం. అతిథు లానందసామ్రాజ్యాన నోలలాడిపోయారు.

అంతటితో పరీక్ష ముగిసిందికాదు. రాజుగారు వరికోతలో ధాన్యలక్ష్మీపూజ చేయడానికి నిశ్చయించుకొని "ధాన్యలక్ష్మీపూజకు మిత్రులు వస్తారు. దేవీమందిరాన్ని మంచిమంచిచిత్తరువులు లిఖించి, యలంకరింపవలసింది" అని కృత్రిమరాణితోటి, కజ్జలరేఖతోటి చెప్పాడు. రాణి కేమి చేతనవుతుంది? కాకి కాళ్లు, గద్దముక్కు, కొక్కెరకాళ్లు, కుందేలుతల వేసింది.

కజ్జలరేఖ తొలుత తనమనస్సులో నెప్పుడూ వుండే తల్లిదండ్రుల పాదాలు చిత్రించింది. తర్వాత ధాన్యలక్ష్మిని చిత్రిస్తూ మధ్యమధ్య భారంచేత నమ్రత వహించిన వరికంకులు చిత్రించింది. కైలాసంలో పార్వతీ పరమేశ్వరులను, పద్మపత్రాన లక్ష్మీనారాయణులను, హంసవాహనము నధిరోహించిన మానసదేవిని, సిద్ధవిద్యాధరులను, నందనవనంలో వనదేవిని ఆపదుద్ధారిణియగు రక్షాకాళిని, వారి వాహనాలతోటి కార్తికేయుని గణేశుని, సీతారామలక్ష్మణులను, హిమవంతుని, గంగాగోదావరులను, పుష్పకరథమును, ఇంద్రయములను, చంద్రసూర్య సాగరులను, అరణ్యంలోని జీర్ణదేవాలయాన్ని, రాకొమరుని మృతకళేబరాన్ని, కంటకరాజును, ఆయన ముఖ్యపరివారాన్ని చిత్రించింది. తన చిత్రంమాత్రే మందెక్కడా లేదు. పూర్తికాగానే దీపారాధన చేసింది.

## ౧౪

రాజుగారు మంత్రులతోటి, మిత్రులతోటి రాణి చిత్తరువులను జూచి, యాపైన కజ్జలరేఖచిత్తరువులను జూడబోయ్యారు. ఆమెచిత్రములను జూచి వారంతా తప్పకుండా ఆమె ఉన్నతవంశసంజాత యని స్థిరపరచుకొన్నారు. అనేకపరీక్షలలో ఆమెగొప్పతనం బయటపడుతుండెను.

కజ్జలరేఖ ధర్మమతిని గలసికొని రహస్యంగా యిట్లడిగింది: "మాతండ్రిగారికి క్షేమమా? తమ్ముడన్నా కమితవాత్సల్యం. ఆతడు క్షేమముగనున్నాడా? నేను ఇల్లువిడిచి యిప్పటికి పదేళ్లయింది. స్వప్నాల్లో తప్ప నాతడు నాకళ్ల కగపడకున్నాడుగదా! ఈపదేళ్లలో మాతండ్రిగృహమున జరిగిన విశేషాలు చెప్పు" అంటూ అడవిలో తండ్రి విడిచిపెట్టి వెళ్లినప్పటినుండి తాను పడ్డపాట్లు వివరించి "నీవు సత్యయుగంనుండి వచ్చినదానివి. సమస్తమెరుగుదువు. నీవాణి సత్యం. కనుక నాదురదృష్టదేవత నన్నెప్పుడు విడుస్తుందో చెప్పు" మంది. పక్షి యిట్లంది: "దుఃఖంవల్ల ప్రయోజనం లేదు. విచారపడవద్దు. మీ నాయన యీ పదేళ్లనుండి వర్తకం చేయడంలేదు. నీకై రేయింబవళ్లు కార్చిన కన్నీళ్లతో నాతడు గుడ్డివాడయ్యాడు. నీకేరు

చెప్పుకుంటూ ప్రజలు దుఃఖపడుతుంటారు. నీవు జ్ఞాపకం వచ్చినంతనే దాసదాసీజనం పనిమాని దుఃఖిస్తుంటారు. నీపేరెత్తితే గజతురగాదులు త్రాగేనీళ్లు, తినే మేత మానుతున్నవి. పదేళ్లు గడిసావు. ఇక రెండేళ్లోపిక పట్టితే నీకష్టాలు గట్టెక్కుతవి."

రాజుగారిమిత్రుడొకడు రాజభవనంలో అతిథిగా కొన్నాళ్లున్నాడు. కజ్జలరేఖయొక్క గుణరూపసౌందర్యములకు మోహితుడయ్యాడు. రాచకన్నెయని స్థిరపరచుకొని, ధర్మాధర్మజ్ఞానం పోనాడి, తనయింటికి గొంపోయి ఆమె నెట్లా పెళ్లిచేసికోవడమా యని రాత్రింబగళ్లు ఆలోచింప సాగాడు. ఇందుకు కృత్రిమరాణియామోదాన్ని సంపాదించాడు. కంటకరాజుదర్బారునకు గాని, కృత్రిమరాణివద్దకుగాని పోవడం మానివేసి కజ్జలరేఖవద్దనే వుంటూఉండడ నారంభించాడు. కృత్రిమరాణి యిట్టిస్థితికి సహించి యూరుకుంటుందా? కజ్జలరేఖను రాజప్రాసాదమునుంచి తరిమివేయ సంకల్పించుకొంది. రాజుగారి స్నేహితునితో గలసి కుట్రలుపన్నడం మొదలుపెట్టింది. కజ్జలరేఖయొక్క శీలం విషయంలో రాజుగారికి సంశయం కలిగిస్తే తప్పకుండా ఆమె నాతడు తరిమివేస్తాడని వాళ్లిరువురు నిశ్చయించుకొన్నారు.

ధర్మమతితోగలసి కజ్జలరేఖ యొకగదిలో పరుండుట ఆచారం. ద్వారంరంధ్రముమీద మనుష్యుడెవ్వడో లోపలికి బయటకు రాకపోకలు చేసినట్లు రాజుగారి స్నేహితుడు అడుగులనుంచాడు. అందుమీదట కృత్రిమరాణి అపవాదం మోపి కజ్జలరేఖమీద రాజుగారికి కోపం వచ్చునట్లు చేసింది. రాజుగారు కజ్జలరేఖతో ఆమెమీదకు వచ్చిననేరం చెప్పి సమాధానం అడిగాడు. కజ్జలరేఖ యిట్లంది: "నే నొంటరిగ ధర్మమతితో గలసి పడుకుంటున్నాను. నామీద ఇంతటి ఘోరనేరం మోపిన శత్రువు లెవ్వరో? నాసౌశీల్యమునకు ధర్మదేవతలే సాక్షులు! రాత్రియంతయు కనిపెట్టి చూచే చంద్రుడు, నక్షత్రాలు సాక్షులు. పంజరంలో నున్న ధర్మమతిని తెప్పించి సాక్ష్యం అడగండి."

ధర్మమతి రాగానే రాజిట్లన్నాడు: "ప్రమాణం చేసి, ఓకీరమా, రాత్రి కజ్జలరేఖ ఒంటరిగనుండెనో లేదో, దోషియో నిర్దోషియో చెప్పుము." కీర మిట్లంది: "రాత్రి యేమిజరిగిందో నాకు జ్ఞాపకంలేదు. దురదృష్టవంతురాలు కాకపోతే యిట్టినేరాని కామె యెందుకు చిక్కుతుంది? కళంకినిగానే భావించి వనవాసం పంపండి." కజ్జలను సముద్రమధ్యమున లంకలో విడిచిపెట్టి రావలసిందని రాజుగారు తనమిత్రునితో చెప్పాడు.

రాజుగారితో కజ్జల ఇట్లంది: "నీకొలువులోనే ననేకదోషాలు గావించియుంటాను. వాటినన్నింటిని క్షమింపుము. ప్రవాసంపోతున్న నన్ను నీవు మరచినా చింతలేదుగాని నా మరణకాలమందు నిన్ను కడచూపు చూడ నభిలషిస్తున్నాను. ఆ కోరిక నెరవేర్చడానికి మాత్రం భగవంతుని ప్రార్థిస్తున్నాను." కళ్లవెంట కారే నీళ్లచేత దారికనబడడం కజ్జలకు కష్టమయింది. అట్లాగే కృత్రిమరాణివద్దకు పోయి యిట్లంది: "నీ సేవలో పెక్కుతప్పులు గావించియుంటాను. క్షమింపుము. కొంతకాలం నీకు దాసిగానుంటిని గనుక నన్ను మరచిపోకుము." తర్వాత ధర్మమతివద్ద సెలవు తీసికొని తన నిర్దోషత్వమునకు సూర్యచంద్రులే సాక్షులంటూ నావ యెక్కింది. పురవాసులు హాహాకారాలుచేస్తూ కళ్లనీళ్లు పెట్టారు.

౧౫

మహాసముద్రంమధ్యకు నావ వచ్చింది. అంతట కంటకరాజుగారి స్నేహితు డిట్లన్నాడు: "మాది కాంచనపురం. మేము కోటీశ్వరులం. లెక్కలేనిగజతురగాదులున్నవి. మా బీళ్లలో తొమ్మిదిలక్షల గోవులు మేస్తుంటవి. మితిలేని యైశ్వర్యం మాది. మానావలకు బంగారం ఊదారు. మా కోనేళ్లలో విలాసమందిరా లున్నాయి. నేను బ్రహ్మచారిని. సుందరీ! నీవు నన్ను పెళ్లిచేసికొని నా గృహజ్యోతివి కమ్ము. దాసదాసీజనం నీ యడుగులకు మడుగు లొత్తుతారు. నీవొప్పుకొంటే నావను మా సుందరనగరం వైపుకు నడిపిస్తాను." కజ్జలరేఖ యిట్లంది: "నీవు రాజునకు మిత్రుడవు; నేను దాసిని.

కర్మదోషంచేత ప్రవాస మంపబడ్డాను. ప్రవాసమంపి రమ్మని నిన్నాయన పంపాడు. అంతే నీ విధి. రాకొమరుడనైయుండియు దాసీని పెళ్లిచేసికొంటాననడ మేమి భావ్యం" "ఇంతవరకు నీవు దాసివేగాని యిప్పుడు నిన్ను రాణిని చేస్తాను. ఒకసారి వచ్చి నీవు నాస్వర్ణ ప్రాసాదములు చూస్తే ఆశ్చర్యపోతా వన్నాడు రాజు. "కళంకిని అని యెంచి నాతండ్రి ప్రవాస మంపాడు. రాజుగారు కళంకిని యని భావించి ప్రవాసమంపి రమ్మన్నాడు. ఈ విధంగా కళంకభారాన్ని నెత్తిమీద పెట్టుకొని యిక్కడకు వచ్చాను. సిగ్గుతో క్రుంగిపోతున్న నాకు మానవుని కంటబడటం ఇష్టంలేదు. ఈ యగాధ జలంలోనైనా నన్ను పడత్రోసి పుణ్యం కట్టుకో"మ్మంది కజ్జలరేఖ. రాకొమరు డామెమాటలను లక్ష్యంచేయకుండా నావను తన నగరానికి నడుపుతున్నాడు. అంతట కజ్జలరేఖ యిట్లనుకుంది: "ఈ యాపత్కాలమున నా తల్లిదండ్రు లెందుండిరో గదా! గుండె వ్రక్కలై చచ్చిపోయినా యిక్కడ నా కెవ్వరూ దిక్కు లేదు గదా! పురాకృత కర్మదోషంచేత ఈ జన్మలో ఎక్కు కష్టా లనుభవింపవలసివచ్చింది. ఈ దుష్టు డసలే చచ్చిన వ్యక్తిని ఇంకా చావగొట్ట చూస్తున్నాడు. అయినా నేను పతివ్రతనైతే ఈ నావ కడ్డంగా దిబ్బ లేచునుగాక" యంది కజ్జలరేఖ బిగ్గరగా. అట్లాగే జరిగింది. నావ వెళ్లి ఆ దిబ్బను పట్టింది. వెంటనే ఓడవాళ్లు భయపడిపోయి "యీమె డాకిని, యీమెను విడిపించుకొంటేనే తప్ప సురక్షితంగా ఇలు చేర"మన్నారు. ఉపాయాంతరం కానక రాకొమరు డంగీకరించాడు. ఆమె దిగినంతనే ఓడ నీటిలో తేలింది.

కొంచెంసేపు కజ్జలరేఖవిషయం కట్టిపెట్టి రత్నేశ్వరుని సంగతికి వత్తము. తండ్రి చనిపోయాడు. స్వయంగా వర్తకానికి విదేశాలుపోయి స్వదేశోన్ముఖు డయ్యాడు. తుపానుపట్టి ఓడలను కజ్జలరేఖ ఉన్నద్వీపంవద్ద ఆపవలసివచ్చింది. మహాసుందరియను కజ్జలను చూచాడు. ఒకరినొకరు ఎరుగరు. ఆమెను తన పట్టణానికి తీసికొనివచ్చాడు. పట్టణాన్ని, రాజప్రాసాదాన్ని చూచి యది యంతయు తన తండ్రిగారిదే యని యామె గుర్తించి [illegible] చెప్పలేదు. పూర్వపరిచయాలను జ్ఞప్తికి తెచ్చుకొని తనలో తాను దుఃఖిస్తూ దినాలు గడుపుతుండినది. ఒకనెల గడిచిన తర్వాత రత్నేశ్వరుడు వచ్చి కజ్జలను తన్ను పెళ్లి చేసికొనవలసిందని కోరాడు. "నేను చాలాకాలంనుండి ప్రపంచ సంబంధంలేకుండా విపినాల్లో తిరుగుతుండే దాన్ని. కంటకరాజుగారి మందిరంలో నా జీవిత వృత్తాంతమెరిగిన కీర ముంది. నా పరిణయసంధాన కర్త్రిణి ఆకీరమే. ఆకీరము నిటకు రప్పింపగోరుతున్నాను."

## ౧౬

కజ్జలను ప్రవాస మంపినతర్వాత కంటకరాజు పశ్చాత్తప్తుడై ఆమెకోస మన్వేషిస్తూ దేశాలవెంట పడ్డాడు. ఆసమయాన రత్నేశ్వరుని మనుష్యులు ధనం తీసికొని కంటకరాజుగారి పట్టణానికి వచ్చారు. ధనలోభంచేత కంకణదాసి కీరమును వాళ్ల కమ్మివేసింది.

రత్నేశ్వర రాజుగారు జలదేవతను తెచ్చాననీన్నీ, ఆమెచరిత్ర చెప్పి నాకు పరిణయం చేయడానికి కీరం వచ్చిందనీన్నీ, అందరూ రావచ్చుననీన్నీ దండోరా వేయించాడు. ఈవిచిత్రసంఘటన చూడటానికి పెక్కుమంది సభకువచ్చారు. అందులో కంటకరాజుకూడా ఉండెను.

శుకం బంగారుపంజరం ఎక్కి విలపిస్తూ కజ్జలరేఖచరిత్రనంతా చెప్పి కంటకరేని జన్మవృత్తాంత మిట్లా చెప్పింది: "చంపానగరంలో హీరధరు డనే రా జుండేవాడు. సమస్తైశ్వర్యములున్నా అతనికి సంతానభాగ్యం లేకపోయింది. గొడ్డుబోతని ప్రజ లనుకోవడం అతడెంతమాత్రం సహింపలేకపోయ్యాడు. అతడు మ్రొక్కని దేవుడు లేడు. తుద కొకసన్యాసి వచ్చి 'మీమీద భగవంతునికి దయకలిగిం'దని మామిడిపండు నొకదాన్నిచ్చి రాణిగారిని తినుమని చెప్పాడు. ఆమె పండును తినింది. గర్భవతి అయింది. ఆమె పది నెలలు మోసి మృతశిశువును గన్నది. ఆసన్యాసి సలహా ప్రకారం ఆ మృతశిశువుకు ముల్లుగుచ్చి అడవిలో వ

దేవాలయంలో ఉంచారు. నాటినుండి కంటకరాజని పిలువబడ్డాడు. మృతశరీరంవలె కనబడుతున్నా అతడు పెరుగుతునే యుండెను. కజ్జలరేఖ రావడం, కంటకరాజునకు ప్రాణంపోయడం, కృత్రిమరాణిమోసం" మున్నగు సమస్త విషయాలు సవివరంగా ఆనాటివరకు జరిగిన యథార్థ సంగతులన్నీ చెప్పి, ఆకాశంలోకి ఎగిరి, కజ్జల కష్టాల కిది పండ్రెండవయేడు. ఈవేళ ఆమెసోదరుడు రత్నేశ్వరు డామెను బెండ్లాడఁగోరుతున్నాడు" అంటూ ఆపక్షి స్వర్గలోకాని కెగిరిపోయింది. కజ్జల జీవించి యుండెనో, మరణించెనో తెలియక కొట్టుకొంటున్న కంటకరాజు కీ చరిత్ర వింటున్నపుడు దుఃఖం ఆగింది కాదు. బిగ్గరగా ఏడ్వమొదలుపెట్టాడు. రత్నేశ్వరుడు సిగ్గుపడి అక్కవద్దకు బోయి తనతప్పు క్షమింపవలసిందని వేడుకొన్నాడు. కజ్జలకు కలిగిన కష్టాలకు సభికులు చింతించారు.

౧౭

కంటకరాజుకు కజ్జలనిచ్చి మహావైభవంగా పెళ్లి చేశారు. కంటకరాజు కొన్నాళ్ళక్కడనేవుండి కజ్జలను దీసికొని స్వదేశం వెళ్లాడు. నావను రేవులో నుంచి ఒక్కడూ పోయి రాజభవనంలో గోతిని తీయించాడు. కృత్రిమరాణి యను కంకణదాసి వచ్చి 'ఆ గొయ్యి యెందు'కంది. "రత్నేశ్వరరాజు మన నగరంమీదికి దండెత్తివస్తున్నాడు. మన ధనసంపదనంతా తీసికొని ఈ గోతిలో దాక్కుందా" మన్నాడు కంటకరాజు. కంకణదాసి యెవ్వరిసంగతీ యోచింపకుండా వడివడిగా తననగలు, సుడ్డలు జాగ్రత్తగా దీసికొని గోతిలో దిగింది. రాజుగారి కనుసన్నచేత సేవకులు గోతిని పూడ్చివేశారు.



# రావుశబ్దవిచారం

## శతావధాని చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి

రావుశబ్దాన్నిగూర్చి సుమారు పదిపన్నెండేళ్లకు పూర్వమే వకవ్యాసం వ్రాసినట్టయితే జ్ఞాపకం వుంది గాని అది పత్రికకు పంపినట్టు జ్ఞాపకం లేదు. అందుచేత మళ్లా వ్రాస్తూవున్నాను. యీశబ్దం యెప్పుడు యీలోకాని కవతరించిందో? చరిత్రపరిశోధకులు తప్ప యితరులు నిర్ణయించలేరు. మొత్తం శాస్త్రంచేత సాధించడానికి వీ లున్నా లేకపోయినా యీశబ్దంమాత్రం రాజశబ్దంలోనుంచి పుట్టిం దని చెప్పడం యుక్తిసహంగా వుంటుంది. యేనాఁడు ప్రభుత్వధర్మం రాజులన్ని వదిలి వారిసంబంధం కల వికృతజాతులమీఁదకీ యితరులమీఁదకీ సంక్రమించడానికి మొదలు పెట్టిందో ఆనాఁడే యీరావుశబ్దంకూడా అవతరించిం దనుకుంటే బాసుంటుం దనుకుంటాను. కర్ణాటకభాషలో రావుశబ్దంకన్న రాజశబ్దానికి బదులుగా రాయశబ్దం ప్రచురంగా కనపడుతుంది. కృష్ణదేవరాయలు వగయిరా దీని కుదాహరణాలు. యీ రావుశబ్దం బహుశః మహారాష్ట్రప్రభువులు ధరించిందేమో? అని నాకు తోస్తుంది. ఆ మహారాష్ట్ర ప్రభువులలో కూడా అంతకు ముందు మంత్రులుగా వున్న బ్రాహ్మలు ప్రభువులు కావడంలో ప్రారంభ మైనట్టు తోస్తుంది. కాని యిటీవల వెలమ జమీందా ర్లందఱున్నూ దీన్ని వాడుకొన్నవారే. బాలాజీబాజీరావు వగయిరా పేర్లు మహారాష్ట్రబ్రాహ్మలలో ప్రభువులవే అని ప్రసిద్ధమేకదా! గంగాధర రామారావు, నారయ్యప్పారావు వగయిరాలు వెలమ ప్రభువులవిన్నీ ప్రసిద్ధంగా కనపడుతూ వున్నాయి. కాని పద్దెనిమిదో శతాబ్దాదినుంచేకాని వెలమవారు యీరావుశబ్దాన్ని జమీందార్లుకూడా వాడుకొన్నట్టు లేదు. నీలాద్రిరాయణింగారు, శోభనాద్రి అప్పారాయణింగారు వగయిరా యిందు కుదాహరణం. రాయణింగారు అనేపేరు కొంతమోటుగా కనపడి ఆస్థానంలో రావుశబ్దాన్ని ప్రభువులు ధరించినట్టు కనపడుతుంది. రాజబంధువులు మాత్రం నిన్నమొన్నటిదాఁకా యీ రావుశబ్దాన్ని ధరించక పూర్వపు రాయణింగార్లుగానే వుండేవారు. యిప్పుడిప్పుడు యేవొకరిద్దఱో తప్ప రాజబంధువు లందఱున్నూ రావులుగానే వుంటూవున్నారు. వొకవిధంగా ఆలోచిస్తే యీరావుబిరుదు ప్రతాపరుద్రుఁడి ప్రభుత్వంనాఁడే జమీందార్లకు లభించినట్టున్నూ అందులో రేచర్లగోత్రంవారికి ఆద్యంతాలయందు రావుపదం వుండడం విశేషంగా ఆనాఁడే "శాంక్షన్" నైనదనిన్నీ చెప్పడం విన్నాను. దానికి తత్యంగా యింటిపేరుకూడా రావునా రని యెవరికి వుంటుందో వారికేగాని యితరులకు యీయోగం తటస్థించక పోవడంవల్లనున్నూ వెలమవారి సంస్థానాలలో మనకు తెలిసినంతట్లో మొట్టమొదటిది వేంకటగిరివారిదే అవడంవల్లనున్నూ వారికి యిటీవల వెలుగోటివా రనే యింటిపేరుకూడా ఆగ్రామనివాసంవల్ల సంక్రమించినప్పటికీ మొట్టమొదట బేతాళరెడ్డిగారు సంపాదించిన యింటిపేరు రావువారే అయి వుంటుం దని సయుక్తికంగా తోచడంవల్లనున్నూ యీరావుశబ్దం ప్రతాపరుద్రుఁడినాఁటికే భాషలోకి వచ్చిచేరినట్టు తోస్తుంది. యిటీవల మహమ్మదీయులు తమసామంతరాజులకు యిచ్చే బిరుదాలలోకూడా యీ రావుశబ్దం కనపడుతూ వుంది. యిప్పుడు మనగవర్నమెంటు ప్రసాదించే బిరుదులలో కూడా యీరావుశబ్దం కనపడుతూ వుంది. రావుసాహేబు వగయిరాలు ఉదాహరణం. దీన్నిబట్టి చూస్తే యీ రావుశబ్దం కొంతకాలాన్నుంచి మన ఆంధ్రదేశంలోనే కాక కర్ణాట మహారాష్ట్ర దేశాల్లోకూడా వ్యాప్తిలో వున్నట్టు కనపడుతుంది. యీరావుశబ్దం కమ్మ జమీందార్లుగాని, కాపుజమీందార్లుగాని పూర్వపువారు ధరించినట్టు కనపడదు. వారు నాయుఁడుపదం

తోటే తృప్తిపడ్డారు. వాసిరెడ్డి వెంకటాద్రినాయుఁడు, బొమ్మదేవర నాగన్ననాయుఁడు వగయిరాలు వుదాహరణం. యిటీవల నిన్నమొన్నటినుంచి వారున్నూ దీన్ని ఆమోదిస్తూ వున్నారు. బ్రాహ్మలలో మొట్టమొదట మహారాష్ట్రులున్నూ తరవాత సరిహద్దు ప్రాంతంలో వున్న కర్ణాటకులున్నూ ఉద్యోగవృత్తిలో వున్నవారు ధరించినట్టు తోస్తుంది. మహారాష్ట్రులుగాని కర్ణాటకులుగాని యీ రావుపదాన్ని ధరించేటప్పుడు దానితోతోవాసంగా పంతులుపదం చేర్చడం ఆచారంగా కనపడుతుంది. యీ పంతులుపదం పండితశబ్దవికృతి కనుక యీపదంతో చేరిన రావుపదం బ్రాహ్మణజాతికే వర్తించడం తటస్థించింది. ఆర్వేలనియోగులు వగయిరాలు కూడా పెద్దపెద్ద మంత్రిపదవులలో వున్నప్పుడు సమేతూ ఖడ్గతిక్కన్న- కార్యతిక్కన్న- యీ మాదిరిగానే వ్యవహరింపఁబడుతూ వచ్చారు- మంత్రిభాస్కరుఁడు వగయిరాలు ఉద్యోగద్యోతకమైన మంత్రిపదాన్ని మొట్టమొదట ధరించినట్టు కనపడుతుంది. "స్వర్గస్థుఁ డయ్యె విస్సనమంత్రి" అని శ్రీనాథుఁడు. ఆకాలంనాటికి రావుపదం నియోగులలో వుద్యోగులు కూడా స్వీకరించినట్టే కనపడదు. రాజులు మాత్రం అప్పటికీ యిప్పటికీకూడా మన ఆంధ్రదేశంలో యీ రావుపదానికి దూరంగానే వుంటూ వారికి అనాదిగా వున్న రాజుపదంతోటే వ్యవహరింపఁబడుతూవున్నారు. వెనక యెవరో వారిలో వకరు రావుపదం పెట్టుకునేటప్పటికి వారి క్షత్రియులో లేక మఱి అన్యులో—

"క. వెలమలకుఁ బుట్టినావా?...గావు పద్దేటికి?"

అంటూ ఆక్షేపించినా రని వక రెవరో యెప్పుడో చదవఁగా విన్నట్టు జ్ఞాపకం. పద్యమంతా జ్ఞాపకంలేక వుదాహరించలేదు. యీ పద్యాన్ని బట్టి విచారిస్తే బ్రాహ్మణేతరులలో దీన్ని ప్రాచుర్యంగా ధరించినవారు వెలమ జమీందార్లే అని విస్పష్టమవుతుంది. క్రమంగా యీ రావుపదం పద్ధెనిమిదోశతాబ్దం తుట్టతుద కాలంలో నియోగులమీఁదకే కాక కొంచెం గొప్ప వైదీకులలో వుద్యోగస్థులమీఁదకూడా పాఁకిందిగాని యేమైనా విశేషవ్యాప్తిమాత్రం వున్నట్టు లేదు. రామయ్య, సీతారామయ్య, పుండరీకాక్షుఁడు, రామచంద్రయ్య యిత్యాదులు వుదాహరణం. యింకోకర్మం, అసలు వారు చేవ్రాలుచేయడం రావుపదంతో చేయకపోయినా తదితరులు వారిని రావుపదంతో వ్యవహరించడం వుంది. యీలాగే శూద్రులలో నాయుఁడుపదానికిన్నీ వుంటే కాపులలో పెద్ద పెద్ద జమీందార్లే వుండనివ్వండి, ఐశ్వర్యంలో గొప్పవారే కానివ్వండి ఫ్రెంచి టవును యానాం కాపురస్థులు బెజవాడ బాపనయ్యనాయుఁడు గారిని పోలినవ్యక్తి "నభూతో నభవిష్యతి" కదా! ఆ ఆజానుబాహుత్వం, ఆ వైష్ణవాచారప్రపత్తి, ఆ సౌందర్యం, ఆ లౌకిక వైదికజ్ఞాన ధూర్వహత్వం, ఆ మాట మార్దవం, ఆ భగవద్భక్తి యింతవఱకు నే నే అగ్రజాతిలోనూకూడా చూడనే లేదు. ఫ్రెంచిప్రభుత్వంలో ఆయన కున్నంత పేరుప్రతిష్ఠలో? మన ప్రాంతంలో యెవరికీ లేవు. ఆయన్ని అందఱూ బాపనయ్యనాయుఁడుగా రని వ్యవహరించేవారు. ఆయన వ్రాలుచేయడం 'బాపనయ్య' అనే చేసేవారు. క్రియలో మాట-శూద్రులలో నాగరికులకుఁగాని బ్రాహ్మణులలో నాగరీకులకుఁగాని పూర్వోక్తపదాలు 'నాయుఁడు, రావు' అనేవి సముచితంగా వుంటా యని ప్రజాభిప్రాయమైనట్టు పై సందర్భంవల్ల తేలింది. అట్టివారికి తల్లిదండ్రులు నామకరణం నాయుఁడు, రావు, అనేపదాలతో చేయకపోయినా లోకులు ఆ పదాలతో వాడడం మాన రని తేలింది. యింత నాగరికతాసూచకంగా వున్న నాయుఁడు పదాన్ని కాపులలో పూర్వాచారపరాయణులుగా వుండే శుద్ధశ్రోత్రియులుమాత్రం కొంచెం యీసడించడం నేను పలుచోట్ల విని వున్నాను. వైదికులలో రావు పదాన్ని కొందఱు ఛాందసులు యేవగించుకోడం యేలాటిదో అదిన్నీ ఆలాటిదే అనుకోవాలి. అంతమాత్రంచేత ఆనాయుఁడుపదమందు యేదో దురర్థం వుందని అనుకోడానికి వీలు కనపడదు. కాని ఆ యీసడించే శ్రోత్రియులు దానివ్యుత్పత్తి కొంత ఆక్షేపణీయంగానే వివరిస్తూ వుంటారు. యెన్నివిధాల చూచినా వారు చెప్పే వ్యుత్పత్త్యర్థం దానిలో మాత్రం కనపడదు. కొందఱు కమ్మజమీందార్లు 'నీఁడు' అనేపదంతో

వ్యవహరింపఁబడడమున్నూ అనుభూతంగా వుంది. 'అంకినీఁడు' వగయిరా యిందుకు వుదాహరణం. మొత్తం, యీ "నీఁడు" పదమున్నూ "నాయుఁడు" పదమున్నూ రెండూ వొకటే అర్థం కలవిగా నాకు తోస్తాయి. కాని కమ్మవారిలో తప్ప యీ "నీఁడు" పదం యితరత్రా కనపడదు. బహుశః యీ రెండుపదాలున్నూ, నాయకపదంలోన్నుంచి పుట్టిన వికృతు లని నాకు తోస్తుంది. కృష్ణదేవరాయలనాటికి యీనాయకపదమే వారిచేతికింద వుండే చిన్నచిన్న జమీందారులకో ముతాదార్లకో వ్యవహరింపఁబడేది- ప్రస్తుతం మనకు ప్రధానం రావుపదం. దాన్ని నుతించే మరికొన్ని మాటలు వ్రాసి దీన్ని ముగిస్తాను. పందొమ్మిదో శతాబ్దం మొదలు యీరావుపదం వైదీకంలోకి కూడా బాగా ప్రవేశించింది- శ్రీ రెంటాల సుబ్బారావుగారు ౧౯౦౮-లేక ౧౯౦౯ ప్రాంతంలో "జనరంజని" అనే పేరుతో వొకమాసపత్రిక ప్రచురిస్తూ అందులో సోమయాజులురావు, అవధానిరావు, శాస్త్రిరావు, అనే పేరులుకూడా వుంటే బాగుంటుందనో, లేక యీ పై పేర్లవారికి రావుపదం తగుల్చుకొనేభాగ్యం పట్టింది కాదనో కొంత వ్రాసినట్లు జ్ఞాపకం. దీనివల్ల రావుపదం వైదీకులలో సర్వత్రా వ్యాపించిందికాని వంశక్రమంగా వస్తూవున్న పైపేర్లవారికి మాత్రం లేదని తేలుతూవుంది. యీలా వ్యాపించేరోజులలోనే లింగధారిపిల్లలకుకూడా యీరావుపదం "లింగం" అనేపదానికి ఆదేశంగా రావడానికి ఆరంభించింది. ఆరోజుల్లో నేను బందరులో వున్నాను. అప్పుడు శ్రీ కాశీనాథుని బ్రహ్మయ్యలింగంగారికుటుంబంలో భైరవప్రసాదరావు, వటుకప్రసాదరావు అనేపేర్లు ప్రారంభమయినాయి. యెవళ్లో స్కూలుపిల్లలువచ్చి—'మీ ప్రసాదరావు' వున్నాఁడా ? అని అడిగేటప్పటికి బ్రహ్మయ్యలింగంగారు తల కంటగించుకొని,'ప్రసాదరావునాయుఁడు' వున్నాఁడా ? అని అడగరాదా ! అంటూ వుంటే నేను వినడం తటస్థించింది. దీన్నిబట్టి యీ నాగరికతాద్యోతకమైన రావుపదం పూర్వాచారపరాయణులుగా వుండే శైవులకు గాని స్మార్తులకుఁగాని యిష్టంలేదు సరికదా ! మంత్రిపదవులు వగయిరాలు చేసిన నియోగులలోకూడా పూర్వాచారపరాయణులకు సమేతూ నిన్న మొన్నటిదాఁకా యిష్టం లేనట్టే నా బుద్ధికి తోస్తుంది. అప్పటికీ యిప్పటికీ యీ పదంతో బొత్తిగా సంబంధమే లేని వారు వైష్ణవులున్నూ, వైఖానసులున్నూ కనపడుతారు. వారికి వున్న ఆచార్యపదస్థానాన్ని యెందుచేతో యింతవఱకు యీరావుపదం ఆక్రమించ లేకపోయింది. యిది మిక్కిలీ అభినందనీయమేకాని వైఖానసులలో యెవరో వకాయన యల్. యమ్. పీ క్లాసులును ప్యాసయినవారు యీరావుపదమకుటంతో వ్యవహరింపఁ బడుతున్నట్టు ప్రతీతమయింది. యెక్కడో వకరుండేటే వుండనివ్వండిగాని అంతమాత్రంచేత వచ్చిన చిక్కు లేదు. పైని చెప్పిన బ్రాహ్మణశాఖ లింకా పూర్వంనుంచీ వున్న ఆచార్యపదంతోటే వ్యవహరింపఁబడుతూ వున్నారు. యిఁక విశ్వబ్రాహ్మణులు- యీజాతివారు వైష్ణవులతోపాటు ఆచార్యపదాన్ని ధరించడానికి పడేటంత కుతూహలాన్ని రావుపదం కోసం పడడంలేదు. బ్రహ్మశ్రీబిరుదం బ్రాహ్మణేతరులందరున్నూ ధరించడానికి కుతూహలపడుతూ వుండడమే కాదు విశ్శృంఖలంగా ధరిస్తూనే వున్నారు. యిదివరలో శాస్త్రీ-అవధానీ-సోమయాజీ-అనే పదాలతోపాటు యీబ్రహ్మశ్రీ కూడా కాస్త లౌకికంలో వుండేవారు యేవగించుకొనేచాపతులోదే కాని నేటికి దీని అదృష్టరేఖ బయటికి వచ్చింది. అమృతాంజనంలాగ యిది ఖండాంతరాలకున్నూ కూడా వ్యాపించే స్థితిలో వుం దని సంతోషించతగి వుంది. రావుపదాన్నిగూర్చి వ్రాస్తూ ప్రసక్తానుప్రసక్తంగా యితరవిషయాలు నడుస్తూ వున్నాయి. పందొమ్మిదో శతాబ్దిలో యీరావుపదం మెల్లిగా వైదీకులలోకికూడా ప్రవేశించింది. లౌకికవ్యాపారంలో వుండే వైదీకులలో ప్రవేశించి చాలాకాల మయింది. యీ శతాబ్దంలో గ్రామపౌరోహిత్యం అర్చకత్వం వగయిరా వైదికవ్యాపారంలో సంచరించే వారుకూడా తమబిడ్డలకు యీ రావుపదంతోటే నామకరణం చేయడానికి ఆరంభించారు. వకవేళ తల్లిదండ్రులు రావుపదంతో నామకరణం చేయక

పోయినా లోకులు రావుపదంతోనే వారివారిని పిలుస్తూ వున్నారు. మా చిరంజీవుల కెవరికిన్నీ నేను రావుపదంతో నామకరణం చేయలేదు. కాని మాపిల్లల్ని పిలవడం కొందఱు రావుపదంతోనే పిలుస్తూవున్నారు. దీన్నిసతించి యింతగా నేను వ్రాయడాని క్కారణం యీ పదంలో దురర్థం వుందనే తాత్పర్యంచేత కాదు. రాజన్ శబ్దమునుంచి పుట్టినట్టు ముందే వ్రాశానుకదా! అట్టి బిరుదాన్ని రాజ్యభారాన్ని నిర్వర్తించే జమీందార్లున్నూ వారితోపాటు ఆ వ్యవహారాలు చక్కఁబెట్టే వుద్యోగులున్నూ ధరించడం వుచితంగాని యితరులు ధరించడం వుచితం కాదనే తలంపుతో నేను దీన్ని యింతగా విమర్శిస్తూవున్నాను. అయితే వకటి మాత్రం ఆలోచించవలసి వుంది. ముందుగా పుట్టిన శిశువు భవిష్యత్కాలంలో యేవ్యాపారం చేస్తాఁడో తెలుసుకోవడం సాధ్యపడదు కాఁబట్టి తల్లిదండ్రులు ఆశీర్వచనార్థం రావుపదంతో నామకరణం చేస్తూన్నారనేది కొంత యుక్తిసహంగా వుంటుంది. యేలాగయితే యేమి క్రమంగా అష్టాదశవర్ణాలవారున్నూ యీరావు పదానికి అలవాటు పడ్డారు. యిప్పుడు జమీందారు రావు, సెట్టిరావు, ఉద్యోగస్థుఁడు రావు, రైతు రావు, పాలికాపు రావు యీలా విడివిడిగా యెందఱనని యెత్తి చూపేది? కనక రామదాసు కాఁబోలును వకకీర్తన—

"అంతా రామమయం యీజగ మంతా రామ మయం" అని గానంచేసి వున్నాఁడు. యిప్పుడు ఆకీర్తననే—

"అంతా రావుమయం యీజగ మంతా రావు మయం" అని మార్చుకొని పాడుకుంటే స్వభావోక్తిగా వుంటుంది. నైజాంలో రెడ్లరాజ్యాలు గద్వాలవగయిరాలు కొన్ని వున్నాయి. సింహాసనం యెక్కిన ప్రభువునకు మాత్రం రావుపదంతో మిళితమైన భూపాలపదం వుంటుంది. తక్కినరాజబంధువు లందఱూ రెడ్డిపదంతోనే వుంటారు. రాజు ధరించవలసిన బిరుదాన్ని మనం ధరించకూడదనే కట్టుఁబాటును యింకా వారు పాటిస్తూ వున్నట్టు కనపడుతుంది. మన ప్రాంతాలలోకూడా యీ విచక్షణ పూర్వకాలంలో వుండేది. బ్రిటిషుప్రభుత్వంలో ఆయీవిచక్షణ పూర్తిగా తగ్గింది. వారిచ్చే 'సర్' వగయిరా బిరుదాల విషయంలో తప్ప తక్కినవి యెవరేలా ధరించినాసరే రాచకీయంగా వచ్చే చిక్కు లేదు. విరాటపర్వంలో ధౌమ్యులు ధర్మరాజాదులకు రాజసేవాప్రకరణాన్ని బోధిస్తూ కొన్ని విషయాలు వివరించాఁడు. అప్పటికి ఆకట్టుఁబాట్లు అమల్లో వుండేవని దాన్నిబట్టి మనం గ్రహించుకోవలసి వుంటుంది. యెప్పుడో మాంధాతలనాఁటి కట్టుఁబాట్లు యిప్పుడు ప్రజలు అనుసరిస్తారా? అనుసరించరు. కనక యిదిన్నీ బాగానే వుంది. రష్యాలో సామ్యవాదం బయలుదేఱిందంటూ వింటూన్నాంగదా! మనదేశంలో కూడా యీరావుబిరుదంమట్టుకు సామ్యవాద సిద్ధాంతాన్ని సూచిస్తూ వుందని సంతోషిస్తూ దీన్ని ముగిస్తాను.





౫ పరివారముతోనున్న అవలోకితుడు

౧-వ గుహలో వెనుక గోడమీద ఎడమప్రక్కనున్న చిత్రము



౬. ౧-వ గుహలో మధ్య గృహద్వారముకడ కావలియున్న యిద్దరు బోధిసత్త్వులలో నొకడు.
వెనుకగోడమీద కుడిప్రక్కనున్నది



౭ మహోత్సవ సమయమందలి నాట్యమును



౮ మాటాడుచున్నారు ఈ యిద్దరు దాసికలు...

ఈ రెండును ౧-వ గుహాయందలి వర్ణచిత్రముల ప్రతికృతులు



౯ స్తంభమూలము నలంకరించిన యువతీయువకులు



౧౦ వందనము- ఈ చిత్రములు రెండును ౨-వ గుహయందలివి

# విజయనగర సామ్రాజ్యమందలి ఆంధ్రవాఙ్మయ చరిత్రము

బులుసు వేంకటరమణయ్య

వాఙ్మయతత్త్వమును కూలంకషముగ గుఱుతెఱుఁగుటకు ముఖ్యాధారము చరిత్రము. అది కవిచరిత్ర, గ్రంథపరిమితి మాత్రప్రతిపాదకము కాక వాఙ్మయవిమర్శరూపమయి యుండవలెను. అట్టివే యథార్థచరిత్రములు; ఆంధ్రమున అతిదుర్లభములు కూడ.

ఈ లోపమును సవరించుటకే 'ఆంధ్రవాఙ్మయచరిత్రము *' వెలువరింపఁబడుచున్నది.

'ఆంధ్రపండితులని యనిపించుకొనినవారును సామాన్యులవలెనే ఆంధ్రకవీశ్వరులను గుఱించి చాలవఱకు నిశ్చితాభిప్రాయములు గలిగియుండలేదనియు, ప్రతివారును సామాన్యముగ గతానుగతికముగ కొన్ని పుడిమాటలను మాత్రమే జెప్పికొని సంతసించుచున్నారనియు' గ్రంథకర్తగారికిఁ 'దెలియవచ్చినది.'

'ప్రతివారును యే మహాకవినిగుఱించి ప్రసంగించినను తెలిసినట్లు తలయూపుచు 'ఆహా! యేమి కవిత్వమండి! రసము చిప్పిలుచూ యుండును. ప్రతి పద్యమునందును రసము కారుచునే యుండును' అని యద్భుతకౌతుకముల నభినయింతురు. కాని యే విషయమునందాకవివరుఁడు గొప్పవాఁడో, దేనియందు ప్రత్యేకముగ విశిష్టుఁడో, ఆయనకావ్యరీతి యెట్టిదియో, యిత్యాదివిషయములలోఁ గొంతమంది పండితులుగూడ నజ్ఞానాంధకారమున మునిగియున్నారని, వారు "తెలిసికొ"న్నారు!

'ఆంగ్లేయవాఙ్మయ నికషోపల కషణానిశితు'లై యున్న గ్రంథకర్తగారికి 'ఆంధ్రకవీంద్రుల కావ్యమర్మముల నెఱుంగవలయునను జిజ్ఞాస పొడమినది. కాని సరియగు నాంధ్రవిమర్శన గ్రంథములు లేని హేతువున, వారి 'యభీష్టము నెరవేరు తెరువు గానంబడలేదు. గురుజాడ శ్రీరామమూర్తిగారును, కందుకూరి వీరేశలింగముగారును ఆంధ్రకవుల దేశకాలనిర్ణయమునకు వారి యనూనపరిశ్రమనంతయు ధారవోసిరి. కాని యా కవుల కవితారీతులు, భావభావనాశక్తులు, నిమ్నోన్నతావస్థలు, కథాసంధాన చిత్రీకరణములు, ఇత్యాది కావ్యహృదయపరిస్పందనముల స్పృశింపక యట్టెవిడిచిపెట్టిరి. ఇట్టి స్థితిలో నాంధ్రకవుల శక్తివిశేషములను విచారించుట కవకాశమేది?'

'కావున సాధ్యమైనంత వఱకును' వారు 'చదువుచు వచ్చిన యాంధ్రకవుల కవితాసారమును నూతనముగా గని పెట్టుచు, వారివారికిఁ బరస్పరముగల సామ్యభేదముల నిరూపించుకొనుచు, వారివారి వ్యక్తిగతలక్షణలక్ష్యవిశేషముల నరయుచు – యిట్లు ముఖ్యములైన యాంధ్రగ్రంథములం జదువ నారంభించి'రి. తొలుత వీరు 'కేవల సంస్కృతాంగ్లేయ గ్రంథములే గాక నాంధ్రగ్రంథములఁ గూడ పఠించుచు నూతన విద్యా

---

* ప్రథమభాగము. గ్రంథకర్త: శ్రీ టేకుమల్ల అచ్యుతరావుగారు, ఎం. ఏ. ఎల్. టి. డెమ్మీ ౧/౮ సైజు. ౩౦౮ పుటలు. వెల రూ. ౨ లు. విద్యార్థులకు రు. ౧-౮-౦. ప్రకాశకులు: ఎన్. రామారావుగారు, బి. ఏ. ఇన్నీసుపేట, రాజమండ్రి.

ఖ్యాసిపగిది బ్రహ్మశ్రీ గుంటూరి వీరభద్రశాస్త్రిలు గారను నొక గురువరుని పాదపద్మముల సేవించి 'ముక్కు తిమ్మన పారిజాతాపహరణము, పెద్దన మనుచరిత్రము, ఇత్యాది గ్రంథములను సాంగోపాంగముగ నేర్చుకొని నారు. 'కొన్ని సంవత్సరములవఱకు నాంధ్రగ్రంథములఁ జదువుటయు, ఆయాకవీశ్వరుల కాలనిర్ణయాదుల గురించి విచారించుటయు మున్నగు నాంధ్ర వాఙ్మయ సేవాదీక్షాకృత్యములయందే కాలము గడపి' నారు. పయిపరిశోధనల ఫలితమే ప్రస్తుత గ్రంథము.

ఈ గ్రంథమునఁ బదునాలు గధ్యాయములు, నాలు గనుబంధములును కలవు. మొదటి రెం డధ్యాయములలోను విజయనగర రాజ్యోత్పత్తి, తత్పూర్వపు వాఙ్మయస్థితి చర్చింపఁబడినవి. చివటి రెం డధ్యాయములలోను సామాన్యకవులు, సింహావలోకనము వివరింపఁ బడినవి. తక్కిన అధ్యాయములలో వరుసగ సోముని ఉత్తరహరివంశము, జక్కన విక్రమార్కచరిత్రము, వల్లభరాయని క్రీడాభిరామము, నారాయణకవి పంచతంత్రము, దుగ్గననాసికేతోపాఖ్యానము, పిన వీరభద్రుని శాకుంతల, జైమిని భారతములు, మల్లయ్య, సింగయ్యల ప్రబోధచంద్రోదయ, వరాహపురాణములు, మనుమంచి భట్టు హయలక్షణసారము విమర్శింపఁబడినవి.

అనుబంధములందు సంస్కృత, కన్నడ, అఱవ, మహారాష్ట్రవాఙ్మయవిషయములు సంగ్రహింపఁబడినవి.

'గ్రంథకర్తల దేశకాల నిర్ణయాదుల గుఱించి వీరేశలింగముగారు, శ్రీరామమూర్తిగారు మున్నగువారు విపులముగ వ్రాసియేయున్నారు. కావున నే నీవిషయముల గుఱించి యంతగా జర్చించుట పెట్టుకొనలేదు. ......కావున నేను విశేషముగా జేసిన కృషి వాఙ్మయ విమర్శనమే.' అని గ్రంథకర్తగారు ఈ విమర్శనపద్ధతిం గూర్చి తెలిపియున్నారు. కాని యిందు విమర్శకు లుద్దేశించిన వాఙ్మయ విమర్శనముకంటె కవికాల, మూలగ్రంథ విమర్శనమే ఎక్కువగ కానవచ్చుచున్నది.

శ్రీ అచ్యుతరావుగారు నాచన సోమనాథుని గూర్చి వ్రాయుచు క్రింది యంశములను వ్రాసిరి:

'కవిత్వ విషయములో నెంచిచూడఁగ నాంధ్రకవీశ్వరు లందఱిలో సోమనాథుఁ డగ్రగణ్యుఁడు. తిక్కన సోమయాజి గ్రంథరచనా బాహుళ్యమునను, సర్వతోముఖ సామర్థ్యమునను నాంధ్రవాఙ్మయ సేవా ప్రోత్సాహమునను, దేశి యాంధ్రభాషా ప్రయోగ మార్గదర్శిత్వమునను నాంధ్రవాఙ్మయచరిత్రమున నద్వితీయుఁడని ప్రసిద్ధికెక్కినవాఁడు. భాషా పాండిత్యమునను, సాహితీప్రపంచ సర్వజ్ఞత్వమునను, కవితా రసికత్వమునను సోమనాథకవి నిరుపమానుఁడని నిక్కముగఁ జెప్పవచ్చును.'.........'ఒక్క యెఱ్ఱాప్రగడ కవిత్వమే కాదు. భారతము రచించిన కవిత్రయములో నెవ్వరి కవిత్వమును కొన్ని విషయములలో సోమునికవనముతో సరి కాదని నా యభిప్రాయము.'

ఇంతవఱకును విమర్శకులకు సోమన, యెఱ్ఱనల కవితా తారతమ్యమునుపట్లనే అభిప్రాయభేద మున్నట్లు విదితము. ఇందు సోమునితో సాటియగు కవి లేఁడని చెప్పఁబడినది. ఇంతవఱకును తిక్కనను మించిన కవి లేఁడని ఆంధ్రపండితకవుల ఆశయము. ఆ కవికిఁ గల 'కవిబ్రహ్మ' బిరుదము నేఁటికి 'నేతిబీరకాయ' యైనది!

ఇట్లీ కవికి అచ్యుతరావుగారు లోకోత్తరస్థానము నిచ్చుచును, వేఱొకచోట 'అయినను శబ్దాలంకారములు తఱచు గనఁబడుటచేత నా విషయమున నీకవి వరుఁడు కొంచె మతిమాత్రముగఁ బోయెనా యను సందేహము కలుగుచున్న' దని వ్రాసిరి.

సోమనాథుని కవిత్వ తత్త్వమును చూపుటకు కొన్ని పద్యము లిం దుదహరింపఁబడినవి. వానికి వివరణము మాత్రము లేదు. ఏ విషయమున నేది విశిష్టమో తెలియకున్నది. ఈ విషయమున వీరును తక్కిన 'యాంధ్రపండితుల' మార్గమునే త్రొక్కుట వింత!

ఒక్క సోమనాథుని విషయముననే కాదు. ఇందు విమర్శింపఁబడిన గ్రంథము లన్నింటి విషయమునను పయిపద్ధతియే కాన్పించుచున్నది.

ఇందలి మూఁడవ ప్రకరణమున సోమనాథుని కవిత్వపద్ధతులు విపులముగ వివరింపఁబడినవి. కాని కవి

గ్రంథాశ్వాసాంత గద్యలలో చెప్పుకొనిన 'నవీనగుణ సనాథ' అను విశేషణమును సార్థకపఱచు విమర్శనము మృగ్యము. ఏతద్విమర్శనమును సమగ్రముగ చదివినను 'సోముని నవీనగుణము లేవి?' అని ప్రశ్నించుకొనినపుడు నిరుత్తరమే సమాధానము కావలసివచ్చును.*

ఈ 'వాఙ్మయచరిత్రము'నందలి యైదవ యధ్యాయమున విమర్శకుల యభిప్రాయములను పరామర్శించుచు 'క్రీడాభిరామము' వినుకొండ వల్లభరాయ విరచితమే అని సిద్ధాంతీకరింపఁబడినది. అందులకు ప్రధాన కారణములు 'ఈ గ్రంథము రూపకముగాని కేవలము ప్రబంధము† కాకుండుటయు, 'ఇది హాస్యరస ప్రధానమైన క్షుద్రకావ్యము కాని యున్నతాదర్శములు కల యుత్తమకావ్యము కాకుండుటయు నఁట! పయి 'రెండు విషయములకుఁ బ్రాముఖ్య మివ్వకపోవుటచే' ఏతత్కర్తృత్వమునుగూర్చిన వాదవివాదములు కలిగిన వఁట!

కాని యీ యంశములు పయి సిద్ధాంతమున కుపపాదకములు; అసంగతములు. పేరున కిది రూపకముగాని సంస్కృతరూపకసమానము కాదు. ఇందు హాస్యరసస్పర్శ యేమాత్రమును లేదు. కొన్ని వర్ణనలు జుగుప్సావహములనుట నిజము. హాస, జుగుప్సలు విభిన్నములు. వికృతదర్శనమునఁ గలుగు చిత్తవికారమే హాస్యమునకు స్థాయి. అది యిందు మృగ్యము.

క్రీడాభిరామము 'క్షుద్ర ప్రబంధము' అనఁగా 'నీచకావ్యము' అని అచ్యుతరావుగా రభిప్రాయపడుచున్నట్లు తేలుచున్నది. ఆ అభిప్రాయ మసంగతము. 'ఇది అమూల్యాంధ్రగ్రంథములలో నొకటిగఁ బరిగణింపఁదగిన' దని వారే వేఱొకయెడ వ్రాసియున్నారు.

మఱియు క్షుద్రప్రబంధమన ఖండకావ్యభేదము. ఉదాహరణము, తారావళి, ఓరుదావళి మొదలగునవి క్షుద్రప్రబంధములని సాహిత్యశాస్త్రమున నియతము.

క్రీడాభిరామము వల్లభరాయని కృతియే యనుటకు ఇం దీయబడిన ప్రమాణము లత్యంతము దుర్బలములు. శ్రీ అచ్యుతరావుగా రిట్టి యసభ్యవర్ణనలతోఁ గూడిన కృతిని శ్రీనాథుఁడు రచించెననుట అన్యాయమని చెప్పుచు మరల 'వల్లభరాయఁ డీ గ్రంథమును దెనిగించి తన స్నేహితుఁడును, కవిసార్వభౌముఁడు నను శ్రీనాథునిచేఁ గొంతసాయము బొందియుండవచ్చును' అని వ్రాయుట ఆశ్చర్యకరము! తనకుఁ గాదని తన మిత్రున కపకీర్తి నంటఁగట్టుట శ్రీనాథునివంటి మహాకవి చేయుపని యని విశ్వసింపవలెనా?

ఈ గ్రంథము వెలువడిననాఁటి కయిదేండ్లక్రిందనే శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిలుగారు. విపులమగు నుపోద్ఘాతముతో సుపరిష్కృతమగు క్రీడాభిరామమును ప్రాజ్ఞులకొఱకు ప్రకటింపించి యున్నారు. ఇది తెలుఁగు దేశమున కెఱుకపడనిది కాదు. ఆ యుపోద్ఘాతమున ప్రతిపక్ష సిద్ధాంతఖండన పూర్వకముగ క్రీడాభిరామమునకు శ్రీనాథుని కర్తృత్వమే స్థిరపఱుపఁబడినది. దానిం జూచినచో ఎట్టి విపరీతాభిప్రాయమునకును అవకాశము ఉండదు. శ్రీ అచ్యుతరావుగారు రా గ్రంథముసంగతిని నెత్తుకొనలేదు. వా రా గ్రంథమును చూడలేదేమో! చూచియే యుండిన నిట్లు వ్రాసియుండరు.

'మిక్కిలి తప్పులతో ననన్వితముగా నున్న' వల్లభరాయని వంశవృక్షమును శ్రీ ప్రభాకరశాస్త్రిలుగారు 'జాగ్రత్తగాఁ బరిశోధించి ఉచితవిధమున సంస్కరించిరి. ఈ 'వాఙ్మయచరిత్రము' నందలి వంశవృక్షము పయిదానికి విలక్షణముగ నున్నది.

క్రీడాభిరామమునందలి చారిత్రక విషయములను, కవిత్వమును శ్రీ శాస్త్రిలుగారు విపులముగను, చక్కఁగను విమర్శించి యనేక నూతనాంశములను బయలుపఱ

---

* సోముని నవీనగుణములను శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు (గ్రంథకర్తకు ప్రతిపక్షులే) 'సారస్వతోపన్యాసములు'లో చక్కఁగ వివరించినారు.

† ఇది ప్రబంధమే అని వేఱొకచో (పుట ౧౬౮.) వీరే వ్రాసియున్నారు.

చిరి. ఇందలి క్రీడాభిరామ గ్రంథవిమర్శనము ముక్తసరిగ మూడుపుటలలో ముగింపఁబడినది.

దగ్గుబల్లి దుగ్గనకవినిగూర్చి వ్రాయుచు శ్రీ అచ్యుత రావుగారు అప్రస్తుత మయినను శ్రీనాథుని జన్మస్థానమును, కులగోత్రములను అవతారికయందు విమర్శించుచు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిలవారి యభిప్రాయములను ఖండింపదొరకొనిరి. కాని తగిన యుపపత్తులను చూపఁజాలకపోయిరి. శ్రీ శాస్త్రిలుగా రభిప్రాయపడినట్లు కృష్ణాజిల్లాలో సముద్రతీరమునఁగల కాళీపట్టణమే శ్రీనాథుని జన్మస్థానము కావచ్చును. వారు చూపిన ప్రమాణములే యుక్తిసహములు. *

ఎనిమిదవ యధ్యాయమున పిల్లలమఱ్ఱి పినవీరభద్రకవినిగూర్చియు, నతని శృంగారశాకుంతలమును గూర్చియు విపులమగు విమర్శనము కలదు.

ప్రాచీనకాలమునం దాంధ్రమున నాటకములు వెలువడకుండుటకుఁ గారణ మం దీ క్రిందివిధముగ వ్రాయఁబడినది:

'మన వాఙ్మయములో సంస్కృతమునందుఁగాని, మఱే యే హైందవభాషయందుఁగాని పొడసూపని ప్రబంధస్వరూప ముత్పత్తియగుటయే' 'నిజమయిన నాటక మొక్కటియుఁ గానరాకుండుట'కుఁ గారణము. 'మన ప్రబంధములు సంస్కృతనాటకములకును, సంస్కృతకావ్యములకును మధ్యవర్తులు. వీనియందు నాటకములయొక్కయుఁ, గావ్యములయొక్కయు లక్షణములు సామాన్యముగ నుండుటచే వేఱుగా నాటకములు వ్రాయ నవసరము లేకపోయినది.'

పయియూహ యుక్తిదూరము. మఱియు నాంధ్రప్రబంధ సామాన్యలక్షణమును నిరూపించి వాని మధ్యవర్తిత్వమును నిరూపించిన కొంత బాగుగ నుండియుండును. కావ్య, నాటకలక్షణము లైన నిం దీయఁబడలేదు. పయిలక్షణములపయి ఆధారపడియున్న పైసిద్ధాంతము నెట్లు గ్రహింపవనగును?

గద్యపద్యాత్మక పద్ధతియే ఆంధ్రప్రబంధముల నవ్యత యందుమా, వీలులేదు. అట్టివి సంస్కృతమునను కలవు. అవియే చంపూప్రబంధములు! వానియందును కొన్ని ఆంధ్ర ప్రబంధములందువలె పాత్రప్రవేశము మొదలగు విషయములు నాటకపద్ధతినే ఉన్నవి.

పినవీరన శృంగారశాకుంతలమున ఎఱ్ఱాప్రగడ కవిని స్తుతింపకుండుటకుఁ గారణము కృతిపతివంశమువారికిని ఎఱ్ఱనవంశమువారికిని గల పరస్పరద్వేషమని శ్రీ అచ్యుతరావుగారి యూహ. ఇది వీరు కల్పించినదో, యథార్థ మైనదో తెలియకున్నది. శ్రీ పినవీరభద్రుని గ్రంథములందుఁ బయి యూహల కెట్టి యాధారములును లేవు.

పినవీరభద్రుఁడు తన ప్రబంధమునకు భారత, కాళిదాస నాటకములలో ఒకదానినే మూలముగా గ్రహింపక తనకు తోఁచినరీతిని రెండు గ్రంథములలోని విషయములను గ్రహించెను. అట్లు గ్రహించి 'కథాసంవిధాన మెంతయు నుచితముగను, రసపోషకముగను నిర్వహించెనని నిష్పక్షపాతబుద్ధితోఁ జెప్పవచ్చు' నని అచ్యుతరావుగారి అభిప్రాయము. విచారించి చూచి నచో నితఁడు చేసిన మార్పు లనుచితములు, రసాపకర్షకములుగ నున్నవి. †

భారతమున శకుంతల తనజన్మవృత్తాంతమును తానే దుష్యంతునితోఁ జెప్పినట్లున్నది. కాళిదాసు అనసూయా ప్రియంవద లను చెలికత్తెలచే దానిం జెప్పించెను. పినవీరన అనసూయా ప్రియంవదలను కల్పిం

---

* శ్రీ ఎ. వి. ఆర్. సోమయాజులుగారు ఈశ్వర సంవత్సరాది సంచికలో (ఆంధ్రపత్రిక) 'శ్రీనాథుని జన్మస్థానము'ను గూర్చి క్రొత్తసిద్ధాంతమును బయలుపఱచిరి. అది సరిగా లేదు. శ్రీశాస్త్రిలుగారి మతమును సరి కాదనుటకు వారు చూపిన ప్రమాణములు సరిగా లేవు.

† ఈ విషయమును విపులముగఁ దెలియఁగోరువారు నేను వ్రాసిన 'పిన వీరభద్రకవి శాకుంతలమునందలి యనుచితపు మార్పులు' అను వ్యాసమును చూడఁ దగుదురు. భారతి, సంపు. ౬; సంచిక ౧౨.

చియు, దానిని వారిచేఁగాక ఋషికుమారులచేఁ జెప్పించెను. 'శృంగారరసపూరిత మగు నీ యితివృత్తమును స్త్రీలచేఁ బురుషులకుఁ జెప్పించిన విపులవర్ణనలకు నవకాశ మీయ దని కణ్వశిష్యులచే రాజునకుఁ జెప్పించుట 'ఎంతయు సమంజసమై, కవియొక్క యుచితజ్ఞతకు గొప్ప దృష్టాంతముగా నున్న' దని అచ్యుతరావుగారు వ్రాసిరి.

దీని యౌచిత్యానౌచిత్యములు సహృదయులే నిర్ణయింపవలెను.

ఇట్టి వింకను పెక్కులు కలవు. అంగుళీయకదానము, ఆకాశవాణీవృత్తాంతము మొదలగునవి గమనింపఁదగినవి. ఇట్టి గ్రంథమును పురస్కరించుకొని గ్రంథకర్త 'ఎంతమంది కవు లెన్నివిధముల నీ నాటకమును దెనిఁగించిన నవి పినవీరభద్రుని కృతిని మించుట లేదు. పినవీరభద్రుని యాంధ్రీకరణ మసదృశము, అనతిశయ్యము' అని వ్రాయుచున్నారు!!

పినవీరభద్రుని గ్రంథాంతరమగు జైమినిభారతమును గూర్చి వ్రాయుచు తొలుత మూలగ్రంథమును చర్చించుచు అచ్యుతరావుగారు 'జైమినికవి యని చెప్పఁబడిన మహాపురుషుఁడు భారతమందలి యశ్వమేధపర్వముతప్ప నితరపర్వములను వ్రాసియుండఁడని నాకు తోఁచుచున్నది.' అని నిశ్చయించిరి. దానికి ప్రమాణముగ 'ఇతి మహాభారతే ఆశ్వమేధికే పర్వణి జైమినీయే' అను 'నాశ్వాసాంత గద్యభాగము' నిచ్చిరి. జైమిని పూర్తిగా గ్రంథమును వ్రాసియున్నయెడల 'ఇతి మహాభారతే జైమినీయే ఆశ్వమేధికే పర్వణి'అని యుండవలసినదఁట!

యుక్త్యంతరముల కిది సహాయకారి కావచ్చును గాని ప్రధానమగు హేతువు కాఁజాలదు. ఏతన్మాత్రమున నే సిద్ధాంతము నిలువఁజాలదు.

ఈ ప్రకరణమున సంస్కృతాంధ్ర కర్ణాటగ్రంథములకుఁ గల వైలక్షణ్యము, తారతమ్యము విపులముగ వివరింపఁబడినవి.

ఈ గ్రంథమున అన్ని యధ్యాయములయందును ఆ యా కవులను గూర్చియు, గ్రంథములను గూర్చియు, వాని ప్రత్యేకస్థానములను గూర్చియును విపులములగు చర్చలు కలవు. వాఙ్మయచరిత్ర జిజ్ఞాసువుల కవి చాలవఱకు ఉపకారకములు.

'ఈ గ్రంథమందలి యధ్యాయములు చాలవఱకు 'ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక 'లోను, 'భారతి' లోను అప్పుడప్పుడు ప్రకటింపఁబడినవి.' అవి ప్రకటింపఁబడి చాలకాల మయినది. ఈలో వాఙ్మయచరిత్రమునఁ జాల మార్పులు కలిగినవి. విషమసమస్యలు కొన్ని పరిష్కరింపఁబడినవి. కాన పయి వ్యాసములు గ్రంథరూపమును దాల్చినపుడు మార్పుఁ బొందవలసి యున్నది. ఆ మార్పులలో ప్రధానములు—శ్రీనాథుని క్రీడాభిరామ కర్తృత్వము, కృష్ణాజిల్లాలోని కాళీపట్టణమే అతనిజన్మస్థల మగుట, నాచన సోమనాథుని నవీనగుణములు, అతనికి వాఙ్మయమునఁ గల స్థానము, పినవీరభద్రుని మార్పుల అనౌచిత్యము మొదలగునవి. పయి సిద్ధాంతములు శ్రీ అచ్యుతరావుగారికి సమ్మతములు కానప్పుడు వానిని సయుక్తికముగ ఖండించి తమ మతములను నిలుపుకొనుట యుక్తము.

మఱియొక సంగతి. శ్రీ అచ్యుతరావుగారు 'విజయనగర సామ్రాజ్యమందలి ఆంధ్రవాఙ్మయ చరిత్రము'ను వ్రాయఁదలచినారు. కాని క్రీడాభిరామము, పంచతంత్రము, నాసికేతోపాఖ్యానము, ప్రబోధ చంద్రోదయము, వరాహపురాణము విజయనగర సామ్రాజ్యమునకు సంబంధించినవి కావు. హయలక్షణసారముఁ గూర్చి గ్రంథకర్తకే సందేహము కలదు.

ఇప్పుడు వెలువడినది 'ఆంధ్రవాఙ్మయ చరిత్ర'లో మొదటిభాగము మాత్రమే. ౨ వ భాగమున 'విజయనగరరాజ్య చరమభాగమునందలి యాంధ్రవాఙ్మయ' చరిత్ర 'రచింపఁబడును.

'ఈ భాగమందు కృష్ణదేవరాయలు, అల్లసాని పెద్దన్న, ముక్కు తిమ్మన్న, పింగళి సూరన్న, రామరాజభూషణుఁడు మున్నగు సుప్రసిద్ధాంధ్ర కవివతంసములు రచించిన మేటిగ్రంథముల విపుల విమర్శన లుండు'నఁట! శ్రీ అచ్యుతరావుగారు దానిని నిష్కృష్ట సిద్ధాంతములతో నుచితరీతిని రచించినచో ఆంధ్రభాషా, వాఙ్మయములకు తగిన సేవ యొనర్చినవా రగుదురు.

# కవితా వినోదములు

మండపాక పార్వతీశ్వరశాస్త్రి

బ్రహ్మశ్రీ మండపాక పార్వతీశ్వరశాస్త్రిలుగారు తమ స్వీయచరిత్రమున నిట్లు వ్రాసికొన్నారు.

బాణవిద్యా విజృంభణ సంభరితమైన నూత్నాగ్ని యంత్రవినోద వేళ
మ్రోలనుండఁగఁ జూచి, ముసి ముసి నగవుతో శ్రీరంగరాయధాత్రీవిభుండు
చీనాగ్నియంత్ర వితానజధ్వని పంచకము వృత్తమందు వ్యక్తమగు చాయ
నభివర్ణనము సేయుఁడని ధాతృవత్సర దీపావళీనిశాదిని విధింప
నపుడ, తప్పక, టప్పు టుప్పనెడు నిట్టి - నియమితధ్వనులైదు గన్పించు తేట
తోటకముఁ జెప్పి మెప్పొందఁ దోడుపడవె హరిహరేశ్వరదేవ మహానుభావ.

శ్రీ బొబ్బిలి మైనరుమహారాజావారి యాస్థానకవిగాఁ జేరిన పైఁ బార్వతీశ్వరకవిగారు చతుర్విధ కవితా వైదుషిచేఁ బ్రభువులకు నిత్యము నానందమును గలిగించుచుండిరి.

ధాతృ సంవత్సరపు దీపావళినాఁటి రాత్రి చీనాపటాకీలపెట్టె యొకటి ముట్టించి, యది ప్రేలుచుండఁగా, శ్రీ మహారాజావారు ప్రక్కనే నిలిచియుండిన పార్వతీశ్వరకవిగారిని జూచి, "ఈ పటాకీలగుత్తి ప్రేలుచుండిన రీతి ధ్వనులన్నియుఁ గన్పట్టునట్టుగా వర్ణింపుఁడు" అని కోరిరఁట. వెంటనే శ్రీ పార్వతీశ్వరకవిగా రాశువుగా నీ క్రింది శ్లోకమును రచించి చదివిరఁట—

శ్లో. నికట ప్రకట ప్రకటు ప్రపటు ప్రణట ప్రకృతిం శుచి యంత్రచయం
వివిధం నవధన్యకృతం ప్రకృతం త్రి చతుస్సువపుస్సుఖదం కలయ.

ఇందు టప్పు, టుప్పు, ధన్ను, తుస్సు, ఫుస్సు, అనెడు నియమితధ్వనులైదును గన్పట్టునట్లు రచించుట శబ్దచిత్రము. పటాకీలు ప్రేలుటను వర్ణించు పద్యము చదువుచున్నప్పుడు పటాకీలు ప్రేలుచున్నట్లే యుండుట చమత్కారము. అడిగినవెంటనే యాశువుగా నిట్టి పద్యము చెప్పఁగలుగుట కవి సామర్థ్యము. ఇట్టి శబ్దచిత్రములు గల పద్యములు శ్రీ పార్వతీశ్వరకవిగారు పెక్కులు రచించియున్నారు.

---




మల్లాది రామకృష్ణశాస్త్రి

నిన్ను నెదుక్కుంటూ వచ్చానమ్మా!

ఇంతదూరం, ఎక్కడో కృష్ణాతీరాన్నుంచి,...చల్లనితల్లివి ... కష్టాలన్నీ విని, కడుపులోపెట్టుకు ఆదరిస్తావని, నీలో కలిసిపోదామని వచ్చానమ్మా!

సహించారు; మనసులో ఎంత అసహ్యపడుతూన్నా, బయటికి కనబరచకుండా, ఆదరంతో చూస్తూ, తమ ఔదార్యాన్ని ప్రకటించుకుని, లోకంచేత 'ఆహా' అనిపించుకుని, కోటియజ్ఞాలఫలం దక్కినట్టు, మురిసిపోయినారు : కాని, అర్థంచేసుకుని, అనుతాపంలో పాలుపంచుకోలేని, ఈ లోకానికి... ఎంతదూరమైపోతే మాత్రం ఏ మమ్మా.

నావాళ్లే నాకు కానివాళ్లైనప్పుడు... పంచప్రాణాలూ, మమకారం నిల్పినవాళ్లే, వంచనచేసి తూలనాడినప్పుడు ... కోరికలు, ఇక ఈ జన్మకు తీరవనే నిరాశ కుదురుకుపోయినతరువాత...బ్రతికి మాత్రం ఫల మేమున్నదమ్మా!

తీరా...ఇక ఎన్నటికీ కనపడనని తేలిపోయినతరువాత... అన్నయ్య, పాపం, తల్లీతోడూ కనుక ... విచారపడతాడు. నా జీవితం అంతా అడవినికాచిన వెన్నెల అయిపోయినప్పటికీ... నా బాధలన్నీ నేను భరించుకుంటూ, ఇంట్లో చేదోడు వాదోడుగా ఉండి, అక్కరకు అడ్డుపడుతూన్నన్నినాళ్లూ ... ఆయన కేమీ చీమంత ఐనా, నా గొడవ పట్టలేదు; ఇప్పుడు మాత్రం, ఇబ్బందివచ్చినప్పుడు, ఆదుకునేందుకు మనిషి లేకపోయింది కదా అని నన్ను తలుచుకుంటాడేమో; అదైనా ఎంతసేపులే... వదిన కౌగిలిలోకి వెళ్లిపోయినతరువాత లోకాన్నే మరచిపోతాడు.

మాచెల్లెలు, జానకా, అభం శుభం దానికి ఏం తెలుసు ? దానిపెనిమిటి నాకు చేసిన అపకారం ... కాదు, ఉపకారం... దానికి తెలిస్తే ... ఓర్చుకుని, భరించగల జాణతనం... ఆ అమాయకురాలికి, పసిపాపకు... ఏదమ్మా!

'వయసు మళ్లుతూన్నవాడు... కోరక రాని కోరిక...ఆ నికృష్టుడికి, బంగారంవంటి పండుతల్లిని కట్టిపెట్టవద్దు...ఇది సుతరామూ కూడదు... రెండోపెళ్లివాడితో అది బావుకునేది ఏమిటి' అని, నేను పట్టుపట్టి, ఆసంబంధం మానిపించాలని, శాయశక్తులా అన్నయ్యతో పోరుపెట్టాను; కాని, నామాట వింటాడా, పిల్ల సుఖపడుతుందట! ... ఆమాటకు అర్థం ఉన్నదా ? ఆడది సుఖపడటం అంటే ఏమిటో, ఆ మొగరాయుడుకు తెలుసునా ? ముద్దినుసు నగలూ చీరెలూ, ఇనపపెట్టెలో నిండు సంచూలూ చూసుకుంటే కడుపు నిండిపోతుందా ?—పైగా, నేను ఇంకా ఏమన్నా అనిపోతానేమోనని ... 'మొదటి పెళ్లివాడని...పిల్లవాడు చిన్నవాడని, లక్షణమయినవాడని ... నిన్ను ఇస్తే ... ఏమైంది చెప్పు... ఆయుర్దాయం ఉండాలి, సుఖపడి అనుభవించే యోగం ఉండాలికాని...' ఈ మాటలకు నానోరు కట్టుపడింది...మనసు చిల్లులుపడిపోతే మాత్రం... అతనికేం ?

మూడుముళ్లూ పడ్డాయి. పడ్డ ఆరుమాసాలకే పిల్ల ఈడేరింది. వడసారం, పదమూడో ఏడు సగపాలైనా గడవలేదు. పిల్ల ఏపరి కాదు. కాకపోతేనేం, మూడుముచ్చట్లూ తీరినతరువాత, ఒక్కక్షణం ఉండనిచ్చాడా పిల్లను నట్టింట ! గద్ద తన్నుకుపోయినట్టే- నేను మళ్లా నోరుచేసుకున్నాను అప్పుడు కూడా... అన్నయ్యతో, నెమ్మదిగా... ఇంకోసంవత్సరమన్నా ఆగితే మంచిదని, బావగారితో ఏలాగైనా చెప్పి ఒప్పించు; పిల్ల కొంచెం రెక్కొంటే. కాని, ఇప్పటి నుంచీ కాపురం ఏం దిద్దుకుంటుంది. ఇంకో దిక్కులేదు, వంటరిగా క్లామెను...' అని బ్రతిమాలుకున్నాను: అన్నయ్యకే ఈ ఊహ తట్టవలసింది...పోనీ, విన్నైనా హర్షించడా అనుకుంటే, ఆలాకాకపోగా, పైపెచ్చు ఎదురు తిరిగి...'ఎంతకాలం నోట్లో వేలు వేసుకు కూర్చుంటా డనుకుంటావు. ఆడదిక్కు లేకనే, గూట దీపం పెట్టేవాళ్లు లేకనేగా...వెంటనే పెళ్లి చేసుకుంది...ఏం, తీపెళ్లిందా ఏం...దానిఈడుకు నేను అమ్మకు కడుపున పడ్డానుట...ఇంకా,ఆయనపుణ్యమా అంటూ మంచివాడు కనుక, ఇంతకాలం ఆపాడు. మనం చూడటం లేదూ, లోకంలో...వెంటనే...పసుపుబట్టలతోనే తీసుకువెళ్లి కాపురం పెట్టుకున్నవాళ్లు ఎంతమంది లేరు ? — ఆలా చేస్తేమాత్రం, వద్దనగలిగేవాళ్లమా ? నీమాటలకేంలే ? — నట్టింట కనబడుతూన్నన్నాళ్లూ ... ఎంత వయసు వచ్చినా, మనకు పసిపిల్లే ... అవతలవాళ్ల కష్టసుఖాలుకూడా కొంచెం యోచించవద్దూ...' అంటూ నన్ను గదమాయించి, బావమరదిని వెనక వేసుకువచ్చాడు. నేను అనేదేముంటీ ఇక...అన్నింటికీ తల ఊపవలసినదాన్నేనాయెను; పోనీ, చెప్పి చూసేవాళ్లెవరైనా ఉన్నారా అంటే, ఇరుపార్శ్వాలా...నా అన్నవారు లేరు. ఇటు మా అన్నయ్యా...అటు మాజానకి మొగుడు పూర్ణయ్యా శాస్త్రుల్లూ...ఎవరియింటికి వారే పెద్దలు !

సరే, ఆకాస్త మొక్కూకూడా తీరిపోయింది. గది అలంకారాలన్నీ ఇరుగమ్మా, పొరుగమ్మా ఎవరో చెయిచేసుకుని కానిచ్చే

శారు. నాకు, ఒకమారి తొంగిచూడ్డానికైనా, మనసు ఒప్పలేదు. పిండివంటదగ్గర కూర్చున్నంతసేపూ, కంటనీరు పెడుతూనే ఉన్నాను. పొగపోయి కళ్లు ఎర్రవారిన వను కున్నారు... పేరంటాళ్లు... మనసు ఎంత కుమిలిపోతూన్నదో ఎవరూ గ్రహించలేదు...నయమే అసీని!

ఇక... ఆ కాపురం ముచ్చట్లు ఏమని చెప్పేది. మూడునిద్దర్లూ కాగానే, తెల్లవారితే మంగళవారమయినా, నిమిషం నిలవకుండా తర్లించుకు వెళ్లిపోయినాడు... తీసుకువెళ్లి కత్తులబోనులో ఇరికించాడు. మెదలడానికి వీలులేదు. కూరనార అమ్మేవాళ్లతోనైనా మాట్లాడకూడదు. మగపురుగుకంట బడరాదు...మా పక్కవీథిలోనే ఉన్నా...మళ్లా గడపతొక్కనీయలేదు... ప్రాణాలన్నీ దానిమీదే పెట్టుకుని ఉన్నా...పోయి ఒకమారు కంటనైనా చూద్దామంటే, నాకు అసలు పొరాగత్తెం ఉందీ?- ఇక, బండీలో కాలు పెట్టబోతూ, నేను మడిగట్టుకుని, ఊరగాయలు సర్దుతూంటే, బెదురుకుంటూవచ్చి, నన్ను కావిలించుకుని... 'ఒక్కర్తైనా ఉండలేనే, రోజూ వచ్చి చూసి వెళుతూండవే అక్కయ్యా! ... మిమ్మల్నందర్నీ విడిచివెళుతూంటే, ఏమిటో తగని దిగులుగా ఉందే...' అని గావురుమన్నది. నేనూ, అధైర్యపడితే కుర్రది మరీ బెగ్గటిల్లిపోతుందని, రొమ్ముకు అదుముకుని... సముదాయించాను. చెపుదామనుకున్న నాలుగుమాటలూ చెప్పకముందే...అన్నయ్యా, బండీవాడు తొందరపడుతున్నాడని వచ్చి మాకిద్దరికీ ఎడబాటులు చేశాడు. ఆ తరువాత వాడెన్నా తిరిగిచూశాడా... నేను అనుక్షణం పోరుతూన్నా... 'ఏముంది చూసేందుకు...వాళ్ల కాపురం వాళ్లు చేసుకుంటూన్నారు. చీటికీ మాటికీ...ఇట్టే అట్టే మనంగనక వెళుతూంటిమామెనా, తనమీద ఏం నేరాలు చెపుతూందో...మన కేం దోచిపెడుతూందో అని అని ఆయన అనుమానపడవచ్చును... లేనిపోని కలతలు తెచ్చిపెట్టడం ఎందుకూ...' ఇలా సాకులు చెప్పి తప్పించుకుంటూండేవాడు.

వారంరోజులైంది - వాకిట్లో... ప్రొద్దున్నే ముగ్గు వేస్తూండేవేళకు శాస్త్రుల్లు వీభూతి పెండెకట్టుతో ఊడిపడ్డాడు ... 'అంబయ్య ఇంకా నిద్రలేవలేదుటమ్మా...' అని రోడ్డుమీద నిలుచునే ఓ పొల్లుకేక పెట్టాడు. పలుదోముపుల్ల తిరి తిప్పి నములుకుంటూ, అన్నయ్య, కేకవిని, లోపలనుంచి వచ్చి... ఆయన్ను రమ్మని తలవిసిరాడు. మెట్లు ఎక్కుతూ, నావంక మోరపెట్టి... 'దానికి కొంచెం నలతగా ఉందమ్మా...చెయ్యి తీరిక అయినతరువాత ఒక్కమారి వచ్చి చూసి పో...'అని, అన్నయ్యతో ఏదో ఈమాటా ఆమాటా ఆడి వెళ్లిపోయినాడు.

వినేటప్పటికే నాకు కాళ్లూ చేతులూ ఆడలేదు. ముగ్గుబుట్ట అక్కడే పారేసి పరుగెత్తాను. పోయిచూద్దునుకదా ... పిల్లది బొత్తిగా లోజెడ్డది. గడపలో కాలుపెట్టినప్పటినుంచీ మూసినకన్ను తెరవడం లేదుట...ఆయన, ఒంటిపూట ఇంత ఉడకేసుకు తింటూ...దానికి జావకాచి పడేస్తూ

...వ్యసహారం ముదిరేదాకా...తీసుకువచ్చాడు. నన్ను చూసేటప్పటికి...జానకికి ప్రాణం లేచివచ్చింది. ఏముందీ, ఒకరి నొకరు కావిలించుకుని...దాన్ని చూసి నేను ఏడవా... నన్ను చూసి అదిఏడవా: ఇంతలో అన్నయ్య కూడా వచ్చాడు. స్థితిగతులు తెలిసినతరువాత వాడికీ వెస్టబుట్టింది. ఆపాళంగా పోయి డాక్టరును పిలుచుకువచ్చాడు... టైఫాయిడ్ అని తేలింది.

మాయింటికి తక్షణం తీసుకువెళ్దామన్నాను. ఆపెసినారికి ఖర్చు తగ్గడమే కావాలిసింది...వెంటనే సరే అన్నాడు. కాని, ఒకచిక్కు వచ్చింది. మావదినె, కార్యంఅయిపోయిన మర్నాడే పుట్టింటికి వెళ్ళింది. అన్నయ్య ఆసాయంకాలమే దొరతో సర్క్యూటు వెళ్ళాలట...సెలవు దొరికే నౌకరీ కాదామెను: మళ్ళా తిరిగి రావడానికి ఏ ఇరవైరోజులో పడుతుంది...అంతవరకూ, రెండోదిక్కు లేకుండా నేను నిభాయించడం ఏలా? ఏమిటీ చేయడం ఇప్పుడు? నాకు ఎంతమాత్రమూ ఇష్టములేకపోయినా, ఆ మానవుడు, ఉండమని అనకపోయినా, తప్పిందికాదు: అది, మళ్ళా లేచి ప్రజల్లో పడేదాకా అక్కడే నాకొలువు.

తిరిగివచ్చి, మడిధోవతులు పట్టుకుని వెళ్ళి...వేగిరం స్నానంచేసి వంటచేశాను. అన్నయ్య, మొగమాటం చంపుకుని ఆపూట అక్కడే భోజనంచేసి సాయంత్రంబండికి వెళ్ళిపోయినాడు.

క్రమంగా, ఆరోజు కారోజు ముసలాయన రుసరుసలుమాని, కొంచెం ముఖం విప్పారి ఉండేవాడు. పత్రసోపేతంగా చేసి పెడుతూంటినామెను; ఏంతీపెళ్ళిందా...వేళకు అన్నీ అమరుస్తూంటే; మొదటిలో మాటా పలుకూ లేకపోయినా, ఆనాటికానాడు, అదీ ఇదీ కనుక్కోడం... భోజనం ముందర లోకాభిరామాయణం వేయడం... ఆషామాషీ లాడటం... నన్ను సవిస్తూండటం... మొత్తానికి, నాచేత అక్కరకు వచ్చినట్టే ఉంది: మనిషి కదలికలో కొంతమార్పు కనిపించింది. నాకుకూడా, మొదట ముళ్ళమీద ఉన్నట్టుండి, ఎప్పుడు ఇవతల పడదామా అని ఉన్నా... పోనుపోను, కొంత బెరుకు తీరింది.

మూడువారాలు గడచిపోయినవి. జానకి జబ్బు మళ్లుముఖంపట్టింది. పథ్యం పెట్టి, నేను మా యింటికి వద్దామనుకున్నాను. కాని, మనయత్నమూ, తానొకటితలిస్తే దైవమొకటి తలచిందని ... కావలసిన కారణార్థం వేరుగా ఉండగా... ఇంతకూ, అన్నీ అల్లా ఒనగూడాయి. అన్నయ్య ఇంకోపదిరోజులదాకా రానని, టపా తీసుకువెళ్ళే జవాను చేత కబురంపించాడు. అందాకా అక్కడే ఉండమని జానకి పట్టుపట్టింది. మా మరదికూడా... ఏకళ నున్నాడో ... బలవంతం చేశాడు. పోనీలే, వాళ్లు అంత ప్రాధేయపడుతూన్నప్పుడు ... అక్కడమాత్రం మించిపోయే దేముంది, ఒంటరిగా ఉండాలిసిందేకదా, అన్నయ్యవచ్చేదాకా: పోని, ఈలోపుగా పిల్లకు జవపట్టేదాకా కనిపెట్టుకుని ఉండవచ్చునని... అట్టే బెట్టుచెయ్యకుండా మెత్తపడ్డాను.

పడిలేచిందా. అప్పుడే పొయిలాకటకు రానీయ్యడానికి నేను ఒప్పుకోలేదు. ఏం గంప చాకిరీ ఉందని? ముచ్చటగా ముగ్గురికి వండి వార్చడం అదో పనా? పైగా, మాతల్లి, లేచి తిరుగుతూండటమే నాకు కొండంత సత్తువ తెచ్చింది. జిహ్వ చచ్చిఉందేమో. కావలసినవి అడిగి చేసిపెట్టేదాన్ని...

తిన్నది వంటపడుతూన్న కొద్దీ... బాగా తెప్పరిల్లి కోలుకుంటూంది జానకి: సంధ్యపడగానే, ముందు దానికి అన్నం పెట్టేసే దాన్ని... అంగట్లో మెతుకులు అంగట్లో ఉండగానే, చెయికడుక్కోడం వ్యవధానం పక్కమీద ఒరిగేది ... పగలు కునకడానికి వీలులేదేమో... మళ్లా పొద్దుపొడిచేదాకా ఆదమరచి నిద్రపోయేది. నేను, ఆయనకోసం కనిపెట్టుకుని ఉండి, తిన్నతరువాత... పిండో పాడో నోటకొట్టుకుని... మూతలుపెట్టేసి... నసారా అంచున మాలతీపందిరికి దగ్గరగా పక్కవేసుకునేదాన్ని ; జానకి పక్కగదిలో పడుకునేది ... కటకటాల తలుపు కనుక... పిలిస్తే పలకడానికి అందుబాటు. ఆయన... ఇంటిముందు...ఆరుబయట పడుకునేవాడు.

—అర్ధరాత్రి ... చప్పున మెళకువ వచ్చింది. పిండారబోసినట్టు వెన్నెల...ఆలకించి చూశాను: అవతలపక్క, కునిసందులో ... కొంచెం అలికిడి వినపడ్డది: నాళ్ల నడుమ: దొంగా తోడుమోతూ రావడానికి వీలులేనిస్థలం: ఏమిటా చూద్దామని... లేచి, మెల్లిగా ఆవేపుకు వెళ్లాను:

మందార చెట్లనీడలు పడుతూ నేలంతా, చీకటీ వెలుతురూ మాసికల చదరంగ పాళీ లాగా ఉంది. మొదట ఏమీ కనిపించలేదు, మళ్లా పరకాయించి చూశాను: చెట్లచాటున ఎవరో ఉన్నట్టుంది... కాళ్లు చూచాయగా కనిపించినవి. ఒళ్లు ఝుల్లుమన్నది: గుండె గొంతుకలోకి ఎగదట్టి కెక్కుమని ... దగ్గు, అరుపు కలిసి... కేకపెట్టాను. నోట...అరవడానికైనా... మాట రావడంలేదు : కాళ్లు పాతుకుపోయినాయి... వైరిభయంలో... రెప్ప ఆడలేదు: గుడ్లు అప్పగించి చూస్తూ నిలవబడిపోయినాను.

—మనిషి తొందరగా నడిచిపోతూన్న చప్పుడు... దొడ్డితలుపు రపేలున పడ్డది: మా మరిది, చెట్టుమాటునుంచి, నిదానంగా, నాదగ్గిరికి వచ్చాడు. నన్నుచూసి ... పోల్చుకోకముందు ఉలికిపడి... అంతలో తెప్పరిల్లాడు: భార్య ఏమోననుకుని భయపడి ఉంటాడు మొదట: అవతల మనిషిని నేను గుర్తించాను: మా యింట్లో పనిచేసే ... ముత్యాలు:

'ఇక్కడ నిలుచున్నావేం... నిద్రలోనడిచివచ్చావా' ... ఆయన ఏమీ చలించకుండా... మామూలుగా అడిగాడు: నేనేమీ సమాధానం చెప్పకుండా ఊరుకున్నాను. ఒక్కనిమిషం నన్ను పరకాయించి చూసి, 'పోయి పడుకో' అని, ఏదో గొణుగుకుని వెళ్లిపోయినాడు.

నేను, వెళ్లి, మళ్లా మంచంమీద పడుకున్నాను. నిద్ర రాదు ... ఆలోచనలన్నీ సముద్రకెరటాల లాగా నన్ను ఆవరించి ఊపివేసినవి. పక్క కుదరక చాలాసేపు అటూ ఇటూ దొర్లాను: ఎంతోసేపటికి

కాని, ఎటో అటు పాలుపోయిందికాదు. నిశ్చయానికంటూ వచ్చినతరువాతకూడా... తలచుకోవడం, దద్దరిల్లిపోవడం! — ఎలాగై తేనేం, మనసును ఒప్పించాను: జయించానన్న ఉత్సాహంలో...చిరునవ్వు పెదవుల మీద మొలక లెత్తుతూండగానే ... జోగిపోయినాను:

ఎంతోసేపటికి...మళ్లా మెళకువవచ్చింది: తట్టి...గిలిగింత పెట్టి లేపినట్లైంది: కళ్లు తెరిచాను: వెన్నెల మసక వారింది ... చుక్క పొడవబోతూంది: చూపు...మరల్చి...ఆ... వేపుకు...సారించాను: నా కాళ్లదగ్గర... పాదం పట్టుకుని కదుపుతూ...మా మరది కూర్చునిఉన్నాడు: నాకు, తెలుసును... ఆయన వస్తాడని...అలా అవుతుందని: నాకు, ఇష్టమేకాదూ...

నేను మసలడం కనిపెట్టి ... ఆయన, ధైర్యంచాలక...చట్టున లేచి నిలుచున్నాడు: ఎక్కడ మనసు మార్చుకుని...బెడిసిపోతాడో అని...నోరు మెదల్పకుండా... ఆవంక చేతులుజాచి...బలవంతంగా పొదువుకున్నాను...ఆయన్ని సుఖపెట్టడంలో... ఆయనకోసం...నేను లోకం...నన్నే నేను... మరచిపోయినాను.

ద్వితీయవిఘ్నం కాలేదు...ఆలా అవుతుందేమోనని...ఆయన కుండవలసిన ఆదుర్దా అంతా నేను పడ్డాను: వారంరోజులు...వరుసగా—

పొరబాటుకాదు...తెలిసి చేసినపనే... నన్ను మోసగించలేదు...ఆయన...మొగమాటపడకపోతే...నేనే బలవంతంచేసేదాన్ని ...అవునమ్మా...ఆపరిస్థితి ఆలాంటిది! ఏం... నీకుకూడా, ఈమాటంటే ఆశ్చర్యం వేస్తున్నదా? కళ్లుకానరాని కండకావరంతో... అప్పుడు పోతరించిపోయి...ఇప్పుడు ఇంకో వేషం వేస్తూంది...ఇది...ఎంతకైనా తగిందే...తెగించిపోయినతరువాత...అని అనుకుంటూన్నావా? — కాదమ్మా కథ సాంతం విను...

వారంరోజులు దాటినతరువాత...అనుకున్నదానికన్న ముందరగానే, అన్నయ్య తిరిగివచ్చాడు: నేను... మళ్లా మాయింట్లో ...గృహప్రవేశ మైనాను: అప్పటికి జానకీ బాగా లేచి తిరుగుతూ, దానిపని అది చేసుకునే ధోరణిలో పడ్డది.

నెల్లాళ్లయింది...కొంచెం బెంగగా ఉంది:

రెండోనెల ... అనుమానంగా ... అవునా, కాదా అని...ఏలాగో మనసు కుదటపరుచుకుంటూ తిరిగాను:

మూడోనెల... నిశ్చయమయింది: కొంప నిలువునా కూలిపోయింది. అన్నయ్యకు కూడా ఆచోకీ తెలిసింది:

ఏంచేస్తాడు, పాపం... నన్నా గద్దించి అడగలేడు... ఎవరితోనన్నా చెప్పడానికా... ఇంకా ఏమన్నా ఉందా... వాడలో ఉండనిస్తారా... తల ఎత్తుకు తిరగనిస్తారా?... దాచడమా... ఎంతకాలమని? ఎప్పుడో ఒకప్పుడు పాపం బద్దలుకాక తప్పుతుందా?

అయిదోనెల జోరబడేదాకా...ఏం చేయాలో తోచక... కాలుకాలిన పిల్లి

లాగా ... నిలిచినచోట నిలవకుండా ... నానాహైరానూ పడ్డాడు: ఇక, ఒకక్షణం తామసించడానికి వీలులేదు... అప్పటికే అమ్మలక్కలందరూ ఏలాగో పసికట్టి... గుస గుసలు పోతూన్నారు: అవి ఏమన్నా చెవిని పడ్డాయో ఏం కర్మమో... ఎన్నడూ పల్లెత్తి నన్ను ఒక్కమాట సాధారణంగా అనని వాడు... ఆనాడు ఇంటికి వచ్చీరావడంతోనే రుద్రుడై పోయినాడు...ఒకటని, ఒకటి అన లేదా: అన్నిటికీ ఒడిపట్టి ఊరుకున్నాను.

ఊరుకున్నా నన్నమాటే కాని... పైకీ, నాకూ తరతరబుట్టింది. అంతవరకూ... ముంచుకువస్తున్నా... మనసు... తుడిచిన పలకలాగా... ఏ ఊహా కనపడకుండా... అదోమాదిరి మైకంగా...ఏదో ఫలానా అని చెప్పలేని బాధగా...సంతోషంగా... ఉంటూవచ్చింది: అన్నయ్య ధూకుడు చూసిన తరువాత ఒక్కమారి అయోమయంలో పడి పోయినాను...ఏది దారి ?...అంతటితో ఊరు కుంటాడా ... పెచ్చుమీరిపోయి ... రెక్క పట్టుకు వాకిట్లోకి ఈడ్చివేస్తే...నేను ఏం కావాలి ?

అనుకున్నంతా అయింది ... గెంటడం తరువాయి...కాని, మామరది...ఆయన్ను మా అన్నయ్య సలహా అడిగాడట, ఏం చేయాలని...అవును గొర్రె కటికవాణ్ణేనమ్ము తుంది !...అడ్డుపడి, ఏదో హితబోధచేసి... అన్నయ్య మూర్ఖం విడనకపోవడంచేత... తానే ఖర్చులన్నీ భరించే పద్ధతిమీద...ఆ నాత్రిరాత్రే...పట్నంబండికి పంపించాడు:

రైలుదిగగానే ... నన్ను తీసుకువెళ్లడానికి స్టేషనుకు వచ్చిన దొరసానివెంట ఆస్పత్రికి వెళ్లాను: మామరది...వాళ్లకు, నేను బండీ ఎక్కగానే టెలిగ్రాంఇచ్చాడట...

మళ్లా ఏడునెల్లకు ... ఇవతలపడ్డాను... నా బంగారుతండ్రిని వాళ్లు...ఏంచేసుకున్నారో...ఎవరికి పెంచుకో నిచ్చారో ... భూమి మీద పడగానే...వాడికీ నాకూ ఈజన్మకు రుణం తీరిపోయింది !

ఎల్లకాలం ... వాళ్లుమాత్రం ఉండ నిస్తారా?-నాకు మళ్లా మా ఊరు వెళ్లా లంటే...మొగం చెల్లడంలేదు: ఎప్పుడు బయలుదేరుతా నని అన్నయ్య ఉత్తరం వ్రాశాడు...నేను మెదలకుండా ఊరుకు న్నాను. అప్పుడు, ఆయనే స్వయంగా వచ్చి...తీసుకువెళ్లి యింట్లోదిగవిడిచాడు:

వదినె ... నెల్లాళ్లక్రితమే పిల్ల నెత్తుకుని వచ్చింది. అన్నయ్య వెళ్లి భారసాల చేసు కుని...నెల వెళ్లక ముందే...తీసుకు వచ్చాడట. వచ్చానా...నాతో, మావాడూ మాట్లాడలేదు...సరే, మావదినె, నన్ను చూడగానే మొగం పక్కకు తిప్పుకుని గది లోకి వెళ్లిపోయింది: చెప్పరానిదానికన్నా కనాకష్టమైపోయినాను...తెల్లవారి లేవడం తోనే నేను కంటబడితే నాయెనా, ఇద్దరి ముఖాలూ మటమటలాడిపోయేవి: అయితే అన్నీ అమర్చి పెడితే...విస్తరి ముందరికి వచ్చి...ఎంచులుపెడుతూ...సుష్టుగా భోం చేయడానికి...అప్పుడు మాత్రం... ఏఅడ్డంకీ లేదు: అందుకు పనికివస్తాను:

నామీద దయతలచి ఉంచుకున్నారా? ...చాకిరీకి మనిషి తేరగా అమిరింది గనుక ...ఏలాగో సరిపెట్టుకుం టున్నారు. మా వదినె...ఆరాణీ, అసలు మంచినాడే అంతం తామెను..,ఎన్నడూ అవతల చెంబు ఇవతల పెట్టినపాపాన పోయిందా ... అందులో, బాలింతరాలు? అన్నయ్యకు ఆవిడ కాలు క్రింద పెడితే ఎక్కడ అరిగిపోతుందోనని... ఎంతభయం ?

నేనూ... బాలింతరాలనే కాదూ... కాని...నాముద్దు ముక్కలు చేసేది ఎవరు ? ఆమాట తలవడానికైనా...వీలుందా?-ఒళ్లు భారకించినా ... ఎంత ఓపిక లేకపోయినా... వేళకు లేవకుండా, కొంచెం బద్ధకించి మూలిగానో, ఇక అవి దెప్పళ్లుకావు...సాధింపులు కావు...నాతల్లో గుండె చిట్టెం కట్టిపోయింది: ఎంతకైనా తల ఒగ్గవలసినదాన్నేకా :

'నాకంట నరుడు పడరాదు, నరుడికంట నేను పడరాదు' ... ఇలా రెండు నెల్లుపైగా ... రాణీవాసమైపోయింది నాబ్రతుకు: నెలుపలసావడిలోకైనా వచ్చేదాన్నికాను. అన్నా ళ్లూ గడపదిగితే ఒట్టు !

ఇక, లోకం...

పాడులోకం... వేలు నంచడానికి సందు దొరికితే ఊరుకుంటుందా...గోరంతలు కొండంతలుచేసి,దుయ్యబట్టకోక మానుతుందా? ఒకకంట్లో సున్నం... రెండోకంట్లో కారం...

అన్నయ్యను...పరమయోగ్యుడికి ఇంత కష్టం వచ్చిందా...అయ్యో పాపం ... అని ఊరడించింది :

ఇంతకూ కారకురాలినికదా అని... ఈ కులనాశకురాలిని పడదిట్టింది :

తిడుతూన్న ఆనాలికే...మామరది... మహానుభావుడు, ఆపత్తులో అడ్డపడ్డాడని... ఆయన్ను అందలాన పట్టింది: అయినా, అది ఎంతవరకు నిజమోలే...నోరు మాటాడు తూంటే నోసలు వెక్కిరిస్తూన్నప్పుడు... దేన్ని నమ్మడం?

ఇలా... ఈ అగచాట్లమారి బ్రతుకు... ఎప్పటికి తెల్లవారనూ అని నా గుండెల్లో రాయిపడ్డది. కాని, ఇంతలో ఏం జరిగిందనుకున్నావూ-

మా జానకికి...నెలలు నిండాయి. సుఖంగానే చెంబెడు నీళ్లూ పోసుకుని... తల్లీ పిల్లవాడూ గట్టెక్కి ఇవతలపడ్డారు. నక్షత్రదోషం ఏదో రవంత ఉందట, పోనడానికి మూనెలో మొగం చూసుకున్నారు. నేను రానన్నా, ససేమిరా కాదు కూడదని, పట్టుబలవంతాన సీక్కెళ్లారు.

మా అమ్మడు పీటలమీద కూర్చుని ఉండగా,చూడ ముచ్చటై ఒక్కమారు చెయి తీరిక చేసుకుని, గుమ్మంలోంచి తొంగి చూశాను...ఎన్నాళ్లైందో దాన్నిచూసి...

అది నావంక చూసేసరికి...ముఖం వెనక్కు లాక్కున్నాను. దానికంట పడలేక పోయినాను :

ఆశీర్వచనాలైన తరువాత ... పాపణ్ణి పొత్తిళ్లలో పొదివి...నా దగ్గరకు తీసుకు వచ్చింది జానకి. నేను తలుపుకు చెయిబార జాచి జారగిలబడి...కంట నీటిబొట్టు పొడమ

కుండా, పళ్లబిగివిని నిలుచుని ఉన్నాను. నావాలకం ఏం కనిపెట్టగలదు...పిచ్చపాడ గట్టు...పిల్లవాణ్ణి నాచేతులో పెట్టబోతూ ...'వెళ్లునాయనా...అమ్మ!...చూడవే... నిన్నుచూసి నవ్వుతున్నాడేవ్, అక్కయ్యా! ...ఇక నిన్ను వదలడేమోనేవ్...తీసుకోవే ...పోసీలే నేను పనికిరాకపోతే...మీఆమ్మ దగ్గిరకే వెళ్లు బాబూ...'అని తన ఉబలాటం కొద్దీ...ఏమేమో పలుకుతూంది. నాకు... ఏలా ఉందని చెప్పనూ?...

పక్కను చోద్యం చూస్తూఉన్న పెద్ద ముత్తైదువ ఒకావిడ...' అవునే, జానకీ... వీడిని మీ అక్కయ్యకు ఇచ్చేసి...నీవు ఇంకో కొడుకును కనుక్కోవే...' అని... ఆమెకు తోచినట్లు...హాస్య మాడింది... వింటూన్నవాళ్లు నవ్వారు: నా మనసులో భగభగమన్నది...జాస్తూన్న చేతులు వెనక్కు నెట్టుకుని...నీరోడుతూన్న కళ్లతో వెనక్కు తిరిగాను: అందరి పాయసాల్లోనూ నెయ్యి ఒలికినప్పుడూ...నా వంతుకు దక్కేది... పచ్చి విషమేనా?

'కంట్లో నిప్పులు పెట్టుకుంది...చూసి ఓర్చే నేర్పుకూడానా...' జానకి...మా జానకే...ఈమాటలు...నావెనకాల అన్నది ...అవునీ, నిండా మునిగినవాళ్ల కేం చలి?

అంతటితో...ఆకాండ అయిపోయింది: అన్నం నోటికి పోలేదు: మెతుకు ముట్ట కుండా...ఊరికే విస్తరిముందర కూర్చుని లేచాను: దానికేంలే, కడుపు నిండే ఉంది కాదూ, ఇవన్నీ చూసుకుంటూ!

ఓ విధంగానా, నాకు వంచన! పులి మీద పుట్ర రేగింది! రాత్రి భోజనాలైన తరువాత, ఒంటిపాటున...మామరది నాకు, అడ్డంవచ్చాడు: మరి, అధమం ఏమూడు నెలలైనా...గదిలో పక్క వేయించుకునేం దుకు వీలు లేదుగా...ఎదురుగుండా నేను కనబడుతూంటిని. ఊరుకోవలసినంత కర్మం ఏంవచ్చింది?– ఒకమారు లోకువైన తరు వాత...ఇక...ఛీ...మగపురుగులు!

ఎంత స్వాతంత్ర్యంతో నాచెయి పట్టు కున్నా డనుకున్నావు? ఊరుకున్నాను: ఇంకా ముదరనీ...

రెండో చెయ్యి...నా భుజంమీద వేసి ...మెడమీదుగా వాల్చి నన్ను దగ్గిరకు లాక్కునే ... గృహస్థ మార్గంలో... ఉన్నాడు:

జానకి ... గుమ్మంలోకి వచ్చింది... మమ్మల్ని చూసి ... గుడ్లు వెళ్లుకొచ్చి... తూలుతూ వెనక అంగవేసి ... తలుపు రఖీమనిపించి, లోపలపడి కెవ్వు మన్నది.

–మా ప్రబుద్ధుడు, తన ధోరణిలో తా నున్నాడు కాని...వెనుకా ముందూ చూడటం ఉందా? రానిచ్చాను...మెదల కుండా...అసహ్యించుకుని ముఖం తిప్పేసు కోకుండా...మరీ దగ్గిరకు రానిచ్చాను. మా యిద్దరి పెదవులకీ, నూలువాసికూడా ఎడం లేదు. అందాకా వచ్చినతరువాత, పిడి కిలి ఇనుపగుండులాగా చేసి, ఎగువకు, గురిగా పళ్లు కరుచుకు పోయేటట్టు...గడ్డం చెక్కలయేటట్టు...విరగి బాదిచాను. తగిలే తగలడంతోనే, మళ్లా కిక్కురు మనకుండా,

చాపచుట్టుగా పడిపోయినాడు...మా మరది. ...అంత సత్తువ ఎక్కడనుంచి వచ్చిందో నాకు!

వెనక్కు తిరిగిచూడకుండా...దూసుకు వచ్చి... చూడకుండా రావడంలో...పారి జాతం చెట్టుమీద పడి, లేచి...ఎలా పోయి పడ్డానో, మా యింటిదగ్గర పిలవగా,పిలవగా ఓపట్టుకు, మా వదినె...పమిటె సర్దుకుంటూ ...వచ్చి తలుపు తీసి...నిలవకుండా పోయి, గదితలుపు గడియవేసుకున్నది — నాకు, ఊరినపుండుమీద ఉప్పూ కారం చల్లిన ట్టయింది—అందరికీ నేను భారమే!

అప్పటికి ఈ ఆలోచన లేదు సుమా. మతిచెడి,...మనస్సంతా పాడైపోయి క్షోభ పడుతూ...సావడి నాలుగుమూలలా కలయ దిరుగుతూండగా... వంకెను, బరువుగా... అన్నయ్య కోటు...జేబు కనిపించింది... చూడగానే... అప్పుడూ, ఈ ఆలోచన తోచింది...చూస్తూన్నకొద్దీ అది పాదుకు పోయింది. ఒక్కక్షణం ఇక ఆలస్యం చేయ కుండా, పర్సు మెల్లిగా తీసి...కావలసినంత అందులో ఉందో లేదో చూసుకుని, చేత బట్టుకుని...పిల్లిలాగా అడుగులో అడుగు వేసుకుంటూ, ఆ యింటికీ...యింటివాళ్లకూ ...అంతటితో ఋణం తీర్చుకుని...వచ్చే శాను.

ఎవరికంటా పడకుండా...రైల్లో పడి... రెండుసార్లు, ఎక్కడ మారాలో తెలియక, దోవతప్పి......వెనుకా ముందూ అయి... చివరకు...ఇవాళ అసుర సంధ్యలో ... ఇక్కడ దిగాను.

దిగి యకాయకిని వచ్చేశానమ్మా: నాలిక పిడచబారి పోతూంది: మాగంగమ్మ తల్లిని చూడంగీ...పచ్చిమంచినీళ్లన్నా ముట్ట కూడదనుకుని...తీర్థోపవాసఫలం దోవలోనే దక్కించుకు వచ్చాను:

చిరుకెరటాల మీదుగా...అనుమానా లన్నీ ఒడ్డుకు పరుగెత్తిస్తున్నావా?- నాకు అంతమాత్రం తెలియదనుకున్నావమ్మా! చెప్పనా?

మా మరదిని ఎందుకు లోబరచుకున్నా ననా?-నాకోసంకాదు...నాచెల్లెలికోసం: వెలి రుచులు మరగి, ఇక దానికి దక్కకుండా పోతాడేమో నని ... దాని జీవితం ధ్వంసం కాకుండా, నన్ను బలియిచ్చుకున్నాను: నాకే కోరిక ఉండి, చెడిపోవా లనుకుంటే...ఆము సలితా తేనా...దొరికింది - దేశం గొడ్డుపో యిందా?-తనను వలచి వచ్చా ననుకున్నాడు ...యిష్టం వచ్చినప్పుడు, వీలు చిక్కినప్పు డల్లా...లోకువచేసుకోగల...ప్రజ్ఞ ఉందను కున్నాడు...పాపం ... పిచ్చిబ్రాహ్మడు: ఆ జన్మ అంతేలే!-బుద్ధివచ్చిందంటావా, ఏమో, నాకు నమ్మకంలేదు: బుద్ధే ఉంటే- నీతీ నియ మం అనేవే ఏమూలైనా ఉంటే-చేసిన పాడు పని ఆసలాతో ప్రతిష్ఠ సంపాదించుకునేం దుకు పెనగులాడుతాడా?— కన్నుతెరవని పసికూనను కటికవాళ్లకు అప్పగించ నిస్తాడా?

జానకి... నేను విరగడైపోయిందే చాలు నని...సంతోషిస్తుంది: పోనీలే, నామీద జాలి తలవడం...నాకోసం బాధపడటంకన్న ...ఇదేమంచిది: నామీదకోపం అల్లా దానికి మొగుడిమీద ప్రేమను పుట్టిస్తుంది: ప్రాని

పల్లు అందుబాటులో లేకపోయినకొద్దీ... మెడ మరీ సాగుతుంది: ఇంకొకరికి దక్కిపో తున్నాడని తెలిసినప్పుడు కాని, ఆడదానికి ...మగవాణ్ని ... తానే సర్వాపోశనం పట్టాలనే తహతహ పుట్టదు: ఆలా జరి గిందో ... అంతకన్నా నాకు మరికావలసిన దేముంది?

కన్నతరువాత ... నెలలుమోసినందుకు ఫలం దక్కకుండా చేజారిపోయినతరువాత కాని...కడుపు తీపంటే ఏమిటో తెలియ లేదమ్మా. పోనీలే...ఒంటరిగా మాయమై పోవడంకన్న, తీరని కోరికలన్నా, వెంట తీసుకు వస్తూన్నాను: అదీ కొంత మేలే కాదూ?

ఎవరిమీద పగ సాధించను...ఎన్నింటి కని ఏడ్వను...-నాకు లేకపోయినా...ఇం కోరన్నా...నామూలాన కుదటపడి బాగుం డటమే పదివేలు!

అన్నయ్య అంటావా-'పోయి గంగలో కలవనీ — దాని కిలాంటి విపరీతపుబుద్ధి పుట్టి నప్పుడే అదిమాకు కానిదై పోయింది'...అని మొండిగా అనేస్తాడు: ఒకవేళ...అనలేక ఊరుకున్నా, నేర్పే నెరజాణ, మావదినె ఉండనే ఉన్నదిగా!

నేను ఎవడివెంటనో పడి దేశాలు పట్టి పోయినాను అనుకుంటారు. అంతేకాని... వాళ్ల నోటివాక్యమే ఫలిస్తూన్నదని...ఏలా అనుకోగలరు?

ఇక...వాళ్లెవరికీ నేను కలలోనైనా కన పడను కాదూ-

'నీది ఇంత దొడ్డమనసా' అని ఆశ్చ ర్యపడుతున్నావా?- నీ వాక్కతెవేనా, మరి, ఈ ఏడేడు పధ్నాలుగు లోకాల్లోనూ?

మీచెల్లెలు పార్వతికోసం...మహే శ్వరుడితో నీవు ఆడిన నాటకమే—నేనూ వర్ణించానమ్మా: నిన్ను చూసి నేర్చుకున్న దేనమ్మా.

మన ఇద్దరి మనసూ ఒకటి- మన కోరి కలు ఒకటి- మన ఇద్దరి పేరూకూడా ఒకటే ...అందుకనే...నిన్ను వెదుక్కుంటూవచ్చా నమ్మా.

---

# ఆంధ్రసంచిక

—— (*) ——

## ఆంధ్రపత్రిక బహుధాన్య సంవత్సరాది సంచిక

—— (*) ——

### ఆంధ్రమహాశయులకు విజ్ఞప్తి

ఎప్పటితీరున రాబోవు బహుధాన్య సంవత్సరమునకు సంవత్సరాది సంచికను ప్రకటింపబోవుచున్నాము. అందు సారస్వత, సాంఘిక, రాజకీయార్థికాది విషయములకు సంబంధించిన వ్యాసములు ప్రకటింపబడును. భాషాభిమానులు పూర్వమువలెనే దయయుంచి అమూల్యములగు తమ వ్యాసములతో సంచిక నలంకరించి మా యుద్యమమునకు దోడ్పడ ప్రార్థితులు.

సంచికయందు విషయవిభాగమును గావించి యేవిభాగమునకు సంబంధించిన వ్యాసముల నావిభాగమునందే ముద్రించి సంచికను సంవత్సరాదినాటికి గ్రాహకుల కర్పింపదలచినాము. వ్యాసములను రాబోవు నవంబరు 15వ తేదిలోపల మా కందజేయ వేడికోలు. నియమితకాలమునకు పూర్వమే వ్యాసములన్నియు మాకు జేరినగాని విషయవిభాగమును గావింప నవకాశము కానేరదు. సంచిక ముద్రణ మారంభించినపిదప బంపు వ్యాసములను సంచికయందు జేర్చుటకు వీలుండదు.

కాబట్టి వ్యాసములను, వ్యాసముల చిత్రములను, ఇతర చిత్రములను సంపూర్ణవివరణములతో నియమితకాలమునకు బూర్వమే మాకు పంప ప్రార్థన.

మరి:— ఈ బహుధాన్య సంచికను 'ఆంధ్రసంచిక' అను విశేషసంచికగా ప్రకటింప నిశ్చయించినాము. ఇదివరకు ఆంధ్రదేశము, ఆంధ్రజాతి అన్నిదిక్కుల పొందిన అభ్యుదయమును, భావికాలమున అభ్యుదయమున కుపకరించు మార్గములను వివరించు వ్యాసములను అందు ప్రకటింప మాకోరిక. అందుకు తగిన వ్యాసములను రచియించి పంపి మాకోరిక నెరవేరునట్లు చేయ ప్రార్థన.

కా. నాగేశ్వరరావు,
ఆంధ్రపత్రికాధిపతి.


ప్రతివ్యాసమునను 'సంవత్సరాది సంచికకు' అని వ్రాసియుండవేడెదము.

# కళాపూర్ణోదయ జీవితము

**మల్లాది సూర్యనారాయణశాస్త్రి**

మహాకవి పింగళి సూరనార్యుని కృతులందే కాక ఆంధ్ర ప్రబంధములందెల్ల నగ్రగణ్యమైన యీ మహా ప్రబంధము జీవితము విచిత్రమైనది. ప్రపంచమందలి యెల్ల పదార్థములును తమతమ జన్మకాలగ్రహసంపత్తినిబట్టి యుచ్చత్వనీచత్వములు గాంచుచుండుననుట నిజము. సుగుణసంపద సమానముగా నున్న వారిలోఁగూడ నొకనికి వచ్చిన పేరింకొకరికి రాకుండుటయేకాదు, యోగ్యత హెచ్చుగానున్న వాని జాతక మణఁగియుండుటయు, అది మిక్కిలి తక్కువగా నున్నవాని జాతకము పైకి వచ్చుటయుఁగూడ మన మెఱుఁగుదుము. అట్లే ప్రబంధములును యోగ్యతతో నిమిత్తము లేకుండఁ గొన్ని మొదటినుండియుఁ గీర్తిగాంచినవి. కొన్ని నడుమ బయటికివచ్చినవి. కొన్ని పేరు లేకుండఁగానే యణఁగిపోయినవి. ఇఁకనో సర్వసుగుణసంపన్నము లయ్యుఁ జిరకాల మణఁగియున్న వానిలో గణింపఁదగినవి ఉత్తరహరివంశము, కళాపూర్ణోదయము నని ప్రబంధపాఠకలోక మెఱుఁగకపోలేదు.

అపూర్వ మద్భుత మతివిచిత్రము నైన కథాసంవిధానముందేమి, బహువిధ ప్రతిపాదనముందేమి, రసౌచిత్యమందేమి కళాపూర్ణోదయమువంటి ప్రబంధ మాంధ్రమందు లేదు. సరిగదా బృహత్కథనుబట్టి వెలసిన కథాకావ్యములను విడిచినచో సంస్కృతమందును గనఁబడదు. అట్టి దివ్యమైన యీ కథాకావ్యము రమారమి ౨౫౦ సంవత్సరము లజ్ఞాతవాసము చేసిన దనుటకంటె దీని మొదటి కష్టదశను వేఱుగాఁ జెప్పనక్కఱలేదు. ఇది క్రీ. ౧౬౦౦-౧౬౧౫ నడుమఁ బుట్టినది. ౧౮౯౭లో బ్రౌనుదొర కంటఁబడి లిఖితపుస్తకపాఠములను లభించినది. ఈమధ్యకాలమునం దాంధ్రదేశమంతయును మూఁడు, లేక నాలుగు జీర్ణ తాళపత్రపుస్తకములలోఁ దల దాఁచుకొని యందందు పడియున్నది. ఇట్టి దుర్దశకుఁ గారణమేమని యూహింపఁగా నాకిట్లు తోఁచినది.

సూరనార్యుని కాలమందును, అంతకుఁ బూర్వమును తెలుఁగునఁబుట్టిన కావ్యములన్నియుఁ బౌరాణికములు. ఆనాఁడాకృతులందున్న యభిరుచి పాఠకలోకమున కితరకృతులందు లేదు. అభినవ విచిత్రాద్భుత కథాకల్పనతోడి ప్రబంధ మప్పటికిఁ బుట్టినది యిదొక్కటే. ఇఁక నిదియో, దీక్షతోఁ, దదేకదృష్టితో రెండుసార్లు చదివినఁగాని మనసునకుఁ బట్టనిదైనది. అందుచే నిది పుట్టిన కొంతకాలమునకే

> "ఊహించి తెలియరాకుండ సూరపరాజు
> శ్రమఁ గళాపూర్ణోదయము రచించె"

అన్న యపవాదము బయలుదేఱినది. అసలే సమకాలమువారు రేగలి రచియించిన కావ్యమునైనను మెచ్చుకొనరు. అందులో రచనయందును, కథాకల్పనమందునుగూడ నభినవమై, యొక్క ప్రక్కలోనే పాత్రసంభాషణమున మాఱిపోవుచు కన్నుమూసి తెఱచునంతలో నలుదెసలకు వడిగాఁ బరుగెత్తును, అనేకములైన యుపకథలయల్లికలో మఱుఁగుపడి తుద మొదలు తెలియరాక కనవచ్చు మూలకథతోడి యీదివ్యకథాఖ్యాయికారూప కావ్యమును సమకాలమువారు మెచ్చుకొనక పై విధముగా దీని నపవాదముపాలుచేసిరన్న నాశ్చర్య మేమి? అది యాకాలమువారికిఁ దగును గాని, సర్వలక్షణసంపన్నమైన దీని మనోహరరూపమును బరిశీలించిన మన కాకాలమువారు గుణజ్ఞులుగాక యసూయాపరులై దీని నణఁచివైచిరని మాత్రము తోఁచకపోదు. అయినను, అట్లు చిరకాల మణఁగియున్న యీకావ్యరత్న మాంధ్రుల భాగ్యమున బయటఁబడి యాంధ్రవాఙ్మయసేవికి శిరోభూషణ మైనదిగదా యని మాత్రమే మనము సంతసింతము.

౧౮౪౭ లో నొక తాటాకుల పుస్తకము సంపాదించి దాని కొక కాగితముల ప్రతి వ్రాయించి బ్రౌను పండితుఁడు చెన్నపురి రాజకీయ లిఖితపుస్తకభాండాగారమున నుంచెను. తరువాత దానిపుత్రికలుగా మఱికొన్ని కాగితపుస్తకము లుదయించి యందందు సంచరించి మరల నాస్థానమునకే వచ్చినవి. మఱికొన్ని తాటాకుప్రతులుగూడ నందు కలవు గాని, అవి బ్రౌను దొరకు లభించిన మొదటి పుస్తకమునకుఁ బుత్రిక లనఁదగిలేవు. వానిలో నన్నేకము లసంపూర్ణములు. బ్రౌనుకు దొరకిన ప్రతిలోని కొన్ని పాఠములకు వేఱయిన సుపాఠములతోఁడి తాటాకుల ప్రతియొకటి యీ భాండాగారమునఁ గలదుగాని యందా దాని యాశ్వాసము మధ్యభాగము మొదలుగా గ్రంథము లేదు. తంజావూరు పుస్తక భాండాగారమున రెండు తాటాకుపుస్తకము లున్నవి గాని యందొకటి యసమగ్రము. అవి రెండును బ్రౌను దొరకు లభించిన మొదటి ప్రతికంటె వేఱని కొన్ని పాఠభేదములనుబట్టి తెలియవచ్చినది. దీనినిబట్టి ౧౮౪౭ ప్రాంతమున దేశమందు సజీవములై యున్న కళాపూర్ణోదయ తాళపత్రపుస్తకములు మూఁడు, లేక నాలు గని తేలినది. లిఖితపుస్తక సంపాదకులకుఁ దక్కిన ప్రబంధముల ప్రతులు దేశమున వందలకొలఁది లభించియుండఁగా, దీనిప్రతులు నాలుగుకంటె నప్పటికి దేశమున లేవనుటయే దీని వ్యాప్తి మిక్కిలి మందముగా నుండెననియు, ఆకాలమువారు దీని నాదరింపక యుపేక్షించిరనియుఁ దెలుపఁగలదు. ఇది దీని ప్రాథమికావస్థ.

౧౮౭౭ లో నిది మొదటఁ జెన్నపురిలో ముద్రితమైనది. ముద్రించి ప్రకటించినవారు బరూరు త్యాగరాయశాస్త్రిగారు. వా రేవ్రాఁతప్రతి ననుసరించి ముద్రించిరో తెలియదుగాని, అప్పటికి నిప్పటికిని సజీవములై యున్న లిఖిత పుస్తకములలోని పాఠములకు వేఱయిన యపపాఠము లందు వందలకొలఁదిగా నున్నవి. దానిని బట్టివారు చెన్నపురి పుస్తకభాండాగారములోని వ్రాఁత ప్రతు లాధారముగా దోషములు సవరించి, పాఠములు పరిష్కరించి ముద్రించినవారు కారని తేలినది. అనంతరము ౧౯౦౯ లో గుంటూరిలోని పి. వి. రమణయ్య కంపెనీవారు కాకినాడ సరస్వతీ ముద్రాలయమున నచ్చొత్తించిరి. ఏవో, అక్కడక్కడ లోపాలిన సవరణలు నాలుగైదు కనవచ్చిన నేమి? అది యన్నివిధములఁ బై శాస్త్రిగారి ప్రతికి నకలే. తరువాత ౧౯౧౦ లో వావిళ్లవారు దీనిని బ్రకటించిరి. అదియు నేవో నాలుగైదు సవరణలు చూపించినను, పై రెండు ప్రతులలోని యపపాఠములనేకాక, మఱికొన్ని యపపాఠములను గూడఁ జేర్చినది. వావిళ్లవారికి వ్రాఁతప్రతులు మిక్కిలియందుబాటులో నున్నవి. వారి మొదటిముద్రణమునకు శ్రీపిఠాపురము మహారాజావారు ద్రవ్య మిచ్చిరి. అయిననేమి? వారు కూడ నాఁటి ముద్రణమునకుఁగాని, తరువాతి ముద్రణములకుఁగాని చెన్నపురిలోని లిఖితపుస్తకముల సాహాయ్యమునఁ బాఠపరిష్కారము గావింపఁజేసినవారు కారని యందలి యపపాఠపరంపరవలన విదితమగుచున్నది. మిక్కిలి గణింపరాని యపపాఠములను లెక్కింపకున్నను, నాకు లభించినవ్రాఁతప్రతులలోని పాఠములకు వేఱై, అనర్థములు సందిగ్ధార్థములు అపార్థములు అనన్వితములు అసందర్భములు అనుచితములు అలాక్షణికములు అసహజములు నైన యపపాఠములు నేఁడు లభించుచున్న ముద్రితకళాపూర్ణోదయపుస్తకమున (౬౬౪) ఆఱువందల యాఱువదినాలుగు కల వని చెప్పుటచేఁ బై మూఁడువిధములైన ముద్రణము లెట్టి యవస్థలో నున్నవో పాఠకలోక మెఱుఁగకపోదు. ఇది దీని ద్వితీయావస్థ. ఇఁక దీని ప్రకృతస్థితి.

౧౯౦౩ లో త్యాగరాయశాస్త్రిగా రచ్చొత్తించిన దీనిప్రతిని నేను జదివితిని. అందు పెక్కువాక్యము లపపాఠదోషములపాలై యర్థముకాకున్నను, ఎట్లో మూలకథ మాత్రము గ్రహింపఁ గలిగితిని. తరువాత ౧౯౩౧ మొదలుగా నీకావ్య మాంధ్రవిశ్వకళాపరిషత్కళాశాలాంధ్రవిద్యార్థులకుఁ బఠనీయమగుటచే దీనిని శ్రద్ధగాఁ జదివి విద్యార్థులకు బోధింపవలసివచ్చినది. నా కాసమయమున సిద్ధమైనది వావిళ్లవారి ప్రతి. ఒకసారి త్యాగరాయశాస్త్రిగారి ప్రతి సంపాదించియు, మఱొకసారి గుంటూరివారి ప్రతి సంపాదించియుఁ బాఠములు సరిచూచితిని. లాభించలేదు. ప్రకరణసందర్భమును, పాత్రసంభా

షణ సందర్భములను బురస్కరించుకొని కొన్నిపాఠములు సవరించుకొని యెట్లో కాలమునుగడపుటయే యైనది కాని, తృప్తికరముగాఁ బఠనపాఠవ్యవహారము సాగినది కాదు. అందుచే వ్రాఁతప్రతులు సంపాదించి దీనిని బరిష్కరింపవలె నన్నయుద్దేశము దృఢముగా మనస్సున నంకురించినది.

౧౯౩౬ మార్చి నెలలో మూఁడు ప్రతులు సంపాదించి ప్రత్యక్షరపఠన మారంభించి ముద్రిత పుస్తకములలోని యపపాఠ స్థానములందు వ్రాఁతపుస్తకములలోని సపాఠములను జేర్చితిని. మరల మూఁడు వేఱుప్రతులు సంపాదించి యట్లే కావించితిని. పిదప స్వయముగా, చెన్నపురి తంజాపూరు పురములకుఁ బోయి లిఖితపుస్తకాలయములలో లభించిన ప్రతులు పరిశోధించితిని. మొత్త మిట్లు పాఠము లెత్తి వ్రాయుటకు ౧౮ మాసముల కాలము పట్టినది. తరువాత నాలుగుమాసములు పరిష్కృతపాఠములను మూలమునఁ జేర్చి యపపాఠముల ననుసనఁ జూపుచుఁ బరిశుద్ధపాఠములతోడి పుస్తకము సిద్ధముచేసి, ప్రధానకథాభాగమున, కనఁగా ఆఱవ యాశ్వాసములో సగమువఱకును, పాఠకులకుఁ గథారహస్యములు సులభముగాఁ దెలియుటకై భావప్రకాశిక యనుటీక రచియించి మూలముక్రిందఁ జేర్చితిని.

ఇట్లు సర్వాంగసౌష్ఠవముతో సిద్ధమైన యీ మహాకావ్యమునుదంతమును దెలుపుచు దీనిని బ్రకటింపఁజేయ ననుగ్రహింపవలసిన దని, విద్వత్ప్రభువులు మహోదారులు భాషాపోషకులు నైన శ్రీ మహారాజా రావు వేంకటకుమార మహీపతి సూర్యారావు బహదరు శ్రీ పీఠికాపుర సంస్థానాధీశ్వరుల కొక విజ్ఞప్తి పంపితిని. శ్రీవారు కళాపూర్ణోదయమందలి యాదరమును, నాయందలి దయయుఁ గారణములుగా నన్నుఁ బిలిపించి యందందు పాఠపరిష్కారములు చిత్తగించి యీ కావ్యము ముద్రించుటకుఁ గావలసిన ద్రవ్య మొసఁగ ననుగ్రహించిరి. ఇపు డిది పిఠాపురములోని విద్వజ్జన మనోరంజనముద్రాలయమున నచ్చుపడుచున్నది.

ఇఁక మూఁడుమాసములలోఁ బరిష్కృత పరిశుద్ధ సహజమధుర కళాపూర్ణోదయ కవిత్వరస మాస్వాదించి యాంధ్రపాఠకలోక మానందపరవశము కాఁగల దని నా విన్నపము.

---

# త్రాగుడు నిరోధము జయించునా?

గాడిచర్ల హరిసర్వోత్తమరావు

మన కోస్తాకు సంబంధించిన పరిపాలన రిపోర్టు—దీనినే అడ్మినిస్ట్రేషను రిపోర్టు అంటారు—ప్రభుత్వము వారు ప్రతి సంవత్సరమును ఇంగ్లీషులో ప్రకటింతురు. అందులో ఒక్కొక్క శాఖకు సంబంధించిన వివరాలు వ్రాయుదురు. ౧౯౩౪-౩౫ వ సంవత్సరపు రిపోర్టు తీసి ఎక్సైజు ప్రకరణము చూడండి. అందులో "విదేశపు మత్తుపానీయము" లను శీర్షిక క్రింద ఈ విధముగా మన అపయశస్సు వర్ణితమయినది.

"ఈబాబతు అన్ని అయిటములలోను కర్చు పెరిగినది. దీనికి కారణము విదేశపు మత్తుపానీయము యెడల ప్రజాదరణము ప్రబలుటయే. ఈయాదరణ విద్యావంతులైనవారిలోనే కన్పించుచుండినది. ఇప్పుడు మధ్యతరగతులవారందరికిని ప్రాకినది. నాటు సారాయమునకంటె విదేశపు మత్తుపానీయము లెక్కువ రుచికరములను భావము వీరిలో వ్యాపించుచున్నది."

*　　*　　*　　*

ఇంతకంటెను మనకు తలవంపు లేమికావలెను? మన దేశములోని ప్రాంతీయ శాసనసభలు ౧౯౨౨ వ సంవత్సరమునుండి మత్తుపానీయముల చలామణిని తగ్గించుటకు ప్రయత్నించిన వనియు, తుదకు త్రాగుడును పూర్ణముగా నిరోధించుట వీనియుద్దేశ మనియు ఎన్సైక్లోపీడియా బ్రిటానికా యను ప్రసిద్ధిపొందిన ఇంగ్లీషు విశ్వకోశ మొకమూలకు వ్రాయుచునేయుండ మన కీ యపకీర్తి మరియొక ప్రక్కన కలుగుచునే యుండవలసినదేనా?

గాంధీజీ నాయకత్వమున ౧౯౨౦-౨౧, ౧౯౨౮ లకు మధ్యన క్రమముగా నిష్కర్షగా ఎన్నడును కని విని యెరుగని రీతిగా మన స్వప్రయత్నముచేత తగ్గించివైచిన త్రాగుబోతుతనమును మరల తలయెత్తనీయవలసినదేనా? బుక్ మస్లినులు, అల్పాకాలు, సర్జిలు కట్టి తొడిగి కులికి సాధారణప్రజాసమూహమునకు విదేశపు గుడ్డలు వ్యాపించునట్లు చేసి వారికి కూటికి గుడ్డకు లేనట్లు గావించిన విద్యావంతులమును, మధ్యతరగతివారమును అయిన మనము విదేశపుసారాయములు క్రోలికైపెక్కి తందనాలాడి మనము నశించుటేగాక మన యుదాహరణచే ప్రజలందరను నశింపుచేయ సిద్ధపడవలసినదేనా? కాంగ్రెసు మంత్రివర్గములు అధికారము స్వీకరించునప్పటికి వారికెదుర్కొనిన మహాసమస్యయిది.

*　　*　　*　　*

మన ప్రధానమంత్రి రాజగోపాలాచారి యుపన్యాసములలో నీయంశమును కొంత విశదము చేసినాడు. ముందుకు భారతభూమిని నడుపవలసిన విద్యావంతులు మధ్యతరగతులవారు జాతిలోని యువకులు యువతులు చేతులాడని చనటులుగ, కాళ్లాడని కుంటులుగ, కండ్లు లేని కబోదులుగ, చెవులులేని చిత్రమృగములుగ, మెదడు లేని మొద్దుకట్టెలుగ పరిణమించి అల్పాయువులై పోవుట కంటె కనుపించు మహాత్తమవిపత్తు. దీనిని వారింపకున్న మహాపాపము. కావున త్రాగుడునిరోధము వెంటనే సాగింపదగినది. అరనిముస మాలస్యముచేయరాదని ఆతని మానస మతనిని పురికొల్పినది. కార్యావతరణమయినది.

*　　*　　*　　*

త్రాగుడువలన కలుగునట్టి యరిష్టము లిట్టివి యని వర్ణించుట నిజముగా ఆవశ్యకమేకాదు. మన శాస్త్రములు, పురాణములు, ఇతిహాసములు ప్రపంచములోని సర్వమతములలోని సద్రచనలు ఏవియుకూడ త్రాగుడును ఖండింపనియట్టివి లేవు. త్రాగుడువలని దుష్ఫలములను వివరింపనివి లేవు. తుదకు నేటి ప్రవీణవైద్యులు సారాయమును మందుగాకూడ వాడరాదని తీర్మానమునకు వచ్చినారు. వీరి పరిశోధనలు త్రాగుడునందలి గొప్ప విపత్తులను ప్రకటనపరచినవి.

*　　*　　*　　*

త్రాగుడుకు చావులకు గల పరస్పర సంబంధము లను పాశ్చాత్య శాస్త్రజ్ఞులు లెక్కలువేసి కనిపెట్టినారు. డెన్‌మార్కుకు చెందిన కోపెన్‌హేగన్‌లో శుద్ధసారాయము త్రాగుడు ౧౯౧౦-౧౯; ౧౯౧౭-౨౧ ల మధ్యన మనిషి ౧ కి ౪.౮ లైటరుల నుండి ౨.౫ లైటరులకు తగ్గినది. ఘాటు సారాయముల త్రాగుడు ౧౩ నుండి ౧ కి తగ్గినది. ౧౯౦౩ వ సంవత్సరమువరకును స్త్రీలకంటె పురుషుల మరణములు వేయికి ౩౯ ఎక్కువగా నుండినది ౧౯౨౪ లో హెచ్చుదలే లేని సమస్థితికి వచ్చినది. ఇది ౨౬-౩౫ సంవత్సరముల వయసువారికి సంబంధించిన లెక్క. ౩౬-౪౫ ఏండ్లవారి లెక్క తీసికొనినపక్షమున మరణముల రేటు ౬౧ నుండి ౧౬ కు; ౪౬-౫౫ సంవత్సరములవారి లెక్క ౪౦ నుండి ౧౧; ౫౬-౬౪ ఏండ్లవారి లెక్క ౪౫ నుండి ౪౪ కు తగ్గినది. ఆడవారు త్రాగువారు కాదు. త్రాగిన తక్కువ తాగువారు. కాబట్టి ఈ తారతమ్య విమర్శ చేయగలిగినారు. ఇదేవిధమైన ఫలములనే జర్మనీ, స్విటజర్లందు, బవేరియాలు తేల్చుకో గలిగినవి.

స్విటజర్లందులోని రహస్యపు రికార్డులను బట్టి చూడగా అచ్చట సహజముగా చచ్చినమగవారిలో ౧౦౦ కి ఏడుగురు, స్త్రీలలో ౧౦౦ కి ౧ రు త్రాగుడు చేత చచ్చినవారని ఆకస్మికమరణములలో మగవారిలో ౧౦౦ కి ౧౧, ఆడువారిలో ౧౦౦ కి ముగ్గురు త్రాగుడు మూలకముగా మరణించినవారని తేలునట! మరియొక చిత్రము. ఇంగ్లండు వేల్సులలో త్రాగినతల్లులు తెలివి తప్పి పసికందులమీదికి పొర్లడములో అవి ఊపిరాడక చచ్చునట! అట్టిచావులు త్రాగుడు తగ్గించు ఏర్పాటులతో ౧౯౧౧ లో నూటికి ౧.౩౯ ఉండినది ౧౯౩౦ లో .౫౫ కు తగ్గినవట!

*  *  *  *

చావులోనే కాదు త్రాగుడుదుష్ఫలములు కనుపించవలెను. రోగములును త్రాగువారికి ఎక్కువగా వచ్చును. రోగకాలమును వీరి విషయమున దీర్ఘముగా నుండును. జర్మను ఇన్సూరెన్సు కంపెనీల లెక్కలను బట్టి యీ విషయమున పరిశోధన జరిగినది. త్రాగుబోతులకు కలిగిన రోగములు వాని పొడవు మొత్తము సభ్యుల రోగములు పొడుగునకు నూటికి ౪౭ మొదలు ౧౮౦ వంతులు హెచ్చుగా నుండునని నిశ్చయించినారు.

*  *  *  *

త్రాగుడుకారణముగ ఆత్మహత్యలు చేసుకొనడము త్రాగుడుచే కలుగు మనోరోగములచే చావడము త్రాగుడు తగ్గినకొల్ల తగ్గినదనుటను బవేరియా రుజువు చేసినది. ౧౯౧౧ నుండి ౧౭ లోపల నూటికి ౫.౨ నుండి ౦.౯ కు తగ్గినది.

*  *  *  *

పాశ్చాత్యపండితుల పరిశీలనముల యంకెలనిచ్చి చదువరులకు తలనొప్పి కల్గించుటకంటె ఎడ్వర్డు ఎ. స్ట్రెక్టరు ఎం. డీ., జీ. ఫ్రాన్‌క్లిన్ ఈబా ఎం. డీ అను ఇరువురు ప్రసిద్ధులగు డాక్టరులు వ్రాసిన ఫలశ్రుతి వినిపించిన చాలును.

"సారాయము (ఆల్‌కొహాల్) మందులలో ఉపయోగకరమా, నిరుపయోగమా యనుమాట యెట్లున్నను, ఎక్కువగా ఉపయోగించినప్పుడు ప్రత్యేకముగా నరములకు దెబ్బతాకుననుట సర్వేసర్వత్ర అంగీకృతమయి యున్నది. ప్లూటార్కు, ఆరిస్టోటలు, హిప్పాక్రాటీసు (గ్రీసుదేశపుధన్వంతరి) ఈ విషయమును గురించి ఏనాడో వివరించివ్రాసిరి......పరోక్షముగా త్రాగుడువలన కలిగే రోగములమాట దూరమునం దుంచినా మానసిక రోగములలో నూటికి ౫ మొదలు ౧౦ వరకును ప్రత్యక్షముగా సారాయమువలననే కలుగుచున్నవి. సారాయమును మోతాదుగా పుచ్చుకొనినను మానవునిలో చాలకశక్తిని అది తగ్గించును. అశాంతిని పెంచును. కండబలమును కృశింపజేయును. ఆయాసము కలుగుటను త్వరీకరించును. భావనైర్మల్యమును కెరచును. నిర్ణయశక్తిని కొరవడజేయును. మానసికపటుత్వమును భంజించును. జ్ఞాపకశక్తి సునిశితత్వమును మొద్దుపారించును. చిత్తస్థైర్యమును కలచును........బుద్ధి, హృదయము, నీతులు చెడుటేకాక త్రాగుబోతుకు

భ్రమలప్రపంచ మేర్పడిపోయి ఎవ్వరో భూతమై తన్ను వెంటాడుచున్న ట్లెల్లప్పుడును గోచరించును."

*   *   *   *

త్రాగుడు నరముల నింత సడలించునని వర్ణించిన పిదప, శరీరము నింత బడలించు ననినవెనుక, దిట్టమగు కండరశక్తి, నిశిత మగు దృష్టిపటిమ, నిశ్చంచల మగు బుద్ధిబలము కలిగి చేయవలసిన సకల కర్మాచరణ మందును త్రాగుడున కభ్యాసపడినవాడు కొరవడునని వేరె చెప్పనేల? అట్టివారి సంఖ్య పెరిగినట్లెల్ల వస్తూత్పత్తి దేశమునందు కృశించి దేశసౌభాగ్యము క్షీణించు నని వేరుగ వర్ణింపనేల? మనదేశపు నేతపనివారిలో కల హెచ్చు త్రాగుబోతులతో కొద్దిపాటి యనుభవము కలవా రందరకును త్రాగుబోతుతనము మన యైశ్వర్య నిర్మాణమున కెంత యాటంకకరముగా నున్నదో తెలిసికొని యుండగలరు. త్రాగుబోతుల సంతతులను గురించి పాశ్చాత్యవైద్యులు చేసిన పరిశీలనమునుబట్టి మొదట గర్భస్రావము, పిదప ఊపిరిపోయిన శిశువుల యుత్పత్తి, ఈరెండవస్థలు దాటినచో, కొందర మతమున, మతి తక్కువపిల్లలజననము అథవా మూర్ఛరోగపు పిల్లల పుట్టుక అతిత్రాగుడుచే కలుగుఫలము లని నిర్ణయమైనది.

*   *   *   *

సంఘమున కింతటి నష్టము కలిగించు దురభ్యాసము కావుననే దీనినిగురించి భారతీయ నాయకులు, శాస్త్రవేత్తలు, పౌరాణికులు, గురువులు త్రాగుడుయెడల పరిపూర్ణ విముఖత్వము కల్గించుటకు ఉదాహరణము లిచ్చినారు, కథలు కల్పించినారు, కావ్యము లల్లినారు, పాటలు పాడినారు, మతనియమములు చేసినారు, సాంఘికాపరాధములు విధించినారు. తుదకు మనువు బ్రాహ్మణుడు సారాయిత్రాగితే కాచినసీస మతనిచేత త్రాగించడము ప్రాయశ్చిత్త మన్నాడు. అనగా మరణ దండన నియమించినా డన్నమాట. ఇది బ్రాహ్మణునకు విధించిన శిక్ష; కాబట్టి ఇతరులు త్రాగవచ్చునని గెజిటులో నాటి మద్రాసు ప్రభుత్వమువారి అధికారములలో ప్రకటితమైన ఈ విషయకగ్రంథమున నొకచోట సూచించిరి. ఇది చాల గొప్ప పొరపాటు. ప్రజలకు మార్గదర్శకుడుగా నుండదగినవాడు—నాటి సాంఘిక పరిసరములలో, బ్రాహ్మణుడుగా అంగీకృతుడై యుండినాడు కాబట్టి అట్టివానిని నిక్కచ్చిగా శిక్షించడ మవసర మయి అతనికి కఠినతమశిక్ష చెప్పబడినది. ఎంతో నవనాగరకపరిస్థితు లేర్పడిన చంద్రగుప్తుని కాలమునందుగూడ మంచి బాగా తెలిసిన మనుష్యులకే మిక్కిలి తక్కువపరిమాణములుగ సుర అమ్మవలసినదేకాని ఇతరులకు అమ్మరాదని నియమ మేర్పడియుండినది. "త్రాగిన కర్మకరుడు పనిని చెడగొట్టును. సామాన్యార్యప్రజ సుర త్రాగినచో నీతి చెడి గుణభ్రష్టులగుదురు. ఈ దేకవంతులు త్రాగిరాదుండగములు కావింతురు. కాబట్టి వీరికి సుర అమ్మరాదు" అను వాక్యము లర్థశాస్త్రమున గలవు. ఈ నియమము లకు మించినయెడల బలమైన దండుగలు విధించవలసినదనియు అచ్చటనే యున్నది. ఇందుచేత త్రాగుడు పూర్తిగా లేనికాలము అన్ని దేశములందువలె మనదేశము నందును పూర్వమున నుండలేదేమో యని అంగీకరించిన నంగీకరించవచ్చును కాని చంద్రగుప్తుని కాలమునకేమి అంతకుముందునుంచి యేమి త్రాగుడును నిరోధించుటకు సర్వప్రయత్నములు ఈ భూమిలో జరిగినవనుట నిర్వివాదము. బౌద్ధయుగమునకు చెందిన 'కుంభజాతక' మను గ్రంథమున సుర, వారుణి యను నీత్రాగుడువస్తువుల జన్మను గురించిన కథ యొకటి కలదు. అన్నివివరముల కిచట తావు చాలదు. కాని 'శవత్తి'లో 'శబ్బమిత్త' యను రాజు సురాపానము చేయ తలపెట్టి సిద్ధపడు నిముసమునకు 'శక్క'—ఇంద్రు డని అర్థము చెప్పవచ్చునేమో—చేత సుర నించిన కలశము పూని ఆకాశవాణిని దాని చెడుగుల నన్నిటిని వర్ణించుటయు 'శబ్బమిత్త' (సర్వమిత్రుడు) మోసమునుండి మేల్కాంచి త్రాగుడును పరిహరించుటయు వచ్చిన మహాపురుష డంతర్ధానమగుటయు వర్ణితములయినవి. త్రాగుడు నిరోధముల కిన్ని యుగములుగ ఇన్నివిధముల ప్రచారము జరిగిన ఈ దేశము మార్గదర్శకము కాలేకపోయినచో మరి యేదేశము కాగలదు?

*   *   *   *

త్రాగుడు నిరోధింపను ప్రయత్నించినది మన దేశమొక్కటియే యనుకొనవలదు. సభ్యతలోనే రక్తము లోనే యుగములు యుగములుగా త్రాగుడుమీది జాడ్యము మనదేశమునందువలె ఇతర దేశములలో పెరిగి లేదనుట నిజమే కాని త్రాగుడువలన కలుగునట్టి మహత్తమ నష్టములను వారును చక్కగా కనిపెట్టుకొనినారు కాబట్టి అచ్చటచ్చట ౧౯౧౪-౧౮ వ సంవత్సరపు సంగ్రామమునకు పూర్వముకూడ ఎన్నెన్నో ప్రయత్నములు జరిగినవి నిరోధమునకు.

నిన్న నేడు సంపూర్ణనిరోధము ప్రయత్నించి ౧౩ సంవత్సరములు సాగించి ౧౯౩౩ వ సంవత్సరము డిసెంబరు ౫ వ తేదిని మరల వెనుకంజవేయవలసివచ్చిన అమెరికా సంయుక్తరాష్ట్రములలో త్రాగుడు నిరోధ ప్రయత్నములు ౧౮౫౦ వ సంవత్సరముననే అంకురించినవి. ౧౮౬౫ సంవత్సరమువరకు సాగినవి. అయిదు సంవత్సరములు చప్పబడినవి. మరల ౧౮౭౦ లో ఆరంభమయి ౧౮౯౦ వరకు ఇంకొక నిరోధయుగము విజృంభించినది. పశమటి రాష్ట్రములన్నిటిలోవలె అమెరికాలో త్రాగు డెక్కువగా పుచ్చుకోనివారున్నారు గాని అసలు పుచ్చుకోనివారు లేరు. ఉన్నను నూటికి కోటికొక మహత్తమవ్యక్తి యుండును. కాబట్టి మొదట మొదట జొత్తిగా వ్యక్తులు త్రాగరాదనే ప్రచారమునే తదభిమానులు సాగించిరి. ప్రజలలో త్రాగవచ్చునను పరంపరాగతమైన అభిప్రాయముకల రాష్ట్రము కాబట్టి భిన్నాభిప్రాయములు నేటికిని తప్పలేదనిన నా డెక్కువగా నున్నవని వేరుగా చెప్పనక్కరలేదు. అందుచేత పూర్తిగా త్రాగుడును మానుకొనుడని త్రాగేవ్యక్తులకు బోధించుటచేత ఫలము కలుగలేదు. సారాయము అమ్మునట్టి అంగళ్లు లేకుండజేయుటే యుపాయమని ౧౮౯౦ లో సంస్కర్తలు తమదృష్టిని ఆ యుద్దేశమునందు లగ్నముచేసిరి. ౧౮౯౩ లో 'ఆంటీసెలూనులీగు'— అనగా సారాయమమ్ముటకు కొట్ల రద్దుసంఘములు— స్థాపితమయ్యెను. ౧౯౦౬ వ సంవత్సరము నాటికి యునైటెడ్ స్టేట్సులోని సగముభాగమున నూటికి ౪౦ మంది జనాభాపైన ప్రజలు వోట్లువేసికొని సలూనులకు లైసెన్సు లిచ్చుటే నిలిపివేసిరి. అయినను త్రాగుడు నిలువలేదు. కారణము మరియేమియు కాదు. పట్టణము లకు పట్టణములు, ప్రాంతములకు ప్రాంతములు నిరోధ చర్యలు తీసికొనిరిగాని సర్వరాష్ట్రశాసనములు— ఫెడరేషను చట్టములన్నమాట— మార్పుకానందున సారాయములుదొరకుట సులభముగానుండినది. సారాయము ననేక రూపములుగా సిద్ధపరచి మహత్తమవ్యాపారము చేయునట్టి కోటీశ్వరులు సంస్కర్తల ప్రయత్నములను జూచి వారిని భంగపెరచుటకు బలవత్తరముగా రాజకీయపు పార్టీల నేర్పరచుకొనియుండినారు. ౧౮౬౯ లో స్థాపితమయిన త్రాగుడు నిరోధపు జాతీయపక్షమునకు ఏనాడును ఎలెక్షనులలో నూటికి రెండు వోట్లయినను వచ్చుచుండలేదు. కాని వారిప్రయత్నములు వృథ కాలేదు. విద్యాలయములలో త్రాగుడును గురించిన బోధ చాల హెచ్చుగా జరిగియుండినది. కావున ప్రాంతీయముగా మరల ౧౯౦౦ వ సంవత్సరము నాటికి నిరోధ ప్రయత్నము జరుగసాగెను. ఈ ప్రయత్నము సాగగా సాగగా ౧౯౧౭ వ సంవత్సరమునకు యునైటెడ్ స్టేట్సులో నూటికి ౭౦ వంతుల భాగమున త్రాగుడు అంగళ్లకు లైసెన్సు లిచ్చుటే మానుకొని యుండిరి. సంయుక్తప్రభుత్వమువారు తప్పక శాసనము సవరణచేసి తీరవలెనని మూడింట రెండువంతుల ప్రజ కోరనారంభించిరి. త్రాగుడు దుకాణములు కావలయునని కోరే వారు గొప్పగొప్ప నగరములలో తప్ప మరెచ్చటను నుండలేదు. ౧౫ ముఖ్యపట్టణపు ప్రాంతములలో ఐదేసి లక్షలవంతున జనులుకలచోట్లయందు మాత్రము లైసెన్సు పొందిన సలూను లుండినవి.

సలూనులకు లైసెన్సులే యిచ్చుటలేదని నిర్ణయించిన ప్రాంతములు మొదట మొదట ఎక్కువకైపు చేయు సారాలు, తేలికసారాలు అను భేదమును పాటించి ఎక్కువకైపు రకములను నిరోధింప జూచెను గాని ౧౯౧౭ నాటికి ఈ తారతమ్యమును జూచుటకు వీలులేకపోయి ఏసారాయమునకును లైసెన్సు ఇచ్చుట లేదనిరి. కారణాలు వెదుకుకొన పనిలేదు. తారతమ్యము చేయుటలో ఇది కైపుకు హద్దు, ఇది కాదని గీత

గించుట సులభము కాలేదు. ఆల్కాహాలు-అనగా మద్య సారము—కొద్దిగా కడుపులోనికి చేరినను విపత్కర మను నిర్ణయ మేర్పడుట రెండవకారణము. అమ్మేరక ములు కొట్లలో వేరుచేయుటకు రాకపోవుట మూడవ కారణము. క్రమక్రమముగా ఇట్టి కారణములచేత సం పూర్ణనిరోధ మేశరణ్యమని అభిప్రాయము గట్టిపడినందున సంయుక్త రాష్ట్రశాసనము మార్చితీరవలెనను ఆందో ళన ప్రబలెను. ఆసవరణకు రాష్ట్రశాసనసభలో మూ డింట రెండువంతులవోట్లు అవసరము. ౧౯౧౮వ సంవత్సరమువరకు ఆ మాత్రము వోటు దొరకలేదు. ఆ సంవత్సరము వోటు దొరకినది. దానిని ప్రాంతములు మరలస్థిరపరుపవలసివచ్చినది. దానికి రమారమి ౫ ఏండ్లు పట్టినది. ౧౯౨౦ న త్రాగుడు నిరోధశాసనము అమెరి కాలో అమలులోనికి వచ్చి ౧౩ ౧/౨ సంవత్సరములు పనిచేసినది.

త్రాగుడునిరోధమును గురించి ఒక్క అమెరికా మాత్రమే పరిశ్రమ చేయుచుండిన దనుకొనవలదు. ఇతర ప్రాంతములను ప్రయత్నములు కొద్దిగనో, గొప్పగనో జరుగుచునేయుండినవి. ౧౯౧౪ లో ప్రళయము పోలిన మహాసంగ్రామము ప్రపంచమంతటను చెలరేగినప్పుడు అన్ని రాష్ట్రములలోను త్రాగుడునిరోధమును గట్టిగా అమలులో పెట్టిరి. అప్పుడు కనడాలో ప్రవేశపెట్టిన త్రాగుడునిరోధము ఆ రాష్ట్రమునకు చెందిన ప్రిన్సు ఎడ్వర్డు దీవిప్రాంతమునందుమాత్ర మిప్పటికిని ప్రచార మందున్నది. ఫిన్లండు డెన్మార్కు స్వీడన్ రుష్యాలు సంపూర్ణనిరోధప్రయత్నములు చేసి సాగించినవి, విర మించుకొనినవి. ప్రపంచమహా సంగ్రామకాలమున త్రాగుడు నిరోధ నోద్యమమునకు కలిగిన బిగువు అమె రికాలోని పూర్ణనిరోధ ప్రయత్నమునకు దోహదమైనది.

* * * *

నిజముగా ౧౯౨౦ వ సంవత్సరము—మనదేశ మున గాంధీజీయుగారంభ మైన ఏడు—ప్రపంచ చరి త్రమునందును చాల గొప్పయుగము. త్రాగుడునిరోధము వలన కలిగిన ఫలములు నాటికి ప్రపంచమంతటను స్పష్ట పడినవి. అన్ని దేశములలోను యుద్ధపునాటి నిరోధములు కారణముగా ప్రజలకు గొప్ప ప్రయోజన ములు కలిగినవి. అమెరికాలో నిరోధ శాసన మమలులోనికి వచ్చిన ఆరంభసంవత్సరములు కాబట్టి అచ్చట కలిగిన ప్రయోజనములను లెక్కవేయుట కవ కాశ మిచ్చినది. తక్కిన దేశముల కథయంతయు వ్రాసి న నిది యొకగ్రంథ మగును. మనదేశములో నే డారం భించిన త్రాగుడునిరోధమునెడల విరోధభావము కన పరచునట్టి యొకకొందరు అమెరికా సంయుక్త రాష్ట్రాంగమువారు నిరోధశాసనమును ౧౯౩౫ లో రద్దు చేయుటనుబట్టి దానిని మనకు కారణముగాచూపి ఇచ్చ టను త్రాగుడునిరోధము సాగ దని వాదించుట ఆచార మైనది. అచ్చట నిరోధశాసనము రద్దగు కారణములు అచ్చటికి ఇచ్చటికి కల భేదములు ముందుకు వివరింప నగును కాని ముఖ్యముగా త్రాగుడునిరోధనోద్యమము పేరుపెట్టగనే కలిగిన ప్రజాజీవితములోని అపారమగు మార్పు ఇచ్చటనే యిప్పుడే వివరింపదగును.

* * * *

దేశములో పాలకు కలుగు గిరాకి పసిబిడ్డలనుంచి పెద్దవారివరకు అందరకును పుష్టిని, ఆరోగ్యమును సమ కూర్చునది. ౧౯౧౮-౨౦ ల మధ్యన అమెరికాలో పాలగిరాకి తలకు ఐదింట మూడవవంతు గేలనుమాత్రము పెరిగినది. ౧౯౨౦-౨౫ నకు మధ్యన ౧౧.౮౫ గేలనుల హెచ్చుదల చూపెను. వెన్న, ఆకుకూరల వినియోగ మందును ఇట్టి వ్యత్యాసమే పొడచూపినది. నిజమునకు మానవారోగ్యమునకు ఎక్కువ లాభదాయకమగు భోజన పద్ధతి ఈయేండ్లలో నేర్పడినది. నిరోధశాసనము అమలులోకి వచ్చినతరువాత అమెరికను కుటుంబము సంపాదించుకొనగలిగిన ఇంటివసతులు అంకెకుమం దప్పుడును సాధ్యముకాలేదు. ౧౯౨౦-౨౭ మధ్యన విద్యాలయములమీద అమెరికావారు అంతకుముందు కంటె రెట్టింపు వ్యయముచేసిరి. స్కూళ్లు, కాలేజీలలో విద్యార్థుల సంఖ్య ౧౯౧౬-౧౯౨౦ ల మధ్యన ౪,౯౯, ౩౬౪ నుండి ౫,౨౧,౮౫౪ లకు లక్షకు తక్కువగా పెరిగినది, ౧౯౨౦ కి తరువాత ౯,౧౯,౩౮౧ లకు అనగా నాలుగులక్షలు రమారమి అభివృద్ధియైనది. కర్మ

కరుల హాలి ౧౯౧౫-౨౯ ల మధ్యన నూటికి ౮౩ వంతున పెరిగినది. తామత్రాగే 'బీరు' తనుకులేకుండ నిరోధితమయిన నాళ్లలో అమెరికా కర్మకరులు చూపిన కార్యదక్షత మరియెప్పుడును చూపలేదు. వారపుహాలీ చేతపడుటతోనే త్రాగి సోమవారము పగటివేళ పనికిరాకపోవడము కర్మకరులలో ఎక్కువ. ఒక కర్మాగారములో ఆ గైరుహాజరులెక్క విమర్శగా చూచినారు. ౧౯౦౭ లో నూటికి ౭.౮౧ వంతున, ౧౯౧౩ లో రమారమి అంతే ఉన్న గైరుహాజరులు ౧౯౨౯ వ నాటికి నూటికి ౨.౩౫ దిగెను.

*     *     *     *

అమెరికాలో మనదేశములోవలె ఈత తాటి చెట్లు లేవు. ఎక్కువసారాయము ధాన్యమునుండి తీయుదురు. రైతుకు ధాన్యపుగిరాకి చెడిపోవునని నిరోధము వద్దనువారుందురు. కాని అమెరికాలోని త్రాగుడునిరోధముచే రైతు కేనష్టమును కలుగలేదు. ధాన్యపుగిరాకి ఏకొద్దిగానో తగ్గినా ఆతడుత్పత్తిచేయునట్టి యితర వస్తువులకు గిరాకీ బ్రహ్మాండముగా హెచ్చినది. ఒక రైతుప్రతినిధి ఈ విషయమై సాక్ష్యమిచ్చుచు చక్కెరకు గిరాకి పెరుగుటచేత 'బీటు' పంట యభివృద్ధియైన దనినాడు. ఎక్కుడలేనిగిరాకి గుడ్లకు కోళ్లకు మాంసమునకు కలిగిన దనినాడు. పాలమాట యిదివరకే వ్రాయబడినది. చక్కెరపాల గిరాకీలెక్క ఎట్లుపెరిగినదో చూడుడు. ౧౯౧౭ లో ౭౬౫,౦౦౦ టన్నులు చక్కెర తయారుచేసిన అమెరికా మరి పదియేండ్లలో ౧౦౬౨,౦౦౦ టన్నులను తయారుచేసినది. ౧౯౧౭ లో మనిషికి ౭౫౮.౧ రతుల పాలు కర్చు కాగా ౧౯౨౭ లో ౯౬౭.౩ రతులు కర్చయినది.

*     *     *     *

మొత్తముమీద ఒకానొక అమెరికను వ్రాసినట్లు త్రాగుడునిరోధము అమెరికాలో సంఘ జీవితమునే క్రొత్తమార్గమునకు మరల్చినది. ఈ పరివర్తనమునకు ఇతరకారణములను చూప ప్రయత్నించువారుందకపోరు. మానవవిషయములలో దేనిని కూడ వేరుపరచి దీనికిదేయని నిర్ణయింప వీలుకాదు. కాని త్రాగుడు నిరోధ మారంభమగుటతో ఇంతమార్పు కలుగుటను ఎవ్వరును కాదనలేరు. ఇతరరాష్ట్రములలోను కొంతపరివర్తనము కలిగినది కాని వారు నిలుపుకొనక ౧౯౩౦ నుండి పైబడిన ఆర్థికదైన్యకాలమున కష్టముల్లో బడినారు. అమెరికా అప్పుడుకూడ సుఖముగానే జీవించినది.

*     *     *     *

ఇంతటి చరిత్ర వినినవారెవరును కూడ సర్వరాష్ట్రశాసనము అమెరికాలో రద్దయినదనిన నవవచ్చునేమో, త్రాగుడునిరోధ ప్రయత్నము తాత్కాలికముగా కొంత కుంటుపడిన దనవచ్చునేమో గాని విఫలమైనదనిమాత్ర మనరాదు. మూడు గెల్లువలుగా చెలరేగిన యీ నీతినిబద్ధోత్సాహము అంతరించు ననుకొనవలదు. మరల త్వరలోనే విజృంభించును. అమెరికాలో నీ యుద్యమమున కంతరాయములు కలుగుటకు దీనిని నిర్వహింప నేర్పడిన అధికారశాఖలవారికి సామరస్యము లేకపోవుట మొదటి కారణము. సర్వరాష్ట్ర ప్రభుత్వము తగిన యుత్సాహము చూపలేదు. ద్రవ్యబలమును సమకూర్చి యియ్యలేదు. రాజకీయపక్షుల విభేదములు—పెట్టుబడిదారుల ప్రాబల్యముచే—ఈమహోద్యమమున కాటంకములయినవి. పట్టణవాసుల పాడు నాగరకభావములు పడేపడే యడ్డుపడినవి. అన్నిటికంటె గొప్ప దోషము ఏర్పడినచట్టమునందే యుండినది. ఇంటిలో మద్యము చేసికొనుట కనుకూలము పెట్టియుండినారు. ఇన్ని సందరదోషముల నాధారము చేసికొని డెమోక్రాటిక్ పార్టీవారు యునైటెడ్ స్టేట్సు అధ్యక్షుని ఎలెక్షనుకు తమ ప్రతినిధిని నిలుపుచు సర్వరాష్ట్ర నిరోధశాసనపు రద్దును ముఖ్యోద్దేశముగా ప్రకటించిరి. ప్రపంచమునంతటిని ఆవరించిన ఆర్థికదుస్థితిలో సర్కారుకు ఆదాయము కలుగునను ఆశయు కొంత నిరోధశాసనపు రద్దుకు తోడ్పడినది. ఈతాత్కాలిక భంగము ముందు విజయమునకు సూచకమే గాని వేరుగాదు. కార్యమునం దుత్సాహము విశ్వాసము గల నాయకత్వమేర్పడి ఉద్యమపు స్నేహితులే తమ పిచ్చి పిచ్చి విమర్శలచేతను కేకలచేతను ఉద్యమ నిర్వాహకుల

కాటంకము కాకయుండుటేని ఇండ్లలో మద్యముచేసి కొను అవకాశమునుగూడ నిర్మూలించి శాంతముతో ధైర్యముతో మరియొకమారీయుద్యమమును సాగించు టకు త్వరలోనే అమెరికా సిద్ధపడగలదు. మనదేశము లోని త్రాగుడునిరోధప్రయత్నము అచ్చటి సంస్కర్త లకు దోహదము కాగలదు.

* * *

అమెరికా పరిస్థితులకును మన పరిస్థితులకును కల భేదము గమనింపదగినది. అప్పుడు, మనదేశము నందు త్రాగుడునిరోధమున కెంత పరిపూర్ణావకాశము లున్నవో తెలియగలదు. ఇంటింటను త్రాగుడువస్తు వులకు ప్రవేశమున కవకాశము కల నాగరకము అమెరి కాది. ఒకచిన్న ఉదాహరణము. కలిఫోర్ని యా విశ్వవిద్యాలయమునకు చెందిన కాలేజీలలో చదువు పై దర్జా విద్యార్థులకు ప్రశ్నావళిని పంపి పెద్దలు బయటికి రాని అన్ని ఏర్పాటులును చేసి పరిశీలన చేసినారు. ౩౨౧౦ మందివద్దనుండి జవాబులు వచ్చినవి. అందులో ౨౫౪౫ మంది తాము అలవాటుగా త్రాగుటను తెలి పిరి. ౫౪౮ గురు రెండుమాసముల కొకపర్యాయము త్రాగుదురనిరి. ౧౧౩ గురు నెలకొకపర్యాయము త్రాగు నట్లు విన్నవించిరి. ౯౦౨ గురు వారమున కొకపర్యా యమో కొంచెమెక్కువగానో త్రాగువారమనిరి. అనగా రమారమి అందరును త్రాగువారే యైనారు. ఇట్టి స్థితి కలచోట నిరోధాభిప్రాయము బలపడుట కవకాశము చాల తక్కువ. మన యదృష్టవశముచేత మనదేశము నందీస్థితి మనకింకను చాలదూరమున్నది. నేడే నిరోధ ప్రయత్నము చక్కగ సాగించుకొంటిమా ఆస్థితి కలుగ కుండ మనము కాచుకొనవచ్చును. సామాన్యప్రజల లోను ఈ విధమగు తారతమ్యమే పడమటి దేశములకును మనకును కలదు. మితముగా త్రాగువారి కని పడమటి సీమలలో ప్రతియింటను మద్యము బహిరంగముగా భోజనపు టేబిలుమీద నధివసించుటకు వీలుకలదు. మన దేశమున నవనాగరకపు వాసనచే లజ్జ వదలిన పెద్దల యిండ్లలోనికి త్రాగుడుపదార్థము బహిరంగముగా ప్రవేశించుటేమో కాని గౌరవముంచుకొనదలచిన ఏజాతి వాడును ఇంటిలోనికి బహిరంగముగా సారాయిని తెచ్చుటకు సాహసింపడు. నిన్న నేటివరకు బ్రాహ్మ ణు డీవిషయమున చూపిన శీలము బ్రాహ్మణ సంప్ర దాయముల నవలంబించిన ఎల్లకులములను త్రాగుడు భూతమునుండి దూరముగా నుంచుటకు తోడైనది. పైదర్జా కులము లనుకొనువారెవ్వరును నేటికిని బ్రాహ్మ ణులు, రాజులు, వైశ్యులు, కమ్మలు, కంసలులు, కొన్ని ప్రాంతములలో రెడ్లు, అన్ని ప్రాంతములలో లింగాయతులు, దక్షిణదేశమున శైవ సంప్రదాయపు బ్రాహ్మణేతరులు ఇట్టివారందరును సురను తాకకుండ దను నాచారమును పెరుపుచున్నారు. గాంధియుగమున కొన్నికొన్నిచోట్ల చాల హీనజాతు లనుకొనినవారి లోనికిని బ్రాహ్మణాచారము చక్కగ ప్రాకినది. ఎక్కువ త్రాగుబోతు లనిపించుకొను కులములు నిజ ముగా పలుకుబడి లేనివి. అచ్చటను మన ఆర్థికపరిస్థి తులు కారణముగా కూటికిలేదను దుఃఖముచే ఇంటి ఆపది మగవాని త్రాగుడువిషయమున పోరుపెట్టు చునే యున్నది. సంఘనీతిలోని ఈ వృష్టిభేదము మనకును అమెరికాకును గల భేదములలో ముఖ్యతమ భేదము. ఇదే కారణముగానే అమెరికాలో త్రాగుడు నిరోధపు జాతీయ పక్షమునకు నూటికి రెండు వోట్లు రావడము కష్టము కాగా త్రాగుడుపూర్ణనిరోధము మొదటినుండియు సాధింపదలచిన కాంగ్రెసుపార్టీకి ఎన్నికలలో నెప్పుడును పూర్ణవిజయమే కాని ఖండ విజయ మనుమాటయైనను లేదు. మరియొక సంగతి. ప్రజల వోట్లచే నేర్పడే సర్వరాష్ట్రప్రభుత్వ మిప్పటి కింకను మనకు ఏర్పడలేదు. నేటి ప్రాంతీయనిర్ణయ ములు రేపటి సర్వభారత నిర్ణయములు చేయుటకు మనకు పూర్ణావకాశ మున్నది. అంతేకాదు, త్రాగుడు వస్తువుల నిర్మాణమున కోట్లకొలది ద్రవ్యమును వ్యాపా రార్థము కురిపించి పెట్టిన పెట్టుబడిదారులు మనకు లేరు. మనపుణ్యముకొలది జనసమూహము త్రాగు తాటి ఈత వగైరాల రసమును ప్రజలు ప్రబోధిమ లనుదురేని అక్కడికక్కడే దివ్యమైన చక్కెరగాను, తీపుపాన కముగాను మార్చివేయుట కవకాశమున్నది. పట్టణవాస

ములలో పరమస్వతంత్రు లనుకొని విదేశములకు ఒక ప్రక్కన సర్వదాస్యమును చేయుచు త్రాగుటకు తమకు వ్యక్తిస్వాతంత్ర్యము కావలయు నని కోరువారి జన సంఖ్యయు మన కిప్పటి కింకను ఎక్కువకాలేదు. మన ప్రజ నూటికి ౯౦ గురు గ్రామసీమలలోనే నివసించు చున్నారు. అమెరికాలో ఏ నలువదియో యేబదియో కల గ్రామవాసప్రజయే త్రాగుడునిరోధమునకు సహాయ భూతులగుచుండ మన మహాప్రజ పై నిదర్శించిన స్థితు లలో మనకు సహాయభూతులు కారనుటను వట్టిచిత్త భ్రమ. పదిదినముల నేలను ప్రయాణములో మన ముఖ్య మంత్రి శ్రీ జగోపాలాచారిగారికి ప్రజలు కనుబరచిన యాదరణ మనప్రజల చిత్తవృత్తి కిప్పటికే తార్కాణ ముగా నున్నది. సంకల్పశుద్ధితో; ఆత్మవిశ్వాసముతో, శాంతచిత్తముతో పెద్దనాయకులు, ఉపనాయకులు; ప్రజాప్రముఖులు ప్రవర్తించి పరస్పర విమర్శలతో కాలము పుచ్చక భక్తితో కార్యక్రమమును నడిపిన యెడల మనదేశమున త్రాగుడును రూపుమాపి అమెరికా యున్నత ప్రయత్నములకు దూరమునుండియే చేయూత నొసగి తక్కిన విషయములలో మార్గదర్శకు లైనను కాకున్నను ఈ విషయమునందు మార్గదర్శకుల మగు టకు, లోకశాంతికి ప్రథమబీజములు నాటుటకు భారత జాతి కిప్పు డవకాశము దొరకినది. వినియోగించు కొందముగాక. విజయులమగుదుముగాక. జయము. త్రాగుడు నిరోధమునకు జయము.

---

## బ స వ పు రా ణ ము　వెల 2-8-0

గ్రంథకర్త:—పాల్కురికి సోమనాథకవి　పరిష్కర్త:—వేటూరి ప్రభాకరశాస్త్రి గారు

పండ్రెండవ శతాబ్దమున వెలసిన శైవమతప్రతిపాదకమగు ద్విపదకావ్యము. ఇందు శైవ మతోద్ధారకు డగు బసవేశ్వరునియు, తత్పూర్వులు తత్సమకాలీనులు నగు శివభక్తులయు చరిత్ర ములను సరసముగను, పాఠకులు మనసుకరగి తన్మయులగునట్లుగను, కవి వర్ణించినాడు. గ్రంథమున మృదుమధురములగు జానుదెనుగు పలుకుల జాలువార్చి రచనమున ముద్దులుగురిపించినాడు. గ్రంథము భిన్నభిన్న మండలములకు జెందిన పెక్కు తాళపత్ర మాతృకలతో సరిచూచి పరిష్కరింపబడినది. పాఠాంతరములు సూచింపబడినవి. పరిష్కర్త రచియించిన అమూల్యమగు పీఠిక (129 పుటలు) ఇందు గలదు. ఆకాలపు టపూర్వసారస్వత చారిత్రక విశేషముల లెక్కకు మిక్కిలిగ నందు పరిష్కర్త యేర్చికూర్చినారు. ఆధునిక కవికుమారుల కిది యత్యంతోపకారకము.

మేనేజరు, ఆంధ్రగ్రంథమాల, నెం. 2, తంబుసెట్టివీథి, మదరాసు.




## చీమల జీవితోదంతము

చీమలు చూచుటకు చాల చిన్నప్రాణులే. కాని వాని కున్నంత కార్యదీక్ష మానవులమగు మనకు లేదు. నెమ్మదినెమ్మదిగానే అవి తాము పూనిన కార్యములను, మధ్యను వదలక కొనసాగించుకొనుచుండును. ఈగుణమునుబట్టియే 'గచ్ఛ త్పిపీలికాపంక్తి స్సముద్రమపి గచ్ఛతి' (ఆగక, ఏకధాటిగా పోవుచో చీమలు కూడ సముద్రమును చేరుకొనగలవు) అను సామెత యేర్పడినది. ఇటువంటి వెన్నియోకథలు మనలో వాడుకయందున్నవి. ఇటువంటిచీమలనుగురించి వివరముగా తెలిసికొనుట మనకు భావ్యముకాదా?

ఈ జిజ్ఞాసతోనే ఒకవైజ్ఞానికుడు రకరకములైన చీమలను సేకరించి, పరిశీలించుటకు పూనుకొనెను. ఆపరిశీలన కుపయోగించునట్లు అతడొక కృత్రిమమైన గూడు (చీమలయిల్లు) తయారుచేసుకొనెను. ఎట్లనగా: రెండు గాజుపలకలను తెచ్చి, ఆరెంటిని విడదీయుటకు వానికి నడుమ మూడంచులకును దాదాపు అంగుళము మందము గల గాజుబద్దల నమర్చి, ఆమూడుభాగములను బంధించుటకై అన్నిటికిని చేర్చి ఒక అతుకుగుడ్డ నతికించిపెట్టెను. పైపైపుసందుమాత్రము గూటికి ద్వారముగా నుండవలయునని గాజుబద్దతో మూయక తెరచియే యుంచెను. అవసరములేని వేళలందు దానిని అతుకుగుడ్డతో మాత్రము మూసియుంచుచుండెను.

ఈ గూటిలో సగమువరకు సన్ననియిసుకను నింపెను. తరువాత ఈ గూటి నతడు ఒక మేజామీద అడ్డముగా పెట్టెను. మేజాకాళ్లక్రింద చిన్ననీటిపాత్రల నుంచెను.

ఇక చీమలవేటకు బయలుదేరెను. చేత నొకసంచి పట్టుకొని, గరిటెకాడ నొకదానిని తీసుకొనివెళ్లి ఒక మైదానమునందున్న చీమలపుట్టల నన్నిటిని చిలుకద్రవ్వి, చీమలు చెదరిపారిపోక పూర్వమే ఆ మంటినంతటిని సప్పిళ్లతో ఎత్తి సంచిలో వేసి బిగియగట్టి, ఇంటికి దీసుకొనిపోయి ఆ మేజామీద పలుచగా ఆ మంటిని పరచెను. త్వరలోనే ఆ మంటిలోని చెమ్మదన మంతయు నారిపోయెను. అందలి చీమలన్నియు సనసన సమకూడి ఎక్కడికిపోవుటకును పాలుపోక, ఇటునటు తారట్లాడి చివరకు అక్కడ నుండిన గాజుగూటిలోనికి దూరుకొనెను. అది ఇంకను చెమ్మగా ఉన్నదికదా మరి! (తడిఆరిన మంటిలో చీమలు త్వరగా చనిపోవును.) వెంటనే గూటిద్వారము నతడు నల్లనిగుడ్డలో మూసివేసెను. చీమలకు సూర్యుని వెలుతురుకు వైరము. ఇట్లు పట్టి బంధించిన చీమలలో అన్నిరకముల చీమలు- మగచీమలు, ఆడుచీమలు, పిల్లచీమలు, తదితరములైన నానాజాతులు- ఉండునట్లు అతడు చాల ప్రయత్నము చేసి అన్నింటిని సేకరించెను.

ఇక అక్కడనుండి అతడు పరిశోధన కుపక్రమించెను. ఎన్నెన్నో పరిశీలనలు చేసెను. వాని జీవిత విధానమును, వాని ప్రవర్తనను మొదలైనవానిని కని పెట్టుటకు ఎన్నోతంటాలుపడెను. చివరకతడు తేల్చిన సారాంశము లివి.

చీమలలో ఒక తెగకు మరియొక తెగకు వైర, నిర్యాతనములు కలవేమో కాని ఒకటే తెగకు చెందిన చీమలు పరస్పరము సామాన్యముగా కలహించుకొనుచుండవు. ఏవోకొన్ని విపరీతపు చీమలుతప్ప తక్కినవి సామాన్యముగా ఒకదానిగూటిమీద మరియొకటి పోయి



పరిశోధన



చీమలఆహార సంపాదన

ఇరెక్కల చీమల పోరాటము.





చీమలకు గాజుటిల్లు చేయుటకథము

పడవు. చీమలకు శాంతముగా కాలము గడుపుట ఇష్టము. వానికి పనిపాటులు చేయుటయన చాలప్రీతి. తమ కుటుంబమునకు కావలసిన సౌకర్యములన్నిటిని అవి తమ గూటిలో కల్పించుకొనును. రాణివాసమునకు వేరుగదులు, చిన్నపిల్లలపోషణకు గదులు, ఇతరయావత్సౌకర్యములు వాని గూళ్లలో నేర్పాటయియుండును. పిల్లచీమలను అతిజాగ్రత్తగా అవి పోషించుకొనివచ్చుచుండును. చచ్చినపురుగులు, మాంసపుముక్కలు అవితినును. కొన్ని ధాన్యపుగింజలనుకూడ తినును. తీపువస్తువులు చీమలకు చాలఇష్టము. అట్లని, చక్కెరపదార్థము నెక్కువగా ఉపయోగించుట వానికి మంచిదికాదు. చీమలకుదాహశాంతికి నీరు కావలసినదేకాని, నీటితో వానిని ముంచవలసినపని లేదు. అవి నివసించుచుండు నేల యెల్లప్పుడును చెమ్మగా నుండిన చాలును, వానికి కావలసిన నీరు అందుండియే లభించును. కృత్రిమపుగూళ్లలో నున్నవానికి, అప్పుడప్పుడు గూటిలో సముద్రపు పాచినుండా కావలసినంత నీటిని కల్పించుచుండవచ్చును.

చీమలకుకూడ 'ఆవులు' ఉండును. అవి ఒకవిధమైన పురుగులు; ఆకుపచ్చగా నుండును. మామూలుగా నవి రసవంతములైన తీగలమీదను, మొక్కలమీదను నుండునట్టివి. అవి దొరకినచో, చీమలు వానిని ప్రతిదినము మేతకు తోలుకొని పోవుచును, మెత్తని వానిశరీరములను తట్టి, తియ్యని ఒకద్రవమును బిందువులుబిందువులుగా పిండుకొనుచును ఉండును. చీమలగూళ్లను త్రవ్వి తెచ్చునప్పుడు. అందులో చిన్నచిన్న కుమ్మరపురుగులు, కంబళిపురుగులు, పేడపురుగులు మొదలైనవి కూడ రావచ్చును. ఒక్కొక్కప్పుడు మరియొక తెగకు చేరిన చిరుచీమలుకూడ ఉండవచ్చును. అవి చీమల అతిథులు; చీమల ఆహారసామగ్రిగదులను లూటీచేయుటకును, వానిబిడ్డలను తన్నుకొని పోవుటకును, అవి తినుచుండిన ఆహారమును లాగుకొనిపోవుటకును వచ్చినట్టివి.

చీమలు తమ నివాసస్థలములను చాల శుభ్రముగా నుంచుకొనును. అశుద్ధపదార్థముల నెప్పటికప్పుడవి తొలగించివేయుచుండును. అట్టి వానిని మంటిక్రిందికి త్రోసివేసి పైన శుభ్రమైన ఇసుకవాటుమంటిని కప్పుచుండును.

ఒకసంగతి చూడుడు. పైప్రకారముగా తయారుచేసినట్టి చీమలయిండ్లను మేజాపై పెట్టి, ఆ మేజాకాళ్లను నీటిగిన్నెలలో పెట్టుడు. ఆ మేజాకు

ప్రక్కగా మరి రెండుమూడు మేజాలనుంచి, ఒక్కొక్కదానికిని కాగితపుచంతెనలను అమర్పుడు. ఇప్పుడు ఏదో ఒక మేజామీద ఏదైన నొక తీపువస్తువును పెట్టి, ఒకచీమను తీసికొనిపోయి ఆవస్తువుదగ్గర వదలుము. ఆ చీమను గుర్తుపెట్టుకొనుటకుగాను తెల్లరంగును









దేనినైన దానిమీద చల్లుము. తా నావస్తువును క్రిందమీద చూచినవెంటనే ఆ చీమ పోయి తనయింటిలోని తక్కిన చీమలను వెంటతీసికొని అది నేరుగా మొదటి మార్గమునే పట్టిపోవును.

నిజముగా తోడి చీమలకా మొదటిచీమ తానెందుకు వానినట్లు తీసుకొనివచ్చినదో, ఆవస్తు వెందున్నదో వివరముగా తెలిపియుండినయెడల, అవి తప్పక దాని వెనువెంబడినే పోవలసినది. కాని పైపరిశోధకుని అనుభవములో అవి అట్లు చేయలేదట. ఇక్కడనక్కడ పాలుపోక తిరుగుచు అవి కాలక్షేపము చేయుచుండును. వానిలో నేదైన నొకచీమ ఆ తీపువస్తువును చేరుకొనగలిగినచో, అది కేవలము ఆనుషంగికమే. కాబట్టి తేలున దేమనగా: అపూర్వమైనవస్తువును కనిపెట్టినప్పుడు ఆ కనిపెట్టిన చీమ తోడిచీమలకు తెలుపునదంతయు బయటికి రమ్మనిమాత్రమే.

చీమలు నీలమురంగుగాని, ఊదారంగుగాని చూచినప్పుడును, అటువంటి వెలుతురు మీద పడినప్పుడును నిప్పుచుట్టుకొన్నట్లు తపించిపోవును. ఎరుపురంగు చూచినప్పుడుగాని, ఎరుపురంగువెలుతురు మీద పడినప్పుడుగాని ఏ విధమునను ఆరాటపడక అవి సంతోషముగానుండును.

చీమ లొకటి కొకటి సాయము చేసికొనుచుండునని అందురుగాని ఆ విషయము సందేహింపవలసినదిగానే యున్నది. ఒకపేపెరపైకె రెండుచీమలు పెనసులాడుకొనుచుండుటవంటివి ననమనేకము చూచుచున్నాము. చీమలకు తెలివి యున్నదా అని కొందరడుగుచుందురు. అనుభవమువలన తెలిసికొని నడవడిని చక్కదిద్దుకొనగల నేర్పే తెలివి యను పదార్థమైనచో చీమలకటువంటిది తక్కువ యనియే చెప్పవచ్చును. సహజమైన ఒకానొకశక్తియే దాని జీవి



౧. చీమలు 'ఆవుల'ను మేతకు తోలుకొనిపోవుట; ౨. గాజుటెంక్లలోనికి పుట్టమట్టినివేయుట; 3 పుట్టమంటిని సేకరించుట; ౪. మేజా అడుగున నీటిపాత్రలనుంచుట; ౫. మేజాకుమేజాకు నడుమ వంతెన లమర్చి చీమలను వదలుట.

తమును నడపుచుండును. సహజమైనశక్తి యనగా, ఏ యనుభవముకూడ లేకయే ఒకానొకపనిని నెరవేర్పగలుగు సామర్థ్యము. మానవులకువలెనే చీమలకు గూడ ఇటు

వంటి ప్రాకృతికమైన శక్తులుండును. ఆ శక్తులనవి యెంత యనుభవము చే



మామూలు కండ్ల వైఖరి

ఒక బాలిక దృష్టిని పరీక్షించుచుండుట.

లేను సంపాదింప నేరవు.

చీమలలో అది ఇది అను భేదములేక అన్నియు పనిచేయుచునే యుండును. అన్నియు ఫలితము లనుభవించును. ఆ అనుభవించుటలో హెచ్చుతక్కువ లుండవచ్చును. విప్లవములుగాని, మేము పనిచేయమని కూర్చునుటవంటి సమ్మెలుగాని చీమలలో నుండవు. ఒకరి కష్టములతో, మరియొకరు లాభములు పొందుట, ఇతరులమీద ఆధారపడుట, బలవంతునిదే రాజ్యమని పరులమీద బడి కొల్లగొట్టుట మొదలైనగుణములు చీమలకు లేవు. తమవద్దకు వచ్చు 'అతిథుల'కును మానవులకును అవి ఆ గుణములను హక్కు భుక్తము చేయుచున్నవి.

---

## నేత్ర పరీక్ష

నాగరకత ఎక్కువయిన కొలదియు నేత్రములకు పరిశ్రమ యెక్కువగుచున్నది. ఉద్యోగులును, నిరుద్యోగులునుకూడ పత్రికలు, పుస్తకములు, వ్యవహారపు ఉత్తర ప్రత్యుత్తరములు మొదలయినవి విస్తారముగా చదువవలసిన యగత్యము దినదినమునకు నెక్కువ యగుచున్నది. ముద్రణాలయములు, ముద్రా లేఖినులును ఈ పరిశ్రమకు దోహదమిచ్చుచున్నవి. ఈ నిరంతర పరిశ్రమకు కన్నులు తాళుకొనుచున్నవో, లేదో ఒకమారు గమనించుట మంచిది. నేత్రముల విలోకనశక్తి హెచ్చుచున్నదో, తగ్గుచున్నదో తెలిసికొని, హెచ్చుదలలో నున్నచో ఇంకను ఆశక్తిని పెంపొందించుకొనుటకును, తగ్గుదలలో నున్నచో నివారణోపాయములను వెదకి హెచ్చుదలకు తెచ్చుకొనుటకును ప్రతివాడునుపూనుకొనవలయును. నేత్రవైద్యులు ఇప్పుడును నేత్ర పరీక్షలు చేయుచు దృష్టిదోషము గల నేత్రములకు సులోచనములు





యంత్రములోని ముద్రవ్రాత కాగితములు
కనుపాపల చలనములు, పటలములమీది కెక్కినప్పుడు దాల్చు రూపములు

తగిలించుచున్నారు, వాస్తవమే. కాని ఆ పరీక్షలు గాని, ఆ సులోచనములు గాని దృష్టిని — అనగా కంటిచూపు శక్తిని — చక్కదిద్దు

చున్నవేమో కాని చూచి చదువుటలోని అంతరములను క్రమపరచుటలేదు. ఒకడు ఒక వ్రాతను ఎంత వేగముతో చదువుచున్నాడో, ఆ చదువుటలో నతని కన్నులు తటపటాయించక ఋజువుగా ప్రసరించుచుండునో లేదో, ఎంతచిన్న యక్షరములవరకు నతడు చదువగలుగునో, ఒకవేళ పఠనశక్తిలో నేవేని తారతమ్యములున్నచో వానిని సరిపరచుకొనుట యెట్లో మొదలైన యంశములు పాఠకుల నేత్రపరీక్షకు ముఖ్యములై యుండవలెను. ఇటువంటి యంశములను కనిపెట్టుటకే చిత్రములందలి మోస్తరు యంత్రము కనిపెట్టబడినది. ఇది కూడ ఒక ఛాయాచిత్రగ్రాహిణి యనియే చెప్పవచ్చును. వ్యక్తులు చదువునప్పుడు వారి కనుపాపలేయే విధముగా చలించుచుండునో ఈ యంత్రము మూలముగా ఒక చిత్రపటలముమీద నర్తింపబడును. ఆ కనుపాప చలనములందలి విధములనుబట్టి వ్యక్తుల పఠనశక్తిని నిర్ణయింపవచ్చును.

ఈ యంత్రముతో వ్యక్తులను—అనగా వారి పఠనశక్తిని, తద్వారా దృష్టిశక్తిని—పరీక్షించు విధము రెండవ చిత్రములో చూపబడియున్నది, చూడుడు. పరీక్షింపవలసిన వ్యక్తి తన యెదుట కొంచెముదూరములో నిలువబెట్టబడియుండు నొక వ్రాతకాగితముమీద దృష్టి నిలిపి చదువ నుపక్రమించును. ఆ సందర్భములో నతనికండ్లలోనికి




యంత్రములోని భాగముల వివరము

వెలుతురు కిరణములు ప్రసరింపజేయబడును. ఆ కిరణములు కనుపాపలమీద పడి అక్కడనుండి యంత్రముయొక్క అవలిపైపున నొక పెట్టెలో నుండు ఛాయాచిత్రపటలముమీద ప్రతిఫలించును. ఆపటలము మామూలు చిత్రగ్రాహిణులందువలెకాక చలనచిత్రగ్రాహిణియందువలె తిరుగుచుండును గావున కనుపాప చలనములన్నియు యథాతథముగా దానిమీద చిత్రింపబడుచుండును. అవి బొమ్మలవలెగాక ఏవో వంకరటింకర గీతలవలె నుండును. ఏలాటిలోపమును లేని కంటిపాపలు ఒకపంక్తిమీద ప్రసరించునపుడు మధ్య మధ్య ఎక్కువసేపు ఆగక త్వరత్వరగా ప్రసరించుచుండును. అటువంటి చలనములను చిత్రపటలమున కెక్కించినపుడు అందులో అవి కేవలము అడ్డగీతలుగానే గోచరించును. నిలువుగీతలును ఉండునుగాని ఎక్కువ దీర్ఘములుగా నుండవు. నిలువుగీతలు కనుపాపల చలనముయొక్క ఆనుదలపరిమితిని తెలుపును. నిష్కళంకమైన పాపలు పదిమాటలఒకవాక్యమును చదువులోపల దాదాపు ఎనిమిది పర్యాయములు ఆగును. సకళంకమైన కంటిపాపలు అదే వాక్యము చదువుటకు ౧౫ పర్యాయములు, ఒక్కొక్కప్పుడు అంతకంటె నెక్కువగాను ఆగవలసియుండును. అందువలన నట్టి సందర్భములలో చిత్రపటలములందు అడ్డగీతలకంటె ఎక్కువ పొడుగుగా నిలువుగీతలే కనుపించుచుండును. ఇక పటలముయొక్క పొడవును కొలిచి కంటియొక్కవేగమును నిర్ణయింతురు. ఇట్లు పరీక్షలకు నిలిచినవ్యక్తులు వ్రాత



దృష్టిదోషములను సరిపుచ్చుకొనుటకు పఠనాభ్యాసము

కాగితములను సరిగా చదివినారో, లేక చదివినట్లు నటించుచు కండ్లను పంక్తులుపంక్తులుగా త్రిప్పినారో తెలిసికొనుటకు, అంతయు నయినతరువాత చివర వ్రాత కాగితమునందలి విషయములమీద కొన్ని ప్రశ్నలువేయుదురు. పఠనశక్తిలో కుందుపాటుగాని, ఎసుదుదిసుళ్లుగాని యున్నచో, ఆ శక్తిని కొన్నాళ్లపాటు అభ్యాసముచేసి సరిపరచుకొనుటకు మరియొక యంత్రముకూడ ఏర్పరుపబడినది (చిత్రము ౫). వ్యక్తి యెదుటనుండు పెట్టెను చూడుడు. దానిమధ్య అడ్డముగానుండు చీలికలో వ్రాతకాగితము పంక్తులు పంక్తులుగా వచ్చున ట్లేర్పాటు చేయబడియుండును. అనగా వ్యక్తికి అన్ని పంక్తులను ఏకటకన్పించి అదియా, ఇదియా యను భ్రమకలుగజేయకుండ ఒక్కొక్క పంక్తియే దృష్టిపథమునకు తేబడుచుండునన్నమాట. ఆపంక్తియైనను ఒకటేసారి అంతయు కనబడదు. పంక్తిలో మూడవవంతుమాత్రమే ఒక్కొక్కసారి కనబడును. ఆ భాగము చదివికాగానే తరువాతి భాగము వచ్చును. అంతవరకును అది మూయబడియుండును. అటువంటి యేర్పాట్లు అందులో గలవు. ఇట్లు చదువవలసిన వ్రాత కొంచెముకొంచెముగా కనుపించుచుండుటవలన దానిని చదువునప్పుడు దృష్టి తడబడుట గాని, ముందువెనుకలకు ప్రసరించుటగాని సంభవింపవు. ఇట్లు చదువుటను దినక్రమముగా అభ్యాసము చేయుచుండినచో త్వరలోనే పఠనశక్తి చక్కబడును. ఇక పఠనవేగము సంగతియో? దానినికూడ దీనిమూలముగానే వృద్ధిచేసికొనవచ్చును. తడబాటులేక చదువుట అభ్యాసమైనపిదప, చీలికలోనికి పంక్తులు వచ్చువేగమును కొంచెముకొంచెముగా పెంచుకొనుచు కొన్నాళ్లు అభ్యాసము చేసినయెడల పఠనవేగముకూడ త్వరలోనే వృద్ధికాగలదు.

---

## చేతివణకును పరీక్షించు పెట్టె

నరముల దౌర్బల్యమునుబట్టి చేతులు హెచ్చుతక్కువలుగా వణకుచుండుట సంభవించును. కాబట్టి చేతివణకులోని హెచ్చుతక్కువలనుబట్టి నరముల దౌర్బల్యమునందలి హెచ్చుతక్కువలను గ్రహించుటకు వీలగును. అటువంటి పరీక్షకొరకు తయారైనదే యీ పెట్టె. ఈ పెట్టెకు ముందువైపున నొక అల్యూమినియపు తగడుండును. పెట్టెకు ముందువైపుగోడ అదియే యన్నమాట. ఆతగడులో వరుసగా కొన్ని రంధ్రములు చేయబడియుండును. మొదటిది పెద్దది. ఆతరువాత ప్రతిదాని పరిమాణమును వరుసగా తగ్గిపోయి యుండును. చివరిది



పెట్టెలో విభాగములు

ఒకానొక వ్యక్తిపరీక్ష

మిక్కిలిచిన్నది. పెట్టెలోపల ఒకవిద్యుచ్ఛక్తిగంటయు, ఒకవిద్యుద్ఘటమాలయునుండును. దీనితో వ్యక్తులయొక్క నరముల దౌర్బల్యాదౌర్బల్యములను కనిపెట్టుట యెట్లనగా: లోపలి విద్యుద్ఘటమాలకు జతపరచియుండు తీగెకొనలో నున్నటువంటి సూదిని పట్టుకొని, దానిమొననుండు సూదిని వరుసగా ఆ రంధ్రములలో చొప్పించుకొనుచు పోవలెను. అట్లు చేయునప్పుడు చేతిని దేనికిని ఆనించరాదు. సూది రంధ్రములలోనికి సూటిగా పోవలయును కాని ఆ రంధ్రముల అంచులను తాకగూడదు. పొరపాటున తాకినచో వెంటనే గణగణ మని గంట మ్రోగును. చివరిరంధ్రమువరకును ప్రతిదానియందును సూదిని నిలుకడగా ప్రవేశపెట్టగలిగినచో నావ్యక్తికి నరముల దౌర్బల్యము లేకపోవుటచేత చేతివణకు లేదన్నట్లు, ఎక్కడనయినను సూది రంధ్రముల అంచులను తాకినచో, చేతివణకువలన అట్లుజరుగునుగావున నావ్యక్తికి నరముల దౌర్బల్య మున్నట్లు నిర్ణయింపబడును. ముఖ్యముగా చేతినరముల దౌర్బల్యమే యీ పెట్టె మూలమున పరీక్షింపనగును.

---

# కలగూరగంప

## లండనులోని ప్రీవీకౌన్సిలు సంగతి సందర్భములు

ఇండియా దేశమునకు పరమోన్నత న్యాయస్థానము ప్రీవీకౌన్సిలు. ఈ దేశములోని న్యాయస్థానములందు న్యాయము జరుగలేదని తలచువారు లండనులోని ఈ ప్రీవీకౌన్సిలు విచారణ నభిలషించుచుందురు. అందులోనికి పోయి ఆచర్చలను వినుచున్నచో నీదేశపు మారుమూలల వ్యవహారములన్నియు వివరముగా తెలియవచ్చుచుండును. ఇక్కడి ఇన్ని ఉన్నత న్యాయస్థానములకు అనుశాసకమై, వీనిని కాదని తీర్పుచెప్పగల తాహతుగలిగి, మంత్రిపుంగవులకు ధర్మాసనమై యొప్పు ప్రీవీకౌన్సిలు ఎంత గొప్ప మందిరములో నుండునో, ఎన్ని లాంఛనములతో, ఎంతపారాతో, ఎంత హడావిడితో నుండునో యని భావించుటసహజము. కాని వాస్తవస్థితి నరయుడు.

లండను డౌనింగువీథిలో నొక మూడంతస్తుల మేడలో ప్రీవీకౌన్సిలు సమావేశము. ఆ మేడయినను ఎంత సామాన్యముగా నుండవలయునో అంత సామాన్యముగా నుండును. ఏదో సామాన్య గృహస్థు ఇంటివలె నదియుండును. వీథిలో పోవువారు పొరపాటుననైనను ఆమేడవైపు కాకర్షింపబడుట పొసగదు. అంత సామాన్యముగా నుండు నా భవనము! అటువంటి ఇంటిలో - ఒకగొప్ప దేశమునకు, అందలి అసంఖ్యాతప్రజలకు ఉన్నత ధర్మాసనమైన ప్రీవీకౌన్సిలు సమావేశమగునని ఆ ప్రాంతములకు పోయిన క్రొత్తవారు కలలోనైన భావింపజాలరు. భావించిననేమి, భావింపకున్ననేమి ? అదియే ఇండియా న్యాయస్థానముల తప్పులను దిద్దుచున్న ధర్మాసనము. భవనమునుబట్టి యెవరు నమ్మకున్న మాత్రమున నేమి! దానికొక చిన్నబోర్డు తగిలించియుండును : ప్రీవీకౌన్సిలు న్యాయవిచారణ సంఘము అని.

కౌన్సిలు సమావేశమౌనప్పుడు ఇందులో నొక గదిలో అర్ధచంద్రాకారమున నున్న ఒక మేజాముందు అయిదుగురు వృద్ధబృహస్పతులు కూర్చుందురు. వారు నల్లని కోట్లను, చారల నిజార్లను ధరించియుందురు. వారు సమావేశమగు నీగది యెత్తుగానుండును. చుట్టును న్యాయపుస్తకముల బీరువా లుండును. గదిలో ఎర్రని లివాసీ



యొకటి పరువబడియుండును. గోడల కక్కడక్కడ కీర్తిశేషులయిన ప్రముఖ న్యాయమూర్తుల తైలవర్ణచిత్రములు వ్రేలాడగట్టబడియుండును. న్యాయమూర్తుల మేజా కెదురుగా నుండు బల్లమీద విస్గులు, గౌను

లు వేసికొన్న న్యాయవాదులు కూర్చొనియుందురు. వారొక్కరొక్కరుగా లేచి కేసుయొక్క వివరములను పూసగ్రుచ్చినట్లు ధర్మాసనమునకు వినిపించుచుందురు. అప్పుడు సభయంతయు శాంతముగా నుండవలెను. ఎవరుగాని దగ్గగూ దు; తుమ్మగూడదు; చీదగూడదు. పొరపాటున నేదేని జరిగెనచో వెంటనే ద్వారపాలకుడు ఆచేసినవాని వైపు ఉరిమిచూచును. ఒక న్యాయవాది మాటలాడుచున్నపుడు తక్కినవారు గుసగుసలాడుటగాని, ఒకరినొకరు సంప్రతించుటగాని చేయగూడదు. అందరును సద్దుగానుండవలెను. సభకు వచ్చునప్పుడు న్యాయవాదులు బయటనే క్రమముగా వారీగా వరుసదీరి, ఒక్కొక్కరుగా లోనికి రావలెను. ఉభయపక్షముల వాదనలును అయి, కేసుసంగతిసందర్భము లన్నియు ముగిసినతర్వాత న్యాయమూర్తులు తప్ప తక్కినవారినందరిని వెళ్లిపొమ్మందురు. అప్పుడు న్యాయమూర్తులైదుగురును సంప్రతించుకొని వారి తీర్పును తయారుచేయుదురు. దానిని వెంటనే ముద్రింపచేయుట కిత్తురు. ఆతరువాతనే దానిప్రతులు ఈయవలసినవారికందరికిని ఇత్తురు. ఆతీర్పేలే ఖాయము. దానికి తిరుగు మరిలేదు. ఎట్లులేదన్నను సంవత్సరమున కొకవంద అప్పీళ్లయినను అక్కడ విచారింపబడుచుండును. అప్పీళ్లుచేయువారి భవిష్యత్తంతయు లండను డౌనింగువీథిలోని ఆ ప్రాత చిన్నకట్టడము నాశ్రయించుకొనియుండును. కట్టడమేమి చేయగలదు? అదయినను ఈనాటిదా, శతమానము కడచినదే! వయోవృద్ధుకాదా మరి !!

---

## కుంకుమ పువ్వు

మనవారు కుంకుమపువ్వును మందులకును వాడుచున్నారు; పరిమళ ద్రవ్యముగాను వాడుచున్నారు. ఇతర దేశస్థులుకూడ దీని యుపయోగమును గమనించినారు; తమ దేశములందును దీనిని సాధ్యమైనంతవరకు పండించుచున్నారు. మనదేశమునందు కాశ్మీరము అనాదిగా



పొలముదున్నుట

కుంకుమపువ్వుపంటకు ప్రసిద్ధి చెందియున్నది. ఆదేశములో ఈపంట చాల ఎక్కువగా నున్నది. అక్టోబరు నవంబరు నెలలలో నీపైరు ఊదా-నీలపు పూలను పూయుచుండును. ఆపూలు గమ్మని వాసన వేయుచుండును.

ఈపైరుకు భూమిని దాదాపు ౧౫ అంగుళముల లోతు వరకు దున్నెదరు. దున్ని, మంటిగడ్డలను చిదుకగొట్టి, పెళ్లలులేకుండ మంటిని మెత్తగా చేయుదురు. తరువాత ఆనేలను పాదులుగట్టి, గనిమల నేర్పాటుచేసి, కుంకుమపువ్వు మొక్కలను రెండుమూడంగుళముల లోతునకు ఆరేడంగుళముల దూరమున కొకటివంతున వరుసలు వరుసలుగా నాటెదరు. ఈ నాటకము జూలై మొదలు ఆగస్టువరకు గల కాలములో జరుగును. ఒక్కొక్క



కుంకుమపువ్వులు

ప్పుడు సెప్టెంబరు మధ్యవరకుగూడ ఇదిపోవుచుండును. కొంతకాలమై, వానలు కొంచెము కురిసినతర్వాత నీ పైరు నాటుకొని మొలకెత్తి వృద్ధిపొందును. ఆతర్వాత



రకములవారీగా కుంకుమపువ్వును ఏరుట

ఒకవారమునకు పూత ఆరంభించును. అప్పుడు మొక్కల నిండుగానుండు పూలు చూచువారికి ఒక పెద్ద పూలసముద్రముగా కనబడుచుండును. అవిఅప్పుడు ఊదానీలముల మధ్యరంగులో నుండును. ఆతర్వాతనే ఈపైరు బాగుగా చిగిరించును. ఈపైరు మామూలుగా తొమ్మిది యంగుళముల యెత్తున కెదుగును. ఈ పైరుయొక్క పువ్వులలోని భాగములే ఎండబెట్టబడి కుంకుమపువ్వని వ్యవహరింపబడుచున్నవి. కేసరము లాకరకపు కుంకుమపువ్వు; సన్ననికాడ లాకరకపు కుంకుమపువ్వు. పూలు బాగుగా పండబారినతరువాత నారింజరంగుకు తేలును. ఇట్లు తయారైన కుంకుమపువ్వులో మేలిరకములు, తక్కువ రకములుగూడ నుండును. కుంకుమపువ్వు చాల వెలగలది. దీని ననేకవిధములుగా మనవారు వాడుచున్నారు. పర్షియా దేశములో గూడ నీపంట విశేషముగానున్నది.

---

## చీనాస్త్రీల పురోభివృద్ధి

ప్రస్తుతము చీనాస్త్రీలు నిరూపించుచుండు పురోభివృద్ధిని గాంచినచో నెంతటివానికైనను ఆశ్చర్యము గలుగకమానదు. ఒక్క ముప్పది యేండ్లలోనే అక్కడిస్త్రీలు తాతలకాలమునుండి వచ్చుచున్న ఆచార సంప్రదాయములను, కట్టుబాట్లనుపరిత్యజించి, సంఘదాస్యమును తొలగించుకొని, స్వీయ వ్యక్తిత్వమును ప్రదర్శింపగల యున్నతస్థితికి వచ్చినారు. ఈ స్వల్పావకాశములోనే చీనాదేశము ముగ్గురు నారీరత్నములను పైకిదెచ్చి వారి మహత్వమును ప్రదర్శింప జేయగలిగినది. చీనాదేశపు మహిళోద్యమమునకు ఆముగ్గురే ప్రధాన కారకురాండ్రు. వారు: డా. మేరీచాంగ్, మదామ్ సన్యత్ సేన్, మదామ్ చియాంగ్ కై షేక్.

నిజము చెప్పవలసివచ్చినచో, చీనాదేశపు ప్రస్తుతోన్నతస్థితికి ఆదేశపు స్త్రీలే, వారి ఉద్యమములే ప్రధాన కారణమని చెప్పకతప్పదు. చీనాస్త్రీలు ఇంకను ఆ ప్రాతపుంతలలోనే యుండి, పిల్లలను కనుట వంటవార్చుట మొదలగు దాస్యశృంఖలలతోనే మెలగుచున్నారని మనలో కొందరిప్పటికిని భావించుచుండుట వినవచ్చుచున్నది. కాని, అట్లు భావించువారు ప్రస్తుత చీనాను ఎరుగకుండుటయే అట్టిభావన కెడమిచ్చుచున్నది.

ముప్పదేండ్లకు పూర్వము గౌరవకుటుంబములకు చెందిన స్త్రీలు వీధులలో కనిపించెడివారు కారు. వారెల్లప్పుడును ఇంటనే కూర్చొని ఇంటిపనులను చూచుకొనుచుండెడివారు. తక్కువ జాతి స్త్రీలే అప్పుడు వీధులందు కనవచ్చుచుండిరి. ఇప్పుడో- అంగళ్లు, ప్రభుత్వ కార్యాలయ



మదామ్ చియాంగ్ కై షేక్

ములు, కర్మాగారములు, ధనాగారములు, ఎక్కడ జూచినను స్త్రీ లుద్యోగములు చేయుచుండుట చూడ వచ్చును. న్యాయవాదినులు, వైద్యురాండ్రు, రచయిత్రులు, ఉపాధ్యాయురాండ్రుకూడ ప్రబలి పోయినారు. ఆట పాటలయందును, ఉపన్యాస వేదికలు మొదలగు ప్రజాప్రబోధ కార్యములందును వారు పురుషులతో బాటు సమాన భాగ స్వామ్యమును వహించి, పురుషులకన్న నెక్కువ సామర్థ్యమును ప్రదర్శించుచున్నారు. గొప్ప గొప్ప బాధ్యతాయుత పదవులను విదేశములలో గూడ చీనాస్త్రీలు సంపాదించి, వానిని నేర్పుతో నిర్వహించుచున్నారు. అవసరము వచ్చినప్పుడు జాతీయ స్వాతంత్ర్యమును నిలువబెట్టుటకు వారు యుద్ధరంగములకుగూడ దుమికి, వైరుల నురుమాడి విక్రమసాహసములు చూపిన నిదర్శనములు చాల కలవు. చదువు సంధ్యలందు కూడ వారు పురోగమనమునే అవలంబించుచున్నారు. స్త్రీవిద్య నానాటికిని అక్కడ హెచ్చి పోవుచున్నది. కొలది యేండ్లక్రిందటి విద్యావతుల సంఖ్యకును నేటి సంఖ్యకును హస్తిమశకాంతరము కనబడుచున్నది. అక్కడి మహిళోద్యమమునకుగల ప్రధాన లక్ష్యములలో నివి కొన్ని: సంఘమునందును, ధర్మపథమునందును స్త్రీ పురుషునితో సమానముగా నుండవలెను; పనిపాటులుచేయు స్త్రీల ఆరోగ్యమును కాపాడుట కవసరమైన కార్మిక నిబంధనలు చేయబడవలెను-పురుషులకును స్త్రీలకును అవిశేషముగా కూలీ లుండవలెను; వ్యభిచారమును రూపుమాపవలెను; భర్తల నెన్నుకొనుటలో స్త్రీకి స్వాతంత్ర్య మీయవలెను; కొడుకులకును, కూతుండ్రకును ఆస్తిలో సమాన స్వామ్య ముండవలెను; రైతాంగపు యువతులకుగూడ విద్యా సౌకర్యముల నేర్పాటు చేయవలెను. ఇంతేగా వ్యక్తి స్వాతంత్ర్యమును, భావ స్వాతంత్ర్యమును అభిలషించి పోరాడుచుండుట వారు పురుషుల నెదిరించవలయునని కాని, వారిని కాదని పోవలయుననికాని కాదు. స్త్రీ సామాన్యమును అధోగతినుండి ఉత్తమ గతికి తీసికొనివచ్చుటకే వారి ఈ ప్రయత్నమంతేయు.



శ్రీమతి సన్యత్ సేన్





నేడు చీనాస్త్రీలు నాడు



చీనాదేశపు దంపతులు; సమానస్వామ్యము

చీనాస్త్రీలు వ్యాయామ క్రీడలందు కూడ అత్యంతశ్రద్ధను కనబరచుచున్నారు. దేహారోగ్యమునకు వ్యాయామ మెంత యవసరమో వారు బాగుగా గ్రహించినారు. కావుననే వ్యాయామముకూడ మహిళోద్యమములో నొక యంగమైనది. గుఱ్ఱపుస్వారి, కాలిబంతియాట, ఈత మొదలగు వ్యాయామాంగము లన్నింటి యందును చీనాస్త్రీలు పాల్గొనుచున్నారు. పాల్గొని తమ దేహారోగ్యమును చక్కబరచుకొనుచున్నారు.

ఇట్లు సర్వవిధముల యందును చీనాస్త్రీలు నేడు ఉత్తమస్థితిలో నుండి, ఇతర ప్రాచ్య దేశములకు ఆదర్శప్రాయముగా నున్నారు.

---

# ఆంధ్రమహాసభలు– బెజవాడ,

(౨౫, ౨౬-౧౦-౧౯౩౮)
౨౫-వ ఆంధ్రమహాసభ



శ్రీ కే. కోటిరెడ్డిగారు
అధ్యక్షులు.

రజతోత్సవము



శ్రీ హెచ్. సీతారామరెడ్డిగారు
ప్రారంభకులు.



శ్రీ టి. యస్. రామకృష్ణారెడ్డిగారు
అధ్యక్షులు.



కొండా. వెంకటప్పయ్యపంతులుగారు
ప్రారంభకులు

ఆంధ్రమహాసభ రజతోత్సవము



శ్రీ గద్దె రంగయ్యనాయుడుగారు
అధ్యక్షులు

ఆంధ్రలలితకళాపారిశ్రామిక ప్రదర్శనము




శ్రీ కల్లూరు సుబ్బారావుగారు
ప్రారంభకులు

౨౦-వ ఆంధ్రదేశగ్రంథాలయ ప్రతినిధులమహాసభ




శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారు
అధ్యక్షులు

# భారతీయ మహిళామండలి



శ్రీమతి బారు సత్యవతిగారు

ఈమె గుంటూరిలో మొదటి తరగతి బెంచి మేజిస్ట్రేటు. స్త్రీల రిక్రియేషన్ క్లబ్బుకు సెక్రెటరి. శ్రీ. బారు గోవిందరావుగారి అర్ధాంగి.



శ్రీ పద్మావతి (చిన్నమ్మ) గరు, గోపనునివాసి

ఈమె గ్రామపునర్నిర్మాణ, సంఘసేవా కార్యనిర్వాహణాదులలో ఇంగ్లాండున డిప్లొమా పొంది వచ్చెను.

## ఆంధ్రమహాసభలు—బెజవాడ.



శ్రీ లక్ష్మీదేవిగారు
సరస్వతీ పతాకోత్సవమొనర్చినవారు



శ్రీ గంధం అమ్మన్న రాజాగారు
జాతీయపతాకోత్సవ మొనర్చినవారు




శ్రీ వైలెట్ హారికన్య,
యం. ఏ, యల్. యల్. బి.
బొంబాయి హైకోర్టు మొదటి స్త్రీ అడ్వకేటు.
ఈమె పోలీసుకోర్టులో ప్రాక్టీసు చేయును.

---

# అజంతా



౧౬-వ గుహ. క్రీ. శ. ౬, ౭ శతాబ్దులనాటిది.



నాగరాజు. ౧౯-వ గుహలోనిది

[ఓ. జే. హాల్డేన్‌గారు 'జియోగ్రాఫికల్ మేగజీన్'లో అజంతాను గురించి ఒక వ్యాసం వ్రాసి ప్రకటించారు. దానిలోని చిత్రాలన్నీ వారువ్రాసినవే — అజంతాచిత్రాలకు నకళ్లు. ఇందు ప్రకటించిన అజంతాచిత్రాలు వాటినిపట్టితీసినవే. ఈ వ్యాసం వారివ్యాసాన్ననుసరించి వ్రాసినది.]

గుహలు దొలిచే పద్ధతిని హిందువులు బహుశః ఈజిప్టునుండి నేర్చుకొనియుండవచ్చును. వారీ విధానాన్ని వేయిసంవత్సరాలకాలం– అనుస్యూతంగా కాకపోయినా– అవలంబించారు. ఈ పద్ధతిలో వారు తమ ఉత్తమకళలో (ప్రపంచపు ఉత్తమకళలోకూడాను) చాలాభాగము జీవత్ శిలలో నిక్షేపించారు.

మనుష్యకృతములయిన గుహలు హిందూదేశములో చాలా ప్రదేశాల ఉన్నవి; వీటిలో అతివిస్తారంగాను, అతిప్రసిద్ధంగాను ఉన్నవి పడమటి కనుమలలోను, వాటి పరిసరశాఖలలోను కనబడుతవి. వీటిలో చాలా గుహలు క్రీస్తు శకానికి పూర్వము రెండవశతాబ్దానికీ, క్రీస్తుశకము రెండవ శతాబ్దానికీ నడిమికాలంలో హిందూదేశ ప్రధానమతం బౌద్ధ[illegible] దొలిచిన బౌద్ధగుహలే. తరువాతి కాలంలో బౌద్ధం తన ప్రాధాన్యం కొంత గోలుపోయినా క్రీస్తుశకం ఆరవశతాబ్దంలో గుప్తవంశజులనాటి బ్రాహ్మణమతముతోడి స్పర్ధవల్ల పౌరుషం తెచ్చుకొని అది కాలూది నిలువతొక్కుకొని మళ్లీ కొంత ఉజ్జీవనం పొందింది. అజంతాలో ఒక్కచోటే ఆ పాతకాలపు బౌద్ధకళా, ఉజ్జీవం పొందిననాటి బౌద్ధకళా రెండూ కనిపిస్తవి. కళాత్మకంగా చూస్తే అజంతాకు తగిన ప్రతిస్పర్ధి ఆ కొండలలోనే ౪౦ మైళ్ల దూరాన ఉన్న ఎల్లోరా. అయితే అక్కడ మొదట తొలిచినవని చెప్పదగిన గుహలు అజంతాలో కడపట తొలిచిన వాటికంటెను తరువాతివి. వాటిలో బ్రాహ్మణ, బౌద్ధ సంప్రదాయాలను రెంటినీ అనుసరించిన కళ చాలా

అజంతాలోను, ఇంకా ఇతరములైన హిందూ గుహో, భిన్న ప్రతిష్ఠాపనములలోను చూడనయ్యే మతము ఇప్పటికీ ఆసియాఖండ ప్రాన్దేశాలలో ప్రాభవం నెరపుతూనే ఉంది కాని అది తన జన్మభూమి అయిన హిందూదేశంలోమాత్రం వేయిసంవత్సరాలకు పూర్వమే అంతరించిపోయింది. బ్రాహ్మణుల ప్రాచీన వేద మతాన్ని నిరసిస్తూ పుట్టివర్ధిల్లిన ఆ మతం చివర కా బ్రాహ్మణ మతానికే లొంగిపోయింది; కాని బౌద్ధం లొంగిపోయిన బ్రాహ్మణమతం గౌతమబుద్ధుడు ధిక్కరించి వాదించిన . బ్రాహ్మణమతంమాత్రం కాదు. దేశంలో జనాదరంపొంది ఉన్న మతసంప్రదాయాల నిగ్గంతా తీసుకొని, బౌద్ధంలోనివే చాలా విషయాలు సంగ్రహించి తయారయిన బ్రాహ్మణమత మది. అందువల్ల గౌతముడి దేశస్థులు ఎదిరితిరిగి నిరాకరించిన అతని బోధానిరాకరణం నిజంగాచూస్తే నామమాత్రం కాని వాస్తవంకాదు.

అజంతా అనే పట్టణాన్నిబట్టి పేరువచ్చిన అజంతాకొండలలో ఒక వివిక్తమయిన కోనలో 'అజంతాగుహలు' దొలిచారు. ఆగుహాలయాల ముందరి నుంచే ప్రవహిస్తుంది వాఘోరానది. ఒక్కొక్క శిఖరంతోను, రెండేసి శిఖరాలతోను శోభిల్లే యీకొండలు ఒకదానికంటె ఒకటి యెత్తువుతూ సోపానపంక్తి క్రమాన ఉంటవి. ఇచ్చటి ప్రకృతి జలపాతాలతో కడు నేత్రపర్వంగా ఉంటుంది. ౨౫ం అడుగులయెత్తున నిట్టనిలువుగా ఉన్న ఒకరాతిలో ఈగుహలు చెక్కినారు. గుహలన్నీకలసి మొత్తం ౩౦. ముందునుంచి చూస్తే మలిచిన యీ గుహాలయాలు గుండ్రనగా అర్ధవర్తుల పరిధిలో కనబడుతవి.

ఈ గుహలన్నీ రెండు రకాలుగా ఉన్నవి; ఒకరకం ప్రార్థనాదికాలు జరపే చైత్యాలయం; రెండవ రకం భిక్షునివాసయోగ్యము లయిన గదులతోగూడిన పెద్దశాల. చైత్యాలయాల ముఖభాగం గుర్రపులాడముల ఆకారంగల తోరణాలతోను, విస్తృతమయిన శిల్పపు పనితోను అందాలుచిమ్ముతూ మనదృష్టి నాకర్షిస్తుంది. ఈ చైత్యాలయానికీ ఆదిమ క్రైస్తవ దేవగృహానికీ సన్నిహితమయిన పోలిక ఉంది. ఒక్కొక్క చైత్యాలయంలో మధ్యభాగాని కిడాపెడా అసలురాతిలో మలచిన స్తంభాలవరస ఉంటుంది. వీటిప్రక్కల ప్రదక్షిణమార్గం. వీటిలోపలి పటలభాగం అర్ధవర్తులంగా వంపుగా ఉంటుంది.దూరాన చివర ఒకచైత్యం. చైత్యాలయంలో ఇదే కడభాగం. చైత్యమునేస్తూపమనికూడా వ్యవహరిస్తారు.

అజంతాలో నున్న నాలుగు చైత్యాలయాలూ ఈ బౌద్ధనివేశ చరిత్రంతా వివరిస్తవి. వీటిలో రెండాలయాలు క్రీస్తుశకమునకు పూర్వము ఒకటిరెండుశతాబ్దాల నుంచీ ఉన్నవి; కడమ రెండూ క్రీస్తుశకం ఆరేడుశతాబ్దాల నాటివి. ఈ రెండు జతలకూ వ్యత్యాసం చాలా ఉంది. దీనినిబట్టి ఈ మధ్యకాలంలో బౌద్ధమతమే కాకుండా బౌద్ధకళకూడా ఎంతటి మార్పు పొందిందో తెలుసుకోవచ్చును. మలికాలపు చైత్యాలయాలు రెంటిలోను వెలుపలా లోపలాకూడా శిల్పాలంకారం అతివిస్తారంగా చేశారు. తొలికాలపు గుహాలలోని పెద్దదానిలో ఎక్కడా అలంకారమే లేదు. రెండవదానిలో కూడా దాదాపుగా లేదనే చెప్పవచ్చును.

ఈ రెండు జతల చైత్యాలయాలకూ తీర్పు తీరువలలోనూ, పనితనంలోనూకూడా చాలా వ్యత్యాసం ఉంది.

ఈ రెండుజతల నిర్మాణాలకూ గల మధ్యకాలంలో బౌద్ధములో గొప్పమార్పులు వచ్చినవి. ప్రధానమయిన వివి. బుద్ధప్రతిమలు చెక్కకూడదనే నిషేధశిల్పిసమయం పోయింది; హీనయానమనే శిక్షానియమ, నాస్తికతత్వ విచారసంబంధమయిన ఆదిమబౌద్ధాన్ని ఒకమాదిరి దేవతాబహుళమయిన మతంగామార్చిన మహాయానసంప్రదాయం వెలిసింది. ఈ రెండుమార్పుల ప్రాబల్యమూ మలికాలపు చైత్యాలయాలలో గోచరిస్తుంది. బోధిసత్వ పూజా ప్రధానమయిన మహాయాన ప్రాబల్యాన బోధిసత్వవిగ్రహాలు ఇచట కనబడుతవి. బుద్ధవిగ్రహాలను కూడా చూస్తాం మన మిక్కడ.

౧౯–వ గుహకడ ఆలయతోరణాన్ని కాపుకాస్తున్న యక్షజతా, పడగలతోనున్న దివ్యమయిన నాగరాజవిగ్రహమూ ఉన్నవి. పడగలతోనున్న నాగులవిగ్రహాలు అజంతా గుహాలలో చాలా కనబడుతవి. దీనినిబట్టి

చూస్తే ఈ ప్రాంతాన బౌద్ధం వ్యాపించడానికి పూర్వం నాగపూజ విశేషంగా ఉండేదేమో అని తోస్తుంది.

మిగిలిన గుహలన్నీ భిక్షుకశాలలు. ఇవన్నీ చతురంగా ఉంటవి — ౧౫ అడుగుల చతురం మొదలు ౫౦ అడుగుల చతురంకలవికూడా ఉన్నవి. ఒక్కొక్క శాలలో చుట్టూ పడకటిళ్లున్నవి. అవి చిన్నగదులు. ఈ శాలలో కూడా తొలికాలపు మలికాలపు చైత్యాలయాలకుండే భేదమే కనబడుతుంది.

నాలుగు గుహలలో మాత్రమే రంగులచిత్రములు చాలా ఉన్నవి. వీటిలో రెంటిలో (పదహారు, పదిహేడు సంఖ్యగుహలు) శిల్పమేమీ లేని అష్టభుజాత్మక స్తంభాలు రెండుచిత్రాలంకారపరిశోభితములై ఉన్నవి. మిగిలినరెంటిలోను (ఒకటవది, రెండవది), ఏమాత్రమో తయారు పూర్తికాకుండా ఉన్న మరి యెనిమిదింటిలోను అతివిస్తృత శిల్పభాసురములయిన స్తంభాలున్నవి. ఈ స్తంభాలమీదకూడా కొన్నిచిత్రా లున్నప్పటికీ ముఖ్యంగా శిల్ప విశేషానికి చెప్పవలసినవే యివి.

చిత్రాలతోమాత్రమే అలంకృత మయిన స్తంభాలు గల గుహలకంటె శిల్పస్తంభాలతో ఒప్పే గుహలు ఎంతకాలంతరువాతివో మనం వాటిలో కనబడే వ్యత్యాసాలనుబట్టే ఊహించవలసి ఉంటుంది. అజంతాలో ౧౬-వ, ౧౭-వ గుహలలోమాత్రమే అలంకారభూయిష్ఠమయిన సంస్కృత శాసనా లున్నవి. ఈ శాసనా లెప్పటివో తెలుసుకోవచ్చును. ౧౬-వ గుహలోని శాసనం కడపటి వాకాటకనృపాలుని రాజ్యమును గురించీ, వంశమునుగురించీ తెలుపుతుంది. ౧౭-వ గుహలోని శాసనంకూడా ఆరాజు రాజ్యకాలానికి చెందినదే. ఈ రాజు క్రీస్తుశకం ఆరవ శతాబ్దం ప్రథమపాదం నాటివాడు కావచ్చునని నిశ్చయంగా చెప్పవచ్చును. ఇంతకుపూర్వం ఒక శతాబ్దానికి పైగానే పాలించారు వాకాటకులు దక్కనుదేశంలో చాలాభాగం. విఖ్యాతులయిన గుప్తవంశంవారికీ వీరికీ వివాహసంబంధా లున్నవి. వాకాటకరాజుల పేరులేమో తెలుస్తవి కాని ఇక్కడ చెప్పినదీ, అజంతాలో చూచేదీ తక్క అంతకు మిగిలి వారినిగురించి యేమీ తెలియదు. హూణదండయాత్రలవల్ల ఉత్తరహిందూస్థానంలోని గుప్తసామ్రాజ్యం కూలనారంభించినకాలంలోనే కడపటిమారు అజంతా కలంకారాలు కూర్చి దాన్ని కీర్తిపాత్రం చేశారు. ఇట్లు చేయుట కారంభంచేసినవారు బహుశః స్వదేశంనుంచి శరణ్యం వెదుక్కొంటూవచ్చిన గుప్తశిల్పులు కావచ్చును. ఈ గుహలలో వాకాటకుల తరువాతికాలపు శాసనమొకటి ఉన్నా దానివల్ల చరిత్ర విషయమేమీ తెలియదు. వాకాటకుల తరువాత ఈ ప్రాంతాన రాజ్యమేలినవారు చాళుక్యులు.

చూసీ చూడగానే దేనికంటెనూకూడా నాకు అక్కజము గొల్పినదీ, సంతోషం కలిగించినదీ రెండవ గుహలోని పటల చిత్రం (లోపలికప్పుమీది చిత్రం). ఒకటవగుహలోనిదికూడా దీనిలాగే ఉంది. విషయవిస్తృతిలో దీనికంటెనూ రమ్యంగా ఉందికాని దానికి భద్రత తక్కువ. ఇందువల్లనే యేమో రెండవదానంత అద్భుతావహంగా ఉండలేదు.

౧౭-వ గుహాముఖమండపం మరొకరత్నం. చిత్రా లిప్పుడు చిత్రించినట్లు నవత వెదజల్లుతున్నవి. చిత్రాని కుండవలసిన గొప్పలక్షణాలన్నీ ఉన్నవి. ఇది ఒకచిత్రకావ్యమే. దీనిలో రచనా, అలంకారమూ రెండూకూడా ఉన్నవి. మధ్యకవాటాన్ని కాపుకాసే ఇద్దరు గొప్ప బోధిసత్త్వులూ అంతర్హితులయినారు. వారి కిరీటాల కొనభాగాలుమాత్రం నిలిచిఉన్నవి. ఈ శేషచిత్రభాగాలను బట్టిచూసే ఆచిత్రాలు చాలా శ్రేష్ఠమయినవని చెప్పవచ్చును.

నే నెప్పుడూ శిల్పకృతిలో కననేరని కాళిదాసు కవిత్వం ఈ చిత్రంలో కంటికి కనబడేటట్టు చేశారు. దీనినిబట్టిచూస్తే నాకు ఈచిత్రంవ్రాసిన చిత్రకారుడికీ ఆకవికీ కాలంలో అట్టే ఎడం ఉండదని తోచింది.

అవలోకితేశ్వరుణ్ని సేవించడానికి గంధర్వాది అప్సరోగణము వస్తున్నది. ఈచిత్రంలో పాడుతూ పుష్పమాఘ్రాణిస్తున్న గంధర్వుణ్నీ, అప్సరస లిద్దరినీ, కిన్నరులు (సగం పక్షిరూపము, సగం దేవరూపము) ఇద్దరినీ, ఇంకా వేణువూదేవారలనూ ఇతరులనూ చూడ

గలం. గంధర్వాదులపు వెనుకనుండే తెలుపులు శిలలని భావన-భారతీయుల స్వర్గమెప్పుడూ పర్వతంమీదనే ఉంటుంది గనుక.

సేవ్యమానులయిన ఇటువంటి బోధిసత్త్వులజతలు అజంతాలోని సహాకవాటాలమీద—అవి భిక్షుకశాలల వి కానీ, చైత్యాలయాలవి కానీ—కనబడుతవి. అందరికీ బాగా తెలిసినదీ, ఇప్పటికీ చాలాభద్రంగా ఉన్నదీ ఒకటవగుహ గర్భాలయం ముందరి గదిద్వారంకాపు కాస్తున్న అవలోకితుడు. బోధిసత్త్వులందరిలో అవలోకితుడు మొట్టమొదటివాడు. బహుశః తరువాతివారం దరూ ఇతని ననుసరించి యేర్పడ్డవారే. బోధిసత్త్వభావ న యిది: తాను ముక్తియోగ్యుడయినప్పటికి దానిని పొంద నిరాకరించి, సంసారంలోపడి త్రొక్కుళ్లాడే మానవ సంఘానికి ముందుగా ముక్తిలభించేటట్టు సాయపడ డంకోసం వేచిఉండే దేవత - బోధిసత్త్వుడు. అవలోకితుడనగా క్రిందికి చూచేవాడు. వంగిన ఆతల, కరుణా రసపరిపూరితమయిన ఆ వదనము - ఆభావమును బాగా తెలుపుతున్నవి. ఈ విగ్రహం - కిరీటంవరకే చూస్తే ఎనిమిదడుగులయెత్తున్నది. ఛాయ స్వచ్ఛంగా, దాదాపు రజతంగా ఉంది. ఇతనిదేవి నలుపురంగులో నున్నది తార కావచ్చును. సేవించుటకు వచ్చిన యక్షగంధర్వాది పరివారమంతా వెనుక నున్నది.

రెండవప్రక్క నున్న బోధిసత్త్వుడిచేతిలో మామూలుగా వజ్రపాణిచేతిలో ఉండే వజ్రాయుధంలేదు. అందువల్ల ఇతడు మైత్రేయుడని నాఅనుమానం. ఈ కాలంలో వజ్రపాణికి బదులు మైత్రేయుణ్ణి చూస్తాం. మైత్రేయుడు పంచధ్యానిబుద్ధులలోనివాడు కాడు. మానవ లోకంలో ముందు పుట్టబోయే బుద్ధుడతడు; అవతరింపవలసిన సమయాని కెదురుచూస్తూ అతడు తుషితస్వర్గంలో ఉంటాడు.

ఈగోడలమీద ఆకాలపు చిత్రకారులు ఉత్తమ శ్రేణికి చెందిన చిత్రాలు వ్రాశారు. ఈచిత్రాలలో కొన్ని జాతకకథలు, అనగాబుద్ధుడి పూర్వజన్మగాథలు. ఇటువంటిదే ఒకటి పట్టాభిషేకచిత్రం—జనకజాతక మేమో యిది. రాజుగానో, యువరాజుగానో చేస్తూ తీర్థోదకంతో అభిషేచనం చేస్తున్నారా రాజకుమారుణ్ణి. ఒకవేళ ఈచిత్రం బుద్ధుడిజీవితగాథకు సంబంధించిన దయినా కావచ్చును. అట్లయిన నిది సిద్ధార్థుని సర్వసంగపరిత్యాగానికి పూర్వం అతనిని రాజ్యాని కభిషేకించిన చిత్రం కావాలి. ప్రక్కగదిలోనిస్త్రీ అతని భార్య కావచ్చు. రాజాదయ కాశించి అన్నిరకాల బిచ్చగాళ్లూ వేచిఉన్నారు (౨-వ, ౩-వ పటాలు).

ఇంకో గోడమీద ఉన్నది నాగరాజుకథ. శాప వశాన్ని కాబోలు నాగరాజు ఒక గారడీవాడికి చిక్కి నాగమయినాడు. అతణ్ణి వాడిబారినుంచి తప్పించి రక్షించాడు ఒకరాజు. వెంటనే ఆనాగానికి మామూలు రూపం వచ్చింది. నాగరాజు తనకు విముక్తి నిచ్చిన రాజును తీసుకుపోయి కృతజ్ఞతతో సమ్మానిస్తున్నాడు. ఈచిత్రంలో రాజఖడ్గవాహకు డొక మ్లేచ్ఛుణ్ణీ, నాగరాజ ఖడ్గవాహకుడు ఒక నీగ్రోవాణ్ణీ చూస్తాం. ఒంటి పడగతో నాగరాజుదగ్గర ఉన్న స్త్రీ అతని భార్య. వేరొకచోట నీగ్రో ఖడ్గవాహకుని దగ్గరనున్న నాగిని పరిచారిక కావచ్చును. ఈపటం చాలా చెడి పోయినది. న్యాడాయింగులో ముఖాలలోని చాలా నైసములు అనుమేయములు (చూ. ౪-వ పటము).

ఏభయియేళ్ల తరువాతివని ఊహించే రెండవ సంఖ్య గుహలోని చిత్రాలలోకూడా సిద్ధహస్తులు - ఆ నాగరాజచిత్రాన్నీ, మైత్రేయచిత్రాన్నీ వ్రాసిన చిత్ర కారుల హస్తమే కనబడుతుంది. మైత్రేయచిత్రం వ్రాసినవారే వ్రాసిఉంటారు స్తంభాధిష్ఠానంమీద గల మనోహర మయిన ప్రేమికచిత్రాన్ని (చూడుడు: ౯-వ పటం). నాగరాజచిత్రం వ్రాసినవారు వ్రాసిం దని ఊహింపదగింది కత్తిదూసి ఉన్న రాజు సమక్షాన ప్రణమిల్లుతున్న స్త్రీసమూహచిత్రం (౧౦-వ పటం ఆసమూహంలోని ఒకస్త్రీచిత్రం).



# విమర్శనము

## నాటకమర్మము

క్రౌను ౧/౮ సైజు; ౧౫౫ పేజీలు, పీచుకాగితము, వెల రు. ౦-౮-౦.

గ్రం. కర్త: పోరంకి వేంకటసుబ్బారావు

ఈ నాటి ఆంధ్రనాటక రంగాన్ని పూర్తిగ అవగాహనచేసికొన్న దిట్ట యీకవి. నటులలో జరుగుచున్నట్టి అపకృత్యము లన్నీ యిందు వెలిపుచ్చబడినవి. వస్తువు బహుమనోహరముగ నున్నది.

"ఉపన్యాసములతోగాని, లిఖితపూర్వకముగా పత్రికలలోగాని ఏకినను వాటిని లక్ష్యపెట్టక తమ్ముగా దన్నట్లుండుటచే ముల్లుకర్రకైనను పోటునాటని పశుప్రాయులు" అని తెలుగునటులగూర్చి ఒకచో గ్రంథకర్త వ్రాసిరి. ఇందు యథార్థము లేకపోలేదు. ౧౯౩౨వ సంవత్సరమునుండి యేదో విధముగ దేశమునందు ఆంధ్రనాటక రంగమువిషయమై అలజడి జరుగుచున్నప్పటికి నటులలో సంస్కారం కలుగలేదు. చేసేదిలేక ఆంధ్రనాటక కళాపరిషత్తుకు గూడ అట్టి నటులపంచనే పొట్టబోసికొనవలసిన దుస్థితి సంప్రాప్తమైనది.

ఆంధ్రనాటక రంగాన్ని ఔన్నత్యానికి తెచ్చేవి సభలు, తీర్మానాలు కావు. ప్రదర్శనం జరుగుతున్నప్పుడే కళావేత్తలు నిష్పాక్షికబుద్ధితో రంగంపైనే విమర్శించవలెను. కళాసంప్రదాయజ్ఞులైపుడు బుద్ధిమరల్పని జనసామాన్యమునకు అప్పుడుగాని కళాభిమానులు చేసే అలజడిలో మర్మం తేటపడదు. ఈ సంవత్సరం పరిషత్తు పాడునప్పుడు కళాప్రియులు యీ విషయమై తీర్మానించి యీ మార్గంద్వారా నైనా మన నటులు త్రోవలోనికి వస్తారేమో పరీక్షించవలెను.

పండితపామరు లెల్లరు చదువతగిన గ్రంథం. ఆంధ్రనాటక కళాపరిషత్తువారు యిట్టి గ్రంథాలకు హెచ్చు ప్రచారమును కల్పించుట వారివిధి.

వ కుటుంబరావు

---

## తారుమారు

డెమ్మీ ౧/౮ సైజు; సుమారు ౧౨౦ పేజీలు, పీచు కాగితము, వెల రు. ౦-౮-౦

గ్రం: కర్త: పోరంకి వేంకటసుబ్బారావు

క్రొత్తగా వైధవ్యం పుచ్చుకున్న కామాక్షి భర్తను బలవంతపెట్టి యావదాస్తిని తనపేర విల్లు వ్రాయించుకుని పూజనీయురాలైన కోడలిని కోరంటికం పెట్టడం, డాక్టరుపరీక్ష ప్యాసై ప్రాక్టీసు చేస్తున్న కూతురుదుర్వృత్తులకు సహాయపడటం, తాను గూడ సమయంచిక్కితే పైపైరుచులు చూడటం సాగిస్తూ వుంటుంది. ఈమెకు అభం శుభం యెరగని బి. ఏ. ప్యాసైన కొడుకొకడు. సుందరం అనే వాడు గూడ తల్లి, అప్పగారు యెంత చెపితే అంత. వీనిని లోబరచుకుని కోడలును నానా అగచాట్లు పెట్టి, యింటిలోనుండి గెంటివేసి, బాగా చదువుకున్న మరొకపిల్లను వివాహంచేస్తారు. ఈమె అత్తగారికి అణగక యెదురు తిరిగి యిల్లు విడిచి పుట్టింటికి వెళ్లిపోతుంది. డాక్టరు కుమార్తె తురకను వివాహమాడుతుంది. ఇట్టి పరిస్థితులలో యింటి పురోహితుడు వైరాగివేషం ధరించి

కేరళశాస్త్రజ్ఞుని అయి కథనంతా తారుమారు చేస్తాడు. సుందరానికి జ్ఞాననేత్రం కల్పిస్తాడు. తల్లి కాశీ వెళ్లి పోతుంది. డాక్టరు ప్రాణత్యాగం చేసుకుంటుంది. సుందరం తన మొదటిభార్యగుణసంపదను తెలిసికొని తిరిగి ఆమెను రప్పించుకుంటాడు.

కథఅంతా సాంఘికమే. అసహజ ఘట్టాలు యేమీలేవు. పురోహితుడు పూనుకొనకపోతే కథకు తారుమారుండదు. పాత్రలన్నీ చక్కగ పోషింపబడి న్నవి. ...ధంగ విభజనలనుగూర్చి గ్రంథకర్త కొంచెం శ్రద్ధ తీసికొని యుండవలసినది. పాటలు, దరువులు యేమీ లేవు. స్వల్పముగ పద్యములు కలవు. సుశీల దైవసన్నిధిని, భర్తరాజు యాయవార సమయంలో మాత్రమే పద్యాలో, పాటలో వుండటం ఉచితంగాని తదితర ప్రదేశాల్లో వాటికి స్థానంలేదు. పరిశ్రమచేస్తే గ్రంథకర్త మంచి సాంఘిక నాటకాలని సృష్టించగలడని తోస్తోంది.

వ. కుటుంబరావు

---

## స్వేచ్ఛా జీవులు

క్రౌను ౧/౮ సైజు; ౭౨ పుటలు, పేపరుకాగితం. వెల ఉదాహరింపబడలేదు

రచయిత : చాపర్ల సత్యనారాయణరావు, రాజమండ్రి.

ఇదొక చిన్న నాటకం. ఈచిన్ని నాటికాప్రసూనమ్మునకు ప్రాతికశరీరము 'యాంటిగనీ' అనీ, తక్కినది ప్రకృతి వ్రాయసగాని లేఖినీవిహారము' అనీ గ్రంథకర్త వ్రాస్తున్నారు.

ఒకరాజు కిద్దరు కొడుకులు, యిద్దరు కూతుళ్లు. రాజు మరణించును. రాజ్యంకోసం యిద్దరన్నదమ్ములు దెబ్బలాడుకుని యుద్ధంలో మరణిస్తే మేనమామ రాజై వచ్చిన తన మేనల్లుని కళేబరాని కెవ్వరుగాని దహనసంస్కారం చేయరాదని, ఆ శవాన్ని అల్లే కాకులు గ్రద్దలు నక్కలు పొట్టను బెట్టుకోవలెనని, దహనసంస్కారాని కుపక్రమించినవారు దండనీయులని ఆజ్ఞ చేశాడు. రాజాజ్ఞ తిరస్కరించి దహనసంస్కారం జరిపించటానికి ఒకసోదరి ప్రయత్నించి ఖైదుచేయబడుతుంది. ఈమెకు మేనమామకుమారునికి సంబంధం. ఈ కారణాన దహనసంస్కారం చేయకూడదనటం అధర్మమని యీతడు గూడ వాదిస్తాడు. రాజాజ్ఞ జవదాటకం సమంజసం కాదని, రాజు నెదిరించినద్రోహిని మోహించటం తప్పు అనీ, తండ్రిమాటను మన్నించటం ధర్మమనీ కొడుకుకు బోధిస్తాడు మంత్రి. దహనసంస్కారం జన్మహక్కు అనీ, రాజాది అధర్మమనీ, ఆమెను విడువనని కొడుకుపట్టు. ఈ సమయంలో ఆమె ఉరివేసికొని మరణిస్తుంది. ఇది తెలిసి రాజకుమారుడు ప్రాణత్యాగం చేసికొంటాడు. కొడుకుమరణవార్త విని తల్లి ప్రాణముల వదలుతుంది. ఈవిపత్తు చూడలేక రాజే స్పృహ తప్పి పడిపోవును.

ఇంచుమించుగ మూలంలోని కథకూడ యింతే. అయితే యిన్ని మరణాలున్నట్లగుపడదు. బహుశః వీరు కల్పించియుందురు. ఈగాథలో ధర్మాధర్మములకు సంకులసమరం. చివరకు ధర్మమూ నెగ్గలేదు, అధర్మమూ నెగ్గలేదు. రాజుసంకల్పమే నెగ్గింది. శవమునకు దహనసంస్కారము జరుగనేలేదు. కాకులు గ్రద్దలే భక్షించి నట్లున్నవి.

పాత్రలన్నియు చక్కగ పోషింపబడినవి. ఉచితమగు భాషగూడ వాడబడినను అక్కడక్కడ సంస్కృతాంధ్ర సమ్మేళనముతో "నిరంకుశతుపాను, అధర్మసవాలు" మొదలైనవి ప్రయోగింపబడి కొంతకుంటును దెచ్చుచున్నవి.

ఈ గ్రంథకర్తకూడ స్వేచ్ఛాజీవివలె కనపడుచున్నాడు. పూర్వకవుల పద్యాంతములంటే వీరికి యేవగింపు కాబోలు. ఈ గ్రంథాన్ని తమ బాబాయికి, పిన్నికి అంకితమొనర్చిరి. వారినామాక్షరముల నుదాహరింపకపోవుటలో గ్రంథకర్తయూహ యేమిటో తెలియకున్నది. పూర్వకవుల పద్యాంతములం దుపయోగము లేకపోలేదని గ్రంథకర్త గ్రహింపవలెను.

"గ్రంథమునకు పీఠిక వ్రాయుట బంట్రోతు ముందునడచుచుండ అనుసరించు ఉద్యోగిదర్జావంటిది" అని

వ్రాసిరి. ఇది విపరీతార్థబోధకముగా నున్నది. గ్రంథము నకు పీఠిక వ్రాయుట ఉద్యోగిముందు లాంతరు చేత బూని త్రోవజూపుటకయి బంట్రోతును పంపుట వంటిది అంటే అర్థంఉంటుంది. పీఠికచదివేసరికి గ్రంథ స్థవిషయము కొంత అవగాహన కావాలి.

గ్రంథకర్త నాటకసంప్రదాయమును, నాటకోప యోగమును బాగుగ గ్రహించి రాబోవు నాటికలను వెలువరించినచో అవి ప్రజాదరము పొందగలవనియే నమ్మిక.

వ. కుటుంబరావు

---

## త్రిమూర్తుల టాకీ

డెమ్మీ ౧/౮ సైజు; ౭౮ పేజీలు, పీచు కాగితం, వెల చెప్పలేదు.

గ్రంథకర్త: పోరంకి వెంకటసుబ్బారావు.

ప్రకాశకుడు: చెరుకువాడ వేంకటరామయ్య, రాజమండ్రి.

తెలుగుసినీమాకళ యేవిధంగా ధనాశాపరుల చేతులలో భ్రష్టమవుతోందీ యీకృతికర్త హాస్యధోర ణిలో నాటకరూపంగా రచించిన గ్రంథం ఈ "త్రిమూ ర్తులటాకీ." మదరాసులో స్టూడియోలు వెలిసిం తరు వాత పరిస్థితు లెలావున్నాయో గాని తెలుగుటాకీల యొక్క ప్రథమదశలో నటులు బొంబాయి, కలకత్తా, పూనా, కొల్హాపురం వగైరా పట్నాలలో గల స్టూడి యోలకు తోలుకుపోబడినప్పుడు వారు పడిన అగచాట్లు గ్రంథకర్త కేవలం స్వానుభవంమీద వ్రాసినటు లున్నవి. ఇంతే కాకుండా అక్కడి ప్రొడ్యూసర్ల సంకుచితదృష్టి, తియ్యనికబుర్లు యిక్కడ చెప్పి ఆక్షేపాం తాలకు తోలుకువెళ్లిన డైరెక్టరు మడతమాటలు, సున్నకుసున్న హళ్లికిహళ్లి చెయ్యటం, అసంబద్ధ ప్రలాపాలు, ప్రొడ్యూసర్లు కళపై రవ్వంతైనాకూడ శ్రద్ధ నిల్పకపోవటం మొదలైనవన్నీ యథాతథంగా నిరూ పింపబడినవి. ఈ గ్రంథ భాగమంతా కొంతకాలం క్రిందట 'భారతి' పత్రికలో ప్రకటింపబడినదే!

పాశ్చాత్య దేశాలలో యీ కళ యెంతో ప్రాముఖ్యము వహిస్తూ, పంచేంద్రియాలను యేకకాలం లో తృప్తిపరచగల టాకీలు తయారవుతుంటే చదవవేస్తే ఉన్నమతికూడ పోయినట్లు మన తెలుగుప్రొడ్యూసర్లు క్రొత్తసంగతులు అనుభవానికి తెచ్చుకుని కళను అభి వృద్ధిపరచుకోవటానికి బదులు భ్రష్టపరచుకొంటు న్నారు. ఈనాటి స్థితిగతుల్ని పరామర్శిస్తే మరొక్క సంవత్సరంలో తెలుగునాడులో సినీమా ప్రొడక్షను సంపూర్ణంగా అంతరిస్తుందేమోనని తోస్తోంది. కొందర పడకపోతే చేతులార ధ్వంసం నిశ్చయము.

వ. కుటుంబరావు

---

## సర్వలక్షణసంగ్రహః

భిక్షు గౌరీశంకరసంగృహీతము. పాకెట్ సైజు. ౧౬౦ పుటలు. వెల నాలుగణాలు. ప్రకాశకురాలు: శ్రీ మనభరీదేవి, పుట్టీగ్రామము, భవానీఖేడపోస్టు, హిసారా జిల్లా, పంజాబు.

ఇందు వేద, వేదాంగ, శాస్త్ర, కావ్యాదులలోని లక్షణములు వీలగునంతవఱకును సంగ్రహింపఁబడినవి. వివరణములతోఁ గూడిన యీలక్షణము లిందు ౩౭౩౧ కలవు. సంస్కృతమున సర్వశాస్త్రములందును కొను పాటి లక్షణజ్ఞానమును సంపాదింపఁదలఁచువారికి ఈ చిన్నపుస్తకము మిక్కిలి ఉపయోగకరము. ఈరీతి లక్షణసంగ్రహ గ్రంథములలో ఇదియే మొదటి పుస్తక మని చెప్పవచ్చును.

ఇందుఁ జేరని లక్షణములు ఎన్నియేని కలవు. కాని 'సూక్ష్మములో మోక్షము' సంపాదింపఁదలఁచు వారి కిది చాలును.

అమూల్యమగు నీ చిన్నపుస్తకము అందఱికి అందుబాటులో నుండుటకు వెల నాలుగణాలే నిర్ణయిం పఁబడినది. లక్షణజిజ్ఞాసువు లీ యవకాశమును సఫలము సొనరించుకొందురుగాక!

బు. వేం. శ.

---

## అపరాధి యెవరు ?

సాంఘికనవల. గ్రంథకర్త: కేతవరపు రామకృష్ణ శాస్త్రి డెమ్మీ ౧/౮ సైజు, ౧౦౬ పుటలు. వెల ౧౨ అణాలు. ప్రకటనకర్త: కురుకూరి సుబ్బారావు, ప్రొప్రయిటరు, సరస్వతీ బుక్ డిపో, బెజవాడ, కృష్ణా జిల్లా.

ఇది 'పాఠశాలలయందు విద్య నభ్యసించుటవలన బాలికలు చెడిపోదు'రను ఆశయమున సుఖాంతముగ వ్రాయఁబడిన నవల. పాత్రల నడువడులబట్టియు, పేరులనుబట్టియు నిది యొక హిందీనవల కనువాదమని తోఁచుచున్నది. కాని గ్రంథకర్త ఆ యంశమును తెలుపలేదు. ఇందలి భాష పాత్రానుసరణముగ కాక గ్రాంథికముగ నున్నది.

మన దేశము దీనావస్థ పొందుటకు నిరక్షరాస్యత ప్రధానకారణ మనియు బాలికా ప్రపంచమున విద్యాభ్యాసమును విస్తరింపఁజేయవలెననియు నేఁటి విద్యాధికుల ఆశయము. అది ఆమోదనీయము. కళాశాలా విద్యాభ్యాసముపట్ల బాలికలగూర్చి అభిప్రాయభేద మున్నను పాఠశాలలలోఁ జదువుటకు విద్యాధికుల యాక్షేపణ లేశమును లేదు. మొలక లెత్తుచున్న స్త్రీవిద్యను గ్రంథకర్త యిందు నిరసించుచున్నారు.

ఎనిమిదవ తరగతి—లేక—మూఁడవ ఫారము వఱకు బాలికలు చదివిన చాలునని గ్రంథకర్త అభిప్రాయపడుచున్నారు. కాని వారి కాపాటిచదువు చాలదు. ఆఱవఫారము వఱకును చదివినగాని వారికి తగుపాటి జ్ఞానము కలుగదు. మూఁడవఫారము ప్యాసయినవఱకు మంచి నడత గల బాలికలు మఱి మూఁడేండ్ల విద్యాభ్యాసమున చెడిపోదు రని తలఁచుట కాధారము లేదు. వారి జ్ఞానమును అభివృద్ధిని పొందును.

ఈ నవలయం దొక బాలిక స్కూలుఫైనలు వఱకును చదివి కోరినమగని పెండ్లాడి, తన నగలకొఱకును, వేషముకొఱకును మగనిని పీడించి, గృహకృత్యములం దత్తగారికి సాయపడక మగనిస్నేహితునితో మాటలాడుచుండినదని వర్ణింపఁబడినది.

ఈ కాలమున చిన్నకథల కున్న ప్రాముఖ్యము నవలలకు లేదు. ఎక్కువవ్యయముతో, కష్టనష్టములతో, వందలకొలది పుటలతో భాషాంతరీకరణరూపముగ వెలువడు నవలలు చేయలేని ప్రబోధమును తక్కువవెలలు గల నేఁటి చిన్నకథలే యొసరింపఁజాలియున్నవి. కావుననే నవలలను ప్రకటించు పెక్కు గ్రంథమాలలు మూలఁబడినవి. ఇప్పటి నవల మెప్పును గడించి ప్రచారము నొందవలెనని న అన్నివిషయములను ఉత్తమమై యుండవలెను.

మన దేశపు దౌర్భాగ్యమునకు స్త్రీలు వెనుకబడుట ఒక ప్రధానకారణము. విద్యాభ్యాసమువలన బాలికలు చెడిపోవుదురను దురభిప్రాయము స్త్రీలలోనే కాదు- పురుషులలోఁగూడ ప్రబలియున్నది. ఇట్టి సమయమున నిరక్షరాస్యతను తొలఁగించి మహిళాలోకమున విజ్ఞానాంకురములను వెదచల్లు నాశయములను ప్రకటించు నవలలే (స్త్రీ లెక్కువగ వానినే చదువుదురు గనుక) ఆవశ్యకములు.

విద్య నేర్వనినాఁడు బాలికకు విజ్ఞానము కలుగదు. విజ్ఞానహీనురాలు గృహకృత్యములను నెరవేర్చుటకు సమర్థురా లగుట దుర్లభము.

ర.

---

## రాధికాసాంత్వనము, సప్తపదులు

శృంగారకావ్య గ్రంథమండలి ప్రబంధ పరంపర ౧. శ్రీ ముద్దు పళని ప్రణీతములు. డెమ్మీ ౧/౮ సైజు.

౨౯ + ౧౭౭ పుటలు. వెల మెంబరులకు మాత్రము, ౧౨ అణాలు. ఇతరు, లెంత వెలయిచ్చినను విక్రయింపఁబడవు. ప్రకాశకులు శృంగారకావ్య గ్రంథమండలివారు, మచిలీపట్టణము.

రాధికాసాంత్వన మీవఱకు శ్రీమతి బెంగుళూరు నాగరత్నముగారిచే ప్రకటింపఁబడినది. సప్తపదులలో ఉపలబ్ధములను, వానితోఁబాటు అనుపలబ్ధములకు స్వీయాంధ్రీకరణములను విపులమగు పీఠికతో

శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు పెక్కేండ్లక్రిందటనే వెలువరించినారు. కాని ఆ రెండు గ్రంథములును ఇప్పు డనుపలబ్ధములే. శృంగార గ్రంథప్రకటనమున తెలుగుతల్లిని సేవింపఁదలఁచుకొన్న శృంగారకావ్య గ్రంథమండలివారు పళనికృతులగు పయిగ్రంథములను ఒకే గ్రంథముగ శ్రీ వెంపటి నాగభూషణంగారి 'రససమీక్ష'లతో ముద్రించి గ్రంథమాలా సభ్యలోకమున కందఁజేయుచున్నారు.

నవలామణుల హృదయము నవనీతమువంటిది. కావున వారికవిత పురుషుల కవిత్వమువలె శబ్దగాంభీర్యము, అన్వయక్లేశము లేక మృదులమయి హృదయావర్జకముగ నుండును. తక్కిన కావ్యములగతి యెట్లున్నను శృంగారకావ్యములను రచించుటకు వారే తగినవారు. అందును 'యౌవనవతులు, సకలకళాప్రౌఢలు సర్వంకషరాసిక్య నిధానములు' అను వెలయాండ్రదే అందందెవేసిన చేయి.

మగవారి శృంగారవర్ణనము కచ, కుచాద్యవయవములతో నారంభమయి, సమ, విపరీతరతములతోను, పునారతులతోను అంత మొందును. ఎన్నిమాఱులు శృంగారవర్ణనమునకు సమయము లభించినను ఇదియే పద్ధతి.

స్త్రీల శృంగారరసవర్ణనము మోటుగ నుండదు. అది 'రోకళ్లపాట'యును గాదు. వారి రచనయందు పద్యములన్నియు శృంగారరస గుళికలు! పోకడలు వింతవింతలు! మనసుకెక్కిన వర్ణనలు! సంభాషణలు, వాదులాటలు సాటిలేనివి. పళని శృంగారవర్ణనమున మితి మీఱినను సరసతకు లోపము లేదు. మితిమీఱిన వర్ణనమునను మితిమీఱిన మార్దవము! అవియే పురుషవర్ణితము లయినచో ఎంత వ్రీడాకరము లయిన అయియుండును.

యశోదా నందులు కృష్ణుని గారాబముతో పెంచుకొనుచుండిరి. నందుని చెల్లెలు రాధ 'గోపసతుల కెల్ల కుసుమశరుఁ'డైన 'రాజగోపాలమూర్తి'ని వశము చేసికొని హరికే ప్రాణపదమై స్వైరవిహారము చేయుచుండెను. యశోద సోదరుఁడగు కుంభకుని కూఁతురు ఇళ మాధవుని మహిళ. మేనత్తవద్ద చనవుచేత ఇళ వ్రేపల్లెయందే యుండి రాధపోషణమున పెరుగుచుండెను. ఇళ కొన్నాళ్లకు కాపురమునకు వచ్చినది. కొన్నాళ్లకు కృష్ణుఁడు భార్యతోఁగూడ అత్తగారింటికి వెళ్లినాఁడు. రాధ మాధవుని విరహమును సహింపలేకపోయినది. ఆమెకు ఇళపై ఎక్కువగ అసూయగలిగినది. రాధ చిలుకను రాయబార మంపినది. అది మిథిలకుఁ బోయి తన కృత్యమును నెఱవేర్చి, అచటి విలాసములను రాధకు తెల్పినది.

రాధా విరహము మాధవునకును దుర్భర మయినది. అతఁడు రాధవద్దకు రాఁగా తొలుత నామె ప్రణయకోపము వహించును. క్షమించవలెనని అతఁడు పాదములంటగా అతనిని తన్ని పిదప వలవల విలపించును. తుదకు నాథునికౌగిట పరవశురా లగును.

ఇందలి కథాంశ మిది—వర్ణనలతోఁ గూడిన పయి కథ యిందు నాలుగాశ్వాసములలో పెంచఁబడినది. ముద్దులు మూటగట్టు ముద్దుపళని కవితాస్రవంతిలో పడిన వర్ణనములు విపులము లయినను విసుపు జనింపదు.

శృంగారగ్రంథమండలివారి యీ కూరుపు చాల వఱకు పరిశోధితమయి చక్కఁగ ముద్రింపఁబడినది. పీఠికారూపములగు 'రససమీక్ష'లయందు విమర్శనము క్రొత్తపోకడలుపోయి సహృదయరంజకమయి ఉన్నది. అందు గ్రంథకర్త్రింగూర్చి, గ్రంథకథాంశములంగూర్చి, కవిత్వమునుగూర్చియు చక్కని విషయములు వివరింపఁబడినవి.

ఈ గ్రంథమున నందందు అధస్సూచికలందు '[మూ]' అను సంకేతమున కొన్ని పాఠాంతరము లీయఁబడి యున్నవి. ఆ సూచికనుగూర్చిన వివరణ మెచ్చటను లేదు; కాని 'మూలపాఠము' అని యూహించుటకవకాశ మున్నది. ముద్రిత పాఠములకంటె ఆ మూల పాఠములే చాలచోట్ల అనుగుణములు, మచ్చునకు కొన్ని—

ఆశ్వా ౧. ప. ౭౫. న మూలపాఠము 'మునినాథ! విన్నపం + బొక్కటే హరికథ' అనునది.

ఇచటి అఖండయతిని మార్పఁ దలంపునఁ గాఁబోలు ముద్రితపాఠము 'మునినాథ! మను నేను బొందుగా హరికథ' అని మార్పఁబడినది. ఈ పాఠమున యతి మారినను 'బొందుగా' అను ఎక్కువపదము ప్రవేశింప వలసివచ్చినది. ఇట్టి కూరుపు పలనికవిత్వమున పరిపాటి కాదు.

ఆ. ౧. ప. ౭౪ న మూలపాఠము 'ముద్దియల నందు జాగరం బుండఁ బనిచి' అనునది. ముద్రితపాఠము 'యుగ్మలుల నందు జాగరం బుండఁబనిచి' అని. యతి మార్పునకే యీ మార్పు చేయఁబడియుండవలెను. 'యుగ్మలుల' కంటె 'ముద్దియల' అనునదే ముద్దులు మూటగట్టు పదము.

ఆ. ౧. ప. ౭౮ న మూలము 'ముదితయొక్కతె మేలిమి ముసుఁగొసంగె' అని యున్నది. గ్రంథమున దానికి బదులు 'పడఁతియొక్కతె యసరు ధూపంబు నైచె' అని యున్నది. ఈ పద్యపు తొలి సీసపాదమున 'పరిమళంబుల ముట్టికురు లార్చె నొకభామ' అని వర్ణింపఁబడుటచే తిరిగి అగురుధూపపు ప్రసక్తి అనావశ్యకము. ఔత్తరాహుల సంప్రదాయసిద్ధ మగు 'మేలిముసుఁగే' అపేక్షణీయము.

౧. ఆ. ప. ౧౩౪ ముద్రితగ్రంథమున క్రిందిరీతి నీయఁబడినది.

'గీ. చేరి యందాక వారు చాళీలిబంధ
గతులఁ బెనఁగి చాలక పునా రతులఁ గలసి
బడలికలు దీర నొక్కింత పవ్వళించి
మదవతీకృష్ణు లప్పుడు నిదురలేచి.'

మూలపాఠ మీ క్రిందిరీతిది:

గీ. 'చేరి యందాకఁ బెనఁగు చాళీలిబంధ
రతులు చాలక మఱి పునారతులఁ గలసి'

..............................

ఇచట మూలపాఠమే సరసము. ముద్రణమున కర్తృపదము పునరుక్తము.

ఆ. ౨. ప. ౧౧౩ గీతపద్యపు మొదటిపాదము 'రతుల నేనేలఁ దా సమరతుల నేలె' అని ముద్రితపాఠము. మూలపాఠము 'రతుల నే నేలఁగా నను రతుల నేలె' అనునది. ఇచట మూలపాఠమే యుచితము. ఒకరు రతుల నేలినచో రెండవవారును రతులనే యేల వలెను. 'సమరతుల' నేలుట సామ్యమునకు సరిపడదు. ఈ పద్యమున వ్యతిరేకరహిత మగు సామ్యమే ఉద్దిష్ట మను నంశము 'నేను ముద్దులు పెట్టఁ దాను ముద్దులు పెట్టె తెఱవ నీదు ఋణంబు తీరె నను' మొదలగు సీసపాదములవలనఁ దేలుచున్నది.

ఆ. ౨. ప. ౧౩౫ చివరిపాదము ముద్రితపాఠమున 'పదక మెద మీఁఱ బంగారుపటము జాఱ' అని కలదు. మూలమున 'పదకమె యెదయందు మదనుండు విరియఁబాఱ' అని కలదు. ముద్రితపాఠమున క్రియ లోపించినది. ఆ పాఠము నంగీకరించినచో తరువాతి పద్యమునఁ గల 'ఇటు లేతెంచిన శౌరిరాకఁ గని య య్యేణాక్షి' అనుదానితో అన్వయము కుదురదు. కాన మూలపాఠమే శరణ్యము.

ఆ. ౩. ప. ౭ న ముద్రణమున 'రామా యట్లనె కాని పంచిపని రారాసేల? యేమాయె' అని కలదు. మూలపాఠము మాత్రము 'రామా యట్లనె కాని మంచి పని మేలాయెన్ మఱేమాయె?' అని కలదు. యతి భయముననే ముద్రణపాఠము మార్పఁబడి యుండవలెను.

ఆ. ౪. ప. ౪౩ న 'అటు మోహమై విని నట్లుండిన మరలంజని శౌరిని జేరి' అని ముద్రితపాఠము. ఇందు కర్త లేదు. మూలమున 'అటు మోహమైనను చూచి చిలుక వేగమె చని శౌరిని జేరి' అని యుచితముగ నున్నది.

ఆ. ౪. ప. ౧౦౮ గీతమున ముద్రితపాఠము 'జేరి మరుబారి నలసిరి కొమరుమీఱి' అని యున్నది. మూలమున 'కూడి మరుకేళి సలిపిరి కోప మారి' అని కలదు. మూలపాఠపు ఔచిత్యము సహృదయుల కెఱుకపడనిది కాదు.

ఇట్టి మూలపాఠములనే గ్రంథమునఁ జేర్చి వలయుచో ముద్రితపాఠముల నధస్సూచికల క్రింద నిచ్చినచో ఈ గ్రంథ మింకను రాణకెక్కియుండెడిది.

'సప్తపదు'లకు మూలము శ్రీ ఆండాళమ్మ ద్రావిడమున రచించిన 'తిరుప్పావై' పాసురములు. ఒక్కొక్క పాసురమున క్రింది ఏడు చరణములు గల పద మనువాదము.

గోపికలు కృష్ణుని విరహమును సైఁపలేక తెల్ల వాఱుజామున ఒకళ్లొకళ్లను మేలుకొలిపి శ్రీకృష్ణు నందఱును చేరఁజనుట ఇందలి ప్రధాన కథాంశము. మూలమునందలి పదిపాసురములకే అనువాదము లభించి నవి. పళని పది పాసురములను మాత్రమే అనువదించి యుండునని 'రససమీక్షకు'ల ఆశయము. వారి యూహ కాధారము లపేక్షితములు.

'శ్రీ శాస్త్రిలవారు...సుద్దుపళని పద్ధతిని అను సరించి 'సప్తపదు'ల మిగతా గ్రంథమును పూరించ కుండా, ద్రావిడగాథలకు వివరణం వ్రాసి ఊరుకున్నా —ప్రమాదమేమీ ఉండేది కాదు....'

అని శ్రీ నాగభూషణంగారు శ్రీ ప్రభాకర శాస్త్రిలుగారి అనువాదమునుగూర్చి కొంచెపు టసం తృప్తిని వెల్లడించినారు. శ్రీశాస్త్రిలుగారి అనువాదము లేనిచో మనకు ఇంతవఱకు పూర్తియగు అనువాదమే లభింపకపోయెడిది. రచనలో రెండిటికిని కొంతభేద మున్నను రసములో అది కానరాదు. పీఠికారచయితలు అనుకొనిన ప్రమాద మేమో!

మన ప్రభుత్వమువారు పెక్కేండ్లక్రిందటనే శృంగారగ్రంథప్రకటనమునుగూర్చి నిషేధపు టుత్తరు వును జారీచేసియున్నారు. ప్రాజ్ఞులకుమాత్ర మమ్మ పద్ధతిపయి కొందఱుప్రకాశకులకు అనుజ్ఞనిచ్చుటయు కలదు. ఇట్టిగ్రంథములు జనసామాన్యమున కందుబా టులో నుండినచో ముప్పుకలుగునని వారి అభిప్రాయమై యుండవలెను. ఇయ్యవి జనసామాన్యమున కందు బాటులో నున్నను నష్టము లేదు. సామాన్యులకు వీని నర్థముచేసికొనుపాటి జ్ఞాన ముండు టరుదు. జ్ఞానమున్నవారు వీనిని సద్వినియోగమునకే ఉపయో గింతురు. ప్రభుత్వపు టుత్తరువువలన పెక్కు ప్రాచీన (శృంగార) గ్రంథములు మూలపడి బూజుపట్టి యున్నవి. కొలదికాలమున కవి నామావశిష్టములగుట తప్పదు. కావున హేయ, జుగుప్సా కలుషితములు కాని శృంగారరస విలసితములగు కావ్య, ప్రబంధములపయిఁ గల యానిషే ధపు టుత్తరువును రద్దుపఱచుట ప్రభుత్వమువారికి విధి యైనది.

కొలఁదికాలముక్రిందట మద్రపురమున నుండిన 'శృంగార గ్రంథమాల' కొన్ని ప్రబంధములను ప్రక టించి భాషాసేవ నొనరించినది. కాని అందలి కావ్య ములు స్వరూపమునను ఎక్కువ అందచందములను గూర్చుకొని ఎక్కువవెలకుగాని చిక్కకుండినవి. ఏ వెలకైనను గ్రంథములు లభించు ననుకొన్న—ఇపు డా గ్రంథమాలయే లేకుండపోయినది.

శ్రీ శృంగారకావ్య గ్రంథమండలివా రాలో చించి, గ్రంథముల వెలలను తగ్గించి, ఉన్నంతలోనే పుస్తకమును చక్కగ ముద్రించి పయిలోపములను తీర్చి భాషాసేవ ఒనరించుట ఎంతయు ప్రశంసనీయము.

బు. వేం. ర.

---

## గేయగుచ్ఛము

గ్రంథకర్త: సబ్నివీసు గురునాథరావు, వినుకొండ. వెల ౦-౮-౦.

గ్రంథకర్తగారు ఆంధ్రలోకమునకు చిరపరిచయులు. వారి రచన లప్పుడప్పుడు పత్రికలందు ప్రచు రింపఁబడుచు నామోదముం గూర్చుచుండెడివి.

కవితావేశమున వీరు వ్రాసిన గేయముల సంపు టమే గేయగుచ్ఛము. అతివిశాలభావములు చక్కని యింపగుశైలిలో చిత్రింపఁబడినవి. హృదయసంచలన మొనరించి యానందమొడగూర్చు విషయసముదాయము. కవిగారి యాధ్యాత్మిక భావములు, జాతీయభావములు, ప్రకృతివిచారణలు అన్నియు సుబోధకముగా వ్యక్త ము లైనవి.

కాని విషయవిభజనము మాత్రము చక్కగా లేదు. ఆధ్యాత్మిక విషయ మంతయు ఒకప్రక్కనను, దేశీయభావములన్నియు మరొకవైపునను విభజించి.

యుండిన కలగూరగంపగా తోపక బాసుండియుండును. కాని కవిగారు దేశభక్తులు దైవభక్తులగుటచే రెంటికి యభేదమును పాటించి మిళితముచేసియుందురు. Spiritualisation of politics అనగా రాజకీయమును ఆధ్యాత్మికముగా జేసివేయుభావము లిందు విశేషముగాఁ గానవచ్చుచున్నవి.

"జ"

## గ్రంథస్వీకారము

### శ్రీ బ్రహ్మానందలీలలు (నాటకము)

డెమ్మీ ౧/౮ సైజు. పు. ౧౪౦; వెల రు. ౦-౧౨-౦
గ్రంథకర్త: వడ్డెపాటి నిరంజనశాస్త్రి
ప్రకాశకులు: సుందరరాం అండ్ సన్సు, తెనాలి.

### ౧. శ్రీ రాజా వేంకటకృష్ణారావు బహద్దరువారి జీవితము

క్రౌను ౧/౮ సైజు పు. ౧౪౦

### ౨. రామకోటీశ్వర తారావళి

క్రౌను ౧/౮ సైజు. పు. ౧౦
పై రెండుగ్రంథములకును కర్త: వాజపేయయాజుల రామసుబ్బారాయడు బి. ఏ., కొల్లాపురము.

ప్రకాశకులు: ప్రెసిడెంటు, స్నేహలతాకవితా సంఘము, కొల్లాపురము, మొరవకొండపోస్టు, కర్నూలుజిల్లా.

### కలిక (కథామాలిక)

పూల్సుకేప్ ౧/౮ సైజు, పు. ౧౧౭ వెల౦-౮-౦
గ్రంథకర్త: బొడ్డు బాపిరాజు.
ప్రకాశకులు: యువకార్యాలయము, తెనాలి.

### నన్నిచోడదేవ కుమారసంభవ విమర్శనము

రాయల్ ౧/౮ సైజు. పు. ౨౦౮. వెల రు. ౨-౦-౦ (౧౯౩౭.)
గ్రంథకర్త: శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రి, ఆంధ్ర సహోపన్యాసకుడు, ఓరియంటల్ రీసర్చి ఇన్‌స్టిట్యూట్, మదరాసు యూనివర్సిటీ, మదరాసు.

### ఆంధ్రసాహిత్య పరిషత్తు రజతోత్సవ సంపుటము

రాయల్ ౧/౮ సైజు. పు. ౫౬+౨౬౫+౩౨.
ఆంధ్రసాహిత్యపరిషత్తు, కాకినాడ - ౧౯౩౭.

Printed and Published by K. Nageswara Rao,
at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St., Madras. Editor:—K. Nageswara Rao.

# విషయసూచిక



# చిత్రములు

# కాంగ్రెస్ చరిత్ర

ప్రతు లైపోవుచున్నవి. త్వరపడవలెను.

పట్టాభి శీతారామయ్యగారి యింగ్లీషు గ్రంథమునకు తెలుగు అనువాదము

## ప్రతి 1 కి ధర రు. 2–8–0.

కొద్ది ప్రతులుమాత్రమే తయారయినవి గాన ఆశాభంగము కలుగ కుండుటకై తక్షణమే ఆర్డరులను పంపుకొనుడు.

వర్తకులకు, ఎక్కువ ప్రతులనుతీసుకొను వారికి ప్రత్యేక సదుపాయముకలదు.

ఈ ప్రతులు ఆంధ్రపత్రిక ఏజెంట్లు అందరివద్దను దొరకును.

మేనేజరు:—ఆంధ్ర గ్రంథమాల, 7. తంబుశెట్టి వీధి, మద్రాసు.

# "ఎలక్షన్లు"

## ఎన్నికలకు సంబంధించిన యావద్విషయములు తెల్పు తెలుగు గ్రంథము

వెల రూ. **2-8-0**

శాసనసభల ఎన్నికలు, జిల్లాబోర్డుల మునిసిపాలిటీ పంచాయితీల ఎన్నికలున్ను, విశ్వాసరాహిత్య తీర్మానములున్ను, ఎలక్షను విచారణలును, ప్రెసిడెంటు–వైస్‌ప్రెసిడెంటు ఎన్నికలు మున్నగు విషయములగూర్చి యిందు విపులముగా వ్రాయబడియున్నది.

గ్రంథకర్త: అవసరాల వెంకటనర్సు, బి. ఏ., బి. యల్., వకీలు

ఓటరుజాబితాలు మొదలు మెంబరు ఎన్నిక పూర్తియగువరకు అమలులో పెట్టు న్యాయశాస్త్రవిధాన మంతయు నీగ్రంథమున సులభశైలిని విశదీకరింపబడియున్నది.

ఆంధ్రగ్రంథమాల, 7, తంబుచెట్టి వీధి, మద్రాసు.



సంపు ౧౪ ఈశ్వర, మార్గశీర్ష మాసము ( డిశంబరు 1937 ) సంఖ్య ౧౨

# పెండ్లిసందడి

పెమ్మరాజు లక్ష్మీపతి

కృషికమిత్రమా! చల్లని మృగశిరాప్ర-వేశ సుముహూర్త మదె; వినువీథి నీలి
జిలుగుమొయిళుల మేల్కట్లు జీరువారె, - రోహిణీశార్ద్రనహ్నా తిరోహితముగ.

అది యొక పెండ్లిపందిరి దిగంతముల్ జెలువారె నీలసి
రద శుభదుందుభిధ్వనులు శ్రావ్యములై; యమరేంద్రవైభవా
స్పదమగు తీవితో తరలివచ్చిరి పెండ్లికి, భారతీయుల్
త్రిదశులు వియ్యమందెద రదే కనుగొమ్మ నభంబుసందడుల్.

వసుధకు దొడ్డిచాయలను వాకిలివైపున పెండ్లిపందిరుల్
ముసుగులుకప్ప క్రొత్తతమముల్ గదిసెన్ గృహమందు; పెండ్లివ

న్నసిరుల గ్రుమ్మరించు నెరసీటుల నూడుపుబేరటాండ్రుదా
రసిలి రోకళ్లోకళ్లు మెయిరాపులు చిర్నగవుల్ సెలంగగా;
పల్లకీ పైకి నెత్తి రచె పశ్చిమదిగ్వలయాంత మింద్రచా
పోల్లసనంబుతో మెరయుచున్నది, వియ్యమువారి రాక వి
ద్యుల్లతికాప్రదీపికలతో పెనుసందడిగా జెలంగె, దా
నెల్లియ లగ్న మింతతడ వేటికి? నీ వెదురేగు మిత్తఱిన్.

రంగులకోకలుం జిలుగురైకలు, కొప్పులలో తురాయిపూ
లుం గొమరారగా పులుగులుంబలె బారులుదీరి చేలలో
వంగిన యాడ్పుచేడియల పాటల కీజగమెల్ల పుల్కరిం
చెం గనుమోయి! పచ్చనగు జీవకళల్ విలసిల్లె నెల్లెడన్.

పచ్చని యద్దకంబు పనివానితనంబు వెలార్చుచుండె, నీ
బచ్చికనేలపై నొక తివాచిని విప్పినయట్లు, దానిపై
విచ్చిన గడ్డిపూలు పలు వింత తెరంగుల కత్తిరింపులై
యచ్చరతీగబోడుల యొయారపుపట్టునలట్లు యూగెడిన్.

చరమదిక్కున మూగు జలదాళి వినువీథి దరలించి తూర్పుగా తరమితరమి
తరులజొంపంబుల తల లొక్కప్రక్కకు వసుధాతలముదాక వంచివంచి
ఎరుపువారుచు పొంగు వృద్ధగౌతమినుండి, తెలుగునేలకు నీరు మలపి మలపి
తరపైన పచ్చని వరియాకుమళ్లపై తెరతెరల్ కెరటముల్ పరపిపరపి
పృథివిపై రాలుచున్న నేరేడుపండ్ల- నేరికొను నూడ్పుజనము పయ్యెదల నెగుర
గొట్టుచును వారితో గుసగుసలు కో-డిగములు సెలగ గోదావరిగాలి వచ్చె.
నీకు తొలికాన్పు సస్య లక్ష్మీకుమారి;-అఖిలజగమును బెండ్లియిల్లై తనర్ప
అమరవరులెల్ల కుసుమవర్షములుకురియ,-ధన్యహాలిక! కన్యాప్రదాత వగుము.

---

# పూర్ణ

[నవల - అనువృత్తము]

వాసిష్ఠగణపతిముని

## ఏడవ ప్రకరణము

### చిరకాలమునకుఁ గలసిన దంపతులు

కర్ణి తలుపుఁ దీయఁగానే జటాధారి యున్నతపురుషుఁ డొకఁడు లోపలఁ బ్రవేశించినాఁడు. అతఁడు ప్రవేశింపఁగానే కంపమానహస్తముతో కర్ణి తిరిగియుఁ దలుపు వేసికొనినది. అతఁడు తిన్నగా పెరటికి వెళ్లి నూతిదగ్గఱ కాలు సేతులు గడుగుకొని వచ్చులోపల కర్ణి యాసనమును సిద్ధపఱచినది. ముని వచ్చి కూర్చున్నాఁడు. కర్ణి విసనకఱ్ఱతో విసరుచు దగ్గఱ నిలువఁబడియున్నది. ఆవచ్చిన మహాపురుషుఁడు జటామునియే యని నేను పాఠకులకు వేఱుగాఁ జెప్పనక్కఱలేదు.

అతని నిండుజటలు వెనుకప్రక్క భూమి కంటి వ్రేలాడుచుండినవి. అవి పిశంగవర్ణములేగాని వాటిలో నొకటిగూడ పండు వెంట్రుక లేదు. ముందుగడ్డము నాభిని దాఁటి వ్రేలాడుచున్నది. అదియుఁగూడ సర్వపిశంగవర్ణమే యగును. విశాలఫాలమును, విస్తృతనేత్రములును అతని మహానుభావప్రకృతిని తెలియఁజేయుచున్నవి.

జటా—పెద్దనాగూ! నీతపస్సు వృద్ధిఁ బొందుచున్నదా?

కర్ణి—సమాచారము లన్నియుఁ దరువాత మాట్లాడవచ్చును. నేను స్నానముఁ జేసి వండెదను. భోజనముఁ జేసెదరా? ఆ మాట ముందు చెప్పుఁడు.

జటా—నాకు భోజనాపేక్ష లేదు. కొంతసేపైనపిమ్మట నీచేత నొకచెంబు మంచినీళ్లు త్రావెదను. అడిగినదానికి బదులు చెప్పుము.

కర్ణి—మగఁడు విడిచిన దౌర్భాగ్యవతికి తపస్సెక్కడనుండి వచ్చును? తపస్సు సంగతియే నాకుఁ దెలియదు. నా దుఃఖము వృద్ధిఁ బొందుచున్నది.

జటా—చెట్టంత కొడుకు. అన్నవస్త్రములకు లోటులేదు. ఇట్లుండ నీకు దుఃఖమెందులకు? నీ మగఁడు నీలోపల నుండు నెడల నిన్నతఁడు విడిచినట్లు బుద్ధిమంతు లంగీకరింపరు. అతఁడు నీలోపల లేనియెడల నతని శరీరము నీదగ్గఱ నుండినను లాభము లేదు.

కర్ణి—ఎంతయున్నను మగఁడు దగ్గఱ లేనియెడల సుఖ మెక్కడిది? మనస్సులో నుండు మగఁడు బజారుకు వెళ్లి సామాను తెచ్చునా? బట్టలు కొనియిచ్చునా? నగలు పెట్టునా? మాట్లాడునా? నవ్వునా?

ఏదిమైన చేష్ట నేయునా ? ఆడదానికిఁ గావల సిన దేదిమైన నతఁడు నేయఁగలఁడా ? శరీ రము దగ్గఱ లేనపు డతఁడు మఱికొంత దుఃఖము నిచ్చును. నేను కాత్యాయనివంటి దాన నగునెడల నామగఁడు నాదగ్గఱ లేక పోయినను నిశ్చింతనై యుందును——

జటా——ఆఁ! అట్లనఁగూడదు. నీ వధిక ప్రసంగముఁ జేయుచున్నావు. నీకుమనుష్యుల నాణెమే తెలియలేదు. నేను పరిశుద్ధురాల నని గర్వించు నీకంటె మాత్రమే గాదు; శ్రీకాకుల నగరియందు మహాసాధ్వి యని ప్రసిద్ధిఁ జెందిన రణంధరునిభార్య సురభి కంటెఁగూడ కాత్యాయని పరిశుద్ధురాలు. ఆమెచరిత్రము నిర్దుష్టము. ఆమె ననినవారికి పాపము వచ్చును.

వంటింట నుండు రథిని యీ మాటల నాశ్చర్యముతో వినినది. ఆ మాటలు విని కర్ణి పాతాళములోఁ గ్రుంగిపోయినది.—— "నాది తప్పే. నేను లోకాపవాదమును నమ్మి నాను." అని యామెనోటనుండి మాటలు వెలువడినవి.

జటా——పరిశుద్ధమగు నిన్ను బహి ష్కరించిన లోకమేనా యిది?

కర్ణి——ఔను.

జటా——ప్రకృతమును ననుసరించెదము. ముందే నీకు నేను చెప్పితిని. "నీవు కామిని వగునెడల నాయొద్దకు రావలదు. తగిన సంపన్నయువకుని పెండ్లాడుకొనుము. నీకు గొప్పపుత్రుఁడే కావలయునెడల నే నిచ్చె దను". ఈ నా మాటలు, నీకు జ్ఞప్తియం దున్నవా? నా శరీరము నీదగ్గఱ నున్నను నీవు చెప్పిన మగని కృత్యముల నది నేయ దని నీకుఁ దెలియనివిషయము గాదు. హా స్యోక్తుల కిది సమయము గాదు. రెండు గడియలకంటె నధికముగా నే నిక్కడ నుండఁ దలఁచుకొన లేదు. ఆవశ్యకమైన విషయ ములను మాత్రము మాట్లాడుము.

కర్ణి—— కొడుకు నిచ్చితి నన్నారు. నా కక్కఱలే దా కొడుకు. మీరే తీసుకొని పొండు. వానివలన నా కెట్టి యుపకారము గూడ లేదు. వేళకు రెండుమెతుకులు తిను టకు వాఁడు వచ్చుటయే దుర్ఘటము. అది యును గాక వాని నేజాతివారును తమలోఁ జేర్చుకొనకపోవుటవలన వానికి సరిమైన స్థల ములోఁ బెండ్లి యగుటదుర్ఘటము గదా!

జటా——నాగూ! రేపు నీవు బ్రాహ్మణ కుల పరిషత్తుకు భీమనాథునిద్వారా దర ఖాస్తు పంపించుము. పరిషదధ్యక్షుఁడు భీమ నాథుని మహర్షిపుత్రునిగా నంగీకరించి బ్రాహ్మణజాతిలోఁ జేర్చుకొనును. నీకొడుకు వ్యర్థుఁడని తలంపకుము. వాఁ డొక గొప్ప దేశము జయించి రాజు కాఁగలఁడు. ఈ నా మాటను నమ్ముము.

రథిని గడగడ వణఁకినది. "ఈశ్వరా! జటాముని యుద్దేశించిన దేశము ఆంధ్ర దేశము కాకుండ నుండవలెను. భీమనాథుఁ డే నిశంభుఁడా? అట్లుండఁగూడదు" ఇవి రథిని మానసికవచనములు.

కర్ణి——మీమాట నేను నమ్మెదను. నా కొడుకు జయింపఁబోవు దేశ మేదియో చెప్పెదరా?

జటా—ఆదేశ మేదియో యిప్పుడు నీతోఁ జెప్పఁదలఁచుకొనలేదు. ఇంక నీ కేమి కావలెనో కోరుము.

కర్ణి—నేను మీపైఁగల మోహము చేతనే మిమ్ములను బెండ్లియాడితిని గాని పుత్రాశచేఁ గాదు. మీ మాటలు నాకు జ్ఞప్తియందు లేకపోలేదు. అప్పుడు మోహ ముగ్ధరాలగు నాపై మీ రట్టి షరతును విధించితిరి. మోహావేశమువలననే దానిని నే నంగీకరించితిని. మీరు నన్నేలుకొనకుండ విడిచిపెట్టునెడల నా కొడుకు రాజైనను నా దుఃఖ మారదు. అందువలన నేను కోరునది మీసన్నిధి.

జటా—నీదగ్గఱ నుండుటకుఁగాని, ని న్నింకొకచోటునకు దీసుకొనివెళ్లుటకుఁగాని నాకు సాధ్యపడదు. స్వచ్ఛందసంచారు లగు నా పాదములను సంకెళ్లతో బంధించుకొనఁ జాలను.

ఆమాటలు వినఁగానే కర్ణి కేడుపు వచ్చినది. జన్మమధ్యమునందుఁ గన్నీ రెఱుంగని యా ధీరవనితకుఁ గన్నీరు ప్రవహించినది.

జటా—నాగూ! నీ వట్లేడవకుము. నీ వంటి ధీరురాలకు దుఃఖము తగదు. నీవు కోరుచున్నావు గాన వారమున కొకసారి నిన్ను సంధించెదను. ప్రతి శుక్రవారము రాత్రి పంౡెండు గడియలకు నేను నీ దగ్గఱకు వచ్చెదను. అప్పుడు నీ వీ యపవిత్ర స్థలమునందుఁ గాక కృష్ణానదీ తీరమునందలి యక్షోభ్యాశ్రమమునకు సమీపమున నిర్మింపఁబోవు కుటీరమునకు వచ్చుచుండుము.

కర్ణి—(విసరుచునే యింకొక చేతితో కన్నీరు తుడుచుకొని) అచ్చట నొక కుటీరమును నిర్మింపఁబోయెదరా?

జటా—ఔను. మన దంపతుల కాపురమునిమిత్తము నిర్మింపవలసియున్నది.

రథిని లోలోపల నవ్వుకొనును.

కర్ణి—అక్షోభ్యముని మీ శిష్యుఁడా?

జటా—ఔను.

కర్ణి—మఱియొకటి నే నడుగవలసియున్నది. మనపిల్లవాఁ డొక దేశమును జయించుట స్వతంత్రముగానా? లేక ఆంధ్ర చక్రవర్తికి సహాయుఁడుగా నుండియా?"

జటా—ఆంధ్ర చక్రవర్తికి సహాయుఁడుగా నుండియే జయించును.

రథి—(తనలో) ఇది యొక గొప్ప శుభవార్త.

కర్ణి—ఇది నాకు చాల సంతోషకరమగు వార్త.

జటా—మన పిల్లవాఁ డెప్పుడును కుండినుల వంశాధికారమునకు విరుద్ధముగాఁ బనిసేయఁడు.

## ఎనిమిదియవ ప్రకరణము

"కగచజబాబు"

ఈ ప్రకరణాంశములు చర్విత చర్వణములే యైనను సందర్భోచితములై యున్నందున నింకొకమారు చెప్పఁబడుచున్నవి. పాఠకు లీవిషయమును గమనింతురుగాక.

కర్ణి—ప్రభో! ఒకసంగతి నా దగ్గఱ దాచక చెప్పవలెను. మిమ్ములను జటా

ముని యని యందఱును చెప్పుదురే గాని యసలుపే రెవరికిని దెలియదు. మీపే రేమియో తెలియకుండ నిప్పుడు నేను మిమ్ములను విడుచుదానను గాను.

జటా—నా యసలుపేరు తెలుసుకొనినందున నీకుఁగల ప్రయోజన మేమి? జగత్ప్రసిద్ధ మగు జటామునినామ ముండనే యున్నది వ్యవహారమునకు.

కర్ణి—అసలుపేరు నాకుఁ దెలిసి తీరవలెను.

రథి—(తనలో) ఇది మంచి ప్రశ్న.

జటా—భవనందిభార్య వైజయంతిని నీ వెఱుంగుదువా?

కర్ణి—ఆ పెద్దముత్తైదువు. నెఱుంగనివారు శ్రీకాకుళనగరములో నుండరు.

జటా—ఆమెయన్న పేరు నీకుఁ దెలుసునా?

కర్ణి—యోగదర్శనకారుఁ డగు రాఢీతర కంకోలుఁ డామెయన్న యని చెప్పుదురు.

జటా—ఆరాఢీతర కంకోలుఁడే నీభర్త జటాముని.

రథి—(తనలో) ఇప్పుడు జటాముని కళారాదినామము నిస్సంశయముగాఁ దెలిసినది.

కర్ణి—అట్లగునెడల ఘనేంద్రుఁడు మన మేనల్లుఁ డన్నమాట.

జటా—ఔను.

కర్ణి—వైజయంతికిఁ బెండ్లి చేసి మీరు వెళ్లిపోయినపిమ్మట జటామునిగా నీదేశమునకు వచ్చువఱకు మధ్య మీచరిత్ర నాకు వినవలె నని యున్నది.

రథి—(తనలో) నేను తలంచుకొనిన ప్రశ్నయే దొడ్డమ్మ వేసినది.

జటా—నాచరిత్రయంతయుఁ జెప్పిన భారతమంత యగును. నీకుఁ గావలసిన విషయముల నడుగుము. వివరించి చెప్పెదను.

కర్ణి—శాంతిసేనాకుమారిని బెండ్లియాడిన విమలుఁడు మీ కుమారుఁడేనా?

జటా—సాక్షాత్తుగా నా కుమారుఁడే.

కర్ణి—విమల రాజకాళుల తండ్రి యగు గణదాసు మీరేనా?

జటా—ఔను.

కర్ణి—రాజకాళమ్మ మిమ్ములను "కగచజ" బాబు అని కీర్తించినది. ఆమాట కర్థ మేమి?

జటా—క అనఁగా కంకోలుఁడు. గ అనఁగా గణదాసు. చ అనఁగా చక్రధరుఁడు. జ అనఁగా జటాముని.

కర్ణి—(నవ్వుచు) నలువురకు నలువురు భార్యలున్నారా?

జటా—కంకోలుని భార్య కుండలిని. గణదాసుని రమణి వనదుర్గ. చక్రధరుని పత్ని భైరవి. జటామునిప్రేయసి కర్ణి.

రథి—(తనలో) అనేక సందేహము లిప్పుడు విడిపోయినవి.

కర్ణి—నే నొక్కతనే యిప్పుడు మిగిలి యున్న భార్యను కాఁబోలును?

జటా—ఔను.

కర్ణి—పూర్ణా మణిమాలలు నా మనుమరాండ్రన్నమాట. ముందే యీ విషయమును నేను పోల్చుకొంటిని గాని యిప్పుడు స్థిరపడినది. మనుమరాలు సత్యప్రభ యెచ్చట నున్నదో?

జటా—రాజ్యప్రాప్తివఱకు నా విషయమును రహస్యముగా నుంచవలెనని శాంతిసేన కోరిక. అందువలన నీవిప్పుడా విషయమును దెలుసుకొనుటకు యత్నింపకుము.

కర్ణి—నేను తప్ప తక్కిన ముప్వురు కాంతలును బ్రాహ్మణ కన్యలేనా?

జటా—పెద్దవారిద్దఱును బ్రాహ్మణ కన్యలు. భైరవి రాక్షసకన్య.

రథిని యాశ్చర్యముతో వినును.

కర్ణి—(సంభ్రమముతో) రాక్షసకన్యయా?

జటా—ఔను. రాక్షసకన్య యనఁగా భయపడితివా?

కర్ణి—రామాయణము విన్నవారికి రాక్షసకన్యలంటే భయమే కలుగును.

జటా—ఇప్పటి కాపాలికులే పూర్వచరిత్రకారుల భాషలో రాక్షసులు. పూర్వకాలమునందు వారిలో నరబలియిచ్చునాచార మధికముగా నుండెడిది. ఇప్పుడు సర్కారువారి ప్రయత్నమువలన ప్రాయికముగా నాయాచారము కట్టిపోయినది. వారిలోఁగూడ చక్కనిస్త్రీ లుందురుసుమా. రాక్షసకన్య మందోదరి యెంత చక్కనిదో రామాయణకవివర్ణనను విన్నావుగదా? నీ సవతి భైరవిగూడ మిక్కిలి చక్కనిదే.

కర్ణి—ఆమె కెందఱు పిల్లలు?

జటా—ముప్వురు. పెద్దపిల్లలు స్త్రీలు. మూడవవాఁడు పురుషుఁడు.

కర్ణి—వారిపేరు లేమి?

జటా—సుముఖి, అపరాజిత, అక్షోభ్యుఁడు.

కర్ణి—కృష్ణాతీరమునందు అక్షోభ్యమునియేనా?

జటా—వాఁడే.

కర్ణి—అక్షోభ్యముని నాకుమారుఁడా? ఈరాత్రి నాకు సురాత్రి. అన్ని పక్షములందలి యువకులును శత్రుమిత్ర భేదములేక యే మహాముని పాదచ్ఛాయయం దైకమత్యముచే మిలితులగుచున్నారో, ఎవని యుపదేశామృతము సర్వతాపహరమో, ఎవని శ్రేష్ఠవిజ్ఞానమునకు శ్రీకాకుళనగరమునందలి సర్వపండితులును జేతులొగ్గెదరో, మంత్రశాస్త్రమునం దెవఁ డద్వితీయుఁడో, వృద్ధులలో నెవఁడు వృద్ధుఁడో, యువకులలో నెవఁడు యువకుఁడో, పిల్లలలో నెవఁడు పిల్లవాఁడో, స్త్రీలలో నెవఁడు స్త్రీయో, మన్మథుఁ డెవనికి జయపత్రిక నిచ్చివేసెనో, రాజనీతి యెవనిదగ్గఱనుండి నేర్చుకొనఁదగినదో, తప స్సెవని స్థిరాస్తియో ఆ యక్షోభ్య మహాముని నా కుమారుఁడా?

జటా—ఔను.

రథిని యాశ్చర్యముతో వినును.

కర్ణి—సుముఖి ఎవరు?

జటా—నాపిల్లలలో నందఱికంటె నాకు మరదృష్టవంతురాలు. ఒక నాగుఁడు నిద్రలో

నామెను మోసగించెను. ఆమోసమువలన నామెచరిత్ర శోచనీయ మైనది. ఆమోసమునకు ఫలితముగా నామె కొక కుమారుఁడు పుట్టినాఁడు.

కర్ణి— ఆ నాగుని పే రేమియో నేను వినవచ్చునా ?

జటా—వాని పేరు కుంజనాథుఁడు. ఆ యభాగ్యుఁ డుదయించినపిమ్మట నే వాని తండ్రి మందనాథుఁడు చిత్రకూట రాజ్య భ్రష్టుఁ డైనాఁడు.

రథి – (తనలో) అయ్యో ! విప్లవ నాయకుఁడు నిశంభుఁడు జటాముని దౌహిత్రుఁడా ?

కర్ణి—అట్లగు నెడల నిశంభుఁడు మన దౌహిత్రుఁడా ?

జటా—ఔను. నేను కాపాలికాంగనను పెండ్లాడినందులకుఁ దగిన ఫలిత మనుభవించితిని. కాపాలికులకంటె శతగుణ క్రూరుఁడు నిశంభుఁడు నాకు దౌహిత్రుఁడై దాఁపరించెను.

కర్ణి—మీరు మీ మనుమఁ డారంభించిన విప్లవము నాశీర్వదించుచున్నారాయేమి?

రథి — (తనలో) ఇప్పుడు విషయము స్పష్ట మగును.

జటా — నాభావము భోగనాథునకు ప్రతికూలముగా నున్నను కుండినవంశాధికారమునకుఁ బ్రతికూలముగా లేదు.

రథి—(తనలో) ఈశ్వర ! నీకు వందనములు. జటాముని నా పుట్టింటివారి వంశాధికారమునకుఁ బ్రతికూలుఁడు కాఁడు.

కర్ణి — చాలసంతోషము. అపరాజిత యెచ్చట నున్నది ?

జటా— తపస్సుఁ జేసుకొనుచున్నది. భైరవి పరమపదముఁ జెందినపిమ్మట నేను నామవర్జితుఁడ నై దేశద్రిమ్మరి నైతిని. ప్రజలే నాకీ జటామునినామముఁ బెట్టిరి. పిమ్మట నిన్ను నేను పెండ్లియాడుటయు, నీయందు నాకు భీమనాథుఁడు పుట్టుటయు నీకుఁ దెలిసిన విషయములే.

కర్ణి—ఆంధ్రసామ్రాజ్యములోని మహారత్నము లన్నియు మనవంశమునకే చేరియున్నవి. ఒక్కటే నాబెంగ. మేనల్లుఁడు ఘనేంద్రుఁడు రాష్ట్రియుఁడుగా నున్నాఁడు. మనుమఁడు నిశంభుఁడు విప్లవనాయకుఁడుగా నున్నాఁడు. ఆయిద్దఱు వీరులకు నెక్కడ యుద్ధము వచ్చునో ?

జటా— అన్ని సమస్యలను సులభముగా విడఁగొట్టు జటామునికిఁగూడ నీ సమస్య చిక్కుగానే యున్నది.

కర్ణి—మఱియొక ప్రశ్న నాది కలదు.

జటా—అది యేది ?

కర్ణి—సుముఖి యెచ్చట నున్నది ?

జటా—అంధకారములో. అంతకంటె నామెను గుఱించి నేను మఱియేమియును జెప్పఁజాలను. ఆసంగతి యటుండనిమ్ము. నీకిం కేమి కావలయును-చెప్పుము.

కర్ణి—గొప్పకోడలు కావలయును.

జటా—తప్పక నీకు గొప్ప కోడలు లభించును.

కర్ణి—నే నెంచుకొనుపిల్ల లభించునా ?

జటా—ఔను. ఇంక మంచినీళ్లు తెమ్ము.

కర్ణి మంచినీళ్లు తీసుకొని వచ్చినది. మహర్షి త్రావి నిలఁబడినాఁడు. కర్ణి యతనిని సమీపించినది. మహర్షి వేదండశుండాసన్నిభము లగు తన విశాల భుజములతో నామెను దృఢముగా నాలింగించుకొనెను. కర్ణి యమృతప్రవాహములో మునిఁగిపోయినది! సుమా రిరువదిమూఁడు సంవత్సరములనుండి యామె పడుచుండిన విరహశ్రమ యంతయును దీరిన ట్లయ్యెను. ఆ హర్షపారవశ్యములో నామె ప్రపంచమును మఱచిపోయినది. తనను గూడ మఱచిపోయినది. ఆమెకు తెలివి వచ్చి కండ్లు విప్పిచూచుసరికి మహర్షి యచ్చట కన్పట్టుట లేదు. వీథి తలుపు గడియ వేసియే యుండెను. ఇంతట కర్ణి చెవులకు వంటింట రథిసీ మహర్షుల సంవాద ధ్వని వినిపించినది. కర్ణి యా లోపలికి వెళ్లలేదు. అచ్చట నిలుచుండియే వారి మాటలు వినుచుండెను.

## తొమ్మిదియవ ప్రకరణము

### అభయప్రదానము

రథి—భగవన్ ! తాతగారిసన్నిధిలోఁ దమతో మాట్లాడుటకు నాకు వీలుగాక యిచ్చటికి వచ్చితిని.

జటా— కుమారీ ! నీ కేమి మాట్లాడవలెనని యున్నది ?

రథి — మా తాతయ్యతోఁ దమ స్వచరిత్ర యంతయును జెప్పినారా ?

జటా—చెప్పితిని.

రథి—కాలనాథబాబు నాసోదరుఁడును, మీ దౌహిత్రుఁడు ననుసంగతి నిజమేనా ?

జటా—నిజమే.

రథి — ఈ సంగతిని తాతయ్యకుఁ జెప్పినారా ?

జటా—చెప్పితిని. వారసుత్వ విషయములో మాత్రము శక్తిధరుఁడు సింహాసనోత్తరాధికారి యగుటకే ముం దవకాశము నీయవలెను. ఒకవేళ రాజధర్మాసనము జ్యేష్ఠపక్షము తీర్పుఁ జెప్పిన నప్పుడు చూచుకొనవచ్చును. అంతియేగాని వ్యాజ్యమధ్యమునఁ గాలనాథుని జన్మరహస్యముగుఱించి విచారింప సందర్భమును సృజింప నక్కఱలేదని నేను సూచించితిని.

రథి—శాంతిసేనాకుమారి వ్యాజ్యము దాఖలు చేయునెడల తమరు సాక్ష్యము చెప్పవలసివచ్చు ననుకొనెదను.

జటా—విమలుఁడు నా కుమారుఁడను విషయములోను, శీలభద్రశిష్యురాలు శాంతిసేనయే యను విషయములోను నా సాక్ష్యమవసరమనియా నీ యభిప్రాయము ?

రథి – ఔను.

జటా—తప్పక జెప్పెదను. ఆ రెండును శంకింపరాని సత్యములు.

రథి— నిశంభునాగేంద్రునకు నా తండ్రితో యుద్ధము రాకుండఁ గాపాడు భారము తమది.

జటా—కుమారీ ! ఇది యుద్ధకాలము. ప్రళయతాండవ నాయిక యగు మహాశక్తి దక్షిణాపథమున నాట్యమాడవలసిన కాల

మిది. యుద్ధములను దప్పించుట నావలనఁ గాదు. అయినను నీతండ్రి కనుకూలముగానే సర్వము ముగియును.

రథి — మఱియొక యనుమానము నాకుఁ గలదు. మా అన్నయ్య భీమనాథ బాబు పరంతపసంఘమునఁ బనిచేయుచున్నాఁడని. అది వాస్తవమే యగునెడల నా తండ్రికి క్షేమ మెట్లు సులభము ?

జటా— నీ యనుమానము సత్యమే యగును. వాఁడచ్చట నుండుటవలన సంధి యగునేమో యను నాశ కవకాశము గలదు. నిశంభుఁడు శక్తిధరునిపైఁ బ్రీతిఁ జూపుచు భీమనాథుని వశపఱచుకొనినాఁడు. భీమనాథుఁడు తన సంఘములో నుండినంత కాలము వాఁడసలు కుండినుల వంశాధికారమును నిర్మూలింప యత్నింపఁజాలఁడు. వాని కట్టి దురుద్దేశమే కలుగునెడల భీమనాథుఁడు తత్క్షణమే యా సంఘమును విడిచివేయును.

రథి—మా అన్నయ్యయే చోరపరమేశ్వరుఁడా ?

జటా — ఔను. మీ యన్నయ్యయే తస్కరాణాంపతి. స్నేహవశంవదుఁడై తన మిత్రునికొఱకును, దరిద్రులకొఱకును తన కళాచాతుర్యమును జూపుచున్నాఁడు. కావలయునెడల నీ యన్నయ్యను వశపఱచుకొని వానిచే నీ వేపనుల నైనఁ జేయించుకొనవచ్చును.

రథి — ఒక్కటిమాత్రము మఱియొకసారి మీరు నా కభయ మీయవలెను. మీ కుమారుఁడు భీమనాథుఁడు నా పుట్టింటివారి వంశాధికారమునకు విరుద్ధముగాఁ బని సేయకుండ మీ రాతనికి సూచింపవలెను.

జటా—ఆవిషయములో నీవు భయపడవలదు. నా కుమారులలో నెవరుగూడ నీ తండ్రి వంశాధికారమునకు విరుద్ధముగాఁ బనిసేయకుండ నేను చూచుకొనెదను. నీవు మాత్ర మిప్పుడు భీమనాథునిపై నీ తండ్రి ప్రభుత్వ మేదైన చర్య తీసుకొనకుండ చూడుము. వాఁడు సామసాధ్యుఁడే కాని దండసాధ్యుఁడు గాఁడు. వానితోఁ విరోధముఁ దెచ్చిపెట్టుకొనుట కొఱవితోఁ దల గోకుకొనుటవంటిది.

రథి—అట్లే చేసెదను. నాకు తప్ప నింకెవరికిని మా అన్నయ్య పరంతప సంఘములో నున్నట్లు తెలియదు. నే నెవరికిని జెప్పను సరియే కదా యతనిని బట్టుకొనుటకు దొరతనమువారు ప్రయత్నించునెడల వారి ప్రయత్నమునుగూడ వారింతును.

జటా—కుండినులయధికారమును గాపాడుటకు బలవత్తర మగు రాజసైన్య మొకమెత్తు. మహాప్రాజ్ఞురాల వగు నీ వొకమెత్తు.

కర్ణి కీ మాటలు వినిపించినవి గాని యన్నియును గ్రొత్తగానే యుండినవి. ఇంతట మహర్షియు రథినియు లోపలనుండి మధ్యశాలకు వచ్చిరి.

## పదియవ ప్రకరణము

పనిలేనివాంగకు ఫలినియే తగును

జటా—(కర్ణినిజూచి) పెద్దనాగూ! నేను పోయివచ్చెదను.

కర్ణి —మీపిల్లవాని నొకసారిచూడరా?

జటా—ఇంకొకసారి చూచెదను.

కర్ణి—నా కిదివఱకు మనవాఁడు దొంగల నాయకుఁడుగాఁ బనిచేయుచున్నాఁ డని తెలియదు. తెలిసియుండిన నాలుగుచీవాట్లు పెట్టి మానిపించియుందును. ఒకనిస్నేహము కొఱకు మనపిల్లవాఁ డెందులకు దొంగకావలయును? వీనికి చిన్నబాబుకంటె (శక్తిధరుని కంటె) నిశంభుఁ డుట్టిపడిన స్నేహితుఁడా? రహస్యబంధుత్వముఁ దెలిసి యా బ్రహ్మ రాక్షసి కుమారునితో స్నేహము సేయుచున్నాఁడు కాఁబోలును. ఘనేంద్రుఁడు మాత్రము వానికి బంధువుఁడు కాఁడా? నాకొడుకు దొంగ యనిన నాకుఁ దలవంపు. ఈరాత్రియే మీరు వానినిఁ జూచి దొంగతనమునుండి నివారింపవలయును.

జటా—జగదీశ్వరుని విచిత్ర లీలలలో నిది యొకటి. చౌర్యకళలో నెన్ని చమత్కారము లున్న యవియన్నియును ప్రపంచమునకుఁ జూపుటకు "కర్ణిసుతుఁడై" వాఁడు పుట్టియున్నాఁడు. నీ విప్పు డేమియు వానితోఁ గలుగఁజేసుకొనకుము. పెండ్లికిఁ బిమ్మట వాని చౌర్యగుణమును నేను నివారించి పోఁగొట్టెదను.

కర్ణి—అట్లగునెడల వానిపెండ్లి శీఘ్రముగాఁ జేసివైచెదను.

జటా — రథిసీకుమారీ! పెండ్లిప్రస్తావము వచ్చినది గనుక ముప్వురును గలసి యాలోచించి కన్యకను నిర్ణయించెదము. కూర్చుండుఁడు.

ముప్పురును గూర్చుండిరి.

కర్ణి — రథిసీకుమారి నా కడుపునఁ బుట్టకపోయినను నాపాలుఁద్రావి పెరిగినది. రాజగృహసంప్రదాయ మనుసరించి దాదులు తల్లులతో సమానులు. అందువలన రాజకుమారి రథిని మనవానికిఁ బనికిరాదు. పూర్ణామణిమాలలు మనయింటి పిల్లలు. భానుమతి యెదురు మేనఱికము గాన సంప్రదాయ విరుద్ధము. ఇంక మిగిలిన యుత్తమ వరణీయకన్య లెనమండ్రుగురు—ఫలినియు, మధువాణియు, కనకవల్లియు, ధరణియు, విలాసవతియు, సుశీలయు, పద్మాక్షియు, కుముదాక్షియును.

జటా — (రథినిని జూచి) కుమారీ! వీరిలో నెవరు శ్రేష్ఠలో నీ యభిప్రాయ మేమి?

రథి—ఫలినియు, ధరణియు, మధువాణియు వీరిలో నెంచఁదగినవా రని నాభావము.

కర్ణి—ఫలినీ మధువాణులు శ్రీమంతుల పిల్లలు. మనకు లభించుట దుర్ఘటము. ధరణి మనతో సమానస్కంధుల యింటి పిల్ల. ఆమెను గుఱించి ప్రయత్నించిన మనయత్నము కొనసాగవచ్చును.

జటా — పతంగావధానికిఁ బదివేల రూపాయిలుఁ బోసినఁ గాని యా సంబంధము స్థిరపడ నేరదు.

కర్ణి—కన్య నమ్ముటకు వాని కధికార మేమున్నది?

జటా — ఇంటియందు దతని యధికార మఖండముగా సాగుచున్నది. అంత గొప్ప స్వగృహవీరుఁ డీ శ్రీకాకుల నగరమున దొరకు టరుదు. ముందు గట్టిగా కేకలు

వేసి కార్యమును సాధింపఁజూచును. అందులకు లోఁగనియెడల తొమ్మిదవ "అష్టకము" యొక్క పారాయణ యారంభించును. అప్పటికిని గార్యము కానపుడు చతుర్థోపాయమునకు దివ్య యొకటి తీసుకొనును. ధరణి నీకుఁ గావలయునెడల వాఁడు కోరినధనము వానికిఁ బోయవలసినదే.

కర్ణి—నాదగ్గఱ పదివేలు లేవు. నే నీయఁజాలను.

రథి—ఇప్పుడు ధరణి కాలనాథబాబు అధీనతయం దున్నది. పతంగుని బారినుండి యామె నతఁడు విడిపించి యింటికిఁ దెచ్చుకొనినాఁడు. కాఁబట్టి శుల్కముయొక్క యవసరము లేదు.

జటా—అట్లగునెడల నామె సులభసాధ్యయే యగును. నీకు సమ్మతమైన పిల్ల యేదియో దానినే చెప్పుము.

కర్ణి—నాకు మువ్వురును సమానులే! (రథినిని జూచి) కుమారీ! నీ వేమనియెదవు?

రథి—పతంగావధానిని మించిన రసికుఁడు మనచండసేనబాబు. అతఁడు తన కొమార్తెను మేనల్లుఁడు వీరసింహున కిచ్చెదనని పట్టుపట్టియున్నాఁడు. అవ్వ కొడుకును సమర్థించుచున్నది. వీ రిద్దరికి భోగనాథ రణేశ్వరులు దన్నైయున్నారు. తల్లి ధారావతికి మాత్రము తనయాడబొట్టెకొడుకునకు (వీరసింహునకు) ఈయవలయునని లేదు. ఆమె ఘనేంద్రబాబున కీయవలెనని యనుచున్నది. మాపినతల్లిగారిని (లీలావతీదేవిని) విశాలాక్షుఁ డాశ్రయించుచున్నాఁడు. తనకుమారుఁడు పద్మాక్షున కామెను (ఫలినిని) జేసుకొనవలెనని యున్నది. ఈరోజు సాయంకాలమున నతనిమెత్తు నెగురఁగొట్టివేసినది భృంగాలక. రెండు జాతకములకును పొందిక లేదని దైవజ్ఞుఁడు మాపిన్నమ్మగారివద్దఁ జెప్పివేసినాఁడు. అతఁ డట్లు చెప్పుటకు శాస్త్రీయకారణము లేకపోలేదుగాని విశాలాక్షుఁ డా దైవజ్ఞుని హస్తమును నింపియుండిన నతఁ డా కారణమును లేవఁదీయకఁ బోయియుండును. ఇది ఫలినిసంగతి. మహర్షి యద్భుతప్రభావమువలన నా సంబంధము కావలయు నేమో గాని మనుష్యప్రయత్నముఁబట్టి చూచిన ఘనేంద్ర వీరసింహులలో నొకని కామె యగునట్లు కనిపించుచున్నది. ఇఁక మధువాణిసంగతిఁ జూచిన నామెతండ్రి తన నూతన గృహిణిచేతి కీలుబొమ్మ. ఆమెకు మా అన్నయ్యపై గొప్ప అభిప్రాయ మున్నది. దేవకీర్తిగారి కుటుంబస్థు లందఱికిని మన భీమనాథబాబు మిత్రుఁడే యగును. అందువలన మధువాణి సాధ్యురాలనియే నాభావము. ధరణి యందఱికంటె సులభురాలు. నేనుగూడ మా దొడ్డమ్మవలె నీ మువ్వురిలో నెవరు లభించినను సంతసించుదాననే.

రథిని యీవాక్యము ముగించులోపల వీథియరుగుపైనుండి యా మువ్వురికిని గొన్ని పాటలు వినఁబడినవి.

"శతకోటిధరునకు శచిదేవిపగిది
రతిదేవిమామకు రమదేవికరణి
వనజాతభవునకు వాణివిధాన
జనకర్మసాక్షికి సంధ్యచందాన

బాలేందుమౌళికిఁ బార్వతిమాడ్కి
కాళింగజేతకు లీలమ్మభంగి
పనిలేనిదొంగకు ఫలినియే తగును."

జటా—అదుగో! వానియక్క వానికిఁ దగిన కన్యను సూచించినది. అదియే సరి. తన్ను బ్రాహ్మణులలోఁ జేర్చుకొనినపిమ్మట మనవాఁ డొకసారి తత్కాల సేనాపతిగారి యింటికి వెళ్లి రానిమ్ము. ఫలినికంట వాఁ డొకసారి పడినఁ జాలును. మన కార్యము సిద్ధమగును.

అని చెప్పి లేచెను. కర్ణి త్వరగా లేచి వెళ్లి తలుపుఁ దీసినది. రాజకాళి లోపలకు వచ్చి తనతండ్రితో మాట్లాడుట కనకాశ మీయవలె నని కర్ణి తలంపు. తలుపు తీయఁబడఁగానే జటాముని యాయిల్లు విడిచి వీథిలోఁ బడినవాఁ డయ్యెను. రాజకాళి సత్వరముగా నతని ననుగమించినది. దృష్టిపథము దాఁటునఱకు కర్ణియు, రథినియు నా తండ్రి కూఁతుండ్రను జూచిరి. పిమ్మట రథిని కర్ణిచే ననుజ్ఞాతమై ముసుగువేసుకొని యచ్చట నుండి కదలి వెళ్లిపోయినది. జటాముని యిచ్చిన యభయమును మూటఁగట్టుకొనియే వెళ్లినది.

## పదునొకండవ ప్రకరణము

### క్రొత్త శతపతి

సోమవారమునాటి భానువు తన బంగారు కిరణములచే శ్రీకాకుల నగరమును వెలిగించినవాఁ డయ్యెను. శివంకరసంఘనాయకుఁడు వ్రాసిన కైంకర్యాభ్యర్థనపత్రమునకు చక్రవర్తి యనుకూలమగుప్రత్యుత్తరము ప్రాతఃకాలముననే పంపినవాఁ డయ్యెను.

ఆ ప్రాతఃకాలముననే క్రొత్త రాజకులము గూడి ప్రజల పన్నులను పూర్వపు స్థితికి తగ్గించివేసినది. హేమచంద్రుఁ డెంత వాదించినను ఫలము లేకఁబోయినది. మల్లికార్జునుని పంతము నెగ్గినది. ఆ సువార్త పట్టణ మంతయు వ్యాపించి పల్లెలకుఁగూడ నెగఁబ్రాఁకినది. ప్రజ లెంతయో హర్షించిరి. మల్లికార్జునుని మంత్రినిగా నియమించి ప్రజలకుఁ బన్ను తగ్గింపఁజేసినది యంతయు శివంకరసంఘమువారుచేసిన ప్రయత్నఫలితమే యని యనేకులు ప్రజాప్రముఖులు తలంచిరి. ఈ వార్త లీలావతీదేవిని స్తబ్ధురాలినిగాఁ జేసినది. చక్రవర్తియే మల్లికార్జునుని ప్రేరేపించి యీపనిఁ జేయించెనని యామె యనుకొనినది. భోగనాథునకు సగముప్రాణములు పోయినట్లే యయ్యెను. మల్లికార్జునుఁడు ప్రాసాదమును దరిద్రమునుగాఁ జేయుటకుఁ దలపెట్టెనని యతఁడు తన మిత్రులయొద్ద విలపించెను.

ఆ ప్రాతఃకాలముననే భీమనాథుని విజ్ఞప్తి నంగీకరించి బ్రాహ్మణకుల పరిషదధ్యక్షుఁడు ధర్మపాలసూరి జటామునిని మహర్షినిగా నంగీకరించుచు నట్టి మహాపురుషుల సంతానముయొక్క జాతిని బీజప్రాధాన్యముచేఁ బరిగణింపవచ్చు నని తీర్పిచ్చినవాఁ డయ్యెను. ఆ సంగతిని విని రథిని మిక్కిలి యానందించినది. భీమనాథుని మిత్రు లగు శక్తిధర ఘనేంద్ర మల్లికార్జున కాలనాథులు సంతోషించిరి. పూర్ణ హర్షించినది. రాజకాళి యా క్రొత్తబ్రాహ్మణునకు తన క్రొత్తపాటలచే స్వాగత మొసంగెను.

"మత్తేభవీర్యుఁడు మాభీముఁ డిపుడు
క్రొత్తగా మావిప్రకులములోఁ జేరె
ఇలలోని జేజేల కిది సుదినంబు
కులమందుఁ జేరెను గుణభూషణుండు
లక్షుకుఁడుల్యుండు లభియించె మాకు
దక్షుఁడు వీరుండు త్రాత నిర్జేత."

ఇది యొకవంక. మఱియొకవంక శివకీర్తి మ్లానుఁ డయ్యెను. చంద్రసేనుఁడు నిట్టూర్పు విడిచెను. పింగాక్షుఁడు క్రోధోద్దీప్తుఁ డైనాఁడు. సులోచనుఁడు నిరుత్సాహతఁ జెందెను. బలభద్రుఁడు రసాతలమునఁ గ్రుంగినవాఁ డయ్యెను. పద్మిని కడు వగచినది. అరుణుఁ డాకాశముపై తిట్లు వర్షించినాఁడు. ధవలాక్షి కొంచె మదరినది. ఎనభైమందివీరులు చచ్చిన చావుకంటె భీమనాథుని బ్రాహ్మణజాతిప్రవేశమే పరంతపసంఘమునకు గొప్పవ్యథ కలుగఁ జేసినది:

భానుమతి యక్షోభ్యునివలన మహావిద్యఁ దీసుకొని యాఱుమాసములనుండి జపించుచుండినది. ఆమె కీదినముననే దేవీకటాక్షముచే కవిత్వశక్తి యుల్లసించినది. పూర్ణాప్రభృతుల కవిత్వశక్తి యాంధ్రభాషలోఁ బ్రసరింప, భానుమతికవిత్వశక్తి సంస్కృతభాషలోఁ బ్రసరింప నారంభించినది. గాయత్రీఛందస్సులో నామెతొలికవిత యిట్లు వెలువడినది.

శ్లో. ౧. సదమృత మిందో రతులితసారం
భవతి బతేతో హిమమపి ఘోరం.
౨. భవతు వధూనాం పతిసుఖ మిష్టం,
పరవశభావో మహ దిహ కష్టం.
౩. అమలసతీనాం శత మిహ లోకే,
అచపలకన్యా నభువి ననాకే.

(౧. చంద్రుని మంచియమృతము సాటిలేని సారముఁ గలది. ఇతనినుండియే ఘోరమగు మంచుకూడ కలుగును. ఆశ్చర్యము. భర్త యొక్క విలాసగోష్ఠి మిక్కిలి సౌఖ్యప్రదమే మైనను, అతని సాధికారనిర్బంధము జాడ్యప్రద మను తాత్పర్యమును మనస్సునందుంచుకొని యన్యాపదేశవిధమున కవీశ్వరి యిట్లు చెప్పుచున్నది.

౨. స్త్రీలకు భర్తృసుఖము ఇష్ట మగును గాక. ఇచ్చట పరవశత్వము గొప్పకష్టము.

౩. ఈ లోకమునందు నిర్మల పతివ్రతల శతము చిక్కును. మన్మథుని జయించిన కన్యమాత్రము భూమియందును, స్వర్గమునందునుగూడ చిక్కదు.)

ఈ మూఁడు శ్లోకము లా ప్రాతఃకాలముననే శుభ్రాంగికిఁ బంపఁబడినవి. తద్ద్వారా యామె శిష్యురాం డ్రగు నాంధ్రకవీశ్వరుల మధ్యఁగూడఁ బడినవి. అందఱును భానుమతి నవకవితను మెచ్చుకొనిరి.

* * *

తత్కాలసేనాపతి చండసేనుఁడు సోమవారమునాఁడు మధ్యాహ్నమున విశ్రాంతి కసంతరము కచ్చేరి సావడిలో కూర్చున్నాఁడు. ఇప్పుడు మువ్వురు శతపతుల నియమించు నధికార మతనిచేతిలో నున్నది. మల్లికార్జున కాలనాథ సులోచనుల శతపతిపదవులు ఖాళీపడియున్నవి గదా. అతని కుమారితె ఫలిని యతనిదగ్గఱనే కూర్చు

న్నది. రాజకీయ రంగములో సంభవించు చున్న మార్పులను గుఱించియే వారిద్దఱును మాట్లాడుకొనుచున్నారు. కాలనాథ భీమ నాథులు బ్రాహ్మణులలోఁ జేర్చఁబడినందున జాతిపవిత్రతయే యడుగంటిన దని ప్రస్తావ వశమున చండసేనుఁ డనెను. మనజాతికి దీని వలన మఱింత పుష్టి కలుగు నని ఫలిని చెప్పి నది. ఆ విషయములో తండ్రికూతుండ్ర వాగ్వాదము జరుగుచుండఁగానే ప్రతీహారి వచ్చి—"ప్రభో! తమదర్శనముకొఱకు జటా మునిపుత్రుఁడు భీమనాథుఁడు వచ్చి ద్వార మున వేచియున్నాఁడు." అని సేనాపతితో మనవి చేసెను.

చండ—పిల్లా! నీ వెప్పుడైన భీమనా థుని జూచినావా?

ఫలి — చెప్పుకొనఁగా వినడమే గాని చూడలేదు. అతఁడు మిక్కిలి పొడగరి యఁట.

చండ— పొడగరి మాత్రమే కాదు. పొడవునకుఁ దగిన లావుకూడ. అది యొక మాంసపర్వత మని చెప్పవచ్చును. వీని తల్లి కర్ణిగూడ సాధారణ పురుషులను మించిన పొడగరి. స్త్రీజాతిలో నంత స్థూలాంగిని నే నెచ్చటను జూడలేదు. ఆమె తనకొడుకునకుఁ బదిసంవత్సరములవఱకు పాలిచ్చినది యఁట. పాలయాధిక్యమువలన నామెకు పెద్దావని బిరుదము వచ్చినది. శక్తిధరుఁడే గాక రథినీ కుమారిగూడ నామెపాలుఁ ద్రావియే పెరి గెను. ఇప్పటికిని రథినీకుమారి "దొడ్డమ్మా! పాలిచ్చెదవా ?" అని యామెను జూచి నప్పుడెల్ల నడుగుచుండును. అట్టి పెద్దావు పెయ్య వీఁడు. రెండుమూఁడుసారులు శతపతి పదవులు ఖాళీపడినపుడు సేనాపతి రణంధర బాబు వీనిని నియమించుటకు యత్నించెను గాని యప్పు డహంకారముచే నెత్తగానే తనకు సహస్రపతిపదవి కావలె నన్నాఁడు. ఇప్పుడు కొనకు బుద్ధివచ్చి శతపతిపదవి యా చించుటకొఱకే వచ్చియుండనోపును. ఇప్పు డు లోపలకు వచ్చును. చూడుము. (ప్రతీ హారిని జూచి) ప్రవేశపెట్టుము వానిని.

ప్రతీహారి వెళ్లి భీమనాథుని లోపలకుఁ బ్రవేశపెట్టినవాఁడయ్యెను.

ప్రవేశింపఁగానే భీమనాథుఁడు ఫలినిని జూచినవాఁడయ్యెను. ఫలినిగూడ భీమనాథుని జూచినది. జటామునివాక్ఛక్తి మాటలు లేకయే దూతికాకృత్యము నాచరించినది. ఆ దూతికయొక్క నిశ్శబ్దోపన్యాసశక్తికి ఫలిని లొంగిపోయినది. జటామునిమాట నెగ్గినది. కర్ణికోరిక నెరవేరినది. భీమనాథుని వాంఛ తీరినది. రాగతరంగితములగు ఫలినిచూపులు భీమనాథునకు జటాముని వాక్ఛక్తిప్రభావ మును విశదపఱచినవి. ఆ దర్శనకోలాహల ములో ఫలిని దగ్గఱనున్న తండ్రినిగూడ గమ నింపదయ్యెను. బహుకాలాభ్యస్తమగు జితేం ద్రియత్వమును గోల్పోయినది. తన మనో మూలధన మగు లజ్జను బోఁగొట్టుకొనినది. ఇంతవఱకు సర్వసమమై యుండిన ఫలిని యిప్పు డనురాగమువలన భీమనాథునియందు పక్షపాతము వహించినది యయ్యెను. తండ్రి చెప్ప వీరసింహుని, తల్లిచెప్ప ఘనేంద్రుని గూడ నామెమనస్సు లక్ష్యపెట్టక యా మహర్షి పుత్రునిపై లగ్న మయ్యెను.

కొన్నిక్షణము లిట్లు గడచిపోయినవి. ఫలిని మోహనిద్రనుండి మేల్కొంచి సర్దుకొని కూర్చుండినది. చండసేనుఁ డాసనముఁ జూపఁగా భీమనాథుఁడు కూర్చుండెను.

చండ—జటామునిపుత్రుఁడా! మీతల్లిగారు క్షేమముగా నున్నారా?

భీమ—క్షేమముగానే యున్నారు.

చండ — నీవుమాత్రమే బ్రాహ్మణుఁడవుగాఁ బ్రకటింపఁబడితివా? లేక మీతల్లిగారుకూడ బ్రాహ్మణిగాఁ బ్రకటింపఁబడినారా?

భీమ-ఆమె నాగాంగనగానే యున్నది. కొన్నిగడియలకు ముందే నాగకులపరిషదధ్యక్షుఁడు మాయమ్మను శుద్ధిపత్ర మిచ్చి నాగజాతిలోఁ జేరుటకు సమ్మతించెను.

చండ—బాగున్నది పంపకము. కుమారుని బ్రాహ్మణులు, తల్లిని నాగులు సంతులు వేసుకొని పంచుకొనిన ట్లున్నది. ఇన్నాళ్లకు గొప్పతగాయిదా యొకటి తీరినది. (ఫలినిని జూచి) కుమారీ! ఈ పంపకములో లాభ మెవరిది?

ఫలి—మనదే! ఈ వర్ధమానవీరుఁడు మనవంతునకు లభించెను.

చండ—(భీమనాథుని జూచి) ఇప్పుడు నాదగ్గఱకు నీ వేపనిమీద వచ్చియున్నావు?

భీమ—తమసేనలో నొకయుద్యోగము నాశించి తమయొద్ద మనవి చేసుకొనుటకే వచ్చియున్నాను.

చండ—ఇదివరలో రణంధరబాబుగారు సేనాపతిగా నున్న కాలమందు నీవు శతపతి పదవి నంగీకరించుటకుఁ దిరస్కరించినట్లు విన్నాను. ఇప్పుడు కూడ శతపతిపదవులే ఖాళీపడియున్నవి. (పరిహాసగర్భముగా) ఈ మధ్య దండనాయకపదవి ఖాళీపడుసందర్భము వచ్చినదే! అప్పు డేల నీవు దానికై ప్రయత్నించక వదలివేసితివి?

భీమ—మీమేనల్లుఁడు వీరసింహబాబుగారు నాకు మిత్రులు. అతనికి పోటీగా నిలుచుట నా కిష్టము లేదు.

తనతండ్రి పరిహాసోక్తిని, భీమనాథుని ఋజుప్రత్యుత్తరమును ఫలిని గమనించినది.

చండ—సేనాపతిపదవికొఱకు పరీక్ష యొకటి జరుగనున్నదని వదంతి ప్రబలియున్నది. దానికి నీవు నిలచెదవా?

భీమ—ఒకవేళ పరీక్షయే జరుగునెడల ఘనేంద్ర మల్లికార్జునులు నిలువఁజాలరు. అందువలన పరీక్ష యంత వీరజనావర్జకముగా నుండదు. ఇఁక నా అత్యంతప్రియమిత్రులైన శివకీర్తి కాలనాథులతో పోటీసేయుటకు నిలువవలెను. అది నా కిష్టములేదు. పరీక్ష యంతయు ముగించినపిమ్మట నెట్టి యుద్యోగముల గొడవ లేకుండ ప్రస్తుత పరీక్షలో ప్రథమోత్తీర్ణునకు ఘనేంద్ర మల్లికార్జునులకును నాకును ప్రత్యేకపరీక్ష యొకటి నడిపింపవలె నని సార్వభౌముని నేను ప్రత్యక్షముగాఁ గోరెదను. అప్పుడు భీమనాథుని నిజస్థితి లోకమునకు బయల్పడును.

ఫలి — (తనలో) ఇతని యాశయము లుదారములుగా నున్నవి.

చండ—ఉద్యోగ మిచ్చుటకుఁ బరీక్ష ప్రమాణముగాఁ జేయుట నాకు సమ్మతమైనది కాదు. భీమనాథబాబు ! సహస్రపతి పదవి ఖాళీ లేదు. ఒకవేళ యున్నను దాని కెందఱో యున్నతవంశస్థులు అభ్యర్థు లగుదురు. ఇప్పుడు మా సైన్యములో మూఁడు శతపతిపదవులు ఖాళీపడియున్నవి. నీకు కావలయునెడల శతపతిపదవి కిప్పుడే యాజ్ఞాపత్ర మిచ్చెదను.

కొసకు చండసేనుఁడు ఋజుభావము తోడనే మాటలాడినాఁడు. భీమనాథునికే యుద్యోగాపేక్ష యుండునెడల నతనిప్రయత్నమునకు వేఱుమార్గ మున్నది. అతని కా యుద్దేశము లేదు. అతని లక్ష్యమంతయు నాదినమున ఫలినిని జూచుటయే. ఆ పని నెఱవేఱినది. అయిన నాచోరపరమేశ్వరునకుఁ దృప్తి తీరలేదు. సంవాదవ్యాజమున కాలమును పొడిగించి యా మోహనాంగిని మఱియు మఱియుఁ జూచుటయే యతని ప్రధాన లక్ష్యముగా నుండెను. కొసకతఁడు తాను వేసిన వలలోఁ దానే చిక్కుకొనెను.

భీమ—బాబుగారు ! శతపతిపదవిని నాకిచ్చెదనని రెండుమూఁడుసారులు రణంధర బాబుగారు నన్నుఁ గోరిరి. అప్పుడు నేను తిరస్కరించితిని. ఇప్పుడు నేను శతపతిపదవి కంగీకరించునెడల పరిహాసాస్పదుఁడ నగుదును.

చండ—నీతో సమానులగు మల్లికార్జున కాలనాథులు ముందు శతపతులుగాఁ బని చేసినవారే గదా. ఇప్పు డొకఁడు మహామంత్రి యైనాఁడు; ఒకఁడు దండనాయకుఁడైనాఁడు. అసలు ఘనేంద్రుఁడు ముందు నగరపాలుఁడుగాఁ బనిచేసెను. ఇప్పుడు రాష్ట్రియుఁ డైనాఁడు. ఈ కాలములో దశపతిపదవి దొరకుటయే దుర్లభముగానున్నది.

భీమ—కాలనాథుఁడు జీవించుటకును, మల్లికార్జునుఁడు తన తల్లిని నౌకరీలోనుండి విముక్తిసేయుటకును ఎంత చిన్నపనిలోనైన ముందుఁ బ్రవేశించిరి. ఘనేంద్రుఁడు తండ్రిగారి యొత్తిడివలన నంత చిన్నపనిలోఁ బ్రవేశింపవలసివచ్చినది. నా కట్టి యిబ్బందులు లేవు.

ఫలిని—మీరు యింక స్వతంత్రజీవనముకొఱకుఁ బ్రయత్నింపవలసియేయున్నది. ఇన్నాళ్లు మీరు తల్లివలనఁ బోషింపఁబడుట యంత యాక్షేపణీయవిషయము గాదు. ఈ దినము మొదలుకొని యామె నాగాంగన. మీరు బ్రాహ్మణకుమారులు. ఆపత్సమయములందుఁ దప్ప నెట్టి ప్రతిఫలము లేకయే బ్రాహ్మణులు నాగులయన్నము తిని జీవించుట గౌరవహానికరము.

చండ—ఔను.

ఫలిని యింకను జెప్పుచున్నది—"మీరు శతపతిపదవిలోఁ జేరుట హాస్యాస్పద మని తలంచుకాలము వెళ్లిపోయినది. తన పినతండ్రి యింటనుండి కాలనాథబాబు బయల్వెడలినరోజును, ఇప్పుడు మీరు బ్రాహ్మణులలోఁ జేరిన దినమును సమానసందర్భములుగానే యున్నవి. అతనికి నిలుచుటకుఁ బినతండ్రి యొకయిల్లుఁ జూపెను. జీవనమునకా దినముననే రణంధరబాబు పిలిచి శతపతి పదవినిచ్చెను. మీకుఁగూడ నిప్పు డా రెండును

అవసరములు. మీయింట మీతల్లి యుండ వచ్చును గాని మీరు మీతల్లియింట నింక యుండుట తప్పు. మీరు మీతల్లిని భోషింప వచ్చును గాని మీ తల్లిచే మీరు పోషింపఁ బడుట యింకమీఁదట తప్పు. బ్రాహ్మణకన్య నగు నేను బ్రాహ్మణజాతిపక్షమున నీమాటలు మీతో మనవిఁ జేసితిని. వీటిలో నధికప్రసంగ మేమైన నుండు నెడల మీరు క్షమింపఁ గోరె దను.

ఫలినివచనోపన్యాసము భీమనాథునకు సదశ్వమునకుఁ గశాఘాతమువలె నుండినది. అతఁ డారాత్రి మొదలుకొనియే ప్రత్యే కముగా నుండుటకును, ప్రత్యేకముగా జీవిం చుటకును సంకల్పించుకొనెను. తత్క్షణమే శతపతిపదవి స్వీకరింపవలెనని యతనికి బుద్ధి పుట్టినది. పూర్వప్రతిబంధకమే యిప్పుడు తిరి గియు నతని మనస్సునకు స్ఫురించినది. అది యేది? సార్వభౌముని యన్నమును దినుచు నతనిధనముదోఁచుట తప్పనుభావము. అప్పు డే దానికిఁ బ్రత్యుత్తరముగూడ నతనికి వచ్చి వేసెను. "ఇంక నేను సర్కారువారి ధనము జోలికి పోను"అని యతఁడు నిర్ణయించుకొనిన వాఁడయ్యెను. ప్రాతఃకాలమున రాజకులము నందు పన్నులను తగ్గించు ప్రకటన మతనికి జ్ఞప్తికివచ్చి యతనిని సులువుగా నట్టినిర్ణయ మునకుఁ దీసుకొనిరాఁగలిగెను. కొనకతఁడు తన భావిప్రేయసి లేక భావకల్పితరమణి సూచనకు లొంగిపోవలసిన వాఁడయ్యెను. అతఁడు మెల్లగాఁ దనలొంగుపాటు నిట్లంగీ కరించెను:

"అమ్మాయిచెప్పినయుక్తినచ్చినది. నేను ప్రవేశించిన జాతికగౌరవముఁ దెచ్చుటకంటె నేను శతపతినై పరిహాసాస్పదుఁడనగుటయే మేలని నాకుఁ దోఁచుచున్నది. బాబుగారు! ఆజ్ఞాపత్రమిచ్చిన తాముని ర్దేశించుశతమునకు నేతనై సార్వభౌముని సేవఁ జేయఁగలవాఁ డను."

చండసేనుఁడు తనకుమారితెయుక్తివాద వైభవమున కుప్పొంగెను. తనమాట నెగ్గి నందులకు ఫలిని సంతోషించినది. దండ నాయక సింగాక్షుని దళములో సహస్రపతి బలభద్రునిచేతిక్రింద సులోచనుఁ డుండెడు వాఁడు. అతనిపదవినే చండసేనుఁడు భీమ నాథున కిచ్చుచు నాజ్ఞాపత్ర మొసంగినవాఁ డయ్యెను. భీమనాథుఁడు ఫలినీవిలోకనోత్స వములో మునిఁగియుండెను. తా నొక గొప్ప శతపతిని సంపాదించి సర్కారువారి కిచ్చితి నను హర్షములో నున్నాఁడు చండసేనుఁడు. భీమనాథుని నూతన జీవితారంభమునకుఁ గారకురాల నైతి నని ఫలిని సంతోషించు చున్నది. ఫలినీ భీమనాథులు తనచేతఁ జిక్కకమానరని మన్మథుఁడు నాట్యమాడ నారంభించినాఁడు.

## పంద్రెండవ ప్రకరణము

### చోరరాక్షసుఁడు

సోమవారమురాత్రి మిక్కిలి సంభ్రమ ముతో భీమనాథుఁడు గాక తక్కిన పరంతప సంఘునాయకులు చంద్రసేనునియింటఁ గూడి రి. ఇదివఱకు భీమనాథుని చేతిక్రిందఁ బని సేయు జంభుఁ డను కాపాలికుఁ డొకఁ డా సభలో సన్నిహితుఁ డయ్యెను. భీమనాథుని స్థానములో నతఁడు కూర్చుండెను. తక్కిన వారు మునుపటివారే,

నిశం — ఈ దినమున ప్రాతఃకాలము నందు భీమనాథుఁడు బ్రాహ్మణజాతిలోఁ జేర్చుకొనఁబడినాఁడు. ఆ క్రొత్తబ్రాహ్మణుఁ డంతటితోఁ బోవక సార్వభౌముని సేనలో శతపతిగాఁ గుదురుకొనెను. ఇప్పుడు తాను బ్రాహ్మణుఁ డయ్యెను గనుక నాగులసొత్తు తినఁజాలఁడఁట.

పింగాక్షుఁడు—ఏనాగులసొత్తు ?

నిశం — తన తల్లిసొత్తు. ఈ దినము మొదలుకొని యతని స్వతంత్రజీవన మారంభించినది. ఈదినము మొదలుకొని యతఁడు సార్వభౌముని సొత్తు దిన నారంభించినాఁడు. అందులకుఁ బ్రతిఫలముగా నతఁ డిటుపిమ్మట సర్కారువారిసొత్తు దోఁచఁడఁట. మదాంధులగు శ్రీమంతుల సొత్తు దోఁచుటయు, చౌర్యసాధ్యము లగు సంఘుస్థుల కార్యములు నెరవేర్చుటయు మాత్రము తాను పరంతపసంఘమునకుఁగాను జేయునఁట. అందువలన మన చోరవర్గమును రెండు భాగములనుగాఁ జేయవలసియున్నది.

పింగా—అన్నింటికంటె నతనిని విడుచుకొనిన మనకు క్షేమ మని నాకుఁ దోఁచుచున్నది. భోగనాథునిపై ద్వేష మొక్కటి తప్ప మనలో బంధించునంశ మొక్కటియును లేదు.

నిశం—అతని నెప్పుడును విడువవలదని ధవళాక్షీ దేవి యాదేశము.

సులోచనుఁడు—అతనిని విడువనక్కఱ లేదు. కాని యతనిని బిలిచిన యంతరంగ సభలలో మనము రహస్యములను మాట్లాడుకొనకుండ నుండవలెను.

నిశం — అట్టికష్టము నతఁడు మనకుఁ బెట్టలేదు. అంతరంగసభలోని సభ్యత్వమును గూడ నతఁడు విడిచివేసినాఁడు. అతనిస్థానము నందులకే జంభున కిచ్చి యితనిని సభకుఁ దీసుకొనివచ్చితిని.

ఈజంభుఁడు జటాముని తృతీయభార్యయగు భైరవికిఁ దమ్మునికుమారుఁడు. అందువలన నిశంభునితల్లి సుముఖికి మేనబావ యగును. అందువలన నిశంభునకుఁ దండ్రి వరుస. ఇతని కాంధ్రభాషలో సంతకము సేయుట మాత్రము తెలుసును. ఇతర భాషలో దేనిలోనైన నితఁడు పండితుఁడుగా నుండనచ్చు నని మా పాఠకులు భ్రమపడవలదు. తక్కిన భాషలలో సంతకము సేయుటకుఁగూడ నితనికిఁ దెలియదు. దొంగతనములో నితఁడు గొప్పనిపుణుఁడు. మాటలలో నసాధ్యుఁడు. ఇంద్రునినైన తృణీకరించి పలుకుట యితని యలవాటు. ఒక సంవత్సరము క్రింద జరిగిన వస్తాదుల మల్లయుద్ధ పరీక్షలో నితఁడు విదేశీయమల్లుల నోడించి పేరువడసియున్నాఁడు. భీమనాథునితో మల్లయుద్ధమం దొకపట్టు గెలిచి రెండుపట్టు లోడెను. ఒకపట్టయినను భీమనాథునితోఁ బట్టి గెలుచుట యసాధ్యకార్యములలో జమ. తనచేత నినుపగద యుండిన ఘనేంద్ర కాలనాథ మల్లికార్జునులను బొడిచేసివేసెద నని యితఁడు డాబులు కొట్టుచుండును. ఇతనికి మనుష్యులను వధించుట యనిన నత్యుత్సాహము. మద్యమాంసము లితనికి ప్రతి

దినావశ్యకములు. ఇతని యక్క పేరు చించాక్షి. ఆమెవయస్సు ముప్పదికి మించి నను పెండ్లిమాత్ర మింక నామెకుఁ గాలేదు. జంభుఁడు పాతికయేండ్లవాఁడు. ఇతనికిఁగూడ పెండ్లి కాలేదు. ఇద్దఱును రూపమునందుఁ గాటుకకొండలే యగుదురు. చించాక్షిగూడ మిక్కిలి బలవంతురాలనియు, బరంతపసంఘములో నామె సభ్యురా లనియు పాఠకులు గమనింపఁదగిన విషయము. వీ రిద్దఱును నివసించు వీథిలో వీరికి దడియనివారు లేరు. సంస్థానమల్లుఁడుగా నితఁడు సుచంద్రునివలన జీతముఁ బొందుచున్నాఁడు. సంఘచోరుఁడుగా నిశంభునివలన జీతముఁ దినుచున్నాఁడు. ఇతనికి నిశంభునిపై నభిమాన మెక్కువ. అందఱికంటె నిశంభున కితనిపై విశ్వాస మధికము. ఇతనికి చోరరాక్షసుఁడని సంఘములో మాత్రము ప్రసిద్ధ మగు బిరుదు. ప్రకృత మనుసరించెదము.

పింగా—ఇప్పుడు భీమనాథుఁడు మన యంతరంగసభలో సభ్యత్వము విడిచివేసినందున మన సంఘలక్ష్యమును మార్చుకొనుట కభ్యంతర మేమి గలదు? ఆంధ్రరాష్ట్రమును శక్తిధరున కొప్పగింపవలసిన యవసర మేమి మనకు? కాకులుని రాజ్యమును కాకులదౌహిత్రికే యిచ్చివేయుట మనవిధి.

నిశం—మన మతనికిఁ దెలియకుండ సంఘలక్ష్యము మార్చుట తగనిపని. అది యెప్పటికైన నతనికిఁ దెలియకఁ దీరదు. అది తెలిసిన నతఁడు మనకు ఘోరవిరోధి యగును.

జంభు—అతఁడు విరోధియైన మనకుఁ గల నష్ట మేమి? ముప్వురున్నవారు నలువు రగుదురు. మనముగూడ నలువురమున్నారము. మన మిద్దఱము. అరుణపింగాక్షు లిద్దఱు.

నిశం — పూర్ణాఘోరకులను లెక్క వేయ నక్కఱలేదా?

జంభు—పూర్ణకు మా చించాక్షి సరిపోవును. మన బలభద్రుఁడు ఘోరకునకు సరిపోవును.

పర్ణిని—నాలుగు వీరయుగళములలో జోడీ లెట్లు?

జంభు— నేను భీమనాథుని జయించెదను. నిశంభుఁడు ఘనేంద్రుని నిర్జించును. అరుణుఁడు మల్లికార్జునుని హతమార్చును. పింగాక్షుఁడు కాలనాథుని పేరడంచును.

పర్ణి—చోరపరమేశ్వరుఁడు స్త్రీల నగలను దొంగలించ నని యొకవ్రతముఁ బెట్టుకొనియున్నాఁడు. మీకుఁగూడ నావ్రత మున్నదా?

జంభు—దొరకిన దేదియు విడిచిపెట్టనని నేను వ్రతముఁ బెట్టుకొనియున్నాను.

పర్ణి—అంతఃపురముఁ బ్రవేశించి రాణిగారి యేడువారముల నగలను తమరు దొంగలింపఁగలరా?

నిశం — అది మిక్కిలి దుష్కరమైన కార్యము.

జంభు—చోరపరమేశ్వరునకువలె చోరరాక్షసునకుఁ గూడ దొంగలించిన సొత్తులో నగముఁ దీసుకొను హక్కిచ్చెదరా?

పర్ణి — చోరపరమేశ్వరునివలె చోర రాక్షసుఁడు తనకులభించిన భాగమును ధర్మముఁ జేసివేసునా ?

జంభు—చోరరాక్షసునకు ధర్మమేచేసుకొనుట కిష్టముండునెడల నతఁడు మీదగ్గఱ దొంగనౌకరీ కేల కుదురుకొనును ?

నిశంభుఁడు సభ్యుల నా విషయములో నభిప్రాయ మడిగెను. సభలో మతభేదము పుట్టినది. హిరణ్యనాభుఁడు నాల్గవవంతుగా నవరించిన బాగుండునని సూచించెను. దాని నందఱు నంగీకరించిరి.

జంభు—నాకు నాల్గవవంతే చాలును. నేను తప్పక యంతఃపురముఁ బ్రవేశించి రాణి నగలను దోఁచెదను. నాకు బలభద్రుఁ డొక్కరుఁడు సహాయుఁడుగా నుండినఁ జాలును.

నిశం—అట్లే కానిమ్ము. ఏరోజురాత్రి యీపనిఁజేసెదవు ?

జంభు—ఎల్లుండి మంగళవారమునాఁడు రాత్రి. చక్రవర్తి యారాత్రి ప్రాసాదమున నుండఁడు. అతఁడు ప్రతిమంగళవారము రాత్రియందు చిట్టడవిలోనుండు మహామారీ మందిరము దగ్గఱకు వెళ్లుచుండును. ఆ సమయమునందు రాజును బంధింప వీలుగా నుండునని నే నెన్నిమోసారులు భీమనాథబాబుకుఁ జెప్పితిని. అతఁ డంగీకరించినవాఁడు గాఁడయ్యెను.

పింగా—ఇప్పుడు భీమనాథుఁడు రంగము నుండి ప్రాయికముగా నిష్క్రమించినందున మన మింక నాపనిని జేయవచ్చును.

పింగాక్షుని సూచన నరుణ జంభ సులోచనులు సమర్థించిరి. తక్కినవా రంగీకరింప లేదు. వా రంగీకరింపకఁబోవుటకు కారణ మేమి? “బుధవారము సింహాసనోత్తరాధికారి సమస్యావిచారణదినము. ఆ దినమునఁ జక్రవర్తి లేనియెడల నిబంధనప్రకారము మహామంత్రి యతనిస్థానము నాక్రమించును. అరాజక మగు సమయమున యువరాజును సింహాసనమున నుంచి కార్యములు నడుపుట యవసరము గాన ఆదినమున విచారణ నిలుపరు. మల్లికార్జునుఁడు ధర్మాసనమున వెల్లిన శక్తిధరునదే యావరాజ్య మనుటలో సందేహము లేదు. నిజముగా శక్తిధరుఁడు యావరాజ్యమునకు వచ్చిన, ముందుగా భీమనాథుఁడు పరంతపసంఘమును విడిచిపెట్టి వేయును. అతఁడు సంఘములో నున్నందున సంఘమునఁ జేరినవా రెందఱో గలరు. వారందఱునుగూడ సంఘమును విడిచిపెట్టుదురు. శక్తిధరుఁడు యావరాజ్యమునకు వచ్చిన వెంటనే పరీక్షావసరము లేకయే కాలనాథుని సైనాపత్య మిచ్చివేయును. అంతియేగాక శాంతిసేనకుఁ జిత్రకూట మహామండలముఁ గూడ నిచ్చివేయవచ్చును.” ఇవి వారు చూపిన కారణ సంగ్రహము. భోగనాథుని యావరాజ్యము స్థిరపడిన పిమ్మట మహారాజును మంగళవారపురాత్రి బంధించుట గుఱించి యందఱు నేకాభిప్రాయు లైరి.

పర్ణి—ప్రతిమంగళవారమురాత్రి మహారాజు మహామారీమందిరమునకు వెళ్లుటకుఁ గారణమేమి ?

చంద్రసేనుఁడు—ఏదియో గుప్తపూజ యని చెప్పవచ్చును.

హిరణ్యనాభుఁడు — ఏదియో గుప్తచర్య కని నాయుద్దేశము.

అరుణుఁడు—ఎవతె యందులకుఁ దగిన నాయికామణి ?

హిర—గుప్తచర్య యనఁగా కౌలికు లాచరింపఁదగిన కులయోగినీపూజ యని నా భావము.

అరు—కులయోగిని యనఁగా నేమి ?

హిర—కుండలినీశక్తిని లేపిన మాంత్రికురాలుగా నుండవలెను. అట్టి నారీమణిని కౌలికసాధకుఁడు భార్యాభావముతో నారాధించును. ప్రచండ చండీ విద్యోపాసకుల కీ పద్ధతి గలదు. ప్రచండచండీమాతయే నా మాంత్రికముచే మహామారి. అందువలన మహామారీమందిరమునందు జరుగు క్రియ కులయోగినీపూజగానే యుండును.

అరు—భార్యాభావముతో నారాధించుట యనఁగా—?

నిశంభు— (ప్రసంగమధ్యమందు) ప్రస్తుత మీ ప్రసంగము మన కనవసరము. భోగనాథుని యావరాజ్యము స్థిరపడువఱకు మహారాజుజోలికి మనము పోఁగూడదు.

అందఱును నిశ్శబ్దు లైరి.

నిశంభుఁడు—(జంభునిఁ జూచి) బాబు! మంగళవారమునాఁడు రాత్రి కోట పడమర మైదానములో బలభద్రుఁడు నిన్ను సంధించున ట్లేర్పాటుఁ జేసెదను.

జంభు—అట్లే కానిండు.

చంద్ర —చీఁకటిరాత్రులలో నీ పని సేయఁగూడదా ?

జంభు — వెన్నెల రాత్రియే కోటలో దొంగతనమునకు మంచిది. వెన్నెలరాత్రులయందు చిన్నచిన్న బురుజులలో నెవరు నుండరు. నాలుగు పెద్దబురుజులలో నలువు రుందురు. వారికిఁ దెలియకుండ కోటగోడ మెక్కుట కష్టమైనపని గాదు. అందులకుఁ దగినస్థలము నాకుఁ దెలుసును.

నిశం—ఔను. వాస్తవమే! కోటలో దొంగతనమునకుఁ జీఁకటిరాత్రికంటె వెన్నెల రాత్రియే మేలు. చీఁకటిరాత్రులలో కావలివారు మిక్కిలి జాగ్రత్తగా నుందురు.

పర్ణి—అంతఃపురమునందుఁ బ్రవేశించి దొంగలింపఁగల్గునెడల భీమనాథబాబుకంటె జంభాసురుఁడే గొప్ప దొంగ యని మన మంగీకరింపవచ్చును. అప్పుడు మన చోరరాక్షసునకుఁ జోరమహేంద్ర బిరుద మీయవచ్చును.

అందఱుసభికు లామాటను సమర్థించిరి. చోరరాక్షసునిముఖము త్సాహముచే వికసించినది. అతని దృష్టు లప్పుడే రాణిగారి యంతఃపుర సౌధముపైఁ బ్రసరించినవి. వాటి కదిగోచరము కాకపోయినను సంకల్పము దానిని వాటిముందుఁ దెచ్చిపెట్టినది. అచ్చట నిద్రవోవుచున్న లీలావతి కన్పట్టినది. తానామెను లేపి యెట్టి కఠినోక్తులతో దడిపింపవలయునో యాగ్రంథము నతని ప్రతిభ సమకూర్చుచున్నది. అప్పు డందఱి దృష్టులును చోరరాక్షసునిపైఁ బడినవి. అతఁ డాపూటకు నాయకుఁడుగా నుండెను. ఆ యుచ్ఛృంఖలుఁ డగు వీరకాపాలికుని ద్వారా మెన్ని యోకార్యములను సాధించుటకు నిశంభుఁడు సంకల్పించుకొనినాఁడు.

## పదమూఁడవ ప్రకరణము

### జంభనిగ్రహము

మంగళవారమునాఁడు రాత్రి కోటవెనుక ప్రక్క నొక చిన్నపడవచే నగడ్తను దాఁటి యిద్దఱు మనుష్యులు కోటగోడను సమీపించిరి. వారిలో నొకఁడు వస్తాదు జంభుఁడనియు, మఱియొకఁడు వాని యనుయాయి బలభద్రుఁడనియు, మా పాఠకులకు బోధపడి యుండును. నల్లనిబుఱకాచే వారి శరీరము లాచ్ఛాదితములై యుండుటఁబట్టి వారి నిజ స్వరూపము లేమియును దెలియలేదు.

జంభుఁడు తన యిష్టదేవతకు మ్రొక్కి త్రాడుచేఁ గట్టఁబడిన యుడుమును కోటగోడపై విసరినవాఁడయ్యెను. ఆ బలవత్తర ప్రాణి కోటపైఁ దనకు దొరకిన యొకచెట్టు వేరును దిట్టముగాఁ బట్టుకొనినది. ముందుగా నాయకుఁడు గోడ నా త్రాడు సహాయమున మిక్కిలి లాఘవముతో నెక్కినవాఁడయ్యెను. పిమ్మట ననుచరుఁ డెక్కెను. ఆ స్థలమునందు వృక్షము లధికముగా నున్నందున కోటబురుజులపైఁ గావలికాయువాని దృష్టికి వారగుపడలేదు. పడవచే వారగడ్తను దాఁటునది గూడ వానికి కనుపించుట కవకాశము లేకపోయినది. ఆ చెట్ల నీడయే వారిని భద్రముగా నచ్చటఁగూడఁ గాపాడినది.

ఇప్పుడు నాయకునకు లీలావతీదేవి నిద్రించు భవనము లక్ష్యమై యున్నది. గోడ దిగిన నుద్యానవనము. ఉద్యానమునుండి యంతఃపురమునకు వెళ్లు త్రోవలో నొక సింహద్వారము దాఁటవలసియున్నది. ఆ ద్వారము నొక ప్రతీహారి (పురుషుఁడు) కాయుచున్నాఁడు. ఉద్యానవన మధ్యము నందలి భవనములో చాలమంది యుద్యానపాలకులు నిద్రించుచున్నారు. సింహద్వారము దాఁటిన లీలావతీభవనమువఱకు కష్టములేదు. ఆ భవనమునందు కొన్ని కక్ష్యాంతరములు దాఁటవలసియుండును. వాటియందు ప్రతీహారిణు లందఱు నబల లగు స్త్రీలు. ఇది జంభుఁడు సంగ్రహించిన విషయసంగ్రహము.

మత్తుమందువలన ప్రతీహారిణులను మూర్ఛితలనుగాఁ జేయవచ్చునని చోరరాక్షసుని సంవిధానము. పురుషుని మాత్రము బంధింపవలసియుండు నని వాఁ డనుకొనినాఁడు. అనుచరునియొద్దనే మత్తుమందు గలదు. ఆడవాండ్రను దాఁటవలసిన యుద్యోగము ననుచరున కిచ్చి, మగవానిని దాఁటవలసిన యుద్యోగమును దాను పుచ్చుకొనినాఁడు. చడిచప్పుడు లేకుండ వారిద్దఱును కోటగోడనుండి యుద్యానములోనికి దిగిరి. పిమ్మట క్షణములో నుద్యానము దాఁటి యంతఃపుర పశ్చిమ సింహద్వారము దగ్గఱకు వచ్చిరి. ఆద్వారపాలకుని బంధించుటలో గడబిడ జరుగునేమోయని నాయకుఁడు భయపడెనుగాని, యా యుద్యోగి కాళ్లు సాచి గోడ నానుకొని కూర్చుండియే చేతఁ గత్తిబట్టుకొని నిద్రించుచున్నాఁడు. అందువలన వాని నేమియును జేయనక్కఱలేకయే సులభముగా వారు లోపలఁ బ్రవేశించిరి. ముం దనుచరుఁడు, వెనుక నాయకుఁడును నడుచుచున్నారు. ఇద్దఱును రాణిగారి భవనమువఱకు నిరాటంకముగా వెళ్లిరి. అచ్చట ప్రతీహారిణులను, నిద్రించుచున్నవారిని దాఁటిపోవుచు, మెలకువతో

నున్నవారిని మత్తుమందుచే మూర్ఛితల నుగాఁ జేయుచు, ననుచరుఁడు మిక్కిలి చురుకుగాఁ దాము వచ్చిన కార్యమునకు త్రోవ సరళముఁ జేయుచుండెను. రెండు గడియలవఱ కెవరికిని దెలివి రాసీయకుండ నుండునంత బలవత్తర మైనది యా మత్తు మందు. వారట్లు సులభముగాఁ గక్ష్యాంతర ములను దాఁటి లీలావతీదేవి శయనశాలఁ బ్రవేశించిరి.

దీపము లఖండముగా వెలుఁగుచున్నవి. హంసతూలికాతల్పముపై లీలావతీ దేవి నిద్రించుచున్నది. ఆమె మంగళవారపునగ లతో నీరాత్రి పండుకొనియున్నది.

నాయకుఁ డప్పుడు శబ్దములేకుండ లీలా వతీదేవిని లేపవలెనని దన యనుచరున కాజ్ఞ యిచ్చెను. వాఁడు మెల్లగాఁ దల్పము సమీ పించి లీలావతీదేవి పాదములను మృదువుగాఁ బట్టెను. అంతతో నామెకుఁ దెలివివచ్చి కండ్లు విప్పిచూచినది. వాఁడు వెంటనే కాలు వదలివేసెను. నాయకుఁడు తాను లీలావతీ దేవితో మాట్లాడవలసినది యాలోచించు కొనినాఁడు. వాఁడు తన చాతుర్యమును, తన నిర్భయత్వమును, తన దృఢత్వమును తన యనుచరునకు వెల్లడియగునట్లు రాణి నిట్లు హెచ్చరించెను:

"లీలావతీ! నీ వేమి కేకవేసినను, ఈ బాకుతో నిన్ను పొడిచి చంపివేసెదను. ఇప్పుడు నీ మానప్రాణములను రక్షించు కొనుటకొక్క యుపాయమే యున్నది. నీ యేడువారముల నగలను దీసి మా కిచ్చి వేయుము."

వాఁ డనినట్లే చేయగలవాఁడని వాని కాఠిన్యస్వరముచే లీలావతీదేవి తెలుసు కొనెను. అట్టి భయావహ సమయములోఁ గూడ మన స్వాస్థ్యముఁ దప్పిపోకుండ లీలా వతీదేవి తన సహజ నయవంచకస్వరముతో నిట్లనినది :

"ఎవరవు నాయనా నీవు?"

జంభు—నేను వస్తాదు జంభుఁడను. పరంతపసంఘనాయకులలో నొకఁడను. ఇంక నీవు శీఘ్రముగాఁ గార్యమునకు గడంగుము. ముం దొంటినగ లొలిచిపెట్టుము.

ధిక్కరింపఁబడుట లీలావతీదేవికి స్వప్న ములోఁగూడఁ దెలియదు. బెదరింపఁబడుట మిక్కిలి యపరిచితము. అవమానింపఁబడుట యూహించుటకుఁ గూడ శక్యము కానిది. సులోచనుఁడు పెద్దగుంపుతో నడ్డినపుడు గూడ నామె ధిక్కరింపఁబడలేదు; అవమా నింపఁబడలేదు. లక్షసైన్యమున కామె యధీశ్వరి యనుట సత్యమైన సంగతి. శత పతులును, సహస్రపతులును, దండనాయ కులును ఆమెకనుసన్నలలో మెలంగు చుందురు. ఆమెదగ్గఱనే కాదు; ఆమె సఖి భృంగాలక దగ్గఱఁగూడ పెద్ద పెద్ద యధి కారులు భయపడుచుందురు. ఆంధ్రరాష్ట్ర ములో నామె కడ్డులేదు. అట్టి మహోన్నత రాజ్ఞి తన యంతఃపురమున, తన శయ్యా గృహమునందే యొక తుచ్ఛకాపాలికునిచే ధిక్కరింపఁబడినది; బెదరింపఁబడినది. అవమా నింపఁబడినది; ఆమెమానప్రాణము లిప్పుడు సందిగ్ధస్థితియం దున్నవి. ఆమెయెదుట నిద్దఱు నీలకవచధారులు, భయంకరాయుధపాణులై

కన్పట్టుచున్నారు. ఒకఁడు క్రూరపరాక్రముఁ డగు జంభుఁడని తెలిసిపోయినది. ఇంకొకఁడు వాని యనుచరుఁ డని సందర్భము చెప్పకయే చెప్పుచున్నది. నూర్వురు సాధారణపురుషులను దా నొక్కరుఁడే తలపడి జయించు శక్తి జంభునకుఁ గల దని యామెకుఁ దన కుమారుఁడు భోగనాథుఁడు చెప్పి యుండుట జ్ఞప్తికి వచ్చినది. అంతఃపురమున రాజుగారు లేరు. అంతఃపుర స్త్రీ లందఱును జంభున కడ్డుగా నిలువఁజాలరు. ఆమె యి ట్లనుకొనినది:

"వీఁడే నిశంభునకుఁ గుడిభుజముగా నుండు వోరపరమేశ్వరుఁడుగా నుండనోపును. సర్కారుసొత్తుఁ గావలసినంత కొల్లకొట్టి యిప్పు డంతఃపురముఁ బ్రవేశించియున్నాఁడు. ఈ రెండవవాఁడు కూడ మిక్కిలి బలవంతుఁడుగాఁ గన్పట్టుచున్నాఁడు. ఎందఱిని వధించుకొని వచ్చినారో వీరు? వీరిని నే నెదిరించిన నా మానప్రాణములను వీరు నిలువనీయరు. సుమా రిరువదిరెండు సంవత్సరములు ప్రయత్నించి యమూల్యరత్నములను సంపాదించి నేను చేయించుకొనిన నగలనెల్ల వీరి కిచ్చుటయా? అయ్యో! నా కిప్పుడు దిక్కెవ్వరు? అయినను మంచిమాటలచే వీనిని మఱలింపఁ జూచెదను.

"వత్సా! జంభాసురా! నీ విట్టిపనికిఁ బూనుకొనుట నా కాశ్చర్యముగా నున్నది. నీతల్లి యొకటియు నే నొకటియునా? ఇది వఱకు నీ రాష్ట్రరక్షకులలో నీ వొకఁడ వని ధైర్యముఁ జెందియున్నదానను. మా రాజు నీవంటి రాష్ట్రవీరులను నమ్మియే విప్లవసంఘమువలన భయము విడిచి నిశ్చింతగా నున్నారు. ఈ నీకృత్యమును వినిన నీ యక్కయ్య చించాతమ్మ నొచ్చుకొనదా? నీ విచ్చటికి వచ్చినసంగతి నే నెవరితోడను జెప్ప నని నా మంగళసూత్రమును బట్టుకొని ప్రతిజ్ఞఁ జేసెదను. నీకు దండనాయకపదవి యిప్పించెదను. పరంతపసంఘములో నుండి నీకు లాభ మేమి?

జంభుఁడు— నీ నక్కచిక్కులు నాదగ్గఱ పనిసేయవు. నీమాటలు నమ్ముటకు నే నంత గ్రుడ్డివాఁడను గాను. ఇప్పుడు నీ నగ లన్నియుఁ దీసుకొనినగాని నేను పోవ నని నీతో స్పష్టముగాఁ జెప్పుచున్నాను. నీవు బుద్ధిమంతురాలవై నగ లీయని యెడల నేమి జరుగునో చెప్పెద వినుము. ఈ యంతఃపురముననే, ఈ హంసతూలికా తల్పముననే నీ మానము రాక్షసునిచే భంగపరుపఁబడును. పిమ్మట నపవిత్రముగాఁ జేయఁబడిన నీశరీరమునుండి శిరస్సు వేఱుగాఁ జేయఁబడును. కొసకు వెతకివెతకి నీ నగలుగూడ నపహరింపఁబడును. నీ కొక క్షణమే యవకాశ మిచ్చితిని. నగ లిచ్చెదవా? చెడిచచ్చెదవా? ఏదియో యొకటి నిశ్చయించుకొనుము.

ఇద్దఱి చేతులలోఁ గత్తులు మెఱసిపోవుచున్నవి. లీలావతి కనులకు యమదూతలవలె వారిద్దఱును కన్పట్టిరి. నగలన్నియు నిచ్చివేయుటకే లీలావతి నిశ్చయించెను. విప్లవసంఘపు క్రౌర్య మప్పు డామెకు బోధపడెను. ఇప్పటికి వానికి నగలన్నియు నిచ్చివేసి మఱునాఁడునుండియు రాష్ట్రములో నుండు విప్లవకారులను వెతకివెతకి వేటాడ

ను త్తరువుఁ బుట్టింపవలయునని యామె యను కొనెను.

లీలా—నా నగలన్నియు నిచ్చివేసె దను. న న్నేమియు బాధపెట్టకుము.

జంభు — అట్లగు నెడల వెంటనే లేచి నగల నిమ్ము.

సర్వరాష్ట్రిమున కాజ్ఞాపకురా లిప్వ డాజ్ఞాపింపఁబడుచున్నది. ఆమె క్రోధావే శము పట్టఁజాలకపోయెను. అప్రయత్నముగా నామెనోటినుండి యీమాట జాఱినది:

"నానాథుఁడే యుండు నెడల నీశాల నిం కొకరు ప్రవేశింపఁగలరా ?"

ఆమాటను మహావీరత్వమదశాలి యగు జంభుఁడు సహింపఁడయ్యెను. అతఁడు సార్వ భౌముని తృణీకరించుచు నిట్లు పలికెను:

"నీవు పిల్చి పిప్పిఁ జేసిన యాచచ్చుకుక్క యున్న నేమి? లేకపోయిన నేమి?"

జంభుఁ డీమాట ముగించులోపల నొక యద్భుతము జరిగినది. రెండవమనిషి తన కుడిచేత నుండు కృపాణము నెడమచేతికిఁ దీసుకొని, ఆ కుడిచేతితో జంభుని యెడమ చెయ్యిని పట్టుకొని దిట్టముగా లాగి యొక విసురు విసిరివేసినవాఁ డయ్యెను. జంభుఁడు నీటిప్రవాహముచేఁ ద్రోయఁబడిన చెట్టువలె నేలఁగూలెను. రెండవమనిషి కొంచెమైన నాలస్యము సేయక వానిపైఁబడి కత్తిని లాగు కొనెను. ఈ రెండుపనులు నొకతెప్పపాటులో జరిగిపోయినవి.

"బలభద్రుఁడు సుచంద్రుని మనుష్యుఁడా? కానిమ్ము. నన్నుఁ బడఁద్రోసి యాక్రమించు కొనుశక్తి వీని కెక్కడిది?" అని జంభుఁడు తన లో గొణుగుకొనెను. దెబ్బ బలముగాఁ దగి లినది. ఇనుపపర్వతము మీఁదపడినట్లున్నది వానిశరీరము. లీలావతి యాశ్చర్యముతోఁ జూచుచున్నది.

"దొంగనక్కా! ఆడువారిదగ్గఱనా నీ బింకములు. మహారాజపరమేశ్వర సుచంద్ర భట్టారకుఁడు చచ్చుకుక్కయా? దయ్యాల చక్రవర్తిగూడఁ దేఱిచూడఁజాలని యాంధ్ర సమ్రాజ్ఞి మానము గుఱించి బెదరింప నీ వెవఁడవు?"

స్వరమువలన నా రెండవమనిషి యెవరో లీలావతీజంభు లుభయులకును దెలిసిపోయి నది. ఇంతవఱకు హానముగాఁ దన యను చరుఁడు తన్నంటి వచ్చుచుండినందులకుఁ గారణ మప్పుడు జంభునకుఁ దెలిసినది. ఎవ రతఁడు? పరంతపసంఘమునకు భయవర్ధనుఁ డగు రాష్ట్రియఘనేంద్రుఁ డతఁడు. శత్రు వులచే లక్షసైన్యమునకు సమానముగాఁ జూడఁబడు మహావీరఘనేంద్రుఁ డతఁడు. రాజకాళిచేఁ ద్రాత యని పొగడఁబడిన విఖ్యాతచరిత్రుఁడగు ఘనేంద్రుఁ డతఁడు.

ఇప్పుడు మఱియొకసారి లీలావతి ఘనేం ద్రుని బలమును ప్రత్యక్షముగాఁ జూచినది. తన తమ్ముఁడే యిప్పుడు రాష్ట్రియుఁడుగా నుండు నెడలఁ దనపని యేమగునో యామెకుఁ దోఁచెను. అసమర్థుల నధికారములో నుంచఁ గూడదనుసూత్ర మామె కిప్పుడు బోధపడి నది. అధికారు లెంత సమర్థులైన ప్రభుత్వ శక్తి యంత దుర్నిరీక్ష్యముగా నుండు నని యామె యిప్పు డెఱింగినది,

సర్వదేశములనుండి

వార్తలను సంగీతమును వినవీలొనర్చు



"హిస్ మాస్టర్స్ వాయ్స్"

రేడియో

రిసీవరు

మాడల్ 481 AC

(200-250 వోల్టులు :: 50-100 సైకిల్సు)

వెల రూ 350/-

- చూపునకు రామణీయకము
- చెవికింపైన జీవనాదము
- 7-2200 మీటర్లలోని అన్ని స్టేషనులు విననగును
- గ్రామఫోను రికార్డులను కూడ విద్యుచ్ఛక్తి మూలముగ ప్రతిఫలింపనగును

నేడే వివరములకు మాకు వ్రాయుడు!

# ది గ్రామఫోన్ కంపెని-

లిమిటెడ్,

**45, సౌత్ పెరేడు, బెంగుళూరు.**



వెల స్వల్పము! ఫల మధికము!!

# ఫలాహార మాహాత్మ్యము

మహాత్మాగాంధీ మొదలయిన మహామహులు దీనినిగురించి పలుసార్లు పలువిధములుగా ప్రశంసించియున్నారు. శాస్త్రములు దీనిని బహువిధములుగా ఉద్ఘోషించుచున్నవి వైద్యులు దీనిని వేవిధములుగా పొగడియున్నారు.

అటువంటి ఫలములను గురించి తెలుసుకొనుటకు మీ రెందుకు కృషి చేయరాదు?

లోకములో ఎన్నెన్నిరకముల పండ్లున్నవి? వాని గుణాగుణము లేవి? ఏయే దేశములలో ఏయే కాలమానములలో ఏయే పండ్లు పండును? ఏయేపండ్లకు ఏయే భూసారము అనుకూలముగా ఉండును? ఏయేపండ్ల ఆహారపు విలువ యెటువంటిది? ఏయేపండ్లచెట్లను ఏయేవిధముగా పెంపకము చేయవలయును? ఆపంటలకు చేయదగిన కృషి యేది? మొదలయిన విషయములన్నియు ప్రతివారును తెలుసుకొనవలసినది పరమధర్మము.

ఈ ఫలకృషి అనేకకృషులకు మూలాధారమగుచున్నది. కాదా? మీ ధర్మ నిర్వహణమునకును, పరిజ్ఞానమునకును, శ్రేయస్సునకును ఫలకృషిని వివరముగా తెలుసుకొనుట అత్యవసరము.

ఆంధ్రగ్రంథమాలవారి నూతన గ్రంథము 'పండ్లు'
మీ కీ విషయములో యావత్సహాయమును చేయగలదు.
వెంటనే వారికి ఉత్తరము వ్రాయుడు.

వెల రూ. 1-8-0. పోస్టేజి ప్రత్యేకము

ఆంధ్రగ్రంథమాల, పోస్టుబాక్సు 212, మదరాసు.

జంభన కతఁడు ఘనేంద్రుఁడని తెలియఁగానే సర్వాశ లడుగంటినవి. జీవితాశగూడ సంశయగ్రస్త మయ్యెను. ఒకక్షణముక్రిందట లీలావతి పడిన భయము జంభన కిప్పుడావేశించినది. అట్లయ్యు నతఁడు వెఱ్ఱిధైర్యముతోఁ దనమీఁదనుండు ఘనేంద్రుని దిరుగఁద్రోయుటకుఁ జేష్టించెను. ఆ మహావీరుని యణుమాత్రముగూడ కదల్చుటకు వానిబలము చాలినదికాదు. తన యావద్బలమునుజూపి చేష్టించెనేగాని యది సాధ్యపడినది గాదు.

ఘనేంద్రుఁడు లీలావతీదేవితో నిట్లనెను: "తల్లీ! తమరు శీఘ్రముగా వెళ్లి పరిచారికలను లేపి మహాప్రతీహారికిఁ గబురంపుఁడు. పదిమంది భటులతో రావలసినదిగా నాజ్ఞాపింపుఁడు. నే నీ క్షుద్రు నంతవఱకుఁ గదలనీయకుండఁ బట్టి యుంచెదను."

లీలావతి శరవేగముతో నాపనిని నిర్వర్తించినది. ఘనేంద్రుఁడు పదిమందితో నని చెప్పినను నూఱుమందితో నని లీలావతి యాజ్ఞాపించినది. ఒకగడియలో నూఱుమంది భటులతో మహాప్రతీహారి వచ్చిచేరెను. జంభు నినుపసంకెలలతోఁ గట్టి ప్రాసాదములోనే యొకకొట్టడిలో వేసి యాయుధపాణులగు నూర్వురుభటు లచ్చటఁ గావలి కాయునట్లు ఘోరకుఁ డేర్పాటుఁ జేసినవాఁడయ్యెను.

"ఎట్లు వీనితో నీవు కలిసిరాఁగలిగితివి?" అని సమ్రాజ్ఞి ఘనేంద్రుని ప్రశ్నించెను.

"నిశంభుఁడు బలభద్రుఁ డను నాగునకు వ్రాసి పంపిన జాబు నాచేతికిఁ జిక్కనందున నేను బలభద్రునివలె నల్లని బురకా వేసుకొని రాత్రి నిర్ణీతస్థలమునకుఁ గోటమైదానములో వీనిని సంధించితిని" అని ఘనేంద్రుఁడు బదులు చెప్పెను.

ఆరాత్రియే యీవార్త రాజధానిలో ననేకస్థలములకుఁ బ్రాఁకినది. శివకీర్తి స్తబ్ధుఁడయ్యెను. పింగాక్షుఁడు నిర్విణ్ణుఁ డైనాఁడు. చించాక్షిమనస్సు చితికిపోయినది. ఇది యొకవంక.

ఇది ఘనేంద్రునకుమాత్రమే సాధ్యమైన కార్య మని మల్లికార్జునుఁడు పలికెను. ఇది మహావిజయ మని కాలనాథుఁ డనెను. త్రాగుబోతునకు సరిగాఁ బ్రక్రియ నడపఁజాలకఁబోయె నని భీమనాథుఁ డనినాఁడు. పూర్ణకు ఘనేంద్రునిపై నుదయించిన యనురాగ మీవార్తవలన స్థిరపడిపోయెను. ఇది మఱియొకవంక.

[పూర్ణ యింతటితో నంతరించుచున్నది. తరువాతిగ్రంథమును రచింపకయే గ్రంథకర్త యశశ్శరీరులయిరి. ఈరచన యెల్లవిధముల నాంధ్రవాఙ్మయమున కమూల్యాలంకారము. ఇట్టిది యి ట్లపూర్ణముగ నంతరించుట మిగుల విచారకరము.—సం. భా.]

———

# నన్నయ భావప్రకాశిక

(అనువృత్తము)

కీ. శే. పోరనంది రామశాస్త్రి

సభాపర్వమందలి 'సభాపర్వంబునకథ' అను చోటి 'న' అనునది పరనిమిత్తమునుబట్టి వచ్చిన 'నగాగమము' గాదు. ఎందుచేత ననగా నది షష్ఠీవిభక్తి గాదు. 'ను' ప్రత్యయము లేదు. ఆదిపర్వమందు

"నుతజలపూరితంబు లగు
నూతులు నూఱిటికంటె సూనృత
వ్రత యొకబావి మేలు మఱి
బావులునూఱిటికంటె నొక్కస
త్క్రతు వది మేలు తత్క్రతుశ
తంబునకంటె సుతుండు మేలు త
త్సుతశతకంబుకంటె నొక
సూనృతవాక్యము మేలు సూడఁగన్"

అనుదానిలో నట్టిదే. అచ్చట నాదరాతిశయద్యోతనమునకై యప్పటిలోకవువాడుక ననుసరించి యట్లు ప్రయోగించియుండును. మఱియు "సభాపర్వంబునకథ" అనునది షష్ఠీసమాసముగాదు, సప్తమీసమాసము. అచ్చోట షష్ఠీసమాసమునుబట్టికాని, విభక్తిప్రత్యయమును బట్టికాని వచ్చిన నగాగమము గాదు. అది సప్తమీతత్పురుషము, అలుక్సమాసము. సరళాదేశముచేయక "విజయంచేసి", "భయంపడి", "పదంపడి", "చేకొని", "కైకొని" మొదలగువానిలో సరళాదేశము లేకయే లోకము ననుసరించి ప్రయోగించినట్లే యిదియు నట్లు ప్రయోగించి యుండును. కావున నది యతనికి విరోధముగాదు. ఇత డింకను ఆదిపర్వము తృతీయాశ్వాసమందు గిరికావర్ణనమున "పలుకులముద్దును" అను పద్యమందు "నెలజవ్వనంబునవిలసనము" అనుచోట సప్తమీ తత్పురుషమందు "జవ్వనంబున" అనియు నకారము ప్రయోగించియున్నాడు. కావున నది యతనికి వాడుకయై యుండును. ఆదిపర్వము, పంచమాశ్వాసము- "అలయక ధర్మశాస్త్రములయందు బురాణములందు" అనుచోట "ధర్మశాస్త్రములందు" అనుటచేత సప్తమి సరిపడియుండఁగా "ధర్మశాస్త్రములయందు" అని 'య' యొకటి యెక్కువ ప్రయోగించినట్లే "సభాపర్వంబు కథ" అనఁగానే సరిపడినప్పటికిని "సభాపర్వంబునకథ" అని నకార మొక్కటి యెక్కువగా బ్రయోగించుట లోకమువాడుక యయ్యుండును. ఈ మహాకవి యాంధ్రభాషలో గవితకు మార్గమునుజూపి తాను స్వతంత్రుడై యాత్రోవద్రొక్కి తన వ్యాకరణమువలనను, భారతము వలనను తనమార్గమును గవులకు గనబఱచినవాడు. ఇతనిగ్రంథము లక్షణ మని యెల్లకవులును నొప్పికొనుచునేయున్నారు. ఇత డాంధ్రకవితకపూర్వపథమును గల్పెట్టునప్పుడు ప్రాచీనసంస్కృతకవితాప్రచారము ననుసరించి తెలుగునందు నాసంస్కృతభాషాసంప్రదాయముల ననుసరించియే కొన్నిచోట్ల సంధులు, సమాసములు, క్రియలను గల్పించి ప్రయోగించియున్నాడు. అట్టి సాంకర్య మీభాషలో నపరిహార్య మని తెలియుటకయ్యే తనవ్యాకరణమున "ప్రథమాద్వైభక్తికమోర్బిందుశ్చ మహా న్పతిక్రియార్థేషు" అనుచోట సంస్కృత శబ్దమునకు "పత్" ధాత్వర్థకక్రియాపదములు పరమగు నపు డాసంస్కృతశబ్దమునకు తెనుగుమర్యాదచే సిద్ధమగు మువర్ణకమునకు లోపముగాని, పూర్ణబిందువు గాని విధించి సంస్కృతమందు నధికరణమందు సప్తమికి బదులుగా వచ్చు ద్వితీయకు తెనుగుమర్యాదను ప్రథమ చేసి యా మువర్ణకమునకు లోపబిందువులను

చెప్పటచే నిచట సంస్కృత తెనుగుభాషలకు సాంకర్యమును తెలియబఱచియున్నాఁడు.

అట్లే తనభారతమందు "భయముపడు", "భయపడు" అని ప్రయోగించియున్నాఁడు. "భయంపడు"అనుచోట అధికరణార్థమందు ద్వితీయ చేసి దానిపైని తెనుగుపడుక్రియను చేసినాఁడని తెలియదగియున్నది. పత్ ధాతువునకు భ్రంశముతో నన్వయము లేదు. కావున "భయముపడు", "భయపడు" అనుచోట్ల ద్వితీయార్థమందు చేసిన ప్రథమయేకాని వేఱుకాదు. అది "విజయంచేసి" ఇత్యాదిస్థలమందు స్పష్టము. "భయపడు" అనునట్లు "విజయచేసి" యని రూపము లేదు. చేయుధాతువు సకర్మకముగాని యకర్మకము గాదు. ఇచట నింకొక విశేషముగూడ దెలియబడును. లోకవ్యవహారములో రూఢములగు పదముల రూపార్థసిద్ధులలో వ్యాకరణములను బాటింప నక్కఱలే దనియే తానచ్చట సంస్కృతవ్యాకరణ మర్యాద నతిక్రమించి సంస్కృత పదములను తెనుగుపదముతో గలుపుటయు, తెనుగు వ్యాకరణ మర్యాద నతిక్రమించి "భయంపడు", "పదంపడి", "విజయంచేసి" ఇత్యాదిస్థలమందు సరళాదేశాభావమును చేసియున్నాఁడు.

ఇతఁడు కావ్యమునకు ముఖ్యలక్షణము రసము. దానికార్థగుణసంపత్తియు, శాబ్దగుణసంపత్తియు రెండును అంగములు. అందు శాబ్దగుణసంపత్తికంటె నార్థగుణ సంపత్తియే ముఖ్యము. శాబ్దగుణసంపత్తిలోను వ్యాకరణముకంటె బద్యరచనలలో ఛందోగుణసంపత్తియే ముఖ్యలక్షణము. అని యెంచి తనభారతములో నట్టిప్రయోగములను జేసియున్నాఁడు. అన్నిటికంటెను దేశభాషాకావ్యములలో, వ్యాకరణవిరోధ మున్నను దానిని పాటింపక లోకము,వ్యవహారము ననుసరించియే రసస్ఫూర్తి,విషయసిద్ధియు నగునట్లు చేయుట యుచితమన్నట్లితని ప్రయోగములవలన దెలియబడును. ప్రయోగములు—— "అనఘ యిదియేటితప మే-మనుపమ గుణఖ్యాతుల మగుట నాధారము లే-కనుసంతానచ్ఛేదం-బున వ్రేలెద మశమ లోకముల దెరువుసనన్." (ఆదిపర్వము, ద్వితీయాశ్వాసము)అను పద్యమందు మూడవచరణములో "ఆధారము లేకను" అనుచోట "లేక" అనుదాని వ్యతిరేకక్త్వార్థకము, కళయును. కళపదమునకు నకారము వ్యాకరణమువలన జేర్పరాకున్నను అచ్చట నకారము ప్రాసస్థావము.గుటను ఛందస్సునకై వ్యాకరణము నతిక్రమించుట.

ఇచటను బ్రహ్మశ్రీ శతఘంటము వెంకటరంగశాస్త్రిగారు "వ్యతిరేకక్త్వార్థకావ్యయము ద్రుతాంతము గూడ నుండవచ్చుననుటకంటె నచ్చట "లేకయును" అనుచోట "యు శబ్దము" లోపించి "ను" వర్ణము మాత్రము శేషించియుండునని కాని, "లేక అనుసంతానోచ్ఛేదంబున" నని పదవిభాగము గల్పించి కాని యుపపత్తియూహింపవచ్చును. అనుగంత సంతానమని అను సంతాన శబ్దమున కర్థము చేయవచ్చును."అని యుపపత్తిని చెప్పినారు. ఇచ్చట వీరి ప్రతిభావిశేషమును గనుపఱచినట్లు తోచునుగాని కవిహృదయ మట్టిదిగా దోచదు. కవిహృదయము వారి ప్రయోగాంతరములవలన దెలియఁబడును. వీరు చెప్పిన యుపపత్తులను జూతము. సముచ్చయార్థమందు "యు" గాని, "ను" గాని యొక్కటేసరి పడియుండఁగా రెండును గల్పించుట కవసరములేదు. అట్లు కల్పించుటయును ఛందస్సుకొఱకయే కావలయు. అట్లుకాక "యు" లోపించినదని భావించినను దృష్టమగుచున్నది ప్రాసస్థాన మనుట యుచితమా, లోపించినది ప్రాసస్థానమనుట యుచితమా? అందువలన వ్యాకరణము ఛందస్సున కనుజీవ్యమనుట స్పష్టమగుచున్నది.

ఇంక రెండవ యుపపత్తిని చూతము. "అనుగత సంతాన మనుసంతాన"మని. ఇచట సంతానపదమే "సంతన్యతే అనేన" అను వ్యుత్పత్తిచే ననుగతమయినదని సిద్ధించుచుండగా మఱల "అను" అనునదియు నట్టిదిగానే కానిపించుచున్నది. సంతానము తంతువువలెనే వంశమున కవిచ్ఛేదము గలుగజేయునది కావుననే దానియందు తంతుత్వారోపణము చేసియున్నారు. ఇట్టి సమన్వయక్లేశము కంటె నచ్చట సరళాదేశము చేయలేదని యంగీకరించినచో హాని యేమియును గానరాదు. ఇట్లు సరళాదేశముచేయని స్థలము లనేకము భారతమందు గానబడుచునే యున్నవి.

సభాపర్వమందు "అని యిట్లు సభాపర్వంబునకథ" అనుచోట "సభాపర్వంబునకథ" అను సప్తమీ సమాసమందు "కథ" అనుచోట సరళాదేశము లేదు.

ఆదిపర్వ ప్రథమాశ్వాసమందు "కాదన కిట్టిపాటి యపకారము దక్షుకు డేకవిప్రసంబోధనజేసి చేసె నృపపుంగవ, నీవు ననేకభూసురా, పాదితసర్పయాగమున భస్మముసేయుము తక్షకాదికా, కోదరసంహారిక్ హుతవహోగ్రసమగ్రశిఖాచయంబులన్." అను నీదకారప్రాసమందు రెండవపాదములో "సంబోధన" అనుచోట చతుర్థసవర్ణమగు "ధ"కారము ప్రాసమును చేసి యున్నాడు. ఇందువలన నితడు యతియందే కాక ప్రాసమందుగూడ వర్గాక్షరములకు మైత్రి యొప్పినట్లు కానబడుచున్నది.

ఇంకను నితడు సకర్మకమగు "కొను" ధాతువును వ్యస్తముగా నుపయోగించునపుడు "క" కారమునకు సరళాదేశము జేసియు, నుపపదమున్నప్పుడు సరళాదేశము చేయక లోకమువాడుక ననుసరించియే ప్రయోగించువాడు.

సభాపర్వము ప్రథమాశ్వాసమున "మదమాతంగ తురంగ కాంచనలసన్మాణిక్యగాణిక్య సంపద లోలిం గొనివచ్చి యిచ్చి ముదము,ప్పం గాంచి సేవించి రయ్యుదయాస్తాచలసేతుశీతనగ మధ్యోర్వీపతుల్ సంతతా,భ్యుదయున్ ధర్మజు దత్సభాస్థితు జగత్పూర్ణప్రతాపోదయున్" ఇందు "సంపద లోలిం గొనివచ్చి" అనుచోట గొనియని సరళము. ఆదిపర్వము అష్టమాశ్వాసమున "వీరల దోడ్కొనిపోవగ" అనుదానిలో "తోడు + కొని" అనుచోట సరళాదేశము చేయలేదు. ఆది. ౭-వ ఆ. న "తిపిరి యభోజ్యంబగు మా- నవమాంసము తోడ భోజనము పెట్టినవా-డవు నీవు మనుష్యాదుడ-వవుమని వాడిచ్చె శాప మన్నరపతికిన్" అను వకార ప్రాస పద్యము నాల్గవచరణమందు ప్రాసముకొఱకు అగుధాతువుగకారమును వకారముగా మార్చి చెప్పియున్నాడు.

ఆది. ౫ ఆ. "కొడుకుల నిందఱ వీరలగురువృద్ధుల కడకుం గొనిపోవలయు అని తమలో విచారించి కుంతీదేవినిం గుమారులం దోడ్కొని."

ఆది. ౭ ఆ. "ఇంతులగోష్ఠి" అను నీపద్యమందు నాల్గవపాదమందు "వింతయె కాముశక్తియుడివింపగ శక్యమె యెట్టివారికిన్." "యుడిపింపగ" అని వ్రాతపుస్తకములోనున్నది. ఇచట వకారపకారములకు నన్నయభట్టుడు మైత్రి యొప్పినట్లు కానబడుచున్నది. తన వ్యాకరణమందు పరుషములకు గసడదవల యాదేశము జెప్పుట యిందుకు జ్ఞాపకము గావచ్చును. సవర్ణములే యాదేశములగుట ప్రసిద్ధము. కాని యిచట నొకటి విచారణీయము. అర్థముకొఱకు పదమా, పదముకొఱకర్థమా? "ఉడిపింపగ" నని యున్నచో నభీష్టార్థము సిద్ధించునా? "ఉడివింపగ"నని యున్నచో నర్థము సిద్ధించునా? విచారింపగా యతిస్థానమందు వర్గస్థానముల సామ్యమునుబట్టి మైత్రి నంగీకరించినట్లే ప్రాసమందును గొన్నిటికి మైత్రి నంగీకరించినట్లు తెలియబడును. తనవ్యాకరణమందు "లఘువోఽలఘువశ్చేతి ద్వేధా స్తస్థా న్వివదన్తి శాస్త్రారః, అన్యేఽన్యవ్యాకరణస్పష్టాః" అని చెప్పి పిమ్మట "రస్త్వత్ర గృహ్యతే ద్వివిధః" అని లఘ్వలఘురూపములగు రెండు రవర్ణములను నేకరూపమున గ్రహించుటయే సాధురేఫ శకటరేఫములకు మైత్రి నంగీకరించినట్లు తెలియజేయును. ఇంకను "నాన్యేషాం వైధర్మ్యం లఘ్వలఘూనాం రయోస్తు నిత్యంస్యాత్" అనుచోట తక్కిన యంతస్థములకు వైధర్మ్యము, అనగా రూపభేదము లేదనియు, నీరేఫములకుమాత్రము రూపభేద ముండుననియు "రయోః" అని యేకశేషముచేసి గ్రహించుటచేత వానికి యతిప్రాసములందు మైత్రియుండవచ్చుననియును తెలియబడును.

ఆ రెండును మూర్ధన్యములే కావున స్థానసామ్యమునుబట్టి మైత్రినొప్పినట్లే పకారవకారములకుగూడ నోష్ఠ్యత్వసామ్యమునుబట్టి మైత్రి యొప్పియుండును. అది కనిపెట్టియో, కనిపెట్టకనో భారతము వ్రాతపుస్తకములలోని పాఠములను దిద్ది క్రొత్తపుస్తకములను ముద్రించుచున్నట్లు కానబడుచున్నది. వీరు శబ్దములకు లక్షణ మనగా శబ్దస్వరూపమేకాని యర్థము లక్షణమయినట్లు తలచరు. అది చింత్యము.

అప్పకవీయమందు శంభుదాసుని లక్ష్మీనృసింహ కథయందలి "పొందవు దుఃఖము ల్భయము బొందదు పొందదు దైన్యమెన్నఁడయిం బొందవు తీవ్రదుర్దశలు పొందు ప్రియంబులు పొందు సంపదల్ వొందు సమగ్రసౌఖ్యములు బొందు సమున్నతకీర్తు లెందు గోవింద పదారవింద పదవీపరిణద్ధగరిష్ఠచిత్తులన్." అను పద్యములో మూడవపాదాదిని "పొందు" అనుటకు బదులు "వొందు" అని వకారము ప్రథమవిాది పకారమునకు జేసిన వకారాదేశము. ఇందువలన నీగసడదవాదేశము యతిప్రాసములందు పవలకు మైత్రికొఱకే యయినట్లు తెలియదగియున్నది.

భారతము ఆది. ౪ ఆ. అక్కర. "అవసరజ్ఞుండయి వ్యాసు డేతెంచె నంత నత్తపసి, కపిలగడ్డంబును గపిలజడలును గపిలకన్నులును, దవినయన్నవ నల్లనైన దీర్ఘతపుతనువును జూచి, యుబిద గన్నుంగవ మొగిచి తెఱవకయుండె భయమున." ఇందు వకారప్రాస ముండుటను పైనున్న "కపిలగడ్డము" మొదలగు స్థలములలో నున్న కపిలపదము "కవిల" అని దిద్ది అందుకు "కవిలశబ్దము కపిలశబ్దతద్భవము"గా సీతారామాచార్యులవా రాంధ్రశబ్దరత్నాకరమను నిఘంటువునందు వ్రాసియున్నారనియు, గ్రామ్యపదప్రయోగమున వపలకు ప్రాసము నన్నయభట్టుడు చేసెననుటకంటె నిది యొప్పనియు చెప్పుచున్నారు.

కాని యిచట మనము కొంచెమాలోచింపవలసి యున్నది. భారతమందు నన్నయభట్టుని యభిప్రాయ మాలోచింపవలయునా, సీతారామాచార్యులవారి యభిప్రాయమా? నన్నయభట్టుడు ఆంధ్రశబ్దచింతామణియందు "తజ్జా సమాచ దేశ్యా గ్రామ్యా చేయం చతుర్విధా భవతి" అని తెలుగుభాషలో గ్రామ్య మొకభాగముగా జెప్పియుండెనుగదా, దాని యుపయోగ మెచ్చటను? ఆంధ్రశబ్దచింతామణి నన్నయభట్టుకు రచించినది కాదన్న పక్షమున నందుకేనా యీయుపపత్తికల్పనాక్లేశము? మఱియు నన్నయభట్టుడు తాను గ్రామ్యముల నుపయోగించినవాడుగావున నందుకై తన వ్యాకరణమందు గ్రామ్యభాగ మొప్పికొనినాడన్నకంటె నితర వ్యాకరణకర్తలుగూడ గ్రామ్య మొప్పికొనుట యాతనికి మఱింత సహకారమే కదా? కావున నట్టి కల్పనాక్లేశము వారికి నిష్ప్రయోజనమేకాని సఫలముగాదు. నన్నయభట్టుని హృదయ మతిగభీరము. అతడు లోకజ్ఞుడుగావున లోకవ్యవహారములో నున్న పదములు వ్యాకరణవిరుద్ధమయ్యును వ్యాకరణవిరోధమును పాటింపక తా నుపయోగించిన ట్లతనిప్రయోగముల వలన దెలియబడుచున్నది. అది యెట్లనగా—

ఆదిపర్వము. ౧ ఆశ్వాసము "అలయకయేన— ఈ ప్రమద్వరకు నిర్విషమయ్యెడు నేడు విాదయన్" అనుదానిలో "నిర్విష" అనునది బహువ్రీహిచే విశేషణ మగుచుండగా దానిని నామముగా బ్రయోగించి యున్నాడు.

౧ ప. ౩ ఆ.న "అరుదుగ సర్వశైలముల యంతతనర్పును నార్జవంబు సుస్థిరతయు నోషధీరసవిశేషతయుం గల దుత్తమంబు మందరకుధరంబు" అను దానిలో "తనర్పు", "ఆర్జవము", "సుస్థిరత" అను ధర్మములతోపాటు "ఓషధీరసవిశేషత" అని ప్రయోగించియున్నాడు. ఇచటను బహువ్రీహిసమాసము చేసి దానిపైని భావార్థమందు "తల్" ప్రత్యయము చెప్పి క్లిష్టగతిని నుపపత్తి చెప్పవచ్చునుగాని యాతని శైలి యట్టిదిగా దోచదు. అచ్చటనే "కలదు" అని క్రియ కాన్పించుచున్నది. కావున నప్పుడు "ఓషధీరసవిశేషములను గలుగుటను గలదు" అని యర్థము. చెప్పికొనవలయును. స్థలాంతరములను జూచి నిశ్చయింపుడు.

ఆది. ౪ ఆశ్వా.న "అతిశయరూపయౌవన గుణాధిక సుందరమైన యాసతీ ద్వితయమునందు" అను దానిలో విశేష్యమగు నతిశయపదము విశేషణపదము.

ఆది. ౪ ఆ.న తాన తన నీడనీళ్లల-లో-నూను జనకుండు సూచి మ-హానందము బొందు నతిశయప్రీతి మెయిన్"

ఆది. ౪ ఆ.న "ధర్మార్థకామసాధన కుపకరణంబు- గృహనీతివిద్యకు గృహము విమల,చారిత్రశిక్షు

కా చార్యకంబు” అనుచోట నాచార్యుడనుదానికి “ఆచార్యక ”మని.

ఆది. ౫ ఆ. న “ఈ వంశము విచ్ఛేదము గావ చ్చిన ” విచ్ఛిన్నమనుటకు.

ఆది. ౫ ఆ. న “సలలితమైన పుట్టుకవచంబు—నిజద్యుతి సవిస్తరలీల వెలుంగుచుండగన్.” “సవిస్తార ” అనుటకు.

“యదుకులవిమల—వినయాభిమాన వివేకసౌజన్యాది, సదమలగుణరత్న జన్మభూమి, బరమపతివ్రతాభరణాభిశోభిత ” “పాతివ్రత్యాభరణాభిశోభిత ” అనుటకు.

ఆది. ౬ ఆ. న “రాజపదస్థుం డరాజపదస్థుల, బకుబలాఢ్యు డపకుబలుల, విపులార్థవంతుండు విగతార్థవంతుల, నవసరంబెఱిగివాడ శ్రమమున, దూష్యుల దుది దాక దూషించు—” ఇందు “విగతార్థులు ” అనుటకు.

ఆది. ౪ ఆ. న “ధర్మసుతు డున్నచోటను, ధర్మువునకు హానిగలదె ధారుణినైనన్, ధర్మువె తాత్పర్యముగా, నిర్మలమతి నుండునది వినీతాత్ములరై ”ఇందు “ధర్మమందే తాత్పర్యముగా” ననుటకు.

ఆది. ౮ ఆ. న “అనిన బ్రతీపు డిట్లనియె నం బురుహానన యగ్నిసాక్షికం, బున బరిణీతయైన సతి” “అగ్నిసాక్షికముగ” ననుటకు.

ఆది. ౯ ఆ. న “అక్కఢకుండు-నూటేసివేలు పాడిమొదవులను నగ్నిసాక్షికంబుగా నరణంబిచ్చిన. ”

ఆది. ౩ ఆ. న “నిగ్రహ మేది నన్ను ధరణీవర కూపము వెల్వరించునా, డుగ్రమయూఖసాక్షిగ ” అని స్థలాంతరమందు.

ఆది. ౨ ఆ. న “క్షత్రియవంశ్యులై—స్వచా, రిత్రము దప్పకుండగ బరిక్షితు కాచినయట్లు రామమాం, ధాత్రరఘుక్షితీశులు ముదంబున గాచిరె యేయుగంబులన్.” ఇందు “మాంధాతృ” అనుటకు. ప్రాసకొఱకు నామవ్యత్యాసము చేసియుండునా, లేక ఋకారరేఫములకు ప్రాస మంగీకరించియుండునా? ఇది విచారణీయము.

ఆరణ్య. ౩ ఆ. న “ధ్యానమాత్రనచేసి-సాయక ప్రయోగంబులు జక్కవచ్చి, పొందె మాంధాతృ త్రిభువనపూజ్య తేజు.”

“మఱియు నమ్మాంధాతృండు” “ఇది యమ్మాంధాతృ యజ్ఞస్థానంబు” అని స్థలాంతరములందు.

ఆది. ౫ ఆ. న “సవిశేషముగ ధనుర్వేద విశారదు లైరి.”ఇచట విశేషపదము విశేష్యముగాను,

సభా. ౧ ఆ. న “ప్రాజ్ఞుడు విశేషధర్మ విధిజ్ఞుడు.” ఇచట విశేషణముగాను,

ఇంకను సభా. ౨ ఆ. న “పురుషవిశేషు డుత్తముడు”, “ఈయవనీశ్వరప్రవరు లిందఱు నిన్ను నగంగ నిట్లుకా, జేయుదె ధర్మరాజను విశేషసమాఖ్య నిరర్థకంబుగా” అనుచోట్ల విశేషణముగాను ప్రయోగింప బడినవి.

ఈవిశేషపద మొకప్పు డెట్లో సమర్థింపబడినను అతిశయ, విస్తారపదములు విశేషణము లెట్లగునో తెలియదు.

సభాప. ౨ ఆ. న “దీనికి ధృతరాష్ట్రినను, జ్ఞానము...భవదభి ప్రాయానుగుణైశ్వర్య మతిశయంబుగ బ్రీతిన్.”

అరణ్య. ౧ ఆ.న “అతిశయ తాపసోత్తముడు.” స్థలాంతరములందు విశేష్యములుగా-

సభా. ౧ ఆ.న “ తద్ద్వారపాలురు—నృపవర్యపర్యాప్త, మయ్యె నీవిజయ వీర్యాతిశయము.”

—“ సమసత్వాతిశయుల్ వృకోదరజరాసంధుల్. ”

సభా. ౨ ఆ. న “అనియిట్లు సభాపర్వంబునకక్ష, నిత్యమహిమాతిశయా.”

ఆరణ్య. ౧ ఆ.న “ఎల్లనెయ్యములకు దల్లిదండ్రులయందు, సుతులవలని నెయ్య మతిశయంబు, ”

ఆది. ౬ ఆ. న " దుఃఖాతిశయంబున మతి భ్రమ యయ్యెంగాకేమి. "

" విస్తార'' పదము

ఆది. ౧ ఆ. న "అభిమతంబగు నశ్వమేధాదిక...మత్యంత వివిధవస్తు విస్తరమగు బుధవరుల సభల" ఇచట "విస్తార" మనుటకు "విస్తర"మని.

సభా. ౧ ఆ. న "వీరికు ధర్మజుండు—మఱియంచలుకుం జెఱినేయివేయి విస్తారయసుండుధేనువుల-యుతంబుగ నిచ్చె"

—"అది శతయోజన విస్తారాయామరమణీయంబు."

అరణ్య. ౨ ఆ.న" పూరుపురూరవు లట్లు-ధారుణి రక్షింపుము విస్తారగుణాధారధీర ధర్మతనూజా"

" నెయ్య'' ప ద ము

ఆది. ౮ ఆశ్వా. " శ్రీపతి కడునెయ్యంబున, నాపోవక పాఱునొద్ద."

—" క్రమమున సుంతీదేవిని—వేర్వే౫ నెయ్యుడయి పూజించెన్."

సభా. ౧ ఆ. న "మంచిగ భూరిభూసుర...నించె యశంబు బంధులకు నెయ్యురకుఁ హృదయప్రియంబుగా."

—"వానికి నెయ్యుఁడై యమరవంద్య పదాంబుజుడు."

ఆది. ౮ ఆ. న "దానికి నెయ్యుండవయి."

ఆది. ౩ ఆ. వ "సకలధర్మ విదుండవు—నెయ్యమొనరంగ నెఱిఁగింపుమయ్య మాకు."

''అగ్నిహోత్ర'' పదము

ఆది. ౩ ఆ. "మానాగ్ని హోత్రమును మఱి, మానాధ్యయనమును మానమానంబును విజ్ఞానమున మాన యజ్ఞము, నా నియతార్థంబు లివియు నాలుగు నివియున్." (క్రొ). నాలుగు నుర్విన్ (ప్రా).

ఆది. ౪ ఆ. న "ఇట్లు హృదయసుఖావహం బగుచున్న—అవిచ్ఛిన్నహుతాయ మానాగ్నిహోత్ర స్వాహాశబ్దంబులును."

"పరువడి నగ్నిహోత్రములు బంధులు శిష్యులు దోడరా మహీ, సురవరులెల్ల బాంధు నృపనానుల యొద్దకు బ్రీతి నేసుదెంచిరి."

అరణ్య. ౧ ఆ. న "పాపసౌబల ప్రయుక్తం డయిన—సాయం హోమార్థప్రజ్వలిత జ్వలనంబులయిన యనేకసహస్ర బ్రాహ్మణాగ్నిహోత్రంబులం జూచి."

ఆది. ౩ ఆ. న "వాడిమయూఖముల్ గలుగువా డపరాంబుధి గ్రుంకెధేనువుల్, నేడిట వచ్చె నేకతమ నిమ్మెయిన్‌భవదగ్నిహోత్రముల్, వోడిగవేల్వగా బడియె బ్రొద్దునబోయె—"

ఆది. ౧ ఆ. న "భృగుడను విప్రుండు మనవ బులోమయన్, దాని గర్భిణి దనధర్మపత్ని, నగ్నిహోత్రమునకు నగ్నులు విహరింపు, మని పంచి యభిషేచనార్థ మరుగ, నంత బులోముడన్ వింతరక్కసు డగ్నిహోత్ర గృహంబున కొయ్యవచ్చి."

ఆది. ౧ ఆ. న "త్రేతాగ్ను లెల్లను దేజరిల్లమి జేసి, క్రతుకృత్యములు వినిర్గతములయ్యె, నగ్నిహోత్రములందు నౌపాసనాది సాయంప్రాతరాహుతు లంత నుడిగె"; సభా. ౧. ఆ. న "వేదములగ్నిహోత్ర ఫలములు."

ఈమీద జెప్పిన విశేష, అతిశయ, విస్తార, నెయ్య, అగ్నిహోత్రపదములకు ధర్మనర్మిభావనియమము గానరాదు.

మఱియు ఆదిప. ౬ ఆ. న "దీనికి సాదృశ్యము గా, నేనేమి యొనర్తు నీకు నిష్టంబనినన్" అని ప్రాతపుస్తకములలోను, "దీనికి సదృశము గా మఱి యే నేమి యొనర్తు" అని క్రొత్తపుస్తకముల లోనునున్నది.

అరణ్య ౨ ఆ. న "వారలచెప్పినట్ల తననిర్వాహకంబు సెప్పి త్రసదస్యుం డగస్త్యున కిట్లనియె" అని ప్రాత. "తన నిర్వాహకంబు సెప్పి" అని క్రొత్త పుస్తకమందు. ఏది యెట్లైనను "తన నిర్వాహ్యాకృత్య" మని యచ్చటి యభిప్రాయము. నిర్వాహ మన్నను, నిర్వాహ్యమన్నను అది లోకమువాడుకను బట్టి

నన్నయభట్టుడట్లు చెప్పినదిగా నున్నది. "సాదృశ్య ముగా" ననునదియును అట్లే కాన్పించుచున్నది. అతిశయ, విశేష, విస్తారపదములను గూడ లోకమువాడుకను బట్టియే అధికమను నర్థమందు బ్రయోగించి యున్నాడు గాని శాస్త్రమునుబట్టి కాదు. ఈమహాకవి "లోకజ్ఞుడ"నని తన్ను చెప్పికొనియే యున్నాడు. అట్లే యితడు లోకమువాడుకలో నున్నవానిని వ్యాకరణ విరోధమును పాటింపక స్వతంత్రుడై ప్రయోగించినవాడు. విజయంచేసి, భయంపడి, అవసరపడి, సమయపడి, నీకారణము, నీతదర్థమున, వాడిబాణలతులు, కలుషదర్పపూరిపరుపులు, హంసపిండు, అవమానపాటు, భంగపాటువిధాత్రుచెయ్వులు, కుసుమకోమలి మొదలగు ననేకమిశ్రరూపములను చేసియున్నాడు. ఇంక ననేకావ్యయములను నామములుగా జేసి "వృథపుచ్చక" యథాశక్తిజేసి "ఇహము" "నిర్భయముననే" ఇత్యాదులు ప్రయోగించి యున్నాడు.

ఇంకను "నీశరణంబుసొచ్చినమాకు బరమశోభనంబులు" "నాకుశరణమగుడు" "శరణువేడినరక్షింపమియు" అనువానిలో శర్మశర్మిభావమునకు లింగములకు సాంకర్యముచేసి "మూర్ఖవు శిశుపాల" "రథమొక్కండు" "అయ్యశ్వోత్తమున్" ఈ మొదలగువానిలో మహత్త్వామహత్త్వవ్యత్యాసము చేసి. "ఈసుననీసుదొట్టిసుర లెల్ల నభీష్టవరంబు లిచ్చుటం, జేసికృతార్థుడైన కురుసింహము నూర్జితశౌర్యు నర్జునున్, భాసురతేజు విశ్వపరిపాలకుడైన మహేంద్రుతోడ నేకాసన మెక్కియున్న మహిమాస్పదు నింద్రసమాను జూచితిన్" అనుదానిలో కురుసింహమునకు కృతార్థుడు అని విశేషణమువలన మహదమహద్భావసాంకర్యమును చేసియున్నాడు.

"ధృతిమంతుల భుజవిక్రమ, జితశత్రుల బాండవేయ సింహులను మదో, ద్ధతిమై" ఇందు సింహపదము మహత్తుగా.

ఆది. ౫ ఆ. న"వీరలు దైవశక్తి బ్రభవించినవారను శేమిసందియం, బీరమణీయకాంతిని వహింపగ వేల్పులకాక యిట్టి యా, కారవిశేషసంపద బ్రకాశితతేజము పేర్మి జూడ."

ఆది. ౭ ఆ. న. "రవినిభతేజుడైన ధృతరాష్ట్రుడు పంపగ నీవు కార్యగౌ, రవమున వచ్చినప్పడతిరంబుగ వీరికి నిష్టసిద్ధిదా, నవుటది యేమి సందియమె యంబుజనాభుడు నీవు బాండవ, ప్రవరులకెల్లప్రొద్దును శుభంబతలంతురు కాదనెమ్మతోన్" వీనిలో "అవుటకేమి సందియము, అనుదానికి విశేష్యమగు సందియమును విశేషణముగా నుపయోగించినాడు.

స్థలాంతరమందు "ఈహిత కార్యసిద్ధి యిదియెట్లొకొ తా సమహారు నంచు సం, దేహము బొంది సోమకయుధిష్ఠిరులున్న ఉదీయధర్మసం, దేహనివృత్తి వుట్ట జనుదెంచె బరాశరసూను డాత్మగే, జోహృతసూర్యతేజు డసుచున్ దిశలెల్ల వెలుంగుచుండగన్"అనుదానిలో సందియపదమునకు బ్రకృతియగు సందేహపదమును విశేష్యముగా బ్రయోగించెను.

మఱియు సభా. ౧ ఆ. న "అతులచతురంగసేనా, యుతు డంతర్గిరి బహిర్గిరోపగిరుల భూ, పతుల నని నోర్చి శౌర్యో, న్నతి గొనియెను వారిచేత నానాధనముల్." ఇందు "అంతర్గిరిబహిర్గిర్యుపగిరుల" అనుటకు "అంతర్గిరి బహిర్గిరోపగిరుల"అని సంధిచేసి యున్నాడు.

సభా. ౨ ఆ. న "దేవసురు ద్విజప్రకరతృప్తికరున్ వరరాజసూయయా, జ్ఞావభృథాభిషేక విమలాంగు విశుద్ధయశోనిధిన్ జగ, త్పావను ధర్మనందను సభాస్థితు జూచి ముదంబునొంది రిం, ద్రావరజాది మిత్రులును హర్షత బొందరి ధార్తరాష్ట్రులున్."ఇందు ధర్మపదమును హర్షపదముపైని భావార్థకతల్ ప్రత్యయమును చేసినాడు. ఇచట బహువ్రీహిసమాసము చేసి పిమ్మట తల్ ప్రత్యయము చెప్పవచ్చునుగాని క్లిష్టము. కవియభిప్రాయ మట్టిదిగా దోచదు. ముందు గనుపఱచినవానిని జూడనగును.

ఆది. ౮ ఆ. న "మయభుజగమోక్షణమని, ర్ణయముగ నెఱిగితి" ఇచట ప్రాసకొఱకు ధర్మపదమును ధర్మిపరముగా జెప్పినాడు.

ఈమహాకవి లోకజ్ఞుడగుటను లోకోక్తులను, లోకమువాడుకలోని పదములను బ్రయోగించుటకు బ్రీతిగలవాడుగా నితనిగ్రంథమువలన దెలియబడును.

## శ్రీయుత కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారి

తైలవర్ణ చిత్రమునకు ప్రతికృతి




ఈ చిత్రము ఆంధ్రవిశ్వవిద్యాలయము [illegible]. శ్రీ చావలి నాగేశ్వరరావుగారు దీనిని చిత్రించిరి.
శ్రీ పంతులుగారికి ఆంధ్రవిశ్వవిద్యాలయము 'కళాప్రపూర్ణ' బిరుదమునొసగి గౌరవించినది.





ఆంధ్రవిశ్వవిద్యాలయమునకు లక్షరూపాయలు దానమిచ్చిన

**శ్రీ తిరువాన్కూరు మహారాజుగారు**

వీరికి ఆంధ్రవిశ్వవిద్యాలయము డి. లిట్. బిరుదమునిచ్చి గౌరవించినది.

**శ్రీ తిరువాన్కూరు మహారాణిగారు**

వీరికి ఆంధ్రవిశ్వవిద్యాలయము డి. లిట్. బిరుదమునిచ్చి గౌరవించినది.





ఆంధ్రవిశ్వవిద్యాలయమునకు లక్షరూపాయలను దానమిచ్చిన

**శ్రీ నిజాముప్రభువుగారు**

# వసంతసేన

కపిస్థలం కృష్ణమాచార్యులు

వెలయాలు అని వసంతసేనమీద మన కుండు ప్రేమ తగ్గుటలేదు. నాటకములో ఎక్కడను నాయికా నాయకుల జాతిభేదము మన కంతగా కనబడుట లేదు. వారి సౌంద ర్యము, వారిశీలము, వారిప్రేమలలో మునిగి యున్న మనకు వారి జాతిభేదమును గమనిం చుటకు అవకాశమే లేదు!

కవి వసంతసేనను అంగాంగముగా వర్ణించుటయేమో లేదు; కాని, సాటిలేని ఆమెసౌందర్యమును ఎట్లో మన హృదయ ములలో అచ్చువేయగలిగినాడు. మొదటి యంకములోనే ఆమెసుకుమారశరీరము మన అంతర్దృష్టికి అగపడుచున్నది. వెంట బడుచున్న శకారునిబారినుండి ఆమెను కాపాడవలెనని మనము తహతహపడు చున్నాము. ఇంతవరకును మనకు చారు దత్తుని పరిచయము లేదు; వసంతసేన ఎవరో కూడ తెలియదు: అయినను, ఆమె భద్ర ముగా నుండవలెనన్న తహతహమాత్రము మనహృదయములలో గట్టిగా నాటుకొన్నది. ఆమె శకారుని చేతులలోనుండి — మరల చిక్కుకొనుటకు వీలులేకుండ — తప్పించు కొనినపిదపగాని మనము కుదుటబడుటలేదు. ఆమె చారుదత్తుని ఇంటిలోనికి పోయినప్పుడే మనగుండెదడ తగ్గుచున్నది. బ్రాహ్మణుని యిల్లు; అదియునుగాక ఉత్తరువులేదు; అందు లోను ఆడది; చీకటిలో ప్రవేశించవచ్చునా అని యోచనచేయుటకుకూడ మన కోపిక లేదు. అప్పుడే ఆమె చారుదత్తుని యింటి వారిలో నొకతె యైనట్లు మనకు తోచినది.

చారుదత్తుని అందరును పొగడుచుండుట ఆమె వినియున్నది. ఆముద్దుపేరు విన్నప్పటి నుండియు అతనిపై మరులుగొనియున్నది. కామదేవునిగుడిలో అతనిని చూచినది; పరిచయము కలిగినది — ఒడలుతెలియని మోజు పడినది. అతనెక్కడ, తానెక్కడ? పోపొమ్మనునేమో అని భయపడి అప్పుడే ప్రేమభిక్ష పెట్టుమనలేకపోయినది. అదేకార ణము—చారుదత్తుని యింటికి వచ్చి, ఏదో ఒక నెపముమీద తననగలు అక్కడ పెట్టి పోవుటకు.

ఆ కామదేవునిగుడిలోనే వసంతసేన రూపరేఖావిలాసములు చూచి, చారుదత్తు డును స్తబ్ధుడైనాడు. ఆమెసౌభాగ్య మెక్కడ, తనదౌర్భాగ్య మెక్కడ? — గొంతెమ్మ కోరికలు కావుకదా! వసంతసేన తప్పక గుణములకు లొంగగలదు...ఏమో! ఎవరికి తెలియును? — ధనమునకు లొంగిన యెడల?... కాబట్టి, "మనము నిరుపేదలము; ఆమె మనకు దొరుకునదికాదు" అని — తనమైత్రేయుని తృప్తిపరచుట కైనను — అనక తప్పినదికాదు చారుదత్తునికి.

కథ నడువనునడువను వారి యిరువురిప్రేమలును ఒకరిది ఒకరిది తగియున్నదని మనకు చాల తృప్తికలుగుచున్నది. ఉజ్జయినిలో చారుదత్తుడు కాక ఇంకెవ్వడును వసంతసేనకు సౌఖ్యము కలిగింపలేడని మన నమ్మకము. దూతను విడిచినయెడల, వసంతసేన తప్ప ఇంకెవ్వతెయు చారుదత్తునికి సౌఖ్యము కలిగింపలేదనియు మన నమ్మకము.

ఉజ్జయినిలో ఇరువురును సుప్రసిద్ధులే. వారి కీర్తి నీచపాత్రలవరకును ప్రాకినది. "నీకు చారుదత్తుడును, వసంతసేనయు తెలియని యెడల చంద్రుడును వానిని వెన్నాడియుండు చంద్రికయును తెలియనియట్లే" అన్నాడు చందనకుడు.

ఇరువురును ఒరుల యిడుమలు చూచి జాలిపడక ఉండలేరు. విదూషకుడు పావురపు జంటను వేరుచేయ నెంచినప్పుడు చారుదత్తుడు "పాప మాపావురము తనపెంటితో డనే యుండనిమ్ము" అనుచున్నాడు. మదనికయు, ఆమెప్రియుడు శర్విలకుడును మాటలాడుచున్నప్పుడు "ఎవరి వినోదమునకును అంతరాయము లేకుండును గాక" అని సద్దు చేయక దూరముగాపోయినది వసంతసేన.

వసంతసేన అప్సరసకుపుట్టి అడవిలో పెరిగిన శకుంతల కాదు; అంతఃపురములో పుట్టి, అంతఃపురములో పెరిగిన మాళవికయు కాదు—నగరములోపుట్టి, నగరములో పెరిగిన నాజూకుపడుచు. ఆడువారికి అలంకారములైన గుణముల కామెయెడ ఏలోటును లేదు. మదనికాశర్విలకుల రహస్యభాషణములు వినరాదనిదూరముగా తొలగునప్పుడు, శర్విలకుడు తన పేరుచెప్పుటవిని, మనసు మార్చుకొని తిరిగివచ్చి వారిమాటలు పొంచి యుండి వినుచున్నది. మరల చారుదత్తుడు మరణదండన తప్పించుకొన్నప్పుడు అతని వధ్యమాల తీసి అక్కడికి బంధించితేబడిన శకారుని మెడలో వేసినది.

వసంతసేన చారుదత్తుని పేదరికమును బట్టియే అతనిని వలచినది. తనకు మంచి వార్తను తెచ్చిన వసంతసేన చెలికత్తెను బహూకరింపవలెనని ఉంగరముకొరకై ఉత్త వ్రేలిని చూచి తలవంచుకొన్న చారుదత్తుని చూచి, "అందుకే నిన్ను ప్రేమించుట" అని తనలో అనుకొన్నది వసంతసేన. ఆమె శకుంతలవలె, మాళవికవలె గాఢముగ ప్రేమించినను నిజముగా ఆమెప్రేమకు సాటి పోర్షియాప్రేమ; ఇమోగెన్ప్రేమ. ఆమెప్రేమలో సంశయము లేదు; అసూయ లేదు. ఆమె ధూతను ద్వేషింపలేదు; ధూతయెడ ఆమెకు సోదరీభావము. ఆమెను కొలుచుటకుకూడ తయారు. ధూతకుకూడ ఆమెయన్న ద్వేషము లేదు. చారుదత్తుడు వసంతసేనను ప్రేమించుట రహస్యముకానేకాదు; ధూతకు బాగుగాతెలియును. తాను వసంతసేనను ప్రేమించుటలో చారుదత్తుని కేమియు దోషము కనబడుటలేదు. "ఇది ప్రాయపు నేరముగాని శీలపునేరము కాదు" అనుచున్నా డతడు.

ఏదైనను సరియే, చారుదత్తుని దన్న యెడల అతిపవిత్ర మగును వసంతసేన దృష్టికి. తాను మదపుటేనుగును సమాళించిన నేర్పునకు మెచ్చి, గుంపులో నెవరో

యిచ్చిన దని కర్ణపూరకుండు తనకు వస్త్రమును చూపినప్పుడు—గుంపులోని యతడు చారుదత్తుడే యని గ్రహించి — అది మల్లె పూలవాసన కొట్టుచున్నదా చూడ మని, వస్త్రము తనప్రియునిదే యని నిశ్చయించుకొని, కొంచెముకూడ సంశయములేక దానిని తనపై కప్పుకొన్నది వసంతసేన. మరియు, సంవాహకుడు చారుదత్తుని కొలువులో నుండె నని యెరిగినవెంటనే వానికి ఆసనమిచ్చి, ముందటికంటె బాగుగ ఉపచరించినది.

వసంతసేనకు ప్రియుని చూడ ఎంత యుబలాటమో ఎంత నిశ్చయమో చూడుడు.

"ఉదయన్తునామ మేఘా
భవతు నిశా వర్ష మవిరతం పతతు
గణయామి నైవ సర్వం
దయితాభి ముఖేన హృదయేన."

అనుచున్నది.

ఆమెకు తల్లిమీద యెంతప్రేమ యుండవలెనో అంతే. ఆప్రేమను ప్రియునియెడ తనధర్మమునకు అడ్డుతగులనీయలేదు. రాజుయొక్క బావమరదికి స్వాగత మివ్వమని అమ్మ ఆజ్ఞాపించినది కాని సాధ్యపడ దని ధైర్యముగా చెప్పినది వసంతసేన.

చారుదత్తుని కొడుకుమీద వసంతసేనకు గల మమకారము లేతయెడదలలో పుట్టి పెరిగెడి నిష్కల్మషమైన అనురాగము. మట్టిబండిని పారద్రోసి, బంగారుబండి కావలె నని యేడ్చుచున్న ఆబిడ్డను చూడలేక వసంతసేన వానికి తన నగ లిచ్చినది; కాని ఏడ్చుచు ఇచ్చినదని తీసుకోలేదు వాడు. అవును; ఏడ్చుచునే యిచ్చినది; ఏడువక ఉండలేకపోయినది. చారుదత్తుని నిరుపేదతనము, బాలునికి బొమ్మలుకూడ లేకపోవుట చూచి ఆమెకన్నులలో నీరు తిరిగినది.

వసంతసేన మనలోకములో పుట్టి పెరిగినది. మనవంటి మనిషి; అందులో స్త్రీ. కవిమహాశయుని ఇంద్రజాలమువలన మన హృదయములు వసంతసేనాసహధర్మచరములగుచున్నవి.



# 'వినుకలి - కనుకలి'

నేలటూరు వెంకటరమణయ్య

వినుకలి అనుపదమునకు 'వినికి', 'ఆకర్ణనము' అను నర్థములను జెప్పి బ. సీతారామాచార్యులవారు ఎఱ్ఱనహరి వంశము ఉ. భా. (3. ౭3)

కని పరమేష్ఠి చేసిన జ
గత్త్రియసర్గమునందు నెవ్విధం
బునఁ బొలుపారు నద్భుతపు
మూర్తులుగల్గెనె దీనివిన్న య
వ్వినుకలి మెట్టులైన నొక
వెంట సహించితి నింక నెట్లు నా
మనసున కోర్వవచ్చునస
మానవిలోకన రాగవేదనల్.

అనుపద్యమును ఉదాహరించియున్నారు. 'కనుకలి'కి పదమునకు 'చూపు' అనియర్థము నిర్వచించి, బ. సీ. గారు తదాధారముగ ప్రభావతీప్రద్యుమ్నములోని (3. ౨౮)

వినుకలిచేత నే విరహ
వేదన నామది నింత వర్ధిలెఁ
గనుకలి నిట్లు చిత్రఫల
కంబున గాంచిన యింతి నెమ్మనం
బునఁగడు నింత కెంతపరి
పూర్తివహించునో యెంతనొచ్చునో
ఘనమని వింటేఁ జిత్తరువుఁ
గన్గొనుప్రేమయు నేమి సేయుదుఁ.

అను పద్యమును ఉదాహరించియున్నారు.

పై యుదాహృతపద్యములందు యీపదములకు బ. సీ. గారు నిర్వచించిన 'వినికి' 'చూపు', అనువానికంటె ఎక్కువయర్థము కలదని నాతలంపు. 'వినుకలి', 'కనుకలి' అనుపదములు 'విను', 'కను' అనుక్రియలనుండి యుత్పన్నములు- విను + కలి, కను + కలి. ఇవి 'విను', 'కను' క్రియలనుండి పుట్టిన నామవాచకములని బ. సీ. గారు తలఁచినట్లు తోఁచుచున్నది. అగుననుకొందము. కాని 'విను', 'కను' అనుక్రియాపదములకు 'వినుడు', 'కనుడు' అను నామరూపము లుండినట్లు గ్రంథములవల్ల దెలియుచున్నది. వీనికి ఇప్పటి గ్రాంథికభాషయందు 'వినుట' 'కనుట' యనియు, వ్యావహారికమున 'వినడం', 'కనడం' అనియు రూపములు. దృష్ట్యర్థమున 'కను' క్రియయు, తజ్జనితమగు 'కనడము' వ్యావహారికమున నంతగా ప్రచారమున లేకున్నను 'విను', 'వినడము'లు సర్వసామాన్యముగ వాడుకయందున్నవి. ఈ పదములకును 'వినుకలి' 'కనుకలు'లకును భేదమేమేనియు కలదో, లేక యవి సమానార్థకములో విచారించవలసియున్నది. సమానార్థకములైనచో 'వినుకలి', 'కనుకలి' శబ్దములలోని 'విను', 'కను' క్రియాపదములకు 'కలి' యను ప్రత్యయ మేల చేర్పఁబడినది? ఈప్రత్యయమున కేమేనియు నర్థముకలదా, లేక నిరర్థకపదమా? బ. సీ. గారిచే ఉదా

హృత పద్యములనుత రచిచూచిన విషయము కొంత బోధపడునని నమ్మెదను. సూరనగారి పద్యమున 'వినుకలి' చేతనే విరహవేదన కలిగినట్లు చెప్పఁబడియున్నది. 'వినుకలి'కి 'వినుట' యని యర్థము చేసికొందుమేని, ప్రభావతినిగూర్చి హంసిచెప్పిన మాటలు విన్నంతటనే ప్రద్యుమ్నునకు విరహవేదన కలిగినదని గ్రహించవలయును. కాని శ్రవణమాత్రముననే విరహవేదన కలుగుట యెట్లు? మోహము కలుగవచ్చును. మోహోదయమునకు కారణమగువ్యక్తితోడ సంయోగము కుదరకపోయినప్పుడు విరహము కలుగును. తత్కారణమున విరహవేదన. కావున కేవలము 'వినుట'చే విరహవేదన కలుగుట యసంభవము. అయిన, సూరనగా రిట్లుచెప్పుట యజ్ఞానముచేతనా? అజ్ఞానమును సూరనగారి కారోపించునంతటి ప్రజ్ఞానంతుఁడను గాను. అట్లారోపించుటకు నవకాశమును లేదు. 'విను' క్రియకు'కలి' శబ్దమును దగిలించుటచే ప్రద్యుమ్నునకు ప్రభావతినిగూర్చి విన్నంతటనే 'తగులము' గలిగెనని సూచించి యట్టి శ్రవణజనితమైన తగులముచే విరహవ్యథ కలిగెనని చెప్పియున్నాఁడు. 'కలి' శబ్దమున కింతయర్థము కలదని ఎఱ్ఱనగారి పద్యమునలనను దెలియవచ్చుచున్నది. శ్రీకృష్ణుఁడు వివాహార్థమై నాఁచికొనపోవఁదలఁచిన రుక్మిణీదేవియొక్క ప్రథమసందర్శన మైనంతటనే, "దీని విన్న యప్పినుకలి యెట్టులైన నోకవెంట సహించితి నింక నెట్లు నామనసున కోర్వ వచ్చు ననమాన విలోకనరాగము' అని చింతించెను. ఇచ్చట 'వినుకలి' కేమియర్థము చెప్పవలయును? బ. సీ. గారు చెప్పిన 'వినికి' యనుకూలపడునా? అట్లయిన రుక్మిణిని గూర్చి విన్న 'వినికి'ని శ్రీకృష్ణుఁ డేదోయొక విధమున సహించెనని గదా యర్థమగును? అతఁడు విన్నది నిందావాక్యములా, లేక రుక్మిణి కృష్ణునకు శత్రురాలా? కాదుగదా? మఱి ఆమె కృష్ణుఁడువలచిన ప్రియురాలు. ఆమె సౌందర్యవర్ణనాత్మకము లగు మాటల 'వినికి'ని కృష్ణుఁడు కష్టముతో సహించుట యెట్లు? అవి యాతని శ్రోత్రపేయములై యుండవలయును గదా. అతఁడు వానిని గడునాసక్తితో జెవియొగ్గి వినియుండవలయును గదా! కావున బ. సీ. గారు నిర్వచించిన యర్థ మిచ్చట పొందుపడదు. చక్కఁగ విచారించిన 'వినుకలి'యన వినుటవల్ల కలిగిన మోహము. నారదునివల్ల రుక్మిణీసౌందర్యమును విని కృష్ణుఁ డామెపై మరులుకొనెను. అట్లు వినుటవల్ల కలిగిన మోహము, అనఁగా 'వినుకలి' యోర్వఁగూడనిదైనను, దాని నెట్లో కృష్ణుఁ డోర్చుకొనియుండెను.

'వినుకలి'లోని 'కలి'కింత యర్థముకలదు. ఈ విషయము 'కనుకలి' శబ్దవిచారమువల్ల తెల్లము కాఁగలదు. 'కనుకలి' యన చూచుటవల్ల పుట్టిన మోహము. పైని యుదాహృతమైన సూరనగారి పద్యమున 'కనుకలి' కిదియేయర్థము, ప్రద్యుమ్నుఁ డిట్లుతలఁచెను. "వినుకలి"చేతనే నే నింత మనోవేదనఁ బడుచున్నానే; హంసి చెప్పిన రీతిని, నారూపమును 'చిత్రఫలకంబున గాంచినయింతి' (ప్రభావతి)'యొక్క నెమ్మనంబునఁ 'గనుకలి'వల్ల కలిగిన విరహవేదనఁ 'గడునింత కెంత పరిపూర్తి వహించునో' కదా! 'కను

కలి'ని "విలోకనరాగవేదనల్" అని సంస్కృతీకరించి ఎత్తిన 'కనుకలి'యనఁగా 'చూచుటవల్ల కలిగిన మోహ'మని స్పష్టీకరించినాఁడు. ఈమాట నీయర్థముననే ప్రాచీనులగు ఇతర కవిపుంగవులును ప్రయోగించియున్నారు. ఇందుకొండు రెండుదాహరణములు - కేతన దశకుమార చరిత్రయందు ప్రమతి కథను వర్ణించుచు ప్రమతిచే నీవాక్యమును బలికించినాఁడు :

మున్నుఁ గనుకలిగాఁకచే బన్నములకు
వచ్చి యలదురి నేనుపవనములోన
నగ్గలించిన వలవంత బెగ్గలించు
చున్నచో నమ్మెడకునొక్కయువిదవచ్చి.

కనుకలిచే 'కాక' కలిగెనఁట! బ. సీ. గారి నిర్వచనప్రకారము చూచుటచే కలిగిన జ్వరమని యర్థము చేసికొనవలయును. ప్రమతి భయంకరరూపమును బొడగని వెఱచుటచే జ్వరమువచ్చెనా? కాదు. అతఁడు యక్షిణీ చెయ్దమువల్ల ఒకనాటిరేయి వింధ్యారణ్యమున నిద్రించుచు మేల్కని శ్రావస్తీ పురాధీశుని కూతుపర్యంకమున ఆ కుమారి కౌఁగిట బవళించియుండుట గాంచెను. మరల నిద్రించి మేల్కొని యథాప్రకారము వింధ్యాటవియందే యుండుటను కనుగొనెను. కాని నిద్రయందుగాంచిన రాచకన్నియయందాతని మనస్సు లగ్నముకాఁగా నామెను వెతకుచు నాతఁడు శ్రావస్తికిబోయి యొక యుద్యానవనముఁబ్రవేశించినప్పుడు పైఁజెప్పినరీతిని తలపోసెను. కావున, అతఁడు గాంచిన రూపు భయంకరమైనది కాదు. మనోహరమైనదే. అగునేని చూచుటవల్ల కాఁక పొడముట యసంభవము. 'కనుకలికాఁక' యనఁగా చూచుటవల్ల కలిగిన మోహముచే పొడమిన మోహజ్వరము. ఈయర్థమే వెన్నెలకంటి అన్నయ్యగారి షోడశకుమారచరిత్ర యందలి

"కనుకలిఁ జిక్కి యేను బిగి
కౌఁగిటఁజేర్పఁగగోరు నాసరో
జనయనయప్డు కుంజరమి
షంబునఁ బైఁబడి యిట్లుకౌగిలిం
చిన,"

అను పద్యమువల్లను ప్రతిపాదింపఁబడుచున్నది.

ఇందువల్ల 'వినుకలి, కనుకలి' శబ్దములయం దంతర్గతమైన 'కలి' యొక్క ప్రత్యేకపదమనియు, దానియర్థము 'మోహ'మనియు తేలినది. కాని 'కలి' అనుమాటకు మోహమను నర్థము కలదనుట కెద్దియేనియు నాధారముగలదో విచారింతము.

'కలి' యనుపదము నామవాచకము: ఇది (మోహార్థమున) ప్రత్యేకపదముగ నెచ్చటను గాన్పించదు; కాని దీనియం దుత్పన్నమైన 'కలచు' అను క్రియారూపము ప్రాచీనగ్రంథములయం దగపడు చున్నది. మంత్రిభాస్కరుని (తిక్కనతాత) రామాయణము అరణ్యకాండలో (౧. ౧౩౮) శూర్పణఖ శ్రీరాముని గాంచి వలచి, తన వలపు నిట్లు ప్రకటించుచున్నది:

బలిమి జగత్త్రియంబుఁ బలు
బాములఁబెట్టుచు దేవతావళుల్

పెలుకుఱఁ బంక్తికంఠుఁడను
పేరఁ దనర్చిన దైత్యభర్తకుం
జెలియలఁ బేరు శూర్పణఖ
చెప్పెడిదేమి మహీశ నీకు నేఁ
గలచితి నిన్నుఁదక్క నొరుఁ
గైకొన నీవును బాయు మీసతిన్.

వావిళ్ల వారిచే ముద్రితమైన భాస్కరరామాయణము ప్రతియందు 'కలసితి' అని యున్నది. కాని యిది తప్పు. అచ్చుఁ గూర్చువారో, లేక పరిష్కర్తలో యీరూపమును బ్రసాదించినారని తలఁచెదను. 'కలచితి' యను రూపమే సాధువు. తాళపత్ర ప్రతులను శోధించిన 'కలచితి' యనియే యుండునని నా నమ్మకము. పండితోత్తము లగు నా మిత్రులొకరు ఇచ్చట 'కలచితి' నన 'సంగమించితి' నని యర్థము జేసికొనవలయు ననిరి. కాని పైపద్యములో శూర్పణఖయొక్క వాక్యములను జక్కఁగఁ బరీక్షింపరైరి. శూర్పణఖ రామునిపైఁ దన వలపును బ్రథమమునఁ బ్రకటించు తా విది. రాముఁ డది యెవ్వతెయో తత్పూర్వ మెఱుఁగడు. కావున నది స్వచరిత్రను జెప్పకొనవలసిన యవసరము వచ్చినది. "ఓరాజా! దేవతలు భయముచే గంప మొందునట్లు ముల్లోకములను బాధపెట్టునట్టి పంక్తికంఠుఁ డను రాక్షసరాజు చెలియలను" అని తన యాన్నత్యమును వెల్లడిపఱచి, "ఇంక నేను చెప్పవలసినది ఏమి యున్నది? ఒక్కటే. నిన్ను నేను గలచితిని. నినుందప్ప యన్యుల నంగీకరింపను" అని తన మనోనిశ్చయమును దెలియఁజేసెను. ఇచ్చట 'కలచితి' అనఁగా 'సంగమించితి' నని యర్థము చెప్పికొనిన, సంగమము చేసినపిమ్మట శూర్పణఖ రాముని కావిషయమును నెఱుకపఱచవలసిన యవసర మేమి వచ్చినది? సంగమము చేసిన విషయము రాముఁ డెఱుఁగఁడా? అతఁ డెఱుఁగక సంగమ మగుట యెట్లు? మఱియు, నిన్నుదక్క నొరు గైకొన ననిబాస సేయుట యేల? సంగమించియున్న కైకొన కయా సంగమము నడచినది? లేక, శూర్పణఖ యన్యాసక్త యని రాముఁడు శంకింప నాశంకను నివారించుటకు నిన్నుదక్క నన్యులను గైకొన నని నమ్మిక మొసఁగినదా? అట్టి దేదియును లేదే. కావున 'కలచితి' నను మాటకు 'సంగమించితి' నన్న యర్థము పొసఁగదు. 'కలచితి' నన 'వలచితి', 'మోహించితి', 'మరులు గొంటి' ననియే చెప్పవలసియున్నది.

మఱియు, ఆంధ్రకవులయందు ప్రాచీనతముఁ డగు నన్నెచోడుఁడు 'కలుచు' అను క్రియను నీయర్థమందే పెక్కుపర్యాయములు బ్రయోగించియున్నాఁడు. పరమశివుఁడు కృత్రిమవటుస్వరూపియై తపం బొనర్చెడు పార్వతీదేవి మనస్థైర్యము నారయఁ దలఁచి తపోవనంబునకుఁ బోయి యచ్చట పార్వతీదేవి పరిచారికలవలన నామె శివుని నాథునిగాఁ గోరి తపమునల్పుచున్నది యెఱింగి, శివుని నేలిదము సేయఁదొడఁగి యిట్లనియెను:

ఎట్టెట్టా శివుఁ గల్చె నంటి, నిక మా
యాతన్వి? దర్గ గల్వఁగా
నట్టుల్ మెచ్చకయున్న వే తపము నే
యంజొచ్చె నున్నాతఁడే

ముట్టుం బోలినవానిఁగాఁ దలఁచియే
మోహించి దేశంబులోఁ
బుట్టంబట్టులు మాలెనే నగజ యా
భూతేశ్వరుం గల్వఁగాన్.
కు. సం. ౭. ౮౫౧.

వారిరుహానన నీరూపుఁగనుగొన్న
నలకూబరుండైనఁ గలచివచ్చు.
కు. సం. ౭. ౮౫౩.

తగరము వాఁడిచేసి వెడ
తాపసి నాకడ బీరగాఁడుగాఁ
బొగడెదు నీవు మాకలుగఁ
బోయెదు లోకమువారు భిక్షుకున్
నగసుత గల్చిపోయె నని
నవ్వుదు రాతఁడు నీకుఁ గల్వఁగాఁ
దగదని బుద్ధిసెప్పఁ డిది
తప్పె వరానన నీకుఁ జూడఁగాన్.
కు. సం. ౭. ౮౬౪.

నేరక కల్చి భిక్షుకుని
నీవొక పెద్దగఁ జేసె దింత...
కు. సం. ౭. ౮౬౫.

పులిగూడు దిండిగొఱగం
గలిచియు నోచెల్లయింత గల్పించెదు శ్రీ
గలవాని దగినపురుషుం
గలిచిననీకన్నదోయిఁ గనుఁడరుదనుమా.
కు. సం. ౭. ౮౭౪.

మఱియు, మన్మథుఁడు దేవేంద్రునితో నిట్లు బింకము వల్కెను:

.........................

...........నీవు దన్నుఁగ
ల్చిన నోరుఁ దాను గల్చి చను
చేడియ గల్గినఁ జూపు తెచ్చెదన్.
కు. సం. ౪. ౩౯౯.

పై యుదాహృత పద్యములయందు 'కలుచు' శబ్దార్థము తెల్లము గావింపఁబడి నది. 'కలుచు' అనఁగా 'వలచు', 'వలగొను' అనియే ప్రాచీను లర్థము చేసికొనిరి. తరువాత నీమాట వాఙ్మయమున నంతరించెను; కాని 'వినుకలి', 'కనుకలి' యను సంయుక్త పదములయందు దాని మాతృక యగు 'కలి' శేషించియున్నది.




నమ్మకమైన
నాణ్యమైన
కమలములకు
ప్రసిద్ధమైన
సరాజ్యుల్స్
౩౹౩, ఎస్ప్లనేడు
మద్రాసు.
TELUGU

# మ హా మా య

[ఏ కాం కి క]

మల్లాది అవధాని

చరిత్ర: ౧౫౦౫ జూలై ౫ న ఆగ్రానగరమున మహోగ్రమయిన భూకంపము కలిగినది. పర్వతములు చలించినవి. భవనములు కూలినవి. ప్రజసహస్రములు నిముసకాలములో పరమపదించినారు. అంతకు పూర్వముగాని, ఆటుతరువాతగాని అట్టి భూకంప మీ భారత వర్షమున నెన్నడూ కలగలేదని చరిత్రకారులు వ్రాస్తున్నారు. నాటి కథ—

* * * *

(సమయము: రాత్రి. ఆకాశమున చంద్రబింబము ప్రకాశిస్తున్నది. చిన్న చిన్న మబ్బుతునకలు కదులుతూ కలుసుకొంటున్నవి.

స్థానము: ఆగ్రాలో ఉద్యానము. దూరమునుండి 'బుల్ బుల్' దీనముగా అరుస్తున్నది. శెఫాలి విరియ బూచినది. ఎదురుగా నారికేళవృక్షములు వరుసలో నున్నవి; వెన్నెలలో పాడువయిన నీడలు వేస్తున్నవి.

కదంబముదరి నొక పెద్ద యినుపబోను ఉన్నది. దాని దగ్గరకు తార్తార్ ఖాన్ వెళ్లుతున్నాడు. అతని చేతులో ఖడ్గము మెరుస్తున్నది. వెళ్లి బోనుకు దూరముగా నిలచి సందేహించుతూ గజముల సందులలో నుండి లోపలకు చూస్తున్నాడు. అతని వెనుకనుండి శయక్ జాదాఖాన్ వచ్చి నిశ్శబ్దముగా క్షణము నిలచినాడు.)

శయక్ జాదా: (గట్టిగా) తార్తార్.

తార్తార్: (త్రుళ్లిపడి వెనుదిరిగి) నీవటోయి! అబ్బ! ఇంకా నాగుండె దడదడ కొట్టుకొంటూనే వుంది.

శయక్ జాదా: (చిరునవ్వుతో) నేను కాకుంటే మరెవ రనుకున్నావు?

తార్తార్: సుల్తాన్‌వారు హఠాత్తుగా వచ్చారేమిటి చెప్మా అనుకుని గతుక్కుమన్నాను.

శయక్ జాదా: తప్పుపనిచేస్తే మన స్సలాగే బేజారుపడిపోతుందిలే!

తార్తార్: నేను చేసిన తప్పేమిటో కాస్తచెప్ప గలవా?

శయక్ జాదా: (పరిహాసముగా) నువ్వుచేసిన పని తప్పనగలనా? చూదామనిపించింది. ఒకసారి బోను దగ్గిరకి వెళ్లావు. అంతే!

తార్తార్: ఇదా నీ అనుమానం! లోపల యేమో చప్పుడయితే దగ్గిరకి వెళ్లి చూస్తున్నాను. ఇంతలో నువ్వు వచ్చావు. సరేగాని చూశావూ?

శయక్ జాదా: తోప్‌ఖానా దాటి ఫర్లాంగు దూరం నడిచి చూసివచ్చాను. సుల్తానువారు వచ్చేజాడ యేమీకనబడలేదు.

తార్తార్: అయితే యీరాత్రంతా తెల్లవార్లూ యీ బోనుచుట్టూ తిరుగుతూ మనమిద్దరమూ పడిగాపులు గాయవలసిందేనా?

శయక్ జాదా: అధికార్ల తెలువు లిలాగ నేడుస్తున్నాయి. ఇనపబోనుకు కాపలా యెందుకుచెప్పు?

తార్తార్: మెల్లగామాటాడు నాయనా, గోడలకూడా చెవులుంటాయి.

శయక్ జాదా: ఫర్వాలేదు. ఇక్కడ గోడలు లేవులే.

తార్తార్: జాగరంచెయ్యాలి కాబోలురా భగవంతుడా?



12 - 6

———శయక్ జాదా :(పరిహాసము) నే నింటికిపోనా ? ఒక్కడవూ హాయిగా యిక్కడ మేలుకుందువుగాని.

తార్తార్ : ఒక్కడనూనా ?

శయక్ జాదా : కాదుకాదు. ఇద్దరూ !

తార్తార్ : ఇద్దరెవరు ?

శయక్ జాదా : నువ్వూ బోనూ.

తార్తార్ : (ఆవులించి) సుల్తా నీరాత్రి వచ్చితీరుతాడు.

శయక్ జాదా : భవిష్యత్తు చెప్పేస్తున్నావే !

తార్తార్ : భవిష్యత్తుజ్ఞానం ఆపిల్లకు బాగావుందట.

శయక్ జాదా : (ఆత్రుతతో) ఏపిల్ల ?

తార్తార్ : ఆపిల్ల అన్న ప్రతీమాటా జరిగిపోతుందట. సుల్తాన్ కాశీ పొలిమేరలకు రాలేడని గతసంవత్సరం చెప్పిందట. సరిగ్గా అలాగే జరిగింది. అంతదూరమూ వెళ్లి సైనికుల్లో కలరా తగలగానే తిరిగివెళ్లి పోవచ్చాడు.

శయక్ జాదా : ఎవరు ?

తార్తార్ : మొన్న నేం జరిగిందో విన్నావు కదా ! ధూల్ పూర్ మహేశ్వరాలయం మన సుల్తాన్ వారు ముట్టడించారు. 'ఎన్నటికీ యాతురక యీ ఆలయంలో ప్రవేశించలేడని ఆ పిల్ల పలికింది. అంతే అయింది.

శయక్ జాదా : ఓయి నీయిల్లు బంగారుంగాను ! హిమాలయాల్లోంచి వచ్చిన పిశాచపుపిల్లను గురించా యీగాథ అంతాను.

తార్తార్ : పిశాచపుపిల్ల ! ఏం మాటన్నావు ?

శయక్ జాదా : నావేపు కొరకొర చూస్తున్నావేం ?

తార్తార్ : పిశాచపుపిల్లా !

శయక్ జాదా : ఊళ్లోకొందరు 'సుల్తాను ధూల్ పూర్ నుండి ఒక పిశాచపుపిల్లను ఖైదీచేసి తెచ్చా'డని అంటున్నారు. నేను విన్నాను, అన్నాను. నామీద నెందు కాగ్రహం ?

తార్తార్ : ఆ పిల్లకళ్లు తళతళ ముత్యాల్లాగ మెరుస్తున్నాయి. చీకటిరాత్రి గరికపువ్వులమీద యెగురుతున్న మిణుగురుపురుగుల్ని చూశావూ ? వంకలు తిరిగిన ఆ చిన్న నీలికళ్లు అచ్చం అలాగే వున్నాయి.

శయక్ జాదా : మన సుల్తానువారు రాసినగ్రంథం ముల్లా చదివితే విన్నాను. అందులో వర్ణనలాగ వుంది నీ వర్ణన.

తార్తార్ : మెరుపువేపు తేరిపారచూడలేనట్టే ఆ పిల్ల కళ్లల్లోకి చూడలేను. నా ఒళ్లు ఝల్లుమంది తలుచుకుంటే ఒళ్లు గరిపొడుస్తూంది.

శయక్ జాదా : చక్కగా వుందా యేమిటి ?

తార్తార్ : మాబాగా అడిగావు ! చిన్నతనంలో నేను జనానాల్లో తిరిగేవాడను. ఎన్నడూ నా జన్మలో ఎక్కడా అటువంటి మహాచక్కని పిల్లను చూడలేదు. నాకు మాటలురావు. ఆ పగడంపూసలవంటి పెదవులు, నిగనిగ మెరుస్తున్న కంఠమూ...ఒక్కటే మాట విను. ఆమె యీ లోకంమనిషి కాదు.

శయక్ జాదా : హిందువుల్లో కామినీ పిశాచాలంటూ వొక తెగ వుందట.

తార్తార్ : ఊరుకో !

శయక్ జాదా : భాయీ ! నిన్న దివలలో వేసుకుంటూంది. పిల్లలవాడవు. అక్కనక్కన చస్తావు సుమా !

తార్తార్: వెర్రిమాటలు. దెయ్యాలూగియ్యాలూ అబద్ధం. ఆ పిల్ల హిమాలయాల్లో కాంచనగంగా ఆపైని బౌద్ధవిహారాల వెనక కుటీరంలో వుండేదట. మన సుల్తాన్ హిందూఆలయాలు నేలమట్టంచేసి అక్కడే మస్ జీదులు కడుతున్నాడని విని చాలాఖేద పడిందట. మథురలో నదికెదురుగా మస్ జీద్ కట్టగానే యిక కోపం పట్టలేక మంచుకొండల్లోంచిదిగి వచ్చిందట. నాటినుంచి సుల్తాన్ ఒక్క ఆలయమయినా ధ్వంసం చెయ్యలేకపోతున్నాడు.

శయక్ జాదా: ఇదంతా దాని మహత్తే అంటావా కాబోలు!

తార్తార్ : కాకుంటే యింకేమిటి? మనవాళ్లు కాశీలో కాలుపెట్టలేకపోయినారు. కలరా తగిలి తిరిగి వచ్చారు. మళ్లా మథుర వెళ్లుదామని బయలుదేరారు. సుల్తాన్‌కి చచ్చేటంత జబ్బుచేసింది. ధూల్‌పూర్ వెళ్లారు. కాని ఆలయం పట్టుకోలేక చల్లగా తిరిగి వచ్చారు.

శయక్ జాదా: ధూల్‌పూరాలయం ఆపిశాచపు.., కాదు. ఆపిల్లే రక్షించిందంటావా?

తార్తార్ : అంతా అలాగే అంటున్నారు.

శయక్ జాదా: సరే బాగుందయ్యా! మరి ఆలయాన్ని రక్షించిన ఘుసురాలు తానెందుకు ఖైదీగా మనవాళ్లకు దొరికిపోయింది.

తార్తార్: ఆమెవుద్దేశం మనం కనుక్కోగలమా?

శయక్ జాదా : (విచిత్రముగా నతనివంకచూచి) తార్తార్ !

తార్తార్ : ఏమి?

శయక్ జాదా: నేనెవరో పోల్చుకొన్నావూ? నాపేరేమిటో చెప్పు!

తార్తార్ : నీ ప్రశ్న నాకు బోధపడలేదు.

శయక్ జాదా : నిన్నా దెయ్యమావేశించింది. నిజం నిజం!

తార్తార్ : ఓయి పిరికివాడా! నీకు మతిపోయిందా యేమిటి?

శయక్ జాదా : ఇంకాలేదు. దాన్ని చూశాక నీ మాదిరిగానే నాకూపోవచ్చును.

తార్తారు : (ఆవులించి) సుల్తానురాలేదు. నాకు నిద్దరొస్తూంది.

శయక్ జాదా : మరిరాడు కాబోలు. నేనింటికి పోతాను.

తార్తార్ : వచ్చాడా అంటే నీవుకనబడకపోతే రేపుదయం నీతలకాయ యెగిరిపోగలదు సుమా!

శయక్ జాదా : ఈ రాత్రి హిందూ దెయ్యం చేతులో చచ్చేకంటే రేపుదయం మనసుల్తాన్ చేతులో చావడం నయంకాదూ?

తార్తార్ : నీసందేహం తీరకుంది ఒకసారి వెళ్లి చూచిరా!

శయక్ జాదా : నేనా? ఒంటరిగానా?

తార్తార్ : నేకూడ సాయంవస్తాను పద.

(ఇద్దరూ బోనుదగ్గరకువెళ్లినారు. శయక్ జాదా సందేహిస్తూ భయముతో బోనులోనికి తొంగి చూచి నాలుగడుగులు దూరము వచ్చినాడు.)

శయక్ జాదా : తార్తార్! తార్తార్!

తార్తార్ : ఏమలాగ గాభరాపడిపోతున్నావు?

శయక్ జాదా : పొడుగ్గా జడలుకట్టిన బంగారు జుట్టు...ఏనుగుదంతంవంటి వొళ్లు. తామరమొగ్గలవంటి అరచేతులూ...నిజమే...నువ్వన్న ప్రతీ అక్షరమూ నిజమే.

తార్తార్ : ఆకళ్లు చూశావా?

శయక్ జాదా : లేదు. నావైపు వెనుదిరిగి నించునివుంది. ఎంతనున్నటి వీపు?

తార్తార్ : పిశాచమేనా?

శయక్ జాదా : ఊళ్లోమూర్ఖులలాగంటే నమ్మకున్నాను. మాటలు వచ్చునా?

తార్తార్ : (నవ్వుతూ) నీకా? నాకా?

శయక్ జాదా : ఆమనిషికి.

తార్తార్ : ఏమోతెలీదు. నేను ఆవిడతో మాటాడలేదు. ఆవిడను చూస్తేనే యేదోవొకవిధమయిన భయం...

శయక్ జాదా : ఆం. అదే అదే. అనోరకంగా జంకుకలుగుతుంది.కళ్లు జిగేల్మని నుండె జల్లుమంటుంది.

తార్తార్ : ఉదయంనుంచి వొక్కమాటయినా మాటాడి ఆ గొంతు విందామని పదిమార్లు ప్రయత్నిం

చాను గాని బోనుదగ్గిరకి వెళ్లితే కనబడకుండా గాల్లో యెవరోనింపుని నన్ను వెనక్కి గెంటినట్టయివచ్చి పూరు కున్నాను.

శయక్ జాదా : ఆపిల్ల పిశాచంకాదు.

తార్తార్ : ఎంతమాత్రమూకాదు.

శయక్ జాదా : పేరు ?

తార్తార్ : ఎవరిపేరు ?

శయక్ జాదా : ఆపిశా...ఆ మనిషి పేరు ?

తార్తార్ : ఆ పిల్లపేరా ? ఆ పిల్లపేరూ... మహా... మహా... ముల్లాచెప్పగావిన్నాను, మరిచిపో యాను. మహాకాళి...కాదు, కాదు మహా మహా... ఆఁ...మహామాయ !

శయక్ జాదా : మహామాయా ! మహంకాళీవిగ్ర హాన్ని చూశావా ?

తార్తార్ : చూశాను. ఎంతభయంకరంగావుం టుంది. మనసుల్తాన్ ఆవిగ్రహాన్ని మస్ జిద్ కి మెట్లుగా చెక్కించాడుకాదూ ?

శయక్ జాదా : కాని మహామాయ యెంతచక్క గావుంది !

తార్తార్ : దూరాన చూడు వెలుతురు !

శయక్ జాదా : అవును !

తార్తార్ : అదుగో కొాజ్జాలు

శయక్ జాదా : వస్తున్నారు !

తార్తార్ : నువ్వాటునించో !

శయక్ జాదా : కొాజ్జాలు దివిటీలు పట్టుకొని వస్తున్నారు.

తార్తార్ : అదుగోసుల్తాన్ !...వెనకవాళ్లెవరు?

(ముందు కాగడాలు పట్టుకొని కొాజ్జాలు తరు వాత సుల్తాన్ సికందర్ లోడీ అతనివెనుక చాలమంది వృద్ధులయిన కాజీలు మౌల్వీలు వస్తున్నారు. సికందర్ తెల్లని మామూలుదుస్తులూ తలనొక సామాన్యమయిన టోపీ ధరించినాడు. అతడు సన్నగా ఆరడుగుల పొడు వుగా ఉన్నాడు. కోలనిసుఖము- చిరుగెడ్డము. వయ స్సు నలభై,నలభైఅయిదు.కాజీలుమౌల్వీలు నల్లనిదుస్తులు ధరించినారు. వారందరకును తెల్లని గెడ్డములున్నవి. ప్రతీవానిచేతనూ అక్షమాలిక లున్నవి. తార్తార్, శయక్ జాదా నేలను మోకరించి తలలువాంచి ప్రణా మములు చేసినారు.)

సికందర్ : మధ్యాహ్నం ఆహార మేమిటి వేసి నారు ?

తార్తార్ : అరటిపండ్లు బోనుపైకన్నంలో నుంచి లోపలకు పడవేశాము.

శయక్ జాదా : కాని తినలేదట !

తార్తార్ : నేను చూశాను జహాపనా ! ఒక్క పండునయినా ముట్టుకోలేదు.

సికందర్ : ఉదయంనుంచి భోజనమేలేదు !

తార్తార్ : లేదు. మంచినీళ్లయినా త్రాగలేదు.

శయక్ జాదా : ఒక్కమాటయినా మాటాడ లేదు. మాటలు రావుకాబోలును.

సయన్ కాజీ : మూగిమనిషి కాదు. ధూల్ పూర్ హిందూఆలయం పడగొట్టడానికి వెళ్లినపుడు ఆలయగోపురంమీద నిలుచుండి, సంస్కృత భాషలో కాబోలును ఏవో మంత్రాలు భయంకరంగా వల్లిం చింది. మనమంతా విన్నాము. అపుడు మనం ఆలయం దగ్గిరకి వెళ్లలేకపోయాము. గొడ్డళ్లు చేతుల్లోనుంచి జారిపోయినాయి.

మియాన్ కాజీ : తరవాత మంత్రాలు వల్లిస్తూ తొందరతొందరగా జుట్టు గాల్లోపల ఎగురుతూవుంటే ఆలయంచుట్టూ పరిగెత్తింది. చుట్టూ నేల నొక గీత గీసింది. 'ఈగీతదాటి తురకలు లోపలికి రాలేరంది.

ఆసన్ ముల్లా : పదిమంది మనసైనికు లాగీత దాటారు. వెంటనే భొళ్లుభొళ్లున రక్తం క్రక్కుకుని చనిపోయినారు పాపం !

సయన్ కాజీ : అది మాంత్రికురాలు !

మియాన్ కాజీ: అవును మాంత్రికురాలు.

కాదిర్ మాల్వీ : సందేహంలేదు మాంత్రికురాలు!

సికందర్ : ఇంత గోమాంసం లోపల పడవెయ్యలేక పోయినారు ? తింటుందేమో ?

తార్తార్ : మాంసమా జహాపనా ?

సికందర్ : అవును.

తార్తార్ : ఆమె...అది హిందువు జనాబ్ !

సికందర్ : హిందువులు గోవుని పూజిస్తారు.

ఆసన్ : గోమాంసం దానిచేత తినిపించవలసింది.

సయన్ కాజీ : అది యేమీ భోజనంచెయ్యదట.

ఆసన్ : ఎన్నడూ ?

సయన్ కాజీ : ఎన్నడూ ఏమీ భుజించదట. హిమాలయాల్లో వుండేటప్పుడు మాత్రం రోజు కోసారి గంగానదిలోని నీ రొక పుడిసెడు త్రాగుతుందట.

మియాన్ కాజీ : ఏమీ తినకుండా యెలా బ్రుకుకుతూంది చెప్మా !

కాదిర్ మాల్వీ : అది మాంత్రికురాలు !

సికందర్ : నేనెన్నడూ దాన్ని చూడలేదు. ధూల్ పూర్ లో నా కది కనబడలేదు. ఎలాగుంటుంది ?

కాదిర్ : నేనూ సరిగ్గా చూడలేదు.

మియాన్ : దూరంనుంచి చూశానుగాని నా కా ఆకారం స్పష్టంగా కనబడలేదు.

సికందర్ : సయన్ కాజీ ! తమరు చూచినారు కదా, ఎలాగుంటుంది చెప్పండి !

సయన్ : గోపురంమీద నిలుచుంది జనాబ్ ! దూరంలో నేనున్నాను. నా కది ఒకపక్షిమాదిరిగా కన పడ్డది.

కాదిర్ : ఆ మాంత్రికురాలికి చిన్నచిన్న రెక్కలు రెండున్నవట. హిమాలయాల్లో వొక మంచుశిఖరం మీదనుంచి యింకోదానిమీదకు తూనీగలాగ తుప్పు తుప్పున యెగిరిపోతుందట.

మియాన్ : నుదుట కొమ్మొకటున్నదట జహాపనా !

ఆసన్ : ఉల్లూ కళ్లవంటి కళ్లట.

కాదిర్ : దాన్నిచూస్తే హిందువులే ధనుసు కొని పారిపోతారట.

సయన్ : ఒకసారి దాని కళ్లలోనుండి అగ్ని కణాలు రాలడం చూశామని మన సైనికులు చెప్పగా విన్నాను.

సికందర్ : దాని వయస్సెంతో ?

కాదిర్ : మూడు నాలుగువందల సంవత్సరాలుంటాయట !

సికందరు : (ఆశ్చర్యముతో) ఏమిటి ? నాలుగు వందలా?

సయన్ : ఏమనిషీ అంతకాలం బ్రదకలేదు.

మియాన్ : మాంత్రికులయితే మాత్రమంతకాలం బ్రదకగలరా? కల్ల !

కాదిర్ : తోగ్లక్ వారి సైన్యాలు హిమాలయాల్లోనుంచి వెళ్లినపుడు మంత్రాలు చదువుతూ మంచు బండల్ని కదలించిందట. అది మంత్రం చదవగానే పెద్ద మంచు బండొకటి దొర్లి వచ్చి సైనికులమీద పడడం వాళ్లుతారుమని చనిపోవడం...ఆ సైన్యమంతా యిలాగే నశించిందట.

సికందర్ : ఇది ఆనాటిదా?

కాదిర్ : సుల్తానా రిజియాబీగమ్ కాలంలో వొకసారి కొండల్లోనుంచి దిగివచ్చి 'ఇపుడు సింహాసనంమీద కూర్చున్న యీ స్త్రీ ఎల్లుండి చీకటికొట్లో చనిపోతుంది' అని భవిష్యం చెప్పి తిరిగి కొండల్లోకి మాయమయిపోయిందట. ఆమూడోనాడు రిజియాబీగం వారు చనిపోయినారు.

సికందర్ : (కోపముగా) సందేహంలేదు. ఇది సైతాన్ అవతారం !

కాదిర్ : కావడంచేత మనసైన్యాలు ధూల్ పూర్ ఆలయం విడిచి పలాయితులు కావడమేమిటి?

సయన్ : కాశీ విషయం మరిచిపోయినారా కాదర్జీ ! అపుడు చెలరేగిన కలరాదెయ్యం దీని జుట్టులోనుంచే పుట్టింది.

సికందర్ : అవును! కాఫర్ల ఆలయాలన్నీ యిదే రక్షిస్తూంది!

సయాన్ : నడుము వంగికనులు గుంటలుపడి ఒళ్లు ముడుతలుపడి...

మియాన్ : జుట్టు నెరిసిపోయి వోకమృగం లాగ కనబడుతుందని విన్నాను.

సికందర్ : (ఆలోచనచేస్తూ) కాఫర్ల నిది అన్ని విధాలా కాపాడుతూంది కాదన్జీ!

కాదిర్ : జహాపనా!

సికందర్ : ఖొరాన్‌లో యిటువంటివాళ్ల కేమి శిక్షు విధించినారో సెలవిస్తారా?

కాదిర్ : అనేకం శిక్షలున్నాయి జహాపనా!

సికందర్ : గట్టిశిక్షలు చెప్పండి!

కాదిర్ : మాంత్రికులనుగాని మాంత్రికురాండ్రను గాని బ్రదికివుండగా అగ్నిజ్వాలల్లో నిలిపి కాల్చి కాల్చి చంపవమూ....

సయన్ : కాని ధూల్‌పూర్‌లో కాలిపోతూ కూలిపోతున్న భవనాల్లోని మంటల్లోనుంచి అది పరిగెత్తింది.

సికందర్ : (నిర్విరబోయి) నిజమా?

కాదిర్ : ఏనుగుకాలిక్రింద త్రొక్కించి....

సయాన్ : దాన్ని గోపురంమీదచూచి మన ఏను ఏనుగులు సుర్రాలు మహావీరులుకూడ వున్మత్తుల్లాగ వెన్నిచ్చి పారిపోయినారు. మరిచిపోయినారా?

సయన్ : దాన్నిచూచిన ప్రతీమనిషీ...జీవీ ముగ్ధుడై తీరుతాడు. చూడనంతసేపే! చూశాక దాని మంత్రాలు తంత్రాలు వచ్చి మీదపడతాయి.

సికందర్ : అల్లా! సైతాన్ని చంపే మార్గమే లేదా!

కాదిర్ : సైతాన్ని తొలగించే మార్గాలు ఖొరాన్లో వున్నాయి జహాపనా!

సికందర్ : (నమ్రుడై) మీరందరూ భగవంతుని దూతలు. పరమపవిత్రులు. ఆలోచించిచెప్పండి యీసైతాన్ని ధ్వంసం చేసేమార్గం!

కాదిర్ : ఇది సైతాన్‌కాదు జనాబ్!

సికందర్ : మరెవరు?

కాదిర్ : సైతాన్ మేమున్నచోట నుండనే వుండలేదు. ఇది సైతానుకికూడా తల్లిలాగుంది.

సికందర్ : దీన్ని చంపేమార్గం లేదా?

సయన్ : ఇంతవరకూ మనం ప్రయత్నంచెయ్య లేదే!

కాదిర్ : ధూల్‌పూర్‌లో వందలకొలది బాణాలువేశారు. అన్ని దాని కిటూ అటూ వెళ్లిపోయినాయి. కాని ఒకటీ తగలలేదు.

సయాన్ : ఒక అగ్నిగోళందానిమీదకు విడిచి పెట్టారు. ఆగోళాన్ని నవ్వుతూ కబళించిందట.

కాదిర్ : పోనీ! తిరిగి దీన్ని తీసుకుపోయి హిమాలయాల్లో విడిచిపెట్టివస్తే?

సికందర్ : ఎన్నటికీ వీలులేదు. దీన్ని చంపి తీరాలి. మన మార్గాల కిది అడ్డుతగలకమానదు. మనం ఆలయంకొట్టడానికి బయలుదేరితే యిది ఆలయగోపురంమీద హాజరవుతూంది.

కాదిర్ : నిజమే! కాని ఎలాగ?

సికందర్ : (వరలోనుండి కైజారును చటుకున లాగి నిశ్చితస్వరమున) నేను చంపుతాను. అది యీరాత్రి చచ్చితీరాలి. ఈ కైజారును దీనిగుండెలో పొడిచి నరాలుపీకి చంపుతాను. అల్లా సహాయమున్నాడు.

ఎవడక్కడ?

తార్తార్ : (వచ్చి) జహాపనా!

సికందర్ : ఆబోనుతలుపులు తియ్యి! వెళ్లు!

తార్తార్ : (బోనుదగ్గరకు వెళ్లబోయి తిరిగివచ్చి) జనాబ్!

సికందర్ : తిరిగివచ్చినావేమి పిరికిపందా?

తార్తార్ : ఆమెహ దెయ్యంకాదని నాకు తెలుసును జహాపనా! కాని చీకటి!

సికందర్ : చంద్రుడు ప్రకాశిస్తున్నాడు. ఎటు చూచినా వెన్నెలే. చీకటా? నీకళ్లు చీకట్లు కమ్ముతున్నాయా?

తార్తార్ : నాకు వెన్నెలకనుబడలేదు జనాబ్. క్షమించండి జనాబ్!

సికందర్ : (కొజ్జాలతో) కాగడాలు పట్టుకొని ముందుకు నడవండి !

(కొజ్జాలు కాగడాలను ముందుకు జాచి నడుస్తున్నారు. చప్పున కాగడాలన్నీ ఒక్కసారిగా ఆరిపోయినాయి.)

కొజ్జాలు : (భీతితో) ఆరిపోయినాయి!

సికందర్: గాలివేసింది ఆరిపోయినాయి!(శయక్ జాదాతోను తార్తారుతోను) వెనక్కు వెనక్కు జంకుతారేమి? నడవండి ముందుకు! పిరికిచూపులు చూస్తున్నారా? పొడిచి చంపుతాను మిమ్మ. నారాజ్యంలో పిరికిపందలకి తావులేదు. (కైజారుతో శయక్ జాదా సుండెల్లో పొడిచినాను)

(శయక్ జాదా నేలను కూలబడినాడు.)

సికందర్ : (ఉగ్రముగా) నీ విటురా !

తార్తార్ : (బోనువైపు తొందరగా నడుస్తున్నాడు.)

సికందర్ : (రక్తసిక్తమయిన కైజారుసుచూస్తూ) ఆ సైతాన్ సుండెలోకి దూసుకుపోవాలి !

తార్తార్ : (భీతితో యినుపబోను తలుపు తెరిచి పరిగెత్తుకు దూరముగాపోయి నిలచినాడు.)

(బోనులోనుండి స్త్రీకంఠము)

తమసోమా జ్యోతిర్గమయ !

అందరూ : (ఒక్కసారిగా త్రుళ్లి పడినారు)

కాదిర్ : విన్నారా?

సయద్ : ఏమి కంఠం...నావొళ్లు కంపిస్తూంది !

సయాన్ : నా హృదయం టకటక కొట్టుకొంటూంది !

సికందర్ : (కఠోరముగా) అది అరుస్తూంది! బొబ్బలు పెడుతూంది ! (ఒక అడుగు ముందుకువైచి గట్టిగా) ఓ సైతాన్ దుహితా ! నరకలోక రాణీ ! బోనులోనుండి బయటకు రా !

(మహామాయ బోనులోనుండి బయటకు వచ్చినది.)

అందరూ : (చకితులై నిశ్చేష్టులై నిర్వాక్కులై పోయినారు.)

సికందర్ : (క్షణము శిలాప్రతిమవలె నిలచిన పిదప) ఎవరు నువ్వు?

కాదిర్ : ఆమె వృద్ధురాలు కాదు !

సయద్ : నుదుట కొమ్ములేదు...రెక్కలూ లేవు !

సయాన్ : ఎంత చక్కనిపిల్ల...ఆ శరీరం ఎలాగ నిగనిగలు తేరిందో !

కాదిర్ : ఆ జుట్టు చూడు. బంగారపు జడలు కట్టి బుజాలమీద వూగులాడుతూంది.

సయద్ : ఆ పెదవులు దానిమ్మగింజలు !

కాదిర్ : ఆశరీరం ఆశరీరం...వెన్నెలపోసు. ఏనుగుదంతంతో ఏశిల్పిచెక్కిన ప్రతిమోకదా !

సయద్ : చమరీమృగరోమంలో నేసిన వస్త్రం కట్టుకుంది.

సయాన్ : అది వస్త్రంకాదు. చమరీమృగ చర్మమే !

సయద్ : ఆ అరచేతులు చూడండి, ఆపాదాలు చూడండి ! తామర మొగ్గల్లాగ వున్నాయి.

కాదిర్ : కనులు మూసుకునే నిలుచుంది.

సయద్ : ఆముత్యాల పెదవులు కదులుతున్నాయి.

సయాన్ : భగవంతుణ్ణి ప్రార్థిస్తూంది కాబోలు.

కాదిర్ : హిందువుల స్వర్గంలోనుంచి దిగివచ్చిన అప్సరస కాదుగదా ?

సయద్ : నాకు హిందూమతంలో కూడా కొంత నిజం వుందని యీరాత్రి బోధపడుతూంది .

కాదిర్ : (ఆవులించి) ఆపిల్లనేపు చూస్తే నిద్ర వస్తూంది.

సయద్ : (ఆవులించి) నాకున్నూ !

సయూన్ : నాకుగూడాను. వింతగావుందే.

కాజీలందరూ : (ఒక్కసారిగా) చూడండి! చూడండి! ఆ అమ్మాయిముఖంలో నుంచి మెరుపులు! అబ్బ! నేను చూడలేను...(వెనుకకు వెనుకకు వెళ్లిపో తున్నారు) ఆపిల్ల పేరు?

ఒకమాల్వీ : మహామాయ!

కాజీలందరూ : (కలసి) మహామాయ! మహామాయ! (మూరనుగాపోయి ప్రతిమలవలె నిలచిపోయి నారు.)

సికందర్ : (హీనస్వరమున) ఎవరు నువ్వు?

మహామాయ : (కన్నులు మూసుకొనే జవాబులు చెపుతున్నది.) సోఒహం.

సికందర్ : నీతలిదండ్రు లెవరు?

మహామాయ : (కన్నులు మూసుకొనే)

సఏవ మాతాచ పితా సఏవ!
సఏవ బంధుశ్చ సఖా సఏవ!

సికందర్ : నీ నివాసమెక్కడ?

మహామాయ : (నిదురనుండి మేల్కాంచిన విధముగా, చేతులుజాచి కన్నులు మూసుకొనే) సర్వత్ర సర్వత్ర!

సికందర్ : మా భాషలో మాటాడలేవా? నీవు కాఫరువా?

మహామాయ : కాను!

సికందర్ : (ఆనందముతో) ముసల్మాన్‌వా?

మహామాయ : కాను!

సికందర్ : మరే మతస్థురాలవు?

మహామాయ : మతంలేదు.

సికందర్ : ఇంతకాలమూ హిమాలయాల్లో వుండేదానవట గాదూ?

మహామాయ : అవును.

సికందర్ : కాంచనగంగా ఆపైని మంచుకొండల్లోనా?

మహామాయ : నాకు గృహంలేదు. ఒకసారి కాంచనగంగ, ఒకసారి మానససరోవరం, యింకోసారి కేదారనాథం, మరోసారికైలాసం......యిలాగు తిరుగుతూ వుంటాను.

సికందర్ : మరి కొండలుదిగి యెందుకు వచ్చావు!

మహామాయ : ఆజ్ఞ! ఆజ్ఞ!

సికందర్ : ఎవరు నిన్నాజ్ఞాపించినవారు?

మహామాయ : (ఆకాశంవంక చేతులుఎత్తి) అతడు!

సికందర్ : చంద్రుడా?

మహామాయ : కాదు.

సికందర్ : మరెవరు?

మహామాయ : నా తండ్రి!

సికందర్ : భగవంతుడా?

మహామాయ : అవును.

సికందర్ : (సంశయముతో) భగవంతుడా? సైతానా?

మహామాయ : నా తండ్రి!

సికందర్ : ఏమని ఆజ్ఞాపించినాడు?

మహామాయ : కొండలుదిగి దేశంలోనికి వెళ్లమని.

సికందర్ : నీదగ్గిరకు వచ్చిచెప్పినాడా?

మహామాయ : లేదు. ఒకరాత్రి శిఖరాలమీద తిరుగుతున్నాను. పైన మబ్బులున్నాయి. ఎవరో నన్ను గట్టిగా పిలచారు.

సికందర్ : ఏమని?

మహామాయ : 'మహామాయా?' అని.

సికందర్ : నీపేర దేనా?

మహామాయ : అంతవరకు నాకుపేరేలేదు. కాని ఆపిలుపువినగానే తలెత్తిపైకి చూశాను. మబ్బులోనుంచి వొక కంఠధ్వని "నిన్నే!" అని వినబడింది. నాటినుంచి నేను మహామాయనే!

సికందర్ : తరవాత ?

మహామాయ : "దేశంలో అధర్మంరేగిపోతూంది. ధర్మసంస్థాపన చెయ్యి"అని తిరిగి మేఘాలు అరిచాయి. స్పష్టంగా విన్నాను. "వెళ్లు! వెంటనేవెళ్లు!" అని విన బడింది. నాలో తుపానుగాలికి గల బలం విజృంభిం చింది. కొండలమీద నుంచి పరిగెత్తుకుంటూ దిగి కాశీ వచ్చాను.

సికందర్ : ఆఁ ఆఁ ?

మహామాయ : నామనస్సులో వింత దృశ్యంకన బడింది.

సికందర్ : ఏమి టది ?

మహామాయ : తురకలు ఆలయంమీద పడబోతు న్నారు. వారిలో కలరాపుట్టింది. వాళ్లు వెనుదిరిగి పారి పోయినారు——ఇదంతా వాస్తవంమాదిరి నామనస్సులో కనబడింది. నాకు కనబడిన ప్రతీజీవితోనూ నిర్జీవితోనూ యీ విషయం చెప్పాను. నేను చెప్పిన మూడోనా డలాగనే జరిగిందట.

సికందర్ : (భీతితో) అవునవును. తరుపరి ?

మహామాయ : మధురలో...

సికందర్ : నాపరాజయాలు మరిచెప్పకు!

మహామాయ: తరవాత ధూల్‌పూర్‌లో. అక్క డ నేను – నేను కాను. నాలో ఇంకెవరో వుండి నన్ను యంత్రంమాదిరిగా త్రిప్పినట్టయినది.

సికందర్ : నువ్వు మాంత్రికురాలవేనా ?

మహామాయ : నాకు తెలీదు.

సికందర్ : నేను రేపు మధుర బయలుదేరుతు న్నాను. ఆలయం నాశనంచేసి అక్కడనే మస్‌జిద్ కట్టుతాను.

మహామాయ : నువ్వు చెయ్యలేవు. చెయ్యలేవు. నన్ను నాతండ్రి పంపించాడు !

సికందర్ : నువ్వడ్డుతావా ?

మహామాయ : నువ్విక్కడనుంచి కదలలేవు. నీసైన్యం కదలలేదు. రేపటిసంగతి నువ్వు చూడలేవు. నేను చూడగలను.

సికందర్ : హిందూమతాన్నుద్ధరించ దలుచు కున్నావా ?

మహామాయ : ధర్మాన్ని !

సికందర్ : నిన్ను దారిలోనుంచి తొలగించి వేస్తున్నాను. ఈకైజారు చూడు. దీన్ని నీహృదయంలో పొడిచి నిన్ను చంపుతాను. కాని నీశరీర మెంతమృదువు!

మహామాయ : (చిరునవ్వు నవ్వినది.)

సికందర్ : పన్నీరువానలాగ నవ్వుతున్నావు. కన్నులు మూసుకొనే మాటాడుతున్నావు.

మహామాయ: (కన్నులు విప్పి నలుదిక్కుల కలయ జూచినది.)

సికందర్ : ఎంత చక్కనికళ్లు!...నీచూపులు తుపాను జల్లులలాగ నాశరీరంమీద పడుతున్నాయి. నాదేహం జలదరిస్తూంది.

మహామాయ : (దూరాననున్న పర్వతాలవంక చూస్తున్నది.)

సికందర్ : ఏమిటో ఆలోచిస్తున్నావు!

మహామాయ : ఆలోచించలేదు. చూస్తున్నాను.

సికందర్ : ఏమిటి ?

మహామాయ : భవిష్యత్తు!

సికందర్ : గతానాగతాలు చూడడ మెందుకు? సర్వమూ మరిచిపోతాను. నన్ను నీతో మంచుకొండ ల్లోనికి తీసుకుపో. నీరూపం చూస్తూ లోకాన్ని విస్మ రిస్తాను.

మహామాయ : నువ్వు నాతో రావడానికి వీల్లేదు.

సికందర్: నన్ను విడిచి వెళ్లిపోదలచుకున్నావా?

మహామాయ : మరేమి ?

సికందర్ : నువ్విక్కడనుంచి కదలలేవు.

మహామాయ : ఎందు చేత ?

సికందర్ : నువ్వు నాకైదీవి.

మహామాయ : నా అంతట నేనే కోరి మీ సైన్యం దగ్గరకు వచ్చి 'నా జేతికి శృంఖలాలు తొడగండి' అని చెప్పినాను. వారు నన్నీ బోనులో వుంచారు. అంతే గాని నన్నెవరూ కైదీని చెయ్యలేదు.

సికందర్ : అయినా నువ్విపుడు నా అధీనంలో వున్నావు కదా?

మహామాయ : లేను — నన్ను చంపదలచుకొన్నావా?

సికందర్ : (తన చేతిలోని కైజారును వరలో నుంచి) నిన్నా మహామాయా! అంత కఠోరమయినపని చెయ్యగలనా?

మహామాయ : ఇపుడిపుడే చంపుతా నన్నావు!

సికందర్ : అన్నాను. కాని నువ్వు కన్నులువిప్పి చూడగానే నా మనస్సు మారిపోయింది. నీకళ్లలో నుంచి ఏదో తేజస్సు నా హృదయాన్ని తడిపివేస్తూంది. నీవు మాంత్రికురాలవే. నన్ను మంత్రించి వేస్తున్నావు!

మహామాయ : లేదు! లేదు!

సికందర్ : మరి నన్ను నీ స్వరూప మెందు కింత బలంగా ఆకర్షించివేస్తూంది?

మహామాయ : (ఆలోచిస్తూ) అందుకే నన్నిక్కడకు పంపినాడు. ఆహా అంతా కనబడుతూంది!

సికందర్ : నాకు మతంవద్దు. అధికారంవద్దు. కాని నీ సౌందర్యం అనుభవం కావాలి! ఆకన్నులు... ఆ పెదవులు...దగ్గరకు రా! నన్ను నీ దేహాన్ని స్పృశించనీ!

మహామాయ : నా శరీరాన్ని మానవులు స్పృశించలేరు. దూరంగా వెళ్లు!

సికందర్ : నేను మానవుడనుగాను. భగవంతుని ప్రతినిధిని,

మహామాయ : నీకు భగవంతునితో ఏ విధమయిన సంబంధమూ లేదు. భగవంతుని మహోద్యానంలో నీకు తావులేదు. దూరంగా వెళ్లు!

సికందర్ : [కోపముతో] నేను దూరంగా పోవాలికదూ ? నువ్వు నాచేతులోనుంచి తప్పుకో గలవా? నీ పెదవులను, నీ కన్నులను విడిచిపెట్టను.

మహామాయ : (వికటాట్టహాసముతో) నన్ను నువ్వు స్పృశించలేవు!

సికందర్ : (ముందుకు తొందరగా నడిచి ఆమెను పట్టుకొన బోతున్నాడు.)

మహామాయ : (మమతలోవలె) అదుగో! అదుగో! కనబడుతూంది! సర్వనాశనం! సర్వనాశనం!

సికందర్ : నువ్వు దేవకన్యవయినా, పిశాచివయినా, మాంత్రికురాలవయినా యీ రాత్రి నాచేతుల్లోచిక్కిన పక్షివేసుమా! (ముందుకు అడుగువేసినాడు.)

మహామాయ : ఇందుకే నేను వచ్చాను. అదుగో ఆరంభం!! (ఏదో విచిత్రమయిన ధ్వని. ధ్వని క్షణ క్షణము అధికమయినది. ఇంకా అధికమయిపోతున్నది.

దూరమున ప్రతిమలవలె నిలచిన మౌల్వీలు కాజీలు కదలినారు.)

కాదిర్ : ఇంతసేపూ మనమందరమూ నిద్రపోతున్నామా ?

సయన్ : వినండి! వినండి! ఆ ధ్వని!...

సయాన్ : అల్లా! ఎదట పర్వతాలు కదులుతున్న వేమిటి ?

మియాన్ : అవును పర్వతాలు కదలిపోతున్నవి.

కాదిర్ : ఇది భూకంపం కాదుగదా!

సయన్ : అటుచూడండి! సుల్తాన్ ఆమెమీద ఉరక బోతున్నాడు.

కాదిర్ : నాకాళ్ల క్రింద భూమి కదులుతూంది.

అందరూ : అల్లా! అల్లా!

(భూమి కంపిస్తున్నది. మహాధ్వని. చెట్లుగాలిలో ఎగిరిపోయినవి. అవతల కలకలము. ప్రజలు రోదిస్తున్నారు. దూరంగా భవనములు కూలిపోతున్నవి. ఎదట చాల దూరాన పర్వతాలు గజగజ కదలుతున్నట్టు లీలగా కనబడుతున్నది.)

మహామాయ : ముందుకురాకు !

సికందర్ : (ముందుకు వెళ్లబోయినాడు)

(భూమి మహాధ్వనితో రెండుగా చీలినది. మహామాయకూ సికందర్‌కూ నడుమ మహాఖాతం ఏర్పడినది.)

మహామాయ : అధర్మం నశిస్తూంది. అధర్మాన్ని పునాదిగా వేసికట్టిన పట్టణం కూలిపోయింది. సరి ! నాఅవతారంసరి !

(మరల భూమి కంపించినది. భూమి రెండుగా విడినది. భూగర్భములోనికి మహామాయ వెళ్లిపోయినది.

సికందర్ లోడి ఏకాకిగా నిలచినాడు. ఎక్కడా ఎవరూ లేరు. చూపుమేరదూరంవరకు పాడుపడిన పట్టణవీథులు కనబడుతున్నవి.)

(భూగర్భములోనుండి స్త్రీ కంఠము.)

"మృత్యోర్మా మృతంగమయ"

---

# అద్వైతం

శ్రీరంగం శ్రీనివాసరావు

ఆనందం అర్ణవ మైతే,
అనురాగం అంబర మైతే-
అనురాగపు టంచులు చూస్తాం.
ఆనందపు లోతులు తీస్తాం.

నీ కంకణ నిక్వాణంలో,
నాజీవన నిర్వాణంలో-
నీమదిలో డోలలు తూగీ
నాహృదిలో జ్వాలలు రేగీ-
నీతలపున రేకులు పూస్తే,
నావలపున బాకులు దూస్తే-
మరణానికి ప్రాణం పోస్తాం,
స్వర్గానికి నిచ్చెన వేస్తాం.

హసనానికి రాణివి నీవై,
వ్యసనానికి బానిస నేనై-
విషమించిన మదీయఖేదం
కుసుమించిన త్వదీయ మోదం
విషవాయువు లై ప్రసరిస్తే,
విరితేనియ లై ప్రవహిస్తే-
ప్రపంచమును పరిహాసిస్తాం,
భవిష్యమును పరిపాలిస్తాం.

వాసంతసమీరం నీవై,
హేమంతతుషారం నేనై-
నీఎగిరిన జీవవిహంగం,
నాపగిలిన మరణమృదంగం-
చిగురించిన తోటలలోనో,
చితులుంచిన చోటులలోనో-
వలయములై చలించినపుడే,
విలయములై జ్వలించినపుడే-
కాలానికి కళ్లెం వేస్తాం,
ప్రేమానికి గొళ్లెం తీస్తాం.

నీమోపకి కావిని నేనై,
నాభావికి దేవివి నీవై-
నీకంకణ నిక్వాణంలో
నాజీవన నిర్వాణంలో
ఆనందం అర్ణవ మైతే
అనురాగం అంబర మైతే
ప్రపంచమును పరిహాసిస్తాం,
భవిష్యమును పరిపాలిస్తాం.

[A. C Swinburne తనరచనలలో ముఖ్యంగా 'A Match' అనేగీతంలో చూపినమార్గానికి కృతజ్ఞతతో]

---

# కొన్నివిశేషములు

పిశుపాటి విశ్వేశ్వరశాస్త్రి

ఆంధ్రసాహిత్య పరిషద్రజతోత్సవ సంచికలో "ముద్రితాంధ్ర గ్రంథములు" అను వ్యాసములో నేను వ్రాసినట్లు నాకుఁ బ్రమాదములని తోఁచిన మఱికొన్ని విషయముల నిట విమర్శించుచున్నాను.

బ్ర. శ్రీ. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు వ్రాసిన "క్రీడాభిరామము","బసవపురాణ" పీఠికలలోనివియు, బ్ర. శ్రీ. వేదం వేంకటరాయశాస్త్రిగారి "ఆముక్తమాల్యదావ్యాఖ్య" లోనివియు నగు కొన్ని శబ్దములును, అర్థములును ఈ వ్యాసమునఁ జర్చనీయ విషయములు.

"నారికేళబక జాతీయములు"

వ. టిట్టిభ! యవలోకింపు. నారికేళబక జాతీయంబులైన యీ జగజెట్టి కోడిపుంజులు మెడలు నిక్కించుచు నెక్కలల్లార్చుచుఁ గొక్కొక్కొ యని కాల్దువ్వి...ఏకాంగ యుద్ధంబునేసి......

(క్రీడాభిరామము, ౭౬ పా.)

శ్రీప్రభాకరశాస్త్రిగారు పీఠికలో "అసాధారణ ప్రయోగములు" అను శీర్షికక్రిందఁ బైవచనములోని "నారికేళ బక జాతీయంబులు" అను శబ్దమున కీ విధముగా వ్యాఖ్యవ్రాసినారు:

"నారికేళ బకజాతీయంబులు=నారికేళ బకములను కొంగలను బోలినవి. కొబ్బరిచెట్లపై వ్రాలు బకములకు నారికేళబకములని పేరుండఁబోలును. తజ్జాతీయములగు కోళ్లకు కా పే రుండఁబోలును. కేయూరబాహుచరిత్ర. 3 ఆశ్వా. లో నారికేళబక మను కొక్కెర కథ గలదు.

కలిమిఁ దరముగాని వ్యయం
బులు పేరిమ్మలకుఁ జేసి పొలియ రెదుర్బు
ద్ధులు నారికేళబక మను (?)
పులుఁగు దురైశ్వర్యమహిమఁ బొలిసిన భంగిన్." అని

పై వ్యాఖ్యానమంతయును గేవలము ఊహాకల్పితమును, ప్రామాదికముగాను గూడ నున్నది. ఏలయనఁ గోడిపుంజులలో నారికేళజాతి యనియు, బకజాతి యనియు రెండు జాతులు గలవు. పందెములో బకజాతి కోడిని నారికేళజాతికోడి జయించును. కనుక "నారికేళ బకజాతీయంబులు=నారికేళ జాతికి సంబంధించినవియు, బకజాతికి సంబంధించినవియు" అని యర్థము చెప్పవలయును. కేతన దశకుమారచరిత్రలో నీవిషయము స్పష్టముగాఁ గలదు. చూడుఁడు:

"నడుమ నొక బోయపల్లెన్
గడువేడుకఁ గోడిపోరుఁ గనుఁగొనియెడు సం
దడిఁ దఱియఁ జొచ్చి కోళుల
నెడమడువుగ విడుచుచున్న యెడ నిట్లంటిన్.

చరణములు నేత్రములు గడు
నరుణము లారెలును ముక్కు నాయతములు గం
ధరములుఁ దొడలును సన్నము
లరయఁగ బకజాతి కది భయంపడుఁ బోరన్.

ఆరెలు వలములు దొడలును
దోరము బలుమెడయు జుట్టుఁ దుండమ్ముఁ గుఱుచల్
భీరంబును నురమును వి
స్తారి యగు న్నారికేళ జాతికి నెందున్.

ఆనారికేళజాతికి
మానుగ బకజాతి పోర నూర్కొన దనుడున్."

(దశకుమారచరిత్ర, ౯-౨౯-౩౦-౩౧-౩౨.)

"తేఁడు"

"వీఁ డిదె తెల్ల నాకులను
వీడెము సేయుచు వీథి వచ్చుచు
న్నాఁడు మదించి తిండి తిని
నాఁడు సుమీ యిటమీఁద నేడకో

తేఁడఁగఁ బోయెడిక్ గరణ
దేశపుజాణఁడు గాఁగ నోపు నీ
బాఁడు పణోపహార పరి
పాటి యెఱుంగఁగ వచ్చు వీనిచేక్."
(క్రీడాభిరామము, ౫౩ పా.)

ఇట "తేఁడు=వెదకు" అని (పీఠిక ౧౨౧ పా) శ్రీ శాస్త్రిగా రర్థము వ్రాసినారు. కాని తేఁడుధాతువున కీయర్థమును, తన్నిర్ణాయక ప్రయోగములును గాన్పింపవు. ఇదియేగాక యీ పద్యమునఁగూడ వీరు వ్రాసిన యర్థ మేమాత్రమును సందర్భోచితముగా లేదు. శబ్దరత్నాకరములో నీపదమునకు "తెండు, శయనించు" అను నర్థము వ్రాసి

"అతివపూర్ణేందు భీతిఁ దదశ్మశాలఁ
దేఁడి యతఁ డందు నినుమడి తీండ్రఁదోఁప
మింటిపైనుంట కాదని యింటిపైకిఁ
దెన్నుకొంటి నటంచుఁ జెక్కిచ్చు నెడలు."
(ఆముక్తమాల్యద, ౫- ౧౮౬.)

ఉదాహరణముగా నీయఁబడినది. ఈ యర్థమే క్రీడాభిరామ ప్రయోగమునఁగూడ నెంతయు సమంజసముగా నున్నది. ఈ బ్రాహ్మణుఁడు పూఁటకూటింట భుజించి తాంబూలము వేసికొనుచు నెక్కడకో శయనింపఁబోవుచున్నాఁడని యిట భావము. మఱియు

"అనలుని గాఁడుచుం జముని
నాఁడుచు రాక్షసుఁ బాఁచుచుం గప
ర్దినొసలు చూఁడుచుం దనుజు
ప్రేవులుదోఁడుచు గాడ్పుకడ్పులో
గునుకులు గోఁడుచుక్ వరుణు
గుండియఁదేఁడుచు వాహనేంద్రు నం
దినిజన వేఁడుచుక్ నృపతి
సేర్పులుదీడుచు వెండి వాఁడిగక్."
(కళత్స్థవిజయము, ౫-౧౨౩.)

"గుండియఁదేఁడుచుక్ = గుండియయందు శయనించుచు" ఇతరులను బెదరించునప్పుడు 'నీగుండెలలో నిద్రపోవుదును' అనుట వ్యవహారమునఁ గలదు. దానినే యీకవి యిట గ్రహించినాఁడు. మఱియు "తేఁడు" ధాతుసమానార్థక మగు "తెండు"ధాతువునకుఁ గూడ "శయనించు" అను నర్థమే సప్రమాణముగాఁ గాన్పించుచున్నది. పై విషయము లన్నియుఁ బరిశీలించి చూడఁగాఁ గ్రీడాభిరామ ప్రయోగములో శ్రీ శాస్త్రిగారు వ్రాసిన యర్థము సమంజసముగా లేదని తోఁపక పోదు.

"ఆహివెట్టు"

"ఆహివెట్టితి జొన్నగడ్డాగ్రహార
వృత్తి యేనూఱు రూకల వృత్తమునకు."
(క్రీడాభిరామము, ౯౦ పా.)

ఇందు "ఆహివెట్టు=తాకట్టు పెట్టు"అని శ్రీశాస్త్రిగారు (పీఠిక ౧౨౩ పా.) అర్థము వ్రాసినారు. కాం పొరటలో మూలమునఁగూడ నిట్లే యున్నది. కాని "ఆహివెట్టు" అనుపదమే యెక్కడను గాన్పింపదు. కావున నిట "ఆధివెట్టు" అని యుండవలయును. ఆధి శబ్దమునకుఁ దాకట్టు అనునర్థము గలదు.

"బన్ధకం వ్యసనం చేతఃపీడాధిష్ఠాన మాధయః"
(అమరకోశము.)

ఈ క్రింది ప్రయోగములోఁ గూడ "ఆధివెట్టు" పదము గలదు.

"గ్రహణసంక్రమణాదుల రాచనగరఁ
గానుకీసంబు వెడలమి గ్రాసమునకు
నాధివెట్టిరి క్షేత్రంబులందుఁ గొన్ని
లేన్నయుండును గృహభర్తలేని బ్రదుకు."
(మనుచరిత్ర, 3-3౮.)

ఇంక బసవపురాణ పీఠికలో "శబ్దనిశేషములు" అనుశీర్షిక క్రింద నిచ్చిన శబ్దములను, అర్థములను గొంచెము పరిశీలింతము.

"నంజు"

(విటుఁడు) ద్వి. గొఱియఁబట్టుడుఁ దద్దఁ గోపించి చూచి, పరువడిఁ గిన్నర బ్రహ్మయ్య యెదిరి, పట్టకు పట్టకు బసవరాజాన, పట్టినఁ దలఁ దెగఁగొట్టుదు నింక,

నంజుదురే శరణాగతవజ్ర, పంజరంబిదియె మాభక్తుల చేరువ, మనుచు డగ్గఱుదు......(బసవపురాణము, ౫. ౧౫౮ పా.)

ఇట శ్రీ శాస్త్రిగారు "నంజు=సందేహించు" అని యర్థము వ్రాసినారు. కాని "నంజు" అను పదమునకీ యర్థమునఁ బ్రయోగములు కాన్పింపవు. మఱియీ పైప్రయోగమున "అంజు" అనవలయునేగాని "నంజు" అనరాదు. లేనిచో యతిభ్రంశముగూడఁ దటస్థింపఁగలదు. అఖండయతి నుపయోగించినాఁడనుట యనావశ్యక కల్పనము.

"అంజక హృద్గతంబగు మ
హామృగ మారణకారణస్పృహా
పుంజము నెల్వరించెనన
బ్రోవుపకా గురిగెంజ పేరులు..."
(సుదక్షిణా పరిణయము, ౩-౧౩౯.)

అని నిర్ధారకప్రయోగముగూడఁ గలదు. ఇదియేగాక కన్నడ తమిళభాషలలోఁగూడ "అంజు" అనియే కలదు. తుళుభాషలో "అంజుని" అని కలదు. కావునఁ బైవిషయములన్నియును విమర్శించి చూడఁగా నిట "అంజు" అనుటయే యుక్తముగా నున్నది.

"పదరు"

ద్వి. ముదలింపముదలింప ములు వుచ్చి పెద్ద
పదరడ్చినట్లయ్యె నది సెప్పనేల.
(బసవపురాణము, ౪-౨౧౨ పా.)

ఇట శ్రీ శాస్త్రిగారు "పదరు=దబ్బనము?"అని (పీఠిక, ౧౨౦ పా.) సందేహచిహ్నముతో నర్థము వ్రాసినారు. కాని "ముల్లుతీసి కొఱ్ఱుగొట్టినాఁడు" అను వ్యవహారమును బట్టియు,

చ...ముల్లువుచ్చి కొఱ్ఱడిచిన చందమయ్యె...
(మనుచరిత్ర. ౩-౩౮.)

ప్రయోగమును బట్టియు "పదఱు=కొఱ్ఱు" అని యర్థము చెప్పుటయే యుక్తమని నా యభిప్రాయము. మఱియును చిన్నయసూరిగారుగూడఁ దన వ్రాఁత నిఘంటువులో "పదరు=కొఱ్ఱు" అని యర్థము వ్రాసి పై బసవపురాణమునే యుదాహరణముగా నిచ్చినారు. "ముల్లు తీసి దబ్బనము గ్రుచ్చినాఁడు" అని వ్యవహారమున గాని కవిప్రయోగములలోఁగాని లేకుండుటయు "కొఱ్ఱు" అని యర్థము చెప్పుటయే సమంజస మని సూచించుచున్నది.

"క్రొత్తడి"

అతని పరమ సాధ్వి యతివ మాదాంబ
సతతశివాచార సంపన్నధన్య
క్రొత్తడి నెల్లను గొండొక్క పెద్ద
యుత్తమురాలు ధర్మోపేతగాత్రి.
(బసవపురాణము, ౧. ౧౩ పా.)

ఇట శ్రీశాస్త్రిగారు "క్రొత్తడి = స్త్రీసమూహము" అని (పీఠిక ౧౧౭ పా.) యర్థము వ్రాసి దానిని బలపఱుచుటకై "అది పుణ్యచరిత్రకులాగ్రగణ్య క్రొత్తడి సకలంబు......భార. ఉద్యో ౩. ౧౨౪." ప్రయోగము చూపినారు. కాని క్రొత్తడి శబ్దమునకు "౧ పతివ్రత, ౨. మగనాలు, సభర్తృక" అను నర్థములు తప్ప స్త్రీ సమూహమను నర్థముగాని, దానికిఁ దగిన ప్రబల ప్రమాణములుగాని కాన్పింపవు. మఱియును పై బసవపురాణములో "క్రొత్తడులందెల్ల"అని సవరించి "క్రొత్తడులు=మగనాండ్రు, సభర్తృకలు" అని యర్థము చెప్పిన సమంజసముగా నుండును. ఇట్టి సవరణల నెన్నింటినో శ్రీశాస్త్రిగారీగ్రంథమునఁ జేసియేయున్నారు. మఱియు నిటఁగూడ మఱికొన్ని పాఠాంతరము లున్నట్లు శ్రీ శాస్త్రిగారే (ఫుట్‌నోట్సులో) చూపియున్నారు. "క్రొత్తడులు" అనుబహువచన రూపమున క్రింది ప్రయోగము గలదు.

"అత్తలకు మ్రొక్కి తక్కటి
క్రొత్తడు లందఱకుఁ బ్రియము గొనలునిగుడఁగా
నత్తఱిఁ దిలకించె వరవ
ధూత్తమయై సత్యభామ యుజ్జ్వలగరిమన్."
(హరివంశము, ఉత్తర భా. ౮. ౨౨౦.)

ఇక నీయర్థమును బలపఱుచుటకై యిచ్చిన భారత ప్రయోగములో "క్రొత్తడి సకలంబు = స్త్రీ సమూహ మంతయును" అని శ్రీ శాస్త్రిగా రర్థము

చేసినట్లు వారిచ్చిన యుదాహరణభాగమును బట్టి స్పష్టమగుచున్నది. కాని యీ పద్యమునంతయును దిల కించినచో నీయర్థము యుక్తముగాఁ దోఁపదు. చూడుఁడు.

కొడుకులకంటె నయ్యనుఁగుఁ
  గోడలి కెక్కుడు గూర్తుఁ గోడలుం
గొడుకులుసేయు భక్తి కటఁ
  గోటిమడుంగులు భక్తి నాకునె
వ్వఁడు దగఁజేయుచుండు నది
  పుణ్యచరిత్ర కులాగ్రగణ్య క్రొ
త్తడి సకలంబుఁజూడ సభ
  దైన్యముఁబొందుట నూచి పొక్కితిన్."
(భార. ఉద్యో. 3. ౧౮౭)

ఈ పద్యమునకు మూలమునుగూడ నిటఁజూపుచున్నాను:

"సర్వైః పుత్త్రైః ప్రియతరా, ద్రౌపదీ మే జనార్దన.
(సం. భార. ఉద్యో. ౯౦ అధ్యా. ౪౩.)

ఈ విషయమునే తిక్కనకవి చతురముగా "కొడుకులకంటె...చేయుచుండు" అనువఱకుఁ జెంచి వ్రాసినాఁడు.

శ్లో...తథావృత్తా.
సం.భార. ఉద్యో. ౯౦ అధ్యా. ౪౪.
(తథావృత్తా=పుణ్యశీలా. నీలకంఠవ్యాఖ్య.)
ఇది "పుణ్యచరిత్ర" అనుదానికి మూలము.
శ్లో. కులీనా...,, ,, ,, ౪౩.
శ్లో. మహాభిజనసంపన్నా... ,, ,, ,, ౪౫.
ఇవి "కులాగ్రగణ్య" అనుదానికి మూలములు.

"పతిభిః పంచభి శ్శూరై రగ్నికల్పైః ప్రహారిభిః,
ఉపపన్నా మహేష్వాసైః...."౪౬.

ఇందలి భావమునే "సభర్తృక"యను నర్థముగల క్రొత్తడిపదముచేఁ దిక్కన ప్రకటించినాఁడు.

"సర్వే పైక్షన్త కురవః......"౫౧.

ఇది"సకలంబుఁజూడఁగ" అనుదానికి మూలము.

"త న్నాహం దహతి యత్కృష్ణా, సభాయాం కురుసన్నిధౌ, ధార్తరాష్ట్రైః పరిక్లిష్టా..."౫౭.

ఇందలిభావమునే "సభ దైన్యముఁ బొందుట నూచి పొక్కితిన్" అని చెప్పినాఁడు. ఈ విధముగాఁ దిక్కనమహాకవి యనేక శ్లోకములలో వ్యాసమహర్షి చెప్పిన విషయము నొక్క పద్యములో సంగ్రహించినాఁడు. కావున మూలమునుబట్టి చూచినచో శ్రీశాస్త్రిగారి సమన్వయము తిక్కనమహాకవి కనభిప్రేతమనుట స్పష్టమేకదా? పైఁగా సంస్కృతభారతమున స్త్రీలు చూచుచుండఁగా ద్రౌపది సభలో నవమానింపఁబడిన దను విషయమే ప్రకృతఘట్టమున లేదు. పైవిషయములన్నింటినిబట్టి యాలోచింపఁగాఁ బైభారతప్రయోగములోను, బసవపురాణములోనుగూడ "క్రొత్తడి= మగనాలు, పతివత్ని, సభర్తృక" అని యర్థముచెప్పటయే యుక్తమని తోఁచుచున్నది.

* * * *

ఇంక బ్ర. శ్రీ. వేదం వేంకటరాయశాస్త్రిగారి ఆముక్తమాల్యదావ్యాఖ్యలోని కొన్ని శబ్దములను, తదర్థములను బరిశీలింతము.

"కొనకొనఁగొడి"

"చక్రస్తనప్రకాశమునకు ఫేనంపుఁ
  గొంగిడి గొనగొనఁ గోళ్ల గొణఁగి."
(ఆముక్తమాల్యద, ౪-౧౮౩.)

వ్యాఖ్య: (స్రవంతులు) చక్రస్తన...కున్= జక్కవలు అను కుచముల ప్రకటనకై (అనఁగా అవి కనఁబడుటకై) ఫేనంపుఁగొంగు = నురువనెడి పయ్యెంటను. ఇడి=జార్చి. గొనగొనన్ = గొనగొనమని అవ్యక్తముగా. కోళ్లన్ = బొల్లికోళ్ల నుపేరి నీటికోళ్లచేత. గొణఁగి = అస్పష్టముగాఁ బలికి:—

సముద్రుఁడు సరిత్పతియగుటంజేసి నదీ సముద్రములకు నాయికా నాయకభావము. శరన్నదులు ఒక్కొక్కతావున అతనిచిత్తము నాకర్షించుటకై చక్రవాకము లనియెడి స్తనముల ప్రకాశము అతని కనుఁగవం ధనియించునట్లుగా నురువనెడి పయ్యెంటను ఎడలించి

బొల్లికోళ్ల గొనగొనధ్వనులనెడి వ్యాజమున అవ్యక్తము గానేమో గొణుఁగుచు—

అని శ్రీ వేంకటరాయ శాస్త్రిగారు వ్యాఖ్యానము చేసినారు. పైవ్యాఖ్యలో “గొనగొనఁ గోళ్లన్”అనుచో “గొనగొన”అనియు “కోళ్లన్” అనియు రెండు పదములుగా గ్రహించి యర్థము చెప్పినారు. ఈ వ్యాఖ్యానములోఁ గుక్కుట సామాన్య వాచకము కోడిశబ్దమునకు “నీటికోడి”అని కుక్కుట విశేష వాచకత్వము ననవసరముగాఁ గల్పించుటయు, “కొనకొనఁ గోళ్లన్” అనుదానిని “గొనగొనఁ గోళ్లన్” అని గ్రహించుటయు, “కొనకొనఁ గోడి” అను నేకపదమును పదద్వయముగా విభజించుటయును ప్రమాదములని తోఁచుచున్నది. ఈక్రింది ప్రయోగము లీవిషయము నంతను విశదము చేయుచున్నవి, చూడుఁడు.

“...గుండఁగి గొనకొనఁగోడిపికిలి,...
గీ. మొదలుగాఁగల్గు పులుఁగులన్...”
(సుదక్షిణాపరిణయము, 3-౧౫౪.)

“కొనకొనంగోడి యేట్రింత కొంకనక్క
నమలి యీనాలుగిటి దర్శనంబులెస్స.”
(క్రీడాభిరామము, ౧౭ పా.)

(కొనకొనంగోడి=జలకుక్కుటము, బొల్లికోడి) ఈ ప్రయోగములలో “కొనకొనఁ గోడి” అని యేకపదముగా గ్రహింపవలయునే గాని శ్రీ శాస్త్రిగారు గ్రహించినట్లు పదద్వయముగా గ్రహించుటకు వీలులేదుగదా ?

“పొల్లకట్టు”

“సమ్మదదివ్యదృక్ఖచరరక్షఃపిశాచ
పుంజమహీభుక్పతత్త్రి ప్రభంజనములు
సోఁక వెఱఁబాఱెఁ గల్లాన శూర్పవాత
ఘట్టనలఁ బాఱు పెనుఁబొల్లకట్టువోలె”
(ఆముక్తమాల్యద, ౪-౧౩.)

వ్యాఖ్య: గరుడవాహనారూఢుఁడై వచ్చుచున్న శ్రీమహావిష్ణువును—సంతోషముతోఁ జూడఁగోరి యాకాశమునందున్న రక్షః పిశాచసంఘము గరుడుని ఱెక్కలగాలితగులఁగానే భయముచేత—కళ్లానన్ ధాన్యము నుఱిచెడిచోట. శూర్ప...లన్. శూర్ప=చేఁటలయొక్క. వాత=గాలియొక్క. ఘట్టనలన్=దెబ్బలచేత. పాఱు...లెన్. పాఱు=ఎగిరిపోవునట్టి. పెను=పెద్ద. పొల్లకట్టువోలెన్ = తాలుకలయొక్క మొత్తమువలె. పాఱెన్=పలాయితమాయెను.

అని శ్రీశాస్త్రిగారు వ్యాఖ్యవ్రాసినారు. పైవ్యాఖ్యలో శ్రీ శాస్త్రిగారు “పొల్లకట్టు” శబ్దమును “పొల్ల + కట్టు” అని పదద్వయముగా గ్రహించి “పొల్ల=తాలుకలయొక్క. కట్టు=సమూహము.” అని యర్థము వ్రాసినట్లు స్పష్టముగాఁ దెలియుచున్నది. శబ్దరత్నాకరమునఁగూడ “కట్టు” శబ్దముక్రింద “(పొల్లయొక్క) సమూహము” అనునర్థముపై యాముక్తమాల్యదోదాహరణముతోనే యీయఁబడియున్నది. కావుననే శ్రీ శాస్త్రిగారు గూడఁ దదనుసారముగానే యర్థము వ్రాసియున్నారు. కాని కట్టుశబ్దమునకు సమూహార్థము చెప్పుటకుఁ దగిన ప్రమాణములు కాన్పింపవు. మఱియు “పొల్లకట్టు, పొల్ల” అనునవి రెండును సమానార్థకములే. “పొల్లకట్టు=తాలుక” అని యర్థము.

“తుచ్ఛధాన్యాభిధతోఁ చుఁదాలు తాలుక
పొల్లకట్టు తబక పొల్లు పొల్ల”
గీ. తప్పతంకరతూరునా...
(ఆంధ్రభాషార్ణవము, ౨-౨౩౮.)
(ప్రాఁతప్రతిపాఠము.)

ఇక్కడ వావిళ్లవారు ముద్రించిన యాంధ్రభాషార్ణవములో నపపాఠము గలదు. ఇట్టి ప్రమాదములు వావిళ్లవారు ముద్రించిన గ్రంథములలోఁ జాల కలవని “ముద్రితాంధ్ర గ్రంథము”లను వ్యాసములో నిరూపించియున్నాను.

# ఆంధ్రదేశమున యంత్రాలయ పరిశ్రమాభివృద్ధి

## తగిన యవకాశములు ౧

“రావు”

**యంత్రయుగము :**

యంత్రములు క్రీస్తునకు పూర్వముకూడ గ్రీసు, చైనా మొదలగు దేశములలో వాడుకలో నున్నట్లు చరిత్రమూలముగా కనుపించుచున్నది. ఆకాలములో అరిస్టాటలు, ఆర్కిమెడీసువంటి శాస్త్రజ్ఞులు తమ పరిశోధనా చాతుర్యమువల్ల క్రొత్తక్రొత్త యంత్రములు కనిపెట్టినట్లును, వానివలన ప్రజలు కొన్నికొన్ని యుపయోగము లందినట్లును స్పష్టమగుచున్నది. వారి సిద్ధాంతములు నేటికికూడ శాస్త్రాధారములుగా తీసుకొనబడుచున్నవి. అప్పటినుంచి ప్రకృతి రహస్య పరిశీలనము పాశ్చాత్యప్రపంచములో ప్రాబల్యము నందినది.

కాని మొత్తముమీద యెన్ని యభివృద్ధి మార్గముల నన్వేషించినా ౧౮ వ శతాబ్దమువరకు యంత్రాలయ పరిశ్రమలు మాత్రము విరివిగా ప్రారంభింపబడి యుండలేదు. ప్రాత యాచారముల వదలి క్రొత్త పద్ధతుల నవలంబించుటకు ప్రజలు సమ్మతించలేదు. దీని విషయమై యచ్చటచ్చట సంఘర్షణలుకూడ జరిగినవి. ఈ యన్ని విషయములలోను ఇంగ్లాండు కడు సమర్థతతో వ్యవహరించినది. ౧౮౪౮ వ సంవత్సరమునాటికి పరిస్థితులు మార్పుచెందినవి. యంత్రాలయ నిర్మాణమునకు అనుకూలవాతావరణము లభించినది. నాటినుండియే నిజముగా యంత్రయుగము ప్రపంచములో ప్రారంభమైనట్లు చెప్పవచ్చును.

౧౮౪౮ నుండి యొకశతాబ్దమైన పూర్తికాకమునుపే యంత్రములవల్లను, యంత్రాలయ పరిశ్రమలవల్లను పాశ్చాత్యదేశములు అద్భుతమైన ఫలితములను ప్రదర్శింప గలిగినవి. దీనివలన సర్వప్రపంచము విభ్రమము చెందిన దనుటలో ఆశ్చర్యములేదు. యంత్రయుగము నూత్న నాగరకతకు మూలకారణమైనది. విజ్ఞానమునకు మెరుగుపెట్టి శాస్త్రజ్ఞులకు క్రొత్తరుముల చవిచూపినది. సౌభాగ్యమును విస్తరింపజేసి విశ్వమానవ సౌభ్రాత్రమునకు దారిచూపినది. దీని యాదేశానుసారము ప్రవర్తించిన ఇంగ్లాండు, జర్మనీ, ఫ్రాన్సు, అమెరికా మొదలైన సామ్రాజ్యదేశములు, వీనినే యాదర్శముగా భావించి యనుకరించుచున్న జపానువంటి ప్రాచ్యరాజ్యములు అచిరకాలములో అఖండైశ్వర్యములు సంపాదించినవి. ౧౯౧౪ లో పరస్పరవిద్వేషములచే ప్రజ్వలింపబడిన అయిరోపామహాసంగ్రామ కాలమున నీయభివృద్ధికి తాత్కాలికముగా కొంతయాటంకము సంభవించినను, యుద్ధానంతరము ప్రతిచోటను యంత్రాలయములు తిరిగి ద్విగుణీకృతోత్సాహముతో పనిచేసినవి. అంతవరకును వెనుకబడి యున్న రష్యాదేశము సోవియటు ప్రభుత్వముక్రింద పరిశ్రమాలయములు, కర్మాగారములు నిర్మించి పది సంవత్సరముల కాలములో సాటి దేశములం దెల్ల మేటి యనిపించుకొన్నది.

ఈ విధముగా ౧౯౨౫ మొదలు ౧౯౨౯ లోగా పోలండ్ ౩౮%, కనడా ౫౪%, ఫ్రాన్సు ౩౦%, స్వీడన్ ౨౬%, జర్మనీ ౨౨%, అమెరికా ౧౪%, రష్యా ౧౦౦% వంతున సరకుల నంతకుపూర్వముకన్న అధికముగా ఉత్పత్తిచేయ గలిగినవి.—యంత్రాలయ

పరిశ్రమలు లేక యేదేశముకూడ ఆర్థిక సౌష్ఠవమును బడయజాలదని స్పష్టముచేసినవి.

### మన యాంధ్రదేశము :

ఇట్టి యంత్రయుగమునందు నాగరక ప్రపంచములో యితర దేశములకన్న హిందూదేశము సర్వవిధముల వెనుక బడియున్నది. ప్రాచీన గౌరవమును బట్టి ప్రాకులాడు టయేగాని భావిపరిస్థితులగూర్చి తలపోయుటలేదు. రత్నగర్భయని పేరునకు మాత్ర మున్నది—కోట్లకొలది ప్రజలలో గర్భదారిద్ర్యము ఘనీభవించియున్నది. ఇది నేటి మన భరతఖండము.

ఈ యిరువదవశతాబ్దారంభమునుండి కాంగ్రెసు జాతీయోద్యమ సంరంభమువలన దేశములో కొంతవరకు సంచలనము కలిగినది. ప్రజలు మేల్కాంచి స్వశక్తి నెరుగ ప్రయత్నించుచున్నారు. బెంగాలు, బొంబాయి మున్నగురాష్ట్రములు ముందంజవైచి దేశాభ్యుదయము నకు తోడ్పడుచున్నవి.—స్వదేశ పరిశ్రమల నారంభించి స్వధర్మమును నిర్వహించుచున్నవి. కాని మనయాంధ్ర భూమి యింకను సర్వవిషయములందును వెనుకబడియే యున్నది. కారణ మేమి ?

అవకాశములు లేకకాదు—అర్థసంపదలు లేక కాదు—ఆంధ్రులలో తగినంత ఆసక్తి, అభిమానము, పట్టుదల లేనందువల్ల నని భావింపవలసివచ్చుచున్నది. ౧౯౧౩ నుండి ప్రత్యేకాంధ్రరాష్ట్రముకొరకు ఆందోళనచేసినా ఫలితముమాత్రము నేటివరకును పూర్ణానుస్వారమే.

మన యాంధ్రదేశము షుమారు ౭౦ వేలమైళ్ల విస్తీర్ణముగల విశాలదేశము—౧౮౦ లక్షుల సోదరాంధ్రుల నివాసస్థానము — సమస్తవిధమైన పాడిపంట లున్నవి. కాని స్వదేశములో పరిశ్రమాభివృద్ధి, జీవనాధారము లేక మనరాష్ట్రప్రజలు రంగూను, బెంగాలు, మధ్యపరగణాలు మొదలగుచోట్లకు వృత్తులకై పోయి నివాస మేర్పరచుకోవలసివచ్చినది. ఈ విధముగా షుమారు ౧౨౦ లక్షుల జనులు అన్యప్రాంతములలో వలసపోయియున్నట్లు తేలుచున్నది. దీనంతటను మూల కారణము మనవారి యుదాసీనభావమే కాని వేరు కాదు. లేకపోయినచో మన పూర్వపరిశ్రమ లడుగంట వలసినవి కావు—కళాకౌశలము సమసిపోవలసినది కాదు. విజయనగర మహాసామ్రాజ్యమునాటి యఖండవైభవము, కాకతీయులనాటి యైశ్వర్యావిశేషములు నేడు స్వప్నప్రాయముగ నున్నవి. అది యంత్రయుగము కాదు. యంత్రాలయములు నాడు హిందూదేశములోనే కాదు పాశ్చాత్య ప్రపంచమునందుకూడ ప్రారంభింపబడి యుండలేదు. అయినను నాటి మనవారి పరిశ్రమలలోని ప్రావీణ్యము, వాణిజ్యములోని సమర్థత అద్భుతముగా నున్నట్లు విదేశములనుండి వచ్చిన పలువురు శ్లాఘించి యున్నారు. లోహపరికరములు, వస్త్రములు, తివాసీలు, రంగులు, సుగంధద్రవ్యములు, వజ్రములు మొదలగు పలురకములైనవానికి సంబంధించిన పరిశ్రమలలో ననుభవము సంపాదించి తమ హస్తనైపుణ్యమును ప్రదర్శించినట్లు తెలియుచున్నది. అది యానాటి పరిస్థితి.

నేడు వ్యవహారము తారుమారైనది. మనము తయారుచేసిన వస్తువులు విదేశముల కెగుమతిచేయు దినములు గతించి పైదేశములనుండి తెప్పించుకొనవలసి వచ్చుచున్నది. ప్రతి సంవత్సరము కోట్లకొలది ద్రవ్యము విదేశములనుండి వచ్చు వస్త్రములు, ఔషధములు, ఇనుప సామానులు, సబ్బులు, సుగంధ ద్రవ్యములు, కాగితములు మొదలగు వ్రాతవస్తువులు, తదితరమైన వాని నెన్నియో కొనుటకై వినియోగించు చున్నాము. ఇటీవల సర్ యం. విశ్వేశ్వరయ్యగారు తెల్పినట్లు ముడివస్తువులను అన్యదేశముల కెగుమతిచేసి, వానికి బదులు తయారైన సామానుల నచ్చటనుండి రప్పించుకొను రాష్ట్రముగాని, దేశముగాని నిజముగా ఆత్మహత్యను బూనుకొనినదే యగును. మనదేశములో నుత్పన్నమగు ముడిపదార్థములు మన దేశీయ పరిశ్రమాభివృద్ధికై వినియోగపరచి నిరుద్యోగులైన యువకులకు, నిస్సహాయులైన రైతులకు ప్రోత్సాహము నిచ్చుట అపేక్షణీయమేకాక అవశ్యకర్తవ్యము కూడను. దీనికై మనదేశములో ఆధునిక పద్ధతుల ననుసరించి మనకుగల యవకాశముల గ్రహించుట యవసరము.

### యంత్రాలయ పరిశ్రమలు :

ఆంధ్రదేశములో యీక్రింది యంత్రాలయ పరిశ్రమలు నెలకొల్పుట లాభకరము.

౧. పంచదార
౨. అభ్రకము
౩. సబ్బులు
౪. నిప్పుపెట్టెలు-కాగితములు
౫. నూలు, పట్టువస్త్రములు
౬. పొగాకు-సిగరెట్లు
౭. వజ్రములు-మాంగనీసు
౮. సినిమాలు-కర్మాగారములు మొదలైనవి

ఇట్టి యంత్రాలయపరిశ్రమలు విద్యుచ్ఛక్తిసహాయమున నడుపుట మిక్కిలి సులభము. ప్రస్తుతము మద్రాసు ప్రభుత్వముయొక్క అభివృద్ధిశాఖలోని కార్యక్రమమునుబట్టి ౧౯౪౧ నాటికి బెజవాడ, విశాఖపట్నం, పాపనాశనం మొదలగు ఎలెక్ట్రిక్ స్కీములు పూర్తికావచ్చునని తేలుచున్నది. ఈమాత్రమున చాలదు. ఇంకను దేశమంతటనుకూడ ప్రతిగ్రామమునకును విద్యుచ్ఛక్తిచౌకగా లభించునట్లు ప్రయత్నింపవలసియున్నది. ఇప్పటి విధానమునుబట్టి త్వరలోనే యట్టి యవకాశములు కలుగుననుటకును సందేహము లేదు. విద్యుచ్ఛక్తి వలన యంత్రాలయ పరిశ్రమలకును, పరిశ్రమలవలన ఎలెక్ట్రిక్ కంపెనీలకును పరస్పరము లాభదాయకముగ నుండి దేశాభ్యుదయమునకు తోడ్పడును. అట్టి సందర్భమున మనరాష్ట్రమున నాయాపరిశ్రమాభివృద్ధికి గల యవకాశములు గమనింపదగును.

### ౧. పంచదార :

మొదటినుంచి హిందూదేశములో చెరకుపంట విరివిగానున్నదే. బెల్లము, చక్కెర మనదేశీయులు తరచు వాడుచునేయుండెడునారు. అట్టిపరిశ్రమ యడుగంటి ప్రజలు విదేశీ పంచదారపై ఆధారపడవలసిన యవస్థ తటస్థించినది. కాని యిటీవలనే ప్రభుత్వముయొక్క రక్షణచట్టములవలన కాస్త ఆధారము దొరకి స్వదేశపరిశ్రమ కొంచెము తిరిగి తలయెత్తినది.

అయినప్పటికి మనయాంధ్రులు ఇతరరాష్ట్రీయులకన్న యథాపూర్వముగనే వెనుకంజవేయుచున్నారు. కృష్ణ, గోదావరి, విశాఖపట్నం, గంజాంజిల్లాలలో మనకు సమృద్ధిగా చెరకు పండుచున్నను ఆస్కా, సామర్లకోట, ఉయ్యూరు, హాస్పేట పంచదార ఫ్యాక్టరీలు ౪ మాత్రము పనిచేయుచున్నవి. అందును పూర్తిగా స్వదేశీపెట్టుబడిదారుల సహాయమున పనిచేయుచున్న ఉయ్యూరు ఫ్యాక్టరీ యంతసంతృప్తికరముగా నున్నట్టు తోచదు. చక్కెరపరిశ్రమకై ప్రపంచములో షుమారు ౧౦౦౦ పైగా పెద్దపెద్ద ఫ్యాక్టరీలు స్థాపింపబడి పనిచేయుచున్నవి. కాని హిందూదేశము మొత్తమున ౧౪౩ ఫ్యాక్టరీలను, దానిలో మన యాంధ్రదేశమున ౪ ఫ్యాక్టరీలు మాత్రముండుట నిజముగా విచారింపవలసిన యంశము కాదా?

ప్రజ లీ విషయములో తగినంత యుత్సాహము చూపినచో యీ పరిశ్రమ మనరాష్ట్రములో అభివృద్ధి గాంచుటకు చక్కని అవకాశము లున్నవనుట స్పష్టము.

### ౨. అభ్రకము :

విద్యుచ్ఛక్తి విపరీతముగా వ్యాప్తినందుచున్న యీకాలములో అభ్రకముయొక్క విలువను గుర్తింపనివా రెవరు నుండరు. ప్రపంచములో అభ్రకము ఉత్పత్తి చేయుటయందు హిందూదేశము ప్రాధాన్యము వహించినదని చెప్పవచ్చును. మన నెల్లూరుజిల్లానుండి మాత్రము సగటున సాలునకు ౯,౫౯,౬౪౬ పౌనులు ఎగుమతియగుచున్నట్లు తెలియుచున్నది. ఈ జిల్లాలో మైకావ్యాపారము షుమారు ౫౦ సంవత్సరములక్రింద ప్రారంభింపబడి సాధారణముగా యేటా ౧౧ లక్షలకుపైబడి ఆదాయము సంపాదింప శక్తిగలిగియుండెడిది. అట్టి యమూల్యమైన పరిశ్రమ నేడు మనవారి యుపేక్షవలన, ప్రభుత్వముయొక్క నిరాదరణవల్ల క్షీణించి దైన్యస్థితికివచ్చినది. ఇప్పుడు సాలీనా ఆదాయము ౧౧ లక్షలనుండి ౨ లక్షలకు తగ్గి యీ వ్యాపారమువల్ల బ్రతుకుచున్న ౩౦౦౦ పైగల కుటుంబములకు దారిద్ర్యము సిద్ధించినది.

కనుక దీని ప్రాముఖ్యమును గ్రహించి ప్రజలేకాక ప్రభుత్వముకూడ తగినచర్య తీసుకొనుట యావసరము.

### ౩. సబ్బులు:

నేడు పట్టణములలోనే కాక పల్లెలందుకూడ నవీననాగరకతయొక్క చిహ్నముగా సబ్బులు అనుదినము వాడుకలోనికి వచ్చుచున్నవి. ఇవి తయారు చేయు పరిశ్రమాలయములు మనకు లేనందువల్ల పరరాష్ట్రములనుంచి, పరదేశములనుంచి వచ్చు సబ్బులకై సంవత్సరమునకు ౬ లక్షల రూపాయలు వ్యయపరచుచున్నాము. ఇంతకు నిట్టి పరిశ్రమకు వలసిన సదుపాయములు మనకు లేకపోలేదు. కాని ప్రజలయొక్క యాదరణ, పరిశ్రమకు వలసిన సాధనసంపత్తి, అనుభవముగల నిపుణులయొక్క సహాయము సంపాదింప లేకపోవుట మనలోని గొప్పలోపము. అందువలననే యీ శతాబ్దారంభమున బందరుపురమున స్థాపింపబడిన ఫ్యాక్టరీయును, బెజవాడలోని ఆంధ్రా సోప్ ఫ్యాక్టరీయును జయప్రదముగా పనిచేయలేకపోవుట తటస్థించినది. కనుక క్రమపద్ధతులపై పనిచేసినచో యీ పరిశ్రమ మంచిలాభకరముగ నుండుననుటకు సందేహములేదు.

### ౪. నిప్పపెట్టెలు-కాగితములు:

ఇది యొక విచిత్రగాథ. అవకాశములను గుర్తించినను, కార్యనిర్వహణకౌశలము నార్జింపకపోవుటచే కలిగిన లోపమువలన మన రాజమహేంద్రవరములోని ఆంధ్రపేపర్ మిల్లును విరమించుకోవలసివచ్చినది. నిప్పపెట్టెల ఫ్యాక్టరీకి అడుగులోనే హంసపాదు సంభవించినది. మనదేశములో గోదావరి, కర్నూలు, కడప ప్రాంతములగల యడవులలోని కలపను గ్రహించి, యాయాచోట్ల కలపకోయు యంత్రాలయములు (Saw-Mills) నేర్పాటుచేసినచో కలపవ్యాపారమునకు లాభముగా నుండుటయేగాక, దీనివలన నిప్పపెట్టెలు, కాగితముల పరిశ్రమలకు తగినంత ముడిపదార్థములు (Good Pulp etc.) కూడ దొరకుట కవకాశమున్నది. మద్రాసులో విదేశీయులచే నిర్వహింపబడుచున్న వెస్టరన్ ఇండియా మాచ్ ఫ్యాక్టరీ మొదలైనవానిని గమనించియైన మనవారు నేర్చుకొనవలసిన యంశము లెన్నియో యున్నవి. అందుచేతుటులోనున్న యీపరిశ్రమకు ఆంధ్రసోదరుల యభిమాన మత్యవసరము.

### ౫. నూలు, పట్టువస్త్రములు:

పై యన్నివిషయములలో వలెనే దీనిలోకూడ మనకు చక్కని సదుపాయము లున్నవి. అసలు ప్రారంభమునుండి యాంధ్రు లీపరిశ్రమ కలవాటుపడినవారే. రాయలసీమయందును, గుంటూరు జిల్లాలోను ప్రత్తి విశేషముగా దొరకుచున్నది. చేనేత పరిశ్రమకూడ మొత్తముమీద ప్రతిజిల్లాయందును అభ్యాసములోనున్నది. కాని చెప్పుకొనుటకు తగిన యంత్రాలయపరిశ్రమ లేదు. కనీసము మద్రాసురాజధానిలోని మిల్లుపరిశ్రమతో పోల్చిచూచినను మనమెంతయో వెనుకనున్నట్లు క్రిందివిషయములే నిదర్శనములు:

| ప్రదేశము | మిల్లులసంఖ్య |
|---|---|
| కోయంబత్తూరు | ౨౬ |
| మధుర | ౮ |
| మద్రాసు | ౪ |
| కన్ననూరు | ౧ |
| తిరునల్వేలి | ౨ |
| మలబారు | ౩ |
| తిరుచనాపల్లి | ౧ |
| ఆంధ్రదేశము మొత్తంమీద | ౩ |
| మొత్తము మద్రాసురాజధానిలో | ౪౮ |

ఆంధ్రదేశమునగల ౩ మిల్లులలోను కృష్ణానదీతీరమున తాడేపల్లి వద్ద స్థాపించిన ఒకమిల్లు సరిగా పనిచేయలేకపోయినదని యెల్లరెరిగినదే. ఇక మిగిలిన రెండును గోదావరిజిల్లాలోని పందలపాకలో పనిచేయుచున్నవి. ఇట్టి యభివృద్ధి నిరుత్సాహము కలిగించుటలో నాశ్చర్యము లేదు.

### ౬. పొగాకు — సిగరెట్లు:

పొగత్రాగుడు దురభ్యాసములలో చేర్పతగినదైనను పొగాకు పంటను ప్రభుత్వముగాని, ప్రజలుగాని బహిష్కరింపనంతవరకు దానికి సంబంధించిన

పరిశ్రమలగూర్చి విచారించుట సమంజసమే యగును. రానురాను జనసామాన్యమునకు విదేశములనుండి వచ్చు సిగరెట్లు కాల్చుటలో అభిలాష మెండగుచున్నది. ఈ యభ్యాసము మూలమున విదేశములకు లక్షలకొలది ధనము ఏటేటా సమర్పించుచునేయున్నాము. ఉత్పత్తియైన ముడిపొగాకు విదేశముల కెగుమతి చేయుటకు బదులు మనదేశముననే సిగరెట్లు, బీడీలు, నస్యము మొదలగునవి చేయుటకు వినియోగించినచో మనదేశీయుల కెందరికో యిందుమూలమున జీవనాధారము కల్పించినవార మగుదుము. వస్తువులుకూడ చవుకగా లభించుట కవకాశము కల్గును.

౭. వజ్రములు - మాంగనీసు:

మనదేశములో పూర్వము వజ్రములు సాన పెట్టెడువారనియు, వజ్రపుగనులు కలవనియు, వజ్రపు వ్యాపారము విజయనగర సామ్రాజ్య దినములలోను, ప్రతాపరుద్రుని కాలముననువిరివిగా నున్నట్లును గ్రంథ దృష్టాంతము లున్నవి. కర్నూలు, అనంతపురం జిల్లాలలో వజ్రకరూరునందు విస్తారమైన వజ్రపుగను లున్నట్లును విదేశీయులు కూడ పలువురు అభిప్రాయ మిచ్చియున్నారు. ప్రపంచములో ప్రసిద్ధికెక్కిన కోహినూరు వజ్రము మనరాష్ట్రములో గుంటూరు జిల్లాలోని కొల్లూరువద్ద దొరకినట్లు కొందరి యభిప్రాయము. ఏమైనను ఈ పరిశ్రమ విషయమై శాస్త్రజ్ఞుల సలహాల ననుసరించి తగినంత కృషి చేయతగియున్నదనుట నిశ్చయము.

ఈ విధముగనే మాంగనీసు గనులనుండి మాంగనీసు లోహమును తీయువిధానము కూడ అభివృద్ధిపరచుకొనవలసి యున్నది. ఈ లోహము మనహిందూదేశము నుండి ౧౯౨౬-౨౯ లో ప్రతివత్సరము ౧౦ లక్షల టన్నులవంతున విదేశముల కెగుమతిచేయబడుచుండినది. తర్వాత సంభవించిన ప్రపంచార్థికక్లిష్ట పరిస్థితులవల్ల ౧౯౩౨ లో ౨౧౨,౬౦౪ టన్నులు మాత్రము ఎగుమతియైనది కాని ౧౯౩౫ లో అనుకూలవాతావరణము కలిగి తిరిగి ౬౪౧,౪౮౩ టన్నులు పంపగలిగాము. విశాఖపట్నము హార్బరు నిర్మించుటవలన నీవ్యాపారమునకు మరింత ప్రోత్సాహము కలిగినది. విశాఖపట్నం, గంజాంజిల్లాలలో గజపతినగరము, చిట్టివలస మొదలగు ప్రాంతములందు మాంగనీసుగనులు జాస్తిగానున్నట్లు డాక్టరు, సర్ ఫార్మర్ గారు పరిశోధనలు సల్పి తమ నిశ్చితాభిప్రాయముల వెల్లడించియున్నారు.

మాంగనీసు లోహము ప్రపంచములో శ్రేష్ఠమగు ఉక్కును తయారుచేయుట కమితముగా నుపయోగింపబడుచున్నది. దీనియొక్క యుపయోగము మనపూర్వు లిదివరకే గ్రహించినట్లు ప్రత్యక్ష నిదర్శనము లనేకము లున్నవి. అట్టి యీపరిశ్రమను పోషింపవలసిన యగత్యము ఆంధ్రు లెల్లరును గ్రహించుట మంచిది.

౮. సినిమాలు-కర్మాగారములు మొదలైనవి:

సినిమా పరిశ్రమ ప్రస్తుత కాల పరిస్థితులలో ప్రజాభిమానమును బడసి త్వరలో అభివృద్ధికి రాదగిన యవకాశము లెన్నియో యున్నవి. దీనివలన పరిశ్రమదారులకే కాక కళాభిమానులకు, జనసామాన్యమునకు కూడ యెంతయేని లాభమున్నది. జనులలో చక్కని ప్రబోధమును కల్పించుటలో దీనికి మించినది లేదు. ఇట్టి యమూల్యావకాశమును గమనించియే రష్యా, ఇటలీ, జర్మనీ మొదలగు దేశములలో విద్యావిషయక మైనట్టియు, తదితరమైన యుపయోగకరము లగు చిత్రముల గ్రామములలో సహితము ప్రచారమునిమిత్తము తయారుచేయుచున్నారు.

ముఖ్యముగా మన పరాధీనభారతదేశమున కిట్టి పరిశ్రమ యవసరము. ఉత్తర హిందూస్థానములో యిప్పటి కప్పుడే ప్రోత్సాహకరమైన ఫలితములు కన్పించుచున్నవి. మన యాంధ్రరాష్ట్రమును గూర్చి వేరుగ వ్రాయ నవసరములేదు. ఇంతవరకు వెలువడిన చిత్రములు ప్రాథమ్యాసరులకు, ప్రేక్షకులకు కూడ సంతృప్తికరముగ లేనట్లు తేలుచున్నది. చిత్రముల తయారు చేయుటకు మంచి సాధనసంపత్తి గల యొక స్టూడియో యుండవలయుననియు, కళాకౌశలముగల నటబృందము

యొక్కయు, శాస్త్రనిపుణులను టెక్నీషియనుల యొక్కయు సహాయముకూడ అవసర మున్నదనియు నందరు నెరిగినదే. కాని యనుభవములోనికి వచ్చుసరికి వలసినంత ప్రయత్నము తక్కువ—దానినిబట్టియే ఫలితములుకూడ శూన్యము.

ఈ పరిశ్రమాభివృద్ధి కిట్టి సౌకర్యము లున్నవో అదేవిధముగ ప్రతి ముఖ్యపట్నమునందును కర్మాగారములు నిర్మించుట కట్టియవకాశము లున్నవి. యంత్రములు, యంత్రాలయములతోబాటు కర్మాగారములు (Workshops) అనుభవశాలులైన కార్మికులును కావలసియున్నారు. స్వయంపోషణమునకును, స్వతంత్ర నిర్మాణశక్తికిని కర్మాగారములు ముఖ్యసాధనములు. అనుదినము మన పరిశ్రమదారు లుపయోగించు సులభమగు యంత్రసామగ్రి, పరికరములు అచ్చటచ్చటనే తయారుచేసికొనుటకు వీలగును. బియ్యపుమరలు, పిండిమరలు, నీటిపంపులు, గృహోపకరణయంత్రములు, వ్యవసాయపు పనిముట్లు, ముద్రాయంత్రపు సామానులు మొదలగున వెన్నియో విదేశములపై నాధారపడక స్వయముగా చేసుకొనవచ్చును.

ఆంధ్రులెల్ల రిట్టి సందర్భమున నాయావిషయములగూర్చి తగుశ్రద్ధ వహించుట యుక్తము.

**పరిశ్రమాభివృద్ధికి కొన్ని సూచనలు :**

సాధారణముగా యంత్రాలయ పరిశ్రమలయొక్క యవకాశములను, ప్రయోజనములను గుర్తించినప్పటికిని ప్రజ లిట్టిపరిశ్రమల ప్రారంభించుటకు సాహసింపలేకపోవుచున్నారు. ఒకవేళ కొందరు ధైర్యముతో నారంభించినను తుదవరకు జయప్రదముగ నిర్వహింపలేకపోవుచున్నారు. దీని కీ క్రిందిపరిస్థితులే కారణములు :

౧. పరిశ్రమలకు వలసిన పెట్టుబడి లభించకపోవుట

౨. అనుభవము గల శాస్త్రనిపుణుల సహాయముతో కార్యనిర్వహణము చేయకపోవుట

౩. తయారుకాబడిన వస్తువులను పోటీలేక సులభముగా దేశములో విక్రయింపలేకపోవుట

౪. సరియైన ప్రజాక్షేమానము లేకపోవుట.

ఈ వైయంతిరాయములు పోయి యనుకూలవాతావరణము గలుగుటకు ప్రప్రథమమున దేశములో భీమాకంపెనీలు, బ్యాంకులు, పెట్టుబడిసంఘములు వృద్ధికావలెను. ప్రజ లిట్టివానిని పోషించి, బ్యాంకింగు పద్ధతుల నలవరచుకొనవలయును. ప్రభుత్వము దేశీయపరిశ్రమలకు రక్షణ ప్రసాదించి రవాణాసౌకర్యములు వృద్ధిచేయవలయును. అందుపై మంచియనుభవశాలుల సహాయమున నేర్పాటుచేసినచో పరిశ్రమలు బాగుపడుటకు సందేహము లేదు.

దీనికితోడు ఆంధ్రసోదరులెల్లరు ఆంధ్రాభిమానము ప్రదర్శింపవలసిన యవసరముకూడ గుర్తెరింగెదరు గాక !

---

# అవంతికాపట్టణ సౌభాగ్యము

చిత్రములు



౧ సిప్రానది : దానితీరముననుండు దేవాలయములు, సత్రములు, స్నానఘట్టములు



౨ సిప్రానదిగట్టున నొక స్నానఘట్టము



౩ మహాకాళ దేవాలయము



౮ రాణాజీధర్మసత్రము-వందలకొలది సాధువులకు విశ్రాంతిమందిరము



౫ దేవాలయముమీద తిరుగుచుండు పక్షిజాలములకు భక్తులు ప్రసాదములను తినబెట్టుట



౬ అవంతిక చుట్టు ప్రక్కల జీవజాలములు మానవులవలన భయమును వీడి చరించుచుండును. క్షిప్రానదిలోని స్నానాద్యనుష్ఠానవేదికపై లైత్రి కునితో బాటు నిర్భయముగ ప్రాకులాడుచున్న యీ తాబేలు నిదర్శనము

౭ వైరాగ్యమార్గమును బట్టిన పెద్దలకు మహంతు లీవిధముగ తత్త్వోపదేశము చేయుచుందురు





౮ వైరాగ్యసాధనకు భంగీసాధన అవసరమని యీ సాధువుల భావన

# పూర్వోత్తర జన్మాలు

చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి

యీ రెండున్నూ వకదానితో వకటి సంబంధం కలవి. యిందేది లేకపోయినా రెండోది లేదన్నమాటే. ప్రతి భారతీయుఁడూ దీన్ని వుందనుకొనేవాఁడే కాని కొందఱు నేఁటినిబ్యాధికులు యీవిషయాన్ని అలాగ్గా ఖండిస్తూ వుంటారు. నాస్తికులలో యీ విషయాన్ని వొప్పుకోనివా రుండేవారని కొన్ని కారికలవల్ల గోచరిస్తుంది. ఆలాటిదాన్ని వకదాన్ని వుదాహరిస్తాను—

"శ్లో. యావజ్జీవం సుఖం జీవే దృణంకృత్వాఘృతం పిబేత్, భస్మీభూతస్య దేహస్య పునరాగమనం కుతః."

దీని తాత్పర్యం, యీదేహం భస్మమయేవఱకే దీనికి కష్టసుఖాలతో సంబంధం గాని తరవాత ఆలాటి సంబంధం వున్నట్టు ప్రత్యక్షప్రమాణ మేదీ కనపడదు గనక. అంటే? వుత్తరజన్మం. అంటూలేదు కనక నిర్భయంగా ఆహారవిహారాదులలో ప్రవర్తించి సుఖపడవలసిందేగాని పరలోకానికి భయపడి సుఖాన్ని చెడఁగొట్టుకో నక్కఱలేదనియ్యేవే. పాశ్చాత్యులు నాస్తికులైతే కారుగాని పై శ్లోకార్థానికి అనుగుణంగా వారు ప్రవర్తిస్తారు. వారిగాలి సోఁకిన మనవారిలో చాలామంది కూడా అదేవిధంగా ప్రవర్తిస్తారు. యీలా ప్రవర్తించేవారున్నూ ప్రవర్తించడమే మోక్షమన్నట్టుగా బోధించేవారున్నూ పూర్తిగా దైవవంచితులు! సందేహం లేదు—దేవుఁడు లేఁడని చెప్పిన బుద్ధభగవానుఁడుకూడా పూర్వజన్మాన్ని వప్పుకున్నాఁడు. ఆయనకి జ్ఞానోదయ మైనప్పుడు అప్పటికి గతించిన అయిదువందల జన్మలవృత్తాంతం గోచరించినట్టు అతని చరిత్రలోనే వుంది. పూర్వజన్మమంటూ వక్కటేనా వుండడానికి వప్పుకుంటేవుత్తర జన్మం "తాటితో దబ్బనం"గా అప్పుడే సిద్ధంగదా! దానితో పుణ్యపాపానుభవం వగయిరాలు యేలాగా తప్పనివే, వాట్లతోపాటు సర్వశిక్షకుఁడు భగవంతుఁడు యేదో వక పేరుతో యేర్పాటవుతాఁడు. వాఁడికి వకపే రంటూ వుండడానికి వాఁడు యెవఁడికేనా కొడు కై లేకదా? నామకరణం చేయడానికి. ఆత్మ అని కొందఱు, అల్లా అని కొందఱు, గాడ్డు అని కొందఱు ఆయా భాషలలో ఆయాపేళ్లతో వ్యవహరించుకుంటారు. వకజన్మమెుగి, శూద్రుఁడు సుమారు యిప్పటికి యిరవై యైదేళ్లనాఁడు బందరులో అవతరించాఁడు. అతఁడు "డుండుం" అనే పేరుతో ఆపరమేశ్వరుణ్ణి వ్యవహరించేవాఁడు. నేనే కాదు, బందరులోనున్నూ చుట్టుపట్లానున్నూ ఆమహాపురుషుణ్ణి పలువురు చూచి వున్నారు; ఆతనివుపన్యాసాలు వినిన్నీ వున్నారు. నేను చూచునప్పటికి ఆయన వయస్సు యిరవైకి లోపు. అతఁడు సంస్కృతం బొత్తిగా తెలియనివాఁడు, తెలుఁగు యింగ్లీషుతోపాటు ఫస్టుఫారంప్రాంతంలో చదివి అంతతో స్వస్తి చెప్పినవాఁడు. మాటలు పరిశుభ్రంగా వుండేవి కావు గాని అందులో వుండే అర్థగౌరవం మాత్రం శ్రీ శంకర రామానుజాదుల భాష్యాలను మఱిపిస్తూ వుండేది. అతఁడు అద్వైతి, ద్వైతాన్ని గూర్చి మాట్లాడేటప్పుడు ఆమతం లోకం అనేవాఁడు. అంటే, లోకంలో శత్రుమిత్రాది భేదమూ, రాజభృత్యాది భేదమూ, స్త్రీపురుషాదిభేదమూ యేలా పాటింపఁబడుతూవుందో ఆమతంలోకూడా ఆలాగే ఆయా భేదాలు పాటింపఁబడుతూ వుంటాయనిన్నీ, భగవంతుఁ డున్నాఁ డనిన్నీ, భక్తులు సేవిస్తే వారివారికోర్కెలు సఫలం అవుతాయనిన్నీ ఆమతంచెపుతుందికనక ఆమతానికీ లోకానికీఅంతగాని,కొంతగాని వైరుధ్యం లేకపోవడం. ఆమతమే లోకం,లోకమే ఆమతమూ అనుకోవచ్చునని ఆయనతాత్పర్యం. అద్వైతమతస్థులుకూడా యేదో పరమార్థావస్థలోతప్ప పూర్తిగా ద్వైతమతస్థులుగానే వుంటారు. ద్వైతంలో ముక్తులు

నాలుగింటిలోనూ సాలోక్య సామీప్యాలు రెండూ మాత్రమే అంగీకరిస్తారుగాని సారూప్య సాయుజ్యాలు అంగీకరించ రని మాపరమగురువులు సెలవియ్యగా విన్నట్టు జ్ఞాపకం. వారిమతంలో కాకికి ముక్తి రావలసి వస్తే కాకిగానే వుండిముక్తిని పొందవలసిందే. అంటే? ఆజాతిలోనే నల్లదనం పోయి తెల్లదనం రావలసిందే కాని హంసగాగాని మరోలాగగాని మారుతుం దన డానికి వొప్పుకోరు. పరియాకుక్కకు ముక్తివస్తే సీమ కుక్కగా మారుతుం దని దాన్నిబట్టి తెలుసుకోవలసి వుంటుంది. ఆ "దుండుం"గారు విశిష్టాద్వైతాన్ని గురించి మాట్లాడేటప్పుడు ఆమతం "లోకానుకూలం" అనే వారు. అనగా చాలావఱకు ద్వైతంలో వుండే భేదా లన్నీ దానిలోనూ పాటిస్తూనే వుంటారు కనుకనున్నూ "సోహంబ్రహ్మ, బ్రహ్మ సత్యం జగన్మిథ్యా" అంటూ కూర్చోరు కనుకనున్నూ విశిష్టాద్వైతమతం లోకానికి అనుకూలించేభావాలు కలదేగాని వ్యతిరేకించే భావాలు కలది కాదని ఆయన బాగా విపులంగా వ్యాఖ్యానం చేసి చెప్పేవారు. ఆయన చదువుకున్నది యేమీ లేక పోయినా పెద్దపెద్ద యమ్యేలకు, రిటయిరై కూర్చున్న పెద్దపెద్ద జడ్జీలకు ఆయావిషయాలు బాగా తల కెక్కేటట్టు ఆయన బోధిస్తూవుంటే, "యిదెక్కడి ప్రతిభ" అని అందఱికీ ఆశ్చర్యం కలిగేది. ఆయన యేగ్రంథాలూ చదవకపోయినా యెన్నో భావాలు ఆయా మతరహస్య గ్రంథాల్లో వుండేవన్నీ వచ్చేవి, కొన్ని స్వతంత్రభావాలుకూడా వుండేవి. 'జనకుణ్ణిగూర్చి అందఱూ సంసారిగా చెపుతారుగాని అందుకు నా కంగీకారం లే' దని చెప్పేవాఁడు. యింకా యీలాటివి కొన్ని ఆయన స్వంతాలు వుండేవి. గీతపద్యాలు ఆసుగా చెపుతూ ఆయన ఆయాభావాలు వెల్లడించేవాఁడు. ప్రతీ గీత పద్యానికీ తుట్టతుదను "సంగరహితభవ! శ్రీరంగ దాస!" అనేమాట వుండేది. శ్రీరంగ అనేపదం "సిరంగ" అని సవరిస్తే గణభంగం లేకుండా సరిపోతుంది గాని ఆయన వుచ్చారణలో "సిరంగ" అన్నట్టున్నూ, శ్రీరంగ అన్నట్టున్నూకూడా తేలేదికాదు. వుపన్యాసం చెప్పేటప్పుడు తన అభిప్రాయం శ్రోతలకు బోధపడిందో? లేదో? అనే అంశం ఆయన స్వయంగానే గ్రహించి మళ్లామళ్లా వుపన్యసించి బోధపఱిచేవాఁడు. తనకు గురువునుగా దంపులు దంపుకొని జీవించే పల్లెకులస్థురాలు చందమ్మ అనే ఆవిణ్ణి చెప్పే వాఁడు. కాని ఆమె జ్ఞానస్థురా లనే ప్రతీతి ఆబందరులో యెవ్వరున్నూ అప్పుడుగాని యిటీవలగాని యెఱుగరు. ఆయనపేరు రంగయ్య, యిటీవల రంగదాసు. కాని ఆయన ప్రతివాక్యంలోనున్నూ "దుండుం" అని ఆవృత్తి చేస్తూ వుండడంవల్ల అందఱున్నూ "దుండుం"గా రని వ్యవహరించేవారు. ఆయన సుమారు యిరవైయేండ్ల వయస్సులో భౌతిక దేహాన్ని చాలించారు. యింకా యీయన్ని గుఱించిన విశేషాలు వ్రాయవలసివస్తే చాలా వ్రాయాలి, గ్రంథం విస్తరిస్తుంది. యింతకూ చెప్పొచ్చే దేమి టంటే? పూర్వజన్మ మంటూ వకటి లేక, ఆజన్మసంస్కారమంటూ వకటి లేకపోతే యేమీ చదువుకోని శూద్ర పిల్లవానికి యింతటి మహత్తరమైన జ్ఞానం యేలా అబ్బుతుందో? వారువారు విచారించుకోవలసి వుంటుంది. మహాకవిశిరోమణి కాళిదాసంతవాఁడు—"ప్రపేదిరే ప్రాక్తనజన్మవిద్యాః" అని వూరికేనే అంటాఁడా? అయితే యీలాటి ప్రమాణా లెన్ని వున్నప్పటికీ యింకా మాకు ప్రత్యక్షప్రమాణం కావా లనేవారు కొందఱు వుంటారు. వారే—"తెలిసియుఁ దెలియని నరుఁ దెల్ప బ్రహ్మదేవునితరమే" అనేతరగతిలోవారు. ప్రత్యక్షంగా కొందఱు పరలోకానికి వెళ్లివచ్చి చెప్పిన వారున్నూ వుంటారు. యేలా గంటారా? యేదో తీవ్రమైన వ్యాధివల్ల చచ్చి శ్మశానానికి తీసుకువెళ్లినపిమ్మట కదలిక కలిగి బ్రతకడమంటూ యెక్కడో వుంటుంది. ఆ బాపతువాళ్లు కొన్ని సంగతులు ఆలోకానికి సంబంధించినవైతే చెపుతారుగాని వాట్లను విశ్వసించనివారు క్షణంలో ఖండించేస్తారు. అందుచేత ఆబాపతు గాథలు వుదాహరించి గ్రంథాన్ని పెంచక రంగదాసుగారి సంగతి వుదాహరించాను- యింతగా ఆ యీ సంగతి సందర్భాలు వుదాహరించి యీ పూర్వోత్తరజన్మాలని సాధించడ మెందుకంటే? యిది లేదనుకోవడంతోటట్టే

యెంతో చిక్కు తటస్థిస్తుంది. యెన్నో అకార్యాలు చేయడానికి సిద్ధపడవలసి వస్తుంది. కనక ఆస్తికమతం యావత్తూ దీనిమీఁదనే ఆధారపడి వుండకతప్పదు. ఆగామిసంచిత ప్రారబ్ధాలనే కర్మలు వగయిరాలున్నూ వాట్ల అనుభవమున్నూ కూడా దీనిమీఁదే ఆధారపడివుంది. కనక ప్రతీ ఆస్తికమతానికీ యివే పునాదులుగా భావించక తప్పదు. మనగ్రంథాలల్లో సర్వత్రా వీట్లకు సంబంధించినగాథలే కనపడతాయి, కనక విస్తరించవలసివుండదు. యీ భయ మంటూ వున్నప్పుడే మనిషి ప్రవర్తన యుక్తంగా వుంటుంది. అందుకే వీట్లనుగూర్చి భారతాదిగ్రంథాలు పనిగట్టుకొని యీవిధంగా మొఱ పెడుతూవున్నాయి—

"క. ఈ లోకము యసుఁ గొందఱు
కాలోకము కొందఱకు నిహమ్మును బరముల్
మే లగుఁ గొందఱ కధిపా!
యేలోకము లేదునూనె యిలఁ గొందఱకున్.

చ. ధనములు పాలఁ గల్గి సతతమ్మను నింద్రియ వాంఛ సల్పుచున్, మనమున నెన్నఁడున్ సుకృతమార్గముపొంతను బోక లోభమో, హనియతబుద్ధులై తిరుగనట్టిజనుల్ పరలోకసౌఖ్యముల్, గనుటకు నేర రిప్పటిసుఖమ్ములు మే లయి తోఁచు వారికిన్.

మ. ఉపవాసవ్రత సంతతాధ్యయన తీర్థోపాస నాధిక్రియై, కపరత్వమ్మునఁజేసి యైహికము దుఃఖప్రాయమై పోవఁగా, విపులానందముఁ బొందఁగల్గుఁ దుదిఁ నాపియ్యాతమోదైకలో, లుపబుద్ధిన్ జిరపుణ్యశీలురకు నాలోకమ్మునన్ భూవరా!"

యెన్నిటినని వుదాహరించేది? మన గ్రంథా లన్నీ యీలాటిసందర్భాలే బోధిస్తా యంటే చాలు ననుకుంటాను. ఆఖరికి యేశతకంలో పద్యం చదివినా భగవత్సేవ చేసుకుంటూ సత్ప్రవర్తన కలిగి వర్తించ మనే బోధిస్తుంది—

"ఉ. ఎందఱు దేవతల్ చనిరి యెందఱు తాపసులట్టె భ్రష్టులై, రెందఱు రాజు లేఁగిరి మఱెందఱు యోగులు జోగు లైరిగో, విందుని పాదపద్మములు వీడని భక్తిభజింపనేర కా, చందము నొంద కీవు మనసా! హరిపాదము లాశ్రయింపుమా!"

శతకాలే అక్కర్లేదు, ముష్టికి వచ్చేవాళ్లు సామాన్యంగా పాడేపాటల్లోకూడా భగవన్నామస్మరణకంటె మనిషికి తరింపఁజేసే దంటూ మఱొకటి లేదని బోధించే వెన్నో వుంటాయి—

"మాధవుఁ దలఁచే మానసమైతే మానవజన్మం శాశ్వతవలెన్, మదమునఁ జెడి తిరిగేటట్టయితే మహిషంబై జన్మింపవలెన్"

అందఱూ యీలాటివి వింటూనే వుంటారు. పూర్వోత్తరజన్మ లంటూ లేకపోతే భగవదారాధనకు ఫలం లేనేలేదు. అయీ నమ్మిక లేనివాళ్లు కేవలమూ "లంబోదరాయ నమః, ఉదరం పూజయామి" అనే తరగతిలోనే వుండవలసినవాళ్లై దానికోసమై కార్యాకార్యవిచారణ లేకుండా నిర్భయంగా అన్ని పనులూ చేయవలసినవా ళ్లవుతారు. మోక్ష మంటూ వకటి వున్నా అది బహుజన్మకృత తపశ్చర్యాసాధ్యం గానున్నూ, అందులోకూడా యే స్వల్పవ్యక్తులకో గాని ఘటించేది కానట్టున్నూ ఆయా గ్రంథాలవల్ల గోచరిస్తుంది. అందుచేత దానికోసం ప్రయత్నించడం 'అందని మ్రానిపండ్ల కఱ్ఱు సాచడం' వంటిది కాఁబట్టి ప్రతి మనుష్యుఁడున్నూ యీ జన్మంలో తాను వున్నస్థితి కంటె యేకొంచెమో మంచిస్థితిని సంపాదించుకోవడానికి ప్రయత్నించవలసి వుంటుంది. అట్టి ప్రయత్నం పూర్వోత్తరజన్మా లున్నాయనే విశ్వాసం కలవారికిఁ గాని సంఘటించదు. కనక యింతగా వ్రాయవలసి వచ్చింది.

"క. శరదిందుముఖులు చామర
లిరుప్రక్కల వీవ శిబిక లెక్కి మహోన్నం
దరసాధ్వి నోలలాడెడి
నరు లెల్లఁ బురాభవమ్మున న్నీధక్తుల్."

"క. కరులు గలవారు విలస
త్తరుణీసంభోగనియతతారుణ్యమదో

ద్ధురత గలవాఁరు నరవర
పరిచితచరణులును నీదుభక్తులు తల్లీ!"

ఆయీయోగా లేవిన్నీ కేవలనిర్గుణోపాసకుల యినవారి మనస్సును ఆకర్షించలేవు. అట్టినిర్గుణోపాసన కోటి కొక్కరికికూడా సంఘటించదు. కనక దాన్ని గూర్చి మొట్టమొదటనే ప్రయత్నించి కష్టించడం వ్యర్థం. పూర్వోత్తరజన్మ లంటూ వున్నాయనే విశ్వాసం వకటి మనస్సుకు దృఢపడితే వాఁడికి తప్ప కుండా సత్ప్రివర్తన అలవాటు పడినట్టే. వొకప్పుడు విధిలేక వాఁడు అకార్యాన్ని చేయవలసివచ్చినా అది వాఁడిమనస్సుకు శల్యప్రాయంగా వుండి బాధిస్తూనే వుంటుంది. చూడండీ? ధర్మరాజు విధిలేక యుద్ధంలో భీష్మద్రోణాదులను కొంతధర్మవిరుద్ధంగా చంపించవలసి వచ్చినా దానికోసం యెంతో పశ్చాత్తాపపడి యెన్నో అఘనోదనప్రాయశ్చిత్తాలు చేసికొన్నట్టు పంచమ వేదం భారతం తెలుపుతూవుంది. ముస్సోలినీ యేవిధ మైన ఆవశ్యకత్వమూ లేకుండానే కేవలరాజ్యకాంక్షతో అబిసీనియాప్రజలను ఆబాలస్త్రీ వృద్ధంగా విషవాయు ప్రభృతి మారణయంత్రాలకు బలియిచ్చి లేశమన్నా విచారించినట్టేనా కనపడదు. అలాగే జపాను చీనాను గుజెంచినన్నీ. దీన్నిబట్టి చూస్తే కరుణ అనేవస్తువు యూరపుఖండంలో యేమాత్రమూ లాకూడా నిలవడా నికి నీడే లే దని తేలుతూవుంది.. మళ్లా శాంతిక్రియలు, మనలో ఋషులవంటివారు లేకమో అంటే యెందఱో మతబోధకులు వున్నారు. మన మతప్రవర్తకులకంటే కూడా వారికి యెక్కువ ధనసహాయమున్నా, పలుకు బడిన్నీ కూడా వున్నట్టు కనపడుతుంది. అయినప్పటికీ నిర పరాధులైన ప్రజలకు తటస్థమైనకష్టాన్ని వారెవ్వరున్నా వారించనే లేకపోతూ వున్నారు. యిట్టి అన్యాయాలు వారించడానికే పూర్వపు చక్రవర్తులు ఆయుధధార ణాన్ని అంగీకరించేవా రని కనపడుతుంది. అప్పుడు కూడా వృథారాజ్యకాంక్షతో ప్రజాపీడ చేసే దస్యులు లేకపోలేదు. కాని ఆపీడను వారు వారించేవారు. యిప్పు డు పేరుగలరాజ్యాలవాండ్లున్నా రాజ్యసంపాదనా కాంక్షతోటే వుండడంచేత యెవరిమట్టుకు వారే వుపే క్షిస్తూవున్నారు. మనువు చెప్పినట్టు లోకువజంతువు బలవత్తరమైన జంతువుకు ఆహారంగా యేర్పడడమే తుదకు పరమసిద్ధాంత మైపోయింది. పూర్వోత్తరజన్మ సత్తాను వీరు బొత్తిగా అంగీకరించ రనే స్పష్టపడుతూ వుంది. ఇట్టి ఘోరకృత్యాలు చేసేవారికి తగిన నిష్కృ తిని భగవంతుఁడు కలిగించేవాఁడంటూ పెద్దలు చెప్పడం కలదు. అలా కలిగించడంకూడా నూటికి తొంభైపాళ్లు వుత్తరజన్మలోనేకాని యీజన్మలో కాదు.—

"శ్లో. అత్యుత్కటైః పుణ్యపాపైరిహైవ ఫలమశ్నుతే"

అంటూకూడా అభియుక్తోక్తి వకటి వుందిగాని యేమేనా యీఅభియుక్తోక్తి పూర్వకాలంలో అమల్లో వుండేదేమో కాని యీకాలంలో అమల్లో వున్నట్టు కనపడడం లేదు. అందుచేత ప్రపంచకం మఱీ నిర్భీ కంగా నడుస్తూ వున్నట్టు కనపడుతుంది. యిది యెవరి దోషమూ కాదనిన్నీ, యీయుగంయొక్క దోషమే అనిన్నీ కొన్నిగ్రంథాలవల్ల తేలుతుంది. కాని దాన్ని బట్టి యీయుగంవా రంతా అయోగ్యంగా వర్తించవల సిం దని విధి లేదు. "యేమయ్యా! యింత దురన్యా యంగా ప్రవర్తిస్తున్నా?" వంటే? "యీయుగంలో యీలాగే ప్రవర్తించాలి" అనేది జవాబు కాదు. యీలాటిస్థలాలు అర్థం చేసుకోవడానికే పెద్దలసేవ కావాలి. ఆగ్రంథాల్లోనే యీకలియుగాన్ని గూర్చి వ్రాసివ్రాసి— "యీయుగంలో కూడా క్వాచి త్కంగా యోగ్యులు వుండవచ్చు" నని వ్రాసివున్నారు. కృతయుగంలో అయోగ్యులసంఖ్యలాగే కలియుగంలో యోగ్యులసంఖ్య చాలా తక్కువగా వుంటుం దన్నట్టు తేలుతుంది. యోగ్యతాయోగ్యతలకు ప్రభుత్వంద్వా రాగా వచ్చే శిక్షకు భయపడడమే కారణమనుకుంటే అంతమాత్రంతో సరిపోదు. యెంతో పెద్దవుద్యోగాల ల్లో వుండి యెందఱో చక్కట్లు దిద్దఁగలవాళ్లుకూడా అకార్యాలు చేసి ప్రజాపీడ చేయడ మనేది పరలోక భయం లేకపోవడంవల్లనే కాని మఱొకటి కాదు. ప్రభువులుగాని,; వారిచే నియమింపఁబడ్డ వుద్యోగులుగాని సర్వజ్ఞులు కారు. ఆగుణం వొక్క భగవంతునికిన్నీ, వానిచే

నియమింపఁబడ్డ ఆయా అధికార్లకున్నూ మాత్రమే వుంది. వారివల్ల కలిగే కష్టసుఖాలు జన్మాంతరంలో అనుభవించతగ్గవే కాని యిప్పుడు గోచరించేవి కావు కనక పూర్వోత్తరజన్మాలు వున్నాయని నిశ్చయించుకొని తదనుగుణంగా ప్రవర్తించడంకన్న శ్రేయస్సంటూ మరోటి లేదు, లేనేలేదు. యెన్నో మతరహస్యాలు తెలిసినవారే—

"సుకృతం దుష్కృతం చైవ గచ్ఛంత మను గచ్ఛతి" అని వ్రాసి వున్నారు. యీలాటి పెద్దలమాటలెన్నో వంటఁబట్టినతరవాతే యీపద్యాన్ని మేము వ్రాసిందిన్నీ—

"మ. తనజన్మించిననాఁడు తెచ్చికొనెనో? తాఁ బోవునవ్వేళఁ గై,
కొనునో? రెంటికిఁ గాని దెయ్యదియు స్వీయం బంచు మూర్ఖుల్ వచిం,
చిన నే నొప్పను గర్మమొక్కటియసుల్ స్వీయంబు వచ్చున్ జనున్,
దనతో నయ్యది తచ్చరిత్ర మతిచిత్రం బంబ! కామేశ్వరీ!"

నేను యేవ్యాసం వ్రాసినా పూర్వపుచదువును బట్టిన్నీ, పూర్వాచారాలయందుండేవిశ్వాసాన్ని బట్టిన్నీ, పూర్వుల అనుభవాన్ని బట్టిన్నీ తప్ప యిప్పటినవీనుల నూత్న భావాలనుబట్టి లేశమున్నూ కాదు. నాభావాలకిన్నీ యిప్పటివారి భావాలకిన్నీ వుత్తరధ్రువానికిన్నీ దక్షిణధ్రువానికిన్నీ వున్నంత పొత్తుమాత్రమే వుంటుంది. అందుచేత నా అభిప్రాయాలు యిప్పటివారు ఖండించడం బహు తేలిక అని నాకే తెలుసును-దానికి తథ్యంగా దేవదాసీలు గానాభినయసంరక్షణాన్ని పూర్వం నుంచిన్నీ చేసివున్నారనిన్నీ, ఆవిద్యలు సంసారిస్త్రీలకు కూడా లభ్యమైనప్పటికీ నిరాఘాటంగా నిర్లజ్జగా సభలలో ప్రదర్శించడం జరగదనిన్నీ యేవో కొన్నిమాటలు వ్రాసివున్నాను. దానిమీఁద మా ఆకొండివారొకరు వారి భిన్నాభిప్రాయాన్ని ప్రకటించి వున్నారు. వారివ్యాసం కూడా కొంత విపులంగానే వుంది. వారు ఆవ్యాసంలో అనేకాంశాలు చర్చించివున్నారు. సంసారిస్త్రీలు యితరపురుషులతో రంగస్థలాలలో ఆయాపాత్రల కనుగుణంగా యితరనటకులతో నటించడాని కభ్యంతరం లేదని తుట్టతుదకు తేల్చారు. ఆలా నటించి పేరుప్రతిష్ఠలు ఆర్జించిన పతివ్రతలపేర్లుమాత్రం వుదాహరించలేదుగాని అట్టిమోస్తరాండ్రు పలువురు ఈకాలంలో వున్నారనికూడా అంతతోగత్యా సిద్ధాంతీకరించారు. యీమాటను ఖండించవలసివస్తే ఖండించినవాఁడిమీఁద పడే అపాండవం చాలా వుంటుంది. అది విద్యావిషయానికి లోఁబడక లీగల్ చర్యలోకి దిగుతుంది. దానిలో వకస్త్రీని పతివ్రత కాదని అన్నవాఁడివాదమే వోడిపోతుంది. యెందుచేత నంటే? ఆవిషయం ఋజువు చేయడం చాలా కష్టంగదా? అదిన్నీకాక వొకస్త్రీని పతివ్రత అన్నవాఁడియందు లోకానికున్నంత ఆదరం అన్యథాగా అన్నవానియందు వుండదు. అందుచేత నేను మాబంధువుగారు వ్రాసిన అభిప్రాయాల్తోనే యేకీభవించ వలసి వచ్చింది. నా శేషజీవితంలో యేసంసారి స్త్రీయేనా చక్కఁగా గానాభినయాలు రంగస్థలాల్లో ప్రదర్శిస్తూ భర్తయొక్క ఆదరానికి పాత్రురాలుగా కూడా వుండి అత్తమామలకూ, తక్కిన కులస్థులకూ బంధుజాతానికిన్నీ గౌరవించతగ్గదిగా వుండంటే? నాకున్నూ చూచి సంతోషించా లనే వుంది. యితరవిద్యలవల్ల నీత్యనీతులు రెండున్నూ సంప్రాప్తం అయితే కావచ్చునేమో కాని కేవలస్వర ప్రధాన మైన సంగీతంవల్లఁగాని శృంగారభావాలు ప్రధానంగానున్నూ తదితరభావాలు దానికి అంగాలుగానున్నూ ప్రదర్శించడానికి యేర్పడ్డ అభినయంవల్లఁగాని అనీతికే యెక్కువ స్థానం వుందిగాని నీతికి స్థానం కనపడదు. యిప్పటివారు దానిలో నీతికికూడా చోటుం దనేయెడల నేను కాదని వాదించేదిలేదు. సంసారిస్త్రీలక్షణం యేలా వుండాలో "గృహలక్ష్మి" అనే వ్యాసంలో మనపూర్వుల అభిప్రాయానుసారం వివరించివున్నాను. భవభూత్యాదులకన్న మిన్నలయినవా రిప్పు డున్నారనేవిశ్వాసం నాకు లేదు. లేకపోయినా వృథాగా వాదించడంకన్న ప్రతివాదుల వాదంతో యేకీభవించడం పత్రికల కంతగా పని చెప్పకుండా తేలిపోతుంది; కనక దేవదాసీజాతి మనలో వకటి వుండ నక్కఱలేదు. మనయిళ్లల్లో జరిగే శుభశోభనాలల్లో వెంకయ్యగారింట్లో పుల్లయ్యగారిపెండ్లాం వగయిరాలున్నూ, పుల్లయ్యగారింట్లో వెంకయ్యగారి పెండ్లాం వగయిరాలున్నూ వచ్చి మేళతాళాలు చేసి ఆయా సమ్మానాలు స్వీకరించి భర్తలను పోషించడం నాకున్నూ అంగీకారమే. త్వరలో అట్టి మహాభాగ్యం మనకు పట్టవలసిం దని ప్రతివాదులతోపాటు నేనుకూడా భగవంతుణ్ణి ప్రార్థిస్తాను. యీ పూర్వోత్తర జన్మాలను గూర్చి వ్యతిరేకంగా వ్రాసేవారికి కూడా నా విన్నపమింతే!

# టిబెట్టు

మద్దిపాటి... 

మప్పిడి భాస్కర రామారావు

టిబెట్టు మహోన్నతమైన శీతభూమి. హిందూ దేశానికి ఉత్తరంగా వుండడంచేత హిమాలయాలు ఈరెండు దేశాలికి మధ్య "పెట్టనిగోడల్లా" వున్నాయి. హిందువులకు పవిత్రమైన కైలాసపర్వతం, మానససరోవరం ఈదేశానికి పడమరగావున్నాయి. గంగ, సింధు, బ్రహ్మపుత్ర, శతద్రు (సట్లెజ్) మొదలైన నదులు కైలాసపర్వత ప్రాంతాన్నే జన్మిస్తున్నాయి. గౌరీశంకర్ (ఎవరెస్టు), కాంచనగంగ శిఖరాలు వాటి ధవళ మకుటాగ్రాలమీద ఉదయారుణరేఖలు ప్రసరించి నప్పుడు సువర్ణకాంతులను వెదజల్లుతుంటాయి. ఈ ప్రదేశాల్నే గంధర్వులు సంచరించేవారట. అచ్చరలు నృత్యం చేసేవారట. కాళిదాసాది కవులు ఈప్రదేశాల్నే ఉపాధిగా (**background**) నిర్మించుకుని మహాకావ్యాలు వ్రాసేరు. ఇప్పటికీ జ్ఞానపిపాసగల ఎందరో మహాఋషులకు ఉనికిపట్టయివుంది.

హిందూదేశాన్నుంచి టిబెట్టు పోవాలసినయెడల దుర్గమములైన కనుమలద్వారా చేరవలసివుంటుంది. డార్జిలింగ్ నుండి సిక్కిమ్ లోయమీదుగా టిబెట్టుచేర వచ్చు. బౌద్ధమతం ఇతర దేశాలందు వ్యాపించి, చివరికి హిందూదేశం ంచి పలాయనమైనప్పుడు ఈమార్గాలనే పోయి దుర్భేద్యమైన టిబెట్టును ఆశ్రయించింది. చాలా కాలంనుంచి ఈరెండుదేశాలికి రాకపోకలుండడంచేత టిబెట్టులో చాలా హిందూసంప్రదాయాలే కనిపిస్తాయి. పూర్వం ఈదేశాన్ని "త్రివిష్టపం" అని అంటూండేవారు. 'కాంభోజరాజ్యం' కూడ ఈప్రదేశాన్నే అయివుంటుందని చరిత్రకారులు అంటున్నారు.

టిబెట్టు అతి శీతలప్రదేశం కనక పంట లంతగా పండవు. కాని దక్షిణంగావున్న నదిలోయల్లో గోధుమ, బార్లీ మొదలనుధాన్యాలు, ఫలజాతులు పండుతాయి. హిమానీనదాలు కరగడంవల్ల యీనదులందు వేసవిలో కూడా పుష్కలంగా నీరుంటుంది. "యాక్" మృగం టిబెట్టుదేశపు కామధేనువని చెప్పవచ్చు. రాకపోకలలో సామగ్రి మొయ్యడానికి వుపయోగిస్తుంది. దాని పాలు, మాంసం, చర్మంకూడా ఆదేశంవారు ఉపయోగిస్తారు.

టిబెట్టుదేశస్థులు మంగోలియాజాతికి చెందుతారు. బౌద్ధమతావలంబకులు. వారికి మతమంటే అమితమైన గౌరవం, గూఢ విశ్వాసంకూడా. ప్రతి ప్రదేశంలోను భూతాలు సంచరిస్తుంటాయని వారి నమ్మకం. వాటిని పారదోలడానికి 'ఓంమణి పద్మేహం' అను మంత్రోచ్చారణ చేస్తుంటారు. ఈమంత్రం వారి ప్రార్థనయొక్క బీజం. అక్కడ మతగురువుల్ని 'లామా' లంటారు. ప్రధాన మతాధికారి "దలై లామా." అతనే సర్వాధికారి, రాజ్యపరిపాలనయందు కూడా, దలైలామా అంటే టిబెట్టువారికి చాలాగౌరవం. ఒక దలైలామా మరణించిన తరువాత. సర్వాధికారం వహించడానికి తగినలక్షణాలుకల ఒకశిశువును మతాధికారులు వెదకి దలైలామాగా ఎన్నుకుంటారు. మరణించిన దలైలామాయొక్క ఆత్మ ఈశిశువులో ప్రవేశిస్తుందని వారినమ్మకం. ఆరోజునుంచి ఆశిశువుకు మతబోధ, సర్వాధికారానికి అవసరమైన విద్య నేర్పడం మొదలుపెడతారు. దలైలామా టిబెట్టు ముఖ్యపట్టణమైన "లాసా"లో వుంటాడు. లాసాపట్టణం బ్రహ్మపుత్రానది (సాన్-పొ) లోయకు ఉత్తరంగా వుంది. పట్నానికి అన్నివైపుల పచ్చని దేవదారువనాలు, దూరాన్ని మేఘాల్ని మించిపోతున్న తెలనిమంచుకొండలకు అందాలు కూరుస్తుంటాయి.

దలైలామా నివసించే భవనాన్ని "పొటాలా" అంటారు. ఇది ఉన్నతస్థలంమీద కట్టబడివుంది. ౯౦౦ అ. ఎత్తునుండి లండన్ నగరంలోని "సెంటు పాల్స్ కెథీడ్రల్" (St. Paul's Cathedral) కన్న కూడ ౭౦ అ. ఎత్తుగా వుంటుంది. లాసాలో మనదృష్టిని మొదట ఆకర్షించేది పొటాలా భవనమే.

ఇటీవలవరకు ఈనగరంలో తెల్లవారు అడుగు పెట్టలేదు. టిబెట్టువారికి విదేశీయులవారంటే అనుమానం. అందులో తెల్లవారంటే మరిన్నీ. వారిమతాన్ని, దేశాన్ని నాశనంచేసి, దేవతలు సంచరించే ఆప్రదేశాల్ని అపవిత్రం చేస్తారని భయం. పద్దెనిమిదో శతాబ్దాంతాన్ని వారన్ హేస్టింగ్స్ కొంతమంది పాశ్చాత్యుల్ని 'లాసా' పంపేడు, టిబెట్టువారితో మైత్రికోరుతూ. అది అంతగా ఫలించలేదు. తరువాత ౧౯౦౪ లో సర్. ఫ్రేన్సిస్ యంగ్‌హస్బెండ్ నాయకత్వంక్రింద బ్రిటిషుదళం లాసా చేరబోయింది. టిబెట్టుసైనికులు వారిని అడ్డగించేరు. వారి మతగురువులు మంత్రించిన అస్త్రాలచేత, మంత్రప్రభావంచేత బ్రిటిష్‌సైన్యాన్ని రూపుమాపవచ్చు ననుకున్నారు. ఆసాహసంతో ఎదుర్కున్నారు. బ్రిటిష్‌వారు అగ్నివర్షం కురిపించేటప్పటికి వందలకొలది టిబెట్టుసైనికులు హతులై, మిగతావారు చెల్లాచెదరై, కల్‌నల్ యంగ్ హస్బెండుకి దారిఇచ్చేశారు. కల్‌నల్ లాసాచేరి పొటాలా భవనంమీదనుంచి ఒకసాయంత్రం మంచుశిఖరాల అలలలో మునిగిపోతున్న సూర్యుణ్ణి అవలోకిస్తుంటే, తనలో ఏదో హఠాత్తుగా మార్పువచ్చి జ్ఞానసంబంధమైన అనుభవంపొంది తానుచేసిన కార్యానికి చాలాపశ్చాత్తాపపడ్డట్టు అతని అనుభవాలలో వ్రాసుకున్నాడు. అప్పటినుంచి టిబెట్టువారు పాశ్చాత్యులని రానిస్తున్నారు. క్రమంగా వారిలోని మూఢత్వం నశిస్తోంది; పాశ్చాత్యనాగరకతకు తావిస్తున్నారు. ఇప్పుడు డార్జీలింగ్‌నుండి లాసాకు తంతివేసేరు. పొటాలాభవనం విద్యుద్దీపాలతో మెరుస్తూవుం దిప్పుడు. లాసాలో బ్రాడ్‌కాస్టింగ్ (Broad casting) స్టేషనుకూడా నెలకొల్పుతున్నారు, ఇతర రాష్ట్రాల రాజప్రతినిధులకు రాజకీయవార్తలు ముఖ్యపట్టణంనుంచి త్వరలో పంపడానికి. 'సిక్కిమ్' లోయ మీదుగా డార్జిలింగ్‌నుండి లాసాకు మోటారురోడ్డు వేస్తే రాకపోకలకు సులువుగా వుంటుంది.



హిమాలయాలు ఖనిజాలకి ఆటపట్టు. టిబెట్టులో బంగారుగనులు విశేషంగా వున్నాయి. ఇప్పటికీ వారు పురాతనపద్ధతులమీదనే బంగారం తీస్తుంటారు. కాని తగినపరిశోధన జరగలేదు. ఏ కంపెనీ అయినా, టిబెట్టుగవర్నమెంటు అనుమతిని పొంది, బంగారుగనులు వృద్ధిచేస్తే ఉభయులకుకూడ లాభంగా వుండవచ్చు, కాని బ్రిటిష్‌వారు మాత్రం మొదట వ్యాపారస్థులుగా, పిదప రాజ్యకాంక్షులుగా ఉండే స్వభావం మార్చుకోవాలి. ఎందుచేతనంటే టిబెట్టుకి ఇప్పుడు చాలాక్లిష్టమైన సమయం. ౧౯౩౩ సం॥ డిశంబరులో ౧౩ వ దలైలామా చనిపోయేడు. మొన్నమొన్ననే పదునాలుగో దలైలామా దొరికేడు. అతనింకా బాల్యదశలోనే వున్నాడు. అతనికి సర్వాధికారం వచ్చేప్పటికి ౧౫, ౨౦ సంవత్సరాలు పట్టవచ్చు. ఈలోపున రాజ్యపరిపాలన ప్రతినిధులను 'లామా'లే చేస్తారు. టిబెట్టు చైనాకు సామంతరాజ్యం. తూర్పున చైనాజపాన్ సమస్య. ఉత్తరపడమరల సోవియట్ రష్యా ప్రచారం. దక్షిణాన్ని బ్రిటిష్ ఇండియా. ఈమధ్యనవుంది. టిబెట్టుభావిభాగ్యం ఎలా మారుతుందో?

---

# యక్షుని ప్రేమలేఖ

**కాళిదాస – తీర్థులు**

శ్లో. శాపాంతో మే భుజగశయనా దుత్థితే శార్‌ఙ్గపాణౌ
శేషాన్ మాసాన్ గమయ చతురో లోచనే మీలయిత్వా,
పశ్చా దావాం విరహగుణితం తం త మాత్మాభిలాషం
నిర్వేక్ష్యావః పరిణతశరచ్చంద్రికాసు క్షపాసు.

గీ. శేషశయనుండు నిదుర లేచినదినమున - నాకు శాపము తీఱు; నీ నాల్గునెలలుఁ గనులుమూసికొనియొకేనిఁగడపుకొనుము-పిదపమనమిద్దఱముఁగూడివిరహదినములందు గుణియించుకొన్న ఆయాయి కోర్కు--లనుభవింతము లే పిండి యారఁబోసినలలిఁ గాసెడి పండువెన్నెలబయటను - రమణీ! సరసము లగు శరద్రాత్రులందు.

---

# వెంకన్న

'కరుణకుమార'



"చేరగాళ్లు ఎద్దుపగ్గంపట్టుకొని విరవిర లాక్కుపోయారు"

౧

"అయ్యా! రాగయ్యా! శిస్తుపైకం యిప్పించుకొని రమ్మన్నాడయ్యా, రెడ్డి" అని ఉదయం తెల్లవారేవరకు యమకింకరుల్లాగ ఇద్దరు వెట్టివాండ్లు వచ్చి వాకిట నిలబడ్డారు.

రాగయ్య డెబ్బదేండ్లతొక్క. ఇంకా నిద్రమంచంమీదనుంచి లేవనేలేదు.

"ఈ రెండురోజులూ నిదానించండర్రా: పిల్లవాడు ఊరునుంచి వచ్చి, కరణంకాడ లెక్కచూచుకొని పైకం కట్టేస్తాడు" అని మంచంమీద పడుచునే, వణికే కంఠంతో సమాధానం చెప్పాడు రాగయ్య. "రెడ్డి ఒప్పుకోవడం లేదయ్యా! ఇయ్యాల ముడుపు ఇరసాలుఅయి తీరాలె, ఇంక నిలపడానికి లేదంటున్నారు మునసబూ, కరణమూను. పైకం యివ్వకుంటే ఎద్దునిపట్టుకొని రమ్మన్నాడు రెడ్డి" అని వెట్టివాళ్లు ఇద్దరూ చెరొకకర్ర చేతపట్టుకొని, వాకిట్లో నిలబడ్డారు.

'ఎద్దుని జప్తిచేసి తీసుకొనిరమ్మన్నాడు రెడ్డి' అనేమాటలు రాగయ్యచెవిలో పడేవరకు అతనిమనస్సు కలుక్కుమన్నది. అతనికి డెబ్భైయేళ్లు వచ్చినవి. ఇంతవరకెన్నడూ అటువంటి చిన్నతనంమాట అతడు వినిపించుకొనియుండలేదు. సర్కారుకువెయ్యా, పదిహేనువందలూ శిస్తుకట్టే మహామహా పెద్దపెద్దరెడ్లందరికంటె కూడా-చిన్నకాపు అయినా తాను ఒకరిచేత అడిగించుకోవలసిన అవసరం లేకుండా, ఏవాయిదా శిస్తు ఆవాయిదాకు ముందుగానే మునసబుకు చెల్లించి రసీదు తెచ్చుకొనే - బాధ్యత తెలిసిన కాపు అతడు. తనహయాంలో తాను ఒకరికి చెప్పినవాడే కాని ఒకరిచేత చెప్పించుకొన్నవాడు కాదు. కాని ఈ నాటికి చిక్కుపడవలసి వచ్చింది. మునసబు పంపిన ఒక వెట్టివాడిచేత ఈకాలా





12 10

నికి తా నావిధంగా అడిగించుకోవలసి వచ్చింది! పైగా ఎద్దును పట్టుకొని రమ్మన్నాడు రెడ్డి! పోగామిగిలిన ఐశ్వర్యంలో తనవద్ద ఉన్నది— ఇంట బుట్టి పెరిగిన ఈ ఎద్దు ఒక్కటే! ఆఎద్దుజత కొక దున్నపోతు నాధారం చేసుకొని, ఆనాలుగెకరాల కయ్యా ఎట్లాగో సాగు చేసుకొంటున్నాడు రాగయ్య. తన ఏకైకపుత్రుడు రమణయ్యతో సమానంగా పెంచుకొన్నఎద్దు అది. దాన్నే జప్తిచేయాలని తలపెట్టాడు రెడ్డి. ఔరా దుర్దినం! అనుకొన్నాడు రాగయ్య.

అతని కళ్లవెంబడి గిర్రున తిరిగినై నీళ్లు. దొడ్లో గాట కట్టివేసిన ఎద్దు కళ్లల్లో మెదిలింది. ఇంతబ్రతుకు బ్రతికి, బంగారంవంటి ఎద్దును పదిమందిలోనూ జప్తి చేయించుకొంటాడా తాను? అంతకంటె తనశిరస్సు నేల బడిపోవడం మేలుకదూ! అంతకంటె ఆఎద్దును ఏ కసాయివాడికైనా అయినకాడికి తెగనమ్మి సర్కారుశిస్తు సర్కారువారి మొఖాన్న కొట్టడం మేలుకదూ!

రోషం పుట్టేవరకు రాగయ్యకు కళ్లెర్రనైనవి. కనురెప్పలమీద జారిపడ్డ తెల్లని కనుబొమ్మలు పైకెత్తేడు. ముడతలుపడ్డ మొఖంలో ప్రజ్వలించే ఆరెండు నేత్రాల్లోనూ మిగిలిఉన్న రెండుచుక్కలు కింద రాలినై. కనుబొమ్మ లెత్తేవరకు నుదుటిమీద తాచుపాము పిల్లల్లాగ మూడుముడతలు పైకి ఉబికినై.

"ఒరే! పదిగంటలకు పైకం పంపుతానని రెడ్డితో చెప్పండి. అప్పటికి పైకం చేరకుంటే—ఇట్లనే మీ ఇష్టప్రకారం ఎద్దును తీసుకొనిపోవచ్చును. నేను చెప్పానని రెడ్డితో చెప్పం"డన్నాడు రాగయ్య.

వెట్టివాళ్లు వెళ్లిపోయారు.

"ఏందయ్యా! ఎద్దుని తీసుకొనిపొమ్మంటున్నావు?" అని లోపల కుండలుకడిగే భార్య లక్ష్మమ్మ ఈ మాటలు విని, బయటికి వచ్చి భర్త నడిగింది. "సర్కారుకు చెల్లించవలసిన శిస్తు చెల్లించకపోతే అధికార్లు ఊరుకుంటారా? శిస్తు కట్తావా, ఎద్దుని జప్తి చేయుమంటావా అని మునసబు కబురు చేశాడు"అని చెప్పాడు రాగయ్య.

"అయ్యో! ఇదేం పోయేకాలమయ్యా! సర్కారుశిస్తు కట్టకుండా ఎగవేస్తా మనుకొన్నాడా రెడ్డి! అందరూ తనకిమల్లె కలిగినవాళ్లే ఉంటారా లోకంలో? ఒకరోజు ముందూ వెనకా ఉండొద్దా ఎంతవాడికైనా?" అని బుగ్గలు నొక్కుకొని నిలబడింది లక్ష్మమ్మ.

"మునసబుతప్పేముంది? వాళ్ల డ్యూటీప్రకారం వాళ్లుఅడగడం న్యాయమే" అన్నాడు రాగయ్య.

"అందుకని, సాటి కాపువాడయికూడా, వాకిట వెట్టివాళ్లచేత ఎద్దుని జప్తీచేయించడానికి సిద్ధమవుతాడా? ఈరోజు సిద్ధమగుంజలుకూడా ఆపాలం మీద కళ్లచూడినపాపాన్ని పోలేదే! శిస్తు ఎట్లా కట్తా మనుకొన్నాడా మునసీబు?"

"మనరోదన అరణ్యరోదన. ఎందుకు నువ్వు ఆయాసపడుతావు? ఏడితప్పినా సర్కారుముడుపు తప్పదుగుంటా మరి?"

"నువ్వు మొదటినుంచీ ఇట్లాంటినీతులు చెప్పే సంసారం ఇంతకాడికి తెచ్చేవు. నువ్వు శిస్తూ కట్టొద్దు, ముడుపూ కట్టొద్దు. ఊరుకో! పల్లెలికి పోయిన పిల్లోడు రానీ! కరణంకాడికి పోయి లెఖ్ఖడొక్కా చూచుకొని కట్టవలసిఉంటే వాడే కట్టి రసీదు తెచ్చుకొంటాడు."

"అయ్య వచ్చేదాకా అమావాస్య నిలుస్తుందటే పిచ్చిదానా? సర్కారుకు మనములాగా ఏమీ ఉండదనుకో!"

"అయితే నీ మనసొచ్చినట్లు చేసుకో" అని విసుక్కుంటూ లోపలికి పోయింది లక్ష్మమ్మ.

గ్రామమునసబు అక్రమంగా తన పెనిమిటిదగ్గర డబ్బు గుంజుకొంటున్నాడేమోనన్న ఆక్రోశంకొద్దీ మాట్లాడవలసి మాట్లాడిందికాని భర్తమాట కెన్నడూ ఎదురాడేది కాదు ఆ భాగ్యశాలి. భర్తమీదనే ఆజమాయిషీ పెట్టి, తా నింట్లోకి వెళ్లిపోయింది.

## ౨

అప్పటికప్పుడే వారంరోజులకిందట ఎద్దుల బేరగాళ్లు పడమటినుంచి వచ్చి ఆ గ్రామంలో దిగి ఉన్నారు.

రాగయ్యకొడుకు రమణారెడ్డి పొగాకుబేరంమీద ఏటిఅవతల పల్లెల్లోకి పోయి పదిరోజు లయింది. అత డెప్పుడు వస్తాడో! వారానికల్లా తిరిగివస్తానని నమ్మకం చెప్పిపోయిన కొడుకు ఇంకా ఇంటికిరాలేదు. అతడు వచ్చేదాకా సర్కారుశిస్తు నిలుస్తుందా? నిలవకపోతే, పైకం ఎక్కణ్ణుంచి తీసుకొనిరాగలడు రాగయ్య? పదిగంటలకు పైకం చెల్లిస్తానని గ్రామమునసబుకి ఖండితంగా చెప్పిపంపాడు. ఆమాట పొరపాటయితే, ఎద్దుని జప్తీచేయకమానడు మునసబు. ఈ సారి తాను మూడోవాయిదాపైకంకూడా చెల్లించలేనని చెప్పితే, ఇంతవరకూ గ్రామమునసబు తనని ఒత్తిడిచేయకుండా నిలుపుకొని వచ్చాడు. కాని, ఇది ఆఖరువాయిదా! ఇక శిస్తు నిలపడానికి వీల్లేదని రాగయ్యకి తెలుసు. రెండువాయిదాల శిస్తూ, కరణానికివ్వవలసిన జమాబందీ మామూలూ వగైరాలన్నీ కలిసి ఇరవై రూపాయలదాకా చెల్లించవలసి ఉంటుందని కరణం యిదివరకే చెప్పాడు. ఇంట్లో కూటికే చాలీచాలకుండా ఉన్నవి ఈ యేడు పొలంలో పండిన గింజలు. ఏవస్తు వయినా కుదువపెట్టి తెద్దామనుకొంటే, భార్యమెడలో తాళిబొట్టు తప్ప మరొకటి ఏమీ లేదు. పిల్లవాడుగనక ఉంటే ఏమారాజునో అడిగి తీసుకొని వచ్చేవాడు. తాను ముసలివాడు. ఒకరిదగ్గరకు పోయి చేబదు లడగడానికి అభిమానం. అక్కడికీ, షాహుకారివద్దకు పోయి ఒకపాతిక రూపాయలు ప్రోనోటుమీద బదులడిగాడు. కాని, మేజరు అయిన కొడుకూ తనూ ఇద్దరూకూడా చేరి ప్రోనోటు రాసియిస్తే రూపాయివడ్డీకి ఇస్తానన్నా డతడు; కాని హాజరులో తనకొడు కేడీ?

శిస్తుపైకం తాను సర్దుబాటు చేయగల ఉపాయం అతని కేమీ తోచలేదు. అట్టే ఆలోచించాడు. పోనీ, ఎద్దుజతకి కట్టే దున్నపోతును అమ్మివేద్దామని ఆలోచన పుట్టింది. కాని దానిమీద ఏడెనిమిది రూపాయలకంటె జాస్తిగా రాదే! పదిహేను ఇరవైరోజుల నుండీ ఈ సందుకట్లు పిల్లవాడు ఇంటిపొరుగున ఉండడమేలేదు. అందువల్ల పశువులకు సరిగా మేత అమరక, అవి చిక్కి శల్యమైపోయాయి. ఆదున్నపోతు అమ్మబోతే అడివీ, కొనబోతే కొరివీగా ఉన్నది. ఇక ఎటువచ్చీ ఎద్దు ఒకటి ఉన్నది. దాన్ని అమ్మితే అప్పటిధరల్లో ఏనలభయ్యో, ఏభయ్యో ఇస్తారు. అదిగాక అవసరంకొద్దీ కావలెనని అమ్మజూపితే, రూపాయిసొమ్ము అర్ధరూపాయికి అడుగుతారు బేరగాళ్లు. తాను శిస్తు కట్టకుంటే మునసబు ఎటు తిరిగీ ఆయెద్దును జప్తిచేసితీరుతాడు. తన ఇంట్లో అప్పటి కాయెద్దుతప్ప, విలువగల మరొకచరాస్తి ఏమిన్నీ లేదు. ఎద్దును జప్తిచేసి తీసుకొనిపోతే తా నేంచేయగలడు? దాన్ని అయినకాడికి ఏలంలో అమ్మివేస్తే తా నేంచేయగలడు? తనకంఠంలో ప్రాణం ఉండగా, వెట్టివాడు తన ఆవరణలో ప్రవేశించి ఎద్దును పట్టుకొనిపోతూఉంటే తాను చూస్తూ ఊరుకోవడం ఎల్లాగ? అంతకంటె, పోతే పోయింది ఎద్దు, దాన్ని నట్టుగా అమ్మివేసి సర్కారుశిస్తు సర్కారువారి మొఖాన్నకొట్టడం తనకు గౌరవంకదా! తన హయాంలో సంపాదించిన ఆస్తి ఎంత ఖర్చయిపోయింది కాదు? తన తండ్రి యిచ్చిన భూములూ, పశువులూ ఎన్ని నష్టమైపోయినవికాదు? ఇంట పుట్టిన ఎద్దని దీనిమీద మమకారంగాని, లేకపోతే ఈ ఎద్దు ఉండి తనని రక్షిస్తుందా? తన ఐశ్వర్యం అంతా ఎట్లాపోయిందో ఇదికూడా అట్లనే పోయిం దనుకొంటాను— అని ఈవిధంగా పనిచేయడం మొదలెట్టింది రాగయ్యబుర్ర.

రాగయ్య మళ్లా భార్యతోనయినా సంప్రదించలేదు. కాలికిచెప్పులు తొడుక్కొన్నాడు. ఊరివెలుపల మందబయట దిగిన ఎద్దులబేరగాళ్లవద్దకు వెళ్లాడు. వాళ్ల నింటికి పిలుచుకొని వచ్చాడు. ఎద్దును చూపించాడు. ఏభయి రూపాయలకు బేరం ఫయిసలు చేసుకొన్నాడు. డబ్బు చేతిలో వేసుకొన్నాడు. ఎద్దుమెడ పలుపు విప్పి బేరగాళ్ల చేతిలో పెట్టాడు. దుఃఖం ఆపు

కోలేక పోయాడు. బొటబొట ప్రవహించింది కన్నీరు. "నామహాలక్ష్మి పోతున్నదే" అని లక్ష్మమ్మ భోరు మన్నది.

"మనకి ఋణం తీరిపోయింది—ఊరుకో" అని ఆమెకు ధైర్యం చెప్పాడు రాగయ్య.

"పసిబిడ్డని సాకినట్లు సాకాను. దానితల్లికి పుట్టిన దూడలు నాబిడ్డల్లాగే బతకకుండా చచ్చిపోతుంటే తిరపతి వెంకటేశ్వర్లకి మొక్కుకొని, దీనికి వెంకన్న అని పేరుపెట్టుకొన్నాను. నాకు రమణయ్య ఒకకొడుకూ, ఇదొకకొడుకూ అని అనుకొన్నాను— అయ్యా! వెంకన్నా! నాచేతినీళ్లు నీకు ఋణం తీరి పోయిందయ్యా? పోతుండావా? ఇక మళ్లా నాకళ్లకు అగపడవూ? నిన్ను విడిచిపెట్టి నే నెట్లా ఉండేదే ఈకొంపలో? నువ్వు అగపడకుంటే రమణయ్యా కూడు కుడిచి నీళ్లు తాగుతాడా......"అని ఎద్దుమీద చెయ్యి వేసి తెగ ఏడుస్తోంది లక్ష్మమ్మ.

రాగయ్య లోలోపలనే కుమిలిపోతున్నాడు. మొగవాడు తాను. వయస్సుమీరిన అనుభవశాలి. కష్టసుఖాలు తెలుసుకొన్న జ్ఞాని. తనుకూడా ఆడదాని లాగా బెంబేలుపడితే ఎట్లా? "ఋణానుబంధ రూపేణ పశుపత్నీ సుతాదయః" అని పెద్దలు చెప్పేవాక్యం స్మృతికి వచ్చిందతనికి.

"ఈ గొడ్డుమీద నీకెందుకీమమకారం? ఋణం తీర్చుకొని దానిదారిని అది వెళ్లిపోతోంది: నువ్వు ఏడవబోకు" అని భార్యకు ధైర్యం చెప్పి తాను ధైర్యం తెచ్చుకొన్నాడు.

చేరగాళ్లు ఎద్దుపగ్గంపట్టుకొని బరబర లాక్కొని పోయారు.

ఎద్దులేక బావురుమన్న దొడ్డి చూచుకొని లక్ష్మమ్మ మళ్లా బావురుమని దొడ్లోనే ఏడుస్తూ కూర్చున్నది. రాగయ్య ఇంట్లోకి పోయి, చుట్ట చుట్టించి, వాకిలిముంగిట గోడకానుకొని గొంతుకూర్చున్నాడు. దుఃఖభారకంపిత మయిన తన హృదయాన్ని స్వస్థపరుచుకొంటున్నాడు.

కొడుకు రమణయ్య వచ్చి సంగతి తెలుసుకొంటే, తగవులాడుతాడేమోనే అని అతనికి సందేహం కలిగింది. కాని అంతలోనే ధైర్యం తెచ్చుకొంటున్నాడు; నెత్తి మీది బరువును దింపుకొనేనిమిత్తం అమ్మవలసివచ్చిందని చెప్పితే, పిల్లవాడుమాత్రం కాదంటాడా? అని అనుకొన్నాడు.

వీథిలో మళ్లా ప్రత్యక్షమయారు సెట్టివాళ్లు.

"నేను ఎంతపైకం కట్టవలెనో కరణంచేత కాగితం మీద లెక్కవేయించి తీసుకొనిరండి. పైకం యిస్తాను. తయారుగానేవుంది" అని వాళ్లతో చెప్పాడు రాగయ్య.

"కరణమూ రెడ్డీ కచ్చేరిలో కూచునిఉండారు నువ్వే ఆడదాకా వచ్చిపైకం చెల్లించి రాగూడదయ్యా? అని అడిగారు గ్రామనౌకర్లు.

రాగయ్యకు వీథిలో బడి నలుగురి మొఖమూ చూడ్డానికి సిగ్గయింది; గ్రామాధికార్ల సమక్షంలోకి పోవడానికి తలకొట్టినట్లయింది: మనస్సు కిష్టపడలేదు.

"నేను చెప్పానని చెప్పితే కరణం లెక్కతేల్చి యిస్తాడు లేరా. నాకు వంట్లో వుషారుగా లేదు. నేను ఇప్పుడు నడిచిరాలేను. కాగితం రాయించి తీసుకొని రండి. ఇదిగో! పైకం సిద్ధంగా వున్నది" అన్నాడు రాగయ్య.

కరణం లెక్కవేసి, మూడు, నాలుగువాయిదాలకు ఇవ్వవలసిన మాగాణిశిస్తూ, ఉత్తరువు లేకుండా సాగుబడిచేసినందుకు తీర్వజాస్తి నీటి అపరాధమూ, రోడ్డుసెస్సులూ, విద్యపన్నూ, తన జమాబందీ మామూలూ, డి.పి. డబ్ల్యు ఓవర్‌సీరుకి చెందవలసిన మామూలూ, —అమాంబాపతులూ కలిసి రు. ౧౯-౧౨-౦ లకు లెక్క తేల్చి కాగితంమీద వేసి పంపాడు. పైకం సెట్టి వాళ్లపరంగా యిచ్చి పంపివేశాడు రాగయ్య. శిస్తు కట్టగా మిగిలినపైకం రు. ౩౦-౦-౦ లూ పెట్టె తీసి, పెట్టెలో భద్రం చేసుకొన్నాడు.

ఆరోజు పడమట బారెడుపొద్దు తిరిగేవరకూ లక్ష్మమ్మ వంటచేయకుండా ఏడుస్తూనే ఉన్నది.

పొద్దుగూకేసుందు ఇన్ని మెతుకులు కొరికాడు రాగయ్య. ఉదయం తొమ్మిది గంటలకల్లా తోలిపెట్టిన ఎద్దు సాయంత్రందాకా తనకళ్ల బడకుండా వున్నందువల్ల అతనికి మనస్సు ఉండబట్టడం లేదు: పొద్దుగూకిన తర్వాత మందబయటికి పోయి, బేరగాళ్లమందలో కలిసిపోయిన తన ఎద్దును ఒకసారి చూచుకొని మరీ ఇంటికి వచ్చాడు.

ఆరాత్రి వేకువనే బేరగాళ్లు ఎద్దుమందను తోలుకొని పడమటికి వెళ్లిపోయారు.

3

రాగయ్య కడుపున ఏనమండుగురు సంతానం కలిగారు. కాని అతనికి వృద్ధాప్యం వచ్చేవరకు మిగిలిన వాళ్లలోకల్లా కొడుకు రమణయ్య ఒకడున్నూ, కూతురు వెంకమ్మ ఒకతీని. ఆడపిల్ల పెద్దమనిషయి భర్తతో సంసారం చేసుకొంటోంది. రమణయ్య ఇప్పుడు పాతికేళ్లవాడు. ఇటీవలనే మేనమామకూతురిని ఏటిఅవతల వివాహం చేసుకొన్నాడు. కాని ఆపిల్ల ఇంకా పసిది: కాపరానికి రాలేదు.

రాగయ్యతండ్రి చనిపోయేటపుడు పదహారెకరాల మాగాణీ, నాలుగెకరాల పశువుల బీడూ, రెండెకరాలతోటా, దొడ్డీ, కపిలెభావీ, ఇల్లూ, రెండుగాళ్ల ఎద్దులూ, నాలుగు పాడిపశువులూ వగైరా స్థిరచరాస్తులంతా కలిసి ఏడెనిమిదివేలరూపాయల ఆస్తి వప్పచెప్పి చనిపోయాడు. కాని ఆస్తితోకూడా తన హయాంలో చేసిన నాలుగువేల రూపాయల అప్పుకూడా చూపించి మరీపోయాడు. రాగయ్య వయస్సులో ఉండంగా కష్టపడి ఆపదహారెకరాల పొలమూ పండించుకొని దానిమీదవచ్చే ఆదాయంలో, అప్పులవాళ్లకి ఏటా కొంత చెల్లువేసి, అంతా పదిపన్నెండేళ్లలో అప్పులేకుండా చేసుకొని, ఆస్తిని మిగుల్చుకొందామని తాపత్రయపడ్డాడు. కాని, పాపం, అప్పటి కతడు ఒంటరిగాడు. ఇంటిదగ్గర సంసారమూ, పొలంలో సేద్యమూ—ఈ రెంటితో తానొక్కడూ తూగలేకపోయాడు. అదిగాక- చిన్నతనంలోనే తనకు భగవంతుడు సంతానప్రాప్తి కలగజేసినందుకు, ఏ మొగపిల్లవాళ్లయినా, ఒకరిద్దరు బయలుదేరి ఉంటే, ఏదో బర్రెగొడ్డుల నయినా మళ్లవేసుకొని వచ్చేటందుకు ఉపయోగపడేవారు. ఆప్రాప్తంకూడా లేకుండా లక్ష్మమ్మ వరసవరసగా ముగ్గురు ఆడపిల్లలను కనడమూ, వాళ్లల్లో ఇద్దరుపిల్లలు పుట్టిన మూడోనెలలోనే నష్టమైపోవడమూ, ఇప్పుడు వెంకమ్మ మాత్రం మిగలడమూ జరిగింది.

నాలుగువేల రూపాయల అప్పు తీర్చాలంటే సాధ్యమైన పనేనా? అవసరం కొద్దీ, తనతండ్రి ముక్కాలురూపాయీ, రూపాయీ, రూపాయిపావలా-ఈ ప్రకారం బ్రహ్మాండమైన వడ్డీలమీదచేసిన అప్పు. ఈ అప్పుల్లో ఏటా అంతకం తిరిగే ప్రోనోట్లు కొన్నీ, రెండేళ్లకి అంతకం తిరిగేవి కొన్నీ, మూడేళ్లకి తిరిగేవి కొన్నీని. వడ్డీ అసలు కలిసేవరకు, పాపం పెరిగినట్లు, ఇబ్బడికి ఇబ్బడయిపోతోంది అప్పు. ఒకవేళ పొలంమీద వచ్చే గింజలమ్మి, తోటలో పండే మిరపకాయ లమ్మి, ఇంట్లో పెరిగిన కోడెదూడల నమ్మి, పదివరాలు పోసుచేసి బాకీల్లోకి ఏవందో, రెండువందలో చెల్లువేసినప్పటికీ, అసలు అసల్లాగే ఉండడం సరిగదా, వడ్డీలోకికూడా సరిపోవడం లేదు ఆ చెల్లు. దీనికితోడు బాకీదార్లుకూడా అప్పులు కట్టుమని తొందరచేస్తూ వచ్చారు. ఇక ఇది పనిగాదనుకొని తండ్రి గతించిన నాలుగేళ్లకల్లా ఆరువేలదాకా పెరిగిన అప్పుకు సరిపొయ్యే పొలం అయినకాడికి తెగనమ్మి ఋణబాధ అనేది లేకుండా చేసుకోవాలని నిశ్చయపరుచుకొని-పదహారెకరాలలో పది ఎకరాల మాగాణీ, రెండెకరాలతోటా అమ్మివేసి ఋణబాధ పూర్తిగా నివర్తి చేసుకొన్నాడు రాగయ్య. ఇప్పుడు పోగా మిగిలి ఉన్నది నాలుగెకరాల మాగాణికయ్యా, నాలుగెకరాల బీటికయ్యా మాత్రమే.

కష్టపడి చేసుకొంటే మాగాణికయ్యా మంచిదే. కనీసం ఎకరాపుట్టి చొప్పున నాలుగెకరాలూ నాలుగుపుట్లు నమ్మకంగా పండితే సర్కారుకిస్తులూ, సేద్యపు

ఖర్చులూ పోను,తన కుటుంబం మనవర్తికి సరిపోతుంది; పరవాలేదు. కాని రాగయ్య అదృష్టానికితోడు ఇప్పటికి అయిదారేళ్లనుంచి ధాన్యానికి ధర తగ్గిపోవడం సంగతి ఎట్లాఉన్నా, నాలుగేళ్లకిందట కొట్టిన గాలివానసంవత్సరం మొదలు ఎందువల్లనో చెరువుకి సకాలంలో నీరు ఎక్కడమూ లేదు, పంటలు సరిగ్గా పండడమూ లేదు.ఎంత ఎరువు తోలినా,ఎంత సత్తువ చేసినా, రాత్రింబగళ్లు కయ్య విడిచిపెట్టకుండా దాంట్లోనే పండుకొన్నాకూడా, ఎకరానికి పందుం, పన్నిద్దుంగింజలు రాలేవరకు కటకటయిపోతోంది. ఈ ఆదాయం చాలక ఈ మధ్య రమణయ్య పొగాకుబేరం ఒకటి పెట్టుకొని, సేద్యం నాద్యంలేని తీరుబడిరోజుల్లో ఏదో పదిరూపాయల పొగాకు కొని, దాన్ని ఏటి అవతల పల్లెల్లోకి ఎత్తుకొనిపోయి, మారుబేరానికి అమ్ముకొని తన పొట్టగడవగా, నాలుగుపావులు మిగిలితే ఇంటికి చేర్చుకొంటున్నాడు. శరీరకష్టం అంటే అతగాడికి ఒక లెఖ్కలోనిది కాదు. మంచి వయస్సులో ఉన్నాడు. అతనికి తల్లితండ్రి అంటే పంచప్రాణాలూను. ఆ తల్లిదండ్రులుకూడా రమణయ్య అంటే అదేవిధంగానే ఉంటారు.

రమణయ్య నెత్తిన పొగాకుమూట పెట్టుకొని పల్లెల్లోనికి పోయి పదిరోజులు దాటింది. ఒకవేళ ఏటి అవతలికి పోయినా, ఎప్పుడుగాని వారంరోజులకంటె ఎక్కువగా నిలిచేవాడుకాడు. అట్లాంటిది ఈసారి మాత్రం ఎందువల్లనో పదిరోజులు దాటి కూడా ఇంకా ఇంటికి చేరుకోలేదు.

వెంకన్ననమ్మి నాలుగురోజు లయింది: అయిదురోజు లయింది: ఆ రయింది: ఏతత్సంబంధమయిన ఎడబాటు రాగయ్యకీ, లక్ష్మమ్మకీ కూడా పరిపాటయిపోయింది. బిడ్డ రమణయ్య ఇంకా రాలేదేమా అని ముదుసల్లు కొడుకుమీద మరులు నిలుపుకోలేకపోతున్నారు. వెంకన్న విడిచినయింట్లో రమణయ్యఅయినా తిరుగుతుంటే, ఆవృద్ధుల కదొక విధమైన తృప్తీ, ఆనంధమూను.

ఏడోరోజు ఉదయం తొమ్మిది గంటలకు రమణయ్య ఇంటికి చేరాడు. వీధివసారాలో మంచంమీదనే పండుకొని ఉన్నాడు తండ్రి రాగయ్య. లక్ష్మమ్మ దొడ్లో కుండలుకడిగిన నీళ్లు బర్రెగొడ్డుతాగే తొట్టిలో పోస్తున్నది. రమణయ్య అడుగుల చప్పుడు విని, దిగ్గున మంచంమీద లేచి కూర్చున్నాడు రాగయ్య.

“ఈతడవ ఇన్నాళ్లు నిలిచినావేమి నాయనా!” అని ఆప్యాయంగా కొడుకుని అడిగాడు.

“ఏందో ఆలస్యమే అయిందే ఈసారి పోయినవాణ్ణి ఎట్లాగా పోయానుకదా అని మామగారి ఊరికికూడా పోయి, పిల్లవాళ్లని చూచివచ్చా” అన్నాడు రమణయ్య.

కొడుకుమాటల సవ్వడి విని, ఇంట్లోనుంచి వాకిట్లోకి వచ్చింది తల్లి.

“ఏందీ! మామగారింటికి పోయివచ్చావా? అందరూ బాగుండారా?” అని తానుకూడా అడిగింది.

“ఆ! అందరూ బాగానే ఉండారు. మామకాలు ఈమధ్య ఎద్దు తొక్కిందట. పాదంఅంతా మోపుచేసి వారంరోజులుగా ఆయన లేవలేకపోతున్నాడు” అని సమాధానం చెప్పాడు రమణయ్య.

“అయ్యో! మరి ఆసంగతి చెప్పిపంపనే లేదు చూడు, వాళ్లు. పోయి చూచేనా వద్దును ఒకసారి” అన్నది లక్ష్మమ్మ.

“ఇప్పుడు నయమయిందిలే: ఎవడో మంగలివాడిచేత కాలు తోమిస్తుండాడు. ఇప్పుడిప్పుడే కాలు కిందపెట్టి లేచి తిరుగుతున్నాడు.”

“సరే: బాగానే ఉండది” అంటూ లక్ష్మమ్మ లోపలికి వెళ్లిపోయింది.

“ఎండపడింది. కాళ్లూ మొఖమూ కడుక్కొని, చద్దినీళ్లు తాగు నాయనా: చెట్టసడించే ఆముఖం” అన్నాడు తండ్రి.

నెత్తిని చుట్టిన గుడ్డ తీసి మంచంకోడిమీద వేసి, జుట్టుముడి విప్పి, రెండు చేతులా దులుపుకొని మళ్లా ముడివేసుకొన్నాడు రమణయ్య. పళ్లు తోముకోను దొడ్లో వరల బావికాడికిపోయి, ఎద్దు సంగతి జ్ఞాపకానికి రాగా, పసువుల చప్పారంలోకి పోయి చూచాడు. దున్నపోతు మాత్రం గాటకట్టివేసి ఉన్నది. ఎద్దు లేదు. పాలు తాగే బర్రెదూడ పండుకొని నెమరు వేస్తోంది. బర్రె పొలంపోయింది కాబోలు ననుకొన్నాడు. మరి ఎద్దు ఏమయింబా అని సందేహం కలిగింది.

బావికాడ పళ్లుతోముకొని మొఖమూ కాళ్లూ కడుక్కొని ఇంట్లోకి వస్తూ,

"ఎద్దునికూడా పొలం తోలిపెట్టావా ఈపొద్దు" అని తల్లిని అడిగాడు.

"పొలమూ లేదు, వల్లకాడూ లేదు నాయనా" అని నిట్టూర్చింది తల్లి.

"మరిఏమయిందీ ఎద్దు?"

"పసమటి ఎద్దులబేరగాళ్లకి ఏభయిరూపాయలకి అమ్మివేశాడు మీ అయ్య. ఏం చెప్పమంటావు నాయనా?" అని కన్నీరు నించింది పొయ్యికాడ కూర్చున్న తల్లి.

రమణయ్య నసుం కరేలుమన్నది. ఎద్దును అమ్మడమేమిటో అతనికి అర్థం కాలేదు:

వాకిట్లోకి పరుసు పెట్టాడు.

"ఎద్దు నెందుకు అమ్మావే, నాయనా?" అని తండ్రిని అడిగాడు.

"సర్కారు శిస్తుకి రెడ్డి తొందరచేశాడు. నువ్వు సమయానికి ఇంటికాడ లేకపోతివి. నేను ముసలాణ్ణయి లేవలేకపోతిని........."అని ఏమో చెప్పబోయాడు రాగయ్య.

రమణయ్యకు చికా కనిపించింది:

"ఏమిశిస్తే? ఈ యేడు మనకయ్యలన్నీ ఈటుపోయినవి. మన కీయేడు శిస్తు ముజరా ఇస్తారని నాతో చెప్పాడు కరణం. ఇంకా శిస్తు-శిస్తు- దానితల్లికడుపు కాలినశిస్తు—ఇంకా శిస్తు ఎక్కణ్ణుంచి వచ్చిందే" అని పెద్దగా అరిచాడు రమణయ్య.

"నా కేం తెలుసు ఆసంగతి? ఇరవై రూపాయలు శిస్తు కట్టాలి. కట్తావా లేకపోతే ఎద్దుని జప్తీచేయమంటావా అని రెడ్డీ, కరణమూ చేరి వెట్టివాళ్లని ఇంటిమీదికి పంపించారు. న న్నేంచేయుమంటావు చెప్ప?"

"అయితేమట్టుకు; నేను వచ్చేవరకూ నిలవనైనా నిలవకుండా బంగారువంటి ఎద్దును అమ్ముకొంటారటయ్యా? నీ కెవరు చెప్పారే ఈ సలహా?"

"చెప్పాను నాయనా? పిల్లోడు వస్తాడు, రెండు రోజులు నిదానించండయ్యా అని బ్రతిమలాడుకొన్నాను. కాని వాళ్లు మనమాటలు వింటారా చేస్తారా?"

"అయ్యయ్యో: ఎంతపని చేశావయ్యా? నోటికాడకూడు పోగొట్టుకొంటారటయ్యా ఎవరైనాను? నీ కేమంతతొందర వచ్చిందే, నేనురాకుండానే నిక్షేపంవంటి ఎద్దును నాశంచేశావుగదయ్యా" అని కిందకూలబడ్డాడు రమణయ్య.

"మన వెంకన్నకీ, మనకీఋణం తీరిపోయింది నాయనా. బిడ్డనిసాకినట్లు ఎనిమిదేళ్లుసాకాను. ఏంక్రియ? బంగారంవంటి ఎద్దుని అమ్మి పైకం కట్టేదాకా నిలవనిచ్చాడా ఆరెడ్డి? సాటికాపువాడయి తేమట్టుకు, ఏంప్రయోజనం? ఏంచేస్తాం? మనఖర్మ అట్లాతెల్లవారింది." అని కంటనీరుపెట్టుకొంది లక్ష్మమ్మ.

"నీ కెవడు చెప్పాడయ్యా ఈ ఆలోచన? అయ్యయ్యో. బంగారం. బంగారం కాని అది ఎద్దా? ప్రాణంతో సమానంగా సాకుకొన్నానయ్యా దాన్ని. ఆఎద్దు నాధారంచేసుకొని ఆ నాలుగెకరాలకయ్యా చల్లుకొంటున్నాను. నాశనం అయింది గదయ్యా నాఎద్దు" అని రమణయ్య వలవల ఏడుస్తున్నాడు.

"ఊరుకోనాయనా, ఊరుకో. తీరిపోయింది, దానికీ మనకీ ఋణం తీరిపోయింది. నేనూ ఇల్లాగే మన

స్నుపట్టలేక ఈ వారంరోజులూ ఏడ్చాను. ఏంచేస్తాడు మీనాయనమట్టుకు? ఇంతకాలమూ బతికి సెట్టివాళ్లచేత ఎద్దుని యాలంవేయించుకోడానికి, ఆయనకు తలకొట్టిన ట్లనిపించి, ఆఖరికి ఆ యెద్దునయినా అమ్మి, సర్కారు బదనాయం తొలగించుకోవలసివచ్చింది.—లే; ఊరుకో. రమణా! ఊరుకో."

రమణయ్యకు ఎక్కిళ్లు వస్తున్నవి.

"పశువయితే మట్టుకు, పశుజన్మ ఎత్తవలసిందా? అది పసిబిడ్డే. ఒకకొమ్ము మ్మాకించి ఎరుగా? ఒక తోకాడించి ఎరుగా? కాలు జాడించి ఎరుగా?-సాధువంటేసాధువా—అది,ధర్మరాజే! మాటలునేర్చిన గొడ్డు. తిరపతి వెంకటేశ్వరులు మళ్లా మన ఇంట వెలిశాడని సంతోషించాం. మనఇంటబుట్టినదూడ మన ఇంటనే మట్టి అవుతుందనుకొన్నాం. ఇంతకీ దానికి సుఖపడేయోగం లేదు........."

"..................."

"ఆ పడమటివాళ్ల చేతుల్లో పడింది. దాని రాత ఏరాళ్లపాలు గావలసిఉన్నదో? ఏకసాయివాళ్ల చేతుల్లో పడుతుందో?—తలుచుకొంటే, ఊఁ-కడుపు తరుక్కొని పోతుంది నాయనా?......ఇన్నాళ్లు దాని అస్థులూ చర్మమూ మనకి ధారపోసి చాకిరీచేసినందుకు, దానిపట్ల మనం విశ్వాసం చూపించలేకపోయాం. ఏమీ, మనిషిజన్మ అయి పుట్టితేమట్టుకు దాని ఋణం మనం వెయ్యిజన్మాలకయినా తీర్చుకోగలమా?" అని లక్ష్మమ్మ కన్నీరు ఒత్తుకొంది.

మంచంమీద పండుకొన్న రాగయ్య ముక్కు తుడుచుకొని కళ్లు చికిలించాడు.

"నా వెంకన్నా! ఇక నాకు అగపడవా! పదిహేనురోజుల కిందట చూసినచూపే కడసారి చూపా?" అని రమణయ్య బొరుమన్నాడు.

"నీ కేమి పిచ్చా ఏమిటి రమణా? ఊరుకో. ఏం దీ పిచ్చి చేష్టాలు—శుభమల్లె! రెండు రోజులు తాళండయ్యా, పిల్లవాడు వచ్చి మీపైకం మీకు కట్టు తాడని బ్రతిమలాడితే [illegible]



పోసి కొట్టిన ఆరెడ్డినీ కరణాన్నీ అనుకోవాలిగాని— మనం ఎంత ఏడిచి ఏం ప్రయోజనం? లే, చద్దన్నం తిందువుగాని లే. వేళకు తిండీ నీళ్లూ అమరక మనిషివి అసలే బెట్టపడి ఉండావు" అని ఓదార్చింది తల్లి.

రమణయ్యకు దుఃఖంపోయి, దాని స్థానంలో రోషం పుట్టింది. గ్రామాధికార్లు రెండురోజులు నిదానించి ఉంటే తన ఎద్దు తనకి దక్కిఉండునని అతనికి నమ్మకం తోచింది. కరణంమీదా, మునసబుమీదా అతనికి పట్టరాని ఆగ్రహం వచ్చింది. వాళ్లతో తాను తగువులాడలేకపోయినా, వెళ్లి తన అక్కసం తీరేలాగ వాళ్లని మొఖంమీద నాలుగుమాటలూ అనేసి రావాలని అతనికి ఉద్రేకం కలిగింది. ఒళ్లు వేడెక్కింది. ఆ వీరావేశంమీద కూర్చున్న మనిషి గభాలున లేచి—.

"వెళ్లి నాలుగుమాటలూ మొఖంమీద అడిగివస్తానుండు—ఈ మునసబునీ కరణాన్నీని" అని బయల్దేరాడు రమణయ్య.

"అబ్బాయీ! నువ్వేమీ తొందరపడవద్దు. నామాట విను! నువ్వు అధికార్లతో తగవు పెట్టుకొంటే నీకే తగులుతుంది దెబ్బ. నిదానించు. మన ఖర్మకి గ్రామాధికార్లు కర్తలా" అని తండ్రి అడ్డుతగిలాడు.

"నే నేమీ తగవులాడను లేవే? ఆశిస్తేమిటో, ఆలెఖ్ఖ ఏమిటో—లెఖ్ఖయినాచూపించుకొనివస్తాను: మనకిఇంకా ఇరవై రూపాయల శిస్తు ఏడనుండివచ్చిందీ? అంతశిస్తు కట్టవలసినట్లు నాకు జ్ఞాపకంలేదే?" అని బయటికి వచ్చాడు రమణయ్య.

"అబ్బాయీ! నువ్వు అసలే కోపదారి మనిషివి. వాళ్లతో అనవసరంగా తగువులాడక నీపనేమిటో అది చూచుకొనిరా" అని తండ్రి మళ్లా బోధించాడు.

ఎకాయెకీని రమణయ్య గ్రామ చావడికి పోయాడు. కరణమూ, మునసబూకూడా కూర్చుని పైకం వసూలుపనిలోనే ఉన్నారు. ఇంకా ఇతర రైతులు నలుగురైదుగురు కూడా లెఖ్ఖలు చూపించుకొంటున్నారు.

"ఏమయ్యా ! మునసబుగారూ ! మీకు సర్కారు వాళ్లు అధికారం యిస్తేమట్టుకు మాబోటి బీదవాళ్లని గొంతుకు తెగ్గోయమనికూడా అధికారం యిచ్చారా?" అని పెద్దంగా అడిగాడు రమణయ్య.

"గొంతుకు తెగ్గోస్తే ఉరిశిక్ష వేస్తారు సర్కారు" అని ఎగతాళిగా జవాబిచ్చాడు మునసబు.

"అది కాదయ్యా ! మీకు శిస్తుపైకం కట్టవలసి ఉంటే మాత్రం, నేను ఇంటికాడ లేకుండా చూచి ముసలాణ్ణి ఏపించుకొని ఎద్దును అమ్మిస్తారటయ్యా? నువ్వు మాత్రం కాపోడివి కాదూ? నీకుమాత్రం సేద్యం లేదూ? నీకు మాత్రం పసువులు లేవూ?"

"నిజమేరా! ఉన్నాయి. ఉంటే? మీ నాయన్ని ఎద్దుని అమ్మవలసిందని నేను బదనాయం చేశానా?"

"పైకం కట్టకుంటే, ఎద్దుని జప్తీచేస్తానని వెట్టివాళ్లని ఇంటిమీదికి పంపితే, దాని అర్థం ఏమిటి?"

"సర్కారుశిస్తు కట్టకుంటే, జప్తిచేయక ముద్దు పెట్టుకొంటారా?"

"రెండురోజుల్లో నేను వస్తానే ఉంటినే? అంతమాత్రంనిదానిస్తేసర్కారువాళ్లుపీకి తెగ్గోస్తారా ఏందయ్యా?"



"ఏమయ్యా ! మునసబుగారూ! మీకు సర్కారువాళ్లు అధికారం యిస్తేమట్టుకు మాబోటి బీదవాళ్లని గొంతుకు తెగ్గోయమనికూడా అధికారం యిచ్చారా?"

"ఎవరిమట్టుకు వాళ్లు వాయిదాలు వేస్తుంటే ఇక పని జరిగేది ఎట్లా?"

"నాశనం చేశారు గదయ్యా, మీరంతా చేరి, ఎద్దును: మాబోటి బీదోళ్లని ఇట్లా ఏడిపిస్తే మీబోటి గొప్పోళ్లకి మేలు లేదయ్యా. ఆ ఒక్క ఎద్దూ అట్లా అన్యాయం అయిపోయిందే, ఇక నేను దేనితో సేద్యం చేసుకొనేదో మీరే చెప్పండయ్యా?" అని అక్కడ ఉండిన నలుగురు రైతులకేసిచూచి దీనంగా అడిగాడురమణయ్య.

రమణయ్య అమాయకత్వానికీ, అతని నిష్కాపట్యానికీ అక్కడ చేరిన రైతులకేగాక, మునసబుకీ, కరణానికీకూడా నవ్వు వచ్చింది.

"నవ్వుతా రెండుకయ్యా? ముసలాడిదగ్గర ఇరవై రూపాయలు గుంజుకొన్నారట. అంతశిస్తు ఏడనుంచి వచ్చిందయ్యా రెడ్డిగారూ?" అని అడిగాడు రమణయ్య.

"ఆసంగతి కరణాన్ని అడిగి లెఖ్ఖ చూపించుకో" అన్నాడు రెడ్డి.

"ఏమయ్యా కరణమయ్యా! నువ్వు ఏటా అయిన కాడికి మాదగ్గర జమాబందీమామూలనీ, వల్లకాడు మామూలనీ ఊడేస్తూనే ఉంటివి. ఇప్పుడింత శిస్తు ఏడనుంచి వచ్చిందీ?" అని కరణాన్ని అడిగాడు.

కరణం చిరునవ్వు నవ్వాడు.

"నీమాగాణికయ్య నాలుగెకరాలకీ ఇరవై రెండు రూపాయలు మాగాణిశిస్తు ఇవ్వబనిలేదట్రా?"

"రామరామ! ఈ ఏడు ఆపొలంలో చిట్టెడుగింజలు కళ్లచూచింది లేదే? వొట్టితాలూ జొండూ కోసుకొని తెచ్చుకొంటిమే! నువ్వు తణిఖీ చేసికూడా వస్తివే! పండలేదని రాసి, శిస్తు ముజరా యిప్పిస్తానని చెప్పితివి గదయ్యా!"

"చెప్పినమాట నిజమే. నీనంబరులో మూడున్నర ఎకరాలో పైరు పోయిన మాట నిజమే. కాని మిగిలిన అరఎకరా పండిందికదూ?"

"నాలుగెకరాల కయ్యలో ఒక అరఎకరా పండితే పూర్తిశిస్తు కట్టవలసిందేనా?"

"ఆహా!"

"ఇదేమి ఘోరమయ్యా?"

"కొరవ నెంబర్లకి శిస్తు ముజరా ఇవ్వర్రా సర్కారువారు."

"ఆకొరవమాత్రం ఏమిపండిందయ్యా? కూలి ఖర్చులకే చాల్లేదు ఆనలుతుము గింజలున్నా."

"అందుకనే నేనూ ఇన్‌స్పెక్టరూ వేయడంలో నీనెంబరంతా కలిసి సగటున ఒక అణాఫలితంమాత్రమే వేశాం. కాని తహశీల్‌దారు ఒప్పుకోలేదు. నాలుగెకరాల్లోనూ అరఎకరాలో పైరు వెన్నుదీసి కొత్త నదరుగా అగపడేవరకు ఆయన సరాసరి రెండణాల ఫలితం వేశాడు. దానితో అంతా తుడిచిపెట్టుకొనిపోయింది."

"రెండణాలఫలితం పండితే ముజరా ఇవ్వరా?"

"ఇవ్వరు రెండణాలకు లోపలనే ఉండాలి ఫలితం. అదిగాక నీ పొలానికి ఆజుబాజులో ఉండే కయ్యలన్నీ సుమారుగా పండినట్లు తహశీల్‌దారు రాసుకొనిపోయాడు. నీ పక్కభూములు పండి, నీ భూమి పండకుంటే, అది రైతు కసూరీవల్ల జరిగిందిగాని, సర్కారువారి జవాబ్దారీ కాదని, నీకు ముజరా ఇవ్వడానికి వీల్లేదని తోసేశారు... ఈపేచులన్నీ మీకేం తెలుస్తాయి?"

"ఏమి అన్యాయపు కాలం వచ్చిందయ్యా! సరే. నీవన్నట్లే మాగాణిశిస్తు ఇరవై రెండు రూపాయల్లోనూ పదకొండు రూపాయలు మొదటి రెండువాయిదాల్లోనూ చెల్లిస్తినే—ఇంకా ఇప్పుడు ఇరవై రూపాయలెట్లా అయింది శిస్తు?"

"నువ్వు ఇసకకయ్యలో చేసిన తీర్వ జాస్తీసంగతి మరిచావా ఏమిటి?"

"దాని కెంత పడిందేమిటి శిస్తు?"

"పావలాతక్కువ ఏడురూపాయలు."

"ఏందీ, ఆ ముంతెడు విత్తనాలపట్టుకీ ఏడు రూపాయలశిస్తేందయ్యా? నువ్వేమో మాకొంపలు ముంచేటట్టుగా ఉండావే?"

"అది మెట్టభూమికదట్రా; దానికి ఉత్తర్వు లేకుండా నువ్వు నీళ్లు తీసుకొన్నందుకు అయికున్నరరూపాయి అపరాధం వేశారు. అపరాధమూ, శిస్తూ కలిసి ఆరుమ్ముక్కాలు రూపాయి అయింది."

"ఇదేందబ్బా, ఈ విడ్డూరమూ? ముంతెడు విత్తనాలపట్టు కేందీ, ఏడురూపాయల శిస్తేందీ?...... కొంపలు పెరుక్కొని ఏడకయినా లేచిపోవలసినట్టుగా ఉందికాని............"అని ఆశ్చర్యపోతున్నాడు రమణయ్య.

ఇదంతా చూస్తూ ఉండిన రైతులు పకపకా నవ్వుతున్నారు.

“మేమూ ఇట్లాగే ఏడుస్తున్నాంరా నాయనా పొద్దుటినుంచీ. మాగోడు ఆ పరమాత్ముడికే ఎరుక. మాకుకూడా తలా అయిదూ, పదీ అపరాధాలు పడ్డాయి. ఏందో హెచ్చుమాగాణి రేటంటూ, దానిలో తగ్గ మెట్ట రేటు తోసేస్తారంటూ, దానికేమో ఇబ్బడీ, ముబ్బడీ కడతారంటూ............ఏమిటో చెప్పతున్నాడు కరణం. ఆయనగారు చెప్పే దేమిటో మా కేమీ బుర్ర కెక్కడం లేదు. పొద్దుటినించీ, మేము ఎంతెంత శిస్తు కట్టాలెనో మాకు తెలియక కొట్టుమిట్లాడుతున్నాం. ఎవడితో చెప్పకోవాలో తెలియడంలేదు....”

అని ఆరైతులు రమణయ్యతో చెప్పారు.

“అదిగాదయ్యా కరణంగారూ! నాతీర్వజాస్తి పాదికి నీళ్ల ఉత్తర్వు తెప్పిస్తానని చెప్పి, నువ్వు చేసుకోమంటే కదయ్యా, నే నా కయ్యలో ప్రవేశించాను. లేకుంటే నాకెందు కా లట్టాలు...” అని రమణయ్య అడిగాడు కరణాన్ని.

“అవును రా! నిరుడు సంవత్సరం గ్రామంలో పెద్ద పెద్ద రైతులందరూ ఉప్పత్తులుపడి ఒకరిమీద ఒకరు సొడ్డుపెట్టుకొని ఆ వోవయకీగుకు చెల్లించవలసిన ముడుపు చెల్లించనేలేదు. అందువల్ల ఈ యేడు ఈ వూళ్లో తీర్వ జాస్తి కేసులకు ఉత్తర్వులు ఇవ్వడానికి వీల్లేదని, ఆయన పైకిరాసి, అందరికీ తోక తెగ్గోశాడు. న న్నేం చేయమంటావు?”

“మీ ఇష్టంవచ్చినట్లు ఏడిపించండయ్యా మమ్మల్ని. మాకేం తెలుస్తాయి ఈ తిరుగుళ్లు? పశువులం మేం. అట్లా బంగారంవంటి ఎద్దు మట్టిగడ్డలయిపోయిందనే ఏడిచేదా, ఇక్కడి అపరాధాలు చెల్లించవలసివచ్చిందనే ఏడిచేదా! ఛీ! నుక్కడు విషం తాగి చస్తే మేలు, ఈ గడ్డన బతికేదానికంటె. ఏడిపించండి. తల్లి అయినా మీరే, తండ్రి అయినా మీరే అని, కరణం మునసబుల్నిద్దర్నీ నమ్ముకొన్నందుకు, మమ్మల్ని మీ రేం చేస్తే చెల్లుబడి కాదు గనక! మమ్మల్నిట్లా తడిగుడ్డలతో కోసే బదులు, ఒక్కసారి పడేసి ఏటపోతును నరికినట్లు నరికిపారేయరాదూ” అని ఇట్లాగే ఏమేమో సణుగుకొంటూ ఇంటికి చక్కాపోయాడు రమణయ్య.

౪

ఎన్నివిధాల ప్రయత్నించినా రమణయ్యకు వెంకన్నమీదనుంచి మనస్సు మరలడం లేదు. ఎన్ని తంటాలయినా పడి, పడమటి బేరగాళ్ల పోబడీ తెలుసుకొని, వాళ్ల డబ్బు వాళ్లకి వాపసుఇచ్చి తనఎద్దును తాను మళ్లా ఇంటికి తెచ్చుకోవాలనికూడా అతనికి అదే ఆలోచనగా ఉన్నది. కాని—చేతిలో చిక్కినఎద్దును మళ్లా వాళ్లు ఇస్తారా? ఇంకో నాలుగురూపాయలు లాభం చూపి అడిగితే ఎందు కివ్వరు?—వాళ్లు బేరగాళ్లుకదా. పోనీ, ఎద్దును ఇవ్వకుంటేమానె, వాండ్ల ఆచోకీ తెలిస్తే పోయి ఎద్దునయినా కళ్లతో ఒకసారి చూచి రావచ్చును అని ఆలోచించాడు రమణయ్య. పడమటి వాళ్ల దేవూరో అని తండ్రి నడిగాడు.

“వెలిగొండలికి అవతల అదేదోవూరని చెప్పారు. నాకు జ్ఞాపకంలే” దని చెప్పాడు తండ్రి.

రమణయ్య గ్రామంలోకి పోయి, బేరగాళ్లవిషయమై వాళ్లనీ, వీళ్లనీ విచారించాడు; కాని వాళ్ల స్వగ్రామం ఏదో తెలియదని కొందరూ, తెలిసినా నీకు వా ళ్లింకా చిక్కుతారా, ఏవూరు పోయారో, ఎక్కడ తిరుగుతున్నారో అని కొందరూ, వా ళ్లీపాటికి వెలిగొండ దాటిపోయి ఉంటారని మరికొందరూ, ఇంకా నీకు ఎద్దుమీద ఆశ ఎందుకని కొందరూ—ఈవిధంగా అతనికి నిరుత్సాహకరమైన సమాధానాలు చెప్పారు గ్రామంలోని రైతులు. బేరగాళ్లని వెదకి పట్టుకోవడం సాధ్యమైనపనిగా తోచలేదు రమణయ్యకి. తాను ఒంటరిగాడు. ఇంటికాడ ముసలివాళ్లని విడిచి, తాను ఎన్ని ఊళ్లని తిరగగలడు? ఎంతకాలం అని తిరగగలడు? అది కాక, తా నాప్రయత్నమేమీ పెట్టుకోవద్దని ఇంటి దగ్గర తల్లీ తండ్రీకూడా చాలాదూరం చెప్పారు. ఆ ప్రయత్నం విరమించుకొన్నాడు రమణయ్య.

పొద్దుపోకులూ కాలుకాలిన పిల్లిలాగ తిరిగి తిరిగి సాయంకాలానికి ఇంటికి ఘటం చేరవేశాడు రమణయ్య. అతనికి మనస్సు కుదుటపడడంలేదు; దొడ్లో ఎద్దులేకపోవడం అతనికి ఇల్లంతా బావురుమనిపోయింది. బయట వీథిలో పొయ్యే పశువుల్నీ ఎద్దుల్నీ చూచుకొని ముచ్చటపడుతున్నాడు. ఎక్కడికి పోయినా, సాయంకాలానికి తనయిల్లు చేరుకొంటూ ఉండేదే అని ఎద్దు వస్తుందేమో అన్నట్లుగా వీథివాకిట్లో ఎదురుచూస్తూ నిలిచేవాడు. దొడ్లోకి పోయి చప్పారంచుట్టూ తిరుగుతూవుండేవాడు. ఎద్దుకు కట్టే నుంజవైపు ఆట్టే పరకాయించి చూచాడు. ఎద్దు అక్కడ నిలబడి చేత్తో మెడ దువ్వమని తలపైకెత్తినట్టుగానే గోచరించిం దతని కళ్లకి. మళ్లా అంతలోనే వట్టి నుంజమాత్రమే కనిపించింది. అతనికి పెద్దదుఃఖం పొంగివచ్చింది. ఎద్దు యింటికి వచ్చేవేళ, ఎద్దుకి బుట్టమేపుపెట్టే సమయం, గాడిలో పచ్చిగడ్డి వేసేకాలం,—ఇవన్నీ అతనికి జ్ఞాపకానికి వచ్చినై; కాని వీటిల్లో ఏపనీకూడా చేయవలసిన అవసరం లేకుండాపోయింది. తనకి చేయి విరగగొట్టినట్టుగా ఉంది. వాకిట్లో గోడ కానించిన నాగేలీ, కాడిమానూ అతనికళ్లల్లో పడినవి. ఎద్దు జ్ఞాపకానికి వచ్చింది. కళ్లు చెమ్మగిల్లినై. కళ్లల్లో మెదిలాడు వెంకన్న. ఒకక్షణం నాగేలివైపు చూస్తూ నిలబడ్డాడు. "ఇంక నేను సేద్యం ఎట్లా చేసుకొనేదే, వెంకన్నా." అని కళ్లు తుడుచుకొన్నాడు.

రమణయ్య ఇంట్లోకి వచ్చాడు: గోడలో కొయ్యకు తగిలించిన మువ్వలూ, గంటా, తోలుపట్టెడా, చికుమోర తాడూ అగపించినవి అతనికళ్లకి. ఇక తానాదుఃఖం పడలేకపోయాడు. ప్రక్కనే నులకమంచంమీద బోర్లగిలాపడి డొక్క లెగరవేస్తున్నాడు.

గంటసేపయింది రమణయ్య ఆవిధంగా పండుకొని. రాత్రి భోజనాలవేళయింది: తల్లి వచ్చి అన్నానికి రమ్మని పిలిచింది. ఆకలవడంలేదు, భోజనానికి రానన్నాడు రమణయ్య.

"ఇదేంది అబ్బాయీ! నీ కిదే పిచ్చిగా ఉన్నదే. పోతే పోయిందిలే ఎద్దు. దానికోసరం దిగులుపడి, కూడూ, నీళ్లూ మానుకొంటారా? నువ్వు మొగవాడివి. నీకేం? నీరెక్కలు బావుంటే, ఇట్లాంటి ఎద్దుల్ని లక్ష సంపాదించుకోవచ్చు. ఇట్లా దిగులుపడి కూచుంటారా? బాగానే వుంది — అన్నానికి లే" అని తల్లి పిలిచింది.

"......................"

"నువ్వీవిధంగా దిగులుపడ్డావని ఆముసలాయనకి ఎంతో కష్టంగా ఉంది. దాని కాలం, కర్మం ఒనగూడి వచ్చి, శనిగాడు నెత్తికెక్కినందువల్ల, దాన్ని అమ్మవలసివచ్చి అమ్మాముగాని—ఆయనకి మాత్రం ఎద్దుని అమ్మడం సంతోషమా ఏమిటి? లే! నువ్వు లేచి రెండుమెతుకులు తింటేనేగాని ఆయన లేవడు. పాపం! ఆయనది పెద్దప్రాణం. ఒక్కగాక ఒక్కబిడ్డవు, నీమీద ప్రాణాలు పెట్టుకొని బ్రతుకుతున్నాం మేమిద్దరమూను. లే. నాయనా, లే!" అని బలవంతం చేసింది తల్లి.

తనస్థితి చూచి తండ్రి కష్టపడుతున్నాడని వినేవరకు రమణయ్యకు హృదయం విరిగిపోయింది. ఒకవేళ తనకి బాధగా ఉంటే—దాన్ని తండ్రికి తెలియపర్చకుండా కడుపులోనే దాచిపెట్టుకోవడం మంచిదనుకొన్నాడు; లేచి భోజనం చేశాడు.

దినములు గడిచిపోతున్నవి. వెంకన్నని అమ్మివేసి ఒకటి, రెండు, మూడు నెలలయింది. వృద్ధుడయిన రాగయ్య ఒకరోజున అకస్మాత్తుగా జబ్బుచేసి, కొడుకు చేతులమీదుగా అవతలికి దాటుకొన్నాడు. రమణయ్య భుజాలమీది భారం బరువెక్కినట్టయింది.

మరుసటినెలలో భార్య కాపరానికి వచ్చింది. రమణయ్యజీవితంలో సుఖమూ, దుఃఖమూ రెండూ కూడా పొడగట్టాయి. ఆ రెంటినీ వేసుకొన్న కావడిబద్ద బరువెక్కి నడుస్తూవుంటే అతని నడుములాగే అదికూడా జవజవలాడుతోంది.

పొగాకుబుట్ట నెత్తినివేసుకొని పల్లెల్లో తిరిగి బేరం చేసుకొంటూనే ఉన్నాడు రమణయ్య. ఏవూరు పోయినా వెంకన్నజాడ ఏమయినా సుర్తు చిక్కుతుందే

మోనని ఇంకా అతనికి అడియాస కొట్టుకొంటూనే ఉంది కొనఊపిరితో. కనబడిన పశువులమందనంతనీ కలయ వెదుకుతాడు; తనకు పరిచయముండిన బంధుమిత్రుల నందరినీ తరిచితరిచి అడుగుతాడు; దృష్టిలో పడ్డ ఎద్దునల్లా దీక్షతో పరిశీలిస్తాడు. వెంకన్నపోలికలు గల ఎద్దు తనదృష్టికి తగిలితే భ్రమపడి దానికోసం కంచెలు గెంతుకుంటూ పరుగులు తీస్తాడు. అది తన వెంకన్న కాకుంటే వెంటనే నిట్టూర్పు విడుస్తాడు. దాన్నీజన్మలో మళ్లా తానొక్కసారి చూడాలని అతనికోరిక; అంతే అతని ఆశ!

"వెంకన్న ఇప్పుడు ఏసంపన్న గృహస్థు ఇంట్లో పెరుగుతున్నాడో — సుఖమేపడుతున్నాడో కష్టమే పడుతున్నాడో! దాని ఖామందు దాన్ని సరిగా విచారిస్తున్నాడో లేదో! ఇంతకాలం అది మన ఇంటివద్దనే పుట్టిపెరిగిందే, మన ఊరు, మన ఇల్లు దానికి సత్తేనే. పోనీ ఒకసారి రప్పించుకొనయినా అది మన ఇంటికి రాకూడదూ? ఒక్కసారి తనివితీర దాన్నిచూచి మళ్లా పంపివేద్దునే! నా గొంతుక సవ్వడి చెవినిపడితే అది పసికట్టుతుందే. నావాసన అది నిమిషంలో పసికట్టుతుందే. నానడక దానికి సత్తేనే!" ఇట్లా లోలోపలనే ఆరాటిస్తూ ఉంటుం దతని మనస్సు.

దినములు గడిచినకొద్దీ, తా నీజన్మలో మళ్లా వెంకన్నను చూడగలనన్న ఆశ పూర్తిగా వదలుకొన్నాడు రమణయ్య. రానురాను ఆచింతనే మరచిపోయాడు.

రమణయ్య తన సంసారమేమో, తన భార్య ఏమో—తన సౌఖ్యమేమో, ఈ లోకంలోనే మునిగి తేలుతున్నాడు.

౨

ఎంతలో తిరిగివస్తుంది కాలం! వెంకన్నని అమ్మి అప్పుడే ఏడునెల లయింది.

అది మార్గశిరమాసం. చలి వడకించేస్తోంది.

మామూలు ప్రకారం లక్ష్మమ్మ వేకువనేలేచింది. ఇంట్లో పిల్లవాడూ, కోడలూ ఇంకా గాఢనిద్రలోనే వున్నారు. కోళ్లు కొక్కొరోకో యని కూస్తున్నాయి.

సంజవెల్తురు వచ్చింది. మంచు దట్టంగా పట్టింది. వాకిట కసవు చిమ్ముకోను లక్ష్మమ్మ మంచం విడిచి తలుపు చిలుకుతీసి ముంగిట్లోకి వచ్చింది. చేతిలో పొరకకట్ట తీసుకొని వీథివాకిలి తెరిచింది. తలుపు తెరిచీ తెరవడంలోనే బక్కచిక్కిన ఒక ఎద్దు గభాలున తోసుకొంటూ ఆమెమీదికి వచ్చింది. ఇంకా నిద్రకళ్లమీదా, మత్తుమీదా ఉన్నదేమో, కొమ్ములు ముందుకు వంచి తోసుకువచ్చే ఆ ఎద్దును జూచి పొడుస్తుందేమోనన్న భయంచేత ఆమె వెనక్కి రెండడుగులువేసింది. ఎద్దు ముంగిటిలో ప్రవేశించి దొడ్డిలోకిపోయే ఉత్తరపుతట్టు సందు ముఖం పట్టింది. "హా, హా, హా" అంటూ సమయానికి కర్రేదీ చిక్కనందువల్ల, పొరకకట్టతోనే ఎద్దుని అదలించి వెనక్కి మళ్లగొట్టడానికి ప్రయత్నించింది లక్ష్మమ్మ. కాని ఆ అదలింపులు లెక్కపెట్టకుండా ఎద్దు దొడ్లోకి పోయింది.

దొడ్లో చప్పారంలో పాలిచ్చే బర్రెపడ్డా! దూడా, దున్నపోతూ ఉన్నవి. ఈ ఎద్దు ఎవరిదో, ఆ పశువుల్ని పొడుస్తుందో ఏమో! ఎంత అదలించినా జములేకుండా దూసుకొని దొడ్లోకి పోయింది. లక్ష్మమ్మకి ఖంగారు పుట్టింది.

"అబ్బాయి! అబ్బాయి! రమణా! ఇట్లారా" అని పిలిచింది లక్ష్మమ్మ.

"ఎందుకు?" అని నిద్ర మంచంమీదనుంచే పలికాడు రమణయ్య.

"ఎవరిదో ఎద్దు దొడ్లోపడి నానాబీభత్సం చేస్తుం దదిరా. ఎంతకొట్టినా వెనక్కిపోలేదు. బర్రెదూడని పొడుస్తుందో ఏమో! ఒకపాలి లేచి ఇట్లా రా! దాన్ని బయటికి వెళ్ల తరుము" అని అరచింది లక్ష్మమ్మ.

మొలగుడ్డ బిగించుకొంటూ రమణయ్య దొడ్లోకి పోయాడు.

"ఇదేమి అలవాటమ్మా? పశువుల్ని ఇంటికాడ భద్రంచేసుకోవాలిగాని, ఇట్లా ఊరిమీదికి విడిచిపెట్టితే ఎట్లా అనుకొన్నారో! దొడ్లో నీళ్లకుండలూ బొచ్చెలూ ఉండాయి. ఏం నాశనం చేసిందో ఈ ఎద్దు" అని సణుగు

కొంటూ వీథిలోకి వచ్చి, వంగి, వీథి వాకిలి చిమ్మడం మొదలుపెట్టింది లక్ష్మమ్మ.

రమణయ్య ఎద్దును పట్టుకొంటూ దొడ్లోకి పోయేవరకు అది అప్పటికే చప్పారంలోకి పోయి దున్న పోతుజతను సుంజకాడ నిలిచింది. ఆ యెద్దును జూచి బెదురుకొన్నాయో ఏమో, పండుకొన్న దున్నపోతూ, బర్రెపడ్డా, దూడా ఒక్కసారిగాలేచి నిలబడి ఎద్దువైపు చూస్తున్నాయి.

"దా! దా!" అంటూ, చేతిలో చిన్నకర్ర తీసుకొని ఎద్దును సమీపించాడు రమణయ్య. అతన్ని చూడగానే ఎద్దు ముందుకు రెండడుగులు వేసి మెడకింద గీరమని మోర ఎత్తింది.

అప్పటి కప్పుడే తూర్పురేఖలు బాగాఆరి వెలుగు వచ్చింది. రమణయ్య ఆట్టే ఎద్దువైపు చూశాడు. దానిచుట్టూ ఒకసారి తిరిగాడు. దగ్గరగా వచ్చాడు. ఎద్దుమోరమీద చెయ్యిపెట్టాడు. పాతనెత్తురూ పాత నెత్తురూ గుర్తు తెలుసుకొన్నాయి.

"అమ్మా! అమ్మా! వెంకన్న వచ్చాడేవు; వెంక న్నేవు" అని పెద్దంగా అరచాడు రమణయ్య.

"ఆ! ఆ! నా వెంకన్నే — నా తిరపతి వెంక టేశ్వర్లే!" అని అరుచుకొంటూ దొడ్లోకి ఒక్కదూకు దూకింది లక్ష్మమ్మ.

అప్పటికప్పుడే తన ఇద్దరు బిడ్డలూ, ఒకరినొకరు పరామర్శించుకొంటున్నారు.

"తప్పించుకొని వచ్చింది కాబోలురా, నాయనా! చూశావా దాని విశ్వాసం! దాన్ని పరాయివాడిచేతి లోపెట్టి ఏడోనెల జారబడింది. అయితేనేం? దాని కెంతసుర్తో కనుక్కో! ఏవూరునుంచి వచ్చిందో. ఎప్పుడు బయల్దేరిందో" అని అంటూ లక్ష్మమ్మకూడా ఎద్దు దగ్గరగా వచ్చింది.

"నావెంకన్నా! ఎల్లా అయిపోయావురా! బక్కచేసులడి వరుగైనావు!" అని కంట తడిపెట్టు కొని లక్ష్మమ్మ "వెంకన్నా! మరిచిపోయావను కొన్నాం. ఇంతకాలం ఏడ ఉండావు నాయనా? నీ అన్న రమణడూ, నేనూ నీకు సుర్తుఉండామా?— నీకోసరం అలవటించి మరీ ప్రాణం విడిచాడు — ఆ ముసలాయన. నీచూపు ఆయనకి ఋణం లేకుండా పోయింది. ఈపొద్దు నిన్నుచూచి ఉంటే ఆ మారాజు ఎంత పొంగిపోయేవాడో—"

రమణయ్యా, వెంకన్నా కన్నులరమోడ్చి తన్మయులై ఒకరిలో ఒకరు లీనమైపోయారు.

"అయ్యో! నా బంగారుకొండా! కళ్లల్లోవున్నై ప్రాణాలు! సుర్తుపట్టడానికి శక్యం కాకుండా ఇట్లా ఎండిపోయావేమి—వెంకన్నా? తలుపు తెరిచి చూస్తును గదా—ఎవరిఎద్దో అని భ్రమపడ్డాను. నా తిరపతి వెంకన్నా! మన ఇల్లు విడిచిపెట్టి పోయాక దిగులుపడ్డా వా ఏంది? నాకళ్లుకాలిపోతే ఇట్టా శల్యమై పోయా వేమి నాయనా!" అని చేత్తో నిమిరింది లక్ష్మమ్మ.

ఎద్దుమొఖంలో మొఖంపెట్టుకొని నిలబడే ఉన్నాడు రమణయ్య.

"నిన్ను చేతులారా ఆపడమటివాళ్లకి అమ్ముకొని పాపం ఒడిగట్టుకొన్నాం. ఈ యేడు నెలలూ ఎంత దిగులుపడ్డావో! మేతానీళ్లూ అమరక ఎట్టా అయిపో యావో! ఏవూరునుంచి వచ్చావు వెంకన్నా? ఇన్నాళ్లు ఎవరింటికాడ ఉండావు నాయనా" అని ఎన్నెన్ని ప్రశ్నలో అడుగుతోంది లక్ష్మమ్మ.

ఇంతలో వీథిలో ఇద్దరు పరాయిమొగవాళ్లు ఎవరో వచ్చి లక్ష్మమ్మని పిలిచారు. ఆమె దొడ్లో ఉన్న దని తెలిసి ఆయిద్దరు మనుష్యులూ దొడ్లోకి వచ్చారు.

"మేం మాదిగలం. మాది సీకాయకాగొల్లు. ఈ ఎద్దుని మేం మొన్నటిదినం కోటపాడులో యానాది రెడ్డి దగ్గర రెండువరాలకి కొన్నాం"—

"మీరు మాదిగవాళ్లా? అయ్యో, నా వెంకన్న కేం గతిపట్టిందే—"అని లక్ష్మమ్మ గొల్లుమనింది.

"మీదగ్గరకొన్న పడమటి షేరగాళ్లీయెద్దునికోట పాడులో ఏభయి అయిదు రూపాయలకి యానాదిరెడ్డికి అమ్మివేసిపోయారంట! కాని ఆరెడ్డికాడికి పోయినేళ్లే

నుంచీ ఎంత మేపినా ఈ ఎద్దు ఎక్కిరాక ఆరోజు కారోజు చిక్కి ఎండిపోతూవచ్చిందంట! దానితో తెసు లట్టుకొని పీనుగయిందంట. దీని కారెడ్డి ఎన్నెన్నిమందులో మాకులో పెట్టి వైద్యాలు చేయించి చేయించి కార్యంలేక ప్రాణం విసిగి దీనితో చరపడలేక మొన్నటి రోజున దీన్ని మాకు రెండువరాల కమ్మేశాడు. దీన్ని తీరా మేము తోలుకొని ఇంటికి పోతూవుంటే, నిన్న రాత్రివేళ ఇది మమ్మల్ని తప్పించుకొని. పారిపోయింది. ఇది విూపూరి ఎద్దని మాకు తెలుసు. అందువల్ల ఈడకే పోయి ఉంటదని మే మిద్దరం అపరాత్రికాడ లేచి వెతుక్కుంటూ వచ్చాం. చూడండి. ఆఎద్దు కున్నన్ని మరులు మానవుడికి ఉంటాయా?" అని మాదిగలిద్దరూ ఎద్దువృత్తాంతం అంతా చెప్పారు.

ఈవిషయం అంతా చెవుల్లో వేసుకొంటూ ఉండిన రమణయ్యా, లక్ష్మమ్మా కొయ్యబారిపోయారు.

వెంకన్న శిరస్సు రమణయ్య బాహువల్లర్లలోనే చిక్కుకొనివుంది. రమణయ్య కన్నీటిధార కాలువలు కట్టుతోంది. లక్ష్మమ్మ తేపతేపకూ ముక్కు తుడుచుకొంటూ ఎద్దుదగ్గిరనే నిలబడింది. గెడ్డంకింద కర్రలు మోటించి, మాదిగ లిద్దరూ చూస్తూ నిలబడ్డారు.

సుంటలుకట్టిన నేత్రాలు రెండూ ఒక్కసారిగా, నల్లనుడ్డు మరుసపడేటట్టుగా గిర్రున తిప్పాడు వెంకన్న. రమణయ్య తన రెండుకళ్లూ తిప్పి ఎద్దుకళ్లల్లోకి చూశాడు. నిలబడిన ఆయెద్దు ముందుకాళ్లు రెండూ ముడిచి కిందికి మోకరించింది. దాని మెడ విడవకుండానే రమణయ్యకూడా మోకరిల్లాడు. ఎద్దు నందివాహనం లాగా పండుకొన్నది. ఎద్దుతల తనఒడిలో పెట్టుకొని కూర్చున్నాడు రమణయ్య. ఎద్దు కళ్లు రెండూ మూసేసింది.





ద్వారపాలకశిలాశిల్పము. తంజావూరు బృహదీశ్వరాలయమున నున్నది. విజయరాజేంద్ర దేవరాయలు తొమ్మిది వందల యేండ్లకు పూర్వము కల్యాణపురము (బొంబాయి రాజధాని) నుండి తన విజయయాత్రలో కొనితెచ్చెను. (S. S. S)

# మన రబ్బరుకథ

'వల్కనైజు' విధాన మేనాడు పాడసూపినదో కాని నాడుమొదలు ఆధునికవాణిజ్య క్షేత్రమున రబ్బరు యొక్క ఉపయోగము నానాటికిని హెచ్చిపోవుచున్నది. ప్రపంచము మొత్తములో నుత్పత్తియగు ముడిరబ్బరులో సగమునకుపైగా ఒక్క బ్రిటిషుసామ్రాజ్యములోనే తయారగుచున్నది. అందులో సగమువంతు భారత, సింహళదేశములు మట్టుకే తయారు చేయుచున్నవి. మన దేశమందు ముడిరబ్బరుపగల యీ యభివృద్ధిని చూచియే బ్రిటీషువారు ఈ రబ్బరుపరిశ్రమను అనేకవిధములుగా ఉన్నతికి తీసుకొనివచ్చినారు; తీసుకొనివచ్చుచున్నారు. విరివిగా డబ్బుపెట్టుబడిపెట్టి, బుద్ధిల సహమహామికతో నుపయోగించి, వింతవింతరీతులుగా వారీ పరిశ్రమను కొనసాగించుచున్నారు.

రబ్బరు నుత్పత్తిచేయుచెట్లు అనేకమున్నవి. కాని ఆఅన్నిటిలోను ప్రధానస్థాన మాక్రమించునది 'పారా' రబ్బరుచెట్టు. బ్రేజిల్ ప్రాంతములందు ఈ చెట్లు అపరిమితముగా నుండెను. ఈ తరగతి చెట్లే ప్రస్తుతము



రబ్బరుచెట్ల అడవి

మన భారతదేశములోను, సింహళదేశమందును కూడ అపరిమితముగా పెంచబడుచున్నవి. మనదేశమం దీచెట్ల పెంపకమునకు పునాదివేసినవాడు హెన్రీ విక్‌హాం అనునతడు. ౧౮౭౬ వ సంవత్సరములో అతడు బ్రేజిల్



ఒకానొక రబ్బరు అడవిలో నమర్చిన త్రాటివంతెన



రబ్బరుచెట్లను గీతగీయు వైనము



కారుచుండు పచ్చిపాలను తీగగా సాగదీయుట

నుండి రబ్బరు విత్తనములను దొంగిలించి తెచ్చెను. ఈ ఉద్యమములో అతని భుజములు తట్టినవారు అప్పడు 'క్యూగార్డెన్సు' డైరెక్టరుగానుండిన సర్ జోసెఫ్ హూకర్ అనునతడును, అప్పటి ఇండియాస్టేట్ సెక్రెటరీయును. ఒకసారి ఇతని ప్రయత్నము విఫలమాయెను. రెండవసారి ఇతడు అంతకంటె గట్టిప్రయత్నము చేసెను. ఈసారి అదృష్టముకూడ అతనికి తోడుపడెను. గింజలను ఎగుమతిచేయు విధానము విషయమై ఇతడు అక్కడి స్థానిక వ్యావసాయికులతో నాలోచించుచు తంటాలుపడుచుండగా దైవవశాన అప్పడే 'అమెజాన్' అను నొక పెద్ద ఓడ వచ్చిన సంగతి ఇతని చెవులబడెను. లివర్పూలు, ఆబ్టో-అమెజానుల మధ్య వర్తక వ్యాపారమును సాగించుచుండు ఓడ అది. తిరిగి వచ్చుటకు ఏలాటి రవానారుసుమును తీసుకొనరట ఆఓడఖామందులు. ఈ సంగతికూడ హెన్రీ విన్నాడు. ఒక్క దెబ్బతో అతడు ఆఓడను ఇండియాప్రభుత్వపు తరఫున గుత్తకు తీసుకొన్నాడు. ఆఓడలోని కమాండరుతో టపెజోస్ అమెజానునదుల కూడ లిప్తలమున తనను కలుసుకొనవలసినదిగా ఏర్పాట్లు చేసుకొన్నాడు. తనకు సాధ్యమైనంతమందిని - దొరకినంతమందిని మనదేశపు కూలీలను టపెజోస్, మడీరియాలకు నడుమగల అడవులందంతట నింపివేసెను. మేలిరకపు పారారబ్బరు చెట్లకా అడవులు కాణాచిగా నుండెను. ఆఅడవులనుండి రబ్బరు విత్తనములను సేకరించి గంపలకు నింపి ఆకూలీలు మోయగలిగినంతవరకు వారినెత్తి కెక్కించి ఓడదగ్గరికి చేర్చెను. ఆచేర్చిన గింజలగంపలు సుమారు ౭౦ వేలుండవచ్చును. బ్రెజిల్ అధికారులు ఈ ఎగుమతి కెక్కడ ఆటంక పెట్టుదురో అని ఇతడు చాల భయపడెను. ఎట్లో ఓడ అక్కడనుండి బయలుదేరెను. వాతావరణముకూడ అనుకూలముగా నుండి ఓడ నిరాటంకముగా సాగివచ్చుచుండెను. మధ్యలో పారావద్ద ఓడ ఆగవలెను. ఆగినదికూడ. బ్రిటిష్ కాన్సలువారి పుణ్యమాయని యెవరును ఆక్షేపణ చెప్పలేదు. ఓడ నిరభ్యంతరముగా సాగిపోయివచ్చెను. ప్రయాణమందు జాప్యమును లేక ఓడ వడివడిగా వచ్చినందున రబ్బరుగింజలు చెడిపోవలసిన



మరిగలలోనికి కారిన పాలను బక్కెట్లలోనికి కుమ్మరించుట



అప్పటమైన పాలో, కాదో
కర్మాగారములందు పరీక్షించుట

అవసరము కలుగలేదు. ఓడ లివర్పూలు చేరుకోగానే రాత్రిగూడ్సుబండియొకటి అక్కడ తయారుగా నుండెను. గింజల నందులోని కెక్కించి భద్రముగా 'క్యూగార్డెన్సు'కు చేర్పించిరి. అన్నిగింజలను తీసుకొని వచ్చిరన్నమాటేకాని అందులో నూటిలో నాలుసువంతుననే బ్రతుకగల్గినవి. ఏమయిననేమి, హెన్రీ ఆగింజలను బ్రేజిల్ నుండి క్యూకు అంతత్వరగా, అంతభద్రముగా తీసుకొనివచ్చుట కనుకూలపడిన సందర్భము లొదసుట అతని అదృష్టమనియే చెప్పవలయును. ఈ కష్టమును స్మరించి అక్కడి ప్రభుత్వ మతని కొక 'నైట్' గిరి ప్రసాదించెను. రబ్బరు పెంపకపు సంఘముతరపున ఇతని కొక బంగారుపదకము గూడ బహుమతి చేయబడెను. క్యూలో నాటగా అంకురించిన మొక్కలలో కొన్ని మలయాకును సింహళమునకును పంపబడెను. ఆపంపిన వానిలో దాదాపన్నియు నాటుకొని యెదిగినవి. అక్కడనుండి యీమొక్కలు మనదేశమునకు ప్రాకినవి. ప్రస్తుత మీ దేశములో వేలకొలది యెకరముల భూమి యీ రబ్బరుచెట్ల పెంపకమునకు వినియోగింపబడు చున్నదన్నచో దీని పంట యెంతయున్నతిలో నున్నదో యూహింపవచ్చును.

ఈచెట్లు ఎకరాకు నూరుచొప్పున పెంచబడును. ఇవి సుమారు ౫,౬ ఏండ్లకు పక్వమునకు వచ్చును. ఈ కాలపరిమితి దేశకాల పరిస్థితులనుబట్టి అటునిటు కావచ్చునుకూడ. చెట్లు పక్వమునకురాగానే రబ్బరు ఉత్పత్తికి ఆరంభమగును. వర్షపాత మెంతకెంత యెక్కువగునో అంతకంత రబ్బరుఉత్పత్తికూడ ఎక్కువగును. ఎంత చచ్చునేలలలో నయినను సరియే రబ్బరుచెట్లు ప్రోదిగా నెదుగును. కాబట్టియే యెందునకును పనికిరాని నేలలను రబ్బరుచెట్ల పెంపకమునకు ఉపయోగించుచున్నారు.

చెట్లు పక్వమునకు వచ్చుసరికి వాని ప్రకాండములు దాదాపు ఇరవై యంగుళముల వ్యాసము గలిగి యుండును. అప్పు డాచెట్లను కత్తివంటి యొక పనిముట్టుతో బెరడు పైపొరను చెక్కుదురు. ఆచెక్కుట మూలముగా ద్రవనాళములు తెరచుకొనును. అక్కడ



రబ్బరుపాలను జల్లెళ్లలో వడియబోయుట



రబ్బరుపాలను గడ్డకట్టనిచ్చు పళ్లెములలో పోయుట

నుండి ప్రకాండము చుట్టుగా కాలువవలె నొక కోత చేయుదురు. కాలువ చివరికొనలో కట్టిపెట్టబడిన పాత్రలో ద్రవము (చెట్టుపాలు) కారును. పైవిధముగా



రబ్బరుపలకలను రేఖాకల్పన చేయు రోలర్ల నడుమవేసి త్రిప్పుట

కాట్లు పెట్టునప్పుడు ప్రకాండములోపలి పొరకు దెబ్బ తగులకుండ జాగ్రత్తగా నుండవలయును. పూర్వము ప్రతిదినమును కాట్లుపెట్టుట (లేక గీయుట) అలవాటుగా నుండెనుగాని, అట్లు చేయుటవలన చెట్ల భావ్య వృద్ధి కాటంకము గలుగునని యిప్పుడు దినమువిడచి దినము కాట్లుపెట్టుపద్ధతికి వచ్చినారు. సగటున ఒక్కొక్క చెట్టునుండి ఇరువదినుండి ముప్పదిగాలన్ల వరకు పాలు తీయవచ్చును. ప్రతిగాలనుకు రెండుపౌనుల రబ్బరు తయారగును. చెట్లకు కట్టిపెట్టిన మరిగలు నిండగానే పాలను వానినుండి పెద్దపెద్ద కాసులలోనికి నింపుకొని కర్మాగారమునకు కొనిపోవుదురు. అక్కడ ఈ పాలలో కొన్ని రాసాయనిక ద్రవ్యములను చేర్చి క్రమముగా గడ్డకట్టునట్లు చేయుదురు. పూర్తిగా గడ్డకట్టక



కొయ్యచట్టములమీద రబ్బరు పలకలను ఆరవేయుట

ముందే ఈద్రవమును కావలసిన యాకారముగల పాత్రములలో వేసియుంచి కావలసిన యాకారపు పలకలుగా తయారుచేయుదురు. రబ్బరుపాలు గడ్డకట్టుటకు సామాన్యముగా పండ్రెండుగంటలు పట్టును. అట్లు తయారైన ఆరబ్బరుపలకలను రోలర్ల నడుమ నిరికించి యీడ్చి తీయుదురు. ఇట్లు చేయుటవలన ఆపలకలలోని మడ

తలు పోవుటయేకాక వానికి నునుపుదనము గూడ వచ్చును. ఆపలకలను మరల ఇంకొకరకపు రోలర్లలో నిరికించి యీడ్చి తీయుదురు. అప్పు డాపలకలమీద కొన్నిరేఖ లేర్పడి వానికొక యందమునిచ్చును. ఈ రేఖాకల్పన పద్ధతి కేవలము అందమునకేకాక పలకల నెగుమతి చేయునప్పుడు ఒకటికొకటి అతుకుకొనిపోకుం డుటకు గూడ ఏర్పడినది.

ఈ కలాపమంతయు నయినతర్వాత ఆపలకలను కడిగి ఆరవేయుదురు. తర్వాత వానిని పొగచూరు ఇంటికి చేర్చి పొగచూరునట్లు చేయుదురు. దీనివలన రబ్బరుకు అతుకుడుగుణము పోవునని యిట్లు చేయబడు చున్నది. ఈరబ్బరు పలకలు పొగచూరుటకు దాదాపు ౧౫ దినములు పట్టును. అప్పటికవి యెగుమతికి సిద్ధ మగును.

---



---

# అనంగసేన

"ప్రేమలత"

౧

సార్వభౌముండు కవికులచక్రవర్తి
రసికతాజీవి పర్యాయకుసుమశరుఁడు
మగఁడు నీకన్న కీరితి మంటఁ గలియఁ
గులటవై యేమి యొడిఁగట్టుకొంటివమ్మ !

౨

రాజకార్యంబుఁ దలఁపఁడు భోజనంబు
మాటఁదలపోయఁ డాత్మసామ్రాజ్యమమ్మ
కొనిమె నీ; కట్టి ప్రేమజీవనుని! గుండె
చీల్చివైచితొకో ! యెంత చెడిపె వకట !

ప్రాణపదమంచు నిన్ను దర్బారుసేయు
సమయమునఁగూడఁ బాయనిసాధురసికు
కన్నొమఱఁగి యంత్రలంతలు కానిపనులు
సేయ మన సెట్టులొప్పెనే మాయలాడి.

మాయయును మర్మ మెఱుఁగని మమతతోడ
నిన్నుఁ బ్రేమించి, తనకు నీ వున్నఁజాలు
సర్వముఁ ద్యజింతు ననియున్న సార్వభౌము
కులముమర్యాదయే గంగఁ గలిపినావె ?

అపయశముతోడ నీదుపే రారిపోమెఁ
గాని యమ్మహాత్మున కేమిగలదు లోటు ?
ఆతని సుభాషితం బజరామర మయి
విశ్వపావనమై మోక్షవిద్య యయ్యె.

---

# ప్రాచ్యవిద్యా పట్టపరీక్షలు

కట్టి సాంబమూర్తిశాస్త్రి

౧౯౧౦ సంవత్సరమునకుఁ బూర్వము ప్రాచ్యవిద్యలకు దొరతనమువారి యాదరాలంబము లంతగా లేవని ప్రజ లనుకొనెడివారు. దేశభాషాగ్రంథకరణసభ వంటివానిద్వారమున నేవో కొన్నిగ్రంథముల ప్రకటించుటయు, పాఠశాలలలో ప్రాచ్యవిద్యోపాధ్యాయు లవసరమైనపుడు గొప్పవిద్వాంసుల సలహా ననుసరించి పండితుల నియమించుచుండుటయు మాత్రమే ఆకాలమున దొరతనమువారు చేయు ప్రాచ్యవిద్యాపోషణమై యుండెను. ఒక్కొక్కప్పుడు పండితులకు పోటీపరీక్షల నేర్పాటుచేసి యుత్తీర్ణులకు పాఠశాలలలో నుద్యోగము లిచ్చుటయు జరుగుచుండెడిది. ఇంతియకాని పండితపదవి కర్హమగు విద్యాపరిమితి నిర్ణయింపబడియుండలేదు. సంస్కృతభాషయు, నందున్న శాస్త్రములును గుఱుపుపాఠశాలలు దేశమున విరివిగ నుండెడివి. కాని దేశభాషల బోధించు పాఠశాలలు లేకుండెడివి. సంస్కృతభాషను శాస్త్రములును, ప్రధానముగ నభ్యసించినపిదప ననేకులు స్వయముగనో, గురుముఖముననో దేశభాషలందు గొప్పపరిశ్రమము గావించి మాతృభాషాపోషణము గావించెడివారు. ఐచ్ఛికముగ గావించినదగుట వారి దేశభాషాపాండిత్య మఖండము పూర్ణమునై యుండెడిది. ఏలన; వారు కావించిన పరిశ్రమము కేవలము జ్ఞానాభివృద్ధికనియే కాని పొట్టపోసికొనుటకు గాదు. ఐనను కొందఱకు దేశభాషాపాండిత్యమువలన ద్రవ్యలాభముగూడ నుండెడిది. అప్పటివారికి జ్ఞానసంపాదనమే ముఖ్యము; ద్రవ్యార్జనము యాదృచ్ఛికము. సంస్కృతభాషావిషయముగూడ నిట్లే. సంస్కృతభాషనుగాని శాస్త్రములనుగాని పరిమితి నిర్ణయించు పరీక్షలును లేవు. ఆ పండితుల కుపాధి కల్పించుటయును లేదు. ఐనను దేశభాషలవలెఁగాక నాభాషయు శాస్త్రములు నున్నతస్థితిలోనే యుండెడివి. శ్రీకాశీ, బరోడా, పూనా మొదలగు నితరరాష్ట్రపట్టణములందును, గద్వాల, ఆత్మకూరు, వనపర్తి, ఉర్లాము, విజయనగరము, పిఠాపురము, జటప్రోలు మొదలగు నాంధ్రపట్టణములందును రాజులును, ధనాధికులును విద్వాంసుల బరీక్షింపించి యోగ్యతాపత్రములను ద్రవ్యసత్కారములు నిచ్చెడివారు. వార్షికముగ లభించు సంభావనములతో బండితులకు గుటుంబపోషణము సుకరముగా నుండెడిది. ఇంతియకాక ప్రతి సంస్థానాధిపతియు దన యాస్థానమున వేదశాస్త్ర పండితులను పెక్కురను నిలిపి వారికి స్థిరవసతుల గల్పించువారు. ఇతరధనాధికులే కాక సామాన్య సంసారులు గూడ దమయిండ్లజరగు వివాహోపనయనాది శుభకార్యములందు పండితసదస్సులజరపి పండితులకు విశేషసత్కారములు చేయువారు. ఈకాలమున సైతము కొందరు విద్యాప్రియులును, కొన్ని సంఘములును నేఁటేట బండితసభలు జరపి పండితులకు భూరి సంభావనము లిచ్చుట జరగుచునే యున్నది.

వేదశాస్త్రములును సంస్కృతభాషయు దేశభాషలును దొరతనమువారి యాదరాభిమానము లంతగా లేకున్నను దేశీయప్రభువుల యాలంబనమున వృద్ధినందుచుండ దొరతనమువారు తమ కొలువుకాండ్రకు నాంగ్లభాషతో దసమాత్రము దేశభాషాజ్ఞానముకూడ నవసరమగుటచే నాంగ్లపాఠశాలలలో నేకొలదిమంది పండితులకో కించిదుపాధి కల్పించుచుండువారు. క్రమక్రమముగ దేశదౌర్భాగ్యమునంజేసి పల్లెటూరిప్రజలకెల్ల దొరతనమువారి కొలువునం దాశ యధికమై తన్మూలమున నాంగ్లవిద్యావ్యామోహ మతిశయించుటంజేసి మాధ్యమికోన్నత పాఠశాలల సంఖ్య పెరుగుటయు, వాని

యందు దేశభాషాధ్యాపకు లధికముగా గావలసివచ్చుటయు దటస్థించినవి. కాని అర్హులగు పండితుల సంఖ్య అంతకంతకు దిగజాఱజొచ్చినది. ప్రజాసామాన్యమాంగ్ల భాషపై మరులుగొనుటయు, ప్రాచ్య విద్యాపండితులకు దేశీయులొసగు నాలంబ మంతకంతకు సన్నగిల్లుటయు దీనికి హేతువు లని వేఱ చెప్పవలెనా? మఱియు బండితుల నియమింపవలసినప్పుడు విద్యార్హత యుపేక్షింపబడి యాశ్రయణ పటుత్వము గణ్యమగుటయు దీనికి గారణమే. ఇట్లీ పండితక్షామము పెక్కు పెరుగుటకు సహింపజాలక చిరస్మరణీయులు మాననీయులు నగు కీ. శే. శ్రీ కృష్ణస్వామయ్యరు మొదలగు మహాశయులు విశేషప్రయత్నములొనరించి తమకు దొరతనమున గల పలుకుబడినెల్ల వినియోగించి మదరాసు విశ్వవిద్యాలయమువారిచే దేశభాషలందును వేదశాస్త్రములందు నున్నతపరీక్షల జరిపించి పట్టములిచ్చు నేర్పాటుచేయించిరి. కీ. శే. కృష్ణస్వామయ్యరుగారికి వేదశాస్త్రములం దాదరాభిమానము లపారములు. తాము స్వయముగ దమ తండ్రిగారిపేర నొక కళాశాలస్థాపించి అందు వేదమును బూర్వోత్తరమీమాంసలును గఱపు నేర్పాటుచేసి విద్యార్థుల కన్నవస్త్రములు బసలుకూడ నొసంగుచుండిరి. ఆ కళాశాల నేటికిని దినదినాభివృద్ధి నొందుచు ప్రాచీనగురుకులపద్ధతిని జూపరులకు గోచరింపజేయుచున్నది. ఇంతియకాక, ఆంధ్రదేశమున విజయనగరమహారాజసంస్కృత కళాశాలయందును, తెనాలి సంస్కృత కళాశాలయందును, నరవదేశమున పంచనదము మొదలగు స్థలములందును, కేరళదేశమున పట్టాంబి మొదలగు చోటులను గొప్ప కళాశాలలు నెలకొల్పునట్లును వానియందు ప్రాచ్యవిద్యాపట్టపరీక్షలకు విద్యగరపుటకును విశేషప్రోత్సాహము గావించిన యామహామహుని నామ మెల్లరకు ప్రాతస్స్మరణీయము గదా?

౧౯౧౫ ఏప్రిల్ ౧౯ తేదిని మొట్టమొదటి ప్రాచ్య విద్యాపరీక్ష మదరాసు విశ్వవిద్యాలయము వారి సెనేటుభవనమున(నిప్పుడు శాసనసభ సమావేశమగు చోట) జరిగినది. నాటినుండి నేటివఱకు ననేకులు పరీక్షలం దుత్తీర్ణులై నలుదెసల వ్యాపించుచున్నారు.

మొట్టమొదట నీపరీక్షలవలన నుద్యోగములు లభించుననునాశ గాఢముగ ప్రేరేపించుటచేతనే యనేకు లీపరీక్షలకు జదువుట సంభవించినదనుట పాఠకులు గ్రహింపకుండరుకదా? అయినను విద్వాంసులకును, విదుషీమణులకును, శిరోమణులకును బిరుదములు లభించుచున్నవేకాని యుపాధులుమాత్రము శశవిషాణములే అయిపోయినవి. పంచాంగము చంకబెట్టుకొని చేత చెంబుపట్టుకొని యాయావరము చేసికొను బ్రాహ్మణున కేనాటి కష్టమునకు దగినఫల మానాడే లభించునుగాని కళాశాలాధికారులును, నధ్యాపకులు నొసంగినయోగ్యతాపత్రముల చేతపట్టుకొని యధికారుల వాకిళ్ల పడిగాపులు పడియున్న విద్వాన్ శిరోమణులకు మాత్రము లేశమైన ఫలము లేదయ్యె. ఈ దౌర్భాగ్యప్రాచ్యవిద్యాపట్టభద్రులు పదితరము లీలోగా సంపాదకత్వ మెఱుంగరు. అదియే వీరికి జేతనైనచో వీరు నాంగ్లవిద్యాపట్టభద్రులే కాదగుదురు. వినుచున్నారముకదా ఆంగ్లవిద్యాభ్యాసమున మహోన్నతి బొందినవారిలో ననేకులు పాకశాసనులయో, గంగాధరులయో, దేవతార్చకులయో బిడ్డలేయని.

లెక్కకుమిఱిలి యెక్కులతోడి చెదపురుగుల వోలె నంతట నల్లలాడుచున్న వీరి దురవస్థ చూచియు ననర్హులు పాఠశాలలందు నిండుటకు సహింపకయు గొందఱు విద్యాభిమానులు కావించిన ప్రయత్నముల వలన “ఇకముందు కాలీవచ్చు పండిత పదవులకు ప్రాచ్య విద్యాపట్టభద్రులనే తక్క యితరుల నియమింపరా”దను దొరతనమువారి ప్రకటనము వెలువడినది. ఐనను ఆ యాజ్ఞను మన్నించిన పాఠశాలాధికారి సామాన్యముగా గానరాడు. పాఠశాలాధికారుల దౌష్ట్యమున కుపాధ్యాయ పండిత పరిషత్తు కొంత దోహదముగావించుట సత్యము కాకపోలేదు. ౧౯౨౭ సంవత్సరమున దొరతనమువారు మరల నొకప్రకటనము గావించిరి. దాని సారాంశ మిట్లున్నది: “ఇకముందు కాలీవచ్చు పద

వులందు దప్పక ప్రాచ్యవిద్యాపట్టభద్రులనే నియమింప వలయును. ఇంతకుపూర్వము నియమింపబడి ఖాయపడు పడియున్న పండితులకు ప్రత్యేకానుమతి యీయబడి నది" అని. ఈ గూర్డరుహాఁ పూర్వమువలెనే పాఠశాలాధికారులచే నిరాకరింపబడిన దృష్టాంతములు పెక్కు గలవు.

దొరతనమువారు కఠినముగా శాసించుచున్నను వారిప్రకటనను లుల్లంఘింపబడుటకు గారణ మేమా యని పలువురకు సంశయ ముదయింపవచ్చును. కాని యట్లుల్లంఘించుటకు దగునవకాశములు దొరతనమువారి యాజ్ఞలందే కలవు. శాసనసమ్మతమగు నర్హతగల పండితులు లభింపనప్పుడు మండలవిద్యాధికారి విచక్షణను నుపయోగించి యే యభ్యర్థికైనను ననుమతి నీయ వచ్చునను నాజ్ఞరొకటి కలదు. దాని నాధారముగా గొని పాఠశాలాధికారులు తమ యిష్టము వచ్చిన పండితు లను నేర్పాటుచేసికొనుటకు అనుకూలముకలుగుట వింత కాదు.

ఏతావతా విశ్వవిద్యాలయమువారి యీ పరీక్షల వలన నేటేట వందలో పదులలో పట్టభద్రులు తయా రగుటయు నూటి కిరువదికైన నుద్యోగములు లభింప మియు నేఖర్చువెచ్చములు లేక మాధుకరాన్నముచే పొట్ట నింపుకొనుచు విద్యాభ్యాసము గావించు పేద బాలురకు పరీక్షల రుసుములకని, పాడు పుస్తకములకని కళాశాలార్హములగు గుడ్డలకని అనవసరవ్యయము గలు గుటయు ఫలితములు. ఇంతియకాని విద్యాస్నాతకు లకు దొంటి జీవికోపాధికాని, గౌరవముకాని లభింప కున్నది. పైపెచ్చు పరీక్షానియమితపాఠ్యగ్రంథముల అవకతవకలచే పూర్వముకీర్తి పాండిత్యముగూడ లభింప కున్నది.

ఆంధ్రులకు ప్రత్యేకవిశ్వవిద్యాలయ మున్ననే కాని దేశాభివృద్ధి కానేరదని పెక్కండ్లు పెక్కురు మహానుభావులు గావించిన యాందోళనఫలితముగా నా విర్భవించిన యాంధ్రవిశ్వవిద్యాలయము ఎల్ల విధముల మద్రవిశ్వవిద్యాలయమునే యనుకరించుచు విశేష ధన వ్యయమునకు గారణమైయున్నదేకాని దానివలన జెప్పు కొనదగిన లాభమేమియును లేదు. పూర్వ మొక్క మద్ర విశ్వవిద్యాలయమువలన మాత్రమే వందలువందలుగా విద్వాంశిరోమణులు తయారగుచుండ నాంధ్రవిశ్వ విద్యాలయమున రెట్టింపుగ ప్రవీణులు తయారగు చున్నారు. పైపెచ్చుగ ఇంటరుమీడియేటు పాసయిన తరువాత కేవలము ఆంధ్రభాషలోనే ఆనర్సులు లెక్కకు మిక్కిలిగా తయారగుచున్నారు. ఈ పరీక్షల వలన నిరుద్యోగత్వ మింకను బలపడుచున్నదియే కాని శాంతి యించుకయును గలుగకున్నది. ఆంధ్ర విశ్వవిద్యా లయము సొంతముగా కళాశాల స్థాపించి ఆంధ్రభాషా ప్రధానమగు ఆనర్సుకోర్సుల నేర్పఱిచినది. ఆపరీక్షకు జదువవలసిన కాలము మూడేండ్లు. అధ్యాపకులు బహు సమర్థులు. పరీక్ష్యగ్రంథములు నుత్తమములు. అట్టియ్యు ఆనర్సుల పాండిత్యముమాత్ర ముండవలసినంతగా గానరాదు. వారికి సంస్కృతభాషాపరిచయము శూన్యము. తక్కిన దేశభాషలమాట యెట్లున్నను నాంధ్రభాషకు మాత్రము సంస్కృతభాషా పరిచయ మత్యావశ్యక మనుట ప్రాజ్ఞసమ్మతము. సంస్కృతపరిచయమే లేనిచో పూర్వగ్రంథములు కొఱుకఁబడవు ఇట్టి నిష్ప్రయోజనములగు ప్రశ్నలను ఆనర్సులను దయారుచేయుటమాత్రమున విశ్వవిద్యా లయోద్దేశము నెఱవేఱుచున్నదని సంతసింపవచ్చునే కాని వారికి పొట్టగడచుమార్గ మేదియు నగపడ కున్నది. ఇదివఱకు విద్వాంశిరోమణులు ప్రవీణులు మాత్రమే దేశభాషాధ్యాపకపదవుల కఱ్ఱులుచాచి యుండగా నిప్పు డానర్సులుకూడ వారికి తోడై "యాచకా యాచకద్విషః" యన్నట్లు దొమ్మియుద్ధము లారంభించుచున్నారు.

"విద్య జ్ఞానార్జనమునకే కాని పొట్టకుకాదు" అను శ్రీరంగనీసులు ఉపన్యాసవేదికలపై గంభీరముగ నేకరువుపెట్టవచ్చునుగాని నిక్కముగా జ్ఞానార్జనమునకే విద్యాభ్యాసముచేసిన, తమ పిల్లలచే చేయించుచున్న మహర్షు లెందును గానరారు. అందును భాషాప్రధానము లగు నీ పరీక్షలయందు మిక్కిలి దారిద్ర్యము తాండవించు

చున్నది. ఎక్కడ ఏచిన్న తెనుగు పండితపదవి కాళీ వచ్చినను వందలకొలది విద్వాంసులు ప్రవీణులు ఆనర్సులును ప్రత్యక్షము. అయినను ఒక విశేషము మాత్ర మున్నది. రెండు మూడు ప్రాచ్యవిద్యాపరీక్షలందు తీర్ణు లయిన పట్టభద్రులనేని నిరాకరించి యీ ఆనర్సుల కుద్యోగములు ప్రసాదించుట పాఠశాలాధికారుల కభిమతముగ సర్వత్ర గోచరించుచున్నది. కేవలము భాషాప్రధానము లగు నీరెండు పరీక్షల జరుపుటవలన విశ్వవిద్యాలయము వారికి విద్యార్థులకును నధికధనవ్యయముదక్క ఫలితము మాత్రము శూన్యమే.

ఏకారణముననో కాని దొరతనమువారికి ప్రాచ్యవిద్యాపట్టభద్రులపై గల ప్రేమవాత్సల్యము లిప్పు డింకఁబాఱినవి. ౧౯౩౭ సంవత్సరమున గూడ దేశభాషాధ్యాపకపదవులకు ప్రాచ్యవిద్యా పట్టభద్రుల నియమింపరా దను(?) నిత్యాది ప్రకటనములు గావించిన దొరతనమువా రిప్పుడు భాషాప్రధానమగు బి. ఏ. ప్యాసయినవారికి బండితపదవు లీయవచ్చునని దయచూపుచున్నారు. ఇంతియకాక భాషాప్రధాన బి. ఏ. పరీక్షలు, ప్రాచ్యవిద్యాపరీక్షలు సమానముసేయని న్యాయము చెప్పుచున్నారు. ఈపూర్వనిర్ధారణలవలన ప్రాచ్య విద్యలవారికి కిదివర కున్న లేశమాత్ర మవకాశముగూడ మూలముట్టుగ పెకలింపబడినది. దొరతనమువారి పరస్పర విరుద్ధాజ్ఞలకు గారణమేమో దురూహము. ఇంతకు ముందు పదులు పాతికలు జీతబత్తెములతో గాలము గడపు ప్రాచ్యవిద్యలవారు తమ జీవితకాలమున బూర్తిగా బొందలేకున్నను మాటకరుకైనను నెలకు డెబ్బది రూపాయలు జీతము పుచ్చుకొందురను ప్రధాని శ్రీ బొబ్బిలిరాజాగారి స్కేలు దొరతనమువారి ప్రకటనములకు వైరుధ్య మాపాదించియుండును. వాస్తవముగ ఆస్కేలు అణ్ణమలైనిస్డ ఆనర్సులకు, బి. ఏ. లకును మైనర్డునుగ్గలు ఫైనలువారికంటె గూడ దక్కువవేతనముల నిర్ణయించి గొప్ప అన్యాయము గావించుట నిక్కము. దానివలననే బి. ఏలు, ఆనర్సులును ప్రాచ్యవిద్యలవారిపై దండెత్తుటయు, విపరీత ప్రకటనములు వెలువడుటయు సంభవించియుండును. దొరతనమువారి ప్రకటనముఆంగ్లవిద్యావంతులలోని నిరుద్యోగతను గొంత వఱకు తగ్గించుటకు జూచినదేకాని యందుగల్గు పూర్వాపరవిరోధములగాని, న్యాయాన్యాయములనుగాని గమనింపలేదనుట స్పష్టము. నిరుద్యోగత ఒక్క బి. ఏ. లు ఎం. ఏ. లకేకాదు; విద్వాంస శిరోమణులకు గూడ తలమున్కలుగా నున్నది. ఆంగ్లపట్టభద్రులకు నిరుద్యోగత్వము పోఁద్రోలుటకు విద్వాంసులతో సరిచేసినట్లే విద్వత్ప్రవీణశిరోమణుల నిరుద్యోగత మాపుటకు ప్రాచ్యవిద్యాపట్టభద్రులు మూడవఫారము సర్టిఫికేటు లేకుండనే హైయర్ ఎలిమెంటరీ క్లాసు బోధింపుటకు హాజరుకావచ్చునని గూడ యొక జి. ఓ. బయలుదేరినదని వినవచ్చుచున్నది. ఇదియే వాస్తవమైనచో నిశ్చయముగ నింతకంటె ప్రమాదమింకొకటి యుండబోదు. 'నీ అన్నము నాకిచ్చిన నీ కాకలి లేకుండునట్లు మందిచ్చెద' నన్న శిరోమణివలె నీప్రకటనము ప్రాచ్యవిద్యాపట్టభద్రులకు మిగులుచున్న అవకాశము హరింపనేల? పిదప వారికి వీరికిగూడ నవమానకరమగు నుపాయము చూపనేల?

ప్రాచ్యవిద్యాపట్టభద్రులు విశ్వవిద్యాలయము వారిచే గ్రాడ్యుయేట్లుగా బరిగణింపబడినారు. అయినను న్యాయముగ వీరు ఆంగ్లగ్రాడ్యుయేట్లకంటె నధిక కాలము విద్యాభ్యాసము గావించినట్లు స్పష్టమే. ఇంటరుమీడియేటుపరీక్షలందలి దేశభాషాప్రశ్నపత్రమును, ప్రాచ్యవిద్యాప్రవేశపరీక్షకు జరుపవలసినట్టి ఎంట్రన్సుపరీక్ష ప్రశ్నపత్రమును సమానములని విశ్వవిద్యాలయమువారే నిర్ణయించియుండిరి. ఇంగ్లీషున ఆరుఫారములు మాధ్యమికపాఠశాలలందు నిర్ణీతమైయున్నట్లే ప్రాచ్యవిద్యలకు ఆఱు అడ్వాన్సుక్లాసులు గలవు. పైగా యింటరుమీడియేటుతో సమానమగునది ఎంట్రన్సుపరీక్ష. అందుత్తీర్ణులైనపిదప ప్రిలిమినరీ రెండేండ్లును, ఫైనలు రెండేండ్లును జదివిన ప్రాచ్యవిద్యాపట్టభద్రులగుదురు. ఆంగ్లగ్రాడ్యుయేటుల విద్యాకాలమును ప్రాచ్యవిద్యల ప్రిలిమినరీ కాలమును సమానములు. పైగా ఫైనలు రెండేండ్ల పరిశ్రమము ప్రాచ్యవిద్యాపట్టభద్రులకు గలదు. ఇట్లుండ విశ్వవిద్యాలయమువారు గ్రాడ్యుయేట్లుగా పరిగణించి నంతమాత్రమున పఠనీయములుగా నియమితగ్రంథములను రెంటి మూటిని జదివి సమాధానమైన దమ భాషలో వ్రాయజాలక ఆంగ్లభాషలో వ్రాయు గ్రాడ్యుయేట్లను చిన్నప్పటినుండి అదే పనిగా దేశభాషాధ్యయనమొన

ర్చిన ప్రాచ్యవిద్యలవారికో సరిచేయుట అన్యాయ్యమో న్యాయ్యమో లోకమూహింపకుండునా? ఇంతియకాక ప్రాథమికపాఠశాలలో నాలవ తరగతియందు దుత్తీర్ణుడై ఏకేండ్లక్కడనో నామరూపములులేని పాఠశాలలో నుపాధ్యాయుడుగానున్న మహానుభావులు మూడవ ఫారము సర్టిఫికేటు లేకుండనే నిలువదగిన హైయరు ఎలిమెంటరీ పరీక్షకు ఖండాంతరీయుల చేతను గూడ శెక్కిచిగములు మన్ననలందిన, అందునున్న ప్రాచ్య విద్యల నాటితేరిన పండితులు హాజరుకావన్నను ప్రకటనము నిక్కముగ నిరుద్యోగత నశింపజేయుటకా, లేక ప్రాచ్యవిద్యలను దదధ్యేతలను నవమానించుటకా? జీవికోపాధి కల్పించుటకేనైనచో నెన్నడు నిట్టి కష్టకర్తి కూడ చూపగూడదు. ఇట్టి జీవిక లేకున్నను బురాణములు చెప్పుకొనియైనను, లేదా బి. ఏ., ఎమ్. ఏలకు దేశభాషలందు ప్రైవేటుట్యూషను చెప్పుకొనియైనను వారు జీవింపగలరు. ఈ సదుపాయము ఆంగ్లపట్టభద్రులకే చేసినచో వాస్తవముగ మహోపకారము చేసిన ట్లగును. ఏలందురా? బి. ఏ., ఎమ్. ఏలు ప్యాసయి తొమ్మిది మాసములు యల్. టి. పరీక్షకో, బి. యి. పరీక్షకో చదివినవారికి ఎలిమెంటరీ స్కూళ్లలో మూడవఫారము హెడ్మాష్టరుగ్రింద అసిస్టెంట్లుగా ౨౫ రూపాయల జీతముతో నుద్యోగము చెలాయించుచున్నవారెందరో కలరు. బి.ఏ. లైనను, ఎమ్.ఏ. లైనను, ఒ. యి. యల్ టీ లైననే యీ ప్రాథమిక పాఠశాలల పనికైనను నర్హులగుదురు. లేనిచో నేటేట మండల విద్యాధికారి ప్రత్యేకానుమతి బడయవలసియుండును. అట్టిచో వారికీ యవకాశమిచ్చినచో విశేషవ్యయముతో సైదాపేటలోనో, రాజమండ్రిలోనో జదువ నక్కరలేకయే అనాయాసముగానే హయ్యరు ఎలిమెంటరీ ప్యాసయి సులభముగనే ఉద్యోగములు గూడ నొందగలరు. అప్పుడు ప్రాచ్యవిద్యలవారికి మానుషాపాదితమైన దారిద్ర్యము నశించును. దైవికమైన దారిద్ర్యమా? అది అందఱకును గలదు. అసలు ఆ దారిద్ర్యము ప్రస్తుతవిద్యావిధానమునందే కలదు. ప్రకృతవిద్యావిధానము లోపభూయిష్ఠమని యెల్లరు ఘోషించుచునేయున్నారుకదా? ఎప్పుడో నూటేండ్లకు పూర్వము దొరతనమువారి కొలువున కవసరమై నిర్ణీతమైన విద్యావిధానమే కోట్లకొలది జనమున కాధారమైన వీరందఱకు నౌకరీ లెవ్వ రెక్కడ నిత్తురు? నౌకరీతప్ప నితరోపయోగములేని విద్యావిధానము దారిద్ర్యనిలయ మెట్లుకాకుండును?

మొట్టమొదట ఆర్యులు వర్ణవిభాగము గావించుకొన్నపుడు వేదవేదాంగవేదాంతాదులను జదువుచు వానినుజ్జీవింపజేయుటయు, ప్రజాపాలనము, వాణిజ్యము, కృషి మొదలగువానిని నాలుగువర్ణములవారికి విహితవృత్తులుగా నేర్పఱచుకొన్నారు. అందు మొదటిది కేవలము ఐహికఫలము లేక వారివేదశాస్త్రాదులను నిలుపుటకుమాత్రమే యుపకరించును. ఇతరవృత్తులు శారీరికమానసికకష్టములతో గూడి ఐహికఫలముల నిచ్చునవి. ఐనను ఆర్యులు మొదటివృత్తికే యధికగౌరవ మొసంగి యితరవృత్తులవారు తమకుదగినంత పరిశ్రమావకాశము లేకున్నను, దానితరులకు జెప్పుటకు దీరికలేకున్నను ఆవశ్యకముగా తామైన పఠించుచు పఠనపాఠనములచే దమవిద్యల నుజ్జీవింపజేయు మొదటివృత్తిని గురుపదముగా భావించి గౌరవించుచుండిరి. తన్మూలముననే కదా ఆర్యభావములు, వేదవేదాంతములు నిప్పటికిని వాసితఱుగక నిలిచియున్నవి. అట్లే యిప్పుడు మాత్రమే కాక యెల్లకాలము దేశభాషలను, ప్రాచ్యవిద్యలను ప్రధానముగా నభ్యసించి వాని నుద్ధరించువారు కొందఱుండక తీఱదు. వారికి తగినపరీక్షలును శ్రమమునకు దగిన జీవికాసాధనములును గూడ నేర్పఱచుట దొరతనమువారికిని, దేశీయులకును బరమకర్తవ్యమే. ప్రాచ్యవిద్యలవారి కవమానముగాని, అపకృతిగాని గావించిన నిశ్చయముగ భాషాశాస్త్రనాశమునకే (దేశనాశమునకే) పూనుకొన్నట్లు భావింపవలయును.

ప్రాచ్యవిద్యలయు, దత్పట్టభద్రులయు గౌరవమును జీవికలను రక్షింపవలయు నందురని దొరతనమువారు తమ పరస్పరవిరుద్ధప్రకటనముల సవరించి ప్రాచ్యవిద్యలవారికి తగినయుపాధి తప్పక లభించునట్లును, ప్రాచ్యవిద్యలు పదికాలములపాటు జీవించియుండునట్లును జూడవలయును. దేశాభిమానులును దేశభక్తులును దమ దేశగౌరవము భాషలవలననే లభించునని గుర్తించి ప్రాచ్యవిద్యాభివృద్ధి కెక్కువగా పాటుపడవలయును.

# చిల్క

రాయప్రోలు సుబ్బారావు

పుట్టింది ఒకచిల్క——
పొలముపచ్చల పైట
పొరలు వాఁకలనాట
అల్లారుముద్దుగా — అందాలహద్దుగా.

పెరిగింది ఆచిల్క——
పిండివెన్నెలసీమ
పిల్లతెమ్మెరలోమ
పూబొత్తికలలోన — పోకిల్లు కలలీన.

త్రావింది ఆచిల్క——
తళుకుతీవెల రాలు
తరిపె రంగులపాలు
పతూలుపచ్చగా — పలువన్నెలెచ్చగా.

చవి జూచె నాచిల్క——
చల్లవెన్నెల రేల
చందమామల మ్రోల
పండుటాకులజున్ను — వెండిగిన్నెల వెన్న.

ఆడింది ఆచిల్క——
అలరు మావులతోట
ఆడుబిడ్డలతోడ
ఆబాలగోపాల — మానందమునసోల.

పలికింది ఆచిల్క——
తెలుఁగుమీటి మరంద
మలుఁగువాఱ నమంద
సౌందర్య మూరగా — సారస్వధారగా.

నేర్చింది ఆచిల్క——
నిండు కమ్మదనాల
పండ్ల పక్వరసాలు
పొంగారుపదములన్ — బంగారుఫణుతులన్.

వినిపించె నాచిల్క——
తెనుగు వాకిండ్లలో
పెనగు పూచెండ్లలో
మిసలాడుమవ్వాల — అసియాడు అందాల.

పాడితే ఆచిల్క——
పారవశ్యము పొంగు
భావదాస్యము క్రుంగు
తెగిపోవు వీణియల్ — దిగువచ్చు వాణియున్

ఆచిల్క అమృతోక్తి——
కారాటపడె గీతి
కారాడె నునుకైత
రాగాలముద్దుకో — రసపాకసిద్ధికో !

విన్నారు జనులెల్ల——
విన్నారు పండితుల్
విన్నారు పాటకుల్
భూచక్ర ముల్కగా — ఆచిల్క పల్కగా.

బ్రహ్మాండ మయినట్టి——
భాష్యాలు తుదముట్ట
పఠియించె నొకభట్టు
పాండిత్యమున వచో — భాండంబు బరువెక్క.

ఆచిల్క నుడికారర—
మావేశ మెగబోయ
ఆలించి వలవేయ
పరవశంబున జిక్కె — పారతంత్ర్యమె (పరతంత్రతనె) మెక్కె

తెలుపారె తూర్పెల్ల—
జెనుగు కుంకుమతీగ
లనుగు కొమ్మలు సాగ
ఎలుగెత్తెనా చిల్క — అలవాటు మెయికుల్క.

వినువారు లేరైరి—
చనువారలు హాలంత
గణపాతము లజంత
భేదాపవాదాలె — చాదేరు ముప్వేళ.

తన ముద్దుగీతాల—
కనువైన లయలేదు
చనువైన శ్రుతిరాదు
పదశోధనమె, సంధి — సదమదమ్ములె యెందు.

తన రెక్కలను నిక్క—
తరుగేమల్ పెనవోవు
తళతళల్ కనరావు
ఆధాతు దుర్గాల — నా దేశమార్గాల.

పొదకట్టి వేసట్టు—
పొడుచు పూవుంబస్లు
పడుచు మావికుడల్లు
మారేడుతరులెల్ల — మహాసీయకుశలెల్ల.

ఆయగ్ని వేదికర్—
ఆశబ్దఘోషలో
ఆకెట్ట భాషలో
ఉడికింది ఆచిల్క — మిడికింది కడునల్క.

మ్రాంగన్ను పెట్టింది—
మధురకంఠము మూసి
మనసుముచ్చట రోసి
గాసిల్లి గాసిల్లి — ఆసించె తొలియిల్లె.

భారతారణ్యాన—
పడిపోమె నా భట్టు
విడిపోమె వాకట్టు
ఇదె సందనుచు చిల్క — మెగిరిపోయింది.

దానిమ్మపండ్లలో—
తరుణ మాణిక్యాల
నవుణరేఖలు తేల
తీసింది ఆచిల్క — తేటనెత్తురులొల్క.

తినబోయి తినలేక—
తననోట బిగియించి
కనుసూటిగ లగించి
వ్రాలింది పెన్నాగ్ర—వంతియొద్దున సందె.

పచ్చికెంపులబువ్వ—
భక్షింపగా నుండె
వీక్షింప కేదండ
ఒడిసిపైకొనె నింత — లో నొక్క తిక్కన్న.

# ఆంధ్రరాష్ట్రమునకు ఆలస్యమేల?

## (ఆలస్యమువలన కలుగు మహానర్థములు సత్వరకార్యనిర్వాహణావశ్యకత)

— గరిమెళ్ల సత్యనారాయణ

ఆంధ్రు లారంభశూరులన్న నూట ఆధునికకాలములో అన్వర్థమైపోయినది. దేశోద్ధారకుని పత్రికా సంస్థలు, పట్టాభిగారి బందరుసంస్థలు, ఉన్నవవారి శారదానికేతనము మొదలగు కొన్ని మాత్రము ఈసూత్రమునకు కాస్త వ్యతిరేకములై నేటివరకును నిలిచియున్నవి. తగిన కట్టుదిట్టములు చేస్తే చిరస్థాయులే కాగలవు. ఇంక రాజమహేంద్రవరం పేపరుమిల్లుకు పాపరుచీటీ వచ్చినది. చెన్నపురి స్వరాజ్యపత్రికకు కన్నం పడిపోయినది. ఎన్నెన్నో పారిశ్రామిక సంస్థలను యెన్నెమ్మ కొట్టివేసినది. క్రొత్త క్రొత్తగా ఊహింపబడుచున్న సినీమాకంపెనీలు రిక్తప్రకటనలగుచున్నవి. దేశీయ విద్యాప్రయత్నములు తేజోహీనములగుచున్నవి. కొన్ని కొన్ని ఖద్దరుసంస్థలుకూడ కత్తీలపాలగుచున్నవి.

ఇందుకు కారణము లేకపోలేదు. ఏ సంకల్పమునైనను ప్రారంభించేనాడుండే విజృంభణముఆమర్నాడు ఆంధ్రుల కుండదు. ఆరంభములు అత్యంతమగు అట్టహాసముతో జరుగును. ఆ సంస్థలకు ఆరంభకులుగా, ఉపన్యాసకులుగా, అధ్యక్షులుగా, కార్యదర్శులుగా, కోశాధ్యక్షులుగా, భాగస్వాములుగా చేరేవారి సంఖ్యకు మితియుండదు. ఎవరిని చేర్చుకొనకున్న యేమి ముప్పు వచ్చునో అన్నంత ఉప్పెనగా ప్రతీదీ మొట్టమొదట ఉండును. ఇట్టి శుభోదయముతో ప్రారంభమైన సంస్థకు అడ్డు యేదైనను రాగలదా అన్నంత ఉత్సాహము మొదటి కొన్నాళ్లదాకా ఆంధ్రుల నందరినీ ఉల్లాసాల లూగించుచుండును. ప్రోస్పెక్టసు అచ్చుపడగానేనో, పేరులు ప్రకటింపబడగానేనో ఆ ఉద్దేశము కొంచెము తగ్గును. కార్యోపక్రమణమనేటప్పటికి కలతలు ప్రవేశించును. అక్కడనుంచి కార్యదర్శుల పాట్లు చెప్పనక్కరలేదు. సభ అనేనాటికి కోరముకూడుటయే కష్టము. కూడితే ఒక నిర్ణయమునకు రావడము కష్టము. దీనితో ఒకరిద్దరు వెనుకతగ్గి బిగి తగ్గించివేతురు. ఇతరులు వీరి ననుసరించి విరమింప ప్రయత్నము చేయుచుందురు. అటుతరువాత సైంధింసఅప్పు కడు సులభముగ తెగివేరిపోవును. కొందరికి కొంతనష్టములో వివేకముదయించి, వచ్చే ప్రయత్నాలలో అడుగుపెట్టుట మానుకొందురు.

ఇతరరాష్ట్రములు, అనగా బెంగాల్, గుజరాతు, పంజాబు, బొంబాయిలలో అనేక జాయింటుస్టాకు కంపెనీలు, మిల్లులు, భీమాకంపెనీలు, ఫిల్ముచిత్రములు, బ్యాంకులు మొదలగునవి లేచి దినదిన ప్రవర్ధమానములగుచుండగా మన ఆంధ్రరాష్ట్రములో అవి చాలా అరుదుగా ఉన్నవి. ప్రతీరాష్ట్రపు విదేశపుకంపెనీవారున్నూ మన ఆంధ్రరాష్ట్రమును పలువిధముల దోచుకొనుచుండగా, మనశ్రమను ద్రవ్యమును మనము వారికి ధారపోయుచున్నాము. ఇతరరాష్ట్రములలోని యెట్టి డిగ్రీలును లేని యువకులు నెలకు వందలు వేలు జీతములు లాగుచుండగా మనము పెద్దచదువులకై ఆస్తులు తగుల బెట్టుకొని నిరుద్యోగులమై మలమల మాడిపోవుచున్నాము. మనకు మూలధనమునకు కొదవా, ధీచాతుర్యమునకు కొరతా, కార్యనిర్వహణశక్తి తక్కువా, యోగ్యవర్తనకు లోపమా? కార్యంపట్ల ఐకమత్యము శూన్యముగ ఉండుటొక్కటే దీనికి కారణమనవలెను. ఈకారణమువల్లనే ఏకైకవ్యక్తి మాత్రస్థాపితములగు సంస్థ [illegible]వి. తక్కినవి కృశించినవి.

## సంఘీభావము అవశ్యము

ఇది కలియుగము, ధనయుగము, వాణిజ్యయుగము. పదిమంది కలిస్తేనేకాని ప్రసిద్ధమైన ప్రయత్నము లేవీ కొనసాగవు. పదిమందిమాట ఒక్కటైతేనే యే సంస్థఅయినా బాగా వర్ధిల్లుతుంది కాని, లేకుంటే అత్యంత ఉన్నత స్థానమునకు రాజాలదు. ఈ యుగములో అత్యంత ఉన్నతమైన సంస్థలుమాత్రమే ధక్కామొక్కలకు ఆగి కొంతకాలమువరకు నిలువనుకాని, సాధారణసంస్థలు చితికిపోక తప్పదు. పదిమందితో కలసి పనిచేసే శక్తి ఆంధ్రులకు తక్కువనుకోవాలి. ఎవరి క్రిందనో చాకిరీయైనా చేస్తారుకాని తమసంఘములో సమరసంగా వర్తింపలేరు. ఎవరిపట్టు నెగ్గాలని వారికే ఉబలాటం. పదిమంది పది త్రోవల లాగుతే అసలు పనే చెడిపోతుందనేనా వారికి దృష్టి ఉండదు. ఎవరికి తమత్రోవ యెక్కువగా ఉంటే వారు కొంతవరకే పైచెయ్యి కలిగి ఉండగలరుగాని, కలకాలం ఆస్థితిలో వారు ఉండలేరు. ఆటువంటి నిర్వ్యగ్ర స్థితికి అతనొకపార్టీ బయలుదేరతీస్తే వెంటనే మరోపార్టీ బయలుదేరుతుంది. ఎవరి పార్టీబలంకోసం వారు యెటువంటి పనులనైనా చేయుటకు సంకోచింపరు. మన గ్రామపంచాయతీసంస్థలు, నగరపరిపాలనసంస్థలు, కాంగ్రెసుసంస్థలు, శాసనసభాసంస్థలు, ఇదీ అదీ అనడమెందుకు— అన్ని సంస్థలలోనూ నేడు ఇటువంటి పార్టీలే ఉంటున్నవి. అవన్నీ పైనున్న కొన్ని ఉత్తరోత్తరాధికార సంస్థల క్రింద ఉంటున్నవి కనుక యేలాగో ఒకలాగ యీడ్చుకొనివస్తున్నవి; తక్కినవి వేగంవేగం తెగిపోతున్నవి.

ఈలాగైతే యేజాతియైనా యెప్పటికి అభివృద్ధికి రాగలదు? ఆంధ్రులు వెనుకబడుతున్నారు, ఆంధ్రభాష కేవలమడుగునున్నది, ఆంధ్రసంపద హరించుచున్నది, ఆంధ్రవిజ్ఞానము కళలు ఆరిపోవుచున్నవి, ఆంధ్రులు నిరుద్యోగులగుచున్నారు, ఆంధ్రరాష్ట్రసమస్య ఆలస్యమగుచున్నది అని పట్టిపట్టి ఆందోళనలు చేస్తే యేమి లాభము? ఆంధ్రులు మొట్టమొదట తమలో ఐకమత్యమును సాధించుకోవాలి. అప్పుడే క్రిందనున్న పల్లెటూరు బడిమొదలు పైనున్న ఆంధ్రరాష్ట్రముదాకా అన్ని సమస్యలు ఏకముహూర్తమున సులభముగా పరిష్కారము కాగలవు. అట్లుకాక ఈ అనేకత్వం ఉన్నన్నాళ్లు మనము ఈయీడు పాట్లన్నీ పడవలసినదే. ఆంధ్రులకు మొట్టమొదట కలుగవలసినది ఈ ఆంధ్రచైతన్యం. ఈ చైతన్యం లేకుండా వారికి వర్గచైతన్యం, కులచైతన్యం, మతచైతన్యం, జిల్లాచైతన్యం, గ్రామచైతన్యం, వ్యక్తిచైతన్యం కలుగుటవలన వారు మరింత పరస్పరకలహములకే పాత్రులై అసలుచైతన్యమునే కోలుపోవుదురు కాని నిజమైన జాతీయాభివృద్ధిని పొందజాలరు.

మనకు కావలసినది జాతీయచైతన్యముకాని, ఈ ఆంధ్రరాష్ట్రీయ చైతన్యమెందుకని ఆక్షేపించేవారు కొందరు లేకపోలేదు. ఈమాట నిజమేకావచ్చును కాని ప్రతిరాష్ట్రమువారును తమతమ చైతన్యములను ఆరీతి నుద్దీపింపజేసుకొని సర్వతోభివృద్ధికి వచ్చి భారతజాతీయచైతన్యమునకు తమవంతుని దోహదము చేయుచుండగా ఆంధ్రులదెసమాత్రం వ్రేలుపెట్టి దీని నొకనేరముగా చూపుట పాడికాదు. ఇట్టిచైతన్య ముదయించినంత మాత్రమున ఇతరులపై అసూయకలుగునని మన మనుకొనరాదు. వారిప్రతిభను ప్రశంసించు ద్వారానే మన కిట్టి చైతన్యజ్ఞానము కలుగవలెను. మనరాష్ట్ర విషయములయందు మన కెట్టిగౌరవాభిమానము లుండునో, అట్టివే ఇతరరాష్ట్ర విషయములందును, అఖిలభారత విషయములందును ఉండుటకు వీలులేదా? భాషాప్రయుక్త రాష్ట్రసమస్య కిట్టి వ్యాఖ్యానము నెవరును ఎన్నడును చేయలేదే. తిలకుమహాశయుడే దీని నంగీకరించెను. జవహరులాలే ఆమోదించుచున్నారు. ప్రతినాయకులును దీనిని ప్రశంసించుచునే యున్నారు. నిజముగా రాష్ట్రము లుండవలసిన పద్ధతియే అది. అంతేకాని బ్రిటిషు ప్రభుత్వ రాష్ట్రవిభజనపద్ధతి ఒకపద్ధతియేకాదు. వీలయినంతవరకు దానిని సవరించవలసినదే! దీని కాటంకము చెప్పటలో వివేకము లేదు.

## రాష్ట్రసమస్య

ఇట్టిరాష్ట్రమే మనకు తొలినుండియు ప్రత్యేకముగ ఉండినయెడల మనసమస్యలును సంస్థలును స్థితి

గములను నే కింత వెనుకబడియుంటవు. మనసమస్యను దేనిని పరిష్కరించుటకును నేను మనము కర్తలము కాకున్నాము. విద్యాసమస్య, పరిశ్రమలసమస్య, ఆర్థిక సమస్య, వ్యవసాయసమస్య, నీటిపారుదల సమస్య, వాణిజ్యసమస్య యేసమస్య పరిష్కారము కావలెనన్నను మనకు పైఅనుమతి ఒకటి కావలసియున్నది. ఆ పైఅనుమతినిచ్చు నదిపెక్కకలగాపులగం సంస్థయైయున్నది. అదియే మద్రాసు ప్రభుత్వము. ఆప్రభుత్వమునకు అందరితోవలె మనము కప్పములు కట్టుచున్నాము; విధేయతలు సలుపుచున్నాము; అభివృద్ధిని కల్పించుచున్నాము; కాని మనవిషయమైన ప్రశ్న యేదైనా వచ్చినప్పుడు మన అందరిమాటా చెల్లుటకు వీలుకాకున్నది. ఆప్రభుత్వము తన అనుకూలము ప్రకారము ఈప్రశ్నకు సమాధానము చెప్పును కాని, మనఅనుకూలము ప్రకారము మనకును, ఇతరుల అనుకూలము ప్రకారము వారికిని పరిష్కారమిచ్చే ఔదార్యము గలది కాకున్నది. కనుకనే భాషాప్రయుక్త రీతిని మనము నలుగురము వేరువేరుగ నున్నచో అందరిసమస్యలును యథానుకూలముగా పరిష్కరించుకొనవచ్చుననియే మనసంకల్పము. ఎవరుకాని దీనికి ఎందుకు అడ్డము చెప్పవలెనో అర్థము కాకున్నది. ఇతరులను మించికూడా మనలో మనమే స్పర్థలుపడి దీని కెందుకు ప్రాతికూల్యమును ప్రకటించవలెనో మరీ అర్థము కాకున్నది.

## అర్థములేని ఆక్షేపణలు

ఆంధ్రరాష్ట్రసమస్యకంటె మద్రాసు ప్రభుత్వసమస్య చాలా ప్రధానమైనదనియు, ఈనూతనప్రభుత్వ ప్రారంభావస్థలో దీనిని పైకియెత్తితే ఆప్రధానసమస్యకు ఆటంకము వచ్చుననియు మనకు కొన్ని హితబోధలుకూడా వినబడుచున్నవి. ఈరాష్ట్రీయ, రాజధానీయ, అఖిలభారత జాతీయ సమస్యలలో ఒకదానికి ప్రాధాన్యమును, ఇంకొకదానికి అప్రాధాన్యమునుకాని, ఒకదానికి ప్రథమప్రాధాన్యమును, ఇంకొకదానికి ద్వితీయ లేక తృతీయ ప్రాధాన్యమును కాని యిచ్చుటకు వీలు లేదు. అన్నిటికిని సమానప్రాధాన్యము నిచ్చినపుడే సమస్యను పరిష్కారము చిక్కగలదు కాని, ఇటువంటి భేదసృష్టివలన లాభము చిక్కబోదు. ఈభేదసృష్టి కేవలము కాలయాపనకు నెపమును, వేరుభావములకు ఆకరమును అనుచున్నదనుటకు సందేహము లేదు. ఇట్టి సృష్టి వల్లనే జస్టీసు, ఇండిపెండెంటు మంత్రివర్గములు ఈ సమస్యను దిగద్రొక్కి యథాశక్తిని కాలక్షేపము చేసుకొనగలిగినవి. కాంగ్రెసు మంత్రివర్గమునకు, అందులో ముఖ్యముగ మన ఆంధ్రశాఖకుకూడా ఇటువంటిసృష్టి లేదని మనము అనుకోవలెను. కాలయాపనమునకును నెపములను విడచి కార్యకరణమునకు దిగునట్టిదే యేమంత్రివర్గమైనను రాణించగలదు. క్రొత్తపంథాలకు దిగుటకై సంకోచించుచు తమకు చేజిక్కిన పదవుల నేవోయొకరీతిని నిలబెట్టుకొనుటకై తంటాలు పడుచుండుటవలననే గదా జస్టీసుప్రభుత్వము నిర్వీర్యమై అఖాతములో మునిగిపోయినది! అట్టి రాజనీతిని తిరస్కరించియే కదా కాంగ్రెసు మంత్రివర్గము ఎన్నియో నూతన సంస్కరణములకు గడంగుచున్నది! వీనిలో యే సంస్కరణముకన్న ఈసంస్కరణము తక్కువ ప్రధానమైనది? దీనికి కలిగే ఆటంకము లేమి?

ప్రారంభించిన నూతనసంస్కరణములకే చాలా సొమ్ము వ్యయమగుచుండగా, వానికి ఈ సంస్కరణమునుకూడా చేర్చి ఆవ్యయభారమును మరింత యెక్కువ చేయవలెనెందుకని కొందరు మహాశయులు ప్రశ్నించి మన ఆశయమును త్రోసిరాజు చేయుచున్నారు. రాష్ట్రములన్నీ కలసివుంటేనే దక్షిణఇండియా, లేక మదరాసు రాజధానీప్రభుత్వ మంతయు స్వయంసమర్థకముగా ఉండును కాని వానిని వేరుపరచుచో ప్రతిరాష్ట్రమును స్వయంసమర్థము కాక చేతిసొమ్ము తినులుకొనునని కొందరు వాదించుచున్నారు. ఇది కొన్ని భాగములపట్ల నిజమగునేమో కాని ఆంధ్రరాష్ట్రసమస్య నాలోచించినంత మేరకు సత్యముకాదని రూఢిగా చెప్పవచ్చును. సింధు, ఒరిస్సా, సరిహద్దురాష్ట్రములవలెగాక ఇది స్వయం సమర్థకమైనదని లెక్కలు స్పష్టపరచుచునే యున్నవిగదా! ఏ చిన్న భూభాగమో, ఏ అల్పసంఖ్యాకజనులో, వీరికొరకై ప్రత్యేకత యెందుకనువాన

మిక్కుడ పొసగదుగదా! మూడుకోట్లకు మించిన జనసంఖ్యయు, ౧౧ మండలములును గల ఆంధ్రావనిపైని ఈ నేరమును మోపతగదు గదా! ఇట్లు వేరు చేయుట వలన ఇతరభాగములకైనను విశేషనష్టము కలుగదు సరేగదా న్యాయమైన లాభములేవియో జరుగుచునే ఉండును. ఏది యెట్లున్నను నాలుగుభాషలును బ్రిటిషు ఇండియాలో సగము భూభాగమును గల దక్షిణ ఇండియానంతటిని ఒకే రాష్ట్రప్రభుత్వములో కుక్కు ఈ విధానము నిప్పటివలెనే కొనసాగించవలెనని సలహా యిచ్చుటలో అర్థములేదు. ఈ నాలుగింటిలోను అధికతర జనసంఖ్యయు, జిల్లాలును గల ఆంధ్రభాగమునైనను ముందుగా విడదీసి వారి పరిపాలనమును వారికొప్పగించుట ప్రప్రథమ కర్తవ్యము.

ఈ పని యింతకుముందెన్నో సంవత్సరముల క్రిందటనే జరుగవలసియుండెను. ఈ ఆందోళన ప్రారంభమై ఇరవై సంవత్సరములు దాటినది. దీనికి యేడు వెనకల ప్రారంభమైన ఆందోళనలెన్నో కార్యరూపమును దాల్చినవి. జస్టిసుపార్టీవారి అశ్రద్ధయు, కాంగ్రెసు పార్టీవారి అన్య కార్యనిమగ్నతయే దీని నిన్నేళ్లు ఆలస్యము చేసినవి. ఈ కాలములోనే మనభేదములను విస్తరింపజేయుటకును, పరస్పరస్పర్ధలు పుట్టించుటకును అనేక ప్రయత్నములు జరిగినవి. అయినను ఆంధ్ర రాష్ట్ర నిర్మాణము దైవనిర్ణయము. ఇట్టి పరస్పర స్పర్ధలు చిరకాలము నిలువజాలవు. నవ్యతరమగు ఆందోళన సకలభాగములయందును ఏకముహూర్తమున ప్రారంభమైనది. ఈబీజమును మొట్టమొదట నాటిన శ్రీ పట్టాభి సీతారామయ్యగారు తిరిగీ అనుపమానమైన ఆందోళనమును లేవనెత్తి దీనిని సాధించుటకై కంకణము కట్టుకొనియున్నారు. సందేహములు స్పర్ధలు పటాపంచలగుచున్నవి. ఇది కేవలము ప్రాంతీయ సమస్యగాకాక అఖిలభారతసమస్యగాకూడ పరిణమించినది. అఖిలభారత కాంగ్రెసు కమిటీనుండియే మద్రాసు ప్రభుత్వమునకు హుకుము రానున్నది. విజయము చేరవగుచున్నది. కనుక నాయకులును ప్రచారకులును కూడ చిలిపి సందేహములను మాని కార్యక్రమమునకై గడంగుట శ్రేయము.

“ఆంధ్రులలో ఐకమత్యములేదు. ఒకప్రాంతము వారు రాష్ట్రముకావాలంటే ఇంకొకప్రాంతమువారు వద్దంటున్నారు. ఒకపార్టీకి ఇంకొకపార్టీకి పొసగకుండా ఉన్నది. ఇవన్నీ సర్దుకుంటేకాని ఆంధ్రరాష్ట్ర సమస్య నాలోచించుటకు వీలులే”దని కొందరాంధ్రేతరులు ఇప్పటిప్పుడుకూడ వ్రాయుచున్నారు. ప్రత్యేకరాష్ట్రమేర్పడేవరకును ఇట్టిభేదములను రేపుటకును వర్ధిల్లుటకును అవకాశము లుంటూనే ఉండును. వీని కన్నిటికిని స్వస్తిచెప్పవలెనను సంకల్పముంటే ఆంధ్ర రాష్ట్రమును వెంటనే విభజింపకతప్పదు. ఆ మరునాటి నుండియు ఇట్టికాల్పనిక భేదములన్నియు నశించి ఐకమత్యధర్మము తనంతటతానే వర్ధిల్లగలదు.

ప్రత్యేకరాష్ట్రమైతే రాయలసీమవారికో, ఉత్తరసీమలవారికో కొన్ని ఇబ్బందు లుండునని కొందరు వాదింతురు. విశాలదృష్టితో చూచినయెడల నవి యెవ్వియును ఇబ్బందులుకావు. ఒకవేళ అయినను, ఈజిల్లాలన్నిటిని ఒక కాంపోజిట్టు రాష్ట్రములో కుక్కుట వలన కలిగే ఇబ్బందులకంటె యెక్కువకావు. ప్రస్తుతము అవి యిబ్బందులవలె కొందరకగపడినను ప్రత్యేక రాష్ట్ర మేర్పడగానే వానినన్నిటిని సవరించుకొని సమ్యగ్భావముతో వర్తించగల నేర్పు సిద్ధించకమానదు. ఒక కాంపోజిటురాష్ట్రములోనే ఎన్నోయిబ్బందులు పొందుచు కాలక్షేపము చేయువారు ప్రత్యేకరాష్ట్రములో కలతలుపడుతారన్నది వ్యర్థమగుమాట.

### భేదములు: నిజమైనవికావు

ఇంతకును ఆంధ్రు లేయేప్రాంతముల నెట్టియెట్టి ఆచారవ్యవహారాదులతోనున్నను ఆంధ్రులే. వారిది యేకభావ, యేకభావములు. వారిలాభములును నష్టములును సర్వసమానములు. ఒకరినష్టము నొకరిలాభముగాను, ఒకరి లాభమును తమనష్టముగాను భావించుకొందురని అనుకొనుటకు వీలులేదు. కొన్నికొన్నిమండలసమస్యలు ప్రత్యేకములనునుగాక, ఇప్పుడుమాత్ర

ము కాకున్నవా? సమిష్టి ఆంధ్రసమస్యలు వేనవేలున్నవే? వానిపోషణమునకై సంకుచితలాభ భావములను వారు త్యాగముచేసుకొనలేరా? గాంధీమహాత్ముని అసహాయయోగమునందు వారు ప్రదర్శించిన మహాత్యాగములలో ఇది యెన్నవవంతు? ఇంతకును, ఒక అవయవముకొరకై శరీరమునందలి ఇంకొక యవయవము పక్షేశ్రమ త్యాగ మనిపించుకొనదు; ప్రధానకర్తవ్యమే. అట్లే "రాయలసీమ" కొరకు సర్కారులో, "సర్కారుల" కొరకు రాయలసీమయో యేదేనా శ్రమపడవలవస్తే అది త్యాగమనిపించుకొనదు. సకలాంధ్రుల శ్రేయస్సే ప్రతిఆంధ్రుని శ్రేయస్సున్ను. ఏయొక్క వ్యక్తి అశ్రేయస్సునుకూడ ఆంధ్రరాష్ట్రము తనదంతటిదిగానే భావించి దానిని మాయనుచేయుటకై ప్రయత్నించును. అందుకనేగదా మనము ప్రత్యేకాంధ్రరాష్ట్రమునకై ఆందోళన ప్రారంభించినాము! ఈ ప్రత్యేకాంధ్రరాష్ట్ర-ఆందోళనను వ్యతిరేకించి సమిష్టి రాష్ట్రసంతృప్తితో కాలక్షేపము చేయుచున్న యెడల, ప్రత్యేకభాగములకు కలిగే విశేషపుష్టి యేమియును లేకుండుటను సరేకదా, సమాననష్టములు కూడ అపరిమితముగ నున్నవి. కనుక వ్యతిరేకభావముల కింతతో స్వస్తి చెప్పవలెను.

ఇంతకును ఆంధ్రమండలములను, రెండుఖండములుగా విభజించుట యెట్లు? దత్తమండలము లొకఖండమును, సర్కారు లొకఖండమును, తక్కినభాగము లొకఖండమునా? వీనిలోగల ప్రబలభేదము లేవి? వీరందరిదీ ఒకభాషకాదా, కులములు నాడులు మొదలగువానిలో భేదములు కలవా? ఆచారవ్యవహారములలో భేదములు కలవా? వీనిమధ్య కొండలు సముద్రములు నిలచి అంతరాయములు కలిగించుచున్నవా, రాకపోకలకు సులభోపాయములు తక్కువా? దేనినిబట్టి ఈఖండప్రభేదము? చారిత్రకముగానైనను ఇవి వేరువేరుభాగములా? ఎన్ని ఆంధ్ర, ఆంధ్రేతర సామ్రాజ్యములక్రింద ఇవన్నియు కలసియుండలేదు? ఎంతమంది ఆంధ్ర కవి, పండిత సచివోత్తములు వీనిలో సమానగౌరవముతో సంచరించుచు ఆంధ్రవిజ్ఞానమును, కళలను పోషించుచుండలేదు? ఎన్ని సందర్భములలో వీరందరును కత్తికట్టి సమానశత్రువులతో పోరాడి విజయధ్వజములను ప్రతిష్ఠించలేదు? ప్రతాపరుద్రునికన్న గౌరవ మొక్క ఓరుగల్లు ప్రాంతమువారిదేనా? శ్రీనాథుని పెంచినకీర్తి ఒక్క నెల్లూరు మండలముదేనా? పెద్దనాదులను, శ్రీకృష్ణదేవరాయలను వర్ధిల్లజేసిన తేజము ఒక్క రాయలసీమవారిదేనా? పంచమవేదమగు ఆంధ్రమహాభారతకృతిని ప్రారంభించిన యశశ్చంద్రిక నొక్క రాజమహేంద్రవరమే సుత్తగొన్నదా? కీరిలో నెవ్వరి పేరు దలను కొన్నను ఆంధ్రులకందరకును పులకాంకురములు పొడమకుండునా? రాయల పరిపాలనము కేవల దత్తమండలములతో ముగిసినదా? దక్షిణదేశమునం దంతటను ఆతనిధాటి వెలయలేదా, కటకమువరకును అతనిపరాక్రమము ప్రసరించలేదా? ఇంటింటను ప్రతీకవీశ్వరుని గ్రంథములను పఠించబడుచున్నవే, గోడగోడయందును ప్రతికవిని చిత్రపటమును తగిలించబడుచున్నదే, జిహ్వాజిహ్వయందును వారిపద్యములు చరిత్రములు సంచరించుచున్నవే! వీనిలో దేనిని ఏయాంధ్రుడు నాదికాదనగలడు, లేక నాదిమాత్రమే అనగలడు? ఈభేదము లీనాటికైనను పటాపంచలు కావలదా?

ఆంధ్రులందరును ఇట్టి స్వల్పభేదములను మాని యేకచైతన్యముతో విజృంభించగలిగిననాడే వారి ప్రజ్ఞ దేదీప్యమానము కాగలదు. ఆనాడే ప్రారంభప్రయోజనవిద్యలు సత్వరముగా వ్యాపించగలవు; మండలరాష్ట్రీయ పరిపాలనములు చక్కగా వర్ధిల్లగలవు; వ్యవసాయ వాణిజ్య పరిశ్రమలు సవ్యముగా విజృంభించగలవు; శ్రీ సౌభాగ్యములు చెలరేగగలవు; భాషాయోషామణి "శిరీషకుసుమ పేశల సుధామయోక్తుల" చిందగలదు; కావ్యనాటకాలంకారములు కమనీయములు కాగలవు; స్వల్పభేదము లెల్లయు తొలగి సౌమనస్యము చెలగగలదు; అఖిలభారత జాతీయాభివృద్ధికి కూడ మన మిప్పటికంటె చక్కని దోహదమొసంగగల్గుదుము. ఈలోపల మన లోపముల నెన్నిసార్లు మనము లెక్కపెట్టుకున్నను లాభములేదు. అవి యెల్లయు తొలంగగల తరుణౌషధ మొక్కటియే. అదియే స్వరాష్ట్రసంసిద్ధి.

అందుకే మన ప్రయత్నముల నేకముఖము చేయవలసిన ఆవశ్యకత.

## ఫెడరేషనుకు ఈ సమస్యకు సంబంధములేదు

మరియు నొక్కమాట. ఫెడరేషను వస్తే కాని ఇది సిద్ధించనేరదనుమాట మనము అనుకోకూడదు. ఫెడరేషను రాకపోయినను ఇది సిద్ధింపగలదని ధ్రువమైనది. ఆ విషయమంతయు ఇక్కడ తలపెట్టుటచర్వితచర్వణము. మన మనుకొనేరీతి ఫెడరేషను వచ్చుటకు చాలాకాలము పట్టవచ్చును. బ్రిటిషువారు ఇస్తామంటున్న మోస్తరు ఫెడరేషను మాకు వద్దని కాంగ్రెస్సే ఆటంకములు చెప్పుచున్నది. యుక్తమైన ఫెడరేషను వచ్చుటకు ఆంధ్రరాష్ట్రనిర్మాణము అడ్డు కానేరదు. మనమనుకొనే రీతి ఫెడరేషను వచ్చునుగాక, రాకుండునుగాక, మన రాష్ట్రనిర్మాణ ప్రయత్నమునుండి మనము విరమించుటకు వీలులేదు. ఆంధ్రదేశమంతయు ఏకకంఠముతో ఇందుకై మాఱుమ్రోగవలెను. మద్రాసు శాసనసభలలో ఈ తీర్మానము సత్వరముగా ప్యాసు కావలెను. సెంట్రలు సభలలో ఇది ఆమోదింపబడవలెను. బ్రిటిషుపార్లమెంటు ఇట్టి కోర్కకు అడ్డుచెప్పజాలదు. అడ్డుచెప్పితే అప్పుడే ఆక్షేపించి పోరాడవచ్చును. కొందరూహించుచున్న ఆటంకములు ఊహలుమాత్రమే కాని సత్యముకావు. తీవ్రప్రయత్నమాత్రమున ఇది సులభసాధ్యము. ఇటువంటితరుణముల నిదివరలో నెన్నింటినో కోలుపోతిమి. ఇదియే ఆఖరుప్రయత్నముగా నమ్మి మనము పట్టువిడువకుండా పోరాడవలెను. ఈ సమయమునుకూడ వృథాపుచ్చితిమేని ఫెడరేషనువచ్చినతరువాతనైనను ఇది సిద్ధించుననుట కేమి నిశ్చయము? మనవ్యతిరేకపక్షమువారుఇప్పటికంటెవేఱు వ్యతిరేకకారణములను అధికముగా అక్కాలమున సత్తళముగా సృష్టించి యేకరువుపెట్టుదురు. కాలము తిరిగినకొద్దీ జాలమునతిప్ప మరే క్రొత్తవిశేషమునురాబోదు. మనదృష్టిని ఈ సమస్యనుండి తప్పించి, మన ఆశయమునువీటిబుచ్చుటకై అనేకప్రయత్నములు జరుగుచున్నవి. వీనిని మొదటిలోనే మనము త్రుంచివేయకున్నయెడల రానురాను ఇవి మరింత ప్రబలమగును.

---

# ఆంధ్రభాషా చరిత్రము*

గాడిచర్ల హరిసర్వోత్తమ రావు

భాషాచరిత్రము వ్రాయుట ప్రాచీనకాలమున నున్నదేనా, నవీనముగా నేర్పడినదా యను ప్రశ్న కొంతవరకు కలుగవచ్చును. అన్ని విషయములందువలెనే యీ విషయమునందును భారతవర్షమే లోకమునకు మార్గదర్శకము. స్వరముగూడ తప్పకయుండునట్లు వేదములను నిలుపుకొనివచ్చిన ఈ భూమి 'నిరుక్త'మును సృష్టించగలిగినదిగాని మరియొకభూమియందట్టి ప్రయత్నము మరల సంస్కృతపరిచయము పదితొమ్మిదవ శతాబ్దమునందు కలుగువరకును సాధ్యమేకాలేదు.

*    *    *    *

భాషల తారతమ్య పరిశీలనకును మనదేశము వంటి దేశము భూమిమీద మరి యెచ్చటను లేదు. ఇచ్చట సజీవములుగా నున్నన్ని భాషలును మరియెచ్చటను లేవు. ప్రపంచ మంతటిని లెక్కపెట్టి చూడగా రెండుకోట్లును అంతకు పైబడియు ప్రజ వ్యవహరించు భాషలు ౧౯ గలవు. అందులో ఆరు మనదేశములో ప్రచారమందుండునట్టివి. ఇవిగాక మనదేశమునందు అభివృద్ధిలో క్రిందిమెట్టులలో క్రిందిమెట్టునను, పైమెట్టులలో పైమెట్టునను ఉండునట్టి భాషలు ఇంకను ౧౯౬ కలవని యనుచున్నారు. ఇంతటి భాషాసంపద కలిగిన ఈ దేశమునగాక భాషాశాస్త్రము మరి యేదేశమున పరిపూర్ణత్వము పొందగలదు?

మనదేశమునందు ప్రాచీన కాలములందు వ్యవహారమునందున్న భాషలును సంఖ్యయందు తక్కువగావు. ప్రాకృతభాషలు ఇదివరలో ఆరని వ్యవహారముండినది. ఇవిగాక మరి పదునాలుగు ప్రాకృతములను ఇటీవలి పరిశోధకులు బహిరంగపరచినారు. వీనియన్నిటి యపభ్రంశములనుకొనునట్టి భేదము లొక్కొక్కటికి పెక్కులుపెక్కులుగా కన్పించుచున్నవి. వీనికి సంబంధించిన పరిశ్రమ యిప్పటికింకను బాల్యావస్థయందే యున్నది.

*    *    *    *

అన్నిటియందువలె ఇందులోను మన మభివృద్ధికాక ఇతరుల నాయకత్వమున పడియుండవలసివచ్చుటకు మన పారతంత్ర్యమే కారణము. ప్రపంచములోని అన్ని భాషలలోను పదునైదవభాషయయిన మన తెలుగుభాషకు నేడు శ్రీ చిలుకూరి నారాయణరావుగారు వ్రాయువరకు సమగ్రమగు భాషాచరిత్ర ప్రయత్నమే జరుగకపోవుట మన మెంత వెనుకబడియున్నారమో సూచించగలదు. నిజమునకు తారతమ్యపరీక్షతో ఫలమును దేల్చి భాషాచరిత్ర వ్రాయునట్టి యాచారము పందొమ్మిదవ శతాబ్దారంభమునందంకురించినది. నాటినుండి నేటివరకు యూరోపియనురాష్ట్రములవారు తమ తమ భాషలచరిత్రములు వ్రాసికొనినారు. ఆంగ్లమున వ్రాసిన గ్రంథసామగ్రి ప్రత్యేకము గ్రంథాలయమే యగును. మనదేశపు భాషలలో సంస్కృతమునకును ఇట్టి చరిత్ర యేర్పడినది. కారణము తక్కిన యన్నిభాషలవారికిని సంస్కృతమే ఈ శాస్త్రభిక్ష పెట్టుటమే. మరి బంగాళాభాషకుమాత్రము సునీతి కుమారచటుర్జీ ఒక్క చరిత్రము వ్రాసినారు. తరువాతిది మనప్రయత్నమే.

*    *    *    *

---

* కర్త: శ్రీ చిలుకూరి నారాయణరావు, ఎం. ఏ., ఎల్. టి., పిహెచ్. డి., సంస్కృతాంధ్ర కర్ణాటక భాషాధ్యాపకుడు, రాయలసీమకళాశాల, అనంతపురము. ౩సంపుటములు. మూడుభాగములు. ఆంధ్రవిశ్వకళాపరిషత్ గ్రంథమాలలో ౧౭వ ప్రచురణముగా ప్రకటితమయినది. వెల సంపుటము ౧కి రు.౬-౦-౦లు.

కాల్డువెల్లను పాశ్చాత్యపండితుడు ద్రావిడభాషల చరిత్రను ౧౮౫౬వ సంవత్సరమున వ్రాసిపెట్టెను. అందులోని తెలుగుభాషాచరిత్రే మన కింతకాలము భాషాచరిత్రగ నుపకరించినది. ఈ మధ్యకాలమున భాషావిషయకమైన పరిశ్రమ ఎవ్వరును చేయలేదని దీనివలన అర్థముకాదు. తెలుగుభాషామాత్రమునకు సంబంధించి అనేకు లనేకవిధములుగా పాటుపడినవారున్నారు. ఆంధ్రభాషానుస్వారతత్త్వమని, ద్విరేఫదర్పణమని కొంత ప్రాచీనులు వ్రాసిన గ్రంథములేగాక ఇటీవల శ్రీ గిడుగురామమూర్తిపంతులుగారి బాలకవిశరణ్యము, ఆంధ్రపండితభిషక్కుల భాషాభేషజము, కోరాడ రామకృష్ణయ్యగారి 'ద్రవిడియన్ ఫైలాలజీ', 'సంధి' ఇట్టివిగూడ పేర్కొనదగిన ప్రయత్నము లున్నవి. ఇవి యేవియుగూడ ఆంధ్రభాషకు సంబంధించిన సమగ్ర చరిత్ర ప్రయత్నములనుటకు వీలులేదు.

* * * *

శ్రీ చిలుకూరి నారాయణరావుగారి ప్రయత్నము సమగ్రప్రయత్నమనదగునాయని ప్రశ్నించువా రుందురు. వారికి శ్రీ నారాయణరావుగారి పదములతోనే ప్రత్యుత్తరమిచ్చుట మేలు:

"ఆంధ్రభాషాచరిత్రమున దెలుపవలసిన విషయము లింక నెన్నియో యున్నవి. ఆంధ్రభాషా చరిత్ర నిర్మాణమున కిది ప్రథమ ప్రయత్నము. మున్ముందెవ్వరైన నీమార్గమునఁ బనిజేసి యింతకంటెఁ బ్రామాణికమును సమగ్రమును నగు గ్రంథమును వ్రాయుట కిది దారియగునుగదా యని సంతోషించుటకు మాత్రము నాకు స్వేచ్ఛ కలదని మనవిచేసికొనుచున్నాను."

* * * *

శ్రీ నారాయణరావుగారు సహజ నమ్రభావమున పైమాటలు వ్రాసిరి. ఆ మాత్రముచేత ఈగ్రంథ మసమగ్రమని యెవ్వరును ననుకొనరాదు. వా రసమగ్రమనుకొనుటకు కారణము వారికి ఎంతవ్రాసినను తృప్తి కాకపోవుటయే. క్రియాప్రకరణమును, అవ్యయప్రకరణమును స్థలసంకోచముచే ననుకొన్నంత విస్తరించి వ్రాయుటకు వీలులేకపోయినదట! శిశువులభాష, స్త్రీలభాష, మాండలికభాషలు, సాంకేతికరహస్యభాషలు వివరింపక ఆంధ్రభాషాచరిత్రము సంపూర్ణము కాజాలదట. నన్నయకాలపు ఆంధ్రభాషా లక్షణము నేర్పఱుప తాము ప్రయత్నించినట్లే యితరకవుల గ్రంథములకును నితరులు లక్షణము నేర్పఱుప బ్రయత్నింపవలెనట! అట్టి ప్రత్యేక లక్షణగ్రంథములు బయలువడువఱకును భాషాచరిత్రనిర్మాణవిషయమున సంతృప్తి గలుగ జాలదట!

* * * *

ఇక నీ గ్రంథరచనలో శ్రీ నారాయణరావుగారు చేసిన కృషిని విపులముగా వివరించుట కుపోద్ఘాతముగా వారు తీర్చినపనిని వారే సంక్షేపముగా సూచించిన ఘట్టమును నిచ్చట పొందుపరచుట యుత్తమము:

"ఈ గ్రంథమున నాంధ్రభాషాచరిత్రనిర్మాణమునకు దారితీయఁ బ్రయత్నించితిని. అందుకు నన్నయ భారతభాగముభాష, నానాటి శాసనముల మూలమును, ఇంచుమించు నూఱు వ్రాతప్రతుల సహాయమును నిరూపింప బ్రయత్నించితిని. ఈ గ్రంథమందలి 'పదునొకండవ శతాబ్దము నాఁటి తెనుఁగుభాష' యను నధ్యాయ మాకృషికి ఫలము. అటుపిమ్మట ననేకాంధ్ర కావ్యముల భాషయందు గానవచ్చిన వ్యాకరణ విశేషములను సాధ్యమైనంతవఱకును గుర్తించి వానిని వర్గీకరించి యాయావిషయముల ననుసరించి యేర్పఱిచితిని. నేఁటికిఁ బ్రకటింపఁబడిన శాసనముల నన్నిటిని బరిశీలించి యందలి ప్రయోగముల నాయాప్రకరణములందు చేర్చితిని. వ్యావహారికభాష యేయేకాలములందు గ్రంథస్థమగుచు వచ్చినదో నిరూపించితిని. పూర్వవైయాకరణులు వ్యాకరణవిషయమునఁ జేసిన కృషినంతటి నుపయోగించుకొంటిని. ఆంధ్రభాషకును దక్కిన ద్రావిడ భాషలకును ద్రావిడ భాషావర్గమునకును నార్యభాషావర్గమునకును గల సంబంధమును నాకుఁ దోచినట్లు వివరించితిని."

* * * *

ప్రస్తుతవిమర్శ సందర్భమున శ్రీ నారాయణరావుగారు పేర్కొనిన కష్టపటివిషయమునే మొదటి

విషయముగా పరిగణింపదగియున్నది. మన దేశభాషల జన్మమును నిర్ణయము చేయడములో రెండాచారములు ప్రబలినవి. సంస్కృత సంప్రదాయమున కలవాటుపడిన ఛాందసులగు పండితులకు తెలుగు సంస్కృతజన్యమే. ఆకారణముచేత 'లట్' లిట్'లతో సహా సర్వసంస్కృత సాంకేతిక నిఘంటువు తెలుగువ్యాకరణములోనికి జొచ్చినది. పాశ్చాత్యసంపర్కము మనకు కలిగినతరువాత పడమటిపండితులు - ముఖ్యముగా కాల్డువెల్లు - దక్షిణభాషలగు తెలుగు, కన్నడము, తమిళము, మళయాళము ఇత్యాదిభాషల కాదిభాషయగు ద్రావిడ మొండియుండవలెననియు, ఈ భాషావర్గమే వేరనియు నిర్వచించిరి. ఇట్టినిర్వచన మేర్పడినతరువాత తెలుగుతల్లి పుత్రులలోనే చాలమంది ఆర్యభాషాకుటుంబము వేరు, ద్రావిడభాషాకుటుంబము వేరు అని యంగీకరించి ఆవాదమునే స్థాపింపదలచుకొనినవారు బయలుదేరినారు. బ్రిటిషువారికి బానిసలుగా నుండనొల్లక సంపూర్ణస్వాతంత్ర్యము కోరినట్టుగానే ఆర్యభాషలకు దాస్యము నెఱపకుండా తెలుగు సర్వస్వతంత్రకుటుంబములోనిదని నిర్ధారణచేయడము కొందరకు జీవనోద్దేశముగా పరిణమించినది.

* * * *

శ్రీ చిలుకూరి నారాయణరావుగారు తమ గురువులగు శ్రీ గిడుగు రామమూర్తిపంతులుగారితో భిన్నపడుటను గూడ సహించి అసలు ద్రావిడమనేదే ఆర్యభాషకు చెందిన యొక ప్రాకృతమనియు, ఆంధ్రభాష ప్రాకృతజన్యమనియు తీర్మానించుకొని ప్రాతకాలపు పండితులకు బాసటయయి నిలచినారు.

* * * *

శ్రీ నారాయణరావుగారి మొదటి సంపుటమునందు విశేషభాగము కాల్డువెల్లుసిద్ధాంతములను పూర్వపక్షముచేయుటకు ఉపయోగించినారు. ఈ పూర్వపక్ష ప్రయత్నము మూడు మార్గముల ననుసరించినది. ద్రావిడభాషలయందు ఆర్యభాషల పోలికలు కనుపించినప్పుడెల్లయు ఆ సంబంధమును తిరస్కరించి వానిని సిథియనుభాషలతో కాల్డువెల్లు ముడిపెట్టుచు వచ్చినాడు. ఇటీవల జరిగిన పరిశోధనలవలన సిథియనుభాషగాని, సిథియనుభాషాకుటుంబము గాని లేదని తేలినది. కాబట్టి కాల్డువెల్లుసిద్ధాంతములకు అతఁ డేర్పరచిన పునాదియే త్రవ్వి పారవేసినట్లయినది. ఇక పై కట్టడము నిలిచినదని ఎట్లంగీకరింపనగును? ఇది మొదటి మార్గము. రెండవమార్గము ద్రావిడభాష యనునది నిజముగా ప్రాకృతభాషలయందొకటియని నిరూపించుటే. కాల్డువెల్లనాటికి ప్రాకృతభాషలను గూర్చిగాని, ఆధునికార్యభాషలను గూర్చిగాని పరిశోధన లెక్కువగా జరిగియుండలేదట! ద్రావిడభాషలు ప్రాకృతములు కావనకొనడముచే నార్యభాషలు వేరనకొని ద్రావిడభాషల ప్రాధాన్యమువలన ఆర్యభాషలు ప్రాకృతములగాను, నేటి యార్యభాషలుగాను పరిణమించినవని చెప్పుట సంభవించినదట! ఈవాదమే నిజముకావలెనన యెడల ప్రాకృతభాషలు ప్రచారమునందున్న కాలమునకే ద్రావిడభాషలు నేటి రూపమునగాని, తత్తుల్యమైన రూపమునగాని యుండెనని నిరూపించవలసిన యావశ్యకము కలుగుచున్నదని రావుగారి మాట సత్యము. దీనికి విరోధమైన స్థితియే ప్రత్యక్షముగా చరిత్రవలన కన్పించును. ఇండియా దేశపు భాషలలో లిఖితరూపమున నున్నవానిలో సంస్కృతముతరువాత ప్రాకృతములు మొదటివి. నేడంగీకృతమైన సిద్ధాంతమును బట్టి తమిళము క్రీ. శ ౫-౬ శతాబ్దమునందుగాని గ్రంథస్థమైనట్లు కన్పించదు. తరువాత కన్నడము ౭ వ శతాబ్దమునను, తెనుగు ౯ వ శతాబ్దమునను గ్రంథస్థములయినవి. తక్కిన నేటి భారతవర్షీయభాషలన్నియును ౧౧ వ శతాబ్దమునకు పిదప గ్రంథస్థములయినవే. అందుచేత శ్రీ నారాయణరావుగారు క్రీస్తుకు మూడు శతాబ్దములు పూర్వమే ప్రచారమందుండిన ప్రాకృతములు ద్రావిడభాషల ప్రాధాన్యమున నేర్పడినవని చెప్పుట పొసగదని నిర్ణయించుచున్నారు. ఇట్లు కాల్డువెల్లు చెప్పిన భావమును త్రోసిపుచ్చి రావుగారు ద్రావిడము ప్రాకృతములలో నొకటి యనుటకు పైశాచీప్రాకృతవర్గముతో ద్రావిడభాషలకు గల సన్నిహితసంబంధమును నిరూపింపజూచినారు. వీరు ౫౫౧ వ

పుట కెదుట ప్రకటించిన చిత్రపటమునందు పైశాచీ భాషలు వ్యాపించిన మార్గమును చూపించినారు. పిశాచ జనుల ఆదిమనివాసస్థలము హిందూకుష్‌పర్వత ప్రాంతములలోని శీతభూములు. అచ్చటినుండి కొందఱు శాఖలుగ బయలుదేరి ఒక్కటి పడమటి ఇండియా ననుసరించి సరిగ దక్షిణమునకు దిగివచ్చిరనియు, మఱియొక్కటి నిండు తూర్పునకు ప్రయాణమై నేపాల్ భూటానుల నావరించి దక్షిణమునకు దిరిగి యొకవైపు మగధ, ఆంధ్ర, మహారాష్ట్ర ఉపశాఖలయిపోయి మఱియొకవైపు గౌడమును నాక్రమించి దక్షిణమునకు వచ్చుసరికి మొదటిశాఖతో చేరిపోయిరనియు శ్రీ రావుగారు తెలియజేయుచున్నారు. ఈ రెండు శాఖలవారు తీసికొనిన మార్గములకువారు కేకయమార్గమనియు, బాహ్లిక మార్గమనియు నామకరణము చేసియున్నారు. వారు తమ సిద్ధాంతమును స్థిరపరచికొనుటకు అవలంబించిన మూడవమార్గము ప్రాకృతజనితములని యంగీకృతములయి యుండు నేటి భారతీయార్యభాషల పోలికలే ద్రావిడ భాషలయందు కన్పించుటను విపులముగా నుదాహరించుట.

*    *    *

కాల్డువెల్లు ద్రావిడభాషలకును ఆర్యభాషలకును సంబంధము పొసగదని చెప్పుటకు పదమూడు కారణములను వ్రాసెను. ఈ యన్నిటను ఆర్యభాషలగు ప్రాకృతములకును, ద్రావిడభాషలకును సంబంధము కలదని ప్రకృత గ్రంథకర్త నిరూపించుటకు ప్రయత్నించినాడు. ౧౬౫౦ పేజీలమహాగ్రంథమున చేసిన యీ ప్రయత్నమును ఇట్టి సంక్షేపవిమర్శలో నిముడ్చుట సాధ్యముగాని పని. కాల్డువెల్లు ఆక్షేపము తమ సమాధానమని గ్రంథకర్త టూకీగానిచ్చిన పట్టి సంక్షేపవివరణమే ౨౦ పుటలున్నది (౫౬-౭౬). స్థాలీపులాకన్యాయముగా కొన్ని సందర్భములను అనువదించి చూపుట కంటె ఎక్కువ ఇచ్చుట సాధ్యముగాదు.

*    *    *    *

మనము తెలుగువ్యాకరణము చదువుకొనునప్పుడు తత్సమ, తద్భవ, దేశ్యములతో కూడుకొన్నది మనభాషయని మొదట నేర్చుకొందుము. దేశ్యమనునది అచ్చము మనభాషయొక్క ప్రత్యేకస్వాతంత్ర్యమును నిర్ణయించునట్టిదియని మనభావన. ద్రావిడభాషలయందీ దేశ్యభాగ మున్నది కావున ద్రావిడకుటుంబము వేరనుట అవాదమునందొక యంగము. ద్రావిడభాషలలో నున్నట్టే ప్రాకృతములందును ఇదేవిభాగమే—తత్సమ, తద్భవ, దేశ్యవిభాగమే—కలదని శ్రీ రావుగారు మొదట సూచించినారు. నిజమునకు ఒకభాషనుండి యొకభాష పుట్టినదనడమే పొసగదు. భాషకును భాషకును సామీప్యముచేతనేమి, సాహచర్యముచేతనేమి సన్నిహితమైన సంబంధ ముండవచ్చునుగాని ఆమాత్రముచేత పోలికగల భాషలన్నియు నేదోయొక ఆదిమభాషనుండి పుట్టినవని పెనగులాడుటలో పెద్ద ప్రయోజన మున్నట్లు కన్పించదు. నోటికొకమాట యన్నట్లతిని గూడ మించి ఒకేవ్యక్తి బాల్యమున నొకభాష, కౌమారమున నొకభాష, యౌవనమున నింకొకభాష, వార్ధక్యమున మఱియొకభాష మాట్లాడునది చూచిచూచి బ్రహ్మవలె అనంతమైన శబ్దమును జనకజన్యభాషలుగ వర్గీకరించు ప్రయత్నము చేయుటే పొరబాటు. ప్రచారమునందుండు భాషలన్నియును—అందులో నూర్లు వేల సంవత్సరముల చరిత్రకలయవి—స్వతంత్రముగా జీవించినవే యని యొప్పుకొనకతప్పదు. మహానదుల మహాపురుషుల జన్మపరిస్థితి నామకార్థమైనట్లే మహాభాషల జన్మపరిస్థితియు నామమాత్రమే. ఒకవేళ జనకజన్యసిద్ధాంత మంగీకరించినా జనించినపిదప తత్తదవసరమునుబట్టి క్రొత్త సృష్టిచేసికొనిన పదజాలమును, రూపకల్పనయు ఆది పదజాలమును, రూపకల్పనను మరపించివేయవచ్చును. ఈ విషయమునే పెరుమాటలలో ఇంతకంటె కొంచెము కొరవగా ప్రస్తుతగ్రంథకర్త ౭౭౫ పుటలో సూచించినారు. "ఒకభాష మఱియొకభాషనుండి జనించినదనుట స్థూలనిర్వచనముమాత్ర మగును. భాష ప్రవాహిని..... శాఖ తొల్లిటి తల్లికంటె మహత్తరము కావచ్చును. అప్పుడు దానిలక్షణము తల్లిలక్షణముకంటె కొంతవేఱగును" అని వ్రాసిరి. వారు పరిమితముగానైనను ద్రావిడభాషల కొక జన్యభాషము నిర్వచించుచున్నారు.

కాబట్టి సూచనచేయుటయం దొకకొంత జాగరూకత కనుపరచిరి. ఈ విషయము స్వతంత్రభాషావాదమును భాషాశాస్త్రవేత్త లనేకు లంగీకరించినారు.

* * * *

ఈ వాదము సహేతుకమైనదే కాబట్టి దీనిని నంగీకరింతుమా భాషాచరిత్రయందు ఆదిమసూత్రముల మీఁది పోరాటము తప్పిపోవును. సమరసభావమున సరి పోల్చి చూచుకొనుచు నుడికారపు వైశేష్యములను సృష్టిరహస్యములుగా తిలకించి యానందించు భాగ్యము భాషాశాస్త్రజ్ఞుల యనుభవమునకు వచ్చును.

* * * *

ఈ సమరసదృష్టి నారాయణరావుగారి వ్రాతయం దెడనెడ కన్పించుచునేయున్నది. వారు సంస్కృతమునుగూడ సింహాసన మెక్కించినవారుగాదు. అదియు నొక ప్రాకృతమే యన్నారు. ద్రావిడమనునట్టిదియు నొక ప్రాకృతమే యన్నారు. సత్యము చెప్పదలచుకొందుమా 'ప్రాకృత' శబ్దమందే పరమరహస్యము ఇమిడియున్నది. ప్రకృతము భాష. ప్రాకృతము. అది సజీవము; చైతన్యముగలది. దానినే ఇంగ్లీషులో 'డయలెక్టు' అన్నాడు వ్హిట్నీ. ప్రతియొప్పభాషయు డయలెక్టుగా ఆరంభమయినదే. ఏ డయలెక్టుబంధువు లీతెలుగు మున్నుగాగల భాషలంటే ఆర్యభాషాప్రవాహము లోని ద్రావిడ డయలెక్టుకు బంధువు లన్నారు. ఇంతకంటె నెక్కువగా శ్రీరావుగారు బల్లగుద్ది చెప్పిన దేమియును లేదు.

* * * *

కాని కాల్డువెల్లు నెడల వారు కనుపరచిన గౌరవ మొకవైపుండగా అతని ననుసరించి లోకము ద్రావిడ మన నేదియో భారతజీవితవాహినిలో కలవని ప్రత్యేకమగు విలక్షణ స్వరూపమని భ్రమ కల్పించికొనియున్నందున నారాయణరావుగారు ద్రావిడభాషల యార్యసంబంధమును దృఢముగా స్థాపింప నుపక్రమించినారు. తెలుగుభాషలోని 'ఒకటి'ని ఇంగ్లీషుభాషలోని 'యూనిటీ'తోను, 'ఇది'ని 'ఇట్'తోను ననుసంధించినారు. మన శకటరేఫమునకు సంస్కృతమున ఛాయను సూచించినారు. ఇంగ్లీషులో 'అక్సెంట్' అనే శబ్దోచ్చారణలోని యూత తెలుగులో నున్నదని చూపించినారు. ఈ సందర్భమున వారు వ్రాసిన విషయము హృదయంగమము. దాని ననువదించుట యవసరము.

* * * *

"పద్యములలో శ్లేషకల్పనముఁ జేయవలసి వచ్చినప్పుడును నర్థవైచిత్రిని జూపనెంచినప్పుడును కవులీ యూతప్రాధాన్యమును బాగుగా గ్రహించియున్నారు. ఈ క్రింది పద్యములో 1 అనునది ప్రధానమైన ఊతకును, 2 అనునది అప్రధానమైన ఊతకును, 0 అనునది యూతలేనందుకును గురుతులుగా నుంచి రామాయణ భారతార్థములను తెలియఁ జేయవచ్చును.

రామాయణార్థము

1 ఎందు 1 వేట 2 రారె యితరు 1లే 0 మనసు 0 తో
దార 2 సంగమంబుఁ 1 దప్పఁ 2 ద్రోచి
1 తకట పాండు 2 రాజ 2 యశ 1 మెన్నవై 1 తతి
2 ప్రహర 1దశర థేశ 1 కులము 2 రోయ

భారతార్థము

1 ఎందు 1 వేట 2 రారె 1 యితరు లేమనసు 0 తో
1 దార 2 సంగమంబుఁ 1 దప్పఁ 2 ద్రోచి
1 తకట పాండు 2 రాజ 1 యశ 2 మెన్నవై 1 తతి
2 ప్రహరద0శర 1 థేశ 2 కులము 1 రోయ"

* * * *

ఇట్టి యుదాహరణములనే శ్రీ రావుగారు చేమకూర వెంకటకవినుండియు, వ్యవహారమునుండియు నిచ్చినారు. వీనిని కాదనుట మిక్కిలి కష్టము.

మొదటి సంపుటమునందు నారాయణరావుగారు వివరించిన విషయములలో గమనింపదగినవి, వారి యసార కృషికి నిదర్శనములైనవి అనేకములున్నవి. తెలుఁగు, తెనుఁగు అనుపదముల వ్యుత్పత్తివిచారము చేసినారు. తెలుఁగును గురించి వ్రాయుటలో కన్నడమున వ్రాసిన అందులో క్రీ. శ. ౮౭౦నుండి ౧౩౬౮ వరకు వ్రాసిన వారిలో సుప్రసిద్ధుల ననేకులను పేర్కొని వారు తెలుగుసీమవారనుటను సూచించి తెలుగుకర్ణాటక దేశజన

సంబంధములను వివరించి తెలుకన్నడము తెలుగైననై యుండవలెననినారు. కాని ఈ పదములలోని 'ను' ప్రత్యయచరిత్రలోనికి దిగి టిబేటు అసాము నేపాళములవరకును ప్రయాణముచేసి బర్మాలో తలైంగ్ అనునొక భాష యున్నదని తెల్పి కాని దానికిని తెలుగునకును సన్నిహితమైన సంబంధము కనుపించదని తెలుగు శబ్దము వ్యుత్పత్తినిగూర్చి ఇదమిత్థమని చెప్పుటకు నేటికి దగిన యాధారములు లభింపలేదనిరి. ఈ విమర్శలో వారు కన్నడకవి పూజ్యపాదుని క్రీ. శ. ౮౭౦ వానిగ వర్ణించిరి. ౬౫ పుటలో భాషలు గ్రంథస్థమయిన వివరణ నిచ్చుటలో కన్నడమునకు ౭ వ శతాబ్దమును నియమించిరి. ఈ రెంటిని సమన్వయముచేయుట యవసరముగాదోచును.

*  *  *  *

తెలుగుభాష తక్కిన ద్రావిడభాష లన్నిటికంటె స్వతంత్రమగు స్థానము నాక్రమించుచున్నదని గ్రీయర్సను పండితుని యభిప్రాయమట! ప్రాచీన ప్రాకృతభాషల కిది తక్కిన ద్రావిడ భాషలకంటె నెక్కువదగ్గరగా నుండుటయే యట! వీరు ౫౮ వ పుటలో నిచ్చిన మూలద్రావిడ భాష వంశవృక్షములో నీస్వాతంత్ర్య మగుపించుచున్నది. మూలప్రకృతికి తెలుగు దగ్గరిదియగుట కొంత జ్యేష్ఠత్వ మర్యాద కలుగునని ఆంధ్రమాససమున్యాయ మగు నుబ్బు నొందవచ్చును.

*  *  *  *

భాషా శాస్త్రమున కెక్కువ ప్రత్యక్ష సంబంధము లేకపోయినను ఆంధ్రలిపి చరిత్రమును గ్రంథకర్త చక్కని పటములతోకూడ మొదటి సంపుటమునందు జేర్చినారు. ఇందులోనే వీరు శకటరేఫము గూర్చి మున్నగు విషయములను గొనితెచ్చి తమ వాదమును బలపరచుకొనినారు.

*  *  *  *

'సంధి'ని వివరించుటలో సంస్కృత, ప్రాకృత, ద్రావిడ సంధి చరిత్రము చదువరులకు చాల యుపయుక్తమగునట్లు సుబోధకముగ రచించినారు. ఆచ్ఛిక ప్రకరణమునందు వీరు చేర్చిన కృతకశబ్దముల విమర్శ భాషకు వీరిచేసిన సేవలో మిక్కిలి ప్రశంసనీయమని యెన్నదగియున్నది. అచ్చతెనుగు పేరుపెట్టి మధ్యకాలపు కవులుచేసిన యల్లరి నిజమైన భాషా సౌందర్యమునే కప్పిపుచ్చిన దనుటలో సందియము లేదు. వీరి విపరీత ధోరణి తెనుగునుడికారమునే మరుగుపరచి దాని మీద నేవగింపునుగూడ కలిగించినది. కృతకశబ్దజాలమును వేరుపరచుటచే జలగడిగి అసలు తెలుగు అపరంజిని బయటికి దీయుటకు వీరు తోడ్పడినవారైనారు.

*  *  *  *

వీరు మొదటి సంపుటమునను రెండవ సంపుటమునను వర్గీకరించి చేర్చిన పదములయు, ప్రత్యయములయు, పదస్వరూపములయు జాబితాలు అనంతములు, వీరి యోర్పుకు నిదర్శనములు. అందులో వీరు క్రొత్తగా చేర్చిన నావికపదజాలము, అన్యదేశపదజాలము. అనంతపురముజిల్లా గ్రామ నామధేయముల మీమాంస, తాకీతాకక వదలిన తమబిడ్డల బాలభాష ప్రశంస పరిశోధకుల హృదయముల కానందము గలిగింపదగినవి. ఈ జాబితాలు వీరి వ్రాయదలపెట్టిన నిఘంటువునకు ప్రాతిపదికము లనుట స్పష్టము.

*  *  *  *

డాక్టరు నారాయణరావుగారు తమ రెండవ సంపుటమునందు 'వ్యాకరణము', నన్నయకు పూర్వకాలపు తెలుగుభాష, పదునొకొండవ శతాబ్దమునాటి తెలుగుభాష, ఆంధ్రశబ్దచింతామణి, ఉత్తరాంధ్ర భాష యను ముఖ్యాంశములను వివరించినారు.

*  *  *  *

వ్యాకరణమను భాగమునందు గ్రంథకర్త కాల్డువెల్లు సిద్ధాంతముల ప్రశంస మరలమరల లేక తప్పినది గాదు. ఇతర ద్రావిడభాషలతో తెలుగునకు గల పోలికలెంత చూపవలసివచ్చినదో అంతటి పోలికలును సంస్కృతముతోను, ప్రాకృతములతోను, నేటి ఆర్యభాషలతోను చూపవలసివచ్చినది. అందుచేత లింగ, వచన, విభక్తి, సర్వనామ, క్రియాప్రకరణములలో వీనికి సంబంధించిన ద్రావిడ వ్యాకరణ విమర్శతోగూడ సంస్కృత

ప్రాకృత మరాఠీత్యాది ఆర్యభాషాసంబంధ వ్యాకరణ వివరణమును జేయవలసివచ్చినది. ఇంత విస్తారకార్య సాధన చేయుటచేత నీ గ్రంథకర్త తెలుగు వాచక ప్రపంచమున కెక్కువ విషయసంగ్రహణము చేసి పెట్టినవారైనారు.

*   *   *   *

కాల్డువెల్లు ద్రావిడభాషలలోని లింగమును గురించి ప్రశంసించుచు సిథియను భాషలతో ముడిపెట్టుటలో కొంత హాస్యరసము నొలికించిరి. ఇండో యూరపియను భాషలను మాట్లాడు జాతులవారు మనుష్య పురుష స్త్రీవాచక శబ్దములకు పుంస్త్రీలింగ శబ్దములను జేర్చుటయేగాక తిర్యగ్జంతువాచకశబ్దములు చేతను నానావస్తువులకును గుణవాచకశబ్దములకును గూడ పుంస్త్రీ భేదమును గల్పించి, వానికి ప్రాణప్రతిష్ఠ చేసి, తమ కవితాదృష్టిని వెల్లడించిరనియు సిథియనుభాషలను మాట్లాడువారు—వారిని బోలిన ద్రావిడభాషలు మాట్లాడువారు—బుద్ధియుతులగు మానవస్త్రీపురుషులను గూడ నప్రాణి వస్తువుల జతజేర్చి వానికి నపుంసకలింగత్వము నంటగట్టి ప్రాణ్యప్రాణివాచకముల నన్నిటి నొక్క వర్గములోనికి దింపి తమ భావనాబలహీనతను ప్రకటించిరనియు, ద్రావిడభాషలను మాట్లాడువా రన్ని శబ్దములను ఏకరూపకమను చావు మట్టమునకు (Dead level of Uniformity) దెచ్చిరనియు వ్రాసిరి. ఈ దెబ్బ శ్రీ నారాయణరావుగారికి ఏలాగో చురుక్కుమని తాకినది. ఈ క్రింది ఎదురుదెబ్బ తీసినారు.

"స్త్రీయైన పెండ్లాము భార్యవలె స్త్రీ లింగముం దుంచక, ఒకప్పుడు మగవానిని చేసి 'దార' అనియు, ఒకప్పుడామెకు నపుంసకత్వము నారోపించి 'కళత్ర' మనియుఁ జెప్పుట యేటి భావన? 'పాషాణము'ను పుంలింగముచేసి 'శిల'ను స్త్రీలింగము చేయనేల? 'ఆహవ' 'సంగ్రామము'లు పురుషోచితములు కావుననా యవి పుంలింగములగుట? అయిన 'రణము' నపుంసకులుచేయునదియు, 'ఆజి' స్త్రీలు చేయునదిగావున వానికి నపుంసక స్త్రీ లింగములు వరుసగ నాపాదింపఁబడినవని చెప్పననా? 'సంగ్రామ' 'రణాజు'లయందు గావలసిన వీర్య, 'బలములు' నపుంసకములనుట యేటి భావన? వ్యాకరణ గ్రంథమున కశ్లీలతాదోషము లేదుగావున చెప్పవలసివచ్చినది.—స్త్రీత్వ చిహ్నమగు నవయవ వాచకపదమునకు పుంలింగత్వమును గల్పించి, పుంస్త్వ చిహ్నద్యోతకమగు పదమునకు నపుంసకత్వమును గల్పించుట యెంతటి తెల్వి?"

*   *   *   *

ఇది యంతయు మనసునం దిడుకొనియేగాబోలు వాదపువేడి యెక్కువగా లేని మరియొకచోట కైయటుని కొనిదెచ్చి నపుంసకలింగప్రాధాన్యము నీక్రింది రీతిని సమర్థించినారు.

"స్త్రీ పురుషలక్షణములగు ప్రసవసంస్త్యానము లకు నడుమనుండు 'స్థితి' యను లక్షణముగలది నపుంసకమని కైయటుని యభిప్రాయము. అనఁగా నపుంసక లింగ శబ్దవాచ్యమగు వస్తువునందు శక్తి యనంతముగా నుండి క్షీణింపదని యతని యభిప్రాయము. అందుచేతనే యనంతమగు నిర్గుణబ్రహ్మము నపుంసకలింగ సంజ్ఞనే నిర్దేశింపఁబడుట కాఁబోలు"

సెబాస్! నారాయణరావు సెబాస్!

*   *   *   *

వీరు వ్రాసిన వచనవిభక్తి సర్వనామ ప్రకరణములలోను నిట్టి యాకర్షక విషయములు లేకపోలేదు. వీరి మతమున తెలుగు విభక్తు లన్నింటిలోను అన్ని ప్రత్యయములును సంఖ్యలో ఏడింటికంటె హెచ్చు లేవు. అవి డు, ము, వు, లు, ల, న, కు అనునవి. తక్కినవన్నియు అవ్యయములు, లేదా ప్రత్యేకపదములు. సర్వనామప్రకరణములో 'ఇది' 'ఒకటి'లను గురించిన ప్రసంగ మిదివరలోనే వచ్చినది. శ్రీ నారాయణరావుగారు భాషాస్వాతంత్ర్యనిరూపణకు ప్రాణప్రాయమయిన సంఖ్యావాచకప్రశంసలో తక్కినయన్నిటిని తమ సిద్ధాంతమునకు సరిపోవున ట్లన్వయించుకొనగలిగినారు గాని 'మూడు' 'నాలుగు' లకు మాత్రము ఆర్యభాషా సంబంధమును కుదుర్చలేకపోయిరి.

*   *   *   *

రెండవ సంపుటములోని మూడవభాగమే నిజమైన ఆంధ్రభాషా చరిత్ర యనవచ్చును. తక్కిన దంత యును ఆచరిత్రతత్త్వము, ఆతత్త్వమున కాధారమైన తారతమ్యపరీక్ష. నన్నయభట్టుకు పూర్వము కవులు లేరని తెలుగుభాష చెప్పుకొనదగినదని వ్రాసికొనుట తెలుగు వారి కొకవిధమైన కొరతగానే యుండినది. క్రీ. శ. ౬౩౩, ౬౭౫, ౭౧౮-౫౧, ౮౮౭ వ సంవత్సరముల జయసింహవల్లభ, మంగియుగరాజ, అహదనకర, యుద్ధమల్లుని బెజవాడ, గుణగవిజయాదిత్య పండురంగ శాసనములను ఇంతకు బూర్వము ప్రకటితములుగాని నన్నయకు బూర్వకాలపు శాసనము లేదును పరిశీలించి కొన్నిటిని క్రొత్తగా విమర్శించి క్రొత్త వ్యాఖ్యానములు వ్రాసి అందులో కర్ణాటక ద్విపదపాదములను బోలిన కవిత్వమును, సీసపద్యములును, తరువోజలును ఉన్నవనుటను గూడ ప్రకటించుటచేతను పదనొకొండవు శతాబ్దమునాటి తెనుఁగుభాషను శాసనముల భాషాధారకముగను ఇతరాధారములనిూదను విమర్శించుటచేతను, నన్నయ ప్రథమకవి కాడని యీగ్రంథకర్త తేల్చినారు. వీరు 'ఆంధ్రశబ్దచింతామణి'ని నన్నయ రచించినవాడు కాదనియు తేల్చిరి. తదర్థముయి వీరా గ్రంథము సామూలాగ్రము విపులవ్యాఖ్యతో రచించి ఈ సంపుటమున జేర్చిరి. ఇది తెలుగునకు మహోపకారము. నన్నయభట్టు గరుడోపాఖ్యానమును వర వ్రాతప్రతుల సాయముతో సంపాదించుటయు తెలుగు భాషభాగ్యమే. ఈ పాఠమును చదివినవారికి మన మింతకాలమును తిరస్కరించుచుండిన వాడుక వ్రాతపక్కియందు ప్రాచీన లేఖకాచార మెంత యిమిడినదియు నర్థము కాగలదు. శాసనముల వ్రాతకాండ్రు తెలియక తప్పులుగ వ్రాసిన వ్రాతగాక వారిమార్గముననే ఆయా కాలమున వ్రాత నెలసినదనుటయు తెలియగలదు. నిజమునకు నన్నయభాషకును వ్యవహారభాష యనుకొనబడు ఆకాలపు శాసనభాషకును ఎక్కువ భేదము లేదనుటయు నీగ్రంథము రుజువుపరచుటకు ప్రయత్నించినది. వ్యావహారికములని మనవారు త్రోసిపుచ్చిన కొన్ని చక్కని తెలుగు నుడికారములకు పునరుజ్జీవము కల్పించుటకును తమిళ కన్నడ తెలుగు సంప్రదాయముల సన్నిహితత్వము న నేకవిషయములందు నిరూపించుటకును 'గరుడోపాఖ్యాన' వాచకము పనికిరాగలదు.

* * * *

శ్రీ చిలుకూరి నారాయణరావుగారు తమ ప్రయత్నమున కడపటి యంగముగా రచించిన 'ఉత్తరాంధ్రము' ఉత్తరాదివారి యాంధ్రమునకు సంబంధించినది యని పొరబడిన విమర్శకులును నున్నారట. నిజమునకు ఉత్తరాదివారి యాంధ్రముతో దీనికి ప్రసక్తిలేదు. పదనొకండవు శతాబ్దమున కుత్తరమగు, అనగా తిక్కనాది దగు ఆంధ్రసంప్రదాయమును ఈ భాగము వివరించుచున్నది. ఈ యుత్తరాంధ్రమునకు సంబంధించిన లింగ, వచన, విభక్తి, సర్వనామ, క్రియా, సంధి, సమాసాది వివరము లదివరకే మొదటిసంపుటమునను రెండవసంపుటమునను ఆయాఘట్టములలో చేర్చియున్నందున వీరీభాగమున నేను వ్యవహారభాషయనబడుభాష పదునొకండవ శతాబ్దోత్తరాంధ్ర వాఙ్మయమునను శాసనముల లోను నెంతవిపులముగా వాడినారో చూపుటకే ప్రయత్నించిరి. 'తనవ్యవహారముననున్న పదములను విడిచి కవి యుండనువేయలేడు; 'మనకిప్పుడు పామరజన భాషితమని తోచు. పదము లుత్తమవర్ణములవారిలోఁ బ్రచారమునం దుండియుండవలెను.' 'ప్రమాణమైన మనుష్యుడు, ప్రమాణమైన నుఱ్ఱు, ప్రమాణమైన చెట్టు నను వ్యక్తు లెట్లు దుర్లభములో, ప్రమాణ భాషావిషయమునగూడనంతే' 'ఏదోయొక ప్రామాణిక కృతకభాషను కల్పించికొన్నను నది యారూపమునఁ జిరకాల ముండఁ జాలదు' 'ప్రపంచమునకును భాషకును బరిణామము సహజము' అను తమభావములను నిర్ధరించుట కీభాగమున నుదాహరణములను నుప్పించిరి. తుదకు 'వస్తా చూస్తి మి రోస్తిమిఁక' 'వస్తివో' 'తనువిస్తిని మనసిస్తిని' 'వస్తాడు నీలఘనపతి' వంటి రూపములుగూడ ప్రయోగార్హములే యని ప్రయోగములను గ్రాంథిక

గనుబరచినారు. 'తెనుఁగు మఱుఁగులు' 'తెలుఁగు పలుకు బడులు' 'సామెతలు' వినిపించినారు.

* * * *

ఈ గ్రంథకర్తకు చదువరులను నిద్రబోనిచ్చు స్వభావ మున్నట్లు కానరాదు. గ్రంథము ముగించిన పిదప సమస్యల నెక్కడ మరచిపోదురోయని గ్రంథాంతమున ౧౨ పేజీల ప్రశ్నల కల్పించిరి. కొన్నిటికి తామే ప్రత్యుత్తరము లిచ్చినను చాల యెక్కువగ ఉత్తరమిచ్చుకొను బాధ్యత చదువరులకే వదలిరి. తానే నిర్వాహకు డను గర్వము తనకు లేదని చూపుటలోను బరు వితరులమీద పడవేయవలసినవరకు పడవేయుట యందును ఈ గ్రంథకర్త నేర్పరియనుట ఈ సమస్యల పరంపరచేతనేగాక ఇతర ఘటనల 'ఇది ప్రథమప్రయత్నము'; 'ఇందు లోపము లుండగలవు'; 'ఆంధ్ర భాషా తత్త్వవిచారము చేయఁబూను పండితు లీ విషయమై శ్రద్ధ తీసికొనవలసియున్నది'; 'ఇట్లు చెప్పుట యుక్తము'; 'నిరూపింప వీలగును'; 'భాషాశాస్త్ర విషయముల నింతకంటె నెక్కువ నిశ్చయముగఁ జెప్ప వీలులేదు'; 'ఏమోయని నాకు దోచుచున్నది'; 'ఇతర కవుల గ్రంథములకును నితరుల లక్షణము నేర్పరుపఁ బ్రయత్నింపవలసి యున్నది' అను నీతిచతుర ప్రయోగములచేతను స్పష్టము కాఁగలదు. ఇట్టివారితో వ్యవహార మెవ్వరు పెట్టుకొనగలరు? విలువగలది గ్రహించి వినియోగించుకొను డను వీరి హెచ్చరిక ప్రశస్తము.

---

## భారతి చందాదార్లకు హెచ్చరిక

ఈ క్రింది కనబరచిన నెంబర్ల వారికి ఈ నెల (1937 సం. డిశంబరు నెల)తో ఇదివరకు చెల్లించిన చందా పూర్తి యగుచున్నది. తిరిగి ఇంకొక సంవత్సరమునకును చందా మాకు చేరునట్లు ఈ నెలాఖరులోగా మనియార్డరు చేసినచో తెంపులేకుండ పత్రికను పంపుచుందుము. అట్లు తమయొద్దనుండి 30-వ తేది లోపుగ సొమ్ము రానిచో సహజ భాషాభిమానులగు తాము తిరిగి ఇంకొక సంవత్సరము వఱకు చందాదారులుగ నుందురను నమ్మకముతో 1938 సం. జనవరి 10-వ తేదిని రూ 6-4-0 లకు వి.పి. పంపుచున్నాము. గావున తా మెప్పటివలెనే పత్రికయం దభిమాన ముంచి సొమ్ము చెల్లించి వి. పి. ని గైకొన ప్రార్థితులు. ఒకవేళ తమ కీ పత్రిక ప్రస్తుత మనవసరముగ దోచినచో మా కావిషయము వెంటనే తెలియజేసినయెడల వి. పి. పంపుట మానుదుము.

A 5, 8, 13, 14. B 12, 14, 16, 17. C 8. H 24, 54, 56, 59, 61, 62. J 11 12. K 7, 11, 19, 20. L 4, 11, 12, 15. M 6, 7. N 22, 25. P 34, 39, 40, 41, 42, 43, 44, 45, 48, 49. R 34, 35, 37, 38, 39, 40, 41, 42, 43. S 32, 33, 35, 37, 40, 41, 43, 45, 49, 51, 78, 135, 141, 143, 144, 145, 147, 148, 149, 151, 152, 153, 154, 155, 155, 156, 159, 160, 161, 162, 163, 164, 166, 167, 170, 172. V 34, 35, 36, 37, 38, 39, 40, 42.

---



౯ సిప్రానదిగట్టుననుండు రామఘట్టము



౧౦ హరసిద్ధి దేవాలయముప్రక్కన జ్యోతి స్తంభము
(దీపావళినాడు ఈ దీపములు వెలిగింతురు)



౧౧ ఆదిలో జైనుల దేవళము : ప్రస్తుతము హిందువుల దేవళము

# అవంతికాపట్టణ సౌభాగ్యము

భారతీయులు పవిత్రతమముగా నెంచు అయోధ్యాది సప్తక్షేత్రములలో అవంతికయొకటి. దీనిని ప్రస్తుతము ఉజ్జయినిఅనుచున్నారు. ఇది మాల్వాపీఠభూమిలో సిప్రానదీతీరముననున్నది. భారతీయ భూగోళశాస్త్రపు మధ్యాహ్నరేఖ యీ యవంతికమీదుగా ప్రసరించుచున్న దందురు.

అవంతికవైభవ మీనాటిది కాదు. చరిత్రకు గూడ అందని ఏమూడువేల యేండ్లనుండియో అవంతిక మహోన్నతస్థాన మలంకరించియున్నది. కాళిదాసు దీనిని వేనిళ్ళములుగా పొగడియున్నాడు. అశోకుడు, విక్రమాదిత్యుడు, చంద్రగుప్తుడు, అక్బరు, ఈఅవంతికకు ప్రాభవమును కల్పించినవారే. రెండుమార్లు ఈ అవంతికకు ప్రళయమువచ్చి ఇది నాశనము చేయబడినది: ఒకసారి వరదలవల్లను, మరియొకసారి ఢిల్లీ ప్రభువు ఆల్తమాషువల్లను. ఇది వరుసగా బ్రాహ్మణ, జైన, బౌద్ధ, సిథియన్, హైందవ, గ్రీకు, మొగలు రాజ్యములకు రాజధానీనగరముగానుండి, చివరకు గ్వాలియరు ప్రభువు మహారాజా దౌలత్ రావుసిందియాకాలమునకు ఆహోదా ౧౮౧౦ లో లష్కరుకు అందజేయబడినది.

అవంతిక చాలకాలము సుప్రసిద్ధ విద్యాపీఠముగా వెలసినది. ఇక్కడనే బలరామకృష్ణులు సాందీపనివద్ద విద్యలు నేర్చిరి. ఇప్పటికిని సాందీపని ఆశ్రమస్థలము యాత్రాస్థలముగ నెన్నబడుచున్నది. ఆస్థలమునందొక దేవాలయమును, ఒక రమణీయసరోవరమును ఉండి ఆ ప్రదేశమున కొక పవిత్రవాతావరణమును తెచ్చిపెట్టుచున్నవి. ఆప్రదేశము అంకపత్ అనుపేర వ్యవహరింపబడుచు పెక్కుమంది వైష్ణవులను నానాదిక్కులనుండి ఆకర్షించుచున్నది. వైష్ణవక్షేత్రముగాకంటెను శైవక్షేత్రముగానే అవంతికకు ప్రఖ్యాతి. ప్రఖ్యాతమైన మహాకాళ దేవాలయము అవంతిక కాభాగ్యమును కలిగించినది. ౧౨౩౫ లో ఈ దేవాలయమును ధ్వంసము చేసి, ఢిల్లీప్రభువగు ఆల్తమాషు ఇందలి మహాకాళవిగ్రహమును తన రాజధాని కెత్తుకొనిపోయెనట. ఆతర్వాత అయిదువందల యేండ్లకు మహారాష్ట్ర ప్రభుత్వమున దివానుగా పనిచేయుచుండిన రామచంద్రుడను పుణ్యశాలి ఆ ప్రాతస్థలముననే ప్రస్తుతమున్న దేవాలయమును కట్టించెను. ఏటేట లక్షలకొలది తీర్థప్రజ యీ క్షేత్రమును దర్శించి, పూజా పురస్కారములు సమర్పించి, ధన్యులై పోవుచుందురు. ఈ క్షేత్రములో ప్రతినిత్యము వంద, వందయేబదిమంది పండాలు చేతులనిండుగ పనిపెట్టుకొని తిరుగుచుందురు. (బ్రాహ్మణపురోహితులకు అక్కడ పండాలని పేరు.) నిత్యము ఎంతమంది యాత్రికులు వచ్చిపోవుచుందురో దీనినిబట్టి యూహించుకొనవచ్చును.

శ్రీ కృష్ణపరమాత్మ అవంతికలో చదువుకొనుచున్నరోజులలో ఇది యొక జ్యోతిషిక కేంద్రముగా కూడ ప్రసిద్ధిగాంచియుండెను. ఆనాటికప్పుడే హోరా విజ్ఞాన కేంద్రములలో నొకటిగా ఇది యెన్నబడుచుండెను. ఈ యవంతికను రాజధానిగా పాలించిన విక్రమాదిత్యుని పేరటనే విక్రమశకమను ప్రసిద్ధశక మేర్పడినది. యంత్రమహల్ అనబడుచు ప్రస్తుత మిక్కడనుండు వేధశాల ౧౭౩౩ లో మహారాజా జయసింహుచే కట్టింపబడినది. ఎన్నెన్నో జ్యోతిషపరికరములు దీనిలో నెలకొల్పబడియున్నవి. ఇక్కడ గంటలు, నిమిషములు, లిప్తలు కూడ తెలిసికొను నేర్పాట్లుగలవు.

మహాకాళ దేవాలయమునకు ఏడెనిమిది నిమిషములనడకదూరములో రామఘట్టమను నొక స్నానఘట్టముకలదు. యాత్రికు లిక్కడ స్నానముచేసియే మహాకాళదర్శనము చేయుచుందురు. సిప్రానదితీర్థమును యాత్రికులు అపవిత్రము చేయకుండ సకలమైన కట్టుదిట్టములు చేయబడినవి. ఈ నీళ్లలో సబ్బుపులుముట సుతరాము పనికిరాదు. నీళ్లు మురికియగుననియే కాక అక్కడి తాబేళ్లకు హింసగా ఉండుననికూడ సబ్బువాడరాదని నిషేధింపబడినది.

క్రీ. పె. మూడవశతాబ్దములో రాజ్యపాలనము చేయుచుండిన బౌద్ధచక్రవర్తి అశోకుని కాలమునుండి, యీ యవంతికయందును, దీనిచుట్టుప్రక్కలందును జీవజంతువులు విచ్చలవిడిగా నిర్భయముగా తిరుగులాడగల్గుచున్నవి. ఎవరినుండి యేయాపద వచ్చునో యను

భయము వానికి పోయినది. ముఖ్యముగా సిప్రానదియందలి చేపలు, తాబేళ్ల విషయమున నీయహింసాసూత్రము బహునిర్బంధముగా పాలింపబడుచున్నది. చేపలుపట్టరాదనియు, వేటాడరాదనియు ప్రకటనలా పరిసరములందు లెక్కలేనన్ని గోచరించుచుండును. దీనికి ఫలితముగా సిప్రానదీతీరములందు అడవిజంతువుల విహారము ప్రబలిపోయినది; సిప్రానదీజలములందు తాబేళ్లసంఖ్య హెచ్చిపోయినది. మానవవ్యక్తులతో వానికి చనవు ఎక్కువైపోయినది. వారు తీర్థములందు స్రుంకులిడునప్పుడును, పరిసరములందు మసలుచున్నప్పుడును అవి వారిమీదికే అతిచనవుగా ఎగబ్రాకుచుండును. యాత్రికులుగూడ ఆప్రాణులమీద అపారమైన ప్రేమ కనబరచుచుందురు. అవి తినగలిగిన ఆహారవస్తువులను తెచ్చి, వానికివేయుట వారు విహితకృత్యముగా భావింతురు. పక్షులకుగూడ వారట్లే చేయుచుందురు.

పండుగ పర్వదినములందు సిప్రానదీతీరములందు పచ్చిగడ్డిమోపులు మొదలగు పశువులఆహారసామగ్రి విశేషముగా అమ్మకమునకు వచ్చును. యాత్రికులు దానిని కొని అస్వామికముగా ఆ పరిసరములందు తిరుగుచుండు ఆవులకును, ఎద్దులకును వేయుచుందురు. నదీతీరములందు రాతితొట్లు నిర్మింపబడియుండును. యాత్రికులు నదీజలములను పాత్రలలో తెచ్చి వానితో ఆతొట్లను నింపిపెట్టుచుందురు. ఆవులు మొదలగు మూగజంతువులు దాహము తీర్చుకొనునుగదా యను ధర్మబుద్ధితో వారీపనిని చేయుచుందురు. వ్యవసాయము చేసుకొని జీవించు కర్షకులు తాము, తమ పశువులుకూడ యాత్రికుల ధర్మదానములవలన లాభము పొందవచ్చుననునాసతో తమ పశువులను తోలుకొని ఈ నదీపరిసరములకు వత్తురు. వచ్చునప్పుడు వారు తమ సొంతగడ్డినికూడ కొంచెము తెచ్చుకొందురు. యాత్రికులు నదిలో స్నానముచేసి, దానధర్మముచేయుపుణ్యాబుద్ధితో మూగజంతువుల కొరకు వెదకుచు, కర్షకులవద్దనుండి ఆగడ్డినికొని వారి పశువులకే దానిని మేయబెట్టుచుందురు. ఈ యేర్పాటు చాలవింతగా కనబడుచున్నది. అస్వామికముగా తిరుగు జంతువులకు మరింత యదృష్టము! వీలన: అటువంటి పశువుల తిండితీర్థములకై చందాలను పోగుచేయుటకు ప్రభుత్వముతరపుననే మనుష్యులు నియమింపబడియున్నారు.

సిప్రానది చాల పవిత్రముగా నెంచబడుచున్నది. దాని తీర్థములందు స్నానమాడుట ముక్తిదాయకముగ తలపబడుచున్నది. రామఘట్టముదగ్గర దానికి మరింత ఖ్యాతి. బృహస్పతి సింహరాశిలో ప్రవేశించునప్పుడీ నదికి పుష్కరము సంభవించుచుండును. పండ్రెండేండ్లకొకసారి అది జరుగుచుండును. అప్పుడు సకల తీర్థములును సిప్రానదిలో అంతర్వాహినిగా ప్రవేశించునట. ఆ మహోత్సవమునకు లక్షలకొలది యాత్రికు లిక్కడకు వచ్చి యీ నదియందు స్రుంకులిడుదురు. ఆ మహాజన ప్రవాహములో సాధువులనబడు బైరాగులుకూడ పెద్ద సంఖ్యతో నుందురు.

వైష్ణవ సాధువులు నదికి కుడిగట్టునను, శైవ సాధువులు నదికెడమగట్టునను విడుదు లేర్పాటుచేసుకొందురు. మామూలుగా ఈ రెండుతెగల బైరాగులును అవంతికలో ఆరువారములపాటు మకాము వేయుదురు. మొదటి మూడువారములును వారు గ్వాలియరు మహారాజు అతిథులుగాను, ఆ తర్వాతి మూడువారములును ఉజ్జయిని ధనికుల అతిథులుగాను ఉందురు. వారు గుంపులుగుంపులుగా నుండి, మహంతు లను పేరిటి దళపతుల యాజ్ఞలకు లోబడియుందురు. రాజుగారి అధికారుల చెంతకును, ధనికుల చెంతకును ఈ మహంతులే వెళ్లి, తమ తమ గుంపులకు కావలసినంత ఆహారసామగ్రిని, వంటచెరకును అడిగి తెచ్చుకొందురు. వీరు తప్పుడులెక్క చెప్పి యెక్కువ సామగ్రిని తీసుకొనిపోవుచున్నారని ఒకవేళ ఆదాతలకు తెలిసినప్పటికిని వారావిషయమై వీరి నేమియు ప్రశ్నింపరాదు. ఈ బైరాగులకు ధారాళముగా దానముచేయవలెనునది ఆదాతల సిద్ధాంతము. పారమార్థికచింతతో కాలముగడపుచు, ఐహికభోగములను వదలి కాలక్షేపముచేయు సాధుబృందముమీద సంశయించుటగాని, వారిని కసరుటగాని దయాధర్మబుద్ధిగల ఆ పుణ్యాత్ములు హేయకృత్యములుగా భావింతురు. ఇటువంటి దైవచింతకుల నాదరించుటవలన తమ కపారమైన శ్రేయస్సు కలుగుననని వారి భావన.

మహాకాళనాథుని ఆశ్రయమున అవంతిక యిట్లింతటి మహావైభవముతో వెలయుచు, దర్శన స్మరణములచేతనే మానవులకు ముక్తిని కలుగజేయుచు వారిని ధన్యులను జేయుచున్నది.

# మృతజీవి మున్నంగి......శర్మ

ఆంధ్రులలో పేరున్న వారిలో వాఁడు, సరసుఁడు, స్నేహపాత్రుఁడు మున్నంగి...శర్మ ముక్కడిక్షయ రోగమువాతఁ బడి, ఇంచుమించు రెండేండ్లు కృశించి కృశించి క్రుంగి కూలారిపోయినాఁడు. శర్మయొక్కని పోవుటతో ఒకపండితుఁడు, ఒకకవి, ఒకవిమర్శకుఁడు, ఒకవక్త, ఒకరచయిత, ఒకదేశాభిమాని, ఒకసంఘసంస్కర్త, ఒకరాజకీయవేత్త, ఒకపత్రికానిర్వహణదక్షుఁడు, ఒకసహృదయుఁడు-ఇందఱిని ఆంధ్రలోక మేకకాలమున కోలుపోయినది. దేనఁ జూచిన దాన శర్మ సిద్ధహస్తుఁ డనిపించుకొనినవాఁడు; ప్రాచీనులలో ప్రాచీనుఁడు, నవీనులలో నవీనుఁడు; పెద్దలలో పెద్ద, చిన్నలలో చిన్న; గంటలకొలఁది నోరార మాటలాడి నో రూరఁ జేయఁగలవాఁడు. శర్మ గానాభినయములు రెంటను తీరినవాఁ డని యందురు. కావచ్చును; అన్నింట నున్న వాని కవి యొక్క లెక్కలోనివి కావు.

శర్మరచనములు తక్కిన గుణములకువలె లయకును నిలయములు. పద్యరచనములయందుకంటె గద్యరచనములయందు దాని మెఱుఁగు మిక్కిలి యెక్కువ.

భాషయందును, భావమందును బాగుమీఱిన శర్మ 'భావశబలత'లు భావోద్దీపకములు. అవి మోమోటమితగులని నేమాత్రము నెఱుఁగనివి.

శర్మ తన మేలిరచనముల నొసఁగి కొంతకాలము భారతి నాదరించినాఁడు. తరువాత భారతప్రకటనము వంక తనదృష్టి మరలినది.

అంతకుపూర్వ మేనాఁడో శ్రీ వేంకటరాయశాస్త్రిగారితో శర్మ కనుబంధ మేర్పడినది. చిరకాల మాయనకు తోడునీడగ నుండినాఁడు. శర్మ జిజ్ఞాసువు; శాస్త్రి విజ్ఞాననిధి. ఆ విజ్ఞాననిధినుండి యీ జిజ్ఞాసువు యథేష్టముగ సాహిత్యసామగ్రిని సేకరించుకొని ఎక్కువసమర్థుఁ డయినాఁడు. అంత, సుపరిష్కృతముగ ఆంధ్రభారతమును క్రొత్త ముద్రించి వెలయింపవలె నను సంకల్ప మతనిలో మొలకెత్తినది. వేలకొలఁది ధనముఁగాని కేవలము మాటల నెఱవేఱునది కాదా సంకల్పము. శర్మ అకించనుఁడు; ధనము తిరిపె మెత్తుటకయి దేశముల వెంట తిరిగినాఁడు మూఁడు నాలుగేండ్లు; తిరుగని నాడుల నన్నిటిని తిరిగినాఁడు; అడుగనివారి నందఱిని అడిగినాఁడు; కార్యార్థ మెందఱనో కలసి మెలఁకువను మిన్నన కెక్కించి కృతార్థులను చేసినాఁడు, తా నెంత కృతార్థుఁడయ్యెనో కాని.



భాషాభిమానులగు శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారిని బోలిన యుదారహృదయుల చేయూఁతను కొంతకుకొంత పొందఁగలిగినాఁడు; తనచావు నాఁటి కట్లో, తీరనిరోగముతో పోరాడుచున్నను, కొన్ని పర్వములను తాఁ గోరినతీరు సొరులతో ముద్రించినట్లు తెలియవచ్చుచున్నది. శర్మ జీవించియుండఁగా వానిని చూచి ఆనందించి శర్మను మనసార అభినందించు భాగ్యము లభించినదికాదు. దాని కిపుడు చింత పనిలేదు. వానిని నేఁడు కాకున్న నింకొకనాఁడు చూడవచ్చును. శర్మ నింక నెన్నఁటికేని చూడఁగలమా! కాని, అతని

ప్రకటనముల నిక చూచునపుడు అతఁడు మనకు కన్నులకు పొడగట్టుట తప్పదు ; అతనికయి మనము కన్నుల నీరుపెట్టుట తప్పదు. ఏమయిన నేమి ? శర్మ భారత ప్రకటనావేదనతో క్రమ్గి ప్రాణములను పోగొట్టుకొన్నాఁడు.

ఈ విషాదసమయమున అర్ధాయువు కొంపెల్ల జనార్దనరావు జ్ఞప్తికి వచ్చుచున్నాఁడు. పాపము, అతఁడును ఇతనివలెనే, ఉదయినికోసము పలువరించి పలువరించి ప్రాణములను పాడురోగమునకు బలియిచ్చినాఁడు.

శర్మ ఏఁబదిని దాఁటినవాఁడు. జనార్దనరావు అందున సగమువాఁడు. ఇద్దఱును ప్రయోజకులే. ఏమి లాభము ? ఆవేదనాగ్నికి తమ యాయువ్యమును ఆహుతిచేసికొన్నారు! అంతే!! గ. సు.

---

## ధన్యజీవనుడు జగదీశచంద్రుడు

పందొమ్మిదవ శతాబ్దపుటుత్తరార్ధము ఆరంభవేళలో నవతరించి, విజ్ఞానశాస్త్రమున నిధి యయి తనకును, తన దేశమునకును ఆచంద్రార్కము గౌరవమును నిలువబెట్టిన మహాపురుషుడు జగదీశచంద్రుడు. అతడెనుబది యేండ్లు బ్రతికినాడు. అతనిది నిక్కమయిన బ్రతుకు. అతని భౌతికకాయము నేడు యశఃకాయముగ మాఱినది. యశఃకాయము చిరంజీవము.

అతడు చిన్ననాటనే ప్రకృతిశాస్త్రాధ్యయనమునకు నడుముకట్టినాడు. క్రమముగా భౌతికశాస్త్రమున ప్రవేశించి అందారితేరినాడు. ఆవల జీవశాస్త్రమును చేపట్టి అందును కృతార్థుడయినాడు. ఆయాశాస్త్రములయందపారముగ పరిశోధనములను చేసినాడు. నిస్తంత్రీవార్తాహరణసూత్రములను, వెలుగక్కరలేకుండ ఫోటోలను తీయగల మార్గములను ఈ యిరువదవ శతాబ్దిప్రారంభకాలమునకే లోకమున ప్రకటించినాడు.

భూతకోటి స్థావరజంగమాత్మకము. ఉభయము జీవవంతమనుట సృష్టిగతమగు సిద్ధాంతము; ఆత్మవంతమునయినను ననుట జగదీశుని సిద్ధాంతము. సుఖ



దుఃఖాదిమానసిక భావానుభూతి జంగమమున కెట్లో స్థావరమునకు నట్లే యని యతడు నిరూపించినాడు. నిరూపణమున కావశ్యకమగు సాధనసామగ్రిని తానే కల్పించినాడు. అతడు గొప్ప మేధావి. అతని కేది సాధ్యము కాదు ?

అతని ప్రతిభకు, అతని కార్యదీక్షకు అతని ముఖము నిర్మలమగు ప్రతిబింబము. అతడు తన జీవితమును, ఆర్జనమును విజ్ఞానాభ్యుదయమునకు సమర్పించినాడు: అతడు ధన్యజీవనుడు. వర్ధమానభారతిజాతి కతని నామము నిత్యస్మరణీయము.

---




## పిల్ల వైజ్ఞానికులు

'పిట్ట కొంచెము, కూత ఘనము' అని మనలో ఒకసామెత ఉన్నది. ఈచిత్రములందలి బాలురను చూడుడు. వయస్సుకు మించిన మేధాసంపదతో వీరు అఖండమైన ప్రఖ్యాతిని సంపాదించుచున్నారు. వైజ్ఞానిక రహస్యము





లను వీ రింతే చిన్న వయస్సుననే యెట్లు అవగాహన చేసుకొనగల్గిరో! పురాతనజన్మ పుణ్యపరిపాకమునగాక మరెట్లు?



ఆ నిలుచుకొని యున్నది(5) రాబర్టు స్నెల్లింగు. వయస్సు తొమ్మిదేండ్లు. కుర్చీలో కూర్చొని ఆఫోనులో మాట్లాడుచున్నది రాబర్టుఅన్న విల్లియము. అతని వయస్సు పదకొండు. ఈ యిద్దరును భాగస్వాములుగా ఒక



పరిశ్రమాగారము నడపుచున్నారు. సిరాలుతయారుచేయుటలో వీరిద్దరు నిపుణులు. రకరకముల సిరాలు శాస్త్రీయపద్ధతులతో అత్యుత్తమముగా తయారుచేసి వీరు కచేరీలకు, పాఠశాలలకు సరఫరా చేయుటయేకాక అంగళ్లకుగూడ అమ్మకమునకు సిద్ధపరచుచుందురు. వీరి పరిశ్రమాగారమునకు స్నెల్లింగు కెమికల్ ఇంక్ కంపెనీ అనిపేరు. దీనిలో వీరికి ఏడాదికి ౨౦౦ షిల్లింగులు ఆదాయము వచ్చుచున్నది. కంపెనీ

వ్యవహారములు చూచుకొనుచు అన్న పర్యవేక్షణచేయు చుండును; తమ్ముడు నడుముకట్టుకొని తన తెలివితేటల నుపయోగించి అత్యుత్తమమైన సిరాలు తయారుచేయు చుండును.

సాన్‌ఫ్రాన్సిస్కోలో మరియొక పిల్లవాడు. (8) అతని పేరు లియో సలనేవ్. వయస్సు ౧౪ ఏండ్లుండును. నక్షత్ర విజ్ఞానము లో అతనికభిరుచి మెండు. ఎట్లు సంపాదించుకొన్నాడో ఆకాశ్రరహస్యములను కాని, ఆరంగమందలి అఖండ పండితుల ను కూడ ఆశ్చర్య చకితులను చేయు చున్నాడు. ఇటీవలనే ఇతడొక దూరదర్శిని నెక్కడనో అరువుదెచ్చుకొని, నక్షత్రమండలము నదేపనిగా పరిశీలించుచు, పదేండ్లుగా నేలాటి చలనములేక గోచరమగుచుండిన యొక నక్షత్రములో అపూర్వమైన హెచ్చుతగ్గులను కనిపెట్టి వేత్తలకు నివేదించినాడు.

న్యూయార్కులో మరియొక బాలుడు; వయస్సు ఎనిమిది. (4) గుడ్డలను అమరికగా పెట్టుకొని జాగ్రత్తపరచుటకు అనుకూలమైన కొయ్యచట్టము నొకదానిని ఎవరిబుద్ధికిని అందని పద్ధతితో తయారుచేసినాడట. అంత అనుకూలమైన చట్ట మప్పటి కాదేశములో ఎవరును చూచియెరుగరట. కాబట్టి దాని నితడు సంయుక్తరాష్ట్ర ప్రభుత్వమున రిజిస్టరుచేయించి సర్వస్వామ్యములను తన పరముగానే ఖాయపరచు



యొక్క ప్రతిబింబమును, ప్రభుత్వమిచ్చిన సర్వస్వామ్య పత్రికను తల్లికిచూపుచు ఇతడు మురియుచున్నాడు, చూడుడు.

కాలిఫోర్నియాలో బిల్లి బెట్టెరిడ్జి అని మరియొక బాలుడు. (7) వయస్సు పదునైదు. యంత్రనిర్మాణపు మెళకువలను ఇతడు బాగుగా గ్రహించినాడు. ఉపయోగములేక, అరిగిపోయి పారవేయబడిన ఏవేవో యంత్రముల భాగములను అప్పుడప్పుడు చేర్చిపెట్టియుండి యితడు తర్వాత వానితో నొకపందెపుమోటారును నిర్మించినాడు. మోటారు నడపునేర్పును చుకొన్నాడు. దాని నితడు గంటకు 100 మైళ్లవేగముతో నడిపి తన చాకచక్యమును ప్రదర్శించినాడు.

వైమానికుడు మరియొక బాలుడు. (3) న్యూయార్కు దేశస్థుడు. వయస్సు పదకొండు. విమానములను నడపు ప్రావీణ్యమును అలవరచుకొన్నాడు. మరియొకరి సహాయ మవసరము లేకయే ఒంటిగా విమానమునడ

సంపాదింపగల నేర్పుగడించినాడు. విమానయంత్రమందలి నిరోధకపు మీటలను, చుక్కానిని అందుకొనుటకు ఇతడువీపుప్రక్కన దిండ్లను పెట్టుకొనుచుండు నన్నచో ఇతనివయస్సేమాత్రమో, ఆవయస్సుకు ఆనేర్పుకు ఎంత అంతరమో ఊహింపవచ్చును. తల్లికి తన నేర్పును చూపి మెప్పింపవలయునని యితడామెదగ్గర ఆశీర్వాదముపొంది, విమానములో నొకప్రయాణముచేసివచ్చుటకు పూనుచుండుట యీచిత్రమున గానవచ్చును.

ఈ యిద్దరు బాలురను చూడుడు.(6) ముద్రణకళయందును, పత్రికానిర్వహణమునందును వీరు ఆరితేరిన



వారు. తమ వయస్సెన్న యినను గణింపక వీరిద్దరును 'ఈగిల్ హెరాల్డు' అను పేరుతో నొక వార్తాపత్రికను నడపుచున్నారు. పత్రికను తయారుచేయునది వీరే; అచ్చువేయునది వీరే; తదితరములైన వ్యవహారములను నడపునది వీరే. తదేకదీక్షతో వీ రెట్లు తమ విధులను నెరవేర్చుచున్నారో చూడుడు.

పదునారేండ్ల వయస్సులోనే జోసఫ్ అను ఈ బాలుడు(1) రాసాయనిక పరిశోధనలకు పూనుకొని, తత్సంబంధమైన పరిపత్తులకే ఆశ్చర్యమును కల్పించుచున్నాడు. ఇటీవలనే ఇతడు రక్తసంబంధమైన రసాయన ప్రక్రియలో నొక క్రొత్త పద్ధతిని కనిపెట్టి పరిషత్తులకు ఆ విషయము నెరుకపరచినాడు. వా రాశ్చర్యపడినారు.

జాన్‌వాల్ష్, కెన్నెత్ ఫ్లూయిస్ అను పేర్లుగల యీ బాలురను (2) చూడుడు. నీటిలోపలికి గజముల కొలదిదూరము ఈదుచుపోవుటలో అసమానమైన శక్తి సంపాదించినారు వీరు. అందుకు వలసిన పరికరము నొకదానిని వీరే స్వయముగ తయారుచేసికొన్నారు. ఈసాధనముయొక్క సహాయముతో వీరు సముద్రములో 30 అడుగులలోతునకుపోయి జలాంతర్గాములకు కావలసిన సౌకర్యములను, కష్టసుఖములను పరిశీలించునాసతో వెళ్లివచ్చినారట.

యుక్తవయస్సుకైనను రాకపూర్వమే తమ మేధాసంపదను, కల్పనాశక్తిని, శాస్త్రవిజ్ఞానమును ప్రదర్శించిన బాలవైజ్ఞానికులు ఇంకను ఎందరో నేడు కనబడుచున్నారు.

---

## మణికట్టు నోటుపుస్తకము

చూచుటకిది గడియారమువలెనున్నను ఇది గడియారముమాత్రము కాదు; నోటుపుస్తకము. అనేకవ్యాసంగములుగల వ్యవహర్తల యుపయోగమునకై యిది తయారుచేయబడినది.



ఏదైన నొక విషయమును తటాలున వ్రాసిపెట్టుకొనవలసి వచ్చినప్పుడు కాగితము కొరకై అక్కడ ఇక్కడ వెతకుకొనన నక్కరలేని కల్పన యిది. ఈ నోటుపుస్తకమున కొకమూత కూడ ఉండును. పుస్తకమున కొకమూలనుండునుండీని నొక్కగానే మూత తెరచుకొనును. లోపల పొడుగాటికాగితము చుట్టపెట్టుకొనియుండును. పైభాగము వ్రాతతో నిండినవెంటనే, ఛాయాచిత్రపటలమును త్రిప్పినట్లు కాగితము చుట్టను త్రిప్పినచో వ్రాతకాగితము ఈవలివైపునకు చుట్టుకొని, దానిస్థానమునకు ఆవలివైపునుండి ఖాళీ కాగితము వచ్చి కుదురుకొనును.

---

## సంచారగృహములు

ఇదివరకు గృహములు స్థిరాస్తిక్రింద పరిగణింపబడుచుండెడివి. కాని యిప్పుడిప్పుడు నిర్మింపబడుచుండు ఈ సంచారగృహములు స్థిరాస్తిక్రిందికివచ్చునో, చరాస్తిక్రిందికివచ్చునో చూడవలసియున్నది. సామాన్య

కుటుంబములకు సరిపోగలపాటి గదులతో నీ గృహములు మొత్తము ఉక్కుతో తయారు చేయబడుచున్నవి. కావలసినన్ని సౌకర్యము లతో వీనిని కర్మాగారములందేచేసి ముగిం చి, పూర్తియయిన వెనుక వానిని త్రోపుడు బండ్లలో మోసుకొనిపోయి, స్థాపింపవలసిన స్థలములందు స్థాపింతురు. ఈక్రొత్త విధాన ములో మన మికమీదట తక్కిన వస్తువులను వలెనే కట్టిపెట్టిన ఇండ్లను కర్మాగారములందే కొని మనచోట్లకు మోయించుకొని రావచ్చు నన్నమాట. ఇవి నిప్పుకు కాలిపోవు; భూకంపములకు అదురవు' అని వీని నిర్మాతల పూచీ. తయారయిన కర్మా గారమునుండి తెచ్చుకొన్నట్లే వీనిని ఒకచోటుమార్చి మరియొకచోటికి చేర్చుటకుకూడ సాధ్యమగును.



---

## పండ్లను గట్టిగానుంచు దంతతూలిక



ఇదికూడ కేశతూలికవలెనే ఇండ్లలోని విద్యుచ్ఛక్తితోనే పనిచేయును. ఈతూలికయొక్క చేతి పిడిలో నొకమర యుండును. తూలికతీగను విద్యుచ్ఛక్తి గూటిలోనికి అమర్చగానే ఆ మర ఆడును. దానితో బాటు చక్రాకారమననున్న తూలికకూడ గిరగిర ఆడును. అది అట్లు పండ్లమీద ఆడుచు పండ్లను శుభ్రపరచుటయే కాక పండ్ల యిగుళ్లను బలపరచును.

# కలిగూరగాంపే

## యువతుల దేహసౌష్ఠవమునకు వ్యాయామ విధానములు

ముప్పదియేండ్ల వయస్సువరకు - లావుగానున్నను, సన్నగానున్నను స్త్రీలు తమ దేహసౌష్ఠవమును గురించియెక్కువ జాగ్రత్తపడవలసిన యవసరము లేదు కాని,ఆతర్వాతనే ఎక్కువ జాగ్రత్తపడవలసియుండును. నడుము లావెక్క నారంభించును; తుంటి భాగము విశాలమగును; తొడలు దళసరియగును; పొట్టదగ్గర క్రొవ్వు పెట్టుకొనివచ్చును. ఇటువంటివి దేహసౌష్ఠవమునే పాడుచేయునని మన మనుదినము కన్నులారచూచి తెలిసికొన్నదే. కాబట్టి యిటువంటివి దగ్గరచేరకుండ జేసికొను నుపాయముల ననుసరించుట ప్రతియువతికిని



చి, ౧.

ధర్మము. దేహసౌష్ఠవము పోయిన పోవుగాక యనునంతటి నిరీహ యేస్త్రీకిని ఉండదు కదా! శ్రద్ధ, పట్టుదల యున్నచో ఉపాయములకు కొదువ యుండునా? ఉండదు.

అట్టి ఉపాయములలో ముఖ్యమైనది ఆహారనియమము. కన్న తిండి తినకుండ, తినునదైనను- అరుగునో అరగదోయను శంకయైనను మానుకొని- కడుపబ్బ తినకుండ నియమితాహారమునకు అలవాటుపడుట దేహసౌష్ఠవమున కనుకూలమైన విధులలో మొదటిది. కాయగూరలు, పండ్లదినుసులు మొదలైనవి రోజువారీ ఆహారములో ఎంతవిరివిగా వాడుచుండిన అంత మంచిది. ఇటువంటివి ఆకలిని హాతమార్చలేకపోవచ్చునుగాని జీర్ణశక్తిని వృద్ధిచేయుటలోను, కణసమితులనబడు టిష్యూలకు పుష్టినిచ్చుటలోను, నరములకు బలమును కల్పించుటలోను అప్రతిమానముగ పనిచేయును. ఇటువంటి ఆహారమున కుపక్రమించిన మొదటిరోజులలో దేహమున నీరసముగా నున్నట్లు తోచవచ్చునుగాని ఆ నీరసమే దేహమాంద్యము తొలగిపోవుటకు తొలిమెట్టయి, రానురాను అలవాటుపడి దేహమునకు చులకదనమును, ఉత్సాహమును కలుగజేయును. వీలయిన యెడల వారమున కొకసారి ఒకదినమంతయు, అనగా ౨౪ గంటలసేపు ఆహారమును పూర్తిగా విసర్జించి, వట్టి నీళ్లతోనే - ఎంతఎక్కువైన అంతమంచిది-విశ్రాంతిగా కాలము గడుపుట చాలమంచిపని. దేహమందలి అలసత, క్రొవ్వుగుణములు మొదలైనవి పారిపోవుటకు ఇటువంటి యలవాటు సహాయకారి యగును.

ఆహారనియమమునకు తరువాతిది శరీరవ్యాయామము. అదికూడ నిత్యకృత్యములలో నొకటిగా పరిగణింపబడవలయునే కాని వారమునకో నెలకో ఒకటి రెండురోజులు చేయుచుండిన జాలదు. శరీరవ్యాయామమునకు తగిన సమయములు ఉదయము, సాయంకాలము. యువతు లాచరింపదగు సులభమైన శరీరవ్యాయామములు కొన్ని యిక్కడ నిరూపింపబడుచున్నవి.

కాలివ్రేళ్లను తాకుట: పాదములను ౪౫ డిగ్రీల అంతరముగా నుండునట్లు పెట్టుకొని, మడిమలనుచేర్చి నిలువవలయును. చేతులను తలమీదికి ఎత్తుకొని నిటారున నిలువవలయును. తరువాత నడుమువంచి, మోకా

ళ్లను నిలువుగ పెట్టుకొని వంగి చేతి వ్రేళ్లతో కాలి వ్రేళ్లను తాకవలయును. మరల చేతులను తలపైకి తీసుకొనిపోయి, ప్రక్కలకు వలయాకారముగ జారవేయవలెను. మరల చేతులను తలపైకెత్తి ముందువలెనే చేయవలెను. ఇట్లు కొన్నిమార్లు ఎడతెగకుండ ఈ యభ్యాసమును చేయవలెను. (చి. ౧.)

ఉదరమునకు పరిశ్రమ: బీరువాలకో, సోఫాలకో ఎదురుగా



కూడ[?]మో కాళ్ల నేమాత్రము, వంచకుండ నిలువుననే యుంచుకొని యుండవలెను. అటుగాని, ఇటుగాని వంగునప్పుడు అనుకూలమైన వేగముతో వంగుట వంటి ప్రదేశమునకు చక్కని పరిశ్రమయగును. ఈ అభ్యాసమును కూడ పది యిరువది మార్లు చేయవలెను.

చి. ౨.

కూర్చొని నేలమీద వెల్లకిల బరుండవలయును. కాళ్లను బీరువాల క్రిందికో, సోఫాల క్రిందికో పోనిచ్చి కాలి వ్రేళ్లను వాని అడుగుఅంచుల కానించి జారి రాకుండ నుంచవలయును. చేతులను రొమ్ముమీదికి కట్టుకొనవలయును. కట్టిన చేతులను వదలకుండ అట్లే నడుముమీద లేచి కూర్చొన్న స్థితికి రావలయును. వెంటనే మరల ముందువలెనే నేలమీదికి శరీరమునువాల్చి పండుకొన్న స్థితికి రావలెను. ఇట్లు అధమము పదిపర్యాయము లైనను చేయవలెను. ఈ వ్యాయామము మలబద్ధకమును నివారించుకొనుటకు అత్యుత్తమమైనది. (చి. ౨.)

నడుమువాల్చి ప్రక్కలకు వంగుట: పాదములను దూరదూరముగా పెట్టుకొని నిలువవలెను. చేతులను భుజముల కెదురుగా చక్కగా చాచి పెట్టుకొనవలెను. ఆ చాచిన వానిని అట్లే పెట్టుకొని నడుము దగ్గర ప్రక్కలకువంగి, ఎడమ చేతి వ్రేళ్లతో కుడిపాదమును తాకవలెను. మరల మొదటిస్థితికి పోయి, ఈసారి మరియొక ప్రక్కకు వంగి కుడిచేతి వ్రేళ్లతో ఎడమ పాదమును తాకవలెను. ఈ యుభయవేళలందు

(చి. 3.)

తలమీదికి పాదములు చేర్చుట: నేలమీద వెల్లకిలపండుకొనవలెను. చేతులను పైకి చాచవలయును. కాలి వ్రేళ్లు మొదలుకొని శరీరమంతటనుండు కండరముల నన్నిటిని బిగింపజేసినట్లుగా చాచవలయును. మరల సడలింపవలయును. చేతులు చాచినవి చాచినట్లే పెట్టుకొని నెమ్మదిగా కూర్చొన్న స్థితిలోనికి రావలయును. అట్లు చేయునప్పుడు తల మోకాళ్లకు తాకునట్లును, చేతి వ్రేళ్లు కాలి వ్రేళ్లను తాకునట్లును కాళ్లను వంచుకొనవలయును. మరల మునుపటి స్థితికి రావలయును. చేతులు ప్రక్కకు పెట్టుకొని, కాళ్లను పైపైకి ఎత్తుకొనుచుపోయి తలమీదుగా అటువైపు నేలను తాకునట్లు చేయవలెను. మరల వానిని నెమ్మదిగా వెనుకకు తేవలెను. ఇట్లు చేయునప్పుడు శరీరమును నేలమీద ఆనియేయుండునట్లు పెట్టుకొని, మోకాళ్లు



చి. 3


(చి. ౪.)

వంగకుండ నీలిగించుకొని యుండవలయును. ఇట్లు కొన్ని పర్యాయములు చేయవలెను. ఉదరభాగము నందలి కండరములను బలపరచుట కింతకంటె మంచి అభ్యాసము వేరొకటి లేదు. (చి. ౪, ౫.)

'ఊపుకు స్థూను' : చేతులు ప్రక్కకు పెట్టుకొని వీపుమీదవెల్లకిల పండుకొనవలెను. కాళ్లను నిలువునపైకి లేవనెత్తవలెను. పిదప వానిని వంచి మోకాళ్లతో రొమ్మును తాకుటకు ప్రయత్నింపవలెను. కాలివ్రేళ్లను మడవరాదు. చేతులతో కాళ్లను పెనవేసుకొని ఆపట్టును



సడలించకుండ అట్లే లేచికూర్చొనవలెను. ఇట్లే ఊపుకు ధోరణిగా కొన్ని మార్లు చేయవలెను. (చి. ౬.)

ఈ యభ్యాసములు మొట్ట మొదటి రోజులలో కొంచెము శ్రమసాధ్యములుగా నున్నప్పటికిని అలవాటు చేసుకొన్న కొలదిని బహుసులభము లుగా తోచగలవు.


(చి. ౫.)


(చి. ౬.)

పండ్లుతోముట యెంత ముఖ్య కర్తవ్యముగా భావించుచున్నామో అదియేబుద్ధితోనే శరీర వ్యాయామమునుకూడ చేయు నలవాటు పెట్టుకొనుట ప్రశస్తమైనపని.

## శ్రీ జోస్యుల కృష్ణమూర్తి, తణుకు




ఇంగ్లాండు మొదలగు పాశ్చాత్యదేశములలో రేడియో బ్రాడ్‌కాస్టింగ్ మొదలగు విషయములందు ప్రావీణ్యమును గడించుకొనివచ్చిన ప్రథమాంధ్రుఁడు.

---

## నన్నయార్యు నిరంకుశ ప్రయోగము

నన్నయభట్టారకుఁడు తన భారతమున రెండు మూఁడు శబ్దములను యథేష్టముగాఁ బ్రయోగించెనని పరిశోధకు లెఱుఁగుదురు. అందు—

"భీమాసురవీరులము
ష్టాముష్టి రణచ్ఛటచ్ఛటాశబ్దంబు."

అనుచో, 'ముష్టీముష్టి' కావలసియుండఁగా 'ముష్టాముష్టి' యని పాణినీయవిరుద్ధముగా యతిస్థానమునఁ బ్రయోగించియున్నాఁడు. ముష్ట్యర్థమున ముష్టశబ్దమకారాంతము గనఁబడదు. ఇది తొల్లి నారచియించిన భారతపీఠికలోఁ జూపియున్నాను. ఇపుడు మఱియొకటి కనవచ్చినది. సభా—౧-౨౩౫.

"క. అతుల చతురంగసేనా
యుతుఁడంతర్గిరి బహిర్గిరోపగిరులభూ
పతుల ననినోర్చి—"

ఇచ్చట 'బహిర్గిర్యుపగిరి' అని పాణినీయమునఁ గావలసియుండఁగా ఇ+ఉ=లకు 'ఓ' ఆదేశము గావించి బహిర్గిరోపగిరులని ప్రయోగించెను. ఈఓకారాదేశము యతిస్థానములోనిది. ఎటు సవరింత మన్నను వీలు కనఁబడదు. పాఠాంతరమూ కనరాదు. గిరిశబ్దము కారాంతముగాఁగూడ నున్న దందుమా? ప్రమాణము కనఁబడదు. పైగా సంస్కృతభారతములోని యీక్రింది శ్లోకమున కిది సరియైన తెలుఁగు. సభాపర్వ దిగ్విజయపర్వణి-౨౭ అధ్యాయే-

"అన్తర్గిరిఞ్చ కౌన్తేయ స్తథైవచ బహిర్గిరిమ్,
తథై వోపగిరిఞ్చైవ విజిగ్యే ప్రురుషర్షభః"

దీనినిబట్టి కూడ "గిరోపగిరు"లన్న ప్రయోగము నిరంకుశమే యని తోఁచినది. ప్రాజ్ఞులు చిత్తగింతురుగాక.

మల్లాది సూర్యనారాయణశాస్త్రి

---

## శ్రీపాద లక్ష్మీపతి శాస్త్రిగారు



'నన్నెచోడదేవ కుమారసంభవ విమర్శము'కర్త.
ఈగ్రంథము విమర్శ ఈసంచికయందు కలదు.



# విమర్శనము

## శ్రీ భగవద్గీత

### (మూలము, అనువాదము)

క్రౌను ౧/౮ సైజు. పు. ౩౬౮. వెల రు ౦-౮-౦. అనువాదకుడు: రావుసాహెబు బచ్చు పాపయ్యశ్రేష్ఠి.

ప్రకాశకులు: ద్వారకానాథ్ అండుకంపెనీ, ౫౫, ప్రొసీను ముత్యాలుమొదలివీధి, మద్రాసు.

భగవద్గీతకు ఆంధ్రమున పద్యానువాదములు, గద్యానువాదములు, గేయానువాదములు, సారములు, టీకాతాత్పర్య విశేషార్థబోధకరచనలు— అసంఖ్యాకములు పుట్టి వ్యాప్తియందున్నవి. ఇప్పటికిని అనేకు లనేకరూపముల రచియించుచున్నారు. ఇంకను ఇట్లే అనేకులు రచియింప గలరు. భారతీయుని దృష్టిలో భగవద్గీతమహిమ అట్టిది! అందలి విషయము సామాన్యదృష్టికి గోచరింపని గహనమయిన వేదాంతము. కావున ఆయా రచనల తీరుతెన్నులు ఆయా రచయితలు మూలగ్రంథమును బోధపరచుకొనుటయందు ననుసరించియుండును. వానితత్త్వము నిద మిత్థమని నిర్ణయించి చెప్పుట సాధ్యముకాని పని.

ప్రకృతగ్రంథము క్రొత్తగా వెలువడినది. మూలమునందలి శ్లోకములన్నియు నిందు గీతపద్యముల రూపమును పొందినవి. మూలము ఎడమవైపు పుటమీదను, అనువాదము కుడివైపు పుటమీదను పొందుపబడినవి. అనువాదమునందలి క్లిష్టవిషయములకు వివరణము మూలము ప్రక్కనే చేర్పబడినవి. అనువాదశ్రమమును, ముద్రణవ్యయమును భరించి సుందరముగ పుస్తకమును తయారుచేసి కేవల మూల్యాలవలనకే విక్రయింప అనువాదకర్త సంకల్పించుట ప్రశంసార్హమగు విషయము. అనువాదకర్తకు భగవద్గీతయందు గల నిరతిశయభక్తిని ఈ సంకల్పము నిరూపించుచున్నది. ఉద్ధృతభాగములు అనువాదముతీరును పాఠకులకు తెలుపగలవు.

మూలము :

శ్రేయోహి జ్ఞాన మభ్యాసాత్
జ్ఞానా ద్ధ్యానం విశిష్యతే,
ధ్యానా త్కర్మఫలత్యాగ
స్త్యాగా చ్ఛాన్తి రనంతరమ్

అనువాదము :

మూఢుఁ డొనరించు నభ్యాసమునకు జ్ఞాన
మున్న మేలు, ధ్యానము దానికన్న మేలు,
ధ్యానమును మించినది ఫలత్యాగముసుమి
జనన కట్టిత్యాగంబుచే శాంతి గల్గు.

మూలము :

న త ద్భాసయతే సూర్యో
న శశాంకో న పావకః,
య ద్గత్వా న నివర్తన్తే
త ద్ధామ పరమం మమ.

అను :

భాస్కరుండును జంద్రుండుఁ బావకుండుఁ
జాల రద్దానికిం బ్రకాశం బొసఁగ;
ఎటకుఁ జనువారు మరలి తా మిటకు రారొ
యట్టిదే నాపదంధామ మనుము పార్థ!

మూలము :

యో న హృష్యతి న ద్వేష్టి
న శోచతి న కాంక్షతి,
శుభాశుభపరిత్యాగీ
భక్తిమాన్ యస్స మే ప్రియః.

అను :

సంతసంబు గనక వంతలఁ జెందక
ద్వేష మందక యభిలాషి గాక
పుణ్యపాపములను బొందక వర్జించు
భక్తుఁ డనును నాకుఁ బరమప్రియుఁడు.

ఇంచుమించుగ నిట్లేయుండును [అనువాద మంత యును. పారాయణము చేయువారి కావశ్యకమగు ఉప క్రమోపసంహారగ్రంథ సామగ్రి యంతయు ఆద్యంత ములయందు గలదు. చివర నలువదిపుటలయందు మూల శ్లోకారంభభాగముల అకారాద్యనుక్రమణికయు కలదు.

## నన్నిచోడదేవ కుమారసంభవ విమర్శము

మద్రాసు విశ్వవిద్యాలయాంధ్ర గ్రంథమాల, ౬ (బులెటిన్). రచయిత : శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రి. ఆంధ్రసహోపన్యాసకులు, ప్రాచ్యపరిశోధన సంస్థ, మద్రాసు విశ్వవిద్యాలయము. రాయల్ సైజు ౧/౮ సైజు. పుటలు ౨౦౮. వెల రెండురూపాయలు. ప్రకాశకులు: మద్రాసు విశ్వవిద్యాలయమువారు, మద్రాసు.

ఆంధ్రవాఙ్మయమునఁ గల ఉత్తమమహాకావ్యము లలో రాజశిఖామణియు, కవిరాజశిఖామణియు నను నన్నిచోడదేవుఁడు రచించిన 'కుమారసంభవము' ఒకటి. ఇది శైవకావ్యములలో అగ్రగణ్యము ; దేశి కవితను గూర్పఁబడి జానుతెలుఁగునుడికారపుసొంపు నింపారు ప్రబంధములలో ప్రధానము, ప్రథమమును.

'కుమారసంభవము'ను తొలుత సంపాదించి తెలుఁగుదేశమునకును, తెలుఁగువాఙ్మయమునకును మహోపకార మొనరించినవారు శ్రీ మానవల్లి రామ కృష్ణకవిగారు. వీరు 'కుమారసంభవమందలి మొదటి యేఁడాశ్వాసములు గల భాగమును మొదటిసంపుట ముగా ౧౯౦౯-వ సంవత్సరమునఁ బ్రకటించిరి. మిగిలిన యైదాశ్వాసములు గల భాగమును ద్వితీయ సంపుట ముగా ౧౯౧౪-వ సంవత్సరమునఁ బ్రకటించిరి. రెండు సంపుటముల చివరను లఘుటీకలును, రెండవ సంపుటము చివర ముఖ్యపాఠభేదములును గలవు. పీఠికలలో ముఖ్య ముగాఁ గవికాలనిర్ణయాదులను సూచించి తమభావము లను ప్రకటించిరి.'

శ్రీ రామకృష్ణకవిగారు పీఠికలో నన్నిచో డుఁడు ప్రథమాంధ్రకవి యనియు, నతఁడు క్రీ. శ. ౯౪౦ ప్రాంతపువాఁ డనియు వ్రాసియున్నారు. ఆయం శమే యాంధ్రవిమర్శకలోకపు దృష్టి నాకర్షించి వాద, వివాదముల కాలవాలమయినది.

ఈ విషయమును చక్కఁగ పరిశీలించిన విమర్శ కులలో శ్రీ శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిలుగా రొకరు. శ్రీ శాస్త్రిలుగారు తక్కిన పెక్కురు విమర్శ కులవలె కవికాలనిర్ణయముతోనే తృప్తినొందక అతని నివాస, సమకాలికులంగూర్చియు, ప్రకృత గ్రంథమూల భూతములను సంస్కృత గ్రంథముల తత్త్వముం గూర్చియు, నన్నిచోడ గ్రంథయథార్థస్థితిం గూర్చియు విశేష పరిశ్రమ నొనరించిరి. ఆ పరిశోధనల ఫలితమే ఈ 'కుమారసంభవ విమర్శము'.

ఈ రీవియమున పెక్కు సంస్కృతాంధ్ర, ద్రవిడ, కర్ణాట, మలయాళాది భాషా, వాఙ్మయ సం ప్రదాయములను, శాసన, గ్రంథప్రమాణములను సంద ర్భానుసారముగ వివరించుచు తమ సర్వతోముఖ పాండి త్యమును విశదపఱచుచు అనేక నూతనాంశములను వెల్లడించినారు.

కొందఱి మతమున నన్నిచోడుని కాలము ౧౦ వ శతాబ్ది. మఱికొందఱి మతమున ౧౨-వ శతాబ్ది. ఇంచు మించుగ విమర్శకు లందఱు నీ రెండు పక్షములకును జెందినవారే. పయి మతభేదములకు శాసనములే ప్రమాణీ కరింపఁబడినవి. కాని ఆ ప్రమాణములు దుర్బలములు, సందిగ్ధములు నగుటచే శ్రీ శాస్త్రిలుగారు తమపయి

ముల నంగీకరింపక భాషా నివర్శనములనుబట్టియే కాల నిర్ణయమునకుఁ గడంగిరి.

వారి యభిప్రాయ మిది: ఛందస్సంప్రదాయములు, వ్యాకరణపద్ధతి, చిత్రకవిత, భాషాంతర సంబంధము, త్రిమూర్త్యాదిస్తవరీతి మొదలనువానిం బట్టి చూచిన నన్నిచోడుఁడు నవీనుఁడనుటయే యుచితము; నన్నయభట్టునకు సమీపమునఁ బూర్వాపరకాలములం దున్న కవితాశక్తి యితని కావ్యమున కానరాదు; ద్వాదశ శతాబ్ది ప్రాంతమున నెవనిచేతనో కాళిదాసనామమున రచింపఁబడిన దని యూహింపఁబడిన సంస్కృత కుమారసంభవోత్తర సర్గ భాగములోని భావములఁ గొన్నింటి నీతఁడు గ్రహించెను; తిక్కన, కేతనల గ్రంథభాగములందలి కొన్ని పద్యములను, భావములను ఇతఁ డనుసరించుటయే కాక వానికి మెఱుఁగు పెట్టఁదలఁచి రచించెను; ఇతఁడు భారతకవితా, శైవకవితా సముచ్చయముగాఁ గావ్యము రచించెను; కాన నీతఁడు చతుర్దశశతాబ్ది ప్రథమపాదమునన్నో, త్రయోదశ శతాబ్ది చతుర్థపాదముననో ఉండి యుండవలెను—అని.

ఈ కుమారసంభవ కావ్యముయొక్క మూలగ్రంథమునుగూర్చి విమర్శించుచు శ్రీ రామకృష్ణకవిగారు 'ఈ కుమారసంభవము కాళిదాస కావ్యమునకుఁ దెనుఁగు కాదు; ......ఉద్భటుని కావ్యమునకుఁ దెనుఁగుగాదని తేఁర్పడుచున్నది.' అని వ్రాసియున్నారు.

'సర్వత్ర, పదమునకుఁ బదముగాఁ [శక్కికి శక్క, నుక్కికి నుక్క అన్నట్లుగా] దెనిఁగింపలేదు; కాని మొత్తమునఁ గాళిదాసు కావ్యమే నన్నిచోడుని కావ్యమునకు మూలమని స్పష్టముగాఁ గనఁబడుచున్నది.' 'ఉద్భటుని కుమారసంభవమునుండి మన కవి కొంతవిషయము గ్రహింపకపోలేదు.' 'ఇంక నెన్నో పద్యములు సంస్కృత, కర్ణాట, కాంధ్రకవుల గ్రంథములలోని పద్యముల భావములతో సాదృశ్యము గలవి కనఁబడుచున్నవి.' అని శ్రీ లక్ష్మీపతిశాస్త్రిలుగారు చెప్పుచు, ఆ యా గ్రంథములతో 'కుమారసంభవము'ను బొల్చి సరిపోల్చి చూపిరి. కాళిదాస గ్రంథశ్లోకములకు నన్నిచోడుఁడు మెఱుఁగుఁబెట్టిన పట్టు లిందు చాల సరసముగ సమర్థింపఁబడినవి. ఈ విషయమున వీరి పరిశోధన మద్వితీయము.

ఈ సందర్భముననే శ్రీ శాస్త్రిలుగారు మూల గ్రంథముల తత్త్వమును వివరించిరి; కాళిదాసు కుమారసంభవములోని మొదటి ఎనిమిది సర్గములనే రచించె ననియు, తక్కిన సర్గముల రచన సరళము కాదనియు, దోషజుష్ట మనియు సప్రమాణముగ నిరూపించిరి; కొందఱు తలఁచునట్లు ఉద్భటుఁడు 'కుమారసంభవము, అలంకార గ్రంథము, హరలీల' లను గ్రంథత్రయమును రచింపలే దనియు, 'ఉద్భటుఁడు కవిత్వము మెఱయునట్లు] కుమారసంభవమును వరుసగా అలంకార లక్ష్యగ్రంథముగాను, గూఢమును నిలివస్తువు గలుగు కావ్యముగాను, హరుని లీలను ( = ప్రచ్ఛన్నవటురూపధారణ లీలతో) చెప్పి, హరుని మెప్పించె' ననియు తెలిపిరి. తమ యభిప్రాయమున కనుగుణముగనే వారు 'క. క్రమమున నుద్భటుఁడు కవి, త్వము మెఱయఁ గుమారసంభవమ్ము నలంకా, రము గూఢవస్తుమయకా, వ్యముగా హరు లీలఁ జెప్పి హరు మెప్పించెన్' అను నన్నిచోడ పద్యమును సరళముగ సమన్వయించిరి.

మఱియు నుద్భటుఁడు తన కుమార సంభవములోని యేకదేశమును అలంకారముల వివరించుపట్ల ఉదాహరింపలే దనియు, అతఁడు రచించినదే కుమారసంభవైకదేశమనియు, 'నుద్భటారాధ్య చరిత్ర' విషయీభూతుఁడగు నుద్భటుఁడు ఇతనికంటె భిన్నుఁడనియు వివరించిరి.

శ్రీ శాస్త్రిలుగారు నన్నిచోడ కవిత్వమును విమర్శించుచు కవికిఁగల సర్వతోముఖ పాండిత్యమును, ఔచితీ పరిజ్ఞానమును వివరించుచు నిష్పక్షపాతముగ అనౌచిత్యములఁ గూడ నొండు రెండింటిని జూపిరి. కుమారసంభవ ముద్రణమున దొరలిన దోషములను, అపపాఠములను అముద్రితప్రతుల సాయమున వీరు చూపుచు ఉపవిరమములు, పదములు నను పాఠములను వివరించిరి.

ఈ ‘విమర్శ’ మన్నివిధముల నుత్తమమై నన్నిచోడహృదయము నెఱుఁగఁదలఁచువారికి శరణ్యమయి యున్నది.

ఈ విమర్శ ‘గ్రంథము’ విషయ మై శ్రీ శాస్త్రులు గారు ‘ఈ ప్రబంధ మెంతయో పరిశీలించి సరియగు పాఠములతో విపులవ్యాఖ్యతోఁ బ్రకటింపవలసియున్నది. అట్లు రచించి యాంధ్ర గ్రంథమునకుఁ బ్రశస్తి తెచ్చిన నాఁడే యాతని ఋణము తీర్చినవార మగుదుము.’ అని నివేదించిరి.

‘కుమారసంభవ విమర్శము’ను తీరని శ్రమలకోర్చి పరిశ్రమించి రచించి ఆంధ్రమహాజనుల పక్షమున నన్నిచోడుని ఋణమును కొంత తీర్చినవారు శ్రీ శాస్త్రులు గారే. ఋణమును తీర్పఁ బ్రారంభించినవారే కడ ముట్టతీర్చుట ఉచితము. ‘కాలదోషము’ పట్టకుండ పీలగునంత శీఘ్రముగనే శ్రీ శాస్త్రులుగారు పనికిఁ బూనుకొనుట శ్రేయము.

శ్రీ శాస్త్రులుగారిచే ‘కుమారసంభవ విమర్శము’ను రచియింపఁజేసి, దానిని ప్రకటించి ఆంధ్రుల యాదరమునకుఁ బాత్రులయిన మద్రాసు విశ్వవిద్యాలయము వారు శ్రీ శాస్త్రులుగారిచేతనే త్వరలో కుమారసంభవ వ్యాఖ్యను రచింపఁజేసి సమూలముగ దానిని ప్రకటించి నచో ఆంధ్రభాషా, వాఙ్మయములకు మహోపకార మొనర్చినవా రగుదురు.

బః. వేం. ర.

---

## ఆంధ్రసాహిత్య పరిషత్తు రజతోత్సవ సంపుటము

రాయల్ ౧/౮ సైజు. పుటలు ౫౬ + ౬౭౫ + ౯౨. వెల ఒక రూపాయి. ప్రకాశకులు: ఆంధ్ర సాహిత్య పరిషత్తువారు, కాకినాడ.

ఆంధ్ర భాషావాఙ్మయముల కభివృద్ధిని కలిగించి జీవాభ్యుదయమునకుఁ బాటుపడఁదలఁచి ‘ఆంధ్ర సాహిత్య పరిషత్తు’ ౧౯౧౧వ సంవత్సరమున మద్రపురమునందే వెలసినది. భాషాసేవకయి కంకణము కట్టి తెలుగునాట వెలసిన మొదటి సారస్వతసంస్థ యీ పరిషత్తే.

ప్రారంభింపఁబడినది మొదలు నేటి వఱకును పరిషత్తు శక్తివంచన లేక పాటుపడుచున్నది. పెక్కు ప్రాచీన శాసనములను, ప్రాచీన గ్రంథములను, నవీనుల విమర్శ గ్రంథములను ప్రకటించినది; నామమాత్రావశిష్టము లగుచున్న ప్రాచీనగ్రంథములను పెక్కింటిని భద్రపఱచి గొప్ప గ్రంథాలయమును నెలకొల్పినది; పత్రికా ప్రకటనమున అనేకములగు నంశములను తెలుగువారికి తెలియఁజెప్పినది; నిఘంటునిర్మాణమునకు పూనుకొనినది; వార్షిక సభలమూలమున చాలమంది విద్వాంసుల నొకచోఁ జేర్చుచు, అనేక విషయములను చర్చించి, పరిష్కరించి వాఙ్మయాభివృద్ధి కనువగు సాధనములను కల్పించినది.

ఆంధ్ర సాహిత్య పరిషత్తు పెక్కుమంది ప్రభువులయొక్కయు, విద్యాధికులయొక్కయు మన్ననలఁ గాంచినది. ఈ యంశము ఈ ‘రజతోత్సవసంచిక’ లోని ‘ఆంధ్ర సాహిత్య పరిషచ్చరిత్రము’ను బట్టియే తెలియుచున్నది.

పరిషత్తునకు శ్రీ జయంతి రామయ్యపంతులు గారు జీవగఱ్ఱ. పరిషత్తేర్పడుటకును వారి ప్రయత్నమే మూలము. ఇంత యేల ? పరిషత్తే పంతులుగారు, పంతులుగారే పరిషత్తు అనియు చెప్పవచ్చును. ఇట్టి యనుబంధ ముండుటంబట్టియే పంతులుగారు రహోరాత్రములు కష్టపడి పరిషత్తునకు ధనమును సేకరించి, యీ సంస్థను చిరస్థాయి నొనర్చినారు.

సామాన్యముగ ఆలోచించిన మన తెలుఁగునాటి సంస్థను స్థాపించినను అది చిరస్థాయి యగుటయు— ఒకవేళ నిలిచినను సముముగ సాగుటయు దుర్లభముగ నున్నది. ప్రతిభాలప్రచార మున్నదనో అతిశీఘ్రముగనే అంతరించుచుండుట అందఱు నెఱిఁగినదే! ఆంధ్రసాహిత్యపరిషత్తుమాత్ర మట్టి దీనస్థితికి రాలేదు. ప్రతికూల వాతావరణ మెంత యొక్కువగ నున్నను పరిషత్తుమాత్రము చలింపకుండుట ఒక గొప్ప విశేషము.

పరిషత్తునకు ౧౯౩౬ వ సంవత్సరమున ఇరువది యైదేండ్లు నిండినవి; ఎక్కువ సంతోషముతో ఈ సంస్థ పండువు జరుపుకొన్నది. 'రజతోత్సవ సంపుటము' ప్రకటన మూలమున తన యభివృద్ధిని, ఆనందమును తెలుఁగుదేశమునకు ఎఱుకపఱచుచున్నది; తెలుఁగునాడును దానిం దెలిసి మురియుచున్నది.

ఈ 'రజతోత్సవ సంపుటము'న 'పరిషచ్చరిత్రము, అనుబంధములు'ను గాక ౪౭ వ్యాసములు, ప్రభువులయు, విద్యాధికులయు, పరిషదభిమానులయు ఛాయాచిత్రములును గలవు. వ్యాసములలో ౪౨ ఆంధ్రభాగమునకుఁ జెందినవి. అందు గద్యములు ౨౯, పద్యములు ౧౩. తక్కిన యైదును ఆంగ్లవ్యాసములు.

ప్రకటితపూర్వమయ్యును 'శాసన పద్యమంజరి' విద్యాధికుల మన్ననల నందుటచే తిరిగి యిందు పద్యభాగమునఁ జేర్పఁబడినది.

ఇందలి వ్యాసములు చాలవఱకును ఆయా విషయములలో ప్రత్యేకపరిశ్రమ చేసినవారిచే రచింపఁబడినవి. అవి చాల విశేషాంశములను తెలిపి కొన్ని సమస్యలను పరిష్కరింపఁజాలియున్నవి. పండితులు పరిశోధకులును పరికింపవలసిన యంశములు ననేకము లీ వ్యాసములందు ఉన్నవి.

ఉపయుక్త విషయ ప్రతిపాదకమగు నీ సంపుటము నాంధ్రాభిమానులెల్లరును ఆదరింపఁదగును.

బు. వేం. ర.

---

## కుమారవిజయము

గ్రంథకర్త: ఉ. భా. ప్ర. కొమ్మనమంచి భోగయ్యశర్మ ప్రైవేటు తెలుఁగు పండితులు, రెడ్డి పోలవరం, తూ. గో. జిల్లా. ధర రు. ౧-౦-౦

గ్రంథకర్తగారి స్వేచ్ఛ గ్రంథనామధేయముననే తెలియుచున్నది. కుమారుని సంభవమా లేక విజయమా ప్రధానోద్దేశము? నవీనభావసంపన్నముగా రచింపఁబడియున్నదని యంకితమున కలదు. ఆ నవీన భావము లెవ్వియో మాత్రము గ్రంథమున కానరావు. అసదృశమగు కాళిదాసుని రత్నమునకు సరియగు యిమిటేషన్ రంగూన్ రాయి తయారుచేసిన చాలును. అసలురత్నమునకు నూతనకళలు కూర్చి శ్రమింప నవసరము లేదనుకొందును.

గ్రంథమున నున్న భావములు తీసివేసియు, లేనివి చొప్పించియు, రెంటిని కలిపియు నిట్లనేకవిధముల గ్రంథము కలగాపులగమై కాళిదాసుని హృదయ మెఱుకపడుటే కష్టమైపోయినది. సరియగు ననువాదము కుదురక వాక్యధోరణియే యొకమాదిరియున్నది. "యం సర్వశైలాః" అను రెండవశ్లోక భావమునకే యివ్విషయము వ్యక్తమగుచున్నది.

శైలి కొంత పురాణధోరణి, కొంత కావ్యధోరణి, కొంత సరళాధోరణి- ఇట్లనేకరీతుల నడచినది.

కథావస్తువా కాళిదాసునిది; గ్రంథముద్రణాది వ్యయమా కృతిపతిది; కాని సర్వస్వామ్యములుమాత్రము గ్రంథకర్తవి. ఇట్టిదృష్టి యింకను వీడకుండుట చాల శోచనీయము.

వందపుటల పుస్తకమునకు ఒక రూపాయిధర యుంచుటచేతనే యాంధ్రగ్రంథములు చాలవఱకు గ్రంథకర్తల గృహములనో, ముద్రాక్షరశాలల యందో మూల్గుచుండుట తటస్థించుచున్నది. ప్రజల యార్థికస్థితి ననుసరించి స్వల్పక్రయముంచిన నెక్కువపుస్తకములు క్రయమగుటకు లాభమునకును అవకాశ ముండును. "Low prices and large sales" అన్నారు.

మచ్చునకు ఒకతప్పయినను ఆంగ్లగ్రంథముల కానవచ్చుటరుదు. తప్పొప్పులపట్టిక గ్రంథమునకు విరూపము. ఇట్టిపట్టికలు లేకుండునట్లు చూడవలయును.

గ్రంథకర్తగారు శ్రమించి కుమారసంభవకథ నంతయు సంగ్రహముగా వ్రాసి పాఠకలోకమున కందజేసిరి. క్రొత్తమాదిరి అచ్చుకూర్పుతో చక్కగా ముద్రిం

పబడినది. పుస్తకము స్కూళ్లలో యుపయోగమునకై యుద్దేశింపబడిన ట్లున్నది. ప్రాపకము ప్రాధాన్యము కదా! 'జ'

---

## ఓరుగల్లు సామ్రాజ్యము (చారిత్రక నవల)

గ్రంథకర్త: ఆయుర్వేదభూషణ, పండిత పీటూరి వాసుదేవశాస్త్రి, రాజమహేంద్రవరం. క్రౌనుసైజు ౩౩౪ పుటలు. వెల రు. ౧-౦-౦

ఆంధ్రభాషయందుగల నవలలలో ముప్పాతిక మువ్వీసము ఏ వెంగాలీభాషనుండియో, ఆంగ్ల భాష నుండియో, ఉత్తరాదిభాషనుండియో అనువాదము లగుటచేత వానిలో తెలుగు పేరులు, తెనుగు ఆచారములు తెనుగుతనముకొరకే వాచిపోవుచున్న ట్లుండును. కనీసము కథాసామగ్రి యైనను తెనుగునాటి ప్రతిభకు సంబంధించియుండినయెడల ఆగ్రంథము కొంతవరకును తెలుగుతనము సూరుచుండగలదు. అక్షరాలు మినహాగా తెలుగుతన మెక్కడైనా వున్నదా అను అనుమానమును కలిగించే మన తెనుగునవలా ప్రపంచములో మునిగియున్న వారికి ఈగ్రంథము కొంతవరకు ఆశాజనకమై యుండకతప్పదు.

ఇందులో ప్రతాపరుద్రుని దర్బారు సొగసు, ఓరుగల్లు దేవగిరి నగరముల సౌందర్యము, శైవజైన సిద్ధాంతవాదుల చర్చలు, శ్రీనాథ విద్యానాథుల కవితాలంకార ధోరణులు, కమ్మ పద్మనెలమల స్పర్థలు, పచ్చితుల కలికిద్రములు, ఉదారుల మర్యాదలు అన్నిటియందును ఆంధ్రత్వము అలికిన ట్లున్నది. నేటి తెలుగుహృదయములలో ఆంధ్రపౌరుషము, ఆంధ్ర ప్రజ్ఞ, ఆంధ్రచైతన్యము, ఆంధ్రప్రతిజ్ఞ ఉదయించి మనము మన పురాణపురుషులను బురుడించవలెనన్న ఇటువంటి గ్రంథము లెన్నియో అవసరము. సుందరమగు శైలి, అందమగు కల్పనలతోగూడి గ్రంథ మామూలాగ్రము కౌతూహలమును రేపుచుండును.

గ. సత్యనారాయణ

---

౧. శ్రీ భాగవత కృష్ణకథాసంగ్రహము

(నిర్వచనము) సం. ౧౯౩౨. వెల రు. ౦-౬-౦

దశమ, ఏకాదశ, ద్వాదశ స్కంధములలోని కథాభాగ మిందు పద్యరూపమున సంగ్రహింపబడినది.

౨. కుశలవ నిర్వచనరామాయణము

సం. ౧౯౨౬. వెల రు. ౦-౪-౦

రామాయణకథ యంతయు నిందు పద్యరూపమున సంగ్రహింపబడెను.

౩. ఆంజనేయ శతకాదిస్తోత్రావళి

సం. ౧౯౨౫. వెల రు. ౦-౨-౦

ఇందు ఆంజనేయశతకము, హరిహరాష్టోత్తర శత నామస్తోత్రము, ఆదిత్యాదినవగ్రహస్తోత్రము, సప్తర్షి శ్రీరామ స్తవరాజము, త్రిమూర్త్యాత్మకాభేద స్తవము- అనునవి, పద్యరచనలు, కలవు.

ఈమూడు గ్రంథములను మాచవోలు కామయ్య రచియించెను. దైవభక్తి కలవారి కీగ్రంథములు చదువదగినవి. ఇవి నెల్లూరుపురమున తిప్పరాజువారి వీథిని ౧౦౫-వ నంబరు ఇంటనుండు సూరం వీరాస్వామి అనువారివద్ద దొరకును.

---

## ఆంధ్ర సేవ

కార్యస్థానము: ౧౫౦ అణ్ణాపిళ్లెవీధి, జార్జి టవును, మద్రాసు. సంవత్సరచందా ఒక రూపాయి మాత్రమే (తపాలుకర్చుతో కూడ)

ఇది యొక నూతన సచిత్ర మాసపత్రిక. ఇందు వాఙ్మయ వాణిజ్య విషయములు ప్రకటితము లగును. పవిత్రభావ ముదయింపజేయు ఆకర్షణీయమగు 'సరస్వతి: అర్చన' చిత్రముగల ముఖపత్రముతో ముచ్చటగొల్పు ముద్రణముతో నలరారుచున్నది.

నవంబరు సంచికలో—వివేకానందుని 'సందేశము' తొలిపూజ నందినది. 'why?' అను ఆంగ్లేయ పద్యానువాదము, 'చిన్నారి పాపల చిత్ర ప్రశ్నలు'ను

ఆంధ్ర బాలబాలికలకు ఆనందదాయకముగ నుండగలవు. శ్రీ గొబ్బూరి వేంకటానంద రాఘవరావుగారి 'మద్య నిషేధము'లో [తద్యుద్యమమును బలపరచు విలువగల విషయములు క్రోడీకరింపబడినవి. రామమోహన్ గారి 'అనువాదాలు పనికిరావా?' యను వ్యాసము చిన్నదయినను ఉత్తేజకముగ నున్నది. ఇవికాక 'పుస్తకసమీక్ష'యు, వణిక్పుంగవుల కుపకరించు 'భారత బజార్' మున్నగు క్రొంగ్రొత్త తెన్నుల విషయములు పత్రికకు వన్నె తెచ్చుచున్నవి.

ఆంధ్రమహాశయు లీ పత్రిక నెల్లవిధముల నాదరించి, ఉచితరీతిని ప్రోత్సహింతురుగాక.

ఆంధ్రుడు.

---

### ఆంధ్రకథా సరిత్సాగరము

(నాలుగు సంపుటములు; పద్యకావ్యము)

క్రౌను ౧/౮ సైజు, పు. (౬౮౦ + ౨౩౬ + ౩౦౯ + ౧౧౪) = ౯౮౨. సం. ౧౯౩౪ వేంకటరామ కృష్ణప్రణీతము.

ప్రకాశకులు: ఓలేటి వేంకటరామశాస్త్రి, పిఠాపురము.

---

### వేదాంత డిండిమము

(సతాత్పర్య గేయానువాదము)

క్రౌను ౧/౮ సైజు. పు. ౭౯. రు వెల ౦-౩-౦

అనువాదకుడు: పంతుల లక్ష్మీనారాయణశాస్త్రి (సాహిత్య, ఉభయభాషాప్రవీణ.)

ప్రకాశకులు: దేవగుప్తాపు వేంకటరమణకవి, వెంపడాం.

---

### అమరుకావ్యము

(పద్యానువాదము)

క్రౌను ౧/౮ సైజు. వెల రు. ౦-౧౨-౦ సం. ౧౯౩౪.

అనువాదకుడు: గుత్తుం వేంకటసుబ్రహ్మణ్యం, బి. ఏ., బి. యల్., అడ్వొకేటు, నెల్లూరు.

---

### నెచ్చెలి

(మంజరి రచనము)

క్రౌను ౧/౮ పు. ౪౫. వెల రు. ౧-౦-౦ సం. ౧౯౩౨

గ్రంథకర్త: కొండి శ్రీపతిశాస్త్రి.

---

### రష్యా కథలు

(కథల సంపుటి)

క్రౌను ౧/౮ సైజు. పు. ౧౫౧. సం. ౧౯౩౪

అనువాదకుడు: నార్ల వెంకటేశ్వరరావు.

ప్రకాశకులు: నవయుగ ప్రచురణాలయంవారు, పెదనగల్లుపోస్టు, కృష్ణాజిల్లా.

---

### బాల వ్యాకరణము

(గ్రాంథికాంధ్ర కల్పకము అను నామాంతరము గల బాలవ్యాకరణ సారస్య సర్వస్వపేటిక యను టీకతో గూడినది.)

డెమ్మీ ౧/౮ సైజు. పు. ౫౮౪ వెల రు. ౩-౦-౦

టీకాప్రణేత: విద్వాన్ దూసి రామమూర్తిశాస్త్రి.

ప్రకాశకులు: వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్సు, ౨౯౨, ఎస్ప్లనేడ్, చెన్నపురి.

---

### నారాయణీయాంధ్ర వ్యాకరణము అను నన్నయాథర్వణకారికావళి

క్రౌను ౧/౮ సైజు. పు. ౫౮౦. వెల రు ౧-౮-౦. సం. ౧౯౩౪.

ఆంధ్రీకర్త: చర్ల నారాయణశాస్త్రి.

సూత్రవివరణకర్త: చర్ల గణపతిశాస్త్రి, నిడదవోలు, పశ్చిమగోదావరిజిల్లా.

---

Printed and Published by K. Nageswara Rao, at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St., Madras. Editor: K. Nageswara Rao.

# శ్రీ అరవింద జీవితము

ఇంతవఱ కేభాషయందును ఇంత వివరముగా ప్రకటింపబడలేదు.

జన్మస్థానము, బాల్యవిశేషము, జాతకము, విద్యాభ్యాసము, విదేశవాసము. ఉద్యోగము, బరోడావాసము, వివాహము, యోగుల పరిచయము, ధర్మపత్నికి వ్రాసిన అద్భుతలేఖలు.

ఉద్యోగ విసర్జనము, జాతీయ కళాశాల, వందేమాతరం పత్రికసంబంధము. రాజద్రోహనేరారోపణము, సూరతు కాంగ్రెస్సు, ఆలీపూరు బాంబుకేసు. జెయిలులో శ్రీ కృష్ణ భగవానుని సందర్శనాదేశముల ననుభవించుట. ఉపన్యాసము, వాఙ్మూలము, కర్మయోగి పత్రికానిర్వహణము. తత్పత్రికాలతత్వములు, నాదేశీయుల కొక బహిరంగలేఖ. పుదుచ్చేరి నివాసము, 'ఆర్య' పత్రికాస్థాపనము, దాని యాదర్శములు, వాఙ్మయము.

ఏకాంతవాసము, రవీంద్రుడు దర్శించి స్తుతించుట, శ్రీ అరవిందాశ్రమము. శ్రీ అరవిందోపదేశము, 'స్వాతంత్ర్య నిర్వచనము', 'ప్రాచ్యులు-పాశ్చాత్యులు. 'ఆత్మశక్తి', జాతీయత' వీనినిగూర్చి లోగడ వ్రాసిన వ్యాసములు మున్నగునవి గలవు.

# శ్రీ అరవింద దర్శనము

'LIFE DIVINE' అను తమగ్రంథమున శ్రీ అరవిందులే రచించిన సారసంగ్రహమునకు బ్ర. వే. చంద్రశేఖరంగారొనర్చిన ఆంధ్రీకరణము

౧. ఇందు దివ్యపరిణామవాదము, ౨. సృష్టియొక్క నాల్గు దృష్టులు, 3. విజ్ఞానసత్తయొక్క ఆవశ్యకత, ౪. చిన్మయ విజ్ఞానసత్త, ౫. సమాప్తి అను శీర్షికల క్రింద శ్రీ అరవిందుల అపూర్వతత్త్వమంతయు వివరింపబడియున్నది.

'మాయ' యని ప్రపంచమును సన్న్యసించకుండ, నేటి యష్టకష్టములకు క్షోభలకు 'దాసోహం' అని లొంగి మృత్యువుచే ఈడ్వబడకుండ, భాగవతజీవనమును దివ్యజీవనమును అమృతత్వమును అనుభవించగల పరమరహస్యము మార్గము శాస్త్రీయముగా నిందు వెల్లడింపబడినది.

ప్రతిగ్రంథము ఒక్కొక్క రూపాయి పో॥ వేరు

ఆంధ్ర గ్రంథమాల,

7, తంబుశెట్టివీధి - మద్రాసు.

# బసవపురాణము

వెల 2-8-0

గ్రంథకర్త:—పాల్కురికి సోమనాథకవి

పరిష్కర్త:—వేటూరి ప్రభాకరశాస్త్రిగారు

పండ్రెండవ శతాబ్దమున వెలసిన శైవమత ప్రతిపాదకమగు ద్విపదకావ్యము. ఇందు శైవమతోద్ధారకుడగు బసవేశ్వరునియు, తత్పూర్వులు తత్సమకాలీనులు నగు శివభక్తులయు చరిత్రములును సరసముగను, పాఠకులు మనసు కరగి తన్మయులగునట్లుగను, కవి వర్ణించినాడు. గ్రంథమున మృదుమధురములగు జానుదెనుగు పలుకుల జాలువార్చి రచనమున ముద్దులుగురిపించినాడు. గ్రంథము భిన్నభిన్న మండలములకు జెందిన పెక్కు తాళపత్ర మాతృకలతో సరిచూచి పరిష్కరింపబడినది. పాఠాంతరములు సూచింపబడినవి. పరిష్కర్త రచియించిన అమూల్యమగు పీఠిక (120 పుటలు) ఇందు గలదు. ఆకాలపు టపూర్వ సారస్వత చారిత్రక విశేషముల లెక్కకు మిక్కిలిగ నందు పరిష్కర్త యేర్చికూర్చినారు. ఆధునిక కవికుమారులకిది యత్యంతోపకారకము.

మేనేజరు, ఆంధ్ర గ్రంథమాల,

నెం. ౭, తంబుచెట్టివీధి, మదరాసు

---

# Bharathi Advertisement

## RATE

| | | | |
|---|---|---|---|
| Ordinary page per month | | | Rs. 25 |
| „ | ½ „ | „ | „ 15 |
| „ | ¼ „ | „ | „ 8 |

Contract Rate for 6 Months & above

| | | |
|---|---|---|
| 1 page | .... | Rs. 20 |
| ½ „ | .... | „ 13 |
| ¼ „ | .... | „ 7 |

Special rates for cover and other pages in the midst of reading matter.

For full particulars apply to:—

*Manager*,

**Bharathi Office,**

7, Thambu Chetty St., MADRAS.

